శ్రీ



త్ర ము.

మనయాంధ్ర భూషణ ప్రాయములై యున్న కావ్యము లందు వసుచరిత్ర ము పేరెన్నిక గాంచుట తెలిసిన విషయము. పెక్కువిధము నావైచిత్ర్యములచేతఁ జిత్రితమై యనన్యసాధ్య ములు న లునగు శ్లేషభంగికలచేతఁ జమత్కృతిఁ గూర్చుచుఁ ప్రబతి సి కెక్కిన దీకావ్యరత్నము. మన తెనుఁగు భాషయందు క్తినంతయుఁ బచరించి యింతవఱకు మనకవు లెవరును ముద్దులు సుద్దులను నతి మృదుమధురబంధమున నీశృంగారప్ర ంచినదయ్యె. ఇందలికథ మహాభారతమునందలి యాదిపర్వము చరవసుచరిత్రమునుండి కయికొనఁబడినది. ఆకథా ప్రణాళితో, వర్ణన ణీయముగాఁ గూర్చియుఁ గల్పనలురసోచితముగా మార్చియు మృదు రణిని హావణింపఁగా నికావ్యమైనదని చెప్పవచ్చును. దీనిని రచించిన

క వి

సాహిత్యరసపోషణుం డగు రామరాజభూషణుఁడు. దీని కృతిపతి యారివీటిబుక్క శౌరివంశమువాఁడును శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడైన యళియరామరాజు తమ్ముఁ డునగు తిరుమలదేవరాయలు. దీనికథానాయకుఁ డుపరిచరవసువు. ఈకవికాలము మొదలగు చరిత్రాంశములను గృతిపతి కాలమును బట్టియుఁ గవికృత గ్రంథము ల్లోదలి నిదర్శనములంబట్టియు ముఖ్యముగా నిర్ణయింప వలసియున్నది.

క వి కా ల ము

తెలియుటకై ముందు కృతిపతియగు తిరుమలదేవరాయలకాలమును దెలియవలయును. ఇద్దతిరుమలదేవరాయలును నతని యన్న రామరాజును దమ్ముఁడు వేంకటాద్రియును విజయనగరరాజ్యము తరపున బహమనీ నబాబులతోఁ జేసిన యుద్ధములను, విజయనగరరాజ్య క్షీణతకు మూలమైన తల్లికోట యుద్ధమునకుఁ పిదప తిరుమలరాయలును వేంకటాద్రియు వీరిపుత్రులును సదరు బహామనీరాజు లతో గావించిన యుద్ధములనను, వీరల దానశాసనములనును, బట్టి రూఢిగాఁ దెలియవచ్చును. మఱియు వసుచరిత్రము, నరసభూపాలీయము, రామరాజీయము,

లక్ష్మీవిలాసము మొదలగు గ్రంథములం బట్టియు, ఫెరిస్టాయను ప[illegible]మ్మదీయచరిత్ర
కారుని వ్రాతలం బట్టియు, స్యూయెల్ (Sewel) దొర వ్రాసిన ఫ[illegible]టన్ ఎంపైర్
(Forgotten Empire) అను గ్రంథముం బట్టియు నిశ్చయింపవచ్చు[illegible]హమనీ రాజ్య
పు విభాగములను, వాని పాలకుల నామములను [illegible]గాలములను [illegible]చిన యెడల
వారితోఁ బొసఁగిన యుద్ధముల కాలములును దెలియనగును [illegible] దదాంధ్రరాజ్య
విభాగాదుల నిట వ్రాసెదను.

## బహమనీ రాజ్యము

మొదట 'అల్లాయుద్దీన్ హసన్ గంగూ' అనువానిచే 1347-వ సం॥ స్థాపితము. ఇది నాలుగు భాగములుగా విభక్తము, [illegible]ందు.

1. మొదటిది 'అహమ్మద్' నగరరాజ్యము. దీని 'నిజాంషాహి' యనియు దీని పాలకుని 'నిజాంషా' యనియుఁ జెప్పుదురు. ఈ 'నిజాంషా'ను 'నిజా'మనియు 'నిజాముఁ'డనియు మనకవులు పేర్కొనియున్నారు. ఈరాజ్యమును, 'బురహాన్ అనువాఁడు' క్రీ॥ శ॥ 1553 వఱకును, 'హుస్సేన్' అనువాఁడు 156[illegible] వఱకును 'ముర్తజా' యనువాఁడు 1586 వఱకును, పాలించిరి.

2. అహమ్మద్ నగరరాజ్యమునకు దక్షిణమున బీజపూర్ రాజ్యము. ఇదియే 'విజాపుర' రాజ్యమని మన గ్రంథములందుఁ గనుపట్టుచున్నది. ఇది 'అదిల్ షాహి' యనియు దీని పాలకుఁడు 'అదిల్ షా' యనియుఁ బేర్కొనఁబడును. 'ఇబ్రహీమ్' అనునతఁడు 1557 వఱకును, 'అలీ' అనునతఁడు 1580 వఱకును, దీనిని పాలించిరి. ఈ రాజ్యపుఁ బాలకుని మనకవులు 'సవాయి' యనియు 'సవాదుఁ'డనియు వాడిరి.

3. పై రెండు రాజ్యములకుఁ దూర్పునందు బీదరురాజ్యము. దీనికి '[illegible]దుషాహి' యనియు, దీని పాలకునికి 'బెరీదుషా' యనియుఁ బేరులు. ఈపాలకునే 'బ[illegible]' అనియు నిచటి దుర్గమును 'బెడిదకోట' యనియు మనకవులు వాడిరి. [illegible] 'అమీర్' అనునతఁడు 1549 వఱకును, 'అలీ' 1562 వఱకును, 'ఇబ్రహీమ్' [illegible] వఱకును, 'కాసీమ్' 1572 వఱకును, పాలించిరి.

4. బీదరునకుఁ దూర్పునఁ గోలకొండ రాజ్యము. దీనికి 'కుతుబ్ షాహి' యనియు దీని పాలకునికి 'కుతుబ్ షా' యనియుఁ బేర్లు. ఈపాలకుని 'కుతుబ[illegible]ల్క[illegible]' యని మనకవులు వాడిరి. దీనిని 'జంషీ' యనువాఁడు 1550 వఱకును, 'ఇబ్రహీమ్' 1580 వఱకును, 'మహమ్మద్ కూలి' 1611 వఱకును పాలించిరి. [illegible]యందు 'ఇబ్రహీ'మ్ము 'ఇభరామ్' అనియు 'మల్కిభరామ్' అనియు మన గ్రంథములందుఁ బేర్కొనఁబడియున్నాఁడు. వీరి రాజ్యకాలములను యుద్ధకాలములను బట్టి కవికాలాదులు నిర్ణయింతును.

శా. విశ్వామిత్రునిఁ గొల్చి రాముఁ డతఁ డుర్విం జెందెఁ గల్యాణముల్
విశ్వామిత్రులు గొల్వ రాముఁ డితఁ డుర్విం జెందెఁ గల్యాణముల్
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురుల్ సాధించు కల్యాణలా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథనధర్మాలంబన వ్యక్తముల్.

(వసు - 1 - 47)

క. ఖల్యాభయకర హరి ఖుర, హల్యాహతజన్య జాంగలాంగణ ఫలసా
కల్యావహ బహుదిగ్జయ, కల్యాణనిజామ గుప్తకల్యాణ హరా.

(వసు - 5 - 127)

రామరాజిట్లు కల్యాణపురమును వశము చేసికొనుటకు సైఁపక హుస్సేన్ నిజాంషా యిబ్రహీంకుతుబ్షాతోఁ గూడి మరలఁ గల్యాణపురమును ముట్టడించి రామరాజునకు నోడి కాందిశీకుఁ డాయెను. పిదప నిజాము కుతుబ్షాపొత్తు నిందించుచు రామరాజును శరణుజొరఁగానతఁడు మరల నిజామును * నహమ్మదు నగర రాజ్యమున నిలిపెను. ఈవిషయ మీకృతియందుఁ జెప్పఁబడియున్నది.

మ. హరిశౌర్యుండగు రామభూవిభుని తీవ్రాటోప వద్వాహినీ
శరవేగంబున నాత్మమూలబలముల్ జాఱన్ దళాడంబరం
బరుగం గొమ్మలు వ్రాల లావఱి నిజామాదుల్ వజీరుల్ భజిం
తురు నమ్రత్వముఁ గానలో ముసలిమానుల్ గా వితర్కింపఁగన్.

(వసు-1-46).

సీ. ఎదలపైఁ బొదలు పయ్యెదలు జాఱఁగఁ బాఱు, బిబ్బిలకుమునుంగు లబ్బఁజేసె
ఘనభేరికాధ్వనుల్ విని గుండియలు బ్రీల, వ్రాలుమల్కలకు నోలిలు సేసె
నుడుగని విభ్రాంతిఁ దడ బాళ్లు వడ నిల్చు, ఖానులు డాఁగఁ జీకటులు చేసె
గడ లేని కాందిశీకత నేఁగు తమ కుర్వి, జడధులెల్లను గాలినడలు సేసె
ననుచు శిరములఁ గాల్తు రెవ్వ[illegible]మగ్ర, సైన్యధుతధూళి జ[illegible] చనుసపాద
కుతుబశాహిని [illegible] పతుల, తండు నృపమాత్రుఁడే రామధరణివిభుఁడు.

(వసు 1-46)

సీ. ప్రబలావలేప విగ్రహజాయ మానాగ్ర, హము డించి బహుధావనాప్తిగా[illegible]
బురమెల్లఁ బ్రత్యగ్ర భూతిపాలుగఁ జేసి, యచలాసనాభ్యాసి యై కృశించ[illegible]
రతినిభరామాను గతమైత్రిపై రోసి, కలనైనఁ గల్యాణకాంతఁ యుడుఁడు
సరవిఁ బ్రాణాయామ సంసిద్ధికై సొరె, సొరెకుఁ గుండలిస్థాన మంటు
మానక నిజాముఁ డపసర్గ మార్గవృత్తి, బెరయుఁ బరబుద్ధి [illegible] చి
యతఁడు శ్రీరాముఁ డఖలసన్నుతికిఁ దగఁడె, సేతుకాశీతలాం[illegible]ఖ్యాతయశుఁడు

(వసు-1-48)

* చూడు 'ఫర్గాట నెంపైర్' పుటలు 196,197.

బహామర్శింతము. రామరాజభూషణుఁడు "వసుచరిత్రాదికావ్యప్రీత బహునృప ప్రాపితానేకరత్న ప్లవుండ" నని హరిశ్చంద్ర నలోపాఖ్యానమునఁ జెప్పికొనియుం డుటవలన నతఁడు రచించినదిగాఁ దెలియు హరిశ్చంద్ర నలోపాఖ్యానము నుండియు నట్టి గద్యపద్యముల నుదాహరించెదను.

మ. నను శ్రీరామపదారవింద భజనానందుల్ జగత్ప్రాణనం
దనకారుణ్య కటాక్షలబ్ధకవితా ధారాసుధారాశిసం
జనితైకైక దినప్రబంధ ఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వం బంచి పల్కెం గృపన్.

గద్య. శ్రీరామచంద్రచరణారవింద వందనపవన నందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ ప్రణీతంబగు వసుచరిత్రము.

(వసుచరిత్ర.)

సీ. శతలేఖనీపద్య సంధానధౌరేయు, ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యని, రోష్ఠ్యజ్ఞు సచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య, సాధితన్యస్తాక్షరీధురీణు
నేకసంధోచితశ్లోక భాషాకృత్యు, చతురు నోష్ఠ్యనిరోష్ఠ్య సంకరజ్ఞు
నమితయమకాశుధీప్రబంధాంక సింగ, రాజసుత తిమ్మరాజపుత్రప్రసిద్ధ
సరసవేంకటరాయభూషణసుపుత్రు,ననుబుధవిధేయుశుభమూర్తినామధేయు.

గద్య. శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితాసారసారస్వతాలంకార నిరంకుశ ప్రతిభాబంధురప్రబంధ పఠనరచనా ధురంధరప్రబంధాంక వేంకట రాయభూషణసుపుత్ర తిమ్మరాజపౌత్ర స[illegible] భాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి[illegible] ప్రణీతం బయినకావ్యాలంకారసంగ్రహంము.

(నరసభూపాలీయము.)

వనధిలంఘనకృపా వర్ధితోభయకవి, తాకళారత్నరత్నాకరుండ
సకలకర్ణాటరత్నధురంధర రామ, విభుదత్త శుభచిహ్న విభవయుతుఁడ
వసుచరిత్రాదికావ్యప్రీత బహునృప, ప్రాపితానేకరత్నప్లవుండ
[illegible]వేంకటేశ్వరానుగ్రహ, నిరుపాధికైశ్వర్య నిత్యయశుఁడ,
[illegible]ప్రబంధాంక సింగరాజ, తిమ్మరాజప్రియతనూజ ధీరసూర
[illegible]మనుపభూషణాఖ్యునుకవి, నంకితమొనర్తు నీకావ్య మనఘుభక్తి.

(హరిశ్చంద్ర నలోపాఖ్యానము.)

ఈపద్యములంబట్టి మూర్తియు రామరాజభూషణుఁడును ప్రబంధాంక వంశమువారనియు నిరువురకు ముత్తాతసింగరాజును, తాత తిమ్మరాజును నగుదురని యు, వీరి తండ్రులు మాత్రము వేఱనియుఁ, బేళ్లును భిన్నములనియుఁ దెలియుచున్నది. అనఁగా నిరువురకు వంశమును దాత ముత్తాతలును సములు; తండ్రులు వేఱు; పేళ్లు వేఱని తాత్పర్యముగదా! మనమిపుడు నామభేద పితృభేదములలో మొదటిదగు నామభేదమును విమర్శింతము. ఒకరు మూర్తియనియు మఱియొకరు రామరాజభూషణుఁడనియు నామభేద మున్నదిగదా. వీరికిఁగల విశేషణములకును గల భేదాభేదములనుబట్టి నామములభేదాభేదమును నూహింపవచ్చును. 'ఘటికాశత గ్రంథకరణధుర్యు' 'ఘటికాస్సద్యశ్శత గ్రంథకల్పనుఁ'డనుటచే నిరువురును ఘటికాశతగ్రంథకర్తలగుట తేటతెల్లము. 'హనుమత్ప్రసాదలబ్ధకవితాసార' 'వనధిలంఘనకృపావర్ధిత ... కరుండ' 'జగత్ప్రాణనందన ... కవితాధారా' ఇత్యాదులఁబట్టి యిరువురను హనుమత్ప్రసాదలబ్ధ కవిత్వాదిసంపన్నులు. మూర్తికిఁగల 'శతలేఖనీపద్యసంధానధౌరేయు ... 'ఆశుప్రబంధబంధాభిజ్ఞు ... ఓష్ఠ్యనిరోష్ఠ్య సంకరజ్ఞు' ననెడు వఱకుఁగల ప్రజ్ఞావిశేషములు, రామరాజభూషణుని 'సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకషచతుర్విధ కవితానిర్వాహక సాహిత్యరసపోషణ'యనువిశేషణములచే గర్భితములై యున్నవి. కనుక నుభయుల విశేషణములు పరస్పరవ్యావర్తకములుగాక పరస్పరైక్య సూచకములుగానే యున్నవి. నరసభూపాలీయమందలి శతలేఖనీపద్య సంధాయకత్వాదులు కేవలధారణా శక్త్యాదిప్రకాశకములే కాన వసుచరిత్రరచనచేఁ గలిగిన యనన్యసామాన్యప్రఖ్యాతి వైభవమునకుఁ బిదప నంతవిశేషప్రసిద్ధి హేతువులుగాని యావిశేషణములనుగంఠోక్తముగాఁ జెప్పుకొనుట యనభిమతమును ననావశ్యకము నగుటచే వసుచరిత్రగద్యమందు వానిని గర్భీకరించినాఁడనుకొనవచ్చును. మఱియు'శుభ' మూర్తినామధేయు 'రామవిభుదత్త 'శుభ' చిహ్నవిభవయుతుఁడ'నియు రెంటనునున్న 'శుభ'విశేషణమిద్దఱొక్కరేయనుటకుఁ బ్రబలసాక్ష్యముగా నున్నదని బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులవారు వ్రాసిరి. కాని దీనింబట్టి కవులనైక్య మూహించుటకుఁ జాలిన యుపపత్తి లేదు. మొదట 'శుభ' విశేషణము 'మూర్తి'కిసామాన్యముగా గణసౌకర్యమునకై చేర్పఁబడియుండవ[చ్చు]ను. రెండవది రామరాజేదో యొక శుభచిహ్నము నొసఁగియుండుటకునూచకముగా నున్నది. రామరాజభూషణయను పదము కవికి నామకరణముచేసి నప్పటిపేరైనచో దానినే 'రామభూషణ'యనియు 'రామనృపభూషణ'యనియుఁ బదలోపముతోను బర్యాయపదయోజనతోను జెప్పుటపొసఁగదు. కాన రామరాజిచ్చిన శుభచిహ్నము 'రామరాజభూషణుఁ'డను బిరుదమైననే యీయనుపపత్తికిఁ బరిహారము కలుగును. కాఁబట్టి ''మూర్తి' యనుట జన్మనామమును రామరాజ భూషణుఁడనుట బిరుదనామమునుగా గ్రహింపఁదగును. ఇట్లుభయకృతికర్తల విశేషణములు

పరస్పరము విరుద్ధములును వ్యావర్తకములును గాక పర్యాయములును బరస్పర సూచకములు నగుటంబట్టియు,నుభయనామములును భిన్నపురుషులకంటె నేకపురుషునకేయన్వయించుట మఱింతయుపపన్నముగా నుండుటంబట్టియు నాయుభయ నామముల యాపాతభేదముచేఁ గవులు భిన్నులు కారనియు నొక్కరేయగుదు రనియు నిశ్చయింపఁ దగియున్నది. ఇఁక వారిరువురకుఁ గలతండ్రుల నామభేదమును విమర్శింతము.

మూర్తి తండ్రి వేంకటరాయభూషణుఁడు. రామరాజభూషణుని తండ్రి సూరపరాజు. ముత్తాతకును దాతకును, సింగరాజనియుఁ దిమ్మరాజనియుఁ బేరులు కాఁగాఁ దిమ్మరాజుకొడుకులం దొకనికి సూరపరాజనియుండ మఱియొకనికి వేంకట రాజని యుండుటమిక్కిలి క్రమముగా నుండును; కాని వేంకటరాయలనుటకాని వేంకటరాయభూషణుఁ డనుటకాని యసంభావితము కాకున్నను నంతగాఁ గ్రమ ముగాఁ దోఁపక జన్మకృతనామమునకంటె శక్తిసంపాదిత నామముగా నుండుట మఱింత సంభావ్యముగా నుండునని తోఁచుచున్నది.

గీ. తారచించిన వసుచరిత్రమునఁగన్న, తండ్రి సూరన వెలయించి తెలఁపఁడయ్యె
నన్ను మనశారదామూర్తి నాఫలంబె, దత్తుఁడగు వానిఁ జేపట్టఁ దరిమె నాకు.

అని యొకచాటువుచే సూరప జనకపితయు వేంకటరాయభూషణుఁడు పాలకపి తయునని తెలియుచున్నది. నిరాధారమైన యీచాటువు నాశ్రయించుట కంటె వేంకటరాయభూషణుఁడను నామవైఖరీ విశేషమునాశ్రయించి, సూరపరాజే యచ్యుత దేవరాయల పుత్త్రుఁడగు వేంకటరాయల సభ కలంకార భూతుఁ డగుటం జేసి వేంకటరాయభూషణుఁడని రామరాజభూషణ శబ్దమువలెనే యొకబిరుదము నొంది యుండునని యూహించుటతగియున్నది.

ఈకవివంశము ప్రబంధాంకముచేఁ బ్రసిద్ధమగుటచేఁ గవిత్వాది ప్రఖ్యాతి గలిగినది గావలయును. అట్టిదికావుననే యది యసమానకవితానిధియగు రామ రాజభూషణునియుత్పత్తికిగని యైనది. ప్రాయికముగా మహాకవులవంశమునందు వారికిఁ బూర్వులందును బిమ్మటివారియందును గవితాస్వాదనములు చూపట్టు చున్నవని యాంగ్లకవిచరిత్రకారులు పెక్కు నిదర్శనము లిచ్చియున్నారు. మ ఱియు సదాశివరాయలను సింహాసనమునం దునిచి తత్ప్రతినిధిగానుండిన రామ రాజు కాలముననను నతని తమ్ముఁడు తిరుమలదేవరాయని కాలముననను రామరాజ భూషణుఁ డుండగా సదాశివరాయలకు మునుపటిరాజగు వేంకటరాయల కాల మున రామరాజభూషణునితండ్రి సూరపరాజుండుట కాలమునుబట్టియు సంభా వ్యముగానున్నది. ప్రబంధాంకమను వంశనామముం బట్టి సూరపరాజు తద్రాజ సభకు భూషణప్రాయుఁడై యుండుననుటయు సంభావ్యముగానే యున్నది. ఇట్లు

వంశమును మఱ్ఱాతయుఁ దాతయునేకాక తండ్రియు నిరువురకవులకు నొక్కఁడే యనియుఁ గాఁబట్టి భట్టుమూర్తియె రామరాజ భూషణుఁ డనియు సిద్ధాంతము చేయఁదగియున్నది.

మఱియుఁ బండితజనప్రతీతినిబట్టియుఁ గవికి దాదాపు కాలమువారివ్రాఁతలం బట్టియు రామరాజభూషణుఁడే భట్టుమూర్తియనుట దృఢపడుచున్నది. ఇంచుమించు గారామరాజభూషణునికాలమందు రచియింపఁబడిన లక్షణదీపికలో "మంజీర శబ్దమునకుబట్టుమూర్తి వసుచరిత్రము మొదటి పద్యము ప్రథమచరణమున పొల్లునకుఁ బ్రయోగమనియు నందుల కుదాహరణముగా 'శ్రీభూపుత్రివివాహవేళనిజమంజీరాగ్రరత్న'యనియు వ్రాయఁబడియున్నది. రామరాజభూషణుకాలమునం దుండిన వేంకటపతిరాయల విద్యాగురుఁడు మండరామానుజాచార్యుని ముమ్మనుమనిమనుమఁడగు లక్ష్మీనరసింహాచార్యులు తనయాంధ్రకౌముదియందు "ముప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్య శిష్యేణ భట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే" యని యిందులకులక్ష్యముగా 'సీ. రాజహంసులుగాని రాజహంసులుగారు సరిసత్కళా సారసారరుచుల' యను వసుచరిత్ర సీసపాదమును జెప్పియున్నాఁడు. మఱి యహోబలపతికిని నప్పటికవికిని నత్యల్పకాలములోనుండిన వసుచరిత్ర వ్యాఖ్యాతయగు సోమనాథకవి వ్యాఖ్యానపీఠికలో,

"శా. ఈరీతిం గవితావితాన వృతిగౌరీశానవహాళిస్థలీ
దారోద్దేశుఁడ నైననాకు వెస విద్యావంతులెల్లన్ మనో
హారిప్రక్రియ మూర్తిచేత రచితంబై విశ్రుతం బౌవసు
క్ష్మారాట్చిత్రచరిత్ర టీకకయి యుత్సాహంబుపుట్టించిరన్.

ఉ. కారణ జన్ముఁడై కవిని కాయముమెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁడయి పొల్పువహించిన భట్టుమూర్తిచే
నీరితమై సుఖార్థ పదహీనపదాస్పద మైనయావసు
క్ష్మారమణ ప్రవృత్తము సుసాధ్యముకాదు తలంచి చూచిరన్."

అని వ్రాసియున్నాఁడు. ఈయాధారము లించుమించుగా సమకాలీనుల నుండియు సమీపకాలము వారినుండియు మనకంటె మిక్కిలి పూర్వకాలము వారినుండియు గ్రహింపఁబడినవి. కాన విశ్వసనీయములు కావని చెప్పరాదు. వీనిని బట్టియు మూర్తియే రామరాజభూషణుఁ డని తేలుచున్నది.

మఱియు నుభయకావ్య కవిత్వములందలి సాదృశ్యవిశేషములంబట్టియు దానికర్త లిరువురు నొకకవియేయని యేర్పడుచున్నది. తిక్కనాదిమహాకవులును పూర్వరచితగ్రంథములనుండి పద్యములను యథారూపముగానో లేక యతిస్వల్పముగా మార్చియో పిమ్మట రచించినకావ్యములం దుంచియున్నారు. ఒకకవి పద్య

మునుజూచి దానితో సమాన మగుభావముగల పద్యమునుగాని దానికిఁ బర్యాయములగు పదములతోడి రచనగాని యనుకరించి మఱియొకకవి రచియించునుగాని యాపద్యమునే యా భావమునే యట్లే కొనుటగాని మెఱుఁగుపెట్టుటకై మార్చికొనుటకాని యొకకవికే చెల్లును. ఉదాహరణము తిక్కన,

"చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దార భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగిన మాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతి బలంబులఁ గప్ప శార్ఙ్గని
క్వణనము రోదసీ కుహరకర్పరముం బగిలింప నుగ్రతన్."

అని నిర్వచనోత్తరరామాయణమున రచియించినపద్యమునే కొంతమార్పుతో

"చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ జాలభీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగిన మాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్పగాండివ
క్వణనము రోదసీ కుహరకర్పరముం బగిలింప నుగ్రతన్"

అని విరాటపర్వమున నుంచెను. ఇది యేకకవికే చెల్లునుగాని భిన్నులకుఁ జెల్లదు. ఇట్లే నరసభూపాలీయ వసుచరిత్రములందును నేకకర్తృకము లనఁదగు పద్యముల నిటఁజూపెద.

శా. గంగం దాల్చితి వుత్తమాంగమున సఖ్యైకోలు గావించి త
ద్ధాంగీకార మసం బురంధ్రి నిను వామాంగంబునం దాల్పనే
శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజన్ శీర్షాపగాబింబిత
స్వాంగాసందతఁ జేయు శంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్.

(నరస భూపాలీయము)

శా. ఆమందాకిని మౌళిఁబూని నను నర్ధాంగీకృతం జేసి తౌ
నౌమేత్మే లని యార్యయల్గఁ బ్రణతుండై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయున్ మొరయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్.

(వసుచరిత్రము.)

శా. ఆమోదంబున శ్రీనృసింహవిభు దానాంభోనిధుల్ సాగర
స్వామిం జెంద యశంబు మేఘములఁబర్వం గల్గు వర్షాశర
త్సామానాధికరణ్యలబ్ధి కచటన్ దామోదరుం డొందు ని
ద్రాముద్రానుగతప్రబోధములు చిత్రం బేకకాలంబునన్.

(నరస భూపాలీయము.)

శా. రామక్ష్మావరుదానతోయతటినీవ్రాతంబు కల్లోలినీ
స్వామింజెంద యశంబు మేఘములఁ బర్వం గల్గువర్షాశర
త్సామానాధికరణ్యలబ్ధి కచటం జక్రాయుధుం డొందు ని
ద్రాముద్రానుగత ప్రబోధనులు చిత్రం బేక కాలంబునన్.

(వసుచరిత్రము.)

ఇట్టివి పెక్కులుగలవు. ఇందు నరసభూపాలీయపద్యములనే పిదప వసుచరిత్రమున మఱింత మెఱుఁగుగాను బొంకముగాను ప్రౌఢముగాను గవి యల వరించినాఁడు. నరసభూపాలీయమే వసుచరిత్రమునకు ముందు రచింపఁబడినదనుట కాధారముగలదు. నరసభూపాలీయమున రామరాజు 'సకల కర్ణాటదేశంబు నిలిపె' నని కర్ణాటరాజ్యస్థాపనము చేయుట చెప్పఁబడినదే కాని తద్రాజ్యనాశ మెందును సూచింపఁబడలేదు. వసుచరిత్రముననే 'సాధుకర్ణాటవిభవ సంస్థాపనం' బని రామరాజకృత కర్ణాటరాజ్య విభవస్థాపనమును 'జీర్ణ కర్ణాట లక్ష్మీపునస్సృష్టి' యని, నశించిన కర్ణాటరాజ్యమును దిరుమలదేవరాయలు మరల నుజ్జీవింపఁజేయుటయుఁ జెప్పఁబడినది. కనుక వసుచరిత్రమే పిదప రచింపఁబడినది గావలయును. మఱియుఁ గవి నరసభూపాలీయమునఁ దిరుమలరాయవర్ణనమున జీర్ణ కర్ణాట పునరుద్ధారి యనుమాట తలపెట్టక పోవుటయేకాక 'ప్రాభవ్యోపేతుఁడౌ తిమ్మ పార్థివుం'డని యతనిని సాధారణముగా నెఱ తిమ్మరాజని చెప్పినాఁడు. అతఁడు రాజై పెనుఁగొండయందు రాజ్యమేలుచున్నపుడు 'కర్ణాటకాంద్ధధరణీ పునరుద్ధారికిఁ దిరుమలదేవమహారాయాగ్రణికి' (వసు) నని తిరుమలదేవరాయలని పేర్కొన్నాఁడు. దీనినిఁబట్టియు వసుచరిత్ర వెనుక రచింపఁబడినదనియే తెలుచున్నది.

ఇట్లు రామరాజభూషణుఁడే బట్టుమూర్తియని పెక్కుప్రమాణములవలనఁ దెలియుచున్నది. భట్టుమూర్తి యల్లసానిపెద్దనార్యుని శిష్యుఁడని పండితపరంపరాగతమగు ప్రతీతిగలదు. మఱి లక్ష్మీ నరసింహాచార్యుల వారి యాంధ్రకౌముదియందు 'ముప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్యశిష్యేణ భట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే' యను వాక్యమును దీని కుపబలముగా నున్నది. మఱియు నల్లసానిపెద్దన తనకుమారుఁడు విద్యలెస్సగా నభ్యసింప కుండుటకు వానిని దండింపఁగా నతని భార్య 'మీశిష్యుఁడగు బట్టువాని పాటి శ్లేషముక్కలు చెప్పకొను శక్తిగలుగకపోదు ? ఏల యింతకఠినముగా శిక్షించెద'రని చెప్పెననుటయు నిందులకాధారముగా నున్నది. వీనిని బట్టి రామరాజభూషణుఁడు పెద్దనార్యుని కాలమందుఁ గేవల ముండుటయే కాక శ్లేషకవనమునఁ బ్రసిద్ధుఁడయ్యు నుండెనని తెలియు చున్నది. పెద్దనార్యుని కాలమునందె ప్రసిద్ధుఁడై యుండుటం బట్టి కృష్ణరాయని కాలమునందును గవియుండవలదాయనితోఁచుచున్నది. కృష్ణరాయల యష్టదిగ్గజములలో భట్టుమూర్తియు నొక్కఁడను ప్రతీతిగలదు: కాని యితనితండ్రి

సూరపరాజు కృష్ణదేవరాయలకును నచ్యుతరాయలకును బిమ్మట రాజ్యమునకు వచ్చిన వేంకటరాయల కాలమునందుఁ బ్రసిద్ధినొందిన వాఁడని మనము నిశ్చయించి యుండఁగా నతనికొడుకు భట్టుమూర్తి కృష్ణరాయల కాలమందుఁ బ్రసిద్ధుఁడై యుండెననుట కాలవ్యవధానమును బట్టి యంతగా విశ్వసనీయముగాకున్నది. కృష్ణరాయలకాలమువాఁ డనుట నట్లుండగ దేని యల్లసాని పెద్దనకాలమువాఁడను జనశ్రుతి యెట్లన్నచోఁ గృష్ణదేవరాయలకుఁ బిదప నల్లసాని పెద్దనజీవించి యున్నట్లు,

సీ. ఎదురైనచోఁ దనమదకరీంద్రమునిల్పి, కేలూఁతయిచ్చి యెక్కించుకొనియె,
వసుచరిత్రంబందుకొని పురంబేఁగుచోఁ, బల్లకి తనకేలఁ బట్టియెత్తె,
... ... ... ... ... ...
... ... ... ... ... ...
ఆంధ్రకవితా పితామహయల్లసాని, పెద్దనార్యుండయని సన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతోడ మునింగుచుకొనక, వసుధ బ్రతికితి జీవచ్ఛవంబనంగ.

యను చాటుపద్యమువలనఁ దెలియుచున్నది. మఱియుఁ గృష్ణరాయల నిర్యాణానంతరము గజపతి దండెత్తిరాఁగాఁ బెద్దన యతనిని జూచి,

సీ. రాయరావుతుకొండ రాచయేనుఁగువచ్చి యారెల్లకోటఁ గోరాడునాఁడు

యని చెప్పినన్నపద్యము నిందులకు సాధనముగా నున్నది. రాయనిపిదపఁ బెద్దన యెంతకాలము జీవించియుండెనో చెప్పవలనుగాదు గాని భట్టుమూర్తి శ్లేష కవితాప్రసిద్ధుఁడగువఱకు నుండియుండవచ్చునని యూహింపఁదగియున్నది. కృష్ణరాయలకాలమందే పెద్దన భట్టుమూర్తి కాచార్యకమును చేసి యుండవచ్చును గాని యప్పటికే మూర్తి యతని యష్టదిగ్గజములలో నొకఁడుగా నుండఁగూడుననుట వేంకటరాయలసభ నలంకరించిన సూరపరాజునుబట్టి నిర్ణయింపరాకున్నది. ఏది యెట్లయినను బెద్దన యంత్యకాలమున రామరాజభూషణుఁడు ప్రసిద్ధుఁడుగా నుండవచ్చును గాని యప్పటికిఁ గౌమారావస్థగా నుండునని యనుమానింపఁదగి యున్నది. దీనినిఁబట్టి యతఁడు క్రీశ 1515-25 సంవత్సరములందుఁ బుట్టినవాఁడు గానోపు ననవచ్చును. పెనుఁగొండయుద్ధము వసుచరిత్రమున వర్ణించుటచేత 1580 సంవత్సరముల ప్రాంతమువఱకు నుండియుండునని ముందే చెప్పియున్నాను. మొత్తమున కవి పదియాఱవశతాబ్ది నట్టనడుమ నున్నవాఁడని నిశ్చయింపవచ్చును.

ఈప్రసక్తియందుఁ జాలవఱకు దేలిన చరిత్రాంశములను దెలిపితిని. వానిని బట్టి కవి కృతిపతి వంశమును వర్ణించు ఘట్టములందలి పద్యములందు దేశచరిత్ర ప్రయుక్తములగు విషయములును మఱింత తెలివిడియై వానియర్థములును మిక్కిలి సూటిగా నిర్ణయింపఁగూడునని నాయభిప్రాయము. అపుడు ప్రసక్తివశమునఁ జెప్పిన చారిత్రక విషయములే కాక యాకృతిపతి వంశావతారవర్ణనమును బూర్ణముగా నాలోడనముచేసి తేలెడి చరిత్రాంశములను రూపించుట మఱియు నుద్బోధక

ముగా నుండును. ఇందు ముందుఁ గవి వర్ణించినట్లు కృతిపతి వంశవృక్షమును వ్రాసెదను. ఈ కృతిపతి చంద్రవంశపువాఁడు 'జనక నేత్ర ఫలంబయిన పాలపాపఁడు ... ... రాణచంద్రుండు కాంతిని స్తంద్రుఁ డలరు' నని మొదట వంశమునకుఁ గూటస్థుఁ డైన చంద్రుని వర్ణించెను. ఆచంద్రునకు బుధుఁడు, బుధునకుఁ బురూరవుఁడు, పురూరవునకు నాయువు, ఆయువునకు నహుషుఁడు, నహుషునకు యయాతి, యయాతివంశమున భరతుఁడు, భరతునివంశమున ధర్మపుత్రాదులగు పంచపాండవులును బుట్టిరని చంద్రవంశమునఁ బురాణాది ప్రోక్తభాగమును నాలుగైదు పద్యములచే వర్ణించి యంత నా ధర్మపుత్రాదుల వంశమునందుఁ దాత పిన్నమరాజు మొదలుగాఁ గృతిపతి తత్పుత్రులనఱకు వర్ణించినాఁడు. ఆక్రమము నిటవ్రాసెద.




ఈతిరుమల దేవరాయలనే యెఱతిమ్మరాజందురు. తిరుమల దేవరాయలకు ముగ్గురు సోదరీరత్నములు గలరు. అందు లక్కమ్మ నరసభూపాలీయకృతికర్త యగు నహోబిల నరసరాజునకుఁ దల్లి. ఓబమ్మ రామాభ్యుదయ కృతికర్తయగు గొబ్బూరి

నరసరాజునకుఁ దల్లి. కోనమ్మ పరమయోగివిలాసమును రచించిన తిమ్మరాజునకుఁ దల్లి. ఈ విషయ మీయాగ్రంథములందలి కృతిపతి కృతికర్తల వంశావతారముల వలనఁ దెలియుచున్నది. అందుఁ దిరుమల రాయని యన్న యగు రామరాజువిషయమై

సీ. పట్టాభిషేక విపర్యయంబునఁ బ్రోలు, వెడలి ప్రియానుజుల్ వెంటఁ గొలువఁ
చిత్రకూటాభిఖ్యఁ జెలఁగు పెన్గొండ సాంద్రహరిద్విపేంద్ర నాదవనిఁ జేరి
ఖలజనస్థానవాసులఁ బల్వుర వధించి, మహిమసలకఖరస్మయ మడంచి
హరి వీరభటమహోద్ధతి నబ్ధిఁగంపింప, దురమునఁగదిసి తద్ద్రోహిఁ దునిమి
యనఘతరసార్థివేందిర నధిగమించి, సాధుకర్ణాటవిభవ సంస్థాపనంబు
పూనిశరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁడతఁడు నిజ చరితంబు రామాయణముగ.

నని వర్ణింపఁబడియున్నది. అచ్యుతదేవరాయల పుత్త్రుఁడగు వేంకట రాయలు రాజ్యమునకువచ్చి కొంతకాలమునకు మరణింపఁగా రామరా జచ్యుత రాయల తమ్ముఁడగు శ్రీరంగరాయల పుత్త్రుని సదాశివరాయలను బట్టాభిషిక్తునిఁ జేయఁదలంచెను. అపు డచ్యుతరాయల బావయు వేంకటరాయల మేనమామయు నగు సలకయ తిమ్మన యాపట్టాభిషేకమునకుఁ బ్రతిఘటించి వేంకటరాయల యనంతరము తానే రాజ్యమాక్రమించుకొనఁగా రామరాజు తగు ప్రయత్నమున నతనిని జంపి సదాశివరాయలకుఁ బట్టాభిషేకముచేసి కర్ణాటరాజ్యవిభవమును స్థాపించిన వాఁడయ్యెను. ఇది యీ క్రిందిపద్యమునందుఁ గాన నగును.

'హరిశౌర్యుండగు రామభూవిభుని తీవ్రాటోపవద్వాహినీ
శరవేగం ... ... నిజామాదుల్ వజీరుల్ భజింతురు సమ్యక్త్వము.

లనుచు శిరములఁ దాల్తు రెవ్వనిసమగ్ర
సైన్య ధుత ధూళిచకితులై చనుసపాద
కుతుప శాహి నిజామాది కుతలపతు ల
తండు నృపమాత్రుఁడే రామధరణివిభుఁడు.

విశ్వామిత్త్రునిఁ గొల్చి రాముఁ డతఁ డుర్వింజెందెఁ గల్యాణముల్
విశ్వామిత్రులు గొల్వరాముఁ డితఁ డుర్వింజెందెఁ గల్యాణముల్

... ... ... ...

మానక నిజాముఁ డపవర్గమార్గ వృత్తి
బెరయఁ బరబుద్ధి నెవ్వాని పేరు దలఁచి
యతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతికిఁ దగఁడె.

ఈ పద్యములవలన రామరాజు సపాదుఁడనెడి యదిల్షా నోడించి కృష్ణాతుంగ భద్రలనడిమి యంతర్వేదిని గయికొనుటయు అలీఅదిల్షా ప్రార్థనమున నిజామునోడించి కల్యాణపట్టనమును గెలుచుటయుఁ దిరుగఁ బయిసెత్తిన నిజాం

పాకుతుప్‌షాల గెలిచి కాందిశీకులను జేయుటయు, నిజాము మఱల శరణుఁ జొరఁగా రాజ్యమునందు నిలుపుటయు మొదలగు చరిత్రాంశములు పూర్వోక్తములు తెలియుచున్నవి. ఇతని తమ్ముఁడు వేంకటాద్రి, రామరాజునకు నిజాము అదిల్‌షాల తోడఁ జేసిన యుద్ధమునఁ దోడుపడి పరాక్రమము నెఱపుట మీఁది పద్యముల వలనఁ దెలియునది.

మ. 'కడిమిన్ వేంకటరాయశౌరి నెదురంగా లేక యత్యాహితం
బడరం గౌతమి దాఁటు వేళ నిజకాంతాశ్రుప్రవాహాప్తిఁ గాల్
నడ దప్పన్ జడుఁడై నిజాముఁ డుడుపాలంబంబునన్ దాఁటి యె
క్కడఁ గన్నన్ భజియించు నయ్యుడుపరేఖన్ నామమోహంబునన్.

ఉ. ఏకసపాదలక్షమిత మింద్రజు దోశ్చరితప్రబంధ మ
స్తోకమె యంచుఁ జాపజితధూర్జటి వేంకటశౌరి శౌర్యదీ
ప్తాకృతి కర్ణభీష్మజయశక్తి ననేకసపాదలక్షసం
ఖ్యాకమనీయ భూరివిభవాప్తి వహించు నుదంచితోన్నతిన్.'

ఇతఁడు రామరాజు కాలమందే బీదరు నబాబును జయించుట యీపద్యమునఁ దెలియునది.

'అనుచు గడుమెచ్చి జయలక్ష్మి యాజిరంగ
కాతర బరీద కేతన ఘటిత భద్ర
కలశ మెదురుగఁ బూని యేఘనునిఁ జెందె
నతఁడు సామాన్యుఁడే వేంకటాద్రి విభుఁడు.'

ఈ వేంకటాద్రితోఁ గూడఁ దిరుమలరాయలును గూడి బీదరు పాలకుని గెలిచె నని యీపద్యమున నేర్పడుచున్నది.

'వినమద సూదనమల్క వినోదన వీరబరీద నరాదహారీ'

(అ-3-1-83)

'... ... ... ...కలితకూట కనకవాటసంభ్రమ
ద్భ్రమిత ఘోట బెడదకోట పటుకవాట పాటనా'

(అ-5-128)

"కడిమిన్ వేంకటరాయశౌరి నెదురంగాలేక యత్యాహితం బడరన్ గౌతమి దాఁటు వేళ"ననుచో నిజాముని గోదావరి వఱకుఁ బాఱఁదోలుట తెలియునది. ఇది రామరాజు, తిరుమలదేవరాయ వేంకటాద్రుల తోడ్పాటునఁ గావించెనని యీ మీఁదిపద్యము తెలుపుచున్నది.

ఉ. ఆయనుజుల్ విశద్ధహారిదంత మహాకరిదంత కాంతిరే
ఖాయితకీర్తులై కొలువ గౌతమినీట నరాతిఘాతికా

... శ్రేయకర కృత్యముల్ గడిగి శ్రీరమణీవరమూర్తి రామభూ
నాయకుఁ డుర్వి నేలె భువనస్తవనీయ జయాభిరాముఁడై.

రామరాజు నిజాము నోడించి పలాయితునిఁ గావించునపుడును దిరుమల దేవరాయలు విక్రమించుట

గీ. తగవరిగదా నిజాముఁ డుద్దండజయప
టిష్ఠ తిరుమలరాయ ధాటికిఁ జలించి
పఱచునెడ శక్తి మఱచియు మఱవఁడయ్యెఁ
దత్తదుచితప్రదేశ సంధాన యుక్తి.

ఇబ్రహీముతోడి యుద్ధమునందుఁ గూడఁ దిరుమలరాయల తోడ్పాటు గలదు.

క. అబ్రాశిధీర ధీరచి తబ్రాహ్మీధవ వివేక తరుణచరణభా
గిబ్రాహ్మశరణ సకలక, కుబ్రాహ్మాభరణ కరణగుణసంభరణా.

రామరాజునకుఁబిదప

క. 'ఆరామశౌరిపిమ్మట, ధీరామరశాఖి వీరతిరుమలరాయం
డారామ సేతుహిమవ, త్తారమణీ రమణుఁడై జగంబు భరించెన్'

అనుటచేఁ దిరుమలరాయలు రాజ్యమునకు వచ్చెను. రామరాజు తల్లికోట యుద్ధమున హతుండగుటవలన కర్ణాటరాజ్యము క్షీణింపఁగా మఱలఁ దిరుమలదేవ రాయలు పట్టాభిషిక్తుఁడై దాని నుద్ధరింపఁజేసెను, ఇదియే కర్ణాటరాజ్య విభవ పునరుద్ధారియనుట తెలుపుచున్నది. తిరుమలదేవరాయలు పిదపఁ బట్టాభిషేకము నొందుట,

గీ. కడిగికొనియె వసుంధరా కమలనయన, యార వీరప్రతాప రాజాధిరాజ
రాజదేవేంద్ర తిరుమల రాయచంద్ర, సాంద్ర పట్టాభిషేకాంబు సముదయమున.

నను పద్యముచేఁ దెలియుచున్నది. అయిన నితఁడు మఱలఁ బట్టాభిషిక్తుఁడైనది విజయనగరమునఁ గాదు పెనుగొండయందు. ఇది పెనుగొండపై నిజామెత్తివచ్చిన యుద్ధమువలనఁ దెలియుచున్నది.

చ. తిరుమల రాయశేఖరుని ధీరచమూభటరాజి యాజిభీ
కరయవనేశ్వర ప్రహితఖానబలంబులఁ జక్కుసేయ ని
ద్ధరఁ బెనుఁగొండకొండలు మదద్విప చర్మకపాలమాలికా
పరికరభూషితంబు లయి బల్విడిఁ గాంచె గిరీశభావమున్.

తిరుమలదేవరాయలు వేంగళాంబయందు లక్ష్మీరాముఁడు, రఘునాథుఁడు, శ్రీరంగరాయఁడు, రామరాజు, వేంకటరాయఁడని యేవురుపుత్రులను గాంచెను.

వీరును దండ్రితోడ నిజామాదులయుద్ధమునందు విక్రమించుట తెలియు చున్నది.

శా. యాదోరాశి గభీరమూర్తి రఘునాథాధీశుఁ డుద్దండ బా
హాదర్పాంధసపాదమల్కికనిజామానీకముల్ ద్రుంప జ
న్యాదూరక్షితిఁ బాఱుకృష్ణకును గృష్ణాకంబు నాఁ డబ్బె బి
బ్బీదీవ్యన్నయనాబ్జకజ్జలజలాభీలప్రవాహంబునన్.

తిరుమల దేవరాయుల పిదపఁ బట్టాభిషిక్తుఁ డైనవాఁడు శ్రీరంగరాయలు.

చ. హరిపదభక్తశీలుఁ డగునారఘునాథ నృపాలుకూర్మిసో
దరుఁడు సిరంగరాయవసుధావరుఁ డాత్మగుణప్రమోదవ
త్తిరుమలరాయశేఖర వితీర్ణమహాయువరాజపట్టబం
ధురుఁడయి సర్వభూభువన ధూర్వహశక్తి వహించు నెంతయున్.

ఇతనితమ్ముఁడు రామరాజతనికాలమున

మ. ఘనశౌర్యుండు సిరంగరాయ నరలోకస్వామితోఁబుట్టు రా
మనృపాలాగ్రణి సహ్యజాంబుధిపయోమధ్యోర్వి శ్రీరంగప
ట్టనలంకానగరంబు పుణ్యజన పీడావార్త లేకుండఁ గై
కొనియెన్ మిత్రభవ్యోపకార నిరపేక్షుండై విచిత్రంబునన్.

అన్నట్లు శ్రీరంగపట్టణమును సాధించెను. ఇతనితమ్ముఁడు వేంకటరాయలు

మ. 'హరుఁ డాతారకశైలదుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖరవిఖ్యాతి వహించుఁ జంద్రగిరి దుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖరసదాసంసేవ్యుఁ డై యారయి
ద్ధర బంటేలికవాసి తద్గిరులకున్ దద్వల్లభశ్రీలకున్'

అన్నట్లు చంద్రగిరిదుర్గమును బాలించుచుండెను. శ్రీరంగరాయలకుఁ బిదప వేంకటరాయలు రాజ్యమును బెనుఁగొండనుండి చంద్రగిరికి మార్చు కొన్నట్టు క్రిందిపద్యమువలనఁ దోఁచుచున్నది.

గీ. అంచువారల నిరసించి యవనికాంత
తనభుజాదండమున నుండఁ దనరుచుండు
భావజనిభుండు వేంకటక్ష్మావరుండు.

ఈ పుత్రులందఱును దిరుమలరాయలకాలమునందును నతనికిఁ జాలఁ దోడ్పడుచుండి వైక్యమునఁ బ్రవర్తించుచుండిరి.

క. ఆతనయులు జగతీ విఖ్యాతనయులు గొలువ శాశ్వతైశ్వర్యకలా
న్వీతుఁడు తిరుమలరాయోర్వీతల నాయకుఁడు వెలయు విభవోన్నతుఁడై.

సదాశివరాయలదానశాసనములు తిరుమలదేవరాయలకాలమునందుఁ గనఁబడుచున్నవి కాని తిరుమలరాయలే కర్ణాటరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడైనట్టు తెలియుచున్నది.

గీ. అంతకాలము తనయంద యచలయై య
నంతయై రత్నగర్భయై యనని యలర
నలరుఁ గర్ణాటరాజ్య సింహాసనాధి
రాజ్యశుభశాలి తిరుమల రాయమౌళి.

దీనినిబట్టి సదాశివరాయల రాజ్యప్రసక్తి యేమైనదియుఁ దెలియరాకున్నది. తిరుమల దేవరాయలకుఁ బిదప యువరాజపట్టమును శ్రీరంగరాయలు 'చ. హరిపద భక్తిశీలుఁడగు నారఘునాథ నృపాలు కూర్మిసో, దరుఁడుసిరంగరాయ వసుధావరుఁ'డను పద్యమువలనఁ బొందెనని దెలియుచున్నది. వేంకటరాయ లపుడు, 'మ. హరుఁడాతారక శైలదుర్గమున నధ్యాసీనుఁడై రాజశేఖరవిఖ్యాతి వహించుఁ జంద్రగిరిదుర్గంబందు శ్రీవేంకటేశ్వరుఁ' డనుపద్యమువలనఁ జంద్రగిరిదుర్గము నేలుచుండెనని తెలియుచున్నది. పెనుఁగొండలో శ్రీరంగరాయలు రాజ్యము చేయుచున్నప్పుడును భామినీపాలకులు పయినెత్తి రాఁగా వారి నతఁడు గెలిచెనని ఫెరిస్తావ్రాఁతల వలనఁ దెలియుచున్నది. శ్రీరంగరాయల కనంతరము మహమ్మదీయుల దాడికోర్వకయో మఱి యేకారణముననో పెనుఁగొండనుండి వేంకటరాయలు పాలించుచుండిన చంద్రగిరికే రాజధాని మార్పఁబడినట్లు తోఁచుచున్నది. ఇప్పు డీవంశమువారే యానెగొందిసంస్థానపాలకులై యున్నారు.

ఈ తిరుమల దేవరాయలకు వరాహధ్వజము. ఇతఁడు భూవరాహాంకుఁడు 'వసుమతీ భారధూర్వహత నెవ్వని యుర్వీరావరాహాంక మర్థమువహించు' నని కవి చెప్పియున్నాఁడు. మఱియు నితనికి 'వీరప్రతాప రాజాధిరాజ' 'రాజపరమేశ్వర' 'అష్టదిగ్రాజకుల మనోభయంకర' 'జయజన్య మన్నెవిభాళ' 'మూరురాయరగండ' 'ఎంతెంబరగం'డాది బిరుదములునుగలవు. ఇతని దాత్రేయగోత్రము. ఇదియెల్ల వీరాఁదిశాసనమునఁ దెలియవచ్చుచున్నది.

'ప్రాజ్య కర్ణాటరాజ్య శ్రీస్థాపనాచార్య విక్రమతేజః
ఆత్రేయ గోత్రపాథోజ మార్తాండస్య మనస్వినః
అంతెంబవరగండస్య సింధ్వన్త క్షితిరక్షిణః
వర్ణితయశసో నానా వర్ణశ్రీ మండలీకగండస్య
పబిరుదరాయరాహుత వేశ్యాకభుజఙ్గ బిరుదభరితస్య

విఖ్యాత బిరుదమన్నె విభాళాలీలస్య విజయశీలస్య
విశ్వమ్భరాభృతిస్ఫుటవిశ్రుతధరణీ వరాహబిరుదస్య
కల్యాణపురనాధస్య శల్యారి సమతేజసః
వేంగీ త్రిభువనీమల్ల లింగస్థిరయశోనిధేః
శ్రీమత్తిరుమలక్ష్మాప శేఖరస్య దయామ్బుధేః
(ఎపిగ్రాఫికా యిండికా 9 వ పుస్తకము. 338వ-పుట.)

తిరుమలరాయలకు చాళుక్యనారాయణుఁడను బిరుదమును గలదు. ఇదియే నరసభూపాలీయమున,

'రాజదేవేంద్రుఁ డితఁడనఁ దేజరిల్లు, ననఘ చాళుక్యనారాయ ణాంకవివిధ బిరుదమన్నె విభాళాది బిరుదశాలి, ప్రాభవప్రాపేతుఁ డెఱతిమ్మ పార్థివుండు.

ఈ నారాయణ బిరుదమునుబట్టియె వసుచరిత్రమున,

మ. ధర నెవ్వానికి వ్రాయుపద్మజుఁడు వ్రాతల్ వానితోనేగు న
స్థిరముల్ శాశ్వతకీర్తి యాతిరుమల శ్రీరాయనారాయణుం
డు రహిన్ వ్రాసిన శాసనాక్షరము లుండుం బుత్రపౌత్రాన్వయ
స్థిరవృత్తిం బృథుకాక్షరంబులు గురుశ్రీపర్ణతుల్యంబు లే.

యనుపద్యమున 'తిరుమల శ్రీరాయనారాయణుఁ' డన్నాఁడు. ఇట్లాయా పద్యములందు స్ఫురించుచరిత్రాంశములను దదర్థగ్రహణసౌకర్యమునకై వ్రాసితిని. ఇంతవఱకుఁ గృతికర్తను గూర్చియుఁ గృతిపతిని గూర్చియు వ్రాసియైనది. ఇంక నీ

## కృతి

నిగూర్చి వ్రాసెద. ఇందలి యితివృత్తమున కాకరమగు గథాభాగమును, దాని యందుఁ గవి కవితారసోచితముగాఁ బెంచుచును దగ్గించుచును మార్చుచును వచ్చిన యంగములును, గవితాశైలియు మొదలగువిషయములును వ్రాయుటయావశ్యకము. ఇందలికథ మహాభారతమునుండి కయికొనఁబడినదని మునుపు వ్రాసితినిగదా. ఆకథాంశము నిట నందున్నరీతిని సంగ్రహించి వ్రాసెద.

చేదిదేశమును వసు వనురాజేలుచుండెను. అతఁ డొకనాఁడు వేఁటకుఁబోయి యొకతపోవనమునఁ దపముచేయుచుండెను. అపుడు దేవేంద్రుఁ డతనికడకు వచ్చి యాతని రాజ్యపాలనమునకును దపస్సునకు మెచ్చి మైత్రిచేసికొని, తనలోకమునకు రాకపోకలు చేయుచుండుమని యాతనికిఁజెప్పెను. మఱియునింద్రుఁడాతనికిఁగనక రత్నమయమై కామగమన మగువిమానమును, దేవత్వమును, సకలప్రహరణముల నువారించు నింద్రమాలయును కమలమాలికయు, దుష్టశిక్షణశిష్టరక్షణక్షమంబైన

వేణుయష్టియు ననుగ్రహించెను. వసు వావిమానము నెక్కి యుపరిలోకముల సంచారము చేయుటంబట్టి, యతనికి నుపరిచరవసువను పేరు కలిగెను. అతఁ డింద్రమాలికను దాల్చి యావేణుయష్టికిఁ బ్రతిసంవత్సర మింద్రోత్సవము చేయుచునుండెను. అది మొదలుగ రాజు లేఁటేఁట నింద్రోత్సవము చేయువారైరి. ఆవసురాజున కింద్రునివరమునఁ బుత్రు లేవురు పుట్టిరి. అతఁడు రాజ్యము సేయుచుండఁగాఁ జేదిపట్టనమునకు సమీపమునఁ బాఱు శుక్తిమతి యనునదిని హిమవంతుని పుత్రుఁ డగు కోలాహలుఁడు కామించి నిరోధించెను. అపు డానదీ జలములచేఁ జుట్టుప్రక్కలజనపదముల కుపద్రవము గలుగఁగా వసురా జెఱిఁగి తనకాలిగోట నాకోలాహలు నెగమీటి యానది వెల్లువ నాఁపినవాఁడయ్యెను. శుక్తిమతికిఁ గోలాహలునిసమాగమమువలన వసుపదుఁడను పుత్రుడును గిరిక యను పుత్రికయుఁ బుట్టిరి. ఆనది, వసురాజు తనకుఁ గోలాహలునివలని నిరోధము నుడిపినందులకుఁ గానుకగా నాబిడ్డలనిరువురను నా రాజునకు సమర్పించెను. రాజు వసుపదుని సేనాధిపతిగాఁ జేసి గిరికను బెండ్లియాడెను. ఇదియ భారత మందలికథాంశము

వేఱొకచోట నిచ్చియున్న వసుచరిత్ర కథాసారమును జూచినయెడలఁ గవి యామూలకథయందుఁ గవితారసానురూపముగాఁ గావించిన మార్పులు తెలియ వచ్చును. వసురాజు వేఁటకుఁ బోవఁగా నచ్చట గిరికను దలఁచుకొనుటవలన నతనికి రేతః స్ఖలనమగుటయు, దానినొక డేఁగ యఱుతెంగట్టిపంపుటయు మొదలగునంశములు రసానుగుణ కథాప్రణాళికకు ననుపయుక్తములును ననుచితములు నగుటచేఁ గవి విడిచిపెట్టెను. కవి కవితానిబంధమునకు జీవాతువు రసపోషణము. ఆరసపోషణమునకై వంశానుచరితనముకుఁగా నున్నయైతిహాసికకథను బెంచియుఁ దగ్గించియుఁ గొనుటయె యావశ్యకము. కాళిదాసును దనశాకుంతల కథను భారతమునుండి కయికొన్నను, రసానురూపముగా దానియందుఁ బెక్కుమార్పులు గావించుకొన్నాఁడు. ఇట్టి మార్పులు రసైకజీవికుఁడగు కవికిఁ ద్రోసిపుచ్చరాని వియై యున్నవి. భారతమునఁ గోలాహలసమాగమమువలన శుక్తిమతి తాను గన్నగిరికను వసురాజునకు నర్పించెననియు నతఁడాబిడను బెండ్లాడెననియునున్నది. కవి యాముక్కనుగొని మొదట వసంతవర్ణనము చేసి వనపాలకులచే రాజును వనవిలోకమునకు వచ్చునట్లుగావించి, యచ్చటనుండి కిన్నరపక్షిమిథునప్రసంగతిని దెచ్చి కోలాహలపర్వతాగమనమునుగూర్చి యందు మృదుగాన సమాకర్ణనమును బొందుపఱచి, నర్మసచివదూత్యమును బచరించి, మఱికొన్ని మతకములచే నాయికాసందర్శనమునొందించెను. పిదపఁ జెలులచేతగిరికావృత్తాంతకథనమున శుక్తిమతీకోలాహలచరిత్రమును దెలిపినాఁడు. అవ్వల నాయికానాయకవిప్రలంభశృంగారము. పిదప మంజువాణీదౌత్యము. అంతట నిరువురకువివాహము నని యింతపెద్దదిగాఁ బెంచినాఁడు. ఇచ్చట నాయికాసందర్శనమువఱకునుగల విష

యము, పెద్దనమనుచరిత్రమును జూచి యనుసరింపఁబడినది. మనుచరిత్రమునఁ బ్రవరుఁడు సిద్ధునిమూలమున హిమవంతమునకుఁబోవుటయుఁదద్వాసిని యగువరూథినిని జూచుటయు ఘటింపఁబడినవి. ఇందు గిరికావాసమగు కోలాహలమునకు రాజును దోడ్తెచ్చుటకై వనపాలుగరయాహ్వానమును, నుద్యానసందర్శనమును, నందలికిన్నర మిథునమునుగూర్చి యాకొండకుఁదెచ్చినాఁడు; నాయికనుజూపినాఁడు. మనుచరిత్ర మందలికోనయు నిందుఁగలదు. అందు వీటికాగంధమారుతము పొలసి ప్రవరు నాకర్షించినది. ఇందు మృదుగాన మాకర్షించినది.

క. 'మృగమదసౌరభ విభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపుఁ దెలుపునొక్కమారుత మొలసెన్ (మనుచ)

వ. విశ్రమించిన నందొక్కకలస్వనంబు విన వచ్చె మాధురీధుర్యమై.

క. వీనులవిందై యమృతపు
సోనలపొందై యమందనుమచలదళినీ
గానముక్రందై యారవ
మానందబ్రహ్మమైన నధిపతి పల్కెన్ (వసుచ)

అచ్చటికోన

సీ. రేలెల్ల నమృతమరీచినంటున నంటఁగరఁగి నిర్మలపయోఝురులఁ దొఱఁగి
బలువిడి ఫెనులో యఁబడిన శ్రీన్నెలతాల, చఱులలో నిరుగడఁ దఱచుమెఱచు
పటికంపుఁబణఁకులపజ్జ గొజ్జఁగెనీటి, యేటిక్రేవలఁ జలియినుకవెట్టు
నేఁడాకుటనఁటుల నెలమావిగుమురుల, సురపొన్నకూటాలఁ జుట్టుకొనిన
బండిగురువెందలిగ చప్పరము లెనసి
ముడిగొనిన ద్రాతుపందిళ్లనడుమఁ గిన్న
రీనినాదానుకారిశారీశుకాది
ఘోష ఘుమఘుమితంబైనకోన గనియె.

దీనికే మనుచరిత్రమునందు,

సీ. కులిశధారాహతిఁ బొలుపుసఁబైనుండి, యడుగుమోవఁగ జేగుతైనతటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఝరమువాఱఁ, జలువ యాసద్యోటి కెలఁకులందు
నినుకవెట్టిన నేల నేచి యర్కాంశులఁ, జొరనీక దట్టమై యిరులుగవయు
క్రముకపున్నాగనారంగరంభానారి, కేరాదివిటపికాంతారవీథిఁ

కెరలుపికశారికాకీరకేకిభృంగ
సారసధ్వనిఁ దనలోనిచంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వయువతి
గానఘూర్ణిత మగునొక్కకోన గనియె.

(మనుచరిత్ర)

అందు "పూవుందీవలనొప్పునొక్కభవనంబున్ గారుడోత్కీర్ణము"ను జూచినాఁడు. ఇందును "నిరుపమంబైనదివ్యమందిరము" గనియెను. ఆభవనమున

సీ. తతనితంబాభోగధవళాంశుకములోని, యంగదట్టపుఁగావిరంగువలనఁ
శశికాంతమణి పీఠిజాజువాలుఁగఁగాయ, లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీ ధూతతంత్రీస్వనంబుతో, జిలిబిలిపాటముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కియరమోడ్పుకనుదోయి, రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢిఁ బలికించుగీతప్రబంధములకుఁ
గ్రమకరపంకరుహరత్నకటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయించుచుండె.

ఇందు,

సీ. వలుఁదగుబ్బలు ప్రసేవకవృత్తిఁ దగుగుబ్బ, కాయలకపరంజిచాయ లొసఁగ
లలితాంగుళీదళంబులు సమేళములైన, సారెలపై రాగసంపద లీడఁ
బాణికంకణరుతుల్ ప్రాణానుబంధంబు, గల తాళగతి కనుగ్రహము లీన
నాలాపభంగి యత్యక్తసంవాది స, మస్వరంబులకు గ్రామంబు లునుపఁ
బ్రచురతానామృతముల మూర్ఛనల్చేన
చేతనంబులు చేతనరీతిఁ దనరఁ
జేతనంబు లచేతనభాతి నొనర
వీణ వాయించునొకయలివేణిఁ గంటి.

అందలి నాయికయెట్టిది?

మ. అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలం జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్.

ఇందో,

చ. తరువులపొంతఁ బొంచి వసుధావరమిత్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభం

దరళవిలోచనం దతనితంబఁ దటిన్నిభగాత్రవల్లరిన్
దరుణశశాంకఫాల నొకదన్విఁ దరంగ వళిం దలోదరిన్

దీని కెల్ల మూలము శృంగారనైషధమున,

మ. కమలేందీవర షండ మండిత లసత్కాంతార సేవారతిన్
గమికర్మీకృత నైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందు బింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్,

(ఆ-2-ప-21)

అని యున్నది.

ఇట్లు రెండుకావ్యములందునుగల కథాప్రణాళికయందు రచనల సామ్యమునుజూపుట మనుచరిత్రమును రామరాజభూషణుఁ డనుకరించువిధమును దెలుపుటకై, మనుచరిత్రమునందుఁ బెద్దన శ్లిష్టరచనలయుబడిం బడక కేవలము స్వభావలక్షణముల సహజపటుశైలిని జిత్రించి పాత్రమును నత్యంతరసాలంబనమును గావించినాఁడు. వసుచరిత్రమునందో శ్లేషరచనముల చిక్కులు పెక్కులు దవిల్చికొనియు నాయుబడిని దోఁపనీయనిమృదుపదగుంభనమాధురితో మిటారించు సొబగునడతోఁ బాత్రమును లోకోత్తరసౌందర్యపాత్రముగా దిద్దినాఁడు. అందుఁ బరమఛాందసుని వగలాడి మిన్న కడకుఁ దెచ్చినందున నా యిరువుర నడుమ శృంగారరసము పొంగారినదిగాదు. పిదప నాయిక విప్రలంభశృంగారము. ఆఛాందసుని వేషము దాల్చిన గంధర్వునకును నాయికకును గడుపులోని చిచ్చువంటి యొడంబడికతో సంభోగ శృంగారము గాన నిదియుఁ బయోముఖవిషకుంభమే. స్వరోచి యా విర్భవించిన పిదప నతనికిని గళావత్యాదులకును ననురూప శృంగారము ఘటించినను హంసమిథున వాక్యాదులవలనఁ దద్రసప్రణాళికకందంద విచ్ఛేదము. కడపట స్వారోచిషమనువు కేవలశాంతిరసప్రాబల్యముతోఁ ప్రబంధ సమాపనము. దీనింబట్టి మొత్తమునకు మనుచరిత్రము వస్త్వైక్యముగాన రాదు.మఱియు శృంగారరసము వస్తువైవిధ్యమువలనను విషమ సమాగమముల వలనను, గడపటి శాంతిరసైక ప్రాచుర్యమువలనను, నొక్కరూపున సాగక [illegible]దొడుకై వింగడించుచున్నది. వసుచరిత్రమునందో మొదటినుండి కడవఱకు[illegible]స్తువున నైక్యమును రసమున కుత్తరోత్తరావిచ్ఛేదమును గానిపించుచున్నది. మొదటి నాయికానాయకు లిరువురే కడవఱకును శృంగారరసపోషణమునఁ బాలుపడియున్నవారు. అందుఁ బ్రవరవరూథినీ సమాగమమువలె నిందు శుక్తిమతీకోలాహలసంగమము నున్నది కాని యిది మొదటఁ గన్నాకుగా రాక నడుమ సంగముగా వచ్చుటచే శృంగారరసముతో విరోధింపక దానికి సహాకారమైయున్నది.

ఈకవి కవిత్వము శ్లేషైకతానము. అయినను గొన్ని శ్లేషకవనములుంబోలె గటువై యర్థక్లేశము నాపాదింపక మొత్తమునకు మృదుపాకసౌభాగ్యము గలిగి యతిభోగ్యముగా నుండును. ఒక్కయుదాహరణము.

వసంతవర్ణనము.

చ. ఒనర హిమాపకుంఠనము లూడ్చి తెమల్చినపత్త్రభంగముల్
సన నసియాడుచుం మొగడచన్నులు పల్లవపాణిఁ గప్పు నా
తనలతికాలతాంగుల నుదారగతిం జలి వాపి నెయ్యపుం
బెనఁకువ నేర్పె దక్షిణసమీరణుఁ డొయ్యనఁ దావులంటుచున్.

మ. అలరుంగ్రైదువుజోదుకూర్మిసయిదోడై మాధవశ్రీతపః
ఫలమై యాడుమరుత్కుమారుఁ బ్రియమొప్పం దేనెనిరాల్చి లేఁ
దెలిపూజొంపపుఁబొత్తులం బొదిఁగి ధాత్రీజాతముల్ జోల వా
డె లసత్పల్లవడోల నుంచి కలకంఠీగీతనాదంబులన్.

సీ. మును సుమనోరాగమున వసంతము సూపెఁ, గాన నేఁడిర యశోకంపుఁ గొమ్మ
కాకొమ్మ నగుచు నెయ్యమునఁ గ్రొన్ననతేనె, మొలఁగెడుసరసాళిమీఁదఁ జల్లె
నాసరసాళి సోయగపుఁబాటలతోడఁ, జని మాధవిప్రవాళశాఖిఁ దుడిచె
నామాధవిపరాగ మక్షిరాగము మించఁ, బరతెంచు కలకంఠిపై విదిర్చె
నిట్లు లతికలు హితకోటి నెనసి యపుడు
మదనదేవోత్సవక్రీడఁ బొదలు ననిన
వరులుఁ దరుణులు విరులయోవరుల వఱలు
సిరుల వలరాచజాతరుల్ సేయు టరుదె.

ఇందు శ్లేషబంధమును వీడకయె సులలిత పదగుంభనమున సర్థవైభవమెంత గూర్చినాఁడో తెలియుఁడు. మఱి యుద్యానపాలురు రాజునకుఁ గానుకవెట్టు పండ్లు మొదలగువానిని గొని,

సీ. "ఏపారు పొదరిండ్ల నాపాటలాశోక, దీపార్చిఁ గనక కలాపమరసె
[illegible]లావలులు దాఁటి యేలాలతావార, బాలాతతిపరాగపటల మూడ్చె
[illegible]నామధుపనవ్యగానామృతము మెచ్చి, సూనాసవము లెల్లఁ జూఱలిచ్చె
ఝంకారహితధీరహుంకార శుకభటా, హంకారములఫలాహతి యొనర్చె
ననుచు నాగంధవహునిధౌర్త్యములు దెలుపు
లీల విరిసినవిరులు రాలిన రజంబు
లులికిన రసంబు లురిలినఫలము లధిపు
మ్రోల నిడి పల్కు రుద్యానపాలు రపుడు."

అని యతిమనోహరమగు నొకచమత్కారసాధనము గావించినాఁడు. చప్పిడివిషయమైనను మహాకవిచేత నెంతో భోగ్యవస్తువుగా మాఱుచున్నది. మఱియు మనుచరిత్రమునఁ బ్రవరునికి హిమవద్దర్శనోత్సుకత్వంబు పట్టించుటకై సిద్ధుండు గావించినవర్ణనములుంబోలె వనపాలురును రాజుం జూచి యుద్యానవన వైభవమును,

సీ. ఇమ్ములై మరు వాజారమ్ములై పొదలుండఁ, బూఁజవికలు వేఱ పూనవలదు
తెప్పలై నత్తావిసుప్పలై పుప్పొళ్లు, రుల గందవడి తోవఁ జిలుకవలదు
సారమై హిమజలాసారమై పూఁదేనె, నెఱయఁ గేళాకూళి నింపవలదు
మొత్తమై మారుతాయత్తమై గంబూర, మెగయ వితానముల్ బిగియవలదు
స్వామి యారామశుభవైభవములు చూడ
నెపుడు విచ్చేయుదురొ యంచు నెదురుసూచు
సహజ సౌభాగ్యములు గూర్చి చైత్రుఁ డతఁడు
కూర్మి భవదీయ వనపాలకుండు కాఁడె"

యని యాలోకనోత్సవమును గలిగించిరి. ఈపద్యమునందలి యనుప్రాస విభవమును నర్థచమత్కారవైఖరియు నద్వితీయములు. రా జుద్యానమునకుఁ బోయిన పిదప నందలి లతికలను స్త్రీలుగా నుత్ప్రేక్షించి శృంగారచేష్టావిశేషములను వానికి నతి మృదుతరవాగ్వైఖరితోఁ గూర్చిన యొప్పు చెప్పనలవిగాదు.

మ. కలకంఠార్భటి నొండొరుం బిలుచుచుం గాఢచ్ఛదాచ్ఛాదికల్
వోలయంగా నవగంధబంధుర రజంబుల్ నిండఁగా జాలకం
బులు గాసింబడఁగా నికుంజనిలయంబుల్ మీఱి వాయుత్వరం
దలసూపెం బ్రతతీసతీవితతి గోత్రాకాంతుఁ డేతేరఁగన్.

చ. జనపతి దారసిల్ల నొకసంపెఁగతావులకొమ్మ రాగ
వర్ఘనసుమనోభిరామ యయి కాఁక వహింపఁగఁ బోలుఁ గానిచో
ననుపమపంచసాయకకరాంచలచంచలచాపశింజినీ
జనితకఠోరఝంకృతులు సైఁచకయున్నె పరాగపాండువై.

చ. చలితలతాంతకాంతి యనుచందురకావిచెఱంగు దాఁటి స
మ్మిళితవయోవిలాసముల మీటినవిచ్చుఫలస్తనాగ్రముల్
వెలువడఁ గప్పఁ దత్క్షణమ వేల్లితదోహదధూపధూమ కుం
తలములు విప్పి దాడిమలతాలలితాంగి నృపాలుచెంగటన్.

సీ. చిగురుఁగెంగేలు సాఁచె రసాలవల్లరి, తేఁటిచూపులఁజూచెఁ దిలకతిలక
పికగీతిఁ బాడిచూపెఁ బ్రియాళులత పల్కెఁ, గీరభాషలఁ గర్ణికారశాఖ
ముఖరకీర్తి నింపె నింపుగలసంపెఁగకొమ్మ, వన్నెగా నగియె తేఁబొన్నతీఁగ
సురభిళశ్వసనంబు నెరపె సింధుకవల్లి, గుబ్బచ్చెఁ దావులు సోకఁ గ్రోవిరెమ్మ

యాత్మ రుచిరోపచారంబు లధిప కల్పకంబునకుఁ దత్తదామోదగరిమఁ బెనుప
సంగనానిత్యకలితదోహదవిశేష, సన్నుతాచారముల సడిసన్నకతన.

తర్వాత రాజును గోలాహలమునకుఁ బుచ్చుటకు వలయు సాధనములను నతి మృదమధురగుంభనముల నలవరించినాఁడు.

తే. నృపునెదుటఁ దేనెవాఁకలో నిబిడవిచల
దతనుపత్త్రాళిఫలసాంద్ర మగుచు నొక్క
నగము కైవ్రాలి యేటిలో నాఁటియున్న
నాఁటియున్నతనగరాజు నలువుఁ దెలిపె.

ఉ. ఉన్నతి నన్నగాగ్రమున నున్నయొకానొక కిన్నరద్వయం
బన్నిఖిలోక్తివేది కపు డన్యదురాసద మైనయొక్క యా
సన్నశుభంబుఁ దిన్నని ప్రసన్ననిజోక్తులఁ దెల్పి తోన యేఁ
గె న్నరదేవపాదపవిఖిన్నబృహన్నగకూటవాటికిన్.

క. ఆలోకాద్భుత విహగయు, గాలోకి ప్రీతివలన సతిలోకినయః
కోలాహల కోలాహల, లీలాహలహాలిక చెంగలించెం బతికిన్.

ఇట్లు తేనెవాఁకలో నాఁటియున్నవృక్షమును, అవృక్షాగ్రమందలి కిన్నరమిథునమును, వానిశుభోదర్క ప్రస్తావనమును, దన్మూలమున నవి కోలాహలపర్వతమునకేఁగఁగా దద్దర్శనార్థము దాను నాపర్వతమునకుఁ బోవ నుత్సహించుటయుఁ గల్పించినాఁడు. పక్షిమాటల నెఱుంగుటకై 'యన్నిఖిలోక్తి వేది'యనియుఁ జెప్పినాఁడు. పిదపఁ గోలాహలమునకుఁబోవుట. అందు విచిత్రకథాసందర్భసంవిధానమునకై నర్మసచివు నొకనిఁగూర్చి తన్మూలమున వారికిద్దఱకు సంభాషణ ప్రసక్తి గలిగించి కోలాహలవర్ణన మతివేలమనోహరముగాఁ బచరించినాఁడు.

సీ. ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ, మొకసీమ నానామయూరనినద
మొకవంక నకలంక మకరాంక హయహేష, లొకక్రేవ వనదేవ యువతిగీతి
మొకచెంత సురకాంతల కరాంత తతనాద, మొకదారి నవశారికోదితంబు
లొకయోరఁ బటుచారణ కుమార ఫణితంబు, లొకదండ నలిమండలికలగాన
మొక్క మొగిమ్రోయఁ గదళీగృహోపపన్న, కిన్నరీబృందబృందసంగీతరీతి
నమరునతి వేలకోలాహలముల కలిమి,నధిప యీయద్రికోలాహలాఖ్య మొక్క.

అంత గిరికానివాసంబగు నాకోలాహలంబునందు గిరికాసన్నిధి సమాకర్షణమునకై యొక కలస్వనసమాకర్ణనము.

క. పీనులవిందై యమృతపు, సోనలపొందై యమందసుమచలదళినీ
గానముక్రందై యారవ,మానంద బ్రహ్మమైన నధిపతి పల్కెన్.

అన్నట్లు బ్రహ్మానంద సంధాయకమగుటంబట్టి దానిమూలము నెఱుంగవలయుననికోరిక. ముందుగానే సంతరించియున్న నర్మసచివుఁడు తన్నాదము వచ్చిన

చోటికిఁబోవుట గూర్చినాఁడు. ఆపోవుదారియునందలి మందిరమును నల్లసానిపెద్దన యాచార్యకమువలన సిద్ధించినవే. ప్రవరుఁడు వీటీగంధస్థగితమారుతముచే నాకర్షింపఁబడిపోయినట్లు సచివుఁడు నాగమును విని పోయినాఁడు. అయినను ఛాందసుఁడగు ప్రవరునివలెఁ జక్కఁగా 'చేరఁజనిపల్కె విభ్రాంతుఁడై' కాదు. నర్మసచివుఁడు రసజ్ఞుఁడు. రసజ్ఞుఁడైన నేమి, యామందిరమున సుందరులుండుట యెట్లు గ్రహింపనగును? అందులకై,

"క. కనుఁగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తిముకురతలబహి
ర్జనితానుబింబనమ్ములు, వనితారత్నములు మెలఁగువల నెఱిఁగింపన్"

అని వనిత లుండుట దెలుపు సాధకము గూర్చినాఁడు. కాఁబట్టి రసజ్ఞుఁడగు సచివుఁడు ప్రవరునివలె విభ్రాంతుఁడై చేరంజనక తరువులపొంతఁ బొంచి కాంచి నాఁడు. మరల వసురాజుకడకు వచ్చి తదీయావయవసౌందర్యమును వర్ణించి రాజునకు విరాళిఁ బుట్టించినాఁడు.

తే. మేటిజమ్మేటి యసటఁ గ్రొమ్మిసిమిచుమించుఁ
బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటము వెట్టి
తమ్మిగద్దియదాకటఁ గ్రమ్మి యట్టి
కొమ్మఁగావింపఁబోలు నెత్తమ్మి చూలి.

ఈ పద్యమునకు నొరవడి,

తే. నేరెటేటి యసల్ దెచ్చినీరజాప్తు, సానఁబట్టిన రాపొడి చల్లి మెదిపి
పదను సుధనిడి చేసెనో పద్మభవుఁడు, వీనిఁగాకున్నఁ గలదె యీమేనికాంతి.

(మనుచరిత్రము.)

గిరికావయవవర్ణనమునం దధరవర్ణనమును మచ్చునకై యుదాహరించెదను.

సీ. కొమ్మవాతెఱతోఁ గుణమ్ముకై కొనివచ్చి, కఠినవిద్రుమము చేకట్లఁ బడియెఁ
గోమలి యధరంబుతో మొనల్ పచరించి, యరుచిబింబఫలంబు లవిసిపడియె
మృగనేత్రపెదవితో సొగసుఁబూనఁ గడంగి, కెంపు నీరసము నెక్కించుకొనియె
సతిమోవితో రసస్థితులు చూపి సుగంధ, వికలబంధూక మూరకయ విరిసె
డాయుపగడంబునకుఁ బగడంబు బింబ
మునకు బింబంబు మెఱయు కెంపునకుఁ గెంపు
బంధుజీవమునకుఁ దగబంధుజీవ
మౌర యాకుందరదన రదాంశుకంబు.

ఇందలి శ్లేషవైభవమును, ననుప్రాస సౌభాగ్యమును, భావచమత్కారమ్మును నిరతిశయములు. లోకమునందు సామాన్యముగా నేనుఁగులు కదళీ వృక్షములను భంజించుటను, బెల్లము ఖండశర్కర మొదలగు పాకావస్థలనొందుటను, గొ

యతి రంజకముగా గిరికయూరువులను మృదూక్తిమాధురిని గూర్చి వర్ణనము చేసినాఁడు.

మ. సతియూరుద్యుతిఁ జెందఁ బూని నిజదుశ్చర్మాపనోదక్రియా
రతిఁ బాథోలవపూరితోదరములై రంభాభహస్తంబులు
స్నతతిన్ వీడ మరుద్విభూతిఁ గదలింద్వగ్దోష మాచంచలో
ద్ధతశుండాతతిఁ బాయదయ్యె నదెపో తద్వైరమూలం బిలన్.

ఉ. ఇంతిమృదూక్తిమాధురికి నిక్షురసం బెనవ్రాలఁ జాల నా
ద్యంతము నోడి మధ్యమగుణాశ్రయమై నెఱకాఁకి నెన్నిజ
న్మాంతరముల్ వహించియుఁ దనంతనె ఖండములయ్యెఁ గాని యా
వంతయుఁ బూన దెంతివోడి యయ్యు నఖండతనీయసంపదన్.

అవయవ వర్ణనమును ముగించుచు సర్వావయవసౌందర్యసమష్టిని,

మ. "కమనీయాకృతి యోగ్యకీర్తనముల న్గన్పట్టునా శ్యామ యా
సుమనోవల్లరి యాసుధాసరసి యాసాంపొందు డాల్టీవి యా
సుమబాణాంబక యాయమూల్యమణి యాచొక్కంపుఁబూబంతి యా
కొమరుంబ్రాయపురంభ యాచిగురుఁటాకుంబోఁడి నీకే తగున్."

అని యొక్క పద్యమున వర్ణించినాఁడు.

దీని ననుసరించి వ్రాసిన పద్యములు రెండొకటిగలవు.

మ. తఱచుల్ వేయు నిఁకేల యాతెఱవ యాదానిమ్మ పూరెమ్మ యా
నెఱిగప్రంపుటనంటి క్రొమ్మొల్మలక యానిద్దంపు లేమావి యా
మెఱుఁగుంబంగరు తీవ యానన జిరామేల్జోదు వాలారునుం
గఱుకుంగైదువ యాకడిందినవలా కన్యాకు నీకే తగున్.

(అచ్చ తెనుఁగు రామాయణము)

మ. పలుకుల్ వేయు నిఁకేల భూరమణ యాబంగారుకీల్బొమ్మ యా
వలికప్రంపుటనంటికొమ్మొలక యా వాల్గంటి యాశ్యామ యా
యలివేణీ ఘనమాళికాభరణ మయ్యంభోజపత్రాక్షి యా
తలిరుంబ్రాయపుఁ గల్కి రాచిలుక యాతన్వంగి నీకే తగున్.

(రసికజనమనోభిరామము)

పిదపరాజును గిరికయున్న చోటికిఁదోడ్కొని పోవుట. అతఁడు

... ప్రాచీనపుం,

జాలుందీవలచాటునన్ నిలిచి వాచాలాళి పక్షానిలా,

లోలత్పల్లవజాలమార్గముల నాలోలాక్షి'

ని జూచెను. అంత వసురాజు గిరిక 'వినుతాంగ తరంగిత సౌకుమార్యములను'గొనియాడుట. గిరికా విషయమగు నగ

గిరికాసౌందర్యరసానుభావము నున్నస్తకము చేయుటచేతఁ గొంతసూటి మందగిల్లుచున్నది. అయినను గవినిరర్గళశ్లేషకవితాప్రవాహపరీవాహ మనివార్యమగుటచే నిది క్షంతవ్యము. అంత నర్మసచివుని గిరికయొద్దకు యోగివేషమునఁ బుచ్చెను; ఆవేషమునకుఁ బరికరము నాకొండయందె సమకట్టినాఁడు. ఎట్లు

సీ. కనకవల్లిమ తల్లికలవెంపు జడగుంపు, పుష్పపరాగసంభూతి భూతి
కమనీయశాఖాప్రకాండంబు దండంబు, తరుణపల్లవకోటి ధాతుశాటి
వల్కలఘట్టంబు వరయోగపట్టంబు, జాలకవిసరంబు జపసరంబు
ఫలరసాసారంబు పాత్రాంబుపూరంబు, కింజల్కములచాలు మౌంజినూలు
సేయఁజాలిన యమ్మహాశిఖరిశిఖర, రుచిరసురభూజరాజిచే నుచితవేష
మొనసి నరపాలనిరపాయహితవిహార, హారి గడిదేఁటి యొకజడదారి యయ్యె.

దీనికిఁ బ్రతిగా మనుచరిత్రమున గంధర్వుఁడు ప్రవరవేషమును దాల్చిన పద్యమును జూడుఁడు.

సీ. అర్ధచంద్రుని తేట నవఘళించులలాట,పట్టిఁ దీర్చినగంగమట్టితోడఁ
జెక్కుటద్దములందు జిగివెల్లువలుచిందు, రమణీయమణికుండలములతోడ
బసిఁడిబ్రాఁతచెఱంగు మిసిమిదోఁపఁజెలంగు, నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేనిరాకట్టు జాళువామొలకట్టు, బెడఁగారునీర్కావి పింజెతోడ
ధవళధవళము లగుజన్నిదములతోడఁ
గౌశికాముద్ర యిడినయుంగరముతోడ
శాంతరస మొల్కుబ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుఁడయ్యె వియచ్చరప్రవరుఁ డపుడు.

వసుచరిత్రమునందలి శబ్దాలంకారసముల్లసితంబగు రచనయు మనుచరిత్రమునందు స్వభావవర్ణనైకవిలసితంబగు రమణీయతయును దెలియునది. ఇందు శబ్దాలంకారడంబరములో వేషస్ఫూర్తి చక్కఁగా మది నచ్చుపడదు. అందు నర్థసంపదలో వేషము కన్నులు ముందుఁగట్టినట్లుండును. వేషమైనది. ఇంక నేమిపని ? నర్మసచివుఁడు గిరికయొద్దకుఁ బోవలయును. అందులకై కవి యొకయుపశ్రుతిని బొందుపఱిచినాఁడు.

తే. గంధగజయానగీత ప్రబంధకలన
నలరి యతి లియ్యమైపచ్చు టరిది మగువ
లార కనుఁగొంటిరే యనునాళివాక్య
మొకటి విన్నదైన నిదె వేళ యొదవె ననుచు.

ఉ. మేలు లతాంగి నీపలుకు మెచ్చితినే యతివచ్చుజాడ యే
లీల నెఱింగితమ్మ బహుళీకృతచాతురి మించునీవిపం

చెలులిటారవామృతము చిత్తము సోఁకినవార లీకళా
శాలినిఁ జూచి దీవన లొసంగక పోవరు చుమ్ము నావుడున్.

పిదప సచివుఁడు స్వపరముగాను యోగిపరముగాను నర్థద్వయము గలుగు నట్లు తనవృత్తాంతమును నాకారగోపన కౌశలముతోను యథార్థనివేదన చాతురితోను నుపన్యసించి తన మాహాత్మ్యము వారికిఁ దోఁచునట్లు,

చ. అనుపమభాగ్యలక్షణసమన్వితి యీరమణీలలామ యీ
మనసిజరాజరాజ్యరమ మానసవీథిఁ దలంప సింధునం
దన యచలేంద్రనందన యనం గననయ్యెడి నీలతాంగిపా
వనకులగోత్రభూతి చెలువా చెలువారఁగఁ దెల్పవే యనన్.

జన్మవృత్తాంతమును దెలిసియుఁ దెలియనివానింబోలె నడిగినట్లు, 'సింధునందన' 'అచలేంద్రనందన' 'పావనకులగోత్రభూతి' యను పదములు కవి నిబంధించెను. సచివుఁడేమో సామాన్యముగా నట్లడిగినాఁడు. అందలి యర్థాంతర ఘటనమువలన యోగికావున నాంతరదృష్టిచేఁ దెలిసి యడిగినట్లు చెలులకుఁ దోఁపించినాఁడు. ఈనైపుణి నిరుపమానమని చెప్పఁ దీఱదు. ఇందుఁ గవికి నాటక కథావైచిత్ర్య సంవిధాన చాతురియు నవలలు రచించువారి యపూర్వ సందర్భ నిర్మాణ ప్రాగల్భ్యముఁ గూడియున్నవి. పాత్రములను నాయాసందర్భముల నాయా సంధ్యంగములచేఁ దెరచాటుననుండి రంగమునఁ బ్రవేశపెట్టుటయు, బీజములచేతఁ గథాప్రణాళికను గొనసాగించుటయు ననునాటకలక్షణముల నెన్నియో యిందుఁ జూడనగును. వసురాజుమాటున నుంచుటయు, సచివుని వేషాంతరమునఁ జొనుపుటయుఁ, బరస్పర సంభాషణ సందర్భనాదులకు యాదృచ్ఛికములగు సందర్భములను జిత్రించుటయు, నిందఱప్రతిమానములుగా నున్నవి. నెచ్చెలులు 'వంచనాయతి యాదృచ్ఛికసూక్తి నూటిపడి'సందున 'అన్యోన్యాసనాలోకనాయత నానాద్భుత లీలఁ దేలి మునిమాహాత్మ్యంబు వర్ణించిరి' వారిలోమంజువాణి 'సీకియ్యాఖల ప్రపంచకథ లెల్లనెఱుంగు తెఱంగుచోద్యమే' 'ఈరమణీలలామ ... సింధునందన యచలేంద్రనందన యనం గననయ్యెడు నంచు నిట్లు పే, ర్కొనియును గ్రమ్మఱం దెలియఁగోరుట కూరిమిపెంపునం గదా' యనిచెప్పి యంతగిరికావృత్తాంతప్రస్తావమునకు దిగి నాయికాజనన మూలమగు శుక్తిమతీకోలాహల సమాగమమును జెప్పించినాఁడు. ఆయిద్దఱకును స్త్రీత్వ పురుషత్వములతోనే కాక నదీత్వపర్వతత్వములతోను సమాగమము పొందుపఱచుటకై యర్థద్వయము గూర్చినాఁడు. ఇందుఁ జూపిన శ్లేష రచనాకౌశల మత్యంత స్తుతి పాత్రము. శుక్తిమతిని గోలాహలుఁడు చూచి కామించుటకై దానికి బ్రహ్మలోకగమనమును మూలమందు లేని దానిని గల్పించినాఁడు. ఆ శుక్తిమతి,

'భాగధేయమహిమంబున మిన్నులు ముట్టివచ్చు ధ
న్యుని నతనిన్ భజించి నదియున్ వినయంబున నోరయైచనున్.

ఇందలి 'మిన్నులుముట్టివచ్చు' 'ఓరయైచను' ననుపదములచేఁ బర్వత
ాకాశము నంటుటయు నది పర్వతము నోరగిలి పాఱుటయు ననుధర్మములు
ంజితము గావించినాఁడు. మఱియుఁ గోలాహలుని విరహావేదనను బర్వతధర్మ
ను వదలకయె యతి మృదుమధురఫణితిని జోడించిన యానుడికారము
ంక మీకవికులతిలకునికే తగును.

తనకూటములఁ బ్రోదిఁ దాల్చురంభాదులు, సరసభావముదప్పి శిరమువంపఁ
దనలోలతలఁ బెంపుగనుకలకంఠులు, చేరి పైప్రవాలక చెదరిపలుకఁ
దనవంక నలరుపద్మినులెల్లఁ దమి గాన, కయ వాడి మోము లగ్గలముముడువఁ
దనమహాభోగంబులనెసఁగు భోగినుల్, వెరలి నిట్టూర్పుఁదెరలు నెఱప

. నకటకట మంచుమలపట్టి యతనుతాప
వహ్నిపాలయ్యె ఝురబాష్పవారి యగుచు
నిత్యశుక్తిమతీధ్యాననిశ్చలాత్ముఁ
డగుచు నంచితగహనరోమాంచుఁ డగుచు.

కోలాహలుఁడు శుక్తిమతికిఁ జెప్పినపద్యమును జూడుఁడు.

ఉ. నావలనం బ్రియం బెఱిఁగి స న్నోకమాఱును బల్కరింప కీ
వే వెస నోరచేసికొని యేఁగుదుగాని సరిల్లలామ ని
న్నేవగఁ జేరవత్తు మది కింపగు నీదునవ్యోదితామృతం
బేవగఁ గ్రోలఁగాంతు నని యే నెపుడుం దలపోయుచుందుదున్.

ఇందు నదీపర్వత ధర్మములును గూర్చియున్నాఁడు. కోలాహలుఁడు 'తప్పక యంతరంగమునఁ దాఱిచి నన్ను నదీనుఁ జేయవే' యన్నచో 'నదీను' నన్న యర్థద్వయ రచనాచమత్కృతియ యనన్యాదృశముకదా! దానికి శుక్తిమతి, చెప్పినవాక్యము

క. పుడమిఁ నచలేంద్రులెచ్చట, జడవాహిను లెచట నెచటి సఖ్యము వినఁ జొ
ప్పడదు పొడవడరు మీయెడ, నెడపక మారసములెచటఁ గెక్కుమహాత్మా!

ఇందును నదీపర్వత ధర్మములు జోడించుట నిరుపమానము. కోలాహలుఁడు 'నీకమనీయకాంతిధారావళిలో మునింగితిని' 'నన్నుం బ్రోవకనుళ్లఁ బెల్లెదో' 'గ్రుచ్చి యెత్తి నిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో.' యనఁగా శుక్తిమతి. నీవు 'నిజగౌరవోన్నతులు తలఁపవు' 'మాదృశ జడస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ, కులగిరి కోటిలోఁ గడులఘుత్వము గాదె.' యన్నది. ఇందును నదీ పర్వతధర్మములు బాగుగాఁ గూర్పఁబడినవి.

మనుచరిత్రమున 'వెలివెట్టిరే బాడబులు పరాశరుపట్టి దాశకన్యాకేళి తప్పఁ జేసి' యనుదానివలె నిక్కవియును శ్లేషవిభవముతో 'అతనుభూతి ఫలింపద య్యెనే చదలేటి సికతాల్పు నింధానచిత్రకునకు' నిత్యాదిపద్యము రచించెను. అం దభిముఖుఁడుగాని ప్రవరునిఁ బైపాటున వరూథిని 'ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ జాలిండ్లు పొంగారఁ బైఁ, యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బానింప' నన్నట్లే యిందుఁ గోలాహలుఁడును,

మ. నిలువెల్లన్ నిరపాయశంబరమయోన్మేషంబునం బొంగుచున్
    గలకూలంకషగాఢ గర్వనిధులం గాంతానుకూల్యంబుచేఁ
    దలమే నిల్వఁగఁ బ్రాతికూల్యపరుషోద్యత్ప్రౌఢిఁ గా కంచు న
    య్యలఘుం డాస్యము జేపుఱింప నిజరూపాటోపసంరంభి యై.

పట్టి శుక్తిమతిని నిరోధించినాఁడు ఇట 'నిజరూపాటోపసంరంభియై' యనుటచేఁ బర్వతాకారమున నిరోధించుటయుఁ దానిచేఁ బ్రవాహముపొంగి పొరలుటయుఁ బ్రాప్తములు. నదీప్రవాహ విప్లవమును, ప్రజలు వసురాజునకు విన్నవించుకొనుటయు నతఁడు వచ్చి కోలాహలుని కాలితోఁ దన్నగమీఁటి నదీనిరోధము ను జనోపద్రవమును మాన్పుటయు నతి ప్రౌఢరచనల వర్ణించినాఁడు. ఇందులకై యింద్రుఁడు మెచ్చి వసురాజునకు నొక దివ్యవిమానము నిచ్చెను. ఇది భారతమునందుఁ బూర్వమే యిచ్చినట్లున్నను గథాసందర్భౌచిత్యవిశారదుఁ డైన కవి కోలాహలు నెగఁజిమ్మిన బలాతిశయమునకు మెచ్చి యిచ్చినట్లుగా నలవరించినాఁడు. విమానవర్ణనము నద్భుతము. ఇంద్రుఁడు,

'... ... ఈశుభవిమానంబెక్కి వేడ్కన్ విని
    ర్మలసన్మార్గవిహారహారి వగుచున్ మాపీఁటికిన్ రాకపో
    కలు గావింపు మటంచు నిచ్చిన వసుత్రాజాని' ...

యనుటచే వసురాజు 'ఉపరిచరుఁ డై'నాఁడు. అంత శుక్తిమతికిఁ గోలాహల సమాగమమున గర్భము. దీనినిగూడ నదీలక్షణద్యోతనసమన్వితముగానే వర్ణించినాఁడు.

సీ. నాళీకముఖికి నెన్నడుముగానఁగనయ్యెఁ, దనరునెత్తఱుల బిత్తరముదరలె
    శఫరాక్షి కున్నతస్థలు లగమ్యములయ్యె, బడిబడి నడలెల్ల జడనుపడియెఁ
    జారువేణికి వింతచవుల నింపులుమీఱెఁ, గనుపట్టె విశదమై గండరేఖ
    కంబుకంఠికి సాంద్ర కంకణంబులుజాఱె, నాదంబు మందమందత వహించె

గీ. హంసయానకు నలిమేచకాంచలములఁ, గుబ్బపొందమ్మిమొగ్గలు కొమరుమిగిలెఁ
    బ్రకటితావర్తనాభి కేర్పడియె నంత, రుచిరతరశైవలశ్యామరోమరాజి.

అంత శుక్తిమతియందు నొకపుత్రుఁడును బుత్రికయుఁ బుట్టిరి. పుత్రునకు 'శైలావరోధము వారించి తనున్ ధరించె వసుపాదం బంచు' వసుపదుఁడను

పేరిడెను. కూఁతునకు,'గిరిరాజ తనయకై వడి,సిరిరాజిల వెలయు నీ సుశీల' యనుచు నచటిమౌనులు 'గిరిక'యను పేరిడిరి, ఆకూఁతు నల్లారుముద్దుగాఁ బెంచుటను జెప్పు పద్య మత్యంతహృద్యము.

సీ. మందయానము నేర్పు నిందిందిరాజీవ,రాజీవరాజన్మరాళరాజి
 కలికిపల్కులు నేర్పు లలితనానావాస, నావాసనికట కాననశుకాళి
 గొనబుపాటలు నేర్పుఁ గుముద రసామోద, సామోద మధుపశుద్ధాంతసమితి
 నటనలీలలు నేర్పుఁ దటరూఢకల్పాగ, కల్పాగ చరనీలకంఠవితతి

గీ. యన్నకీకస్య కఖిలభాగ్యములు గలుగ, మునిపురంధ్రీజనంబు దీవన లొసంగు
 నతివ సైరంధ్రులై దాదులై వయస్య, లై విపిన దేవతలు ప్రోతు రనుదినంబు.

ఇట్లు మంజువాణి పూర్వ వృత్తాంతమును జెప్పి ప్రకృతాంశమునకు వచ్చి

ఉ. "ఆనగజాత యీతరుణి యౌవనదేవత లీవయస్య లా
 మానవనాథపాదసఖ మర్దితభూధర మీనగోత్తమం
 బీనగమాళిపై నెనఁగు నీమణిధామము లీకొలంకు లీ
 కోనలు నీనికుంజములుఁ గుంజరయాన విహారరంగముల్."

అని చెప్పి విరమించినది. కపటయతియు నా నాయికకును వసురాజునకును సంగతి కలిగించుటకై దానిని వసురాజు పెండ్లియాడునట్లు దీవించి నెచ్చెలు లట్టి భాగ్యమెప్పుడు కలుగునో యనఁగా నిదిగో నా మంత్రప్రభావమున నతని నిప్పుడే రప్పించెదనని 'మజ్జా'యనుటయు నప్పుడు

మ. ఇది సంధింపఁగ వేళయంచు వసురాజేంద్రుండు నీరంధ్ర ని
 రదవార ప్రతిసీర వెల్వడినతారాభర్తలీలన్ లతా
 చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
 న్మదభృంగీరుతి వందిమాగధకథామాధుర్యముం దెల్పఁగన్'

ఇదయె నాయికానాయకుల ప్రథమసందర్శనము. దీనిని గవివరుఁడు నాటకోచితప్రక్రియతోఁ జిత్రసందర్భములు పాత్రపఱిచి నిర్వహించినాఁడు. వసురాజును శ్లేషగంధములేక సహజస్వభావశైలితో వర్ణించిన వర్ణనాతీత మగు పద్య మాకర్ణింపుఁడు.

సీ. తలిరుఁబ్రాయమువాని వలరాజు నలరాజు,నలరాజుఁ దెగడుసోయగమువానిఁ
 బసిఁడిచాయలవానిఁ బగడంబు జగడంబు,జగడంబు గలమోవిసొగసువానిఁ
 దళుకుఁజెక్కులవానిఁదులకింపు పలుకెంపు,పలుకెంపులొలయునవ్వొలుకువానిఁ
 జిలికిచూపులవాని సిరిమించు దొరయించు,దొరయించు కాంచనాంబరమువాని

గీ. నొఉపుగలవాని మకుట కేయూరహార, కటక కుండలచాకచక్యములవాని
 నమ్మహీజానిఁగని లేచి యమితవినయ ,సంభ్రమము దోఁప నిలిచిరబ్జాతముఖులు.

నాయికానాయకుల ప్రథమసందర్శనమును దజ్జనితశృంగార రసాంకురము లను నతిపేశలముగా వర్ణించినాఁడు. వరూథిని ప్రవరునితో స్వాతిశయోద్ఘాటన ముగాఁ జెప్పిన 'చిన్నివెన్నెలకందువెన్నుఁడన్ని సుధాబ్ధిఁ, బొడమిన చెలువ తోఁ బుట్టుమాకు' నిత్యాదులనటెనె నెచ్చెలులను గిరికాసౌభాగ్యసౌకుమార్యాది ద్యోతకముగా,

"సీ. అడుగువెట్టదు నవ్యహరిచందనలతాంతి, సరణిపైఁ గాని యీయరుగుఁజగి
కేల నంటదు కోరికతిపారిజాతిపల్లరిఁ గాని యీయతిలలితిశాఖ
తనువుఁజేర్పదు నవ్యందారమందారివమం, జులశయ్యఁ గాని యీసురభిళాంగి
పెదవిఁజేర్పదు కల్పపృథివీజ ఫలసంతతి యెకాని యీమోవితీపులాఁడి
గురుకులక్రమాయాత మీగిరిజచల్లఁ, దనము జనన్కై కరూథ మీతిటినిపట్టి
సరసగంభీర భావంబు సహజసిద్ధ, మీసలినసోదరీమణి మనితావి"

యని వర్ణించిరి. అంత మాయామాని రాజును నీక్షించిపోయి తిరుగ నైజ వేషముతో సచివుఁడై వచ్చి రాజును గలిసెను. నెచ్చెలు లాసచివుని పలుకుబడి మొదలగు వానినిబట్టి, 'తొంటిమునియెకా' నెఱింగి యతినివాక్చాతుర్యగుణములను నగుచు భావించిరి. ఇటఁ గవి నర్మసచివుని మరల రాజుకడకుఁ దెచ్చి యతిని మా యాదికమును బయలువెట్టుట యనుచితమని తలంపరాదు. అర్థద్వయగుంభితము లగుసతని వాక్చాతుర్యగుణములు పాఠకులకేకాక యాపండితులకును ననుభూతిపాత్రము లైననే సార్థకములగును. కొన్నిపట్టులయందలి శ్లేషలు పాఠకులకు మాత్రమే తెలి యుట యుచితము. కొన్నిటఁగలవి పాఠకులకేకాక యుద్దేశించి చెప్పఁబడినవారికిని దెలియుట సరసము. కావుననే యిట చెలులు

"క. కోలాహల శైలాధిప, లీలాగతుఁడై నపతి యలీకయతీంద్రుఁ
నీలాలకావలోకక, శాలోలత సనిపె నని తలంచిరి ముదితల్."

అని చెప్పినాఁడు. అంత నాయికా నాయకులకుఁ గూడిన శృంగారరసమును విరహముచే విప్రలంభముగామార్చి పిదపఁ దదసహనవ్యథచేఁ బరస్పర వరణ మునకుఁ బాకముచేయుటకై పన్నికపన్ను సఖీపరిహాసవాక్యముఁ బ్రసక్తింపఁ జేసి నాఁడు. ఆపద్యము లతి మనోహరములు.

"చ. అపుడొకబాల కేలమున నల్లనఁ బల్కుచు నింతులార యీ
నృపమణిరాకచే నలరి యీగిరికానన మిప్పుడెంతచో
క్కపు సిరిఁదాల్చెఁ జూడుఁ డనఁ గన్నియ మోము మొగఁజేర్చి సిగ్గురా
గపుఁదమియుం బెనంగఁ బ్రియుఁగాంచెఁ గుచాంచలహారధారలోఁ"

చెలి యిట్లు సిగ్గునూలుకొల్పి చూపును బరిహారింపించి తల వాల్పఁజేసినది. అంతే చాలదు. అచ్చోటనుండి కదల్పవలెను. అందులకై,

చ. అలికులవేణికిం బెటిఁగి యాచెలి వెండియు నేకతంబునం
బొలఁతుకలార యీచిగురుఁబోఁడి కుచార్పితహారనాయకో
జ్జ్వలరుచిఁ గంటిరే యనిన, జంద్రముఖుల్ చిఱునవ్వుఁ బూని రా
లలనలఁ జూచి కిన్కయుఁ గలంతయుఁ గొంకును నంకురింపఁగన్

గిరిక 'చారుఘనస్రుతిసీరచెంతకు' నరిగెను. అటనుండియుఁ గదల్చిననే వివాహఘటనానుకూలంబగు విప్రలంభంబు పైకొనునుగాన నాయనుఁగునెచ్చెలి మఱియు,

'తే. అభినవాలోక నోత్కంఠ నధిపుఁ డలర, నలరుఁబోఁడి సముద్గలజ్జానుభావ
భావమై తెరమాటునఁ బగటుచూపఁ, జూపఱకుఁ దోఁచె బరిణయస్ఫూర్తి.' ...

అనెను. అంత నటనుండి కదలిపోవుటకై తలంచి యొంటిమెయిఁబోవలేక తన నెచ్చెలి కలహంసిని దలఁచుకొనఁగా నదివచ్చి తల్లిని దోడ్తెమ్మన్నదని పిలుచుకొని పోయెను. గిరిక పోవ నుంకించినను శృంగారరసము పోవనీక యడ్డగించును గాన పోకకుఁ జిట్టుముట్టాడుట గలుగును. చెలులోనాయికానాయక సందర్శన జనిత కుతూహలలు గాన రాజును బాసి గిరికను గొనిపోవ నుంకింపరు. కాన రాజునుండి గిరిక ననివార్యముగాఁ బాసి కొంపోవుటకై కలహంసను గవి తెచ్చికూర్చినాఁడు. గిరిక పోవుచు,

'అలఘుపదాంగదధ్వనికి నంచలు మూఁగిన నిల్చి నెయ్యపుం
జెలువలఁ గూడఁ బిల్చుగతిఁ జిల్కకుఁ బార్శ్వలతాంచలంబులన్
ఫలముఁ దెమల్చురీతి నలిపంక్తికి మోముమలంచుకై వడిన్'

రాజును గ్రమ్మఱఁ జూచుచుఁ బోవుటయు, రాజును గిరికపోయిన పిదప నాబిడయున్న స్థలాదులను జూచి 'కాంబోలు నివి బాలక మనీయు పదలీల లిచటఁ బల్లవజాలమ్మినుమడించె' నిత్యాదులు చెప్పుటయుఁ గవి శాకుంతలమున దుష్యంతుని వీడి శకుంతల పోవుఘట్టమున ననుసరించి రచించినట్లు తోఁచుచున్నది. మఱియుఁ 'గానలోఁ గలయఁ జరించు భూపతికిఁ గన్నియరూపమె యెల్లెడఁ దోఁచుట' వలన రామాయణమున రామునకు సీతరూపమె యంతటనుదోఁచి భ్రమించినట్లుగా.

'సీ. కనుఁగొంటి లతికూన ననిడాయుఁ గాకున్న, నభినవతరలతావాప్తిఁ జెలువుఁ
గంటి పద్మిని నని గమకించుఁ గాకున్నఁ, బరితాపగరిమఁ దామరలఁ జూచుఁ
జూచితిఁ గొమ్మనంచు నటించుఁ గాకున్న, నలయు శాఖోపశాఖానురక్తిఁ
దమిఁ జూడఁగంటి నూతిసరంభ నని యేఁగుఁ, గాకున్నఁ గదళిచెంగట భ్రమించు
గీ. పయ్యెడ ననంగశరశరవ్యాంతరంగ, కలిత భావతరంగముల్ గప్పికొనఁగ
విభుఁడు చెలిమ్రోలనాత్మీయ విభ్రమములు, దేటపడకుండ నేర్పునమాటుపఱుచు.'

నని కవివర్ణించెను. రామునికింబోలె నన్యాపహరణమువలని దుర్భరచింత గాక రాజున కంతర్ధానమువలని చింతగాన నతఁడు రామునివలెఁ దనవిభ్రమములు

బయలు పుచ్చకుండ నేర్పున మాటుపఱచుకొన్నట్లు కవి ఘటించుట యొక్క యౌచిత్యవిభవము. అంత నర్మసచివుఁడు.

" చ. అతివ గురుండు తావకపదానతుఁ డంగనఁ గన్నతల్లి యు
ద్ధృతభవదీయశౌర్యరసపోషితజీవన కొమ్మ నెచ్చెలుల్
సతతము నీకథల్ పొగడ జాణలు శాల భవద్విలాసమో
హిత హితకార్యసంగతికి నియ్యకొ సందియ మంద నేటికిన్."

అని రాజును బురమునకుఁ బిలుచుకొని పోయెను. అంతఁ గవి యిరువురకు విప్రలంభశృంగారమున మన్మథావస్థలను మనోజ్ఞముగా వర్ణించెను. అందు గిరిక,

" ఉ. అమ్మక చెల్ల ధైర్యవిభవాతిశయంబునఁ నంప్రదింపు లే
కమ్మును గాక నైతి జడజన్మమునన్ జనియించెఁ బోలి పైఁ
గ్రమ్ము సదాఘుతాపహృతిఁ గ్రాఁగుచుఁ జిక్కటి లోఁతు దక్కి ని
క్కమ్ముగఁ దండ్రిచాయగల కన్యలు ధన్యలుగా నసుంధరన్".

'ఒక్లనొంచు వెన్నెలికి బాతికింబొడమి వేఁడినైతిఁ దలంపు లేటికిన్' అను వాక్యముల యర్థద్వయ గౌరవమును దెలియునది. విరహబాధాశాంతికై వనికిఁ బోయినది. వసుచరిత్రమున 'చనుఁగవ్వదోలఁగ వాసనగాలి కెదురేఁగుఁ బరువొప్పనలుఁగులఁ బాయుకరణి' నను పద్యమునే యనుప్రాసవైచిత్ర్యముతో,

' సీ. పవమానమానవ ప్లవమానకైరవ, చ్యవమానరజము మైఁ జంటకొనుచుఁ
గరసారసాగ్రతామరసాతిసాంద్ర సీధురసాప్తిఁ గన్నీరుఁ దుడుచుకొనుచు
మదనానలప్రభాసదనాగ్రకోమల, చ్ఛదనార్చిపైఁ జూపు జరిపికొనుచు
సలయాహతలయాకి సలయాగమలయాగ,నిలయా నిలునకూర్పు దెలుపఁదలఁచుఁ

గీ. గుంజపుటగుంజ దళిపుంజశింజితంబు, వెగ్గలంబైనఁ జెవియొగ్గి వినఁగడంగుఁ
బంచశరభూత పరిభూతపంచభూత, ములఁ దదీయస్థలంబులఁ గలుపుకరణి."

నని చమత్కరించినాఁడు. పెద్దన వరూథినికిఁ జెలులచేఁ జెప్పించిన

ఉ. పూఁతపసింపివంటి వలపుం బచరించు కులంబుపీతికిన్
లేఁతగదమ్మ యుత్తెఱఁగు లేమ సురాంగన లెల్ల నిట్టి సీ
సేఁతకు హత్తురమ్మ దయసేయక త్రిన్ననిమేను వెన్నెలన్
వేఁతురటమ్మ యింతకను వేదురులు చెల్లునటమ్మ యింతికి" యను పద్యమువలెనే,

కవి గిరికకుఁ జెలులచే

చ. కటకట మమ్ము నొక్కత్రుటికాలముఁ బాయనిదాన వొంటిమై
నెటువలె వచ్చితమ్మ చెలి యిచ్చటి క్రేఁకపుఁ దేనెవాఁక లీ
నెటువలె నీఁదితమ్మ తెరువెల్లను బుప్పొడి నీపదాంబుజం
బెటువలె నోర్చెనమ్మ తరుణీ తగునమ్మ కఠింది చెయ్దముల్.

అని చెప్పించినాఁడు. అంతఁ జెలుల వనవిహారవర్ణనములు, శుకపికాదుల మిత్రతా మిత్రతారూపవర్ణనముల శ్లేషభంగిని గవి చిత్రించినాఁడు. మనుచరిత్ర మందలి రగడకు మా ఱిందు వృషభగతి రగడ మఱియు రసవంతముగా నున్నది. చెలుల జలకేళి మనుచరిత్రము నందుంబోలె. పిదప రస మున్నస్తకమై గిరిక మూర్ఛిల్లఁగా శిశిరోపచారములు. అందును గిరికకుఁ దెలివిగలిగించుటకై కవి శ్లేష నాశ్రయించి చెలులు 'నెలఁత కీవసుతాభంబు నింపుమనుచు' నన్న వసునామప్రసక్తి సభంగ శ్లేషముచేత సమర్థించి తన్మూలమున మూర్ఛదేర్చినాఁడు. ఇట్లు చిత్రములగు సందర్భములు పొందుపఱిచియుఁ బాత్రములను బ్రవేశపెట్టియు, యాదృచ్ఛికములను సూటిపఱిచియు, శ్లేషల నాశ్రయించియు నాటకసంవిధానముఁబోలెఁ గథాప్రణాళికను గవి సాగించుచు వచ్చినవాఁ డయ్యెను. కావుననే, 'ఆ వాక్యంబులలోనుధామయశుభైకాయత్తచిత్తేశసం, జ్ఞావర్ణంబు లొకింతవీను లెనయన్ సంజాతచైతన్యయై' యన్నాఁడు. అంతఁ జెలులు గిరికను గ్రీడాగృహమునకు మరలఁ దోడ్కొని వచ్చిరి. అంత సూర్యాస్తమయచంద్రోదయాదివర్ణనము లతి హృదయంగమములు మచ్చున కొక పద్యము:—

 మ. పరిదఁభోరుహలోచనల్ గగనరంగాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్.

గిరిక విరాళిని జూడలేక మంజువాణి యాబిసహారమును నానవాలుగాఁ గొని వసురాజు కడకు దూతికగాఁబోయినది. అంత గిరిక చంద్రాదులను దూషింపఁ దొడంగెను. అందుఁ జంద్రునిఁజూచి,

"ఉ. ఇంతుల నేఁచుపాతక మ దింతట నంతటఁబోదు పాంథలో
కాంతక నిన్ను ఘోరతమమై ఘనమై యజహత్యకళంకమై
వంతిలఁబెట్టి యాఱుపది వ్రక్కలు సేయక పూర్వపక్షపుం
గంతుల కేమి చూచెదవుగా తుది నీబహుళార్తి ఖేదముల్"

యన్న పద్యమునందుఁ గల శ్లేషకృత చమత్కారము సామాన్యమే! మనుచరిత్రమందలి,

"శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిం బ్లుయిం బంపినన్
స్వాహాకాముకుఁ డౌట నిన్నతఁడు గావంబోలు మోమోడి సం
దేహంబేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుందు వె
ట్లాహా దైవము దోసకారులకుఁ దోడై వచ్చు నెప్పట్టునన్"

అను పద్యమును జూచి,

కమలాభర్త భవద్విరోధిపయిఁ జక్రంబుం బ్రయోగింప ను
త్తమశస్త్రం బది యాత్మనామకభిదాదర్పాంధు నిన్నుం గ్రమ్మెఱుం
గి మహారాహువుఁ దున్మియుం దునుమ కేఁగెం గాక చక్రంబుచేఁ
దుముఱై పోవనివారలుం గలరె నీదోషంబు గాదే శశీ".

యని యీపద్యమును గవి రచించినాఁడు. అందు శివునికంటినిప్పు; ఇందు విష్ణునిచక్రము. ఆయగ్ని స్వాహాకాముకుఁడగుటచేతి మన్మథునిఁ దెగటార్పక కాచినాఁడు. చక్రి మాత్మ నామకభిదాదర్పాంధుఁ డగుటచేతఁ జంద్రుని మొఱంగి రాహువును దున్మితునుమక పోయినది. అందు వైవము దోషకాగులకుఁ దోడై వచ్చినది. ఇందుఁ దోడు గాక పోయినది. ఇందు 'కమలాభర్త' యనుపదము సాభిప్రాయత్వమును 'తున్మియుం దునుము కేఁగె' నను పలుకుల యర్థభావవిభవమును, 'ఆత్మనామకభిదాదర్పాంధు' నను శ్లేషచమత్కారమును గూడఁ బెద్దనపద్దమునకిది మెఱుఁగుగా నున్నది. ఈదూషణామందలి 'మోమోటపుం ద్రోవల్' 'నీయొడ గాలివ్రాయె' 'మూలలవైచె' నను పలుకుబడుల సారస్యము వర్ణనాతీతము. గిరిక,

"శా. ఆజాబిల్లి వెలుంగువెల్లికల డాయంగ లేక రాకానిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ బటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ రాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికాగవసుధాపూరంబు తోరంబుగాన్."

అను రోదనవర్ణనముతోడఁ బెద్దన రచించిన,

"ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీపుద్రోవ ని
చ్చోటఁ భవన్మఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి యు
ప్పాటలగంధి వేదన నెపం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చుగుబ్బచనుమిట్టల వ్రశులు చిందుపాఱఁగన్."

అనుపద్యమును దిమ్మకవి రచించిన,

ఉ. ఈసునఁ బుట్టిడెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖ మైనమోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్.

అనుపద్యమును శ్రీనాథుఁడు రచించిన,

ఉ. కొసరివసంతకాలమునఁ గోయిలకోల్చిన భంగి నేడ్చె న
బ్జసరుహనేత్ర కొండచటఁ బెద్ద యెలుంగున వెక్కివెక్కి వె

క్కసమగు మన్యువేగమునఁ గాటుక కన్నుల నీరు సోనలై
యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగువాఱునట్లుగాన్.

అనుపద్యమును బోల్చిచూడఁగా దీనిప్రాశస్త్యము గాన నగును. పూర్వోక్తము లగు పద్యములకెల్ల నిది యెంత మెఱుఁగో తనంతటఁ దేలఁగలదు. ఇట్లు వగచుచున్న గిరికకు నూఱటగా వసురాజుకడకుఁ బోయిన మంజువాణి మఱలి రాక గాన్పించినది. దానిరాకను, 'సీ. ఇది తమ్మికంటిపై నీసడించిననిశాధవుఁ దోలులోకబాంధవుని పొడుపు' నని వర్ణించుపద్యము హృద్యాతిహృద్యము. హనుమంతుఁడు రాముని ముద్రిక గొనిపోయి సీత చూడామణిని దెచ్చు నభిజ్ఞాపకవ్యాపారమును జూచి, కవి మంజువాణికి గిరికహారమును గొంపోయి వసురాజు ముద్రాంగుళీయమును దెచ్చు పని యలవరించినాఁడు. అంత మంజువాణి వసురాజు కడకుఁబోయి వచ్చిన వృత్తాంతము చెప్పఁదొడఁగినది. దానిపోయి వచ్చునంత తెఱపిలోఁ జంద్రాదూషణములు పచరించి యంతిమదశకుఁ దెచ్చి విముక్తిసాధనము నాసన్నము చేయుటకై మంజువాణి పునరాగమనమును గవి సంతరించినాఁడు. మంజువాణి వసురాజుముద్రికను గిరికయెదుట నిడి యూఱటగలిగించి యంత వృత్తాంతము చెప్పఁ దొడంగినది. అందు నాకాశమునఁ బోవునపుడు,

'కొండ లచ్చనగండ్లయి నిండుచెఱువు, లెల్ల సద్దంపుఁ బిల్లలయి యేర్లు ముత్తి
యంపుసరులై యరణ్యంపు గుంపులెల్ల, నాఱులై తోఁచుఁ బొడువున నారులార'

యనువర్ణనము స్వభావానురూపము. అట్లు పోయి వసురాజుపురము హర్మ్యధ్వజాదులచే నెఱిఁగి యందు రాచనగరును,

'యక్షాంగనల్ పుష్కర
ధ్వనితోఁ జారణకన్యకల్ చటులవాగ్వైచిత్రితోఁ బన్నగాం
గన లుద్యన్మణిదీపమాలికలతో గంధర్వకాంతల్ సుకం
ఠనినాదాతిశయంబుతోఁ బ్రహరి చుట్టం గాంచి'
'సురలోకంబఁట సిద్ధసాధ్యఫణిగంధర్వాంగనాసేవనా
పరిపాకంబఁట యెంతవింత, యనుచుం బల్మాఱు వీక్షించి యే
సురరాడ్దత్తవిమానచిత్రి మహిమల్ సూ' యంచు నూహించి

తెలిసికొన్నదై యాకాశమునుండి క్రిందికి దిగినది. అంతట మహాభారత సభాపర్వమున దుర్యోధనుఁడు మయకృతసభయందుఁ బడినభ్రమణములను గొని యా రాచనగర మంజువాణి భ్రమణములను

సీ. ఒకవంక నిర్మలోదకశంక సంకుచ, త్పరిధాన నైరిత్తఁ బాఱఁదలఁతు
నొకచోట విఘటితోరుకవాట గృహవాట, మని మిన్నకయతూఁటి చనఁదలంతు

నొకయిక్క నిది వితర్దిక నిక్కమని పదాగ్రమునిక్క రహి నెక్కఁ గాఁదలంతు
నొకచాయఁ జిత్రభిత్తిక గా యనుచు సోయగమునఁ బాయకి డాయఁగాఁదలంతు

ననివర్ణించినాఁడు. పిదపనంతఃపురస్త్రీలనిద్రావస్థయందలి రూపచేష్టితాదులు రామాయణసుందరకాండమున రావణాంతఃపురస్త్రీలరూపచేష్టితాది వర్ణనము ననుకరించి రచించినట్లు తోఁచుచున్నది. ఇట్లంతఃపురస్త్రీల ప్రసక్తిని దెచ్చి వారియం దిద్దఱు స్త్రీలకు సంభాషణము ఘటించి మంజువాణి 'చెవులకుఁ గొంతయామెతగా' వను రాజు విప్రలంభమును సూచించినాఁడు. పిదప మంజువాణికి రాజును మన్మథవ్యథాసూచకములగు లక్షణములతోఁ జూపిన పద్యమెంతయు మనోజ్ఞము.

సీ. నేసకొప్పునజాఱు చెంగల్వ మొగడలు, జాగరారుణకటాక్షముల నెనయ
నిద్దంపుఁగపురంపు నిడుదయొంటులచాయ, గండపాండిమకుఁ గైదండయొసఁగ
నెత్తమ్మినూలిజన్నిదము శయ్యావివ, ర్తనలూనహారసూత్రములఁ బెనఁగఁ
బలుచనివలిప దువ్వలువ తావియచిక్కఁ, బూసిన గందంపుఁ బూఁతఁ బోల
నొప్పుపువ్వొడిపఱపు పై నొత్తిగిల్లి, మోముఁదమ్మి తలాడపై మోపి యడుగుఁ
జివురు చిగురాకుబటువునఁ జేర్చి చిత్ర, ఫలక మీక్షించునా సార్వభౌముఁ గంటి.

ఇందు జాగరారుణకటాక్షములు గండపాండిమ మొదలగునవి చెంగల్వ మొగడలు కపురంపు నిడుదయొంటులచాయ మొదలగు వానియందుఁ దేటపడవు. మఱియుఁ జెంగల్వ మొగడలు మొదలగునవి శిశిరోపచారమునకే కాక వట్టియలంకారమునకును గావచ్చును. కనుక నిట్టి సందేహమును బోఁగొట్టుటకై రాజుచేతఁ జిత్రఫలకమును గవి పెట్టినాఁడు. ఆఫలకమందలి చిత్తరువు గిరికయా? మఱొక్కతియా ?

'గురునిగుణ మురోజగిరులు గాంచినఁ గాంచుఁ, గాక నీమనంబు గాంచ నేల
తల్లికుటిలవృత్తి తగుఁగాక కురులకు, నింత నీదుచెయ్వు లెనయ నేల.'

దీనిచేత గిరికయని తెలిసీనది. చిత్రఫలకము నుద్దేశించి రాజుపలికిన మాటలు మిక్కిలి నీటుగులుకుచున్నవి. అంత మంజువాణి మహారాజు మ్రోల దారున నిలుచుటయుఁ దనంతట మాఱుపలుకుటయు నయము గాదని దాని నందలి యంత్రపుత్రికలలో నొకతిని గాఁ గీలుకొలిపి ప్రత్యుత్తరము చెప్పించి రాజునకు గిరికవ్యథను దెలిపినాఁడు. దీనిచేత స్వరూపమును జూపకయే రాజుతోడి ప్రత్యక్షసంభాషణమును బడసి యతని హృదయము నామూలముగా నెఱుంగుట గలుగుచున్నది.

శా. మాయాశీలురు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైకకా
ర్యాయత్తుల్ సమయానుకూలహృదయవ్యాపారగోపాయనో

పాయఙ్జల్ మగవార లాపయి మహీపాలుర్ నుహావ్వై భవ
శ్రీయోగాంధులు సెప్పనేల మగవారిఁ నమ్మఁగా వచ్చునే.

అనెడి యీపద్యమునకుఁ బోలిన శ్లోక మిది

శ్లో॥ మాయాశీలాః ప్రకృతిచపలా నిర్దయా ధూర్తవాచ
స్స్వార్థాయత్తా స్స్వమయహితకృద్గోపనోపాయదక్షాః।
సాధారణ్యా దతిహిపురుషా స్తత్రచాఽపి క్షితీశా
శ్శ్రీయోగాన్ధాః కిముత పురుషా నైవ విశ్వాసయోగ్యాః॥

మంజువాణి రాజునకు గిరికావ్యథ యూరక యెవ్వరో 'చారణకన్యయో ఖచరసారసగంధియొ కాక కిన్నరాం, భోరుహపాణియో' చెప్పినట్లు ఘటించుట చాలదు. సీతకు హనుమంతునిచేతంబోలె రాజునకు గిరికయాపుత్త్రాలిచేత సాభిజ్ఞానముగాఁ దెలుపుటయే నాయకుల దుస్సహావ్యథ మరణపర్యవసితముగాక యురవడితగ్గి యుండుటకును బరస్పరసంగతిని ద్వరపెట్టుటకును మిక్కిలి యుపయుక్తముగానుండును. మణిపుత్రికాంతర్యాతమగు రూపమున రాజుమర్మము నరసిన పిదపను రాజును జక్కఁ దారసించి యభిజ్ఞానము నిచ్చుట స్త్రీజనోచిత వినయమున కనురూపముగాదని, గిరికావ్యథను విన్నకుందుచే రాజు శయ్యాపై సోలునట్లు తెలిపిగూర్చి యాసమయమున గిరికహారము నాతని కంఠమున నిల్పునట్లు చేసినాఁడు. అది గిరికహారమే యని రాజునకుఁ దెలిసిననే కదా తాపశాంతి. అందులకే,

శా. ఈహారం బొకమాటు పిమ్మటికి నే నెచ్చోటనో కన్నయ
ట్లూహాం బయ్యెడి నీయమూల్యమణిహారో త్తంసముం జిత్రక
న్యాహారంబు నుదారవై ఖరి నొకండైతోఁచె నీహార మా
నీహారాద్రిజకన్యహార మగు సందేహంబు లే దెంతయున్.

అనుపద్యము గూర్చినాఁడు. ఆహారమును గూర్చి రాజు చెప్పిన పద్యముల భావవిభవమును జమత్కారసంపత్తియు నర్థ సారస్యమును నప్రతిమానములు.

'ప్రమదారత్నము పేరుగా నెద నినుం బాటించి ప్రార్థించెదన్'
'నినుఁ జిక్కులఁ బెట్టఁజుమీ'

'నిను ... ... ... గంధసారములచేఁ దెలివొందఁగఁ జేయుచున్నఁడో' యను పలుకుబళ్లయందలి చమత్కృతి యింతయని చెప్పనలవిగాదు.

చ. 'చెలులమొఱఁగి నాఁడు మణిచిత్రగృహంబున మోము వాంచి తో
య్యాలి భవదేకదర్శిత మదాకృతిఁ జూచెఁ గదా వినీలకుం
తలహృదయంబు నీకు విదితంబుగదా యిఁకఁ దాఁచ నేటికిన్
వెలఁది మనంబు దెల్పఁగదవే మణిహారమ నిన్ను వేఁడెదన్'.

శా. శుక్తిక్రోడకుటీగుహా వసతివై సూచ్యగ్రసంస్థాయివై
ముక్తాహారమవై భజించితిగదా ముగ్ధాకుచద్వంద్వసం
సక్తిం దాదృశభూతి తావకకృపాసంసిద్ధి లేకబ్బునే
ముక్తాహారత నున్నయంతిన తలంపుల్ నింపు నా కింపుగాన్.

గిరికాహారసంగతివలన రాజునకు సుఖసంభ్రమములు గలిగినవి. ఇఁక నా హారము దెచ్చిన పాత్రమును రాజు నెదుటఁ బొడసూపించి యాశ్వాసనము గూర్ప వలయును. అందులకై రాజే 'ఓయప్రతిమోపకారసుకృతశ్రీగణ్యదాక్షిణ్యశా, లిని నీకుం బ్రతిమావదేశ మిఁక నేలే పల్కవే సన్నిధి' నని చెప్పఁగా 'రఘునందనుని సన్నిధిఁ బ్రభూతచైతన్యమై నిల్చుచట్టుపొలఁతికరణి రత్నపుబొమ్మగతి మాని' మంజువాణి యెదుట నిల్చినది. రాజునకును మంజువాణికిని సంభాషణసంగతి నలవరించుటకై కవిపొందుపఱచిన సందర్భము లాతనియౌచిత్యపు మెలపును గల్పనాసంపత్తిని సందర్భోచిత వివిధ వేషభాషాదిరచనాప్రాగల్భ్యమును నాటకసందర్భసంవిధానములంబోలి యాతని నిరతిశయప్రౌఢి నిరూపించు చున్నది. పిదప రాజునకును మంజువాణికిని సంభాషణము మిక్కిలి నిపుణముగాను రసవంతముగాను గూర్చినాఁడు. ఆయిరువురయుక్తిప్రత్యుక్తులయందుఁ గలభావముల యువతిచతురతయు శ్లేషరచనల చమత్కృతియు నిరుపమములు, ఒక్క పద్యము.

'ఏమేమీ జగతిం గఠోరములు శైలేంద్రంబు లౌఁగా తదీ
యామేయస్థ్యయ భేది యంతకుఁ గఠోరాకారుఁడౌనే కదా
యామేటిక్ ధృతివాపి చూపులనె యూఁటాడించు వా రెంతవా
రో మీనేత్రుణ తా నెఱుంగదె తదారూఢప్రభావోన్నతుల్.

మంజువాణి రాజుంజూచి 'చతురాస్యుఁడవు. నీకు వచనప్రౌఢియరుదే! మా తెలివ నేఁచెదవ్రొ ప్రోచెదవ్రొ తెలుపు ముల్ల' మనఁగా రాజు 'నామోహముం బురంధ్రీమణి నీవ చూచితిగదే తగదే జగదేకధ్వని యక్కామునియాన సందియముగా ననుఁబల్క యఘుంబు గైకొన'ననెను. అంత మంజువాణి రాజునంగుళి ముద్రికఁగొని గిరికకు నిచ్చి రాజు హృదయము తెల్పి యాబిడవ్యథ నుపశమింపఁజేసెను.

ఇంతవఱకు నాయికానాయకుల యాశ్వాసనమునకై మంజువాణి రాయబారమును బొందుపఱచినాఁడు. ఇది తెరమాటు సంవిధానము, వారిరువుర యంతరంగముల కుందు వాపులకైన యాంతరంగికప్రక్రియ. ఇఁక వారిరువురకు బాహాటమగు వివాహసంగతిని ఘటించుటకై మఱియొక సంధాన కుశలమగు రాయ

భారమును గూర్పవలసియున్నది. ఇందులకు మంజువాణింబోని పాత్రము సరసము గాదు. మహారాజునకుఁ బెండ్లి జరుపువాఁడు నతని ప్రభుత్వమునకు ననురూపుఁడగు నొకప్రభూత్తముఁడో స్నేహితుఁడో కావలయును. కనుక దేవేంద్రుఁడే యిట్టి పనికిఁ బూనునట్లు కవి సంఘటించెను. అంతేఁ ప్రభాతవర్ణనము మనుచరిత్రక్షుణ్ణ మార్గమున నాయికం గూర్చి యొక చెలికత్తియచేత వర్ణితము గావింపఁబడినది. రెం డొకయుదాహరణములు.

మ. సకలాశాగతి నర్మకోపవిరతి శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశబ్దజ్ఞానమే మూల మిం
తకుఁ బోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెంతం గొండలన్ బల్లెలం
గృకవాకుల్ మొరసెన్ గృహోపరి త్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్.

(వసుచరి)

మ. ఒకనాఁ డింద్రునియంతవేలుపు మదీయోక్తిన్ విడంబించి తా
నొకకాలం బెఱిఁగింప వచ్చి మునిశాపోద్వృత్తి పాలయ్యె మా
మకశబ్దం బిది యల్పమే త్రిమునిసంభావ్య త్రికాలీ విబో
ధక మన్ రీతిఁ ద్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్రచూడౌఘముల్.

(వసుచరి)

మ. ఇనుఁ డస్త్రాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ దద్దీప్తి సం
జనసంబంధజ బాంధవంబున రతిశ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్ధవళిమం దాఁ బూనెనో చొప్పు మా
ర్పననన్ వెల్వెలఁబాఱె దీపకలికావ్రాతంబు శాతోదరీ.

(మనుచరి)

మ. తొవకున్ దూరపునంటు రేమగువపొందుం బూర్వపక్షంబు వ
మ్మవుఁ దారారుచి మద్విభూతి నది గా కబ్జారితో వారికే
యవినాభావము నాకుఁ గాక యని చంద్రాపాయవేళం బ్రదీ
పవిపాండుద్యుతి పేరఁ జంద్రిక శిఖం బ్రాపించె నీక్షించితే.

(వసుచరి)

మ. జలజాగార పరంపరల్ మఘవదాశాభిత్తిఁ దీండ్రించుచున్
దళమై వెన్నెలచిచ్చు లంటిన మిళద్బాహ్యచ్ఛదశ్యామికా
చ్ఛలనం గంది ముడుంగుచోఁ జిమచినుచ్ఛబ్దంబులతోఁ బుట్టున
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలెన్ గర్వస్వనద్భృంగముల్.

(మనుచరి)

ఉ. తమ్మి పతంగపత్ని తమి దాల్చినపాండురకోరకాండముల్
గ్రమ్మి నిమీలతచ్ఛద పరంపరచేఁ బ్రసవాప్తివేళ రా

నిమ్నుల వాని నొయ్యవిరియించిన హేతుగుణాప్తి బాంధవ
గ్నమ్నుల నేఁచు తేఁటిపిలుకల్ వెడలెఁ సహజాసితచ్ఛవిన్.

(వసుచరి)

అంత వసురాజునకుఁ గన్యనిమ్మని యడుగుటకై యింద్రుఁడు సపరివారము గాఁ గోలాహలునికడకు వచ్చుట వర్ణింపఁబడినది. ఆపరివారముతో గంగాదేవియు నుత్తరకథాప్రణాళియందు వన్నెగూర్చు నొకసందర్భమును హత్తించి కావ్య సమష్టికి శోభావిశేషమును గలిగించుటకై చేర్పఁబడినది. దేవతాంగనలు గిరికాసౌందర్యమును జూచిపొందిన భావవికృతులు శ్లేషభిత్తిక నాశ్రయించి వర్ణించిన పద్యముం గనుఁడు.

సీ. తలయెత్తదయ్యెఁ గేవలజడస్థితి రంభ, జళుకుఁ జూపులఁ జూడసాగె హారిణి
కుందుకుందునః జెంది కొదఁదెల్పె శశిరేఖ, పలపలనై నెల్లపాటెఁ దార
మఱువక పూనె మైమఱువు పరూధిని, చెయ్వు లన్నియు దక్కెఁ జిత్రరేఖ
యుచితకార్య వివేక ముడిగె మదాలస, మానె నుద్ధతభాష మంజుఘోష
తాపడియె సానుమతిసాంద్రతాపమునఁగ, రంగె హేమాభిధాన నిర్జరలతాంగు
లిట్లు దనుఁజూచి సిగ్గుపా టొనయ వినయ,వినతయై యున్నగరాజ తనయఁ జేరి.

గంగాదేవిని బరివారముతోడఁ జేర్చినందులకుఁ దత్కృతాశీర్వాదరూపమగు సరసపద్యరచనమే కారణము. అది యిది

మ. చరణాగ్రానమితాచలేశ్వరునిఁ గా సన్మార్గసంచారిఁ గా
స్థిరకల్యాణ సమాఖ్యుఁగా హరికృపన్ శీఘ్రంబ చేపట్టి యో
గిరికన్యా యరలేక నీ వతఁడు నేకీ భావముం జెందుమీ
గిరికన్యామణికన్న ధన్య వగు యత్నీనాను మోదంబునన్.

ఇందు సామాన్యముగా మంచిగొప్పవరుఁడు గలుగవలయు నని చేసిన యాశీర్వాదము వసురాజున కన్వయించునట్లు కూర్పఁబడినది. పిదపఁ గోలాహలుఁ డింద్రుని సత్కరించుటయు నింద్రుం డీతనిని గిరికను వసురాజున కియ్యనడుగుటయు నతిచతురభంగిని రచింపఁబడినవి. వసురాజున కిచ్చుటయందు గంగావచనమును 'చరణాగ్రానమితాచలేశ్వరుఁడు గా' నిత్యాదిని ప్రమాణముగానింద్రుఁడు రూపించెను. ఈవన్నెగూర్చుటకే గంగాదేవి యింద్రపరివారములోఁ గూర్పఁబడినది. మఱియు నింద్రుఁడు 'నీతపః పాకంబెట్టి దొకాని పాదనిహతింబై కొన్న వాఁ డంఘ్రినా, లీక ద్వంద్వనతుండుగా నెరపఁ గల్గెం గల్మియున్ బల్మియు' నన్న మాట చాతుర్యముఁ గనుఁడు. ఇంద్రుఁడు గోలాహలునిఁ గన్యనడుగవచ్చుటయు నతఁడందులకియ్యకొనుటయు విని శుక్తిమతియుఁ దక్కిన నదులును హిమవదాదిపర్వతరాజములు నక్కడకు

వచ్చుట మెచ్చులుగులుకు శబ్దార్థవైచిత్రులలో వర్ణింపఁబడినది. ఈవర్ణన
ముత్తర వివాహశుభనిర్వహణమునకే కాక కథా శరీరమునకును బుష్టి గలి
గించుచున్నది. ఇట్లు గుమిగూడినవారికెల్ల విడిపట్టుగావలయును. అది నూతన
ముగా నిర్మించునంత వ్యవధి లేదు. వచ్చిన విందులు పర్వతరాజులుగాన సామా
న్యములై యున్న పట్టణములును వారి విడిపట్టునకుఁ జాలవు. కావుననే యిం
ద్రుఁడు కోలాహలమునందే యొకపట్టణమును మనస్సుచే నిర్మించుటను గు
మారసంభవమున హిమవంతమునందు నిర్మించిన సృష్టిననుసరించి రచించినాఁడు.

సీ. నిమ్నప్రపాతాంతనిర్ఝరపరిఖలతోఁ, గనుపట్టెఁ గోటలై కటకపరిధి
మణిచిత్రకిరణతోరణ మాలికలతోఁ బ్రకాశించెగృహములై గహ్వరములు
శుచికరోపలభంగసోపాన సరణితోఁ, జెలఁగె సౌధాళులై శిఖరపాళి
ఘనసారవనుసార గంధసారములతో, నలరె నంగడులై తటాజిరములు
కలమధుర కోకిలాలాపకలనతోడఁ, జెన్నలరెఁ గన్నెలై కొన్ని చిన్నిలతలు
సమధికస్కంధశాఖాభుజములతోడఁ, దనరెఁ దరుణాగ్రగణ్యులై తరువులెల్ల.

అందుఁ గురంగములు తురంగములయిన దానిని వర్ణించు పద్యము సొబ
గు గనుఁడు.

ఉ. జాతికి నెల్లరాజపరిచర్యయు గాలికి నెక్కుడన్న వి
ఖ్యాతియు రాఁ గురంగములు గట్టున నేమి తపం బొనర్చెనో
యాతతశృంగభార రహితాత్మమహోముఖకాంతతాప్తి నా
రాతనరారె నన్నియుఁ దురంగములై తదభీష్టసంపదన్.

పట్టణము నిర్మించినపిదప నింద్రుఁడు బృహస్పతి నడిగి యొకశుభలగ్న
ము నేర్పఱచి దానిని గోలాహలునికిఁ దెలిపి యంత నాశుభసన్నాహమును వసు
రాజునకుఁ దెలుపవచ్చెను. వెనుక నింద్రుఁడు వసురాజు విషయ[illegible] కోలాహలునిఁ
గన్య నడుగుటకుఁ బూనినందులకుఁ గారణము స్ఫుటముగా వివరిం[illegible]చే నది కథా
ప్రబంధమునం దొక శైథిల్యముగాఁ దోఁచెడిని. దాని నపన[illegible]ట్టకై యట
యింద్రుఁడు వసురాజుంజూచి తా నతనికార్యమునకుం బూ[illegible]తువు రూపించు
టచే నాపొచ్చెము మానినదయ్యె. ఆకారణ మిది

ఉ. నిన్నటి మాపు మాపురమణీరమణీయసభావిభాగభా
గున్నతరత్నపీఠిఁ గొలువుండి సురాంగనలాడఁ గిన్నరుల్
కిన్నరమీటి పాడఁ దిలకించుచు నియ్యెడ శైల రాఁ దో[illegible]
మన్నిరవద్యమిత్రుఁ డని మక్కువ మీఱ నినుం దలం[illegible]

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# వసుచరిత్రము సవ్యాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.



భూపుత్త్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్థలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవశిలాకన్యాలీల యించుక న్ముదిం
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గన్న సీ
తాభామాపతి ప్రోవుతం దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్. 1

అవతారిక. రామరాజభూషణుఁ డనుమహాకవి యీకావ్యమును దిరుమలదేవరాయల కంకితముగా రచించువాఁడై 'మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని శాస్త్రాణిప్రథన్తే' అను ప్రమాణముంబట్టియు, శిష్టపరంపరాగతమయినయాచారముంబట్టియు, విఘ్నములు తొలంగి యిది పయింబయిఁ బ్రసి[illegible]దుటకును, దొలుత మంగళ మాచరింపఁబూని యదియు 'ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్' 'కావ్యారంభము, ఆశీర్వాదమైనను నమస్కారమైనను వస్తునిర్దేశ మైననుగా వచ్చు' నని మూఁ[illegible]ధము లగుటం జేసి యం దాశీర్వాదరూప మయినమంగళమును గ్రంథరూప ముగా నీపద్యముచే రచించినవాఁ డయ్యె.

అర్థము. [illegible]భూపుత్రి-శ్రీ=లక్ష్మీస్వరూపురాలైన, భూపుత్రి = భూదేవికూఁతురయిన సీతాదేవి, (లక్ష్మియే[illegible]టకు రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీకృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరే షానపాయినీ' అ[illegible]ణము.) వివాహవేళన్ = పెండ్లికాలమందు-అనఁగా వివాహవేదియందు వరుఁ [illegible] దానును [illegible] సమయమందనుట. నిజ...వ్యక్తిన్-నిజ=తనదైన-మంజీర=అందియయొక్క [[illegible]దాఙ్గదం [illegible]టిదక్షిణే నూపురోఽస్త్రియామ్-హంసకః పాదకటకః' అమరుఁడు) అగ్ర రత్న-శ్రే[illegible] మండలి - ('పరార్ధ్యాగ్రప్రాగ్రహర ప్రాగ్ర్యాగ్ర్యాగ్రీయ మగ్రియమ్' అమ.) శ్రేష్ఠరత్న[illegible]నాయకమణి యందని కొందఱు. కాని నాయకశబ్దము హారమధ్యరత్నమందే [illegible]ను 'గిలింతు[illegible] గుచ్ఛ శిలాభగరిమ నాయకత్వముసార్థతాయుతముగ'నని య[illegible]మణియందుఁ గవి ప్రయోగించి యున్నాఁడు. 'హారమధ్యమణిః' అని మేదిని. కా[illegible]రత్న' మను నాయకరత్నమనుట యుక్తముగాదు. మఱియు 'అగ్ర'

మనఁగా (అగ్రం పురశిఖామానశ్రేష్ఠాధిక ఫలాదిషు' అని నానార్థరత్నమాల) చెప్పిన 'ముందటిది' అనియు నర్థము గనుక, అగ్రరత్న=అందె ముందటిప్రక్కఁ గల రత్నమందలి యనియు నర్థము చేయవచ్చును. ముందటిప్రక్క రత్నమనుట సిగ్గుచేఁ దలవంచుకొని యున్న సీత రూపము ప్రతిబింబించుటకు మిక్కిలి యుపయుక్తముగానున్నది.] స్వలీలా= తనదైనపోలికి (అనఁగా రూపము)యొక్క-(ఇట లీలాశబ్దము 'యః సంయతి ప్రాప్తపినాకి లీలః' రఘువంశ-౬-౭౨. ఇత్యాదులందుంబోలె 'పోలిక'ని లేక 'స్ఫూర్తిని' దెలుపుచున్నది) అభివ్యక్తిన్ = ప్రతిబింబమును—(తనయందియ ముందటిప్రక్కం గల మణియందుఁ బ్రతిఫలించిన తన రూపము ననుట.) వర...లీల—వర=పతియగు రామునియొక్క, అంఘ్రిరేణు = పాదధూళివలన, భవ=పుట్టిన, కన్యా = కన్యకయొక్క, లీల = పోల్కి—రూపము, అంచున్ రాముని పాదధూళిసోఁకి పాషాణ మహల్యారూపము నొందెను; కావున మంజీరాగ్రరత్నమును పాషాణజాతి యగుటంజేసి యతని పాదరేణువుసోఁకి స్త్రీరూపము నొందెనోయనుట, మదిన్ = మనస్సునందు, తాన్=సీత, భావింపన్ =తలంపఁగా, శుభక్రమ - ఆకలనచేన్—శుభ=మంగళకరమైన - పెండ్లికాలమున జరుపఁబడు, క్రమ=పాదవిన్యాసముయొక్క ('క్రము పాదవిక్షేపే, అను ధాత్వర్థముంబట్టి క్రమమనఁగా నడుగుపెట్టుట), ఆకలనచేన్ =బంధనముచే-చేయుటచేత—(అనఁగా సీతను సన్నెకంటిమీఁద నడుగుపెట్టించుటచేతననుట, తత్-రత్నమున్ =ఆరత్నమును, కప్పె, సీతాభామాపతి=కప్పిపుచ్చు సీతారమణి భర్తయైన శ్రీరాముఁడు, తిరుమలేంద్ర శ్రీమహారాయనిన్ =తిరుమలదేవరాయశ్రేష్ఠుని, ప్రోవుతన్ =రక్షించుఁగాత.

తా. సీత వివాహవేదియందు వరునితోఁ గూర్చుండియున్నపుడు తాను సిగ్గుచేతఁ దలవంచుకొని తనపాదముపంకఁ జూచుచుండెను. అపుడా పాదమునందలి యందె ముందటిప్రక్కం గల మేటిరత్నమం దామెరూపము ప్రతిఫలించెను. దానిని జూచి సీత పాషాణమును స్త్రీనిఁగాఁ జేసినట్టి రామునిపాదరేణువు సోఁకుటవలన నందె రత్నమును పాషాణమే కనుక స్త్రీయైనదోయని భ్రమించెను. రాముఁ డది యెఱిఁగి సన్నెకంటిని ద్రొక్కించు నెపమున నారత్నమును మూసి యాబిడభ్రాంతిని బోఁగొట్టెను.

సోమకవి విద్వన్మనోరంజని యనువ్యాఖ్యయందు "'శుభక్రమాకలన' యనుటకు వెనుక వ్రాసిన యర్థమునంగీకరింపక "వివాహవేళయనఁగా సన్నెకంటిని ద్రొక్కించువేళ. క్రమమనఁగా పాదవిక్షేప ఇతిధాతుః. సన్నెకంటిని ద్రొక్కించువేళఁ బాదవిక్షేపమును జేయించుచు రత్నమును గప్పెనని ప్రకారాంతరముచేతఁ గొంద ఱర్థముచెప్పుచున్నారు. సన్నెకంటిని ద్రొక్కించువేళయందు నిలుచుండవలసినది. నిలుచున్నప్పుడు నిజమంజీరరత్ననిజాకారప్రతిఫలనము లెస్సగా సంభవింపదు. శుభక్రమాకలన యనఁగా శుభపాదవిక్షేపకలనయని చెప్పినచో క్లిష్టనామకదోషము ప్రాప్తమగుచున్నది. 'క్లిష్టం తదర్థావగతి ర్దూరదూరాయతో భవేత్''. శుభక్రమాకలన యనెడుపదమునకు పాదవిక్షేపణకలనరూపార్థమే కవిహృదయమైనయెడ 'పదక్రమాకలన' యని రచించును. కనుకఁ బ్రకారాంతర ముపేక్షణీయము. శుభక్రమాకలనచే ననఁగా శుభలీలచేతననుట'' యని వ్రాసియున్నాఁడు. ఇది యొప్పిదమే ; కాని 'క్రమ ఆకలన' యను రెండుపదములను బ్రయోగించినందులకు 'లీల' యని మాత్ర మర్థము స్ఫురించుట చాలినట్లు గానిపింపమిచే నది కవిహృదయముగాఁ దోఁపకున్నది. మఱియు సీతకుఁ గలిగినభ్రాంతిని సవిశేషముగా వర్ణించినట్టే, దానిని బరిహరించుటకైన రామునియుపాయకృత్యమును, 'నిట్టిశుభలీలచే' నని సవిశేషముగా వర్ణింపక వట్టి 'శుభలీల'యని సామాన్యముగాఁ జెప్పుట సరసముగాకున్నది. మఱియు 'సాగరః ప్లవగేంద్రేణ క్రమేణైకేన లంఘితః' 'మూఁడుక్రమముల...' ఇత్యాదులందుఁ

క్రమశబ్దమాత్రము పాదవిక్షేపమం దక్లిష్టముగానే రూఢమైయున్నది. మఱియు నన్నెకంటెని ద్రొక్కించునపుడు నిలుచుండవలసియున్నను నడుగును దానిని ద్రొక్కుటకై చాఁపవలసియుండుటంబట్టి యాకారప్రతిఫలన మంతగాఁ గొఱవడకుండవచ్చును.

ఇటసీత భ్రాంతి రామునిచేఁ బరిహృతమై తీఱుటంబట్టి యాబిడ తనయందె యుందలి ప్రతిబింబమును గన్యాంతరముగాఁ దలంచి కన్యాంతరసన్నిధానమువలనఁ బ్రణయవైకల్యము నొందఁగా రాముఁడు దానిం బోఁగొట్టెనని వ్యంజితమగుచున్నది. కవి సీతాపాణిగ్రహణరూపమైన పరమలాభప్రాప్తిసమయమును వైవాహికానందలీలానుభవసమయమును ననుసంధించుటచేఁ గృతిపతికిని బరమలాభమును బరమానందమును గూర్చఁగాతమని యాశయము. 'శ్రీరాముఁ' డని సొంతినామముచే నిర్దేశింపక 'సీతాభామాపతిప్రోచుతెన్' అనుటచే సీతారూప యగులక్ష్మీదేవి కధినాథుఁడు గాన కృతిపతికి లక్ష్మి నవ్వారిగా నొసంగఁజాలునని వ్యంజితము; మఱియు దీనిచే నాశ్రితరక్షణమందు లక్ష్మీదేవి పురుషకారము నిట సూచితము. నిజప్రతిబింబమందలి కన్యాంతరభ్రాంతిచే సీతకుఁ బ్రణయవైముఖ్యమంకురించినతోడనే దానిని మెలపునఁ బరిహరించి తదాభిముఖ్యముం గూర్చుకొన్న చతురుఁడగు సమర్థుఁడు లక్ష్మీవైముఖ్యమునకు హేతువులగు దురితములనెల్లఁ దక్షణమ యనాయాసమునఁ బరిహరించి తదాశ్రయత్వము కృతిపతికిఁ గలుగఁజేయుననియు ధ్వనించుచున్నది. మఱియు నిట మంజీరమునందిల యగ్రరత్నమునందలి సీతాప్రతిబింబముచే, శుక్తిమతియందుఁ గోలాహల పర్వతసంగముచే గిరికాజన్మమును 'శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్ప' అనుటచే వసురాజు పాదవిక్షేపముచేఁ గోలాహలు నెగఁజిమ్ముటయు 'సీతాభామాపతి' యనుటచే రాజునకు గిరికతోడి వివాహమును ననెడి కావ్యార్థమును 'మహాకావ్యార్థ సూచన'మ్మనెడి యుభియుక్తోక్తిచొప్పున సూచితమయ్యెనని తెలియునది. కోలాహలోత్క్షేపణమను కావ్యార్థమునకు సూచకమగుటంబట్టియు 'శుభక్రమాకలనకుఁ బ్రకృతార్థ మొప్పిదముగానున్నది. ఇట కావ్యాదిని శ్రీకారముంచుట సర్వశుభప్రదము.

'వేదములకెల్ల నోంకార • మాది యైన, కరణిఁ గృతులకునెల్ల శ్రీ • కారమాది
గాన కవివరులెల్లను • దానిఁ దక్క, నితర వర్ణంబు లిడరు సంస్కృతుల మొదల.'
'పదపడి శ్రీ కారము కృతి, మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును, గదిసి సువర్ణంబు సేయుకరణిఁ ధరణిన్.'

మఱియు గ్రంథాదిని మగణము ప్రయోగించుట 'మో భూమి స్త్రీ గురుశ్శ్రియం వితనుతే' అన్నట్లు శ్రీప్రదము. ఇందుల కప్పకవియు 'నధర్వవేదముఖంబగు మగణంబు వసుమతీ దేవతాకంబు గాన శివప్రదం' బని చెప్పినాఁడు.

వ్యాకరణము. ఇట మొదటిపాదమందు. 'మంజీర శబ్దమునకు 'మంజురుచ్యమ్ ఈరయతి ఇతి మంజీరః' అని వ్యుత్పత్తి 'మంజు ఈరయతి' యనుచో మంజు శబ్దము కడపలఁగల 'ఉ' కారమునకు 'ఇకోయణచి' అనుపాణినిసూత్రముచే 'వ' కారము ప్రాపించుటవలన 'మంజ్వీరః' అని రూపము సిద్ధింపఁగా, మంజీర శబ్దము శకంధ్వాది గణములోఁ జేరినది గనుక 'శకన్ధ్వాదిషు పరరూపమ్ వాచ్యమ్' అను వరరుచి వార్తికముచే నది ప్రాపింపకపోవుటచే 'ఉ' కారమునకుఁ బరరూపమైన 'ఈ' కారమువచ్చి 'మంజీరః' అని యైనది.

'శకంధు రథ కర్కంధూః కుద్దాలో లక్తపర్కటీ
లాఙ్గలీషా మనీషాచ హలీషాచ పతఞ్జలిః ॥'

కుతిక్కలోక్షిప మఞ్జీర మ స్తిష్క కులటాదయః
తథాన్యకంధు సీమన్తా శకన్ధ్వాది గణే స్మృతాః ॥'

అని యిచి శకంధ్వాదులు, 'మంజీర శబ్దమందలి 'ఈ' కారము పదాన్యమైన యచ్చు గాన పదాది 'శ్రీ' తోడ విశ్రమమెట్లు పొందు నన్నచో

క. 'విరతికి వ్యాకరణమునను, వరరుచిచేఁ జెప్పఁబడిన • వాక్యమువలనం
బర రూపము నిత్యంబై, పరఁగు శకంధ్వాదులకు నుభయముం జెల్లున్.'

అని యప్పకవి చెప్పినట్లు శకంధ్వాదిగణములోని పదములయందు హల్లునకును మీఁద నది కిన యచ్చునకును విశ్రమము చెల్లును గనుక మంజీరశబ్దమందుఁ గలహల్లగు 'జ' కారమునకును 'శ్రీ' తోడి విశ్రమము చెప్పఁబడెనని తెలియునది. ఇదియె పరరూపయతి. ప్రోచుతన్ అనుటకు 'ప్రోవుతన్' అని వ్రాఁతప్రతులను నచ్చు ప్రతులను గానిపించుచున్నది ; కాని, యీరూపము కవిత్రయ మతవిరుద్ధము. 'అగమాన్య చకారంబులకు నద్విరుక్తంబులకు ముత్తుపగంబగునపుడు వవలగు'(బాలవ్యా. క్రియాపరిచ్ఛేదము)నన్నట్టు లిటుముత్తు పరముగాను. రాయశబ్దము డుమంతమున 'ను' త్వమురాదుగనుక 'రాయనిక్' అని రూపము.

మంజీరాగ్రరత్నమందలి నిజప్రతిబింబమునందు నితర కన్యాభ్రాంతి నొందుటచే నిట భ్రాంతి మదలంకారము. అది భ్రాంతియని సీతకు, నితరులకుఁ దెలియకుండఁ దెలుపు రాముని చేష్టనుబట్టి సూక్ష్మాలంకారమని కొందఱు. ఇట సీతాదేవికి 'ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా' యన్నట్లు స్వాధీనపతిక యనియు శ్రీరాముఁడు 'ఏకాయత్తోఽనుకూలస్స్యాత్' అన్నట్లు అనుకూలనాయకుఁ డనియుఁ దెలియునది.

సీ. సకలలోకాభినంద్య కలా కలాపంబు
దొరయు నెమ్మోము చంద్రదురునితోడ
బహుదివ్యఫల పరిపాక సౌభాగ్యంబు
నెరపు కెమ్మోవి మాణిక్యము తోడ
నవవయశ్శ్రీనిధానంబులై తగు నురో
భవ సుధా పూర్ణకుంభములతోడ
నమ్లాన సుమమాలికాభిరూప్యము దాల్చు
లలిత భుజాకల్పలతలతోడ

తే. నడరి జనకాబ్ధి సీమ రామాభిధాన
హరి కహీనగుణ ప్రోత హారశరాస
గిరిమథన యత్నమునఁ దోఁచు సిరియ శేష
రాజ్యము లొసంగుఁ దిరుమల రాయమణికి. 2

అవతారిక. ఇందుఁ గర్తృపదము 'సిరి' యనుటచే సీతయందు లక్ష్మీత్వము నారోపించి యర్థద్వయము గలుగఁ జెప్పినాఁడు.

అర్థము. సకల...లాపంబు — (సీతాపరమైన యర్థము-) సకలలోక = సమస్తజనులచేత, అభినంద్య=మిక్కిలి కొనియాడఁదగిన, కలా = లావణ్యకళయొక్కడు, కలాపంబుక్ = భూషణముతో,

దొరయు = పొందుచున్న, నెమ్మోము చందురునితోడన్ = చక్కని ముఖమనెడి చంద్రునితోడను, (లక్ష్మీపరమైన యర్థము)— సకలలోక = సమస్తభువనముల చేతను, ('లోకస్తు భువనే జనే') అభినంద్యమైన- కలా = పదాఱుకళలయొక్క, కలాపంబున్ = సమూహమును, ('కలాపో భూషణే బర్హే తూణీరే సంహతావపి' అ.) దొరయు=పొందుచున్న, నెమ్మోము చందురునితోడన్ = తన ముఖమును బోలిన చంద్రునితోడను.

బహు...గ్యంబు—(సీత) బహు=మిక్కిలియైన- దివ్యఫల=దేవతావృక్ష (అనఁగాఁ గల్పవృక్ష) ఫలములయొక్క- పరిపాక=పరిపక్వమగుటయొక్క- సౌభాగ్యంబున్=చక్కఁదనమును, (మిక్కిలియుఁ జక్కఁగాఁ బండుటవలని మాధుర్యాతిశయముననుట) నెరపు=పచరించునట్టి, కెమ్మోవిమానికము తోడన్=ఎఱ్ఱని పెదవియనెడి మాణిక్యముతోడను, (లక్ష్మి) బహు=అనేకులైన- దివ్య=దేవతలయొక్క- ఫలపరిపాక=వాంఛితార్థములు సిద్ధించుటయొక్క- సౌభాగ్యంబున్=సౌష్ఠవమును - వాంఛితార్థములు మిక్కిలి చక్కఁగా సిద్ధించుట యనుట, నెరపు=కలిగించునట్టి, కెమ్మోవిమానికముతోడన్=తన యెఱ్ఱని యధరమును బోలిన చింతామణి రత్నముతోడను, పండు ఎఱుపు వర్ణములోనిది గాన యధరముతోడి సామ్యము. కల్పవృక్షపుఁ బండుగాఁ గొనుట నిరతిశయమైన మాధుర్యమునకు. దాని పరిపాక సౌభాగ్యమామాధుర్యపరిపూర్తికి. 'ప్రార్థనా కల్పపాదప ప్రాజ్యఫలము, తియ్యపూఁదేనియల త్రోవిదీనిమోవి' అని శృంగారనైషధము.

నవ...నంబులై — (సీత) నవ=క్రొత్తయగు, వయఃశ్రీ = యౌవనలక్ష్మికి, నిధానంబులై=నివాసములై- తగు=ఒప్పునట్టి, ఉరోభవ=స్తనములనెడి - సుధాపూర్ణకుంభములతోడన్=అమృతమునిండియున్న కలశములతోడను, ఇట 'నవవయఃశ్రీ నిధానంబు' లగుకుచములనుటచే క్రొత్తయగు యౌవనంపుఁ బొంపునకుఁ బ్రకాశకములయిన కుచములనుట; యౌవన ప్రాదుర్భావమునకు స్ఫోరకములయిన స్తనములు మంచిబిగియు వర్తులత్వమును నున్నతియుఁ గాంతియుఁ గలిగియుండును గాన సుధాకుంభములతోడి సామ్యము. (లక్ష్మి) నవవయస్=క్రొత్త యౌవనముయొక్క, శ్రీ=సమృద్ధియనెడి, శ్రీ=ధనమునకు, నిధానంబులై=పాత్రములై - (ఇది సుధాకుంభములకు విశేషణము.) ఎప్పుడును క్రొత్తగానుండునట్టి యౌవనమునకు నాస్పదమయినట్టియనుట, ఉరోభవ=తనకుచములను బోలిన, సుధాపూర్ణకుంభములతోడను—సుధాపానము చేసిన వారెప్పుడును నవయౌవనముగలవారై యుందురని తెలియునది.

అమ్లా...రూప్యము—అమ్లాన=వాడని- సుమమాలికా=పూదండయొక్క - ఆభిరూప్యమున్ = చక్కఁదనమును-('ప్రాప్తరూప సురూపాభిరూపా బుధ మనోజ్ఞయోః' అమ. అభిరూపమనఁగా చక్కనిది. అభిరూపముయొక్క భావము ఆభిరూప్యము), తాల్చు=వహించు, లలిత = సొగసయిన, భుజా=బాహువులనెడి, కల్పలతలతోడన్=కల్పవృక్షపుఁ దీఁగలతోడను (వాడని పూవుమాలె చక్కనగల బాహువులనఁగా రెండు ఖండములు వేఱువేఱు కట్టంబడి పిదప నవి రెండును ముడివేయంబడి యొక పూమాలె గావింపఁబడును. కనుక పూమాలె రెండుఖండములవలె బాహువులును రెండై యొప్పుననియు అఖండము లొక్కొక్కటియు నగ్రభాగమునఁగలఁ బలుపు నురువును, రానురాను దగ్గఁగా, చివరలందు సన్నముగా నుండునట్లు, బాహువులును మూఁపులకడ స్థూలములును బీనములునై యుత్తరోత్తరసూక్ష్మత గలిగియుండుననియుఁ దెలియునది. పూమాలెవలె సుకుమారములును సుందరములునునుట; వాఁడని పూమాలెవలెననుట దానివలెఁ గాంత్యతిశయమును గుత్తంపు బలుపును గలిగి గుండ్రములైయుండు ననుట. (లక్ష్మి) అమ్లాన=(ఎన్నఁటికిని) వాఁడకుండునట్టి, సుమమాలికా=పువ్వుల సమూహముయొక్క-అభిరూ

ప్యమును తాల్చు, (ఇటఁ దాల్చునవి కల్పలతలని తెలియునది.) లలి...తోడన్=సుందరములయి తన భుజములను బోలిన కల్పవృక్షపుఁ దీఁగలతోడననుట. (కల్పవృక్షపుఁ బువ్వులెన్నటికిని వాఁడకుండుట ప్రసిద్ధము.)

అడరి=ప్రకాశించి, జనకాబ్ధిసీమన్--(సీత) జనక=జనకరాజనెడి, అబ్ధిసీమన్=సముద్ర ప్రదేశమందు, రామ-అభిధానహారికిన్=రాముఁడను పేరుగల విష్ణువునకు, అహీన...త్నమునన్—అహీన=హీనముకాని—మిక్కిలి సారముగల, గుణ=నారిచేత, ప్రోత=కూర్పఁబడిన, హరశరాసన=శివధనుస్సు అనెడి, గిరి=మందరపర్వతముయొక్క, మథన=విఱుచుట యనెడి చిలుకుటయొక్క, యత్నమునన్=పూనికిచేత, తోఁచు=సంప్రాప్తమైన, సిరి=(సీతయనెడు) లక్ష్మి—(లక్ష్మి) జనక+అబ్ధిసీమన్=జన్మస్థానమయిన సముద్రగర్భమందు, రామ + అభిధానహారికిన్ = రమణీయములయిన నామములుగల విష్ణువునకు, అహీన=(అహి+ఇన) సర్పరాజయిన వాసుకియనెడి, ('ఇనస్సూర్యే ప్రభౌ'అ) గుణ=కవ్వపుఁ ద్రాటిచేత-- ('గుణస్త్వావృత్తిశబ్దాది జ్యేన్ద్రియాముఖ్యతన్తుషు' వైజయంతి) ప్రోతమైన, హరశరాసగిరి--హరశర=శివుని బాణమయిన విష్ణువునందు - అతని కూర్మదేహముపయిని, ఆస=నిలిచియుండిన, గిరి=మందర పర్వతమువలని, మథనయత్నమునన్=త్రచ్చు ప్రయత్నముచేత, తోఁచు=అవిర్భవించు, సిరి=లక్ష్మి-- తిరుమలరాయమణికిన్=తిరుమలరాయ శ్రేష్ఠునికి, అశేషరాజ్యములన్, ఒసంగున్ = ఇచ్చుఁగాత, ఇట తద్ధర్మమాశీరర్థమునఁ బ్రయుక్తము.

శ్రీమద్రామాయణమున నహల్య పాషాణముగానుండినట్లు గానరాదు. అందు నహల్య బుద్ధిపూర్వకముగా వ్యభిచరించినందులకు వలయు ప్రాయశ్చిత్తము ముని శాపరూపమున విధించినాఁడు; కాని యహల్యను శిల యగుమని చెప్పలేదు. పెక్కువేల సంవత్సరములు వాయుభక్షణము సేయుచు నన్నపానాదులులేక తపించుచు భస్మంబునం బరుండి సమస్తప్రాణులకుఁ గాన్పింపకయుండు మనియె శాపము. అయినను బ్రహ్మపురాణమున 'సాతితస్తస్య రామస్య పాదస్పర్శాన్మహాత్మనః। అభూత్సురూపా వనితా సమాక్రాన్తా మహాశిలా' అని యహల్యకుఁ బాషాణావస్థ చెప్పఁబడినది. దీనినే కవి యిచ్చట ననుసంధించినాఁడని తెలియునది.

ఇట సిరి తానొక్కతి కాక దానమున కుపమానభూతుఁ డగుచంద్రుఁడు, కామితార్థములనెల్ల నొసంగెడి చింతారత్న కల్పలతలు, చిరాయురారోగ్యములనిచ్చు సుధాకలశములు,నని యత్యంత దానశౌండమయిన పరికరసంపత్తితోడ నావిర్భవించినది. మఱి తానో సిద్ధ సంకల్పుఁ డగుసాక్షాద్విష్ణువునకుఁ గూడ మహాప్రయత్నముననే లభింపఁగూడిన నిరవధికాపూర్వాతిదుర్లభవస్తువిశేషభూత యగు సర్వోత్కృష్టురాలు. అట్టి పరికరసామగ్రితోఁగూడిన యిట్టి యపూర్వలోకోత్తర దేవీరత్నమునకు, తక్కిన దేవతలవలెఁ గవలము ప్రోచుట కాచుట కాదు, సమస్తరాజ్యములు నొసంగుటె యుచితము. 'అశేషరాజ్యము లొసంగు'నన్నాఁడు. మఱి హరి తన్నుఁబడయుటకై చేసిన మహాప్రయత్నము మిక్కిలియుఁ జరితార్థమగునట్లు కన్నులు విందులుసేయు చందురునివంటి మోముతోను, చుంబనమునకు మిక్కిలియుఁ దీపులొలుకుచుఁ గెంపుసొంపారు మోవితోను, ఉపభోగమునకు మిక్కిలియు ననురూపమయి యమృతంపుఁగుండలవలెఁ దగుబిగివట్రువగుబ్బలతోఁగూడిన నవవయఃశ్రీతోడను, ఆలింగనమున మిక్కిలి యానందహేతువులయిన తీఁగలవంటి భుజములతోడను నావిర్భవించినదని యాకూతము. హరి నిన్నిముఖముల నలరించినదిగావుననే తదీయకృపాపాత్రమయిన కృతిపతినిగూడ నన్నిరాజ్యము

లిచ్చి యలరించునని హృదయము. ఇందును 'జనకాబ్ధిసీమ......గిరిమథన......సిరి' యనుటచే శుక్తిమతియందుఁ గోలాహలబలవత్సమాగమమున నయినగిరికాసంభవము సూచిత మగుచున్నది.

ఇందు 'సుధాపూర్ణకుంభములతోడ' ననియుఁ, బంచమాశ్వాసమున 'సుపర్వగణికామణి స్ఫురణతో సుధారమ్యపాత్రపాలికలతో' ననియు సుధాకుంభముల బహుత్వము చెప్పఁబడెను. సముద్రమథనమం దుత్పన్నమయిన యమృతకుంభ మొక్కటియే యని భాగవతాదులయందుఁ జెప్పఁబడుచున్నది, ఈ బహుత్వము విచార్యము.

ఇట పద్యాంతచరణాంత పదాంత నకారలోపములకు 'వాక్యావసానగస్య స్యాల్లోపో న ప్రాయశో౽త్రహి' అని యధర్వణకారిక. 'అవసానంబున ద్రుతస్వరంబునకేనియు ద్రుతంబున కేనియు లోపంబు విభాషనగు' (బాలవ్యాకరణము) వాక్యమనఁగా నిచటఁబద్యమే. సీసాదులందు వాక్యము ప్రతిపాదమును వృత్తాదులయందుఁ బూర్వార్ధము నుత్తరార్ధము ననువాక్యద్వయంబునుగా దెలియునది. శ్లేషమునకును ఇందు రూపకమునకు సంకరము.

మ. సకలామోదక తాళవృత్తగతులన్ సంగీత సాహిత్య నా
మక విద్యాయుగళంబు పల్కుఁజెలికిం బాలిండ్లజో డై సిరుల్
ప్రకటింపన్ నఖరేఖలందు నలఘుప్రస్తారముల్ సేయుస
ర్వకలాకాంతుఁడు ప్రోచుఁ దిర్మలమహారాయ క్షమావల్లభున్. 8

అ. ఇందుఁ గుచపరముగను విద్యాపరముగను నర్థద్వయము కవి నిబంధించినాఁడు. (కుచపరమైనయర్థము.) సకల...గతులన్—సకల+ఆమోదక=సర్వానందకరమైన, తాళవృత్తగతులన్=తాటిపండువలె గుండ్రనను నొందియుండుటలచేత, (విద్యాపరమయిన యర్థము) సకల=కలాసహితులకు—అనఁగాఁ బండితులకు, ఆమోదక=ఆనందకరమయిన, తాళ=ధ్రువాదితాళమార్గములచేతను, వృత్త=శార్దూలాది వృత్తములచేతను, అని సంగీతసాహిత్యములకు క్రమముగా నన్వయించుకొనునది. (ఇటతృతీయకు ద్వితీయ) సంగీ...యుగళంబున్—సంగీత=సంగీతమును, సాహిత్య=సాహిత్యమునునెడి, విద్యాయుగళంబు=విద్యలదోయి, పల్కుఁజెలికిన్=సరస్వతీదేవికి, బాలిండ్లజోడై=కుచద్వంద్వమై, సిరులు=కాంతిసంపదలను, ప్రకటింపన్=ప్రకాశింపఁజేయుచుండఁగా, అందున్=ఆకుచయుగమందు, (అవిద్యాయుగళమందును), (కుచ)-నఖరేఖలు=నఖక్షతములనుట, ఇట ద్వితీయకుఁ బ్రథమ, అలఘుప్రస్తారముల్—అలఘు=స్వల్పముగాని - అధికమయిన, ప్రస్తారముల్=తరతరములు గలవానినిగా, (లేక అలఘువనఁగా గురువు. అది బాలచంద్రాకారముగా వ్రాయఁబడును గావున, బాలచంద్ర సదృశములయిన యంకములు అనఁగా నెలవంకలు గలవానినిగా ననియు నర్థము. (విద్య) నఖరేఖలు=అంగుళిరేఖలు —(ఇట నఖశబ్దముచేఁ దదాశ్రయమయిన యంగుళిలక్షితము. రేఖయనఁగా లేఖ. రలలకభేదము. శ్లో॥ రలయో, ర్లడయో, స్తద్వ, ల్లళయో, శ్శసయోరపి, వబయో ర్ణణయో శ్చాన్తే సవిసర్గా విసర్గయోః। సబిన్దు కాబిన్దుకయో స్స్యా దభేదేన కల్పనమ్' అని భోజరాజు. కనుక నఖరేఖలనఁగా వ్రేలిచేత వ్రాయువ్రాతలనుట), అలఘుప్రస్తారముల్=గురుప్రస్తారములు గలవానినిగా (సకలచ్ఛందములకును మొదట సర్వగురువృత్తము పుట్టుచున్నది గనుక గురుప్రస్తారము చెప్పినాఁడు. నఖరేఖలకును స్త్రీలింగమునకు 'అలఘుప్రస్తారము' లని విశేషణము నపుంసకలింగమగుటకు 'అమహద్వాచకంబులగు స్త్రీలింగంబులకు నభయంబునగు' (బాలవ్యాక-తత్సమ) చేయు, సర్వకలాకాంతుఁడు—సర్వకలా=సమస్తములయిన విద్యలచేత, కాంతుఁడు=

ఒప్పుచున్నవాఁడు, లేక, సర్వకళా=సరస్వతీదేవికి, కాంతుఁడు=పెనిమిటియైనవాఁడు—బ్రహ్మ, తిర్మల మహారాయ క్ష్మావల్లభున్=తిరుమలరాయ మహాభూనాథుని, ప్రోచున్=రక్షించుఁగాక, ఆశీస్సునఁ దద్ధర్మము.

రెండవచరణమున దాపలబిందువు గదిసియున్న బకారము మొదలనున్న మకారమునకు విశ్రమ మయ్యెను. ఇదియు బిందుయతి.

క. పని బూని నిలుపఁ దమతమ, యనునాసికములకు బిందు • యతులన వెనుకన్
గనుపట్టు వాల్గు లిపులును, వెనుకున్నలు డాసి తమకుఁ • బిఱుఁదఁగదియుచోన్. (అప్పకవి.)

సంగీతసాహిత్యములు సరస్వతికి స్తనద్వయములగుటకు 'సఙ్గీతమపిసాహిత్యమ్ సరస్వత్యాః స్తనద్వయమ్ । ఏకమాపాత మధుర మన్యదా లోచనామృత' మ్మని ప్రమాణము. ఇందును శ్లేషమునకును రూపకమునకును సంకరము. సంగీతసాహిత్యములే కుచములుగాఁగల యట్టి స్త్రీని నిపుణముగ భోగించునట్టి కాంతుఁ డగువాఁడు క్ష్మకుఁ గాంతుఁడయినవానిని నట్టె దానిని నిపుణముగా భోగించునట్లు సేయుఁగాత మని కవి యాశయము.

మ. రమణీయాక్షసరాకృతిం బొలుచువర్ణశ్రేణి వీణానులా
పముచేతం గరఁగించి యందు నిజబింబం బొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును దత్వర్ణాళియం దెల్లఁ బూ
ర్ణము గావించినవాణి తిర్మలమహారాయోక్తిఁ బొల్చుం గృపన్. 4

అ. ఇందు వర్ణపంక్తి కెల్ల శ్రుతిసిద్ధ మైనబ్రహ్మాత్మకత్వమును బ్రహ్మప్రతిపాదకత్వమును సరస్వతి భంగ్యంతరమునఁ గావించునట్లు కవి యధ్యవసించుచున్నాఁడు. రమణీ ... కృతిన్ — రమణీయ=మనోహరమయిన, అక్షసర = స్ఫటికాక్షమాలికయొక్క, ఆకృతిన్ = ఆకారముచేత, పొలుచు=ప్రకాశించుచున్న, వర్ణశ్రేణిన్=అక్షరపంక్తిని, వీణా-అనులాపముచేతన్=వీణెయొక్క పలుకుబడిచేత, కరఁగించి=నీరుచేసి, అందున్=కరఁగి నీరయిన యాయక్షరపంక్తియందు, నిజబింబంబు = తనదయిన నీడ, ఒప్పన్=కనఁబడుచుండఁగా, అచ్ఛ=స్వచ్ఛమయిన, అమృతత్వమును=బ్రహ్మస్వరూపము నని యర్థము—తేటయైన నీరగుటనని భావము, ఆత్మప్రతిపాదకత్వమును=బ్రహ్మ ప్రతిపాదకత్వమునని యర్థము. బింబ ప్రతిపాదకత్వమునని భావము, తత్ వర్ణ ఆళియందెల్లన్=ఆయక్షర సమూహమునందంతట, పూర్ణము=నిండినది, కావించినవాణి=చేసినసరస్వతి, తిర్మల...ఉక్తిన్=తిరుమలమహారాయ=తిరుమలదేవమహారాయలయొక్క, ఉక్తిన్=వాక్కునందు. ఇట సప్తమ్యర్థమునఁ దృతీయ. కృపన్=దయచేత, పొల్చున్=వర్తించుఁగాత.

సరస్వతీదేవి యక్షమాలికను వీణియను దాల్చియుండుట ప్రసిద్ధము. అక్షరపంక్తినే యక్షమాలికారూపమునఁ దాల్చియుండున ట్లైతిహ్యము. గానమునకు ఱాలు గరంగునేకాని యక్షరములు గరంగవు. కాన కవి యక్షరపంక్తిని యక్షమాలికారూపమునంగొని దానిని సరస్వతిచే వీణానాదమునం గరఁగించి నీరుగావించినాఁడు. నీటిలోఁ దననీడ యగపడునేకద. ఇట్లు వర్ణపంక్తి కరఁగి యచ్చంపు నీరగుటం బట్టి దాని నచ్ఛామృతమనియుఁ, దనబింబమును జూపుటంబట్టి యాత్మప్రతిపాదకమనియు నధ్యవసించి యా పటిమచే దానినే శుద్ధబ్రహ్మమనియు, బ్రహ్మప్రతిపాదకమనియు నధ్యవసించినాఁడని తెలియునది. అచ్చంపు నీరగుటను ఆత్మబింబమును జూపుటను అచ్ఛామృతమని ఆత్మప్రతిపాదకమని శ్లేషములచే,

శుద్ధబ్రహ్మముగను బ్రహ్మప్రతిపాదకముగను నధ్యవసించుటచే నిం దలంకారము రూపకాతిశయోక్తి. 'తిర్మలమహారాయ' అనుచో 'తిర్మల' యను రూపము 'తిరు' శబ్దరేఫముమీఁది ఉకారమునకు లోపము కార్మెఱుపులు చన్గవ మొదలగువానియందుంబోలె వైకల్పిక మగుటంజేసి సిద్ధించెనని తెలియునది.

తా. సుందరమయిన యక్షరమాలికారూపమగు నక్షరపంక్తిని వీణానాదముచే నీరుగాఁ గరఁగించి యానీటియందుఁ దన నీడయగపడఁగా, నాయక్షరపంక్తి నచ్ఛామృతమును (శుద్ధబ్రహ్మమును—అచ్ఛంపునీటిని) ఆత్మప్రతిపాదకమును (బ్రహ్మప్రతిపాదకమును బింబప్రతిపాదకమును) పూర్ణముగాఁ గావించినట్టి సరస్వతి తిరుమలరాయనివాక్కునందు దయతో నెలకొనియుండుఁగాత. వర్ణములం దెల్ల నచ్ఛామృతత్వము నాత్మ ప్రతిపాదకత్వమును బూర్ణము గావించిన దిట్ట గాన తిరుమలరాయోక్తి యందును నచ్ఛామృతత్వమును - అనఁగా నచ్ఛంపు నమృతంబగుటయు, నాత్మప్రతిపాదకత్వమును - అనఁగాఁ దన సారస్వతవిభవమును వెలయించుటయుఁ జేయుఁగాత - అనఁగాఁ దిరుమలరాయని పలుకులు మీఁదు మిక్కిలి యచ్ఛంపు నమృతంబువలె రుచులు గులుకుచు మఱిమఱి చాకచక్యవిభవము గలిగియుండునట్లు చేయుఁగాత మని యభిప్రాయము.

శా. ఆమందాకిని మౌళిఁ బూని నను నర్ధాంగీకృతం జేసి జౌ
నౌ మేల్మే లని యార్య యల్గఁ బ్రణతుండై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయుం మొరయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడుశంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్. 6

ఆమందాకినిఁ = ఆముసలిదానిని యర్థము-ఆకాశగంగనని భావము (మందాకిని యనఁగా 'షష్టివర్షాతుమన్దాకినీ' అను నిఘంటువుం బట్టియు, 'మన్దం అకతి వృద్ధత్వకృతాఙ్గశైథిల్యేన గచ్ఛతీతి మన్దాకినీ' అను వ్యుత్పత్తింబట్టియు, అఱువదిసంవత్సరములు చెల్లిన ముసలిదానికిని, 'మన్దాకినీ వియద్గఙ్గా' అని యమరుని చెప్పున నాకాశగంగకును బేరు, మౌళిఁ బూని = తలపయి నెక్కించుకొని, ననుఁ = ఆర్యను. అనఁగా పదియాఱేండ్ల వయసుగల భార్యనయిన నన్ను, (ఆర్యయనఁగా. 'ఆర్యాషోడశవత్సరా' అను నిఘంటువుంబట్టియు '-రణీయా విలాసిభి రభిగమ్యే త్యార్యా' అను వ్యుత్పత్తింబట్టియు పదియాఱుసంవత్సరముల వయసుగల యువతికిని 'ఆర్యాదాక్షాయణీచైవ' అను నమరుని చెప్పున పార్వతికిని పేరు) అర్ధాంగీకృతంజేసితివి = సగము అంగీకరింపఁబడినదానినిగాఁ జేసితివి-కొంచెముగానే యంగీకరించితివనుట, జౌఁ = జౌను, మేల్ మేలు అని = బాగు బాగు అని, ఆర్య = పార్వతి, అల్గఁ = కోపింపఁగా నని యర్థము-(మందాకినిని మౌళిఁ బూని యనఁగా, ఆకాశగంగను జటాజూటమందుఁ దాల్చినాఁడనియు, ననుఁ అర్ధాంగీకృతం జేసితివనఁగా పార్వతీదేవిని దన కర్ధదేహముగాఁ జేసికొన్నాఁడనియును భావము) ప్రణతుండై = నమస్కరించినవాఁడై, తత్ ...మర్షంబునఁ - తత్ = సవతియైన యాపార్వతియొక్క, పద+అంభోజ = అడుగుతామరలయొక్క, యోగ = సోఁకుటచేనయిన, అమర్షంబునఁ = సైఁపమిచేత, గంగయుఁ = జటాజూటమందలి గంగాదేవియు, మొరయఁ = మొఱపెట్టఁగా, చూడా...ర్థ్యంబునఁ—చూడా+ఆభోగ = జడలనిండు జొంపముయొక్క- సమ్యక్క్రియా = చక్కఁజేయుటయందలి - సామర్థ్యంబునఁ = నేర్పుచేత, అనఁగా ప్రొక్కుటకై తలవంచినపుడు క్రిందికి జాఱిన

గంగవలనఁ జెదరిన జటాజూటమును మరలఁ జక్కఁబఱచుకొనుట యనెడు వ్యాజముచేత ననుట. వేఁడుకొంచుఁడు=గంగ నోదార్చుటకై ప్రార్థించునట్టి శివుఁడు, కృతిస్వామిన్=కృతిపతిని - తిరుమలదేవరాయని, కృపన్=దయచేత, ప్రోచుతన్=రక్షించుఁగాత.

శివునకుఁ బార్వతియు గంగయు నిరువురును భార్యలుగదా. అందు గంగ శివునితలయందుండును; పార్వతి యర్ధదేహముగా నుండును. ఈసందర్భములం గొని కవి యొకకథ కల్పించినాఁడు. అదియేదన- పార్వతి శివునితో 'అమందాకినిని (అఱువదియేండ్ల ముసలిదని యర్థము. ఆకాశ గంగనని భావము) తలపయి నెక్కించుకొని ఆర్య (పదియాఱేండ్లదని యర్థము. పార్వతియని భావము) అగునన్ను నర్ధాంగీకారము చేసితివి (కొంచెముగా నంగీకరించితివని యర్థము. సగము దేహముగాఁ జేసికొంటివనిభావము) అనికోపింపఁగా, శివుఁడు పార్వతికోపమును బోఁగొట్టుటకై యామెపాదములకుఁ దలసోఁక మ్రొక్కెను. అప్పు డతని తలయందలి గంగ తనసవతియడుగులు తనకుఁ దగిలినందులకు సైఁపక మొఱపెట్టెను. అట్లు కలఁగఁబాఱి మొఱయిడఁగా, దానిచేఁ జెదరిన జటాజూటమును సవరించుకొనునెపమునఁ బార్వతి కెఱుకపడకుండునట్లు గంగను శివుఁ డోదార్చె' నని యాశయము. శివుఁడు శిరసువంపఁగా గంగ ప్రవాహము క్రిందికి జాఱుటచే ఘోషించెనని భావము. 'తుల్యో౽నేకత్ర దక్షిణః' అన్నట్లిచట నాయికలిరువురయందును సమానుఁడగుటచే శివుఁడు దక్షిణనాయకుఁడు. ఇరువుర నాయికల నిట్లులోదార్చు సమర్థుండు కృతిపతి రక్షణమందు సమర్థుండగునని యాశయము. ఇట అలంకారము, శ్లేషమూలాతిశయోక్తి.

సీ. ఘనఘనాఘనలక్ష్మి నెనయుకొప్పిరుగడ
నిరుగడఁ దరుణాబ్జకృతవతంస
మురుచిత్రకాగ్నిశిఖోన్మేష మిరువంక
నిరువంకఁ గుండలిస్ఫురితకర్ణ
ముడిఫ్రొనిమిన్కు లీనెడుపేరు లిరుదెస
నిరుదెసఁ గమలబంధుదకరంబు
నెఱి మించుచిఱుతవన్నియచేల యరుమేన
నిరుమేన రతిమనోహరవిభూతి

తే. యమర నన్యోన్యవేషభేదాసహిష్ణు
భావవిభవంబుఁ దెలుపుచుఁ బరమమైత్రి
మగనిసామేన నిలిచిన యగతనూజ
ప్రథనజయ మిచ్చుఁ దిరుమలరాయమణికి. 6

అ. ఇందు సీసపాదములు నాలుగింట నర్థద్వయమునకును నభేదాధ్యవసాయము చేసి శివపార్వతులకు వేష మొకటియే యగుటను బ్రతిపాదించుచున్నాఁడు. ఇరుగడన్=రెండువైపులందును, ఘనఘనాఘనలక్ష్మినెనయుకొప్పు—అనఁగా శివునివైపున, ఘన=అధికమైన, ఘనాఘన=వర్షించుచున్న మేఘముయొక్క, లక్ష్మిన్=సంపదను, ఎనయు=పొందుచున్నట్టి—మిక్కిలి వార్షికమేఘములు క్రమ్మియున్నట్టి యాకాశమనుట. కొప్పు=కేశబంధము, శివుఁడు వ్యోమకేశుఁడగుట ప్రసిద్ధము. ఘనాఘనశబ్దమునకు 'శక్రమాతుకమత్తేభవర్షుకాబ్దా ఘనాఘనాః' అని యమరుఁడు. పార్వతివైపున, ఘన=

అధికమైన, ఘనాఘనలక్ష్మీ=వర్షాకాల మేఘపు కాంతివంటి కాంతిని, ఎనయు=పొందుచున్న, కొప్పు. ఇట నిదర్శనము. ఇరుగడల్ = రెండువైపులను - అనఁగా శివునివైపున, తరు ... వతంసము-తరుణ+అబ్జ=బాలచంద్రునిచేత, కృత=చేయఁబడిన, వతంసము = శిరోభూషణము—తలపువ్వు. పార్వతివైపున-తరుణ+అబ్జ=లేఁతతామరచే, కృత=చేయఁబడిన, వతంసమనుట. అబ్జశబ్దము 'అబ్జో ధన్వన్తరౌ చన్ద్రే నిచులే శఙ్ఖపద్మయోః' అని విశ్వనిఘంటువు చెప్పున చంద్రునియందును, దామరసమునందును వర్తించుచున్నది. అవతంసశబ్దమునకు 'వష్టి భాగురి రల్లోపమవాప్యోరుపసర్గయోః' అనుటంబట్టి యుపసర్గము మొదటి 'అ' కారమునకు వైకల్పిక లోపమువలన వతంసమని రూపము సిద్ధించినది.

ఇరువంకల్ = రెండుప్రక్కలయందును. ఉరు ... స్మేషము—శివుప్రక్క—ఉరుచిత్రక = మిక్కిలియాశ్చర్యకరమయిన, అగ్నిశిఖా=నొసటికంటి యగ్నిజ్వాలయొక్క, ఉన్మేషము= వికాసము. పార్వతిప్రక్క—ఉరు=మిక్కిలియైన, చిత్రక=తిలకరూపమయిన, అగ్నిశిఖా=కుంకుమయొక్క, ఉన్మేషము=వికాసము, కుంకుమబొట్టుయొక్క వికాసాతిశయమనుట. 'చిత్రంస్యా దద్భుతాలేఖ్య తిలకేషు' అనియు. 'కుంకుమేగ్ని శిఖంమతమ్' అనియు విశ్వము. ఇరువంకల్ =రెండుప్రక్కలను, కుండలి ... కర్ణము—శివునివంక—కుండలి=వాసుకిచేత, స్ఫురత్ = ప్రకాశించుచున్న, కర్ణము=చెవియు, వాసుకి పోఁగులుగాఁగల చెవియనుట. పార్వతివంక - కుండలి = రత్నకుండలములుగలదై, ప్రకాశించుచున్న చెవియనుట.

ఇరుదెసల్ =రెండు దిక్కులందును, ఉడి ... హారులు - శివునిదెస—ఉడివోనిమిన్కులు=ఉడిగిపోని పలుకులను-అనఁగా వేదములను, ఈనెడు = పుట్టించెడు - పుట్టించుబ్రహ్మముఖములు, హారులు= హారములు - అనఁగా బ్రహ్మకపాల మాలికలనుట. పార్వతిదెసను—ఉడివోనిమిన్కులు = ఉడిగిపోని కాంతులను, పుట్టించుహారములని యర్థము. ఇరుదెసల్ =రెండుదిక్కులందును, కమలబంధురకరంబు—శివునిదిక్కున—కమల=లేడిచేత, బంధుర=సుందరమైన, కరంబు = హస్తము. పార్వతిదిక్కున — కమల = పద్మముచేత, సుందరమయిన హస్తమని యర్థము. కమలశబ్దము. 'స్యాత్కురఙ్గే౽పి కమలః' అని లేడియందును తామరయందును వర్తించుచున్నది.

ఇరుమేనల్ =రెండుదేహములందును, సొంపుమించు చిఱుతవన్నియచేలము - శివునిమేన—సొంపు= అందము, మించు = అతిశయించెడి, చిఱుతవన్నియచేలము = మూఁడువన్నెలుగల వ్యాఘ్రాజినాంబరము; పార్వతిమేన—అందము మీఱు చిత్రవర్ణములుగల వస్త్రము—లేక చిఱుతవన్నియ యనఁగా సన్నవన్నెగలదియనియు నర్థము. ఇరుమేనల్ = రెండుదేహములందును, రతిమనోహరవిభూతి - శివునిమేన-- రతిమనోహర=మన్మథునియొక్క, విభూతి=భస్మము - మన్మథునిఁ జిచ్చుకంటఁ గాల్చిన నీఱనుట. పార్వతిమేన - రతిమనోహర విభూతి=మన్మథుని విభవము--అత్యంత సౌందర్యాతిశయ ప్రయుక్తమయిన మన్మథోద్దీపన వైభవమనుట - లేక-రతి=రతిదేవివలె మనోహరమయిన విభూతి అనఁగా శోభ పెంపనియు నర్థము. 'భూతిర్భస్మని సంపది' అని అమ.

అమరల్ =ఒప్పుచుండఁగా, అన్యోన్య=పరస్పర సంబంధమగు, వేషభేద = వేషములయొక్క భేదమునందు - వేషములు భేదముగలిగియుండు విషయమున, అసహిష్ణుభావ = సహింపని యభిప్రాయముయొక్క, విభవంబుల్ =అతిశయమును - ఒండొరులవేషములు భేదముగలిగియుండుట కించిన్మాత్రమును సహింపకుండుట యనుట, తెలుపుచుల్ = తెలియఁజేయుచు--(అనఁగా దంపతుల కిద్దఱకు నొక్కవేషమేయుండవలయు నన్న యభిప్రాయమును తెలియఁజేయుచు ననుట,) పరమమైత్రిల్ =మిక్కిలియైన

స్నేహము చేత, మగనిసామేనన్ = పెనిమిటియొక్క యర్ధశరీరమందు, నిలిచిన, నగతనూజ=కొండ కొన్నట్టిపర్వతపుత్రికయైన పార్వతి, తిరుమలరాయమణికిన్ = తిరుమలరాయ శ్రేష్ఠునికి, ప్రధనజయమున్ =యుద్ధమందలి గెలుపును, ఇచ్చున్=ఇచ్చుఁగాక.

సంహారకర్తయు రౌద్రరసాధిదేవతయునగు శివునికి నిట్లు వైశిష్ట్యము నొందియున్నట్టి యిల్లాలు గావున నతనివలెనే రౌద్రకర్మమగు యుద్ధమునందును జయమును గృతిపతికి నొసంగుఁగాతమని యాశయము. ఇరుగడ నిత్యాదులందు సంస్కృతమునందుంబోలె నేకపద్భావము నెఱుంగునది. 'ఇరుగడఁ దరుణాబ్జకృతవతంస' మన్నచో ఋత్వ సంబంధయతి. ఇందులకు.

తే. సారిదిఁ గాదులఁ గలపట్టు • సుడులకెల్ల, ఋత్వమిత్రంబు లగు నచ్చు • లెనయ నైదు
చెల్లు హాయలును స్వరమైత్రిఁ • జెందునపుడు, వెలయు నివి ఋత్వసంబంధ • వళులనంగ.

యని యప్పకవి. శివుఁడర్ధనారీశ్వరుఁడు గనుకఁ దన్మూర్తియందు వలపలి సగము శివుఁడనియు దాపలిసగము పార్వతియనియుఁ దెలియునది.

తా. సాంబమూర్తియందు, పార్వతీదేవి తన ప్రక్కను శివునిప్రక్కను ఘనాఘనలక్ష్మి నెనయుకొప్పు, తరుణాబ్జకృతవతంసము మొదలగునవన్నియు సమానములుగా నమరుచుండఁగాఁ దానంజేసి దనకును శివునకును దేహములందు భేద మెంతమాత్రము లేకుండవలయునని మిక్కుటమయిన యభిప్రాయమును గలిగియుండుటను దెలిపినదయ్యె. అట్లు పెనిమిటి యర్ధదేహమున గాఢంపుసెయ్యమున నెలకొనియున్న పార్వతి తిరుమలదేవరాయలకు యుద్ధములందు జయ మొసంగుఁగాఁత. ఇందలంకారము శ్లేషమూలక మగుసత్ప్రేక్ష.

శా. దంతాఘట్టిత రాజతాచల చలద్గౌరీ స్వయంగ్రాహముం
గంతుద్వేషికిఁ గూర్చి శైలజకుఁ దద్గంగాఝరాచాంతి న
త్యంతామోదము మున్నుగా నిడి కుమారాగ్రేసరుం డై పితృ
స్వాంతంబుల్ వెలయింపఁ జాలునిభరాడ్వక్త్రుం బ్రశంసించెదన్. 7

అ. దంతా...గ్రాహమున్ - దంత=దంతముచే - కోఱకొమ్ముచే, ఆఘట్టిత=అంతటను గట్టనచేయఁబడిన, రాజతాచల=వెండి కొండయందు, చలత్=చలించుచున్న - భయమున వడఁకుచున్న, గౌరీ=పార్వతియొక్క, స్వయం గ్రాహమున్ = తానేకౌఁగిలించుకొనుటను, కంతుద్వేషికిన్ =మన్మథవిరోధియైన శివునకు, కూర్చి=కలిగించి, (విఘ్నేశ్వరుఁడు గజముఖుఁడును, ఏకదంతుఁడు నగునుగాన తనకోఱకొమ్ముచే నేనుఁగువలె వెండికొండను గ్రుమ్మి కోరాడఁగా నాయదరుపలనఁ బార్వతి దిగులుగొని వడఁకుచుఁబోయి పతిని దానే కౌఁగిలించుకొనెననియు, భార్య తానే కౌఁగిలించుకొనుట పతికి మిక్కిలి యానందావహమగుటచే నట్టి పరమానందలాభమును దండ్రియైన శివునకుఁ దాను సంఘటింపంజేసినాఁడనియు నర్థము) ఇంతవఱకుఁ దండ్రిని వెలయించుట చెప్పినాఁడు. ఇఁకఁ దల్లిని వెలయించుటను జెప్పుచున్నాఁడు-శైలజకున్ =పార్వతికి, తత్ ... చాంతి - తత్ =ఆశివునిదైన - శివుని శిరసునందుఁగల, గంగాఝర=గంగాప్రవాహముయొక్క, ఆచాంతిన్ =ఆచమనముచేత- గంగాప్రవాహము సెల్లఁ దొండమునఁబీల్చి యాచమించి వైచుటచేత, అత్యంత ఆమోదమున్ =మీఁదు మిక్కిలియైనసంతోషమును, మున్నుగాన్ ఇడి=ముందుగాఁ గలుగఁజేసి, స్త్రీలకు సవతిలేకుండుట మిక్కిలియుసంతో

సాపత్న్యము గావునఁ దల్లికి సవతియగు గంగను నిశ్శేషముగాఁ దీర్చి వైచుటచే నామెను మున్నువెలయించినాఁడనుట. తల్లిని మున్ను వెలయించునట్లు చెప్పనేలయన శ్లో॥ గర్భధారణపోషాభ్యాం పితుర్మాతాగరీయసీ' అన్నట్లు గర్భధారణ పోషణములచేఁ దండ్రికంటెఁ దల్లి యెక్కుడుగావున నామెను ముందుగా వెలయించినాఁడనుట. గజములు ముందుగా నీరు ద్రావి పిదప సంతోషముచే వప్రక్రీడ (క్రొవ్విళ్లు కోరాడుట)ను జేయుట వాడుక గనుక ముందు గంగాఝురమును ద్రావి పిదపఁ గైలాసమున వప్రక్రీడ సలిపినాఁడని భావ మూహ్యము. కుమారాగ్రేసరుండై=కుమారులలో శ్రేష్ఠుఁడై యని యర్థము - (కుమారస్వామి కగ్రజుఁడై యనిభావము.) పితృస్వాంతంబుల్=తలిదండ్రుల మనసులను, మాతాపితరౌ పితరౌ అని పితృశబ్దము తలిదండ్రుల కిరువురకు నైనపేరు. వెలయింపఁగ చాలు=ఉల్లసిల్లఁ జేయఁజాలినట్టి, ఇభరాడ్వక్త్రున్=గజముఖుఁడైన విఘ్నేశ్వరుని - (ఇది సాభిప్రాయపదము. ఇభరాడ్వక్త్రుఁడనుటయే కైలాసఘట్టనమునకు గంగాఝురపానమునకును నుపయుక్తముగా నున్నది. అట్టివిఘ్నేశ్వరుని) ప్రశంసించెదన్=మిక్కిలి స్తోత్రము చేయుచున్నాను.

ఇది వాచిక నమస్క్రియారూపమగు మంగళము. నిత్యసమాసమందు హల్లునకును వానిమీఁద నడికినయచ్చునకును విశ్రమము చెల్లును. స్వాంతసిద్ధాంతాదిశబ్దములు నిత్యసమాసములు. కనుక నా లవచరణమున స్వాంతశబ్దమందలి 'స్వ' యను నుపసర్గముమీఁద నచ్చుదికియున్నను, నందలిహల్లయిన వకారమునకు విశ్రమము చెప్పఁబడెనని తెలియునది. ఇందులకు.

తే. ఒక్కసమసనమున శబ్ద • యుగముఁ గూడి, పదము లేర్పాటుగాఁ గానఁ • బడని ప్రాణ
సంధులకు నిత్యసమసనక్రాంతులును న,ఖండ విశ్రమములు ననఁ • రెండుఁ జెల్లు.

నని యప్పకవి. ఇందలంకార ముత్ప్రేక్ష.

తా. విఘ్నేశ్వరుఁడు తన దంతముచేత వెండికొండను గ్రుమ్మికోరాడుటవలనఁ బార్వతి భయపడి తానై శివునిఁ గౌఁగిలించుకొనుటచే నతని కట్టియాలింగన సౌఖ్యము నొసంగెను; అంతకుముందే తనసవతితల్లియగు గంగాదేవి ప్రవాహమునెల్ల తొండమునఁ దీర్చి వైచుటచేఁ దల్లికిని మిక్కిలి సంతోషము గావించెను. ఇట్లు తల్లిదండ్రుల నిరువుర నుల్లసిల్లఁ జేసినవాఁడును గుమారస్వామి కన్నయు మేటికుమారుండు నగు గజముఖుని విఘ్నేశ్వరుని మిక్కిలియు స్తోత్రము చేసెదను.

సీ. తరుణార్కకబళనోద్ధతిఁ జూపె నెవ్వాఁడు
రుచులచే ఫలమోహరుచులచేత
నకలంకరామముద్రికఁ బూనె నెవ్వాఁడు
శయముచే హృత్కుశేశయముచేత
మున్నీరు పల్వలంబుగ దాఁటె నెవ్వాఁడు
జవముచే గుణగణార్జవముచేత
నతులశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాఁడు
రణముచే నియమధారణముచేత
తే. ధరణి నెవ్వాఁడు దానవ ద్విరదదళన
విహృతిఁ దనకేసరికిశోరవృత్తిఁ దెలిపె

నతని మత్కావ్యభవ్యవాగమృతఘటన
మంజులస్వాంతు హనుమంతు మదిఁ దలంతు. 8

అ. ఎవ్వాఁడు=ఎవ్వఁడు, రుచులచేఁ=దేహకాంతులచేతను, ఫలమోహరుచులచేతఁ=ఫలమనెడు భ్రాంతిచేతఁ బుట్టిన స్పృహలచేతను, 'అభిషఙ్గే స్పృహాయాంచ గభస్తౌచ రుచిః స్త్రియామ్' అని అమ. తరు ... ద్ధతిఁ — తరుణ+అర్క = బాలసూర్యునియొక్క, కబళన= తిరస్కరించుట యందును - మ్రింగుటయందును, ఉద్ధతిఁ=ఎగురుపాటును — (పదటమును), చూపెఁ=చూపెనో— బాలసూర్యుని దేహకాంతులచేఁ దిరస్కరించుటయు ఫలభ్రాంతిచే మ్రింగఁబూనుటయు నని తెలియునది. హనుమంతుఁడు బాలసూర్యునివలె గెంజివర్ణముగలవాఁ డనుట 'అరుణ కమలవర్ణం ప్రజ్వలత్పావకాక్షమ్' 'కాఞ్చనాద్రి కమనీయ విగ్రహమ్' 'ఫుల్లాశోకోత్కరాభాసమ్' ఇత్యాదులచేఁ దెలియునది.

ఎవ్వాఁడు, శయముచేఁ=హస్తముచేతను, హృత్కుశేశయముచేతఁ =హృదయకమలము చేతను, 'పఞ్చశాఖశ్శయః పాణిః' 'శతపత్రంకుశేశయమ్' అనియు అమ. అకలంక = నిష్కళంకమయిన, రామముద్రికఁ=రాముని యుంగరమును-స్వరూపముద్రను, పూనెఁ=తాల్చెనో, అనఁగా హస్తముచేత రాముని యుంగరమును హృదయముచేత రాముని స్వరూపముద్రను వహించినాఁడనుట. ముద్రికయనఁగా ఉంగరమును ముద్రయునగును. హృదయమందు స్వరూపముద్ర యనఁగా హృదయమున ముద్రవేసినట్లు రాముని స్వరూపము గట్టిగాఁ బాఁదుకొలిపినాఁడని యర్థము.

ఎవ్వాఁడు, జవముచేఁ=వేగముచేతను, గుణగణ+ఆర్జవముచేతఁ= గుణసమూహముయొక్క ఋజుభావము చేను-తనగుణము లెల్లఁ జక్కనై యుండుటచేత ననుట, మున్నీరు = సముద్రమును, పల్వలంబుగఁ=పవుటీపడియగా -- చవుటిపడియ యంతటిదిగా, దాఁటెఁ=దాఁటెనో, గుణగణార్జవము చేత ననుటచే సముద్రమును వేగముచే దాఁటుట మాత్రమేకాదు; సురసను జయించుట మొదలయిన చక్కని పరాక్రమాది గుణసమూహముచేతను గూడ దాఁటినాఁడని యర్థము.

ఎవ్వాఁడు, రణముచేఁ=యుద్ధముచేతను, నియమధారణముచేతఁ=బ్రహ్మచర్యాదినియమముల యొక్క దాల్చుటచేతను, అక్షశిక్షాప్రౌఢిఁ= అక్షాసురుని శిక్షించుటయందలి నేర్పుచేతను - ఇంద్రియముల నిగ్రహించుట యందలి నేర్పుచేతను, అక్షుఁడనఁగా రావణపుత్రుఁడయిన అక్షకుమారుఁడు. అక్షమనఁగా 'అక్షమింద్రియే' అమ. అన్నట్లింద్రియము. అలరారెఁ=ఒప్పెనో - యుద్ధముచే అక్షుని శిక్షించినాఁడనియు బ్రహ్మచర్యాది నియమముచే అక్షములను-అనఁగా నింద్రియములను-నిగ్రహించినాఁడనియు నర్థము.

ఎవ్వాఁడు, ధరణిఁ = భూమియందు, దానవ...విహృతిఁ —('ఉపమితం వ్యాఘ్రాదిభిః అను సూత్రముచే 'దానవా ద్విరదా ఇవ దానవద్విరదాః'' అని యుపమితసమాసము చేయఁగా, దైత్యశ్రేష్ఠులని యర్థము. 'స్యురుత్తరపదే వ్యాఘ్రపుఙ్గవర్షభకుఞ్జరాః। సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' అని యమరుఁడు చెప్పిన వ్యాఘ్రాదు లుత్తరపదములై శ్రేష్ఠార్థవాచకము లగుచున్నవి. ద్విరదశబ్దము కుంజర పర్యాయము గనక నిట శ్రేష్ఠార్థమును జెప్పెడిని) దానవద్విరద= దైత్యశ్రేష్ఠులనెడి, దానవద్ద్విరద=మదముగల గజములయొక్క, దళన=భేదనమందలి, విహృతి=విహారముచేత-నిచ్చలు భేదించుచుండుటచేత ననుట - (ఇట 'దానవద్విరద' యనియు 'దానవత్ ద్విరద'

యనియు రెండర్థముల రెండు రూపములు గ్రహింపఁబడెను. ఈరెండు రూపములను 'దానవద్ద్విరద' యని వ్రాయవచ్చును. ఎట్లన 'అనచిచ'(అచః పరస్య యరో ద్వే వా స్తో న త్వచి) అని పాణినిసూత్రము. 'అచ్చుకంటెఁ బరమైన హకారేతర హల్లునకు నచ్చుపరము గానపుడు, ద్విత్వము వికల్పముగా నగును' అని యర్థము. ఈసూత్రముచొప్పున 'దానవ + ద్విరద' అనుచో 'న' కారమందలి 'అ' అను హకారేతర హల్లునకు నచ్చుపరముగాక హల్లయిన 'ద' కారమే పరమయినది గనుక నా 'వ' కారమునకు ద్విత్వము వికల్పమగును. కాన 'దానవద్ద్విరద, అనిరూపము సిద్ధించుచున్నది. దీనిని 'దానవద్విరద' యని ప్రథమార్థమునకును, 'దానవత్ ద్విరద' యని ద్వితీయార్థమునకు నుపయోగించుకొనవచ్చునని తెలియునది.) తనకేసరికిశోరవృత్తిక్ = తనసింహపుఁ బిల్లయొక్క వ్యాపారమును-తన కేసరియనెడు వానరునికిఁ గుమారుఁడగుట నను భావము, తెలిపెక్ = కనఁబఱిచెనో, మేటిరాక్షసులనెడు మదపు టేనుఁగులను సింహపుఁ బిల్లవలెఁ జెండాడువాఁడని యర్థము. అతనిక్ = అట్టివాఁడును, మత్... స్వాంతుక్ — మత్కావ్య = నేను రచించెడి కావ్యమందు, భవ్యవాక్ = శుభవాక్కులనెడి, అమృత = అమృతముయొక్క, ఘటన = పొందించుటయందు, మంజుల = ఒప్పుచున్న, స్వాంతుక్ = మనసుగలవాఁడును-తనమనః ప్రసాదముచే నమృతమువలె చవులుగులుకు మంచి పలుకులతో నా కావ్యము రచించునట్లు సేయువాఁడనుట - కావుననే కవి మీఁద 'జగత్ప్రాణనందన కారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశి... గ్రంథకల్పనుఁ' డనియు 'పవననందన ప్రసాదసమాసాదిత...కవితాసర్వస్వుఁ' డని గద్యమునను జెప్పుకొనెడిని. అగు, హనుమంతుక్ = హనుమంతుని, మదిక్ = మనస్సునందు, తలంతుక్ = ధ్యానించుచున్నాను.

ఇచట హనుమంతునికి 'తరుణార్క కబళన'ముచే బాల్యవృత్తాంతమును, 'రామముద్రికఁబూనె' ననుటచే రామాంగుళీయకమును గొని సీతాన్వేషణమునకై పోవుటయు 'మున్నీరుపల్వలంబుగఁ దాఁటె' ననుటచే సురసాదిజయపూర్వకముగ సముద్రమును దాఁటి లంకం జేరి సీతం గాంచుటయు 'అక్షశిక్షా ప్రౌఢినలరారె' ననుటచే నక్షాదివధలంకాదహనాదులు గావించుటయు 'దానవద్ద్విరద పశన'మును జెప్పుటచే రామాదులతోఁ గూడి వచ్చి యనేక రాక్షసులను జంపి జయము గూర్చుటయునని యతని చరిత్రమంతయుఁ గ్రమముగఁ జెప్పఁబడుట తెలియునది. మఱియు, మొదటిపాదమునఁ దేజః ప్రభావములును, రెండవపాదాన భక్తి తాత్పర్యములును, మూఁడవపాదానియందు జవసామర్థ్యములును, నాల్గవపాదమున శౌర్యపరాక్రమములును దేటపఱుపఁబడినవని తెలియునది. ఇచట నర్థాలంకారము శ్లేషము; శబ్దాలంకారము ఛేకానుప్రాసము.

తా. ఎవఁడు, పండని భ్రమించి దానియందలి రుచులచేత (చవులచేత) బాలసూర్యునిఁ బట్టనుంకించుటయే కాక తేజములచేత (కాంతులచేత) బాలసూర్యునిఁ దిరస్కరించెనో, ఎవఁడు రాముని యంగుళీయమును సీత కానవాలుగాఁ జేతఁ దాల్చి కొంపోవుటయే కాక రాముని స్వరూపమును హృదయారవిందంబునందు ముద్రించినట్లు భక్తిని దాల్చియుండెనో, ఎవఁడు సముద్రమును వేగముచేతనే కాక చక్కని పరాక్రమాది గుణములచేతను నంతరాయములను దొలఁగించికొని చోటపడియావలె నవలీలఁ దాఁటెనో, ఎవఁడు యుద్ధముచేసి యక్షునిఁ జంపునేరుపు నెఱపుటయే కాక బ్రహ్మచర్యాది నియమముచే నక్షములను (ఇంద్రియములను) గూడ జయించు నేర్పు నెఱపెనో, ఎవఁడు రాక్షసులనెడి యేనుఁగులను సింహపుఁ బిల్లవలెఁ జీల్చెనో, కేసరియను వానరుని కొడుకగునట్టి హనుమంతుని, తనమనః ప్రసాదముతో నా కావ్యము నమృతప్రాయములయిన మంచి వాక్కులను బొందించుఁగాక యనికోరి మనమున ధ్యానించుచున్నాను.

సీ. భువిఁ గవితాకన్యఁ ♦ బుట్టించె నెవ్వాఁడు
బడి నాగమము లెల్ల ♦ నడపె నెవ్వఁ
డేను నీ వనుమాట ♦ లెనయించె నెవ్వాఁడు
కోమలపదలీలఁ ♦ గూర్చె నెవ్వఁ
డనఘతులాకోటి ♦ నలరించె నెవ్వాఁడు
నిఖిలగుణంబులు ♦ నేర్పె నెవ్వఁ
డినకరసంప్రాప్తి ♦ నెసఁగించె నెవ్వాఁడు
రహి నించె నర్థగౌ ♦ రవము నెవ్వఁ
తే. డట్టివాణీగురుత్వమహత్త్వఖనుల
ఘనులఁ బ్రాచేతసవ్యాస ♦ కాళిదాస
దండి భవభూతి మాఘ సత్కవి మయూర
భారవుల భారవుల నాత్మఁ ♦ బ్రస్తుతింతు. 9

అ. ఇందు వాల్మీకి మొదలయిన సంస్కృత మహాకవులను గవితయనెడు కన్యకు జననాద్య వస్థాసంపాదకులుగా నలవరించి యర్థద్వయమునకు నభేదాధ్యవసాయము చేసియున్నాఁడు. ఎవ్వాఁడు = ఎవఁడు, భువిన్ = భూమియందు, కవితాకన్యన్ = కవితయనెడు కన్యను, పుట్టించెన్ = జన్మింపఁజేసెనో - అనఁగా ప్రథమమునఁ గవిత నవతరింపఁజేసినవాఁడు వాల్మీకియని తెలియునది. 'భూదివోస్తు ఙ్యాయశ్ తత్' భూదివ్ శబ్దములకు సప్తమియందుఁ గల రూపములు తెనుఁగునఁ బ్రాతి పదికములగు ననెడి శబ్దాను శాసనసూత్రముచే, భువి దివి యని రూపములు కలిగెను. బడిన్ = వెంబడిగా, ఆగములెల్ల నడపెన్ = ఆగమోక్త ధర్మములనెల్ల జరిగించెనోయని కన్యాపరమైన యర్థము. వేదములనెల్ల విభజించి ప్రవర్తింపఁజేసెనో యని కవితాపరమైన యర్థము. వేదవిభాగము చేసినవాఁడు వ్యాసుఁడని తెలియునది.

ఎవ్వాఁడు, ఏను నీవు అనుమాటలు = (కన్యకు) నేను నీవు అనెడి తొలితొలి మాటలను ఎనయించెన్ = పట్టించెనో - నేర్పెనోయనుట; (కవితకు) 'త్వమేవాహం నసంశయః' 'నీవే నేను సందేహము లేదు' అని సరస్వతి కాళిదాసునిఁగూర్చి చెప్పియుండుటచే సరస్వతి నైననేనే నీవు అనుమాటలను వ్యాపింపఁజేసెనో యనుట. దీనిచే కాళిదాసని తెలియునది. ఎవ్వఁడు, కోమలపదలీలన్ కూర్చెన్ - (కన్య) కోమల = మృదువైన, పదలీలన్ = పాదక్రియను - మెల్లగా నడుగులు పెట్టుట ననుట - కూర్చెన్ - ఘటింపఁజేసెనో, (కవిత) కోమల = మృదువయిన, పదలీలన్ = శబ్దవిలాసమును కూర్చెనోయనుట 'దండినః పదలాలిత్య' మ్మనుటంబట్టి యిట దండియని తెలియునది. 'లీలావిలాస క్రియయోః' అని యమరుని చొప్పున లీలా శబ్దమునకుఁ గ్రియ యనియు నర్థము.

ఎవ్వాఁడు, అనఘ...నలరించెన్ - (కన్య) అనఘ = నెఱసులేని, తులాకోటిన్ = అందెను, అలరించెన్ = అలంకరించెనో - మేలయిన యందెలను గాలికిఁ దొడిగి నాఁడనుట. (కవిత) * అహో మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ ఫణితిం। తులాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం

* కాళిదాస భవభూతులు భిన్నకాలములందుండిరనుటకు రాజతరంగిణీ గౌరవధాది ప్రబంధంబులుండుటంబట్టి యీవచనములకుఁ బ్రామాణ్యము చింతనీయము.

లఘిమని। గిరాందేవీ సద్యశ్శ్రుతి కలితకల్హారకలికా మధూలీమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ ’ అన్నట్లు కాళిదాసునకును భవభూతికిని కవిత్వాతిశయమును బట్టి వివాదము వచ్చుట విని సరస్వతి వారిరువురకవనములను త్రాసునందుఁ దూఁచి భవభూతి కవనము కొంచెపడఁగా చెవిని జెరివిన కల్హారంపుఁదేనియబొట్టును దానియందుఁ బిలికినదని ప్రతీతి. దీనిని బట్టి - అనఘ = దోషములేని, తులాకోటిన్ = త్రాసుయొక్క నొకమూలను, అలరించెన్ = కవితారూప సరస్వతి నొప్పునట్లు చేసెనోయనుట - తన కవితారూప సరస్వతిని త్రాసునఁదూఁచిన వాఁడు భవభూతియని తెలియునది. ఎవ్వఁడు, నిఖిల... నేర్పెన్ - (కన్య) నిఖిల గుణంబులు=సమస్త గుణములను, నేర్పెన్ = కఱపెనో, (కవిత) నిఖిలగుణంబులు = శ్లేషాది సమస్తగుణములను, నేర్పెన్ = తెలియఁజేసెనో, అనఁగా—శ్లో. ‘దండినః పదలాలిత్యం భారవేరర్థగౌరవమ్। ఉపమా కాళిదాసస్య మాఘస్యైతే త్రయోగుణాః ’ అన్నట్లు దండ్యాదులందలి గుణత్రయమును గలవాఁడు మాఘుఁడని తెలియునది.

ఎవ్వాఁడు, ఇన... నెసఁగించెన్ - (కన్య) ఇన = పెనిమిటియొక్క, కరసంప్రాప్తిన్ = పాణిగ్రహణమును, ఎసఁగించెన్ = ఒనఁగూర్చెనో - వరు నేర్పఱచి పెండ్లికావించెనో యనుట, (కవిత) ఇన = సూర్యుని యొక్క, కర = కిరణములయొక్క, సంప్రాప్తిన్ = పొందుటను, ఎసఁగించెన్ = ప్రకటింపఁజేసెనో-అనఁగా మయూరుఁడనుట, ‘ఇనస్సూర్యే నృపే౽పత్యౌ’ అని విశ్వము. ఎవ్వఁడు, అర్థగౌరవము రహినించెన్—(కన్య) అర్థగౌరవము = ధనముయొక్క యతిశయమును, రహిన్ = ఒప్పునట్లు, నించెన్ = నిండించెనో - పెండ్లియైన పిదప సరణముగా నెక్కుడు ధనము నందించెనో యనుట - (కవిత) అర్థగౌరవమున్ = శబ్దములయందలి యర్థము పెంపును, రహిన్ = ఒప్పునట్లు నించెననుట - అనఁగా ‘భారవేరర్థగౌరవమ్ ’ అన్నట్లు భారవియని తెలియునది.

అట్టి... ఖనులన్—అట్టి = అటువంటి, వాణీ =కవితారూప సరస్వతియొక్క- గురుత్వ=జనకత్వాదిరూపమగు గౌరవముచేనైన-మహత్త్వ=శ్రేష్ఠతకు-ఖనులన్ =ఆధారభూతులయిన, ఘనులన్ = శ్రేష్ఠులను,భారవులన్-భా=కాంతియందు,రవులన్ =సూర్యులయినవారిని, ప్రాచేతస... భారవులన్... ప్రాచేతస = వాల్మీకిని, వ్యాస = వ్యాసుని, కాళిదాస = కాళిదాసుని, దండి = దండిని, భవభూతి= భవభూతిని, మాఘసత్కవిన్ = మాఘుఁడనెడి కవిశ్రేష్ఠుని, మయూర = మయూరుని, భారవులన్ =భారవిని, ఆత్మన్ =అంతరంగమందు, ప్రస్తుతింతున్ =స్తోత్రము చేయుచున్నాను. ‘కవితాకన్యను బుట్టించె’ ననుట మొదలుగా ‘అర్థగౌరవమునించె’ నన్న పర్యంతమును చెప్పఁబడిన పుట్టించుట మొదలయిన కార్యములకు వాల్మీకి మొదలుకొని భారవివఱకుఁ గల కవులు క్రమముగాఁ గర్తలని క్రమాలంకారము. కన్యకు నుత్తరోత్తరావస్థాసంపాదకులైన వారుంబలె వ్యాసాదులు కవితకు నుత్తరోత్తరావస్థాసంపాదకు లని తెలియునది. కవితాకన్యయనుచోట రూపకము. అగమములు మొదలగుచోట్ల నర్థద్వయమునకు నభేదాధ్యవసాయము చేయుటంబట్టి శ్లేషమూలకమయిన యతిశయోక్తి; రూపకాతిశయోక్తులకు నంగాంగీభావముచేత సంకరము. తా- సుగమము.

మ. మహిమన్ వాగనుశాసనుండు సృజియింపం గుండలేంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీకనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించునీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దక్తాప్రిగల్భవ్య మూహించెదన్. 10

అ.. ఇందు నన్నయభట్టు మొదలయిన యాంధ్రకవులను వర్ణించుచున్నాఁడు మఱియు బ్ర

పంచమనఁగా విస్తరమును విశ్వమును. కనుక ఆంధ్రోక్తిమయ ప్రపంచమనెడి ప్రపంచముచేత నని యర్థముచేసి యాంధ్రోక్తిమయప్రపంచపరముగాను ప్రపంచపరముగాను నర్థద్వయము గ్రహించునది— మహిన్=భూమియందు, మున్=ముందు, వాగనుశాసనుండు=శబ్దానుశాసనుఁడైన నన్నయభట్టు, సృజియింపన్=పుట్టింపఁగా, నని యాంధ్రోక్తిమయ ప్రపంచపరము, వాగనుశాసనుండు=సరస్వతీ నియామకుఁడయిన బ్రహ్మ పుట్టింపఁగా నని ప్రపంచపరము. కుండలీంద్రుండు- (కుండలేష్టిఁజేసి కుండలములు ధరించిన) తిక్కనసోమయాజిశ్రేష్ఠుఁడు, తత్...మూలమై-తత్=ఆయాంధ్ర ప్రబంధ విస్తరముయొక్క, మహనీయ=ఒప్పిదమయిన, స్థితి = ఉనికికి, మూలమై=ఆధారమై, నిలువన్=నిలిచి యుండఁగా నని యాంధ్ర ప్రబంధ విస్తరపరము. కుండలీంద్రుండు=సర్పములకు రాజయిన శేషుఁడు, తత్=ఆప్రపంచముయొక్క, గొప్పయునికికి నాధారమై నిలువఁగానని ప్రపంచపరము. శ్రీనాథుండు=(ఆంధ్ర)-శ్రీనాథుఁడను కవి, ప్రోవన్=పోషింపఁగా, (ప్రపంచ) శ్రీనాథుండు=విష్ణువు, రక్షింపఁగా ననుట, మహోమహులై.. వెలయింపన్ - (ఆంధ్ర) మహోమహులై=గొప్ప తేజస్సుగలవారై, సోముఁడు=నాచనసోముఁడును, భాస్కరుండు=భాస్కరుఁడు ననుకవులు, వెలయింపన్=ప్రకాశింపఁజేయుఁగా, (ప్రపంచ) మహోమహులై=గొప్ప కాంతిగలవారై, సోముఁడున్=చంద్రుఁడు, భాస్కరుండున్=సూర్యుండును, ప్రకాశింపఁజేయఁగా, సొంపు = చక్కనను, పాటించు = కయికొనునట్టి - సొంపుపెంపారునట్టి యనుట, ఈ, బహుళ=అధికమయిన, ఆంధ్ర ఉక్తి మయ=తెనుఁగు మాటలచేతనయిన-ఆంధ్రప్రబంధమయమయిన, ప్రపంచ=విస్తరమనెడి ప్రపంచముచేత, తత్ప్రాగల్భ్యము-తత్=ఆపూర్వోక్త కవులయొక్క, ఆబ్రహ్మాదులయొక్కయు నని యర్థాంతరము. ప్రాగల్భ్యము=ప్రౌఢిని ఊహించెదన్=భావించుచున్నాను - వారి ప్రౌఢి యిట్టిదిగదా యని యెన్నుచున్నాననుట.

'ప్రపఞ్చస్సంచయే ప్రోక్తో విస్తరేచ ప్రతారణే' అని విశ్వము. ఈపద్యమున వాగనుశాసనాది పదములు ప్రకృతార్థములయందుఁ గుంఠిత శక్తికములు గావున బ్రహ్మాద్యర్థవాచకములుగావు; కనుక శబ్దశక్తిమహిమచే విశ్వపరమైనయర్థము వ్యంగ్యము. కాన, శబ్దశక్తి మూలవ్యంగ్యధ్వని.

తా. భూమియందు మొదట నన్నయభట్టు పుట్టింపఁగా, తిక్కనసోమయాజి యునికికి నాధారభూతుఁడై నిలువఁగా, శ్రీనాథుఁడను కవి పోషింపఁగా, సోముఁడును భాస్కరుఁడు నను కవులు మిక్కిలి తేజముదీపింప దానిని బ్రకాశింపఁజేయఁగా, పెంపారుచు నధికముగా విలసిల్లుచున్న యీ యాంధ్ర ప్రబంధవిస్తరమును బట్టి యాకవుల ప్రౌఢి యిట్టిదిగదా యని భావించుచున్నా నని వాచ్యార్థము. మొదట బ్రహ్మ సృజింపఁగా నాదిశేషుఁ డాధారమయి నిలువఁగా విష్ణువు ప్రోవఁగా చంద్రసూర్యులు మిక్కిలియుఁ బ్రకాశముతో వెలిఁగింపఁగా పెంపునొందియున్న యీ ప్రపంచమును బట్టి యా బ్రహ్మాదుల ప్రౌఢి యిట్టిదిగదాయని యెన్నుచున్నానని వ్యంగ్యము.

శా. భావం బెక్కడ లేక వృత్తనియమాశాపాయంబుఁ జింతింప కెం
దే వర్తించి పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవి ప్రణీత కృతి సామాన్యాకృతిం బూని పై
పై వన్నెల్ పచరింప దానిఁ దిలకింపం బోరు ధీరోత్తముల్. 11

అ. ఇందుఁ గుకవినిందనముచేయుచున్నాఁడు. మఱియు నిట 'కుకవి ప్రణీతకృతి సామాన్యాకృతింబూని పైపైవన్నెల్ పచరింప' ననుటచే సామాన్యయనఁగా వేశ్యగనుకఁ గుత్సితకవిచేతఁ

జెప్పఁబడిన ప్రబంధము పరముగాను వేశ్యాస్త్రీపరముగాను నర్థద్వయము గలుగఁజెప్పినాఁడు - భావం బు ఎక్కడఁ డఁగ లేక = వ్యంగ్యార్థ మేపట్టున నరసినను లేక యని కుకవిప్రబంధపరము. భావమనఁగా వ్యంగ్యార్థమును చిత్తమునగును, గనుక చిత్త మెవనియందును లేక యని సామాన్యాపరము. వృత్త...జింతింపక - వృత్తములనఁగా శార్దూల మత్తేభవిక్రీడితాదివృత్తములును వ్యాపారములును గనుక, (కుకవిప్రబంధపరముగా) వృత్త=శార్దూలాది వృత్తములయొక్క, నియమ - యతిప్రాసాదిలక్షణము యొక్క, అపాయంబుఁగ=హానిని, చింతింపక = విచారింపక, యనియర్థము. (సామాన్యపరముగా) వృత్త=నడవడియొక్క, నియమ=నియతియొక్క, అపాయముఁగ=హానిని - మంచినడవడి విడిచినందు లకు విచారములేక యని యర్థాంతరము. ఎందేఁ బ్రవర్తించి - (కుకవి) ఎందేఁ = ఎక్కడ నేని, ప్రవర్తించి = ప్రవర్తించి - ఎక్కడనో యపండితులయొద్దఁ జదువఁబడినదై యనుట, (సామాన్య) ఎందేఁ = ఎక్కడను - ఎల్లయెడల ననుట, ప్రవర్తించి = వ్యభిచరించి, పరా...దీపించి - (కుకవి) పర+అర్థ+వంచనల చేఁ = ఇతరకవుల శబ్దార్థములను దొంగలించుటలచేత, దీపించి = ప్రకాశిం చి, (సామాన్య) పరుల ద్రవ్యముల నపహరించుటచేఁ బ్రకాశించి, మూర్ఖాళిసంభావింపఁ - (కుకవి) మూర్ఖ అళి = పామర సమూహము, సంభావింపఁ = మెచ్చఁగా, (సామాన్య) మూర్ఖా+ఆళి= మూర్ఖురాలయిన చెలికత్తె, మెచ్చఁగా - "అలిస్సంఖ్యావళీ అళి" అని. కుకవిప్రణీతకృతి - కుకవి = కుత్సితకవిచేత, ప్రణీత=రచింపఁబడిన, కృతి = ప్రబంధము, సామాన్యా+ఆకృతింబూని = వేశ్య యొక్క స్వరూపమునువహించి - బోగము దానిని బోలినదై యనుట, పైపైమెఱుంగుల్ = పై పయి మెఱుఁగులను, పచరింపఁ = నెఱపఁగా - బోగముదానివలె వట్టిపయితళుకులు మాపుటయే కాని లోపల నేమియుసారస్యముండ దనుట. దానిఁ = ఆకుకవి గ్రంథమును, ధీరోత్తముల్ =పండితశ్రేష్ఠులు - అని కుకవి కృతిపరము- దానిఁ =ఆ సామాన్యను, ధీరోత్తముల్ = కామాదులచేఁ గీడుపడక దిటగలిగియున్న యంతఃకరణములుగలవారిలో మేటియైనవారు - ధైర్యశాలులు అని సామాన్యాపరము. తిలకింపఁ బోరు= విమర్శించి చూడను జూడరనియర్థము. కన్నెత్తి చూడనయినఁ జూడరని యర్థాంతరము.

'విత్తమాత్రోపాధేస్సకలపురుషాభిలాషిణీ సామాన్యావనితా' కేవలము విత్తమే కారణముగా సకలపురుషులను గోరునది సామాన్యయని సామాన్యాలక్షణము తెలియునది. ఇం దాకృతిశబ్దము సాదృ శ్యవాచకము గనుక నలంకార ముపమ. 'ఎందేఁ బ్రవర్తించి' యనుచో ఏనిశబ్దమునికారమునకు 'అపిశబ్దార్థ స్యేతః' 'అపిశబ్దముయొక్క ఇకారమునకులోపము' అనుసూత్రముచేత లోపముకలుగఁగా మిగిలిన ద్రుతమునకు సరళము పరమగుటచే లోపముకలిగెనని తెలియునది. మొదటిచరణమున ప్రాదియతి. 'భావంబెక్కడలేక' ఇత్యాదులందలి యర్థద్వయమున కభేదాధ్యవసాయముచే శ్లేషమూలమయినయతి శయోక్తి. ఉపమకును అతిశయోక్తికిని సంకరము.

తా. ఏపట్టునందును వ్యంగ్యార్థములేక, శార్దూలాదివృత్తముల ప్రాసాది నియమములను విమ ర్శింపక, యెక్కడనో పామరులయొద్దఁ జదువఁబడినదై, యితరకవులశబ్దార్థములను దొంగలించుటచే వన్నెగాంచు పామరసమూహము మెచ్చుకొనఁగా కుత్సితకవి రచించినగ్రంథము పైపయి తళుకులు చూపునే కాని లోనసారస్యములేకుండును. గావున, దానిని బండితోత్తములు విమర్శించిచూడనైనను జూడరనియర్థము. ఎవరియందును మనసులేక, నడవడి నియతితప్పుటయు సరకుసేయక, యెల్ల యెడల వ్యభిచరించి, యితరులద్రవ్యమును మోసపుచ్చి, వాసికెక్కి, మూర్ఖురాలయిన చెలికత్తె యందులకు మెచ్చు కొనఁగా పయిపయి తళుకులు బోగముది పచరించునుగాన మనస్సు చిక్కంబట్టిన ధైర్యశాలులు దానిని గన్నెత్తియుఁ జూడరని యర్థాంతరము.

వ. అని యిష్టదేవతావందనంబును సుకవికవితాభినందనంబును కుకవినిందనంబునుం గావించి సనాతనాధునాతనాఖిలమహాకవిజనానుగ్రహంబునఁ బురాతనపుణ్యశ్లోకరాజర్షివర్ణనాకర్ణనోత్కంఠితసకలజనసేవ్యం బగునొక్కమహాకావ్యంబు రసోచితచమత్క్రియాకల్పనాకల్పభవ్యంబు గా నొనరింపం బూని యున్న సమయంబున. 12

అ. అని=ఇట్లని, ఇష్టదేవతావందనంబును=ఇష్టదేవతలనుగూర్చిన నమస్కారమును, సుకవికవితా అభినందనంబును - సుకవి=సత్కవులయొక్క- కవితా=కవిత్వముయొక్క- అభినందనంబును=మెచ్చుకోలును, కుకవినిందనంబును = కుత్సితకవులయొక్క దూషణమును, కావించి=చేసి, సనాత...నుగ్రహంబునన్ - సనాతన=ప్రాచీనులయినవారును - అధునాతన=నవీనులైనవారును- అగు- అఖిలమహాకవి = సకలమహాకవులయొక్క- అనుగ్రహంబునన్ = దయచేత, పురా... సేవ్యంబు- పురాతన = ప్రాచీనుఁడయిన- పుణ్యశ్లోక=పవిత్రమయినకీర్తి గలిగిన - రాజర్షి = రాజర్షియొక్క - వర్ణన = వర్ణనముయొక్క -ఆకర్ణన=వినుటయందు- ఉత్కంఠిత=తహతహపాటుగల- సకలజన = సమస్తజనులచేతను- సేవ్యంబు= సేవింపఁదగినది,అగు, ఒక్క మహాకావ్యంబున్ =ఒక్కమహాప్రబంధమును, రసో... భవ్యంబుగాన్ - రస ఉచిత=శృంగారాదిరసములకుఁదగియుండెడు- చమత్క్రియా =శబ్దచమత్కారముయొక్క- కల్పనా=రచనయనెడు- ఆకల్ప=అలంకారముచేత- భవ్యంబుగాన్ =యోగ్యమగునట్లుగా, ఒనరింపన్ పూని=రచింప సమకట్టి, ఉన్నసమయంబునన్ =ఉన్న కాలమునందు-దీనికి ముందటిపద్యముతో నన్వయము.

సీ. వసుమతీభారధూర్వహత నెవ్వని యుర్వ
 రావరాహాంక మర్థము వహించుఁ
గరగతచక్రవిక్రమశక్తి నెవ్వాని
 రామానుజత్వంబు రమణ కెక్కు
జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నె
 వ్వాని లోకేశ్వరత్వము పొసంగుఁ
జటులశార్వరమగ్నసర్వవర్ణోద్ధార
 పటిమ నెవ్వనిరాజభావ మెసఁగు

తే. నతఁడు వీరప్రతాప రాజాధిరాజ
రాజపరమేశ్వ రాష్టదిగ్రాజకులము
నోభయంకర బిరుద సన్నుతజయాభి
రామగుణహారి తిరుమలరాయశౌరి. 13

ఇందుఁ 'దిరుమలదేవరాయనికిఁ ద్రిమూర్త్యాత్మకత్వమును బ్రతిపాదించి యర్థద్వయమున కభేదాధ్యవసాయముచేసి యున్నాఁడు—వసుమతీ...వహతన్—వసుమతీభార = భూభారముయొక్క, ధూర్వహతన్ = భారవాహిత్వముచేత—భూభారమును వహించుటచేత — భూరాజ్యమును బరిపాలించుటచేతననుట, ఎవ్వని = ఏరాజుయొక్క, ఉర్వరా వరాహ అంకము=భూవరాహుఁడను బిరుదము, అర్థము వహించున్=సార్థకత్వమును దాల్చునో, ఏరాజుయొక్క భూవరాహనామము సార్థకత్వము

నొందునోయని యర్థాంతరము. అంకమనఁగా 'అఙ్కమఙ్కే స్వలఙ్కే చిహ్నాయోః' లాంఛనమునకును, నామమునకును పేరు.

కర .. శక్తిన్-కరగత=హస్తగతములయిన- చక్ర=రాష్ట్రములుగలిగిన- విక్రమశక్తిన్= పరాక్రమశక్తిచేత, ఎవ్వాని= ఏరాజుయొక్క, రామానుజత్వంబు=రామదేవరాయలయొక్క తమ్ముఁడౌట, రమణకెక్కున్=వన్నెకెక్కునో యనియర్థము. కరగత = హస్తగతమయిన- చక్ర=సుదర్శనచక్రము యొక్క- విక్రమశక్తిన్=పరాక్రమశక్తిచేత- ఎవ్వని=ఏరాజుయొక్క- రామానుజత్వంబు = బలరామునికిఁ దమ్ముఁడౌట—అనఁగా, కృష్ణుఁడౌట, రమణకెక్కునోయని యర్థాంతరము. 'చక్రం రాష్ట్రే' 'చక్రం సుదర్శనమ్' అ. ఈరెండు పాదములందును రాజునకు భూపరావానామమును కృష్ణరూపమును జెప్పుటంబట్టి విష్ణువుతోడితాదాత్మ్యమును బ్రతిపాదించుట తెలియునది.

జీర్ణ ... సృష్టి—జీర్ణ=ఖిలమయిన-కర్ణాటలక్ష్మీ=కర్ణాటరాజ్యలక్ష్మియొక్క- పునస్సృష్టి=మరల నిర్మించుటచేత- ఎవ్వాని=ఏరాజుయొక్క- లోకేశ్వరత్వము=జనేశ్వరత్వము - పొసంగున్ = ఒప్పుచుండునోయని యర్థము—ఇటలోకశబ్దము జనపరము—'లోకస్తు భువనే జనే' అజీర్ణకర్ణుఁడనఁగా 'వృద్ధశ్రవాః' అను పదమునకుఁ బర్యాయముగాఁ గొన్నచో నింద్రుఁడగును. అతనివలని, అట=దుర్వాసుని శాపమువలన చలించిన- లక్ష్మీ=రాజ్యలక్ష్మియొక్క- పునస్సృష్టిన్= పునరుద్ధరణముచేత, ఏరాజుయొక్క, లోకేశ్వరత్వము=బ్రహ్మత్వము పొసంగునోయని యర్థాంతరము. ఇట లోకశబ్దము భువనపరము. 'హిరణ్యగర్భోలోకేశః' అ. ఈ యర్థము కవిహృదయము గాదనియు 'వసుమతీ భారధూర్వహతి'నసెడు పదమువలె 'జీర్ణకర్ణాట లక్ష్మీపునస్సృష్టి' యనెడు పదమును శ్లిష్టముగాదనియు రాజును సృష్టిమాత్రముచేతనే సృష్టికర్తయైన బ్రహ్మగాఁ జెప్పెనాఁడనియుఁ గొందఱమతము.

చటుల ... పటిమన్—చటుల = క్రూరులయిన - శార్వర=ఘాతుకులయందు - మగ్న=మునిఁగిపోయిన- సర్వవర్ణ=బ్రాహ్మణాది సకలవర్ణములయొక్క- ఉద్ధార=ఉద్ధరించుటయందలి- పటిమన్ = సామర్థ్యముచేత, ఎవ్వని=ఏరాజుయొక్క, రాజభావము=ప్రభుత్వము—రాచఱికము, పొసఁగున్ =అతిశయించునో యనియర్థము. చటుల=దట్టమయిన, శార్వర=కటిక-చీఁకటియందు, మగ్న=మఱఁగిన-లీనమయిన- సర్వవర్ణ=తెలుపు పసపు మొదలయిన యెల్లవర్ణములయొక్క- ఉద్ధార=ఉద్ధరించుటయందలి- వేఱువేఱ తెలుపుటయందలి యనుట. పటిమన్=పాటవముచేత, ఏరాజుయొక్క, రాజభావము= చంద్రత్వము, ప్రకాశించునోయని యర్థాంతరము— 'శార్వరం త్వన్ధతమసే ఘాతుకే ఘేద్యలిఙ్గకమ్' 'వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ' 'రాజా మృగాఙ్కే క్షత్రియే నృపే' చంద్రుఁడు శివునియష్టమూర్తులలో నొకమూర్తిగనుక నిందువలన శివత్వము ప్రతిపాదించినాఁడు. శివునకు 'పృథివీ సలిలం తేజో వాయురాకాశమేవచ । సూర్యాచన్ద్రమసౌ సోమయాజీ చేత్యష్టమూర్తయః?' అని యష్టమూర్తులు తెలియునది. ఇంతవఱకు రాజునకుఁ ద్రిమూర్త్యాత్మకత్వముఁ బ్రతిపాదించినాఁడని తెలియునది.

అతఁడు=ఆరాజు, 'వీరప్రతాప' 'రాజాధిరాజ' 'రాజపరమేశ్వర' 'అష్టదిగ్రాజకుల మనోభయంకర' యనునట్టి,బిరుద=బిరుదులచేత, సన్నుత=స్తోత్రముచేయఁబడిన, జయ=జయముచేత, అభిరామ= ఒప్పుచున్న, గుణ=గుణములచేత, [illegible]హారి=మనోహరుఁడయిన, తిరుమలరాయశౌరి= తిరుమలరాయరాజు. దీనికిసు ముందఱిపద్యముతో నన్వయము,ఇందును శ్లేషమూలమయిన యతిశయోక్తి యలంకారము.

వ. వెండియుం బ్రచండరుచిపిచండిలమార్తాండమండలపాండిత్యభూషితభుజార్గళనిరర్గ
ళప్రతాపదీపితప్రకాశకాశికీభూతకదనభూతలభీతాభీతవిమతక్షమాధీశ్వరుండును,
విశ్వవిశ్వంభరావినుత శాశ్వతైశ్వర్యధుర్యతామహేశ్వరుండును, నంభోధివసన
సంభాసమానకుంభినీ వలయసంభరణదీక్షాశుభారంభ సుభగంభావుకగంభీరభేరీ
భాంకరణదంభశుంభదంభోధరగర్జాసముజ్జృంభణ సంభావితాత్మీయపట్టాభిషేక
సమయసముత్తంభితశాతకుంభకుంభనిగుంభితాంభోవర్షవిద్రావితక్షుద్రనృపోప
ద్రవతాపభద్రవద్రసానిత్యరసార్ద్రితాను సంధాయకదైనందినదానధారాప్రవా
హుండును, నసమసమరసముత్సాహసాహసహసితసితవాహుండును, నభగం
భువసమంగళసర్వస్వమరకతదండపుండరీకాగ్రవర్ణనీయసువర్ణకలశకర్ణికాధిష్ఠిత
రాజ్యలక్ష్మీరతోష్ణపథానాడంబరసంబోధకాంబురుహబంధుబింబానుబింబ వైభ
వుండును, త్రైలోక్యవినుతచాళుక్యనారాయణాంకసంకల్పితాశేషపోషణప్రాభ
వుండును, గృపాణకృష్ణనిర్మథ్యమానరణార్ణవసముత్పన్నవిజయలక్ష్మీనిక్షిప్తనిరు
పమనిరీక్షణసరస్మరమకరపతాకాలోకనమాత్రసంపాదితకంపస్వేదభీరూభవన్నా
నావజీరసేనామానభేదనుండును, శ్రీరామచంద్రచరణకమలయుగళాభివాద
నుండును, నాత్రేయగోత్రపావనుండును, నఖిలకర్ణాటరాజ్యపునరుజ్జీవనుం
డును, శ్రీరంగరాజరత్నరత్నాకరపూర్ణచంద్రుండును, నగుతిరుమలరాయ
దేవేంద్రుండు, నిస్తంద్రవిభవసాంద్రుండై యొక్కనాఁడు వజ్రకీలితద్వార
బంధబంధురలక్ష్మీవిలాసంబు జననసమయజలాంతర్లక్ష్యమాణజలజసదనాస
మాగమనసంపదసొంపు సంపాదింప సాభోగయవనికాభ్యంతరసద్యస్సముద్య
తయంత్రపాంచాలికాసంచారంబులు జిలుఁగుతరంగలమఱుంగు దొలంగివచ్చు
నచ్చరమెఱుంగుఁబోండ్లతెఱంగు లెఱింగింపఁ జంద్రకాంతభిత్తిబింబితచంద్రా
ననావదనంబులు తరంగభక్తిబహూకృతనవేందుబింబంబులయందంబు పొం
దుపఱుప నభినవస్ఫటికోపలసంస్థాపితసోపానపార్శ్వకరికరాకారరేఖావిశేషం
బులు సప్రతిచ్ఛాయసంజాయమానసంక్రందనవేదండశుండాదండప్రచారం
బులం బచరింపఁ, గలశవారాశి* చెలువునం బొలుపలరువిమలపట్టాంబరవితాన వి
ద్యోతమానమహాస్థానభవనరాజంబునం దెలిదీవిఠీవి నలరునమూల్యముక్తా
మయసింహాసనంబున సుఖాసీనుండై సామంతమకుటఘట్టనజాతజాతరూప
రేణుపరంపరఁ బీతాంబరత్వంబు వహించినమిత్రవర్గంబుతో సారూప్యదేదీప్య
మానభక్తోపలాలనపరాయణుం డగునాదినారాయణుకరణి సిరుల నిరవొందుచు.

అ. వెండియున్ = మఱియును, ప్రచండ...క్షమాధీశ్వరుండును—ప్రచండ = మిక్కిలియు తీవ్రమైన- రుచి = తేజస్సుచేత- పిచండిల = పెద్దకడుపుగల - మిక్కిలియుఁదేజస్సుచేతఁ బరిపూర్ణ

* క. సలువునం జెలువలరు.

మయిన యనుట- మార్తాండమండల=సూర్యమండలముయొక్క- పాండిత్య=సామర్థ్యముచేత - తపింపఁజేయుటయందలి ప్రావీణ్యముచేతననుట, భూషిత=అలంకరింపఁబడిన - అనఁగాఁ బ్రచండసూర్యమండలమునకుంగల యత్యంత తపనశక్తితోఁగూడి వెలుంగుచున్న యనుట. ఇది ప్రతాపమునకు విశేషణము. భుజా+అర్గళ= గడియమ్రానులవంటి భుజములయొక్క, (అర్గళమనఁగాఁ దలుపున కడ్డము వైచు గడెమ్రాను. గడియమ్రానులనుటచే నిడుపులును బలుపులును దృఢములును దుర్నివారములు నయినట్టిభుజములని తెలియునది అట్టిభుజములయొక్క) నిరర్గళ=అడ్డములేని- ప్రతాప=ప్రతాపముయొక్క- శత్రులను వధింపఁజేయు పరాక్రమముయొక్క- దీపిత= తేజరిల్లుచున్న-(ఇట క్తప్రత్యయము వర్తమానార్థకము), ప్రకాశ=ప్రకాశముచేత- కౌశికీభూత=గుడ్లగూబలయిన - గూబలవలె సంధులయిన, యని యొకయర్థము - ఇంద్రులయిన యని మఱియొకయర్థము, 'మహేంద్ర గుగ్గులూలూకవ్యాళగ్రాహిషు కౌశికః' కౌశికశబ్దము గుడ్లగూబయందును నింద్రునియందును వర్తించుచున్నది. (కౌశికీభూత అను విశేషణము భీతాభీతవిమతక్ష్మాధీశ్వరులతో నన్వయించును) కదనభూతల = యుద్ధభూమియందు- భీత=భయపడినవారును- అభీత = భయపడనివారునగు-విమతక్ష్మాధీశ్వరుండును = శత్రురాజులుగలవాఁడును, భీతులయినవారు గుడ్లగూబలయిరనియు అభీతులయినవా రింద్రులయిరనియుఁ గ్రమాలంకారము. సూర్యునిప్రకాశమునకు గుడ్లగూబలు గొందులనడఁగియుండునుగదా. సూర్యమండలతేజస్సువలె మిక్కిలి తీక్ష్ణమయినది గనుక రాజప్రతాపమునకు యుద్ధమందు భయపడి పాఱిపోయిన శత్రురాజులు గుడ్లగూబలవలె కొండగొందుల దాఁగిరనియు, దానికి భయపడక యెదుర్కొని మృతిఁ బొందినవార లింద్రునివలె స్వర్గభోగము లనుభవించిరనియు నాశయము. ప్రతాపమునకు సూర్యమండలముతో సాదృశ్యము చెప్పుట గుడ్లగూబలయి రనుట కుపయుక్తమగుచున్నదిగాని యింద్రులయిరనుటకు నంతగాఁ బ్రయోజనకారిగాఁ గానిపింపదు. అలం. సావయవరూపకము.

విశ్వ ..మహేశ్వరుండును—విశ్వ = సమస్తమయిన- విశ్వంభరా=భూమిచేత - భూప్రజలచేతననుట- వినుత = స్తోత్రముచేయఁబడిన- శాశ్వత = స్థిరమయిన- ఐశ్వర్య=సంపదయనెడు - లోకనియంతృత్వమనెడి -ఐశ్వర్య = అణిమాదిభూతియొక్క- ధుర్యతా = ధురంధరత్వమందు- మహేశ్వరుఁడును = శివుఁడయినవాఁడును. 'ప్రభౌ త్రిష్వీశ్వర శ్శమ్భౌ' అని నానార్థరత్నమాల. శివుఁడు 'అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా। ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః' అనెడి యెనిమిదిభూతులుగలవాఁడని తెలియునది. శాశ్వతశబ్దము శివునందును వర్తించుచున్నదిగాన శాశ్వతైశ్వర్యము గలవాఁడు మహేశ్వరుఁడగునని శబ్దసామ్యప్రయుక్తమయిన చమత్కారము గ్రహించునది. అలం. శ్లేషమూలాభేదాధ్యవసాయము.

అంభోధి...ప్రవాహుండును - అంభోధి = సముద్రమనెడి- వసన=వస్త్రముచేత- సంభాసమాన=మిక్కిలియుఁ బ్రకాశించుచున్న- నలుగడలసముద్ర మెల్లగాఁగలయనుట, కుంభినీవలయ= భూమండలముయొక్క- సంభరణ = భరించుటయందలి, దీక్షా= దీక్షయనెడి, శుభారంభ = శుభకార్యారంభమందు, సుభగంభావుక = మనోహరమగుచున్న యని యొక్కయర్థము. అంభోధివసనసంభాసమాన =సముద్రమనెడి వస్త్రముచేత మిక్కిలి ప్రకాశించుచున్న- కుంభినీ = భూదేవియొక్క- వలయసంభరణ=కంకణధారణమందలి- దీక్షాశుభారంభ=దీక్షయనెడు శుభకార్యారంభమందు- సుభగంభావుకమయిన యని యర్థాంతరము- (ఇట కుంభినికిని దద్గతస్త్రీలింగగమ్య యయిన లౌకికనాయికకు నభేదాధ్యవసాయముచేసి యర్థద్వయము గలుగఁజేసినాఁడు) - గంభీర=గాంభీర్యము గలిగిన - మిక్కిలియు గొప్పధ్వ

నిగల- భేరీభాంకరణ = భేరీభాంకారమనెడి- దంభ=మిషగలిగిన- శుంభత్ = ప్రకాశించుచున్న, అం
భోధరగర్జా=మేఘధ్వనియొక్క - అనఁగా ఉఱుముయొక్క- సముజ్జృంభ= విజృంభణముచేత, సం
భావిత=ఊహింపఁబడిన, ఆత్మీయ=తనదయిన- పట్టాభిషేకకాలమందు -సముత్తంభిత = మిక్కిలియె
త్తఁబడుచున్న- శాతకుంభ = బంగారుమయమయిన - 'తపనీయం శాతకుంభమ్' అని అ. కుంభ = కల
శములనుండి. నిగుంభిత = వెడలింపఁబడుచున్న- అంభః =ఉదకమనెడి- వర్ష =వర్షముచేత- విద్రావి
త=పోఁగొట్టఁబడిన 'ప్రద్రావోద్ద్రావసంద్రావ విద్రావాః' అని అ. క్షుద్రనృప = నీచులయిన రాజుల
వలని, ఉపద్రవ=బాధయనెడు- తాపము=తాపముగలదియగు- భద్రవత్ = భద్రవతియైన - క్షుద్రరా
జులవలని తాపముదీఱఁగా భద్రప్రాప్తినొంది గట్టిదయినదనుట. రసా=భూమికి, నిత్య = ఎడతెగకుం
డునట్లుగా - రస ఆర్ద్రితా=జలముచేతఁదడిసియుండుటను - సంతోషరసముచేతఁ దోఁగియుండుట
వని నాయికాపరమయినయర్థము- అనుసంధాయక = ఒడఁగూర్చుచున్నట్టి- దైనందిన= ప్రతిదినమంద
యిన, దానధారా=దానోదకధారలయొక్క, ప్రవాహుండును=వెల్లువగలవాఁడును - అనఁగా భేర్యా
దివాద్యములు మ్రోయుట శుభకార్యములందు. అట్టిశుభకార్యములు వివాహకంకణధారణాదులు.
వలయశబ్దము మండలమందును కటకమందును వర్తించుటవలన 'కుంభినీవలయసంభరణదీక్ష' యనుటచే
భూమండలభరణ దీక్షను, భూదేవియనెడి నాయికయొక్క కంకణధారణ దీక్షగావ్యవసించి,అట్టిదీక్ష
'శుభారంభ'యన్నట్లు శుభకార్యమునగుటచేఁ దత్సూచకముగా భేరీభాంకరణముచెలంగుటను బొసఁ
గించినాఁడని కవి శబ్దార్థసందర్భమునిట తెలియునది. కనుక భూభరణదీక్షను భూదేవీకంకణధారణ
దీక్షగా నధ్యవసించుటయు దానిని శుభకార్యమనుటయు భేరీభాంకృతియుపపాదనమున కని గ్రా
హ్యము. మఱి యుఱుము ముందువర్షమును సూచించును. ఆవర్షంపు ధారలచేత భూమితాప మాఱు
ను. పిదప నద్యాదిప్రవాహములచే నాభూమికి ఆర్ద్రిత గలుగునుగదా. అట్లే యిట భేరీభాంకృతి య
నెడి యుఱుముచేత పట్టాభిషేకజలధార యనెడివర్షధార సూచితమయ్యెననియు, ఆవర్షధారచేత
క్షుద్రరాజులవలని బాధయనెడి తాపము భూమికిఁ దీఱిపోయెననియు, పిదప దాన జలధారాప్రవాహ
ముచేత భూమికి రసార్ద్రిత గలిగెననియుఁ జెప్పంబడినది. తాపమనఁగా వేఁడిమియు వేదనయు, రసా
ర్ద్రితయనఁగా జలమునఁ దడియుటయు సంతోషాది రసమునఁ దోఁగి(యనఁగాఁగూడి)యుండుటయు,
నగును కావున భూదేవి యనెడి నాయికపరముగా - రాజుపట్టాభిషేకమున నాయికను జేపట్టఁగానే
యది యంతకుముందు క్షుద్రులవలనఁ బడినవేదన తోడనే తీఱినదయ్యెననియుఁ, బిదప రాజు కోరినది
యిచ్చి యుపలాలింప నిరంతరము సంతోషరసమునఁ దేలుచుండె ననియు భావము వ్యంజితమగుచు
న్నది. మఱియు 'అంభోధిజనన...కుంభినీవలయ సంభరణ' యనుటచే ఆనాయిక మంచి వలువగట్టి
కొని కంకణములు దొడిగికొని పట్టాభిషేకమున భేర్యాది వాద్యధ్వనులు చెలంగ రాజును జేపట్టెననియు
ధ్వనితము. ఇంతకు మును పానాయిక దివ్యవస్త్రధారణకంకణాద్యలంకరణములు లేక సొంపుదూలి
యుండెననియు సూచితము.'సముత్తంభి'అనువిశేషణము మిక్కిలి పయికెత్తఁబడిన కలశములనుండిపడు
జలధారలు పొడవునుండి కురియువర్షధారల ననుకరించుటకై యుపయుక్తము. ప్రవాహశబ్దముచే
నవ్వారిగా దానములొసంగుట తెలియునది. ఇట భూమికిఁ బట్టాభిషేకసమయమందుఁ దాపనివారణ
మును భద్రప్రాప్తి (యనఁగా - నిష్టావాప్తి)యుఁ గలిగె ననుటచే పట్టాభిషేకసమయమందే సకలోప
ద్రవములు నివర్తించెననియుఁ బ్రజలకు సమస్తాభీష్టము లొనఁగూడెననియు, పట్టాభిషేకానంతరము రాజు
నిత్యము నర్థులకు నవ్వారిగా దానము లిచ్చుచున్నాఁడనియు నాశయము. ఇట అతిశయోక్తి, అప
హ్నవము, రూపకము, కావ్యలింగము నలంకారములు.

అసమ... సితవాహుండును—అసమ=సమానరహితమయిన [illegible] యుద్ధమందలి ప్రయత్నా హ=మిక్కుటమయిన యత్నముచేతను, సాహస=తెగువచేతను, హాసిత=పరిహాసముచేయఁబడిన, సిత వాహుండును=(శ్వేతవాహనుఁడయిన) అర్జునుఁడును—యుద్ధములం దర్జునునికంటె నతిశయించిన యుత్సాహమును సాహసమును గలవాఁడనుట

అభంగ... వైభవుండును—అభంగ=భంగములేనిదియు, భువన మంగళ సర్వస్వ=జగన్మంగళ మునకు యావద్ధనమైనదియు- జగన్మంగళసారమయినది యనుట. మరకతదండ=మరకత రత్నమయ మయిన కాఁడ గలిగినదియు, అగు, పుండరీక=శ్వేతచ్ఛత్రమనెడి, అభంగ=అలలులేనిదియు, భువన మంగళ సర్వస్వ = ఉదకమంగళమునకు యావద్ధనమయినదియు-ఉదకమంగళ సారమయినది యను ట. మరకతదండ=మరకతమణివలెఁ బచ్చనయిన తూఁడుగలిగినదియు, అగు, పుండరీక=తెల్లదామర యొక్క, అగ్ర=కొనయందలి, వర్ణనీయ=స్తుతింపఁదగిన, సువర్ణకలశ = బంగారుపుఁగలశమనెడి, కర్ణి కా=దిమ్మెయందు, అధిష్ఠిత=నివసించిన, రాజ్యలక్ష్మీ=రాజ్యలక్ష్మియొక్క, రత్న + ఉపధాన=కెంపుల యొ ఱగుడు బిల్లయొక్క, ఆడంబర=విజృంభణమునకు, సంబోధక=తెలియఁబఱుచునట్టి—అనఁగా ఒరగుడు బిల్లవిలాసమును గనఁబఱుచుచున్న యనుట, అంబురుహబంధుబింబ=(తామరలకుచుట్టమయిన) సూర్యుని బింబముయొక్క, అనుబింబ=ప్రతిఫలనముయొక్క, వైభవుఁడును=విభవముగలవాఁడును.— సూర్యునిబిం బము విభవముతోఁ బ్రతిఫలించి కెంపులయొరగుదిండువలె చెలువు గులుకుచుఁ జూపట్టుచున్నది య నుట. లక్ష్మి తామరయందు వసించునది. కనుక, నిట పచ్చమణిమయమయిన కాఁడగల శ్వేతచ్ఛత్రమును పచ్చనితూఁడుగల తెల్లదామరగాను, ఆఛత్రముమీఁది బంగారు కలశమును ఆతామర నడిమి మిద్దెగాను, రూపించి యాశ్వేతచ్ఛత్రము యొక్క బంగారుకలశమనెడి శ్వేతపద్మముయొక్క కర్ణికయందు రాజ్యల క్ష్మి వసించునట్లు చెప్పినాఁడు. ఆబంగారుకలశమందు సూర్యబింబము ప్రతిఫలింపఁగా నాప్రతిబింబ మం డలి రాజ్యలక్ష్మికిఁ గెంపులయొరగుబిల్లవలె నుండునట్లు వర్ణించినాఁడు. శ్వేతచ్ఛత్రము రాజ్యసంపత్తికి ద్యోతకము గనుక నందు రాజ్యలక్ష్మి వసించునట్లు చెప్పఁబడెను. అఖండ భూమండలమును జయించి శ్వే తచ్ఛత్రము దాల్చి రాజాధికంపుసిరియంతయుఁ గులుకుచున్నాఁడని తాత్పర్యము. ఇట. అలం. ఉత్ప్రే క్ష రూపకానుప్రాణితము. 'భఙ్గస్తరఙ్గే రుగ్భేదే భేదే జయవిపర్యయే' 'భువనం విష్టపే లోకేసలి లేఽపి వియత్యపి' అనివిశ్వము. 'మకరవక్త్రాజ్జాతంమరకతమ్' మకరమునోటనుండి పుట్టినది మరకతమని వ్యుత్పత్తి. 'ప్రసహ్య మణిముద్ధరేన్మకరవక్త్ర దంష్ట్రాన్తరాత్' ఇత్యాదులచే మొసలినోటనుండి యు రత్నములు పుట్టునని ప్రసిద్ధి. ఈశబ్దముంబోలె, 'పశ్యక' 'కశ్యప' 'హింసికా' 'సింహికా' ఇత్యాదులు వర్ణవ్యత్యయసిద్ధము లయినవని యెఱుంగునది. 'పుణ్డరీకం సితచ్ఛత్రే కుష్ఠభేదే సితామ్బుజే' అనినానార్థ.

త్రైలోక్య... ప్రాభవుండును—త్రైలోక్య=మూఁడులోకములవారిచేత, వినుత = స్తోత్రముచే యఁబడిన, చాళుక్యనారాయణాంక=చాళుక్యనారాయణ బిరుదమనెడి, నారాయణాంక=నారాయ ణనామముచేత, సంకల్పిత=సంకల్పింపఁబడిన, అశేషపోషణ = సమస్తజనులను పోషించుటయందలి, ప్రాభవుండును=సామర్థ్యముగలవాఁడును, నారాయణమూర్తి సర్వజగత్పోషకుఁడగుట ప్రసిద్ధము. అట్లె సమస్తజనపోషకుండగుటంబట్టి ముల్లోకములు కొనియాడునట్లు చాళుక్యనారాయణుఁ డనెడి బిరుదము రాజునకుఁ గలిగెనని భావము. అలం. శ్లేషమూలాధ్యవసాయము.

కృపాణ... భేదనుండును—కృపాణ=ఖడ్గమనెడు, కృష్ణ=కృష్ణనామముగల విష్ణువుచేత, నిర్మ థ్యమాన=లెస్సగామథింపఁబడుచున్న, (చిలుకఁబడుచున్న యనివిష్ణుపరముగాను కలఁగింపఁబడుచున్న యని ఖడ్గపరముగాను గ్రహించునది), రణఅర్ణవ=యుద్ధమనెడి సముద్రమువలన, సముత్పన్న=పుట్టిన, విజ

యలక్ష్మీ=విజయసమృద్ధి యనెడు లక్ష్మిచేత, నిక్షిప్త=నిగిడింపఁబడిన, నిరుపమ=సాటిలేని, నిరీక్షణ=చూపులయొక్క, నర్మకర = విలాసమును చేయుచున్న—నిరీక్షణములో యున్నట్లు చూపట్టుచున్న యనుట, మకరపతాకా = మకరాకారములు చిత్రింపఁబడియున్న టెక్కెములయొక్క, ఆలోకనమాత్ర= చూచుట మాత్రముచేత, సంపాదిత= సంపాదింపఁబడిన, కంప = వడఁకును, స్వేద = చెమటయుఁ గలిగిన, భీరూభవత్=భయశీలురగుచున్న, నానా=సమస్తమయిన, వజీర=మ్లేచ్ఛప్రధానులయొక్క, సేనా=సైన్యములయొక్క, మాన = గర్వమును, భేదనుండును=పోఁగొట్టినవాఁడును. లక్ష్మి విష్ణువుచేఁ జిలుకంబడినసముద్రమునఁ బుట్టినదిగావున విజయలక్ష్మి పుట్టుటకై ఖడ్గమనెడి విష్ణునిచే మథింపఁబడు యుద్ధమనెడి సముద్రమును జెప్పినాఁడు. అట్లు పుట్టినలక్ష్మియొక్క నిరీక్షణములవలె మకరపతాక లొప్పుననియు, ఆ నిరీక్షణములను జూచినమాత్రముననే వజీరసైనికులు కంపస్వేదములనెడు శృంగారానుభావముల నొందిరనియునర్థము. కంపస్వేదములు శృంగారరసమునకును భయానకరసమునకును సాధారణములు గనుక భీరూభవద్వజీరసేనలకు భయానకరసమువలనఁ గలిగిన కంపస్వేదములను శృంగారరసమువలనఁ గలిగిన కంపస్వేదములుగా నధ్యవసించినాఁడు. విష్ణువునల్లని యవతారమగు కృష్ణునిఁ జెప్పుట ఖడ్గము నలుపుగనుక, రాజుమహాయుద్ధమున ఖడ్గముచే వజీరసేనలను గలంచి నలంచి జయలక్ష్మిని బొందుటచే నాశత్రువులు భయముగొని యతనిమకరపతాకలను జూచినమాత్రముననే వడఁకుచుఁ జెమర్చుచు నుందురు. ఇఁక నెదుర్చుటయెక్కడిదని తాత్పర్యము. ఇట రూపకసంకీర్ణరసవదలంకారము. శ్రీరామ...వాదనుండును—శ్రీరామచంద్ర=శ్రీరామస్వామియొక్క, చరణకమలయుగళ=పాదారవిందములజంటనుగూర్చి, అభివాదనుండును=నమస్కారములగలవాఁడును-శ్రీరామపాదాబ్జయుగళమునకు నమస్కరించువాఁడనుట.

ఆత్రేయగోత్ర పావనుండును = ఆత్రేయగోత్రమును పవిత్రముచేయు వాఁడును - ఆగోత్రమునఁ బుట్టినవాఁడనుట. అఖిల...పునరుజ్జీవనుండును—అఖిల=సమస్తమయిన, కర్ణాటరాజ్య=కర్ణాటరాజ్యముయొక్క, పునరుజ్జీవనుండును=మరల నుద్ధరించుట గలవాఁడును, శ్రీరంగ...చంద్రుఁడును—శ్రీరంగరాజరత్న=శ్రీరంగరాజశ్రేష్ఠుఁడనెడు, రత్నాకర=సముద్రునకు, పూర్ణచంద్రుండును=నిండుచంద్రుఁడును, అగు, తిరుమలరాయదేవేంద్రుఁడు = తిరుమలరాయశ్రేష్ఠుఁడు. ఇంతవఱకును జతిగా నంత్యనియమములు చెప్పినాఁడు. నిస్తంద్ర విభవసాంద్రుండై— నిస్తంద్ర=కలంకలేని—నిర్దుష్టమయిన, విభవ=ఐశ్వర్యముచేత, సాంద్రుఁడై=పరిపూర్ణుఁడై, ఒక్కనాఁడు=ఒకదినమందు,

ఇట మీఁద రాజుసభామంటపమును క్షీరసముద్రముగాను, సింహాసనమును శ్వేతద్వీపముగాను, రాజును ఆదినారాయణ మూర్తిగాను, వర్ణించుచున్నాఁడు—వజ్ర...విలాసంబు—వజ్రకీలిత=వజ్రమణులు దాపిన, ద్వారబంధ=ద్వారబంధమందు—లక్ష్మికమ్మియందు, బంధుర=సుందరమగు, లక్ష్మీవిలాసంబు=లక్ష్మీప్రతిమయొక్క విలసనము, జనన...సొంపు—జననసమయ=జన్మించు సమయమందు, జల అంతరిలక్ష్యమాణ=జలములోపల నగపడుచున్న, జలజసదనా=లక్ష్మీదేవియొక్క, సమాగమన సంపద=వచ్చునట్టివైభవముయొక్క, సొంపు=శృంగారమును, సంపాదింపఁగ=ఘటింపఁగా, లక్ష్మికమ్మియందుదాపిన వజ్రమణుల తెల్లనికాంతులు తనపై ప్రసరించియుండఁగాఁ గనుపట్టుచున్న లక్ష్మీప్రతిమ, పాలకడలి తెల్లనినీటఁ దడిసి వెలువడుచున్న లక్ష్మీదేవివలె అతిమనోహరముగాను ఆశ్చర్యకరముగాను జూపట్టుచుండెనని భావము. అలం. నిదర్శన.

సాభోగ...సంచారంబులు—సాభోగ=పరిపూర్ణతతోఁగూడిన-నిండుపఱుపుగలయనుట-విశాలములయినయని భావము, యవనికా=తెరయొక్క, అభ్యంతర=లోపలనుండి, సద్యః=అప్పుడే, సముద్యత=వెలువడిరానుంకించుచున్న, యంత్రపాంచాలికా=కీలుబొమ్మలయొక్క, సంచారంబులు=ప్రచారములు. మొ

లఁకువలు, జిలుగుతరంగలమలుంగు=పెనఁగొన్న అలలమాటును, తొలంగి=విడిచి, వచ్చునచ్చరమెలుఁగుఁబోండ్లతెలుంగులు=వచ్చుచున్న యప్సరఃస్త్రీలయొక్క విధములను, ఎఱింగింపన్ = తెలియఁజేయుచుండఁగా-విరివియైన తెరలమాటునుండి తొడనే వెడలి రాఁజూచునట్లున్న కీలుబొమ్మలు, సముద్రపుదట్టంపు టలలలోనుండి వెలువడుచున్న యప్సరఃస్త్రీలవలె నుండెననుట; సముద్రపు పఱపు ననుకరించుటకు తెరకు 'సాభోగ'యని విశేషణము. సముద్రపుటలలకును తెరముడుతలకును సాదృశ్యము. అప్సరఃస్త్రీలతోఁ బోల్చుటచే కీలుబొమ్మల సౌందర్యాతిశయము ద్యోతితము. అలం. ఉపమ. 'పాఞ్చాలికా పుత్రికా స్యాద్వస్త్రదన్తాదిభిః కృతా' అని. అ. 'తరంగము'నకు చరితాములలోనిదిగాన 'తరంగ' యని రూపమని బాలవ్యా. 'అంభోధితరఁగలగమి' యనుప్రయోగమునుబట్టి 'తరఁగ' వైకృతమనియు, అరసున్నకు నిండుసున్న రాఁగా 'తరంగ' యని సిద్ధించెననియు శబ్దర.

చంద్ర...వదనంబులు—చంద్రకాంత=చంద్రకాంతమణులచే రచితములయిన, భిత్తి=గోడల యందు, బింబిత=ప్రతిఫలించిన, చంద్రాననా=చంద్రునివంటి ముఖముగల స్త్రీలయొక్క, వదనంబులు=ముఖములు, తరంగ...యంపంబుల్—తరంగభక్తి=అలల విభాగముచేత, వేఱువేఱుపెక్కులుగా అలలేర్పడి యుండుటచేత ననుట,—లేక భక్తియనఁగా రచనమనియు నర్థముగనుక తరంగముల రచనచేత, బహూకృత=అనేకములుగాఁ జేయఁబడిన, నవ=నూతనమయిన-క్రొత్తగాఁబుట్టిన యనుట, ఇందుబింబంబుల=చంద్రుని బింబములయొక్క, అందంబులు=చక్కఁదనములను, పొందుపఱుపన్=అలవఱుచుచుండఁగా - చంద్రకాంతపు గోడలయందుఁ బ్రతిబింబించు స్త్రీల చందురునివంటి మొగంబులు పెక్కులయిన యలలందుఁ బెక్కులుగాఁ బ్రతిబింబించుచున్న యప్పుడు పుట్టినచంద్రుని ప్రతిబింబముల వలెఁ జెలువుగులుకుచుండె నని యర్థము. అలం. నిదర్శన.

అభినవ...విశేషంబులు - అభినవ=మిక్కిలియు నూతనములయిన, స్ఫటిక ఉపల=పటికపురాలచేత, సంస్థాపిత=స్థాపింపఁబడినవి యగు, సోపానపార్శ్వ=మెట్లప్రక్కల యందలి, కరికర ఆకార = ఏనుఁగుతుండములవంటి యాకారములుగాఁ దీర్పఁబడిన, రేఖావిశేషంబులు = రేఖాభేదములు, సప్రతి...ప్రచారంబులన్—సప్రతిచ్ఛాయ=ప్రతిబింబములతోఁ గూడునట్టులుగా, సంజాయమాన=జన్మించుచున్న, సంక్రందన వేదండ =(ఇంద్రుని యేనుంగయిన) ఐరావతముయొక్క, శుండాదండ=దండమువంటి తొండముయొక్క, ప్రచారంబులన్=విధములను, వచరింపన్=తెలుపుచుండఁగా- అచ్చంపుఁ బటికపురాలతోఁగట్టఁబడిన మెట్ల కిరుప్రక్కల ఊఁతపట్టులుగా నున్నగోడలయందో, లేక మదురులందో, ఏనుఁగుతుండములవలె రేఖలు తీర్పఁబడి యున్నవనియు, అవి సముద్రపుటలలనుండి తొండము ముందుపడ ఐరావతము లేచుచున్నపుడు దానితొండమునను ఆతొండముయొక్క ప్రతిబింబములనను బోలియుండెననియు భావము. తెల్లని పటికపురాల మెట్లు పాలసముద్రపు తెల్లని యలలుగాను, మెట్లపయి నున్న కరికరాకారరేఖలు అలలనుండి పయికిలేచుచున్న యైరావతము తొండమును దాని ప్రతిబింబములనుగాను నుండెనని తెలియునది. 'సంజాయమాన' అను వర్తమాన క్రియ ఐరావతము పుట్టుచున్న యవస్థయందుండుటను దెలుపుటకు. కావుననే దానిదేహమంతయుఁగాక తొండము మాత్రమే యలలనుండి పయికిఁ బొడసూపుట. అట్లాతొండము పయికిలేచుటచే దానికిఁ బ్రతిబింబములు పెక్కులు గలిగెననియు, కాన యలలపయిని యాతొండమునకును దాని ప్రతిబింబములకును మెట్లపయిని కరికరాకారరేఖలతో సాదృశ్యముగలిగెననియుఁ దెలియునది. కరికరాకారరేఖలను పటికపురాల [illegible] దిర్చుట, ఐరావతముయొక్క తెల్లనితొండముతో సాటికై. అలం. నిదర్శన.

కలశవారాశి చెలువునన్=పాలసముద్రమువలె, పొలుపు...రాజంబునన్ - పొలుపు అలరు=ఒప్పు

చున్నట్టి, విమల=స్వచ్ఛమయిన, పట్టాంబర=పట్టువస్త్రముయొక్క, వితాన=మేలుకట్టుచేత, 'అస్త్రీ వితానముల్లోచః' అని అ. విద్యోతమాన = మిక్కిలియుఁ బ్రకాశించుచున్న, మహాస్థానభవన రాజంబునన్ = గొప్పదియైన యాస్థానమంటపశ్రేష్ఠమందు - ఆస్థానమంటపమునకుఁ దెల్లపట్టు మేలుకట్టును జెప్పుట పాలసముద్రముతోడి సాదృశ్యాతిశయమునకు. పాలసముద్రముతో నాస్థాన మంటపమును బోల్చినపుడు, ఆసముద్రమునఁ బుట్టిన లక్ష్మి, యప్సరసలు, చంద్రుఁడు, ఐరావతమనెడి వీనికి సాటిగాఁ ద్వారబంధలక్ష్మీప్రభృతులను జెప్పినాఁడు. తెలిదీవి ఠీవిన్ = శ్వేతద్వీపము మురువున, (ఠీవి-యన్యదేశ్యము) అలరు... సింహాసనంబునన్ - అలరు=ఒప్పుచున్న, అమూల్య=విలువలేని, ముక్తామయ=ముత్యములచే నయిన, మిక్కిలియు ముత్యములుగూర్చి రచింపఁబడిన యనుట, సింహాసనంబునన్=సింహాసనమందు,(పాలసముద్రమందు శ్వేతద్వీపముండుట ప్రసిద్ధము. శ్వేతద్వీపముతోడి సామ్యముకొఱకు సింహాసనమును ముక్తామయ మన్నాఁడు.) సుఖాసీనుఁడై = సుఖముగాఁ గూర్చున్నవాఁడై.

సామంత ... పరంపరన్ - సామంత=సామంతరాజులయొక్క, మకుట=కిరీటములయొక్క, ఘట్టన=ఒరపిళ్లచేత, జాత=పుట్టిన, జాతరూపరేణు=బంగారపు రజనుయొక్క, 'చామీకరంజాతరూపమ్' అని అ. పరంపరన్=వరుసచేత, పీతాంబరత్వంబు=పచ్చనివస్త్రములు గలవారగుటను-విష్ణుసారూప్యమునని భావము, వహించిన మిత్రవర్గంబుతోన్ = తాల్చిన స్నేహితుల సమూహముతో - సామంత రాజులకిరీటముల రాపిడిచే రాలి బంగారపుదుమ్ము పయిఁబయిఁ బర్వుటవలనఁ గొలువునున్న స్నేహితుల వస్త్రములన్నియు బంగారువస్త్రములవలె నుండెనని భావము. జాతరూపరేణువునకుఁ బరంపరను జెప్పుటవలన పయిఁబయిని ఎడతెగక పర్వుటకు లెక్కలేని కిరీటముల రాపిడివలయుటయు, దానిచే సామంతులు లెక్కకు మీఱినవారై క్రిక్కిఱిసి కొలుచుటయు, దానిచే కృతిపతి సార్వభౌముఁడగుటయు వ్యంజితములు. అలం. శ్లేషము.

సారూప్య ... పరాయణుండు—సారూప్య = సమానరూపత్వముచేత - విష్ణువు పీతాంబరుఁడయినట్టె తామును పీతాంబరులగుటచేతననుట, దేదీప్యమాన=మిక్కిలి ప్రకాశించుచున్న, భక్త=భక్తులయొక్క, ఉపలాలన=బుజ్జగించుటయందు-భక్తులను బుజ్జగించుటయందనుట, పరాయణుండు=ఆసక్తుఁడయినవాఁడు, అగు ఆదినారాయణుని కరణిన్=అయినట్టి శ్వేత ద్వీపవాసుఁడయిన ఆదినారాయణమూర్తివలె-విష్ణువు భక్తులకు సారూప్యమొసంగుట శ్రుతిప్రసిద్ధము. పీతాంబరుఁడనఁగా పచ్చనివస్త్రముగలవాఁడనియు విష్ణువనియు నర్థములుగావున రాజును పీతాంబరుఁడయిన యాదినారాయణునిఁగా వర్ణించి, సామంతరాజుల కిరీటముల బంగారుపొడి పర్వుటచే పీతాంబరులయిన (అనఁగా పచ్చని వలువ గలవారయిన) యతనిమిత్రులను పీతాంబరులనుగా (విష్ణువులనుగా) శ్లేషముచే నధ్యవసించి, పీతాంబరత్వమందు విష్ణువునకును నతని భక్తులకుంబోలె రాజునకును నతని మిత్రులకును సారూప్యము చెప్పినాఁడు. సిరులన్=సకలసంపదలచేత-లక్ష్మి మొదలయిన వారలచేతనని యర్థాంతరము. ఇరవొందుచున్=ఒప్పుచున్నవాఁడై, ముంపరి పద్యముతో నన్వయము. ఒక్కనాఁ డన్నది మొదలుకొని ఉపమయలంకారము.

సీ. కటకేంద్రుఁ డంపినగంధసింధురము లా
త్మస్వామిమాఱు హస్తములు మొగువ
హయనాథుఁ డంపినహరులు కైజామోర
లార్చుచుఁ బతికి జోహారుసేయ

నావాడపతి పంపినయమూల్యకటకముల్
కర్తపేరుగఁ బదాగ్రములఁ బెనఁగఁ
బాండ్యేశుఁ డంపినభర్మంబు లధిపతి
ప్రతిగా నిజాంకముద్రలు వహింప
తే-గీ. శౌర్యకీర్తులతో వచ్చు సకలదిఙ్న
రేంద్రరాజ్యేందిరలమాడ్కి నిగురుఁబోండ్లు
చటులమాణిక్యమయదండ చారుచామ
రములు వీవంగఁ బేరోలగమున నుండి. 15

అ. కటకేంద్రుఁడు=కటకపురిరాజు-అనఁగా గజపతి, అంపిన గంధసింధురములు=పంపిన మదపుటేనుఁగులు, ఆత్మస్వామి మాఱు=తమ యధిపతికిబదులుగా, హస్తములు మొగుపన్=చేతులుజోడించి మ్రొక్కుగానని యర్థము. (హస్తశబ్దము 'హస్తోనక్షత్రభేదే స్యాత్కరేభ కరయోరపి' అని విశ్వనిఘంటుచొప్పున గజతుండమునందును వర్తించును; కనుక తుండములు ముడువఁగానని భావము.) హయవాహుఁడు=అశ్వపతి, పంపిన, హరులు=గుఱ్ఱములు, కైజామోరలు = కళ్లెములతో వెనుకకు బిగించిన మూతులు, ఆర్చుచున్ = అల్లార్చుచు, పతికిన్=తమయేలికకుఁగాను—తమరాజునకుఁ బ్రతిగాననుట, జోహారుసేయన్=దండములుపెట్టఁగా, నావాడపతి=నావాడదేశపురాజు, పంపిన, అమూల్యకటకముల్=విలువలేనట్టి గండపెండేరములు, కర్తపేరుగన్ = తమయధిపునిపేరుగా, పదాగ్రములన్=పాదాగ్రములయందు, పెనఁగన్=పెనఁచుకొనఁగా-- ధరింపఁబడఁగా-(తమరాజు తిరుమలదేవరాయని పాదాగ్రములనుబట్టికొని మ్రొక్కునట్లుగా తాము పాదాగ్రములఁ దగిలియుండెనని 'పెనఁగు' శబ్దసారస్యము.) పాండ్యేశుఁడు=పాండ్యదేశాధిపతి, పంపిన, భర్మంబులు=సువర్ణములు, అధిపతి ప్రతిగాన్=తమరాజునకు బదులుగా, (ఇక్కడ ప్రతియనునది "దేశ్యపదము 'ప్రతిమాటలేఁటికిఁ బలుకవయ్య' అని శబ్దానుశాసనుఁడు; ఉపసర్గమని భ్రమింపవలదు" అనిసోమకవి. శబ్దరత్నాకరమున సాంస్కృతికావ్యయ మని యున్నది.) నిజ=తనయొక్క, అంకముద్రలు=లాంఛనమయినపేరుగల ముద్రలను, వహింపన్=ఱొమ్మున ధరింపఁగా ననుట - ఱొమ్మునందు పతిలాంఛనపుముద్రలు ధరించుట భృత్యలక్షణము. అంకమనఁగా లాంఛనమునకును నామమునకును పేరుగనుక, అవి బంగారు నాణెములుగావింపఁబడి రాజునామపు ముద్రలుదాల్చియుండెనని భావము.

శౌర్యకీర్తులతోన్=వారివారి ప్రతాపకీర్తులతోఁగూడ, వచ్చు...మాడ్కిన్=వచ్చు= వచ్చునట్టి, సకలదిఙ్నరేంద్ర=సమస్తదిక్కులయందుండు రాజులయొక్క, రాజ్యఇందిరలమాడ్కిన్ = రాజ్యలక్ష్ములోయన్నట్లు, ఇగురుఁబోండ్లు=స్త్రీలు, చటుల...చామరములు - చటుల=ప్రకాశమానములయిన, మాణిక్యమయ=పద్మరాగమణి వికారములయిన, దండ=కాఁడలచేత, చారు=సుందరములయిన, చామరములన్ = వింజామరలను, వీవంగన్=వీచుచుండఁగా, ప్రతాప మెఱ్ఱనిదనియుఁ, గీర్తి తెల్లనిదనియుఁ గవిసమయము. కనుకఁ బ్రతాపమునకును, బద్మరాగమణి దండములకును, గీర్తికిని, వింజామరలకును, రాజ్యలక్ష్ములకును చామరగ్రాహిణులయిన స్త్రీలకును, ఔపమ్యము దెలియునది. పేరోలగమున నుండి= పెద్దకొలువున నున్నవాఁడై - ముందటిపద్యముతో నన్వయము.

శౌర్యకీర్తులతోవచ్చు రాజ్యేందిరలనెడి యుపమాన మప్రసిద్ధముగనుక నలంకార ముత్ప్రేక్ష. మఱి సీసపాదములు మూఁడవ నాలవదానియం దతిశయోక్తి. మఱియు నిట సమస్తరాజులంపిన యు

పాయనములతో వెలుంగుటను జెప్పుటచే సకలదిగ్విజయమును దత్ప్రియుక్తమయిన రాజాధిరాజత్వ వైభవమును కృతిపతికి వర్ణితములయ్యెనని తెలియునది. ఉదాత్తాలంకారము.

తా. కటకదేశపురాజయిన గజపతి పంపినమదపుటేనుఁగులు తమరాజునకు బదులుగా హస్తములు మోడ్చునట్లు తొండములు ముడువఁగా, అశ్వపతిపంపిన గుఱ్ఱములు కళ్లెముచే వెనుకకు బిగింపఁబడిన మోరల నల్లలార్చుచుఁ దమ యేలికకుగాను దండముపెట్టఁగా, నావాడదేశపురాజు పంపిన వెలలేని గండపెండేరములు తమయేలికపేరుగా నడుగులయందుఁ జెనఁచుకొని యుండఁగా, పాండ్యరాజంపినబంగారములు తమపతికి బదులుగా ఱొమ్మున తనలాంఛనమయిన వరాహపు ముద్రలుదాల్చు భృత్యులవలె వాణెములై తన నామపు ముద్రలుదాల్చియుండఁగా, ఆయాదిక్కుల రాజులందఱ ప్రతాపకీర్తులతోఁగూడి వారివారి రాజ్యలక్ష్ములు వచ్చెనోయన్నట్లు ప్రకాశించుచున్న కెంపులకాఁడలు గలతెల్లని చామరములను బట్టుకొని, పూవుఁబోండ్లు వీచుచుండఁగాఁ బెద్దకొలువున్నవాఁడై.

మ. నను శ్రీరామపదారవిందభజనానందుం జగత్ప్రాణనం
దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశి సం
జనితైకైకదినప్రబంధ ఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వం బంచి పల్కెం గృపన్. 16

అ. శ్రీరామ...ఆనందుఁ — శ్రీరామ = శ్రీరామునియొక్క, పదారవింద = పాదపద్మములయొక్క, భజన = సేవయందలి, ఆనందుఁ = సంతోషముగలవాఁడును, జగత్ప్రాణ...కల్పను—జగత్ప్రాణనందన = వాయుకుమారుఁడయిన హనుమంతునియొక్క, కారుణ్యకటాక్ష = కరుణతోడి కడకంటి చూపుచేత, లబ్ధ = పొందఁబడిన, కవితాధారా = కవిత్వధారయనెడి, సుధారాశి = అమృతరాశి నుండి, సంజనిత = పుట్టుచున్న, ఏకైకదినప్రబంధ = ఒక్కొక్కదినమునకు ఒక్కొక్క ప్రబంధముయొక్కయు, ఘటికాసద్యశ్శతగ్రంథ = ఒక గడియలో యొకశతకముయొక్కయు, కల్పనుఁ = కల్పించుటగలవాఁడును, (హనుమంతుని కృపావీక్షణమువలనఁ గవిత్వధార యమృతరాశివలె నుప్పతిల్లఁగా దినమునకొక్క ప్రబంధమును గడియకొక్క శతకమును రచించు వాఁడయ్యెననుట. కవిత్వమునకు 'ధారా' యనుటచే నిరతిశయసులభనిర్గళ విహారమును, 'సుధారాశి' యనుటచే నత్యంతభోగ్యత్వమును వ్యంజితములు. దినమునకొక్క ప్రబంధము చెప్పువాఁడనని స్వాతిశయము ప్రకటించియు హనుమంతుని కృపాకటాక్షముచే నదిగలిగినట్లు చెప్పుటచే వినయము ననుసంధించినాఁడు.) సంగీత కళా రహస్యనిధి - సంగీతకళా = సంగీతవిద్యయొక్క, రహస్య = మర్మములకు, నిధిఁ = పాఁతఱయైనవాఁడును, అగు, ననుఁ = నన్ను, పిల్వంబంచి = పిలిపించి, కృపన్ = దయారసముచేత, పల్కెన్ = ఇట్లనిచెప్పెను. చెప్పిన దానిని మీఁదిపద్యమునఁ జెప్పుచున్నాఁడు. జగత్ప్రాణనందనుఁడనుచో జగత్ప్రాణశబ్దము సాభిప్రాయము గనుక పరికరాంకుర మలంకారము. జగత్తునకుఁ బ్రాణభూతుఁడయిన వానికుమారుఁడగుటచేఁ దానును జగత్తునకు బ్రాణభూతుఁడును నధికమహత్వము గలవాఁడునగునని యాశయము. 'జగత్...రాశి' యనుట పృథక్పదమని సోమకవి. అలఁ రూపకము సావయవము.

తా. శ్రీరాముని పాదారవిందములను సేవించుటయం దానందముగలిగి వాయుకుమారుఁడగు హనుమంతుని కృపాకటాక్షమువలన కవిత్వధార యమృతరాశివలె నుప్పతిల్లుటచే దినమునకొక్క ప్రబంధమును గడియకొక్క శతకమును రచించువాఁడనై సంగీతవిద్యా మర్మములకెల్లఁ బట్టయినట్టి నన్ను దయతోఁ బిలువనంపి.

శా. శ్రీరామక్షితిపుఁ డ్మదగ్రజుఁ డ్జయశ్రీలోలు నానాకలా
పారీణుఁడ్బహుసంస్కృతాంధ్ర కృతులం బల్మాఱు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవే దండాగ్రహారాదిస
త్కారం బందితి రామభూషణకవీ ధన్యుండ వీ వన్నిటన్. 17

అ. నానాకలాపారీణుఁడ్ — నానా=అనేకములయిన, కళా=విద్యలందు, పారీణుఁడ్ = దరి ముట్టినవాఁడును—గడిదేఱినవాఁడనుట, జయశ్రీలోలుఁడ్ = జయలక్ష్మియం దాసక్తుఁడయినవాఁడును, మత్ అగ్రజుఁడ్=నాకు అన్నయైనవాఁడును, అగు, శ్రీరామక్షితిపుఁడ్=సంపద్యుక్తుఁ డయినరామదేవరాయలను, బహు సంస్కృతఆంధ్రకృతులన్=అనేకములయిన సంస్కృతాంధ్ర భాషా కావ్యముల చేత, పల్మాఱున్=పెక్కుమాఱులు, మెప్పించి=మెచ్చుకొనునట్లు చేసి, తత్కారుణ్యంబునన్=అతని దయచేత, రత్న...సత్కారంబు—రత్నహార=మణిహారములును, హయ=గుఱ్ఱములును, వేదండ=ఏనుఁగులును, అగ్రహార=అగ్రహారములును, ఆది=మొదలుగాఁగల, సత్కారంబు=సమ్మానమును, అందితి = పొందితివి, రామభూషణకవీ=రామభూషణుఁడను పేరుగలకవీ, నీవు, అన్నిటన్ = సమస్తవిధములను, ధన్యుండవు=కృతార్థుఁడవు.

వేదండమన్నచోట 'వేదస్సామవేదః అణ్డో జననకారణం యస్యేతివేదణ్డః' సామవేదము అండముగా అనఁగా జననకారణముగాఁ గలదిగాన వేదండమని వ్యుత్పాదకమగు విగ్రహము. ఈ శబ్దము శకంధ్వాదిగణములోనిది గనుక సవర్ణదీర్ఘము రాక పరరూపమువచ్చినది. శకంధ్వాదులందు స్వరవ్యంజనములు రెండును యతు లగును గాన దీని 'ద'కారము యతియగుట చెల్లుచున్నది. శ్రీరామదేవరాయలు నానాకలాపారీణుం డగుటంబట్టియే బహుసంస్కృతాంధ్రకృతులచే మెప్పించుట ఘటించినది. అతనిని బల్మాఱు మెప్పించుటచేతరత్నహారాది బహువిధసత్కారముఁ బొందఁగలుగుటయు దానంజేసి యన్నిట ధన్యుండగుటయు సిద్ధించుచున్నది. అలం. కావ్యలింగము.

తా. నానావిద్యలయం దాఱితేఱినవాఁడును జయలక్ష్మీపరాయణుఁడునగు మాయన్న శ్రీరామదేవరాయలను నీవు పెక్కుసంస్కృతకావ్యములచేతను నాంధ్రకృతులచేతను మాటిమాటికి మెప్పించి యతని కరుణవలన రత్నహారాది బహుసమ్మానములను బొందితివి. రామభూషణకవీ! అన్నివిధముల నీవు కృతార్థుఁడవు.

గీ. తరుతటాకాదిసంతతుల్ ధరణి నెచట
నిలిపి రచటనే యుండు వా రనికిని గృతిము
ఖంబునను విశ్వవిఖ్యాతి గాన కృతియె
సంతతివతంస మది మాకు సంఘటింపు. 18

అ. తరు...సంతతుల్ —తరు=వృక్షములు-వృక్షవన ప్రతిష్ఠయనుట, తటాక=చెఱువును--చెఱువుఁ ద్రవ్వించుటయనుట, ఆది=మొదలుగాఁగల, సంతతులు=సంతానములు, ధరణిన్=భూమియందు, ఎచటన్=ఎక్కడ, నిలిపిరి=ప్రతిష్ఠించిరో-ప్రతిష్ఠింతురో యనుట, వర్తమానమునందు భూతము. అచటనే=అచ్చటనే, ఉండును. శ్లో॥ బ్రహ్మప్రతిష్ఠా సంతానం తటాకో వనమేవచ। కృతిర్దేవాలయం చైవ నిక్షేపః సప్తసంతతిః॥ అగ్రహారప్రతిష్ఠ, సంతానము, తటాకము, వనము, కృతి, దేవాలయము, ధననిక్షేపమ్ము సప్తసంతానములు. ఇందుఁ గృతితప్పఁ దక్కిన సంతానములెక్కడఁ బ్రతిష్ఠింతురో

యక్కడనే యుండుననియుఁ గృతిమాత్రము సర్వత్ర వ్యాపించుననియుఁ జెప్పినాఁడు, వానికిని = తక్కిన యాసంతానములకును, కృతిముఖంబుననె=కృతిమూలముననే, విశ్వవిఖ్యాతి=ప్రపంచమందుఁ బ్రసిద్ధికలుగును, కాన=కనుక, కృతియె=ప్రబంధమే, సంతతివతంసము = సంతానములలో శ్రేష్ఠమయినది. అది=ఆకృతిని, (ద్వితీయకుఁ బ్రథమ,) మాకుక్, సంఘటింపు = ఒడఁగూర్పుము - అనఁగా మాపేర ప్రబంధము రచింపుమని భావము.

తా. తోఁటపెట్టుట చెఱువుద్రవ్వించుట మొదలయిన సంతానములు భూమియందెచటఁ బ్రతిష్ఠింతురో యచటనే యుండునుగాని కృతివలె నంతటను వ్యాపింపఁజాలవు. ఆతీరున తటాకాది సంతానములును గృతి మూలముననే ప్రపంచమునఁ బ్రసిద్ధికి వచ్చును. కాఁబట్టి కృతియే సంతానములలో నెల్ల నుత్తమమయినది. కాన యట్టికృతి నొకటి మాపేర రచియింపుమా.

ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీరినజాతిరత్నముల్
గావున నిట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్. 19

అ. కేవలకల్పనాకథలు=పురాణములందుఁ జెప్పఁబడనివై కేవలము కవిచేతఁ గల్పింపఁబడినకథలు, కృత్రిమరత్నములు=కల్లమణులు-గాజుపచ్చలు మొదలయినవాని వంటివనుట, ఆద్యసత్కథల్ =పూర్వులయినరాజాదులచరిత్రలు, వావిరిక్ =క్రమమున-అచ్చముగాననుట, పుట్టురత్నములు=పుట్టెడిరత్నములు, పుట్టినవిపుట్టినట్టుగా నేయుండెడివజ్రములు మొదలయిన మూఁగరాలవంటివి, అవారిత...వృత్తములు-అవారిత=నివారింపఁబడని, సత్కవికల్పనా=శ్రేష్ఠుఁడయినకవియొక్క, రచనయనెడు, విభూషా=అలంకారమును, వహా=వహించిన, పూర్వవృత్తములు=పూర్వులచరితములు, సానలక్ తీరిన జాతిరత్నముల్ =వజ్రపుసానలఁదీర్పఁబడిన ఉత్తమరత్నములవంటివి. తాము నచ్చములై సానలయందును దీరిన మిక్కిలి మేలిమిగన్న రత్నములనుట. కవికల్పనా లంకృతత్వము సానలఁదీరుటకును, పూర్వవృత్తమగుట జాతిరత్నమగుటకును సామ్యము. కావునక్ = కాఁబట్టి, నేర్పుపెంపునక్ = నిపుణత్వముయొక్క యతిశయము చేత - మిక్కిలియు నైపుణ్యముమెఱసి, ఇట్టిమిశ్రకథగాక్ = ఇట్లు కవికల్పనమును పూర్వవృత్తమును గలసినట్టి కథగానుండునట్లు, రచియింపుము=కృతిని రచింపుమనుట. కవికల్పనాచమత్కృతియుఁ బూర్వరాజ వృత్తాంతమును గూడియున్నట్టుగా కృతిని రచింపుమని భావము. అలం. రూపకము.

తా. పురాణాద్యాధారములేక కేవలము కవిచేతఁగల్పింపఁబడినకథలు గాజుపచ్చలవలె కల్లరత్నములవంటివి. కేవలము పూర్వరాజచరిత్రలును పుట్టినవి పుట్టినట్టుగా నేయుండు వజ్రములు మొదలయిన మూఁగరాలవంటివి. మహాకవి నిరర్గళమయిన కల్పనాచమత్కృతిచే నలంకృతములయిన పూర్వ రాజ చరిత్రములు సానఁబట్టంబడిన యుత్తమరత్నముల వంటివి. కాఁబట్టి కవితాకల్పనయును బూర్వరాజ వృత్తమును గలసినట్టి కథ గలదిగా నొక కృతిని మిక్కిలియు నేర్పుమెఱసి రచింపుము.

వ. అని సబహుమానంబుగాఁ దాంబూల జాంబూనదాంబరాగ్రహారాదిప్రదానంబుల నాదరించుటయు నేను నానందకందళితాంతరంగుండ నై కృతిపతివంశావతారం బభివర్ణించెద. 20

అ. అని=ఇట్లుపలికి, సబహుమానంబుగాన్=బహుమాన పూర్వకముగా - మన్ననతో ననుట తాంబూల... ప్రదానంబులన్—తాంబూల = కర్పూరతాంబూలమును, జాంబూనద=బంగారమును-సువర్ణములనుట, అంబర=చీనాంబరములును, అగ్రహార=అగ్రహారములును, ఆది=మొదలుగాఁగలవానియొక్క, ప్రదానంబులన్=ఇచ్చుటలచేత-తాంబూలాదుల నిచ్చుటచేతననుట. ఆదరించుటయున్ = మన్నింపఁగా, ఏనున్=నేనును, ఆనంద...రంగుండనై - ఆనంద=సంతోషముచేత, కందళిత=పల్లవించిన, అంతరంగుండనై=అంతఃకరణము గలవాఁడనై, కృతిపతివంశ-అవతారంబు=కృతిపతియైన తిమ్మలదేవరాయలయొక్క వంశము పారంపర్యమును, అభివర్ణించెదన్=వర్ణించుచున్నాను. అది యెట్లన్నఁగా-

సీ. జనకనేత్రఫలం బయినపాలపాపఁడు, వరవృద్ధిఁ గాంచుజైవాత్రుకుండు
శ్యామాభిరాముఁడై యమరు రేఖాశాలి, రహిఁ గళల్ పూను సర్వజ్ఞమౌళి
కువలయానందంబుఁ గూర్చు చల్లనిరాజు, తమ మెల్ల నడఁచు సత్ప్రభవిహారి
వసువులు గురియు దివ్యవదాన్యతిలకుండు, లచ్చితోఁ బుట్టిన లక్షణాఢ్యుఁ
తే. డంబుజాసనుఁ డన విధుఁ డనఁగ సోముఁ, డన నెగడి హంససంగతి నడర సురలఁ
బోవ దాక్షాయణీప్రేమఁ బూన నేర్చు, జాణ చంద్రుండు కాంతినిస్తంద్రుఁ డలరు.

అ. ఇందు చంద్రునిపరముగను, జన్మబాల్యకౌమారాద్యవస్థ లానుపూర్విని బొందుచున్న యొక పురుషశ్రేష్ఠుని పరముగను, నర్థద్వయముగలుగఁ జెప్పుచున్నాఁడు. జనక...పాపఁడు - జనకనేత్రఫలంబు=తండ్రి నేత్రములకలిమికి ఫలభూతుఁడు-తండ్రికి నేత్రసాఫల్యకరుఁ డనుట, అయిన, పాలపాపఁడు=పాలుత్రాగు చిన్నబిడ్డఁడని యర్థము. (చంద్రపరముగా) జనకుఁడయిన అత్రిమునియొక్క నేత్రమువలనఁ బుట్టినవాఁడనియు, పాలసముద్రుని బిడ్డఁడనియును భావము. 'అగు పోవుల కడ ద్రావ కవ్యక్రంబులు పరంబులగునపుడు యకారంబగు' (బాలవ్యా. క్రియా. ౫౫) నను సూత్రముచే అగు ధాతువునకు 'అయి' అను రూపము సిద్ధింపఁగా 'నవర్ణకం బు క వదర్థంబునం దగు' (క్రి. ౭౬) నను సూత్రముచే 'అయిన' యని సిద్ధించెను. వర...జైవాత్రుకుండు—వరవృద్ధిన్=గొప్పదైన యభివృద్ధిని, గాంచు జైవాత్రుకుండు=పొందుచున్న దీర్ఘాయుష్మంతుఁడు. (చంద్ర) శుక్లపక్షమందభివృద్ధి నొందుచున్నవాఁడనియు, జైవాత్రుకుఁడను పేరుగలవాఁడనియు భావము. 'జైవాత్రకః కర్షకేన్దావైద్యే చాయుష్మతి త్రిషు' నానార్థ.

శ్యామా...శాలి—శ్యామా=నడి యౌవనముగల స్త్రీలకు, అభిరాముఁడై=మనోహరుఁడై, అమరు రేఖాశాలి = ఒప్పుచుండెడు సౌందర్యరేఖచే నొప్పుచున్నవాఁడు - లేక వాలకులిశాదిభాగ్యరేఖలచేత నొప్పుచున్న వాఁడు—(చంద్ర) శ్యామా=రాత్రియందు, అభిరాముఁ డయినవాఁడనియు, రేఖాకారముచే నొప్పువాఁడనియును భావము. 'శ్యామా యౌవనమధ్యస్థా త్రివృతా శారిబానిశా' నానార్థ. రహి...మౌళి—రహిన్ = ఒప్పిదమగునట్లుగా, కళల్=విద్యలను, పూను సర్వజ్ఞమౌళి=వహించిన సర్వజ్ఞశ్రేష్ఠుఁడు—విద్యలనెల్లఁ గఱచి మేటిసర్వజ్ఞుఁ డయినవాఁడనుట. (చంద్ర) షోడశకళలనుధరించినవాఁడనియు, (సర్వజ్ఞుఁడను నామము శివునకుఁ గలదు గావున,) శివునకు శిరోభూషణ మయిన వాఁడనియు భావము. 'కృశానురేతాస్సర్వజ్ఞో ధూర్జటిః' అమ.

కువల...రాజు—కువలయ ఆనందంబు=భూమండలమునకు ఆనందమును, కూర్చు చల్లని రాజు=కలిగించు చల్లని ప్రభువు. (చంద్ర) కువలయ=కలువలకు, ఆనందమున్=వికాసము ననుట, కూర్చువాఁ

డనియు, శైత్యగుణముగలవాఁడనియు, రాజనామము గలవాఁడనియు భావము. ('గోత్రా కుః పృథివీ' అనుటచే 'కు' అనఁగా భూమి గనుక కువలయమనఁగా భూమండలము. 'స్యాదుత్పలం కువలయమ్' 'రాజా మృగాఙ్కే క్షత్రియే నృపే' అమ.) తమ... విహారి—తమము ఎల్లన్ = తమోగుణమునంతయు, అడఁచు సత్పథ విహారి = పోఁగొట్టునట్టి సన్మార్గమందు వర్తించువాఁడు. 'రాహౌ ధ్వాన్తే గుణే తమః' అమ. అని తమశ్శబ్దము తమోగుణమునందును చీఁకటియందును వర్తించును. 'సన్ సత్యే విదుషి శ్రేష్ఠే సాధౌ భవతిచ త్రిషు। సత్త్రీబ మృతే' నానార్థ. అని సచ్ఛబ్దము. శ్రేష్ఠార్థమందును నక్షత్రములందును వర్తించును కనుక, (చంద్ర) తమమెల్లన్ = చీఁకటినంతయును అడఁచువాఁడనియు, సత్ + పథవిహారి = నక్షత్రముల మార్గమందు—అనఁగా ఆకాశమునందు - వర్తించువాఁడనియు భావము.

వసువులు ... తిలకుండు—వసువులు = ధనములను, కురియు = అవార్యరిగా వెదచల్లునట్టి, దివ్యవదాన్య తిలకుండు = శ్రేష్ఠులయిన దాతలకు భూషణమైనవాఁడు - దాతృశిరోమణియైనవాఁ డనుట. (దేవభేదే౽నలే రశ్మౌ వసూరత్నే ధనే వసుః అ. అని వసువులనఁగా ధనమునకును గిరణములకును బేరు గనుక) (చంద్ర) వసువులుకురియు = కిరణములను ప్రసరింపఁజేయువాఁడనియు, దివ్యులనఁగా, దేవతలు గనుక దేవతలకుఁ గళల నాహారముగానిచ్చుటచే దాతృశ్రేష్ఠుఁ డయినవాఁడనియు భావము. శ్లో॥ 'ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవిః' అని చంద్రుని కళలను ఆయాతిథులందు అగ్నిసూర్యాది దేవతలు గొనుట తెలియునది. లచ్చి ... లక్షణాఢ్యుఁడు—లచ్చితోన్ పుట్టిన = ఆగర్భశ్రీమంతుఁడయిన, లక్షణాఢ్యుఁడు = విశాలఫాలత్వాదిశుభలక్షణసంపన్నుఁడు. 'కలఙ్కాఙ్కౌ లాఞ్ఛనంచ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్' అమ- అని లక్షణమనఁగా లాంఛనమును. (చంద్ర) లచ్చితోఁ బుట్టిన యనుటచే లక్ష్మీదేవికిఁ దోడఁబుట్టినవాఁడనియు, మృగము లాంఛనముగాఁ గలవాఁడనియు భావము.

అంబుజాసనుఁడనన్ = (తామర ఆసనముగాఁగల) బ్రహ్మయనునట్లు గానని యర్థము- తామరలను దిరస్కరించువాఁడని భావము. విధుఁడనఁగన్ = విష్ణు వనునట్టులుగా - విధుఁ డనునామము గలవాఁడని భావము. సోముఁడు (స + ఉమా) అనఁగన్ = శివుఁడనునట్టులుగా- సోమనామము గలవాఁడని భావము. నెగడి = ప్రకాశించి, హంససంగతిన్ అడరన్ = హంసవాహనముతోడి కూడికచేత ప్రకాశించుటకు—ఇందులకు అంబుజాసనుఁ డనుట హేతువు. 'రవి శ్వేత చ్ఛదౌ హంసౌ' అమ. అని హంసశబ్దము సూర్యునియందును వర్తించుటచేత, హంససంగతిన్ అడరన్ = సూర్యసంగమముచేత ప్రకాశించుటకని భావము. సూర్యకిరణములు చంద్రునిఁబొంది వెన్నెలలగుచున్నదను ప్రతీతి యిట

శ్లో॥ 'సలిలమయే శశిని రవే ర్దీధితయో మూర్ఛితా స్తమో నైశమ్ ।
భిన్దన్తి దర్పణోదరనిహితా ఇవ మన్దిరస్యాన్తః' ॥ వరాహమిహిరుఁడు.

యనుసంధించునది. సురలన్ ప్రోవన్ = దేవతలను రక్షించుటకు. ఇందులకు 'విధుఁ' (డనఁగా విష్ణుఁ) డనుట హేతువు. విష్ణువు అమృతమునొసఁగి దేవరక్షణము సేయుట సుప్రసిద్ధము. అమృతకళల నొసంగి దేవతలను రక్షించుటకని భావము. 'సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దంబు వైకల్పికముగా స్త్రీత్వతుల్యాంబులగు - సంస్కృతసమాసంబునం గావు. (బా. తత్స. ౭౦) అను సూత్రముచేత సురశబ్దమునకు స్త్రీత్వము. దాక్షాయణీ ప్రేమన్ పూనన్ = పార్వతియందు ప్రీతి వహించుటకు - ఇందులకు 'సోముఁ (డనఁగా శివుఁ)' డనుట హేతువు. 'దాక్షాయణీత్వపర్ణాయాం రోహిణ్యాం తారకాసు చ' విశ్వ అని దాక్షాయణీశబ్దము రోహిణియందును, అశ్విన్యాదినక్షత్రములందును వర్తించునుగనుక, రోహిణియందు ప్రీతివహించుటకని భావము. అశ్విన్యాదులందలి ప్రీతికంటె రోహిణియందలి ప్రీతియే

చంద్రునికి ఎక్కుడు గనుక అశ్విన్యాదులను జెప్పక రోహిణిని జెప్పుట సరసతరము. నేర్పు జాణ = నేర్చినచతురుఁడును, కాంతినిస్తంద్రుఁడు = కాంతియందు నిశ్చలుఁడయినవాఁడును, నిశ్చలమయిన కాంతిగలవాఁడు ననుట, అగు, ఇంద్రుఁడు, అలరున్ = ఒప్పుచుండును. అంబుజాసనాదినామత్రయమునకు

గీ. జగముఁ బొడమింప నంబుజాసనుఁడ వైతి, సకలభూచక్రవిస్ఫూర్తి సమయఁ జేయ
నైతి సోముండ వౌర యోమాయచంద్ర, విధుఁడ వైతి పోషింపంగ విధములేక.

రామాభ్యుదయము.

ఇట 'జనక నేత్రఫలం' బనునది మొదలుగా 'లక్షణాఢ్యుఁ' డనువఱకును గల శబ్దముల శ్లిష్టశక్తిచే తండ్రికి నేత్రములు సఫలమగునట్లుగా పుట్టి, పాల్ద్రావు చిన్నపాపఁడై పెరిఁగి, కౌమారదశ నొంది, దీర్ఘాయుష్మంతుఁడై, యౌవనదశకువచ్చి, సౌందర్యరేఖచే యువతుల కెల్ల మనోహరుఁడై, సమస్తవిద్యలను నేర్చి సర్వజ్ఞుఁడయి, రాజత్వమునొంది, భూప్రజల కానందముగాఁ బాలించుచు, తనసన్మార్గప్రవర్తనమువలన లోకుల యజ్ఞానమునుబోఁగొట్టుచు, యాచకుల కవ్వారిగా దానములొసంగుచు, ఇట్లు సర్వశుభలక్షణలక్షితుఁడయి, అగణ్యశ్రీమంతుఁ డగుపురుషుఁడు వ్యంజితుఁడు. వానికిఁ దశావిశేషములు క్రమముచొప్పునఁ గూర్పఁబడినవి. అంబుజాసనుఁడును (బ్రహ్మయు) విధుఁడును (విష్ణువును) సోముఁడును (శివుఁడును) నయిన హేతువు నే నాఁ సనంగతికి సురలఁ బ్రోచుటకును దాక్షాయణీ(పార్వతీ)ప్రేమఁబూనుటకును నేర్చుట నుపపాదించుటచే పదార్థహేతుకమయి శ్లేషానుప్రాణితమగు కావ్యలింగమును, ప్రకృతవిశేషణములచే అప్రకృతపురుషవృత్తాంతము స్ఫురించుటవలన సమాసోక్తియు, అంబుజాసనత్వాద్యారోపప్రకరణమున శ్లేషానుప్రాణితమాలారూపపరంపరిత రూపకమును నలంకారములు. జనక నేత్ర ఫలమనుట మొదలుగా తుదివఱకును శబ్దశ్లేషమహిమచేత అప్రకృతమగు బాలాదివృత్తాంతము వ్యంగ్యము. అది ప్రకృతంబగు వాచ్యమున కుపస్కారకమే యగును గావున గుణీభూతమని తెలియునది. తాత్పర్యము సుగమము.

చ. అతనికిఁ గల్గె సౌమ్యుఁడు గుణార్జవరమ్యుఁ డతం డవార్యదో
ర్యుతదివిజారిభైరవుఁ బురూరవుఁ గాంచెఁ జిరాయు వాయు వా
కృతికి జనించె నాసుకృతికిం గలిగెన్ నహుషుం డకల్మషుం
డతనికిఁ బుట్టె శామ్యదభియాతి యయాతి తదన్వయంబునన్. 22

అ. అతనికిన్ = ఆ చంద్రునికి, గుణార్జవరమ్యుఁడు — గుణ = సుగుణములయొక్క, ఆర్జవ = ఋజుభావము చేత - చక్కటి చేత - అనఁగా తిన్ననైనను చేత ననుట, రమ్యుఁడు = ఒప్పుచున్నవాఁడు, అగు, సౌమ్యుఁడు = బుధుఁడు - (మనోజ్ఞుఁ డయినవాఁడనియు శ్లిష్టశక్తిచే నూహ్యము. 'సౌమ్యో బుధే మనోజ్ఞే స్యా దనుగ్రే సోమదైవతే' విశ్వ.) కల్గెను. అతండు = ఆబుధుఁడు, అవార్య...భైరవున్ -- అవార్య = వారింప శక్యముగాని, దోర్యుత = బాహువులతోఁగూడిన - వారింపరాని భుజపరాక్రమముతోఁ గూడిన యనుట, దివిజారి = రాక్షసులకు, భైరవున్ = భయంకరుఁ డయినవాఁడగు, పురూరవున్ = పురూరవుని - ఇది సకారాంతశబ్దము. కాంచెన్ = కనెను, చిరాయువు = దీర్ఘాయుష్మంతుఁడయిన, ఆయువు = ఆయువనెడిరాజు, ఆకృతికిన్ = కుశలుఁడయిన యా పురూరవునికి, జనించెను. ఆసుకృతికిన్ = పుణ్యాత్ముఁడయిన ఆయాయువునకు, అకల్మషుఁడు = కల్మషరహితుఁడయిన, నహుషుఁడు = నహుషుఁ డనెడి రాజు, కలిగెను. అతనికిన్ = ఆ నహుషునికి, శామ్యదభియాతి — శామ్యత్ = అడఁగిపోవు

చున్న-రూపుమాయుచున్న, అభియాతి=శత్రువులుగల - శత్రువులను రూపుమాపునట్టి యనుట, యయాతి=యయాతియనెడు రాజు, పుట్టెన్=జనించెను,తత్+అన్వయంబునన్=ఆయయాతివంశమందు-ముందరిపద్యముతో నన్వయము. అలం. సౌమ్యపదశ్లేషస్థలమున శ్లేషమూలకంబగు కావ్యలింగము.

తా. ఆ చంద్రునికిఁ జక్కనిగుణములచే నొప్పుచున్న మనోజ్ఞాకారుఁడగు బుధుఁడుపుట్టెను. ఆ బుధుఁడు వారింపరాని భుజపరాక్రమము గలరాక్షసులకు భయంకరుఁ డయినపురూరవునిఁ గాంచెను. కుశలుఁ డయినయా పురూరవునకు దీర్ఘాయుష్మంతుఁ డయినయాయువు పుట్టెను. పుణ్యాత్ముఁడగునా యా యువునకుఁ గల్మషరహితుఁడయిన నహుషుఁడు పొడమెను. ఆ నహుషునకు శత్రుల పీఁచమడంచు యయాతి గలిగెను. ఆ యయాతివంశమందు.

శా. ద్వీపప్రోద్భవ సూక్త పంచమమహావేదంబు దీపించె నే
భూపాలోత్తముపేర భారతియు నేపుణ్యాత్ము వంశ స్తవం
బాపాదించి కృతార్థ యయ్యె నతఁ డాశాంతక్షమాపాలన
వ్యాపారాభిరతుండు వొల్చు భరతుం డాత్రేయగోత్రేయుఁ డై. 23

అ. ద్వీప...వేదంబు—ద్వీప ప్రోద్భవ=ద్వీపమునందుఁ బుట్టిన వ్యాసునిచేత, సూక్త=లెస్సగాఁ జెప్పఁబడిన, పంచమ మహావేదంబు=అయిదవవేదమయిన భారతము. 'భారతఃపఞ్చమోవేదః' అనిప్రతీతి. ఏ భూపాలోత్తము పేరన్=ఏ రాజశ్రేష్ఠుని పేరిట, దీపించెన్ = ప్రకాశించెనో, అనఁగా భరతు నధికరించి చేయఁబడినగ్రంథముగాన భారతమని భరతుని పేరఁ జెప్పఁబడినదయ్యెనని భావము. భారతియున్ = సరస్వతీదేవియు, ఏపుణ్యాత్మువంశ స్తవంబు = ఏసుకృతాత్ముని వంశముయొక్క స్తోత్రమును, ఆపాదించి =ప్రతిపాదించి,కృతార్థయయ్యెన్ = కృతార్థురాలయ్యెనో, అనఁగా పుణ్యాత్ముఁడయిన భరతుని వంశముయొక్క స్తోత్రమురూపముగా నుండునట్టి ధన్యత్వమునొందెనోయనుట. కృతార్థయనఁగా అన్వర్థయనియు నర్థముగావున,'భరతస్యేయం భారతీ' యను వ్యుత్పత్తిఁ జేయఁగా, భరతవంశ స్తవ పాదనముచే భారతియని యన్వర్థనామము గలదయ్యెనని గ్రాహ్యము. అతఁడు, ఆశా...రతుండు —ఆశా అంత=దిక్కులంతముగాఁగల,క్షమా=భూమియొక్క,పాలన=పరిపాలించుట యనెడు, వ్యాపార=క్రియయందు, అభిరతుండు=ఆసక్తుఁ డయినవాఁడగు, భరతుండు=భరతుఁడను రాజు, ఆత్రేయగోత్రేయుఁడై=అత్రేయగోత్రమునందు జన్మించినవాఁడై, పొల్చున్ = ప్రకాశించును. అనఁగా పూర్వోక్తమయిన యయాతివంశమందు భరతుండను రాజు సార్వభౌముఁడై యత్యంతప్రసిద్ధి గాంచెనని తాత్పర్యము.

ద్వీపశబ్దము 'ద్విర్గతా ఆపః అత్రేతిద్వీపః' అనువిగ్రహముచే ద్వి ఆపః అని రెండుగా నేర్పడినది. 'ద్వ్యన్తరుపసర్గేభ్యోఽప ఈత్' 'ద్వి, అంతః, ఉపసర్గములకంటె పరంబయిన అప్పునకు ఈత్' వచ్చుననుసూత్రముచేత, ద్విశబ్దమునకంటె పరమయిన అప్శబ్దముయొక్క అకారమునకు ఈకారాదేశము వచ్చినది. ఇది నిత్యసమాసము. నిత్యసమాసమందు స్వర వ్యంజనములు రెండును యతులగును గాన యీశబ్దమందలి వకారమునకు విశ్రమము చెప్పఁబడినది. ఇది య[illegible]డయతియనియు, నిత్యసమాసయతియనియుఁ జెప్పఁబడుచున్నది.

క. లోకంబునఁ గర్ణాటవ, నౌకో ద్వీపాంతరీప • నాస్తి పదార్థా
నే కాన్యోన్య జనార్దన, నౌకాదులు నిత్యసమసనము లంద్రు బుధుల్.

ఇందు 'భారతియు కృతార్థయయ్యె'ననుచో భరతుఁడు పుణ్యాత్ముండయి యున్నగుణముచేత భారతియందుఁ గృతార్థత్వము నొందు గుణ మల్లసితమగుటచే నుల్లాసాలంకారము. ఒకని గుణదోషములవలన మఱొకనియందు దాగుణదోషము లుల్లసిలునేని యుల్లాసాలంకార మనఁబడును 'ఏకస్యగుణదోషాభ్యా ముల్లాసోఽన్యస్య తౌ యది' అని లక్షణము. 'నిరుక్తిర్యోగతో నామ్నా మన్యార్థత్వప్రకల్పనమ్' నామములకు యోగశక్తిచే వేఱొకయర్థమును గల్పించుట నిరుక్తి యనఁబడు' నను లక్షణముచే నిట భారతి యనునామము యోగమువలన నన్వర్థమగుటచే నిరుక్తియు నలంకారము. 'పంచమవేద' మనుబిరుదముచే నట్టివేదప్రాయమైనదిగూడ నారాజునామమునఁ బ్రకాశించుటచే నతనిలోకోత్తరమహిమాతిశయము ధ్వనితము.

తా. వ్యాసుఁడు చెప్పిన పంచమవేద మారాజుపేరిట భారతమని ప్రసిద్ధిగాంచెనో, ఏపుణ్యాత్ముని వంశపుస్తోత్రము రూపమగుటచే సరస్వతియుఁ గృతార్థయై భారతియనెడి యన్వర్థనామము నొందెనో, ఆభరతుఁ డాత్రేయగోత్రమున జనించినవాఁడు దిగంతభూమండలమును నాసక్తితోఁ బరిపాలించుచు వెలయుచుండెను.

ఉ. ఆభరతాన్వయంబున రణాధ్వరయూపభుజుల్ మహాధరి
త్రీభుజు లుద్భవించిరి యుధిష్ఠిరముఖ్యులు విశ్రుతాఖ్యు లు
ర్వీభరణప్రవీణులు వివేకధురీణులు దానదీక్షితా
గ్రాభిహితుల్ సుధీయుతు లుదారదయాహృదయుల్ శుభోదయుల్. 24

అ. ఆభరతాన్వయంబునన్ = ఆభరతునివంశమందు, రణా...భుజుల్ - రణ=యుద్ధమనెడి, అధ్వర=యజ్ఞమందు, యూప=స్తంభములయిన, భుజుల్=బాహువులుగలవారు- యూపములు యజ్ఞనిర్వాహమునకు ముఖ్యములయినట్లు, యుద్ధనిర్వాహమునకు బాహువు లత్యంతోపకారములనుట. బాహులదీర్ఘతయుఁ బటిష్ఠతయు యూపసామ్యముచే వ్యంజితములు. బాహుబలముచేతఁ బెక్కుయుద్ధములు గావించి గెలుపుగొన్నవారనుట, మహాధరిత్రీభుజులు=గొప్పరాజులు - ధరిత్రీ భుక్ఛబ్దము 'గుణవద్గణో ప్యతీస్త్రైకవచనతుల్యో భవేద్వికృతౌ' నన్నియ. అని ద్వితీయైకవచనాంతతుల్యము. విశ్రుత+అఖ్యులు=ప్రసిద్ధములయిన నామములు గలవారును, ఉర్వీభరణప్రవీణులు=భూమిని భరించుటయందు నిపుణులయినవారును, వివేకధురీణులు=(మంచిచెడ్డల నేర్పఱచి తెలిసికొను) తెలివియొక్క భారముగలవారును - అట్టిశక్తి మిక్కిలియుఁ గలవారనుట, దాన..హితుల్ - దానదీక్షిత=దానదీక్షగలవారిలో- దానము నియమమునఁ జేయునట్లు ప్రతిజ్ఞపట్టినవారిలోననుట, అగ్ర+అభిహితుల్ = మొదటఁ జెప్పఁబడినవారును—అగ్రగణ్యులనుట, నిరవధికదాతృత్వాతిశయము ద్యోతితము. సుధీయుతులు=మంచి బుద్ధితోఁగూడినవారును, ఉదారదయాహృదయుల్ - ఉదార=మిక్కిలియైన, దయా=దయ, హృదయుల్=మనసునందుఁ గలవారును, శుభ+ఉదయుల్=మేలయిన అభ్యుదయము గలవారును, వివేకధురీణతా దానదీక్షాది గుణసంపన్నులగుటచేత, మంచి యభ్యుదయము గలవారనుట, అగు, యుధిష్ఠిరముఖ్యులు=ధర్మరాజు మొదలయినవారు, ఉద్భవించిరి=పుట్టిరి. రణాధ్వరయూపభుజులనుచో రూపకము.

తా. ఆ భరతవంశమున భుజపరాక్రమముచేతఁ బెక్కుయుద్ధముల నిర్వహించి, ప్రసిద్ధిగాంచి, భూభరణమందు నిపుణులై, వివేకము మిక్కిలియుఁ గలిగి, దానపరాయణులం దగ్రగణ్యులయి

మంచిబుద్ధిగలిగి, గొప్ప దయతోఁగూడిన మనస్సులతో, ఎంతయు నభ్యుదయము గలిగినధర్మరాజు మొదలయినగొప్పరాజులు పుట్టిరి.

క. ఆసంతతి వైభవజిత, వాసవుఁ డగుతాతపిన్నవసుధాధిపుఁ డు
ద్భాసిల్లెఁ గీర్తిమయము,క్తాసౌధ సువర్ణ కలశిత విభావసుఁ డై. 25

అ. ఆ సంతతిన్ = ఆధర్మరాజాదుల వంశమందు, 'సంతతిర్గోత్రజననకులా న్యభిజనాన్వయౌ' అని. అమ. వైభవజితవాసవుఁడు—వైభవ = విభవముచేత, జిత = జయింపఁబడిన, వాసవుఁడు = ఇంద్రుఁడు గలవాఁడు - వైభవముచే ఇంద్రుని జయించినవాఁడు - ఇంద్రునికంటె ఎక్కుడగు వైభవముగలవాఁడనుట - అగు, తాతపిన్నవసుధాధిపుఁడు = తాతపిన్నరాజు, కీర్తి... విభావసుఁడై— కీర్తిమయ = కీర్తిరూపమయిన - అనఁగా కీర్తియేయగు, ముక్తాసౌధ = ముత్యాలమేడయందు, సువర్ణకలశిత = బంగారపు కలశముగా చేయఁబడిన, విభావసుఁడై = సూర్యుఁడుగలవాఁడై, ఉద్భాసిల్లెన్ = ప్రకాశించెను. ఇక్కడ కీర్తిని ముక్తాసౌధమనుటయందు ముక్తాశబ్దముచే ముత్తెములవలెఁ దెల్లనయినదనియు, సౌధమనుటచే మేడవలెఁ బొడవుగా ఆకాశమునకు వ్యాపించినదనియు, కీర్తియనెడు మేడపయిని సూర్యుఁడు బంగారుకలశము గావింపఁబడెననుటచే ఆకీర్తి సూర్యమండలము వఱకువ్యాపించినదనియు భావము. ఇందుఁ గీర్తిని ముక్తాసౌధముగాను సూర్యుని సువర్ణకలశముగాను రూపించుటచేత రూపకాలంకారము.

తా. ఆధర్మరాజాదుల వంశమందుఁ దాత పిన్నయనెడురాజు, తన కీర్తి సూర్యమండలము వఱకు వ్యాపింపఁగా నెంతయుఁ బ్రకాశించెను.

ఉ. ఆసుగుణాబ్ధికిం బ్రశమితాఖిలదోషుఁడు చక్రపాలనా
భ్యాసుఁడు సోమదేవుఁ డనునద్భుతశీలుఁడు గల్గె నాకళా
భ్యాసికి నుద్భవించె దురహంకృతిమత్పరవాహినీశ సం
త్రాసద బాణ లాఘవుఁడు రాఘవుఁ డాజికృత ప్రమోదుఁ డై. 26

అ. ఆసుగుణాబ్ధికిన్ - ఆసుగుణసముద్రుఁ డయినరాజనెడు సముద్రునికి, ప్రశమి...దోషుఁడు—ప్రశమిత = మిక్కిలియు నిరసింపఁబడిన, అఖిల = సమస్తములయిన, దోషుఁడు = రాత్రులు గలవాఁడని చంద్రపరమైన యర్థము. పోఁగొట్టఁబడిన సమస్తపాపములు గలవాఁడని రాజపరమయిన భావము - 'దోషస్స్యాద్దూషణేపాపే దోషారాత్రౌ భుజేఽపిచ' విశ్వ. చక్రపాలనాభ్యాసుఁడు = చక్రవాకపరిపాలనమందు అభ్యాసము గలవాఁడు, (రాజు) రాష్ట్రపరిపాలనమం దభ్యాసముగలవాఁడని భావము. 'చక్రం చయే జలావర్తే రథాఙ్గేరాష్ట్ర సైన్యయోః । ఘటసాధన భేదేచ క్లీబే కోకేతు పుంస్యయమ్' నానార్థ. సోమదేవుఁడు అను అద్భుతశీలుఁడు 'దేవస్స్యాద్ఘనే రాజ్ఞి' విశ్వ. అని దేవుఁడనఁగా దేవతయు రాజునగుదురు గాన, చంద్రుఁడనెడి అద్భుతవృత్తిగల వాఁడని యర్థము. విరుద్ధగుణములతోఁ గూడినవాఁడనుట - (రాజు) సోముఁడనెడి అద్భుతమయిన సద్వృత్తిగలరాజని భావము. కల్గెను. ఇక్కడ సముద్రునివలన సోముఁడై (అనఁగా చంద్రుఁడయి) పుట్టినందులకు రాత్రిశోభావహత్వాదిసహజగుణములు గలిగియుండక రాత్రినిరాసకత్వాది విరుద్ధగుణములు గలిగియుండుటచే నతనిశీలము (అనఁగా నడవడి) అద్భుతముగా (విపరీతముగా) నున్నదనియర్థము. సోముఁడను పేరుతోఁ బుట్టినాఁడనియు పాపనిరాసకత్వాది గుణములచేత అం

దఱు నాశ్చర్యపడునట్టి మంచినడవడి గలిగియున్నాఁడనియు భావము. ఆకళాభ్యాసికిన్ =(కళలనఁగా షోడశకళలును విద్యలునుగనుక) షోడశకళలు అలవడియున్న యాచంద్రునికి - విద్యలలవడియున్న యారాజునకని భావము. దురహంకృతి...లాఘవుఁడు దురహంకృతిమత్ = దురహంకారములోఁగూడిన, పర ( పరుఁడనఁగా ఉత్కృష్టుఁడును శత్రుఁడునగును గనుక ) ఉత్కృష్టుఁడయిన - ఉల్లోలకల్లోలమాలికలచేత ఉత్కృష్టుఁడయిన యనుట, వాహినీశ= (వాహినియనఁగా నదియును సేనయునగును గాన ) నదీనాథుఁడయిన సముద్రునికి, సంత్రాసద=మిక్కిలి దిగులుగొలుపుచున్న, బాణలాఘవుఁడు = బాణములందలి మెలపుసాధనగలవాఁడు, శరముల నవలీలఁబఱపి సముద్రుని మిక్కిలియు దిగులుగొలిపినవాఁడనుట, అగు, రాఘవుఁడు=శ్రీరామస్వామి యని యర్థము. దురహంకృతిమత్ = దురహంకారయుక్తులయిన, పరవాహినీశ = శత్రుసేనాధిపతులకు, మిక్కిలి భయముగలిగించుచున్న బాణలాఘవముగల రాఘవుఁడను రాజని భావము. 'పరస్స్యాదుత్తమానాత్మవైరిదూరేషు కేవలే' 'వాహిన్యాంచ తరఙ్గిణ్యాంసేనా సైన్యప్రభేదయోః' విశ్వ. ఆజి...ప్రమోదుఁడై— అజమహారాజకుమారుఁడయిన దశరథునియందు, కృత=చేయఁబడిన, ప్రమోదుఁడై = సంతోషముగలవాఁడై-అనఁగా దశరథునికి సంతోషముగలిగించువాఁడై యని శ్రీరామపరమయిన యర్థము. ఆజి= యుద్ధరంగమందు, చేయఁబడిన సంతోషముగలవాఁడై—అనఁగా యుద్ధముచేయుటయందు సంతోషమునొందినవాఁడై యని రాఘవరాజు పరమయిన భావము. ఉద్భవించెన్ = పుట్టెను.

ఇట సముద్రునికి రాత్రినిరాసకత్వాది విరుద్ధగుణములతోఁబుట్టి చంద్రుఁడచ్యుతశీలుఁడయినట్టు చంద్రునకును, చంద్రేతరవంశ్యుఁడగు రాముఁడు పుట్టి యచ్యుతశీలుఁడే యైనాఁడని పారస్యము. కారణమయిన చంద్రునకును కార్యమయిన రామునకును సారూప్యమున్నదిగనుక 'సారూప్య మపికార్యస్య కారణేన సమం విదుః' అన్నట్లు సమాలంకార ప్రభేదము. ఇందు సోమదేవరాజ రాఘవరాజ పరములయిన యర్థములు శబ్దశక్తిచే వ్యంజితములగుటవలన శబ్దశక్తిమూలధ్వని. ఇది ప్రకృతాప్రకృత శ్లేషమని నవీనులు. 'ప్రశమితాఖిలదోషుఁ'డిత్యాదులందు విరోధము లేకుండియు నున్నట్లు తోఁపట్టుటచేత విరోధాభాసము శ్లేషానుప్రాణిత మలంకారము. తాత్పర్యము సుగమము.

క. ఆవిభునకు నర్జున పరిభావకుఁడయి పిన్నశౌరి శౌరిపగిదిఁ బొడమె వం
శావహుఁడు పిన్నశౌరి రమావల్లభుఁ డతఁడు బుక్కమహీధవుఁ గాంచెన్.

అ. ఆవిభునకున్ =ఆరాఘవరాజునకు, అర్జున పరిభావకుఁడై=శౌర్యముచేత అర్జునుని తిరస్కరించినవాఁడై యని రాజు పరమయిన యర్థము, అర్జునములనఁగా ఏరుమద్దిచెట్లు - వానిని గూలఁద్రోసినవాఁడని బాలకృష్ణ పరమయిన యర్థాంతరము. వంశావహుఁడు = వంశోద్ధారకుఁడు - వేణువును ధరించినవాఁడని యర్థాంతరము. రమావల్లభుఁడు = రాజ్యలక్ష్మీవల్లభుఁడును-లేక సంపదచేత మనోజ్ఞుఁడయినవాఁడును. లక్ష్మీవల్లభుఁడని యర్థాంతరము. ఈ మూడుపదములందును అర్థద్వయమున కభేదాధ్యవసాయము. ఇట్టివాఁడయిన, పిన్నశౌరి=పిన్నశౌరి యనురాజు, పిన్నశౌరిపగిదిన్ = బాలకృష్ణునివలె, పొడమెన్ = జన్మించెను. ఇక్కడ ధర్మసామ్య నామ సామ్యములచే పిన్నశౌరితోఁ బిన్నశౌరి సమానుఁడని తాత్పర్యము. అతఁడు=ఆపిన్నశౌరి, బుక్కమహీధవు = బుక్కరాజును, కాంచెన్ =కనెను. ఇందు ఉపమ అలం. పగిది యనెడి ఇవార్థకమువలన నుపమ దోఁచినను నర్జునపరిభావకత్వాదిధర్మములు శ్లేషమూలకములగుటచే ఉపమగాక శ్లేషమే యగునని సర్వస్వకారవిద్యానాథాదుల మతము. తా. సుగమము.

సీ. తనభవ్యధామంబు § తనభవ్యధామంబు, కరణి మిత్త్రోన్మేష§కరము గాఁగఁ
దనధర్మగుణములు § దనధర్మగుణముల,ట్లతులిత శ్రుతిమార్గ § గతుల నెసఁగఁ
దనమహాహవదీక్ష § దనమహాహవదీక్ష, పగిది నానావనీ§పకులఁ బెంపఁ
దనయంబకంబులు § దనయంబకము లట్లు,పరభీరువిముఖతఁ § బరిఢవిల్లఁ
తే. బరఁగుఁ గఠినాద్రి జడ లుఠ§జ్జరఠకమఠ,కూట కిటి గూఢచరణ ది§క్కోటికరటి
కుటిలతా సహ భూసౌఖ్య § ఘటనభూరి,భుజబలవిహారి యార్వీటి§బుక్కశౌరి.28

అ. ధామమనఁగా ప్రతాపమును గృహమును. 'గృహదేహత్విట్ప్రభావాధామాని' అ. తన భవ్యధామంబు = తన శుభకరమయిన ప్రతాపము, తన భవ్యధామంబు కరణిన్ = తన శుభకరమయిన గృహమువలె=(మిత్త్రుఁడనఁగా సూర్యుఁడును బంధువును. 'మిత్త్రంసుహృదిమిత్త్రోఽర్కః' విశ్వ.) మిత్త్ర + ఉన్మేషకరము = సూర్యునకు ప్రకాశము గలిగించునదియని ప్రతాపపరమైన యర్థము. బంధులకు వికాసము గలిగించునది యని గృహపరమైన యర్థము.

ధర్మమనఁగా ధనుస్సును న్యాయమును ; గుణమనఁగా నారియును గుణమును; 'ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోఃక్రతౌ' । ఉపమాయా మహింసాయాం చాపే' విశ్వ. 'మౌర్వ్యాం ద్రవ్యాశ్రితే సత్త్వశుక్ల సన్ధ్యాదికే గుణః' అమ. తన ధర్మగుణములు=తనయొక్క చాపమునల్లెత్రాళ్లు, తన ధర్మగుణములట్లు=తన న్యాయగుణములవలె, శ్రుతియనఁగా కర్ణమును వేదమును 'వేదే శ్రవసిచ శ్రుతిః' అమ. అతులిత... గతులన్—అతులిత=సమానరహితమగు నట్టులుగా, శ్రుతిమార్గ గతులన్=శ్రవణమార్గ ప్రవర్తనముల చేత, ఎసఁగన్=ఒప్పుచుండఁగా, అని అల్లెత్రాటి పరమయిన యర్థము. వేదమార్గ ప్రవర్తనముల చేత నొప్పుచుండఁగా నని న్యాయగుణ పరమయిన యర్థము.

ఆహవమనఁగా యుద్ధము. హవమనఁగా యజ్ఞము 'ఆజ్ఞాహ్వానాధ్వరాహవాః' అమ. తన మహాత్ +ఆహవదీక్ష=తనయొక్క అధికమయిన యుద్ధదీక్ష, తన మహాత్ +హవదీక్ష పగిదిన్=తనయుత్కృష్టమయిన యజ్ఞదీక్షవలె,(అవనీపకులనఁగా-రాజులు.వనీపకులనఁగా యాచకులు. పెంపు అనఁగా క్షయమును వృద్ధియును,) నానా= పెక్కుండ్రయిన, అవనీపకులన్=రాజులను, పెంపన్=నాశము నొందించు చుండఁగానని యుద్ధదీక్షాపరమయిన యర్థము. సమస్త యాచకులను వృద్ధిఁ బొందించు చుండఁగా నని యజ్ఞదీక్షాపరమయిన యర్థము. ఇక్కడ పెరుఁగు ధాతువు ప్రేరణమగు పెంచు వృద్ధ్యర్థకము; పెరుగుధాతు ప్రేరణమగు పెంచు క్షయార్థకము. పూసలదారము పెరిగిపోయిన దనఁగా సన్నగిలి పోయినదని యర్థము.

అంబకములనఁగా బాణములును నేత్రములును. 'అమ్బకం నేత్రశరయోః' విశ్వ. తన యంబకంబులు=తన బాణములు, తన యంబకములట్లు=తన నేత్రములవలె, పరులనఁగా శత్రువులును అన్యులును. భీరువనఁగా భయశీలుఁడును స్త్రీభేదమును. పరభీరు=శత్రులలో భయపడు వాండ్రవలన, విముఖతన్ = పెడమొగము కలిగియుండుటచేత—ఎదుర్కొనక మార్మొగముకలిగి తిరుగుటచేత, పరిఢవిల్లన్=ఒప్పుచుండఁగా, నని బాణపరమైన యర్థము. పరస్త్రీపరాఙ్ముఖత్వముచేత నొప్పుచుండఁగా నని నేత్రపరమయిన యర్థము.

కఠినాద్రి... విహారి—కఠిన=కర్కశములయిన, అద్రి=పర్వతముల యొక్కయు, జడలుఠత్ జరఠకమఠ—జడమనఁగా మాంద్యమును జలమును. లడకలభేదము. జడ=మాంద్యములోనని యర్థము.

ఇట జడశబ్దము భావప్రధాన నిర్దేశము-జలములోనని భావము. లుఠత్=పొర్లుచుండు, జరఠకమఠ=ముది కూర్మముయొక్కయు, కాపట్యముగల వరాహమని యర్థము. నిజమునకు వరాహము గానివాఁడని భావము. కూటకిటి=కపట వరాహముయొక్కయు, గూఢ చరణ=గూఢ చరణుఁడనఁగా కపటమయిన నడవడి గలవాఁడును సర్పమును గనుక-గూఢ ప్రచారముగల శేషాహియొక్కయు, దిక్కోటికరటి=దిక్కుల తుదలందుండు ఏనుఁగులయొక్కయు - దిగ్గజముల యొక్కయని యర్థము. దిక్కుల మూలలం బనికిమాలి పడియుండు నేనుఁగులయొక్క యనిభావము. కుటిలత=కుటిలత్వమును—అనఁగా క్రూర భావమును. అసహ=సహింపని, భూ=భూ దేవికి, సౌఖ్య=సుఖమును, ఘటన=పొందించునట్టి, భూరి=అధికమయిన, భుజబల=బాహుబలము చేత, విహారి=విహరించువాఁడు—తన భుజబలము చేత భూదేవిని దాల్చి జరఠ కమఠాదులవలని క్రూరత్వము దానికిఁ గలుగకుండునట్లు చేసినవాఁ డనుట—అనఁగా కులపర్వతములు మొదలయినవాని పరిస్పందము లేకుండ భూభారమునంతయుఁ దన బాహుబలము చేతనే భరించియుండువాఁడని భావము, అగు. ఆర్వీటి బుక్కశౌరి=ఆర్వీడను రాజధాని కధిపతియైన బుక్కరాజు, పరఁగున్=ప్రవర్తిల్లుచుండును.

కమఠకిట్యాదులకు జరఠకూటాదివిశేషణములు తత్కుటిలతా ప్రయుక్తమయిన యసహ్యతకుఁ గారణములు. మఱియు నిచట 'తన భవ్యధామంబు కరణి' నని యిత్యాదులం దుపమానోపమేయములు రెండును బ్రకృతములే యగును, గనుక, సముచ్చయోపమయని కొందఱ మతము. మొదటి నాలుగు చరణములందును ధర్మసామ్యము శ్లేషకృతము గనుక నుపమగాదు శ్లేషమని కొందఱమతము. 'నానావనీపకులు' 'మహాహవదీక్ష' యనుచో శబ్దశ్లేషము. భవ్యప్రతాప ధనుర్గుణాదుల యుక్తేషము నిఖిల భూభారభరణ రూపార్థమును హేతువయి సమర్థించుటవలన వాక్యార్థహేతుక కావ్యలింగము. కమఠాదులకు జరఠత్వాది విశేషణములు కౌటిల్యా సహనమునకు హేతువులుగనుక నిది పదార్థహేతుక కావ్యలింగము. 'తనది వ్యధామంబు తన దివ్యధామంబు' కరణి నిత్యాదులందు ఛేకానుప్రాసమును, కఠినాద్రీత్యాదులందు తకార టకారముల అసకృదావృత్తి చేత వృత్త్యనుప్రాసమును శబ్దాలంకారములు.

తా. సుగమము.

క. ఆబుక్కనృపతి కతుల భు,జా బందీకృత మదాంధశత్రురమావే
ణీబంధవిలస దసిధా,రాబంధురుఁ డయినరామరాజు జనించెన్. 29

అ. ఆబుక్కనృపతికిన్=ఆ బుక్కరాజునకు, అతుల...బంధురుఁడు—అతుల=సమానరహితమయిన, భుజా=బాహువునందు, బందీకృత=చెఱఁబెట్టఁబడినదయిన, మదాంధ=మదము చేతఁ గన్ను గానకయున్న, శత్రు=శత్రురాజులయొక్క, రమా=రాజ్యలక్ష్మియొక్క, వేణీబంధ=జడయోయన్నట్లు, విలసత్=ప్రకాశించుచున్న, అసిధారా=కత్తివాదర చేత, బంధురుఁడు=మనోజ్ఞుఁడు, అయిన, రామరాజు = రామరాజనెడు కుమారుఁడు, జనించెన్=పుట్టెను. ఖడ్గము చేత శత్రురాజులను జయించి వారి రాజ్యలక్ష్మినెల్లఁ గయికొన్నాఁడని భావము.

ఇందు ఖడ్గధారను చెఱఁబెట్టఁబడిన రాజుల రాజ్యలక్ష్మియొక్క వేణీబంధముగా నుత్ప్రేక్షించినాఁడు గనుక వస్తూత్ప్రేక్ష యలంకారము. అసియొక్క 'ధార'వలె వేణియొక్క 'బంధ'ము. అసిధారచే భయంకరుఁడు గాక 'బంధురుఁ' డగుట అది వేణిబంధమో యని తోఁచుటంబట్టి. శత్రులను 'మదాంధు'లను జేసినట్టి రమ కడుసొంపయినదియే కావలయును. 'వేణి'చే యౌవనము స్ఫురితము.

కాన సొంపయిన యువతీమణివేణిని బట్టుట పురుషునియందు 'బంధుర'ము. మదాంధులగు శత్రుల రాజ్యలక్ష్మిని బట్టిన భుజము గాన 'అతుల'ము.

తా. ఆబుక్కరాజునకు రామరాజనకుమారుఁడు పుట్టెను. అతనిఖడ్గధార యసమాన భుజబలముచేత మదాంధులయిన శత్రురాజులను గెలిచి చెంౘెట్టి గయికొన్నవారి రాజ్యలక్ష్మియొక్క జడరో యన్నట్లు వెలయుచుండెను.

సీ. ఏరాజు భూరితేజోరుణాలోకంబు, లోకంబుతమము నిరాకరించు
నేధన్యుబాహాధరాధరాభోగంబు, భోగంబు నవరించు భూమిసతికి
నేపుణ్యు నభిరూపరూపానుభావంబు, భావంబు గరఁగించు భామినులకు
నేభవ్యు శుభకీర్తిశోభావిహారంబు, హారంబు దశదిశాయాతమున

తే. కతఁడు మతిమంతుఁ డతికాంతుఁ డరికృతాంతుఁ
డనుపమస్వాంతుఁ డాశ్రితవనవసంతుఁ
డనఘుతర కందనోలిమహాపురీ నిశాంతుఁ డగురామ మేదినీకాంతుఁ డలరు.

అ. ఏరాజు = ఏప్రభువుయొక్క, భూరి...లోకంబుల్ - భూరి = అధికమయిన, తేజః= ప్రతాపమనెడి, అరుణ = సూర్యునియొక్క, ఆలోకంబు = ప్రకాశము, లోకంబు తమము = లోకముయొక్క చీఁకటిని, నిరాకరించుల్ = నిరసించునోయని యర్థము - తమమనఁగా శోకమునగునుగాన లోకముయొక్క శోకమును బోఁగొట్టునోయని భావము. ('మిహిరారుణ పూషణః' అమ. 'రాహౌ ధ్వాన్తేగుణే శోకే తమశ్శబ్దోఽభిధీయతే' విశ్వ) ఏధన్యు...భోగంబు — ఏధన్యు = ఏకృతార్థునియొక్క, బాహా=భుజమనెడి, ధరాధర=ఆదిశేషునియొక్క, ఆభోగంబు=పరిపూర్ణత్వము - నిండుపడగల యాదిశేషుఁడనుట. దీనిచే బాహులదీర్ఘత్వ భూభారధురీణత్వాదులు ధ్వనితములు. భూమిసతికిల్=భూకాంతకు, భోగంబుల్ = సుఖమును, నవరించుల్ = ఒనగూర్చునో. ఏపుణ్యు...భావంబు---ఏపుణ్యు=ఏపుణ్యాత్మునియొక్క, అభిరూప=మనోహరమయిన, రూప = చక్కఁదనముయొక్క, రూపమనఁగా

'అఙ్గాన్యభూషితాన్యేవ ప్రక్షేపాద్యై ర్విభూషణైః ।
యేన భూషితవ ద్భాన్తి తద్రూపమితి కథ్యతే॥'
'ఆవేధ్యారోప్య విక్షేప్య బన్ధనీయై రభూషితమ్ ।
యదఙ్గంభూషిత మివాభాతి తద్రూప మితికథ్యతే॥'

అనుభావంబు=ప్రభావము, 'అనుభావః ప్రభావేచ' అమ. భామినులకుల్ = స్త్రీలకు, భావంబుల్=మనస్సును, కరఁగించునో. ఏభవ్యు...విహారంబు---ఏభవ్యు = ఏయోగ్యునియొక్క, శుభ=శుభకరమయిన, కీర్తి=యశస్సుయొక్క, శోభా=కాంతియొక్క, విహారంబు=ప్రచారము, దశదిశాయాతమునకుల్ = పది దిక్కులనెడి యువతీ సమూహమునకు, హారంబు = ముత్యాలహారమో - ముత్యాలహారమువలె నుండునో యనుట.

అతఁడు=అట్టి, మతిమంతుఁడు=బుద్ధిమంతుఁడయినవాఁడును, అతికాంతుఁడు=మిక్కిలి కాంతిగుణము గలవాఁడును, అరికృతాంతుఁడు = శత్రువులకు యముఁడయినవాఁడును, అనుపమస్వాంతుఁడు = ఉపమానరహితమయిన మనస్సుగలవాఁడును, ఆశ్రితవనవసంతుఁడు = ఆశ్రితులనెడు వనములకు వసంతర్తువయినవాఁడు - వసంతర్తువు వనములను పల్లవపుష్పాది సమృద్ధిగలిగించి శోభిల్లఁజేయు

నట్లు, తాను నాశ్రితులకు సకలసంపత్సమృద్ధి గలిగించి శోభిల్లఁజేయువాఁడనుట, అనఘ...నిశాంతుఁడు—అనఘ తర = మిక్కిలియు దోషరహితమయిన, కందనోలి మహాపురీ = కందనోలనెడు మహాపట్టణమే, నిశాంతుఁడు = నివాసముగాఁ గలవాఁడును, అగు, రామ మేదినీకాంతుఁడు=రామరాజు, అలరుఁ=ఒప్పుచుండును. ఇందుఁ దేజోబాహాదులు సూర్యశేషాదులుగా రూపితములగుటచే నలంకారము రూపకము ప్రతిపాదము నెఱుంగునది. అవి పరస్పర నిరపేక్షములగుటచేఁ దిలతండుల న్యాయమున సంసృష్టి. ఛేకానుప్రాసము శబ్దాలంకారము.

తా. ఏరాజు నధిక ప్రతాపమనెడి సూర్యప్రకాశము లోకము తమమును (చీఁకటినని యర్థము శోకమునని భావము) నిరాకరించునో, ఏకృతార్థుని బాహువనెడి యాదిశేషుని నిండుపఱుపు, భూదేవికి సుఖముగూర్చునో, ఏపుణ్యాత్ముని సుందరమయిన రూపంపుఁ బెంపు చెలువల మనస్సును గరంగించునో, ఏ భాగ్యుని శుభకీర్తికాంతిప్రసారము, పది దిశలనెడి యువతులకు ముత్తెపుహారమువలె నుండునో, యట్టి బుద్ధిమంతుఁడును, మిక్కిలి కాంతుఁడును, శత్రులకు యముఁడయినవాఁడును, సాటిలేని గొప్పమనస్సుగలవాఁడును, ఆశ్రితులనెడి వనమునకు వసంతుఁడయినవాఁడును, మిక్కిలియు దోషరహితమయిన కందనోలి మహాపట్టణము వాసస్థానముగాఁగలవాఁడునగు రామరాజొప్పుచుండును.

శా. ఆరామ క్షితిభర్తకుం బ్రథిత సత్యాలాప ధర్మోద్భవ
శ్రీరమ్యుం డగుతిమ్మరాజు, బలలక్ష్మీధామ భీమప్రథా
పారీణుం డగుకొండశౌరి, విజయప్రఖ్యాతచారిత్రుఁ డౌ
శ్రీరంగేంద్రుఁడుఁ, గల్గి రైందవకుల క్షేమంకరాకారులై. 31

అ. ఆరామక్షితిభర్తకు = ఆరామరాజునకు, ప్రథిత ... రమ్యుండు—ప్రథిత = ప్రసిద్ధమయిన, సత్య + ఆలాప = సత్యవచనముగల, ధర్మోద్భవ = ధర్మరాజుయొక్క, శ్రీ = శోభచేత, రమ్యుండు = ఒప్పుచున్నవాఁడు — అనఁగా ధర్మరాజే, అగు, తిమ్మరాజు = తిమ్మరాజును అని యర్థము. ప్రథిత=ప్రసిద్ధమయిన, సత్యాలాప = సత్యము పలుకుటయనెడు, ధర్మ = ధర్మమువలన, ఉద్భవ = పుట్టిన, శ్రీ = సంపదచేత, రమ్యుఁడు = ఒప్పుచున్నవాఁడని యర్థాంతరము. బల...పారీణుఁడు—బలలక్ష్మీ = బలసమృద్ధికి, ధామ = స్థానభూతుఁడయిన, భీమ = భీమునియొక్క, ప్రథా= ప్రసిద్ధియందు, పారీణుండు = దరిముట్టినవాఁడు - భీముని పూర్ణప్రసిద్ధిని బొందినవాఁడనుట—అనఁగా భీముఁడే, అగు, కొండశౌరి = కొండలరాయఁడని యర్థము. బలసమృద్ధికి స్థానభూతులయిన వారలకు, భీమ = భయంకరమయిన, ప్రథా = ప్రసిద్ధియందు, దరిముట్టినవాఁడని యర్థాంతరము. బలసమృద్ధి పరిపూర్ణముగాఁ గలవారికిఁగూడ మహాబలవంతుఁడని భయంకరమయిన పూర్ణప్రసిద్ధిఁబొందిన వాఁడనుట. విజయప్రఖ్యాత చారిత్రుఁడు—విజయ = అర్జునునియొక్క, ప్రఖ్యాత = ప్రసిద్ధమయిన, చారిత్రుఁడు = చరిత్రములుగలవాఁడు - అనఁగా అర్జునుఁడే, అగు, శ్రీరంగేంద్రుఁడు = శ్రీరంగరాజును, విజయప్రతిపాదకములయిన ప్రసిద్ధచరిత్రలు గలవాఁడని యర్థాంతరము. ఐందవకుల... కారులై—ఐందవకుల=చంద్రసంబంధియైన వంశమునకు - చంద్రవంశమున కనుట, క్షేమంకర = సుఖకరములయిన, ఆకారులై = రూపముగలవారై - ఇది ధర్మరాజ భీమార్జునులకును, తిమ్మరాజ కొండలరాయ శ్రీరంగరాజులకు ముప్వురకును సాధారణమగు విశేషణము, కలిగిరి= పుట్టిరి.

సత్యాలాపబలలక్ష్మీవిజయముల చేత చంద్రవంశమునకు క్షేమంకరులయిరని యాశయము. క్షేమంకర- 'క్షేమప్రియమద్రేఽణ్చ' అని ఖచ్ప్రత్యయము. 'అరుర్ద్విషదజన్తస్యముమ్' అని ముమాగమము.

ఇందు శ్లేషయును, సత్యలాపాది హేతుగర్భవిశేషణముల చేత ఇందుకుల క్షేమంకరత్వమును సమర్థించుటచేత పదార్థహేతుక కావ్యలింగము నలంకారములు.

తా. ఆరామరాజునకు సత్యవచనుం డని వాసికెక్కి ధర్మసంపన్నుఁడగు తిమ్మరాజును, బలసంపన్నులగువారికిఁగూడ మహాబలవంతుఁడని భయంకరమగు ప్రసిద్ధినిగాంచిన కొండలరాయఁడును, విజయములచేఁ బ్రఖ్యాతుఁడైన శ్రీరంగరాజును, ధర్మరాజభీమార్జునులవలెఁ జంద్రవంశమునకు క్షేమంకరులై యుదయించిరి.

శా. ఆరాజత్రితయంబులో నసమబాణారాతి విజ్ఞాతదో
స్సారుం డాత్తసుభద్రుఁ డర్జునగుణశ్లాఘ్యుండు నై పొల్చు నా
శ్రీరంగేంద్రుఁ డశేషరాజ్యపదవీ సింహాసనాక్షీణ ల
క్ష్మీరాజ న్నిజసంతతిప్రథితుఁడై మించెన్ ధరామండలిన్. 32

ఆ. ఆరాజత్రితయంబులోన్ = క్రిందచెప్పఁబడిన యాముగ్గురురాజులలోపల, నిర్ధారణషష్ఠి, అసమ...సారుండు—అసమబాణ=మన్మథునికి, అరాతి=శత్రువయిన రుద్రునిచేత, విజ్ఞాత=ఎఱుఁగఁబడిన, దోస్సారుండు=భుజబలము గలవాఁడని యర్థము. బోయవేషమున శివుఁ డర్జునునితో పోరాడి యతనిబల మెఱుంగుట ప్రసిద్ధము. అసమ = సమానరహితములయిన, బాణ = బాణములుగలిగిన, అరాతి = శత్రువులచేత, విజ్ఞాత=ఎఱుఁగఁబడిన, దోస్సారుఁడు = భుజబలముగలవాఁడని భావము. అసమానములయిన బాణములుగల మహాశక్తిమంతులగు శత్రువులకే యతని భుజబలము తెలియునుగాని యల్పులకుఁ దెలియరాదనుట. ఆత్తసుభద్రుఁడు = పొందఁబడిన సుభద్రగలవాఁడును-పొందఁబడిన మంచి శుభములు గలవాఁడని భావము. అర్జున...శ్లాఘ్యుండు — అర్జునగుణ = అర్జునుని గుణములచేత, శ్లాఘ్యుండు = కొనియాడఁదగినవాఁడు--అనఁగా అర్జునుఁడే యని యర్థము. అర్జునశబ్దము నిర్మలార్థకము నగుటవలన, నిర్మలములయిన గుణములచేతఁ గొనియాడఁదగినవాఁడని భావము. ఐ = అయి, పొల్చు + ఆ - శ్రీరంగేంద్రుఁడు = ప్రకాశించుచున్నయాశ్రీరంగరాజు, అశేష...ప్రథితుఁడై—అశేష = సమస్తమయిన, రాజ్య = రాజ్యములయొక్క, పదవీ=వైభవముతోఁగూడిన, సింహాసన=సింహాసనసంబంధియైన, అక్షీణ=క్షీణముగాని, లక్ష్మీ=సంపదచేత, రాజత్ = ప్రకాశించుచున్న, నిజసంతతి = తన సంతతిచేత — అనఁగా పరీక్షిత్తుమొద లయినవారిచేత నని యర్జునపరముగాను తనసంతతిచేత నని శ్రీరంగరాజపరముగాను తెలియునది. ప్రథితుఁడై = ప్రసిద్ధుఁడై- ధర్మజభీమార్జునులలో అర్జునునిసంతతి రాజ్యసింహాసనాధిపత్యమునకు అంకురమయి నిలిచినట్లు ఆముగ్గురురాజులలోను శ్రీరంగరాజు సంతతిమాత్రమే రాచటికమునకు నిలిచినదని తాత్పర్యము. ధరామండలిన్ = భూమండలమందు, మించెన్ = అతిశయించెను.

శివవిజ్ఞాతదోస్సారత్వాదు లర్జునునిగుణములు. శత్రువిజ్ఞాతదోస్సారత్వాదులు శ్రీరంగరాజగుణములు. వానికిని రాజగుణములకును శ్లేషమూలకమయిన యభేదాధ్యవసాయము. అశేషరాజ్యపదవీ సింహాసనమును సంబంధించినదగుటచే లక్ష్మి 'అక్షీణ'మైనది. అట్టిలక్ష్మిచే రాజిల్లు సంతతిగలవాఁ డగుటచే 'ప్రథితుఁడయి మించుట' అర్జునగుణ శ్లాఘ్యుండునై యన్నచో నువర్ణకము. అర్థవిశేషద్యోతనమందును, అప్రకృతపరమైన తదభావద్యోతనమందును చెప్పఁబడినది.

శ్లో॥ 'యువర్ణకస్స్యాద్వ్యాప్తాత్తు నువర్ణక ఉతోభవేత్ ।
ద్యోతకావర్థభేదస్య చాన్యత్రాపి క్వచిద్భవేత్ '
(యాప్తాత్=ఇకారాకారాన్తాత్. అన్యత్రాపి=అర్థవిశేషాభావేపి.) అథర్వణ.

ఆముగ్గురు రాజులలో, అసమానదానశక్తులగు పగవారికి తెలియు బాహుబలముగలిగి, సమస్తశుభములనొంది, నిర్మలగుణములచేఁ గొనియాడఁదగినవాఁడగు శ్రీరంగరాజు, అర్జునునివలె తనసంతతివారు సమస్తరాజ్యముల నేకచ్ఛత్రముగాఁ బాలించుచు నక్షయ మయినసంపత్తిగలవారై వెలయుచుండుట వలనఁ దాను మిక్కిలియుఁ బ్రసిద్ధినొంది భూమండలమునం దతిశయించినవాఁ డయ్యె.

శా. క్షోణీవిశ్రుత నిత్యదాన నిధియై సొం పొందు శ్రీరంగరా
ట్పాణిం బాయనిసత్కృపాణి యదనం బ్రత్యర్థి దానైక పా
రీణం బౌ టరుదే తదీయకరతాదృక్ఖడ్గ విద్ధాహిత
శ్రేణుల్ మున్నుగఁ గర్ణఖేచరవితీర్ణిప్రౌఢిఁ బాటింపఁగన్. 33

అ. క్షోణీ...యై—క్షోణీ=భూమియందు, విశ్రుత = ప్రసిద్ధమయిన, నిత్య = ఎడతెగని, దాన = దానమునకు, నిధియై = స్థానమై, సొంపొందు...పాణిన్ - సొంపొందు = చక్కనగుచున్న, శ్రీరంగరాట్ = శ్రీరంగరాజుయొక్క, పాణిన్ = హస్తమును, బాయని = ఎడఁబాయకుండునట్టి, సత్కృపాణి = శ్రేష్ఠమయిన ఖడ్గము, అదనన్ = సమయమందు, ప్రత్య...పారీణంబు—ప్రత్యర్థి = ప్రతియాచకుని విషయమైన, దాన = త్యాగమందు, ఏక = ముఖ్యముగా, పారీణంబు = తేఱుగడదైనది, ఔట = అగుట, అరుదే = ఆశ్చర్యమా - అనఁగా ఆశ్చర్యము గాదనుట. ప్రత్యర్థి= శత్రువులయొక్క, దాన=ఖేదనమందు, పారీణమయినదని భావము. 'దానంగజమదే త్యాగే పాలన (ఖేదన) చ్ఛేద శుద్ధిషు' విశ్వ. 'అభియాతి పరారాతి ప్రత్యర్థి పరిపన్థినః' అమ. శ్రీరంగరాజు నిత్యదాననిధి యైనపాణిని బాయకుండుటచే కృపాణి తానును దానైకపారీణ యైనదని చమత్కారము. తదీయ...శ్రేణుల్—తదీయకర = ఆశ్రీరంగరాజు హస్తమందలి, తాదృక్ఖడ్గ= అటువంటిదయిన ఖడ్గముచేత, విద్ధ = వేధింపఁబడిన - గ్రుచ్చంబడిన, అహితశ్రేణుల్ = శత్రుసమూహములు, మున్నుగన్ = మొదలుగా - శత్రులుకూడననుట, కర్ణఖేచరవితీర్ణిప్రౌఢిన్ = కర్ణునివలెను ఖేచరునివలెను వితరణ సామర్థ్యమును, పాటింపఁగాన్ = పూనఁగానని యర్థము - భయపడి లోఁపడినవారు కర్ణునివలె అర్థమును, మాఱ్కొనినాతులైనవారు ఖేచరునివలెఁ బ్రాణములును నిచ్చెదరనిభావము. కర్ణుఁడు దానమునం బ్రసిద్ధుఁ డగుటయు, ఖేచరుఁడనువాఁడు సర్పనగరమం దొకానొకనాగకుమారుని మాఱుగా గరుత్మంతున కాహారమై ప్రాణత్యాగము సేయఁ బూనుటయుఁ బురాణప్రసిద్ధము.

నిత్యదాననిధియైన రాజహస్తమునెడఁబాయని ఖడ్గము దానైక పారీణమాట యేమివింత! అట్టి ఖడ్గముచేత విద్ధులయిన శత్రువులు సహితము వితరణ (దాన) ప్రౌఢిని బూనిరని యర్థము. కృపాణ శబ్దము జాతివాచకము గనుక 'జాతేర స్త్రీవిషయాదయోపధాత్' అను సూత్రముచేత జీష్. ఇది ఈకారాంత స్త్రీలింగమయ్యె, అమహత్తుగాన 'ఉభయవిధమమహతీనామ్' అను సూత్రముచే దీనికి 'దానైకపారీణం'బను నపుంసక విశేషణము చెల్లుచున్నది. అదనుశబ్ద మాపగిభక్తికాంతమగుటచే 'అదనన్' అనిరైనది. ఇందు మూఁడవపాదమున రేఫమునకు బుకారవిశ్రమము చెప్పఁబడెను. ఇదియే బువడి.

ఇట రాజ పాణిగత దాతృత్వగుణము తన్నిష్ఠమగు ఖడ్గమునందును తద్విద్ధులగు శత్రురాజులందును ఉల్లసితమయ్యెగనుక నుల్లాసమలంకారము శ్లేషానుప్రాణితము. కృపాణియను స్త్రీలింగస్వారస్యముచేత వ్యంజితయగు నాయిక శ్రీరంగరాజుపాణిం బాయని దనుటచే అతని నెడతెగక చెట్టపట్టియుండున దనియు, పత్ని పతికి సహధర్మచరి గనుక నతఁడు నిత్యదాననిధి కాఁగాఁ

దాను పతినివలెనే దానైకపారీణ యైనదనియు, పతివ్రతలకుఁ బతిధర్మానుసరణ మెంతవింతగా దనియు నప్రస్తుత పతివ్రతావిషయము స్ఫురించుటచే సమాసోక్తియు, కృపాణిచే విద్ధులగువారును దానప్రౌఢి చూపఁగా కృపాణి దానపారీణయగుట చెప్పనేల యని కైముతికన్యాయమువలన అర్థాపత్తియు. అలం.

తా. భూమియందు నిత్యమును దానము సేయుటయందుఁ బ్రసిద్ధిగాంచి మించు శ్రీరంగరాజు హస్తమును నెపుడును బాయకుండుటచే మేటిఖడ్గమును సమయమువచ్చినపుడు ప్రత్యర్థులకు ( యాచకులకని యర్థము - శత్రువులకని భావము.) దానము (త్యాగమని యర్థము - ఛేదనమని భావము.) సేయుట యందుఁ దేఱుగడయైనదగుట యొకవింత కాదు. ఏలనఁగా దానిచే విద్ధులయిన శత్రువులుగూడ నర్థములను బ్రాణములను నొసంగి కర్ణునివలెను ఖేచరునివలెను దానసామర్థ్యము నెఱపుచున్నారు.

సీ. వెస విభీషణరాజ్యవిముఖుఁడై, సహ్యభూ,వలయంబుఁ జేకొని నిలువఁడేని
సప్తసాలాంతరస్థాయియై నిదురించు, తఱిని జాగరణంబు దాల్పఁడేని
శ్రుతిదూరభోగసక్తత విజ్ఞవీఁగి తాఁ,జరణ మగ్రజుదెసఁ జాఁపఁడేని
యలరారుసిరిఁ దన యడుగునఁగూర్చి గ,ట్టిగ నీగిచేయి మాటికొనఁడేని
తే. రమణఁ బ్రతిసేయవచ్చు శ్రీరంగశౌరి, భయదరిపుపురహారి నిర్భయవిహారి
యార్యసత్కారకారి యౌదార్యవిభవ,ధారియై మించుశ్రీరంగశౌరి కెపుడు.

అ. ఇందు శ్రీరంగశౌరి అనఁగా శ్రీరంగనాథుఁడు. శ్రీరంగశౌరికి ననఁగాఁ బూర్వోక్తుఁడయిన శ్రీరంగరాజు. శ్రీరంగనాథుఁడు శ్రీరంగరాజుతో నామసామ్యము కలిగియున్నను గుణసామ్యము లేవందున సమానుఁడుగాఁడని చెప్పుచున్నాఁడు—వెస...విముఖుఁడై—వెసన్ = శీఘ్రముగా, విభీషణ రాజ్య = భయంకరులయిన శత్రువులరాజ్యములవలన, విముఖుఁడై = మొగము త్రిప్పుకొన్నవాఁడై— ఎదిరించిపోఁజాలనివాఁడై యనుట, సహ్యభూవలయంబు = తనకు సహింపను దగినంత భూవలయమును - అనఁగాఁ దనజీవనమునకును శక్తికిని దగినంతమాత్రపు భూమిని, చేకొని = గ్రహించి, నిలువఁడేని = అందులోనే నిలిచి కాలముగడపకపోయెనేని యనియర్థము. విభీషణరాజ్యమనఁగా లంక, అందులకుఁ బోకున్నవాఁడనియు సహ్యభూవలయమనఁగా సహ్యపర్వతమువలనఁ బుట్టిన కావేరియొక్క వలయము. రెండుప్రక్కలఁ గావేరి వలయముగాఁ జుట్టుకొనియున్న శ్రీరంగక్షేత్రమును బరిగ్రహించి నిలిచియున్నవాఁడనియు - అనఁగా ఉభయకావేరిమధ్యమున నెలకొనియున్న వాఁడనియు భావము. 'సహ్యంచ తత్ భూవలయంచ' అని యర్థమునను 'సహ్యాత్ పర్వతవిశేషాత్ భవతీతి సహ్యభూః కావేరీ. తస్యావలయః సహ్యభూవలయః' అని భావమునను విగ్రహము తెలియునది. 'సహ్యశైలాన్తరారోగ్య సౌధవ్యేషు ప్రచక్షతే' విశ్వ.

సప్త...దాల్పఁడేని—సప్తసాల=ఏడుకోటలయొక్క, అంతర = లోపల, స్థాయియై = ఉన్న వాఁడై, నిదురించుతఱిని = నిదురపోవురాత్రిసమయమున, జాగరణంబు తాల్పఁడేని = కన్నుమూయక నిద్రవోగించుచుండక పోయెనేని అని యర్థము - సప్తప్రాకారముల నడుమనున్నవాఁడనియు విగ్రహమూర్తి గనుక కన్నుమూయక యున్నాఁడనియును భావము. నిదురించుతఱి ననఁగా, చాతుర్మాస్యమందు జాగ్రదవస్థయైన యోగనిద్రను బొందినవాఁడనియుఁ జెప్పవచ్చును. యోగనిద్ర జాగ్రదవస్థ యనుటకు

శ్లో॥ శయ్యా యస్య ద్విషా శృణోతి భవతి ఛ్ఛన్దాంసి యద్వాహనం
లీలా యస్య జగన్తి కాలకలనా మూలంచ యల్లోచనమ్ ।
నిద్రా జాగ్రత ఏవ యస్య నిగమస్తోమా ఋతంసోత్పలం
వేదః పుష్యతు రఙ్గమఙ్గళనిధిః శ్రేయాంసి భూయాంసి వః॥
'నిద్రాముద్రాం నిఖిలజగతీరక్షణే జాగరూకామ్' భోజరాజు.

అనియుఁ బ్రమాణములు.

శ్రుతి...చాఁపఁడేని—శ్రుతిదూర=వేదములకు దవ్వయిన- వేదబాహ్యమయిన యనుట, భోగ= సుఖమందలి, సక్తతన్ = ఆసక్తిచేత, విఱ్ఱవీఁగి = గర్వించి, తాను, చరణము = కాలిని, అగ్రజు చెసన్=పూజ్యుఁడగు నన్నగారయిన యింద్రుని పంకకై, చాఁపఁడేనిన్=చాఁచి పరుండకపోయె నేని యనియర్థము—వేదబాహ్యమయిన సుఖములం దగిలినవాఁడు గనుక అన్నగారిప్రక్కఁ గాలుసాఁచినాఁ డనుట. ఇట ఇంద్రావరజ శబ్దార్థము ననుసంధించినాఁడు. వామనావతారమున ఇంద్రునకుఁ దమ్ముఁడై కదా యదితికడుపునఁ బుట్టినాఁడు. శ్రుతిదూర = చెవులులేనట్టి శేషాహియొక్క, భోగ = శరీరము యొక్క, సక్తతన్ = సంపర్కముచేత, - -అనఁగా శేషునిదేహముపయిఁ బవళించుటచేత విఱ్ఱవీఁగి వాఁడనియుఁ దూర్పుదిక్కునఁ బాదములుచాఁపి పడమటిదిక్కు తలగాఁ బరుండినాఁడనియును భావము. 'భోగస్సుఖేధనేచాహేః శరీర ఫణయోర్మతః' అమ.

అలరారు...మాటికొనఁడేని--అలరారు = ఒప్పుచున్న, సిరి=ధనమును, తనయడుగునన్ కూర్చి= తనక్రిందదాఁచిపెట్టుకొని, గట్టిగన్ = దృఢముగా, ఈగిచేయి = దానమిచ్చుకుడిచేతిని, మాటికొనఁ డేని = ముడుఁచుకొని యుండకపోయె నేని యనియర్థము. సిరియనఁగాలక్ష్మి, లక్ష్మికిఁ బాదసేవ యొడఁ గూర్చినాఁడనియు కుడిచేయి తలక్రిందఁబెట్టుకొన్నాఁడనియును భావము.

భయద...ధారి---భయద = భయంకరులయిన, రిపు - శత్రులయొక్క, పుర = పట్టణములను, హారి = హరించువాఁడును, నిర్భయవిహారి = భయములేనట్లుగా - భయములేకయనుట, విహరించు వాఁడును, ఆర్య = పూజ్యులయొక్క, సత్కార = పూజను - సజ్జనులఁ బూజించుటననుట, కారి= చేయువాఁడును, ఔదార్యవిభవధారి = దానవైభవమును ధరించినవాఁడును - ఐ, మించు = అతిశయించుచున్న, శ్రీరంగశౌరికిన్ = శ్రీరంగరాజునకు, ఎపుడున్ = ఎప్పుడును, శ్రీరంగశౌరిన్ = శ్రీరంగనాథుని, రమణన్ = ఒప్పిదమగునట్లుగా, ప్రతిసేయవచ్చున్ = సాటిచేయవచ్చును- అనఁగా (భయద...హారి) భయంకరశత్రుపురములను హరించు నట్టివానికి - రాజునకనుట (విభీషణ...) భయంకరశత్రురాజ్యముల నెదుర్పలేక విముఖుఁడయినవాఁడును; (నిర్భయవిహారి) నిర్భయముగా విహరించువానికి (సప్త ..) ఏడుకోటలలోపలనుండియు భయముచేతఁ గన్నుమూయకుండువాఁడును; (ఆర్యసత్కారకారి) పూజ్యులయినవారికిఁ బూజసేయువానికి (శ్రుతి...) వేదబాహ్యుఁడయి పూజ్యుఁడగు నన్ననవమానించువాఁడును; (ఔదార్యవిభవధారి) వితరణ విభవముగలవానికి (అలరారు...) ధనము దాఁచిపెట్టుకొని యీవి చేయిముడుఁచుకొన్నవాఁడునగు శ్రీరంగనాథుఁడు సమానుఁడు కాఁడని తాత్పర్యము. యథాసంఖ్యమును, వర్ణ్యావర్ణ్యులగు శ్రీరంగరాజ శ్రీరంగనాథులకు శ్లేషమూలకముగ సామ్య మాపాదించి విరుద్ధధర్మములను జెప్పుటంబట్టి వ్యతిరేకమును, అలం. 'ఉపమానాద్యదన్యస్య వ్యతిరేకస్స ఏవసః' కావ్యప్రకాశము. ఇందు నుపమానినివృత్తికి హేతువు శ్లేషాధ్యవసితమై యున్నది. యదర్థము చేత [illegible]యర్థ మారోపించి మఱియొక యర్థమును గల్పించుటచేత వక్రోక్తి భేదమని

మతాంతరము. గీతియందు రివర్ణము పలుమాఱావర్తించుటచేత వృత్త్యనుప్రాసము శబ్దాలంకారము.

తా. సుగమము.

క. అమనుజేంద్రునకుఁ బురంధ్రీమణి యయి తిమ్మమాంబ శ్రీరామునకున్
భూమిజ సుత్రామునకుఁ బులోమజయునుబలె జగంబులలో నుతి కెక్కున్.

అ. అమనుజేంద్రునకున్ = ఆ శ్రీరంగరాజునకు, పురంధ్రీమణియయి = భార్యారత్నమై, తిమ్మమాంబ = తిమ్మమ్మయను నామె, అయ్య అమ్మ యిత్యాదులు నామపదములమీఁదను బరంబయి పరంబగు ఆర్య అంబాది పదములతో సమసించుట 'నన్నయార్యుఁడు' 'తిక్కమాంబ' యిత్యాదులం గనునది. శ్రీరామునకున్ = శ్రీరామస్వామికి, భూమిజ = సీతాదేవియు, సుత్రామునకున్ = దేవేంద్రునకు, పులోమజయునుబలె = శచీదేవియుఁబోలె, జగంబులో = జగత్తున, నుతికెక్కున్ = ప్రఖ్యాతికెక్కియుండును. శ్రీరామునకు సీతయు, దేవేంద్రునకు శచియుఁ బురంధ్రీమణులయినట్లు తిమ్మాంబయు నారాజునకుఁ బురంధ్రీమణి యయ్యెనని తాత్పర్యము. భూమిజ యనుటచే నేకపత్నీ ప్రావణ్యము పెంపును; పులోమజ యనుటచే నగ్రమహిషీత్వవైభవమును, దిమ్మమాంబకు వ్యంజితములు—'తిమ్మమాంబ' యనుచో

'ఆర్యాంబాదిక శబ్దాస్స్యు రత్ర శ్లేషత్వ గోచరాః ।
తత స్తద న్త శబ్దేభ్యస్సైవ శ్లేషత్వగోచరాః ॥' అధర్వణ.

అను వచనమువలన అంబాశబ్దముమీఁద అంబాశబ్దము కవిస్వాతంత్ర్యకృతమని తెలియునది. ఇందలంకార ముపమ. తా. సుగమము.

సీ. ధర యేయపాంసులతల సూపరాకుండఁ, దనకూర్మి ఱేని నప్పునను ముంచెఁ
గమల యేనిశ్చలత రమణు పేరెదకు మోఁపై నిల్చి యతని పేరడుగు పఱిచె
సతి యేయచండికత పతిఁ జట్టుకూఁతురై, జగడాలు పచరించి సగమొనర్చె
వాణి యేమితసూక్తి వదలదు తలవాకిలి నిజేశు మాటమోఁచె ననఁ జేసె

తే. ననుచు భూకాంత శ్రీకాంత హరునికాంత, నజునికాంతను నిరసించి యాసిరంగ
పార్థివునికాంత తిమ్మాంబ పతికిఁ గుశల, కీర్తి బలవృద్ధి నిర్మలస్ఫూర్తి లొసఁగు.

అ. ధర యేయపాంసుల — (పాంసులయనఁగా జారిణి. 'స్వైరిణీ పాంసు లాధస్యాత్' అమ. పాంసుల గానిది అపాంసుల - అనఁగాఁ బతివ్రత. అప్పు = అనఁగా సంస్కృత మైనపుడు జలమును, తెనుఁగయినపుడు ఋణమును, అప్పుశబ్దమునిత్యబహువచనాంతము 'అపః స్త్రీభూమ్ని వార్వారి' అమ. అయినను 'అప్పుపాలైన శుభ్రాబ్జంబురుచియెంత' ఇత్యాది ప్రయోగములంబట్టి యేకవచనాంతమును గలదు. కూర్మియనఁగా సంస్కృతమున (కూర్మశబ్దముమీఁద జీవ్విధింపఁగాఁ గలిగినరూపము గనుక) తాఁబేలు-అఁడుతాఁబేలనియు-తెనుఁగున మక్కువ, గారాము. కూర్మిఱేఁడనఁగా గారాబుపతి; ప్రాణేశ్వరుఁడని యర్థమును కూర్మరాజని విష్ణువునకు నామముగాన ఆదికూర్మమగు విష్ణువనిభావమును దెలియునది. ధర = భూదేవి, ఏయపాంసుల = ఏటి పతివ్రత—పతివ్రతగా దనుట. ఏలనఁగా—తల ...ముంచెన్—తలసూప రాకుండన్ = తలయెత్తుకొని తిరుగఁగూడకుండునట్లు, తన కూర్మిఱేనిన్ = తన గారాబు పతిని, అప్పునన్ = అప్పునందే, ముంచెన్ = ముంచివేసెను. అప్పులలోనే మునిఁగిపోవునట్లు చేసెనని యర్థము. పాంసువనఁగా దుమ్ము. అదిగలది పాంసుల. పాంసులగానిది అపాంసుల గనుక భూమి యేయపాంసుల-భూమియేటి పరాగరహితురాలనుట. అనఁగా పరాగసహితురాలే యనియును,

తన్ను ధరించిన కూర్మరాజును - అనఁగా అది కూర్మమును దలపయికిఁ గానరాకుండునట్లు అప్పునందే (అనఁగా నీటియందే) మునిఁగియుండునట్లు చేసెననియు భావము. "కూర్మమని చెప్పవలసినచోట 'కూర్మి తోడని చెప్పుట 'ప్రకృతానుపయుక్తార్థ మపుష్టార్థంతిదుచ్యతే' అని అపుష్టార్థదోషమును గలిగించినను శ్లేషముగనుక 'అపుష్టోఽర్థోపి సాధు స్స్యాద్యది చేతస్సుఖావహః" (అధర్వణ) అనువచనముంబట్టి సాధువుగా గ్రహించునది" అని సోమకవి.

కమల...అడుగుపఱిచె. పేరనఁగా నామమును పేరమును, అడుగుపఱుచుట యనఁగా రొమ్ము మాపుటయు క్రిందగునట్లు సేయుటయు. కమల=శ్రీదేవి, ఏనిశ్చల=ఏటి నిశ్చలురాలు, అనఁగా నిశ్చలురాలుగాదనుట, ఏలనఁగా—రమణుపేరెదకున్ = పెనిమిటియైన విష్ణువు విశాలమయిన రొమ్మునకు, మోపు, ఐ, నిల్చి=బరువగునట్లుగాఁ ద్రొక్కి నిలిచినదై, అతనిపేరు అడుగుపఱిచెన్=ఆయన పేరడఁగి పోవునట్లు చేసెనని యర్థము. లక్ష్మి యేనిశ్చలురా లనఁగా చంచలురాలేయనియు, పెనిమిటి వక్షస్థలమందు నిలిచి, యాతనిపేరును అనఁగా హారమును గ్రిందుపఱిచినదనియు, లేక లక్ష్మీనారాయణాదినామములందుఁ దనపేరు ముందుగాఁ బలుకఁబడుచున్నది గావున నాతని నామమును గ్రిందుపఱిచిన దనియు భావము. రొమ్ముద్రొక్కుట యనఁగా అవమానించుట, ఇందులకు

'జక్కవకవ రొమ్ముద్రొక్కి నిల్చినజాడ నున్నవి నవలాప యోధరము' లని విజయవిలాసము.

సతి...సగముచేసె—చండిక యనఁగా కోపముగలదియు పార్వతియు, జగడాలు అనఁగా కలహములును, జగ=గొప్ప, డాలు=కాంతియు, సతి=శివునికాంత, ఏయచండిక=ఏటి కోపములేనిది—ఉగ్రతలేనిది—అనఁగా ఉగ్రతగలదియే యనుట, ఏలనఁగా, పతిన్ = పెనిమిటియైన శివుని, చట్టు కూఁతురై = చట్రాతికిఁ బుట్టినదై — అనఁగా చట్రాయివలెఁ గఠినురాలై, జగడాలు పచరించి=జగడాలాడి, సగము చేసెన్=కృశించి సగమగునట్లు కావించెనని యర్థము. చండికానామము గలదియనియు, హిమవంతునిఁ గూఁతురయినదనియు, జగడా లుపచరించి యనఁగా మేలయిన కాంతిని గలుగఁజేసినదనియు పతిని అర్ధనారీశ్వరునిఁ గావించినదనియును భావము. 'శివా భవానీ రుద్రాణీ శర్వాణీ చణ్డికామ్బికా' అమ. 'జగ' అనుటకు 'జగమెఱుంగు దాని జగమెఱుంగు' విజయవిలాసము. 'జగా' రూపాం. జగాజిగి.

వాణి...జేసెన్—తలవాఁకిలి యనఁగా బయటివాకిలియు నోరును. మాటమోచుట యనఁగా వాగ్రూపయైన సరస్వతిని మోచుటయు నిందపాలగుటయు. వాణి=సరస్వతి, ఏమితసూక్తి=ఏటిమితభాషిణి—అనఁగా బహుభాషిణియనుట—వసరుఁబోతని యర్థము. వదలదు తలవాఁకిలి=బయటవాఁకిలి వదలక యందే నిలుచుండును. ('కులకన్యకలకు వేఁడుకఁ దలఁచీర్లన పరులతోడి తగుమాటలకుం, దలకొన నగునే' భార. అను. ౧-ఆ.) అని సాధ్వికి తలవాకిట నుండుటదగదు. నిజేశుని = తన పెనిమిటియైన బ్రహ్మను, మాటమోచెన్ = నిందపాలయ్యెను. అనంజేసి = అని జనులాడునట్లుగాఁ జేసెనని యర్థము. సరస్వతి యేటి మిత సూక్తియనఁగా, వాగ్రూపగనుక మితమైన సూక్తులుగలదిగాదు సకలోక్తిస్వరూపురాలే యనియు, తలవాకిట నే నిలుచుననఁగా నోటనే వర్తించునదనియు, తన పతిని మాటమోచువానిఁ జేసెననఁగా వాణీపతుఁ డనిపించెననియును భావము. 'మాటమోచిన యంచ తేట చెమంత' అనుచో మాటమోచుట కీరెండర్థములును బ్రయుక్తమై యున్నవి.

అనుచున్=ఇట్లు పలుకుచు, భూకాంతన్=భూదేవిని, శ్రీకాంతన్=లక్ష్మీదేవిని, హరునికాంతన్=పార్వతీదేవిని, అజునికాంతన్=సరస్వతీదేవిని, నిరసించి = తిరస్కరించి, అసిరంగ పార్థివుని

కాంత=ఆశ్రీరంగరాజుయొక్క భార్య, అగు, తిమ్మాంబ=తిమ్మమ్మ, పతికిన్ = పెనిమిటికి, కుశల...స్ఫూర్తులు—కుశల=క్షేమమును, కీర్తి=కీర్తిని, బలవృద్ధి = బలసంపత్తిని, నిర్మల స్ఫూర్తులు = మాలిన్యములేని స్ఫూర్తిని (తోఁచికను), ఒసఁగన్=కలుగఁజేయును.

భూదేవి పతిక 'అప్పునసెముంచె' ననుటచే అకుశలము చేసెననియు, లక్ష్మి 'పేరడుగుపటిచె' ననుటచే అపకీర్తి చేసెననియు, పార్వతి 'సగముచేసె'ననుటచే దౌర్బల్యము కలిగించెననియు, సరస్వతి 'మాటమాచెననఁజేసె' ననుటచే అప్రకాశము నొందించెననియు నాలుగుమొదటి చరణములం దోఁచుచున్నది. తిమ్మాంబ వారలఁ దిరస్కరించి పతికిఁదద్వ్యతిరిక్తములయిన కుశల కీర్తి బలవృద్ధి నిర్మలస్ఫూర్తులు గలుగఁజేసెనని తాత్పర్యము. ఇచట క్రమమును, శ్లేషకృతాభేదాధ్యవసాయమున నప్పునముంచుట మొదలయిన హేతువులం బచరించిభూమ్యాదులకుఁ బాంసులత్వాదులను సాధించుటచే అనుమానమును, భూకాంత మొదలగువారికిని దిమ్మమకును సామ్యముఁ జెప్పఁజాలి భేదము సాధించినందుచే వ్యతిరేకమును అలం. తా. సుగమము.

శా. చేతోజాత సమాన మూర్తి యగునాశ్రీరంగధాత్రీధవుం
డాతిమ్మాంబికయందుఁ గోనవిభుఁ దిమ్మాధీశు రామప్రభున్
భూతాశేషవిపక్షు శ్రీతిరుమలేంద్రున్ వేంకటాఖ్యాన
విఖ్యాతుం గాంచె సురద్రుమపంచకము నయ్యంభోధిరాజుంబలెన్. 87

అ. చేతోజాత సమానమూర్తి=మన్మథునికి సమానమయిన యాకృతి గలవాఁడు, అగు, ఆ శ్రీరంగ ధాత్రీధవుండు=ఆశ్రీరంగరాజు, ఆతిమ్మాంబికయందున్ = భార్యారత్నమయిన యాతిమ్మమ్మయందు, కోనవిభున్=కోనమరాజును, తిమ్మాధీశున్=తిమ్మరాజును, రామప్రభున్=రామరాజును, భూతాశేషవిపక్షున్—భూత = ఎగురఁ గొట్టఁబడిన—అవలీలఁ దఱుమఁ గొట్టఁబడినయనుట; అశేష విపక్షున్=సమస్త శత్రువులు గలిగిన, శ్రీ తిరుమలేంద్రున్=సంపద్యుక్తుఁ డయిన తిరుమల దేవరాయని, వేంకట ఆఖ్యాన విఖ్యాతున్ = వేంకటాద్రిరాయఁడను పేర ప్రసిద్ధుఁడయిన వానిని, సురద్రు పంచకము=కల్పవృక్షము లయిదింటిని, అయ్యంభోధి రాజుంబలెన్=అక్షీర సముద్రునివలెనే - అక్షీర సముద్రుఁ డయిదుకల్పవృక్షములనుగాంచి నట్లనుట. కాంచెన్=కనెను. ఇం దలంకార ముపమ.

తా. మన్మథసమానాకారుఁడయిన యాశ్రీరంగరాజు తన భార్యయైన యాతిమ్మమ్మయందు, కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, సమస్తశత్రులను బాఱఁదిమ్మిన తిరుమలదేవరాజు, వేంకటాద్రి యనెడి యేవురు కొడుకులను, పాలసముద్రుఁ డయిదు కల్పవృక్షములంబోలెఁ గాంచెను.

'అంభోధిరాజుంబలెన్' ఇట--["అంభోధిరాజున్" అని ద్వితీయైకవచనాంతము. 'బలెన్' అనునది సాదృశ్యవాచకమైన దేశ్యపదము. సాదృశ్యవాచకపదములు పరమందుండఁగా విభక్తివైచిత్ర్యము గలదు—'చందురుంబోని మొగము'; 'చంద్రుఁడుంబోని మొగము' ఇత్యాదులు"] సోమకవి 'బలెన్' 'పోలెన్' 'వలెన్' అనునివి ఇవార్థకములు. 'పోని' వదర్థకము. ఇందు మొదటిమూఁడును అవ్యయములు. నాలవదివిశేషణము. కవిత్రయ ప్రయోగములందు—ప్రథమాంతములకు 'బలెన్' 'పోని' 'పోలెన్' పరమగునపుడు వైకల్పికముగా 'ను' గాగమంబగును. పక్షంబున 'పోలెన్' కు అడాగమసరళాదేశాదులును 'పోని'కి దుబ్బర్ణకేతరముమీఁద సరళాదేశమును 'బలెన్' కు ద్రుతలోపము నగును—వాఁడుబోలె, వాఁడుపోలె, వృక్షమపోలె, హరియపోలె, సురకన్యవోని, వేల్పుబలె. ఇట అడాగమము అవధారణార్థము గాదు. 'వలెన్' పరమగునపుడు పూర్వపదముతోడ షష్ఠీసమాసమగును. కనుక ఉపమేయవాక్యమందలి 'శ్రీరంగ

ధాత్రీధవుండు' అన్నట్లు ఉపమానవాక్యమందు దానికి ప్రతియైన 'అంభోధిరాజు' ను ప్రథమాంతముగాఁ గొనుట యొప్పిదము. 'అంభోధిరాజుంబలెన్' అనుచో నిందున్న 'ను' గాగమమున కాదేశమైనది గాని ద్వితీయాప్రత్యయమునకుఁగాదు. కాన యిందు 'అంభోధిరాజు' ప్రథమైకవచనాంతమనుట యుపపన్నము.

క. అందగ్రజుండు రాజపు, రందరుఁ డన వెలసెఁ గోనరాజు నిజభుజా
సందీపితాసిభిదుర, స్పందనిపాతితమహావిపక్షోత్కరుఁ డై. 38

అ. అందున్ = ఆకుమారులలో, అగ్రజుండు = పెద్దవాఁడయిన, కోనరాజు = కోనమరాజు, నిజ...త్కరుఁడై---నిజ = తన, భుజా = బాహువునందు, సందీపిత = మిక్కిలి ప్రకాశించుచున్న, అసి = ఖడ్గమనెడి, భిదుర = వజ్రాయుధముయొక్క, స్పంద = చలన మాత్రముచేత, నిపాతిత = కూల్పఁబడిన, మహత్ = అధికమయిన, విపక్ష = శత్రులయొక్క, ఉత్కర = సమూహములనెడు, మహా = అధికమయిన, అవి = కులపర్వతములయొక్క, ('అవిశ్శైలేరవౌ మేషే' విశ్వ) పక్ష = ఱెక్కలయొక్క, ఉత్కరుఁడై = సమూహము గలవాఁడై, రాజపురందరుఁడనన్ = రాజులలో ఇంద్రుఁడను నట్లుగా—రాజేంద్రుఁ డనునట్లుగా నని భావము, వెలసెన్ = ప్రకాశించెను. ఖడ్గమును వజ్రాయుధముగా రూపించుటచే నందులకై, మహావిపక్షోత్కరమనెడు (అనఁగా మహాశత్రు సమూహమనెడు) మహావిప క్షోత్కరమని (కులపర్వతముల ఱెక్కల సమూహమని) శ్లిష్టముగా రూపణము చేసినాఁడు. ఇం దలంకారము రూపకము సావయవము.

తా. వారిలోఁ బెద్దవాఁడయిన కోనమరాజు తన ఖడ్గము నల్లలార్చిన మాత్రముచే మహాశత్రు సమూహమును, ఇంద్రుఁడు వజ్రముచే మహాకులపర్వతముల ఱెక్కల సమూహములను చెండాడునట్లు పడఁగూల్చి రాజులలో నింద్రుఁ డనఁగాఁ బ్రకాశించెను.

శా. శ్రీరంగాధిపు కోనభూవిభుని కీర్తి స్వచ్ఛతుండాంక తే
జోరాజద్ద్విజరాజు తీవ్రగతిచే *సూర్యాతిగుం డై నభం
బారోహించి పవిన్ హసించుచు నహీనారాతులం జించి త
త్సారాహార్నిశ గుప్త వాసవసుధన్ సాధించుఁ జిత్రంబుగన్. 39

అ. ఇట తేజఃపరముగాను గరుడపరముగాను నర్థద్వయము—శ్రీరంగాధిపు...రాజు—శ్రీరంగాధిపుకోన భూవిభుని = శ్రీరంగరాజు కుమారుఁడయిన కోనమరాజుయొక్క, కీర్తి = కీర్తియనెడు, స్వచ్ఛ = తెల్లనయిన, తుండ = ముఖమే, అంక = చిహ్నముగాఁగల, తేజః = ప్రతాపమనెడు, రాజత్ = ప్రకాశించుచున్న, ద్విజరాజు = గరుత్మంతుఁడు, తీవ్రగతిచేన్ = తీవ్రమనఁగా అత్యుష్ణమును అత్యంతమును గనుక - అత్యుష్ణగతిచేత, సూర్య+అతిగుండై = సూర్యునిఁ దిరస్కరించిన వాఁడై యని యర్థము - (అత్యంతగతిచేత సూర్యమండలమును దాఁటినవాఁడై యనియు 'తీవ్రమత్యుష్ణ కటుకనితాన్తే ష్వన్యవన్మతమ్' విశ్వ.) నభంబు ఆరోహించి = ఆకాశము పయికిఁబోయి, పవిన్ = వజ్రాయుధమును, హసించుచున్ = హసించుటయనఁగా తిరస్కరించుటయు సరకుసేయకుంటయుఁ గనుక-తిరస్కరించుచును - (సరకుసేయకయనియును), అహీన+అరాతులన్ = అధికమైన శత్రువులను, చించి = చీలికలుచేసి - (అహి ఇన అరాతులన్ = అమృతరక్షకులయిన సర్పములనెడు శత్రువులను జించియనియు), తత్...వాసవసుధన్—తత్ = ఆయధికులయిన శత్రువులయొక్క, సార = బలముచేత, అహర్నిశ = రేయుంబవలును, గుప్త = రక్షింపఁబడుచున్న, వాస = నివాస

* 'సూర్యాతిగుండై' అని పాఠాంతరము.

మైన, వసుధర్ = భూమిని - (తత్ = ఆసర్పశ్రేష్ఠులయొక్క, సార = బలముచేత, రేయుంబవలును గుప్తమయిన, వాసవ=ఇంద్రునియొక్క, సుధర్ = అమృతముననియును), చిత్రంబుగన్=ఆశ్చర్యమగునట్లుగా, సాధించున్=స్వాధీనముగాఁ జేసికొనును.

ఇట గరుత్మంతునికి 'కుఙ్కుమాఙ్కితవర్ణాయ కున్దేన్దు ధవళాయచ' యన్న స్తోత్రము చొప్పున శరీరమంతయు కుంకుమ నెఱుపును మొగము తెలుపునగును. కనుక కోనమరాజు నెఱుపయిన ప్రతాపమును గరుడునిఁగాను, దెల్లనికీర్తిని దానితుండముగాను రూపించినాఁడు. గరుడుఁ డమృతమును దెచ్చుటకై వేగగతిని సూర్యమండలమునుదాఁటి యాకాశమునఁ బయిపయిని స్వర్గలోకమునకుఁబోయి యుద్ధమున నింద్రుఁడు ప్రేసిన వజ్రాయుధమును సరకుసేయక యమృతమునకుఁ గాఁపుగానున్న మేటిసర్పములను జించి చెండాడియు రేయుంబవలును గాచుచుండిన యింద్రుని యమృతమును సాధించెనని గరుడపరమయిన యర్థము.

రాజప్రతాపము మిక్కిలి వేఁడిమిచే సూర్యు నతిశయించి యాకాశమునకుఁ బయిబయి వ్యాపించి యింద్రుని వజ్రాయుధమునుగూడఁ దిరస్కరించుచు, మేటిశత్రువులను జించి చెండాడి వారు రేయుంబవలును గాచుచుండిన నివాసభూమిని సాధించునని తాత్పర్యము. ఇందు శ్లేషోత్థాపితమయిన రూపక మలంకారము. 'వాసవసుధ' ననుచో శబ్దశ్లేషము సభంగము.

క. ఆతనితమ్ముఁడు తిమ్మక్ష్మాతలపతి వొగడుగనియె ఘనుఁ డనఁ గీర్తి
వ్రాతవినూతన కైతక,జాతద్యోతన*కృపాణచపలాన్వితుఁ డై. 40

అ. ఆతనితమ్ముఁడు=ఆ కోనమరాజుతమ్ముఁడయిన, తిమ్మక్ష్మాతలపతి=తిమ్మరాజు, కీర్తి...న్వితుఁడై, కీర్తివ్రాత=కీర్తిసమూహమనెడి, వినూతన = మిక్కిలిక్రొత్తయైన, కైతక = మొగలిపువ్వులయొక్క, జాత=సమూహమునకు, ద్యోతన=సూచకమయిన, కృపాణ = ఖడ్గమనెడి, చపలా = మెఱుపుతోడ, అన్వితుఁడయి=కూఁడుకొన్నవాఁడయి, ఘనుఁ డనన్ = మేఘుఁ డనునట్టులుగానని యర్థము. మహాత్ముఁ డను నట్టులుగానని భావము. వొగడుగనియెన్=పొగడ్తగాంచెను.

మెఱుపుమెఱవఁగానే మొగిలిచెట్లు పూయుట ప్రసిద్ధము. మెఱుపుమెఱయఁగానే మొగిలిచెట్లు పూఁతరొత్తుచున్నవని తెలియునట్లు తిమ్మరాజు ఖడ్గము తలతలమని యల్లార్పఁగానే మిగులఁ గీర్తి గలుగఁబోవుచున్నదని తెలియుచున్నదనియు, ఆఖడ్గముచేత సూచితమయిన పరాక్రమమున నతఁడు పొగడ్తనొందినాఁడనియు తాత్పర్యము.

తిమ్మరాజు మేఘునిఁగాను శత్రులపయి వేవేగ అల్లలార్పఁగా తలతలమెఱయు కృపాణమును మెఱచుచున్న మెఱుపుగాను, దానిచే వికసిల్లు కీర్తిని పూఁతపట్టు మొగలిపూవులుగాను, రూపించుట చేత నిం దలంకారము రూపకము. ఘనశబ్దము మేఘపరమున 'ము' వర్ణాంత గావలసియుండియు, మహత్త్వవివక్షచే డుజ్వవర్ణాంతమయ్యెను. ఇట్లు సముద్రుఁడు మొదలగునవి.

ఇందులకు 'విభాషాతః ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిద్భవేత్' అధర్వణ.
కృపాణమును మెఱుపుగా వర్ణించుటచేత మెఱుపుమెఱయున ట్లది యతివేగమున నల్లలార్పంబడు నర

* 'కృపాణి.చపలాన్వితుఁడై' అని పెక్కుప్రతులు; కాని కృపాణీశబ్దము హ్రస్వాంతము గానరాదు. 'ఈదన్తానా మి ద్వదేవ కృతహ్రస్వః' అను ప్రమాణమున్నచో నయినను, కాతిదా[illegible] శబ్దంబులందుంబోలె 'జ్యాపోస్సంజ్ఞా చ్ఛన్దసో ర్బహులమ్' అన్న సూత్రంబుచే-నయినను, ఇకారాన్తత్వము సాధించిన నుపమానోపమేయంబులకు లింగైక్యము కలుగును.

వడియు, దానిచేత నే ప్రకాశిత మయినపరాక్రమమునకు జనస్తుతియు, అట్టి పరాక్రమమున కీర్తి వికాసము సూచితమగుటయు తెలియునది.

సీ. ధాత్రీశ్వరులు గాని ధాత్రీశ్వరులుగారు, పురుడు వాగనుభూతి భూతిగతుల
మానవేంద్రులు గాని మానవేంద్రులు గారు, పోల్కి నయాభోగ భోగకళల
రాజహంసులుగాని రాజహంసులు గారు, సరి సత్కళాసారసారరుచుల
నరపుంగవులు గాని నరపుంగవులు గారు, తరమెన్న వరధర్మధర్మభృతుల

తే. జగతి నీమేటికని నృపుల్ వొగడ నెగడె, నేబిరుద రాయరావుతాహితవధూభు
జంగ బిరుదాంకపుంఖిత సమర విజయ, కాహళుఁడు తిమ్మవిభుఁడాజిదోహలుండు.

అ. జగతిన్=భూమియందు, ఈమేటికిన్=ఈరాజశ్రేష్ఠునికి, వాగనుభూతి భూతిగతులన్— వాగనుభూతి=శబ్దవిద్యయొక్కయు, భూతి=ఐశ్వర్యముయొక్కయు, గతులన్=మార్గములచేత, పురుడు=ఈడు, ధాత్రీశ్వరులుగాని=ధాతయును ఈశ్వరుఁడుగాని, అనఁగా బ్రహ్మయు రుద్రుఁడునుగాని, ('ధాతాచ ఈశ్వరశ్చ ధాత్రీశ్వరౌ'—'ఇకోయణచి' అని రేఫాదేశము. ప్రకృతియందు ద్వివచనమునకు బహువచనాదేశము విహితము గనుక 'ప్రకృతివద్వికృతి' రను న్యాయమున నిందును ద్వివచనాదేశ మెఱుంగునది. ఇట క్రమాలంకారము. ఇట్లె తక్కిన మూఁడుపాదములందును దెలియవలయును.) ధాత్రీశ్వరులుగారు=భూమీశ్వరులుగారు (ధాత్ర్యాః ఈశ్వరాః=ధాత్రీశ్వరాః).

నయాభోగభోగకళలన్—నయ-అభోగ=నీతిపరిపూర్ణతయొక్కయు, భోగ=భోగముయొక్కయు, కళలన్=విశదభావములచేత, పోల్కి=పోలిక, మానవేంద్రులుగాని = మనువును ఇంద్రుఁడును గాని, (మానవశ్చ ఇన్ద్రశ్చ—మానవేన్ద్రౌ=ఇట మనువే మానవుఁడని వ్యుత్పత్తి. 'ప్రజ్ఞాదిభ్యశ్చ' అని స్వార్థమందు అణ్ప్రత్యయము.) మానవేంద్రులుగారు=మానవుల కింద్రులయినరాజులుగారు. (మానవానాం ఇన్ద్రాః; లేక-మానవా ఇన్ద్రాఇవ మానవేన్ద్రాః.)

సత్కళాసారసారరుచులన్—సత్కళాసార = శ్రేష్ఠమయిన చతుష్షష్టికళల సారముచేత నని యర్థము (షోడశకళలచేతనని భావము.) సారరుచులన్=బలీయమైన తేజస్సుచేతను, సరి=సాటి, రాజహంసులుగాని=చంద్రసూర్యులుగాని (రాజాచ హంసశ్చ=రాజహంసౌ), రాజహంసులుగారు=రాజశ్రేష్ఠులుగారు (రాజానోహంసా ఇవ రాజహంసాః)

వరధర్మధర్మభృతులన్—వరధర్మ=శ్రేష్ఠమయిన ధనుస్సుయొక్కయు, ధర్మ= ధర్మముయొక్కయు, భృతులన్=భరణములచేత, నరపుంగవులుగాని — నర=అర్జునుఁడును, పుంగవ=ధర్మదేవతయైన వృషభమునుగాని (నరశ్చ పుఙ్గవశ్చ నరపుఙ్గవౌ), నరపుంగవులుగారు=రాజులుగారు. (నరాః పుఙ్గవా ఇవ నరపుఙ్గవాః.) పుంగవశబ్దము వృషభపరమయినపుడు మహత్త్వవివక్షచే మహతార్థ్యము వచ్చెను.

అని, నృపుల్ = రాజులు, పొగడన్ = పొగడుచుండఁగా, 'బిరుదరాయరావుత' అనునట్టియు, 'అహితవధూభుజంగ'. యనునట్టియు, బిరుదాంక=బిరుదనామముచేత, పుంఖిత=నిండింపఁబడిన, సమర=యుద్ధమందలి, 'విజయకాహళుఁడు=విజయప్రయుక్తమయిన కాహళముగలవాఁడును, ఆజిదోహలుండు=యుద్ధమందు వికాసముగలిగినవాఁడును అగు, ఏతిమ్మవిభుఁడు=ఏతిమ్మరాజు, నెగడెన్=వృద్ధిఁ బొందిప్రకాశించెనో.

ఈగీతియందలి యచ్ఛబ్దమునకు మీఁది వచనమునొదల నున్న తచ్ఛబ్దముతో అన్వయము. ఈ యచ్ఛబ్దము తిమ్మవిభుఁడను విశేష్యముతో సమసించి యుండవలయుటకు మాఱుగా విశేషణముతో

సమసించియున్నది. పరంపరగా విశేష్యాన్వయము దీని కలుగునది. శ్లేషమూలకంబగు పరిసంఖ్యాలంకారము.

వ. తత్క్రమంబున.

అ. తత్-క్రమంబునన్ = ఆతిమ్మరాజు కులము వరుసయందు.

తే. రవికులం బలరింప శ్రీరాముఁ డయిన, శౌరి తన రెండుకన్నులు సరియకాఁగఁ
దలఁచి సోమాన్వయము పవిత్రంబు సేయ, నవని శ్రీరంగవిభురాముఁడై జనించె.

అ. రవికులంబు అలరింపన్ = సూర్యవంశమును ప్రకాశింపఁజేయుటకొఱకు, శ్రీరాముఁడయిన శౌరి = శ్రీరాముఁడుగా నవతరించిన విష్ణుమూర్తి, తనరెండు కన్నులు సరియకాఁగన్ తలఁచి = తనరెండు కన్నులు సమానముగానే విచారించి, ఇట విష్ణువుకన్నులు సూర్యచంద్రులని తెలియునది. 'భూఃపాదా యస్యనాభిర్వియ దసు రనిలశ్చన్ద్ర సూర్యౌచ నేత్రే' యని ప్రమాణము. సోమాన్వయమున్ = చంద్రవంశమును గూడ, పవిత్రంబు సేయన్ = పావనము సేయుటకు, అవనిన్ = భూమియందు, శ్రీరంగవిభురాముఁడై = శ్రీరంగరాజు కుమారుఁడయిన రామరాజయి, జనించెన్ = జన్మించెను.

ఇట శౌరికి తననేత్రద్వయమునుగుఱించి విచారము సేయుసంబంధములేకున్నను, సంబంధమును జెప్పుటచే సంబంధాతిశయోక్తి. శౌరినే రామరాజుఁగా రూపణముచేయుటచే రూపకము. దాశరథి రాముఁడుగానుండు దశకంటె, రామరాజుగానుండు దశయందు విశేషము కానిపింపమిచే అనుభయము. అతిశయోక్తిచే రూపకముత్థాపిత మగుచున్నదిగాన రెంటికిని సంకరము. రెండు వస్తువులకు నెక్కువ తక్కువలులేమి నుదాహరించుటయందు రెండుకన్నులనెడి లోకోక్తి యిట అనుసంధింపఁబడెను.

తా. సూర్యవంశము నలంకరించుటకు దశరథునకు శ్రీరాముఁడుగా నవతరించిన విష్ణువు, సూర్యచంద్రులనెడు తన రెండుకన్నులును సమానములగుట నాలోచించి, రెండవ కన్నయిన చంద్రుని వంశమును పావనము సేయుటకొఱకు భూమియందు శ్రీరంగరాజునకు రాముండుగా జనించెను.

సీ. పట్టాభిషేకవిపర్యయంబునఁ బ్రోలు, వెడలి ప్రియానుజుల్ వెంటఁ గొలువఁ
జిత్రకూటాభిఖ్యఁ జెలఁగు పెన్గొండ సాం, ద్రహరిద్విపేంద్ర నాదవనిఁ జేరి
ఖలజనస్థానవాసులఁ బల్వుర వధించి, మహిమసలక ఖరస్మయ మడంచి
హరివీరభట మహోద్ధతి నబ్ధి గంపింప, దురమునఁ గదిసి తద్ద్రోహిఁ దునిమి

తే. యనఘతరపార్థివేందిర నధిగమించి, సాధు కర్ణాట విభవసంస్థాపనంబు
పూనిశరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁ, డతఁడు నిజచరితంబు రామాయణముగ.

అ. ఇట రామరాజపరముగాను శ్రీరామపరముగాను అర్థద్వయము—రాముఁడు అతఁడు = రాముఁడైనయా రాజు—రామరాజనుట, నిజచరితంబు = తనచరిత్రము, రామాయణముగన్ = రామాయణకథ యగునట్లుగా, రామరాజగు తనకథ శ్రీరాముని కథయగునట్లుగా ననుట--ఆకథ యీ కథయగుట అభేదాధ్యవసాయము చేత నని మర్మము. రామునిచరిత్ర రామాయణము కావలసినదే యని అనురూప్యము గ్రహించునది. పట్టాభిషేక విపర్యయంబునన్ = పట్టాభిషేకముయొక్క వ్యత్యయమందు - అనఁగా తప్పిపోవుటయందనుట - శ్రీరామునకుంబోలె రామరాజునకును పట్టాభిషేకము విఘ్నముపొందెనని యిట తెలియునది. ప్రోలు వెడలి = పట్టణమునుండి బయలుదేఱి, ప్రియ+అనుజుల్ = (రాజ) ప్రియులయిన తమ్ములు-అనఁగా తిరుమలరాయఁడును వేంకటాద్రియును, వెంటన్ కొలువన్ = తనవెంబడిని కొలిచిరాఁగా - (రామ) ప్రియా+అనుజుల్ = ప్రియురాలయిన సీతయు తమ్ముఁడయిన లక్ష్మణుఁడును వెంటఁగొలిచి రాఁగా.

అభిఖ్యయనఁగా నామమును ప్రథయును - (రాజ) చిత్రకూటాభిఖ్యన్—చిత్ర = విచిత్రము లయిన, కూట = శిఖరములయొక్క, అభిఖ్యన్=ప్రథచేత, చెలఁగు = విలసిల్లుచున్న, పెన్గొండన్ = పెనుగొండయందున్న, సాంద్ర... పేంద్రన్—సాంద్ర=దట్టమయిన, హరి=గుఱ్ఱములును, ద్విపేంద్ర= మేటిఏనుఁగులును గలిగిన, ఆదవనిన్=ఆదవని యనెడు పట్టణమును, (ప్రకృతమున ఆదోని యనఁబడు పట్టణము,) చేరి=పోయి-ఆక్రమించి, చెందియని పాఠాంతరమునను అర్థము సమానమే. (రామ) చిత్ర కూట+అభిఖ్యన్= చిత్రకూట మనెడు పేరిచేత, చెలఁగు పెన్గొండన్=మహాపర్వతమునందు, సాంద్ర= నిబిడమయిన, హరిః=సింహములయొక్కయు, ద్విపేంద్ర= మేటిగజములయొక్కయు, నాద=ధ్వనులు గలిగిన, వనిన్=అరణ్యమును, చేరి=చెంది. 'అభిఖ్యానామశోభయోః' అమ.

ఖల......వాసులన్—(రాజ) ఖల=పాపాత్ములయిన, జనస్థానవాసులన్=జనపదముల వసించు వారిని, పల్వురన్=అనేకులను, వధించి=సంహరించి, మహిమన్ = ప్రభావముచేత, సలక = సలకుఁ డను, ఖర=క్రూరునియొక్క, స్మయము=గర్వమును, అడంచి, (రామ) ఖల = పాపాత్ములయిన, జన స్థానవాసులన్ = జనస్థానమందున్న రాక్షసులను, పల్వురను, వధించి, మహిన్ = భూమియందు, మసలక=జాగుసేయక-భూమియందు తా నవతరించిన ప్రయోజనమును త్వరితముగాఁ దీర్చుకొనువాఁడై యనుట, ఖర = ఖరాసురునియొక్క, స్మయమునడంచి = గర్వమును నాశముచేసి.

హరి...దునిమి—(రాజ) హరి = గుఱ్ఱములయొక్కయు, వీరభట = శూరులయిన భటులయొ క్కయు, మహోద్ధతిన్ = అధికమయిన పదటముచేత-ఎగవుచేననుట, అబ్ధి = సముద్రము, కంపిం పన్=చలించునట్లుగా, దురమునన్=యుద్ధమందు, కదిసి=తారసించి-మార్కొని, తద్ద్రోహిన్ = పూర్వము చెప్పఁబడిన యాసలకుఁడను ద్రోహిని, తునిమి=వధించి. (రామ) హరివీరభట=కపివీరసైనికుల యొక్క, మహోద్ధతిచేత, అబ్ధి కంపింపన్ = దక్షిణసముద్రము వడఁకఁగా - సేతువునుగట్టి దాఁటు టచే ఆసముద్రము కలగుండు నొందఁగాననుట, దురమునఁ గదిసి, తత్ - ద్రోహిన్ = ప్రసిద్ధుఁడైన యాద్రోహిని రావణుని,తునిమి. రావణుఁడు సీత నపహరించుటచే రామునకు ద్రోహిగాఁ జెప్పఁబడు టను దెలియునది.

అనఘ...నధిగమించి - (రాజ) అనఘతర=మిక్కిలి నిష్కల్మషమయిన, పార్థివ + ఇందిరన్ = రాజలక్ష్మిని - రాజ్యసంపత్తిననుట, అధిగమించి = పొంది. (రామ) అనఘతర=నిష్పాపురాలగున-అగ్ని ప్రవేశాదులచే మిక్కిలియు నిర్దోషురాలుగా వాసి గన్నట్టియనుట, పార్థివ + ఇందిరన్—పార్థివ=పృథి విని సంబంధించిన-అనఁగా భూదేవికొమార్తయైనట్టి, ఇందిరన్ =లక్ష్మిని-అనఁగా సీతను, అధిగమించి= పొంది- పెండ్లాడి, సాధు...వూని-(రాజ) సాధు=చక్కనయిన, కర్ణాటవిభవసంస్థాపనంబు=కర్ణాట రాజ్య వైభవముయొక్క సంస్థాపించుటను, వూని=వహించి, (రామ) సాధు = యోగ్యులయినవారి యొక్క, కర్ణ+అట=కర్ణగోచరమయిన - సాధులువిని యామోదించునట్టి యనుట, విభవసంస్థాపనంబు వూని=వైభవముయొక్క సంస్థాపనమును వహించి-సాధువులు విని యనుమోదించునట్లుగా పితృవచన పరిపాలనాదులు నెఱపి ధర్మోత్తరముగాఁ దనరాజ్యవైభవమును గట్టిగా నెలకొలిపికొన్నాఁడనుట. శరణమనఁగా గృహమును రక్షణమును, శరణా...ప్రోచెన్—(రాజ) శరణ+ఆగతులన్ ఎల్లన్=గృ హమునుగూర్చి వచ్చినవారినందఱును, ప్రోచెన్=రక్షించెను. (రామ)శరణాగతుల నెల్లన్=రక్షణమును గూర్చివచ్చిన విభీషణాదుల నందఱను రక్షించెను. 'శరణం గృహరక్షిత్రోః' విశ్వ. ఇందు శ్లిష్టరూపక మంకారము.

'హరివీరభట మహోద్ధతి' ననుచో అంత్యోష్మసంధివిశ్రమము. హకారముతో ఉద్ధతిలోని 'ధ' కారమునకు విశ్రమము. అంత్యోష్మమనఁగా 'శషస' లనెడి ఊష్మములలో నంత్యమగు హకారము. 'ఉద్ధతి' అనుచో 'ఝయోహోఽన్యతరస్యామ్' అను సూత్రముచే హకారమున కాదేశమైన ధకారముగాన విశ్రమముచెల్లుట తెలియునది.

మ. హరిశౌర్యుం డగురామభూవిభుని తీవ్రాటోపవద్వాహినీ
శరవేగంబున నాత్మమూలబలముల్ జాఱన్ దళాడంబరం
బరుగం గొమ్మలు ప్రావ లావతి నిజామాదుల్ వజీరుల్ భజిం
తురు నమ్రత్వముఁ గానలో ముసలిమానుల్ గా వితర్కింపఁగన్. 44

అ. ఇందు నిజామాదులకును ముదిమ్రాఁకులకును అభేదాధ్యవసాయముగాన అర్థద్వయము దెలియునది. హరిశౌర్యుండు=సింహముయొక్క పరాక్రమమువంటి పరాక్రమముగలవాఁడు,అగు,రామ... వేగంబునన్—రామభూవిభుని = రామరాజుయొక్క, తీవ్ర = ఉరవడిగల, ఆటోపవత్ =యుద్ధవిజృంభణముగల,వాహినీ= సేనయొక్క, శరవేగంబునన్ =బాణవేగముచేత నని నిజామాదిపరమైన యర్థము.తీవ్రాటోపవత్ =మిక్కిలి యాడంబరముతోఁ గూడిన, వాహినీ=నదియొక్క, శరవేగంబునన్ =జలవేగముచేత నని వృక్షపరమైన అర్థాం. ఆత్మమూలబలముల్ = (నిజా) తమయొక్క నమ్మికగల బలములు, జాఱన్= తొలఁగా, పలాయితముకాఁగా- (వృక్ష)ఆత్మమూల=తమవ్రేళ్లయొక్క, బలముల్ =సత్తువులు-దార్ఢ్యము, జాఱన్ =తీసిపోవఁగా, దళమనఁగా రాణువయు ఆకును, దళ+ఆడంబరంబు = (నిజా) రాణువయొక్క విజృంభణమును, అరుగన్ = పోఁగా-నశింపఁగా - (వృక్ష) ఆకులవిజృంభణము నశింపఁగా 'దళోఽంశే స్త్రీభిదేభేదే' విశ్వ. ('దళం పర్ణంఛదః పుమాన్' అమ.) కొమ్మలుపోవన్-(నిజా)-పుత్రపౌత్రాదులు హతులుకాఁగా- (వృక్ష) శాఖలువిఱిగి పడిపోఁగా ఇంతవఱకు అర్థద్వయమునకు అభేదాధ్యవసాయము. కొమ్మలనఁగా పుత్రాదు లనుటకు

మ. గురుగుం జెంచలి దుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముంగూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారికో
గిరముల్ మెక్కి తమిం గొమల్ పొలమువోఁ గ్రేఁపుల్ మెయుల్ నాక మేఁ
కెరువుంగుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్. (ఆముక్తమాల్యద.)

లావతి=బలముసెడి,నిజాము ఆదుల్ =నిజాము మొదలయిన మ్లేచ్ఛప్రభువులును, వజీరుల్ =మ్లేచ్ఛప్రధానులును, కానలోన్ =అరణ్యమందు, ముసలి మానుల్ కాన్ = ముదిసిన మ్రాఁకులో [illegible]నట్లు, వితర్కింపఁగన్ = (జనులు) ఊహించునట్లుగా, మాను అనుచో రేఫసంయోగములేమికిఁ [illegible]ణము మృగ్యము. ముసల్మానులని తురకలను వ్యవహరించుట గలదుగనుక తురకలని భావము. నమ్రత్వము=వంగుటను-తురకలపరముగా అపజయముచే లోఁబడుటయనియు - వృక్షపరముగా వేళ్లదిట తప్పుటచే ఒఱఁగి కూలుటయనియు నర్థము. భజింతురు = పొందుదురు.

ఇటు తురకలకు ముసల్మానులను పేరుండుటంబట్టి యాశబ్దశక్తివలన ముసలిమ్రానులుగా నధ్యవసించి వారికిని ముదిమ్రాఁకులకు నర్థద్వయము గలుగఁ జెప్పినాఁడు. జీర్ణవృక్షగత ధర్మసంబంధము నిమిత్తముగాఁ గొని మ్లేచ్ఛులను వృక్షములుగా నుత్ప్రేక్షించుటవలన ఉత్ప్రేక్షాలంకారము. రామభూవిభునకు హరిశౌర్యుఁడను విశేషణము మ్లేచ్ఛాదులను నమ్రులను జేయుటకు సాధకముగుటచే కావ్యలింగభేదము. ఈ రెంటికిని సంకరము.మిక్కిలి యురవడిరైన నదీజలవేగమున ముదిసినమ్రాఁకులు వేళ్లదిటతప్పి

యాకుల జొంపమంతయుఁ బోయి కొమ్మలువిఱిగి బలముతీసిపోయి యొఱఁగిపోవుటయును, రామరాజు సేనల బాణవేగముచే తురకప్రభువులు తమమూలబలము పాఱిపోఁగా రాణువల యేపుచెడఁగా పుత్ర పౌత్రాదులు నశింపఁగా బలముతగ్గి నష్టులయి లోఁబడి పోవుటయును నభిన్నముగా నధ్యవసింపఁబడినది. నిజామాదులు యుద్ధమున నోడి పరికరములన్నియుఁ దూలి యడవికిఁ బాఱిపోయిరని తాత్పర్యము.

సీ. ఎదలపైఁ బొదలుపయ్యెదలు జాఱఁగఁ బాఱు, బిబ్బీలకు ముసుంగులబ్బఁ జేసె
ఘనభేరికాధ్వనుల్ విని గుండియలు వ్రీల, వ్రాలుమల్కలకు గోలీలు సేసె
నుడుగని విభ్రాంతి దడగాళ్లు వడ నిల్చు, ఖానులు డాఁగఁ జీఁకటులు సేసెఁ
గడలేని కాందిశీకత నేఁగుతమ కుర్వి, జడధులెల్లను గాలినడలు సేసె.

తే. ననుచు శిరములఁ దాల్తురెవ్వని సమగ్ర, సైన్యధుతధూళిఁ జకితులై చనుసపాద
కుతుపశాహినిజామాదికుతలపతుల, తండు నృపమాత్రుఁడే రామధరణివిభుఁడు.

అ. ఎదలపైన్ = వక్షస్థలములమీఁద, పొదలుపయ్యెదలు = ఒప్పారెడుపయఁటలు, జాఱన్ = జాఱిపోవునట్లుగా, పాఱుబిబ్బీలకున్ = పరుగిడునట్టి మ్లేచ్ఛాంతఃపుర స్త్రీలకు, ముసుంగులు = ముసుఁగులు, అబ్బన్ చేసెన్ = కలుగునట్లుగాఁజేసెను. ఘనభేరికాధ్వనుల్ = గొప్పదియైన రణభేరియొక్క భాంకారములను, విని, గుండియలు వ్రీలన్ = గుండెలు పగులునట్లుగా, వ్రాలు మల్కలకున్ = నిర్జీవులయికూలునట్టి తురకలకు, గోలీలు సేసెన్ = గోలీలేర్పఱచెను. ఉడుగని విభ్రాంతిన్ = తీసిపోవకుండెడు భయమువలని తడఁబాటుచేత, దడగాళ్లుపడన్ = కాళ్లు తడఁబడగా, నిల్చుఖానులు = కదలలేక నిలిచిన మ్లేచ్ఛప్రధానులు, డాఁగన్ = దాఁగుటకు, చీఁకటులు సేసెన్ = చీఁకట్లు కల్పించెను. కడలేని కాందిశీకతన్ = తుదిముట్టని పలాయనముచేత - తుదిలేక యూరక పాఱుచుండుటచేత - పాఱిపోవుటకు ముగింపులేమి భయాతిశయమువలన, ఏఁగు తమకున్ = పోవునట్టి తమకు, ఉర్విన్ = భూమియందు, జడధులెల్లను = సముద్రములన్నిటిని, కాలినడలు చేసెన్ = కాలిచే నడచి పోఁదగినంత లోఁతుగలవానినిగాఁ జేసెను.

అనుచున్ = అని చెప్పుచు, ఎవ్వని...చకితులై — ఎవ్వని = ఏరాజుయొక్క, సమగ్ర = సంపూర్ణమయిన, సైన్య = సేనలచేత, ధుత = ఎగురఁగొట్టఁబడిన, ధూళిన్ = దుమ్మును, చకితులై = భయపడి, చను, సపాద కుతుప శాహి నిజామాది - పోవుచుండు-సపాదుఁడు, కుతుపశాహి, నిజాము మొదలయిన, కుతలపతులు = భూపతులు - రాజులు, శిరములన్ తాల్తురు = శిరసావహింతురోయని యర్థము. ధూళి వారి శిరస్సులమీఁదఁ బడునని భావము. అతఁడు = అట్టివాఁడయిన, రామధరణివిభుఁడు = రామరాజు, నృపమాత్రుఁడే = రాజులపాటి వాఁడా, అంపలు రాజులవంటివాఁడా- కాఁడనుట.

ఇట సైన్యములచేఁ జిమ్మఁబడినధూళికి, 'బిబ్బీలకు ముసుంగులబ్బఁజేసె' ననుటచే అత్యంతమగు ప్రసరణమును, 'మల్కలకు గోలీలు సేసె' ననుటచే అత్యంత ప్రసరణ నిబిడత్వములను, 'ఖానులకు చీకట్లు చేసె' ననుటచే అత్యంతప్రసరణ నిబిడత్వబాహుళ్యములను, 'జడధులెల్లను గాలినడలు సేసె' ననుటచే నత్యంత ప్రసరణ నిబిడత్వబాహుళ్య దిగంతవ్యాప్తులును దెలియునది. సేనాధూళి వ్యాపించిన మాత్రముననే నిజామాదులు నిజసేనలు చెల్లచెదరై కుటుంబములు చీకాకై పలాయితులయిరని భావము. తమ బిబ్బీలు మొదలగువారికిఁ బరిహారముగా ముసుంగులు మొదలయినవి కల్పించి యుపకరించుటచే నిజామాదు లాధూళిని శిరసావహించి శ్లాఘింతురని చమత్కారము. కాందిశీకత కడలేనిదిగావుననే అందుల కుర్వియఁ జాలనందున సముద్రములపయినిగూడ నడి కొనసాఁగునట్లు వానిని కాలినడలుగాఁ జేసినాఁడని

యూశయము. ఇచట బీబీలు మొగలగువారికి, సేనాధూళి ముఖాభరణాదులను కల్పించెనని యూహించి రన్న సంబంధము లేకపోయినను సంబంధమును జెప్పుటచే అతిశయోక్తి-ఆధూళిశిరస్సునఁ బడుటనే శిరస్సునఁదాల్చి శ్లాఘించుటగా రూపణముచేయుటచే రూపకమును. అతిశయోక్తి యీరూపకము నుత్థాపించుటచే రెండింటికిని సంకరము. ఇటువంటి వాఁడను హేతువుచే కేవలరాజ మాత్రుఁడుగాఁడను టను సమర్థించుటచే కావ్యలింగమును. ఇట సపాదుఁడనఁగా షహాబాత్తనియు కుతుపశాహియనఁగా కుటుబ్‌షా అనియు నిజాముఁడనఁగా నైజామనియు మ్లేచ్ఛరాజులను దెలియునది. తా. సుగమము.

పయ్యెదనులచో నడిమి 'య'కారమునకును ఎత్వము కలదనుటకు.

[గీ. 'తాయెతులు నుయ్యెలయుఁ బయ్యెఁపయును దక్కఁ,గలుగ దెత్వంబు మధ్య'య'కారమునకుఁ
దుదిని గ్రియదక్క నెత్వంబు గదియ దాది, నత్వమొందదు తెనుఁగున నబ్జనాభ.'

ముద్దరాజు రామన్న

గీ. ధరణి నుయ్యెల పయ్యెద తాయెతులను, గల'య'కారంబునకు వక్రములు నిజంబు
ముద్దరాజు రామన వానిమాటని బద, మధ్య'యా'లని చెప్పినమాట మిథ్య.

గీ. ఊఁచునెల కాకగుట చేత నుయ్యెలయ్యెఁ, బైనియొదకు వక్రోక్తిని బయ్యెదయ్యెఁ
దల్లికాపునకై కట్టఁగగినసరులు, తేలఁ బల్కఁగఁదాయెతుల్ దేశ్యమునను. అప్పకవి.

"పయ్యెదేత్యాదినామగత 'య'కారస్యాపి" ఇతి పృథగేత్వం విహితమేవ 'డోలాభూషోత్తరీయాణి విసైత్వం నాస్తి మధ్యయః' అప్పకవిస్తు 'పయ్యెదేత్యాదా వత్త్వం యత్రుతిత్వం చాహ తదేతత్పాత్రప్రామాణ్యాత్స్వకపోలకల్పితమేవే త్యనుసన్ధేయమ్." అహోబలపండితుఁడు.

దీనిచేత నిది యేకపదమనియు పనమధ్య 'య'కార మెత్వయుక్తమనియు గ్రహించునది.] అని సోమకవి. కాని 'ఉయ్యెల' 'పయ్యెద' ల 'య'కారమునకు అత్వము.

'అబ్జనాభునితూఁగుటు య్యాలలుగంటె' భీమఖండము.

ఉ। య్యాల నూఁపుచుఁ జెనుపఁదోడఁగె నావరశిశువున్. కళాపూర్ణోదయము.

ఉ। య్యాలో జొంపములంచుఁ బాడుదురు భిల్లాంభోజపత్రేక్షణల్.

ప। య్యాద దడియంగఁగానఁబడె నంచితనిర్మల రత్నభూస్థలిన్. భాస్కరరామాయణము.

'యానవేగమునఁ బయ్యెదకొంగు సడలిన' షోడశకుమారచరిత్రము.

శా. విశ్వామిత్రునిఁ గొల్చి రాముఁ డతఁ డుర్విం జెందెఁ గల్యాణముల్
విశ్వామిత్రులఁ గొల్చి రాముఁ డితఁ డుర్విం జెందెఁ గల[illegible]
శశ్వత్కీర్తులు రాము లియ్యిరువురుర్విన్ సాధించు కల్యాణ లా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథన ధర్మాలంబన వ్యక్తముల్. 46

అ. విశ్వామిత్రునిన్ = విశ్వమునకు అమిత్రుఁడయినవానిని, కొలిచి=సేవించి యనియర్థము- విశ్వామిత్రమహామునిని సేవించి యనిభావము. రాముఁడు అతఁడు=దశరథకుమారుఁడయిన యారాముఁడు, ఉర్విన్ = భూమియందు, కళ్యాణముల్ చెందెన్ = వివాహమును బొందెను - విశ్వామిత్రుని ప్రాపుచే సీతను బెండ్లియాడెననుట. రాముఁడితఁడు = ఈరామరాజు, విశ్వామిత్రులు [illegible]ల్వన్ = విశ్వామిత్ర మహామునులే తన్నుఁగొల్వఁగా, ఉర్విన్ చెందెన్ కల్యాణముల్ = భూమియందు కల్యాణము బొందెనని యర్థము. ఆరామునకును ఈరామునకు నిట కల్యాణము బొందుట సమానధర్మము. విశ్వ = సమస్తులయిన, అమిత్రులు = శత్రువులు, కొల్వన్ = సేవింపఁగా, ఉర్వియందు కల్యా

ణమనెడు పట్టణమును బొందినాఁడని భావము. కల్యాణపట్టణమును ముట్టడించి శత్రువులెల్లఁ దనకు లోఁబడిపోయి కొలువఁగా దాని నాక్రమించికొన్నాఁడనుట. కల్యాణమును బొందుట ఆరామునకును ఈరామునకును సమానమే, ఇరువురకు విశేషమేమన అతఁడొక విశ్వామిత్రుని తానుగొలిచి దానినిబొందినాఁడు. ఇతఁడు పెక్కు విశ్వామిత్రులచేఁ దన్నుఁగొలిపించుకొని దానిని బొందినాఁడు; కాన యితఁడే యతిశయించినవాఁడని చమత్కారము. శశ్వత్ కీర్తులు = ప్రకాశించుచున్న కీర్తిగలవారయిన, రాములు అయ్యిరువురుర్ = ఆ యిద్దఱు రాములును, సాధించు...శ్వైశ్వర్యంబులు - సాధించు = సాధించినట్టి, కల్యాణలాభ = కల్యాణప్రాప్తి రూపమయిన, ఐశ్వర్యంబులు = వైభవములు - వారిరువురును కల్యాణమునుబడసిన వైభవములనుట, ధర్మ...వ్యక్తముల్ - ధర్మమనఁగా న్యాయమును చాపమును గాన, ధర్మనిర్మథన = న్యాయమును ధ్వంసము చేయుటచేతను, ధర్మాలంబన = న్యాయము నవలంబించుటచేతను, వ్యక్తముల్ = ప్రకటములయినవి. ఆరాముఁ డన్యాయముగాను ఈరాముఁడు న్యాయముగాను కల్యాణమును బొందిరని యర్థము. ధర్మనిర్మథన=విల్లువిఱుచుటచేతను -(శివధనుర్భంగము చేయుటచేత ననుట.) ధర్మాలంబన = విలు నవలంబించుటచేతను -(విలుగొని బాణములను బ్రయోగించుటచేతననుట,) ప్రకటములయినవని భావము.

అతఁడు శివుని విల్లువిఱిచి సీతాకల్యాణమును బొందెననియు, ఇతఁడు వింటబాణములుపైచి కల్యాణపట్టణమును బొందినాఁడనియు ఆశయము. విశ్వమునకు అమిత్రుఁడయినవానిని గొల్చి ధర్మనిర్మథన వ్యాపారముచే కల్యాణమును బొందిన యారామునకంటె విశ్వమునకమిత్రులయిన వారిని గొలిపించుకొని ధర్మావలంబనవ్యాపారముచే కల్యాణమునుబొందిన యీరాముఁడుత్తముఁడని సారస్యము. ఇట శ్లేషోత్థాపిత మయిన వ్యతిరేక మలంకారము. తా. సుగమము.

సీ. ప్రబలావలేప విగ్రహజాయమానాగ్ర, హముడించి బహుధావనాప్తిఁగాంచు
బురమెల్లఁ బ్రత్యగ్రభూతిపాలుగఁజేసి, యచలాసనాభ్యాసినై కృశించు
రతినిభరామానుగతమైత్రిపై రోసి, కలనైనఁ గల్యాణకాంతఁ యిడఁడు
సరవిఁ బ్రాణాయామసంసిద్ధికై సారె, సారెకుఁ గుండలిస్థాన మంటు

తే. మానకనిజాముఁ డపవర్గమార్గవృత్తి, బెరయఁ బరబుద్ధి నెవ్వాని పేరుదలఁచి
యతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతికిఁదగఁడె, సేతుకాశీతలాంతరఖ్యాతయశుఁడు.

ఆ. [illegible]నకు రామరాజకృతమయిన అపజయవృత్తిపరముగాను శ్రీరామకృతమైన అపవర్గవృత్తిపరముగాను సర్వద్వయమునకు నభేదాధ్యవసాయము చేసి చెప్పుచున్నాఁడు. నిజాముఁడు, మానక = విడువక, పరబుద్ధి = శత్రుబుద్ధిచేతనని యర్థము, పరబ్రహ్మబుద్ధిచేతనని యర్థాంతరము. ఎవ్వానిపేరు దలఁచి = ఏ రామరాజునామము నెంచి—ఏశ్రీరాముని పేరుదలఁచియనియు, ప్రబల...కాంచుర్—(అపజయ)—ప్రబల=బలీయమయిన, అవలేప=గర్వముచేత నయిన, విగ్రహ=విరోధమువలన, జాయమాన=పుట్టుచున్న, ఆగ్రహముర్=కోపమును, డించి=విడిచిపెట్టి, బహు=గట్టిగా, ధావన+ఆప్తిర్=పలాయనమును బొందుటను, కాంచుర్ = పొందునో—పలాయితుఁ డగునో- తాను మిక్కిలి గర్వించి రా[illegible]రాజుతో విరోధము పెట్టుకొన్నందున నతనిపయిఁ గలిగిన కోపావేశమునుగూడ దిగ[illegible]చి మిక్కిలియుఁ బాఱిపోవుననుట. (అపవర్గ) ప్రబల=మిక్కుటమయిన, అవలేప=వ్యాప్తిగల, విగ్రహ=దేహమువలన, జాయమాన=పుట్టుచున్న, ఆగ్రహముర్=అభిమానమును, డించి=పరిత్యజించి, [illegible]ధా=పలువిధములుగా, వన+ఆప్తిర్ కాంచుర్=అడవులను బొందుటను బొందునో—అడవులకుఁ

బోవునో - మీఁదు మిక్కిలి వ్యాపించుచున్న దేహాభిమానమును దిగవిడిచి తపస్సు గావించుటకు వనమునకుఁ బోవునోయనుట.

పురం ...కృశించు---(అపజయ) పురమెల్లన్ =పట్టణమంతయు, ప్రత్యగ్ర ... పాలుగన్ --ప్రత్యగ్ర=నూతనమయిన,భూతిపాలుగన్ =బూడిదపాలుగా, చేసి, అచల+అసన+అభ్యాసియై-అచల=కొండయందు, అసన = ఉండుటయొక్క, అభ్యాసియై=అలవాటు గలవాఁడై, కృశించున్ =క్షీణించునో-పట్టణమంతయు శత్రువులకు జిక్కి బూడిదపాలుగాఁగా కొండలకుఁ బాఱిపోయి యచటనే యుండుట వలన క్షీణించి పోవుచున్నాఁడనుట. (అపవర్గ) పురమెల్లన్ =దేహమంతయు, ప్రత్యగ్రభూతి పాలుగన్ చేసి = క్రొత్తబూడిదపాలు గావించి-అనఁగా తురికగనుక శ్రీరామునియందలి భక్తి క్రొత్తగా నంకురించుటచే ఇంతవఱకులేక క్రొత్తగా దేహమంతయు బూడిద పూసికొన్నవాఁడై యనుట. అచల=నిశ్చలమైన, ఆసన=పద్మాసనము మొదలయి వాని యందలి, అభ్యాసియై=పరిచయము గలవాఁడై, కృశించున్ =చిక్కిపోవునో---రామభక్తివలనఁ గ్రొత్తగా దేహమంతయు విబూది పూసికొని పద్మాసనాదు లలవాటు చేయుటచేఁ జిక్కిపోయినాఁ డనుట. 'పురంపురి శరీరేచ' విశ్వ.

రతి...యిడఁడు---(అపజయ) ఇభరామ=ఇబ్రాహీం అనువానియందు, అనుగత=పొందఁబడిన, మైత్రిపైన్ =స్నేహముమీఁద--ఇభరామునితోడి స్నేహము నందనుట, రతిన్ =ఆసక్తిని, రోసి=మానుకొని, కలనైనన్ =స్వప్నమందయినను, కల్యాణకాంక్ష=కల్యాణ పట్టణముమీఁది వాంఛను, ఇడఁడు=పెట్టుకొనఁడో - ఇబ్రాహీంతోడి స్నేహమును మానికొని కల్యాణ పట్టణమును మరలఁ బట్టుకొనవలెన నెడి యపేక్షకలయందును లేకుండుననుట---దీనిచేత నిజాము ఇబ్రహీంతోఁగూడి రామరాజుతో శత్రుత్వము గలిగియుండెననియు కల్యాణ పట్టణమును బోఁగొట్టుకొన్నాఁడనియుఁ జరిత్రాంశము తెలియుచది. (అపవర్గ) రతినిభ=రతీదేవితో సాటియైన, రామ = స్త్రీలయందు, అనుగత = పొందఁబడిన, మైత్రిపైన్ రోసి=స్నేహముమీఁద విరక్తిఁజెంది,కలనయినను, కల్యాణకాంక్షయిడఁడు=బంగారమునం దభిలాష యుంపఁడో. మిక్కిలి చక్కని స్త్రీలయందును విరక్తిగలిగి బంగారము మొదలయిన యమూల్య వస్తువులందుఁ గలనయినను గోరిక లేకుండుననుట.

సరవి...మంటున్ ---(అపజయ) సరవిన్ =యుక్తమగునట్లుగా, ప్రాణా+ఆయామ+సంసిద్ధికై=ప్రాణముయొక్క నిడివి సిద్ధించుటకై---ప్రాణము దీర్ఘకాలముండుటను బొందుటకై---అనఁగా వధము దప్పించుకొనుట కనుట, సారెసారెకున్ =మాటిమాటికి, కుండలి స్థానము అంటున్ =సర్పములకు స్థానమయిన పుట్టను అంటునో, అనఁగా పుట్టపయి నెక్కునోయని యర్థము. పుట్టనెక్కినవానిని, పూరిగఱచిన వానిని, పాఱిపోవు వానిని యుద్ధమందుఁ జంపరాదని సం[illegible].(అపవర్గ) ప్రాణాయామ మనెడి యోగముయొక్క యంగము సిద్ధించుకొఱకు కుంభ[illegible]ఁడు మనస్సు నావేశించి కుండలినీశక్తికి స్థానమయిన మూలాధారమంటునో ---[కుల కుండలినీశక్తి యనఁగా

శ్లో॥ భుజఙ్గాకారరూపేణ మూలాధారం సమాస్థితా । శక్తిః కుణ్డలినీ నామ బిసతన్తునిభా శుభా
మూలకన్దం ఫణాగ్రేణ దష్ట్వాకమలకన్దవత్ । ముఖేనపుచ్ఛంసంగృహ్య బ్రహ్మరన్ధ్రింసమాస్థితా॥
పద్మాసనగతఃస్వస్థో గుదమాకుఞ్చ్య సాధకః। వాయుమూర్ధ్వగతింకుర్వఙ్కుమ్భకావిష్టమానసః।
వాయ్వాఘాతవశాదగ్నిస్స్వాధిష్ఠానగతోజ్వలన్ ।జ్వలనాఘాతపవనాఘాతాదున్నిద్రితాహిరాట్॥
రుద్రగ్రన్థింతతోభిత్వా విష్ణుగ్రన్థింభినత్త్యతః । బ్రహ్మగన్థింభినత్త్యేవకమలాని భినత్తిషట్ ।
సహస్రకమలే శక్తిశ్శివేన సహమోదతే । సా చావస్థాపరాజ్ఞేయా సైవ నిర్వృతికారణమ్ ॥

వామకేశ్వర తంత్రము.

శ్లో॥ ధ్యాయేత్కుణ్డలినీం సూక్ష్మాం మూలాధారనివాసినీమ్। తామిష్టదేవతారూపాం సార్ధత్రివలయాన్వితామ్.
కోటిసౌదామినీభాసాం స్వయమ్భూలిఙ్గవేష్టినీమ్। తాముత్థాప్య మహాదేవీం ప్రాణమన్త్రేణ సాధకః
ఉద్యద్దినకరోద్ద్యోతాం యావచ్ఛ్వాసం దృఢాసనః। అశేషాశుభశాన్త్యర్థం సమాహితమనాశ్చిరమ్॥
తత్ప్రభాపటలవ్యాప్తం శరీరమపి చిన్తయేత్॥ తంత్రసారము.

ఈ 'కుండలిని' కే 'కుండలి' యనియుఁ బేరు.

శ్లో॥ అధోముఖస్తత్ర లిఙ్గః స్వయమ్భూస్తేన చాల్యతే। నీవారశూకవత్తన్వీ కుణ్డలీ పరదేవతా
శఙ్ఖతుల్యనిభా దేవీ సార్ధత్రివలయాన్వితా। ముఖేనాచ్ఛాద్య బ్రహ్మాస్యం తయా సంవేష్టితః ప్రభుః॥
సమ్మోహన తంత్రము.

దీనికిఁ బర్యాయములు.

'కుటిలాఙ్గీ కుణ్డలినీ భుజఙ్గీ శక్తి రీశ్వరీ
అరున్ధతీ' ...................................... హఠయోగదీపిక.

దేహమునందు మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ, అని ఆఱుచక్రములును దానిపైని సహస్రారపద్మమును గలవు.

'మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానంచ మేహనమ్। నాభిస్తు మణిపూరాఖ్యం హృదయాబ్జ మనాహతమ్।
తాలుమూలం విశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలామ్బుజం। సహస్రారం బ్రహ్మరన్ధ్ర మిత్యాగమవిదో విదుః॥

అన్నట్లు, గుహ్యలింగములకు నడుమ రెండంగుళులక్రిందియగుస్థానము మూలాధారము. అందు 'వ, శ, ష, స' అను అక్షరములతోఁ గూడినదై బంగారువర్ణము గలిగి నాలుగు దళములుగల పద్మముండును. దానికినడుమ ఇచ్ఛా, జ్ఞాన, క్రియాస్వరూపమగు త్రికోణముగలదు. అందు పృథివి వర్తించుచున్నది. అందే మృణాళసూత్రమువలె సూక్ష్మమై సార్ధత్రి (3½) వలయాకారమై మెఱుపుంబోని ప్రభగలిగి స్వయంభులింగమును పరివేష్టించి 'కులకుండలిని' అనెడి శక్తియున్నది. స్వాధిష్ఠానము రెండవది. ఇది 'బ, భ, మ, య, ర, ల, వర్ణములతోఁగూడి, ఆఱుదళముల పద్మము గలిగి యుండును. ఇందగ్ని వర్తించుచున్నది.

'కుండలిస్థానము' అనుచో శక్తిపరముగా 'కుండలీ' అనియు (జాతియందు జీప్), సర్పపరముగా 'కుండలిన్' అనియు (ఇన్నంతముగా) రూపములు. రెండురూపములకు సమముగాఁ బొందుపఱుటకై కవి 'కుండలిస్థాన' మన్నాఁడు.]

అపవర్గమార్గస్థితిన్ = (అపజయ) వర్గమనఁగా పుత్రపౌత్రాదికము - అపగతమయిన పుత్రపౌత్రాదికముయొక్క మార్గమందలి స్థితిని-పుత్రపౌత్రాదులమార్గమందు వర్తించుట అపగతమయినవాఁ డగుటను- పుత్రపౌత్రాదులతోఁగూడి స్వస్థానమున వర్తించుటలేక పలాయితుఁ డయినవాఁ డనుట, బెరయున్ = పొందునో - (అపవర్గమనఁగా మోక్షము. మోక్షమార్గమందలి వృత్తిని బొందునో-మోక్షమార్గమందు వర్తించునో యనియు) అతఁడు - అనఁగా నిజాముఁడు, పరబుద్ధిచేత ఎవనిపేరు దలఁచి పయిని చెప్పఁబడినప్రకారముల వర్తించునో యతఁడైన యనుట, శ్రీరాముఁడు—శ్రీ=సంపద్యుక్తుఁడయిన, రాముఁడు = రామరాజని యర్థము—శ్రీ = లక్ష్మీయుక్తుఁడయిన, రాముఁడు=శ్రీరాముఁడని యర్థాంతరము, అఖిల సన్నుతికిన్=ఎల్లవారియొక్క స్తోత్రమునకు, తగఁడే= అర్హుఁడుగాఁడా - అర్హుఁడు గాఁదగుననుట. అతఁడు మఱియు నెట్టివాఁడనఁగా, సేతు... యశుఁడు— సేతు శీతశైల అంతర=సేతువునకును శీతశైలమునకు మధ్యమగు భూమియందు, ఖ్యాత=.

ప్రసిద్ధమయిన, యశుఁడు = కీర్తిగలవాఁడని యర్థము. ఇట శ్లేషము లేక ధ్వనియు మతభేదమున గ్రహించునది.

చ. అరి జయ కీర్తి సాంద్రుఁ డగునయ్యభిరామ నరేంద్ర సోదరుం
దిరుమలదేవరాయల నుతింపఁ దరంబె తదీయహేతి శాం
కరి యతిలోహితావయవయై తగఁ దను నాత్మహృదంతరంబులం
దరలక తాల్చువారలకుఁ దార్చు సురీ వరణీయ వైఖరుల్. 48

అ. అరి...సాంద్రుఁడు—అరిజయ=శత్రుజయమువలని, కీర్తి=యశస్సుచేత, సాంద్రుఁడు = దట్టమయినవాఁడు - అకీర్తి దట్టముగాఁ గలవాఁడనుట, అగు, అయ్యభిరామ...సోదరుక్—అయ్యభిరామనరేంద్ర=ఆ రామరాజుయొక్క, సోదరుక్=తమ్ముఁడయిన, తిరుమలదేవరాయలను, నుతింపక్ తరంబె=పొగడ శక్యమా-శక్యము గాదనుట, ఏలనఁగా, తదీయ...శాంకరి—తదీయ = అతనిదయిన, హేతి = ఖడ్గమనెడి, శాంకరి=శాంకరియనెడు శక్తి, అతిలోహిత+అవయవఁ గాక్ = (ఖడ్గ) మిక్కిలియు రక్తముతోఁగూడిన అవయవముగల దానినిగా, (శక్తి) మిక్కిలి ఎఱుపైన మూర్తిగల దానినిగా, తనుక్=తన్ను, ఆత్మహృదంతరంబులక్ = (ఖడ్గ) తమవక్షస్థలముల నడుమ- (శక్తి) తమ హృదయములలోపల, తరలక = చలింపక, తాల్చువారలకుక్ = ధరించుచట్టివారికి, సురీ...వైఖరుల్—సురీ = దేవతా స్త్రీలకు, వరణీయ = వరింపఁదగిన, వైఖరుల్ = రీతులను, తార్చుక్ = ఒడఁగూర్చును. ఖడ్గము నెత్తుటఁ దోఁగినట్లు తమ వక్షస్థలములందు గ్రుచ్చఁబడినవై తమ్ము హతులంగావించి స్వర్గమందలి యప్సరః స్త్రీలప్రాప్తిని గలిగించుచున్నదని యర్థము. శాంకరి ఉదయసూర్యునిరీతిని మిక్కిలి రక్తిమతోఁగూడిన దేహముగల దానినిగాఁ దన్ను తమ హృదయాంతరములందు ధ్యానము చేసి నిలిపినవారికి దేవతా స్త్రీలను వశీకరించు సామర్థ్యము నిచ్చుననియు నర్థము.

శాంకరిని అరుణాకారము గలదానినిగాను, ఆమె దేహకాంతి చేత నుండే భూమిని ఆకాశమును అరుణితమయిన దానినిగాను ధ్యానము చేసిన వారికి స్త్రీవశీకరణ సిద్ధియగునని ఆగమరహస్యము.

శ్లో॥ యావకాబ్ధా నిమగ్నాం యోదివం భూమించ చిన్తయేత్ ।
తస్య సర్వావశం యాతా త్రైలోక్యవనితా ధ్రువమ్ ॥

శ్లో॥ తనుచ్ఛాయాభి స్తే తరుణతరణిశ్రీసరణిభి । ర్దివంసర్వా ముర్వీ మరుణిమనిమగ్నాం స్మరతి యః।
భవన్త్యస్య త్రస్యద్వనహరిణశాలీనయనాః। సహోర్వశ్యా వశ్యాః కతి కతి న గీర్వాణగణికాః॥
సౌందర్యలహరి.

శ్లో॥ మాణిక్యారుణమూర్తిం త్వాం, ప్యాత్వా ప్యావహాత్మమ ।
లక్ష్మ్యై ఏవ వశీకారో జాతః కనకముద్రికే ॥ ముద్రికాలాభము.

యుద్ధమున హతులయిన వీరులకు దేవకన్యాప్రాప్తి కలుగుననుటకు

చ. ఉభయరగండ తావకరణోగ్రగజానకముల్ గుభుల్ గుభుల్
గుభు లని మ్రోయఁగా భవదకుంఠితవీరభటుల్ ప్రభుల్ ప్రభుల్
ప్రభులని శత్రుభూపతులపైఁ జొరఁబాఱ నెడక్ ఘభుల్ విభుల్
విభులని సంభ్రమింపుదురు వేడ్క నఖర్వ సుపర్వ భామినుల్. నరసభూపాలీయము.

ఇచట 'తిరుమల దేవరాయలక్' అని పూజార్థకబహువచనమునకు విశేషణమగు 'సోదరుక్' అనునది ఏకవచనాంతము. 'తిరుమల దేవరాయనిక్' అని సోమకవి పాఠము. ఇందులకు

'ఏకత్వం భేదకగతబహువచనానాంచ దృశ్యతే విక్రుతౌ' అథర్వణ.
అనునదియే ప్రమాణముగా నోపు. ఇందు శ్లేషరూపకములకు సంకరము.

క. ఆరాయమణికి జగతీ, హారాయిత కీర్తి ఘృణికి నైనుసంభవుఁ డై
నారాయణాంశభవుఁ డితఁ, డౌరా యన వేంకటక్షమాధిపుఁ డలరున్. 49

అ. వేంకట క్షమాధిపుఁడు=వేంకట రాయరాజు, జగతీ ... ఘృణికిన్—జగతీ=భూమికి, హారాయిత=ముత్యాలహారమువలె నాచరించుచున్న, కీర్తిఘృణికిన్=కీర్తియొక్క ధవళకాంతి గలవాఁడగు, ఆరాయమణికిన్=అతిరుమల దేవరాయ శ్రేష్ఠునకు, అనుసంభవుఁడై=తమ్ముఁడై, నారాయణాంశభవుఁ డితఁడు ఔరాయనన్ = ఔరా యితఁడు నారాయణ మూర్తియంశమున జన్మించినవాఁడు అనునట్లు, అలరున్=ఒప్పుచుండును.

ఇందు కీర్తిఘృణి జగతికి హారాయితమైన దనుటచే కీర్తి ఎక్కుడి ధవళమై జగమునంతయు వ్యాపించియుండుట తెలియునది. జగతీ అని స్త్రీలింగమువలన స్త్రీత్వము వ్యంజిత మగుచున్నదిగాన, 'హారాయిత' యనుచో నుపమాలంకారము. సాధారణ ధర్మము కనఁబడమిచే ధర్మలుప్తోపమ.

తా. జగతికి ముత్తెపుహారమువలెఁ దెల్లనయినకీర్తిప్రకాశము గలయాతిరుమలదేవరాయ శ్రేష్ఠునకుఁ దమ్ముఁడై 'ఔరా! యితఁడు నారాయణాంశమునఁ బుట్టినవాఁడో' యని జను లెన్నునట్లు వేంకటరాయ రా జొప్పుచుండును.

సీ. నిరతంబు దుర్మార్గనిరతు లౌ తురకల, నతుల సన్మార్గ సంగతులఁ జేసె
ననియత మోహాంధు లౌ పారసీకుల, స్వస్త్రీసుఖైక నిశ్చలులఁ జేసె
నతనిర్దయాత్ము లౌ యవనుల భూతసం, తాన తృప్తిప్రదాత్మకులఁ జేసె
ద్విజపక్షపాతంబుఁ దెగడు పాశ్చాత్యుల, ద్విజ పక్షపాత భావితులఁ జేసె
తే. ననుచుఁ గడుమెచ్చి జయలక్ష్మి యాజిరంగ, కాతరబరీద కేతన ఘటితభద్ర
కలశ మెదురుగఁ బూని యేఘనునిఁ జెందె,నతఁడు సామాన్యుఁ డే వేంకటాద్రివిభుఁడు.

అ. జయలక్ష్మి=జయలక్ష్మి అనెడు నాయిక, నిరతంబు = నిరంతరము, దుర్మార్గనిరతులు=దుర్మార్గమం దాసక్తులు, ఔ, తురకలను, అతుల ... సంగతులన్—అతుల = సమానరహితమయిన, సత్+మార్గ = సజ్జనమార్గముతోడ, సంగతులన్ = కూడుకొన్నవారిని, చేసెనని యర్థము - దుర్మార్గులగు తురకలను సజ్జనమార్గమందు వర్తించునట్లు చేసెననుట. సన్మార్గమనఁగా నక్షత్రమార్గము, అనఁగా ఆకాశము, గనుక సన్మార్గసంగతులన్ జేసెననఁగా, ఆకాశసంగతులను జేసినని యర్థాంతరము.

అనియతమోహాంధులు = అనియత=నియతిము గానట్టి, మోహ=కాముకత్వముచేత, అంధులు=గుడ్డివారయిన - ఈ స్త్రీ గూడదగును దీనిని గూడఁదగదు అని శాస్త్రనియమములేక కన్నగానక కామము పచరించువారై యునట్టి యనుట, పారసీకులన్ = మ్లేచ్ఛులను, స్వస్త్రీ ... నిశ్చలులన్—స్వస్త్రీ=తమతమభార్యలవలని, సుఖ = భోగమందు, ఏక = ముఖ్యముగునట్లుగా, నిశ్చలులన్ = చలింపనివారినిఁగా. చేసెనని యర్థము. స్వఃస్త్రీ = స్వర్గస్త్రీలయందలి, సుఖమునం దాసక్తులనుగాఁ జేసెనని యర్థాంతరము. ఇచట స్వ+స్త్రీ = తమ యాఁడుది, స్వః+స్త్రీ = స్వర్గపు ఆఁడుది అని యర్థము. ఈ రెండుపక్షములందును స్త్రీశబ్దసకారమునకు ద్విత్వముగాని స్వః శబ్దవిసర్గమునకు వికల్పలోపముగాని చేయవచ్చును.

అతి నిర్దయాత్ములు=మిక్కిలియు దయలేని మనసుగలవారు, జో, యవనులన్ = యవనదేశపు తురకలను, భూత...త్మకులన్—భూతసంతాన=ప్రాణికోటికి, ('భూతఃక్ష్మాదౌ పిశాచాదౌ న్యాయ్యే సత్త్వోపమానయోః' విశ్వ) తృప్తి+ప్రద=తృప్తినిచ్చునట్టి - హితముగావించునట్టి, ఆత్మకులన్ = మనస్సుగలవారినిగా చేసెననియర్థము. భూతసంతాన = పిశాచగణమునకు, తృప్తిప్రద = తృప్తినిచ్చునట్టి, ఆత్మకులన్ = దేహములు గలవారినిగాఁ జేసెనని యర్థాంతరము. ఇట ఆత్మన్ శబ్దము దేహపరము. 'ఆత్మా యత్నో ధృతిర్బుద్ధి స్స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ. తురకలను జంపి వారి కళేబరములను పిశాచాదుల కాహారము గావించెననుట.

ద్విజపక్షపాతంబున్ =బ్రాహ్మణపక్షపాతమును, తెగడు పాశ్చాత్యులన్ =నిందించునట్టి పశ్చిమదేశ వాసులయిన మ్లేచ్ఛులను, ద్విజపక్షపాత = బ్రాహ్మణులయందలి పక్షపాతముచే, భావితులన్ = చిత్తముగలవారినిగాఁ జేసెనని యర్థము. ద్విజ = కంకగృధ్రాది పక్షులయొక్క, పక్షపాత=పక్షవిక్షేపముచేత-ఱెక్కలకొట్టుటచేత, భావితులన్ =పొందఁబడినవారినిగాఁ జేసెనని యర్థాంతరము. యుద్ధరంగమున హతులయి గ్రద్దలు మొదలగువాని ఱెక్కలచేఁ గొట్టుపడునట్లు చేసెననుట. 'లబ్ధం ప్రాప్తం విన్నం విత్తం భావిత మాసాదితంచ భూతంచ' అమ.

అనుచున్ =ఇట్లుపలుకుచు, కడుమెచ్చి = మిక్కిలియుశ్లాఘించి, ఆజిరంగ...కలశము—ఆజిరంగ=యుద్ధరంగమందు, కాతర=భయశీలుఁడయిన, ఖరీద=బెదరుకోట నబాబుయొక్క, కేతన=ధ్వజమందు, ఘటితే=నిలుపఁబడిన, భద్రకలశము=సువర్ణకలశమనెడి పూర్ణకలశమును- ('భద్రఃకుమ్భః పూర్ణకుమ్భః' అమ. 'భద్రం స్యాన్మఙ్గళే హేమ్ని ముస్తకా కరణాన్తరే' విశ్వ.) ఎదురుగన్ పూని= ఎదురుగఁబట్టుకొని, ఏఘనునిన్ =ఏమహానుభావుని, చెందెన్ =పొందెనో, బెదరుకోట నబాబును గెలిచి యతని ధ్వజమందలి సువర్ణకలశమును కయికొనుట జయలక్ష్మి పూర్ణకలశమునెత్తికొని తన్నుఁ జెందుటగా నధ్యవసించినాఁడని తెలియునది. ముత్తయిదువ పూర్ణకలశమునెదురుగఁ బట్టికొనివచ్చుట మంగళప్రదమనియు మంగళసూచకమనియుఁ దెలియునది. దానినే యిట కవి యనుసంధించినాఁడు. అతఁడు=అట్టివాఁడయిన, వేంకటాద్రివిభుఁడు=వేంకటరాయఁడు, సామాన్యుఁడే=కేవలుఁడా. అందఱు రాజులపాటివాఁడు గాఁడనుట.

ఇట జయలక్ష్మికి వేంకటాద్రిరాయని శ్లాఘించు సంబంధములేకపోయినను సంబంధమును వర్ణించుటచే అతిశయోక్తి. ఇది 'సన్మార్గ' ఇత్యాది పదశ్లేషముచే నుత్థాపితము గనుక శ్లేషమునకును దీనికిని సంకరము. మఱియు నింను బరీదుఁడు జయింపఁబడినాఁడను గమ్యమును జయలక్ష్మి వేంకటరాయని ప్రాప్తించినదనెడి యొకభంగ్యంతరముచేతఁ జెప్పుటచేత పర్యాయోక్తము నలంకారము.

ఇట జయలక్ష్మి దివాభిసారిక. అభిసారిక-ఇది అష్టవిధనాయికలలో నొకతె. 'యా కాన్తాఽభిసరేత్కాన్తం సారయేద్వాఽభిసారికా' కాంతునిఁగూర్చి తానై సంకేతస్థలమునకు పోవునది గాని కాంతుని రప్పించుకొనునది గాని అభిసారిక. ఇందు పరకీయకు సమయానుగుణమగు వేషభూషలును శంకాప్రజ్ఞానైపుణ్యములును కపటసాహసాదులును చేష్టలు. స్వీయకు పతిశుశ్రూషాదులు చేష్టలు. స్వీయకు సమయానుగుణ వేషభూషాదులు గలుగవని కొందఱు; కలుగుటయే చమత్కారి యని మఱికొందఱు. ఈ అభిసారిక, (కొందఱి మతమున పరకీయ యగునది మాత్రమే) దివాభిసారిక, జ్యోత్స్నాభిసారిక, తమిస్రాభిసారిక, యని మూఁడు తెఱంగుల నుండును.

మ. కడిమిన్ వేంకటరాయశౌరి నెదురంచగా లేక యత్యాహితం
బడరన్ గౌతమి దాఁటువేళ నిజకాంతాశ్రు ప్రవాహోక్తిఁ గా

ల్నడ దప్పఁ జడుఁడై నిజాముఁ డుడుపాశ్రయాలంబంబునం దాఁటి యె
క్కడఁ గన్నఁ భజియించు నయ్యుడుపరేఖఁ నామమోహంబునన్. 51

అ. నిజాముఁడు, కడిమిన్ = బలిమిచేత - పౌరుషముచేత ననుట, వేంకటరాయశౌరిన్ = శూర వంశజాతుండయిన వేంకటరాయలను, ఎదురఁగాన్ లేక = మార్కొని నిలుచుటకుశక్తుఁడుగాక, అత్యాహితంబు = మిక్కిలియు భయము - 'అత్యాహితం మహాభీతిః' అమ. అడరన్ = పయికొనఁగా - ఉద్రేకింపఁగా ననుట. గాతమిన్ దాఁటువేళన్ = పాఱిపోవుచు గోదావరినిదాఁటు సమయమందు, నిజ...: ఆప్తిన్ - నిజ = తన, కాంతా = భార్యలయొక్క, అశ్రు = శోకబాష్పములవలన నయిన, ప్రవాహ = పయినీటిపొర్లుయొక్క, ఆప్తిన్ = కూడికచేత - తనభార్యలవ్వారిగాఁ దొరఁగిన కన్నీరు వెల్లువయై యాగోదావరిలో పయివెల్లువ రాఁగా ననుట, కాల్ నడ తప్పన్ = కాలితో నడచిపోవుట కయితిలేక పోవఁగా, వెల్లువ యెక్కువ యగుటచే కాలనడచిపోవుట అశక్యముకాఁగా ననుట. జడుఁడై = విభ్రాంతిఁ బొందినవాఁడై, ఉడుప + ఆలంబంబునన్ = తెప్పకొయ్యయొక్క అవలంబించుటచేత - తెప్పకొయ్యనాధారముగానెక్కి యనుట, గోదావరిని, దాఁటి, ఎక్కడన్ = ఎచ్చోటను, కన్నన్ = చూచినను, అయ్యుడుపరేఖన్ = (ఉడుపశబ్దము తెప్పయందును జంద్రునియందును వర్తించుచున్నది - 'ఉడుపం తు ప్లవేచన్ద్రే' విశ్వ.) ఆచంద్రరేఖను - నెలపొడుపునాఁటి చంద్రరేఖననుట, నామమోహంబునన్ = ఏక నామ భ్రాంతిచేత - తెప్పకును చంద్రునకును 'ఉడుప' యని ఏకనామము. తనకట్టి యాపత్సమయమందుపకరించిన యాతెప్పకొయ్యపేరే చంద్రుఁడును గలిగియున్నాఁడని చంద్రునియందు మిక్కుటమైన వలపునకుఁ బరవశుఁడై యనుట, భజియించున్ = సేవించును. అనఁగా ఉడుపరేఖ ఆపత్కాలమందుఁ దన్నుద్ధరించుటం బట్టి ఉడుపరేఖానామముగల చంద్రరేఖను సేవించునని తాత్పర్యము.

నెలపొడుపునాఁటికి తురకలు చంద్రరేఖనుజూచుట ప్రసిద్ధము. చంద్రునికిని దెప్పకును ఉడుప యనునామసామ్యమును గొని యాచంద్రరేఖను జూచుటకుఁ గారణము అది తన్నుద్ధరించిన తెప్పకొయ్యయొక్క ఉడుపయను పేరుగలిగి యుండుటగాఁ గవి యధ్యవసించినాఁడు. లోకమున మహోపకారపరులయినవారియందలి ప్రేమనుగాని భక్తిఁగాని వారిపేరుగలవారియందును జూపుట గలదు. ఇట చంద్రరేఖనుజూచుటకు, ఆపత్కాలమును గోదావరిని దాఁటుటకు తెప్ప సాహాయ్యపడుట హేతువుగాకపోయినను హేతువుగా సంభావించుటచే హేతూత్ప్రేక్ష; ఇది ఉడుపశబ్దగత మయినశ్లేషముచే నుత్థాపితమయినది గాన రెంటికిని సంకరము. కాంతల యశ్రుపూరమునకు గోదావరీప్రవాహమును రెందు సంబంధము లేకున్నను సంబంధమును జెప్పుటచే అతిశయోక్తియు నలంకారములు.

తా. నిజాముఁడు తనబలిమిచే వేంకటరాయుల నెదిరించి నిలువఁజాలక మిక్కిలిభయము పయికొనఁగా పాఱిపోవుచు గోదావరీనదిని దాఁటునపు డతనిభార్యల కన్నీరు వెల్లిగొని యానదియందు పయివెల్లువగాఁ రాఁగ కాలిచే దాని దాఁటనయితి లేక యొకయుడుపను (అనఁగా తెప్పను) ఊని దాఁటి యాయుడుపనామమే చంద్రుఁడునుగలిగి యున్నందున, నామసామ్యముచే నయిన మోహముచే నెక్కడఁజూచినను ఆయుడుపరేఖను (అనఁగాఁ జంద్రరేఖను) సేవించుచుండును.

ఉ. ఏక సపాద లక్ష మిత శ్రీ మిగ్రదజు దోశ్చరిత ప్రబంధ మ
స్తోకమె యంచుఁ జాపజిత శ్రీ ధూర్జటి వేంకటశౌరి శౌర్య దీ
ప్తాకృతి కర్ణ భీష్మజయ శ్రీ శక్తి ననేక సపాదలక్ష సం
ఖ్యాకమనీయ భూరివిభశ్రీవాప్తి వహించు నుదంచితోన్నతిన్. 52

అ. చాపజితధూర్జటి—చాప=ధనుస్సుచేత, జిత=జయింపఁబడిన, ధూర్జటి=శివుఁడుగలిగినవాఁడయిన - అర్జునునివలె చాపముచేత శివుని గెలిచినవాఁడయిన యనియర్థము. చాపముచేత గెలువఁబడిన ధూర్జటి యనురాజుగలవాఁ డయినయని భావము. వేంకటశౌర = వేఁకటరాయఁడు, శౌర్య...కృతి—శౌర్యదీక్షా=పరాక్రమదీక్షయందు, కృతి = కుశలుఁడయినవాఁడగుచు, ఇంద్రజదోశ్చరితంబు=ఇంద్రకుమారుఁడయిన అర్జునునియొక్క, దోశ్చరితంబు=భుజపరాక్రమచరిత్రము. హరివంశసహితమైన మహాభారతమనుట. ఏకసపాద లక్షమితము=పాదసహితమయిన లక్షయనెడు పరిమాణముగలది- అనఁగా ఒకటియుఁ బాతికలక్షకొలఁదిగలది - మహాభారతము లక్షయు, హరివంశము ఇరువదియైదువేలును గ్రంథములు గలవి. అస్తోకమె = అది మిక్కిలి యధికమయినదా - అనఁగాఁ గొంచెమే, అంచుక్, కర్ణభీష్మ జయశక్తిని = (అర్జునునివలె) కర్ణుని భీష్ముని జయించుటయందలి సామర్థ్యము చేత నని యర్థము. చెవులకు భయంకరమయిన జయశక్తి చేతనని భావము. అనేక...వాప్తి—అనేక=మితిలేని, సపాద లక్ష = పాదసహితములయిన లక్షలనెడి, సంఖ్యా=సంఖ్యచేత, కమనీయ = ఒప్పుచున్న, భూరి = అతిశయించిన, విభవాప్తిని=పరాక్రమప్రబంధరూపమయిన విభవముయొక్క ప్రాప్తిని, ఉదంచిత+ఉన్నతిక్=మిక్కిలి యొప్పుచున్న ఔన్నత్యముచేత, వహించుక్=పొందించుకొనుచు, అని యర్థము. అనేకులయిన సపాదులయొక్క, లక్షలకొలఁదియగు, భూరి=బంగారముయొక్క, విభవముయొక్క ప్రాప్తిని బొందించుకొనునని భావము. అనఁగా నర్జునునికంటె నితఁడు భుజపరాక్రమ ప్రబంధమెక్కుడుగాఁ గలవాఁడని ఫలితార్థము. రెండవయర్థమున భూరియనఁగా బంగారము. 'భూరిప్రాజ్యసువర్ణయోః' విశ్వ.

ఇచట శ్లేషోత్థాపితమయిన వ్యతిరేకమలంకారము. ఇట నర్జునునకును వేంకటరాయనికి చాపజితధూర్జటిత్వమును కర్ణ భీష్మ జయశక్తిమత్త్వమును సమానధర్మములు. అర్జునుని పరాక్రప్రబంధము ఏకసపాద లక్ష మితము. వేంకటరాయని పరాక్రమ ప్రబంధము అనేకసపాదలక్షమితము గాన వేంకటరాయఁడే యధికుఁడని వ్యతిరేకము దెలియునది.

ఉ. ఆయనుజుల్ విశుద్ధ హరిదంత మహా కరిదంత కాంతి రే
ఖాయితకీర్తులై కొలువఁ గౌతమినీట నరాతిఘాతి కౌ
క్షేయక రక్తముల్ గడిగి శ్రీరమణీ వరమూర్తి రామ భూ
నాయకుఁ డుర్వినేలె భువనస్తవనీయ జయాభిరాముఁడై. 58

అ. శ్రీరమణీవరమూర్తి—శ్రీరమణీ=లక్ష్మీకాంతకు, వర=నాథుఁడయిన - నారాయణునివంటి, మూర్తి = రూపముగల, రామభూనాయకుఁడు = రామరాజు, ఆయనుజుల్ = పూర్వముచెప్పఁబడిన యాత్మజులు, అనఁగా తిరుమలరాయఁడును వేంకటరాయఁడుననువారు, విశుద్ధ...కీర్తులై—విశుద్ధ=స్వచ్ఛమయిన, హరిదంత = దిగంతములయందలి, మహాకరిదంత = మహాగజముల దంతములయొక్క, కాంతిరేఖాయిత=కాంతిశ్రేణివలె ఆచరించుచున్న-విస్తరించిన, కీర్తులై=యశస్సుగలవారై 'కాంతిరేఖాయత'యని పాఠము గ్రహించినయెడ యతిభంగము. కొలువక్=సేవింపఁగా, గౌతమినీటక్=గోదావరిజలమందు, అరాతి ..రక్తముల్—అరాతి = శత్రువులను, ఘాతి=ఖండించిన, కౌక్షేయక=ఖడ్గము యొక్క, రక్తముల్=నెత్తురులను, కడిగి=తుడిచివైచి, అనఁగా కందనోలు మొదలుకొని గోదావరివఱకుఁ దనఖడ్గముచేత శత్రుసంహారముచేసి గోదావరిలోఁ గత్తిగడిగినవాఁడని యాశయము. 'కౌక్షేయకో మణ్డలాగ్రః కరవాలః కృపాణవత్' అమ. భువన...రాముఁడై—భువన=లోకముల

చేత, స్తవనీయ=స్తోత్రము చేయఁదగిన, జయ=శత్రుజయముచేత, అభిరాముఁడై=ఒప్పుచున్నవాఁడై, ఉర్విన్=భూమిని, ఏలెన్=పరిపాలించెను. కాంతిరేఖాయితకీర్తులన్నచో నుపమాలంకారము. దిగ్గజములదంతముల కాంతిశ్రేణివలెఁ గీర్తియున్న దనుటచే కీర్తిదిగంతములవఱకు వ్యాపించియున్న దనుట తెలియునది.

తా. అట్టిప్రసిద్ధులగు తనతమ్ములు తిరుమలరాయఁడును వేంకటరాయఁడును, దిగంతములందలి మహాగజముల దంతకాంతిశ్రేణివలెఁ దమకీర్తులు వెలయుచున్నవారై తన్ను సేవింపఁగా శత్రురాజులను చెండాడినఖడ్గము రక్తములను గోదావరినీటఁ గడిగివైచి లక్ష్మీనాథుఁడగు నారాయణునివలె శుభమంగళవిగ్రహుఁడయిన రామరాజు, లోకములందెల్ల పొగడందగిన జయముచే వెలుంగుచు భూమిని బరిపాలించెను.

క. ఆరామశౌరిపిమ్మట, ధీరామరశాఖి వీర ♦ తిరుమలరాయం
డారామసేతుహిమవ, త్త్సారానూరమణుఁడై జగంబు భరించెన్. 54

అ. ఆరామశౌరిపిమ్మటన్ = ఆరామరాజునకు అనంతరము, ధీర+అమరశాఖి= విద్వాంసులకు కల్పవృక్షమయినవాఁడగు - అనఁగా కల్పవృక్షమువలెఁ గోరినవస్తువులెల్ల నొసంగువాఁడగు, వీర తిరుమలరాయండు = శూరుఁడైన తిరుమలదేవరాయఁడు, ఆరామ...రమణుఁడై = రామసేతువుమొదలుకొని హిమవత్పర్వతమువఱకుఁగల భూమి యనుకాంతకు అధిపతియై, జగంబున్ భరించెన్=జగత్తును పాలించినవాఁడయ్యెను. ధీరామరశాఖియనుచో నలంకారము రూపకము.

తా. ఆరామరాజునకుఁ బిమ్మట విద్వాంసులకుఁ గల్పవృక్షమువలెఁ గోరినకోర్కులనెల్ల నిచ్చు వీరుండయిన తిరుమలదేవరాయఁడు, రాముని సేతువు మొదలుకొని హిమవంతమువఱకుఁగల భూమికెల్ల నేలికయై జగమును బరిపాలించెను.

సీ. కావుకా వనువారిఁ ♦ గదిసి తుంగపయోధ,రర దాంతరంబు చేరంగ నీదు
వివృతాగ్రరదనులై ♦ వ్రేళ్లుచీఁకెడువారి, మోముచేర్చిశిరంబు ♦ మూరుకొనదు
పదములు దొట్రిలఁ ♦ బరువులెత్తెడివారి, ననురక్తవృత్తి వెన్నాడిచనదు
పలుచాపలములఁ బుట్టలు♦మెట్టఁజనువారిఁ, దత్తఱంబునఁ గుచ్చి ♦ యెత్తికొనదు
తే. కాంచదోవిజయశ్రీలఁ ♦ బెంచదోప్ర,తాపబాలార్కులను శుభోదయముమీఱ
నౌర తిరుమలరాయ బాహాసిపుత్రి, యఖిలలోకాద్భుతక్రీడ ♦ నతిశయిల్లు. 55

అ. ఇందుఁ దిరుమలరాయని బాహాసిని బుత్రవతియైన పుత్రికగా నధ్యవసించి యర్థద్వయము గలుగఁజెప్పినాఁడు. తిరుమలరాయ బాహాసిపుత్రి=తిరుమలదేవరాయలఖడ్గలత - పుత్రికయును-'స్యాచ్ఛస్త్రీచాసిపుత్రీచ చ్ఛురికాచాసిధేనుకా' అమ. (అని) కావుకావు అనువానిన్ = రక్షింపు రక్షింపు మనువారిని, కదిసి = తారసించి, తుంగ.. నీదు—తుంగ = ఉన్నతములయిన, పయోధర = మేఘములకు, పద = స్థానముయొక్క అనఁగా ఆకాశముయొక్క, అంతరంబు = మధ్యప్రదేశమును, చేరంగనీదు = పొందునట్లుగాఁజేయుదు. అనఁగా నట్టివారిని హతులనుగావించి యూర్ధ్వలోకమునకుఁ బోవునట్లు సేయుదనుట. (పుత్రి) కావు ..గదిసి = కావు కావురని పోరుపెట్టియేడ్చు నిసువులను దగ్గఱఁబోయి, తుంగ...పదాంతరంబు—తుంగ=నిక్కుగల, పయోధరపద=కుచములస్థానముయొక్క, అంతరంబు = మధ్యప్రదేశమును, చేరంగనీయదు. కావుకావురని పోరుపెట్టి యేడ్చుబిడ్డలను దగ్గఱకు

బోయి గబ్బిగుబ్బ పాలిండ్లనడుమ వారిమోమువొత్తి చన్నుఁగుడుపదనుట. 'స్త్రీస్తనాబ్దౌ పయోధరౌ' అను. అని పయోధరశబ్దము స్త్రీస్తనములందును మేఘమునందును వర్తించును.

వివృతా...మూరుకొనదు—(అసి) వివృత+అగ్రరదనులై = తెఱవఁబడిన ముందటిపండ్లు గలవారై, వ్రేళ్లు చీఁకెడివారిన్ = వ్రేళ్లు నోటఁగఱచుకొన్నవారిని, మోముఁజేర్చి= తనమూఁతిని తాఁకించి-మొనవాఁడితాఁకఁచి యనుట, శిరంబు మూరుకొనదు=శిరస్సును ఆఘ్రాణింపదు-ఖేదింపదనుట. (పుత్రి) వివృతాగ్రరదనులై=స్ఫుటముగాఁ గనబడ్డ ముందటిపండ్లుగలవారై - ముందటిపండ్లుమాత్రము మొలచి కనఁబడుచున్నట్టి వారనుట, వ్రేళ్లుచీఁకెడివారిన్ =వ్రేళ్లుగుడుచుకొను బాలకులను, మోముచేర్చి= ముఖముసానించికొని, లేక ముఖముతో ముఖమును జేర్చుకొని-'మోమున మోముఁజేర్చు' అని ప్రయోగము. శిరంబుమూరుకొనదు=జౌదలను వాసనఁజూడదు-మూర్ధాఘ్రాణము సేయదనుట.

పదములు...చనదు—(అసి)పదములు తొట్రిలన్=కాళ్లు తడఁబడఁగా - భయాతిశయముచేత ననుట, పరువులుఎత్తెడివారిన్ =పాఱిపోవునట్టివారిని, అనురక్తవృత్తిన్=అనుగతమయిన రక్తము గల వృత్తిచేత - నఱకఁగానే రక్తముదొరంగునట్లు ప్రవర్తించునదై-రక్తముగార్చునట్లు నఱకుటకై యనుట. వెన్నాడిచనదు=వెంటఁదఱుముకొని పోవదు. (పుత్రి) పదము...వారిన్ =తప్పటడుగులు పెట్టి నడచునట్టిచిన్నవాండ్రను, అనురక్తవృత్తిన్ వెన్నాడిచనదు=అనురాగముగలవృత్తిచేత వెంబడించిపోవదు - వారెక్కడఁబడుదురో యని అనురాగము గడలుకొనఁగా వారినిఁబట్టుకొనుటకు వెంటఁ బరుగిడదనుట.

పలు...రొత్తికొనదు—(అసి) పలుచాపలములన్ = అనేకవిధములయిన చిత్తచాంచల్యముల చేత, పుట్టలు మెట్టన్ చనువారిన్ =పుట్టలపయి నెక్కఁబోవువారిని, తత్తఱంబునన్ =త్వరపాటుచేత - త్వరపడియనుట, గ్రుచ్చిరొత్తికొనదు = పొడిచిలేవనెత్తదు. (పుత్రి) పలుచాపములన్ = పలువిధము లయిన బాల్యచాపల్యములచేత పాముపుట్టలమీఁదికిఁ బోవుచున్న బాలురను అట్లుపోకుండునట్లు బిగ్గఁ బట్టి కౌఁగిలించి ఎత్తికొనదు.

శుభ-ఉదయముమీఱన్ =శుభకరమయిన యభ్యుదయము అతిశయించునట్లుగా-శుభమయినజననము అతిశయించునట్లుగాననియు, విజయశ్రీలన్ కాంచదో=విజయసంపదలను బొంపలేదా-గెలుపులను చక్కఁగా బొందలేదాయనుట. (విజయశ్రీ-శ్రీ యనెడి యాఁడుపిల్లలను గనలేదాయనియు) ప్రతాపబాలార్కులన్ పెంచదో=బాలసూర్యునివంటి ప్రతాపములను నతిశయింపఁ జేయలేదా. (ప్రతాపుఁడు బాలార్కుఁడనెడి మగచిన్నవాండ్రను పెంపలేదా యనియు) ఔర=భళా, అఖిల...క్రీడ—అఖిలలోక= సమస్తలోకములకును, అద్భుత=ఆశ్చర్యకరమయిన - వింతయైనట్టి, క్రీడన్ = విహారముచేత, అతిశయిల్లున్ =అతిశయించును.

రక్షింపుమనువారిని, నోట వ్రేళ్లుగఱచినవారిని, పరుగిడువారిని, పుట్టనెక్కినవారిని జంపరాదని వీరసంప్రదాయము. ఖడ్గము, శత్రువులను జంపిననేకదా జయలక్ష్మినిగాంచి ప్రతాపమును బెంచనేర్చును. కావుమన్నవారిని గదియుట మొదలయినకార్యములు చేయకయే జయలక్ష్మినిగాంచి ప్రతాపమును బెంచుకొన్నది. కాన దానిచరిత్రము సకలలోకాద్భుతముగా నున్నదని భావము. అసిపుత్రియనుచో శబ్దశక్తిచే పుత్రిక యిట వ్యంజిత యగుచున్నది. ఆపుత్రిక 'విజయశ్రీలన్...బాలార్కులన్' అనుటచే ఆఁడుబిడ్డలను మగబిడ్డలను గన్నదిగాఁజేసి, ఇట్టి పుత్రవతిగానుండియు 'కావు కావనువారి...రొత్తికొనదు' అను మొదలైనవానియందభేదాధ్యవసాయముచే కావురనియేడ్చు బిడ్డలను చన్నుగుడుపుట మొదలయిన పుత్రవతీకృత్యములు నేయదయ్యెనని యర్థాంతరమును బొందుపఱచి, కావుననే దానిచరిత్ర లోకాద్భుత మయ్యెనని వ్యంజితము గావించినాఁడు. కాన యిట వ్యంగ్యము. అతి

ప్రతియగునెడి విశేష్యము సయితము శ్లిష్టమయి యుండుటచే సమాసోక్తిగాని శ్లేషముగాని చెప్పఁదగదు. 'మీఁది నాలుగుచరణములందును శ్లేషమూలాతిశయోక్తి' సోమకవి.

ప్రథమమున కావుకావనికదలమెదలలేక యేడ్చునిసువులను, పిదప మునిపండ్లు చక్కఁగా మొలచి ప్రేళ్లుగుడుచువారిని, పిదప తప్పటడుగులుపెట్టి నడుచువారిని, పిదప నడ చక్కఁగాఁ గుఱిచి పుట్టలకెక్కఁబోవువారినిని, ఇట్లు పయిపయిని గలుగుబాల్యావస్థలుగలవారినిగా గ్రహించుటతెలియునది. తిరుమలరాయఁడు, యుద్ధధర్మమునువప్పక కావుకావుమనుట మొదలగునవి చేయునట్టి శత్రువులనుజంపక యెదిరించి నిలిచిన శత్రువులనే నుఱుమాడి జయలక్ష్మిఁ బొంది ప్రతాపము నతిశయింపఁ జేసెనని తాత్పర్యము. ఇట'కావుకావనువారి' ననుచో 'మధ్యమపురుష మువర్ణకమునకు హల్లును అవసానమును బరములగునపుడు లోపము వైకల్పికము' కాన మొదటి కావునకు మువర్ణము హల్లు పరమగుటచే లోపించుట న్యాయము. రెండవ 'కావు' నకు నచ్చుపరమగుటచే నది లోపింపరాకున్నను లోపించియుండుట శబ్దశాస్త్రవిరుద్ధముగాన 'శబ్దశాస్త్రవిరుద్ధం హి చ్యుత సంస్కారమిష్యతే' అన్నచ్యుత సంస్కారదోషము ప్రాప్తించుచున్నదని శంకింపరాదు. 'కావుకావు' అనునది జాతీయము. కావుననే 'కావుకావనుట రక్కసులమూఁకనె కాని ననిచె నీయెడ సింహనాదవిస్ఫూర్తి'(పాండురంగమాహాత్మ్యము.) ఇత్యాదులందును నచ్చుపరమయినపుడును మువర్ణలోపించి యున్నదని తెలియునది. 'వర్ణన్యూనాధికత్వాన్నావ్యదృశ్య లక్షణాద్గ్రామ్య' అను గ్రామ్యలక్షణముచొప్పున నిట వర్ణలోపముచే నిది గ్రామ్యోక్తిగా గ్రహించినను గ్రామ్యోక్తిని దత్తత్స్వభావవర్ణనమందుఁ బ్రయోగించుట. 'గ్రామ్యం తత్తద్విధా సాధ్వీ' దోషముకాదని యధర్వణాముల మతము. కావున నిట కాందిశీకస్వభావ వర్ణనమందే యది ప్రయుక్తమై యుండుటఁబట్టి దోషముగాదు. మఱి 'కాంచదో' 'పెంచదో' అనుచో ముత్తుపరంబయి యున్నపుడు చకారమునకు పకారమురాఁగా కాన్పదో పెంపదోయని రూపములు గావలయును. కావున కాంచదో పెంచదో యనురూపములు కవిత్రయమతమున దుష్టములు; ఇటీవలి కవులమతమున సాధువులుగా నున్నవి.

చ. కిరి కసహాయ జీవనముఁ గేవలగండము లద్రికోటికిం
గరులకు దుస్సహప్రకటఖర్జువు శ్వేతపుమేను చక్రి కీ
విరసులఁ బొందనోల్ల నని వేడ్కభజించె ధరాపురంధ్రి శ్రీ
తిరుమలదేవరాయ జగతీరమణుఁ రమణీ మనోభవున్. 66

అ. ధరాపురంధ్రి = భూకాంత, కిరికిన్ = ఆదివరాహమునకు, అసహాయజీవనము = సహాయ సంపత్తిలేని బ్రతుకు - ఒంటిగాఁ దిరుగుటయని భావము. 'కోలః పోత్రః కిరిః కిటిః' అమ. అద్రికోటికిన్ = కులపర్వతముల సమూహమునకు, కేవలగండములు = వట్టి ప్రాణసంకటములు - అన్నియు ప్రాణసంకటములేయనుట. గండశిలలని భావము. కరులకున్ = దిగ్గజములకు, దుస్స...ఖర్జువు—దుస్సహ = సహింపరానిగాని, ప్రకట = స్ఫుటమైన, ఖర్జువు = గజ్జి - తీఁట యని భావము. చక్రికిన్ = శేషాహికి, చక్రిశబ్దము కుండలి శబ్దపర్యాయము. లేక 'చక్రీజాలికభిక్షుక కులాలా జాహిసూచకే' మేదిని. శ్వేతపుమేను = బొల్లివిడిచిన దేహము-ధవళదేహమని భావము. కాఁబట్టి, ఈవిరసులన్ = ఈ కోఁతగొట్టువారిని, పొందన్ ఒల్లమని = పొందుటకు నిష్టపడనని, రమణీ మనోభవున్ = స్త్రీలకు మన్మథుఁడయిన - మన్మథునివలె సౌందర్యాతిశయముచే మోహపెట్టువాఁ డయినవానిని, శ్రీ తిరుమలదేవరాయ జగతీరమణున్ = సంపత్కర్తుఁడయిన తిరుమలదేవరాయఁ డనెడి రాజును, వేడ్కన్ = వేడుకతో - సంప్రతోషమునట, భజించెన్ = సేవించెను.

ఆదివరాహమును కులపర్వతములును, దిగ్గజములును, శేషుఁడును భూమిని భరించువారు గదా. అందు వరాహాదులకు నధ్యవసాయముచే అసహాయజీవనత్వాది దోషములు గల్పించి భూమి యనుకాంత యాదోషములచే వారియందు వైరస్యము సంభావించినదై స్త్రీలకు మన్మథునిం బోలినట్టి వాఁడు గావున తిరుమలదేవరాయలను వేడుకమెయి సేవించినదని తాత్పర్యము. ఇట భూకాంత తిరుమలదేవరాయని భజించుటకు వరాహాదులు విరసులని సంభావించుట హేతువుగాకపోయినను హేతువుగా నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారము. రమణీమనోభవుఁడను విశేషణముచే జగతీరమణికి వేడ్కభజనీయుఁ డగుటను సమర్థించుటచే కావ్యలింగభేదమును.

సీ. బహుమహీధరకూట । పటలిపాలుగఁ జేసె, గంధాంధ సింధుర । ఘటలనెల్ల
శాఖిశాఖా శిఖా।చయములఁ దగిలించె, నమిత కోదండ దం।డములనెల్ల
శరధికుటుంబినీ।ఝరుల వెంబడిఁ బంచె, రామాకుచాగ్రహా।రములనెల్ల
దుర్దమకర్దమ । స్తోమంబులో వైచె, విజయమంగళ శంఖ।వితతినెల్లఁ
తే. దగవరి గదా నిజాముఁ డు।ద్దండజయప్ర, తిష్ఠతిరుమలరాయధా।టికిఁ జలించి
పఱచు నెడశక్తి మఱచియు । మఱవఁ డయ్యెఁ, దత్తదుచితప్రవేశసం।ధానయుక్తి.

అ. నిజాముఁడు, ఇది కర్త. గంధా.. ఘటలన్ —గంధ+అంధ = గర్వముచే కన్నుఁగానని - మిక్కిలియు మదించియున్నట్టియనుట, సింధురఘటలన్ = గజసమూహములను, ఎల్లన్ = అన్నిటిని, బహు .. పాలుగన్ - బహుమహీధరకూట= అనేకములయిన పర్వతశిఖరములయొక్క, పటలి = సమూహముయొక్క, పాలుగన్ = పాలగునట్లుగా, చేసెను. 'కరిణాంఘటనాఘటా' 'కూటోస్త్రీ శిఖరం శృఙ్గమ్' అమ. ఘటయనఁగా పంద్రెండేనుఁగుల గుంపు. అమిత కోదండ దండములనెల్లన్ = లెక్కకు మీఱిన, వింటి బ్రద్దలనన్నిటిని, శాఖి... చయములన్ —శాఖి = వృక్షములయొక్క, శాఖా = కొమ్మలయొక్క, శిఖా=అగ్రములయొక్క, చయములన్ =సమూహములందు, తగిలించెన్ =తగులుపఱిచెను.

రామా... నెల్లన్ — రామా = భార్యలయొక్క, కుచ = చన్నులయందలి, అగ్ర = శ్రేష్ఠములయిన, హారములనెల్లన్ = ముత్యాలహారముల నన్నిటిని, శరధి... వెంబడిన్ —శరధి = సముద్రునియొక్క, కుటుంబినీ = భార్యలయిన నదులయొక్క, ఝరుల వెంబడిన్ = ప్రవాహముల వెంట, పంచెన్ = పంపెను. విజయ... వితతిన్ —విజయ = జయ ప్రయుక్తములయినవియు, మంగళ=శుభకరములయిన వియు,అగు,శంఖ=శంఖములయొక్క,వితతినెల్లన్ =సమూహమునంతయు, దుర్దమ... స్తోమంబులోన్ - దుర్దమ = అడంపగూడని, కర్దమస్తోమంబులోన్ = బురదతొంపిలో, వైచెన్ = పడవైచెను.

ఇట్లు చేసిన నిజాము, తగవరిగదా=తగవుగలవాఁడుగదా—ఔచిత్యము దెలిసినవాఁడుగదా యనుట. ఏమనఁగా, ఉద్దండ .. ధాటికిన్ —ఉద్దండ=పరాక్రమముచే వేంద్రమయిన, జయ= గెలుపునందు,ప్రతిష్ఠ=సమర్థుఁడయిన, తిరుమలరాయ=తిరుమలదేవరాయలయొక్క, ధాటికిన్ = దండయాత్రకు, తిరుమలదేవరాయఁడు మిక్కిలి సామర్థ్యముతో తన పయివేంద్రమగు దండెత్తివచ్చుటకు, చలించి = చలించినవాఁడై, పఱచునెడన్ = పాఱిపోవునపుడు, శక్తి మఱచియున్ = తన సామర్థ్యము మఱచిపోయినను, తత్ ...యుక్తిన్ —తత్ తత్ =ఆయా వానియొక్క, ఉచితప్రవేశ=తగినట్టి ప్రవేశముయొక్క—వానివానిని తగినచోటఁ జొనుపుటయొక్క, సంధాన =కూర్చుటయందలి, యుక్తిన్ = ఉపాయమును-లేక ఔచిత్యమును, మఱవఁడయ్యెన్ =మఱచిపోవనివాఁడయ్యెను.

నిజాము తిరుమలదేవరాయల ధాటికి నిలువలేక పలాయితుఁడై పోవునపుడు ఏనుఁగులను పర్వత శిఖరములకయి పాఱఁదోలి, వింటిబ్రద్దలను చెట్లకొమ్మలకుఁ దగిలించి భార్యల ముత్యాలహారములను నదులవెల్లువలలోఁ బాఱవైచి విజయశంఖములను బురదలోఁ బడవైచిపోవఁగా వానివానిని వానివాని జన్మస్థానములందుఁ బ్రవేశపెట్టుట యుచితమని విచారించి యట్లు చేసెనో యన్నట్లు లుండెనని తాత్పర్యము. ఏనుఁగులు పర్వతములందు జన్మించుటయు, వింటిబ్రద్దలు వృక్షశాఖలచేతఁ జేయఁబడుటయు ముత్యాలు సముద్రమందుఁ బుట్టుటయు శంఖములు బురదలో నుత్పత్తిల్లుటయుఁ బ్రకటము.

మహీధరములు 'బహు' - ఏనుఁగులు ఘటలుగా నున్నవి గాన; అన్నిటిని పట్టుటకు ఒకటి రెండు కొండలు చాలవు. 'కూట'- శిఖరము లందయినచో అవి శత్రువులకంతగా కనఁబడకయు చిక్కకయు నుండును. 'చయములన్' -వింటిబ్రద్దలు 'అమిత' ములు గాన వానిని దాఁచుటకు చెట్లుకొమ్మలు గుంపులుగుంపులుగా వలయును. 'శిఖా'- కొమ్మలకొనలందు దాఁచుట, యవియు కనఁబడకయు చిక్కకయు నుండుటకు. 'శరధికుటుంబినీఝురులు' నిజాము అంతఃపుర స్త్రీలు పెక్కండ్రు ఉందురు. వారి ముత్తెపుసరులును లెక్కకు మిక్కిలిగా నుండును. కనుక వానిని వైచుటకు ఒకనదిగాక పాఱిపోవు మేరలో అగపడ్డనదులెల్లఁ గావలయును. 'ఝురులు' వెల్లువలలోఁ గొట్టుకొని పోవుటకు; నిలిచిన నీటిలో వైచినవి తెలియఁగూడును గదా. 'శరధికుటుంబినీ' ముత్యములు సముద్రునివి గావున అతనిభార్యలయందు వాని నిడుటయె మిక్కిలి ఉచితము. ఈ యుచితప్రవేశమును దెలుపుటకే నదుల కిట్టి నిర్దేశము. 'కుటుంబినీ' నిజాము రాజ్యమును సన్న్యసించి పోవునపుడు తన రామల హారములను గొప్పముత్తైదువలకు దానముచేయుట పూజ్యమను సారస్యము నిటుస్ఫురించుచున్నది. 'స్తోమ' విజయశంఖముల 'వితతికి' జొంపులు గుంపులుగావలయును. 'దుర్దమ' గుంపులయినను పలుచగా నుండినచో వైచినవి చక్కఁగా మఱుగుపడఁజాలవు. ఇట్లు, దాఁపవలసిన ఏనుఁగులు మొదలయినవానిని పెట్టినపట్టులు కొండ మొదలుగా మిక్కిలి అనువైనవిగాను; 'ఘట, అమిత, వితతి' అను లెక్కకు 'బహు' చయ, స్తోమ' అని అనుమితములయినవిగాను; 'కూట, శిఖా, ఝుర, దుర్దమ' అని మఱుఁగుపడి యుండుటకు మిక్కిలి పదిలమైనవిగాను; అలవరించినాఁడని తెలియునది. తిరుమలరాయని ధాటి 'ఉద్దండజయపటిష్ఠ' ము గాన నిజాముఁడు 'పఱచుట'. పఱచుట ఊరకకాదు. 'చలించి'. కావుననే 'శక్తి మఱచుట'. శక్తి మఱచియు తత్తమ...యుక్తి మఱవఁడు గావుననే 'తగవరి'. ఇట తిరుమలరాయనిదాడి విన్నంతనే, నిజాముఁడు పలాయితుఁ డయినాఁడని యాశయము తిరుమలరాయని ధాటికిఁ బాఱిపోయిన నిజాము గజాదులను పర్వతాదుల పాలుసేయుటకు తత్తదుచిత ప్రవేశసంధానయుక్తి మఱవకుండుట కారణముగాకున్నను కారణముగా నుత్ప్రేక్షించుటచే హేతూత్ప్రేక్ష యలంకారము. తా. సుగమము.

చ. తిరుమలరాయ శేఖరుని ధీరచమూభటరాజి యాజి భీ
కరయవనేశ్వర ప్రహిత ఖాన బలంబులఁ జక్కసేయ ని
ద్ధరఁ బెనుగొండకొండలు మదద్విపచర్మ కపాలమాలికా
పరికర భూషితంబులయి బల్విడిఁ గాంచె గిరీశభావమున్. 58

అ. తిరుమల...రాజి—తిరుమల రాయశేఖరుని = తిరుమల దేవరాయశ్రేష్ఠుని, ధీరచమూభటరాజి---ధీర = ధైర్యముగల, చమూ = సేనయొక్క, భటరాజి = బంట్లసమూహము, ఆజి = యుద్ధమందు; భీకర = భయంకరమయిన, యవనేశ్వర = యవనప్రభువుల చేత—తురకరాజులచేత, ప్రహిత =

పంపఁబడిన, ఖానబలంబులన్ = తురకదండులను, చక్కుసేయన్ = ఖండించివైవఁగా, ఇద్ధరన్ = ఈ భూమియందు, పెనుగొండకొండలు = పెనుగొండయందలి కొండలు, మద...భూషితంబులయి-- మదద్విప = మదపుటేనుఁగులయొక్క, చర్మ = చర్మములు, కపాలమాలికా=కపాలిమాలికలును అనునట్టి, పరికర = అలంకార సామగ్రిచేత, భూషితంబులై = అలంకరింపఁబడినవై, గిరీశభావమ్మున్ = గిరీశుఁడనఁబడు రుద్రునిభావము నని యర్థము. పర్వతరాజత్వ మనిభావము. 'గిరీశో గిరిశో మృడః' అమ. బల్విడిన్ = తగ్గణమే, కాంచెన్ = పొందెను.

మదద్విపచర్మ కపాలిమాలికలచే భూషితత్వము గిరీశునకును పెనుగొండకొండలకును సమాన ధర్మము. అనఁగా తిరుమలదేవరాయల సైనికులు తురకల చతురంగబలములను సంహారింపఁగా పెనుగొండ కొండలపై ఏనుఁగుల కడవసములును దలపుఱ్ఱెల పంక్తులును బడియుండుటచేత నా కొండలు గజచర్మ కపాలిమాలికాధరుఁడయిన రుద్రునివలెనే యుండెనని తాత్పర్యము. ఇట 'మదద్విప' ఇత్యాదిపదార్థముచే పర్వతమునకు గిరీశత్వమును సమర్థించుటవలన కావ్యలింగభేదము శ్లేషసంకీర్ణము.

సీ. కప్పువాటింపదు గగనమధ్యంబుపై, నుప్పొంగు పృథులప యోధరములఁ
సలఁత నొందదు వినిర్మలసుధాధామకో, పరి సమారోహవైభవమునందుఁ
దడఁబాటుఁ బూనదు త్తమరసజ్ఞాస్థాన,వాటిఁ బాటిలునాట్య పాటవమున
శ్రమమునొంద దశేషకమలాకరాభోగ, తరణకేళీ మహోద్యమమునందు
తే. ననుపమాకల్పపరిపూర్తి నతిశయిల్లు,ననిశ నిస్తంద్రగతిఁ బొల్చునఖిలభువన
గర్భగౌరవ మేరీతిఁ గాంచెనొక్కొ,వీర తిరుమలరాయభూవిభునికీర్తి. 59

అ. ఇందుఁ దిరుమలదేవరాయని కీర్తియందు స్త్రీలింగస్వారస్యముచేత, గర్భిణీత్వారోపణము చేసి, అర్థద్వయమునకు అభేదాధ్యవసాయముగలుగఁ జెప్పినాఁడు. వీర...కీర్తి—వీర = శూరుఁడయిన, తిరుమలదేవరాయ భూవిభునికీర్తి = తిరుమలదేవరాయఁడనెడి రాజుయొక్క కీర్తియనెడుస్త్రీ, అఖిల...గౌరవము—అఖిలభువన = సమస్త ప్రపంచమనెడి, గర్భ = గర్భముయొక్క, గౌరవము = భారమును, ఏరీతిన్ = ఏ విధమున, కాంచెనొక్కొ = చెందినదో కాని, గర్భమును బొందుట యాశ్చర్యము; అది యెట్లు పొందినదో తెలియరాదనుట. ఏలనఁగా —గగన మధ్యంబుపైన్ = (కీర్తి) ఆకాశమధ్యమందు, ఉప్పొంగు...పయోధరములన్ —ఉప్పొంగు=ఉల్బణించుచున్న, పృథుల =విస్తృతమయిన, పయోధరములన్ = మేఘములచేత, కప్పువాటింపదు=నలుపునొందదు— కీర్తి సహజముగానే మిక్కిలియు స్వచ్ఛమయిన వస్తువు గనుక ఆకాశముపయిని వ్యాపించునపు డందలి మేఘములతోడి సంపర్కమనెడి దోషముచేత మలినము కానేరదనుట. (గర్భి) గగన మధ్యంబుపైన్ = ఆకాశమువలె సూక్ష్మమయిన మధ్యప్రదేశముమీఁద, ఉప్పొంగు = విజృంభించుచున్న, పృథుల=బలుపుగల, పయోధరములన్ = పాలిండ్లయందు - పాలిండ్లకొనలయందనుట, కప్పువాటింపదు = నలుపునొందదు. ఇట సప్తమ్యర్థమున ద్వితీయ. గర్భిణికి నడుము బలుపుగలిగియు పాలిండ్లముక్కులు నలుపెక్కియు నుండుట స్వభావమైయుండఁగా ఈ గర్భిణికి సూక్ష్మమై నడుముండుటయు పాలిండ్లకొనలు నల్లఁబడకుండుటయు ఆశ్చర్యమనుట.

వినిర్మల ..వైభవమునందు—(కీర్తి) వినిర్మల=మిక్కిలి స్వచ్ఛమయిన, సుధాధామక=అమృతకిరణుఁడయిన చంద్రునియొక్క, ఉపరి=మీఁదికి, సమారోహ = వ్యాపించుటయొక్క, వైభవమునందున్ = వేడుకయందు - పెంపునందు - ఇట వైభవశబ్దముచే కీర్తి అనాయాసముగ వ్యాపించుట

చెప్పఁబడినది. అలఁతనొందదు=ఆయాసమునొందదు (గర్భి) వినిర్మల=మిక్కిలి తెల్లనయిన, సుధా ధామక=సున్నపుగచ్చు వేసిన సౌధములయొక్క, ఉపరి=మీఁదికి, సమారోహ=ఎక్కుటయొక్క, వైభవమునందున్ = విలాసమందు - విలాసముగా నెక్కుటయందు, అలఁతనొందదు=గర్భిణి విలాసముగా మేడల నెక్కుటయు అట్లెక్కియు అలఁతనొందకుండుటయు నాశ్చర్యమనుట.

ఉత్తమ... వాటిన్ —(కీర్తి) ఉత్తమ=సత్పురుషులయొక్క,రసజ్ఞా=జిహ్వాయనెడు,ఆస్థానవాటిన్=ఆస్థానప్రదేశమందు, పాటిలు నాట్యపాటవమునన్=ప్రవర్తించుచున్న నటించు నేర్పునందు - అనఁగా వారలచే చిత్రగతులఁ గొనియాడఁబడుటయం దనుట, తడఁబాటున్=విపర్యాసమును, పూనదు =పొందదని యర్థము. 'రసజ్ఞా రసనా జిహ్వా' అమ. (గర్భి) ఉత్తమ=శ్రేష్ఠులయిన, రసజ్ఞా=శృంగారాది రసముల నెఱింగినవారియొక్క, ఆస్థానవాటిన్=సభాస్థలియందు, పాటిలు=ప్రవర్తిలుచున్న, నాట్య పాటవమునన్=నటనముయొక్క నిపుణత్వమందు, తడఁబాటు పూనదు = శ్రమచేతఁ దడఁబడదు - ఆయాసపడక నిపుణముగా నాట్యముసేయుట గర్భిణియం దాశ్చర్యమనుట.

అశేష...నందు—(కీర్తి) అశేష = సమస్తమయిన, కమల + ఆకర = (జలములకు గనులయినట్టి) సముద్రములయొక్క, ఆభోగ = పరిపూర్ణతయొక్క, తరణకేళీ = దాఁటుట యనెడి క్రీడయొక్క, మహోఉద్యమమందున్=అధిక ప్రయత్నమందు - మిక్కిలియు ప్రయత్నముచేసి, సముద్రముల నిండుపఱపును అవలీలగా దాఁటుటయందనుట,శ్రమనునొందదు=కష్టము చెందదు. సముద్రములో కొంత భాగముగాక దాని యాభోగమును (నిండుపఱపును) విలాసముగాఁ దాఁటుటకు మిక్కిలియు ప్రయత్నము గావలయునుగాన దానికై 'మహోద్యమ' మన్నాఁడు. అట్టి మహోద్యమము శ్రమకరమయ్యును శ్రమపడలేదనుట. ఇట కీర్తికి దిక్కులవ్యాప్తిని గ్రహించునది. (గర్భి) అశేష=సమస్తమయిన, కమలాకర=తామరలకుఁ బుట్టుచోట్లయిన సరస్సులయొక్క, ఆభోగ=పరిపూర్ణతయొక్క, తరణకేళి=దాఁటుటయనెడి క్రీడయొక్క, సరస్సులం దీగట్టునుండి యాగట్టునకు జలక్రీడ లాడుటయొక్క యనుట, మహోద్యమమందున్=అధికప్రయత్నమందు, శ్రమమునొందదు=ప్రయాసపడదు. 'సలిలం కమలంజలమ్' అమ.

అనుప...పూర్తిన్ —(కీర్తి) అనుపమ=సమానరహిత మౌనట్లుగా, ఆకల్పపరిపూర్తిన్=కల్ప పర్యంతమయిన పరిపూర్ణత్వముచేత, అతిశయిల్లున్ = మించును. కల్పపర్యంతము నిండారుచు వర్ధిల్లుచుండుననుట, (గర్భి) ఆకల్ప=అలంకారముయొక్క, వస్త్రాభరణమాల్యాద్యలంకారముయొక్క, పరిపూర్తిన్=పరిపూర్ణతచేత, అనఁగాఁ బూర్ణముగా వస్త్రాభరణాదులు ధరించుటచేత నతిశయించునని యర్థాంతరము. గర్భిణి యాభరణాదులఁ గొంచెముగా ధరించునే కాని పూర్ణముగాఁ దాల్చుట యాశ్చర్యమనుట. 'ఆకల్పవేషౌ నైపథ్యే' అమ అనిశ...గతిన్ —(కీర్తి) అనిశ=ఎల్లప్పుడును, నిస్తంద్రగతిన్=నిరుపద్రవమయిన గమనముచేత - ఏనెఱసునడ్డియులేక వ్యాపించుచుండుటచేత ననుట. ప్రాల్చున్=ప్రకాశించును. (గర్భి) మాంద్యములేని నడకచేతఁ బ్రకాశించును. గర్భిణికి నడమాంద్యము కలిగియుండునుగాన మాంద్యము లేకుండుట యాశ్చర్యము.

నడుము బలియుట, చనుమొనలు నల్లనగుట, మేడలనెక్కుటయం దాయాసము కలుగుట, నాట్యము సేయునపుడు తడఁబడుట, కొలఁకుల జలక్రీడ లాడునపుడు శ్రమపడుట, సొమ్ములు మెండుగలిగియుండవి కొంచెముగాఁ దాల్చుట, నడ మందముగా నుండుట యను నివి గర్భచిహ్నములు. గర్భము ధరించినపు డీగర్భచిహ్నములు తప్పక చూపట్టునుగదా! తిరుమలరాయుని కీర్తికాంత కేవలమయిన

గర్భమునుగాక సమస్త ప్రపంచమనెడి గొప్పగర్భ భారమును దాల్చియుండునది. అట్టిదయ్యు, చను మొనలు నల్లఁబడకుండుట మొదలుగా గర్భిణీ విరుద్ధధర్మములు గలిగియున్నదిగాన యట్టి గర్భగౌరవమును నెట్లుపొందెనో తెలియరాకున్నదని యాశయము. కీర్తి అఖిలభువనముల గర్భము ధరించియున్న దనుటచే గర్భమునకంటె గర్భిణి పెద్దదిగనుక భువనములనెల్ల నతిక్రమించి యంతకన్న నెక్కుడు పఱపుగలిగి యున్నదని వ్యంజితము. మఱి యది మేఘమండలము నాక్రమించి చంద్రమండలము నతిక్రమించిన దనియు, ఉత్తమ జనులచేతఁ జిత్రగతులఁ బ్రశంసింపఁ బడుచున్నదనియు, సముద్రములను దాఁటిపోయిన దనియు, బ్రహ్మకల్ప పర్యంతము నిలిచియుండుననియు, ఎల్లకాలము నిరుపద్రవగతిచేతఁ బ్రకాశించుననియు ఫలితార్థము.

ఇట 'అఖిలభువన గర్భగౌరవ'మనుచో నలంకారము రూపకము. దీనిచే అవయవి యగుకీర్తిని స్త్రీగా రూపణము గమ్యమగుచుండుటవలన నిది యేకదేశవివర్తి రూపకము. గర్భధారణరూపమయిన కారణముండియు కార్యములగు చూచుక నైల్యాదులుపుట్టకుండుటచే విశేషోక్తి. రూపమునకును విశేషోక్తికి నిట అంగాంగిభావముచే సంకరము.

మ. ధర నెవ్వానికి వ్రాయఁ బద్మజుఁడు వ్రాఁతల్ వానితో నేఁగు న
స్థిరముల్ శాశ్వతకీర్తి యాతిరుమల శ్రీరాయనారాయణుం
డు రహిన్ వ్రాసిన శాసనాక్షరము లుండుం బుత్రపౌత్రాన్వయ
స్థిరవృత్తిం బృథుకాక్షరంబులు గురుశ్రీ వర్ణతుల్యంబులే. 60

అ. పద్మజుఁడు=బ్రహ్మ, ధరన్=భూమియందు, ఎవ్వానికిన్=ఎవ్వనికి, వ్రాయున్=నొసట వ్రాయుచున్నాఁడో, వ్రాఁతల్=ఆవ్రాఁతలు, వానితోన్ ఏఁగున్=ఆపురుషునితోనే పోవును. అస్థిరముల్=శాశ్వతములుగానివి, యని యర్థము. 'అస్థీని రాన్తి గృహ్ణన్తి; రా ఆదానే' అను వ్యుత్పత్తిచే అస్థులను గ్రహించినవని భావము. నొసటి యస్థులయందు వ్రాయఁబడిన వనుట. శాశ్వతకీర్తి=శాశ్వతమైన కీర్తిగల, తిరుమల శ్రీరాయ=తిరుమల దేవరాయఁ డనెడు, నారాయణుండు=నారాయణమూర్తి, (శాశ్వతకీర్తి యనునది యిట ఆరోప్యమాణమునకు ఆరోపవిషయమునకును సాధారణమగు విశేషణము). రహిన్=లెస్సగా, వ్రాసిన శాసనాక్షరములు=వ్రాసియిచ్చిన శాసనములమీఁది వ్రాలు, పుత్ర...వృత్తిన్—పుత్ర=కుమారులు, పౌత్ర=మనుమలు, అన్వయ=వారలవంశము, అను వీనియంతం దాఁకనయిన, స్థిరవృత్తిన్=శాశ్వతమయిన వర్తనముచేతను—పుత్రపౌత్ర పారంపర్యముగా శాశ్వతముగ చెడక వర్తించుచుండుటచేత ననుట, ఉండును=నిలిచియుండును. కాఁబట్టి పృథుకాక్షరంబులు-(పృథుకశబ్దము అర్భకునియందును బ్రహ్మయందును వర్తించును. బ్రహ్మపరమయినపుడు 'పృథుర్మహాన్ కో బ్రహ్మే'యని వ్యుత్పత్తి. 'పోతః పాకోఽర్భకో డిమ్భః పృథుకశ్శావకశ్శిశుః' 'మారుతే వేధసి బ్రధ్నే పుంసి కః' అమ.) పృథుక=అర్భకునియొక్క, అక్షరంబులు=వ్రాలు, గురు...తుల్యంబులే—గురు=జనకునియొక్క, శ్రీవర్ణ=శుభాక్షరములతోడ, (లేక తల్లిని మాతృశ్రీ యనునట్లు తండ్రిని గురుశ్రీయనియుఁ జెప్పనగును గాన గురుశ్రీయనఁగా తండ్రి. అతనివర్ణములతో), తుల్యంబులే=సమానములా-సమానములు గావనుట. బ్రహ్మయొక్క వ్రాలు అతనితండ్రియగు నారాయణునివ్రాలతో సాటిగావని ప్రకారాంతరము. పసిబిడ్డఁడు తెలియక యేవో గిలుకునక్కరములు పెద్దవారు తెలిసి నొప్పుగా వ్రాయువానితో సాటియగునా ? తిరుమల శ్రీరాయనారాయణుం డనుటంబట్టి తిరుమలదేవరాయని నిట నారాయణుఁడుగా గ్రహింపవలయును. పృథుకుఁ డనఁగా బ్రహ్మయనియు గురుశ్రీ యనఁగా

గురుతర సంపత్తిగలవాఁడగు రాజనియు భావము. అనఁగా బ్రహ్మవ్రాఁతకంటె తిరుమలదేవరాయఁడు వ్రాసియిచ్చినవ్రాఁత శాశ్వతమయినదని ఫలితార్థము.

ఇట అవర్ణ్యమగు బ్రహ్మలిఖిత లలాటాక్షరమునకు వర్ణ్యమయిన తిరుమలదేవరాయ శాసనాక్షరముతో సామ్యము నిష్పన్నము కామినిఁబట్టి వ్యతిరేకాలంకారము. ఇది అస్థిరాదిపదగతిమయిన శ్లేషముచే ననుప్రాణితము. 'పృసుకాక్షరంబులు గురు శ్రీవర్ణతుల్యంబులే' యనుచో శ్లేషానుప్రాణితమయిన అర్థాంతరన్యాసము. పృథుకశబ్దమునకు—

శ్లో॥ శయ్యాగారోజ్ఝితపనులవై ర్యస్య జీవన్తివేదా
శ్చర్యాతూలం జగదనుదయ శ్శాల్మలీవాజిశాలా ।
వాజిగ్రాసం వహతి గిరిశోఽప్యజ్ఞో భూసా సపూసా
పోక్షీతోఽస్మాక్ పృథుకపృథుక స్సర్వదేవావతంసః ॥

సీ. ఘనసీధు రక్తలోచనయుక్తిఁ గడ నుండు, మాతంగతతి నంటుమలినమెల్ల
గరదుఁడై వెస నధోగతిఁబడ్డ యమ్మహాహీనుని నెనసినయేవమెల్ల
నరకహేతుహిరణ్యహారణవృత్తిఁ జరించు, కొమ్ముకానిభజించుకొదువలెల్ల
రౌరవాధారఘోరప్రపాతకులైన, విషమగోత్రుల నంటువృజినమెల్లఁ

తే. గడిగికొనియె వసుంధరాకమలనయన, యారవీరప్రతాపరాజాధిరాజ
రాజదేవేంద్రతిరుమలరాయ చంద్ర, సాంద్ర పట్టాభిషేకాంబుసముదయమున.

అ. వసుంధరా కమలనయన=భూకాంత, ఘన... మెల్లన్—సీధువనఁగా మద్యమును, ఏనుఁగు కన్నులయందుఁ బుట్టెడు మదమును, ఇందులకు

ఉ. 'చెక్కుల దాన మత్తులను • సీధువు వీనుల సాగరంబు చే
ముక్కున శీర్ణకంబు చను•ముక్కున శిక్యము శేఫసిక్ మదం
బక్కున ఘర్మవారి విపు•లాంఘ్రుల మేఘము జాఱుచుండఁ బెం
పెక్కి కరీంద్రమొప్పె పెల•యూఁటలతోడి నగేంద్రమో యనన్'

మాతంగతతి యనఁగా జండాలసమూహమును గజసమూహమును, ఘన=అధికమయిన, సీధు=మద్యపానమువలన, రక్త=ఎఱ్ఱనయిన, లోచన=కన్నులయొక్క, యుక్తిన్=కూడికతో,కడనుండు=వెలిగానుండునట్టి, మాతంగతతిన్=చండాల సమూహమును, అంటు మలినమెల్లన్ = అంటుకొన్న మాలిన్యమంతయును అని యర్థము. అధికమయిన సీధుపానెడి మదవిశేషముచేత ఎఱ్ఱనయిన కన్నులతో, కడనుండు = దిక్కులయందున్న గజసమూహము నంటియున్నదని భావము.

గరదు... ఏవమెల్లన్—(గరదుఁడై - గరదుఁ డనఁగా 'శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః । క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః॥' అన్నట్లు) విషమును పెట్టునట్టి, ఆతతాయియై, వెసన్=శీఘ్రముగా, అధోగతిన్ పడ్డ = అధోగతి పాలయినట్టి, అమ్మహాహీనునిన్ = అ మిక్కిలి నీచుఁడయినవానిని, ఎనసిన=కలసిన, ఏవముఎల్లన్ = రోఁతయంతయును అని యర్థము. విషప్రదుఁడై, అధోగతిఁబడ్డ = పాతాళలోకమందున్నట్టి, అమహాత్+అహి+ఇనున్=అ మహాసర్పస్వామిని-అనఁగా ఆదిశేషునిఁ గలిసికొనియున్నదని భావము.

నరక... కొదువలెల్లన్—నరకహేతు=నరకమునఁ బడుటకు కారణమయినట్టి, హిరణ్యహారణవృత్తిన్ =బంగారమును దొంగలించు వృత్తిచే - సఁర సేయుమనెడి స తవసనములలోని గొంక

వృత్తిచేత ననుట, చరించు = ప్రవర్తించునట్టి, కొమ్ముకానిన్ = అగసాలవానిని, భజించు = సేవించినట్టి, కోడుపలు ఎల్లన్ = తక్కువలు అన్నియును అని యర్థము. నరకహేతు = నరకాసురుని యుత్పత్తికి హేతువయిన, హిరణ్య హారణవృత్తిన్ = హిరణ్యాక్షుని సంహరించిన వ్యాపారముచేత, చరించు = సంచరించిన, కొమ్ముకానిన్ = కొమ్ముగలిగిన యజ్ఞవరాహమూర్తిని, ధరించినదని భావము. హిరణ్యాక్షుఁడు చాపకట్టుగాచుట్టిన భూమి నుద్ధరించుటకై యజ్ఞవరాహ మవతరించి వానిని జంపుటయు, ఆ వరాహునితో సంయోగముచే భూదేవికి నరకాసురుఁడు పుట్టుటయుఁ బురాణప్రసిద్ధములు. కేవల హిరణ్యశబ్దము హిరణ్యకశిపునియందు వర్తించుటకు—

శ్లో॥ క్రీడాభిన్నహిరణ్యకుక్షి కుహరే రక్తాత్మ నావస్థితాన్
హారం హార ముదారకుఙ్కుమరసా నవ్యాజ సిద్ధాన్ వఖైః ।
వీరశ్రీకుచకుమ్భ సీమ్ని లిఖితో వీరస్య పత్రావళీ
స్తత్కాలోచిత భావబద్ధమధురం మన్దస్మితం పాతు నః ॥

రౌరవా...వృజినమెల్లన్—రౌరవ = రౌరవమనెడి నరకమునకు, ఆధార = ఆధారమయినవారును, ఘోరప్రపాతకులు = భయంకరమయిన మిక్కుటపు పాపములుగలవారును, అయిన, విషమగోత్రులన్ = ఎగుడుదిగుడయిన కులముగలవారిని, చెందు = పొందిన, వృజినముఎల్లన్ = పాపమంతయునని యర్థము. రౌరవ = రురుమృగ సమూహమునకు - అనఁగా జింకగుంపునకు, ఆధార = ఆధారభూతము లయిన, ఘోర = భయంకరములయిన, ప్రపాత = తటములుగలిగిన; 'ప్రపాతస్తుతటోభృగుః' అమ. విషము గోత్రులను = విషమసంఖ్య అనఁగా సప్తసంఖ్యగల కులపర్వతములను - లేక విషమాకారములుగల పర్వతములను బొందియున్నదని భావము.

వీర...సముదయమునన్—వీరప్రతాపరాజాధిరాజ రాజదేవేంద్రయనెడు బిరుదులుగల, తిరుమలరాయచంద్ర = తిరుమలదేవరాయశ్రేష్ఠునియొక్క, సాంద్ర = దట్టమయిన, పట్టాభిషేక = పట్టాభిషేక సంబంధియగు, అంబుసముదయమునన్ = జలసమూహముచేతను, కడిగికొనియెన్ = కడిగివైచికొనెను - అనఁగాఁ బోఁగొట్టుకొనె ననుట. చిత్ర = ఆశ్చర్యము. ఇట తిరుమలరాయనికిఁ బూర్వము భూమిని ధరించుచుండు దిగ్గజములు శేషాహి ఆదివరాహము కులపర్వతములను వీనిని శ్లేషశక్తిచే చండాలురఁగాను, హీనునిగాను, అగసాలవానిఁగాను, విషమకులమువానిఁగాను, నధ్యవసించి వాని సంసర్గమువలననైన మాలిన్యాదులను తిరుమలరాయల పట్టాభిషేకజలములచేతఁ గడుగుకొన్నదయ్యెనని యర్థముచేసినాఁడు. అనఁగా తిరుమలదేవరాయనికిఁ బట్టాభిషేకము కాఁగానే భూదేవి తనకుఁ బూర్వసంసర్గులయిన దిగ్గజములు మొదలయినవానిని నిరాకరించి తిరుమలదేవరాయలను బొందెనని తాత్పర్యము. ఇట తిరుమలదేవరాయల పట్టాభిషేకజలములను భూదేవి మాలిన్యాదులను కడుగునట్టి సంబంధములేకుండియు సంబంధమును జెప్పుటచే అతిశయోక్తి యలంకారము. అది శ్లేషముతో సంకీర్ణము.

తే. ఆవిభునిదేవి శ్రీవేంగళాంబ పుట్టి, నిల్లు మెట్టినయిల్లు వర్ధిల్లఁ జేసెఁ
బుట్టినింటికి మథనంబు మెట్టినింటి, కమిత దోషాహతియుఁగూర్పుకమలఁ దెగడి.

అ. ఆవిభునిదేవి = ఆతిరుమలదేవరాయని భార్య, శ్రీ వేంగళాంబ = సంపద్వ్యక్తులయిన వెంగళమ్మ, పుట్టి...దెగడి—పుట్టినింటికి = తల్లిగారింటికి, మథనంబు = కలగుండును, మెట్టినింటికిన్ = అత్తగారింటికి, అమితదోష + ఆహతియు = మితిలేనట్టుగా దోషములచేఁ గొట్టువడుటయును, కూర్పు కమలన్ = కలుగఁజేయునటి లక్ష్మిని, తెగడి = తిరస్కరించి, పుట్టినిల్లు మెట్టినయిల్లును. వర్ధిల్లఁ

జేసెన్ = వృద్ధిఁబొందించెనని యర్థము. లక్ష్మీదేవికిఁ బుట్టినిల్లు క్షీరసముద్రమును, మెట్టినిల్లు పద్మమును గనుక పుట్టినింటికి ననఁగా క్షీరసముద్రమునకు, మథనంబున్ = మంథరాద్రిచే చిలుకుటను, మెట్టినింటికిన్ = పద్మమునకు, అమిత దోషా హాతియున్ = మితములేని రాత్రివేధయుఁ గూర్చునని భావము. తామరలు రాత్రికాఁగానే ముకుళించుట యిట రాత్రిచేఁ గొట్టువడుటగాఁ జెప్పఁబడినది.

ఇట ఉపమానభూతయైన లక్ష్మింబట్టి వేంగళాంబయందు గుణవిశేషమును వర్ణించుటవలన నలంకారము వ్యతిరేకము. ఇది 'దోష' యను పదమునుబొంది యున్నశ్లేషముచే సుస్థాపితమైయున్నది.

ఉ. ఉంచిన యగ్రహారముల నున్నతవైఖరి విద్యలెల్ల ర
ప్పించిన విప్రవక్త్రములఁ బెంచిన నవ్య వనోత్కరంబులన్
నించిన బల్తటాకముల నెమ్మిఁ గనందగు వేంగళాంబ య
భ్యంచితకీర్తి సౌధ విశదాక్షర సూన *మరాళరాజమై. 68

అ. వేంగళాంబ అభ్యంచితకీర్తి = వేంగళమ్మయొక్క మిక్కిలి యొప్పిదమగుచున్న కీర్తి, ఉంచిన అగ్రహారములన్ = ఆమె ప్రతిష్ఠించినట్టి అగ్రహారములయందును, ఉన్నతవైఖరిన్ = మిక్కిలి గొప్పరీతిని, విద్యలుఎల్లన్ = వేదశాస్త్రాది విద్యలనన్నిటిని, రప్పించిన విప్రవక్త్రములను = వచ్చునట్లు చేయఁబడిన - అనఁగా నేర్పఁబడిన బ్రాహ్మణుల ముఖములందును, పెంచిన ..త్కరంబులన్ — పెంచిన = వృద్ధిఁ బొందించిన, నవ్య = క్రొత్తవియగు, వన-ఉత్కరంబులన్ = వనసమూహములందును, నించినబల్తటాకములన్ = నిండింపఁబడిన గొప్పచెఱువులందును, సౌధ ... రాజమై — సౌధ = సున్నపుగచ్చుచేసిన మేడలును, విశదాక్షర = పరిశుద్ధములయిన యక్షరములును, సూన = తెల్లని పుష్పములును, మరాళరాజమై = హంసశ్రేష్ఠములు నయినదై, నెమ్మిన్ = ప్రీతిచేత, కనందగున్ = చూడఁదగియుండునని క్రమాలంకారము. అనఁగా వేంగళమ్మ పైనిచెప్పఁబడిన అగ్రహారాది సంతానము లనేకములుగావించి బహుకీర్తిఁ జెందినదని తాత్పర్యము. ఇందు, సౌధవిశదాక్షర సూనమరాళ రాజమనునది సమాహార ద్వంద్వము. ఇట కీర్తిని సౌధము మొదలయినవానినిగా ఉల్లేఖించుటచే ఉల్లేఖ మలంకారము. అగ్రహారములు 'సౌధ' యుక్తములు. విద్యలు రప్పించినది 'ఉన్నతవైఖరి' ని. వనములు 'నవ్యములు'. తటాకములు. 'బలుపైనవి'. కావుననే వీనివలని కీర్తి 'అభ్యంచిత' మైనది. సౌధాదులు తెలుపుగణములోఁ జేరినవికాన కీర్తితో సాదృశ్యము. అక్షరములును తెలుపనుటకు నిందే. 'రమణీయాక్షరాకృతిఁ బొలుచువర్ణశ్రేణి' అనుటం దెలియనగును. [అక్షరవైశద్య మనఁగా

'ఉపాంశు దష్టం త్వరితం నిరస్తం విలంబితం గద్గదితం ప్రగీతమ్ ।
నిష్పీడితం గ్రస్త పదాక్షరంచ వదే న్నదీనం నతు సానునాస్యమ్' అను పాఠదోషములు లేక
'మాధుర్య మక్షరవ్యక్తిః పదచ్ఛేద స్తథాఽత్వరా
ధైర్యం లయసమత్వంచ షడేతే పాఠగాగుణాః'

అను గుణములు గలిగియునికి.]

సీ. వసుమతి దానయ్యు శేవరుని వారింపదు, కందమూలంబులఁ గడుపు పెంప
శ్రీకాంత దానయ్యుఁ బ్రియు నిరోధింపదు, క్రిందైన విరోధికిఁ గేలుసాఁప
దాను రుక్మిణియయ్యుఁ దగదన దాత్మనాయకుఁ డొకనరుక్రింద హారులఁబట్టఁ

* మరాళరాజితొ.

దా నన్నపూర్ణాభిధానయయ్యును మాన్ప, దొకనాఁడుఁ దనఱేఁడు బికిరమెత్త
తే. ననుచు ధర నిందిరను భోజతనయ నార్య,నార్యనుతనార్యమేయచర్యలహసించి
పతికి నభిమతభోగ సౌభాగ్యమొసఁగు, విమలసద్గుణనికురుంబ వేంగళాంబ. 64

అ. విమల...నికురుంబ—విమల=నిర్మలమయిన, సద్గుణ=మంచిగుణములయొక్క, నికురుంబ=సమూహముగలదియగు, వేంగళాంబ=వేంగళమ్మ, వసుమతి తాన్ అయ్యును=వసువులనఁగా ధనములు, తాను ధనవంతురాలై యుండియు, అయ్యున్ అనుచో అయి+ఉన్ అని విభాగము. యికారాంతము శేమ్యాదిగణములోఁ జేరినవి గాన యచ్చుపరం బగునపుడు సంధినిత్యము. వరునిన్=పెనిమిటిని, కంద మూలంబులన్=దుంపగడ్డలచేతను వేళ్లచేతను, కసుపు పెంపన్ = పొట్టపోసికొనుచుండఁగా, వారిం పదు=వలదనిమాన్పదు అని యర్థము. భూదేవి వసుమతియను నామముగలదనియు ఆమెకు వరుఁడయిన వరాహమూర్తికిఁ దుంపగడ్డలు, మొదలయినవి యాహారములనియును భావము.

శ్రీకాంత తానయ్యున్=శ్రీయనఁగా సంపద, శ్రీ=సంపదచేత, కాంత=మనోజ్ఞురాలు, అయ్యును, ప్రియున్=పెనిమిటిని, క్రిందు+ఐ విరోధికిన్ కేలుచాఁపన్=శత్రువునకుఁ గ్రిందుపడి చేయి చాఁపఁగా, నిరోధింపదు=వారింపదు - లక్ష్మీదేవి శ్రీకాంతయనునామము గలదనియు నామె పెనిమిటి యైన విష్ణుమూర్తి వామనుఁడై విరోధియగు బలిచక్రవర్తిని యాచించినాఁడనియు భావము.

రుక్మిణి తానయ్యున్—రుక్మమనఁగా బంగారు, అదిగలది రుక్మిణి, తాను బంగారు గలదిగా నుండియు, ఆత్మనాయకుఁడు=ప్రాణేశ్వరుఁడు, ఒక నరునిక్రిందన్=ఒక మనుష్యునిక్రింద, హరులన్ పట్టన్=గుఱ్ఱములను బట్టెడు కొలువుసేయఁగా, తగదు అనదు=సరికాదని చెప్పదు- విదర్భరాజకుమారి రుక్మిణి యనుపేరుగలది యనియు, నామెకుఁ బెనిమిటియైనకృష్ణుఁ డర్జునునకు సారథ్యము చేసినాఁడని యును భావము.

తాను, అన్నపూర్ణాభిధాన అయ్యున్ = అన్నసమృద్ధిచేత సంపూర్ణురాలను పేరుగలదై యుండియు, తన ఱేఁడు=తనయేలిక-నాథుఁడు, బికిరము ఎత్తన్=భిక్ష యెత్తుచుండఁగా, ఒకనాఁడున్=ఒక్క దినమయినను, మాన్పదు=అడ్డగింపదు - పార్వతి అన్నపూర్ణ యనునామము గలదియనియు, నామెకుఁ బతియైనశివుఁడు కపాలహస్తుఁడై భిక్షయెత్తినాఁడనియును భావము. బికిరశబ్దము వికిరశబ్దమునకు వికృతి.

అనుచున్=ఈలాగునఁ బలుకుచు, ధరను=భూదేవిని, ఇందిరను=లక్ష్మీదేవిని, భోజతనయను = రుక్మిణీదేవిని, ఆర్యను=పార్వతీదేవిని, ఆర్య...చర్యలను—ఆర్య = పతి సేవాదులఁ బూజ్యులైన వారిచేత, నుత=స్తోత్రముచేయఁబడిన, నారీ=స్త్రీలయొక్క, అమేయ=గణింప నలవికాని, చర్యలన్ = చర్యలచేత, హసించి=తిరస్కరించి, పతికిన్=పెనిమిటియైనతిరుమలదేవరాయనికి, అభి...భాగ్యము—అభిమత=ఇష్టమయిన, భోగ=భోగములయొక్క, సౌభాగ్యమును=సౌష్ఠవమును-పెనిమిటికి కోరిన సుఖములను చక్కఁగా ననుభవించుటను, ఒసఁగున్=ఇచ్చును - కలుగజేయు ననుట. అనఁగా వేంగళమ్మ భూదేవి మొదలగువారికంటె పాతివ్రత్యమం దతిశయించినదై పెనిమిటియొక్క సేవసేయుచుండు నని భావము. ఇందు శ్లేషోత్థాపితమయిన వ్యతిరేకమలంకారము. నార్యనుత...చర్యలన్ అనుచో వృత్త్యనుప్రాసము.

శా. రారాజద్గుణశాలి తిర్మలమహారాయందు శ్రీవేంగళాం
బా రామామణియందుఁ గాంచె సుతులం బ్రఖ్యాతసత్కీర్తి ల

లక్ష్మీరామున్ రఘునాథభూమిరమణున్ శ్రీరంగరాయాగ్రణిన్
శ్రీరామావనినాథుఁ బ్రాభవనిధిన్ శ్రీ వేంకటక్ష్మావరున్. 65

అ. రారా...శాలి—రారాజత్ = మిక్కిలియుఁ బ్రకాశించుచున్న, గుణ=సద్గుణములచేత, శాలి=ఒప్పుచున్నవాఁడగు, తిర్మలమహారాయందు = తిరుమలదేవరాయఁడు, శ్రీ వేంగళాంబా రామామణియందున్ = సంపద్యుక్తురాలయిన వేంగళమ్మయనెడి స్త్రీరత్నమందు, సుతులన్ = పుత్రులను, కాంచెన్=కనెను. వారెవరనఁగా, ప్రఖ్యాత...రామున్—ప్రఖ్యాత=ప్రసిద్ధమయిన, సత్కీర్తి=మంచి కీర్తియందు, లక్ష్మీరామున్=లక్ష్మీ మనోహరుఁడయిన నారాయణుఁడయిన-ఇట 'కీర్తిస్తు నారాయణే' అను వచనముచొప్పున కీర్తియందు నారాయణ సామ్యము చెప్పినాఁడని తెలియునది. లేక సత్కీర్తి లక్ష్మీ=మంచికీర్తి సంపదచేత, రామున్=మనోహరుఁ డయినవాఁ డయినయనియు నర్థము, రఘునాథ భూమిరమణున్=రఘునాథరాజును, శ్రీరంగరాయాగ్రణిన్ = శ్రీరంగరాయ శ్రేష్ఠుని, శ్రీరామావని నాథున్=శ్రీరామరాజును, ప్రాభవనిధిన్ = ప్రభుత్వమునకు పాఁతఱయైన - మిక్కిలి ప్రభుత్వసంపత్తిచే వెలయువాఁడయిన, శ్రీ వేంకటక్ష్మావరున్=శ్రీ వేంకటరాజును, కాంచెనని యన్వయము.

తా. మిక్కిలియుఁ బ్రకాశించుచున్న గుణములచే నొప్పుచుండు తిరుమలదేవరాయఁడు వేంగళమ్మయందు మంచికీర్తియందు నారాయణునివంటివాఁ డయిన రఘునాథరాజును, శ్రీరంగ రాజును, రామరాజును, మంచి ప్రభుత్వముగల వేంకటరాయనిని గాంచెను.

క. ఆజగదభినుత సుగుణస, మాజులలో నగ్రజుండు మహనీయ యశో
రాజీవాసనుఁడు సుధీ, రాజీవాసనుఁడు వెలసె రఘునాథుఁ డిలన్. 66

అ. ఆ...సమాజులలోన్ —జగత్+అభినుత=జగజ్జనులచేత మిక్కిలియు స్తోత్రము చేయఁబడిన, సుగుణ=సద్గుణములయొక్క, సమాజులలోన్ = సమూహములుగల ఆ రాజులలోపల, అగ్రజుండు = జ్యేష్ఠుఁడైనవాఁడు, మహ...వాసనుఁడు—మహనీయ = మిక్కిలి గొప్పదియైన, యశః=కీర్తియందు, రాజీవాసనుఁడు=చంద్రుఁడయినవాఁడు. (ఇట 'అసుక్షేపణే' యను ధాతువునుబట్టి, 'రాజీవాని అస్యన్తే క్షిప్యన్తే అనేనేతి రాజీవాసనః' పద్మములను దిరస్కరించువాఁడను వ్యుత్పత్తివలనఁ జంద్రుఁడని యర్థము.) సుధీరాజీవాసనుఁడు—సుధీ=యోగ్యమయిన బుద్ధియందు, రాజీవాసనుఁడు=బ్రహ్మయగువాఁడును, అగు, రఘునాథుఁడు=రఘునాథరాజు, ఇలన్=భూమియందు, వెలసెన్=ప్రకాశించెను. ఇట రఘునాథరాజును కీర్తి బుద్ధియనెడి విషయభేదముచేత చంద్రచతుర్ముఖులుగా నుల్లేఖనము చేయుటచే నుల్లేఖాలంకారము.

తా. జగమునందలి వారిచేత మిక్కిలియు స్తోత్రము చేయఁబడిన సద్గుణసమూహములు గల యా రాజులలోపలఁ బెద్దవాఁడును, చంద్రునివంటి కీర్తిగలవాఁడును, బ్రహ్మవంటి సుబుద్ధిగలవాఁడునగు రఘునాథరాజు భూమియందుఁ బ్రకాశించెను.

సీ. బలువాహినులమించు మలకల ఘననామ, కంబులు దూలమూలంబులెత్తఁ
ప్రతిరోధి వరణ వర్గము ద్రోచి తన్మహా, భోగశాలి క్షేత్రములు హరించు
వలగొన్న బహురాజవంశగుల్మంబులఁ, బలుతెఱంగులఁ గుచ్చి పాఱవైచు
వడిఁజొచ్చి కలఁచి యావనరాసుల సమగ్ర, జీవనంబెల్ల దుష్కీర్తిఁ గలుప

తే. నవని నసహాయశూరత ♦ నధిగమించు, ననఘ తిరుమలరాయనం♦దనసమిద్గ
భీరరఘునాథభుజపీఠిఁ ♦ బీఁటవెట్టు, సాహసోదగ్ర బిరుదవ♦రాహమూర్తి. 67

అ. ఇందలిగీతి తుదను బిరుదవరాహమూర్తియని చెప్పుటంబట్టి బిరుదపరముగాను వరాహపరముగాను నర్థద్వయము విచారించునది. అనఘ ..భుజపీఠిన్—అనఘ=నిర్దోషుఁడైన - పుణ్యాత్ముఁడయినయనుట, తిరుమలరాయనందన = తిరుమలదేవరాయని కుమారుఁడును, సమిద్గభీర = యుద్ధమందు గంభీరుఁడును, అగు, రఘునాథ భుజపీఠిన్=రఘునాథరాజుయొక్క బాహాపీఠమందు, పీఁట...మూర్తి, పీఁటవెట్టు=స్థిరముగా పాదుకొనియుండునట్టి, సాహస+ఉదగ్ర=సాహసమందు నెక్కుడయిన, బిరుద వరాహమూర్తి=లాంఛనమగు వరాహమూర్తి, బలు...లేత్తు—(బిరుద) బలు=బలవంతములయిన, వాహినులన్=సేనల చేత, మించు=అతిశయించుచున్న, మలకల=మ్లేచ్ఛులయొక్క, ఘననామకంబులు=గొప్పలయిన పేళ్లు, తూలన్=నశించునట్లుగా, మూలంబులుఎత్తున్=మొదళ్లుతీసివైచును-నిర్మూలముసేయుననుట. (వరాహ)బలువాహినులన్=బలువైననదులయందు, మించు, మలకల=మలుపులయందలి-వంకరలయందుఁగల, ఘననామకంబులన్=మేఘములని పేరుగలవానిని-మేఘనామము లన్నియు తుంగలకుఁ జెల్లునుగనుక, తుంగలను, తూలన్=తూలిపోవునట్లుగా, మూలంబులు ఎత్తున్=వానివేళ్లను అనఁగా దుంపలను పెల్లగించును. 'కురువిన్దో మేఘనామాముస్తాముస్తకమస్త్రియామ్' అమ.

ప్రతిరోధి...హరించున్—(బిరుద) ప్రతిరోధి = చోరులయొక్క, వరణ = ప్రాకారములయొక్క, వర్గమున్=సమూహమును, త్రోచి=పడఁగూల్చి, తత్=వారియొక్క, మహాభోగ=మిక్కిలియైన భోగములచేత, శాలి=ఒప్పుచున్న, క్షేత్ర=కళత్రములను, హరించున్=చెఱఁబట్టును. 'ప్రతిరోధిపరాస్కన్ది పాటచ్చరమలిమ్లుచాః' 'ప్రాకారోవరణస్సాలః' అమ. (వరాహ) ప్రతిరోధి=అవరోధకమయిన - అడ్డగించునట్టిదయిన, వరణ వర్గము=కంచెలుమొదలయినవాని సమూహమును, త్రోచి=పడఁద్రోచి, తత్=ఆయావరణసమూహములోని, మహా+ఆభోగ=మిక్కిలి విస్తృతములైన, శాలిక్షేత్రములు = వరిమళ్లను, హరించున్=తినును. 'క్షేత్రం శరీరే కేదారే సిద్ధస్థానకళత్రయోః' విశ్వ.

వలగొన్న...పాఱవైచు—(బిరుద) వలగొన్న=చుట్టుముట్టిన, బహురాజ=అనేకశత్రురాజులయొక్క, వంశ=వర్గములయొక్క, గుల్మంబులన్=సేనలను, పలుతెఱఁగులన్=అనేకవిధములచేత, క్రుచ్చి=శక్తిచే పొడిచి, పాఱవైచును. (వరాహ) వలగొన్న=చుట్టునావరించియున్న, బహు=అనేకములయిన, రాజవంశ = శ్రేష్ఠమయిన వెదుళ్లయొక్క, గుల్మంబులన్=పొదలను, పలుతెఱంగులన్=కోఱపంటి ప్రచారములచేత, క్రుచ్చిపాఱవైచున్=పొడిచి పెలఁగివైచును. 'గుల్మారుక్స్తమ్బసేనాశ్చ' అమ. పలుతెఱంగులనుచో బిరుద పక్షమున, కర్మధారయ సమాసము గనుక తకారమునకు దకారాదేశము వికల్పమయ్యె, వరాహపక్షమునఁ దత్పురుషముగనుక నుభయపక్షములకు సమరసముగా తకారము చెప్పుటయే యుక్తము.

తే. సంధిగూర్పంగఁ బ్రథమాంత ♦ శబ్దవితతి, పైఁ గచటపతలకు వికృ♦ల్పంబుచెల్లుఁ
గాకు సంబోధ నావ్యయ♦కర్మధార, యంబుల నచేతంబుల ♦ నబ్జనాభ.

వడి...గలపు—(బిరుద) వడిన్=త్వరితముగా, చొచ్చి, కలఁచి=కలగుండుపడఁజేసి, యావనరాసుల=యవనదేశసంభవులయిన తురకల సమూహములయొక్క, సమగ్రజీవనంబు ఎల్లన్ = నిండారునట్టి బ్రతుకంతయు, దుష్కీర్తిన్ కలుపున్= అపకీర్తిపాలుసేయును. (వరాహ) వడిఁజొచ్చికలఁచి=త్వరితముగా చొరఁబడి కలఁకపాఱునట్లుచేసి, ఆవనరాసులన్ = ఆసముద్రములయొక్క, సమగ్రజీవ

నంతెల్లన్ = సంపూర్ణమయిన జలమునంతయును, దుష్కీర్తిన్ కలుపున్ = కీర్తియనఁగా నిచట నురద, 'కీర్తిః ప్రశంసా యశసోర్విస్తారే కర్దమేపిచ' విశ్వ. కొఱయాలిన నురదపాలు సేయును.

అవని... నధిగమించున్—(విరుద) అవనిన్ = భూమియందు, అసహాయశూరతన్ = అసహాయ శూరత్వముచేత, అధిగమించున్ = ప్రవర్తించును. (వరాహ) ఒంటిగాఁ దిరుగును. వరాహ విషయమున పీఁటపెట్టుట యనుపదమును ప్రయోగించుట జాతీయము. 'పీఁటపెట్టి చూపులనె యేర్చుఁ బ్రజ నొక్క సూకరంబు' మనుచరిత్రము. ఇందు వరాహలాంఛనముగల రఘునాథరాజు చేసిన కార్యములనెల్ల లాంఛనమయిన వరాహమూర్తి చేసినట్లుగాఁ జెప్పుట యౌపచారికము. ఇట వరాహమూర్తియును విశేష్యము శ్లిష్టమగుటచే అప్రకృతవరాహవిషయమయి శబ్దశక్తి మూలమగుధ్వని కాని శ్లేషాలంకారముగాదు. ఉభయశ్లేషమందు విశేష్యము శ్లేషింపదు. 'భోగశాలిక్షేత్రములు' అనుచో పోలికపడి.

క. పోలిఁపఁ బుఫు బుధులకు మా, పోలికపడి శీల ముల్లముమున కెన యనఁగా
శీలం బుల్లం బనఁగా, భూలోకం బమరలోకమున కెన యనఁగిన్.

తా. తిరుమలదేవరాయని కుమారుఁడును యుద్ధమం దతిగంభీరుఁడును విరుదవరాహలాంఛనుఁడు నగు రఘునాథరాజు గొప్ప సేనలుగల తురకలను పేరు లడంగిపోవునట్లుగా సిద్ధాలము సేయును. చోరులు కట్టుకొనియున్న ప్రాకారసమూహమును బడఁగూల్చి మిక్కిలి భోగము లనుభవించుచున్న వారి కళత్రములను జెఱపట్టును. చుట్టనున్న యనేకరాజుల సైన్యములను, నానావిధములఁ బొడిచి పటాపంచలు గావించును. త్వరితముగాఁ బారఁబడి యవనదేశపు తురకల సమూహములను జీకాకుపఱచి వారి బ్రతుకునంతయు నపకీర్తి పాలు సేయును.

శా. యాదోరాశి గభీరమూర్తి రఘునాథాధీశుఁ డుద్దండ బా
హాదర్పాంధ సపాద మల్కిక నిజా మానీకముల్ ద్రుంప జ
న్యాదూరక్షితిఁ బాఱుకృష్ణకును గృష్ణాంకంబు నాఁ డబ్బె బి
బ్బీదీవ్యన్నయనాబ్జ కజ్జల జలాభీల ప్రవాహంబునన్. 68

అ. యాదోరాశి గభీరమూర్తి—యాదోరాశి = సముద్రునివలె, గభీరమూర్తి = గంభీరాకారుఁడయిన, రఘునాథాధీశుఁడు = రఘునాథరాజు, ఉద్దండ... మానీకముల్—ఉద్దండ = ప్రచండమయిన, బాహాదర్ప = భుజగర్వముచేత, అంధ = కన్నుగానకున్న, సపాద = సపాదులయొక్కయు, మల్కిక = మలకలయొక్కయు, నిజామ = నిజాముయొక్కయు, అనీకములు = సైన్యములను, త్రుంపన్ = సంహరింపఁగా, జన్య... క్షితిన్—జన్య = యుద్ధమునకు, అదూర = సమీపమయిన, క్షితిన్ = భూమియందు, పాఱు కృష్ణకున్ = ప్రవహించుచున్న కృష్ణానదికి, బిబ్బీ = మ్లేచ్ఛస్త్రీలయొక్క, అనఁగా బూబులయొక్క, దీవ్యత్ = ప్రకాశించుచున్న, నయనాబ్జ = తామరలవంటి కన్నులయందలి, కజ్జల = కాటుకతోఁగూడిన, జల = నీళ్లయొక్క, అభీల = భయంకరమయిన, ప్రవాహంబునన్ = వెల్లువచేత, కృష్ణా-అంకంబు = కృష్ణయనెడి పేరు, నాఁడు = ఆకాటుకతోడి కన్నీటివెల్లువ గూడిననాఁడు, అబ్బెన్ = లభించెను.

రఘునాథరాజుచేత యుద్ధమందు హతులయిన సపాదాదితురుష్కులభార్యలందఱు నేడువఁగా వారల కాటుకకన్నీళ్లు వెల్లిగొని కృష్ణలోఁగలసి నదీజలమంతయు నల్లవాఱినందున నాఁటనుండి * కృష్ణకుఁ గృష్ణయని పేరుగలిగె నని యర్థము. కృష్ణానదీ జలమంతయు నల్లఁబడుటకు వలయునంత కాటుకకన్నీళ్లు ప్రవాహమై పాఱుటకు నెందఱు స్త్రీ) లేడువవలసియుండునో యందఱతురకలను వధించినాఁడని భావము. ఇట కృష్ణాశబ్దమునకు యోగముచే నన్వర్థమును కలిగించుటచే నిగూ

కృష్ణయను పేరుగలుగుటకు అంజనాశ్రుప్రవాహ మేళనము హేతువు గాకపోయినను హేతువుగా నుత్ప్రేక్షించుటవలన హేతూత్ప్రేక్ష. అంజనాశ్రుప్రవాహమునకు నదికి నలుపుకలిగించు సంబంధము లేకున్నను తత్సంబంధమును జెప్పుటచే అతిశయోక్తి. ఈరెంటికిని సంకరము. 'ఉద్దండ బాహాదర్పాంధు'లనుట వారిని ద్రుంపుటయుటకు హేతువు. ప్రవాహ మాభీలమనుట కృష్ణాసంబంధ సౌకర్యమునకు. కృష్ణయందుఁ గలియుట శిపయుక్తముగా అది జన్యాదూరక్షితిఁ బాఱుట చెప్పఁబడినది. దీనిచే కృష్ణానదికి బాపుగా తురకలతో రఘునాథరాజునకు యుద్ధముజరిగె ననుట తెలియుచున్నది.

తా. సుగమము.

మ. హరిమై సాదిశిరంబు సాదిమెయి జాత్యశ్వో త్తమాంగంబుఁ గూ
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందారవృ
ష్టి రహిం బ్రాణయుతంబులై గగనవాటిం బర్వి గంధర్వకి
న్నరరూపంబులు దాల్చి సారెకివి యానందించుఁ దచ్ఛౌర్యమున్. 69

అ. హరిమైన్ = గుఱ్ఱపు కళేబరమందు, సాదిశిరంబు = రౌతుతలయును, సాదిమెయిన్ = రౌతు కళేబరమందు 'అశ్వారోహాస్తు సాదినః' అమ. జాత్యశ్వ + ఉత్తమాంగంబు = ఉత్తమాశ్వము యొక్క తలయును, కూడన్ = అంటుకొనునట్లుగా, రణ + ఉర్విన్ = యుద్ధభూమియందు, రఘునాథ శౌరి = రఘునాథరాయఁడు, అసిన్ = ఖడ్గముచేత, చెండన్ = నఱుకఁగా, దివ్యమందార వృష్టిన్ = దేవతలు కురియునట్టి పారిజాతపుష్ప వర్షముచేత, రహిన్ = లెస్సఁగా, ప్రాణయుతంబులై = ప్రాణములతోఁగూడికొన్నవై, గగనవాటిన్ = ఆకాశవీథిని, పర్వి = వ్యాపించి, గంధర్వ కిన్నరరూపంబులు దాల్చి = గంధర్వ రూపమును కిన్నరరూపమును ధరించి, ఇట కిన్నర గంధర్వరూపము లనుటకు మాఱుగా గంధర్వ కిన్నరరూపము లని వ్యుత్క్రమము. గుఱ్ఱపు కళేబరమందు రౌతుతల యదుకఁగా కిన్నరు లయిరనియు రౌతుకళేబరమందు గుఱ్ఱపు తల యంటుకొనఁగా గంధర్వు లయిరనియుఁ దెలియునది అశ్వదేహమును నరముఖమును గలవారలు కిన్నరులు; మనుష్యదేహమును అశ్వముఖమును గలవారలు గంధర్వులు. ఇందులకు

శ్లో॥ బిమ్బోష్ఠం బహుమనుతే తురఙ్గవక్త్రః । శ్వాస్యాన్తం ముఖమిహ కిన్నరం ప్రియాయాః
శ్లిష్యన్తం ముహురితరో౽పి తస్య జఙ్ఘా । మత్తుఙ్గ స్తనభరభఙ్గ భీరుమధ్యామ్॥ మాఘుఁడు.

సారెకున్ = మాటిమాటికి, అవి = ఆ కిన్నరగంధర్వరూపములు, తత్ + శౌర్యమున్ = అతని శూరత్వమునుగూర్చి, ఆనందించున్ = సంతోషించును. ఇట హరిమైసాది శిరంబుగూడునట్లు ఖండించుటచే ఖండన త్వరాతిశయమును' దివ్యమందారవృష్టిని చెప్పుటచే దేవతాశ్లాఘానూచితమయిన ఖండనలాఘవాతిశయమును ద్యోతితము. ఆనందించు ధాతు విట సకర్మకమగుట విచార్యము. కిన్నరగంధర్వరూప ధారణమునకు రఘునాథశౌరి శౌర్యముతో సంబంధము లేకుండియు సంబంధమును జెప్పుటచే సంబంధాతిశయోక్తి యలంకారము.

తా. రఘునాథరాజు గుఱ్ఱపుకళేబరమందు రౌతుతలయు రౌతుకళేబరమందు గుఱ్ఱపుఁదలయుఁ గూడికొనునట్లు యుద్ధభూమియందు రౌతులను గుఱ్ఱములను నఱుకఁగా, అవియట్లుగూడి యారాజుపయి దేవతలు కురియు పారిజాతపుష్పవర్షముచేఁ బ్రాణమునొంది యాకాశమున కెగసి కిన్నరగంధర్వ రూపములు దాల్చి యారాజు శౌర్యమునకు నానందించును.

వ. హరిపదభక్తశీలుఁ డగు నారఘునాథ నృపాలుకూర్మిసో

దరుఁడు సిరింగరాయ వసుధావరుఁ డాత్మగుణ ప్రమోదవ
త్తిరుమలరాయశేఖరవితీర్ణమహాయువరాజ పట్టబం
ధురుఁ డయి సర్వభూభువనధూర్వహశక్తి వహించు నెంతయున్. 70

అ. హరిపదభక్తిశీలుఁడు = విష్ణుమూర్తిపాదములందలి భక్తియే స్వభావముగాఁ గలవాఁడు, అగు, ఆ రఘునాథనృపాలుకూర్మసోదరుఁడు = ఆరఘునాథరాయుని ముద్దుతమ్ముఁడు; సిరింగరాయ వసుధావరుఁడు = శ్రీరంగరాయరాజు, ఆత్మ... బంధురుఁడు అయి—ఆత్మ = తనయొక్క, గుణ = సుగుణములచేత, ప్రమోదవత్ = సంతోషముగల, తిరుమలరాయశేఖర = తిరుమలదేవరాయశ్రేష్ఠునిచేత, వితీర్ణ = ఇయ్యఁబడిన, మహాత్ = గొప్పదియైన, యువరాజపట్ట = యువరాజుయొక్క పట్టముచేత, బంధురుఁడయి = మనోహరుఁడయి - యువరాజ్యపట్టాభిషేకము చేసి నొప్పినవాఁడై యనుట, ఎంతయున్ = మిక్కిలియును, సర్వ... శక్తిన్ —సర్వభూభువన = సమస్తభూలోకముయొక్క, ధూః = భారమును, వహ = వహించుటకు, శక్తిన్ = సామర్థ్యమును, వహించున్ = పూనియుండును. ఇట తిరుమలదేవరాయఁడు తనజ్యేష్ఠపుత్త్రుం డయిన రఘునాథరాజునకు యువరాజ్యపట్టము కట్టవలసి యుండఁగా రెండవవాఁడగు శ్రీరంగరాయలకు దానిని గట్టుటకుఁ గారణ మతని గుణములకుఁ బ్రమోదమునొందుట చూసియు, శ్రీరంగరాయఁ డట్టిగుణములఁ బడయుటకు హరిపదభక్తిశీలుఁడగుట ముఖ్య కారణమనియు యువరాజపట్టబంధురుఁ డయినంతనే సర్వభూలోకభారవహనశక్తి నెఱపు నని సామ్రాజ్యత్వము కలిగినపు డెంతటిశక్తి నెఱపఁగలఁడనియు నాశయములు ధ్వనించుచున్నవి.

తా. ఆరఘునాథరాజు గారిముద్దుతమ్ముఁడును హరిచరణభక్తిపరాయణుఁడు నయినశ్రీరంగరాయ రాజు తనగుణములకుఁ దిరుమలదేవరాయఁడు సంతుష్టుఁడై గొప్ప యువరాజ్యమునకుఁ బట్టముగట్టఁగా నతఁ డప్పటికే సమస్తభూలోకమును బాలించునంతటి సామర్థ్యమును మిక్కిలియు నెఱపెను.

చ. ఉరమున నేఁగుఁ గుండలి పయోధరధారల నాను నెప్పుడుం
గిరులు గరుల్ రజోవిహృతిఁ గిం జను వెళ్లఁడు నేల *కూర్మశే
ఖరుఁ డిది యేల బాలజనకల్పితసౌఖ్య మటంచు ధారుణీ
తరుణి సిరంగరాయ వసుధావరుఁ జేరెఁ గుమారమన్మథున్. 71

అ. ఇంతవరకు భూమిని ధరించిన శేషాహిమొదలగువారియందు బాలత్వము నారోపించి దానిని బట్టి భూమి వారిని విడనాడి కుమారమన్మథుఁడయిన శ్రీరంగరాయునిఁ జేరెనని చెప్పుచున్నాఁడు. కుండలి= సర్పము, అనఁగా శేషుఁడు, ఉరమునన్ ఏఁగు = అఱ్ఱుతోఁ బ్రాఁకిపోవును. బోరగిల అఱ్ఱుతోఁ బ్రాఁకులాడునంతటి పసిబిడ్డఁ డనుట - సర్పము గనుక అఱ్ఱుతోఁ బోవునని భావము. గిరులు = కొండలు - అనఁగా కులపర్వతములు, ఎప్పుడున్ = నిరంతరమును, పయోధరధారలన్ = చన్నుఁబాలు ధారలను, ఆనున్ = కుడుచును బుజ్జదినునంతటి వయసుగాక చనుఁబాలే యుడితెగక కుడుచుచున్నంతటి పసితనముగలవి యనుట. పయోధరములనఁగా స్తనములును మేఘములును గనుక, జలధారలచే ఎప్పుడును, ఆనున్ = తడిసియుండునని భావము. కరుల్ = ఏనుఁగులు- అనఁగా దిగ్గజములు, రజోవిహృతికిన్ = దుమ్ములుపూసికొనెడి యాటలకు, చనున్ = పోవును. ఆటలాడికొనునంతటి బాల్యము గలవియనుట. ఏనుఁగులు గనుక దుమ్ముఁజల్లుకొనునని భావము. కూర్మశేఖరుఁడు = కూర్మరాజు, ఆది

* 'కూర్మిశేఖరుఁడు' పాఠా.

వరాహమనుట, నేలవెళ్లఁడు = నేలపయిఁబోవఁజాలఁడు--నేలయంటు వదలని అనఁగా పరుండఁబెట్టిన చోటనే కదలమెదలలేకుండునట్టి పసికూనయనుట. భూమికాధారమై యుండునని భావము. బాలజన కల్పితసౌఖ్యము = పసిబాలుర సమూహముచే కల్పింపఁబడిన సంయోగసుఖము, ఇదియేల = ఇట్టిది యెందులకు, అని = విచారించుకొని, ధారుణీతరుణి = భూమియనెడు కౌమారప్రాయముగల స్త్రీ, కుమారమన్మథుఁ = యౌవన పురుషులలో మన్మథునివంటివాఁ డయిన, రంగరాయవసుధావరుఁ = శ్రీరంగరాయఁడను రాజును, చేరెను=పొందెను.

శేషాదులకు 'ఉరమున నేఁగు' నిత్యాదులచే బాలత్వావస్థలును 'కుండలి'యిత్యాది నిర్దేశములచే సౌందర్యరాహిత్యమునుజెప్పి యందులకుఁ బ్రతిభటముగా శ్రీరంగరాయనికి కుమారశబ్దముచే యౌవనమును, మన్మథశబ్దముచే సౌందర్యాతిశయమును జెప్పినాఁడు. భూదేవి తరుణి(జవరాలు)గావున బాలత్వావస్థలందున్న శేషాదులవలన సంభోగసౌఖ్యముగాని వారిరూపవికృతులవలన శృంగారోద్దీపనముగాని తనకుఁ గలుగదనియే వారెంటిని గలిగించుటకు వలయు యౌవనసౌందర్యములుగల రంగరాయనిఁ జెందెనని యర్థము. 'జన' ఒక్కఁడుగాక శేషుఁడు మొదలగువారు పెక్కండ్రు గావుఁ. ఇట 'యథా యూనస్తద్వత్పరమరమణీయాపి రమణీ । కుమారాణాం మన్తఃకరణహరణం నైవకురుతే' అను శ్లోకార్థ మనుసంధింపఁబడినది. అనఁగా శ్రీరంగరాయఁడు భూభరణ సామర్థ్యముచేత శేషుఁడు మొదలయినవారికంటె నధికుఁడని తాత్పర్యము. ఇట 'తరుణి' 'కుమారమన్మథుఁ'డను శబ్దములు సాభిప్రాయములుగాన పరికరము. మఱియు భూకాంత శ్రీరంగరాయనిఁ బొందుటకు శేషాదుల బాలత్వమును సంభావించుట హేతువు గాకపోయినను హేతువుగా వర్ణించుటచే హేతూత్ప్రేక్ష. ఇది పయోధరాది పదగతశ్లేషముచే నుత్థాపితము. తా. సుగమము.

సీ. కుంతలస్థలికి నేగుణగరిష్ఠునిచీటి, కమనీయ కేతకీగర్భదళము
మంజులలాట సీమకు నేమహాభాగు, తేజంబు కాశ్మీర తిలకరేఖ
వత్సభాగమున కే వైభవాధికుని యపారకీర్తిమతల్లి హారవల్లి
కాంచిదేశమున కే ఘనుని సంతతదాన, వారి నిర్ఝరధార హీరరశన

తే. యంగమున కెవ్వని చమూతురంగకోటి, ధాటికాధుతధూళి మాందాళిపట్టు
సమధికాకల్పరుచి పూనుజగతి కతఁడు, రాజమాత్రుండె శ్రీరంగరాయశౌరి.

అ. సమధిక.. రుచిఁ—సమధిక = మిక్కిలి యతిశయించిన, ఆకల్ప--(ఆకల్ప మనఁగా 'చతుర్థాలంకృతిర్వాసోభూషా మాల్యానులేపనైః' అను లక్షణముంబట్టి వస్త్రాభరణమాల్యానులేపనములనెడి నాలుగు విధములయిన యలంకారము. కనుక, శృంగారాత్మక మయిన యా)చతుర్విధాలంకారముయొక్క, 'ఆకల్పవేషౌ నేపథ్యమ్' అను. రుచిఁ = శోభను, పూను=వహించునట్టి, జగతికిఁ = భూదేవియనెడు స్త్రీకి, కుంతలస్థలికిఁ =కుంతలదేశమనెడు కుంతలదేశమునకు (అనఁగా కురుల ప్రదేశమయిన శిరస్సునకు) ఏగుణగరిష్ఠునిచీటి = గుణములందు మిక్కిలి గొప్పవాఁడయిన ఏరాజు యొక్క ఆజ్ఞాపత్రిక, కమనీయ = మనోహరమయిన, కేతకీ = మొగలియొక్క, గర్భదళము = గర్భములోని రేకయయ్యెనో, అనఁగా తేత గేదఁగిపూవురేకయయ్యె ననుట. తలకురులయందుఁ జెరువుకొనుట తేత గేదఁగి రేకు నని తెలియునది.

మంజు...సీమకుఁ—మంజుల=మనోహరమయిన, లాటసీమకుఁ =లాటసీమయనెడు, మంజుల= సుందరమయిన, లలాటసీమకుఁ = ఫాలప్రదేశమునకు, ఏమహాభాగు = మహాభాగ్యశాలియైన ఏరాజు

యొక్క, తేజంబు=ప్రతాపము, కాశ్మీరతిలకరేఖ = కుంకుమబొట్టుయొక్క రేఖ యాయెనో, ప్రతాప మెఱ్ఱనిదిగాఁ గవిసమయము గనుక కుంకుముగా రూపింపఁబడినది. లలాటమునఁ బెట్టుకొనునది గాన కుంకుమబొట్టుగా జెప్పఁబడెను.

వక్షోభాగమునకున్=వక్షోదేశమనెడు వక్షోభాగమునకు, ఏవైభవాధికుని = వైభవముచేత నధికుఁడయిన యేరాజుయొక్క, అపారకీర్తిమతల్లి=అంతములేని మేలయినకీర్తి, మతల్లికాశబ్దమిట 'మతల్లికామచర్చికా ప్రకాండముద్ఘతల్లజౌ, ప్రశస్తవాచకాని' అని ప్రశస్తవాచకము. హారవల్లి=తీఁగవంటి ముత్యాలహారమయ్యెనో, కీర్తి తెలుపని కవిసంప్రదాయము గాన, ముత్యాలహారముగా రూపితము. ఇట వక్షోభాగము గాన ముత్యాలహారమన్నాఁడు.

కాంచిదేశమునకున్=కాంచిదేశమనెడు కాంచిదేశమునకు (కాంచియనఁగా మొలనూలు గాన మొలనూలిప్రదేశమయిన కటిభాగమునకు), ఏఘనుని=గొప్పవాఁడయిన యేరాజుయొక్క, సంతత = ఎడతెగని, దాన=దానసంబంధమైన, వారి=ఉదకముయొక్క, నిర్ఝరధార=ప్రవాహధార, ఘనుఁడనఁగా మేఘమును గనుక ఏమేఘునియొక్క జలప్రవాహధారయని స్ఫురించెడిని. హీరరశన=వజ్రమణులచే నయిన మొలనూలాయెనో, ఇట కటిభాగమును జెప్పుటచే దానధారను రశనగా రూపించినాఁడు. 'స్త్రీ కట్యాం మేఖలా కాంచీ సప్తకీ రశనాచసా' అమ. జలవజ్రములకు వర్ణసామ్యము

అంగమునకున్=అంగదేశమనెడి అంగమునకు (అనఁగా శరీరమునకు) ఎవ్వని=ఏరాజుయొక్క, చమూతురంగకోటీ=సేనను సంబంధించిన యశ్వసమూహముయొక్క, ధాటికా = దవుడుచేత, ధుత= ఎగురఁగొట్టఁబడిన, ధూళి=పరాగము, మాందాళిపట్టు = మదుపువన్నెగల పట్టువస్త్రమాయెనో, ఇట అంగములను జెప్పుటచే సేనాశ్వధూళిని మాందాళి పట్టువస్త్రముగా రూపించినాఁడు. ఇట్లు ప్రథమచరణమున మాల్యశృంగారమును, రెండవచరణమం దనులేపనశృంగారమును, మూఁడవ నాలవచరణములం దాభరణశృంగారమును, గీతియందు వస్త్రశృంగారమును, అని చతుర్విధశృంగారములును.

ఇదియు నేపథ్యము. ఇందులకు

క. 'ఎందును నేపథ్యమునకుఁ, జంగనభూషాంబరప్రసవముల వేర్వే
ఱొందుఁ జతుర్విధ మొక్కటి, యందంబుగఁ బంచవిధము లైయిటు పరఁగున్.' రసాభరణము.

అతఁడు = పూర్వోక్తుఁడయిన, శ్రీరంగరాయశౌరి = శ్రీరంగరాయశ్రేష్ఠుడు, రాజమాత్రుండే=సాధారణ రాజులవంటివాఁడా - అనఁగా కాఁడనుట. జగతి యనెడు కాంతకు కుంతలాది దేశములందెల్లఁ జతుర్విధాలంకారములుఁ గయిసేసినట్టిరాజు సామాన్యుం డగునా యని యర్థము. పైని చెప్పఁబడిన కుంతలాది దేశములనెల్ల స్వాధీనము చేసికొని యేలినాఁడని తాత్పర్యము. ఇట రూపకాలంకారము. జగతీశబ్దమువలన నొకానొక స్త్రీ స్ఫురించుటచే నిది ఏకదేశవర్తి. కుంతలేత్యాదులందు శ్లిష్టమును తక్కినయెడల అశ్లిష్టమును.

మ. జలధిన్ దాన పయోధునీ ఝరులచేఁ జంద్రున్ యశోలక్ష్మిచే
జలదవ్రాతము నాత్మకారిత మహాసత్రాగ్నిధూమంబుచేఁ
జెలువొప్పన్ వెలయింపఁజాలు భళిరే శ్రీరంగరాయక్షమా
లలనావల్లభుఁ డల్లదాతలకు నెల్లన్ దాత యూహింపఁగన్. 78

అ. జలధిన్=సముద్రుని, దాన.. ఝరుల-దాన=దానసంబంధమైన, పయో=జలముచేతనయిన, ధునీ=నదులయొక్క, ఝరులచేన్=ప్రవాహములచేతను, చంద్రుని, యశోలక్ష్మిచేన్=కీర్తిశోభచేతను,

జలసంఘాతమును= మేఘసమూహమును, ఆత్మ...ధూమంబు చేన్—ఆత్మ=తన చేత, కారిత=చేయింపఁ బడిన, మహాసత్ర=మహాయజ్ఞములయందలి, 'సత్రమాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేఽపిచ' విశ్వ. అగ్ని =అగ్నిసంబంధియైన, ధూమంబు చేన్ = పొగచేతను, చెలువు ఒప్పన్ = బాగొప్పఁగా, వెలయింపంజాలును =ప్రకాశింపఁజేయ నేర్చును. భళిరే=ఆశ్చర్యము. శ్రీరంగరాయక్ష్మా లలనావల్లభుఁడు=శ్రీరంగరాయ భూవల్లభుఁడు, ఊహింపఁగన్ =విచారింపఁగా, అల్ల దాతలకు నెల్లన్ =ప్రసిద్ధదాతలయిన వారికందఱకు ను, దాత=దాతయగును. లోకమున సముద్రుఁడును చంద్రుఁడును మేఘుఁడును దాతలలో శ్రేష్ఠులని చెప్పఁబడుచున్నారు; కనుక నట్టి మేటిదాతలకు నయితను శ్రీరంగరాజు దాతయైనాఁడని యర్థము.

దానోదకనదీప్రవాహముల చేత సముద్రునకు జలసమృద్ధిని, శుభ్రయశస్సుయొక్క శోభ చేతఁ జంద్రునకుఁ గాంతిసమృద్ధిని, యజ్ఞాగ్ని ధూమపటలము చేత మేఘునకు రూపసమృద్ధిని గలుగఁజేసినాఁడని భావము. 'వెలయింపంజాలు' నను పదముఁగల వాక్యము చేత రాజునందు దాతలకు నొసంగునట్టి దాతృత్వ మును సమర్థించుటవలనఁ గావ్యలింగమలంకారము. మేఘమునకు 'ధూమయోనిః' అనఁబడుట చేతను 'ధూమజ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః' అని కాళిదాసోక్తిం బట్టియు 'ధూమ' ముపా దానము. మఱియు సముద్రమునంతటి వానిని వెలయించుటకు కేవలమయిన దానపయస్సు చేతఁ గాదు గాన దానపయో'ధునీఝరులు' కావలయును. చంద్రుని వెలయించుటకు కేవలమయిన యశస్సు చాల దుగాన 'యశోలక్ష్మి'. జలసంఘాతమును వెలయించుటకు కేవలమయిన సత్రాగ్నిధూమము చాలదుగాన, 'మహా'సత్రాగ్ని ధూమము. ఈమూఁటిచే వరుసగా దానప్రకర్షమును, కీర్త్యతిశయమును, యజ్ఞబా హుళ్యమును దెలియునది.

తా. శ్రీరంగరాయ భూపతి సముద్రమును దాన నదీజలప్రవాహముల చేతను చంద్రుని యశ స్సుయొక్క శోభ చేతను, మేఘ సమూహమును తాను గావించెడు మహాయజ్ఞములందలి హోమా నలధూమము చేత చక్కఁగాఁ బ్రకాశింపఁ జేయ నేర్చుచున్నాఁడు; లోకమున దాతలని ప్రసిద్ధిగాంచి నయాసముద్రాదులకుఁగూడ నతఁ డూహింపఁగా దాతగా నున్నాఁడు. ఏమాశ్చర్యము!

శా. తుంగక్ష్మాధరకోటు లెక్కి కమలాప్తుఙ్ బ్రమింగి వీరారిశౌ
ర్యాంగారంబుల నొక్కఁ ద్రుక్కఁగొని సద్యశ్శ్రాంతి మానంగ నా
నుం గల్లోలవతీభుజంగ జలసందోహంబు లెల్లన్ సమి
ద్రంగప్రౌఢ సిరంగరాయ పృతనారంగద్రజోజాలముల్. 74

అ. సమిత్...జాలముల్—సమిద్రంగ=యుద్ధరంగమందు, ప్రౌఢ=సమర్థుఁడయిన, సిరంగ రాయు=శ్రీరంగరాయునియొక్క, పృతనా=సేనాసంబంధియైన, రంగత్ =ఒప్పుచున్న, రజోజాలముల్ =ధూళిసమూహములు, తుంగక్ష్మాధరకోటులు = పొడవయిన పర్వత శిఖరములను, ఎక్కి, కమలా ప్తున్ =సూర్యుని, ప్రమింగి=కబళించి, వీర అరి శౌర్య అంగారంబులన్ = వీరులయిన శత్రువులయొక్క శౌర్యముల నెడి నిప్పులను, ఒక్కఁ ద్రుక్కఁగొని=ఒకకబళముగా దిగ్రమింగి, సద్యశ్శ్రాంతి = అప్పుడు పొందిన బడలిక, మానంగన్ =నివారణమగునట్లుగా, అపుడు కలిగిన శ్రమతోడనే నివారితమగునట్లు గా, కల్లోల...సందోహంబులు ఎల్లన్—కల్లోలవతీ=నదులకు, భుజంగ=విటుఁడయిన సముద్రునియొ క్క, జలసందోహంబు లెల్లన్=ఉదకసమూహముల నన్నిటిని, ఆనున్ =త్రాగును.

'తుంగక్ష్మాధరకోటు లెక్కి' ధూళిని పొడవులయిన కొండలకొనలపయిఁకని నిగిడించినదిగాన ఆసే నకొలఁది యింతంతని చెప్ప నలవిగాదు. 'తుంగ...ప్రమింగి' మిక్కిలి పొడవునున్న వస్తువు బట్టి

కొనుటకు నిడుపయిన నిచ్చెనయో పొడవయిన కొంతియడుకో కావలయునట్లు సూర్యునిఁబట్టుటకు తుంగములయిన పర్వతకోటులు వలయును. 'ప్రసంగి' ధూళి మిక్కిలిదట్టమై పటుపుగా నలుప్రక్కలఁ బర్వుటచే సూర్యుఁడు బొత్తిగాఁ గనఁబడఁడయ్యెను. అంతటి ధూళి ఎంతటిదవ్వునకైనను వెళ్ళఁ గూడును.'అరి... అంగారంబులు' అట్టిధూళిని చూడఁగానె సేన వచ్చెదిగానుండునని అందఱుశత్రువులును దవ్వుదవ్వుల నే గంటమి మాలిపోయిరి. 'హిం' వారు పిఱికి సంతలుగారు. కావున నె వారికి 'శౌర్యాగ్ని'. 'ఒక్కఁగుక్కఁగొని' ధూళిని మాపుటచేతనే వారిప్రతాపములెల్ల అవలీల ఒక్క పెట్టు అణఁగంటిని. యుద్ధముతో ఇంచుకైనను బనిలేదు. 'కల్లోల... సంతానంబులు' ధూళివ్యాప్తికి భూతలముపరిమితము చాలదు; సముద్రములును గావలయు. 'అసూక్' సముద్రముపై వ్యాపించుటకాదు. దానిని పూడ్చివేయు వైచినది. 'ఎల్లెక్' అంతొక బొట్టుగూడ మిగులదు. భూమిఁ అన్నిదిక్కులను వలనలకు అడ్డిలేక సేన దాడి పోవుచుండుటచే అన్ని సముద్రములను ఆధూళి ఆవరించినది. అపొడవైనకొండల కొనలెక్కుట కొంత దవ్వునను న్న శత్రువులకును, సూర్యునిఁ గప్పుట మిక్కిలి దవ్వులనున్న శత్రువులకును, రాజు ధాటి తెలుపు టకు. 'సముద్రఁ ప్రౌఢ' ఇంతటి సేన రాజునకు నట్టియాడంబరము గాదు. యుద్ధములం దతఁడాని తే తినదట్టు. 'కల్లోలవతీభుజంగ' దార్శకోత్తముఁడగు కూరాజు సేనాధూళికై తి ము నిందానే ధర్మా లసాధ్యమట్టను. బొజంగులు మొసలగుచుష్టులను పంచెంచుటకై వారినొద్ద సంతుగానుచున్నది. ఇట నిప్పను దుమ్ముచేనార్పుటయు, నిప్పుగొన్నవాఁడు నీరు ద్రాగుటయుఁ గని యనుసంధించవాఁడు.

ఇట సేనారజము చేసిన సముద్రపానమునకు తుంగ తృష్ణాదిరోగోపాదాదులచేఁ బుట్టినశ్రమము నివారించుట ఫలముగాకున్నను ఫలముగా కల్పించుటచే ఫలోత్ప్రేక్షయు ధూళివ్యసన మాత్రముచేత ను శత్రుల శౌర్యములుమాలఁగా యుద్ధమునాట చెప్పవలె యని కైముతికన్యాయమువలన అర్థాపత్తి యునలంకారములు. 'రజోజాలములందు చండపురుషవ్యవహార సమారోపమువలన సమాసోక్తి' యని సోమకవి. ఇట అనుసంధేయము.

సీ. వేదండభయము శుంఠడాడఁడ ర్వాంతి, నమధువల్ పైఁ జిల్కువారి గాఁగ
నత్కర్ణవి స్తీర్ణ తాళన్యంతోద్ధూత, ధూళి చేటలఁ జల్లి దుమ్ము గాఁగ
శ్రమబుర్బురత్తురంగమనాసికా గళ, త్ఫేంకంబు చుకిగ్దిముగ గాఁగఁ
గుపితయోధాక్షిప్త కుంతకాంతారశో, లసములు చండఘుటనలు గాఁగఁ

తే. జెనఁటిపగఱ ప్రతాపంబు చిచ్చు లార్చు, కరిణి గడిదేశమ్ములు సొచ్చి కలఁచి నులఁచు
మూరురాయరగండాంక వీరకృష్ణ, రాయ భూభృద్భయంకర ప్రబలధాటి. మనుచరిత్రము.

తా. యుద్ధమందు మిక్కిలి నేర్పరియైన శ్రీరంగరాయలు చతురంగ బలములతో దండెత్తఁగా నతని సేనచే రేపఁబడిన ధూళి సమూహము పయికి నెగసి పొడవయిన పర్వతములను గ్రమ్మి మఱియు నెక్కుడయి పయిపయినెగసి సూర్యునిని గ్రమ్మి, శత్రు వీరుల శౌర్యాగ్నులను చల్లార్చ యింతటి ప్రయత్నముచే బడలిక బొందఁగా దానిని బోఁగొట్టుకొనుటకై సముద్ర జలములనంతయు ద్రాగ నన్నట్లు వాని నెల్లఁ బూడ్చివైచెను.

సీ. భూరి భుజంగికాభోగభుక్తనిర్ముక్తుఁడై, వారకబుసకొట్టువానిఁ దెగడి
పంకనిశ్శంకుఁడై కాసారదారికవృత్తి, వడలక పల్లొత్తువాని నెడసి
మధుపాంగనాసంగమప్రౌఢి నెపుడుఁ బో, వనిచెక్కుచెమరులవాని రోసి
బింకంపుసానులవంకి రాపడి సేల, వంకపైఁబూనినవానిమాని

తే. పుడమిచెలిఁజెందె నకలంకభోగభాస, మాను నతఁయసౌకర్యమానితాను
భావ నమలినదానవైభవ [illegible]

అ. పుడమిచెలి=భూకాంత, భూరి...నిర్ముక్తుఁడై—భూరి = అనేకలయిన, భుజంగికా=జారస్త్రీలచేత, భుక్త=భుజింపఁబడి, నిర్ముక్తుఁడై = విడువఁబడినవాఁడై, వారకబుసకొట్టువానిన్=ఎడతెగక నిట్టూర్పులు పుచ్చుచుండుశేషుని, తెగడి = నిరసించి, -భూరి = అనేకములయిన, భుజంగికా = ఆఁడుపాములచేత, భుక్త= భోగింపఁబడి, నిర్ముక్తుఁడై = కుబుసమువిడిచినవాఁడై 'నిర్మోకో ముక్తకఞ్చుకః' అమ. వారకబుసకొట్టు = విరామములేక ఫూత్కారముసేయుచున్నవాఁడని భా.

పంకనిశ్శంకుఁడై—పంక = పాపవిషయమై, నిశ్శంకుఁడై = జంకులేనివాఁడై, పారదారికవృత్తిన్ = పరస్త్రీకాముకవృత్తితోడ, వదలక పల్లార్తువానిన్ =విడువక దంతక్షతములుసేయు యజ్ఞవరాహమును, ఎడసి=ఎడఁబాసి-పంకమనఁగా బురద - దానికి జంకనివాఁడై, పారదారికవృత్తిన్—(పారం దృణాతీతి పారదారీ. స ఏవ పారదారికః అనఁగా దరుల నురులం ద్రోయువాఁడు) దరుల నురులం ద్రోయు వ్యాపారముతో, ఎప్పుడును దంష్ట్రాగ్రముచేత ఘట్టనముసేయువాఁడని భా. 'పఙ్కః కర్దమపాపయోః' విశ్వ.

మధు...ప్రౌఢిన్—మధుప=మద్యపానముచేయునట్టి, అంగనా=స్త్రీలతోడి, సంగమ=సంభోగించుటయందలి, ప్రౌఢిన్ = సామర్థ్యముచేత, ఎపుడున్ పోవని చెక్కుచెమటలవానిన్ =ఎప్పుడును బోకుండెడి చెక్కుచెమటలుగల దిగ్గజమును, చెక్కుచెమర్చుట అనఁగా శ్రమపడుట. ఇది జాతీయము - కల్లుద్రాగిన స్త్రీలతో నెప్పుడును సంభోగించుచు శ్రమకు పాలయి యుండునట్టివాఁడయిన దిగ్గజమునకు రోసి. మధుప+అంగనలనఁగా ఆఁడుతుమ్మెదలు, వానితోడి సాంగత్యమందు ప్రౌఢిగలవాఁడనియు ఎప్పుడును గండస్థలమందు మదధారలుగలవాఁడనియు భా. తుమ్మెదలు ఏనుఁగు మదజలవాసనకు మూఁగుట ప్రసిద్ధము.

బింకంపుసానుల వంకరాపడి-సానియనఁగా వారస్త్రీ, సానువు అనఁగా పర్వతపుఁ జెద్దచఱి. బింకముగల వారకాంతల రాపిళ్లంబడి, నెలవంకన్ =నఖక్షతమును, పైఁబూనినవానిన్ = వహించినకులపర్వతమును, మాని = విడిచిపెట్టి - పెద్దచరులయొక్క మలఁకలయందు ంపడిన చంద్రకళను బూని ధరించినది—అనఁగా మిక్కిలి యున్నతమయియుండునదని భావము.

అకలంకభోగభాసమానున్ - అకలంక=కలంకరహితమయిన, భోగ=భోగముచేత, భాసమానున్ =ప్రకాశమానుఁడును- ఇది రాజపరము. శేషుఁడో కళంకసహితమయిన భోగముగలవాఁడనుట. ఇది ప్రథమచరణమునకు వ్యతిరేకమని తెలియునది. భోగమనఁగా సర్పదేహము. నల్లనిమచ్చలచేత కళంకితమైన దేహముగలవాఁడని భావము. 'మూర్ధ్నా ముకున్దపదపఙ్కజ ముద్రితేన' అని శేషశిరోవిశేషణముగాఁ జెప్పఁబడియున్నది. 'కళఙ్కోఙ్కాపవాదయోః' అమ. అక్షయసౌకర్యమానితానుభావున్—అక్షయ=క్షయములేని, సౌకర్య = తిన్నఁదనముచేత, మానిత=ఒప్పుచున్న, అనుభావున్ =ప్రభావముగలవాఁడును-యజ్ఞవరాహమో క్షయసౌకర్యముతోఁ గూడినదనుట. ఇది రెండవచరణమునకు వ్యతిరేకము. క్షయమనఁగా కల్పాంతము, సౌకర్యమన సూకరభావము. కల్పాంతమున సూకరభావముతో అనఁగా వరాహత్వముతోఁగూడినదని భావము. 'క్షయః కల్పాంత ఇత్యపి' అమ. అమలినదానవైభవున్—అమలిన=మాలిన్యరహితమైన, దానవైభవున్ = త్యాగముయొక్క యతిశయముగలవాఁడును, దిగ్గజమో మలినదానము గలదనుట. ఇది మూఁడవచరణమునకు వ్యతిరేకము. దానమనఁగా ఏనుఁగుచెక్కిలి మదజలముగాన మలినమైన మదవైభవముగలదని భావము. 'దానం గజమదే త్యాగే' అమ. అకూటరాగనిస్తంద్రున్—అకూట = కపటములేని, రాగ = అనురాగముచేత, నిస్తంద్రున్ = ప్రకా

శించువాఁడును, కులపర్వతమో కూటరాగము-అనఁగా కపటముతోఁగూడిన యనురాగము గలదనుట. ఇట నాలుగవ చరణమునకు వ్యతిరేకము. కూటములనఁగా శిఖరములుగాన శిఖరములందలి ధాతురాగములతోఁ గూడినదై చలింపనిదని భావము. 'మాయానిశ్చల యన్త్రేషు కైతవాన్కృతరాజిషు। అయోఘనే శైలశృఙ్గే సీరాఙ్గేకూటమస్త్రియామ్' అను. శ్రీరంగరాయచంద్రుఁ = శ్రీరంగరాయశ్రేష్ఠుని, చెందెఁ = పొందెను. అనఁగా భూకాంత తనకు భర్తలైన శేషాహిమొదలైనవారియందు శబ్దశ్లేషముచేత సంప్రాప్తమైన దుర్విటభావములను విచారించినదై వారి సాంగత్యము నిరసించి యుత్తమనాయక ధర్మములుగల శ్రీరంగరాయప్రభువును బొందెనని యర్థము. శేషాహి మొదలైనవారి సాహాయ్యములేక భూతలముయొక్క భారమునెల్ల శ్రీ రంగరాయఁడే భరించెనని తాత్పర్యము. ఇట శ్లేషానుప్రాణితమైన వ్యతిరేక మలంకారము.

మ. ఘనశౌర్యుండు సింగరాయనరలోకస్వామితోఁబుట్టు రా
మనృపాలాగ్రణి సహ్యజాంబుధి పయోమధ్యోర్వి శ్రీరంగప
ట్టణలంకానగరంబు పుణ్యజన పీడావార్త లేకుండఁ గై
కొనియెన్ మిత్రభవోపకార నిరపేక్షుండై విచిత్రంబుగన్. 76

ఆ. ఘనశౌర్యుండు = మిక్కిలి పరాక్రమముగలవాఁడగు, సింగరాయ నరలోకస్వామితోఁబుట్టు = శ్రీరంగరాయరాజు తమ్ముఁడయిన, రామనృపాల+అగ్రణి= రామరాజశ్రేష్ఠుఁడు, సహ్యజా... నగరంబు—సహ్యజా = కావేరియనెడు, అంబుధి = సముద్రముయొక్క, పయః=ఉదకముయొక్క, మధ్యోర్వి - మధ్యభూమియందలి, శ్రీరంగపట్టణలంకానగరంబు = శ్రీరంగపట్టణమనెడి లంకాపురమును, పుణ్య...వార్త - పుణ్యజనపీడా = సజ్జనబాధయను, వార్త = మాట, లేకుండఁ = లేకుండునట్లుగా, మిత్ర...పేక్షుండై—మిత్ర = స్నేహితులవలన, భవ = పుట్టెడు, ఉపకార = సాహాయ్యమందు, నిరపేక్షుండై = అపేక్షలేనివాఁడై—అనఁగా అసహాయుఁడై, విచిత్రంబుగన్ = వింతగా - ఆశ్చర్యముగలుగునట్లుగా, కైకొనియెన్ = సాధించిపుచ్చుకొనెను అని యర్థము. దశరథరాముఁడట్లుకాదు. మిత్రభవోపకారము నపేక్షించినవాఁడై పుణ్యజనపీడ కలుగునట్లుగా, అంబుధిపయోమధ్యభూమియందలి లంకానగరమును గైకొన్నాఁడనుట. మిత్రభవుఁడనఁగా సూర్యునికిఁబుట్టినసుగ్రీవుఁడు గనుక సుగ్రీవుని యుపకారము నపేక్షించినవాఁడనియు, పుణ్యజనులనఁగా 'యాతుధానః పుణ్యజనః' అన్నట్లు రాక్షసులుగాన రాక్షసులకుఁ బీడకలుగునట్లు గావించినవాఁడనియును భావము.

'విచిత్రంబుగన్' ఆరామనృపాలాగ్రణియైనందులకు మిత్రభవోపకారము నపేక్షించి పుణ్యజనపీడగలుగునట్లుగా లంకానగరమున గైకొనవలసియుండఁగా మిత్రభవోపకార మపేక్షింపకయే పుణ్యజనపీడావార్తయు లేనట్లు లంకానగరము గైకొనుట విచిత్రముగానున్నది. ఆదశరథరామ నృపాలాగ్రణికిని ఈరామరాయనృపాలాగ్రణికిని 'సహ్యజాంబుధిపయో మధ్యోర్వి' శ్రీరంగపట్టణ లంకానగరంబు గైకొనుటయందు సామ్యము. పుణ్యజనవిషయమునను మిత్రభవోపకార విషయమునను ఇరువురకును భేదము. ఆరాముఁడు పుణ్యజనులనుబీడించి మిత్రోపకారమును గోరినాఁడు, ఇతఁడో పుణ్యజనులను బీడింపక మిత్రోపకారమును గోరక యున్నవాఁడు గనుక నితఁడారామునికంటె నధికుఁడని యాశయము.

ఇట రామనృపాలాగ్రణి యనెడు రామనృపాలాగ్రణియని రూపకము. అది సహ్యజాంభోధీత్యాద్యవయవ రూపణములచే సావయవరూపకము. దశరథరాముఁడైయున్న యవస్థకంటె రామరాజైయున్న యవస్థయందు మిత్రభవోపకారనిరపేక్షత్వాది శ్లేషముచే ననుగృహీతమైన విశేషమును। ఇతి

పాదించుటవలన అధికాభేదరూపకము. ఘనశౌర్యుఁడను విశేషణముచే మిత్రనిరపేక్షముగాలంకాసాధనమును సమర్థించుటవలనఁ గావ్యలింగము నలంకారము. రెండింటికిని అంగాంగిభావముచే సంకరము.

తా. మహాపరాక్రమశాలియు శ్రీరంగరాజుతోడఁబుట్టువు నయినరామరాజు మిత్రసాహాయ్యము నపేక్షింపకయుఁ బుణ్యజనులకుఁ బీడయన్నమాట కలిగింపకయుఁ దానుకావేరిమధ్యమునం దున్న శ్రీరంగపట్టణమును సాధించెను.

శా. రామక్ష్మావరు దానతోయ తటినీవ్రాతంబు కల్లోలినీ
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గు వర్షాశర
త్సామానాధికరణ్యలబ్ధి కచటం జక్రాయుధుం * డొందు ని
ద్రా ముద్రా నుగతప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్. 77

అ. చక్రాయుధుండు = శ్రీమహావిష్ణువు, రామ...వ్రాతంబు—రామక్ష్మావరు=రామరాజుయొక్క, దాన తోయతటినీ వ్రాతంబు=దానజలములచే నయిన నదులయొక్క సమూహము, కల్లోలినీ స్వామిన్ చెందన్ = నదీపతియైన సముద్రునియందు ప్రవేశించుచుండఁగా, యశంబు=కీర్తి, మేఘములన్ పర్వన్ = మేఘములయందు వ్యాపింపఁగాను, కల్గు...లబ్ధికిన్—కల్గు=సంభవించునట్టి, వర్షాశరత్ = వర్షాకాల శరత్కాలములయొక్క, సామానాధికరణ్య = ఒకకాలమందే కలుగుటయొక్క, లబ్ధికిన్ = ప్రాప్తికి - వర్షాశరత్కాలము లేకకాలమందే ప్రాప్తించుటకనుట, అచటన్ = అపాలసముద్రమందు, నిద్రాముద్రానుగతప్రబోధములు = నిద్రారూపమై నముద్రను - అనఁగా నేత్రముకుళన రూపమయిన నిద్రను, అనుగత = దాని వెంబడిగలిగిన, ప్రబోధములు = మెలఁకువను - నిదురకై కనులు మొగుచుటయు, దోడనే మేలుకనుటయు ననుట. ఏకకాలంబునన్ = ఒక్కసమయమందే, ఒందున్ = పొందుచుండును, చిత్రంబు =ఇది విచిత్రము, లేక, చిత్రంబు=విచిత్రముగానని క్రియావిశేషణము. పొందునను క్రియతో నన్వయము. 'ఇది సుఖంబుండె' నిత్యాదులవలెఁ దెలియునది.

ఏకకాలమందే నిదురయును మెలఁకువయును బొందుట విచిత్రమనుట. విష్ణుమూర్తికి వర్షర్తువునందు నిద్రయును, శరదృతువునందు మెలఁకువయు నగునుగనుక ఈరామరాజు దానములు సేయునపుడు విడుచుజలములు నదులై ప్రవహించి క్షీరసముద్రమునం బ్రవేశించుచుండఁగా, నపుడే యితని శుభ్రయశస్సుపర్వుటచే మేఘములన్నియుఁ దెల్లవాఱుచుండఁగా,సముద్రమున శయనించియుండు విష్ణుమూర్తి నదులు సముద్రమందుఁ బ్రవేశించుటచే వర్షాకాలమని నిద్రను, మేఘములు తెల్లగానుండుటచే శరత్కాలమని మెలఁకువను ఒకప్పుడే పొందుచుండెనని యర్థము. ఇట సంబంధాతిశయోక్తులు మూఁటికిని అంగాంగిభావముచే సంకరము. రామరాజువ్వారిగా దానములు సేయువాఁడనియు నతనికీర్తి అంతటను వ్యాపించిన దనియుఁ దాత్పర్యము. శ్రీవిష్ణుదేవు నిద్రాప్రబోధకాలములు

'క్షీరాబ్ధౌ శేషపర్యఙ్కే ఆషాఢ్యాం సంవిశే ద్ధరిః ।
నిద్రాం త్యజతి కార్తిక్యాం తయోస్సం పూజయే త్సదా' యమస్మృతి.

క. అరఘునాథ ప్రభృతిధ, రారమణేంద్రులకు ముువ్వురకు సోదరుఁడై
సారమతి వేంకటపతి, క్ష్మారమణీప్రియుఁడు వెలయు శత్రుఘ్నుఁడనన్. 78

అ. అరఘు...సోదరుఁడై—అరఘునాథ ప్రభృతి = అరఘునాథుఁడు మొదలయిన, ధరారమణ + ఇంద్రులకున్ = రాజశ్రేష్ఠులకు, ముువ్వురకున్ = ముగ్గురికిని, సోదరుఁడై = తమ్ముఁడై

* 'దుండు' నని పాఠాంతరము.

ఆ రామలక్ష్మణ భరతులకుఁ దమ్ముఁడైయని యర్థాంతరము. సారమతి = శ్రేష్ఠమయిన బుద్ధిగల, వేంకటపతి క్ష్మారమణీ ప్రియుఁడు = వేంకటపతియను రాజు, శత్రుఘ్నుఁడనన్ = శత్రుసంహారకుఁడను నట్టులుగా - శత్రుఘ్నుఁ డనునట్టులుగానని యర్థాంతరము. వెలయున్ = ప్రకాశించును. ఇట రఘునాథాదులకు మువ్వురకుఁ దమ్ముఁ డౌటయనుధర్మము సంబంధమువలన శత్రుఘ్నుఁడు-గా నుత్ప్రేక్షించుటచేత శ్లేషమూలక స్వరూపోత్ప్రేక్ష యలంకారము. తా. సుగమము.

సీ. చెక్కునొక్కదెయంచు దిక్కరిగ్రామణి, యక్కఁజేరదెయంచుఁ *రిక్కరాయఁ
డఱుతనొందదెయంచు హాలాహలాహారి, కంటి కబ్బదె యంచు దంటచిలువ
యంక మొందదెయంచు యదుకుల†జ్యేష్ఠుండు, మోముఁజూడదెయంచు మొదటిగిబ్బ
యడుగుత్రొక్కదెయంచు నమృతంపుమున్నీరు, చాయనుండదెయంచు సౌరశాఖి

తే. తనచెలిమి కాసపడ నొచ్చెమునికి వారిఁ, దెగడి యాత్మసవర్ణలబ్ధికిఁ జరాచ
రంబునఁ జరించుఁ దిరుమలరాయ తనయ, ధీర వేంకటరాయ సత్కీర్తికన్య.

అ. తిరుమల దేవరాయ తనయ ధీర వేంకటరాయ సత్కీర్తికన్య = తిరుమల దేవరాయల కొమారుఁడును ధీరుఁడునయిన వేంకటరాయల యొక్క శ్రేష్ఠమయిన కీర్తియనెడి కన్య, చెక్కు నొక్కదె యంచున్ = చెక్కిలి నొక్కి ముద్దయినను బెట్టుకొనదాయెనని, దిక్కరి గ్రామణిన్=దిగ్గజ శ్రేష్ఠమయిన ఐరావతమును, అక్కఁజేరదె యంచున్ = అక్కు పయికైనను రాదాయెనని, రిక్కరాయఁడు=చంద్రుఁడును, అఱుతన్ ఒందదెయంచున్=కంఠా శ్లేషమయినను జేసికొనదాయెనని, హాలాహల+ఆహారి=శివుఁడును, కంటికిన్ అబ్బదెయంచున్=కంటికయినను దక్కదాయెనని, కంటికిఁ జూడనుగూడ లేదాయెనని, దంటచిలువ=ప్రౌఢసర్పమును—అనఁగా శేషుఁడనుట, అంకము ఒందదెయంచున్=తొడమీఁదికి రాదాయెనని, యదుకుల జ్యేష్ఠుండు=బలరాముఁడును, మోమున్ చూడదె అంచున్=మొగమయినఁ జూడదాయెనని, మొదటిగిబ్బ=ఆదివృషభము —నందియు, అడుగుత్రొక్కదె యంచున్=కాలు ద్రొక్కకయుఁ-అనఁగా పెండ్లియాడకయు పోయెనని,(కలికి నిను రాజకీరంబు కాలుద్రొక్క' విజయ) అమృతంపుమున్నీరు = క్షీరసముద్రుఁడును, చాయన్ ఉండదె యంచున్=సరసనైన నుండదాయెనని, సౌరశాఖి=కల్పవృక్షమును, ఇంతవఱకును చెక్కునొక్కదె యక్కఁజేరదె యిత్యాది విశేషణములవలన ఐరావత చంద్రాదులకు నాయకత్వము వ్యవహరించుట స్ఫురించుచున్నది. తన చెలిమికిన్ ఆసపడన్=తనతోడ సాంగత్యమునకు నిచ్ఛగింపఁగా, ఒచ్చెము ఉనికిన్=లోపము ఉన్నందున, వారిన్ తెగడి=పైని చెప్పఁబడినవారిని దిరస్కరించి, ఆత్మ స వర్ణలబ్ధికిన్=తనకుఁ దగినవారు లభించుకొఱకు, తనకు సాటియైన వర్ణముగలది—అనఁగా దనవలెఁ దెల్లనిది లభించుకొఱకని భావము. చరాచరంబునన్=స్థావర జంగమాత్మకమయిన ప్రపంచమునందంతటను, చరించును.

ఇతనికీర్తి నిష్కళంకమయిన ధావళ్యముగలది. కనుకఁ దనతో సామ్యము పొందవలయునని విచారించిన యైరావత చంద్రాదులకుఁ గ్రమముగా లోపములుండుటచేతను—అనఁగా ఐరావతమునకు, గండస్థలమందు(చెక్కున)మదజలమాలిన్యమును,చంద్రునకువక్షోభాగమందు(అక్కునందు)కళంకమును, శివునకుఁ గంఠమందు (అఱుత) నైల్యమును, శేషునికిఁ గన్నులయందు (కంటియందు) నీలిమయును, బలరామునికిఁ దొడలయందు (అంకమందు) నీలాంబరమును, ఆది వృషభమునకు మొకమున (మోమున) నల్లమచ్చలును, క్షీరసముద్రునకు నధః ప్రదేశమున (అడుగున) నల్లని బురదయు, కల్పవృక్షమునకు

* 'రిక్కరాజు' పాఠా. † [illegible]

ఛాయయందు (చాయయందు) నీలిమయును కలిగియుండుటచేత సామ్యమును బొందలేరయిరి. కనుక వారిని దిరస్కరించి తనకు సాటియైన వస్తువును వెదకు నిమిత్తమయి తిరుగుచున్నదో యన్నట్లుగా జగత్తునం దంతటను వ్యాపించెనని భావము.

చెక్కుటొక్కెడ యనుమొదలయిన విశేషణములవలన దిక్కరిచంద్రాదులకు నాయక స్ఫూర్తి కలుగుచున్నది గనుక సమాసోక్తియని కొందఱు. ఇది గమ్యముగాక కంఠోక్తమగుటచే సమాసోక్తి గాదని కొందఱు. మదజలకళంకాదిమలినీభూతగండస్థల వక్షఃస్థలాది యుక్తములయిన దిక్కరి చంద్రాద్యుప మానములకంటెఁ గీర్తియం దాధిక్యము స్ఫురించుచున్నది గనుక, వ్యతిరేకమును. కీర్తి కన్య విషయముగా దిక్కరి ప్రభృతితిర్యగ్జంతువులకుసయితము రతిని బ్రతిపాదించినాఁడు గాన, రసాభాసము. కీర్తికన్య చరాచరముల సంచరించుటకు ఫలముగానట్టి సవర్ణప్రాప్తిని ఫలముగా నుత్ప్రేక్షించుటవలన ఫలోత్ప్రేక్షయు నలంకారములు. వేంకటరాయల నిష్కళంకమయిన కీర్తి దిక్కరి చంద్రాదులకంటె నధికధావళ్యము గలిగి చరాచరములందెల్ల వ్యాపించెనని తాత్పర్యము.

మ. హరుఁ డాతారక శైలదుర్గమున నధ్యాసీనుఁ డై రాజశే
ఖర విఖ్యాతి వహించుఁ జంద్రగిరిదుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పున్ బహురాజశేఖర సదాసంసేవ్యుఁ డై యౌర యి
ద్ధర బంటేలికవాసి తద్గిరులకుం దద్వల్లభ శ్రీలకున్. 80

అ. హరుఁడు=శివుఁడు, ఆతారకశైలదుర్గమునన్=నక్షత్రము పేరిటి యాపర్వతదుర్గమందు, తారకశబ్దము పుంనపుంసకమును 'తారకః కర్ణధారేచ దైత్యేచ దృశితారకమ్। కనీనికాయాం నక్షత్రేతారకం తారకాపిచ' విశ్వ అధ్యాసీనుఁడై=నివసించినవాఁడై, రాజశేఖర విఖ్యాతిన్=రాజశ్రేష్ఠుఁడని ప్రసిద్ధిని, వహించున్=దాల్చును. వెండికొండయందు వసించినాఁడనియు,జంద్రశేఖరనామము గలవాఁడనియునుభావము. శ్రీవేంకటేశ్వరుఁడు=సంపద్యుక్తుఁడయిన వేంకటరాయఁడు, చంద్రగిరి దుర్గంబందున్= చంద్రుని పేరిటిపర్వత దుర్గమందు, బహురాజ... సేవ్యుఁడై —బహురాజశేఖర=అనేకులయిన రాజశ్రేష్ఠులచేత, సదా=ఎల్లప్పుడును, సంసేవ్యుఁడై=సేవింపఁబడుచున్నవాఁడై, ఒప్పున్=వెలయుచుండెను- చంద్రగిరియనెడి పర్వతదుర్గమం దనేకసామంతరాజసేవ్యుఁడై వెలయుచుండెనని భావము. ఔర=భళి, ఇద్ధరన్=ఈ భూమియందు, తద్గిరులకున్ = ఆతారకగిరి చంద్రగిరులకును, తత్ వల్లభశ్రీలకున్=ఆగిరుల కధిపతులయిన హరవేంకటేశ్వరుల సంపదలకును, బంటేలికవాసి= బంటుదొరవాసి-బంటునకు దొరకును గలయంత తారతమ్యము గలదని యర్థము. తారకములకును చంద్రునకును రాజశేఖరునకును రాజశేఖర సంసేవ్యునకును గల బంటుదొరవాసినిగాని తారకగిరికిని చంద్రగిరికిని బంటుదొరవాసిని జెప్పినాఁడని చమత్కారము తెలియునది.

మఱియు 'వసుచన్ద్రం చార్జునంచ కల్యాణం భూరిగైరికమ్' అని చంద్రమనఁగా బంగారము గనుక, వెండికొండకును బంగారుకొండకును బంటేలికవాసియని ప్రకారాంతరము. వెండికొండ బంగారుకొండల యేలికలయిన హరవేంకటేశ్వరుల సంపదలును నాకొండల యుపాదానములగు వెండి బంగారములను బట్టి బంటుదొర తారతమ్యము గలిగియున్నదని చమత్కారము. ఇచట వేంకటేశ్వరుడనఁగా తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామియుఁ జంద్రగిరి దుర్గమువాఁడును గనుక శివునికంటె వేంకటేశ్వరా పరరూపుఁడయిన విష్ణుఁ డధికుఁడని కవి వైష్ణవ పక్షపాతమున స్ఫురించెడిని. వేంకటరాజు, చంద్రగిరి దుర్గమం దనేక సామంతరాజ సంసేవితుఁడై వెండికొండయందలి శివునకన్న మించిన పెంపు

సొంపుతో వెలయుచుండెనని తాత్పర్యము. ఇచట మొదటి రెండువాక్యములందుఁ దారకగిరి చంద్రగిరులకు వాని యేలికలకును భృత్యరాజాంతరమును సమర్థించుటచే వాక్యార్థహేతుక కావ్యలింగము శ్లేషోత్థాపితము.

సీ. చుట్టఁజుట్టుకొని శేషుఁడు నిద్దురయపోవు, ముదిపన్నగములలోఁ మొదటివాఁడు
మొనయకాదిమకూర్మము మేముదుంగు మేను మో, సినఁ బెద్దవారిలోఁ బెద్దవాఁడు
సమధికాశాప్తి హస్తముచాఁచుఁ బద్మినీ, వైరి దిక్కరి తలవడఁకువాఁడు
తనయొంటి పంటిచేతనె యంటునాదికా, లము ఘోణి పాండురోమములవాఁడు

తే. కదలలేఁడద్రి బహువయఃక్రమమువాఁడ, టంచు వారలనిరసించి యవనికాంత
తనభుజాదండముననుండఁ గదనరు మందు, భావజనిభుండు వేంకటపతివిభుండు.

అ. శేషుఁడు, చుట్టఁజుట్టుకొని నిద్దురయపోవున్ = శరీరమంతయుఁ గుదియఁదీసికొని యెప్పుడును నిద్రపోవుచునే యున్నాఁడు. ఇంతేకాక, ముదిపన్నగములలో మొదటివాఁడు=ముదిసిన పాములలో మొదటఁ జెప్పఁబడినవాఁడు. ఆదికూర్మము= భూమికి ముందుగాఁ బుట్టిన కూర్మఁడు, మేనుమోపినన్ =దేహము మోపఁగానే, మొనయక = పయికొనక, ముదుంగున్ =ముడుఁచుకొని పోవును. అదియునుగాక, పెద్దవారిలోఁ బెద్దవాఁడు, వృద్ధులలో నతివృద్ధు. దిక్కరి=దిగ్గజము, సమధిక ఆశాఆప్తిన్—సమధిక= మిక్కిలి యధికమైన, ఆశాప్తిన్ =ఆశను బొందుటచేత, హస్తము చాఁచున్ =చేఁజాచుచుండును - పేరాశవలన చేయిచాఁచి యడుగుచుండునను - అనఁగా లేకితనముగా యాచించుననుట, అదియునుగాక, పద్మినీవైరి=పద్మినీ జాతి స్త్రీలకుఁ గొంగానివాఁడును, తలవడఁకువాఁడు = తలవడఁకుచుండు ముసలివాఁడును. ఆశలనఁగా దిక్కులు, 'ఆశాస్తృష్ణా దిశో ప్రోక్తాః' అ. హస్తమనఁగా తుండము. 'హస్తోనక్షత్రభేదస్యాత్కరేథ కరయోరపి' విశ్వ. పద్మినియనఁగా పద్మలత 'పద్మినీ స్త్రీవిశేషేపి సరస్యామవ్జజేపి చ' విశ్వ. కనుక దిక్కులయందుఁ దుండము సాఁచువాఁడనియును దామరతీఁగలను ద్రెంచి వేయువాఁడనియును శిరస్సుచాంచల్యమే స్వభావముగాఁ గలవాఁడనియును భావము. ఆదికాలము ఘోణి=అనఁగా ఆదివరాహము, తన యొంటిపంటిచేతనే యంటున్ =ఒంటిపల్లనఁగా అన్నిపండ్లు నూడిపోఁగా మిగిలినపల్లు-దానిచేతనే నొక్కుననియును, అదియునుంగాక, పాండురోమములవాఁడు=నరసిన వెంట్రుకలవాఁడనియు నర్థము. ఒంటి కోరపల్లు గలవాఁడనియు శ్వేతవరాహము గనుక తెల్లని వెంట్రుకలు గలవాఁడనియును భావము. 'దంష్ట్రిఘోణీ స్తబ్ధరోమా' అమ.

కదలలేఁడు అద్రి=అద్రియనఁగా కులపర్వతము- కులపర్వతుఁడు, కదలలేఁడు=కూర్చున్నచోట నుండి యీవలావలఁ గదలఁజాలనివాఁడు; అదియునుంగాక, బహువయః క్రమమువాఁడు-బహు=అనేకములయిన, వయః=బాల్యకౌమార యౌవనములయొక్క, క్రమమువాఁడు=క్రమించుట గలవాఁడు, బాల్యకౌమారాది ప్రాయములు గడచిన ముదుకఁడనుట. అద్రి అచలమనియు, వయశ్శబ్దము పక్షియను నర్థముగలిగియుండుటవలన అనేకములయిన పక్షులయొక్క గతి గలిగినవాఁడనియును భావము. 'వయః పక్షిణి బాల్యాదౌ వయో యౌవనమాత్రకే' విశ్వ. అటంచు=ఇట్లనుచు, వారలఁ=వృద్ధధర్మములుగల శేషుఁడు మొదలయినవారిని, నిరసించి=నిరాకరించి, అవనికాంత=భూకాంత, తన భుజాదండమునన్ ఉండన్ =తనదు బాహుదండమందు నివసింపఁగా, భావజనిభుండు=మన్మథస

మానుఁడయిన, ఇది సాభిప్రాయము. వేంకటక్ష్మావిభుండు=వేంకటరాయ భూమీశ్వరుఁడు, తనరున్ = ఒప్పుచుండును.

దిక్కరివరాహాద్రులకు మహద్వివక్షఁజేసి చెప్పుట తెలియునది. ఇచట నవనికాంత వేంకటరాజ భుజానందము నందుటకు శేషాదులయందలి వృద్ధధర్మముల సంభావనముచే నయిన నిరసనము హేతువుగాకపోయినను హేతువుగా నుత్ప్రేక్షించుటచే హేతూత్ప్రేక్ష యలంకారము శ్లేషోత్థాపితము. భావజనిభుండను విశేషణముచే భుజాదండాశ్రయణమును సమర్థించుటచే కావ్యలింగమును పరికరము నలంకారములు.

మ. అతిధీరుం డతిదానశూరుఁ డతిరమ్యాకారుఁ డత్యంతసు
వ్రతుఁ డంచుం దను సన్నుతించుకవివాగ్వ్యాపార మెల్లన్ యథా
ర్థతమం బై విలసిల్లఁ దిర్మలమహారాయేంద్రుశ్రీవేంకట
క్షితినాథోత్తముఁ డందు నిందు గతిఁ గల్పించుం గవిశ్రేణికిన్. 82

అ. తిర్మలమహారాయేంద్రు శ్రీవేంకటక్షితి నాథోత్తముఁడు=తిరుమల దేవరాయని కుమారుఁడయిన వేంకటరాయమహారాజు, అతిధీరుండు=అత్యంత ధైర్యముగలవాఁడును, అతి దానశూరుఁడు=అతిశయమయిన దానమునందుఁ దెగువగలవాఁడును, అతిరమ్యాకారుఁడు=మిక్కిలి మనోహరమయిన రూపముగలవాఁడును, అత్యంతసువ్రతుఁడు=మిక్కిలి యుత్కటమయిన నియమముగలవాఁడును, అంచున్, తనున్=తన్ను, సన్ను... మెల్లన్—సన్నుతించు=స్తుతిచేయుచున్న, కవి=కవులయొక్క, వాక్ వ్యాపారము ఎల్లన్=వాగ్వ్యాపృత్తియంతయును--కవిత్వ వ్యాపారమంతయు ననుట, యథార్థతమంబై=మిక్కిలియు నిజమై, విలసిల్లన్=ఒప్పునట్లుగా, కవిశ్రేణికిన్=కవిసమూహమునకు, అందున్ ఇందున్=పరలోకమందును ఈలోకమందును, గతిన్ కల్పించున్=సద్గతిని గలుగఁజేయును. ఇక్కడ నపరిమిత ధనప్రాప్తిచేత ఐహికమును, అతి ధీరత్వాదిగుణములు యథార్థముగాఁగల పుణ్యశ్లోకుని వర్ణించిన మహాత్మ్యముచేతను వర్ణనావిషయయాథార్థ్యవిభవముచేతను ఆముష్మికమును, గవిశ్రేణికిఁ గలుగఁ జేయుచున్నాఁడని యాశయము. కవి వాగ్వ్యాపారమెల్లన్=అని కవివర్ణనాకృత్స్నత దెలియునది. కవులెంత వర్ణించినను నంతయు యథార్థతమంబగునే కాని యాలంకారికమాత్రము గాదనుటచే వేంకటరాయని యతిధీరత్వాదులు నిరవధికాతిశయములయినవని తేలుచున్నది. ఇచట 'అతి' యను నుపసర్గ మన్నిగుణములకుండుట కనురూపముగా యథార్థశబ్దమునకు తమ శబ్దమును గూర్చినాఁడు. అత్యంతములయిన ధీరత్వాదులు గనుక నెంతవర్ణించినను నంతకంత యథార్థములనుట. కవి వాగ్వ్యాపారమెల్ల రాజగుణవైభవము నతిక్రమింపఁజాలమియు ధ్వనితము. 'తిర్మలమహారాయేంద్రు' అని పితృనామయోగముచే నట్టి కడుపునఁబుట్టుటయు, నిట్టి మహాగుణసంపత్తికి హేతువనుట ధ్వనితము. నాలవపాదమున యతి మైత్రి విచార్యము. అలం.

క. ఆతనయులు జగతీ విఖ్యాత నయులు గొలువ శాశ్వతైశ్వర్యకలా
న్వీతుఁడు దిర్మలరాయో ర్వీతలనాయకుఁడు వెలయు విభవోన్నతుఁడై. 83

అ. జగతీవిఖ్యాతనయులు—జగతీ=భూమియందు, విఖ్యాత=ప్రసిద్ధులయిన, నయులు=నీతిగలవారు, అగు, ఆతనయులు=ఆపుత్రులు, కొలువన్=కొలుచుచుండఁగా, శాశ్వ...న్వీతుఁడు—శాశ్వత=స్థిరమయిన, ఐశ్వర్యకలా=అధిరాజవిశేషముతో, అన్వీతుఁడు=కూడినవాఁడగు, తిర్మలరాయ+ఉర్వీ

తలనాయకుఁడు=తిరుమల దేవరాయరాజు, విభవ+ఉన్నతుఁడై=ఐశ్వర్యముచేత అధికుఁడై, వెలయున్=ప్రకాశించును. తా. సుగమము.

సీ. ఎంతకాలము మహా ♦ శాంతసంగతి దివ్య, దంతావళంబులు ♦ దిరుగకుండు
నెంతకాలమువరా ♦ హేంద్రుఁ డద్వంద్వుఁడై, కల్పముల్ వనరాశిఁ ♦ గడపుచుండు
నెంతకాలము భుజం ♦ గేశుఁ డాదిమభిక్షు, పదని షేవణనిష్ఠ ♦ బాయకుండు
నెంతకాలము గిరుల్ ♦ సంతతాభ్యున్నతి, నలహంసపద్ధతి ♦ నంటియుండు

తే. నంతకాలముఁ దనయంద ♦ యచలయై య,నంతయైరత్నగర్భయై ♦ యవనియలర
నలరుఁ గర్ణాటరాజ్యసిం ♦ హాసనాధి, రాజ్యశుభశాలి తిరుమల ♦ రాయమౌళి. 84

అ. ఎంతకాలము=ఎంతవఱకు, మహాశాంతసంగతిన్=మహాశాంతులయిన వారిసాంగత్యముతోడ, దివ్యదంతావళంబులు=దిగ్గజములు, తిరుగకుండున్=చలింపకుండునో - మహాత్+ఆశా+అంతసంగతిన్=గొప్ప దిగంతములతోడి సాంగత్యము నెంతకాలము విడువకుండునో యని భావము. దిగంతములం దెంతకాలము చలింపకుండునో యనుట. ఎంతకాలము=ఎంతవఱకు, వరాహేంద్రుఁడు=యజ్ఞవరాహమూర్తి, అద్వంద్వుఁడై=సుఖదుఃఖాది ద్వంద్వరహితుఁడై, వనరాశిన్=అగాధ్యసముద్రమందు, కల్పములు=అనేక కల్పములు, కడపుచుండున్=తపముసేయుచుఁ గడపుచుండునో - అద్వంద్వుఁడై=అసహాయుఁడై, వనరాశిన్=జలరాశియందు, కల్పములు గడపుచుండునో యని భావము. వనమనఁగా జలమనియు నర్థము. ఎంతకాలము = ఎంతవఱకు, భుజంగేశుఁడు = ఆదిశేషుఁడు, ఆదిమ ... నిష్ఠన్-ఆదిమభిక్షు=పురాతనభిక్షుకులయొక్క, పదని షేవణనిష్ఠన్=పాదసేవానిష్ఠను, బాయకుండునో- ఆదిమభిక్షు వనఁగా శివుఁడు. అతనికి పాదభూషణమయి యుండునోయని భావము. ఎంతకాలము=ఎంతవఱకు, గిరులు=కులపర్వతములు, సంతత+అభ్యున్నతిన్=ఎడతెగని యతిశయముచేత, అలహంసపద్ధతిన్ = ఆయోగిమార్గమును, అంటియుండున్=అవలంబించి యుండునో - ఇక్కడ హంసశబ్దము యోగిపరము. సంతత+అభ్యున్నతిన్=ఎడతెగని మిక్కిలిదైన పొడవుచేత, అలహంసపద్ధతిన్=హంసశబ్దమునకు సూర్యుఁడని యర్థము గలదుగాన, సూర్యమార్గమయిన యాకాశమునంటియుండునో యని భావము.

అంతకాలము=అంతవఱకు, అనఁగా దంతావళప్రభృతు లెంతకాలము వైరాగ్యదశలతో నుండునో యంతకాలము - శాశ్వతకాలమనుట. దిగ్దంతావళాదులకు దిగంతసంగతి మొదలయినది శాశ్వతముగా సంభవించుట ప్రకటమే. తనయందు=తనయందే, అవని=భూమి, అచలయై=చలింపనిదై - అచలయను నామముగలదైయ నిభావము. అనంతయై=అంతములేనిదై, నాశరహితయై - 'మృతా వవసితే రమ్యే సమాప్తావనః' విశ్వ. అనంతయను నామముగలదై యని భావము. రత్నగర్భయై=రత్నపరిపూర్ణయై - రత్నగర్భయను నామముగలదై యని భావము. 'జగతీరత్నగర్భాచ' అ. అలరన్=ఒప్పుచుండఁగా, కర్ణాట... శాలి-కర్ణాటరాజ్య=కర్ణాటరాజ్య సంబంధియైన, సింహాసన=సింహాసనమందలి, అధిరాజ్య=అధిరాజభావమనెడు, శుభ=శుభముచేత, శాలి=ఒప్పుచున్న, తిరుమలరాయమౌళి=తిరుమల రాయశ్రేష్ఠుఁడు, అలరున్=ప్రకాశించును.

భూధరణపరు లయినశేషాహిప్రభృతులకు, 'ఉరమున నేఁగు గుండలి' యనెడు పద్యమున బాల్యావస్థయు, 'భూరిభుజంగికా' యనెడు పద్యమున యౌవనావస్థయు, 'చుట్టఁజుట్టుకొని' యనెడు ద్యమున వార్ధకావస్థయును 'ఎంతకాలము మహాశాంతసంగతి' యనెడు పద్యమునఁ [illegible]

జెప్పినాఁడని తెలియవలయును. ఇట దిగ్గజాదులయందు విశేషణసామ్యమువలన నప్రస్తుతయోగి వృత్తాంతము దోఁచుచుండుటవలన సమాసోక్తి యలంకారము.

### షష్ఠ్యంతములు.

క. ఏవంవిధ వివిధగుణ, శ్రీవార్నిధి కఖిలసుజనసేవధికి ధనుః
ప్రావీణ్యశరధిశరధికి, ధావద్రిపుసంఘ లంఘితదిశావధికిన్. 85

అ. ఏవం ..నిధికిన్-ఏవంవిధ = ఇటువంటిదయిన, వివిధగుణ=నానావిధములయిన సుగుణములయొక్క, శ్రీ=సంపత్తికి, వార్నిధికిన్=సముద్రుఁడయినవానికని యర్థము. గుణశ్రీయనెడుశ్రీకిన్=అనఁగా లక్ష్మికి, వార్నిధికిన్=ఉత్పత్తిస్థానమయిన వానికని ప్రకారాంతరము. అఖిలసుజనసేవధికిన్-అఖిలసుజన=సమస్త సజ్జనులకు, సేవధికిన్=నిధియైనవానికి, 'నిధిర్నా సేవధిః, అమ. ధనుః ప్రావీణ్య=విలువిద్యయొక్క సామర్థ్యమందు, శరధి=సముద్రమే, శరధికిన్=అమ్ములపొదిగాఁగల రుద్రుఁడయినవానికిని, ధావత్...అవధికిన్ - ధావత్=పాఱిపోవుచున్న, రిపు=శత్రులయొక్క, సంఘ=సమూహముచేత, లంఘిత=దాఁటఁబడిన, దిశా అవధికిన్=దిగంతములు గలవానికి, ఇదిమొదలుగా కృతికర్తకు నైదుపద్యములవఱకు షష్ఠ్యంతములు చెప్పుచున్నాఁడు. ప్రతిపద్యమునను నంత్యప్రాసము కడవఱకుఁ జెప్పబడుచున్నది. ఉల్లేఖాలంకారము.

క. ఉన్నతజయ జన్యబిరుద, మన్నెవిభాళాదిబిరుద మాన్యునకు మహో
ద్యన్నిబిడ జన్యపటహజ, ధాన్నినదక్షురదరిచ్ఛటా సైన్యునకున్. 86

అ. ఉన్నత...మాన్యునకు—ఉన్నత=ఉత్కృష్టమయిన, జయ=విజయమువలన, జన్య= సంభవించిన, బిరుదమన్నెవిభాళఆది = మన్నెవిభాళుఁడనెడి బిరుదుమొదలయిన - బిరుద = బిరుదులచేత, మాన్యునకున్ = పూజ్యుఁడయినవానికి, మహో...సైన్యునకున్—మహత్ = ఉత్కటముగా, ఉద్యత్ = ప్రకాశించుచున్న, నిబిడ = సాంద్రమయిన, జన్యపటహ = రణభేరివలన, జ=పుట్టిన, ధాన్నినద = ధాంకారధ్వనిచేత, క్షరత్ = నశించుచున్న, అరిచ్ఛటా = శత్రు సమూహముయొక్క, సైన్యునకున్ = సేఁలుగలవానికిని-అనఁగా రణభేరీధ్వని విన్నంతమాత్రనే గుండెలుపగిలి శత్రుసైన్యములన్నియు నశించునని తాత్పర్యము. అలం.

క. క్ష్వేళారుతశీలాహిత, ఫాలాహృతలిపినిభాసి భాసిచ్ఛాయా
పాళికిఁ బరిపాలితనర, పాళీదత్తద్విపాద్యుపాయనతతికిన్. 87

అ. క్ష్వేళా...పాళికిన్—క్ష్వేళారుతశీల = సింహనాదమే స్వభావముగాఁగలిగిన - అనఁగా పరాక్రమశాలులయిన, 'క్ష్వేళాతు సింహనాదస్స్యాత్' అమ. అహిత = శత్రువులయొక్క, ఫాల = నొసళ్లనుండి, ఆహృత = హరింపఁబడిన, లిపినిభ = అక్షరపఙ్క్తులవలెనున్న, అసి = ఖడ్గముయొక్క, భాసి = ప్రకాశించుచున్న, ఛాయాపాళికిన్ = ఛాయలవరుసగలవానికి, పరిపాలిత...తతికిన్—పరిపాలిత = స్వీకరింపఁబడిన, నరప = రాజులయొక్క, ఆళీ= సమూహముచేత, దత్త = సమర్పింపఁబడిన, ద్విపాది = ఏనుఁగులుమొదలయిన, ఉపాయనతతికిన్ = కానుకల సమూహముగలవానికి, 'ఉపాయన ముపగ్రాహ్యముపహారస్తథోపదా' అమ. కత్తియొక్క ప్రకాశించుచున్న కాంతివరుసలు పరాక్రమశాలులయిన శత్రువుల ఫాలమునుండి హరించినయక్షరపంక్తులవలె నున్నదని ఉత్ప్రేక్ష.ఎదిర్చి సింహనాదముచేసినరాజుల రాజ్యప్రాణాదికములెల్ల ఖడ్గమున

హరించువాఁడనియు, లోనయినచో కాచినట్టి రాజులచే నేనుంగులు మొదలయిన కానుకలుఁ గొని మన్నిం చువాఁడనియుఁ దాత్పర్యము.

క. ఉద్ధతరిపు విద్ధతపన,పద్ధతి కరిభవన దవనిపట దంబుధి సం
పద్ధరణ సముద్ధరణ స,మిద్ధరణ రజోవ్రజోద్యదిభమద స్రుతికిన్. 88

అ. ఉద్ధత...పద్ధతికిన్—.ఉద్ధత = ఉత్కటముగా హతులయిన, రిపు = శత్రువులచేత, విద్ధ = భేదింపఁబడిన, తపనపద్ధతికిన్ = సూర్యమార్గము గలవానికి, 'ద్వావిమౌ పురుషౌలోకే సూర్యమండలభేదినౌ। పరివ్రాడ్యోగయుక్తశ్చరణే చాభిముఖోహతః' అనెడు వచనమువలన యుద్ధాభిముఖులై యెదిరించి హతులయినశూరులు సూర్యమండలమును భేదించుకొని పోయి వీరస్వర్గమును బొందుచున్నారని సంప్రదాయము. అరి...స్రుతికిన్—అరి = శత్రువులకు, భవనత్ = దాఁగియుండు గృహమగుచున్నట్టియు, అవని=భూదేవికి, పటత్ =వస్త్రమగుచున్నట్టియు, అంబుధి=సముద్రము యొక్క,సంపత్ =జలరూపమయిన సంపత్తియొక్క, హరణ = హరించుటచేతను, సముద్ధరణ=అసంపత్తియొక్క పునరుద్ధరణముచేతను, సమిద్ధ=ప్రకాశమానములయిన, రణరజోవ్రజ=యుద్ధరంగమందలి పరాగసమూహమును, ఉద్యత్ =ఉదయించుచున్న, ఇభమద=గజముల మదజలముయొక్క, స్రుతికిన్ =కాఱుటయునుగలవానికి, క్రమాలంకారము. సముద్రము శత్రువుల దాఁగుడు గృహమయినందున రణధూళిచేత దాని సంపత్తును హరించినాఁడనియు, భూదేవి కాచ్ఛాదన పటమయినందున గజమదజల ప్రవాహముచేతఁ బూరించినాఁడనియుఁ దెలియునది. అరిభవనత్వాది హేతువులచేత సముద్రసంపద్ధరణత్వాదులను సమర్థించుటచేత కావ్యలింగమలంకారము. సముద్రముజలపూరణముచేయునంతటి ధూళిని బట్టి సైన్యబాహుళ్యమును, దానినిబూరించునంతటి మదజలప్రవాహములఁ జెప్పుటచే గజసేనాబాహుళ్యమును దెలియునది. సైన్యధూళికి సముద్రసంపద్ధరణ సంబంధమును గజమదజలస్రుతికి సముద్ర సంపదుద్ధరణ సంబంధమును లేకున్నను గలయట్లు చెప్పుటంజేసి అలంకారము అతిశయోక్తులు.

క. ధీరవివిధారిగిరిపవి, ధారికిఁ గర్ణాటకాంధ్ర ధరణీపునరు
ద్ధారికిఁ దిరుమలదేవమ, హారాయాగ్రణికి వితరణామరమణికిన్. 89

అ. ధీర...ధారికిన్—ధీర = ధైర్యవంతులయిన, వివిధ+అరి = నానావిధ శత్రువులనెడు, గిరి = పర్వతములకు, పవిధారికిని = వజ్రాయుధధరుఁడయిన యింద్రుఁడైనవానికిని, 'కులిశంభిదురం పవిః' అని. కర్ణాట...ధారికిన్—కర్ణాటక ఆంధ్రధరణీ = కర్ణాటభూమిని ఆంధ్రభూమిని, పునరుద్ధారికిన్ = మరలనుద్ధరించినవానికిని, అనఁగా కర్ణాటాంధ్ర దేశములు మ్లేచ్ఛులచే నాక్రమింపఁబడియుండఁగా వాండ్రనుజయించి వానినేలినాఁడని తాత్పర్యము. వితరణ+అమరమణికిన్=దాతృత్వమందు చింతామణియైనవానికి, తిరుమలదేవ మహారాయాగ్రణికిన్=తిరుమలదేవరాయశ్రేష్ఠునకు, అలంకారము రూపకము, ఉపమ.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినవసుచరిత్రం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 90

అ. అభ్యుదయ పరంపరా అభివృద్ధిగాన్ = పూర్వోక్తుఁడయిన తిరుమలదేవరాయనికి శ్రేయః పరంపరలయొక్క యభివృద్ధిగలుగునట్లు - శ్రేయస్సు లొకటిపయి నొకటి యెడతెగక కలుగుచు వర్ధిల్లుచుండునట్లుగా ననుట, నాయొనర్పంబూనిన=నేనురచింప నుద్యమించినట్టి, వసుచరిత్రంబనుమహాప్రబంధంబునకున్, కథాక్రమంబు=కథయొక్క క్రమము- కథయొక్క విధానము చెప్పిన మొదలు. ఎట్టిదనిన.

## కథాప్రారంభము.

శా. శ్రీరమ్యం బగునైమిశంబునఁ దపశ్శ్రీరాజితావ్యాజతే
జోరాజుల్ శుకశౌనకాది మునిరాజుల్ సూతజుం జూచి ము
న్నేరాజేంద్రుఁడు దివ్యచిహ్నధరుఁడై యేలెన్ మహీమండలం
బారాజేంద్రునిఁ దెల్పు మా కన నతం డత్యంతహర్షంబునన్. 91

అ. శ్రీరమ్యంబు — శ్రీ=వనలక్ష్మిచేత, రమ్యంబు = మనోహరమయినదగు, నైమిశంబునన్ = నైమిశారణ్యమందు, తపఃశ్రీ = తపస్సంపదచేత, రాజిత = ప్రకాశించుచున్న, అవ్యాజ = దంభరహితమయిన - ఒకతెచ్చికోలు కారణముచేతఁ గాక తనంతట నే సహజముగాఁ గలిగియున్న దయిన, తేజోరాజులు = తేజస్సమూహము గలిగిన వారగు, శుకశౌనకాది మునిరాజులు = శుకుఁడు శౌనకుఁడు మొదలయిన మునిశ్రేష్ఠులు, సూతజున్ = సూతుని, చూచి, మున్ను = పూర్వకాలమందు, ఏరాజేంద్రుఁడు=ఏరాజశ్రేష్ఠుఁడు, దివ్యచిహ్నధరుఁడై=దేవతాలాంఛనమును ధరించినవాఁడై - ఆకాశవిమానాదులంబోవుట మొదలగు దేవతాలక్షణములుగలవాఁడై యనుట, మహీమండలంబున్ =భూమండలమును, ఏలెన్ =పరిపాలించెనో, ఆరాజేంద్రునిన్ =ఆరాజశ్రేష్ఠుని, మాకున్, తెల్పుము, అనన్ = తెలియఁజెప్పుమనఁగా, అతండు=ఆసూతుఁడు, అత్యంత హర్షంబునన్ = మిక్కిలి సంతోషముతో, ఇది ముందరి పద్యముతో నన్వయించెడిని. 'తెలుపు మాకు' ననుచో హల్లుపరమగుటచే మధ్యమపురుష 'ము' వర్ణమునకు లోపమని తెలియునది.

తా. రమణీయమయిన నైమిశారణ్యమందు, మహాతపస్సుచేతఁ దనంతట తేజఃపటలము దొలఁకాడుచుండు శుకశౌనకాది మునివరులు సూతునిఁ జూచి 'పూర్వకాలమునం దే మహారాజు దేవతాచిహ్నములుగలవాఁడై భూమండలమును బాలించెనో యట్టి యతనిని మాకుఁదెలుపు' మని యడుగఁగా నాసూతుఁడు మిక్కిలి సంతోషముతో.

శా. శక్రాపాదిత దివ్యచిహ్నధరుఁడై చంచద్విమానాధిరా
జక్రీడాపరుఁడై యమానుషమహాసత్త్వాఢ్యుఁడై చేదిభూ
చక్రేశుండు ధరిత్రి యేలె వసుసంజ్ఞం దచ్చరిత్రంబు ని
ర్వక్రప్రౌఢిని విన్నవింతు నని వాగ్వైచిత్రితో నిట్లనున్. 92

అ. చేది భూచక్రేశుండు = చేది దేశాధీశ్వరుఁడు, శక్ర...ధరుఁడై—శక్ర = దేవేంద్రునిచేత, ఆపాదిత = పొందింపఁబడిన, దివ్యచిహ్నధరుఁడై = దేవతాలాంఛనములను ధరించినవాఁడై, చంచత్...పరుఁడై—చంచత్ = ప్రకాశించుచున్న, విమాన+అధిరాజ=విమానశ్రేష్ఠమందలి, క్రీడా=విహారమందు, పరుఁడై = ఆసక్తుఁడై, అమానుష...త్వాఢ్యుఁడై—అమానుష = మనుష్యసాధారణముగాని, మహాసత్త్వ+ఆఢ్యుఁడై=మహాబలముచేత అధికుఁడై, వసుసంజ్ఞన్ =వసువనెడి పేరిచేత, ధరిత్రిన్ = భూమిని, ఏలెన్ = పరిపాలించెను. తచ్చరిత్రంబున్ =అతనికథను, నిర్వక్రప్రౌఢిన్ = వంకరలేని - అనఁగా చక్కనయిన - సామర్థ్యముచేత, విన్నవింతున్ = విన్నపము చేసెదను, అని వాక్+వైచిత్రితోన్ = వాక్యచమత్కృతితో, ఇట్లు అనున్ = ఈవక్ష్యమాణప్రకారమునఁ జెప్పెను. ఇట భూతంబున లాట్లు. ప్రౌఢిశబ్దమునకు ఇమనిచ్చురాదు గనుక 'ప్రౌఢిమ' యనుట, అసమంజసము; కాని ప్రాఁగ్రప్రతులయెల్ల 'ప్రౌఢిమ'యని కానఁబడుచున్నది.

తా. చేదిదేశమునకు రాజు దేవేంద్రుఁడొసంగిన దేవలాంఛనములను ధరించి గొప్ప దివ్యవిమానమున విహరించుచు మనుష్యులకలవిగాని మహాబలముగలిగి, వసు వనుపేరితో భూమిని బరిపాలించెను. అతని చరిత్రము నేర్పుతోఁ జెప్పెదనని సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పఁదొడంగెను.

సీ. వరసుమనోభవ్య • తరుల కావాల మ,త్యలఘుకలాపాలి • కిలరుభరణి
సరిలేని తెలిముత్తె • సరులకోటారు క,ళ్యాణపరంపర • లతొలుదీవి
సురుచిరమణుల కాకర సీమ శ్రుతిహిత,భాషితద్విజకోటి • పట్టుఁగొమ్మ
సరసులకారామ • సరణి శ్రీరంగగే, హక్రోడవాసిని • కాటపట్టు

తే. వెలయు నావరణాంబుసంపీతహాట,కాండమోహదపరిఖావృ • తాంఘ్రివజ్ర
దంతురప్రాంతగంగానిరంతరాగ్ర, భూరివరణం బధిష్ఠాన • పురవరంబు. 93

అ. వర...తరులకున్—వర=శ్రేష్ఠులును, సుమనః=మంచిమనస్సుచేత, భవ్యతరులు=అత్యంత యోగ్యులును, అనెడు, వరసుమనో భవ్యతరులకున్—వర=శ్రేష్ఠములయిన, సుమనః=పుష్పముల చేత, భవ్య=యోగ్యములయిన, తరులకున్=వృక్షములకు, ఆవాలము=పాదు అయినదియు, అత్యలఘు...భరణి—అతి+అలఘు=మిక్కిలియు గొప్పలయిన, కలా=విద్యలయొక్క, పాలికలు=సమూహములనెడు, అత్యలఘు=మిక్కిలియు గొప్పవయిన, కలాప=భూషణములయొక్క, అలికలకున్=సమూహములకు, భరణి=సొమ్ములుంచెడి భరణియైనది. సరి...కోటారు—సరిలేని=సాటిలేనట్టి, తెలిముత్తెసరుల,=శుభ్రములయిన ముత్యాలహారము లనెడు, సరిలేని=సమానములేని, తెలిముత్తెసరుల=తెల్లముత్తె సరిసడ్లయొక్క, కోటారు=ధాన్యపురాసులుంచెడుకొట్టు, అయినదియు, కళ్యాణ...దీవి—కళ్యాణపరంపరల=శుభపరంపరలనెడు, కల్యాణపరంపరల=సువర్ణ పరంపరలయొక్క, తొలుదీవి=జంబూద్వీపమైనదియు, 'కళ్యాణమక్షయే స్వర్ణేకళ్యాణం మఙ్గళేపిచ' విశ్వ.

సురుచిర...సీమ— సురుచి=మంచికాంతి గలిగిన, రమణులు=స్త్రీలనెడు, సురుచిర=లెస్సగాఁ బ్రకాశించునట్టి, మణులకున్=రత్నములకు, ఆకరసీమ=గనియైనదియు, శ్రుతి...గొమ్మ—శ్రుతిహిత=వేదవిహితములగుయిన, భాషిత=వాక్యములుగల, ద్విజకోటి=బ్రాహ్మణసమూహ మనెడి, శ్రుతిహిత=చెవులకింపయిన, భాషిత=పలుకులుగల, ద్విజకోటి=శుకపికాది పక్షిసమూహముయొక్క, పట్టుఁగొమ్మ=అవలంబ శాఖయైనది - ఊఁతయైనదనుట—ఆధారమైనదియు ననుట, సరసుల...సరణి—సరసులకున్=శృంగారాది రసజ్ఞులనెడు, సరసులకున్=కొలంకులకు, ఆరామసరణి=ఉద్యానవాటికయైనదియు, శ్రీరంగ...ఆటపట్టు—శ్రీరంగగేహ=శ్రీరంగమే మందిరముగాఁగల విష్ణుమూర్తియొక్క, క్రోడవాసినికిన్ = వక్షఃస్థల వాసినియైన (అనఁగా 'లక్ష్మీం క్షీర సముద్రరాజతనయాం శ్రీరఙ్గధామేశ్వరీమ్' అన్నట్లు) లక్ష్మియనెడు, శ్రీ=శోభాయుక్తమయిన, రంగగేహ = నాట్యమందిరముయొక్క, క్రోడ=నడుమ, వాసినికిన్=వర్తించునట్టిదానికి - అనఁగా నర్తకికి, ఆటపట్టు=నాట్యస్థానమైనదియు, 'వనా క్రోడం భుజాన్తరమ్' అమ.

ఆవరణ...అంఘ్రి—ఆవరణాంబు=మహాజలముచేత, సంపీత=అపరంపఁబడిన, హాటకాండ=హిరణ్మయమైన బ్రహ్మాండమోయనునట్టి, మోహద = భ్రాంతిని గలుగఁజేయుచున్న, పరిఖా=అగడ్త చేత, వృత=పరివేష్టింపఁబడిన, అంఘ్రి=అడుగు మట్టుగలదియు, వజ్ర...ప్రాంత—వజ్ర=వజ్రమణుల చేత, దంతుర=నిండిన - చెక్కఁబడిన యనుట, ప్రాంత=పార్శ్వభాగములు గలదియు, గంగా...రాగ్ర—గంగా = ఆకాశగంగతోడ, నిరంతర=ఎడములేకున్న, అగ్ర=అగ్రభాగము గలదియు - ఆకాశ

గంగకును దీనికిని నడుమ నెడములేదనుట. అనఁగా అంతపొడవయినదియు, భూరిపరణంబు-భూరి= బంగారు మయమైన, పరణంబు = కోటగలిగినదియు, 'స్వర్ణే౽పిభూరి' అమ. 'ప్రాకారో వరణస్సాలః' అమ. అగు అధిష్ఠాన పురవరంబు=అధిష్ఠాన మనెడుపట్టణశ్రేష్ఠము, వెలయున్=ప్రకాశించును. పరిఖాజలముచేతను పార్శ్వభాగ వజ్రకాంతులచేతను, అగ్రభాగమునం దెడములేకయున్న గంగా జలముచేతను నావరింపఁబడిన బంగారపుకోట, ఆవరణాంబు సంవీతహాట కాండమువలె నున్నదనుట. ఇట వరసుమనోభ వ్యేత్యాదులందు శ్లిష్టరూపకము. ఆకరసీమేత్యాదులందు నుల్లేఖాలంకారము. కలాపాలికలు సురుచిరమణులు అన్న రెండుచోట్ల సభంగ శబ్దశ్లేషము. తక్కినది యర్థశ్లేషము. ఆవరణాం...మోహద-అనుచో భ్రాంతిమంతము. రూపకోల్లేఖములు రెంటికిని సంకరము.

తా. అధిష్ఠానమను పట్టణము మంచివృక్షములును, మహనీయ హృదయులును, సకలకళావంతులును, గొప్పయాభరణములును, తెల్లనిముత్తెములును, తెల్లముత్తెసరివడ్లును, బంగారమును, శుభపరంపరలును, మేలయిన రత్నములును, సుందరాకారలయిన స్త్రీలును, వేదాధ్యయన సంపన్నులయిన బ్రాహ్మణులును, నింపయిన రవళిసేయు శుకపికాది పక్షులును, రసజ్ఞజనులును, కొలంకులును, లక్ష్మియు, నర్తకులును గలదయి వెలుంగుచుండును. దాని బంగారుకోట, క్రింద నగడ్తజలమును ప్రక్కల తెల్లని నీరువలెనున్న వజ్రకాంతులును పయిని గంగాజలమును నావరించియుండుటచేత మహాజలముచేత నావరింపఁబడియున్న బంగారు మయమైన బ్రహ్మాండమువలె విలసిల్లుచుండును.

చ. అలఘు తరగ్రహాంశు గణితాగణి తాభినుతాగ్రరత్నకం
దళరుచిఁ బొల్చు వీటివరణంబు గతావరణం బొనర్చ ని
చ్చలు నలకోటకొమ్మ బలుసందుల పొందుల నేఁగఁ గాఁ జుమీ
యలవఱిచెం బతంగుఁడు సహాయ రథాంగముగా శతాంగమున్. 94

అ. పతంగుఁడు,=సూర్యుఁడు, అలఘు...రుచిన్—అలఘుతర=మిక్కిలి గొప్పవయిన, గ్రహ= సూర్యాది నవగ్రహములయొక్క, అంశు=కాంతులచేత, గణిత=పెక్కుమడుంగులుగాఁ జేయఁబడిన—ఇనుమడింపఁబడిన, తత్తద్గ్రహసమాన వర్ణములుగలవియు ననుట, అగణిత=లెక్కింప నలవికానివియు, అభినుత=అంతటఁ గొనియాడఁబడినవియు, అగు, అగ్ర=అగ్రభాగమందలి, రత్నకందళ= పద్మరాగాది రత్నాంకురములయొక్క, రుచిన్=కాంతిచేత, పురికోటయందు ముందటిభాగమునఁ బొదిఁగియున్న పద్మరాగాదిమణులు సూర్యాది గ్రహములయొక్క యట్టికాంతులచేతఁ బెక్కుమడుంగులగు ననుట, పొల్చు=ఒప్పుచున్న, వీటివరణంబు=అధిష్ఠాన పురముయొక్క కోట, గతావరణంబు ఒనర్పన్ = (గతమనఁగా గతి దానికి ఆవరణమనఁగా నిరోధము) - గతినిరోధము సేయఁగా-పోకరాకల నడ్డగింపఁగా ననుట, నిచ్చలున్=నిరంతరమును, అలకోట కొమ్మబలుసందుల పొందులన్=ఆకోట కొమ్మలయొక్క బలువయిన సందులవెంబడిని, ఏఁగఁగాన్ చుమీ=పోవుటకే చుమీ, శతాంగమున్=తన రథమును 'శతాఙ్గస్స్యన్దనో రథః' అమ. అసహాయ రథాంగముగాన్=జతలేని యొంటిబండి కల్లుగలదానినిగా, అలవఱిచెన్=పనుపఱిచెను.

'గ్రహాంశుగుణిత' యనుటచే నట్టి గ్రహకాంతులు తనయందలి రత్నములకుఁ దాఁకి కాంతి యినుమడింపఁ జేయుటకుఁ గోట యాగ్రహముల నంటియుండవలయునని వ్యంజితము. స్మృతియు

'భాస్కరాఙ్గారకా రక్తౌశ్వేతౌ శుక్రనిశాకరౌ, గురుసోమాత్మజౌపీతౌ కృష్ణవర్ణ శ్శనిస్తథా।
రాహుకేతూ ధూమ్రవర్ణౌ గ్రహవర్ణాః ప్రకీర్తితాః'

అన్నట్లు సూర్యాంగారకులు రక్తవర్ణమును, శుక్రచంద్రులు శ్వేతవర్ణమును, గురుబుధులు పీత వర్ణమును, శని నీలవర్ణమును, రాహుకేతువులు ధూమ్రవర్ణమును గలవారని యుండుటచే, ఆయాగ్రహ కాంతులచే నాయావర్ణ సామ్యముగల పద్మరాగాది మణులకాంతు లిను మడింపఁబడినవని యర్థము. మఱియు నవరత్నములకును దత్తద్వర్ణసామ్యమూలమున నవగ్రహములు అధిదేవతలు.

'మాణిక్యం తరణేః స్సుజాతమమలం ముక్తాఫలం శీతగో
ర్మాహేయస్యతు విద్రుమో మరకతం సౌమ్యస్య గారుత్మతమ్ ।
దేవేజ్యస్య తు పుష్పరాగ మసురామాత్యస్య వజ్రం శనే
ర్నీలం నిర్మల మన్యయోశ్చ కథితే గోమేధ వైడూర్యకే' అని యున్నది.

ఇందు రెండవ పాదమునం దనునాసికయతి. మఱియు నిట పతంగుఁడనుటకు పక్షియను నర్థాంతరమున పక్షులు కొమ్మలందు దిరుగాడుటయుంబోలె పతంగుఁడును కోటకొమ్మలందుఁ దిరుగాడు వాఁడయ్యెనని భావము స్ఫురించుచున్నది. ఇందుఁ గోటగొమ్మలు సూర్యమండలము నతిక్రమించి యున్నవనియు దాని సందులవెంబడిని సూర్యుఁడు పోవుచుటచే కోటవిరివి యతిమాత్ర మయిన దనియు దెలియునది. ఇం దలంకారము ఫలోత్ప్రేక్ష 'కొమ్మ'లు 'పతంగుఁ' డను శబ్దములచే నప్రస్తుత పక్షివృత్తాంత స్ఫూర్తినిబట్టి సమాసోక్తియు.

చ. పురిపరిఖా మహాంబునిధి భూరిగభీర తరాంబుపూరముల్
సరభసవృత్తిఁ జొచ్చి బలిసద్మతలం బతలం బొనర్పఁగాఁ
జరణకృత ప్రచారములు సాఁగవు వీరికి నంచు నబ్జజుం
డురగులఁ జేసెఁ బన్నగకులోద్భవులన్ వడిఁ దేలియాడఁగన్. 95

అ. పుర...పూరములన్—పురి=అధిష్ఠానపుర సంబంధియైన, పరిఖా=అగడ్తయనెడు, మహాంబునిధి = మహాసముద్రముయొక్క, భూరి=మిక్కిలి యైనదియు, గభీరతర = మిగుల లోఁతియైనదియు, అగు, అంబుపూరములు=జలప్రవాహములు, సరభసవృత్తిన్=వేగముతోఁగూడిన వర్తనముతో—వేగముతోననుట, చొచ్చి=చొరఁబాఱి, బలిసద్మతలంబు=రసాతలమును. 'అధోభువన పాతాళ బలిసద్మ రసాతలమ్' అను. అతలంబు ఒనర్పఁగాన్ = తలముకాని దానిని—అనఁగా స్వరూపరహితమైన దానినిగాఁ జేయఁగా, 'అథస్స్వరూపయో రస్త్రీతలమ్' అను. అతలమనఁగాఁ బాతాళముగనుక నిక్కడఁ బాతాళమును జేయఁగాననని భావసారస్యము గ్రహింపవలయును. 'భూమా పేటీ భువనమతలమ్' ఇత్యాది ప్రయోగముల నీయర్థ మెఱుంగునది. వీరికిన్=ఈ సర్పములకు, చరణకృత ప్రచారములు=పాదములచేత చేయఁబడిన గమనాగమనములు - కాళ్లతో రాకపోకలుచేయుట యనుట. సాఁగవు=చెల్లవు - సరిపడిరావు, అంచున్=అని, విచారించి=ఆలోచించి, అబ్జజుండు=(తామరయందుఁ బుట్టిన) బ్రహ్మదేవుఁడు, పన్నగకుల ఉద్భవులన్=సర్పకులమందుఁ బుట్టినవారిని, వడిన్=వేగమున, తేలియాడఁగన్=నీటిపయి తేలియాడుకొఱకు, ఉరగులన్=ఉరముచేతఁ బోవువారినిగా, చేసెను, ఉరగులని పేరు గలవియని భావము. ఇట పన్నగశబ్దమునకు పదములతో నడువనేరనిదని వ్యుత్పత్తి గాన సాభిప్రాయమ్ము. ఇం దలంకార మతిశయోక్తియు నుత్ప్రేక్షయును. రెంటికిని సంకరము. 'అతల' 'ఉరగ' 'పన్నగ' శబ్దములందు యోగముచే అన్వర్థకల్పనముంబట్టి నిరుక్తియు. పరిఖ అంబుధివంటిది గావుననే దాని యంబుపూరములు భూరియు గంభీరతరములు నయినవి. కావుననే యవి రసాతలమును

ముట్టినవి. అగడ్త అపారములయిన జలములుగలిగి మిక్కిలియు లోఁతయి మహాసముద్రమువలె నుండు నని తాత్పర్యము.

మ. చతురాస్యుల్ పురుషోత్తముల్ బుధగురుల్ సర్వజ్ఞమూర్తుల్ మహా
శతమన్యుల్ శుచిధర్మపుణ్యజనతాశ్లాఘ్యుల్ ప్రచేతుల్ సదా
గతు లక్షీణనవార్థకర్తలు కళాకాంతుల్ జగద్బంధు లా
క్షితిదేవుల్ పురిదేవతా మహిమలం జెన్నొందుటల్ చిత్రమే. 96

అ. ఇందు నధిష్ఠానపురమునం గల బ్రాహ్మణులయందు దేవత్వమారోపించి యర్థద్వయమునకు నభేదాధ్యవసాయము చెప్పినాఁడు. ఆక్షితిదేవుల్=అధిష్ఠానపురమందుఁ గల బ్రాహ్మణులు, చతురాస్యుల్—ఆస్యమందుఁ బుట్టునది ఆస్యము అనఁగా వాక్యము, చతురములయిన వాక్యములుగలవారని బ్రాహ్మణపరమైన యర్థము. చతురాస్యుఁడనఁగా నాలుగు ముఖములుగలవాఁడు బ్రహ్మ గాన బ్రహ్మలని యర్థాంతరము. పురుషోత్తముల్=పురుషశ్రేష్ఠులు - విష్ణుమూర్తులనియు, బుధగురుల్=పండితులయిన వారికిని గురువులు అనఁగా హితాహితముల నుపదేశించునట్టి వారనుట-బుధులును బృహస్పతులుననియు, సర్వజ్ఞమూర్తుల్=సకలమును దెలిసినవారు - రుద్రమూర్తులనియు 'సర్వజ్ఞః శ్శివశ్శూలీమహేశ్వరః' అమ. మహాశతమన్యుల్= మహత్తరములయిన యనేక యజ్ఞములుచేసినవారు - మహేంద్రులనియు, శుచి... శ్లాఘ్యుల్—శుచిధర్మ=పరిశుద్ధ ధర్మముచేతను - అనఁగా పవిత్రత్వముచేతను, పుణ్యజనతా=సుజనత్వము చేతను, శ్లాఘ్యుల్=కొనియాడఁ దగినవారు. శుచియనఁగా అగ్ని 'శుచిరప్పిత్తమ్' అమ. ధర్ముఁడనఁగా యముఁడు, పుణ్యజనుఁడనఁగా నిర్ఋతి గనుక అగ్ని యమ నిర్ఋతులని యర్థాంతరము. ప్రచేతుల్=ప్రకృష్టమయిన మనస్సుగలవారు - వరుణులనియు 'ప్రచేతా వరుణఃపాశీ' అమ. సదాగతులు=మంచియాగమనము గలవారు - వారిరాక శుభమయినదనుట, వాయుదేవులనియు, అక్షీణనవార్థకర్తలు—అక్షీణ=క్షయింపని, నవ=నూతనమయిన, అర్థకర్తలు=అర్థకల్పనములు సేయువారు - నవార్థములనఁగా నవసంఖ్యగల నిధులు-వానికిఁ గర్తలనఁగాఁ గుబేరులనియు 'అర్థోభిధేయ రైవస్తుప్రయోజన నివృత్తిషు' అమ. అక్షీణసదర్థకర్తలని పాఠాంతరము. కళాకాంతుల్=విద్యల కధిపతులు - చంద్రులనియు, జగత్ బంధులు=జగజ్జనులకు ఆప్తులు - సూర్యులనియు 'ఖద్యోతో లోకబాన్ధవః' అమ. ఇట్టివారైన, ఆబ్రాహ్మణులు, పురిన్=పట్టణమందు, దేవతామహిమలన్ = దేవతాప్రభావములచేత, చెన్నొందుటల్=ఒప్పుచుండుటలు, చిత్రమే = ఆశ్చర్యమా - ఆశ్చర్యము గాదనుట. అనఁగా శబ్దశ్లేషముచేతఁ బ్రాప్తములయిన బ్రహ్మాదిదేవతాధర్మములు గల బ్రాహ్మణులు దేవతామహిమలచేతఁ జెన్నొందుట యేమివింతయని యర్థము. ఇందు శ్లేషము కావ్యలింగమును.

సీ. పగలైనఁ దెల్విగోల్పడనిరాజులు శరం, బులు చన్న వెలువెలంబోని ఘనులు
ధనదాశఁ గేలుమోడ్పని సార్వభౌమాంకు, లని వెన్కముందుఁ జూడనికుమారు
లరిమెచ్చఁ గరములు నెరపనియినులు లాల,మున వాలుమఱవని పురుషసింహు
లనయంబునడకఁ దప్పనిగోత్రపతు లెప్పు,డును సీదిరము లేనియనఘభోగు
తే. లౌర వీ రన వీరనయైకపరులు, వఱలుదురు వీటఁ బుష్పవద్వంశ్యు లగుటఁ
గువలయాధార కమలానుగుణవిహార, సారసౌజన్యధరులు రాజన్యవరులు. 97

అ. ఇం దధిష్ఠానపురమందలి రాజులవర్ణించినాఁడు—పగలు...రాజులు - పగలనఁగా విరోధ

ములును పగటిపూఁటయును - రాజులనఁగా క్షత్రియులును చంద్రులును - తెల్వియనఁగా ముఖవికాస మును గాంతియు-పగలైనన్ = విరోధములుకలిగినను, తెల్వి = ముఖవికాసమును, కోల్పడనిరాజులు= పోఁగొట్టుకోనని రాజులయినక్షత్రియులని యర్థము - ఇందువలన రాజయినచంద్రుఁడు విరోధము కలిగి నపుడు ముఖకాంతి దప్పెడువాఁడని తెలియుచున్నది. పగటిపూఁటఁ జంద్రుఁడు కాంతిహీనుఁ డగు నని భావము. మీఁదనెల్ల నిట్లె గ్రహించునది. శరంబులు...ఘనులు—శరంబులనఁగా బాణములును నీళ్లును - ఘనులనఁగా అధికులును మేఘములును. శరంబులు విన్నన్ = బాణములుపోఁగా, వెలవెలఁ బోని=తెల్లఁబాఱకుండెడు, ఘనులు= అధికులయిన వారు - ఘనులయిన మేఘములు, బాణములు చెల్లి పోఁగా తెల్లఁబోవునట్టివనుట. జలము వర్షింపఁబడఁగా మేఘములు తెల్లనాఁయుచున్నవని భావము.

ధనధా...మాంకులు—- ధనదుఁడనఁగా ధనమిచ్చువాఁడును కుబేరుఁడును - ఆశయనఁగా తృ ష్ణయు దిక్కును - సార్వభౌముఁడనఁగా చక్రవర్తియు ఉత్తరదిగ్గజమును - 'ఆశాతృష్ణాదిశా ప్రోక్తా' 'సార్వభౌమ స్సర్వపృథ్వీపాలకే దిగ్గజాంతరే' నానార్థ. ధనదాశకన్=ధనమిచ్చువానియందలి యాశ చేత, కేలుమోడ్పని = చేయి ముడుచుకొని యాచింపని, సార్వభౌమాంకులు=చక్రవర్తి చిహ్నములు గలవారు - సార్వభౌమ నామముగల దిగ్గజము-ధన దాశ చే హస్తముపట్టుకొని యడిగికొనునదియనుట, కుబేరునిదిక్కునఁ దుండము ముడిఁచికొని యున్నదనిభావము. అని...కుమారులు — కుమారుఁడనఁగా రాజకుమారుఁడును కుమారస్వామియు. అని = యుద్ధమందు, వెనుకముందుఁజూడని = సంకోచింపని, కుమారులు = కౌమరప్రాయముగలవారు - కుమారస్వామి యుద్ధమందు వెనుకముందుఁ జూచువాఁ డనుట - షణ్ముఖుఁడు ముందు మూఁడుముఖములతోను వెనుక మూఁడు ముఖములతోను జూచునని భావము.

అరి...యినులు —- అరియనఁగా శత్రువును జక్రవాకమును - కరములనఁగా పన్నులును గిరణ ములును - ఇనుఁడనఁగా ప్రభువును సూర్యుఁడును, అరమనఁగా జక్రాంగము. 'అరం శీఘ్రేచచ క్రాఙ్గే' విశ్వ 'అరాణ్యస్యసన్తి'యనెడు వ్యుత్పత్తిచే అరియనఁగా బండిగారెకుఁ పేరు గనుక బండిగా రెపేళ్లన్నియు చక్రవాకములకుఁ జెల్లును గనుకను నిక్కడ అరిశబ్దము చక్రవాకములందును వర్తించుచు న్నది. 'కోకశ్చక్రశ్చ క్రవాకోరథాఙ్గాహ్వయనామకః' అమ. 'బలిహస్తాంశవఃకరాః' అమ. 'ఇన స్సూర్యేప్రభౌరాజ్ఞి' అమ. అరిమెచ్చన్=శత్రువులుమెచ్చునట్లుగాఁ బన్నులియ్యని ప్రభువులు - ఇనుఁడ యినసూర్యుఁడు శత్రువుమెచ్చునట్లుగాఁ బన్నిచ్చువాఁడనుట. సూర్యుఁడు చక్రవాకములు మెచ్చున ట్లుగాఁ గిరణప్రసారము సేయుచున్నాఁడని భావము. అలఘు...సింహులు—వాలు అనఁగాఁ గత్తి యు తోఁకయు, పురుషసింహుఁడనఁగా పురుషశ్రేష్ఠుఁడును నరసింహుఁడును - నరసింహుఁడు యుద్ధ మందుఁగత్తియొమటినాఁడనుట.నరసింహుఁ డాయుధములేకయే హిరణ్యకశిపుని వధించినాఁడనిభావము.

నడక యనఁగా నడవడియు సంచారమును - గోత్రపతులనఁగా కులపతులును పర్వతశ్రేష్ఠ ములును. అనయంబున్ = సర్వకాలమును, నడకఁదప్పని=నడవడిఁ దప్పనట్టి, గోత్రపతులు = కులప తులు- గోత్రపతులయిన పర్వతశ్రేష్ఠములు నడవడి దప్పినవనుట. పర్వతము లెప్పుడును సంచారము లేక యుండునని భావము. సీదిరమనఁగా శృంగారభావమును కుబుసమును. భోగులనఁగా రాజులును సర్ప ములును. 'భోగీభుజఙ్గమేరాజ్ఞి' విశ్వము. ఎప్పుడును...భోగులు—-ఎప్పుడును = ఏసమయమందును, సీదిరము=రోఁతగొట్టుతనము, లేని అనఘభోగులు=నిర్దోషమయిన భోగము లనుభవించు వారు - సర్ప ములో రెప్పుడును సీదిరముతో నుండునవి యనుట. సర్పములు కుబుసములలో నుండునని భావ...

శౌరవీరు అనఁగ్=శౌరా వీరు అనునట్లుగా, వీరనయైకపరులు=వీరనీతియందు ముఖ్యముగా ఆసక్తులయినవారు, పుష్పవత్ వంశ్యులు అగుటన్-పుష్పవంతులనఁగా చంద్రసూర్యులు 'ఏకయోక్త్యా పుష్పవన్తౌదివాకరనిశాకరౌ' అమ. చంద్రసూర్యవంశములఁ బుట్టినవారు పుష్పవద్వంశ్యులు, పుష్పవద్వంశ్యులగుటంబట్టి, కువలయా - ధరులు - కువలయ=కలువలకు, ఆధార=ఆధారమైనదియు, కమల=తామరలకు, అనుగుణ=అనుకూలమైదియు, అగు, విహార=సంచారములు గలవారనియును, పుష్పవంతుల వంశమునఁ బుట్టినవారు గనుక, కువలయ కమల పుష్పములను బరిపాలనము సేయుచున్నవారనియును రెండర్థములు దెలియునది. కువలయమనఁగా భూవలయము. 'గోత్రాకుఃపృథివీపృథ్వీ' అమ. కమలయనఁగా లక్ష్మి. 'కమలా శ్రీర్హరిప్రియా' అమ. కాన, కువలయాధార=భూవలయమునకు ఆధారమయినట్టియు - కమలానుగుణ=రాజ్యలక్ష్మికి అనుగుణ మయినట్టియు, విహారములు గలవారని భావము. సారసౌజన్యధరులు=సార=శ్రేష్ఠమయిన, సౌజన్య = సుజనత్వమును, ధరులు = ధరించినవారలును అయిన, రాజన్యవరులు=రాజశ్రేష్ఠులు, పీటన్=అధిష్ఠాన పురమందు, వఱలుదురు=ప్రకాశింతురు.

ఇందు రాజఘనాదిపదములు శ్లిష్టములగుటచే వానిశక్తి ప్రకృతమాత్రమందు విశ్రమించినవయ్యును, 'పగలైనఁ దెల్పిగోల్పడని' ఇత్యాదివ్యతిరేక విశేషముల మహిమచే ప్రతీయమానములగు చంద్రమేఘాదులందు శ్లేషానుగృహీతమయిన యభేదాధ్యవసాయముచేత వైరకాలిక వైరూప్యాది దోషములు దోఁచుటచేత రాజులయందు చంద్రాది ప్రతియోగికంబగు వ్యతిరేకము వ్యంజితమగుచున్నదిగాన వ్యతిరేకాలంకారధ్వని. మఱి పుష్పవంతుల వంశమునందుఁ బుట్టినవారు గనుక పుష్పపరిపాలనము చేయుచున్నారని యిట సమాలంకారమును 'సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః' అని తల్లక్షణము (సోమకవి).

తా. ఆయధిష్ఠాన పురమందుఁగల రాజశ్రేష్ఠులు, యుద్ధముగలిగిన ముఖకాంతి మాయక, బాణములు వ్యయమయినను వెలువెలఁబోక, యొకరిని గేలుసాచియడుగకయు, యుద్ధములందు జంకులేక, యొరికి కప్పములుగట్టకయు, ఖడ్గాదిసన్నాహముదప్పక, కులాచారము రోఁతపుట్టునట్లు చేయకయు, ఎడతెగని భోగము లనుభవించుచు, వీరనీతియందును విన్నాణులై, చంద్రసూర్యవంశముల జనించినవారై, భూవలయమును బ్రోచునట్టియు రాజ్యలక్ష్మికిఁ దగునట్టియు వర్తనములుగలిగి, మిక్కిలి సుజనత్వముతో విలసిల్లుచుందురు.

చ. చెలిపులిగూడు మాను పనిశ్రీదునిఁ గాదని మిత్రు నక్షయో
జ్జ్వలవసుఁ జేయ మిత్ర వసుసంపద కైనఘనావరోధమున్
వెలువడఁ జేయ నేర్తురు మణీవిపణీ తపనీయరాశి పే
శలరుచిఁ గోటికోటి విలసద్ధ్వజకోటిఁ బురీకిరాటకుల్. 98

అ. పురీకిరాటకుల్ - పురీ=అధిష్ఠాన పురమందలి, కిరాటకుల్=వైశ్యులు, చెలిపులిగూడు-చెలి=చెలికాఁడయిన శివునియొక్క, పులిగూడు=భిక్షాన్నమును, మానుపని శ్రీదుని=విడిపింపలేనట్టి కుబేరుని, కాదు అని=సరికాదని, నిందించియనుట. ఇట శ్రీదశబ్దము సాభిప్రాయము. శ్రీనొసంగువాఁడయ్యును చెలికాని బీదతనమును మాన్పఁడయ్యెననుట. మణి...పేశల్ — మణీవిపణీ=రత్నమయములయిన యంగడివీథులందలి, తపనీయరాశి=బంగారు రాసులయొక్క, పేశలరుచిన్=సిద్ధమ్మయిన కాంతిచేతను, కోటి...కోటిన్ — కోటికోటి - ప్రతికోటి ధనమందును, విలసత్ = ప్రకాశించుచున్న. ధ్వజకోటి=పడగల సమూహముచేతను - ఒక్కొక్కకోటికి పడగయెత్తుదురు గనుక నిట

యిట్లు చెప్పఁబడినది. మిత్రుఁన్ = స్నేహితుఁడయిన సూర్యుని, అక్షయ = క్షయములేనిదియు, ఉజ్జ్వల = ప్రకాశమానమైనదియునగు, వసున్ = ధనముగలవానినిగా, చేయన్ = చేయుటకును, మిత్రవసు... వెలివడన్—మిత్రవసు సంపదకై = ఆచెలికాని ధనసంపత్తికిఁగాను, ఐనఘన + అవరోధమున్ = కలిగినట్టి గొప్పవిరోధమును, వెలువడన్ చేయన్ = పోఁగొట్టుటకును, నేర్తురు = సమర్థులౌదురని యర్థము. 'మిత్రం సుహృదిమిత్రోర్కః' అని సుహృద్వాచకమయిన మిత్రశబ్దము నిత్యనపుంసకమయ్యును. 'క్లీబంబులు మిత్రాదులు విభాషంబుంలింగ తుల్యంబులగు' (బాలవ్యాక) ననుటంబట్టియు 'క్వచిదర్థవిశేషేతు క్లీబేऽపృథయలిఙ్గతా' అను నధర్వణవచనముంబట్టియు నిట పుంలింగము. మణిపపణిశబ్దములకు 'కృదికారాదక్తినః' అను సూత్రముచే ఈకారాంతత్వము. 'దేవఖేజే నరేరత్నా వసూ రత్నే ధనేవసుః' అమ. మిత్రునకు వసుసంపత్తిని, గలిగించి దానికయిన విరోధమును బరిహరింతురనుటచే ఇష్టావాప్తియు అనిష్టపరిహారము ననుఫలద్వయము కలిగింతురనుట. సువర్ణరాసులయొక్క నిద్ధమయిన కాంతిచేత, అక్షయోజ్జ్వలవసున్ చేయ ననఁగా అక్షయములయిన కిరణములు గలవానినిగాఁ జేయుటకును, వసుసంపదకున్ = ఆకిరణ సంపత్తికిని, ఐన ఘనావరోధమున్ = కలుగు మేఘచ్ఛాదనమును - మబ్బుక్రమ్ముటను, కోటికోటి విలసద్ధ్వజ కోటిచేతన్ - అనఁగా ధ్వజముల పటములచేఁ బుట్టిన వాయువులచేతఁ బోఁగొట్టుటకును నేర్తురని భావము. అనఁగా నాపట్టణమందుండు వైశ్యులు సూర్యమండల మేఘమండల పర్యంతమును వ్యాపించియుండెడు సువర్ణరాసులును ధనరాసులునుగలిగి కుబేరునిఁ దిరస్కరించుచున్నారని తాత్పర్యము. ఇచటఁ గిరాటులకుఁ గుబేరునికంటె నాధిక్యమును వర్ణించుటవలన వ్యతిరేకమును వృత్త్యనుప్రాసమును.

మ. బలిచూడామణు లందు *విష్ణుపదజుల్ సాటించుధాన్యంపుఁ ది
ప్పలు చంద్రామృత సాంద్రసేకమునఁ బైపై మోసు - లెత్తంగఁ ద
త్కలమాంకూరము మేయుచున్న నెలజింకన్ సారె వారించు వా
రలతోఁబుట్టువు గంగ పద్మముఖనిర్వ్యద్భంగ నాదార్భటిన్. 99

అ. అందున్ = ఆపట్టణమందు, బలిచూడామణులు = బలవంతుల తలమానికము లయినవారైన - మహాబలవంతులైన - శూద్రులు విష్ణుపదమునందుఁ బుట్టినవారు; విష్ణుపాదము బలిచక్రవర్తి శిరోభాగము నాక్రమించినదిగాన యాపదమందుఁబుట్టిన శూద్రు లవి యాక్రమించియున్న బలి శిరసునకుఁ జూడారత్నములని ప్రకారాంతరము - ఇట్టివారయిన, విష్ణుపదజుల్ = శూద్రులు, విష్ణుపదశబ్దము బలిచూడామణు లనువాని యర్థాంతరమునకు గంగతోఁబుట్టుదనమునకు నుపయుక్తముగాఁ బ్రయుక్తము, సాటించు...తిప్పలు—సాటించు = రచించునట్టి, ధాన్యంపుతిప్పలు = ధాన్యపుప్రోవులు, చంద్రా... సేకమునన్—చంద్రామృత = చంద్రుని సంబంధించిన యమృతముయొక్క, సాంద్ర = గట్టిమయిన, సేకమునన్ = తడుపుటవలన, పైపైమోసులు ఎత్తంగన్ = పైపైని మొలకలెత్తఁగా - ధాన్యమును నీటఁదడిపినయెడల మొలకలువిడుచుట సుప్రసిద్ధము. తత్ + కలమ + అంకూరము = అవరిమొక్క పైరును, మేయుచున్న నెలజింకన్ = మేయుచున్నట్టి చంద్రునిలోనున్న జింకను, ఆధాన్యపుతిప్పలు చంద్రమండలమంత పొడవులగుటచే నందలి మొలకలను చంద్రునియందలి జింక మేయుచున్నదని తెలియునది. వారలతోఁబుట్టువు = ఆశూద్రులకుఁ దోడఁబుట్టినదయిన - అనఁగా శూద్రులును గంగయును

*'విష్ణుపదజుల్ పండించు ధాన్యంపుఁదిప్ప'లనియు, 'తత్కలమాంకూరపుఁబంపు మేయునెలజింకన్' అనియుఁ బాఠాంతరములు.

విష్ణుపాదమందుఁ బుట్టినవారు గనుక వారి కాగంగ తోఁబుట్టువనిచెప్పుట తెలియునది. గంగ=ఆకాశ గంగ, పద్మ...దార్భటిన్—పద్మముఖ = తామరలనెడు ముఖమువలన, నిర్యత్=బయలువెడలుచున్న, భృంగనాద=తుమ్మెదల ఝుంకారమనెడు, ఆర్భటిన్=అంతుచేత, సారెన్=మాటిమాటికిని, వారించున్ =మేయకుండఁదోలును. సహోదరికి సహోదరుల సొమ్మునకు హానిగలుగుట సైఁపదుగాన గంగతనతోఁ బుట్టువులయిన శూద్రుల ధాన్యపుఁదిప్పలందలి మోసులను జంద్రుని జింకదినుటకు సైఁపకవారించినదని యర్థము.

'ఆర్భటిన్' పైరుమేయు మృగములను దోలుటకు కోయని బిట్టుగానఱచుట చెల్లునుగాన నెల జింకను దోలుటకై గంగకు కేవలభృంగనాదమును గాక భృంగనాదముయొక్క ఆర్భటిని జెప్పి నాఁడు. 'సాంద్ర' అంతటి తిప్పలను తడుపుటకును మోసులెత్తించుటకును దట్టముగావడుపవలయును. 'నిర్యత్' తోఁబుట్టువుగాన ఉడుగక ఆర్భటిచేయుచున్నది. కావుననే 'సారె' వారించినది.

'విష్ణుపదజాల్' అనుటచే విష్ణుపదమునఁ బుట్టినవారు పాటించిన ధాన్యపురాసులు విష్ణుపదము నంటుట యుక్తమనియు ధ్వనించుచున్నది. 'బలిచూడామణు'లనుటచే ధాన్యంపుఁదిప్ప లంతటిపొడవుగాఁ బాటించునంత బలపటిమతగలవారని స్ఫురించుచున్నది. అనఁగా నాపట్టణమందుండు శూద్రులు పండించు ధాన్యపురాసులు గంగానదిని జంద్రమండలము నంటియుండునని ఫలితార్థము. అల. 'బలిచూడామణులు' 'విష్ణుపదజు' లను నివి సాభిప్రాయములు గాన పరికరము. తిప్పలంత పొడవుగా పాటించుటకును గంగ తోఁబుట్టుదనము నెఱపుటకును సమర్థకములు గాన కావ్యలింగమును. ధాన్యపుఁ దిప్పలకు చంద్రామృతసేకమున మోసులెత్తు సంబంధమును, దాని కల మాంకూరములకు నెలజింక మేయుసంబంధమును లేకయుఁ జెప్పఁబడినవి గాన యతిశయోక్తులు మూఁడు. 'పద్మముఖ...ఆర్భటిన్' అనుచో రూపకము. ఇది మూఁడవయతిశయోక్తికి అంగము.

చ. పరబలభంగచంగము లభంగుర తుంగమతంగజంబు ల
 ప్పురిఁ బరికీర్ణకర్ణపుటపూరితభూరితరానిలాహతి
 న్విరియఁగఁ దోల మేఘములు నింగి దొఱంగి తదంఘ్రిమూలముల్
 శరణము నందఁబోలు ననిశంబుఁ బదంబుమదంబు పేరిటన్. 100

అ. అప్పురిన్=ఆపట్టణమందు, పర...చంగములు — పరబల = శత్రుసైన్యముల యొక్క, భంగ=భంజించుటయందు - శత్రుసైన్యములను భంజించుట యందనుట, చంగములు=సమర్థములైనవియు, అభంగుర...మతంగజంబులు - అభంగుర=ఓటమిలేనివియు, తుంగ=మిక్కిలి పొడవులయినవియు, అగు, మతంగజంబులు=ఏనుఁగులు, పరికీర్ణ . హతిన్-పరికీర్ణ=అంతటను వ్యాప్తమయినదియు, కర్ణపుట పూరిత=చెవులు రెంటిచేతను నింపింపఁబడినదియు, భూరితర=మిక్కిలి అధికమయినదియు నగు, అనిల=వాయువుయొక్క, ఆహతిన్=ప్రహారముచేత - బిట్టుగాఁ గొట్టుటచేత - చెవులయందు నిండిన వాయువు మీఁదు మిక్కిలియై యంతటను నిగిడి యురవడిగాఁ గొట్టెడి యుద్ధతిచేత ననుట, విరియఁగన్=విచ్చిపోవునట్లుగా - చెల్లాచెదరగు నట్లుగా, తోలన్=పాఱఁగొట్టఁగా, మేఘములు=మబ్బులు, నింగిన్ = ఆకాశమును, తొఱంగి = విడిచి, తత్+అంఘ్రిమూలముల్ = ఆ యేనుఁగుల యొక్క పాదముల మూలములను, అనిశంబున్=నిరంతరమును, పదంబు మదంబు పేరిటన్=పాదముల నలనఁ బుట్టు మదమనెడి నెపమున, శరణమున్+అందన్ పోలున్= శరణుఁజొచ్చియుండఁ బోలును. ఓడినది గెలిచినదాని యడుగులను శరణుఁజొచ్చుట సహజము కదా. అట్లే మేఘములును నప్పురి యే

నఁగులకు నోడి వానియడుగులను శరణుఁజొచ్చి యుండవచ్చునని యర్థము. ఏనుఁగులకు కపోలములు మొదలయిన యెనిమిదిస్థానములం దెనిమిది మదములు పుట్టుచున్నవి. అందుఁ బాదములందుఁ బుట్టు మదమునకు మేఘమని పేరు. కాఁబట్టి పాదములందు మేఘమనెడి మదమురూపమున మేఘములే శరణుఁజొచ్చియుండునని కవి యుపహ్నవించినాఁడు. ఆయేనుంగులు 'అభంగురతుంగ' ములు. మేఘమండలమంత పొడువులు కావలయును; కావుననె వాని కర్ణపుటపూరితమగు వాయువు 'భూరితర' మేఘములనుఁ బాఱఁజిమ్మునంత కొలఁదియు; 'పరికీర్ణ' పాఱఁజిమ్ము నంత యురవడియుఁగలది. 'భూరితర' తోలుటకును 'పరికీర్ణ' విరియఁగఁ దోలుటకును. గజమదములకు

'దానం కపోలయో స్సీధు రక్ష్ణోశ్శ్రోత్రయో స్తుసాగరః'
కర్ణాగ్రే శీకర స్సిక్యం స్తనాగ్రే మేహనే మదః ।
హృదయే ఘర్మసలిలం మేఘస్తు చరణద్వయే ।
సంజ్ఞయాష్ట మదాహ్యేతే జాయన్తే భద్రదన్తినామ్' అమరకోశము.

ఇట్టి యేనుంగులు గావున నే యవి పరబల భంగదంగములును అలం. అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, అపహ్నవము. వృత్త్యనుప్రాసము శబ్దాలంకారము.

మహాస్రగ్ధర. పరభూభృత్ప్రాప్తి నబ్ధిం బడురవిహారులం బ్రౌఢిఁ బాటింపవెందున్
సరిగాఁ దద్ధిక్కృతుల్ సైఁచక రవి హరిదై చాయకున్ రానడంచుం
జరణోద్యద్ధూళిఁ దద్వాసతఁ దగుహరియున్ సప్తిగాఁ బాదధారా
స్ఫురణం బేవింతయుంచుం బురిహరులు నగుంబూర్ణ ధారాసమృద్ధిన్.

అ. ఇందశ్వములను వర్ణించుచున్నాఁడు - పురిహరులు=అధిష్ఠాన పురమందలి గుఱ్ఱములు, పరభూభృత్ ప్రాప్తిన్=శత్రురాజు ప్రాప్తి చేత=శత్రు రాజాక్రమించుటచేతననుట, అబ్ధిన్=(భయపడి) సముద్రమునందు, పడురవిహారులన్=పడునట్టి సూర్యుని గుఱ్ఱములను, ప్రౌఢిన్ = ప్రౌఢిచేత, సరిగాన్=తమకు సాటిగా, ఎందున్=ఏసమయమందును, పాటింపవు=సరకు సేయవు అని యర్థము. భూభృత్-అనఁగా రాజును పర్వతమును 'పరభూభృత్' అనఁగా పరరాజును పడమటికొండయు, సూర్యుని గుఱ్ఱములు అస్త పర్వతప్రాప్తిచేత సముద్రములో మునుఁగుచున్నవని భావము. తత్ ధిక్కృతుల్ = తన గుఱ్ఱములకయిన ధిక్కారములను-లేక ఆపురిహరులు తనగుఱ్ఱములను ధిక్కరించుటలను, సైఁచక=సహింపక, ('సైఁచక' ఖండబిందువుమీఁది సిద్ధచకారంబునకు ముత్తుపరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు (బా. వ్యా.) అన్నట్లు సైఁపక యని యుండవలెనియు ప్రాయికంబుగ ననుటచే 'నోఁచక' వలె 'సైఁచక' యనియుం జెల్లునని తోఁచెడిని.) రవి=సూర్యుఁడు, హరిదై=తానుగుఱ్ఱమై, చాయకున్ రాన్=పోలికకు రాఁజాడఁగా-తమ్ముఁ బోలఁజూడఁగా, చరణ + ఉద్యత్ ధూళిన్=గొరిసెలచే నెగురుచున్న దుమ్ముచేత, అడంచున్=అడఁచివైచునని యర్థము, సూర్యుఁడు హరియనెడు నామముగలవాఁడనియు లేక సంజ్ఞాదేవి నూఱడించుకొఱకై అశ్వమయినాఁడనియు, లేక ఛాయాదేవికై యశ్వమయినాఁడనియు, తాము బిట్టుగా రేఁపు గొరిజలదుమ్ముచే సూర్యునిఁగప్పి పుచ్చుచున్నవనియు భావము. ('చాయకున్ రానడంచున్' అనుటకు నీడక్రిందికి జలపానార్థమై వచ్చుగుఱ్ఱముల పదధూళిచేత నాచ్ఛాదితుఁ డౌచున్నాఁడనియు భావము వర్ణింపఁబడినది. కాని, కవి హృదయముగాఁదోఁపదు.) తత్ వాసతన్=ఆసూర్యునియందలి వాసముచేత, తగుహరియున్=ఒప్పుచున్న విష్ణుఁడును 'ధ్యేయస్సదా సవితృమణ్డల మధ్యవర్తీ' అన్నట్లు విష్ణుఁడు సూర్యమండలమధ్య వర్తియగుట నిట యనుసంధించు నది

సప్తిగాన్ = (సూర్యతిరస్కారమును సహింపక తాను) గుఱ్ఱముకాఁగా, పాదధారా స్ఫురణంబు= (ధారయనఁగా ఆస్కందితము మొదలయిన యశ్వగతి విశేషమునకుఁ బేరు. పాదమనఁగా-పాతికకును చరణమునకును బేరు) పూర్ణతలేక పాతికపాలయిన ధార నెఱపఁబడుట, ఏఁ వింతయంచున్ = ఏమి యాశ్చర్యమనుచు, పూర్ణాధారాసమృద్ధిన్ =సంపూర్ణమయిన ధారలయొక్క పెంపుచేత, నగున్ =పరి హాసముచేయును. విష్ణుఁడు పాతికపాలు ధారగలవాఁడని నిండుధారలు నెఱపుచు నతనిని బరిహాసము సేయుచని యర్థము. విష్ణుదేవుఁడు హయగ్రీవమూర్తి యైనవాఁడనియు, పాదధారాస్ఫురణమనఁగా పాద మందు గంగాజలధారయొక్క స్ఫురణముగల వాఁడనియును భావము. 'పాదాఽశ్వీయం క్రమితుర్యాంశాః' అనియు 'ఆస్కన్దితం ధౌరితకం రేచితం వల్గితంప్లుతమ్ । గతయోఽమూః పఞ్చధారాః' అమ.

అధిష్ఠాన పురమందలి యశ్వములు సూర్యాశ్వములు మొదలయినవానిని వేగమునఁ దిరస్కరించు నని ఫలితార్థము. ఇట సూర్యాశ్వములు సముద్రమునం బడుటకు శ్లేషానుగృహీతమయిన పరరాజప్రాప్తిని హేతువుగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. మఱియు సూర్యుఁడును విష్ణుఁడును అశ్వములగుటకు న శ్వముల ధిక్కృతి స్థైర్యమియు సూర్యమండల వాసిత్వమును హేతువులుగా నుత్ప్రేక్షించుటచే రెండు హేతూత్ప్రేక్షలు. ఈమూఁటికి అంగాంగిభావముచే సంకరము.

మ. అలఘుస్యందనకోటి వీటిమణిరథ్యావాటికా హాటకా
కలితక్షోణుల నేఁగుచోఁ జటులచక్రక్షుణ్ణతత్క్షోదముల్
గలయం బర్వి సుపర్వలోకనదిలో గాంగేయపంకంబు జొ
బ్బిలఁజేయం దఱుచై జనించి యచటం బెంపొందుఁ బొందామరల్. 102

అ. అలఘుస్యందనకోటి = గొప్పవయిన రథములసమూహము, వీటి...క్షోణులన్ - వీటి= పట్టణముయొక్క, మణి=రత్నమయములయిన, రథ్యావాటికా=రథ్యయనఁగా రథములకు ననువయిన మార్గము. ('రథ్యాప్రతోలీ విశిఖా' అమ). అట్టి మార్గముల వరుసలందుఁగల, హాటక=బంగారముచేతను, ఆకలిత = ఒప్పుచున్న, క్షోణులన్ =కట్టడపునేలలందు - రథములుపోవఁదగునట్టి తెరువుల వరుసలం దు బంగారుతోఁగట్టంబడిన నెలకట్టులందు, ఏఁగుచోన్ = పోవుసమయమందు, చటుల...క్షోద ముల్ —చటుల = చంచలములయిన, చక్ర = బండికల్లులచేత, క్షుణ్ణ=నలిగిన- పొడియైన, తత్ క్షోద ముల్ =ఆబంగారపుచూర్ణములు, కలయన్ =అంతటను, పర్వి=వ్యాపించి, సుపర్వలోకనదిలోన్ =దేవ లోకనదియైన యాకాశగంగలో, గాంగేయపంకంబు=బంగారపుబురదను, జొబ్బిలన్ చేయన్ =తొంపి యగునట్లుచేయఁగా, 'తపనీయం శాతకుమ్భంగాఙ్గేయం భర్మకర్బురమ్' అమ. తఱుచై=దట్టమై, జనించి= పుట్టి, అచటన్ =ఆయాకాశగంగయందు, పొందామరలు=బంగారుతామరలు, పెంపొందున్ = వృద్ధిఁ బొందుచుండును.

అంతఁగల రథసమూహము లపరిమితములగుటచేత వాని చక్రములచే బంగారునెలకట్టుల నుండి బంగారపుదుమ్మును నతిబహుళమై రేఁగుటవలన నవి యాకాశగంగలోఁబడి బంగారుబురదగా జొబ్బిలినదనియు అట్లుజొబ్బిలినంత బురదయగుటచే నందుఁ బొందామరలు తఱుచై పెంపొందినవని యు నర్థము. అనఁగా పొందామరలు తఱుచైపుట్టునట్లుగా బంగారపుబురద గంగలో జొబ్బిలుటకు రేఁగిననెలకట్టులదుమ్ము అత్యంత బహుళముగా నోపును. కావుననే రథములు 'కోటి' అపరిమితములును, 'అలఘు' అతిప్రమాణములు నగును. 'హాటకాకలితక్షోణులు' బంగారునెలకట్టులుగావుననే చక్రముల రాపుచే బంగారుదుమ్మురేఁగి గంగలో బురదయగుటయు దానియందు పొందామరలు పుట్టు

టయు. ఇచట రథ్యాపరాగములకును ఆకాశగంగవఱకు వ్యాపించుటకును సంబంధములేకున్నను సంబంధమును జెప్పుటచే నలంకార మతిశయోక్తి. అందురథములు పోవుమార్గములందు బంగారుపుసెలకట్టులు విశేషించియున్నవనియు రథములు లెక్కకుమీఱి కలవనియు వానినుండి రేఁగుదుమ్ము లాకాశమునంటుచున్నవనియుఁ దాత్పర్యము.

క. అన్నగరినాట్యశాలలఁ, జెన్నగుమురజములరవళిచే నటియించుం
గన్నియలకన్న మున్నుగఁ, బన్నగభుక్తతులు దృష్టిపాత్రము లగుచున్. 103

అ. అన్నగరినాట్యశాలలన్ = ఆపట్టణమందు నాటకశాలలందు, పన్నగభుక్ తతులు= నెమిళ్లయొక్క సమూహములు. 'మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజఙ్గభుక్' అమ. చెన్నగు= ఒప్పిదమగుచున్న, మురజముల రవళిచేన్ =మృదంగములయొక్క నాదముల చేత, 'మృదఙ్గా మురజాః' అమ. కన్నియలకన్న మున్నుగన్ = నాట్యము చేయవలసిన కన్నెపడుచులకంటె ముందుగానే, దృష్టిపాత్రములు అగుచున్ = చూచుటకు యోగ్యములగుచు 'దృష్టియుక్తం దృష్టిసదృశచిహ్నాయుక్తం, పాత్రం పత్రసమూహో యేషాం తే' అను సమాసముచేత దృష్టి సదృశములయిన చిహ్నములతోఁగూడిన యీఁకలు గలవియగుచు నని యర్థస్వారస్యము. నటియించున్ = నాట్యముచేయును, నెమలయీఁకలమీఁదఁగన్నులవలె గుఱుతులుగలిగియుండుట ప్రసిద్ధము. నెమళ్లు మేఘధ్వనికి నటియించుట స్వభావము. ఇచట మృదంగధ్వని మేఘధ్వనియుంబోలి యుండుటచే నది మేఘధ్వనియని భ్రమించి నాట్యమాడుచున్నవని తెలియునది. ఇందలంకారము భ్రాంతిమంతము వ్యంగ్యము. అది నటియించున్ అని వాచ్యము సిద్ధించుట కంగమయినందున గుణీభూతము. మృదంగధ్వని మేఘధ్వనివలెగంభీరముగా నుండుననుట. ఇట 'కన్నన్' అనునది 'కంటె' శబ్దమునకుఁ బ్రత్యామ్నాయమని యఱుంగునది.

తా. ఆపురమునందలి నర్తనశాలలలో మద్దెలలు మేఘధ్వనివలె మిక్కిలి గంభీరముగా మ్రోఁగఁగా నందుఁగల నెమిళ్లు మేఘధ్వని యని భ్రమించి యాటలాడు కన్నెలకన్న మున్నుగా నాట్యమాడును.

ఉ. చందనగంధు లిందుమణిసౌధతలంబుల గొండ్లి సల్పఁగా
నందలిదివ్యచిత్రముల యందొకరై యనిమేషభామినుల్
కందళితాద్భుతస్ఫురణఁ గన్గొని తన్నటనాంతగీత ని
ష్యందసజీవచిత్రముల సందడి నేఁగుదు రప్పురంబునన్. 104

అ. అనిమేషభామినుల్ =(ఱెప్పపాటులేని) దేవతాస్త్రీలు, అప్పురంబునన్ = ఆయయోధ్యాపురమందు, చందనగంధులు = స్త్రీలు, ఇందుమణి సౌధతలంబులన్ = చంద్రకాంతమణి నిర్మితములయిన మేడలయందు, గొండ్లి=నాట్యమును, సల్పఁగాన్ = చేయఁగా, అందలి దివ్యచిత్రములయందున్ ఒకరై=ఆ మేడలయందలి సుందరములయిన చిత్రప్రతిమలయందు- లేక దేవతారూప చిత్రప్రతిమలయందు - దామును చిత్రప్రతిమలవలె నున్నవారై, అందలి యనుచో అలిగాగమము. సమాసంబున 'అందు ఇందుఎందు' అనువానికి అలిగాగమము వచ్చుటగలదు. ఇట అనిమేషభామినుల్ అనుట సాభిప్రాయము. వారు ఱెప్పపాటులేనివారు గాన ఱెప్పపాటులేనిచిత్తరుబొమ్మలలోఁగలసి యేర్పడక యుండిరని యాశయము. దివ్యచిత్రప్రతిమలవలెఁ దామును దివ్య చిత్రాకారములు గలవారు గావునను నేర్పడకయుండిరనియును గ్రాహ్యము. కంద...స్ఫురణన్ — కందళిత = అంకురించిన,

అద్భుతస్ఫురణన్ = ఆశ్చర్యస్ఫూర్తిచేత, కన్గొని = ఆయాటచూచి, తత్...సందడిన్—తత్+నటన+అంత = ఆ నాట్యపుతీరుగడయందలి, గీత = గానామృతముయొక్క, నిష్యంద = ప్రసరణముచేత, సజీవ=ప్రాణయుక్తములయిన, చిత్రముల = చిత్తరుబొమ్మలయొక్క, సందడిన్ = తొందరనడుమను - లేక తొట్రుపాటునందు, ఏఁగుదురు = పోవుదురు.

మొదలె దేవతాస్త్రీలకు రెప్పపాటులేదు గనుక చిత్రపుబొమ్మలతో సామ్యముసిద్ధము. మఱి కందళితాద్భుతస్ఫురణచే కాలుసేతులు గదల్చుటయులేక మ్రానుపడియుండుటచే మఱింత యాప్రతిమలతోడి సామ్యము సాధితము. గానరసముచేత శిలలుగరఁగునని కవిసమయము. గానామృతముచే చిత్రప్రతిమలకుఁ బ్రాణములువచ్చి కదలగా ఆసందడిలో దామును గదలి తమ్ముఁదెలియనీయక యే పోవుదురని యర్థము. అపట్టణపుమేడలకు దేవతాస్త్రీలు వచ్చుటచే నవి స్వర్గము నంటియున్నవనియు, దేవతాస్త్రీలును గందళితాద్భుతస్ఫురణతోఁ గనుగొని రనుటచే నాపుర స్త్రీల నాట్య మప్సరఃస్త్రీలకును వింతయై కనుపట్టుచున్నదనియు, ఆనాట్యమందలి గానరసము అచేతనములను సచేతనములుగాఁ జేయఁజాలియున్నదనియుఁ దాత్పర్యము. ఇట నప్సరసలకు చిత్రములకంటె విశేషమేమియుఁ దోఁపకుండుట వర్ణించుటచే నలంకారము సామాన్యము. మఱి (దివ్య) విశేషణముచే దివ్యచిత్రములందు దివ్యభామినులు లోకరైయుండుట యుపపన్నమేయని వ్యంజితము.

చ. ఒనరుఁ బురాధిరాజమున నుజ్జ్వలవజ్రకలాపగోపురా
గ్రనిహిత హేమకుంభములు గాంగహిరణ్మయకంజమంజిమం
దనరఁగ నిక్కిదిక్కరులతండము తుండము సాఁచునంచు నుం
చినవెఱబొమ్మలో యనఁగఁ జిత్రితసాంద్రమృగేంద్రరూపముల్. 105

అ. పురాధిరాజమునన్ = పట్టణశ్రేష్ఠమందు - అధిష్ఠానపురమందనుట. ఉజ్జ్వల...కుంభములు—ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, వజ్ర = వజ్రమణులయొక్క, కలాప = సముదాయముతోఁగూడిన, గోపుర = పురద్వారములయొక్క, అగ్ర = అగ్రభాగములందు, నిహిత = ఉంపఁబడిన, హేమకుంభములు = బంగారుపుకలశములు, 'పురద్వారంతుగోపురమ్' అమ. గాంగ... మంజిమన్—గాంగ = గంగాసంబంధియైన, హిరణ్మయకంజ = బంగారుదామరలయొక్క, మంజిమన్ = చక్కందనముచేత - అనఁగా బంగారుదామరలవలె, తనరఁగన్ = ఒప్పుచుండఁగా, నిక్కి = పైకినుబికి, దిక్కరులతండము = దిగ్గజముల సమూహము, తుండము సాఁచున్ అంచున్ = తుండమును నిగిడించి పట్టఁబోవునని, ఏనుఁగులు తొండములతో దామరలనుబట్టి త్రెంచివైచుట సహజము గనుక బంగారు తామరలనెడి భ్రాంతిచేతఁబట్టి పెకలింపఁబోవుననుట. ఉంచినవెఱబొమ్మలో యనఁగన్ = నిలిపిన బెదురుజంత్రపు రూపములో యన్నట్లుగా, చిత్రితసాంద్ర మృగేంద్రరూపముల్ = చిత్రింపఁబడిన దట్టమయినసింహరూపములు, ఒనరున్ = ఒప్పుచుండును.

వజ్రకాంతుల వెల్లువలకు తెల్లనిగంగానదితోను, అందలి బంగారుకలశములకు-గంగయందలి బంగారు తామరలతోను సామ్యముదెలియునది. అనఁగా గోపురాగ్రమందలి బంగారుకలశములు గోపురమందు దాఁపినవజ్రమణుల తెల్లనికాంతులపయిని స్వచ్ఛమయిన యాకాశగంగా జలముపయిని బంగారు దామరలవలె నుండెననియు, ఆకలశములు దిగ్గజములను మించియుండెననియు, కనుక దానిని తామరలనితలఁచి దిగ్గజములు తుండములు సాఁచిపట్టుకొనునోయని వాని బెదరునకై యుంచినట్లు నలుగడల సింహప్రతిమలు వెలయుచుండె ననియునర్థము. దిక్కరినిగాక దిక్కరులతండమును వెఱపింపవలసియుండుటచే మృగేం

ద్రరూపములు సాంద్రముగా నుంపఁబడెనని సాంద్రశబ్ద పారశ్యము 'గాంగ...దనరఁగ' ననుచో నిదర్శనాలంకారము. (ఇచట గోపురాగ్ర సువర్ణకలశముల నాకాశగంగా కమలములుగా నుత్ప్రేక్షించుటవలన స్వరూపోత్ప్రేక్ష యని కొందఱు.) అచట సింహప్రతిమాస్థాపనమునకు దిగ్గజకరప్రసారణనివృత్తి ఫలముగా నుత్ప్రేక్షించుటచే ఫలోత్ప్రేక్షయునలంకారము.

సీ. ఘనులఁ గొండలపాలుగాఁ జేసినకొఱంత, ద్విజరాజు నెపుడుఁ గుందించుకొదవ
కువలయంబు దినంబుఁ గూల్చునాడిక బంధు, జీవ మామోదిగాఁ జేయనిసడి
కల్యాణగోత్రంబు గరిమ వంచినదూఱు, సరసుల నింకించు పరుసదనము
దానికేల్ వసులక్ష్మిఁ బూనఁ జేయనిజట్టు, తమ్ములఁ బంకాప్తిఁ దాఁచునగడు
తే. నలువ వారించుకొనియెఁ దత్ నగరసతుల, నెఱికురులు ముద్దుమోములు నిడుదకన్ను
లలఁతిమోవులు బిగిగుబ్బ లరిదినాభు, లలరుతొడలును మృదుపదంబులు నొనర్చి.

అ. నలువ=బ్రహ్మ, ఘనుల...కొఱంత—ఘనులనఁగా మహాత్ములును మేఘములును - మహాత్ములయినవారిని కొండలపాలుగాఁ జేసిన తక్కువయని యర్థము. మేఘములను గొండలయందు వ్యాపింపఁజేసినాఁడని భావము. ద్విజ...కొదువ—ద్విజరాజనఁగా బ్రాహ్మణోత్తముఁడును జంద్రుండును - బ్రాహ్మణోత్తముల నెల్లకాలమును దుఃఖపడునట్లు చేసిన లోపమనుట - చంద్రునిఁ బ్రతిపక్షమందును గృశింపఁజేసినాఁడని భావము. కువలయంబు...నాడిక—కువలయమనఁగా భూవలయమును కలువయును - భూవలయమును బ్రతిదినమును గూలిపోవునట్లు చేయు నపవాదమనుట - కలువలను బగటిపూఁట ముకుళింపఁజేసినాఁడని భావము. బంధు...సడి—బంధుజీవమనఁగా బంధుజనుల జీవనమును మంకెనపువ్వును - ఆమోదమనఁగా సంతోషమును పరిమళమును - బంధుజనుల జీవనమును సంతోషయుక్తమయినదిగాఁ జేయనినింద యనుట - మంకెనపువ్వును బరిమళములేకుండఁ జేసినాఁడని భావము. 'బన్ధూకో బన్ధుజీవకః' అని.

కల్యాణ...దూఱు—కల్యాణమనఁగా మంగళమును బంగారమును - గోత్రమనఁగా వంశమును బర్వతమును - మంగళకరమైన వంశముయొక్క గౌరవమును బోఁగొట్టిన దూషణ మనుట - బంగారుపర్వతముయొక్క యున్నతిని వంచి శివునకు విల్లుగాఁ జేసినాఁడని భావము. సరసుల...దనము—సరసులనఁగా రసికులును కొలఁకులును, రసజ్ఞులయినవారిని ముడుంగఁ జేసిన (అనఁగాఁ దగ్గుపఱిచిన) కఠినత్వమనుట - కొలఁకుల నెండకాలమందు నింకిపోవునట్లు చేసినాఁడని భావము. దాని...జట్టు—దానియనఁగా దాతయును ఏనుఁగును - కేలనఁగా హస్తమును గజతుండమును - వసులక్ష్మియనఁగా ధనసంపత్తియు కాంతిసంపత్తియును - దాతయొక్క హస్తము ధనసంపద వహింపఁజేయక పోయిన సడియని యర్థము - ఏనుఁగు తుండమును గాంతి సంపదఁ వహింపకుండఁ జేసినాఁడని భావము. తమ్ముల...నగడు—తమ్ములనఁగా సోదరులును తామరలును, పంకమనఁగా పాపమును బురదయును - సోదరులను బాపము నొందించిన రవ్వయనుట - తామరలను బురదపాలు చేసినాఁడని భావము.

తత్ నగరసతుల = ఆపట్టణపు స్త్రీలయొక్క, నెఱికురులు = నెఱులుగల తలవెండ్రుకలును - లేక చక్కనయిన తలవెండ్రుకలును, ముద్దుమోములు = మనోహరములయిన ముఖములును, నిడుదకన్నులు = పొడవులయిన కన్నులును, అలఁతిమోవులు = సన్నని పెదవులును, బిగిగుబ్బలు = బటువైనకుచములును, అరిదినాభులు = వింతయైనపొక్కిళ్లును, అలరుతొడలు = ఒప్పయిన తొడలును, మృదుపదంబులు = మెత్తనయిన యడుగులును, ఒనర్చి = సృజించి, వారించుకొనియెన్ = పోఁగొట్టుకొనెను. ఘనులఁ గొండలపాలుగాఁ జేసినకొఱంత మొదలుగా తమ్ములఁ బంకాప్తిఁ దాఁచు నగడు నందుక...

యపవాదములను అవ్వల నన్నిటిని నివారించుకొన్నాఁడని యర్థము. మేఘములు మొదలయినవానిని నెఱికురులు మొదలయినవిగా సృజించినాఁడని భావము. ఇట శిరసుమొదలుగా పాదమువఱకు వర్ణనము. 'మానవా మౌళితో వర్ణ్యా దేవాశ్చరణతః స్మృతాః' యని కవిశిక్ష.

ఆపట్టణపు స్త్రీలు మేఘములవంటి నల్లని నెఱికురులును, చందురునివంటి ముద్దుగులుకు మొగములును, కలువరేకులవంటి సోగలయిన కన్నులును, మంకెనపువ్వువంటి యెఱ్ఱని పెదవులును, బంగారుకొండలవంటి బటువులయిన చన్నులును, కొలఁకులవంటి లోఁతులయిన పొక్కిళ్లును, ఏనుఁగు తుండములవంటి చక్కని తొడలును, తామరపువ్వులవంటి మెత్తని యడుగులును గలవారని ఫలితార్థము. ఇందు శ్లేషమహిమచేత మహాపురుషావయవములుగా నధ్యవసింపఁబడిన మేఘాదులతో పట్టణస్త్రీల చికురాదులకుఁ దాదాత్మ్యము ప్రతీతమగుటచేత రూపకము వ్యంజితమగుచున్నది. మేఘాదులకును జికురాదులకును గ్రమంబున నన్వయము గలుగుటచే యథాసంఖ్యమలంకారము. లోకమునం దొకానొకఁడు చిరకాలము దుష్కర్మశతములనుజేసి పిదప నేదేనొక సుకృతమువలన వివేకమునొంది మంచికర్మముల నాచరించి పవిత్రుఁడగుచున్నాఁడు. బ్రహ్మయుం దీవృత్తాంతము నారోపించుటవలన సమాసోక్తియు నలంకారము. 'తమ్ములన్' అనుచోట ప్రత్యయాంతము శ్లిష్టము.

మ. పురిపూఁదోఁటలతావి మిన్నలమ వేల్పుల్ మెచ్చ తద్భూజభా
స్వరసంతానములన్ దివిం బెనుప నాసంతానముల్ దివ్యని
ర్ఝరిణీ నిర్మలవారిపూరపరిపోషం బందియుం దన్మహా
తరులక్ష్మీ పరిపూర్తిఁ గాన కెసఁగెం దత్కల్పశాఖప్రథన్. 107

అ. పురి .. తావి—పురి = అధిష్ఠానపురమందలి, పూఁదోఁటలతావి = పువ్వుతోఁటలయొక్క పరిమళము, మిన్నుఅలమన్ = ఆకాశమును గ్రమ్ముకొనఁగా, వేల్పుల్ = దేవతలు, మెచ్చ = అపరిమళమునుమెచ్చి, తత్ ... సంతానములన్ - తద్భూజ = ఆపువ్వుచెట్లయొక్క, భాస్వర = ప్రకాశించుచున్న, సంతానములన్ = పిలుకలను, దివిన్ = స్వర్గమందు, పెనుపన్ = నాటివర్ధిల్లఁజేయఁగా, ఆసంతానములు = ఆపిలుకలు, దివ్య ... పోషంబు—దివ్యనిర్ఝరిణీ = ఆకాశగంగయొక్క, నిర్మల = స్వచ్ఛమయిన, వారిపూర = జలసమృద్ధిచేత, పరిపోషంబు అందియున్ = మిక్కిలిపోషణమును బొందినదయ్యును, తత్ ... పూర్తిన్—తత్ = ఆమొదటి గొప్పచెట్లయొక్క, లక్ష్మీపరిపూర్తిన్ = శోభాసమృద్ధిని- సిరిపెంపును, కానక = పొందఁజాలక - వాని పూర్ణత్వమునుగానక వాని సంతానత్వమును మాత్రమే గలిగియుని భావము. తత్ ... ప్రథన్—తత్ + కల్ప = వానికంటెఁ గొంచెముతక్కువైనవియను, ప్రథన్ = ప్రసిద్ధిచేత, ఎసఁగెన్ = ప్రకాశించెను. కల్పప్రత్యయ మిట ఈషదసమాప్తియందుఁ బ్రయుక్తము. దేవతావృక్షము లయిదింటికిని గల్పములని వ్యవహారముగలదు. కనుక, సంతానములు తత్కల్పశాఖిప్రథన్ ఎసఁగెన్ అనఁగా ప్రసిద్ధమైన కల్పవృక్షవ్యవహారములచేతఁ బ్రకాశించెను అని భావము. కల్పవృక్షములని ప్రసిద్ధముగా బిలువఁబడుచున్న వనుట.

ఆపట్టణము నుద్యానవనములందలి వృక్షములు స్వర్గమందుండెడు కల్పవృక్షములకంటె నతిశయించియున్నవని తాత్పర్యము. పూఁదోఁట 'ప్రాఁతాదులతొలియచ్చు మీఁదివర్ణంబులకు లోపంబు బహుళంబుగా నగు'ననుసూత్రముచేత తొలియచ్చుమీఁది వర్ణమగు తకారమునకు లోపమురాఁగా 'లుప్తశేషంబునకు నుగాగమంబగు' ననుసూత్రముచేతను ఆనుగాగమమునకు 'బిందు సంశ్లేషంబులు విభాషనగు' ననుసూత్రముచేత ననుస్వారాదేశమునురాఁగా పూఁదోఁటయని రూపము కలిగెను. పురిపూఁ

దోఁటలతావి యాకాశమునంటుకు వ్యాపించుటఁబట్టి యే దేవతలుమెచ్చి వానిపిలుకలను దేవలోకమునఁ బెంచిరని తెలియునది. ఇచట దేవవృక్షములకు యోగముచేఁ గల్పశాఖిత్వమును వర్ణించుటచే నలంకారము నిరుక్తి. పురిపూఁదోఁటలందలి చెట్లపిలుకలను దివినిబెంచుటయు గంగాజలము పాతించుట యునను సంబంధము దేవతలులేకుండియును జెప్పుటచే అతిశయోక్తి.

[తత్ కల్పశాఖిప్రథక్=తత్=ఆపుర వృక్షములకంటె, కల్ప=ఇంచుక తక్కువయైన, శాఖి=వృక్షములు, అనెడి ప్రథచేతక్=వ్యవహారముచేత, తత్=ప్రసిద్ధమైన, కల్పశాఖి=కల్పవృక్షములనెడి ప్రథక్=వ్యవహారముచేత, ఎసఁగెనని అప్పత్తి-ఆచెట్లకంటె కల్పములు (తక్కువయైనవి) అనుమాటయె కల్పవృక్షము లనుపేరుగా పరిణమించినదనుట. మొదటి యర్థమున తచ్ఛబ్దము ప్రకారాంతరపదము; రెండవదాన తచ్ఛబ్దము ప్రసిద్ధిపరము] సోమకవి. 'మన్దారః పారిజాతకః। సన్తానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచన్దనమ్' అన్నట్లు దేవవృక్షములు సంతానములనియుఁ గలవు; పురితరువుల సంతానములు కావుననే యవి సంతానములను పేరొందెననియు సారస్యము. ఇట నిరుక్తి. దేవవృక్షములైదింటికిని కల్పవృక్షములను సామాన్య వ్యవహారముగలదు 'రరాజ ధామ్నా రఘుసూనురేవ కల్పద్రుమాణా మివ పారిజాతః' (రఘు). కాన యాసంతాన(వృక్ష)ములకు కల్పశాఖిప్రథ కలిగెననియు భావము సూచితము.

సీ. పొన్నపూ వొడినేలఁ ♦ బొదివితే చెలి యది, పొడమె బల్దివిపైఁ ♦ బొదువవలదె
చెలువ మాటితివేల ♦ కలువచా లదియుఁ గప్పఁగ రాదె మిన్నులకొ ♦ బావికడది
మొగడతమ్ములు నేల ♦ మూసితే సతి మూయఁ, దగదె మానసభూని ♦ దానములవి
తరుణి పూరెమ్మ యెత్తవదేల యది హేమ, శిఖరిదాపుది బయల్ ♦ సేయఁదగునె

తే. యనుచు రసమర్మసరసోక్తు ♦ లాడునట్టి, జట్టికాంద్ర యథోచిత ♦ సరసవచన
రచనఁ దేల్చుచు వివిధవిభ్రమము వఱల, విరులు విలుతురు పుష్పలావికలుపీట.

అ. ఇం పధిష్ఠానపురమునఁ బువ్వులమ్మెడు పడుచులతోఁ బువ్వులు గొనవచ్చినకోడెకాంద్రు పలికెడి మర్మగర్భిత నర్మవాక్యములకు నావిధముననే ప్రత్యుత్తరములిచ్చుచు వారు పువ్వులమ్ముట వర్ణించుచున్నాఁడు. పొన్న.. బొదువవలదే—ఇచటఁ బొన్నపూ వుపమానము - నాభియుపమేయము. బల్దివియుపమానము-జఘనముపమేయము. ఉపమానపదములచే ఉపమేయములను గ్రహించునది. నాభిని ఒడిలోఁ గనఁబడకుండఁ బొదువు కొన్నావేమే యని మర్మము. పొన్నపువ్వును జాపక యొడిలో దాఁచినావేమేయని మర్మగర్భితమయిన నర్మము. ఇది జట్టికాంద్రప్రశ్నము. (పుష్పలావికల యుత్తరము) అది=ఆనాభి, జఘనముమీఁదఁ బొడమెను. బొదువవలదా యని మర్మము. ఆపొన్నపువ్వు బలువయిన ద్వీపాంతరమునందుఁ బుట్టినదిగాన యపురూపమయినది. దానిని దాఁపవలదాయని మర్మగర్భితమయిన నర్మము. ఇట్లే మీఁదనెల్లను నర్మమర్మములను ప్రశ్నోత్తరములు తెలియునది. (జట్టి) చెలువ ...చాలు - ఇట కలువచా లుపమానము-నూఁగారుపమేయము. చక్కనిదానా, నల్లగలువలచాలు కప్పిపెట్టితివేలయని నర్మము. నూఁగారు కప్పిపెట్టితివేమేయని మర్మము. (పుష్ప) అదియు...కడది—మిన్ననఁగా నడుము - బావియనఁగా నాభి. కనుక మిన్నులబావియనఁగా నడుముపయినున్న నాభి. ఆకలువచాలు, మిన్నులబావికడది=ఆకాశగంగ దాపుదిగనుకఁ గప్పిపెట్టఁ దగదాయని నర్మము. ఆనూఁగారు నడుము పైనున్న నాభిదాపుదిగనుకఁ గప్పిపెట్టఁదగదాయని మర్మము. (జట్టి) మొగడ...సతి—మొగడతమ్ము లుపమానము - గుబ్బచన్ను లుపమేయము. చిన్నదానా! తామరమొగ్గల నేలమూసిపెటి

తివేయని నర్మము. గుబ్బచన్నుల నేలమూసిపెట్టితివేయని మర్మము. (పుష్ప) మూయ...లవి—మానసభూమియనఁగా వక్షఃస్థలము తన్నిక్షేపములనికాని మానసభూ! అనఁగా: మన్మథుఁడు, తన్నిక్షేపములని కాని యర్థము. అవి = ఆతామరమొగ్గలు, మానసభూనిధానములు = మానస సరోభూమియందలి నిక్షేపములు, మూయఁదగదే=మూసిపెట్టఁగూడదాయని నర్మము. అవి=ఆగుబ్బచన్నులు, మానసభూ నిధానములు=వక్షఃస్థలమం దుండునవి- లేక మన్మథుని నిక్షేపములయినవి, కనుక మూసిపెట్టఁగూడదాయని మర్మము. (జట్టి) తరుణి...వదేల—ఇట పూరెమ్మయుపమానము - చేయి ఉపమేయము. మేరు వుపమానము, స్తనము ఉపమేయము. తరుణి=లేఁతవయసుగలదానా, పూదీఁగె యేల యెత్తవే యని నర్మము. చేయి నేటికెత్తవేయని మర్మము. (పుష్ప) అది=ఆపూరెమ్మ, హేమశిఖరిదాపుది = మేరుపర్వతము పొంతనుండునది, బయల్ నేయఁదగునె=బయలు పఱుపవచ్చునాయని నర్మము. చేయి చన్నునకుఁ బొంతనున్నది బయలుపుచ్చవచ్చునా యని మర్మము.

అనుచున్=ఈలాగునఁ బలుకుచు, రసమర్మసరసోక్తులు=మోహారస గర్భితములయిన సరసవాక్యములు, ఆడు జట్టికాండ్రన్=పలుకునట్టి పువ్వులు కొనవచ్చిన కోడెకాండ్రను, యథోచిత...రచనన్—యథోచిత=వానికిఁ దగినట్టి, సరసవచన=రసవంతములయిన వాక్యములయొక్క, రచనన్=కూర్పుచేత, తేల్చుచున్=ఆనందింపఁజేయుచు, వివిధవిభ్రమను=నానావిధమయిన విలాసము, వఱలన్=ఉల్లసిల్లుచుండఁగా, వీటన్=ఆయధిష్ఠానపురమందు, పుష్పలావికలు=పువ్వులఁగోసెడు స్త్రీలు, విరులువిలుతురు=పువ్వులు అమ్ముచుందురు. ఇట నాభిమొదలయిన విషయముల నిగరణముచేత రూపకాతిశయోక్తి యలంకారము.

మ. అమరుం దత్పురిచెంతఁ గాంతకనకాబ్జాలంబరోలంబశు
క్తిమతీవాహిని సారసారణులు తత్కేదారకోదారస
స్యము ముక్కారును బండఁజేయ దివివారల్ వీటిసత్రాన్నభా
గము లాసింపఁగఁ దత్సురాలయనదీఖ్యాతిన్ విడంబించుచున్. 109

అ. తత్పురిచెంతన్=ఆపట్టణమునకు సమీపమందు, కాంత...రోలంబ—కాంత=మనోహరములయిన, కనక+అబ్జ=బంగారు దామరలే, ఆలంబ=అవలంబనముగాఁ గలిగిన - బంగారుతామరలం దెప్పుడునుండు, రోలంబ=తుమ్మెదలు గలిగినదియైన - 'ఇన్దిన్దిర శ్చఞ్చరీకో రోలమ్బో బమ్భరశ్చసః' అమ. ఈవిశేషణము శుక్తిమతీనదికిని ఆకాశగంగకును సాధారణమైనది. శుక్తిమతీవాహిని=శుక్తిమతియను పేరుగలనది, సారసారణులు—సార=బలమయిన, సారణులు=కాలువలు, 'సారణీచాల్పసరితి' విశ్వ. తత్...సస్యమున్—తత్ = ఆపట్టణమందలి, కేదారక=వరిమళ్లయొక్క, ఉదార=గొప్పవియగు, సస్యము=పైరును, ముక్కారును=మూఁడుకారులయందును, పండన్ చేయన్=పండునట్లు చేయుచుండఁగా, దివివారల్ = స్వర్గమును సంబంధించినవారలు - అనఁగా దేవతలు, వీటిసత్రాన్నభాగములు—వీటి=ఆపట్టణమందలి, సత్ర=యజ్ఞములందలి, అన్నభాగములు=అన్నముయొక్క పాళ్లు - అనఁగా హవిర్భాగములు - ఆసింపఁగన్=కోరఁగా - కోరినవారై యాపట్టణమునకు వచ్చియుండఁగా, కాలువలు బలవంతములై పైరును మూఁడుకార్లును బండించుచుండుటవలన ధాన్య సమృద్ధింబట్టి యజ్ఞము లెడతెగకయందుఁ జరుగుచుండుననియు, ఆయజ్ఞములందలి హవిర్భాగములకు గానదేవత లెప్పుడు వచ్చియుందురనియుఁ దెలియునది.' సత్రమాచ్ఛాదనే యజ్ఞే సదా దానేవనేఽపిచ' అమ. తత్...ఖ్యాతిన్—తత్సురాలయనదీ=ఆప్రసిద్ధమయిన దేవలోకమందలి నదియగు గంగయొక్క,

ఖ్యాతిన్=ప్రసిద్ధిచేత, విడంబించుచున్=ప్రకాశించుచు, లేక ఖ్యాతిన్=ప్రసిద్ధిని, విడంబించుచున్= అనుకరించుచు, 'పురమొప్పున్ మహికంఠహారతరళస్ఫూర్తిన్ విడంబించుచున్' అని ప్రయోగము - అమరున్=ఒప్పుచుండును.

'సురాలయనదీ' హావిర్భాగములకొఱకు దేవతలెప్పుడు నాపట్టణమందే యుండుటచేతఁ బట్టణము సురాలయముగా నుండును గనుక శుక్తిమతీనదియు సురాలయనదివలె నుండుననుట. 'కనకాబ్జ' బంగారు తామరలు గలిగియుండుటవలనను సురాలయనదీఖ్యాతిని విడంబించుచు నమరునని యాశయము. అనఁగా ఆపురిపొంత శుక్తిమతీనది ప్రవహించుచుండును. అది గొప్పనది గనుక నందుండి బలువయిన కాలువలు నలుగడలఁ బాఱుచుండుటచేఁ బంటలు మూఁడుకార్లును బండుచుండును. ఆపంటల పెంపునుబట్టి యందు యజ్ఞము లెడతెగక జరుగుచుండును. ఆయజ్ఞములందు హావిర్భాగములు గొనుటకై దేవతలెప్పుడు నచట వచ్చియుందురు. ఆశుక్తిమతిలో బంగారుదామరలు పూఁచును. ఆపట్టణము స్వర్గపట్టణమువలెనే యుండునని తాత్పర్యము. ఇట శుక్తిమతి సురాలయనదీ ఖ్యాతిని విడంబించునని సామ్యమును వర్ణించుటచేత నుపమయలంకారము. 'సురాలయనదీ' అనునది సాభిప్రాయము గాన పరికరాంకురమును.

శా. వీటన్ మీటగుజోటులేటివఱదన్ వేమాఱుఁ గ్రీడింపఁ ద
త్పాటీరాంకసపంకశంఖగత ముక్తాశ్రేణి యవ్వాసనన్
బాటించున్ మృగనాభిపంకయుతభామాకంబుకంఠాప్తి నే
నాటన్ మిన్కులు గల్గువారి కగు జన్మస్థానసౌఖ్యోన్నతుల్. 110

అ. వీటన్=ఆపట్టణమందు, మీటు అగుజోటులు=మిన్నలయిన స్త్రీలు, జోటిశబ్దము యోషిచ్ఛబ్దభవము, ఏటివఱదన్=శుక్తిమతీనది ప్రవాహమందు, వేమాఱున్=పలుమాఱును, క్రీడింపన్=జలక్రీడలాడఁగా - జలక్రీడలాడుచుండుటచేత ననుట, తత్...శ్రేణి - తత్=ఆస్త్రీలదయిన - ఆస్త్రీలు చనుగుబ్బలయందు నలందినట్టి, పాటీర=శ్రీచందనమే, అంక = చిహ్నముగాఁ గలవియు - దానిచేఁ బరిమళించునవి యనుట, సపంక=బురదతోఁ గూడినవియు - బురదతోఁగూడి నల్లనైనవియు ననుట, అగు, శంఖ=నదియందలి శంఖములను, గత=పొందిన- అనఁగా నాశంఖములందుఁ బుట్టిన, ముక్తాశ్రేణి=మౌక్తికసమూహము, అవ్వాసనన్ = ఆసంస్కారముచేత, మృగనాభి...కంఠాప్తిన్=మృగనాభిపంకయుత=కస్తూరికా పంకముతోఁగూడిన - అనుకయునకస్తూరి నలందినట్టియనుట, ఇది కంఠములకు విశేషణము, భామా= స్త్రీలయొక్క, కంబుకంఠ=శంఖులవలె మూఁడురేకలతోఁగూడిన కంఠములయొక్క, ఆప్తిన్=ప్రాప్తిని, (కంబుకంఠమనఁగా కమ్బుగ్రీవ - అనఁగా 'కమ్బుగ్రీవా త్రిరేఖాసా' అమ. అని మూఁడురేఖలు గలకంఠము - ఇట్టి కంఠముయొక్క ప్రాప్తిని), పాటించున్ = పొందును. అనఁగా జలక్రీడలాడు స్త్రీలచందనము తగిలి పరిమళించుచున్న నల్లనిబురదతోఁ గూడినవై మూఁడు చుట్లు గలిగియున్న శంఖములందు మునుపుండినవి కావున ఆపూర్వవాసనచే పరిమళించుచున్న నల్లనికస్తూరితోఁగూడి మూఁడురేకలుగలిగి ఆశంఖములకుఁ బ్రతినిధులుగానున్న స్త్రీకంఠప్రదేశములను బొందుచున్నవనుట. పాటీరము నదీగర్భస్థములగు శంఖములనుబొంది పరిమళింపఁజేయునంత బాహుళ్యము కలిగియుండుటకై దాని నలందినజోటులు 'మీఁటు'అగుటయు వారు క్రీడించుట 'వేమాఱు'అగుటయుఁ జెప్పఁబడినది - దీనినే సామాన్యమగు లౌకికన్యాయముచే సమర్థించుచున్నాఁడు. ఏనాటన్... సౌఖ్యోన్నతుల్ — మిన్కులనఁగా ధనములును గాంతులును, మిన్కులు గల్గువారికిన్ = ధనములు

గలవారికి, ఏనాటన్ - ఏదేశమందును, జన్మస్థాన=పుట్టినచోటఁ గలిగియుండిన, సౌఖ్య+ఉన్నతుల్ సుఖాతిశయములు, కలుగును, ధనవంతు లేదేశమునకుఁ బోయినను వారికిఁ బుట్టినచోటఁగల సౌఖ్యములు తప్పక కలుగునని యర్థము. మిన్కులుగలవారనఁగా- ముత్యాలు కాంతులుగలవియని భావము, ముత్యాలు కాంతులుగలవియగుట శ్లేషముచే ధనములు గలవియనుటగా నధ్యవసించి ధనముగలవారి కెచ్చటఁబో యిన జన్మస్థాన సౌఖ్యములుగలుగును; గావున, నట్టిముత్యములకును, పుట్టుచోటగు సంకువులందున్న పుడు వాసనగల నల్లనిబురదతోడి మూఁడురేకలుగలవాని పొత్తుగలిగియుండునట్లు స్త్రీకంఠములందున్న పుడు ను వాసనగల నల్లనికస్తూరితోడి మూఁడురేఖలుగలవాని పొత్తుగలిగియున్నదని సమర్థించినాఁడు. శుక్తి మతీనది గర్భమందలి శంఖములందలి ముక్తాఫలములు పురకాంతల కంఠదేశములందు హారములై ప్రకా శించునని ఫలితార్థము. శంఖములందు ముత్యములుపుట్టుట రత్నశాస్త్రప్రసిద్ధము.

క. పరజనితశంఖమౌక్తిక, మరయఁ గపోతాండభాతి నత్యుజ్జ్వలమై
పరఁగు నది మంత్రసాధన, పరులకుఁ దక్కంగ దుర్లభం బితరులకున్.

ఇట ముక్తాశ్రేణియొక్క పురస్త్రీకంఠప్రాప్తికి శంఖోత్పత్తివాసనహేతువుగా వర్ణించు టచే హేతూత్ప్రేక్షయు 'ఏనాటన్ ...సౌఖ్యోన్నతుల్' అను సామాన్యముచే ప్రకృతార్థమును సమర్థించుటచే అర్థాంతరన్యాసము నలంకారములు.

తా. ఆపట్టణమందు మిన్నలయిన స్త్రీలు శుక్తిమతీ నదియందు పలుమాఱు క్రీడించుచుందురు. వారల లందినచందనము నదిలోనున్న శంఖములకు నంటి యందలి ముత్తెములు పరిమళించుచుండును. ఆ స్త్రీలాముత్తెములను హారములుగాఁ గ్రుచ్చి ధరించుచుందురు.

ఉ. చెన్నగునన్నదీపులినసీమల దాఁగిలిమూఁత లాడుచున్
వెన్నెలరేలఁ గప్పురపువిప్పటనంటులనీడ నీఁగు రా
కన్నెల రోయునన్నులకుఁ గన్నులు మూయుఁ దదీయవాసనల్
మన్ననఁగాంచి కప్రపుదుమారము రేఁచుసమీరడింభముల్. 111

అ. కప్రపు...డింభముల్ —కప్రపుదుమారము = కర్పూరధూళిని, రేఁచు=ఎగరఁ జిమ్ముచున్న, సమీరడింభముల్=మందమారుతములు - కూనగాడ్పులు - పిల్లలును, ఇటసమీరడింభములనెడి డింభము లని రూపకాలంకారము. చెన్నగు...సీమలన్ —చెన్ను అగు=చక్కనగుచున్న, అన్నదీ=ఆశుక్తిమతి యొక్క, పులినసీమలన్=ఇసుకదిన్నెల ప్రదేశములందు, దాఁగిలిమూఁతలు ఆడుచున్=దాఁగురుమూఁ తలనెడి యాట నాడుచు, వెన్నెలరేలన్=వెన్నెలుగలరాత్రులందు, కప్పురపు విప్పటనంటులన్=గొప్ప విరియైన కర్పూరపు టరఁటిచెట్లయొక్క, నీడను=నీడయందు, ఈఁగురాకన్నెలన్ = దాఁగియుండునట్టి రాచకన్నియలను, రోయు అన్నులకున్=వెదకునట్టి స్త్రీలకు, తదీయవాసనల్=ఆదాఁగియున్న కన్నె లవియగు దేహవాసనలను, మన్ననన్=మన్ననచేత, కాంచి=గ్రహించి, కన్నులుమూయున్=కన్నులు గప్పును. అనఁగా దాఁగియున్న రాచకన్నెల వాసనలను వారిమన్ననచేఁ దాము పడసినవై యందు లకుఁ బ్రత్యుపకారముగా వారికి సహాయముచేయఁగోరి యా స్త్రీలను వెదకవచ్చిన స్త్రీలకుఁ దాము రేఁచిన కర్పూరపుదుమ్ముచేఁ గన్నులు కనఁబడకుండఁజేయునని యర్థము. సమీరములు తామును డింభ ములగుటచే వారిలోఁగూడి యిట్లాటలాడినవని యాశయము.

దాఁగిలి మూఁతలాటకు అన్నది పులినసీమలు 'చెన్ను'అగుటచేఁ దగినయెడ యైనవి; 'రేలు వెన్నెలలు' గలిగియుండుటచేఁ దగిన కాలమైనవి. అనఁటులు విప్పగుటచే క్రిందఁ దాఁగుటకు

అనుపయ్యెను. కప్పురపుటనంటు లగుటచే కప్పురపుదుమారము లేచుటకు పిలయ్యెను. మఱియు స సమీరడింభములు దాఁగిన కన్నెల వాసనలను బడయుటచే ఆకన్నెలవంటివేయై వానివలె వెదకుకన్నెలఁ గన్నులుమూసినవనియు వ్యంజితము. దాఁగిలిమూఁతలనఁగా ఒకతె కూర్చుండి ముందుగా నొకతె కన్నులుగట్టిగామూసి పట్టికొనియుండఁగాఁ బక్కనవుండువారలు పోయి యొక్కొక్కచోటనో దాఁగియుందరు. అప్పుడు కన్నులు మూయఁబడినదానిని విడిచిపెట్టఁగా నదిపోయి దాఁగినవారిని వెదకి యొండొవతి దాఁకునో యాతాఁకఁబడినది దాఁకినదానిచే దాను గన్నులుమూయించుకొని దాఁగినతక్కినవారి వెదకును. ఇట్లు ఆటసాఁగుచుండును. మఱియు సమీరడింభములు దాఁగిన కన్నెలవాసనలను గాంచటచే నాకన్నెలకంటె నవివేఱగుట నగఁగా విశేషము గలదియగుట తోఁపమి యనటఁ బ్రతీతమగటచే సామాన్యాలంకారము వ్యంగ్యము. అది కన్నులుమూయుట యనువాచ్యమునకు నంగమగుటచే గుణీభూతము. వెదకు కన్నెల కన్నులుమూయుటకు దాఁగినకన్నెలవాసనలు గాంచుట హేతువుగ నుత్ప్రేక్షించుట ప్రతీతమగుచున్నది. కాన హేతూత్ప్రేక్షయు గమ్యమగుచున్నది. 'మన్ననల్' అనుదముతో నావాసనలు పడసినందునకై ప్రత్యుపకారముగా నిచ్చుచున్నటుల వెదకుకన్యల కన్నులుగప్పుట. ఇట ఉపకారమునకుఁ బ్రత్యుపకృతి నేయువాని కృతజ్ఞతయును స్ఫురించుటచే సమాసోక్తియు.

[డింభపదము గౌణార్థమును ముఖ్యార్థమును జెప్పుచున్నది. ముఖ్యార్థము చెప్పునపుడు దుబంతమేకాని ముప్రత్యయాంతముగా నేరదు. తదుక్తమమరోపబలపతినా 'పోతః పాకోఽర్భకో డిమ్భః పృథుకః శాబకః శిశుః' ఇత్యమరః ఇత్యభిధానోక్తేషు అర్భకాద్యమ్బకాదశబ్దానాం శేషాంచి వ్యాప్త్యవివక్షాయాం డుబ్ స్యాత్తేన డింభకుఁడు ఇత్యాదితి'' కనుక నిక్కడ లింగవ్యత్యాస మంగీకరించి చెప్పవలెను.] సోమకవి.

చ. వలనగు నమ్మహాతటినివారి నవారితకేళిఁ జల్పు కాం
తల చనుమిట్టలం దొలఁగుకట్టపుఁగట్టుపునుంగు వాసనల్
చిలుకుచు వీటిరాజనపుఁజేలకు దద్దనకాల్వవెంట రా
దళముగ వానియప్పునుఁగుతావులె చల్చుఁ దదీయధాన్యముల్. 112

అ. వలను...వారిన్—వలనుఅగు=యుక్తమయిన, అమ్మహాతటినివారిన్=ఆమహానదియొక్క జలమందు, అవారితకేళిన్ చల్పు=అడ్డములేనట్లుగా జలక్రీడలాడుచుండెడు, కాంతల=స్త్రీలయొక్క, చనుమిట్టలన్=మిట్టలైన స్తనములవలననుండి, తొలఁగు...పునుఁగు—తొలఁగు=విడుచున్న, కట్టపు=దట్టమయిన, తట్టుపునుంగు, వాసనల్ చిలుకుచున్=పరిమళములు చల్లుచు, వీటిరాజనపుచేలకున్=ఆపట్టణమందలి రాజనాలుపండుపరిచేలకు, దద్దన=పొంగులెట్లు తీర్పఁబడిన, కాలువవెంటన్=కాలువవెంబడిని, రాన్=రాఁగా, చేనుశబ్దము సవర్ణలోపము బహువచనమున వైకల్పికమగుట తెలియునది. దళముగన్=బలముగాన్, అని=అప్పునుఁగును గ్రహించి, ఎక 'ఆని'=అప్పునుఁగునందు మిక్కుటముగాఁదొరిగి, తదీయధాన్యముల్ = ఆరాజనపు ధాన్యములు, అప్పునుఁగు తావులె= అపునుఁగువాసనలనే, చల్చున్= వాసనగొట్టును.గుబాళించుననుట, అపునుఁగు వాసనలనే వెలయించుననుట. కాంతలానదియందు కేళి 'అవారితముగా' సలుపుటవలన తట్టుపునుంగు 'దట్టముగా' దొలఁగఁగా నది కాలువవెంటనుబోయి ధాన్యములవాన్పునంత బాహుళ్యము గలది యగుచున్నది. 'చల్చు' అనుటకు 'వెనువు మీనొప్పల చల్చు' 'ఇసచల్చు బాలకుఁడు' ఇత్యాదులు ప్రయోగములం దెలియునది. ఇటధాన్యములకు పునుంగుగంధముతో సంబంధములేకున్నను సంబంధమును వర్ణించుటచేత నలంకార మతిశయోక్తి.

చ. పగడపుఁజిట్టలన్ మనికిపట్టుగఁ గట్టిన పట్టుజీనువుల్
జిగిబిగి మించుచంచువులఁ జించినచో రసపూర మూరఁ జె
న్నగు రసదాడిగుంపులు పురాంతికసీమలశాలిపాలికా
జగదభినంద్యగానరససంగతిఁ గన్నుల నీరు గన్గతిన్. 113

అ. పగడపుఁజిట్టలన్ = శుక్తిమతీనది తీరమందున్న పగడపుఁదీఁగల చిట్టిపాదలను, మనికిపట్టుగన్ = నివాసభూమిగా, కట్టినపట్టు జీనువుల్ = గ్రహించినట్టి పట్టుజీనువులు అనెడి పక్షి విశేషములు, జిగిన్ = కాంతిచేతను, బిగిన్ = కాఠిన్యముచేతను, మించు చంచువులన్ = అతిశయించుచున్న ముక్కులచేత, చించినచోన్ = చీల్చినయెడ, రసపూరము = రసప్రవాహము, ఊరన్ = ఊరుచుండఁగా, రసదాడిగుంపులు = తెల్ల చెఱుకుగుంపులు, పుర + అంతికసీమల = పట్టణమునకు దాపటిప్రదేశములందలి, శాలి...సంగతిన్—శాలిపాలికా = వరిచేలుకాచు పడుచులయొక్క, జగత్ + అభినంద్య = జగజ్జనులచే కొనియాడఁదగిన, గానరస = సంగీతరసముయొక్క, సంగతిన్ = అనుభవముచేత, కన్నులనీరు కన్గతిన్ = కన్నుల నానందబాష్పములు వహించినట్లు - కను అను మను ఇత్యాదులగు నుకారాంతములు కొన్నిటికి సమాసంబునందుది యుత్వములోపించుట ప్రయోగంబులఁ జూపట్టుచున్నది - అన్నాడు, మన్మాని, మొదలగునవి. చెన్నుఅగున్ = ఒప్పుచుండును. కన్నులనఁగా గణుపులు నగును. కన్నులవిల్తుఁ డిత్యాదుల దెలియునది. పట్టుజీనువులు ముక్కులచే జీల్పఁగాఁ గన్నులం (గణుపులయం) దయిన రసపూరోదయమును, రసదాడి గుంపులయందు కన్నులయందు నానందబాష్పోదయముగా నుత్ప్రేక్షించినాఁడు. మఱియు గానరసమహత్త్వమున మోళ్లు చిగుర్చుట ఱాలుగరఁగుట మొదలయినవి కవిసమయ సిద్ధములు. కనుక నచేతనములయిన యిక్షుకాండములందు ఆనందబాష్పోదయము యుక్తమే. గానమున మ్రాఁకులు చిగుర్చుట 'పట్టిమ్రాఁకులుపల్లవింపగ' నిత్యాదులందు తెలియునది. అలంకార ముత్ప్రేక్ష. వరిచేనికాఁపరి పడుచులగానమే జగదభినంద్యమయియుండఁగా నందలి నాగరక ప్రవీణల సంగీతకౌశలాతిశయము నేమని చెప్పనని యాశయము.

క. ఆరాజధాని కధిపతి, యై రాజిలు వసునృపాలుఁ డతఁ డసిధారా
ధారాధరధారాజల, భారాహత రాజహంస పద్మోదయుఁడై. 114

అ. ఆరాజధానికిన్ = ఆయధిష్ఠానపురమునకు, అధిపతియై = ప్రభువై, వసునృపాలుఁడు = వసురాజు, అతఁడు, అసి...పద్మోదయుఁడై — అసిధారా = ఖడ్గధారయనెడు, ధారాధర = మేఘమును సంబంధించిన, ధారాజలభార = ధారారూపమయిన యుదకభారముచేత, ఆహత = కొట్టఁబడిన, రాజహంస = రాజశ్రేష్ఠులయొక్క, పద్మా = సంపదయొక్క, ఉదయ = అభ్యుదయమనెడి, రాజహంస = రాజహంసలయొక్కయు, పద్మ = కమలములయొక్కయు, ఉదయుఁడై = అభ్యుదయము గలవాఁడై, రాజిలున్ = ప్రకాశించును. మేఘముయొక్క ధారారూప జలభారము, రాజహంసలయొక్కయుఁ గమలములయొక్కయు నభ్యుదయము నెట్లు హరించునో యట్లె వసురాజుయొక్క ఖడ్గధార, రాజశ్రేష్ఠులయొక్క సంపదభ్యుదయమును హరించునని భావము. వర్షజలధారలు రాజహంసములకును పద్మములకును అనిష్టములౌట లోకప్రసిద్ధము. ఇట ఖడ్గాదులను మేఘాదిరూపముల రూపించుటచే నలంకారము రూపకము. ఇది 'రాజహంస' అనుచో శ్లిష్టము.

సీ. తనయశోవిశదముక్తాసౌధపాళికి, నంబుదాయనము వాతాయనపుంగఁ

దనశౌర్యశిఖిశిఖాతతికి జాంబూనద, భూధరం బపరంజిపూఁదె గాఁగఁ
దనబలోద్ధతరజోదంభకుంభినికిఁదా, రాగ్రహంబులు గర్భరత్నములుగఁ
దనదానధారాఖ్యవనధికి మిన్నేఱు, కల్లోలధుతవారికణము గాఁగఁ
తే. దనవినూతనసుగుణసంతానవల్లి, సముదయంబున కంభోజసంభవాండ
భాండము లఖండఫలపరంపరలుగాఁగ, వఱలుభవ్యవిభావిభావసుఁడువసుఁడు.

అ. భవ్య...వసుఁడు—భవ్య = ఉత్కృష్టమైన, విభా = తేజస్సునందు, విభావసుఁడు= సూర్యుఁడయిన 'విభావసుర్గ్రహపతిః' అని. వసుఁడు = వసురాజు, తన...పాళికిన్—తనయశః=కీర్తి యనెడు, ముక్తాసౌధపాళికిన్ = ముత్యాలమేడలయొక్క సమూహమునకు, అంబుదాయనము = ఆకాశము, వాతాయనముగన్ = గవాక్షమగుచుండఁగా, అనఁగా సౌధముపొడవునకుఁ గ్రిందుగను విరివిని తక్కువగను గవాక్షముండును; కనుక ఆకాశమును గవాక్షమయ్యెననుటచే కీర్తి యంతకంటె పొడవుగను విరివిగను వ్యాపించినదని భావము. మీఁద నెల్లనిట్లె గ్రహించునది. తన...తతికిన్—తన= తనయొక్క, శౌర్య = ప్రతాపమనెడు, శిఖిశిఖాతతికిన్ = అగ్నిజ్వాలల సమూహమునకు, జాంబూనద భూధరంబు= బంగారుకొండ, అపరంజిపూదెగాఁగన్ = మేలిబంగారు పూసయగుచుండఁగా- బంగారుపర్వతమె పూసయంతయగునేని శౌర్యాగ్ని కొలఁది యెంతయురునైనది యని దాని యత్యంత ప్రమాణమును దెలియునది.

దన...కుంభినికిన్—తన = తనయొక్క, బల = సైన్య (పద ఘట్టన)ముచేత, ఉద్ధత = ఎగసిన, రజః = పరాగమనెడు, దంభకుంభినికిన్ = కృత్రిమ భూమికి, లేక పరాగదంభ = పరాగ వ్యాజముగల కుంభినికనియుఁ జెప్పవచ్చును. తారాగ్రహంబులు = నక్షత్రములును సూర్యాదిగ్రహములును, గర్భరత్నములుగన్ = గర్భమందలి రత్నములౌచుండఁగా - భూమి రత్నగర్భ యగుట ప్రసిద్ధము. తారాగ్రహములె గర్భరత్నములైనచో అపరాగదంభకుంభిని పొడవును విరివియు నతిమాత్రములని తెలియుచున్నది.

తన...వనధికిన్—తన=తనయొక్క, దానధారాఖ్య వనధికిన్ = దానధారాజలమనెడు సముద్రమునకు, మిన్నేఱు=ఆకాశగంగ, కల్లోల...గాఁగాన్—కల్లోల=పెద్దయలలవలన నుండి, ధుత= ఎగసిన, వారికణముగాఁగన్ = జలబిందువగుచుండఁగా, ఆకాశగంగయే జలబిందువైనట్టి దానధారా జలధి ప్రమాణము నిరతిశయమని తేలుచున్నది. తరంగము లొండొంటిఁదాఁకి నురుఁగులతో నెగయు జలబిందువులు తెల్లగానుండును గాన తెల్లనిగంగానదికి సాటిగాఁ గయికొన్నాఁడు.

తన...వల్లి—తన=తనయొక్క, వినూతన=అపూర్వమైన, సుగుణ=సుగుణసముదాయమనెడు, సంతానవల్లి సముదయంబునకున్ = కల్పలతా సమూహమునకు, అంభోజభవాండ భాండములు = బ్రహ్మాండభాండములు, అఖండ...గాఁగన్—అఖండ = సంపూర్ణమయిన - నిండారఁబండిన యనుట, ఫలపరంపరలు గాఁగన్ = పండులయొక్క దొంతరలగుచుండఁగా, బ్రహ్మాండభాండములు పండ్లుమాత్రమయినట్టి సుగుణకల్పవల్లి కొలఁది నిరతిశయమయినది గదా. వఱలున్ = ప్రకాశించును - ఇచట శ్లేషానుప్రాణితములగు పరంపరిత రూపకము లయిదింటికి సంసృష్టి. ఈ రూపకములవలనఁ గీర్త్యాదుల కతివైపుల్యము ధ్వనించుచున్నది గాన నలంకారముచే వస్తుధ్వని.

చ. మసలక యెల్లకాలమును [illegible]మారుతపారణధార్యమాణ యై
యసమ[illegible]లోచ్ఛ్రయంబుల నసంత యనంతతపం బొనర్చి తా

వసుమతి యై తదీయగుణవాసన గంధవతీప్రతీతియుం
బొసఁగఁగఁ దెల్పె రత్నపరిపూర్ణమహాకటకాభిరూప్యమున్. 116

అ. అనంత = భూదేవి. 'భూర్భూమిరచలానన్తా' అ. మసలక = జాగుసేయక, ఎల్లకాలమును = నిరంతరమును, మారుత...మాణయై—మారుత పారణ = వాయుభక్షణముచేత, ధార్యమాణయై - ప్రాణధారణము చేయుచున్నదై, అసమ = విషమాకారములయిన - అనఁగా దుర్గమములయిన, శిలోచ్చయంబులన్ = పర్వతములయందు, అనంతతపంబు ఒనర్చి= అంతములేని తపస్సుచేసి, అనఁగాఁ జిరకాలము తపముసలిపి - మారుతపారణమనఁగా వాయువాహారముగాఁ గలది సర్పముగనుక శేషుఁడగును; అతనిచేత ధరింపఁబడుచున్నదనియు అసమశిలోచ్చయం బనఁగా, అషమసంఖ్య అనఁగా సప్తసంఖ్యగల కులపర్వతములందు నిలిచియున్నదనియును భావము. తాన్ వసుమతియై = తాను వసురాజుగలదై - వసుమతీనామమునుగలదై యని భావము. 'సర్వంసహా వసుమతీ వసుధోర్వీ వసున్ధరా' అమ. తదీయగుణ వాసనన్ =ఆవసురాజుయొక్క గుణవాసనచేత - ఇట గుణప్రకాశమును వాసనగా నధ్యవసించినాఁడు. గంధవతీ ప్రతీతియున్ = గంధవతి యనెడుప్రసిద్ధియు, పొసఁగఁగన్ = ఒప్పుచుండఁగా - ఆవాసనను బొందుటచే తాను గంధవతి (అనఁగా వాసనగలది)యని ప్రసిద్ధిఁగాంచినదనుట. 'గన్ధవతీ పృథివీ' అని భూమికి గంధవతియని పేరుగలదని భావము. రత్న...రూప్యమున్ — కటకమనఁగా హస్తకంకణమును పర్వతసానువును గనుక రత్నములచేతఁ బరిపూర్ణమయిన కంకణ సౌభాగ్యమును, తెల్పెన్ =ప్రకటించెనని యర్థము. 'కటకంవలయే సానౌ రాజధానీనితమ్బయోః' విశ్వ. రత్నకటకమనఁగా రత్నసానువయిన మేరుపర్వతము; దానిచేతఁ జేయఁబడిన సౌభాగ్యమును దెల్పెనని భావము. 'మేరుస్సుమేరుర్హేమాద్రీ రత్నసానుస్సురాలయః' అమ. వసువనఁగా ధనమును గనుక వసుమతియనఁగా ధనికురాలు. తపఃఫలముగా మహాధనికుఁడగు ప్రభూత్తముని వరునిగాఁబడసి తదనుగుణమైన గంధమాల్యాభరణాది సంపద్విభవమునొందినదని యర్థము. భూమి యాదిశేషకులపర్వతములచే నెప్పుడును దాల్పంబడుచుండుననియు వసుమతీ గంధవతీనామములు గలదనియు మేరుపర్వతము కర్ణికగాఁ గలిగి వెలయుచున్నదనియు భావము. ఇచట భూమియొక్క కులపర్వతనివాసమును దపశ్చర్యగా నధ్యవసించుటచే రూపకాతిశయోక్తి. దీని వసుమతీత్వప్రాప్తికి హేతువుగా నుపన్యసించుటవలన హేతూత్ప్రేక్ష. ఇది శ్లేషానుప్రాణితము, మఱి రూపకాతిశయోక్తితోడ దీనికి సంకరము. వసుమతీ గంధవతీశబ్దములంబట్టి నిరుక్తియు.

సీ. మీఱినరాజు బల్మి నడంప లోనైన, నభినవస్థితిఁ బెంప నతఁడె నేర్చుఁ
చేటిచూచినఁ దీవ్రదీప్తిఁ జూప జనాళి, కక్షిసాఫల్యమీ నతఁడె నేర్చు
సింధువింకఁ బ్రతాపశిఖిఁ బూన విశ్రాణి, తాంబుల నవి నింప నతఁడె నేర్చు
సమిదున్ముఖుని తేజము మలఁపఁ బాదంబు, లంటిన వెలయింప నతఁడె నేర్చు
తే. మండలము దాల్పహరిదెసమైత్రినిలుప, నలఘు సన్మార్గగతిఁ దెల్ప నతఁడె నేర్చు
నాజగద్బంధునకు వసురాజనామ, మిడినచతురాస్యుకౌశలం బెన్న నరిది. 117

అ. ఈపద్యమున వసురాజును శబ్దశ్లేషముచే సూర్యునిగా నధ్యవసించి యర్థద్వయమును గలుగఁజెప్పినాఁడు. మీఱిన...నేర్చున్ —రాజనఁగా ఒకానొకరాజును, చంద్రుఁడును, గర్వించి తన్ను ధిక్కరించిన రాజుయొక్క బలిమినడంచుటకును లోనువయైన నంతకంతకు వృద్ధిబొందించుటకును

చతురములయిన వాక్కులుగలవాఁడని సాభిప్రాయము గావున పరికరాంకుర మలంకారము. ఇచట శబ్దశక్తి మూలధ్వని లేక శ్లేషము సాభిప్రాయమని విచారింపవలయును.

మ. జననాథాగ్రణి యొక్కనాఁడు హిమవజ్జాతుండు కోలాహలా
ఖ్యనగాధీశుఁడు వ్రాలి శుక్తిమతి నాఁగన్ వేగ లేగవ్వ మీ
టినసూటిన్ బొటవ్రేలిగోట నెగమీటెం గుంఠితాహార్య శా
సనగర్వాగ్రహుఁడై బలారి తనతోఁ సఖ్యంబు వాటింపఁగాన్. 118

అ. జననాథాగ్రణి=రాజశ్రేష్ఠుఁడయిన యావసురాజు, ఒక్కనాఁడు=ఒక దినమందు, హిమవజ్జాతుండు=హిమవంతునివలనఁ బుట్టినవాఁడగు, కోలాహలాఖ్యనగాధీశుఁడు=కోలాహలుఁడనెడి పేరుగల పర్వతశ్రేష్ఠుఁడు, వ్రాలి=పైఁగావచ్చి ప్రవేశించినవాఁడై, శుక్తిమతిన్=శుక్తిమతీనదిని, ఆఁగన్=అడ్డగింపఁగా-రతికై నలమఁగా ననుట, వేగ=శీఘ్రముగా, లేగవ్వమీటిన సూటిన్=చిన్నగవ్వ నెగమీటినట్లుగా, బొటవ్రేలిగోటన్=కాలిబొటనవ్రేలిగోటిచేత, ఎగమీటెన్=ఎగిరిపోవునట్లుగా మీటివైచెను. ఎట్లనఁగా, బలారి=దేవేంద్రుఁడు, కుంఠితా... గ్రహుఁడై—కుంఠిత=మొక్కపోయిన, ఆహార్యశాసన=పర్వతదండనముచేతనయిన, గర్వాగ్రహుఁడై=గర్వాటోపము గలవాఁడై - ఇంద్రుఁడు పర్వతములను దండించుటవలనఁ బొందిన పెనుగర్వము వసురాజుచే మొక్కపుచ్చఁబడిన దనుట, తనతోన్, సఖ్యంబు పాటింపఁగాన్=స్నేహము చేయునట్లుగా, ఎగమీటెనని సంబంధము. ఇంద్రుఁడు దాను వజ్రాయుధముచేఁ జేసిన పర్వతశిక్ష వసురాజు కాలిగోటిచేతనే చేసెను గనుక తానుపర్వతములను దండించువాఁడని విఱ్ఱవీఁగుచుండు గర్వాతిశయమును దిగవిడిచి వసురాజుతో స్నేహముచేసెనని తాత్పర్యము. 'హిమవజ్జాతుండు' కోలాహలుని బలధైర్యస్థైర్యములు స్వభావమహనీయము లనుటకు. అట్టి బలధైర్యధుర్యుని ఎగమీఁటుట చేతనుగాదు, కాలనుగాదు, బొటవ్రేల. అందును బొటవ్రేలియేకదేశమగు 'గోటన్;' అదియును 'లేగవ్వ'వలె అవలీలను. దీనిచే రాజుబలిమి నిరతిశయమని ద్యోతితము. అలం. వ్యతిరేకధ్వనియు కావ్యలింగమును.

తే. ప్రబలకోలాహలాహార్యపతనరుద్ధ, విపులశుక్తిమతీమగ్నవిపుల నతని
చరణనఖరేఖ సంవర్తసమయజలధి, నుద్ధరించినకిటిదంష్ట్రయొఱపుఁ దెలిపె. 119

అ. అతని = ఆ వసురాజుయొక్క, చరణనఖరేఖ = రేఖాకృతిగల పాదనఖము - కాలిగోరు, ప్రబల = బలిష్ఠమయిన, కోలాహల అహార్య=కోలాహల పర్వతముయొక్క, పతన = పడుటవలన, రుద్ధ=అడ్డగింపఁబడిన, విపుల=విరివియైన, శుక్తిమతీ=శుక్తిమతీ నదియందు, మగ్న=మునిఁగియున్న, విపులకున్=భూమికి, 'విపులాగహ్వరీధాత్రీ' అమ. సంవర్తసమయజలధిన్ = ప్రలయకాల సముద్రమువలననుండి, ఉద్ధరించిన=పయికెత్తిన, కిటిదంష్ట్ర=యజ్ఞవరాహమూర్తి కోఱయొక్క, ఒఱపున్=రీతిని, తెలిపెన్=ప్రకటించెను. ఇట ప్రలయకాల సముద్రమునకును శుక్తిమతీనదికిని వరాహదంష్ట్రకును వసురాజపాద నఖమునకును ఉపమానోపమేయభావమని విచారింపవలయును; కాన యలంకార ముపమ.

చ. బలరిపుమిత్రుఁడై నయలపార్థివతల్లజు పాదపల్లవో
జ్జ్వలనఖరేఖదండ నగమండవిఖండనచండిమంబు తా

వలమునఁ నభ్యసించెనొకో వజ్రము రాజశిరోవిభాగ భా
గలఘు కిరీటవజ్రకళికాకృతి నిచ్చలు నాశ్రయించుచున్. 120

అ. వజ్రము=వజ్రాయుధము, 'వజ్రోఽస్త్రీ హీరకే పవౌ' అమ. రాజ...కాకృతిన్ — రాజ=సామంతరాజులయొక్క, శిరోవిభాగ = శిరఃప్రదేశములను, భాక్=పొందిన, అలఘు = అలఘువుము లైన, కిరీట=కిరీటములందలి, వజ్రకళికాకృతిన్=మొగ్గలుగాఁ దీర్పఁబడిన వజ్రమణి స్వరూపముచేత, నిచ్చలున్=నిరంతరమును, ఆశ్రయించుచున్=ఆశ్రయించినదై, బలరిపుమిత్రుఁడు=దేవేంద్రునికి స్నేహితుఁడు, ఐన...చండన్ — ఐన=అయినట్టి, అలపార్థివతల్లజ=రాజశ్రేష్ఠుఁడయిన యావసురాజుయొక్క, పాదపల్లవ=చిగురుటాకులవంటి పాదములను, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, నఖరేఖ=రేఖాకారమయిన నఖముయొక్క, చెండన్=సమీపమందు, నగ..చండిమంబు — నగమండ=పర్వతసమూహములయొక్క, విఖండన=భేదించుటయందలి, చండిమంబు = తీక్ష్ణత్వమును, తాలమునగఁ = స్థిరమానట్లుగా, అభ్యసించెనొకో = నేర్చుకొనెనేమో, అనఁగా వసురాజుయొక్క పాదనఖము పర్వతభేదము చేసినది గనుక వజ్రాయుధమును వన కాసామర్థ్యము లభించుకొఱకు సామంతరాజమకుట సంఘటితవజ్రకళికారూపముచేత నాశ్రయించి యావసుపాద నఖసన్నిధానమందుఁ బర్వతసమూహభేదన పాండిత్యమును, నేర్చుకొన్నట్లున్నదని తాత్పర్యము. ఇట్లు చెప్పుటచేత, వసురాజు కాలిగోటిచేతఁ బ్రబలమయిన పర్వతము నెగమీటిన మహాబలవంతుఁ డనియు సామంతరాజులు నిరంతర మతనికిఁ బాదప్రణామము చేయుచుందురనియుఁ దెలియుచున్నది. అలంకార ముత్ప్రేక్ష.

'నిచ్చలున్ ఆశ్రయించుచున్' రాజులు ఎడతెగక మ్రొక్కుచుందురు గాన వజ్రము వారి కిరీటములనుండి ఎప్పుడును రాజు పాదనఖమును ఆశ్రయించుచుండుట గలిగినది. అంతటివిద్యకు అట్టి సేవచేయవలయును. కావుననే యభ్యసించుట 'తాలమున'. 'కళికా' మొగ్గలవలె మొనసియుండుట రాజపాద నఖ స్పర్శసౌకర్యమునకు; మఱి వజ్రాయుధసారూప్యప్రయుక్తమైన తాదాత్మ్యసంభావనకు 'బలరిపుమిత్రుఁడు' అనుమైత్రియ తదాశ్రయణాదిసౌకర్యమునకు మూలము.

చ. ఘనుఁ డతఁ డేఁగుదెంచి సరి గద్దియ నుండ నగారి శైలఖం
డనకథ చారణాళి పొగడన్ నిజ సన్నుతి కోసరించునే
ర్పునఁ దలవంచి పీఠతటరూఢమణిన్ బొటవ్రేల మీటు న
య్యనఘుఁడు కొండ మీటినమహాద్భుతకృత్యము దెల్పు కైవడిన్. 121

అ. ఘనుఁడు=గొప్పవాఁడయిన - గుణాధికుఁడయిన యనుట, అతఁడు = ఆవసురాజు, ఏఁగుదెంచి=వచ్చినవాఁడై, సరిగద్దియన్ ఉండన్ =తనకుసమానమగు గద్దెమీఁదఁ గూర్చుండఁగా, నగారి=పర్వతద్వేషియగు యింద్రుఁడు, శైలఖండనకథ=తాను పర్వతములను ఖండించినకథను, చారణాళి=స్తోత్రపాఠకసమూహము, పొగడన్=స్తోత్రము చేయుచుండఁగా, నిజసన్నుతికిన్ =ఆత్మస్తుతికి-తన్నుఁబొగడుటకు, ఓసరించు నేర్పునన్=సహింపని యట్లుగాఁ దోఁచునట్టి నేర్పుతో, అనఁగా సహింపలేదన్న మిష చేతననుట, తలవంచి=తలవంచుకొని, పీఠ...మణిన్ — పీఠతట = గద్దెపీఁటయొక్క దరియందు, రూఢ=స్థాపింపఁబడిన, మణి=ఒకరత్నమును, బొటవ్రేలన్ మీటున్ =కాలిబొటనవ్రేలితో మీటును, ఏమి తాత్పర్యముచేత ననఁగా— అయ్యనఘుఁడు = నిర్దోషుఁడయిన యావసురాజు, కొండమీటిన = కోలాహలపర్వతమును కాలితో నెగమీటిన, మహాద్భుతకృత్యమున్ = అత్యాశ్చర్యకరమయిన కార్యమును, తెల్పుకైవడిన్=తెలియఁ జేయునట్లుగా, పీఠతటరూఢమణిని బొటనవ్రేలుమీఁటునని సంబం

ధము. అనఁగా దివ్యవిమానారూఢుఁడయి స్వర్గమునకుఁబోయి దేవేంద్రునితోఁగూడ సరిగద్దియపయిం గూర్చుండినపుడు దేవేంద్రుఁడు పర్వతముల భేదించిన కథను చారణులు కైవారము చేయుఁగా, ఆత్మ స్తుతికి లజ్జించినవానివలెఁ దలవంచుకొని బొటనవ్రేలితో పీఠసార్శ్వమందున్న రత్నమును మీటు చుండుట 'ఈవసురాజు కీర్తిని బొటనవ్రేలిగోటిచేఁ బర్వతమును మీటి వైచినాఁడు; ఇట్టి మహాబలుని సన్నిధానమందు నేను వజ్రాయుధముచేఁ బర్వతభంజనము చేసిన కథ నేమిగొప్పయని పొగడె దరు? కాఁబట్టి పొగడవల' దని తెలియఁజేసిన యభినయవ్యాపారముగా నుండెనని యాశయము. ఇట లజ్జానుభావము చేత బొటనవ్రేలిగోటితో పీఠమును రాయుటను వసురాజ కృతపర్వతోత్పాటనకృత్య ము నివేదించుటగా నుత్ప్రేక్షించుటచే నలంకార ముత్ప్రేక్ష. సూక్ష్మాలంకారమును.

మ. అనఘాత్మీయపదోపకంఠమునఁ బ్రాణాచారముం బూనురీ
తి నితాంతానత శృంగమై నిభృతమై దిక్కేది యక్కోలుండ యుం
డినఁ గొన్నాళ్లకుఁ గేళిశైలముగఁ బాలించెన్ మహీజాని మ
న్ననఁ దచ్ఛైలశిరంబుపై మృదుపదన్యాసంబు గావించుచున్. 122

అ. అక్కోలుండ=ఆకోలాహలపర్వతము, అనఘ...కంఠమునన్—అనఘ=కల్మషరహితమయిన, ఆత్మీయ=స్వకీయమైన, పద=పాదములయొక్క, ఉపకంఠమునన్=సమీపమందని యర్థము. ఆత్మీయమైన, పద=స్థానమగు పట్టణముయొక్క సమీపమందని భావము. ప్రాణాచారముం బూనురీతిని=ప్రాణాచారము పట్టినట్లుగానే, 'ప్రాణాచారశబ్దము' బృహదభిధానశబ్దకల్పద్రుమాదికోశములందుఁ గానరాదు. దీనికిఁ బ్రాయోపవేశమని శబ్దరత్నాకరమునను న్నది. నితాంత...శృంగమై—నితాంతి=మిక్కిలియు, ఆనత=వంపఁబడిన, శృంగమై=శిఖరముగలదై, నిభృతమై=నిశ్చలమైనదై, దిక్కు ఏది=దిక్కు చెడి, అక్కోలుండయుండినన్=ఆకోలాహలపర్వతము ఉండఁగా, కొన్నాళ్లకున్=కొన్ని దినములమీఁద, మహీజాని=వసురాజు, (మహీజాయాఅస్యేతి మహీజానిః 'జాయాని జేతి సమాసాన్తోనిజాదేశః') మన్ననన్=ఆదరముచేత, తచ్ఛైలశిరంబుపైన్=ఆపర్వతశిరోభాగముమీఁద, మృదుపదన్యాసంబున్=మృదువయిన పాదవిన్యాసమును, కావించుచున్=చేయుచు - మెల్లని నడలనడచుచును, కేళిశైలముగన్=క్రీడాపర్వతముగా, పాలించెన్=అంగీకరించెను. ఇందు నితాంతానతశృంగత్వ నిభృతత్వానన్యగతికత్వాదులు ప్రాణాచారలక్షణములని తెలియునది. ఉత్ప్రేక్షాలంకారము.

ఉ. ఆనరలోకపాలకు మహామహనీయ భుజోపగూహన
శ్రీ నిరవొందుచుం బుడమిచేడియ గోత్రము లూరడిల్ల సం
తానసమృద్ధిచే శుభవితానము తానసి మయ్యె నేకసం
తానము గన్నదై నతవితాంసపురిం బురణించి నవ్వుచున్. 123

అ. ఆనర..శ్రీన్—ఆనరలోకపాలకు=ఆవసురాజుయొక్క, మహాత్=అధికమయిన, మహనీయ=ఒప్పుచున్న, భుజోపగూహనశ్రీన్=భుజాలింగన సంపత్తిచే - భుజములతోఁ గౌఁగిలించు పెంపుసొంపుచేతననుట, ఇరవొందుచున్=ఒప్పుచున్—నిలుకడ గలిగి యొప్పుచుననుట, పుడమిచేడియ=భూకాంత, గోత్రములు ఊరడిల్లన్=వంశములు ఊరడిల్లఁగానని యర్థము - కులపర్వతములు భూభరణశ్రమముమాని విశ్రాంతినొందఁగానని భావము. సంతాన సమృద్ధిచేన్=సంతాన పరంపరలచేత నని యర్థము - సప్తసంతాన సమృద్ధిచేతనని భావము. ఏకసంతానము గన్న = ఒక్కసంతునుగన్న-

ఒక్కకొడుకు కొడుకుఁగాఁడన్న సామెతచొప్పున నొకసంతు గలిగి కదలి సంభవ్యప్పున, వైజయంతపురిన్ = దేవతాశ్రేష్ఠుని, ఇంద్రునిపట్టణమయిన స్వర్గమును, పురణింపఁ బుష్పమాలిన్ = వెలసేఁగి సహవాసము చేయుచు, శుభవితానము తానకము అయ్యెన్ = శుభసమూహమునకు అస్పదమాయెనని యర్థము. స్వర్గమందు సంతానవృక్ష మొకటియే యున్నదని భావము.

భూమియనెడికాంత ఆరాజును జేపట్టి యతనిభుజాశ్రితగుణము వంపుసొంపున నిజవంశము వారెల్ల లలసిల్లఁగా పెక్కుసంతతులనుగాంచి మఱియు ననేకములగు [illegible] స్త్రీలను బరిహాసించినదని ప్రకృతార్థము. రాజు భూమిని నిజభుజాదండమునఁ దాల్పఁగా, ఆనఁగా దాని బాలనముసేయఁ బూనఁగా, కులపర్వతములకు విశ్రాంతిగలిగినదనియు [illegible] సప్తసంతానములు వెలిసెననియు, మఱియు ననేక శుభపరంపరలు వ్యాపించెననియుఁ దాత్పర్యము. 'సన్తానస్సన్తతౌ గోత్రే స్యాదపత్యే సురద్రుమే' విశ్వ. ఇట భూమిని భుజగలం దాల్చుటను భుజగములచేఁ గౌఁగిలించుటగా నధ్యవసించుటచేత అతిశయోక్తి. పరపురుషుని వాత్సల్యమును నపహరించుటచేత వ్యతిరేకము సంతానపదగతశ్లేషోత్థాపితము. పురుషుని 'చేపట్టు' యనుటంబట్టి గొప్పవాడుఁ జేపట్టిన దానివలనఁ గులమువారు [illegible] సంతానశుభపరంపరపరల నంది సామాన్యస్త్రీల నతిశయించు [illegible] వృత్తాంతము స్ఫురించుటచే సమాసోక్తియు.

క. అగితి నభిమతభోగ, శ్రీగలభువి కొసఁగె నుల్లసితపత్రలతా
సౌగంధ్యము నవకలికా, సౌగంధ్యముఁ జైత్రలక్ష్మి సైరంధ్రియునై. 124

అ. చైత్రలక్ష్మి = వసంతలక్ష్మి, అగితిన్ = పూర్వోక్తప్రకారముగ, అభిమతభోగశ్రీ = అభీష్టసుఖసంపత్తి, గలభువికిన్ = గలిగిన భూకాంతకు, సైరంధ్రియునై = సైరంధ్రివలె - (సైరంధ్రియనఁగా బాతివ్రత్య హానిలేకుండఁ బరగృహమందు స్వాధీనురాలై యుండి రాజకన్యలకు మకరికాపత్రరచనాది కృత్యములాచరించునట్టి స్త్రీ), 'సైరన్ధ్రీ పరవేశ్మస్థా స్వవశా శిల్పకారికా' అమ. ఉల్లసిత... సౌగంధ్యము — ఉల్లసిత = వికసించిన, పత్రలతా = తీఁగెలుగా వ్రాయఁబడు మకరికాపత్రరచనలయొక్క, సౌగంధ్యము = సంబంధసహితత్వము అని యర్థము. ఆకులయొక్కయు తీఁగెలయొక్కయు సంబంధసహితత్వమని భావము. గంధమనఁగా సంబంధము. సంబంధసహితమయినది సగంధము సగంధభావము సౌగంధ్యమని తెలియునది. 'గన్ధో గన్ధక ఆమోదే లేశే సంబన్ధ గర్వయోః' విశ్వ. నవ... సౌగంధ్యము — నవకలికా = క్రొంచెముగా వికసించిన మొగ్గలయొక్క, సౌగంధ్యమున్ = సౌరభ్యమును, ఒసఁగెన్ = ఇచ్చినదాయెను.

భూమియందు వసంతర్తువు ప్రవేశించి వృక్షలతాదులను జిగిరింపఁజేసి పుష్పింపఁజేసెనని తాత్పర్యము. వసురాజునుజేపట్టి యభిమతభోగము లనుభవించుచున్న రాజ్ఞియగు భూమియను కాంతకు చైత్రలక్ష్మియనెడి సైరంధ్రి మకరికా పత్రరచనలును దీర్చి క్రొత్తమొగ్గల దండలను తావులు గుబాళింపఁగా నలంకరించెనని ప్రకృతార్థము. 'అభిమతభోగశ్రీగల' మహారాజును జేపట్టి అభీష్టభోగసౌభాగ్యముగల రాజ్ఞి గావుననే చైత్రలక్ష్మి సైరంధ్రీవ్యాపారము చేసినదనుట. 'అభిమతభోగశ్రీగల' అను విశేషణము హేతుగర్భమగుటచే కావ్యలింగమును శ్లేషానుప్రాణితమైన ఉపమయు నలంకారములు. 'శ్రీగల'యనుచో ప్రథమమీది పరుషములకుఁ గసడదవలు బహుళ మనుసూత్రముచేత గకారమువచ్చినది గాన ప్రాసముగాఁ జెప్పినాఁడు. ఇది సంధిగతప్రాస మనఁబడును.

గీ. 'సంధిగూడిన వ్రాలు ప్రాసంబులైన, నవియె సంధిగతాఖ్యల నలరుచుండు
దివిజులాశ్చర్యమొంద శౌరి కడవైచెఁ, జెంగిపోనీక మధురలో నంగరి నన'. అప్పకవి.

సౌగంధ్య సౌగంధ్య శబ్దములకు

ఉ. వింధ్య మధిత్యకాకటకవిస్ఫుటపాదపపుష్పగుచ్ఛసౌ
గంధ్యము హేమధాతుమయకల్పితసంధ్యము బద్ధ మేరుసౌ
గంధ్యము చండకేసరినికాయనిరాకృతభద్రదంతిద
ర్పాంధ్యముఁ గ్రుంగఁ గ్రొక్కెడి మహాగుణభూషణ సత్యభూషణా. రామాభ్యుదయము.

సీ. లలనాజనాపాంగ వలనావసదనంగ, తులనాభికాభంగ దోఃప్రసంగ
మలసానిలవిలోల దళసాసవరసాల, ఫలసాదరశుకాల పనవిశాల
మలినీగరుదనీక మలినీకృతధునీక, మలినీ సుఖితకోక కులవధూక
మతికాంత సలతాంత లతికాంతరనితాంత, రతికాంతరణతాంత సుతనుకాంత

తే. మకృతకామోదకురవకా వికలవకుల, ముకులసకలవనాంత ప్రమోదచలిత
కలితకలకంఠకులకంఠ కాకలీవి, భాసురము వొల్చు మధుమాసవాసరంబు.

అ. లలనా...ప్రసంగము—లలనాజన=స్త్రీజనముయొక్క, అపాంగ=క్రేఁగంటిచూపులయొక్క, వలన=చలనమందు, అవసత్=నివసించినవారును, అనంగ=మన్మథునితోడ, తులన=సమానధర్మముగలవారును, అగు, అభిక=కాముకులయొక్క, 'కమనః కామనోఽభికః' అమ. అభంగ=అంతరాయములేని, దోఃప్రసంగము=ఆలింగన ప్రచారములు గలదియు, లలనాజనులయపాంగములందు వసించువారనఁగా నాయపాంగములు వారిపై మిక్కిలి పొలయుచుండుననుట. శృంగారరసప్రేరితములును భావసూచకములు నగుటచేఁ జూపు లపాంగప్రయుక్తములని తెలియునది. 'అవసత్' అనుటచే దృష్టినైరంతర్యమువలని మోహాతిశయము వ్యంజితము. 'ముగ్ధాఙ్గనా పాఙ్గతరఙ్గితాని' ఇత్యాదులంబట్టి స్త్రీల కడకంటి చూపులు మిక్కిలియు మారోద్దీపకములు గాన అభికులదోఃప్రసంగము లభంగముగాఁ గలుగుట. మన్మథునితోడ సమానధర్మము గలకాముకులనఁగా మన్మథునివలె (మిక్కిలి చక్కనివారై) స్త్రీలను మోహింపఁజేయునట్టి వారనుట. వారలకు అభంగమయినదోః ప్రసంగమనఁగా మిక్కిలి చక్కనివారగుటచే స్త్రీలు తమంతట వారినిపిలచి యాభిముఖ్యము నెఱపుటచే వారు వారిని గౌఁగిలించువిషయమున భంగము అనఁగా అడ్డిలేకుండునని యాశయము. అనఁగా వసంతర్తు మన్మథోద్దీపకమయినది గనుక స్త్రీల యపాంగములపుడు శృంగారరసప్రేరితములును మారోద్దీపకములునయ్యెననియు కాముకులు కాముకురాండ్రు నేయడ్డియులేక నిచ్చలు క్రీడించిరనియుఁ దెలియునది.

అలసా...విశాల—అలస=మందగతిగల - మెల్లగా వీచునట్టి, అనిల=వాయువుచేత -అనఁగా మలయమారుతముచేత, విలోల=మిక్కిలియు చలించుచున్న, దళ=చిగురుటాకులుగలవియు, ససాసవ=మకరందముతోఁ గూడినవియు, అగు, రసాల=తియ్యమామిడి చెట్లయొక్క, 'ఆమ్రశ్చూతో రసాలోఽసౌ' అమ. సాదర=ఆదరముతోఁ గూడికొన్న, శుక=చిలుకలయొక్క, ఆలపన=ఆలాపముచేత, విశాల=విస్తారమయినదియు, మందమారుతములు పొలసినవనియు, తియ్యమామిడి చిగిర్చి పండ్లుపడి ఫలరసములు దొరకినవనియు నందలి పండ్లయందలి యాదరమున చిలుకలు వానినిమెసవి కలకలపలుకులు మిక్కిలియుఁ బలికినవనియు నర్థము.

అలినీ...వధూకము—అలినీ=ఆఁడుతుమ్మెదలయొక్క, గరుత్=ఱెక్కలయొక్క, అనీక=సమూహముచేత, మలినీకృత=నల్లనివిగాఁ జేయఁబడిన, ధునీ=నదీసంబంధులయిన, కమలినీ=తామరతీఁగలయందు, సుఖిత=సుఖఁబున్న, కోకకుల వధూకము=చక్రవాక స్త్రీలు గలదియు, అప్పుడు నదు

లందు తామరతీఁగలు గోముగాఁ బూచుటచే వానిని తుమ్మెదలు జొంపములుగొని గ్రమ్మియుండెననియు ఆతామరతీఁగలయందుఁ జక్రవాకములు సుఖముగా నుల్లసిల్లుచుండెననియుఁ దాత్పర్యము.

అతికాంత... కాంతము—అతికాంత=అత్యంత మనోహరములయిన, సలతాంత=పుష్పసహితములైన, లతికాంతర=తీఁగ యిండ్లలోపల, నితాంత=ఎడతెగని, రతికాంతరణ=మన్మథయుద్ధమందు, తాంత=అలసిన, సుతనుకాంతము=స్త్రీ పురుషులు గలదియు, పూఁబొదరిండ్లయందు స్త్రీలును బురుషులును ఎడతెగక రతికేళి సలుపుచుందురని యాశయము. ప్రథమపాదమున కాముకులయుఁ జతుర్థపాదమున దంపతులయు రతివ్యాపారము వర్ణితమని తెలియునది.

అకృతక... విభాసురము—అకృతక=కృత్రిమముగాని-అనఁగా స్వభావసిద్ధమయిన, ఆమోద=పరిమళముగల, కురవక=గోరంటపుష్పములుగలిగినవియు, అవికల=విచ్ఛిన్నములుగాని, వకుళ = పొగడచెట్లయొక్క, ముకుళ = మొగ్గలుగలిగినవియు, అగు, సకల=సమస్తములయిన, వనాంత=వనమధ్యములందు, ప్రమోద=సంతోషముచేత, చలిత=సంచరించుచున్న, కలిత=ఒప్పినవి యగుచున్న, కలకంఠ=కోయిలలయొక్క, కుల=సమూహముయొక్క, కంఠకాకలీ = కంఠసంబంధమయిన యవ్యక్త మధురధ్వనిచేత, భాసురము=ప్రకాశించుచున్నదియు అగు, మధుమాస వాసరంబు=వసంత వాసరము, పొల్చెన్=ప్రకాశించును, గోరంటలు పూచినవనియు పొగడలు మొగ్గదొడిగినవనియు కోయిల లవ్యక్తమధురధ్వనులు గావించిరనియుఁ దాత్పర్యము. ఇందు సీసము ప్రతిపాదమును నాలుగంత్యానుప్రాసములు గలిగియున్నది. కోయిలలు వసంతర్తువుననే కూయుదురందురు.

చ. ఒనర హిమావకుంఠనము లూడ్చి తెమల్చిన పత్త్రిభంగముల్
సన నసియాడుచుం మొగడచన్నులు పల్లవపాణిఁ గప్పునూ
తన లతికాలతాంగుల నుదారగతిం జలివాపి నెయ్యపుం
బెనఁకువ నేర్పె దక్షిణసమీరణుఁ డొయ్యనఁ దావు లంటుచున్. 126

అ. దక్షిణ సమీరణుఁడు=దక్షిణవాయువనెడు దక్షిణనాయకుఁడు, ఒనరన్ = ఒప్పిదమగునట్లుగా, హిమావకుంఠనములు—హిమ=మంచనెడు, అవకుంఠనములు=పయి ముసుంగులను, ఊడ్చి=విడఁదీసి, తెమల్చిన... భంగముల్—తెమల్చిన = కదల్పఁబడిన, పత్త్రభంగముల్=భంగములనఁగా పరంపరలును రచనలును, పత్త్రపరంపర లనెడుకస్తూరికా పత్త్రరచనములు, చనన్=పోవుచుండఁగా - చెదరుచుండఁగా ననుట. భంగశబ్దము పరంపరావాచకమగుటకు 'శిలావిభఙ్గైర్మృగరాజశాబ, స్తుఙ్గం నగోత్సఙ్గమి వారురోహ' (రఘు) అని. యాడుచున్=అల్లలాడుచు- మెల్లగా పడఁకుచు 'అసి' యనుట 'అసికోఁతలు' ఇత్యాదులందు ఈయర్థకముగాఁ జూపట్టుచున్నది. మొగడచన్నులు=పూమొగ్గ లనెడుపాలిండ్ల చన్నులను, పల్లవపాణిన్=చిగురుటాకులనెడి హస్తములచేత, కప్పు... లతాంగులన్—కప్పు=ఆచ్ఛాదించుచుండెడు, నూతన=క్రొత్తవయిన, లతికా=తీఁగలనెడు, లతాంగులన్ = స్త్రీలను - అనఁగా నవోఢలను, ఉదారగతిన్=ఉదారశబ్ద మతిశయమందును దాతయందును వర్తించును. 'ఉదారో దాతృమహతోః' అని. గనుక అతిశయగతి యనెడు ముక్తాహారాది ప్రదానముచేత, చలివాపి=చలిని బోఁగొట్టియనియును వడఁకును బోఁగొట్టియనియు నర్థము. ఒయ్యనన్=మెల్లఁగా, తావులు అంటుచున్=తావులనగా వాసనలును స్థానములును, వాసనల నంటుచు ననియుఁ గళాస్థానముల నంటుచుననియు నర్థము. నెయ్యపుంబెనఁకువ = పెనఁకువయనఁగా నల్లికయును కలయికయు, ఇష్టమయిన యల్లికననియును కలయికననియు నర్థము. నేర్పెన్ = కల్పెను.

ఇట క్రొత్తతీఁగలను నవోఢలుగా వర్ణించినాఁడు. నాయకుఁడు నవోఢ ముసుఁగును విడఁదీసి చిగురుటాకులవంటి చేతులఁ గప్పికొనఁగా దానివడఁకను బోఁగొట్టి, కోరినసొమ్ములు మొదలైనవి యిచ్చి నెయ్యముతియ్యమున బుజ్జగించి రతికేళికి మరుగఁజేయునని నవోఢపరముగా గ్రహించునది. శీతకాలముపోయి వసంతకాలము రాఁగానే మలయమారుతము పొలసి పయిని గప్పియున్న మంచును బోఁగొట్టి, నూతనములయిన తీఁగల నెడలిన యాకులు చెదరునట్లుగా నల్లలార్చుచు, చిగురుటాకులను బూమొగ్గలను బుట్టించి యవి యల్లలాడకుండునట్లు అంతట వానినల్లుకొనునట్లుగాఁ జేసెనని. క్రొత్త తీఁగలపరమయిన తాత్పర్యము. అలం. రూపకముసావయవము పత్రభంగాదిశబ్దములందు శ్లిష్టము. నవోఢా లక్షణము. లజ్జాభర పరాధీనరతిర్నవోఢా.

శ్లో॥ బలాన్నీతా పార్శ్వం ముఖ మనుముఖం నైవ కురుతే
ధునానా మూర్ధానం క్షిపతి వచనం చుమ్బనవిధౌ।
హృదిన్యస్తం హస్తం క్షిపతి గమనారోపితమనా
నవోఢా వోఢారం రమయతి చ సన్తాపయతి చ॥ రసమంజరి.

మ. అలరుంగైదువుజోదు కూరిమి సయిదోడై మాధవశ్రీతపః
ఫలమై యాడుమరుత్కుమారుఁ బ్రియమొప్పం దేనె*నీరార్చి లేఁ
దెలిపూజొంపపుఁబొత్తులం బొదిఁగి ధాత్రీజాతముల్ జోలపా
డె లసత్పల్లవడోల నుంచి కలకంఠీనాదగీతంబులన్. 127

అ. ధాత్రీజాతముల్ = వృక్షములనెడు పెంపుడుఁ దల్లులయొక్క సమూహములు, అలరుంగైదువు...జోడై = పూవు లాయుధముగాఁ గల మన్మథునియొక్క, కూరిమిసయిదోడై = ముద్దుతమ్ముఁడై, మాధవ..ఫలమై—మాధవశ్రీ=వసంత లక్ష్మియనెడు లక్ష్మీదేవియొక్క, 'మాధవస్తు వసన్తేస్యా ద్వైశాఖే గరుడధ్వజే' విశ్వ. తపఃఫలమై=తపస్సునకు ఫలరూపమై, ఆడు=క్రీడించుచున్న, మరుచ్ఛబ్దము వాయువందును దేవతలయందును వర్తించును. 'మరుతౌ పవనామరౌ' అమ. మరుత్కుమారున్=కుమారవాయు వనెడు దేవతా కుమారుని, ప్రియమొప్పన్=ప్రేమాతిశయ మొప్పఁగా, తేనెనీరార్చి = పువ్వుఁ దేనియలచేత జలకమార్చి, లేఁదెలిపూజొంపపుఁ బొత్తులన్ = లేఁతవియైన తెల్లని పూగుత్తు లనెడు పొత్తిగుడ్డలలో, పొదిఁగి = కప్పి, లసత్..డోలన్—లసత్=ఒప్పుచున్న, పల్లవ=చిగురుటాకులనెడు, డోలన్ ఉంచి=తొట్లలోఁ బరుండఁబెట్టి, కలకంఠీ నాదగీతంబులన్-కలకంఠీనాద=ఆఁడు కోవెల నాదము లనెడు (అవ్యక్తమధుర కంఠధ్వనిగల స్త్రీలయొక్క), గీతంబులన్ = పాటలచేత, జోలపాడెన్=జోలపాడెను. 'ధాత్రీ స్యాదుపమాతాపి క్షితిరప్యామలక్యపి' అని విశ్వము.

'అలరు..సైదోడు'- వసంతమందు మన్మథుఁడు తోడ మలయమారుతమును పొడగుటచే మన్మథునకు తమ్ముఁడయ్యెను. 'కూరిమి'-మన్మథునికి అనఁగా మన్మథోద్దీపనమునకు - అనుకూలమైనది గాన యీగారాము. 'మాధ..ఫలము'- వసంతపు సొంపునకు మిక్కిలి పెంపుగూర్చునది గాన దాని తపఃఫలము. 'మాధవ శ్రీ శబ్దములచే మాధవశ్రీలకు (అనఁగా లక్ష్మీ విష్ణువులకు) పుత్రుఁడగు మన్మథుని తమ్ముఁడు గాన వారికిని తపఃఫలమైన బిడ్డఁడగునని సారస్యము. 'తేనెనీరార్చి'-గాడ్పుయొక్క చల్లఁదనమునకు. 'లేఁదె...పొదిఁగి'- దానియొక్క తావికి. 'ప్రియమొప్పన్' గొప్పజోదునకు గారాపుఁదమ్ముఁడు గాన యీప్రియము. మఱిగొప్పకాంత తపస్సులుచేసి కన్న బిడ్డఁడు. అందును 'మరుత్' దేవకుమారుఁడు కావున నే

* 'దేనెనోలార్చి పెందెలి' పాఠా.

యీ యల్లారుముద్దు. వసంతము రాఁగా మన్మథుఁ డుద్దీపించెను. అందులకుఁ దోడుగా మలయమారుతమును వసంతము సొంపు పెంపార వీచుచుఁ బూఁదేనెల నొలికించుచు పూగుత్తులం బొచ్చి తావులు గొల్లలాడుచుఁ జిగుళ్లనల్లలార్చుచు ఆఁడుకోవెల లింపయినరవములు సేయఁగాఁ జెట్లచాలునఁ బొలయుచుండె నని తాత్పర్యము. అలం. రూపకము సావయవము 'అలరుం... కుమారుఁ' డనుచో విశేషణములు సాభిప్రాయములును మీఁది మరందస్నానాదులకు సాధకములును గాన పరికరమును గావ్యలింగమును.

సీ. మును సుమనోరాగమున వసంతము సూపెఁ, గాననేందిర యశోకంపుఁగొమ్మ
కాకొమ్మ నగుచు నెయ్యమునఁ గ్రొన్ననతేనె, మొలఁగెడు సరసాళిమీఁదఁ జల్లె
నాసరసాళి సోయగపుఁ బాటలతోడఁ, జని మాధవి ప్రవాళశాటిఁ దుడిచె
నామాధవి పరాగ మక్షిరాగము మించఁ, బరతెంచు పికకంఠిపై విదిర్చె
తే. నిట్లు లతికలు హితకోటిఁ గనసి యపుడు, మదనదేవోత్సవ క్రీడఁ బొదలు ననిన
వరులుఁ దరుణులు విరులయోకవగల వఱలు, సిగుల వలరాచజాతరల్ సేయుటరుదె.

అ. కానన+ఇందిర=వనలక్ష్మి అనెడు ఒకానొక స్త్రీ, మును=ముందుగా, అశోకంపు కొమ్మకున్=అశోకవృక్షపు కొమ్మ యనెడు శోకరహితయైన యొక స్త్రీకి, సుమనోరాగమునన్ = మిక్కిలి గొప్పదైన మనస్సునందలి యనురక్తిచేత, లేక కుసుంబాపువ్వులయొక్క పుప్పొడిచేతనని యర్థము. సుమనస్సనఁగా పువ్వు - రాగమనఁగా ఎఱుపు, గనుక పువ్వుల యెఱుపని భావము, వసంతము సూపెన్ = వసంతమనఁగా వివాహాదులందు వేడుకగా నొండొరులమీఁదఁ జల్లుకొనెడి యెఱ్ఱని యొకరంజక ద్రవ్యము; అది తెలుపుగా నెఱ్ఱనయి యుండును; అట్టివసంతమును కనఁబఱిచెను - వసంతము చిలికె ననుట. వసంతర్తు ధర్మమును కనఁబఱిచెనని భావము. వసంతమును మిక్కిలి యనురాగముచేతఁగాని యెఱ్ఱని రంజక ద్రవ్యముచేతఁగాని చేయఁబడును గాన సుమనోరాగమనుటకు మంచి మనస్సుయొక్క యనురాగముచేత ననికాని కుసుంబా మొదలయిన యెఱ్ఱనిపువ్వుల యెఱుపుచే అనఁగా నెఱ్ఱని రంజక ద్రవ్యముచే ననికాని యర్థము గ్రాహ్యము 'సుమనోరాగశబ్ద' ముభయార్థములందును లాక్షణికము 'కాననేందిర' ఏకదేశవర్తిరూపకము. 'అశోకంపుఁగొమ్మ' శ్లిష్టరూపకము.

ఆకొమ్మ = ఆ యశోకపుఁగొమ్మ, నగుచున్ = పరిహాసము సేయుచు, నెయ్యమునన్ = స్నేహముచేత, క్రొన్ననతేనె = క్రొత్తపూవుఁదేనియ, మొలఁగెడు ... మీఁదన్ — మొలఁగెడు=తిరుగుచున్న, సరసాళి మీఁదన్ - సరస+అళి యనియు సరస+ఆళి యనియు విసంధి గ్రహింపవలయును - సరసమైన తుమ్మెదయనెడు సగకురాలయిన చెలిమీఁద, చల్లెన్ = చల్లెను. 'నగుచున్ నెయ్యమునన్' అను రెండుపదములందును లక్ష్యార్థమునకు ముఖ్యార్థముచేత నభేదాధ్యవసాయము.

ఆసరసాళి=సరసమైన తుమ్మెదయనెడి సగకురాలయిన యాచెలి, సోయగపు పాటలతోడన్ = ముద్దుగులికెడి పాటలు పాడుచుననుట, చని=పోయి, మాధవి ప్రవాళశాటిన్ =మాధవి యనఁగా బండిగురివెందతీఁగ - ఆతీఁగయనెడి మాధవనామముగల యొకానొక స్త్రీయొక్క, ప్రవాళశాటిన్ =ప్రవాళమనఁగా చిగురుటాకు-అది యనెడు వస్త్రముచేత, తుడిచెన్ =ఆపూఁదేనెను దుడిచివైచెను. 'క్రొన్ననతేనె సోయగపుఁ బాటలు' ఈరెండు పదములు నుభయత్రసాధారణములు.

ఆమాధవి=అనఁగా బండిగురువెందతీఁగ యనెడు మాధవి నామముగల స్త్రీ, పరాగము=అనఁగా రంజకద్రవ్య విశేషము అని యర్థము- పుప్పొడియని భావము. అక్షి... విదిర్చెన్ =స్వాభావికమయిన కంటిరక్తిమ మించుచుండఁగాఁ బరుగెత్తి వచ్చుచున్న యాఁడుకోవెలమీఁద విదలించె ననియును,

త్వరితముగా వచ్చుచున్న యవ్యక్తమధురకంఠస్వరముగల స్త్రీమీఁదఁ గన్ను లెఱ్ఱఁబడునట్లుగా విదిలించెననియు నర్థము. ఇచట నభేదాధ్యవసాయము చేయవలయును.

ఇట్లు=ఈప్రకారముగా, లతికలు=తీఁగలు, హితకోటికిన్ ఎనసి=ఇష్టసమూహమును గలసికొని, అపుడు=ఆవసంతఋతువునందు, మదనదేవోత్సవక్రీడకున్ పొదలుననినన్ = మన్మథదేవతా సంబంధియైన యుత్సవక్రీడచేత నొప్పుచుండునని చెప్పుచుండఁగా, వరులున్ తరుణులున్=పురుషులును స్త్రీలును, విరుల యొవరులన్=పూవుచప్పరములందు, వఱలుచిరులన్=ప్రకాశించుచుండెడు పెంపుసొంపులచేత, వలరాచజాతరల్=మన్మథోత్సవములను, చేయుట అరుదె=చేయుట యొకయాశ్చర్యమా - ఆశ్చర్యము గాదనుట. 'చేయుటుఱదె' యను పాఠమున చేయుటతగదా - తగునని యర్థము. అలం. శ్లేషము. అర్థాపత్తి.

మ. అరిగాఁ బంచమ మేవగించి నవలాశ్రీలవ్వేళ హిందోళవై
ఖరి సూపం బికజాత మాత్మరవభంగవ్యాకులం బై వనీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుల్ తాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్. 129

అ. నవలాలు=స్త్రీలు, ఇది దేశ్యపదము గనుక హ్రస్వము రాదయ్యె. 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాన్న చదేశ్యపదే నచైకవర్ణేపి' అని నన్నయ భట్టీయము. అవ్వేళన్=ఆవసంతము లోలుత, అరిగాన్ పంచమము ఏవగించి = కోవెలలకుఁ బ్రతికూలమానట్లుగాఁ బంచమస్వరమును రోసి యని యర్థము 'పికః కూజతి పఞ్చమమ్' అని పంచమము పికరాగముగా తెలియునది. 'రి' అనఁగా ఋషభస్వరమునకు సంజ్ఞ గనుక ఋషభస్వర రహితమగునట్లుగా నని భావము. - ఋషభస్వరమును పంచమస్వరమును రెంటిని విడిచి యనుట.

'ప్రథమశ్శ్రవణాచ్ఛబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః
సా శ్రుతి స్సమ్పరిజ్ఞేయా స్వరావయవ లక్షణా ।
శ్రుతిభ్యస్స్యు స్స్వరాష్షడ్జ ర్షభ గాన్ధార మధ్యమాః
పఞ్చమోధైవత శ్చాథ నిషాద ఇతిసప్త తే ॥
తేషాం సంజ్ఞా స్సరిగమ పధనీతి స్వరా మతాః' సంగీతశాస్త్రము.

హిందోళవైఖరి సూపన్=హిందోళమనఁగా హిందోళరాగము. అది ఋషభపంచమస్వరములు రెండును గాక కడమ యైదుస్వరములతోఁ గూడుకొన్న ఔడవరాగమనియును, శిశిరఋతువసంతఋతువులయొక్క సంధికాలమందు గానముచేయఁబడునది యనియు సంగీతశాస్త్ర ప్రసిద్ధము గనుక నట్టి హిందోళరాగముయొక్క వైఖరిని గనఁబఱుపఁగా—ఆరాగమును బాడఁగా ననుట.

'శిశిరస్య వసన్తస్య సన్ధౌ హిన్దోళరాగకః
ఔడవః పఞ్చభిః ప్రోక్తః స్వరైష్షడ్భిస్తు షాడవః ।
'సంపూర్ణ స్సప్తభిర్జ్ఞేయః ఏవం రాగా స్త్రిధా మతాః' సంగీతశాస్త్రము.

పికజాతము=కోకిల సమూహము, ఆత్మరవ=స్వకీయమయిన పంచమ స్వరముయొక్క, భంగ=తిరస్కారమువలన, వ్యాకులంబై=విచారముగలదై, వనీధరన్=వనభూమియందు, ఆలంబిత=అవలంబింపఁబడిన, పల్లవ=చిగురుటాకులు గల, వ్రత = నియమముయొక్క, విధులు=విధానములను, తాల్పన్=వహింపఁగా, అనఁగా పర్ణభక్షణము చేసి తపము సలుపఁగా ననుట, తదీయధ్వనిన్=ఆకోకిల సమూ

హముయొక్క రవమును - అనఁగా పంచమస్వరమును, వసంతము=వసంతరాగము, మహాసంపూర్ణభావ ఉన్నతిన్=మహత్తరమయి నింపారినట్టి భావముయొక్క యతిశయముచేత, సరిగాన్=కోకిలకు సమతూలమానట్లుగా నని యర్థము. ఋషభస్వర సహితమగునట్లుగా నని భావము. కైకొనియెన్=అంగీకరించెనని యర్థము. వసంతర్తు ప్రవేశము కాఁగానే స్త్రీలు ఋషభపంచమములతోఁ గూడ సప్తస్వర సహితమయి సంపూర్ణసంజ్ఞగల వసంతరాగమును బాడిరని యాశయము. 'కేచిదౌడవసంపూర్ణాః కేచిత్షాడవపూరణాః । కేచిత్సంపూర్ణరాగాశ్చ' యని 'ఔడవ షాడవ' ములును పంచషట్స్వరపూర్తిచే 'సంపూర్ణ' విశేషణవిశిష్టము లగుటంబట్టె తద్వ్యావృత్తికై సప్తస్వరసహితమైన వసంతరాగమును 'మహా'సంపూర్ణ మన్నాఁడు.

> శ్రీరాగోఽథ వసన్తశ్చ భైరవః పఞ్చమస్తథా । మేఘరాగో బృహన్నాటః షడేతే పురుషాహ్వయాః।
> శ్రీరాగో రాగిణీయుక్తో శిశిరే గీయతే బుధైః । వసన్తస్ససహాయస్తు వసన్తర్తౌ ప్రగీయతే ॥
> భైరవస్ససహాయస్తు ఋతౌ గ్రీష్మే ప్రగీయతే । పఞ్చమస్తు తథా జ్ఞేయో రాగిణ్యా సహ శారదే ।
> మేఘరాగో రాగిణీభిర్యుక్తో వర్షాసు గీయతే । నాటనారాయణో రాగో రాగిణ్యా సహ హైమకే॥
>
> సంగీతశాస్త్రము.

మ. కరఘాతంబుల కోర్వలేక హిమసంఘాతంబు శీతక్షమా
ధరదుర్గంబు భజింపఁగా నలజగత్కంపప్రదాస్తోకభీ
కరదోషాయతిశాలిఁ జుట్టుకొని లగ్గల్పట్టి ఘట్టింతు నం
చరవిందాప్తుఁ డుదీచికేఁగెఁ బ్రబలుండై మాని దాక్షిణ్యమున్. 130

అ. హిమసంఘాతంబు=మంచుయొక్క గుంపు, కరఘాతంబులకున్=ముష్టిదెబ్బలకు, ఓర్వలేక =సహింపలేక యని యర్థము. ఇట దుర్బలవ్యవహార సమారోపము—కిరణముల వేండ్రమునకు తాళలేక యని భావము. శీతక్షమాధరదుర్గంబున్=హిమవత్పర్వత దుర్గమును, భజింపన్=ఆశ్రయింపఁగా నని యర్థము. స్వస్థానము గనుక శీతక్షమాధర దుర్గమును శీతసంఘాతము నాశ్రయించెనని యాశయము. అల=ఆ, జగత్కంపప్రద=జగత్తులకు తొందర నిచ్చుచున్నదియు, అస్తోకభీకర = అధిక భయమును గలిగించునదియు, దోష=పాపముయొక్క, ఆయతి=దైర్ఘ్యముచేత, శాలిన్=ఒప్పుచున్నట్టిదియు నగు దానిని - హిమసంఘాతంబునని యర్థము, జగత్తులను వలిచేత వడఁకించుననియు మిక్కిలి భయంకరమై యుండుననియు దోషాయతిశాలి యనఁగా రాత్రియొక్క దీర్ఘత్వముచేత నొప్పుచుండుననియును భావము. శీతకాలపురాత్రి యెక్కువగానుండుట ప్రకటము. చుట్టుకొని=ఇట్టిసంఘాతమును జుట్టవైచుకొని, లగ్గల్పట్టి = ఆవరణముదాఁటి, ఘట్టింతున్ అంచున్ =మర్దింతుఁగాక యని, అరవిందాప్తుఁడు= కమలములకు హితుఁడయిన సూర్యుఁడు, దాక్షిణ్యమున్ మాని = మోమోటమువదలి యని యర్థము. దక్షిణస్థితత్వమునుమాని యని భావము. ప్రబలుండై=గొప్ప బలము-అనఁగా సేన-గలవాఁడై-ఇట ప్రబల వ్యవహారసమారోపము —వేండ్రమయినవాఁడని భావము. ఉదీచికిన్=ఉత్తరపు దిక్కునకు, ఏఁగెన్= పోయెను. మంచువలన అరవిందములు చెడుచున్నవి గనుక సూర్యుఁ డరవిందాప్తుఁడు గాన మంచును శిక్షింపఁబోవుట యుక్తమనెడి యభిప్రాయమును గ్రహింపవలయును. అలం. 'కర.. భజింపఁగా' హేతూత్ప్రేక్ష. 'భీక...శాలిన్' కావ్యలింగము. 'అరవిందాప్తుఁడు' పరికరాంకురము. 'చుట్టుకొని ...ఏఁగె' హేతూత్ప్రేక్ష లేక సంబంధాతిశయోక్తి.

మ. చివురుం గైదువు వేల్పు చైత్రమున నక్షీణధ్వజోత్క్షేపవై
భవుఁడై తెమ్మెర తేరిపైఁ గదలి రాఁ బ్రత్యగ్రసాలాగ్రహ

ర్మ్యవిటంకంబులు ప్రాఁకి పల్లవజాక్షుల్ సల్లిరుత్ఫుల్లప
ల్లవహస్తంబుల భావిభావుకఫలోల్లాసంబుతోఁ గ్రొవ్విరుల్. 131

అ. ఇందు దేవతారథోత్సవము జరుగురీతిని మన్మథ రథోత్సవమును అలవరించి చెప్పుచున్నాఁడు. చివురుంగైదువు వేల్పు = (చిగురాకు ఆయుధముగాఁగల) మన్మథుఁ డనెడి దేవుఁడు, చైత్రమునన్ = చైత్రమాసమందు, అక్షీణ...వైభవుఁడై—అక్షీణ = తక్కువకాని, ధ్వజ + ఉత్క్షేప = ధ్వజమును ఎత్తుట యనెడు, వైభవుఁడై = విభవము గలవాఁడై - ఉత్సవము ప్రారంభించుటకు ధ్వజారోహణము చేయుదురుగాన మన్మథుఁడును మీనధ్వజారోహణమనెడు పట్టాంబరధ్వజారోహణ వైభవముగలవాఁడయి యనుట, తెమ్మెర తేరిపైన్ = మలయమారుతమనెడి రథముమీఁద, కదలిరాన్ = బయలుదేఱి రాఁగా, పల్లవజాక్షుల్ = తీఁగలనెడు స్త్రీలు, ప్రత్యగ్ర...విటంకంబులు— ప్రత్యగ్ర = క్రొత్తలయిన, సాల + అగ్ర = చెట్లకొనలనెడు, హర్మ్య విటంకంబులు = మేడలపయిభాగములను, ప్రాఁకి = ఆరోహించి, ఉత్ఫు...హస్తంబులన్—ఉత్ఫుల్ల = వికసించిన, పల్లవ = చిగుళ్లటాకు లనెడు, హస్తంబులన్ = చేతులచేత, భావి...ల్లాసంబుతోన్-భావి = మీఁదగలుగఁగల, భావుక = ఒప్పిదమయిన, ఫల + ఉల్లాసంబుతోన్ = పండ్లయొక్క తోఁపిక యనెడి కోరినఫలముయొక్క యొడఁగూడుటతో, క్రొవ్విరుల్ = క్రొత్తగా వికసిన పువ్వులను, చల్లిరి.

లోకమున ఏదేవునికేని తఱచుగాఁ జైత్రమాసమున సంవత్సరోత్సవము జరగించునెడల ముందు ధ్వజారోహణము చేసి పిదప రథోత్సవము జరుగుటగలదు - రథారూఢుఁడై వచ్చు దేవునిమీఁదఁ బుర స్త్రీలు మేడలపయి కెక్కి యారథముమీఁద దోసిళ్లతోఁ బువ్వులు మొదలయినవి చల్లుదురు. ఇచట చైత్రమునవర్తించు వసంతర్తువు మన్మథోద్దీపకమయినదిగాన, యిది మన్మథోత్సవ సమయముగా రూపించి మన్మథునికిఁ జేప పడఁగయు తెమ్మెర తేరు నగుటంజేసి, మీనధ్వజారోహణము నే పట్టాంబరధ్వజారోహణముగాఁ జెప్పి తెమ్మెర తేరిపై వచ్చుటయనెడు రథోత్సవమును బన్నినాఁడు. అపుడు సౌధాగ్రములకు మాఱుగా వృక్షాగ్రములను, అందారోహించిన స్త్రీలకు మాఱుగా ప్రాఁకినలతలనును, స్త్రీలదోసిళ్లకు మాఱుగా లతిలయుత్ఫుల్లపల్లవములనును, వారు పువ్వులు చల్లుటకు మాఱుగా నందు పువ్వులు రాలుటను, వారి కభిమతఫలము మీఁద నొడఁగూడనుండుటకుఁ బ్రతిగా అందు మీఁదఁబండ్లు పండఁగలుగుటనుఁ, గవి నిబంధించినాఁడు. అనఁగా చైత్రమాసికమగు వసంతర్తువున మన్మథుఁడుద్రేకి విజృంభించెననియు, తదుద్దీపకముగా మలయమారుతము వచ్చెననియు, లతలు పెరిఁగి మ్రాఁకులకుఁ బ్రాకి చిగుళ్లు వికసిల్లఁ బువ్వులుపూయఁగా నా తెమ్మెరసోఁకునఁ జిగుళ్లజొంపములనుండి పువ్వులు రాలెననియు, ఇఁకఁ బండ్లు పండఁగలవనియుఁ దాత్పర్యము. వసంతర్తువు తఱచుగా పల్లవకుసుమఫలాదులకుఁ గాలమగుటయట యనుసంధించునది. రథారూఢుఁడైన దేవునకు ఆయుధసన్నాహమునకై 'చిగురుంగైదువు', అని చిగురాకడిదము చెప్పుట సాభిప్రాయము. అలం. రూపకము, సావయవము.

'తెమ్మెర' ఇది 'తెమ్మెరలు'అనియు పూర్వకవిప్రయోగములందు 'తెమ్మెరలెలదీఁగకొనలవఁకిలొత్తు' (ఉద్యోగ. ౨-౧౧౨) దఱచుగాఁ గనుపట్టుచున్నవి. కన్నడమందలి 'ఎలర్' 'ఎరల్' అను పదమునుండి యిది వచ్చినది గానోపు. కాన 'అరులు' 'ఇరులు' 'మరులు' అనుపదములందుంబోలె నిందును 'లు'వర్ణము బహువచనప్రయుక్తముగాక స్వతస్సిద్ధము గావలయు. కాని యిటీవల నిందుంబోలె 'తెమ్మెర నీకంతెమ్మెర' (విజయ) యని 'తెమ్మెర' గానే ప్రయోగములు చూపట్టుచున్నవి.

మ. మహిళామండల మంజులభ్రమరకాకమర్దంబు శ్యామాముఖా

ర్ముహురున్మీలిత పత్రభేదనిపుణాంగంబుం బద్మినీకంకణ
గ్రహణాపాదియునై సగంధవిటపిప్రాప్తిన్ విజృంభించుచున్
విహరించెన్ మధుమత్త గంధవహ మశ్వేళన్ వనాంతంబునన్. 132

అ. పూర్వపద్యమున మన్మథుని విజృంభణమును జెప్పి యిపుడు తదుద్దీపకములలో నొకటియగు మారుతమువిహారణమును ఉద్దీపనానుగుణ లక్షణయుక్తముగా వర్ణించుచున్నాఁడు. అశ్వేళన్ = అశ్వాకాలమందు- వసంత కాలమం దనుట. మధుమత్త గంధవహము—మధు=వసంతమాసమునందు, మత్త=క్రొవ్విన, గంధవహము=వాయువు అని యర్థము. మధు=మద్యముచేత, మత్త=మదించిన గంధవహమని యర్థాంతరము. గంధవహుఁడనఁగా గర్వమును వహించినవాఁడని సాభిప్రాయము. 'గన్ధో గన్ధక ఆమోదే లేశే సంబన్ధగర్వయోః' విశ్వ. ఇఁక సామాన్యముగా వసంత వాయువు గావించు చేష్టితములను మద్యముద్రావిన గర్వాంధుని చేష్టితములనుగా నర్థద్వయము గలుగఁ జెప్పుచున్నాఁడు. మహిళా...మర్దంబు—మహిళా = ప్రేంకణపుఁ దీఁగలయొక్క, 'శ్యామాతు మహిళాహ్వయా, లతాగోవన్దనీ గున్ద్రా ప్రియఙ్గుః ఫలినీ ఫలీ' అమ. మండల=సమూహమందు, మంజుల=సొగసయిన, భ్రమరక=తుమ్మెదలయొక్క, అమర్దంబు=పమ్మర్దము - అనఁగా రాపాడు గలిగించునని వసంతవాయుపరమైన యర్థము. మహిళామండల= స్త్రీసమూహముయొక్క, మంజుల = మృదువయిన, భ్రమరక= ముంగురులయొక్క, అమర్దంబు = నలుపుటఁ గలది, స్త్రీల ముంగురులఁ బీడించునదియని మధుమద గర్వితుని పరమైన యర్థాంతరము. 'అలకాశ్చూర్ణకున్తలాః । తేలలాటే భ్రమరకాః' అమ. శ్యామా ...నిపుణంబున్—శ్యామా (వాయు) = లతావిశేషముయొక్క - నల్లతెగడ లేక బావంజియొక్క, ముహుఃముహుః = మాటిమాటికి, ఉన్మీలిత=వికాసమును బొందుచున్న, పత్ర=ఆకులయొక్క, భేద= దుల్చుటయందు, నిపుణంబున్ = నేర్పుగలదయి. బావంజియం దప్పుడపుడు పొటమరించుచున్న యాకులను దుల్చుచున్నది యనుట. (గర్వి) శ్యామా=నడిజవ్వనముగల స్త్రీయొక్క, ముహుర్ముహుః=మాటి మాటికి, (ఇది 'భేద'తో నన్వయించెదని) ఉన్మీలిత=వికసింపఁ జేయఁబడిన - దిద్దఁబడుచున్న యనుట; పత్త్రి=మకరికా పత్త్రములయొక్క, భేద=భిన్నపఱచుటయందు, చెల్లగించి చెఱుపుటయం దనుట, నిపుణమయినదనియు, 'శ్యామా యౌవనమధ్యస్థా' అమ. నడిజవ్వనముగల చెలువదైనమకరికా పత్త్రములను మాటిమాటికిఁ జెఱుపుచున్నదనుట. పద్మినీ...పాదియున్ (వాయు) పద్మినీ = తామరతీఁగ యొక్క, కంకణ=జలబిందువులయొక్క, గ్రహణ=గ్రహించుటను, ఆపాదియున్=కలిగించుచున్నది యు- తామరల నీటిబొట్టులతోఁగూడి చల్లనయి కమ్మనయి వీచుచున్నది యనుట. (గర్వి) పద్మినీ= పద్మినీజాతి స్త్రీయొక్క, కంకణ=కడియమునుయొక్క, ఇటకడియముచేత హస్తముపలక్షితము గనుక, హస్తముయొక్క గ్రహణాపాదనము చేయుచున్నదియు, పద్మినీజాతి స్త్రీలు పతివ్రతలగుదురు. అట్టి వారిని జేపట్టిలాగుట గర్వాంధుని చేష్టితమని తెలియునది. ఐ=ఇట్టిదై, సగ...ప్రాప్తిన్ (వాయు)— సగంధ=వాసనతోఁగూడిన, విటప = వృక్షవిస్తారముయొక్క, ప్రాప్తిన్ =పొందుటచేత, విజృంభించుచున్=అతిశయించుచు - వాసనలు గుబాళించు చెట్లు జొంపంబులంబడి కమ్మఁదనమునను జల్లఁదనమునను నతిశయించుచును 'విస్తారో విటపోఽస్త్రియామ్' అమ. (గర్వి) సగంధ=గర్వముతోఁ గూడిన, విటప = విటనాయకునియొక్క, ప్రాప్తిన్ =కూటమిచేత, విజృంభించుచున్=విఱ్ఱవీఁగుచు - గంధవహుఁడై మహిళాదులందు దుశ్చేష్టితములచేయు విటునికి సగంధుఁడగు విటపుని కూటమిచేత విఱ్ఱవీఁగుట సహజమని యాశయము. వనాంతంబునన్ = వనమధ్యమందు లేక అంత శబ్దము రమణీయవా

చక్కమైనచో రమణీయమయిన వనమునందు, విహరించెన్=సంచరించెను. ఇట గంధవహము అని ముక్ గ్గాంతకమయిన యమహన్నపుంసకమునకుఁ బుంస్త్వవివక్ష 'పాండవసింహముల్' 'పురుషసింహము' ఇత్యాదులందుఁ బోలె నెఱుంగునది.

సీ. ఏపారుపాదరిండ్ల నాపాటలాశోక, దీపార్చిఁ గనకకలాప మరసె
సాలావలులు దాఁటి యేలాలతావార, బాలాతతిపరాగ పటము లూడ్చె
నానామధుపనవ్య గానామృతము మెచ్చి, సూనాసవములెల్లఁ జూఱ లిచ్చె
ఝంకారరహితధీర హుంకారశుకభటా, హంకారముల ఫలాహతి యొసర్చె

తే. ననుచు నాగంధవహునిధౌర్త్యములు దెలుపు, లీల విరిసినవిరులురాలినరజంబు
లొలికినరసంబు లురిలినఫలము లధిపు,మ్రోల నిడి పల్కి రుద్యానపాలురపుడు.

అ. పూర్వపద్యమున వసంతవాయువునకు గంధవహశబ్దసారస్యముచే వనాంతసంచరణమునఁ జేసిన పిటధౌర్త్యములను గొన్నింటిని జెప్పి యిందును దన్నామమునవే వనమునం జేసినమఱికొన్ని ధౌర్త్యములను ఉద్యానపాలురు రాజునకుఁ దెలుపునట్లుగాఁ గవి వర్ణించుచున్నాఁడు - అపుడు=అసమయమందు, ఉద్యానపాలురు=వనపాలకులు, ఇడకర్త. ఏపారు... అరసెన్--ఏపారు=పెచ్చుపెరుఁగుచున్న, పాదరిండ్లన్=తీఁగయిండ్లనెడి యిండ్లయందు, ఆ...అర్చిన్—ఆపాటల=అంతట నెఱ్ఱనయిన, అశోక=రక్తాశోకమనెడి, దీప+అర్చిన్=దీపపు సెగ చేత - జ్వలించుచున్న దీపముచేతననుట, కనకకలాపము=(కనకమనఁగా సంపెఁగయు బంగారమును- బంగారము పేళ్లన్నియు సంపెఁగకుఁ జెల్లునని తెలియునది ) సంపెఁగపువ్వులనెడు బంగారపురాశిని, అరసెను = రోసెను, దొంగలు దీపములు వెలిఁగించుకొని ధనికుల గొప్పయిండ్లలోఁ జొచ్చి బంగారములను వెదకు ధౌర్త్యము నిట తెలియునది. గొప్పయిండ్లలో దీపములు వెలిఁగించుకొని బాహాటముగా ధనము వెదకుట మిక్కిలియుఁ జౌర్యసాహసాతిశయమని వ్యంజితము.

సాలా...లూడ్చెన్—సాలమనఁగా వృక్షమును ప్రాకారమును, 'అనోకహః కుటస్సాలః' 'ప్రాకారోవరణస్సాలః' అమ. సాల ఆవలులు = వృక్షసమూహములనెడు ప్రాకారసమూహములను, దాఁటి, ఏలాలతా=ఏలకి తీఁగలనెడు, వారబాలా=వేశ్యాంగనలయొక్క, తతి = సమూహముయొక్క, పరాగ=పుష్పొడియనెడి, పటములు=వస్త్రములను, ఊడ్చెన్=ఒలిచెను, పెక్కుప్రాకారములనుగడచి యందులోనున్న వారకాంతల వలువలనూడ్చుట మిక్కిలియు ధౌర్త్యమనుట. 'వర బాలాతతి' యను పాఠాంతరమున, ఉత్తమస్త్రీ సమూహమని యర్థము. ప్రాకారములలోపల రాణివాస ముండఁదగినవారు వరబాలలేకాని వారబాలలుగారు. వరబాలల వలువలూడ్చుటయే ధౌర్త్యసూచకముగాన, యీపాఠము యుక్తమే. లేక ఏలాలతల 'వార' = సమూహమనెడి, బాలాతతి యనియుఁ జెప్పవచ్చును.

నానా...జూఱలిచ్చె—మధుపశబ్దము తుమ్మెదయందును మద్యపాయియందును వర్తించును,నానా=సమస్తములయిన, మధుప=తుమ్మెదలనెడి మద్యపానులయొక్క, నవ్య=నూతనములయిన, గాన+అమృతమున్=అమృతప్రాయమయిన సంగీతమును,మెచ్చి, సూన+ఆసవములు ఎల్లన్=పూ నాసవమనఁగా పూఁదేనెయు, ఇప్పపూవు మొదలగు పూవులచేతఁ జేయఁబడు మద్యమును-పూఁదేనియ లనెడియిప్పపూసారా మొదలయినవాని నన్నిటిని, జూఱలిచ్చెను=కొల్లగొనియిచ్చెను- త్రాగుబోతులను గూర్చికొని వారి పాటలకుమెచ్చి యిటసంతరించిన సారాలనెల్లఁ గొల్లపెట్టి వారి కిచ్చివేసినాఁడనుట.

ఝంకా...ఒసర్చెన్—ఝంకారరహిత=జంకులేనట్టి, ధీర=సమర్థమయిన-దిట్టతనముగల యనుట,

హుంకార=హుం అనెడి శబ్దముతోఁగూడికొన్న, శుక=చిలుకల అనెడు, భట=భటులయొక్క, అహంకారములన్ =గర్వములచేత, ఫలాహతిన్ - ఫల=పండ్లయొక్క, ఆహతి=కొట్టుట, అనెడి, ఫలాహతి=ఫలమును జెఱచుట, ఒనర్చెన్ =చేసెను - జంతువులే దిట్టసేనలఁ గూర్చుకొని మామిఁడిలుగు ఫలము నంతయుఁ బాడుచేసె ననుట.

అనుచున్ = అని పలుకుచు, అగంధవహుఁడు = గంధవహుఁ డనఁగా వాయువును, గర్వము గలవాఁడును - ఆవాయువనెడి సర్వగస్తువియొక్క, ధాటీగ్రహములు = దుండగములను, తెలుపు లీలన్ = తెలియఁజేయువిధమున, విరిసినవిరులు = రాలిపడిన పుష్పములును, రాలినరజంబుల్ = తొరఁగిన పుప్పొడులను, ఒలికిన రసంబులు=చిందిన పూఁదేనెలను, ఊడిన ఫలములు = కసిమసఁబండి రాలిన పండ్లను, అని క్రమాన్వయము తెలియునది, అధిపుమ్రోలన్ =వసురాజు ముందఱ, ఇడి = ఉంచి, పలికిరి=వక్ష్యమాణమును జెప్పిరి. వసంతఋతువునఁ జక్కఁగా రక్తాశోకములు పూచియున్న యావనమున, మలయమారుతము సుడిసియాఁగా పెరిఁగిన పొదరిండ్లయందు సంపెంగవిరులు రాలియుండెననియు, చెట్ల పయిని సుడిసి దానిపయిని బ్రాఁకియున్న యేలకితీఁగెలపుప్పొడి నూరెననియు, గాలిపోఁకున హాయిగా తుమ్మెదలు ఝంఝమ్మని పాటలుపాడుచుఁ బూదేనియలవ్వారిగాఁ గ్రోలెననియును, చిలుకలు చెలరేఁగి కొలకొలగూయుచుఁ బండ్లనుజీర్చి భక్షించెననియును దాత్పర్యము. పొదరిండ్లయందు రాలిన సంపెఁగ పువ్వులు వాఁడకమఱింత మనోజ్ఞము లగుటంజేసియు, ఏలకితీఁగలనుండి రాలిన పుప్పొడి మిక్కిలి పరిమళయుక్తము లగుటంజేసియు, తుమ్మెదలు గ్రోలిన పూఁదేనియలు మిక్కిలి యాస్వాద్యము లగుటంజేసియు, చిలుక ముక్కుపోటుల విరిసినపండ్లు మిక్కిలి మధురము లగుటంజేసియు నవి రాజునకుఁ గానికలు పెట్టిరని తెలియునది. ఇట రూపకమును, మర్యాదకుఁ బెట్టిన గానికలను ధాటీగ్రహసేననునట్లు చూపినగుణములుగా నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షయుఁ, గ్రమమును, నలంకారములు శ్లేషోత్థాపితములు. వీని కంగాంగిభావముచే సంకరము.

క. స్వామీ యేమని పొగడెద, మామనికిన్ మనికి యైన యారామముసం
గామనిశితాస్త్రములు త, త్కోమలతర*లతలుఁ జిగురుఁగొమ్మలుఁ జేవల్.

అ. ఇట వనపాలకులు రాజునకుఁ జేయు విన్నపము దెలుపుచున్నాఁడు. స్వామీ=ఏలినవారా! ఆమనికిన్ =వసంతమునకు, మనికియైన=నివాసస్థానమయినట్టి, ఆరామమునన్ =ఉద్యానవనమందు, కోమలతరలతలు=ఇట లతాశబ్దముచేఁ దజ్జన్యములయిన పుష్పములు లక్షితములగుచున్నవి. కోమలతర=మిక్కిలియు మృదువులయిన, లతలున్ =తీఁగలయందుండు పువ్వులును, కామనిశితాస్త్రములు-కామ=మన్మథుని యొక్క, నిశిత=మిక్కిలి వాఁడియైన, అస్త్రములు=బాణములు, చిగురుకొమ్మలున్ =లేఁతకొమ్మలును, చేవల్ =సారములు, 'చిగురుఁగొమ్మల చేవల్' అను పాఠా. కాని 'చిగురుగొమ్మైనఁజేవ' (మనుచరిత్ర) 'చిగురుఁగొమ్మయుఁజేవ' (రామాభ్యు) అను నింబట్టి ప్రకృతపాఠము గయికొనంబడియె. కాఁబట్టి, ఏమనిపొగడెదము= ఏమని కొనియాడఁగలము-అనఁగా కొనియాడఁజాలమనుట, మిక్కిలియు సుకుమారములయిన పుష్పములు మన్మథకఠోరబాణములని చెప్పుటయు కడుంజేలికరయైన చిగురుఁగొమ్మలను చేవలనుటయు విరోధము, మొదటిదానియందు మన్మథోద్దీపకములనియు రెండవదానియందు దినదిన ప్రవర్ధమానములనియుఁ బరిహారము. అలం. విరోధాభాసము. అతిశయోక్తి.

---

* లతలు చిగురుఁగొమ్మలచేవల్.

తే. నాథ చివురులు రంజిల్లెఁ, ననలు* మొలిచె, నలరె విరులెల్లఁ, బూఁ పలుకుదలలు సూపెఁ
బసిమి నిరవొందెఁ, బిందియల్ బలసెఁ, బవళ, లాటువులు సాంద్రరుచులఁ, ఫలంబు లెసఁగె.

అ. నాథ=స్వామీ, చివురులు రంజిల్లెన్=చిగురుటాకులు ఎఱ్ఱఁదనముచే నొప్పెను, ననలు మొలిచెన్=మొగ్గలు పొటమరించెను, విరులెల్లన్ అలరెన్=పువ్వులన్నియు వికసించెను. పూఁపలుదలలు సూపెన్=పూఁటిమలు పొడసూపెను, పిందియల్=లేఁతపిందెలు, పసిమిన్=పసరుచాయచేత, ఇరవొందెన్=అమరెను, పవళలాటువులు=క్రొత్తలయిన కాయలు, బలసెన్=బలుపు నొందెను, ఫలంబులు=పండ్లు, సాంద్రరుచులన్=దట్టమయిన తియ్యఁదనములచేత, లేక ఎఱుపు పసుపు మొదలయిన వర్ణములచేత, ఎసఁగెన్=ప్రకాశించెను. అనగా నివి యన్నియును గలిగియున్నవని తాత్పర్యము. ఇఁట చివురులు మొదలుకొని పండ్లనఁబడుంగల యవస్థలు వరుసఁగాఁ జెప్పినాఁడు.

ఉ. కేళివనాళి నీయెడ శుకీనినదార్భటి చెప్ప నేల భూ
పాలక నీలకంఠములు పాయక మ్రోయు లతాంతవాస నా
జాలము సోడుముట్టు సురసాలము వీడ్కొని వచ్చు షట్పదీ
మాలికఁ దోఁచు నబ్బురపు మబ్బులయుబ్బులు గుబ్బతిల్లఁగన్. 135

అ. భూపాలక=ఓ వసుమహారాజా! కేళివనాళిన్=క్రీడావనముల వరుసయందు, ఈయెడన్=ఈ వసంతసమయమున, శుకీనినదార్భటి—శుకీ = ఆఁడు చిలుకలయొక్క, నినద = చప్పుళ్లయొక్క, ఆర్భటి=ఆడంబరము, చెప్ప నేల = చెప్ప నక్కఱలేదు—అనఁగా విరామములేకయే యున్నదనియు వసంతర్తువు గనుక నిపుడు చిలుకల కోలాహలములు గలిగియుండుట వింతగాదనియు ఆశయము. లతాంత=ఉద్యానవనపుష్పములయొక్క, వాసనాజాలము=పరిమళసమూహము, సోడుముట్టన్=మిన్నంటి శపాలముల కెక్కఁగా, సురసాలమున్=కల్పవృక్షమును, వీడ్కొని=విడిచిపెట్టి, వచ్చు = వచ్చుచున్న - ఇచటఁ గల్పవృక్షముయొక్క వాసనకంటె ఉద్యానపుష్పముల వాసనలు శ్రేష్ఠములని తాత్పర్యము. షట్పదీమాలికన్=ఆఁడుతుమ్మెదలయొక్క సమూహమందు, తోఁచు - స్ఫురించుచున్న, అబ్బురపుమబ్బుల = ఆశ్చర్యములయిన మేఘములయొక్క, ఉబ్బులు=ఉల్బణములు = ఎగపులనుట, గుబ్బతిల్లఁగన్=అతిశయించుచుండఁగా, నీలకంఠములు=వర్షర్తువునందుఁ ధ్వనిచేయు నెమిళ్లును. 'మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజఙ్గభుక్' అను. పాయక మ్రోయున్=ఎడతెగక కేకారవములు సేయుచుండును — అనఁగా షట్పదీమాలికయందలి మేఘపటల భ్రాంతిచే నీలకంఠము లెడతెగక ధ్వనిచేయు ననుట. షట్పదీమాలిక మబ్బులయుబ్బుంబోలు నంత బాహుళ్యము గలిమిచేత ఉద్యానవన పుష్పముల వాసనాతిశయము వ్యంజితము. కల్పవృక్షములం గల తుమ్మెదలెల్లను బారులుగొని క్రిక్కిరిసి మిక్కుటమై వచ్చుటచేతను మబ్బుల యుబ్బుం బోలిక చూపట్టుట. అధికత్వముచేత అబ్బురములని తెలియునది.

క. మహనీయ మధుఝరీ సం, గ్రహమునఁ గాలువలు వఱపి గనిమలుగ రజం
బహరహము నెఱపి మాకున్, సహకారము లయ్యె నచటి సహకారంబుల్.

అ. అచటి సహకారంబుల్=ఆ వనమందలి తియ్యమామిడిచెట్లు, మహ...సంగ్రహమునన్ — మహనీయ=గొప్పదయిన - విస్తరించిన, మధు=పూఁదేనెయొక్క, ఝరీ=ప్రవాహముయొక్క, సంగ్రహమునన్ = సంపాదనముచేత - ఒడఁగూర్చి సమకట్టుటచేత ననుట, కాలువలు వఱపి = కాలువలు

* మొనసె.

సాగించి - కాలువలుగా పాఱించి యనుట. మధువు ఝరిగా దొరిఁగినను ఆఝరి కాలువలుగాఁ బాఱు నంత గొప్పదిగా నుండవలయును. గాన, 'మహనీయ' మని విశేషించినాఁడు. దీనిచేత తియ్యమామిడి జొంపముల పెంపును వాని తియ్యందనపు సొంపు నూహించుకొనునది. రజంబుల్ = పుప్పొడిని, అహరహంబుల్ = ప్రతిదినమును—ఒక్కనాఁటికిని దప్పక యనుట - దీనిచేత వాని సహాకారత్వము యొక్క యతిశయము తెలియునది. సెలపి = నిండించి - పూర్ణముగా సవరించియనుట, మాకుల్ = ఆతోఁటలో కాలువలు పాఱ్చి గనిమలుకట్టు పనిసేయువలయువారు మగుమాకు, సహకారిములు అయ్యెల్ = తోడుపని సేయునవి అయ్యెను. పఱపు నట్టి కాలువ యొక్కఁడగాక 'కాలువ'లని పెక్కులగుటచేతను రజస్సు సెలపుట యొక్కవాఁడు గాక 'అహరహ' మ్మనుటచేతను వాని సహాకారిత్వము నతిశయము తెలియునది.

తా. ఆవనమందలి తియ్యమామిడి చెట్లు మిక్కిలి జొంపములై యవ్వారిగాఁ గాలువలు పాఱునట్లు పూఁదేనెలు గార్చుచుఁ గుప్పలుగుప్పలుగాఁ బుప్పొడి గొరుఁగుచు నుండును. అలం. ఉదాత్తమును, కావ్యలింగమును.

మ. బలుకప్రంపుటనంటి కప్పురపుఁదిప్పల్ గప్పి యుప్పొంగుజా
లులగొజ్జంగిల నీరు సజ్జకపుఁగేళాకూళికిన్ డిగ్గి త
జ్జలసూత్రంబులు ప్రాఁకి తుంపురులుగా జాఱున్ నిదాఘాంశు నా
వళి పీడ్కొన్నతమంబుఁ గాంచి వనిలో వర్తించుమంచో యనన్. 137

అ. బలు...తిప్పల్ — బలు = బలువయిన - మిక్కిలి దప్పముగాఁ బెరిఁగినట్టి, కప్రంపుటనంటి = కర్పూర పరఁటులను సంబంధించినట్టి, కప్పురపు + తిప్పల్ = కర్పూరపుఁ బ్రోగులను - కర్పూరపరఁటులనుండి యవ్వారిగాఁ గొరిఁగి కుప్పలుగొన్న కప్పురపు రాసుల ననుట - ఆ యరఁటులు 'బలు' వగుటచేతను దానినుండి తొరిఁగిన కప్పురమును 'తిప్ప' లయ్యెనని తెలియునది - ఆ తిప్పలను, కప్పి ...జాల్ — కప్పి = క్రమ్మి - ముంచి యనుట, ఉప్పొంగు = పయిని బొంగుచుండెడి, జాల్ = ప్రవాహము, కల ...నీరు — కల = కలిగినట్టి, గొజ్జంగల = గొజ్జంగపూవులయొక్క, నీరు - గొజ్జంగిపూవుల నీరు కర్పూరపు రాసులను ముంచి యుంచుటకే మిక్కిలియై యుండవలయును. అట్లు ముంచియు నందినికిపోవక దాని నుండి యవలికి పాఱునంతటి వెల్లువగా నుండెననుటచేఁ దాని బాహుళ్యాతిశయము వ్యంజితము. అంత బహుళమయినది గావుననే, సజ్జకపు కేళాకూళికిన్ - సజ్జకపు = ఆయత్తపఱుపఁబడియున్న, కేళాకూళికిన్ = జలయంత్ర గృహమునకు - క్రీడాసరస్సునకని కొందఱు - గొజ్జంగిపూలనుండి వచ్చునీరును బట్టుకొనునట్టి వాటముగాఁ గేళాకూళి యమర్పఁబడియున్న దనుట - దానికి, డిగ్గి = దిగి, తత్ + జలసూత్రంబులు = దానియొక్క జలయంత్రములను, ప్రాఁకి = వ్యాపించి - దానిలోని కారంజాలలో నెక్కి - ఆ కేళాకూళి నిండి దానినుండి నలుప్రక్కల వ్యాపించుటకై పన్నియున్న జలయంత్రములం దెల్ల నిండిన దనుట, తుంపురులుగాన్ = సన్నవానచినుకులుగా, వనిలోన్ = ఉద్యానవనములోపల, నిదా...ఆవళి - నిదాఘాంశు = సూర్యునియొక్క, ఆవళిన్ = అగడును - అడావడిని, పీడ్కొన్నతమంబున్ = తప్పించుకొన్న చీఁకటిని, చెట్లు సూర్యకిరణములును జొరనీయనంత జొంపముగాఁ గ్రమ్ముకొని గలిగించుచున్న దట్టంపునీడల నిచట చీఁకట్లుగా నధ్యవసించినాఁడు. కాంచి = చూచి, వర్తించు మంచో యనన్ = (తానుగూడ నందు) మెలఁగుచున్న మంచో యనునట్లుగా, జాఱున్ = క్రిందఁదొరుగును.

గొజ్జంగపూలనీరు కర్పూరరాసులను ముంచి పాఱుటచేత చలువగొని కేళాకూళినిదిగుటచేత మఱింత జిలుజిలుమనుచు జలయంత్రములందుఁ దుంపరలుగాఁ దొరఁగుటచే, జిలుజిలుమని సన్నచినుకులు

గాఁ బొరఁగుమంచుతోడి సామ్యము నొందినది. దీనిచే గొజ్జంగిపూలచెట్లును గర్పూరపు టరఁటులును మిక్కుటముగా నుండుటయుఁ దెలియునది. నీరు తుంపురుమంచువలెఁ దోఁచుటకు నలుగడల విరివిగా పర్వియుండవలయును గాన దానినిబర్వఁజేయు జలయంత్రములు పెక్కులుండవలయుననియు వ్యంజితము. సూర్యుని వేండ్రమున కోపనివి చీఁకటియు మంచు నే. తమకంటె బలవంతుఁడై తమకును సమానుఁడయిన శత్రువు గల యిరువురు నొకరితోనొకరు పొత్తుగలిగియుండుటయుఁ గూడి ప్రవర్తించుటయు, సహజము. కావుననే సూర్యుండను బలవంతుఁడయిన శత్రువుగల మంచు సూర్యుఁడే శత్రుఁడుగాఁగల చీఁకటితోఁ జెలిమిగలదై యది తమ పగవానిబాధ-అనఁగా సూర్యుని వేండ్రము-లేనిచోట నుండునని తాను నదియున్నచోటనే ప్రవర్తించెనని భావము. దీనింబట్టి సూర్యకిరణములు చొరనీయనంత నిబిడముగా వృక్షములు వనమందు జొంపములుగొని యుండుటయు వానివలనఁ గ్రమ్మిన దట్టంపునీడలు చీఁకట్లవలె చూపట్టుటయు వ్యంజితము. 'చలియిసుక వెట్టు నేడాకులరఁటుల' (మనుచరిత్రము) అనుటచే నాయరఁటుల నుండి దొరఁగు కపురము చలువగలిగియుండుటయు, 'గొజ్జంగ పూఁబొదల్ గురియంగఁ బటికంపుదొనల నిండినయట్టి తుహినజలము' అనుటచే గొజ్జంగెపూలనుండి కారు జలము శైత్యసౌరభ్యార్ద్ర మగుటయు తెలియునది.

తా. ఆవనమందు కర్పూరపు టరఁటులును గొజ్జంగలు నవ్వారిగా నుండుటచే గొజ్జంగపూల నుండి కారిన నీరా కర్పూరపుటరఁటుల నుండి దొరఁగిన కర్పూరపు రాసులనుంచుకొని చలువయుఁ దావియునొంది వెల్లువగొని దానికై యాయా త్రిపటిచియున్న జలయంత్రపు సరస్సులోనికిఁ దిగి యక్కడనుండి నలుప్రక్కల నిగిడియున్న నీటియంత్రములద్వారా వ్యాపించి సన్ననితుంపురులై మంచువలె జలుజలుమని కురియుచుండును. చెట్లు జొంపములయి సూర్యకిరణములను జొరనీయకుండుటచే దట్టంపు నీడలుక్రమ్మి చీఁకటివలె నుండును. అలంకారము ఉత్ప్రేక్ష.

శా. ఆ యారామ్ములఁ బొల్చుకొమ్మలబెడం గాపల్లవశ్రేణి రం
గాయాతావుల మించుపూఁబఱపు లాహా యెన్నఁగా శక్యమే
యా యుద్యానము సాటిచైత్రరథమో కల్లా నాయతశ్రీయుతం
బై యొక్కొక్కనగంబె చైత్రరథమై యందుర్ విజృంభింపఁగన్. 138

అ. ఆయారమ్ములన్=ఆపొదరిండ్లయందు, పొల్చు...బెడంగు, పొల్చు=ప్రకాశించుచున్నట్టి, కొమ్మల = శాఖలయొక్క - స్త్రీలయొక్క యని యర్థాంతరము, బెడంగు=చక్కఁదనమును, ఆ పల్లవ...రంగు—ఆపల్లవశ్రేణి = ఆచిగురుటాకుల బంతియొక్క - విటపంక్తియొక్క యని యర్థాం. 'పల్లవః కిసలేషిద్గే' విశ్వ. రంగు=సొగసును - పొదరిండ్లయందలి శాఖలును నందు మొలకొత్తిన చిగుళ్లనునని వసంతర్తువు పల్లవితత్వము. ఆపొదరిండ్లయందలి స్త్రీలును వారితోడి కూడికగల విటసమూహములునని. వసంతసమయంపు మన్మథోద్దీపకత్వాతిశయమును, ఆయా...బఱపులు—ఆయాతావులన్= ఆయాపరిమళములచేత, మించు=అతిశయించుచున్న, పూ+పఱపులు=పుష్పవిస్తారములు, ఆయా తావులన్=ఆయాస్థలములందు,మించు,పూపఱపులు=పుష్పశయ్యలునని యర్థాం. వాసనార్థకమయిన తావులన పదమున నేకవచనము తావి. స్థలార్థకమున నేకవచనము తావు.పఱపుఅనఁగా విస్తారమును శయ్యయు,వసంతము పుష్పసమయముగాన పూవులు వలువగల వాసనలుగుబాళించుచు విస్తరించియున్నవనుట. వసంతము మారోద్దీపకమగుటచే సంభోగమునకై స్త్రీపురుషులయ్యెయెడలఁ బూవుసెజ్జలుపఱచుకొనియున్నారనుట. ఆహా=ఆశ్చర్యము, ఎన్నన్ గాన్=గణించుటకు, శక్యమే=తరమా-తరముగాదనుట. చైత్రరథ

ము=కుబేరుని యుద్యానవనము 'అస్యోద్యానం చైత్రరథమ్' అని. ఆయుద్యానముసాటి= ఆపూఁదోఁటకు సమానము, ఎట్లుఅగుక్ =ఏరీతినగును - ఏవిధమునను సమానముగా కేరదనుట. ఏలనఁగా-ఒక్కొక్కనగంబె = ఒక్కొక్కవృక్షమే, ఆ...యై - ఆయతి = విస్తరించిన, శ్రీ=సమృద్ధితోడ, యుతంబు+ఐ=కూడినదై, చైత్రరథమై - కుబేరవనమై యని యర్థము. చైత్రుఁ డనఁగా వసంతుఁడు; గనుక, వసంతునికి రథమయినదని భావము - ఇట రథశబ్దముచే ఆరోహావిషయమగుటమాత్రము భావ్యము - చైత్రుఁ డారోహించునట్టిదియనుట - చైత్రుఁ డాక్రమించుటచేఁ జక్కఁగాఁ జిగిర్చి పూచియున్న పెంపు సొంపుగులుకుచున్నదని భావము. అందుక్ = ఆవనమందు, విజృంభింపఁగక్ = ప్రకాశించుచుండఁగా, ఆ యుద్యానమునకుఁ జైత్రరథమెట్లు సాటియగునని పూర్వముతో నన్వయము. కుబేరునివన మంతయుఁజేర ఆయతి శ్రీయుతంబగుచైత్రరథమగుచున్నది. ఈవనమం దొక్కొక్కవృక్షము మాత్రమే ఆయతి శ్రీయుతమై ఒక్కొక్కచైత్రరథముగానున్నది- కాఁన నెక్కుడు చైత్రరథముల పెంపుగల దీనితో నాయొక్కచైత్రరథమెట్లు సాటియగునని యాశయము. ఒక్కొక్కవృక్షమును బండువై పల్లవపుష్పములచే నలంకృతమైయుండుటఁ జూడఁగా వసంతుఁ డనుచేటికుఁగాను అలంకృతమయిన రథమువలెఁ దేఁటలుమందనయు భావము వ్యంజితమగుచున్నది.

తా. ఆవనమందుఁగల పొదరిండ్లలోనున్న చెట్లుకొమ్మలయు చిగుళ్లయు సొగసును, స్త్రీలయు విటశ్రేణులయు సొంపును, మఱి పలువగల వాసనల గుబాళించుచు విస్తారముగాఁ బూచియున్న పువ్వుజొంపములును, ఆగూస్సలములందు స్త్రీపురుషు లాపూజొంపములచేఁ గావించుకొన్న శయ్యలును, నాశ్చర్యము గొలుపుచు నింతింతని గణింపఁదరము కాకున్నవి.మఱియు నందలి యొక్కొక్కవృక్షమును వసంతమహిమచేఁ జక్కఁగాఁ జిగిర్చియుఁ బూచియు మిక్కిలి పెంపు సొంపారుచుండుటవలనఁ గుబేరుని యుద్యానవన మగు చైత్రరథ మనుగూడ నతిశయించి ప్రకాశించుచున్నది. అలం. శ్లేషానుప్రాణితమయిన కావ్యలింగమును, అర్థాపత్తి.

సీ. ఇమ్ములై మరుహజారమ్ములై పొదలుండఁ, బూఁజవికలు వేఱ పూయవలదు
తెప్పలై నెత్తావికుప్పలై పుప్పొళ్లు, గుల గండవహు త్రోవఁ జిలుక వలదు
సారమై హిమజలాసారమై పూఁదేనె, సెలయేఁ గేళాకూళి నింపవలదు
మొత్తమై మ్మృగనాభి తతియత్తమై గంబూర, మొగయు వితానముల్ బెగియవలదు
తే. స్వామి యారామశుభవైభవములు సూడ
నెపుడు విచ్చేయుదురొ యంచు నెదురుసూచు
సహజసౌభాగ్యములు* గూర్చి చైత్రుఁ డితఁడు
కూరిమి భవనీయవనపాలకుండు గాఁడె. 189

అ. ఇమ్ములై = విశాలములయినవై, మరుహజారమ్ములై = మన్మథుని కొలువుఁగూటములై - అనఁగా రత్యాదిక్రీడల పెంపుసొంపారుచున్నట్టి స్థానములైయనుట, పొదలు ఉండక్ =పొదరిండ్లుండఁగా, పూ+చవికలు = పువ్వు చప్పరములు, వేఱ=ప్రత్యేకముగా, పూయవలదు = తాల్పవలదు - అనఁగాఁ గట్ట నక్కఱలే దనుట. పూఁజవికలవలె విరివిగాను మన్మథక్రీడల నుద్దీపకముగాను పొదరు లున్నవనుట. తెప్పలై = తెట్టెలుగట్టినవై, నెత్తావికుప్పలై = పరిమళరాసులై, పుప్పొళ్లు = ఉరులక్ = రాలుచుండఁగా, గండవాడి = బుక్కాపొడి, త్రోవక్ = మార్గమందు, చిలుక

* గూర్చు.

వలదు=చల్లనక్కఱలేదు. గందపొడివలెనే పుప్పొడియు పరిమళము బుగులుకొనుచున్న దనుట. సారమై = చేవగలదై - బలమైనదై యనుట. హిమజల + ఆసారమై = మంచుజడి వంటిదై, పూ+తేనె = మకరందము, నెఱయన్ = వ్యాపించుచుండఁగా, కేళీకూళి = జలయంత్రపుగుంత, నింపవలదు =నీళ్లచే నింపనక్కఱలేదు. కేళీకూళియందు నీళ్లునింపి జలయంత్రములఁబర్వించి నలుగడల తుంపురులుగాఁ జల్లించునట్లు పూఁదేనె దట్టమై మంచుజడివలెఁ గురియుచుండుననుట. (చూడు. ౧౩౯-వ పద్యము). మొత్తమై = రాశియై, మారుత + ఆయత్తమై = వాయువునకు లోనయి, గంబూరము = పచ్చకర్పూరము, ఎగయన్ = ఎగురుచుండఁగా, వితానముల్ = మేలుకట్లు, బిగియవలదు = కట్టనక్కఱలేదు. పచ్చకర్పూరము కుప్పలుకుప్పలుగా దట్టముగొని పయినిబర్వుట మేలుకట్లుకట్టినట్లున్న దనుట.

స్వామి=దేవరా, సహజ ..చైత్రుఁడతఁడు—సహజ=స్వభావ సిద్ధములయిన, సౌభాగ్యములు= ఒప్పిదములను - శృంగారముల ననుట, కూర్చు=ఒడఁగూర్చునట్టి, చైత్రుఁడు=ఆవసంతుఁడు - పొదలు, పుప్పొళ్లు, పూఁదేనె గంబూరమును వసంతుని సహజసౌభాగ్యములనియు, ఇట్టి సహజములయిన వానిచేతనే పూఁజవికలు మొదలయినవి నిర్మించినాఁడనియు, భావము. ఆరామశుభవైభవములు-ఆరామ= ఉద్యానమును సంబంధించిన, శుభవైభవములను = సొగసయిన పెంపుసొంపులను, చూడన్ = కటాక్షించుకొఱకు, ఎపుడు విచ్చేయుదురో అంచున్ = ఎప్పుడు విజయముచేయుదురో యని, ఎదురుచూచున్ = ప్రతీక్షించుచుండును - పొదలు మొదలయిన వసంతుని సహజసౌభాగ్యములచే నయినపూఁజవికలు మొదలయినవి ఆరామమునకు శుభవైభవములు. ఆరామమున పూఁజవికలు మొదలయినవి గట్టుట దానికి విభవములగును. దాని పొదరిండ్లు మొదలయినవానిచేతనే యట్టివి తమంతటఁ గట్టింపఁబడి యుండుట దాని శుభవిభవములగునని శుభశబ్దసారస్యము. ఇట్లెదురుచూచుటకుఁ గారణమేమనఁగా, అతఁడు = ఆవసంతుఁడు, కూర్మిన్ = గారాముచేత, భవదీయ వనపాలకుండు = దేవర తోఁటను గాఁచువాఁడు, కాఁడె = కాఁడాయని యర్థము. వసంతుఁడు సహజముగా వనములను బాలించువాఁడని భావము. నీతోఁటవాఁడుగాన నీయారామమునకు నీవెపుడు వత్తువోయని యలంకారములు చేసి యెదురుచూచుచున్నాఁడని యాశయము. ప్రభువులు వనవిహారమునకై వత్తురని వనపాలకులు పూఁబందిళ్లుగట్టి మార్గమందు మెత్తగానుండునట్లు గందవొడిచల్లి, కేళీకూళిలో నీరునింప మంచుచినుకులవలె నలుగడలఁ బడునట్లుచేసి, పయిని మేలుకట్లు కట్టి యాయితిపఱచుట మరియాద. వానిని వనపాలకుల మగుమేము చేయనక్కఱలే కుండునట్లు వసంతుఁడు మావలెనే దేవరవనపాలకుఁడు గావున పూఁజవికలు మున్నగువానికి మాఱుగా వానింబోలు పొదరిండ్లు మొదలయినవానిని సమకట్టి తమరాక కెదురు చూచుచున్నాఁడని తాత్పర్యము. ఉద్యానవన మట్లు వసంతసమయ సహజసౌభాగ్యములచే నత్యంతశుభ విభవముల రమ్యముగానున్నదిగాన వనవిహారార్థము దేవరవిజయము చేయవలయునని వనపాలకులు విజ్ఞాపనము చేసిరని ఫలితార్థము. అలం. ఉదాత్తము, కావ్యలింగమును.

క. అని వనపాలురు దెలిపిన, జనపాలున కనఘపూగ * సాలాళీ నూ
తనపాళీ ఘనకేళీ, వనపాళీదర్శనోత్సవం బిగిరించెన్. 140

అ. అని, వనపాలురు = తోఁట కాచువాండ్రు, తెలిపినన్ = విన్నపము సేయఁగా, జనపాలునకున్ = రాజునకు, అనఘ...ఉత్సవంబు—అనఘ = దోషరహితమయిన, పూగసాల = పోఁకచెట్లయొక్క, ఆవళి = పంక్తులయొక్క, నూతన = క్రొత్తలయిన, పాళి = సముదాయముతోఁ

* సాలావళి.

గూడిన, ఘన = అధికమయిన, కేళీవనపాళీ = క్రీడావనము ప్రదేశముయొక్క, దర్శన= చూచుటయం దలి, ఉత్సవంబు = వేడుక, ఇగిరించెన్ = మొలకొత్తెను - వసంతమునందుఁ బోఁక చెట్లు క్రొత్తగా మొలచినవి మిక్కిలి మణీయమగుటచే నదియే రాజునకు వనకేళిదర్శనమునకు ఘనకారణముగానుండునట్లూహించునది. ఆ వసురాజుద్యానవనమును జూడ నుత్సుకుఁడయ్యెనని తా. అలం. వృత్త్యనుప్రాసము.

తే. నృపుఁ డలవనీపకుల నవనీపకుల నొ, నర్చి యచ్చో నిజారామ *నవవసంత
సమయసౌభాగ్యములుచూడఁ జనుమనోరథం బునం రథంబుఁ దెమ్మనఁ దడయకపుడు.

అ. నృపుఁడు = వసురాజు, అల వనీపకులన్ = ఆ వనపాలకులనని యర్థము - యాచకులనని యర్థాంతరము, అవనీపకులన్ = అనేక గ్రామములనొసంగి భూపతులనుగా, ఒనర్చి = చేసి యనియర్థము - యాచకులుగాని వారినిగాఁ జేసి యని యర్థాంతరము. 'వనీపకో యాచనకః' అమ. అచ్చోన్ = ఆసమయమందు, నిజా...సౌభాగ్యములు—నిజా + ఆరామ = తనయుద్యానవనమందలి, నవ = క్రొత్తయిన, వసంతసమయ = వసంతఋతువును సంబంధించినట్టి, సౌభాగ్యములు = ఒప్పిదములను, చూడన్ చనుమనో రథంబునన్ = చూడఁబోవలయుననెడి యభిలాషముతో, రథంబున్, తెమ్ముఅనన్ = తెమ్మనియాజ్ఞ సేయఁగా, తడయక = జాగుసేయక, అపుడు = ఆసమయమందు - దీనికి పుంస్త్రీ పద్యముతో నన్వయము. ఆరామము (నిజ) తనది. అందును వసంతఋతువు (నవ) క్రొత్తయొప్పిదములుగలది. కావుననే చూడఁబోవలయునని యభిలాషము కలిగినదని 'నిజ' 'నవ' శబ్దముల సారస్యము.

తా. రాజపుడు వనపాలకులకు పలయు ధనాదులిచ్చి వారిని సంపన్నులనుజేసి తనదయిన పూఁదోఁటయందు వసంతఋతువువలనఁ గ్రొత్తగాఁగలిగిన యొప్పిదములను జూడఁబోవలయునని యభిలాషపడి రథము దెమ్మనెను. అలం. విరోధాభాసము, వృత్త్యనుప్రాసము.

సీ. జతగూర్చి తారవజ్రాలఁ బన్నినకమ్మిఁ, గ్రమ్మినమణి రథాంగములగములు
నీలాలదృష్టి పూనినసక్రముఖములఁ, దగు పచ్చపనినిగనిగని నొగలు
ముత్యాలచవిర కెంపులచట్టము తెడంకు, దట్టంబుమాడ్కిఁ గెంపుబట్టుపఱుపు
పగడాలకంబాలజిగి మించుపుష్యరా, గపులోవ వైడూర్య ఘంటికలును

తే. దలతలని మానికంబుల కలశమును జయాంక కేతనమును గల్గునరదమొకటి
మనసుతో ససమెలఁగుసాప్రమాణికాశ్వరత్నములఁ †బన్ని తెచ్చె సారథియొకండు.

అ. సారథి ఒకండు=ఒక్క సారథి, జతగూర్చి=జతగా సవరించి - జోడించి యనుట, తారవజ్రాలన్ - తారశబ్దము ముత్యములు మొదలగువాని సంశుద్ధియందు వర్తించుచున్నది. 'తారోవానరభిన్ముక్తావిశుద్ధౌ శుద్ధమౌక్తికే' మేదిని. 'తారో ముక్తాదిసంశుద్ధౌ తరణే శుద్ధమౌక్తికే' విశ్వ. పరిశుద్ధములయిన వజ్రములచేత, పన్నిన=నిర్మించినట్టి, కమ్మి=కట్టుచేత, గ్రమ్మిన=పొదిగిన, మణిరథాంగముల గములు=పద్మరాగమణిమయములయిన చక్రములయొక్క సమూహములును - వజ్రాలు అటుగవు గనుక వానిచేత రథపుబండికమ్మి చేయుట తెలియునది. వజ్రలక్షణము

ఉ. దాకటిమీఁదఁ బెట్టి వెడిపంబుగ సమ్మెట వ్రేయ భిన్నమై
పోక జలంబులోఁ బడిన బ్రుంగునఁ గ్రుంగక లోహపఙ్క్తికిన్
జేకొని వ్రాయ రేఖ విలసిల్లదు వజ్రము శుద్ధమిద్ధరం
బ్రాకటలీలఁ దాల్ప నలభార్గవుఁ డిచ్చు శుభంబు సిరులున్.

---

*న గవనంతి. † బూన్చి.

నీలాలదృష్టి=నీలమణులే దృష్టులుగా, పూనిన నక్రముఖములన్--పూనిన = ధరించునట్టి, నక్రముఖములన్ = మొసలి ముఖములచేత, తగు = ఒప్పుచున్న, పచ్చపసి = మరకతమణి పనితనముచేత, నిగనిగని = నిగనిగ మెఱయుచున్న, నొగలు = నొగకఱ్ఱలును - పచ్చలమయములై నిగనిగలాడుచున్న నొగలను ఖములు మకరాకారములుగాను, ఆమకరములకు నీలమణులచే దృష్టులుగాను అమర్పఁబడి యున్న దనుట, ముత్యాల...చట్టము — ముత్యాలబవిర = ముత్యాలు గూర్చిన వలయముగల, కెంపుల చట్టము=కెంపులు చెక్కిన పట్టమును, త...మాడ్కిన్ —తత్ +అంశు=ఆ కెంపులయొక్క, కాంతులయొక్క, ధట్టంబు మాడ్కిన్ =సమూహమో యన్నట్లున్న, కెంబట్టు పఱపు=ఎఱ్ఱపట్టు పఱపును, దాని చట్టమంతయుఁ గెంపులుపొదిఁగినదనియు, ఆచట్టమును ముత్యములు వలయముగాఁ గ్రువ్వంబడి యున్నదనియు వానిపయిని గట్టియున్న యెఱ్ఱపట్టు పఱపు ఆచట్టపుఁ గెంపుల కాంతివలె నుండె ననియు నుత్ప్రేక్ష. పగడాల కంబాలజిగిన్ =పవడపు స్తంభములయొక్క కాంతిచేత, మించు పుష్య రాగపు = అతిశయించుచున్న పుష్యరాగమణిమయమయిన, లోవ = చప్పరపు వలయము, వైదూర్యఘంటికలును=వైదూర్యమణి వికారములయిన చిఱుగంటలును, దాని వట్రువచప్పరము పుష్యరాగములచేత రచితమై, పగడపు స్తంభములు కలిగియుండె ననుట

తళతళని మానికంబుల కలశమును = గోమేధికమణి వికారమయిన పయికలశమును, ఇంతవఱకు నవరత్నములు గలుగఁజెప్పినాఁడు, నవరత్నములకు

క. 'కురువింద వజ్రమౌక్తిక, సరమరకత శక్రనీల • వైదూర్య మనో
హారపుష్యరాగ విద్రుమ, వరనుత గోమేధికములు • నవరత్నంబుల్'. రత్నపరీక్ష.

జయాంక కేతనమును, జయ = జయముచే నయిన, అంక = గుఱుతులుగల - బిరుద చిహ్నములుగల, కేతనమున్ =ధ్వజమును, కల్గు నరదము=కలిగినట్టిరథమును, ఒకటి, మనసుతోనన...రత్నములన్ —మనస్సుతోనన=మనస్సుతోఁగూడనే - మనస్సు కోరిన ట్లెల్ల లేక మనస్సుపోవునంత వేగముతో ననుట, మెలఁగు=ప్రవర్తించునట్టి, సాౘ్రమాణిక=సాౘ్రమాణి సంజ్ఞగల, అశ్వరత్నములను=గుఱ్ఱపు మిన్నలను, పన్ని=కట్టి - ఇట రత్నమయమైన రథమునకు నశ్వరత్నముతోడ కూడిక యర్హమని అనురూప్యము. తెచ్చెన్ =తీసికొని వచ్చెను. ఇట మణిరథాంగము లనుచో పద్మరాగమణిని జెప్పి 'కెంపుల చట్టము' అనుచో కెంపులను జెప్పుట పునరుక్తిగా నేరదు, పద్మరాగమునకును గెంపునకును భేదము గలదనియుఁ గలియుగమునఁ బద్మరాగము లేదనియుఁ బూర్వయుగములందేయది గలదనియును స్ఫురింపఁజేయుకొఱకు మణిశబ్దమును గ్రహించుట తెలియునది.

క. ' ధరఁబద్మరాగ మెందును, దొరకదు కలియుగమునందుఁ • దూఁచిన వ్రేఁకై
నిరుపమనిర్మలరుచి గల,కురువిందపుఁ గెంపు గలదు • కోరిధరింపన్'. రత్నపరీక్ష.

[మనళ్ళబ్ద సకారమునకు ద్విత్వము రామికి 'ఎందు వేఁటరారె యితరు లేమనసుతో, దారసంగ సుఖముఁ దప్పఁద్రోచి' (రాఘ. పాం.) ఇట్లే 'సదసులోని విప్రజనము మీఁద' ఆది.] సోమకవి.

తా. ఒకసారథి మనోవేగమునఁబోవు సాౘ్రమాణి గుఱ్ఱములు పూన్చిన రథమొక్కటిఁ దెచ్చెను. దానికిఁ బద్మరాగమణులు పొదిగిన చక్రములుండెను. ఆ చక్రముల చుట్టుగల కమ్మిని (కట్టున) మేలయిన వజ్రాలు పొదుగఁబడియుండెను. దాని నొగకఱ్ఱలు పచ్చలచే రచితములయి నిగనిగమని ప్రకాశించుచుండెను. ఆ నొగకఱ్ఱలముఖము మొసలిముఖములవలె నేర్పఱచి దానికి దృష్టులుగా నీలాలు చెక్కఁబడి యుండెను. దాని పయిచట్టము కెంపులు పొదుగంబడినదై, చుట్టును ముత్యాలవలయము

కలిగియుండెను. ఆ చట్టముపయిని గట్టంబడిన రెట్టుపట్టు సఱపు దాని కెంపుల కాంతిసారెc దుల కించుచుండెను. అందు వలయాకారముగ నడుమనున్న చప్పరము పుష్యరాగములతోc జేయcబడినది. ఆ చప్పరమునకుc బగడపు స్తంభములుండెను. అనేక చిఱుగంటలు వైడూర్యమణి విరచితములు దాని పయినున్న కలశము తళతళ ప్రకాశించు గోమేధికములతో నయినది. దానికిc గట్టcబడియున్న టెక్కెమున రాజు జయవిరుదచిహ్నము లుండెను. అలం. ఉత్ప్రేక్షయు, ఉదాత్తమును.

తే. తెచ్చిన ననేకచక్రసందీప్తమును న,తీతహరిదశ్వమును జగద్విశ్రుతోరు
సారథియు నై సయమ్మహాసారసహితు, నరద మగుడయ్యె జనలోచనాబ్జములకు.

అ. తెచ్చినన్=సారథి రథమును దోలుకొని తేcగా, అనేక...దీప్తమును—అనేక=పెక్కులయిన, చక్ర=బండి కన్నులచేత, సందీప్తము = మిక్కిలియుc బ్రకాశించు చున్నదియు, సూర్యరథమో యొకటె బండికల్లుగలదనుట. అతీ...దశ్వమును—అతీత = అతిక్రమింపcబడిన, హరిత్=దిక్కులుగల, అశ్వము = గుఱ్ఱములు గలదియు - అనcగా దిక్కులనుగూడ దాటిపోవునట్టి గుఱ్ఱములు గలది యని యర్థము. సూర్యుని గుఱ్ఱములో అతీతములుగాని హరిత్తులుగలవి యనుట - హరిద్వర్ణముగల గుఱ్ఱములుగలవని భావము. ' దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చతాః ' అను. హరిత్తనcగా గుఱ్ఱమును వచ్చనియు, జగ...సారథియున్ — జగత్ విశ్రుత = జగమునం బ్రసిద్ధుcడయిన, ఉరు=గొప్పవాcడగు, సారథియును=సారథి గలదియని యర్థము సూర్యరథమో జగద్విశ్రుతుcడయిన ఉరుసారథి లేదనుట. జగద్విశ్రుతుcడయిన అనూరు సారథి గలదని భావము. ఐన...రథము—అయిన అమ్మహాసారస+హితు = ఆ (తామరలకు బాంధవుc డయిన) సూర్యునియొక్క రథమని యర్థము. అమ్మహాసార+సహితు=ఆ మహాబలములతోc గూడినవాcడయిన వసురాజుయొక్క రథమని భావము. జనలోచన+అబ్జములకున్ =జనులయొక్క నేత్రములనెడి కమలములకు, అరుదయ్యె=ఆశ్చర్యమయ్యెను. కమలములకు ఏకచక్రాదులతోcగూడిన సూర్యరథము పరిచితము. ఇది అనేకచక్రాదులుగలిగి, ప్రసిద్ధ సూర్యరథమునకు విలక్షణముగా నున్నదిగాన లోచనకమలములకు ఆశ్చర్య మయ్యెనని యర్థము. ప్రసిద్ధసూర్యుని రథము ఏకచక్రాదులు గలది. ఇది 'మహా' సూర్యుని రథము గనుక అనేకచక్రాదులు గలిగినదని మహచ్ఛబ్దసారస్యము. మిక్కిలి వెలపాడుగయిన రత్నములు మేటిగుఱ్ఱములు మొదలయినవానితోc గూడియుండుటవలన జనుల నేత్రకమలములకు వింతగాc జూపట్టెనని భావము. అలం ..

తా. సారథి తెచ్చిన యారథ మనేకచక్రములచేc బ్రకాశించుచు, దిక్కులనుగూడc గడచునట్టి మేటియశ్వములు పూన్పcబడ, జగత్ప్రసిద్ధుcడయిన గొప్పసారథితోcగూడి పొడచూపcగా నమూల్యమణిమయమయిన దానిని జూచి జను లాశ్చర్యపడిరి.

మ. ద్రవిణాధీశ్వరుc డాత్మరూఢవసునాథఖ్యాతిభీతిం గరం
బు విమానోత్తమ మంపెనో యన రుచింబొల్పారు నాస్యందనం
బవనీనాయకుc డెక్కె నొక్క మొగి శంఖారావముల్ వందిపుం
గవవాచావిభవంబు వేత్రధరహుంకారంబుc దోరంబుగన్. 144

అ. అవనీనాయకుcడు=రాజు, ద్రవిణాధీశ్వరుcడు=ధనమున కధిపతియైన కుబేరుcడు, ఆత్మ... భీతిన్—ఆత్మ=తనయందు, రూఢ=ప్రసిద్ధమై యుండెడు - తనకే వాచకమై యుండునట్టి యనుట. వసు...భీతిన్—వసునాథ (వసురితి నాథః)=వసురాజనెడి, ఖ్యాతి=ప్రసిద్ధిచేతc బుట్టిన, భీతిన్=భయ

ముచేత - సమానమయిన నామముగలిగి యుండుటకు భయపడి యనుట. లేక, వసునాథ(వసురాజస్య నాథః)=వసురాజునకు నాథుఁడగుటచే, ఖ్యాతిచేతఁ బుట్టిన భయముచేత ననుట - ఇతఁడు నాకు నాథుఁడని యెక్కుడు ప్రసిద్ధినొందుట కర్హుఁడాయని వసురాజునకుఁ గోపము వచ్చునను భయముచేత నని కొందఱు. (వసూనాం ధనానాం నాథః) వసువనఁగా ధనము, దానికి నాథుఁడని భావము. ఈ యర్థమున కనుగుణముగా ద్రవిణాధీశ్వరుఁడను పదమును బ్రయోగించినాఁడు, కరంబు=అప్పనమగు నట్లు, విమానోత్తమము=విమాన శ్రేష్ఠమును - అనఁగా పుష్పకవిమానమును, అంపెనోయనన్=పంపినాఁడో యన్నట్లు, రుచిన్=రత్నకాంతిచే, పొల్పారు ఆస్యందనంబు=ఒప్పుచున్న ఆరథమును, ఒక్కమొగిన్ = ఏకకాలమందు, శంఖారావముల్=శంఖధ్వనులును, వంది...విభవంబున్ — వందిపుంగవ=స్తుతిపాఠకోత్తములయొక్క, వాచా=వాక్కులయొక్క, విభవంబున్=వైభవమును, వేత్రధర హుంకారంబు=వెండిబెత్తముల వారియొక్క హుమ్మనెడి యదల్పులును, తోరంబుగన్ = హెచ్చునట్లుగా, ఎక్కన్=ఎక్కినవాఁ డయ్యెను. కుబేరునకును వసునాథుఁడని ప్రసిద్ధిగలదు; అందులకు వసురాజు తన పేరుగలిగి యున్నాఁడని కాని తనకు నాథుఁడని ప్రసిద్ధిగలిగియున్నాఁడని కాని కోపించునోయని భయపడి కుబేరుఁడు తన విధేయతను జూపుటకై యప్పనముగాఁ దన పుష్పకవిమానమును బంపెనో యన్నట్లు వసురాజు రథముండెనని యుత్ప్రేక్ష. ద్రవిణాధీశ్వరుఁడు సాభిప్రాయముగాన పరికరాంకురమును, ఆరథము, పుష్పకనిమానమువలె వైశాల్యమును నమూల్యమణి విరచితమును నతిసుందరమునై యుండెననియు వసురాజు దిక్పాలురకంటె నతిశయించిన వీర్యముగలవాఁడనియు నాశయము.

తా. వసురాజు కుబేరుని పుష్పకవిమానమువలెనున్న యామేటిరథము నారోహింపఁగానే, శంఖధ్వనులును వందిస్తోత్రములును, వెండిబెత్తములవారి సాహోనినాదములును మిక్కుటముగా బోరుకొనెను.

చ. *పొడగన వేళ యబ్బె నని పొంగి కళింగ శకాంగముఖ్యు ల
య్యెడ నెడ యీక క్రిందుకొని యెల్లెడలన్ వెడలంగ వారిబల్
తొడవుల రాలి ముత్యములు తోరములై తొరఁగెం బురంబున
ల్గడలఁ బ్రసూనకోరకనికాయము నింపినసొంపు పెంపునన్. 145

అ. కళింగశకాంగముఖ్యులు = కళింగదేశ, శకదేశ, అంగదేశ రాజులు మొదలయినవారు, పొడగనన్=దర్శనము సేయుటకు, వేళ=సమయము, అబ్బెన్ అని=దొరకెనని, పొంగి=సంతోషించి, అయ్యెడన్=ఆ సమయమందు, ఎడయీక=సందియ్యక, క్రిందుకొని=దొమ్మిగాఁగూడి, ఎల్లెడలన్= అన్ని దిక్కులనుండి, వెడలంగన్=బయలుదేఱఁగా, వారి బల్ తొడవులన్=వారి గొప్పభూషణముల నుండి, రాలి, ముత్యములు, తోరములై=అధికములై, పురంబు నల్గడన్=పట్టణపు నాలుగు దిక్కుల యందును, ప్రసూన...నికాయము—ప్రసూనకోరక=పూమొగ్గలయొక్క, నికాయము=సమూహమును, నింపినసొంపు పెంపునన్ = నిండుగాఁ బోసినట్టి యందముయొక్క యతిశయముతో, తొరఁగెన్ = రాలిపడెను. 'ఎల్లెడల' నుండి వచ్చుటంబట్టియే పురంబు 'నల్గడలను' తొరఁగెను. పట్టణము నలుప్రక్కలను దొరఁగుటంజేసి నలుప్రక్కలను రాజులు వచ్చుచుండిరనియు, ఊరక వచ్చుటకాక ఎడయీక క్రిందుకొని వచ్చుటచే వారసంఖ్యాకులై యుండిరనియు దీనిచేత వసురాజు సకలదిక్కులను గెలిచి లెక్కలేని రాజులను గ్రిందుపఱచియుండెననియు వ్యంజితములు. 'ఎడయీక క్రిందుకొనుటం' జేసి తొడవులనుండి ముత్యములు రాలుట. వేళయబ్బెనని పొంగుటచే

* పొడఁగనువేళ.

చిరకాలముగా వేచియుండుటయు కేవలురుగాక కళింగాది దేశాధిపతు లట్లు వేచియుండిరనుటచే నారాజు ప్రభుత్వాతిశయమును సూచితములు. అలం. నిదర్శన.

వ. అప్పు డప్పురందరవైభవుండు మణిచాపశరకలాపరాజితంబును, మదాంధరాజహంసోద్వేజకకూజితంబును, మంజుతరకంజరాగపుంజపింజరితమరీచిమంజరీ సంజనిత సమంజస సౌదామనీ ధామంబును మౌక్తికవితానదంతురితాంతరాభిరామంబును మహానీలకిరణ ధోరణీ సంస్ఫారిత వినీలశాద్వలంబును నగు నరదంబు నధివసించి సముజ్జ్వలిత హేతిధరవిభ్రమంబులు నుద్దండదండధర సంభ్రమంబులును, నుష్ట్రప్రయాణ వాగ్విశేషంబులు నుజ్జృంభిత వాహినీశ్వర రసోన్మేషంబులు నుద్ధూతకేతనానిల కోలాహలంబులు, నున్నత రాజరాజభజన కౌతుహలంబులు నుగ్రసేనాగణ కిలకిలంబులు నవధరించుచు నానందనోద్యానరాజంబుఁ జేరం జనుసమయంబున. 146

అ. ఈ వచనమునం దొలుత నను రాజును 'పురందరవైభవుం'డని చెప్పుటచేత రాజపరముగాను ఇంద్రపరముగాను నర్థద్వయము గ్రహింపవలయును. ఎట్లనిన—అప్పుడు = ఆ సమయమగు సమయము నందు, అప్పురందరవైభవుండు = ఇంద్రుని వైభవముగల యానరునరాజు, మణి...రాజితంబున— మణి చాప=రత్న మయమయిన చాపముచేతను, మణిచాపమనఁగా ఇంద్రధనుస్సు. 'నేన్ద్రధనురితి పరస్మై ప్రబ్రూయాత్, యది బ్రూయాత్ మణిధనురిత్యేవ బ్రూయాత్' (ధర్మసూత్రకారః) శరకలాప= బాణములచేతను పొదులచేతను, రాజితంబును = ప్రకాశించుచున్నదియు, అని రాజ రథపరమయిన యర్థము. మణిచాప=ఇంద్రధనువుచేతను, శరకలాప=జల సముదాయముచేతను, రాజితంబును=ప్రకాశించుచున్నదియు నని మేఘరూప మహేంద్రరథపర మయినయర్థాంతరము. 'శరంనీరే' శరః కాండే. విశ్వ 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతే౽పిచ' అమ. మదా...కూజితంబును—(రథ) మదాంధ=మదముచేతఁ గన్నులు గానకున్న, రాజహంస=రాజశ్రేష్ఠులకు, ఉద్వేజక=భీతాకరమగుయిన, కూజితంబును=నేమి ధ్వనిగలది, (మేఘ)- నేమియనఁగా రథచక్రము అంచులు, మదాంధములయిన రాజ హంసలకు భీతాకరమయిన గర్జాధ్వని గలది, మంజుతర...ధామంబును—(రథ) మంజుతర=మిక్కిలియు మనోహరమయిన, కంజరాగ=పద్మరాగములయొక్క, పుంజ=సమూహముయొక్క, పింజరిత= పసుపురంగుగల (తారకాది ఇతచ్ప్రత్యయము) మరీచి=కాంతులయొక్క, మంజరీ=గుచ్ఛములవలన, సంజనిత=పుట్టిన, సమంజస=చక్కని, సౌదామనీ = మెఱపుఁ దీఁగలవంటి, ధామంబును=కాంతి గలది (మేఘ)-మంజుతర కంజరాగపుంజ పింజరితమరీచి మంజరివలె సంజనితమగుచున్న మెఱపు తీఁగలయొక్క కాంతిగలది 'తటిత్సౌదామనీ విద్యుచ్చఞ్చలా చపలాపిచ' అమ. మౌక్తిక...రామంబును - (రథ) = ముత్తెములు గూర్చిన, వితాన = మేలుకట్టుచేత, దంతురిత = వ్యాప్తమయిన, అంతర = మధ్యప్రదేశముచేత, అభిరామంబును = ఒప్పుచున్నదియు 'అస్త్రీవితాన ముల్లోచః' అమ. మౌక్తికవితాన= ముత్తెములసమూహముచేత, దంతురిత=వ్యాపింపఁబడిన, అంతర=ఉదరాంతరముచేత, అభిరామంబు= ఒప్పుచున్నది 'పూగోవితానం ప్రకరః' అమరశేషము. మేఘమందు ముత్తెములు పుట్టుటకు

'నీరదముల్ దిగంతముల • నిండి తటిద్ఘన గర్జితంబు లే
పార మహోగ్ర వృష్టిగురియం బ్రభవించి నితాంతకాంతితో

వారయఁ గుక్కుటాండ సమంబై పడు మత్స్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందురు వెసన్ • వసుధం బడకుండ నేర్పునన్' రత్నపరీక్ష.

మసార...శరదంబును—(రథ) మసారసార=ఇంద్ర నీలమణి శ్రేష్ఠములయొక్క, 'మసార మిన్ద్రనీలంస్యాత్' విశ్వ. కిరణ=కాంతులయొక్క, ధోరణీ=సరణిచేత, సంస్కారిత=లెస్సగా స్మరింపఁ జేయఁబడిన, వినీల=మిక్కిలి నల్లనయిన, శరదంబును = మేఘము గలదియు, (మేఘ) మసారసార కిరణధోరణీ సంస్కారితమయిన నీలమేఘమనుట. అగు అరదంబున్ = అయినట్టి రథమును, అధివసించి=ఎక్కి కూర్చున్నవాఁడై, సము...భ్రమంబులును—(రాజ) సముజ్జ్వలిత= మిక్కిలి ప్రజ్వరిల్లుచున్న, హేతి=ఖడ్గములను, ధర=ధరించినవారియొక్క, విభ్రమంబులును=వీరవిలాసములు, (ఇంద్ర)-హేతియనఁగా అగ్నిజ్వాలయు, హేతిధరుఁడనఁగా అగ్నిదేవుఁడు, సముజ్జ్వలితుఁ డగుచున్న అగ్నియొక్క విలాసములును 'రవేరర్చిశ్చ శస్త్రంచవహ్నిజ్వాలాచహేతయః' విశ్వ. ఉద్దండ...సంభ్రమంబులును—(రాజ)ఉద్దండ=ఉద్దండులయిన, దండధర=బాణాకఱ్ఱలు ధరించినవారియొక్క, సంభ్రమంబులును=ఉత్సాహములును, దండధరుఁ డనఁగా యముఁడు, ఉద్దండుఁడయిన యమునియొక్కయుత్సాహములును, ఉన్నిద్ర...విశేషంబులును-(రాజ)ఉన్నిద్ర = వికాసయుక్తులయిన, పుణ్యాజన=సజ్జనులయొక్క, వాగ్విశేషంబులును=వాక్యవిశేషములును, (ఇంద్ర) పుణ్యాజనుఁడనఁగా నైరృతి, ఉన్నిద్రుఁడయిన నైరృతియొక్క వాగ్విశేషములును, ఉజ్జృంభిత...న్మేషంబులును—(రాజ)ఉజ్జృంభిత=మిక్కుటముగా విజృంభించుచున్న, వాహినీశ్వర = సేనానాయకులయొక్క, రస+ఉన్మేషంబులును=వీరరసంబు వికాసములును (ఇంద్ర) వాహినియనఁగా నది వాహినీశ్వరుఁ డనఁగా నదులకు రాజయిన వరుణుఁడు, రసమనఁగా జలము, ఉజ్జృంభితుఁ డగుచున్న వరుణునియొక్క జలోన్మేషములును, ఉద్ధూత...కోలాహలంబులును—(రాజ) ఉద్ధూత=ఎగురఁ గొట్టఁబడుచున్న, కేతన=ధ్వజపటముయొక్క, అనిల=వాయువుయొక్క,కోలాహలంబులును=కలకలధ్వనులను, (ఇంద్ర) ఉద్ధూత కేతనుఁడయిన వాయువుయొక్క కోలాహలములును,ఉన్నత...కౌతూహలంబులను—(రాజ)ఉన్నత=గొప్పవారయిన, రాజరాజ=రాజాధిరాజులయొక్క, భజన=సేవించుటయందలి, కౌతూహలములును = కుతుకములును, (ఇంద్ర) రాజరాజనఁగా కుబేరుఁడు. అతని సేనా కౌతూహలములును 'రాజరాజోధనాధిపః' అమ. 'ఉగ్ర...కలకలంబులును—(రాజ) ఉగ్రసేనా=భయంకరమయిన సేనయొక్క, గణ=సమూహము నందలి, కలకలంబులును=కలకల ధ్వనులును, (ఇంద్ర) ఉగ్రుఁడనఁగా శివుఁడు. అతనిసేనలైన ప్రమథగణముయొక్క కలకలములును, అవధరించుచున్ = చిత్తగించుచు, ఆనందన+ఉద్యాన రాజంబున్—ఆనందన=ఆనందకరమయిన, ఉద్యానరాజంబున్=ఆ రామశ్రేష్ఠమును, చేరంజనుసమయంబున=సమీపించి పోవుచున్న సమయమందని యర్థము. ఆ'నందన'వనమును సమీపించి పోవుచున్న సమయమందని యర్థాంతరము. ఇంద్రుని వనమునకు 'నన్దనం వనమ్' అన్నట్లు నందనమనిపేరు. దీనికి మీఁది పద్యముతో నన్వయము. అలం. శ్లేషము.

తా. ఆరాజు మేఘముపయి నారోహించి యష్టదిక్పాలకులు గొలువఁ నందనవనమునకుఁబోవు దేవేంద్రునివలె మణిమయమయిన యారథమునెక్కి కూర్చుండి, ఖడ్గధారులు దండధారులు సేనాపతులు, రాజరాజులు, సేనాసమూహములును బరివేష్టించి రాఁగాఁ దన యుద్యానవనమును జేరఁబోవు సమయమందు.

సీ. నృపమౌళిభవ సువర్ణపరాగములు సువర్ణపరాగములు నభిన్నత వహించె
గమనీయతపనీయకదళికా పవనంబు, గదళికాపవనంబుఁ గలసి మెలఁగె

లలితమాగధలోకకలకంఠగానంబు, కలకంఠగానంబు నలమికొనియెఁ
దతవాదకసమీరహత కిన్నరీరుతుల్, కిన్నరీరుతులు నేకీభవించె
తే. నపుడు చేరంగవచ్చినయవనిజాని, కవనిజానీక మచట సాష్టాంగ మెఱఁగెఁ
గేళివనబహిరంగణాక్షీణమధుర, మధురసఝరానుబింబసంభావనమున. 147

అ. నృప...పరాగములు—నృప=రాజులయొక్క, మౌళి=కిరీటములవలన-కిరీటముల రాపిడివలన, భవ=పుట్టిన - రాలినయనుట, సువర్ణపరాగములు = బంగారు రాపొడులును, సువర్ణపరాగములు = సంపెంగ చెట్లయొక్క పుష్పొడులును - బంగారు పేళ్లు సంపెంగకును కల్లునని తెలియునది. అభిన్నతన్ = భేదము లేమిని - వేఱుగాక పోవుటను, వహించెన్ = తాల్చెను, కదళి యనఁగా ధ్వజమును కదళీ వృక్షమును. 'కదళీ వైజయన్త్యాం చ రమ్భాయాం హరిణాన్తరే' విశ్వ. కమనీ... పవనంబుల్—కమనీయ=మనోహరమైన, తపనీయ = బంగారు మయమయిన, కదళికా=ధ్వజమును సంబంధించిన, పవనంబు = వాయువును, కదళికాపవనంబుల్ = కదళీవృక్షసంబంధియైన వాయువును, కలసి=కూడికొని, మెలఁగెన్ =ప్రవర్తించెను. కలకంఠమనఁగా మధుర ధ్వనిగల కంఠమును కోయిలయును. లలిత=ఒప్పుచున్న, మాగధలోక =గానరూపముగా స్తుతిసేయు మాగధ జనులయొక్క, కలకంఠగానంబు=మధురధ్వని గలకంఠములచేతఁ బాడదు సంగీతంబును, కలకంఠ=కోయిలలయొక్క, గానంబుల్ =పంచమ స్వరగానములును, అలమికొనియెన్ =మిళితమాయెను.

శ్లో॥ 'రాజ్ఞః పురజనస్యాపి మఙ్గళాచార శంసనః ।
మాస్యైర్మాగధి కాగీతైర్మాగధా ఇత్యుదీరితాః॥' అని మాగధ లక్షణము.

తతవాదక=వీణలు వాయించువారియొక్క, 'తతం వీణాదికం వాద్యమ్' అను. సమీర... రుతుల్—సమీర=వాయువుచేత, హత=కొట్టఁబడుచున్న తీఁగలుగల, కిన్నరీ=కిన్నరయనెడి వీణల యొక్క, రుతుల్=నాదములును, కిన్నరీరుతుల్ = ఆఁడుకిన్నరపక్షుల నాదములను, ఏకీభవించెన్ = ఒకటి యయ్యెను. అపుడు=ఆసమయమందు, చేరంగన్ వచ్చిన = సమీపించి వచ్చిన, అవనిజానికిన్ = రాజునకు, అవనీజ+అనీకము=వృక్షముల సమూహము, అచటన్ = ఆ ప్రదేశమున, కేళివన=ఉద్యాన వనముయొక్క, బహిరంగణ=బయటి ముంగిలియందలి, అక్షీణ=తక్కువకాని, మధుర=తియ్యని, మధురస=మకరందముయొక్క, ఝర=ప్రవాహమందయిన, అనుబింబ సంభావనమునన్ =ప్రతిబింబమనెడు భావనచేత - నెపముచేత ననుట. సాష్టాంగము=ఎనిమిది యంగములతోఁ గూడినట్లుగా, ఎఱఁగెన్ = నమస్కరించెను. అనఁగా వనము వెలుపలి ప్రదేశమందలి మకరంద ప్రవాహమందు వనవృక్షములు ప్రతి ఫలింపఁగా అడ్డముగాఁ జాఁగియున్న యాప్రతిబింబములవలన, వచ్చిన వసురాజున కవి నేలం జాఁగి పడి నమస్కరించినట్లుండెనని యర్థము. వసురాజు కేళివని చేరంగ వచ్చెనుగాని యింకను జొరలేదు. కాఁబట్టి యతనికి నమస్కరించుట గళివని దాపుననే—యనఁగా వెలుపలనే—యుండవలయును. కాన కేళివన బహిరంగణమందలి మకరంద ప్రవాహమందుఁ బ్రతిబింబములు గ్రహింపఁబడెనని తెలియునది. సహోక్తియు వ్యాజోక్తియు చేకాన్ప్రాసము నలంకారములు.

తా. వసురాజుద్యానవనమును సమీపించిరాఁగా, రాజుల కిరీటముల రాపిడివలని రాపొడులు రాలి సంపెంగపుప్పొళ్లతోఁ గలసియుండెను. అరఁటులగాలియు టెక్కెముల గాలియు కలిసి కొనెను. మాగధుల మధురస్వరములును కోయిలల స్వరములును గూడికొనెను. కిన్నరీ వాద్యముల రుతులును, కిన్నరీపక్షులరవములును జేరికొనెను. ఆతోఁటవెలుపల నెడ తెగక ప్రవహించుచున్న పూఁదే

కెజాలునందు వృక్షములు ప్రతిఫలింపఁగా వాని ప్రతిబింబము లపుడు చేరవచ్చినరాజునకు నమస్కరించి నటులుండెను.

ఇట రాజురాఁగా సామాన్యముగాఁ జూడవచ్చిన సామంతుల యొరపిడివలని రజమునకును ధ్వజ వాయువునకును మాగధమధురస్వరములకును వీణాదివాద్యరవములకును బదులుగా, సంపెంగపుప్పొళ్లును అరంట్లగాడ్పులును కోయిలలరవళియు, ఆఁడు కిన్నరపక్షుల రుతులును, కేళీవని పచరించెననియు, దెలియునది. మఱి రాజు సమీపించి వచ్చునపుడు సాజారమున మొక్కువారివలె వృక్షములును ప్రతిబింబములచే మ్రొక్కినట్లుండెననుట తెలియునది.

క. కులపతియు వేత్రధరు *లొ, త్తిలి సాంగు భళాయనంగఁ దేరు డిగి మహీ
శులఁ గనిపి బలము నచటనె, నిలిపి యుపవనంబు సొచ్చెనిజహితయుతుఁడై.

అ. కులపతియుఁన్=వంశకర్తయైన, వసురాజును, వేత్రధరులు=వెండిబెత్తములవారు, ఒత్తిలి=ఒకనైపునకు నొరసిల్లి, సాంగుభళాయనంగన్=సాంగుభళాయని యెచ్చరిక సేయఁగా, తేరుడిగి=రథమునుండిదిగి, మహీశులన్=రాజులను, అనిపి=పంపి - సెలవిచ్చి పంపియనుట, బలమున్ = సేనను, అచటనె=అక్కడనే, వనముబయటనే, నిలిపి, ఉపవనంబున్=తోఁటనుచొచ్చి, నిజహితయుతుఁడై=తన యిష్టసఖునితోఁ గూడికొన్నవాఁడై, ముందటిపద్యముతో నన్వయము. రథ మారోహించినపుడును రథముదిగునపుడును వేత్రధరులు సాంగుభళాయని విఘ్నశాంత్యర్థముగాను విభవసూచకముగాను నెచ్చరిక సేయుట దేవతలకును రాజులకును సహజము. చంద్రవంశమునకుఁ గూటస్థుఁ డగుటంజేసి కులపతి యని యిటఁ జెప్పంబడుట తెలియునది.

తా. వంశకర్తయగు వసురాజు వెండిబెత్తములవారు సాంగుభళాయని యొరగిలి యెచ్చరికలు సేయఁగా రథముదిగి తనతోడవచ్చిన రాజులను వీడుకొలిపి సైన్యము నుద్యానవనమునకుఁ బీడ కలుగునని వెలుపలనే నిలిపి యాప్తసఖునితో సాతోఁటను జొచ్చి.

తే. ఘనతరఫలాన తాఖండకదళికలును, కీరరాజీకృతసజీవతోరణములుఁ
బొంగునెలమావికురుజులుఁ బభంగనవఫ,లావళులుఁ గాంచె నృపుఁడు వనాగ్రసీమ.

అ. నృపుఁడు=వసురాజు, వన+అగ్రసీమన్ =ఉద్యానవనము ముందటిప్రదేశమున, ఘన...కదళికలును—ఘనతర=మిక్కిలిగొప్పలయిన, ఫల=పండ్లగెలలచేత, ఆనత=వంగియున్న, అఖండ=సంపూర్ణమయిన, కదళికలును=అరఁటిచెట్లును, కీర...తోరణములు—కీరరాజీ = చిలుకలపంక్తులచేత - బారులుగా నున్నచిలుకలచేత, కృత=చేయఁబడిన, సజీవ=ప్రాణసహితములయిన, తోరణములు, పొంగు...కురుజులు—పొంగు=ఉల్లసిల్లుచున్న-ఎసరేఁగుచున్న, ఎలమావి = గుజ్జుమామిళ్లమొక్క, కురుజులును = బొంపములును, అభంగ...ఫలులున్—అభంగ=భంగమునొందని - చిలుకలు మొదలయినవానిచేఁ గొట్టబడనివియు, నవ=క్రొత్తలయినవియు, అగు, ఫలా+ఆవళులున్ - పండ్లసమూహములును. కాంచెన్ = చూచెను.

గొప్పరాజు వచ్చునపుడు పట్టణము, వనము గృహముమొదలగువాని ముందటిభాగములందు పండ్లగెలలతోఁ గూడిన యరఁటిచెట్లు రెండుప్రక్కలను నిలిపి పచ్చనితోరణములుకట్టి మామిడిచిగురు బొంపములు వ్రేలఁగట్టి చిలుకమున్నగు మొదలయినవానిచే భిన్నములుగాని పండ్లను ముందటఁ దట్టల

* లొత్తిలు.

యందుగానుకలుపెట్టి యిల్లలంకరించుటయును రాజాయలంకారములు గాంచుచుఁ బ్రవేశించుటయును, ప్రసిద్ధముగనుక వనాగ్రమసీమయందు స్వతస్సిద్ధములుగానున్న కదళీస్తంభాదులను వసురాజు చూచెనని తాత్పర్యము. అనఁగా వనముయొక్క ముందటిభాగమందును అప్రయత్నపూర్వకముగా నవి స్వతస్సిద్ధములై యుండెనని తెలియునది. అలం. సమాసోక్తి.

తా. రాజాయుద్యానవనము ముందటిభాగమునఁ దనరాకకై యలంకారములు స్వతస్సిద్ధముగా నలవడి యున్నట్లుంబోలె నున్నదై పెనుబండ్ల బరువులచే వంగియున్న యరఁటిచెట్లును వసంతర్తువు ఫలసమయముగాన ఫలాస్వాదనమునకై బారులు బారులుగాఁ దీరియున్న చిలుకల గుంపులును, చిగిర్చిన గుజ్జుమామిళ్ల జిగుళ్లజొంపములును, కొట్టుపడని పండ్లును, అరఁటిచెట్లు నడుమ తోరణములుగట్టి చిగురుకురుజాలను వ్రేలంజేసి పండ్లు నలుపాయె తినట్టు లమరియుండఁగా జూచుచుం బోయెను.

మ. అల చైత్రాంచితసత్త్రశాలికల నిష్టాహారతృప్తిం గుతూ
హలముల్ గాంచు ద్విజావళిన్ శ్రుతిహితావ్యాజానులాపంబుతో
నలఘుశ్రీకరశాఖికాంచలవినిర్యత్కేసరార్ద్రాక్షతం
బులు రాల్చెన్ సరిదేవరత్నమకుటీభూషావిశేషంబుగన్. 150

టీ. అల...శాలికలన్—అల=ఆ, చైత్ర = వసంతునిచేత, అంచిత=ఒప్పుచున్న, సత్త్రశాలికలన్=వనప్రదేశములందని యర్థము. చైత్రాంచిత=చైత్రమాసమందొప్పుచున్న, సత్త్రశాలికలన్=యజ్ఞశాలలయందు--లేక, సరతాన్నదాన శాలలందని యైనను నర్థాంతరము. 'సత్త్రమాచ్ఛాదనే యజ్ఞే సదా దానే వనేఽపిచ' అను. ఇష్టఆహారతృప్తిన్=ఇష్టమయిన యాహారములవలని తనివిచేత, కుతూహలముల్=సంతోషములను - ఉబ్బులననుట, కాంచుద్విజావళుల్=పొందుచున్న (చిలుకలు మొదలయిన) పక్షుల సమూహములని యర్థము - పొందుచున్న బ్రాహ్మణసమూహములని యర్థాంతరము. శ్రుతిహిత...లాపంబుతోన్--శ్రుతిహిత=చెవులకింపయినదియు, అవ్యాజ=ఒకకారణమునుబట్టి గాక సహజముగాఁ గలిగినదియు నగు, అనులాపంబుతోన్=కొలకొలమనిమాటికిఁ బలుకు పలుకుఁబడితోననుట. అలఘు...క్షతంబులు--అలఘు=అధికములును, శ్రీకర=శోభాకరము లునునగు, శాఖికా=కొమ్మలయొక్క, అంచల=కొనలవలన, వినిర్యత్=జాఱుచున్న, కేసరఆర్ద్రాక్షతంబులు=ఆర్ద్రాక్షతములవంటి- అనఁగా పసపుచేతఁ దడుపఁబడిన యక్షతలవంటి యకరువులను, సరి...విశేషంబుగన్--సరిదేవ = వసురాజుయొక్క, రత్నమకుటీ=మణిమయమయిన కిరీటమునకు, భూషావిశేషంబుగన్ = అలంకార విశేషమగునట్లుగా, రాల్చెన్=చల్లెను అని యర్థము. శ్రుతిహిత=వేదానుగుణమయిన, అవ్యాజ=వంచనమునకుఁ గాక మనఃపూర్వకమయిన, అనులాపంబుతోన్=వాక్కులతోడ, అలఘుశ్రీ=మిక్కిలియుశోభగల, కరశాఖికా=వ్రేళ్లయొక్క 'అఙ్గుళ్యః కరశాఖాః స్యుః' అను. అంచల=మొనలనుండి, వినిర్యత్ = వెడలుచున్న-పడుచున్నయనుట, కేసర-ఆర్ద్రాక్షతంబులు—కేసర = అకరువులవంటి, ఆర్ద్రాక్షతములను నరదేవరత్నమకుటీ భూషావిశేషమగునట్లుగాఁ జల్లెనని యర్థాంతరము. బ్రాహ్మణులు దీవించి చల్లుమంత్రాక్షతములు రాజకిరీటాలంకారములగుట ప్రకటము.

ఇచట వనప్రదేశములందు వసంతర్తువుచేఁ గలిగి పల్లవ పుష్పఫలాదులచే నిష్టాహారములం దనివి నొందిన చిలుకలు మొదలయిన పక్షులను అన్నదానశాలలందు నిష్టాహారములం దనివినొందిన బ్రాహ్మణులుగాను, ఆపక్షులుకేరి చెవికింపుగాఁ గొలగొలమను సహజధ్వనులను బ్రాహ్మణులు వేదసహితముగాఁ జెప్పు నాశీర్వాదధ్వనులుగాను, వానిచేఁ జెట్ల కొమ్మలనుండి రాలు పచ్చని యకరువులను బ్రాహ్మణుల

చేతఁగొని చల్లు పసపు అక్షతలుగాను శ్లేషచే నిబంధించినాఁడు. చైత్రమాసమందే యాగాదులు చేయంబడుట 'వసన్తసమయః శ్రీమాన్' ఇత్యాదిరామాయణాది సూక్తులచేత దెలియునది. ఇష్టాహారతృప్తిచేతనే, ద్విజులకు అనులాపము 'అవ్యాజ' మగుట తెలియునది. వసంతర్తువురాఁగా చిగుళ్లు పువ్వులు పండ్లుపూఁడేనెలును సమృద్ధముగాఁగలిగి పక్షులు తనివినొంది కొలకొలమని సహజధ్వనులు చెవి కింపుగాఁ జేయుచుండెననియు కొమ్మలు పువ్వులు పూచి పత్త్రచలనములచేత నకరువులు రాల్చుచుండెననియు ఫలితార్థము. దీనిచే బ్రాహ్మణులు తృప్తిప్రయుక్తముగను మనఃపూర్వకముగాను నక్షతలుచల్లి చేయు నాశీర్వాద ధ్వనులుగా వర్ణించుట తెలియునది. అలం. శ్లిష్టరూపకము.

ఉ. ఆదరణీయరామకథనాంకశుకోక్తులతోడఁ దీవము
త్తైదువచాలు శోభనపుటారతు లెత్తె సదాగతిన్ గిరి
క్షోదవినోదికిం జిగురుజొంపపుఁగెంపులపళ్లెరంబులం
బ్రోదిఁ దనర్చునగ్గలపుమొగ్గలు ముత్తెపుముగ్గు లీనఁగన్. 151

అ. తీవముత్తైదువచాలు=తీఁగలనెడి సువాసినుల పంక్తి, ఆద...తోడన్—ఆదరణీయ=మన్నింపఁదగిన, రామకథ=రామరామఅని చెప్పుటయే, అంక=గుఱుతుగాఁగల, శుక=(రామ) చిలుకలయొక్క, ఉక్తులతోడన్ = పలుకులు అనెడు రామనామాంకములైన చిలుకపలుకులవంటి పలుకులతోడ సదాగతిన్=వాయువుచేతనని యర్థము. శుభాగమనముచేతనని యర్థాంతరము. చిగురుజొంపపు కెంపుల పళ్లెరంబులన్=ఎఱ్ఱని చిగురాకులగుత్తులనెడు కెంపులతోఁజేసిన పళ్లెరములందు, ప్రోదిన్=పెంపుచేత, తనర్చు అగ్గలపు మొగ్గలు = మిక్కుటమయిన తెల్లనిపూమొగ్గలు, ముత్తెపుముగ్గులు=ముత్యాలరంగవల్లులను, ఈనఁగన్ = కల్పించుచుండఁగా, గిరిక్షోదవినోదికిన్ = కోలాహలపర్వత భంజనవినోదియైన వసురాజునకు, శోభనపు ఆరతులు=మంగళములగుహారతులు, ఎత్తెను. అనఁగా ఉద్యానమందుఁ బువ్వులత లెఱ్ఱనిచిగురుటాకుల జొంపములతోడను దెల్లని పూమొగ్గలతోడను మలయమారుతముచేతఁ గదలియాడుచుండఁగా వానిమీఁదనుండి చిలుకలు రామరామయని పలుకుచుండెనని తాత్పర్యము.

ఇట ముత్తైదులహారతులు చెప్పఁబడెను. పళ్లెరములో ముత్తెములను ముగ్గులుగాఁ దీర్చి దానిచే నివాళించుట వాడుక. ఇట చిగురుజొంపములు కెంపులపళ్లెరముగాను అందలి మిక్కుటముగా నున్న తెల్లనిమొగ్గలను ముత్తెపుముగ్గులుగాను జెప్పినాఁడు. గాలి అల్లలాడించుటయె ఆరతిత్రిప్పుట. 'గిరిక్షోదవినోదికిన్' కొండనెగఁజిమ్ముట యొకవేడుకగాఁగల మహాబలుఁడు గావుననే గౌరవార్థమీ హారతి. 'సదాగతిన్' శుభాగమనాది సూచకమేకదా హారతి. 'రామకథనాంక' రామరామయను రామచిలుకలపలుకులే గాముని చెప్పుటతోఁగూడిన పలుకులు—అనఁగా ముత్తైదువ లారతులిచ్చునపుడు రామునిగూర్చిన పెండ్లిపాటలు మొదలగువానిని చిలుకపలుకులతోఁ బాడిరనుట. ఇంవలంకారము. రూపకము. 'ముత్తెపుముగ్గులీనఁగన్' అనుచో నిదర్శన.

మ. అలరారెన్ నెలతాలఁ గట్టినమహీజావాలముల్ గొన్ని స
త్ఫలసాంద్రంబులు గొన్ని పల్లవరుచిప్రాగ్భారపట్టాంబరో
జ్జ్వలముల్ గొన్ని సమగ్రశారదరుజోజాలంబులై మాధవుం
డులుపానించినరౌప్యపాత్రికలు నానొప్పెన్ నృపాగ్రంబునన్. 152

అ. 'అలచైత్రాంచిత' అనుపద్యమున అక్షతలతోడి బ్రాహ్మణాశీర్వాదములనను 'ఆదరణీయరామ' అనుపద్యమున ముత్తైదువల మంగళమైనహారతులును వచరించి యీపద్యమునందు వసంతుఁడు పెట్టి

వెండిపాత్రల కానుకలను బచరించుచున్నాఁడు. అలరారిన్ = ఒప్పుమీఱఁగా, నెలఱాలన్ = చంద్ర కాంతమణులతో, కట్టిన మహీజ+ఆవాలముల్ = కట్టఁబడిన వృక్షములయొక్క పాదులు, కొన్ని, సత్ ఫలసాంద్రంబులు = మేలయినఫలములచేత నిండియున్నవి యును, కొన్ని, పల్ల...జ్జ్వలముల్---పల్లవ = ఎఱ్ఱనిచిగురుటాకులయొక్క, రుచిప్రాగ్భార = కాంతి యతిశయమనెడి, పట్టాంబర = ఎఱ్ఱపట్టుతాపితా లచేత, ఉజ్జ్వలముల్ = ప్రకాశించుచున్నవి యును, కొన్ని, సమగ్ర...జాలంబులు--సమగ్ర = సంపూర్ణ మయిన, శారద = ఏడాకు లరఁటిచెట్లయొక్క, రజోజాలంబులు = ధూళిసమూహములు-కర్పూరసముదాయ మును గలసినవియును, 'సప్తపర్ణోవిశాలత్వక్ శారదో విషమచ్ఛదః' అమ. ఐ = అయినవై, మాధవుండు = వసంతుఁడు, 'మాధవస్తు వసన్తస్స్యాత్' విశ్వ. ఉలుపా = కానుకలు, నించినరౌప్య పాత్రికలు = నించి నట్టి వెండిపళ్లెరములు, నాన్ = అనునట్లుగా, నృపాగ్రణులన్ = వసురాజుమొదలు, ఒప్పెన్, రాజులకు వెండిపళ్లెరములందు మంచి మంచిఫలములును బట్టుతాపితాలను సర్పూరమునుంచి యెదు టఁగానుక పెట్టుటసహజము. ఇట చంద్రకాంతములచేతఁ గట్టినపాదులను వెండిపాత్రికలుగాను, అంకురాలిన ఫలాదులను గానుకలుగాను గవి నిరూపించినాఁడు. వసంతర్తువగుటచేఁ గొన్నిచెట్ల యందుఁ బండ్లు చక్కఁగాఁ దమంతఁ బాఁదులందుఁ జొరఁగియుండెననియు, కొన్నిటఁ జిగుళ్లు మిక్కి లియుఁ జిగిర్చి జొంపములుగా పాదులందు రాలియుండెననియు, ఏడాకు లరఁటిచెట్లనుండి కర్పూర రజమును నిండుగా రాలియుండెననియు ఫలితార్థము. పల్లవ పుష్ప ఫలసమయము వసంతము. ఏడాకు లరఁటులును అపుడే ఫలించుటను తెలియునది.

తా. చంద్రకాంతపుగాలచేఁ గట్టంబడిన పాదులుకొన్నింట దట్టములుగాఁ బండ్లును, కొన్నిట నెఱ్ఱపట్టుతాపితాలవంటి జిగురు జొంపములును, కొన్నింట ఏడాకు లరఁటులనుండి కర్పూరపురజము ను, రాలియుండుటను జూడఁగా మన్మథుఁడు రాజుమొదలు వెండి పళ్లెరములలోఁ బండ్లును బట్టుతాపి తాలును కర్పూరపు సిరమును గానుకలు పెట్టెనోయనునట్లుండెను. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

మ. కలకంఠార్భటి నొండొరుం బిలుచుచున్ గాఢచ్ఛదాచ్ఛాదికల్  
వ్రాలయంగా నవగంధబంధురరజంబుల్ చిందఁగా జాలకం  
బులు గాసింబడఁగా నికుంజనిలయంబుల్ మీఱి వాయుత్వరం  
దలసూపెం బ్రతతీసతీవితతి గోత్రాకాంతుఁ డేతేరఁగన్. 153

అ. గోత్రాకాంతుఁడు = భూకాంతుఁడయిన వసురాజు, ఏతేరఁగన్ = రాఁగా, ప్రతతీ సతీ వితతి - ప్రతతీ = తీఁగలనెడి, సతీ = స్త్రీలయొక్క, వితతి = సమూహము, కలకంఠ = కోయిలల యొక్క, ఆర్భటిన్ = బిట్టురవళియనెడి, కల = అతిమధురమయిన, కంఠార్భటిన్ = కంఠనాదము చేత, ఒండొరులన్ = ఒకరినొకరు, పిలుచుచున్, గాఢ...ఛాదికల్---గాఢ = దృఢమయిన, ఛద = ఆకులనెడు, ఆచ్ఛాదికల్ = మేలిమునుంగులు, వ్రాలయంగాన్ = తొలఁగిపోఁగా, నవ...రజంబుల్—, నవ = క్రొత్తలయిన, గంధ—గంధమనఁగా పరిమళమును అలందికొనుటకుఁ దీసి వగంధమును గనుక పరిమళముచేత, బంధుర = మనోహరమగుచున్న, రజంబులు = పుప్పొడులనెడి, రజంబులు = అంగ రాగపుపొళ్లు, చిందఁగాన్ = చెదిరిపోఁగా, జాలకంబులు = జాలకములనఁగా పూమొగ్గలును గవాక్షము లును - పూమొగ్గలనెడి కిటికీలు, గాసింబడఁగా = ఒత్తుడుపడఁగా, 'జాలం గవాక్షఆనాయే కోరకేదమ్భ బృన్దయోః' విశ్వ. నికుంజనిలయంబుల్ = పొదరిండ్లనెడు గృహములను, మీఱి = అతిక్రమించి, వాయు త్వరన్ = వాయువుయొక్క వేగముచేతనని యర్థము. వాయువేగమువంటి వేగముచేతనని యర్థాంత

రము. తలచూపెన్ = పొడచూపెను.—అనఁగా నుద్యానవనమందు మలయమారుతము వీచుచుండఁగాఁ బొదలలోనున్న తీఁగలు కోవెలలు నాదములు చేయఁగా, పైయాకులు తొలఁగిపోవఁగాఁ, బుప్పొడులు రాలఁగాఁ బూమొగ్గలు గానిపడఁగాఁ బొదరిండ్లుదాఁటి పైకివచ్చెనని తాత్పర్యము. ఇందు రాజు వీథులందు రాఁగా పురస్త్రీలు మేడలపయినెక్కి చూచుటగా వర్ణింపఁబడినది. రాజు వచ్చినాఁడని తెలియఁగానే స్త్రీలొకరినొకరు బిలుచుకొనుచు మెయిగొండ పట్టుగా ముసుఁగులు వైచుకొని మేన నలందియున్న గంధములు చిటిలిపొడియై రాలఁగాఁ దమ గృహములోపలనుండి వాయువేగమునఁ గిటికీలు తొందరగాఁ దెఱచి తల నిక్కి చూచుచున్నట్లుండెనని వర్ణనము. అలం. శ్లిష్టరూపకము సావయవము.

చ. జనపతిదారసిల్ల నొక సంపెఁగతావులకొమ్మ రాగవ
ద్ఘన సుమనోభిరామ యయి కాఁక వహింపఁగఁబోలుఁ గానిచో
ననుపమపంచసాయక కరాంచలచంచలచాపశింజినీ
జనితకఠోరఝుంకృతులు సైఁపక యున్నె పరాగపాండువై. 154

అ. రాజును జూడవచ్చిన స్త్రీనిగా ఆయాలతికలను వేఱువేఱ వర్ణించుచున్నాఁడు—జనపతి= రాజు, దారసిల్లన్ = సమీపమునకు రాఁగా, ఒక సంపెఁగతావులకొమ్మ = ఒకానొక సంపెంగచెట్టు వాసనగల కొమ్మయనెడు సంపంగెపువ్వుల వాసనగల స్త్రీ, ఇది కర్తృపదము. రాగ...రామయయి— రాగవత్ = అనురాగముగలదియు, ఘన = అతిశయమైనదియు, సు = లెస్సయినదియు, అగు, మనః= మనస్సుచేత, అభిరామయయి = ఒప్పుచున్నదై యని యర్థము. రాగవత్ = గౌరవర్ణముగల, ఘన సుమనోభిరామయయి = ఘనమయిన పుష్పములచేత నొప్పుచున్నదై యని భావము. కాఁకన్ = విరహపు తాపమును, వహింపఁగన్ పోలున్ = తాల్పఁబోలునని యర్థము. సంపెంగపువ్వులందుఁ గాఁక గుణముగలదని భావము. కానిచోన్ = లేనియెడల, పరాగపాండువై = పుప్పొడివలెఁ దెల్లని వర్ణముగలదై—అనఁగా విరహతాపముచేతఁ దెల్లపడిన దేహముగలదై యనియర్థము. పుప్పొడిచేతఁ దెల్లగానున్నదని భావము. అనుపమ...ఝుంకృతులు—అనుపమ = సాటిలేని, పంచసాయక=మన్మథునియొక్క, కరాంచల = హస్తము మొనయందు, చంచల=చలించుచున్న, చాప = ధనువుయొక్క, శింజినీ = తుమ్మెదలుచాలుచేత రచింపఁబడిన నారివలన, జనిత= పుట్టింపఁబడిన, కఠోర = పరుషములయిన, ఝుంకృతులు=ఝుంకారములను, సైఁపకయున్నె = సహింపలేక పోవునాయని యర్థము. అనఁగా విరహతాపమును బొందకయున్నయెడల సహించునుగదా యనుట. విరహులు మన్మథచాపశింజినీధ్వనులను సహింపలేకపోవుట ప్రసిద్ధమేకదా. సంపెంగకును దుమ్మెదలకును విరోధము గనుక సంపఁగికొమ్మ తుమ్మెదలయొక్క ఝుంకారమును సైఁపదని భావము. ఇచట తుమ్మెదల ఝుంకారమును మన్మథచాపగుణధ్వనులుగా అధ్యవసించినాఁడు. అనఁగా వసురాజు సమీపమున నొకసంపెఁగ పువ్వులకొమ్మ స్వభావసిద్ధమయిన యుష్ణగుణముగలిగి పుప్పొడిచేతఁ గప్పఁబడినదై తుమ్మెదలులేక కనఁబడెనని తాత్పర్యము. అలం. రూపకమును, పర్యాయోక్తమును.

చ. చలితలతాంతకాంతి యనుచందురకావిచెఱంగు దాఁటి స
మ్మిళితవయోవిలాసముల మీటినవిచ్చుఫలస్తనాగ్రముల్
వెలువడఁ గప్పెఁ దత్క్షణమ వేల్లితదోహదధూపధూమకుం
తలములు విప్పి దాడిమలతా*లలితాంగి నృపాలు చెంగటన్. 155

* వినతాంగి - వినుతాంగి.

అ. మఱియొకలతను స్త్రీనింబోలె వర్ణించుచున్నాఁడు. దాడిమలతాలలితాంగి-దాడిమలతా, దాడిమకొమ్మయనెడు, లలితాంగి = స్త్రీ, చలిత...కాంతి—చలిత = కదల్పఁబడిన, లతాంత కాంతి = ఎఱ్ఱని పూవుయొక్క కాంతియనెడు, చందురకావి చెఱంగుల్ = చంద్రకావి పైఁటకొంగును దాఁటి=కడచి - తొలఁగఁద్రోచికొని, సమ్మి...లాసములన్—సమ్మిలిత=సమకూడియున్న, వయోవిలాసములన్=పక్షిచంచువుల విలాసములచేతనని ఘలపరమయిన యర్థము. యౌవనవిలాసములచేతనని స్తనపరమైన యర్థము. 'ఖగబాల్యాదినోర్వయః' అమ. మీటినన్ = మీటినయెడ, విచ్చుఫలస్తనాగ్రముల్-విచ్చు=విరియుచున్నట్టి,ఫల=ఫలములనెడి, (మీఁటినవిచ్చు) గోటమీఁటినయెడ విచ్చిపోవునట్లుగానున్న, ఫలస్తనాగ్రములు=ఫలములవంటి కుచములయొక్క కొనలు, నెలువడన్=బయలుపడఁగా, తత్క్షణమ=అపుడే, వేల్లి...తులనములు—వేల్లిత=వంకరలయిన 'ఆవిద్ధం కుటిలం భుగ్నం వేల్లితం వక్రమిత్యపి' అమ. దోహద=దోహదమును సంబంధించిన, ధూపధూమ=ధూపముయొక్క ధూమరేఖయనెడు-ఇక్కడ దానిమ్మచెట్టునకు ధూపములు వేయుట దోహదముగా తెలియునది. కుంతలనములు = తలవెండ్రుకలు, విప్పి = విడఁదీసి, కప్పెన్ =ఫలస్తనాగ్రములను గప్పెను. వస్త్రహీనత కలిగినప్పుడు తలవెండ్రుకలచేత మానసంరక్షణము చేసికొనుట స్త్రీలకు స్వభావము.

దోహదమనఁగా తరులతాదులం దకాలమునఁ బుష్పఫలాదులు కలిగించు ద్రవ్యమునకును నట్లు కలిగించుటకును పేరు. 'తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతమ్ । పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యాత్తుతత్క్రియా'అని తెలియునది. యువతులకు చంద్రకావిపయ్యఁట పొంపు. 'సమ్మి...లాసములన్' వయస్సుచే మిక్కిలి యుబ్బులగుటంజేసి పయ్యంటలోన అడఁగవు. మఱి సుందరపురుష దర్శనమున రాగిణులకు పయ్యఁటజాఱుటయు చనుఁగవ యుబ్బుటయు స్వభావము. 'మీఁటినవిచ్చు' విగుళులయినవి కావున. రాజామోల యగుటచేఁ దలవెండ్రుకలు విప్పి వానిని గప్పుట.' మీటిన విచ్చుగుబ్బచనులు' (మనుచరి) 'మీటినవిచ్చుచనుదోయి' (విజయ)

అనఁగా వసురాజునకు దాపున నొక దాడిమచెట్టుకొమ్మ యెఱ్ఱని పువ్వులయొక్క కాంతి నతిక్రమించి చిలుకలు మొదలయిన వానిచేతఁ బొడువంబడి మొనలు పగిలినవై దోహదధూపముచేతఁ గప్పంబడిన పండిన పండ్లతోఁ గనుపట్టెనని తాత్పర్యము.

సీ. చిగురుఁ గెంగేలు సాఁచె రసాలవల్లరి, తేఁటిచూపులఁ జూచెఁ దిలకలతిక
[illegible]కగీతిఁ బాడి చూపెఁ బ్రియాళులత పల్కెఁ, గీరభాషలఁ గర్ణికారశాఖ
ముఖరక్తి నిం[illegible]పు గలసంపెఁగకొమ్మ, వన్నెగా నగియెఁ దేఁబొన్నతీఁగ
సురభిళశ్వసనంబు నెరపె సింధుకవల్లి, క్రుచ్చెఁ దావులు పోఁకఁ గ్రోవిరెమ్మ
తే. యాత్తరుచిరోపచారంబు లధిపకల్ప,కంబునకుఁ దత్తదామోదగరిమఁ బెనుప
నంగనానిత్యకలితదోహదవిశేష, సన్నుతాచారముల నడిసన్నకతన. 156

అ. మఱికొన్నిలతలవ్యాపారముల నుపచారచేష్టితములుగా వర్ణించుచున్నాఁడు- అనఁగా రసా[illegible]గువానియందు స్త్రీలింగమహిమచేత స్త్రీత్వద్యోతన మగుచున్నది. గనుక వానిపల్లవస్ప[illegible]రాజునందుఁ జేయఁబడిన కరస్పర్శాదినర్మచేష్టలుగాను వసురాజనెడు కల్పవృక్షమునకుఁజే[illegible]హదవిశేషములుగాను జెప్పినాఁడు - ఎట్లనఁగా, అంగనా...చారములన్ —అంగనా=ర[illegible]లయిన స్త్రీలచేత, నిత్య=నిరంతరమును, కలిత=తమకుఁజేయఁబడుచుండెడు, దోహద[illegible]క్తదోహద విశేషరూపములయిన, సన్నుత=ప్రసిద్ధములైన, ఆచారముల=ఆచారముల

యొక్క, నడిసన్నకతనన్ = సంజ్ఞచేతననుట-ప్రసిద్ధిగాంచుటచేత - లేక వానియందు మిక్కిలిఅలవడి యుండుటచేత ననియుఁ జెప్పవచ్చును. ఆత్మ...చారంబులు — ఆత్మ = తమయొక్క - తాఁ జేయుచున్న, రుచిర = మనోహరములయిన, ఉపచారంబులు = కరస్పర్శము మొదలయిన దోహదోపచారములు, అధిప కల్పకంబునకున్ = వసురాజనెడు కల్పవృక్షమునకు, తత్...గరిమన్ -- తత్తత్ = ఆయా, ఆమోద = ముదముయొక్క, పరిమళముయొక్క యనియు, గరిమన్ = ఆధిక్యమును, పెనుపన్ = వృద్ధిఁ బొందించునట్టులుగా,

రసాలవల్లరి = తియ్యమామిడికొమ్మ యనెడి రసాలవల్లరియను పేరుగలనాయిక, చిగురుఁగేంగేలన్ = చిగురాకనెడు హస్తమును, చాఁచెన్ = వసురాజుపయికిఁ జాఁచెను - అనఁగా హస్తస్పర్శము చేసెననుట. ఇది కరస్పర్శరూపమయిన దోహదము. తియ్యమామిడి హస్తస్పర్శరూపమయిన దోహదము చేతఁ బూచునది గనుక నాపరిచయమును బట్టి హస్తస్పర్శము చేసిన దనిభావము. ఇట్లిమీఁద నెల్ల తత్తద్దోహద పరిచితిగల వృక్షశాఖాంగనలవలనఁ దత్తద్దోహద మాచరింపఁబడెనని తెలియునది. తిలకమనఁగా = బొట్టుగుచెట్టు, తిలకలతిక = బొట్టుగుకొమ్మ యనెడు తిలకలతికయను పేరుగల నాయిక, తేఁటిచూపులన్ = తుమ్మెదలనెడు చూపులచేత, చూచెన్ = చూచెను. ఇది వీక్షణరూపమయిన దోహదము. ప్రియాళు వనఁగాఁ బ్రేంకణము-ప్రియాళులత = ప్రేంకణపుఁదీఁగ యనెడు ప్రియాళులత యను పేరుగల నాయిక, పికగీతిన్ = కోకిలపాట యనెడుపాటను, పాడిచూపెన్ = గానము చేసెను. ఇట గానరూపమయినదోహదము. కర్ణికారశాఖ = కొండగోఁగు కొమ్మయనెడు కర్ణికారశాఖ నామనాయిక, కీరభాషలన్ = చిలుకపలుకులనెడు పలుకులచేత, పల్కెన్ = భాషించెను. ఇది సల్లాపరూపదోహదము. ముఖరక్తి యనఁగా శాఖాముఖమునందుండెడు పుష్పపురక్తిమయును, ముఖమిచ్చుటయును - ఇంపుగల సంపెఁగకొమ్మ = ప్రీతిగల సంపెఁగకొమ్మయను పేరుగలనాయిక, ముఖరక్తిన్ = శాఖాముఖకుసుమరక్తిమ యనెడు ముఖమిచ్చుటను గలుగఁజేసెను. ఇది ముఖరాగరూపదోహదము. లేఁబొన్నతీఁగ = లేతపొన్నతీఁగయనెడు లేఁబొన్నతీఁగ పేరుగలనాయిక, వన్నెగాన్ = వన్నెయనగా పువ్వులకాంతియును సొగసును - పువ్వ కాంతియనెడు నవ్వుచేత సొగసుగా నవ్వెను. ఇది హసితరూపదోహదము. శ్వసనమనఁగా వాయువును నిశ్వాసమును, సింధుకవల్లి = వావిలికొమ్మయనెడు సింధుకవల్లినామనాయిక, 'అథసింధుకః, సింధువారేంద్రసురసౌనిర్గుణ్డీన్ద్రాణికేత్యపి' అమ. సురభిశ్వసనంబున్ — సురభి = పరిమళముతోఁగూడిన, శ్వసనంబున్ = వాయువనెడి నిశ్వాసమును, నెరపెన్ = పొందించెను - ఇది ముఖవాయురూపదోహదము. తావులనఁగా వాసనలును గళాస్థానములును, క్రోవిరెమ్మ = క్రోవికొమ్మయనెడు క్రోవి రెమ్మయను పేరుగల నాయిక, తావులుసోఁకన్ = పరిమళములనెడు కళాస్థానములంటునట్లుగా, క్రుచ్చెన్ = కౌఁగిలించెను. ఇది యాలింగన రూపదోహదము. కల్పక మభీష్ట ఫలప్రదాయిగనుక సకలదోహదక్రియాయోగ్యమని తెలియవలయును. ఆ యావగలాండ్రు కల్పవృక్షమువలెఁ గామితభోగము లొసంగు నారాజునకు ఆ యాయనురాగంపుఁజెయ్వులు చేసెగనుట. ఆయావృక్షములకుఁ జేయఁదగిన దోహదక్రియలకుఁ బ్రమాణము.

శ్లో॥ 'అశోకశ్చరణాఘాతాద్వకుళో ముఖసీధునా। ఆలిఙ్గనాత్కురవకస్తిలకో వీక్షణేనచ।
కరస్పర్శేన మాకన్దో ముఖరాగేణ చమ్పకః। సల్లాపతః కర్ణికారస్సిన్దువారో ముఖానిలాత్।
గీత్యా ప్రియాళుర్నితరాం నమేరుర్హసితేనచ॥

అనఁగా అశోకవృక్షము పాదతాడనముచేతను, పొగడచెట్టు ఉమియుటచేతను, ఎఱ్ఱపువ్వుల పెద్దగోరంట కౌఁగిలించుటచేతను, బొట్టుగుచెట్టు చూచుటచేతను, మామిడిచెట్టు చేతనంటుటచేతను,

సంపెఁగచెట్టు ముఖరాగముచేతను, గొండగోఁగుచెట్టు సల్లాపముచేతను, పాదిరిచెట్టు ముఖవాయువుచేతను, గ్రేంకణపుచెట్టు గానముచేతను, సురపొన్న నవ్వుటచేతను, బుష్పించుచున్నవి. ఆయావృక్షము లాయాదోహదములచేత అకాలమందును బుష్పించుచున్నవని శాస్త్రము. (ఆరసాలవల్ల ర్యాదులు తమకు స్త్రీలుచేయు సన్నుతాచారములనే రుచిరోపచారములుగా అధిపకల్పకమనకుఁ జేసినవి. అధిపుఁడును గల్పకమును అగుటచే ఆనందమును బరిమళమును బచించు ఆమోదము శబ్దము చెప్పఁబడెను.) సీసము మొదటి రెండుపాదముల రూపకము. తక్కిన రెంట సమాసోక్తి.

తా. రాజుగారుఁగా తియ్యమామిడి కొమ్మయందలి క్రొంజిగురు నిక్కెను. బొట్టుగు చెట్టునుండి తేంట్లు చాలుగానిగిడెను. గ్రేంకణపుఁదీఁగయందలి కోయిల యింపుగాఁగూసెను. కొండగోఁగు కొమ్మయందు చిలుక కలకలపలికెను. సంపెఁగకొమ్మ ఎఱ్ఱనిపువ్వులతోఁ జూపట్టెను. లేఁతపొన్నతీఁగ తెల్లని పువ్వుల వన్నెగులుకుచుండెను. పాదిరితీఁగ గమగమయని మంచివాసనతోడి గాలిగుబాళించెను. క్రోవిరెమ్మయు వాసనలు బుగులుకొన చుట్టుబొదివెను.

మ. చనువొప్పన్ నగి పల్కి పాడి కని యాశ్వాసంబు నొందించి చే
కొని మో మిచ్చి కవుంగలించి తరులం గొన్నింటి మన్నించి యం
గన లయ్యో మము నెంత చేసి రను మం గంకేళియుం గేసరం
బును భూజానికి మ్రొక్కె గుచ్ఛవినతిం బూఁదేనెకన్నీటితోన్. 157

అ. అంగనలు=స్త్రీలు, చనువు ఒప్పన్=మన్ననయొప్పునట్లుగా, నగి=నవ్వి, పల్కి=సల్లాపము చేసి, పాడి=గానముజేసి, కని=చూచి, ఆశ్వాసంబునొందించి=ఊరటనుగలిగించి - ఆ నిశ్వాసమును నెరపియని భావము. చేకొని=అంగీకరించి - చేతముట్టియనిభావము, మోమిచ్చి=ముఖోల్లాసము కనఁబఱచి, కవుంగలించి=ఆలింగనముచేసికొని, గొన్నింటిని తరులన్ = గొన్నివృక్షములను - అనఁగా పూర్వపద్యమునఁ జెప్పంబడిన రసాలాదివృక్షముల నెనిమిదింటిని, మన్నించి=గారవించి - బహూకరించి యనుట. పూర్వోక్తములయిన హాసనము మొదలుగాఁగల దోహదక్రియ లెనిమిదియును మన్ననచేత జరిపెను నర్మచేష్టలనంటివిగాన నాక్రియలచేత వానిని మన్నించిరనుట. అయ్యో=అక్కటా, మమున్=మమ్ము, ఎంత చేసిరి=ఎంత యవమానముచేసిరో, మా చితివా, అనుమన్=అని - అనఁగా తన్నియుమిసినారనుట. అశోకము తన్నఁగాపూయునది యనియు, పొగడ ఉమియఁగాఁ బూయునది యనియును దెలియవలయును. కంకేళియున్=అశోకమును, కేసరంబును=పొగడయును, గుచ్ఛవినతిన్=పువ్వుల గుత్తి బరువువలని వంగుటయనెడు నమ్రత్వముచేత, పూఁదేనె కన్నీటితోన్=పువ్వుదేనెయను బాష్పముతోడ, భూజానికిన్=రాజునకు, మ్రొక్కెన్=నమస్కరించెను. ఉత్ప్రేక్ష. వంగి కన్నులనీరుగారగా మ్రొక్కుట తమకుఁ గలిగిన దుఃఖమును ప్రభువునకు మనవిచేసికొనుట యగునుగాన పూగుత్తుల బరువున వంగుటయు పూఁదేనెచేఁ గన్నీరును బచరించినాఁడు. అనఁగా అశోకమును బొగడయును స్త్రీకృతమయిన చరణాహతి ముఖసీధువు లనుదోహదములచేత దాము వంగునట్లు బటువుగాఁ బూచియుఁ గ్రిందికిఁ జాలుకొనునట్లు పూఁదేనె దొరుఁగుచును నుండెనని తాత్పర్యము.

మ. లలితైణాంకశిలాలవాల మను కేళాకూళిలో నీరువైఁ
జెలువొప్పన్ ధరియించి తోడనె మిళచ్చిక్రోడదంష్ట్రాదళ
త్ఫలరంధ్రంబులచే వెలార్చి జలసూత్రస్తంభముంబోని య
గ్గలపుంజాయలగుజ్జునారికడముం గాంచెన్ విభుం డయ్యెడన్. 158

అ. గుజ్జుటెంకాయచెట్టు నిచట జలసూత్ర స్తంభముగాఁ గవి వర్ణించుచున్నాఁడు. విభుండు= రాజు, లలిత...వాలము—లలిత=ఒప్పుచున్న, ఏణాంకశిలా=చంద్రకాంత శిలలచేత రచింపఁ బడిన, ఆలవాలము=పాదు, అనుకేళాకూళిలోనీరు=అనునట్టికుండులోని - అనఁగా జలయంత్ర సరస్సులోని - జలమును, పైకే = మీఁదిభాగమందు, పయినున్న కాయలందనుట, చెలువు ఒప్పన్ = అందము మీఱఁగా, ధరియించి=తాల్చి - అనఁగా పయినున్న కాయలలోకి నెగఁబీల్చుకొని, తోడనే = వెంటనే, మిళత్...రంధ్రంబులచేత్—మిళత్ = కూడుచున్న - నీళ్లెగఁబీల్చి కాయలలోఁ జేర్చుకొన్నతోడు తనే దానిని గొఱుక సమకట్టిన యనుట, చిత్రోడ=ఉడుతలయొక్క, 'చిత్రోడఃస్ఫూలదన్తకః' అమ. శేష. దంష్ట్రా=కోఱలచేత, దళత్ = బ్రద్దలగుచున్న, ఫల = కాయలయొక్క, రంధ్రములచేత్ = రంధ్రములచేత, వెలార్చి = బయలువెడలించి, కేళాకూళిలోని జలసూత్ర స్తంభమందలి నీరెగఁ బీల్చుకొని తోడనె వెడలఁ జల్లుచున్నదిగాన యట్లె యిదియు నీళ్లుకాయలలోని కెగఁబీల్చుకొని తోడనే వెలువరించుట కనువుగా నుడుతలుతోడనే కోఱలతోఁ గొఱుకుట ననుసంధించినాఁడు. జలసూత్ర స్తంభము= స్తంభమువలె నున్నజలయంత్రపు గొట్టమును, పోసి = పోలునట్టి, దీనిచే 'పోసి' క్రియాజన్యవిశేషణ మగుటఁ దెలియునని. అగ్గలపుం...కడముం—అగ్గలపుంజాయలు=దట్టమయిన, నీడలుగల, గుజ్జువారికడముం = గున్నటెంకాయచెట్టును, అయ్యెడన్ = ఆసన్నప్రదేశమందు, కాంచెన్ = చూచెను.

ఇచట చంద్రకాంత శిలారచితమయి నీళ్లు నిండియున్న పాదును చలువరాలచేఁ గట్టంబడు కేళాకూళిగాను, ఆపాదులోనున్న గుజ్జుటెంకాయచెట్టును, జలసూత్ర నాళముగాను దాని కాయ లుడుతలు కోఱలంగొఱికి పెక్కుతూంట్లు గావింపఁగా అతూంట్లనుండి బొట్లుగా నీరుగారుటను జలయంత్రము పయినున్న చిన్నబొందలనుండి నీరుతుంపరగాఁ జాఱుటగాను, రూపించినాఁడు. రూపకాను ప్రాణితమయిన యుపమయలంకారము. మఱియు నీడగల పట్టులందే కేళాకూళి యుండుట గలదుగాన వారికడమునకును నగ్గలపుంజాయలు చెప్పినాఁడు. 'నిదాఘాంశు నావళి వీడొ్క్నతమంబుఁగాంచి వనిలోవర్తించు మంచోయనన్' అనుచో జలయంత్రములదారిని మంచువలె జాఱుతుంపరలు చీఁకటియున్నచోట వర్తించుటను జెప్పుటచే చీఁకటిగా నధ్యవసింపఁబడిన చెట్ల దట్టంపు నీడయందు ప్రవర్తించుట తెలియుచున్నది. దీనింబట్టి కేళాకూళి నీడపట్టులయందే ప్రాయికముగాఁ గట్టంబడుట తెలియుచున్నది. కాన, యిచటను నీడలకలిమి చేతను ఔపమ్యపూర్తిసిద్ధించుటకై 'అగ్గలంపుఁ జాయల'ని చెప్పుట యగును.

రా జాసన్నప్రదేశమం దొకగున్నటెంకాయచెట్టును జూచెను. అది చంద్రకాంతపుపాదు గలిగి పయినున్న కాయల నుడుతలు కోఱలచే గంట్లు సేయఁగా నాగంట్లవలన నీరుబొట్లుగాఁ గార్చుచుండెను. దానిని జూడఁగా గేళాకూళిలోని నీరు జలయంత్రనాళము పయికిఁ బీల్చుకొని సన్నరంధ్రములదారిని వెదచల్లునట్లుండెను.

తే. నృపునెదుటఁ దేనెవాఁకలోనిబిడవిచల, దతనుపత్త్రాళిఫలసాంద్రమగుచునొక్క
నగముకై వ్రాలియేటిలోనాటియున్న, నాఁటి యున్నతనగరాజు నలువుఁదెలిపె.

అ. నృపునెదుటన్ = వసురాజునకు౦గల. తేనెవాఁకలోన్ = పూఁదేనెకాలువలో, నిబిడసాంద్రము - నిబిడ=దట్టమానట్టులుగా, విచలత్ = చలించుచున్న, అతను = గొప్పదయిన, పత్త్రాళి= ఆకులసమూహము చేతను, ఫల = కాయలచేతను, సాంద్రము = దట్టమయినది, అగుచున్,

ఒక్కనగము = ఒక్కవృక్షము, క్రేవాలి = ఒరగినదై, ఏటిలోన్ = శుక్తిమతీనదిలో, నాటియున్న = నాఁటుకొనియున్న, నాఁటి = ఆకాలమందలి, ఉన్నతనగరాజు = పొడవయిన పర్వతశ్రేష్ఠమగు కోలాహలములయొక్క, నలువున్ = చందమును, తెలిపెన్ = తెలియఁజేసెను. శుక్తిమతీ నదియందు క్రేవాలియున్న కోలాహలుని తలఁపించినదని యాశయము. అనగము ఆకులచేతను ఫలములచేతను సాంద్రమగుట వృక్షములచేతను బండలచేతను సాంద్రమగు పర్వతముతోడి సామ్యంపు దార్ఢ్యమునకు. మఱియు నగశబ్దము పర్వతవాచియునగుటచేతను శబ్దశక్తిచేతను బర్వతసామ్యము పోషితము. పర్వతసామ్యముచే వృక్షము పటుపును బొడవునుగలది యగుటయు వ్యంజితము. అలం. నిదర్శన. 'శైలవృక్షనగావగా' అమ.

ఉ. ఉన్నతి నన్నగాగ్రమున నున్న యొకానొకకిన్నరద్వయం
బన్నిఖిలోక్తివేదికపు డన్యదురాసదమైనయొక్కయా
సన్నశుభంబుఁ దిన్ననిప్రసన్ననిజోక్తులఁ దెల్పి తోన యేఁ
గె న్నరదేవపాదపవిభిన్నబృహన్నగకూటవాటికన్. 160

అ. ఉన్నతిన్ = నిక్కుతోడ - సుఖంపు పెంపుతోడ, అన్నగాగ్రమునన్ = ఆవృక్షము కొనయందు, పూర్వపద్యమునఁ జెప్పిన నగశబ్దమునే యిచటను బ్రయోగించుట కిన్నరదేవతావాచియగు కిన్నరశబ్దము నయిన మన్వయించుటకని తెలియునది. కిన్నరులు పర్వతాగ్రములందు వర్తించుట సహజముగదా. ఒకానొక కిన్నరద్వయంబు = ఒక కిన్నరపక్షి మిథునము, అన్నఖిల + ఉక్తివేదికిన్ = సకల జంతువులయొక్క పలుకులు దెలిసిన యావసురాజునకు, అపుడు = ఆసమయమందు, అన్యదురాసదము - అన్య = ఇతరులకు, దురాసదము = పొంద నలవిగానిది, ఐన, ఒక్కయాసన్నశుభంబున్ = ఒక సమీపకాల శుభమును, తిన్నని...క్తులన్ — తిన్నని = చక్కనివై, ప్రసన్న = ఆదరముతోఁ గూడిన, నిజ - ఉక్తులన్ = తమ భాషలచేత, తెల్పి = తెలియం జెప్పి, తోన = వెంటనే, నరదేవ...వాటికిన్ — నరదేవ = వసురాజుయొక్క. పాద = చరణమనెడు, పవి = వజ్రాయుధముచేత, భిన్న = భేద పెట్టఁబడినదియు, బృహత్ = పెద్దదియు అగు, నగ = కోలాహల పర్వతముయొక్క, కూటవాటికిన్ = శిఖరసమూహమునకు, 'కూటోఽస్త్రీ శిఖరం శృఙ్గమ్' అమ. ఏఁగెన్ = పోయెను - అనఁగా వసురాజును గోలాహల పర్వత గమనోత్సుకునిగాఁ జేయుట కోయనఁ గిన్నర మిథునం బాపర్వత శిఖరమున కరిగెనుట. 'నగాగ్రమునందుండిన కిన్నరమిథునం బుగాన, నగకూటవాటికిఁ బోయెనని చమత్కారము. అవి యానగమునకుఁ బోవుట వసురాజును సముతమచటికిఁ బోవునట్లు నుత్సుకునిఁ జేయుటకుఁగా నని భావము.

తా. ఆవృక్షము కొనయందున్న యొకానొక కిన్నరపక్షిజంటకవి యారాజు సమస్తజంతువుల భాషలు దెలిసినవాఁడుగాన నతనికి స్వల్పకాలములోఁ గలుగనున్న యొక శుభమును (అనఁగా గిరికాసందర్శనమును) తమ బాసను దెలిపి యతనిపదహతిచేఁ గొట్టువడిన కోలాహలపర్వతపుశిఖరములకుఁ బోయెను.

క. ఆలోకాద్భుత విహగయుగాలోకప్రీతివలన నతి లోకవయః
కోలాహలకోలాహల, లీలాహలహాలిక చెంగలించెం బతికిన్. 161

అ. ఆ...వలనన్ — ఆ = అట్టి. లోకాద్భుత = జగమున కాశ్చర్యకరమైన, విహగయుగ = కిన్నరపక్షి మిథునముయొక్క, ఆలోక = చూచుటవలనఁ బుట్టిన, ప్రీతివలనన్ = ప్రేమచేత, పతికిన్ = వసురాజునకు, అతి...హాలిక — అతిలోక = లోకాతీతమయిన, వయః = పక్షులయొక్క, కోలాహల =

కలకలధ్వనులుగల, కోలాహల=కోలాహలపర్వతమందు, లీలా=లీలావిహారమందలి, హాలహాలిక=తహతహపాటు, చెంగలించెన్=ఉద్రేకించెను. కిన్నరపక్షులు భూలోకమున కాశ్చర్యకరములనుట. ఆపక్షులను జూచుటవలన మక్కువపుట్టఁగానట్టి లోకాతీతము లయినపక్షులు కలకలధ్వనులు చేయుచుఁ గోలాహలముననుండును గాన నక్కడకుఁబోయి వానిని జూతమను తహతహపాటు పుట్టినదని యాశయము.

ఆ శ్వా సాం త ము.

మ. అవితోర్వీ నవఖండ ఖండపరశుజ్యా భోగిసాభోగభో
గవిభాస్వద్భుజదండ దండధర వీతశూరూక్ష నానావిప
క్షవిభుక్షేపక కాండ కాండభయ కృద్గంభీర భేరీమహా
రవదీర్ణాద్రిపిచండ చండబలధౌరంధర్యహర్యగ్రజా. 162

అ. అవిత...ఖండ—అవిత = రక్షింపఁబడిన. ఊర్వీనవఖండ = భూమియొక్క తొమ్మిది ఖండములు గలవాఁడా. ఖండపరశు...దండ—ఖండపరశు = శివునియొక్క 'భూతేశః ఖణ్డపరశుః' అను. జ్యా = వింటినారియైన, భోగి = సర్పముయొక్క - అనఁగా ఆదిశేషునియొక్క, స+ఆభోగ = పరిపూర్ణత్వముతోఁ గూడిన - ఆదిశేషుని నిండుపఱుపుతోఁగూడిన, భోగ = శరీరమువలె - శరీరముయొక్క నిండు విఱివివలె ననుట. 'భోగస్సుఖే స్త్ర్యాదిభృతావహేశ్చ ఫణకాయయోః' విశ్వ. విభాస్వత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, భుజదండ=కఱ్ఱలవంటి బాహులు గలవాఁడా - దండశబ్దముచేఁ గఱ్ఱలవలె నిడుపలై బటువులైన బాహువులని తెలియునది. దండధర...కాండ—దండధర - యమునియొక్క, పీశా = మాపువలె, రూక్ష = తీక్ష్ణమయిన, నానా = సమస్తమగు, విపక్షవిభు = శత్రులయిన రాజులను, క్షేపక = చిమ్మివైచునట్టి, కాండ = బాణములుగలవాఁడా, కాండ...పిచండ—కాండ = బ్రహ్మాండమునకు, 'కస్య బ్రహ్మణః అణ్డః కాణ్డః' అని వ్యుత్పత్తి. భయకృత్ = భయము చేయుచున్న, గంభీర = గొప్పదియైన, భేరి = రణభేరియొక్క, మహత్ = గొప్పదియైన, రవ = ధ్వనిచేత, దీర్ణ = బ్రద్దలు చేయఁబడిన, అద్రిపిచండ=పర్వతోదరములుగలవాఁడా. పర్వతపునడిమి ప్రదేశములనుట. 'పిచణ్డముదరే విద్యాత్పశోరవయవేఽపిచ' విశ్వ. చండ...హర్యగ్రజా—చండ = ఉద్దండమయిన, బల = బలముయొక్క, ధౌరంధర్య = భారమును వహించుటయందు, హర్యగ్రజా = బలరాముఁ డయినవాఁడా - బలరామునివలె బలధురంధరుఁడయిన వాఁడా యనుట. యని సంబోధనము. ఈ పద్యము ముక్తపదగ్రస్తము.

క. శ్రీకర్ణాటేశ్వర వి,శ్వాకర్ణిత బిరుదశాస నాంక వితీర్ణి
శ్రీకర్ణ దశదిశాలల, నాకర్ణాభరణ సుగుణ నవరత్నఖనీ. 168

అ. శ్రీకర్ణాట+ఈశ్వర - శ్రీ=సంపద్యుక్తమయిన, కర్ణాట=కర్ణాటరాజ్యమునకు, ఈశ్వర=ప్రభువయినవాఁడా. విశ్వా . నాంక—విశ్వ = ప్రపంచముచేత, ఆకర్ణిత= వినఁబడిన - ప్రపంచమంతయుఁ జక్కఁగాఁ బ్రసిద్ధమయిన యనుట. బిరుదశాసన = బిరుదులతోఁగూడిన శాసనముయొక్క, అంక - చిహ్నములుగలవాఁడా - లేక - బిరుదశాసనుఁడను బిరుదచిహ్నము గలవాఁడా. వితీర్ణి...కర్ణ—వితీర్ణి = దానముయొక్క. శ్రీ=సంపత్తియందు, కర్ణ=కర్ణుఁడయిన వాఁడా, దశదిశా...ఖనీ—దశదిశా = పదిదిక్కులనెడి, లలనా = స్త్రీలకు, కర్ణాభరణ = కర్ణభూషణములయిన, సుగుణ = సద్గుణములనెడి, నవరత్న = క్రొత్తవియగు రత్నములకు, ఖనీ = గనియైనవాఁడా. దశదిశలందును నీగుణములు ప్రఖ్యాతములై వన్నెగూర్చుచున్నవి యనుట.

తా. కర్ణాటరాజ్యమునకుఁ బ్రభువయినవాఁడా! సమస్తప్రపంచమునందును జక్కఁగాఁ బ్రసిద్ధమయిన బిరుదశాసన చిహ్నములుగలవాఁడా. దానవిభవమునందుఁ గర్ణుఁడయినవాఁడా! పదిదిక్కుల యందును శోభిలుచున్న సుగుణములుగలవాఁడా!

పృథ్వి. కబంధహర ధీరతాకర కరాసికృత్తత్రుట
త్కబంధ పరిపంథిసంగ్రథితసూర్య సూర్యర్పిత
ప్రబంధరసబంధురార్థపదబంధ బంధుస్వధీ
నిబంధన యబంధనాగ్ని నిభనిత్యతేజోనిధీ. 164

అ. కబంధ...ఆకర - కబంధ = కబంధుఁడనెడి యసురుని, హర = సంహరించిన శ్రీరాముని యొక్క, ధీరతా = ధైర్యమునకు, ఆకర = స్థానమయినవాఁడా, అనఁగా శ్రీరామునికిఁగల ధైర్య సంపత్తిగలవాఁడా యనుట. కర సూర్య—కరాసి = ఖడ్గముచేత, కృత్త = తుండింపఁబడి, త్రుటత్ = తెగిన, కబంధ = మొండెములుగల, 'కబన్ధోస్త్రీ క్రియాయుక్త మపమూర్ధకళేబరమ్' అను. పరిపంథి = శత్రువులచేత, సంగ్రథిత = భేదింపఁబడిన, సూర్య = సూర్యమండలము గలవాఁడా. యుద్ధమునందు హతులయిన వీరులు సూర్యమండలమును భేదించుకొని పోవుదురని ప్రతీతి యిటయను సంధింపవది సూరి...బంధ—సూరి = పండితులచేత - పండితులగు కవులచేతననుట, అర్పిత = సమర్పింపఁబడిన, ప్రబంధ = ప్రబంధములయందలి, రస = శృంగారాది రసములచేత, బంధుర = సుందరమగుచున్న, అర్థ = అర్థమును, పదబంధ = పద సందర్భమును - పదముల కూర్పుననుట, గలవాఁడా. బంధు...నిబంధన—బంధు = బంధువులయందు, స్వధీ = తనదను బుద్ధియొక్క, నిబంధన = కట్టుపాటుగలవాఁడా-లేక బంధువులకు స్వాధీనుఁడా, అబ్...నిధీ—అబ్-ఇంధనఅగ్ని = బడబాగ్నితోడ, నిభ = సమానమయిన, నిత్య = శాశ్వతమయిన, తేజః = ప్రతాపమునకు, నిధి = స్థానమైనవాఁడా. ఇది ముక్తపద గ్రస్తమును ద్విప్రాసమును.

తా. కబంధుని సంహరించిన శ్రీరామునివలె ధైర్యశాలియగువాఁడా! శత్రువును ఖడ్గముచేతఁ దుండించి చంపి స్వర్గగతులను జేసినవాఁడా! విద్వత్కవులచే రసవంతములయిన యర్థములతోను బదసందర్భములతోను గూడిన కృతుల నందినవాఁడా! బంధువులను నీవలెనే నియతితో నెంచువాఁడా! బడబాగ్నివలె నెడతెగని చండప్రతాపము గలవాఁడా!

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాదసమాసాదితసంస్కృతాంధ్ర
భాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితానిర్వాహక సాహిత్య రస
పోషణ రామరాజభూషణప్రణీతం బయినవసుచరి
త్రంబునందుఁ బ్రథమాశ్వాసము.

# వసుచరిత్రము సవ్యాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీతిరుమలరాయ జయ
శ్రీతరుణీరమణ సుగుణశీతల యాకా
శీతలసేతు ధరాతిధు
రాతతభుజదండ మూరురాయరగండా. 1

అ. శ్రీ తిరుమలరాయ = సంపద్యుక్తుఁడయిన తిరుమలరాయనామము గలవాఁడా, జయ... రమణ — జయశ్రీ = జయలక్ష్మియొక్క, రమణ = పతియైనవాఁడా, సుగుణశీతల—సుగుణ = మంచి గుణములచేత, శీతల = చల్లనయినవాఁడా—సుగుణములచేత జనుల కాహ్లాదము గలిగించువాఁడా యనుట. ఆ...దండ—ఆకాశీతల = కాశీప్రదేశము మొదలుకొని, ఇక్కడ 'ఆఙ్' అనెడు నిపాత మభివ్యాప్తిని దెలిపెడిని. 'ఆఙీషదర్థేఽభివ్యాప్తౌ సీమార్థే ధాతుయోగజే' అని. సేతు = సేతువువఱకుఁగల, ధరా = భూమియొక్క, అతిధురా = అత్యంతమయిన బరువుచేత, తత = వ్యాప్తమయిన, భుజదండ = బాహుదండముగలవాఁడా - కాశిమొదలుకొని సేతువువఱకుఁగల భూతలమును బాలించువాఁడాయనుట. మూరురాయరగండా = ముగ్గురు రాజులకు - అనఁగా అశ్వపతి, నరపతి, గజపతులకు భర్తయైనవాఁడా-ఆముగ్గురు రాజులను జయించి లోఁబఱచుకొన్నవాఁడా యనుట.

తా. సుగమము.

తే. అవధరింపుము శౌనకాద్యఖిలసన్మునీంద్రులకు రౌమహర్షణి యిట్లు పలుకు
నమ్మహీజాని నిజవిహారాచలేంద్ర, దివ్యసౌభాగ్యములుచూడఁదివురుటయును.

అ. అవధరింపుము = చిత్తగింపుము. రౌమహర్షణి = రోమహర్షణుని పుత్త్రుఁడయిన సూతుఁడు, శౌన... నీంద్రులకు—శౌనక + ఆది = శౌనకుఁడు మొదలయిన, అఖిల = సమస్త, మునీంద్రులకు = మునిశ్రేష్ఠులకు, ఇట్లు = ఈవిధమున, పలుకు = చెప్పుచున్నాఁడు. కొన్నియెడలాట్టును భూతంబు నందగును గాన పలికెనని యర్థము. ఇట్లె - 'స్వారోచియిట్లనుఁ'(మనుచరిత్రము)'ఇట్లను నాకీచకాధముండు' (విరాటపర్వము) ఇత్యాదుల నెఱుంగునది. అది యేమనగా—అమ్మహీజాని = ఆవసురాజు, నిజ...సౌభాగ్యములు—నిజ = తనదయిన, విహార+అచలేంద్ర = క్రీడాపర్వతరాజమగు కోలాహలాద్రి

రొక్క, దివ్యసౌభాగ్యములు = దివ్యములయిన వైభవములు, చూడక్ = చూచుటకు, తివురుటయును = ప్రయత్నముచేయుఁగాను. తా. సుగమము.

ఉ. ఆయెడ నొక్కనర్మసచివాగ్రణి యిట్లను నోయఖండతే
జోయుత యద్భుతం బొకటి చూచితిఁ జూపెద నీకు నాదుచే
చాయనె చూడు మభ్రమునఁ జక్కఁగ నల్లదె నల్లమబ్బులోఁ
పాయవు కొన్నిమ్రాఁకులు నృపా యవుఁ జుమ్మి నాకభూజముల్. 3

అ. ఆయెడక్ = ఆసమయమునందు, ఒక్క నర్మసచివ అగ్రణి = ఒకయూనంగు మంత్రిశ్రేష్ఠుఁడు, ఇట్లనుక్ = ఈప్రకారముగాఁ జెప్పెను. ఓ అఖండతేజోయుత = ! అఖండమయిన తేజస్సుతోఁ గూడిన వాఁడా, అద్భుతంబు ఒకటిక్ = ఒక యాశ్చర్యమును, చూచితిని, నీకుక్, చూపెదను, నాదుచే చాయనె = నాచేతివెంబడిగానే - నా చేయిచాఁచిన దిక్కుజాడనే యనుట, అభ్రమునక్ = ఆకాశమందు, చక్కఁగక్ = సూటిగను, చూడుమని వెనుక కన్వయము. అల్లదె = అదిగో, నల్లమబ్బులోక్ = నీలమేఘములో, కొన్నిమ్రాఁకులు = కొన్నివృక్షములు, పాయవు = విడువకయున్నవి - స్థిరముగా నెలకొనియున్నవనుట. నృపా = రాజా, అవి = ఆకనఁబడు వృక్షములు, నాకభూజముల్ = కల్పవృక్షములు, అవుక్ చుమ్మీ = అగునుజుమీ. నల్లనిమబ్బులోనుండుటంబట్టి నాకసంబంధములనియు, పాయక యుండుటంబట్టి వృక్షములనియు మంత్రి వివేచించుట తెలియునది.

తా. అపుడొకయనుంగుమంత్రి రాజునుజూచి 'ఓ మహాతేజస్వి! నే నొకయాశ్చర్యమును జూచితిని. అది నీకుఁజూపెదను. నేనుజేయి నిగిడ్చిన జాడగాఁ జూడుము. అదిగో నల్లనిమేఘమందుఁ గొన్నివృక్షములు స్థిరముగా నెలకొనియున్నవి. రాజా! అవి యట్లుండుటంబట్టి కల్పవృక్షము లగును జుమీ' యనెను.

చ. అన విని నవ్వి సూక్ష్మగతి నారసి యారసికావతంసుఁ డి
ట్లను మన కేళిశైల మది యల్లది తన్మఘవాశ్మకూటమ
మ్మనికిమహీజముల్ చదలుమ్రాఁకు లటంచు భ్రమించి పల్కెదై
నను మృష గాదు నీపలుకు నాకనగంబులె తద్ద్రుమావళుల్. 4

అ. అనక్ = అని మంత్రి చెప్పఁగా, విని, ఆరసిక అవతంసుఁడు = రసికులయందు శ్రేష్ఠుఁడయిన యా వసురాజు, నవ్వి = నగి, సూక్ష్మగతిక్ = సూక్ష్మమయిన మార్గముచేత - సూటియైన పద్ధతిచేతను - సన్నని నెరవుననను, ఆరసి = విచారించి - విమర్శించి, ఇట్లు అనుక్ = ఈవిధమునఁ జెప్పెను. అతఁడు మిక్కిలియు రసికుఁడగుటచే మంత్రిచెప్పినదే యవునని నమ్మక స్థూలదృష్టిచేత నే యదివేఱగునని కనుఁగొని నవ్వినాఁడు. పిదప సూక్ష్మవిమర్శనముచేత ఆవేఱయినది పలానిదని నిర్ణయించినాఁడని తెలియునది—అతఁడు చెప్పినదేమనఁగా, అది = అకనఁబడునది యనుట, మనకేళిశైలము = మనక్రీడాపర్వతము - అనఁగా కోలాహలపర్వతమనుట, అల్లది = అదిగోఁ గనఁబడునది. తత్ ...కూటము—తత్ = దానిదయిన, మఘవాశ్మ = ఇంద్రనీలమణిమయమయిన, కూటము = శిఖరము - నల్లమబ్బుగాదనుట, అమ్మనికిమహీజముల్ = అచోటునందలి - అనఁగా ఆయింద్రనీలమణిశిఖరమందలి - వృక్షములు, చదలుమ్రాఁకులు = ఆకాశవృక్షములు, అటంచుక్ = అని, భ్రమించి = భ్రమసి, పల్కెదు = పలుకుచున్నావు. ఐనను = అయినప్పటికిని, నీపలుకు = నీమాట, మృష = అబద్ధము, కాదు.

ఎట్లనఁగా, తత్ ద్రుమ ఆవళుల్ = (మన క్రీడాపర్వతశిఖరమందున్న) ఆచెట్లవరుసలు, నాకనగంబులె= (నీవుచెప్పినట్లు) ఆకాశవృక్షములేయని యర్థము. స్వర్గసంబంధి కల్పవృక్షములేయని భావము.

నాకశబ్దము ఆకాశమందును స్వర్గమందును 'ఆకాశే త్రిదివే నాకః' అమ. వర్తించుచున్నది గాన నర్మసచివుఁడు కల్పవృక్షపరముగా 'నాకభూజము' లన్నదానిని రాజు రసికాగ్రేసరుఁడుగాన కాదని నిరూపించి పిదప రసికత్వమొలుకునట్లు 'ఆకాశ' మనెడి యర్థాంతరమును గర్భీకరించి 'నాకనగములే' యని మంత్రిమాట నాయర్థాంతరమున స్థిరీకరించినాఁడు - ఇదియె రసికత్వాతిశయమునకు ద్యోతకము. ఇందు భ్రమనొందిన సచివునకంటెఁ గలరూపు నిరూపించినరాజె నెక్కుడుగాన యతనికంటెఁ గొంచెము తక్కువయగు మంత్రి పీఠమర్దుఁడుగావలయును 'కిఞ్చిదూనః పీఠమర్దః' అని లక్షణము. ఇట కోలాహలపు ఇంద్రనీలశిఖరమును నల్లనిమబ్బుగాను, అందలివృక్షములను గల్పవృక్షములుగాను, మంత్రిభ్రమించినాఁడు. మంత్రి యంతటి నిపుణునిఁగూడ నల్లనిమబ్బుగా భ్రమింపఁజేయుటంబట్టి యాశిఖరముయొక్క ఔన్నత్యాతిశయమును, అది యింద్రనీలమయమగుటచేఁ గోలాహలుని సౌభాగ్యవిభవమును వ్యంజితములు. అలం. పరికరము, నిరుక్తి.

తా. మంత్రి యట్లు చెప్పినది విని రాజు మహారసికుఁడుగాన యట్లు గాదని నవ్వి, యంతసూక్ష్మముగాపరిశీలించి మంత్రితో 'అది మన క్రీడాపర్వతమయిన కోలాహలము, ఆనల్లమబ్బు దాని యింద్రనీలమణి శిఖరము. ఆశిఖరమందలి వృక్షములనే నాకవృక్షములని భ్రమసిచెప్పితివి. అయిన నవి నాకవృక్షములే; నీపలుకు తప్పుగా' దనెను.

సీ. అచటిసానులు రత్నరుచిరంబు లననేల, వానివంశము లెల్ల నీనుమణులు
ద్రుమములెల్లను సురాగమములౌటరుదెని, త్యసురాగములుతదీయాంకురములు
లతలు సంజీవనుల్గావె యచ్చట వాని, తావులు నలినుసంజీవనములు
రసములెల్లను సిద్ధరసము లౌ టెంత త,త్ప్రసవంబులును సిద్ధరసములచట
తే. నచట మణిచిత్రభూములు నచట నమరు, నమరతరువులగుములు నచటితీవ
లచటి పొందమ్మికొలఁకులు నభవు నింట, నైన నాదంటబలువింటనైనఁ గలవె.

అ. అచటిసానులు = ఆకోలాహలపర్వతమందలి చఱులు, రత్నరుచిరంబులు = మణులచేతఁ బ్రకాశించుచుండునవి, అనన్ ఏల=అని చెప్పుటయెందులకు - చెప్పనక్కఱలేదనుట. ఏలనఁగా - వానివంశములు ఎల్లన్ =వంశమనఁగా 'వంశో వేణౌ కులే వర్గే పృష్ఠస్యావయవేఽపి చ' అ. వి. అన్నట్లు సంతానములును వెదుళ్లును - వాని సంతతులన్నియును గూడ, మణులన్ = రత్నములను, ఈనున్ = కనును, అని యర్థము. ఆచఱులయందలి వెదుళ్లు ముత్యములను గనుచున్నవని భావము. వానిసంతతులే రత్నముల నీనుచుండఁగా అవి రత్నములచేఁ బ్రకాశించుటను చెప్ప నేలయనుట. వెదుళ్లయందు ముత్యాలుపుట్టుటకు 'విదితముగ బొంగువెదురున, నొదవిన మౌక్తికము తారకోజ్జ్వలము శుభప్రదము' అని రత్నశాస్త్రము. ద్రుమములు ఎల్లన్ = అందలి వృక్షములన్నియును, సురాగమములు - సుర+అగమములు = దేవతావృక్షములు - కల్పవృక్షములు, ఔట = అగుట, అరుదె = ఆశ్చర్యమా - ఆశ్చర్యము గాదనుట. ఏలనఁగా, తదీయ+అంకురములున్ =ఆవృక్షములయొక్క చిగుళ్లుగూడ, నిత్యసురాగములు— నిత్య = నిత్యములయిన - ఎల్లప్పటికిని, సురాగములు=కల్పవృక్షములు అని యర్థము. వానిచిగుళ్లే నిత్యకల్పవృక్షములు కాఁగా ఆవృక్షములు కల్పవృక్షములగుట యాశ్చర్యమా యని యర్థము. సు + రాగములు = మంచి రక్తిమగలవియని భావము. చిగుళ్లు ఎప్పుడును మంచియెఱుపుగలిగి యుండునవుట

లతలు = అందలితీఁగలు, సంజీవనుల్ గా వె=సంజీవనీలతలుగావా, అవునుట. ఏలనఁగా, అన్నటన్ = ఆపర్వతమందు, వానితావులును = ఆతీఁగల వాసనలుగూడ, అతనుసంజీవనములు= మిక్కిలియు సంజీవనులు - వాసనలే మిక్కిలియు సంజీవనులు కాఁగా అవి గలలతలు సంజీవనులు కాక పోవునా యని యర్థము. అతను = దేహములేనివారిని, సంజీవనులు = బ్రతికించునవి యని ప్రకారాంతరము. అతనుఁడనఁగా మన్మథుఁడుగనుక అతను సంజీవనములనఁగా మన్మథుని నుద్దీపింపఁ జేయునవియనుట. వావాసనలు మిక్కిలియు మన్మథోద్దీపకములని భావము. రసములు ఎల్లను=జలములన్నియును, సిద్ధరసములు=మధురసములు,లేక సిద్ధుల సంబంధించిన దివ్యరసములు, ఔట, ఎంత=ఏమిగొప్ప, అచట,తత్-ప్రసవంబులును=దానియొక్క కన్నట్టివి గూడ - ప్రసవమనఁగా గర్భమోచనమగనుక కన్నట్టి సుపువులు గూడ, సిద్ధరసములు=ప్రసిద్ధములైన మధురసములు-లేక సిద్ధులను సంబంధించిన దివ్యరసములు-అవికన్న సిసువులే సిద్ధరసములు కాఁగా నవి యట్లగుట యేమియుక్కువయని యర్థము. 'స్యాదు త్వా తేఫలే పుష్పే ప్రసవో గర్భమోచనే' అమ. ప్రసవములనఁగా పువ్వులును గాన, అజలములయందలి పువ్వులును సిద్ధరసములు-అనఁగా సిద్ధమయిన మకరందముగలవని భావము.

కాఁబట్టి - అచటిమణి చిత్రభూములు=అక్కడిరత్నములచేత వింతలయిన నేలలును, అచట=అందు, అమరునమర తరువులగుములు——అమరు=ఒప్పుచున్న, అమరతరువుల = దేవతా వృక్షములయొక్క, గుములు=సమూహములును, అచటితీవలును=అక్కడితీఁగలును, అచటి పొందమ్మికొలఁకులున్ = అక్కడనుండెడి బంగారు తామరలుగలకొలఁకులును, అని క్రమాలంకారము. అధవునింటనైనన్ =శివునకు గృహమయిన కైలాసపర్వతమందయినను, ఆనంట = అదిట్టయొక్క, బలువింటనైనన్ =గొప్పవిల్లయిన మేరుపర్వతమందయినను, కలవె=ఉన్నవా - లేవనుట. ఇచట శ్లేషమహిమచేఁ గోలాహాలమందలి సానువులు మొదలయినవానికి నతిశయముగూర్చినాఁడు. కోలాహాలము కైలాస మేరుపర్వతములకంటె మహిమాతిశయముగలదని భావము.

తా. ఆపర్వతమందు చఱులు రత్నములచేతఁ బ్రకాశించుచుండును. వానియందలి వెదుళ్లను ముత్యములు పుట్టును. వృక్షములు కల్పవృక్షములవలెనే గుప్పెడు నెఱ్ఱనయిన చిగుళ్లు గలిగియుండును. అందలి తీఁగలు మన్మథోద్దీపకములయి వాసనలు గుబాళించుచుండును. అందలిజలములు తేనియలవలె రుచులుగలుగును. అందలి పువ్వులను మకరందము మిక్కిలి సూఁ గలిగియుండును. కాఁబట్టి యది కైలాసమేరు పర్వతముల నతిశయించి యున్నది. అలం. శ్లేషానుప్రాణితార్థాపత్తి.

మ. అది గాదే మన కేళిభూధరము దవ్వా చూత వహాయద్రి సం
పద లంచుం గయిదండఁ బూని ధరణీపాలుండు లీలాగిరిం
గదియన్ నర్మసఖుండు వల్కు నచటం గల్పద్రుహాలారసా
స్పదవైమానికమానినీమధురగానస్వానసానందుఁడై. 6

అ. మన కేళీభూధరము=మన క్రీడాపర్వతము, అదిగాదే=అదేకదా - అనఁగా నదిగో కనఁబడునట్టిదే మన క్రీడాపర్వతమయిన కోలాహలమనుట. దవ్వా=దూరమా - దూరము గాదనుట. కాఁబట్టి, ఆయద్రిసంపదలన్ =ఆపర్వతమును సంబంధించిన సౌభాగ్యములను, చూతము, అంచున్, కయిదండన్ పూని=హస్తావలంబనము చేసి, ధరణీపాలుండు=రాజు, లీలాగిరిన్ =క్రీడాపర్వతమును, కదియన్ =చేరఁబోవఁగా, నర్మసఖుండు=హాస్యచెలికాఁడు, అచటన్ =ఆచేరఁబోయిన స్థలమందు, కల్పద్రు... సానందుఁడై——కల్పద్రు=కల్పవృక్షమును సంబంధించిన, హాలారస=సురపానము(ను చేయుట

చేత, ఉన్మద=మత్తుగొనియున్న, వైమానికమానినీ=దేవతాస్త్రీలయొక్క, మధుర=ఇంపయిన, గాన స్వాన=పాటయొక్క ధ్వనిచేత, సానందుఁడై-ఆనందముతోఁగూడినవాఁడై, పల్కెన్=చెప్పెను, కల్పద్రుమ హాలారసపాన ప్రయుక్తమయిన యున్మత్తత గానమాధుర్యమునకు నెంతయుఁ బోషకము. ఆమధురగానస్వానము వినుటయే మీఁది పద్యమునందుగల పిక గేయమయూరనినదాదిధ్వనిసంకులత్వమును బరామర్శించుటకు మూలమై కోలాహల శబ్దనిరుక్తికిఁ బ్రసక్తి కలిగించెడినని తెలియునది.

తా. రాజు కూర్మిచెలికానితో 'మన క్రీడాపర్వత మదియేకదా - దాపుననే యున్నది గాన పోయిచూత'మని యతని కయిదండఁగొని యాపర్వతమును జేరఁబోఁగా నంతనాసఖుఁడు కల్పవృక్షపు మద్యమునుద్రావి మత్తుగొని మిక్కిలి యింపుగాఁబాడు దేవతాస్త్రీల తియ్యని గానధ్వనినివిని యానందముపొంది రాజుతో నిట్లనెను ప్రౌఢోక్తియలంకారము.

సీ. ఒకచాయ ననపాయపికగేయసముదాయ, మొకసీమ నానామయూరనినద
మొకవంక నకలంకమకరాంకహయహేష, లొకక్రేవ వనదేవయువతిగీత
మొకచెంత సురకాంతకరాంత తతనాద, మొకదారి నవశారికోదితంబు
లొకయోరఁ బటుచారణకుమారఘణితంబు, లొకదండ నలిమండలికలగాన

తే. మొక్కమొగిమ్రోయఁ గదళీగృహోపపన్న, కిన్నరీబృందబృందసంగీతరీతి
నమరునతివేల కోలాహలములకలిమి, నధిపయీయద్రి కోలాహలాఖ్యమొక్కె.

అ. అధిప=రాజా! ఒకచాయన్=ఒక వంకను, అన...దాయము—అనపాయ=ఎడఁబాటులేని-లేక ఎడతెగని, పిక=కోయిలలయొక్క, గేయ=గానములయొక్క, సముదాయము=సమూహమును, ఒకసీమన్=ఒకచోట, నానా=అనేకములయిన, మయూర=నెమిళ్లయొక్క, నినదము=కేకాధ్వనియును, ఒకవంకన్=ఒకవైపున, అకలంక... హేషలు—అకలంక=కలంకములేని-తొట్రుపడని యనుట, మకరాంకహయ=మన్మథుని గుఱ్ఱములయొక్క, అనఁగా చిలుకలయొక్క, హేషలు=సకిలింపులును-అనఁగా బిగ్గఱ పలుకులును, ఒకక్రేవన్=ఒకపార్శ్వమందు, సురకాంతల=అప్సరః స్త్రీలయొక్క, కరాంత=చేతి కొనలయందలి, తత=వీణ మొదలయిన వాద్యములయొక్క, 'తతం వీణాదికంవాద్యమ్' అమ. నాదము = ధ్వనియును, ఒకదారిన్ = ఒక మార్గమందు, నవ...దితంబులు—నవ = నూతనమయిన, శారికా = గోరువంకలయొక్క, ఉదితంబులు = భాషితములును 'ఉక్తం భాషితమ్' అమ. ఒకయోరన్=ఒకవైపున, పటు...ఘణితంబులు—పటు = సమర్థులయిన, చారణకుమార=చారణజాతి పడుచువాండ్రయొక్క, ఘణితంబులు=స్తుతివాక్యములును, ఒకదండన్=ఒకదిక్కున, అలి మండలి=తుమ్మెదగుంపులయొక్క, కలగానము = అవ్యక్త మధురమయిన గానమును, ఒక్క మొగిమ్రోయన్=ఒక్కుమ్మడిగా ధ్వనించుచుండఁగా, కదళీ...రీతి—కదళీగృహా=అరఁటి చప్పరములయందు, ఉపపన్న=కూడుకొన్న, కిన్నరీబృంద=కిన్నర స్త్రీసమూహముయొక్క, బృందసంగీతరీతిన్=గుంపుగాఁజేరి పాడు పాటయొక్క వైఖరిచేత, అమరు=కలుగునట్టి, అతివేల=మితిమీఱిన, కోలాహలముల కలిమిన్=కలకలధ్వనులు గలిగియుండుటచేత, ఈయద్రి=ఈపర్వతము, కోలాహలాఖ్య మొక్కె=కోలాహలమనెడు పేరుగలవాయెనో యేమొ-పిక గేయాదినానావిధకోలాహలములనుబట్టి కోలాహలమని దీనికిఁ బేరుగలిగిన దేమోయనుట. కిన్నరీ బృందముయొక్క బృందగానమును గ్రహించుట కోలాహలత్వసిద్ధికని తెలియునది. నిరుక్తి, ఉత్ప్రేక్షయు.

మ. ఘనజాంబూనదరౌప్యరత్నరుచులం గన్పట్టు నీగట్టుఁ జు
ట్టిన గండోపలమండలంబుఁ గనుఁగొంటే మేదినీశైలశా
సన యుష్మచ్చరణావధూత మగునీశైలంబు నూరార్పఁగా
ననుకంపామతిఁ జేరు మేరుముఖగోత్రాధీశులం బోలెడిన్.

అ. ఘన...రుచులన్ — ఘన=మిక్కిలి యైన, జాంబూనద = బంగారుయొక్కయు, రౌప్య= వెండియొక్కయు, రత్న=మణులయొక్కయు, రుచులన్ = కాంతుల చేత, కన్పట్టు=అగపడుచున్న బంగారు వెండి యధికముగా నుండుటచే వానిరుచులతోఁ గనఁబడుచున్నట్టి అనుట, ఈగట్టున్= ఈపర్వతమును, చుట్టిన...లంబు — చుట్టిన=చుట్టుకొనియున్న, గండ+ఉపల=గండశిలలయొక్క, మండలంబు=సమూహమును, కనుఁగొంటే=చూచితివా, మేదినీ..శాసన — మేదినీ=భూమియందు, శైలశాసన = ఇంద్రుఁడయినవాఁడా - ఈ సంబోధనము కోలాహలపర్వతభంజనాభిప్రాయగర్భము. యుష్మత్ =మీయొక్క, చరణ=పాదముచేత. అవధూతము=ఎగురఁ జిమ్మఁబడినది, అగు ఈశైలంబు= అయినట్టియీపర్వతము, ఊరార్పఁగాన్ =ఊఱడించుకొనుటకు, అనుకంపామతిన్ =దయతోడి బుద్ధిలో. చేరు...ధీశులన్ —చేరు=ఒద్దకువచ్చు, మేరుముఖ= మేరుపర్వతము మొదలయిన, గోత్రాధీశులన్= పర్వతాధిపతులను, పోలెడిన్ =పోలుచున్నవి. కనుఁగొంటేయు సంబంధము. ఇందు మిక్కుటమయిన బంగారు వెండి రత్నముల కాంతుల చేతఁ జూడఁబడుచున్నది. గనుక నీకాంతులుగల మేరు కైలాస రోహణాద్రులు మొదలయిన పర్వతములే వచ్చి యున్నట్టుగాఁ దోఁచుచున్నవని యర్థము.

(అత్ర గణ్డోపలమణ్డలస్య జామ్బూనదరౌప్య రత్నమయత్వాసంబన్ధేఽపి తత్సంబన్ధోక్త్యా అతిశయోక్తిః. తయానుప్రాణితయా గణ్డోపలానాం మేరుముఖపర్వతత్వోత్ప్రేక్షయా కోలాహలస్య లోకాతిశాయి మహత్త్వం ధ్వన్యత ఇత్యలఙ్కారేణ వస్తుధ్వనిః) సోమకవి.

తా. భూమికి దేవేంద్రుఁడ వయినవాఁడా! ఈపర్వతము చుట్టును గండశిలలు కొన్ని బంగారు కాంతులును గొన్ని వెండికాంతులును గొన్ని రత్నకాంతులును మిక్కుటముగాఁ గలిగియుండుటను జూడఁగా బంగారుమయమయిన మేరువు, వెండిమయమయిన కైలాసము, రత్నమయమయిన రోహణపర్వతము మొదలయిన మేటిపర్వతములు, నీపాదముచేతఁ జిమ్మఁబడి నొచ్చినయీపర్వతము నూరార్చుటకై వచ్చినవో యన్నట్లు చూపట్టుచున్

ఉ. అక్కట నీయుదగ్రచరణాహతి [illegible] లేక యేగతిన్
స్రుక్కెనొ గట్టురాచకొమరుం డలనాఁడు కపోతహుంకృతిన్
గ్రక్కున మూల్గుచుం బల ముఖంబున నేఁడును గంటె నెత్తురుల్
గ్రక్కెడు ధాతుపుల్ చెదరఁగా నరుణాంబుఝురీమిషంబునన్. 9

అ. అక్కట=అయ్యయో, నీ...హతికిన్ —నీ=నీయొక్క, ఉదగ్ర=మిగుల పయికెత్తఁబడిన - లేక ఉత్కటమయిన, చరణ ఆహతికిన్ =పాదముదెబ్బకు, ఓరువలేక=సైఁపఁజాలక, గట్టు రాచకొమరుండు=పర్వతరాజయిన హిమవంతుని కుమారుఁడు - కోలాహలుఁడనుట. అలనాఁడు=తన్నఁబడిన యాదినమందు, ఏగతిన్ =ఏవిధమైన, స్రుక్కెనో=సొమ్మసిల్లెనో - లేక కీడ్పడెనో, తెలియదని విశేషము. కపోతహుంకృతిన్ —కపోత=గువ్వలయొక్క, హుంకృతిన్ =హుంకారముగాడి హుంకారముచేతను- అనఁగా ఆయాసముచేత హుం అనెడు అనుకరణధ్వనిచేత ననుట,

కపోతహుంకృతులను క్రందనకుంధనాదులుగా వర్ణించుట గలదు.

శ్లో॥ చరమగిరికురఙ్గీశృఙ్గకణ్డూయనేన స్వపితి సుఖమిదానీ మన్తరిక్షే కురఙ్గః।
పరిణతరవిగర్భవ్యాకులా పౌరుహూతీ దిగపి మదకపోతీహుఙ్కృతైః క్రన్దతీవ॥

(భోజచరిత్రము)

గ్రక్కునన్ = తోడనే. ఎడతెగక, మూల్గుచున్ = మూలుగుచును, బిలముఖంబునన్ = గుహాయనెడు ముఖము చేత, ధాతువుల్ చెదరఁగాన్ = నాడులు చెదరఁగా - గైరికాది ధాతువులు చెదరఁగానని భావము. అరుణ...విషంబునన్ - అరుణ = ఎఱ్ఱనయిన, అంబు = జలముయొక్క, ఝరీ = ప్రవాహమనెడు, విషంబునన్ = నెపము చేత, నేఁడును = ఇప్పుడును, నెత్తురుల్ గ్రక్కెడున్ = నెత్తురు గ్రక్కుచున్నాఁడు. కంటె = చూచితివా. అలం. రూపకము, శ్లేషము, అపహ్నవము; ఈ మూఁటిచే నుత్థాపితమైన అర్థాపత్తియు.

తా. అయ్యో! నీ వేంద్రమయిన హాస్యపు దెబ్బకు నా కోలాహలుఁడు, నేఁడేమఁ గువ్వ కూఁతల మూలుగుచు, ధాతువులు చెదర, యెఱ్ఱనినీటి వెల్లువయను నెపమున నెత్తురు గ్రక్కుచున్నాఁడు. నేఁటికి యిట్లుండఁగా దెబ్బతిన్నయీవాఁడు దానికెట్లు సామ్యపడ్డాఁడో తెలియరాకున్నది. నేఁటికంటె నెన్నఁడో యీ మడుంగులు వాఁడు వెతగుడిచియుండును ఫలితార్థము.

మ. నను నువ్వెత్తుగఁ బాఱమీటితివి నానాధైర్యసామగ్రి మ
జ్జనకున్ మున్నె తృణీకరించితి కృపాస్వాంతంబునం బ్రోవు మిం
క నరేంద్రా యని గట్టువేఁడెడి నినుం గంటే తృణగ్రాహిసూ
తననీలాశ్మదరీముఖాగ్రవిచలద్వాతూలమంద్రధ్వనిన్.

అ. నరేంద్రా = రాజా! ననున్ = నన్ను, ఉవ్వెత్తుగన్ = ఒక్కుమ్మడిని, పాఱమీటితివి = ఎగిరిపోవునట్లు గోటితోఁజిమ్మితివి. నానాధైర్యసామగ్రిన్ = నానావిధమయిన ధైర్యసంపదచేత, మజ్జనకున్ = మాతండ్రియైన హిమవంతుని, మున్నె = మునుపే, తృణీకరించితివి = గడ్డిపరకఁజేసితివి. మిక్కిలి యలక్ష్యపెట్టితివి. కాఁబట్టి, కృపాస్వాంతంబునన్ = దయతోఁగూడిన మనస్సుచేత, ఇంకన్ = ఇఁకమీఁదను, ప్రోవుము = రక్షింపుము. అని. తృణ...ధ్వనిన్ —తృణగ్రాహి = గఱికకఱచుకొని యున్న, నూతన = నవీనమయిన, నీలాశ్మ = మహానీలములయొక్క, దరీ = గుహాయనెడు, ముఖ=ముఖముయొక్క, అగ్ర = కొనయనెడు, ముఖాగ్ర = నోఁకొనయందు, విచలత్ = మిక్కిలి చలించుచున్న, వాతూల = వాయుసంబంధియైన, మంద్రధ్వనిన్ = గంభీరధ్వనియనెడు హీనస్వరము చేత, గట్టు = ఈకోలాహలాద్రి, నినున్ వేఁడెడిన్ = ప్రార్థించుచున్నది. కంటె = చూచితివా. నన్నొకయవలీల నెగఁజిమ్మితివి, నాతండ్రి మహాధైర్యనిధి యున్నాఁడను కొంటెనిగాని యతనినిగూడ నాహాధైర్యసంపత్తిచే గడ్డిపఱకగాఁ జేసితివి. కాఁబట్టి వేఱుదిక్కులేక నీవొక్కఁడవే శరణ్యుఁడవగుటచే దయతోఁగావుమని వేఁడుట తెలియునది. లోకమందు బలవంతునిచేతఁ గీడ్పడినవాఁరు భయపడి నోటగఱిక గఱచుకొని హీనస్వరమున గాచి రక్షింపుమని వేఁడికొనుటను ఇట ననుసంధించునది. ఇచట దరి నీలాశ్మమయ మయినదిగాఁ జెప్పుట యేలన నీలములు గఱికనుగఱచుట రత్నశాస్త్రప్రసిద్ధము. తృణగ్రాహిత్వ సిద్ధికై నీలాశ్మమయిన దరిని గ్రహించినాఁడు. అలం. పకాను ప్రాణితమైనఉత్ప్రేక్ష గమ్యము. తృణగ్రాహినీలలక్షణము.

క. కసవులనిసువులు కరచున, వెస నిడి నీలంబుమీఁద విడ నూఁదుదురున్
వెస నెడని పోక నిలిచిన, వసుధఁ దృణగ్రాహి యనఁగ వర్ణన కెక్కున్.

చొక్కపుఁగదంబంబులు పూఁయువిద్యాధరీకదంబంబుల యాటపాటలకు మెచ్చి యచ్చటివనదేవత లెత్తునారతిపళ్లెరంబులకరణిఁదనరుతరణికాంతపట్టికలును,దరణికాంతపట్టికలఁ బుట్టుచిట్టంపుసెకలపై నెట్టుకొనునవతిచిరప్రసూతచమరీస్తన్యంబులుపొంగినఁ గనుంగొని చెంగటిమునిజన తపోవనసవన భవనంబులఁ బ్రవర్గ్యారంభంబు లని విందులకు ముందుముందుగాఁ గ్రందుకొని వచ్చుబృందారకసందోహంబులును, గలిగి సనవరతామోద సిద్ధమహిళాకులం బయ్యు ననవరతామోద సిద్ధమహిళాకులం బై, నిశాకరకాంతిరాజీవరాగచ్ఛాయం బయ్యు ననిశాకర కాంత రాజీవరాగచ్ఛాయం బై, మహాభూరిప్రభాభాసమానం బయ్యు నమేరు భూరిప్రభాభాసమానం బై, వెలయుచున్న యది విలోకింపుము. 11

అ. మఱియును, ఇక్కులాచలసంతానంబు = కులపర్వతమయిన హిమవంతుని సంతానమయిన యీకోలాహల పర్వతము, సంతాన...తరంగింబులు—సంతానకుసుమ= పారిజాతపుష్పములయొక్క, వాసనా = పరిమళమునుగూర్చి, సమాగత = వచ్చిన, సారంగ = తుమ్మెదలయొక్క, సరస = మనోహరమయిన, సంగీత = గానముయొక్క, భంగీ = రీతియొక్క, తరంగింబులు = పరంపరలు, ఉపాంగంబులుగా=శ్రుతులగునట్లుగా, పాడు = గానముసేయుచున్న, వేల్పుగాణీల = గానముసేసెడి యచ్చరలయొక్క, పాణి = హస్తములచేత, ఈరిత = పలికింపఁబడుచున్న, మాణిక్యవీణా = పద్మరాగమణిమయమయిన వీణలయొక్క, రాగ + అమృతంబులక్ = రాగ మనఁగా రాగము, అమృతప్రాయములయిన రాగములచేత, కరఁగి = నీరుగానయి, జరిగు = ప్రవహించుచున్న, కురువింద కందళంబుల= మొలక కెంపుల సంబంధించిన - కురువిందమనఁగా 'సులలిత మత్తకోకిలలోచనద్యుతి నలరారుఁ గురువిందమనెడు కెంపు' అని రత్నశాస్త్రముచొప్పన కెంపు, దానిని సంబంధించిన, జలంబులక్= నీటిచేత, పదనుఅయిన = తడిసి లుగవఱ్ఱయున్న, గైరికతలంబులక్ = గైరికాదిధాతు ప్రదేశములందు, పొడమిన కారణగుణంబులక్ = ఎఱ్ఱనగు కెంపుఁనీటిచేత బురదపడనయిన రక్తధాతు ప్రదేశములయందుఁ బుట్టిన హేతువువలన, 'కారణగుణాహి కార్యగుణానారభన్తే' అను న్యాయమిట అనుసంధించునది. పగడంబుడంబు = పగడపుఁగాంతిని, విడంబించు = పోలునట్టి, [illegible] నిగని = నిగనిగమెఱయునట్టి, ఇట అంత్యానివర్ణము అనంతగుణవాచకములకుం బో[illegible] నది. ఇట్లే 'ధగధగని దేహరుచి' (మనుచరిత్రము) ఇత్యాదులూహించునది. తొగరు=ఎఱ్ఱ[illegible] వ్యాపింపఁగా = అతిశయింపగా, నెగడు = వృద్ధిఁబొందుచున్న, అనఁగా [illegible]నున్న, అగణిత = ఎన్నఁదరముకాని, లతావితానంబులక్ = తీఁగమొత్తములందు[illegible] =తిన్న తిన్నగాను, ఓయ్యారంబులక్ = విలాసములచేత, ఉయ్యెలలూఁగు = ఉయ్యెలలూఁగు[illegible] అజర గజరాజయానల = దేవతాస్త్రీలయొక్క, ఉపరి = ఊర్ధ్వభాగమందు, విస్ఫురత్ = వా[illegible]చునట్టి, చరణకంజ = పాదకమలములందు, మంజీర = మిక్కిలి మనోహరములగుచున్న; మంజీ[illegible]ములక్ = అందెలయందు, పెచ్చుపెరుఁగు =అతిశయించుచున్న, అచ్చపుఁబచ్చల = పరిశుద్ధముల[illegible] మరకత మణులయొక్క, చాయలు = కాంతులు, మెచ్చులు నేయుక్ = మనస్సును రంజింపగా, [illegible]కలమచ్చికలక్ = పచ్చగడ్డి పరకలనెడు భ్రమచేత, విచ్చలవిడిక్ = స్వేచ్ఛగా, క్రమ్ముకొని = [illegible], మెసవక్ = మేయుటకు, ఉంకించు = యత్నించుచున్న, అంకపురాజంకక్ = లాంఛనమయిన రాజు కురంగమును, జంకించి = అదల్చి, మగుడక్ =మరల, తివియునెడక్ = వెనుకకుఁదిరుగ[illegible] పుయు

ముందు, తెగడి=తెవరుకొని, తోడఁబడన్ = వెంబడివెంబడిగా, తడఁబడన్ =తొట్రుపడునట్లు, అడుగులిడన్ = అడుగులుపెట్టి త్రొక్కఁగా - తప్పటడుగులు పెట్టి త్రొక్కఁగా, కందు = కమలిన, చందురునిమేనన్ = చంద్రుని దేహమునందు, చిందు = వెడలిపడుచున్న, సుధాబిందు సందోహంబు పొందునన్=అమృతబిందు సమూహముయొక్క సాంగత్యముచేత-(అతిశయోక్తి) చిందుపడి=(మునుపు) అడఁగిపడి, ధవళ=నీదయిన, అరుణ=ఎఱ్ఱని, చరణ=పాదముయొక్క, నిహతిన్=దెబ్బచేత, పెకలిన=పెల్లగిలి ఊడిపోయిన, కఱకుఱెక్కలు=కర్కశములయిన ఱెక్కలు, మగుడన్=మరల, ఇగిరించిన తెఱఁగునన్=చిగిర్చినదోయన్నట్లున్న, కాళ్లగుల తెగలను=నల్లనిమబ్బులగుంపులను-(ఉత్ప్రేక్ష) కని=చూచి, మద = మదముగల, సామజ = ఏనుఁగులయొక్క, సమాజములు అని = సమూహములని, అరసి = విచారించి, మెఱసిన మెఱపు నొఱపులు = ఆమబ్బుగుంపులయందు మెఱసిన మెఱుపుఁదీఁగ కాంతులను, ఉపరి = మీఁదను, పరికీర్ణ = వ్యాప్తమయిన-అనఁగా చల్లుకొనఁబడిన, గైరిక = గైరికధాతుసంబంధియైన, పరాగంబులనియు=దుమ్ములనియు-జాజురేఖలనుట, ఉఱుములు=గర్జితములు, ఉరుబృంహితంబులనియును=అధికతరములయిన నోటియందలి ఘీంకారములనియును, భ్రాంతినొందియని భావము. (రూపకానుప్రాణిత భ్రాంతిమంతము) రేసి=ఉద్రేకించి, అనఁగా చెలరేఁగి, ఏసగాన్ = ఏటవాలుగా, తివిసి = తీసి, తడవిండ్లన్ ఏసి = తడవింటిబద్దలచేత బాణములువేసి, క్రొవ్వునన్ కూసి = ఉబ్బువలన క్రొవ్వునకేక వేసి, డాసి = సమీపమునకుఁబోయి, తమువర = ఆ మేఘ గర్భములయందలి, కరక = వడగండ్లయొక్క, నికరములు = సమూహములు, 'వర్షోపలస్తు కరకా' అమ. కరకాశబ్దము త్రిపుంలింగములందు వర్తించును. జలజల తొరఁగినన్ = జలజలమనిరాలఁగా, చూచి, గుత్తపుముత్తియంబులు అని=బిగువైన ముత్తెములని, భ్రమసి, ఏఱి, సారెసారెకున్ = మాటిమాటికి, గీరసగింజలాడం దలంచు= ఓమనగుంట లాడవలయునని యెంచుచున్న, చెంచుముద్దియలు=ముద్దరాండ్రగు చెంచు కన్నెలయొక్క, అశ్రాంత = ఎడతెగని, మృగయా = వేటయందలి, పరిశ్రాంతిన్ = ఆయాసమును, నివారించు = పోఁగొట్టుచున్న, పటీరతరువాటికలును = శ్రీచందన వృక్షములయొక్క సమూహములును.

పటీరతరువాటికావిటపములు = శ్రీచందన వృక్షసమూహములయొక్క విస్తారములు, నికట = సమీపమందలి, కూట = శిఖరములయొక్క, కోటి = అంచులయొక్క, విటంకంబులను = అగ్ర[illegible]లను, ఒరయన్ = రాపాడఁగా, నెఱయు = రాలిన, సురభిళరజంబులతోన్ = వాసన [illegible] రాపాడితోడ, పరిఫుల్ల = చక్కఁగా వికసించిన, హల్లక = ఎఱ్ఱకలువలయందలి, [illegible] = పుప్పొళ్లయొక్క ముత్తములును, పరిక్షుణ్ణ = మిక్కిలి నలఁగిన, కాశ్మీర = [illegible]యొక్క [illegible]కింజల్కములయొక్క, ఆసారంబులు=ధారాపాతములును, పరిమృదిత= [illegible]బడిన, శైలేయ=జాతిపువ్వుయొక్క, సారంబులు=స్థిరాంశములను, ఇది పరిమళయుక్త[illegible]యవలయును. 'శైలేయధ్వని శిలాతలాని' అని ప్రయోగము. పటిమయొసఁగ సగఁబాలు [illegible]ఁదన మెప్పునట్లుగా అర్థభాగముగూడఁగలిపి, అభ్యంచిత=మిక్కిలి యొప్పుచున్న, కాం[illegible]ంగ పువ్వులయొక్క, సౌరభ=పరిమళముయొక్క, సమాగమంబునన్ = చేరుటచేత, పుష్పగట్టి [illegible]ము చేసి, గంధవహుఁడు=వాయువనెడు బుక్కావాఁడు, సవరించిన=సిద్ధపఱిచిన, [illegible] [illegible]భాగ్యమయిన బుక్కాయొక్క, [illegible]వలపులు=నిండువాసనలు, వలపులనఁగా [illegible]

[illegible] కమ్మవలపుం, కెందినచందమామఁ దెల్లఁ జెలుకునఁ బం డై
[illegible]ర్ణుల,యందెల ప్రాయంబు విడువని రాయితమరొయ్యన్'. కవికర్ణరసాయనము.

(రూపకము, ఉదాత్తమును) వలపులరేని = మన్మథునియొక్క, కలనన్ = యుద్ధమందు, కలఅలయికలను = కలిగినట్టి బడలికలను - అనఁగా రతికేళిశ్రమములను, అపనయింపన్ = పోఁగొట్టుచుండఁగా, ఇంపుసొంపునన్ = ఆనందముయొక్క విలాసముచేత, పెంపుమిగులు = అతిశయించుచున్న, కింపురుషచంపకామోదలకున్ = సంపంగె పువ్వు వాసనవంటి వాసనగల కింపురుషస్త్రీలకు, తావులు = నివాసస్థానములు, అగు, సేమంతి పూఁబొదలును = చేమంతిపువ్వుఁ బొదరిండ్లును, (ఉదాత్తము).

సేమంతి పూఁబొదలన్ = చేమంతిపూవు పొదలవలన, చినుకు . సలిలములు — చినుకు = కురియుచున్న, అనఘ = దోషములేని - నిర్మలమయిన, హిమసలిలములు = మంచునీళ్లు, నెలచలపనౌనలన్ = చంద్రకాంతపు ఱాలమయములయిన కొండదొనలయందు, తొట్టి = నిండి, జలజలఅనన్ = జలజల జాలువట్టుగా, జాలుగొని = జాలుగట్టి, వెల్లువలై = వెల్లువలై, మల్లడిగొని = చుట్టుకొని-ఒకటినొకటి పెనఁగొని, అల్లనల్లనన్ = మెల్లమెల్లగా-ఇది 'కఱచికొనఁ బఱచి'తో నన్వయించెడిని, అతి .. తలంబులన్ — అతిశీతల = మిక్కిలి చల్లనయిన, శిలాతలంబులన్ = ఱాతిబండలయందు, మెలఁగుకస్తూరి మెకంబుల = వర్తించునట్టి కస్తూరిమృగములయొక్క, మదభరంబులన్ = మదాతిశయముచేత, తొరఁగునాభిరక్తంబులు = స్రవించుచున్న నాభియందలి నెత్తురులు, ఇగిరి = తడియంతయుఁ దీసి = ఎండియనుట, గని గట్టినసిగరములు = గడ్డగట్టిన పెళ్లికలను, 'వలచుకస్తూరి సిగరాలతెలుపు దెలుప' శృం. నైష. ౭ ఆ. ౧౫౮ ప. 'కస్తూరినిగర మనఁగ' భాగవత. ౩ స్క. ౮. కరఁచికొని = కరఁగఁదీసికొని, పఱచి = ప్రవహించి, అవలన్, గమ్మనన్ = గమ్మనునట్లుగా పరిమళించు, కట్టజవ్వాదికలయికలన్ = కట్టు జవ్వాదియొక్క కూడికలవలన - జవ్వాదికట్టులు కూడుకొనుటవలన అనుట, కలనిగ్గులన్ = కలిగినట్టినిగ్గులచేత, అగ్గలంబులై = అతిశయించినవై, కదలి = అక్కడనుండి సాఁగి, కర్పూర ... ఒప్పను - కర్పూరకదళికల = కర్పూరపు టరఁటులయొక్క, పుప్పొడితిప్పల = పుప్పొడి కుప్పలయొక్క-అనఁగా కర్పూరపురాసులయొక్క, ఒప్పను = ఒప్పిదమును, అప్పళించి = అలమికొని-ఆ బాగునంతయుఁ గయికొనియనుట, గ్రక్కునన్ = అపుడే, చిక్కనయిన = గట్టిపడిన, అచ్చొక్కపు కదంబంబుల = అచ్చమయిన ఆయను లేపనములను, పూయు విద్యాధరీ కదంబంబుల = అలఁదుకొను విద్యాధరస్త్రీసమూహములయొక్క, ఆటపాటలకున్ = నృత్తగీతములకు, మెచ్చి = మెచ్చుకొన్నవారై, అచ్చటన్ = ఆస్థలమందు, వనదేవతలు, ఎత్తు ... కరణిన్ — ఎత్తు = ఎత్తిపట్టిన, అరతిపళ్లెరంబులకరణిన్ = నివాళి పళ్లెరముల విధమున - పళ్లెరములో యనునట్లనుట, తనరు ... పట్టికలును — తనరు = ఒప్పుచున్న, తరణికాంత = సూర్యకాంత మణులయొక్క, పట్టికలును = చట్టుపలకలును, (ఉత్ప్రేక్ష, ఉదాత్తము)

తరణికాంతి మణిపట్టికలవలనన్ = సూర్యకాంతి మణిపట్టికలవలననుండి, పుట్టుపట్టంపు సెకలపైన్ = పుట్టునట్టి పట్టమయిన సెగలమీఁద, నెట్టు .. స్తన్యంబుల — నెట్టుకొను = వ్యాపించిన, అనతి చిరప్రసూత = అతిచిరప్రసూతలుగానట్టి-అనఁగా క్రొత్తగా ఈనినట్టి, చమరీ = సవరపుమెకములయొక్క, స్తన్యంబులు = చనుఁబాలు, అనగా చన్నులకు మిక్కిలియై తమకుఁదామె స్రవించుచున్న చనుఁబాలనుట. పొంగినన్ = పొంగఁగా, కనుంగొని = చూచి, చెంగటి ... రంభంబులు — చెంగటి = అక్కడికి సమీపమందున్న, మునిజన = మునిజనులయొక్క, తపోవన = తాపసాశ్రమములందలి, సవన భవనంబుల = యజ్ఞశాలలయందలి, ప్రవర్గ్య = యజ్ఞమందు పాలతోఁ జేయఁబడు ప్రవర్గ్యహోమముయొక్క, ఆరంభంబులు = మొదలుపెట్టుటలు, అని, విందులకున్ = హవిర్భాగములకు, ముందుముందుగాన్ = ఒకరికంటె నొకరు ముందుగా, క్రందుకొని = సందడిపడి, వచ్చు ... దోహంబులును-వచ్చు = వచ్చునట్టి, బృందారక = దేవతలయొక్క, సందోహంబులును = సమూహములును, (భ్రాంతిమంతము)

కలిగి=కలిగియుండి, నవ...య్యకు—నవరతి=ప్రథమ సురతిమందలి, ఆమోద=ఆనందముతోఁ గూడిన, సిద్ధమహిళా=సిద్ధాంగనలయొక్క, కులంబు అయ్యును=సమూహముగలదైనను, అనవర...కులంబై-అనివిరోధము,—అనవరత=ఎప్పుడును, ఆమోద=పరిమళముచేత, సిద్ధ=సిద్ధమైయుండెడు, మహిళా=ప్రేంకణపుతీఁగలచేత,'శ్యామాతు మహిళాప్రియా లతా గోవిన్దనీగున్ధా'ఇతి'అమ. అకులంబై=వ్యాప్తమైనదై, అని విరోధ పరిహారము. నిశా...బయ్యున్—నిశాకర కాంతి=చంద్రకాంతములయొక్క, రాజీ=సమూహమును, పరాగచ్ఛాయంబు అయ్యును=శ్రేష్ఠమయిన వృక్షచ్ఛాయలును గలదైనను-లేక, చంద్రకాంతములును, రాజీవ రాగచ్ఛాయంబు=తామరలును.సంబంధించిన పుష్పనిఛాయలును గలదైనను అని యర్థాంతరము - అనిశ...చ్ఛాయంబై అని విరోధము—అనిశ = నిరంతరమును, అకర = గనుల యందు, కాంతి = మనోహరములయిన, రాజీవరాగ = పద్మరాగమణులయొక్క, ఛాయంబై = కాంతులగలదియై యని విరోధ పరిహారము. మేరు ..బయ్యున్—మేరు = మేరుపర్వతమువలె, భూరి ప్రభా = బంగారు కాంతులచేత, భా సమానంబయ్యున్ = ప్రకాశించుచున్న దయినను, అమేరు... భా సమానంబై అని విరోధము —నమేరు=సురపొన్నవృక్షములయొక్క, భూరి=అధికమయిన, ప్రభా=శోభలచేత, భాసమానంబై=ప్రకాశించుచున్నదై యని విరోధపరిహారము 'భూరిప్రాజ్యసువర్ణయోః' విశ్వ. వెలయుచున్నయది=ప్రకాశించుచున్నది. విలోకింపుము=చూడుము అనుట. (విరోధాభాసము)

చ. కొలకులఁ బజ్జ సజ్జకపుఁ గొజ్జఁగి పూఁబొదరిండ్లఁ జోరునం
జిలుకు హిమాంబుపూరములు శీతకరోపలపట్టికాతటం
బుల దుముకంగఁ బుటం బెగయుఁ భూరితుషారకణంబు లెల్లెడన్
వలగొన నిన్నగంబు హిమవన్నగ మన్ దనరారు భూవరా. 12

అ. భూవరా = రాజా, కొలఁకుల పజ్జ=తామరకొలఁకులయొక్క పొంతనున్న, సజ్జక పు...రిండ్లన్—సజ్జకపు=మనోజ్ఞములయిన, గొజ్జఁగపూపొదరిండ్లన్=గొజ్జఁగపూవుల పొదలయందును, జోరునన్=జోరనునట్లుగా, చిలుకు హిమాంబుపూరములు=కురియునట్టి మంచునీటిముంపులు, శీత...తటంబులన్—శీతకర + ఉపల=చంద్రకాంతపు రాలమయములయిన,పట్టికా=పలకలయొక్క, తటంబులన్=దరులయందు, దుముకఁగ=పడఁగా నెగయుచుండఁగా, పుటంబుఎగయు=మీఁదికెగురుచున్న,భూరి=అధికమయిన, తుషార=మంచుయొక్క, కణంబులు=తుంపురులు, ఎల్లెడన్=అంతటను, వలగొనన్=పరివేష్టింపఁగా- చుట్టుకొనఁగా ననుట. ఇన్నగంబు=ఈ క్రోలాహలపర్వతము, హిమవత్ నగము=హిమవత్పర్వతము, అన్ తనరు=అనెడయొప్పును, అరున్=పొడియుండును, లేక హిమవన్నగము అన్=హిమవత్పర్వత మనునట్లుగా, తనరారున్=ఒప్పుచుండును. ఈయర్థమునందు 'అన్'అనుటకు అనునట్లుగా ననియర్థము విచార్యము 'తనరు'నకు విశేష్యరూపములేక 'తనరి' అరు 'తనరారు'అని శబ్దరత్నాకరమందున్నది. అయినను 'అన్'శబ్దము 'అనఁగా' ననుటకుఁ జాలమిచే 'అన్వాఁడు' ఇత్యాదులందుంబోలె నంత్యోకారము లోపించిన తద్ధర్మవిశేషణముగాఁగొని 'తనరు'ను విశేష్యముగాఁగొనుట మఱింత యుపపన్నమని తోఁచెడిని. అనఁగా చంద్రుడిగి బోలియుండునని భావము. అలం. కావ్యలింగము.

ఇట గొజ్జంగెపూలబొదలనుండి మంచునీళ్లు ధారలుధారలుగా జోరునఁగురిసి యాకొండయొక్క చంద్రకాంతపుదరులపయిం బడినపడిచేఁ దుంపురులుగా పయికెగయఁగా నవి సన్నని మంచుచినుకుల వలెఁ దోఁచుచున్నవి గాన మంచుకొండవలెనున్నదని యాశయము. హిమాంబువు 'పూరములై' 'జోరునం' గురియుటచేత తుషారకణంబులు 'భూరులై' 'ఎల్లెడను వలగొనుటం' బట్టి 'హిమవన్నగ' మన

నొప్పుచున్న దనుట. దీనిచే నందు గొజ్జంగిపూఁబొదరిండ్లు విస్తరించియున్నవనియుఁ, గాన యది భోగ్యతాతిశయముగలదనియు రాజునకుఁ దెలుపుచు విహారాసక్తిఁ బుట్టించుటకుఁ బోషకమగుచున్నది. కొలఁకులపజ్జ గొజ్జంగిపూఁబొదలుండుట దానియందుఁ గురిసిన హిమజలములచే నవి పూరితములయి మఱింత చలువయు వాసనయుఁ దెలుపుగులుకుకొనుటకు.

మ. అని కేళీసచివుండు దెల్ప నిజలీలాహార్య మాసింహాసం
హనుఁ డెక్కి తదీయనిర్ఝరసమీరాందోళితైలాసుగం
ధినికుంజాంతనవేందుకాంతమణివేదిం బ్రౌఢిమై విశ్రమిం
చిన నం దొక్కకలస్వనంబు వినవచ్చెన్ మాధురీధుర్యమై. 18

అ. అని = ఇట్లని, కేళీసచివుండు = క్రీడాసహాయుఁడయినమంత్రి, తెల్పన్ = విజ్ఞాపనము చేయఁగా, ఆసింహ సంహననుండు = శ్రేష్ఠములయిన అంగములతోఁగూడిన యారాజు. ఇది భావిగిరికా మోహనమునకుఁ బ్రథమసూచకమగు బీజము. 'వరాఙ్గరూపోపేతో యస్సింహసంహననో హిసః' అమ. నిజలీలా + అహార్యము = తన క్రీడాపర్వతమును - ఆకోలాహలాద్రిననుట, ఎక్కి = ఎక్కినవాఁడై, తదీయ... వేదిన్ — తదీయ = ఆపర్వతమును సంబంధించిన, నిర్ఝర = సెలయేటిప్రవాహము యొక్క, సమీర = వాయువుచేత, ఆందోళిత = కదల్పఁబడుచున్న, ఏలా = ఏలకితీఁగలచేత, సుగంధి = మంచిపరిమళముగల, నికుంజ = పొదరింటియొక్క, అంత = సమీపమందలి, 'అన్తస్తు ప్రాన్తికేనాశే స్వరూపే' విశ్వ. నవ = క్రొత్తయైన, ఇందుకాంతమణి = చంద్రకాంత మణిమయమయిన, వేదిన్ = అరుఁగుమీఁదను, ప్రౌఢిమైన్ = సుఖముగా, విశ్రమించినన్ = అలఁత దీఱ కూర్చుండియుండఁగా, అందున్ = ఆపర్వతమందు, ఒక్కకలస్వనంబు = అవ్యక్తమధురమయిన యొకానొక ధ్వని, మాధురీధుర్యమై = మాధుర్యమును వహించినదై - మధురమైయనుట, వినవచ్చెను.

ఇట నిర్ఝరసమీరమును జెప్పుటచే దానికిఁ జలువయు ఏలాందోళనమును జెప్పుటచే వాసనయుఁ జెప్పఁబడినవి. ఇట్టిగాలి వీచుచుండఁగా నవచంద్రకాంతి వేదిపయిని గూర్చుండుటచే ప్రౌఢిమై విశ్రమముకలిగినది. ఇట గిరికాసమీపాకర్షణమునకయి మొదట ఉద్యానవనవర్ణనమును, అందుండి క్రీడాసచివోక్తినిబట్టియుకిన్నరపక్షిగతినిబట్టియుఁగోలాహలాద్రిగమనమును, బొంచుపఱచి యటనుండి గిరికాసన్నికర్షసమాకర్షణమునకై మాధురీధుర్యమగు కలస్వనమును సంతరించినాఁడు. అది మాధురీధుర్యమగుటయే ఆకర్షణమున కుపోద్బలకము - ఈకలస్వనము గానము గనుక ఉద్దీపన విభావము.

తా. క్రీడాసహాయుఁడయినమంత్రి యిట్లు కోలాహలమునువర్ణింపఁగా నా సుందరాంగుఁ డాపర్వతమునెక్కి యందు సెలయేటిగాలిచేఁ గదలుచున్నయేలకితీఁగలు పెనఁగొన్న యొక పొదరింటికడ నవచంద్రకాంతపుఁదిన్నెపయి సుఖముగా విశ్రమించియుండఁగా నొకానొకమధురధ్వని యట వినఁబడెను.

క. వీనులవిందై యమృతపుసోనలసొంపై యమందసుమచలదళినీ
గానముక్రిందై యారవ, మానందబ్రహ్మ మయిన యధిపతి కెక్కెన్. 14

అ. ఆస్వనము = (వినఁబడిన) ఆధ్వని, వీనులవిందై = చెవులపండువై, అమృతపుసోనలసొంపై = అమృతవర్షములతో చెలిమిగలదై - అమృతవర్షములవలె నత్యంత భోగ్యమైయనుట — సోనలనిబహుత్వముచే భోగ్యత్వాతిశయముధ్వనితము, అమంద... క్రిందై - అమంద = అధికమంయిన,

సుమ = పుష్పములందు, చలత్ = సంచరించుచున్న, అళినీ = ఆఁడుతుమ్మెదల, గాన = గానముయొక్క, క్రందై = నాదముగలదై, కావుననే, ఆనందబ్రహ్మము = ఆనందస్వరూపమయిన పరబ్రహ్మమయినది- బ్రహ్మానందస్వరూపమయినదనుట, అయినన్ = కాఁగా, అధిపతి = వసురాజు, పల్కెను. నాయికా రూపమయిన యాలంబనమున కిచట కిలస్వనగానం బనెడియుద్దీపనమును బచరించినాఁడు. 'అళినీ' అని ఆఁడుతుమ్మెదలను గ్రహించుట గానముయొక్క మార్దవాతిశయమునకు. 'అమందసుమచలత్' అత్యంతము పూఁదేనియలం గ్రోలి మత్తిలియుండుట అళినీగానంపుసొంపునకుఁ బోషకము.

తా. ఆవినఁబడినధ్వని చెవులపండువై యమృతవర్షములవలె నతిభోగ్యమై పూవులందుఁ దేనియలాని క్రొవ్వియున్న యాఁడుతుమ్మెదల పాటలవలెనున్నదై బ్రహ్మానందము కలిగింపఁగా రాజొక మాట చెప్పెను.

శా. నాదం బొక్కటి పిక్కటిల్లె దిశలన్ నవ్యామృతావ్యాహితా
స్వాదంబై వినవచ్చెడిం బ్రియవయస్యా వింటివే షట్పదీ
నాదంబో కలకంఠనాదమొ మరున్నారీమణీవల్లకీ
నాదంబో వివరింపరాదు పరమానందానుసంధానమై. 15

అ. ప్రియవయస్యా = ఇష్టసఖా, నాదం బొక్కటి = ఒకానొకధ్వని, పరమాన...ధానమై— పరమానంద = ఉత్కృష్టమయిన ఆనందమునకు, అనుసంధానమై = సంఘటనముచేయునట్టిదై - మిక్కుటమయిన యానందము ఒడఁగూర్చునదై యనుట, దిశలన్ = దిక్కులందు, పిక్కటిల్లెన్ = వెక్కసముగానిండెను- నిండారెననుట. నవ్యా...స్వాదంబై—నవ్య = నూతనమయిన - లేత యింపయిన, అమృత = అమృతమువలె, అవ్యాహిత = అవిచ్ఛిన్నమగునట్లుగా, ఆస్వాదంబై = అనుభవించుట గలదై, ఎడతెగక యమృతము నాస్వాదించినట్లయి యనుట. వినవచ్చెడిన్ = వినఁబడుచున్నది. వింటివే = విన్నావా. షట్పదీనాదంబో = ఆఁడుతుమ్మెదలయొక్క నాదమో, కలకంఠనాదమో = కోవెలలయొక్క నాదమో, మరున్నారీమణీ = దేవతాస్త్రీలయొక్క, వల్లకీనాదంబో = వీణాధ్వనియో, వివరింపరాదు = ఏర్పఱుపఁదరముగాదు. అది పరమానందమున మగ్నముచేయుచున్నది. కావున యే నాదమని యేర్పఱుచుటకును పరముగాకున్నదని యాశయము. ఇట పర్వతాగ్రముగనుక, దేవతాస్త్రీల వీణానాదమును గ్రహించినాఁడు.

తా. అనుంగుఁజెలికాఁడా? ఒకనాదము మిక్కుటమయిన యానందమునుగూర్చుచు దిక్కులందెల్ల నిండుకొన్నది. అది యెడతెగక యమృతము నాస్వాదించినట్లు మిక్కిలి భోగ్యమై వినఁబడుచున్నది. వింటివా! అది యాఁడుతుమ్మెదల ధ్వనియో! కోవెలల రవళియో! దేవతాస్త్రీల వీణాశబ్దమో! వివరింపఁ దరముగాకున్నది.

శా. నానాగాయనగాయనీమణులనాదం బుర్వి నాలింపమో
నానాఁటన్ సగభేదవీటఁ గలగంధర్వాప్సరోగీతవి
ద్యా[illegible]ణ్యము లెన్నియేని వినమో యందైన నిందైన విం
దై నాదం బొనఁగూర్చునే మదికి నిత్యోల్లాససందోహమున్. 16

అ. ఉర్విన్ = భూమియందు, నానా...గానంబు--నానా = వివిధములయిన, గాయనగాయనీమణులు = సంగీతముపాడెడు పురుషులలోను స్త్రీలలోను శ్రేష్ఠులయినవారియొక్క, గానంబు =

సంగీతమును, ఆలింపమో = వినమా - వినియున్నారమనుట. నానాఁటన్ = నాఁడునాఁడు - అపు డపుడనుట, నగభేదిపీటన్ = పర్వతభంజనుఁడయిన యింద్రునిపట్టణమునందు, కలగంధ...పుణ్యములు--కల = ఉన్నట్టి, గంధర్వ = గంధర్వులయొక్కయు, అప్సరః = అచ్చరలయొక్కయు, గీతవిద్యా = సంగీతవిద్యయందలి, నైపుణ్యములు = నేర్పులు, ఎన్నియేనిన్ = ఎన్నియైనప్పటికిని, వినమో = విన్నారముగామా, అంద్రైనన్ = అస్వర్గమందయినను, ఇంద్రైనన్ = ఈభూమియందయినను, విందై = హితమయినదై, నాదంబు = శబ్దము, మదికిన్ = మనస్సునకు, ఇట్లు = ఈప్రకారముగా, ఆనందసందోహమున్ = సంతోషసమూహమును - పయిపయిని సంతోషములను, ఒనగూర్చునే = సంఘటించెనా - అనఁగా సంఘటింపలేదనుట.

తా. మనము పాటపాడుటయందు మేటులగు పురుషులయు స్త్రీలయు పాట లపుడపుడు భూమియందు వినుచుండలేదా! ఇక్కడనే కాదు; ఇంద్రునిపట్టణమునంగల గంధర్వులయు నప్సరలయు పాటలవిద్యయందలి నేరుపుల నెన్నింటినో గనలేదా! అస్వర్గమందుఁగాని యీ భూమియందుఁగాని చెవులవిందై నాదమిట్లు పయిపయిని సంతోషములను నొంతరముగాఁ గలిగింపలేదుగదా.

చ. అన విని కేళికాసచివుఁ డాస్వనమల్లన యాలకించి యో
జనవర వల్లకీరవముసంగతిఁ బాడెద రెవ్వరో వినూ
తనగతి నిమ్మహాద్రిపయిఁ దన్మృదుపంచమషడ్జశయ్యకొ
య్యన నెలుఁగించె వింటె ప్రమదాకులకోకిలకేకిలోకముల్. 17

అ. అనన్ = వసురాజిట్లు చెప్పఁగా, (దానిని విని), కేళికాసచివుఁడు = క్రీడాసహాయుఁడయిన మంత్రి, ఆస్వనము = ఆనాదమును, అల్లన = మెల్లగా - సూటిగాననుట, ఆలకించి = విని, ఓజనవర = ఓరాజా, ఎవ్వరో, వల్లకీరవముసంగతిన్ = వీణానాదముతోఁగూడ, వినూతనగతిన్ = క్రొత్తరీతిగా, ఇమ్మహాద్రిపయిన్ = ఈమహాపర్వతముమీఁద, పాడెదరు. తత్...శయ్యకున్—తత్ = ఆపాటనుసంబంధించిన, మృదు = మెత్తని, పంచమషడ్జశయ్యకున్ = పంచమస్వరశయ్యకును షడ్జస్వరశయ్యకును, ప్రమ...లోకముల్—ప్రమద = సంతోషముచేత - లేక మిక్కుటమయిన మదముచేత, ఆకుల = తొట్రుపడుచున్న, కోకిల = కోవెలలయొక్కయు, కేకి = నెమిళ్లయొక్కయు, లోకముల్ = సమూహములు, ఒయ్యనన్ = వరుసగానే - లేక వెంటనే, ఎలుఁగించెన్ = మాఱుకూసెను. వింటె = విన్నావా! 'పికః కూజతిపఞ్చమం షడ్జం మయూరోవదతి' అన్నట్లు పంచమశయ్యకుఁగోవెలయును, షడ్జశయ్యకు మయూరములును నెలుగించెనని క్రమాలంకారము. కోకిల మయూరము లెలుగించుటం బట్టి యవి పంచమషడ్జస్వరములనియు దానింబట్టి యవి గానధ్వని యగుననియు నూహించుట తెలియుచది. అలం. క్రమము, అనుమానము వ్యంగ్యము.

తా. వసురాజిట్లు చెప్పఁగావిని యనుంగుమంత్రి యాధ్వనిని సూటిగా నాలించి విని రాజుతో 'రాజా! ఎవరో వీణవాయించుచు మిక్కిలియు వింతయగురీతిని బాడుచున్నారు. ఆ పాటయందలి మృదువయిన పంచమషడ్జస్వరములను కోయిలలును నెమిళ్లును మాఱుగూయుచున్నవి. వినుము' అనెను.

కం. అనవుఁడు శశికాంతదరీ, జనితప్రతినాదమయిన సంగీతకల
స్వనము మనమున నొక్కానొక, యనురాగభరంబుఁ బెనుప నవనిపుఁ డనియెన్.

అ. అనవుఁడున్ = కేళీసచివుఁ డిట్లు చెప్పఁగా, అవనిపుఁడు = రాజు, శశి...నాదము—శశికాంత = చంద్రకాంతపు రాలమయమయిన, దరీ = గుహాలవలన, జనిత = పుట్టిన, ప్రతినాదము =

ప్రతిధ్వనిగలది, ఐన, సం .. స్వనము - సంగీత = పాటనుసంబంధించిన, కలస్వనము = అవ్యక్త మధురధ్వని, మనమునన్ = మనస్సునందు, ఒకానొక యనురాగభరంబు = ఒకానొకటయిన ప్రేమాతిశయమును, పెనుపన్ = వృద్ధిఁబొందింపఁగా, అనియెన్ = ఇట్లు చెప్పెను. శశికాంతదరుల యందు ప్రతిధ్వనించుటచే నది మఱింత స్పష్టముగాను అనుభూతమయి అనురాగభరము పెంచినది. అనురాగముయొక్క 'భరము' నుబట్టియే దాని నరయుపలయు ననుబుద్ధి రాజునకుఁ గలుగుట.

తా. సుగమము. అలం. సమాధి వ్యంగ్యము-లక్షణము 'సమాధిః కార్యసౌకర్యం కారణాన్తరసన్నిధేః' అని చంద్రాలోకము.

ఉ. ఎచ్చటివారొ యీదరుల ♦ నీబలుగోనల నీనగాలిఁగో
నెచ్చట నున్నవారొ మది ♦ కింపులు నింపుకలస్వనంబుతో
నిచ్చటఁ బాడుచుండఁ గత ♦ మెయ్యదియో వివరించి క్రమ్మఱన్
వచ్చెదవే తిదాయతనవాటికిఁ బోవుద మీక్షణంబునన్. 19

అ. ఎచ్చటివారొ = ఎచ్చటనుండువారో, ఈదరులన్ = ఈగుహాలయందును, ఈ బలుగోనలన్ = ఈపెద్దకోనలయందును, ఈ నగాలిఁగోన్ = ఈచెట్లపరుసయందును, ఎచ్చటనున్నవారో = ఏచోటనున్నారో, తెలియకున్నదని శేషము. గుహాలును కానలును నగాలియు తమయందుఁగలవారిని సులువుగాఁ దెలియనీనట్టిమాటులగుటచే నట యుదాహృతములు. మదికిన్ = మనస్సునకు, ఇంపులు = సుఖములను, నింపుకలస్వనంబుతోన్ = నిండించుచున్న యవ్యక్తమధురమయిన ధ్వనితోడ, ఇచ్చటన్, పాడుచుండన్ = గానముసేయుచుండుటకు, కతము = కారణము, ఎయ్యదియో = ఏమో, వివరించి = వివర్యించి, క్రమ్మఱన్ = మరలి, వచ్చెదవే = వత్తువా. తిదాయతనవాటికిన్ = అగ్రహావాటికకు, ఈక్షణంబునన్ = ఇపుడే, పోవుదము. 'ఈక్షణంబునన్', అనుటచే పూర్వోక్తమయిన యనురాగభరముచేఁ బ్రయుక్తమయిన త్వరాతిశయము వ్యంజితము.

తా. 'ఆ పాడువారెక్కడనుండునట్టివారో, ఈ గుహలయందును, ఈ పెనుగోనలయందును, ఈచెట్లపరుసను నెచ్చటనున్నారో! మనస్సునకు సుఖ పరంపరలు నిండించుచున్న యతి మధురధ్వనితో నీపర్వతమందుఁ బాడుచుండుటకుఁ గారణమేమియో! ఇవన్నియు విమర్శించి తెలిసికొని మరలి మ్ము. నీవు వచ్చినతోడ నే యాగ్రహామున్నచోటికి మనమిరువురము పోదము' అనెను.

చ. అని యనుపన్ వినోదసఖుఁ ♦ డచ్చటి పూఁబొదరిండ్లు చూచి కాం
చనమణికందరాసదనసంతతులు లారసి పక్వగోస్తనీ
ఘనతరకాయమానములు ♦ గన్గొని తిన్ననికన్నమావిగుం
పునఁ బెనఁగొన్నమల్లియలు ♦ పూచినకోనలు గాంచి యొక్కచోన్. 20

అ. అని, రాజు, అనుపన్ = పంపఁగా, వినోదసఖుఁడు = శేలి సచివుఁడు, అచ్చటి పూఁబొదరిండ్లు = ఆ పర్వతమందలి పూలఁబొదలను, చూచి, కాంచ... సంతతులు—కాంచన = బంగార మయములును, మణి = రత్నమయములు నయిన, కందరా = గుహలనెడి, సదనసంతతులు = గృహసమూహములు, ఇట కందరశబ్దము 'దరీతు కన్దరో వా స్త్రీ' అన్నట్లు అకారాంత స్త్రీలింగమయ్యు, తెలుఁగున గ్రీవో ల్కాప్రభృతుల వంటిదిగాన 'ఇచ్చటి రత్నకందరము లు' అని ప్రయోగము. అరసి = వెదకి, పక్వ... మానములు—పక్వ = పండిన, గోస్తనీ = ద్రాక్షలయొక్క, 'మృద్వీకా గోస్తనీ ద్రాక్షా' అమ. ఘనతర = గొప్పలయిన, కాయమానములు = పందిళ్లు, కన్గొని = చూచి, తిన్న... గుంపునన్—తిన్నని = చక్కనయిన, కన్నమావిగుంపునన్ = గున్నమామిళ్ల సమూహమందు, పెనఁగొన్న మల్లియలన్ = అల్లి

కొన్న మల్లెతీఁగలు, పూచిన కోనలు=పుష్పించియున్న కోనలనును, కాంచి=చూచి, ఒక్కచోటన్= ఒకానొక స్థలమందు, సుందరి కన్పియను. పూఁబొదరిండ్లును కాంచనమణి కందరా సంతతులును, పక్వగోస్తనీకాయమానములును, తిన్ననికన్నె మావిగుంపునఁ బెనఁగొన్న మల్లియలును - అనఁగా మల్లెపొదరులును, కోలాహలుని యొక్క క్రీడాప్రదేశత్వమున కెంతయుఁ బోషకములై దాని రామణీయకవైభవమును దెలుపుచున్నది. తా. సుగమము.

సీ. రేలెల్ల నమృతమరీచిసంటున నంటఁ, గరఁగి నిర్మలపయోఝరులఁ దొరఁగి
బలువిడి పెనుఁబోయఁ బడిన క్రొన్నెలఱాల, చఱులలో నిరుగడఁ దఱచు మెఱచు
పటికంపుఁ బణఁకులఁ బజ్జ గొజ్జఁగ నీటి, యేటి క్రేవలఁ జలియిసుక వెట్టు
నేడాకుటనఁటులఁ నెలమావిగుములఁ, సురపొన్నకూటాలఁ జుట్టుకొనిన
తే. బండిగురువెంపఁ దీఁగ చప్పరములెనసి, ముడిగొనిన ద్రాక్షపందిళ్ల నడుమఁ గిన్న
రీనినాదానుకారి శారీశుకాది, ఘోషఘుమఘుమితం బైన కోన గనియె. 21

అ. రేలు+ఎల్లన్=రాత్రుల యందంతియు, అమృతమరీచి = చంద్రునియొక్క, సంటునన్= సంబంధముచేత, అంటన్ కరఁగి= మొదలుముట్ట నీరుగాఁ గరఁగి, నిర్మలపయోఝరులన్ = స్వచ్ఛమయిన జలప్రవాహములచేత - ఆ ప్రవాహముగ్రూపున ననుట, తొరఁగి=స్రవించి - వెల్లువలుగాఁ బ్రవహించి యనుట, బలువిడిన్ = విస్తారమగునట్లుగా, పెనుబోయన్ = పెద్దసారియయందు, పడిన, క్రొన్నెలఱాల చఱులలోన్ = క్రొత్త చంద్రకాంతశిలలయొక్క చఱియలయందు, ఇరుగడన్= రెండు ప్రక్కలను, తఱచు=అధికముగా, మెఱచు...పజ్జన్ — మెఱచు=ప్రకాశించుచున్న, పటికంపు= స్ఫటిక శిలలయొక్క, పణఁకుల=పేటులయొక్క, పజ్జన్=చేరువను, గొజ్జఁగనీటి యేటిక్రేవలన్= గొజ్జంగి పువ్వుల నీరువలన నయిన యేటియొక్క పార్శ్వములయందు, చలియిసుక వెట్టు=కర్పూరము నుగూడఁ బెట్టుచున్న 'ఘనసారశ్చన్ద్రసంజ్ఞః సితాభ్రో హిమవాలుకా' అనుచో హిమవాలుకాశబ్దమునకుఁ బ్రతి 'చలియిసుక', ఏడాకుటనఁటులన్ = కర్పూరపుటనఁటులను, ఎలమావిగుములన్ = లేఁత మామిడిచెట్ల గుంపులను, సురపొన్న కూటాలన్ = కూటములవంటి సురపొన్న చెట్లను, చుట్టుకొనిన = అల్లుకొన్న, బండిగురువెంపతీఁగ చప్పరములు = బండిగురువెంప తీఁగ లల్లికొనియున్న చవికలును, ఎనసి=కూడికొని, ముడిగొనిన=పెనఁగొన్న, ద్రాక్షపందిళ్ల నడుమన్=ద్రాక్షపందిళ్ల మధ్యభాగములందు, కిన్నరీ=కిన్నెర వాద్యముయొక్క, నినాద=నాదమును, అనుకారి=పోలియున్న, శారీశుక + ఆది+ఘోష - శారీ=గోరువంకలు, శుక=చిలుకలు, ఆది=మొదలయిన వానియొక్క, ఘోష=ధ్వనిచేత, ఘుమఘుమితంబు=ఘుమఘుమ యనెడు శబ్దము గలదిగాఁ జేయఁబడినది, అగు నొక్క కోనన్ = అయినట్టి యొక్క కోనను, కనియెను. ఇది మనుచరిత్రమునందలి సీసమునుబోల రచింపఁబడినది.

తా. ఆ పర్వతమందు నొకలోయ - అనఁగా కొండచీలిక - గలదు. రాత్రులం దాపర్వతమందలి చంద్రకాంతపుశిలలు చంద్రుని కిరణములసోఁకునకు తుదముట్టఁగరఁగి యచ్ఛమయిననీటి వెల్లువలయి యాలోయయందుఁబడి యచట మరల ఱాలయి యుండెను. ఆట్లందు చంద్రకాంతపు శిలలచేతనయిన చఱియ లేర్పడెను. ఆచఱియలలో రెండు ప్రక్కలను తళతళమని మిక్కిలియుఁ బ్రకాశించు పటికపుఱాలు పేటులెత్తి యుండెను. ఆపేటులచేరగా గొజ్జంగ పూవులనుండి తొరఁగిన నీ రొకయేఱయి పాఱుచుండెను. ఆయేటి రెండుప్రక్కలను కర్పూరపు టరఁటులు, గున్నమామిడి

తోఁపులు, సురపొన్నచెట్లును మొలచియుండెను. ఆచెట్లను బండిగురువెంద తీఁగలు పెనఁగొని నడికలుగాఁ దీటియుండెను. ఆచవికలలో ద్రాక్షతీఁగలు నల్లుకొని పందిళ్లుగా నేర్పడియుండెను. ఆద్రాక్ష పందిళ్లనడుమ కిన్నెరవాద్యపు ధ్వనివలెనున్న గోరువంకలయు చిలుకలయు ధ్వనులచే ఘుమఘుమ యని శబ్దము బోరుకొనుచున్న యొకకోనను మంత్రి చూచెను.

'కాలకుల పజ్జసజ్జకపు గొజ్జఁగపూ బొదరిండ్లు' అన్నట్లు, 'గొజ్జఁగి నీటియేటి త్రోవ'లనుట తెలియువది. కాలఁకులపజ్జ గొజ్జఁగపూఁ బొదరిండ్లుండుట దానం గారిఁగిననీటిచే నది నింపఁబడుకొఱకు. అలం. స్వభావోక్తి.

లయగ్రాహి.

ఓరగయివ్రాలిన నమేరువుల పుప్పొడుల,సారువుల వెంట సహకార మిళదేలా
ధారములఁ జాలుహిమవారి కృతసారణులఁ,బైరయిన చెంగలువకేయారికలలోఁగా
శ్మీరకృత సేతువులదారిఁ జనుచో నచటఁ, గూరుకలహంస లగడై రొదలుసేయం
గీరములు సారెఁ బెఱవారలిట చేరిరని, చారణులఁ జీర వసువీరసఖుఁ డంతన్.

అ. ఓరగయి వ్రాలిన = ఒరగఁబడి వ్రాలినట్టి, నమేరువుల = సురపొన్నలయొక్క, పుప్పొడుల యొక్క = పువ్వుపరాగములయొక్క, సారువుల వెంటన్ = సారువులనఁగా బరువులయినవస్తువులను మీఁది కెక్కించుటకుఁ గట్టినవంతెనలు - అవంతెనలవెంబడిగానున్న, సహ... ధారములన్ — సహకార = తియ్య మామిళ్లతోడ, మిళత్ = కూడికొనుచున్న, ఏలా = ఏలకితీఁగలయొక్క, ఆధారములన్ = పాదుల వలననుండి, జాలు = స్రవించుచున్న, హిమవారి = మంచునీటిచేత, కృత = చేయఁబడిన, సారణులన్ = కాలువలవలన, 'సారణిః కుల్యాల్పసరిత్' విశ్వ. పైరైన = పెరిఁగిన, చెంగలువ = మెట్ట చెంగల్వల యొక్క, ఈరికలలోన్ = చాల్పులలోను, కాశ్మీర = కుంకుమ పువ్వుచేత, కృత = చేయఁబడిన, సేతువుల = కట్టలయొక్క, దారిన్ = మార్గమునందు, చనుచోన్ = పోవునపుడు, అచటన్, కూరు = నిదురించుచున్న, కలహంసలు = ధూమ్రవర్ణముగల హంసలు, అగడై = పీడితములయి, రొదలుసేయన్ = క్రేంకారములు సేయఁగాను, కీరములు = చిలుకలు, సారెన్ = మాటికి, పెఱవారలు = అన్యులు, ఇట = ఇచ్చటికి, చేరిరి అని, చారణులన్ = చారణు లనువారిని, చీరన్ = పిలువఁగా, వసువీరసఖుఁడు = వీరుఁడయిన వసురాజు చెలికాఁడు, అంతన్ = అటమీఁద.

తా. సురపొన్నచెట్ల పుప్పొళ్లురాలి సేతువులుగా నేర్పడియుండెను. ఆసేతువుల వెంట తియ్య మామిళ్లతోఁ బెనఁగొన్న యేలకితీఁగల పాదులనుండి చిన్నకాలువలుగాఁ బాఱుమంచు నీటిచేత చెంగలువలు చాల్పులుగా పయిరయి యుండెను. అందుఁ గుంకుమపువ్వుల గట్లు గట్టఁబడియుండఁగా, ఆ గనిమలదారిని బోవునపుడు దచట నిదురించుచుండిన కలహంసలు బెదరి హాయిడఁజొచ్చెను. చిలుక లెవరో వచ్చినారని చారణులను బిలుచుచుండెను. ఆమంత్రి యాసేతువులదారిని బోయి.

ఇట ఏలకిపాదులనుండి తొరిఁగిన మంచు నీటి కాలువలును, అందు సురపొన్నపుప్పొళ్ల సారువులును, చెంగలువ మళ్లలో కుంకుమపువ్వుతోడి గనిమలును, దెలియునది. అలం. ఉదాత్తము.

సీ. పగడాలకొణిగలకు నిగనిగల్ వజ్రంపు, జగతిత్రేవల నెఱకజాజు నింప
నీలజాలకజాలకు బాలోకము లఖండ, కాలాగరుజధూపకకాంతిఁ బెనుప
ముత్యాలనవరంగముల రంగు నవరంగ, వల్లివిభూతి ముంగిళ్ల నునుప
గారుత్మతద్వారకచారుప్రభాపూర, తోరణంబుల హరిత్తులు పొసంగ

తే. భర్మపాంచాలికాపాణిఁ బద్మరాగ, రాజి నీరాజనోపచారముగ వఱలఁ
దరళవైడూర్యవలభికల్ తెరలు నెరప, నిరుపమంబైన దివ్యమందిరము గనియె.

అ. పగడాల కొణిగల నిగనిగల్ = కొణిగలనఁగా ముంజూరులు- పగడాల జాలరుగట్టినముంజూర్లయొక్క నిగనిగని మెఱయుచున్నట్టి కాంతిరేకలు, వజ్రంపు జగతిత్రోవలన్ = జగతియనఁగా అరుఁగు 'జిగిలి యననరుఁగనఁగను జగతియనఁగ, దిన్నెయన వేదికాఖ్యలై యెన్నఁదనరు' (ఆంధ్రనామ) వజ్రమణులచే రచితములయిన యరుఁగులయొక్క పార్శ్వభాగములందు, ప్రతిఫలించియనిశేషము, నెఱజాజినింపన్ = ఎఱ్ఱనిజాజు పట్టెలను గలిగింపఁగా-ఎఱ్ఱని జాజుపట్టెలవలెఁ దోఁచింపఁగా ననుట, నీల...లోకములు—నీల=ఇంద్రనీలమణిమయములయిన, జాలక=గవాక్షములయొక్క, జాల = సమూహమువలన, జ=పుట్టిన, ఆలోకములు=కాంతులు, అఖండ=ఎడతెగని, కాలాగరు=కృష్ణాగరువలన, జ=పుట్టిన, ధూపకాంతిన్ = ధూపపుకాంతిని - అనఁగా తదాశ్రయమయిన ధూపమును, పెనుపన్ = వృద్ధిఁబొందింపఁగా, కృష్ణాగరుధూపధూమమువలెఁ దోఁపింపఁగా ననుట, ముత్యాల నవరంగములరంగు = నవరంగములనఁగా నవరంగపుచవికలనెడిగృహవిశేషములు, ముత్యాలమయములయిన నవరంగములయొక్క కాంతి, నవ=క్రొత్తలయిన, రంగవల్లి=ముత్యాలముగ్గులయొక్క, విభూతిన్=సంపదను, ముంగిళ్లన్=గృహాంగణములందు, ఉనుపన్ = ఉంపఁగా- ముత్యాలనవరంగపు చవికలకాంతి ముంగిళ్లయందు వ్యాపించి ముత్యపుముగ్గులనెడి భ్రాంతిపుట్టింపఁగా ననుట, గారుత్మత...హరిత్తులు—గారుత్మత=మరకతమయములయిన - గరుడపచ్చలచేత రచితములయిన, ద్వార=వాకిళ్లయొక్క, చారు= సుందరమయిన, ప్రభాపూర=కాంతిసమృద్ధియనెడు, తోరణంబుల=తోరణములయొక్క, హరిత్తులు = పసరుచాయలు, బొసంగన్ = ఒప్పఁగాను - మరకతద్వారముల కాంతిపూరములు పచ్చనితోరణములు గట్టినట్లు తోఁచింపఁగా ననుట.

భర్మ...రాజి—భర్మపాంచాలికా=బంగారుమయములయిన బొమ్మలయొక్క, పాణి=హస్తములందలి, పద్మరాగ=కెంపులయొక్క, రాజి=పంక్తి, నీరాజన+ఉపచారమునన్=నివాళిదీపము చుట్టుముపచారముగా, వఱలన్ = ప్రకాశింపఁగా - దోషనివారణమునకై చేయు నుపచారమగు నీరాజనదీపమువలెఁ దోఁపింపఁగా ననుట. తరళ...వలభికల్—తరళ = తెరవాలుచుండెడి, వైడూర్య= వైడూర్యమణిమయములయిన, వలభికల్ = స్తంభముమీఁది శ్రేణులు, తెరలు నెరపన్ = తెరచీరలను గల్పింపఁగా ననుట, అనఁగా వైడూర్యవలభికల కాంతులు తెరలనెడు భ్రాంతిని బుట్టింపఁగా ననుట,

'పగలు గొంచిఁ గానఁబడదు • బిడాలంబు, కన్నుఁబోలె వెల్గు • గల్గి నూలు
దిరుగునట్టుమీఁదఁ • దెరవాలు వైడూర్య,రత్నమునకుఁ దీప్తియత్నమునకు.' రత్నశాస్త్రము.

నిరుపమంబు=ఉపమానములేనిది, ఐన దివ్యమందిరమున్ =అయినట్టి దివ్యగృహమును, కనియెన్ = చూచెను.. గృహసంబంధులయిన నానారత్నకాంతులే యాగృహమునకు నానాలంకారాద్యములై యొప్పఁగా వెలుఁగుచుండె ననుట.

తా. ఆవసురాజు చెలికాఁడొక దివ్యమందిరమును జూచెను. అందు పగడాల ముంజూర్ల కాంతులు వజ్రమణిమయములయిన యరుఁగులందు ప్రతిఫలించి దానికి నెఱ్ఱనిజాజు పట్టెలు పెట్టినట్లు వన్నె గూర్చుచుండెను. నీలమణులచేత రచింపఁబడిన కిటికీగుంపులనుండి వెడలు నల్లనికాంతులు కృష్ణాగరు ధూపపుఁబొగలు లోపలనుండి వెడలుచున్నట్లు తోఁచింపుచుండెను. ముత్యాలతో రచింపఁబడిన నవరంగములనెడి చవికల ముత్యాలకాంతులు ముంగిళ్లయందుఁ బ్రసరించి ముగ్గులు పెట్టినట్లు చూపట్టుచుం

డెను. గరుడపచ్చలతోఁ జేయఁబడిన వాకిళ్ల పసరుచాయలు పచ్చతోరణములు గట్టినట్లు కాన్పించు చుండెను. బంగారుబొమ్మలచేతనున్న కెంపులకాంతి నివాళిదీపములవలెఁ బ్రకాశించుచుండెను. వైడూర్యమణులవలభులకాంతులు ప్రసరించి తెరలుగట్టినట్లుండెను. అలం. స్వభావోక్తి, ఉత్ప్రేక్షయును, ఉదాత్తమును.

క. కనుఁగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తికముకురతలబహి
ర్జనితానుబింబసమ్ములు, వనితారత్నములు మెలఁగుకైవడి నెఱింగింపన్. 24

అ. కనుఁగొని=చూచినవాఁడై, మణిమందిరమునన్ = రత్నమయమయిన గృహమునందు, మునుకొని=ముందుగానే, కలధౌ...బింబసమ్ములు - కలధౌత = బంగారు మయమయిన - 'కలధౌతం రౌప్యహేమ్నోః' అను. భిత్తిముకురతల = అద్దములవంటి గోడనలననుండి, బహిః = వెలుపల, జనిత = ఉదయించుచున్న, అనుబింబసమ్ములు = ప్రతిబింబములు, వనితారత్నములు = స్త్రీరత్నములు-మేటిపడఁతులు, 'జాతౌజాతౌ యదుత్కృష్టం తద్రత్నమితి కథ్యతే' అను. మెలఁగు = ప్రవర్తించు నట్టి, వలను=జాడను, ఎఱింగింపన్ = తెలియఁజేయుచుండఁగా, పయిపద్యముతో నన్వయము.

మందిరము మణిమయమయినది; కనుక, తదీయమణిమయమయిన కాంచనభిత్తిని ముకురతలముగాఁ బోల్చినాఁడు-అనఁగా నాగోడచుట్టును బంగారురంగుననును, నడిమ ప్రదేశమందు రత్నఫలకములును గలిగియున్నదని తాత్పర్యము.

నిద్దములగు బంగారుగోడ లద్దములవలె నుండుటచే లోనున్న స్త్రీలరూపములు వాని యందుఁ బ్రతిబింబించి వెలుపలఁ దోఁచుచుండుటచే వారు మెలఁగుజాడ తెలిసినది. కావుననే సచివుఁడు తటాలున లోనికిఁబోవక మీఁదిపద్యంబునఁ జెప్పినట్లు,'తరువులపొంతఁబొంచి' చూచినాఁడు. మఱియొక్క సమయమున లోనికిఁ జొచ్చుట మీఁద నలవరింప వలసియుండుటచే నిట మాటునఁ జూచుటయె పొందు. ఈపొందు గలుగుటకే 'కలధౌత...బింబసమ్ముల' నుపకారకముగాఁ బచరించినాఁడు.

చ. తరువులపొంతఁ బొంచి వసుధావరమిత్త్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభం
దరళవిలోచనం దతనితంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
దరుణశశాంకఫాల నొకకన్యఁ దరంగవళిం దలోదరిన్. 25

అ. తరువులపొంతన్ = చెట్లచాటున, పొంచి = పొంచుండి, వసుధావరమిత్త్రుఁడు = వసురాజుయొక్క చెలికాఁడు, 'అథమిత్రం సఖాసుహృత్' అని మిత్రశబ్దము నిత్యనపుంసకమయినను 'మిత్రాదులు గ్లీబంబులు విభాషం బుంలింగతుల్యంబులగు' నను సూత్రముచేత దానికిఁ బుంస్త్వము వైకల్పికముగాన మిత్త్రుఁడన్నాఁడు. అచ్చటన్ = ఆమణిమందిరమందు, తరుణి = కౌమారప్రాయము గలిగినదానిని. తమోవినీలకచన్ =చీఁకటివలె మిక్కిలి నల్లనయినకురులుకలదానిని. తామర...ప్రభన్ — తామరస=తామరయొక్క, ఉదర=గర్భమునకు-తామరదుద్దునకనుట, సోదర=తోఁబుట్టువయిన-సమానమయినదనుట, ప్రభన్ =కాంతిగలిగినదానిని, తరళవిలోచనన్ =చంచలములయిన కన్నులుగలదానిని, తతనితంబన్ = విశాలమయిన కటిభాగముకలదానిని, తటిత్...వల్లరిన్ —తటిత్ = మెఱుపుతోడ, నిభ= సమానమయిన, గాత్రవల్లరిన్ =తీఁగవంటి దేహముగలదానిని, తరుణ... ఫాలన్ —తరుణశశాంక=బాలచంద్రునివంటి, ఫాలన్ =నొసలుగలదానిని, తరంగవళిన్ =తరంగములవంటి కడుపుమడఁతలు గలదానిని, తలోదరిన్ =అఱచేతవంటి కడుపుగలదానిని, ఒకకన్యన్ =ఒకానొక స్త్రీని, గాంచెన్ =చూచెను. ఇప్పద్యమందు రీతియనెడు గుణము గ్రహించునది 'యథార్థక్రమ సర్వాహారీతి రత్యర్థధీయతే' అని లక్షణము.

ఇట తన్వికిఁగల విశేషణములెల్ల 'ద'కారముతోఁ బ్రారంభింపఁబడినవిగాన 'ఒకతన్వి' యను విశేష్యమును 'ఒకదన్వి' యని యుండవలయుననియు నందులకుఁ గర్మధారయసమాసమందుఁ గసడవాదేశము వికల్పముగాన 'దన్వి' యనుట చెల్లుననియు నొకవ్యాఖ్యాత వ్రాసియున్నాఁడు. మఱొక రదిశబ్దశాస్త్రవిహీనమనుదక్షిణ వ్యాఖ్యానుగాఁ దని ఖండించియున్నారు. తెనుఁగులమీఁది సాంస్కృతిక కచటతపలకు గసడదవలురావని సూత్రము. అయినను శబ్దార్థాలంకారైకతానుండగు మహాకవి విశేషణములనెల్ల 'ద'కారములతోఁ బ్రారంభించి విశేష్యమును 'త'కారాది చేయుననుటయెంతమాత్రము పొసంగదు. 'తన్వి' 'దన్వి' కాదేని దకారాది యైనదే పదము పెట్టియుండునే కాని వలయునని నియతితో ముందును వెనుకను దకారాదులు పెట్టి నడుమ తకారమును బెట్టఁడు. కాన యతనిమతమున 'ఒకదన్వి' యనియేయుండనోపు. మఱియు భారతమునఁ గవిత్రయము వాని ప్రయోగములం బరిశీలింపఁగాఁ బెక్కుచోట్ల 'ఏమిగారణంబున 'మూఁడుగోట్లు' ఇత్యాదులవ్వారిగాఁ జూపట్టుచున్నవి.

చ. జగములనెల్లడన్ దురితసంతమసంబు జయింపఁగోరి పా
ల్పుగఁ బరమేష్ఠినిల్పిన వె • లుంగు మహీసురు లట్టివారికిం
దగవు ఘటింప సత్పురుష • దత్తములై చనుజీవనంబు లెం
తగుమతులైన మార్చిరె పదంపడి యాయువు శ్రీయునొల్లరే. (భార. ఉద్యో ౧. ఆ. ౨౮౬)

'అది మొదలుగాఁగవిష్ణుని, మది నల్పి యతఁడు నాకు • మగఁడగు నని యి
ట్లు దపంబు సేయుచుండుదు, నిది నా తెఱఁగనిన దానఁ • వేశ్వరుఁ డనియెన్.' (నిర్వచ. ఉత్తర)

'వి, రహోపించిన నంతకుండుఁ జెడు మీరా మోర్చువారు' (ఉ. హరి. ౪. ఆ.)

క. 'అవిముక్తం బవిముక్తం, బవిముక్తం బనుచుఁ బ్రాతః • రారంభములం
దవధానపరత నెవ్వం,డు దలంచును వాఁడు ధన్యుఁ • డు మునిప్రవరా.' (కాశీఖం)

'వేవణములు' (విజ్ఞా. ప్రా.)

మహాకవులిట్లు తెనుఁగుమీఁది సాంస్కృతిక తకారపకారములకు వరుసఁగా దకారవకారాదేశములు గూర్చియున్నారు. ఈకవి యిందే

ఉ. 'వివిధోర్వీపతులన్ జగన్నుతుల ముక్ వీక్షింపమో వారి పెం,పు వరీక్షింపమొ' (౩ ఆ. ౬)

అని సాంస్కృతికపకారమునకు వకారాదేశము గూర్చినాఁడు. కాని యీ గదవాదేశవికల్పము ప్రాసస్థానములందే కాని యతిస్థానములందుఁ జెల్లదని 'భిన్నపదప్రథమలపై, నున్నపకారంబు వత్వమొందునువిరులన్, మున్నిజరూపము ప్రాసము, నన్నవిరూపంబుఁదాల్పు' (ఆంధ్ర భూ) 'కొన్నియెడల ననఁగాఁ బ్రాసంబులందు' (ప్రౌఢవ్యా) నని యాక్షేపణములు చూపట్టెడిని. మఱియొకచో నిది చర్చింపఁబడును. ఇట తరుణియని యభిప్రాయమును వర్ణించుటచేఁ దదీయయౌవనసూచకములుగా దేహకాంతిసంపత్తియు, లోచనతారళ్యమును, నితంబతత్త్వమును, తరంగవళిత్వమును, తలోదరీత్వమును జెప్పినాఁడు.

తా. ఆ సచివుఁడు చెట్లమాటునఁ బొంచి యొకతన్విని జూచెను. ఆవిడ జవ్వని. ఆవిడకుఁ గురులు చీఁకటివలె నల్లనై యుండెను. మేనిజిగి తామరదుద్దువలె నిద్దమై మెఱయుచుండెను. కన్నులు బెళుకులీనుచుండెను. పిఱుందులు బలితములై యుండెను. తీఁగవలె నొప్పియయగు మేను మెఱుఁగుదీఁగవలెఁ బ్రకాశించుచుండెను. మొగము లేఁతచందురునివలెఁ దులకించుచుండెను. కడుపుపయిని మడఁతలు కరుళ్లవలె నుండెను. కనుపో అఱచేతిపలుచనై పొట్టము గలిగి యుండెను. అలం. ఉపమ.

మ. లలితామోదలతావితానవృత లీలాచంద్రశాలాతలో
జ్జ్వలనీలాతతవేదిపై మొగులుఁ గేలన్ మించు క్రొమ్మించు నా
నలువై యత్తటి సత్తలోదరియు నీహావాదనప్రౌఢిచేఁ
జెలులన్ రంజిలఁ జేయుచున్కి నృపసంసేవాపరుం డాత్మలోన్. 26

అ. లలిత... వేదిపైన్ - లలిత=సుందరమయిన, ఆమోద=పరిమళముగల, లతా = తీఁగలయొ క్క, వితాన=సమూహముచేత, వృత=ఆవరింపఁబడిన, లీలా=విలాసయుక్తమయిన, చంద్రశాలా = శిరోగృహ ప్రదేశమందు, 'చన్ద్రశాలా శిరోగృహమ్' అమ. ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, నీల=ఇంద్ర నీల మణిమయమయినదియు, ఆతత=విరివిగలదియు, అగు, వేదిపైన్=అరుఁగుమీఁద, మొగులుఁ గేలన్=మేఘముతోడ, మించు క్రొమ్మించు=అతిశయించుచున్న క్రొత్తమెఱుపో, నాన్=అనునట్లు, నలువై=సొగసై, అత్తటిన్=ఆసమయమందు, అత్తలోదరియున్=ఆస్త్రీయును, వీణావాదనప్రౌఢిచేన్ =వీణవాయించుటయందలి నేరుపుచేత, చెలులన్ = చెలికత్తెలను, రంజిలన్ చేయుచున్కిన్=చొ క్కించుచుండుటచేత, నృపసంపసేవాపరుండు=వసురాజును సేవసేయుటయందాసక్తుఁడయిన యానర్మ సఖుఁడు, ఆత్మలోన్=తనలో, సంపరిపన్న్యముతో నన్వయము.

తా. నక్కలి తావులు గుబాళించుచున్న తీఁగలజొంపము లావరించి యున్న యొకమిద్దెమీఁది యింటియందుఁ, బ్రకాశించుచున్న యొక నీలమణియరుఁగుమీఁద, మబ్బుప్రక్కనున్న క్రొమ్మెఱుఁ గువలె సొగసుగలుగుచు నాచెలువ గూర్చుండి, యాసమయందు మిక్కిలి నేరుపుతో వీణవాయించి చెలికత్తెలను రంజించుచుండఁగా నామంత్రిచూచి తన మనసులో,

మనుచరిత్రమున నాయిక 'అమలమణిమయ నిజమందిరాంగణమునఁ, దరుణ సహకారమూల వితర్దిమీఁద' నుండఁగా, ఇచట తావులు గుబులుకొను తీఁగలావరించియున్న మిద్దెటింటియందు నీలంపు జాతియరుఁగు పయిని ఈ నాయికగూర్చుండుట తెలియునది. అలం. ఉపమ.

సీ. తనకప్పు నెఱిగొప్పకనె పూని గౌరీస,మాఖ్యమించ జనించినట్టి యార్య
తనచాపలము చూపులనె చూపి సిరులెల్ల,కడఁ జల్లవచ్చిన కమలపాణి
తనపాండిమము నవ్వులనె యుంచి గాంధర్వ, మవనికిఁ దెచ్చిన హంసయాన
తనయదృశ్యత నడుమనె తాల్చి నాంగమై, మొనసినయతనుసమ్మోహవిద్య
తే. గావలయునీ వెలఁది దీని కాంతిగుణక,లాభిరూప్యంబు లెంచఁగించియామహేశు
నానగోద్ధారకుని నాసరోజాధినాధు, నా జగన్మోహనునిఁ దెత్తు ననుచుఁ జనియె. 27

అ. తనకప్పు=తన దేహముసలుపును, నెఱిగొప్పనె=దట్టమయిన కేశపాశమందె, పూని=తాల్చి, గౌరీసమాఖ్య=గౌరియనెడి పేరు, మించన్=అతిశయించునట్లుగా, జనించినట్టిఆర్య = పుట్టినట్టి ఆర్యాదేవి అనఁగా పార్వతి. 'ఆర్యాదాక్షాయణీచైవ గిరిజా మేనకాత్మజా' అమ. గౌరవర్ణముగలది గావ గౌరియనియు కులీనురాలుగాన 'ఆర్య' యనియుఁ జెప్పఁబడినది. గౌరవర్ణమనఁగాఁ బసుపు పచ్చన, 'అగ్రైరగ్రైః కనకకదళీకన్దళీగర్భగౌరైః' అని జయదేవుఁడు. గౌరవర్ణము శ్లాఘ్యముగా స్త్రీ వర్ణించుటచే నిచట ననుసంధింపఁబడెను. 'మహాకుల కులీనార్య సభ్య సజ్జన సాధవః' అని యార్యశబ్ద మునకుఁ గులీనార్థము. పార్వతి నీలవర్ణయగుటయు 'గౌరి' 'ఆర్య' యను పేర్లు గలదగుటయుఁ బ్రసిద్ధములు. ఇందుఁ గొప్ప కటికినల్లఁదనమును మేనిపసుపుచాయయుఁ గులీనత్వమును దెలియునది. తన చాపలము=తనయొక్క చపలత్వము, చూపులనే = చూడ్కులయందే, చూపి = కనఁబఱిచి, సిరులు=

సంపదలను, ఎల్లకడన్ = అన్నిచోట్లను, చల్లన్ = వెదచల్లుటకు, వచ్చిన కమలపాణి = వచ్చినట్టి లక్ష్మీదేవి. సిరులనఁగాఁ గాంతి. కాంతిసంపదల నన్నియెడలఁ బర్వఁజేయునట్టి కమలములవంటి హస్తములుగల దని యర్థాంతరము. లక్ష్మి చంచలురాలును సంపత్ప్రదయుఁ గమలము చేతం గలిగినదగుటయుఁ బ్రసిద్ధము. దీనిచేత చూపులు చెఱకులగుటయు, కాంతి పెంపులు సొంపారుచుండుటయు చేతులు తామరలవలె నుండుటయుఁ దెలియునది.

తన పాండిమము = తన తెలుపును-తన మేనిధావళ్యమును, నవ్వులనె = నవ్వులయందె, ఉంచి, గాంధర్వము = గానమును, అవనికిన్ = భూమికి, తెచ్చినహంసయాన = తీసికొనివచ్చిన హంసవాహనముగల సరస్వతీదేవి యనియర్థము. సరస్వతి తెలుపును, గాంధర్వాభిమానిత్వమును హంసవాహనత్వమును బ్రసిద్ధములు. దీనిచే నాయికకు తెల్లనవ్వును గానవిద్యాప్రౌఢయు హంసనడలవంటి మురిపపునడలును దెలియునది. తనయప్రత్యక్షతన్ = తనయొక్క కనఁబడకపోవుటను, నడుమనె = మధ్యమందే, తాల్చి, సాంగమై = అవయవములతోఁ గూడినదై-ఆకారముగలదై యనుట, మొనసి...విద్య—మొనసిన = పొడసూపిన, అతను = మన్మథునియొక్క, సమ్మోహవిద్య = సమ్మోహనవిద్య. అతను = అధికమయిన, సమ్మోహవిద్య = మోహనవిద్యగలదియని యర్థాంతరము. చిక్కనియు మోహింపఁజేయునది యనుట, విద్యకు అదృశ్యత్వమును ఆకారరహితత్వమును విదితములు. దీనిచే నడుము సన్నదనమును, మోహోద్దీపకత్వమును దెలియునది.

ఈ వెలఁది = ఈ స్త్రీ, కావలయున్. కాఁబట్టి, దీ...రూప్యంబులు—దీని = ఈ చెలువయొక్క కాంతి = గౌరకాంతియు, గుణ = శీలగుణమును, కళా = సంగీతకళను, అభిరూప్యంబులు = చక్కఁదనమును, ఎఱింగించి = తెలిపి, అమ్మహేశున్ = శివుని - ఆ మహాప్రభువునని భావము. అనగోద్ధారకునిన్ = ఆమందరధరుఁడయిన విష్ణువును - ఆ కోలాహలపర్వతము నెత్తినవానినని భావము. ఆప్రజాధినాథున్ = ఆబ్రహ్మను. 'స్రష్టా ప్రజాపతిర్వేధాః' అమ. ఆ జనపతినని భావము. ఆజగన్మోహనునిన్ = జగత్తును మోహింపఁజేసిన యామన్మథుని - జగన్మోహనాకారునని భావము, తెత్తున్ = తీసికొనివత్తును, అనుచున్, చనియెను.

నాయికను ఆర్యాదిశబ్దములచేఁ బార్వతి మొదలయినవారలుగా నర్థమగునట్లు అలవరించి అందుల కనురూపముగా వసురాజును మహేశాదిశబ్దములచే ఈశ్వరాదులుగాను బొందుపఱిచి చెప్పినాఁడని తెలియునది. ఈతఁడే యామెకుఁ దగినభర్తయని యాకూతము. ఇక్కడ 'తనకప్పు నెఱిగొప్పున ... జనించి'నదని కాంతిని బాయనేరక కొప్పున వహించుటను జెప్పుటచేతఁ గాంతికి సార్వకాలికత్వమును, 'సిరులెల్లకడఁ జల్లుటను' జెప్పుటచేత శ్రీప్రదత్వరూపగుణమునకు సర్వవిషయకత్వమును, గాంధర్వకళకు స్వర్గభూలోకములు రెంటను బ్రకాశంబును, సాంగమై మొనసినదన్నందున అభిరూప్యమునకు సద్భావమును తెలియునది. మఱియు 'తనకప్పు నెఱిగొప్పున నెపూని' యన్నందునఁ గొప్పునకతినైల్యమును 'తనచాపలము చూపులనె మోపి' యన్నందున వీక్షణముల కతిచాంచల్యమును, 'తన పాండిమము నవ్వులనె యుంచి' అన్నందున నవ్వునకు ధావళ్యమును 'తనయప్రత్యక్షత నడుమనె తాల్చి' యన్నందున మధ్యమునకు అతిసూక్ష్మత్వమును వ్యంజితములుగాన దీనిచే నత్యంతసౌందర్యము ద్యోతితము.

ఇట ఉపమేయమగు గిరికను గౌర్యాద్యుపమానములుగా ఆరోపించి చెప్పుటచే రూపకము. ఉపమేయమునకు ఉపమానములకంటె నొక్కడ సరసంబగు న్యూనత్వమును ఆధిక్యము జెప్పుటచే నిది అధికారూఢవైశిష్ట్యరూపకము; గౌర్యార్యాదిశబ్దగతశ్లేషానుప్రాణితము. దీనికే విశేషోక్తియనినామమును. 'కావలయు' ననుటచే ఉత్ప్రేక్షావాచకముగా గ్రహించినచో ఉత్ప్రేక్ష. ఆర్యాదిశబ్దములకనురూపముగాను సాభిప్రాయముగాను మహేశాదిశబ్దముల సంఘటించుటచే సమమును పరికరమును నలంకారములు.

తా. ఒక తామరకొలనును జేరితిని. దానితీరమున నరఁటిచెట్లును నారింజచెట్లును పోఁకచెట్లును తోఁపులుండెను. ఆచెట్లవాసనలు గుబులుకొనుచున్న యొకకోనను జూచితిని. ఆకోనలో నొక క్రీడాగృహము గనుపట్టెను. అందు మణిమయములయిన మొగ్గల కిరణసమూహములంతటను బ్రసరించి యుండెను. ఆమొగ్గలను నిజములయిన మొగ్గలుగాఁదలఁచి జుంజుమ్మని పాడుచు తుమ్మెదలు వ్రాలుచుండెను. ఆక్రీడాగృహమునందు.

ఇట తుమ్మెదలను భ్రమింపఁజేయుచున్న దనుటచే నామణికోరకములు నిజములయినవానివలె నగపడునట్లు చేసినపనితనమును దన్మూలమున మందిరరచనయొక్క శిల్పనైపుణియు వ్యంజితములు. భ్రాంతిమంతము గమ్యము.

సీ. వలుఁదగుబ్బలు ప్రసేవకవృత్తిఁ దగుగుబ్బ, కాయల కపరంజిచాయ లొసఁగ
లలితాంగుళీపలాశంబులు సమేళము లైన, సారెలపై రాగసంపద లిడఁ
బాణికంకణరుతుల్ ప్రాణానుబంధంబు, గల తాళగతి కనుగ్రహము లీన
నాలాపభంగి యశ్రాంతసంవాదిస,మస్వరంబులకు గ్రామంబు లనుపఁ
తే. బ్రచురతానామృతముల మూర్ఛనలచేన, చేతనంబులు చేతనరీతిఁ దనరఁ
జేతనంబు లచేతనభాతి నొనరఁ, వీణ వాయించు నొకయలివేణిఁ గంటి. 30

అ. వలుఁదగుబ్బలు = వట్రువలయిన గుబ్బపాలిండ్లు, ప్రసేవకవృత్తిన్ = ప్రసేవకమనఁగా కరివె యనెడి వీణావయవము. కరివెయొక్క వ్యాపారము చేతనని యర్థము. 'కకుభ స్తు ప్రసేవకః' అమ. శ్రేష్ఠుఁడయిన సేవకునియొక్క వ్యాపారము చేతనని యర్థాంతరము. మంచిసేవకునివలె పరిచరించునట్టివనుట. తగుగుబ్బకాయలకున్ — తగు = అట్టివృత్తికిఁ దగినట్టి, గుబ్బకాయలకు = వీణకు వేసిన కాయలకు, అపరంజిచాయలు = అపరంజిబంగారురంగులను, ఒసంగన్ = ఇయ్యఁగా, ఇది రెంటికిని సాధారణపదము. చన్నులు తమకు గుబ్బకాయలు మిక్కిలియు నుడిగము చేయుటకు సంతోషించి దానికిఁదమ మేలిబంగారు రంగునిచ్చినవనుట. పాలిండ్లను వీణకాయలొరయుచుండఁగా వాని మేలిబంగారుచాయ లాకాయలమీఁదఁ బ్రసరించి బంగారురంగు వేసినట్లున్నవనుట. వలుఁదగుబ్బలు గుబ్బకాయలకంటె మిక్కిలి వట్రువలై యందముచూపుచుండెననుట వ్యంజితము.

లలితాంగుళీపలాశంబులు-లలిత = ఒప్పుచున్న, అంగుళీపలాశంబులు = చిగురుటాకులవంటి వ్రేళ్లు, సమేళములు = మేళమనఁగా ఆయారాగములకు ననుగుణముగా స్వరస్థానములయందు మెట్లుకుదిరికపఱచుట - అట్టి మేళముతోఁగూడికొన్నవని యర్థము. సమేళములనఁగా కూడియున్నవని యర్థాంతరము. సారెలపైన్ = మెట్లమీఁద, రాగసంపదలు = రక్తిమయొక్క సమృద్ధులను - లేక రాగములయొక్క సంపదలను, ఇడన్ = ఉంపఁగా - కలిగింపఁగానని యర్థము. అనఁగా అంగుళులచేత వీణమెట్లపయిని తీఁగలను వాయించునపుడు, అంగుళులు తమ సహజరక్తిమచేత మెట్లను ఎఱ్ఱనగఁ జేసినవని కాని లేక అంగుళులమొనలచేతఁ దీఁగలమీఁద వాయింపఁగా రాగములు పుట్టుచున్నవి; కనుక రాగములు గలుగునట్లుగాఁ జేసినవనికాని భావము. రాగసంపదలనఁగా అనురాగసంపదల నియ్యఁగానని యర్థాంతరము. చిగురువ్రేళ్లు, తమతో చెలిమిగా సారెలుగూడికొన్నవి గాన యాచెలికారమునుబట్టి వానియం దమరాగము పెంపులు నింపినవనుట.

పాణికంకణరుతుల్ - పాణికంకణ = చేతికడియములయొక్క, రుతుల్ = ధ్వనులు, ప్రాణా... తాళగతికిన్ — ప్రాణములనఁగా 'కాలో మార్గః క్రియాఙ్గాని గ్రహో జాతిః కళాలయః । యతిః

ప్రస్తారశ్చైవ తాళప్రాణా దశస్మృతాః' కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము, అనునివి పదియును తాళప్రాణములు. ప్రాణఅనుబంధంబు=అట్టిప్రాణములయొక్క సంబంధమని యర్థము. ప్రాణమైత్రియని యర్థాంతరము- కల తాళగతిక్ = కలిగినట్టి తాళప్రచారమునకు, అనుగ్రహములు - అనుగ్రహములనఁగా గీతము తాళము సమముగా నడచునట్టి సమగ్రహములు. అట్టిసమగ్రహములను, ఈనగ్ = కలిగింపఁగా ననియర్థము.

'గీతాతీతే త్వతీత స్స్యాత్ తాళాతీతే త్వనాగతః।
సమస్సమగ్రహశ్చైవ విషమో విషమగ్రహః'

అనుగ్రహములనఁగా ప్రసాదములు నగునుగాన ప్రసాదముల నిచ్చుచుండఁగానని యర్థాంతరము. తాళమునకుఁ బ్రాణమిత్రముగాన దానియెడ ననుగ్రహముచేసినదియని చమత్కారము.

ఆలాపభంగి=రాగసంచారమార్గము, అత్యక్త...స్వరంబులకున్ - అత్యక్త=అసంత్యక్తనామకములయిన, 'అసంత్యక్తాస్తుమాక్షేయాః సంత్యక్తావిషమస్వరాః' అని సంగీతప్రామాణిక వచనము. సంవాది =అమాత్యసంజ్ఞ గలిగిన 'చతుర్విధాస్స్వరావాదీ సంవాదీచవివాద్యపి। అనువాదీచవాదీతు ప్రయోగేబహుళస్స్వరః। వాదీరాజాస్వర స్తస్య సంవాదీస్యాదమాత్యవత్। శత్రుర్వివాదీతస్యస్యాదనువాదీతుభృత్యవత్' సమ=సమసంజ్ఞగల, స్వరంబులకున్=షడ్జపంచమాది సప్తస్వరంబులకని యర్థము. 'శ్రుత్యనన్తరభావీ యస్స్నిగ్ధోఽనురణనాత్మకః। స్వతో రఞ్జయతి శ్రోతృచిత్తం సస్వరఉచ్యతే' అనియు 'స్వయం రఞ్జయతే నాదస్సస్వరఃపరికీర్తితః' అనియును స్వరలక్షణము. అత్యక్త=పరిత్యక్తములుకాని, సంవాది= సమ్యగ్భాషణముగల, సమ=శ్రైష్ఠ్యరహితములయిన, స్వరంబులకున్=కంఠనాదముగలవానికి- అనఁగా ఏకరీతిని సమభాషణముచేసి మంచిమాటలాడెడువానికని యర్థాంతరము. గ్రామంబులు=గ్రామములనఁగా స్వరసమూహములు, వానిని, ఈనుపన్=ఈయఁగా-ఇయ్యఁగానని యర్థము. 'యథాకుటుమ్బిన స్సర్వేప్యేకీభూతాభవన్తిహి। తథాస్వరాణాం సన్దోహో గ్రామ ఇత్యభిధీయతే' అని గ్రామలక్షణము మాన్యపు గ్రామములిచ్చునని యర్థాంతరము. శివతో నెపుడుమంచిమాటలాడుటకు మెచ్చి గ్రామములిచ్చిన వనుట.

ప్రమర...ములన్ - ప్రమర=బహుళములయిన, తాన+అమృతముల = అమృతమువంటి తానముల చేతను, మూర్ఛనలచేన్ = సప్తస్వరములయొక్క ఆరోహణావరోహణములచేతను, 'క్రమాత్స్వరాణాం సప్తానామారోహశ్చావరోహణమ్। మూర్ఛనేత్యుచ్యతే గ్రామస్థా ఏతాస్సప్తసప్తచ' అని మూర్ఛనాలక్షణము. అచేతనంబులు = ప్రాణములేనివి - దారుశిలాదులనుట, చేతనరీతిన్ = చేతనములయినవానివలె- అనఁగా మనుజపశుపక్ష్యాదులవలె, తనరన్ =ఒప్పఁగా, చేతనంబులు = ప్రాణములు గలవి - అనఁగా మనుష్య పశుపక్ష్యాదులు, అచేతనభాతిన్ = ప్రాణములేనివానివలె- దారుశిలాదులవలె, తనరన్ = ఒప్పఁగా. సీ, వాయించు ఒకయులివేణి = వాయించునట్టి ఒకస్త్రీని, కంటేని.

గానమహిమచే అచేతనములయినరాలు కరఁగుటయు మ్రోళ్లుచిగురించుటయు, చేతనములయిన మనుష్యపశుమృగాదులు పారవశ్యమునొంది నిశ్చేష్టితములయి యచేతనములవలె నుండుటయుఁ గవిసంకేతసిద్ధము. తానామృతములు మూర్ఛనలు ననురెంటిచేతను అచేతనము చేతనరీతిని చేతన మచేతనరీతిని దనరునని యర్థము. అమృతముచే అచేతనము సచేతనమగుటయు మూర్ఛన (అనఁగా మూర్ఛ)చే సచేతన మచేతనప్రాయమగుటయుసిద్ధము. కాన తానామృతములచే అచేతనంబులు చేతనరీతిని మూర్ఛనలచే చేతనంబు లచేతనభాతిని దనరుననుశబ్దశక్తిచే అర్థాంతరము. ఇట ప్రసేవకవృత్తి సమేళములు మొదలగువానికి వాసర్వేను కూడికమొదలయిన యర్థాంతరములు పచ

రించి, తదనుగుణములగు అపరంజి ఛాయలొసఁగుట రాగసంపదలిడుట మొదలగువానికి, తాళశ్ర్యాదులిచ్చి యపరంజియిచ్చుట యనురాగముతెలుపుట మొదలయిన యర్థాంతరములను నిబంధించినాఁడు. మఱియు మనుచరిత్రమున నాయికాప్రథమసందర్శనమును వర్ణించు 'తతనితంబాభోగ ధవళాంశుకము లోని' యనుపద్యమునుజూచి దీనిని రచించినట్లున్నది. కాన యందలి 'కాయ లుత్తుంగకుచపాళి నత్తమిల్ల' ననుటకు 'వలుఁద...లొసఁగ' ననియు 'తరుణాంగుళీ ధూతతంత్రీస్వనంబు' నకు 'లలితాంగుళీ...రాగసంపదలిడ' ననియు 'ఆలాపగతి'కి 'ఆలాపభంగి' యనియు 'కటకఝుణఝుణధ్వనిస్ఫూర్తి తాళమానములుగొలుప' ననుటకు 'పాణికంకణ...లీన' ననియుఁ జెప్పఁబడినవి. మఱియు 'తరుణాంగుళీరుచుల్ దంతపుసరకట్లనింగిలీకపు వింతరంగులీన' ననుటయే మూఁడవపాదమున భంగ్యంతరమున వెలయింపఁబడియున్నదనవచ్చును. ఇందలి నాయికయున్న కోనయు చేతివీణయుఁ బెద్దనపరూధినికినిసమకట్టినాఁడు.

తా. నే నొకచెలువను జూచితిని. ఆవిడ వక్షోజములు తనమీఁదియున్న వీణకుఁ గరివెగానున్న కాయలకు బంగారుఛాయ గలిగించుచుండెను. చిగురాకువంటి మెత్తనివ్రేళ్లు సరకట్లమీఁద రాగములను గుదురుపఱచుచు మెలఁగునపుడు తమ కాంతిచే వాని నెఱ్ఱనివాఁగాఁ జేయఁగా, చేతికడియముల ధ్వనులు, తానగతికి సమముగా శ్రుతినిచ్చుచుండఁగా, రాగము లాలాపించుఫక్కి సమస్వరములను గుంపులుగొనఁ జెలంగింపఁగా, నమృత ప్రాయములయిన తానములచేతను మూర్ఛనలచేతను నచేతనములు చేతనములవలెఁ గరఁగఁగా చేతనము లచేతనములవలెఁ జొక్కి భ్రమనుపడఁగా వీణ వాయించుచుండెను. అల. 'ప్రసేవక వృత్తిగల' ఇత్యాదిహేతువులచే 'అపరంజిచాయ లొసంగుట' ఇత్యాదులను సమర్థించుటచేత శ్లేషమూలకమగు కావ్యలింగము. మఱియు నిందు ప్రభువు సేవకస్నేహితాదుల పట్ల నడచుకొను రీతి వ్యంజితము గాన సమాసోక్తియు.

క. నరరాజకన్యలును గిన్నరరాజకుమారికలు ఫణాధర విద్యా
ధర వీణాధర శోణా, ధరలును నాతరుణిఁ బోల్పఁ దగరు నరేంద్రా. 31

అ. నరేంద్రా! నరరాజకన్యలును=మనుజపతులయిన రాజులయొక్క కొమార్తెలును, కిన్నరరాజకుమారికలును = కిన్నరశ్రేష్ఠులయొక్క కొమార్తెలును, ఫణా...ధరలను—ఫణాధర = పన్నగులయొక్కయు, విద్యాధర=విద్యాధరులనెడి దేవజాతి వారియొక్కయు, వీణాధర=వీణను దాల్చిన - వీణనువాయించునట్టి, శోణాధరలును = ఎఱ్ఱని క్రిందిపెదవిగల స్త్రీలును, ఆతరుణిన్ = ఆచిన్నదానిని, పోల్పన్ = పోలికసేయుటకు, తగరు=అర్హులుగారు.

తా. రాజా! మనుష్యరాజుల కన్నెలను కిన్నరశ్రేష్ఠుల కన్నెలను పన్నగులయు విద్యాధరులయు కన్నెలను వీణవాయించువారుగలరుగాని యందెవ్వరు నాచెలువతో సాటసేయ నెంతమాత్రము దగరు.

తే. మేటిజమ్మేటి యసటఁ గ్రొక్కమ్మించు మించు, బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటము వెట్టి
తమ్మిగద్దియదాకటఁ గ్రమ్మి యట్టి, కొమ్మఁ గావింపఁ బోలు నెత్తమ్మిచూలి. 32

అ. నెత్తమ్మిచూలి=పద్మమునందుఁ బుట్టిన బ్రహ్మ, మేటి...యసటన్—మేటి=శ్రేష్ఠమయిన, జమ్మేటి=జంబూనదియొక్క, అసటన్=బురదచేత - జంబూనది బురద బంగారమే గనుక బంగారపు బురదచేత, బొమ్మలు మొదలగువానిని నిర్మించుటకు మొదట నున్నగావలయును గాన, యామంటికిబదులుగా జంబూనదిలోని బంగారుమయమయిన మట్టిని జేకొన్నాఁడని యాశయము. క్రొమ్మించు మించున్=క్రొత్త మెఱుపుయొక్క కాంతిని, పొదివి=పొదిఁగినవాఁడై, మదన...గ్నిన్—మదనప్రతాప=మన్మథునియొక్క ప్రతాపమనెడు, అగ్నిన్=అగ్నియందు, పుటము వెట్టి=పుటమువేసి, తమ్మిగద్దియ దాక

టక్--తమ్మిగద్దియ=తామరపువ్వులో నుండెడి దుద్దుఅనెడి, దాకటక్ - దాకలిమీఁద, గ్రమ్మి=క్రమ్మిసాగించి, అట్టికొమ్మక్=అటువంటి స్త్రీని, కావింపఁబోలుక్ = నిర్మించి యుండునేమో.

మొదట మేలుపుఁడిఁగయే యత్యంతము ప్రకాశించుచుండునది; దానిని బంగారు మట్టిలోఁబొదివి పుటముపెట్టుటచే, దానికాంతి మీఁదు మిక్కిలి యతిశయించిన దగుచున్నది. పిదప దానిని బంగారు పసిమిఛాయగల తామరమొద్దుమీఁదఁ గ్రమ్మి సాగించి చేయుటచేత నాచెలువ దేహకాంతి మఱింత పసపురంగును బొందుచున్నది. అనఁగా నది మేలుపుఁడిఁగకంటె మిక్కిలి యతిశయించిన ధాళధళ్యమును, మేలిబంగారు ఛాయకంటె మిక్కిలి యతిశయించిన పసిమినిగ్గును గలిగియున్నదని భావము. లోకమందు సామాన్యముగాఁగల స్త్రీలకులేనట్టి కాంతియు ధాళధళ్యమును గలిగియుండు నిది యీ విధమయిన బ్రహ్మసృష్టియగు నేమోయని యుత్ప్రేక్ష. ఇదియు లోకోత్తర చమత్కారకారి కావ్యసృష్టి. ‘నేరెటేటియసల్ దెచ్చి నీరజాప్తు సానఁబట్టిన యాపాడిచల్లి మెదిపి, పసను ముద్ద నిడి చేసెనో పద్మభవుఁడు, వీనిఁగాకున్నఁగలదె యీమేనికాంతి’ అను మనుచరిత్రమునందలి నాయికసృష్టికై యుపవరించిన సామగ్రులవలెనే యిచటను సామగ్రులు సమకట్టుట తెలియునది.

‘పాటి జంబేతెబంబాలజాలమునకుఁ, బాటె నూత్నహరిద్రావిభంగమునకుఁ
పరిము సౌదామనీ ధామధామమునకు, గరము పొలుపొందు దీనియంగములకాంతి’. (శృం. నై)

సీ. వనితపాదములు ప్రవాళంబులై మించుఁ, గటి యచలాభోగకలనఁ బొదలు
పడఁతిగుబ్బలు మీఱుఁ భద్రకుంభనిరూఢి, వదన మబ్జఖ్యాతి విదల కొనరుఁ
గలికిచెక్కులు చంద్రఖండంబులై పొల్చుఁ, గన్నులు రాజీవగణన గాంచు
వెలఁదివేనలి నీలవిభ్రమధరంబై తోఁచుఁ, దనువెల్లఁ గాంచనవిభ నెసఁగుఁ
తే. బగడమిగురాకు నిలఁజట్టుఁ బసఁటులఁ గరి,కుంభములఁ దమ్మినెల నెలకూనఁ గపుర
మబ్జములమీల మొగులుఁ గాకలాపిఁ బసిఁడి,సంపెఁగలఁ గూర్చి నలువ నిర్మింపఁబోలు.

అ. మరల నన్యస్త్రీసాధారణమయిన పరికరముచేత నే బ్రహ్మ నిర్మించినట్లుత్ప్రేక్షించుచున్నాఁడు. వనితపాదములు = ఆచెలువయొక్క యడుగులు, ప్రవాళంబులై = పగడములును చిగురుటాకులునై-ఆరెంటినిబోలినవై యనుట, మించుక్ =అతిశయించునని యర్థము. ‘ప్రవాళో స్త్రీ కిసలయేవీణాదణ్డే చవిద్రుమే’ అన్నట్లు ప్రవాళమనఁగాచిగురును బగడమును-పగడముల యెఱ్ఱఁదనమును జిగురులమెత్తఁదనముగలిగియున్నవని భావము. కటి=పిఱుఁదు, అచలా...కలనక్--(అచలా=భూమియొక్కయు, అచల=పర్వతముయొక్కయు), ఆభోగ=పరిపూర్ణతయొక్క, కలనక్=సంపత్తిచేత, పొదలుక్=ఒప్పును - భూమియొక్క విశాలత్వమును పర్వతముయొక్క ఔన్నత్యమును గలిగియున్నదని భావము. ‘అచలా వసుధాయాం స్యాదచలశ్శైలకీలయోః’ మేదిని.

పడఁతిగుబ్బలు = ఆచిన్నదాని గుబ్బచన్నులు, భద్రకుంభనిరూఢిక్ - భద్రకుంభ=మంగళకుంభములగు సువర్ణకలశములయొక్కయు, భద్రకుంభ=భద్రజాతిగజముల కుంభములయొక్కయు, నిరూఢిక్=ప్రసిద్ధిని, మీఱుక్=అతిశయించును బంగారుకలశములందలి కాంతియు గజకుంభములయందలి సమస్థితియును గలిగియున్నవని భావము. వదనము=ముఖము, అబ్జఖ్యాతిక్--అబ్జ = తామరలయొక్కయు చంద్రునియొక్కయు, ఖ్యాతిక్=ప్రసిద్ధిని, విదలక=విడువక, ఒనరుక్=ఒప్పుచుండును. తామరలయందలి చక్కఁదనమును పరిమళమును చంద్రునియందలి కాంతియుఁ బ్రసన్నతయుఁ గలిగియున్నదని భావము.

కలికిచెక్కులు=ఆ స్త్రీయొక్క చెక్కిళ్లు, చంద్రఖండంబులై=చంద్రుని తునుకులై-కర్పూరపుఁదునుకలై-చంద్రునితునుకలవంటివియు కర్పూరపుఁ దునుకలవంటివియునై, పొల్చుఁ=ప్రకాశించును. చంద్రశకలములందలి నిగనిగమెఱయు కాంతియు, కర్పూరశకలములయందలి పరిమళమును నిద్దమును గలిగియున్నవని భావము. 'చన్ద్రః కర్పూరకాంపిల్ల సుధాంశు స్వర్ణవారిషు' మేదిని. కన్నులు=ఆ స్త్రీనేత్రములు, రాజీవగణనన్--రాజీవ=తామరలయొక్కయు, జెలుకుచేఁపలయొక్కయు, గణనన్=ప్రఖ్యాతిని, కాంచున్ = పొందును. కమలదళములందలి విశాలత్వదీర్ఘత్వములును జెలుకుచేఁపలయందలి తళుకులును గలిగియున్నవని భావము. 'రాజీవం నళినే నాతు భేదే హరిణమీనయోః' మేదిని.

వెలఁదివేనలి=ఆ స్త్రీయొక్క జడ, నీలవిషధరంబై=నల్లని మేఘమువంటిదియు-కృష్ణసర్పమువంటిదియునై, లోఁచున్=కనఁబడును. మేఘమందలి నైల్యమును పటుపును, కృష్ణసర్పమందలి నిడివియు ఆఁదోఁకయును గలగియున్నవని భావము. విషాత్వతివిషాయాం స్త్రీవిషంతుగరళే జలే' నానార్థ. తనువు ఎల్లన్=ఆ స్త్రీయొక్కశరీరమంతయు, కాంచనంబు=బంగారము సంపెంగయును, అనఁగన్=అనునట్లుగా, ఎసఁగున్=ఒప్పును. బంగారమువంటి పచ్చని కాంతియు సంపెంగపువ్వుల పరిమళమువంటి పరిమళమును గలిగియున్నదని భావము. బంగారము పేళ్లన్నియు సంపెంగకును జెల్లును.

కాఁబట్టి, పగడను ఇగురాకును = పగడమును జిగురాకును, ఇలన్ట్లు=భూమిని సర్వతమును, పనఁటులు కరికుంభములున్=కలశములను గజకుంభములును, తమ్మినెల=తామరను చంద్రునిని, నెలకూనన్ కపురమున్=బాలచంద్రునిని-కర్పూరమును, అబ్జములు మీలు=కమలములను జెలుకుచేఁపలును, మొగులు కాలాహి=మేఘమును కృష్ణసర్పమును, పసిఁడిసంపఁగలన్=బంగారమును సంపెంగపువ్వులును, కూర్చి=జతచేసి, నలువ=బ్రహ్మదేవుఁడు, నిర్మింపఁబోలు = సృజించియుండవలయును. సీసమునందలి ప్రవాళాద్యుపమాన పదముల కొక్కొకటికినిగల రెండేసియర్థములు కవి తానే యీగీతియందుఁ దెలుపుట తెలియునది. ఇందు పాదమస్తకము క్రమముగా వర్ణనము. తా. సుగమము. అలం. శ్లేషసంసృష్టోత్ప్రేక్ష.

తే. వదనవనజహృతాంశు సర్వస్వుఁడగుచుఁ, గుందునిందుని దరహాసకందళమున
మనుపుమని పాదములఁ బ్రాలి చనని విధుని, కొమ్మలన నింతి మృదునఖాంకురములమరు.

అ. ఇట్లు పాదమస్తకము సమష్టివర్ణనము చేసి యిపు డొక్కొక్కటిగా వేఱువేఱ వర్ణింపఁబూని తొలుత నఖములను వర్ణించుచున్నాఁడు. వదన...సర్వస్వుఁడు—వదన=ముఖమనెడు, వనజ=తామరచేత, హృత=హరింపఁబడిన, సర్వస్వుఁడు=యావద్ధనము గలవాఁడై, కుందు నిందునిన్=క్రుస్సుచున్న అనఁగా కృశించుచున్న చంద్రుని - ఇక్కడ వదనమును వర్ణించి చంద్రునకు వనజముచేత నే సర్వధనాపహరణమగుట యత్యంత దుఃఖకరమని తెలియునది. దరహాసకందళమునన్ = చిఱునవ్వుయొక్క మొలకచేత, మనుపుము అని = వృద్ధిఁబొందింపుము - అనఁగా దరహాసము వెన్నెలవంటిది గనుక దీనిచేత వంశహీనుఁడయిన చంద్రునిఁ గాంతియుక్తునిఁగాఁ జేయుమని భావము. హాసమునందును దరహాసమును, అదరహాసమునందును కందళము నే ప్రశంసించుటను, జెప్పుటచే కందళముననే చంద్రునిఁ బోషించునంత కాంతి పెంపుగలిగియుండుటచే నిఁక హాసముయొక్క ధావళ్యకాంతి సంపత్తిని జెప్ప నేలయని తెలియునది. పాదములన్=అడుగులమీఁద, ప్రాలి=పడి, చనని...కొమ్మలు—చనని=లేచిపోవకున్న, విధునికొమ్మలు=చంద్రుని భార్యలు - అనఁగా నక్షత్రములు, అనన్=అనునట్లు, ఇంతి=ఆ స్త్రీయొక్క, మృదు=మెత్తనివయిన, నఖ అంకురములు=మొలకలవంటి గోళ్లు, అమరున్=ఒప్పును.

తన కందళమాత్రిమ్ము చేత నే చంద్రునికిని గాంతిసంపత్తిగూర్చునంతటి హాసముయొక్క ధావళ్యాతిశయము నిరతిశయమని వ్యంజితము. పద్మము చంద్రునికిఁ విరోధి గనుక వదియా స్త్రీ వదనరూపమునఁ బోఁచి

చంద్రుని సర్వస్వము నపహరించెననియు, సామాన్యములగు వనజములు చంద్రునిచేఁ గాంతిదూలఁగా, ఈవదనవనజము చంద్రునే కాంతిదూలించెఁ గాన సర్వాతిశాయియనియు వ్యంజితములు. అనఁగా నా స్త్రీయొక్క ముఖము తామరవలెఁ దులకించుచున్నదనియు చంద్రుని జయించినదనియు, చిఱునవ్వు వెన్నెలవలె నున్నదనియును, పాదనఖములు నక్షత్రములవలె నున్నవనియును,ఫలితార్థము. పాదములందు జన్మసిద్ధములై యెడకుండు తెల్లనిగోళ్లను పాదములంబడి లేచిపోక ప్రార్థించు చంద్రునిభార్యలుగా (నక్షత్రములు)గా నుత్ప్రేక్షించినాఁడు, వదనవనజము చంద్రుని అంతు 'సర్వస్వము'ను హరించుటయు,తన్ను జయించుచంద్రుని నత్యంతముగాఁ దిరస్కరించుటయు, వదనముయొక్క యత్యంత సౌందర్యాతిరేకమును ధ్వనింపఁజేయుచున్నది. పరిహాసకుండగు మాత్రమున వ్యాతాంతు సర్వస్వుఁడగుచంద్రుని మనుపంజెప్పుట.

చ. ఈమొలదీఁగఁబోఁడి కృప • మీర్పడఁగాఁ దలఁచెఁ దనవ్వులోఁ
వేయువిపాలపాంగములఁ • వెంటఁ బ్రసాదము చేసె నేని నా
నాయకుఁ డంతియుం బ్రియము నొందఁగ నియ్యకోఁడొకో పాల్గుదిక్కులం
బ్రాఁకుఁ బ్రుంగజంబ్రికల్ నిడు • పాఱఁగఁజూచుచు నప్పదార్థముల్. (శృం. నై.)

అను శ్రీనాథునిదమయంతివర్ణన సర్ఘనముఁ బోలుట తెలియునది.

తా. ఆ స్త్రీయొక్క ముఖమనెడి పద్మము చేతఁ దనకిరణ సర్వస్వమును బోఁగొట్టుకొన్నవాఁడై చంద్రుఁడు కృశించుచుండుటను గాంచి తనభార్యలయిన నక్షత్రములు స్త్రీని 'నీచిఱునవ్వు మొలక చేత నతనిని బోషింపుమి' యని పాదములంబడి లేచిపోవక యున్నట్లు లావిడపాదములందలి నఖములు ప్రకాశించుచున్నవి. అలం. 'వదన...నిందుని' అతిశయోక్తి. 'ప్రాలినవని' అతిశయోక్తి. 'తామ్మ లనఁ' ఉత్ప్రేక్ష.

ఉ. భామపదద్వయం బడుగుఁ • బాయకి కొల్చు సరోజరేఖలన్
శ్రీ మెఱయన్ ధరించె మధు • జృంభణచే మొనచూపుపల్లవ
స్తోమముసౌకుమార్యమును • శోభయుఁ గైకొనఁ బోలుఁ గానిచోఁ
గోమలతారుణత్వములు • గోల్పడునే యవి నాఁడు నాఁటికిన్. 34

అ. ఇందు పాదములను వర్ణించుచున్నాఁడు. భామ పదద్వయంబు= ఆ స్త్రీయొక్క యడుగులజంటను, అడుగుఁబాయక=ఒకఅడుగంత యెడమైనను ఎడఁబాయక, కొల్చుసరోజరేఖలన్=కొలువుసేయుచున్న తామరల పంక్తులను అని యర్థము. అడుగుఁబాయక=క్రిందిభాగమును అనఁగా అరికాలినిబాయక కొల్చునట్టి పద్మరేఖలని భావము. శ్రీ=సంపద, మెఱయన్ = ప్రకాశించునట్లుగా, ధరించె=వహించె - ఆవి యడుగు లాశ్రయించి కొలిచినందులకు వానిని సంపదల నొసంగి ప్రకాశించునట్లుగా బోషించెనని యర్థము. శ్రీ = కాంతి, ప్రకాశించునట్లుగా ధరించెనని భావము. మధుజృంభణచేన్=మద్యపానముచేతఁ గలిగిన మత్తుయొక్క యుద్రేకముచేత, మొనచూపు=ప్రతిఘటించుచున్న పల్లవస్తోమము=విటసమూహముయొక్క, సౌకుమార్యమును=సుకుమారత్వమును, శోభయున్=తేజస్సును, కైకొనఁబోలున్ = హరించియుండవచ్చునని యర్థము. వారి మంచిపదముచేఁదన్నుపుమిడిసిపాటును మగటిమిని దూరించి యుండుననుట. మద్యపానముదాపి యెదుర్చువారి నుక్కుమడఁచి వారిధనాదులను జేకొనుట వ్యాయామేకదా యని యాశయము. మధుజృంభణచేన్=మధుమాసముయొక్క విజృంభణముచేత, మొనచూపు=పొడచూపుచున్న - వసంతర్తువుగాన పొటమరించుచున్న యనుట, పల్లవస్తోమము=చిగురుజొంపముయొక్క, సౌకుమార్యము=మృదుత్వమును, శోభయున్=అరుణకాంతి

యును శైశోవంబోలునని భావము. కానివోక్ =అలాగున హరించుట లేకపోయినయెడ, అవి=ఆపల్లవ ములు, నాఁడునాఁటికిన్ =దినదినము, కోమలతారుణత్వములు - కోమలతా=మృదుత్వమును, అరుణ త్వములు=ఎఱుపును, కోల్పడునే=పోఁగొట్టుకొనునాయని యర్థము.

చిగురుటాకులు నానాఁటికి ముదిరి, మెత్తఁదనముపోయి బిఱుసుపాటి యెఱుపునుదీసి పచ్చగాఁ పండిపోవుచున్నవి కదా. భామపదద్వయము వానిమృదుత్వమును గయికొనుటచేత నే బిఱుసుపాటి నట్లును ఎఱుపునుహరించుటచేత నే పచ్చగాఁబండునట్లును గవి యుత్ప్రేక్షించినాఁడు. ఆ స్త్రీయొక్క పదయుగళము తన్ననుసరించిన పద్మపంక్తుల నాదరించుచేత నంగీకరించి ప్రతిఘటించినపల్లవస్తోమ మును గర్వముడిపెనని యాశయము. అపి యెఱ్ఱదామరలనుబోలి చిగురుటాకులను నిరసించి యత్యంత కోమలత్వారుణత్వములచే నొప్పుచున్నవని ఫలితార్థము. భాగ్యముగల స్త్రీలకు అడుగులయందుఁ బద్మ రేఖలుండునని సాముద్రికశాస్త్రము. 'చక్రస్వస్తికశఙ్ఖాబ్జ ధ్వజమీనాతపత్రవత్ । యస్యాః పాద తలేరేఖా సాభవేత్ క్షితియాఙ్గనా' అని సాముద్రికము.

తా. ఆ స్త్రీపాదముల జంట తన యడుగుభాగమందుఁ భాగ్యసూచకములగు పద్మరేఖలను గలిగి యెఱ్ఱదామరలవలెఁ గొమరారుచు, వసంతఋతువుఁ బొటమరించుటచే నవకంబయిన చిగురులమె త్తఁదనమును మెఱుఁగును గలిగి యొప్పుచున్నవి. శ్లేషమూలమగు హేతూత్ప్రేక్ష సమాసోక్తియు.

తే. కలమగర్భహిరణ్యకాహళులు దొరయ
నీఁతలును బ్రోఁతలును జూపి యెలమి మకర
లీల లోఁగొని దొనల శరాళి ముంచి
యబల మృదుజంఘికాప్రకాశౌఘ మడరు. 35

అ. ఇందుఁ బిక్కలను వర్ణించుచున్నాఁడు. అబల ..ఓఘము—ఓఘమనఁగా 'ఓఘోవేగేజలస్య చ, బృన్దేపరమ్పరాయాంచ' మేదిని, మృదు=కోమలమయిన, జంఘికా=పిక్కలయొక్క, ప్రకాశఓఘ ము=ప్రకాశ సమూహమనెడు జలప్రవాహము, కలమగర్భ... కాహళులు-కలమగర్భ=వరిపొట్టలను,హి రణ్యకాహళులన్ =బంగారు బూరలును-అనఁగా తుతారాలను, దొరయన్ =సామ్యమునకుఁ దారసించి రాఁగా, ఈఁతలును=ఈనుటలును, బ్రోఁతలును=బ్రోయుటలును, చూపి—అనఁగావానియందలి యీ యవగుణముల చేత సామ్యమునకు యోగ్యములుగావని దెలిపి యని జంఘాపరమైన యర్థము. తనయందలి యీఁదులాటలను ధ్వనిచేయుటలును గనఁబఱిచి యని ప్రవాహపరమయిన యర్థము. ఎలమిన్ =వేడుక చేత, లీలయనఁగా విలాసమును క్రియయును, (జం) మకరలీలన్ =మకరాకారముయొక్క విలాసమును, లోఁగొని=అపహరించి, (ప్రవా) మకరములయొక్క చేష్టలను లోఁగాఁ జేర్చుకొని 'లీలావిలాసక్రి యయోః' అమ. దొనలనఁగా అంపపొదులును బండలమీఁది జలాశయములును. శరమనఁగా బాణ మును జలమును, (జం) దొనలన్ =అంపపొదులను, శరాళిన్ =బాణ సమూహముచేత, ముంచి, అంపపొ దులందు బాణములు నిండియుండుట ప్రకటమేకదా. (ప్రవా) బాతిదొనలను జలసమూహముచేత నిండించి, అడరున్ =ప్రకాశించును.

ఇట స్త్రీలజంఘల కుపమానములయినవి కలమగర్భములు హిరణ్యకాహళులు మకరములు అంపపొదులును. జంఘాప్రకాశమును జలప్రవాహముగా నిరూపించి మొదటి రెండుపమాన ములను ఈఁతలచేతను బ్రోఁతలచేతను, మూఁడవదియగు మకరములను లోఁగొనుటచేతను, జయిం చినట్లు శబ్దముల శ్లిష్టశక్తి మహిమచేత సమర్థించినాఁడు. ఈఁతలు బ్రోఁతలనఁగా జంఘాప రమున ఈనుటలును బ్రోయుటలునని యవలక్షణముల నెదుటియందుఁ జూచినవన్నియు, జలపరమున

సహజముగా నీఁదులాటలును ధ్వనిచేయుటలును దనయందుఁ జూపినదనియు గ్రహించునది. లోఁగొను టయనఁగా జంఘలు మకరములను లోపరచినవనియు జలములు మకరములలీలలను లోపలఁగలిగియున్న వనియు గ్రాహ్యము. పిదప నాలుగవదియైన యంపపాదులను జయించుటను సమర్థించుటకై దానికి దొనయనుపర్యాయమును జంఘాజలములు రెంటికి ననురూపములయిన యర్థములు గలదానిని సంతరించి దానిని శరాళియుంచి జయించుటను జెప్పినాఁడు. శరాళియనఁగా జంఘాపరమున బాణసమూహమనియు జలపరమున జలసమూహమనియు నర్థము. అనఁగా నాస్త్రీయొక్క జంఘలు నరిపొట్టలను బంగారు కాహళలను మకరాకృతులను అంపపాదులను దిరస్కరించినవి క్రిందనమున నిక్కుచుండు నని తాత్పర్యము. అల. శ్లిష్టరూపకము.

మ. సతియూరుద్యుతిఁ జెందఁబూని నిజదుశ్చర్మాపనోదక్రియా
రతిఁ బాథోలవపూరితోదరములై రంభేభహస్తంబు లు
న్నతిఁజేన్ వీఁచె మరుద్విభూతిఁ గదలెన్ త్వగ్దోష మూచంచలో
ద్ధతశుండాతతిఁ బాయకయ్యె నదె పో తద్వైర మూలం బిలన్. 36

అ. ఇందుఁ దొడలను వర్ణించుచున్నాఁడు. సతి=ఆస్త్రీయొక్క, ఊరుద్యుతిన్=తొడల యొక్క శోభను, చెందన్=పొందుటకు, పూని=ప్రయత్నించి, నిజ...రతిన్—నిజ=తనయొక్క, దుశ్చర్మ=దుష్టమయిన చర్మముయొక్క, అనఁగా నిచట అరఁటియందుండు పొరలును, గజతుండ మందుఁ గర్కశత్వమును దెల్లని పొడలును దుశ్చర్మమనుటచేఁ దెలియునది. అపనోదక్రియా=పోఁగొట్టు కార్యమందలి, రతిన్=ఆసక్తిచేత, అనఁగా తమయందలి దోషములుండుటచే ఊరులతోడి సామ్యము సిద్ధింపదుగాన ముందుగా నీదోషములను బోఁగొట్టుకొనవలయు నన్న యాసక్తిచేతననుట, పాథో... దరములై—పాథోలవ=జలముయొక్క లేశమాత్రముచేత, పూరిత=నిండింపఁబడిన, ఉదరములై= కడుపులుగలవై. అనఁగా లోకమం దెవరేని దోషనివృత్తికొఱకు మితాహారులై తపసు చేయవల యునుగాన నివియు జలకణమాత్రములను గొనుటచేత కడుపు ప్రోచుకొనుచున్నవై యనుట, అరఁటి యందును గజతుండమందును నీరు నిండియున్నదని భావము; దీనినే దోషనివృత్త్యర్థమయిన తపము కొఱకు వలయుజలమాత్రాహారముగాఁ గవి నిబంధించినాఁడు. రంభా..హస్తంబులు— రంభా= అరఁటిచెట్లును, ఇభహస్తంబులు=గజతుండములును, ఉన్నతిన్=ఉన్నసమయమందు - దీక్షవహించి యున్న కాలమందనుట, మరుద్విభూతిన్=దేవతా సంపత్తిచేతనని యర్థము. వాయుసంపత్తిచేతనని భావము; తపస్సు చేసినందులకు దేవతగడా వరియుత్తువలెను. 'మరుతా పవనామరా' అను. కదలెన్=అరఁటియందు, త్వగ్దోషము=దుశ్చర్మదోషము, చెడెన్=నశించిపోయెనని యర్థము. గాలి కొట్టి పయిపొరలు కూడిపోయెనని భావము. ఆచంచల...తతిన్—ఆచంచల=కొంచెమైన చాంచల్యము గుణము గలిగినదియు, ఉద్ధత=ఎగురుపాటు గలదియు - కాంతిలేక మిడిసిపాటు గలదియనుట, అగు, శుండాతతిన్=గజతుండ సమూహమందు, పాయకయ్యెన్=ఆదుశ్చర్మదోషము వదలి పోవదయ్యెనని యర్థము. ఏనుఁగులతొండము లల్లలాడుచుండుగుణమును, పైకి నెత్తంబడుచుండుటయును గలిగియుండుట ప్రకటము. ఇలన్=భూమియందు, తద్వైరమూలంబు=ఆయరఁటిచెట్లకును గజతుండములకును గలవిరోధమునకు హేతువు, అదెపో=అదియేసుమీ. అనఁగా అరఁటియు నేనుఁగు తుండను నుసతపస్సు చేసినందు లకు నరఁటియందలి త్వగ్దోషముపోయి యేనుఁగు తొండములయందలి త్వగ్దోషము పోవకుండెనుగాన అయీర్ష్యచేత గజతుండము లాయరఁటులను బెల్లగించి వేయుచున్నవని యాశయము - ఏనుఁగు అరఁటి

చెట్లును వెకలించితినుట స్వభావము. ఆ స్త్రీయొక్క తొడలు అరఁటిబోదెలవలె నునుపును ఏనుఁగు తొండములవలె వాఁదోఁకయుఁ గలిగియున్నవని ఫలితార్థము.

తా. అరఁటియు నేనుఁగు తుండమును నా స్త్రీ తొడల యందమును బొందవలెనని యత్నించి ముందుగా తమపయి తోలుఁగవలసిన దోషములను (చూదుమును కర్కశత్వాదులను) బోఁగొట్టుకొనుటకై జలలేశమాత్రమును లోఁగొని తపస్సు చేయుచుండఁగా మరుత్ప్రసాదముచేత (వాయువుచేత ననుట) నరఁటియందు వర్ణదోషము (చూదుము) విడిపోయెను. చంచలమై పయికి మిడిసిపడుచుండుటచే నేనుఁగుతుండమందా దోషము (కర్కశత్వాదులు) విడకపోయెను. ఆయూర్వ్యచేతనే గజతుండము లాయరఁటిచెట్లతోడ విరోధముగలిగి వానిని పెల్లగించుచున్నవి. అలం. 'సతి...తతిక్'-హేతూత్ప్రేక్ష. 'అచంచ...తతిక్'- కావ్యలింగము.'అదె...బిలస్'-అతిశయోక్తి.

చ. అతివనితంబబింబ మఖిలావనిభాగము నేలి దీవులం
చితరుచి నాక్రమించి యరిజృంభణవారణధుర్య మై సువృ
త్తతఁ బరిపూర్ణరాజరమఁ దాల్చి సదా గజమస్తకోపరి
స్థిత మయి కాంచెఁ గాంచిగుణదీపితకాంచనపట్టబంధమున్. 37

అ. ఇందు నితంబమండలమును వర్ణించుచున్నాఁడు. అతివ=ఆ స్త్రీయొక్క, నితంబబింబము=కటిమండలము, అఖిలావనిభాగము=సమస్త భూప్రదేశమును - భూమండలమునంతయు, ఏలి=లోఁకువపఱచుకొని యని యర్థము. సమస్త భూభాగమును బరిపాలించియని ధ్వన్యర్థము. దీవులు=ద్వీపములను, అంచితరుచిక్=(రుచియనఁగా సౌందర్యమును, స్పృహయును)- ఒప్పుచున్న సౌందర్యముచేత, ఆక్రమించి=తిరస్కరించి-సప్తద్వీపములను ఒప్పుచున్న స్పృహచేత నాక్రమించియని అర్థం. అరియనగా రథచక్రమును శత్రువును, అరి=రథచక్రముయొక్క జృంభణ=గర్వ సమృద్ధియొక్క, వారణ=పోఁగొట్టుటయందు, ధుర్యమై=సమర్థమై, అరి=శత్రువులయొక్క - గర్వవారణమందు సమర్థమైనదని అర్థం. సువృత్తతక్=చక్కని వర్తులమగుటచేత, పరిపూర్ణ రాజరమక్=సంపూర్ణ చంద్రమండలసంపదను, తాల్చికదా=వహించియేకదా, సువృత్తతక్=సత్ప్రవర్తనముచేత పరిపూర్ణ రాజరమక్=సంపూర్ణ రాజలక్ష్మిని, తాల్చి కదా=వహించియేకదా యని అర్థం, గజ...స్థితమై--గజమస్తక=ఏనుఁగు కుంభములకు, ఉపరిస్థితమై=పయిగానున్నదై - ఏనుఁగు కుంభములను గ్రిందుపఱచినదై యనుట. ఏనుఁగు మూఁపుపయి నారోహించినదై యని అర్థం. కాంచి ..పట్టబంధముక్—కాంచి గుణ=బంగారు మొలనూలనెడు, దీపిత=ప్రకాశించుచున్న, కాంచన=బంగారు మయమగున, పట్ట=రాజ్యాభిషేకసమయమున నొసటఁ గట్టంబడెడు పట్టికయొక్క, బంధముక్=కట్టుటను, కాంచెక్=పొందెను.

ఇట నితంబబింబపరముగాను రాజపరముగాను అర్థద్వయము గలుగఁ జెప్పినాఁడు. రాజు భూభాగమంతయుఁ బాలించి సప్త దీవులనాక్రమించి శత్రువులనేపడఁచి మంచి వర్తనముతోఁ బూర్ణరాజలక్ష్మిని బొందెకదా ఏనుఁగుపయి నెక్కి బంగారుపట్టమును నొసటఁ గట్టికొని రాజ్యాభిషేకము చేసికొనవలయునని రాజపరమయిన యర్థము. కటిమండలము, భూవిస్తారమువకంటె విరివియై ద్వీపములకంటె నత్యున్నతమై రథచక్రముకంటె చక్కనైనదై, సంపూర్ణ చంద్రమండలముకంటె వర్తులమై గజకుంభములకంటె సమస్థితిగలిగి, ఉపరిభాగమందు బంగారు మొలనూలుగలిగి యొప్పుచున్నదని తాత్పర్యము. శ్లేషమూలకమైన సమాసోక్తి. 'కాంచ...ధముక్'రూపకము.

చ. కలికిముఖేందుకాంతికరమై కాంతవయోజలదాంతవేళ వ
ర్తులకుచగండశైలములు దోఁప వళిత్రయశోషరేఖ లిం
పలరఁగ మధ్యసీమ బయలై కటిసైకత మొప్ప బాల్య మ
న్బలునది యింకుచో మెఱసె నాభిగభీరజలాశయం బనన్. 38

అ. నవవయస్సంధిని వర్ణించుచున్నాఁడు - కలికి...వేళన్—కలికి=ఆ స్త్రీయొక్క, ముఖేందు=మొగమనెడు చంద్రునకు, కాంతికర=కాంతిని జేయునట్టి- లావణ్యశోభను గలిగించునట్టి యనుట, కాంత=మనోహరమయిన, వయః=యౌవనమనెడు, జలదాంతవేళన్=మబ్బులు విడుసమయమందు - శరదృతువు రాఁగా యనుట, వర్తు...శైలములు—వర్తుల=వట్రువలయిన, కుచ=స్తనములనెడు, గండశైలములు=పెద్దఱాతిగుండ్లు, తోఁపన్=కానవచ్చినట్లుగాను, వళిత్రయ=మూఁడు కడుపుమీఁది ముడుతలనెడు, శోషరేఖలు=నీరెండిపోవుటవలన నేర్పడునట్టి యిసుకరేఖలు, ఇంపలరఁగన్=చక్కనై యొప్పఁగా, మధ్యసీమ=నడుము, బయలై=అతి సూక్ష్మమై యని స్త్రీపరమయిన యర్థము. మధ్యప్రదేశము ప్రవాహరహితమై యని నదీపరమయిన యర్థము, కటి=పిఱుఁదనెడు, సైకతము=ఇసుకదిన్నె, ఒప్పన్=ఒప్పునట్లుగాను, బాల్యము అన్ బలునది=పసితనమనెడు పెద్దయేఱు, ఇంకుచోన్=ఎండిపోవుచుండఁగా, నాభి=పొక్కిలి, గభీరజలాశయంబు=లోఁతయిన మడుఁగో, అనన్, మెఱసెను.

పెద్దనది యింకిననే లోఁతయిన మడుఁగును, గండశైలములు మొదలయినవి కనఁబడుటయుఁ గలదు గాన బాల్యమును బలునదిగా యిట నిరూపించినాఁడు. అనఁగా నా స్త్రీకి బాల్యప్రాయము గడచిపోయి యౌవనప్రాయము రాఁగానే ముఖకాంతి యతిశయించెననియు,కుచము లున్నతములై కనుపట్టెననియు, వళులేర్పడెననియు, నడుము మిక్కిలి సన్నగిల్లెననియు, పిఱుఁదు గొప్పదయ్యెననియు, నాభి లోఁతుగా నుండెననియు దాత్పర్యము. దీనిచే నాయిక యౌవనప్రాదుర్భావమును సన్నూలమున సంభోగార్హతయు సూచితములు. ఇందుఁ బ్రకృతాప్రకృతము లయినయౌవన శరదాగమములయందు ముఖకాంతికుచప్రాదుర్భావాదులును జంద్రప్రకాశగండశైలపర్యనాదులును నగువస్తువుల తోఁపిక యథాక్రమముగఁ జెప్పఁబడెను. రూపకానుప్రాణిత ముత్ప్రేక్ష.

తా. ఆచెలువకు యౌవనము శరదృతువువలె రాఁగా నపుడు ముఖముకాంతి చంద్రప్రకాశమువలె నతిశయించెను. అంత నాబిడ బాల్యము పెద్దనదివలె నింకఁగా వట్రువలయిన గండశిలలు తోఁచినట్లు గుబ్బచన్నులును, ఎండిపోయిన యిసుక రేఖలు తోఁచునట్లు వళిరేకలును, మధ్యదేశము బయలగునట్లు మధ్యము సన్నముగను, యిసుకదిన్నవలె పిఱుఁదులు బలితముగను, లోఁతయిన మడుఁగువలె నాభియును గనుపట్టెను.

చ. అలికులవేణియారు నవయౌవన మన్ నలరాచతోఁటలోఁ
బొలుచునితంబవేదికడఁ బొక్కిలిదిగ్గియచెంత నీలసం
కలితనవాంబుయంత్ర మగుఁ గానియెడన్ రసగుంభనంబు సం
ధిలఁ బుట ముబ్బునే నడుమ నిల్చి ఘనస్తనసూనగుచ్ఛముల్. 39

టీ. అలి...యారు— అలికులవేణి = తుమ్మెదగుంపువంటిజడగలయాస్త్రీయొక్క, ఆరు = నూఁగారు, నవయౌవనము=క్రొత్తపరువము, అన్, నలరాచతోఁటలో=అనెడి మన్మథుని యుద్యానమందు, నలరాచశబ్దముచే రాజోద్యానమని యతిశయము దెలియునది. పొలు...కడన్—పొలుచు=ప్రకాశించునట్టి, నితంబవేదికడన్=పిఱుఁదులనెడి అరుఁగుపట్టును, పొక్కిలిదిగ్గియ చెంతన్=

నాభి యనెడు బొడ్డనబావి సమీపమందుండునట్టి, నీల... యంత్రము—నీల=ఇంద్రనీలమణులతో, సంక
లిత=కూడిన, నవ=క్రొత్తదైన, అంబుయంత్రము=నీళ్లుపాఱెడు దోనెపెట్టె, అగును, కానియెడన్ =
అట్లు గాకపోయినపక్షమందు, రసగుంభనంబు—రస=శృంగార రసమనెడు జలధారయొక్క, గుంభ
నంబు=కూర్పు, సంధిలన్=ఒడఁగూడుచుండఁగా, ఘన స్తనసూనగుచ్ఛముల్ = గొప్పలయిన కుచము
లనెడు పువ్వుగుత్తులు, నడుమన్ = మధ్యభాగమందు, నిలిచి= నిలువంబడి, పుటము ఉబ్బనే=పయికి
నుబుకునా - ఉబుకకయే పోవుననుట,

తా. ఆ స్త్రీయొక్క యౌవనము మన్మథోద్యానమువలె సర్వజన మనోరంజకము గను, పిఱుఁదు
అరుఁగువలెను, నాభి బొడ్డనబావివలెను, నూఁగారు నీలమణులు చెక్కినజలయంత్రమువలెను, కుచ
ములు పువ్వుగుత్తులవలెను నున్నవి. పిఱుఁదుల విరివియు, పొక్కిలిలోఁతును, నూఁగారురేకయు,
చనుఁగవ యుబ్బును, యౌవనోత్సేక సూచకములు. యౌవనమును వలరాచతోఁటగా రూపించుటచే
గోముగా నీళ్లుకట్టి పెంచుటచే పల్లవపుష్పశాఖాద్యుల్లసిత మైన రాజోద్యానమువలె నత్యంత రామణీయక
మును నతిభోగ్యత్వమును సూచితములు. అందు, చన్నుఁగవపూగుత్తులుగాను, మోవిచేతలు మొదలైనవి
కెంజిగుళ్లు లేఁగొమ్మలు మొదలైనవిగాను, గ్రహించునది. 'నవ' నూఁగారు క్రొత్తగా నిగిడినది గాన
క్రొత్త దోనెపెట్టెకు సాటి. 'ఘన' చనుఁగవ గొప్పలగుటచే పుట ముబ్బుట. ఈ చనుఁగవయుబ్బే
శృంగార రసోద్దీపనమునకుఁ బాకము దెలుపునది. యౌవనోదయమున కనుబంధి యగు శృంగారరసోద్దీప
నము రసగుంభనమనియు, తదుద్దీపనానుబోధ మగు స్తనప్రాదుర్భావమును సూనగుచ్ఛోద్భేదమనియు
వర్ణితము. అలం. రూపకము.

మ. ఘననాభీగుహచెంత నారుపొగ లేఁగౌఁగా నాని తా నాయనం
గుని మెప్పించి తదాత్మతం బొరయఁ గన్గోఁజాల కుజ్జృంభిత
స్తనయుగ్మం బతనుత్వ మొందె నదె ప్రత్యక్షంబు బింబాధరస్థితిం
బనరెం గన్నులు కెంబరాహితగతిం గాఢాప్తిం బయోజాస్యకున్. 40

అ. పయోజాస్యకున్=తామరవంటి ముఖముగలయా స్త్రీకి, ఘన...చెంత—ఘన= గొప్ప
దైన, నాభి=పొక్కిలియనెడు, గుహచెంతన్=బిలముయొక్క సమీపమందు, లేఁగౌను=సూక్ష్మమయిన
నడుము, అరుపొగ=నూఁగారుఅనెడు ధూమమును, ఆని=పానముసేసి - అనఁగా ఉగ్రమయిన తపస్సు
చేసి - పొగనూని తపముసేయుట యొకానొక తీవ్ర తపోవిశేషమని తెలియునది.

మ. దమయంతీ స్తనకుంభవిభ్రమము బొందం గోరుటన్ ధూమపా
నము గావించు నధోముఖంబులగు నానాకుంభముల్ వోలె ధూ
పములన్ దోహదమాచరింపఁగఁ గడున్ బక్వంబులై యున్న దాడిమముల్'

అని శృంగారనైషధమున ధూమపానరూపమగు తపము చెప్పఁబడియున్నది. తాను=అనఁద
ము, ఆయనంగునిన్=ఆమన్మథుని - శరీరవిహీనుఁడయిన యామన్మథుని, మెప్పించి = సంతోషింపఁజేసి,
తదాత్మతన్=వానితోడి భావమగుటను - అనఁగా తాదాత్మ్యమును, పొరయన్=పొందఁగా - మన్మ
థసాయుజ్యమును బొందగా ననుట, అనంగునిభావమయిన శరీరవిహీనతను అనఁగా అస్పృశ్యత్వమును
బొందఁగానని భావము. కన్గోన్ చాలక=ఈ మేలుచూచి చూడోపక, ఉజ్జృంభిత...యుగ్మంబు—ఉజ్జృం
భిత=విజృంభించుచున్న, స్తనయుగంబు=చన్నులజంట, అతనుత్వము = అతనుఁ డనఁగా మన్మథుఁడు -
మన్మథసాయుజ్యమును పొందెనని యర్థము. అతను శబ్దమున కధికమనియు నర్థముగాన ఆధిక్యమును

పొందెనని భావము. అధరోష్ఠంబు=మోవి, ఇక్షుధరస్థితిన్=ధర్మమనఁగా విల్లును గుణమును, చెఱకు తుంటవిల్తుఁడు విల్లుగాఁగల మన్మథునితోడి స్థితితో - సాయుజ్యముతో ననుట, గనరెన్=ఒప్పెనని యర్థము. ఇక్షువుయొక్క ధర్మము మాధుర్యముగాన మాధుర్యస్థితిచేత నొప్పెనని భావము. కన్నులు, శంబరాహితగతిన్--శంబరాహిత = శంబరుఁడనఁగా ఆపేరుగల యొక యసుర, శంబరమనఁగా లేడియును, శంబరాసురున కహితుఁడయిన మన్మథునియొక్క సాయుజ్యమును బొందెనని యర్థము. లేడికన్నులను దిరస్కరించిన విధమునువహించెనని భావము. 'శమ్బరం సలిలేప్యంసి మృగదైత్య విశేషయోః' విశ్వ.

ఆ స్త్రీయొక్క నాభి గుహవలె నున్నదనియు, నడుము కానరాకున్నదనియు, నూఁగారు నల్లగా ధూమరేఖవలె నున్నదనియు, చన్నుంగవ గొప్పవై యున్నవనియు, పెదవితీయనై యున్నదనియు, కన్నులు లేడికన్నులఁ దిరస్కరించు చున్నవనియుఁ దాత్పర్యము. చన్నుంగవ బలితము లగుటయు కన్నులు బెళుకులుగాంచుటయు నడుము సూక్ష్మమగుటయు నూఁగారు నల్లనై పొడచూపుటయు పొక్కిలి లోఁతగుటయు నవయౌవనోదయవిభవము సూచించుచున్నవి. అన్నిటికిని మన్మథసాయుజ్యప్రాప్తిని జెప్పుటచే మన్మథోద్దీపకత్వము వ్యంజితము. పెదవుల కిక్షుధర్మస్థితి వర్ణనచే చుంబనయోగ్యతయుఁ, గన్నులకు లేడికన్నుల బెళుకుజెప్పుటచే దుర్నిరమోహకత్వమును, స్తనయుగ్మమున కతనుత్వముచే నాలింగనార్హతయుఁ, బక్కినవానిచే నత్యంతభోగ్యత్వమును నాయికయందు ధ్వనించుచున్నవి.

పెద్దనాభి యనెడుగుహాప్రాంత నూఁగారనెడు పొగవ్రాగి లేఁతనడుము మన్మథునికై తపము చేసి యతని భావమును (అనఁగా అదృశ్యత్వమును) బొందఁగా, చన్నుంగవ యందులకుఁ జూపోపక తానును అతనుత్వమును (మన్మథత్వమని యర్థము. అధికత్వమని భావము) బొందెను. పెదవియు నిక్షుధర్మస్థితిని (చెఱకువిలుతుని భావమని యర్థము. చెఱకుగుణమయిన తీయఁదనమునని భావము) నొందెను. కన్నులు, శంబరాహితగతిని (మన్మథత్వమును, లేడికి విరోధియగుటను) పొందెను. అల. 'ఘన...బొరయక' నుత్ప్రేక్ష. 'ఘననాభిత్యాదిగతి రూపకసంకీర్ణమును తదాత్మ్య శాబ్దగత శ్లేషమూలకమును. తక్కినదానియందు శ్లేషానుప్రాణితమగు పర్యాయోక్తము. సమాసోక్తియు.

సీ. క్షణవిలాసమె కాని కగజనిష్పందులు, సరియె దుర్గాధివాసమున మనినఁ
బైపూఁతరుచి గాక ప్రతియె కిన్నరకాయ, లరిది మేరువు తలయంచ నిడినఁ
బ్రొద్దువన్నెలె కాక యొద్దియే తమ్మిమొగ్గలు చక్రములఁ గూడి జలము గొనినఁ
గాఁకచాయలె కాక కనకకుంభము లిడె, శ్రీగులశిరోగ్రసీమ నున్న

తే. మిళితఘనసారమై నున్న మిగిలి కనసి, యంతరము సూత్రమున కీక యలరిజోడు
వదల కమితరసప్రౌఢిఁ బొడలి మెఱయు, నన్నుతలమిన్న వలిగుబ్బచన్నుఁగవకు.

అ. ఇందు నాయికకుచవర్ణనము సేయుచున్నాఁడు - గజనిష్పందులు, క్షణవిలాసమె కాని= నిమిషమాత్రము శృంగారమే కాని, దుర్గాధివాసమున్=దుర్గమందలి కాఁపుచేత, మనినన్=వర్తించినప్పటికిని-పర్వతసహవాసము గలిగియున్నప్పటికి నని భావము. సరియె = సమానమగునా - కావనుట. కిన్నరకాయలు=కిన్నరవీణెకు వేసెడు గుబ్బకాయలు, పైపూఁతరుచి కాక=పయిని బూసినపూఁతరంగే కాక, అరిది=ఆశ్చర్యమయిన, మేరువు=బంగారుకొండ, తలయంచ్=తలక్రింద, ఇడినన్=ఉండుకొన్నను - మేరువుపూసతోఁ గూడికొన్నప్పటికిని భావము, ప్రతియె=ఈడగునా - కావనుట. తమ్మిమొగ్గలు=తామర మొగ్గలు, ప్రొద్దువన్నెలె కాక=ఆ సూర్యప్రొద్దు, గుణములే కాని=వేళవేళ గుణములే కాని యని యర్థము - సూర్యునిచేతనయిన వికాసములే కాని యని భావము. చక్రములన్=సేసలతోఁగూడి, జలముఁగొనినన్=బలువు పాలిచినప్పటికిని 'చక్రం కాసీకము స్త్రియామ్' అను. చక్రవాకములతోఁ గూడియు

న్నను రేకులు గలిగియున్నవని భావము. ఉద్దియై=జతయగువా - అనఁగా జతగావనుట. కనకకుంభ
ములు=బంగారుకలశములు, కాఁకచాయలె కాక= కాఁకవలన వచ్చినవన్నెలే కాని, శ్రీకరుల=సంపద
హస్తమందుఁ గలవారియొక్క - అనఁగా భాగ్యవంతులయొక్క, శిరోగ్రసీమన్=తలమీఁది ప్రదేశ
మందు, ఉన్నన్=ఉన్నప్పటికిని యని యర్థము, శ్రీకరుల=శ్రీదేవిని స్నానము చేయించునట్టి, దివ్యగజముల
యొక్క, శిరోగ్రసీమనున్నన్=కుంభములతోఁ గూడుకొన్నప్పటికిని అనిభావము. ఈడే=ఈడగువా -
అనఁగా కావనుట. 'లక్ష్మీర్దివ్యైర్గజేన్ద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుమ్భైః' అని ప్రయోగము.

ఈ నాలుగుచరణముల యందును జెప్పఁబడిన గజనిమ్మపండ్లును, పర్వతములును, కిన్నరకాయలను
మేరువును, తామరమొగ్గలును, చక్రవాకములును, సువర్ణకలశములును, గజకుంభములునునని యీరాఱుని
మిది యుపమానములందుండెడి లోపములచేత నివి సమానములు కావని చెప్పఁబడుచున్నది. మిళిత ... సా
రమై—మిళిత=కూడఁబడి, ఘన=అధికమయిన, సారమై=చేవగలదై-కర్పూరముతోఁ గూడిన దని భా
వము. గజనిమ్మపండ్లన్నఁ క్షణమాత్ర విలాసములుగనుక అల్పసారములనుట. ఇక్కడ కుచయుగమునకు
కర్పూరానుకూల్యమును, నిమ్మపండ్లకు కర్పూరప్రాతికూల్యమును గనుక నీవిధముగను వ్యతిరేకము చె
ప్పవచ్చును. నిమ్మపండ్లనుగూర్చి 'కర్పూర ప్రతికూలతా యదిన చేత్త్వయ్యేవ సర్వే గుణాః' అని చెప్పఁ
బడియున్నది. నున్నమిగిలి=నున్నఁదనముచేత నతిశయించి - పర్వతములన్నఁ గఱుకులయిన వనుట.
కదిసి=కదియఁబడి-కిన్నెరకాయలన్నఁ దొడగలిగియున్నవనుట. అంతరము సూత్రమునకున్ ఈక=
దారము దూఱునంతమాత్రమునందు లేక-మేరువున్నఁ దారముచేత గ్రుచ్చఁబడుచున్నదనుట,
అలరి=ఉల్లసించియని యర్థము. తామరమొగ్గలో వికసిల్లవనుట. జోడువపలక=జంటఁబాయక - చక్ర
వాకములన్నఁ సాయంకాలను కాఁగానే జోడుపాయుచున్నవనుట. అమితరస ప్రౌఢిన్=మితిలేని
శృంగారరస ప్రౌఢిచేత, పొదలి=విజృంభించి - సువర్ణకలశములన్నఁ మితరసప్రౌఢిచేత నొప్పు
చున్నవనుట- మితిజలములు నిండియుండునని భావము, మెఱయు=ప్రకాశించునట్టి-గజకుంభములన్నఁ
ప్రకాశింపవనుట. అన్నులతలమిన్న=కాంతాశిరోమణియైన యా స్త్రీయొక్క, నలి=చెలువమైన, గుబ్బ
=గుబ్బలవలె నుండెడు, చన్నుఁగవకున్=స్తనద్వయమునకు, సరియె=మొదలగువానితో సంబంధము.

ఇట గజనిమ్మపండులు మొదలయినవి తమంతట ఉపమానములయ్యు నాచన్నుఁగవకు సరిగానే
రక తమవలెనే యుపమానభూతములగు పర్వతాదులను దోడుసేసికొన్నను సాటిగాకపోవుటచే స్తన
ములనిరుపమత్వాతిశయము వ్యంజితము. మఱియు నీగజనిమ్మపండ్లు మొదలగువానికి దుర్గాధివాసము-మే
రువుతలయంపి, చక్రములకూడిక, శ్రీకరుల శిరోగ్రసీమయని, అత్యంత ప్రభుత్వప్రభావ బలసంపద్విశేష
ములను నర్థాంతరమునచే నలవఱిచి అట్టి ప్రకృష్టసాహాయ్య సంపత్తిని గుమురుపఱిచియు సాటికామిని
దెలుపుటచే చన్నుఁగవ లోకోత్తరసౌందర్యాతిశయము ధ్వనితము. అన్నులతలమిన్న గావుననే
దానిని చన్నుఁగవయు నుపమానముల కన్నిటికిని దలమిన్నయనుట యుచితమనియు నాశయము. అలం.
వ్యతిరేకము 'ప్రొద్దువెన్నెలె' ఇత్యాదులందు శ్లేషోత్థాపితము. 'మిళితఘనసారమై' ఇత్యాదులందు
గావ్యలింగముఁ. రెంటికి సంకరము.

తా. ఆకాంతామణి చన్నుఁగవ యెప్పటికిని విలాసము గలిగియుండుటచే నల్పకాలవిలాస
ముగల గజనిమ్మపండ్లును, నునుపులయి యుండుటచేతఁ గఱుకులగు కొండలనను, రెండొంటి గదిసి
యుండుటచే నెడగలిగియుండు కిన్నెరవీణెకాయలను, మేరుపర్వతమును, ఎప్పుడును వికసించి
యుండుటచే తామర మొగ్గలనను, కవబాయకుండుటచే జోడువీడుచక్రవాకములను, సహజ

మయిన చాయలచేఁ గాఁకవలనఁ జాయగాంచు బంగారు కుండలమును, నిగ్గు మెఱయుచుండుటచే నిగ్గులేనియేనుఁగు కుంభములను నతిశయించి వెలుఁగుచున్నది.

చ. సతిహృదయాలవాలమున ♦ జవ్వనపుం బెనుఁగాఁకఁ జేసి య
య్యతనుఁడు గుబ్బపొంబనఁటు ♦ లారనులోహశలాక నెత్తి యూ
ర్జితరుచి నింపఁగాఁ దుదలఁ ♦ జిందినతాఁపొడి బాహుమూలజ
ద్యుతి యగుఁ గానిచో నచట ♦ దోర్మయభర్మలతల్ జనించునే. 42

అ. అయ్యతనుఁడు - ఆమన్మథుఁడు-ఇటమీఁది రూపకములంబట్టి మన్మథుఁ డగసాలెవానిఁగా రూపించుకొనవలయును, ఇది యేకదేశవర్తిరూపకము. సతి..వాలము—సతి = ఆస్త్రీయొక్క, హృదయ = వక్షఃస్థలమనెడి, ఆలవాలమునన్ = కుదుటియందు, జవ్వనపుంబెనుకాఁకన్ = యౌవనమనెడి పెద్దకాఁకచేత, చేసి=నిర్మించి, గుబ్బపొంబనటులు -- గుబ్బ=చన్నులనెడి, పొంబనటులు= బంగారుకుండలు, ఆరు=నూఁగారు, అను లోహశలాకన్ = అనెడి యినుపకడ్డిచేత, ఎత్తి=ఎత్తిపట్టి, ఊర్జితరుచిన్ =ఉచితమయిన మెఱుఁగు, నింపఁగాన్ =నించఁగా - తగిన మెఱుఁగువచ్చునట్లు సానఁబట్టఁగా, తుదలన్ =అగ్రములనెడి కుండలచివరలందు, చిందినతాఁపొడి=రాలిన రజమే, బాహు... ద్యుతి— బాహుమూలజ=భుజముల మొదటఁబుట్టిన, ద్యుతి=కాంతి, అగును, కానిచోన్ ,అచటన్ = ఆబాహుమూలప్రదేశమందు, దోర్మయభర్మలతల్--దోర్మయ=బాహురూపములయిన, భర్మలతల్= బంగారుతీఁగలు, జనించునే=పుట్టునా.

అగసాలెవాఁడు కుంపటియందు నిప్పురగిల్చి దానిచే బంగారుసొమ్ములు మొదలగునవి చేయునుగనుక, ఇట మన్మథుఁడనెడి యగసాలెవాఁడు, ఱొమ్మనెడి కుదుటియందు యౌవనమనెడి కాఁకచే గుబ్బచన్నులను బంగారు కుండలను జేసినాఁడని వర్ణితము. అనఁగా యౌవనము దలసూపఁగా వక్షస్స్థలమున మన్మథోద్దీపకమయి బంగారుకుండలవలె చన్నులంగవ బొడసూపినదని భావము. అట్లగసాలెవాఁడు బంగారుతో నేవయిన వస్తువులను జేసి దానికి వలయునంత మెఱుఁగువచ్చుటకై సానఁబట్టుటయు దానిచే బంగారుదుమ్ము ప్రక్కలఁ గారుఁగుటయుఁ గలదు; అట్లే చన్నులనెడు బంగారుకుండలను దగినమెఱుంగులకొఱకు సానఁబట్టఁగా వాని బంగారుపొడి చివరలందు - అనఁగా బాహుమూలములందు, నొరిఁగినదనియు దానిచేతనే బాహుమూలములందుఁ గాంతిగలిగినదనియుఁ జెప్పినాఁడు. దీనిచే గుబ్బచన్నులు మంచి నునుపానిమెఱుఁగెక్కియున్నవనియు, బాహుమూలములు బంగారు తళతళకాంతు లీనుచున్నవనియు భావము. బంగారుదుమ్ము గనుకనే దానినుండి బాహువులను బంగారుతీఁగలవలె పుట్టినవన్నాఁడు. బంగారు భూమియందేకదా బంగారుతీఁగలు పుట్టును. అనఁగా బాహువులుబంగారు తీఁగలవలె నున్నవని భావము. కారణానుగుణముగా కార్యములుపుట్టుట ప్రసిద్ధమేకదా!

తా. ఆపడఁతికి యౌవనము పొడసూపియుండుటచే మరులు పుట్టించుచు బంగారు కుండలవలె నునుపయి మెఱుఁగెక్కినచాలిండ్లు మెఱయుచుండెను. బాహుమూలములు బంగారు నిగనిగకాంతుల దులకించుచుండెను. చేతులు బంగారుతీఁగలవలె రంగారుచుండెను. అలం. రూపకానుప్రాణితమగు ఉత్ప్రేక్ష.

చ. విలసితమౌక్తికంబులు స ♦ విభ్రమరేఖలు నున్కి నాటి రాఁ
దలఁచి మహోద్ధతిన్ మొరసి ♦ తన్మృదునాదవిలాసకౌశలం

బలవడమిన్ ముడింగి దరమై తనలో వివరం బెఱింగి యా
వలమురి దాఁ బ్రదక్షిణము వచ్చెనొ యాతనికంఠలక్ష్మికిన్. 43

అ. ఇందుకంఠమును వర్ణించుచున్నాఁడు, ఆవలమురి=శంఖము. విలసితమౌక్తికంబులు = మిక్కిలి ప్రకాశించుచున్న ముత్యాలపేరులును, సవిభ్రమరేఖలున్ = విభ్రమశబ్దము భ్రాంతియందును విలాసమందును వర్తించుచున్నది. 'విభ్రమోభ్రాన్తిహావయోః' అమ. విలాసములతోఁగూడిన రేఖాత్రయమును, అని కంఠపరమయిన యర్థము. ముత్యములును తిరుగుడు గలరేఖలును అని శంఖపరమయిన యర్థము.

'లలాటేచ గళేచైవ మధ్యేచైవ వళిత్రయం
స్త్రీపుంసయో రిదం జ్ఞేయం మహాభాగ్యైకసూచకమ్' సాముద్రికము.

ఉన్కిన్=ఉన్నందువలన - అనఁగా విలసితమౌక్తికంబులును సవిభ్రమరేఖలును గంఠమందును తనయందును సాధారణముగా నున్నందున, పాటిరాఁ దలఁచి=ఆ స్త్రీకంఠమునకు సరిరావలయునని యెంచి, మహోద్ధతిన్ = మిక్కుటమయిన యొగరుచేత, మొరసి=ధ్వనిచేసి, తత్ ... కౌశలంబు - తత్=ఆకంఠమును సంబంధించిన, మృదు - మెత్తనయిన, నాద=స్వరముయొక్క, విలాస=సౌష్ఠవమందలి, కౌశలంబు = నైపుణమును, అలవడమిన్ = కలుగక పోవుటచేత, ముడింగి=సంకోచమును బొంది-నీళ్లలో మునిఁగినదని భావము. దరమై=భయమై - దరమనెడి పేరుగలదైయని భావము. తనలో వివరంబు ఎఱింగి= తనలోఁగలయావద్వృత్తాంతమును దెలిసికొని -అనఁగాఁ దనకు మృదువయిన యెలుఁగులేమిని దెలిసికొనియనుట - లోపలరంధ్రముగలదని భావము. ఆసతి=ఆ స్త్రీయొక్క, కంఠలక్ష్మికిన్ = కంఠముయొక్క సౌందర్యలక్ష్మికి, తాన్ = తాను, ప్రదక్షిణము వచ్చెనో =అపరాధక్షమాపణముకొఱకు ప్రదక్షిణము చేసినది కాఁబోలును - దక్షిణావర్తము గలదని భావము.

ఇక్కడ శంఖమునందలి దక్షిణావర్తత్వమును ప్రదక్షిణాగమనముగాఁ గవి యుత్ప్రేక్షించినాఁడు. ఒకటిరెండుగుణములు సమానముగా నుండినంతనే తక్కువయినవాఁడు విఱ్ఱవీఁగి తనయొక్కువవానితో పాటికిరాఁబోఁడఁగా నంతఁ దనకొఱంత బయలుపడఁగా భయమునొంది తనలోఁగుట్టు నెఱింగి యాయెక్కువ వానికిఁ బ్రదక్షిణము వచ్చుట లోకమున సహజము. దానినే కవి యిట శంఖమునం దనుసంధించినాఁడు. అనఁగా నా స్త్రీకంఠము ముత్యాలపేరులచే నలంకృతమై విలాసయుక్తములగు భాగ్యరేఖలు మూఁడుగలిగి మెత్తనయి యింపారు నెలుంగుతోఁగూడి శంఖము నతిశయించి సౌందర్యము పెంపు పొంపారుచుండునని. అలం. 'విలసిత . మొరసి' హేతూత్ప్రేక్ష. 'తన్మృదు .. ముడింగి' హేతూత్ప్రేక్ష. దీనికి 'దరమై ..వచ్చెనో' అని శ్లేషానుగృహీతమగు నుత్ప్రేక్షతో సంకరము. సమాసోక్తియు.

సీ. కొమ్మవాతెఱతోఁ గుణసామ్యముఁ గైకొనవచ్చి, కఠినవిద్రుమము చేతఁ గట్టఁబడియెఁ
గోమలియధరంబుతో మొనల్ పచరించి, యరుచిబింబఫలంబు లవిసిపడియె
మృగనేత్రపెదవితో సొగసుఁ బూనఁగడంగి, కెంపునీరసము నెక్కించుకొనియె
సతిమోవితో నెనసస్థితులు చూపి సుగంధవికలబంధూక మూకరకయ విరిసె

తే. డాయు పగడంబునకుఁ బగడంబు బింబమునకు బింబంబు మొఱఁకు కెంపునకుఁ గెంపు
బంధుజీవంబునకుఁ దాన బంధుజీవ, మారా యాకువదన రదాంశుకంబు. 44

అ. కఠినవిద్రుమము=కాఠిన్యగుణముగల పగడము, కొమ్మవాతెఱతోన్ = ఆచెలువయొక్క మృదువయిన పెదవితో, గుణసామ్యమున్=సమానగుణమును, కైకొనన్ = గ్రహించుటకువచ్చి, చేకట్లన్

పడియెన్ = చేతియందలి కట్లనుబడెను. అనఁగా చేతులుకట్టివేయఁబడెనని యర్థము. గుణమనఁగా దారముగనుక దారముగ్రుచ్చఁబడి చేకట్లనెడిహస్తాభరణములందుఁ జేరినదని భావము. అరుచిబింబఫలంబులు=రుచిలేనిదొండపండ్లు, కోమలి యధరంబులోన్=ఆచెలువతియని మోవితోడ, మొనల్ పచరించి=ఎదిరించినవై, అవిసిపడియెన్ = గుప్పునఁగూలెను. మొనలనఁగా ఫలములయొక్క క్రిందఁ గనఁబడెడు కొనలుగనుక మొనఁజూపి కుళ్లిపడిపోవుచున్నవని భావము. కెంపు=రసహీనమయిన పద్మరాగము, మృగనేత్ర పెదవితోన్=ఆస్త్రీయొక్క రసయుక్తమయిన పెదవితోడ, సొగసు - సొగసనఁగా నిచట కాంతి, కాంతిని, పూనక కడంగి=వహించుటకుఁబూడంగి, నీరసము=తేలికగుణమును, ఎక్కించుకొనియెన్=చెక్కవేయించుకొనెనని యర్థము. నీరసత్వమును బోఁగొట్టించుకొనెననుట, కాంతికొఱకు సానవేయఁబడుచున్నదని భావము. సుగంధవికల బంధూకము-సుగంధ=మంచిగంధముచేత, వికల=శూన్యమయిన-మంచివాసనలేనియనుట, బంధూకము=మంకెనపువ్వు, సతిమోవితోన్=ఆచెలి యధరములో, రసస్థితులు=రసమనఁగా నిచట స్నేహము—స్నేహము గలిగియుండుటను, చూచి, పొరికయ=విస్ఫారణముగా, విరిసెన్=విచ్చిపోయెను. రసమనఁగా మకరందమును గాన మకరందరసస్థితులు చూచి తనకుఁ దానే వికసించుచున్నదని భావము.

ఔర=ఆశ్చర్యము, అకుంఠరదన= ఆస్త్రీయొక్క, రదాంశుకంబు= పెదవి, దాయు పగడంబునకున్ = తారసించిన పగడమునకు, పగ=విరోధముయొక్క, డంబు=అతిశయమూపమైనదియు, బింబమునకున్=దొండపండునకు, బింబంబు=ప్రతిపక్షమైనదియు, మెఱయుకెంపునకు=ప్రకాశించెడు పద్మరాగమునకు, కెంపు=కోపప్రయుక్తమయిన రక్తిమగలదియు, బంధుజీవంబునకును=మంకెన పువ్వునకును, 'బన్ధూకో బన్ధుజీవకః' అను. తాన=తానే, బంధుజీవము = జ్ఞాతిజీవనమయినది అని యర్థము. క్రమాలంకారము. ఇక్కడ మనుష్యునకు మనుష్యుఁడన్నట్లు పగడంబునకు పగడంబు, బింబమునకు బింబము, కెంపునకు కెంపు, బంధుజీవమునకుఁ దానే బంధుజీవము అని సారస్యము గ్రహించునది. అనఁగా నితరవస్తువులకంటె విద్రుమబింబపద్మరాగబంధూకముల కెట్టియరుణత్వాతిశయము గలదో యా విద్రుమాదులకంటెను వర్ణనీయమయిన యధరమునకు నట్టి యరుణత్వాతిశయము గలదని సారాలంకారము గమ్యము. అలం. వ్యతిరేకము. 'చేకట్ల' నిత్యాదిపదగత శ్లేషోత్థాపితము. ఛేకానుప్రాసమును.

ఉ. ఇంతిమృదూక్తిమాధురికి నిక్షురసం బెనపోలఁ జాలకా
ద్యంతము నోడి మధ్యమగుణాశ్రయమై నెఱకాఁక నన్నిజ
న్మాంతరముల్ వహించియుఁ దనంతన ఖండములయ్యెఁ గాని యా
వంతయుఁ బూన దెంతవడి కయ్యె నఖండతదీయసంపదన్. 45

అ. ఇంతి...మాధురికిన్—ఇంతి = ఆస్త్రీయొక్క, మృదుఉక్తిమాధురికిన్=మెత్తనిమాటల తియ్యఁదనమునకు, ఇక్షురసంబు = చెఱకుపాలు, ఎనపోలన్ చాలక = సాటిరా నేరక, అద్యంతముల్ ఓడి=అద్యంతములయందు ఓడిపోయినదై, 'ఆదిశ్చ అన్తశ్చ ఆద్యన్తమ్' అని యేకవద్భావము - చెఱకు మొదటికణుపునందును చివరకణుపునందును మధురరసము లేనిదని భావము. మధ్యమగుణ ఆశ్రయమై=ఉత్తమగుణముకాక మధ్యగుణమునకాశ్రయమై-మధ్యభాగమందు మాధుర్యగుణమున కాశ్రయమైనని భావము. నెఱకాఁకన్=గొప్పకోపముచేత-ఘనమయిన యగ్నిచేతనని భావము. అన్నిజన్మాంతరముల్=అనేకజన్మములు, వహించియును=తాల్చినప్పటికిని - పెక్కుజన్మములెత్తినప్పటికిననుట. గుడశర్కరాది దశలు పొందుచున్నదనిభావము. తనంతటనె=తనంతటఁ దానే, ఖండములు అయ్యెన్ కాని=

తునకలై పోయెనుగాని-ఖండశర్కర యగుచున్నదని భావము. ఎంతపొడియయ్యును=ఎంత పొడి పొడియైనప్పటికిని - ఇది జాతియును-విలవిలఁబన్నుకొని తానెంత నుగ్గునూచ యైనననుట - పొడిరూపమున శర్కరాభేదమగుచున్నదని భావము. అనఁగా నవాతు పంచదారయగుచున్న దనుట, అఖండ... సంపదల్—అఖండ=సంపూర్ణమయిన, తదీయసంపదల్=ఆ స్త్రీయొక్క మృదువచన మాధుర్యసంబంధియైన సమృద్ధిని, ఆవంతయున్=ఆవగింజంత యైనను, పూనదు=వహింపఁజాలదు—అనఁగా నా స్త్రీ వాఙ్మాధుర్యము బెల్లమును బులకండములను నవాతుచక్కెరను గూడ మించినదని తాత్పర్యము.

‘ఆప్యంత... నొంది’ మొదటఁ బోలఁజూడఁగా సంపూర్ణముగాఓడుట కలిగెను. ‘మధ్యమగుణాశ్రయమై’ ఎన్నోపాట్లు పడఁగా నడితరపుగుణము కలిగెను. దానియుత్తమగుణము కలుగదయ్యె. ‘జన్మాంతరముల్’ ఆ జన్మమునందుఁబోల శక్యముగాదని జన్మాంతరము లెత్తినదిగాని ‘ఖండములు’ తుపకు ఖండములే యైనవి. ‘అఖండ’ ఖండమైనది అఖండముతో సాటి యెన్నటికిని గాదు. చెఱకురసము సామాన్యముగానే కాక యెన్ని పాకములఁజెందియును సాటిగాదయ్యెననుట. అలం. శ్లేషోత్థాపితమగు వ్యతిరేకమును సమాసోక్తియు. ‘అఖండ’ కావ్యలింగము.

శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాఁకం దపం బంది యో
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసి యై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్. 46

అ. నానా=సమస్తమయిన, సూన=పుష్పములయొక్క, వితాన=సమూహముయొక్క-వాసనలన్=పరిమళములచేత, ఆనందించు సారంగము=సంతోషించునట్టి తుమ్మెద, ఏలా=ఎందులకు, నన్నొల్లదు, అటంచున్=అని, గంధఫలి=సంపెఁగమొగ్గ, ‘అథ చాంపేయశ్చమ్పకో హేమపుష్పకః’ ఏతస్యకలికా గన్ధఫలీస్యాత్’ అమ. బల్ కాఁకన్=బలుపయిన కోపముచేత నని కాని, పంచాగ్నిమధ్యమందని కాని యర్థము, తపంబు అంది=తపస్సుచేసి యని యర్థము; తపమనఁగా గ్రీష్మకాలమును గనుక అధికమయిన యుష్ణగుణముతోడ గ్రీష్మర్తువునందుఁ బుట్టుచున్నదని భావము. ‘ఉష్ణఊష్మాగమస్తపః’ అమ. యోషా=ఆచెలువయొక్క, నాసాకృతిన్=నాసికారూపమును - నాసికారూపమయిన జన్మాంతరము ననుట, తాల్చి=పొంది, సర్వ...వాసియై-సర్వ=సమస్తమయిన, సుమనః=పుష్పములయొక్క, సౌరభ్య=సువాసనకు, సంవాసియై=నివాసస్థానమై, సమస్తపుష్పవాసనలను గ్రహించుచున్నదని భావము. ప్రేక్షణ...పుంజంబులు-ప్రేక్షణమాలికా=చూపులచాలనెడు, మధుకరీ=ఆఁడుతుమ్మెదలయొక్క, పుంజంబులు=సమూహములను, ఇర్వంకలన్=రెండుప్రక్కలను, పూనెన్=వహించెను. తుమ్మెదలను సేవకులనుగా నేలి యుభయపార్శ్వములందును నిల్పెనని ప్రకారాంతరము. ఆస్త్రీయొక్క నాసిక సంపెఁగమొగ్గవలె చక్కనై యున్నదనియు వీక్షణములు తుమ్మెదబారులవలె నున్నవనియుఁ దాత్పర్యము.

‘సర్వ’ సారంగము ‘నానా’ సూనముల వాసనలకుఁ జొక్కినది గాన తాను ‘సర్వ’ పుష్పముల వాసనలకు పట్టయినది. అది ‘సూన’వాసనలకే చొక్కినది. తాను ‘సుమనస్సౌరభ్యముల’కు నిక్కయైనది. ‘మధుకరీపుంజంబులు’ ఒక్క సారంగము గదా తన్నొల్లకపోయె. తపమునఁ దన సారంగీపుంజములనే రెండుప్రక్కలఁ గొలిపించుకొన్నది. అలం. ‘నానా...తపంబంది’ ఉత్ప్రేక్ష. ‘బల్కాఁకం దపంబంది’ ఇత్యాదిపదగతశ్లేషానుప్రాణితము. ‘యోషా...దాల్చి’ అతిశయోక్తి. ‘ప్రేక్ష... పుంజంబులు’ పరిణామము. సమాసోక్తియు.

మ. తనరాజీవశరం బెఱుంగదు నిశాతత్త్వంబు లేఁగల్వతూ
పునకుం జాలదు వేగలీల యని యా పూర్వుల్ పూమల్కు లెగ్గించి క్రొ
న్ననవిల్కాఁడు నవాంబుజోత్పలవితానం బీనుమీనాక్షిలో
చనముల్ వింట ఘటింపఁ బొల్చె నవి నిస్తంద్రాంబకఖ్యాతులన్. 47

అ. తనరాజీవశరంబు=తనయొక్క అరవిందబాణము, నిశాతత్వంబు=వాఁడిగలుగుటను, ఎఱుంగదు=గుఱుతెఱుఁగదు—అనఁగా పద్మబాణమునకు వాఁడిలేదనుట. కమలము నిశా(రాత్రి)స్వరూపము నెఱుఁగదని భావము. లేఁగల్వతూపునకున్=కోమలమయిన నీలోత్పల బాణమునకు, వేగలీల=తీవ్రగమనక్రియ, చాలదు = సరిపోవదు. కలువకు, వేగన్ = తెల్లవాఱఁగానే, లీల = వికాసరూపమయిన విలాసము చాలదని భావము, అని=ఇట్లు విచారించి, ఆపూర్వుల్కులు=పురాతనములయిన యా పుష్పబాణములను, ఎగ్గించి=తప్పుపట్టి, క్రొన్ననవిల్కాఁడు=ఎఱ్ఱనిచిగుళ్లే విల్లుగాఁగల మన్మథుఁడు, నవ=నూతనములయిన, అంబుజ=తామరలయొక్కయు, ఉత్పల=నల్లకలువల యొక్కయు, వితానంబు=సమూహమును, అనఁగా అభినవాంబుజోత్పల బాణములను, ఈను=ఉత్పాదించుచున్న, మీనాక్షిలోచనముల్ =ఆ స్త్రీయొక్క నేత్రములను, వింటన్, ఘటింపన్ =(క్రొన్నన విల్కాఁ డన్నందున క్రొన్ననవింటను)సంధింపఁగా, ఇక్కడ నేత్రము లంబుజోత్పల వితానమీనుట ధవళనీలకాంతుల నీనుటయే యనిభావము. అవి=ఆ నేత్రములు, నిస్తంద్ర అంబకఖ్యాతులన్——నిస్తంద్రశబ్దము ఖ్యాతిశబ్దమునకు విశేషణమయ్యు, అర్థసౌందర్యబలముచేత అంబకశబ్దమునకు విశేషణమగుచున్నది. తంద్రయనఁగా దోషవిశేషము. అంబకములనఁగా బాణములును నేత్రములును. అనిశాతత్వాతీవ్రగమనాది దోషములు లేని బాణములయొక్క ప్రసిద్ధులచేత, పొల్చెన్=ప్రకాశించెను. తంద్రారూపదోషములేని నేత్రములని భావము. అనఁగా ఆ స్త్రీయొక్క నేత్రములు తెల్లదామరరేకులకంటెను నల్లగలువ రేకులకంటెను నతిశయించిన చక్కఁదనము గలిగి మన్మథబాణములవలె నున్నవని తాత్పర్యము. ఇక్కడ రూపకాతిశయోక్తియలంకారము. ఈయలంకారముచేత నానావిధానేకబాణసంపాదకకామనాయకసామ్రాజ్యముస్ఫురించుచున్నది గనుక నుపమాలంకారధ్వని కలుగుచున్నది.

తే. త్రిజగతీసుదతీరూపవిజయకీర్తి, గలుగు నని యింతిఫాలభాగమున వ్రాసి
నలువ యాశుభవాచకంబులను శ్రీల, మొదలఁ దుదిని ల్పెనఁ గర్ణములు దనర్చు.

అ. ఇందుఁ గర్ణములను వర్ణించుచున్నాఁడు. నలువ=బ్రహ్మ, త్రిజగతీ=మూఁడుజగములందలి, సుదతీ=స్త్రీలయొక్క, రూప=చక్కఁదనమును, విజయ=గెలుచుటచేత నయిన, కీర్తి=యశస్సు, కలుగును అని, ఇంతిఫాలభాగమునన్=ఆ స్త్రీయొక్క నుదుటియందు, వ్రాసి, ఆశుభవాచకంబులకున్=అవ్రాయఁబడిన శుభవాక్యములకు, శ్రీలన్=శ్రీకారములను, మొదలన్=మొదటను, తుదిన్=చివరను, నిల్పెన్ అనన్=నిలిపినాఁడో యనునట్లుగానే, కర్ణములు=చెవులు, తనర్చున్=ఒప్పుచుండును, ఏదేని శుభలేఖ వ్రాతవ్రాయునపుడు మొదట శ్రీకారముంచుట ప్రకటము. ఇటకూడ శుభవాచకములే బ్రహ్మ వ్రాయుటంబట్టి మొదటను దుదను శ్రీకారము లుంచినాఁడని చెప్పఁబడినది. మఱియు ఫాలమందు బ్రహ్మ ప్రాణుల యాయురాదులు వ్రాయుననెడి ప్రతీతి యిట యనుసంధింపఁబడినది. చెవులు శ్రీ యనునక్షరమ్ములవలె నున్నవని తాత్పర్యము. అలం ఉత్ప్రేక్ష. త్రిలోకకామినీసౌందర్యాతిశాయి యగు నాయికాసౌందర్యవైభవ మిట స్ఫురించుచున్నది.

చ. అనయము నీలకంధరము నభ్రము నన్నసమాఖ్యవారితో

నొనరియు నింతివేనలికి నోడి యనిశ్చితరూపధేయమై
చనియె మొగుల్ నగావళికి శబ్దగుణంబులు సూపువాని నె
ట్టనఁ బురివిచ్చువానిదరి డాయుజడాత్ములకెవ్వి నిల్కడల్. 49

అ. ఇందుఁ గొప్పును వర్ణించుచున్నాఁడు. అనయమున్=ఎల్లప్పుడును, నీలకంధరమున్ అభ్రమున్ అన్న సమాఖ్యవారితోన్=నీలకంధరము అభ్రము అనునట్టి తనకు సమానములయిన నామములుగల నెమలితోడను ఆకాశముతోడను, ఒనరియున్=కూడికొనియుండియును నని యర్థము. మేఘము నెమలికిఁ బ్రియమైనదియు ఆకాశముతోఁ గూడికొన్నదియునని భావము. ఇంతి వేనలికిన్=ఆ స్త్రీయొక్క కొప్పునకు, ఓడి=కాంతిచేత సాటిగాలేక యోడి, అనిశ్చిత...ధేయమై - అనిశ్చిత=నిశ్చయింపఁబడని-తెలియరానియనుట, రూపధేయమై=రూపముగలదై యని యర్థము, నానారూపములు గలదగుటచేత నీరూప మా పముగలదని నిశ్చయింపరానిదని భావము. మొగులు=మేఘము, నగావళికిన్=పర్వతసమూహమునకై, చనియెన్=పోయెను, ఎందులకనఁగా, శబ్దగుణంబులు సూపువాని = ఇక్కడ గుణములనగా ఆవృత్తులు-శబ్దావృత్తులను గనఁబఱుచు వానియొక్కయు - అనఁగా ఆడినమాటలే యాడుచుండునట్టి వదరుఁబోతుయొక్కయు నని యర్థము. శబ్దగుణక మాకాశమని భావము, గుణస్త్వావృత్తి శబ్దాదిజ్యేన్ద్రియాముఖ్యతన్తుషు' నైధృతి. నెట్టనన్ = శీఘ్రముగా, పురివిచ్చువాని = పురి కొననివానియొక్కయు నని యర్థము. నెమలిపురి విప్పుచున్నదని భావము. ఇక్కడ వ్యత్క్రమము. దరిన్=సమీపమును, డాయు జడాత్ములకున్ - డాయు=చేరునట్టి, జడాత్ములకున్=మందమతుల కని యర్థము. జలమాత్మయందుఁ గలిగియున్నదని భావము. 'లడయోరభేదః' అనుటచే జడమనఁగా జలమని భావము గ్రహించునది. నిల్కడల్ ఎవ్వి=స్థిరభావము లెక్కడివి - అనఁగా మందమతులకు స్థిరచిత్తములు లేవనుట. ఆ స్త్రీయొక్క కొప్పు మేఘమునకంటె నతిశయమయిన నీలకాంతిగలిగి నెమలి పింఛమువలె విప్పుగలిగి యున్నదని తాత్పర్యము.

'సమాఖ్యవారితో' మేఘము తనంతటఁ దానే ఇంతి వేనలిని గెలువఁదరముకాదు గాన యీడు జోడగు నొకరిద్దఱను తోడు సేసికొన్నది. 'ఓడి' అప్పటికిని ఓడుటయే కాక గెలుపన్నమాట లేదయ్యె. 'నగావళికిన్' ఓడినవారు కొండలపాలేకదా. 'శబ్దగుణంబులు ... విచ్చువాని' కార్యశూరత్వము లేక యట్టి వదరుఁబోతునను బ్రయత్నపరుఁడు గాని సోమరినిని దోడుగాఁ జేపట్టినవారికి నుదురుపాటెక్కడిది? అలం. 'నీల...నగావళికిన్' హేతూత్ప్రేక్ష. 'శబ్ద...నిల్కడల్' శ్లేషానుప్రాణితమైన అర్థాంతరన్యాసము. సమాసోక్తియును.

సీ. కన్నెపాదము లజుఁ గన్నమేటికినైన, బాలజంఘలు వరశాలికైనఁ
బూఁబోఁడిజఘనంబు భూరివేదికినైనఁ, బొలఁతిపొక్కిలి సరసులకునైన
నతికౌను సర్వజ్ఞమతికైన నతివచ, స్తవ ప్రసన్నాదికృత్యకవులకైన
రమణినెమ్మోము పూర్ణకళానిధికినైన, వనితవేనలి ఫణిస్వామికైన [నె
తే. గుణములన్నియుఁ గ్రహింపఁగోచరింప, వనినమముబోంట్లకునుతింపనలవియగు
కువలయాధీశ నీవు గన్గొంటివేని, చెలువచెలువాత్మఁ బాయక నిలుచు నేమొ.

అ. కన్నెపాదములు=ఆకన్యయొక్క యడుగులు, అజున్=బ్రహ్మను, కన్నమేటికినయినన్=కాంచినట్టిశ్రేష్ఠుఁడగువిష్ణువునకయినను - పద్మమునకయిన నని భా. బాలజంఘలు = ఆపడఁతియొక్క పిక్కలు, వరశాలికైనన్ = వరములచేత నొప్పుచున్నవానికయినను - అనఁగా వరములు పడసిన

వానికయిన ననుట. పర = శ్రేష్ఠమయిన, ఫాలికిన్ ఐనను = పరిపాట్టకయిన నని భా. పూఁబోఁడి, జఘనంబు = కటిపురోభాగము, భూరివేదికినయినన్ = మిక్కిలి తెలిసినవానికయిన - బంగారమయమైన యరుఁగునకయిన నని భా, పొలఁతి.పొక్కిలి=నాభి, సరసులకునయినన్=శృంగారరసయుక్తులకయిన-సరోవరములకని భా. సతి కౌను=నడుము, సర్వజ్ఞమతికైనన్ = సర్వజ్ఞుఁడయిన శివుని యొక్క బుద్ధికయినను - ఆకాశమునకయిననని భా. అతివ, చన్గవ=చన్నులజంట, ప్రసన్నాదిత్య కవులకైనన్ =ప్రసన్నులయిన దేవతలుగల - అనఁగా దేవతలు ప్రసన్నులయియున్న - కవులకయినను 'కేజలే వయః పక్షిణః' అనెడు వ్యుత్పత్తి చేత కవియనఁగా జలపక్షి. కవులనఁగా జలపక్షులు. ప్రసన్నుఁడయిన సూర్యుఁడుగల కవులు చక్రవాకములుగనుక చక్రవాకములకయిన నని భావము. రమణి నెమ్మోము=సొగసయిన ముఖము,పూర్ణకళానిధికినయినన్=సంపూర్ణవిద్యానిధికయిన- సంపూర్ణచంద్రునకయిననని భా. వనిత, వేనలి=జడ, ఫణిస్వామికయినన్ = శేషునకయినను - సర్పశ్రేష్ఠునకయిన నని భా.

గుణములన్నియును = ఆపాదములు మొదలయిన యవయవములకుఁగలగుణముల నన్నింటిని, గ్రహింపన్ =విష్ణుప్రభృతులకుఁ దెలిసికొనుటకు- పద్మాదులకుఁ గయికొనుటకని భావము. గోచరింపవు= (పాదాదులు) కనుపట్టవు, విషయములుగావనుట. విష్ణుప్రభృతులాపాదాదుల గుణములన్నియును నెఱుంగఁజాలరనుట. పద్మాదులకాపాదాదుల గుణములన్నియుఁ గలుగఁజాలవని భావము. పాదాదులు అజుఁగన్న మేటి మొదలయినవారికి గుణములన్నిటిని గ్రహింప గోచరింపవని యన్వయము. అనినన్ =అనఁగా, మముబోంట్లకు=మావంటివారికి, నుతింపన్ =స్తోత్రము చేయుటకు, అలవియగునె=శక్యమగునా-శక్యముగాదనుట. కువలయాధీశ=ఓవసుమహారాజా ! నీవు, కన్గొంటివేని=చూచితివేని, చెలువచెలువు= ఆపడఁతియొక్క చక్కఁదనము, ఆత్మన్ =అంతఃకరణమును, పాయక=ఎడఁబాయక, నిలుచునేమొ= నిలిచియుండునేమొ - అనఁగా నీవుచూచి తీరవలెనుగాని నేనాచక్కఁదనమును గొనియాడ శక్తుఁడనుగానని తాత్పర్యము.

తా. అకన్యపాదములు. పిక్కలు, కటి, పొక్కిలి, నడుము,చన్నుంగవ, నెమ్మోము, కొప్పు,అను వానియందొక్కొక్కదానికింగల గుణములన్నియు వానికుపమానములయిన తామర, పరపొట్ట, బంగరు తిన్నె, సరస్సు, ఆకాశము, చక్రవాకములు, చంద్రుఁడు, సర్పము అనువాని కొక్కొక్కనికిని వరుసగా నెంతమాత్రమును గలుగఁజాలవు. వానిని,వర్ణించుట విష్ణువు శివుఁడు శేషుఁడు మొదలయినవారికే శక్యము గాదనఁగా నిఁక మాబోంట్లకుఁ బొగడశక్యమగునా? రాజా! నీవు కన్నారఁజూచితివేని యా సుందరీమణి చక్కఁదనము నీమనస్సునం దచ్చొత్తినట్లే యగునేమో. అలం. శ్లేషానుప్రాణితమైన అరాపత్తి. ఉపమాధ్వనియు.

మ. కమనీయాకృతియోగ్యకీర్తనములన్ గన్పట్టునాశ్యామ యా
సుమనోవల్లరి యాసుధాసరసి యాసొంపొందుడాల్దీవి యా
సుమబాణాంబక యాయమూల్యమణి యా చొక్కంపుఁబూబంతి యా
కొమరుంబ్రాయపురంభ యాచిగురుటాకుంబోఁడి నీకే తగున్. 51

అ. కమనీయ...కీర్తనములన్ - కమనీయ=సుందరమయిన,ఆకృతి=ఆకారమునకు - అనఁగా అవయవములకు, యోగ్య=తగినట్టివయిన, కీర్తనములన్ - పొగడికలతోడ - అనఁగా మస్తకము మొదలుకొని పాదపర్యంతముగల యవయవములకుఁ దగినట్టివర్ణనములతోడనని యర్థము. లేక- ఆయా యవయవములకు యోగ్యమయిన శ్యామ సుమబాణాంబక మొదలయినపదములచేతఁ దన్నే పేర్కొనుటల

తోడననియు నర్థము, కన్పట్టు=కనఁబడుచున్న, ఆశ్యామ=అనఁడియౌవనముగల స్త్రీ) 'శ్యామా యౌవ నమధ్యస్థా' అను. లేక 'శ్యామయనగా 'శ్యామాతు మహిళాహ్వయా' అన్నట్లు ప్రేంకణ పుఁదీఁగగనుక నాతీఁగయైనదియు - ఆతీఁగవలె నున్నట్టిదియనుట, ఆకృతి శ్యామవలె నుండుటచే ఆ కృతిపతియే శ్యామయని కీర్తింపఁబడినది. ఇదియే కమనీయాకృతి యోగ్యకీర్తనమని తెలియునది. అవయవములు కమనీయము లగుటంజేసియే దానికి దగినట్లు కమనీయములయిన శ్యామాదిపదములఁ జేతఁ గీర్తింపఁ బడుచున్నదని కమనీయవిశేషణసారస్యము. ఆసుమబాణ అంబక = ఆమన్మథు నియొక్క బాణము - బాణమువంటిదని యర్థము - మన్మథుని బాణములవంటి కన్నులుగలదియును - ఇట నేత్రావయవమునకు నుపమానముగాఁగల 'సుమబాణాంబక' పదములచేత నేత్రియే యోగ్యముగాఁ గీర్తింపఁబడుట తెలియువది. ఆయమూల్యమణి=ఆవిలువలేని పద్మరాగమణియైనది, ఆమణివంటిదనుట- వెలలేని పద్మరాగమణివంటి యధరోష్ఠము గలదియౌను. అధరోష్ఠమునకుఁగగు అమూల్యమణి శబ్దము చేత నవయవియే కీర్తింపఁబడినది. ఇట్లె మీఁదనెల్లఁ దెలియునది. ఆచొక్కంపు పూబంతి=ఆయచ్ఛ మయిన పూవుచెండు - పూచెండువంటిదనుట - చొక్కపు పూచెండ్లవంటి చన్నుఁగవగలదియును, ఆసుమనోవల్లరి=ఆపూవుదీఁగ - పూఁదీఁగవంటిదనుట-పూఁదీఁగలవంటి బాహువులగలదియును, ఆసుధా సరసి = ఆయమృతపుకొలను - అమృతపుకొలనువంటిదనుట - అమృతకొలనువంటి నాభిగలదియు, ఆసొంపొందుడాల్ దీవి = ఆచక్కనగుచున్న కాంతియొక్క ద్వీపము(స్థానము)-కాంతి స్థానమువంటి దనుట. కాంతిగల ద్వీపమువంటి కటిచక్రము గలదియు, ఆకొమరుం బ్రాయపురంభ=అపూపవయసు గల రంభ - ఎలప్రాయపు రంభవంటిదనుట - రంభయనఁగా అప్సరసయు అరఁటియుఁగనుక - లేఁత యరఁటిబోదెలవంటితొడలుగలదియు. ఇట యవయవిపరమందు రంభయను నప్సరసను అవయవపర మున రంభయనఁబడు నరఁటినిగ్రహించునది.

ఇట శ్యామాదిపదములు ఉపమానములయి ఆయాయవయవములను గీర్తించుచు తన్మూలముననేకాక ప్రత్యేకముగనుగూడ నవయవిని గీర్తించుశక్తిగలిగి యుండుటను దెలియునది. ప్రత్యేకముగ నెట్లన- 'పూఁదీఁగ' 'మరుని పూములికి' 'వెలలేనిరతనము' 'పూబంతి' 'తళుకులదీవి' 'అమృతంపుబావి' 'రంభ' యిత్యాదిపదము లవయవోపమానత్వము నాశ్రయింపక తమంతటనే సాదృశ్యార్థమున స్త్రీవిషయ మందుఁ బ్రయుక్తములై యున్నవి. కవి యిట్టు లవయవములకు నుపమానము లయినవియుఁ దమంతటఁ బ్రత్యేకముగ నవయవికిని బ్రయుక్తములయినవియు నగు పదములనే యిటఁగ్రోడీకరించిన చతురత నె ఱుంగునది. ఆచిగురుటాకుంబోడి=ఆచిగురువంటి మేనుగలదియు . చిగురుటాకులవంటి పాదములుగ లదియును. ఇవి యెల్ల నవయవములనుబట్టి యవయవికి యోగ్యమయినకీర్తనములు. ఇట్టి సుందరి,నీకే, తగును - మఱియొకరికిఁ దగదని భావము. మఱియు శ్యామాపదము మొదలుకొని రంభాపదము వఱకుఁగల యుపమానపదములచేత నుపమేయమయిన స్త్రీలక్షిత యగుచున్నది. కాన యభేదరూపా తిశయోక్తి తెలియునది.

తా. తీఁగవంటి మేనును, మరునియమ్ములవంటి కన్నులును, వెలలేనికెంపువంటి వాతెఱయు, చొక్కపుఁబూవుబంతివంటి చన్నుంగవయు, పూఁదీఁగలవంటి చేతులును, అమృతంపుగోలనువంటి పొక్కిలియు, కాంతులు తళుకొత్తు దీవివలెనున్న కటిచక్రమును, పరువ మయినయరఁటిబోదెలవంటి తొడలును, చిగురాకులవంటి యడుగులునుగలిగి యిట్లు సొగసయినయవయవములకుఁదగినట్టి కీర్తనము లచే నొప్పుచున్న యాసౌందర్యవతి నీకేతగును గాని మఱొక్కరికిఁ దగదు.

తే. చిత్తజాకార యాచెల్వచెలులచెల్వ, మలవియె నుతింపవారు వామాక్షివలనఁ
గలికిచూపులు ననవద్యగతులుఁ బొరయఁ, గదిసిన సురాహిరాజన్యకన్యలో క్క.

అ. చిత్తజాకార=మన్మథునివంటి రూపముగల ఓసురాజా! ఈసంబోధనముచే ఆసుందరీమ ణికి నీవే తగుదువనుట మరింత పోషితము. ఆచెల్వచెలుల చెల్వము = ఆ స్త్రీ యొక్క చెలికత్తె యల చక్కఁదనము. నుతింపన్=పొగడుటకు, అలవియే=శక్యమా — శక్యముగాదనుట. ఏల నిన, వారు=ఆచెలికత్తెలు, వామాక్షివలనన్=సుందరములయిన నేత్రములుగల యా స్త్రీవలన, కలికిచూ పులు=సొగసయిన బెళుకుచూపులను, అనవద్యగతులు = దోషములేని అనఁగా తొట్రుపాటులేని నడ కలను, పొరయన్=పొందుటకు - నేర్చుకొనుటకు, కదిసిన=చేరవచ్చిన, సుర=దేవతలయొక్కయు, అహి=పన్నగులయొక్కయు, కన్యలో క్క = కన్నెపడుచులగుదురేమో- అని క్రమాలంకారము.

దేవతాకన్యలు తెప్పపాటులేని చూపులుగలవారు. నాగకన్యలు పాదప్రచారములేనివారు, కనుక తెప్పలల్లార్చెడు(కులుకు) చూపులను పాదములచే నడచెడు (సురిపెపు) నడలను ఆపడఁతివలన నేర్చు కొనవలయునని వచ్చిన దేవనాగకన్యలుగాని సాధారణపు మానవకన్యలు గారుసుమాయని తాత్పర్యము. దీనిచేఁ జెలికత్తెల యసాధారణ సౌందర్యాతిశయమును దన్మూలమునఁ దత్సేవిత యగునానాయికయను పమసౌందర్యవైభవమును వ్యంజితములగుచున్నవి. అలం. ఉత్ప్రేక్ష. దీనిచే నాయికాత్రిలోకోత్తర సౌందర్యరూప వస్తుధ్వని. ఆనాయికను మనుజకన్యలనే కాక దేవకన్యలును నాగకన్యలనుగూడ నతిశ యించినదని తా.

శా. ఆలావణ్యవతీమణుల్ గొలువఁగా నాలేమ యాకోనలో
నాలీలాభవనంబులో ననఘకంఠాలప్తిసౌభాగ్యముల్
వ్యాలోలాంగుళిసంజ్ఞచేఁ గఱపుతీరన్ వీణఁ బల్కించునా
యాలాపంబె గిరిన్ దరీముఖరమై యాలింపఁగా నయ్యెడిన్. 58

అ. ఆలావణ్యవతీమణుల్ = ఆ స్త్రీరత్నములు, కొలువఁగాన్=సేవింపఁగా, ఆలేమ=ఆ స్త్రీ, ఆకోనలోన్=పూర్వము చెప్పఁబడిన యాకోనయందు, ఆలీలాభవనంబులోన్ = ఆక్రీడా గృహములో, అనఘ...సౌభాగ్యముల్ — అనఘ=నిష్కల్మషములయిన - ఏదోషమును లేకుండునట్టి, కంఠ=ఎలుఁగు యొక్క, ఆలప్తి=పలుకఁబడియొక్క, సౌభాగ్యముల్ = ఒప్పిదములను - తనకంఠస్వరముచేతఁ బలు కంబడిన పలుకులయొక్క యొప్పు పెంపులననుట, వ్యాలోల...సంజ్ఞచేన్=వ్యాలోల = మిక్కిలి కద లుచున్న-సరకట్లపయి సంచరించుచున్న, అంగుళిసంజ్ఞచేన్ = వేళ్లయొక్క సైగచేత, కఱపుతీరన్=నే ర్పుచున్నవిధముగా - నేర్పుచున్నదోయన్నట్లు, వీణన్ = వీణయందు, పల్కించు ఆ యాలాపంబె= పలికించుచున్న యారాగసంచారమె, మృగాదులకు అవయవసంజ్ఞలచేతనే యేదేని కఱపుట సహజము. ఇట వీణకుఁ దనకంఠస్వరముయొక్క పలుకఁబడి పెంపుసొంపులను జేతిసైగచేఁ గఱపుచున్నదో యన్నట్లు మెట్లమీఁద వ్రేళ్లుసంచరించుట చూపట్టుటను వర్ణించినాఁడు, గిరిన్ = ఈకోలాహలపర్వ తమందు, దరీముఖరమై=గుహలయందు మాఱుమ్రోయుచున్నదై - గుహలయందు మాఱుమ్రోయుట యే వినఁబడుటకు నుపకారకముగా నిటచెప్పఁబడెను. ఆలింపఁగానయ్యెడిన్ =వినవచ్చుచున్నది.

తా. ఆచెలువ యాసుందరీమణులు గొలుచుచుండఁగా మునుపుచెప్పిన యాకోనయందు క్రీడా భవనమున నిర్దుష్టమయిన తనకంఠస్వరపురాగసౌభాగ్యములను వ్రేళ్లాడించి సైగలుచేసి వీణకుఁ జెప్పిం చుచున్నదోయనునట్లుగా వాయింపఁగా నారాగసంచారమే యీకొండయందు గుహాలలోఁ బ్రతిధ్వ

నించుచు మనకు వినవచ్చుచున్నది. అలం. ఉత్ప్రేక్ష. దీనిచే నాయికకంఠధ్వని వీణాధ్వనిం బోలిన దని యుపమాలంకారధ్వని.

ఉ. స్వైరవిహారధీర లగు సారసలోచన లున్నచోటికిన్
బోరన లాతివారు చొరఁ బూనినచో రసభంగ మంచు నేఁ
జేరక పువ్వుఁదీవియలచెంతనె నిల్చి లతాంగిరూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్. 54

అ. స్వైర...ధీరలు—స్వైరవిహార=స్వేచ్ఛగా విహరించుటయందు, ధీరలు=ప్రౌఢలు-దిట్టలు, అగు, సారసలోచనలు=స్త్రీలు, ఉన్నచోటికిన్, బోరనన్ = తటాలున, లాతివారు=అన్యులు, చొరన్ పూనినచోన్=ప్రవేశింపఁజూచినయెడల, రసభంగము=సారస్యముచెడుట, అంచున్-సారస్యము చెడిపోవునని, నేను, చేరక=వారిని తారసింపక- వారియెదుటికిఁబోకయనుట, పువ్వుఁదీవియల చెంతనె=పూవుఁదీఁగలపొంతనే - అనఁగా వానిచాటుననే, నిల్చి, లతాంగిరూపు = ఆపడఁతియొక్క చక్కఁదనము, కన్నారఁగన్=కన్నులునిండుగా - కంటికిఁ దృప్తియగునట్లుగా, చూచి, నవ+అంబురుహ+అంబక—నవ=క్రొత్తయైన, అంబురుహ=తామరరేకులవంటి, అంబక = నేత్రములుగలవాఁడా, నీకున్, తెల్పఁగన్, వచ్చితిని.

సారసలోచన లున్నచోటికి నవసారసలోచనుఁడవయిన నీకుఁ బోవుటయుక్తమని యానుషంగికార్థము గ్రహించునది. నవాంబురుహాంబకయన్నచో అంబకశబ్దమునకు బాణమనియు నర్థము గాన నవమన్మథుఁడనియు నర్థము గ్రాహ్యము. సారసలోచనలు స్వైరవిహారధీరలగుటచే బోరనఁజొచ్చుటయు లాతివారగుటయు రసభంగమునకు హేతువులని తెలియునది.

తా. ‘ఆ సుందరీమణులు, దిట్టలై విచ్చలవిడిని గ్రీడించుచుందువారు. అట్లువారు క్రీడించుచున్నచోటికి మొదలెపోరాదు; మఱి యుందెలుకచేయక తటాలునను బోరాదు. అట్లితరులు చొచ్చినచో సారస్యము చెడిపోవును’ అని నేనువారియెదుటికిఁబోవక పువ్వుదీఁగలమఱుఁగుననే యుండి యాచిన్నారి చక్కఁదనమును గన్నారఁగఁజూచి నవమన్మథుఁడవయిన నీకుఁ దెలుపుటకై వచ్చితిని.’’ అనెను. ‘స్వైర...ధీరలు’ కావ్యలింగము. ‘నవాంబురుహాంబక’ పరికరాంకురము.

చ. అని చెలి విన్నవించుటయు నాహితవాక్యము మున్ను విన్నయ
న్నినదముకన్నఁ దిన్ననయి నీరజలోచన యున్నకో నకుం
జనఁ దివిరింపఁ దత్ప్రియ వచస్స్థితికన్న విరాళి నించె న
జ్జనపతికిన్ మనోజభుజచాపలతాగుణగుంజితార్భటుల్. 55

అ. అని, చెలి = చెలికాఁడు, విన్నవించుటయున్ = విజ్ఞాపనముచేయఁగా, ఆహితవాక్యము=అప్రియమయిన వచనము, మున్ను=మునుపు, విన్న యన్నినదముకన్నన్=విన్నట్టి యాసంగీత నాదముకంటెను, తిన్ననయి=చక్కనయి ఆసంగీతనాదము విన్నప్పటి యానందమునకంటె నట్టి సుందరీ మణియున్న దన్నవాక్యము మఱింత యానందముగ నుండెనని యాశయము, నీరజలోచన = తామరల వంటి కన్నులుగల యాచెలువ, ఉన్నకోనకున్, చనన్=పోవుటకు, తివిరింపన్=పూన్పఁగా - ప్రయత్నపెట్టఁగా-లేక తీవరపెట్టఁగా, అనినదముకన్న నాహితవాక్యము ఆస్త్రీయున్నకోనకుఁ బోవు విషయమై మఱింత పూనిక గలిగించినదనుట, తత్...కన్న- తత్=ఆసఖునియొక్క, ప్రియ=ప్రియమయిన, వచఃస్థితికన్నన్=వాక్యసంగతికంటెను, మనోజ...ర్భటుల్—మనోజ=మన్మథునియొక్క, భుజ=బా

హువులందలి, చాపలతా=తీఁగవంటిధనుస్సుయొక్క, గుణ=నారియొక్క, గుంజిత=మ్రోఁతయొక్క, ఆర్భటులు=ధ్వని యాడంబరములు, అజ్జనపతికిన్=ఆవసురాజునకు, పిరాళిన్=వలపును - మన్మథ వికారమునసుట, నించెన్=పూర్ణీభవింపఁజేసెను. ఇట తుమ్మెదలఝంకారములను మన్మథచాపశింజినీటంకారములుగాఁజెప్పినాఁడు. గానవినాదము పోఁగుతూహలము గలిగించెను. దానికంటె సఖుని హితవాక్యము త్వరపెట్టెను. దానికంటె తుమ్మెదలఝంకారములు మిక్కిలియు వలపునించెనని యుత్తరోత్తరాతిశయము తెలియునది. ఇట గానాకర్ణనమునఁ దలసూపినరతి సఖునివాక్యముచేఁ బరిణతిమై తుమ్మెదల ఝంకారములవలన శృంగారరసముగా వెలివిరిసినదని యాశయము.

తా. ఇట్లా చెలికాఁడు విన్నవింపఁగా గానధ్వనికంటె నతనిప్రియవాక్యమే యాచెలువయున్న చోటికిఁబోవునట్లు త్వరగపుట్టించెను. తుమ్మెదలు ఝంకృతులు సేయఁగా నపుడవి యాప్రియవాక్యముకంటె మఱింత మరులు నించెను. అలం. సారము. 'మనో...ర్తులఁ' సర్వ్యయోక్తము. సమాధి గమ్యము.

ఇట తుమ్మెదఝంకారములను మన్మథచాపశింజినీటంకృతిధ్వనులగాఁ జెప్పుటచే, మన్మథుఁడు వసురాజు నాక్రమించుటకై సన్నాహసంరంభము వ్యంజితమగుచున్నది. ఎవరో గానముచేయుచున్నారని తెలియుటకంటె నపూర్వసౌందర్యవతి గానము చేయుచున్నదని వినుట మఱింతత్వరాతిశయమును మన్మథవికారప్రాదుర్భావమును జేసెను. మదనపరికరమయిన మధుపఝంకారము లావికారమును బూర్ణీభవింపఁ జేయుటయుఁ దెలియునది.

తే. కిన్నరవిహంగయుగళిచే ముమ్న విన్న, సన్నుతాసన్నశుభద ప్రసన్న ఫణితి
మదికిసరిదాఁకముదమునఁ బొదలి మేదినీపతి హితాగ్రణిని ద్రోవసూపు మనుడు.

అ. కిన్నర విహంగయుగళిచేన్=కిన్నరపక్షులజంటచేత, మున్ను=మునుపు, విన్న...ఫణితి— విన్న=విన్నదియు, సన్నుత = కొనియాడఁ బడినదియు, ఆసన్న శుభద = సమీపమందలి శుభము నిచ్చునదియు, ప్రసన్న=స్వచ్ఛమయినదియు, అగు, ఫణితి = పలుకుబడి-వాక్యరచన, మదికిన్=మనస్సునకు. సరిదాఁకన్ = తారకాణముకాఁగా, ముదమునన్=సంతోషముచేత, పొదలి=ఉబ్బి - సంతోషముచేత ఉప్పొంగియనుట, మేదినీపతి=రాజు, హితాగ్రణిని=హితులలో శ్రేష్ఠుఁడయిన చెలికానిని, త్రోవసూపుము, అనుడున్=అని చెప్పఁగా, ముందఱికన్వయము.

తా. మునుపు కిన్నరపక్షుల జతవలనఁ దానుదోఁడనే యొక శుభముగలుగునని విన్నపలుకుబడి యపుడామంత్రి చెప్పినదానివలనఁ దన మనసునకు సరిపోయినదని తోఁపఁగా, సంతోషముచే నుప్పొంగి యావసురాజు తన మేటిహితుని దారిచూపుమని చెప్పఁగా.

సీ. ఈతాలఁబోరాదు హేరాళము జవాది, యీరాలనడుచక్కి నేఁగవలయు
నాకాన నేకాల మడరుఁ దేనియవాన, లాకాన నేర్పున సరుగవలయు
నీవంక నేవంక నెనసినతుహినాంబు, వీవంకఁ బూఁదెప్ప నీఁదవలయు
నామూలనునుమూల తామొత్తములచఱు,లామూలనుగఁ దీవలంటవలయు

తే. నధిపయిదిమానికపుఁగోన యదిలతాంత, రజముసారువయిది కప్పురంపుటనఁటి
చప్పరంబల్లయది కాంతసదనమనుచు, నరపతికిఁ దెల్పె నరుగుచో నర్మసఖుఁడు.

అ. నర్మసఖుఁడు=[illegible]రిమి చెలికాఁడు, అరుగునపుడు = పోవుచున్న సమయమందు, నరపతికిన్=రాజునకు, ఈతాలన్ = ఈశిలలందు, పోరాదు = పోఁగూడదు - ఈశిలలమీఁదుగాఁ బోఁగూడదనుట. ఏల[illegible]గా జవాది = జవ్వాజి, హేరాళము=మిక్కిలి యధికము. జవ్వాది

పిల్లి తీఁగాలమీఁద జవ్వాదినింపినందున నవి జిడ్డుగలిగి జాఱుచున్నవని భావము. మఱి యెటుపోవలెన నఁగా, ఈరాలనడు చక్కిన్ =ఈరాలనఁగా ఈరములు పొదలు - పొదలనడిదారిని, ఏఁగవలయున్ = పోవలయును. ఆకానన్ =ఆయడవియందు, తేనియవానలు=మకరంద వర్షములు, ఏకాలము=ఎల్లకాలము, అడరున్ =క్రమ్ముచుండును. కాఁబట్టి, ఆకానన్ =ఆకు+ఆనన్ - ఆకులనూనునట్లుగా- ఆకులడ్డమగునట్లుగా - ఆకుజొంపముల క్రిందుగాననుట, అరుగవలయున్ =పోవలయును, ఈవంకన్ =ఈపార్శ్వమందు, ఏవంకను=ఏదిక్కునందును, ఎవసిన తుహినాంబులు=కలయఁబాఱియున్న మంచునీళ్లు, కాఁబట్టి, ఈవంకన్ =ఈసెలయేటిని, పూఁదెప్పన్ =పువ్వుల తెప్పచేత, ఈఁదవలయున్ =ఈఁదిదాఁటవలయును. ఆమూలన్ =ఆకోణమందు, నును...చఱుల్ —నును=నునుపుగలిగిన, మూలతా=వజ్రమణులయొక్క, మొత్తములమయమయిన, చఱుల్ = చఱియలు, చఱులు నున్ననయిన వజ్రమణులుగా నున్న వనుట. కాఁబట్టి, ఆమూలమునకున్ =మొదలంటఁగా, తీవలు=తీఁగలను, అంటవలయును=పట్టుకొనవలయు-నును పగుటచే జాఱును గనుకఁ దీఁగలనుబట్టుకొని దిగవలయుననుట. అధిప=రాజా, ఇది, మానికపుఁగోన= మాణిక్యమయినకోన, అది=ఆకనఁబడునది, లతాంతరజము=పుష్పాదియొక్క, సాఁపవ= మేరువ-అనఁగా బరువయిన వస్తువులు పయికెక్కించుటకయి పొడవుగా మట్టితోఁబోసిన మేరువకు సారువమనియుఁ బేరుగనుక నిక్కడ పుష్పాదిదిన్నె యని తెలియవలయును. ఇది, కప్పురపుటనఁటి చప్పరంబు= కర్పూరపరఁటి చవిక. అల్లయది=అదిగో కానఁబడునది. కాంతసదనము = నేను జూచిన స్త్రీయొక్క గృహము, అనుచున్ , రాజునకు తెల్పెను. తా. సుగమము. అలం. వృత్త్యనుప్రాసము.

సీ. ప్రకటితోన్మేష కీపద్మిని కినకర, కౌతుకావాప్తి వేగనె ఘటించుఁ
దతవయోవిభవ కీలతకూన కాసన్న,పున్నాగవిహృతి గొబ్బునను యబ్బు
విలసితామోద కీ కలికికొమ్మకు రాజ, సారంగయోగ మీక్షణమ కల్గు
భువనాభివంద్య కీ నవరసనసికి, మానసప్రియలీల తోన దొరకు
తే. ననుచుఁదమలోన లేఁదోఁటకలరయుమగువ,లాపునుడువులువినవయ్యెనదియెఱింగి
నృపయుపశ్రుతివింటివేయిచటననుచు, నాప్తుఁడెఱిఁగింపహర్షించెనధిపుఁడపుడు.

అ. ఇం దుపశ్రుతిని జెప్పుచున్నాఁడు. ప్రకటితోన్మేషకున్ —ప్రకటిత=(పరువము) తెలియఁబడుచున్న, ఉన్మేషకున్ =వికాసము గలిగినదైన, ఈపద్మినికిన్ =ఈతామరతీఁగకు, ఇన...వాప్తి— ఇనకర=సూర్యకిరణములచేతనయిన, కౌతుక=ఉబ్బుయొక్క, అవాప్తి=ప్రాప్తి. వేగనే= తెల్లవాఱఁగానే, ఘటించు=ఒనఁగూడునని యర్థము ప్రకటితోన్మేషకున్ = ప్రకటితమయిన యుల్లాసముగల, ఈపద్మినికిన్ =ఈపద్మినీజాతి స్త్రీకి, ఇనకర=రాజహస్తముయొక్క, కౌతుక అవాప్తి=అభిలాష ప్రయుక్తమయిన ప్రాప్తి, వేగనే ఘటించున్ =శీఘ్రముగానే ఒనఁగూడునని యర్థాంతరము. 'కౌతుకంత్వభిలాషేస్యా దుత్సవే నర్మహర్షయోః, పరంపరాసమాయాతమఙ్గళేచ కుతూహలే' విశ్వ. వేగ ననెడుపదము నరితాదిగణపతితము గనుక తువర్ణలోపమని తెలియునది. మగువలు లేఁదోఁటలు వెదకునపుడు, ఈతామరతీఁగకు సూర్యకిరణములు తెల్లవాఱఁగా సోఁకఁగానే యుల్లాసము కలుగునని తమకుఁ దాము చెప్పుకొఁగానది వారికిఁ దెలియకయే పద్మినీజాతి స్త్రీకి రాజహస్తప్రాప్తి గలుగునని యర్థాంతరముగలిగి యుపశ్రుతియగుట తెలియునది. ఇట్లే మీఁద నెల్లఁగావ్యము.

తత...విభవకున్ —తత=విస్తరించిన, వయః=(శుకశారికాది) పక్షులయొక్క, విభవకున్ =వైభవముగలదియైన, ఈలతకూనకున్ =ఈలేఁతతీఁగకు, ఆసన్న...విహృతి—ఆసన్న = సమీపమందున్న,

పున్నాగ=పొన్నచెట్టునందలి, విహృతి=విహారము-అనఁగా పొన్నచెట్టునఁ బ్రాఁకుట, గొబ్బుననె=త్వరితముగానే, అబ్బున్=లభించును. తత=విస్తరించిన, వయః=యౌవనముయొక్క, విభవముగల యొకన్యకు, ఆసన్న=సమీపగతుఁడయిన, పున్నాగ=పురుషునితోడి, విహృతి=విహారము, త్వరగానే లభించునని యర్థాంతరము. 'పున్నాగే పురుషస్తుఙ్గః కేసరో దేవవల్లభః' అమ.

విలసితామోదకున్ — విలసిత=ఒప్పుచున్న, ఆమోదకున్ = పరిమళముగలదయిన, ఈకలికికొమ్మకు=సొగసయిన యీవృక్షశాఖకు, రాజసారంగయోగము = రాచతుమ్మెదతోడికూడిక, ఈక్షణమ=ఇపుడే, కల్గున్=కలుగును. విలసితమయిన, ఆమోద=సంతోషముగల, ఈకలికికొమ్మకు=చక్కని స్త్రీకి, రాజసారంగయోగము = రాజకుంజరునియొక్క అనఁగా రాజశ్రేష్ఠునియొక్క, సంయోగము, ఈక్షణమందే కలుగునని యర్థాంతరము. అర్థమున సారఙ్గాణాం భృఙ్గాణాం రాజా రాజసారఙ్గః 'రాజదన్తాదిషు పర' మ్మని ప్రాక్ప్రయోగార్హమగు సారంగశబ్దమునకు పరనిపాతము. అర్థాంతరమున రాజాసారఙ్గో గజ ఇవ రాజసారఙ్గః.

భువనాభినంద్యకు — భువన=జలముచేత, అభినంద్యకున్ = మిక్కిలి కొనియాడందగినదియైన, ఈ, నవరస సరసికిన్=క్రొత్తయగు మాధుర్యరసముతో(లేక జలముతో)గూడిన కొలఁకునకు, మానసప్రియులీల — మానసప్రియ=హంసలయొక్క, లీల=క్రీడ, తోన=వెంటనే, దొరకున్=లభించును. భువనాభినంద్య=జగత్తుచే స్తోత్రము చేయఁదగిన యీ నవశృంగార రసముతోఁగూడిన రసికురాలికి పురుషశ్రేష్ఠునితోడి క్రీడ వెంటనే దొరకునని యర్థాంతరము. 'భువనం విష్టపేఽపి స్యాత్సలిలే గగనే' మేదిని.

అనుచున్=ఇట్లు పలుకుచు, లేఁదోఁటలు=లేఁతతోఁటలనుటచే సూర్యకిరణములకు విరియకున్న లేఁత తామరతీఁగయు, చెట్టుపయి ప్రాఁకుగొనని యెలతీఁగయును, తుమ్మెదలింకను ముసరనికొమ్మయును, క్రొత్తఁగా నీరునించిన కొలఁకును, నిటు గ్రహింపఁబడినవని తెలియునది. అరయు = పరిశీలించుచున్న, మగువలు=స్త్రీలు, తమలోనన్=ఒకరితో నొకరు, ఆడునుడువులు=చెప్పికొనుమాటలు, విననయ్యెన్=వినవచ్చెను, అది, ఎఱింగి=అట్టిమాటలు వినవచ్చుటను గనుఁగొన్నవాఁడై యనుట. నృప=రాజా, ఇచటన్=ఈప్రదేశమున, ఉపశ్రుతి=ఉపశ్రుతివాక్యమును, వింటివే=విన్నావా, ఉపశ్రుతియనఁగా నొక పనికిఁబోవునపుడుగాని దానిని గుఱించి మాటలాడునపుడుగాని యందుల కనుకూలముగా నాకస్మికముగ నితరులవలన వినవచ్చుమాటల సముదాయము, అనుచున్=అని పలుకుచును, ఎఱింగింపన్ = తెలియఁజెప్పఁగా, అధిపుఁడు=రాజు, హర్షించి=సంతోషించి, అపుడు=ఆసమయమందు, పయిపద్యముతో నన్వయము. ఇట పద్మిన్యాదులకుఁగల 'ప్రకటితోన్మేషాది' విశేషణములు 'ఇనకరకాతుకావాప్తి శీఘ్రఘటనాదులకు' హేతువులు. పరువము ప్రకటముగానుండుటఁబట్టియే తామరతీఁగకు సూర్యకిరణ ప్రాప్తివలనవికాసమును, పక్షులు వ్రాలునంతి పెనుపు నొందియుండుటచే లతకూనకు పొన్నచెట్టుపయి ప్రాఁకునంతచాఁగుపడియు, వాసనలిచ్చుచుండుటచే శాఖకు తుమ్మెదవాక్రించికూడుటయు, జలములు కొనియాడఁదగినవగుటచే సరసికి హంసకేలలును, శీఘ్రముగాఁ గలుగునని యాశయము.

ఇది భావిభావుక రూపార్థాంతర సూచకమైన సఖీవాక్య ముపశ్రుతిగాఁ దెలియవలెను. ద్వయోరప్యర్థయోర్వాచకత్వా న్నశ్లేషః - నాపిశబ్దశక్తిమూలా ఉపమాలంకార ధ్వనిః సంబన్ధాన్తరే సమ్భవతి ఔపమ్యమూలకత్వకల్పనానపేక్షణాత్ । కింతు సూచకత్వసంబన్ధాచ్ఛబ్దశక్తిమూలో వస్తుధ్వనిః. అతఏవోక్తమలఙ్కారసర్వస్వే శ్లేషాలఙ్కారప్రస్తావే 'యత్రసూచనవ్యాపారోఽస్తి తత్రశబ్దశక్తిమూలో వస్తుధ్వనిర్బోద్ధవ్య' ఇతి. ఇక్కడ యాదృచ్ఛిక సూక్తియందు సూచనవ్యాపార

మని తెలియవలెను. ఈరీతినే యుత్తరత్ర 'లలనాలలామ' మొదలగుపద్యములందు యాదృచ్ఛిక సూక్తులందలి సూచనవ్యాపారము గ్రహింపవలెను. ఈ విచారము కవి తానే 'అతులప్రౌఢిమచో ను భావముల' ననుపద్యములో 'యాదృచ్ఛికసూక్తి సూటిపడ' నన్నచోటఁ బ్రకటముచేసినాఁడు.

క. *కుతుకమున నచలసుత యగు, సతిఁ గనఁ జనురాజమౌళిచాడ్పున నపు డా
క్షితిపతి సతిఁ జూచుతమిన్, హితసూచితసరణిఁ గానకే తెంచు నెడన్. 59

అ. ఆక్షితిపతి = ఆవసురాజు, కుతుకమునన్ = కుతూహలముచేత, అచలసుత = హిమవత్పర్వతపు కూఁతురు, అగుసతిన్ = అయినచెలువను - పార్వతీదేవిని, కనన్ = చూచుటకు, చనురాజమౌళిచాడ్పునన్ = పోవునట్టి చంద్రశేఖరుఁడయిన శివునివలె - శివుఁడో యనునట్లుగా, ఇచట 'అచలసుత యగుసతి' యనఁగాఁ గోలాహలపర్వతపుత్రియైన గిరికాదేవియనియు, రాజమౌళియనఁగా రాజశ్రేష్ఠుఁడయిన వసురాజనియును భావము. అపుడు = ఆసమయమందు, సతిన్ = ఆస్త్రీని, చూచుతమిన్ = చూడవలయు నెడి కోరికచేత, హితసూచిత సరణిన్ -- హిత=నర్మసఖునిచేత, సూచిత = సూచింపఁబడిన, సరణిన్ = మార్గమున, కానకున్, ఏతెంచు నెడన్ = వచ్చునపుడు, ముందుపద్యముతో నన్వయము.

ఇట 'అచల సుతయగుసతిఁ గనఁ జనురాజమౌళి చాడ్పునన్' అనుచో నవీనమతము చొప్పున నుపమాలంకారము. రాజమౌళిత్వము సమానధర్మము గ్రాహ్యము - రాజమౌళిపదము ఉపమానవాచకమును రాజమౌళిత్వరూపసమానధర్మవాచకము నని తెలియునది. ఇట్లే అచలసుతాదిపదములకును సమానధర్మవాచకత్వము తెలియునది. ప్రాచీనులు, విశేష్యశ్లిష్టతయందు శబ్దమాత్రసాధర్మ్యమంగీకరించి ధర్మసామ్యము లేమిగనుక శ్లేషాలంకారమనిరి. కనుక శ్లేషాలంకార మగుచున్నది. శ్లో॥ ప్రకృతాప్రకృతోభయగత ముక్తం చే చ్ఛబ్దమాత్రసాధర్మ్యమ్ శ్లేషోఽయం శ్లిష్టత్వం సర్వత్రాప్యస్యయే నాస్త్యే' అని లక్షణము. 'తనకప్పు నెఱిఁగొప్పునను పూస' యనెడి పద్యములో ఆర్యాదిశబ్దములు పార్వత్యాద్యుపమానవాచకములును ఆర్యాత్వాదిరూపసమాన ధర్మవాచకములునని తెలియవలెను. ఈపద్యములో నుత్ప్రేక్షాలంకారము. చతుర్థాశ్వాసమందు 'నటదీశానశిరస్తటత్రుటితతరత్నచ్ఛాయ కల్లోలినీ విటమధ్యంబున వ్రాలె నభ్రమణి' యన్నచో నభ్రమణిపద ముపమేయభూతసూర్యవాచకమును, అభ్రమణిత్వము ఉపమేయభూతహారశిరోరత్న సూర్యసాధారణ ధర్మమును నగుచున్నదిగనుక నుభయథా చెప్పవలయును. పూర్వత్ర ఉపమాన పదములందు శ్లిష్టత్వము; ఇక్కడ నుపమేయపదములందు శ్లిష్టత్వమని భేదము. మాఘకవియు 'జగత్ప్రశీకర్తు మివాస్మరస్య ప్రభావళీకేతన

---

* ఈపద్యము బ్రౌణ్ దొరగారు ప్రకటించిన పుస్తకమునఁ గానరాదు. మఱియు నిచట వాయికకుంగల యచలసుతాత్వాదులింకను దెలియంబడకున్నవిగాన తెలియకమునుపే యిట్లు చెప్పుట సంగతముగాదు. కేవల స్త్రీమాత్రముగనే యింతవఱకును గవి చెప్పియున్నాఁడు. కాఁబట్టి యీపద్యము లేమియె యుచితము. అచలసుతాత్వాదులు కంఠోక్తులుగాక యలంకారగమ్యములై యున్న దన్నను జదువరికి మాత్రము దెలిసియు రాజునకుఁ దెలియకయు నుండుట తటస్థించుచున్నది. అపుడు తెలియని రాజునకుఁ దోఁచునయ్యు. రసాదులు దెలిసినపాఠకుల కంతగ స్ఫోరకములుగా నేరవుగాన రాజుతోఁ బాటిగా తెలియకుండుటయే రచనాఫక్కియందలి చాతుర్యము. మఱియు గమ్యముగఁ దెలుపుటయు మీఁదివివరణమునందలి సారస్యమును నపూర్వత్వప్రయుక్తమయిన రామణీయకమును గుందించుచున్నదనుట సహృదయైకవేద్యము.

వైజయన్తీ' అన్నాఁడు. ఇందుఁ గదళీవృక్షములను గేతన వైజయంతులుగా నుత్ప్రేక్షించి నాఁడు కదళులనఁగా వైజయంతులని యర్థాంతరము. 'కదళీ వైజయన్త్యాం చ రమ్భాయాం హారిణాన్తరే' మదీయపద్యము 'రాజేవదృశ్యతే చన్ద్రిస్సభాస్తారా ఇవామ్బరే । సదస్యయాని లక్ష్యన్తే శరదాగమ రాత్రిషు' సోమకవి.

తా. పర్వతపుత్రిక యైనపార్వతిని జూడఁబోవు శివునివలె నానసురాజు పర్వతపుత్రి యైన యాపడఁతిని జూచుటకుఁ బ్రియసఖుఁడు చూపిన దారిని బోవునపుడు.

తే. తొలుదొలుత భద్రకుంభముల్ తోఁపఁ బిదపఁ
బచ్చతామానికపు నిచ్చపచ్చతోర
ణంబు వొడసూప వరుసఁ గన్యాగృహంబు
నరపతి కమూల్యకల్యాణగరిమఁ దెలిపె. 60

అ. తొలుతొలుతన్ = ముందుముందుగా, భద్రకుంభముల్ = పూర్ణకలశములు, తోఁపన్ = కనఁబడఁగా - బంగారుకలశములు తోఁపఁగానని భావము.' భద్రస్స్యాన్మఙ్గళే హేమ్ని మస్తకే కరణాన్తరే' విశ్వ. పిదపన్ = తర్వాత, పచ్చతామానికపు నిచ్చ పచ్చతోరణంబు = మరకతమణులవలె ఎప్పుడును పచ్చనగుతోరణము, పొడసూపన్ = కనుపట్టఁగా, మరకతమణిమయమయి యెప్పుడును పచ్చనిదగు బహిర్ద్వారము కనఁబడఁగా నని భావము. 'తోరణోஉస్త్రీ బహిర్ద్వారమ్' అమ. ఇట 'నిచ్చ' అనుటకు నర్థము క్లిష్టముగా నున్నది. శబ్దరత్నాకరముచొప్పున నవ్యయమాత్రమేని వికృతిని సమాసమధ్యగత మగుట పొసఁగదు. ఈకవియే 'దివ్యదీపములె నిచ్చరాగ'(ఆశ్వా-౨.)అని అవ్యయముగాఁ బ్రయోగించినాఁడు) వరుసన్ = క్రమముగా, కన్యాగృహంబు = అకన్యయొక్క మందిరము, నరపతికిన్ = వసురాజునకు, అమూల్యకల్యాణగరిమన్ = అనర్ఘమైనశుభాతిశయమును, తెలియఁబలిచెను. అనర్ఘమయిన బంగారుయొక్క యతిశయమును సూచించెనని భావము. 'కల్యాణం మఙ్గళేస్వర్ణే' నానా. కల్యాణమునకు మంగళమనియు, బంగారమనియు నర్థములుగనుక మంగళసూచకముగాఁ బూర్ణకలశములను బచ్చతోరణములను గనుపట్టెననియు, బంగారు పెంపు సూచించునట్లుగా బంగారుకుంభములును మరకతమణిమయబహిర్ద్వారములును గనుపట్టెననియు నర్థస్వారస్యము తెలియునది. గృహములయందు ముందు బంగారుకలశము లుంచుట ప్రసిద్ధము. అలం. శ్లేష. దానిచేతి నుత్థాపితమైన అనుమానము.

శా. ఆలోఁ గాంచనమందిరంబు నవరత్నాలోక ముల్లోకమై
యాలోకోత్సవ మాచరింపఁ బతి డాయం బోయి ప్రాచీనపుం
జాలుందీవలచాటునన్ నిలిచి హాళిచాలాళిఁ గొనిలా
లోలోత్పల్లవజాలమార్గముల నాలోలాక్షి వీక్షించినన్. 61

అ. ఆలోన్ = అంతలోన, కాంచనమందిరంబు = బంగారుమయమయిన గృహముయొక్క, 'ఆలోకాంచనమందిరం' బని సోమకవిపాఠము. అజనాంచితమైనగృహమని యర్థము. నవరత్న = తొమ్మిది విధములయిన రత్నములయొక్క, ఆలోకము = ప్రకాశము. ఉల్లోకమై = లోకాతీతమై, ఆలోక + ఉత్సవము = కమలపండువు, ఆచరింపన్ = చేయఁగా, 'ఆలోకా పర్యనోద్ద్యోతో' అమ. పతి = వసురాజు, డాయన్ పోయి = సమీపించిపోయి, ప్రాచీనపుంజాలుం దీవలచాటునన్ = చుట్టునాటియుండెడు కంచెయొక్క చాలుపుగానున్న తీఁగలయొక్క, 'ప్రాచీనం ప్రాన్తతోవృతిః' అమ. చాటునన్ = మఱుఁగునందు, తీఁగెల చాలుపులుగానిడి పెనఁచుకొని చుట్టుకంచెగా నుండఁగా దానిమఱుఁగుననుట. తీఁగలచాలు

పుగా నుండుటయే మఱిఁగియుండుట కుపకారకము, నిలిచి=నిలుచుండి, వాచాల...మార్గములన్ — వాచాల=మ్రోఁగుచున్న-మొరయుచున్న, అళి=తుమ్మెదలయొక్క, పక్ష=ఱెక్కలవలనఁబుట్టిన, అనిల=గాలిచేత, ఆలోలత్=అంతటఁ జలించుచున్న, పల్లవ=చిగురుటాకులనెడి, జాలమార్గములన్=కిటికీల సందులనుండి-జొంపముగా నాతీఁగలయందు చిగుళ్లు గుబురుకొనియుండఁగా తుమ్మెదల ఱెక్కలగాడ్పులచే నవి యిటునటుచలించి తెఱపులియ్యఁగా నాసందులనుండియనుట. తుమ్మెదలఱెక్కలగాలివలననే తెఱపు లిచ్చు ననుటచేఁ జిగుళ్లదట్టపు జొంపమును వానితీవలచాలుపును రాజు మఱిఁగియుండుటకు మిక్కిలి సహకారములని తెలియునది. ఆలోలాక్షిన్=ఆ స్త్రీని, ఈక్షించినన్ = చూడఁగా, అనఁగా నాయికను రాజు తీఁగకంచెమాటునఁ బొంచుండి చూచెనని తాత్పర్యము.

తా. ఆ బంగారు గృహమందుఁ దాఁపియున్న తొమ్మిదవగల రతనములకాంతులు లోకాతీతమై కనులపండువులు సేయుచుండఁగా రాజు సమీపించిపోయి చుట్టును జాలుపులుగా నున్నతీఁగలచేనయిన కంచెకోట మఱుఁగునఁ బొంచుండి తుమ్మెదల ఱెక్కలగాలిచే నందలి చిగుళ్లజొంపములు తెఱపులియ్యఁగా నాసందులనుండి యాపడఁతిని జూచెను. ముందఱిపద్యముతో నన్వయము.

చ. కనుఁగవ పూర్ణకామ మగుఁ గన్గవకన్నను బూర్ణకామమై
మన మతిచిత్రవృత్తి యగు మానసవృత్తికి మున్నచిత్రమై
తనువు రసోత్తరంగ మగుఁ దత్తనువైఖరి కన్న సంభ్రమం
బెనసి రసోత్తరంగ మగు నీప్సిత మానగమానభేదికిన్. 62

అ. అనగమానభేదికిన్ = కోలాహలపర్వతముయొక్క గర్వమును భేదించిన యావసురాజునకు, కనుఁగవ = కన్నుదోయి, పూర్ణకామము -- పూర్ణ = నిండారిన, కామము = మనోరథముగలది, అగును, మనము = మనసు, కన్గవకన్నను=పూర్ణకామమయిన కన్నుదోయికంటెను, పూర్ణకామమై= సంప్రాప్తమనోరథమయి - పూర్ణుఁడయిన మన్మథుఁడుగలదై యని భావము. 'కామఃస్మరేఽభిలాషేచ' అమ. అతిచిత్రవృత్తియగున్=మిక్కిలి వింతయైన వ్యాపారముగలది యగును. తనువు=శరీరము, మానసవృత్తికిన్ మున్న = అతిచిత్రవృత్తియైన మనస్సునకంటె ముందుగా, చిత్రమై = అత్యంతచిత్రవృత్తియై - చిత్రప్రతిమవలెఁ జేష్టారహితమయి యనిభావము. 'చిత్రంస్యాదద్భుతాలేఖ్య తిలకేషు' విశ్వ. రసోత్తరంగము = రసమనఁగా స్వేదజలము - దానిచే సాంద్రమగునని యర్థము. ఈప్సితము= అభిలాషము, తత్తనువైఖరికన్నన్ = రసోత్తరంగమయిన యాశరీరమునకంటె మిక్కిలియును, సంభ్రమంబు = తొట్రుపాటును, ఎనసి = పొంది, రసోత్తరంగమగునని యర్థము. రసమనఁగా నిచట అనురాగము - దానిచేత నతిశయించునని భావము. 'శృంగారముఖ్యమధురాది సువర్ణగేతో నిర్యాసరాగ గరళద్రవపారదేషు। ఆస్వాదనధ్వని సుధామ్బురసాఖ్యధాతు ష్విష్టో రసోథరసనా ధరణీ రసా స్యాత్' నానా. కన్నులకుఁ జగదేకసుందరాకారమును జూడఁగా దనివితీఱెననియు నట్టిరూపము నుబట్టి మనసునమన్మథవికారముద్దీపించెననియు దానిచే దేహము పరవశమయ్యెననియుఁ బిదప గోరికయు ననురాగమును బిరిగొనెననియు ఫలితార్థము.

తా. ఆనాయికను జూడఁగానే వసురాజునకుఁ గన్నుదోయి కోరిక నిండినదాయెను. మనస్సు మన్మథునకులోనయి యద్భుతవ్యాపారయుక్తమయ్యెను. శరీరము చిత్రప్రతిమవలెఁ జేష్టారహితమయి స్వేదజలసాంద్రమాయెను. అభిలాషము తొందరపాటుఁజెంది యనురాగాతిశయముతోఁ గూడినదాయెను.

మ. జననాథోత్తముఁ డింతిఁ జూడ ననిమేషత్వంబుఁ గాంక్షించు న
య్యనిమేషత్వము కాంత కాంతముఖచంద్రాసేవనానందవా
సనఁ బ్రాపించినఁ గోరు నప్పు డనిమేషస్వామిభావంబుఁ గ
న్గొన నెందుల్ నృపు లుత్తరోత్తరపదానూనస్పృహాచంచలుల్. 68

అ. జననాథోత్తముఁడు = వసురాజు, ఇంతిన్ = ఆ స్త్రీని, చూడన్ = చూచుకొఱకు, అనిమేషత్వంబున్ = దేవత్వమును, కాంక్షించున్ = కోరును-తెప్పపాటులేక యుండుటను కోరునని భావము. అయ్యనిమేషత్వము = ఆదేవత్వమును, కాంత ... వాసనన్ — కాంత = సుందరియైన, కాంత = ఆపడఁతియొక్క, ముఖ=ముఖమనెడి, చంద్ర = చంద్రకళామృతముయొక్క, ఆసేవన = చక్కఁగా సేవించుటవలన నయిన, ఆనంద = సంతోషముయొక్క, వాసనన్ = సంస్కారముచేత, ప్రాపించినన్ = పొందఁగానని యర్థము. 'ప్రథమాంపిబతే వహ్ని ర్ద్వితీయాం పిబ తేరవిః' అను నిత్యాదివచనములవలన దేవతలకుఁ జంద్రకళామృతపానము స్వభావధర్మము. వసురాజును నాయికముఖచంద్రామృతపానవాసనచేత దేవత్వమును బొందెనని యర్థము. చంద్రకళామృత పానముచేత దేవత్వము సిద్ధించునుగదా. గిరికాదేవిముఖమును నత్యాదరముతోఁ జూచుచుండుటవలన తెప్పపాటు లేమి సిద్ధింపఁగాఁ గోరు ననిభావము. అప్పుడు=ఆసమయమందు, అనిమేషస్వామి భావంబు=దేవాధిపతిత్వమును -అనఁగా నింద్రత్వమును- వేయికన్నులు గలిగియుండుట నని భావము. కోరున్ = కాంక్షించును. కన్గొనన్ = విచారించిచూడఁగా, ఎందున్ = ఎచ్చోటను, నృపులు = రాజులు, ఉత్త... చంచలుల్ — ఉత్తరోత్తరపద = అంతకంతకు హెచ్చయినస్థానములందలి, అనూన = అధికమయిన, స్పృహా = అపేక్షయందు, అచంచలుల్ = చలింపనివారుగదా - పయిపయి నెక్కుడగు పదవులందు వారి కపేక్ష చలింపకుండుననుట. ఏమనిన, వసురాజు మనుజుఁడైయుండి ముందుగా దేవత్వముఁగోరి యది సిద్ధింపఁగానే దేవేంద్రత్వము గోరినాఁడు గనుక రాజు లంతకంతకు హెచ్చయిన యధికారమునే కోరుచుందురనుట. 'అసంతుష్టాద్విజా నష్టాః సంతుష్టాఇవపార్థివాః । సలజ్జాగణికా నష్టా నిర్లజ్జేవ కులాఙ్గనా' అను న్యాయ మిట యనుసంధించునది. అనఁగా వసురాజు గిరికాదేవిని జూచునెడల ముందుగా తెప్పపాటులేని చూపులుగలుగుటనుగోరి గిరికాముఖవీక్షణమునందలి యత్యాదరముచేత నది సిద్ధింపఁగా నంతటఁ దనివితీరక వేయిగన్నులు గలుగుటను గోరెనని తాత్పర్యము. 'అనిమేష' 'అనిమేషస్వామి' అనునవి సాభిప్రాయములుగాన పరికరము అలం. శ్లేషోత్థాపితమగు అర్థాంతరన్యాసము.

తే. కాంతపద మొంది యట యూరుఁగ్రమ్మి కాంచి, సీమ నెనసి పయోధరశిఖరిదుర్గ
సంగతికి లాఁచు నృపదృష్టి చక్రశాస, నోన్నతస్థాన మపుడుగా నొదవుఁదనకు.

అ. నృపదృష్టి=వసురాజుచూపు, కాంతపదము = నాయికయొక్క పాదమును, ఒంది=చేరి, కాంత=రమణీయమయిన, పదము = స్థానమును బొందియని యర్థాంతరము. అట = అపిమ్మట, ఊరుక్రమ్మి = తొడవావరించి - గ్రామము నాక్రమించి యని యర్థాం. కాంచిసీమ = కటిప్రదేశమును, ఎనసి = కూడుకొని- మేఖలావీమ నెనసియని యర్థాం. తొడనేమీఁద శిఖరిదుర్గమును చెప్పినాఁడు గనుక కాంచీపదము మేఖలాశబ్దార్థకమని గ్రహింపవలయును. మేఖలయనఁగా పర్వతనితంబము. 'మేఖలాఖడ్గబన్ధేస్యాత్కాఞ్చ్యాశైలనితమ్బయోః' విశ్వ. పయోధర .. సంగతికిన్ -పయోధర=కొండలను బోలెడి కుచములయొక్క, దుర్గ=పొందశక్యముగాని, సంగతికిన్ =కూడికకు-పొందనలవిగాని యాక్ర

మణమున కనుట, లాఁచుఁ = పెనఁగు లాడుచున్నది. మేఘములతోఁగూడిన పర్వత దుర్గముల సంగతికి లాఁచుచున్నదని యర్థం. తనకుఁ = అనఁగా నృపదృష్టియగు తనకు, అపుడుగా = ఆపయోధరశిఖరదుర్గసంగతి గలిగినప్పటికిఁగదా, చక్ర ... స్థానము — చక్రశాసన = చక్రవాకములను నిరసించునట్టి, ఉన్నతస్థానము = కుచప్రదేశమని యర్థము. చక్రశాసన = రాష్ట్రపరిపాలన చేయునట్టి యున్నతస్థానమని యర్థాంతరము. ‘చక్రంచయే జలావర్తే రథాఙ్గే రాష్ట్ర సైన్యయోః। ఘటసాధనభేదేపి క్లీబే కోకేతు పుంస్యయమ్’ నానా. ఒదవుఁ = లభించును.

ఇక్కడ నాయిక యడుగులనుండి కుచములవఱకు సాగుచున్ననృపదృష్టి పరముగను, మంచి చోటినుండి పర్వత దుర్గమువఱకు నాశ్రయింపఁజూచు నొకనిపరముగను నభేదాధ్యవసాయముచే నర్థద్వయము గలుగఁజెప్పినాఁడు. అందు రాజు దృష్టి ముందుగా పాదములందుఁ బ్రసరించి తర్వాతఁ దొడలనావరించి, యామీఁదఁ గటిప్రదేశమును గలిసికొని, యక్కడనుండి గమింపశక్యముగాని కుచగిరులతోఁ గూడుకొనుటకుఁగా మిక్కిలియుఁ జాటుపడుచుండెనని తాత్పర్యము—అనఁగా నాపర్యంతమెంకలాగున వచ్చినదై యక్కడనుండి కుచములను దాఁటిపోఁజాలకుండెననుట. ఎవఁడయిననొకఁడు ముందు నిరాశ్రయుఁడై యుండి ముందుగా మంచిస్థలమును గొంచెము సంపాదించుకొని యా పిమ్మట నొకగ్రామ మాక్రమించుకొని యా వెంబడి నొకసీమను అనఁగా తాలూకాను స్వవశముచేసికొని యక్కడనుండి పర్వతదుర్గము నవలంబించుటకుఁ దగిన ప్రయత్నము సేయుట యుక్తమనియు నట్టి దుర్గము సంపాదించిననే రాష్ట్ర పాలకత్వము వానికి సిద్ధింపఁగూడు ననియు నర్థాంతరమందలి భావము తెలియునది. కాంతిపద మనుచో నర్థమున కాంతాయాః పదమనియు నర్థాంతరమున కాంతంపదమ్ అనియు విగ్రహము. ‘ఊరు’ తొడ యగునపుడు సంస్కృతము; గ్రామార్థమునఁ దెనుఁగు. అలం. శ్లేషమూలక మగు సమాసోక్తి.

మ. నిరతిఁ నాభిసురంగ మీఁగియు వళీనిశ్రేణికఁ హత్తియు
న్వరరోమావలి వల్లరీగుణము నంటం బ్రాఁకియుం దత్పయో
ధర దుర్గంబుల నాక్రమించె నచలేంద్రద్వేషిచూపౌర సం
గరసామోదవినిద్రవృత్తికి నశక్యం బెద్దియుం గల్గునే. 65

అ. ఇందును రాజుదృష్టినే చెప్పుచున్నాఁడు. అచలే...చూపు—అచలేంద్ర = పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలునికి, ద్వేషి =శత్రువయిన, లేక ‘అచలోఽద్రావుభువ్యచలా’ నానా. అని యుండుటవలన అచల శబ్దము పర్వతమందును, అచలాశబ్దము భూమియందును వర్తించును గనుక అచలేంద్రులనఁగా భూమీంద్రులయిన శత్రురాజులు, వారికి ద్వేషియైన వసురాజుయొక్క, చూపు = దృష్టి నిరతిఁ = అధికాసక్తిచేత, నాభిసురంగము = నాయికయొక్క పొక్కిలియనెడు సొరంగములో, ఈఁగియుఁ = తూఁటియును, వళీనిశ్రేణికఁ — వళీ = ముత్తరులనెడు - అనఁగా కడుపుమీఁది మూఁడు ముడుతలనెడు, నిశ్రేణికఁ = నిచ్చెనను, ‘నిశ్రేణి స్త్వధిరోహిణీ’ హత్తియుఁ = హత్తుకొనియును, వర...గుణముఁ—వర = శ్రేష్ఠమయిన, రోమావలివల్లరీ = నూఁగారుతీఁగ యనెడు-తీఁగవలెనున్న నూఁగారనెడు, గుణమును = లగ్గపట్టుత్రాడును, అంటంబ్రాఁకియుఁ = చివరముట్ట నల్లుకొనియు, తత్...దుర్గంబులఁ--తత్ = ఆస్త్రీయొక్క, పయోధర = కుచములనెడు, దుర్గంబులఁ = పర్వతదుర్గములను, ఆక్రమించెఁ = స్వవశముచేసికొనెను. ఔరా=ఆశ్చర్యము! సంగ...వృత్తికిఁ—సంగరస = సంభోగానురాగమందలి, ఆమోద = సంతోషముచేతనైన, వినిద్రవృ

త్రికిన్ =నిద్రారహిత వ్యాపారముగలవానికి-జాగరూకతగలవానికనుట, సంగర=యుద్ధమందు, సామోదవినిద్రవ్రత్తికిన్ = సంతోషయుక్తమయిన జాగరూకతగలవాని కని యర్థాంతరము. అశక్యంబు= శక్యముగానిది, ఎద్దియున్ = ఏదేని, కల్గునే = కలుగునా - కలుగదనుట.

రాజు దృష్టిపరముగను ఆక్రమశీలుఁడగు శూరునిపరముగను నర్థద్వయము నిటనిబంధించినాఁడు. రాజుదృష్టి సంభోగరసమందలి సంతోషముచేత హెచ్చరికగలదై నాయికయొక్క నాభీబిలములోఁ జొచ్చివళిత్రయమునుహత్తుకొని రోమావలివెంటఁబ్రాఁకి కుచములమీఁద బ్రసరించెనని యర్థము. ఎవఁడయిన నొకఁడు యుద్ధమందలి యుత్సాహముతోఁ గూడిన జాగ్రత్తగలిగి నేల సొరంగముఁ ద్రవ్వించి దాని గుండఁ దూఱిపోయికాని, లేక నిచ్చెనతోడ్పాటుచే నెక్కికాని, లగ్గపట్టు త్రాళ్లవెంట బ్రాఁకికాని, దుర్గముసాధించి యాక్రమించుట యుక్తమని యర్థాంతర భావము. అలం. సమాసోక్తియు. శ్లేషానుగృహీతమగు అర్థాంతరన్యాసమును.

ఉ. ఆమనుజేంద్రుచూపు తిలకాంచిత మై నెఱదావి చల్లునా
రామముఖంబునన్ నెఱయఁ బ్రాలుచు హాసమరందచిక్కణం
బై మెఱుఁగారుగండఫలకామృత భానుశిలాతలంబుల
న్వేమఱు జాఱి యూఁతగొను నిద్దపుఁబెన్నెఱితీవ జొంపముల్. 66

అ. ఇందును రాజుదృష్టియే వర్ణితము. ఈ పద్యమం దంతటను రూపకమున్నందున రాజుదృష్టిని దుమ్మెదగా నిరూపణము సేయఁజనును. ఆమనుజేంద్రుచూపు = ఆవసురాజుదృష్టి, తిలక అంచిత మై = కస్తూరీ తిలకముచేత నొప్పుచున్నదై, నెఱదావి=నిండువాసనను, చల్లు నారామముఖంబునన్ -- చల్లు = వెదచల్లుచున్న - వ్యాపింపఁజేయుచున్న, ఆరామముఖంబునన్ - ఆగిరికాదేవియొక్క ముఖమందని యర్థము. తిలకవృక్షముచేత నొప్పుచు నిండుపువ్వుల వాసనలను వ్యాపింపఁజేయుచున్న ఉద్యానవనము ముంగలనని యర్థాంతరము. ఆరామముఖమన్నచోట రామయొక్క ముఖమనియు ఆరామముయొక్క ముఖమనియు నర్థద్వయమున రూపభేదము, నెరయన్ = అంతటనుగలయ ప్రాలుచు, హాస...చిక్కణంబై...హాస = నవ్వనెడు, మరంద = పూఁదేనియచేత,చిక్కణంబై = నునుపువాఱినదై, మెఱుఁగారు తలంబులన్ -- మెఱుఁగారు = కాంతినిండుచున్న - మిక్కిలి మెఱయుచున్న, గండఫలక = పలకలవంటి చెక్కులనెడు, అమృతభాను శిలాతలంబులన్ =చంద్రకాంత శిలాప్రదేశములందు, వేమఱు = పలుమాఱును, జాఱి = జరిగి - పడఁబోవుచుననుట, నిద్దపు పెన్నెఱితీవ జొంపముల్ = నిద్దములయిన గొప్పతలవెండ్రుకలనెడు తీఁగగుంపులను. ఊఁతగొనున్ = గట్టిగాఁబట్టుకొనును.

తా. ఆమనురాజుయొక్కచూపు, కస్తూరీతిలకముచేత శోభిలుచున్న నాయికముఖము సౌందర్యమునంతయుఁ గ్రహించుచు, నవ్వుచేత దట్టమై తళతళమెఱయుచును జంద్రకాంతమణిశకలములవలె నున్న చెక్కిళ్లయందు నిబ్బరముగా నిలువలేక జాఱిపోవుచును నిగారమయి సోగలై యున్న తలవెండ్రుకలపయి వ్యాపించి నిలిచెను. తుమ్మెద తిలకవృక్షముచే నొప్పుచు పుష్పవాసనలు గుబాళించుచున్న యుద్యానవనము నంతటను బ్రాలుచు మకరందముచేత నునుపువాఱి యున్నచంద్రకాంత శిలలయ్యెడు బ్రాఁకి యచోట నిలువ నవకాశములేక తీఁగగుంపులను నవలంబించియుండుట యుక్తమని యర్థాంతరముఖందలి భావము. అలం. శ్లిష్టరూపకము.

సీ. పదములఁ బల్లవింపఁ జేసినోవుఁ దొడలమం, గళమహారంభాప్తిఁ గాంచనోపు

కటిఁ గరిస్కంధాధిగమలీలఁ గననోపు; నసదుగా నెనసి మిన్నంద నోపు
గుబ్బలసిరికల్మిఁ గొండ దాఁకఁగనోపు, నళుత నొక్కనిధాన మరయనోపుఁ
జక్కెరమోవి నిష్టఫలం బెనయ నోపు, శ్రుతుల శ్రీలనె యెదుర్కొనఁగనోపు
తే. రమ్యవదనాబ్జమునఁ బూర్ణరాజ మండ, లాధిపత్యశుభావాప్తి నలరనోపుఁ
గురుల ఘనసంపదలు చూఱఁ గొనఁగనోపు, నింతినెమ్మేనఁ బర్వునుర్వీశదృష్టి.

అ. ఇంతినెమ్మేనన్ = ఆ స్త్రీయొక్క దేహమందు, పర్వునుర్వీశదృష్టి=వ్యాపించిన రాజుయొక్క చూపు, పదములన్ = పాదములయందు, వ్యాపించి, పల్లవింపఁగన్ ఓపున్ = ఉల్లసింపఁగ నోపును - చిగురు వెట్టఁగ నోపునని భావము. పదరూపపల్లవము గలదనుట. ఇట్లే మీఁద నెల్ల నయ్యయవయవముల కుపమానస్ఫోరకములగు వ్యాపారముల సంతరించుట తెలియునది. తొడలన్ = తొడలయందు, మంగళ .. భాప్తిన్--మంగళ = శుభముయొక్క, మహత్ - ఆరంభ = గొప్పయారంభముయొక్క, ఆప్తిన్ = ప్రాప్తిని, కాంచనోపున్ = పొందనోపు - మంగళార్థమయిన మహాకదళీస్తంభప్రాప్తిని గాంచనోపునని భావము. ఊరుకాండ రూపరంభాస్తంభప్రాప్తిని గాంచుననుట. కటిన్ = పిఱుఁదునందు, కరి ... లీలన్ — కరిస్కంధ = ఏనుఁగు మూఁపుయొక్క, అధిగమ = పొందుటయొక్క, లీలన్=విలాసమును, కననోపును = ఏనుఁగుమూఁపు నెక్కనోపును -గజమస్తక ప్రాప్తినిగాంచనోపునని భావము - కటిరూపగజమస్తక ప్రాప్తిఁగాంచుననుట. అసదుగాను = సూక్ష్మమయిన నడుమును, ఎనసి=పొందినదై, మిన్నందన్ నోపున్ =మిన్ను ముట్టఁబోవును - ఆకాశస్పర్శము సేయ నోపునని భావము. మధ్యరూప గగనమును స్పృశించుననుట.

గుబ్బలసిరికల్మిన్ = సిరియనఁగా సంపదయని యర్థము - కాంతియని భావము. స్తనసంపదయొక్క కలిమియుండుటచేత - స్తనసంపత్తిని గలిగియుండుటచేత ననుట, కొండ దాఁకఁగన్ ఓపున్ = కొండతో సరికానోపునని యర్థము. పర్వతస్పర్శము సేయనోపునని భావము. స్తనరూపపర్వతములఁ దాఁకుననుట. అళుతన్ =కంఠమందు, ఒక్కనిధానము=అనిర్వాచ్యమయిన యొకనిక్షేపమును, అరయనోపున్ =కననోపును - శంఖముఁ గననోపునని భావము. కంఠరూపశంఖము నరయుననుట. ఇక్కడ ఒక్కనిధానమనుటచే 'మహాపద్మశ్చ పద్మశ్చ శఙ్ఖో మకరకచ్ఛపౌ । ముకున్దః కున్దనీలౌ చ ఖర్వశ్చ నిధయో నవ' అను నీశ్లోకమునఁ జెప్పఁబడిన నవనిధులలో నొకటియగు శంఖము లక్షితమగుచున్నది. ఇట 'నిధాన' శబ్దమునకు నభిధేయము శంఖనిధి. దీనికి వాచకమగు శంఖశబ్దముచే కంబువు లక్షితమగుచున్నదని తెలియునది. చక్కెరమోవిన్ =పంచదారతో సాటియైనతీపుగల పెదవియందు, ఇష్టఫలంబు ఎనయనోపున్ =అభీష్టఫలమును బొందనోపును - మధురఫలమును బొందనోపునని భావము. అధరోష్ఠరూప మధురఫలమును నెనయు ననుట. శ్రుతులన్ =చెవులయందు, శ్రీలనె=సంపదలనె, ఎదుర్కొనఁగనోపున్ =ఎదుర్కొన నోపును - శ్రీకారముల నెదుర్కొన నోపునని భావము. శ్రవణరూప శ్రీకారముల నెదురుకొనుననుట.

రమ్యవదనాబ్జమునన్ — రమ్య = సుందరమయిన, వదన+అబ్జమునన్ = పద్మమువంటి ముఖమునందు, పూర్ణ ... వాప్తిన్ — పూర్ణ=సంపూర్ణమయిన, రాజమండల = రాజసమూహముయొక్క, ఆధిపత్య=ప్రభుత్వముయొక్క, శుభావాప్తిన్=శుభప్రాప్తిచేత, అలరనోపున్ =సంతోషింప నోపును- సంపూర్ణచంద్రమండలాధిపత్యముయొక్క శుభావాప్తిని నలరనోపునని భావము. వదనరూపసంపూర్ణచంద్రమండలాధిపత్యముయొక్క శుభావాప్తిచేత నలరుననుట. కురులన్ = తలవెండ్రుకలయందు, ఘనసంపదలు - ఘన = గొప్పవారయిన పరరాజులయొక్క, సంపదలు=విభవములును, చూఱఁగొనఁగ

నోపుక్ = దోఁచుకొననోపును - మేఘసంపదలు చూఱగొననోపునని భావము. కుంతలరూప మేఘ సంపదలు చూఱ గొనుననుట.

రాజుయొక్క దృష్టిగావున రాజోచితకార్యను లాచరింపఁదగుటచే పల్లవించుట మొదలుకొని ఘనసంపదలు చూఱగొనుట తుదిగా రాజకీయములయిన యుత్తరోత్తరావస్థలను యథాక్రమముగాఁ జెప్పినాఁడు. అనఁగా ఉల్లాసముకొందుట, గొప్పకుభారంభములనుజేయుట, గజస్కంధమారోహించుట, మిన్నుముట్టుట - అనఁగా మీఁదు మిక్కిలి విజృంభించుట, కొండదుర్గము ముట్టడించుట,నిధి నిగాంచుట, అభీష్టఫలముఁ బడయుట, సంపదలు తనంత నేపొందుట, రాజసమూహమునెల్ల నేలుట, పరరాజులసంపదల కొల్లగొనుట, యనునివి రాజోచితకార్యములు, పల్లవరంభా ద్యుపమానపదములచేఁ బాదాదిచికుర పర్యంతమయిన వర్ణనము స్పష్టము. ఇక్కడ నతిశయోక్త్యనుప్రాణితమయిన సమాలంకారము.

కనుఁగవపూర్ణకామమగు ననెడి పద్యము మొదలుగా నీపద్యమువఱకుంగల యాఱుపద్యముల యందును వసురాజునకు మన్మథద్వాదశావస్థలలోఁ బ్రథమావస్థయైన చక్షుఃప్రీతినిజెప్పినాఁడు. ఇందులకు 'ఆదరాద్దర్శనం చక్షుఃప్రీతిరి త్యభిధీయతే' యని లక్షణము. ఆదరముతో నాయికను జూచుట చక్షుఃప్రీతియనుట 'ద్వాదశావస్థ లీక్షణోత్సవము చిత్త, సంగమంబును సంకల్పసంప్రతాప, జాగరము కార్శ్య మరతి లజ్జావిముక్తి, సంజ్వరోన్మాద మూర్ఛనాచరమములును' అని పండ్రెండవస్థలు. (కొందఱు సంప్రతాపసం జ్వరములనెడి రెండవస్థలను విడిచిపెట్టి తక్కినపదియ యవస్థలందురు.)

తే. వాఙ్మనసగోచరేతరాద్వైతరాగ, జలధి నపు డోలిఁదేలి రాజన్యమౌళి
ఘనతరాశ్చర్యశాలి యై కవనితరూప,మనితరాయత్త మగునాత్మ నభినుతించె.

అ. వాఙ్మనస...జలధిక్—వాఙ్మనస=వాక్కునకును మనస్సునకును, గోచరేతర=గోచరించువానికంటె వేఱయిన - అనఁగా గోచరింపనివయినదియు, అద్వైత = అద్వితీయమయినదియు, అగు, రాగ = శృంగారస్థాయి భావమనెడు, జలధిక్ = సముద్రమందు, అపుడు=ఆసమయమందు, ఓలిక్=యుక్తమానట్లుగా, తేలి=ఓలలాడి, రాజన్యమౌళి=వసురాజ శిఖామణి, ఘనతర + ఆశ్చర్య శాలియై-అధికమయిన యాశ్చర్యముచేత, ఒప్పుచున్నవాఁడై, వనితరూపము = గిరికాదేవి యాకృతి, అనితరాయత్తము=పరాధీనముగాకయున్నట్టి - ఆరూపమునందే తగులుపడ్డ, ఆత్మక్=తనహృదయములో, అభినుతించెక్ = కొనియాడెను.

'వాఙ్మ...రాగజలధి' — ఇట్టిరాగమును గలిగించినందున ఆనాయికరూపసౌందర్యముగూడ ఇట్టిదనిచెప్పను తలంపను ఈడుచూపను అలవి గానట్టిదే కావలయును. కావున నే అశ్చర్యము 'ఘనతరము.' దానిచేతనే ఆత్మ 'అనితరాయత్త' మగుట. ఇక్కడ రాగ మనఁగా శృంగారస్థాయి భావము. సజాతీయమయిన నాయి కాంతరాసక్తిచేతను విజాతీయమయిన క్రోధాదికముచేతను, గొట్టుపడకనిల్చి సజాతీయవిజాతీయములను స్వస్వరూపములుగాఁ జేయురాగము శృంగారస్థాయిభావ మనఁబడును. 'సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాక్ । యావద్రసం వర్తమాన స్థాయీభావ ఉదాహృతః । విరుద్ధై రవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః । ఆత్మభావం నయత్యన్యాక్ స్థాయీభావ ఆంకురః' అని లక్షణము.

సీ. ఘనలక్ష్మి నెసఁగునంకెగనముంగురులపేర, భ్రమరకంబులు ధాత్రిఁ బ్రబలఁబోలుఁ
గమలావళి నదల్చుక విమలాంగిమోముతో, నొనఁగూడిసన్మిత్రుఁ డొనరఁబోలు

నమృతసంగత మైన౯ యతివచక్కరమోవి, నీడయై బింబంబు౯ నెగడఁబోలు
మేలిమిగట్టులౌ౯ మెలఁతచన్నుల కనుం, గై గోత్రవర్గ మిం౯ పలరఁబోలు
తే. సాటిరాఁబోలుసరులు భుజాలతలకుఁ, జక్ర మేల్పడిగాఁబోలు౯ జఘనరమకుఁ
దమ్ములుపదానుజన్ములై౯తనరఁబోలుఁ, బ్రసవములుగాళ్ల నిసువులై౯యెసఁగఁబోలు.

అ. ఘనలక్ష్మిక్ = అధికమయిన సంపదచేత, ఎసఁగుఅంగన ముంగురులపేరక్ = ఒప్పుచున్న స్త్రీ యొక్క నుదుటిపై కురులయొక్క పేరును వహించి, భ్రమరకంబులు = తుమ్మెదలు, ధాత్రిక్ = భూమియందు, ప్రబలక్ పోలుక్ = వృద్ధిఁబొందఁబోలును-ఇక్కడ భ్రమరకములనఁగా ముంగురులును దుమ్మెదలును, భృఙ్గాలకౌ భ్రమరకౌ' నానా. ముంగురులు ఘనలక్ష్మి నెసఁగుననఁగా మేఘకాంతిచేతనొప్పునని భావము. గొప్పసంపదగలవాని పేరును పెట్టుకొనుట మంచిదిగాన భ్రమరకములని ముంగురులకుఁ బేరుండఁగా నాపేరే తుమ్మెదలును దమకు భ్రమరకములని పెట్టుకొనెనని యర్థము. ముంగురులు ఘనలక్ష్మిని అనఁగా మేఘకాంతి నెసఁగుననియు తుమ్మెదలకును ముంగురులకును సమముగా భ్రమరకములను పేరుగలదనియు భావము.

కమలావళిక్ = పద్మసమూహమును, అదల్చు విమలాంగిమోముతోక్ = ధిక్కరించుచున్న యాపడఁతియొక్క మొగముతో, ఒనఁగూడి = జతగలిగి, సన్మిత్రుండు- సత్ + మిత్రుఁడు = నక్షత్రములకాప్తుఁడయిన చంద్రుఁడు, ఒనరఁబోలుక్ = సన్మిత్రుఁడై యొప్పుచుండఁబోలును-అనఁగా శ్రేష్ఠుఁడైనసఖుఁడై యొనరఁబోలుననుట. ఇక్కడ నాయికముఖమునకును జంద్రునకును బద్మనిరాసకత్వము సమముగనుక మిత్రత కర్తృత్వము తెలియునది. సన్మిత్రుఁడు (అనఁగా చంద్రుఁడు) తనవలెనే నాయికముఖమును బద్మములను నిరసించుటనుజూచి దానికి సన్మిత్రుఁడై (అనఁగా మేటిచెలికాఁడై) యొప్పినాఁడని యర్థము. నక్షత్రములకు మిత్రుఁడగుటచే సన్మిత్రుఁడను చంద్రుని పేరు చెలిమోమునకు సన్మిత్రుఁడగుటచేతఁ గలిగినట్లుగా నుత్ప్రేక్షయైయుంగునది. 'సక్ సత్యే విదుషి శ్రేష్ఠే సాధౌ భవతిచ త్రిషు, సత్స్త్రీబమ్యాఞ్చ' నానా.

అమృతసంగతము = అమృతముతోఁ గూడినది. అయిన, అతిపచక్కరమోవి = స్త్రీయొక్క చక్కరవలెఁదియ్యనయిన పెదవియొక్క, నీడయై = ఛాయయై, బింబంబు = దొండపండు, నెగడఁబోలుక్ = బింబమనునట్లుగాఁ బ్రసిద్ధిఁబొందఁబోలును - బింబమనఁగా నీడయు దొండపండును-దొండపండునకుఁగల బింబమను పేరు నాయిక పెదవికి బింబము అనఁగా నీడయగుటచేతఁ గలిగియుండునేమోయనియుత్ప్రేక్ష.

ప్రతిబిమ్బే తత్ప్రతికృతౌ ప్రతికృత్యాంచ మణ్డలే।
లాఞ్ఛనేఽపిచ బిమ్బోఽస్త్రీ నద్వయో ర్బిమ్బికాఫలే' నానా.

మేలిమిగట్టులు = మేలిమి బంగారుకొండలు,:ఐన, మెలఁతచన్నులకుక్ = చెలువకుచములకు, అనంగై = కూర్మియై - గారాబమై, గోత్రవర్గము = పర్వతసమూహము, ఇంపులరక్ పోలుక్ = గోత్రవర్గ మనునట్లుగా హితమై యొప్పఁబోలునని యర్థము. గోత్రవర్గమనఁగా నిచట బంధుసమూహమును పర్వతసమూహమును, గనుకఁ జన్నులను బంగారుకొండలుగాఁ జెప్పి పర్వతములతోడి బాంధవము పచరించినాఁడు. పర్వతములు-పర్వతములకు బంధువులేకదా యనుట. చన్నులకు బంధువులగుటచే వానికి గోత్రవర్గమని పేరుకలిగెనుగాఁబోలుననుట. ఘనలక్ష్మి నెసఁగుటచే దుమ్మెదలకు ముంగురులను పేరఁ బ్రబలుటయు, కమలముల నదల్చుటచే చంద్రునికి మొగముతో మైత్రియు, అమృతముతోఁ గూడియుండుట

చేత మోవికి బింబము నీడ యగుటయు, మేలిమిగట్టులౌటచేత మెలఁతచన్నులకుఁ గొండలు గోత్ర వర్గ మగుటయు నని హేతువులు దెలియునది.

సరులు=హారములు, భుజాలతలకున్ = ఈ స్త్రీ తీఁగవంటి బుజములకు, సాటిరాన్ పోలున్ = సరులు అనునట్లుగా అనఁగా సమానము లనునట్లుగా నీడుపడబోలును - సరియనఁగా సమానమును . హారములకు సరులనెడిపేరు భుజాలతలకు సరులు (సమానములు) అగుటచే కలిగెనని యుత్ప్రేక్ష- చక్రము=బండికల్లు, జఘనరమకున్ = ఈ స్త్రీయొక్క కటిపురోభాగ సమృద్ధికి, ఏల్బడికాఁబోలు = చక్ర మనునట్లుగా నేలుకోఁదగినది కాఁబోలును - చక్రమనఁగా నిక్కడఁ గొలుచునట్టి సైన్యము. తమ్ములు = తామరలు, పదానుజన్ములై = ఈ స్త్రీయొక్క పాదములకుఁ దోడఁబుట్టువులై, తనరఁ బోలున్ =తమ్ములనునట్లుగా నొప్పఁబోలునని యర్థము. తమ్ములనగా నిచటఁ గనిష్ఠభ్రాతలు. 'తమ్ములు నాఁబేరగుఁ బద్మమ్ముల కనుజన్ములకును దరణేందుధరా' ఆంధ్రనామ సంగ్రహము. ప్రసవములు = పుష్పములు, గోళ్లనిసువులై = ఈ స్త్రీ నఖములయొక్క శిశువులై, ఎసఁగఁబోలున్ = ప్రసవము లనునట్లుగా వృద్ధిఁబొందఁబోలును. ప్రసవములనఁగా శిశువులును తామరలు - పదములకుఁ దమ్ములగు టచేతఁ దమ్ములని పేరొందినట్లును - పువ్వులు గోళ్లకుఁ బ్రసవములగుటచేత ప్రసవములని పేరొందినట్లును నుత్ప్రేక్ష. ఈపద్యమందు నాయిక కాకేశపాదము వర్ణనము చేసినాఁడు.

తా. ఈ స్త్రీ ముంగురులు మేఘకాంతి చేనొప్పుచుఁ దుమ్మెదలవలె వెలయుచున్నది. మొగము తామరలధిక్కరించి చంద్రునివలె వెలయుచున్నది. చక్కెరమోవి యమృతముతోఁ గూడినట్లు తీయనై దొండపండువలెనున్నది. చన్నుదోయి బంగారుకొండలవలె వెలుఁగుచున్నది. చేతులు హార ములవలెను, గటిచక్రము బండికల్లువలెను, అడుగులు తామరలవలెను, గోళ్లు పువ్వులవలెను విలసిల్లు చున్నవి.

'ఘనలక్ష్మినెసఁగు' నిత్యాది హేతువులచేత భ్రమరకత్వాదులను సమర్థించుటచే నాలుగుపెద్ద పాదములందు కావ్యలింగములు నాలుగు. భ్రమరకత్వాది విశేష్యము లభిప్రాయగర్భము లగుటంజేసి పరికరాంకురము లెనిమిది. వీనికెల్ల నుత్ప్రేక్ష యంగి.

చ. బొమవిలు చూపుతూపులును బూని మృగాంకునిగెల్చి యింతిమో
మమృతము మందహాసమున నచ్ఛపుడాలు కపోలలీల ఫా
లమునఁ గలావిలాస మఖిలంబుఁ గొనం గని వెన్కఁజొచ్చె న
య్యమృతగభస్తిభీతతిమిరావళి వేనలిపెంపుసొంపునన్. 70

అ. ఇంతిమోము=ఈ స్త్రీయొక్క ముఖము, బొమవిలు=కనుబొమ్మయనెడు ధనుస్సును, చూపు =వీక్షణములనెడు, తూపులును=బాణములును, పూని=ధరించి, మృగాంకునిన్=చంద్రుని, గెల్చి, అమృ తమున్=చంద్రునిలోనుండు నమృతమును, మందహాసమునన్ = చిఱునవ్వుచేతను, అచ్ఛపుడాలు= నిర్మలమయినకాంతిని, కపోలలీలన్=చెక్కిళ్లయొక్క విలాసముచేతను, ఫాలమునన్ = నొసటిచేత, కళావిలాసము=చంద్రఖండముయొక్క డంబమును, అఖిలంబున్=అంతటిని, కొనన్ = హరింపఁగా, కని, అయ్యమృత ... రావళి — అయ్యమృతగభస్తి = ఆచంద్రునివలన, భీత = భయపడిన, తి మిరఆవళి=అంధకారసమూహము, వేనలి పెంపుసొంపునన్=ఈ స్త్రీయొక్క కొప్పనెడు మిషచేత, వెన్కఁజొచ్చెన్=శరణుసొచ్చి వెనుకఁజేరెను అని యర్థము. పగవానియొక్క పగవాఁడు బంధువని యున్నదిగనుకఁ జీఁకటులు తమకు విరోధియైన చంద్రునిగెలిచినముఖమును, తమమిత్రమునుగాఁ దలఁచి

వెనుకఁజొచ్చెననుట అనఁగా గిరికయొక్క కనుబొమ్మలు వంపఁబడిన విండ్లవలెనున్నవనియుఁ జూపులు బాణములవలె నున్నవనియు, ముఖము చంద్రునివలె నున్నదనియు, నవ్వు అమృతమువలె నున్నదనియు, చెక్కిళ్లు చంద్రప్రభలవలె నున్నవనియు, నొసలు చంద్రకళవలెనున్నదనియుఁ,గొప్ప గాఢాంధకారమువలె మిగుల నల్లనై యున్నదనియు ఫలితార్థము.

'బొమవిలు చూపు తూపులు' పరిణామాలంకారము. దీనిచే 'మృంగాకుని...గొనక్'అను అతిశయోక్తి పోషితము. 'అమ...భీత' కావ్యలింగము 'వేన...పునక్' అపహ్నవము 'వెన్కఁ జొచ్చె'నను దానిశ్లేషముచే ననుప్రాణితము.

చ. బలితపు గుబ్బగుబ్బలులకైపై నిరవొంది మెఱుంగుఁదీఁగచే
నలరి హృతాబ్జపూగరుచి కైయై నిరవద్యకలారవామృతం
బులకలిమిం బికాంగనలకమూఁకకు మూకత సంఘటించు నీ
చిలుకలకొల్కికంధర భజింపఁగఁ జెల్లదె కంధరాంకమున్. 71

అ. ఇందు కంఠమునకును మేఘమునకు నభేదాధ్యవసాయముచేత అర్థద్వయము మూఁడుపాదములం దెలియునది. బలితపుగుబ్బగుబ్బలులపైక్ = (కంఠ) గొప్పవయిన చనుఁగొండలమీఁద, ఇరవొంది=ఒప్పుచున్నదై - (మేఘ) కొండలమీఁదనుండుట మేఘధర్మములని తెలియునది. మెఱుంగుఁదీఁగచే-(కంఠ)మెఱుఁగయిన బంగారుతీఁగయనెడు భూషణవిశేషముచేత,అలరి=ప్రకాశించి-(మేఘ) మెఱుపుఁదీఁగచేత నలరి - హృత...రుచియై —— (కంఠ) హృత= హరింపఁబడిన,అబ్జ = శంఖముయొక్కయు, పూగ = పోఁకమ్రాని బోదెయొక్కయు, రుచియై = శోభగలిగినదై- (మేఘ) హరింపఁబడిన పద్మసమూహశోభగలదై- కమలములకు మేఘము ప్రతికూలమగుట ప్రకటముగదా. 'అబ్జోధన్వన్తరౌ చన్ద్రేనిచుళే శఙ్ఖపద్మయోః' విశ్వము, 'పూగః క్రముక బృన్దయోః' అమ. నిరవద్య...మృతంబుల కలిమిక్ —— (కంఠ) నిరవద్య=అనింద్యమయిన, కలా=అవ్యక్త మధురమయిన, ఆరవ అమృతంబులకలిమిక్ = అమృతప్రాయములయిన స్వరములకలిమిచేత-(మేఘ) నిరవద్యమయిన గర్జారవముయొక్కయు జలసందోహములయొక్కయు కలిమిచే-అమృతమనఁగా ఉదకమునకుఁబేరు,'స్యాద్యజ్ఞశేషామ్బు నభోరసాయన క్షీరాజ్యసోమాన్నసుధాసు చామృతమ్' నానా. పికాంగనలమూఁకకుక్ = ఆఁడు కోవెలలయొక్క సమూహమునకు, మూకత = మూఁగతనము, సంఘటించు ... కంధర —— (కంఠ) సంఘటించు=సంపాదించుచున్నదాని-నీకంఠస్వరమాధుర్యముతోఁ దమ కంఠనాదము సమానముగాదని సిగ్గుపడి కోయిలలు పలుకకుండుననుట - (మేఘ) వర్షర్తువునందుఁ గోయిలలు గూయుటలేదు గనుకఁ బికసమూహములకు మూకత్వము సంఘటించుటయే మేఘధర్మమని తెలియునది. ఈ చిలుకలకొల్కి కంధర = ఈ స్త్రీయొక్క కంఠము. కంధరాంకముక్ = కంధరమను మేఘనామమును 'గ్రీవాయాం కన్ధరా మేఘే పుమాన్' నానా. భజింపఁగఁజెల్లదె = వహింపఁగూడదా-అనఁగా వృత్తిసామ్యమును నామసామ్యమునుగల కంధర, కంధరాంకమును వహించుటకుఁ దగుననుట. శ్లేషమూలకమైన కావ్యలింగము. 'బలితపు గుబ్బగుబ్బలులు' పరిణామ మంగము.

తా. ఆచెలువకంఠము బంగారుతీఁగచే నలంకృతమై,శంఖమును పోఁక బోదెను చెలువునమించి, యవ్యక్త మధురస్వరముచే కోయిలల నతిశయించి,యొప్పుచున్నది.

మ. సమదాభంగమ నోజసామజ మురోకైజగ్రావ లీలాధి క
క్లమమై నాభిసరోంతరంబున మునుంకైగం బొంగు నుద్వేలభం

గము లయ్యెఁ గవల యంతరాళమునం దత్ప్రద్గంధానుబంధంబుచే
నమరుం దుమ్మెదచాలు నా నొనరె నూఁగారింతి లేఁగౌనునన్. 72

అ. సమద...సామజము — సమద = మదముతోఁ గూడినదియు, అభంగ = భంగములేనిదియు - పరాజయము నొందనిదియు, అగు, మనోజ = మన్మథుఁడనెడి, సామజము = ఏనుఁగు. ఉరోజ...క్లమమై — ఉరోజ = స్తనములనెడు, గ్రావ = పర్వతములయందలి, లీలా = క్రీడలచేత - పర్వతములయందుఁ జేయఁబడిన వప్రక్రీడలచేత ననుట, అధికక్లమమై = అత్యంతమయిన బడలికగలదై, నాభిసరోంతరంబునన్ = బొక్కిలి యనెడు కొలఁకులోపల, మునుంగన్, వళులు = కడుపుమీఁది మడతలు, పొంగు...భంగములు — పొంగు = పయికి నుప్పొంగినవై, ఉద్వేల = గట్టుపయింబొరలిన - ఉత్కటమయిన, భంగములు = అలలు, అయ్యెన్ = అయినట్లుగా నుండెను. అంతరాళమునన్ = వళులనెడు తరంగముల యొక్క నడుమ, తత్ ... బంధంబుచేన్ — తత్ = ఆనాభి సరోవరమందు మునిఁగిన మన్మథ మదసామజముయొక్క, గంధ = మదసౌరభమందలి, అనుబంధంబుచేన్ = ఆసక్తిచేత, అమరుం దుమ్మెదచాలునాన్ = ఒప్పుచున్న తుమ్మెదలబారో యన్నట్లుగా, ఇంతి లేఁగౌనునన్ = ఈ స్త్రీయొక్క అతిసూక్ష్మమయిన నడుమునందు, నూఁగారు = రోమావళి, ఒనరెన్ = ఒప్పెను.

ఏనుఁగులు పర్వతములందుఁ గ్రీడసలుపుట స్వభావము. ఇక్కడ మన్మథగజము స్తనపర్వతములందుఁ గ్రీడసల్పుటను జెప్పుటచే స్తనము లత్యంతమన్మథోద్దీపకములనుట వ్యంజితము. ఏనుఁగులు కొండలఁ గ్రొవ్విళ్లుగోరాడి బడలికదీఱఁ గొలఁకులందు మునిఁగి దాని నల్లకల్లోలము నేయుటయు దాని మదము వాసనకుఁ దుమ్మెదచాలు మూసరుటయు ప్రసిద్ధము. 'సమదాభంగ' మనోజసామజము మత్తిల్లి విఱ్ఱవీఁగుచుంటవలననె (ఉరోజ) గ్రావలీల. 'అధిక క్లమ'ముగా క్రీడించి బడలుటవలననే నాభిసరస్సున మునుఁగుట. 'ఉద్వేల' ఏనుంగు నంత పెద్దది మునుఁగఁగా అలలు గట్టుపై నెగయకపోవు. ఆనాయిక కుచములు పర్వతములవలె గట్టిగానున్నవనియు, నాభి కొలనువలె లోఁతు గలిగియున్నదనియు, కడుపుమీఁది మడతలు తరంగములవలె వెంబడిగాను స్పష్టమయిన యొగపుగలదిగాను నున్నవనియు, నూఁగారు తుమ్మెదచాలువలె నల్లనై సోగగానున్నదనియు ఫలితార్థము. 'అమరుఁ దుమ్మెదచాలు' అనుచో ఉదంత తద్ధర్మక్రియావిశేషణములమీఁది పరుషములకు నుగాగమసరళాదేశములు కవిత్రయమతమునం జొప్పట్టవుగాని మనుచరిత్రమున 'ప్రభలునభోంతరిక్షమున...బొల్పగుం జవిక' ననియు 'మించుం బ్రాయపు లేటి పిండు' ననియుఁ బ్రయోగములు చూపట్టుచున్నవి. 'సమదా...భంగములయ్యెన్' రూపకము. ఈరూపకముచే 'భంగములయ్యెన్' 'తుమ్మెదచాలు నానొనరె' అను ఉత్ప్రేక్షలు రెండు ఉత్థాపితములు.

చ. వనితకుచాద్రులం బొడమి వాటపుఁ బొక్కిలి నిండి యుబ్బి జా
ల్గొని కటిచక్ర మాని మెఱుఁగుందొడ లై విరవాసి వచ్చునా
తనకిరణామృతౌఘములదండ హలాంకపదోత్థితంబు లై
మను నుడివ్రానిగర్భకలశంబులు గావె లతాంగిజంఘికల్. 73

అ. లతాంగి జంఘికల్ = ఈ స్త్రీయొక్క పిక్కలు, వనితకుచాద్రులన్ = ఈ స్త్రీయొక్క ఉబ్బుచన్నులనెడు కొండలయందు, పొడమి = పుట్టి, వాటపుబొక్కిలి = కుదురయిన నాభియనెడు నేలగుంతయందునిండి, బొక్కిలియనగా నాభికిని నేలగుంతకునుబేరు, ఉబ్బి = అందుండి పయికినుప్పొంగి, జాల్గొని = జాలుగాఁ బ్రవహించి, కటిచక్రము = కటిప్రదేశమనెడు రాష్ట్రమును, ఆని = లోఁగొని, మెఱుఁగుందొడలై = మెఱయుచున్న యూరురూపములై, విరవాసి = రెండుపాయలై,

వచ్చునూతన...దండర్—వచ్చు = వచ్చునట్టి, నూతన = క్రొత్తలయిన, కిరణ = కాంతియనెడు, అమృత+ఓఘముల = జలప్రవాహములయొక్క, దండర్ = చేరువ. హలాంక ... త్థితంబులై — హలాంక = హలరేఖలుగల, పద = పాదములనెడు, హలాంక = నాఁగటి దుక్కిగల, పద = స్థానములవలన, అనఁగా నాఁగేటిచేత దున్ని వెదవేసిన మడిచేలవలన ననుట. 'పదంవ్యవసిత త్రాణస్థానలక్ష్మాంఘ్రివస్తుషు' అమ. ఉత్థితంబులై=మొలచినవై, మను=వృద్ధిఁబొందుచున్న, ఉడివోని = ఉడిగిపోకుండెడు, గర్భకలమంబులు=పొట్టతోనున్న వరిపైరులు, శావె=శావా-వరిపొట్టలేయుగుననుట.

ఇక్కడ ఉడివోనిపిక్కలను ఉడివోనివరిపొట్టలుగా నుత్ప్రేక్షించినాఁడు. జలప్రవాహము కొండలయందుఁబుట్టి నేలవాటముగానున్న గుంతనిండి దానినుండి యుప్పొంగి వెల్లువలై దేశమునుజుట్టి రెండు పాయలై ప్రవహించి యంతనాఁగేటిచే దున్నఁబడి విత్తుచల్లియున్న ప్రదేశములందుఁ బాఱఁగా నాచోట వరిపైరు మొలచుటప్రసిద్ధము. ఆజలప్రవాహములవలెనే యిచటను నాయికా కాంతి ప్రవాహములనుగా రూపించియువి పుట్టుటకుఁ గుచములనెడు పర్వతములను, పొక్కిలి యనెడు గుంతను, కటిప్రదేశమనెడి దేశమును, దొడలనెడు పాయలను, తొడలపొంత సౌభాగ్య సూచకము లయిన హలరేఖలనెడి నాఁగేటిచాళ్లను,అవిగల పదములనెడు పాదములను, గుదుఱుపఱచి యాపదములయందు మొలచిన వరిపొట్టలుగా పిక్కలను జెప్పినాఁడు. రూపకోత్థాపితమైన యుత్ప్రేక్ష. ఘనలక్ష్మి నెసఁగు వనెడి పద్యము మొదలుకొని యీ పద్యము తుదిగానైదుపద్యములలోన వస్థాభేదమయిన ప్రలాపమును జెప్పినాఁడు. ఇందులకు 'వెలయఁగ సతిఁగొనియాడుట, పలఁపఁ బ్రలాపము' అని లక్షణము.

చ. అని వనితాలలామ వినుతాంగతరంగితసౌకుమార్యముల్
గని కొనియాడు సమ్మదముఁ గ్రమ్ముకొనం దల యూఁచు నవ్వు న
వ్వనరుహసూతిచేతియనివారితచాతురి మెచ్చుఁ గాని య 74
య్యనఘుఁ డెఱుంగఁడయ్యె మననాంతర మాంతరవిస్మయంబునన్.

అ. అని, వనితాలలామ=సౌందర్యవతియైన యా స్త్రీయొక్క, 'లలామం త్రిషురమ్యేస్యాత్ముఖ్య సామర్థ్యలక్ష్మసు' విశ్వ. వినుత=స్తోత్రము చేయఁబడిన, అంగ=అవయవములందు, తరంగిత=అలలుగాఁజేయఁబడిన - అలలవలె పయి పయినిగుడుచున్నట్టి, సౌకుమార్యముల్ = కోమలత్వములను, కని=చూచి, కొనియాడుర్=స్తోత్రము చేయును, సమ్మదము= సంతోషము, క్రమ్ముకొనర్=ఆవరించుకొనఁగా, తలయూఁచుర్ = శిరఃకంపము సేయును. నవ్వుర్=నెత్తి నవ్వుగానవ్వును, అవ్వనరుహ... చాతురిర్—అవ్వనరుహసూతి = (తామరయందుఁబుట్టిన యా)బ్రహ్మయొక్క, చేతి=చేతియొక్క, అనివారిత=నివారింపఁబడని, చాతురిర్=చాతుర్యమును, మెచ్చుర్=మెచ్చుకొనును, కాని=ఇంతేకాని, అయ్యనఘుఁడు = పాపరహితుఁడైన యారాజు, ఆంతర = హృదయమందలి, విస్మయంబునర్=ఆశ్చర్యముచేత, మననాంతరము = మతియొక్క యాలోచనమును, ఎఱుంగఁడయ్యెర్ = గుఱుతెఱుఁగఁడాయెను .. అనఁగా విభ్రాంతిపడిచూచుచు నూరకుండెననుట.

తా. ఆరాజు ఆనాయిక యంగములందు నలలవలె పయిపయిం జాఁగుచున్న మెత్తందనపు ముద్దులనుజూచి పొగడుచు సంతోషించుచు మెచ్చిదలయూఁచుచు నవ్వుచు నాచెలువను నిర్మించిన బ్రహ్మయొక్క చేతిశిల్పనైపుణమునకు మెచ్చుచునుండెను.ఇంతేకాని యతని కాసౌందర్యాతిశయముచే మనంబున నాశ్చర్యము పయికొనఁగా మఱేమియుఁ జేయఁ దోఁపదయ్యె.

మ. అపు డానర్మసఖుండు చేరఁ జని కన్యారత్నముం జూచి తే

తపనీయాచలధీర నాపలుకు తథ్యం బౌఁ గదా యింకనే
జపివేషంబునఁ జేరఁబోయి లలనాజన్మప్రకారంబు దే
టపడం గాంచెదఁ బంపు మన్న నఖండప్రేమసామగ్రితోన్. 75

అ. అపుడు = ఆసమయమందు - వసురాజేమియుఁ దోఁపకయున్న పుడనుట. ఆనర్మసఖుండు = ఆప్రియమిత్రుఁడు, చేరన్ జని = సమీపించిపోయి, తపనీయాచలధీర = బంగారుకొండవలె - అనఁగా మేరుపర్వతమువలె ధైర్యముగలవాఁడా, కన్యారత్నమున్ = కన్యలలో రత్నమువంటి దయిన యాచెలువను, చూచితే = చూచితివా, నాపలుకు, తథ్యంబు = నిజము, ఔన్ కదా = అగునుగదా. నేను జెప్పినంతటి సౌందర్యవతియే యగునుగదా యనుట. ఇంకన్, నేను, జపివేషంబునన్ = మునివేషముచేత, చేరన్ పోయి, లలనాజన్మప్రకారంబు = ఈ స్త్రీయొక్క పుట్టుకవిధమును, తేటపడన్ = విశదమగునట్లు, కాంచెదన్ = కనుఁగొనెదను, పంపుము, అన్నన్, అఖండప్రేమసామగ్రితోన్ - అఖండ = సంపూర్ణమయిన, ప్రేమసామగ్రితోన్ = అనురాగభరముచేత, దీనికి ముందఱి పద్యములో నన్వయము. 'తేట పడంగాంచెద' ననుచో 'తేట'యను ప్రథమమీఁది పరుషమునకు సరళాదేశము లేనందున సరళాదేశము వైకల్పికమే కాన నిత్యమను పక్షము నిరస్తము.

తా. అట్లు వసురాజేమియుఁ దోఁపకుండఁగా, గారాబుచెలికాఁడతనిని సమీపించి 'మేరుధీరా! కాంతామణిని జూచితివా? నే నీచెలువనుగుఱించి వర్ణించిచెప్పినమాట నిజమేయగునుగదా! ఇఁక నేను మునివేషము వేసికొనిపోయి యీకన్య యెవరికూఁతురో తెలిసికొనెదను. నన్నుపంపు' మనఁగా రాజు మిక్కిలియుఁ బ్రేమ గడలుకొనఁగా.

తే. కుంభగత దీపశోభానిగుంభలీలఁ, గుంభకుచమేనఁ జూడ్కు లాగుబ్బకొనఁగఁ
గాంచువిభుఁ డంగనాప్రసంగంబుకతన, మంత్రివరు నెట్టకేలకు మఱలి చూచి.

అ. కుంభ...లీలన్ — కుంభగత = కుండలోనున్నట్టి, దీప = దీపముయొక్క, శోభా = కాంతియొక్క, నిగుంభలీలన్ = వ్యాపనమువలె, కుంభకుచమేనన్ = కలశములవంటి చన్నులుగల యాపఁడతి దేహమందు, చూడ్కులు = చూపులు, ఆగుబ్బకొనఁగన్ = పిక్కటిల్లినట్లుగా, కాంచువిభుఁడు = చూచుచున్నరాజు, అంగనాప్రసంగంబుకతనన్ = ఆ స్త్రీనిగూర్చిన ముచ్చటయే యైనందున, మంత్రివరున్ = మంత్రిశ్రేష్ఠుని, ఎట్టకేలకున్ = కొంతసేపటికి, మఱలి చూచి, ఈ పద్యమునకు ముందటి పద్యములో నన్వయము. రాజు మనసాంతరము లేక నాయికాయత్తచిత్తుఁడైయున్నను మంత్రి నాయికాప్రసంగమే చేయుటంబట్టి యతనిని మఱల చూచినాఁడనుట. ఇతరప్రసంగ మయినచోఁ బాటింపఁజాలఁడని యాశయము. మఱి కుండలోపలనున్న దీపము దానియం దావంతచోటయినను విడువక యలమునట్టు రాజుయొక్క చూడ్కులును నాయికమేనియం దిసుమంతభాగమునయిన విడువక ప్రసరించెననియు దీనిచే ఆనాయిక సర్వావయవములు సౌందర్యాతిశయయుక్తములనియు తెలియునది. నాయికాదేహ మాద్యంతమునందు వ్యాపించుటకై కుంభగతదీప మిచటఁ బోలికగాఁ గయికొనఁబడుట తెలియునది. అలం. ఉపమ.

ఉ. ఏగతి యోగిరూపము వహించెదో యేగతిఁ బ్రౌఢి మించెదో
యేగతి వేల గాంచెదవొ యేకత మున్నవధూజనంబు నీ
వేగతిఁ బల్కరించెదవొ యిష్టసఖా భవదీయనీతికా
ర్యాగతి నేడు చూతము గదా యని యంపిన నాతఁడంబునన్. 77

అ. ఇష్టసఖా=గారాబు చెలికాఁడా, యోగిరూపము = మునివేషమును, ఏగతిఁ=ఏవిధమున, వహించెదో=పూనెదవో, ఏగతిని, ప్రౌఢిమించెదో=నేర్పుచేత నతిశయించెదవో — ఎక్కుడు నేర్పును జెలువెదవో యనుట - వారిని సంధించునపుడు వారికంటె నేర్పున వెనుదీయక యతిశయింతువో యనుట, ఏగతిని, వేళఁ=సమయమును, కాంచెదవో=కనిపెట్టెదవో, ఏకతము ఉన్న వధూజనంబుఁ=ఏకాంతమునందున్న స్త్రీసమూహమును, 'జనస్సమూహే లోకేఽపి' నానా. నీవు, ఏగతిని, పల్కరించెదవో=మాటాడించెదవో, ఏకాంతముగానున్న స్త్రీలను మిక్కిలి యౌచిత్యము తప్పకుండఁగా మెలపున మాటాడవలయు ననుట. భవదీయ...గతి - భవదీయ=నీదయిన, నీతికార్య=నయముతోఁ గూడిన పనియొక్క, ఆగతి=రాక - కలుగువిధము ననుట, నీతిమెఱసి నీవు కార్యమును బన్నువిధమును, నేఁడు, చూతముగదా=చూడనేచూచెదముగదా, అని, అంపినఁ=పంపఁగా, ఆక్షణంబునఁ=తత్క్షణమే, ముందటిపద్యముతో నన్వయము. ఏకతమనుచోఁ గ్రియావిశేషణముగా గ్రహించునది.

తా. గారాబు చెలికాఁడా! నీవు మునివేష మెట్లు దాల్చెదవో, ఎట్లు నేర్పు మించెదవో, నీకు సమయమెట్లు గలుగునో, మఱి యేకాంతమందున్న స్త్రీలను నేవిధమున మాటాడించెదవో, నీనీతికార్యమును నేఁడుగదా చూడఁబోయెదము, అని పంపఁగా నాక్షణమందే,

సీ. కనకవల్లిమతల్లి । కలపెంపుజడగుంపు, పుష్పపరాగసం । భూతి భూతి
కమనీయశాఖాప్ర । కాండంబు దండంబు, తరుణపల్లవకోటి । ధాతుశాటి
వల్కలధట్టంబు । వరయోగపట్టంబు, జాలకవిసరంబు । జపసరంబు
ఫలరసాసారంబు । పాత్రాంబుపూరంబు, కింజల్కములుచాలు । మౌంజినూలు
తే. సేయఁజాలినయమ్మహా । శిఖరిశిఖర, రుచిరసురభూజరాజిచే । నుచితవేష
మెనసి నరపాల నిరపాయ । హితవిహార, హారి గడిదేఱి యొకజడ । దారియయ్యె.

అ. కనక...పెంపుఁ - కనక=బంగారుమయములయిన, వల్లిమతల్లికల=మేటితీఁగలయొక్క, పెంపు=సమృద్ధిని, జడగుంపు=జటల సమూహముగాను, పుష్పపరాగ సంభూతి = పుప్పొడియొక్క చక్కఁగాఁ గలిగియుండుటను - పుప్పొడి చక్కఁగాఁ గలిగియుండుట ననుట, భూతి=భస్మముగాను, కమనీయ...ప్రకాండంబు - కమనీయ=మనోహరమయిన, శాఖాప్రకాండంబు =శ్రేష్ఠమయినకొమ్మను, దండంబు=యోగవేత్రముగాను, తరుణ...కోటి-తరుణ=లేఁతలైన, పల్లవ=చిగురాకులయొక్క, కోటి =సమూహము, ధాతుశాటి=కాషాయవస్త్రముగాను, 'పసాదయస్స్త కషాయవస్త్రయో,భూతాని పఞ్చస్వగుణాశ్చ గైరికమ్ । శిలావికారేన్ద్రియశబ్దయో నయో, లోహంస్వభావ్యం కనకంచ ధాతవః' నానా. వల్కల ధట్టంబు = వల్కలమనఁగా చెట్టుపయి తాట - నార- నారయొక్క బంధమును, వర యోగపట్టంబు = శ్రేష్ఠమయిన యోగపట్టెడగాను, జాలకవిసరంబు = మొగ్గలయొక్క సమూహమును, జపసరంబు = జపమాలికగాను, ఫలరస ఆసారంబు = పండ్లరసముయొక్క జడి - జడిగాఁ గురియుచున్న పండ్లరసమనుట, పాత్రాంబుపూరంబు=కమండలు జలసమృద్ధిగాను, కింజల్కముల చాలు =అకరువులపంక్తిని, మౌంజినూలు=ముంజకసవుచేనైన మొలత్రాడుగాను, చేయఁ = చేయుటకు, చాలిన, యమ్మహాశిఖరి=ఆకోలాహల మహాపర్వతముయొక్క, శిఖర=శృంగములందు, రుచిర= ప్రకాశమానములగుచున్న, సురభూజ=కల్పవృక్షములయొక్క, రాజిచేఁ =సమూహముచేత, ఉచితవేషము=యోగియగుటకుఁ దగినవేషము, ఎనసి=పొంది, నరపాల=వసురాజుయొక్క, నిరపాయ=ఎడతెగని, హితవిహార=ఇష్టవిహారమందు, హారి=ఒప్పుచున్న, నర్మసఖుఁడు, గడిదేఱి=జంకులేనివాఁడై, ఒక జడదారి = జటాధరుఁడ

యిన యోగీశ్వరుఁడు, అయ్యెను. 'ఏగతి యోగిరూపము వహించెదో' అని యసురాజుయోగివేషమునకుఁ దగిన పరికర మెక్కడ దొరకునని యాశంకింపఁగా నర్మసఖుఁడు ఇష్టదాయకముల యిన కల్పవృక్షము లా కొండయందు నుండుటచే నవన్నియు నొడఁగూడినవాఁడయ్యెనని తెలియునది.

తా. ఆ మహాపర్వతమందుఁ గల కల్పవృక్షముల మహిమచే నానర్మసఖుఁడు బంగారుతీఁగల గుంపు జడలుగాను, పుప్పొడి బూదిగాను, మేటికొమ్మ యోగదండముగాను, లేఁజిగుళ్లు కాషాయ వస్త్రముగాను, నారచుడి యోగపట్టెడగాను, మొగ్గలచాలు జపమాలికగాను, జడివలెఁ గొరఁగు పండ్లరసము కమండలు జలముగాను, అకురువులపంక్తి ముంజత్రాడుగాను, అలవడఁగా నిట్లు తగిన వేషమును బొంది తెగువచేసి యొక యోగియయ్యె. అలం. సమాధి.

క. ఆమాయతపసి నియమ,స్థేమాయత నక్షసరముఁ ద్రిప్పుచు నెలమిన్
వామాయ తనయనాజన, హైమాయతనంబుఁ జేర నరుగుచు నచటన్. 79

అ. ఆమాయతపసి=అకృత్రిమయోగి, నియమ...యతన్ - నియమ=నియమముయొక్క, స్థేమ=నిలుకడను, ఆయతన్=పొందినవాఁడగుట చేత, 'నియమస్థేమానం ఏతీతి నియమస్థేమా యః తస్యభావః నియమస్థేమాయతా'. అక్షసరము=స్ఫటికాక్షమాలికను, త్రిప్పుచున్=వ్రేళ్లమీఁద త్రిప్పుచును, ఎలమిన్=ఉత్సాహముచేత, వామ=సుందరమయిన, 'వామావథ్వాంసవ్యరమ్య ప్రతీపేష్వేషవాచ్యవత్' నానా. ఆయత=విశాలములయిన, నయనా=నేత్రములుగల స్త్రీలయొక్క, జన = సమూహము యొక్క, హైమాయతనంబున్=బంగారపు టిల్లును, చేర నరుగుచున్= సమీపించిపోవుచు, అచటన్.

తా. సుగమము.

తే. గంధగజయానగీతప్రబంధ కలన, నలరి యతి లియ్యమైవచ్చు నరిది మగువ
లార కనుఁగొంటిరే యను నాళివాక్య,మొకటివినసై ననిదెవేళ యొదవెననుచు.

అ. గంధగజ...కలనన్ - గంధగజయాన = గంధగజము గమనమువంటి గమనముగల యా నాయికయొక్క, గీతప్రబంధకలనన్ - గీత= ప్రబంధరచనయందు, —అనఁగా గీతములు చెప్పుటయందు, అలరి=ఒప్పినదై, యతి=వడి—అనఁగా గణాదియైన విశ్రమాక్షరము, 'సంగీతకలనాయాం గణాద్యాయతిరుచ్యతే। ప్రాసోవాయతిసామీప్యే నాతిదూరే విధీయతే' అని సంగీతశాస్త్రము. లియ్యమయి=లీనమయి-కూడఁగలసి, వచ్చున్=వచ్చుచుండును, అరిది=ఇది మిక్కిలివింత, మగువలార=చెలులారా, కనుఁగొంటిరే=చూచినారలె, అను ఆళివాక్యము = అనెడి చెలికత్తెయొక్క వాక్యము, ఒకటి, వినసైనన్=వినరాఁగానే, ఇదెవేళ ఒదవెన్ అనుచున్ = ఇదియేసమయముదొరకెనని, దీనికి ముందరిపద్యముతో నన్వయము.

ఇందుఁ జెలికత్తె సంగీతవిషయమున వాక్యముపలుకఁగా నర్మసఖుఁడు తనకు నిది సమయమని తలంచుట యెట్లనఁగా, గీతప్రబంధకలన నలరి యతి లియ్యమయి వచ్చు నరిదియనెడిచోట గీతప్రబంధా [illegible]నముచేత సంతోషించి యొకానొక యతీశ్వరుఁ డీపాటతోనే కలసివచ్చునని చెలికత్తియ పలికి నట్లుగా నర్థముచేసి తనకు నిదియు సమయమని తలఁచెనని తెలియునది. 'యతిర్భిక్షా పుమాన్ స్త్రీతు నియమే శ్లోకవిశ్రమే' అని నానార్థ రత్నమాల.

ఉ. మేలు లతాంగి నీపలుకు మెచ్చితినే యతి వచ్చు జాడయే
లీల నెఱింగితమ్మ బహుళీకృతచాతురి మించునీవిపం

చీలలితారవామృతము చిత్తము సోఁకినవార లీకలా
శాలినిఁ జూచి దీవెన లొసంగక పోవరు సుమ్ము నావుడున్. 81

అ. మేలు= బాగుబాగు, లతాంగి = చిన్నదానా, నీపలుకు = నీవుపలికిన వాక్యము, నేను, మెచ్చితిన్, యతి = యతీశ్వరుఁడు, వచ్చుజాడ = వచ్చెడుసంజ్ఞ, ఏలీలన్ = ఏవిధమున, ఎఱింగితమ్మ=గుఱుతెఱింగితివమ్మా, బహు...చాతురిన్—బహుళీకృత = పెక్కువిధములుగాఁ జేయఁబడిన, చాతురిన్ =నిపుణత్వముచేత, మించు...మృతము—మించు = అతిశయించుచున్న, ఈవిపంచీ = ఈవీణయొక్క, లలిత = మనోహరమయిన, ఆరవ = ధ్వనియనెడు, అమృతము = అమృతప్రాయమయిన నాదమనుట, చిత్తము=మనసును, సోఁకినవారు=అంటినవారు,మనస్సుచేత నీ నాదామృతమును జవిచూచిన వారనుట, ఈకళాశాలినిన్ =లావణ్యవతియైన యీపడఁతిని, చూచి,దీవెనలు, ఒసంగకపోవరు సుమ్ము=ఇయ్యకపోవరుసుమీ. నావుడున్ = అనఁగానే—అని యాకపటయతి మాటునుండి పలుకఁగానే, కళాశాలిని శబ్దముచేత కళానిధియగు చంద్రత్వము వ్యంజితమై తన్మూలమున నాదరూపామృతస్ఫూర్తికి నుపపత్తి గుదురుపఱిచిన భావము గర్భితమైయున్నది. అనఁగా వీణానాద మమృతప్రాయమై మనస్సున కతిభోగ్యమైయుండుటచే దీనిని విన్నవారి కిట్టిగానకళావతిని దీవింపక పోవను మనసొప్పదు గాన, తప్పక దీవింతురని యర్థము. ఇట్లు తానువచ్చుటకు హేతువు నుపపాదించుకొను చాతురి తెలియఁనది. అలం. అర్థాన్తరన్యాసవిశేషము—శ్లేషోపస్కృతము.

ఉ. అచ్చట నున్నయిందుముఖు లందఱు నాపలు కాలకించి 'తా
నెచ్చట నుండియో యొక యతీంద్రుఁడు వచ్చెఁ గదమ్మ' యంచు లో
నచ్చెరుపాటు సంభ్రమము నందుచు గద్దియ డిగ్గి రంతలో
వచ్చెఁ దపోధనుండు జనవల్లభుఁడున్ మది మెచ్చె నెచ్చెలిన్. 82

అ. అచ్చటన్=ఆచోట - ఆనాయికగృహమున, ఉన్న యిందుముఖులు, అందఱున్, ఆపలుకు=యతీశ్వరుఁడు పలికిన యావాక్యము, ఆలకించి,ఒకయతీంద్రుఁడు=ఒక మునిశ్రేష్ఠుఁడు, తాను, ఎచ్చటనుండియో వచ్చెఁ గదమ్మ అంచున్,లోన్ =మనస్సులో, అచ్చెరుపాటు=ఆశ్చర్యమును, సంభ్రమమున్ =తొందరపాటును, అందుచున్ = పొందుచు, గద్దియ = కూర్చున్న గద్దెపీఁటలపయినుండి, డిగ్గిరి=దిగిరి. అంతలోన్ =లేచునంతలోపల, తపోధనుండు = యతీశ్వరుఁడును, వచ్చెన్ =ఆగృహములోనికి వచ్చెను, జనవల్లభుఁడున్ = తెఱగలచాటుననుండి చూచుచున్న వసురాజును, నెచ్చెలిన్ = తన యొక్క చెలికానిని, మదిన్ =మనస్సునందు, మెచ్చెన్ =మెచ్చుకొనెను.

తా. ఇట్లాకపటముని చాటుననుండి చెప్పఁగానే యానాయిక గృహమందుండిన స్త్రీలందఱును విని'యెవఁడో యొక మునిశ్రేష్ఠుఁ డెచ్చటనుండియో వచ్చెఁగదమ్మా' యంచు నాశ్చర్యమును తొట్రుపాటునుమీఱ గద్దెపీఁటలనుండి దిగిరి. వారు లేచినంతలో నామునియు వచ్చెను. అతఁడుచేసిన నేర్పునకు రాజుమనసునందు మెచ్చుకొనెను.(మునిచాటుననుండి తనరాకముందు తెలుపుట యేకాంతమందున్న యా స్త్రీలు తన సన్నిధానమునకుఁ రాఁబట్టుకొనుటకుఁ దగిన యాయితపాటునను మెలపునను నుండుటకని తెలియునది.)

చ. ముని యట రాఁ దటాలున సమున్నతపీఠము డిగ్గి నిల్చినం
గననిఱుపేదకౌను కుచ గౌరవ మోర్వక కంప మొందఁగా

జనపతిచూడ్కి తోడనె ససంభ్రమసంభరితానుకంపమై
యొనసి వలగ్నముం బొదివె నీశులు దీనదయాలుదర్శనుల్. 88

అ. ముని=ఆయతి, అటరాన్=ఆవిధమునరాఁగా, తటాలునన్=తెప్పున, సమున్నత పీఠము మున్=మిక్కిలి యెత్తుగానున్న గద్దెను, డిగ్గి=దిగి, నిల్చి...కౌను - నిల్చి=నిలువఁబడిన, అంగన = ఆ స్త్రీయొక్క, నిఱుపేదకౌను=మిక్కిలియును బీదతనముగలిగి యున్న నడుము, కుచగౌరవము=చన్నుల బరువును, ఓర్వక=సహింపలేక, కంపము ఒందఁగాన్=వడఁకఁగాఁ, జనపతిచూడ్కి=వసురాజుయొక్క చూపు, తోడనె=ఆవెంబడినే, ససంభ్రమ...కంపమై - సంభ్రమమనఁగా ఆదరమును సంవేగమును, 'సంభ్రమస్సాధ్వసేపి స్యాత్సంవేగాదరయోరపి' మేదిని. ససంభ్రమ = ఆవేగముతోఁ గూడుకొన్నదియు, సంభరిత=లెస్సగా నింపఁబడినదియు, అగు, అనుకంపమై= వడఁకుగలదియై యనియర్థము, ఆదరముతోఁ గూడుకొన్నదియు భరింపఁబడిన దయగలదియునై యని యర్థాంతరము. 'కృపాదయానుకమ్పా స్యాత్' అమ. ఎనసి=మిళితమై, వలగ్నమున్ = నడుమును, పొదివెన్ = పొదిగి పట్టుకొనెను. 'మధ్యమం చావలగ్నంచ మధ్యో స్త్రీ ద్వాపరౌద్వయోః' అమ. వష్టి వాగురి రల్లోపమవాప్యోరుపసర్గయోః అనువచనమువలన 'అవలగ్న' మనుపదము మొదటనుండు నకారమునకు లోపముగలదు. కాన వలగ్నమని చెప్పఁబడెను. ఈశులు = ప్రభువులు, 'ఈశశ్శమ్భు ప్రభౌతుత్రిష్వీశాలాఙ్గలదణ్డకే' నానా. దీన=బీదవాండ్రయందు, దయాళు=దయగలిగిన, దర్శనుల్=చూపుగలవారు, అనఁగా యతినినాయిక చూచినతోడనే గద్దెపీఁట దిగి నిలుచుండఁగా స్తనభారముచేత నడుము జవజవలాడుచుండెననియు నపుడు చాటున నున్న వసురాజు తొందరపాటును జలనమునుగల చూపులచేత నానడుముయొక్క విలాసమును జూచెననియుఁ దాత్పర్యము.

కౌను నిఱుపేదయనుటచే మిక్కిలి సన్ననిదనియును మిక్కిలి బీదయనియు నర్థములు. మిక్కిలి సన్నమయినదిగావున కుచభారమునకు నాఁగక స్వభావముచే వడఁకినదని భావము. మిక్కిలి బీదదైనదిగాన దుఃఖభరమును సైఁపలేక భయమున వడఁకినదని యర్థాంతరము. అట్లు సన్నఁదనముచే నతిమోహనముగా నల్లలాడుచున్న నడుమును జూడఁగా రాజు చూపు ససంభ్రమ, సంభరిత, అనుకంపమైనది=తొట్రుపాటునొంది, నిండారి, వడఁకుతోఁ గూడినదయినది తొట్రుపడుచు వడఁకుచున్న పూర్ణదృష్టులు ప్రసరించెననుట, నిఱుపేదతనముచే వడవడవడఁకుచున్న దానిని జూచి, ఆదరమును జాలియుఁగొన్న చూడ్కులతోఁ జూచెనని యర్థాంతరము. కనుక 'ఈశులు దీనదయాళుదర్శనుల్' అనుట సిద్ధించినది. అలం. శ్లేషోత్థాపితమగు అర్థాంతరన్యాసము. తా. సుగమము.

తే. ఇంతియును నంత నంతంత నెదిగి పొదలు, నిబ్బరపుగబ్బిగుబ్బలయుబ్బుకతన
నోరగాఁ బాణికంజాబుకలూఁది మ్రొక్కె, మక్కువసఖీమణులుఁ దాను మౌనిమణికి.

అ. ఇంతియును=ఆ స్త్రీయును. అంతన్=అంతట, అంతంతన్=అంతకంతకు-పయిపయి, ఎదిగి=వృద్ధిఁబొంది, పొదలు...కతనన్—పొదలు=ఒప్పుచున్న, నిబ్బరపు=బటువులయిన, గబ్బి=కదలనట్టి, గుబ్బల=స్తనములయొక్క, ఉబ్బుకతనన్=పొంగరింపువలన—అతిశయమువలన, నిర్భరశబ్దభవము నిబ్బరము. ఓరగాన్=ఒకప్రక్కకు నొదుఁగునట్లుగా, పాణికంజంబులు=హస్తకమలములు, ఊఁది=ఉనిచి—ఒండొంటితో జోడించి యనుట—అంజలిగీలించి, గబ్బిగుబ్బలయుబ్బువలన వానికి నడుమసరిగాఁ జేతులు జోడింప వీలుపడమిచేత రెండుచేతులు వానికొక ప్రక్కఁగాఁగూర్చి యంజలి జోడించినదనుట. మక్కువ=ప్రీతిచేత, సఖీమణులున్=చెలికత్తియ లున్నలును, తానున్=తానును, మౌనిమణికిన్=మునిశ్రే

షునికి, మ్రొక్కెన్=నమస్కరించెను. ఇటనమస్కృతిక్రియకు కర్తృబహుత్వముండియు ఆత్మార్థంబభిహితంబగుచో సంఖ్యాభిధాయి తద్విశిష్టంబుల కేకవచనంబగు ననుసూత్రముచేత 'మ్రొక్కెన్' అనునేకవచనాంతక్రియ దెలియునది.

తా. ఆనాయికయును నంతకంతకుఁ బెరుఁగుచున్న బటువులయిన గబ్బి చన్నులయుబ్బువలన తామరలవంటి చేతులురెంటిని నాచన్నులనడుమఁబట్టనేరక వానికి నొకప్రక్కఁగా జోడించి ప్రీతితోడ చెలికత్తెలును దానును నామునీశ్వరునికి మ్రొక్కెను.

వ. అప్పు డప్రతిమతపోనిధి యొప్పులకుప్ప యగునప్పూఁబోఁడియనల్పవినయకల్పనంబులకు నుప్పొంగి 'యో యనన్యకన్యాసామాన్యలావణ్యప్రభావసువల్లభుం బెండ్లి యాడు'మని దీవించి తదీయవివిధపూజావిధానంబులం బ్రమోదమానమానసుం డై యాముద్దియ లిడుపసిండిగద్దియ నధివసించె నయ్యెడం దొయ్యలులు నయ్యతిపనుపునం దమతమయుచితాసనంబుల నలంకరించి రంత నాకంజనయనయనుంగుంజెలులలో సమంజసవచనచాతురీరంజిత యగుమంజువాణి యంజలిపట్టి యతికుంజరునితో నిట్లనియె. 86

అ. అప్పుడు, అప్రతిమతపోనిధి=ప్రతిలేని యామౌనియతీశ్వరుఁడు, ఒప్పులకుప్ప=సౌందర్యరాశి, అగు అప్పూఁబోఁడి...నంబులకున్—అప్పూబోఁడి=ఆనాయికయొక్క, అనల్ప=తక్కువకాని - మిక్కిలియైన, వినయకల్పనంబులకున్ = అడఁకువలయొక్క చేయుటలకు - పలువిధముల మిక్కిలియు అడఁకువచూపుటకనుట, ఉప్పొంగి, అనన్య...వల్లభున్—అనన్యకన్యాసామాన్య=ఇతరకన్యలకు సాధారణముకాని, లావణ్యప్రభావ = లావణ్యమనఁగా ముత్తెములలోఁగనిపించెడు కాంతియొక్క తళుకువలె నవయవములందుఁ బ్రకాశించెడు కళకుఁబేరు. అట్టిలావణ్యపుమహిమగలదానా, సువల్లభున్=మంచి ప్రియపురుషుని, పెండ్లియాడుము=వివాహముగమ్ము. అనిదీవించియనియర్థము. అనన్యకన్యాసామాన్యలావణ్యప్రభా - వసువల్లభుం బెండ్లియాడుమని దీవించి యనిభావము. తదీయ ..విధానంబులన్—తదీయ=ఆనాయికదయిన, వివిధ=అర్ఘ్యపాద్యాదులచేనానావిధములయిన, పూజావిధానంబులన్=పూజయొక్కవిధులచేత, ప్రమోదమానమానసుండై=సంతోషించుచున్న మనసుగలవాఁడై, ఆముద్దియలు=ఆపడఁతులు-ఆనాయికచెలికత్తెలనుట, ఇడుపసిండిగద్దియన్ = తెచ్చియుంచినబంగారుగద్దెపీఁటను,అధివసించెన్ =కూర్చుండెను. అయ్యెడన్ =ఆసమయమందు,తొయ్యలులు=ఆస్త్రీలు, అయ్యతిపనుపునం=ఆమునియనుజ్ఞచేత—మునికూర్చుండుఁడని యనుజ్ఞయొసంగఁగా, తమతమయుచితాసనంబులన్=వారివారికి నర్హములయిన పీఠములను,అలంకరించిరి=శోభిల్లజేసిరి—అనఁగాతమతమ గద్దెలమీఁద నన్నిదొలఁకఁగూర్చుండిరనియు, వారు కూర్చుండుట యాగద్దియల కొకయలంకారమై యుండెననియు భావము. ఆకంజనయనయనుఁగుఁజెలులలోన్ = తామరలవంటి కన్నులుగల యానాయికగారాబుచెలిమికత్తెలలో, సమంజస ..రజింత—సమంజస=చక్కనయిన, వచనచాతురీ = మాటనేరుపుచేత, రంజిత=ప్రకాశింపఁబడుచున్నది, అగు, మంజువాణి=మంజువాణియనెడి చెలికత్తియ, అంజలిపట్టి=చేతులుమోడ్చి, యతికుంజరునితోన్ =మునిశ్రేష్ఠునితో, ఇట్లు అనియెన్ =ఒకవాక్యముచెప్పెను. అదియేదనఁగా. తా. సుగమము.

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి నేఁగుచు నిచ్చటి కద్భుతంబుగా
వచ్చితి రార్యసన్నుత భవచ్చరణాబ్జనఖేందుయుక్తిచే

నచ్చపుఁదెల్వి వచ్చెఁ దమ మంతయు విచ్చెఁ గలాకలాపముల్
హెచ్చె మదాళిభాగ్య మిఁక నింద్రపురంధ్రుల కయినఁ గల్గునే. 86

అ. ఆర్యసన్నుత!=పూజ్యులయిన వారిచేత స్తోత్రము చేయఁబడినమహాత్మా ! ఎచ్చటనుండి ఎచ్చటికిన్ ఏఁగుచున్ ఇచ్చటికిన్ ఆద్భుతంబుగాన్ వచ్చితిరి. భవత్ ...యుక్తిచేన్—భవత్ = దేవరవారియొక్క, చరణాబ్జ=పాదపద్మములయొక్క, నఖ = గోరనెడు, ఇందు=చంద్రునియొక్క, యుక్తిచేన్=కూడికొనుట చేత, అచ్చఁపుఁదెల్వివచ్చెన్—తెలివి యనఁగా వికాసమును వెన్నెలయును గనుక, స్వచ్ఛమయిన తెలివియనెడు వెన్నెలవచ్చెను - తమము అంతయున్ విచ్చెన్=తమమనఁగా అజ్ఞానమును చీఁకటియును.— అజ్ఞానమనెడి చీఁకటివిచ్చిపోయెను,కలాకలాపముల్ హెచ్చెన్=లావణ్యకళలనెడు షోడశకళాసమూహములు అతిశయించెను. మత్ అళిభాగ్యము = నాయొక్క చెలికత్తె—అనఁగా నాయికయొక్క- అదృష్టము, ఇఁకన్=ఇఁకమీఁద, ఇంద్రపురంధ్రులకైనన్=దేవతాస్త్రీలకయినను,కల్గునే=కలుగునా—కలుగ నేరదనుట. నఖమును జంద్రునిఁగా నిరూపించుటచే, చంద్రునివలని వెన్నెలరాకయు చీఁకటివిచ్చుటయు, కళలు హెచ్చుటయు నిట సంఘటింపఁబడెను. మీపదారవిందములు పెట్టఁగానే మాకు వికాసముగలిగెననియు, అజ్ఞానముమానెననియు, లావణ్యకళలతిశయించె ననియుఁ దాత్పర్యము. అలం. శ్లిష్టరూపకము.

మ. అంబురుహాప్తతేజ భవదీదంఘ్రుల వ్రాలఁగఁ గల్గు నుత్తమాం
గం బది యుత్తమాంగము జగన్మహనీయ భవత్కథావిశే
షంబు నుతింపఁగాఁ గలరసజ్ఞ రసజ్ఞ భవద్విభావనా
ప్తిం బరిపూర్ణమై జరుగు దిష్టము దిష్టము శిష్టకోటికిన్. 87

అ. అంబురుహాప్తతేజ=సూర్యుని తేజస్సు వంటి తేజస్సు గలవాఁడా, శిష్టకోటికిన్=పెద్దల సమూహమునకు, భవత్ అంఘ్రులన్=దేవరవారియొక్క పాదములందు, వ్రాలఁగన్ కల్గు=పడుటకుఁ గలిగిన - అనఁగా మ్రొక్కఁగలిగిన, ఉత్తమాంగంబు అది=ఆశిరసే, ఉత్తమాంగము=శిరసును-ఉత్తమమయినయంగమును, 'ఉత్తమాఙ్గంశిరశ్శీర్షమ్' అమ. జగన్మహనీయ=జగత్తులయందుగొప్పవాఁడా, భవత్కథావిశేషంబు=మీయొక్క చరిత్రాతిశయము, నుతింపఁగాన్=స్తోత్రముచేయుటకు - కలరసజ్ఞ—చాలిన నాలుక,రసజ్ఞ=నాలుకయును సమస్తరసములను గుఱుతెఱుఁగునదియును,'రసజ్ఞారసనాజిహ్వా' అమ. భవత్=దేవరవారియొక్క, విభావనా ఆప్తిన్ = ధ్యానముయొక్క ప్రాప్తిచేత, పరిపూర్ణమై= సంపూర్ణమై, జరుగు=కడచునట్టి, దిష్టము=కాలమే, దిష్టము=కాలమును—శుభకరమయిన యదృష్టమును- 'దిష్టందైవేచకాలేస్యాత్' అమ.

తా. మహాత్మా! మీపాదములకు మ్రొక్కఁగలిగిన శిరసే శిరసు. నీచరిత్రములను గొనియాడు నాలుకయే నాలుక. నిన్నుధ్యానముచేయుటచే జరుగునట్టి కాలమే కాలము సుమా.

క. లలనాలలామ వీణా,కలనాదము మెచ్చి కరుణఁ గమనీయవరా
కలనాదరమున వచ్చిన, యలనాదప్రియుఁడవొ మహాత్మ తెలుపవే. 88

అ. లలనా...నాదము— కాంతారత్నమయిన మాచెలియొక్క వీణియయొక్క అవ్యక్తమధురమయిన ధ్వనిని, మెచ్చి=మెచ్చుకొని, కరుణన్=దయతో, కమనీయ .దరమునన్— కమనీయ=ఒప్పుచున్న, వరాకలన=వరములిచ్చుట యందలి, ఆదరమునన్ = ఆదరముచేతననియర్థము. సుందరుఁడయిన వరుని అనఁగా పెనిమిటిని ఘటించెడి యాదరముచేతనని యర్థాంతరము. 'దేవప్రసాదే వరణే

జామాతరివరః పుమాన్, క్లీబేతు కుఙ్కుమే, త్రిష్వి ష్టేత్వవ్యయం పరమ్' నానా. వచ్చిన అలనాధ ప్రియుఁడవో=ఆగానప్రియుఁడయిన నారదుఁడవేమొ, తెలుపవే.

ఉ. ఓయతులప్రభావయుత! యోయతిలోకమణీ! యనంతర
త్నాయతతేజ! తావకశు భాంకముఁ గన్నసువర్ణరేఖలం
బాయనికూర్మిఁ దెల్పి యనపాయము గాఁగ మదీయకర్ణపా
ళీయుగళీపరిష్కరణలీల ఘటింపఁగదే ముదంబునన్. 89

అ. ఈపద్యమున 'యతిలోకమణీ' యన్నందున యతిపరముగాను మణిపరముగాను నర్థవ్యయము - ఓయతులప్రభావ (యతి) =సాటిలేని మహిమగలవాఁడా 'తులాసాదృశ్యమానయోః' అని మేదిని- (మణి) తులయనఁగామానమును. అతుల=మానమునతిక్రమించినదియు, ప్రభావ=ప్రభావము తోఁగూడినదియును, ఓయతిలోకమణీ = (యతి) ఓయతిజనశ్రేష్ఠుఁడా, (మణి) లోకాతిశయమయిన మాణిక్యమా, అనంత ... తేజ---అనంతరత్న=(యతి) సూర్యునివలె, ఆయతతేజ=విస్తరించిన తేజస్సు గలవాఁడా - (మణి) అసంఖ్యాములయిన రత్నముల యొక్క ఆయతమయిన తేజముకలది. 'అనన్తం గగనే క్లీబే పుమాన్ శేషవిశేషయోః। అనన్తాపూర్ణిమా దూర్వావిశల్యాశారిబామహీ' నానా. తావక శుభాంకమున్=(యతి) నీయొక్క శుభమయిన నామమును, కన్నసువర్ణరేఖలన్ - కాంచినట్టి అనఁగా నీనామముగా నేర్పడినయట్టి, సువర్ణరేఖలన్ =యోగ్యములయిన యక్షరపంక్తులను, (మణి)మాణిక్యాంకిత కాంచనరేఖలని అనఁగాకర్ణాభరణ విశేషములని యర్థము. పాయనికూర్మి = ఎడతెగనిప్రేమచేత, తెల్పి = ఆనతిచ్చి, అనపాయము కాఁగన్ =అపాయరహితమగునట్లుగా, మదీయ...లీలన్ - మదీయ=(యతి) నాదయిన, కర్ణపాళీ = చెవితమ్మెలయొక్క, యుగళీ=జంటకు, పరిష్కరణలీలన్ =సంతుష్టివిలాసమును, ముదంబునన్ = సంతోషమున, ఘటింపఁగదే=ఒడఁగూర్పఁగదే - కర్ణాలంకారమును జేయఁగదేయని మణిపరమైన యర్థము. అనఁగా గిరికాదేవి ప్రియసఖియైన మంజువాణి యతిని స్తోత్రముచేసి మీనామధేయ మానతిచ్చి శ్రవణానందముఁ జేయవేయని యడిగెననితాత్పర్యము.అలం. ప్రకృతాప్రకృత శ్లేషము.

చ. అన మునిరాజు పల్కు వనితా! జనతావినుతాభిధేయుఁడై
యొనరినగౌతముఁ మునికులోత్తముఁ జెప్పఁగ విందువే కదా
యనఘ తదన్వవాయకలశాంబుధిఁ బుట్టినవాఁడ గౌతమా
ఖ్య నెసఁగువాఁడ నేఁ బరమహాసరసప్రతిభానుభావుఁడన్. 90

అ. అనన్ =మంజువాణి యిట్లడుగఁగా, మునిరాజు పల్కున్ =మునిశ్రేష్ఠుఁడు బదులు చెప్పుచున్నాఁడు. ఏమనియనఁగా, వనితా=ఓచిన్నదానా, జన... ధేయుఁడై---జనతా=జనసమూహముచేత, వినుత=స్తోత్రముచేయఁబడిన, అభిధేయుఁడై = పేరుగలవాఁడై, ఒనరినగౌతమున్ =ఒప్పిన గౌతముఁడనువానిని, ముని కులోత్తమున్ =మునికులశ్రేష్ఠుఁడయినవానిని - మునికులోత్తముఁడయిన గౌతముఁడనువానిని, చెప్పఁగన్ = చెప్పఁగొనఁగా, విందువే= వినియుందువేకదా, అనఘ...శాంబుధిన్---అనఘ-దోషరహితమయిన, తత్ అన్వవాయ=ఆగౌతమునియొక్క వంశమనెడు, కలశాంబుధిన్ =పాలసముద్రమునందు, పుట్టినవాఁడను, గౌతమాఖ్యన్ =గౌతముఁడను పేరుచేత, ఎసఁగువాఁడన్ =ఒప్పుచున్నవాఁడను, నేను, పర...భావుఁడన్---పర = పరమపురుషునియందు, మహాసరస=మిక్కిలియు సా

రస్యము గల, ప్రతిభా=అప్పటప్పటికిని వికాసముఁ బొందుచుండెడి బుద్ధియొక్క, అనుభావుఁడన్=ప్రభావముగలవాఁడను-నాబుద్ధి పరమపురుషునియందు మిక్కిలియుఁ బ్రయోజనయుక్తముగా నిష్ఠమై యెంతయు నతిశయమును బొందినఁదని యర్థము. పరమ=ఉత్కృష్టమయిన, హాసరస=హాస్యరసమందలి ప్రతిభావిభవముగలవాఁడనని యర్థాంతరము. హాసరసమందు నాబుద్ధి మిక్కిలి యతిశయించినదనుట. 'ప్రజ్ఞాంనవనవోన్మేషశాలినీం ప్రతిభాంవిదుః' హాసరసముగలవాఁడనఁగా నాయికానుకూల్యమందు సహాయుఁడైన విదూషకుఁడని తెలియవలయును. 'సన్ధానకుశలశ్చేటో హాస్యకారీ విదూషకః' అని విదూషకలక్షణము.

ఈపద్యము మొదటిపాదమున 'తా' అనునక్షరముమీఁది సంబోధనవిశిష్టమయిన యాకారము యతిగాఁ జెల్లినది. ఇది కాకుస్వరయతి యనియు ప్లుతియతియనియుఁ జెప్పఁబడును. 'పలుకులతల గలవ్రాలకు, పలనగుచోఁ బ్లుతిము నిల్పి వానికి రెండున్, వలుగఁ జెప్పినఁగావ్యం, బుల నది కాకుస్వరంబు ప్లుతవళియునగున్' అని లక్షణము. గౌతముఁడు జనతావినుతాభిధేయుఁడగుటంబట్టియే 'చెప్పఁగ విందువేకదా' యనుట. అన్వవాయమును గలశాంబుధి యనుటకుఁ దగినట్లు తజ్జనితుఁడయిన గౌతమునిఁ జంద్రునిఁగా రూపింపలేముగాన నిచట కలశాంబుధిశబ్దముచే దానివలె స్వచ్ఛమును విస్తృతమయినదని తెలియునది. ఇట నర్మసఖుఁడు తన గోత్రినామమే చెప్పినాఁడని తెలియునది. తానునొకమునిగాఁ దోఁచునట్లు చెప్పటచే పరమపురుషునియందాసక్తియు విదూషకుఁడు గాన హాసమందాసక్తియు నిట దెలిపినాఁడు. ఇట 'హాస్యకారీవిదూషకః' అనులక్షణముచొప్పున నీప్రియసఖుఁడు శాకుంతలాదులందుం బోలె నాయకునికిఁ దోడగు విదూషకుఁడనియే తెలియునది.

ఉ. ఓవలమానమీనమిథునోపమలోలవిలోచనాంత కాం
తా వసునాథు నున్నతనగాహితపాదసనాథు నాత్మసం
సేవకశేవధిం దగ భజించి తదీయరహస్యమంత్రసం
భావనచే సనాదిమునిమార్గముఁ గాంచితి నద్భుతంబుగాన్. 91

అ. ఇది మొదలుగా నాసఖుఁడు తన్ను మునిగాను రాజసఖునిఁగాను దెలియునట్లు అర్థద్వయము గలుగఁ జెప్పుచున్నాఁడు. ఓవలమాన ... నాంత—వలమాన=బెళుకుచుండెడు, మీనమిథున=వాలుగు చేఁపలజంటతోడ, ఉపమ=సామ్యముగల, లోల=చలించుచున్న, విలోచన=నేత్రములయొక్క, అంత=కొనలుగలదానా, కాంతా=చక్కనిదానా, ఉన్న ... నాథున్—ఉన్నత=పొడవయిన, నగ=వృక్షములందు, ఆహిత=ఉంపఁబడిన-నిగిడింపఁబడిన, పాద=కిరణములతోడ, సనాథున్=కూఁడుకొన్నవాఁడని సూర్యపరమయిన యర్థము. ఉన్నత నగ=మిక్కిలి పొడవయిన కోలాహల పర్వతమునకు 'శైలవృక్షౌనగావగౌ' అను. అహిత=ప్రతికూలమయిన, పాద=పాదముతో, గూడుకొన్నవాఁడని రాజపరమయిన యర్థము. పాదముచేఁ గోలాహలునెగఁజిమ్మినవాఁడనుట—మునిపరముగా సూర్యానుభజనమును, సఖిపరముగా రాజానుభజనమును బచరించుట తెలియునది. 'పాదారశ్మ్యఙ్ఘ్రితుర్యాంశాః' అను. సం. శేవధిన్—సంసేవకః=లెస్సగా సేవించువారికి, శేవధిన్=నిధియైనవానికి 'నిధిర్నా శేవధిః' అను. ఈవిశేషణము రెంటికిని సమానము. వసునాథున్=సూర్యుని-వసురాజునని యర్థాంతరము. ఆత్మన్=మనస్సునందు, తగన్, భజించి=కొలిచి, తదీయ ... సంభావనచేన్--తదీయ=ఆసూర్యునిదయిన, రహస్యమంత్ర=గోప్యమయిన మంత్రముయొక్క, సంభావనచేన్=సమ్యగ్భావనచేత, చక్కఁగా ననుష్ఠించుటచేత - ఆవసురాజుయొక్క రహస్యకార్యాలోచనమందలి యూహచేత నని యర్థాం.

'మన్త్రో) వేదభేదేస్యాద్దేవాదీనాంచ సాధనే గుప్తవాదే' అని విశ్వ. అద్భుతంబుగాన్ = ఆశ్చర్యమగునట్లుగా, అనాది మునిమార్గమున్ - అనాదిముని=పురాతనులయిన మునులయొక్క, మార్గమును గాంచితిని. ఇట నవిద్యతే ఆదిర్యస్మాత్ స అనాదిః, అనాదిశ్చాసౌ మునిశ్చ, అనాదిమునిః అని విగ్రహము. అనాదిముని మార్గము=నూతనమునిమార్గమును బొందితినని యర్థాంతరము. ఇట 'ఆదిశ్చాసౌ మునిశ్చ ఆదిమునిః ఆదిమునిర్న భవతీత్యనాదిమునిః అని విగ్రహము. ఇప్పద్యమందును రెండవపాదమునఁ గాకుస్వరయతి. కిరణములను వృక్షములపయిఁ బ్రసరించుసూర్యునిదయిన రహస్యమంత్రమును లెస్సగాజపించి పురాతన ఋషులమార్గమును జెందితినని ఋషిపరముగాను, కాలిచేత బర్వతమును జిమ్మినవసురాజు రహస్యకార్యము నాలోచించి యది యొడఁగూర్చుటకై క్రొత్తగా మునిరూపము దాల్చితినని సఖిపరముగాను నర్థములు గ్రాహ్యములు.

తే. నాఁటి వినుమేనుబిన్నటనాఁటనుండి, యును దదంఘ్రిసేవావృత్తి నున్నకతన
నిచ్చెనాకుఁ బ్రసన్నుఁడై యినుఁడతండు, సకలపదముల నాత్మానుసరణమహిమ.

అ. నాఁటి=శ్రీపడఁతీ, వినుము, ఏను, పిన్నటనాఁటనుండియును = చిన్ననాఁట నుండియును, తత్...వృత్తిన్ — తత్ =(యతి) ఆసూర్యునియొక్క, అంఘ్రి=కిరణమును, సేవా=సేవించు, వృత్తిన్ =వ్యాపారముచేత - అనఁగా కిరణములను ఆస్వాదించు వృత్తిచేత-కిరణములను పానముసేయు తపోవ్యాపారముచేత ననుట, ఉన్నకతనన్ = ఉన్నందుచేత (సఖి) తత్=ఆవసురాజుయొక్క, అంఘ్రిసేవావృత్తినున్న కతనన్ = పాదసేవావ్యాపారమున నున్నందువలన, ప్రసన్నుఁడై = ప్రత్యక్షమయినవాఁడై-అనుగ్రహించినవాఁడై యని యర్థాం. ఇనుఁడు=సూర్యుఁడయిన యతఁడు-ప్రభువయిన యతఁడని యర్థాం. పదమనఁగా స్థానమును అధికారమును, అనుసరణమనఁగా, అనుగమనమును, అనుకరణమును, సకలపదములన్ = (యతి) మేరుకైలాస మందరాది సమస్తస్థానములయందు, ఆత్మానుసరణమహిమన్ =తనవెంట సంచరించుప్రభావమును, (సఖి) సకలాధికారములయందును ఆత్మానుసరణమహిమన్ =తన్ను ననువర్తించుట -అనఁగా స్వతంత్ర ప్రవర్తనముసేయు పెద్దతికమును 'పదంవ్యవసితత్రాణస్థాన లక్ష్మాంఘ్రివస్తుషు' అమ. నాకున్, ఇచ్చెను=దయచేసెను. నేను సూర్యకిరణము లాహారముగాఁ దపముసేయఁగా నాకాసూర్యుఁడు ప్రత్యక్షుఁడయి మేరుమందరాది సమస్తస్థానములందును దన్ను వెంబడించు మహత్వము నాకు దయచేసెననియు, ఆరాజుపాదములను గొలుచుచుండుటవలన నతఁ డనుగ్రహించి నాకు సమస్తాధికారములందును స్వతంత్రముగాఁ బ్రవర్తించు గౌరవమును దయచేసెననియు నర్థములు.

సీ. కావున నుద్యానగతుఁడైన మత్స్వామి, తో నమేరుసమేధమానమంజు
లచ్ఛాయలఁ గరం బలరుచు నీలగ్రీవ, నిలయాభిరామసీమలఁ దెలియుచు
సుమనోమనోజ్ఞధామములు మెచ్చుచుఁ బుష్క, రసరోవరోర్మిసంభ్రమముగనుచు
రంభాదిలాస్యసంరంభముల్ దిలకించు, కొనుచుఁ గిన్నరమృదుధ్వనులు వినుచు
తే. శిశిరశిఖరిస్థలంబు లీక్షించుకొనుచుఁ, జంపకారణ్య మరయుచుజగతి నద్భు
తం బయినపుండరీక కేదార సేతు, వైఖరికి నిచ్చగించుచు వచ్చి వచ్చి. 98

అ. కావునన్ =అట్లగుటవలన-అట్లు సూర్యునివెంట మేరుమందరాది సకలస్థానములకుఁబోవునట్టి మహిమ గలుగుటంబట్టి యనుట, ఉద్యానగతుఁడు-ఉత్ యాన (యతి) = ఊర్ధ్వయానమును అనఁగా

మీఁదుగా ఆకాశమునఁ బోవుటను, గతుఁడు = పొందినవాఁడు, అగు, మత్స్వామితోన్ = నాస్వామియగు సూర్యునితోఁగూడ నే, మేరు...చ్ఛాయలన్ — మేరు= మేరుపర్వతమందు, సమేధమాన= లెస్సగావృద్ధిఁబొందుచున్న, మంజుల = మనోహరములయిన, ఛాయలన్ = కాంతులచేత, కరంబు= మిక్కిలి, అలరుచున్ =సంతోషించుచు, (సఖి) ఉద్యానగతుఁడయినమత్స్వామితోన్ =పూఁదోఁటకు వచ్చిన నాయేలికయగు రాజుతోఁగూడ, నమేరు...చ్ఛాయలన్—నమేరు = పొన్నచెట్లయొక్క, సమేధమాన=వృద్ధిఁబొందుచున్న, మంజుల=పల్లవములచేత మనోహరములయిన, ఛాయలన్ = నీడలయందు, మిక్కిలిసంతోషము నొందుచు 'ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' అను. నీల..సీమలన్ — (యతి) నీలగ్రీవ=శివునికి, నిలయ=వాసస్థానమయిన కైలాసమందు, అభిరామ= ఒప్పుచుండెడి, సీమలన్ = ప్రదేశములను, తెలియుచున్ = కనుఁగొనుచు—(సఖి) నీలగ్రీవములనఁగా నెమిళ్లు, వానికి స్థానభూతములయిన ప్రదేశములను జూచుచును.

సుమనః...ధామములు — (యతి) సుమనః = దేవతలయొక్క, మనోజ్ఞ = సుందరములయిన, ధామములు = మేడలు మొదలయిన గృహములను, మెచ్చుచున్ = మెచ్చుకొనుచు, (సఖి) సుమనః = పుష్పములచేత, మనోజ్ఞ = మనోహరములగుచున్న, ధామములు = గృహములను అనఁగాఁ బూఁబొదరిండ్లను, మెచ్చుచున్, పుష్కర...భ్రమమున్ — (యతి) పుష్కరసరోవర = పుష్కరసరస్సనెడు తీర్థమందలి, ఊర్మిసంభ్రమమున్ =అలల కొంపలపాటును, కనుచున్ = చూచుచును, (సఖి) పుష్కరమనఁగా తామర, పుష్కరసరోవర = తామరకొలఁకులందలి, తరంగసంచలనమును జూచుచును, రంభా...రంభముల్ —(యతి) రంభాది = రంభ మొదలుగాఁగల అప్సరఃస్త్రీలయొక్క, లాస్యసంరంభముల్ = నాట్యవిజృంభణములను, తిలకించుకొనుచున్ = చూచుకొనుచు- (సఖి) రంభాది=అరఁటిచెట్లు మొదలయినవానియొక్క, లాస్యసంరంభములు = అల్లలాడు సంరంభములను చూచుకొనుచును, కిన్నర మృదుధ్వనులు —(యతి) కిన్నర = కిన్నరులనెడు దేవజాతివారియొక్క - అనఁగా అశ్వముఖులయొక్క, మృదుధ్వనులు = సౌమ్యములయిన సంగీతనాదములను, వినుచు, (సఖి) కిన్నరపక్షుల మృదువయిన నాదములనువించును, శిశిరశిఖరిస్థలంబులు—(యతి) శిశిరశిఖరి = చలికొండయైన హిమవత్పర్వతముయొక్క స్థలములను జూచుకొనుచు — (సఖి) శిశిర=చల్లనయిన, శిఖిస్థలంబులు = వృక్షప్రదేశములను - వృక్షచ్ఛాయలచేఁ జల్లనయిన ప్రదేశములను గాంచుచు 'తరుశైలౌ శిఖరిణౌ' అను. చంపకారణ్యము = (యతి) చంపకారణ్యమనెడి పుణ్యభూమిని, అరయుచున్ =పరిశీలించుచును, (సఖి) సంపెంగవనమును జూచుచును, జగతిన్ =లోకమందు, అద్భుతంబు=ఆశ్చర్యకరము, అయిన...వైఖరికిన్ —(యతి) అయిన, పుండరీకము, కేదారము, సేతువు అనెడు పుణ్యక్షేత్రములయొక్క రీతికి, ఇచ్చగించుచున్ =ప్రీతిపడుచు - వానిని సేవించుచు, (సఖి) పుండరీక కేదార = తామరమళ్లపట్టులయొక్క, 'పుణ్డరీకం సితచ్ఛత్రే పద్మభేదే సితామ్బుజే, నా త్వాగ్రమేరజతే వ్యాఘ్రే దిగ్గజే కుఞ్జరే స్వగే' నానా. సేతువైఖరికిన్ =కట్టలుండెడు పొందికను, ఇచ్చగించుచున్ = మెచ్చుకొనుచు, వచ్చివచ్చి. శబ్దశక్తిమూలధ్వని.

చ. సరసదరీఝరీ వికచకేసరసౌరభ సారపూరితాం
బర మగునిమ్మహానగము కొప్పజనె యానవపద్మినీమనో
హరుఁడు వెలుంగ నాయన కుశేశయన మిచ్చుటఁ గూర్చువాఁడ నై
యరయుదుఁ బద్మినీసముదయంబని వచ్చితినమ్మ నెచ్చెలీ. 94

అ. నెచ్చెలీ=సఖీమణీ, సరస...బరము—సరస=రసవంతమైన - సొగసైనదనుట, దరీ=గుహా ప్రాంతములందలి,ఝరీ=ప్రవాహములయందు, వికచ=వికసించిన, సారస = తామరలయొక్క, సౌరభసార=మేలయిన వాసనచేత, పూరిత=నిండింపఁబడిన, అంబరము=ఆకాశము, అగు,...పజ్జనె = ఈకొల్ల కోలాహల పర్వతముయొక్క ప్రాంతమందే, ఆ నవపద్మినీమనోహరుఁడు = పద్మినియనఁగా తామరతీఁగయును పద్మినీజాతి స్త్రీయును - 'పద్మినీ కరిణీస్త్రీ స్త్రీ సరోజ్జనలినీషుచ' వా వా. నూతనమయిన పద్మలతకుఁ బ్రియుఁడయిన యాసూర్యుఁడు. వెలుంగన్ = ప్రకాశింపఁగానని యర్థము. నూతన పద్మినీజాతి స్త్రీలకుఁ బ్రియుఁడయిన వసురాజు విలసిల్లఁగానని యర్థాంతరము. ఆయనకున్, ఉపాయనమున్ = కానుకను, ఇచ్చుటను, కూర్చువాఁడనై= ఒడఁగూర్చువాఁడనై, సూర్యునకుఁ గానుక సమర్పించుటను సమకట్టువాఁడనై - వసురాజునకుఁ గానుకనొసంగుట సమకట్టువాఁడనై యని యర్థాంతరము. పద్మినీసముదయంబున్ = తామరతీఁగల సమూహమును,అరయుదున్ = వెదకుదును గాక - పద్మినీజాతి స్త్రీ సముదాయమును వెదకుదును కాకయని యర్థాంతరము. వచ్చితినమ్మ = వచ్చినాను. ఈకొండ గుహలయందలి ప్రవాహములందుఁ దామరలు విరిసి వాసనలు గుబాళించుచున్నవిగాన తామరతీఁగ లిటగలవని తెలిసి దీనిప్రక్కనే యాసూర్యునకుఁగానుక సమర్పించుటకై క్రొత్త తామరతీఁగలను సమర్పింపవచ్చునని యిటవచ్చితినని యర్థము. ఈకొండప్రక్కనే పద్మినీజాతీ స్త్రీల మనసును హరించునట్టి యా వసురాజునకుఁ గానుకనొసంగుటకై యిటవచ్చితినని యర్థాంతరము. విరిసిన తామరల వాసనలు మిన్నుముట్టుటచే నిందుఁ దామరతీఁగలున్నవని యనుమానమునకు హేతువు.

క. అని తెలిపి మఱియు నిట్లను, వనితా యీకన్య యనఘవైభవధన్యం
   గనుఁగొన వాత్సల్యంబును, ననుకంపయు నద్భుతంబు నయ్యెడు మాకున్.

అ. అని తెలిపి, మఱియున్, ఇట్లనున్ = ఏమనియనఁగా, వనితా=ఓపడఁతీ, అనఘ వైభవధన్యన్ =దోషరహితమయిన విభవముచేతఁ గృతార్థురాలయిన, ఈకన్యన్,కనుఁగొనన్ = చూడఁగా, మాకున్, వాత్సల్యంబును=ప్రేమయును, అనుకంపయున్ = కరుణయు, 'కారుణ్యం కరుణా ఘృణా కృపా దయానుకమ్పా స్యాత్' అమ. అద్భుతంబున్=ఆశ్చర్యమును, అయ్యెడున్ = అగుచున్నది. స్వభావముచే వాత్సల్యమును, అనురూపవర సంఘటనములకై యనుకంపయు, అతిశయ రూపసంపత్తినిబట్టి అద్భుతమునని తెలియునది.

చ. అనుపమభాగ్యలక్షణసమన్విత యీరమణీలలామ యీ
   మనసిజరాజరాజ్యరమ మానసవీథిఁ దలంప సింధునం
   దన యచలేంద్రనందన యనం గనవయ్యెడి నీలతాంగి పా
   వనకులగోత్రభూతిచెలువా చెలువారఁగఁ దెల్పవే యనన్. 96

అ. అనుపమ...సమన్విత = సమాన రహితములగు భాగ్య చిహ్నములతోఁ గూడినదయిన, ఈరమణీలలామ=ఈకాంతారత్నము, ఈమనసిజరాజరాజ్యరమ=మన్మథరాజుయొక్క రాజ్యలక్ష్మియు, అయిన యాకన్య, మానసవీథిన్ =మనఃప్రదేశమందు,తలంపన్ =విచారింపఁగా, సింధునందన=లక్ష్మీదేవియును, అచలేంద్రనందన=పార్వతీదేవియును, అనన్ = అనునట్లుగా, కనవయ్యెడిన్ = చూపట్టుచున్నది అనియర్థము. 'సింధుస్తు వారిధౌ, దేశే నదే గజమదే వా నద్యాదౌ స్త్రీ) యామయమ్' నానా. సింధువనఁగా నదియునుగాన శుక్తిమతీనది పుత్రికయనియును, అచలేంద్రనందన యనఁగా, పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలుని పుత్రికయనియును, గిరికాపరమయిన ధ్వనితార్థము తెలియునది.

ఇక్కడ నప్రకృతవాచకములయిన సింధునందనాదిపదములందు సూచనావ్యాపారమని గ్రహింపవలయును. చెలువా=ఓమగువా, ఈలతాంగి=ఈ స్త్రీయొక్క, పావన...భూతి—కులగోత్రములనఁగా వంశమును నామమును - పవిత్రములయిన కులగోత్రములయొక్క వైభవమని యర్థము. పావనమనఁగా ఉదకము, 'పావనం తు జలే కృచ్ఛ్రే' విశ్వ. కులగోత్రమనఁగా కులపర్వతమయిన కోలాహలము; దానివలన, భూతి = పుట్టుకయని యర్థాంతరము. చెలువారఁగన్ = చక్కనగునట్లుగా, తెల్పవే=తెలియఁజెప్పవే, అనన్=అని యడుగఁగా, ఇక్కడ కపటయతి నాయికావృత్తాంతము నడుగుచునే సంతరించిన శబ్దముల యర్థశక్తిచే శుక్తిమతీనదికిని గోలాహలపర్వతమునకును బుట్టుటయు స్ఫురించునట్లు చెప్పుట దెలియునది.

మ. అతులప్రౌఢివచోఽనుభావములప్రోవై మించు నా వంచనా
యతి యాదృచ్ఛికసూక్తి నూటిపడ నన్యోన్యాననాలోకనా
యతనానాద్భుతలీలఁ దేలి మునిమాహాత్మ్యంబు వర్ణించి రా
శతపత్త్రేక్షణ లెల్ల నుల్లముల విశ్వాసంబు సంధిల్లఁగన్. 97

అ. అతుల...ప్రోవు—అతుల=సమానములేని, ప్రౌఢివచః= మిక్కిలి నేర్పుమాటల యందలి, అనుభావముల=ప్రభావములయొక్క, ప్రోవు=రాశి, ఐ, మించు నా వంచనాయతి=అతిశయించుచున్న యాకపటమునియొక్క, యాదృచ్ఛిక=తనంతటనే పలికిన-బుద్ధిపూర్వకముగాఁ గాక దైవికముగాఁ జెప్పఁబడిన యనుట, సూక్తి=మాట-నాయికావృత్తాంత సూచకమయిన వాక్యమనుట. 'వ్యాహార ఉక్తిర్లపితంభాషితం వచనం వచః' అమ. నూటిపడన్ = వాస్తవముగాఁ దార్కాణపడఁగా - అతఁడు నాయికవృత్తాంతము తెలియక యడిగినది తెలిసి యడిగినట్లుగాఁ బొందికపడఁగా ననుట. ముని 'సింధునందన అచలేంద్రనందన' అని వర్ణనాపరముగాఁ జెప్పినమాటలకు నదికూఁతురు పర్వతపుఁ గూతురని వృత్తాంతము దెలిసియడిగినట్లుగాఁ బొందికపడుటయు, 'పావనకులగోత్రభూతి' యనుచోటను దెలియక యడుగుట జలమునకుఁ గులపర్వతమునకును బుట్టుటయని తెలిసి యడిగినట్లుగను బొందికపడుటయుఁ దెలియునది. కావుననే యతఁడు తెలియక యడిగినదెల్ల తెలిసి యడిగినట్లు నిజములయినవిగానే నూటిపడెనని భావము. అన్యో...లీలన్—అన్యోన్య=ఒండొరులయొక్క, ఆనన= ముఖములయొక్క, ఆలోకన=చూచుటతోఁగూడిన, ఆయత=అతిశయించిన, నానా=బహువిధమయిన, అద్భుతలీలన్= ఆశ్చర్యపులీలయందు, తేలి=తెప్పలదేలి-మిక్కిలి యాశ్చర్యరసమునందుఁ మునిఁగినవారై యనుట, ఆ శతపత్త్రేక్షణలు ఎల్లన్=ఆ స్త్రీలందఱును, ఉల్లములన్=మనస్సులందు, విశ్వాసంబు=నమ్మకము, సంధిల్లగన్=సమకూడఁగా-అతఁడు పరోక్షజ్ఞానముగల మునియని నమ్మకము గుదురఁగాననుట. ముని మాహాత్మ్యంబున్=ఆ ఋషియొక్క ప్రభావమును, వర్ణించిరి=స్తోత్రము చేసిరి. ఇట కపట యతి తెలియక యడిగినమాటలు నాయికవృత్తాంతము తెలిసియడిగినవిగా నుండునట్లు కవి పొందుపఱుచుట, యాచెలికత్తెల కతనియందు మహాముని యని నమ్మికగలిగి నాయికావృత్తాంతమును జెప్పుటకునుఁ దన్మూలమున నుత్తరకథా విస్తృతికి బీజమలవడుటకును నుపపత్తి గలిగించినాఁడని తెలియునది. ఇందు రెండవపాదమందలి 'అన్యోన్య' శబ్ద ముభయయతులలోనిది గావున, 'య' అనుదానితో యతి మైత్రి నొందుచున్నది. 'యాదృచ్ఛికసూక్తి నూటిపడుటయే' యతనియందు మునియనెడు విశ్వాసము సంధిల్లుటకు హేతువు.

ఉ. అయ్యెడ మంజువాణి వినయమ్మున నమ్మునిరాజుఁ బల్కు నో
యయ్య సమస్తలోకభరణాభరణాత్మమహామహోజ్జ్వలున్

నెయ్యము మీఱఁ గొల్చి మహనీయశుభోన్నతిఁ గాంచి యున్న నీ
కియ్యఖిలప్రపంచకథ లెల్ల నెఱుంగుటెఱుంగు చోద్యమే. 98

అ. అయ్యెడన్ = ఆసమయమందు, మంజువాణి, వినయమ్మునన్ = అడఁకువతోడ, అమ్ముని రాజున్ పల్కున్ = ఆబుషిశ్రేష్ఠునితోడఁ జెప్పుచున్నది. ఏమనిన-ఓయయ్య = ఓతండ్రీ ! సమస్తలోక = సకలభువనములయొక్క, భరణ = భరించుటయే, ఆభరణ = భూషణముగాఁగల, ఆత్మ = తమవయిన, మహత్ = అధికమయిన, మహ = ఉత్సవములచేత, 'మహ ఉద్ధవ ఉత్సవః' అమ. ఉజ్జ్వలున్ = వెలుఁగుచున్న సూర్యుని, నెయ్యము మీఱన్ = ఆస్త్రభావము మించఁగా, కొల్చి = సేవించి, మహనీయ...న్నతిన్ — మహనీయ = మిక్కిలిపూజ్యమయిన, శుభోన్నతి = శుభాతిశయమును, కాంచి = పొంది, ఉన్ననీకు, ఇయ్యఖిలప్రపంచకథలు = ఈసమస్త జగత్తునందలి వృత్తాంతములు, ఎల్లన్, ఎఱుంగుటెఱుంగు = తెలిసియుండువిధము, చోద్యమే = ఆశ్చర్యమా- ఆశ్చర్యముగాదనుట. అనఁగా మీకు నీప్రపంచమందలి వృత్తాంతములన్నియుఁ దెలిసియున్నవిగావున నీకన్యయొక్క వృత్తాంతమును దెలిసియుండక తప్పదని భావము. సమస్తలోకభరణముగలవానిని గొల్చుటంజేసి యీసమస్తప్రపంచము కథలు తెలియుట చోద్యముగాదని గూఢశయము.

చ. అనుపమభాగ్యలక్షణసమన్విత యీరమణీలలామ యీ
మనసిజరాజరాజ్యరమ మానసవీథిఁ దలంప సింధునం
దన యచలేంద్రనందన యనంగ నయ్యెడి నంచు నిట్లు పే
ర్కొనియును గ్రమ్మఱం దెలియఁగోరుట కూరిమి పెంపునంగదా. 99

అ. అనుపమ...మన్విత — అనుపమ = సాటిలేని, భాగ్యలక్షణ = భాగ్యచిహ్నములతోఁ గూడిన, ఈరమణీలలామ = ఈకాంతారత్నము, ఈమనసిజరాజరాజ్యరమ = మన్మథుఁడనెడి రాజుయొక్క రాజ్యలక్ష్మియైన యీకన్య, మానసవీథిన్ = మనస్సునందు, తలంపన్ = విచారింపఁగా, సింధునందన = శుక్తిమతీనది పుత్రికయు, అచలేంద్రనందన = కోలాహలాద్రి పుత్రికయు, అనన్ = అనునట్లుగా, కన నయ్యెడినంచున్ = చూపట్టుచున్నదని, ఇట్లు = ఈవిధమున, పేర్కొనియును = పేరుచెప్పినవారయ్యు-సింధునందనాచలనందనా పదములకు కపటయతి లక్ష్మీపార్వతీపరముగా గ్రహించి చెప్పఁగా నవియే శుక్తిమతీ కోలాహలాద్రిసంభవపరముగా నర్థమిచ్చుటంబట్టి శుక్తిమతీకోలాహలాద్రి పుత్రిగా మీరేదీనిని పేరుకొనియును, గ్రమ్మఱన్ = మరల, తెలియఁగోరుట = తెలిసికొనవలయునని నిచ్చగించుట, కూరిమి పెంపునంగదా = ప్రేమాతిశయముచేతనేగదా. 96 వ పద్యమున మాయా మునివాక్యమున నర్థద్వయము గల్గునట్లుగాఁ జెప్పంబడిన సింధునందన అచలేంద్రనందన యనెడుపదములకు మంజువాణి శుక్తిమతీనదీ పుత్రియనియుఁ గోలాహలాద్రి పుత్రియనియును నర్థమునుగ్రహించి యీపద్యమందు నీరీతిగాఁ గపట మునితోఁ బలికెనని తెలియునది.

క. కావున నీవనజానన, పావనజననక్రమంబు భవదీయదయా
శ్రీవలన విన్నవించెద, నే వినుమని యవ్విలాసినీమణి వలికెన్. 100

అ. కావునన్ = కాఁబట్టి, ఈవనజానన = ఈకన్యకయొక్క, పావనజనన క్రమంబు = పవిత్రమయిన జన్మప్రకారమని యర్థము. వనజాననపావన జననక్రమంబు అనుచోట తెనుఁగువష్ఠీ సమాసము గనుక వనజాననాశబ్దమునకు హ్రస్వముకలిగినది. పావనమనఁగా జలమునంగనుక జలమందు అనఁగా

జలమయశుక్తిమతియందుఁ బుట్టినవిధమని యర్థాంతరము. భవదీయ దయాశ్రీవలనన్ = దేవరవారి యొక్క కృపాసంపత్తిచేత, నేన్ = నేను, విన్నవించెదన్ = విన్నపము చేయుచున్నాను, వినుము అని. అవ్విలాసినీమణి = ఒయ్యారులలో మేలుబంతియైన యామంజువాణి, పలికెను.

మ. కలఁ డుల్లోకమహామహోగ్రహుతభుగ్జ్వాలావళీనిర్జల
స్థలదంభోనిధి లక్ష్యహైమవతపక్షక్షోదదక్షోరుది
గ్వలభీదుర్భరభేరికాభయదభాంకారైకసంప్రీణితా
చలవైరిస్తుతకీర్తిసాంద్రుఁడు వసుక్ష్మాపాలచంద్రుం డిలన్. 101

అ. ఉల్లోక...సాంద్రుఁడు—ఉల్లోక = లోకాతీతమైన, మహస్ = ప్రతాపమనెడు, మహోగ్ర = మిక్కిలి తీక్ష్ణమయిన, హుతభుక్ = అగ్నియొక్క, జ్వాలావళీ = జ్వాలలసమూహముచేత, నిర్జల స్థలత్ = జలశూన్యప్రదేశముగా నాచరించుచున్న, అంభోనిధి = సముద్రమందు, లక్ష్య = చూడఁదగినకనఁబడుచున్న, హైమవత = హిమవత్పర్వతపుత్రుఁడయిన మైనాకునియొక్క, పక్ష = ఱెక్కలయొక్క, క్షోద = పిండిచేయుటయందు, దక్ష = సమర్థమైనదియు, ఉరు = అధికమయినదియు, దిగ్వలభీ = దిగంతము లచేత, దుర్భర = భరింప నలవికానిదియు నగు, భేరికా = రణభేరియొక్క, భయద = శత్రువులకు భయముతో నగునట్టి, భాంకార = భాం అనునట్టి ధ్వనిచేత, ఏక = ముఖ్యముగునట్లుగా, సంప్రీణిత = సంతోషపెట్టఁబడిన, అచలవైరి = పర్వతద్వేషియైన యింద్రునిచేత, స్తుత = స్తోత్రము చేయఁబడిన, కీర్తి = యశస్సుచేత, సాంద్రుఁడు = పూర్ణుఁడు, అనఁగాఁ దనయొక్క ప్రతాపాగ్ని జ్వాలలచేత సముద్రజలము నింకింపఁజేయఁజాలిన శౌర్యముగలవాఁడయిన, వసుక్ష్మాపాలచంద్రుఁడు = వసురాజశ్రేష్ఠుఁడు, కలఁడని యర్థము. ఇంద్రుఁడు పర్వతముల ఱెక్కలు ఖండించుచో హిమవంతుని కొడుకయిన మైనాకుఁడు సముద్రమునం బడి దాఁగికొని ఱెక్కలఁ గాపాడుకొనుట పురాణప్రసిద్ధము. వసురాజు ప్రతాపాగ్ని జ్వాలలచే సముద్రజలములంతయు నింకిపోఁగా నపుడు మైనాకుఁడు బయలుపడె ననియు, వసురాజు జైత్రభేరీ భాంకారములచే వెలువడిన మైనాకుని ఱెక్కలు తుత్తుమురై పోవఁగా తనకుమాఱుగా నట్లు వాని ఱెక్కలు పోకార్చి నందులకు నింద్రుఁడు మిక్కిలి సంతుష్టిఁ బొంది వసురాజు నెంతయుఁ బొగడెననియు నర్థము- ప్రతాపాగ్ని జ్వాలచే సముద్రజలము నింకుసంబంధము లేకుండియు సంబంధమును జెప్పుటచే నతిశయోక్తి. భేరీ భాంకారధ్వనిచే మైనాకుని పక్షక్షోదాసంభవమయ్యు సంభవమును జెప్పుటఁ జేసియు నతిశయోక్తి: 'హైమవత పక్షక్షోదదక్ష' మను విశేషణగతిని భేరిభాంకరణజనిత సంప్రీతికి హేతువగుటచే కావ్యలింగము నలంకారములు.

శా. స్వారాజ్యంబును బోలె నింద్రున కధిష్ఠానం బధిష్ఠానమై
యారాజన్యున కింపుసొం పెసఁగు నిత్యశ్రీలతావాలమై
యారామస్థ యమానసూనమకరందాసారశైవాలినీ
ధారావర్ధితసాధుశీగుణాల సత్కాంతాగకాంతారమై. 102

అ. ఇంద్రునకున్ = దేవేంద్రునకు, స్వారాజ్యంబునుబోలెన్ = స్వర్గరాజ్యమువలె, అధిష్ఠానంబు = అధిష్ఠానమనెడు పట్టణము, అధిష్ఠానమై = నివాసస్థానమై—రాజధానియై యనుట, 'అధిష్ఠానంపుటః ప్రభావ చక్రేష్వధ్యాసనేపిచ' నానా. నిత్య...వాలమై—నిత్యశ్రీ = శాశ్వతమయిన సంపత్తియనెడు, లతా = తీఁగకు, ఆవాలమై = పాదుఅయి, పాదనుటచేత, దానియందు నాఁటిన తీఁగ పయిపయి నభి

వర్ధిల్లునట్లు ఆపట్టణమునందలి సంపత్తియు నుత్తరోత్తరాభివృద్ధి నొందుచుండెననుట ధ్వనితము. ఆరా ...కాంతారమై—ఆరామ=ఉద్యానవనములందు, స్మయమాన=వికసించుచున్న, సూన=పుష్పములయొక్క, మకరంద=పూఁదేనెయొక్క, ఆసార=ముసురువలనఁబుట్టిన, శైవాలినీ=నదియొక్క 'తరఙ్గిణీ శైవలినీ తటినీహ్రాదినీధునీ' అమ. శైవలినీ శబ్దమునకు 'శైవాలినీ' రూపాంతరము, ధారా= అల్పప్రవాహముచేత, వర్ధిత=వృద్ధిఁబొందింపఁబడుచున్న, మాధురీగుణ=మాధుర్యముచేత, లసత్=ఒప్పుచున్న, కాంతార=చెఱకుయొక్క, కాంతార=తోఁటలు గలదై, ఆరాజన్యునకున్=ఆవసురాజునకు, ఇంపుసొంపు=ఆనందాతిశయము, ఎనఁగున్=అతిశయించును- మిక్కిలి ప్రీతికరమయి యుండుననిభావము. 'ఇక్షువణ్డ ప్రభేదేస్యాత్కాన్తారః' విశ్వ. 'కాన్తారోఽస్త్రీ వనే దుర్గవర్త్మన్యత్తరేతువా' నానా. తోఁటలయందలి పూఁదేనియలజాలుచేతఁ జెఱకునందలి సహజమాధుర్యము వర్ధిల్లుచున్న దనుట.

తా. ఇంద్రునకు స్వర్గమువలె నారాజునకు నధిష్ఠానము రాజధానియై యొప్పును. ఆపట్టణమందు సంపద నానాఁటికి హెచ్చుచుండెను. పూఁదోఁటలు మిక్కిలి మెండుకొనియుండును. చెఱకు తోఁటలును విస్తరించి యుండును. అలం. రూపకము సావయవము.

తే. రత్నభూషిత యైనయూర్ రాజధాని, యఱుత నురుతరముక్తాఫలాభిరామ
దామకం బనఁజాలి నిర్దంపుఁజవులఁ, బరఁగుశుక్తిమతీనామ భవ్యతటిని.

అ. రత్నభూ + ఉషిత—రత్న = మణినిబద్ధమయిన, భూ=భూమితోడ, ఉషిత = ఉండునదియు, రత్నభూషిత = రత్నాలంకృతయు, ఐనయారాజధాని = (ఇట స్త్రీలింగ పటిమచేత ఒకానొక స్త్రీ స్ఫురించుచున్నది గనుక,) రాజధాని యనెడు స్త్రీయొక్క, స్త్రీస్ఫూర్తిచేతనే 'రత్నభూషిత' అనువిశేషణమునకు అర్థద్వయము. అఱుతన్ = కంఠమందు - సమీపముననునుట, ఉరు ... దామకంబు — ఉరుతర = మిక్కిలి గొప్పలయిన, ముక్తాఫల = ముత్యములతోడ, అభిరామ=ఒప్పుచున్న, దామకంబు అనన్=హారమోయనునట్లుగా, చాలి=అర్హమై, శుక్తిమతీనామ భవ్యతటిని=శుక్తిమతియనెడి దివ్యనది, నిర్దంపుఁజవులన్=స్నిగ్ధమయిన మధురరుచులచేతను-మౌక్తికములచేతను, పరఁగున్=ఒప్పుచుండును. చవులనఁగా రుచులకును మౌక్తికములకునుపేరు. ఇందులకు 'చవులనఁగానభిధానము, లవుసద్రుచులకును ముత్తియంబులకభవా' అని యాంధ్రనామసంగ్రహము, అధిష్ఠాన రాజధానియనెడు స్త్రీయొక్క కంఠమందుఁ బ్రకాశించు ముత్యాలహారమో యన్నట్లు, మధురజలముచేతను ముత్యములచేతను నొప్పుచున్న శుక్తిమతీనది పట్టణప్రాంతమందుఁ బ్రవహించుచుండు నని తాత్పర్యము. అఱుతన్ ఇది అఱుశబ్దమునసప్తమ్యేకవచనము పట్టణము'నఱుతన్' అనుటంబట్టి పట్టణము చుట్టునుగాక నడుమనుగాక, అఱు దేహమునం దొకవలన నుండునట్లుగా పట్టణముయొక్కప్రక్కను బ్రవహించుచున్నదని గ్రాహ్యము. శుక్తిమతియందు ముత్తెపుఁ జిప్పలుండుటయు వానియందు ముత్యములు పుట్టుటయు బ్రకటము. కాన నిర్దంపుఁజవుల నని యర్థద్వయముగూర్చినాఁడు. ముత్తెపుఁ జిప్పల ముత్యములుండుటకు.

'ఒప్పెసఁగు పలుదెఱంగుల, చిప్పలలో స్వాతివానచినుకులు మున్నే
చొప్పునఁ బడు నప్పరుసున, నొప్పాగవును మౌక్తికంబు లొక్కొకభంగిన్' రత్నపరీక్ష.

అలం. శ్లిష్టరూపకోత్థాపితమగు నుత్ప్రేక్ష.

ఉ. జీవనమెల్ల సత్కవినిర్ షేవిత మాశయమెల్ల నచ్ఛతా
పావనతాగభీరతలర్ పట్టు ప్రచారము లెల్ల విశ్వధా

త్రీవలయత్రికాలఫల దేశికముల్ నవకంబు లెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లానదిపెంపు నుతింప శక్యమే. 104

అ. శుక్తిమతీనదిని వర్ణించుచున్నాఁడు—ఇట నదీపరముగాను ధార్మికురాలి పరముగాను అర్థద్వయము. జీవన...నిషేవితము—జీవనమనఁగా జలమును బ్రతుకును, 'సలిలేపిచజీవనమ్' నానా. కవులనఁగా జలపక్షులును కవిజనులును—జీవనమెల్లన్ = (నదీ) జలమంతయు, సత్కవినిషేవితము= శ్రేష్ఠములయిన జలపక్షులచేత సేవింపఁబడుచున్నది. (ధార్మి) బ్రతుకంతయును శ్రేష్ఠులయిన కవిజనులచేత ననుభవింపఁబడుచున్నది - కవిజనుల భరణమునందే యార్జితమును వినియోగించుచున్నదనుట. ఆశయమెల్ల.. పట్టు—ఆశయమనఁగా మడుఁగును, మనస్సును. ఆశయమెల్లన్ = (నదీ) మడుఁగంతయును, అచ్ఛతాపావనతాగభీరతలపట్టు = నిర్మలత్వముయొక్కయు పావనత్వముయొక్కయు అగాధత్వముయొక్కయు స్థానము - మడుగు తేఁటయై పవిత్రమై లోఁతుగలిగి యుండు ననుట. (ధార్మి) మనస్సు నిష్కల్మషత్వముయొక్కయు, పవిత్రత్వముయొక్కయు, గంభీరత్వముయొక్కయు స్థానము. ప్రచారము... దేశికముల్ — ప్రచారము లనఁగా జలప్రవాహములును, ప్రవర్తనములును, ప్రచారములెల్లన్ = (నదీ) జలప్రవాహములన్నియును, విశ్వధాత్రీవలయ = సమస్తభూతలమునకును, త్రికాలఫల దేశికముల్ = ముక్కారుపంటలు గలుగఁ జేయుచున్నవి. (ధార్మి) ప్రవర్తనములన్నియు సమస్తభూజనులకుఁ గాలత్రయ ఫలములను దెలియఁజేయునట్టివి. భూతకాలపుణ్య సూచకములును భవిష్యత్కాల శుభహేతుకములును వర్తమానకాలదురిత భంజకములునని యాశయము. నవకంబు...స్పదములు—నవ = (నదీ) నూతనమయిన, కంబులు ఎల్లన్= శంఖములన్నియును, ముక్తావళి = ముత్యముల సమూహముల = విభ్రమ = చుట్టు రేకలకును, ఆస్పదంబులు= ఆధారభూతములు - శంఖములన్నియు ముత్తెములుగలిగి చుట్టు రేకలతోఁ గూడి యుండుననుట. ఇట విభ్రమశబ్దము భ్రమణాశ్రయమయిన రేఖల కుపలక్షకము. నవకంబులు= (ధార్మి) కోమలత్వములు,—అనఁగాఁ జక్కఁదనములు ఇది దేశ్యము. ముక్తావళి=ముక్తులయిన వారికిని, విభ్రమాస్పదములు = భ్రమను గలిగించుట కాస్పదములు—ముక్తులను గూడ మోహపెట్టునట్టివనుట. 'పరిత్యక్తేఽపి ముక్తస్స్యన్ముక్తా ముక్తాఫలే స్త్రియామ్' నానా. ఆనదిపెంపు=అశుక్తిమతియొక్క ఘనతను, నుతింపన్ శక్యమే=కొనియాడఁ దరమా—తరముకాదనుట. అలం. శ్లేషము.

సీ. అనుకూలఖేలనాయత్తజీవనమైత్రి, నడరి నర్మద బోటి యై భజింప
నూర్మికాకంకణద్యుతికలాపము దోఁప, బాహుద కై దండఁ బరిఢవింప
సముదితారావసంభ్రమసాంద్ర యై సారె, సారె వేత్రవతి హెచ్చరికఁ దెల్ప
గంభీరరసగుంభసంభృతప్రౌఢిమ,తో సరస్వతి పల్కుఁ దోడు గాఁగ

తే. గులములోఁ బెద్దయునమూల్యగుణమణిప్ర, కాండపరిపూర్ణయును గాన గారవము
నఖిలనదులునుదనుఁ గొల్వ ననుదినంబు,నలువకొలువున కేఁగు నన్నదియతీంద్ర.[న

అ. ఇందును నదీపరముగాను స్త్రీపరముగాను అర్థద్వయము. యతీంద్ర = ఓ మునీంద్రుఁడా, అన్నది = అశుక్తిమతి, అనుకూల...మైత్రిన్ — (స్త్రీ) అనుకూల = ఇష్టమయిన- ఖేలన = క్రీడయందు, ఆయత్త = అధీనమయిన, జీవనమైత్రిన్ = ప్రాణస్నేహముచేత, దానుకోరిన క్రీడల కాయితపడి యుండునట్టి చెలియైనదనుట, అడరి = ప్రకాశించి, నర్మద = నర్మదానదియనెడు

నర్మప్రదయైన చెలికత్తియు, బోటియై = పరిచారికయై, భజింపఁ = కొలువఁగా. (నది) అనుకూలఫలదాయత్త - కూలమనఁగా గట్టు. గట్టుల ననుసరించి విహరించుటయం దధీనమయిన - గట్టు నతిక్రమింపక లోనయి ప్రవహించుటగల యనుట, జీవనమైత్రి = జలమైత్రిచేత, అడరి = ప్రకాశించియని భావము. దాని జలములు గట్టు ననుసరించి ప్రవహించుచుండు ననుట. నదు లిట్టు ప్రవహించుచుండుట సహజము. బాహుద యనఁగా బాహుదానదియు, కయిదండ యొసఁగు స్త్రీయును. ఊర్మి . లాపము— ఊర్మికలనఁగా - ఉంగరములును అలలును, కంకణములనఁగా కడియములును జలకణములును-ఊర్మికా= (స్త్రీ) ఉంగరములయొక్కయు 'అఙ్గులీయక మూర్మికా' అమ. కంకణ=బంగారు కడియములయొక్కయు, 'కఙ్కణం కరభూషణమ్' అమ. ద్యుతికలాపము=కాంతిసమూహము, తోఁపఁ = ప్రకాశింపఁగా, బాహుద = బాహుదానదియ నెడు కైదండ యిచ్చు చెలికత్తియు, కైదండఁ = చేయూఁతయిచ్చుటయందు, పరిఢవింపఁ = ఒప్పుచుండఁగా నని యర్థము. (నది) ఊర్మిక = అలలను సంబంధించిన, కంకణ = జలబిందువులయొక్క, ద్యుతికలాపముతోఁ పఁ = కాంతిసమూహము విలసిల్లఁగా నని భావము. నదులయలలందు లేచు జలబిందువులు కాంతిచే నొప్పుట ప్రకటము.

వేత్రవతి యనఁగా వేత్రవతీనదియును వెండిబెత్తము పట్టుకొని కొలిచెడి స్త్రీయును, సముదితా... సాంద్రయై—(స్త్రీ) సముదితఆరావ= యోగ్యమయిన వాక్యధ్వనులయొక్క, సంభ్రమ=తొట్రుపాటుచేత, సాంద్రయై=పూర్ణయై, వేత్రవతి=వేత్రవతీ నదియ నెడు వెండిబెత్తపు కొలువుడుకత్తె, సారెసారె= మాటిమాటికిని, హెచ్చరిక తెలుపఁ = పరాకు తెలుపఁగా. ప్రవాహ సముదితమయినధ్వని సంభ్రమముగల దియని భావము. నదులు ప్రవాహవేగముచే ధ్వని సేయుట స్వభావము. సరస్వతియనఁగా సరస్వతీనదియును మాటకారియు, గంభీర...ప్రౌఢిమతోఁ—గంభీర = సుగూఢమయిన, రస=శృంగారరసము యొక్క, గుంభ=పూర్తిచేత, సంభృత=భరింపఁబడిన, ప్రౌఢిమతోఁ = ప్రాగల్భ్యముతోడ, సరస్వతి=సరస్వతీనదియ నెడు మాటకారియగు చెలికత్తియు, పల్కుఁ దోడుగాఁగ = సహోక్తి ప్రత్యుక్తులు జరిగించునది యగుచుండఁగా నని యర్థము. గంభీర=అగాధమయిన, రస=జలముయొక్క, గుంభ=పూర్తియొక్క, సంభృత=దాల్చియున్న, ప్రౌఢిమతో ననిభావము. నర్మదాదిపదములు నర్మప్రదానాది యోగ్యతాభిప్రాయగర్భితములయిన విశేష్యములుగనుకఁ బరికరాంకుర మలంకారము.

ప్రౌఢశబ్దము క్తిన్నంత మే కాని ఇమనిజంతముగాదు. కనుక 'ప్రౌఢిమ' యనుట విచార్యము. ఇట్లె 'పాటలీచంపకోత్పల ప్రౌఢిమములు' అని పారిజాతాపహరణమందును (ఆ-౨-౪౬) 'గంభీరవాక్ప్రౌఢిమ' ననికళాపూర్ణోదయమందును మఱికొన్ని ప్రౌఢకవిప్రయోగములందును గనఁబడుచున్నది. దీనిబట్టియే సీతారామాచార్యుల వారును 'ప్రౌఢిమ' శబ్దమున్నదని నిఘంటువున నుదాహరించిరి కాఁబోలు. కులములోఁ పెద్దయుఁ = వంశశ్రేష్ఠురాలని యర్థము. స్వజాతిగణములోఁ బెద్దదియని భావము. అమూల్య... పూర్ణయుఁ—ప్రకాండము శ్రేష్ఠవాచకమును సమూహవాచకమును, అమూల్య = విలువలేని, మణిప్రకాండ = మణిశ్రేష్ఠములవంటి, గుణ=గుణముల చేత, పరిపూర్ణయును = సంపూర్ణమయినదియునని యర్థము. అనర్ఘగుణమయిన మణిసమూహముచేతఁ బరిపూర్ణయని భావము. కాన=కాఁబట్టి, గారవమునఁ = ప్రేమచేత, అఖిల నదులును=ఎల్లనదులును, తనుఁ, కొల్వఁ = సేవింపఁగా - కొలిచిరాఁగా ననుట, అనుదినంబు=ప్రతిదినము, నలువ కొలువునకుఁ = బ్రహ్మదేవుని సభకు, ఏఁగుఁ = పోవుచుండును. ఆనది స్త్రీరూపయై నర్మదాదినదులు స్త్రీరూపములోఁ బూర్వోక్తప్రకారముగాఁ బరిచరించుచు గొలిచిరాఁగాఁ బ్రతిదినమును బ్రహ్మసభకుఁ బోయి వచ్చుచుండునని తాత్పర్యము.

క. ఆలీల నమ్మహానది, నాళీకజుఁ గొల్చి యొక్కనాఁడు ప్రియాళీ
కేళీసంభ్రమవినుత మ, రాళీగతు లడర మఱలి రా నొకచోటన్. 106

అ. ఆలీలన్ = ఆవిధమున, అమ్మహానది = ఆగొప్పనదియైన శుక్తిమతి, నాళీకజున్ = బ్రహ్మదేవుని, కొల్చి = సేవించి, ఒక్కనాఁడు = ఒకానొకదినమందు, ప్రియాళీ ..గతులు—ప్రియాళీ=ప్రియసఖులతోడి, కేళీ=క్రీడయందలి, సంభ్రమ=సంబరముతోఁగూడిన, వినుత=స్తుతింపఁబడిన, మరాళీగతులు = ఆఁడు హంసనడలవంటినడలు, అడరన్ = ప్రకాశింపఁగా, మరలిరాన్ = మరలివచ్చుచుండఁగా 'ప్రియా... గతులు' అనుచో ప్రియములగు అళుల (తుమ్మెదల) కేళీసంభ్రమములును వినుతములయిన మరాళుల (ఆఁడుహంసల) గతులునుగలిగినదని నదీపరముగా నర్థము క్లిష్టము. ఒకచోటన్ = ఒకస్థలమందు - ముందటిపద్యముతో నన్వయము అలం.

సీ. సుమనోధివాసభాసురశిఖోన్నతివాఁడు, ఘనసారతిలకవాసనలవాఁడు
ఘనసంకుమదసాంద్రగండభాగమువాఁడు, నవపద్మరాగదంతములవాఁడు
కలితోపకంఠనక్షత్రమాలికవాఁడు, హరిచందనచ్ఛాయ నమరువాఁడు
తపనీయమేఖలాధాళధళ్యమువాఁడు, మణిపాదవలయధామంబువాఁడ

తే. నర్ఘరత్నావళీ విచిత్రాంబరాభి, రామశృంగారములవాఁడు హైమగర్భ
గేహమున కేఁగువాఁడుకోలాహలాఖ్యుఁ,డొకధరాధీశుఁ డెదురయ్యెనువిదకపుడు.

అ. ఇట యెదురువచ్చిన కోలాహలపర్వతుని, పర్వతపరముగాను పురుషపరముగాను వర్ణించుచున్నాఁడు. అధివాసమనఁగా గంధమాల్యాదులచేతఁ జేయఁబడు సంస్కారము. 'సంస్కారో గన్ధమాల్యాద్యైర్యస్స్యాత్తదధివాసనమ్' అమ. సుమనః అధివాస = పుష్పములచేతనైన అలంకారముచేత, భాసుర= ప్రకాశించుచున్న, శిఖోన్నతివాఁడు = సిగముడియొక్క హెచ్చుగలవాఁడును అని యర్థము. సుమనోధివాస - దేవతానివాసముతోడ 'సుమనాః పుష్పమాలత్యోస్స్త్రీ)దశే' విశ్వము. భాసుర=ప్రకాశించుచున్న, శిఖోన్నతివాఁడు=అగ్రభాగముయొక్క పొడవుగలవాఁడును అని భావము. అగ్రము పొడవగుటచే నందు దేవతలు వాసముచేయుదురనుట. ఘన...వాఁడు—కర్పూరతిలకముయొక్క వాసనలుగలవాఁడు - కర్పూరపుటరఁటులయొక్కయు తిలకవృక్షములయొక్కయు వాసనలు గలవాఁడని భావము. ఘనసం ... గమువాఁడు — ఘన = అధికమయిన, సంకుమద = జవ్వాదిచేత, సాంద్ర = దట్టమయిన, గండభాగమువాఁడు = చెక్కిళ్లుగలవాఁడు - జవ్వాదిచేత దట్టమయిన గండశిలలు గలవాఁడని భావము. గండశిలలందు జవ్వాదిపిల్లులు జవ్వాదివిడుచుననుట. నవ...దంతములవాఁడు—నవ = నూతనమయిన, పద్మరాగ=పద్మరాగమణులవంటి, దంతములవాఁడు= పండ్లుగలవాఁడు-పద్మరాగమణిమయము లయిన సానువులుగలవాఁడును అని భావము. 'దన్తోఽద్రికటకే కుఞ్జే రదనేప్యన్నతోపలే' నానా. 'దన్తస్సానుని కథ్యతే' విశ్వ.

కలిత...మాలికవాఁడు—నక్షత్రమాలికయనఁగా ఇరువదియేడు ముత్యాలు గూర్చినహారము. 'సైవ నక్షత్రమాలాస్యాత్సప్తవింశతిమౌక్తికా' అమ. కలిత=కూడుకొనఁబడిన, ఉపకంఠ = కంఠ ప్రాంతమందలి, నక్షత్రమాలికవాఁడు = నక్షత్రమాలికగలవాఁడును — సమీపమందు నక్షత్రసమూహము గలవాఁడని భావము - నక్షత్రమండలమంత పొడవు మించుమించుగాఁ గలవాఁడనుట. 'ఉపకణ్ఠాన్తికాభ్యర్ణాభ్యగ్రాః' అమ. హరిచంద ... నమరువాఁడు — హరిచందనచ్ఛాయన్ = పీతవర్ణము

గల చందనపుఁబూఁతయొక్క కాంతిగలవాఁడును - హరిచందన వృక్షముల ఛాయచేత నొప్పు చున్నవాఁడునని భావము. మొదటిఛాయాశబ్దమునకుఁ గాంతియు రెండవఛాయాశబ్దమునకు నీడ యునర్థములు. 'హరిచన్దన మాఖ్యాతం గో శీర్షే సురపాదపే' విశ్వము. తపనీయ ... ధళధళ్యమువాఁడు- తపనీయ=బంగారుమయమయిన, మేఖలా=మొలనూలియొక్క, ధాళధళ్యమువాఁడు = ధళధళయను కాంతిగలవాఁడును - బంగారుమయ మయిననితంబప్రదేశము గలవాఁడును అని భావము. ఇక్కడ మేఖలాశబ్దము శైలనితంబపరము. 'మేఖలాఖడ్గబన్ధే స్యాత్కాఞ్చ్యాం శైలనితమ్బయోః' అని విశ్వము. మణి ... ధామంబువాఁడు - మణి = రత్నఖచితములయిన, పాదవలయ = కాలియందెలయొక్క, ధామంబువాఁడు = కాంతిగలవాఁడును అని యర్థము. రత్నమయమయిన ప్రత్యంతపర్వతముయొక్క కాంతివరణము గలవాఁడని భావము. 'పాదాః ప్రత్యన్తపర్వతాః' అమ.

అనర్ఘ ... శృంగారములవాఁడు- అనర్ఘ=విలువలేని,రత్నావళీ=రత్నసమూహములచేత, విచిత్ర= వింతగానున్న, అంబర=వస్త్రములవలన, అభిరామ=ఒప్పుచున్న, శృంగారములవాఁడు= సింగారములు గలవాఁడును - అనర్ఘ=అమూల్యములయిన, రత్నావళీ=నానావిధరత్నకాంతులచేత, విచిత్ర=నానా వర్ణమయిన, అంబర=ఆకాశముగలిగిన, అభిరామ=రమణీయములయిన, శృంగ = శిఖరములయొక్క, అరములవాఁడు = అంచులుగలవాఁడు ననిభావము - శిఖరాంచలము లాకాశము నొరయుచున్నవనుట. హైమగర్భగేహమునకుఁ - హైమగర్భ=బ్రహ్మదేవుని సంబంధించిన, గేహమునకుఁ=గృహమునకు - స భామందిరమునకనుట, ఏఁగువాఁడు= పోవుచున్నవాఁడును, కోలాహలాఖ్యుఁడు= కోలాహలుఁడనెడి పేరుగలవాఁడును. అగు, ఒక ధరాధీశుఁడు=ఒకరాజు.పర్వతాధీశ్వరుఁడని భావము. ఉవిదకుఁ = స్త్రీరూపయగు శుక్తిమతికి, అపుడు, ఎదురయ్యెఁ =ఎదురుపడెను.

తా. సిగయందుఁ బువ్వులుదుఱిమి, కప్పురపుబొట్టుపెట్టి, చెక్కిళ్లయందు జవ్వాదియు మేనఁ జందనమును బూసికొని, పలువరుస కెంపులవలె మెఱయ, కంఠమున ముత్యాలహారమును, నడుమ బంగా రుమొలనూలును, కాలియందు రతనాలయందెలును వెలుఁగ, మణిమయమగు పుటముగట్టి సింగారించు కొని కోలాహలుఁడనువాఁడు బ్రహ్మసభకుఁ బోవుచుండి దారిలో నెదురుపడెను.

చ. అనుపమభాగ్యశాలి కచలాధిపమాళికిఁ బుత్రుఁడై జగ
జ్జనని కనుంగుఁదమ్ముఁ డయి శంకరుముద్దుమఱందికుట్టయై
మనుతనభాగధేయమహిమంబున మిన్నులు ముట్టివచ్చుధ
న్యుని నతనిన్ భజించి నదియయ్యున్ వినయంబున నొంద్యమై చనన్. 108

అ. నదియయ్యున్ = శుక్తిమతియు, అనుపమభాగ్యశాలికిన్ = సమానరహితములయిన భాగ్య ములచేత నొప్పుచున్నవాఁడయిన, అచలాధిప మాళికిన్=పర్వతరాజ శ్రేష్ఠునికి- అనఁగా హిమవంతుని కనియర్థము. అచలాశబ్దము భూవాచకముగనుక భూపతిశ్రేష్ఠునికని యర్థాంతరమును - ధరాధీశుఁడని పూర్వపద్యమున పర్వత రాజోభయపరముగాఁ గ్రహించుటచే నిచ్చట నట్లే గ్రహించుటచెల్లును. పుత్రుఁడై=కుమారుఁడై, జగజ్జననికిన్=లోకమాతయైన పార్వతికి, అనుంగుఁదమ్ముఁడయి=గారాబుతమ్ముఁ డయి, శంకరు...కుట్టయై=శంకరునియొక్క ముద్దులపిన్నమఱఁదియై, కుట్టశబ్దము త్తరపదమైనపుడు కనిష్ఠార్థమునఁ బ్రయోగింపఁబడుచున్నది. కొడుకుఁగుట్ట, తమ్ముఁగుట్ట యిత్యాదులు. మను...మంబు నన్—మను=వర్ధిల్లుచున్న, తనభాగధేయ మహిమంబునన్=తనభాగ్యాతిశయముయొక్క మహత్త్వము చేత, మిన్నులుముట్టి=ఉప్పొంగి మిన్నుముట్టి, ఇటమిన్నులుముట్టుట భాగ్యాతిశయముచే వీఁగుటీఁగుట

కును, పర్వతమగుటచే ఔన్నత్యముచేత ఆకాశమునొరయుటకును చెల్లును. పచ్చుధన్యునిన్ = పచ్చు చున్న కృతార్థుఁడయిన, అతనిన్ = ఆకోలాహలుని, భజించి = సేవించి, కొనయంబునన్ = అడఁకువతో, ఓరయై = ఒకప్రక్కగా ఒదిఁగినదై, చనన్ = పోవఁగా, ఇట మిన్నులుముట్టి పచ్చునన్న చోటఁ బర్వతమత్యున్నత మగుటచేత మిన్నుముట్టుటయునగును. రాజాధిరాజుకొడుకు ; లోకమాతకుఁ దమ్ముఁడు; దేవదేవుఁడగు శంకరునిమఱఁది; కనుక నె భాగ్యమహిమయు మిన్నులుముట్టుటయు. ధన్యుఁ డగుటయు. 'ఓరయైచనన్' అన్నచోట నది పర్వతప్రాంతములకు నోరసిల్లి ప్రవహించుటయును స్వభావమని గ్రాహ్యము అలం. సమాసోక్తి.

సీ. బాలకూర్మవిలాసకపదములు కాంతరంభాప్రతిబింబోరుకభవ్యరుచులు
సరససైకతసారకజఘనసౌభాగ్యంబు, నతనాభిరూపవకనభ్రమంబు
బెడఁగారుదరులయొకప్పిదమును నామీఁదఁ, జనుజక్కవలనిక్కుకచక్కఁదనము
కమలకోమలముఖకకామనీయకమును, త్పలమంజులాలోకవిలసనంబు
తే. ఘనఘటానీలవేణియుఁ గలతరంగి, జీరమణినిత్యనిర్మలాకారకాంతి
ధార ధారున నెదిరినంతనె నగేంద్రుు, గాఢతరధైర్యము వ్వెత్తుగా హరించె.

అ. ఇందును స్త్రీనదీ పరముగా అర్థద్వయము-బాలకూర్మ...పదములు—బాలకూర్మ=చిన్న తాఁబేళ్లయొక్క, విలాసపదములు = విలాసముతోఁగూడిన స్థానములును, బాలకూర్మవిలాసములవంటి విలాసములుగల మీఁగాళ్లును,కాంత...రుచులు-కాంత=మనోజ్ఞములయిన,రంభా=అరఁటిచెట్లయొక్క, ప్రతిబింబ=ప్రతిచ్ఛాయలయొక్క,ఉరు=అధికమయిన, భవ్య=యోగ్యమయిన, రుచులు=కాంతులును-రంభాస్తంభప్రతిరూపములయినతొడలయొక్క భవ్యకాంతులును,సరస...సౌభాగ్యంబు- సరస=జలము తోఁగూడిన,సైకతసారజ=సారములయిన-అనఁగా శ్రేష్ఠములయిన యిసుకదిన్నెలవలనఁ బుట్టిన,ఘన= అధికమయిన, సౌభాగ్యంబు=సౌష్ఠవమును - శృంగారరసయుక్తమును సైకతసారసదృశమును నయిన జఘనముయొక్క సౌభాగ్యమును, 'సాగోబలే స్థిరాంశేచ న్యాయ్యే క్లీబం వరేత్రిషు' విశ్వము. నత... భ్రమంబు—నత=గంభీరమయినదియు,నాభిరూప=నాభిసదృశమయినదియు, (లేక)న + అభిరూప=సుం దరముగానిదియు-అనఁగా భయంకరమయినదియు నగు,వనభ్రమంబు=నీటిసుడియు, గంభీరమయి నాభి వంటి నీటిసుడియును - స్త్రీపరముగా నీటిసుడివంటినాభియును, బెడఁగారుదరుల... యొప్పిదమును- బెడఁగుఆరు = గొప్పవియగు- బెడఁగుశబ్దమునకు 'ప్రబలాకారముతో గిరీశశిరము బ్రాపించి పెద్దాఁ గనాఁ, గ బెడంగయ్యె జనాపవాదము' అనుప్రయోగముఁబట్టి గొప్పదియని యర్థము తెలియునది. దరుల యొప్పిదము=తీరముల చక్కఁదనమనుట-తఱులనఁగావళులు, బెడఁగుఆరు=విలాసముఁలుఁ గులుకుచున్న, తఱుల యొప్పిదమును = వళుల చక్కఁదనమును - ఇక్కడ బెడఁగారు దరులనుచోఁ గర్మధారయ సమాసముగనుక వికల్పముచేత 'త' కారమునకు 'ద' కారమువచ్చినది. (వళులనుచో 'తఱు'లని శకట రేఫయుక్తముగాను, తీరములనుచో దరులని లఘురేఫయుక్తముగాను శ్లేషైకతాన మగుటచేత భేదమున గ్రహింపకతీఱదు.)ఆమీఁదన్ =ఆతీరములమీఁద,చను...చక్కఁదనము—చను=సంచరించుచున్న,జక్క వల=చక్రవాకములయొక్క, నిక్కు=ఎగపుయొక్క, చక్కఁదనముసు-ఆమీఁదన్ = ఆవళులమీఁద, చనుజక్కవల=చక్రవాకములవంటి కుచములయొక్క, నిక్కుచక్కఁదనము = ఎగపుయొక్క అందము. కమల...కామనీయకమును—కమల=తామరలయొక్క, కోమల=మృదువయిన, ముఖ=అగ్రభాగముల యొక్క, కామనీయకమును=సౌందర్యమును- కమలమువలెఁ గోమలమైన ముఖముయొక్క సౌందర్య

మును, ఉత్పల...విలసనంబు—ఉత్పల=నల్లగలువలయొక్క, మంజుల = మనోహరమయిన, ఆలోక= ప్రభయొక్క, విలసనంబు=విలాసమును- ఉత్పలమువలె మనోహరములయిన, ఆలోక=చూపులయొక్క విలాసమునను, 'ఆలోకాదర్శనోద్ద్యోతా' అమ.

వేణీశబ్దము నదీప్రవాహమందును జడయందును వర్తించును. 'వేణీనదీప్రవాహేచకచోచ్చయే' విశ్వము. ఘనఘటా = నీరుద్రావవచ్చిన మేఘమాలికచేత, నీల=నల్లనిదగు, వేణియున్ = ప్రవాహమును- ఘనఘటా = మేఘమాలికవలె, నీల=నల్లనయిన, వేణియున్=జడయును, కలతరంగిణీ రమణి= కలిగియున్ననదీకాంతయొక్క, నిత్య...ధార — నిత్య=నిరంతరమైన, నిర్మలస్వరూపకాంతిగల జలధారయు—నిత్యనిర్మలమయిన ఆకారముయొక్క కాంతిధారయు, ధాటునన్ = అదాటున, ఎదిరినంతనె=ఎదురయినమాత్రముచేతనే, నగ... ధైర్యము=పర్వతశ్రేష్ఠుఁడయినకోలాహలునియొక్క మిక్కిలి దృఢమయిన ధైర్యమును, ఉవ్విళ్తుగాన్=బోత్తిగా, హరించెను, శుక్తిమతి మీఁగాళ్లవంటి యడుగులు మొదలుగాఁ గలయవయవసౌందర్యముచేత కోలాహలుని బలువయిన తాల్మిని హరించెననియు, తాఁవేళ్లు మొదలుగాఁగల ప్రవాహవేగముచేత ఆకొండ దిటను హరించెననియు నర్థములు. నదీప్రవాహధారలు పర్వతములను కలగుండుపెట్టుట ప్రకటము. అలం. శ్లేషోపమానుప్రాణితకావ్యలింగము.

క. ఆకరణిఁ దరంగిణి నగ, లోకేశ్వరుధైర్యమెల్ల లోఁగొని రా నీ
 రాకరగభీర యాసు, శ్లోకుఁడు నాచెలువచెలువు లోఁగొని చనియెన్. 110

అ. నీరాకరగభీర=సముద్రునివలె గంభీరుఁడయిన యతీంద్రా, ఆకరణిన్ =ఆప్రకారమున, తరంగిణి=శుక్తిమతీ నది, నగలోకేశ్వరు ధైర్యమెల్లన్ =పర్వతరాజయిన కోలాహలునిధైర్యమంతయును, లోఁగొనిరాన్ =తనలోఁజేర్చుకొనిరాఁగా, ఆ సుశ్లోకుఁడు=మంచికీర్తిగల యా కోలాహలుఁడును, 'పద్యేయశసిచశ్లోకః' అమ. ఆచెలువచెలువు = ఆశుక్తిమతియొక్క చక్కఁదనమును, లోఁగొని = తన లోఁజేర్చుకొని, చనియెన్ =పోయెను-అనఁగాఁ గోలాహలుఁడు శుక్తిమతి సౌందర్యము నాలోకించుటవలన ధైర్యహీనుఁడై యాసౌందర్యమును మనస్సునందే నిలుపుకొని పోయెననియర్థము. నదులు గట్లను దిగఁగోసి యావరించుటయును గట్లు నదీజలమును లోఁగొనుటయును స్వభావములు.

మ. అలఘుశ్రీనిధి యానగేంద్రతనయుం డాసైకతశ్రోణియొ
 ప్పులు తెప్పార్పక చూచి చన్నమొదలుం బొంగారి పైపై రసం
 బులు జృంభించు భ్రమించు నాశయము కూర్మిల్ మించ దీపించు ను
 త్కలికాచాపలముల్ మనోనిబిడచింతాతన్మయత్వంబునన్. 111

అ. అలఘుశ్రీనిధి-అలఘు = అధికమయిన, శ్రీ = ఐశ్వర్యమునకున్ నిధి = స్థానమయినవాఁడని యర్థము - గురుత్వనిధి యనిభావము. ఆనగేంద్రతనయుండు = పర్వతరాజకుమారుఁడయిన యాకోలాహలుఁడు, ఆసైకతశ్రోణి యొప్పులు = ఇసుకదిన్నెలవంటి పిఱుఁదులుగల దానియొక్క చక్కఁదనములను-పిఱుఁదులవంటి యిసుకదిన్నెలుగలదని భావము. తెప్పఅర్పక = తెప్పగదల్పక - తెప్పవ్రాల్పక యనుట, చూచి, చన్నమొదలున్ =పోయినదిమొదలుకొని, ఇట 'మొదలు' శబ్దమువాత్రము 'మొదలుకొని' 'మొదలుగా' ననునర్థములం బ్రయుక్తమై క్రియావిశేషణమగుచున్నది. 'వాలారుంగొనగోళ్లనీవలసతిన్ వాయించుచో నాటకున్ మేళంబయినవిపంచి నిన్నమొదలున్' అని యిది ద్రుతాంతముగాను 'లక్కయిలుగాలినది మొదలక్కట' (ఉద్యోగపర్వ. 3. ఆశ్వాస) యని కేవలముగాను బ్రయుక్తమైయున్నది. మనో...యత్వంబునన్—మనః = మనస్సునందు, నిబిడ = దట్ట

మయిన, చింతా=చింత చేతనయిన, తన్మయత్వంబునన్=శుక్తిమతీ మయమయిన యంతఃకరణ వృత్తి కలుగుటచేత ననియును - శుక్తిమతీ స్వరూపత్వముచేత ననియును నర్థద్వయము. ఈయర్థద్వయమునకు అభేదాధ్యవసాయము చేసి శుక్తిమతీ ధర్మము లయినజలాశయములు మొదలయినవి పొడ చూపినవని చెప్పవలయును. ఇక్కడఁ జింతయనెడు సంచారిభావము 'ఇష్టానధిగమాద్ధ్యానం చిన్తా శూన్యత్వ తాపకృత్.' పొంగారి=ఉప్పొంగి, పై...జృంభించున్ — ఇటరసములనఁగా అనురాగములు, అతిశయద్యోతనార్థము బహువచనము. పైపైన్ = మీఁదమీఁద - అంతకంతకుననుట. రసంబులు=అనురాగములు, జృంభించున్=విజృంభించుననియర్థము. ఉప్పొంగి మీఁదమీఁద రసములనఁగా జలములు వెల్లువపెట్టునని యర్థాంతరము. ఆశయము భ్రమించున్-ఆశయమనఁగా మానసమును 'ఆశయస్స్యాదభిప్రాయే మానసాధారయోరపి' మేదిని. మానసముభ్రమించు ననఁగా మోహిత మగునని యర్థము. ఇట భ్రమణమనఁగా వైచిత్ర్యము గనుక మోహమనెడి సంచారిభావము. 'మోహస్తు మూర్ఛనం భీతిదుఃఖావేశానుచిన్తనైః' అని లక్షణము. ఆశయమనఁగా అధారమును గనుక జలాధారమగు స్థలము, భ్రమించుననఁగా సుడిగొనునని యర్థాంతరము. కూర్మిల్ మించున్ = ప్రేమలతిశయించును. ఇక్కడఁజెప్పఁబడిన ప్రేమలకును లోపలఁజెప్పఁబడిన యనురాగములకును నవస్థాభేదమువలన భేదమని తెలియునది ఎట్లనఁగా.

'రాగోఽనువృత్తోఽవిచ్ఛిన్న మనురాగ ఉదాహృతః'
'సప్రేమా యన్మిథో యూనోర్నిరూఢం భావబన్ధనమ్'

అని భేదము దెలియునది. ఉత్కలికా చాపలముల్ = ఔత్సుక్యమును చాపల్యమును, దీపించున్ = ప్రకాశించుననియర్థము. ఇక్కడ ఔత్సుక్యచాపల్యములనెడి సంచారి భావద్వయము 'కాలాక్షమత్వ మౌత్సుక్య మప్రాప్తే రిష్టవస్తునః, చాపలం త్వనవస్థానం రాగద్వేషాది సంభవమ్' అని తెలియునది. కూర్మిల్ మించన్ = ఆఁడుతాఁబేళ్లు ఉల్లసిల్లఁగా, ఉత్కలికాచాపలముల్=అలలయొక్క చాంచల్యములు, ప్రకాశించునని యర్థాంతరము. కథితోత్కలికోత్కణ్ఠాహేలా సలిలవీచిషు' మేదిని. ఈపద్యమునఁ జింతామోహౌత్సుక్య చాపలము లనెడు నాలుగుసంచారిభావములు చెప్పఁబడినవి. ఇట తన్మయత్వమని శుక్తిమతీత్వము నధ్యవసించుటచే శుక్తిమతీ ధర్మములయిన జలములు పొంగారుట, జలాశయము సుడిగొనుట, ఆఁడుతాఁబేళ్లుల్లసిల్లుట, అలలుచలించుట మొదలగునవి కోలాహలునియందు ప్రతిపాదింపఁబడినవని తెలియునది.

సీ. తనకూటములఁ బ్రోదిఁ దాల్చురంభాదులు, సరసభావము దప్పి శిరము వంపఁ
దనలోలతలఁ బెంపుఁ గనుకలకంఠులు, చేరిపై వ్రాలక చెదరి పలుకఁ
దనవంక నలరుపర్దిని నెల్లఁదమిఁ గాన, కయ వాఁడిమోము లగ్గలము ముదువఁ
దనమహాభోగంబు లెసంగుభోగినుల్, దెరలి నిట్టూరుపుఁ దెరలు నెరప

తే. నకటకటమంచుమలపట్టియతనుతాప,వహ్నిపాలయ్యెఘురబాష్పవారియగుచు
నిత్యశుక్తిమతీధ్యాననిశ్చలాత్ముఁ,డగుచు నంచితగహనరోమాంచుఁ డగుచు.

అ. ఇటపర్వతమును గ్రమ్మిన దావాగ్నిపరముగాను కాముకుని నలమిన మన్మథాగ్నిపరముగాను అర్థద్వయము. మంచుమలపట్టి = హిమవంతుని పుత్త్రుఁడు - కోలాహలుఁడు, తనకూట...వంపన్ — కూటమియనఁగా కలయిక, తనకూటములన్ = తనయొక్క కలయికలచేత, ప్రోదిన్ = పెంపును, తాల్చు రంభాదులు = వహించుచున్న రంభ మొదలయిన దేవకాంతలు, సరసభావమున్ = సర

సత్వమును, తప్పి = మాని, శిరమువంపఁగ = తలవంచుకొనఁగా నని యర్థము. కూట మనఁగా శిఖరము- తనశిఖరములందుఁ బెంపువహించుచున్న, రంభాదులు = అరఁటులు మొదలయినవృక్షములు, సరసభావము = ఆర్ద్రత్వము తడిగలిగియుండు ననుట. తప్పి, వాఁడుచూపి అగ్రభాగములను వంపఁగా నని భావము. వహ్నికిఁ జెట్లు నీరుసురిఁగి కమరి తల మొగ్గతిలుట స్వభావము. 'శిరోగ్రంశిఖరంవానా' అమ. తనలోలతిలకఁ—లోలత మనఁగా ఆసక్తియు లోపలితీఁగయనియు నర్థము. తన యాసక్తులచేత, పెంపుగను కలకంఠులు=ఘనతను బొందుచున్న అవ్యక్త మధుర కంఠనాదము గల స్త్రీలు, 'కలకణ్ఠస్తుకోకిలే' 'హంసేపారావతేచాపి త్రిషుత్వేష కలస్వరే' నానార్థ. చేరి, ప్రైవాలక=దగ్గఱవచ్చి - పయికొనక, చెదరిపలుకఁగ=తొలఁగి మాటాడఁగానని యర్థము. తనలోఁ గల లతలయందుఁ బెంపుగను ఆఁడుకోవెలలు చేరి తనప్రైవాలక తొలఁగి కూయఁగానని యర్థము. నిప్పు వ్యాపింపఁగా కోకిలలు తీఁగలనుబాసి కూయుట సహజము.

తనవంకఁ = తనదెస, అలరు = సంతోషించునట్టి, పద్మినులుఎల్లఁ = పద్మినీజాతి స్త్రీలందఱును, 'పద్మినీకరిణీస్త్రీ స్త్రీసరోజ్జ్వలినీషుచ' నానా. తమిఁ = తనవలని తమకమును, కానకయ = ఎంతమాత్రము గాంచలేకయే, వాడి = వికాసముదప్పి, మోములు అగ్గలముముడువఁ = ముఖములు మిక్కిలియు ముడిఁచికొనఁగానని యర్థము. వంకయనఁగా - ఏఱు, తనవంకఁ = తన్ను సంబంధించిన సెలయేటియందు, అలరు = వికసించుచుండు, పద్మినులెల్లఁ = తామరతీఁగ లన్నియును, తమిఁ = రాత్రిని, చూడకయే = రాత్రిరాకుండఁగనే 'రజనీయామినీ తమీ' అమ. వాడి...ముడువఁ = వాఁడువాఱి యగ్రములను మిక్కిలి ముడుఁచుకొనఁగా నని భావము. వహ్నిసోఁకఁగా తామరతీఁగలు రాత్రిలేకయే మొనలు ముడుంగుకొనును. తనమహాభోగంబులఁ = తన యధికమయిన సంభోగముల చేత, ఎసంగు=ఒప్పుచున్న, భోగినులు=పట్టపుదేవిగాక తక్కినరాజుభార్యలు, 'కృతాభిషేకామహిషీ భోగిన్యోఽన్యానృపస్త్రియః' అమ. తెరలి= పెడమొగమై, లేక, చలించి, నిట్టూరుపు దెరలునెరపఁ = పెద్దయూర్పుల పరంపరలను నింపఁగానని యర్థము. మహాత్ =అధికమయిన, ఆభోగములఁ =తనయొక్క విస్తారములందు - తన పెద్దపుఱ్ఱపులయిన భాగములం దనుట, ఎసంగుచున్న, భోగినులు=ఆఁడుపాములు, తెరలి, నిట్టూరుపు దెరలునెరపఁ =ఫూత్కారములు నింపఁగానని భావము.

అకటకట=అయ్యయ్యో! ఇట మంచుమలపట్టి యయ్యును దాపముపాలయ్యెనని విరోధము తెలియునది. ఝుర...వారి—ఝుర=జలప్రవాహమువలె ఉల్బణించుచున్న, బాష్పవారి = అశ్రుజలధారలు గలవాఁడు అగుచు - బాష్పమనఁగా ఊష్మమును. ప్రవాహములయందలి ఊష్మముతోఁ గూడిన జలములు గలవాఁడగుచున్నాఁడని భావము. 'బాష్పోనేత్ర జలోష్మణోః' విశ్వము. ఈమీఁదఁ జెప్పఁబడిన అతనుతాపవహ్ని పాలయ్యెనెడి చోటనున్న భావార్థమిపుడు చెప్పఁబడినభావార్థకమందును మీఁదఁ జెప్పఁబడిన భావార్థములయందును హేతువుగా గ్రహించునది. వహ్నిని గ్రాఁగుటచే ప్రవాహములందు వేఁడినీరు చూపట్టెనని యాశయము. నిత్య...నిశ్చలాత్ముఁడు — నిత్య=ఎడతెగని, శక్తిమతీధ్యాన=శక్తిమతీవిషయమయిన చింతచేత, నిశ్చల=క్రియారహితమయిన, ఆత్ముఁడగుచుఁ =గాత్రముగలవాఁడగుచు నని యర్థము. పర్వతుఁడుగనుకఁ జలింపఁడని భావము. అంచిత... మాంచుఁడగుచుఁ - అంచిత=ఒప్పుచున్న, గహన=అడవిరూపమయిన, రోమాంచుఁడగుచుఁ =గగురుపాటు గలవాఁడగుచు నని యర్థము. 'రోమాఞ్చోరోమహర్షణమ్' అమ. ఈపూర్వోక్తములయిన వికారములుగల వాఁడగుచు, అగను తాపవహ్నిపాలు అయ్యెఁ = మన్మథతాపమనెడి యగ్ని

పాలయ్యెను అని యర్థము. అతను శబ్దమునకు మన్మథుఁడనియు అధికమనియు నర్థములు. పర్వతము గనుక అధికతాపదావాగ్నిపాలగుచున్నదని భావము. బాష్పవారియు నిశ్చలాత్మత్వమును రోమాంచమును నని యీమూఁడును సాత్త్వికభావములు. అలం. రూపకము శ్లేషానుప్రాణితము.

'అశ్రునేత్రోద్భవంవారి దుఃఖరోష ప్రహర్షజమ్
స్తంభస్స్యాన్నిష్క్రియాఙ్గత్వం రాగభీత్యాది సంభవమ్,
సుఖాద్యతిశయాజ్జాతో రోమాఞ్చో రోమవిక్రియా.

చ. కులగిరిరాజనందనుఁడు కూరిమి నాభువనాభినందితం
దలఁపఁ దలంపులోపలనె దర్పకకేతనవల్గనంబు లం
చలయెలగోలు నంబుజవిశాలశిలీముఖతాండవంబు లు
త్పలదళమండలాగ్రములు పైకొను నెట్టివొ తత్ప్రభావముల్. 118

అ. కులగిరి రాజనందనుఁడు=కులపర్వతశ్రేష్ఠుఁడయిన హిమవంతుని కుమారుఁడగు కోలాహలుఁడు, కూరిమిన్=ప్రేమచేత, అభువనాభినందితన్ = లోకసన్నుతయైన యాశుక్తిమతిని యర్థము. జలాభినందితయైన నది నవిభావము. 'భువనం ఖాంబు లోకేషు' నానా. తలఁపన్=తలఁపఁగా, తలంపులోపలనె=తలంచుకొన్నంత లోపలనే, దర్పక కేతనవల్గనంబులు=మన్మథుని యొక్క ధ్వజచలనములు- దర్పక కేతనము మీనము గనుక మత్స్యచలనములని భావము. అంచలయెలగోలున్ = హంసరూపములయిన మన్మథునియెలగోలుమూఁకలును - హంసల కోలాహలములని భావము. అంబుజ... తాండవంబులు - తామరరూపములయిన పెనుబాణముల యొక్క పతనములును - 'అరవిన్దమశోకంచ చూతంచ నవమల్లికా, నీలోత్పలంచ పంచైతే పంచబాణస్యసాయకాః' అమ.— తామరలందు విహరించుతుమ్మెదల నటనములని భావము. శిలీముఖము 'అలిబాణౌ శిలీముఖౌ' అమ. అన్నట్లు తుమ్మెదలందును బాణములందును వర్తించుచున్నది. ఉత్పలదళమండలాగ్రములు = కలువరేకుల రూపమయిన ఖడ్గములును - కలువరేకుల మండలముయొక్క (అనఁగా తంపరయొక్క) అగ్రభాగములని భావము. పైకొనున్=క్రమ్ముకొనును. తత్ప్రభావముల్ ఎట్టివో = ఆశుక్తిమతి మహిమలెట్టివో- అనఁగా మిక్కిలి విచిత్రములనుట. కోలాహలుఁడు శుక్తిమతిని దలంచుకొన్నమాత్రనే మన్మథావిర్భావముగలవాఁడయ్యెనని యర్థము. మత్స్యవల్గనము మొదలయిన నదీధర్మములను మన్మథకేతన చలనాది మారోద్దీపన ధర్మములుగా నధ్యవసించుట తెలియునది.

ఆక్రమించుకొన వయినెత్తివచ్చువాని ధ్వజము మొట్టమొదటను, పిదప వానితోలి సైన్యము లును, పిమ్మట వాని బాణములును, అల్లెత్రాటి చలనములును, పిమ్మట వానిఖడ్గమును జాపట్టుటయుఁ దాగసించుటయును ప్రసిద్ధము. ఇచ్చటను కోలాహలు నాక్రమింపవచ్చుమన్మథుని మీనధ్వజమును, హంసల యెలగోలుసేనయు, అంబుజబాణములును, తుమ్మెదవారి నటనములును, కలువరేకు ఖడ్గమును, వరుసగాఁ బయికొనెనని ఆక్రమణ పరికరమునకు అనుపూర్విని దెలియునది. మండలాగ్రములును బయికొనునట్లు చెప్పుటచే మన్మథుఁడు పరిపూర్ణముగాఁ దారసించి యాక్రమించినాఁడను వ్యంజితము. తలంపులోపలనే పైకొనెననుటచేత, సంకల్పమాత్రమున నట్లు మనఃపారవశ్యముగలిగించిన శుక్తిమతీ సౌందర్య సౌకుమార్యాది ప్రభావములును వ్యంజితములు. మఱి 'తలంపులోపలనె' యను సంకల్పములోపలనె యవి పయికొనుటకు మన్మథుఁడు సంకల్పసంభవుఁడు గాన వానికేతనవల్గనాదులన్నియును సంకల్పములోనే తోఁచెనని యు పారస్యము స్ఫురించెడిని. కులగిరి రాజనందనునకుఁ దలంచుటను

భువనాభినందితరా తగునని యామరూప్యము. తలంచినమాత్రనే పైకొనునట్లు చేయుటను కేవలకృత్యములనరాదు 'ఎట్టివొతత్వభావముల్' అవి ప్రభావములగును. అలం. పూర్వోక్తము.

తే. మరునినాళీకసాయకోత్కరము కరము
ధరముఁ దరమిడి మెఱమి టేఁ యరిది సొరిది
నుఱిది నవి మెట్లు తెగఁగోయు నురునదీఝ
రంబుల జనింపవో శతారములు గావొ. 114

అ. మరుని...కరము—మరుని=మన్మథునియొక్క, నాళీకసాయక ఉత్కరము=తామరలనెడి అలుఁగులబాణముల పరంపర, కరము=మిక్కిలి, ధరముఁ=కోలాహలపర్వతమును, తరమిడి=అదరంటునట్లు, మెఱుముట=మర్మములందుఁ గ్రుచ్చియిటునటు మెసల్చుట, ఏయరిది=ఏమియాశ్చర్యము! ఇట 'ఏమి' కి 'ఏఁ' అనియు రూపములు. 'బలు చెదవిడియేఁ' అని భాగవతము. 'ఏమిటిమాట' లిత్యాదులందుఁ బ్రాఁత ప్రతులనెల్ల 'ఏఁటి' మాటలని మిథ్యాస్థానమున నర్థించుట చూపట్టెడిని. సొరిదిన్=యుక్తమగునట్లుగా, అవి=ఆపద్మబాణములు, ఉఱిదిన్ = ఉరవడిచేత, మెట్లు తెగఁగోయు ఉరునదీఝరంబులన్ జనింపవో = కొండలను దెగునట్లుగా ఛేదించుకొని పాఱెడిగొప్పనదీప్రవాహములందుఁ బుట్టినవి గావా, శతారములుగావో = పర్వతములను భేదించెడి నూఱంచులుగల వజ్రాయుధములు గావా; కాఁబట్టి కోలాహలపర్వతమును ఛేదించుట యాశ్చర్యముగాదని యర్థము. శతారమనఁగా 'సహస్రపత్రంకమలం శతపత్రం కుశేశయమ్' అని నూఱు ఱేకులుగలదిగాన పద్మములని భావము. వజ్రాయుధమును 'శతకోటి స్స్వరుః, అనుటంజేసియు 'నూఱంచులవాలు' అనుటం జేసియు నూఱంచులుగల దని తెలియునది. కారణగుణము కార్యమునకును గలుగునుగాన గట్లఁగోసెడి నదులం బుట్టిన తామరలకు గట్లనుగోయుట సహజమనుట. నాళీకమనఁగా అలుఁగులబాణమునగును గాన మన్మథుఁడు తామరలనెడి యలుఁగుల బాణములను కోలాహలుని మర్మలందుఁగ్రుచ్చి యిటునటు మెదల్చినాఁడనుటచే తామరకు నాళీక శబ్దము. పూర్వపద్యమున సంకల్పజనితమగు మన్మథాక్రమణమును ఇందు మన్మథబాధనమును. మెట్లు తెగఁగోయునదీఝరములంబుట్టినవి; మఱి మెట్లు తమంతటనే తెగనఱకు వజ్రాయుధము లయినవి. కనుక మెట్టగు కోలాహలుని మెఱుముట వింతకాదు. అలం. శ్లేషమూలకమగు కావ్యలింగము. అర్థాపత్తియు.

చ. కపురపుఁగమ్మతావిఁ జలిగ్రమ్మెడుఁ గొజ్జఁగపువ్వునీట న
చ్చపునెలఱాలవెల్లువలఁ జందనవాసన నేమిటన్ నగా
ధిపు నతితీవ్రతాపశిఖ దీఱక పోయె గతాగతక్రియా
నిపుణ ఘనాళినీతతటినీలలితామృతధారఁ దక్కఁగాన్. 115

అ. కపురపుఁగమ్మతావిన్ = కర్పూరముయొక్క యింపయిన పరిమళముచేత, చలిగ్రమ్మెడు గొజ్జఁగపువ్వునీటన్ = చల్లఁదనము గ్రమ్ముచుండెడు అనఁగా చలువలు మిక్కిలియు నిచ్చుచుండెడు గొజ్జంగ పూనీటిచేతను - అనఁగా జల్లనిపన్నీటిచేతను - లేక 'బలుకప్రంపుటసంటె కప్పురపుఁ దిప్పల గప్పియుప్పొంగు జాల్గల గొజ్జంగెల నీరు' అన్నట్లు, గొజ్జంగనీటికి శైత్యాతిశయము కలిగించుటకై కపురపుటరంటి కపురపుఁదిప్పలఁ బాతించుట చెప్పినాఁడుగాన, 'కపురపుఁగమ్మ తావిచలిగ్రమ్మెడు గొజ్జఁగి పువ్వునీట' నని యొకటిగా గ్రహింపవచ్చును. కర్పూరముయొక్క యింపయిన తావితోఁగూడి చలువలు గ్రమ్ముచున్న పన్నీటిచేతననుట - అచ్ఛపు నెలఱాల వెల్లువలన్=స్వచ్ఛమయిన చంద్రకాంత

శిలలు కరఁగి ప్రవహించు ప్రవాహముచేతను, చందనవాసనన్ = శ్రీచందనపు వాసనచేత, ఏమిటన్ వీనిలో దేనిచేతను, నగాధిపు అతితీవ్రతాపశిఖి = పర్వతశ్రేష్ఠునియొక్క మిక్కిలియు వేండ్రమయిన విరహతాపమనెడు అగ్ని, తీఱకపోయెన్ = అడఁగకపోయెను. కర్పూరపరఁటులును, గొజ్జంగులును చంద్రకాంతశిలలును, శ్రీచందన వృక్షములును పర్వతమందుఁ గలవస్తువులనియు, ఎరగలిచిచ్చు దగులఁగా నివి యన్నియు నుండియు నది శమింపదనియుఁ దెలియునది. మఱి శమించుట యెట్లనిన-గతా.. ధారన్—గతాగత = పోవుచు వచ్చుచునుండెడు, క్రియానిపుణ = కార్యమందు నేర్పుగల - కార్యము నొడఁగూర్చుటయందు నిపుణలయిన, ఘనాళి = గొప్పసఖీజనులచేత ననియర్థము - పోవుచు వచ్చుచుండు కార్యముగల మేఘపంక్తిచేతనని భావము. నీత = పొందింపఁబడిన, తటినీ = శుక్తిమతీనదియొక్క, లలిత = మనోహరమయిన, అమృతధారన్ – అమృతమనఁగా జలమును గనుక జలధారయనెడు సుధాధారచేత, తక్కఁగాన్ = తప్ప, మఱియొకదానిచేత తీఱకపోయెనని సంబంధము అనఁగా శుక్తిమతీనదినిగూర్చి కోలాహలునకుఁ గలకేవల మన్మథాగ్ని, యాబిడచెలికత్తెలు తోడ్కొని వచ్చిన యామె యింపయిన యధర సుధారసము గ్రోలిననే తీఱునుగాని కేవల శైత్యప్రదములయిన తక్కిన కర్పూరాదులచే శమింపదయ్యెననుట. ఇట పర్వతమునందు స్వతస్సిద్ధములైన కర్పూరచందన వృక్షములును చంద్రకాంత శిలాద్రవములును శైత్యసంపాదక ద్రవ్యములుగా సమకట్టినాఁడు. ఆపర్వతమందు కారుచిచ్చుపుట్టఁగా, అందలి గొజ్జగినీరు నెలతాల వెల్లువలు మొదలగు వానిచే శమింపక మేఘములు శుక్తిమతీనది జలములు ద్రావివచ్చి కురిసినజలములనే శమించెననుట. పర్వతమందలి యెరగలి నిప్పులు అందుఁగల కర్పూరకదళ్యాదుల చే నడఁగక మేఘవర్గముచేతనే యడఁగు ననిభావము. అలం. సమాసోక్తి శ్లేషానుప్రాణితము.

ఉ. శైలకులేంద్రుఁ డిట్లు మదశాలిశుకాలిపికాలిశారికా
జాలకనీలకంఠరవసంగతిఁ దాలిమి నిల్పఁజాలకు
ద్వేలకరాలకంతుశరవేదన దీఱ నదీరసోర్మికం
దేలక యేల కల్గు మహనీయసుఖం బని నిశ్చితాత్ముఁడై. 116

అ. శైలకులేంద్రుఁడు = కోలాహలపర్వతశ్రేష్ఠుఁడు, ఇట్లు = ఈచెప్పఁబడిన విధమున, మద... సంగతిన్ — మదశాలి = మదముచేత ఒప్పుచున్న చిలుకలయొక్కయు తుమ్మెదలయొక్కయు కోకిలలయొక్కయు సమూహములయొక్కయు, శారికాజాలక = గోరవంక పిట్టల గుంపులయొక్కయు, నీలకంఠ = నెమిళ్లయొక్కయు, రవ = కలకల ధ్వనులయొక్క, సంగతిన్ = కూడికచేత, తాలిమి = ధైర్యము, నిల్పఁజాలక = నిలుపలేక, 'ద్విరేఫః పుష్పలిడ్భృంగ షట్పదభ్రమరాళయః' 'వనప్రియః పరభృతః కోకిలః పిక ఇత్యపి' 'నీలకంఠశ్శిఖీ...' అను. కరాళ... వేదనన్ — కరాళ = భయంకరమయిన, కంతుశర = మన్మథబాణముల వలని, వేదన = బాధ, తీఱన్ = శమించునట్లుగా, నదీ...ర్మికన్ — నదీ = శుక్తిమతీనదియొక్క, రస+ఊర్మికన్ = సంభోగశృంగార రసతరంగమందునని యర్థము. జలతరంగమందని భావము. తేలక = ఓలలాడకపోయిన పక్షమున, మహనీయసుఖంబు = అతిశయమయిన సౌఖ్యము, ఏలకల్గున్ = ఎట్లుగలుగుచున్నది, అని, నిశ్చితాత్ముఁడై = నిశ్చయింపఁబడిన యంతఃకరణముగలవాఁడై - మనసులోన నిశ్చయించుకొన్నవాఁడై యనుట. ముందఱిపద్యముతో నన్వయము.

ఇట పర్వతమందలి శుకపికాదులనే యుద్దీపనములుగా నలవఱిచినాఁడు. కంతువేదన ఉద్వేలముగాన నదీరస తరంగములఁ దేలకతీఱదు. పర్వతమందలి చిచ్చు, అందలి నదీ తరంగిత ప్రవాహములచేతనే కాని తక్కినవిధముల నుపశమింపదని భావము.

క. రుచిరాజితమణిభూషా, రుచిరాజి వెలుంగ దివ్యరూపోజ్జ్వలుఁడై
యచలాధీశ్వరుఁ డొకనాఁ, డచలామణిహార మగుమహానదిఁ జేరెన్. 117

అ. రుచిర..రాజి—రుచిర = ప్రకాశించుచున్నదై, అజిత = వెలకులోఁబడని - అనఁగా అనర్ఘములయిన, మణి = రత్నమయములయిన, భూషా = ఆభరణములయొక్క, రుచిరాజి = కాంతిపుంజము, 'రుచిః కిరణే కాన్తౌ వభివ్యాభిలాషయోః' నానా. వెలుంగన్ = ప్రకాశింపఁగా, దివ్య = సౌందర్య యోగ్యమయిన, రూప = ఆకృతిచేత, ఉజ్జ్వలుఁడై = ప్రకాశించుచున్నవాఁడై, అచలాధీశ్వరుఁడు = కోలాహలుఁడు, ఒకనాఁడు = ఒకానొక దినమందు, అచలా=భూమికి, మణిహారము = ముత్యాలహారమువలె నున్నట్టి, మహానదిన్ = గొప్పనదియైన శుక్తిమతిని, చేరెన్ = సమీపించిపోయెను. అలం. యమకభేదము శబ్దాలంకారము.

శా. చేరన్ రా నదియుం దటోద్గతఝరీసీమాధికోదగ్రసం
చారశ్రీ నెదురేఁగి యూర్మిమయహస్తన్యస్తరాజీవరా
జీరాజన్మణిభాజనంబుల రజశ్శ్రీగంధకింజల్కరే
ఖారక్తాక్షతముల్ వహించి వరుసం గావించెఁ బూజావిధుల్. 118

అ. చేరన్ రాన్ = కోలాహలుఁడు సమీపించిరాఁగా, నదియున్ = శుక్తిమతీనదియును, తట...శ్రీన్ — తట+ఉద్గత = తీరము నతిక్రమించి పైకివచ్చిన, ఝరీ = ప్రవాహముయొక్క, సీమయనఁగా నిటపర్యన్త. 'సీమసీమే ఇమే స్త్రీ తే కూలమర్యాదయోరపి' నానా. సీమాధిక = మేర మీఱినదై, ఉదగ్ర - ఉత్కటమగుచున్న, సంచారశ్రీన్ = సంచారసంపత్తిచేత, ఎదురేఁగి=ఎదురుగాఁ బోయినదని యర్థము. సీమయనఁగా పొలిమేర-పూజ్యులయినవారు తనయొద్దకు వచ్చుచుండఁగా పొలిమేర దాఁటి యెదురుగాఁ బోవలసినది న్యాయమైనందున సీమాధికోదగ్రసంచారమనఁగా పొలిమేర దాఁటిపోవుట యని యర్థాంతరము. అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము. ఊర్మి...భాజనంబులన్ —ఊర్ములు = అలలరూపములయిన, హస్త = చేతులయందు, న్యస్త = ఉంపఁబడిన, రాజీవరాజీ = పద్మసమూహమనెడి, రాజత్ మణిభాజనంబులన్ = ప్రకాశించుచున్న రత్నపాత్రములందు, 'భాజనం యోగ్యపాత్రయోః'. నానా. రజః = పుప్పొడియనెడు, శ్రీగంధ = శ్రీచందనమును, కింజల్కరేఖా = అకరువులనెడి, రక్తాక్షత = ఎఱ్ఱని యక్షతలను, అక్షతశబ్దము కుళాదిగణములోఁ జేరినదయ్యు. 'వక్షతాదికశబ్దానాం స్వరూపం చ యథాభవేత్' అని యథర్వణుఁడు చెప్పినట్లు హంసాక్షతాదిశబ్దములకు వికల్పముగాన నిచట అక్షతములని ప్రయోగము. వహించి = ఉంచుకొని, వరుసన్ = అర్ఘ్యపాద్యాదిక్రమముచేత, పూజావిధులు = అర్చావిధానములు, కావించెను. అనఁగా లోకమందుఁ బూజ్యులయినవారు తన యింటికి వచ్చుచుండఁగా దెలిసికొని పొలిమేర కవతలికి యెదురుగాఁబోయి వెంటఁబెట్టుకొనివచ్చి పళ్లెరములందు గంధాక్షతలుంచుకొని యర్ఘ్యపాద్యాది విధులచేతఁ బూజచేయుట మర్యాదగనుక నట్లు శుక్తిమతి కోలాహలునకుఁ బూజచేసెనని తెలియునది. నది గట్లపయి నుప్పొంగి వెల్లువగొని తనయందలి తామరలు తేలుచుండఁగాఁ బర్వతమునకుఁ బ్రవహించుట ప్రకటము. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష గమ్యము.

తే. గిరియును దదంతికోత్తుంగకతరచిరత్న, రత్నతటపీఠిఁ జెందెఁ గాకరవము వఱల
వరలలితవాహినీ వైభవంబుఁ గాంచి, కాంచె బహుపద్మనిధిలాభకౌతుకంబు.

అ. గిరియును = కోలాహలపర్వతమును, తత్...పీఠిక్ - తత్ = ఆనదియొక్క, అంతిక = సమీపమందలి, ఉత్తుంగతర = ఉన్నతమయిన, చిరత్నరత్న = ప్రాచీనరత్నమయమయిన, తట= తీరమందలి, పీఠిక్ = పీఠమును, గౌరవము వెలుంగ్ = ఘనతమీఱునట్లుగా నని యర్థము. దుర్భరత్వ మొప్పఁగా నని భావము. చెందెక్ = అధిష్ఠించెను - నరి...వైభవంబులక్ —వరి = శ్రేష్ఠమును, లలిత= ఒప్పిదమునునైన, వాహినీవైభవంబు = శుక్తిమతీనదియొక్క వైభవమును, కాంచి= చూచి, బహుపద్మనిధిలాభకౌతుకంబుక్ కాంచెను = అనేకములయిన పద్మములనెడి నిధులయొక్క ప్రాప్తివలని సంతోషమును బొందెనని యర్థము. అనేక పద్మాకర లాభకౌతుకమును బొందెనని భావము. ఈ పద్యము ముక్తపాదాంత్యగ్రస్తముగాఁ జెప్పంబడెను.

ఇట 'లలిత' మనఁగా సౌకుమార్య ప్రయుక్తమయిన శృంగారచేష్టావిశేషము. కోలాహలుఁడు తన పెద్దఱికము మీఱవచ్చి యానదియొడ్డున రత్నపీఠముఁగూర్చుండి దానియొక్క లలితములతోడి సౌందర్య వైభవమును జూడఁగానే పెక్కు పద్మనిధులు దొరికినంత సంతోషమునొందెనని యర్థము. పర్వతములు 'గౌరవము' మిక్కిలి యురువులగుటయు నదులు దానికడఁ బాఱుటయు నదీప్రవాహములవలన దానియందుఁ బద్మాకరము లేర్పడుటయు ప్రకటము.

వ. అప్పు డప్పుణ్యతరంగిణి యన్నగాగ్రణితో నిట్లనియె. 120

అ. అప్పుడు=ఆసమయమందు, అప్పుణ్యతరంగిణి=పుణ్యనదియైన యాశుక్తిమతి, అన్నగాగ్రణితోక్=పర్వతశ్రేష్ఠుఁడయిన యాకోలాహలునితో, ఈరీతిగాఁ బలికెను. ఏమనఁగ.

సీ. అతులశైవలవతీశతము లీనెడు మీకు, నాయిచ్చువిమలార్ఘ్యతోయ మెంత
ప్రాలేయనిలయసంభవము గాంచినమీకుఁ, బన్నీట నొసరించుపాద్య మెంత
సరసమందారమంజరుల రంజిలుమీకుఁ, బెనఁచి పూదండ లర్పించు టెంత
గోరత్నదోహనగురులక్ష్మి గలమీకు, నుపదగా మణివర్గ మొసఁగు టెంత
తే. యనఘు లెవ్వారలైనఁ గొండడంతివారి, కివనిఁ గొండంతపూజ సేయఁగఁగలరె
భక్తినే నిచ్చునీపుష్పపత్రతోయ, మాత్రములు గైకొను డొకాకగోత్రతిలక.

అ. అతుల=ఎనలేనట్టి, శైవలవతీ = నదులయొక్క, శతములు=నందలను, ఈనెడుమీకుక్ = పుట్టించునట్టిమీకు, నాయిచ్చు విమల అర్ఘ్యతోయము= నేను ఇచ్చునట్టి నిర్మలమయిన యర్ఘ్యజలము, ఎంత = ఎంతమాత్రము,-అనఁగా ఎక్కువకానిదిగా ననుట. ప్రాలేయనిలయ = హిమజలములకు నివాసమయిన పర్వతమువలన-అనఁగా హిమవంతునివలన 'ప్రాలేయం మిహికాచాథ హిమానీ హిమసంహతిః' అను. సంభవముక్=పుట్టుకను, కాంచినమీకుక్ = పొందినట్టిమీకు, పన్నీటక్ ఒసరించుపాద్యము ఎంత=పరిమళముతోఁగూడ పొందెడు హిమజలముచేత నిచ్చునట్టి పాద్యమెంతమాత్రమనుట. సరస... జరులక్ —సరస=మకరందముతోఁగూడిన, మందారమంజరులక్ =కల్పవృక్షపు పూగుత్తులచేత,రంజిలు మీకుక్ =రక్తినొందుచున్న మీకు, పెనఁచిపూదండ లర్పించుటెంత=కలయఁబెనఁచి పుష్పమాలికల నర్పించుట యెంతమాత్రము - ఏపాటిదియనుట. గోరత్నదోహనగురు లక్ష్మిగలమీకుక్ = గోశబ్దము గోవునందును భూమియందును వర్తించును-'స్వర్గేషు పశువాగ్వజ్రదిఙ్నేత్ర ఘృణిభూజలే, లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసిగౌః' అను. గో=గోరూపమైన భూమివలన, రత్నదోహన=రత్నములను పిదుకుటగలిగిన, గురు=తండ్రియైన హిమవంతునియొక్క, లక్ష్మిగలమీకుక్ =సంపదగలయట్టిమీకు, ఉపదగాక్ =కానుకగా, మణివర్గము=రత్నసమూహము, ఒసఁగుటెంత=ఇచ్చుట యెంతమాత్రము.'ఉపాయనముపగ్రాహ్య

సుపహార స్తథోపదా' అమ. భూదేవి గోరూపిణి యైనదనియు హిమవత్పర్వతము వత్సరూపమయిన దనియు రత్నాదులు పిదుకఁబడినవనియుఁ బ్రసిద్ధము. అనఘ=నిష్కల్మషుఁడయిన యోకోలాహలా ద్రీ, ఎవ్వారలయినన్ = ఎవ్వరయినప్పటికిని, కొండంతవారికిన్ = కొండపొడుగు ఘనతగలవారికని యర్థము. పర్వతమునకనిభావము. అవనిన్ = భూమియందు, కొండంతపూజ=కొండపొడుగుపూజ, చేయం గఁగలరె = చేయఁగలరా - చేయఁజేరుగదాయనుట. ఇంకనేమనిన, భక్తిన్ = భక్తితోను, ఇచ్చు, ఈపుష్పపత్రతోయమాత్రములు = ఈపుష్పము పత్రము ఉదకముఅనెడి యింతమాత్రములు, కైకొను టెకాక = గ్రహించుటయేకాని - మఱేమికాదనుట. నే నీయల్పమాత్రములు సమర్పించినను భక్తి పూర్వకముగా నియ్యంబడినవని యీయల్పములను బహూకరించి మీరు చేకొనుచున్నారేకాని లేకున్న నివి మీకెంతమాత్రమని యర్థము. గోత్రతిలక=వంశశ్రేష్ఠుఁడాయని యర్థము. వంశతిలకునకే యిట్టి సౌజ న్యము దగునని యాశయము. పర్వతశ్రేష్ఠుఁడా యనిభావము. 'పత్రంపుష్పంఫలంతోయం యోమేభక్త్యా ప్రయచ్ఛతి, తదహంభక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః' అను గీతాశ్లోక మిట యనుసంధేయము. అలం. ఇటవిభావన లోకోక్తియర్థాంతర గర్భమగుటంజేసి ఛేకోక్తి.

చ. విలసితరత్నకూటములు వేలుపుఁగన్నెలకూటముల్ సుధా
కలితసరఃకృపీటములు కామితనూతనవస్తుజాలదో
హలసురభూజవాటము లొకప్పుడుఁ బాయకి కల్గునీకు న
వ్వల నొకయర్థనీయమగువస్తువు గల్గునె ముజ్జగంబులన్. 122

అ. విలసిత...కూటములు—విలసిత=మిక్కిలియుఁ బ్రకాశించుచున్న, రత్నకూటములు=మణి మయములయిన శిఖరములును, 'కూటోఽస్త్రీశిఖరంశృఙ్గమ్' అమ. వేలుపుకన్నెలకూటముల్ = దేవ తాస్త్రీలయొక్క సాంగత్యములును, మొదటి 'కూటముల్' 'కూట' శబ్దమునకు బహువచనము, రెండవది 'కూటమి' శబ్దమునకు బహువచనమని తెలియునది. ఇట కోలాహలునియందు ఇంద్రవ్యవహార సమారో పణమును స్ఫురించుచుండుటచే, నింద్రునివలె, విలసితరత్నకూటములు=ప్రకాశించుచున్న రత్నసమూ హములు, 'వేలుపు కన్నెలకూటముల్'- దేవతాస్త్రీలతోడి సంభోగములును గలవాఁడవని యర్థాంతరము నూహ్యము. సుధా...కృపీటములు—సుధా=అమృతముచే,కలిత=ఒప్పుచున్న-మాధుర్యముచేత ననుట, సరః=సరస్సులయొక్క, కృపీటములు=జలములు, 'కృపీటముదకేజలే' నానా. అమృతముతోఁ గూడియు న్నకొలంకులజలము-అనఁగా సరస్సునందలి జలము లమృతమగుట యని యింద్రత్వారోపణమునకు నను రూపముగా గ్రహించునది. కామిత...వాటములు---కామిత=కోరఁబడిన, నూతన = క్రొత్తయయిన, వస్తుజాల=పదార్థసమూహములను,దోహల=ఇచ్చునట్టి, సురభూజవాటములు=కల్పవృక్షపు చాలుపులును, ఒకప్పుడున్ =ఏకాలమందును- సరంతరమనుట, పాయక =వీడక , కల్గునీకున్ =కలిగియుండునట్టి నీకు, అనఁగా ఈచెప్పఁబడినవస్తువులు గలవాఁడు దేవేంద్రుఁడుగనుక దేవేంద్రవైభవముగల నీకునని ధ్వనితా ర్థము. అవ్వలన్ =అవతల, ముజ్జగంబులన్ =మూఁడులోకములందును, ఒక అర్థనీయము అగువస్తువు= ఒకకోరఁదగినపదార్థము, కల్గునె=కలుగ నేర్చునా - కలుగ నేరదనుట.

'సంపత్తికో విలసితరత్నసమూహ(కూట)ము లున్నవి. రతికో దేవతాస్త్రీలతోడి సంభోగము. అన్నపానీయములకో సుధగలసరోజలములు. ఇఁకఁ దక్కినభోగములు క్రొత్తక్రొత్తఁగ నేవియేని తలం చుకొన్నచో వానినిచ్చెడు కల్పవృక్షము లున్నవి. ఇట్టివైభవములు దేవేంద్రునికిఁగల యట్టివి. మఱియొక ప్పుడుండి యొకప్పుడులేకపోవునవిగాక నిరంతరముగలిగి యుండునవి. ఇట్టినీకు మముబోఁటివారివలనఁ గోరఁదగినదేమున్నది.భక్తి నొకటి మెచ్చుకొనుట తప్ప'నని యర్థము.పర్వతముగనుక శిఖరములందు రత్న

ములుగలవనియు నవిపాడవులగుటచే నాకాశమునందుఁగల దేవతాస్త్రీలువచ్చినరనియు కొలఁకుల నీరం తియు నమృతమువలెఁ,జవులుగులుకునవియు క్రొత్తక్రొత్త వస్తువులేవి కోరినను గల్పవృక్షములందుఁగలవి యొసంగునవనియు భావము. ధనములందు రత్నములకంటెను, స్త్రీలందు దేవకన్యలకంటెను, పానీయములం దమృతముకంటెను, ఇష్టార్థప్రదములందుఁ గల్పవృక్షములకంటెను నతిశయించినవి యుల్లోకములందు లేవుగాన ముజ్జగములందు మఱియొకకోరఁదగిన వస్తువు లే దన్నాఁడు. ఇక్కడ ఇంద్రసమారోపణము గమ్యమగుటచే నలంకారము సమాసోక్తి.

క. ఏతాదృశగుణగరిమస,మేతాత్ములు మీర లిచటికి కేతెంచుట యో
శీతాద్రితనయ మదుపరి,జాతాభినవానురాగసంపత్తిఁగదా. 128

అ. ఓశీతాద్రితనయ=ఓహిమవత్పర్వతపుత్త్రీ, ఏతా...త్ములు—ఏతాదృశ=ఇటువంటి, గుణ=సుగుణములయొక్క, గరిమ=గౌరవముతోడ- గొప్పగుణసంపత్తితోడ ననుట, సమేత = కూడిన, ఆత్ములు = అంతఃకరణముగలవారని యర్థము. ఏతాదృశగుణ = ఇటువంటిగుణములుగల-ఇటువంటిదయిన యనుట, గరిమ=గురుత్వముతోడ-అనఁగా దుర్భరత్వముతోడ, సమేత = కూడిన, ఆత్ములు=మూర్తి గలవారని భావము. (అగు) మీరలు=మీరు, పూజ్యార్థమందు బహువచనము. 'ద్రోణులందు భీష్ములదేఁ' (ఉ.ద్యో. ర ఆ.)నని తిక్కన, ఇచటికిన్, ఏతెంచుట=వచ్చుట, మత్...సంపత్తిన్—మత్-ఉపరి=నామీఁద, జాత=పుట్టిన, అభినవ=క్రొత్తయైన, అనురాగ సంపత్తిన్ కదా=వాత్సల్యము పెంపుచేతఁగదాయని యర్థము. నామీఁదఁగలిగిన స్త్రీవిషయానురాగసమృద్ధిచేతఁ గదాయని (కొందఱు మతమున, నా నీళ్లపయిభాగమునం దేలుటకుం గలిగినయాస్థచేతఁగదాయనియు) శుక్తిమతీవాక్య మం దబుద్ధిపూర్వకమగు నర్థమును స్ఫురించెడిని. 'గుణగరిమ' యనుచో గుణాతిశయముగలవారలు గాన 'మదుపరి' నాపయిని వాత్సల్యగుణమున వచ్చితిరనుట బుద్ధికృతమైనయర్థము. (కొందఱు) అతిదుర్భరత్వముగలవారుగాన నానీళ్లపయిభాగమునం దేల నాస్థగలవారయితి రని అబుద్ధికృతమైన యర్థమును దెలిపెదరు ఈరెండవయర్థము. 'నిజంబ పల్కితి వవున్ భువనాశయసన్నివేశ వేదిని' అను కోలాహలుని వచనములచేత ఉన్నీతమందురు. 'సంసక్తిఁగదా' యని పాఠాం.

చ. అన విని గట్టురాకొమరుఁ డాననగహ్వరరోచమాననూ
తనతరదంతహీరరుచిధారలు వెల్వడ నొక్కలేఁతన
వ్వు నగి నిజంబ పల్కితి వవున్ భువనాశయసన్నివేశ వే
దిని సరసాగ్రగణ్యవు గదే యని యన్నదిఁ బల్కె వెండియున్. 124

అ. అనన్, విని, గట్టురాకొమరుఁడు = పర్వతరాజకుమారుఁడయిన కోలాహలుఁడు, ఆనన...ధారలు---ఆననగహ్వర=గుహవంటి ముఖమునందు, రోచమాన=ప్రకాశించుచున్న, నూతనతర=మిక్కిలి క్రొత్తలయిన, దంతహీర=వజ్రమణులవంటి దంతములయొక్క, రుచి=కాంతియొక్క, ధారలు=అల్పప్రవాహములు.'ధారాప్రాకారాశి సేనాగ్రం పతదంబ్వాగి సంతతిః, ఖడ్గాదినిశితప్రాంతే తురంగగతి పఞ్చకే' నానా. వెల్వడన్ = బయలుదేఱఁగా నని యర్థము. ఆననగహ్వర = ముఖమువంటి గుహయందు, రోచమాన=ప్రకాశించుచున్నవియు, నూతనతర=మిక్కిలి క్రొత్తవియునగు, దంత = సానువులంపలి, 'దంతస్సానునికఘ్యతే' విశ్వము. హీర=వజ్రమణులయొక్క, కాంతిధారలు వెలువడఁగా నని భావము. ఒక్కలేఁత నవ్వునగి=ఒకచిఱునవ్వునవ్వి, నిజంబ పల్కితివి, అవున్ = అవును, యథార్థమే చెప్పితివి. భువన.. వేదిని—భువన=జగత్తులయొక్క, ఆశయ=అభిప్రాయముయొక్క, సన్నివేశ=స్థితిని, వేదిని=గుర్తెఱిగినదానాయని యర్థము. భువనాశయ=జలాశయమంపలి, సన్నివేశ=సత్+నివేశ = సత్పురుష

ప్రవేశమును, వేదిని=గుఱుతెఱింగినవానాయనిభావము. సరస అగ్రగణ్యవుగదే = సరసులయినవారిలో అనఁగా రసికురాండ్రలో శ్రేష్ఠురాలవుగదే యనియర్థము. సరసా=జలసహితలయిన నదులలో శ్రేష్ఠురాలవుగదే యని భావము. అగ్రగణ్యమనఁగా ముందుగా నెన్నఁదగినది. మొదటఁ గారవింపఁదగినదనుట. అని, అన్నదిన్ =అనదినిగూర్చి, పల్కున్ =ఒకవాక్యమును జెప్పెను.

ఈ క్రిమతి 'మమపరి జాతాభినవానురాగ సంపత్తింజేసి' వచ్చితిరని యతనివాత్సల్యసంపత్తిని వచ్చుటకు హేతువుగాఁ గొనియాడఁగా నందే స్ఫురించుభావార్థమునుండి 'స్త్రీవిషయానురాగ సంపత్తిచేతఁ దానువచ్చినట్లు చెప్పినదిగా నన్వయించుకొని 'అవును నిజమే చెప్పితివి' అని నవ్వినాఁడు. 'సరసాగ్రగణ్య'-తనలోని యభిప్రాయమును దెలిసికొనుటకు మేటిరసికురాలుగావలయును. పర్వతగుహలందు వజ్రముల కాంతులు పర్వుటయు నదుల మడుఁగులందు సత్పురుషులు చొచ్చి జలకమాడుట యునదులు గొప్పనీటిపట్టులగుటయు ప్రకటము. 'పల్కున్' అని భూతంబున లాట్టు. అలం. కేవల ప్రకృతగోచరశ్లేషము.

మ. పరమామోదముతో నశేషతటినీపద్మాస్యలం గూడి నీ
వరవిందోద్భవుఁ గొల్చి యేఁగుతఱి నీయచ్ఛాచ్ఛభావంబు నీ
సరసత్వంబును నీగభీరతయు నీ సర్వంకషప్రౌఢి నీ
పరిపూర్ణత్వముఁ గాంచి మెచ్చి మదిలో భావింతు నిన్నెప్పుడున్. 125

అ. నీవు, పరమ + ఆమోదముతోన్ = మిక్కిలి గొప్పసంతోషముతోడ, అశేష...స్యలన్—సమస్తనదీకాంతలను, కూడి = కూడుకొని, అరవిందోద్భవున్ = బ్రహ్మదేవుని, కొల్చి= సేవించి, ఏఁగుతఱిన్ = పోవుచుండునపుడు, నీ అచ్ఛ + అచ్ఛభావంబున్ = నీదయిన మిక్కిలి నిర్మలమయిన హృదయమును - నీయత్యంత నిర్మలత్వమునని భావము. 'భావః పదార్థసత్తాయాం క్రియాచేష్టాత్మ యోనిషు । విద్వల్లీలా స్వభావేషుభూత్యభిప్రాయ జన్తుషు' నానా. నీ సరసత్వంబున్= నీరసికత్వమును - జలసహితత్వమని భావము. నీగభీరతయున్=నీదయిన గాంభీర్యగుణము - అనఁగా మనోవికారములను సులువుగా బయలుపుచ్చని యనుగుణమును. నీలోఁతునని భావము. నీసర్వంకషప్రౌఢిన్=నీయొక్క సమస్తమును సంగ్రహించు నేర్పును- సర్వమును వ్యాపించు సామర్థ్యమునని భావము. నీపరిపూర్ణత్వము=నీయొక్క సంపూర్ణభావమును-నీప్రవాహపరిపూర్ణత్వమునని భావము. కాంచి= చూచి, మెచ్చి=మెచ్చుకొని, మదిలోన్=మానసమందు, నిన్ను, ఎప్పుడున్, భావింతున్=తలంచుచుందును. 'భావింతు నిన్నెంతయున్' అని పాఠాం. నిన్ను మిక్కిలియుఁ దలంతునని యర్థము. ఇచట నుత్తమసుందరీధర్మములును నుత్తమనదీధర్మములును నభేదాధ్యవసాయముచేతఁ జెప్పంబడినవి. అలం. శ్లేషము.

శా. ఆపద్మోద్భవునోలగంబునకు దివ్యద్వీపినుల్ నిచ్చ రా
రో పోరో మఱి యెందఱేనియును వారిన్ మేము సంధింపమా
యేపద్మాననఁ జూచినం దెలియ నిన్నీక్షించినట్లుండ దే
లా పల్మాటలు పూర్వజన్మకృతముల్ గాఁబోలు నీనెయ్యముల్. 126

అ. ఆపద్మోద్భవు ఓలగంబునకున్ = ఆబ్రహ్మదేవునియొక్క కొలువునకు, దివ్యద్వీపినుల్ = దివ్యనదులు. 'స్రోతస్వినీ ద్వీపవతీ' అమ. నిచ్చన్ = ఎప్పుడును 'ఎపుడు నెడపక యుడుగక యెల్లప్రొద్దు, నిచ్చ యనునవియు నిచ్చలనఁగఁ, దనరు నాఖ్యలు స...తంబనుట కథవ' ఆంధ్రనామ. మఱి యెందఱేనియున్ = ఇఁక నెందఱయినను, రారో పోరో = వచ్చుచుండలేదా పోవుచుండలేదా.

వారున్ మేమున్ సంధింపమో = వారును మేమును ఎదురుకొనలేదా, ఏపద్మాననన్ = పద్మమువంటి ముఖముగల యే స్త్రీనిచూచినను - ఆననమువంటి పద్మములుగల యేనదిని జూచినను అని భావము. నిన్నున్, ఈక్షించినట్లు ఉండదు = చూచినట్లుగా నుండదు. ఏలాపల్‌మాటలు = పెక్కుమాట లెందుకు, ఈనెయ్యముల్ = ఈమక్కువలు, పూర్వజన్మకృతముల్ = తొల్లిఁటి పుట్టుకయందుఁ జేయఁబడినవి, కాఁబోలున్ = అగు నేమో. ఎందఱనో దివ్యనదీమణులను జూచుచున్నారముగాని వారిని జూచుట నిన్నుఁజూచినట్లుండదు. అనఁగా వారిమీఁద నీమీఁదంబోలె నెయ్యము గలుగదు. ఇట్లు నెయ్యము గలుగుటకుఁ గారణ మిప్పటిపుట్టువునం దేదియుఁ గానరాకున్నది. ఇది పూర్వజన్మకృతమయిన స్నేహముచేఁ గలిగినదిగా నుండవచ్చునేమోయని యర్థము. 'సంస్కారాః ప్రాక్తనా ఇవ' యన్నట్లు లిప్పటి జన్మమునఁ గలుగుటకంతగా హేతూపపత్తి పొసఁగనిదానికి పూర్వజన్మవాసనను హేతువుగా రూపించుట తెలియునది. మనకిరువురకు నెయ్యము జన్మాంతరకృతమగుటచే నాతప్పుగాదనియుఁ ద్రోసిపుచ్చ నలవిగాదనియు భావము తెలియునది.

ఉ. నావలనం బ్రియం బెఱిఁగి నన్నొకమాఱును బల్కరింపకీ
వే వెస నోరసేసికొని యేఁగుదు గాని సరిల్లలామ ని
న్నేవగఁ జేరవత్తు మది కింపగునీదునవోదితామృతం
బేవగఁ గ్రోలఁ గాంతు నని యే నెపుడుం దలపోయుచుండుదున్. 127

అ. సరిత్‌లలామ = నదులకు భూషణమువయిన శుక్తిమతీ, నావలనన్ ప్రియంబుఎఱింగి = నీవిషయమై నాకుఁగల ప్రేమను దెలిసికొని - నాకు నీయందుఁగల మక్కువను గుఱుతెఱిఁగియునుట, నన్నున్, ఒకమాఱును = ఒకసారియైనను, పల్కరింపకి = మాటలాడనీయక - నాతోడ నొకపరియైన మాటాడకయునుట, ఈవే వెసన్ ఒరచేసికొని ఏఁగుదు కాని = నీవే త్వరితముగా తొలఁగుపాటు చేసికొని పోదువుగాని - ఇంతవఱకును నదీప్రవాహపరముగాను నిట్లె యర్థము చెప్పవలయును. నిన్నున్, ఏవగన్ = ఏవిధముచేత, చేరన్ కన్ ఎత్తున్ = సమీపించివత్తును - నీవు నామక్కువ తెలిసికొని నాతో మాటాడక ఓరగా నొడఁగిపోయినను బోదువుపో. నిన్ను నే నేవిధమునఁ గదియుదునని యర్థము. మదికిన్ = మనస్సునకు, ఇంపు ..అమృతంబున్—ఇంపగు = ప్రియమయినట్టి, నీదు, నవ = నూతనమయిన, ఉదిత = మాటయనెడు, అమృతంబున్ = అమృతమునని యర్థము. నవ= క్రొత్తగా, ఉదిత = పుట్టిన, అమృతంబున్ = ఉదకమునని భావము. ఏవగన్ = ఏవిధమున, క్రోలన్ కాంతున్ = పానముసేయుదును, అని = అనుకొని, ఏను, ఎపుడున్ = ఎల్లప్పుడును, తలపోయుచుండుదున్ = చింతించుచునే యుందును. అనఁగా నామీఁద నీకుమాత్రమే మక్కువలేదుగాని, నాకెల్లప్పుడును నీమీఁదనే మక్కువ గలిగియున్నదని యర్థము. నదులు పర్వతములవోరగాఁ బ్రవహించుటయు పర్వతజలములచే నదు లుపకార మొందుటయు నదులు క్రొత్తప్రవాహములు రాఁగా పర్వతప్రాంతములఁ దారసించుటయుఁ దెలియునది. అలం. శ్లేషము.

తే. విమలమధురమనోహరవృత్తి వెలయు, వారిఁ గొనియాడ బుధు లెంత దూరమైనఁ
బోవుదురుగాన యేను నీకౌఁ బొందుఁగోరి, దవ్వనక వచ్చితి నశేషతాపశమని.

అ. అశేషతాపశమని—అశేష = నిశ్శేషముగా, తాప = మన్మథతాపమును, శమని = శమింపఁ జేయుదానా - దప్పి మొదలయిన తాపములను శమింపఁజేయుదానా యని భావము. విమల... వృత్తిన్—విమల = నిర్దుష్టమును, మధుర = ప్రియమును, మనోహర = చక్కనిదియునయిన, వృత్తిన్ =

వర్తనముచేత, వెలయువారికిన్=ప్రకాశించెడువారలను-నిష్కలుషమును మాధుర్యయుక్తమును మనోహరమును నయిన స్థితిగలవారిని-అనఁగా జలముననిభావము. 'స్వాదుప్రియౌచ మధురౌ' అమ. కొనియాడన్=వర్ణించుకొఱకు, కొని=గ్రహించి, ఆడన్=స్నానముసేయుకొఱకని భావము. 'ఏను తీర్థంబులాడంగ నేఁగుదెంచి' యేను దీర్థంబులాడక యుని 'ఆడు' ధాతువు స్నానార్థము తెలియునది. బుధులు=తెలిసినవారు-పెద్దలనుట, ఎంతదూరమయినన్ పోదురుగాన=ఎంతదూరమయినను పోవుదురుగనుక, ఏనున్=నేనును,నీపొందున్=నీయొక్క సాంగత్యమును,కోరి,దవ్వుఅనక=దూరమనియెంచక,వచ్చితిని. బుధులుగూడ దవ్వనక వత్తురుగాన నేనువచ్చుటయుఁ దప్పుగాదు. ఒప్పేయని యాశయము. అశేష తాపశమని యనుట సాభిప్రాయముగాన పరికరాంకురము. సామాన్యముచే విశేష సమర్థనమునుబట్టి అర్థాంతరన్యాసము. విమలమధుర మనోహరవృత్తియను హేతువుచేత బుధులుపోవుట నిబంధించుటచే పదార్థహేతుకమును బుధులుపోవుటంజేసి నేనునువచ్చితి ననుటచేత వాక్యార్థహేతుకము నయినకావ్యలింగము శ్లేషానుప్రాణిత మలంకారములు.

ఉ. చెప్పెడిదేమి నాకుఁ గలజీవనమంతయు నీక కూర్చి యె
 ల్లప్పుడు నిన్నుఁబాయక ప్రియాచరణం బొనరింపనేర్తు నీ
 చొప్పున కీవు నియ్యకొని చొక్కపుజక్కవగుబ్బలాఁడి మేల్
 దప్పక యంతరంగమునఁ దారిచి నన్ను నదీనుఁ జేయవే. 129

అ. చెప్పెడిదేమి = ఇఁకమీఁదఁ జెప్పవలసిన దేమున్నది. అనఁగా వేఱొకమాట చెప్పవలసినది లేదనుట. నాకున్, కలజీవనమంతయున్ నీకకూర్చి = జీవనమనఁగా బ్రతుకును, జలమును - నాకుఁ గలిగియున్న బ్రతుకు బంతాలనంతటిని నీకేయొప్పగించి-నాయందుండెడు సెలయేటిజలములను నీయందుఁజేర్చి యనిభావము. ఎల్లప్పుడున్ నిన్నున్ పాయక=ఎల్లకాలము నిన్నునెడఁబాయక, ప్రియాచరణంబున్ ఒనరింపన్ నేర్తున్=ప్రియముసేయుటను-చేయనేర్తును ప్రియము గావింపనేర్తు ననుట-ప్రియుఁడు చేయుకార్యము చేయనేర్తునని భావము. ఈచొప్పనకున్=ఈపద్ధతికి, ఈవున్=నీవును, ఇయ్యకొని=సమ్మతించి-నేను సమ్మతించుట చెప్పనక్కఱలేదని భావము. చొక్కపు జక్కవగుబ్బలాఁడి=చక్కని చక్రవాకములవంటి కుచములుగలదానా - చక్కని కుచములవంటి చక్రవాకములు గలదానా యని భావము. మేల్ తప్పక=మోహమునువిడువక - మేలుచెఱుపక యని భావము. 'వలపు కూరిమి మేలునా నలరుఁబేళ్లు, మోహమునకు' ఆంధ్ర. అంతరంగమునన్ తారిచి=హృదయమందు జేరిచి-నాహితము నీహృదయమునందుఁ దలపోసియని యర్థము. నాయందు వలపును నీహృదయమందుఁ గలిగియనిభావము. నన్నున్, అదీనున్=దీనుఁడుగానివానినిగా -నదీనున్—నదీ+ఇనున్=నదీనాధునిఁగా నని భావము. వలపును గంఠోక్తముగాఁజెప్పుట అరసికత్వమును అమనోజ్ఞమును కాన తదర్థకముల నెల్ల భావములుగా నిట గ్రాహ్యము. చేయవే=చేయుమా - అనఁగా నన్నువలచి వరించి శుక్తిమతీనాధుఁడనునట్లుగాఁ జేయవేయనుట. 'చొక్కపు జక్కవగుబ్బలాఁడి' యనుట కోలాహలుని మోహమునకు ముఖ్యకారణము తెలిపెడిని. పర్వతములనుండి ప్రవహించుజలములు నదులంజేరుటయు పర్వతములు నదుల కధ్యక్షములగుటయుఁ బ్రసిద్ధము. అలం. శ్లేషము.

క. అన విని నగరాజు ఘన,ధ్వనిగరిమకుఁ గలఁగి ముకులితకరాంబుజయై
 వినయమునయంబుభయమును, మనమునఁబెనఁగొనఁగశుక్తిమతియిట్లనియెన్,

అ. అనఁ, విని, నగరాజు... గరిమకుఁ — నగరాజు=కోలాహలునియొక్క, ఘన=గొప్పదయిన, ధ్వని = వాక్యధ్వనియొక్క, గరిమకుఁ = అతిశయమునకు, గొప్పవ్యంగార్థవైభవమునకు - అనఁగా తన్నువలచుటను సూచించుటకు, కలఁగి = వ్యాకులపడియని యర్థము. ఘన = మేఘములయొక్క ధ్వని గరిమకు, కలుషితమయిన తామరలుగలదై యని భావము. వినయము=అడఁకువయును, నయంబు= నీతియును, భయమునా = వెఱపును, మనమునఁ = మనస్సునందు, పెనఁగొనఁగఁ = పిరిగొనఁగా, ముకుళితకరాంబుజయై=మోడ్చిన చేయిదమ్ములుగలదై శుక్తిమతి, ఇట్లు అనియెఁ=ఈవాక్యము చెప్పెను.

సీ. నిలువెల్ల నీచాతినీచోపసరణంబు, ప్రకృతియెల్లను జాడ్యపరిణతంబు
పెంపెల్ల నియతగాంభీర్యమాన విహీన, మంతరంబెల్లఁ బంకావిలంబు
జీవనం బెల్ల నంచిత బుద్బుదప్రాయ, ముదయమెల్లను దుర్దినోన్ముఖంబు
గతులెల్లఁ గుటిలప్రకార కారణము లు,త్సేకంబు లెల్ల భంగాకులములు
తే. నిలుకడ హుళక్కి తావులు పొలసువల్చు, నిట్టిసాబోంట్లతోఁ జెలిమి యెట్లు పొసఁగు
నచలితోత్తుంగ ధైర్యునకు లఘుమతికి, ననఘగతికి నభంగశీలునకు నీకు. 181

అ. నిలువెల్లఁ =స్వరూపమంతయు, నీచ అతినీచ ఉపసరణంబు = హీనాతిహీనప్రవర్తనము గలది - నిమ్నాతినిమ్నస్థల సరణముగలది - అనఁగాఁ బల్లముకంటె మఱింత పల్లముగానుండుచోటికిఁ బాఱునదియనిభావము. ప్రకృతియెల్లను = స్వభావ మంతయును, జాడ్యపరిణతంబు = మాంద్యముచేతఁ బరిపక్వమయినది - శైత్యముచేతఁ బక్వమయినదని భావము. 'జడో మూర్ఖే హిమగ్రస్తే' అను 'శైత్యంహి యత్సా ప్రకృతిర్జలస్య' పెంపెల్లఁ = అభివృద్ధియంతయు, నియత ... విహీనము — నియత=నియమముతోఁగూడియున్న, గాంభీర్య=గంభీరభావముతోడను, మాన= చిత్తసమున్నతితోడను, విహీనము= తక్కువయైనది- అనఁగా గాంభీర్యమానములు లేనిదనుట. గాంభీర్యమును మానమును విడిచి పెరుఁగునదని యర్థము. పెంపెల్లఁ =జలాధిక్యమంతయును, నియత = నియతమైన, ఇంతయని యొక కొలఁది గల, గాంభీర్య=లోఁతుయొక్క, మాన=ప్రమాణముచేత, విహీనము= లేనిదనిభావము. లోఁతు ఒకటేకొలఁదిగాలేక యెక్కువతక్కువలుగా నుండుననుట. అంతరంబెల్లఁ =హృదయమంతయు, పంక ఆవిలంబు = పాపముచేతఁ గలుషితమయినది- జలములోపలి భూమియంతయును బురదతోఁ గూడినదనిభావము.

జీవనంబెల్లఁ =బ్రతుకంతయును, అంచితబుద్బుదప్రాయము=ఒప్పుచున్న నీటిబుగ్గవంటిది. అనఁగా క్షణభంగురమని యర్థము. జీవనమనఁగా ఉదకమును, అది బుద్బుదబహుళమయినదని భావము. ఇచట ప్రాయశ్శబ్దము తుల్యార్థమందును బాహుళ్యమందును వర్తించుచున్నది. 'ప్రాయస్త్వనశనే మృత్యౌ తుల్యబాహుళ్యయోరపి' విశ్వ. ఉదయమెల్లను = అభ్యుదయమంతయును, దుర్దిన+ఉన్ముఖంబు = దుష్టదినమునకు మీఁదుచూచునది - దుష్టదినములంపలి కుత్సితవృత్తిచే అభ్యుదయము పొంద నెదురుచూచునది యనుట, — ఉదయమెల్లను =ఉత్పత్తియంతయును, దుర్దిన = మబ్బు క్రమ్మినదినమునకు, ఉన్ముఖంబు=మీఁదుచూచుచున్నదని భావము. 'మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దినమ్' అను. అనఁగా సూర్యుఁడు గనఁబడకుండ మేఘముపట్టి వర్షించుటచేత నదులు జలపూరితములగుచున్నవనుట. గతులెల్లఁ =నడకలన్నియు, కుటిలప్రకార=కుటిలపద్ధతులకు, కారణములు=హేతువులయినవి- ప్రవాహగతులెల్ల వంకరలుగానుండునని భావము - అనఁగా నదులు వంకవంకలుగాఁ బ్రవహించుననుట. ఉత్సేకంబులెల్లఁ =ఉద్రేకములన్నియు, భంగ అకులములు = అపజయములచే నెరసినవి-

మిట్టిపడి నిక్కఁజూపి యపజయములపాలగుటయేకాని మఱేమియులేదనుట - ప్రవాహము పొంగివచ్చుట లన్నియు అలలతోఁ గూడియుండునని భావము. 'భఙ్గ స్తరఙ్గే రుగ్భేదే భేదే జయవిపర్యయే' విశ్వ.

నిలుకడ=స్థైర్యము,హుళిక్కి=దబ్బఱ-మనస్సునిలుకడలేదని యర్థము నిలిచియుండుట యెన్నటికి లేదనిభావము.'బద్దునాబొంకునాఁగ దబ్బఱయనఁగఁ, గల్లనాఁగ హుళిక్కినాఁ జెల్లుఁబేళ్లు, ధరనసత్యంబునకును' (ఆంధ్ర). తావులు=నీచవాసనలు, పొలసునల్కున్ = నీచువాసన వాసించును - స్థానములు నీచువాసించునని భావము. మత్స్యాదులు నదులందుండుటంబట్టి నీచువాసనయని తెలియునది. 'తావులన స్థలములొప్పను,దావులునావాసనలకుఁదగుఁబేళ్లుశివా'(ఆంధ్ర). ఇట్టిమాబోంట్లతోడన్ =ఇట్లుండెడు మావంటివారితో,అచలిత ... ధైర్యునకున్ —అచలిత=చలింపని,ఉత్తుంగ=ఉన్నతమయిన,ధైర్యునకున్= ధైర్యముగలిగినవానికిని,అలఘుమతికిన్=ఘనమయినమనస్సుగలవానికి,అనఘగతికిన్=పాపరహితమయిన నడవడిగలవానికి,అభంగశీలునకున్=భంగ మొటులేని మంచిప్రవృత్తిగలవానికి, ఇట్టివాఁడయిన నీకు, చెల్మి= స్నేహము-సహవాసము, ఎట్లు పొసఁగున్ =ఏవిధమున పొందికపడును-పొందికపడదనుట. ఇట క్రమాలంకారము తెలియునది.

ప్రథమచరణాదులందున్న నీచాతినీచోపసరణత్వాములకుఁ బ్రతిద్వంద్వులుగా అచలితోత్తుంగ ధైర్యాదులు చెప్పఁబడెనని తెలియునది. అనఁగా మేము చలించువాండ్రము, నీవు చలింపనివాఁడవు. మేము మహానీచులము, నీవు గొప్పవాఁడవు. మేము పాఱిపోవువాండ్రము,నీవు ధైర్యము చెడనివాఁడవు. మేము మందమతులము,నీవు గొప్పమతిగలవాఁడవు. మేము కుటిలప్రవర్తనముగలవాండ్రము, నీవు కుటిల ప్రవర్తనము లేనివాఁడవు. మేము భంగపడిన శీలము గలవాండ్రము,నీవు భంగములేని శీలముగలవాఁడవు. కాఁబట్టి యిట్టిదుర్గుణములుగల మాతోడ నిట్టిసుగుణగరిష్ఠుఁడ వయిన నీ కెలాగునఁ బొందు పొసఁగును. ఎంతమాత్రము పొసఁగ నేరదని భావము.

క. పుడమి నచలేంద్రు లెచ్చట, జడవాహిను లెచట నెచటికేసఖ్యము వినఁ జొ
ప్పడదు పొడవడఁగు మీరాయెడ, నెడపక మారసము లెచటికిఁ గెక్కు మహాత్మా !

అ. పుడమిన్=భూమియందు, అచల+ఇంద్రులు=పర్వతశ్రేష్ఠులు,ఎచ్చట=ఎక్కడ,జడవాహినులు=జలమయములయిన నదులు ఎక్కడనని యర్థము. అచలా + ఇంద్రులు=భూదేవేంద్రులయిన రాజు లెక్కడ, జడవాహినులు= నీళ్లకడవలు మోయునటిక త్తియ లెక్కడనని యర్థాంతరము. ఎచటి సఖ్యము=ఎక్కడిస్నేహము, వినన్ చొప్పడదు=వినుటకే యుక్తముగాదు. పొడవు అడరుమీరాయెడన్ = అతిశయము గలిగిన మీవిషయమై, ఎడపక = ఎడపడక, మారసములు=మాయనురాగములు, ఎచటి కెక్కున్=ఎక్కడికందుచున్నవి. మాయనురాగములు మిక్కిలి గొప్పవారగు మీకెంతమాత్రము పట్టవనియర్థము.మిక్కిలిపొడవుచేత నొప్పుచుండెడు మీయందుఁ గ్రిందనుండెడుమాజలములెక్కడి కెక్కఁగలవని యర్థాంతరము. మహాత్మా = పూజ్యుఁడయినవాఁడాయని యర్థము. పెద్దదేహముగల కొలాహలుఁడాయని భావము. జడశబ్దమునకు 'లడయోరభేదః' అనుసూత్రము చే జలమని రూపాంతరము.

అలం. విషమము.

ఉ. నా విని గట్టుఱేఁడు వచనంబున విన్నఁదనంబు దోఁప నో
శైవలినీశిఖామణి నిజంబు భవత్కమనీయకాంతిధా
రావళిలో మునింగితి దరీయామతిఁ బ్రోవక సుళ్లఁ బెట్టెదో
నీ వికఁ గ్రుచ్చియెత్తి ఘననిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో యనన్. 133

అ. నాన్ = ఇట్లు శుక్తిమతి చెప్పఁగా, విని = ఆలకించి, గట్టుఱేఁడు = పర్వతనాథుఁడయిన కోలాహలుఁడు, సదనంబునన్ = సుఖముగనుండు, విన్నఁదనంబు = దీనత్వము, తోఁపన్ = కనఁబడఁగా, ఓశైవలినీశిఖామణి = ఓనదీశిరోమణీ - శుక్తిమతీ, నిజంబు = నీమాట నిజమే, అయినను, భవత్ ... వళిలోన్ — భవత్ = నీదయిన, కమనీయ = ఒప్పుచున్న, కాంతిధారా ఆవళిలోనన్ = కాంతియొక్క ధారాప్రవాహపరంపరయందు, మునింగితిన్ = అడఁగితినని యర్థము. కమనీయమయిన కాంతిగల ప్రవాహపరంపరయందు నడంగితినని భావము. దయామతిన్ = కృపతోఁగూడిన మనస్సుచేత, ప్రోవక = రక్షింపక, సుళ్లన్ పెట్టెదో = నదిసుళ్లయందుఁ బెట్టెదవో - అనఁగాఁ జిక్కులం ముంచెదవో, లేక, నీవు, ఇఁకన్ = ఇఁకమీఁద, ప్రసన్నమతి = ప్రసన్నురాలవై, ఘనసౌఖ్యవృత్తిన్ = గొప్పసౌఖ్యమునందు, తెప్పలఁ దేల్చెదో = తెప్పలఁ దేలునట్లుగాఁ జేసెదవో, అనన్ = అని కోలాహలుఁడు చెప్పఁగా నని యర్థము. సుళ్లఁబెట్టెదో అనుచోట సుడిగుండములలోఁ బడవైచి ముంచెదవో యనియు, దెప్పలఁ దేల్చెదో యనుచోట తెప్పలమీఁదఁ దేలునట్లుగాఁ జేయుదువా యనియు సారస్యము గ్రహించునది. ముంచిన ముంచుము, తేల్చినఁ దేల్చుము అను లోకోక్తి యిట భావితము. నీయొక్క ధారాప్రవాహరూపమయిన లావణ్యము నాకు మోహింపఁదగి యున్నవాఁడను. కనుక నన్నుఁ జేపట్టి సుఖపెట్టెదవో లేక నిరసించి వ్యాకులపెట్టెదవో నీకే తెలియును అని కోలాహలుఁడు చెప్పెనని తాత్పర్యము. ఇట నదీసంబంధులగు సుళ్లఁబెట్టుటయు తెప్పలం దేల్చుటయు ప్రతికూలానుకూలకృత్యములుగా నధ్యవసించి చెప్పుట తెలియునది. నదిప్రవాహమునందు మునింగినవాఁడు సుడిగుండములోనైనఁ జిక్కుకొనును; లేక తెప్పఁ దేలునట్లుగాఁ బయి కేఁదులాడు ననుట యిట యనుసంధించినాఁడు.

చ. వెలువెలఁబోకె శుక్తిమతి! వెండియుఁ గొండలఱేనిఁ బల్కె న
గ్గల మగుపంచసాయకవికారమునన్ నిజగౌరవోన్నతు
ల్దలఁపవు గాని మాదృశజడస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ
కులగిరికోటిలోఁ గడులఘుత్వము గాదె తలంచి చూడుమా. 134

అ. శుక్తిమతి, వెలువెలన్ పోకె = వెలవెలఁబోయి - విపర్ణతనొందియనుట, వెండియున్ = మరల, కొండలఱేనిన్ = పర్వతనాథుఁడయిన కోలాహలునిఁగూర్చి, పల్కెన్ = ఇట్లు చెప్పుచున్నది - ఏమని యనఁగా, అగ్గలము = మిక్కుటము, అగు పంచసాయకవికారమునన్ = అయిన మన్మథవికారముచేత, నిజగౌరవ ఉన్నతుల్ = నీయొక్క గౌరవమును ఉన్నతియును, తలఁపవు గాని = విచారించుకొనవు గాని, మాదృశజడస్థితిన్ = మాబోఁటి జడులయందునికిచేత, తెప్పలఁ దేలుచున్నన్ = ఉద్ధరింపఁబడి ఆనందము నొందుచున్నచో - మాబోఁటిజడులతోఁ జేరియుండి చొక్కుచుండిన యెడల ననుట, మీకులగిరికోటిలోన్ = మీకులపర్వతముల సమూహములోఁ గడులఘుత్వము గాదా = మిక్కిలి చులకన గాదా, తలంచి చూడుమా = విచారించి చూడుమా యని యర్థము. నీగౌరవోన్నతులనఁగా నీప్రసిద్ధత్వమును పొడవును విచారింపకొనక మాబోఁటిజలములందుఁ దెప్పలమీఁదఁ దేలుచుండుట పర్వతశ్రేణిలో చులకనగదా యని యర్థాంతరము. కొండ నీళ్లలోఁ దేలుట యెంతయుఁ బొసఁగమి ప్రకటముగదా. జడులమయిన మేమెక్కడ! మిక్కిలిగొప్పవారయిన కులపర్వతముల వంశములోని మీరెక్కడ! ఇట్టిమీరు మాయందు నిలిచి మాప్రాపు గుడుచుచుంటిరేని మీబోఁటికి మిక్కిలితక్కువపాటగు నని యర్థము. నది కలంగినచో వివర్ణతనొందుట ప్రసిద్ధము. అలం. శ్లేషమూలాభేదాధ్యవసాయము.

మ. మతిఁ గ్రీడారతి గల్గెనేని సకలక్ష్మాపుణ్యదేశాళిఁ గాం
చి తపస్స్ఫూర్తిమెయిం గృశించి వనరాశిం జెందుమాబోంట్ల ను
ద్ధతిచేఁ గ్రమ్మఁగనేల నీకుఁ గలవే తారుణ్యలావణ్యజృం
భితరంభాదినిలింపభామ లన భూభృన్మౌళి రాగాంధుఁడై. 135

అ. మతిక్ = బుద్ధియందు, క్రీడారతి = సంభోగక్రీడలయందలి యాసక్తి, కల్గెనేని = కలిగినయెడ, సకల... శాలిక్ - సకల = సమస్తమయిన, క్ష్మా = భూమియందలి, పుణ్యదేశాళిక్ = పుణ్యక్షేత్రసమూహమును, కాంచి = చూచియని తపస్వినీపరమయిన యర్థము. సమస్తపుణ్యభూమిప్రవేశములందు వ్యాపించి యనినదీపరమయిన భావము. తపఃస్ఫూర్తిమెయిక్ = తపస్సుయొక్క స్ఫురణముచేత, కృశించి = సన్నగిల్లియని యర్థము- గ్రీష్మర్తువుయొక్క విజృంభణముచేత శుష్కించియని భావము. వనరాశిక్ = అరణ్యసమూహమును - సముద్రము నని భావము. చెందుమాబోంట్ల = పొందువట్టి మావంటివారిని - అనఁగా తపస్విను లనుట - మావంటినదుల నని భావము. 'వనేసలిలకాననే' అమ. ఉద్ధతిచేక్ = ఎగపుచేత, క్రమ్మఁగనేల = పయికొననేల, తారుణ్య... భామలు — తారుణ్య = యౌవనముచేతను, లావణ్య = ముత్యపునీరువలెఁ బ్రకాశించు దేహకాంతి చేతను, జృంభిత = నిక్కుచున్న, రంభాది = రంభ మొదలయిన, నిలింపభామలు = దేవతాస్త్రీలు, నీకక్, కలవే = లేకున్నారా - ఉన్నారుగదా యనుట. అనక్ = అనియుక్తి మతి చెప్పఁగా, భూభృన్మౌళి = పర్వతశేఖరుఁడయిన కోలాహలుఁడు - రాజశేఖరుఁడని భావము. రాగాంధుఁడై = కామాతురత్వముచేతఁ గన్నులుగానని వాఁడై. అలం. శ్లేషమూలాభేదాధ్యవసాయము.

సీ. అతనుభూతి ఘటింపఁ గదియ్యోనే చదలేఱు సికఁదాల్చు నింధానచిత్రకునకుఁ
వరవంశవైఖరి వదలెనే రవిసుతాపతి యైనదైతేయభంజనునకు
వసులాభసంపత్తి మసలెనే జాహ్నవిఁ జేకొన్న శంతనుక్షితిపమణికిఁ
గమలోదయఖ్యాతి దెమలెనే నానానదీకాంతుఁ డయినరత్నాకరునకుఁ

తే. వారి కేలాఘమువచ్చె వనిత యెంత, మాఱుమసలెదు వట్టినేమములు చాలుఁ
నేలు నన్నని సతికమ్మకేలాలిపట్టు, ప్రబలతరదీర్ఘభుజశాఖఁ బట్టుటయును.

అ. చదలేఱు సికఁదాల్చు = ఆకాశగంగను జటాజూటమందు ధరించిన, ఇంధానచిత్రకునకుక్ = అగ్నియే తిలకముగాఁగల శివునకు, 'తిమాలపత్రతిలకచిత్రకాణివిశేషకమ్' అమ. అతను = అధికమయిన, భూతి = ఐశ్వర్యము, ఘటింపదయ్యోనే = ఒనఁగూడకపోయెనా - అనఁగా ఒనఁగూడినది గదా యని యర్థము. అతను = మన్మథునియొక్క, భూతి = భస్మము, ఘటింపఁదయ్యోనే = ఘటింపకపోయెనా - అనఁగా ఘటించినదని భావము. రవిసుతాపతియైన = సూర్యునికొమార్తయైన కాళిందికి భర్తయగు, దైతేయభంజనునకు = శ్రీకృష్ణునకు, వర = శ్రేష్ఠమయిన, వంశవైఖరి = వంశవిస్ఫూర్తి, వదలెనే = వదలిపోయినదా - అనఁగా వదలిపోలేదుగదా — శ్రేష్ఠమయిన వేణుగానవైఖరి గలవాఁడని భావము, జాహ్నవిక్ చేకొన్న = జహ్నుకన్యకయైన భాగీరథిని పరిగ్రహించిన, శంతనుక్షితిపమణికిక్ = శంతనుఁడనెడు రాజశ్రేష్ఠునకు, వసులాభసంపత్తి మసలెనే = ధనలాభసంపత్తి గలుగకపోయెనా- అనఁగాఁ గలిగినదిగదా యనుట. అష్టమవసువయిన భీష్ముఁడు గలిగినాఁడని భావము. నానానదీకాంతుఁడయిన = సమస్తనదులకును పెనిమిటియయిన, రత్నాకరునకుక్ = సముద్రునకు, కమలోదయఖ్యాతి తెమలెనే = సంపదుదయప్రఖ్యాతి చలించెనా - అనఁగాఁ జలించి పోలేదు

గదా యనుట. లక్ష్మీదేవి పుట్టినదనెడి ఖ్యాతి యున్నదని కాని, లేక కమలమనఁగా జలముగనుక జలపూరితో దయఖ్యాతియున్నదని కాని భావము.

వారికిన్, ఏలాఘనమువచ్చెన్ = అనఁగా నదులయిన యమునాకాళగంగను, గాళిందిని, భాగీరథిని, ఇది యది యనక సమస్తనదులనును, బరిగ్రహించినశివుఁడు, శ్రీకృష్ణుఁడు, శంతనుఁడు, సముద్రుఁడు అనువీరికేమి చిన్నతనము వచ్చినది - అనఁగా చులుకఁదనమేమియు రాలేదుగదాయనుట. వనిత = ఓశుక్తిమతీ, ఎంతిమాఱుమసలెదు = ఎంతగాఁ బ్రతికూలభావము వహించుచున్నావు. వట్టినేమములుచాలున్ = పనికిమాలిననియమము లింతటితోఁజాలును. ఏలునన్నున్ అని—న న్నేలుకొమ్మని, సతి = శుక్తిమతి యొక్క, కమలాలి = పద్మసమూహములగల, పట్టు = పట్టువస్త్రమును, తమ్మిపూఁబనిగల వస్త్రమనుట, ప్రబలతర = మిక్కిలియు బలిష్ఠమయిన, దీర్ఘభుజశాఖన్ = శాఖా సదృశమయిన దీర్ఘబాహువుచేత, పట్టుటయును = పట్టఁగానని యర్థము - పట్టు అనఁగా స్థానమునుగనుక శుక్తిమతీ నది కమలములుగల స్థానము గలదియనియును గోలాహలపర్వతము ప్రబలతర దీర్ఘబాహు సదృశశాఖలు గలదనియును భావము. అలం. శ్లేషమూల విశేషోక్తి "కార్యాజనిర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే".

ఉ. వేణి చలింపఁ గంపితనవీనమృణాలభుజాగ్రకంకణ
శ్రేణి నటింప లోలశఫరీనిబిరీసకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసకగణక్వణనంబును మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖశోభిత యై కడు సంభ్రమించినన్. 187

అ. ఇట కాముకగ్రస్తవిముఖస్త్రీపరముగను పర్వతనిరుద్ధనదీపరముగను నర్థద్వయము గ్రహించునది. వేణిచలింపన్ - వేణియనఁగా ఏటిపాయకును, పాయువలె నల్లినస్త్రీలజడకును పేరు. 'వేణీప్రవాహే సరితాం మేలనే కేశబన్ధనే, దేవశాస్త్ర్లే' నానా. పాయయనెడి జడ కదలియాడఁగా, కంపిత ... శ్రేణి — కంపిత = చలించుచున్నట్టి, నవీన = క్రొత్తయైన, మృణాల = తామరతూఁడులనెడు, భుజ = బాహువులయొక్క, అగ్ర = కొనలందు, కంకణ = జలబిందువులనెడు, కంకణ = కడియములయొక్క, 'స్యాత్కఙ్కణం హస్తసూత్రే శిఖరేకటకే జలే' నానా. శ్రేణి = పంక్తి, నటింపన్ = అల్లలాడఁగా. లోల... కాంతి = లోల = కదలుచున్న, శఫరీ = ఎగసిపడెడు చేఁపలనెడు, 'ప్రోష్ఠీతుశఫరీద్వయోః' అమ. నిబిరీస = పట్టమయిన 'నిబిడం నిబిరీసం చదృఢంగాఢం ప్రచక్షతే' వైజయ. కటాక్ష = క్రేఁగంటిచూపులయొక్క, కాంతి = ప్రకాశము, విన్నాణము చూపన్ = అందము గనఁబఱుపఁగా, భయముచే మిట్టిపడు బెదరుచూపులు గాన మిడిసిపడు చేఁపలుగా రూపించినాఁడని తెలియునది. హంసకములనఁగా హంసలును కాలియందెలును. 'హంసకః పాదకటకః' అమ. హంసక = హంసలనెడు కాలియందెలయొక్క, గణ = సమూహముయొక్క, క్వణనంబులు = ధ్వనులు, మీఱన్ = అతిశయింపఁగా, సైకతశ్రోణి = ఇసుకదిన్నెలవంటి పిఱుఁదులుగలది - శుక్తిమతి, వివర్తిత = త్రిప్పఁబడిన, అబ్జ = తామరయనెడు - తామరవంటి, ముఖ = మొగముచేత, శోభితయై = ఒప్పుచున్నదై, కడున్ = మిక్కిలి, సంభ్రమించినన్ = తత్తఱపడఁగా - మిక్కిలియు తొందరపాటు నొందఁగాననుట - దీనికిముందటి పద్యముతో నన్వయము.

నదీప్రవాహమల్లకల్లోలపడఁగా, తామరతూఁడులిట్టట్టు నల్లలాడుటచే జలబిందువులు చెదరఁగా చేఁపలు మిడిసిమిడిసి పడి మినమిన కాంతుల సొంపు నెఱపఁగా, హంసల గుంపులు రొదలు చేయఁగా, తామరలు తాఱుమాఱువడఁగా, మిక్కిలియు వ్యాకులపడినదని యర్థము. శుక్తిమతీనాయిక జడ యల్లలాడఁగా లేఁదూఁడులంబోని చేతులు వడఁకుటచేఁ గడియములు చలింపఁగా, మిట్టిపడు చేఁపలవలె కడకంటి

చూపులు మిట్టిమిట్టిపాలయుచు చకచక కాంతులు చెఱవు చూపఁగా, కాలియందెలు మ్రోఁగఁగా, తామరపుష్పమువంటి సెమ్మోమును ద్రిప్పుకొని మిక్కిలి తొందరపాటు నొందినదని యర్థాంతరము. అట్లు మువంటి ముఖమును వివర్తితముచేయఁగా మొట్టమొదట వేణి (జడ) చలించుచున్నది. పిదప చేతులతో వలదని యడ్డగింపఁగా కంకణములు (కడియములు) నటించుచున్నది. పిమ్మట మొగము త్రిప్పికొనుటచేఁ గంటి నిండుచూపులుగాక కడకంటి బెదురుచూపులు చేఁపలవలె మిడిసి పొలయుచుఁ జకచక కాంతి విన్నాణము చూపుచున్నది. పిదప సంభ్రమించి యవ్వలికడుగులిడఁ బెనఁగుటచే కాలియందియలు మ్రోఁగుచున్నది. ఇట్లు పెనఁగి కొంచెము పెడమఱలుటచే, నిసుకదిన్నెలవంటి పిఱుఁదుల (సైకతశ్రోణి) యొఱపు చూపట్టుచున్నదని యిందలి విషయముల యనుక్రమము తెలియునది. మొదట మొగము ద్రిప్పుకొనుటయు, అంతకు విడువనిచో చేతులతో నడ్డగించుటయు, దానికిని మానినచో కడకంటిచూపులతో వలదని వేఁడుటయు, అందులకును వీడనిచో నవ్వలికిఁబోవ నడుగులు పెట్టుటయు, పెనఁగులాడి పెడమఱలుటయు ప్రతికూలయగు నాయికయందు వర్ణించిన క్రమమంతయు స్వాభావికము అలం. శ్లిష్టరూపకము. స్వభావోక్తియు.

మ. నిలువెల్లన్ నిరపాయశంబరమయోన్మేషంబునం బొంగు నా
గలఁ గూలంకషగాఢగర్వనిధులన్ గాంతానుకూల్యంబుచేఁ
దలమే నిల్పఁగఁ బ్రాతికూల్యపరుషోద్యత్ప్రౌఢిఁ గాకంచు న
య్యలఘుం డాస్యము జేవురింప నిజరోషాటోపసంరంభియై. 138

అ. ఆ అలఘుఁడు = ఆగొప్పవాఁడు - ఆగొప్పశరీరము గలకోలాహలుఁడనియు నర్థము. నిలువెల్లన్ = దేహమాద్యంతము - స్వరూపమంతయు ననుట, నిర ... న్మేషంబునన్ — శంబరమనఁగా మాయయును గలదు, నిరపాయ = అపాయములేని, శంబరమయ = శంబరాసురునియొక్కయు మయునియొక్కయు, ఉన్మేషంబునన్ = వికాసముచేత- అనఁగా వారలమాయవంటి మాయచేత ననుట- లేక శంబరమయ = శాంబరీమయమయిన- అనఁగా మాయాత్మకమయిన, ఉన్మేషముచేత- మాయను బచరించుటచేత ననుట, పొంగురాఁగలన్ = ఉద్రేకించుచున్న ధూర్తస్త్రీలను, కూలంకష ... నిధులన్ - కూలంకష = గట్టును ఒఱయుచున్నదియు - అనఁగా పరిపూర్ణమయినదియు, గాఢ = దట్టమైనదియు, అగు, గర్వ = గర్వమునకు- అలక్ష్యభావమునకనుట, నిధులన్ - స్థానభూతలయిన వారిని - అట్టి ధూర్తస్త్రీలననుట, కాంత అనుకూల్యము చేన్ = పురుషులయొక్క అనుకూలభావముచేత, నిల్పఁగన్ = జవదాటనీయకఁ నిలుపుటకు, తలమే = శక్యమగునా- కాదనుట. మఱి దేనిచేత శక్యమన్నచో, ప్రాతికూల్య = ప్రతికూలభావముచేత, పరుష = కఠినమయిన, ఉద్యత్ = ప్రకాశించుచున్న - స్ఫుటముగా నెఱపఁబడుచున్నయనుట, ప్రౌఢిన్ కాక = నేర్పుచేతనే కాని- ప్రతికూలముగాను బరుషముగాను నడచుకొనెడు దిట్టతనముచేతనే కాని యనుకూలముగా నడచుకొన్నచో మేరయందు నిలువరు, అని, అంచున్ = అనుచునని యర్థము. నదీపరముగా- నిలువెల్లన్ = పొడవాద్యంతము, నిరపాయ = వీడుటలేని- ఎడతెగనియనుట, లేక, నిరపాయ = అపాయములేని — అడ్డులేనియనుట, శంబరమయ, జలమయమైన, ఉన్మేషంబునన్ = వికాసముచేత, జలము మిక్కిలిగా నుల్లసిల్లుటచేత ననుట. పొంగురాఁగల = వెల్లువ పెట్టఁజాలిన, కూలంకష = ఒడ్డును రాచుకొనునట్టి - ఒడ్డులను రాచుకొనెడి ప్రవాహము యొక్క యనుట, గాఢ = దృఢమయిన, గర్వ = కావరమునకు, నిధులన్ = స్థానములయినవారిని. అనఁగా గట్టులుపొంగఁ బ్రవహించునట్టి యురవడిగల నదులననుట - ఇట నదీపరమున 'రాఁగల' నని లఘురేఫాదిగాను స్త్రీపరముగ

'ఱాఁగల' నని శకటరేఫాదిగాను గ్రహించునది. కూలంకష = నములమనెడి, 'కూలంకషానిర్ఝరిణీ' అమ. గాఢ=దృఢమయిన, గర్వ=అహంకారమునకు, నిధులన్=స్థానము లయినవానిని - అని బ్రౌన్ దొర గారు వ్రాయించిన టీకయం దర్థము వ్రాయఁబడియున్నది. కాని యీయర్థము సమంజసముగాదు. కాంత= ఒప్పిదమయిన, అనుకూల్యంబుచేన్=కూలానుసరణముచేత-గట్టులను బొందికగా ననుసరించిపోవుటచేత, నిల్పఁగన్=నిలువఁబట్టుటకు-గట్టుల నతిక్రమింపక దాని ననుసరించియే ప్రవహించునట్లు చేయుటకనుట, తలమే=శక్యమా, మఱి దేనిచేత శక్యమన్నచో, ప్రాతి ... ప్రౌఢిన్ గాక – ప్రాతికూల్య = కూలమునకుఁ బ్రతికూలమైనదానియందు అనఁగా అడ్డకట్టయందు-పరుషమయిన ప్రౌఢిచేతనే శక్యమగును గాని యనుచు నని నదీపరమయిన యర్థము. ఇట కోలాహలునకుఁగల 'అలఘు' విశేషణము రెండర్థములకును బొందుపడునది. అలఘుఁడు (గొప్పవాఁడు) అగుటచే నట్టి ధూర్తస్త్రీని జవదాఁటనీక నిలువఁబట్టఁజాలు ననియు అలఘుఁడు (గొప్పకోపముగలవాఁడు) అగుటచే నట్టి పెద్దనది నడ్డకట్టఁజాలు ననియుఁ దెలియునది.
ఆస్యము = ముఖము, జేవురింపన్ = (కోపముచే) ఎఱ్ఱవాఱుచుండఁగా, నిజ...సంరంభిమై—నిజ= తనదయిన, రూప = పర్వతరూపముయొక్క, ఆటోప = విజృంభణమందు - ఆటోపమనఁగా ఉద్దేశ్య కార్యజాతస్యగ్రతి, సంరంభిమై=త్వరగలవాఁడై-తన గొప్పస్వరూపముయొక్క పెంపును జూపఁ ద్వర గలవాఁడై యని స్త్రీపరమయిన యర్థము; మఱియు ఆస్యమనఁగా పర్వతముఖము; అది జేగుఱుధాతువుచే మెఱయుచుండఁగా నని పర్వతపరమయిన యర్థము. 'వెల్లిపడినట్టి జేగుఱుఁ గల్లువోలె' నని పర్వతసంబంధి వర్ణనముల నరయునది. 'అడుగుమోవఁగ జేగుఱుఁజిమ్ము నతిపులన్' 'జేగుఱు సెలయేటి' ననియుఁ బ్రయోగములు.

మఱి 'ఱాఁగ' శబ్దము ధూర్తస్త్రీవాచకము శకటరేఫాదియగుటకు 'అంతులుమీఁదు మిక్కిలిగ ఱాఁగతనంబున దొమ్మిచేసె' (భీ-౪-ఆ.) నదులు నలువెల్ల జలముల నిండఁగా గట్లకు లోనుగాక పొంగి ప్రవహించుటయు దానినడ్డకట్టులచేఁ బొంగనీక యాఁగుటయు, పర్వతములు నదీప్రవాహముల నడ్డగించుటయు గైరిక ధాతువగు జేగుఱు గలిగియుండుటయు బ్రకటములు. 'నిజరూపాటోప' అనుచో కాముకపరమున తన సౌమ్యభావముగాక శక్త్యాదిప్రయుక్తమయిన తనపౌరుషస్వరూపమని తెలియునది. 'నారూపుఁజూపెద' 'నారూపు దెలియవు' 'ఉన్నరూపు మఱుంగఁడు' ఇత్యాదిప్రయోగములం దెలియునది.

'పొంగు ... నిధులన్' అనుచో ధూర్తస్త్రీపరముగా 'పొంగు ఱాఁగలఁ గూలంకష ... నిధులన్' అనియు ఉద్వేలనదీపరముగా 'పొంగురాఁగల గూలంకష . నిధులన్' అనియు పాఠము గ్రహించునది. ఈరెండర్థములకును పాఠమునందు 'ఱాఁగల' కు పరముగానున్న అర్ధబిందువు యొక్క సద్భావాభావములవలన దప్ప దక్కిన యెడల సామ్యమే. 'కూలంకష' శబ్దము మొదటి 'క' కారమునకు [illegible] పరమున ద్రుతపూర్వక మగుటచే 'గ' కారమును, నదీపరమున కర్మధారయమగుటచే గసడదవాదేశ విధి నొప్పని 'గ' కారమును ఆదేశమని తెలియునది. ఈ పాఠముచేతఁ గాక మఱియొక తీరున రెండర్థములును బొసఁగవు. అర్ధబిందు సద్భావాభావ భేదమును రేఫలఘుత్వాలఘుత్వ భేదమును వ్యాఖ్యాతలు నిరాకరింపక తీఱదు. ఇందే 'బెడఁగారు పెరుల (దళుల) గుమ్మిదమును' మొదలగు వానివలన రేఫభేద నిరాకరణము తెలియుచున్నది. మఱి 'పిం యుతనిందల పైనిడి, కొని యాఁగినియమికి' (రాఘవపాండ) భేదముచో నర్ధబిందుదనిరాకరణమును జూపట్టెడి అయినను గొందఱు 'ఏగి' పఠింతురుగాన యిది నిదర్శనము గాకపోవచ్చును; ఎట్లయినను నిట యర్థద్వయానుగుణ్యమునకు 'గూలంకష' యను గకారాదిగనే పాఠము గ్రహింపవలసినదిగాన 'ఒకదన్ని' యనుటయు నిట్లె సాధువుగా [illegible]యున్నది. వ్యాకరణైకశరణులగువారు రెండర్థములందును

'రాఁగలకూలంకష' అని పాఠము గ్రహించెదరు. అపుడు 'పాంగురాఁగల' అనఁగా ఉద్రేకించునట్టి+అని రెంటనుఅర్థముకానియిసరసమునుగవితాశ్లేష సంపత్తికిఁ బ్రతికూలమును నగును. కాన కవిహృదయ మును గాదు. సోమకవ్యాది వ్యాఖ్యాతల కభిమతమును గాదు.

వ. నెట్టన నాగట్టుదొరపట్టి యెట్టకేలకు మట్టుమీఱి గుట్టునం బట్టరానితమకం బునం దట్టువడి కట్టలుకం గట్టలువడ నేయుకట్టిఁడిమరుని యంపసెలకట్టియల బెట్టునం బుట్టుబెట్టిదపు నొప్పి దొట్టి దట్టంపునిట్టూరుపుఁబొగలు నిగుడుసొగసు నం దగులుమొగులు తెగలరచ్చల నచ్చటం బెచ్చువెరుఁగుజాంబూనదాంబుజ కదంబ కాలంబి కాదంబ కాడంబరంబులు వారించుచు రాకరాకలం బైకొను కోకారిసెకసోఁకులం బ్రాఁకిన యాకారపాండిమంబునలువునం జెలువలరు కలువచెలి చలుపవన్నెల నెలకొన్న వెన్నెల వెల్లువల నుల్లోలకల్లోలమాలికా దోలికాకేళికాచతురచక్రబాలికాజాలంబుల మేలంబులఁ దూలించుచుం దమిఁ గొలుపు నగ్గలపువలపునం గల యలపునం బొడముడగ్గుత్తికఁ దడఁబడ నుడువు నుడువులవడువున మెఱయుసిరయచంక్రమణ చలదుపలఫలకమిలదలఘుతర ఘుమఘుమార్భటి నికటతట విటపివిటపచ్ఛటారట దపారకీర కిన్నరమిథునాదు లం జదల మెదలంజేయుచుఁ దనయహార్యభావగౌరవంబు కల్లోలినీరయనివార ణంబునుం గామోపభోగసమయసముచితవిజనతాకారణంబునుఁ, గందర్పబల సంబాధబాధానధీరణంబునుం గాఁగ మాటిమాటికిం గూటములం బాటింపు మని యబ్బోటిపదంబులం బడినవడువున నడుగున బ్రాలి యడ్డగించి యలముకొని చెం గల్వతావులు చెదర వేణిఁ దెమలించుచు మకరికలు నులియ గండపాలి నొక్కుచు మధురామృతంబులువడయం బలుతెంపుసొబగులానుచు మౌక్తికంబులు జడియం బయోధరస్థలులం బట్టుచు విశదాంశుకాంతస్థితి దొరలంగ నతివిపులపులినజఘ నారోహంబుల నుత్పలపత్రంబులు నెఱపుచుం దనివి లేక దద్దయు నాగద్దతి యమ్ముద్దరాలిం గ్రద్దయుం బ్రొద్దు నిరోధించుసమయంబున. 139

అ. ఆ గట్టుదొరపట్టి = పర్వతరాజకుమారుఁడయిన యాకోలాహలుఁడు, నెట్టనన్ =అనివార్యముగా, ఇది రూపాంతరము. 'నెట్టనముగ నని యుండుటంబట్టి ద్రుతాంతముగా' దని శబ్దరత్నాకరము. ఎట్టకేలకున్ = తుదకు, మట్టుమీఱి = మితిమించినదయి, గుట్టునన్ పట్టరాని= రహస్యమున నిలువఁ బట్టఁగూడని- వెలిపుచ్చక గోప్యముగా నుంచుకొనఁగూడని యనుట, తమకంబునన్ =తమిచేత-కామాతురత్వముచేత - అభిలాషయందలి తొందరచేతననుట, తట్టువడి = కొట్టువడి - అట్టితమికి మిక్కిలియు లోనయి, ఒకదానిచే తట్టువడుటయనఁగా దానికి శీఘ్రముగా మిక్కిలియుఁ గ్రిందుపడుట. కట్టలుకన్=మిక్కుటమయిన కోపముచే (ఇది మరునిసంబంధించినది.) కట్టలువడన్=మోపులయిపడునట్లుగా, ఏయు=ప్రయోగించుచున్న, కట్టిఁడిమరుని=కఠినుఁడయిన మన్మథునియొక్క, అంపసెలకట్టియల=అంపకోలలయొక్క - అనఁగా శరకాండములయొక్క, బెట్టునన్ =పటిమచేత, పుట్టుబెట్టిదపు నొప్పి=పుట్టెడిమిక్కుటమయిన బాధ, తొట్టి=ప్రాప్తించి, దట్టంపునిట్టూరుపు పొగలు నిగుడుసొగసునన్ =దట్టమయిన నిట్టూరుపు ధూమములు వ్యాపించినతీరుగా - వ్యాపించినవో యనునట్లుగా ననుట.

తగులు మొగులు తెగలరచ్చలన్ = తనయందలి మేఘసమూహములయొక్క సమ్మర్దముల చేత, అచ్చటన్ = ఆశుక్తిమతీనదియందు, పెచ్చుపెరుఁగు = అతిశయించుచున్న, జాంబూనద అంబుజ = బంగారు తామరలయొక్క, కదంబక = సమూహమును, ఆలంబ = అవలంబించిన, కాదంబక = కలహంసలయొక్క, ఆడంబరంబులు = విజృంభణములను, వారించుచున్ = నివారించుచు - అనఁగా కోలాహలుఁడు తనకు విరహోద్రేకముఁ జేయుచున్న శుక్తిమతీ సువర్ణకమలములందు విహరించుచున్న హంసలయాడంబరములను తన నిశ్వాసవాయువులో యున్నట్లున్న తనయందలి మేఘమాలికచేత నివారించినాఁడని యర్థము. మేఘములకును హంసలకును విరోధము ప్రకటము. అలం. ఉత్ప్రేక్ష.

రాకరాకలన్ - రాకయనఁగా పున్నమ- పున్నమలువచ్చుటలచేత = పున్నమలువచ్చునపుడెల్ల ననుట, పైకొను = క్రమ్ముచున్న, కోకారి = చంద్రునియొక్క, సెక = సెగలయొక్క, సోఁకులన్ = అంటుకొనుటలచేత, వెన్నెలవిరహికి వేఁడి' యని కవిసమయము.

'చన్ద్రోఽపి చణ్డకరాయతే'

ఏకిరతిహిమగర్భైః రగ్నిముంముర్మయూఖైఃత్వమపిసుమబాణాన్ వజ్రసారీకరోషి' శాకుంత.

ప్రాకిన = వ్యాపించిన, ఆకారపాండిమంబునలువునన్ = మేనియొక్క తెల్లఁదనమురీతిని-విరహముచే మేనికిఁగలిగిన వెలుకఁదనమో యనునట్లుగా, చెలువుఅలరు = ఒప్పనిమాఱుచున్న, కలువచెలిచలువ = చంద్రకాంతశిలలయొక్క, వన్నెలన్ = కాంతులచేత, సెలకొన్న = కలిగిన, వెన్నెల వెల్లువలన్ = చంద్రకాప్రవాహములచేత-చంద్రకాంత శిలలకాంతి ప్రసారమనెడు వెన్నెల ప్రవాహముచేతననుట. ఉల్లోల...

మేలంబులలన్ — ఉల్లోల = ఉప్పొంగుచున్న, కల్లోలమాలికా = శుక్తిమతీనదియొక్క అలలవరుసలనెడు, డోలికా = తొట్లయందలి, కేళికా = క్రీడయందు, చతుర = ప్రవీణములయిన, చక్రబాలికా = చక్రవాకస్త్రీలయొక్క, జాలంబుల = సమూహములయొక్క, మేలంబులన్ = పరిహాసములను, తూలించుచున్ = భంగపఱుచుచు- అనఁగా శుక్తిమతీనది జలతరంగమాలికలయందుఁ దూఁగుచున్నవై తనకు విరహోద్దీపనము చేయుచున్న చక్రవాకస్త్రీలను పూర్ణిమాచంద్రునియొక్క కాఁకలుసోఁకుటచేత వ్యాపించిన తనయొక్క విరహపాండిమయో యన్నట్లున్న చంద్రకాంతశిలాకాంతులనెడు వెన్నెలలచేతఁ దిరస్కరించినాఁడనుట. ఇక్కడ వెన్నెలలకును జక్రవాకములకును విరోధము తెలియునది. అలం. ఉత్ప్రేక్ష.

తమిగొలుప = అభిలాషను పుట్టించెడి, అగ్గలపువలపునన్ = మిక్కుటమయిన మోహమువలన, కలఅలపునన్ = కలిగినట్టి ఆయాసముచేత, పొడము = పుట్టిన, డగ్గుత్తికన్ = గద్గదస్వరముచేత, తడఁబడ నుడువు = తాఱుమాఱుగా పలికెడు, నుడువులనడుమునన్ = పలుకులరీతిని - పలుకులోయనునట్లుగా ననుట. మెఱయు = ప్రకాశించుచున్న, సరయు = వేగముతోఁ గూడుకొన్నట్లుగా, చంక్రమణ = చెంగలింపులచేత, చలత్ = కదలుచున్న - పొరలుచున్నయనుట. ఉపలఫలక = పలకలవంటిరాలతోడ, 'పాషాణప్రస్తరగ్రావో పలాశ్మానశ్శిలాదృషత్' అమ. మిళత్ = కూడుకొనుచున్న, అలఘుతర = అధికమయిన, ఘుమఘుమ ఆర్భటి = ఘుమఘుమయనెడు ధ్వనిచేత, నికట = సమీపమందలి, తట = శుక్తిమతీతీరమందలి, విటపి = వృక్షములయొక్క, విటపచ్ఛటా = శాఖాసమూహమందు, రటత్ = రొదసేయుచున్న, అపార = అంతములేని, కీరకిన్నర మిథునాదులన్ = శుకదంపతులు కిన్నరపక్షి దంపతులు మొదలయినవానిని, చదలన్ = ఆకాశమందు, మెదలన్ చేయుచున్ = తిరుగునట్లుగాఁ జేయుచు, అనఁగా శుక్తిమతీతీర వృక్షశాఖలందు రొదసేయుచును విరహోద్రేకమును జేయుచున్న కీరకిన్నర పక్షి మిథునము మొదలయినవానిని, శుక్తిమతియందలి మోహాతిరేకముచేత డగ్గుత్తికపడి పలికెడి తనపలుకులో యన్నట్లుగా

నున్న దొర్లిపడు ఱాల చప్పళ్లచే బెదరుకొని పయికెగసిపోవునట్లు చేసినాఁడనుట. ఇక్కడ శిలా పతనజాత ఘుమఘుమార్భటికిని బకులకును ప్రాతికూల్యమని తెలియునది. అలం. ఉత్ప్రేక్ష.

తన యహార్యభావగౌరవంబు=తనయొక్క పర్వతభావముచేతనయిన దుర్భరత్వమునని యర్థము. 'అహార్యధరపర్వతాః' అను. హరింపఁదగినది హార్యము. హార్యముగానిది అహార్యము. అనఁగా సజాతీయ విజాతీయములచేతఁ దిరస్కరింపఁబడని దనుట. ఈవిధమయిన భావముయొక్క, గౌరవము=అతిశయము. 'సజాతీయైర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్ ।యావద్రసంవర్తమానః స్థాయీ భావఉదాహృతః' అనియున్నది గనుక స్థాయిభావమని యర్థాంతరము. కల్లోలినీ=శుక్తిమతీనదియొక్క, రయ=ప్రవాహవేగముయొక్క, నివారణంబును=నివారకమైనదియును, కామోపభోగసమయ=సంభోగకాలమునకు, సముచిత = తగినట్టి, విజనతా = ఏకాంతస్థితికి, కారణంబును = హేతువయినదియు, కందర్పబల= మన్మథబలముయొక్క, సంబాధ = సమ్మర్దముచే నయిన, బాధా = వ్యథకు, అపధీరణంబును = తిరస్కారక మయినదియు, కాఁగన్ = అవుచుండఁగా - పెనశృంగారస్థాయిభావమతిశయింపఁగా, ఆశుక్తిమతీకాంతను బట్టి యడ్డగించుటయు నాపడఁతితోడ సంభోగమునకు నేకాంతము నేర్పఱచుటయు, మన్మథబలములగు శుకకోకిలాదులబాధను నిరాకరించుటయుఁ జేసినాఁడని యర్థము. తాను పర్వతమగుటచే పొడవును వెడలుపును గలిగియుండుటవలన మహానది నడ్డగింపనేర్చినాఁ డనియు, తనపఱపే యేకాంత మొనగూర్చినవనియు, తనయందలి మేఘమాలికలు చంద్రకాంత శిలాకాంతులు ఉపల ఘుమఘుమార్భటి మొదలయినవానిచే మన్మథునిబలంగములగు శుకపికాదుల రొదలువారించినాఁడనియు నర్థము. అలం. శ్లేషానుప్రాణిత రూపకము.

మాటిమాటికిన్=సారెసారెకు, కూటములం పాటింపును అని=కలయికలచేత ఆదరింపును అని, అబ్బోటిపదంబులన్ పడినవతువునన్=ఆశుక్తిమతియొక్క పాదములందుఁబడినట్లుగా, అడుగునన్ ప్రావాలి=జలాధఃప్రదేశమునందుప్రావాలి-అడుగనఁగాపాదమునుగనుక నిక్కడఁజమత్కారముగ్రహింపవలయును. జలము లోఁతునకుఁబడినదై, తనకూటములన్=శిఖరములను, పాటింపును=చేపట్టును. శిఖరములందుఁ బ్రవహింపుమన్నాఁడని నదీపరమయిన యర్థము. నదిలోఁతునకు ప్రావాలి ప్రవాహము మట్టమునకు శిఖరములఁ దెచ్చినాఁడని గ్రాహ్యము. అడ్డగించి అలముకొని=నిరోధించి కౌఁగిలించుకొని, చెంగల్వతావులు చెదరన్ వేణిన్ తెమలించుచున్=చెంగల్వపువ్వుల వాసనలు చెదరిపోవునట్లుగా జడనుబట్టి కదలించియని యర్థము - చెంగలువలుండెడు స్థలములు నలఁగిపోవునట్లుగాఁ బ్రవాహము పొరలఁజేసినాఁడని యర్థాంతరము. మకరికలు నలియన్=మకరికాపత్త్రరచనలు చెదరిపోవునట్లుగా, గండపాళిన్ నొక్కుచున్ = చెక్కులు నొక్కుచునని యర్థము. మొసళ్లు ఒత్తుడుపడునట్లుగా, గండశిలల నొక్కినాఁడని యర్థాంతరము. మధుర అమృతంబు పడయన్ పలుదెర సొబగులు అనుచున్=మధురమయిన యమృతమును బ్రాపించుకొఱకు అధరము చెలువముల నానుచు-అనఁగా నధరపానము సేయుచుననుట. పలుదెర అనఁగా పంటికి తెరఅనఁగా రదచ్ఛదమయిన అధరము. ఇట పంటియొక్క తెర యని తత్పురుషము. మధురామృతమనగా మధురజలమును-ఆజలమును బొందుకొఱకు, పలుదెర సొబగులు అనుచున్=బహువిధములయిన యలలయొక్క చక్కఁదనములను గ్రహించినాఁడని యర్థాంతరము. ఇట పలుతెర కర్మధారయము. మౌక్తికంబులు=ముత్యములు, జడియన్ = చిట్లిపడునట్లుగా, పయోధరస్థలులు=కుచప్రదేశములు అంటుచునని యర్థము. 'తరుణీస్తనఏవరాజతే మణిహారావళిరామణీయకమ్' అన్నట్లు, ముత్తెములహారములు గుబ్బలవలెయుం బొలుపుగులుకుటచే నిట్లు చెప్పంబడెను. శుక్తిమతి

యుంపలి మౌక్తికములు చెదరునట్లుగా జలములున్నపట్టుల నంటినాఁడని యర్థాంతరము. శుక్తిమతియను నామమన్వర్థముగా నానది ముత్యములకుఁ బట్టగుట తెలియునది. అలం. శ్లేషమూల రూపకము.

విశద... నెఱపుచున్ — విశద=శుభ్రమయిన, అంశుక=వస్త్రముయొక్క, అంతఃస్థితి=లోపల నుండుట, తోరలంగన్=కలంగునట్లుగా, వస్త్రముచే మఱుఁగుపడియున్నది బయలుపడునట్లుగా ననుట. అతివిపుల= మిక్కిలివిశాలమయిన, పులిన=ఇసుకదిన్నెలవంటి, జఘన=కటిస్థల మందలి, ఆరోహంబులన్=ఎక్కుటలతోడను, కటిస్థలములపయిని బ్రాఁకుటలతోఁగూడ ననుట. ఉత్పలపత్త్రంబులు=ఉత్పలపత్త్రములనెడు నఖక్షతివిశేషములను, నెఱపుచున్=పర్వఁజేయుచు ననియర్థము. ఉత్పలపత్త్రమనఁగా సంభోగకాలమున నితంబమునఁ జేయు నఖక్షతము. 'భవేదుత్పలపత్త్రంతు తద్వదేవ స్త్రియాఃకృతే' విశ్వ. 'కణ్ఠేకుమణిమాలాస్యాత్కపోలే చన్ద్రలేఖికా, నితమ్బయోరుత్పలం పత్త్రం స్తనే శశప్లుతమ్' రతిరహస్యము. 'చెలువుఁ డుత్పలపత్త్రంబులఁ బిఱుందున నుంప, నతని లాంగలరేఖ నమరె ననియు' నని రాజశేఖరచరిత్రము. విశదాంశు=తెల్లనికిరణములుగల చంద్రునివలె 'విధుస్సుధాంశు శ్శుభ్రాంశు రోషధీశో నిశాపతిః' అమ. కాంతి=రమ్యమయిన, స్థితి=ఉనికి, లేక 'విశద + అంశుక= శుభ్రవస్త్రముయొక్క, అంతి = రమ్యమైన (మృతౌ అవసితే రమ్యే సమాప్తావన్త ఇష్యతే' అమ. స్థితి=ఉనికి-అస్థితివంటి స్థితియని నిదర్శనాలంకారము. తోరలఁగన్ = కలంగునట్లుగా, అతివిపుల= మిక్కిలి విశాలమైన, పులినజఘన=జఘనములవంటి యిసుకదిన్నెలయందలి, ఆరోహంబులన్ = ఎక్కుటలచేత, ఉత్పలపత్త్రంబులు నెఱపుచున్ = నల్లగలువరేకులను వ్యాపింపఁజేయుచును - నదియందు నల్లగలువలరేకులను జల్లచెదరుగావించుచునని యర్థాంతరము. తనివిలేక=తృప్తినొందక, తద్దయున్= మిక్కిలియు, ఆగద్దఱి=ధూర్తుఁడయిన యాకోలాహలుఁడు, ఆనుద్దరాలిన్ = ఆశుక్తిమతీకాంతను, పెద్దయుంబ్రొద్దు = తడవుసేపు, నిరోధించు సమయంబునన్ = అడ్డగించియున్న సమయమందు - ఈపద్యమునకు ముందటి పద్యముతో నన్వయము. అలం. ఉక్తము.

ఉ. ఓవసుధామహేంద్ర కరుణోదధి యీతడ వేల ప్రోవ రా
వే వసుభూప యంచు నెలుఁగెత్తి వెసన్ మొఱవెట్టుచాడ్పునన్
శైవలినీరవం బెసఁగెఁ శైవలినీనినదంబుకన్న ము
న్నావిలభూరివారివిహగారవగౌరవ మెచ్చె నెల్లెడన్. 140

అ. శైవలినీరవంబు=శుక్తిమతియొక్క-ధ్వని, ఓవసుధామహేంద్ర=ఓభూలోకదేవేంద్రుఁడా, ఈవిశేషణముచే నింద్రుఁడు పర్వతముల భేదించునట్లీవు నీపర్వతమును భేదింపనర్హుఁడవనిభావము వ్యంజితము. కరుణోదధి=దయాసముద్రుఁడా, దీనిచే ఆర్తరక్షణమవశ్యమనుట సూచితము. వసుభూప=వసురాజా, ఈతడవు ఏల=ఈజాగెందుకు, ప్రోవన్ రావే=రక్షింపరమ్మా, అంచున్=అనిపలుకుచు, ఎలుఁగెత్తి=పెద్దగొంతుచేసికొని, వెసన్=శీఘ్రముగా, మొఱవెట్టుచాడ్పునన్=కుయ్యిడుచున్నట్లుగా, ఎసఁగెన్=అతిశయించెను. శైవలినీనినదంబుకన్నన్ మున్న= నదియొక్క ధ్వనికంటె ముందుగా, ఆవిల...గౌరవము—ఆవిల=కలఁకనొందిన, భూరి=అనేకములయిన, వారివిహగ=జలపక్షులయొక్క, ఆరవ=ధ్వనులయొక్క, గౌరవము=అతిశయము, ఎల్లెడలన్=అంతటను-అన్నిదిక్కుల ననుట, ఎచ్చెన్=అధికమాయెను. వసుధామహేంద్ర, కరుణోదధి యనువిశేషణములచే ప్రకృతోపయుక్తములయిన పర్వతభంజనసామర్థ్యమును రక్షణశీలత్వమును రాజునందు సూచితములు.

- అలం. ఉత్ప్రేక్ష.

మ. కలగుం డై నెల వేది యిట్లు వరటాకారండవాదిద్విజా
వళి ఘోషించుటకన్న మున్న గిరిరాడ్వ్యావిద్ధకల్లోలినీ
సలిలోపప్లుతభూజనుల్ నిజనివాసస్థేమసంశూన్యులై
కలఁకన్ ఘూర్ణిలుఘోష మొక్కమొగి దిక్చక్రంబులం గ్రమ్మినన్. 141

అ. వరటా.. ద్విజావళి—వరటా = ఆఁడుహంసలును, 'హంసస్యయోషిద్వరటా' అమ. కారండవ=కన్నెరేడుపక్షులును, ఆది = మొదలయిన, ద్విజ + ఆవళి = పక్షులయొక్క సమూహము, 'శకుంతిపక్షి శకుని శకుంతశకునద్విజాః' అమ. కలగుండై=కలఁతనొంది- గజిబిజియై, నెలవు ఏది= వాసస్థలమువిడిచి, ఇట్లు=ఈవిధమున, ఘోషించుటకన్న మున్న=రొదసేయుటకంటె ముందుగా, గిరి...భూజనుల్—గిరిరాట్=కోలాహలునిచేత, వ్యావిద్ధ = మరలింపఁబడిన, కల్లో[illegible]=శుక్తిమతి యొక్క, సలిల=ఉదకముచేత, ఉపప్లుత=[illegible]ంపఁబడిన, భూజనులు=భూమియందలి [illegible]ణంబుఁ నిజ... సంశూన్యులై—నిజనివాస=తమగృహములందలి, స్థేమ = నిలుకడ- ఉనికి, సంశూన[illegible]మతిశయింపయు లేనివారై, కలఁకన్ =కలఁతచేత-భయమున విరవిరఁబోవుటంజేసి యనుట. ఘూర్ణిల్లు=[illegible] ఘోషము=పెనుధ్వని, ఒక్కమొగిన్ =ఒక్కసారిగా, దిక్చక్రంబులన్ = దిగ్వలయములందు, క్రమ్మినన్ =ఆవరింపఁగా, దీనికి ముందటిపద్యముతో నన్వయము. ఇటశుక్తిమతి ఘోషముకన్న మున్న వరటాకారండవాది ఘోషములెసఁగెననుటచే వరటాదుల సంక్షోభము తొలుఁతను బిదప శుక్తిమతీసంక్షోభమును గలిగెనని తెలియునది. వరటాది ఘోషముకంటె ముందుగా భూజనఘోషము దిక్చక్రములను గ్రమ్మెననుటచే, దిక్చక్రములం గ్రమ్మునంతటిజనఘోషము పర్వుటకు మూలమయిన నివాసస్థేమ సంశూన్యత యత్యంతమయినదియు,అందులకుమూలమైనకల్లోలినీసలిలోపప్లుతి యపారమయినదనియు, దానిచే నిరోధకమయిన కోలాహలునిప్రమాణమతిమాత్రమయినదనియుఁ దెలియునది.అలం. శ్లేషమూలరూపకము.

మ. విని యాఘంతు దురంతశైలమథనావిర్భూతసింధూద్ధత
ధ్వనియో కాక మహోదకప్రళయసంక్రాంతసంబు లోకాళిఁ బై
కొని కారించెనో యీసుదుస్సహమహాకోలాహలోద్వృత్తి కే
మి నిమిత్తం బని భర్తలోకభరణోత్సాహంబు వాటింపఁగాన్. 142

అ. భర్త=వసురాజు, విని=ఆఘోషమును విన్నవాఁడై, ఆఘంతు = అఘోషము, దురంత... ధ్వనియో—దురంత=అంతములేని, శైల=మందరపర్వతముచేత, మథన = చిలుకుటవలన, ఆవిర్భూత= పుట్టిన, సింధు=సముద్రముయొక్క, ఉద్ధత=చిమ్మిరేఁగిన, ధ్వనియో=ఘోషమోయని యర్థము. కోలాహలపర్వత బాధవలన ఆవిర్భవించిన, సింధు=శుక్తిమతీ నదియొక్క ధ్వనియోయని యర్థాంతరము. కాక=లేక, మహో...క్రాంతసంబు—మహోదక=బ్రహ్మాండము నావరించియున్న మహాజలమువలని, ప్రళయము=నాశమునుగూర్చగలిగిన, సంక్రాంతసంబు=గొప్పదిగులు, లోక + ఆళి=జగజ్జాలమును, పైకొని= ఆక్రమించి, కారించెనో=బాధించెనోయని యర్థము. శుక్తిమతి మహాజలము సేయుప్రళయమువలని భయము, లోకాళిన్ =జనసమూహమును, ఆక్రమించి బాధించెనోయని యర్థాంతరము. సుదుస్సహ... వృత్తికిన్—సుదుస్సహ=మిక్కిలి సహింపనలవిగాని, మహత్ =మిక్కిలి యధికమయిన, కోలాహల= ఈకలకలధ్వనియొక్క, ఉద్వృత్తికిన్ =ఉ[illegible]మునకు, ఏమినిమిత్తంబు=ఏమి హేతువు అని యర్థము. కోలాహలుని యుద్వృత్తికేమినిమిత్తమ[illegible]ంతరము. అని=విచారించి, లోకభరణోత్సాహంబు= జన సంరక్షణమందలి యుల్లాసము, పాటింపఁగన్ =కైకొనఁగా-లోకమున రక్షింపవలయునని ప్రయ

ష్టముననుల్లసిల్లఁగాననుట. ఇచటఁ గోలాహలపర్వత వృత్తాంతమును దెలియని వసురాజుయొక్క వచనమందు శ్లేషభంగిచేతఁ దద్వృత్తాంతద్యోతకమయిన సత్యవాక్యత్వము స్ఫురించుచున్నది. భర్త యను విశేషణమువలన భర్తగావున నే లోకభరణముచేసి యున్నానని మిన్నకయుండిననుసంయుండనని యాశయము. ఇట భర్తృశబ్దాములచే లోకభర్తయు మందరపర్వతోద్ధారకుఁడు నగు విష్ణువృత్తాంతము సమారోపితముగాన సమాసోక్తి.

క. నానాజనపదకటక, స్థానాశ్రయు లాక్షణంబ వచ్చను దెంచి వసు
ధ్మానాధుఁ గాంచి పలికిరి, దీనానూనానులాపదీపితభయులై. 148

అ. నానా...శ్రయులు — నానా = సమస్తమయిన, జనపద = గ్రామములయొక్కయు, 'జనే గ్రామే జనపదః' నానా. కటక = పట్టణములయొక్కయు, స్థాన = స్థలములను, ఆశ్రయులు = ఆశ్రయించినవారు-అనఁగానందుఁగాపురమున్నవారు, లాక్షణంబ = అప్పుడే, చనుదెంచి = వచ్చి, వసుధ్మానాధుఁగాంచి = వసురాజును జూచి, దీన...భయులై - దీన = కొంచెపడిన-అధికమయిన, అనులాప = ముహుర్భాషణముల చేత-అనఁగా ఆడినమాటలే ఆడుటలచేత, దీపిత = ప్రకాశితమగుచున్న, భయులై = భయము గలవారై, పలికిరి = ఇట్లు చెప్పిరి. అది యేమనఁగ.

సీ. ఇష్టకృత్యము నిర్వహించుఁగాని దినంబు, శుచి మలీమసగతుల్ చూప వెఱచు
దాక్షిణ్యము వహించి తినరుఁగాని సదాగ, తి రజోభరభ్రాంతిఁ దిరుగ వెఱచు
జగతికిఁ దేజంబు సమకూర్చుఁగాని మి, త్రుఁడు చండకరశక్తిఁ దోడర వెఱచుఁ
గొలుచునాయమె చూపి నిలుచుఁగాని ధరిత్రి, జీవసదంబు గర్జింప వెఱచు

తే. దేవ తావకకరుణా సుధావిశేష, పోషితాశేష సద్వీపభూతలమున
నేఁటితుద కీక్షణంబున నాఁటుకొనిన, పాటు మదిఁ జిత్తగింపవే పార్థివేంద్ర. 144

అ. దేవ = దేవరా, నేఁటితుదకున్ = నేఁటివఱకును, తావ ... తలమునన్ — తావక = నీదయిన, కరుణాసుధావిశేష = కృపయనెడి యమృతవిశేషముచేత, పోషిత = పోషింపఁబడిన, అశేష = సమస్తమయిన, సద్వీప = ద్వీపములతోఁగూడిన, భూతలమునన్ = భూమియందు - అనఁగా దయతోఁ బాలించుచున్న సప్తద్వీపములతోఁగూడిన భూమండల మందనుట. దీనిచే వసురాజు సార్వభౌమత్వము ద్యోతితము. శుచి = అగ్నిహోత్రుఁడు- పరిశుద్ధుఁడని యర్థాంతరము. 'శుచిర్గ్రీష్మాగ్నిశృంగారే ష్వాషాఢే శుద్ధమంత్రిణి, జ్యేష్ఠేచ పుంసధవళే శుద్ధేనుపహతేత్రిషు' మేదిని. దినంబున్ = ప్రతిదినమును, ఇష్టకృత్యము నిర్వహించున్ కాని = ప్రియమయిన కార్యమే చేసి తీర్చునుకాని, మలీమసగతుల్ చూపన్ వెఱచు = కుత్సిత మార్గములను జూప భయపడు నని యర్థము. ఇష్టమనఁగా యజ్ఞము. యజ్ఞకార్యమే నిర్వహించునుగాని గృహారణ్యాదులకుఁ నుపద్రవము సేయుఁడని భావము. అనఁగా దాను ఇష్టకార్యనిర్వాహకుఁడును గృష్ణవర్త్ముఁడును గనుక తనయందలిగుణ మవలంబించి దుర్గుణమును విడిచినాఁడనుట. 'ఇష్టమాశంసితేఽపిస్యాత్పూజితే ప్రేయసి త్రిషు। సప్తతిన్తౌ పుమాన్ క్లీబే సంస్కారే క్రతుకర్మణి' మేదిని. సదాగతి = వాయువు - మంచియాగమనము గలవాఁడని యర్థాంతరము. దాక్షిణ్యమె వహించి = మోమోటమే పూని, తినరున్ కాని = ఒప్పునుగాని, రజోభరభ్రాంతిన్ = రజోగు[illegible]పయుక్తమయిన చాంచల్యముచేత, తిరుగ వెఱచున్ = తిరుగ భయపడునని యర్థము. దాక్షిణ్యమన[illegible] దక్షిణదిక్కునఁ బుట్టుట - దక్షిణదిగ్భవ

త్వము నొంది అనఁగా మలయమారుతమై యుండునుగాని, రజస్సు అనఁగా దుమ్మునగనుక దుమ్ముతోఁగూడి సుడియున్నట్టి సుడిగాలియై తిరుగఁడనిభావము.

మిత్రుఁడు=సూర్యుఁడు-స్నేహితుఁడని యర్థాంతరము. 'మిత్రంసుహృది మిత్రోఽర్కః' అమ. జగతికిన్=జగజ్జనులకు, తేజంబు సమకూర్చున్ కాని=జయప్రయుక్తమయిన తేజమునే యొడఁగూర్చును గాని, చండకరశక్తికిన్=వేండ్రమయిన భుజశక్తితో, తొడరవెలయదు = విలసడవెలయునని యర్థము. తీక్ష్ణమయిన బాహుపరాక్రమము చూపి పయిపెత్తి రాఁడనుట—అంధకారమును దొలఁగించి, తేజమును=ప్రకాశమును, గలిగించునే కాని కిరణములవేఁడిమిని చూపఁడనిభావము. జీవనదంబు=జలమునిచ్చు మేఘము—జీవనప్రదాయకమని యర్థాంతరము. 'జీవనం జర్తనే నీరప్రాణధారణ యోరపి' మేదిని. ధరిత్రికిన్=భూమియందు, కొలుచు నాయమెచూపి=కొలువుగొలిచెడి మరియాదనే చూపి, నిలుచుఁగాని, గర్జింపన్ వెలయదు = ప్రతిభటించి ధిక్కరించి పలుకవెలయునని యర్థము. కొలుచనఁగా ధాన్యము, ఆయమనఁగా వచ్చు బడి-ధాన్యమువచ్చు బడిని కనఁబడఁజేయునే కాని వ్యర్థముగా ఉఱుమదని భావము.

గుణావలంబనమును దోషత్యాగమును అంతట నెఱుంగునది. అనఁగా అగ్నిప్రముఖులు నీదురాజ్యములో తమతమశుచ్యాదినామానుగుణముగా వర్తించినారనుట. నేఁటిదాఁక ఈవిధమున నుండఁగా, ఈక్షణంబునన్ = ఈసమయమందు, నాఁటుకొనపాటు= తొగులుకొన్నకక్తి, పార్థివేంద్ర=రాజాగ్రణీ, మదిన్, చిత్తగింపవే=అవధరింపుము. మహనీయులును దేవతలును నయిన అగ్నిప్రభృతులు పయితము నీయాజ్ఞకు వెఱచుచుండఁగా నేఁడొక్కఁడు వెఱవక చేసిన యవినీతినివినుమని యాశయము. అగ్న్యాదులు వెఱచుటను జెప్పటచే వసురాజు యొక్క ప్రతాపాతిశయము వ్యంజితము.ఇట గుణ మవలంబించి దోషమును త్యజించుటచేతను అగ్న్యాదులు స్వశుచ్యాదినామానుగుణముగా వర్తించుటచేతను వర్ణనీయమగుచున్న రాజప్రతాపాతిశయము గమ్యమగుటంబట్టి ప్రస్తుతాంకుర మలంకారము.

ఉ. అక్కట మిక్కుటంబగు రయంబున నెక్కడనుండి వచ్చెనో
యొక్కనగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహముల్
పిక్కటిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీస్రవంతి పే
రక్కున వ్రాలి యాఁగె భువనావళి నుద్భటవింధ్యవైఖరిన్. 145

అ. అక్కట=అయ్యయో, మిక్కుటంబు అగు= అతిశయము నయిన, రయంబునన్=వేగముచేత, ఎక్కడనుండి వచ్చెనో= ఏస్థలమునుండి వచ్చెనో, ఒక్కనగంబు = ఒక్కపర్వతము, వచ్చి, నినద + ఉద్ధతిన్ = ధ్వనితోఁగూడిన యొగపుచేత, ఒక్కటన్=ఏకకాలమందు, దిక్కటాహముల్ = కటాహములవంటి (కుండబోచ్చెలవంటి) దిక్కులు, పిక్కటిలంగన్ = పూర్ణీభవించునట్లుగా, పెల్లునన్ = ఉద్రేకముచేత, గుభిల్లునన్ = గుభిల్లుమనునట్లుగా, శుక్తిమతీస్రవంతి = శుక్తిమతీనది యొక్క, 'స్రవన్తీనిమ్నగాపగా' అమ. పేరు అక్కునన్ వ్రాలి= పెద్దఱొమ్ముమీఁదవ్రాలి, భువనావళిన్ = లోకసమూహమును అని వింధ్యగిరిపరమయిన యర్థము. ఉద్భటవింధ్య వైఖరిన్—ఉద్భట= హెచ్చయిన, వింధ్యవైఖరిన్=వింధ్యపర్వతమువలె, భువనావళిన్=జలసమూహమును(అని కోలాహలపర్వతపరమయిన యర్థము.) ఆఁగెన్=అడ్డగించెను. ఉపమ. 'భువనావళి' శ్లేషోపస్కృతము.

క. గోత్రాజనవిత్రాసద, గోత్రార్భటి కోర్వలేక ఘూర్ణిలి నదియున్
మాత్రాతీతభయభ్రమ, పాత్రాశయ యగుచు ధాత్రిఁ బదపడి యలమెన్.

అ. గోత్ర యనఁగా భూమి. గోత్రమనఁగా పర్వతము. 'గోత్రంనామ్ని కులేక్షేత్రే గోత్రాభువి గవాంగణే, గోత్రశ్శైలే' నానా. గోత్రాజన=భూజనులకు, విత్రాసద=మిక్కిలి దిగులుపుట్టించు నదయిన, గోత్ర=కోలాహలపర్వతముయొక్క, ఆస్ఫాటికిన్ = అస్ఫాటమునకు, ఓర్వలేక = సహింపఁ జాలక, నదియున్=శుక్తిమతీనదియు, ఘూర్ణిల్లి= గిరగిరఁదిరిగి, మాత్రాతీత = మితిమీఱిన, భయ= భయంకరమగుచున్న, భ్రమ=సుడిగుండములకు, పాత్ర=భాజనమయిన, ఆశయయగుచున్=జలోదర ప్రదేశములుగలదై యనియర్థము. అతిమాత్రమయిన భయభ్రాంతులకు భాజనమయిన, ఆశయ=మనస్సు గలదై యని యర్థాంతరము. ధాత్రిన్-ధాత్రియనఁగా భూమియుఁ దల్లియు, ధాత్రిన్ పదపడి అల మెన్=భూమిని ప్రత్యాసక్తిచేత నప్పళించెనని యర్థము. తల్లిని గౌఁగిలించికొనెనని యర్థాంతరము. 'ధాత్రీజనన్యామలకే వసుమత్యుపమాతృషు' అమ. ఇక్కడ శుక్తిమతీనదియందు భయగ్రస్త బాలికావ్యవహారారోపము చేయుట తెలియుచున్నది. భూజనులకు భయంకరమయిన కోలాహలపర్వతము యొక్క పతనవేగమును సహింపఁజాలక శుక్తిమతీనది తిరుగుడుగాడి వెల్లువపెట్టి భూమి నాచ్ఛాదించిన దని యర్థము. బెట్టిదుఁడయిన కాముకుఁడు బలాత్కారమునఁ బయింబడఁగా, వానికిభయపడి తల్లిని గౌఁగిలించుకొనెనని భావముగమ్యము. అలం. గూఢశ్లేషాంగకమైన సమాసోక్తి.

ఉ. ఏమని చెప్పవచ్చు ధరణీశ్వర యాబలుసేఁగి తన్మహా
భూమిధరోపరోధమునఁ బొంగు నభంగసరిజ్ఝరంబు పై
పై మహియెల్ల నల్లుకొన బల్విడి నందనుబింబితాభ్రరే
ఖామహిమంబు గానఁ దగుఁ గ్రక్కున మిన్నులు వడ్డకై వడిన్. 147

అ. ధరణీశ్వర=వసుమహారాజా, ఆబలుసేఁగి = ఆప్రబలమయిన కీడు, ఏమనిచెప్పవచ్చున్ =ఎంతనిచెప్పఁగూడును - అనఁగాఁ జెప్పనలవిగాదనుట. ఏమనిన - తత్ మహాభూమిధర = మిక్కిలి గొప్పదయిన యాకోలాహలపర్వతముయొక్క, ఉపరోధమునన్ =అడ్డగింపుచేత, పొంగు=ఉప్పొంగు నట్టి, అభంగ = అడ్డులేనట్టి, సరిత్ ఝరంబు=నదీప్రవాహము, పైపైన్ =మీఁదమీఁద, మహి యెల్లన్ =భూమియంతయును, అల్లుకొనన్ = వ్యాపింపఁగా, బల్విడిన్ = త్వరితముగా, అందున్ = ఆవెల్లువయందు, అనుబింబిత...మహిమంబు — అనుబింబిత=ప్రతిఫలించిన, అభ్రరేఖా= ఆకాశస్వరూ పముయొక్క, 'నభస్స్వర్గాంబురేష్వభ్రమ్' నానా. మహిమంబు = అతిశయము, మిన్ను లుపడ్డకైవడిన్=ఆకాశము వచ్చి దానిలోఁబడినట్లుగా, కానఁగన్ =చూడనొప్పను. అనఁగా భూమి యు నాకాశము నేకమయినట్లు వెల్లువయిక్కడ నలుపపెట్టినది. అందువలనఁ గలిగిన యుపద్రవమెంత యో మీరే యూహించుకొన నగునుగాని మాకుఁ జెప్ప నలవిగాదనియాశయము. అలం. ఉత్ప్రేక్ష.

మహిని కొంచెముగాక 'ఎల్ల'ను అల్లుకొనుటచేత నే అభ్రరేఖ కొంతగాక దాని 'మహిమంబు' అను బింబితమయినది. 'మిన్నులుపడ్డ' ననుట జాతీయము. 'పాలిన్నైచిత్తె మిన్నులుపడ్డచోట'(మను) 'మిన్విఱిగిపైఁబడినట్టు'(తారాశశా)ఇత్యాదులందు అత్యంత దుర్నివారమైన ప్రతిరోధమునూచితము. అతి విస్తృతమయిన ఆకాశముపడినట్లు చెప్పుటచే ప్రవాహమునకు అంతటను వ్యాప్త్యతిశయమును దానిచే ఉపద్రవముయొక్క అతిబాహుళ్యమును దెలియునది. 'మిన్నులుపడ్డ' అను జాతీయపు భావ ముచే అప్రమేయభయావేశమును దెలియునది.

సీ. సర్వసర్వంసహాచక్రంబు జడమయ్యె, గ్రామములు భంగసంగతము లయ్యె
నాలయవ్రాతంబు లవనశూన్యము లయ్యె, సాలములు కాండశేషంబు లయ్యె

వివిధజంతువితానక్ విహృతి వారితమయ్యె, వస్తుజాతములెల్లఁ బంకలయ్యె
నరలోకమెల్లఁ గంఠగతజీవనమయ్యెఁ, గలమంబు లప్ప్రాప్తఫలము లయ్యెఁ
తే. దోఁటచేనుకోటారంబుల్ దొడ్డియనెడు, నాసలన్నియునిసుమంత లయ్యెస్వామి
పాదపద్మంబు లీక్షించుభాగ్య మునికిఁ, దప్పి వచ్చితి మేము గోత్రాతలేంద్ర.

అ. గోత్రాతలేంద్ర=రాజా, సర్వ...మయ్యె—సర్వసర్వంసహాచక్రంబు = సమస్తమయిన భూపలయమును, జడమయ్యెన్ = స్తబ్ధమయ్యెను - అనఁగా అడఁగియున్నదయ్యెనని యర్థము 'లడయోరభేదః' అనుటంబట్టి జడమనఁగా జలమునగునుగనుక జలమయ్యెనని యర్థాంతరము. భూమండలమంతయు జలమయ్యెననుట. గ్రామములన్ =ఊళ్లు, భంగసంగతములయ్యెన్ = వైకల్యముతోఁగూడినవయ్యెను - భంగమనఁగా తరంగముగనుక - తరంగముతోఁ గూడినవయ్యెనని యర్థాంతరము. ఆలయవ్రాతంబులు=గృహసమూహములు, అవనశూన్యములయ్యెన్ = అవనమనఁగా రక్షణము- రక్షాశూన్యములాయెను - వనమనఁగా ఉదకము. వనశూన్యములుగానివి అవనశూన్యములు - అనఁగా జలయుక్తములయ్యెనని యర్థాంతరము. సాలములన్ =వృక్షములు 'అనోకహఃకుటస్సాలః' అమ. కాండశేషంబులయ్యెన్ = బోదెలుమాత్రము మిగిలినవాయెను - కొమ్మలు మొదలగునవిపోయి వట్టి బోదెలుమాత్రమే నిలిచియున్నవనుట - కొమ్మలువిఱిగి మోళ్లయ్యెనని యర్థము. జలశేషములాయెనని అర్థాంతరము. వివిధ ..విహృతి—వివిధ=నానావిధములయిన, జంతువితాన = ప్రాణిసమూహము యొక్క, విహృతి = విహారము, వారితమయ్యెన్ = నివారింపఁబడినదయ్యెను - వారితమయ్యెన్ =సంజాతవారి యయ్యెనని యర్థాంతరము. వస్తుజాతములెల్లన్ =వస్తుసమూహములన్నియును, పంకలయ్యెన్ =నానానదీగతములాయెను- పంకయనఁగా నదియు - వస్తువులన్నియు నదులై ప్రవహించెనని యర్థాంతరము. నరలోకమెల్లన్ = జనసమూహమంతయు, కంఠగతజీవనము=కంఠగతప్రాణము అయ్యెను—జీవనమనఁగా జలముగనుక కుత్తుకబంటినీరు గలదయ్యెనని యర్థాంతరము. కలమంబులు=వరిపైరులు, అప్ప్రాప్తఫలములయ్యెన్ =నష్టములయినఫలములుగలవయ్యెను. అప్పులనఁగాజలములు -జలప్రాప్తఫలములయ్యెను - అనఁగా జలములందు మునిగిపోయెనని యర్థాంతరము. అ+ప్రాప్తఫలములు, అప్+ప్రాప్తఫలములు అని రెండర్థములందు నూపము 'అంచిచ' అను సూత్రముంబట్టి 'దానవద్విరద' (౧ఆ.౭పద్య) అనుచోటంబోలె పకారద్విత్వము సాధువని తెలియునది.

తోఁట ..యనెడు = ఇదితోఁట ఇదిచేను ఇదకొటారు ఇదదొడ్డి అనునట్టి, ఆసలన్నియున్ =ఆశలెల్లను, ఇసుమంతలయ్యెన్ = కించిన్మాత్రములయ్యెనని యర్థము.—ఇసుకమయములయ్యెనని అర్థాం. స్వామి పాదపద్మంబులీక్షించు భాగ్యమునకున్ =దేవరవారి పాదారవిందములు దర్శనము చేయునట్టి భాగ్యము గలిగియున్నందున, ఏము తప్పివచ్చితిమి= మేమాయాపదకుఁదప్పి ప్రాణములతో వచ్చినారము. ఇక్కడ రెండర్థములును ప్రకృతములుగాన ప్రకృతశ్లేషమలంకారము.

మ. అనుచున్ వారలు విన్నవించుటయు లోకానీక రక్షాకళా
కనదుత్సాహరసచ్ఛవిస్ఫురణమై కన్దోయిఁ గెంపెక్క దా
నొక్కన నుర్వీజనదైన్యభంజనఘనభ్రూభంగభంగీ వినూ
తనశక్రధ్వజ ముప్పవిల్ల ఖలగోత్రధ్వంసనోదగ్రుఁడై. 149

అ. అనుచున్ =ఈప్రకారమున, వారలు, విన్నవించుటయున్ =విజ్ఞాపనము చేయఁగా, లోకానీక ...స్ఫురణమైన్ —లోకానీక =జనసమూహముయొక్క, రక్షాకళా=రక్షించుకార్యమందు, కనత్ =

ప్రకాశించుచున్న, ఉత్సాహరస=ఉత్సాహరసముయొక్క, ఛవి=కాంతియొక్క - ఇచట వీరరసము నకు స్థాయియైన యుత్సాహమని తెలియునది. వీరరస మెఱ్ఱనిదని కవిసమయముగావున వీరరసముయొక్క అరుణవర్ణమే యుత్సాహపువర్ణమును; కాన దాని ఛవియనఁగా అరుణచ్ఛవి, దానియొక్క, స్ఫురణమై=తోఁపికయై-దాని స్ఫూర్తియో యనునట్లుగా ననుట, కన్దోయిక్=కన్నులరెంటియందు, కట్టెఱ్ఱ కార్కొనన్=మిక్కిలి యెఱుపుపయికొనఁగా, ఉర్వీ...ధ్వజము—ఉర్వీజన = భూజనుల యొక్క, దైన్య=దీనత్వమును, భంజన=పోఁగొట్టుటయందు, ఘన =దట్టమయిన, భ్రూభంగభంగీ= బొమముడియొక్క తీరనెడి, నూతనశక్రధ్వజము=క్రొత్తయింద్రధ్వజము-క్రొత్తగా నెత్తఁబడిన యిం ద్రధ్వజమనుట- ఇంద్రధ్వజమనఁగా ఉత్సవకాలమందు వస్త్రముగట్టి నిలుపునట్టి ధ్వజము, భాద్రపద శుక్ల ద్వాదశియందెత్తంబడు ధ్వజమని కొందఱు-ఇది యుత్సవాదుల ప్రారంభమునకు సూచకముగా నెత్తంబడును. అపుడు జనులు చూచి సొంపునొందుదురు.

'పురుహూతధ్వజస్యేవ తస్యోన్నయనపఙ్క్తయః ।
నవాభ్యుత్థానదర్శిన్యో ననందు స్సప్రజాః ప్రజాః' రఘువంశము.

ఇంద్రధ్వజమును గ్రొత్తగా బయికెత్తునపుడు జనులు సొంపునొంది యుత్సవముకలుగునని తలఁచు నట్లు రాజుబొమ క్రొత్తగాఁబయికెత్తి ముడివేయఁగా జనులు దీనత్వమువిడిచి పర్వతబాధానివృత్తిరూప మయిన యుత్సవముగలుగునని తలంచిరనిభావము. ఖల...దగ్రుఁడై—ఖల=దుర్మార్గుఁడయిన, గోత్ర= కోలాహల పర్వతునియొక్క, ధ్వంసన=నశింపఁజేయుటయందు, ఉదగ్రుఁడై=ఉద్యుక్తుఁడై. ముందటి పద్యముతో నన్వయము. ఖలగోత్రమనఁగా దుష్టవంశములనియు నర్థముగాన దుష్టవంశ్యులను ధ్వంసము సేయువాఁడైయనియు భావము వ్యంజితము. 'కట్టెఱ్ఱదార్కొన' ఎఱుపు గదిరినకంటిపయి నెత్తఁ బడినబొమలు, ఎఱ్ఱపట్టు వస్త్రము గట్టఁబడిన యింద్రధ్వజమువలె నుండెను.

'యష్టించ వైణవీం తస్మై దదౌ వృత్రనిషూదనః'
తస్యాః శక్రస్య పూజార్థం భూమౌ భూమిపతి స్తదా। ప్రవేశం కారయామాస సర్వోత్సవపరం తథా॥
మార్గశీర్షే మహారాజ పూర్వపక్షే మహామఖమ్। తతఃప్రభృతి చాద్యాపి యష్టేః క్షితిపసత్తమైః॥
ప్రవేశః క్రియతే రాజన్ యథా తేన ప్రవర్తితః।అపరేద్యుస్తతస్తస్యాః క్రియతేఽత్యుచ్ఛ్రయోనృపైః॥
అలంకృతాయాఃపిటకైర్గంధమాల్యైశ్చభూషణైః।మాల్యదామపరిక్షిప్తాంద్వాత్రింశత్కిష్కుసమ్మితామ్॥
ఉద్ధృత్య పిటకే చాపి ద్వాదశారత్నికోచ్ఛ్రయే।మహారజనవాసాంసి పరిక్షిప్య ధ్వజోత్తమమ్॥
వాసోభి రన్నపానైశ్చ పూజితైర్బ్రాహ్మణర్షభైః।పుణ్యాహం వాచయిత్వాథధ్వజఉచ్ఛ్రియతేతథా॥
శంఖభేరీ మృదఙ్గైశ్చ సన్నాదః క్రియతే తథా'' (మహాభారత)

ఆయుత్సవమపుడు ప్రజల యుల్లాసము.

'నానావిధానిదానానిదత్వార్థిభ్యఃసుపూజనైః। అలంకృత్వామాల్యదామైర్వస్త్రైర్నానావిధైస్తథా
దృతిభి స్స్వజనైః సర్వే క్రీడిత్వా నృపశాసనాత్।సభాజయిత్వా రాజానం కృత్వా నర్మాశ్రయాః కథాః॥
రమన్తేనాగరాఃసర్వే తథా జానపదైస్సహ।సూతాశ్చ మాగధాశ్చైవ రమన్తే నటనర్తకాః'॥
'ఏవ జానపదాస్సర్వే చక్రు రింద్రమహం మహాత్' అని యున్నది.

ఇట 'మహారజనవాసాంసి' అని కుసుమయద్దినయెఱ్ఱనివస్త్రములను గట్టుటను జెప్పుటచే నిట కట్టెఱ్ఱ దార్కొన్నకంటిబొమల నిక్కునకును మహారజనవాసముగట్టిన యింద్రధ్వజము నెత్తుటకును బోలిక దెలియునది. ఆయింద్రధ్వజోత్సవమువలని ఫలమును

'యేపూజయిష్యన్తి నరారాజానశ్చమహంమమ। కారయిష్యన్తిచముదాయథా చేదిపతేర్నృపః॥
తేషాం శ్రీర్విజయశ్చైవ సరాష్ట్రాణాం భవిష్యతి। తథా స్ఫీతో జనపదో ముదితశ్చ భవిష్యతి॥
నిరీతికాని సస్యాని భవన్తి బహుధా నృప। రాక్షసాశ్చ పిశాచాశ్చ నలుంపన్తే కథంచన'॥
అనియున్నది. కావుననే యిట్టి యింద్రధ్వజము నెత్తుటయందు ప్రజలయుబ్బు.

క. నరవరుఁ డభయం బొసఁగుచు, హరిరథనిరసనమనోరయంబున నరిగెం
గరిభరణకరణపరిణత,కరుణాపరిణాహి యగు జగత్పతి లీలన్. 150

అ. నరవరుఁడు=వసురాజు,అభయంబు ఒసంగుచున్=ప్రజలకు అభయప్రదానముసేయుచు, హరి...రయంబునన్—హరిరథ=విష్ణువు రథమయిన గరుత్మంతుని, లేక హరియనఁగా ఇంద్రుఁడు గనుక నింద్రరథమయిన మేఘమును-లేక హరియనఁగా జింక గనుక జింకవాహనముగాఁగల వాయువును,లేకహరి యనఁగా సూర్యుఁడుగనుక సూర్యరథమును, నిరసన=తిరస్కరించునట్టి, మనోరయంబునన్=మనోవేగముచేత, అరిగెన్=(కోలాహల పర్వతము నెగఁజిమ్ముటకు) పోయెను. ఎట్లనినన్ - కరి ..పరిణాహి— కరి=గజేంద్రునియొక్క, భరణకరణ = రక్షణసేయుటయందు, పరిణత = పరిపక్వమయిన-సిద్ధమయిన యనుట, కరుణా=కృపయొక్క-పూర్ణమును సన్నద్ధమునయిన కరుణయొక్క, పరిణాహి=విశాలతగలవాఁడు-కరుణా బాహుళ్యముగలవాఁడనుట, అగు, జగత్పతిలీలన్ = నారాయణునివలె అరిగెనని యన్వయము. ఇచట జగత్పతిశబ్దము విష్ణువునకును వసురాజునకును వాచకమగుటంగాన ఆజగత్పతివలె నితఁడును జగత్పతిగాన కరుణాపరిణాహియై యభయంబొసఁగుచు నరుగుటయుక్తమే యని వ్యంజితము. అలం. ఉపమ.

సీ. దశనశంబముల దుర్ధరమహీధరకూట, కోటి నుగ్గులు సేయుకుంజరములు
ఖురధూతగురుధూళి శరధిలీననగాళి, మట్టు దట్టించునారట్టజములు
పటుచక్రచంక్రమాస్ఫుటిఁ గొండ లవియించు, సమిదభంగశతాంగశతశతంబు
లెత్తువడ్డమహాకుభృత్తుల నతులిత, ధృతిఁ జేకొఁ గొనని ధీరభటులు

తే. తడయకప్పుడుపతివెంటఁ దవిలినడువ,నమరుబృంహితహేషితఘుమఘుమితభు
జాసమాస్ఫాలితంబులఁ జడికి నడిఁకి, కులశిఖరమండలము గలగుండు వడియె.

అ. దశనశంబములన్—దశన=పంతములనెడు 'రదనాదశనాదన్తాః' అమ. శంబములన్ = వజ్రాయుధములచేత, 'శతకోటిస్స్వరుశ్శంబోదంభోళిరశనిర్ద్వయోః' అమ. దుర్ధర=ధరింపశక్యముగాని, మహీధర=పర్వతములయొక్క, కూటకోటిన్ =శిఖరసమూహములను, నుగ్గులుసేయు=పొడిపొడిగాఁజేయఁ జాలిన, కుంజరములు = ఏనుఁగులును 'మతఙ్గజోగజోనాగః కుఞ్జరోవారణఃకరీ' అమ. ఖుర=గిట్టలచేత, 'శఫంక్లీబేఖురఃపుమాన్' అమ. ధూత = ఎగురఁగొట్టఁబడిన, గురు=అతిశయించిన, ధూళిన్ = దుమ్ముచేత, శరధి=సముద్రమందు, లీన = దాఁగియున్న, నగ+ఆళి=పర్వతసమూహముయొక్క, మట్టున్ దట్టించు=మట్టుపెట్టు - అడంచునట్టి-మాటును. (పాఠాం. గుట్టున్ =మర్మమును, ధట్టించు = భేదించునట్టి), ఆరట్టజములు=ఆరట్టదేశసంభవములయిన గుఱ్ఱములును, అనఁగా ఆగుఱ్ఱములు గొరిజలవలన నెగసినధూళి సముద్రములోఁబడి నీళ్లనింకింపఁగా నందు దాఁగియున్న పర్వతములన్నియు బయటఁబడుచున్నవని తాత్పర్యము. పూర్వపాదమున దశనములు శంబముల వంటివిగానపర్వతసమూహము నుగ్గులుసేయఁ జాలు!నని భావము

పటు...ర్భటిన్—పటు=పటువయిన, చక్ర = బండికన్నులయొక్క, చంక్రమ = దూఁకుడు వలనఁ బుట్టిన, ఆర్భటిన్ = ఘోషముచేత, కొండలు = పర్వతములను, అవియించు...తంబు—అవియించు = బ్రద్దలు సేయఁజాలిన, సమిత్ = యుద్ధమందు, అభంగ=పరాజయములేని, శతాంగ= రథములయొక్క, శతశతంబులు = నంపవంపలును - అనఁగా నంపలకొలఁదిని—లెక్కలేని రథములు ననుట, ఎత్తువడ్డ మహాకుభృత్తులన్ = లేవలేక యెత్తుపడిన మహాపర్వతములను, అతులితధృతిన్ = ఎనలేనిధైర్యముచేత, చీరికిన్ కొనని = ఎంతమాత్రము లక్ష్యపెట్టని - చీరియనఁగా నలుసు-మిక్కిలి యల్పాంశము. 'ఒకచీరియుఁబంచి యిత్తునె' అని ఉద్యోగపర్వము. కొనుట యనఁగా లక్ష్యపెట్టుట 'లక్షణకుమారుఁడు కొనఁడరాతుల నధిపా' ఉద్యోగపర్వము. శబ్దరత్నాకరమున 'చీరి' వస్త్యంతముగనే కనఁబడుచున్నదని యున్నది. కాని ప్రథమాంతముగను జూపట్టుచున్నది. కొనుధాతువునకుఁ బ్రత్యేకముగా 'లక్ష్యపెట్టు' అనియర్థముగలదు. ధీరభటులు=ధైర్యవంతులయిన కాలిబంట్లు, ఎత్తువడ్డ మహాకుభృత్తులనుచో పర్వతములు నగములుగనుక ఉన్నచోటనుండి లేవ నేరవనిభావము. ఎత్తువడుటయనఁగా చెడుట 'పరిభ్రమఁదెత్తువడి శుష్కభూముఁడై' యని ప్రయోగము. చెడినట్టి పర్వతముల ననియు నర్థము చెప్పవచ్చును. ధైర్యమందుఁ బర్వతముతో సాటి కవులు చెప్పుదురు. ధృతి అనఁగా పర్వతమువలె నెందులకుఁ జలింపక దిటగలిగి యుండుట - అదియె శోకహర్షాదులచే మనోవికారము నొందకుండుట.

తడయక=జాగుసేయక, అపుడు = ఆసమయమందు, పతివెంటన్=వనురాజువెంబడిగా, తవిలి నడవన్=అంటినడవఁగా, అమరు=ఒప్పుచున్న, బృంహిత=ఘీంకారములయొక్కయు, హేషిత=సకిలింతలయొక్కయు, ఘుమఘుమిత=ఘుమఘుమ ధ్వనులయొక్కయు, భుజాసమాస్ఫాలితంబుల = భుజములప్పళించెడు మల్లవచుపులయొక్కయు ననిక్రమము, జడికిన్=అంతునకు, నడిఁకి=భయపడి, కులకుధరమండలము=చుట్టునున్న కులపర్వత సమూహము, మండలశబ్దము వలయముగానున్న దానినే వచించును గావ భూమిచుట్టు నున్నకులపర్వతసమూహము ననుట. కలగుండుపడియెన్=ఆకులత్వము నొందెను. ఇందు 'హస్త్యశ్వరథపాదాతం సేనాంగం స్యాచ్చతుష్టయమ్' అని చెప్పఁబడిన చతురంగబలమును జెప్పి చతురంగబలమునకును బర్వతనిర్భేదన నిపుణత్వమును గలుగఁజెప్పినాఁడు గనుక అట్టిపరికరసంపత్తియు మీఁదఁజెప్పబడు కోలాహలపర్వతనిర్భేదనమునకు నత్యంతసహకారమగుట సూచితము. ఇది ముద్రాలంకారము. 'సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైఃపదైః' అని తల్లక్షణము.

చ. అంత ననంతవేగభుజగాంతకుఁ డమ్మహికాంతుఁ డాశ్రిత
స్వాంతము సంతసిల్ల సురచారణసన్నుతి పర్వ నవ్వనా
భ్యంతరరోధకం బగుమహాద్రి సఖంబున మీటె సంభ్రమ వి
భ్రాంతము గాఁగ దుందుభికబంధము మీటినరాముకై వడిన్. 152

అ. అంతన్ = పిమ్మట, అనంత...గాంతకుఁడు—అనంత = కొలఁదిలేని, వేగ = వడియందు—గమనత్వరయందు, భుజగ అంతకుఁడు = (సర్పములకు యముఁడయిన) గరుత్మంతుఁడు అని రాజపరమయిన యర్థము. అనంతవేగముగల వాహనమయిన భుజగాంతకుఁడు గలవాఁడని శ్రీరామపరమయిన యర్థము. అమ్మహికాంతుఁడు = ఆవసురాజని యర్థము - ఆవిష్ణుదేవుఁడని యర్థాంతరము. ఆశ్రితస్వాంతము=ఆశ్రయించినజనుల హృదయములు, ఇట స్వాంతమని బహుత్వమం దేకవచనము, సంతసిల్లన్= సంతోషింపఁగా - ఆశ్రయించిన సుగ్రీవునిహృదయము సంతోషింపఁగా నని యర్థాంతరము. సురచారణసన్నుతి = దేవతలయొక్కయు చారణులయొక్కయు స్తోత్రము, పర్వన్ = వ్యాపింపఁగా,

అవ్వనాభ్యంతరరోధకంబు - వనమనఁగా ఉదకమును అరణ్యమును, 'వనేసలిలకాననే' అమ. ఆశుక్తిమతీ నది జలాభ్యంతరము నడ్డపెట్టుచునది—అనఁగా జలములకు నడ్డకట్టయినది యని యర్థము. అరణ్యమున కడ్డకట్టయినదని యర్థాంతరము. మహాద్రిన్ = గొప్పదయిన కోలాహలపర్వతమును, అభ్రవిభ్రాంతముగాఁగన్ = మింటియందుఁ దిరుగుడుపడునట్టుగా - మింటికి సుడివడుచు నెగయు నట్లుగాననుట. దుందుభికబంధమున్ = దుందుభియనెడు రాక్షసునియొక్క మొండెమును, మీటిన రాముక్రైవడిన్ = చిమ్మినరఘురామునివలె, నఖంబునన్ = కాలిబొటనవ్రేలి గోటిచేత, మీటెన్ = చిమ్మెను. తొల్లి రాముఁ డరణ్యము నడ్డగించియున్న దుందుభి రాక్షసుని కళేబరమును కాలి బొటనవ్రేల మింటి కెగయునట్లు చిమ్మినరీతినే వసురాజును నదీజలముల నడ్డగించియున్న యాపర్వతమును నావ్రేలనే యట్లే యెగయునట్లు చిమ్మెను. శ్లేషానుప్రాణిత మయినయుపమాలంకారము.

క. వసురా జయ్యెడ బలవ, ద్విసృమరపాదప్రసారదీర్ణాచలుఁడై
యెసఁగఁగ వసుధాపరికీ, ర్ణసరిన్నిర్ఝరము తత్క్షణంబునఁ దిగిచెన్. 153

అ. వసురాజు = వసురాజని యర్థము. వసువులకు అనఁగా రశ్మిపటలమునకు రాజయిన సూర్యుఁడని యర్థాంతరము. అయ్యెడన్ = ఆసమయమందు, బల...చలుఁడై—బలవత్ = మిక్కిలి బలముగల, విసృమర = వ్యాపించుగుణముగల, పాద = చరణముయొక్క, ప్రసార = చాఁచుటచేత- అనఁగాఁ జిమ్ముటచేత, దీర్ణ = బ్రద్దలుగాఁ జేయఁబడిన, అచలుఁడై = పర్వతముగలవాఁడై యని రాజపరమయిన యర్థము. బలవత్ = మిక్కిలి బలిమిగల, విసృమర = వ్యాపనశీలమయిన, పాదప్రసార = కిరణముల ప్రసరణముచేత, 'పాదారశ్మ్యంఘ్రితుర్యాంశాః' అమ. దీర్ణ = నెఱియలు విచ్చునట్లుగాఁ జేయఁబడిన, అచలుఁడయి - అచలయనఁగా భూమి. 'భూర్భూమిరచలానన్తా' అమ భూమిగల వాఁడయియని సూర్యపరమయిన యర్థము. ఎసఁగఁగన్ = ఒప్పుచుండఁగా, వసుధా = భూభాగమందు, పరికీర్ణ = వ్యాపించిన, సరిత్ = శుక్తిమతీనదియొక్క, నిర్ఝరము = ప్రవాహము, తత్క్షణంబునన్ = ఆక్షణమందే, తిగిచెన్ = ఈడ్చుకొనెను- తీసిపోవఁజేసెనని యర్థము. భూచక్రమందు వ్యాపించియున్న నదులప్రవాహము తీసిపోయెనని యర్థాంతరము. సూర్యునివేఁడిమికి భూమి బ్రద్దలు వాఱుటయు నదీప్రవాహము లింకిపోవుటయుఁ బ్రకటము. వసురాజు మిక్కిలి బలముగల తనపాదమునుజాఁచి యాకోలాహలుని బ్రద్దలువాఱ నొగఁజిమ్మఁగా నంతకుమునుపు భూమియంతయు వెల్లువగట్టియుండిన శుక్తిమతీజలప్రవాహము తోడనే మరలి తీసిపోయెనని తాత్పర్యము. ఇచటఁ బ్రాచీనులమతమున శబ్దశక్తిమూలధ్వని; నవీనులమతమున ప్రకృతాప్రకృతశ్లేషము.

శా. మొక్కల్ వోయిన తెక్కుమొక్కగమితోన్ మూర్ఛాలసత్వంబుతోఁ
జిక్కుల్ వడ్డ లతాద్రుమావలులతోన్ శీర్ణోపలశ్రేణితో
నక్కోలాహల ముర్వి వ్రాలియును నెయ్యం బొప్ప నయ్యేటికే
గ్రుక్కిళ్ మ్రింగుచు నుండె నండనె వసుక్షోణీధవత్రస్తమై. 154

అ. అక్కోలాహలము = ఆకోలాహలపర్వతము, మొక్కల్ వోయిన = తునుకలయిన, తెక్కుమొక్కగమితోన్ = మొలకలవంటి తెక్కులగుంపులతోడ - వాఁడితఱిఁగి మోటువడిన తెక్కులగుంపులతోననుట, మూర్ఛా+అలసత్వంబుతోన్ = మూర్ఛవలనఁబుట్టిన దుర్బలత్వముతోడను, చిక్కుల్ పడ్డ లతాద్రుమ+ఆవలులతోన్ = తాఱుమాఱుగా పెనఁచుకొన్న తీఁగలయొక్కయు చెట్లయొక్కయు సమూహములతోడను, శీర్ణ ఉపలశ్రేణితోన్ = జాఱిన బండలయొక్క సమూహముతో, ఉర్విన్ = భూమిపయిని, వ్రాలియును, నెయ్యంబు ఒప్పన్ = ప్రేమమీఱఁగా, అయ్యేటికే = ఆశుక్తిమతి నిమిత్తమే, గ్రుక్కిళ్ మ్రింగుచు = గుటకలు మ్రింగుచు—ఇష్టవస్తుప్రాప్తియందలి మిక్కుటమయిన యార్తి

చేత నోరు గుటకలు మ్రింగుట సహజము. వసుక్షోణీధవత్రిస్తమై = వసురాజుచేత దిగులు పెట్టఁబడినదై అండనె = సమీపమందే, ఉండెన్ = నిలిచియుండెను.

తా. ఆకోలాహలపర్వతము తన రెక్కలన్నియు నొక్కులువోయి పట్టమోడుపై మిగులఁగా మూర్ఛవలన సత్తువదూలఁగా, తనయందలి మ్రాఁకులును తీఁగలను తాఱుమాఱై యొండొంటితో గజిబిజిగాఁ బెనఁచుకొనఁగా, తనయందలి త్రాలు నోర్గపోనఁగా నేలపయి నొరగియు నలఁపువిడువక నాశుక్తిమతినదికొఱకే యార్తితో గుటకలు మ్రింగుచు, వసురాజు దిగులు పెట్టుటచేత బలవంతముగాఁ బయికొనఁజాలక సమీపమందే యూరకపడియుండెను.

'గ్రుక్కిళ్ మ్రింగుచున్' బహువచనము పరంబగునపు డాదేశమగు నలఘురేఫమాత్రము క్రియాపదంబులు పరములగుచో శేషించుట 'పసివాళ్ వాడుచు' నిత్యాది ప్రాచీనకవి ప్రయోగములందుఁ గానఁబడుచున్నది. పసివాళ్లు వాడి యెంతయు, వసంతసమయంపు టెండ (కళా. పూ) పసివాళ్వాడుచు వచ్చెఁ జూడుము చెలీ వారాంగనారత్నమున్.' 'నంపమామచలులు, కెంపుమోవుల సుధకు గ్రుక్కిళ్లు మ్రింగ (తారాశ).

ఉ. పోటసబంతి మీటుగతి భూవరుఁ డంఘ్రినఖాంచలంబునన్
మీటిన గట్టు బిట్టెగసి మేదిని వ్రాలుఘనస్వనంబునన్
హాటకశైలకూటకటకాలిఁ బ్రతిధ్వని పర్వె నా నభో
వాటి నెసంగె నంత సురవారవధూమురవారవార్భటుల్. 155

అ. భూవరుఁడు = వసురాజు, పోటసబంతిన్ మీటుగతిన్ = పూలచెండు నెగమీటినట్లుగా, అంఘ్రి నఖ అంచలంబునన్ = కాలిగోటికొనచేత, మీటినన్ = ఎగమీటఁగా, గట్టు = కోలాహలపర్వతము, బిట్టు ఎగసి = మిక్కిలియు ఎగసినదై, మేదినిన్ = భూమిపయిని, వ్రాలు ఘనస్వనంబునన్ = పడెడు గొప్పధ్వనిచేత, హాటక ... కాలి—హాటకశైల = మేరుపర్వతముయొక్క, కూట=శిఖరములయొక్క, కటక = చరులయొక్కయు, 'కటకోఽస్త్రీ నితమ్బోఽద్రేః' అమ. ఆలి=సమూహమందు, ప్రతిధ్వని పర్వెన్ నాన్ = మాఱుమ్రోఁతపుట్టెనోయన్నట్లుగా, అంతన్ = ఆమీఁదట, సురవార ... ర్భటుల్— సురవారవధూ = దేవతావేశ్యలయొక్క—అనఁగా రంభాదులయొక్క, మురవ = ( మురః చర్మపటికా సంవేష్టనం తంవాతి గచ్ఛతీతి మురవః ) మృదంగములయొక్క, ఆరవ=ధ్వనియొక్క, ఆర్భటుల్ = ఆర్భాటములు, నభోవాటిన్=ఆకాశప్రదేశమందు, ఎసఁగెన్ = అతిశయించెను.

వసురాజు వీరకృత్యమునకై మెచ్చినరంభాదుల మద్దెలధ్వనిని కోలాహలుని పాటునఁబుట్టిన మేరుకూటకటకములందలి ప్రతిధ్వనిగా నుత్ప్రేక్షించుటచే మేరుశిఖరములు మింటి నంటుచున్న వగుటయు అవి దేవతావాసములగుటయు సూచితములు. మింటఁ జెలంగిన మహాధ్వనిని కోలాహలపతనవేగమువలని మేరుకూటప్రతిధ్వనిగా నికర్షాతిశయమును వసురాజవిక్రమప్రయుక్తమయిన రంభాదిమృదంగరవార్భటిగా ఉత్కర్షాతిశయమును పర్వతవసురాజులకుఁ గ్రమముగా స్ఫురించునట్లు నిబంధించినాఁడు. కోలాహలుఁడు పడినధ్వనికి మింటినొరయుచున్న మేరుశిఖరములందుఁ బ్రతిధ్వనిగలిగినట్లుండెననుటచే. ఆప్రతిధ్వని యాకాశము ముట్టినదియు దానిచే పర్వతపతనముయొక్క యురవడియుఁ దానివలన నెగఁజిమ్మిన వసురాజు బలవిక్రమాతిశయమును వ్యంజితములు. మింట వసురాజకీర్తనపరముగాఁ జెలంగిన రంభాదిమృదంగరవార్భటిని కోలాహలునికి పతనజనితనికర్షాతిశయద్యోతకమగు మేరుకూట ప్రతిధ్వనిగా నుత్ప్రేక్షించుటచే అలం. ఉత్ప్రేక్ష.

క. నావిని పరమాద్భుతకల, నావినివేశమున మించి నవముని యవధా
నావలితనేత్రుఁడై చెలి, నావలికథఁ దెలుపు మనియె నధికప్రీతిన్. 156

అ. నవముని = క్రొత్తముని—వేషముచే క్రొత్తగా మునియైనమంత్రి, నాఁ = అట్లుమంజువాణి చెప్పఁగా, విని, పరమ... వేళమునఁ —పరమ+అద్భుత=మిక్కిలియైన యాశ్చర్యముయొక్క, కలనా = ఒడఁగూడుటయొక్క—మిక్కిలిగా ఒడఁగూడిన యాశ్చర్యముయొక్క, వినివేళమునఁ = ఆవేశముచేత, మించి = అతిశయించి, అవధాన = ఎచ్చరికచేత, ఆవలిత=వికసించిన, నేత్రుఁడై= కన్నులుగలవాఁడయి - అనఁగా వినుటయందలి అత్యాదరముచేత కన్నులు లెస్సగావిచ్చి తేఱిచూచుచున్నవాఁడై యనుట, చెలిఁ = మంజువాణిని, అధికప్రీతిఁ = మిక్కిలిప్రేమచేత, ఆవలికథఁ = తరువాతికథను, తెలుపుము, అనియెఁ = అని యడిగినవాఁడయ్యెను.

—••◆ ఆ శ్వా సాం త ము. ◆••—

శా. వర్ధిష్ణుప్రతిభాపరాశర శరత్స్వర్ధేనువాణీసుధా
వార్ధిస్పర్ధియశోధురంధర ధరాధ్వంసిస్వరుశ్రీమహా
దోర్ధామర్ధివిశేషభాసుర సురస్తోమస్తుతాజిక్షమా
దుర్ధర్షధ్వజినీసముత్కర కరాధూతేందుధారాధరా. 157

అ. వర్ధిష్ణు...పరాశర—వర్ధిష్ణు=వృద్ధినొందుగుణముగల, ప్రతిభా = అప్పటప్పటికి వికాసమునొందునట్టి ('ప్రతిభానవనవోన్మేషశాలినీ' అమ.) బుద్ధియందు, పరాశర= పరాశరముని వైనవాఁడా, శర...ధురంధర—శర = మబ్బుతోడను, స్వర్ధేను = కామధేనువుతోడను, వాణీ=సరస్వతితోడను, సుధావార్ధి=క్షీరసముద్రముతోడను, స్పర్ధి=మచ్చరించెడు, యశః=కీర్తియొక్క, ధురంధర=భారము నువహించినవాఁడా—అనఁగా మబ్బుమొదలయిన తెల్లనివస్తువులను దిరస్కరించిన ధవలమయిన కీర్తిగలవాఁడా యనుట. ధరధ్వంసి=పర్వతములను ధ్వంసముచేయు దేవేంద్రునియొక్క, స్వరు= వజ్రాయుధమువంటి 'శతకోటిః స్వరుశ్శంబః' అమ. శ్రీ = శోభతోఁగూడిన, మహత్ = మిక్కిలి యధికమయిన, దోర్ధామ=బాహుతేజముయొక్క, ఋద్ధివిశేష=సమృద్ధివిశేషముచేత, భాసుర= ప్రకాశించుచున్నవాఁడా, సురస్తోమ=దేవతాసమూహముచేత, స్తుత = స్తోత్రముచేయఁబడిన, ఆజిక్షమా= యుద్ధభూమియందు, దుర్ధర్ష =జయింపనలవిగాని, ధ్వజినీ= సేనలయొక్క,'ధ్వజినీవాహినీసేనా' అమ. సముత్కర=సమూహముగలవాఁడా. కర + ఆధూత - కర=హస్తముచేత - హస్తముయొక్క దాన మహిమచేతననుట, ఆధూత=విదుల్పఁబడిన - తిరస్కరింపఁబడిన, ఇందు=చంద్రుఁడును, ధారాధరా =మేఘములును గలవాఁడా యని కృతిపతి సంబోధనము.

తా. పయిపయి వికసించునట్టి బుద్ధియందుఁ బరాశరమునివంటివాఁడా ! మబ్బు కామధేనువు సరస్వతి పాలసముద్రము మొదలయినవానికంటె ధవలమయిన కీర్త్యతిశయముగలవాఁడా! దేవేంద్రుని వజ్రాయుధమువలె నధికమయిన బాహుప్రతాప సంపత్తిగలవాఁడా ! దేవతలను గొనియాడునట్టి సైన్యసమూహమును యుద్ధరంగమునుంగలవాఁడా! దానముచేత నింద్రుని మేఘమును నిరసించినవాఁడా. అలంకారము. ఉపమ, రూపకము, ప్రతీపము.

క. లజ్జావతీమనోజ ద,లజ్జాతిసుగంధిగుణ కరేలానలినీఖే
లజ్జాలపాద సమరమి, లజ్జాంగలక్షానహాలహాళత్రిపురహరా. 158

అ. లజ్జావతీ,మనోజ= స్త్రీలకు మన్మథుఁడయినవాఁడా,ఇట లజ్జావతీశబ్దముచే ఉత్తమనాయికాత్వమును తన్మూలమున సౌందర్యసంపత్తియు సూచితములనికొందఱు. సౌందర్యవతులయిన యుత్తమనాయికలకు వలపుగొలుపునట్టివాఁడే చక్కనివాఁడు గాన లజ్జావతీశబ్ద సారస్య మూహించునదని

కొందఱు. దలత్ ... గుణ-దలత్=విరియుచున్న, జాతి= జాజిపువ్వువలె, సుగంధి=పరిమలించుచున్న, గుణ=సుగుణములుగలవాఁడా, కలా=విద్యలనెడు, నలినీ=తామరతీఁగలయందు, ఖేలత్=క్రీడించుచున్న, జాలపాద=రాజహంసమయినవాఁడా - విద్యలనెల్ల నాటితేటి యందు వినోదించువాఁడా యనుట— విద్యల సారస్యములనెల్లఁ జక్కఁగాఁ దెలిసి యందు వినోదించువాఁడా. ఒకదానియందు జితశ్రముఁడయినవానికే దానిసారస్యమందు వినోదించుటగలుగును, సమర ... హరా—సమర=యుద్ధమందు, మిలత్=కూడిన- తారసించినయనుట, జాంగల=జాంగలదేశాధిపుఁడయిన మ్లేచ్ఛుఁడనెడు, హాలహాల=కాలకూటమునకు, త్రిపురహరా=రుద్రుఁడవయినవాఁడా-రుద్రుఁడు కాలకూటమునుహరించినట్లు జాంగల తురకనునొక్కుమ్మడి రూపడంచినవాఁడా యనుట. దీనిచే జాంగలఖానుఁడు హాలాహలమువలె భయంకరుఁడును మహాప్రతాపుఁడు ననియు నట్టివాని నవలీలఁగ జయించుటచేఁ గృతిపతియు నసదృశబల పరాక్రముఁడనియు వ్యంజితము. అలం. రూపకములు.

పంచచామరము. వరాహవావదాతవాహ ౹ వాహరాజగర్వశా
ర్వరాహరీశదోర్విటంక ౹ వజ్రపీఠలాలితో
ర్వరాహరీశ వైభవాభిరామభూమ భూమహా
వరాహ వారణాధిరాజ ౹ వారిరాశిమందరా. 159

అ. వర ... వాహ—వర=శ్రేష్ఠమయిన, ఆహవ=యుద్ధమందు, అవదాతవాహ = శ్వేతవాహనుఁడవయినవాఁడా - అర్జునుఁడవయినవాఁడా. వాహరాజ = అశ్వపతియొక్క, గర్వ = దర్పమనెడు, శార్వర=అంధకారమునకు, అహరీశ=సూర్యుఁడయినవాఁడా, దోర్విటంక=భుజప్రదేశమనెడు, వజ్రపీఠ = వజ్రపుఁబీఁటయందు, లాలిత = బుజ్జగింపఁబడిన, ఉర్వరా = భూమిగలవాఁడా, దోర్విటంకము చందనలిప్తముగుటంజేసియు నతిదృఢత్వముఁబట్టియు వజ్రమయమయినపీఁటగాఁ జెప్పుట తెలియునది. భూమి యతని బాహువులందు వజ్రపీఠమునందుఁబోలె స్థిరముగాఁ బాదుకొన్నదని భావము- భూమి లాలితమనుటచే నితనిబాహుపాలనమున మిక్కిలియు సుఖంబొందెననియు వ్యంజితము. హరి+ఈశ = హరిహరులయొక్క, వైభవ=ఐశ్వర్యమువంటి ఐశ్వర్యముచేత, అభిరామ=ఒప్పుచున్న, భూమ=మహత్త్వముగలవాఁడా - రక్షణశిక్షణములందు హరిహరులవలె మిక్కిలియు నొప్పువాఁడా యనియుఁ జెప్పవచ్చును. భూమహావరాహ=భూచక్రమునకు ఆదివరాహమయినవాఁడా- భూమి నుద్ధరించువాఁడా యనుట. ఇందు భూమికి నుద్ధరణమును, వజ్రపీఠలాలిత యనుచో స్థిరావస్థితియు నత్యంతసుఖమును వర్ణించినాఁడని భేదము దెలియునది. వారణ ... మందరా — వారణాధిరాజ=గజపతియనెడు, వారిరాశి = సముద్రమునకు, మందరా = మందరపర్వతమైనవాఁడా - అనఁగా గజపతినిగలంచి నలంచినవాఁడా యనుట. సముద్రమువలె నక్షోభ్యుఁడయిన గజరాజును సయితము గలగుండుపఱిచినాఁ డనుట.

గద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాద సామాసాదిత
సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితా నిర్వా
హక సాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతం
బయిన వసుచరిత్రం బనుమహాప్రబంధము
నందు ద్వితీయాశ్వాసము.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

# వసుచరిత్రము సవ్యాఖ్యానము.

## తృతీయాశ్వాసము.



శ్రీతిరస్కారదక్షిణ
వీక్షాదక్షిణభుజాగ్రసేవిధాత్రీరిపురీ
శిక్షణఫాలేక్షణ శుభ
లక్షణధౌరేయ తిరుమలమహారాయా. 1

అ. శ్రీ...జాగ్ర = లక్ష్మీదేవియొక్కయు, భూదేవియొక్కయు, రక్షించుటయందు, సమర్థమయిన చూపును, కుడిభుజముయొక్క మీఁదిభాగమునుగలవాఁడా, అనఁగా చూడ్కియందు మహాలక్ష్మియు భుజాగ్రమందు భూమియును గలవాఁడాయనుట. చూచినవారిని శ్రీమంతులను జేయుచున్నాఁడనియు భూమిని జక్కఁగా బరిపాలించుచున్నాఁడనియు నాశయము. వివిధ...ఫాలేక్షణ= నానావిధములయిన, శత్రు(రాజు)ల పట్టణములనెడి త్రిపురములయొక్క, శిక్షించుటయందు నొసటికంటివాఁడా (రుద్రుఁడా), శుభ...ధౌరేయ—శుభకరములయిన సాముద్రికలక్షణములను ధరించినవాఁడా! తిరుమలమహారాయా అని కృతిపతింగూర్చి సంబోధనము.

తే. అవధరింపుము శౌనకాద్యఖిల సన్మునీంద్రులకు రౌమహర్షణి యిట్లుపలుకు
మఱియునమ్మాయతపసితో మంజువాణి, మంజువాణీవిలాస సంపదల ననియె.

అ. అవధరింపుము = చిత్తగింపుము అని కృతిపతినిగూర్చి చెప్పట; శౌనక...ద్రులకున్ = శౌనకుఁడు మొదలుగాఁగల సమస్త మునిసత్తములకు, రౌమహర్షణి = రోమహర్షణుని పుత్రుఁడయిన సూతుఁడు, అమ్మాయతపసితోన్ = ఆబూటకపు ఋషితోడ, మంజువాణీ...పదలన్ = ఇంపయిన వాక్కుయొక్క విలాసముయొక్క పెంపుసొంపులచేత - ముద్దుపలుకుల సొబగు మిక్కిలియు పెంపుగులుకునట్లుగా ననుట. మంజువాణి యామాయతపసికిఁ జెప్పినదని తాత్పర్యము - మంజువాణిగాన మంజువాణీ విలాససంపదలు చూపినదని యాశయము.

క. మందారవర్షవర్ధన, బృందారక బృందదుందుభిధ్వనిగర్జా
సందోహ మపుడు నృపజయ, నందితశక్రోపసర్పణం బెఱిఁగించెన్, 3

అ. అపుడు, మందార ... సందోహము—పారిజాతపుఁబువ్వుల వానను వృద్ధిఁబొందించుచు న్నట్టి (అనఁగా పయిపయి మిక్కిలిగురియుచున్నట్టి) దేవతల సమూహములయొక్క, భేరులయొక్క చప్పుడనెడు ఉఱుముల (ఉఱుములవంటి భేరిచప్పుళ్లు) సమూహము. నృప ... సర్వాణంబు—వసురాజు యొక్క (కోలాహలపర్వత భంజనరూపమయిన) జయముచేత సంతోషపెట్టఁబడిన, ఇంద్రునియొక్క రాకను - వసురాజు కోలాహలుని నెగఁజిమ్మిన పీ. కృత్యమును విని యింద్రుఁ డతనికడకు వచ్చుటను, ఎఱింగించినదని యర్థము.

వసురాజు కోలాహలమును కాలిగోటఁ జిమ్మినపుడు దేవతలు గుంపులుగొని కల్పవృక్షపుష్పము లు పయిఁబయిఁగురిసిరనియు దేవదుందుభులు మ్రోసెననియు, ఆధ్వని యింద్రుఁ డిక్కడకు వచ్చు చున్నాఁడని సూచించెననియుఁ దాత్పర్యము. ఇంద్రుఁడు పర్వతమును భంజించువాఁడు గాన తన వలెనె పర్వతభంజనముచేసిన వసురాజునెడ నతనికి సంతోషముపుట్టుట సహజము. 'దుందుభిధ్వని గర్జ సందోహము' ఇంద్రుఁడు మేఘవాహనుఁడుగనుక నతనిరాకను మేఘగర్జనములు దెలుపును. ఇట దుం దుభి ధ్వనిని గర్జలంగారూపించుటచే వాని ధ్వన్యతిశయమును ఇంద్రాగమన సూచనమున కయిన సా మానుగుణ్యమును స్ఫురించుచున్నవి.

సీ. గోత్రవర్గము పాదుకొల్పిన నయశాలి, కరమున శతకోటి గలుగుమేటి
కల్యాణమయధామగరిమ గాంచిన ధన్యుఁ, డహితబలచ్ఛేది యైనజోదు
భూరిసంపదఁ దలపువ్వువాఁడని భోగి, వరసుధర్మావాప్తిఁ బరఁగుసుకృతి
సకలభారముపూనుసైదోడుగలపెద్ద, విద్యాధరుల నేలు వినుతకీర్తి

తే. వేయికన్నులవేల్పు భూవిభుని మెచ్చి, యుచితమగు పారితోషికంబొసఁగవ
ననలుఁడర్కజుఁ డసురేశుఁ డబ్ధిరాజు,ననిలుఁ డర్థేశుఁ డలికలోచనుఁడుఁగో

అ. ఇటసామాన్య రాజపరముగాను ఇంద్రపరముగాను అర్థద్వయము తెలియునది—గో శాలి—(రాజ)గోత్రవర్గము=(గోత్రమనఁగా కులమును పర్వతమును 'గోత్రంకులేబలేనామ్ని గో ధరణీధరే' విశ్వము.) బ్రాహ్మణ క్షత్రియాదులయిన కులముల సమూహమును, పాదుకొల్పిన= రముకాకుండ తమతమ మేరలందు) గట్టిగానిలిపిన, 'తావుకొల్పిన' అని పాఠా. నయశాలి=నీతి ప్పువాఁడు - (ఇంద్ర) పర్వతసమూహముయొక్క ఱెక్కలుఁద్రెంచి వానిని దమతమ స్థాన దలనీక కుదురుకొలిపిన వాఁడనిభావము. కరమునన్ - (రాజ)=చేతియందు, శతకోటి=నూ ధనమును, గలుగు మేటి=గలిగిన గొప్పవాఁడు. శతకోటియనఁగా వజ్రాయుధము గనుక వ జ్రాయుధముగలవాఁడని భావము. కల్యాణ ... గరిమన్—(రాజ) కల్యాణమయ=(కల్యాణ గళమును బంగారమును) మంగళరూపమైన, ధామ=గృహముయొక్క, గరిమన్ = గొప్ప గృహముగలవాఁ డనెడు గౌరవమునఁట), కాంచిన ధన్యుఁడు=పొందిన కృతార్థుఁడు. =బంగారుమయమైన మేరుపర్వతమే, ధామగరిమ=గృహముగాఁగలవాఁ డనుగౌరవమ డని భావము. మేరుపర్వతము దేవతలకు వాసమగుట ప్రకటము. అహితబలచ్ఛేది ఐన ) శత్రుసైన్యమునుఛేదించునట్టి యోధుఁడు— (ఇంద్ర) అహితుఁడయిన బలాసురుని ని భావము. భూరిసంపదన్ = (రాజ) అధికసంపత్తిచేత, తలపువ్వువాఁడనిభోగి = డునంత (మాత్రపు శ్రమమయిన) లేని భోగముగలవాఁడు - (ఇంద్ర) అధికమయి నెప్పుడును వాడకుండెడు కల్పవృక్షపుఁ బువ్వులను దలను ధరించినవాఁడని భావ

వృత్ర పుష్పములు వాడకుండుటకు 'అమ్లానకుసుమమాలికాభిరూప్యము(దాల్చు లలితభుజా తోడ' నని యిందును జెప్పంబడుట తెలియుచున్నది) వరసుధర్మ అవాప్తిన్ (రాజ)=శ్రేష్ఠమును నయిన ధర్మముయొక్క ప్రాప్తిచేత, పర(గుసుకృతి = ప్రవర్తించు పుణ్యాత్ము(డు - శ్రేష్ఠ ధర్మయను పేరిటి సభయొక్క ప్రాప్తిగలవా(డని భావము. 'స్యాత్సుధర్మా దేవసభా' అమ.

శక్రస్యతు సభాదివ్యా భాస్వరా కర్మనిర్మి[తా], విస్తీర్ణాయోజనశతం శతమధ్యర్థమా...
వైహాయసీకామగమా పంచయోజనముచ్ఛ్రితా, జరాశోక సమాపేతా నిరాతంకా శి...
వేశ్మాసనవతీ రమ్యా దివ్యపాదపశోభితా, తస్యాం దేవేశ్వరః పార్థసభాయాం పరమ
ఆస్తే శచ్యా మహేంద్రాణ్యా శ్రియా లక్ష్మ్యాచ భారత. (భార. సభాపర్వ. ...

సకలభారము పూను సైదోడుగల పెద్ద=(రాజ) సమస్తరాజ్య భారమును వహించునట్టి... గల పెద్దవా(డు-(ఇంద్ర)సమస్తభువన భారధురంధరు(డయిన యుపేంద్రు(డు (అన(గా విష్ణు తమ్ము(డు గా(గలవా(డని భావము. విష్ణుదేవు(డు దేవేంద్రునకు( దమ్ము(డగునట్లుగా నదితిగర్భ... మున(జైపుట్టుట ప్రసిద్ధము. విద్యాధరులన్ ఏలువినుతకీర్తి=(రాజ)విద్యావంతులను భరించె... బడుకీర్తిగలవా(డు-(ఇంద్ర)విద్యాధరులనెడు దేవజాతుల నేలుచున్నవా(డనిభావము. 'విద్యా రో యక్షరక్షో గన్ధర్వకిన్నరాః । పిశాచో గుహ్యకస్సిద్ధో భూతో౽మీ దేవయోనయః' ... కన్నులవేల్పు=సహస్రాక్షు(డయిన యింద్రు(డు, భూవిభునిన్=వసురాజును, మెచ్చి, ఉచితవ... రితోషికంబు=తగిన బహుమానమును, ఒస(గన్=ఇచ్చుటకై, వచ్చెను-ఎవరెవరితో(గూడి అనలు(డు = అగ్నిదేవు(డును, అర్కజు(డు = యము(డును, అసురేభ్యు(డు = నైరృతి, ... వరుణు(డు, అనిలు(డు=వాయువును, అర్థేశు(డు=కుబేరుండును, అలికలోచను(డు = నొ... గన్నుగల యీశాను(డును, కొలువన్=కొలిచిరా(గా, వచ్చెనని సంబంధము. ఇచట ... నేలువినుత కీర్తియను పర్యంతము నయశాలి, మేటి, ధన్యుం డిత్యాదులయిన యంత్యపద్యము నిరూపణముగా 'గోత్రవర్గము పాదుకొల్పుట మొదలయినవి ప్రతిపాదించుటజేసె కా... ఇంద్రునకు రాజునకును నభేదాధ్యవసాయము చెప్పంబడుటచే ఇచట నింద్రునియందు న... దులు సమర్థనీయములు. ఆసమర్థనము ఉక్తములగు వర్ణముల కభేదాధ్యవసాయము లేక గ... అతిశయోక్తి స్ఫురించుచున్నది కనుక అతిశయోక్త్యను ప్రాణితమని తెలియునది.

తే. వచ్చి యభివాదనమొనర్చు వసునృపాలు(, గరములాలించి కన్నుల(గొగ...
మందమందార మకరందమధురవచన, రచనల(రవొంద( బలికె( బురంద...

అ. పురందరు(డు=దేవేంద్రు(డు, వచ్చి, అభివాదనము ఒనర్చు వసునృపాలున్= తపేరు చెప్పుచు) మ్రొక్కుచున్న వసురాజును, (అభివాదనమన(గా స్వనామోచ్చారణన... స్కారము సేయుట) కరము=మిక్కిలి, లాలించి=బుజ్జగించి-గారవించి యనుట, కన్నులన్ (కన్నుల(బెట్టుకొన్నా(డనెడి లోకోక్తి ననుసరించి యిచట)కన్నుల(గప్పుకొనియని యర్థ... కొత్తుకొనుట బహుమానాదరప్రేమ గౌరవములకు సూచకము. 'ఇన్నిదినంబులున్ సవతు... గడుగారవంబునం గన్నియ నన్నువల్లభు(డు గన్నుల( గప్పుకొనంగ నుండి'. (పారిజా...

వేయికన్నులుగలవా(డు గనుక నాలింగన వ్యాజముచేత( గన్నుల నలుముకొన్నా... తరము. అమంద...రచనన్ — అమంద=తక్కువకాని, మందార మకరంద=పారిజాతపుష్ప... మధుర=తీయనైన, వచనరచనలు=మాటకూర్పులు, ఇరవొందన్=ఒప్పు(గా, పలికెను. 'కన్ను... వియె' నను లోకోక్తియందు వేయికన్నుల( గప్పికొనియె ననెడి అర్థాంతరముండుటచే శ్లే...

మ. వివిధోర్వీపతులన్ జగన్నుతుల మున్ వీక్షింపమో వారి
పెంపు పరీక్షింపమొ నింపమో చెలిమి యేభూపాలునందైన
భువనత్రాణ పరాయణోద్భటభుజాభూరిప్రభావంబు నీ
జవనాక్షుణబలంబుఁ గంటిమె వసుక్ష్మామండలాఖండలా. 6

అ. వసుక్ష్మామండల + ఆఖండలా = భూమండలమున కింద్రుఁడవు, (ఆఖండలస్సహస్రాక్షః) అయిన వసురాజా, జగత్ + నుతుల్ = లోకులచేతఁ బొగడఁబడిన వారగు, వివిధ ఉర్వీపతులన్ = అనేకులయిన రాజులను, మున్ = మునుపు, వీక్షింపమో = చూడమా-చూచితిమనుట. వారి పెంపు = ఆరాజుల మహత్త్వము, పరీక్షింపమో = విచారించినవారము గామా - విచారించినామనుట. చెలిమి, నింపమో = నిండింపమా - నిండారు స్నేహము సేయపమాయనుట. ఏభూపాలునందయినన్ = ఏరాజునందుఁగాని ఈ...ప్రభావంబున్ — ఈ = ఇటువంటి, భువనత్రాణ = (భువనమనఁగా లోకమును జలమును గనుక) లోకమును గాచుట యందని యర్థము. (శుక్తిమతీ జలరక్షణమందని యర్థాంతరము.) పరాయణ = ఆసక్తిగల, ఉద్భట = ఉద్దండమయిన, భుజా = భు[illegible]
సామర్థ్యమును, ఈ..బలంబున్ — ఈ, జవన[illegible]
(పర్వతము నెగమీటుట యందలి మేని)బలిమిని[illegible]

[పెంపు పరీక్షింపమో యన్నచోట సంధి[illegible]
జడవాచకము గనుక.

'జంగమపదములు దక్క-ధ, రంగల
[illegible] ండ్చుఁ బలి నూ, త్వా[illegible]
అ[illegible] వే నీద్వితీయకుఁ బ్రథమ[illegible]
తస్యాః । [illegible] డపదానాంస్యాత్' అని
[illegible] ంబల్కెడునెడఁ బెం, పె[illegible]
[illegible] కచటతపలకు, గసడదవల[illegible]
అన్న [illegible] బెంపనెడు పదముపైనున్న పరీ[illegible]
వికృతిశబ్దాత్పరతః సాంస్కృతి[illegible]
సూత్రముచేతఁ బెంపనెడు వికృతి[illegible]
యొక్క పకారమునకు వకారాదేశము[illegible]
'సంధిగూర్పంగఁ బ్రథమాంతశబ్దవి[illegible]
గాకు సంబోధనావ్యయకర్మధార[illegible]
అని యీయర్థవిశేషములందు సంస్కృ[illegible]
కనుక నచేతనార్థకమయిన 'పెంపు' అనెడు ప[illegible]
నది. ఉక్తార్థవిశేషములందు వికల్పము చెప్పుట[illegible]
నప్పటికిని సర్వత్ర యతిస్థానమునందు రావని యు[illegible]
'భిన్నపద ప్రథమలపై, నున్నపకార[illegible]
మున్నిజరూపము ప్రాసను, నన్నవ[illegible]
అని వ్రాసియున్నారు. ఈ విషయము మీఁదఁ

'జగన్నుతులన్' అనుటచే కేవలురయిన రాజులనుగాదు, నీవలె జగన్నుతులయినవారినే చూచితిమి. ఊహ చుటయేకాక వారిపెంపెంతయనియు బరీక్షయుఁజేసితిమిగాని నీవంటిరాజును జూడను లేదు. నీయంతటి పెంపును గనలేదనిభావము. అట్టిరాజులతో 'చెలిమినింపమో' యనుటచే వారికంటె నధికుఁడవయిన నీతోడ 'చెలిమినింపఁదగు' నన్నయాశయము వ్యంజితము. వసుత్వా మండలమునకు ఆఖండలుఁడవు; కనుక స్వర్గమునం దాఖండలుండయిన నాకును భూమియం దాఖండలుండ వయిన నీకును చెలిమి మిక్కిలి యనురూపముగాన యవశ్యము కార్యము. 'సమశీల శ్రుత వ్రతులకు, సమధనవంతులకు' భారతము. అనుట యిచట ననుసంధించునది.

చ. సరయనఖాపసారితరసాధర యీధరణీంద్ర కోటిలో
నరయుదుఁ బెద్దగాఁ బృథునరాధిపుఁ గొంత తదీయశక్తి నీ
చరణనఖాంచలంబునకు సాటియె వేయును నేల మద్భుజాం
తర పవిరేఖ నీయడుగునం బడదే శుభలక్షణాకృతిన్. 7

అ. సరయ...రసాధర—సరయ=వేగముతోఁ గూడినట్లుగా, నఖ=కాలిగోటన్రవేలిగోటిచేత, అపసారిత=చిమ్మఁబడిన, రసాధర = కోలాహలపర్వతముగలవాఁడా, వసురాజాయనుట - కాలిగోటిచేతనే పర్వతముల నెగమీటు నీముందట చేతివజ్రముచేతఁ బర్వతములను నెగమీటు నే నెంతమాత్ర ...నిశ్వానుసంధానము గర్భితము. ఈధరణీంద్రకోటిలోన్=భూమి యందు నింద్రులుగా నున్న ...న్న యనుట) ...రాజసమూహములో, పృథునరాధిపున్ = పృథుమహారాజును, ...నుట, పెద్దగాన్ = గొప్పవాఁడని, అరయుదున్= కనుఁగొందును- పదము పృథుశబ్దార్థక మనియును విచారించునది. పృథువు అనఁగా ...నుట 'పృథుస్స్యాన్మహతిత్రిషు, త్వక్పర్ణ్యాం కృష్ణజీరే స్త్రీ' పుమా... దీయశక్తి = అప్పృథుమహారాజుయొక్క సామర్థ్యము, నీచరణనఖ ...కొనకు, సాటియె=సమానమగునా - కాదనుట, వేయును నేల=బహు ...విరేఖ=నాదయిన బాహుమధ్యమందలి (ఱొమ్మునందలి యనియును) ...డుదగానున్న వజ్రమనుట.) శుభలక్షణ ఆకృతిన్ = మహారాజ ...రేఖ రూపముచేత, నీయడుగునన్ = నీపాదమునందు, పడదే=పడ ...కాలికి నమస్కరింపలేదా యనుట. అడుగు అనఁగా

...శమునకును, సమాఖ్యయై యొప్పునడుగు నలికనేత్ర' ఆంధ్రనామసం. ...ం గనుక నీకాలిక్రింది భాగమున వజ్రరేఖారూపమున నున్నదనిభావము. ...నకును వాచకములుగా.

...పవడిఁ బురపురఁబొక్కుచు;నిర్ఘరాంతరముల నిలుచుఁ బోలుచు' (భార.ఆర.) ...నాఁడు. [ఇచట నొకకలయందుఁ దక్కువ నైపుణిగలవారు దానియందుఁ ...యొద్ద, 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' యన్నట్లు పాదములాశ్ర...జము. అట్లె నాచేతనున్న వజ్రాయుధము పర్వతభంజనవిద్యను నెప్పగాఁ గఱచు ...గాశ్రయించియున్నదని యర్థము. అడుగునందు వజ్రరేఖ మహారాజలక్షణముగా ...గాపవజ్రాభా రేఖాః కుర్వన్తి భూపతిమ్' సాముద్రికము. వసురాజునకుఁ ...రేఖ పాదము లాశ్రయించి విద్య గఱప వచ్చినవజ్రరేఖ ( రేఖాకార

అ. దైవతపతి=దేవతలకు రాజు- దేవేంద్రుఁడు, హిత... ఎల్లన్—హిత=ఇష్టులయిన దేవతలయొక్క, మనోరథములెల్లన్ = కోరికలను అన్నిటిని, ఘటింపఁగన్ =సమకూర్చ నట్టియని యర్థము. హిత=హితులయిన రాజులయొక్కయు, సుమనః=('సుమనాః స్త్రీ(స్త్రి)యాంనా ధీరదేవయోః' మేదిని.) పండితులయొక్కయు, కోరికలనెల్ల సమ యని యర్థాంతరము. లోకసన్నుతునకున్ =లోకులచేత పొగడఁబడిన, నీకు, సుమన ఇత్తున్ =(సుమనోరథమనఁగా మంచికోరికయు దేవతావిమానమును గనుక) ఒకమంచికోరిక నిచ్చె (ఒక దివ్యవిమానము నిచ్చెదననియు) ఇట సూచ్యార్థమని గ్రహింపవలయును. లేనియెడ అర్థద్వ నకు అభేదాధ్యవసాయము సేయవలయును. కొమ్ము అటంచు = పరిగ్రహింపుమని, రాజవర్యునకున్ రాజశ్రేష్ఠునకు, అవార్య ... భాసమానము—అవార్య=వారింపనలవికాని, మహత్ =మిక్కుటమయిన అర్యమ=('శూరసూరార్యమాదిత్య ద్వాదశాత్మదివాకరాః' అమ.) సూర్యునివలె, హారి = మనోహ రములయిన, అభీశు=('అభీశుః ప్రగ్రహేరశ్మౌ' నానా.) కిరణములతోడ, సంయుత = కూడుకొన్న మణి=రత్నములచేత, భాసమానము=ప్రకాశించుచున్నది, అగు, ఒక్క విమానమున్, చూపి, యిట్లనె

'యంప్రశంసంతి విద్వాంసో, యం ప్రశంసంతి బాంధవాః। యంప్రశంసంతి రాజానః, తవ్త పురుషోత్తమమ్' హితశబ్దము రాజులకును ఉపలక్షకము. 'సుమనోరథము' లన్నిటిని ఘటింపఁగల్గె నికి సుమనోరథము ఒక్కటినేనియిచ్చుట యెంతయు నుచితమని చమత్కారము. సుమనోర లిచ్చువానికిఁ దానియ్యనేల యనఁగాఁ దాను దైవత (సుమనః) పతిగదా. 'సుమనో ... సుమనోరథమిత్తు' నని పరస్పరోపకారము చెప్పుటచే అన్యోన్యాలంకారము. వసురాజున కిట్టివిమా నమును దేవేంద్రుఁ డిచ్చుటయు నందుచేతనే నతఁ డాకాశమునను విహరించుటకును దానంబట్టి 'ఉప రిచరవసు'వని పేరుగలుగుటకును.

'దైవోపభోగ్యం దివ్యం త్వం మాకాశే స్ఫాటికంమహత్,
ఆకాశగం త్వాం మద్దత్తం విమానముపపత్స్యతే,
త్వామేకః సర్వమర్త్యేషు విమానవరమాస్థితః, చరిష్యస్యుపరిస్థోహి దేవోవిగ్రహవానివ'.(భారత)

చ. జలనిధి సార్వభౌమతనుజాదనుజారుల యేఁగుఁబెండ్లినా
డలఘుఁడు విశ్వకర్మయభశ్రీవాబ్జభవాదులు మెచ్చఁజేసెఁ గౌ
శలమున దీని దీనిపయిఁజారురమాపరమానుషంగుఁడై
యలరెఁ గదా గదాధరుఁ డహస్కరుపై నొఱపైనకైవడిన్. 1

అ. అలఘుఁడు = గొప్పవాఁడు—మహాత్ముఁడు, అగువిశ్వకర్మ, జలనిధి... నాఁడు—జలని సార్వభౌమ=సముద్రములకు చక్రవర్తియైన పాలసముద్రునియొక్క, తనుజా = కూఁతురయిన లక్ష్మీదే యొక్కయు, దనుజారుల=రాక్షసులకు శత్రువయిన విష్ణుదేవునియొక్కయు, (అనఁగా లక్ష్మీనారా యణులయొక్క) ఏఁగు పెండ్లినాఁడు=పెండ్లి యూరేఁగింపునాఁడు, అభవ,అబ్జభవ ఆదులు=శివుఁడు బ్రహ్మ మొదలగువారు, మెచ్చన్ = మెచ్చుకొనునట్లుగా, దీనిన్ =ఈవిమానమును, కౌశలమునన్ =కౌ శలపుణ్యముచేత, చేసెను, దీనిపయిని, చారు ... షంగుఁడై—చారు=ఇంపయిన, రమా=లక్ష్మీదే = మిక్కిలి యెక్కుడయిన, అనుషంగుఁడై = కూడికగలవాఁడై - లక్ష్మీదేవితో ఁడు=విష్ణువు, అహస్కరుపైన్=(భాస్కరాహస్కర బ్రధ్నప్రభాకర

రా॥' అమ.) సూర్యుని పయిని-సూర్యమండలము మీఁదనునట. ఒఱపయినకై వడిక్ = అం॥ లుకునట్లుగా, అలరెక్ గదా=ఒప్పుచుండెనుగదా. విష్ణుదేవుడు సూర్యమండల మధ్యవర్తియగుట.

'ధ్యేయస్సదాసవితృమండల మధ్యవర్తీ నారాయణః' అని చెప్పంబడియున్నది.

విమానము 'అవార్య మహార్యమహార్యభీశుసంయుతమణిభాసమానమయినది రవికోటి వి॥ ంభాసితముసైనది గాన సూర్యునివలెఁ బ్రకాశించుటచే సూర్యమండల సాదృశ్యమిట చెప్పఁబడినట శ్రీనారాయణుల పెండ్లికొఱకు సృజింపఁబడినదని చెప్పుటచేత గిరికావసురాజవివాహ హేతుత్వ ంను నిందు స్ఫురించుచున్నది.

ఉ. శ్రీసతిఁ బ్రేమ మించఁగ వరించి విరించి గురుండు కౌతుకా
వాసములోఁ సురాళి గొలుకవం గొలువై రవికోటిబింబసం
భాసిత మైనయాశుభవిమానముఁ దప్పక చూచునాదుపే
రాస యెఱింగి సైంధవగజాదులతోఁ నొసఁగెం బ్రియంబునన్. 11

అ. విరించిగురుండు=బ్రహ్మకుఁ దండ్రియైన విష్ణుదేవుఁడు, శ్రీసతిక్ = లక్ష్మీకాంతను, ప్రేమ ంచఁగక్, వరించి=పరిగ్రహించి, కౌతుక + ఆవాసములోక్ = కల్యాణమండపమందు, సుర + అళి లువం=దేవతాసమూహము సేవింపఁగా, కొలువు + ఐ=కొలువుదీరియుండి-అనుధాతువుక్త్వార్థకము క్త్వర్థములం జూపట్టెడిని. 'అర్జునుఁడును నేనునై' భారత. ఉద్యోగ. రవికోటిబింబ సంభాసితము= ర్యులయొక్క కోటిబింబములవలె (కోటిసూర్యబింబములవలె) మిక్కిలి ప్రకాశించుచున్నది, ఐన, ా, శుభవిమానము= శుభాస్పదమయిన విమానమును,తప్పక చూచు నాదుపేరాస = విడునక చూచు న్న నామిక్కుటమయిన యభిలాషమును-విడువక చూచుట యత్యంతాభిలాష సూచకము.

'అక్కజమయినరూపమున నాత్మకు వేగయిపొల్చుపాలిపై
నెక్కొనుచూపు గ్రమ్మఱుప నేరక. (భారత-విరాట.)

'రామం మేఘనుగతా దృష్టి రద్యాపి న నివర్తతే. (రామా-అయోధ్యా)

ఎఱింగి=తెలిసికొని, ప్రియంబునక్=నాయందలి ప్రేమచేత, సైంధవగజ ఆదులతోక్ = గుఱ్ఱ ఏనుఁగులు మొదలయినవానితో, ఒసంగెను, సైంధవమనఁగా సింధుదేశమునఁ బుట్టిన యశ్వవి ములయినను నిచట విష్ణుపర్పించు దివ్యాశ్వములు గాన అశ్వసామాన్య పరముగా గ్రహించునది. మూఁడవపాదమున 'సమ్భాసిత' 'విమానము' అని యీరెంటికి యతి బిందుయతి యనంబడును- పంచమవర్గాక్షరములు, పంచమవర్ణములఁగూడి పరఁగనటించుం ంచశరజన్న పెఱనా, లంఘితముగఁ బిఱుఁద సున్న లంటినచోటక్. అనంతునిఛందము.

భూనాయక యీదివ్య వి, మానం బసమానదివ్యమణిశకలశలా
కానీక నిర్మితం బిది, నానాఁటి కనంతకాంచనంబులు గురియున్. 12

అ. భూనాయక=వసురాజా, ఈ దివ్యవిమానంబు, అసమా...నిర్మితంబు—అసమాన = సాటి మణి చిన్తామణి రత్నములయొక్క, శకల = ('భిత్తంశకలఖణ్డేవా' అమ.) తునుకల లా = కమ్ములయొక్క, అనీక = సమూహముచేత, నిర్మితంబు = నిర్మింపఁబడినది. నానాఁటికిక్ =ప్రతిదినము, అనంత కాంచనంబులు=మితిలేనిబంగారములను, కురియును ్వార్థిగా నీనుననుట. దీనిని రచించినమణులె చింతామణులై యనంత— త్త్వము చెప్ప నక్కఱలేదని భావము.

సీ. పటుగాత్ర యీచిత్రభానూజ్జ్వల మఖర్వ, సర్వలోకాలోకసౌఖ్య
ధాత్రీశ యీదివ్యధామోన్నత మనంత,వాహినీవిభవంబువరలఁ జే
నరవరోత్తమ యీఘనప్రకాశ మభంగ, మణిచాపశరపరంపరల
సురమిత్ర యీశరజ్జ్యోతిర్వరాకృతి, శార్వరగర్వభంజన మొనర్చు
తే. నిది యశేషదోషాంతకంబిది నితాంత, కాంతకల్యాణనిధి యిది
రమ్యమిది యమృతాన్నసారప్రదంబు,దీనిఁగొనియాడఁదరమె వా

అ. పటుగాత్ర= (రోగములేమిచే) దృఢమయిన దేహముగలవాఁడా - ఈ
ఈ చిత్రభాను + ఉజ్జ్వలము - చిత్రభానూజ్జ్వలమైన యీచిత్రభానూజ్జ్వలమని
మీఁదనెల్ల నన్వయమేర్పడుచున్నది. చిత్రభాను = ('చిత్రభానుర్విరోచనః విభావసుః
సూర్యునివలె,ఉజ్జ్వలము=ప్రకాశమానమగుచున్న, చిత్రభాను=విచిత్రములైన రత్న
('భానుః కరోమరీచిః స్త్రీపుంసయోర్దీధితిః స్త్రియామ్' అమ.) ఉజ్జ్వలము
యీవిమానము, అఖర్వ...సౌఖ్యము—అఖర్వ = మిక్కిలియైన - సర్వలోక= (
అమ. సమస్తజనులయొక్క, ఆలోక = చూచుటయొక్క, సౌఖ్యమును=సుఖ
సాఫల్యమును ఒసఁగునని యర్థము. ('ఆలోకాదర్శనోద్ద్యోతౌ' అమ.) కన్నులుగ
మానముచూచి తనివలయుననుట-అఖర్వమయిన సమస్తలోకములనుజూచెడి స
ము. దీనినెక్కి సమస్తలోకములను నడ్డిలేకపోయి చూడవచ్చుననుట. చిత్రభా
వెలుంగునదిగాన సర్వజనుల దృష్టి సాఫల్యమొసఁగునని మొదటియర్థమునకు
. ధాత్రీశ=రాజా, ఈదివ్య...న్నతము—దివ్యధామోన్నతమయిన యీ
నఁగా - దివ్య=దేవతలకు - ధామ=స్థానమయిన మేరుపర్వతమువలె, ('మేరుః
అమ.) ఉన్నతము=పొడవయిన, దివ్యధామ = ('ధామజన్మప్రభాస్థాన ప్రభ
దివ్యమయిన ప్రభచేత, ఉన్నతము=అధికమయిన యీవిమానము, అనంత
హినియనఁగా ఆకాశగంగ 'అనంతంసురవర్త్మఖమ్' అమ.) ఆకాశగంగ
జేయుచు=పొందునట్లుగాఁ జేయును. మేరుపర్వతము ఆకాశగంగా ప్రవా
పర్వతమునెక్కి యిదియు ఆకాశగంగాఁ ప్రాప్తినిగలిగించునని యర్థము.
( 'వాహినీస్యాత్తరఙ్గిణ్యాం సేనాసైన్యప్రభేదయోః' విశ్వ.) సేనయొక
చేయునని భావము.

నరవరోత్తమ=రాజశ్రేష్ఠా , ఈఘనప్రకాశము=(ఘనమనగా మేఘ
ప్రకాశముగలదియైన, ఈ ఘనప్రకాశము= గొప్పప్రకాశముగలిగిన యి
లు—అభంగ=అఖండమయిన, మణిచాప=ఇంద్రధనుస్సును, శరపరం
రియును - మేఘప్రకాశమయినదిగాన మేఘమువలె నింద్రధనువును
అభంగములయి రత్నమయములయిన ధనుస్సులను బాణసమూహముల

సురమిత్ర=దేవతాసఖుఁడా, ఈశర...కృతి= (జ్యోతిర్వరుచి
డు.) ఈ శరత్కాలపు చంద్రుని యాకారముగలదియైన- శరత్కా
శోదళమయిన రూపముగల యీవిమానము. శార్వర...జనము—శ

చంద్రాకృతియైనదిగాన చీఁకటిని దూల్చునని యర్థము. శరచ్చంద్రునివంటి దగుటచే చీఁ
ఁ దూల్చునవాఁడు. శరచ్చంద్రుని ప్రకాశాధిక్యమువలన అంధకారముయొక్క సైల
ము భగ్నమగుననుట. ఘాతుకులయిన వారి కాపరమును దూల్చునని భావము.

, అశేషదోషా అంతకంబు=సర్వరాత్రులను తుదముట్టించునదని యర్థము. (చిత్రభాను
లె నుజ్జ్వలమగుటచేతనని తెలియునది. ఇట్లె నీసమందలి యొక్కొకపాదమందును అ
ణముగా గీతములం దొక్కొక్క విశేషణము క్రమముగా నిబంధింపఁబడియున్నది. అశే
మనఁగా సమస్తదోషములను బోఁగొట్టునది యని భావము. ఇది, నితాంత... నిధి=(కల
బంగారును శుభమును) నితాంత=ఎల్లప్పుడును, కాంతి=మనోహరమయిన, కల్యాణ=
, నిధి=స్థానమయినదని యర్థము. దివ్యధామము (మేరువు) వంటిదగుటచేతనని తెలియున
సొంపయినశుభముల కాస్పదమయినదనిభావము. ఇది, కామరూపరమ్యము=నానారూపమ
పయినదని యర్థము. ఘన (మేఘ)ము వంటిదిగాన మేఘమువలె నానారూపముల నె
మరూప=కోరఁదగినట్టి రూపముచేత సొంపయినది - అనఁగా దీనిరూపము మిక్కిలియ
ఁ గోరఁదగినదై సొంపు గులుకుచుండునని భావము. ఇది, అమృత... ప్రదంబు—అమ
మృతాహారముగల దేవతలకు, సారప్రదంబు=బలము నిచ్చునది. జ్యోతిర్వర(చంద్ర) ఆక
చంద్రునివలెనే దేవతలకమృతమయిన తనకళలనొసంగి బలదాయకమగుచున్నదని య
)తాన్నసార ప్రదంబు=దేవతల బలమునంటిబలము నొసంగునది యనిభావము. కాఁబట్టి
'నియాడక్, వాగ్జానికైనక్=సరస్వతీనాథుఁడయిన బ్రహ్మకయినను, తరమె=శక్యమగున
స్తోత్రరూపమయిన వాక్కలాపమున కధిదేవతయైన సరస్వతిని భల్లిగానేలుకొన్న
ఁగా మఱియెవ్వనికిని గాదనుట చెప్పనేల యను నభిప్రాయమున బ్రహ్మకు 'వాగ్జాని' య
ుటనుంపఁబడుట తెలియునది. అలం. శ్లేషము పరికరమును.

తామోదదివ్యపుష్పకసహస్ర, మాలికాధార మైనయీమణివిమాన
మున కెట్లు సరి వసురాజ సారె, పుణ్యాజనభర్తఁ బాసినపుష్ప=చేయు

వసురాజా! ప్రకటిత... ధారము—ప్రకటిత=ప్రసిద్ధమయిన, ఆమో పూర్వోక్తు
నానా.) సంతోషముగల, దివ్య=గొప్పదయిన, పుష్పక = పుష్పకలునుగల నీకు
-, సహస్రమాలికా=వేయివరుసలకు, ఆధారము = పట్టయినదని యర్థ
మన్న, ఆమోద=వాసనగలిగిన, దివ్యపుష్పక=పారిజాతపుష్పములుగల, సహ
గా అనేక) మాలికలకు స్థానమయినదని భావము. ఐన, ఈమణివిమానరాజ
యమయిన విమానశ్రేష్ఠమునకు, సారె=పలుమాఱు, పుణ్యాజన భర్తక్ = ('పు.
క్షసి యక్షే' నానా.) యక్షులకు రాజయిన కుబేరుని, పాసిన=ఎడఁబాసిన, పుష్పకమనె
సరి ఎట్లు=సమాన మెట్లగును - అనఁగాఁ గాదనుట. పుష్పక సహస్రమాలికా ధారమయి
మునకు ఆయొక్కకుబేరునిపుష్పకమెట్లు సాటియగును. పుణ్యాజనభర్తను బాసినపుష్పక
జనభర్తవునయిన నిన్నుఁబొందుచున్న యీవిమానముతో సరిగాదనియు వ్యంజితము.
బేరుని సారెఁబాసినదనుట చింత్యము. రావణుఁ డపహరించినపు డొకసారిపాసినది
టగనుపట్టదు. లేక 'సారె సరి యె'ట్లనుట అన్వయముగాదు. అలం శ్లేషము-అల
సనీయానంతమణికాంతధామ మై, యిధి హిమానీవేళనింపు

శోణప్రవాళమంజులతానిశాంతమై, యలరించు నిది వసంతాగమమునఁ
తరళముక్తాదీప్తిధారాధివాసమై, వేసవి నిది మహోల్లాస మొసఁగుఁ
ప్రబలవజ్రోపలప్రాసాదభాసమై, తొలుకరి నిది కుతూహలము నిలుపు
తే. జనవరోత్తమ యిది సర్వసమయసౌఖ్య, జనక మిందలి యాలేఖ్యసాధ్యసిద్ధ
కిన్నరాంగన లవిగీతగీతనృత్య, వాద్యములు సూపి నిలుతురు వలయునెడల.

అ. జనవరోత్తమ=రాజశ్రేష్ఠా! ఇది, హిమానీవేళ=('హిమానీహిమసంహతి' అమ.) మంచుకాల నందు-శిశిరర్తువునందనుట. మాన...ధామమై—మాననీయ= మన్నింపఁదగిన, అనంతమణి=('ద్యుమణి స్తరణిర్మిత్ర' 'అనన్తం సురవర్త్మఖమ్' అమ.) సూర్యునియొక్క, కాంత=మనోహరమయిన, ధామమ ఐ=కాంతివంటి కాంతిగలదయి యని యర్థము. మాననీయ=అంగీకరింపఁదగిన, అనంత=అంతములేని అమితమయిన, మణి=పద్మరాగమణుల చేత, కాంత=సుందరములగుచున్న, ధామమై = ('ధామ దేహే గృహే రశ్మౌ' హలాయుధ) గృహములుగలదై యని భావము. ఇంపునింపున్=సుఖము నెరపును. ఇది, వసంత + ఆగమమునన్=వసంతము రాకయందు- ననకారునందనుట. శోణ...నిశాంతమై—శోణ ప్రవాళ=ఎఱ్ఱనిచిగుళ్ల చేత, మంజు=సొగసుగులుకుచున్న, లతానిశాంతమై = తీఁగయిండ్లుగలదై యని యర్థము. వసంతర్తువు రతివిహారాదులకుఁ బొదరిండ్లు సుఖావహములగుట ప్రకటము. శోణప్రవాళ ('ప్రవాళోవల్లకీదణ్డే విద్రుమే నవపల్లవే' విశ్వ.) ఎఱ్ఱని పగడములయొక్క, మంజులతా=మనోహరత్వమునకు, నిశాంతమై=పట్టయి- ఆస్పదమై, అలరించున్=సంతోషింపఁ జేయును అని భావము.

ఇది, వేసవిన్=ఎండకారునందు-గ్రీష్మర్తువున ననుట, తరళ...వాసమై—తరళ=భాసురమయిన, ముక్తా=ముత్యములయొక్క, దీప్తిధారా=కాంతి ధారలనెడు, ధారా=జలధారలకు - లేక ముత్యముల వలెఁ గాంతిగల-అనఁగా తెల్లనయి నిర్మలములయిన జలధారలకు, అధివాసమై=స్థానమైయని యర్థము ముత్యములకాంతి పరంపరలకు స్థానమయి యనిభావము. మహోల్లాసము=మిక్కిలియు నుత్సాహము,
తొలుకరిన్=వానకారునందు-వర్షర్తువు నందనుట, ప్రబల...భాసమై— ప్రబల=మిక్కిలి
అనఁగా
అమ.) ఉపల=వజ్రమణుల చేనయిన, ప్రాసాద= మేడలతోడ, భాసమై = ప్రకాశమానమై,
దివ్యమయి =సంతోషముఁ బొందించును. ఇది, సర్వసమయ సౌఖ్యజనకము=సమస్తముల
హిమ (అనఁగా చెప్పక తక్కిన హేమంత శరదృతువులందు వానివానికిఁదగినట్టి) సౌ
...యునది. ఇందలి...రాంగనలు—ఆలేఖ్య=చిత్తరువునందలి, సాధ్యసిద్ధకిన్నర అంగ
కిన్నర స్త్రీలు, వలయునెడలన్ =కావలసిన సమయములందు, అవిగీత గీతనృత్తవాద్య
...మయిన పాట ఆట వాద్యమును, చూపి=నెఱపి, నిలుతురు = నివసించియుందురు.
...ఎమానపు మహత్త్వముచేత నిందలి చిత్తరువునందలి ప్రతిమలు సయితము సచేతనములై
...వుడెల్ల నృత్తగీత వాద్యములను జరిగించునని భావము. ఇట

"హిమశిశిర వసంతగ్రీష్మవర్షా శరత్సు, స్తన తపన వనాంభో హర్మ్య గోక్షీరపాకైః
సుఖ మనుభవ రాజన్ త్వద్ద్విషోయాన్తు నాశం, దివసకమలలక్ష్మా శర్వరీరేణు పంక్తైః"

అనెడి యీశ్లోకార్థము ననుసంధించియుండుట తెలియునది. ఇందు శిశిర వసంత గ్రీష్మములందు, తపన (సూర్య) వన (ఉద్యానవన) అంభస్సు (జలము)లు సుఖావహములుగాఁ జెప్పఁబడి తదనుగుణముగా 'అనంతమణి...'కి. సూర్యకాంతిగాను. 'శోణప్రవాళ...'కు చిగుళ్లు లయినవనపరికరముగాను, 'ముక్తాదీప్తిధారా...'కు జలధారలుగాను నర్థవిశేషములు

నిబంధించి యవి విమానములందుండుట యసంబద్ధములు గాన దత్పరిహారముగా, పద్మరాగవిద్రుమ మౌక్తికపరములుగా భావములు పొందింపఁబడెను. నాలవపాదమున వర్షర్తుసుఖావహమగు హర్మ్యములు విమానగతములగుటకును వర్షర్తువున కనుగుణములగుటకును రెంటికిని బొసఁగియుండుటంబట్టి యర్థ మొక్కటిగా నిబంధింపఁబడెనని తెలియునది. అలం. శ్లేషమూల పర్యాయము.

చ. అరు దగునీవిమానము ప్రజాధిపుఁడుం బురుషోత్తముండు శం
కరుఁడును దక్క నన్యులకుఁగా దధిరోహ మొనర్ప వారిసు
స్థిరకరుణావిశేషమున జిష్ణుఁడనై కయికొంటి దీని నే
నరవర సర్వసద్గుణగణంబులప్రోవగు నీకొసంగితిన్. 16

అ. నరవర=రాజా! అరుదగు=అద్భుతమయిన, యీవిమానము - లేక 'అరుదుగన్' అను పాఠమున అద్భుతమగునట్లుగా ఈవిమానమని యర్థము. ప్రజాధిపుఁడుం=బ్రహ్మయును, పురుషోత్తముండున్=('శ్రీపతిః పురుషోత్తమః' అ.)విష్ణువును, శంకరుఁడును=శివుఁడును, తక్కన్=తప్ప, అన్యులకు, అధిరోహమొనర్పన్ కాదు=ఎక్కుటకుఁదగదు. వారిసుస్థిర కరుణావిశేషమునన్=ఆత్రిమూర్తుల యొక్క మిక్కిలి నిలుకడయైనదయ పెంపుచేత, జిష్ణుఁడనై=జయశీలుఁడనయి అని యర్థము. (జిష్ణుశ్శక్రే ధనంజయే జిత్వరేచ' విశ్వ.) జిష్ణుఁడను పేరుగలవాఁడనై యనిభావము. దీనిని, కైకొంటిన్=చేకొంటిని. నేను సర్వసద్గుణగణంబులప్రోవు=అన్నిమంచిగుణగణములకు రాశి అగునీకు ('ప్రోగుకుప్పవామి ప్రోవు తిట్టయనంగ, రాశికాఖ్యలగు ధరాళతాంగ' ఆంధ్రనామ) ఒసంగితిన్=ఇచ్చినవాఁడనయితిని.

ఇట విమానము 'ప్రజాధిప పురుషోత్తమ శంకరుల'కే యెక్కఁదగినది. జిష్ణుఁడనై కయికొంటి ననుటచే ప్రజాధిప పురుషోత్తమ శంకరజిష్ణులు నలువురకే యది యర్హమని తేలుచున్నది. వసురాజున కది యెట్లర్హమనఁగా-అతఁడు సర్వసద్గుణముల ప్రోవు-అనఁగా ప్రజాధిపత్వ పురుషోత్తమత్వ శంకరత్వ జిష్ణుత్వములనెడి గుణములన్నియుఁ గలవాఁడు గావున నర్హుఁడని గ్రాహ్యము. ప్రజల కధిపతిగావున ప్రజాధిపుఁడు; పురుషులయం దుత్తముఁడు గావున పురుషోత్తముఁడు; శం=సుఖమును, కరోతి=చేయువాఁడుగాన శంకరుఁడు; జయశీలుఁడుగాన జిష్ణుఁడు అని సకలగుణసంపత్తి తెలియునది. పూర్వోక్తులొక్కొక్కరియం దొక్కొక్క గుణమునుబట్టి యర్హత గలుగఁగా ఆయన్నిగుణములునుగల నీకు నర్హమని చెప్పవలయునా యనియు భావము అలం. తుల్యయోగితా భేదము.

మ. నలినీబాంధవతేజ యీశుభవిమానం బెక్కి వేడ్కన్ విని
ర్మలసన్మార్గవిహారహారి వగుచున్ మాపీటికిన్ రాకపో
కలు గావింపు మటంచు నిచ్చిన వసుక్ష్మాజాని యావ్యోమయా
నలలామంబుఁ బరిగ్రహించె భువనానందం బమందంబుగాన్. 17

అ. నలినీ బాంధవతేజ=సూర్యుని తేజస్సువంటి తేజస్సుగలవాఁడా, ఈశుభవిమానంబున్, ఎక్కి, వేడ్కన్=వేడుకతో, వినిర్మల సన్మార్గవిహార హారివి=మిక్కిలియు స్వచ్ఛమయిన ఆకాశమార్గమందలి (సతాంనక్షత్రాణాం మార్గస్సన్మార్గః) సంచారముచేత, హారివగుచున్=ఒప్పినవాఁడవు, (సన్మార్గమనఁగా సజ్జనమార్గంబనియును గ్రాహ్యము. ఇట నలినీబాంధవతేజునకు ఆకాశవిహారము యుక్తమేయని తెలియునది.) మాపీటికిన్=మాపట్టణమునకు-స్వర్గమున కనుట, రాకపోకలు గావింపుము, అటంచున్=అనిచెప్పి, ఇచ్చినన్=(ఇంద్రుఁడావిమానము)నుఇయ్యఁగా, వసుక్ష్మాజాని=(క్ష్మాభూమిఃజాయా

భార్యాయస్యసఃత్స్మజానిః) వసురాజు,ఆ వ్యోమయాన లలామంబున్ = ఆవిమానశ్రేష్ఠమును,(వ్యోమయానంవిమానో స్త్రీ)' అమ.) భువనానందంబు=జగజ్జనుల యానందము, అమందంబుగాన్ = కొఱవడనిదిగా - అతిశయించునట్లుగా, పరిగ్రహించెన్ = పుచ్చుకొన్నవాఁడయ్యెను. వినిర్మల సన్మార్గమందు అనఁగా మిక్కిలి నిర్మలమయిన సజ్జనపథమందుఁ బ్రవర్తించువారికే స్వర్గగమనము సులువుగ లభించుననుటయు నిందు గర్భితము.

వ. ఇట్లు జంభారి కుంభినీపతి కప్రతిమానవిమానంబు సమర్పించి సుఖం బుండుమని చనుటయు నపరిమితకుతూహలంబున నచటితపసు లాన్నృపతి కపు డుపరిచర నామధేయం బంకించి సంకీర్తనంబు గావించి రనంతరంబ యనంతవిజయకీర్తి లాభసౌభాగ్య ధన్యుండగునారాజన్యుం డనన్యాదృశ ప్రమోదభరంబునఁ బురంబునకు మరలి వచ్చి యఖిలజగజ్జేగీయమానవిమానమహిమంబునం బ్రతిదినజాయమానంబు లగు జాతరూపమణి కలాపంబుల భూదేవ దేవతావర్యులకు సపర్యలు గావించుచు నిష్టాపూర్తంబులు నిర్వర్తించుచు నొక్కొక్కయెడ నవ్విమానంబు నెక్కి నాకలోకాదిలోకంబులు నానానగవనానీకంబులు నవద్వయ ద్వీపసాగరంబులు నదీనదప్రచారంబులు నీక్షించుచు శుక్తిమతీమహానది విహారదీర్ఘికయును గోలాహలంబు లీలాచలంబునుంగా మెలంగుచుండె నంత నిచ్చట. 18

అ. ఇట్లు, జంభారి=ఇంద్రుఁడు, కుంభినీపతికిన్ = వసురాజునకు, అప్రతిమాన విమానంబున్ = సమానములేని విమానమును, సమర్పించి=సత్కార పూర్వకముగానిచ్చి, సుఖంబుండుమని = సుఖముగా నుండుమని విశేషణములయిన సుఖ కరుణ మొదలయిన శబ్దములు 'సుఖం కరుణం' అని సంస్కృతమున క్రియావిశేషణములు కాఁగా నవియట్లె, సుఖము కరుణము, అని కేవలముగను అగుధాతుతుమంతములతోఁ జేరి 'సుఖముగన్,కరుణముగన్' అనియును తెనుఁగున వ్యవహరింపఁబడుచున్నవి. మఱి కొన్నియెడల నవధారణార్థమై అత్తుతోఁగూడియుఁ బ్రయుక్తమగుచున్నవి.

'విపులధర్మారంభ సంసిద్ధియగుఁ బరమార్థంబ' (ఆది. ౧ ఆ.) 'జననీసహితంబు పాండవుల్' (విరాట. ౧ ఆ.) 'ఈవిధమున నతికరుణముగా వనరుహనేత్రి కన్నుఁగవఁ ధవళ రుచుల్, 'గావిగొన నేడ్చి' మనుచరిత్ర.

దీనిని బట్టి 'సుఖమాస్స్వ' సుఖంబుండు మను రూపము సిద్ధించినది. అని, చనుటయున్ = పోఁగా, అపరిమిత కుతూహలంబునన్ = మితములేని సంతోషముచేత, అచటి తపసులు=అశుక్తిమతీ తీర ...ండు మునులు, అన్నృపతికిన్ = ఆ వసురాజునకు, అపుడు=ఆ సమయమందు, ఉపరిచర నామ పరిచరుఁడనెడు నామమును, అంకించి=గుఱుతుచేసి - దాని నతనికి నుపపదముగా నుంచి

* నాటకవిచ్ఛేదే సంఖ్యాయాం యుధిభూషణే, సమీపే రూపకే స్థానే మతావుత్సంగ నానార్థ. భారతమునందును. 'రాజోపరిచరేత్యేవం నామతస్యాథ విశ్రుతమ్') అనఁగా

...ఉ... సురాజును పేరుపెట్టి, సంకీర్తనంబు గావించిరి=స్తోత్రముచేసిరి, అనంతరంబ=ఆ తరువాత, ...క... ర్తనము, ఇత్యాదులు 'పరమార్థంబ' వంటిదని తెలియునది. అనంత ... ధన్యుండు—అనంత ... ని, విజయ=గెలుపువలని, కీర్తి=యశస్సుయొక్క, లాభ=ప్రాప్తియొక్క, సౌభాగ్య=సౌభ... ...క్కిలి చక్కనికీర్తిని బడయుటచేత ననుట, ధన్యుండు=కృతార్థుఁడు,

అగు, ఆ రాజన్యుండు=ఆ వసురాజు, అనన్యాదృశ ప్రమోదభరంబునన్=సమానములేనట్టి సంతోషంపు పెంపుచేత, పురంబునకున్, మఱలివచ్చి, అఖిలజ...మంబునన్ — అఖిలజగత్=సమస్తజగత్తుల చేతను, జేగీయమాన=మిక్కిలి కొనియాడఁబడుచున్న, విమాన=విమానముయొక్క, మహిమంబునన్=ప్రభావముచేత, ప్రతిదివస జాయమానంబులు = దినదినమును బుట్టుచున్నవి, అగు, జాతరూపమణి కలాపంబులన్=బంగారులయు రత్నములయు సమూహములచేత (చామీకరం జాతరూపం మహారజతకాంచనే. అ.) భూదేవ దేవతావరులకున్ = బ్రాహ్మణశ్రేష్ఠులకును దేవతాశ్రేష్ఠులకును, సపర్యలు కావించుచున్=పూజలుసలుపుచు, ('సపర్యార్చార్హణాస్సమాః' అమ.) ఇష్టాపూర్తంబులు

[అగ్నిహోత్రం తపస్సత్యం వేదానాం చానుపాలనం । ఆతిథ్యం వైశ్వదేవంచ ఇష్టమిత్యభిధీయతే॥
వాపీకూపతటాకాది దేవతాయతనానిచ । అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే॥]

అనఁబడు ఇష్టాపూర్తములను, నిర్వర్తించుచున్=ఆచరించుచు ననుట. ఒక్కొక్కయెడ, అవ్విమానంబున్, ఎక్కి, నాకలోకాదిలోకంబులు = స్వర్గలోకము మొదలయిన లోకములను, నానానగవన ఆనీకంబులు=అనేకములయిన కొండలయు అడవులయు సమూహములను, నవద్వయద్వీప సాగరంబులు=రెండులొమ్మిదుల (అనఁగాఁ బదునెనిమిది) ద్వీపములును సముద్రములును, నదీనదప్రచారములన్=నదులయు (అనఁగాఁ దూర్పుసముద్రములోఁ బ్రవేశించునట్టి యేఱులయు) నదములయు (పడమటి సముద్రములోఁజొచ్చు నేఱులయు) గమనవిశేషములను, ఈక్షించుచున్=చూచుచు, శుక్తిమతీమహానది, విహారదీర్ఘికయు = క్రీడార్థమయిన సరస్సును, కోలాహలంబు, లీలాచలంబునుంగాన్=క్రీడాపర్వతమును గాఁగా, మెలంగుచుండెన్ = ప్రవర్తించుచుండెను. అంత, ఇచ్చట=ఇక్కడ, దీనికి ముందటిపద్యముతో నన్వయము.

తే. అఖిలభువననిరోధకాహార్యరాజ,గంధనిర్గంధనునిరాకఁగలిమి నలమి
కొన్నయలజడి యుడుగఁ బ్రసన్నయైన,యేటి కొయ్యన గర్భంబుఁదేటపడియె.

అ. అఖిల...కలిమిన్—అఖిలభువన=సమస్తమయిన జలములను, నిరోధక = అడ్డగించువాఁడయిన-అడ్డుగట్టినట్టి, అహార్యరాజ=పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలునియొక్క, గంధ=గర్వమునకు, నిర్గంధనుని=గర్వము లేకుండునట్లు బోఁగొట్టిన వసురాజుయొక్క, రాకకలిమిన్ = వచ్చుటచేత నని యర్థము. సమస్తలోకములను నడ్డగించు వింధ్యాచలము గర్వమును బోఁగొట్టిన యగస్త్యునియొక్క యుదయముచేతనని యర్థాంతరము. అలమికొన్న అలజడి = ఆక్రమించిన దుఃఖము, ఉడుగన్=తీఱఁగానని యర్థము. (అలజడినెంజిలి బిమ్మటి, సిలు గుత్తలపాటు వంతనేగినెగుల్ కొం,దల మలమట డరు గోడు,మ్మలిక మనఁగఁ గుందునా నమరు దుఃఖాఖ్యల్' ఆంధ్రనామశేషము) అలమికొన్న = వ్యాపించిన, అలజడి=ఆజడివాన యుడుగఁగా నని యర్థాంతరము. ప్రసన్నయైన యేటికిన్=మనస్సు కలఁకదేఱిన యాశుక్తిమతికి ననియర్థము. నీటికలఁకదేఱినయానదికినని భావము. ఒయ్యనన్=తిన్నగా, గర్భంబు తేటపడియె = గర్భము స్పష్టముగాఁ జూపట్టెనని యర్థము. నడిమియేఱు గానవచ్చెనని యర్థాంతరము.

ఇట అగస్త్యోదయము చెప్పంబడుటచే శరత్కాలము సూచితము. వసురాజువచ్చి కోలాహలుని యడ్డగింత నుడుపఁగా శుక్తిమతిమనస్సు కలఁకదేఱినదనియు కోలాహలుని సంయోగముచేత నామెకు గర్భము కలిగెననియు నర్థము. వింధ్యపర్వతము నడ్డగింతదూల్చిన యగస్త్యుఁ డుదయింపఁగా శరత్కాలము వచ్చెననియు, అపుడు శుక్తిమతీనది జలము

శోషించుటచేత నడియేఱును గనుపట్టెననియు నర్థాంతరము. అగస్త్యోదయము శరత్కాల సూచక మగుట సుప్రసిద్ధము. ఇందులకు,

మ. స్ఫుటభూగోళావృతిశంక వార్ధి నివర • శ్ముల్ మిన్ను చేర్పం దటి
చ్ఛట లౌర్వంబుగఁ గారుకొంచు ఘనమై • త్మోఁ దీర వర్షింప న
చ్చోటనుం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీ • సూనుండు గాకున్న నొ
క్కొటఁ దారాగ్రహ భాస్కరేందుమణి శు • క్తుల్ వ్యక్తమై తోఁచునే.

చ. అలమలయాద్రిఁ గుంభభవుఁ • డన్కృతకంబు శరత్తుకుండ మం
డలిఁ బ్రతిబింబకైతవము • నం దమ కిచ్చిన వారిదేవతల్
తొలఁకులకోలఁ దాపనిడి • తోమఁ గలం కడఁగెం దదీయత
త్ఫలతకు బ్రాస్వ మాటె కరి • తారక లంబువుఁ దేర్చునే యనన్.

ఆముక్తమాల్యద. ౪. ఆ. ౧౪౬-౧౪౭.

ఇందు నాలవచరణమున ఖండాఖండప్రాస యతియనియు నిందుల కాదిపర్వమున

మత్తకోకిల. 'తీఁగె యుయ్యలలూఁగుఁ జల్లని తియ్యమామిడి మూఁకలం
ద్రాగుఁ బూవుల తేనెసోనలఁ దారుఁ గేతకి జొంపుఁ బు
న్నాగపూగ మహాగసీథుల నాట్యముల్ పచరించు సా
భోగనానలతాగృహంబుల భోగముల్ గను వేడుకన్.'

అని ప్రయోగమనియు సోమకవి వ్రాసెను. 'తేటపడు' సబిందుకముగాఁ జూపట్టదు.

సీ. నాళీకముఖికి నెన్నడుము గానఁగ నయ్యెఁ, దనరు నెత్తలుల బిత్తరము దరలె
శఫరాక్షి కున్నతస్థలు లగమ్యములయ్యె, బడిబడి నడలెల్ల జడను వడియెఁ
జారువేణికి వింతచవుల నింపులు మీఱెఁ, గనుపట్టె విశదమై గండరేఖ
కంబుకంఠికి సాంద్ర కంకణంబులు జాఱె, నాదంబు మందమందత వహించె

తే. హంసయానకు నలిమేచకకాంచలముల, గుబ్బపొందమ్మిమొగ్గలు కొమరు మిగిలెఁ
బ్రకటితావర్త నాభి కేర్పడియె నంత, రుచిరతర శైవలశ్యామ రోమరాజి.

అ. ఇందు గర్భిణీపరముగాను శరత్కాల నదీపరముగాను నర్థద్వయము తెలియునది. నాళీకముఖికిన్ =(గర్భిణి) తామరవంటి ముఖముగలదానికి, నెన్నడుము కానఁగనయ్యెన్ =(నెఱ + నడుము అని సంధి) నడుము దొడ్డదియై చూపట్టెను - (నది) ముఖమువంటి తామరలుగల దానికి నడియేఱు గానవచ్చెను. తనరు...తరలెన్—(గర్భి) (తలు లనఁగా వళులు.) వళులయొక్క విలాసము ఉడిగెను - (నది) వళులవంటి తరంగముల విలాసము వదలెను. నీళ్లుపట్టుటచే అలలు కలుగవని తెలియునది. శఫరాక్షికిన్ =(గర్భి) చేఁపలవంటి కన్నులుగలదానికి (శఫరమనఁగా ఉట్టిపడెడు మీను - బెళుకు చూపుల కనుల నిట్టిచేఁపలతోఁ బోల్చువాడుక. 'మిట్టిమీనై పడె మెలఁతచూపు' విజయవిలాసము.) ఉన్నతస్థలులు=పొడవులయిన మేడలు మొదలగు ప్రదేశములు, అగమ్యములు అయ్యెన్ = (గర్భభారముచే) పొందనలవిగాని వయ్యెను - (నది) కన్నులవంటి మీనములుగలదానికి ఉన్నత ప్రదేశములు జలశోషణముచేత పోవనలవిగాని వయ్యెను. బడిబడి=(గర్భి) క్రమముగా, నడలెల్ల=నడకలన్నియు, జడను వడియెన్ =మందగించెను. ('నడజడను పడియె నాకేర్పడియెం జనుమొనలు నల్లవడియెను' అని మనుచరిత్రము.) (నది) ప్రవాహగతులు మందగించినవి.

చారువేణికిన్=(గర్భి) సొగసయిన జడగలదానికి, 'జలదవేణికి' నని సోమకవిపాఠము. వింత చవులన్ = శ్రోత్రరుచులయందు, ఇంపులుమీఱెన్ = ప్రియము లతిశయించెను - (నది) సొగసయిన ప్రవాహముగలదానికి అపూర్వమయిన- (అనఁగా వర్షర్తువునందలి నీటిరుచికన్న తేటపడియున్న శరదృతువునందలి) నీటిరుచులచేత నింపులు మీఱెను. కనుపట్టె... రేఖ—(గర్భి) గండరేఖ = కపాలపాలిక - చెక్కుల పయిప్రదేశము, విశదమై=తెల్లనయి, కనుపట్టెను-(నది) గండశిలలయొక్క శ్రేణి ప్రకటమయి కనఁబడెను. ('గండో ప్రణేకపోలేపిటకేగర్వేమ్బగాంతరే యోగే। మూలాది దుష్టభాగే హాయభూషణే బుద్బుదేప్యపాయేచ' నానా.) కంబుకంఠికిన్ = (గర్భి) శంఖమువంటి కంఠముగలదానికి, సాంద్రకంకణంబులు=దట్టమై (అనఁగా. గుత్తమయి)యుండిన చేతికడియములు, జాఱెన్ = సడలఁబాఱెను - (నది) కంఠమువంటి శంఖములుగలదానికి, దట్టములయిన (కంకణములనఁగా జలకణములు గాన 'స్యాత్కంకణం హస్తసూత్రే శిఖరే కటకేజలే' నానా.) జలబిందువు లుడిగిపోయెను. నాదంబు...ఐహించెన్ = (గర్భి) ఎలుఁగు రానురాను సన్నగిల్లెను - (నది) ప్రవాహధ్వని మతిమతి సన్నగించెను.

హంసయానకున్=(గర్భి) అంచనడకవంటి నడలుగలదానికి, గుబ్బపొందమ్మిమొగ్గలు = బటువులయి బంగారుతామర మొగ్గలవలెనున్న చన్నులు, అలిరోచక అంచలములన్ = తుమ్మెదలవలె నల్లనయిన మొనలచేత, కొమరుమిగిలెన్ = ఒప్పుమీఱెను - చూచుకములు నల్లపడెననుట - (నది) హంసలసంచారములు గలదానియందుఁ దుమ్మెలచేత నల్లనయిన యగ్రములచేత గుబ్బలవంటి బంగారుతామరమొగ్గలు కొమరుమీఱెను. తామరమొగ్గలు విరియకమునుపు దానిలోని పూఁదేనెను ద్రాగుటకై తుమ్మెదులు దానిమొనలందు నల్లగా మూఁగియుండుట ప్రకటము. ప్రకటిత ఆవర్తనాభికిన్= (గర్భి) ప్రసిద్ధమయిన సుడితోఁగూడిన పొక్కిలిగలదానికి, అంతన్=అమీఁదట, రుచిర... రాజ—రుచిరతర = మిక్కిలి చెలువయిన, శైవల = ('జలనీలీతు శైవాలశైవలే' అమ.) నాఁచుతీఁగవలె, శ్యామ=నల్లనయిన, రోమరాజి=నూఁగారు, ఏర్పడియెన్=స్ఫుటముగాఁ గనఁబడెను - (నది) నాభి యనఁగా ('నాభిర్మధ్యే ప్రధానేంగే కస్తూర్యాం క్షత్రియేనృపే' నానా.) మధ్యప్రదేశముగనుక ప్రకటితమయిన నీటిసుడి గుండముతోఁగూడిన నడిమిప్రదేశముగలదానికి శ్యామరోమరాజివంటి రుచిరతరమగు శైవలమేర్పడెనని యర్థాంతరము.

'గుబ్బపొందమ్మి మొంగడ' లన్నచో స్త్రీపరమున ఉపమితసమాసము. నదీపరమున మధ్యమపదలోపి సమాసము. 'అన్యేచకేచి దుపమానోత్తరపద లోప రూపకాఖ్యాద్యాః' అని శబ్దానుశాసనునిబట్టి యీసమాసములును నిందుఁ గలవు. స్త్రీలకు పొక్కిలి బిలము సుడిగలిగి యుండవలయు నని 'గంభీరా దక్షిణావర్తనాభి స్స్యాత్సుఖసంపదే' సాముద్రికశాస్త్రము.

క. ఆపన్నసత్త్వ యాపగ, యాపగిదిన్ నీరుమోసి ౹ యధిగతసేవా
వ్యాపారద్విజమహిళ, ల్గాపాడఁగ నొక్కపుణ్య ౹ లగ్నమునందున్. 21

అ. ఆపన్నసత్త్వ=(సత్త్వమనఁగా 'శుద్ధేశుక్లార్తవేసత్త్వస్స్వకర్మక్లేశచోదితః। గర్భస్సంపద్యతేయుక్తి వశాదగ్నిరివారణౌ' అన్నట్లు జీవుఁడగును. కనుక ఆపన్నసత్త్వయనఁగా 'ఆపన్నసత్త్వా [illegible]ర్విణ్యంతర్వత్నీతు గర్భిణీ' అమ. అన్నట్లు) గర్భిణి యని యర్థము. ఆపన్నసత్త్వ=('ఆపన్న [illegible] ప్రాప్తస్స్యాత్' అ. 'సత్త్వమస్త్రీతుజంతుషు' అ. అనుటచే) ఆపత్ప్రాప్తమయిన జలజంతు[illegible] యర్థాంతరము. ఆపగ=('స్రోతస్విన్యాపీద్వీపవతీ స్రవంతినిమ్నగాపగా' అ.) నది-గర్భి

తీరైన శుక్తిమతీనది, ఆపగిరిక్ = ఆవిధమున, నీరుమోసి = నీరువట్టియని యర్థము - జలస్వరూపమువహించియని యర్థాంతరము. అధిగత...మహిళల్ — అధిగత = పొందఁబడిన, సేవావ్యాపార = కొలుచునట్టి పనిగల - పరిచర్యావృత్తిగల, ద్విజమహిళల్ = బ్రాహ్మణస్త్రీలు, కాపాడఁగన్ = రక్షణముసేయఁగా నని యర్థము. ద్విజమహిళలనఁగా హంసస్త్రీలు గాన, పొందఁబడిన యనుసరణవృత్తిగల హంసాంగనలు కాచుకొనియుండఁగా - ఆఁడుహంసలు ప్రవాహముపొడుగున ననుసరింపఁగానని యర్థాంతరము. ఒక పుణ్యలగ్నమునందున్ = ఒక శుభముహూర్తమునందు - దీనికి ముందటిపద్యముతో నన్వయము. అఖిల భువన నిరోధకాది పద్యత్రయమందును నభేదాధ్యవసాయ మని గ్రహించునది.

చ. గురుతరనవ్యవేతసనికుంజము రంజిలుచోట హల్లకో
త్కరకరదీపదీధితులు గ్రమ్ముచోట నవారవింద బ
న్ధురమకరందతైలములు నూల్కొనుచోటఁ బరాగరక్షచేఁ
గర మరుదైనచోట నది గాంచెఁ గుమారుఁ గుమారికామణిన్. 22

అ. నది = శుక్తిమతీనది, గురు...కుంజము — గురుతర = మిక్కిలి యధికమయినదియు, నవ్య = క్రొత్తదియునగు, వేతసనికుంజము = ('ద్వాపరివ్యాధవిదులౌ నాదేయీ చాంబువేతసే' అమ.) ప్రబ్బలి పొద, రంజిలుచోటన్ = ఒప్పుచున్నచోట, హల్ల...ధితులు - హల్లక = ('హల్లకం రక్తసంధ్యకమ్' అ.) ఎఱ్ఱగలువలయొక్క, ఉత్కర = సమూహమనెడు, కరదీప = దివిటీలయొక్క, దీధితులు = కాంతులు, క్రమ్ముచోటన్ = వ్యాపించుచుండు చోటను, నవారవింద...తైలములు — నవ అరవింద = క్రొత్తతామరలయందు, బంధుర = ఇంపగుచున్న, మకరంద = పూఁదేనెయనెడు ('మకరందః పుష్పరసః' అమ.) తైలములు = చమురులు, నూల్కొనుచోటన్ = ఒడఁగూడి యుండునట్టిచోట, పరాగరక్షచేన్ — పరాగ = పుప్పొడియనెడి, రక్షచేన్ = విభూతిచేత, ('భూతిర్భసితభస్మని, క్షారో రక్షాచ' అమ.) కరము = మిక్కిలి, అరుదయినచోటన్ = వింతగానుండెడు చోటను - ప్రసవమునకు వలయునట్టివస్తుపరికరములెల్లఁ దనంతటనే అప్రయత్నపూర్వకముగా సమకూడి యుండుటచే నట్టిచోటు 'కరమరుదైనది' అనఁబడెను. ఒక్కకుమారున్, కుమారికామణిన్ = ఒకచక్కనికుమారితను, కాంచెన్ = కనియెను. ఇది

'మృగనాభినికరంపు ఘుమఘుమల్ గలచోటఁ, జదలేటితుంపురుల్ చెదరుచోట' (మను.)

అనుపద్యమునకుఁ బోలికగా రచింపఁబడినది. అందు రత్యాదులకు నుపయుక్తములయిన పరికరములే లతాగృహాంతరసీమ నుందున్నవి. ఇందు ప్రసవోచితములయినవానిని మతింత పొంకముగా గూర్చినాఁడు. ప్రసవగృహమున దీపములును, చమురులును, బూడిదయు నుండవలయును. అవియె యిందును సమకట్టింపఁబడినవి. మనుచరిత్రమందలి 'చిగురుపూవులసంజ' కన్ననిందలి 'హల్లకోత్కరకరదీపదీధితులును' 'కర్పూరతరుధూళి'కన్న నిందలి 'పరాగరక్ష'యు మిక్కిలి యుపయుక్తములు.

తే. ఆనదీనందన జనించుననఘవేళ, నిందుతారాప్రసాదంబు లెన్నఁదరమె
తారకాభర్తసుముఖతఁ దాల్చెఁ దార, కలు శుభాంఘ్రుల నఖరవైఖరివహించె.

ఆ. ఆనదీనందన = ఆశుక్తిమతికూఁతురు, జనించుఅనఘవేళన్ = పుట్టిననిర్దుష్టమైనసమయమందు, ఇందుతారాప్రసాదంబులు = చంద్రునియు తారలయు ననుగ్రహములు, ఎన్నన్ తరమే = గణింపశక్యమా - అనఁగా శక్యముగాదనుట - ఏలనఁగా, తారకాభర్త = చంద్రుఁడు, సుముఖతన్ తాల్చెను = సుముఖత్వమును వహించెనని యర్థము- సుముఖాకారమును వహించినాఁడని భావము. ఆబిడమోముగను పుట్టి

నుండెనని ఫలితార్థము. తారకలు ('నక్షత్రమృక్షం భంతారా తారకాప్యుడు
శుభాంఘ్రులన్ = మంగళకరములయిన-(లేక అందములయిన) పాదములచేత,
మనఁగా తీక్ష్ణము. 'తిగ్మంతీక్ష్ణం ఖరంతద్వత్'అ. అదికానిది అఖరము - అనగా
హావైఖరిని వహించెనని యర్థము. శుభలక్షణాస్పదములయిన పాదములందు,నఖర
లను వహించినవని భావము. ముఖము చంద్రునివలె నుండుటయు గోళ్లు చుక్కల
ించుటయు కన్యాశుభలక్షణములు. దీనిచేఁ బాలికకు రాఁగల మహాభాగ్యోదయ
ంత సౌందర్యాతిశయమును ద్యోతితము నని తెలియునది. చంద్రుఁడు సుముఖత=
తారకలు అఖర(చల్లని) వైఖరియుఁ జూపుటంబట్టి వారిప్రసాదములు చెప్ప
ుఁడు ఆమెముఖమునాకృతియు తారకలు దాని నఖములయాకృతియు గలవని
ముహూర్తమున శుభనక్షత్రమున జనించినదని ఫలితార్థము. అలం. శ్లేషము.

శీత శైలతనయాగ్రణియున్ ముద మంది నెయ్యపుం
ందుఁ గల్గినతనూభవసంపద పేర్మిఁ బావనం
దన్వయంబు కృతినైతి నటంచు వసుక్షితీంద్రుచే
వడ్డనెవ్వగ లన్నవంబుఁ దలంపక యుండె నెమ్మదిన్. 24

= ఆసమయమందు, శీతశైల తనయాగ్రణి = హిమవంతునిపుత్రులలో శ్రేష్ఠుఁ
, ముదముఅంది= సంతోషించి, నెయ్యపుందొయ్యలియందున్ = ప్రేమాస్పదు
ందు-శుక్తిమతియందనుట.కల్గిన తనూభవసంపద పేర్మిన్ = సంభవించిన సం
పెంపుచేత, మదన్వయంబు= నావంశము, పావనంబయ్యెన్ =పవిత్రమయ్యెను.
ుఁడనయితిని, అటంచున్ =అని తలంచుచు, వసుక్షితీంద్రు చేన్ = వసురాజు
వ్వగ=బ్రద్దలు చేయఁబడిన మహావ్యథను, మహాభారతమందును
క స్తేన ప్రహారవివరేణసా' అని కాలితాఁపు చేఁబాసినబ్రద్దలనుండి నది వెలువడె
ప్రయ్యలువడుట తెలియునది. 'ఇటప్రయ్యలువడ్డ నెవ్వగ' ననుచో 'ప్రయ్యలు
గ' యని యర్థము. కర్త్రాదులకుం బ్రాధాన్యవివక్షయందు, ధాతుజ విశేషం
వానితోడ సమసించు'నను సూత్రముచే నిది సిద్ధము. ఇట్లె, 'నీవు సంకటపడి
రత - ఉద్యోగ) ఇత్యాదులెఱుంగునది. లవంబున్ తలంపక =రవ్వంతయినను
స్వస్థమయిన మనస్సుతో, ఉండెను. ఇట్టి సంతానము లభించుటవలని సంతో
భను బోఁగొట్టెనని భావము.

దరసద్విజారవము చెన్నారం గుమారోదయ
ంభవిజృంభమాణ యగుచుం బద్మాస్య శైలావరో
ించి తనున్ ధరించె వసుపాదం బంచు నూహించి నె
వైవాఱి నొనర్చెఁ దద్వసుపదాఖ్యానంబు తోల్బ్రాలికిన్. 25

తామరవంటి ముఖముగలిగిన శుక్తిమతియని యర్థము - ముఖమువంటి తామరగల
ఇది కర్త. అమితా...రవము—అమిత=మితములేని, ఆనందరస=సంతోషము
ఆరవము=బ్రాహ్మణుల (ఆశీర్వాద) ధ్వని, చెన్నారన్= ఒప్పఁగానని యర్థము-
టమయిన యానందముగల, రసద్విజ ఆరవము=జలపక్షి కోలాహలము, ఒప్పఁ

గానని యర్థాంతరము. కుమార...మాణ—కుమార+ఉదయ = పుత్రజననమువలనఁ బుట్టిన, ప్రమద+ఆరంభ=సంతోషముతొడరుటచేత - తొడరిన సంతోషముచేతననుట. విజృంభమాణ=నిక్కుచున్నది అని యర్థము. విజృంభమాణ=ఉప్పొంగినది - అనఁగా వెల్లివొడిచినది యని యర్థాంతరము. అగుచు, వసుపాదము = వసుమహారాజుయొక్క చరణము, శైల + అవరోధము = పర్వతమువలని యడ్డగింత, వారించి=పోఁగొట్టి,తనుక్, భరించెక్ = రక్షించెను. అంచుక్, ఊహించి = విచారించి, నెయ్యము=భక్తి, దైవాఱక్=మీఱఁగా, తొల్చూలికిక్=తొలుతఁబుట్టిన కుమారునికి, తత్ వసుపద + ఆఖ్యానంబు=ఆవసుపదమనెడి నామమును, ఒనర్చెక్=చేసెను-వసుపదుఁడని పేరుపెట్టెనని భావము. ఎవరియందేని మిక్కిలి భక్తిగలిగినచో వారిపేళ్లు గన్నబిడ్డలకిడుట ప్రసిద్ధముకదా. బ్రాహ్మణాశీర్వాదపురస్సరముగాను నామకరణముచేయుటయుఁ బ్రకటమే. వసుపదుఁడను పేరిడినందులకు నీహేతువే.

'తస్మాద్విమోక్షణాత్ప్రీతా నదీరాజ్ఞేన్యవేదయత్ । యఃపుమానభవత్తత్ర తం స రాజర్షిసత్తమః ॥ వసుర్వసుపదశ్చక్రే సేనాపతిమరిందమః' అని భారతమునందును బ్రతిపాదితము.

క. గిరిరాజ తనయకైవడి, సిరి రాజిల వెలయు నీసుశీల యనుచు నా
గిరికన్య కచటిమౌనులు, గిరికాశుభనామ మిడి రకిల్బిషఫణితిన్. 26

అ. అచటిమౌనులు = ఆశుక్తిమతీ తీరమందుండు ఋషులు, ఈసుశీల= మంచిస్వభావముగల యీచిన్నది, గిరిరాజతనయకైవడిక్ = హిమవత్పర్వతరాజకుమారియైన పార్వతివలె, సిరి=ఐశ్వర్యము, రాజిలక్=ప్రకాశింపఁగా, వెలయుక్=విలసిల్లును, అనుచుక్, ఆగిరికన్యకుక్ = ఆకోలాహలుని కూఁతునకు, అకిల్బిషఫణితిక్ =నిర్దుష్టమయిన వాక్యముచేత '(కిల్బిషంత్వఘే అపరాధేపి' నానా.) గిరికాశుభనామము=గిరికయనెడు శుభయుక్తమయినపేరు, ఇడిరి=పెట్టిరి. గిరిరాజకన్యకవలె గిరికన్యకయుండవలయునని తలఁచుట యుచితమేకదా యని సారస్యము.

చ. జలకము లార్చి పాండుజలజచ్ఛదపాళికఁగప్పి తమ్మిసం
పులఁ దెలిదేనె లుగ్గులిడి క్రొందరఁగల్ గదలించుకల్వతొ
ట్టెలలఁ గుమారుఁ గూఁతును ఘటించి భజించు నదీలలామ కో
మలకుముదాగతాళికులమంజురవంబున జోల వాడుచున్. 27

అ. నదీలలామ = నదులకు భూషణమువంటి యాశుక్తిమతి, కుమారుక్, కూఁతును, జలకము లార్చి=స్నానములుచేయించి, పాండు...పాళికక్—పాండుజలజ = తెల్లతామర పువ్వులయొక్క, ఛదపాళికక్=ఆకుల సమూహమనెడి వస్త్రముల సమూహమును ('పత్త్రంపలాశం ఛదనం దళంపర్ణం ఛదః పుమాన్' అమ.) బిడ్డలకుఁ దెల్లని మడుఁగు పేలికలు అనఁగా పొత్తిగుడ్డలను మేనుఒత్తుకొనకుండుటకు నుపయోగించుట వాడుక. కప్పి, తమ్మిసంపులక్ = తామరలనెడి శంఖపాత్రలచేత, తెలిదేనెలు = నిర్మలమయిన మకరందములనెడు తెల్లనితేనియలను - బిడ్డలకు పాలెడలలోఁ దేనియలు పుట్టినపుడాదిగాఁ బోయుటవాడుక, ఉగ్గులిడి = ఉగ్గులుపోసి, క్రొందరఁగల్ = క్రొత్తయలలనెడు (దాదులూఁచుచున్న), కల్వతొట్టెలలక్ = కలువపువ్వులనెడు నుయ్యాలలందు, ఘటించి = కొడుకును గూఁతును బరుండఁబెట్టి, కోమల...రవంబునక్—కోమల=లేఁతలయిన, కుముద=తెల్లగలువలనుగూర్చి, ఆగత=వచ్చిన,అళికుల=తుమ్మెద గుంపులనెడు, అళికుల=చెలికత్తెల సమూహములయొక్క, ఇచట'అళికుల' అనుచో అకారమును 'అళికుల'అనుచో అకారమును సవర్ణదీర్ఘమువలన సంధిగూడినవి, మంజురవంబునక్=మధురఝుంకారధ్వనియనెడులాలిపాటలచేతజోలవాడుచుక్ =జోలపాడుచును,

పరిచరించుచుండును. పరిచర్యారూపసేవ చేయుచుండును-భజనశబ్దముచే పరిచర్య
మయు మూఁడును వ్యంజితములు. అలం. శ్లిష్టాశ్లిష్టవ్యధికరణైకదేశవర్తిరూప

ము నేర్పు నిందిందిరాజీవ, రాజీవరాజన్మరాళరాజి
ం నేర్పు లలితనానావాస,నావాసనికటకానన శుకాళి
ము నేర్పుఁ గుముదరసామోద,సామోద మధుపశుద్ధాంతసమితి
నేర్పుఁ దటరూఢకల్పాగ, కల్పాగచరనీలకంఠవితతి
కఖిలభాగ్యములుగలుగ, మునిపురంధ్రీ జనంబు దీవన లొసంగు
పలై దాదులై వయస్యలై విపినదేవతలు ప్రోతురనుదినంబు.

కన్యకున్=శుక్తిమతీనది పుత్రికయైన గిరికాదేవికి, ఇందిం... రాజి—ఇందిందిర=
జీవ=('ఆజీవో జీవికా వార్తా' అను.) జీవికలయిన-బ్రతుకుఁ దెరువులయిన, రాజీవ=
జత్=ప్రకాశించుచున్న, మరాళరాజి=హంసశ్రేణి, మందయానము నేర్పన్=
. బిడ్డలకుఁ దప్పటడుగులు గఱపుటవాడుక. అట్లుగఱపునవి మందయానసౌంద
హంసలే యైనచో ఆ మందగమనవిలాసమెంత యతిశయముగాఁ గుదురునని వ్యం
జీవ' - తుమ్మెదలనుఁ బూఁదేనెచేఁ బోషించునట్టి తామరల సొంపు సూచితము.
మరలందు విహరించు మరాళములు మత్తిల్లి నడలమురిపెము మఱింత గులుకు
ంసలసహజమందయానవిలాసమునకు నతిశయమునుగూర్చు పరికరమును గూడఁ

—లలిత=మనోహరమయిన, నానావాసనా=సకలమయిన వాసనలకు, వాస=ఉనికి
=దాపటివనమందలి, శుకాళి=చిలుకలగుంపు, కలికిపల్కులు నేర్పన్=ముద్దుగులుకు
కొకతొకపలుకులు దిద్ది బిడ్డలకు నేరుపుటగలదు. అదియు పలుకులముద్దునం దుద్దు
నచో నింక పలుకులుముద్దు ఎంతవిశేషముగాఁ గుదురునని వ్యంజితము. మఱియు
వాసమయిన కాననములనుటచే కాననవృక్షములు పుష్పఫలాదిసౌభాగ్యమున
మత్తతయుఁ దన్మదప్రయుక్తమయిన వానిపలుకులమాధుర్యమును ద్యోతితములు.
ఁ గఱపుటకు నవియున్న కాననము నికటమయినదిగా గ్రహింపఁబడెను.
మితి—కుముద=కలువపువ్వులయందలి, రస=పూఁదేనెయందును, ఆమోద=పరిమళ
= సంతోషయుక్తములగుచున్న, మధుపశుద్ధాంత = ఆఁడు తుమ్మెదలయొక్క,
. ఇట శుద్ధాంతశబ్దమంతఃపుర స్త్రీలయందు వర్తించుచున్నది.
తం శూలపాణి శుద్ధాంతమ్' (మూకపంచశతి - ఆర్యాశతకము.)
న్=ఒప్పిదములగు పాటలను గఱపును. తేంట్లకుఁ బాటలు చెప్పుట కవిసమయము.
మునఁ దేఁటు లెలుఁగెత్తిపాడుచోట — మనుచరిత్ర.
ండ నళిమండలికల గానము. — వసుచరిత్ర.
గా కృష్ణుఁడు మంచివాఁడనుచుఁ జెప్పన్ రాకు ..
మ్మున మేము చొక్కుదుమె — భాగవత ద. స్కం.
తుమ్మెదలపాట లతిమధురములుగా వర్ణింతురు.

క. అంగీకృతరంగన్నా, తంగీ మదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల, భృంగీగణ మొప్పె భ్రమను పెట్టెడుమాడ్కిన్. భాగ. అష్టస్కం.

క. వీనులవిందై యమృతపు, సోనలపొందై యమందసుమచలదళిసీ
గానము క్రందై యారవ, మానందబ్రహ్మమైన నధిపతి పలికెన్. వసుచరి. ౧. ఆ.

పాటలయందు మేటులయిన తుమ్మెదలె పాటలు నేర్పునవి కాఁగా ఆబిడ్డకు పాటలతీయఁదనమెంతగా నలవడవలయుననని భావము. అందు నాతుమ్మెదలు కలువపూవుల తేనియను ద్రావి తావులనాని మత్తిల్లినవి. కాన వానిగానమాధుర్యమతిశయమైనదిగాఁ దగును. తట... వితతి—తట=ళుక్తిమతీతీరమందు, రూఢ=మొలచిన, కల్పాగకల్ప=కల్పవృక్షములకు సాటియైన, అగ=వృక్షములందు, చర=క్రుమ్మరునట్టి, నీలకంఠవితతి=నెమిళ్లగుంపు,('మయూరో బర్హిణో బర్హీ నీలకంఠో భుజంగభుక్') అమ. నటనలీలలు=ఆట సొబగులు, నేర్పన్=కఱపును. ఆటలయందు నీటు చూపు నెమిళ్లే యాటలు నేరుపఁగా నాబాలిక నాట్యవిలాస మద్భుతముగాఁ గుదురఁదగినదని భావము.అందు నా నెమిళ్లు కల్పవృక్ష సదృశములయిన వృక్షములందుఁ జరించునట్టివి గాన మత్తములయి నాట్యవిలాసము మిక్కిలియు గులుకునని తెలియునది. మునిపురంధ్రీజనంబు = (స్యాత్కుటుమ్బినీ పురంధ్రీ' అమ.) తాపస స్త్రీ) జనము. అఖిలభాగ్యములుగలుగన్=సమస్తములయిన సంపదలుగలుగునట్లుగా, దీవనలొసంగున్=ఆశీర్వాదముల నిచ్చును- దీవించుననుట. విపినదేవతలు=వనదేవతలు, సైరంధ్రులై ('సైరంధ్రీ పరవేశ్మస్థా స్వవశా శిల్పకారికా' అమ.)అనఁగా పాతివ్రత్యముదప్పక పరగృహమందుండి రాజకన్యల కలంకారము చేసెడు స్త్రీ) సైరంధ్రి అట్టి) సైరంధ్రులు కొందఱగుచును, దాదులై =కొందఱు దాదులగుచును, వయస్యలై = కొందఱు చెలికత్తెలగుచును, ('ఆళిస్సఖీ వయస్యాచ' అమ.) అతివన్=గిరికాదేవిని, అనుదినంబున్=ప్రతిదినమును, ప్రోతురు=సంరక్షణము చేయుచుందురు. అనఁగా గిరికాదేవి హంసనడకలవంటి నడలును చిలుకపలుకులవంటి పలుకులును, తుమ్మెదల పాటలవంటి పాటలును నెమిళ్లయాటలవంటి యాటలును గలదియయ్యెనని భావము. శైశవమందుండియె యాయావిలాసమందు దిట్టలలో దిట్టలయినవారివలన నేర్పఁబడఁగా ప్రాయమున దాని గమనాదివిలాసవైభవాతిశయము వాచామగోచరము గావలయుననని వ్యంజితము. ఇందుము క్తపదగ్రస్తమలంకారము. గమనవచోవిలాసాదులకు నందుల కుపమానభూతులయిన మరాళశుకాదులు, దీవనలకు నిగ్రహానుగ్రహసమర్థలయిన మునిపురంధ్రులు, నేపథ్యపోషణాదులకు వనదేవతలు. ఇఁక నాంగికసౌభాగ్యసామ్రాజ్యము వర్ణనాతీతమని స్ఫురించుచున్నది.

మ. వెలఁదుల్ దానును గూఢరత్నకసికతాన్వేషంబు గావించుచుం
జెలి బాల్యంబున నిక్కువల్ గనకయుం కేజే సాఁచి యాత్మప్రసూ
పులినోర్విన్ మణు లెందునేని గొని రాకఁబోటుల్ భళీ తల్లి నిన్
గెలిపించెన్ సిరికల్మి నంచు నగుచుం కే క్రీడింతు రబ్బాలతోన్. 29

అ. చెలి=ఆగిరిక, వెలఁదుల్ తానును=చెలికత్తెలును తానును, గూఢరత్నసికత అన్వేషంబున్=గూఢరత్నమనఁగా బాలికలయొక్క క్రీడావిశేషము. అనఁగా ఆదియొక విధమయినయాట.

[రత్నాదిర్వాలుకాదాగుప్తేర్ద్విష్టవ్యకర్మభిః। బాలికాభిః కృతా క్రీడానామ్నా గూఢమణిః స్మృతః. అనియున్నది. ఇసుక కుప్పలు చేసి యందొక కుప్పయందుఁ జెలికత్తియలు గిరికాదేవికిఁ దెలియకుండునట్లు ఒకరత్నము లోపల నుంపఁగా గిరిక యేదేని యొకకుప్ప పట్టుకొని యందు వెదకిన రత్నమొప్పుడు కనఁబడుచున్నదో యపుడు గిరిక గెలిచినట్లు నంతవఱకును గెలుపు లేనట్లును నిట్లొకయాటఁ దాడును.]

ప శంఖములన

కొంకో శంఖములు గట్టినదియని—అనఁగా శంఖములను దిరస్కరించిన కంఠ ఆశంఖములన భూషణముగాఁగట్టుట యెంతమాత్రము యుక్తముగాదని భావము. పాయఁద్రోలమును,ఉంపక్ దీసివైచి, రత్న + అంకితహారము=మణులచే చిహ్నితమయిన అనఁగా ఖచితమయినసుట తెలియ =వేయఁగా, బిడ్డకుక్=పసిబిడ్డయైన కూఁతునకు—మక్కువ యతిశయముచేత గులు అంచుక్ = నది. బరువులనునో=బరువు ఒత్తుకొనునో—బరువగు నేమో. ఇవి ఏల కర్కశ + అలఁశు క్తిమతియు, ఇవిరెండులకుఁగఠినములయినసొమ్ములుఅనిపలుకుచు, నదీలలామయుక్=ఏఱులమిన్న బరువనుటచే హల్లకకలాపములు = ఎఱ్ఱగలువల సొమ్ములను, ఉంచుక్=పెట్టును- రత్నహారముగ సౌకుమార్యము గిరికశరీర సౌకుమార్యాతిశయము ధ్వనితము. హల్లకములె భూషణముగానుంచుటశయము. తండ్రి పుష్పసదృశమనియు వ్యంజితము. పూవువంటి మేనికి పూవులే యలంకారములని తల్లివంకయు కులశైల సుతాగ్రణి, తల్లి నదీలలామ ఈ'అగ్రణీ' 'లలామ' శబ్దములచే పుట్టి వంద్రివంకయు ఆభిజాత్యముచేఁ గిరికకు నత్యంతసౌభాగ్యమును ధ్వనితము.

మ. అనుఁగుంగ్రీడల నెల్లవారలకు నిట్లల్లారుముద్దైన కూఁ
తునకుక్ వాహిని వాణిఁ దాల్చుసుకవిస్తోమంబు రప్పించిహా
ఘన విద్యామహిమల్ కరామలకముల్ గావించె నాత్మీయ. 32
తన పద్మోపచయం బశేషమును దత్ప్రాప్తంబు గావించురలకుక్=అంద

అ. వాహిని=నది-శుక్తిమతి, అనుఁగుంగ్రీడలక్=ఇంపయినయాటలచేత, ఎఁకూఁతురగు గిరి అకును, ఇట్లు=ఈప్రకారమున, అల్లారుముద్దు=మిక్కిలిగారాము, ఐన, కూఁతునకుదనుట కిదియ కకు, కూఁతుశబ్దమునకు ప్రథమయందుఁ దప్పరు వర్ణకము తక్కిన విభక్తులయందుమున, సుకవిస్తో ప్రమాణము. వాణిక్=సరస్వతిని, తాల్చు = వహించుచున్న—అనఁగా విద్యాం వాణిఁదాల్చు= మంబుక్=సత్కవులయొక్క సమూహమును, రప్పించి=పిలువనంపించి యనియర్థమన్న యనిగాని మధురవాక్యములను వహించుచున్న యనిగాని, సరస్వతీదేవిని వాహనమునై వహించలపక్షపః శేషము చెప్పవచ్చును. సుకవిస్తోమంబుక్ = (కవులనఁగా నిట జలపక్షులు, సుకవులనఁగా నేప మహి లయిన రాజహంసలు,) రాజహంసల సమూహములను, రప్పించియని యర్థాంతరము. న్నది. లను, మల్—తత్ = ఆవిద్వత్కవులయొక్క, ఘనవిద్యామహిమలు = గొప్పవయిన విద్యా పడు కర+అమలకముల్ కావించెక్=అరచేతి యుసిరికాయ లగునట్లుగా - అనఁగా సర ప్రభా నట్లుగాఁ జెప్పించెనని యర్థము — ఆరాజహంసలయొక్క మధుర వాక్యరూపములఁ స్థాము వములను నేర్పించెనని యర్థాంతరము. గిరికాదేవి పద్మినీజాతి స్త్రీగనుకఁ బద్మినికి లని విచారించునది. పద్మినీజాతి లక్షణము.

వ్రజతి మృదు సలీలా రాజహంసీవ తన్వీ, త్రివళిలలితమధ్యా హంసః అన్వేషంబుక్
మృదుశుచి లఘుభుక్తి మానినీ గాఢలజ్జా, ధవళకుసుమవాసోవల్లభాయునయాట.

సీ. రాజీవగంధి సాంద్రాశేందు బింబాస్య, నీలోత్పలశ్యామ • నిర్మలాంగగూఢమణిస్ఫుత
సద్గుణచారిత్ర • సత్యవ్రతాచార, తరుణకురంగాక్షి • ధవళ నేత్ర కాదేవికిఁ దెలియకుండ
పాటలాధర రక్త • పల్లవమృదుపాణి, గానవిద్యాలోల యందు వెదకిన రత్న మెరుగు
హంసభాషిణి మణిహార విభూషిత, మదమదావళయాన నిట్టొక యాటయాడును.]

విమలవస్త్రింబు పద్మిని వేడ్కఁగట్టు

గిన్నరకోటులఁ నిలిపి శ్రీ గేయవిశారదఁ
గిన్నరమీఁట వీణఁ బలికింపఁగ గీతముఁ
వన్నియఁ బాడఁ జెప్ప ననివారితచాతు

ఇట తండ్రిచెప్పించు చదువును వర్ణించుచున్నా
మిన్నయు, మహా...ర్పణంబుచేఁ = (కూటమనఁగా స
లయిన రతనముల రాసులయొక్క యిచ్చుటచేత నని య
ముల నిచ్చుటచేత నని యర్థాంతరము.) కిన్నరకోటుల
(రత్నములిచ్చి) కొలువుంచి యని యర్థము. (శిఖరములఁ
కూఁతునుఁ=కుమారిని, కిన్నరఁ=రెండుతీఁగలుగట్టి
టకును, గీతములుఁ=ప్రబంధములును, వీణఁ–వీణఁ
వన్నియఁ=సొగసుగా, పాడఁ=పాడుటకును, చెప్పఁ
అడ్డులేనినేర్పు—ధారాళమయిన నైపుణ్యము, కలుగ
పండితురాలగునట్లు చేసెను.

పూర్వపద్యమునఁ దల్లి సాహిత్యవిద్యయంద
ప్రవీణురాలిని జేయుట చెప్పఁబడినది. తల్లి పద్మరాగ
దండ్రి మహామణిరాసులచే సంగీతమున 'అనివా
'ప్రాప్తంబు' గావించినట్లె తండ్రి తనమణులను 'స
ములసంగతి ధ్వనించుచున్నది.అందు సుకవి'స్తోమ
రాజహంసతామరససమూహముల చేతనే విద్యోపఁ
ఖరగోచరములయిన కిన్నరమణి శృంగముల చేత
తెలియునది. అలం. అభేదరూపాతిశయోక్తి య

శా. వీణావాదనవేళలఁ ఘుమఘుమ
త్ప్రాణాచంచలతైలశూన్యనవ
రాణింపఁ ముఖలక్ష్మికిఁ ముకు
మాణిక్యాయతనం బొనర్చె గి

అ. గిరి=పర్వతము-కోలాహలుఁడు, లే
వాదనవేళలఁ = వీణవాయించు సమయముల
ఘుంకారముయొక్క పుట్టుకను, నింపఁ = !
ఘుంకారము మిక్కిలి పొడమునట్లు చేయుట
చేత, అచంచల = కదలని - అల్లలాడకుండ
తముగాన—ఆఱిపోకుండు నట్టివియు, తైల
ఱలేనివనుట), నవ= క్రొత్తవియు నయిన, దీ
ద్యై—గాలికి ఆఱని చమురునకు వెలుఁగని క్రొ
పఁ =ప్రకాశించుటకొఱకును, ముఖలక్ష్మికి=
ముకురమై=అద్దమై, రంజిల్లఁ=ఒప్పుటకు
మహాత్త్వము చేత, మాణిక్య+ఆయతనంబు=

దీపములు శోణగణములోఁ బతితము. మాణిక్యాయతనమందు వరుసగాఁ దాపియున్న పద్మ రాగపుఁ గెంపులు దీపముల వరుసలుగాఁ బ్రకాశించుచున్నవి. మఱి యాకెంపులు పాషాణజాతివిగాన పాషాణములవలెఁ బ్రతిధ్వని కుపయుక్తమగుటచే ఘుమఘుమధ్వనులను వీణాధ్వని కుపకారముగాఁ గలిగించుచున్నవి. ముఖలక్ష్మి యనుటచే మోముయొక్క శోభా సౌభాగ్యము ధ్వనితము.

ఉ. ఆనగజాత యీతరుణి యీ వనదేవత లీవయస్య లా
మానవనాథపాదనఖమర్దితభూధర మీనగోత్తమం
బీనగమౌళిపై నెసఁగు నీమణిధామము లీకొలంకు లీ
కోనలు నీనికుంజములుఁ గుంజరయాన విహారరంగముల్. 35

అ. ఆనగజాత=ఆకోలాహలునికిఁ బుట్టినదియే, ఈతరుణి=ఈజవరాలు, ఆవనదేవతలు, ఈవయస్యలు=ఈచెలికత్తెలు, ఆమానవ..ధరము—ఆమానవనాథ = ఆవసురాజుయొక్క, పాదనఖ=కాలిగోటిచేత, మర్దిత=పీడింపఁబడిన, భూధరము=పర్వతమే, ఈనగోత్తమము=ఈమేటికొండ, ఈనగమౌళిపైన్=ఈకొండల మిన్నమీఁద, ఎసఁగు ఈమణిధామములు=ఒప్పుచున్న యీపద్మరాగమణుల గృహములును, ఈకొలంకులును, ఈకోనలును = ఈలోయలును —లోయలోని వనప్రదేశములనుట, ఈనికుంజములున్ = ఈపొదరిండ్లును, కుంజరయాన విహారరంగముల్ = ('మతంగజో గజో నాగః కుంజరో వారణః కరీ' అమ.) ఏనుఁగు నడవంటి నడలుగల యీ గిరికాదేవియొక్క విహారపుఁ బట్టులు.

ఇందు 'తరుణి' 'కుంజరయాన' శబ్దములచే ఉపభోగ్యమయిన ప్రాయము కలిమియు, వనదేవతలు వయస్యలనుటచే సౌభాగ్యాతిశయమును సూచితములు.

క. అని వనిత యుపరిచరవసు, జననాయకుకథయుఁ గన్యజననాగతియున్
వినయంబున వినిపింపఁగ, విని యమ్ముని సమ్మదాబ్ధివీచికఁ దేలెన్. 36

అ. అని, వనిత=మంజువాణి, ఉపరి..కథయున్=ఉపరిచరవసురాజు వృత్తాంతమును, కన్యజనన ఆగతియున్=గిరిక పుట్టుకరాకయు —పుట్టుక కలిగిన విధమునసుట, వినయంబునన్ = అడఁకువతో, వినిపింపఁగన్, అమ్ముని=ఆకపటయతి, విని, సమ్మద అబ్ధివీచికన్=సంతోష సముద్రముయొక్క యలయందు ('భంగ స్తరంగ ఊర్మి ర్వా స్త్రియాం వీచిః' అమ.), తేలెన్=ఓలలాడెను.

మ. లతికాసంవృతగాత్రుఁడై నిజకథాలాపంబు లాలించుభూ
పతి యచ్చో హితునేర్పు బోటివచనప్రాగల్భ్యముం గన్యయు
న్నతగోత్రోద్భవ వైభవంబును మది న్వర్ణించి యూహించె ధ
న్యత నాశుక్తిమతీఝరీజనితరత్నం బాత్మవిత్తంబుగాన్. 37

అ. లతికాసంవృత గాత్రుఁడై = తీఁగలచేత చక్కఁగాఁ జుట్టుకొనఁబడిన—(అనఁగా తెలియనట్లు గప్పఁబడిన) దేహముగలవాఁడై, నిజకథ+ఆలాపంబులు=తనకథలను గుఱించినమాటలను, ఆలించుభూపతి=వినుచున్న వసురాజు, అచ్చోన్=అక్కడ, హితునేర్పు = నర్మసఖుని చతురత్వమును, బోటివచన ప్రాగల్భ్యమున్ = మంజువాణియొక్క మాటలప్రౌఢియు, కన్య ఉన్నతగోత్ర ఉద్భవ వైభవంబును=ఆచిన్నదాని హెచ్చయినవంశము (గోత్రమనఁగా వంశమును పర్వతమును) నందలిపుట్టుకయొక్క పెంపుసొంపునని యర్థము. (పొడవయిన కొండవలని పుట్టుకయని యర్థాంతరము.) మదిన్ వర్ణించి=మెచ్చుకొని, ధన్యతన్ = కృతార్థత్వముచేత, ఆశుక్తిమతీ ఝరీజనిత రత్నంబు = ఆ శుక్తి

మతి నదివలనఁ బుట్టిన మేలివస్తువు, ఆత్మవిత్తంబుగాన్=తనధనముగా, ఊహించెను. శుక్తిమతి తనకు సొంతము. అందుఁబుట్టిన మేలివస్తువులన్నియు 'రత్నహారీతు పార్థివః' అన్నట్లు తనసొమ్మేకాన గిరికయుఁ దనధనమేయని యూహించెను. అట్టిరత్నము తనవిత్తముగా నూహించుటచేతనే ధన్యత్వము గలుగఁగా ప్రాప్తించుటయొక్క ధన్యత్వాతిశయమును జెప్పనేలయని భావము.

శా. మాయామానియు నంతఁ గొంతతడ వాత్మధ్యాన విజ్ఞానము
ద్రాయత్తంబున నున్నయట్లలరి కాంతారత్నముం బల్కె లే
మా యే మాంతరదృష్టిఁ జూచితిమి భామాభావిభాగ్యోదయం
బీయబ్జాననఁ బెండ్లియాడు వసురాజేంద్రుండు వాలాయమున్. 38

అ. మాయామానియు=కపటయతియు, అంతన్, కొంతతడవు, ఆత్మ... త్తంబునన్—ఆత్మధ్యాన=పరమాత్మధ్యానమందలి, విజ్ఞానముద్రా = చిన్ముద్రకు, ఆయత్తంబునన్ = లోనయినట్లుగా (క్రియావిశేషణార్థకమయిన అగుధాతు తుమంతకమునకు మాఱుగా నవర్ణమువచ్చుట. ('అగ్నిసాక్షికం,బునఁ బరిణీతయైన' 'యా,నందముబొంది నిర్భయముననన్' ఆదిపర్వము) చూపట్టుచున్నది. లేక భావప్రధాననిర్దేశమైననుం గావచ్చును. ఉన్నయట్లు, అలరి=ఒప్పి (అనఁగా చిన్ముద్రపట్టి యోగసమాధియందు నున్నవాని వలెనుండి), కాంతారత్నమున్ పల్కెన్—ఏమనియనఁగా, లేమా=ఓమంజువాణీ, భామా భావి భాగ్య ఉదయంబు=గిరికయొక్క రాఁగల అదృష్టముయొక్క తోఁపికను, ఏము, అంతరదృష్టిన్=లోనిదయిన (జ్ఞాన) దృష్టిచేత, చూచితిమి, వసురాజేంద్రుండు, వాలాయమున్ = అవశ్యముగా, ఈయబ్జాననన్=తామరవంటి మొగముగల యీచెలువను, పెండ్లియాడును, వసురాజు అనుదానికి సూర్యుఁడనియు అబ్జాననశబ్దమునకు మొగమువంటి తామరయనియు నర్థములు పొసంగుటచే సూర్యుఁడు తామరకుఁ బతియగునట్లు ఈచెలికి వసురాజు పతియై వికాసము కలిగించునని భావము ధ్వనించుచున్నది.

తే. రమణి యిట్టికాంతాలోకరత్న మమరఁ, జేసినవిధాత వసువుతోఁ జేర్పఁడేని
యాతనినిసర్గమధుర సర్గానుభావ, మఖిలభువనప్రసాధనం బగుట యెట్లు. 39

అ. రమణి=మంజువాణీ, ఇట్టి, కాంతాలోకరత్నము = ఆఁడువారి సమూహమునకు మిన్నయైన గిరికాదేవిని, అమరన్=ఒప్పిదమగునట్లుగా, చేసిన, విధాత=బ్రహ్మ, వసువుతోన్=వసురాజుతో, చేర్పఁడేని = కూర్పకపోయెనేని యనియర్థము. (కాంతి=మనోహరమయిన, ఆలోక=ప్రకాశముగల, రత్నమును,అమరన్ చేసిన విధాత, వసువుతోన్=బంగారముతో, చేర్పఁడేని అని యర్థాంతరము.) ఆతని, నిసర్గ... భావము—నిసర్గ = స్వభావముచేత, మధుర = అందమయిన, సర్గ = సృష్టియొక్క, అనుభావము = ప్రభావము, అఖిలభువన ప్రసాధనంబు = సకలమయిన జగత్తునకు అలంకారమగుట, ఎట్లు=ఏవిధమున - ఏవిధముననుగాదని భావము.

'అనర్ఘమపి మాణిక్యం హేమాశ్రయ మపేక్షతే' అనునట్లు మణి బంగారముతోఁ జేరక యలంకారముగా నేరదనుట యిట యనుసంధించినాఁడు. బ్రహ్మసృష్టియందు మధురములును అమధురములును గలవు. అందు స్వభావమనోజ్ఞము లయినవాని నతఁడు సృజించుట సకలజగదలంకారమునకు. అట్టివస్తువును తదనురూపమయిన దానితో,రతనమును బంగారుతోడం బోలెఁ, గూర్చిన నేదానికి వన్నెగలిగి యది సృజించిన బ్రహ్మయుద్దేశమును (అనఁగా సకలజగదలంకారకరణమును) నెఱవేర్పఁజాలును. కాన బ్రహ్మ తననిర్మించిన యాయుద్దేశమొనఁగూడుటకై తానే వసురాజుతోఁ గూర్పకమానఁడు. కూర్పకపోవునేని దానిమహిమ వ్యర్థమగును; తనయుద్దేశమును విఫలమగునని యాశయము. అలం. శ్లేషము.

చ. నెలఁతలలోఁ ద్రిలోకనుత నిర్మలరూపకలాపధన్య యీ
కులగిరిరాజకన్య నృపకోటులలో వసురాజు మేటి య
య్యలఘుఁడు నీలతాంగియు లతాంతముఁ దావియుఁ బోలి యేకమై
వెలయఁగఁ గన్నులారఁ గనువేడుక వేగమ మీఱఁ గల్గెడున్. 40

అ. నెలఁతలలోన్ = స్త్రీలలోపల, ఈ కులగిరి రాజకన్య=పర్వతరాజయిన కోలాహలునికూఁతురగు గిరికాదేవి, త్రి...ధన్య— త్రిలోక = ముల్లోకములచేతను, నుత=కొనియాడఁబడిన, నిర్మల=నెఱసులేనట్టి, రూప=(రూపమనఁగా 'ఆలేప్యాకోప్యనిక్షేప్య బంధనీయైరభూషితమ్। యద్భూషిత మివాభాతి తద్రూపమితికథ్యతే' వస్త్రాభరణ గంధమాల్యములచే నలంకృతము గాకయే యలంకరింపఁబడినట్లుండునట్టిది. అట్టి) రూపమనెడు, కలాప = భూషణముచేత, ధన్య=కృతార్థురాలయినది— ఇట రూపమే యలంకారముగాఁ గలది గాన యలంకారాపేక్ష లేనిదనుట స్ఫురించెడిని. నృపకోటులలోన్ =రాజసమూహములలోపల, వసురాజు, మేటి=గొప్పవాఁడు, కాఁబట్టి, అయ్యలఘుఁడున్ =ఆగొప్పవాఁడును, ఈలతాంగియున్ = ఈపడఁతియును, లతాంతమున్ తావియున్ పోలి= పువ్వును బరిమళమును వలె, ఏకమయి=ఒక్కటివారై- మిక్కిలి యొకరికొకరు పొసఁగి యెసఁగియనుట. ఏకమై అను విశేషణము 'లతాంతము తావికి' చెల్లునుగాని 'అలఘు లతాంగులకు' చెల్లదు; కాన విపరిణామమునఁ జెల్లించుకొనవలయును. వెలయఁగన్ =ప్రకాశింపఁగా, కన్నులారన్ =కన్నులనిండుగా, కనువేడుక = చూచెడువేడుక, మీఱన్, వేగమ=శీఘ్రముగా, కల్గెడిన్ =కలుగఁగలదు.

పూవుతావిచేత మఱింత శోభించునట్లు వసురాజీకన్యచేత మిక్కిలియు నుల్లసిల్లును. తావి పూవు నాశ్రయించియే వెలయఁగూడును గాన యీకన్య వసురాజును జేపట్టియే వెలయఁజెల్లునని యాశయము. దాంపత్యమునకు 'పూవునుం దావియుఁబోలెఁ జాలఁ బ్రమదం బొనరించిరి నాతినెచ్చెలీ.' (మనుచరిత్రము.) అని పూవును దావిని చెప్పుటగలదు. రూపమునందు గిరిక స్త్రీలలో నెక్కుడు; గొప్పతనమందు వసురాజు రాజులలో నెక్కుడు. కావుననే గౌరవస్ఫోరకమయిన 'అలఘు' శబ్దముచేతను సౌందర్యద్యోతకమయిన 'లతాంగి'శబ్దముచేతను వారిరువురను మరల నిర్దేశించినాఁడు. అలం. ఉపమాసంకీర్ణమగు సమము.

వ. అనిన నమ్మందయాన సందియంబున నిట్లనియె. 41

అ. అమ్మందయాన=ఆమంజువాణి, సందియంబునన్ =సందేహముచేత.

ఉ. ఇన్నగరాజుఁ జూడ వసుధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు వచ్చి యీ
క్రొన్ననతీవజొంపముల కోనకు నెన్నఁడు డిగ్గు డిగ్గి యీ
కన్నియఁ గన్నులారఁ గుతుకంబున నెన్నఁడు గాంచుఁ గాంచి తా
నెన్నఁడు గారవించుఁ జెలు లెన్నఁడు గాంతు రభీష్టసంపదల్. 42

అ. వసుధేశ్వరుఁడు=వసురాజు, ఇన్నగరాజున్ = పర్వతశ్రేష్ఠుఁడయిన యీకోలాహలుని. చూడన్, ఎన్నఁడు, వచ్చును. వచ్చి, ఈక్రొన్నన తీవజొంపములకోనకున్ =క్రొత్తవయిన పూవుఁదీవియల గుబురుగల యీలోయకు, ఎన్నఁడు, డిగ్గున్ =దిగును, డిగ్గి=దిగి, ఈకన్నియన్, కన్నులారన్, కుతుకంబునన్ =వేడుకతో, ఎన్నఁడు, కాంచును, కాంచి = చూచి, తాను, ఎన్నఁడు, గారవించున్ =మన్నించును, చెలులు= చెలికత్తెలు-మేమనుట, అభీష్టసంపదల్ =కోరిన సిరులను-వసురాజు గిరికను

పరిగ్రహించుటచేతఁ దమకుఁ గోరినసంపదలెల్లననుట, ఎన్నఁడు,కాంతురు=పొందఁగలరు, ఇదిమిక్కిలి దుర్లభముగదా యని యాశయము.

వసురాజుతోడి కూడిక యీకన్నియకుఁ గల్గుట దుర్లభము. అయిన నందులకుఁ గొన్నియుపపత్తులు గలుగవచ్చును. ఈనగరా జాతనిక్రీడాపర్వతము గాన యిందులకు విహారార్థము రావచ్చును. అట్లు వచ్చునేని యీకోన క్రొన్ననతీవజొంపములు గలదిగాన నిందు దిగవచ్చును.దిగినపిదప నీకన్నియను జూడఁ దటస్థించును. చూచినపిదప నతఁడు మన్నించునేని మాసంపదలన్నియుఁ బండినట్లె.మహాసార్వభౌముఁడు మాచెలిని జేపట్టినపిదప మాకుఁ దక్కువయేమి ? యని తాత్పర్యము. కన్నియను జేపట్టుననుటకు గారవించునని గౌణముగా జెప్పుటచే రాజునందలి వారిగౌరవప్రతిపత్తియు స్త్రీత్వప్రయుక్తమయిన వారిమానంపు పలుకుబిగియు వ్యంజితములు. 'ఏలుకోఁ గద మాచెలి బాల నిపుడు' (విజయవిలాసము) ఇత్యాదు లెఱుంగునది.

చ. అని జవరాలు వెండియుఁ బ్రియమ్మున నమ్మునిఁ జూచి యోతపో
ధనమణి యీలతాంగి వసుధావరు నెన్నఁడు చెట్టపట్టునో
యని యనురక్తి పెంపుమెయి నాడితిఁ గాక శుభప్రసంగ మం
గనకు నొసంగఁ గొంగుముడి గాదె భవద్వచనంబు నావుడున్. 43

అ. అని, జవరాలు=మంజువాణి, వెండియున్=మరల, ప్రియమ్మునన్ = ప్రీతిచేత, అమ్మునిన్, చూచి, ఓతపోధనమణి=తపస్సే ధనముగాఁగలవారిలో మేలయినవాఁడా, ఈలతాంగి,వసుధావరున్= భూపతియైన వసురాజును, ఎన్నఁడు, చెట్టపట్టునో = పాణిగ్రహణము చేయునోకదా, అని, అనురక్తి పెంపుమెయిన్=మక్కువయొక్క యెక్కువచేత, ఆడితిన్ కాక = చెప్పితినే కాని, భవద్వచనంబు= దేవరవారిమాట, అంగనకున్=గిరికాదేవికి, శుభప్రసంగము=మంగళమయిన ప్రసక్తిని-రాజుపాణిగ్రహణముననుట, ఒసంగన్=ఇచ్చుటకు, కొంగుముడిగాదే=కొంగుముళ్లకదా-కొంగుముల్లివలె సిద్ధమైనదిగదా యనుట. నావుడున్=అని పలుకఁగా.

కొంగుముల్లె తలఁచిన కార్యము నెఱవేర్చుటకుఁ దోడనే సిద్ధముగా నుపకరించునది—అనఁగా సిద్ధముగా సమకూర్చునది. అట్లె దేవరవచనమును గిరికకు శుభప్రసంగ మొడఁగూర్చుటకు నత్యంత సిద్ధమైనది. అట్లుండ సందేహమేల యన్నచో 'అతిస్నేహః పాపాశంకీ' అను న్యాయముచొప్పున, అనురక్తి పెంపుచే నట్లుగలిగినది. ఇట 'ఈలతాంగి...పట్టునో' అని స్త్రీ పురుషునిఁ జెట్టపట్టుట వ్యత్క్రమము. 'లతాంగిన్ వసుధావరుఁ డెన్నఁడు చెట్టపట్టునో' యని పాఠముఁ జేసినచో నిది తొలఁగును. అతనివచనము కొంగుముడి యగుటకు నతఁడు 'తపోధనమణి' గదా.

మ. లలనా ! యీయెలనాఁగఁ బెండ్లి యగు వాంఛాలయంబుఁ జేదిక్షమా
తలనాథుం డిది నమ్మవేని నిజమంత్రప్రౌఢి రప్పింతు నా
నలనాసత్యసమానుఁ జూడు మని పంకేతం బొప్ప మాయాజపా
కలనాదంభము పూని మాని దిశ లాకర్ణించి మర్యా యనన్. 44

అ. మాని = ఋషి, లలనా=మంజువాణి, ఈయెలనాగన్ = ఈగిరికను, చేదిక్షమాతలనాథుండు = చేదిభూమికి రాజయినవసురాజు, వాంఛాయంబు=అవశ్యముగా, పెండ్లియగున్=వివాహము కాఁగలఁడు, (పెండ్లి, పయనము, మొదలగువానితోడ'అగు' ధాతువయ్యె నర్థములఁ జూపట్టు

చున్నది. ఇది భాషాశైలి, పెండ్లియగుర్ = పెండ్లి చేసికొనుననుట) ఇది = ఈమాటను, నమ్మవేని, అనలనాసత్యసమాను=నలునితోడను అశ్వివేవతలతోడను ('స్వర్వైద్యావశ్వినీసుతౌ, నాసత్యావశ్వినా దస్రావాశ్వినేయౌచ తా వుభౌ' అమ.) సమానుర్=సాటియైన యావసురాజును - నలునివలెను నశ్వి దేవతలవలెను సౌందర్యవంతుఁడయిన యారాజుననుట. ఇట సౌందర్యద్యోతకములయిన యుపమానము లు రాజునకుఁగూర్చుట 'కన్యావరయతే రూపమ్' అన్నట్లు కన్య యిష్టము చొప్పున. నిజమంత్రప్రౌఢిర్ = నాయొక్క మంత్రప్రభావముచేత, (నారహస్యాలోచనముయొక్క నేర్పుచేతనని యర్థాంతరము). రప్పింతును, చూడుము, అని, పంతంబు ఒప్పర్ = ప్రతిజ్ఞ యొప్పునట్లుగా, మాయా...దంభము — మాయాజప = కల్లజపముయొక్క, ఆకలనా = చేయుటయనెడు, దంభము = నెపము, పూని = కయికొని-ఆనెపమునుపన్ని యనుట ('కపటోఽస్త్రీ వ్యాజదంభోపధయశ్ఛద్మకైతవే, కుసృతిర్నికృతిశ్శాఠ్యమ్' అమ.) దిశలు ఆకర్ణించి=దిక్కులాలించి, మఝ్ఝూఅనర్=మఝ్ఝూ అని ఆకర్షణోపయోగియైన శబ్దమును బలుకఁగా.

'సంధాన కుశలశ్చేటః' అనుటంబట్టి సంధానకౌశలముచేత నర్మసఖుఁడు చేటుఁడు.

మ. ఇది సంధింపఁగ వేళ యంచు వసురాజేంద్రుండు నీరంధ్రనీ
రదవారప్రతిసీర వెల్వడినతారారాభర్త లీలన్ లతా
చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
న్మదభృంగీరుతి వందిమాగధకథా మాధుర్యముం దెల్పఁగన్. 46

అ. వసురాజేంద్రుండు, ఇది సంధింపఁగన్ వేళ అంచున్=ఇదియె కలియుటకు సమయము అని, నీరం...సీర---నీరంధ్ర=దట్టమయిన, నీరదవార = మేఘసమూహమనెడు ('స్తోమౌఘనికరవ్రాత వార సంఘాత సంచయాః' అమ.) ప్రతిసీరన్ = తెరవలననుండి, ('ప్రతిసీరా యవనికా స్యాత్తిరస్కరిణీచ సా' అమ). వెల్వడిన=బయలుపడిన, తారాభర్తలీలన్ = చంద్రునివలె, లతా..దికన్... లతా=తీఁగలయొక్క, ఛద=ఆకులచేతనైన, సంఛాదికన్=కప్పును, పాసి = వదలి-అనఁగా మఱుఁగు విడిచి, సారంగ...రుతి — సారంగ=మగతుమ్మెదలయందలి, రాగ=అనురాగముచేత, భ్రమత్=తిరుగు చున్న, మద=మత్తుగొనియున్న, భృంగీ=ఆఁడుతుమ్మెదలయొక్క, రుతి=ఝుంకారమే, సారంగరాగ= సారంగమనెడు రాగమందు, భ్రమత్=సంచరించుచున్నట్టిదియు, మదభృంగీరుతి=మదించిన యాఁడు తుమ్మెదల నాదముఁవంటిదియునగు నాదము - ఈరెండర్థములకు నభేదాధ్యవసాయము. వందిమాగధ= వందిమాగధులు పాడునట్టి, కథా=చరిత్రలయొక్క, మాధుర్యమున్=తీయఁదనమును, తెల్పఁగన్= తెలియఁజేయుచుండఁగా, ఎదుట, నిలిచెను.

రాజాగమనమందు, వందిమాగధకథాగానములుండుట సహజముగాన మగతుమ్మెదలయం దలిరక్తిచే మొరయుచున్న యాఁడుతుమ్మెదల రవళియే వందిమాగధకథాస్థానముగాఁ జెప్పినాఁడు. దట్టంపుమబ్బుల పటలమునకుఁ బ్రతిగా నుండుటకై తీవెలనుమాత్రము చెప్పక తీవయాకుల జొంపమును జెప్పినాఁడు. మబ్బులదట్టమునుండి వెలువడిన చంద్రుఁడతి రమణీయుఁడు, నత్యంతాహ్లాదకరుండును. మఱిచంద్రునకు 'తారాభర్త' యనుట, రాజు నందలి భర్తృత్వానుగుణ్యమునకు సూచకము. వంది మాగధ కథా మాధుర్యమును పచరించుటకై లతాచ్ఛదసంఛాదికనుండి వెలువడఁగా నది చలించి యం దుండి కదలిన యాఁడుతుమ్మెదల రవళినే వర్ణించినాఁడు.

సీ. తలిరుఁబ్రాయమువాని వలరాజు నలరాజు, నలరాజుఁ దెగడుసోయగమువానిఁ
బసిఁడిచాయలవానిఁ బగడంబు జగడంబు, జగడంబుగలమోవి సొగసువానిఁ

దళుకుఁజెక్కులవానిఁ గ్రొదులకింపుపలు కెంపు,పలుకెంపులొలయునవ్వొలుకువానిఁ
జికిలిచూపులవాని సిరిమించుదొరయించు, దొరయించు కాంచనాంబరమువాని
తే. నొఱపుగలవాని మకుట కేయూరహార, కటకకుండల చాకచక్యములవాని
నమ్మహీజానిఁ గని లేచి యమితవినయ, సంభ్రమముదోఁప నిలిచి రబ్జాతముఖులు.

అ. అబ్జాతముఖులు = తామరలవంటి మొగములుగల స్త్రీలు, తలిరుఁబ్రాయమువానిన్ = లేఁత వయసుగలవానిని, వలరాజు = మన్మథునిని, అలరాజున్ = ఆచంద్రునిని, నలరాజున్ = నలచక్రవర్తినిని, తెగడు=తిరస్కరించునట్టి, సోయగమువానిన్ = చక్కఁదనముగలవానిని, పసిఁడిచాయలవానిన్ = బంగారపు కాంతివంటి కాంతులుగలవానిని, పగడంబు ..డంబు—పగడంబు=పగడముయొక్క, జగ = శ్రేష్ఠమయిన, డంబు=కాంతితోడ, జగడంబు=కలహముగల, మోవిసొగసువానిన్ = వాతెఱ యందము గలవానిని, పగడముకంటె మించిన యెఱుపుగల యందమయిన క్రింది పెదవిగల వానినవుట.

తళుకుఁజెక్కులవానిన్ = తళతళమని మెఱయు చెక్కిళ్లుగలవానిని, తులకి... కెంపులు—తుల కింపు=సొగసుగులుకునట్టి, పలుకెంపు=పండ్లనడి కెంపులయొక్క, పలు= పెక్కులయిన, కెంపులు=ఎఱ్ఱని కాంతులు—('కెంపుతొగరుతొవరు కెంజాయ యెఱుపెఱ్ఱ, యనఁగనరుణకాంతి కాఖ్యలయ్యె' ఆంధ్ర నామ.) ఒలయు=వ్యాపించుచున్న, నవ్వు, ఒలుకువానిన్ =చిందువానిని, చికిలిచూపులవానిన్ =మెఱుఁ గారు తేటచూపులవానిని, సిరిమించుదొర = లక్ష్మీదేవిచే నతిశయించుచున్న స్వామియగు శ్రీవిష్ణువు యొక్క, ఇంచు=కొఱఁతను, దొరయించు= పొసఁగించుచున్న, కాంచన అంబరమువానిన్=బంగారు వలువగలవానిని—అనఁగా విష్ణువు పీతాంబరమువంటి బంగారువలువ గలవానినవుట.

ఒఱపుగలవానిన్ = తేజస్సుగలవానిని, మకుట...క్యములవానిన్ —మకుట= కిరీటముయొక్కయు, ('అథమకుటం కిరీటం పున్నపుంసకమ్' అ.) కేయూర = ('కేయూర మంగదం తుల్యే' అ.) భుజకీర్తులయొక్కయు, హార = ముత్యాలహారముయొక్కయు, ('హారోముక్తావలీ దేవచ్ఛందోసౌ శతయష్టికః' అ.) కటక = కడియములయొక్కయు, ('కటకం కరభూషణమ్' అ.) కుండల=చెవిపోఁగులయొక్కయు, ('కుండలం కర్ణవేష్టనమ్'అ.) చాకచక్యములవాని= చకచకకాంతులు గలవానిని,అమ్మహీజానిన్ = ఆరాజును, కని,లేచి, అమితవినయ సంభ్రమము=మితిలే. అడఁకువయును తొందరపాటును తోఁపఁగా, నిలిచిరి=నిలుచుండిరి. అల. ఉపమ. ఛేకానుప్రాసము.

మ. క్షితిపాలోత్తముఁ డంత సంతసమునం జేరంగ నేతెంచి 'చిం
తితకల్యాణసమృద్ధి ర' స్తనుచు సన్మిత్రుండు దీవింపఁగాఁ
గుతుక స్మేరముఖారవిందుఁ డయి కోర్కుల్ మీఱ నారీజనా
ర్పిత జాంబూనదపీఠిఁ బొల్చె జలజప్రేంఖ న్మరాళం బనన్. 4

అ. క్షితిపాలోత్తముఁడు = వసురాజు, అంత, సంతసమునన్ =సంతోషముతో, చేరంగన్ = దగ్గఱునట్లు, ఏతెంచి = వచ్చి, చింతిత కల్యాణసమృద్ధిః అస్తు= తలఁచుకొనఁబడిన శుభములయొక్క పరిపూర్తి అగుఁగాక యని యర్థము. (తలంపఁబడిన వివాహ సమృద్ధియగుఁగాక యని భావము.) అనుచున్, సన్మిత్రుండు=మునివేషమున నున్న ప్రియసఖుఁడు, దీవింపఁగా, కుతుక...దుఁడయి— కుతుక వేడుకచేత, స్మేర=నవ్వుచున్న, ముఖారవిందుఁడయి=మోముదామరగలవాఁడై, కోర్కుల్, మీఱన్ =అతిశయించుచుండఁగా, నారీ... పీఠిన్ —నారీజన = ఆఁడువారిచేత— గిరిక చెలికత్తెలచేత నను ఓ అర్పిత=ఉంపఁబడిన, జాంబూనదపీఠిన్ = మేలిబంగారు పీఠమందు ('రుక్మం కార్తస్వరం జాంబూన

మస్త్రాపనో స్త్రియామ్' అ.) జలజ... బన్ — జలజ = తామరపువ్వుమీఁద, ప్రేంఖత్ = తూఁగి యాడుచున్న, మరాలంబన్ = రాజహంసయో యనునట్లుగా, పొల్చెన్ = ప్రకాశించెను — అనఁగా బంగారుపీఠమందు సుఖాసీనుఁడై యుండెనని తాత్పర్యము. అలం. ఉపమ.

చ. అనుపమకాంతివైభవసమన్వితు నావసురాజుఁ గాంచుప
ద్మిని సరసాంతరంగమున ◆ మించె వినూతనరాగకందళం
బొనరె నఖండవాసనలు ◆ నుత్కలికల్ విలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై తమిఁ జూపుతుమ్మెదల్. 48

ఆ. అనుపమ... న్వితున్ — అనుపమ = సాటిలేని, కాంతి = ('కాంతిశ్శోభావరేణ్యయోః' అమ. అన్నట్లు కాంతియనఁగా లావణ్యమును ప్రకాశమును — ముత్యములలోఁ దిరిగెడు నీరువలె నవయవము లందుఁ బ్రకాశించునది లావణ్యమందురు. అట్టి) లావణ్యముయొక్క, వైభవ = పెంపుతోడ, సమన్వితున్ = కూడుకొన్నవాఁడయిన, ఆ వసురాజున్ = ఆ వసురాజు (అనెడు అనుపమమయిన ప్రకాశసంపత్తితోఁగూడిన యాసూర్యుని. ఇట వసువులనఁగా కిరణములు, 'వసుర్నా దేవభేదేషు యోక్త్రాగ్నిధనదాంశుషు, మధురేతు త్రిషుక్లీబే సలిలేధనరత్నయోః' నానా. వసువులకురాజు వసురాజు — అనఁగా సూర్యుఁడని యర్థము.) కాంచు = చూచుచున్న, పద్మిని = పద్మినీజాతి స్త్రీయైన గిరిక (యనెడు తామరతీఁగయొక్క,) సరస అంతరంగమునన్ = సరసమయిన హృదయము (అనెడి రస (=జల) యుక్తమయిన లోపలనున్న కందమందు — అనఁగా మూలదుంపయందు), వినూ... ళంబు — వినూతన = మిక్కిలి క్రొత్తదయిన, రాగకందళంబు = అనురాగపు మొలక (అనెడి క్రొత్తదయిన యెఱ్ఱనిమొలక - అనురాగము ప్రేమయందును ఎఱుపునందును వర్తించును), మించెన్ = అతిశయించెను. అఖండవాసనలు — అఖండ = నిండయిన, వాసనలు = భావనలు (అఖండ వాసనయనఁగా తన్మయీ భవనము ; ఇదియె సత్త్వము. సాత్త్వికభావము లయిన రోమాంచకంపస్వేదాదులు) అనెడు పరిమళములు, ఒనరెన్ = ఒప్పెను - ఇట అఖండవాసనాజన్యములయిన సాత్త్వికభావముల నఖండ వాసనలని జన్యజనకముల యభేదోపచారముచేతఁ జెప్పుటతెలియునది. ఉత్కలికల్ = ఉత్కంఠలు [ఉత్కలికయనఁగా ఔత్సుక్యమనెడి సంచారిభావము గనుక నిటబహువచనముచేత శృంగారరసమందుఁ బ్రయుక్తములగు శంకాసూయాది సంచారిభావములని తెలియునది.

'శఙ్కాసూయాథయం గ్లాని ర్వ్యాధిశ్చింతా స్మృతిర్ధృతిః
ఔత్సుక్య విస్మయావేగా వ్రీడోన్మాదా మద స్తథా
విషాదో జడతా నిద్రావహిత్థాచాపలం మృతిః
ఇతి భావాః ప్రయోక్తవ్యాః శృంగారే వ్యభిచారిణః'

అని శంకాదులు. లేక ఉత్కలికలనఁగా తరంగములు 'భవేదుత్కలికోత్కంఠాహేలాసలిలవీచిషు' విశ్వ. కనుకఁ దరంగములవంటి సంచారిభావములు నుత్కలిక లనఁబడుచున్నవని తెలియునది. అట్టి] ఉత్కలికలనెడు ఉత్కలికలు — అనఁగా పయికి లేచిన మొగ్గలు, విలసిల్లెను. [ఇక్కడ ఉత్కలికలవలెనే ఉత్కలికలు — అనఁగా తరంగములవలెనే సంచారిభావములు చూడంబడుచున్నవి. ఎట్లన సముద్రమందుఁ దరంగములు పయికి లేచుచు లోపల నడంగుచునుండి యాసముద్రమునకు నుత్కర్షమునుజేయుచును మరలఁ దత్స్వరూపత్వమునొందుచును వర్తించునట్లె స్థాయిభావమయిన రతియందు సంచారిభావములయిన శంకాసూయాదులువర్తించుచును నాస్థాయిభావమును దమ్మును బోషించుచున్నవై రసాత్మకత్వముఁ బొందుచున్నవి.

'ఫలసంపాదకత్వసామ్యేన క్షేత్ర మివక్షేత్రం శరీరమ్। అపరకత్వసామ్యేన తమ ఇవ తమోమోహాః ఇత్యాదివత్, మజ్జనోన్మజ్జన సామ్యేనోత్కలికా ఇవోత్కలికా ఇతి సంచారిభావా లక్ష్యన్తే' శ్లో॥ మజ్జంతిశ్చ నిమజ్జంతిః కల్లోలా స్తే మృథార్ణవే।తస్యోత్కర్షం వితన్వంతి యాంతి తద్రూపతా మపి॥ తథాస్థాయిని నిర్మగ్నా, ఉన్మగ్నా వ్యభిచారిణః। పుష్ణ్యన్తిస్థాయినం స్వాంశ్చ తత్రయా న్తిరసాత్మతామ్'॥

అని చెప్పఁబడియున్నది.] అల్లనల్ల ... తుమ్మెదల్—ప్రమోదతరళస్థితులై —(ప్రమోదమనఁగా హర్ష మనెడి సంచారిభావము.

'హర్షోమనస్సముల్లాసో దేవీగురుమహీభుజామ్। ప్రసాదాత్ప్రియసంగాచ్ఛుభ వేదిష్టార్థలాభతః'॥

అనియున్నది) హర్షముచేతఁ జంచలస్థితికలిగినవై, తమిన్=తమకముచేత, చూపుతుమ్మెదల్= చూపులనెడి తుమ్మెదలు, అల్లనల్లనన్ = మెల్లమెల్లగా. అంతంత నమట లేక, నల్లనల్లనన్ ... -('ప్రకారే గుణవచనస్య' అను పాణిని సూత్రముచేతను 'ప్రకృతి వద్వికృతిః' అను నన్నయసూత్రముచేతను వచ్చిన ద్విర్భావముచే) నీలప్రకారముగా నిగిడెననియు నర్థము.

దేదీప్యమానకిరణములతో సూర్యుఁడు పొడసూపఁగా తామరతీఁగయొక్క జలములోనున్న మూలదుంపయందు క్రొత్తగా నెఱ్ఱనిమొలక పుట్టి పిదప గుమగుమ వాసనలుగలిగి, యంతపయికి మొగ్గలు పొటమరించుటయు,అంత సంతోషముచేఁ జలించుచు దుమ్మెదలు దానికి నిగుడుటయు నిట ననుసంధించినాఁడు. మిక్కిలి లావణ్యమెలుకుచున్న యీసుర రాజును జూడఁగాఁ బద్మినీజాతి స్త్రీయగు గిరికకు మనసు రసార్ద్రమై క్రొత్తగాననురాగము మొలకెత్తెననియుఁ బిదప సాత్త్వికభావములు నవ్వల సంచారి భావములు నుప్పతిల్లెననియు, నంత సంతోషముచేఁ జంచలములయిన చూపులను నారాజుపయి నిగిడించెననియు నర్థము. అల. శ్లిష్టరూపకము సావయవము.

## రసవిచారము.

ఒకరి సుఖదుఃఖాదులను జూచునపుడును దెలియునపుడును వాసనారూపముగా మన మనస్సులకును నొక వికారముపుట్టుచున్నది. 'సుఖదుఃఖాదిభి ర్భావై ర్భావ స్తద్భావ భావనమ్' ఇట్టి మనోవికారమే భావమనఁబడును. 'వికారో మానసోభావః' అమ. ఒక స్త్రీ సౌందర్యమును జూడఁగా అనురాగమును విరూపత్వమును జూడఁగా హాసమును మనస్సునకుఁ గలుగుచున్నది గదా. మనోవికారములయిన యీ యనురాగాదులే భావములు. ఇట్టి భావము సజాతీయములైన భావములచేతఁగాని విజాతీయములైన భావములచేతఁగాని డిందుపడక రసముగాఁ బరిణమించుచుఁదను మనస్సున స్థిరముగానుండునేని యది స్థాయి యనఁబడును. ఒకనికి నొక నాయికయందు అనురాగమనెడి భావము గలిగియున్నదని తలంతము. ఆభావమునకు మఱియొక నాయికయందలి యనురాగము సజాతీయమైన భావము. హాస్యము బీభత్సము (రోఁత) మొదలగునవి దానికి విజాతీయములైన భావములు. అనురాగమనెడి యీభావము అట్టి సజాతీయములచేతను విజాతీయములచేతను గొట్టుపడక చిత్తమున దృఢముగా వర్ధిల్లుచు రసముగాఁ బరిణమించునంత పటుత్వము గలదగునేని యది స్థాయి భావ మనఁబడును.

'సజాతీయైర్విజాతీయైరతిరస్కృతమూర్తిమాన్। యావద్రసం వర్తమాన స్స్థాయీభావఉదాహృతః'॥

సముద్రములోనఁ గలయునదుల తీయనిజలములు దానివలెనే యుప్పనయై దాని స్వరూపము నొందునట్లు, స్థాయిభావమునందుఁ గలయునితరభావములెల్ల విరుద్ధములయినవియు విరుద్ధములు గానివియు దానిని జెఱుప నేరక దానిమయములే యగుచున్నవి.

'విరుద్ధై రవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః ఆత్మభావం నయత్యన్యాన్ స్థాయీవ లవణాకరః'॥

ఇట్టిస్థాయిభావము పైపయివర్ధిల్లి మిక్కుటమయిన యానంద సంవిద్రూపముగాఁ బరిణమించు నేని రసమనఁబడును. రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము అని యీ తొమ్మిదియు స్థాయిభావములు. ఇవియె వృద్ధినొంది వరుసగా శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము అని రసములు తొమ్మిది.

'రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా ।
జుగుప్సావిస్మయశమాః స్థాయిభావా నవ క్రమాత్ ॥
శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకాః ।
బీభత్సాద్భుతశాన్తాశ్చ రసాః పూర్వైరుదాహృతాః' ॥

ఈస్థాయిని బుష్టినొందించి రసముగాఁ బరిపక్వము సేయు సామగ్రియుఁ గలదు- అది విభావములు, అనుభావములు, సాత్త్వికములు, వ్యభిచారులని నాలుగు విధములనుండును. వ్యంజనాదులు అన్నము నెట్లు భోగ్యముగాఁ జేయునో యట్లె విభావాదులును స్థాయిని స్వాద్యముగాఁజేసి రసముగావించును. 'విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః। ఆనీయమానస్స్వాద్యత్వం స్థాయీభావో రసస్స్మృతః'.

ఇట 'రతి' యనెడు స్థాయిభావము నుదాహరణముగాఁ గొందము. రతి యనఁగా స్త్రీపురుషులకు సంభోగవిషయమై కలుగు నొక యిచ్ఛావిశేషము.

క. తరుణులుఁ బురుషులు నితరే, తరసంబంధేచ్ఛ నెలమి • దలకొనఁగాఁ ద
త్పరమతిఁ దివురుట శృంగా, రరసజ్ఞులమతమునందు • రతి యనఁ బరఁగున్.

స్థాయిని (రతిని) బుట్టించుటకు మొదటి సామగ్రి విభావము. 'విభావః కథ్యతే తత్ర రసోత్పాదనకారణమ్'. ఈ విభావము ఆలంబనము, ఉద్దీపనమని రెండు విధములు. రత్యాదులకు విషయభూతులైన నాయికా నాయకులు ఆలంబనవిభావము. ఈ నాయికా నాయకులయొక్క (1) గుణములు, (2) చేష్టలు (3) అలంకారము (4) తక్కినతటస్థములు అని ఉద్దీపన విభావము నాలుగు విధములుగానుండును. గుణములు రూప యౌవనాదులు. చేష్టలు యౌవనమువలనఁ బుట్టు హావభావాదులు ఇవి పదునెనిమిది.

'హావో భావశ్చ హేలా చ మాధుర్యం ధైర్యమిత్యపి। లీలా విలాసో విచ్ఛిత్తిర్విభ్రమః కిలికించితమ్।
మోట్టాయితం కుట్టమితం బిబ్బోకో లలితం తథా । కుతూహలం చ చకితం విహృతం హాస ఇత్యపి'॥

అలంకారము నూపురాంగదహారాదులు. తటస్థములు మలయానిలచంద్రశుకపికాదులు. ఇట్లు నాయికానాయకులనెడి ఆలంబనము చేతను వారి గుణచేష్టాదులైన యుద్దీపనము చేతను రత్యాది భావములకు స్థాయిత్వము గలుగును. అనఁగా నాస్థాయిభావమునకు నివియె కారణములగును.

శ్లో॥ ఆలంబనం తు రత్యాదేర్విషయో నాయకాదికః। ఉద్దీపనం తదుత్కర్షహేతుస్తచ్చ చతుర్విధమ్।
ఆలంబనగుణశ్చైవ తచ్చేష్టా తదలంకృతిః । తటస్థాశ్చేతి విజ్ఞేయశ్చతుర్ధోద్దీపనక్రమః ॥
ఆలంబనగుణో రూపయౌవనాదిరుదాహృతః। తచ్చేష్టా యౌవనోద్భూతహావభావాదికా మతాః॥

స్థాయికి రెండవసామగ్రి అనుభావములు. ఇవి శరీరజనితములైన కటాక్షము (కడకంటిచూపులు) భ్రూవిక్షేపము (కనుబొమలు త్రిప్పుట) మొదలగునవి. ఇవి హృదయమందలి రత్యాది భావములను వెలిపుచ్చును.

'భ్రూవిక్షేప కటాక్షాది వికారో హృదయస్థితమ్। భావం వ్యనక్తి యస్సోయమనుభావ ఇతీరితః'

ఈ యనుభావములు స్థాయివలనఁ గలుగు కార్యములు. ఇవి స్థాయివలనఁ గలుగునట్టివేని స్థాయిని గలిగించు సామగ్రి యెట్లగు ననరాదు. నాయికాదుల చిత్తములందుఁగల రత్యాదులచే భ్రూవిక్షేపాదులు పుట్టుచు వారిచిత్తములందలి రత్యాదులను, నాయకాదులకుఁ దెలిపి వారికిఁగూడ

వారత్యాదులను గలిగించుచున్నవి. ఇట్లు మొదటివారి రత్యాదుల కవి కార్యములయ్యె రెండవ వారి రత్యాదుల కవి కారణములగుటచే నట్టిసామగ్రిగాఁ జెప్పఁబడినవి. స్థాయికి మూఁడవసామగ్రి సాత్త్వికభావములు. సత్త్వమనఁగా ఒకరి సుఖదుఃఖాదులను భావించుటకు మనస్సు మిక్కిలి యనుకూలము గానుండుట. పరగతములయిన సుఖదుఃఖాదుల ననుభవింపఁగా నంతఃకరణము తన్మయమగును. మనస్సునకుఁగల తన్మయీభావమే సత్త్వము. సత్త్వముచేత నిర్వృత్తములయినవిగాన సాత్త్వికము లనఁబడుచున్నవి. ఇవి స్తంభము ప్రలయము మొదలయినవి యెనిమిది.

'స్తంభప్రలయరోమాంచా స్స్వేదో వైవర్ణ్యవేపథూ।
అశ్రువైస్వర్యమిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః'

అనుభావములవలెనే సాత్త్వికములును రత్యాదిసూచకములుగాన నివియు ననుభావములే యనఁదగినను నివిసత్త్వమువలనఁ గలుగునవిగాన విశేషించినవని తెలియునది. స్థాయికి నాలుగవసామగ్రి వ్యభిచారిభావములు. ఇవి నిర్వేదము, గ్లాని, శంక మొదలైనవి ముప్పదిమూఁడుగలవు. ఈవ్యభిచారులే 'ఏకత్రనియతా భావారజ్యస్తే వ్యభిచారికాః, తఏవాన్యత్ర సంచారాత్సంచారిణ ఇతిస్మృతాః' అని సంచారులు నగును. ఇట్లు స్థాయిభావము- విభావములు, అనుభావములు, సాత్త్వికములు, వ్యభిచారులనెడి చతుర్విధ సామగ్రిచే సముల్లాసితమై రసమగును. స్థాయికి నాయికానాయకులును కటాక్షాదులును నిర్వేదాదులును వరుసగా కారణమనియు కార్యములనియు సహకారులనియు లోకవ్యవహారమునఁ జెప్పఁగా కావ్యనాటకములందు విభావములనియు అనుభావములనియు వ్యభిచారులనియు చెప్పఁబడుచున్నవి. రసమునకు విభావములతోను, అనుభావములతోను, వ్యభిచారులతోను వరుసగా కార్యకారణసంబంధమును, జ్ఞాప్యజ్ఞాపక సంబంధమును, పోష్యపోషకసంబంధమును నుండును. అనఁగా దానికి, విభావములచేత నుత్పత్తియు, అనుభావములచే జ్ఞప్తియు, వ్యభిచారులచేతఁ బుష్టియుఁ గలుగుచున్నవి. సముద్రమం దలలు లేచుచును బడుచును దానిని జెలరేఁగించునట్లు స్థాయిభావమునందు వ్యభిచారులును మెలఁగి దానిని విజృంభింపఁజేయును. రసము వస్త్రమువంటిది. దానికి స్థాయి తంతువులవంటిది. విభావాది సామగ్రులు నాలుగును సాలెవాఁడు మొదలగువానివంటివి. వస్త్రమునకు తంతువులెట్లు సన్నిహితములో, అనఁగా మిక్కిలి సమీపమయిన పూర్వావస్థ తంతువు లెట్లగునో, యట్లె రసమునకు మిక్కిలి దాపైన పూర్వావస్థ స్థాయియె యగును. అనఁగా తంతువులే వస్త్రమగునట్లు స్థాయియె రసమగును. సాలెవాండ్రు మొదలగునవి తమంతఁగాక తంతువుల మూలముననే వస్త్రము కలిగించునట్లు, విభావాదులు తమంతటఁగాక స్థాయిమూలముననే రసమును గలిగించునుగాన భావములలో స్థాయి రసమునకు సన్నిహితమైనదియు విభావాదులు వ్యవహితములైనవియు నగును.

'యథాహి తంతవో వేమ తురీయాదిభి రన్వితాః। రసాత్మనా పరిణతాః పటవాచ్యాభవన్తితే॥
తథైవ స్థాయినో భావా విభావాదిభిరన్వితాః। రసాత్మనా పరిణతా రసవాచ్యా భవన్తితే'॥

ఇది రసస్వరూపము. ఇందు 'అనుపమకాంతి' యను పద్యమున గిరికాపరమయిన యర్థమందు సంపూర్ణమయిన శృంగారరసమును జెప్పినాఁడు. కాంతి యుద్దీపనవిభావము. వసురాజు ఆలంబన విభావము. 'సరసాంతరంగమున మించె వినూతనరాగకందళం' బనఁగా అనురాగయుక్తమయిన యంతరంగమునం దాయనురాగము పూర్ణమయ్యె ననుట. అనురాగ మనఁగా రతియనెడు స్థాయిభావము. కందళపదము అపరిపూర్ణత్వమును దెలుపుచున్నది. వినూతనపదము స్పష్టార్థము. మించెననెడి పదము పూర్ణత్వమును జెప్పుచున్నది. అపరిపూర్ణమయినచో స్థాయిభావమనియుఁ బరిపూర్ణమయినచో రసమని

యును గ్రహించునది. అఖండవాసన లనఁగా సాత్త్వికభావములు. ఉత్కలికలనఁగా సంచారి భావములు. చూపులనఁగా అనుభావములు. ఈరీతిని విభావానుభావ సాత్త్వికసంచారి సముల్లసితమయి స్థాయిభావమయిన యనురాగకందళము సంపూర్ణమయిన శృంగారరసమని గ్రాహ్యము.

చ. తొలుదొలుతన్ విలోలగతిఁ దోఁగలిఱెప్పల నాని కర్ణకుం
డలరుచిధాళధళ్యముల డాపున నల్లన పొంచి మించులై
వెలువడి పూర్ణచంద్రుపయి వెన్నెలపుల్గులచాలు వ్రాలులీ
లల విభుమీఁద వ్రాలె నవశైలా నవలాలితదృష్టిజాలముల్. 49

అ. నవలా...లముల్—నవలా = గిరికయొక్క, నవ=నూతనమయిన, లాలిత=విలాసములుగల, దృష్టిజాలముల్=చూపుల సమూహములు, తొలుదొలుతన్=ముందుముందుగా, విలోలగతిన్—(లోల మనఁగా 'లోలశ్చపలతృష్ణయోః' వి. అన్నట్లు) ఆసక్తిచేతను చపలతచేతను, తోఁగలిఱెప్పలన్= విప్పుగల కనుఱెప్పలను, ఆని=ఊఁది—ఆఱెప్పలందుఁ గొంతసేపు నిలిచియనుట, కర్ణకుం...డాపునన్— కర్ణకుండల=చెవుల కమ్మలయొక్క, రుచి ధాళధళ్యము=ధళధళయను కాంతులయొక్క, డాపునన్= చెంత, అల్లన=మెల్లగా, పొంచి=మఱఁగియుండి - కొంతసేపునిలిచి, మించులై=అతిక్రమించినవై— (మెఱుపుతీఁగల వంటివై యనియు), వెలువడి=బయలుదేఱి, పూర్ణచంద్రుపయిన్=నిండుచంద్రునిమీఁద, వెన్నెలపుల్గులచాలు=చకోరపక్షులచాలు, వ్రాలులీలన్=వ్రాలునట్లుగా, విభుమీఁదన్=వసురాజుమీఁద వ్రాలెను—ఇందు లజ్జాతిశయము స్ఫురించుచున్నది. గనుక నాయిక ముగ్ధ 'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా' లజ్జయనునది సంచారిభావము. 'చేతస్సంకోచనం వ్రీడా నంగరాగ స్తవాదిభిః'.

లజ్జగలవారు మొట్టమొదట వెడలుపులయిన మాటులందుండి పిదప తముబోఁట్లనడుమఁ జక్కఁగా నేర్పడకుండఁ బొంచి పిదపఁ దమిపట్టలేక బయలుపడునట్లు, చూపులును విప్పులయిన ఱెప్పలయందు మఱఁగియుండి పిదప చెవికమ్మల ధళధళలందు పొంచి పిదపఁ బట్టలేక వెలువడి నిగిడెనని తెలియునది. లజ్జాతిశయముచే నిగుడక తోఁగలిఱెప్పల నండగొనుట, పిదప దానినిగడచి యోరలుగాఁ గొంత నిగుడుటచే చెలికమ్మల ధళధళలందుఁ బొంచు. దీనిచేఁ గన్నులు గర్ణాంత విశ్రాంతములగుట వ్యంజితము. లేకున్నఁ గమ్మలు ధళధళలతోఁ గలియుట గలుగదు. చూపులును వెన్నెలపులుఁగులును శ్వేతగణములోనివి. అలం. సమాసోక్తి, ఉపమ.

ధవళబహుళముగ్ధా దుగ్ధకుల్యేవదృష్టిః. (ఉత్తరరామచరిత)
విలోకనప్రభా, వీచికలం దదీయపదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్. (మనుచరిత్ర)
కటాక్షాః క్షీరోదప్రసరదురువీచీసహచరాః. (ప్రతాపరుద్రీయము.)

వెన్నెలపుల్గులు పూర్ణచంద్రుపయి వ్రాలుట తత్కిరణాస్వాదమందలి యభిలాషముచే. అట్లే చూపులును చంద్రునివలె నాహ్లాదకరమయిన రాజు మొగమందుఁ దన్మాధుర్యాస్వాదమునకై వ్రాలుట. ఇట మొగము చెప్పకపోయినను బూర్ణచంద్రుపయిననుటచే రాజుమొగమే గమ్యము. ముఖమాధుర్యాస్వాదనమే కామార్తులకు భోగ్యము.

'వరుచూడ్కి ముద్దియవదనంబుపై వ్రాలి తివుటమై నునుఁగాంతితీపుగ్రోలు'. (విరాటపర్వ)
నవలాశబ్దము 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్' అనుసూత్రముచేత హ్రస్వము నొందవలసియున్నను 'నచ దేశ్యపదే' అనుసూత్రముచే దేశ్యములకు నిషేధముగాన హ్రస్వము గలుగదయ్యె. 'డాపు' శబ్దము దకారమునకు డత్వము వచ్చుటకు.

తే. డంభడిండీరడోలికాం♦డాడిమాది, శబ్దముల కాదివర్ణ ములు ♦ సంస్కృతమున
నుపరివర్గ తృతీయమై ♦ యొప్పునట్లు, దెనుఁగున దకారము డవర్ణ ♦ మొనరుచుండు.

తే. దాఁక దగ్గఱి దిగ్గియ ♦ దాయఁబోయి, దాపలను దిగ్గమనువై ♦కృతముల మొదల
డాఁక డగ్గఱి డిగ్గియ♦డాయఁబోయి, డాపలను డిగ్గు మని డా క♦డంగి నిల్చు.(అప్పకవీయము.)

క. వసుధాసుధాంశుఁ బొదువుచు, వెస మరలుచు మరలి మగుడ ♦ వెడలుచు లలనా
లసమాన దృష్టిజాతము, లసమాంబకుచిత్రశరము ♦లై విలసిల్లెన్. 50

అ. లలనా...జాతము=గిరికయొక్క ప్రకాశించుచున్న చూపులసమూహములు, వసుధాసుధాంశుఁ=భూలోకచంద్రుఁడయిన వసురాజును, పొదువుచున్=క్రమ్ముచును, వెసన్=తోడనె, మరలుచున్, మరలి=మరలినవై, మగుడన్=తిరుగా, వెడలుచున్ = రాజుమీఁదికిఁబోవుచు, అసమాంబకు= సమానరహితములయిన బాణములుగల మన్మథునియొక్క, చిత్రశరములై = వింతలయిన బాణములై, విలసిల్లెన్=ప్రకాశించెను.

లలన దృష్టిజాతము లలరుటకు హేతువు నాయకుఁడు 'వసుధాసుధాంశుఁడు.' చూపులు మర్మములను గొనుటచే శరములనియు,తక్కిన బాణములవలె పోయినదే పోక గాక,పోవుచును మరలివచ్చుచునుండుటచే చిత్రశరములనియు నాశయము. అసమబాణుని (సమానరహిత బాణములు గలవిలుకాని) బాణములు గదా యవి యట్లుండుటకు. ఇట చూపులు కామముచే నిగుడుటయుఁ లజ్జచే మరలుటయుఁ జెప్పుటచే లజ్జాకామముల సామ్యస్థితి వ్యంజితము. ఇందుఁ గొంత శృంగారరస పటిమచే లజ్జ ప్రిదిలుట సూచితము. అలం అతిశయోక్తి.

చ. వనజదళాయతాక్షి నిడువాలికచూపనిమేషవృత్తి నా
ఘనునవకంబుపైఁ బొలసి ♦ కాంతతదీక్షణజాలకంబు పై
కొనినఁ ద్రపాబ్ధిఁ గ్రుంకియును ♦ గోరికఁ గ్రమ్మఱఁ గూడఁబాఱు మో ♦
హనగుణశక్తి నివ్వటిలు ♦ నవ్వలరాయని నేర్పు పెంపునన్. 51

అ. వన...చూపు—వనజదళ+ఆయత + అక్షి= తామరరేకులవలె విరివయిన కన్నులుగల గిరికయొక్క, నిడువాలికచూపు = మిక్కిలియు సోగయైనచూపు, అనిమేషవృత్తిన్ = రెప్పపాటులేని వృత్తిచేతనని యర్థము. (అనిమేషమనఁగా చేఁప గనుక చేఁపవృత్తిచేత ననియునర్థము.) ఆఘనునవకంబుపైన్=ఆగొప్పవాని చక్కఁదనముమీఁద, (ఘనుఁడనఁగా మేఘుఁడును గనుక ఆమేఘునియొక్క, నవ=క్రొత్తదయిన, కంబుపైన్=నీటిపైనని యర్థాంతరము) పొలసి=ప్రసరించి, కాంత...జాలకంబుపైన్—కాంత = చెలువయిన, తత్=ఆరాజుయొక్క, ఈక్షణ=చూపులనెడు, జాలకంబు=వల, ('జాలం సమూహ ఆనాయ్యగవాక్షక్షారకాపపి' అమ.) జాలజాలక శబ్దములు సమానములు, పైకొనినన్= మీఁద నావరింపఁగానని యర్థము. త్రపాబ్ధిన్=లజ్జయనెడు సముద్రమందు, క్రుంకియును=మునిఁగినదయ్యును, మోహనగుణశక్తిన్ = మోహింపఁజేయు గుణముయొక్క సామర్థ్యముచేత, నివ్వటిల్లు= అతిశయించుచున్న, అవ్వలరాయని = ఆమన్మథునియొక్క, నేర్పు పెంపునన్ = నైపుణ్యముయొక్క యతిశయముచేత ననియర్థము. (మోహనగుణశక్తిన్= గుణమనఁగా త్రాడును, మోసపుచ్చునట్టి వల త్రాటియొక్క సామర్థ్యముచేత నతిశయించుచున్న, అవ్వలరాయని=వలకు రాయఁడయిన యాజాస్త్రవానియొక్క, నేర్పుపెంపునని యర్థాంతరము) కోరికన్ = అభిలాషచేత, క్రమ్మఱన్=తిరుగ, కూడఁబాఱున్=మరల నాతనిచూపుపయిఁ బుఱికొనునని యర్థము. (మరల నావలతోఁ గలియుటకుఁ బాఱు

నని యర్థాంతరము.) చేప మేఘము గురిసినక్రొత్తనీటం బడి యందు బెత్తవాఁడు వైచియున్న వల యందుఁ దగిలి మునిఁగియు మరల నావలలవాఁడు నిపుణముగా వైచిన గాలపుఁద్రాటికే పరుగున వచ్చుట నిల ననుసంధించునది. మబ్బుల క్రొత్తనీరుబడి చేపలువచ్చుటయు నపుడు జాలరులు వలలు వైచి చేపలుపట్టుటయుఁ బ్రసిద్ధము. ఇట వలకాఁడు మన్మథుఁడు. వసురాజుసౌందర్యము పయిని మెచ్చె కంటిచూపు పొలసినది. రాజుచూపు నెదురుకొనఁగా మిక్కిలి సిగ్గున మునింగి మరలినది. మరలియు మరల మన్మథుని నేర్పుచే(మదనోద్దీపనముచేత)నతనినిఁ జూచినదని తాత్పర్యము. ఇందు నాయికయందు లజ్జయును మదనవికారమును సమానములుగాఁ జెప్పుటవలన మధ్యాత్వము స్ఫురించెడిని. 'సమానలజ్జా మదనామధ్యా' అని లక్షణము. అలం. శ్లేషము.

తే. కౌతుకముపూనియొండొరుఁ గాంచఁదివురు, చంచలాక్షికిఁ బతికి నేత్రాంచలములు
గూర్చెవలరాచయొజ్జ గోర్కులు దలిర్ప, నది గదా భావిశోభనవ్యంజకంబు.

అ. వలరాచయొజ్జ=మన్మథుఁడనెడి ఉపాధ్యాయుఁడు, కౌతుకముపూని=వేడుకపడి - తోరముగట్టుకొనియనియు, ఒండొరుల్=ఒకరినొకరు, కాంచన్=చూచుటకు, తివురు=ప్రయత్నపడుచున్న, చంచలాక్షికిన్=గిరికకును, పతికిన్=వసురాజునకును, కోర్కులుతలిర్పన్ = కోరికలుచేకుఱునట్లుగా, నేత్రాంచలములు=క్రీఁగంటిచూపులను, కూర్చెను=జతగూర్చెను, అదిగదా, భావిశోభన (వ్యంజకంబు = (నేత్రశబ్దము వస్త్రమందును వర్తించుచున్నది గనుక నేత్రాంచలములుగూర్చుట యన్నది వస్త్రాంచల సంయోజనరూపమయిన) భావికాలశుభసూచకమని భావము.

'నేత్రం వస్త్రేక్షిణివైశాఖగుణభూరుహమూలయోః' నానా. వస్త్రాంచలసంయోగమనఁగా పెండ్లికాలమందు వధూవరుల యుత్తరీయపుఁజెఱఁగులరెండునుగూర్చి వైచునట్టి బ్రహ్మముడి. అనుపమ కాంతియను పద్యముమొదలుకొని యీపద్యము తుదిగాఁగల యైదుపద్యములలో గిరికాదేవికిఁ బ్రథమావస్థయైన నయనోత్సవమును జెప్పినాఁడు. అలం. రూపకము.

సీ. కనుగలవింటఁ జొక్కపుఁజవుల్ పుట్టించి, నారిచే విభ్రమోన్నతులు పెనఁచి
తమ్మితూపున రసోదగ్రత సవరించి, కంకేళిఁ బ్రబలరాగంబు నించి
మొలమావిఁ గేలంటి యెలమిమీఱఁగఁ జేసి, విరవాది నూష్మాభివృద్ధి నెఱపి
కలువచేఁ దమిపెంపు వెలయించి చిగురాకు, మొనలనాకులపాటు మొనయఁ జేసి

తే. యసమశరవీరపుంగవుఁ డాత్మసాధ, నముల నన్నింటిచేఁ జూపి కమిచి పోటు
గంటిదూఱినరీతి వాల్గంటి మనము, నవనిపతిచిత్తమునుదూఱె నాక్షణమున.

అ. కను...పుట్టించి—(కనులనఁగా గణుపులయొద్ద నుండెడు గుంటలు. అవిగలది చెఱకు-గాన) కనుగలవింటన్=చెఱకువింటిచేత, చొక్కపు చవుల్ పుట్టించి=అచ్ఛమయిన ప్రేమముపుట్టించి యని యర్థము. (చవియనఁగా రుచి - తన్మూలమున ప్రేమము.) ప్రేమలక్షణము.

'స ప్రేమా యన్మిథోయూనోర్నిరూఢం భావబంధనమ్'

ఇట బహువచన మతిశయము దోఁపించుటకు—అనఁగా చవులకాస్పదమయిన సాధనముచేతఁ చవులు పుట్టించినాఁడనుట. చెఱకుతుంటలు తీపిగలవని భావము. మఱియుఁ కనుగలవిల్లనఁగా హెచ్చరికగల విల్లనియును భావమూహ్యము.

నారిచే...పెనఁచి=తుమ్మెద యల్లెత్రాటిచేత భ్రాంతియొక్క యతిశయములను పెనఁగొనఁ జేసి (ఇట భ్రాంతిని జెప్పినాఁడు. అది 'మోహస్తు మూర్ఛనం భీతిర్దుఃఖావేశానుచింతనైః' అన్నట్లు

మోహమనెడి సంచారిభావమునకు అనుభావము - విభ్రమోన్నతులుగల సాధనముచేత విభ్రమోన్నతులు పుట్టించినాఁడనుట. తుమ్మెదలు భ్రమణముగలవని భావము.)

తమ్మి...సవరించి—తమ్మి తూపునన్ = అరవిందబాణముచేత, రస ఉదగ్రతన్-(రసమనఁగా అనురాగము) అనురాగంపు పెచ్చును, సవరించి=ఒడఁగూర్చి, (రసోదగ్రతగల సాధనముచేత రసోదగ్రత్వమును గలుగఁజేసినాఁడనుట. అరవిందము మకరంద రసముగలదని భావము.) కంకేళిన్=అశోకపుష్ప బాణముచేత, ప్రబలరాగము నించి=మిక్కుటమయిన రక్తిని నిండించి-ప్రబలరాగముగల సాధనముచేత ప్రబలరాగమును నిండించినాఁడనుట. రక్తాశోకపుష్పము ప్రబలరాగము - అనఁగా మిక్కిలి రక్తిమగలదనిభావము. రక్తాశోకము మన్మథవృద్ధికరమని శాస్త్రము.

'ప్రసూనకై రశోకస్తు శ్వేతోరక్త ఇతిద్విధా। బహుసిద్ధికర శ్శ్వేతోరక్తస్తు స్మరవర్ధనః'॥

ఎలమావి...జేసి—ఎలమావిన్=చూతపుష్పబాణముచేత, కేలు అంటి = చేతిని స్పృశించి, ఎలమి=ఉబ్బు, మీఱఁగఁజేసి=అతిశయింపఁజేసి-(కేలంటి యెలమిమీఱఁ జేయు సాధనముచేతఁ గేలంటి యెలమిమీఱఁ జేసినాఁడనుట - చూతము కేల నంటినఁ బుష్పించుచున్నదని భావము. దానికి కర స్పర్శము దోహదమని దెలియునది. విరవాదిన్ ... నెఱపి—విరవాదిన్=నవమల్లికాబాణముచేత ఊష్మ+అభివృద్ధిన్=సంతాపముయొక్క యతిశయమును, నెఱపి=వచరించి, (సంతాపము చింత యనుసంచారీ భావమున కనుభావము. 'ఇష్టానభిగమాద్ధ్యానం చింతాశూన్యత్వతాపకృత్' ఊష్మాభివృద్ధిగల సాధనముచేత ఊష్మాభివృద్ధిని నెరపినాఁడనుట. 'గ్రీష్మఊష్మకః' అమ. అన్నట్లు, ఊష్మమనఁగా గ్రీష్మర్తువు. విరవాదులు గ్రీష్మర్తువందు వృద్ధిఁబొందుచున్నవని భావము.

కలువచే...వెలయించి—కలువచేన్=నీలోత్పల బాణముచేత, తమిపెంపున్ = ఔత్సుక్యము యొక్క అతిశయమును, వెలయించి=ప్రకటించి, ('తమిపెంపు' అనునది అచ్చతెనుఁగు సమాసము. ఇక్కడ ఔత్సుక్యమనెడి సంచారిభావము. 'కాలాక్షమత్వ మాత్సుక్యం మనస్తాపత్వరాదికృత్' తమిపెంపుగల సాధనముచేతఁ దమిపెంపు వెలయించినాఁడనుట. తమియనఁగా 'రజనీయామినీతమీ' అ. అన్నట్లు రాత్రి. కలువలు రాత్రియందు వికసించుననిభావము.) ఇట మిశ్రసమాసము. చిగురా... జేసి—చిగురాకుమొనలన్=చిగురాకులనెడి మొనలుగల యాయుధములయొక్క మొనలచేత, ఆకుల పాటు=వ్యాకులత్వమును, మొనయఁజేసి=కలిగించి, (వ్యాకులత్వమనఁగా చాపలమనెడి సంచారిభావము. 'చాపలం త్వనవస్థానం రాగద్వేషాదిసంభవమ్' ఆకులపాటు మొనయఁజేయుసాధనముచేత ఆకుల పాటు మొనయించినాఁడనుట. చిగురాకులు మొనలుచూపువేళఁ బండుటాకులు రాలుచున్నవని భావము.)

అసమశర వీరపుంగవుఁడు=మన్మథుఁడనెడు వీరశ్రేష్ఠుఁడు, అత్మసాధనములన్ అన్నింటిచేఁ జూపి=తన యాయుధము లెన్నికలవో యన్నిటిచేతను శూరత్వమును గనఁబఱచి, కమిచి=ఆక్రమించి, పోటుగంటిదూఱినరీతిన్ =పొడిచితీసిన పోటుగంటిలోఁదూఱినట్లుగా, వాల్గంటిమనమున్ =గిరికయొక్క మనస్సును, అవనిపతి చిత్తమును=వసురాజుయొక్క మనస్సును, ఆక్షణమునన్ =తోడనే, తూఱెను.

మన్మథునిసాధనము లెవ్వియన—చెఱకు విల్లు అల్లెత్రాడు తుమ్మెదలుబారు. 'అరవిన్దమశోకంచ చూతంచ నవమల్లికా, నీలోత్పలంచ పంచైతే పంచబాణస్య సాయకాః' అన్న అరవిందాది బాణము లైదు. చిగురాకు బాకు, ఇవియు వానియన్నిసాధనములును వరుసఁగాఁ జెప్పఁబడినవి.'సాధనములన్నింటిచేఁ జూపు'టనఁగా మన్మథుఁడు తనచేత నైనంతవఱకుఁ గలఁచినాఁడు. ఎక్కుడుగాఁ గలంచుటకు మన్మథునికి నలవిగాదు. ఇట మదనోద్దీపనముయొక్క పూర్ణకాష్ఠయు దానిచే ఆలంబనభూతులయిన

నాయికానాయకులసౌందర్యాది మోహనగుణసంపత్తి పెంపును వ్యంజితములు. ఒక బలీయుఁడు తన శత్రువులపయినిదనకుగల యుద్ధసాధనములనెల్లఁ బ్రయోగించి పిదప నాక్రమించి యంతఁ దాను గావించినకోటరంధ్రముగూడ లోనికి దూఱిననే పూర్ణ విజయమగుచున్నది. అట్లె మన్మథుఁడును దనసాధనములన్నింటిచేఁ జేతనయినంత మోహపెట్టి గంటిచేసి దానిగుండ లోపలఁ దూఱినాఁ డనఁబడినది.'సాధ...కమిచి' పరిపూర్ణమయిన యుద్దీపనమును, 'పోటుగంటి దూఱె' అయుద్దీపనము మిక్కిలియుఁ బాధాకరమగుటయు,'చిత్తమునుదూఱె'పూర్ణముగ మన్మథుని బారింబడుటయు, నాయికానాయకుల కునొండొరులను జూడఁగానే కలిగెనని తెలియునది. అలం. అతిశయోక్త్యంగక సమాలంకారము.

క. ఆరాజవదనహృదయము, నారాజవరేణ్యుతలఁపు నారసి మృదుగం
భీరతరవచనరచనా, పారీణత మంజువాణి పలికెం బ్రేమన్. 54

టీ. ఆరాజవదన హృదయమున్ = చందురునివంటి మొగముగల యాగిరికయొక్క మనసును, ఆరాజవరేణ్యుతలఁపున్ = ఆవసురాజు నెన్నికయున, అరసి = విచారించి, మంజువాణి, గం...ణతన్ — గంభీరతర = మిక్కిలియు లోఁతయినయర్థముగల, వచన = మాటలను, రచన = కూర్చుటయందలి, పారీణతన్ = తేఱుగడచేత, ప్రేమన్ = ప్రీతిచేత, పలికెను. ఆగంభీరతరవచనరచన నె మీఁదఁ జెప్పఁబడుచున్నది.

సీ. నేఁడుగా మా కనిందితపర్వసామగ్రి, సవరించె నీరాక కువలయేశ
నేఁడుగా మాతమోనివహంబు నడఁచె నీ, యాలోకమహిమలోకైకమిత్ర
నేఁడుగా మాకు నన్నియుఁగూర్చె నభిమతా, ర్థములు నీసన్నిధి రాజరాజ
నేఁడుగా మాకు మానితసౌమనస్యంబు, లొసఁగె నీపాదాప్తి వసుధరేంద్ర
తే. సురభిచరితుని నిన్ను నిచ్చో భజింపఁ, గాఁ గలిగెఁగాన సఫలతాకలితమై వె
లసెమదీయకాంతారాగకలక్ష్మియింకఁ, దరమెమానాతిచిరభాగ్యగరిమఁబొగడ.

అ. కువలయేశ = (కువలయమనఁగా భూవలయము. 'గోత్రాకుః పృథివీపృథ్వీ' అ.) భూవలయమునకు ఈశుఁడయినవాఁడా, నీరాక = నీవువచ్చుట, మాకున్, నేఁడుగా = నేఁడుగదా, అనిందితపర్వసామగ్రిన్ — నిందితముగాని (అనఁగా పొగడఁదగిన) పండువుయొక్క నిండుఁదనమును-నిండయినపండుగునగుట, సవరించెన్ = అలవఱిచె ననియర్థము. [కువలయమనఁగా కలువయుఁగాన, కలువలకు రాజయిన చంద్రుఁడా! నీరాక (యనఁగా పున్నమ)మాకు అనిందితమయిన పర్వకాలపు పెంపును గలుగఁజేసెనని యర్థాంతరము. పున్నమ పర్వదినమనుట ప్రకటము.]

నేఁడుగా...మిత్ర—లోకవీకమిత్ర = లోకులకు (అనఁగా సర్వజనులకు) ముఖ్యుఁడయిన చెలికాఁడా, నీఆలోకమహిమ = నీదర్శనముయొక్క ప్రభావము, నేఁడుగా = నేఁడేకదా, మాతమోనివహంబులు = మాయొక్క అజ్ఞాన సమూహములను, అడఁగించెన్ = పోఁగొట్టెనని యర్థము. (లోకైకమిత్రయనఁగా లోకబాంధవుఁడయిన యోసూర్యుఁడా, నీ ఆలోకమహిమ = నీ వెలుతురు గొప్పతనము—ప్రకాశ మహత్త్వమనుట, తమోనివహంబులను = చీఁకటిగుంపులను, బోఁగొట్టెనని యర్థాంతరము.)

నేఁడు...రాజ—రాజరాజ = రాజాధిరాజా, నీసన్నిధి = నీసన్నిధానము, నేఁడుగా, మాకున్, అభిమతార్థములు అన్నియుఁగూర్చెన్ = ఇష్టపడిన వస్తువులన్నిటిని ఒడఁగూర్చెనని యర్థము. (రాజరాజనఁగా 'రాజరాజో ధనాధిపః' అ. కుబేరుఁడు. ఓకుబేరుఁడా, నీసత్+నిధి—(అనఁగా మేలయిన నిధి) బంగారు మొదలయిన కోరిన వస్తువులన్నిటిని సమకూర్చెనని యర్థాంతరము. 'అర్థోభిధేయరైవస్తుప్రయోజన నివృత్తిషు' అమ.)

నేఁడు... రేంద్ర—వసుధరేంద్ర = వసురాజా, నీపాదాప్తి=నీయడుగులను బడయుట, నేఁడుగా, మాకుఁగ్, మానిత సౌమనస్యంబులు=ఒప్పుచున్న మనస్సు నెమ్మదులను, ఒసఁగెనని యర్థము- నీయడుగుల నందగొనుటచే మామనస్సులు స్వస్థములయ్యెనని యర్థము. వసువనఁగా-బంగారు, ధరేంద్రమనఁగా=పర్వతశ్రేష్ఠము-బంగారుకొండ ('మహీధ్రశిఖరిక్ష్మాభృదహార్య ధరపర్వతాః' అ. బంగారుకొండా, నీపాదాప్తి=నీప్రత్యంతపర్వతప్రాప్తి('పాదాః ప్రత్యంతపర్వతాః'అ.), మానితసౌమనస్యంబుల నొసఁగుననఁగా పూజ్యములయిన దేవత్వముల నిచ్చునని యర్థాంతరము.('సుపర్వాణ స్సుమనస స్త్రిదివేశా దివౌకసః' అని సుమనసులనఁగా దేవతలు-సౌమనస్యమనఁగా దేవత్వము.) ఇంతవఱకు నాలుగు పాదములందును ప్రకృతాప్రకృతశ్లేషము.

సురభిచరితుఁగ్ = పరిమళించుచున్న చరిత్రములుగల, నిన్ను, ఇచ్చోఁగ్, భజింపఁగలిగెనుగాన=సేవింపఁగలిగెను గాఁబట్టి,('సురభిర్ఘ్రాణతర్పణః' అ.) మదీయకాంతా + రాగలక్ష్మి=మాదయిన గిరికయొక్క యనురాగసంపద, సఫలతాకలితయై = సాఫల్యముచే నొప్పుచున్నదై, వెలసె నని యర్థము- (సురభియనఁగా వసంతర్తువు 'వసంతే పుష్పసమయ స్సురభి.' అ. వసంతసమయపు నడవడి గలవాఁడవయిన నిన్ను. భజింపఁగలుగుటచే, మాదయిన, కాంతార=వనమండలి, అగలక్ష్మి = చెట్ల పెంపుసొంపు,ఫలసహితమయ్యెనని యర్థాంతరము).ఇఁక మానాతి చిరభాగ్యమహిమ=మాగిరికయొక్క శాశ్వతమయిన భాగ్యాతిశయమును, పొగడఁగ్ తరమే=కొనియాడశక్యమా-కాదనుట. మాన + అతిచిర=అతిస్వల్పకాలములోఁ గలుగనున్న భాగ్యవైభవమున గొనియాడఁదరమా యనియు ధ్వనించెడిని.

మొదట (రాక) వచ్చుచున్నాఁడనుటచే (పర్వసామగ్రి)నిండుపండుగగానుండును. వచ్చి కంట గనఁబడఁగా (తమోనివహంబు లడఁగి) మిక్కిలి తెలివిగలుగును. ఇఁక (సన్నిధి) దగ్గఱకేరాఁగా కోరిన కోర్కె లొనఁగూడును. పిదప నడుగులను గొలువఁగా మనస్సులెంతయు నుల్లసిల్లుచుండునని క్రమమిట్లనుసంధించునది. మఱి మాయిచ్చోట నిన్ను సేవింపఁగలుగుట మాచెలివలపు చరితార్థమగుటయు నయ్యె. ఇఁక మాచెలిభాగ్యము పెంపు-మాకుఁ జిరకాలములోనే కలుగనున్న భాగ్యాతిశయము-(అనఁగా మాచెలిని దేవరచెట్టపట్టుట) ఇంతంతని చెప్పఁదరముకాదు. కోర్కెకాష్ఠను జెందుటచేఁ జెప్పనశక్యమన్నది. మఱి యిటగిరిక 'యనురాగలక్ష్మి సఫలతాకలితయై వెలసె' ననుటచే నింతకుమునుపే నాయికకు నాయకునందు ననురాగముండుట సూచితము. ఇదియే, మీఁదిపద్యమునఁ జెప్పంబడియున్నది. మా కలభ్యుఁడయిన నీ యందనురాగమును దీనికిఁ బెంచుచువచ్చితిమి. దానిని జరితార్థముచేయుటకే నీవే యిచ్చటికి విజయము చేయుట యని యభిప్రాయము.

అవః—సఫలతాకలితయై వెలసెనన్న కాంతారాగలక్ష్మికి మూలమెట్లనఁగాఁ జెప్పుచున్నారు.

చ. అనయము నీమహావనము ¶ నందినవారము గాని సజ్జనా
వనగుణధుర్య యేము కడ¶వారము గాము సుమయ్య నీవినూ
తన విజయాంకగేయములఁ ¶ దావకచాటు కథాసుధారసం
బున నలరింతు మీభువన ¶ మోహినిఁ బిన్నటనాఁటనుండియున్. 56

అ. సజ్జన అవన గుణధుర్య = మంచివారిని గాచుట యనుగుణమును వహించువాఁడా, అనయముఁగ్=ఎప్పుడును, నీమహావనముఁగ్ అందినవారము గాని=నీ గొప్ప అవనమును (అనఁగా కాపుదలను) పొందియున్న వారమేకాని, ఏము, కడవారము గాముసుమయ్య = అన్యులయిన వారముగాము సుమా యని యర్థము. (ఈమహాత్+వనము) - గొప్పదియగు వనమును బొందియున్నవారమే కాని మఱియొక

చోటివారముగామని యర్థాంతరము. గిరిక చెలికత్తెలు వనదేవతలుగాన యిట్లు చెప్పుట తెలియునది.)
ఇంతేకాక, నీవినూతనవిజయ అంకగేయములన్ = నీదయిన క్రొత్తగెలుపులే గుఱుతులుగాఁగల (గెలుపులను దెలుపునట్టి) పాటలచేతను, తావకచాటుకథాసుధారసంబునను = నీదయిన స్తుతియోగ్యమగు చరిత్రయనెడు అమృతరసముచేతను, ఈభువనమోహినిన్ = జగమును మోహింపఁజేయునట్టి యీచెలువను, పిన్నటనాఁటనుండియున్ = చిన్ననాఁటినుండి, అలరింతుము = సంతోషింపఁ జేయుదుము.

పిన్నటనాఁటినుండియే నిన్నువలచుట పిన్నతోడనె తిని యున్నది. అనఁగా నిపు డావలపు పెంపుఁ జెప్పనక్కఱలేదు. ఇట్లు వలచినకన్యను విడువరాదు. వలపుండిన నేమి పొలుపువలదా యన్నచో 'భువనమోహిని' వలపును బొలుపును రెంటినిబట్టియు నిదియవశ్యపరిగ్రహార్హ యనుట వ్యంజితము. గానమును కథాకథనమును దటస్థోద్దీపన విభావనములు.

అవ:—వలపునుబొలుపునుండినను దలిదండ్రు లియ్య నొడంబడుదురో యనఁగాఁ జెప్పుచున్నది.

మ. అనఘామూల్యమణిప్రరోహముల నీ కర్పించు నేదివ్యవా
హిని గౌరీపతికిన్ హిమాచలమునట్లేగట్టు నీకున్ విహా
రనగంబై తగునట్టి శుక్తిమతియుం బ్రాలేయశైలేంద్రనం
దనుఁడుం గాంచిన కన్యఁగా నధిప యీతన్వంగి నెన్నందగున్. 57

అ. అధిప = రాజా, అన...హములన్—అనఘ = సెలుసులేని, అమూల్య = విలువలేని, మణిప్రరోహములను = రతనంపుమొలకలను—మొలకమొత్తెములను, నీకున్, ఏ దివ్యవాహిని = ఏ దివ్యనది, అర్పించున్ = సమర్పించుచుండునో, గౌరీపతికిన్ = పార్వతి పెనిమిటియైన శివునకు, హిమాచలమునట్లు = హిమవత్పర్వతమువలె, ఏ గట్టు = ఏ పర్వతము, నీకున్, విహారనగంబై = ఆటలిప్పయై, తగున్, అట్టిశుక్తిమతియును, ప్రాలేయశైలేంద్ర నందనుఁడున్ = పర్వతరాజయిన హిమవంతుని కొడుకయిన కోలాహలుఁడును, కాంచిన = కన్నట్టి, కన్యన్ కాన్, ఈతన్వంగిన్ = ఈచిన్నదానిని, ఎన్నందగున్ = తలంపనొప్పును.

దీనితల్లి నీకుఁ దనయందుఁ బుట్టు రత్నాంకురములను సమర్పించుచుండిన దనుటచేఁ దనయందు జనించిన రత్నాంకురమువంటి గిరికను నీకు సమర్పింపఁగలదియే యని వ్యంజితము. ఇట వస్తువుచేత వస్తుధ్వని. ఇట గిరికను రత్నాంకురముగా నధ్యవసించుట తెలియునది. మణిప్రరోహములనఁగా శుక్తిమతీ పదమునుబట్టి మొలకముత్తియములు. ఈయర్థమునకే సాభిప్రాయముగా శుక్తిమతియని ప్రయుక్తము. తల్లియైనవాహిని 'దివ్య;' తండ్రియో 'ప్రాలేయశైలేంద్ర నందనుఁడు' అనుటచే నట్టియుత్కృష్ట దంపతులకుఁ బుట్టినకన్య యాభిజాత్యము వ్యంజితము. తల్లి నీకు రత్నాంకురసమర్పిణి; తండ్రి నీకు విహారనగమని యీయిరువుర పరాధీనత్వము చెప్పుటచేఁ దజ్జన్యయగు కన్య రాజునకునడుగకయే కయికొనందగినంత సొంతమయిన సొమ్మగుట ధ్వనించెడిని. గౌరీపతికి హిమాచలమునట్లు విహారనగంబను సాదృశ్యముచే, హిమాచలము విహారనగమగుటయే కాక యతనిపుత్రియగు పార్వతి పరిగ్రహపాత్రమయినట్లు, కోలాహలుఁడగు నీకు విహారనగమగుటయే కాక యతనిపుత్రియైన గిరికయు నీకుఁ బరిగ్రహణయోగ్యురా లగుననుట స్ఫురించెడిని. ఇట నుపమాలంకారముచేత వస్తుధ్వని. ఈ పడఁతి సర్వవిధముల నీకు సొంతముయినదే కాని వేఱు కాదని ఫలితార్థము.

అవ:—గిరిక సౌందర్యసౌకుమార్యాదుల రాజున కుద్దీపకముగాఁ జెప్పుచున్నది.

సీ. అడుగువెట్టదు నవ్యహరిచందనలతాంత,సరణిపైఁగాని యీయరుణచరణ
కేల నంటదు కోరకితపారిజాత వ, ల్లరిఁగాని యీయతిలలితబాహ

తనువుఁ జేర్పదు నవ్యోరుదారమందారమం, జుల శయ్యఁ గాని యీసురభిళాంగి
పెదవిఁ జేర్పదు కల్పపృథ్వీజఫల సంత, తియె కాని యీమోవితీపులాఁడి
తే. గురుకులక్రమాయాత మీగిరిజ చల్లఁ, దనము జననై కరూఢ మీతటిని పట్టి
సరసగంభీరభావంబు సహజసిద్ధ, మీనలినసోదరీ మణిమేనితావి. 58

అ. ఈయరుణచరణ = ఎఱ్ఱనియడుగులుగల యీచిన్నది. నవ్య... పైఁ గాని = క్రొత్తదయిన పారిచందన (మనెడు దేవవృక్ష)ముయొక్క చిగురాకులతోఁ గూడిన దారిమీఁద నే తప్ప, అడుగుపెట్టదు, తక్కినవానిపయిని అడుగిడదు. చిగురుటాకులకంటె మిక్కిలి సుకుమారములయిన యడుగులుగలదిగాన చిగురాకులమీఁద నే కాని నడువఁజాలదని భావము. (లతాంతశబ్దమునకుఁ జిగురాకు లనుటకు.

'నవపలాశపలాశవనం పురస్స్ఫుటపరాగపరాగతపఙ్కజం ।
మృదులతాంతలతాంతమలోకయత్') (మాఘ. ౬. సర్గము.)

('అరుణచరణ'యని యడుగులు లెఱ్ఱనివనుటచే ఎఱ్ఱనిలేఁజిగురుటాకులవంటివనియు చిగురాకువంటిదానికిని చిగురాగుననే పొందిక సరిపడుననియు వ్యంజితము.) అలం. ఉదాత్తము.

ఈయతిలలితబాహ = మిక్కిలియు సొగసయిన చేతులుగల యీచిన్నది, కోరకితపారిజాత వల్లరిఁ గాని = మొగ్గవిడిచిన పారిజాత (మనెడు దేవ)వృక్షముయొక్క తీఁగ నేకాని, కేలఁ అంటదు = చేతముట్టదు. (పారిజాతపుఁ దీఁగకంటె మిక్కిలి మృదువయిన చేతులుగలదిగాన యాతీఁగల నే కాని చేతముట్టదనుట. అతిలలితయనుట మిక్కిలియు మెత్తందనము. కావుననే మిక్కిలియు మెత్తనయిన పారిజాతవల్లరి గ్రహింపఁబడెను. పారిజాతము 'కోరకిత' మైనదనుట అందు మొగ్గలుకోయుటకు. ఊరక దానిని నంటుటకు నిమిత్తము లేదుగదా. అతిలలితమైనది అతిలలితమైనదానితో పొందుపడునని భావము.)

ఈసురభిళాంగి = వాసనలొలుకుచున్న దేహముగలది, నవ = క్రొత్తదియు, ఉదార = గొప్పదియు నయిన, మందార = మందార (మనెడుదేవ) వృక్షముయొక్క - వృక్షముయొక్క పువ్వుముల చేతనయిన యనుట, మంజుల = సొగసయిన, శయ్యఁగాని = సెజ్జయందేకాని, తనువుఁ = మేనిని, చేర్పదు = హత్తింపదు- పవ్వళింపదనుట. మందారపుఁ బువ్వులకంటె మృదువులగుటచే మందారపుఁ బువ్వుల సెజ్జ నేకాని పరుండదనుట. ఇట సురభిళాంగి అనుట సురభిళశబ్దముచే పువ్వులు సూచితములుగాన తదనుగుణముగా మందారశబ్దమునకు మందారపుష్పములే గ్రాహ్యము. పువ్వులవంటివానికిఁ బువ్వులతోడి పొత్తేయుచితమని భావము.

ఈమోవితీపులాఁడి = ఈ పెదవితియ్యఁదనముగలది, కల్ప... తతియె కాని—కల్పపృథ్వీజ = కల్పవృక్షముయొక్క, ఫల సంతతియెకాని = పండ్లసమూహము నేకాని, పెదవిఁ జేర్పదు = పెదవికిఁ దెచ్చుకొనదు. అనఁగా అనుభవింపదనుట. తీయనిదానికి తీయనిదానితోడి కూడికయే యొప్పిదమనుట.

ఈనాలుగు చరణములందును 'పంచైతే దేవతరవో మందారః పారిజాతకః । సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనమ్' అను దేవతావృక్షము లయిదింటిలో హరిచందన, పారిజాత, మందార, కల్పవృక్షములచే పల్లవిత, కోరకిత, పుష్పిత, ఫలితములనెడి నాలుగవస్థలు వరుసగాఁ జెప్పినాఁడు. మఱియు చిగుళ్లకును చరణములకును సామాన్యధర్మమయిన అరుణత్వమునుగూర్చి 'అరుణచరణ'యనియు వల్లరికిని బాహువునకునయిన అతిలలితత్వమునుగూర్చి 'అతిలలిత బాహ'యనియు, మందారపుష్పమునకును మేనికినయిన సౌరభమునుగూర్చి 'సురభిళాంగి' యనియు, కల్పఫలమునకును, మోవికినయిన తీపినిగొని 'మోవితీపులాఁడి'యనియు నాలుగింట వరుసగా నాలుగు సాభిప్రాయవిశేషణములను గూర్చినాఁడు.

ఈగిరిజచల్లఁదనము—పర్వతపు కూఁతురయినదీని సౌమ్యభావము. గురుకుల క్రమ ఆయాతము= గొప్పవంశపు వరుసనుండి వచ్చినదని యర్థము. (చల్లఁదనము= శైత్యము, గురు = తండ్రియగు కోలాహలునియొక్క, కులక్రమ = వంశపరంపరవలన, ఆయాతము = వచ్చినదని యర్థాంతరము - హిమవంతుని నాఁటనుండి వచ్చినదనుట—హిమవంతుఁడు చలిమలగదా) ఈతటినిపట్టి= శుక్తిమతీనది కూఁతురయిన దీనియొక్క, సరసగంభీరభావంబు = సరసత్వమును గాంభీర్యమును, జన్మైకరూఢము = పుట్టుకతోఁగూడనే పుట్టినవని యర్థము. [సరసత్వము—రసమనఁగా జలము గనుక జలముతోఁగూడియుండుటయు లోఁతును, శుక్తిమతీనదివలనఁ బుట్టుటచేత వచ్చినవని యర్థాంతరము] ఈనలిన సోదరీమణి = తామరలకుఁ దోఁబుట్టువయిన దీనియొక్క, మేనితావి = శరీరసువాసన, సహజసిద్ధము = స్వభావసిద్ధమయినదని యర్థము. (సహజములయిన—అనఁగా దోడఁబుట్టిన తామరలవలన సిద్ధమయినదని యర్థాంతరము. పద్మినీజాతి కన్యలు పద్మగంధులుగదా.)

ఈ నాలుగుపాదములందును సమృద్ధిమద్వర్ణనముచేసినాఁడు గనుక నుదాత్తమలంకారము. మఱియు నీనాలుగింట హరిచందనాది దేవవృక్షముల యొక్క పల్లవ, కోరకిత, వల్లరీ, పుష్ప, ఫలములకును గిరికపాద, బాహు, గాత్ర, అధరోష్ఠములకును సంబంధము సాదృశ్యపర్యవసాయిగాన నుపమాలంకారమువ్యంగ్యము. సాదృశ్యమున 'అరుణచరణ, అతిలలితబాహ సురభిశాంగి, మోవితీఁపులాఁడి' యను గిరికానామములును, గీతియం దర్థాంతరములందు, గిరిజ, తటినిపట్టి, నలినసోదరీమణి యనునామములును సాభిప్రాయములు గావున, పరికరాంకురము నలంకారము.

'సాభిప్రాయే విశేష్యేతు భవేత్పరికరాంకురః' అని లక్షణము.

మ. పద మెత్తం గలహంసలీల యధరస్స్పందంబు సేయఁగ శుభా
స్పద మా రాగకదంబకంబు శ్రుతి చూఱఁ బఱ శ్రీవిలాసంబు కే
ల్గదలింపఁగ సుకుమారపల్లవనవైకలాలక్ష్మి వీక్షింప వ
ట్పదియుం బొల్చుఁ దరంబె కన్నెఁ గొనియాడఁగ గేయవాక్ప్రౌఢిమన్. 59

అ. పదమెత్తఁగ = అడుగిడఁగానే - నడవఁగానే యనుట, కలహంసలీల=కలనాదముయొక్క విలాసము. (కలహంసమనఁగా కలనాదమని శబ్దకల్పద్రుమము. లేక

'కున్దావదాతాః కలహంసమాలాః। ప్రతీయిరే శ్రోత్రసుఖైర్నినాదైః' భట్టికావ్యము.

అను వచనముచొప్పున కలహంసలనాదము శ్రోత్రసుఖముగావున చెవికింపయిన నాదముల విలాసమనియు నర్థము. లేక తక్కినయధరస్పందాదుల కొక్కొక్కదానికి నొక్కొక్కరాగమును జెప్పినట్లు పదమెత్తుటకును నొకరాగముచెప్పుట క్రమముగాన కలహంసమనెడి రాగవిశేషముగా నొప్పు. ఇందులకు ననురూపముగా 'గేయవాక్ప్రౌఢిమన్' అని కడపట సంగీతమును జెప్పియున్నాఁడు గాన కలహంసమనునది సంగీతశాస్త్రగతమయిన యొక రాగమనుటకు నయితిగా నున్నది.) నడవఁగా రాజహంసల విలాసము పోల్చుచున్నదని భావము. అధరస్పందంబు సేయఁగ = పెదవిగదల్చుటను—అనఁగా పలుకుటను, చేయఁగాఁ=పలుకఁగా ననుట. శుభాస్పదము=మంగళములకు లేక ఒప్పిదములకుచోటు, ఆ రాగకదంబకంబు=అయినట్టి రాగముల సమూహమును, పోల్చుననుట-ఈ'పొల్చు' నిట్లె మీఁదనెల్ల నొక్కొక్కదానితో నన్వయించుకొనునది.(పెదవి గదలుపఁగా ఎఱుపువన్నెలు గుబురుకొనునని భావము.) ఇట 'కలహంసలీలఁ = రాజహంసవిలాసముచేత, పదమెత్తఁ = నడవఁగా, అధరస్పందంబు.

చేయక్ =పలుకఁగా, శుభాస్పదమయిన, రాగకదంబకంబు = రాగసమూహము పొల్చునని యర్థమును చరణాధరోష్ఠరక్తిమ పొల్చునని భావమును బ్రౌన్ దొరగారి టీకయందున్నవి. కాని యీయర్థమున 'కలహంసలీల' వ్యర్థమగుచున్నది. తక్కిన యధరాదులకు రాగాదులు వేఱువేఱఁ జెప్పినట్లు పదమెత్తుటకును వేఱయొక్కటిఁ జెప్పినాఁడనుటయే యుచితము. మఱియు శ్రుతికి శ్రీకారమును, కేలికి ఏలకిలతయు, చూడ్కికి షట్పదియును ఉపమానభూతము లయినవానిని జెప్పినట్లె నడకును 'కలహంస' యని ఉపమానభూతముగా నిబంధించియున్నాఁడు. కాన పదమెత్తుటకు 'కలహంసలీల' యనుటతో మాత్రమే సంబంధము మఱింతసరసము. 'అధరస్పందంబు' నకు నుపమానము చెప్పక పోయినను ఔపమ్యమునకయిన సాధారణధర్మమగు రాగమును జెప్పియున్నాఁడు. అధరస్పందాదులొక్కొక్కటికి నుపమానసాధారణధర్మాన్యతమనిబద్ధమైన యొక్కొక్కవాక్యమును, ఆయావాక్యమందే యొక్కొక్క రాగమును గవి యలవఱిచినట్లె 'పదమెత్తక్' అనుటకుఁ గూడ నలవఱిచియుండును. కనుక దానికి 'కలహంసలీల' యని ఉపమాననిబద్ధమైన వాక్యమున్నదిగాన యింకనందే రాగవిశేషమును నిబంధించియుండును. కనుక 'పదమెత్తఁగా కలహంసలీలపొల్చు' నని యన్వయమే యుచితము కాని 'కలహంసలీలఁబదమెత్తఁగా' నను నన్వయముచితముగాదు. శ్రుతిచూపక్ =చెవి కనఁబఱుపఁగానే, శ్రీవిలాసంబు =శ్రీరాగము పొలుచునని యర్థము. శ్రీకారముయొక్క విలాసము పొలుచునని భావము. ఇందు 'పదము ఎత్తక్' అనుచో పదములనెడి సంజ్ఞగలపాటలనారంభింపఁగానని యు 'శ్రుతి చూపక్' అనుచో సుతిని-అనఁగా స్వరావయవమును జూపఁగా ననియును కొందఱు గ్రహించెదరుగాని తక్కిన హస్తవీక్షణాదుల పక్షమున నట్లుగ్రహించుట పొసఁగనందున గ్రాహ్యముగాదు. కేవల మవయవపరముగా గ్రహించుటే యన్నిటికి సమరసమైనది. కేల్ కదలింపక్ = చేయి అల్లలార్పఁగానే, సుకు... లక్ష్మి—సుకుమార=మృదువయిన, పల్లవ=పల్లవి (పల్లవ మనుగీతావయవము) గల, నవ=క్రొత్తయైన, ఏలాలక్ష్మి=ఏల యనెడిపాటయొక్క పెంపుసొంపు పొలుచుననియర్థము.—(మెత్తని, పల్లవ = చిగుళ్లుగల, ఏలాలక్ష్మి-ఏలకితీఁగ సిరి పెంపు సొంపారునని భావము) వీక్షింపక్ = చూడఁగానే, షట్పదియుక్ = షట్పది యనెడు పాటయును పొల్చునని యర్థము. (ఆఁడుతుమ్మెద స్ఫురించునని భావము.) కాఁబట్టి, గేయ వాక్ ప్రౌఢిమక్ = సంగీతమందలి వాక్కుయొక్క నేర్పునందు—సంగీతవాణియందలి నిపుణత్వము నందనుట, కన్నెక్, కొనియాడక్, తరమే = శక్యముగాదనుట. ఏయవయవము గదల్చినను రాగములు గాన్పించుచున్నవి. కానయీచిన్న దానిగానమహిమ వర్ణింప నలవిగాదనియాశ్చర్యము ధ్వనించుచున్నది.

అడుగుపెట్టినను, పెదవిగదల్చినను, చెవులొగ్గినను, కన్నుగిఱపినను, చేయాడించినను రాగములు పొడకట్టుటచే సంగీతవాణియందు దీనికిఁగల నేరుపు పొగడఁదరమాయని యాశయము ధ్వనితము. హంసలీల, శ్రీ విలాసంబు, ఏలాలక్ష్మి, అనునిమ్మాడుభావములందు నిదర్శన యలంకారము. 'వీక్షింప... షట్పదియుక్' ఇట భావమున చూడ్కి ప్రభను నాఁడుతుమ్మెదగా నధ్యవసించినాఁడు గనుక రూపకాతిశయోక్తి. మఱి ప్రౌఢశబ్దము మహిమాదులలోఁ జేరకుండియు 'ఇమనిచ్' ప్రత్యయాంతముగా దానిని బ్రయోగించుట ప్రౌఢకవులందును జూపట్టుచున్నది.

ఇట్లు గిరిక సౌందర్యసౌకుమార్యాభిజాత్యములను సంగీతప్రవీణతయుఁదదనురాగమును దశాప్రాప్తిసౌలభ్యమును జెప్పి నిగమించుచున్నది.

క. శ్రీనిధి భవదభినివస, న్నానన యీసింధుతనయ కే మహనీయగుణ
శ్రీ నుతికి నెక్కె నేఁడీ, మానిదయామందరాగకమహిమము కలిమిన్. 60

అ. శ్రీనిధి = సంపదకు ఆస్పదమైనవాఁడా, లక్ష్మీదేవికి స్థానమైన విష్ణూ అనియును, భవ .. నస—భవత్ =నీయందు, అభినివసత్ =వసించున్న-ఆసక్తిగలిగియున్న, మానస=మనస్సుగలది, అగు, ఈసింధుతనయ=(సింధువనఁగా నదియు సముద్రమును) నదికూఁతురయిన గిరికాదేవిఅనెడు, భవత్ అభినివసత్ మానస=నీయొక్క వసించుచున్న వక్షముగల సముద్రునికూఁతురయిన లక్ష్మీదేవి, నేఁడు, ఈ...కలిమిన్ —ఈమాని, దయా=కృపతోడి, అమందరాగ=మిక్కిలి అనురాగమనెడు ,మందర + అగ=మందరగిరియొక్క, మహిమము కలిమిన్ =ప్రభావము కలుగుటచేత, మహా...శ్రీన్ —మహనీయ=గొప్పదయిన, గుణశ్రీన్ = గుణసంపత్తిఅనెడు, (గుణమనఁగా త్రాడునుగనుక)వాసుకిరూపమ యిన గొప్పత్రాటియొక్క కలిమి చేత, నుతికిన్ ఎక్కు=పొగడ్తనొందెను. 'భవదభినివిశమానస' యని సోమకవిపాఠము,కాని గిరికకు లక్ష్మితోడి రూపణమునందుఁ బ్రకృతిపాఠము మఱింత యుపయుక్తము. ఇట్లు రూపకముగా గ్రహింపనియెడల 'మానిదయా...కలిమిన్' అను రూపణము పొసఁగదు.

అతఁడు శ్రీనిధి గనుక సింధుతనయ మానస మభినివేశమొందినదని చమత్కారము. విష్ణువునందు లక్ష్మీకింతెఁ దత్సదృశుఁడవయిన నీయందు లక్ష్మింబోని యీపడఁతికి మనసు నెలకొనుట సహజము, ఉచితమును. లక్ష్మీకిఁగల అభినివసన్మానసత్వమాత్రము విష్ణుప్రాప్తికి నిమిత్తముగా సేరదు. మంథరమును దానినిబట్టి వాసుకి (గుణమును) యాఁకట్రాళ్లును గావలయును. అట్లే యీమునీశ్వరుని దయగలిగినది. దానిని బట్టి గొప్పగుణంపుపెంపు నొందినది. అనఁగా నిన్నుఁ జేపట్టగలిగినంతటి యొప్పిదపుఁ బెంపుగల దాయెనని యాకూతము. నిన్నే మనస్సునందు వలచియుండిన యీచెలువకు నేఁటిదినమే యీమానిదయ వలన నిన్నుఁ జేపట్టఁగలిగినంత యొప్పిదమొడఁగూడెనని తాత్పర్యము. అలం. శ్లిష్టరూపకము.

చ. అన జనభర్త పల్కు ముదితా విదితాతనుమంత్రజాలు ని
మ్మునిఁ గొనియాడ శక్యమె సముజ్జ్వలరూపకలాప యైన మీ
యనుఁగువయస్యఁ గాంచుసుకృతాతిశయం బవలీలఁగూర్చె నీ
యనఘుఁ డితండు మాకుఁ బరమాప్తుఁడు గాక మునీంద్రమాత్రుఁడే. 61

అ. అనన్ , జనభర్త=వసురాజు, పల్కున్ =ఇట్లనిపలికెను.—ముదితా=ఓమంజువాణీ, విదిత అతను మంత్రజాలున్ =తెలిసిన ఎక్కువయగు మంత్రముల సమూహముగలవాఁడని యర్థము-(తెలిసిన మన్మథమంత్రసమూహముగలవాఁడని యర్థాంతరము.) అగు ఇమ్మునిన్ , కొనియాడన్ =పొగడుకొనుటకు, శక్యమే=అలవియగునా- అలవిగాదనుట. ఏలనిన, ఈ యనఘుఁడు=ఈ పుణ్యాత్ముఁడు, సముజ్జ్వలరూపకలాప=మిక్కిలి ప్రకాశించుచున్న రూపే సొమ్ముగాఁగలది. ఐన, మీయనుఁగువయస్యన్ = మీగారాబుచెలిని-గిరిక ననుట, కాంచుసుకృత+అతిశయంబున్ =చూచునట్టిపుణ్యముయొక్క పేరిమిని, అవలీలన్ =అనాయాసముగా,కూర్చెన్ =ఒడఁగూర్చెను. కాఁబట్టి, ఇతఁడు, మాకు, పరమాప్తుఁడుకాక= మిక్కిలియుఁ గూర్చునట్టి హితుఁడువగునేకాని, మునీంద్రమాత్రుఁడే=కేవలము మునిమాత్రమే యగునా. ఇట్టియతఁడు మునియేకాఁడు. మాకు పరమహితుఁడునగునని యర్థము. (మాకు మిక్కిలియుఁగూర్చునట్టి స్నేహితుఁడేకాన మునీంద్రమాత్రుఁడా-అనఁగా మునీంద్రుఁడుగాఁడు - మాకుస్నేహితుఁడే యని యర్థాంతరము.)

అనుఁగువయస్యకు రూపమేసొమ్ము. అట్టిదానిఁ గాంచుట కేవలసుకృతముగాదు; సుకృతాతిశయము. అట్టిమహాసుకృతము గలుగుట చిరసాధ్యము.అట్టిదానిని 'అవలీలఁ' గూర్చినవాఁడుగాన గొనియాడుటఅశక్యము. అతఁడు గూర్పఁగలుగుట అతనుమంత్రములఁ దెలిసినవాఁడుగాన. వసురాజు సత్య

సంధుఁడగుటచే నబద్ధము చెప్పరాదుగనుక నాతఁడు పొందుపఱచిన యీపద్యమందు యథార్థవిషయముగ నొకయర్థమును పరభావానుకూలముగ నొకయర్థమును స్ఫురించుచున్నది.

వ. మఱియు నితనిమంత్రప్రభావంబున భవాదృశదివ్యభామినీమృదుమధుర కోమలాలాపంబు లాలింపం గలిగెనని మనుజపతి బహూకరించుటయు నమ్మాని సమ్మదమ్మునఁ గొమ్మనెమ్మోముఁ జూచి తమ్మికంటీ యకుంఠితభువననిర్మాణచాతురీధురీణుం డగు పితామహుం డేతాదృశయోగ్య వస్తుయోజనంబునం బొగడువడసి, యపారపరీవాదపారావార భంగంబుల మునుంగఁడుసుమీ. అదియునుం గాక తదీయఘటనావైభవాభంగరంగప్రసంగంబునకుం బూర్వరంగంబు రసోత్తరంగం బగుట యెఱింగితివిగదా! యింక సందియంబు వలదని వీడ్కొని, యవ్వసుంధరాధరునకు నవ్వరారోహకు నమూల్యకల్యాణకౌతుకసమృద్ధియుం గావలయునని దీవించి వారల వినయసంవిధానంబుల నానందమొందుచు మణిమందిరంబు వెడలి చని యనతిదూరంబునం దోరంబు లగు మందారతరువారంబుల యీఱంబులలో సారం బగు తపోధనాకారంబు డించి యథాపూర్వ వేషంబుతో రాజు నన్వేషించు క్రమంబునం గ్రమ్మఱ నేతెంచి యమ్మహీమండలాఖండలుం గాంచి యద్భుతంబు నటించి పరిసరంబున నిల్చునవసరంబున. 62

అ. మఱియున్, ఈతని, మంత్రప్రభావంబునన్=మంత్రముయొక్క మహిమచేతనని యర్థము- రహస్యాలోచనముయొక్క శక్తిచేతనని యర్థాంతరము. భవా...లాపంబులు—భవాదృశ=మీవంటి, దివ్యభామినీ=దేవతాస్త్రీలయొక్క, మృదు=మెత్తనివియు - పరుసనయిన యక్కరములులేనివనుట. మధుర=తీయనివియు, కోమల = సుకుమారములయినవియు, అగు, ఆలాపంబులు=మాటలు, ఆలింపఁ గలిగె=వినఁగలిగెను, అని, మనుజపతి = రాజు, బహూకరించుటయున్=మన్నన సేయఁగా.

అమ్మాని, సమ్మదమ్మునన్=మిక్కిలియు యుబ్బుతో, కొమ్మనెమ్మోము=మంజువాణి మొగమువంక, చూచి, తమ్మికంటీ=తామరరేకులవంటి కన్నులుగలదానా, అకు...రీణుండు—అకుంఠిత=మొక్కవోని (కీడ్పడనియనుట, ఇది చాతురికి విశేషణము.) భువన=జగత్తులయొక్క, నిర్మాణ=సృజించుటయొక్క, చాతురీ=నేర్పునందు, ధురీణుఁడు=ధురంధరుఁడు,ఐన, పితామహుండు=బ్రహ్మ, ఏతా...జనంబునం— ఏతాదృశ=ఇటువంటి, యోగ్యవస్తు=తగినట్టి వస్తువుల (రెంటి) యొక్క, యోజనంబునన్=కూర్చుట చేత, పొగడువడసి=మెప్పువడసి, (అనఁగా గిరికావసురాజులవంటి యుత్తమ స్త్రీపురుషులను గూర్చి పొగడ్తగన్నవాఁడయి) అపార...గంబులన్—అపార=దరిలేని, పరీవాద=నిందయనెడు,పారావార= సముద్రముయొక్క, భంగంబులన్=అలలయందు, మునుంగఁడుసుమీ. ఇట్టియుత్తమస్త్రీపురుషులను గూర్చి లోకమునం బొగడ్తనే పడయుననుట. అదియునుంగాక, తదీ...సంగంబునకున్-తదీయ= బ్రహ్మయొక్క, ఘటనా=కూర్చుటయొక్క, వైభవ=పెంపుసొంపనెడు - పెంపుసొంపార కూర్చుట యనెడు, అభంగరంగప్రసంగంబునకున్=వైకల్యములేని నాటకప్రస్తావమునకు, పూర్వరంగంబు=(నాటకమునకు తొలుత విఘ్నోపశాంతికొఱకుఁ జేసెడు వినాయకతాళము. అనఁగా) ప్రథమకార్యము,

'యన్నాట్యవస్తునః పూర్వం రంగవిఘ్నోపశాన్తయే
కుశీలవాః ప్రకుర్వన్తి పూర్వరంగః స కీర్త్యతే'

రస+ఉత్తరంగంబు=రసముయొక్క పొంగుచున్న యలలుగలది - మిక్కిలి రసముపయిపయి పచరించుచున్నది - మీఁదుమిక్కిలి రసవంతముగా నొనఁగూడినదనుట, అగుట, ఎట్లింగితవిక దా, గిరికా వసురాజుల పొందునకు మునుముందు నిరాతంకముగా సమకూర్చుటకు వలయుపనులెల్ల విరసముగాక నా కెంతయు సరసముగానే జరుగుట నీకుఁ దెలిసెనుగదా. ఇఁక (మీఁదటి కార్యమునకు) సందియంబువలదు అని వీడ్కొని.

అవ్వసుంధరాధరునకున్=ఆభూపతికిని, అవ్వరారోహకున్=బలితంపుఁ బిఱుఁదులుగల యా గిరికాదేవికిని, అమూ...మృద్ధియుం--అమూల్య=వెలలేని, కల్యాణ=శుభమువలని, కౌతుక = సంతోషముయొక్క, సమృద్ధియు=పరిపూర్తియు నని యర్థము. (కల్యాణమనఁగా పెండ్లి, కౌతుకమనఁగా కంకణము-తోరము, గనుక వివాహదీక్షకయిన కంకణము పెంపుసొంపని యర్థాంతరము.) కలుగుఁగాక యని దీవించి, వారల=ఆ గిరికా వసురాజులయొక్క,వినయసంవిధానంబునన్=అడఁకువ నెఱపుటచేత, ఆనంద...మందిరము, వెడలి=చని, అనతిదూరంబునన్=కొంచెపుదవ్వున-దాపుననుట, తోరంబులు= విస్తారములు, అగు మందారతరువారంబుల = మందారములనెడి దేవవృక్షముల సమూహములయొక్క, యీఱములలోన్=తఱచులలోపల, (ఈఱము అనియు ఈఱమియనియు రూపద్వయము గలదు.

‘పక్షముల యీఱమిగాటుక చిమ్మచీఁకటిన్’ (శృం-నై. ౭. ఆ.)

‘పూఁబొదరిండ్ల యీఱమి మఱుంగునన్’ (కళా. ౧.)

‘ఈఱంపుఁబొదలు’) (కన్యకాపురాణ. ౧. షోడశ. ౮. ఆ.)

సారంబగు=శ్రేష్ఠమయిన, తపోధనాకారంబున్=మునివేషమును, డించి=సడలించి-తీసివైచి, ‘ఉడించి’ యనియు ‘విడిచి’ యని యర్థమనియుఁ గొందఱమతము. దీనిస్వరూపము విచార్యము. యథాపూర్వవేషంబుతోన్=మునుపున్న యెప్పటి (మంత్రి) రూపముతో, రాజును, అన్వేషించు క్రమంబునన్ = వెదకురీతిని, క్రమ్మఱన్, ఏతెంచి=వచ్చి, అమ్మహీమండలాఖండలున్=భూమండలమున కింద్రుఁడయిన యారాజును, కాంచి, అద్భుతంబు నటించి=ఆశ్చర్యమును అభినయించి- అచ్చెఱువడినవానివలెఁ జేష్టలు పచరించియనుట, పరిసరంబునన్=ప్రక్కను, నిల్చునవసరంబునన్=నిల్చున్నసమయమందు, ముందటి పద్యముతో నన్వయము.

తే. పడఁతు లారాజసచివునిఁ బలుకుబడియు
మోముచాయయుఁ గని తొంటిమునియె కాఁగ
నరసి మందాక్షమంద మందాక్షు లగుచు
నగుచు భావించి రతనివాక్పైపుణములు. 63

అ. పడఁతులు=స్త్రీలు-గిరిక చెలికత్తెలు, ఆరాజసచివుని=ఆరాజు మంత్రియొక్క, పలుకుఁబడియు=మాటరొలుఁగుతీరును, మోముచాయయు=మొగమువన్నెయు, కని, తొంటిమునియె కాఁగన్=మును వచ్చిన మునియేయని, అరసి=విమర్శించి-తెలిసి, మందా...క్షులు—మందాక్ష (‘మందాక్షం హ్రీ స్త్రపా వ్రీడా’ అ.) సిగ్గుచేత, మందమంద=మిక్కిలిమందగించిన, అక్షులగుచున్=(మందాని అక్షాణియాసాంతాః అని విగ్రహము) ఇంద్రియములుగలవారగుచు-లేక చూపులుగలవారగుచు (మందాని అక్షీణి యాసాంతాః=మందాక్ష్యః దీనికిఁ దత్సమరూపము మందాక్షులు అనియగును) నగుచున్, అతని, వాక్పైపుణముల=మాట నేరుపులు, భావించిరి = మనసునఁ దలపోసిరి.

అతనిని మున్ను ఋషియని నమ్మి బేలుపోయినందులకు సిగ్గు. దానిచే నతనినిఁ జక్కఁజూడలేమి యని తెలియునది.

క. కోలాహల శైలాధిప, లీలాగతుఁడైన పతి యలీకయతీంద్రున్
నీలాలకావలోకక, ళాలోలత ననిపె నని తలంచిరి ముదితల్. 64

అ. ముదితల్=ఆ స్త్రీలు, కోలా...గతుఁడు = కోలాహలపర్వతశ్రేష్ఠమందలి విలాసార్థముగా వచ్చినవాఁడు, అగు, పతి=రాజు, అలీకయతీంద్రున్=కపటపు మునీశ్వరుని, నీల...లతన్— నీలాలకా=నల్లని కురులుగల యీగిరికయొక్క, అవలోకకళా=చూచుపనియందలి, లోలతన్=తగులు చేత- చూచి రమ్మని యనుట, అనిపె నని తలంచిరి. దీనిచేఁ జెలికత్తెల రసజ్ఞతయు భావప్రౌఢియుఁ దెల్లములు.

చ. అపు డొకబాల మేలమున నల్లనఁ బల్కుచు నింతులార యీ
నృపమణిరాకచే నలరి యీగిరికానన మిప్పు డెంత చొ
క్కపుసిరిఁ దాల్చెఁ జూడుఁ డనఁ గన్నియ మోమెదఁ జేర్చి సిగ్గు రా
గపుఁదమియుం బెనంగఁ బ్రియుఁ గాంచెఁ గుచాంచల హారధారలోన్. 65

అ. అపుడు, ఒకబాల, మేలమునన్ = పరియాచకముచేత-కోడిగముగాననుట, అల్లనన్= మెల్లగా, పల్కుచున్ = నేరుపుమాటలాడుచు, ఇంతులార=ఓచెలియలారా, ఈనృపమణిరాకచేన్= ఈరాచమిన్న వచ్చుటచేత, అలరి = వికసిల్లి, ఈగిరి+కాననము = ఈకొండయందలి యడవి అని యర్థము. (ఈగిరిక+ఆననము= ఈగిరికాదేవి మొగమని యర్థాంతరము.) ఎంత చొక్కపుసిరిన్ =ఎంత చెలువయిన శోభను (కళనుఅనియు), తాల్చెనో=వహించెనో, చూడుఁడు, అనన్ =అనఁగా, కన్నియ= గిరికాదేవి, (తన)మోము, ఎదన్ చేర్చి=ఱొమ్మునఁజేర్చుకొని—అనఁగా మిక్కిలియుఁ దలవంచుకొని, సిగ్గును, రాగపుతమియు=అనురాగముయొక్క తమకమును, ఎసఁగన్ =ఒకటితోనొకటి మల్లాడఁగా, కుచ...ధారలోన్—కుచాంచల = చన్నులప్రక్కనున్న, హారధారలోన్ =ముత్తెపు హారముయొక్క కాంతిపూరమందు, ప్రియున్ =తనకు నింపయిన వసురాజును, కాంచెన్ = చూచెను—ముత్తెపుసరి కాంతియందు ప్రతిబింబించిన రాజుయొక్క రూపమును జూచెనని తాత్పర్యము.

సిగ్గు నాయకునిఁ జూడనీదు. అనురాగపుఁదమి చూడకుండ నీదు. కాన హారకాంతి ప్రతిబింబితునిఁ జూచుటచే రాజును జూచుటయుఁగాక జూడమియుఁగాక రెంటికి ననుగుణముగా నుండుటచే నట్లు చేసినదని నాయిక నేర్పు. అనురాగపుఁదమియేల? ప్రియుఁడుగదా. మొగమెత్తిన ముఖవికాసము తనమర్మమును బయలుపుచ్చును. కాన వంచిన మొగముననే యిట్లు చూచుట పచరించినది. ఇందు 'సిగ్గు రాగపుందమియున్ పెనంగ'ననుటచే గిరిక లజ్జామన్మథ మధ్యస్థురాలయిన మధ్యమనాయిక యని తెలియుచున్నది. 'లజ్జామన్మథమధ్యస్థా మధ్యమా' అనిలక్షణము.

తా. అపుడొక చెలికత్తె తక్కినవారినిజూచి కోడిగముగా 'చెలులారా! ఈరాజురాఁగా నీగిరి కాననము (ఈ కొండ యడవి. ఈ గిరికాదేవి మొగము) వికసిల్లి యెంత మిక్కిలి శోభగలిగియున్నదో చూడుఁడనెను. అది గిరిక తెలిసికొని సిగ్గుచేఁ దలవంచుకొనెను. కాని యనురాగముచేత రాజును జూడఁదహతహపడుటచే యుక్తిచేసి తనచన్నుఁగవ ప్రక్కలనున్న ముత్తెపు సరికాంతియందుఁ బ్రతిబింబించిన రాజు రూపమునుజూచి తమిదీర్చుకొనెను. అలం. సూక్ష్మము.

చ. అలికులవేణి కీలెఱిఁగి యా చెలి వెండియు నేకతంబునం
బోలఁతుకలార యీచిగురుఁ బోఁడికుచార్పితహారనాయకో

జ్జ్వలరుచిఁ గంటిరే యనినఁ జంద్రముఖుల్ చిఱునవ్వుఁ బూని రా
లలనలఁ జూచి కిన్కయుఁ గలంకయుఁ గొంకును నంకురింపఁగన్. 66

అ. ఆచెలి, అలికులవేణికీలు=(తుమ్మెదకదుపువలె నల్లనయిన జడగల) గిరికయొక్క మర్మమును (కుచాంచలహారధారయందు రాజునుజూచు కిటుకును), ఎఱింగి=తెలిసికొని, వెండియున్=మరల, ఏకతంబునన్=ఏకాంతముగా, పొలఁతుకలార=చెలులార, ఈచిగురు...రుచిన్ — ఈచిగురుఁబోఁడి=ఈగిరికయొక్క, కుచ=చన్నులందు, అర్పిత = ఉంపఁబడిన, హార=ముత్తెపుసరియందలి, నాయక=నాయకమణియొక్క, ఉజ్జ్వలరుచిన్ = ప్రకాశించుచున్న కాంతినని యర్థము—(చన్నులందలి హారమందు ప్రతిఫలించిన వసురాజుయొక్క యుజ్జ్వలమయిన లావణ్యమునని యర్థాంతరము. 'నాయకో నేతరి శ్రేష్ఠే హారమధ్యమణావపి' వి. నాయకశబ్దమునకు అధిపతియనియు, హారమధ్యమణి యనియు నర్థములు) కంటిరే, అనినన్, చంద్రముఖులు = (చందురునివంటి మొగములుగల) తక్కిన స్త్రీలు, చిఱునవ్వున్ పూనిరి=ముసిముసినవ్వును వహించిరి. ఆలలనలన్ చూచి=అట్లు పరిహాసభావము నూనిన స్త్రీలనుజూచి, కిన్కయున్= కోపమును- అమర్షమనెడి సంచారిభావమును. 'అమర్షః స్యాత్పరార్థేషు చేతః ప్రజ్వలనమ్.' కలంకయున్ = మనః కాలుష్యమును - (ఇది ఆ యమర్షమునకు అనుభావము) కొంకును=వ్రీడయనెడు సంచారిభావమును. ('చేతస్సంకోచనం వ్రీడా' అ.) అంకురింపఁగన్ = మొలకొత్తఁగా ముందటిపద్యముతో నన్వయము. ఇటమిక్కిలి యుద్దీపించుచున్న శృంగారరసమగ్నత కొకింత విడుమరగాఁ గవి నాయికయందుఁ గోపాద్యనుభావములకు నయితి గల్పించుట తెలియునది.

చ. సొలసి తటిల్లతాంగి జిగిఁజూపు వెలుంగులచేఁ గలధ్వను
ల్గలకలకంఠులన్ గదిమి గాటపునెమ్మి నటింప హంసకం
బులు జడియం బయోధరసమున్నతి భంగురమధ్య పుష్కరాం
చల మరదోఁపఁగా నరిగెఁ జారుఘనప్రతిసీరచెంతకున్. 67

అ. ఇక్కడ గిరికను తటిల్లతాంగి యనుటచే గిరికాపరముగాను తటిల్లతాపరముగానర్థద్వయము తెలియునది. తటిల్లతాంగి = మెఱుపుఁదీఁగవంటి దేహముగలది-గిరిక, సొలసి=ప్రయాసపడి, జిగిసూపు వెలుంగులన్=నిగ్గయినచూపులకాంతులచేత, గలధ్వనుల్ = కంఠధ్వనులుగల - అనఁగా గొణగొణలాడుచున్న, కలకంఠులన్=చెలికత్తెలను, గదిమి=అదల్చి, యని గిరికాపరమైనయర్థము—(జిగిసూపు=కాంతిని కనఁబఱుచునట్టి, వెలుంగులన్=ప్రకాశములచేత, కలధ్వనుల్ = అవ్యక్తమధురధ్వనులు గల, కలకంఠులన్=ఆఁడుకోవెలలను, గదిమి = పోఁదోలియని తటిల్లతాపరమైన యర్థము. 'కదిమి' అనిగ్రహించినచో ఆక్రమించి యనియర్థము. (ఇట జిగిసూపు వెలుగులన్ అనుచో మొదటియర్థమున 'చూపు' విశేష్యము. రెండవయర్థమున క్రియ. మొదటియర్థమున 'జిగిగలచూపు' లని కర్మధారయము గనుక, చకారమునకు సకారాదేశము. రెండవయర్థమున 'ప్రథమమీఁదిపరుషములకుఁ గసడదవలగు'నను సూత్రముచే 'చ' కు 'స' వచ్చినదని తెలియునది. 'వెలుంగులచే గలధ్వనుల్' అనుచో గిరికాపరమయిన యర్థమున 'గల' అని గకారాదిగను అర్థాంతరమున 'కల' అని కకారాదిగను దెలియునది. మొదటి యర్థమున దీనికిముందున్న ద్రుతమునకు లోపము. రెండవదానియందు ద్రుతము పయిని 'క' కారమునకు 'గ' కారాదేశము గలిగించి తానర్థబిందు వగుచున్నది. సఖండనిర్బిందువులకు శ్లేషమందు 'శ్లేషే సఖండనిర్బిందో శ్శ్లేషనం కుత్రచిన్మతమ్' అథర్వణకారికా, అని మేళనముగలుగుటగలదు.) గాటపు నెమ్మినటింపన్=గాఢమయిన మక్కువ విజృంభింపఁగా(గాఢముగా నెమిలి నటనము సేయఁగానని యర్థాంతరము), హంసకంబులు జడియన్=

గాలియందెలు ద్రోయఁగా—(హంసలు వెలుపునొందఁగానని యర్థాం),పయోధరసమున్నతిన్ =చన్నుల నిక్కు చేత - నిబ్బరపుగుబ్బచన్నులబరువు చేతననుట, భంగుర=వకవకలాడుచున్న, మధ్యపుష్కర అంచలము—(పుష్కరమనఁగా ఆకాశముగనుక) ఆకాశమువంటి నడుముయొక్క మొన – (అగ్రభాగము), అరదోఁపన్ = సగము కనిపింపఁగా—(పయోధర సమున్నతిన్ = మబ్బులపాడవు చేత, భంగుర = కనఁబడకయున్న, మధ్య = నడిమిభాగముగల, పుష్కర= ఆకాశముయొక్క, అగ్రభాగము సగము దోఁపగానని యర్థాం. ఆకాశము నడిమిని మబ్బులు క్రమ్మఁగా దానిపార్శ్వములే కొంచెము తెలియుచుండఁగా ననుట,) చారు...నరచెంతికున్ — చారు=అందమయిన, ఘన = గొప్పదయిన, ప్రతిసీర=తెరయొక్క, చెంతకున్, అరిగెను—(చారుఘనమనఁగా వర్షాకాల మేఘముగనుక తెరవలె నున్న నల్లని మబ్బుచెంతకుఁ బోయెనని యర్థాంతరము.

గిరిక, చెలికత్తె లేమోమో గొణుగుచుండఁగా మెఱుఁగుజంకెనల చూపులచే నదల్చి రాజునందలి వల పగ్గలించుచుండఁగాఁ గాలియందెలు మొరయ గబ్బిగుబ్బల నిక్కున సన్నినడుము నకనకలాడుచు సగముదోఁపఁగా, పెద్దతెరమాటునకుఁ బోయెనని యర్థము.

మెఱుపుఁదీఁగ తళతళలాడు ప్రభలచే కొలకొలమని కూయుచున్న కోకిలలు బెదరఁగా, నెమిలి నటనముసేయఁగా, హంసలు భయపడఁగా, మబ్బులాకాశము నడిమి భాగమంతయుఁ గ్రమ్మ దాని యోరలుమాత్రము కొంచెము దెలియుచుండఁగా నల్లనిమేఘము పొంతకుఁబోయెనని యర్థాంతరము.

వర్షాకాలమున మెఱుపులకు కోకిలాదిపక్షులు బెదరి కూఁతలుమానుటయు, హంసలు మెఱుపులను జూచి మేఘములకు భయపడి మానససరస్సునకుఁ బోవుటయు, నెమిళ్లు వర్షాకాలమునఁ బురివిచ్చి యాడుటయు, ఆకాశమం దిందునందుఁ బార్శ్వభాగములు దప్ప మధ్యభాగమంతయు మబ్బులచేఁ గ్రమ్మఁబడుటయు ప్రకటములు. మెఱుపులు శరదృతువునఁ దెల్లని మబ్బులనుబొందవు. కావున నే 'చారుఘన' మనఁబడెను. శ్లేషకృత సాధర్మ్యమూలమగు ఉపమ యనిసోమకవి. గిరికాదేవి చెలులు సేయు పరియాచకములకు సైఁపక దట్టంపుఁ దెరచాటునకుఁ బోయెనని తాత్పర్యము.

క. పరమాణుమధ్య యీగతిఁ, దెరమాటున కరుగఁ దనివి । దీరనిచూడ్కిం
బరమానురాగసూచన, పరమానసుఁ డగుచు । ధరణిపాలకుఁ డంతన్. 68

అ. పరమాణుమధ్య = (పరమాణువనఁగా ఉన్నదనెడి ప్రతీతిమాత్రము గలదై కంటికిఁ గానరాకుండు రేణువు-చిన్నవలుసు)చిన్ననలుసువంటి నడుముగలది, ఈగతిన్=ఈవిధమున, తెరమాటునకున్, అరుగన్=పోఁగా, తనివితీరనిచూడ్కిన్ = తృప్తిపొందని చూపుచేత, పర...నసుఁడు—పరమ+అనురాగ=మిక్కుటమయిన ప్రేమయొక్క, సూచన=కనఁబఱచుటయందు, పర=తగులుగల, మానసుఁడు=మనస్సుగలవాఁడు, అగుచున్, ధరణిపాలకుఁడు=వసురాజు, అంతన్=అమీఁదట, ముందటిపద్యములో నన్వయము. ఇందు ద్వి ప్రాసము.

సీ. మెఱుఁగొప్పు నెఱిగొప్పు । నెఱిగప్పు తఱిఁగప్పు, జలదమాలికచొప్పు । దెలుపలేదొ
బలువాలుగలనేలు । తెలివాలుఁగనుడాలు, కలువపూఁ దెరమేలు । దెలుపలేదొ
బలువైన కలలీనఁ । గలలేనగవుసోన, కలశాబ్ధి తెరమేన । నిలువలేదొ
కనకంపు ననసొంపు । కడనుంపు రుచిపెంపు, పసిఁడితీఁగలగుంపు । మెసఁగలేదొ
తే. ప్రాణసఖులార నెయ్యంపు । టలుకఁబూని, యేల యీబాల యీవేళ । నీవిశాల
యవనికాభ్యంతరంబున । కరిగె ననఁగ, నమఁగునెచ్చెలి మఱియు నెయ్యమునఁ జేరి,

అ. మెఱు...గప్పు—మెఱుఁగొప్పు = నిగనిగమని మెఱయుటయొప్పెడు, (ఇది కొప్పుపక్షమున- నిగనిగమని మెఱపుతీఁగచే నొప్పెడునని జలదమాలిక పక్షమున నర్థము.) నెఱిగొప్పు=సొగసయిన కొప్పు యొక్క, నెఱగప్పు=నిండయిన నలుపు— నల్లనికాంతియనుట, తఱిన్=సమయమందు—అనఁగా వర్షా కాలమందు, కప్పు=క్రమ్మునట్టి, జలదమాలికచొప్పు=మబ్బుల బంతియొక్క రీతిని, తెలుపలేదొ-అనఁగా నెఱగొప్పుయొక్క నల్లనికాంతులు పర్వి తన్నుఁ గనఁబడకుండ జేయుచుండలేదా యనుట. కాన తెర మాటునకుఁ బోవ నక్కఱలేదే యనిభావము. ఇందు 'మెఱుఁగొప్పు' అనునది రెంటికిని సమానధర్మము.

బలువాలుగలన్ =గొప్పవాలుగచేఁపలను, ఏలు=తిరస్కరించు (అని కంటిపక్షమున, క్రిందుపడఁ జేయుటయని కలువపూవుపక్షమున; కాన ఈరెంటికి సమానధర్మము) తెలి= తెల్లని, వాలు=సోగలైన, కనుడాలు=కనులప్రభ, కలువపూఁదెర మేలు=కలువపువ్వుల తెరయొక్క సొగసును, తెలుపలేదా (అనఁ గా కన్నుల ప్రభలు కలువపువ్వుల తెరగ్రమ్మినట్టులు తన్నుఁ గనఁబడకుండఁ జేయలేదా యనుట. ఇట తెలికన్నుడాలు కలువపూఁదెరవలె నల్లనిగాంతి నిగుడ్చుట యెట్లన్నచో కను నల్లనిగ్రుడ్డు కలువపూవులచాలువలె నల్లనికాంతులును, తెల్లనికొలుకులు తెల్లనికాంతులును దొలంకునట్లును గవులు వర్ణింతురు.

'ఆకృష్టే వసనాంచలే కువలయశ్యామా త్రపాధఃకృతా ...దృష్టిః'(కృష్ణకర్ణామృతము)
'అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసిల్లఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా' (మనుచరిత్రము.)
'విలోకన ప్రభా, వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్.'(మనుచరిత్రము.)

నలువైనకలలు=సొగసయిన తళతళకాంతులు (అని నవ్వు పక్షమున - సొగసయిన చంద్రకల లని పాలసముద్రము పక్షమున - కాన యిది రెంటికి సమానధర్మము), ఈనఁగల లేనగవుసోన = కలిగిం పఁజాలు లేఁతనవ్వనెడి సోనవాన, కలశాబ్ధితెర = పాలసముద్రపు అలయనెడు తెరను (తెరయనఁగా తరంగమును) మేనన్ నిలుపలేదో = దేహమునం దుంపలేదో- అనఁగా చిఱునగవు సోనవాన పాల సముద్రపు కరళ్లుగ్రమ్మినట్లు గ్రమ్మి తన్నుఁ గనిపింపకుండఁజేయులేదా యనుట.

కనకంపునననసొంపు = సంపెఁగ పువ్వుచెలువు, (అని మేనిరుచి పక్షమునను పసిఁడితీఁగ పక్షము నను నర్థము. కాఁగ యిదిరెంటికిని సాధారణధర్మము) కడనుంపు = దూరమునఁబెట్టు-నిరసించు, రుచి పెంపు=జిగియెక్కుడు-లావణ్యాతిశయమనుట, పసిఁడితీఁగెలగుంపున్ =బంగారుతీఁగెల జొంపమును - పెనఁచుకొన్న తీఁగజొంపపు మఱుఁగును, మెసఁగలేదొ = (ఇది 'ఒసఁగలేదో' యను యుండునుగాఁ బోలు) కలిగింప లేదా. అనఁగా దేహలావణ్యము పసిఁడితీఁగల జొంపపుమఱుఁగువలె తన్నుఁ గనఁ బడకుండ మఱుఁగు పుచ్చుచుండ లేదా యనుట. ('కనకంకాఞ్చనే నా తు ధుత్తూరే నాగకేసరే, చమ్పకే కాఞ్చనా గేచ' నానా.)

ప్రాణసఖులార = గిరికకు అనుంగు చెలులారా! నెయ్యంపుటలుకన్ పూని = ప్రణయకోపమును దాల్చి, ఏల, ఈబాల, ఈవేళన్, ఈవిశాల యవనికా అభ్యంతరమునకున్ = వెడలుపయిన యీతెర లోపలికి,అరిగెను.'ప్రతిసీరా యవనికా స్యాత్తిరస్కరిణీచ సా' అమ. అనఁగన్ =అని రాజుచెప్పఁగా, అనఁగ నెచ్చెలి=ప్రియసఖి-మంజువాణి, మఱియు నెయ్యమునన్ చేరి=మిక్కిలి చెలిమినిబట్టి గిరికదగ్గ ఱకుఁబోయి,కొప్పునలుపు,కన్నులజిగి,నగవు తెలుపు, మేని మెఱుఁగే, పర్వితన్నుఁ గనఁబడకుండఁ జేయఁగా తనకు మాటునకై యొక తెరకావలయునా యని తాత్పర్యము. మెఱుఁగొప్పు మొదలయిన సాధారణ ధర్మములనుగూడ నిబంధించి నెఱిగొప్పు మొదలయినవానికిని జలదమాలికాదులకును సాదృశ్యము చెప్పి

నాఁడు. అనఁగా నెఱిగొప్పు మబ్బులగుంపువలెను, కను మెఱుఁగుచూపు కలువపూలచాలువలెను, లేనగవు పాలసముద్రపు అలలవలెను, మేను బంగారుతీఁగవలెను వెలుఁగుచున్నదని భావము. నాయిక తెరచాటు నకుఁ బోనేల యను నెపమునుగొనియె తన శృంగారరసమున కాప్యాయనముగా గిరికసౌందర్యమును వర్ణించినాఁడని తెలియునది. (అలం. ఉపమాధ్వనియు సమాధియు)

తే. అభినవాలోకనోత్కంఠ నధిపుఁ డలర, నలరుఁబోఁడి సమగ్రలజ్జానుభావ
భావయై తెరమాటునఁ బగటుచూపఁ, జూపఱకుఁ దోఁచెఁ బరిణయస్ఫూర్తి యనుడు.

అ. అధిపుఁడు=రాజు - (పెండ్లికొడుకని యర్థాంతరము) అభి..ఠన్ — అభినవ=క్రొత్తఁగా-మరల ననుట, ఆలోకన = చూచుటయందలి, ఉత్కంఠన్ = ఉత్సుకత చేత - తహతహచేతననుట. (క్రొత్తఁగాఁ జూచుటయందలి తహతహచేతనని యర్థాంతరము. పెండ్లికొడుకు తెరమాటుననున్న పెండ్లికూఁతును క్రొత్తఁగా జూడఁ దుకతుకపడుట ప్రకటము.) అలరన్ = ఒప్పుచుండఁగా, అలరుఁబోఁడి = ఈగిరిక, సమగ్రలజ్జ+అనుభావభావయై = నిండయిన సిగ్గుయొక్క పేరిమితోఁగూడిన మనస్సుగలదై-లేక నిండారిన సిగ్గనెడు అనుభావముతోఁగూడిన రతియనెడి స్థాయిభావముగలదై, తెరమాటునన్, పగటు చూపన్ = మురువుగులుకఁగా, చూపఱకున్ = చూచువారికి, పరిణయస్ఫూర్తి=పెండ్లితోఁపిక, తోఁచెన్ = కనఁబడెను. అనుడున్ = అని అలవోఁకగాఁ జెప్పఁగాననుట.

రాజు మరల నాయికను జూడఁగోరుటయు వరుఁడు క్రొత్తఁగాఁ జూడఁగోరుటయు, పెండ్లి తంతుచొప్పున పెండ్లికూఁతురు సిగ్గుతో తెరమాటున నుండుటయు,సిగ్గుచేత గిరిక తెరమాటున నుండుటయు సామ్యముచేసి పెండ్లి తోఁపికగానున్నదని చెలి చెప్పినదని చమత్కారము. అలం. స్మరణము.

చ. విని కల కాకుఘోష మొదవించుమదాళిని బక్షగౌరవం
బెనయ నదల్చి మంజుగతి నీవనజాతములో మదీయ ఖే
లనముల కెల్లఁ దోడయి మెలంగఁగ నాకలహంసి రాదొకో
జననివయస్య యంచు నగజాత మదిం దలపోయుచున్నెడన్. **71**

అ. ఇటకలహంసి యను చెలికత్తెకును కలహంసికిని (అనఁగా ఆఁడు రాయంచకును) అభేదాధ్యవసాయము చెప్పినాఁడు. నగజాత=గిరికాదేవి, విని=ఆమంజువాణి చెప్పినది ఆలించి, (చెలికత్తెపరముగా)- కలకాకు ఘోషము = అవ్యక్తమధురమయిన వికారస్వరముతోఁ గూడిన అంతు, ఒదవించుమదాళిన్ = కలిగించుచున్న నాచెలికత్తెను, పక్షగౌరవంబు ఎనయన్ = తోడుపాటు పెంపొప్పఁగా 'పక్షస్సహాయేపి' అమ. నాకు మిక్కిలియుఁ దోడుపడియనుట, (ఇందులకు కలహంసి కర్త్రి)అదల్చి, - (ఆఁడురాయంచపరముగా) మద+అళిని=మదముతోఁగూడిన తుమ్మెదను, పక్షగౌరవంబు = తన ఱెక్కలపెంపు, ఎనయన్=ఒప్పునట్లుగా, అదల్చి యర్థా. మంజుగతిన్ = మృదురీతిని (మృదువయిన నడకతోనని అర్థాం), ఈవనజాతములోన్ = ఈయడవుల గుంపులలో - (ఈ తామరలో నని అర్థాం.) మదీయ ఖేలనములకున్ ఎల్లన్=నా యాటలకన్నిటికిని, తోడయి = సహాయమై, మెలంగఁగన్ =సంచరించుటకు, జననివయస్య=తల్లియైన శుక్తిమతిచెలి - (జననవయస్య యనుపాఠమున నాకుఁ బుట్టుచెలియైన) ఆ కలహంసి=ఆ కలహంసియను స్త్రీ(ఆఁడురాయంచ యని యర్థాంతరము.)రాదొకో = రాదాయేమి, అంచు, మదిన్ తలపోయుచున్, ఉన్నెడన్ = ఉండఁగా - ఆఁడురాయంచ తామరయందు ఝంఝుమ్మని మూఁగుచున్న మత్తిల్లిన దేఁటిని ఱెక్కచేఁ దోలి యందు విహరించుటయుట అనుసంహితమయినది.

ఉ. ఆకలహంసి వచ్చి యచలాత్మజఁ గాంచి కుమారి తాపసా
నీకము నీకమూల్యశుభనిర్వహణంబు ఘటిల్లఁ గల్పకా
నోకహసూనరాజము లనూనమనూక్తులతోడ నొసంగినం
గైకొని తల్లి నిన్ బిలువఁగాఁ బనిచెన్ విరు లిచ్చు వేడుకన్. 72

అ. ఆకలహంసి వచ్చి, అచలాత్మజన్ = గిరికను, కాంచి, కుమారీ, తాపస + అనీకము = మునులసమూహము, నీకున్, అమూల్య శుభ నిర్వహణంబు = వెలలేని కల్యాణమును ఒడఁగూర్చుట, ఘటిల్లన్ = సమకూడునట్లుగా, కల్పక + అనోకహ సూనరాజములు = కల్పవృక్షముయొక్క మేలయిన పువ్వులు, అనూనమను ఉక్తులతోడన్ = కొఱఁతపడని (ఆశీస్సు) మంత్రపు మాటలతోడ, ఒసంగినన్ = ఇయ్యఁగా, కైకొని, తల్లి = నీతల్లి శుక్తిమతి, విరులు = ఆపువ్వులు, నీకు ఇచ్చు వేడుకన్, నిన్, పిలువఁగాఁ బనిచెను-దీనికి ముందరిపద్యముతో నన్వయము.

'అభినవాలోక' అనుపద్యమున 'పరిణయమహూర్తి' యను వివాహమును బుద్ధిపూర్వకముగా చెలి తోఁపించినది. ఇట మునులాశీర్వాదమంత్రములు చెప్పి కల్పవృక్షపుఁబువ్వులు నీకు శుభసిద్ధికై తల్లిచేత నిచ్చియున్నారు. రమ్ము,' అని వివాహసిద్ధిసూచకముగా శుభశకునమును దైవికముగాఁ బొందుపఱిచినాఁడు. మునులొక్కరుగాదు 'అనీక'ము. ఇచ్చినవి కేవలములయిన పువ్వులుగావు; కల్ప వృక్షపు సూన రాజములు. చెప్పినవి వట్టిమాటలుగావు; అనూనములయిన మంత్రములు. కాఁబట్టి యిన్నిటి కూడికవలన ఘటిల్లు శుభసిద్ధి 'అమూల్యమే' కావలయును. అలం. శ్లేష ము.

క. రా రమ్మనఁ గోమలి కుచ, భారమ్మున నడుము వడఁకఁ బదకటకఝుణ
త్కారమ్ము లెసఁగఁ గుసుమా, సారమ్ములు కబరిఁదొరఁగఁ జనఁ దివురుటయున్.

అ. రారమ్ము, అనన్ = అని పిలువఁగా, కోమలి = గిరిక, కుచభారమ్మునన్, నడుమువడఁకన్, పదకటకఝుణత్కారమ్ములు = కాలి యందెల ఝుణఝుణధ్వనులు, ఎసఁగన్ = మీఱఁగా, కుసుమ ఆసారమ్ములు = పువ్వుల సోనలు, కబరిన్ = కొప్పునుండి, తొరఁగన్ = రాలఁగా, కొప్పులోఁ దుఱిమినపువ్వులు దొరుఁగఁగాననుట, చనన్, తివురుటయున్ = ఉంకింపఁగా, ఇందు ద్విప్రాసము. 'హంసకః పాదకటకః' అమ.

చ. నెనరునఁ జేయివట్టి తరుణీ ధరణీసరణీ పురందరుం
డనుపక పోవు టెట్లు తగవా నగ వాఁడిఁ బెట్ట నంచు జ
వ్వనిఁ జెలు లెల్ల నిల్పి మహివల్లభ మా చెలి మీఁది ప్రేమ నీ
మనమునఁ బాయ కుండు మని మానినిఁ దోడ్కొని పోవు నంతటన్. 74

అ. చెలులెల్లన్ = చెలికత్తెలందఱును, నెనరునన్ = మక్కువతో, చేయివట్టి = చేతినిబట్టుకొని, తరుణీ, ధరణీ సరణీపురందరుండు = భూమిత్రోవను దేవేంద్రుఁడు - భూదేవేంద్రుఁ డయిన వసురాజు, భూమికి రాజనక దేవేంద్రుఁడనుటచే నతని యాధిపత్యపుఁబెంపు నత్యంతపూజ్యత్వము యొక్క సొంపును ధ్వనితములు. ఎంతో గొప్పయేలిక, ఎంతో పూజ్యుఁడు. దీనిచేత తత్స్వామిత్వమును తదారాధ్యత్వమును మీఁదు మిక్కిలి స్ఫురించెడిని. ఇట్టివాఁడు, అనుపక = సెలవు నిచ్చిపంపకుండఁగా, పోవుట ఎట్లు = ఎట్లుపోవచ్చును, నగవు ఆఁడిన్ పెట్టన్ తగవా = నవ్వులాటయు, నిందయుఁ బెట్టుటన్యాయమా, అంచున్, జవ్వనిన్ = గిరికాదేవిని, నిల్పి = పోనీయక ఆఁగి, మహివల్లభ = రాజా,

మాచెలిమీఁది ప్రేమ నీమనమునన్ పాయక ఉంతుము, అని, పల్కి, మానినిన్, తోడ్కొనిపోవు నంతటన్=తోడుకొని పోవుచుండఁగా, నెనరనఁగా ప్రేమయనుటకు.

'పేర్మియర్మిలి మక్కువ • కూర్మి నెమ్మి, నెనరు గాదిలి గారాము • నెయ్యమింపు
ప్రేముడి యనుంగు ముద్దనఁ • బ్రియమునకును, నామధేయంబులు' ఆంధ్రనామశేషము.

దీనికి ముందరి పద్యముతో నన్వయము.

మ. శతపత్రేక్షణ వెంటనంటిన • వసుక్ష్మాపాలకాలోకముం
బ్రతిరోధింపఁగఁ జాలదయ్యె భవనప్రాంతోరు కాంతారవే
ల్లితవల్లీవలయంబు తచ్చికురపాళీ • నీరదాళీ మిళ
న్నృతికేళీరసకేకిలోకగరుదున్మీలన్మరుల్లోల మై. 75

అ. శతపత్రేక్షణన్=తామరరేకులవంటి కన్నులుగల గిరికాదేవిని, వెంటనంటిన వసుక్ష్మాపాలక ఆలోకమున్=వెనుదగిలిన వసురాజుచూపును, భవన ... వలయంబు—భవన=గిరికమణిమందిరముయొక్క, ప్రాంత=దాపటి, కాంతార=తోఁపునందు, వేల్లిత = వంకరలయిన - వక్రములుగా పెనఁచుకొన్న, 'వేల్లితం వక్రమిత్యపి' (పెనఁచుకొనుటకు 'వేల్లదేలాలతావలయంబగుమలయంబునన్' మనుచరిత్రము) వల్లీవలయంబు = తీఁగలగుంపు-వలయశబ్దముచే చుట్టలుచుట్టలుగాఁ గాని చుట్టువలయాకారముగాఁగాని పెనఁచుకొనియున్న తీవజొంపములనుట, తత్ ... లోలమై—తత్ = ఆగిరికయొక్క, చికురపాళీ=తల వెండ్రుకల గుంపనెడు, నీరద+ఆళీ=మబ్బులబంతితోడ, మిళత్=కూడుకొనుచున్న, నృతికేళీరత=నర్తన క్రీడయందలి రతిగల-ఆతలవెండ్రుకలగుంపును జూడఁగానే మబ్బులని యుల్లాసముతో పురివిచ్చి యాడుచున్నయనుట, కేకిలోక=నెమిలికదుపుయొక్క, గరుత్ = ఱెక్కలనుండి, ఉన్మీలత్=నిగుడుచున్న, మరుత్=గాలిచేత, లోలమై=కదలుచున్నదై, ప్రతిరోధింపఁగన్=అడ్డగింపఁగా, చాలదయ్యెను.

గిరికమణిమందిరముదాపునఁ బెద్దతోఁపుగలదు. అందు 'వేల్లితవల్లీ వలయంబు' చుట్టును తీఁగలుచుట్టలుచుట్టలుగా జొంపముగొనియున్నవి. అట్టిది, రాజు దృష్టినడ్డపడక సాగనిచ్చునా? కానరాజు చూపునకుమిక్కిలియునడ్డముగలుగవలయును. అయినను గిరికనల్లనైన కురులు మబ్బులనిభ్రమించి నెమిళ్లగుంపులు పురులువిచ్చియాడఁగా నాఱెక్కలగాడ్పులచే నవి యిటునటునల్లలాడుచు సందిచ్చుచుండెనుగాన యాతెఱపి మూలమున రాజు చూపడ్డుపడక గిరిక వెంటసాగుచు నేయుండెననుటఅలంసమాధి. భ్రాంతిమంతమువ్యంగ్యము.

కాంతారము 'ఉరు'వైనది, అందలి తీఁగలో అక్కడనిక్కడఁగాక ('వేల్లిత' 'వలయము') చుట్టలుగాఁ బెనఁచుకొని జొంపముగొనియున్నవి. కావుననే చూపెంతమాత్రమును సాగనీయదు. తీఁగలచాలు పొడుగునకు సందులిచ్చుచుండుటకు ఒకటిరెండు నెమిళ్ల ఱెక్కలగాడ్పుచాలదు. కాన (లోకము)-తీఁగచాలుపొడుగునను నెమిళ్లు పెక్కులుండుటచే నందందు వానిగాడ్పులచే చెదరిసందులు గలుగుటయుఁ దన్మూలమున చూపు పయిపయి సాగుటయు. పురివిచ్చియాడుటయు'కేళీరసము' చేత-అనఁగా మిక్కిలి యుబ్బుగలిగి నిబ్బరముగాఁ బురివిచ్చియాడుట; దానిచే తీఁగలుపాయ దీయునంత గాడ్పులుపుట్టుటయు. చికురపాళీ నీరదాలిని దూరముననుఁజూచికాదు, 'మిలత్' తారసించినచోటులందెల్లఁ జూచినంతనే పురివిచ్చియాడుటచేతనే నాచోటులందెల్లఁ దీఁగలు పాయవిడుచుచుండుటంబట్టి చూపు వెంబడింపఁ జాలినది. చికురాది నీలవస్తువులనుజూచి మేఘభ్రాంతిని నెమిళ్లుపొందుట

'యాం దృష్ట్వా యమునాం పిపాసురనిశం వ్యూహో గవాం గాహతే
విద్యుత్వానితి నీలకణ్ఠనివహో యాం ద్రష్టు ముత్కణ్ఠతే!

ఉత్తంసాయితమాలపల్లవ మితి చ్ఛిన్నాని యాం గోపికాః
కాన్తిః కాలియశాసనస్య వపుషః సా పావనీ పాతు నః॥'(కృష్ణకర్ణామృతము-౨-౨.)

చ. వనతరువల్లికాకుసుమవాసన లొల్లక శైలకన్యకా
ఘనఘనవేణికాభరము కమ్మనితావికిఁ జిక్కి మ్రోయుచున్
వెనుచనియెన్ ద్విరేఫములు వేమఱు భావివియోగచింతచే
వనరుచు వెంటఁ బోవ్రుమహీవల్లభుచూపులప్రోవులో యనన్. 76

అ. ద్విరేఫములు=తుమ్మెదలు, వన...నలు—అడవియందలి చెట్లయొక్కయు తీఁగలయొక్కయు పువ్వులందలి తావులను, ఒల్లక=ఇచ్చగింపక, శైల...తావికిన్—శైలకన్యకా=గిరికయొక్క, ఘన=మేఘమువంటిదియు, ఘన=గొప్పదియునగు, వేణికాభరము = దట్టంపుజడయొక్క, కమ్మనితావికిన్, చిక్కి=వశమై, మ్రోయుచున్=ఝుంకారముసేయుచు, వెనుచనియెన్=వెంటనంటిపోయెను-ఎట్లనిన, వేమఱున్ = మాటికి, భావివియోగచింతచేన్=మీఁదఁగలుగఁబోవు ఎడఁబాటువలని విచారముచేత, వనరుచున్=విలపించుచు, వెంటఁబోవు=గిరికను వెంబడించిపోవుచున్న, మహీవల్లభు చూపుల ప్రోవులోయనన్=రాజుయొక్క చూపుల రాసులోయనునట్లు, వెనుచనియెనని సంబంధము.

వనతరువల్లికా కుసుమముల 'వాసనలు'వట్టివి. గిరిక వేణికాభరము తావియో'కమ్మని'ది. కావుననే తుమ్మెదలు వెనుదగులుట. మ్రోయుచున్ వెనుచనుతుమ్మెదలు, వనరుచు వెంటఁబోవురాజు చూపుల వలె నున్నవి. తుమ్మెదల మ్రోయుటను చూపుల వనరుటగాఁ బోలిక. తుమ్మెదలు 'వేమఱు' వెనుచనుటచే వెంటఁబోవురాజు చూపులు 'ప్రోవు' లుగ నుండెను. ఇట భావివియోగమనఁగా కలయకమునుపటి వియోగముగాన యభిలాష మనెడు విప్రలంభ శృంగారము. అలం. ఉత్ప్రేక్ష.

చ. కలయకమున్న రాగమధి • కంబగునే నభిలాష మిద్దఱుం
గలసినమీఁదఁ బాయుట తఱిన్ విరహంబు నిజేర్షఁ డొందు తో
య్యలిఁ గవయంగ నవ్వనిత • యల్గుట యీర్ష్య విదేశవాసులై
నిలుచుట బ్రవాసము గణింపఁగ నిన్నియు విప్రలంభముల్. (నరసభూపాలీయము)

తే. ఆళిహస్తావలంబనం బడర నడచు, కన్యఁ దదధీనవృత్తియై కాంచునట్టి
వసుపతి నిరంతరాలోక వైభవంబు, సాగనీదయ్యెఁ గన్నీటిజడి గడంగి.. 77

అ. ఇట రాజుదృష్టిపరముగాను సూర్యతేజఃపరముగాను నర్థద్వయము-ఆళిహస్తావలంబనంబు=చెలికత్తియచేదండ, అడరన్=ఒప్పఁగా, నడచుకన్యన్ = నడచిపోవుచున్న గిరికాదేవి ననియర్థము. ('ఉత్తరాయాంత్రయః పాదాః హస్తచిత్తార్ధం కన్యా'అని యున్నది గనుక హస్తనక్షత్రము యొక్క అవలంబనముతో వర్తించు కన్యారాశినని యర్థాంతరము) తదధీనవృత్తియై = ఆగిరికకు లోనయిన (మనో) వ్యాపారముగలవాఁడై, కాంచునట్టి వసుపతి నిరంతర ఆలోకవైభవంబున్ = చూచుచున్న వసురాజు ఎడతెగనిచూపుల పెంపుసొంపు ననియర్థము. (కన్యారాశిలోనయిన వ్యాపారముగలవాఁడై ప్రాపించుచున్న సూర్యునియొక్క యెడతెగని కాంతిసంపదనని యర్థాంతరము) కన్నీటిజడి=ముసరు వలె తొరుగుకన్నీరు, కడఁగి = అతిశయించి, సాఁగనీదయ్యె = నిగుడనీయకపోయెను-ముసరువాన నిగుడనీయ దయ్యెనని యర్థాంతరము. చెలికైదండగొని గిరిక పోవుచుండఁగా వసురా జాబిడయందుఁ దగులుగొని యెడతెగక చూపులుగుడ్పఁగా నింతలో కన్నీరు జడివలె గ్రమ్మి దాని

నడ్డగించెనని యర్థము. సూర్యుఁడు కన్యారాశియందు హస్తనక్షత్రమును బొందఁగా ముసరుపట్టి వాన గురియఁగా నెండఁగాయ దయ్యెనని యర్థాంతరము. అలం శ్లేషము.

వసుపతి 'ఆలోకను' ఱెప్పపాటు తెఱపినికూడ తాళదుగాన 'నిరంతరంబు'. 'వైభవ' మేమి? పయింబయి పెల్లుబ్బిల్లుసొంపు. ఈనిరంతరత్వ వైభవములకు హేతు వేమి? 'తదధీనవృత్తి'. 'ఎట్టి' యాలోకమేని 'కన్నీరు' మాత్రమే నిలుపును. 'ఆలోకను యొక్క వైభవము'నకు కన్నీటియొక్క 'జడి' యే నిలుపఁగావలయును. ఆలోకను అప్పుడప్పుడుగాక 'ఎడతెగనిద' గుటచే దానినాపుటకు 'కన్నీరు'ను పట్టివానగాక ముసరుపట్టిన జడి కావలయును. ఇటరాజునకు అశ్రుసముద్గమముచే సాత్త్వికభావోదయము తెలియునది.

'సంతోషరోష దుఃఖా, క్రాంతస్వాంతులకుఁ బొడముఁ గన్నులనీళ్లం
జింతింప నశ్రులని ప, ర్గింతురు భావవిదులగు మనీషులు కృతులన్.' అని తల్లక్షణము.

చ. కలికియు నానృపాలకునిఁ గ్రమ్మఱఁ జూచుచు నేఁగె నేర్పుతో
నలఘుపదాంగద ధ్వనికి నంచలు మూఁగిన నిల్చి నెయ్యపుం
జెలువలఁగూడఁ బిల్చుగతిఁ జిల్కకుఁ బార్శ్వలతాంచలంబులన్
ఫలము దెమల్చురీతి నళిపంక్తికి మోము మలంచుకైవడిన్. 78

అ. కలికియు=గిరికయు, అలఘుపద అంగదధ్వనికిన్ = గొప్పదయిన కాలియందెల మ్రోతకు, అంచలు, మూఁగినన్=(తమజాతిహంసల రవళియని భ్రమసి) ముసరుకొనఁగా, నిల్చి, నెయ్యపుఁ జెలువలను=ప్రియసఖులను, కూడన్ పిల్చుగతిన్=కలసిరమ్మని పిలుచుతీరుగాను, చిల్కకున్, (చేతవ్రాలిన పెంపుడు) చిలుకకు, పార్శ్వలతా+అంచలంబులన్=ప్రక్కలనున్న కొమ్మలయందు, ఫలమున్=పండును తెమల్చురీతిన్=కోయునట్లుగాను, అళిపంక్తికిన్=(తామరవాసనచే తమ్మియని భ్రమసి పయిన్రవాలునట్టి తుమ్మెదలచాలునకు, మోము, మలంచుకైవడిన్=త్రిప్పినట్లుగాను, అనఁగా నిట్టి నెపములనుబన్నియనుట ఆనృపాలకునిన్=ఆరాజును, నేర్పుతోన్=తిరిగిచూచుటకై యిట్టి నెపములను బన్ను నేరుపుతో, క్రమ్మఱన్=తిరిగి, చూచుచున్ పోయెను.

కాలయందెలధ్వని 'అలఘు' వగుటచే ఒక యంచగాక ! 'అంచలు' మూఁగుటయు దానికె నిలుచుటయు. అంచలు పోనీక యాఁగుటచే చెలులనుగూడ రమ్మనిపిలుచుటకై తిరుగుట; చిలుకను ఎదుట నున్న. కొమ్మలందుఁగాక ప్రక్కవాటుకొమ్మలందుఁ బండుగోయుటకై తిరుగుట; తుమ్మెదలుకొన్నిగాక పంక్తులుగా ముసరుటచే మోముత్రిప్పుకొనుటకై తిరుగుట; ఇవియు నేర్పుతోఁ గ్రమ్మఱఁజూచుటలు.

ఉ. ఆనగరాజభేదియును నానఁగ రానిమనోరథంబుతో
మానిని నాత్మనిల్పి ధృతి మాని నిరంతరబాష్పవారిఁ గ
న్గోనల నాని మానికపుఁగోనలలో నెలమావికానలో
నాననవిల్తుఁ డేఁప నలినాననన యేఁగినజాడ నేఁగుచున్. 79

అ. ఆనగరాజభేదియును = కొండలమిన్నయైన కోలాహలుని భేదించిన యారాజును, ఆనఁగ రానిమనోరథంబుతోన్=తాళఁగూడని యభిలాషతోడ, మానినిన్, ఆత్మన్=మనస్సునందు, నిల్పి=నెలకొలిపి, ధృతిమాని=ధైర్యము దిగవిడిచి, నిరంతరబాష్పవారిన్=ఎడతెగని కన్నీటిని, కన్గోనలన్=కంటికొలఁకులందు, ఆని=ఆఁగఁబట్టి, మానికపుఁగోనలలోన్= మణిమయములయిన చట్టియలలోను, ఎ

మావికానలోన్ = లేఁతమామిడివనములోను, ఆ, ననవిల్తుఁడు = మన్మథుఁడు, ఏఁపన్ = కారింపఁగా, నలినా
ననా = తామరవంటి నెమ్మొగముగల గరిక, ఏఁగినజాడన్ ఏఁగుచున్ = పోయినత్రోవ వెంటనే పోవుచునని
ముందరిపద్యముతో నన్వయము. రాజు ధృతి కుపమానమగు నగరాజును భేదించినవాఁడే. అట్టిదిట్టమన
స్సును భేదించి ధృతి మానిపిననాయిక యక్కజంపుఁ జక్కందనమేమనిచెప్ప. కొండలందలి కోనలు
మొదలగునవి శృంగార విహారస్థానములుగాన మన్మథోద్దీపకములు.

'నెత్తమ్ము లేకొండనెత్తమ్ములం దాడువిద్యాధరీకోటి విటులతోడ' (మనుచరిత్ర)
'చఱులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి' (భాగవత. ౮స్కం.)

అందును మానికపుఁగోనలు. కానయో యెలమావిది. ఎలమావియు మారోద్దీపకము.

'మాకందాంకురచ్ఛాయకుం దోలఁగుం గొమ్మ మనోభవానలశిఖాదోదూయమానాంగియై' (భాగ-దశ)
'ఒకయెలమావినీడ మఱుఁ డోయనఁగా నఱుఁ డుండె నయ్యెడన్' (విజయవిలాస)

అట్టికోనలును ఇట్టికానయు మఱుఁ డేఁపనీకుండ నిచ్చునా. గిరికపోయినజాడఁ బోవుటకు అది
'నలినానన'-తామరవలె కోమలముచూప దానిముద్దుమొగము లాగుచున్నది. ధృతిమానుటకు చిహ్నము
'బాష్పవారి' గ్రమ్ముట. అయిన నది సమూలముగా భిన్నముగానందున కన్గోనలందు దాఁగుట కలిగినది.
'మానిని నాత్మ నిల్పి' అనుటచే రాజునకు ద్వితీయావస్థయగు మనస్సంగ మారంభించుట తెలియునది.

సీ. కాఁబోలు నివి బాలకమ। నీయపదలీల, లిచటఁ బల్లవజాల । మినుమడించెఁ
గాఁబోలు నివి బోటి । కనుఁగొన్నవనవాటి, నిచట భృంగీకోటి । రుచులు నెఱసెఁ
గాఁబోలు నీవంకఁ । గలికి పల్కినపొంక, మిచటఁ దేనియ వంక । లింక కొదవెఁ
గాఁబోలు నీచాయఁ । గాంత నవ్వినచాయ, లిచట సూననికాయ । మింపు మెఱసెఁ
తే. జూచితె వయస్య యనుచు న । శోకతిలక, కర్ణికార నమేరు సం । ఘాతలతల
నలరునారామ సరణిలో । నరసి యరసి, సరసిజాననఁ గానక । సంభ్రమించి. 80

అ. ఇవి = ఈకనఁబడునట్టివి, బాలకమనీయ పదలీలలు = గిరికయొక్క సొగసయిన యడు
గులవిలాసములు, [కాఁ]బోలును, ఏలనఁగా నిచ్చట, పల్లవజాలము = చిగురుటాకులగుంపు, ఇనుమడిం
చెన్ = రెట్టించెను, గిరిక యడుగులు చిగురుటాకులవంటివి గనుక అవిగూడఁ గలియఁగాఁ జిగుళ్లిను
మడించినవనుట, (దీనిగీతియందు 'అశోకతిలక కర్ణికారనమేరు సంఘాతలతల, నలరునారామసర
ణిలో'ననుటచేఁ గ్రమముగా నీచరణమందు పాదవిన్యాసరూప దోహదముచేత నశోకము చిగిరించుట
వలనఁజిగుళ్లిను మడించెనని భావము.)ఇది, కనుఁగొన్నవనవాఁటి=చూచినతోఁపులచాలు, కాఁబోలున్,
ఏలనఁగా, నిచట భృంగీకోటి=ఆఁడుతుమ్మెదల గుంపులయొక్క, రుచులు=కాంతులు, నెరసెన్ =నిండెను.
గిరిక చూపులు తుమ్మెదలవంటివి గనుక వాని రుచులుగూడి యిచట నాఁడుతుమ్మెదలరుచులు మఱింత నిండా
రెననుట(ఈచరణమందు తిలకవృక్షములు వీక్షణరూపదోహదముచేత చిగుర్పఁగా నందులకుఁ దుమ్మెదలు
గుంపులుగొని మూఁగిన వనిభావము,)ఈవంకన్ = ఈప్రక్కను, కలికిపల్కినపొంకము=గిరిక మాటలాడిన
పొందు, కాఁబోలును, ఏలనఁగా, ఇచటన్, తేనియవంకలు=పూఁదేనెకాలువలు, ఇంకక, ఒదవెన్=ఇగిరి
పోకయొప్పుచున్నవి.గిరిక పలుకులును దేనియలవంటివిగనుక వానినిగూడి పూఁదేనెకాలువలు తేనె నిండు
గాఁబడసిన వనుట(ఇందు కొండగోఁగుచెట్లు సల్లాపరూప దోహదముచేతఁ బూచి పూఁదేనెలు మిక్కి
లియు వెల్లిగొన్నవని భావము.) ఈ చాయన్ = ఈవైపున, కాంత, నవ్విన చాయలు=నవ్వినజాడలు,
కాఁబోలున్, ఏలనఁగా, ఇచటన్, సూననికాయము = పువ్వులగుంపు, ఇంపుమెఱసెన్ = సొంపుగా

నుల్లసిల్లినది. అనఁగా గిరిక నవ్వులును పువ్వులవంటివి గావున వానివలన నిక్కడి పూఁదోఁటయు లింపుగు లుకుచున్న వనుట, (ఇందు పొన్నచెట్లు హాసనరూపదోహదముచేత పుష్పించిన వని భావము.) సామాన్యముగాఁ బువ్వులు తెల్లనివిగా గ్రహించుట కవిసమయము.)

'సామాన్యగ్రహణే వారిముచాం కృష్ణత్వమేవహి।
రక్తత్వమేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్యమేవ చ' (కావ్యకల్పలత.)

వయస్య = చెలికాఁడా, చూచితె = చూచితివా, అనుచున్, అశోక తిలక కర్ణికార నమేరు సంఘాతలతలన్ = అశోకము బొట్టుగు కొండగోఁగు సురపొన్న యనువాని సమూహములయొక్క కొమ్మలచేత, అలరు = ఒప్పుచున్న, ఆరామసరణిలోన్ = తోఁటదారియందు, అరసి అరసి = వెదకి వెదకి, సరసిజాననన్ = గిరికను, కానక, సంభ్రమించి = తొందరపడి - ముందరి పద్యముతో నన్వయము. ఇందు పెద్దపాదముల త్రిప్రాసమును అంత్యప్రాసమును జెప్పంబడినవి. అలం. అనుమానము.

చ. కళికలు లేఁజిగుళ్లు నవకంపుటనంటులు కప్పురంపుఁది
ప్పలు ననగుత్తులున్ లతలుఁ బద్మములున్ సమదాళిజాలముల్
వెలయ మనోజరాజభుజవీర్య మవార్య మొనర్చు కానలోఁ
గలయఁ జరించు భూపతికిఁ గన్నియ రూపమె తోఁచు నెల్లెడన్. 81

అ. కళికలు = పూమొగ్గలును, లేఁజిగుళ్లు = లేఁతచిగురుటాకులును, నవకంపుటనంటులు = లేఁతలయిన యరఁటులును, కప్పురంపు తిప్పలు = కర్పూరపుఁ దిన్నెలును, ననగుత్తులున్ = పూగుత్తులును, లతలు = తీఁగలును, పద్మములున్ = తామరలును, సమద + అళిజాలముల్ = మత్తిల్లిన తుమ్మెద గుంపులును, వెలయన్ = ఒప్పుచుండఁగా, మనోజరాజభుజవీర్యము = మన్మథుఁడనెడి రాజుయొక్క బాహుపరాక్రమమును, అవార్యము = నివారింపరానిదిగా, ఒనర్చు కానలోన్ = చేయుచున్న వనమందు, కలయన్ = అంతటను, చరించుభూపతికిన్ = తిరుగుచున్న రాజునకు, ఎల్లెడన్ = ఏస్థలమందును, కన్నియరూపమె, తోఁచును.

ఇందు వనమునఁగల పూమొగ్గలుచిగుళ్లు మొదలయిన యుపమానములచేత గిరికాదేవి, గోళ్లు అడుగులు మొదలయిన యుపమేయములు స్ఫురించుచున్నవి. కనుకనే 'ఎల్లెడఁ గన్నియరూపమె తోఁచుట'. ఇవన్నియు దానువలచిన కన్నియ యాయా యవయవములను దోఁపించుటచే మనోజరాజభుజవీర్యమొనర్చుచున్నవి. అవి కన్నియరూపును దలఁపించుటగాదు; కన్నులయెదుటఁ దోఁపించునంత మిక్కుటమయిన యుద్దీపనము గలిగించుటచే మన్మథుని భుజవీర్యమవార్యమయ్యె. భుజవీర్యముగలవాఁడు రాజుగానుండిన అంతకుమన్న, కాన మన్మథుఁడు 'మనోజరాజు' అనఁబడెను.

సీ. కనుఁగొంటి లతకూనఁ గనిడాయఁ గాకున్న, నభినవతరలతాప్రవాప్తి దెలుపుఁ
గంటిఁ బద్మిని ననిఁ గమకించుఁ గాకున్నఁ, బరితాపగరిమఁ దామరలఁ జూచుఁ
జూచితిఁ గొమ్మ నంచు నటించుఁ గాకున్న, నలయు శాఖోపశాఖానురక్తిఁ
దమిఁ జూడఁ గంటి నూతనరంభ ననియేఁగుఁ, గాకున్నఁ గదలి చెంగట భ్రమించు
తే. నయ్యెడ ననంగశరశరవ్యాంతరంగ, కలితభావతరంగముల్ గప్పికొనఁగ
విభుఁడు చెలిప్రోలనాత్మీయవిభ్రమములు, దేటపడకుండ నేర్పునమాటుపఱుచు.

అ. విభుఁడు = రాజు, లతకూనన్ = కన్నెపడుచును, (లేఁతతీఁగను) కనుఁగొంటిని, అని, డాయన్ = దగ్గఱకుఁబోవును. కాకున్నన్ = కన్నెగానియెడ, ;(సఖునికిఁ దన విభ్రాంతి తెలియకుం

డుటకై) అభినవతర లతా అవాప్తిన్ = మిక్కిలి క్రొత్తదయిన యొక తీఁగను బొందుటను, తెలుపు నని యర్థము - గిరికను లతకూన కనఁబడిన దనిచెప్పి యదికనఁబడక పోఁగా తనభ్రమ గప్పిపుచ్చుటకై లతకూనయనుటకు లేఁతతీఁగయనియు నర్థముగాన లేఁత తీఁగనుజూచితినని తాను చెప్పినట్లు సఖుఁడు గ్రహించుటకై యొక లేఁత తీఁగను బట్టుననియర్థము — క్రొత్తదైన చాంచల్యముయొక్క (దిటలేమి యొక్క) ప్రాప్తిని దెలియఁజేయునని యర్థాంతరము. తరలత అనఁగా చంచలత.

పద్మినిన్ = పద్మినీజాతి స్త్రీయైన గిరికను (తామరతీఁగెననియు) కంటె నని, గమకించున్ = ఉత్సహించును, కాకున్నన్ = అట్లు గిరిక కాకపోఁగా, పరితాపగరిమన్ = తుందుడుకుయొక్క పెల్లిదముతో, తామరలన్ = తామరతీఁగలను చూచును - అనఁగా తామరతీఁగల వైపుచూచిన వానివలెఁ గనఁబడునని యర్థము - పరితాపాతిశయముచేత, తాన్ = తాను, మరలఁజూచును = తిరుగఁజూచునని యర్థాంతరము.

కొమ్మను = చెలువను - గిరికను (చెట్టుకొమ్మననియును), చూచితిని అంచున్, నటించున్ = ఆడును. కాకున్నన్ = గిరిక కాఁగపోఁగా, శాఖ = కొమ్మలయొక్కయు, ఉపశాఖ = కొమ్మలందలి కొమ్మల యొక్కయు, అనురక్తిన్ = అనురాగముచేత, అలయున్ = అలఁత నొందును. అనఁగా కొమ్మలను బట్టి విడుచుటయందలి రక్తిచే అలసినవానివలెఁ గనుపట్టునని యర్థము. శాఖోపశాఖముగా (ఒకటిపయి నొకటిగా) నున్న యనురాగముచేత - అనఁగా పలువగలుగా పుట్టుచున్నయనురక్తిచేత, అలయునని యర్థాంతరము.

నూతనరంభన్ = క్రొత్తరంభను - రంభవంటి గిరికను - (క్రొత్తయరఁటిచెట్టుననియును) కంటెని, అనుచున్ తమిన్ = ఆసక్తితో, ఏఁగును = పోవును, కాకున్నన్ = గిరిక కానిచో, కదలిచెంగటన్ = అరఁటిచెట్టుదాపున, భ్రమించున్ = తిరుగును - వేఁడుకకై యరఁటిచెట్టు దాపున గ్రుమ్మరుచున్నవానివలెఁ జూపట్టునని యర్థము. కదలి = చలించి, చెంగటన్ = దాపున, భ్రమించునని యర్థాంతరము.

అయ్యెడన్ = గిరిక కనుపట్టకున్న యాసమయమందు, అనంగ...రంగముల్ — అనంగశర = మదనుని బాణములకు, శరవ్య = గుఱియైన, అంతరంగ = మనస్సునందు — అనఁగా మనస్సునందలి రతియనెడు స్థాయిభావమునందు, కలిత = కూడుకొన్న, భావతరంగములు = సంచారిభావ పరంపరలు — (లేక భావతరంగములు = సంచారిభావములు లనెడి యలలని రూపకముగా గ్రహించినచో నిందుల కనుగుణముగా, అంతరంగమనెడి సముద్రమని మఱియొక రూపకము జేసికొనవచ్చును. ఎట్లనఁగా:—

> ‘మజ్జన్తశ్చ నిమజ్జన్తః కల్లోలాశ్చ యథార్ణవే।
> తస్యోత్కర్షం వితన్వన్తి యాన్తి తద్రూపతామపి।
> తథా స్థాయిని నిర్మగ్నా ఉన్మగ్నా వ్యభిచారిణః।
> పుష్యన్తి స్థాయినం స్థాస్ను త్రియాన్తి రసాత్మతామ్’

అని స్థాయిభావమునకు సముద్రసామ్యమును సంచారిభావమునకుఁ దరంగసామ్యమును జెప్పఁబడినది గనుక నీపద్యమందు మూఁడు సంచారిభావములు చెప్పినాఁడు, అవి యెవ్వియనిన — గిరికాదేవిని జూచితినని డాయఁబోవుట ఉన్మాదము — ‘ఉన్మాదస్తుల్యవర్తిత్వం చేతనాచేతనేష్వపి’. భ్రాంతిని మఱుఁగుపుచ్చుట అవహిత్థయను సంచారి —‘ హర్షాద్యాకారసంగుప్తి రవహిత్థేతి కథ్యతే’. తరలత్వము మొదలయిన నాలుగును చాపలమనెడు సంచారి. — ‘చాపలం త్వనవస్థానం రాగద్వేషాది సంభవమ్’)- ఇట్టిసంచారిభావములు. కప్పికొనఁగన్ = క్రమ్ముకోఁగా, చెలిమ్రోలన్ = ప్రియసఖుని

యెదుట, ఆత్మీయవిభ్రమము = తనయొక్క విభ్రాంతి వికారములు, తేటపడకుండక్ = తెలియనట్లుగా, నేర్పునన్, మాటుపఱుచన్ = మఱుఁగుచేయును.

ఇందు గిరిక, లేఁతతీఁగవలెను, తామరతీఁగవలెను, పూరెమ్మవలెను, లేఁతయరఁటి బోదియవలెను, లేఁతదనమును, మెత్తఁదనమును, పచ్చఁదనము, నను గుణములంబట్టి వెలయుటచే నయ్యావి గిరికమేనుగా రాజు భ్రమయుటఁ దెలియునది. మఱి 'లత కూన' మొదలగు నర్థద్వయముగలపదములను సంతరించి యొక్కొక్కయర్థము గిరికాపరముగా వావణించి మఱియొక యర్థముచేఁ దనభ్రాంతి గోపనము ను జేయుటయే కాక యీరెండర్థములకును బొసఁగునట్లుగా 'అభినవతరలతావాప్తి' ఇత్యాదులనుపాదముల రెండవసగములందు తాను బొందుపఱిచి కవి యపూర్వశబ్దసంధానవైచిత్రియు నర్థఘటనాచమత్కృతియు నిరుపమానముగా వెలయించుట తెలియునది. అలం. శ్లేషానుప్రాణితమైన యుక్తి.

శా. ఆరామామణి మీఁది ప్రేమమున నిక్కట్లారామ సీమాసరో
వారంబుల్ దిలకించి యందు నతి దుర్వారంబులై మీఱు భృం
గారావంబులచే ననంగరుజ పొంగారం గురంగాక్షి శృం
గారాగారముఁ జేరి తాల్మి నిలుపంగా రాక గారామునన్. 83

అ. ఆరామామణిమీఁది ప్రేమమునన్ = ఆయన్నులమిన్నమీఁద యనురాగముచేత, ఇట్లు, ఆరామసీమాసరోవారంబుల్ = తోఁటయందలి చోట్లయు, కొలంకులయు, సమూహములను-తోఁటయందుఁ బెక్కుచోట్లను పెక్కుకొలంకులను, తిలకించి = విమర్శించిచూచి, అందున్ = ఆచోట్లయందు, అతిదుర్వారంబులై = మిక్కిలియు భరింపరానివై, మీఱు = అతిశయించుచున్న, భృంగఆరావంబులచే = తుమ్మెదల ఝుంకారధ్వనులచేత, అనంగరుజ=మన్మథవ్యాధి - (అనఁగా మరులు) పొంగారన్ = ఉబుకుచుండఁగా- మిక్కుట మగుచుండఁగా, కురంగాక్షి శృంగార+అగారమున్ = లేడికన్నులవంటి కన్నులుగల గిరికసింగారపు ఇంటిని, చేరి=మరలఁజేరి, తాల్మి=దిట, నిలుపఁగాన్ రాక, గారామునన్ = ప్రేమచేత, ముందరిపద్యముతో నన్వయము. (ఇందు అనంగరుజ యనఁగా వ్యాధియనెడు సంచారిభావము.

'మనస్తాపాద్యభిభవోజ్వరాదిర్వ్యాధిరిష్యతే.'

ప్రేమమునకు హేతువు 'రామామణి'. తోఁటలు కొలంకులను'దిరుగఁగాఁ దుమ్మెదల రొదలచే మరులు పయిపయింబొదలె. కాన గిరికయుండిన మణిమందిరమునకే మరలి రాక. విరహులకుఁ బ్రియురాలు మెలఁగినపట్లు ననుభవించిన వస్తువులు నతిభోగ్యములును, ఒకింత ఆప్యాయనములును. శాకుంతలమున శకుంతల యుండిపోయిన పట్టునందు దుష్యంతుఁడు.

'తస్యాః పుష్పమయీ శరీరలులితా శయ్యా శిలాయామియా ।
క్లాన్తో మన్మథలేఖ ఏష నలినీపత్రే నఖై రర్పితః ।
హస్తాద్భ్రష్టమిదం బిసాభరణమ్' (శాకుంతలము)

మంబరంబుసాచి, యీనగరుచేసినదిగదా యదృష్టమనుచు (విజయవిలాసము)

మ. అవనీనాథుఁడు పల్కుఁ జూచితె వయస్యా యీమణీధామ మా
ధవళాక్షీమణి యేఁగ శూన్యగతిమై తద్రూపచిత్రాహితో
త్సవ మేతన్మృదుగానగుంభితరసార్ద్రంబై తదీయాంగ రా
గవరామోదము పూని మామకమనఃకంజాతముం బోలెషిన్. 84

అ. ఇందు మణిధామపరముగాను, వసురాజమనఃపరముగాను అర్థద్వయ మెఱుంగునది—అవనీనాథుఁడు=రాజు, పల్కున్ = ఇట్లని చెప్పుచున్నాఁడు. వయస్యా=చెలికాఁడా, ఈమణీధామము = ఈరత్నమయమయిన మందిరము, ఆధవళాక్షీమణి = ఆతెలికన్నుల గిరిక, ఏఁగన్ = పోఁగానే, శూన్యగతియై = పాడుపడిన రీతిగలదై, తద్రూప...త్సవమై—తత్ = ఆగిరికయొక్క, రూప=ఆకృతిగా వ్రాయఁబడిన, చిత్ర = చిత్తరువుచేత, ఆహిత = పొందింపఁబడిన, ఉత్సవమై=కనులపండువుగలదై, యని మణిమందిర పరము—(తత్ = ఆగిరికయొక్క, రూపచిత్ర = చిత్తరుబొమ్మవలె నిశ్చయముగా నిలిచియున్న రూపముచేత, ఆహిత=కూర్పఁబడిన, ఉత్సవమై=వేడుకగలదియై—నామనసునం దాగిరికరూపు చిత్రమువలెఁ దిరముగా నెలకొనియున్నదని రాజమనఃపరము),త...ర్ద్రింబై—(మణిధామ)-తత్=దానియొక్క, మృదుగాన=మెత్తనిపాటచేత, గుంభిత=రచింపఁబడిన, రస=జలముచేత—పాటకుఁ గరఁగిన రత్నకందళములచేత ననుట, ఆర్ద్రింబై=తడుపఁబడినదై—(రాజమనస్సు) ఆగిరిక, మెత్తనిపాటచేత నింపఁబడిన శృంగారరసముచేత స్తిమితమయి, తదీ...మోదము—(మణిధామ) తదీయ=దానిదయిన, అంగరాగ=మైపూఁతయైన, పర=కుంకుమపువ్వుయొక్క ('పరం కాశ్మీరజం మతమ్' వి.) ఆమోదము = పరిమళమును, పూని=వహించి-(రాజమనస్సు) తదీయ=దానిదయిన, అంగ = అవయవములను గుఱించిన, రాగ=అనురాగముచేఁ బుట్టిన, ఆమోదము=సంతోషమును, పూని, మామకమనఃకంజాతమున్ = నాహృదయకమలమును, పోలెడిన్=పోలుచున్నది, చూచితే. అలం. శ్లేషానుప్రాణితమైన యుపమ.

ఇట మనఃపరమయిన యర్థమున శూన్యగతి యైనదనఁగా చింతయనెడు సంచారిభావమున కనుభావము. గిరికాస్వరూపమును మనస్సున నిశ్చలముగా నిలిపియుండుట చింతాఖ్య సంచారిభావము. గానముద్దీపనవిభావము. రసమనఁగాఁ బూర్ణమయిన శృంగారరసము. అంగమాలంబన విభావము. రాగము రతియనెడు స్థాయిభావము. ఆమోదమనఁగా శృంగారరసానుభావమయిన ప్రమోదము.

సీ. శుచివృత్తి నెన్నాళ్లు ప్రచరించెనో తీర్థ, సంవాస మిచటి హంసవ్రజంబు
సురసాలములనెన్ని వరఫలంబులఁ జెంది, నిలిచెనో యిచటి రాచిలుకచాలు
సుమనోనురక్తి నెట్టి మహోత్సవంబుల, నందెనో యిచటి మత్తాలిసమితి
యదననెంతతపంబు దుదిమీఱ నోఁచెనో, యిచటి గంధాంధబర్హిణగణంబు
తే. లతివవెను వెంటఁదిరుగ నబ్జాక్షిముద్దు, మోవిచవిగొనసతిమోము తావిగొనఁగ
న్యఘన కంకణసినాదగర్జనలరఁ, గాంచెనని యుస్సురను మహీకాంతుఁడపుడు.

అ. ఇచటి, హంసవ్రజంబు=హంసలసమూహము, శుచివృత్తిన్=(శుచియనఁగా పరిశుద్ధమును, గ్రీష్మర్తువును 'శుచిశ్శుద్ధేఽనుపహతే శృంగారాషాఢయోస్సితే। గ్రీష్మే హుతవహేఽపిస్యాదుపధాశుద్ధమంత్రిణి' వి.) పరిశుద్ధమయిన వ్యాపారముతో, తీర్థసంవాసము=(తీర్థమనఁగా పుణ్యక్షేత్రమును జలమును) పుణ్యక్షేత్రవాసమును, ఎన్నాళ్లు, చేసెనోయని యర్థము. (గ్రీష్మసమయంపు ప్రవర్తనముచే కొలంకుల జలమందు వాసముసేయుచున్నదని భావము.)

ఇచటి, రాచిలుకచాలు=రాచిలుకలగుంపు, సురసాలములన్ = (సుర+సాలములనఁగా దేవతా వృక్షములు. కల్పవృక్షములు. సు+రసాలములనఁగా మంచి తియ్యమామిడిచెట్లు) దేవతావృక్షములవలన, వరఫలంబులన్ = వరరూపములయిన ఫలములను, ఎన్ని, చెంది, నిలిచెనోయని యర్థము. (మంచితీయమామిడిచెట్లవలన మేలయినపండ్లనుబొంది నిలుచుండునని భావము.)

ఇచటి, మత్తాలిసమితి=మదించిన తుమ్మెదలగుంపు, సుమనోనురక్తిన్ - (సుమనశ్శబ్దమునకు దేవతలును బువ్వులునర్థము.) దేవతలయందలి యనురాగముచేత, ఎట్టిమహాసవంబులన్ =(సవమనఁగా యజ్ఞము. ఆసవమనఁగా పూఁదేనె) ఎటువంటి మహాయజ్ఞములను, అందెనో=పొందెనో- ఆచరించెనో యని యర్థము. (సుమనోనురక్తిన్=పువ్వులందలి యాసక్తిచేత, ఎట్టిమహా+ఆసవంబులన్ అందెనో-= ఎటువంటి పూఁదేనెలను బొందెనోయని భావము. 'యజ్ఞస్సవోధ్వరోయాగః' అ)

ఇచటి, గంధాంధబర్హిణగణంబు = కావరముచే కన్నుఁగానని నెమిళ్లగుంపు, అదనన్ = కాలమందు, ఎంత తపంబు-(తపమనఁగా తపస్సును గ్రీష్మర్తువును) ఎంతతపస్సు, తుదిమీఱన్ =తుద ముట్టునట్టులుగా, నోఁచెనో=చేసెనోయని యర్థము. (తపంబుతుదిన్ =వేసవికడపలయైన వానకారునందు, మీఱనోఁచెనో=అతిశయముగా నోఁచినవనిభావము. వర్షర్తువు నెమిళ్లకు ప్రీతికరము.)

ఇట్లు హంసాదులకు తీర్థసంవాసాది వ్రతనియమాది పుణ్యకర్మములు చెప్పనేలయనఁగా, అతివ వెనువెంటన్ = గిరికవెంబడిని, తిరుగన్ =తిరుగుటకును, అబ్జాక్షి ముద్దుమోవి చవిగొనన్ =గిరికసొగసయిన పెదవిని రుచిఁజూచుటకును, సతిమోము తావిన్ +కొసరన్ = చెలిమొగము వాసనను వేఁడుటకును-కొసరననుటచే మాటిమాటికి వేఁడి యాస్వాదింపవనుట, కన్యఘన కంకణనినాదగర్జన్ అలరన్ = గిరికయొక్క గొప్పదయిన కంకణముల రవళియనెడు ఉఱుమువలన సంతోషించుటకును, కాంచెన్ = అర్హతవహించెను. అని, మహీకాంతుఁడు = రాజు, అపుడు, ఉస్సురనున్ = ఉస్సురని నిట్టూర్పు పుచ్చును. అంతటిభాగ్యము తాను నోఁచనందుల కని భావము.

ఇచట గిరికనడ, మోవి, మోముతావి, కడియములరవళి యను వీనియందు వరుసగా తమజాతినడ యనియు ఎఱ్ఱనిపండనియు, తామరతావియనియు, ఉఱుమనియు భ్రాంతిగలుగుటచేత వరుసగా నాబిడను హంసలు మొదలయినవి అనుసరణము మొదలయినవానిని చేసెడినని తాత్పర్యము. అట్టిహంసాదులకు నభేదాధ్యవసాయముచేత తపఃకరణాదులుగావించి ధన్యములగుటను సమర్థించి దానధన్యుఁడగుటచే నుస్సురని యూర్పువిడిచినాఁడు. హంసాదులు తీర్థసంవాసాదులచేత ధన్యములైనవి అను స్తుతియును తదనుసరణాద్యభావమువలనఁ దాను ధన్యుఁడు గాలేదను నిందయును దోఁచుచున్నవిగనుక నలంకారమిచట వ్యాజస్తుతి.

'ఉక్తిర్వ్యాజస్తుతిర్నిన్దాస్తుతిభ్యాం స్తుతినిన్దయోః.'

ఉ. మించినవేడ్కతో నచట ఽ మీనవిలోచన మున్ను వీణ వా
యించినచోటు బోటు లలఽయింపఁగ మాటున నున్నచోటు న
య్యంచితగాత్రి యేఁగఁ జెలుఽలాఁగిన చోటును గాంచి రాగముల్
గాంచుఁ దమోమయావృతులు ఽ గాంచు భజించుఁ జలాచలత్వముల్. 86

అ. మీనవిలోచన=మచ్చెకంటి, అచటన్ =ఆమణిమందిరమందు, మించినవేడ్కన్, మున్ను, వీణవాయించినచోటు, బోటులు=చెలికత్తెలు, అలయింపఁగన్ =కోడిగములచే వేసటనొందింపఁగా, మాటునన్ = తెరచాటున, ఉన్నచోటు, అయ్యంచితగాత్రి=ఒప్పుచున్న అవయవములుగల యాచిన్నది, ఏఁగన్ =పోఁజూడఁగా, చెలులు, ఆఁగినచోటు=అడ్డగించినచోటు, కాంచి=చూచి, రాగముల్= శ్రీరాగాదిరాగములును, కాంచున్ =తలంపునకుఁ దెచ్చుకొనునని యర్థము. (అనురాగంపు వగలు పొందునని యర్థాంతరము. ఇట బహువచన మతిశయద్యోతనార్థము,) తమోమయ ఆవృతులు, కాంచున్ =చీఁకటిమయములయిన యావరణములును, గాంచుననియర్థము. (మోహరూపములయిన

యావరణములనుగాంచునని యర్థాం. ఇట తమస్స్పృశమగుటచే మోహామునకు తమోవ్యపదేశము) చలా చలత్వములు భజించుర్ = మట్టిమల్లాడుటలనూహించుననియర్థము. (చాంచల్యమును బొందుననియర్థాం)

ఇట వీణావాదనాదిస్మృతిని జెప్పినాఁడుగనుక స్మృతియనెడు సంచారిభావము. చలాచలత్వమనఁగా చాపల్యమనెడి సంచారిభావము. వీణవాయించినచోట రాగములుగాంచుటయు, మాటున నున్నచోట తమోమయావృతులు గాంచుటయు, ఏఁగఁజెలులాఁగినచోట చలాచలత్వములు భజించుటయు, నని క్రమము. అర్థద్వయమునకు అభేదాధ్యవసాయము. వీణవాయించుచోట రాగములు పుట్టుటయు, మాటునందు తమస్సు ఆవరించుటయు, పోవునపు డడ్డగింపఁగా చలాచలత్వమును స్వభావము. గానాదినిష్పత్తిస్థానమందు రాగాదినిష్పత్తి యుపయుక్తమని తెలియునది. అలం. శ్లేషానుప్రాణిత మగుసమము.

చ. జనపతి యిట్లు పంచశరశాతశరాహతిఁ జంచలింపఁగాఁ
గని హితమంత్రి పల్కు మహికాంత నిరంతరచింత నింత విం
తనెగులు పూననేల లలనానలినాస్త్రుఁడ వీవు నిన్నుఁ గ
న్గొనిన లతాంగి యీలువు మనోభవుఁ డింతకుఁ గొల్లలాడఁడే. 87

అ. జనపతి = వసురాజు, ఇట్లు, పంచశర శాతశర ఆహతిర్ = మన్మథుని వాఁడియమ్ముల దెబ్బచేత, చంచలింపఁగార్ = వడఁకఁగా-మనసుదిటతప్పి కళవళింపఁగాననుట. కని, హితమంత్రి, పల్కుర్ -ఏమనియనఁగా, మహికాంత = భూపతీ, నిరంతర-చింతర్ = ఎడతెగని విచారముచేత, ఇంత, వింత నెగులుర్ = అపూర్వమయిన వ్యథను - ఇంతమాత్రపుబాధ నీవుపడుటచూచి యెఱుఁగమనుట, పూనర్ ఏల, లలనా నలినాస్త్రుఁడవు = స్త్రీలకు మన్మథుఁడవు, కాఁబట్టి, నిన్నుర్ కన్గొనిన, లతాంగి = గిరిక యొక్క, ఈలువు = మానము - లోఁగని బింకముననుట, మనోభవుఁడు = మన్మథుఁడు, ఇంతకుర్ = ఈసరికి-నిన్నుఁజూచినపుడే యాఁడుదిగాన తన మరులు వెలిపుచ్చలేకపోయినను ఇంతటికి నీకయి మరులు పెల్లున మురియుచుండదా యనుట. కొల్లలాడఁడే = చూఱగొనఁడా, అభిమానము కొంచెమేని దక్కనీయఁడనుట.

మరుని బాణములు 'శాత' వాఁడియగుటచే చంచలించుట-అనఁగా మిక్కిలియు చలించుట. 'లలనానలినాస్త్రుఁడవు' మన్మథునకుఁ బ్రతిగా నేర్పడిన మన్మథుఁడవు నీవు. కావుననే యామన్మథునికి నీయెడ ఈసు. ఇట్టి నిన్నుఁజూచిన యాఁడుదాని నూరకవిడువఁడు; ఈలువు కొల్లలాడును. మనసులోని యీలువు అడ్డములోని ముడుపు. దానిని మన్మథుఁడెట్లు కొల్లలాఁడు నందువా? వాఁడును మనోభవుఁడే కదా! మనసులోఁ బుట్టువానికి మనసులోనివస్తువు కొల్లగొనుట యశక్యముగాదు. 'కొల్లలాడఁడే' ఇసుమంతయైన మానము దక్కనీయఁడు. నిన్నుఁ జూచినపుడే యాబిడ 'ఇంతకు' నిలుపోపక మఱుఁగుచుండును జామీ!

అవ. అది నన్నువలచినను దలిదండ్రులకు బరతంత్రురాలుగదా. వారిత్తురో, ఇత్తమన్నను దానిచెలులు వలదందురో యనఁగా చెప్పుచున్నాఁడు.

చ. అతివగురుండు తారక పదానతుఁడంగనఁ గన్నతల్లి య
ద్భుతభవదీయశౌర్యరసపోషితజీవన కొమ్మనెచ్చెలుల్
సతతమ్ము నీకథల్ వొగడ జాలు బాలభవద్విలాసమో
హిత హితకార్యసంగతికి సప్రమ్యోడ సందియ మంద నేటికిన్. 88

అ. అతివ, గురుండు=తండ్రి - కోలాహలుఁడు, తావకపద ఆనతుఁడు = నీయడుగునకు లొంగినవాఁడు-నీయడుగుఁజేరి బ్రతుకువాఁడనుట—(నీయడుగుదెబ్బచేఁ గ్రిందుపడ్డవాఁడని యర్థాంతరము) అంగనన్ =గిరికను, కన్నతల్లి = శుక్తిమతి. అద్భు...వన—అద్భుత=మిక్కిలి వింతయైన, భవదీయ=నీదయిన, శౌర్యరస=శూరత్వముచేత, పోషిత=పోషింపఁబడిన, జీవన=బ్రతుకుగలదని యర్థము—(రసము, జీవనము అనఁగాజలము. జలమునకు జలమువలన పోషణము (పెంపు) గనుక నీదుశౌర్యరసమనెడి రస (జల)ముచేత పోషింపఁబడిన రసముగలదని చమత్కారము). కొమ్మనెచ్చెలుల్ =గిరిక చెలికత్తెలు, సతతము=ఎప్పుడును, నీకథల్ పొగడన్, జాణలు=చదురాండ్రు - దిట్టలనుట, బాల=గిరిక, భవత్ విలాసమోహిత = నీసొగసువగలచేత, మోహింపఁబడినది. కాఁబట్టి, హితకార్య సంగతికిన్ =అభీష్టమయిన కార్యము ఒనఁగూడుటకు, ఇయ్యెడన్ =ఇపుడు, సందియము, అందనేటికిన్ — సందేహ మెంతమాత్ర మక్కఱలేదనుట.

కన్యకు మొట్టమొదటి సొంతకాఁపు తండ్రి, అట్టితండ్రి నీ యడుగులకడ నూడిగము. తల్లియో నీపెట్టుపోఁతలచే బ్రతుకునది. ఇట్టివారు వలచినను వలవకున్నను కన్యనిచ్చి తీఱవలసినదే. మఱి గిరిక యనుఁగు చెలులో,

“నీ వినూతన విజయాంక గేయములఁ దావకచాటు కథాసుధారసం
బున నలరింతు మీభువన మోహినిఁబిన్నట నాఁటనుండియున్.”

అని నీకథలు పొగడువారనుటకు వారిమాటయే ప్రమాణము. కేవలము పొగడుటకే కాదు. నిన్నొల్లకున్నను వలపించునట్లుగాఁ బొగడునట్టి జాణలుసుమీ. వారెల్ల వలపించుట యటుండనీ. కన్య తా వలచుటకో నీ ‘విలాసమే’ యున్నదిగద. నీవిలాసము వలపించుటగాదు ‘మోహిత’ ఒడలే మఱపించినది. నీకే దక్కించినది. అలం. అర్థాపత్తి.

క. బాలాపాణిగ్రహశుభ, వేలానిర్ణీతి కిపుడ విచ్చేయుము భూ
పాలావతంస యన విని, శైలారి యలీకధైర్యచాతుర్యమునన్. 89

అ. భూపాల అవతంస=రాజులకు శిరోభరణమైనవాఁడా, బాలా...ర్ణీతికిన్—చిన్నదాని యొక్క పెండ్లికొఱకయిన, మంచిముహూర్తము, నిర్ణయించుటకు, ఇపుడ=ఇపుడే, (పట్టణమునకు) విచ్చేయుము, అనన్ =అని నర్మసఖుఁడుపలుకఁగా, విని, శైలారి=కోలాహల పర్వతమునకు శత్రువయినరాజు, అలీకధైర్యచాతుర్యమునన్ =కల్ల (అనఁగా తెచ్చుకోలు) ధైర్యముయొక్క నేరుపుచేత (‘అలీకం త్వప్రియేఽనృతే’ అ.) ముందరిపద్యముతో నన్వయము.

కన్య దక్కునాయను వగలేల, దక్కినట్టెయని యిఁక పెండ్లికే - అదియు నెప్పుడోకాదు, ‘ఇపుడ’, మంచి లగ్నమేర్పఱుచుటకే పోఁదగునని ప్రత్యాయనప్రోత్సాహనములు. జాగునకు నిలుపోపవుగాన ‘ఇపుడ’అని ప్రాప్తిత్వర నెచ్చరించుట. లోకోత్తరసౌందర్యవతిని జూడఁగాఁ గలిగిన మిక్కుటంపుమోహము వట్టిమాటలచే పోయి ధైర్యముపుట్టినది నిజమైనదా ? ‘అలీకము’ లేని ధైర్య మున్నట్టు నటించుటయే చాతుర్యము.

మ. అగకూటాగ్రము డిగ్గి సంభ్రమ సముగ్రాధోరణాసీత గం
ధగజోత్తంసము నెక్కి చూడ్కి కెలమిం దత్కుంభహస్త ద్యుతు
ల్నగజాచారుకుచోరువైఖరులు తెల్పం బుట్టు ఘర్మంబు నే
ర్పుగఁ దత్కర్ణవిశీర్ణచామరమరుత్పోతంబులం దీర్చుచున్. 90

అ. అగకూటఅగ్రము=(కోలాహల) పర్వతముయొక్క శిఖరముకొనను, డిగ్గి=దిగి, సం... సముక్—సంభ్రమ=త్వరపాటుచే, సమగ్ర=నిండయిన—(నిండారు త్వరతోఁగూడిన) ఆధోరణ=మావటినిచేత, 'ఆధోరణా హస్తిపకాః' అ. ఆనీత=తేఁబడిన, గంధగజోత్తంసముక్=మదించిన మేటియేనుంగును, ఎక్కి, చూడ్కికిన్=చూపునకు-కన్నులకనుట, ఎలమిన్=ఉబ్బుతో - కనుబండువుగా ననుట. తత్కుంభహస్తద్యుతుల్=ఆయేనుఁగు కుంభములయొక్కయు, తొండములయొక్కయు శోభలు, నగజాచారుకుచ ఊరువైఖరులు=గిరికయొక్క సొగసయిన చన్నులయొక్కయు తొడలయొక్కయు రీతులను, (కుచములు మన్మథుని సామ్రాజ్యపీఠములు. ఊరువులు, మన్మథాంతఃపురకదళీస్తంభములు కాన, అవి తలంపునకురాఁగా అత్యంతము మదనుఁ డుద్దీపింపక మానఁడు. 'ఆరూఢస్య సమున్నతస్తనతటీసామ్రాజ్యసింహాసనమ్। కన్దర్పస్య విభోర్జగత్త్రియజయప్రాకట్యముద్రానిధేః॥' (మూకపంచశతి.) తెల్పన్, పుట్టు, ఘర్మంబు=చెమట - ఇది సాత్త్వికభావ జనితము.

క. సమరతి ఘర్మాదులచే, విమల శరీరములయందు ♦ విస్ఫుటమగు న
చ్చెమటకు నభిధానము స్వే, దముగాఁ బలుకుదురు సమ్మ♦దమున నభిజ్ఞుల్.

నేర్పుగన్=ఉపాయముగా, తత్క...బులన్—తత్= ఆయేనుంగుయొక్క, కర్ణ=చెవులనెడు, విశీర్ణచామర=కదలుచున్న—అనఁగా వీవంబడుచున్న - చామరలయొక్క, మరుత్పోతంబులన్=గాలి పిల్లలచేత, తీర్చుచున్=పోఁగొట్టికొనుచును, ముందఱ నన్వయము. మేనంబుట్టిన స్వేదమును, నేర్పున నేనుంగుచెవులగాడ్పులచేఁ బోఁగొట్టుకొన్నాఁడుగాని వ్యజనాదులచేతఁ బ్రకటము చేసినాఁడు గాఁడు. కనుక ఘర్మాకారగోపనరూపమయిన యవహిత్థయనెడి సంచారిభావము చెప్పఁబడినది. ఇందులకు సంవాదము.

సీ. జాగరదోద్భూత దృగ్రాగంబు మాణిక్య, కర్ణకుండలదీప్తిఁ గప్పిపుచ్చు
రాజకార్యాపరంపరాఖేదమివమున, నిట్టూర్పుగాడ్పుల నివ్వానించు
ఘనసారబహుళచందనవిలేపనమున, నాపాండుభావంబు నపలపించు
దోరంతరన్యస్తతారహారంబుల, నంతఃపరీతాప మపనయించు

తే. మాననీయశశాంకకో[illegible]లములైన, యామినీసమయములుఁ బఁర్యంకములును
సాత్తులుగఁగొంచు వలవంత ♦ జనవిభుండు, కన్నె కూర్మిప్రకాశంబు ♦ గాకయుండ. (శృం.నై)

గజము కేవలమయినది గాదు, గంధగజోత్తంసము. కాన దానికుంభయుగళిబలువును తుండముపొలుపును జెప్పవలయును. కామార్తునకు నవి కాంతకుచోరువులను మీఁదు మిక్కిలి తలఁపింపక మానునా? తెలిపినది ఆమదపుటేనుంగు మిన్నయొక్క కేవల 'కుంభహస్తములు గావు' వానిద్యుతులనుటచే వానిపోలికతోడ పొలుపును బలుపునుగూడ మీఁదుమిక్కిలి తెలిపెననుట. దీనిచే తదీయమయిన స్మరణము మఱింత స్మరోద్దీపకము. కావుననే స్వేదము. దానిని బుట్టించిన యా యేనుంగే దానిని బోకార్చుటకును సాయపడినది. అది పెద్దదిగాన చెవులు చామరలవలె వెడఁదలు; మదముగలదిగాన చెవుల అల్లలార్పులెక్కుడు. కావుననే వానివలన చెమటఁ బోఁగొట్టునన్ని పిల్లగాడ్పులు పుట్టుట. అలం. వ్యాజోక్తి. ఇట ఉక్తి యనుట వ్యాపార మాత్రోపలక్షణము.

మ. అవనీభర్త వినూతనాతసుపతాకాలోకసంప్రేక్షణీ
యవిలాసంబు గజాధిరాజగమనో ♦ దారంబుఁ గాశ్మీర ప

త్రవిచిత్రంబుఁ దటిద్విభాసిరుచి యౌఁ దద్వాహినీజాతవై
భవమున్ లోవెలిఁ గాంచుచుం జనియె సంపత్పేటికిన్ వీటికిన్. 91

అ. ఇందు వాహినీజాత వైభవము అనుటచే వాహిని యనఁగా నదియు సేనయు గనుక నదీకన్యయగు గిరికవైభవమును సేనవైభవము నని యుభయపరముగా నర్థద్వయము తెలియునది. అవనీభర్త=రాజు, వినూ...లాసంబు —(గిరిక) వినూతన=క్రొత్తదయిన, అతనుపతాకా=మన్మథుని గుఱుతులయిన చేపలవంటి, ఆలోక=చూపులయొక్క, ప్రేక్షణీయ=చూడఁదగిన, విలాసంబు = చెలువుగల యట్టిదియును—(సేన)— వినూతన=మిక్కిలి క్రొత్తదియు, అస్తోక = అధికములయినవియు అగు, పతాకా=ధ్వజముల, ఆలోక=కాంతులయొక్క చూడఁదగిన చెలువుగలది ('పతాకా వైజయన్త్యాంచ సౌభాగ్యే కేతుధ్వజేఽపిచ' వి. 'ఆలోకాదర్శనద్యుతీ' అ.)గజా...దారంబు = (గిరిక) మేటి యేనుంగుయొక్క నడకవంటి నడచేత మించినది. (సేన)— మదపుటేనుంగుల గతులచేత నతిశయించినది. కాశ్మీరపత్రవిచిత్రంబు=('పత్రంస్యా ద్వాహనే పర్ణే పక్షేచ శరపక్షిణోః' వి.అని పత్ర మనఁగా మకరికాపత్రములును గుఱ్ఱములును,)—(గిరిక) కుంకుమపత్ర రచనములచేత వింతయైనది—(సేన) కాశ్మీరదేశపు గుఱ్ఱములచేత విచిత్రమయినది. తటిత్ విభాసిరుచి=(గిరిక) మెఱుపుఁదీఁగల వలె ప్రకాశించుచున్న, మేనిజిగి=(లావణ్యముగలది) —తటిత్ విభ = మెఱుపుఁదీఁగ కాంతివంటి కాంతిగల, అసి=కత్తులయొక్క,రుచి=ధగధగ్యము గలది)ఔ, తత్ వాహినీజాత వైభవమున్—అనదికూఁతురయిన గిరికయొక్క సొంపు పెంపును,(ఆసేనయొక్క, జాత=సమూహముయొక్క వైభవమని యర్థాంతరము) లోన్ వెలిన్=లోపలను వెలుపలను, కాంచుచున్, సంపత్పేటికిన్=సిరులకు మందసపుఁ బెట్టెయైన, వీటికిన్=పట్టణమునకు, చనియెను.

లోన్ వెలిన్ చూచుచు ననఁగా గిరికావైభవమును హృదయమందును సేనావైభవమును బాహ్యమందును జూచుచుఁ బోయెననుట. నునుఁజేఁపలవంటి బెళుకుఁజూపుల చెలువు, మదపుటేనుఁగు నడతీవి,కుంకుమ పత్రరేఖల వింతసొంపు, మెఱుపుఁదీఁగవంటి మేనిజిగి, గిరికవైభవంపు పరికరము.క్రొత్త జెండాలు, మదపుటేనుంగుల నడలు, కాశ్మీరపు గుఱ్ఱముల వింత,మెఱుపువలెఁదళతళలాడు కత్తులడాలు, సేనావైభవము నంగములు. అలం. శ్లేషము.

తే. నగరిపుసమానుఁ డీరీతిని నగరి కరిగి, సింధురము డిగ్గి గాంధారసింధు కుకుర
కాశముఖ్యుల ననిపి ప్రకాశవృత ది,శాంత మగు నాత్మకేళీ నిశాంత మొంది.

అ. నగరిపుసమానుఁడు = (కొండలకుఁ బగవాఁడయిన) ఇంద్రునికి సాటియైనవాఁడు—వసురాజు. ఈరీతిని= ఇట్టి యింద్రవిభవముతో ననుట. (నగరిపు శబ్దమిచట సాభిప్రాయము) నగరికిన్, అరిగి, సింధురము=ఏనుఁగును, డిగ్గి, గాంధా...ముఖ్యులన్ —గాంధారసింధు కుకురకాశులనెడు దేశపురాజులను, అనిపి, ప్రకాశవృత దిశ+అంతము=(మణుల) వెలుతురుచే క్రమ్ముకొనఁబడిన దిక్కుల తుదలుగలది, ఐన, ఆత్మకేళీ నిశాంతమున్=తనక్రీడా భవనమును, ఒంది=చేరి,

అట్టివాహినీ వైభవమును గాంధారరాజాది పరివార వైభవమును గలవాఁడు నగరిపుసమానుఁడే. కేళీమందిరపుఁ గాంతులు దిక్కులను గ్రమ్ముటచే దాని విరివియుఁ బొడువును నమూల్యమణిమయత్వమును వ్యంజితములు.

చ. అతివలు ద్రిప్పునారతులకేయట్లు మనంబు భ్రమింపఁ గుంభినీ
పతి జలకంబువేళ యనిభామలు దెల్పఁగఁ బల్లెరంబు వె

ట్టితి మని తొయ్యలుల్ బడిఁబడిఁ నడతేర ననాస్థతో యథో
చితవిధు లాచరించి పువుఁసెజ్జకు నొయ్యన మేను దార్చుచున్. 98

అ. అతివలు, త్రిప్ప, ఆరతులయట్లు=ఆరతులు తిరుగునట్లుగానే, మనంబు, భ్రమింపన్=తిరుగుడు పడుచుండఁగా, కుంభినీపతి, భామలు=స్త్రీలు, జలకంబువేళ = స్నాన సమయము, అని, తెల్పఁగన్, తొయ్యలుల్ = (మఱికొందఱు) స్త్రీలు, పళ్లెరంబు=భోజనపాత్రము, పెట్టితిమి=వడ్డించుటకై యుంచినారము, అని, బడిన్ బడిన్=వెంబడి వెంబడిఁగా - ఒకరివెంటనే మఱొకరుగా, నడతేరన్=రాఁగా, పళ్లెరములు భోజనపాత్రములందుఁ బ్రయుక్తమగుటకు, 'అనఘు లౌనఋపదియెని మిదివేవురు, పసిండి పళ్లెరములన్' భార, సభా. 'లేమనీభర్త పళ్లెరమునఁ గుడువఁడు' (వీర.) అనాస్థతోన్=తగులు - అక్కఱ - దేనియందును లేక, యథోచితవిధులు=అప్పటికిఁదగిన కృత్యములు, ఆచరించి, పువుసెజ్జకున్=పుష్పశయ్యకు, ఒయ్యనన్=మెల్లగా, మేనును, తార్చుచున్=హత్తించుచు—అనఁగా మెల్లఁగా నొరగుచును- ముందఱ నన్వయము.

ఆరతులు దివ్వెలతో మండుచు గుండ్రముగాఁదిరుగుడుపడునట్లె మనసును మదనాగ్నిజ్వాలలచే నెరియుచు తిరుగుడు పడుచున్నది. కావుననే అనాస్థ. అయినను 'విధులు' కాన చేయకతీఱదు. మఱి 'భామలు తొయ్యలులు' అని ఒకతిగాదు. ఒకతివెనుక నొకతిగా పెక్కండ్రువచ్చుచు విన్నవించుచుండుటచేత త్రోసిపుచ్చరాని నిర్బంధము. దీనినిబట్టి 'యథోచిత'ముగా ఆచరించుట, అనఁగా నొకపాటిగా మజ్జనభోజనాదులు జరిగించుట. చింతచే నిదురరాదు; కాన సెజ్జకుఁబోక, 'ఒయ్యనన్' అందును బ్రీతితోఁ బరుండుటగాదు బలవంతముగా 'మేనుదార్చుట'యె. నీళ్లాడుట నిత్యవిధి. అందు భామలు తెల్పియు వారియెదుటనే నిరాకరించుటమిగులనీరసము. తొయ్యలులు బడిబడివచ్చి పిలిచియుఁ గుడుపకుండుట వారికి గుట్టుబయలఁ బెట్టినట్లగును. కావుననే యాచరించినాఁడు. ఇట 'అనాస్థతో' ననుటచే ఆలస్యమనెడి సంచారిభావము. 'మన్దోద్యమత్వమాలస్యం కర్తవ్యేషు ప్రకీర్త్యతే' ఇంతవఱకు రాజునకుఁ జింతాసంగమమును జెప్పినాఁడు.

సీ. గిరికన్యమేన నేకీభవించినఁగాని, తియ్యవిల్తుని నిరోధింపరాదు
సింధుజనెదనుంచి సిరులమించినఁగాని, మిహికాంశుఁగను సన్నమెలపరాదు
శుభవాణి యభిముఖస్ఫురణఁ జూపినఁగాని, పఱచుటంచలఁ గ్రిందుపఱుపరాదు
పద్మినిఁ గరముఖప్రౌఢిఁ దేల్చినగాని, రేలమున్మురము వారింపరాదు
తే. నేర్పుననటంచు నృపతియూనెలఁతఁదలఁచి, తలఁచినగమగు సాత్త్వికోదయదశాను
భావములఁజెందునున్మదప్రసవబాణ, బాణమగ్నతఁగాంచుఁదాపమువహించు.

అ. నృపతి=రాజు, నేర్పునన్ = ఉపాయముతో—ఇదిమీఁదనెల్లఁ గూర్చుకొనునది, గిరికన్య మేనన్=గిరికాదేవి దేహమునందు, ఏకీభవించినన్ కాని=ఒకటిగా కలసికొన్ననేకాని యనియర్థము. (ఇచట 'గిరికయొక్క మేనన్' అని షష్ఠీతత్పురుషము—గిరికన్య=పార్వతి, మేనన్=తనదేహమందు ఏకీభవించినఁగాని—అనఁగా శివుఁడనైనఁగాని యని యర్థాంతరము. ఈయర్థమున గిరికన్య కర్తృపదము.) తియ్యవిల్తునిన్ = మన్మథుని, నిరోధింపరాదు=వారింప నలవిగాదు—మన్మథుని యుద్రేకమడంప నలవిగాదని రాజపరమైన యర్థము—మన్మథునిచేసంహరింపఁ బొసఁగదనిశివపరమైన యర్థము.)

సింధుజన్=నదికిఁ బుట్టినగిరికను, ఎదన్ ఉంచి=ఱొమ్మునఁజేర్చుకొని, సిరులన్=సొంపువెంపులచేత, మించినన్ కాని, యని యర్థము. (సింధుజ=సముద్రకన్యయైన లక్ష్మిని, వక్షఃస్థలమందు నిలిపినఁ

గాని—అనఁగా విష్ణుఁడసైనఁగాని యని యర్థాం.) మిహికాంశుక్ = చంద్రుని, కనుసన్నక్ మెలపరాదు=కంటిసన్నలచేత నడపింపరాదు—మిక్కిలి వశవర్తిగాఁ జేసికొన నలవిగాదని రాజపరమైన యర్థము - (చంద్రుని నేత్రరూపముగాఁ బ్రవర్తింపఁ జేయరాదని విష్ణుపరముగానర్థము. విష్ణునకు లక్ష్మి వక్షమందుండుటయుఁ జంద్రుఁడు కన్నగుట ప్రకటము.)

శుభవాణి=మంచి పలుకులుగల గిరిక, అభిముఖస్ఫురణక్=మొగము నా దెసఁద్రిప్పికనఁబడినఁ గాని యని అర్థము—(శుభాస్పదురాలయిన వాణీదేవి ముఖమందు నిలిచిననేకాని—అనఁగా బ్రహ్మసైనఁగాని యని అర్థాం.) పఱచుటంచలక్ = దుండగములయిన హంసలను, క్రిందుపఱుప రాదు=అడంపనలవిగాదు - హంసలు దుండగము సేయుట మాన్పరాదనుట—(పఱచునట్టి హంసలను వాహనములుగా పయినెక్కి క్రిందుపడఁజేయఁ దరముగాదని అర్థాం. బ్రహ్మ వాణిని మొగమందుఁ దాల్చుటయు హంసవాహనుఁ డగుటయుఁ బ్రకటము.

పద్మినిక్=పద్మినీజాతి స్త్రీయైనగిరికను, కరముఖప్రౌఢిక్=చేతికొనల (గోళ్ల) నేర్పుచేత—అనఁగా స్తనజఘనాదులందు నఖక్షతముల మెలపుతో, తేల్చినక్ కాని=ఉల్లసిలంజేసిననే కాని అని అర్థము—(పద్మినిక్=తామరతీఁగను, కరముఖప్రౌఢిక్ = కిరణాగ్రముల నైపుణిచేత, వికసిల్లఁజేసి ననేకాని - అనఁగా సూర్యుండసైననే కానియని అర్థాం. రేలుముమ్మరము = రాత్రుల యుద్రేకము, వారింపరాదు=నిలుప నలవిగాదు — (రాత్రుల చీఁకటి విజృంభణమును బోఁగొట్ట నలవిగాదని అర్థాం—సూర్యుఁడు తామరతీఁగను వికసింపఁజేయుటయుఁ దనయుదయముచే రాత్రుల నుడుపుటయుఁ బ్రకటము.

అటంచుక్, ఆనెలఁతక్=ఆగిరికను, తలఁచితలఁచి=మాటికిఁ దలచుకొని, సగమగుక్=చిక్కిపోవునని రాజపరము— (అర్ధనారీశ్వరత్వమును వహించునని శివపరము.) సాత్త్వికోదయ దశానుభావములక్ పొందును—(కంపము స్వేదము మొదలయిన) సాత్త్వికోదయ భావములను పది మన్మథావస్థలను బొందునని రాజపరము—సత్త్వగుణోదయ దశాప్రభావములను - లేక సత్త్వగుణోదయమును దశానుభావముల ననఁగా దశావతారములను గాని పొందునని విష్ణుపరము-విష్ణువు సత్త్వగుణప్రధానుఁ డగుట ప్రసిద్ధము) ఉన్మదప్రసవబాణబాణమగ్నతక్ కాంచుక్ = మదమునిక్కినమన్మథుని బాణములందు మునిఁగిపోవుటను గాంచునని రాజపరము—(ఉన్మదప్రసవమనఁగా పద్మము - అది బాణము గాఁగలవాఁడు ఉన్మద ప్రసవబాణుఁడు - మన్మథుఁడు) అతని బాణ మున్మద ప్రసవము—అనఁగాఁ బద్మము - దానియందు—మగ్నతక్=ఎడతెగక వాసము సేయువాని తనమును—అనఁగా బ్రహ్మతనము నని అర్థాం. తాపమువహించుక్ = (చింతాదులవలన గలుగు) తుందుడుకును బొందునని రాజపరము—(ఎండతాపమును వహించునని సూర్యపరము.) గిరికన్యమొదలగు నాలుగింటి అర్థాంతరముల శివ విష్ణు బ్రహ్మ సూర్యపరముగా వరుసను, సగమగుట మొదలయిన నాలుగర్థాంతరములు నిబంధింపఁ బడుట తెలియునది.

ఇట్టి రసోద్దీపకములయిన మన్మథుఁడు, చంద్రుఁడు, హంసలు, రాత్రులనెడు నాలుగింటికిని బరిహారములు వరుసను గిరికాసంగమాదులుగాఁ జెప్పినాఁడు. మొదటినాలుగు చరణములందు రాజునకు సంకల్పావస్థయు, గీతిమొదటిచరణమందుఁ గృశత్వావస్థయుఁ జెప్పఁబడెను. నాలుగు చరణములందును వరుసగా స్ఫురించుశివుఁడు మొదలగువాని కనురూపముగాఁ బార్వతి మొదలగు నర్థములు వచ్చునట్లు గిరికన్యాది పర్యాయములు గిరికకుఁజెప్పిన చమత్కారము గ్రాహ్యము.

మ. అనిశధ్యాతనదీసుతావయవుఁడై యమ్మేటి యయ్యేటి శో
భనముక్తావళు లన్న నన్నది నవాబ్జం బన్న గోరంతనం
టును నొక్కింతముఖానురాగమును బూనుంగాని యేసొమ్ముఁ గై
కొనఁ డేకానుక లిచ్చినం గొనఁడు గోర్కుల్ నిండి దైవాఱఁగాన్. 95

అ. అమ్మేటి=ఆగొప్పవాఁడు—వసురాజు, అనిశ ధ్యాత నదీసుత అవయవుఁడై = ఎల్లప్పుడును ధ్యానము సేయఁబడుచున్న గిరిక అవయవములు గలవాఁడై—గిరికాదేవి నఖముఖాద్యవయవములనే యెప్పుడును ధ్యానముసేయుచు ననుట. కావుననే, అయ్యేటి...వళులు = ఆనది సొగసయిన ముత్తియములసమూహములు, అన్నన్ = అన్నది నవ అబ్జంబు=ఆయేటి క్రొత్తతామర, అన్నన్ = అనిచెప్పినను, గోరంతనంటును = ఇంచుక నెయ్యమును, ఒక్కింత ముఖ+అనురాగమును = ఇంచుకంత మొగము తెలివియు, పూనుంగాని= తాల్చునేకాని, కోర్కుల్ నిండి దైవాఱఁగాన్ = కావలసినయభిలాషములుపూర్ణములయి పొరలిపాఱుచుండఁగా - వలసిన కామితవస్తువులు మీఁదు మిక్కిలిగా వెలయుచుండుటను బట్టియనుట, ఏసొమ్మున్ =(పూర్వోక్తమయిన ముత్తెములు దప్ప మఱి)ఏభూషణమును, కైకొనఁడు= చేపట్టఁడు, ఏకానుకలు = (పూర్వోక్తమయిన తామరలుదప్పమఱి) ఏ యుడుగరలు, ఇచ్చినను, కొనఁడు=పుచ్చుకొనఁడు, (కోర్కుల్ నిండిదైవాఱఁగన్ = గిరికావిషయమయిన కోర్కులు పొంగి పొరలుచుండఁగా ననియుఁ గొందఱర్థము సెప్పెదరు.)

రాజు 'కోర్కుల్ నిండిదైవాఱు' చుండువాఁడు గావుననే యే సొమ్ముఁగొనఁడు, శుక్తిమతిముత్తెములుదప్ప; ఏకానుకలను గొనఁడు, శుక్తిమతి క్రొందామరదప్ప. ఈరెంటిని మాత్రముగొననేల? గిరిక తల్లియందలివిగదా. ప్రియ యందల ప్రేమాతిశయము దానిని జేరినవారిపయిని బొంగిపొరలుట సహజము. ఇదియొకటె కారణముగాదు. గిరిక యవయవములనే యెపుడును దలంచుకొనుచుండువాఁడు గాన దానిగోళ్లవలెను మొగమువలెను నున్నవని యీరెంటిని ముట్టుచున్నాఁడు. నంటు 'గోరంత' ముఖానురాగము 'ఒక్కింత'యననేల నిండుగాఁగూడదా? కోర్కులు నిండిదైవాఱుచున్నదే. కొఱఁత యుండినఁగదా కోర్కినిండుగాఁగలుగును ? ఆ'గోరంతయు' 'ఒక్కింతయు' వెనుకటి కారణములం బట్టిమాత్రమే. 'గోరంత' 'ముఖానురాగ' అనువానియందలి 'గోరు' 'ముఖ'మను శబ్దములు ముత్తెములను నవాబ్జములును తమవంటివగు గిరికగోళ్లను మొగమును దోఁపించుచున్నవిగా శబ్దచమత్కారముగ్రహించునది. మౌక్తికములు భూషణార్థము, నవాబ్జములు ఉపాయనార్థము కాన, తదను గుణములుగా 'ఏసొమ్ము' 'ఏకానుక' అని చెప్పుట తెలియునది. అనిశధ్యాతనదీసుతావయవుఁడనుటచే నిచట చింతయనెడు సంచారి భావము. ఏసొమ్ముఁ గైకొనక పోవుటయు, ఏకానుకలిచ్చినను బుచ్చుకొనకుండుటయు 'అరతి'యనెడు నవస్థ. 'అన్యత్రా ప్రీతిరరతిః' అని తల్లక్షణము. అలం.

తే. కన్యలావణ్య రససుధాగాహనమున, విభునినయనము లస్వప్నవృత్తిఁ జెంద
మనసు తదురోజహేమాద్రిమనికి మరగి, మహితసురతానుభూతికై మలయుచుండు.

అ. విభుని నయనముల్ = రాజుకన్నులు, కన్య, లావణ్యరస సుధాగాహనమునన్ = కాంతి యనెడి అమృతమందలి మునుకచేత, అస్వప్నవృత్తిన్ = ('అస్వప్నా అమృతాంధసః'అ.) దేవతల వ్యాపారమును (దేవత్వము), చెందన్ =పొందఁగా నని యర్థము- (నిద్రలేకుండుటను బొందఁగా నని భావము.) మనసు = రాజుమనసు, తత్ ఉరోజహేమాద్రిమనికిన్ = ఆకన్యయొక్క గుబ్బలనెడు బంగారు కొండయందలి యునికిని, మరగి = అలవాటుచేసికొని, మహితసురతా + అను

భూతికై=ఒప్పుచున్న దేవత్వముయొక్క అనుభవముకొఱకు నని యర్థము. మహిత = ఒప్పిదమయిన, సురత=సంభోగముయొక్క, అనుభవమునకై, యని భావము.మలయుచుండుఁ =ఉద్రేకించుచుండును.

అమృతాస్వాదనముచే దేవత్వసిద్ధి. దేవతలమృతపాయులు, అస్వప్నులు,సురలు ననఁబడుదురు. మేరుపర్వతనివాసులువారు. వారి యీలక్షణములును గొని కవియిందలి చమత్కృతి నలపరించినాఁడు. కన్నులు కన్యలావణ్యమనెడి యమృతమును పానముచేసి అస్వప్నవృత్తిని (దేవత్వమును) జెందినవి. దానిమీఁది యీసుచే మనస్సు కన్యచనుగుబ్బయనెడు బంగారుకొండయందలి వసతిగయికొని సురతానుభూతికై (దేవత్వానుభవమునకై) పాటుపడుచున్నదని యర్థము. కన్ను లస్వప్నములనఁగా నిదుర లేకున్న దనియు మనసు సురతానుభూతికనఁగా రతిసేయుటకు మలయుచున్న దనియు భావము. రాజుకంటికి నిదురపట్టదయ్యెననియు మనసు కన్యచనుగుబ్బలనే యెడతెగక తలంచుచు రతికై యువ్విళ్లూరుచున్నదనియు ఫలితార్థము. లావణ్యముయొక్క 'రస'మ్ముగ్రహించుట అమృతముగా రూపించుటకు. కన్యలావణ్యము కన్నులకతి భోగ్యమగుటచే అమృతము; అత్యంతమగుటచే అందు గాహనము, కొంచెపాటి దానిలోఁ గ్రుంకుట పొసఁగదుగదా. చన్నులుబ్బులై బంగరుజిగి దొలఁకుటచే బంగారుకొండతోసాటి. మేరువాసము దేవతలస్వర్గమహాభోగమునకుంబోలె స్తనగ్రహణము సంభోగసామ్రాజ్యపదవికిఁ బట్టుఁగమ్మ గదా. అలం. శ్లిష్టసమస్త వస్తువిషయ రూపకము.

సీ. శ్రమము నొందింపఁడో । జగదద్భుతాఖండ, కాండప్రయోగ।లాఘవముఁ దెలిపి
సాత్త్వికగుణసార । సామగ్రి నవరింపఁ, డో సుమనోధర్మ । మొనరఁదాల్చి
సంకల్పసిద్ధి యొ।సంగఁడో తగువేళ, నమితప్రతాపసాహ । య్యమొంది
సవ్యసాహిత్యచిం।త వహింపఁ జేయఁడో, నవరసభావవై।భవముఁ జూపి

తే. యతనుఁ డతనికి।సహృదయుఁడై యమేయ, శక్తి నేమేమి గావింపఁ।జాలఁడయ్యెఁ
బతియు నితరప్రసంగ సం। భావనమునఁ, దవులక తదేకపరవశుఁ।డవుటయరుదె.

ఇట మన్మథుఁడు రాజునకు పెక్కులు మహోపకారములను జేసినట్లు శ్లేషముచే సమర్థించి తన్మూలమున రాజు తదేక పరతంత్రుఁడగుట నుపపాదించుచున్నాఁడు. ఎట్లనఁగా. అతనుఁడు= మన్మథుఁడు, జగ...లాఘవముఁ—జగదద్భుత = జగత్తునకు మిక్కిలి వింతయైనదియును, అఖండ = కొట్టుపడనిదియు - అప్రతిహతమైనదియు ననుట, అగు, కాండ=బాణముల, ప్రయోగ= ఏయుటయందలి, లాఘవముఁ = చుల్కఁదనమును - సాదనను, తెలిపి = తెలియఁగఁజపి, శ్రమమునొందింపఁడో =పరిశ్రమముచేయింపఁడో - అలవాటుపొందించిన వాఁడుగాఁడా యని యర్థము - (జగదాశ్చర్యములయిన యఖండబాణములనఁగా పువ్వుబాణములు - వానిని నేయుటయందలి చుల్కనను దెలిపి మిక్కిలి చుల్కఁగాఁ బెక్కు లేసియనుట) రాజునకు వ్యథగలిగించినాఁడని భావము.

సుమనోధర్మము = విద్వద్ధర్మము - పండితుల తెఱంగుననుట, ఒనరఁ = ఒప్పిదముగా, తాల్చి, సాత్త్వి...సామగ్రిఁ—సాత్త్వికగుణ = సత్త్వప్రచురములయిన (శమదమాది) గుణములయొక్క, సార = మేలయిన, సామగ్రిఁ = నిండుఁదనము - పరిపూర్తిని - (చక్కఁగా పరిపూర్తినొందిన సాత్త్వికగుణముల పెంపుననుట)సవరింపఁడో= ఒడగూర్చినవాఁడుగాఁడా?యని యర్థము- (సుమనశ్శబ్దము విద్వాంసునియందేకాక పుష్పమందును వర్తించును. ధర్మమనగా విల్లును, సుమనోధర్మము= పూవింటెని, ఒనరఁ తాల్చి, సాత్త్వికగుణ = కంపము మొదలయిన సాత్త్వికభావములకుఁ జిక్కని పరిపూర్తిని గూర్చినవాఁడని భావము.) అమిత...య్యము= మితములేని పరాక్రమముయొక్క తోడ్పా

టును, ఒంది, తగువేళక్ = యుక్తకాలమున, సంకల్పసిద్ధి=తలఁచినకోర్కి ఒనఁగూడుట, ఒసంగఁడో =కలుగఁజేసినాఁడు గాఁడా యని యర్థము-(అమితప్రతాపుఁడనఁగా వసంతుఁడు - వసంతుని తోడ్పాటునొంది, విరహకాలమందు, సంకల్పమనెడు మన్మథావస్థను బుట్టించినాఁడని భావము.)

నవ...వమున్ = (శృంగారాదులయిన) తొమ్మిదిరసములయొక్కయు వానిభావముల యొక్కయు పెంపుసొంపును, చూపి = తెలియఁజెప్పి, నవ్యసాహిత్యచింతన్ = క్రొత్తయగు సాహిత్యవిద్యనుగుఱించినచింతను-నూతనముగా అలంకారశాస్త్రాదివిచారముననుట, వహింపఁజేయఁడో= కలిగింపఁ జేసినవాఁడు గాఁడా యని యర్థము.(నవరస = క్రొత్తయగు అనురాగమనెడి స్థాయిభావముయొక్కయు, భావ = నిర్వేదాదులయిన సంచారిభావములయొక్కయు, వైభవమును, చూపి = నెఱపి - పుట్టించియనుట. నవ్యసాహిత్యచింత = క్రొత్తయగు కలయికను - అనఁగా సంభోగమును - గుఱించిన చింతను వహింపఁజేసినాఁడని భావము.) అతనికిన్ = రాజునకు, సహృదయుఁడై= ఆప్తుఁడైయని యర్థము - (హృదయగతుఁడైయని భావము.) అమేయశక్తిన్=ఎన్నఁదరముగాని సామర్థ్యముచేత, ఏమేమికావింపఁజాలఁడయ్యెన్ = ఏమేమిచేయుటకు శక్తుఁడుగాకపోయినాఁడు-అన్నికార్యములును జేయనేర్చినవాఁడైనాఁడనుట. కాఁబట్టి, పతియు = రాజును, ఇతర ప్రసంగసంభావనమునన్ = తక్కిన ప్రసక్తులను ఆదరించుటయందు, తవులక = తగులుకొనక, తదేకపరవశుఁడు = ఆమన్మథునికి మాత్రమే లోనయినవాఁడు, అవుట, అరుదే = ఆశ్చర్యమా - ఆశ్చర్యము గాదనుట. పాఠాం - ఉఱదె=తగదా - తగుననుట.

అద్భుత బాణప్రయోగమును గఱపి, విద్వాంసునివలె సత్త్వగుణములు గలిగించి, ప్రతాపము నెఱపి కోరినకోర్కిసాధించియిచ్చి, సాహిత్యవిద్యయు నలవఱచి మఱియుఁ గావలసిన పనులన్నియుఁ రాజునకుఁ గావించినాఁడుగనుక నట్టి మహోపకారుఁడగు మన్మథునికి రాజు తక్కిన ముచ్చటలెల్ల మాని మిక్కిలి పరతంత్రుఁడై యుండుట వింతగాదని యర్థము. పూవువింట పూవుటమ్ములుదొడిగి బాధించి, కంపస్వేదాది సాత్త్వికభావములు కలిగించి, వసంతునిఁ దోడు సేసికొని సంకల్పావస్థనుగూర్చి, రతినిగలిగించి సంభోగచింతఁ బుట్టించి హృదయగతుఁడై మఱియునెన్నియో వలవంతలు పెట్టుట వలన రాజు తక్కిన విషయములెల్ల మాని మన్మథ వికార పరవశుఁడయ్యెనని భావము.

'జగదద్భుత' సామ్ర్ర' 'అమిత' 'వైభవము' అనెడి యీ నాలుగును వరుసగా నాల్గుపాదములందలి యుపకృతులకుఁగాని మన్మథావస్థలకుఁగాని మిక్కిలి యతిశయావహములు 'ఏమేమి ... జాలఁడయ్యె' చేసి యైనట్టియివియేకాక యిఁకనెట్టి యుపకారమేని - (మరణాంతముఖఱకుఁ గల యవస్థలేని) చేయఁజాలినవాఁడు. చాలుటకుమూలము 'సహృదయుఁడు, అమేయశక్తి' అనఁగామనస్సును శక్తియుఁగలవాఁడు. కావుననే వానికే పరతంత్రుఁడై వర్తించుటయని యర్థము. మనసునందే యున్నవాఁడు గాన మనసు వానికే పరవశమయి తక్కిన యుబుసులెల్లఁ బాటింపదని భావము. శృంగారరసము పూర్ణమయి మన్మథపారవశ్య మతిశయించెనని ఫలితార్థము. అలం. ఉభయశ్లేషము.

క. సుమనోమార్గణవశుఁడై, క్షమ యెల్లను దద్గతంబుఁ జే గావించిన భూ
 రమణుని సాంగ యశోజాలములీలం బాండిమం బఱలరె నెమ్మేనన్. ౯౪

అ. ఇందుసాత్త్వికభావమయిన వైవర్ణ్యమును జెప్పుచున్నాఁడు. సుమనో మార్గణవశుఁడై- సుమనః=మంచిమనస్సుగల, మార్గణ=యాచకులకు, వశుఁడై=లోనయినవాఁడై, క్షమయెల్లను=భూమినంతయును, తద్గతంబున్=వారలను బొందినది, గావించిన=చేసిన - వారలకు దానముచేసివైచిన,

భూరమణుని=వసురాజుయొక్క యనియర్థము. (సుమనః=పువ్వులు, మార్గణ=అమ్ములుగాఁగల మన్మథునకు, వశుఁడై, క్షమ=ఓర్పును, అంతయు వాని పాలుచేసినాఁడని భావము. 'మార్గణో యాచకే శరే' వి. 'క్షితిక్షాన్త్యోః క్షమా ప్రోక్తా' వి.) సాంగయశోజాలములిలన్=అవయవములతోఁ గూడిన- ఆకారముతోఁగూడిన - కీర్తిసమూహమువిధమున, అట్టికీర్తియోయనునట్లుగా, నెమ్మేనన్, పాండిమంబు=తెలుపు, అలరెను.

తెల్లవాఱినరాజు మేను ఆకారమువహించిన యతని దానకీర్తియో యనునట్లుండెనని యుత్ప్రేక్ష. మార్గణులు సుమనస్సులు గాన సత్పాత్రము. క్షమ 'యెల్లను' నిచ్చుట యీవి పెంపుసొంపు. తగని పాత్రమును ఇంచుక యీవియుఁగాదు. కావుననె యశస్సుయొక్క 'జాలము'. ఇట యశస్సుయొక్క పటలమును జెప్పుటచే దాని యుపమేయమగు వైవర్ణ్యముయొక్క యతిశయము వ్యంజితము. 'నెమ్మేనన్' ఒడ్డుబొడువునుగల యాతని మేనియం దంతటను బర్వినపాండిమము యశఃపటలము వ్యాపించినట్లుండెను. అలం. శ్లేషమూలకోత్ప్రేక్ష.

సీ. పెనుగట్టు గోటమీటిన మేటికిపు డెంత, యరుదయ్యెఁగన్యాకుచాద్రిగరిమ
గగనఘంటాపథక్రమణశీలున కెంత, గగనమయ్యె లతాంగి కౌనుచదలు
బలువెల్లికిల యెల్లనిలిపిన ఘనునెంత, సుడివెట్టె సతిదృగంశుస్రవంతి
యనుదినవ్యయితనవ్యసువర్ణరాశి నెం, తాసఁగొల్పె వధూవిభాసువర్ణ
తే. మనుచు విస్మితహృదయుఁడై కనికరించి, యవనిపతి కాంతరంగికుఁడగు ననంగుఁ
డనుపమోజ్జ్వలగాత్రి నయ్యచలరాజ, పుత్త్రిఁ దధీనమానసాంబుజ నొనర్చె.

అ. అవనిపతికిన్=రాజునకు, ఆంతరంగికుఁడు=మనస్సు గలిసినవాఁడని యర్థము— (అంతరంగమందుఁ బుట్టినవాఁడని భావము) అగు, అనంగుఁడు=మన్మథుఁడు కర్త, పెనుగట్టుగోట మీటిన మేటికిన్=పెద్దకొండను(కోలాహలమును) గోటిచే నెగఁజిమ్మిన గొప్పవానికి, కన్యాకుచ అద్రిగరిమ=గిరికచనుఁగొండలయొక్క పేరిమి, ఇపుడు=ఈసమయమందు, ఎంత అరుదయ్యెన్=ఎంత యాశ్చర్యమాయెను. గిరికచనుగొండలను గోటమీఁటనలవిగాని పయ్యెననుట. 'గోట' ననుచో పెనుగట్టుపక్షమున కాలిగోరనియు, చనుఁగొండలపక్షమున వ్రేలిగోరనియు తెలియునది. చనుఁగవ గోటమీటుటసహజము.

గగన ఘంటాపథక్రమణశీలునకున్=ఆకాశమనెడి రాజమార్గమందలి తిరుగుటయే స్వభావముగాఁ గలవానికి- (అనఁగా ఉపరిచరుఁడు గనుక ఇంద్రదత్తవిమానారూఢుఁడయి యాకాశమార్గమందు సంచరించువానికనుట.) లతాంగి, కౌనుచదలు=నడుమనెడి యాకాశము. ఎంత, గగనమయ్యెన్=పొందరానిదయ్యెను. ఆకాశము గగననామము గలదౌట స్వభావమే.

బలువెల్లికిన్ = బలీయమయిన (శుక్తిమతీనది) వఱదకు, ఇలన్ ఎల్లన్ నిలిపిన ఘనునకున్=భూమియంతయుఁ జెడకుండనిలిపిన గొప్పవానికి, సతి,దృక్+అంశుస్రవంతి=కన్నుల మెఱుఁగులనెడు ఏఱు, ఎంత, సుడివెట్టెన్ = సుళ్లంబెట్టెను - తప్పుల నలజడిపఱచెననుట. ఏఱు సుళ్లంబెట్టుటయు సహజమే.

అను...రాశిన్—అనుదిన=ప్రతిదినమును, వ్యయిత = వెచ్చింపఁబడిన, నవ్య=క్రొత్తలగు—సువర్ణరాశిన్=బంగారపు కుప్పలుగలవానికి—ఒక్కొక్కనాటికిని బంగారము రాసులురాసులుగా వెచ్చించువానికనుట. వధూవిభా సువర్ణము=గిరికయొక్క కాంతియనెడు బంగారము, ఎంత, ఆసఁగొల్పెన్=ఆసించునట్లు చేసెను. బంగారము ఆసగొలుపుట సహజము.

అనుచున్, విస్మితహృదయుఁడై=ఆశ్చర్యపడిన మనసుగలవాఁడై, కనికరించి, అనుపమ ఉజ్జ్వల గాత్రిన్ = సాటిలేనిదియు మెఱయుచున్నదియు నగు అవయవములు గలదియైన, అయ్యచలరాజపుత్రిన్ = గిరికను, తత్+అధీనమానసాంబుజన్ = అతనికి లోనయిన మనస్సుగలదానినిగా, ఒనర్చెన్ = చేసెను.

కుచాద్రి, కౌనుచదలు, దృగంశుస్రవంతి, విభాసువర్ణము అనువీనియందు దొక్కొక్కటఁగల యుపమానోపమేయములకు రెంటికిని బొందువడునట్లు, వరుసగా గోటమీటుట, గగనమయ్యె, సుడివెట్టె, ఆసగొల్పె నను క్రియలుంచిన చమత్కారము తెలియునది. 'మేటి' 'ఘనుఁడు' నని యట్టిగొప్పరాజే యింతటి కీడ్పడెనాయని మన్మథునికే విస్మయము. విస్మితహృదయుఁడును అంతరంగికుఁడు నగుటచే 'కనికరించి' నాఁడు. ఎవ్వతికైనా యింతకీడ్పడెనో దానినే యతనికి 'అధీనమానసాంబుజ'! నొనర్చి నాఁడు. 'అంతరంగికుఁడు' అంతరంగమున వాఁడుగాన గిరికయంతరంగమును వసురాజున కధీనము చేయుట. కుచాద్రులును కౌనుచదలును, పెనుగట్టును గగనము నతిశయించినవిగాన 'అనుపమ'ములు; దృగంశువు విభాసువర్ణమును 'ఉజ్జ్వల'ములు; కాన యది 'అనుపమోజ్జ్వల' గాత్రి. ఇందు గిరికాదేవికి వసురాజునందు ద్వితీయావస్థయైన చిత్తసంగమును బుట్టించినాఁడు.

మ. లలనారత్నము నొయ్యనొయ్య మొనవ్రేలన్ నేలవ్రాయించి ని
శ్చలవృత్తిన్ వరవర్ణ పూర్ణ ఫలకాసంగంబు నొందించి మి
న్కులు వేమాఱుఁ దదర్థచింతనలతోఁ నూల్కొల్పి నెయ్యంపు టొ
జ్జలు పైపై నెనయింపసాగెఁ బటుశాస్త్రశ్రేణికాభ్యాసమున్. 100

అ. ఇందు మన్మథుని నొజ్జలుగాను, గిరికను శిష్యురాలుగాను, రూపించి చింతావేశము మొదలు మన్మథైకపారవశ్యమువఱకుఁ గల యవస్థలను అక్షరాభ్యాసము మొదలుగా శాస్త్రపరిశ్రమమువఱకుఁగల శిక్షాక్రమముగానధ్యవసించి చెప్పుచున్నాఁడు—నెయ్యంపుటొజ్జలు=ప్రణయోపాధ్యాయుఁడు - మన్మథుఁడనుట—(ప్రేమగల యుపాధ్యాయులని యర్థాంతరము) లలనారత్నమున్= ఆఁడువారియందు మిన్నయైన గిరికను, ఒయ్యనొయ్యన్ = మెల్లమెల్లగా, మొనవ్రేలన్ నేలవ్రాయించి= (చింతపుట్టించి దానిచే) బొటనవ్రేలికొన చేత నేల వ్రాయించియని యర్థము—'చింతచే బొటనవ్రేల వ్రాయుట స్వభావము. బొటవ్రేల నేలవ్రాయుచు బొటబొటఁ గన్నులనునీరు బొబ్బిల్లఁగ(తారాశ.)

(చేతివ్రేలికొనచేత నేలవ్రాఁతలు వ్రాయించి యని యర్థాంతరము.) నిశ్చలవృత్తిన్ = కదల మెదలకుండు వ్యాపారముచేతనని యర్థము-ప్రమానుపాటుతో ననుట—(తిరమయిన వ్యాపారముచేత నని యర్థాంతరము—నిలుకడతప్పక యనుట) వర...సంగంబున్—(వరశబ్దము గొప్పవానియందును, వరునియందును, వర్ణశబ్దము వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ స్తుతౌ రూపయుతాక్షరే వి. రూపమందును అక్షరమందును వర్తించును.) వర=వరుఁడయిన రాజుయొక్క, వర్ణ=రూపముచేత, పూర్ణ=నిండిన, ఫలకా=చిత్తరువు పలకయొక్క, సంగంబున్=కూడికను, ఒందించి యని యర్థము. (నాయికానాయకు లొండొరుల చిత్తరువులు పలకయందు వ్రాయుట స్వభావము.)—(వర = గొప్పలయిన, వర్ణ=అక్షరములచేత, పూర్ణ=నిండిన, ఫలకా=వ్రాఁతపలకయొక్క, సంగంబునొందించి యని యర్థాంతరము. బాలురను పలకలయం దక్షరములు వ్రాయించుట ప్రసిద్ధము.) మిన్కులు=పలుకులు, వేమాఱున్, తత్ అర్థచింతనలతోన్ =రాజుకొఱకయిన యాలోచనలతోడ, నూల్కొలిపి = పొందుపఱిచి యనియర్థము. రాజు నెట్లుపొందఁగలుగునా యనువిచారములోఁడి పలుకులే పలుమాఱు పలికించుచు ననుట - (మిన్కులనగా చదువులునుగనుక చదువులు పలుమాఱును, తదర్థచింతనలతోన్ =వానిశబ్దార్థ

ములయొక్క వల్లనలతోఁ బొందుపఱిచి యనియర్థాంతరము. శబ్దార్థ విచారపూర్వకముగా నయ్యావి చదివించియనుట.), పటు...నమున్—పటు=సమర్థమయిన, శాస్త్రి - (శాస్త్రిమనఁగా 'నిదేశగ్రంథ యోఃశాస్త్రిమ్' అ. ఆజ్ఞ) తనయాజ్ఞలయొక్క, శ్రేణికా=పరంపరయొక్క, అభ్యాసమున్=అల వాటుననియర్థము—తనకట్టడలచొప్పున నడచుటననుట - (వ్యాకరణాదిశాస్త్రిముల నభ్యసించుటనని యర్థాంతరము) పైపైన్ = మీఁదమీఁద - అంతకంతకు, ఎనయింపసాఁగెన్ = పొందింపఁసాగెను.

మన్మథుఁడు మొదటవలపును గలిపించి చింతచే నేమియుఁదోఁపక బొటనవ్రేల నేలవ్రాయించి ప్రమాసుపాటుగలిగించి, నాయకునిరూపు చిత్తరువుపలకయందు వ్రాయించి యతని నెట్లు పొందఁగలు గునను విచారంపుమాటలే మాటికిఁ జెప్పించుచు పయిపయిని తన బలుత్రిప్పులకెల్ల లోఁపడునట్లు అలవఱు చుచున్నాఁడని యర్థము.

ఒజ్జలు నెయ్యముకలిగియుండుటచే చదువుగఱపువాఁడై మొదట చేతివ్రేల నేలపయి గీఱలు వ్రాయించి పిదప నిలుకడలోఁ బలకలయం దక్కరములువ్రాయించి యక్షరజ్ఞాన వాచకములు గుదిరిన పిదప శబ్దార్థములు మాటికిఁజింతించి గ్రహించుకొనునట్లుచేసి, అర్థాన్వయజ్ఞానము గుదిరినపిదప గొప్పవి యగు వ్యాకరణాదిశాస్త్రిపరంపరలందభ్యాసమును బయింబయిఁజేయించుట ప్రసిద్ధము. అల. శ్లేష ము.

(నాయికా నాయకులు ఒండొరులచిత్తరువు పలకలందు వ్రాయుటంగలదు.

'నేర్పుగలచిత్రకరులచే నిలయభిత్తి, భువనమోహనాకారతఁ బొలుపుమిగుల

మగని మగువను వ్రాయించి మదిఁదలంచు, నిషధరాజును దన్నుఁగా నీరజాక్షి '

ఇత్యాదులెఱుంగునది.) ఇందు నిశ్చలవృత్తియనఁగా స్తంభమనెడు సాత్త్వికభావము.

'తలకొనిన రాగభిత్త్యా, దుల కతమునఁ జేష్టలెల్లఁ దొరఁగి శిలా దా

రులఁజేసిన యట్లుండినఁ, గలితస్తంభాఖ్య సాత్త్వికంబై వెలయున్.'

శా. ఆతన్వంగి యనంగఝూంకరణ వత్‌జ్యాముక్తచూతాస్త్రని
ర్ఘాతం బోర్వక తమ్ము లంచుఁ దటినీగర్భైకసంజాతకం
జాతవ్రాతము మాటుఁ జెంద నవి యేఁచన్ సాగె మున్మున్నుగా
'జ్ఞాతిశ్చేదనలేన కిమ్మ'నెడి వాక్చారూఢి సత్యంబుగన్. 101

అ. ఆతన్వంగి=ఆగిరిక, అనంగ...ర్ఘాతంబు—అనంగ=మన్మథునియొక్క, ఝూంకరణవత్=ఝూంఅను ధ్వనితోఁగూడిన, చూతాస్త్రి=చూతపుష్పాస్త్రిముయొక్క, నిర్ఘాతంబు = దెబ్బను, ఓర్వక=సయింపలేక, తమ్ములంచున్=తోఁడఁబుట్టినవారని యర్థము-(తమ్ములనఁగా పద్మములకును బేరని భావము), తటినీ...మాటున్—తటినీ=(తనతల్లియైన శుక్తిమతీ) నదియొక్క, గర్భ=గర్భమువలన, ఏక=ముఖ్యమగునట్లుగా, సంజాత=పుట్టిన, కంజాతవ్రాతము=తామరసమూహముయొక్క, మాటున్ చెందన్=మఱుఁగునకుఁబోఁగా - తోఁడఁబుట్టువులని వారి నండ గొనఁగా ననుట. అవి = ఆతామర లు, మున్మున్నుగాన్=ముందుముందుగా, జ్ఞాతిశ్చేత్ అనలేనకిమ్= జ్ఞాతియగు నేని నిప్పులోఁ బనేమి - దాయాది యగ్నిచేసెడుపని చేయు ననెడి, వాచారూఢి = మాటయొక్కనిరూఢి - జనులు రూఢిగాఁజెప్పికొనెడిమాటయనుట, సత్యంబుగన్=యథార్థమగునట్లుగా, ఏఁచన్-సాఁగెన్ = బాధింపఁదొడఁగెను. 'తమ్ముఁ... జెందన్' అతిశయోక్తి. 'జ్ఞాతిశ్చే...' అర్థాంతరన్యాసము.

'ఝూమ్' అని యల్లెత్రాడు మ్రోగుటచే ఏటు మిక్కిలి బెట్టిదముగావలయును. కావునని య్యా దెబ్బకునోర్వక తామరలను 'తమ్ముల'నియు తటినీగర్భైక సంజాతమ్ములనియు నండగొన్నది. ఇట్టి

గర్భశబ్దము తమ్ములనుటను శబ్దశక్తిచే సమర్థించుటకు నదిలోపలయని భావము. నదిలోపలిపంకమునుండికదా తామరతీఁగ పొడముచున్నది. కన్యకుఁ బెండ్లికిమునుపు జ్ఞాతిత్వముగలదని శాస్త్రముగనుక శుక్తిమతి యందుఁ గిరికతోడఁబుట్టిన హేతువువలనఁగలిగిన జ్ఞాతిద్వేషముచేఁ దామరలు గిరికను బాధింపసాగె నని యర్థము. తామరలగ్గివలె వేఁడిగాఁ జూపట్టెనని తాత్పర్యము. కామార్తులకు శిశిరోపచారముగా తామరలనుహత్తించుటగలదు. వారికి తామరసాదులు మేనికి వేఁడిమియగుటయుఁ బ్రకటము. 'చిగురుఁ దామరపాకు జవ్వంచుచనుదోయిమొనల క్రొవ్వేఁడిని ముడుఁగఁబాఱె'. (శృంగార. నైషధ.)

· చ. ఎరువుగఁ జూడ సాఁగె హరిణేక్షణ పిన్నటనాఁటనుండియుం
బరిచితిఁ బూని మంజుగతిమాధురియుఁ మృదువాగ్విభూతియుఁ
వరుసనె తెల్పి తల్లికడవారును దండ్రి భజించువారు నై
గరిమముఁ గన్నసద్ద్విజశిఖామణులఁ వసులుబ్ధచిత్తయై. 102

అ. 'సద్ద్విజశిఖామణుల'నుటచే హంసశుకపరముగాను బ్రాహ్మణపరముగాను నర్థద్వయము. హరిణేక్షణ=గిరిక, పిన్నటనాఁటనుండియుఁ = చిన్నప్పటినుండి, పరిచితిఁ పూని = మచ్చికనొంది, (హంస)మంజుగతిమాధురియుఁ=సొగసయిననడల యొక్క మురిపెమును, మృదువాక్ విభూతియుఁ= మెత్తనిపలుకుల పెంపుసొంపును, వరుసనె=వెంబడివెంబడిగా, తెల్పి=నేర్పి, (బ్రాహ్మ)మంచినడవడియు తిన్ననిమాటలును నేర్పి, తల్లికడ...మణులఁ - ద్విజశబ్దము పక్షులందును బ్రాహ్మణులందును వర్తించుచున్నది. (హంస)తల్లియైన శుక్తిమతి, కడవారును = రెండుదరులందు వసించువారును - తండ్రియగు కోలాహలుని సేవించువారునునై గౌరవములనుబొందిన మేటిపిట్టలయిన హంసములకు చిలుకలకు, (తల్లి కడవి అంచలు తండ్రికడవి చిలుకలు. పక్షిపరముగా 'తల్లికడవియు' తండ్రిభజించునవియు నని యుండవలయుటకు మహద్వాచకములకుంబోలె 'వారును' అనుట సాధువుగాకున్నను శ్లేషానుగుణ్యమునకై సాధువుగా గ్రహింపఁదగును.—(బ్రాహ్మ)తల్లి వంకవారును దండ్రి పోష్యవర్గము లోనివారునై పెద్దఱికముగాంచిన బ్రాహ్మణశ్రేష్ఠులకు ('దన్తవిప్రాణ్డజా ద్విజాః' అ.) వసులుబ్ధచిత్తయై=వసురాజునందు పేరాసగల మనస్సు గలదై యనియర్థము. (ధనమందుఁబేరాసగల మనస్సు గలదైయని యర్థాంతరము.) ఎరువుగఁ=మఱియొక్కటిగా, చూడసాఁగెను=పెఱవారను బుద్ధితోఁ జూడఁదొడఁగె ననుట.

ధనలుబ్ధునకు, తల్లివంకవారని తండ్రి వంకవారని కాని, పెద్దలనికాని, బ్రాహ్మణోత్తములని కాని పాటించుటగలుగదు. వారో కేవల 'ద్విజులు' కారు. ద్విజశిఖామణులు, అందును 'గరిమము' గన్నవారు. వారినిబట్టి గౌరవమునఁ గాకపోయినను, తల్లిదండ్రినిబట్టియేని ప్రేమమున నయినను, కాకున్న పిన్నటినాఁటినుండి గల తన చెలికారమును బట్టియైనను, తనకు మంచినడవడియు మంచి పలుకుబడియు గఱపిన యుపకారధర్మమును బట్టియయినను, బాటించుట కలుగదయ్యెనని వసు లోభంపు ఔత్కట్యము ఉద్ఘాటితము. మనస్సు వసురాజునందు మరులుగొన్నదనియు, అట్టియవస్థ యందుద్దీపకములుగాన యంచలును జిలుకలును కామార్తిజనకములై యసహ్యము లాయెననియుఁ గావున వానిని ఎరువుగఁ జూడసాగెననియు భావము. పిన్నటి నాఁటినుండియుఁ బరిచితికి నిందే 'మందయానము నేర్పు నిందిందిరాజీవ రాజీవరాజన్మరాళరాజి, కలికిపలుకులు నేర్పు లలితనానా వాసనా వాసనికట కాననశుకాళి'. యనియున్నది. అల. శ్లేషమూలక కావ్యలింగము. శ్లేషోత్థాపితమగు సమాసోక్తియని కొందఱు.

తే. ఆ కులాహార్యనందనకయి యలసపవనఁ, జాలములఁ దూలగతిఁ జాలఁ దూలఁదొడఁగె
గరిమఁ దానెంత యచలేంద్రకన్యయైన, బలుచనగుఁగా దెఘనవసుప్రార్థనమున.

అ. ఆకుల, అహార్యనందన(—'అహార్యధరపర్వతాః')ఆ కులపర్వతపు కూఁతురు—గిరిక,అలస పవనజాలములన్ = మందమారుత సమూహములచేత, తూలగతిన్=దూదివలె, చాలన్, తూలఁ దొడఁగెన్=తూలిపోసాఁగెను. అదియుక్తమే—ఎట్లనిన, గరిమన్ = పెద్దఱికముచేత, తాను, ఎంత, అచలా+ఇంద్రకన్యయైనన్ = ('భూర్భూమి రచలానంతా' అ.) రాజకన్యకయైనను, ఘనవసుప్రార్థనమునన్=మిక్కిలియగు ధనవిషయమైన యాచనచేత, పలుచనగుఁగాదె = చులుకఁదనమును బొందుచున్నదే కాదా యనియర్థము. గరిమన్=దుర్భరత్వముచేత, తాను, ఎంతయచలేంద్ర కన్యయైనన్= ఎంత పర్వతరాజ పుత్రియైనప్పటికిని, ఘనవసు ప్రార్థనమునన్=గొప్పవాఁడగు వసురాజును గుఱించిన యాచనచేత, పలుచనగుఁగాదె = కృశత్వము నొందుచున్నదే కదాయని యర్థాంతరము.

గాలియో బెట్టిదముగాదు. 'అలస'మైనది. అది తూలించినదో కొండలలో కొండయైన కులపర్వతపు కూఁతును.అట్టిదిగాన తూలించుట యను మాటయే తలపెట్టరాదు. తూలింపఁ జాలెనన్నను ఎంతో కష్టముమీఁదఁగదా కావలయును. అట్టిది'తూలగతిన్'మిక్కిలి చుల్కఁగానైనది-పెనుగొండపట్టి దూదిపింజయైనది. ఇందలివిరోధమునకు 'ఆకుల అహార్యనందన' అనుసమాసాంతరము నాశ్రయించుటం జేసి ఆకులయైనదిగాన తూలుట చెల్లునని పరిహారము గలుగుటచేతవిరోధాభాసము.'అచలేంద్రకన్య'యను చో పర్వతకన్య రాజకన్యయను రెండర్థములకు ననుగుణముగా గరిమ (బరువును గొప్పతనమును.) 'పలుచన' (తేలికయు తక్కువపాటును) అని 'గరిమ' 'పలుచన'శబ్దములను రెండర్థములు గలవిగాఁ గవి నిబంధించినాఁడు. ఇందలంకార మర్థాంతరన్యాసము.

ఉ. చెలితెలిచిప్పముత్తియపుఁ జిప్పల నొప్పగు బాష్పవారి చి
ప్పిలి చనుగట్టుపైఁ దొరఁగు పెంపు నుతింపఁగ నయ్యె నయ్యెడన్
వెలఁది మనోగతం బరసి వెల్వడి శుక్తిమతీస్రవంతి యా
యలికులవేణిఁ గాంచినమహాద్రికిఁ దెల్పఁగ నేఁగుకైవడిన్. 104

ఆ. చెలి,తెలి చిప్పముత్తియపు చిప్పలన్ = తేటలయిన కనుఱెప్పలనెడు ముత్తెపు చిప్పలయందు, ఒప్పుఅగు, బాష్పవారి=కన్నీరు, చిప్పిలి=వెల్లివిరిసి, చనుగట్టుపైన్=చన్నుఁగొండపయిని, తొరఁగుపెంపు = స్రవించునట్టి వైభవమును, అయ్యెడన్ = ఆసమయమందు, నుతింపఁగన్, అయ్యెన్=పొగడఁ దగియుండెను. ఎట్లనిన - శుక్తిమతీస్రవంతి=శుక్తిమతీనది. వెలఁది మనోగతంబు= కూఁతురయిన గిరికమనస్సులోని భావమును, అరసి=తెలిసికొని, వెల్వడి=వెడలివచ్చి, ఆయలికులవేణిన్ కాంచిన మహాద్రికిన్ = ఆతుమ్మెద గుంపులవంటి జడగలదానిని, కన్నట్టి పెనుగొండయగు కోలాహలునికి, తెల్పఁగన్, ఏఁగుకైవడిన్ = పోవుచున్నదో యనునట్లుగా, నుతింపఁగ నయ్యెనని సంబంధము.

ఱెప్పలు, (తెలి)=తెల్లనై తేటలయినవి. కావుననే ముత్తెపుచిప్పలు.ముత్తెపుచిప్పలనుండి తొరఁగునట్టి కన్నీరు, ముత్తెముచిప్పలనొప్పుచున్న శుక్తిమతి జలపూరమునకుసాటి.చన్ను కోలాహలునికిసాటి గట్టుగాన గట్టుతోడి సామ్యమని భావము. బాష్పవారి శుక్తిమతీనదిగా రూపించుటచేత అవ్వారిగాఁ దొరుఁగుటయు నిక్కగల చన్నులను దడుపుటయు వ్యంజితములు. అలం. ఉత్ప్రేక్ష. 'తెలిఱెప్పముత్తియపుఁజిప్ప చ్చనుగట్టు' అని వానియందలి రూపకముచేఁ బోషితము.

చ. కొమిరె మనోవ్యథం బొగులఁ గ్రుచ్చి కవుంగిటఁ జేర్చితల్లి శు
క్తిమతి తదీయతాపశిఖ కీలల నింకఁగఁ బోలుఁ గానిచో

రమణిమెయిన్ బిసాంకురపరంపరలున్ ఘనసారవాలుకా
సముదయమున్ సుజాతజలజాతదలంబులు నుల్లసిల్లునే. 105

అ. కోమిరె=కూఁతురయినగిరిక, మనోవ్యథన్=మనస్సు వేదనచేత, పొగులన్=తపింపఁగా, తల్లి శుక్తిమతి, క్రుచ్చి, కవుంగిటఁజేర్చి=బిగియఁ గౌఁగిలించుకొని, తదీయతాపశిఖికీలలన్=ఆగిరికదయిన విరహతాపమనెడు అగ్నిసెగలచేత, ఇంకఁగన్ పోలున్=ఇగిరిపోయి యుండవచ్చును. కానిచోన్= అట్లుకానియెడ, రమణిమెయిన్=గిరికదేహమందు, బిసాంకుర పరంపరలున్=లేఁత తామరతూఁడుల సమూహములును, ఘనసారవాలుకాసముదయమున్ = కర్పూరమనెడు ఇసుకతెరయును, సుజాతజలజాత దలంబులున్ - సుజాత = లెస్సగాఁబుట్టిన-సొగసయిన, జలజాతదలంబులున్ = తామర రేకులును - మిగుల మెత్తనివయిన తామరలోపలి రేకులనుట. ఉల్లసిల్లునె=ఒప్పుచుండునా.

గిరికకు శైత్యోపచారములుగా నొనఁగూర్చిన బిసాంకురాదులను, గిరికను దల్లి శుక్తిమతి కౌఁగిలించికొని యాకూఁతు విరహజ్వాలలందు నిగిరిపోఁగా నానదియందు మిగిలిన బిసాంకుర వాలుకాపద్మ దలములుగా నుత్ప్రేక్షించినాఁడు. గిరిక విరహతాపము పెల్లుదనము దెలియునది. బిసాంకురాదులచేత శుక్తిమతీశోషము నూహింపఁబడుటవలన, అలం. అనుమానము.

చ. ప్రసవశరాఖ్యయోగి బహుభంగుల భావన లిచ్చి మర్దనం
బెసఁగఁగ ధాతువేర్చి బలియించి రసంబు నిశాంత మంతయు
న్వసువుగఁ జేయ మైమఱచి నాతిగలన్మణి భూష లెన్న దా
ప్తసఖులు చేరి పల్కినను బల్కదు చూచియుఁ జూడదెంతయున్. 106

అ. ఇందు మన్మథపరముగాను యోగిపరముగాను అర్థద్వయము. ప్రసవశర + ఆఖ్యయోగి= మన్మథుఁడనెడి రసవాదముసేయు యోగీశ్వరుఁడు, బహుభంగులన్=పెక్కువిధములుగా, భావనలిచ్చి=(మన్మ) సంకల్పములును బుట్టించి-(యోగి) (వృక్షరసములచేత భావనలుచేసి, మర్దనంబు=(మన్మ) పీడించుట — (యోగి) నూఱుట, ఎసఁగఁగన్ = అతిశయింపఁగా, ధాతువుఏర్చి = (మన్మ) ఇంద్రియములఁ గాల్చి - ఇంద్రియమూర్ఛ గలిగించి—'ధాతుర్స్నేంద్రియేషుచ, శబ్దయోనిమహాభూత తద్గణేషు రసాదిషు। మనశ్శిలాదావశ్లేష్మాదా విశేషా ద్గైరికేఽస్థ్నిచ' (మేదిని.) (యోగి) - అభ్రకాది గైరికధాతువులను గూర్చి, రసంబు బలియించి—(మన్మ) 'రసోగంధ రసేజలే' శృంగారాదావిషేవీర్యే తిక్తాదా ద్రవరాగయోః। దేహధాతుప్రభేదేచ పారదస్వాదయోః పుమాన్' మే.) అనురాగరసమును మిక్కుటముచేసి—(యోగి) పాదరసమును బంధించి యని యర్థాంతరము. నిశాంతము అంతయున్ వసువుగన్ చేయన్ — (మన్మ) ఇల్లంతయు వసురాజుమయముగాఁ జేయఁగాననుట.— (యోగి) ఇల్లంతయు బంగారుమయముగాఁ జేయఁగా. మైమఱచి = (మన్మ) దేహస్థితి యెఱుఁగనిదై —(యోగి) మదముచేత నొడలుదెలియనిదై నాతి,=గిరిక, గలత్ మణిభూషలు=జాతి పోవుచున్న రతనాలసొమ్ములను, ఎన్నదు=మన్మథవికారముచేత పాటింపఁదని యర్థము. —(మదముచేతఁ బాటింపదని యర్థాంతరము) ఆప్త...పల్కదు=అనుగుఁజెలులు దగ్గఱఁజేరి మాటలాడినను బలుకదని యర్థము—(అనుంగు చెలులుపల్కరించినను బదులుచెప్పి యాదరింపదనిఅర్థాం)చూచియున్ చూడదు ఎంతయున్=దగ్గఱనున్న వస్తువులను గూడఁ జూడదని యర్థము-కన్నుమిన్నుఁ గానదనిఅ.

ఇందు బహుభంగుల భావనలనఁగా సంకల్పమనెడి యవస్థావిశేషము. మర్దనమనఁగాఅంతఃకరణ ద్రవీభవనము. ధాతువేర్చుట యనఁగా ప్రలయమనెడి సాత్త్వికభావము. 'ప్రలయస్సుఖదుఃఖాద్యైః

ర్గాఢమింద్రియతాపనమ్'. రసము బలియించి యనఁగా రతియనెడు స్థాయిభావము. వసురాజును సర్వత్ర చూచుట, ఉన్మాదమనెడి సంచారిభావము.'ఉన్మాదశ్చిత్తవిభ్రమః' అ. మైమఱచుటయుజాఱిన సొమ్ములు సవరింపకపోవుటయు సఖులకు బదులియ్యకపోవుటయు మోహామనెడి సంచారిభావము. అలం. శ్లేషానుప్రాణితమగు రూపకము.

ఉ. కొంచక యంబుధిం బడినకొండలపత్త్రము లూడ్చదయ్యె నూ
అంచుల కత్తిదాని యుదుటెంతయు నెంతని కంతుచేతి నూ
అంచుల కత్తి హత్తి జవరాలికుచాద్రుల ముంచెఁ బత్త్రరే
ఖాంచితవైభవం బెడల నాతతబాష్పమహాపయోనిధిన్. 107

అ. నూఱంచులకత్తి=శతకోటియైన వజ్రాయుధము,కొంచక=జంకక, అంబుధిన్ పడినకొండల పత్త్రములు=సముద్రమందు పడినకొండల ఱెక్కలను, ఊడ్చదయ్యెన్=కొట్టివైవదాయెను.'ఊడ్చన్' అని చకారమునకు ముత్తు పరంబగునపుడు పకారము రావలసియుండియు రామికి, 'కం, జాతర్వాతము మాటుఁజెంద నవి యేఁచన్ సాగె' నని ౧౦౧ వ పద్యమే యుపోద్బలకము. దానియుదుటు అంతయు నెంత=దానిపదటమెల్ల ఎంతపాటిది, అని, కంతుచేతి నూఱంచులకత్తి=మన్మథునిచేతనుండెడి శత కోటియని యర్థము ..(శతపత్రము అనఁగా అరవిందమని భావము) హత్తి=తాఁకినదై, పత్త్రరేఖా అంచితవైభవంబు=ఱెక్కలరేకల యొప్పుచున్న పెంపును, ఎడలన్=వీడిపోవునట్లుగా నని యర్థము. (మకరికాపత్రపు రేకల యొప్పుచున్న పెంపు తూలునట్లుగానని భావము.) జవరాలికుచాద్రులన్= గిరికచన్నులనెడి కొండలను,ఆతత...నిధిన్=విరివియైన కన్నీరనెడు మహాసముద్రమందు, ముంచెను.

ఇంద్రునిచేతి నూఱంచులకత్తి మైనాకాదిపర్వతములను పత్త్రము లూడ్పకయే సముద్రమాత్ర మందుఁ బడంజేసినది. మరుని నూఱంచులకత్తియో గిరిక కుచపర్వతములను పత్త్రములెల్ల వీడునట్లుగా మహాసముద్రమునందు ముంచినది. కాన దానికంటె నిదియే యెంతో యెక్కువయని యర్థము. ఆమై నాకాదులు సముద్రమున నింద్రునికత్తిచేతఁగాదు మఱియొకదానిచేత—(అనఁగా వాయువుచేత)నూ రకపడినవి మాత్రమే. గిరికాకుచాద్రులో మరునినూఱంచుల కత్తిచేతనే యూరకపడుటగాక యడు గంట ముంపఁబడినవి. బాష్పము 'అతీత' మైనదిగాన దానిచే సముద్రము 'మహా'సముద్రము. జవరా లనుచో 'ఆలు'శబ్దమునకు విశ్రమము చెల్లుటకు.

క. 'ఆలనుపదంబు మొదలను ♦ రాగమంబు, వచ్చుసంధికి నుభయంబు ♦ వడికిఁ జెల్లు
నతివ జవరాలుబాలెంత ♦ రాలు ముద్ద, రాలు ధర్మాత్మురాలన ♦ రాక్షసారి. (అప్పకవీయము)

ఇందు 'కంతుచేతి నూఱంచులకత్తి' యనుచో నతిశయోక్తి 'కుచాద్రులు' 'ఆతత...నిధి' యనుచో రూపకములు. ఇంద్రుని నూఱంచుల కత్తికంటె మరుని నూఱంచులకత్తికి నుత్కర్షముచెప్పుటచే వ్యతి రేకము పూర్వోక్తములయిన యతిశయోక్తి రూపకములచే అనుప్రాణితము. మైనాకుఁడు వాయు వుచేత సముద్రమునంబడుట.

'పూర్వంకృతయుగే తాత పర్వతాః పక్షిణోఽభవన్ । తే హి జగ్ముర్దిశస్సర్వా గరుడానిలవేగినః ॥
తతస్తేషు ప్రయాతేషు దేవసంఘాస్సహర్షిభిః। భూతాని చ భయంజగ్ముస్తేషాం పతనశంకయా ॥
తతః క్రుద్ధస్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః। పక్షాంశ్చిచ్ఛేద వజ్రేణ తత్ర తత్ర సహస్రశః॥
స మాముపగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్। తతోఽహం సహసా క్షిప్తః శ్వసనేన మహాత్మనా॥
అస్మిన్లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ। గుప్తపక్షస్సమగ్రశ్చ తవ పిత్రాభిరక్షితః ॥ (రామాయ)

'సుజాత జలజాత దలంబులుం' అని తామర యాకుల శిశిరోపచారమునకై గిరిక మేనహత్తించి రనియు, మదనతాపంపుఁ జెల్లునకు సయింపక కన్నుఁగవవెల్లి గబ్బిగుబ్బలపయి దిగుపాటి ముంచె ననియు ఫలితార్థము.

క. కంజనయనావిలోకన, ఖంజనయుగ మెదకు వ్రాలఁ గని వసు వాలో
రంజిలుటఁ దెలిసి శంబర,భంజనుఁ డతినిశితవిశిఖ పంక్తి నగల్చెన్. 108

అ. ఇందు మన్మథపరముగాను కిరాతపరముగాను అర్థద్వయము. శంబరభంజనుఁడు=(శంబర శబ్దము 'శంబరో దైత్యహరిణమత్స్యశైలజలాంతరే' అని శంబరాసురునియందును లేడియందును వర్తించుచున్నది గనుక) శంబరాసురుని ఖండించినమన్మథుఁడని యర్థము. లేడిని భంజించు కిరాతుఁ డని యర్థాంతరము. కంజ... యుగము-కంజనయనా=తమ్మికంటియైన గిరికయొక్క, విలోకన=చూపుల నెడు, ఖంజనయుగము=కాటుక పిట్టలజోడు, ('ఖంజరీటస్తు ఖంజనః' అ.) 'లోకే దృశౌ రుచిర చఞ్చలఖఞ్జరీటౌ' అమరుక. కాటుకపిట్టలకు చూపులకు నౌపమ్యము, ఎదకున్ వ్రాలన్=హృదయ ప్రదేశమందు వ్రాలఁగానని విలోకనపరమైన యర్థము— ఎదకువ్రాలుటయనఁగా సంభోగమునకై వ్రాలగానని ఖంజనపరమైన యర్థము - ఎదయనఁగా పశుబుతువు. ఇట తన్మూలమైన సంభోగము - లక్షితము.) కని=చూచి, వసువు ఆలోన్ రంజిలుటన్ తెలిసి=(వసువనఁగా వసురాజును ధనమునుగనుక మన్మథపరముగా) వసురాజాగిరికాహృదయములోఁ బ్రకాశించుటను దెలిసినవాఁడై,(కిరాత) ధనము కాటుకపిట్టలు సంభోగార్థమై వ్రాలిన భూమిలోనుండుటను దెలిసినవాఁడై, అతినిశిత విశిఖపంక్తిన్= మిక్కిలివాఁడియైన యమ్ముల సమూహముచేత, అగల్చెన్=భేదించెను. ఇది యుభయత్రసమానము.

గిరిక దుఃఖభరముచే తలవ్రాల్పఁగా నామెచూపుఁగవ యొమ్ముపయి నెలకొనెననియు దానిచే నామెహృదయమందు వసురాజు వెలయుచున్నాఁడనియుఁ దెలిసి మరుండు మఱియు దెప్పరముగాఁ గారించెనని యర్థము. కాటుకపిట్టలు సంభోగమునకు వ్రాలుచోట ధనముండునఁట. అలం. శ్లేషమూలక రూపకము.

'ఖంజరీటమిథుననిధువనసంచారోపజ్ఞాతనిధిగ్రహణకౌతుకితమతికిరాత ఖన్యమానస్థపుటితాభ్యాశజలాశయాః' 'తస్మిన్నిధిర్భవతి మైథునమేతి యస్మిన్' (బృహత్సంహిత.)

తే. పూఁటపూఁటశరత్కోటి పొడము కతన, విన్ననై యన్నదీకన్య వేణి దూల
సన్నగిలియున్న గతి నెన్నఁజను నెయకట, యూర్మికలు కంకణాకృతి నొనరెనపుడు.

అ. ఇందు 'నదీకన్య' యనుటచే అల్పనది పరముగాను గిరికాదేవిపరముగాను నర్థద్వయము తెలియునది. పూఁటపూఁట శరత్కోటి పొడముకతనన్ = ఒక్కొక్క నాఁడును సంవత్సరకోటి పుట్టుట కారణమువలన - అనఁగా ఒకదినము కోటిసంవత్సరములుగా నుండుటచే యని యర్థము. (శరత్కాలపు కోటిభాగము - దినదినమును శరత్కాలమందుఁ గొంత గొంత భాగముజరుగుట.-యనియర్థాంతరము,) శరదృతుకాలమునం దంపలి దినములు దానిభాగములుగా నెన్నుట తెలియునది. అన్నదీకన్య=ఆ గిరికాదేవి,(అల్పనదియేఱు)విన్ననై=చిన్నఁబోయి యని యర్థము - (నీరువట్టిపోయయని యర్థాంతరము.)వేణితూలన్=జడతూలిపోఁగా (ప్రవాహము తీసిపోఁగాననియు), సన్నగిలియున్నగతిన్=చిక్కిపోయియున్న విధమును, ఎన్నఁజనునె=తలఁపఁగూడునా - తలఁప నలవిగాదనుట. అకట=అయ్యయ్యో, అపుడు=ఆసమయమందు, ఊర్మికలు కంకణాకృతిన్ ఒనరెన్=ఉంగరములు కంకణములాయెను. (అలలు జలకణప్రాయములయ్యెననియు.)

దినమొక్క సంవత్సరముగా గిరికకుఁ దాపమెచ్చుటచే నాబిడ చిన్నఁబోయి జడసొంపుతూలఁగా మిక్కిలి చిక్కెను. దానిచే నామె యుంగరములు చేతి కడియములయ్యెనని యర్థము. కృశత్వముచేత నుంగరములు కరకంకణము లగుట. కరముద్రిక చూడహస్త కంకణమయ్యెన్. (చాటు) నాఁడు నాఁటికి శరత్కాలము కొంతకొంత జరుగుచుండఁగా నాచిన్నయేఱు నీరింకి వెల్లువతీసిపోయి సన్నగిలెను. దానియలలు జలబిందుప్రాయములయ్యెనని యర్థాంతరము. విరహార్తిని స్త్రీలు జడవేసికొనమిచే నది సొంపు చెడుట. అల. శ్లేషానుప్రాణితమగు సమాసోక్తి.

'ఏకవేణీధరా సీతా వాసో మలినమంబరమ్' (రామా) 'ఆద్యేబద్ధావిరహదివసే యాశిఖా దామ హిత్వా, శాపస్యాన్తే విగళితశుచా తాం మయోద్వేష్టనీయాం, స్పర్శక్లిష్టా మయమితనఖేనా సకృత్సారయన్తీం,... ఏకవేణీంకరేణ. మేఘసందేశము'.

సీ. మది నున్నమరుఁడు పంపన్ మహోగ్రగతి వచ్చు, కమ్మఁదెమ్మెర లనన్ గదిసె నూర్పు
లూర్పుగాడ్పుల రాకకు నులికి పాండుమృణాల, కుండలిపైఁ బూనెఁ గుచసురాద్రి
కుచసురాద్రి కరంగెనో ఘోరతాపార్చినాఁ, బడసెఁ బుప్పొడితోడి వలపుఁజెమట
చెమటవెల్లువకు ఫేనములయ్యెఁ బెనుఁగాఁక, నవసి నీరుగఁ బొంగు హారమణులు
తే. హారమణి వారతారాపసారమును గ, ఠోరమూర్ఛాంధకారవిస్తారమును న
పారమై రేయుఁబగలు నేర్పఱుపకునికి, మగువకనుఁదమ్ములరమోడ్పు మఱవవయ్యె.

అ. మదిన్ ఉన్నమరుఁడు పంపన్=మనస్సునందున్న మన్మథుఁడు పంపఁగా, మహోగ్రగతిన్= మిక్కిలి యుగ్రమయినవిధమున, వచ్చు, కమ్మదెమ్మెరలు= మలయమారుతములో, అనన్, ఊర్పులు, కదిసెన్=దాఁపరించెను, ఊర్పుగాడ్పు రాకకున్=నిట్టూర్పు లనెడి వాయువులువచ్చుటకు, ఉలికి=భయపడి, కుచసురాద్రి=చన్ను లనెడు మేరుపర్వతము, పాండుమృణాల కుండలిన్=తెల్లనితామర తూఁ డనెడి సర్పమును — తెల్లనిసర్పమనుటచే శేషుని ననుట. పైన్, పూనెన్. ఘోరతాప అర్చిన్ = బెట్టిదమయిన విరహంపుకాఁక యనెడు అగ్నిచేత, కుచసురాద్రి=చన్ను లనెడు బంగారుకొండ, కరంగెనాన్= కరఁగినదో యనునట్లుగా, పుప్పొడితోడి వలపుఁజెమట=పూవుపొడితోఁగూడి వాసనలుగుబాళించు చెమట, పడసెన్=కలిగెను. చెమట వెల్లువకున్, పెనుఁగాఁకన్=బెట్టిదమయిన విరహతాపముచేత, అవిసి=కుమిలి, నీరుగన్ పొంగు=నీళ్లుగా నుబుకుచున్న, హారమణులు = హారపుముత్తెములు, ఫేనములయ్యెన్=నురుఁగులయ్యెను. హారమణివార=హారపుముత్తెముల సమూహమనెడు, తారా = నక్షత్రములయొక్క, అపసారమును= పోవుటయును, కఠోర=కటువయిన, మూర్ఛా= పరవశత్వ మనెడు, అంధకార=కాఱుచీఁకటియొక్క, విస్తారము=ఆధిక్యమును, అపారమై=తుదిలేనిదై, రేయుంబగలు నేర్పఱుపకునికిన్=రాత్రియగుటయు పగలగుటయు నేర్పాటుగాక యుండుటచే, మగువకనుఁ దమ్ములు=గిరిక కన్నులనెడు తామరలు, అరమోడ్పు మఱవవయ్యెన్=సగము మోడ్చుటను మానకుండెను.

మన్మథునికి కమ్మదెమ్మెరలను బంపఁగలుగుట కతఁడు వానినెక్కు రౌతుగాన. 'మహోగ్రగతి వచ్చు' తెమ్మెరలనుట యూర్పులపండు దట్టమునకు. 'కమ్మ' తెమ్మెరలనుట గిరిక యూర్పులతోడి పోలికకు. మన్మథతాపముచేత నిట్టూర్పులు వేండ్రముగా నిగిడెను. గాడ్పును మ్రింగుగొంగ సర్పముగాన కుచసురాద్రి పాండుమృణాళకుండలిని పయిని బూనినది. కుచములపయి నిట్టూర్పులు పొలయుటచే దాని యౌన్నత్యము వ్యంజితము. తొల్లి వాయువునకు నాదిశేషునికి బలాధికు లెవరని వాదుపుట్టఁగా నప్పు డాదిశేషుఁడు మేరుగిరిశృంగమును బడగలచేఁగప్పి దానిని గదల్పుమని వాయువునకుఁ జెప్పఁగా

నతఁడు గదల్పక పోయెనను పురాణకథ యిట యనుసంధించునది. గిరిక పద్మినీజాతి ప్రయుక్తమయిన పద్మగంధము మేనగలదిగాన చెమటకు వలపు; చెమ్మట, కరఁగిన బంగరుకొండద్రవమువలె పసిమి నొందుటకై పుష్పాడితోడికూడిక. చన్నులయందుఁ దామరతూండ్లు చలువకై కప్పఁబడినవి.

కాఁకచే హారమునందలి ముత్తెములు పెటిలుట. తాపము నుమ్మరముచే చెమ్మట వెల్లువ. ఉమ్మర మునకు హారపుముత్తెములు పెటిలఁగా ఆవెల్లువకు 'నురుఁగు'లయ్యెను ముత్తెములనెడి చుక్కలు పోయి నందునఁ బగలు; మూర్ఛయనెడి కటికిచీఁకటి క్రమ్ముటచే రాత్రి. పగలును రాత్రియు నొక్కటఁ గలు గదుకాన రేయనియు పగలనియు ఏర్పఱుపకునికి. కాన కన్నులనెడి తామరలు పగలుగాన విచ్చియు రేయిగాన మోడ్చియుఁ దుదకు అరమోడ్పునొందెను.

మొదటి మూఁడు పాదముల మూఁడుత్ప్రేక్షలు. రెండవది రూపకసంకీర్ణము గమ్యము. మూఁడవది రూపకోత్థాపితము. నాల్గవపాదమున పరంపరిత రూపకము. గీతిని రూపకానుప్రాణిత కావ్యలింగము.

సీ. వరగుణజాల సంవనన సామగ్రితోఁ, బాశంబు లాశలఁ బాదుకొల్పి
చటులతాపానల జ్వాలికల్ నెఱపి జీ, వనమంతయుఁ గలంచి వనచరాళి
నిస్వనంబులు రేఁచి నిగురుకాతర నేత్ర, శంబరంబులు వాడు శరభగండ
కములుదూలెడుచిత్రకాయలీలలుసోయ, గములుపీడ్కొనుభద్రగతులుజడియు

తే. నాతతస్తబ్ధరోమంబులలసివ్రాలు, ఘనసితాపాంగములుగాఁగఁ గాండవృష్టిఁ
పఱపివేఁటాడఁదొడఁగె శంబరవిరోధి, కాంతయౌవనరేఖలోఁ గలయమెలఁగి.

అ. ఇందలి గీతియందుఁగల 'శంబరవిరోధి' యనెడు విశేష్యపదమునకు మన్మథుఁడనియుఁ గిరాతుఁడనియుఁ బ్రకృతాప్రకృతశ్లేషముగల్పించి యంతట నర్థద్వయము గలుగఁజెప్పినాఁడు. శంబరవిరోధి=మన్మథుఁడని యర్థము. (కిరాతుఁడని యర్థాంతరము) కాంత, యౌవన+రేఖలోన్ = పరువముయొక్క యొప్పిదములో, (కాంతయౌ + వనరేఖలోన్ = అందమయిన అడవి వరుసలో ననియు), కలయన్, మెలఁగి=అంతటను దిరిగి, వర...మగ్రితో—(మన్మథ) వర= వరుఁడైన రాజు యొక్క, గుణజాల=రూపయౌవనాది గుణముల సమూహమనెడి, సంవనన సామగ్రితోన్ = వశము చేసికొనుట యొక్క నిండుతనముతో - (కిరాత) వర = మేలయిన, గుణ=ఉరిత్రాళ్లయొక్కయు, జాల=వలలయొక్కయు, సంవనన = వశక్రియలయొక్కయు, సామగ్రితోన్ = సాధనములతో ('వశక్రియా సంవననమ్' అ.) పాశంబులు = (మన్మథ) (ఇట పాశశబ్దముచే బంధములు లక్షితము.) బంధములను, ఆశలన్ = ఆశలచేత, పాదుకొలిపి = నెలకొలిపి, తిరముగావించి - ఆశాబంధములు గలిగించియనుట - (కిరాత) పాశములు = ఉరుత్రాళ్లు, ఆశలన్ = (దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః' అ.) దిక్కులందు, పాదుకొలిపి=ఘటించి యనియు

చటుల...జ్వాలికల్ = (మన్మ) వేండ్రమయిన తుందుడుకులనెడు అగ్గిసెగలను, నెఱపి=పర్వఁజేసి- (కిరాత) వేండ్రమయిన క్రాఁచుటగల యగ్గిసెగలను నెరపియనియు, జీవనమంతయున్ కలంచి =(మ.) బ్రతుకంతయుఁ గలఁతనొందించి - (కి) జీవనమనఁగా జలము గనుక సరస్సులందలి జలములను దుష్టవస్తువులుగలిపి కలుషితములుగాఁజేసి, వనచరాళి నిస్వనంబులు రేఁచి=(మ) వనమందుఁజరించు శుక పికాదుల కలకలధ్వనులు రేఁగునట్లుగాఁజేసి - (కి) వనమందుఁ గ్రుమ్మరుతనపాటియెఱుకువాండ్ర కూఁకలు బొబ్బలు నతిశయించు నట్లుచేసి.

నిగుడు కాతరనేత్ర శంబరంబులు = (మ)నిగుడుచున్న చలించుచున్న కన్నులందలి జలములు- (కి)బయలుసాగుచున్న బెళుకుఁగన్నులుగల(లేక దీనంపుచూడ్కులుగల)యెఱ్ఱజింకలును (శంబరమనగాఁ జలమును ఎఱ్ఱజింకయు.) వాడు శరభగండకములన్ - (మ) వాడు=వదలుచున్న, శర=తెల్లి వెన్నెయొక్క, భ=కాంతివంటికాంతిగల- అనఁగా విరహముచేఁ దెల్లవాఱిన, గండకములు=చెక్కిళ్లను-(కి) వాడు = నవయుచున్న, శరభములును గండకములును - శరభమనఁగా ఎనిమిదికాళ్ల మృగము. గండకమనఁగా గెండామృగమును, తూలెడు చిత్రకాయలీలలున్ = (మ) తూలిపోవుచున్నవింతలయిన మేని విలాసములును - (కి) తూలియాడుచున్న పులుల లీలలును - ('ద్వీపీవ్యాఘ్రశ్చిత్రకాయః' అమరశేషము.)

సోయగములు వీడ్కొను భద్రగతులు=(మ) మురిపములువీడిన మేలయిన నడలును - (కి) (మెల్లందనంపు) సొగసులు వీడినట్టి భద్రజాతి యేనుంగుల సంచారములును. ('భద్రోమంద్రోమృగశ్చేతి విజ్ఞేయా స్త్రి విధాగజాః' అమ.), జడియు ఆతత స్తబ్ధరోమములు - (మ) జడియు = చచ్చుచున్న, ఆతత=విస్తరించిన, స్తబ్ధ=నిట్టపొడిచిన, రోమములు = గగురుపాటనుట .. (కి) జడియు= భయపడుచున్న విస్తారములయిన పందులును, ('దంష్ట్రిఘోణీ స్తబ్ధరోమా' అ.) అలసి వ్రాలు ఘనసితాపాంగములున్ = అలసటచే సోలుచున్న మిక్కిలి తెల్లనయిన క్రేఁగంటిచూపులును- (కి) బడలికచే పోలేక వ్రాలుచున్న గొప్పనెమిళ్లను, సితాపాంగమనఁగా శుక్లాపాంగము. కాఁగన్=అగునట్లుగా, కాండవృష్టిన్ పఱపి=బాణవర్షము గురియించి, వేఁటాడన్ తొడఁగెను.

మొదట నాయకుని పెక్కుగుణములకు మనస్సు మిక్కిలివశమగుట, ఆశలు కుదురుకొనుట, మన్మథతాపమెసఁగుట, ఉబుసంతయు కలఁగుండువడుట, శుకపికముల రొదలు, కన్నులనీటి జాలు, చెక్కులు పలుచనై తెలుపెక్కుట, మేనిసొబగులు దూలుట, నడలుసురువులు వీడుట, గగురుపాటు, కడకన్నులు సోలుట,యని వరుసగా ఈయవస్థలు తెలియునది.'కాంతయౌవన రేఖలోఁ గలయమెలఁగి వేఁటాడఁ దొడఁగె' ననుటచే గిరిః పరువము నూఁది విచ్చలవిడి బాధించినాఁడనుట. ఇటఁ బ్రకృతాప్రకృత శ్లేషము. విశేష్యశ్లిష్టతనుబట్టి శబ్దశక్తి మూలధ్వని యని మతాంతరము.

చ. అలికులవేణి యిట్లు వలయాంక బిసాంకుర పన్నగాళికిం
జలమరిచల్లగాలికిని జక్కెరఖాణపుఁదేజిఁ దోలుపూ
విలుతువయాళికిం జిగురువిందుల నీలిగయాళికిన్ హాలా
హలగుళికాభదుర్దమఘనాళికి నాళికి లోఁగి యాత్మలోన్. 112

అ. అలికులవేణి=గిరిక, ఇట్లు, వల ..గాళికిన్ — వలయ అంక=గుండ్రనయే గుఱుతుగాఁగల, బిసాంకుర=లేఁతతామర తూఁడులనెడు, పన్నగ ఆళికిన్=పాముల సమూహమునకును, చలమరిచల్లగాలికిని=చలపాదియైన చల్లనిగాడ్పునకును, 'చలిమిరిసన్నగాలికి' నని పాఠా. చక్కెర... వయాళికిన్ —చక్కెర ఖాణపుతేజిన్=పంచదారయే మేఁతగాఁగల గుఱ్ఱమును - అనఁగాచిలుకను, తోలు, పూవిలుతు=మన్మథునియొక్క, వయాళికిన్=వాహ్యాళికి [వయాళియనఁగా వినోదార్థము సపరివారముగాఁ జేయువిహారము. 'ప్రమదనిష్యంద తరనేత్రపద్ములగుచుఁ, బౌరజనులు విలోకింపఁ బ్రమదలీల, సముచితానల్ప పరివారసహితుఁడగుచు, నవనినాథసుతుండు వాహ్యాళివెడలె' (శృంగారనైష) పాలునునీరు నేరుపఱు • పంగలమావుల వేదవీథివా, హ్యాళియొనర్చు నేయలికు • లాలక (రామాభ్యుదయము.) మన్మథుఁడుచిలుకతేజినెక్కి చేయుచున్న వయాళికి ననుటచే,, చిలుకల రొదలకనుట.]

చిగురువిందుల నీలిగయాళికిన్=చిగురే తిండిగాఁగల నల్లనిగయ్యాళికి - అనఁగా కోకిలకనుట. నీలిశబ్దముచేతను నిందధ్వనితము. హాలా...నాళికిన్—హాలాహాల గుళిక+ఆభ=కాలకూటపు గుటిక తోసాటియైన - (గుండ్రగాఁగాని యుండగాఁగాని యుండువానిని గుటికగా రూపించుటగలదు.) 'హరిహరబ్రహ్మ మహానుభావంబు లొక్కొటిగాఁ గరంగిన గుటికయనఁగ...భానుబింబంబు పూర్వాద్రి పైవెలింగె (భార. విరాట)

> ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితా ♦ జాండంబులోఁ జంద్రుఁ డో
> ప్పారెం గాలభిషగ్వరుం డవిరళం♦బై కాముకశ్రేణికిం
> మారోత్సాహము నిల్పఁ బాదరసమున్ ♦ బంధించి గ్రాసార్థమై
> క్షీరస్థాలికఁ బెట్టినట్టిగుటికా♦సిద్ధౌషధం బోయనన్. (మనుచరిత్రము.)

సూర్యు నెఱ్ఱని గుటికగాను జంద్రుని తెల్లని రసగుటికగాను వర్ణించుసట్లు, తుమ్మెదను నల్లని విషపు గుటికగా వర్ణించినాఁడు. విషము నలుపు కవిసమయ సిద్ధము.) దుర్మద=చెడుకావరముగల, ఘన=గొప్పదయిన, అళికిన్ = తుమ్మెదకును, ఆళికిన్=చెలికత్తియకును, లోఁగి=జడిసినదై, ఆత్మలోన్=తనమనస్సునందు, మీఁదికన్వయము.

బిసాంకురము 'పలయాంక'ము లగుటంజేసి పన్నగాలియయ్యె. 'చల్ల'గాలిగాన చలమరి. మరుని తేజికి 'చక్కెర ఖాణ' ముగాన చక్కెరవంటి తీయని రవళి. మరుని 'పయాళి' విరహిణికి 'విరాళి'. 'నీలిగయాళి' యగుట చిగురువిందులచేత. 'పల్లవగ్రాస కషాయకంఠ కలకంఠ కుహూకలకాకలీ ధ్వనిన్.' (పారిజాతాపహరణ)అని పల్లవ గ్రాసముచేత కోవెలలకుఁ గలధ్వనిగలుగును. కావునసే గయాళి. అది మన్మథునకు 'కలకంఠకూజితై ర్నిబద్ధపుష్పాయుధతూర్యనిస్వనః' అన్నట్లువాద్యగాఁడుగదా. వానిపయాళి కీగయాళి వాద్యగాఁడు. అళి దుర్మదఘనమైనదిగాన హాలాహాలపు గుళికకుసాటి. ఇంతకు కొసరుగా 'ఆళి' యొకతె చేరినది. ఆళియేమి బాధకమా? తనమరుని వలవంత దానికిఁ దెలియునో యను సిగ్గుచే దానిఁ జూచినను విసపువిత్తే.

'తేజీ' యనుపదమునకు 'దీర్ఘాణాం హ్రస్వస్వాస్యత్' అనుసూత్రముచే హ్రస్వముప్రాప్తించి 'నచదేశ్యపదేన' అనెడు సూత్రముచే హ్రస్వప్రాప్తి లేకున్నను 'నైకవర్ణేఽన దేశ్యేహ్రస్వోదేశ్యేపి వాక్వచిత్' అనెడు నధర్వణ వచనమువలన హ్రస్వము వచ్చినది. గయ్యాళి గయాళి, అని ద్విత్వా ద్విత్వరూప భేదముచేత రెండువిధము లగుటకు 'అద్విత్వంచ భవేద్ద్విత్వం దీర్ఘోహ్రస్వశ్చ కేషుచిత్' అని యధర్వణవచనము. ఇందుఁ దటస్థోద్దీపనములను జెప్పినాఁడు. 'పల...గాళికిన్' రూపకము. 'చక్కెర...గయాళికిన్' పర్యాయోక్తములు. 'హాలా...నాళికిన్' ఉపమ.

ఉ. అమ్మకచెల్ల ధైర్యవిభవాతిశయంబునఁ దండ్రిపెంపు లే
శమ్మును గానసైతి జడజన్మమునన్ జనయిత్రిఁ బోలి వైఁ
గ్రమ్మునిదాఘతాపహతిఁ గ్రాఁగుచుఁ జిక్కితి లోఁతు దక్కని
క్కమ్ముగఁ దండ్రిచాయ గలకన్యలు ధన్యలుగా వసుంధరన్. 113

అ. అమ్మకచెల్ల=ఓయమ్మ అక్క చెల్లెలా,యని సంతాపజనిత మయినమాట- నేనేమి సేయుదు ననుట, ధైర్యవిభవఅతిశయంబునన్=దిటయొక్క పెంపుసొంపుచే, తండ్రిపెంపున్ = తండ్రియైన కోలాహలుని అతిశయమును, లేశమ్మును, కానసైతిని=పొందనయితిని. (పర్వతము ధైర్యమున కుపమానముగాన యిట కోలాహలుని ధైర్యమునకు నుపమానభూతునిఁ గాఁగొనుట.) (జడమనఁగా అచేతనమువలె మ్రానువడియుండుటయు జలమును.ఇట లడల కభేదము.) నిదాఘమనఁగా వేఁడియు వేసవియును, లోఁతనఁగా గాంభీర్యమును నిమ్నత్వమును,)జడజన్మమునన్...దక్క—జడమయిన జన్మము

చేత తల్లియగు శుక్తిమతిని బోలి, మీఁదఁ బయికొనెడు, వేఁడియైన కొండలపాటుయొక్క తాఁకుచేత, తపించుచు, గాంభీర్యముచెడి, చిక్కితిన్ = కృశించితినని యర్థము. తల్లిని బోలి యున్నందునఁ దల్లి నదిగనుక జలజన్మమును, పైఁగ్రమ్ముచున్న గ్రీష్మకాలపు నెండతాఁకుచేఁ గ్రాఁగుచు నిమ్నత్వముమాని సన్నగిలుటయు, నదీధర్మములని తెలియునది. 'నిదాఘో గ్రీష్మకాలే స్యాదుష్ణే స్వేదాంబునోరపి' విశ్వము. వసుంధరన్ = భూమియందు, నిక్కమ్ముగన్, తండ్రిచాయగల కన్యలు=తండ్రిపోలికగల కన్నెలు, ధన్యలుగా=కృతార్థలు గదా. 'ధన్యా పితృముఖీ కన్యా ధన్యో మాతృముఖ స్సుతః' అన్నట్లు తండ్రినిబోలినకొమార్తయుఁ దల్లినిబోలిన కుమారుఁడును ధన్యులని కలదు. నేను దండ్రినిబోలక తల్లిని బోలినందున నిట్టి వ్యథపాలయితినని యర్థము. శ్లేషను బ్రాణితమగు అర్థాంతరన్యాసము.

మ. సయిదోడయినసువృత్తపాండురమణీ జాలంబు మున్మున్నుగా
భయకృత్పల్లవసూచికాస్థితిఁ దపఃప్రారూఢిఁ బేరై నృపా
న్వయచూడామణి పేరురం బెనసె నేనట్లయ్యుఁ బ్రాపింప లే
నయితిం దాదృశవైభవం బకట భాగ్యాయత్తముల్ గా సిరుల్. **114**

అ. ఇందు 'పాండురమణీ జాలంబు' అనుచో రమణీజాలమనియు మణీజాలమనియుఁ గల రెంటికిం బొసఁగునట్లుగా నర్థములు దెలియునది. సయి...జాలంబు—సయిదోడైన = తోడఁబుట్టిన, సువృత్త=చక్కఁగా గుండ్రనయిన, పాండుర=తెల్లని, మణీజాలంబు = రతనములగుంపు - అనఁగా ముత్తెములని యర్థము - (సువృత్త=మంచినడవడిచేత, పాండు=నిర్మలమయిన, రమణీజాలంబు= స్త్రీసమూహము, అని యర్థాంతరము.)మున్ మున్నుగాన్ =ముందుముందుగా, భయ...స్థితిన్—(మణి) భయకృత్ =వెఱపును జేయునట్టి, పల్లవ=చిగురువంటి-గడ్డిపోఁచ వంటి, సూచికా=సూదులయందలి, స్థితికి విశేషణము - సూదులచేత గ్రుచ్చఁబడుట చేతననుట- (రమణీ)భయకృత్ =వెఱపుఁబుట్టించు, పల్లవ-పత్+లవ = పాదము కొంచెముయొక్క - అనఁగా బొటనవ్రేలియొక్క, సూచికాస్థితిన్= సూదులయందునికిచేత - బొటనవ్రేలిని సూదియందూఁదినిలుచుట చేతననుట, తపఃప్రారూఢిన్= (మణి) గ్రీష్మర్తువుయొక్క యతిశయించుటచేత, పేరై=హారమై, [వేసంగికాలమందు చలువకై ముత్తెపు సరులు వైచుకొనుట ప్రకటము.

క. మొలతొడవును వెలివలువయుఁ, గలపిలుఁదుల ముత్తెసరులు ♦ గందపుఁ బూఁతల్
గలచనులఁ దానపుంబోడి, నలరుకురులఁ బతులవేఁడి ♦ నడఁగింత్రు చెలుల్.

చ. చెలువుగ రేలు మేడపయిఁ జెల్మిపడంతులు పాడఁ దమ్మిపూల్
గలుగుకొలంకు నీటమునుకన్ మెయియొప్పఁగఁ బాటలీసుమం
బులపెనుతావి సారెకును ముక్కును దన్పఁగ ముత్తెసర్లు వె
న్నెలలు సుఖంబుగూర్పఁ జెలి నిత్యము వేసఁగి యింపునింపుతన్. (ఋతుసంహార.)
'తరళముక్తాదీప్తి ధారాధివాసమై వేసవి నిది మహోల్లాసమొసఁగు. (తృతీయా. ౧౫)]

(రమణీ) తపఃప్రారూఢిన్ = తపస్సుయొక్క మిక్కిలియైన దిటచేత - మిక్కిలి దిటవైన తపము చేతననుట, పేరై =ప్రసిద్ధినొందినదై, నృపాన్వయచూడామణి = రాజకులమునకు తలమానికమయిన వసురాజుయొక్క, పేరురంబు = వెడలుపయిన ఱొమ్మును, ఎనసెన్ =పొందినదాయెను. ఏను, అట్లు అయ్యున్ =ఆముత్తెములకుఁ గలిగిన సువృత్తాది లక్షణములుగల దాననయ్యును, తాదృశవైభవంబు= అటువంటి - అనఁగా ముత్యములు గలుగఁ జేసికొన్నట్టి - పెంపుసొంపును - వసురాజు పేరురంబెనయు

టను, ప్రాపింప లేనయితిని, అకట, సిరులు=సంపదలు, భాగ్య+ఆయత్తముల్=పుణ్యమునకు లోనయి నవిగదా - అనఁగా పూర్వజన్మ పుణ్యరూపమయిన భాగ్యమునకుఁ దగునట్లుగానే సంపదలు గలుగు చున్నవి గదాయనుట.

తోడఁబుట్టిన ముత్తెములు పొందినంత భాగ్యము నాకు లేకపోయెననియు, తోడఁబుట్టిన యాఁడుబుట్టువులు పొందినంత భాగ్యము నోఁచక పోయితిననియు నర్థములు. ముత్తెములు బెడిదంపు సూదులచే గ్రుచ్చంబడి వేసంగికాలము ముమ్మరింపఁగా హారములుగా రాజు పేరురమును బొందెను. ఆఁడుబుట్టువులు సూఁదిపయి బొటనవ్రేలూని తపముచేసి పేరెన్నికగాంచి రాజు పేరురమును బొందిరి. పేరురమును ఎనయుట యనఁగా ఆలింగనము సేయుటయని రమణీపరమయిన యర్థమున. ('చెక్కు నొక్కు దెయంచు దిక్కరి గ్రామణి నక్కు సేర దెయంచు రిక్కరాయఁడు'. ఇత్యాదు లెఱుఁగునది. 'అట్లయ్యుఁ' దానివలెనే నేనును సుపాత్రాదులు గలిగినదాననే! పేరురంబెనయకుంట యేల? వాని వలె 'భయ... పేరై' యుండలేదు. ఎప్పుడు? 'ఘన్మన్మగా' పూర్వజన్మములందు. కావుననే 'సిరుల్' భాగ్యాయత్తముల్ = పూర్వజన్మకృత పుణ్యాధీనములు. 'భయ...ప్రారూఢి' యని యిట్టి మహాకఠినతపంబునకు ఫలముగా నెనసిన పేరురంబు 'నృప'నిదిగారాదు 'నృపాన్వయచూడామణి' దిగావలయు. 'పాండురమణీ' 'నృపాన్వయ చూడామణి' యనుట మణులు మణినేపొందునని యౌచిత్యము. పేరు పేరురమును బొందుటయు పొందు. అట్టివాని పేరురంబెనయుట 'వైభవ'ము. కావుననే యట్టిసిరి 'భాగ్యాయత్తము.' అలం. 'సయి...నయితిని' శ్లేషోత్థాపితమగు వ్యతిరేకము. 'భాగ్యా... సిరుల్' అర్థాంతరన్యాసము; రెంటికిని సంకరము. సమాసోక్తియు.

ఉ. తల్లియుఁ దండ్రియుం బహువిధంబులఁ గామితముల్ ఘటింపఁగా
నుల్లము చల్లనై సిరుల నొందు సుపర్వనరాహిరాట్పురీ
హల్లకపాణులం దొకతెనై జనియింపక యొడ్ల నోంచు పె
న్వెల్లికి తాలికిం బొడమి వేటిఁడినైతిఁ దలంపులేటికిన్. 115

అ. తల్లియుం దండ్రియుం బహువిధంబులన్, కామితముల్ = కోరికలను, ఘటింపఁగాన్ = సమకూర్చుచుండఁగా, ఉల్లముచల్లనై, సిరులన్=సంపదలను, ఒందు, సుపర్వ...నర అహి రాట్ పురీహల్లకపాణులందున్ = దేవతలయొక్కయు మనుష్యులయొక్కయు మేటిసర్పముల యొక్కయు పట్టణములందలి - అనఁగా స్వర్గమర్త్య పాతాళలోకములయందలి - చెంగలువలవంటి చేతులుగలవారియందు - స్త్రీలయందు, ఒకతెనై, జనియింపక = పుట్టక, ఒడ్లన్ = ఇతరులను, నోంచు=బాధించుచుండునని యర్థము. ఒడ్లన్ నోంచు=గట్లను ఉరలఁదీసెడునని భావము. పెన్వెల్లికిన్ =పెద్దవఱద పెట్టెడునదికిని, తాలికిన్ =కఠినపాషాణమయిన కొండకును, పొడమి=పుట్టి, వేటిఁడినైతిన్=కొఱమాలిన దాననయితిని. తలంపులేటికిన్ =నాతలంపులతో పనియేమి.

తా. స్వర్గమర్త్య పాతాళములయందు సామాన్యముగా జన్మించెడు స్త్రీలలో నొక్కతెనై పుట్టినట్టయిన పసురాజువిషయమయిన నాకోర్కి తలిదండ్రులు సఫలముఁజేయుదురుగదా. అట్లు పుట్టక యేటికిని గొండకును బుట్టినందున నాకోర్కి సఫలముచేయువారు లేక నాపుట్టుక కొఱమాలిన దయ్యెను. తల్లియగు పెన్వెల్లి ఒడ్లనోంచునది. కాన నాకు 'ఉల్లముచల్లన' గావింపదు. తండ్రి 'తాయి' కాన 'సిరుల' నొందింపఁడు. తాలు రత్నములగునా. కావుననే 'వేటిఁడి' నైతి. 'ఒడ్ల...నైతి' అలం. శ్లేషమూలక కావ్యలింగము.

సీ. సోయగంబున వీణ వాయింప మాయంపు,జటిలుఁ డచ్చటికి నేమిటికి వచ్చె
వచ్చుఁగా కేమి యవ్వసుమహీపాలు బా,లామనోభవుని నేలా తలంచెఁ
దలఁచుఁగా కేమి మిథ్యాజపప్రౌఢి నా, పృథివీశు నేల రప్పించి చూపెఁ
జూపుఁగా కేమి మాయాపారికాంక్షి ద,ర్శితవసుభ్రాంతిఁ జెందితి ని దేల

తే. తల్లి కౌటిల్యమెన్నఁడు దలఁగుఁదండ్రి, హృదయ మెన్నఁటికిఁ గరంగు నీవియోగ
నీరనిధి నెట్లు గడతు శృంగారవనికి,నరుగ నన్నియుఁ జక్కనౌ నచట ననుచు. 116

అ. సోయగంబునన్ = విలాసముచేత, వీణన్ వాయింపన్, మాయంపుజటిలుఁడు = కల్లముని, అచ్చటికిన్ = ఆమణిమందిరమునకు, ఏమిటికిన్ వచ్చెను. వచ్చుఁగాకేమి=వచ్చిన నేమాయెను. బాలామనోభవున్ = పడఁతులకు మన్మథుఁడైన, అవ్వసుమహీపాలున్, ఏలా తలంచెను. తలఁచుఁగాకేమి= తలఁచిన నేమాయెను. మిథ్యాజపప్రౌఢిన్ = అబద్ధపు జపము నేర్పుచేత, అపృథివీశున్ = ఆరాజును, ఏల రప్పించి చూపెను. చూపుఁగాకేమి, మాయా...భ్రాంతిన్—మాయాపారికాంక్షి = కల్లముని చేత, దర్శిత=చూపఁబడిన, వసు = బంగారమందలి, భ్రాంతిన్ = భ్రమమును - అని యర్థము. (వసు భ్రాంతిన్ = వసురాజునందలి భ్రాంతినని భావము) చెందితిన్ = చెందితి నే, ఇది ఏల=ఈ భ్రాంతిని జెంద నేల (ఇట ఇది అనునది భ్రాంతికి విశేషణము. 'ఏల' తోఁగూడ 'ఇది' అది' యు వాక్యాలంకారముగా నేని పూర్వగత విశేష్యమునకు విశేషణముగా నేని ప్రయుక్తమగుట గలదు.)

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరి ♦ పాపపయోరుహచింతనక్రియా
లోలుఁ గృపాలు సాధు ♦ గురుశోకపదానతపాలు నిర్మల
శ్రీలు సమస్తసభ్యనుత ♦ శీలు విఖండిత మోహవల్లికా
జాలు నదేల తండ్రి వడిఁ ♦ జంపఁగఁబంచె మునీంద్ర చెప్పవే.

తల్లికౌటిల్యము ఎన్నఁడుతలఁగున్ = తల్లియైన శుక్తిమతియొక్క (వంకరతనము, బుట్టించు, బుద్ధి యెన్నఁటికి నశింపఁగలదని యర్థము - (నది వంక వంకలుగాఁ బ్రవహించునుగాన వంకలుగాఁ బోవుటమానదని భావము), తండ్రి...కరంగున్ = తండ్రియైన కోలాహలుని దయమాలిన మన సెన్నఁటికిఁ గరఁగునని యర్థము - (రాయిగనుక కరఁగదని భావము.) ఈ, వియోగనీరనిధిన్ = ఎడఁబాటుఅనెడి సముద్రమును, ఎట్లు,కడతున్ = దాఁటుదును, శృంగారవనికిన్ =సింగారపుఁదోఁటకు, అరుగన్, అచట, అన్నియున్, చక్కనౌను=అన్నికార్యములు సరిపడివచ్చును. లేక అన్నివెతలు తీరును, అనుచున్ = అని తలఁచినదై మీఁదికన్వయము.

వచ్చిన జటిలుఁడు మాయంపువాఁడు. తలఁచినరాజు బాలామనోభవుఁడు. అతనిసరప్పించుట మిథ్యాజపప్రౌఢిని. వసుభ్రాంతిఁజెందుట మాయాపారికాంక్షింజేసి. తల్లియందుఁ గౌటిల్యము; తండ్రిగుండెరాయి. విరాళి పెనుసముద్రము.ఇవి యుద్దీపనానుకూలములగు ప్రాతికూల్యములు. ఇవియే శృంగారవనిని జక్కనౌ ననుచుఁదలఁచిన 'అన్నియును'. అలం. 'మాయా... దేల' శ్లేషము.

క. సకియఁ గను మొఱఁగి మధుకర, చికుర నిజారామవాటిఁ జేరి ప్రసూనాం
బకధాటీశుకఘోటీ, నికరాటీకనము మనము నివ్వెఱపఱుపన్. 117

అ. మధుకరచికుర=తుమ్మెదలవంటి కురులుగల గిరిక, సకియన్ = చెలికత్తెను, కనుమొఱఁగి= ఏమఱించి - అనఁగాఁ దప్పించుకొని, నిజారామవాటిన్ = తనయొక్క ఉద్యానవనపుఁ బ్రదేశమును, చేరి, ప్రసూ...కనము—ప్రసూనాంబక =పూవులు బాణములుగాఁగల మన్మథునియొక్క, ధాటీ=

దాడియందలి, శుకఘోటీనికర=చిలుక గుఱ్ఱపుగుంపులయొక్క, ఆటీకనము=రాక, 'టీకృగతౌ' మన మున్=మనస్సును, నిర్వేలపటిమన్=నిండయిన యాశ్చర్యమును బొందింపఁగా, మీఁది కన్వయము. ధాటియనఁగా.- 'శత్రుసేనావమర్దాయ సదృస్సుభటఘోటకైః। విజిగీషాప్రవృత్తిర్యాసాధాటీతి నిగద్యతే' అనిలక్షణము. మదనునిబారిఁ దప్పించుకొనుటకై పోవ మదనునిదాడియే యురవడిగా నెదురుపడెనని యుద్దీపనాతిశయము ధ్వనితము.

సీ. పవమానమానవ ప్లవమానకైరవ, చ్యవమానరజము మైన్ నంటఁదివురుఁ
గరసారసాగ్రతా మరసాతిసాంద్రసీ, ధురసాప్తిఁ గన్నీరుఁ దుడువఁగోరు
మదనానలప్రభాసదనామ్రకోమల, చ్ఛదనార్చిపైఁ జూపుఁ జరపఁ జూచు
సలయాహతలతాకిసలయాగమలయాగ,నిలయానిలునకూర్పు దెలుపఁదలఁచుఁ

తే. గుంజపుటగుంజ దళిపుంజశింజితంబు, వెగ్గలంబైనఁ జెవియొగ్గి వినఁగడంగుఁ
బంచశరభూతపరిభూతపంచభూత,ములఁ దదీయస్థలంబులఁ గలుపుకరణి.

అ. పవ...రజమున్—పవమానమానవ=గాడ్పుపిల్లచేత-(ఇట మానవమనఁగా మాణవము; నణల కభేదము.) ప్లవమాన=తూఁగియాడుచున్న, కైరవ=కలువలనుండి, చ్యవమాన=జాఱుచున్న, రజము=పుప్పొడిని, మైన్=శరీరముచేత, అంటన్, తివురున్=ఉంకించును. మై పృథివీ భూతముగాన పృథివీ వికారమయిన రజస్సుతో పృథ్వీవికారమగు మేనిని గలుపఁజూచుననుట.

కర... ప్తిన్—కరసారస=చేఁదమ్మియొక్క, అగ్ర=చివరయందలి, తామరస= (ఆట) తామరయందు, అతిసాంద్ర=మిక్కిలి దట్టముగానున్న, సీధురస=పూఁదేనెయొక్క, ఆప్తిన్=పడయుటచేత, కన్నీరును, తుడువఁగఁ గోరును=కడుగఁగోరును-అప్పు వికారమయిన కన్నీటిని అప్పువికారమయిన పూఁదేనెయందుఁ గలుపుట యిట తెలియునది. మదన...ర్చిపైన్ - మదనానలప్రభా=మరునియగ్గి వెలుంగులకు, సదన=పట్టయిన, ఆమ్ర=మామిడియొక్క, కోమలచ్ఛద=చిగురుటాకు లనెడు, అర్చిపైన్=సెగమీఁద, చూపు, జరపన్ చూచున్=నిగిడింపఁదలఁచును. మామిడి లేఁత చిగురు ఎఱుపుగాన మదనానల ప్రభకు సదనమయినది; మిక్కిలి విరహులకుఁ గ్రాఁచునదియు. చూపు మెఱుంగుగలదిగాన తేజస్సు వికారము. మామిడిచిగురును మదనాగ్ని ప్రభాసదనమనుటచే అందగ్నిత్వముగాన తేజస్సువికారమయినది. కనుక తేజస్సును దేజస్సుతోఁ గలుపుట.

సలయా...నిలునకున్—సలయ=లయతోఁగూడుకొన్నట్లుగా (లయయనఁగా న్యూనాధిక రహిత తాళసామ్యము. 'తాళః కాలక్రియామానం లయస్సామ్యమ్' అ.) ఆహత=కొట్టఁబడుచున్న, లతాకిసలయ=కొమ్మల చిగుళ్లుగల, అగ=వృక్షములుగలిగిన, మలయాగనిలయ=మలయాచలమే వాసముగాఁగల, అనిలునకున్=వాయువునకు, అనఁగా మలయమారుతమునకు, ఊర్పున్, తెలుపఁదలంచును, ఊర్పు వాయువికారము. మందమారుతమును వాయువికారము; కాన రెంటికిఁ గలయిక.

కుంజ . శింజితంబు—కుంజపుట=పొదరిండ్లయందు, గుంజత్=మ్రోయుచున్న, అళిపుంజ=తుమ్మెద గుంపులయొక్క, శింజితంబు=ఝుంకారధ్వని, వెగ్గలంబైనన్=మిక్కుటముగాఁగా-అసహ్యముకాఁగా ననుట, చెవియొగ్గి వినన్ కడంగున్=చెవిదోరగిలఁ బెట్టుకొని వినఁజూచును. ఆకాశము శబ్దగుణము గలది - అళులమ్రోతయు శబ్దరూపముగాన ఆకాశవికారము; శబ్దేంద్రియమగు చెవియు ఆకాశ వికారము కానరెంటికింగలయిక.

పంచ ..భూతములన్—పంచశరభూత=మన్మథుఁడనెడి పెనుబూతముచేత, పరిభూత=అవమానింపఁబడిన - కీడ్పఱుపఁబడిన, పంచభూతములన్ = (తనదేహమందలి) ఐదుభూతముల (యంశ

ముల) ను, తదీయస్థలంబులన్ = వానిచోట్లయందు - పంచమహాభూతములం దనుట. కలుప్రకరణిన్ = కలుపునట్టిరీతిగా, ఇట పుప్పొడి గాలిచేత రేపఁబడినదిగాఁ జెప్పుట మేనంతయు నంటుటకు. కన్నీరు దుడుచుటకు సాధనసౌకర్యమునకై చేతిచేఁదమ్మియందలి పూఁదేనె. లేఁతమామిడిచిగురునందు, మదనానిల ప్రభాసదనమని మన్మథతాపకరమగుటచే అగ్నిత్వము. ఆచిగురుఁ గాఁచుటచేత నేకాక ఎఱుపుచేతను అగ్నితోడి పోలికనిందుటకై లేఁతదిగా గ్రహింపఁబడెను. ఉద్దీపకమై యూర్పువెడలించుటకు గాడ్పుగందపుగొండది. కుంజపుటమందలి గుంజదళిపుంజము మఱింతయుద్వేజకము. కావున నే 'శింజితంబు' మరునివింటి టంకారము. ఇందు మరణమనెడి వ్యభిచారిభావము. 'మరణం మరణార్థస్తు ప్రయత్నః పరికీర్తితః' అని తల్లక్షణము. అలం. సమము, ఉత్ప్రేక్ష. రెంటికిఁ సంకరము.

క. ఈరీతిఁ బొదల మెదలుచు, నారీతిలకంబు మేనినచ్చిక యిచ్చం
గోరక నవసహకారక,కోరక మూరుకొని వడి నిగుడ గమకించెన్. 119

అ. నారీతిలకంబు, ఈరీతిన్, పొదలన్ మెదలుచు = పొదరిండ్లయందు తిరుగుచు, మేనినచ్చిక = దేహమందలి నమ్మకము - తనయొడలినమ్ముట, ఇచ్చన్ = మనసునందు, కోరక = ఆశింపక - అనఁగా దేహధారణమందాసక్తిలేక యనుట, నవసహకారకోరకము = క్రొత్త తియ్యమామిడిమొగ్గను, మూరుకొని = మూర్కొని, వడిన్, నిగుడన్ = ముగియుటకు, గమకించెన్ = ఉంకించెను. ఇందును మరణాఖ్య భావము.

ఉ. అత్తఱిఁ బిత్తరిన్ మణిగృహంబునఁ గానక బోటికత్తియల్
తత్తఱమంది హాగిరిసుతామణి యెచ్చటికేఁగితే కడుం
గ్రొత్త యటంచుఁ గేళివనకుంజము లారయ వచ్చి యచ్చటం
జిత్తజభల్లభగ్న యగుచెల్వఁ గనుంగొని సంభ్రమంబునన్. 120

అ. అత్తఱిన్ = ఆసమయమందు, బోటికత్తియల్ = చెలికత్తెలు, బిత్తరిన్ = గిరికను, మణిగృహంబునన్ కానక, తత్తఱమంది = తొందరపడి, హాగిరిసుతామణి = అయ్యయోగిరికాదేవీ, ఎచ్చటికిన్, ఏఁగితే = పోయితివే, కడుంగ్రొత్త = మిక్కిలి వింతగానున్నది. అటంచున్, కేళివనకుంజములు = ఉద్యానవనమందలి పొదరిండ్లను, ఆరయన్ = వెదకుటకై, వచ్చి, అచ్చట, చిత్తజభల్లభగ్న = మన్మథుని బాణములచే భిన్నపడినది, అగుచెల్వన్, కనుంగొని, సంభ్రమంబునన్ = తొట్రుపాటుతో, మీదికన్వయము.

చ. కటకట మమ్ము నొక్క త్రుటికాలముఁ బాయనిదాన వొంటిమై
నెటువలె వచ్చితమ్మ చెలి యిచ్చటి క్రేఁకపుఁదేనెవాఁక లీ
వెటువలె నీఁదితమ్మ తెరువెల్లను బుప్పొడి నీపదాంబుజం
బెటువలె నోర్చెనమ్మ తరుణీ తగునమ్మ కడిఁదిచెయ్దముల్. 121

అ. కటకట = అయ్యయ్యో, మమ్ము, ఒక్క, త్రుటికాలమున్, పాయనిదానవు, ఒంటిమైన్ = ఒంటిపాటుతోడ, ఇట 'ఒంటి' విశేష్యముగాఁ బ్రయోగించుటకు 'ఒంటిసనుటయేడ యిట్టులు కడిందివిచారము పుట్టె' (భారత. విరాట.) ఎటువలెన్, వచ్చితిఅమ్మ, చెలి, ఇచ్చటి, క్రేఁకపుతేనె వాఁకలు = బరువయిన - దాఁటుటకు కడిఁదియైన - పూఁదేనె కాలువలు, తెరువు = దారి. కడిందిచెయ్దముల్ = తెగువచేష్టలు, తగునమ్మ = తగునా - తగదనుట.

తేఁనెవాఁకలు 'క్రేఁకని' వానిని దాఁటుటయు, పుప్పొడి యొక్కచోఁగాక 'ఎల్లను' గల తెరువున నడుచుటయు, త్రుటికూడఁబాయనిది యొంటిగవచ్చుటయు 'కడిందిచెయ్దముల్.'

ఉ. ఇచ్చ హితాహితంబు గణియింపనిగోలవు గాన గానకున్
వచ్చితి గాక యో పథికవర్గము నొంటి చరింపనిచ్చునే
యిచ్చటిచూతన్యపుష్టచయ మిచ్చటి మత్తమధువ్రతవ్రజం
బిచ్చటిపల్లవోత్కరము లిచ్చటి పాంసులపంకజావళుల్. 122

అ. ఇచ్చన్=మనసునందు, హితాహితంబున్=మంచిసెబ్బరను, గణియింపని గోలవు=ఎన్న నేరని ముద్దరాలవు, కాన, కానకున్=ఉద్యానవనమునకు, అడవికి అని యర్థాం. అన్యపుష్టచయము= ఇందలి కోయిలలగుంపని యర్థము - (అన్యపుష్ట=దలివంద్రులకంటె ఇతరులు కూడు పెట్టి పెంచినదిప్ప కాయలని యర్థాంతరము) ఇచ్చటి మత్తమధువ్రజంబు=ఇందలిమత్తిల్లిన తుమ్మెదల సమూహమని యర్థము - (మత్తులై మద్యముత్రాగుటయె వ్రతముగాఁగల వారిసమూహమని యర్థాంతరము.) ఇచ్చటి, పల్లవ ఉత్కరము = చిగురుటాకులగుంపు అని యర్థము - ('పల్లవో స్త్రీకిసలయే షిద్గే' వి. విటుల సమూహమని యర్థాంతరము.) ఇచ్చటి, పాంసుల పంకజఆవళుల్ = పుప్పొడి నిండియున్న తామరల బంతులని యర్థము - ('పాంసులః పుంశ్చలే అ.వి.' పాంసుల=జారులయొక్కయు,పంకజ=('అ స్త్రీ పంకంపుమాన్ పాప్మా' అ. పాపసంభవులయొక్కయు, సమూహములని యర్థాంతరము) పథికవర్గమున్= విరహిసమూహమునని యర్థము. (బాటసారులనని యర్థాంతరము) ఒంటిఒంటిగా, చరింపనిచ్చునే=తిరుగనిచ్చునా- తిరిగినయెడల బ్రతుకనీయవని యాశయము.

బాటసారులను పాపాత్ములగు చోరులు బాధింతురు; అందును స్త్రీలయినచో త్రాగుబోతులును, జారులును బాధింతురని యర్థాంతరము. విరహోర్తులకు కోయిలలును, గండుఁ దుమ్మెదలును, జిగుళ్లును, పుప్పొడితోడితామరలును స్మరోద్దీపనము గలిగించునని భావము. అలం. నిరుక్త్యనుప్రాణితమగు కావ్యలింగము.

సీ. ఫలభంగములు సేయుచిలుకకు సాంగమై, క్రోధరసంబు ముక్కునసె యుండుఁ
గాలభేదికి మహాకాలమూర్తికి దంట, కోయిల కెఱమంటగురియు గంట
మదమరాళికి సదాభస్థితి యుడివోదు, ముఖరాగమును గళంబున విసంబు
నలరుఁగొమ్మల తావులార్చియాసవపూర్తి, నెడలించు నళికి మేనెల్ల మలిన
తే. మట్టియిట యేలవచ్చి తీయధరబింబ మీఁతలిరుఁగేలు నీభుజామృదుమృణాళి
కలును నీపువ్వుకోమలాంగములుపూని,గట్టు దొరపట్టివగుచెల్లఁ గంటిమబల.

అ. ఫలభంగములుసేయు చిలుకకు - (ఫలమనఁగా లాభమును మామిడిపండు మొదలయినవియు 'ఫలంజాతఫలేసస్యే హేతూత్థేవ్యుష్టిలాభయోః' మేదిని.) లాభమును చెఱుపుటను జేయు చిలుకలకని యర్థము. మామిడి మొదలగువాని పండ్లను భంగము సేయునవి యని భావము. సాంగమై= నిండుగా, క్రోధరసంబు ముక్కునసే ఉండున్=కోపము ముక్కునసేయుండునని యర్థము. (ఇటులో కోక్తినిబట్టి కోపము ముక్కునసే యుండునని చెప్పుట తెలియునది. (సాంగమయి = రూపునొంది. అనఁగా ఎఱుపువన్నెగాఁ బ్రత్యక్షాకారమునొంది, క్రోధరసంబు ముక్కునసె ఉండునని భావము. ముక్కునందలి యెఱుపును నిగరణముచేసి క్రోధరసముయొక్క సాంగత్యము ప్రత్యక్షాకారము చేత నధ్యవసించినాఁడు. అతిశయోక్త్యనుప్రాణితమగు లోకోక్తి.

కాలభేదికిన్ - (కాలమనఁగా మృత్యువు - 'కాలోమృత్యౌ మహాకాలే సమకే యమకృష్ణయోః' వి.)మృత్యువును భేదించునదియు, మహాకాలమూర్తికిన్=(మహాకాలో మహానటః' అ.)

మహారుద్రమూర్తియైనదియు, అగు. దంటకోయిలకుఁ = ప్రౌఢయగు కోకిలమునకు, ననియర్థము. (వసంతకాలమునందు భేదమునొందునదియు మిక్కిలి నల్లనిరూపుగలదియునని భావము.) కంటఁ, ఎఱ్ఱమంట=ఎఱ్ఱనయిన యగ్నిజ్వాల, కురియుననియర్థము. (కన్నులెఱ్ఱని కాంతి తొలఁకుచుండునని భావము. ఇటకోకిల కంటియెఱ్ఱనికాంతిని నిగరణము చేసి వహ్నిజ్వాలారూపము చేత నధ్యవసించినాఁడు. అతిశయోక్తి.

మదమరాళికిఁ=మదించిన యాఁడుహంసకు, స+దంభస్థితి = కొడుతోఁగూడిన ఉనికి, ఉడివోదు=మానదు, ఇదియునుంగాక, ముఖరాగమును = మొగము కోపమున జేవురించుచుండుటయు, గళంబున విసంబు=గొంతునందు (పరుసంపు పలుకనెడి) విషమును, మొగమెఱ్ఱచేసిఁ౯ని విషము గ్రక్కుచుండుననుట. ఇట పరుసనిపలుకులను విషరూపము చేత నధ్యవసించినాఁడు. విసము విషశబ్ద భవము. (సత్+అంభస్థితి= మంచినీటియందునికి, మానదనియు, ముఖరాగమును = మొగమెఱ్ఱగా నుండుననియు, గొంతునందు విసంబు - 'వబయోరభేదః' అనుటచే బిసము - తామరతూఁడనియు భావము.) 'మృణాళంబిస మజ్జాదికదంబే' అ. శ్లేషభిత్తికమగు నతిశయోక్తి.

అలరుఁగొమ్మల తావులు ఆర్చి=(కొమ్మలనఁగా స్త్రీలును శాఖలును. తావులనఁగా నివాసములును వాసనలును) సంతోషించుచున్న స్త్రీలయొక్క కొంపలుగూల్చి, ఆసవపూర్తి = (ఆసవమనఁగా అసువును - అనఁగా ప్రాణమును సంబంధించినదియు పూఁదేనెయు) ప్రాణములపూర్తి (నిండు ప్రాణములను), ఎడలించు అళికిఁ=వదలించుచున్నతుమ్మెదకు, మేనెల్ల మలినము=ఒడలంతయు అపవిత్రమనియర్థము. అలరు అనఁగా పువ్వును గనుక, పుష్పశాఖల వాసనలను బోఁగొట్టి పూఁదేనె నింపును దొలఁగించుననియు దేహమంతయు నలుపుగల దనియు భావము. అతిశయోక్తి.

అట్టియిట = అట్టిశుకపికాదు లున్న యావనమునకు, ఈయధరబింబము = దొండపండువంటి మోవియును, ఈతలిరుఁగేలుఁ=చిగురువంటి యీచేయియును, ఈభుజామృణాళికలును= లేఁతతూఁడులవంటి యీబుజములును, ఈపుష్ప కోమలాంగములుఁ = పువ్వులవలె మెత్తనయిన యీయవయవములును, పూని=ధరించి-యని క్రమాలంకారము. ఏలవచ్చితివి, అబల=ముద్దరాలా, గట్టుదొరపట్టివి అగుట ఎల్లఁ=పర్వతరాజు కూఁతురయిన లక్షణమంతయు, కంటిమి = తెలిసికొంటిమి, కొండకుఁ బుట్టినదానవు గనుక నింతగట్టిగుండెగలదానవయితి వని భావము.

ఒకటికి ముక్కునఁగోపము. రెండవదానికి కన్నులమంట, మూఁడవదానికి మొగమెల్ల జేవులు. నాలవదానికి మేనంతయు మలినము. కావుననే నాలవది యుసు రే యెడలించును. ఈనాలుగింటికి వరుసగా బింబము, తలిరు, తూఁడు, పువ్వుఁదేనెయు నాహారములు. అట్టిబింబాదులంబోలు నధరాదులుగల నీవువచ్చిన నవి బాధింపకుండునా యనిభావము. ఇట్టియంగములు పూనియు నిట్టిశుకపికాదు లుండుట తెలిసియుఁ వచ్చినకడిఁది గుండెవుగాన 'గట్టిదొర పట్టిపగుట' తెలిసినది. అలం. 'గట్టుదొర పట్టివి' పరికరము.

'తలిరుఁగేలు' అన్నచో 'స్తనాదాద్విత్వవిశిష్టాజాతిః' అనెడు వామనవచనమువలన, గేలు శబ్దమునకు ద్విత్వమే చెప్పవలయునని శంకవలదు. 'కేలు' శబ్దము నిత్యైకవచనాంతము. ఇందులకు 'బహుత్వంక్వచిదేకత్వంబహుత్వం ప్రత్యయేక్వచిత్' ; అని యథర్వణోక్తి ప్రమాణము.

మ. గురువిద్వేషికి విప్రయోగి హరణక్రూరుండు మారుండు దాఁ
బరమాప్తుండు తదీయభృత్యులు దలంపఁ గాంచనస్తేయత

త్వరగంధానిలముల్ మహామధుపముల్ తన్మైత్రిఁ గాంచెం బిక
స్వరముం బంచమశబ్ద మిందుకు సుదృగ్జాలంబు రాఁ జెల్లునే. 124

అ. గురువిద్వేషికిన్ = గురువునకు మిక్కిలిద్వేషించుచున్నవానికి - గురుతల్పగుఁడయిన చంద్రునకనుట. విప్రయోగి హారణక్రూరుండు=విప్రుఁడయిన యోగియొక్క - అనఁగా బ్రాహ్మణుఁడయిన మునియొక్క, హారణ=చంపుటచేత, క్రూరుండు, అగు, మారుండు = మన్మథుఁడు—(మార, శబ్దము చంపువాఁడని వ్యుత్పత్తిగలదిగాన యిటు సాభిప్రాయము)—విప్రయోగమనఁగా రవిహము అదిగలవాఁడు విప్రయోగి. విప్రయోగి హారణమందుఁ గ్రూరుఁడైనవాఁడని భావము.) తదీయ భృత్యులు=వానికొలువుడుగాండ్రు, తలంపన్ = విచారింపఁగా, కాంచన స్తేయ తత్పర గంధానిలముల్=బంగారు దొంగలించుటయే పనిగాఁగల తావిగాడ్పులని యర్థము. (కాంచనమనఁగా సంపెంగయు గనుక, సంపెంగపువ్వులు రాల్చుచున్నవని భావము).మహామధుపముల్=మిక్కిలి మద్యము ద్రావెడునవి. తుమ్మెదలనుట — మధువనఁగా తేనెయుఁ గనుక పూఁదేనెను గ్రోలునని భావము. ('మధుమద్యేపుష్పరసే క్షౌద్రే' అ.)పికస్వరమున్ = కోకిలరవళియును, తత్ మైత్రిన్ = వారితోడి (అనఁగా నామహాపాతకులతోడి) చెలిమిచేత, పంచమశబ్దము=అయిదవదియైన శబ్దమును - అయిదవ మహాపాతకశబ్దమునను, కాంచెను.(పంచమహాపాతకములు 'బ్రహ్మహాచ సురాపశ్చ స్తేయీ చ గురుతల్పగః।మహాపాతకి నశ్చైతే తత్సంయోగీచ పంచమః'అనియున్నది. గురుతల్పగాదులు, చంద్రాదులు నలువురు నాలుగుమహాపాతకులు. వారితోడి సంయోగముచేత కోకిల యెలుంగును పంచమమహాపాతకియైనదని యర్థము. ('పికఃకూజతి పంచమమ్' అన్నట్లు పంచమ స్వరరూఢిని గాంచెనని భావము.)

ఇందుకు - ఈపంచమహాపాతకు లున్నచోటికి, సుదృక్ జాలంబు = మంచిచూపు - అనఁగా యుక్తాయుక్తవివేకముగల జనమని యర్థము. సొగసయిన కన్నులుగల స్త్రీ)సమూహమని భావము. రాన్ చెల్లునా=రావచ్చునా—రాఁదగదని భావము.

చంద్రుఁడు గురుతల్పగుఁడు. మన్మథుఁడు బ్రాహ్మణహంత. గంధానిలములు స్వర్ణస్తేయులు. తుమ్మెదలు సురాపములు. వీరితోడి సంయోగముచేత పికస్వరము పంచమ మహాపాతకి. ఇట్టి పంచమహాపాతకులున్నచోటికి సుజ్ఞానులు రారాదని యర్థము.మరులుద్దీపింపఁజేయు చంద్రాదులున్నయెడకు విరహిణులయిన చెలువలు రాఁగూడదని భావము. శ్లేషమూలక కావ్యలింగము రత్నావలియును.

చ. అని చెలులెల్ల దూతి ధవళాంబుజభాజనరాజి నావటిం
చినకుసుమాన్నరాశిపయిఁ జక్కని చెందొవజోతి నిల్పి య
వ్వనితకుఁ జుట్టురాఁ బడిసి వైచి సగంధపలాశవాటిఁ బా
యని యశరీరిబంటులకు నామితఁ జేసి రనేకభంగులన్. 125

అ. అని, చెలులెల్ల, దూతీ=[illegible]లనాడి, ధవళా ...రాజిన్ = తెల్లతామర పువ్వులనెడి పళ్లెరములయొక్క సమూహమునందు,ఆవటించిన.. పయిన్ —వడ్డించిన పువ్వులనెడి యన్నపురాశిమీఁద, చక్కని చెందొవజోతిన్ =చక్కనైనయెఱ్ఱగలువ పువ్వనెడు జ్యోతిని, నిల్పి,అవ్వనితకున్ ,చుట్టురా= చుట్టు తిరిగి వచ్చునట్లుగా, పడిసెవైచి=దిగఁదుడిచివైచి, సగంధపలాశవాటిన్ పాయనిఅశరీరి బంటులకున్ =వాసనతోఁగూడిన చెట్లతోఁపులను విడువని మన్మథుని (శుకపికాదులను) బంట్లు అనెడు కావరముతోఁగూడిన మాంసాహారుల వీథినివిడువని భేతాళుని భృత్యులకు-అనఁగా బిశాచములకు,('పలాశీవృక్షరక్షసోః' విశ్వము) అనేకభంగులన్ =బహువిధములుగా, ఆమితన్ చేసిరి=ఆహారముచేసిరి.

తెల్లసున్నపు పూఁతపూసిన మూఁకుళ్లలలో నన్నముపడ్డించి దానిపయి యఖండ దీపము పెట్టి పిశాచగ్రస్తులగు వారికి దిగఁదుడిచి క్రొవ్విమాంసములు దినుభేతాళుని బలంగమయిన పిశాచములకు బెట్టుట వాఁడుక. తెల్లమూఁకుళ్లకుమాఱుగా, తెల్లతామరపూలు. పువ్వులన్నము. పువ్వులు సామాన్యముగా, తెల్లగణములోనిదిగాన యన్నమునకుసాటి. జ్యోతి యెఱుపుగాన యందులకు మాఱుగా ఎఱ్ఱగలువ. ఇట గిరికను బట్టినది 'పంచశర' భూతము, బేతాళునివలెనే వాఁడును అశరీరి. వానిబలంగమువలెనే వీనిబలంగమును 'సగంధపలాశ వాటిఁబాయనివి' కావుననే యామిత్రెఁబెట్టుట. అలం. రూపకము. 'సగంధ...బంటుల' కనుచో శ్లిష్టము.

క. ఆవేళ మంజువాణి యు, నావిలగతిఁ జేరి దుస్సహామిళిందపుళిం
దావలి కావలికరువలి, యావలి కావలితహృదయ యగుసతిఁ బలికెన్. 126

అ. ఆవేళన్, మంజువాణి, అనావిలగతిన్ = నిష్కలుషమయినరీతిని, చేరి = దాపునకుఁ బోయి, దుస్సహ మిళింద పుళింద ఆవలికిన్ = సయింపనలవిగాని తుమ్మెదలనెడు బోయల గుంపునకును, పుళిందు లనఁగా నిషాదులలో నొక తెగ, 'భేదాః కిరాతశబర పుళిందా మ్లేచ్ఛజాతయః' అ.ఆవలి కరువలి = ఆచల్లగాలియొక్క, ఆవలికిన్ = (ఆవలిశబ్దము ఆవడి హావడి శబ్దముల రూపాంతరము) ఉపద్రవమునకును, ఆవలితహృదయ = కలఁతనొందిన మనస్సుగలది, అగు, సతిన్ = గిరికనుగూర్చిఁ పలికెను. ఏమనియనఁగా. అలం. వృత్త్యనుప్రాసము.

'మిళిందములు' దుస్సహత్వముచే 'పుళిందులు'. కరువలి 'వలి' యైనదిగాన దానికి 'ఆవలి'. 'గతి' యో - జాలి వంత నెయ్యముతియ్యము మొదలయిన వానిచే మంచిదిగాని యిచ్చకము లోపలి యుబ్బు యీసు మొదలయిన వానిచే కలుషితముగాదు గాన 'అనావిలము'.

తే. కలికి యలికీరమండలి కలికి చూడ, వేల యీవేళఁ బలుక వీ వేల గోల
నీ కటాక్షోర్మి వాక్సుధానీకమునకు, జాలిఁ బడిగాదె యివి యీకుజాలిఁబడియె.

అ. కలికి...లికిన్—సొగసయిన చిలుకలయు తుమ్మెదలయు చుట్టుకొన్న గుంపునకు - మండలి శబ్దముచే గుంపుగొని చుట్టుకొనియుండుట వ్యంజితము. అలికి=వెఱచి, చూడ వేల= ఏలకన్నెత్తి చూడవు, ఈవు, ఈవేళన్, పలుక వేల, గోల = ముద్దరాలా! నీకటాక్షోర్మి - నీకములకున్ = నీ దయిన కడగంటిచూపుల పరంపరలకును, పలుకుల యమృతంపు గుంపునకును, జాలిఁబడికాదె = భంగపడియేకదా, ఇవి = ఈతుమ్మెదలును చిలుకలును, ఈకుజాలిన్ = ఈ చెట్లబంతియందు, పడెను.

'నీకటా...నీకమునకు —కడగంట చూచినమాత్రనే, పలుప తిన్నఁగపలికినమాత్రనే, వికావికలయి చెట్లపాలగునవి యివి. వీని కాభయపడుట, కాన'చూడ వేల' 'పలుక నేల' చూచితివేని పలికితివేని యందులకు మునుపే దుఃఖపడి కుజముల (దుర్గతుల) పాలయి యీరెండును మఱియుఁ బటాపంచలుకావా! నీచూపులో పలుకులో వీని వికావికలుండఁగా చూడకయు పలుకకయునుండుట యెంతమాత్రము సరికాదు. అంతసులువయిన కిటుకు నీవు తెలియక నిన్నుఁజూచి జాలిపడియున్నదానికే యులికెదవు గాన 'గోలవు' అళికీరములు చుట్టును గుంపులుగొనుటచేనే 'మండలి' యనుట. అళులయు కీరములయు 'మండలి' కనుగుణముగా కటాక్షములకు ఊర్మియు వాక్సుధలకు అనీకమును జెప్పఁబడెను. అలం. 'నీ కటా...బడియె' హేతూత్ప్రేక్ష. నీఅళులకంటెను గీరధ్వనులకంటెను కటాక్షములకును వాక్కులకును ఆధిక్యముస్ఫురించుటచే వ్యతిరేకముగమ్యము. కటాక్షాదులకు భంగపడినవానినిజూచి అలుకుటచే కారణములేకయే కార్యోత్పత్తిగాన విభావనయు.

సీ. సకలాగమాంతవాసనలుగాంచి, విముక్తకాంచనం బగుమాధుకర కులంబు
వర్ణిత్వమున దృఢావాప్తి సంయమములై, శౌరిఁ బేర్కొను శుకసంతతులను
గన్న పెంచినవారిఁ గలయక మాధవా, ర్పితసూక్తి మనువనప్రియచయంబు
పద్మాసనాభ్యాస పారవశ్యమున బ్ర, హ్మాధీనగతులైన హంసతతులు
తే. పుష్పఫల పత్రజలమాత్రముల శరీర, యాత్ర గడపుచు సన్మార్గ మధిగమించి
యొసఁగునివియెల్ల నీకేల యెగ్గొనర్చు, వనిత యోవంతి యోవంత వలవదమ్మ.

అ. వనిత=గిరికా, సకల...కులంబు—సకల=సమస్తములయిన, ఆగమాంత = వేదాంతముల యొక్క, వాసనలు=భావనాత్మకమయిన జ్ఞానములను, కాంచి=పొంది, విముక్తకాంచనంబు = విడిచిపెట్టఁబడిన బంగారుగలది,అగు, మాధుకరకులంబు=భిక్షుకజనమునని యర్థము. (సకల, అగమ+అంతముల (లతాంతముల)=పువ్వుల, వాసనలు=పరిమళములను, కాంచి, విముక్తకాంచనంబు=విడిచిపెట్టఁబడిన సంపెఁగపువ్వుగలది, అగు, మాధుకరకులంబు=తుమ్మెదలగుంపుఅని భావము.

వర్ణిత్వమునన్=('వర్ణీస్యాల్లేఖకే చిత్రకారేషి బ్రహ్మచారిణి' వి.) బ్రహ్మచారిత్వముచేత, దృఢ + అవాప్తిన్ = గట్టియైన పొందుటచే - స్థృఢమగునట్లు గాననుట, సంయమములై = ఇంద్రియ నిగ్రహముగలవై, శౌరిన్ = విష్ణువును, పేర్కొను = పలుకుచుండెడి - హరి నామ కీర్తనము చేయుచుండెడి,శుకసంతతులును = శుకముని సమూహములును (ఇట 'వర్ణిత్వమున దృఢావాప్తి' అనుచో నవర్ణము షష్ఠీసమాసమున వచ్చినదని గ్రహింపవచ్చును. 'భవ్యతపంబున ఫలమనంగ' 'గౌరవంబున పేర్మిన్' 'ఉరమునయందుఁ గన్నులు' (భారత) ఇత్యాది ప్రయోగములున్నవిగాన వర్ణిత్వముయొక్క దృఢమయిన పొందుటచేత ననుట. శుకులు నిత్యబ్రహ్మచర్యధుర్యులుగదా. కావుననే తదీయ దృఢావాప్తి. వర్ణిత్వమున దృఢావాప్తిన్=వర్ణిత్వమున (ఇట మతుప్ప్రశంసార్థకము 'భూమనిందా ప్రశంసాసు నిత్యయోగేతిశాయనే, సంబంధేస్తి వివక్షాయాంభవంతి మతుబాదయః'అనువచనము చొప్పున 'ప్రశస్తావర్ణాహారితారుణా వేషాంస్త ఇతివర్ణినః' అనివ్యుత్పత్తి.) ప్రశస్తములయిన శరీరవర్ణములు గలుగుటయొక్క, దృఢావాప్తిన్=గట్టిపొందికచేత, సంయమములై=జోడుగూడినవై, శౌరిఁ బేర్కొను శుకసంతతులను - రామరామయని విష్ణువును బలుకుచుండెడి చిలుకల గుంపులని భావము.

కన్న పెంచినవారిన్ కలయక - కన్నవారిని పెంచినవారిని - అనఁగా తలిదండ్రులు మొదలయినవారిని, కలయక, మాధవ+అర్పితసూక్తిన్ = విష్ణువునందు సమర్పింపఁబడిన మంచిమాటలచేత-విష్ణుచరిత్రములను ముచ్చటించుచుండుటచేతనే యనుట. మను, వనప్రియచయంబు=వనవాసప్రియుల - (వానప్రస్థులయొక్క) సమూహము నని యర్థము. (కన్నకోకిలములను పెంచినకాకులను గలయక) మాధవ అర్పితసూక్తిన్ = వసంతర్తువునందు వినియోగింపఁబడిన మంచి పలుకులచేత, మనుచున్నకోకిల సమూహమని భావము. 'మాధవస్తు వసంతేస్యాద్వైశాఖే గరుడధ్వజే' అని వి. 'వనప్రియఃపరభృతః కోకిలః పికఇత్యపి' అ. కోకిలమును కోకిలగనుటయుఁ గాకి తనగుడ్డని పొదిఁగి పెంచుటయు వసంతకాలమురాఁగా కూయుటయు ప్రకటములు.

పద్మాసన అభ్యాసపారవశ్యమునన్ = (యోగవిహితమయిన పద్మాసనముయొక్క యలవాటునందు మిక్కిలిలోనై యుండుటచేత, బ్రహ్మఅధీనగతులు = పరబ్రహ్మమునకు లోనైన చిత్తవృత్తులు గలిగినవారు, ఐన, హంసతతులు = యోగిసమూహములు నని, యర్థము. పద్మ ఆసన = కూర్చుండెడి యలవాటుయొక్క పరవశత్వముచేత, చతుర్ముఖ బ్రహ్మకులోనయిన గమనములు - అనఁగా బ్రహ్మకువాహనములు-అయిన రాయంచలని భావము.

పుష్పఫలపత్ర జలమాత్రములన్ = పువ్వులు, పండ్లు, చిగురుటాకులు, నీళ్లనెడి యింతమాత్రము స్వల్పాహారముచేత, క్రమాలంకారము. శరీరయాత్రన్ కడపుచున్, సన్మార్గము అధిగమించి = మంచివృత్తినిఁబొంది యని యర్థము - (ఆకాశమార్గమును ఊఁదియని భావము.) ఎసఁగు ఇవి ఎల్లన్ = ఒప్పుచుండెడి యీచెప్పఁబడినవి యన్నియును, నీకు ఏల ఎగ్గొనర్చును = నీకెందులకుఁ గీడు సేయును. కాబట్టి, అవంత = అవిచారము, ఆవంత = ఆవగింజంతయైనను, వలవదమ్మ = అక్కఱలేదమ్మా.

ఇందు వరుసగా తుమ్మెదలు, చిలుకలు, కోయిలలు, అంచలను వీనికి, భిక్షుకత్వ, బ్రహ్మచర్య, వానప్రస్థత్వ, యతిత్వములు నాలుగు పాదములం జెప్పఁబడినది. ఈ నాలుగును పువ్వులను పండ్లను, చిగుళ్లను, నీళ్లను నూఁది బ్రతుకునవిగాన 'పుష్పఫలపత్ర జలమాత్రము' లనఁబడెను. 'సన్మార్గమనియు జెప్పఁబడెను. ఇట్లు భిక్షుకత్వాదులు వానికిఁజెప్పుటచే 'ఎగ్గు' సేయమి సమర్థింపఁబడినది. కావున 'వంత' 'యావంత'యు వలవదు. మన్మథభృత్యులయిన తుమ్మెదలు మొదలయినవి యీచెప్పఁబడిన సన్మార్గముల ననఁగా భిక్షుకత్వాదులయిన యాశ్రమముల నవలంబించిన వారనుట. అలం. అభేదాధ్యవసాయమూలమగు కావ్యలింగము. రత్నావళియు.

ఉ. సారసకైరవంబులకుఁ జంద్రదినేంద్ర విరోధ మంచకుం
బారము లేనిమందగతిభారము దెమ్మెరకున్ ఫణిగ్రహ
క్రూరవిఘాత మంగజునకుం గడతేరని భీమవీక్షణాం
గారకవైర మింత తలఁకం బనిలేదు మనోజుధాటికిన్. 129

అ. సారసకైరవంబులకున్=తామరలకును గలువలకును, చంద్ర దినేంద్రవిరోధము = చంద్రసూర్యగ్రహములయొక్క ప్రాతికూల్యము - అనఁగా తామరలకుఁ జంద్రుఁడును గలువలకు సూర్యుఁడును వైరులనుట. తామరలు రేలుముకుళించుననియు కలువలు పగలు ముకుళించుననియును భావము. అంచకున్=హంసకు, పారములేని మందగతి భారము = ఎన్నటికిని గడముట్టని శనిగ్రహము గతియొక్క భారము. అనఁగా హంసకు శనిగ్రహము చాలఁదనుట - ఎన్నిటికిని మందగతియొక్క యతిశయముగలదని భావము. తెమ్మెరకున్=మలయమారుతమునకు, ఫణిగ్రహక్రూరవిఘాతము = రాహుగ్రహముయొక్క కటువయిన విరోధము- అనఁగా మలయమారుతమునకు రాహుగ్రహము చాలదనుట. వాయువు సర్పములచేత గ్రహింపఁబడుట (అనఁగా భక్షింపఁబడుట) అనెడు క్రూరమయిన చెఱుపు గలదని భావము. అంగజునకున్=మన్మథునకు, కడతేఱని=తుదిగానని, భీమవీక్షణ=ఉగ్రదృష్టిగలిగిన, అంగారక వైరము=అంగారక గ్రహవిరోధము. అనఁగా మన్మథున కంగారకుఁడు చాలదనుట. (భీముఁడనఁగా 'భవోభీమః స్థాణూ రుద్ర ఉమాపతిః' అన్నట్లు శివుని ఉగ్రమయిన కంటియొక్క, అంగారక=నిప్పుతోడి వైరము అనఁగా శివుని మూఁడవకంటి నిప్పుచేతఁ గాల్పువాఁడని భావము.) కాఁబట్టి, వనిత=గిరికాదేవి, మనోజుధాటికిన్=మన్మథునియొక్క దాడికి, తలఁకంబనిలేదు=భయపడనక్కఱలేదు. మన్మథునికిని వానిపరివారమునకును గ్రహచార బలము చాలకున్నదిగాన వానికి భయపడవలసినది లేదని తాత్పర్యము. మనోజుధాటికనఁగా ధాటిలోఁజేరిన శుకపిక కోకిలాదులకనుట. అలం. విరోధాభాసము.

ఉ. నమ్మిక మీఱ నెత్తు వదన మ్మిఁక నెమ్మదికోర్కి నెమ్మితో
నిమ్మని యేము నీదయకు నిమ్మని కమ్మని వింటజోదుపా
దమ్ములు మెట్ట కెంపువిరిదమ్ములు చేర్చి భజింతు మమ్మరో
రమ్మని బోటి కోమలిక రమ్మనివార్యగతిం దెమల్పఁగన్. 130

అ. బోటి=చెలికత్తియ - మంజువాణి, వదనమ్ముక్ = మొగమును, నమ్రికమీఱక్, ఎత్తుము= వంచినమొగము నెత్తుమనుట, ఇఁక, నెమ్మదికోర్కి=మనసులోని యభిలాషమును - అనఁగా వసురాజ పరిగ్రహముననుట. నెమ్మితోక్ ఇమ్ము అని=ప్రేమతోడఁ గలుగఁజేయుము అనియును, నీదయకుక్ ఇమ్ము అని=నీకృపకుఁ బాత్రులమనియును, కమ్మనివింటిజోదు పాదమ్ములు = మన్మథుని యడుగులను, మెట్ట కెంపువిరిదమ్ములు=విరిసిన మెట్టకెందామరపువ్వులును, చేర్చి=అర్పించి, భజింతుము=కొలుతుము, అమ్మరో, రమ్ము అని, కోమలికరమ్ము=గిరికచేతిని, అనివార్యగతిక్ = విడిపించుకొనఁగూడ నట్లుగా, తెమల్పఁగాక్=పట్టితీయఁగా, మీఁదికన్వయము.

ఇట శుకమధుకరాదుల సన్మార్గ వృత్తులుగాని గ్రహచార దౌర్బల్యముగాని చెప్పినను జెలి వినమిని జూచి గౌణముగా 'నెమ్మదికోర్కి నిమ్ము కమ్మనివింటి జోదుపాదమ్ములను భజింతము రమ్మ'న్నది. ఇట మన్మథుని వేఁడుట వరసంయోగప్రాప్తికిఁ గాక మఱియొక్కటికిగానేరదు. గాన వసురాజ ప్రాప్తినే 'నెమ్మదికోర్కి' యని సామాన్యముగా గూఢోక్తిని జెప్పినదని తెలియునది.

ఎట్టిదానికి నట్టివస్తువులచేతనే పూజించుట పొంకము. మన్మథుని పాదములు కెందమ్ముల వంటివి గాన మెట్టకెంపమ్ములచేఁ బూజ ఇదియె.అలం. పర్యాయోక్తము.

క. సోలుచుఁ జెలికెదురాడక, తూలుచుఁ గైదండయొసఁగు తొయ్యలిమేనక్
వ్రాలుచుఁ జింతాజలనిధిఁ, దేలుచుఁ గైసేయుసఖులఁ దెగడుచుఁ గంటన్.

అ. సోలుచుక్=సొటసొటలాడుచు, చెలికిక్, ఎదురాడక = అడ్డుచెప్పక, తూలుచుక్= తూలితూలిపడుచు, కైదండయొసఁగు తొయ్యలిమేనక్ = చేయూఁత యిచ్చుచున్న చెలికత్తె దేహముమీఁద, వ్రాలుచుక్ = జరగుచు, చింతాజలనిధిక్ = విచారసముద్రమందుఁ, తేలుచుక్, కైసేయుసఖులక్ = అలంకరింపవచ్చు చెలికత్తెలను - వీడిన కొప్పుమర్చుట పైటచక్కనొత్తుట పట్టువప్పినసొమ్ములను పొందుగా సవరించుట మొదలయిన కైసేఁతలకువచ్చు చెలులననుట, కంటక్= కనుసైఁగచేతనే, మాటలచేతను జేష్టలచేతను వారించుటకు సత్తువలేనందున, తెగడుచుక్=అదలించుచు, మీఁదికన్వయము.

ఇందు సోలుటయు తొయ్యలిమేన వ్రాలుటయును గ్లానియనెడి సంచారిభావమున కనుభావము. 'గ్లానిర్బలస్యాపచయో నైవర్ణ్యా రతికారణమ్' చెలికెదురాడకపోవుట ముగ్ధాలక్షణము. తూలుట ఉన్మాదానుభావము. 'వినా విచారమాచార ఉన్మాద ఇతిలక్షణమ్' కంటఁదెగడుట అమర్షాను భావము. 'అమర్ష స్సాపరాధేషు మనఃప్రజ్వలనమ్ మతమ్' అనిలక్షణము.

సీ. నిబిడదుస్సహదీర్ఘ నిశ్వాసపవనంబు, పఱచుతేటుల బరాబరులుసేయ
నుజ్జ్వలా వయవతాప జ్వాలికలవేఁడి, చివురు జొంపములపై నవఘళింప
లలితాననేందుమండలపాండురచ్ఛాయ, వనరుహావళి వళావళి యడంప
శ్రమజలాభివ్యక్త సహజసాంకవ మదా, మోదంబు చిలుకల మూలకొత్త
తే. నెసఁగు భసలములను గీసలములను నీర, జాతములను గీరజాతములను
విగ్రహింప నీనిర విరహంబె తోడుగా, వెలఁది వెడలె విపినవీథులకును. 182

అ. నిబిడ... పవనంబు—నిబిడ=దట్టమును, దుస్సహ = సహింపరానిదియు, దీర్ఘ=పొడువు నయిన, నిశ్వాసపవనంబు=నిట్టూర్పుగాలి, పఱచుతేఁటులక్=ధూర్తములయిన తుమ్మెదలను, ('పఱచు

నకీ యర్థమునందు) 'పఱచు తేఁటులఁ గ్రిందుపఱుపరాదు' అని యిందే ప్రయోగము చూపఁబడెను. లేక పఱచు=పయికిఁ బాఱు తెంచునట్టి తేఁటు లనియేని చెప్పవచ్చును. పయికి పాఱు తెంచు దుండగపు తుమ్మెదలనుట. బరాబరులు సేయన్ = ప్రక్కలకుఁ దొలఁగఁద్రోయఁగా, ఉజ్జ్వ...వికల వేఁడి—ఉజ్జ్వల=జ్వలించుచున్న, అవయవతాప = అవయవముల యందలి విరహతాపాగ్నియొక్క, జ్వాలికల=సెగలయొక్క వేఁడి, చివురు జొంపములపైన్, అవఘళింపన్=వ్యాపింపఁగా, లలిత...చ్ఛాయ—లలిత=ఒప్పుచున్న, ఆనన+ఇందు మండల = ముఖమనెడు చంద్రమండలముయొక్క, పాండుర చ్ఛాయ=విరహంపు వెలుకయనెడి తెల్లనివెన్నెల, వనరుహావళి = తామరగుంపులయొక్క, వళావళిన్=అడావడిని, అడంపన్ = అడఁపఁగా; శ్రమ ..దంబు—శ్రమజల = చెమ్మటనీరువలన, అభివ్యక్త=ప్రకటమయిన, సహజ=స్వభావసిద్ధమయిన, సాంకవమద = జవ్వాదియొక్క, ఆమోదంబు=తావి, చిలుకలను, మూలకొత్తన్=మూలలకుఁ దొలఁగాను. (జవ్వాదిపిల్లులకు చిలుకలు భయపడుట ప్రకటము. స్త్రీలశరీరమందు జవ్వాది తావిగలదనుటకు,

'బింబోష్ఠియని నీవు బెదరింపకు శుకంబ సాంకవామోదయీ సన్నుతాంగి.' (రసికజన)

'అవ్వేలఁది మేని జవ్వాది పసగదంబించునోడలు గడిగికొనివార్చి ప్రవరుండు.' (మనుచరిత్ర)

ఎసఁగు, భసలములను = (బంభరశ్చ మిళిందశ్చ హిందోళ భసలౌసమా' యాదవము) తుమ్మెదలను, కిసలములను - ('కిసాలయం కిసలయం కసాలంకిసలం కిసమ్' ద్విరూపకోశము ఇందులకు 'జీర్ణపర్ణ ద్రుసంకీర్ణాహిమణి విభామాయాకిసల వంచ్యమానపికము' అని ప్రయోగమును) చిగుళ్లను, నీరజాతములను = తామరలనను, కీరజాతములను =చిలుకల గుంపులనను, విగ్రహింపన్ ఈనివిరహంబె= విరోధము సేయనీయని వియోగమే, తోడుగాన్ = సహాయముగానని క్రమాలంకారము. వెలఁది=గిరిక, విపినవీథులకును=వనవాటికలకు, వెడలెను.

బిట్టుగాలి తేంట్లకును, అగ్నిసెగ చివుళ్లకును, వెన్నెల తామరలకును, జవ్వాదిపిల్లి చిలుకలకును, విరోధులు. నిట్టూర్పులగాలి విరహాగ్నిసెగ మొదలగు వానసే కొని యా తేంట్లు మొదలగువాని నడంచినది. ఇట్టివెల్ల నొడంగూర్చినది విరహము. కావున నదియే 'తోడుగా' నయ్యెను. విరహము విగ్రహింప నీక మట్టుపెట్టినవే గదాయని యనాదరభావము దెలుపుట కై గిత్వము ప్రయోగించుట సూచితమగునట్లుగా 'భసల గిసల నీరజాత గీరజాత' అనుట తెలియునది. నిశ్వాసపవనము నిబిడమును దుస్సహమును దీర్ఘము నగుటచేతనే, తేటులు బరాబరులు సేయుట. అవయవములన్నిట తాపమాత్రముగాక వాని యుజ్జ్వలజ్వాలికలును గావున చివురు జొంపములమీఁదఁబర్వుట. పాండురచ్ఛాయ తామరల నడంచుటకై ఆననము చంద్రుఁడుగా చెప్పఁబడినది. చంద్రుని కాంతియేకదా తామరలకుం బగ. సాంకవామోదము పొలయుటకై (శ్రమజల) చెమ్మట గూర్పఁబడినది. ఇట 'శ్రమజల'యనుచో శ్రమమనెడి సంచారిభావము. 'ఖేదోధ్వరత్యా దేర్జాతస్స్వేదాతి ధూమకృత్' అని తల్లక్షణము. అలం. 'నిబిడ దుస్సహదీర్ఘ' కావ్యలింగము. 'ఆననేందు మండల' వనరుహావళి నడంచు ప్రకృతకార్యమునకుపయుక్తముగానపరిణామము. 'శ్రమజలాభివ్యక్త' కావ్యలింగము.

క. లలనామణు లపు డుపవన, తలనానాసూనసంపదలు కలకంఠీ
కలనాదకుఁ దెలిపిరి త,త్కలనాదగభమునఁ బ్రొద్దుఁగడపుద మనుచున్. 138

అ. అపుడు, లలనామణులు, ఉపవన... సంపదలు—ఉపవనతల=ఉద్యానవన ప్రదేశమందలి, నానా=సమస్తమైన, అనూన=తక్కువగాని, సంపదలు=వైభవములు, కలకంఠీకలనాదకేళిన్=కోకిల యొక్క అవ్యక్త మధురమయిన కంఠనాదమునంటి నాదముగల గిరికను, తత్కలనాదంభమునన్ = ఆ తెలుపుటయనెడు మిషచేత, ప్రొద్దుగడపుదమనుచున్ = ప్రొద్దుపుచ్చుదమనుచు, తెలిపిరి. ఇందు ద్విప్రాసము.

సీ. కనకగంధము లెఱుంగనివాని కిష్టాప్తి, కాయహీనునకును గరణపటిమ
పెక్కుకాలపుమూఁగకెక్కుడువాక్ప్రౌఢి, యతిచంచలాత్మునికలఘువృత్తి
యిలఁ బుట్టుగ్రుడ్డకు హితదర్శనప్రీతి, యగమకోటికిఁ బల్లవాభివృద్ధి
జడజాతమునకు శాశ్వతబోధసామగ్రి, కోపనావళికి భావోపశమము

తే. నెరపునిరుపమమాధవనిత్యసన్ని, ధానమునఁ బొల్చు భవదీయతాతపాద
సన్నిహితసద్గుణారామసరణి యిదెల,తాంగిగనుఁగొనుమిచటిశోభాతిశయము.

అ. లతాంగి = గిరికా, కన...వానికిన్—(కనకమనఁగా బంగారును సంపెంగయు; గంధ మనగా కొంచెమును వాసనయు - 'గంధో గంధక ఆమోదే లేశే సంబంధగర్వయోః' వి.) బంగారు కొంచెమును తెలియనివానికి, ఇష్టాప్తి=కోరినవస్తువులను బొందుటయని యర్థము - సంపెంగ వాసనలను దెలియని తుమ్మెదలకు ఇష్టమయినది-అనఁగా పూఁదేనె-దొరకుట యనిభావము.) కాయహీనునకున్ = (కరణమనఁగా గాత్రమును సాధనమును-'కరణం సాధకతమక్షేత్ర గాత్రేంద్రియేష్వపి' అ.) దేహము లేనివానికి గాత్రపటిమయని యర్థము - (దేహములేనివాఁడు మన్మథుఁడుగనుక మన్మథునకు పువ్వులు చిగుళ్లు మొదలయిన నానాసాధనముల పటిమయని భావము. మన్మథునకుఁ బువ్వులు మొదలయినవి బాణాదులుగదా.) పెక్కు-కాలపు మూఁగకున్ = బహుకాలమునుండి మాటలులేకయున్న మూఁగ వానికి, ఎక్కుడు వాక్ ప్రౌఢి=మిక్కిలియైన మాటలనేరుపు. (పదినెలలవఱకును బలుకుటలేకుండు కోయిలకు మిక్కిలియు మధురస్వరమని భావము.) అతిచంచలాత్మునకున్=మిక్కిలి చపలమయిన స్వ భావముగలవానికి, అలఘువృత్తి=గొప్పదిటవైనవృత్తి, (మిక్కిలిచపలమయిన వాయువునకు తేలికగాని, అనఁగా వడిలేకమందమయిన - వృత్తియని భావము.)

ఇలన్=భూమియందు, పుట్టుగ్రుడ్డకున్ = జాత్యంధులకు, హితదర్శనప్రీతి = హితులయిన వారిని జూచుటవలని సంతోషము. (ఇలఁబుట్టు గ్రుడ్డకున్=భూమియందు మొదటగ్రుడ్లుగాఁ బుట్టు శుకపికాది పక్షులకు, హితములయిన పండ్లు చిగుళ్లు మొదలయిన హితవస్తువులను గనుంగొనుటచేఁ గలిగెడి సంతోషమనెడిభావము.) అగమకోటికిన్=గమనశక్తిలేని (కుంటి) వాండ్లసమూహమునకు, పల్లవ+అభివృద్ధి—పత్+లవ ('లవోలేశేవిలాసేచ' వి.) పాదముల విలాసము=విలాసంపు నడ పెంపు, (అగమకోటికి = గమనశక్తిలేని వృక్షలతాదులసమూహములకు, చిగుళ్లపెంపు, అనిభావము.) జడజాతమునకున్ = (జడజాతమనఁగా జడుల - (అజ్ఞుల) - సమూహమును, లడల యభేదముంబట్టి జలజాతములును-అనఁగాతామర సమూహములును.) అజ్ఞుల సమూహమునకు, శాశ్వతబోధ సామగ్రి= ఎప్పటికిని జ్ఞానముయొక్క పరిపూర్ణతయని యర్థము. (తామరకు శాశ్వతముగా సమ్యగుత్పన్నమయిన వికాసముయొక్క, సంపూర్ణత్వమని భావము.) 'పునస్సదార్థయోఃశశ్వత్' అ. కోపనా ఆవళికిన్ = కోపశీలురయినవారికి, భావఉపశమము=చిత్తశాంతి. (కోపనా = కోపముగల స్త్రీల సమూహమునకు, కోపశాంతియని భావము.) 'కోపనాసైవ భామినీ' అ.

నెఱపు...ధానమునన్—నెఱపు=ఒడఁగూర్చుచున్న, నిరుపమ=సాటిలేని, మాధవ=విష్ణువు యొక్క, నిత్యసన్నిధానమునన్=ఎడతెగని సాన్నిధ్యముచేత,(మాధవ=వసంతునియొక్క,నిత్యసాన్నిధ్యముచేతనని భావము.) పొల్చు=ఒప్పుచున్న ('మాధవస్తు వసంతేస్యా ద్వైశాఖే గరుడధ్వజే' వి.) భవదీ...సరణి—భవదీయ=నీతండ్రియైన కోలాహలునియొక్క, పాదసన్నిహిత=చరణముదాపటి, సద్గుణ+ఆ+రామ=మంచిగుణములచే అంతట మనోహరులయిన వారియొక్క,సరణి=మార్గము,ఇదే=ఇదియేచుమీ. .(కోలాహల పర్వతముయొక్క, పాద = ప్రత్యంతపర్వతమునకు, సన్నిహిత = దాపటిదయిన, సద్గుణ=సుగుణ సంపన్నమయిన, ఆరామసరణి= తోటదారి, యిదియేసుమాయని భావము.) ఇచటి శోభాతిశయము=ఇచ్చటి యొప్పిదముయొక్క పెంపుసొంపును, కనుఁగొనుము.

మీతండ్రి యడుగుల ప్రాపున నుపజీవించుచుండు మహాగుణవంతులయినవార లుండు పట్టిది. ఇచట నిత్యమును (మాధవుఁడు) విష్ణువు సన్నిధానముసేయుచు కుంటి గ్రుడ్డి మూఁగ నిరుపేద మొదలగువారికి, కాలు, కన్ను, నోరు, బంగారు మొదలయిన యిష్టవస్తువులనెల్ల నొసంగుచుండును. ఇట్టి స్థల మెంత విలక్షణముగా నొప్పుచున్నదో చూడుమని యర్థము.వసంతుఁడు వచ్చుటచేత,శుకపికకోకిలాదులకెల్ల వలయు ఫలపల్లవ మృదుస్వరాదులు గలుగుచుండఁగా సొంపై కోలాహలపర్వతము దాపున నన్ని యొప్పిదములచే నొప్పుచున్న తోఁటదారియిది.దీని రామణీయక వైభవమునుజూడుమా యని భావము. విష్ణు ప్రత్యక్షీకరణముచే తీరరాని కొదువలెల్లఁ దీరుచుచున్న సుగుణగణములున్న పట్టుగాని భయపడవలసినదిలేదని యాశ్వాసనము. మన్మథోద్దీపకములయిన శుకపికాదులను శాంతిరసోద్దీపకములయిన సజ్జనగణముగా నధ్యవసించినాఁడు. శబ్దశక్తిమూలధ్వని.

చ. పరిమిళితప్రవాళనవపట్టపటధ్వజచూతనూతన
స్మరరథరాజముల్ భ్రమరజాలగుణాంచితపాంసుచక్రముల్
దిరల మహాబలంబు దరలింప లతావనితాళి రువ్వులే
మరువపుబంతులట్లు శుకమండలి యాడెడిఁ గంటె పైపయిన్. 136

అ. ఇందు మామిడిచెట్టును మన్మథునిరథముగా నిరూపించి మన్మథుని రథోత్సవమును వర్ణించుచున్నాఁడు. పరిమిళి...రాజముల్—పరిమిళిత =కలయఁగూడుకొన్న, ప్రవాళ= ఎఱ్ఱనిచిగుళ్లనెడు, నవపట్ట=క్రొత్త పట్టువస్త్రముగల, ధ్వజ=టెక్కెములుగల, చూత=మామిడిచెట్లనెడు, నూతన=క్రొత్తదయిన, స్మరరథరాజముల్=మన్మథ దేవతయొక్క రథశ్రేష్ఠమును,భ్రమ...ముల్—భ్రమరజాల=తుమ్మెదల బారులనెడు, గుణ=మోకుత్రాళ్లచేత, అంచిత=ఒప్పుచున్న, పాంసుచక్రముల్=సుళ్లుసుళ్లుగా తిరుగుచుండెడు పుప్పొడి పటలములనెడు తేరిచక్రములు, కెరలన్ = దొర్లునట్లుగా, మహాబలము=వాయువు అనెడు జాతరకువచ్చిన పెనుప్రజ. తరలింపన్=కదల్పఁగా, లతావనితాళి=తీఁగలనెడు పడఁతుల సమూహము, రువ్వులే మరువపు బంతులట్ల=పైని ఉవ్వుచున్న లేఁతమరువము చేతఁ గట్టఁబడిన చెండ్లోయన్నట్లు, పైపయిన్=మీఁదమీఁద, శుకమండలి=చిలుకలగుంపు, ఆడెడిన్=తిరుగుచున్నవి. కంటె=చూచితివా.

ఒకదేవతకు రథోత్సవము నపుడు తేరికిఁ గ్రొత్తపట్టుగుడ్డలుగట్టిన జెండాలనుగట్టి పెద్ద మోకు త్రాళ్లనుబట్టి ప్రజ లీడ్చుచుండఁగా నాచక్రములు గదలిపోవుటయు స్త్రీలు పూబంతులు మొదలయినవి నాతేరిపై విసరివైచుటయుఁ బ్రకటము. చిగుళ్లు 'పరిమిళితము'లౌట జెండాగుడ్డలవలె పఱపయి యుండుటకు, వసంతర్తువునందుఁ గ్రొత్తగాఁబొడమిన చివుళ్లుగాన 'నవ'క్రొత్త పట్టుగుడ్డలవలె

నున్నవి. దానియం దందందుఁగలయఁ గూడికొన్న క్రొంజిగురుల గుబురులే క్రొత్త పట్టుగుడ్డల యెఱ్ఱ నిజెండాలు. చూతముమరునిరథ 'రాజ' మనుట స్మరోద్దీపనమందు మిక్కిలి మేటియైనది. రథమెక్కి యెగడా పనిమొదలుపెట్టుట, మామిడి చిగుర్చుటయు మరునియుద్దీపనను మొదలు పెట్టుటయని తెలియునది. గాలికి పెద్ద గుండ్రని వలయములుగా సుడియు, పుప్పొళ్లు, పెద్ద తేరిచక్రములు. పుప్పొళ్ల పయినిసాఁగు తుమ్మెదలబారులు, మోకుత్రాళ్లు. గాలి కదలించుట మహాప్రజ గదలించుట. గాలిచేతనె పుప్పొడి చక్రములు సుడియు నట్లు మహాప్రజచేతనే తేరిచక్రములు నొర్లును. తీఁగలనుండి మామిడి పైపైవ్రాలుచుండు చిలుకలు స్త్రీలు పైపై తేరమీఁదవైచు మరువంపు చెండ్లు. మరువముతోఁ గట్టిన చెండ్లు, చిలుకలవలెఁ బచ్చగాను చిలుక కడుపులోని యీఁకల తెరలవలె రేకులుగలిగియు నుండును; కాన చిలుకలుగా రూపించుట. మామిడి చిగుర్చుటయు తుమ్మెదల బారుమూఁగుటయు, గాలి పొలసి యల్లల్లఁ జెట్లుచేమల నల్లలాడించుచు పుప్పొళ్లసుళ్లను ద్రిప్పుచుండుటయు; తీఁగలనుండి చిలుకల గుంపు లెగసి యిటునటు చెలలాడుటయు నెంతయు మన్మథవికారోద్దీపకముగా నున్నదని ఫలితార్థము. అలం. రూపకానుప్రాణితమగు నుత్ప్రేక్ష.

చ. మరునకుఁ జైత్రమంత్రి వనమండలరాజ్యఫలైకకాంచనో
త్కరము కరం బొసంగుటయుఁ దావులబచ్చులు చేరి తచ్ఛదా
వరణముఁ బాయవిప్పి పరువంబుగ నెన్నిక కెక్కఁ జేయుచున్
దొరయఁగనీవు గంటె చెలి ధూర్తవతంసమలీమసాళులన్. 136

టీ. మరునకున్ = మన్మథునకు (ఇటచైత్రుని మంత్రిగాఁ జెప్పుటచే మన్మథుని రాజుగా గ్రహింప వలయును గాన) మన్మథుఁడనెడి రాజునకు, చైత్రమంత్రి = వసంతుఁడనెడి మంత్రి, వన...త్కరమున్ —వనమండలరాజ్య = వనమండల మనెడి రాజ్యముయొక్క, ఫల = ఫలములలో, ఏక = ('ఏకే ముఖ్యాన్యకేవలాః' అ) ముఖ్యమయిన, కాంచనోత్కరము = సంపెంగమొగ్గ గుంపనెడు బంగారుసమూహమును, కరంబు ఒసఁగుటయు = ('భాగధేయః కరోబలిః' అ) అప్పనమీయగా, తావులబచ్చులు = (తావులనఁగా వాసనలును స్థానములును - బచ్చులనఁగా నాణెగాండ్రును సరాబులును) వాసనల నాణెము దెలిసిన వాయువులనెడి ఆస్థానమందుండెడి సరాబులు, చేరి = వచ్చినవారై, తత్ ఛద ఆవరణము = దానియొక్క ఆకులకప్పు అనెడు గుడ్డలకప్పును, పాయవిప్పి = తొలఁగునట్లుగా విప్పి - ముల్లెలు విప్పియనుట, పరువంబుగన్ ఎన్నికకు ఎక్కఁజేయుచున్ = పరువము గలుగునట్లుగా పొగడ్త కెక్కఁజేయుచు - (ఉత్సవమగునట్లుగా, లెక్కపెట్టుచునని బచ్చులపరముగా, నర్థము) ధూ ... ళులన్ —(ధూర్తమనఁగా 'ఉన్మత్తః కితవో ధూర్తో ధుత్తూరః కనకాహ్వయః' అ. ఉమ్మెత్తపువ్వును) ఉమ్మెత్తపువ్వుయొక్క, వతంస = కొనలయందుండునట్టి, మలీమస = మలినములయిన, అళులన్ = తుమ్మెదలని యర్థము. ధూర్తవతంస = పలుగాకి మిన్నలయిన, మలీమస+అళులన్ = మలినజన సమూహముల నని యర్థాంతరము. దొరయఁగాన్ ఈవు = చేరనీయవు, చెలి = గిరికా, కంటె = చూచితివా.

రాజునకు మంత్రియు రాజ్యమందలి ఫలములలో ముఖ్యమయినదిగా బంగారు సమూహము నర్పించుటగఁదు. అపుడాస్థానపు సరాబులువచ్చి బంగారు ముల్లెలువిప్పి వానిని ఒరచూచి తూనిక వేయుదురు. వారు తక్కిన ధూర్తులయిన వారిని జేరనీయక తల్లాభము తాముపొందఁ బ్రయత్నించుటయు స్వభావముగాన యావిషయమే యిటయనుసంధింపఁబడినది. వసంతర్తువున సంపెఁగ

మొగ్గ లుపవనమండలమందుఁ జోటమరంచెననియు గాడ్పు వానిపయి రేకులు విచ్చి వికసింపఁజేసి దాని వాసనలు నలుగడలఁ బర్వఁజేసిన దనియు, ఆసంపెంగ తావికిఁ దుమ్మెదలు మూఁగక తొలఁగుచున్నవనియు ఫలితార్థము. బచ్చుశబ్దమునకు 'నిషధేంద్రు బచ్చుకున్' (శృంగా. నై.) 'వసుధ జెల్లింపఁ దరమె యెవ్వారికైన, మెచ్చువాఁడౌర నలరాచ బచ్చువాఁడు' 'దొరయంగనీవు' అనుటబచ్చులను మహా దర్థక కర్తకన్వయింపవు. 'నీరు' అని యుండిన లెస్స. అలం. శ్లేషము. సమాసోక్తియు.

చ. రతిపతిధర్మకర్త ఋతురా జబలావళి నొంచి యేఁగుదు<br>
ర్మతుల మథించి కైకొనినమానధనంబుల ముద్రవెట్టుచోఁ<br>
బ్రతినవ దీపికాశిఖఁ గరంగెడు లక్కయుఁబోలె వంజుల<br>
స్థితమయి తేఁటి వెగ్గలపుఁదేనియ గ్రాయుట గంటివే చెలీ. 137

అ. రతిపతిధర్మకర్త=మన్మథుని ధర్మస్థాపకుఁడయిన, ఋతురాజు=వసంతుఁడు, అనియర్థము. (మన్మథునికి ధర్మము అనఁగా విల్లయిన పువ్వులకు వసంతుఁడు కర్తయని భావము. ఈయర్థమందు రతిపతియనెడు మన్మథనామము అనురాగ పర్యాయమయిన రతికిఁ బతియని యర్థాంతర క్రోడీకారము చేత నుపయుక్తమగుచున్నది.) 'రతిఃస్మరప్రియాయాంచ రాగేఽపి సురతేఽపిచ' విశ్వము.) అబలా...మథించి—అబలా+ఆవళి=స్త్రీసమూహమును, నొంచి=విరహవ్యథపాలుచేసి, ఏఁగు దుర్మతులన్=ఎడఁబాసి పోవుచున్న దుష్టబుద్ధులగుపాంథులను, మథించి=మర్దించి, కైకొనిన మానధనంబుల నెల్లన్=పుచ్చుకొన్న మానమనెడి ధనములును - అనఁగా వారిప్రణయకోపములనెడి ధనములను, ముద్రవెట్టుచోన్ = ముల్లెలుగట్టి సికాముద్రచేసెడు సమయమందు, ప్రతినవ దీపికాశిఖన్=ప్రతి దీపపుఁ గొడిమీఁదను, కరంగెడు లక్కయుఁబోలెన్ = కరఁగినదై కొంతజాఱుచున్న లక్కయో యన్నట్లు, వంజులస్థితమయి = ('వంజులోఽశోకే' ఇటదీప శిఖతోడి సామ్యమునుబట్టి) రక్తాశోకము పువ్వు మొనయందు నిలిచి, తేఁటి=తుమ్మెద, వెగ్గలపుఁదేనియ=వెక్కసమయిన తేనెను, గ్రాయుటన్ = వెడలఁగ్రక్కుటను, చెలీ = గిరికా, కంటివే = చూచితివా? ఎఱ్ఱయశోకపుష్పపుకొన దీపముమొన; ఆపువ్వుపయి వ్రాలియున్న తుమ్మెద దీపముమొనపయి కాలుచున్న లక్క; అది వెడఁగ్రక్కు తేనె కాఱుచున్న లక్క; అని ఉపమానోపమేయ భావము తెలియునది.

రక్తాశోకములు పూఁచుట పాంథులకు విరహోద్దీపకముగా నున్నదనియు ప్రోషితభర్తృకలకు మనోవ్యథాకరముగా నున్నదనియు భావము. తప్పుడించి పోవువారిని నిలువఁజేయని దౌర్బల్యము గలవారుగాన 'అబలలు'. ప్రణయకోపమున దయలేక పోవువారుగాన 'దుర్మతులు.' 'మథించి' కలంచి నలంపనిచోఁ దాఁచిన ధనమియ్యరు. ప్రణయకోపమును దిగవిడువరు. వసంతుని కీపనియేలన 'ఋతురాజు' రాజుగదా. రాజేకదా దండ్యులను దండించి ప్రోగుచేసిన ధనములనెల్ల ముద్రవెట్టుట. రాజయినచోఁ పాంథులను దండింపనేల? రతిపతికి ధర్మకర్తగదా. స్త్రీపురుషులకు రతిగలిగించువాని ధర్మములకు నిర్వాహకుఁడగుటచే స్త్రీలనెడఁబాసి విరతితోఁ బోవువానిని దండించుట. తేఁటి తీపయిన తేనియను గ్రాయుట యేలన నది 'వెగ్గల'మయినందున; లేకున్నఁ గ్రాయుటగలుగదు. దీనిచే పూఁచిన పువ్వుల పెంపుసొంపు ధ్వనితము. అలం. సమాసోక్తి, ఉత్ప్రేక్షయు.

ఉ. తుమ్మెద త్రిమ్మరీఁడు పయిఁదోఁచు పిశంగిమ పద్మినినిశాం<br>
కమ్మది తాఁ బరాగపటిఁ గప్పి మధువ్రతిఁ జేరఁబోవుచున్

నమ్మిక కంగజ ప్రహరణమ్ముల ముట్టెడుఁ జూడవమ్మ ప
ల్గొమ్మలఁ జెందువారలు తగుల్విరియాటలు నేరకుందురే. 138

అ. తుమ్మెద త్రిమ్మరీఁడు = (త్రిమ్మరీఁడనఁగా మిక్కిలియుఁ దిరుగువాఁడు - ఇక్కడ) తుమ్మెదయనెడు మిక్కుటమయిన యనేక స్త్రీవిహారము గలవాఁడు, పయిఁదోఁచు పిశంగిమ=పయిని గనుపట్టునట్టి పసపురంగు అనెడి, పద్మినీనిశాంకమ్ము=(పద్మినియనఁగా తామరతీఁగయు పద్మినీ జాతి స్త్రీయును, నిశాంకము=రాత్రిప్రాప్తమయిన చిహ్నము) పద్మినీజాతి స్త్రీదయిన, నిశాంకము=(నిశ యనఁగా పసపు) పసపుచిహ్నము అనియర్థము - పరపురుషునికి రాత్రి సంభోగము కలుగుటచే పద్మినితో రాత్రి గవగూడి దాని మేని పసపంటుకొన్న చిహ్నమనుట - (తుమ్మెదలు రాత్రులందు తామరల యందుఁ జిక్కువడుచున్నవి గావున రాత్రియందుఁ దామరపుప్పొడి యంటుకొన్న చిహ్నమని భావము) తుమ్మెదల మేఁపు పిశంగిమను.

'అపరు నిశాభానుకిరణానల మంటినఁ గూఁడుకొన్న పు
ప్పొడికొలుచెల్ల మోచికొని పోయెడు సంభ్రమ మొప్పఁ గంటివే
పడఁతి భవద్విహారవనపద్మసరిస్సుముదాలయంబులన్
వెడలుమిళింద బృందముల మేఁపు పిశంగిమ కైతవంబునన్. (మనుచరిత్రము.)

రాత్రి పెల్లన్నియు పసపునకుఁ జెల్లును, అది = ఆపద్మినీనిశాంకమ్మును, తాన్ =తాను, పరాగపటిన్ కప్పి=తెల్లని పుప్పొడియనెడు వస్త్రముచేతఁ గప్పి, మధువ్రతిన్ = (మధువ్రతియనఁగా ఆఁడుతుమ్మెద) మధువ్రతియనెడు నాయికను గలయఁబోవుచు, నమ్మికకున్ =ఆనాయికకు నమ్మిక పుట్టెడి కొఱకు, అంగజప్రహరణమ్ములన్ =మన్మథుని ఆయుధమ్ములను, ముట్టెడున్ = ముట్టి బాసచేయుచున్నదని యర్థము. (మన్మథాయుధములు పువ్వులుగనుక పువ్వుల నంటుచున్నదని భావము.) చూడవమ్మ = అయిన నిదివింతగాదు, ఏమనిన, పల్గొమ్మలఁ జెందువారలు = అనేక స్త్రీలను బొందువారలు అని విటపరమయిన యర్థము.(అనేక వృక్షశాఖలను బొందువారని తుమ్మెదపరమయిన యర్థము. తగుల్ విరియాటలు-తగుల్ =తగులును-ఇది యుభయత్ర సాధారణము. విరియాటలును=స్వేచ్ఛావిహారములునని విటపరముగా-(విరులయందలి-అనఁగా పువ్వులయందలి యాటలని భృంగపరమయిన యర్థము.) నేరకుందురే= నేర్చియె యుందురనుట, పెక్కు స్త్రీలతోఁ బొందునట్టి విటులు, తగులాటములును, స్వేచ్ఛావిహారములును నేరకుందురాయని యర్థము. పెక్కుచెట్ల శాఖలందుఁ బొందెడు తుమ్మెదలు తగులాటమును పుష్పక్రీడయు నేరకుందురాయని యర్థాంతరము.

పద్మపరాగము ఎఱుపుమించినపసుపు. సామాన్యముగాఁబుప్పొడి తెల్లనిది. కావుననే మొదటిదాని నంటుకొన్న పసుపుగా వర్ణించినాఁడు. ఆపసుపు దెలియమికై తెల్లనిగుడ్డ (పరాగపటి) కప్పుకొనుట. బాసకు ఆయుధములుముట్టుట ప్రసిద్ధము. ఒక స్త్రీతోఁబోయి యుండియు లేదని బాసచేయుట నిరంకుశ పాపస్వేచ్ఛ. అది తగునా యన్నచో 'పల్ ... విరియాటలు నేరకుందురే' అట్టివారికి స్వేచ్ఛావిహారము లేకున్నఁ దీఱదని గూఢాశయము. అలం రూపకసంకీర్ణమగునర్థాంతరన్యాసము. 'అంగజప్రహరణమ్ములు' పర్యాయోక్తము.

చ. అనిలకుమారకుండు మరుదద్ధ్వనిరోధిపలాశమండలీ
ఘనవనరాశిలోఁ బుడమికానుపు పద్మినిచిక్కఁ ద్రుక్కఁగా
గనినకరముద్రఁ జూపి వెలయించి తదంబుదరాగపాళిఁ గై
కొనుచుఁ బ్రవాలతేజమునఁ గూరిచెఁ గెంపె పలాశవీథులన్. 139

అ. ఇందు 'అనిలకుమారకుఁ' డనుటచే పిన్నగాడ్పుపరముగాను హనుమంతుని పరముగాను అర్థద్వయము తెలియుచున్నది. అనిలకుమారకుండు=పిన్నవాయువని యర్థము. హనుమంతుఁడని యర్థాంతరము. మరుత్...రాశిలోన్ —మరుత్+అధ్వ = (వా) ఖేచరమార్గమును,నిరోధి=అడ్డగించిన, పలాశమండలీ=వృక్షమండలముచేత, ఘన=గొప్పదగుచున్న, వనరాశిలోన్ = ఉద్యానవన సమూహములో-(హ)మరుత్ అధ్వనిరోధి=దేవతామార్గము నడ్డగించునట్టి, పల+ఆశిమండలీ = రాక్షసమండలమనెడి, ఘనవనరాశిలోన్=గొప్పసముద్రములో, పుడమికానుపు పద్మిని=(వా)భూమియందుఁ బుట్టిన తామర తీఁగ-అనఁగా మెట్టతామరతీఁగ, చిక్కి, స్రుక్కఁగా=చిక్కుకొని, వాడఁగా (హ) భూమి కూఁతురును పద్మినీజాతియు నయిన సీత చిక్కుపడి బాధపడఁగా, ఇనకిరణప్రతన్ చూపి-వెలయించి=(వా) సూర్యుని కిరణముల ప్రసారమును కనఁబఱచి-వికసింపఁజేసి-(హ) ఇనుఁడు-అనఁగా పెనిమిటి-అగు రాముని చేతి యుంగరమును జూపి సంతసింపఁజేసి, తత్ ... గైకొనుచున్=(వా) దానితామరల యొక్క రాగముయొక్క - (ఇట రాగముచేత రాగాశ్రయ మయినపరాగము గ్రాహ్యము గాన) పుష్పాళియొక్క-పంక్తిని. గ్రహించుచు, (హ)సీతాదేవియొక్క పద్మరాగమణి పాళిని గ్రహించుచు, ఇట పాలియనఁగా 'పాళిః కేశుర్ధ్వజోలింగం సమి త్రిం స్యాంజనం స్మృతమ్' చిహ్నమును - ఆనవాలునని యర్థము. ప్రవాళ ... శిఖులన్ - (వా)పలాశశిఖులన్ = వృక్షవాటికలను - చెట్ల చాళ్లను, ప్రవాళతేజమునన్=చిగురుటాకులయొక్క కాంతితోడ, కూరిచెన్, కంటివే-(హ)పలాశశిఖులన్= రాక్షసులశిఖలను, ప్రవాలతేజమునన్=ప్రకృష్టమయిన వాలమందలి యగ్నితో, కూర్చను చూచితివా. లంకకు నిప్పుపరికొలిపినాఁడు చూచితివా.

పిల్లగాడ్పు, ఆకాశమార్గము నడ్డగించునట్లు పొడువుగా చెట్లగుంపులు పెరిఁగియున్న దట్టంపు టడవులలో నొకమెట్ట దామరతీఁగ యాచెట్లదట్టమువలన నెండసోఁకమిచేచిక్కి యెండిపోవుచుండఁగా, తాను చెట్లనడుమఁ దొలఁపిచేసి సూర్యకిరణము దానికిఁ దగులనిచ్చి వికసిల్లునట్లు చేసి యందలి పుష్పాళిని గొల్లకొనుచు చెట్లచాళ్లనకు చిగురుటాకుల మెులపఁజేసినవాఁడయ్యెనని యర్థము. సూర్యకిరణము తగులనియెడఁ జెట్లుచేమలు తెక్కొనకి పోవుట ప్రకటము.

వాయుపుత్రుఁడయిన హనుమంతుఁడు దేవతామార్గము నడ్డగించుచు మహాసముద్రమువలె విస్తరించియున్న రాక్షససమూహమునడుమ భూదేవికూఁతురయిన సీత చిక్కి స్రుక్కుచుండఁగా, నామె పతియగు రాముని యంగులీయక ముద్రనుజూపి సంతసింపఁజేసి యామె పద్మరాగమణియయిన చూడామణిని ఆనవాలుగాఁగొని యంత లంకలో రాక్షసగృహ శిఖలందుఁ దనతోఁకయందు ధగధగమండుచున్న యగ్నిని దరికొలిపెనని యర్థాంతరము. అలం. శ్లేష.

శా. అంచల్లీల హరించెఁ గొంచక యయుక్త్రాఘుత్సమాభోగముల్
పంచాస్త్రుం డన్ని యాకు లెత్తఁగని పైపైఁ గాంచనస్నానమా
డించెన్ మాధవుఁ డీసదాగతిని గంకేళే కన్నెపున్నాగ మె
క్కించెం గోకిలశావాళుల్ మొఱయ నేఁగించె వనీవీథులన్. 140

అ. ఇందు మన్మథ వసంతవాయు వ్యాపారములనుగొని ఒక రాజు పుత్ర విజయవార్త దెచ్చిన దూతకు సమ్మానములుచేయు ముచ్చటగా వర్ణించి చెప్పుచున్నాఁడు. మాధవుఁడు=విష్ణుదేవుఁడని యర్థము-వసంతుఁడనిభావము. పంచాస్త్రుఁడు=మన్మథుఁడు, అయుక్త...గముల్-(విష్ణు)అయుక్త = అయుక్తు

లనఁగా తనతోఁ గలయనివారు-శత్రువులనుట) శత్రువుల, ఓఘ=సమూహముయొక్క, క్షమా =భూముల యొక్క, ఆభోగముల్ = నిండువిస్తారములను- వారిభూవిస్తారముల నన్నిటిని బూర్ణముగా ననుట, కొంచక=జంకక, అంచల్లిలన్ =ఒప్పదమగువిధమున, హరించెన్ =పుచ్చుకొనెను-(వసం) మన్మథుఁడు, అయుక్త... గముల్ —అయుక్తులనఁగాకూడనివారు-విరహివిరహిణీజనులు. క్షమయనఁగాఓరుపువిరహిజనులయొక్క నిండయిన తాలుములను హరించినాఁడని భావము. అని=ఇట్లనిచెప్పి, ఆకులువొత్తెన్ =(వి) పత్రికలెత్తఁగా-జాబులెత్తిచూపఁగా(వసం)ఆకులుచిగుటచేలేచునట్లు చేయగాననిభావము. కని=చూచి, ఈసదాగతిని=(వి)(సత్+ఆగతిని) మంచిరాకగలవానిని-కొడుకు విజయవార్తను దెచ్చినవాఁడుగనుక శుభాగమనముగలవాఁడనుట-(వ) వాయువును,('మాతరిశ్వాసదాగతిః' అ.) కాంచనస్నానము ఆడించెన్ =(వి) కనకాభిషేకి మాడించెను-(వ)కాంచనమనఁగా = సంపెంగ గనుక సంపెంగపువ్వులచేఁ బర్విననానిని గావించె నని భావము. సంపెఁగపువ్వులు గాలియందెల్లఁ దట్టముగా వ్యాపించియుండె ననుట. కన్నె=గిరికా, పున్నాగము ఎక్కించెన్ = (వి)మగయేనుఁగును ఎక్కించెను. (వ) కన్నెపున్నాగమున్న లేఁతపొన్న చెట్టును, ఎక్కించెననిభావము. కోకిల కాహళుల్ = కోకిలధ్వనులవంటి తుతారాలు, మొరయన్ =మోగఁగా, వనీనికుంజలన్ =వనసీమలనెడు వీధులందు, ఏఁగించెన్ =ఊరేఁగించెను. (వ) తుతారాలవంటి కోకిలధ్వనులు చెలఁగఁగా వనవాటికలందు పొలయునట్లు చేసెను. కంటె=చూచితివా.

శత్రువిజయమునకై పోయినపుత్రుని విజయవార్తఁ దెచ్చి జాబుచూపినను గరూపించిన దూతకుఁ దండ్రియగురాజు, కనకాభిషేకముచేసి యేనుఁగునెక్కించి తుతారాలు మ్రోఁగఁగా వీథులందు నూరేగింపఁజేయుట ప్రసిద్ధము. శత్రువుల భూవిస్తారములనెల్ల మన్మథుఁడపహరించినాఁడని విష్ణునకుఁ జెప్పఁగా వచ్చినశుభాగతుఁడగు దూతకు నద్దేవుఁడిట్టి సన్మానము చేసెనాఁడని యర్థము.

వసంతర్తువున మన్మథ సముద్దీపనముచే విరహివిరహిణీజనుల తాలుములెల్లం బూర్ణముగాఁ దూలినపనియు, గాలిమెల్లనిగతితో నాకులను గదల్చుచు సంపెంగపువ్వులఁ బర్వంజేయుచు లేఁత పొన్నల నూఁచుచు, వనవాఁటికలందుఁ బొలసెననియు, కోకిలలు గూసెననియు భావము.

కన్నెపున్నాగమనుచో 'సంస్కృతిపదేన పరిమితి మాంద్రపదం కర్మధారయోభవతి' అను నన్నయభట్టీయము చొప్పన, సమాసమని తెలియునది. పంచాస్త్రుఁడనఁగా విరవియైన యస్త్రములు గలవాఁడని శత్రుభూవిజయపరముగా నర్థము వ్యంజితమగుచున్నది. (కొంచక) భయపడక యని యర్థము. అయ్యోయని దయ చూపకయని భావము. ఆకులెత్తుట, నోటఁజెప్పుటకంటెజాబులు చూపుటమజెంత నమ్మికకుఁ బాత్రము, అలం. శ్లేషమును సమాసోక్తియు.

**తే.** కానఁగడుమౌనియై పెద్దకాలముండి, వాక్యసంసిద్ధి మాధవునివలనఁ గన్న
మత్తకోకిలకవివాక్సమాజమెల్లఁ, బంచమశ్రుతి వింటివే చంచలాక్షి. 141

చంచలాక్షి=బెళుకుఁగన్నులదానా, కానన్ =అరణ్యమందు, కడున్ మౌనియై=మిక్కిలి మౌనవ్రతముదాల్చి, పెద్దకాలము, ఉండి-చిరకాలముండియని యర్థము. పదినెలలవఱకుఁ బలుకుటలేకయుండి యనిభావము. మాధవువలనన్ = విష్ణుదేవునివలన, వాక్యసంసిద్ధి = మాటపరిపాకమును పొందినయని యర్థము. (మాధవువలనన్ =వసంతునివలన, పలుకుటను బొందినయని భావము.') మత్తకోకిలకవి=మదించిన కోయిలయనెడు కవియొక్క, లేక కోకిలక=చిన్నకోయిలయను, వి=పక్షియొక్క యనియుం జెప్పవచ్చును. వాక్సమాజమెల్లన్ =మాటసమూహమంతయు, పంచమశ్రుతి=పంచమవేదమయిన భారతమని యర్థము - పంచమ స్వరమని భావము. వింటివే=వింటివా.

'పికః కూజతి పంచమమ్' అని కోకిల పంచమస్వరమును బలుకుచున్నదని శాస్త్రము. పంచమశ్రుతియనఁగా స్వరారంభకారణావయవమయిన శబ్దవిశేషము, 'ప్రథమశ్రవణాచ్ఛబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః। సా శ్రుతిః సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా' (సంగీతశాస్త్రము.) అడవియందుఁ బెద్దకాలము మౌనవ్రతము ధరించి తపముచేయఁగా విష్ణుండు వాక్పరిపాటిని గృపచేసెననియు దాని చేఁ జెప్పినమాటలన్నియు భారతమువలె సకలపురుషార్థబోధకములై యున్నవనియు నర్థము. భావము సుగమము. అలం. శ్లేషమూలక కావ్యలింగము.

మ. నునుఁగప్రంపుటనంటివిప్పుపొర యక్షిన్జోకెక్కి మాధ్వీమహా
వనధిం బుష్పాడిదీవికిన్ మధుకరవ్యాహారు లేతేరఁ ద
ద్ఘనకర్పూరపటంబు లందుకొని వేడ్కం గోరకవ్యూహమో
హనముక్తావళిఁ దార్చె నీతరగుగాడ్పబ్జాక్షి వీక్షించితే. 142

అ. ఇందు, తుమ్మెదలను బేరగాండ్రుగాను, గాలిని తెరగరిగాను, రూపించుచున్నాఁడు- అబ్జాక్షీ=గిరికా, మధుకరవ్యాహారులు = తుమ్మెదలనెడు బేరగాండ్రు, నునుకప్రంపు టనంటి విప్పు పొర=నున్నని కర్పూరపరఁటి విచ్చుపొర, అక్షిన్ జోకు=అనెడునోనెను, ఎక్కి, మాధ్వీమహావనధిన్ = పూఁదేనెయనెడు గొప్పసముద్రమందు, పుష్పాడిదీవికిన్ = పుష్పాడి తిప్పయనెడు ద్వీపమునకు, ఏతేరన్=రాఁగా, తత్ ఘన కర్పూరపటంబులు = వారివయిన గొప్పకర్పూరములనెడి వస్త్రములను, అందుకొని=తీసికొని, ఈతరగుగాడ్పు = ఈతరగరిగాలి, వేడ్కన్ = వేడుకచేత, కోర...వళిన్ = మొగ్గలయొక్క సమూహమనెడి మనస్సుహరించు ముత్తియములను, తార్చెను=పొందించెను. వస్త్రములను దీసికొని వానికిబదులుగా ముత్యాలిచ్చెననుట, వీక్షించితే=చూచితివా.

ముత్తెములు సముద్ర పరివృతములయిన లంక మొదలయిన ద్వీపములందు మెండుగా దొరకును గాన, బేరగాండ్రు తమయూరియందలి యపూర్వములయిన గుడ్డలు మొదలయినవి యెత్తికొని యోడ లెక్కి యాదీవులకుఁబోయి యాసరకులకు మాఱుగా నాదీవిలోని ముత్తెముల గొనితెచ్చుట వాడుక. దీనినిబట్టియే యిక్కడ మకరంద రసమనెడి యొక మహాసముద్రమును దానియందు పుష్పాడితో నొక దీవియు కర్పూర పరఁటినుండి విడినపొరతో నొకనోనెయుఁగల్పించి తుమ్మెదలను బేరగాండ్రుగను వాని పయి నంటిన కర్పూరములను వస్త్రములుగను, గాలి తరగరిగను, ఆపుష్పాడి దీవిలోని మొగ్గలను ముత్తె ములుగను రూపించినాఁడని తెలియునది. తేనియ లవ్వారిగాఁజిప్ప వెల్లిగొని యొక్కెడనుండఁగా దానినడుమ పుష్పాడితిప్ప యొకదీవివలె నుండెననియు, ఆవెల్లిలో విడిన కర్పూరపరఁటి పొరయొ క్కటి గొట్టుకొని యాపుష్పాడి తిప్పయొద్దకు గాలివడిని బోవుచుండెననియు, ఆపొరయందలి వాస నలకుఁ మూఁగి యందలి కప్పురపురజముచే నవి క్రుంగియుండెననియు. ఆతిప్పను జేరఁగా గాలికొట్టి వానిపయి కప్పురము దుమ్మునంతయుఁ జిమ్ముకొనిపోవఁగా నవియు దరియందలి పూమొగ్గలయందు వ్రాలి యుండగానెననియుఁ దాత్పర్యము. అలం. రూపకము సావయవము.

మ. అలినీలాలక కంటె చిల్కభవదీయాలాప లీలాప్తి నిం
పలరం గోరి విపక్వదాడిమ తరువ్యాలంబి శాఖాఫల
జ్వలనావాఙ్ముఖమై తపంబు నవరింపన్ సాగె నే లబ్బెడిం
దలఁక్రిందైన ననూనవాగ్గ్రహణ మేఘాశక్తి బింబాశికిన్. 143

అ. అలినీలాలక=తుమ్మెదలవలె నల్లనయిన ముంగురులు గలదానా, చిల్క—, భవ...లాప్తిన్—భవదీయ=నీదయిన, ఆలాపలీలా=మాటల మురువుయొక్క—, ఆప్తిన్=ప్రాప్తిచేత, ఇంపు అలరన్=సంతోషము ఉల్లసిల్లఁగా, కోరి = నీయొక్క వాగ్విలాసము తనకులభించి యానందింపవలయునని కోరి యనుట, విపక్వ...ఖమై—విపక్వ=మిక్కిలి పండివిరిసిన, దాడిమతరు=దానిమ్మ చెట్టుయొక్క—, వ్యాలంబి=వ్రేలుచున్న, శాఖా = కొమ్మయందలి, ఫల=పండనునట్టి, జ్వలన=అగ్నికి, అవాఙ్ముఖమై=అధోముఖమై, తపంబు సవరింపన్ సాగెన్=తపస్సుచేయఁ దొడఁగెను. అయినను,బింబాశికిన్=దొండపండ్లు దినువానికి, తలక్రిందయినను=తలక్రిందుగాఁ దపస్సుచేసినను, అనూన...శక్తి—అనూన=కొఱఁతలేని, వాక్ గ్రహణ=మాటలు గ్రహించుటయందలి, మేధాశక్తి=బుద్ధిబలము, ఏల, అబ్బెడిన్=ఎందులకు లభించును - అనఁగా లభింపదనుట. (దొండపండు దిన్నవారు 'సద్యోబుద్ధిహారంబింబం సద్యో బుద్ధికరీవచా' అన్నట్లు, బుద్ధిహీను లగుదురని ప్రసిద్ధము.) అగ్ని తేజొండగు సూర్యునిఁజూచుచు తపంబుసేయుటగలదు. ఇట పండిన దానిమ్మపండు అగ్ని. దాని క్రిందుభాగము విరిసి లోనిగింజలు దెలియుచుండును గాన చిలుక దానియడుగుననుండి మొగము పైకెత్తుకొని దానిగింజలనుగొటికి తినుటచే నధోముఖమగుచున్నది. చిలుకకుఁ దలపయికిఁ ద్రిప్పుట యధోముఖము. గిరికయాలాపలీల తపస్సిద్ధి చేతనే పడయందగినట్టిది గాన, అట్లు చేసినను బింబాశియగుటచే నది పడయదయ్యె. తపస్సుచేసి సంపాదించిన దాని మాటల బుద్ధినంతయు దొండపండు తోడనే హరించునుగదా. చిలుకపలుకులకంటె గిరిక పలుకులు తీయనివని.'ధ్వని భవదీయ...కోరి.' ఉత్ప్రేక్ష. 'ఫలజ్వలన=పరిణామము' 'అధో...సాగెను' అతిశయోక్తి. 'తల...బాశికిన్' అర్థాంతరన్యాసము.

మ. అసితాబ్జేక్షణ చూడు కేతకి శివత్యాగాపవాదంబు దీ
ర్ప సముద్ధూళితధూళికాభసితయై బద్ధాళిరుద్రాక్షయై
యసిపత్రాసికఁ బూని నిల్చుటయు నయ్యష్టాత్ము త్రైలోక్యజీ
వ సముజ్జీవికయైనమూర్తి దరియన్ వచ్చెన్ సదాక్షిణ్యతన్. 144

అ. అసితాబ్జేక్షణ = నల్లకలువలవంటి కన్నులుగలదానా, కేతకి = మొగలిపువ్వు, శివత్యాగ అపవాదంబున్ = శివునిచేత విడువఁబడుట యనునిందను, తీర్పన్ = పోఁగొట్టుకొనుటకు, 'నకేతక్యా సదాశివమ్' అనుటయిట అనుసంధించునది. సము... సితయై = లెస్సగాఁ బూయఁబడిన తెల్లపుప్పొడియనెడి భస్మముగలదై, బద్ధాళిరుద్రాక్షయై = కట్టఁబడిన తుమ్మెదలబారనెడు రుద్రాక్షమాలికలు గలదై, అసి పత్రాసికన్ = మొగలియాకనెడు కత్తిని, పూని, నిల్చుటయున్=నిలువఁగా - ప్రమాణము చేసికొనుటకు సిద్ధపడఁగా నని భావము. అయ్యష్టాత్మ = అష్టమూర్తియైన యాశివుని యొక్క, త్రైలోక్య=మూఁడు లోకములయందలి, జీవ=జంతువులకు, సముజ్జీవకము = ఉజ్జీవనకరము, ఐనమూర్తి=అనఁగా నష్టమూర్తులలో నొకమూర్తియైన వాయువు, సదాక్షిణ్యతన్ = మోమోటముతోనని యర్థము - (దక్షిణుఁడనఁగా దక్షిణపు దిక్కువాఁడు. వానిభావము. దాక్షిణ్యము - దాక్షిణ్య సహితుఁడు సదాక్షిణ్యుఁడు గనుక, దక్షిణదిక్కు వానితనముతోడ ననిభావము) దరియన్ వచ్చెన్ = సమీపమగునట్లు గావచ్చెను - ప్రత్యక్షమాయెనని భావము.

మేనంతయు విభూతిఁబూసికొని రుద్రాక్షమాలికలు వైచికొని చేతఁగత్తిని బట్టుకొని 'శివుఁడనుగ్రహించెనా సరి ; లేకున్నఁగత్తిచేత నఱకుకొని ప్రాణములు విడుతునని ప్రమాణము చేసికొనుటకు సిద్ధపడఁగా నతఁడు తనమూర్తులలో నొకమూర్తిరూపమున మోమోటమున డాయవచ్చెనని యర్థము.

మొగలికి నిలువెల్లఁ దెల్లనిబుప్పొడి గలుగుటయుఁ దుమ్మెదలు మూఁగుటయు దాని రేకులు గత్తివలె నుండుటయుఁ బ్రకటము. అట్లు కత్తి చేతఁబూని నిలుచుటచే, శివుఁడుముల్లోకముల కుజ్జీవకమయిన తన మూర్తిని బంపుట యనుగ్రహించినాఁడు 'సదాక్షిణ్యాతన్' దక్షిణపు దిక్కుగాలి దానిపయిఁ బొలసె ననుట. అలం. హేతూత్ప్రేక్ష. సమాసోక్తి 'అష్టాత్మ'పరికరము. 'త్రైలో...మూర్తి'పర్యాయోక్తము.

తే. కన్నె మరునకుఁ బూఁదూపు - లెన్ని లేవు, కన్నెగేదంగివిరి కెన - గావు గాక
సూనబాణాభియాతికి - దీనిగాలి, సోఁకినను గాదు తలయేఱు - సోఁకు నెపుడు.

అ. కన్నె=గిరికా, మరునకున్=మన్మథునకు, పూఁదూపులు ఎన్ని లేవు - అనఁగా అనేకము లున్న వనుట, అవియన్నియును, కన్నెగేదంగి విరికిన్ = లేఁత మొగలిపువ్వునకు, ఎనగావుగాక= సమానములు గావుగాని, కన్నెగేదంగితో సమానమగుట తప్పఁ దక్కిన గుణములేమో వానికిఁగలవనుట. అదేలనఁగా, సూనబాణాభియాతికిన్ = మన్మథునికి శత్రుఁడయిన శివునకు, దీనిగాలి సోఁకినను, కాదు=సరిపడదు - దీనిగాలి సయితము విరోధించుచున్న దనుట. తలయేఱు సోఁకు నెపుడు=తలనొప్పి యెప్పుడును గలుగునని యర్థము. తలయందలి గంగ యలముకొనునని భావము.

ఒకదానిగాలియుఁ దగులరాదనుట అదియెంతమాత్రము గిట్టదనుటకు జాతీయము. ఏలనఁగా 'తలయేఱు సోఁకును' గాలికే తలనొప్పి గలుగుచున్నది. కావుననే మన్మథునకుఁ దనశత్రువయిన శివుని నొప్పించు బాణములలో నింతటి పనివడిగలది లేదు. తక్కిన పూవుమూఁకలుపోయి గ్రుచ్చుకొని నొప్పించునవి ఇదియోపోయి నాటక తనగాలి సోఁకినంత మాత్రనే తలయేఱు గలిగించునది. కాఁబట్టి యవియన్నియుఁ దనతో సాటికావు. కన్నెగేదంగియనుట మఱింత మోహోద్దీపకత్వమునకు 'కామనిశితాస్త్రములు తతోత్కమలతరలతలు చిగురుఁగొమ్మలచేవల్' అని యున్నదిగదా. అలం. శ్లేషానుప్రాణితమగు కావ్యలింగము.

చ. కనఁ బద మూనఁ బాడఁ బలుకన్ మొగమెత్తుకొనన్ మదింపఁజే
య నలమఁ జల్ల నూర్చ నగ నంటను జాలవు గాక కాఁకచే
ఘనకుచ పువ్వులీవె తిలకంబు నశోకముఁ బ్రేంకణంబు గోఁ
గును గనకంబుఁ గేసరముఁ గ్రోవియు వావిలి పొన్న మావియున్. 146

అ. ఘనకుచ = గబ్బిగుబ్బలు గలదానా, కాఁకచేన్=విరహతాపముచేత, కనన్=చూచుటకును, పదము+ఊనన్ = కాలుమోపుటకును, పాడన్, పలుకన్, మొగమెత్తుకొనన్=ముఖరాగము కనఁబఱుచుటకును, మదింపన్ చేయన్=ముఖసీధువు నించుటకును, అలమన్=కౌఁగిలించుటకును, చల్లనూర్చన్=చల్లని యూర్పుగూర్చుటకును, నగన్, అంటను, చాలవుగాక = ఓపక యున్నావు గాని, తిలకంబున్ = బొట్టుగుచెట్టును, అశోకమున్, ప్రేంకణము=మంకెనతీఁగయు, గోఁగును= కొండగోఁగుచెట్టును, కనకంబు = సంపెఁగయు, కేసరము=పొగడచెట్టు, క్రోవియున్=కోవిదార మును, వావిలి, పొన్న, మావి=తియ్యమామిడి చెట్టును, పువ్వులీవె = పుష్పములు సమర్పింపవా, నీవు పయిని చెప్పినట్టు లూరకచూచుట కాలుమొట్టుట మొదలుగా నిట్టిరవంత యనుగ్రహముచేసినఁ జాలునే, అంతమాత్రనే యవి వలయుపువ్వులను నీకిచ్చునే యనియర్థము. చూచుట మొదలయిన దోహదములను బదింటినిజేయఁగా తిలకాదులు పుష్పించునని యాశయము. క్రమాలంకారము.

సీ. కలికి నీచేపట్టు - కలది మాకందంబు, సతి నీవు గనునది - సరసతిలక
మబల నీయెదఁ జేరు - నది తావిగ్రోవి తో,య్యలినీవు పదముంచు - నది యశోక

మతివ నీ యిరవొందుకనది దగుఁబొగడ బి,త్తరి నీవు నగునది క దా నమేరు
వమలాంగి నీదురాకగము గన్నది ప్రియాళు, వగజ నీవెదిరించుకనది సువర్ణ

తే. మింతినీచేఁ గృతాశ్వాసకమింద్ర సురస,మళికచ భవన్మృదూక్తి కకర్ణాభరణముఁ
గాంచునది కర్ణికారంబు క గానఁగాన, నెరవుసేయక చెలి వీని క విరులుగొనుము.

అ. కలికి=గిరికా, నీచేపట్టుగలది మాకందంబు = నీచేతి తాఁకుఁడు గలది మామిడిచెట్టని యర్థము - నీచేత నూనెడివస్తువే మాకు అందమైనదని యర్థాంతరము.

'మాకందర్పుని ములుకులు, మాకందము లగుటఁజేసి ♦ మాకందంబుల్
మాకందములను క్రియఁదగ, మాకందాగ్రములఁ బికసమాజము నిలిచెన్. (భాగవత)

లేక మా యనఁగా లక్ష్మి 'ఇందిరా లోకమాతా మా రమామంగళ దేవతా' అని లక్ష్మీమూలమయిన దని యర్థము. సతి, నీవు కనునది = నీవుచూచునది, సరసతిలకము = రసవంతమయిన తిలకవృక్షము - నీచూపుచేత నది సరస మగుచున్నదనుట - (నీచూచిన వస్తువే సరసమయిన వానిలో మేలయినదని - మిక్కిలియు సరసవస్తువని- అర్థాంతరము.) అబల, నీఎదఁ జేరునది=నీఱొమ్మునఁ జేరునట్టిది, తావి క్రోవి=వాసనగల క్రోవిచెట్టు, (నీవు ఱొమ్మునఁజేర్చి యాదరించువస్తువే పరిమళములకు స్థానమనియు. ఎదఁజేర్చుట యనఁగా కౌగిలించుటయు మిక్కిలి యాదరించుటయు) తొయ్యలి, నీవు పదముంచునది = నీవు కాలుతాఁకించునది, అశోకము=అశోకవృక్షము - (నీవడుగుపెట్టిన వస్తువే శోకరహితమైన దనియును.)

అతివ, నీయిరవు ఒందునది = నీదయిన కలుపుక్కిలింతను బొందునట్టిది, తగుపొగడ=అర్హమయిన పొగడచెట్టు- ('ఇరా'శబ్దము సురయందు వర్తించును 'గంధోత్తమా ప్రసన్నేరా కాదంబర్యః పరిస్రుతా' అ. ఇర + పొందునది = ఇరవొందునది యని ప్రథమమీఁది కచటతపలకు గసడద వాదేశము - (ఇరవు+ఒందునదియని యర్థాంతరమున విభాగము. నీనెలవును బొందుచున్న అనఁగా నీవున్నచోటనున్నట్టి వస్తువే,తగుఁ బొగడఁ=పొగడుటకుఁ దగును.అర్థమున'తగుఁబొగడ'='తగునట్టి పొగడ' అని తద్ధర్మవిశేషణముతోడి విశేష్యముగాను, అర్థాంతరమున 'తగుఁ బొగడఁ' అని తద్ధర్మ క్రియతోడి తుమంతముగాను గ్రహించునది) 'తగుఁబొగడ' యనునది క్రియాజన్యవిశేషణ సమాసము. నకారము క్రియాపదావయవముగనుక నిక్కడ లుగ్విషయముగాదయ్యెను. కాఁబట్టి పరమందలి 'ప' 'బ' యయ్యెను. 'మించుఁ గ్రొమ్మించు' ఇత్యాదిపదములందుం బలెనని గ్రహించునది. బిత్తరి=గిరికా, నీవు నగునది తాను అమేరువు=నీవు నవ్వఁదగినది పొన్నచెట్టు-(నిన్ను నవ్వించునట్టి వస్తువే మేరువు - మేరువంతగొప్పది యనియును) అమలాంగి, నీదురాగముగన్నది=నీయొక్కగానమును గాంచినదే, ప్రియాళువు=ప్రేంకణమని యర్థము (నీయనురాగమొందినదే హృదయంగమమనియును. ప్రియగతౌ అను ధాతువునుబట్టి హృదయమును గాంచునది గావున ప్రియాళువని తెలియునది.) అగజ నీవు, ఎదిరించునది=మొగమెదురై నిలుచునది - అనఁగా ముఖరాగము నించునది, సువర్ణము=సంపెఁగయని యర్థము. (నీచేత ఎదిరింపఁబడు వస్తువే బంగారమనియు.)

* ఇట 'తగుఁబొగడ' అనుచో తద్ధర్మార్థక విశేషణ సమాసమున తద్ధర్మ విశేషణములకును నుకారాంతములకు షష్ఠీసమాసమందుంబోలెఁ గచట తపలు పరంబులగు నపుడు నుగాగమము వచ్చుట గలదు. ఇందులకు మనుచరిత్రమున.

చ. ప్రభలు నభోవిటంకమున ♦ భానుమరీచులఁ బ్రోదిసేయఁ గా
స్తుభనిభ నూత్నరత్న పరి♦శోభితమై గరుడాశ్మవేది రు

గ్వీభవము పొల్పగుం జవిక • విద్రుమ పాదసువర్ణపీఠిమైఁ
బ్రభుతదలిర్ప మామ వసు•పక్ వసియించె నుదంచితస్థితిన్. (౫. ఆ. ౨౬.)

శా. కాంచెన్ భూవిభుఁడొక్క నాఁడు కనకా•ఖర్వప్రభామంజులా
స్యాంచన్మేచకరత్నవిభ్రమ సనా•థానూనదృగ్గోచులన్
మించుం బ్రాయపులేటి పిండు తనుఁ గూ•ర్మిం జుట్టి రాఁ దద్వనో
దంచద్భూమిఁ జరించునొక్క హరిణో•త్తంసంబు నింపారఁగాన్.

ఇందే 'ఆరుందీవల నుల్లసిల్లులలితోద్యానంబనూనంబుగన్' అని యున్నది.

ఇంతి నీచేన్, కృత + ఆశ్వాసము = చేయఁబడిన ముఖవాయువుగలది. ఇంద్రసురసము= వావిలిచెట్టని యర్థము - (నీచేత, కృత+ఆశ్వాసము= చేయఁబడిన యూఱడింపుగల వస్తువు, ఇంద్రునకు మిక్కిలి ప్రియమనియు) అళికచ=తుమ్మెదలవంటి కురులుగలదానా, భవత్ మృదు + ఉక్తి= నీయొక్క మెత్తని సల్లాపమనెడి, కర్ణాభరణము కాంచునది= చెవి చెఱువుకొను సొమ్ములయిన పువ్వులను బుట్టించునది, కర్ణికారంబు = కొండగోఁగుచెట్టని యర్థము. 'అథద్రుమోత్పలః కర్ణికారః పరివ్యాధః' అమ.) నీమాటలనెడి కర్ణములకు భూషణముగాంచినవస్తువే కర్ణికాయుక్తమని యర్థాంతరము- అనఁగా నలంకృతమయిన కర్ణము గలదనుట, 'కర్ణికాం కర్ణభూషణం ఇయర్తీతి కర్ణికారః' అని సమాసము. 'ఋగతౌ' అని ధాతు వ్యుత్పత్తి. 'కర్ణికా కర్ణభూషణే' అమ. కాంచుటయనఁగా ప్రసూతియగుటయును పొందుటయును, కాన=కాఁబట్టి, కానను=ఈవనమును, ఎరవుసేయక=వేఱుగాఁ దలఁపక, చెలి=గిరికా, వీనివిరులు గొనుము=ఈచెట్లయొక్క పువ్వులను సంగ్రహింపుము.

ఈవనమును ఎరవుగా దలంపవలదు. ఏలన అన్నియును నీచేపట్టుగలది మొదలయినవిగానే యున్నదిగాని వేఱుగాదనుట. విరులుగొనుము 'చేపట్టు' కరస్పర్శాదిదోహదములుచేసి మామిడి మొదలగువాని పువ్వులు గ్రహింపుమని యర్థము. ఊరక చేతనంటుట మొదలయిన స్వల్పానుగ్రహములు పచరించి వలయునన్ని పువ్వులు కోసికొనుమని యర్థాంతరము అలం. శ్లేషమూలకకావ్యలింగము.

క. అని వనితలు జవ్వని క, వ్వని విభవముఁదెల్పి కమ్మవలపులు గొనుగా
డ్పనయమికి ఫణులఁ బెనఁచిన,యనువున జడలడరఁ గుసుమహారణోత్సుకలై.

అ. అని=ఇట్లని, వనితలు=స్త్రీలు, జవ్వనికిన్=గిరికకు, అవ్వనివిభవమున్, తెల్పి,కమ్మవలపులు =మంచివాసనలను,కొను=హరించునట్టి, గాడ్పు=మలయమారుతము, ఎనయమికిన్=సోఁకకయుండుకొఱకు,ఫణులన్=సర్పములను, పెనఁచినయనువునన్ = పెనవేసి చుట్టవేసికొన్నారో యనునట్లుగా,జడలు, అడరన్=ప్రకాశింపఁగా-కమ్మవలపులగాడ్పు సోఁకకుండుటకై వానినాహరించుసర్పములను దమపయి నిగట్టిపెట్టుకొన్నారోయనునట్లు జడలున్నవని భావము.ఇదియే.'పాముకోఁతలతోడసాముచేసినగాడ్పువిపవువిత్తైసోఁకివెగటుచూప.'(విజయవిలాసము.)'ఉరగపూత్కారధూమోగ్రగంధముఁ బాసిపోలయుఁబోయీతావిమలయపవనుఁడు.' (మను) అని మందమారుతమునకు విరహిజనుల నేఁచుగుణము పాము నూర్పుల విసముతోడి కూడికచేత నని యనుసంధించుట గలదు. కుసుమహారణ ఉత్సుకలై=పువ్వుల కోయుటయందు కుతూహలము గలవారై. మీఁది కన్వయము-జడలు వ్రేలుచుండినచో చెట్లకొమ్మలకుఁ దగులుపడునని పువ్వులు గోయఁబోవునపుడు పెనఁచి కట్టుకొనుట. సర్పసామ్యము చేతనే కాక కుసుమహారణ సమయవిరచితో ద్బంధనమునను జడలదీర్ఘత మఱింత మురువుగాఁ దుటారించుచున్నది. అలం. ఉత్ప్రేక్ష.

## వృషభగతి రగడ.

బాల బాలరసాల మిది పిక । పాలిపాలిటియమరసాలము
కేలిఁ గే లిడి గ్రుచ్చఁ గడు రా । గిల్లు గిల్లుము తత్ప్రవాలము
కొమ్మ కొమ్మఁ గదల్చి నన గై । కొనక కొన కది యేల నిక్కెడు
రమ్ము రమ్మున మోపఁ గురువక । రాజి రాజిలు నెంత పొక్కెడు
నాతి నాతిచిరప్రసూత న । నంటి నంటి కదల్ప నేటికి
నీతి నీతిలకంబు వలపులు । నించు నించుక చూచుకోటికి
నోమి యోమితమధ్య నీపద । ముంచు ముంచు నశోకవాసన
లేమ లేమరువములు నీ కవ । లీల లీలల వీఁకలొఁ జన
రామ రా మన కొనరఁ గూర్చు న । రాలు రాలుతు ననలు వైళము
భామ భామహనీయ మగు నీ । పాటపాటవమునఁ బ్రియాళము
నింతు నింతుల కంటెఁ బుష్పోడి । నెరసు నెరసులు పల్కె నింతయుఁ
గాంత కాంతముఖానురాగము । కనక కనకము పూయ దెంతయుఁ
గ్రొవ్వి క్రొవ్విరి మొగ్గ మరుబరి । గోల గోల యి దేల దాఁటితి
నవ్వ నవ్వనవాటిఁ బొన్నలు । ననుచు ననుచు నెఱుంగఁ జాటితి
ముదిత ముదితమనోజ్ఞ యై తెలి । మొల్ల మొల్లము మెచ్చె మాటికి
మదిర మది రహిఁ బూని వకుళము । మన్న మన్నన మధుపకోటికిఁ
జెలువ చెలువపుఁ దావియూరుపు । సిందు సిందుర మింపు మీఱఁగ
వలదు వలదురుమధుమధువ్రత । వాసవాసంతికలు దూఱఁగ
వనిత వనితరులతలయులరుల । వాడి వాడితి కొప్పువ్రేఁగున
మనము మనమునఁ గోరి చెలులకు । మాట మాటలు వచ్చు గోఁగున
వెలయ వెల యని చూపెదవు కురు । వేరు వేఱుగఁ బల్కెదగుదువె
యలసి యలసిరిగంద మడరెడు । నాడ నాడ భుజంగి వగుదువె
వాసి వాసి తెమల్తురా విర । వాది వా దిడ వత్తు రింతులు
గాసిగా సిర మంటె నలఁపక । కప్పు కప్పుర మేల అంతులు
లతిక లతికమనీయకరకిస । లయములయమున నాడె నిత్తతి
సతనునతనుయశోభరం బన । నలరు నలరులు చూడ బిత్తరి
తావితా విది గంధవహకం । దళము దళముగ వీచు నెప్పుడు
కావ కావలిజాజు లిపు డవి । ఘనము ఘనములు మించు నప్పుడు
మాలమాలల మల్లె లెంతటి । మోహమో హరిణాక్షి దాఁచితి
యేల యేలకిపొదలు వెదకెద । వింత వింతలె యెందుఁ జూచితి
గోర గోరఁట నించితివా కలి । గొట్టు గొట్టుగఁ గోయఁ బొసఁగవు

నారి నారికడంపుఁబాలెలు ఽ నాకు నాకులవృత్తి నోసఁగవు
కలయ కలయకలంక కేతకిఽకళిక కళికచ పఱచెఁ బిత్తమె
యళికి యళికి వడంకె నీయిభఽయాన యానవిల్తుఁ గొల్తమె. 14

అ. ఈరగడయందు చెలులు పువ్వులుగోయు సమయమం దాడుకొను వాక్యములున్నవి. బాల ఓ చెలియా, బాలరసాలము ఇది=ఈలేఁత తియ్యమామిడిచెట్టు, పికపాలి...సాలము=కోకిలకదుపు పాలిటి కల్పవృక్షము. అనఁగా చిగురుటాకులచేత నభీష్టసిద్ధి గావించునదని భావము. కేలిన్ క్రీడచేత, కేలు+ఇడి, గ్రుచ్చన్ = చేయిపెట్టి గ్రుచ్చఁగానే, కడున్ రాగిల్లు=రంజించును. కనుక తద్+ప్రవాళము=దానిచిగురును, గిల్లుము. 'కరస్పర్శేచ మాకందః' అ. హస్తస్పర్శమనెడి దోహదముచే తియ్యమామిడి రంజిల్లుచున్న దని భావము. నీవు చేయిపెట్టఁగానే రంజించునని యర్థము 'అమరసాలము' ప్రథమాంతముగనుక పరమయిన కేళి గేలియయ్యెను. కొమ్మ = గిరికా, కొమ్మఁ గదల్చి=విదిల్చి, ననన్=పువ్వును, కైకొనక=చేకొనక, కొనకు,అదియేలనిక్కెదు=కొమ్మకొన కొండలకు నిక్కుచున్నావు. కొమ్మనుబట్టి యాడింపఁగా పువ్వులు తనంతటనే రాలుచున్నవి. దాని కొయందలి పువ్వునకు కాలునొవ్వ నిక్కనేల యనుట. రమ్ము = ఇటురమ్ము, ఉరమ్మునన్=ఱొమ్మునందు మోపన్ = ఆనించుకొనఁగానే, కురవక రాజి = ఎఱ్ఱపువ్వుల పెద్దగోరంటబంతి, రాజిలున్=ప్రకాశించును - నీవు ఱొమ్ముఁజేర్చుకొని యాదరించినంతనే యది యుల్లసిల్లునని యర్థము. ఎంతపొక్కెదు=ఎందుకుఁ దపించుచున్నావని యర్థము. 'ఆలిఙ్గనాత్కురవకః' అన్నట్లు, ఆలింగనరూప దోహదముచే కురవకములు ప్రకాశించునని భావము.

నాతి=గిరికా, న+అతి చిరప్రసూత = కొన్నిదినములనాఁడు గెలవేసిన, అనంటిన్=అరఁటిచెట్టును, అంటి కదల్పనేటికిన్ = ముట్టియాడింపనేల - గెలవేసిన కొన్నిదినములే యైనదిగాన ముట్టియల్లలార్చిన గెలకు హానియని యర్థము. నీతిన్=నయముతోడ, ఈతిలకంబు-ఈబొట్టుగుజెట్టు, ఇంచక, చూచుబోటికిన్=తనవంకఁ జూచునట్టి పడఁతికి, వలపులు=వాసనలను, నించును = నిండించును ఊరకకన్నెత్తి చూచినఁజాలును. వలయునంత వాసనలు గుబాళించునని యర్థము. లేక, వలపులు=ప్రేమలునించును - కన్నెత్తిచూడఁగానే యెంతో వలపుగల నెయ్యముదియ్యములు నెఱపుననియు 'తిలకో వీక్షణేనచ' అన్నట్లు, ఆలోకన రూపదోహదముచే తిలకము పూఁచునని భావము. ఓమితవధ్య=కొలదిపాటి నడుముగలదానా. ఓమి=పోషించి, నీపదముఉంచు=నీయడుగెత్తి పయినిపెట్టుము అశోకవాసన, ముంచున్ = క్రమ్ముకొనును. నీవడుగునెత్తి మోపినంతచాలును - అశోకము వాసనల గుబాళించునని యర్థము. 'అశోకశ్చరణాహత్యా' అన్నట్లు, పదతాడనమనెడి దోహదముచేత అశోకముపూయుచున్నదని భావము. లేమ=చెలియా, లీలల వేఁకలోన్ చనన్=లీలావిహారములు సేయునపుడు, లేమరువములు నీకు, అవలీల = మిక్కిలి సులువుగా దొరకును.

రామ=చెలియ, రా=రమ్ము, ననలు వైళమురాలుతును = పువులు శీఘ్రముగా రాల్చుచున్నాను. మనకు, సరాలు=దండలు, ఒనరన్ కూర్చుము. భామ=చెలియా, నీపాటపాటవమునన్=నీగాన సామర్థ్యముచేత, ప్రియాళము=ప్రేంకణము (ఇది అకారాంతమగుటకు 'చూతైః ప్రియాళైః పనసైః' అని శ్రీభాగవతము) భామహనీయము=కాంతిచేత గొప్పదిఅవును. నీపాటనేర్పునకు నిది యెంతో తెలిసితోలఁకాడునని యర్థము. 'గీత్యాప్రియాళుః' అన్నట్లు గానరూప దోహదముచేత ప్రకాశించుట తెలియునది. ఇంతులకంటన్=చెలులకన్నులందు, పుప్పొడి=పుష్పపరాగపు, నెరసులు,నింతును=నింపుదును. ఇంతయున్, నెరసులు పల్కెను = తప్పులుచెప్పనని యర్థము. నిజముగానే పుప్పొడినింతును గల్లగ

దనుట, కాంత=చెలియా, కాంతముఖ అనురాగము = గిరికయొక్క ముఖరక్తిమను, కనక=చూడక, కనకము=సంపెఁగ, ఎంతయున్ = ఎంతమాత్రమును, పూయదు=పుష్పింపదు. అనురక్తితో మనగిరిక మొగము కనఁబడిచెనా చాలును - పూచునని యర్థము. 'ముఖరాగేణచంపకః' అన్నట్లు, ముఖరక్తిమ యను దోహదముచేత సంపెఁగ పూచుననిభావము.

గోల=ముద్దరాలా, క్రొవ్వి=మదించి, ఇది క్రొవ్విరి=ఈకనఁబడు క్రొత్తవికసించిన పువ్వు. మరుబరిగోల=మన్మథునిబాణముగదా, ఏలఁదాఁటితివి = దానినెందులకు దాఁటితివే - ఆయుధమును దాఁటరాదుగదా, ఇదేల=ఇదియేల 'ఇత్యాదులందలి 'ఇది' అది'- వాక్యాలంకారార్థములు. అవ్వాన వాటియందు=ఆతోఁపుచాలునందు, పొన్నలు, నవ్వన్, ననుచున్=పూచును, అనుమ, ఎఱుంగన్, చాటితిని=తెలియఁజెప్పితిని గదాయని యర్థము. 'నమేరుర్హాసితేనచ' అన్నట్లు హాసనరూపదోహదముచేతఁ బొన్నలుపూయుననిభావము. ముదిత=ఆచెలియ, ముదితమనోజ్ఞయై=సంతసించిన మనఃకమలము గలదై, తెలి మొల్లమొల్లము=తెల్లనిమొల్లపువ్వుల సింగారమును, మాటికిన్, మెచ్చెనని యర్థము. వకుళము=పొగడచెట్టు, మదిరన్=మద్యముచేత, మదిరహిన్ పూని=వికాసమునొంది, మన్నన్=ఉండినట్టయినచో, మధుపకోటికిన్=తుమ్మెదల సమూహమునకు, మన్నన=బహుమతియగును అని యర్థము. మధుపశబ్దమిట సాభిప్రాయము. 'వకుళోముఖ సీధునా' అన్నట్లు సురాగండూషరూప దోహదముచేతఁ బొగడ చెట్లుల్లసిల్లునని తెలియునది.

చెలువ=చెలియా, సిందురము=వావిలిచెట్టు, ఇంపు, మీఱఁగన్, చెలువపుఁదావియూరుపు=మనోహరమయిన వాసనగల ముఖవాయువును- నిశ్శ్వాసముననుట, చిందుమనియర్థము. 'సిందువారో ముఖానిలాత్' అన్నట్లు సిందువారము ముఖవాయు రూపదోహదముచేత పల్లవించుచున్నదని భావము. వలత్...వాసంతికలు=వలత్=తిరుగుచున్న, ఊరుమధు=మిక్కుటమయిన తేనెగల, మధువ్రత=తుమ్మెదలకు, వాస=నివాసములయిన, వాసంతికలు=బండిగురి వెందతీఁగలు 'వాసన్తీ మాధవీలతా' అ. దూఱఁగన్, వలదు అని యర్థము. మధువ్రతశబ్దము సాభిప్రాయము. వనిత=ఓచెలియా, వని=వనమందలి, తరులతల=చెట్లయు తీఁగలయు, అలరులన్=పువ్వులను, వాడి=వ్యయపఱచి, అనఁగాఁ బువ్వులుగోసి, కొప్పు, వ్రేఁగునన్=బరువుచేత, వాడితిన్=బడలిపోయితినని యర్థము. మనము, మనమునన్, కోరి, చెలులకు మాటన్=తోడి చెలిమికత్తెలకియ్యక దాఁచినయెడ, గోఁగునన్=ఈకొండ గోఁగుమూలమున, మాటలువచ్చున్=వివాదములు రాఁగలవు అని యర్థము. 'సల్లాపతః కర్ణికారః' అని సల్లాపరూప దోహదముచేత కొండగోఁగుచెట్టు పుష్పించునని భావము.

కురువేరు, వెలయన్=ఒప్పుచుండఁగా, వెలయని=మిక్కిలి విలువగలదని, మాకు చూపెదవు, వేఱుగన్ పల్కఁదగుదువె=భేదముగా మాట్లాడఁదగుదువటే, యని యర్థము. అలసి, అలసిరిగందము=ఆశ్రీచందన వృక్షము, అడరెడునాడన్ = ప్రకాశించుచుండెడుచోట, ఆడన్ = క్రీడించుటకు భుజంగి వగుదువే=సర్పాంగనవా యేమేయని యర్థము. భుజంగియనఁగా విటకత్తెకును నర్థముగనుకఁ బరిహాస గర్భమని తెలియునది. సర్పములు చందనవృక్షములను జుట్టియుండుటయు నిట యనుసంధించినాఁడు. వాసిన్ పాసి=తారతమ్యమును విడిచి, విరవాదిన్ = విరజాజిని, తెమల్తురా=కదలింతురా, ఇంతులు=తోడిచెలులు, వాదు ఇడన్ వత్తురు = జగడమాడ వత్తురుసుమీయని యర్థము. గాసిగాన్=బాధకమగునట్లుగా, సిరము అంటన్=తలకెక్కను, కప్పురమున్, నలఁపక = నలిపిపాడిచేయక, కప్పు=కప్పిపెట్టుము. అంతులుఏల=కోలాహలము లెందులకు, ఇత్తఱిన్=ఈసమయమందు, లతికలు, అతి...కిసలయము=మిక్కిలి అందమైన, చేతులవంటి చిగుళ్లయొక్క, లయమునన్=లయచేత,ఆడెను.

చిత్తరి=చెలియా, అతను=మన్మథునియొక్క, అతను=అధికమయిన, యశోభరంబనన్=కీర్తి పెల్లిదమనునట్లుగా, అలరులు=పువ్వులు, అలరున్=ఒప్పును, చూడన్=చూడఁగా, ఇది=ఈచోటు, తావితావు=పరిమళముయొక్క స్థానము, కాఁబట్టి, గంధవహకందళము = లేఁతవాయువు, దళము గన్=తఱచుగా, ఎప్పుడు, వీచును. ఆవలి జాజులు=అవ్వలి జాజితీఁగలను, ఇపుడు = ఈసమయ మందు, కావను=కనిపెట్టకుము, ఘనములు=మేఘములు, మించునప్పుడు=అతిశయించునపుడు, అనఁగా వర్షాకాలమందు, అవి=ఆజాజులు, ఘనము=అతిశయము. అనఁగా నావలి జాజితీఁగలు వర్షాకాలమం దుఁ బూయుచున్నవిగాని యిపుడు పుష్పింపవుగనుక వానిని గాచియున్నను పసలేదని యర్థము. ఓహరిణాక్షి, ఎంతటిమోహము = ఎంతమోహమోకాని, మల్లెలు=మల్లెపువ్వులను, మూలమూలలన్= కనఁబడకుండునట్లు చాటుచాటులనును, దాఁచితి = దాఁచిపెట్టుకొంటివని యర్థము. ఏల, ఏలకి పొదలు, వెదకెదవు, ఇంతవింతలె=ఇంతటివింత లెక్కడనైనను గలవా, ఎందున్ చూచితి=ఎక్క డచూచి నేర్చితివని యర్థము. గోరన్=గోళ్లయందు, గోరఁట నించితివో=గోరంటాకునూఱి గోళ్లకుఁ బెట్టుకొనుట ప్రకటము, అయిన, కలిగొట్టు = పాటలిపువ్వులను, గొట్టుగన్ = అలవికానట్లుగా, కోయన్ పోసఁగవు=కోయుటకు వీలుపడదు-గోరంటాకు పెట్టుకొన్న గోళ్లెఱ్ఱగా నుండుటచేతను కలి గొట్టుపువ్వులు నెఱ్ఱగానే యుండుటచేతను భ్రాంత్యవరోధము గలుగునుగానఁగోయఁజాలవనిభావము.

నారి=చెలియా, నారికడంపు పాళెలు=కొబ్బరి బొండ్లాలు, నాకున్, ఆకులవృత్తి=వ్యాకుల పాటును, ఒసఁగవు. అనఁగానవి యెంతపొడవున నున్నప్పటికిని అనాయాసముగా నెక్కి కోయఁగలు గుదునని భావము. కలయక=నాతోఁగలయక, అల అకలంక కేతకి కళికకున్=కలంకరహితమయిన ఆమొగలిపూమొగ్గ యున్నదిక్కునకు, అళికచ=గిరిక, పఱచెన్, పిత్తమె=పిలుతమా - అనఁగా మర ణింపనెంచి యసిపత్రములుగల మొగలిపూమొగ్గకై పరుగిడినదిగనుక పిలుతమని యాశయము. ఈ యిభయాన=గిరిక, అళికి=భయపడి, అళికిన్=తుమ్మెదకు, ఎడంకెన్=కంపించెను. ఆ నన విల్తున్= ఆమన్మథుని, కొల్తమె=పూజింతమాయని యర్థము.

ఇది వృషభగతిరగడ, దీనికి నిరువది యెనిమిది మాత్ర లుండవలయును. లఘువొకమాత్ర గలది. గురువు రెండుమాత్రలు గలదిగాన, యట్టిమాత్ర లిరువదియెనిమిదియని తెలియవలయును. పది యేనవమాత్ర మొదటియతి. రెండురెండు పాదంబు లాద్యంత ప్రాసయుక్తంబులై యుండవలయును. దీనిపాదములకు సంఖ్యానియతిలేదు. ఈరగడయందుఁ గావ్యగుణములలో నొకటియగు కాంతిగుణము చెప్పబడెను. కావ్యగుణములు, శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమతార్థము, దీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి' యనిపది. అందు గాంతియనఁగా చిత్రవర్ణ క్రమస్థితులను మెండుగఁ గూర్చుట.

చ. అని వనకేళి సల్పి లలితాంగు లతాంతలతాంతకోటిలో
వనపవనానుషంగమున వాసన వూవని వానిఁ దేనియల్
దొనఁకని వానిఁ బుప్పొడులు దూలని వాని మదాళిమాలికల్
చెనకనివాని భావభవుసేవకు నేర్పున నేర్పరించుచున్. 150

అ. అని=ఇట్లు చెలులు చెప్పి, వనకేళిసల్పి=వనవిహారము చేసినవారై, లలితాంగులు=స్త్రీలు, లతాంత...కోటిలోన్-లతాంత=వాడని,లతాంతకోటిలోన్=పువ్వులగుంపులో,వనపవనఅనుషంగము

నన్ = అడవిగాలి సోఁకుచేత, వాసనవోవని వానిన్, తేనియలు, తొనఁకనివానిని = చిందిపోఁకయున్న వానిని, పుప్పొడులు, తూలనివానిని = ఎగిరిపోకయున్న వానిని, మదాళిమాలికల్ = మదించిన తుమ్మెద గుంపులు, చెనకనివానిన్ = ముట్టకయున్నట్టి వానిని, ఇట్టివగు, పువ్వులననుట, భావభవు సేమరన్ = మన్మథునిపూజకు, నేర్పునన్, ఏర్పరించుచున్, మీఁదికన్వయము.

పవనము 'వన' సంబంధియైనదే వాసనలఁ గొల్లలాడునది. కాన 'వనపవనము' చేత వాసన వోవని వానినన్నాఁడు. 'తేనియల్ దొనఁకని' నిండి తనంతట చిందిపోవని తేనె. 'మదా... చెనకని' లోనుండఁగా త్రావఁబడని తేనె, ఇట్టి వానినిగా నేర్పరించుటయే 'నేర్పు'. వాసనలు, తేనె, పుప్పొడి అను మూటిచేతను బువ్వులు మరుని కారాధనపాత్రము లనుట.

సీ. కుసుమవాసన లెల్లఁ గొల్లలాడితిమింకఁ, బఱచుటామని యెంత పర్వులిడునొ
చివురుజొంపము లెల్లఁ జిదిమివైచితిమింకఁ, బగఱకోయిలయెంత యెగసిపడునొ
ఫలపరంపర లెల్ల నులిచివైచితి మింకఁ, గొదమచిల్కలవెంత వదరుకొనునొ
కమ్మఁదేనియ లెల్లఁ గ్రుమ్మరించితి మింకఁ, గట్టల్కనళులెంత చుట్టుకొనునొ
తే. యెఱుఁగ రా దింతులార యీతెఱవ నిచట
మసలఁగానీక తోడ్తెందు మనము గొనిన
కుసుమకిసలయ ఫలనవ ప్రసవరసము
లసమశరునకు నర్పింత మనుచు వెడలి. 151

అ. కుసుమవాసనలెల్లన్ = పువ్వుల వాసనల నన్నిటిని, కొల్లలాడితిమి = చూఱపుచ్చితిమి. ఇంకన్. పఱచుటామని = ప్రల్లదపువసంతుఁడు, 'పఱచు'నకు పేర్వాదులలోనిది టుగాగమము. ఎంత పర్వులిడునో = ఎంతదుముకునో, చివురుజొంపములెల్లన్ = చిగురుటాకుల గుత్తులనన్నింటిని, చిదిమివైచితిమి = త్రుంచివైచితిమి, ఇంకన్, పగఱకోయిల = శత్రువయినకోకిల, ఎంత, ఎగసపడునో = మిడిసిపడునో, ఫలపరంపరలెల్లన్ = పండ్లగెలల నన్నిటిని; నులిచివైచితిమి = నలిపితిమి. ఇంకన్, కొదమచిల్కలు అవి = ఆ పరువపువయసుగల చిలుకలు, ఎంత, వదరుకొనునో = తప్పుకూఁతలు కూయునో. కమ్మఁదేనియ లెల్లన్, క్రుమ్మరించితిమి = ఒలకఁబోసితిమి. కట్టల్కన్ = మిక్కిలి కోపము చేత, అళులు = తుమ్మెదలు, చుట్టుకొనునో = చుట్టుముట్టునో. ఆమని పర్వులిడుననఁగా సంతటవ్యాపించుననియు, కోయిల ఎగసిపడునో యనఁగా పక్షి గనుక ఎగిరి వ్రాలుననియు, చిలుకలు వదరుకొనునో యనఁగా, పలుపగల పలుకులు పలుకుననియు, తుమ్మెదలు చుట్టుకొనునో అనఁగా గుంపులుగట్టి ముసరుకొనుననియు భావము.

ఇంతులార, ఎఱుఁగరాదు. ఈ తెఱవన్ = ఈ చిన్నదానిని, గిరికాదేవి ననుట, ఇచటఁ మసలఁగానీక = జాగుగానుండనీయక, తోడ్తెందు = తోడ్కొనిరందు, మనము, కొనిన, కుసుమ... రసములు = పువ్వులును, చిగుళ్లును, పండ్లును, క్రొత్తపూఁదేనెలును, అసమశరునకున్ = మన్మథునకు, అర్పింతము, అని పలుకుచు, వెడలి - మీఁది కన్వయము. ఇందుశంకయనెడి సంచారిభావము చెప్పఁబడెను. 'అనిష్టాభ్యాగమోత్ప్రేక్షా శంకా రోషాదికారణమ్.'

క. మందార ముకుళ కుహళీ, కందళిత మరంద తుందిల మిళింద వధూ
బృందాభి నందితంబగు, మందానిల మొలయ విజిత మార్గ శ్రములై. 152

అ. మం...నందితంబు-మందారముకుళ = మందారవృక్షము మొగ్గలయొక్క, కుహళీ = గుత్తులందు, కందళిత = పుట్టుచున్న, మరంద = పూఁదేనెవలన, తుందిక = పెద్దపొట్టగల-బలిసిన యనుట,

మిళిందవిభూ=ఆఁడు తుమ్మెదలయొక్క, బృంద=సమూహముచేత, అభినందితంబు=మిక్కిలి స్తుతింపఁబడుచున్నది. అగు, మందానిలము, ఒలయన్=వీవఁగా, విజితమార్గశ్రమలై=గెలువఁబడిన-(పోయిన) దారిబడలిక గలవారై, ముంపరి కన్వయము. [కుహాళీశబ్దము పూగుత్తియందు వర్తించుటకు,

చ. ప్రతినవచారుకేసరపరాగశలాటు మిళిందబృందని
ర్మితి కుహాళియుగంబుగతిఁ గ్రేపలఁ గర్ణకలాపరత్న ని
ర్గతిరుచి మంజరుల్ దనరఁగాఁ గ్రముకద్రుమకంఠలక్ష్మికిం
బ్రతిభట వృత్తిఁజూపెడును భామిని కంఠము. (పింగళిసూరన)]

చ. వనజముఖుల్ గనుంగొని రవారితవారితరంగ రంగన
ర్తన సలిలభ్రమ భ్రమణ రంగదభంగ రథాంగధామముల్
మనసిజ హోమకుండనిభ మంజులకంజగతాళి ధూమముల్
ధనదసరోజధామ సమధామము నొక్క సరోలలామమున్. 153

అ. వనజముఖుల్=గిరికచెలికత్తెలు, అవారిత......ధామముల్—అవారిత=వారింపఁబడని, వారితరంగ=నీటి తరఁగలనెడు, రంగ = నాట్యస్థానమందలి, నర్తన=నాట్యమందు, సలిలభ్రమ = నీటిసుడియందలి, భ్రమణ = తిరుగుట అనెడు సుడివలెఁ దిరిగెడి చక్రనాట్యముచేత, రంగత్ = ఒప్పుచున్న, అభంగ=కీడ్పాటులేని, రథాంగ=చక్రవాకములకు, ధామముల్ =స్థానమయినదియు-రూపకము. మనసిజ...ధూమముల్—మనసిజ=మన్మథునియొక్క, హోమకుండనిభ = వేలిమి గుండములతో సాటియైన, మంజులకంజ = అందములయిన (యెఱ్ఱ) దామరలను, గత = పొందియున్న, అళిధూమముల్ =తుమ్మెదలను పొగ-పొగవంటి తుమ్మెదలను-గలదియు,ఉపమ. ధన...ధామము-ధనద=కుబేరుని యొక్క, సరోజధామ=పద్మములకు నిలయమయిన మానస సరోవరముతోడ, సమ=సాటియైన, ధామముల్=ప్రభ కలిగినదియు, ఉపమ. అగు, ఒక్క, సరోలలామమున్ = మేటి కొలంకును, కనుంగొనిరి.

రంగమందు చక్రనాట్య మాడుటగలదు. ఇట నీటికెరళ్లనెడు రంగమందు గుండ్రముగాఁ దిరుగలి యనెడి చక్రనాట్యము చక్రవాకములు చేయుచున్నవి. కార్యసిద్ధికై హోమగుండముల నగ్ని వేల్చుట గలదు. మన్మథుఁడును నెఱ్ఱదామర లనెడు హోమగుండములందు వేల్చుచున్నాఁడు. వేల్చుటకు నడియాల మందుండి వెడలు తుమ్మెదలనెడు పొగయే. నిప్పువేల్వక పొగరాదు. ఇందువలన నతఁడు కోరిన కార్యసిద్ధి మోహనము. ఎఱ్ఱదామరలనుండి వెడలుచున్న నల్లని తుమ్మెదలచాలును జూడఁగా మన్మథోద్దీపక మగుచున్నదని భావము. ఇందు వృత్త్యనుప్రాసము.

వ. కనుంగొని కుఱంగట మెలంగు వనదేవతలాత్మీయచిత్రపత్రలతాతిలక జాలకాలోకంబు లాలోకింపఁగోరి కమలాకరముకురంబు వేమఱు మెఱుంగిడఁ గ్రేవలం దొరఁగు రాపొడికై నడుం బట కిటకి ఘూర్ణ ప్రౌఢ తెగుపటల పరిపతిత పరాగబృందంబులు నెరయు నందింబున కొనసంబునొందుచు నందనారామ సీమావిహార పరిశ్రాంత లగు తమకు నుపభోగ్యంబుగా విన్రమ శాఖాంచల ప్రవాళ తాళ వృంతంబుల విసరి విసరి మృదులపవనవలనగళితకుసుమ సముదయంబులం బుప్పొగట్టి యుబ్జాకరవారిపూరంబు నవీతుషారంబు నపారసౌరభోద్గారంబునుం జేయు శిశిర కిరణ శిలాఫలక పాళికాస్థాపితసోపానోపాంతకల్పి

తాలవాలమూల సలిలసేక సంవర్ధిత సేవంతికా మల్లికాది వల్లికల యల్లికల
కుల్లసిల్లుచుఁ బైతామహాశ్రమంబునం గిరణమాలి సాహాయ్య రంజిత కింజల్క
కీలికీలా మధ్యంబునం బెక్కుకాలంబు నిల్చినకతంబున నాత్మ మాలిన్యంబు
దొఱంగి యభినవ సువర్ణ తేజోవిరాజమానంబు లగు తెఱంగునఁ దరంగిత
తటినీ రజోనుషంగ పిశంగితాంగంబు లగు భృంగంబులం గని యుప్పొంగుచుఁ
దరుణ తరణి కిరణచ్ఛటాచ్ఛాదితంబును దపనీయవర్ణ కర్ణికాధివాసం
బును దా్రమ కేసర వ్రాత జాత రూప స్తంభ సంభార సంభృతంబును
దళద్రాగ పరాగ పరభాగ పరంపరిత పట్టాంబర వితాన సందీపితంబును నగు నింది
రామహాదేవి యెక్కిన శోణారవిందస్యందనంబు క్రిందటం బటికంపు టిరుసున
సంఘటించిన భర్మరథాంగయుగ్మంబులభంగి నంగీకృతైక మృదుమృణాళ కాండ
మండిత తుండంబులగు రథ చరణ దంపతుల సొంపున కింపుమీఱుచుఁ ద్రిభువన
యువలోక మోహ ప్రపంచ నిర్మాణచుంచుం డగు పంచశర విరించునకుఁ బడివాగె
పట్టిన కలధౌత ఖలీన సూత్ర సంకలిత కంఖాణరాజంబులై సంచలిత చంచూ
పుటకోటికలితసరసబిసఖండ సంతాయమానతంతుసందానితాననంబు లగు హంసం
బులం బ్రశంసించుచుఁ, దరళతరంగమాలికాస్ఫాలనచటుత్కమల కరపుటసరయ
సముత్పతన బంధురగంధాంధపుష్పంధయ స్తనంధయదంభంబున జంభరిపుశిలా
సంఘటితఘుటికావినోదంబులు సలుపుసరోవర లక్ష్మీజలభ్రమతాటంక చక్రం
బులం దళుక్కురను తిర్యక్ప్రసారితకటాక్షచాకచక్యంబులపగిది నెగడుమగబేడి
సమొత్తంబులఁ బిత్తరంబులు చిత్తగించుచు, జలాధిదేవత తనకు నఖర్వసార్వకా
లిక సర్వతోముఖసమృద్ధికై వరలక్ష్మి నావహింపం జేసి కింజల్కపుంజరక్తాక్షతం
బులుఁ గీర్ణపరాగహరిచందనంబులుం గలితాగ్రశైవలపలాశంబులుం గ్రీడదళి
ధూపధూమంబులుం బరిఢవిల్లనోమిన సుధాధౌత నూతనపూర్ణకలశంబుల
సొంపు సంపాదించునమందమకరందపూరితోదరదరవికస్వరపుండరీకషండంబుల
మొండునకు నిండువేడుక నెరపుచుఁ, జంచరీకకుటుంబినీఝుంకార మంగళసంగీత
నాదంబులతోఁ జలాచల క్రౌంచకారండవమండలీపక్షపటపటాత్కారపటహార
వంబులతోఁ జపలతరతరంగ భుజోత్క్షిప్తశీకరాచారలాజంబులతో విహారదీర్ఘిక
యనతిదూరమ్మున వచ్చు తమ్మునెదుర్కొనం గత్యంతరంబులు గడచి యేతెం
చుసొంపుఁ దెలుపు నిజవదనచంద్రచంద్రికావృతప్రతీర చంద్రకాంతజాత నూతన
స్రోతోభరంబులయుబ్బునకు నబ్బురపాటు దొరయుచు మఱియుఁ దత్కా
సారం బపరిమితపాండుపక్షవిశేషభూషితంబు గావునఁ బ్రదర్శిత ధార్తరాష్ట్ర
ముఖశ్యామికంబై బహులహరివిలాసభాసురంబు గావునఁ బ్రథమాన మీన
కూర్మాద్యవతారదారకంబై యూర్మిలాభాసమానంబు గావున లక్ష్మణోపభోగ

భవనంబై మానసజయ మహనీయంబుగావున నంతరున్మీలితనాళీకోపరి వికస్వర
కమలకర్ణికా నిర్ణిరోధమాధురీధురీణం బై రాణించుట కుదంచితరోమాంచ
కంచుకితదేహ లై యవ్వరారోహలు ముదంబునం దదంబుఖేలనాయత్తచిత్త లై.

అ. కనుంగొని=చూచినవారై, కుఱంగటన్ = దాపున, ఆత్మీయ...లోకంబులు—ఆత్మీయ= తనవియైన, చిత్ర=వింతవింతలగు, పత్ర=ఆకులయొక్కయు, లతా = తీఁగలయొక్కయు, తిలక = బొట్టుగు చెట్లయొక్కయు, జాలక=పూమొగ్గలయొక్కయు, ఆలోకంబులు=ప్రకాశములను, అని వన పరమైన యర్థము—(ఆత్మీయ= తమవియైన, చిత్ర = చిత్రితములయిన, పత్ర = మకరికాపత్రముల యొక్కయు, లతా = తీఁగలరూపమునున్న రచనలయొక్కయు, తిలక=కుంకుమాదులచే రచిత మయిన తిలకములయొక్కయు, జాలక=సమూహములయొక్క ప్రకాశముల కని దేవతాస్త్రీపర మయిన యర్థము.) ఆలోకింపంగోరి=చూడఁగోరి, కమలాకరముకురంబున్ = తామరకొలను అనెడి అద్దమును, వేమఱున్=పలుమాఱును, మెఱుంగిడన్=మెఱుఁగుపెట్టఁగా, ప్రకేవలన్=పార్శ్వము లందు, తొరఁగు రాపాడికై వడిన్=రాలిన రాపాడియో యన్నట్లుగా, తట...బృందంబులు— తట=గట్టుయొక్క, కటక=వలయాకారమగు చుట్టునందు, రూఢ = మొలచినవియును, ప్రౌఢ= చక్కఁగా ఎదిఁగినవియునునగు, తరు=చెట్లయొక్క, పటల=జొంపమునుండి, పరిపతిత=అంతటరాలిన, పరాగ బృందంబుల=పుప్పొడుల కుప్పలు, నెరయునందంబునకున్=నిండుగా వ్యాపించియున్న సొగ సునకు, ఆనందంబు నొందుచును, స్త్రీలు మొగమునఁ బెట్టుకొన్న బొట్టు మకరికాపత్త్రాదులు అద్ద మునఁ జక్కఁగాఁ దెలియుటకై దానికి రాపాడితోఁ దోడసి మెఱుఁగుపెట్టుటగలదు. ఇట వనదేవ తలు స్త్రీలు, పత్రలతికాదులు మకరికాపత్రలతాదులు, తామరకొలను అద్దము, దాని దరులందు దట్టముగా రాలిన పుప్పొడి దానినిదోడయఁగా పార్శ్వముల దొరిఁగిన రాపాడియని తెలియునది. మెఱుంగు వేమఱుఁబెట్టుటచే రాపాడి దట్టముగాఁ దొరిఁగినదగును గాన 'ప్రౌఢతరు బృందంబులు' చెప్పినాఁడు. అలం. శ్లేషమూలకమగు ఉత్ప్రేక్ష.

నంద...శ్రాంతలు—నందన = సంతోషకరమయిన, ఆరామ=తోఁటయొక్క, సీమా= చివర దనుకనయినట్టి, విహార = సంచారమువలన - అనఁగా తోటయెల్లలవఱకు దవ్వుగా విహరించుటచేత ననుట. (సీమాశబ్దము 'సీమసీమే స్త్రియా ముభే' అ. అని ఆకారాంత స్త్రీలింగము.) పరిశ్రాంతలు= మిక్కిలిబడలినవారు. అగు తమకున్=గిరిక చెలికత్తెలకనుట. ఉపభోగ్యంబుగాన్ =(తామరకొలఁకు నీరు) అనుభవ యోగ్యమగునట్లుగా, వినమ్ర...వృంతంబులన్—మిక్కిలి వంగిన కొమ్మలయొక్క కొనలయందలి చిగురుటాకులనెడు విసనకఱ్ఱలచేత. [తాళవృంతమనఁగా తాఁటియాకుచేతఁ గట్టఁ బడిన విసనకఱ్ఱ. అది తక్కినవానిచేఁ జేయఁబడు వీవనలందును రూఢమయియున్నది.

'కింశీతలైః క్లమవినోదిభిరార్ద్రవాతాన్, సంచారయామి నళినీదళతాళవృంతైః'. (శాకుంతల)]

విసరివిసరి - దీనికికర్త - వాసంతికాదవల్లికలు, మృదుల...దయంబులన్—మెత్తని గాలి యొక్క కదలికచే జాఱిన పువ్వుఁగుంపులచేత, పువ్వుగట్టి = వాసనగలదిగాఁజేసి (పువ్వులచే వాస నకలిగించుటకు పువ్వుగట్టుట యనఁబడును) అబ్జాకరవారి పూరంబున్ = తామరకొలఁకు నీటిపూరం పును, అతితుషారంబున్=మిక్కిలి చల్లనిదిగాను, అపారసౌరభోదారంబున్ = మితిలేని వాసనచే హెచ్చయినదిగాను, చేయుచున్న, శిశిర...అల్లికలకున్—శిశిర కిరణ శిలాఫలక = చంద్రకాంతపు ఱాతిపలకలయొక్క, పాళికా=వరుసచేత, స్థాపిత=చెక్కికట్టఁబడిన, సోపాన=మెట్లయొక్క, ఉ పాంత=సమీపమందు, కల్పిత=రచింపఁబడిన, ఆలవాల=పాదులయొక్క, మూల = మొదళ్లయందలి,

సలిలసేక=నీటిపోఁతచేత, సంవర్ధిత=పెంపఁబడిన, సేవంతికా=చేమంతులు, వాసంతికా = బండిగురువెందలు, మల్లికా=మల్లెలు, ఆది=మొదలుగాఁగల, వల్లికల=తీఁగలయొక్క,అల్లికలకున్, ఉల్లసిల్లుచు, ఆతామరకొలఁకునకు చంద్రకాంతపు ఱాలచేఁ గట్టంబడిన మెట్లుగలవు. ఆమెట్లకు దాపున పాదులు వేసి నీళ్లుపోసి చేమంతులు బండిగురివెందలు మల్లెలు మొదలయినతీఁగలు చక్కఁగా పెంపఁబడి యల్లిబిల్లిగా నల్లుకొనియున్నవి. ఆతీఁగలు మెట్లకుదాపున మొలఁచిన వగుటచేఁ జక్కఁగాఁ బెరిఁగినవిగావున వానికొమ్మలు కొలఁకు నీటిపయిని 'వినమ్ర' వంగి గాలికి అల్లలాడుచును మెల్లనిగాలికి ఆనీటియందు పువ్వులుదొరుఁగుచునుండెను. అట్లు వంగినకొమ్మలు కొనలచిగుళ్లతో ఆనీటిపయి మాటికి నల్లలాడుచుండఁగా విసనకఱ్ఱలతో దానినీటిని మాటికి విసరి చల్లార్చినట్లును వానిపువ్వులు దానియందుఁ దొరిఁగి వాసనలుగుబాళించుటచే ఆనీటికి వాసనగలిగించినట్లును జెప్పినాఁడు. మిక్కిలి బడలిన వారికి ఏలకులు వట్టివేరు మొదలయిన వాసనద్రవ్యములుగూర్చిన చల్లని నీరిచ్చుట బడలికపోకకు మిక్కిలి యుపయుక్తముగదా. గిరికచెలికత్తెలును వనవిహారమున మిక్కిలి బడలివచ్చిన వారగుటచే వాసంతికాది వల్లికలు వారి బడలికపోకకై యాకొలఁకు నీటనినట్లు తమవంగిన కొమ్మలచేఁ జల్లార్చియుఁ దమదొరిఁగిన పువ్వులచే వాసనగట్టియు అనుభవయోగ్యము గావించినవని యాశయము. శాఖలు వినమ్రములనుట నీటికి వానిగాలిసోఁకుటకై. వానికొనల ప్రవాళములనుజెప్పుట గాలిపొలయుటకై. వట్టికొయ్యలాడించిన గాలిగలుగదు; దానియందాకులు మొదలయినవి గట్టిననే గాలి. అల్లెయిట చిగుళ్లు. మృదులమయిన పవనమును చెప్పుట పువ్వులందే రాలుటకు. గాలి పరుషమయినచో పువ్వులందు రాలక చెదరిపోవును. విసరివిసరి 'అతితుషారము' చేయుటకు. కుసుమములు వాసంతికాదులవియగుటయు మఱి సముదయములగుటయు 'అపారసౌరభోదారంబును' జేయుటకు. సోపానముల ఉపాంతమున పాదులేర్పఱుచుట ఆతీఁగలకొమ్మలు కొలఁకు నీటిపయి వ్రాలుటకు. పాదులుగట్టి నీరుపోయుట 'సంవర్ధిత' గోముగాఁబెరిఁగి మొల్లముగా నల్లికొనుటకు; కావుననే యందుల కుల్లసిల్లుట. అల. ఉత్ప్రేక్ష.

పుష్పాడియందుఁ దోఁగి తుమ్మెదలు పసపువాఱుట తపఃఫలముగా శ్లిష్టశక్తిచేత వర్ణించుచున్నాఁడు. పైతామహాశ్రమంబునన్=ప్రయాగయందని యర్థము.

['క్షేత్రం ప్రజాపతేః పుణ్యం సర్వేషామేవ దుర్లభమ్ ।
లభ్యతే పుణ్యసంభారైర్నాన్యదార్థస్య రాశిభిః' అని ప్రయాగమహిమాను వర్ణనము.]

పితామహునకు అనఁగా బ్రహ్మకు ఆశ్రమమయిన తామరయందని భావము. కిరణ...ధ్యంబునన్—కిరణమాలి=(అంశుమాలి) సూర్యునియొక్క, సాహాయ్య=తోడ్పాటుచేత, రంజిత = ఒప్పుచున్న, కింజల్క=ఎఱ్ఱనితామరయకరువులనెడు, కీలికీలా = అగ్నిజ్వాలలయొక్క, మధ్యంబునన్ = నడుమ, (చుట్టునున్న ఎఱ్ఱనియకరువులు నాలుగువైపులనున్న నాలుగగ్నిజ్వాలలు. తోడ్పాటగు సూర్యుఁడు,పయినున్న యగ్గిగాన నన్నియుఁజేరి తపస్సునకువలయుపంచాగ్నులగుట చెప్పఁబడినది. ఇట్లు బంచాగ్నులనడుమ) పెక్కుకాలంబు నిల్చినకతంబునన్-అనఁగా పైతామహాశ్రమమందు పంచాగ్నిమధ్యమునఁ దడవుకాలమునిలిచి తపస్సుచేసిన హేతువుఁబట్టి యనియర్థము. తామరయందకరువులనడుమఁ దుమ్మెద దడవుకాలము వసించుచున్నదని భావము. ఆత్మమాలిన్యంబున్=మనస్సుయొక్క కాలుష్యము నని యర్థము. తనదైన దేహమునలుపునని భావము. తొరంగి=విడిచి, అభినవ సువర్ణతేజో విరాజమానంబులు అగుతెఱంగునన్ = సువర్ణము బ్రహ్మవర్ణముగనుక క్రొత్తదగుమన బ్రహ్మవర్ణ తేజముచేతఁ బ్రకాశమానములయినట్లుగా నని యర్థము-తపస్సునకు ఫలము బ్రహ్మసారూప్యముగదా! సువర్ణమనఁగా బంగారమునగును. క్రొత్తబంగారపుకాంతివంటి కాంతిచేత ప్రకాశమానము లగునట్లుగా నని

భావము. తరంగిత...గంబులు—తరంగిత = అలలవలె వ్యాపించుచున్న - తెరతెరలుగా పర్వుచున్న యనుట, తదీయరజః=ఆతామర పుష్పాదియొక్క, అనుషంగ=కూడికచేత, పిశంగిత = పసపుచాయగాఁ జేయఁబడిన, అంగంబులు=దేహములుగలది. అగు, భృంగంబులన్=తుమ్మెదలను, కని, ఉత్ప్రేంగుచు, బ్రహ్మక్షేత్రమున పంచాగ్నిమధ్యమున దీర్ఘతపముచేసి బ్రహ్మసారూప్యముపొందెనని యర్థము- సూర్యునికిరణముసోఁకి విచ్చిన తామరపూవులకరువులందుఁ దడవుండుటచే తుమ్మెదలందలి పుప్పొడి తగిలి మేని నలుపుపోయి పసపురంగుగాఁ జూపట్టెనని యర్థాంతరము. శ్లిష్టరూపకానుప్రాణితమగు ఉత్ప్రేక్ష.

తరుణది...దితంబును—తరుణతరణి=బాలసూర్యునియొక్క, కిరణ=కిరణముల నెడు, ఛద= వస్త్రములయొక్క, ఛటా=సమూహముచేత, ఆచ్ఛాదితంబును= కప్పఁబడినదియు, తప...ధివాసంబును—తపనీయవర్ణ=బంగారుచాయగల, కర్ణికా=మిద్దెయనెడు రథకర్ణికకు, అధివాసంబును=స్థానమయినదియు, తామ్ర...సంభృతంబును—తామ్రకేసర=ఎఱ్ఱనియకరువులయొక్క, వ్రాత=సముదాయమనెడు, జాతరూప స్తంభ సంభార=బంగారుకంబముల సమూహముచేత, సంభృతంబును= లెస్సగా భరింపఁబడినదియు, తటి...నీపితంబును—తటిద్రాగ=మెఱపుఁదీఁగవలె ఎఱ్ఱగానున్న, పరాగ= పుప్పొడియొక్క, పరభాగ=గుణోత్కర్షములనెడు 'పరభాగో గుణోత్కర్షే' కోశము, పరంపరిత= పరంపరగా నాచరింపంబడిన, పట్టాంబరవితాన=పట్టువస్త్రంపు మేల్కట్లచేత, 'అస్త్రీవితానము ల్లోచః' అ. సందీపితంబును=లెస్సగాఁ బ్రకాశించుచున్నదియు, అగు, ఇందిరా మహాదేవి=లక్ష్మీదేవి, ఎక్కన, శోణారవిందస్యందనంబు క్రిందటన్=ఎఱ్ఱదామరయనెడు రథముక్రింద, పటికంపు టిరుసునన్, సంఘటించిన=పూన్చిన, భర్మరథాంగయుగ్మంబుల భంగిన్ = బంగారుచక్రములో యనునట్లుగా, అంగీ...తుండంబులు—అంగీకృత=స్వీకరింపఁబడిన, ఏక=ఒక్కటైన, మృదు=మెత్తని, మృణాళకాండ=తామరతూఁడుచేత, మండిత= అలంకరింపఁబడిన, తుండంబులు= చంచుపులుగలది. అగు - రథచరణదంపతుల=చక్రవాక మిథునములయొక్క, సొంపునకున్ = చక్కందనమునకు, ఇంపుమీఱుచున్ - ఇందు లక్ష్మీదేవికి నెఱ్ఱదామర రథముగానుత్ప్రేక్ష; ఆతామరతేరికి సూర్యకిరణములు పయి వస్త్రపటలము, పచ్చనిదుద్దు బంగారుకర్ణిక, ఎఱ్ఱనియకరువులు బంగారుకంబములు, ఎఱ్ఱనిపుప్పొడి పట్టు మేలుకట్లు, దానిక్రిందనున్న హంస దంపతులు రెండుచక్రములు. అవి రెండును నొక్కటిగాఁ గఱచుకొన్న తెల్లనితూఁడు అచక్రములకువైచిన పటికంపుటిరుసు అని రూపణములు తెలియునది.

త్రిభువన...చుంచుండు—త్రిభువన=మూఁడులోకములందలి - స్వర్గమర్త్యపాతాళములందలి, యువలోక=వయసుకాండ్ర సమూహముయొక్క, మోహప్రపంచ = మోహవిస్తారమనెడి ప్రపంచముయొక్క, నిర్మాణచుంచుండు = సృష్టియందు ప్రసిద్ధుఁడు. (ఇట చుంచుప్రత్యయము 'తేనవిత్తశ్చుంచుప్చణపౌ' అని ప్రసిద్ధార్థమందు ప్రయుక్తము. కాన నిర్మాణచుంచుండని కలిపి యర్థము వ్రాయనలెనుగాని ప్రకృతినివిడిచి ప్రత్యయమున కర్థముచెప్పరాదు) పంచశర విరించునకున్=మన్మథుఁడనెడి బ్రహ్మకు, 'విరించి' 'విరించః' 'విరించనః' అని యీశబ్దము త్రివిధము. పడివాగె = జాల్మతీలు, పట్టిన, కలధౌత=వెండితోఁ జేసిన, ఖలీన=కళ్లెపుత్రాళ్లతోడ, సంకలిత = కూడుకొన్న, కంఖాణరాజంబులై=గుఱ్ఱపుమిన్నలై, సంచలిత=సంచలించుచున్న, చంచుపుట=దొప్పలవంటి ముక్కులయందు, కంచుకిత=పట్టమైయున్న, సరసబిసఖండ=పచ్చి తామరతూఁడులయొక్క, సంతాయమాన = దీర్ఘములగుచున్న, తంతు=సూత్రముల చేత, సందానిత=కట్టఁబడిన, అంసంబులు =మూఁపులుగలవి. అగు, హంసంబులన్=హంసలను,ప్రశంసించుచున్=కొనియాడుచు, ఇట మన్మథుఁడు బ్రహ్మ.నిర్మించు ప్రపం

చము మోహప్రపంచము. ఇతనికిని కంఖాణరాజను హంసను. దానికి వెండికళ్లెము ముక్కునఁ గఱచు కొనఁబడినదై మెడ చుట్టుకొనియున్న నిడుపతామరతూఁడు. శ్లిష్టరూపకసంకీర్ణమగు నుత్ప్రేక్ష.

తరళ ... దంభంబునన్ — తరళ=చలించుచున్న, తరంగ = కరళ్లయొక్క, మాలికా=పంక్తుల యొక్క, ఆస్ఫాలన=తాఁకుడులచేత, నటత్ =కదలి యాడుచున్న, కమల=తామరలనెడు, కరపుట= దోయిలివలననుండి, సరయ=వేగముతోఁ గూడికొనునట్లుగా, సముత్పతన=పైకెగయుటచేతను, పతన= ఎగసి మరలపడుటచేతను, బంధుర=సుందరములగుచున్న, గంధాంధ = మదముచేత కన్నుఁగానని, పుష్పంధయ=తుమ్మెదలయొక్క, స్తనంధయ=పిల్లలనెడు, దంభంబునన్ =వ్యాజముచేత, జంభరిపు= ఇంద్రుని సంబంధించిన, శిలా=ఱాలచేత, అనఁగా ఇంద్రనీలములచేత, సంఘటిత=రచింపఁబడిన, ఘుటికా=గుండ్లయొక్క. ఈశబ్దము గకారాదిగా నిఘంటువుల నున్నను దెనుఁగు కావ్యములందుఁ బెక్కెట ఘకారాదిగాఁ జూపట్టును. ('ఘుటికా సిద్ధౌషధంబోయనన్' అని మనుచరిత్ర ముద్రణమందును వ్రాఁతప్రతులందును జూపట్టుచున్నవి.) వినోదంబులు, సలుపు=ఆటలాడుచున్న, సరోవరలక్ష్మీ=తామరకొలను లక్ష్మియొక్క, జలభ్రమ=నీటిసుళ్లనెడు, తాటంక చక్రంబులన్ = చక్రములవలెనుండు పౌజుల కమ్మలయందు, తళుక్కురను, తిర్యక్ ప్రసారిత=అడ్డముగా నిగిడింపఁబడిన, కటాక్ష= క్రేఁగంటి చూపులయొక్క, చాకచక్యంబుల సగిదిన్ =చకచకలో యనునట్లుగా, నెగడు = ప్రకటమగుచున్న, మగ బేడిస మొత్తంబుల=గండుబేడిస చేఁపతండములయొక్క, బిత్తరంబులు=విలాసములను, చిత్తగించు చు. స్త్రీలు గచ్చకాయలు మొదలగువానిని నఱిచేతఁ బెట్టుకొని పయికెగవైచుచు మరలఁబడఁ గాఁ బట్టుచు నాడుటగలదు. మఱి చెలువల కన్నులకొన లాకర్ణాంతములనుటయు గలదు గాన, వా రడ్డముగాఁ గెలంకులఁ గడకంటిచూడ్కుల నిగిడ్చినచో నవి వారికన్నుల కమ్మల చకచకలందుఁ బిరి గొనుటయుఁ గలదు. ఈరెండు నిట ననుసంధింపఁబడుట యెట్లన - తామరకొలఁకులక్ష్మి ఆడుకొను బాల. కరళ్లచే పయికిని క్రిందికిని నూఁగులాడు తామరలు ఆయమచేతులు. ఆయూఁగులాటల కం దుండి పైకెగసి మరలదానియందుర్వాలు తుమ్మెదలు నల్లనియాటగుండ్లు. నీటిసుళ్లు ఆమె పౌజుకమ్మలు. దానియందలి చకచకలాడు మగబేడిస మీలగుంపులు కెలంకుల నడ్డముగా నిగుడు క్రేగంటిచూపులు. రూపకాపహ్నవ సంకీర్ణమగు ఉత్ప్రేక్ష.

జలాధిదేవత, తనకు, అఖర్వ...మృద్ధికై — అఖర్వ=ఉన్నతమును, సార్వకాలిక=కలకాలముం డునదియు, సర్వతోముఖ = అంతట వ్యాపించునదియునగు, సమృద్ధికై = సంపదకొఱకని యర్థము. (అధికమును సర్వకాలస్థితము నయిన సర్వతోముఖముయొక్క - అనఁగా జలముయొక్క, సమృద్ధి కొఱకని భావము.) వరలక్ష్మిన్ =వరలక్ష్మీదేవిని, ఆవహింపఁజేసె = ఆహ్వానముచేసె యని యర్థము. తా మరలు లక్ష్మికి విహారస్థానములని భావము. కింజల్క పుంజరక్తాక్షతంబులున్ = అకరువుల గుంపు లనెడి యెఱ్ఱని యక్షింతలును, కీర్ణపరాగ హరిచందనంబులున్ = వ్యాప్తమైన పుప్పొడియనెడి పచ్చని శ్రీచందనములును, కీలితాగ్రశైవలపలాశంబులున్ =అంతర్నిక్షిప్తములైనమొదళ్లుగల నాఁచుతీఁగలనెడి ఆకులును, క్రీడత్ ...ధూమంబులును—క్రీడత్ =విహరించుచున్న, అళి=తుమ్మెదలనెడు, ధూపధూమంబులు= అగరుసాంబ్రాణి ధూపములయొక్క పొగలును, పరిఢవిల్లన్ =ఒప్పుచుండఁగా, నోమిన = నోఁచినట్టి, సుధాధౌత=సున్నముచేత తెల్లనయిన, నూతన=క్రొత్తలయిన, పూర్ణకలశంబుల=జలపూరితములయిన కలశములయొక్క, సొంపున్ , సంపాదించు=కలుగఁజేయుచున్న - అనఁగా వానివలెనే యున్నట్టి, అమంద=తక్కువకాని, మకరంద=పూఁదేనెచేత, పూరిత= నిండింపఁబడిన, ఉదర=గర్భములుగలిగిన, దరవికస్వర=కొంచెముగా వికసించిన-కావుననే కలశములవలె నున్నవనుట. పుండరీక షండంబులు= తెల్లదామర తంపరలయొక్క. మెండునకున్ , నిండువేడుక=పూర్ణకౌతూహలమును, నెరపుచున్ =

ప్రకటించుచు, పుండరీకములు, దరవికస్వరములగుట కలశములవలె నుండుటకు; మకరంద పూరితోదరములగుట పూర్ణకలశములగుటకు; పుండరీకములు (తెల్లదామరలు) అగుట సుధాధౌత కలశములగుటకు. తెల్లపూఁతపూసిన పూర్ణకలశములందు అక్షింతలు, చందనమును జేర్చి మామిడి మొదలయిన యాకులుపయిఁబెట్టి ధూపమువేసి వరలక్ష్మిని నావాహనము చేయుటవాడుక, ఇట శైవాలములు కీలితాగ్రములగుట ఆకులవలెనుండుటకని తెలియునది. రూపక సంకీర్ణమగు నిదర్శన.

చంచరీక ... నాదంబులతోఁ — చంచరీకకుటుంబినీ=ఆఁడుతుమ్మెదలయొక్క, ఝుంకార=ఝుంకారములనెడు, మంగళ సంగీతనాదంబులతోఁ=మంగళార్థములయిన సంగీతధ్వనులతోడను, చలాచల=చలితములయిన, క్రౌంచ=కొంగలయొక్కయు, కారండవ=కన్నెరేడు పులుఁగులయొక్కయు, పటపటత్కార = పటపట అనుధ్వనులనెడు, పటహ+ఆరవంబులతోఁ = తప్పెటలయొక్క చప్పుళ్లతోడను, చపలతర=మిక్కిలి చలించుచున్న, తరంగ=కరళ్లనెడు, భుజ=హస్తములచేత, ఉత్క్షిప్త=ఎగఁజల్లఁబడుచున్న, శీకర=తుంపురులనెడు, ఆచారలాజంబులతోఁ=మంగళాచారము కొఱకయిన వరిపేలాలతోడ, ఆచారలాజములనుటకు 'ఆచారలాజైరివ పౌరకన్యాః' అని రఘువంశము. విహారదీర్ఘిక=క్రీడాసరస్సు, అనతిదూరమ్మునన్=సమీపమందు, వచ్చు, తమ్మున్, ఎదుర్కొనన్, కక్ష్యాంతరంబులు=తొట్టికట్లనడుములు 'కక్ష్యా ప్రకోష్ఠే హర్మ్యాదేః' అమ. కడచి = దాఁటి, ఏతెంచు సొంపు=వచ్చునట్టి యొయ్యారమును, తెలుపు = కనఁబఱుచుచున్న, దీనికి 'స్రోతోభరంబుల'తో నన్వయము. నిజవదన=తమ ముఖములనెడు, చంద్ర=చంద్రులయొక్క, చంద్రికా = వెన్నెలచేత, ఆవృత=ఆవరింపఁబడిన, ప్రతీర=గట్టునందలి, 'కూలంరోధశ్చ తీరంచ ప్రతీరంచ తటంత్రిషు' అమ. చంద్రకాంత=చంద్రకాంత మణులవలన, జాత=పుట్టిన, నూతన = క్రొత్తని, స్రోతః = జలప్రవాహములయొక్క, భరంబుల=పెల్లిదములయొక్క, ఉబ్బునకున్ = ఉల్బణమునకు, అబ్బురపాటు దొరయుచున్=ఆశ్చర్యమును బొందుచు, మంగళార్థ మెదురుకొనువారు స్త్రీల మంగళంపుఁ బాటలతోను మద్దెలల ధ్వనులతో పేలాలతోను వచ్చుటయాచారము. ఇట సరస్సు గట్టునందలి చంద్రకాంతపు ఱాలు చెలికత్తెలముఖచంద్ర చంద్రికల కరఁగి జాలుగానుబికివచ్చుట సరస్సునెదురుగా నెదుర్కొనుటగాను, తుమ్మెదఝుంకారము లందలిపాటలుగాను, కొంగలు మొదలగువాని ఱెక్కలపటపటత్కారములు మద్దెలధ్వనులుగాను, కరడుల పైనెగయు తెల్లనితుంపరలు వరిపేలాలుగాను రూపితములు. స్త్రీలముఖచంద్ర చంద్రికలును జంద్రకాంత శిలలుగరఁగుటయు తామరలు ముడుఁగుటయు మొదలయిన చంద్రికాసాధర్మ్యములు కవిసమయములం జూపఁబడెడిని. ఇందే 'లతితాననేందుమండలపాండురచ్ఛాయ వనరుహావళి వళావళియడంప' నని యున్నవి. రూపకసంకీర్ణ మగునుత్ప్రేక్ష.

మఱియున్, తత్కాసారంబు = ఆకొలను, అప ... షితం — అపరిమిత = మితిలేని, పాండు = పాండురాజు సంబంధులయిన యుధిష్ఠిరాదులయొక్క, పక్ష = బలముచేత, విశేష భూషితంబు = మిక్కిలి యలంకరింపఁబడినది, కావున, ప్రదర్శిత = కనఁబఱుపఁబడిన, ధార్తరాష్ట్ర = దుర్యోధనాదులయొక్క, ముఖశ్యామికంబై = మొగము నల్లఁదనము గలదై - యుధిష్ఠిరాదులందు మిక్కిలి పక్షమువలన దుర్యోధనాదుల మొగములు నల్లవాఱెనని యర్థము— (పాండుపక్షములనఁగా 'హంసాస్తు శ్వేతగరుతః' అ. అన్నట్లు తెల్లనిఱెక్కలుగల హంసలు, ధార్తరాష్ట్రములనఁగా 'ధార్తరాష్ట్రాస్సితేతరైః' అ. అన్నట్లు మిక్కిలినల్లనయిన ముక్కులు పాదములునుగల హంసలు. కనుక అపరిమితములయిన హంస విశేషములచేత శోభితమైనదియు, ధార్తరాష్ట్రములను హంసలు చంచుచరణముల నైల్యముగలదనియు భావము. శ్లేషమూలకకావ్యలింగము.

బహుల...సురంబు—బహుల=మిక్కిలియైన, హరివిలాస = నారాయణుని విలాసములచేత, భాసు రంబు=ప్రకాశించునది, కావున, ప్రథ...రకంబై--ప్రథమాన=ప్రసిద్ధములగుచున్న, మీన కూర్మాద్యవ తార=మత్స్యకూర్మాద్యవతారములకు, ధారకమై=కలిగినదై యని యర్థము - (బహు=అనేకములయిన, లహరి=పెద్దకరడులయొక్క, విలాసముచే ప్రకాశమైనదనియు మత్స్యము కూర్మము మొదయిన జల జంతువుల ఆవిర్భావములకు ధారకమయినదనియు భావము.) ఊర్మికాభాస మానంబు=ఊర్మికాదేవిచే ప్రకాశమానమైనది. కావున, లక్ష్మణోపభోగభవనంబై=లక్ష్మణునకుఁ గేళికాగృహమైనదై యని యర్థ ము. (ఊర్మి=అలలయొక్క, లాభ=ప్రాప్తిచేత, అసమానమైనదనియు, లక్ష్మణా=ఆఁడుబెగ్గురు పక్షు లకు, భోగార్హ మయినదనియును, భావము. 'హంసస్య యోషిద్వరటా సారసస్యతు లక్ష్మణా' అ.) మానసజయ మహనీయంబు = మనోజయముచేత గొప్పది, కావునన్, అంత ... ధురీణంబై — అంత రున్మిలిత=లోపల వికసించిన, నాళికా ఉపరి=షట్కమలములకు మీఁదనున్నట్టి, ఇట నాళికా శబ్దము కమలపరము, వికస్వర కమలకర్ణికా=సహస్రారపద్మ కర్ణికాకారమగు చంద్రమండలమునుండి, నిర్నిరోధ=అడ్డులేనట్లుగా, బోధ=ఉద్భవమయిన, మాధురీ=సుధామాధుర్యమునకు, ధురీణంబై=ధురం ధరమైయని యర్థము.

'తమోమోచకై రేచకైః పూరకాద్యై స్సముద్దీపితా ధారవీధ్యబ్జషట్కైః!
హఠల్లంబికారాజ యోగప్రభావాల్లు ఠత్కుండలి వ్యక్తముక్తా వకాశాం।
సహస్రార పద్మస్థితా పారవాదాంసుధామాధురీం సాధురీత్యా పిబద్భిః!' (సాంబభుజంగము.)

(మానస సరోవర జయముచేత గొప్పదియు, లోపల ఉత్పన్నములయిన నాళికలనఁగా నాళములు- తూఁడులు - వావిపయిని వికసించుచున్న తామరల,కర్ణికా=మిద్దెలయొక్క, అడ్డులేని వికాసము యొక్క,మాధురీ=చక్కఁదనమునకు ధురీణమనియు భావము.)రాణించుటకున్=ఒప్పుటకు,ఉదంచి... దేహలై—ఉదంచిత=మిక్కిలిఒప్పెడి, రోమాంచ=గగురుపాటుచేత, కంచుకిత=నిండఁబర్విన, దేహ లై=దేహములుగలవారై, అవ్వారారోహలు=ఆస్త్రీలు, ఘుదంబునన్, తత్ అంబు ఖేలన ఆయత్త చిత్తలై=ఆకొలఁను నీటియందలి క్రీడించుటకు లోనయిన మనస్సులు గలవారై, ముందరి కన్యయము.

సీ. తనయిల్లు దామరతేతంపమై మెఱయ సం, పన్నళినాక్షి గాఁపున్నచోటు
వలరాజు ముజ్జగంబులు గెల్చి దర్పమే, ర్పడ నిజాంకశరంబు లిడినచోటు
వలిగాలి పన్నగావలిగాహితగరాగ్ని, ఘోరసంజ్వరము వీడ్కొనినచోటు
తొగకొమ్మదమిగ్రమ్మఁ దగురాజు కరమంటి,యొండకన్నెఱుఁగక యెసఁగుచోటు

తే. యిందుముఖులార యిదినేఁడి యిందుఁ గ్రుంకి
మదనుఁబూజింపఁగోర్కులు పొదలు ననుచు
తొడవు లటు వెట్టి వలిపపా వడలుగట్టి
శృంగములు వట్టి నీరాడఁ జేరునపుడు. 155

అ. సంపత్+నలినాక్షి = సంపత్తున కధిదేవతయైన లక్ష్మి, తనయిల్లు తామరతంపమై మెఱ యన్=తనయిల్లు పుత్రపౌత్రాభి వృద్ధిగలదై ప్రకాశించునట్లుగా, కాఁపున్నచోటు=కాఁపురమున్న చోటని యర్థము. అభివృద్ధి పరముగా తామరతంపమనుట లోకోక్తి. (తామర యిల్లు గాఁగలదని భావము. లక్ష్మి కమలాలయగదా.) అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము - ఇట 'తనచోటునకు నత

యిల్లు తామరతంపమై మెఱయ' ననుటచే అభివృద్ధి కరత్వము. 'సంప...గాపున్న' అనుటచే నిశ్చల సంపత్ప్రదత్వమును దెలియుచున్నది. సంపన్నలినాక్షీ శబ్దము సాభిప్రాయము. వలరాజు=మన్మథుఁడు, మున్జగంబులు గెల్చి, దర్పమేర్పడన్ = తన గెలిచిన గర్వము తేటపడునట్లుగా, నిజ అంకశరంబులు = (అంకమనఁగా ధ్వజము, శరములనఁగా బాణములు) తన ధ్వజబాణములను, ఇడినచోటని యర్థము-(మన్మథుని ధ్వజములయిన చేఁపలును బాణములయిన తామర లునుగలిగియున్నదని భావము.) ఇట చోటునకు త్రిభువన జయసాధనా శ్రయత్వము స్ఫురించుచున్నది. వలరాజనుట సాభిప్రాయము. త్రిజగ జ్జయమునకు రాజుగదా సమర్థుఁడనుట.

వలిగాలి=చల్లగాలి—మలయ మారుతమనుట, పన్నగఆవలి = మలయాద్రియందలి సర్పముల సమూహమువలన, గాహిత=చొచ్చిన, గరాగ్ని = విషానలముయొక్క, ఘోర=భయంకరమయిన, సంజ్వరమున్ = సంతాపమును, వీడ్కొనినచోటు = పోఁగొట్టుకొన్న స్థలమని యర్థము - పాము గాలినాహారించునది. మలయపర్వతమున చందన వృక్షములు పెక్కులు. అందు బెనఁచుకొనియుండు పాముల యూర్పుల విషపునిప్పుచే నటనుండి వచ్చుగాలి క్రాఁగియుండును గనుక నిందలి జలముల చలువతగిలి యాక్రాఁగిన వేఁడిమి పోవుచున్నదని యర్థము. చల్లని జలములు గలదని భావము. ఇందు చోటునకు ఉపద్రవ నివర్తకత్వము స్ఫురించుచున్నది. తొగకొమ్మ=కుముదినీకాంత, తమిగ్రమ్మన్=తమకము ముంచుకొనఁగా, తగురాజు కరమంటి = తగిన రాజుయొక్క పాణిగ్రహణము వడసి, ఎండకన్నెఱుఁగక = కష్టలేశమును దెలియక, ఎసఁగుచోటు=మిక్కిలి గోముగాఁ బెరుఁగుటకు ఎండకన్నెఱుఁగక' యనుట. 'ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలుపంచలను బాటుపడియె నేఁడు' (భాగ.) 'ఎండకన్నును వానకన్ను నెఱుఁగని' భారతము.(తమిగ్రమ్మన్=రాత్రికాఁగానే,తగురాజు కరమంటి=యుక్తుఁడయిన చంద్రునియొక్క కిరణస్పర్శము గలదై, ఎండకన్నెఱుఁగక = సూర్యుని గుర్తెఱుఁగక యున్నదనిభావము.) - ఇట చోటునకు 'తగురాజు కరమంటి' అనుటచే శుభహేతుత్వమును'ఎండకన్నెఱుఁగకయెసఁగు'ననుటచే,సుఖసంపాద కత్వమును స్ఫురించెడిని. ఇందు ముఖులార= ఓ చెలులారా, ఇదిసుమీ=ఈపయిని చెప్పఁబడిన గుణములు గలదిచుఁడీ,ఇది. ఇందున్ క్రుంకి, మదనున్ = మన్మథుని, పూజింపన్, కోర్కులు, పొదలు=సిద్ధించునని ఒకరికొకరు చెప్పికొనుచు, తొడవులు = సొమ్ములు, అటుపెట్టి, వలిపపావడలు = సన్నని పావడలు, కట్టి, శృంగములు వట్టి = చిమ్మనగ్రోవులు చేతఁబట్టుకొని, నీరాడన్ = జలక్రీడ సలుపుటకు, చేరునపుడు. అల. 'తొగకొమ్మ' రూపకము. తక్కినచో అతిశయోక్తి రెంటికిని సంకరము. కావ్యలింగమును.

మ. కరముల మూఁపు లూఁదుకొని కన్నెలు చన్నులబంటి నొండొరుల్
బరిగొని నిల్వఁ దత్పరిధిప్రాంశుదృగంశు కలాపపూరితాం
తరమయి పొల్చె భావభవదైవతభావితహేమకుంభసం
భరితమృణాళమండలితపద్మమయప్లవమండలం బనన్. 156

అ. కన్నెలు, కరములన్ = తమచేతులచేత, మూఁపులు ఊఁదుకొని=ఒకరొకరి బుజములు పట్టుకొని, చన్నులబంటిన్ = చన్నులవఱకయిన నీటియందు, ఒండొరుల్ = ఒకరినొకరు, బరిగొని నిల్వన్=చుట్టురాఁదిరిగి నిలువఁగా, తత్పరిధి = ఆకన్నెలయొక్క పరివేషాకారమయిన మండలము ప్రాంశు...తరము—ప్రాంశు = హెచ్చయిన, దృక్ అంశుకలాప = కంటిమెఱుంగుల సమూహము చేత, పూరిత = నిండింపఁబడిన, అంతరమై=నడిమి ప్రదేశముగలదై, భావ...మండలంబు—భావభవ

దైవత=మన్మథుఁడనెడి దేవతకొఱకు, భావిత=కల్పింపఁబడిన, హేమకుంభ = బంగారు కుండలచేత, సంభరిత = చక్కఁగా భరింపఁ బడినదియు - కుండలు నీటనుంచి దానిపయిని తెప్పలను దేలునట్లు పన్నుట యిట యనుసంధించునది. మృణాల మండలిత = తామరతూఁడులచే మండలాకారముగా చేయఁబడినదియు, పద్మమయ = తామరపువ్వులచేత నయినదియు, అగు, ప్లవమండలంబు = తెప్ప యొక్క వలయమో, అనన్, పొల్చెన్=ప్రకాశించెను.

కుచములకును సువర్ణ కుంభములకును, భుజములకును మృణాలములకును, నడుమ ప్రసరించు నేత్రకాంతికిని తామరలతెప్పకును సాదృశ్యము. నీటికుండలు వైచి చుట్టును మండలాకారముగా త్రాళ్లచే తెప్పగట్టుట ప్రకటము. దేవతలకు ప్లవోత్సవమున నిట్లు తెప్పగట్టుదురుగాన మన్మథదేవత కిది తెప్పగా ననుసంధానము. అత్యంతము మన్మథోద్దీపక మగునని భావము. అలం. ఉత్ప్రేక్ష.

చ. నెలఁతలు బంతిగట్టుకొని నీ రెగఁజల్లఁ దదీయమంజులాం
జలికలితోదకం బెగయుజాడ నుతింపఁగ నయ్యెఁ దత్కుచాం
చలజఘనాభిఘాతములు సైఁపక మ్రోయుచుఁ బద్మయుక్తమై
కొలను సరోజబాంధవునకున్ మొఱవెట్టఁగ నేఁగుకైవడిన్. 157

అ. నెలఁతలు, బంతిగట్టుకొని=చుట్టు వరుసగా బంతికొని, నీరు, ఎగ, జల్లన్; తదీయ... తోదకంబు=వారల సొగసయిన దోసెళ్లయందు ఒప్పుచున్న నీరు, ఎగయుజాడ= ఎగసెడు విధము, తత్...ఘాతములు=ఆ స్త్రీల చనుమొనలయొక్కయు కటిపురోభాగములయొక్కయు తాఁకుడు దెబ్బలను, సైఁచక = సహింపలేక, మ్రోయుచున్, కొలను, సరోజబాంధవునకున్ = తామరల కాపుఁడయిన సూర్యునకు, మొఱవెట్టఁగన్, ఏఁగుకైవడిన్=పోవువిధమున, నుతింపఁగనయ్యెన్= పొగడం దగియుండెను. సరోజబాంధవ శబ్దము సాభిప్రాయము.

స్త్రీల దోసిళ్లతోఁగూడ సరోవరజలము పైకెగయుట తామరలతోఁగూడినసరస్సు పైకి పోవుటగా నుత్ప్రేక్షితము. సరోవరము సరోజములతోడఁ గూడుకొని సరోజబాంధవునికి మొఱ పెట్ట పయికి నుద్గమించుటగా నుత్ప్రేక్షితము. బంతిగట్టుకొని చల్లఁబడిన నీ రవ్వారి యగుటచే సరోవరమనియు, బంతులు గొన్నవారి దోసిళ్లు పెక్కులగుటచే తామరలతోడి కూటమియు వర్ణింప నుపయుక్తము లయినవి. నీరెగయుధ్వని సరోవరపు మొఱచప్పుడుగాఁ దెలియునది.

చ. చిగురుంజిమ్మనఁ గ్రోవిలో నొకతె రాజీవాసవం బుంచి పై
నిగిడింపన్ గమకింప నొక్కనవలా నెమ్మోము వే ద్రిప్పిన
న్జగజంపై నెఱిగుంపు గప్పుకొనియె న్దత్క్షిప్త మాధ్వీరసం
బు గొనం బంచినచంచరీకపృతనా పుంజంబుచందంబునన్. 158

అ. ఒకతె, చిగురుం జిమ్మనఁ గ్రోవిలో = చిగురుటాకులచేఁ జేయఁబడిన చిమ్మనగొట్టములో, రాజీవాసవము=తామర పూఁదేనెను, ఉంచి=పోసి, పైనిగిడింపన్=పైని చిమ్ముటకు, గమకింపన్, ఒకనవలా=ఒక స్త్రీ, నెమ్మోమున్- వే, త్రిప్పినన్=శీఘ్రముగా అవతలికి త్రిప్పుకొనఁగా, జగజంపై= మేలయిన జాలరువలె,లేక 'జంపు కురులతోడ' నని యిలాదేవీయమునందలి మేలయిన నిడివిగలదై, నెఱిగుంపు = వెండ్రుకలసమూహము, కప్పుకొనియెన్=మొగమును గ్రమ్ముకొనెను—అనఁగా ముఖము త్రిప్పఁగానే కొప్పువీడి వెండ్రుకలు మొగముపైఁ గ్రమ్మెననుట. తత్=ఆమొదటిదానిచేత, క్షిప్త= చిమ్మఁబడిన, మాధ్వీరసంబు = పూఁదేనెను, గొనన్=హరించుకొఱకు, పంచిన=పంపఁబడిన, చంచరీక

పృతనా పుంజంబు చందంబునన్ =తుమ్మెదల దండుగుంపులో యనునట్లుగా కప్పుకొనెనని సంబంధము. 'నెఱిగుంపు సొంపు నెఱపె' నని సోమకవిపాఠము కొప్పువీడి వెంట్రుకలు పఱవంజేసెననుట. నెఱి గుంపు గప్పుకొనుట మొగమును వెఱ్ఱిప్పుటచేత. జగజంపైన నెఱిగుంపుగాన చంచరీక పృతనా పుంజంబువలె నుండుట. 'పృతనా'-తన్నుఁగాచుటకు దండుపన్నినట్లున్నదనుట. తుమ్మెదలు పూఁదేనె త్రోలునవిగాన మఱియొకతె చిమ్ముతామరపూఁదేనెను కొనుటకు తుమ్మెదల గుంపులను జెప్పినాఁడు. అలం. ఉత్ప్రేక్ష. ఉపమాధ్వనియు.

ఉ. కొందఱు మందగామినులు కోమలపాణితలంబు లొక్క యిం
దిందిర నీలవేణి తెలినెమ్మొగ మంబుల ముంచు నొప్పు నె
న్నందగఁ దావుబల్మి నలినమ్ములు దొమ్ములు గూడి క్రమ్మి పూ
ర్ణేందుని మున్ను గొన్న రుచు లిమ్మని నీటికిఁ దార్చు కైవడిన్. 159

అ. కొందఱుమందగామినుల, కోమ...బులు=మృదువులయిన యఱచేతులు, ఒక్క యిందిందిర నీలవేణి=తుమ్మెదలవలె నల్లనిజడగల యొకతె యొక్క, తెలినెమ్మొగము=తేటగల చక్కని ముఖమును, అంబులన్ = నీళ్లయందు, ముంచునొప్పు = ముంచుచున్న సొగసు, తావుబల్మిన్ = స్థానబలముచేత, నలినమ్ములు=తామరలు, దొమ్ములుగూడి=దొమ్మిచేసి, క్రమ్మి=చుట్టుకొని, పూర్ణేందునిన్ = నిండుచందురుని - ముఖచంద్రుననుట. మున్నుగొన్న రుచులు = మునుపుతీసికొన్న కాంతులను—అనఁగా రాత్రి హరించిన మాయొక్క శోభలను, ఇమ్మని, నీటికిఁదార్చు కైవడిన్ = నీటిలోఁ బడలాగుచున్నదో యన్నట్లుగా, ఎన్నందగును.

ఇట స్త్రీల అఱచేతులకును తామరలకును, మఱియొక్కతె ముఖమునకును పూర్ణచంద్రునకును ఉపమానోపమేయ భావము. బలవంతుఁ డొకఁడుచేసిన యపరాధమును బలహీనులు పెక్కండ్రు తీర్పఁజూచి తఱివేచి తమ పట్టునకు వాఁడురాఁగా గుంపులుచుట్టుకొని వానిని గ్రమ్మి తమ పట్టునకు లాగుట ప్రకటము. అల. ఉత్ప్రేక్ష. సమాసోక్తి, ఉపమాధ్వనియును.

ఉ. బంగరుకొమ్ము పూని యొక ప్రౌఢ రయంబున నీరుచల్ల ము
గ్ధాంగన యోర్తు వక్త్రకిరణాప్తిఁ గరంగెడు చంద్రకాంతపున్
శృంగము పూని దాని గెలిచెన్ వెస నక్షయకాండలబ్ధి ను
ప్పొంగరె రాజరత్నపరిపూర్ణ బలంబున నెట్టివారలున్. 160

అ. ఒక ప్రౌఢ=ఒక ప్రౌఢయగు స్త్రీ, బంగరుకొమ్ము=బంగారపు చిమ్మనగ్రోవి, పూని, రయంబునన్ = వేగముగా, నీరుచల్లన్, ముగ్ధాంగన ఓర్తు=ఒక ముద్దరాలు, వక్త్రకిరణాప్తిన్ = మొగము యొక్క మెఱుంగులను బొందుటచేత, కరంగెడు, చంద్రకాంతపున్ శృంగము=చంద్రకాంత మణిచే రచింపఁబడిన చిమ్మనగ్రోవి, [ప్రసిద్ధ చంద్రకిరణములకే కాక ప్రమదాముఖ చంద్ర కిరణములకు చంద్ర కాంతపుఱాలు గరంగుట 'నిజవదనచంద్రచంద్రికావృతప్రతీరచంద్రకాంతజాతనూతనస్రోతో భర్గంబులయుబ్బునకు' (3 ఆ ౧౫ 3. పచ) ననియున్నది.] పూని, దానిని, గెలిచెను. ఇట వక్త్రమందుఁ జంద్రభ్రాంతిని జెప్పవలయును. ఎట్టివారలున్=ఎటువంటి వారైనను—అనఁగా ఎంతప్రౌఢత చాలని వారైనను, రాజరత్న పరిపూర్ణ బలంబునన్=రాజశ్రేష్ఠునియొక్క నిండు బలిమిచేత, అక్షయకాండ లబ్ధిన్ = తఱుఁగని బాణముల దొరకుటచేత, వెసన్, ఉప్పొంగరె=ఉత్సాహమును బొందరా యేమి

యని యర్థము—రాజనఁగా చంద్రుఁడు, రాజరత్నము = చంద్రకాంతమణి, దానియొక్క పరిపూర్ణ బలము చేతనైన, అక్షయకాండలబ్ధిన్=అక్షయమయిన జలలాభముచేతనుప్పొంగదాయని భావము.

'చంద్రకాంతపున్ శృంగము' అనుచో పరుష సరళములు పరము లగునపుడు ఘుంపులకు నుగాగమము వచ్చుననియుండఁగా నిటస్థిరములు పరము లగునపుడును నది చూపట్టుచున్నది. ఇట్లు 'పూర్వపున్మక్కువ' (నరసభూ) మొదలగు నిటీవలి కవులప్రయోగములందే కాని కవిత్రయ ప్రయోగములఁ గనుపట్టవు. 'సమాసేషు నుమ్బోచ్యతః' అను శబ్దానుశాసన సూత్రమందలి సమాసేషు అనెడు బహువచనముచేత బుంప్వాది వికారమునకంటెఁ బరంబుగ నుగాగమము వచ్చునని గ్రహింప వచ్చును. 'కరంగు కురంగభృన్మణిశృంగ' మని సోమకవి పాఠమున నీదోషము కలుగదు. బంగరు కొమ్మపూని నీరుచల్లినది ప్రౌఢయయ్యును, చంద్రకాంతపు కొమ్మునఁ జల్లుటచే ముగ్ధదానిని జయించెను. ఏలన తన ముఖచంద్రునిచే నాకొమ్ము కరంగుటవలన జలమవ్వారిగాఁ గలుగుటచే, దానికంటెఁ దా నెక్కుడునీరు చిమ్మఁజాలి గెలుపునొందెను. అలం. సమాధియు శ్లేషమూలకమగు నర్థాంతర న్యాసమును. ముగ్ధయయ్యు గెలుచుటచే విషమమును.

ఉ. హాసవిలాసచంద్రికల కొకబ్జిని మోము ముడుంచు దీని కు
ద్భాసిరమావలేపము గదా యని యోర్తు దళప్రకాండముల్
గాసిలఁ జేసి కైకొనియెఁ గర్ణికఁ దత్కమలాధివాస సిం
హాసనముల్ హరించి నిజహస్తగతంబుగఁ జేయుచాడ్పునన్. 161

అ. ఓర్తు=ఒక స్త్రీ, అబ్జిని=తామరతీఁగ, హాసవిలాస చంద్రికలకున్=నానవ్వులనెడు విలాసపు వెన్నెలలకు - వెన్నెలలవంటి నావిలాసపు నవ్వులకనుట, మోము ముడుంచున్ = మొగము ముడుఁచు కొనుచున్నది—అనఁగా చూపోపఁ జాలకున్నది యనుట. ముఖచంద్రకాంతికి తామర మొగుడు ననిభావము. దీనికిన్=ఈతామరకు, ఉద్భాసిరమా అవలేపము=మిక్కిలి ప్రకాశించుచున్న సంపదయొక్క గర్వము గదాయని యర్థము (తామరలక్ష్మికి స్థానమనిభావము.) దళప్రకాండముల్— (దళమనఁగా దండును ఱేకును) శ్రేష్ఠములయిన ఱేకులనెడు సేనాసమూహములను, గాసిలన్ చేసి= గాసిపెట్టి, తత్...హాసనముల్=ఆలక్ష్మికి వాసమయిన సింహాసనమును, హరించి=తీసికొని, నిజహస్త... చాడ్పునన్=తనచేతికిదొరకినది చేసికొన్నట్లుగా, కర్ణికన్=అందలిమిద్దెను, కైకొనియెన్=తీసికొనెను.

తన్నుఁజూచి చూపోపని పగవాని సంపద్గర్వమును హరించుటకై వానిపైదండెత్తి వానిసేనల చీకాకుపఱిచి, రాజ్యమూలమగు వాని సింహాసనమును హరించుట ప్రకటము. ఇట శత్రువు తామర తీఁగ, వానిసేనలు ఱేకులు, దానిలోని మిద్దె లక్ష్మిసింహాసనము. స్త్రీముఖచంద్రికకుఁ దామర మొగుడు ననియు, ఒకతి యొక తామరపూవునందు ఱేకులు నలియఁగా దుద్దుచేతఁ గిల్లెననియు తాత్పర్యము. దీనిసే దానిసహజముకుళమును చూపోపమిచేత మూతి ముడుఁచుకొనుటగాను కాఁబట్టి దాని దుద్దును గిల్లుట దాని సంపత్సింహాసనమును హరించుటగాను నుత్ప్రేక్షించినాఁడు. 'హాస...కైకొనియెన్' ఉత్ప్రేక్ష శ్లేషానుప్రాణితము. 'తత్క...చాడ్పునన్' ఉత్ప్రేక్ష. సమాసోక్తియు.

శా. ఓలంబాలక యోల యోల యనఁనో కోలో లంచు మేలంబునన్
రోలంబాలక యోర్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మి తూఁటాడి కెం
గేలం బట్టి తటాలునన్ నెగసె నక్షీణాంబునాథాంబుజా
క్షిలోకంబు జయించి వారలయశశ్శ్రీఁ దెచ్చుచందంబునన్. 162

అ. రోలంబాలక=తుమ్మెదలవంటి ముంగురులుగలది 'ఇందిందిరశ్చంచరీకో రోలంబోబంభరో౽ళి'పిచ'అ. అగు, ఓర్తు, మఱొకదానిని, ఓలంబాలక = వ్రేలుచున్న ముంగురులుగల ఓ చెలియా! (ఓలోలాంబక = బెళుకుగన్నులు గలదానాయనిపాఠాంతరమున నర్థము.) ఓలఓలయనన్ =మీఁద నీరుచల్లుచు ఓలఓలయని చెప్పఁగా, మఱియొకటి, మేలంబునన్ = కోడిగముచేత, ఓలోలంచు = ఓలఓలయని మాఱుపలుకును, క్రుంకి=నీటిలోమునిఁగి, బిసవల్లుల్ = తామరతూండ్లను,తున్మితూఁటాడి, కెంగేలంబట్టి, తటాలునన్, నెగసెను. నెగయుధాతువు 'నీరలోననుండి నెగయుదెంచె'నని నకారాదియుఁ గలదు.అక్షీణ...లోకంబుల్—అక్షీణ=కొఱవడని, అంబునాథ = జలాధినాథుఁడయిన వరుణునియొక్క, అంబుజాక్షీ లోకంబుల్ = స్త్రీసమూహమును, జయించి=సౌందర్యముచేత గెలిచి, వారలయశశ్రీన్ = వారియొక్క కీర్తిసంపత్తిని, తెచ్చు చందంబునన్ = తీసికొనివచ్చునట్లుగా, తటాలున నెగసెనని సంబంధము.

నీటిలోని బిసవల్లులను, నీటిదేవతయగు వరుణుని స్త్రీల యశశ్రీగా నుత్ప్రేక్ష. ఇట రెండవ పాదమున నహోబలపతి 'రోలంబాలక యోర్తుగ్రుంకి బిసవల్లుల్' అనుపాఠమును గ్రహించెను. ఈపాఠమున రేఫమునకు లకార విశ్రమము చెల్లదుగాన సమంజసముగాదనియు 'లోలంబాలక' లోపల లంబములయిన అలకలు గలదియనియు నప్పకవి. ఇందుల కహోబలపతి రేఫలకారముల కభేదము గనుక విశ్రమము చెల్లుననియు నిది తెలియక యప్పకవి విశ్రమము చెల్లదన్నాఁడనియు 'రాయంచగాళ్లఁ దాలకయము న్నె' మొదలయిన యీకవి ప్రయోగములు సాధువులై యున్నవనియు వ్రాసెను. కాని. "తవులుటకు తాలుటయని వక్రతమము వచ్చుటకాకరమేమో తెలియఁ జేయఁడయ్యె. 'అయిగ వుగాదేశా స్తః క్రమేణసర్వత్ర వక్రతమయోర్వా' అనుసూత్రము. స్వభావసిద్ధములయిన వక్రతమము లకు అయి, అవు, అనెడు ఆదేశములు వికల్పముగా వచ్చునని యున్నదిగాని వ్యస్తవర్ణములకు వక్రతమాదేశము విధింపదు. మఱియు 'కలహంసకాళ్ల దవులకయ మున్నె'యని పాఠభేదము నున్నది. రేఫలకారములకు విశ్రమము భారతాది గ్రంథములం దెక్కడను గానరాదు. కాన లోలంబాలకయనెడు పాఠమే సాధువను గవిహృదయమునని తోఁచెడి" నని .విద్వజ్జనరంజనీవ్యాఖ్యాతయగు సోమకవియు వ్రాసెను కాని 'తవులు' నకు 'తాలు' అని 'సుస్థిరు నిను మావిభుం డనుమతిన్ వెనుదాలెద మాదరంబునన్' (రాఘ. 3. ఆ) ఇత్యాదిప్రయోగములంగలదు. రేఫలకారములకు యతి 'భా,రము నంబుచ్చుచు వర్ధమానవిరహంగ్లానిన్ మదిం గుందుచున్' (శకుంతలాపరిణయము) అని పెక్కుచోట్లఁ గలవు.

సీ. కేలఁ దమ్మిఘటించి పాలమున్నీటిలోఁ, బొడమిన జవరాలిఁ బోలె నొకతె
యమలమృణాళనాళాక్షసూత్రముఁ బాణి,గీలించి యజరాణిఁబోలె నొకతె
వెలిదమ్మితేకు వేనలి నంట లేనెల, పువ్వుఁ దాల్చుభవానిఁ బోలె నొకతె
కలువపుప్పొడి రాల్చి కాయజాస్త్రముల తు,ప్పలుడుల్చురతిదేవిఁబోలె నొకతె
తే. సారకాసార సాగర జనితజలజ, కుండమాధ్వీసుధాధారఁ గ్రోలఁదివురు
ప్రబలరోలంబమాలికారాహుఁబఱపి,దంభనారాయణి యనంగఁ దనరెనొకతె.

అ. ఒకతె, కేలన్, తమ్మిఘటించి, పాలము...జవరాలిన్ =లక్ష్మిని, పోలెను. లక్ష్మి కమలహస్తగనుక నామెను బోలుట. మఱియొకతె, అమల...సూత్రమునన్ =అచ్ఛమయిన తామరతూఁటి కాఁడయనెడు పటికపుపూసల జపమాలికను, పాణిన్ కీలించి=చేతఁబట్టి, అజరాణిన్ =సరస్వతిని, పోలెను. సరస్వతి యక్షమాలికాధర. మఱియొకతె, వెలిదమ్మితేకు=తెల్లదామరపూఱేకు, వేనలిన్ = కొప్పునందు, అంటన్ = అంటుకొనఁగా, లే...భవానిన్ = లేఁత చంద్రుఁడను పువ్వుధరించిన

పార్వతిని, బోలెను. ఒకతె, కలువ...రాల్చి, కాయజాస్త్రముల తుప్పలు = మన్మథ బాణముల యొక్క త్రుప్పును, డుల్చురతిదేవిని, బోలెను.

ఒకతె, సార...ధారన్—సార = శ్రేష్ఠమయిన, కాసార=కొలఁకు అనెడి, సాగర=సముద్రమువలన, జనిత=పుట్టిన, జలజకుండ = తామరయనెడు కలశమందలి, మార్ద్వీ=పూఁదేనెయనెడు, సుధాధార=అమృతప్రదారను, గ్రోలన్, తివురు=యత్నించుచున్న, ప్రలంబ...రాహున్=బలవంతమయిన తుమ్మెదల చాలనెడి రాహుగ్రహమును, పఱపి=వెడలఁగొట్టి, డంభ నారాయణీయనంగన్= కపటవిష్ణువు (అమృతము పంచిపెట్టునపుడు రాక్షసులను వంచింప నారాయణుఁడయిన మోహిని) అనునట్లుగా, ఒప్పెను. సముద్రమునఁ బుట్టిన యమృతకలశమును దేవతలకుఁ బంచునపుడు రాహువు దేవతారూపమున నమృతము ద్రావ నుంకింపఁగా మోహినీ రూపుఁడయిన విష్ణువు వానిని జక్రమున ఖండించుట యిట యనుసంధించునది. అలం. ఉపమ.

ఉ. ఆటకొలంకునం గరఁగి యంబుజగంధులగంధసారముల్
గాటుకయున్ హరిద్రయును గానఁగనయ్యె నితాంతధన్యల
జ్జోటులు మున్గువేళఁ బరిశుద్ధసితాసిత నిర్ఝరంబు ల
న్నీటఁ బిశంగవర్ణతటినీమణితోఁ దలచూపెనో యనన్. 164

అ. అంబుజ...సారముల్=ఆపడఁతుల చందనములు, ('గంధసారో మలయజః' అ.) కాటుకయున్, హారిద్రయును = పసపును, ఆటకొలంకునన్ కరఁగి, నితాంతధన్యలు=మిక్కిలియు పుణ్యవతులు, ('తీవ్రై కాంతనితాంతా నిగాఢ బాఢదృఢానిచ' అ.) అజ్జోటులు=ఆ స్త్రీలు, మున్గువేళన్, పరిశుద్ధసిత అసిత నిర్ఝరంబులు=అచ్చములయిన, (గంగాయమునల) తెల్లనినల్లని ప్రవాహములు, అన్నీటన్=ఆకొలఁకునీటియందు, పిశంగవర్ణతటినీమణితోన్=పచ్చనివన్నెగలనదితోడ-(అనఁగా సరస్వతితోడ. 'సరస్వతీరజోరూపా తమోరూపాకళిందజా। సత్త్వరూపాచ గంగాత్ర త్రితయం బ్రహ్మనిర్గుణమ్'అని యున్నది. సరస్వతి పిశంగవర్ణయని తెలియునది.) తలచూపెనోయనన్, కానఁగనయ్యెను.

ఆపడఁతులు జలకమాఁడునపుడు వారిమేననుండి కరఁగిన చందనము, కాటుకయు, పసపును, గంగయు యమునయు సరస్వతియుఁగా నుత్ప్రేక్ష. ఈపవిత్రనదులు పొడసూపనేల? ఆపడఁతులు నితాంతధన్యలు కనుక కావ్యలింగమును.

తే. కొలన నీరీతి నీరాడి కొప్పు లంబు,రాశి నిర్గతవార్షికాభ్రములఁ బోల
నాత్మనిరసనభీతి నార్ద్రాంబరములు, తనులతల నంటఁబెనఁగఁదత్తటముఁ జేరి.

అ. ఈరీతిన్, కొలన, నీరాడి, కొప్పులు, అంబు...భ్రములన్ = సముద్రమునుండి బయలువెడలుచున్న వర్షాకాలపు మేఘములను, పోలన్, ఆర్ద్ర అంబరములు=తడిసినపావడలు, ఆత్మనిరసనభీతిన్=తమ్ము దిగవిడుతురను భయముచేత, తనులతలన్=తీఁగలవంటి దేహములను, అంటన్ పెనఁగన్=గట్టిగా పెనఁచుకొనఁగా, తత్తటమున్=ఆకొలనిగట్టును, చేరి, మీఁదికన్వయము.

కొప్పులు వార్షికాభ్రములనుట నలుపును పఱపును బట్టి. నీటఁదడిసి రేఁచినవి గాన, సముద్రనిర్గతములయిన వార్షికాభ్రములనుట. అంటఁ బెనఁగుటకు తనువును లతయనుట మిక్కిలి యుపకారకము. అలం. ఉపమయు, ఉత్ప్రేక్షయు.

ఉ. కామిను లన్నగాత్మజకుఁ గల్పకభూరుహదత్తకోమల
క్షౌమముఁ గట్టనిచ్చి యలకల్ దడియార్చి విరుల్ ఘటించి ము

క్తామణిభూషణంబు లిడి గంధ మలంది వెలందియానతిం
దామ నలంకృతాంగులయి దర్పకరాడ్భజనాదరంబునన్. 166

అ. కామినులు, అన్నగాత్మజకున్=ఆగిరికకు, కల్పక... క్షౌమము=కల్పవృక్షముచేత నియ్యఁబడిన మృదువయిన పట్టువలువను కట్టనిచ్చి, 'క్షౌమం దుకూలే స్యాదతసీకుసుమేపిచ' (విశ్వప్రకాశము) ఆఁకల్, తడియార్చి, విరుల్, ఘటించి=తుఱిమి, ముక్తామణి భూషణంబులు = ముత్తెపుసొమ్ములు, వెలందియానతిం=గిరికపంపున, తాము, అలంకృతాంగులు = అలంకరించుకొన్న దేహములు గలవారు. దర్పకరాట్ భజన అదరంబునన్=మన్మథ మహారాజును భజించుటయందలి ప్రీతిచేత, మీఁది కన్వయము. ఇట నాయికకు వస్త్రమాల్యాభరణచందనములను చతుర్విధాలంకారములు దెలియునది. చెలులు నలంకరించుకొనిరి. ఏల, మహారాజు సేవకు నలంకరించుకొనక తీఱదు. ఆరాజెవఁడు? మన్మథుఁడు.

సీ. నారంగములు వాస నారంగములు, గొన్ని యళినాదమంత్రముల్ దెలుపుచోటఁ
దిలకంబు లవనీజ తిలకంబు లవి, గొన్ని ప్రసవాసవార్ఘ్యంబు లొసఁగుచోటఁ
గాంచనంబులు వనైక కాంచనంబులు, గొన్ని కళికాప్రదీపముల్ నిలుపుచోట
సహకారములు చైత్ర సహకారములు గొన్ని, తలిరాకుటారతుల్ దాల్చుచోట

తే. ముప్పిరిఁబెనంగి ద్రాక్షులు గప్పికొనిన, గొప్పకప్రంపుటనఁటుల చప్పరాల
నొప్ప రాలినకప్పురా లుప్పరాలఁ, బెనఁచి వలిగాడ్పు ధూపమర్పించుచోట.

అ. వాసనారంగములు = తావులకు స్థానములు, నారంగములు = నారింజచెట్లు, అళినాద మంత్రముల్=తుమ్మెదల ఝుంకారములనెడు మంత్రములు, తెలుపుచోటన్=చెప్పుచుండెడు నట్టిచోట, అవనీజ తిలకంబులు=వృక్షశ్రేష్ఠములు, తిలకములు=బొట్టుగుచెట్లు, ప్రసవ ఆసవ అర్ఘ్యంబులు=పూఁదేనె అనెడి అర్ఘ్యములు, వనైకకాంచనంబులు = వనమునకు ముఖ్యముగా చెలువుగూర్చునవి, కాంచనంబులు= సంపెంగచెట్లు, కళికాప్రదీపముల్=మొగ్గలనెడు దీపములు, చైత్రసహకారములు=వసంతునికిఁ దోడు పాటయినవి, సహకారములు=తియ్యమామిడి చెట్లు, తలిరాకుటారతుల్ = చిగుళ్లనెడి నీరాజనములు.

ద్రాక్షులు, ముప్పిరిన్ పెనంగి=ముప్పేటలుగా పెనఁగొని, కప్పికొనిన = అల్లుకొన్న, గొప్ప కప్రంపుటనఁటుల చప్పరాల=పెద్దకర్పూర పరఁటి చప్పరములనుండి, ఒప్పన్, రాలిన, కప్పురాలు, ఉప్పరాలన్ = ఊర్ధ్వభాగములను, పెనఁచి, వలిగాలి, ధూప మర్పించుచోటన్ = కర్పూరము నెగఁజిమ్ముటయె ధూపమర్పించుటగాఁ జెప్పినాఁడు.

తుమ్మెదల రవళిమంత్రములు. బొట్టుగుచెట్ల పూఁదేనె అర్ఘ్యము. సంపెంగమొగ్గలు దీపములు. మామిడిచిగుళ్లు ఆరతులు. గాలికెగిరిన కర్పూరధూళి ధూపము. మన్మథ పూజసేయఁ దలఁచినారు గావున, అందులకు వలయు మంత్రార్ఘ్య ప్రభృతులిచట స్వతస్సిద్ధములై యున్నవని తాత్పర్యము. అలం. వృత్త్యనుప్రాసము. అతిశయోక్తియు.

ఉ. గొజ్జఁగమంచునం గలపి కూర్చినపుప్పొడి తిన్నెమీఁద లా
మజ్జక కాయమానలస మానవిమానము క్రింద నొక్క పూ
సెజ్జ ఘటించి యం దొకకుశేశయకర్ణిక నిల్పి యందు సం
పజ్జలజేక్షణాసుతుని భావము వ్రాసి కురంగనాభికన్. 168

అ. గొజ్జఁగమంచునన్=గొజ్జంగపువ్వుల మీఁదనుండి కురిసిన మంచుచేత—పన్నీరుచేతననుట, కలపి...మీఁదన్, లామజ్జక...క్రిందన్—లామజ్జక = వట్టివేళ్లయొక్క, 'అభయం నళదం సేవ్య మమృణాళం జలాశయమ్, లామజ్జకం లఘులయ మవదాహేష్టకాపథే' అ. కాయమాన=పందిటి యందు, లసమాన=ఒప్పుచున్న, విమానముక్రిందన్ = పువ్వుచప్పరము క్రింద, ఒక్క, పూసెజ్జ= పువ్వుశయ్యను, ఘటించి, అందు, ఒక, కుశేశయకర్ణికన్ = తామరమిద్దెను నిలిపి, అందు, సంప... భావము=లక్ష్మీపుత్రుఁడయిన మన్మథుని రూపమును, కురంగనాభికన్ = కస్తూరిచేత, వ్రాసి, కురంగ నాభికన్ అనుపదము కాకాక్షిన్యాయమున పూర్వమునకును ఉత్తరమునకును నన్వయింపవలెను.

పందిరి వేసి యందొక వేదికగట్టి దానిపయిని శిలాలోహాదులందు కొల్చు దేవతరూపు వ్రాసియో చెక్కియో ఆరాధించుట గలదు. ఇట, వట్టివేళ్లపందిరి. పన్నీరుగలపిన పుష్పాడి వేదిక. తామరదుద్దు శిల. మన్మథునిభావము దానిపయిని వ్రాయఁబడినది. వ్రాయుటకు మసి కస్తూరి; అని పరికరోత్కర్ష ము తెలియునది.

తే. అతని వామాంకమున రతి నావహించి, మౌళి నుడురాజు ఋతురాజుఁ గీలుకొల్పి
కేవల సగంధపవన కోకిల మరాళ, కీర సారంగముల వ్రాసి చేరి చెలులు. 169

అ. చెలులు, రతిన్=రతిదేవిని, అతని, వామాంకమునన్ = ఎడమతొడమీఁద, ఆవహించి= ఆవాహనముచేసి—నిలిపి అనుట, మౌళిలన్=ముంగల, ఉడురాజున్=చంద్రునిని, ఋతురాజున్= వసంతునిని, కీలుకొల్పి = సంఘటించి, కేవలన్ = పార్శ్వములందు, సగంధపవన...రంగములన్= వాసనతోడి గాలిని—(మలయమారుతమును), కోయిలను, రాయంచను, చిలుకను, తుమ్మెదలను వ్రాసి, చేరి=సన్నిధికిఁజేరినవారై, మన్మథుని పరిచ్ఛదమును పరివారమును లిఖించుట తెలియునది.

సీ. ధ్యానంబు హృదయవాస్తవ్యకుటుంబికి, నావాహనము జగద్వ్యాపకునకు
నర్ఘ్యపాద్యములు నారాయణప్రియసూతి, కభిషేక మబ్ధికన్యాంకశాయి
కలరుదోయిళ్లు పువ్వులవింటిదొరకు గంధము గంధగిరి మరుద్బాంధవునకు
ధూప మప్రతిమప్రతాపోష్మ సురభికి, దీపంబు తిమిరభయాపహునకు

తే. మధురసఫలోపహారంబు మధుపకీర
పరిజనపరాయణున కంచు భక్తి నొసఁగి
మానమథనాయ మదనాయ మధుసఖాయ
మనసిజాయ నమో నమో యనుచు మ్రొక్కి. 170

అ. హృదయవాస్తవ్యకుటుంబికిన్=హృదయమందు కాఁపురమున్న గేస్తునకు, ధ్యానంబు= హృదయమందేయున్న వానిని హృదయమందు నిల్పి ధ్యానముసేయుట స్థితస్థాపన తుల్యము. అనఁగా హృదయమందే యున్నవానిని హృదయమందు నిలుపుటయే మని యాశయము. మీఁదనెల్ల నిట్లె యాశయము గ్రహించునది. జగద్వ్యాపకునకున్=జగత్తునెల్లఁ బర్వియున్నవానికి, ఆవాహనము- జగ త్తునంత ఆవహించిన వానికే ఆవాహనమనుట. 'నారాయణప్రియ సూతికిన్—(నారములనఁగా జలములు. నారములే అయనముగా అనఁగా స్థానముగాఁ గలవాఁడు-నారాయణుఁడు. 'ఆపో నారా ఇతిప్రోక్తా ఆపో వై నరసూనవః । తాయదస్యాయనం పూర్వం తేన నారాయణస్స్మృతః.' అని భారతమనుస్మృత్యాదులు) జలములు స్థానముగాఁగల నారాయణునకు గారాబుకొడుకయినవానికి

అర్ఘ్యపాద్యములు=జలముచేత నియ్యంబడు నర్ఘ్యమును పాద్యమును. అబ్ధికన్యాంకశాయికిన్ = సముద్రుని కూఁతురయిన లక్ష్మీదేవి తొడలపై పవళించువానికి, అభిషేకము=జలాభిషేకము.

పువ్వులవింటి దొరకున్ = పువ్వులే విల్లుగాఁ గలవానికి, అలరుదోయిళ్లు = పుష్పాంజలులు, గంధ...ధవునకున్=మలయపర్వతపు గాలికి చుట్టమయినవానికి, గంధము=గందము. అప్రతి...రభికిన్=ఎనలేని మగఁటిమియొక్క వేఁడిమిచేత పరిమళించుచున్నవానికి, ధూపము. ధూపము వేఁడిమియు వాసనావ్యాప్తియు గలది. ప్రతాపమును వేఁడిమియు వ్యాప్తియుఁ గలది గాన పోలిక. (సురభిశబ్దము. కేవలప్రతాపపరముగ వ్యాప్తియు, ధూపసాదృశ్యపరముగ వాసనయు నర్థములుగాఁ గలుగుట తెలియునది. లేక ప్రతాపోష్మ యనఁగా ధూపోష్మ. ధూపోష్మచేఁ బరిమళించుచున్న వానికి ధూపమని యర్థము. ధూపజనిత సౌరభ్యముగలవానికి ధూపముచేతి నేమిప్రయోజనమనియాశయము.) ప్రథమార్థమున, ఊష్మసౌరభ్యములుగలవానికి ధూపమేలయనుట. తిమిరభయాపహునకున్ = చీఁకటి వలని వెఱపునుబోఁగొట్టువానికి, దీపము. కామార్తులకు చీఁకటియును భయమునులేమి ప్రకటము.

మధున...యణునకున్—(మధువును ద్రావెడు) తుమ్మెదలును (పండ్లనే తినెడు) చిలుకలును, అనెడు పరిజనమునం దాసక్తుఁడయినవానికి,మధు...హారంబు= తేనెయును బండ్లనుగానుక. అంచున్, భక్తికిన్, ఒసఁగి, మానమథనాయ = స్త్రీపురుషుల ప్రణయకోపములను బోఁగొట్టువాఁడును, మదనాయ= స్త్రీపురుషులను మదింపఁజేయువాఁడును,మధుసఖాయ=వసంతునికి చెలికాఁడయినవాఁడును, అగు, మనసిజాయ=మనసునందుఁబుట్టిన వానికొఱకు, నమోనమః=నమస్కారము నమస్కారము, అనుచున్, మ్రొక్కి. 'నమోయనుచు' అనుచోట 'లోపస్సమ ఆదికే విసర్గస్య' అనెడు శబ్దానుశాసన సూత్రముచేత, నమయనుచు చెప్పవలసినను 'నమశ్శబ్ద విసర్గస్యలోప ఓత్వమపీష్యతే' అనునధర్వణ వచనమున 'నమోయనుచు' ననియుఁ జెప్పవచ్చును. 'అనుకృతేస్సువాక్యంతు' అను సూత్రముచే ననుకరణమందు సంస్కృతవాక్యము ప్రయుక్తము.

అర్పింపవలసిన వన్నియు నవ్వారిగాఁ గలవానికి నవియన్ని యర్పించుట 'భక్తి' చేత ననుట. సర్వకామసమృద్ధుఁడు గాన కామిత ప్రదుఁడగుట సిద్ధమని వ్యంజితము. అలం. సమాలంకారము.

క. కామ కమలాస్త్ర కమలా, కామక సుత కామనీయకనిధీ యనుచుం
గామినులు విన్నవించిరి, కోమల కోకూయమానకోకిలఫణితిన్. 171

అ. కామినులు, కామ=కాముఁడను పేరుఁగలవాఁడా! కమలాస్త్ర = పద్మముబాణముగాఁ గలవాఁడా! కమలా...సుత=లక్ష్మీకాముకుఁడయిన విష్ణువుకుమారుఁడా! కామనీయకనిధీ = చక్కఁదనమునకు పట్టయిన వాఁడా! అనుచున్, కోమల...ఫణితిన్=మృదువైన, కుహూకుహూ అనెడుధ్వనిగలుగుచున్న కోయిలలయొక్క పలుకుబడిచేత, విన్నవించిరి.

శా. వాతాందోళిత చందనాగరులతావ్యాలీఢకేళీవనీ
జాతంబుల్ భవదీయనర్మగృహముల్ చైత్రుండు నీబంటు నీ
కేతత్కాననజాతవస్తునిచయంబే మిచ్చి పూజించుటల్
'శీతాంశోరమృతార్ణవః' మ్మను క్రియంబై జేకొమ్ము చేతోభవా. 172

అ. చేతోభవా=మనస్సునందు పుట్టెడుమన్మథుఁడా! వాత...జాతంబుల్—వాత = గాలిచేత, ఆందోళిత=ఊఁచఁబడుచున్న, చందన=శ్రీగంధముయొక్కయు, అగరు = కృష్ణాగరురుయొక్క

యు, లతా=కొమ్మలతోడ, వ్యాలీఢ=కూడుకొన్న, కేళీవనీ = ఆటతోఁటలయొక్క, జాతంబులు=సమూహములు, భవ...గృహముల్=నీయొక్క కేళీగృహములు. (ఇట గాడ్పు సేవకుఁడు, చందనాగరులతలు=ఉయ్యేలలు, అనివ్యంజితము, అట్టిసేవకుఁ డూఁచుచున్న యిట్టియుయ్యేలలు గలదుగాన నర్మగృహములగుట.) చైత్రుండు=వసంతుఁడు, నీబంటు, నీకున్=ఇట్టివాఁడవగునీకు, ఏత...నిచయంబు=ఈవనమందుపుట్టిన, (పుష్పఫలాదులయిన) వస్తువుల సమూహమును, ఏము, ఇచ్చి పూజించుటలు, శీతా...ర్పణమ్మున్ క్రియన్=చంద్రునికి అమృతమును సమర్పించునట్టులుగా, తలంచి, చేకొమ్ము. అమృతమయుఁడయిన చంద్రునకు అమృతనివేదనముసేయుట యెక్కుడవగా నట్లు, మేముసమర్పించు పుష్పఫలాదులు, వనజాతములే నర్మగృహములుగాను పుష్పఫలాది కరుఁడయిన వసంతుఁడే బంటుగాను గల నీకు నెక్కుడవకావు; అయినను, అనుగ్రహించి కైకొమ్మని తాత్పర్యము.

మ. బలవన్మేరుశరాసనంబును బరబ్రహ్మాస్త్రముం గల్గుబ
ల్విలుకానిం దృణమైన చాపమున గాసిం బోవు లేయల్గులం
జలమానించి సగంబుచేసి తవు నౌర సంకల్పసిద్ధుల్ గొనం
బలుమేరున్ నిరసింప లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే. 173

అ- బలవ...సనంబున=మిక్కిలి బలువయిన మేరువను విల్లును, పరబ్రహ్మ అస్త్రము=పరబ్రహ్మమయిన విష్ణువనెడి అస్త్రమును, కల్గు, బల్విలుకానిన్ = మేటివిలుకాఁడయిన శివుని, తృణమయిన చాపమునన్=గడ్డిపోఁచవలె నిస్సారమయిన వింటిచేతను-(చెఱకు తృణవృక్షములలోనిది, 'నడాదయస్తృణంగర్మచాఖ్యమాక ప్రముఖా అపి' అ. చెఱకువింటిచేతనని భావము) గాలింబోవు లేయుల్గులన్ = గాలికెగిరిపోవు మృదువయిన యమ్ములచేత - (మన్మథుని బాణములు పువ్వులు కనుక గాలికెగిరిపోవునని భావము). చలము ఆనించి=చలము కలిగించి, సగంబుచేసితి=చిక్కి సగమగునట్లు చేసితివి-(శివుఁడర్ధనారీశ్వరుఁడనిభావము.) అవు నౌర్ = మేలు మేలు, లేఁజిగురుఁగొమ్మన్ = లేఁతచిగురుకొమ్మయును, సంకల్పసిద్ధుల్ = సిద్ధసంకల్పులు - తలఁచినది అట్లెసిద్ధించుమహత్త్వముగలవారు, కొనన్=చేకొనఁగా- ఉపయోగింపఁగా ననుట. బలుమేరున్ నిరసింపన్ = బలిష్ఠమయిన మేరుపర్వతమును దూలించుటకు, చేవగాకుండునే = సారముగలది గాకపోవునా. తలఁచినది తలఁచినట్లె సిద్ధించునట్టి మహత్త్వముగలవారిచేత లేఁతచిగురుఁ గొమ్మయైనను మహామేరువునుగూడ నిరసించునంత చేవగలది యగుననుట. మన్మథుఁడు సంకల్పసిద్ధుఁడనియు అనఁగా తలంపునఁ బుట్టువాఁడనియు చిగురాకు వానికి కైదువనియు, మేరువు విల్లుగాఁగల శివునిని గెలిచినాఁడనియు భావము.

'లేఁజిగురుఁ గొమ్మన్' ఇట కొమ్మకు నుకారవ్యవధానము లేకయే సముచ్చయ నువర్ణమువచ్చుట 'వెండియున్' 'వెండిన్' 'ఉండియున్' 'ఉంకిన్' ఇత్యాదులంబోలెఁ దెలియునది. కొమ్మన్ అను నది సప్తమ్యంతముగా గ్రహింపఁబడునేని, చిగురుగొమ్మయందును జేవగలుగకుండునా యని యర్థము. చిగురుఁగొమ్మయు చేవగాకుండునా యనుటయే సరసతరము. ఒకటియందు మఱొకటి గల్గుటకంటె ఒకటి మఱొకటియే యగుననుట మఱింత యతిశయము. మఱియునిందే 'కామనిశితాస్త్రములు తత్కోమలతరలు, చిగురుకొమ్మలచేవల్' అని ప్రథమాంతముగానేయున్నది. 'అచ్చటఁ బుట్టినచిగురుఁ గొమ్మైనఁ జేవ' అనిమనుచరిత్రమందును ప్రథమాంతమే కాన యట్లెయుట పాఠము గృహీతము. అలం. అర్థాంతరన్యాసము శ్లేషోత్థాపితము.

ఉ. కొండఁట విల్లు వేదలలౌ కుండలిరాజఁట నారి యమ్మనం

తుండఁట బైటిపల్లియలుఁ దున్నినవాఁడఁట యొండురెండు భ
ర్గుం డిదె నిండుపౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబు లు
ద్దండత నొక్కతుంటవిలుదాలిచి యంటినఁ గందుతూపులన్. 174

అ. కొండఁట విల్లు = విల్లుమేరుపర్వతమనుట. వేదలల కుండలిరాజఁటనారి = అల్లెత్రాఁడు వేయితలలుగల ఆదిశేషుఁడఁట. అమ్ము, అనంతుండఁట=విష్ణుమూర్తియఁట-ఇట్టి మహాబలీయములయిన సాధనములు గల్గియుండియు, భర్గుడు=శివుఁడు, ఒండురెండు బైటిపల్లియలు=ఒకటిరెండు - అనఁగా స్వల్పములయిన, చాటులేక బట్టబయటనున్న పల్లెలను, ప్రాకారాది దుర్గగుప్తిలేని పేలవంపు ఊళ్లనుట. తున్నినవాఁడట. (ఒండురెండు పల్లెలనఁగా అంతరమందున్న త్రిపురములని భావము) ఇది నిండుపౌరుషమొకో=ఇంది పూర్ణమయిన పరాక్రమమా. (శివుఁడర్ధనారీశ్వరుఁడు గనుక పూర్ణమయిన పౌరుషము అనఁగా పుంస్త్వము-మగతనము-లేని వాఁడని భావము. (పౌరుషం పురుషస్యోక్తం భావే కర్మణి తేజసి' అని, విశ్వము). అని, ఉద్దండతన్=ప్రతాపముచేత, ఒక్కతుంట విలుదాలిచి=ఒకవింటి తునుకను దాల్చి - (తుంటయనఁగా చెఱకుతుంటయనియు), అంటినన్ కందుతూఁపులన్ = చేతఁ దాఁకఁగానే కందిపోవుబాణములచేత - (మన్మథుని బాణములు పువ్వులుగనుక చేతనంటఁగానే కందిపోవునని భావము) ముజ్జగంబులు=మూఁడులోకములను, గెల్వవె=జయింపవా.

కొండ విల్లుగా బలవత్తరములయిన పరికరములుండియు శివుఁడు బట్టబయలుగానున్న యొకటి రెండు (పట్టణములనుగాదు) పల్లెలను గెలిచినాఁడు. అతని దేమిశక్తి ? నీ వొకవింటితునుకను అంటఁగానే కందిపోవుబాణములను గొని మూఁడులోకములను గెలిచి వైచితివి. నీదేశక్తియని యర్థము. శివునకు విల్లుమేరువనియు నారిశేషుఁడనియు బాణము విష్ణువనియుఁ ద్రిపురములు దహించెనని యు ననుసంధించునది. అలం. విభావనయు, వ్యతిరేకమును.

ఉ. సూనశరాసనీశరముఁ సొచ్చినధాతకు నీమహోభరం
బానక రౌప్యభూధరగుహాగృహ మీఁగినశూలికిం ద్వదీ
యానఘశౌర్యశక్తి హృదయంబున బూనురమావిలాసికిన్
మానదు ప్రారజంబును దమంబును సాత్త్వికముం గ్రమంబునన్. 175

అ. సూనశరాస=పువ్వువిలుతుఁడా, నీశరము...ధాతకున్= నీబాణము నాటిన బ్రహ్మకునని యర్థము - (మన్మథబాణము తామరగనుకఁ దామరయందుఁ జొచ్చియున్నాఁడని భావము.) నీ మహోభరంబు=నీతేజంపు అతిశయమును, ఆనక=ఆఁగలేక, రౌప్యభూధర గుహాగృహము = వెండి కొండ గుహాయనెడు నింటియందు, ఈఁగినశూలికిన్=దాఁగియున్న శివునకు - (శివుఁడు కైలాసమందుండునని భావము - భరమనఁగా 'అప్యధాతిశయోభరః' అ.) త్వదీ...శక్తిన్ = నీదయిన నిర్దుష్టమయిన పరాక్రమశక్తిని, హృదయంబున...లాసికిన్ = మనస్సునఁబూనిన విష్ణువునకు - (లక్ష్మీదేవిని వక్షఃస్థలమందు ధరించినాఁడని భావము. 'హృదయంమానసోరసోః' అని విశ్వము. లక్ష్మీదేవిని నిగరణముచేసి యనఘశౌర్యశక్తి రూపముచేత నధ్యవసించినాఁడు. ఈభావార్థమున 'రమావిలాసి' యను పదము సాభిప్రాయము. క్రమంబునన్=వరుసను, రజంబును=పుప్పొడియు-తామరయందుఁ జొచ్చుటచే పుప్పొడియనుట (రజోగుణమని భావము). తమంబును = చీఁకటియు - కైలాసగుహను దాఁగుటచే చీఁకటియనుట - (తమోగుణమని భావము.) సాత్త్వికమున్ = సాత్త్వికభావము. విలాసమున

కాంతను బొమ్మునఁ బూనుటచే స్మరోద్దీపన జనితమగు సాత్త్వికభావములగు కంపస్వేదాదులు తప్పవను ట - (సత్త్వగుణమని భావము) మానదువో = మానిపోదుగదా. అనఁగా త్రిమూర్తులను వశముచేసి కొన్నాఁడవుగదా యని తాత్పర్యము.

నీ 'శరముసొచ్చిన' అనుచో శరమందుఁ జొచ్చినయనెడు సప్తమ్యర్థమున 'అన్యస్యాః క్వచి ద్భవేచ్ఛాన్యా' అను సూత్రముచేత ప్రథమవచ్చినదిగాన రెండర్థములందును ప్రథమాంతమయిన శర మనెడు పదమునకంటెఁ బరంబయిన చకారమునకు సకారమువచ్చినది. 'నీశరముసొచ్చిన ధాతకుఁ' పర్యాయోక్తము 'నీమహో...శూలికిఁ' ఉత్ప్రేక్ష. 'త్వదీ...విలాసికిఁ' పర్యాయోక్తము 'రమా విలాసి' పరికరము. ఇవన్నియు నంగములు. శ్లేషానుప్రాణితమైన కావ్యలింగము అంగి.

క. మొన యఁగనకా కటకట, మొనయుం గనకాద్రిధరుఁడొకొ ముదితా నుపవనా
తనుపవనాహతి కొసఁగక, తనుపవనా మదన నీయకొసంచిత కరుణన్. 176

అ. మదన=ఓమన్మథుఁడా, మొన=బారుదీరుట. సేనలతో నొత్తుపన్ని ప్రతిఘటించుట. అం గనకా = ఈ యాఁడుచిన్నదానికా. ఇదియేమి గొప్పకార్యమనుట. కటకట = అయ్యయ్యో, మొన యన్ = నిన్ను తారసించుటకు, కనకాద్రిధరుఁడె = మేరువు విల్లుగాఁగల శివుఁడాయేమి, ముది తన్=గిరికను, ఉపవన అతను పవన=ఉద్యానవనమందలి అధికమయిన గాడ్పుయొక్క, హతికిన్= తాఁకుడునకు, ఒసఁగక=అప్పగింపక, అనఁగా మలయమారుతమును గాసిపెట్టనీయక, నీఉదంచిత కరు ణన్=గొప్పదయిన నీదు దయారసముచేత, తనుపవనా = తృప్తినొందునట్లు చేయుమయ్యా-అనఁగా నీదయకుఁ బాత్రురాలిని గావింపుమన్నా యనుట. అల. యమకము.

సీ. లోకత్రయీజయోత్సేకంబు దెల్పు నీ,పడగ నారాయణప్రథమమూర్తి
రెండంటఁ జేయునీకాండచాతురికి నా,ద్యనిదర్శనంబు వామార్ధజాని
గాఢనాళీకసంగ్రస్తుఁడై నేఁడును, నీడాఁగువాఁడు వాణీవిలాసి
యొక్కొక్కచోటుకొద్రొక్కించు నీయాజ్ఞఁ,గడవఁడు పద్మినీకాముకుండు

తే. కాంతలనయెంత నీయంతకొ ఘనున కింక, నళిచికురఁ బ్రోవవయ్య పద్మాక్షిఁ గావ
వయ్య శుకవాణిఁ గరుణింపవయ్య పూర్ణ,చంద్రముఖి నేఁచకయ్య యోచక్కనయ్య.

అ. ఓచక్కనయ్య=ఓసుందరుఁడవయిన మన్మథుఁడా! లోక...పడఁగ—లోకత్రయీ - (లోకమనఁగా పురాణమయినది. ఇందులకు.

'నానీశ్వరం భవితుమర్హతి విశ్వమేతద్బహ్వీశ్వరంతు నితరామయథాప్రమాణమ్,
తల్లోకవేదవిదితేశ్వరవర్జనేన కోయంప్రభుః కతిచిదీశ్వర మన్యమాహుః' శివసూక్తి మాల.)

పురాతనములయిన మూఁడువేదములును, జయ=జయించుటయొక్క, ఉత్సేకంబు = ఎగపును, తెల్పు. నీపడగ=ధ్వజము, నారాయ...మూర్తి=నారాయణుని ప్రథమమూర్తియైన మత్స్యము. (మ న్మథునకు చేఁపపడగ యని తెలియునది.) రెండు...తుదికిన్ = రెండువస్తువు లొక్కటిగాఁ గలిసి కొనునట్లు చేయు నీబాణముల నేర్పునకు, వామార్ధజాని = ఎడమభాగము సగము భార్యగాఁగల సాంబమూర్తియే, ఆద్యనిదర్శనంబు మొదటిసాక్షి. (ఇట. 'ఏకమేవ ద్విధాకర్తుం బహవస్సన్తి ధన్వినః, మారఏకో మహాధన్వీ ద్వయమేకం కరోత్యసౌ' అనుట అను సంధించునది.

గాఢ...స్తుఁడై—గాఢ=గట్టిగా, నాళీక=—(నాళీకమనఁగా బాణమును తామరయును) బాణమయిన పద్మముచేత, సంగ్రస్తుఁడై=మిక్కిలి గ్రహింపఁబడినవాఁడై, నేఁడును=ఇప్పటికిని, వాణీ

విలాసి = బ్రహ్మ, నీడాఁగువాఁడు = నీచిహ్నముగలవాఁడు (మన్మథునకు బాణము తామరయనియు బ్రహ్మకు పద్మమువాసమనియు ప్రకటము) నీడాఁగువాఁడు = నీపంచయందు దాఁగినవాఁడు - నిన్నుఁ శరణుసొచ్చినవాఁడనియు నర్థాంతరము. ఎక్కి...యాజ్ఞ=ఎక్కి త్రొక్కరానిచోట్లనెల్లఁ గాముకులచేతఁ ద్రొక్కించునట్టి నీయానతిని, పద్మినీకాముకుఁడు= స్త్రీకాముకుఁడయిన సూర్యుఁడు, కడవఁడు జవదాఁటఁడు. (సూర్యుఁడుపద్మములకును తామరతీఁగలకు ప్రియుఁడనియు ఎక్కి త్రొక్కరానియాకశమునందెక్కి సర్వత్రకిరణముల నిగిడించుచున్నాఁడనియుసుభావము).

కాఁబట్టి, నీయంతఘనునకుఁ గర్జె, కాంతలనెంత= స్త్రీలనఁగా నెంతమాత్రము, ఇంకన్ - అళికురన్=తుమ్మెదలవంటి కురులుగలదానిని, ప్రోవవయ్య, పద్మాక్షిన్=తామరలవంటి కన్నులుగలదానిని కావవయ్య, శుకవాణిన్=చిలుక పలుకులవంటి పలుకులదానిని, కరుణింపవయ్య, పూర్ణచంద్రముఖి= నిండుచందురునివంటి ముఖముగలదానిని, ఏఁచకయ్య=బాధింపకుమయ్య.

వామార్ధజాని, వాణీవిలాసి, పద్మినీకాముకుండు, ఇవి సాభిప్రాయములు. నీమహిమచేతనే యట్టి గొప్పవారును నింతటి స్త్రీపరతంత్రులయిరనుట. అళి పద్మ శుక పూర్ణచంద్రులు నీకు, మౌర్వీ బాణ, వాహన, బంధువులుగనుక వానినిబోలిన చికుర నేత్ర వాణీ వదనములుగల గిరికాదేవి నీచేత గావందగినదిచుమీ యని భావము. శ్లేషమూలకమైన యర్థాపత్తియు పరికరమును.

క. వలదు కొలఁదాఁకు సుమ్మని, చెలువలు మరుఁ గొసరఁగొసరె జిలిబిలిగాడ్పుల్
జలజల వలరులు రాలెను, గలకల మను శుకపికాళికల కలమెసఁగెన్. 178

అ. చెలువలు, మరుని, వలదు=వద్దు, కొలఁదాఁకుసుమ్ము= స్త్రీహత్య తగులునుజుమీ, అని, కొసరన్=కొసరివేఁడఁగా, జిలిబిలిగాడ్పుల్=మలయమారుతములు, విసరెను, అలరులు=పువ్వులు, జలజల రాలెను, కలకలమను=కలకలగూయుచున్న, శుకపికాళికల = చిలుకలయు కోయిలలయు తుమ్మెదలయు, కలము=అవ్యక్త కోలాహలధ్వని, ఎసఁగెన్=అతిశయించెను.

చ. అఱిమి రమాకుమారుఁ డపుడగ్రతలంబున వచ్చి నిల్చిన
ట్లఱిముఱిఁ దోఁచినం గువలయాక్షి వడంకి కడంకఁదూలి మై
మఱచి సగంధగంధగిరిమారుతపాతిత వల్లికాభ యై
యొఱిగిన సంభ్రమించి చెలు లుద్గతబాష్పతరంగితాక్షు లై. 179

అ. రమాకుమారుఁడు = మన్మథుఁడు, అఱిమి= గదమాయించి, అపుడు, అగ్రతలంబునవచ్చి నిల్చినట్లు, అఱిముఱిన్=నిశ్చయముగా, తోఁచినన్, కువలయాక్షి=గిరిక, వడంకి, కడంకఁదూలి=పూనిక చెడి-భ్రమనుపడి యనుట. మైమఱచి, సగం...భయై=కావరముతోఁగూడిన మలయపు గాడ్పుచేత, కూల్పఁబడిన తీఁగవంటిదై, ఒఱిగినన్ = మూర్ఛచేసోలఁగా, చెలులు, సంభ్రమించి=తొందరపడి, ఉద్గత...తాక్షులై=బయలువెడలుచున్న కన్నీళ్లచేత అలలుగొనుచున్న కన్నులుగలవారై - కన్నీరు పయి పయినివెల్లిగొనుచుండఁగాననుట. మీఁదికన్వయము. ఇందువడంకుట వేపథువనెడిసాత్త్వికభావము. ఇందులకు.

'మోదమునన్నైన రోషభయాదుల నేనియును గంపమధికంబగుఁ దా
నేదేహి దేహమున నది, మేదిని వేపథు వనంగ మెఱయుచునుండున్'.

మైమఱచియనుట మొదలుగా మోహమనెడి సంచారిభావము. 'మోహస్తుమూర్ఛనంభీతి దుఃఖావేశానుచిన్తనైః' వల్లికపాతనము గంధగిరిమారుతముచేఁ జెప్పుట దాని సౌకుమార్యంపు సొంపునకు.

ఆమారుతము సగంధమనుట ఒఱగించునంత బిట్టుగానుండుటకు. కావున చెలులయత్నములు ఉద్గత బాష్పతరంగితములు.

సీ. మోహాపదేశతమోముద్రితము లయిన, కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందుతారకాగమఖిన్నకుచకోకములఁ జంద్రనామంబుఁ దలఁపరాదు
శీర్యదాశావృంతశిథిలితాసులతాంత, మసియాడ వీవనల్ విసరరాదు
పటుతాపపుటపాకపరిహీణతనుహేమ, మింకఁ బల్లవపుటార్చి యిడఁగరాదు

తే. లలన కానంగకేలికీలాకలాప, సంతతాలీఢహృదయపాత్రాంతరాళ
పూరితస్నేహపూరంబు పొంగి పొరలఁ, జల్లని పటీరసలిలంబుఁ జల్లరాదు. 180

అ. మోహా...ద్రితములు—మోహ=మూర్ఛయనెడు, అపదేశ=నెపముగల, తమః=చీఁకటిచేత, ముద్రితములు=మూయఁబడినవి, అయిన, కనుదమ్ములన్=కన్నులనెడి తామరలందు, హిమాంబులు=పన్నీరు, ఉనుపరాదు = (మంచునీళ్లుంపరాదనియు అర్థద్వయ)మున కభేదాధ్యవసాయము. మీఁదను నర్థద్వయమున్నచోట నభేదాధ్యవసాయము సేయవలయును. చీఁకటికిఁ దామరలు మొగుడుటయు మంచు దానిచేఱుపునగుటయుఁ బ్రకటము. ఇట కన్నులు తామరలు. దానికిమోహము చీఁకటి. పన్నీరు మంచునీరు, మూర్ఛదేఱుటకై మొగంబునఁ బన్నీరుచల్లుటగలదు. చల్లఁదగిన పన్నీరును జల్లనుగూడదని యుపచారముగా శబ్దశ్లేషమహిమచే నధ్యవసించుట సారస్యము. పన్నీరు శిశిరోపచారముగాఁ జల్లుటకు 'ఒల్లంబోయినఁ జెంగావుల మృణాళభంగంబుల హిమాంబుపూరంబుల నంగంబులకుఁ జలువపుట్టించిన' నని మనుచరిత్రము.

శ్రమ...కోకములన్—శ్రమబిందు= చెమటబొట్టులనెడు, తారక=నక్షత్రములయొక్క, ఆగమ=రాకచేత, ఖిన్న=దుఃఖితములయిన, కుచకోకములన్=చనులనెడుజక్కవలవిషయమై, చంద్రనామంబు (చంద్రునిపేరుగల) కర్పూరమును (చంద్రునిపేరుననియును 'ఘనసారశ్చంద్ర సంజ్ఞః' అ) తలఁపరాదు. జక్కవలకును చంద్రునకును విరోధము. నక్షత్రములరాకకే జక్కవలు దుఃఖపడుచుండఁగా నిఁకఁదత్సూచితమయిన చంద్రునిరాకకు దానిదుఃఖము చెప్పఁదరమా! ఇట చన్నులందు కర్పూరము పూయుటయు నుపచారము. దాని కనుపపత్తి నధ్యవసించినాఁడు.

శీర్య...లతాంతము—శీర్యత్=జాఱుచున్న, ఆశా=(వసురాజువిషయమయిన) ఆశయనెడు, వృంత=తొడిమనుండి, ('వృంతం ప్రసవబంధనమ్') శిథిలిత = సడలిన, అసులతాంతము=ఉసురు అనెడు పువ్వు, అసియాడన్=ఇంచుకైనను గదలునట్లుగా, అపుడే మిక్కిలి వీడిరాలునట్లున్నదిగాన యించుక కదల్చినను రాలిపోవునుగాన యించుకయుఁ గదలునట్లుగా, వీవనల్ విసరరాదు. తొడిమనుండి శిథిలిపడనున్నట్టి పువ్వుపయి గాలియించుకసోఁకి కదల్చినను నది పడిపోవును. ప్రాణములపుడే పోవలసినది. అయినను ఆశనుబట్టి కొంచెమంటుకొనియున్నదని తాత్పర్యము. ఇట వీవనలు విసరుటయనెడి యుపచారమునకు అనుపపత్తి నధ్యవసించినాఁడు.

పటుతాప=మిక్కుటమయిన (చింతాదులచే నయిన) సంతాపమనెడి, పుటపాక= పుటముల యొక్క పచనముచేత, పరిహీణ=తఱిగి కడవన్నె మట్టునకునిలిచిన, తనుహేమము = మేను అనెడి బంగారము, ఇంకన్=ఇగిరిపోవునట్లుగా, పల్లవపుట ఆర్చి = చిగుళ్లసెజ్జయనెడి యగ్నిజ్వాల, ఇడఁగ రాదు. బంగారముపుటము పెట్టుచురాఁగా వన్నెహెచ్చుకొలఁదిని తూనికతగ్గుచుండునని తెలియు

నది. పల్లవపుటమనెడి పుటవిశేషముయొక్క అర్చినిడరాదనియును నర్థము. చిగురుసెజ్జనువై చెసియుప చారమునకు అనుపపత్తి యిట నధ్యవసితము. మిక్కిలి పుటముపెట్టిన బంగారము మొదలంటరూపు మాయుట ప్రకటము. (పుటపాకముయొక్క లక్షణము-

'పుటపాకస్య పాకోఽయం లేపస్యాంగారవర్ణతా, లేపంచద్వ్యంగుళంస్థూలం కుర్యాద్వ్యంగుళిమాత్రికమ్, కాశ్మీరీవటజంబ్వాది పత్రైర్వేష్టనముత్తమమ్' ఆకులనుజుట్టి యెఱ్ఱమట్టితో పూఁత పూసి యగ్నిపచనముచేయుట పుటపాకము). లలనకుఁ=గిరికకు, అనంగ ... పూరంబు—అనంగకీలి=మన్మథాగ్నియొక్క, కీలాకలాప=సెగలగుంపులచేత, సంతత=ఎల్లప్పుడును, ఆలీఢ= వ్యాప్తమయిన, హృదయ=ఎదయనెడు, పాత్ర=పాత్రముయొక్క, అంతరాళ=లోపల, పూరిత= నిండియున్న, స్నేహపూరంబు = స్నేహమనెడు చమురు, పొంగిపొరలఁ = మిక్కిలి పొంగి కాఱిపోవునట్లు, చల్లని, పటీరంబుసలిలంబు=చందనపునీటిని, చల్లరాదు=చిలుకరింపరాదు. పాత్రయందు చమురు తెరలఁ గాఁగుచుండఁగా చల్లనినీరుచల్లిన పొంగి యొలికిపోవుటగలదు. ఇట హృదయమును పాత్రగాను, స్నేహమును చమురుగాను, మన్మథాగ్నిని ప్రొయ్యిమంటగానుజేసి చల్లని చందనపు నీరుచల్లుట అను నుపచారమును బొసఁగమిని జెప్పినాఁడు.

హిమాంబుచంద్ర పల్లవపుటార్చి శబ్దములకుపన్నీరు కర్పూరముపూసెజ్జ అనుశీతోపచార ద్రవ్యములర్థములు. వానికే మంచునీరు, చంద్రుఁడు, పల్లవపుటమనెడి పుటము అనెడి అర్థాంతరములను గొని వీనికి విరోధులయిన కనుపప్పులకును, కుచకోకములకును, తనుహేమమునకును ఇవిపొసఁగవని నిరూపించినాఁడని చమత్కారము దెలియునది. అసువును ప్రిదులుచున్న పువ్వుగాను, స్నేహమును చమురుగాను నధ్యవసాయముచే, విసరుట, చందనపు నీరుచల్లుట యనునుపచారములును బొసఁగమి కుదిర్చినాఁడు. అలం. ఇందు పెద్దపాదములు నాలుగింటను గీతిని రూపకానుప్రాణితములగు కావ్యలింగము లయిదు.

క. ఏమందమేమి సేయుద, మేమం దని మందలింత ♦ మేమందమొ యిం
దేమందయాన నడుగుద, మేమందఱ మనుచుఁదరళ♦హృదయాంబుజలై. 181

అ. ఏమందము = ఏమనిచెప్పుదుము. ఏమందుఅని, మందలింతము=చెప్పుదము, ఏమందమో= ఏమిచందమో, ఇందు, ఏమందయానను అడుగుదము, ఏముఅందఱముఁ, అని పలుకుచు తరళ ... లై= చలించుచున్న హృదయకమలములు గలవారై. ఇందు విషాదమనెడి సంచారిభావము.

సీ. జవరాలియడుగులఁ♦జివురాకులంటించి, పొలఁతియూరు లనంటి♦పొరలఁ బొదివి
కొమ్మచేదోయి చెం♦దమ్ములహత్తించి, లేమబాహులు మృణా♦ళికలఁ బెనఁచి
యతివగుత్తపుగుబ్బ♦లలరుగుత్తులఁగూర్చి, కాంత చెక్కులఁ జంద్ర♦ఖండములఁదికలికి క్రేఁగన్నులు ♦ కలువఱేకులఁగప్పి, లలన వెన్నెఱుల వా♦లంబుముడిఁచి
తే. నవనవగుణానుబంధ బాంధవములైన, చలువలెన్నెనిగావించి ♦ చెలువచెలులు
నెలఁతకీవసుబాధంబు♦నించుమంచు, నించువిల్కానిమరలఁ ద్రొబ్బి ♦ చుటయును.

అ. చెలువచెలులు=గిరికచెలికత్తెలు, జవరాలియడుగులఁ = గిరికపాదములందు,...ఊరులు= తొడలు, అనంటిపొరలఁ=అరఁటిచెట్టుపై పొరలచేత,...చెందమ్ములఁ=ఎఱ్ఱదామరలను, హత్తించి=కదియించి-చేర్చి,...మృణాళికలఁ = తామరతూండ్లచేత,...గుత్తపు=బిగిగల, అలరుగుత్తులు= పూగుత్తులు, చంద్రఖండము=కర్పూరమును - ఇట ఆయాయవయవమునకు సదృశములయిన యాయా

పదార్థమునే యుపచారముగాఁ గయికొనుటచేఁ జెక్కులకును సాదృశ్యపరముగా, చంద్రఖండమునకు చందురుని తునుకలని అర్థమును కర్పూరమని భావమును గ్రహింపవలెను. క్రేఁగన్నులు=కడఁగన్నులు, పెన్నెఱులు = గొప్పకురులు, వాలంబు = కురువేరు, సాదృశ్యపరముగా చమరీవాలమని గ్రాహ్యము ('వాలః కచేఽశ్వాదిపుచ్ఛే హ్రీబేరేతు నపుంసకమ్' నానా.)

నవనవ... బాంధవములు=(నవనవ = క్రొత్తక్రొత్తయనియు, భిన్నభిన్నమైనయనియు నర్థములు గావున) క్రొత్తక్రొత్తలగు, (రక్తిమాది) గుణములయెడ తెగని కూడికచేత చుట్టములయిన (సదృశములైన) యని యర్థము. అనగా వేఱువేఱుగుణములుగల వారికి వేఱువేఱుగుణములచే బాంధవులయిన-అనఁగా ఏ తీరుగుణము గలవారికి ఆతీరుగుణముగలవారు బంధువులని యర్థాంతరము. సలువలు=శైత్యోపచారములు, ఎన్నేని=ఎన్నియో, కావించి, నెలఁతకున్, ఈవు, అసులాభంబు=ప్రాణలాభము, నించుచుంచున్=కలిగింపుమనుమనని యర్థము. (నెలఁతకు ఈవసులాభము గలిగింపుమనియు నర్థము.) ఇంచువిలుకానిన్ = మన్మథుని, మరలన్, ప్రార్థించుటయున్ = వేఁడికొనఁగా.

చలువ సరకు లాయాయవయవములకు పొలుపనేయుటయే కాక ఆయాగుణములనుగూడఁ గలిగియుండుటచే నవనవగుణానుబంధబాంధవము లన్నాఁడు.

శా. ఆవాక్యంబులలో సుధామయశుభైకాయత్త చిత్రేశసం
జ్ఞావర్ణంబు లొకింత వీను లెనయన్ సంజాతచైతన్య యై
పూవుంబోఁడి సుధాంశుబింబసుషమాపూర్ణాభిషేకప్రమీ
లావీతోత్పలవల్లి వోలెఁ గనుఁగల్వల్ విప్ప నాళీజనుల్. 183

అ. పూవుంబోఁడి=గిరిక, ఆవాక్యంబులలోన్ = చెలికత్తెలాడిన యామాటలలో, సుధా... ర్ణంబులు—సుధామయ=అమృతప్రాయములయినవియు,శుభ ఏక ఆయత్త=శుభమునకే లోనయినవియు, అగు, చిత్రేశ సంజ్ఞావర్ణంబులు = నృపయేశ్వరుఁ డయిన వసురాజుయొక్క పేరిటి యక్షరములు, 'వసు' అనునవి, వీను లెనయన్ = చెవులుసోఁకఁగా, సంజాత చైతన్యయై = పుట్టిన తెలివిగలదై, సుధా...వోలెన్—సుధాంశుబింబ = నిండుచంద్రబింబముయొక్క, సుషమా = మేలయిన కాంతి యొక్క - అనఁగా వెన్నెల యొక్క, పూర్ణ అభిషేక = నిండుతడుపుటచేత, ప్రమీలా = మొగుడుమండి, వీత=పాసిన - మోడ్పువీడినయనుట, ఉత్పలవల్లిపోలెన్=కలువతీఁగవలె, కనుఁగల్వల్=కలువల వంటి కన్నులను, విప్పన్ = తెఱవఁగా, ఆళీజనుల్ = చెలికత్తెలు.

సుధామయములైన వర్ణములచేతఁ దెలివినొందుటచే సుధాంశుబింబకాంతిచేత వికసించినకలువ యనుట. గిరిక కలువతీఁగవంటిది గాన కన్నులు కలువలు. సుధాంశుఁడు దూరమందుండియె తనకాంతి సోకుటంజేసి కలువతీఁగను వికసింపఁజేసినట్లు, వసురాజు పరోక్షమునందుండియు నతనిపేరి యక్షరములు గిరికకుఁ దెలివిగూర్చినవియనుట. అలం. ఉపమ. ఇందు బోధమనెడి సంచారిభావము. ఇందులకు

క. జగతిం జిత్తనిమీలన, మగునిద్ర యనంగ మూర్ఛ • నందుఁ బెమోహం
బగుబోధ మెఱుకఁ జెందుట, యగణితమృతి యత్నమంతమగు నెట్లన్నన్. (నరసభూపా.)

ఉ. కొండల మేల బాల మన కూర్చుసపర్యకు మెచ్చి యిందిరా
నందనుఁ డిందు సన్నిధి యొసర్చెఁ జుమీ సుమనఃప్రసాదముం
జెందెఁ జుమీ శుకోక్తిఁ గలసేమము దెల్పెఁ జుమీ సమీహితం
బందెడు సంధియుంబు వలదమ్మ యటం చభయంబుఁ దెల్పుచున్. 184

అ. శాల, కొందలమేల=పరితాపపడుట యెందులకు, మనశ్శూర్చ సపర్యకున్=మనయెడఁ గూర్చినపూజకు, మెచ్చి, ఇందిరానందనుఁడు=మన్మథుఁడు, ఇందు, సన్నిధి యొనర్చెన్ చుమీ=సాక్షాత్కరించినాఁడు చుమీ, సుమనః ప్రసాదమున్=పుష్పప్రసాదమును - దేవతాప్రసాదము ననియును, శుకోక్తిన్=చిలుక పలుకనెడు వాక్యముచేత, కలనేమము = కలిగియున్న కుశలమును, తెల్పెన్ చుమీ=తెలిపినాఁడుచుమీ, కాఁబట్టి, సమీహితంబు, అందెదున్ = కోరిక సిద్ధింపఁగలదు, సందియంబు, వలదమ్మ, అభయంబు=భయములేమిని, మీఁదికన్వయము. అల. శ్లిష్టాశ్లిష్టరూపకసంకరము.

క. కేళికమనీయ కానన, పాళిక వెలువడి కురంగపాళికళాబిం
బాళికలు బాళికడిమిన్, బాలికఁ దెచ్చిరి విహారభవనంబునకున్. 185

అ. కురంగ...బాళికలు—కురంగపాళి-('పాళిః కేతుర్ధ్వజోలిఙ్గం నిమిత్తం వ్యంజనంపదమ్' అ.) జింక లాంఛనముగాఁ గల చంద్రునియొక్క, కళా=కళకు, బింబ=ప్రతిబింబమైన, అళికలు=నొసళ్లుగలవారు, (ఇట చతుర్థి నాఁటి చంద్రునితో ఫాలమునకు సాదృశ్యముగలదు గనుక కళాబింబాళికలని చెప్పినాఁడు. అయినను 'అష్టమీశశాంకబింబంబుల విడంబించు' 'విదియచందురు సైన వెలఁది' యని యితరతిథులనాఁటి చంద్రునితోఁగూడ నుపమించుటగలదు.) కేళీ కమనీయకానన పాళికన్ = క్రీడార్థమై సొగసుగులుకుచున్న వనప్రదేశమును, వెలువడి, బాలికను = గిరికను, బాళికడిమిన్ = విరాళిబలిమినిబట్టి, విహారభవనంబునకున్ = క్రీడాగృహమునకు, తెచ్చిరి. కేళివనము శాళిని మిక్కుటముగావించుటచే నది విడిచి యింటికిఁ దెచ్చిరనుట. ఇందు ద్విప్రాసము.

ఆశ్వాసాంతము.

శా. పశ్యత్ఫాలవిలోచనానలశిఖాభాస్వన్మహోమిత్ర, మి
త్రశ్యామారమణేక్షణప్రవణచేతఃపద్మ, పద్మాంగభూ
దృశ్యాంగద్యుతిసంగ, సంగరమదోద్వృత్తారిరాహుత్తరా
డ్వేశ్యాలోకభుజంగ, జంగమనగద్వేదండపూర్ణాంగణా. 186

అ. పశ్య...మిత్ర—పశ్యత్ఫాల=చూచుచున్న నొసలుగల-నొసటఁగన్నుగల-శివునియొక్క, విలోచన అనల=కంటినిప్పుయొక్క, శిఖా=జ్వాలికవలె, భాస్వత్ = ప్రకాశించుచున్న, మహః=ప్రతాపమే, మిత్ర=చెలిగాఁగలవాఁడా, మిత్ర...పద్మ—మిత్ర=సూర్యుఁడును, శ్యామారమణ=చంద్రుఁడును, ('శ్యామాయామావన మధ్యస్థా స్త్రీ వృతాశారిబానిశా' నానా) ఈక్షణ = కన్నులుగాఁగల విష్ణుదేవునియందు, ప్రవణ=ఆసక్తమైన, చేతఃపద్మ=మనఃకమలముగలవాఁడా, పద్మా...సంగ—పద్మాంగభూ = మన్మథునివలె, దృశ్య = చూడఁదగిన, అంగద్యుతి = దేహకాంతితోడ, సంగ = కూడికగలవాఁడా, సంగ...భుజంగ—సంగర=యుద్ధములందు, మదోద్వృత్త=కావరముచేత విఱ్ఱవీఁగుచున్న, అరి=పగవారగు, రాహుత్త=యోధులనెడు, వేశ్యాలోక=భోగము జనమునకు, భుజంగ = విటుఁడైనవాఁడా, జంగమనగత్ =నడగొండలవలె నాచరించుచున్న, వేదండ=ఏనుఁగులచేత, పూర్ణ=నిండిన, అంగణా=ముంగిలిగలవాఁడా, ఇది కృతిపతి సంబోధనము. ఇందుముక్తపద గ్రస్తము. అనుభేకానుప్రాసభేదము. అల. ఉపమారూపకములు.

క. శంబరనయనానూతన, శంబరహర విమతకుధరశంబ రణజయా
డంబర పీతాంబర యొం, తెంబరగండాంక యతులధృతినిశ్శంకా. 187

అ. శంబరనయనా=లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలకు, నూతనశంబరహర=క్రొత్తమన్మథుఁడయినవాఁడా, విమతకుధరశంబ=పగవారనెడు కొండలకు వజ్రాయుధమైనవాఁడా, 'శతకోటిస్స్వరు శంబో దంభోళిరశనిర్ద్వయోః' అ. రణజయాడంబర పీతాంబర = యుద్ధజయము నాడంబరమందు విష్ణువైనవాఁడా, ఎంతెంబరగండాంక=ఎంతెంబరుఁడను రాజునకు మగఁడవుగనుక ఎంతెంబరగండఁడను బిరుదుగలవాఁడా, అతులధృతి నిశ్శంకా=ఎనలేని ధైర్యముచేత జంకులేనివాఁడా! ఇందు ద్విప్రాసము. 'విమతకుధరశంబ' రూపకము.

## కవిరాజవిరాజితము.

అనయనిషూదన శశ్వదసాదనయప్రతిపాదన దివ్యఝరీ
వనమదనోదన కీర్తివినోదన వైరివనాదనమత్తకరీ
ఘనఘననాదనటజ్జయవాదనగాఢనినాదనతేంద్రగిరీ
వినమదసూదన మల్కవినోదన వీర బరీదనరాదహరీ. 188

అ. అనయ నిషూదన=నీతిలేనివారిని జంపునట్టివాఁడా, శశ్వత్=ఎల్లప్పుడు, అసాద=క్షీణత్వములేనట్టి, నయ=నీతిని, ప్రతిపాదన=ఒసంగువాడా - నీతిని బచరించువాఁడా యనుట. (సాదశబ్దము కార్శ్యవాచకము.) 'శరీరసాదాద సమగ్రభూషణా' (రఘువంశ), దివ్యఝరీ=ఆకాశగంగయొక్క, వన=జలముయొక్క, (వనేసలిలకాననే' అ.) మద=గర్వమును, నోదన = పోఁగొట్టునట్టి, కీర్తివినోదన=కీర్తిచేఁ గ్రీడించువాఁడా - ఆకాశగంగ యుదకము తెల్లనిదిగాన దానికంటె నతిశయించిన ధావళ్యముగల కీర్తిగలవాఁడనుట. వైరివనాదన = పగవారనెడు వనములయొక్క భక్షణమందు, (అనఁగా భంజనమందు), మత్తకరీ=మదపుటేనుఁగయినవాఁడా, ఘన... గిరీ—ఘన = మిక్కుటమయిన, ఘననాద=మేఘగర్జనమువలె, నటత్=ప్రవర్తించుచున్న, జయవాదన=జయభేరియొక్క, గాఢనినాద=బిట్టయినధ్వనికి, నత=వంగిన, ఇంద్రగిరీ=మహేంద్ర పర్వతముగలవాఁడా- మహేంద్రపర్వము పఱకుఁగల దేశమును జయించినవాఁడాయనుట. వినమత్=మిక్కిలి నమ్రులగువారికి, అసూదన=సంహారకుఁడవు గానివాఁడా - అనఁగా రక్షకుఁడయినవాఁడా, మల్కవినోదన=మ్లేచ్ఛులను బాఱఁజిమ్మువాడా, వీరబరీద = పరాక్రమవంతుఁడయిన బెదరు కోటనబాబుసంబంధులనెడు, నరాద=రాక్షసులకు, హరీ=నారాయణుఁడయినవాఁడా! ఇందువృత్త్యనుప్రాసమును అంత్యప్రాసమును. 'దివ్య... వినోదన' వ్యతిరేకము, 'వైరి... కరీ' రూపకము. 'ఘన... గిరీ' అతిశయోక్తి 'వీరహరీ' రూపకము.

## గద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితానిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణప్రణీతం బయినవసుచరిత్రం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# వసుచరిత్రము సవ్యాఖ్యానము.

## చతుర్థాశ్వాసము.



శ్రీరంగరాయకలశాం
భోరాశినిశాసహాయ భూభువనధురా
ధౌరేయ వీరగోష్ఠీ
ధీరాద్భుతసాంపరాయ తిరుమలరాయా. 1

అ. శ్రీరం...హాయ=శ్రీరంగ రాజనెడు పాలసముద్రమునకు చంద్రుఁడవైనవాఁడా! భూ...రేయ=భూలోకముయొక్క భారమునకు ధురంధరుఁడ వైనవాఁడా! వీర...రాయ—వీరగోష్ఠీ=వీరుల సభకు, ('సమజ్యాపరిషద్గోష్ఠీసభా సమితిసంసదః' అ.) అధీర=మనోహరమును, అద్భుత = ఆశ్చర్యకరము నయిన, సాంపరాయ = యుద్ధముగలవాఁడా! తిరుమలరాయా! అని సంబోధనము 'సాంపరాయా(స్త్రీ) యాంద్వంద్వం యుద్ధమ్' అమరశేషము. ఇందు వృత్త్యనుప్రాసము. అల. రూపకము.

తే. అవధరింపుము శౌనకాద్యఖిల సంయమీంద్రులకు రౌమహర్షణి యిట్లుపలుకుఁ
జెలులకై దండఁ బూనియాచిగురుఁ బోఁడి, చారుమణిధామమల్లనఁ జేరఁజనుఁడు.

అ. అవధరింపుము=చిత్తగింపుము, శౌనకాదులకున్ = శౌనకుఁడు మొదలయిన సమస్తముని శ్రేష్ఠులకు, రౌమహర్షణి = రోమహర్షణుని పుత్రుఁడయిన సూతుఁడు, 'రోమహర్షణ స్యాపత్యంపుమాన్ రౌమహర్షణిః' అనివ్యుత్పత్తి. ఇట్లుపలుకున్=ఏమనియనఁగా, చెలులకైదండఁ బూని, ఆచిగురుఁ బోఁడి=గిరిక, చారుమణిధామము=సొగసయి మణిమయమైన తనగృహమును, అల్లన, చేరఁజనుఁడు= చేరఁబోవఁగా.

సీ. పతి వంచనామానిఁ బంచిపెంచిన వేడ్కఁ, బొంచియుండినపువ్వుఁ బోదలుసూచి
సమయానుగుణ సమాగమలీలఁ గాంచిన, నరనాథుచరణాంకసరణిఁ జూచి
రమణీకృతోపచారము లిచ్చఁ గైకొన్న, ప్రియుఁ డున్న సౌవర్ణపీఠిఁ జూచి
రమణానుబింబభాగ్యములు నోఁచినచక, చకితమాణిక్య భిత్తికలు సూచి
తే. హైమగృహవాటి నాఁటి విహారావలోక, కౌతుకం బప్పు డటుగన్నకరణిఁ దోఁప
నలసి సొలసి ప్రవాళశయ్యాతలమున, నలసితాపాంగ మై చేర్చి యడలునంత.

అ. పతి = రాజు, వంచనామాని = కల్లమునిని, పంచి, సమయా ... లీలన్ = సమయమునకుఁ దగునట్లుగా వచ్చినరాకడ యొక్క సొగసును, కాంచిన=పొందిన, నరనాథు... సరణిన్ = రాజు అడుగులచేత గుఱుతిడంబడిన మార్గమును, రమణీ... చారములు= చెలికత్తెలు చేసిన మరియాదలు, ఇచ్చన్ =ఆసక్తితో, సౌవర్ణపీఠి = బంగారపుగద్దియ, రమణాను బింబభాగ్యములు = చెలువుఁడయిన రాజుయొక్క (ప్రతిబింబముయొక్క) భాగ్యములును, చకచకి... భిత్తికలు = చకచకమని మెఱయుచుండు రతనంపు గోడలను, రాజు ప్రతిబింబములు తమయందుఁ గనఁబడుట లా గోడలు నోఁచిన భాగ్యములే యనుట. హైమగృహవాటిన్ = బంగారపు టింటిపట్టున, నాఁటి... కౌతుకంబు = నాఁడుపొందిన రాజుయొక్క దర్శనమువలని కుతూహలము, అప్పు... తోఁపన్ =అప్పుడట్టే పొందినట్లుగాఁ దోఁచుచుండఁగా, అలసి సొలసి, ప్రవా ... మున = చిగురుటాకుల సెజ్జపయిని, అలసితాపాంగ=తెలి కడగన్నులుగల యాగిరిక, మై=దేహమును, అడలునంతన్ = ఆఱట పడుచుండఁగా.

ఇందు భూతార్థసాక్షాత్కారవర్ణనముం జేసినాఁడుగనుక భావికాలంకారము. 'భావికం భూతభావ్యర్థ సాక్షాత్కారస్య వర్ణనమ్' అనిలక్షణము. ప్రియవిరహమందు తదీయదాసవిహారాది స్థలాదులు ప్రియురాలికి నత్యంతప్రియములు.

## సూర్యాస్తమయవర్ణనము.

చ. భవదనుజాత్మజన్ వసుకృపాలుఁడు గైకొను నెల్లి నేఁట న
య్యవనివరప్రసాదమునఁ గనంటదువో భవదీయజాతికిం
బవిభయ మంచు మంచుమలపట్టికి భావిశుభంబు లోకబాం
ధవుఁ డెఱింగింపఁ బోయినవిధంబున నేఁగెఁ బయోధిచెంతకున్. 4

అ. లోకబాంధవుఁడు=సూర్యుఁడు, మంచుమలపట్టికిన్ = హిమవంతుని కొడుకయిన మైనాకునికి, భవత్ ... జన్ = నీతమ్ముఁడయిన కోలాహలుని కూఁతును, వసునృపాలుఁడు=వసురాజు, ఎల్లినేఁట=నేఁడో రేపో, కైకొనును, అయ్యవనివరప్రసాదమునన్ = ఆరాజు ననుగ్రహముచేత భవదీయజాతికిన్ =నీసంబంధులైన పర్వతకులమునకు, పవిభయము = వజ్రాయుధభయము, అంటదువో=తగులదుసుమీ, అంచున్ =ఇట్లని, భావిశుభంబు=ముందుగాఁ గలుగనున్న శుభమును, ఎఱింగింపన్, పోయిన విధంబునన్, పయోధిచెంతకున్ =పడమటిసముద్రము ప్రాంతమునకు, ఏఁగెన్ =పోయెను-సూర్యుఁడస్తమించు సమయమయ్యెనని తాత్పర్యము. లోకబాంధవపదము సాభిప్రాయము.

ఇంద్రుఁడు వజ్రాయుధమునఁ బర్వతముల ఱెక్కలు ఛేదించునపుడు మైనాకుఁడు భయపడి యతివేగమున వాయుసాహాయ్యముచే సముద్రమునంబడి దాఁగికొనుట ప్రసిద్ధము. మైనాకుఁడును గోలాహలుఁడును హిమవంతుని కొడుకులు. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. కాలవశంబునం దనయుకంబుశిత చండిమ దూలి హేళి య
స్తాలయువాటికిం జనుచుఁ గనాత్మకరావృత దుర్గపాళి నా
స్తాళి నమర్చి నాఁ బరిణతాతపముల్ గిరులెక్కనిక్కెఁ ద
న్మూలములం దనాతపసమూహము పేరిటియిర్లవేలముల్. 5

అ. హేళి=సూర్యుఁడు, కాలవశంబునన్ =కాలమునకు లోనగుటచేతను - చెడుకాలమునకు లోనైయనుట- సంధ్యాకాలమునకు లోనగుటచేత నని యర్థము—కాలవిపర్యయముచేత నని అర్థాం

తరము. అస్త-ఆలయవాటికిం = అస్తాచలమనెడు ఇంటిపట్టునకు, చనుచున్ = పోవుచు, ఆత్మకరావృత దుర్గపాళిన్ = తన కిరణములచేత ఆవరింపఁబడిన పర్వతసమూహము లందని యర్థము—తన చేతికి లోనయిన - హస్తగతములయిన - పర్వత దుర్గపాళియందని అర్థాం. ఆప్తాళిన్ = ఆప్తజన సమూహమును, అమర్చినాన్ = కావలిపెట్టెనో యన్నట్లుగా, పరిణత ఆతపముల్ = పండఁబాఱిన యెండలు, గిరులెక్కన్ = పర్వతాగ్రముల కెక్కఁగా, తన్మూలములందున్ = ఆకొండల యడుగుమట్టములందు, అనాతప...వేలముల్ = నీడలయొక్క గుంపులనెడి చీఁకట్లదండు, నిక్కన్ = విఱ్ఱవీఁగెను.

కాలవ...దూలి = పగవా రాక్రమించుకొనఁగా ననుట. ఇట పగవారి దండు('అనాత...వేలముల్'). తనయాప్తులను, సూర్యుఁడు కొండలపయిని గాఁపుపెట్టిపోఁగా వారిని ముట్టడించుటకు సూర్యుని పగవారయిన యిర్లవేలముల్ అడుగుమట్టమున విఱ్ఱవీఁగు చున్నదనుట, సూర్యుఁ డస్తమించు చున్నాఁ డనియు, అతనికిరణములు సంజకెంజాయచే నెఱుపెక్కి పర్వతాగ్రములందుఁ బసపెండలుగా వెలుంగుచుండెననియు పర్వతములక్రింద చీఁకట్లుగ్రమ్మి రానురాను పయికి నిక్కుచుండెననియుఁ దాత్పర్యము. కొండమీఁదనున్న పగవారిని, శత్రువులు ముందుకొండయడుగు నాక్రమించి క్రమంబునఁ బయికినెక్కి ముట్టడించుట ప్రకటము. ఉత్ప్రేక్షకును రూపకమునకు సంకరము సమాసోక్తియు.

తే. అప్పు డపరానుషంగలబ్ధాంగరాగ, మేర్పడఁగ నక్షిగతుఁ డైన యినునిఁ జూచి
పద్మినిముడించె నెమ్మోము ప్రభ దలిర్ప, దయ్యె వెంబడిఁ జనక ఛాయయును మఱలె.

అ. అప్పుడు, పద్మిని = తామరతీఁగయనెడు పద్మినీజాతి స్త్రీ, అపరా...రాగము—అపరా = పడమటిదిక్కుయొక్క, అనుషంగ = కూడికవలన, లబ్ధ = కలిగిన, అంగరాగము = ఆకారములయొక్క యెఱుపు, ఏర్పడఁగాన్ = తేటపడునట్లు గానని యర్థము-అపరా = అన్యస్త్రీతోడి, అనుషంగ = సంభోగమువలనఁ గలిగిన, అంగరాగము = మైపూఁత తేటపడునట్లు గానని అర్థాంతరము. అక్షిగతుఁడు = కంటికగపడ్డవాఁడు, ద్వేషింపఁదగియుండువాఁడని యర్థాంతరము. 'ద్వేష్యేత్వక్షిగతోవధ్యః' అమ. ఇన, ఇనునిన్ = సూర్యుఁడనెడు పెనిమిటినిజూచి, నెమ్మోము ముడించెన్ = మొగము ముడుఁచుకొనెను. ఇట తామరపువ్వు మొగడుటను మోము ముడుంచుటగా నధ్యవసించినాఁడు. ప్రభ = ప్రభయనెడు స్త్రీ, తలిర్పదయ్యెన్ = మందమయ్యెనని ప్రభాపరము. ఉల్లసిల్లకపోయెనని స్త్రీపరము. ఛాయయును = ఛాయయనెడు స్త్రీయును, (సూర్యుఁడు ఛాయాదేవిపతి గదా) వెంబడిన్ చనక = వెంటఁబోవక, మఱలెను = వెంబడిఁ జనకపోవుటయనఁగా వెనుకకు సాఁగుటయని ఛాయాపరము, అనుసరణము మానుటయని స్త్రీపరము.

సూర్యుఁడు పడమటి దిక్కునుజేరి యెఱ్ఱవాఱెననియు సంధ్యాకాలము వర్తించెననియు తామరపూవు మొగుడఁ దొడఁగెననియు, పగటివెలుతురు మందగించెననియు, నీడలు వెనుకకు నిడుదలుగా సాగుచుండెననియుఁ దాత్పర్యము. ఇందు ఖండితయను నాయిక చెప్పఁబడినది.

క. ఇతరదిశ రాత్రి రతిచి, హ్నితుఁడగు పతిరూపుఁగని సహింపనియది ఖం
డితయగుఁ గలహాంతరితయుఁ, బతి నవమానించి పిదపఁ బరితప్త యగున్. నరసరాజీయము.

ఇందు పద్మిని మోముముడుఁచుట మాత్రముచేత ముగ్ధయనియు, ప్రభాస్త్రీ ఉల్లసిల్లక పోవుటచే మధ్యయనియు ఛాయాస్త్రీ వెంబడిఁ జనకమఱలుటచే ప్రౌఢయనియుఁ దెలియువది. పద్మినియందు ముగ్ధాచేష్టయును ఛాయాస్త్రీయందు ప్రౌఢాచేష్టయును బ్రకటించినాఁడు గాన ప్రభాస్త్రీయందు మధ్యాచేష్ట చెప్పవలయును. అలం. ఏకదేశవివర్తిరూపకము. శ్లేషమూలక సమాసోక్తి.

యని కొందఱు. జనకఛాయయనుచో 'ఛేచ' యని విహితంబగు తుగాగమములేకుండుట 'ఆగమ శాస్త్రమనిత్యమ్' అనుటచే నందురు - తుగాగమహానిచే ఛ్చత్వము లేకున్నది.

ముగ్ధాదులు. 'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా । లజ్జామన్మథమధ్యస్థా మధ్యమోదితయౌవనా । స్మరమందీకృతవ్రీడా ప్రౌఢాసంపూర్ణయౌవనా । ఇందు నాయకుఁడు ధృష్టుఁడు'వ్యక్తాపరాధో౽గతభీ స్సధృష్టఇతి కథ్యతే'

సీ. వనజాలయము మూసి ♦ యినుజాడఁదిలకించు, లలితాబ్జినీరాగ ♦ లక్ష్మి యనఁగ
ఘనపదాయసపట్టి ♦ కఁ దమోంజనము పట్టు, నపరాశ యిడిపదీ ♦ పార్చి యనఁగఁ
గప్పుచూపుచుఁ బాంథ ♦ గణము నేఁచు ప్రదోష, కరిమేనిధాతు శృం ♦ గారమనఁగ
ద్విజసూక్తిఁ బతిరాక ♦ దెలిసి మోమెత్తి రాత్రి వహించు కాశ్మీ ♦ రతిలకమనఁగ
తే. సముదమ్మృగహృతరవి రఘూ ♦ త్తమునిసతిఁ బ్ర
భామయిఁ దమోనిశాటుండు ♦ పఱవకుండ
ననలధామంబులోఁ డాఁచి ♦ యమరు లిడిన
వంచనాగౌరగాత్రి నాఁవఱలె సంధ్య. 7

అ. సంధ్యావర్ణనము సేయుచున్నాఁడు - వనజాలయనుమూసి = తామరయనెడి యింటిని మూసి, ఇనుజాడన్ తిలకించు ('సాయంకాలేత్వయం విష్ణుః' అన్నట్లు విష్ణుస్వరూపుఁడయిన) సూర్యునివెదకునట్టి, లలిత ... లక్ష్మి — ఒప్పుచున్న తామరతీఁగయొక్క, అనురాగలక్ష్మియో యన్నట్లుగానని యర్థము. రాగలక్ష్మియన్నచోట సామ్రాజ్యలక్ష్మీత్యాదిస్థలములందుఁబోలెఁ దెలియునది. రాగలక్ష్మియనఁగా ఎఱుపుసంపదయని అనురాగలక్ష్మినే ఆరుణ్యలక్ష్మిగా నధ్యవసాయము. సంధ్యావర్ణనముగాన యిట్లుగ్రహించుట యవసరము. ఈచరణమందు నాయిక అభిసారిక. 'కాంతాభిసరణోద్యుక్తాస్మరార్తాసాభిసారికా. తామరలు ముకుళించెననియు దానియందలి శోభాసంపత్తి తీసిపోయెననియు సంధ్య యెఱ్ఱవాఱెననియుఁ దాత్పర్యము. అలం. ఉత్ప్రేక్ష రూపకోత్థాపిత.

ఘనపద ఆయసపట్టికన్ = ఆకాశమనెడి యినుపరేకునందు, తమోంజనముపట్టన్ = చీఁకటియనెడి కాటుకనుపట్టెడుకొఱకు, అపరాశ = పడమటిదిక్కనెడు స్త్రీ), ఇడిన, దీపార్చియనఁగన్ = దీపపుజ్వాలయో యనునట్లు, ఇనుపరేకుక్రింద దీపముపెట్టి కాటుకను దానియందుఁబట్టునట్లు చేయుదురు. పడమటిదెస మాత్రము సంజచేత ఎఱ్ఱవాఱుచుండెననియు, దక్కినయాకాశ భాగమంతయు నల్లగా చీఁకట్లు గ్రమ్ముచుండెననియుఁ దాత్పర్యము. (ఇందు నాయికవాసకసజ్జిక. 'ప్రియాగమనవేళాయాం మణ్డయన్తీ ముహుర్ముహుః । (కేళీగృహం తథాత్మానం సాస్యాద్వాసకసజ్జికా.) అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

కప్పుచూపుచున్ = నలుపును గనఁబఱచుచు, పాంథగణమున్ = విరహులనెడు తెరువరులను, ఏఁచు = బాధించు, ప్రదోషకరి = ప్రదోషకాలమనెడి యేనుఁగుయొక్క, మేని, ధాతుశృంగారమనఁగన్ = జాజుచేత రేకగారచింపఁబడిన యలంకారమో యన్నట్లుగా (శృంగారమనఁగా, 'శృంగారస్సురతే నాట్యేరసేఽపిగజమణ్డనే' విశ్వము. ఏనుఁగుదేహమందు జాజురేఖలు వ్రాయుటప్రకటము. తెరువరులనేనుఁగులు వేధించుటయుఁ బ్రసిద్ధము.ప్రదోషమును ఏనుఁగుమ నలుపు. పాంథశబ్దమువిరహులకును తెరువరులకును వాచకము. ప్రదోషకాలమురాఁగా మసకలు గ్రమ్ముచుండెననియు, విరహులకు స్మరుఁడుద్దీపించుచుండెననియు,సంజ యెఱ్ఱవాఱెననియుఁ దాత్పర్యము.రూపకసంకీర్ణమగు నుత్ప్రేక్ష,

ద్విజసూ క్తిన్=పక్షి కలకలమనెడు బ్రాహ్మణవాక్యములవలన,('దన్తవిప్రాండజాద్విజాః' అ.) పతిరాకన్ = చంద్రుఁడ నెడి పెనిమిటివచ్చుటను, తెలిసి, మోమెత్తి=ప్రదోషమనెడు ముఖమునెత్తి (మోమనఁగా రజనీముఖము అనఁగా ప్రదోషము 'ప్రదోషోరజనీముఖమ్'అ.) రాత్రి=(ఇట స్త్రీలింగ మహిమచే నొకానొక స్త్రీ స్ఫురించెడిని. గనుక) రాత్రియనెడు స్త్రీ, వహించు, కాశ్మీర తిలకమనఁగన్ = కుంకుమబొట్టోయనఁగా, పక్షులు దమపట్టులకు బోవుచుఁ గలగలధ్వనులు చేయుచుండె ననియు, ప్రదోషమువచ్చెననియు ప్రదోషమునోఁడుదిక్కున సంజ కుంకుమువలె నెఱ్ఱవాఱు చుండెనని యుఁ దాత్పర్యము. ఇందు 'ద్విజసూ క్తి ... తెలిసి' అనుటచే ప్రోషితభర్తృకను జెప్పినాఁడు. 'దేశాంతరగతే కాంతేభిన్నాప్రోషిత భర్తృకా' 'మోమె...తిలకమనఁగ' ననుటచే వాసక సజ్జి కను జెప్పినాఁడు. ఉత్ప్రేక్ష 'ద్విజసూ క్తి' యనుచో శ్లేషసంకరము.

సమయ...సతిన్ = సాయంకాలసమయమనెడు, మృగ=మాయామృగముచేత, హృత = తీసి కొనిపోఁబడిన, రవి=సూర్యుఁడనెడు, రఘూత్తముని=రామునియొక్క, ప్రభామయిన్ = ప్రభారూప మైన, సతిన్=భార్యను, తమోనిశాటుండు = చీఁకటిఅనెడు రాక్షసుఁడు, అనఁగారావణుఁడు. పఱ వకుండన్=బాధలుపెట్టకుండఁగా (పఱుమటకు బాధపెట్టుట యను నర్థమునకు. 'అట్టాలుపఱచెడిదె జూదమాడరె యెంతున్' భార-ఉద్యో.)అనలధామంబునన్=అగ్నితేజస్సునందు,ఇదిప్రభాపరమునను సీతాపరమునను సమము, దాఁచి=దాఁచిపెట్టి, అమరులు=దేవతలు, ఇడిన=ఎదుటనిలిపిన, పంచనా గారగాత్రినాన్=పసపువాయకనీరముగల మాయాసీతయో యన్నట్లుగా, సంధ్య, వఱలెన్=ప్రకా శించెను. సూర్యునికాంతిదినాంతమున నగ్నినిజెందుట శ్రుతిప్రసిద్ధము.సాయంసమయముచేత సూర్యుఁ డస్తమింపఁబోయినాఁడనియు అతనిఁబాయనిప్రభ అనఁగా వెలుతురు తీసిపోయినదనియు, చీఁకటి పర్వెననియు అగ్నికాంతి హెచ్చెననియు, సంజ యెఱ్ఱవాఱెననియుఁ దాత్పర్యము.

'అనలధామంబునఁదాఁచి' ప్రభాపరమున సూర్యునికాంతి దినాంతమునందు నగ్నినిజెందుట ప్రసిద్ధము. ఇందులకు,

> 'ఇనుఁ డస్తాద్రికిఁబోవఁ గొల్లగొని నేఁ • డే తేరఁ దద్దీప్తి నం
> జనసంబంధజ బాంధవంబున రతి•క్రాంతాంగనా నేత్రకో
> ణనికాయంబులదాఁచి తద్ధవళి మం•దాఁబూనెనో చొప్ప మా
> ర్పననన్ వెల్వెలఁబాఱె దీపకలికా•వ్రాతంబు శాతోదరీ'. మనుచరిత్రము.

అందులకు సీతాపరముగా నర్థము. రావణుఁడు సీతనుగొనిపోవఁదలఁచుటను రాముఁడు దెలిసి సీత నగ్నియందుఁ దాఁచుకొమ్మని మాయాసీతను వానికిఁబొడకట్టించెననియు అగ్నిప్రవేశకాలమున నిక్కపుసీత బయలువెడలి మాయసీత మాయమయ్యెననియు అధ్యాత్మరామాయణాదులందున్నది.

'అథరామోఽపితత్సర్వంజ్ఞాత్వా రావణచేష్టితమ్ । ఉవాచసీతామేకాంతే శృణుజానకి మ ద్వచః। రావణో భిక్షురూపేణహ్యాగమిష్యతి తేంతికమ్।త్వంతుచ్ఛాయాం త్వదాకారాంస్థాపయిత్వో టజే విశ । అగ్నావ దృశ్యరూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా । రావణస్యవధాంతేమాం పూర్వవత్ప్రాప్స్యసేశుభే'॥ (అధ్యాత్మరామాయణము.) మఱి కూర్మపురాణమందును నిట్లేయున్నదని తెలియునది. రాగలక్ష్మి, దీపార్చి, ధాతుశృంగారము, కాశ్మీరతిలకము, గౌరగాత్రి యిత్యాదులు అరుణగణము లోనివి గనుక సంధ్యతోడి సాదృశ్యము. 'లక్ష్మి' శబ్దమునకు పెంపును లక్ష్మీదేవియు నర్థములుగనుక అనురాగంపు పెంపనెడి యనుచేతనమును, ఇనుఁజూడతిలకించునట్టి చేతనముగావిందుటకై యనురాగలక్ష్మి

యనుకాంతగా నధ్యవసించినాఁడు. ఇట్లచేతనములు చేతనకార్యాక్షిప్తికై చేతనములుగా నధ్యవసించుట. 'మధురిమస్వారాజ్యలక్ష్మి' యిత్యాదిప్రయోగములం జూపట్టెడిని. మఱియు రాగలక్ష్మియనుట దీపార్చిమొదలగువానివలె సంధ్యతోడి పోల్కికి వలయు నెఱుపుగలిగియుండుటకై యనురాగపు పెంపు అనెడి ఎఱ్ఱని లక్ష్మియని అభేదాధ్యవసాయము.

ఉ. అంబుజినీపురంధ్రి హృదయాధిపుఁ గానక స్రుక్కి యబ్జప
త్త్రంబునఁ దేఁటియూరుపుపొగల్ వెడలంగడు మూర్ఛవోవఁ గో
కం బది హేళికిం దెలుపఁగాదె ప్రియప్రమదావియోగశో
కంబు గణింప కేఁగె నిజకార్యము లెంతురె మిత్రతత్పరుల్. 8

అ. అంబుజినీపురంధ్రి=తామరతీఁగయనెడు స్త్రీ, హృదయాధిపున్=హృదయేశ్వరుఁడయిన సూర్యునిని, కానక, స్రుక్కి=వాడుదేఱి, అబ్జపత్త్రంబునన్=తామరయనెడు మొగమునందు, తేఁటియూరుపుపొగల్ వెడలన్=తుమ్మెదలనెడు నిశ్వాసధూమములు బయలువెడలఁగా, కడున్, మూర్ఛవోవన్, కోకంబు=చక్రవాకము, అది, హేళికిన్=సూర్యునకు, తెలుపన్ కాదె=తెలియఁజేయుట కొఱకేకదా, ప్రియప్రతి...కంబున్=గారాబుఇల్లాలినెడఁబాయుటవలని దుఃఖమును, గణింపక, ఏఁగెన్=పోయెను. అది యుక్తమేకదా, మిత్రతత్పరుల్=చెలికాండ్రయందు తగులుగలవారు, నిజకార్యములు ఎంతురె=ఎన్నరనుట.(మిత్రశబ్దము సూర్యునియందును వర్తించునుగాన, సూర్యుని యందాసక్తిగలిగినవి చక్రవాకములని భావము).

తామర సూర్యుఁడస్తమింపఁగా ముగిడెననియు, అపుడందుండి తేఁటిబారులు వెడలెననియు, చక్రవాకము రాత్రియగుటచే పెంటిని బాసెననియుఁ దాత్పర్యము. అంబు...వోవన్' రూపకానుప్రాణితమైన అతిశయోక్తి. 'కోకం...కేఁగెను' హేతూత్ప్రేక్ష. 'నిజకార్య...తత్పరుల్' అర్థాంతరన్యాసము. తామరలు ముడుంగునపుడందుండి తుమ్మెదలచాలు పొగచాలువలె వెడలుట.

మ. జలజాఁగారపరంపరల్ మధుపదా•శాభిత్తిఁ దీండ్రించుచున్
దలమై వెన్నెలచిచ్చు లంటిన మిళ • ద్వ్యాహ్వాచ్ఛదశ్యామికా
ఫలనం గంది ముడుంగుచో సిమసిమ•చ్ఛబ్దంబుతోఁ బుట్టు న
గ్గలపుంగ్రొంబొగలో యనంగ వెడలెన్ • గర్భస్వనద్భృంగముల్. మనుచరిత్రము.

ఇందు విరహోత్కంఠిత చెప్పఁబడినది.

క. విరహోత్కంఠిత యనునది, వరునితడవు సైఁపలేక • వగ నొందున దీ
శ్వరుఁ డిక్కకు రాకుండిన, భరపడునది విప్రలబ్ధ • భావజుకాఁకన్. నరసరాజీయము.

చ. మొగము మొగంబుఁ గూర్చి బలుముచ్చటఁ బక్షపుటాంతరంబులన్
బిగియఁ గవుంగిలించి తనప్రేయసి ముంగలఁ జంచుపాళికా
విగళితనాళదంభమున వేగనె రాఁ గత మిచ్చి యేఁగె లో
నొగులుచు నొక్కజక్కవ యినుండు సనం దదధీనవృత్తియై. 9

అ. ఒక్కజక్కవ, ఇనుండుసనన్=సూర్యుఁడస్తాద్రికిఁబోవఁగా, తదధీనవృత్తియై=అతనికి లోనయిన నడవడి - అనఁగా నతనివెంట ననుసరించుట - గలదైయనుట—(ఇనుఁడనఁగా ప్రభువును గనుక ప్రభువు జైత్రయాత్రపోవఁగా అతనికిలోనయిన జీవముగలదై - తనబ్రతు కతనికి లోఁబడునగాఁ గలదై - తన యసువు లతనికప్పగింపవలయునదై ననుట. 'అజీవో జీవికా వార్తా వృత్తి ర్వర్తనజీవ

సే' అ) మొగంబు...గూర్చి=పెంటియొక్క ముఖమునందు ముఖము చేర్చి, బలుముచ్చటన్=మిక్కిలి మక్కువచేత, పక్షపుట......లించి = ఱెక్కదొప్పలలోపలి ప్రక్కలచేత బిగ్గఁ గౌఁగిలించికొని, తన ప్రేయసియుంగలన్, చంచుపాళికా = ముక్కుపట్టునుండి, విగళిత = జాఱిన, నాళ = తామర తూఁడనెడు, దంభమునన్ =నెపముచేత, వేఁగనె=తెల్లవాఱఁగానే, రాన్ =వచ్చుటకు, కతము= హేతువును, గుఱుతును,ఇచ్చి,పద్మవికాసము ప్రాతఃకాలలక్షణముగనుక పద్మనాళము ప్రాతఃకాలా గమనజ్ఞాపకమని యిట యాశయము. (శీఘ్రముగావచ్చుటకు నడియాలమిచ్చియని యర్థాంతరము) వేగననెడు పదము చరితాదులలోనిది. గనుక మువర్ణలోపము - లోన్, నొగులుచు = కుందుచు, ఏఁగెన్=పెంటి నెడఁబాసిపోయెను.

ప్రభువు దిగ్విజయయాత్ర పోవఁగా నతనిక్రిందిబంటు నతని యుప్పుదిన్నందునఁ దనయుసు అతనికిలోనైనదిగాన యతని వెంటఁబోవువాఁడై తనగారాము ప్రియురాలిని మొగమునందు మొగము చేర్చుట మొదలయిన బుజ్జనములఁ దనిపి శీఘ్రముగా వచ్చున ట్లానవెట్టి యెడఁబాసిపోవుట నిట సూర్యాస్తమయచక్రవాకచక్రవాకీవియోగములం దనుసంధించినాఁడు. ఇట ప్రోషితభర్తృక 'ఒక దేశమునకుఁ దననాయకుఁడేఁగినఁ జిన్నఁబోవునది ప్రోషితభర్తృక' (నరసరాజీయము) సూర్యుఁడస్తమింపఁగా చక్రవాకములకవ జోడు వీఁడెనని తాత్పర్యము. అలం. సమాసోక్తి.'ఇనుండు ...సృత్తియై'యిత్యాదిగత శ్లేషానుప్రాణితము.

మ. నటదీశానశిరస్తట త్రుటితరత్నచ్ఛాయఁ గల్లోలినీ
విటమధ్యంబున వ్రాలె నభ్రమణి తద్వేగాభిపాతోన్నమ
త్పటుపాథోలవధారఁ దార లెగసెం దద్బిందుసందానితో
త్కటసంధ్యానలధూమకందళము లై కన్పట్టెఁ గ్రౌంజీకటుల్. 10

అ. నటత్...చ్ఛాయ—నటత్ = సంధ్యాకాలమందు నాట్యము చేయుచున్న, ఈశాన = శివునియొక్క, శిరస్తట = తలనుండి, త్రుటిత = తెగిపడిన, రత్నచ్ఛాయన్ = మాణిక్యమోయన్నట్లుగా, అభ్రమణి = సూర్యుఁడు, కల్లోలినీవిటమధ్యంబునన్ =నదీనాథుఁడయిన సముద్రునినడుమ, వ్రాలెన్ = పడెను, పూర్ణముగా నస్తమించెననుట, తత్...ధారన్ — తత్ = ఆమణియొక్క, వేగాభిపాత = వడితోఁగూడిన పాటుచేత, ఉన్నమత్ = పైకెగయుచున్న, పటు=సమర్థమయిన, పాథోలవ = సముద్రజలబిందువుల, ధారన్ = తీరుగా, తారలు=మక్కలు ఎగసెను, తద్బిందు= ఆనీటిబిందువులతోడ, సందానిత = సంగతమైన, లేక సందానిత = కట్టఁబడిన, ఉత్కట = మిక్కుటమయిన, సంధ్యాఅనల = సంధ్యారాగమనెడి అగ్నివలనఁబుట్టిన, ధూమకందళములై = పొగమొలకలోయనునట్లుగా, క్రౌంజీకటుల్ = తొలుదొలి మసకచీఁకట్లు, కన్పట్టెను.

సూర్యుఁడభ్రమణిగాన ఈశానశిరస్త్రుటిత రత్నము. రత్నము సామాన్యముగా నెఱుపని కవిసమయము.

'సామాన్యగ్రహణే వారిముచాం కృష్ణత్వమేవహి
రక్తత్వమేవరత్నానాం పుష్పాణాం శౌక్ల్యమేవచ' కా. క. ల.

కాఁబట్టి రత్నమును సూర్యునితోఁబాటి నెఱుపుగా గ్రహించుట. సూర్యుఁడు శివుని శిరోరత్నమనుట ఆకాశము శివుని శిరస్సగుటచే. అభ్రమణిగావున శివునికి శిరోమణియైనాఁడు. అభ్రమణి శబ్దము సాభిప్రాయము. శివుఁడు వ్యోమకేశుఁడుగదా ! నీటియందు డాయిపడఁగా పైకి బొబ్బెగయునట్లు చుక్కలు. నీటిబొట్లుతగులఁగా నిప్పు కొంతయాఱి మొలకపొగలు వెడలునట్లు మస

చీఁకట్లు. బిందువులుపడుటచే ఎగసినవి ధూమపు కందళములే. క్రొంజీఁకట్లుగాన ధూమపు కందళములతో సాటి. సూర్యుఁడు పూర్ణముగా నస్తమించెననియు, చుక్కలు తలసూపెననియు, వెంటనే సందెమసకచీఁకట్లు చూపట్టెననియుఁ దాత్పర్యము. సంధ్యానలము ఉత్కటమనుటచే పూర్ణముగా నాఱక కొంత వెలుఁగుచుండుట వ్యంజితము. మొలకచీఁకట్లు పర్వెననియు మిక్కుటమయిన సంజకెంజాయ కొంతతీసియుఁ గొంత వెలుఁగుచును నుండెననియు వ్యంజితములు. 'నట... మణి' ఉత్ప్రేక్ష. 'తద్వే... లెగసెన్' ఉత్ప్రేక్ష. 'తద్బంధు... కన్పట్టె' రూపకము.

మ. అరవిందోదరమూర్తి భానుఁ డపుడూష్మాంతంబునన్ సంకుచ
త్సరసీజేక్షణుఁడై పయోనిధిఁ జొరన్ సంధ్యాతటిత్పూర్వమై
నెరసెం జీఁకటికార్మొగుల్ జగతిపై నిమ్నోన్నతాభోగముల్
సరిఁ గావించుచు సర్వతోముఖమహాసారప్రసారంబులన్. 11

అ. ఇట విష్ణుసూర్యపరముగ నర్థద్వయము. అరవిందోదరమూర్తి=(తామర బొడ్డునందుగల) విష్ణువుయొక్క మూర్తిగలవాఁడు, ('సాయం కాలే త్వయం విష్ణుః' అని ప్రమాణము) అని యర్థము. తామరకడుపువలె ఎఱుపయిన మూర్తిగలవాఁడనియర్థాంతరమును, అగు, భానుఁడు=సూర్యుఁడు, అపుడు, ఊష్మాంతంబునన్ - (ఉష్మయనఁగా 'గ్రీష్మ ఊష్మోపకః' 'గ్రీష్మ ఊష్మకః' అ. అని ఎండయును వేసవియును గనుక) ఎండయొక్కముగిమకియందు ఎండ వేడిమి తీఱిపోఁగా నని సూర్యపరము-(గ్రీష్మర్తువుయొక్క కడపల కాఁగా నని విష్ణుపరమైన యర్థము-అనఁగా వర్షర్తువు రాఁగాననుట), సంకుచత్ ...క్షణుఁడై—సంకుచత్ = ముడుగుచున్న, సరసీజ+ఈక్షణుఁడై-(సూర్య) ఈక్షణములవంటి తామరలు గలవాఁడై — (విష్ణు) మూఁతపడుచున్న తామరలవంటి కన్నులుగలవాఁడై, పయోనిధిన్ = (పయశ్శబ్దము 'పయః క్షీరం పయోంబుచ' అ. జలమందును పాలునందును వర్తించును గనుక) పడమటి సముద్రములో, చొరన్ = ప్రవేశింపఁగా నని యర్థము. పాలసముద్రములోఁ జొచ్చిపవ్వళింపఁగా నని యర్థాంతరము, విష్ణువు వర్షర్తువురాఁగానే క్షీరసముద్రశాయి యగుట ప్రకటము ఇందే. వర్షాశరత్ 'సామానాధి కరణ్యశక్తి కచటన్... నిద్రాముద్రాను గతిప్రబోధములు-' ౧ ఆశ్వా. అని యున్నది. సంధ్యాతటిత్ పూర్వమై = సంజయనెడు మెఱుపు తొలుతగాఁ గలిగినదై, చీఁకటి కార్మొగుల్ = చీఁకటి యెనెడి నల్లనిమేఘము, జగతిపైన్ = భూమిమీఁద, సర్వతో... ప్రసారంబులన్—సర్వతోముఖ = అన్నివైపుల వ్యాపించిన, మహాసార = మిక్కిలిబలిమిగల, ప్రసారంబులన్ = నిగుడుటలచేత నని చీఁకటిపరము - సర్వతోముఖ=('కబంధ ముదకం పాథః పుష్కరం సర్వతో ముఖమ్' అ,) జలములయొక్క, మహాసార=గొప్పజడులయొక్క ('ధారాసంపాత ఆసారః అ.) ప్రసారంబులన్ = నిగుడుటచేత - కురియుటచేత నని మేఘపరము. నిమ్నో ... చుచున్ = పల్లముయొక్కయు మెఱకయొక్కయు విస్తారములను సమముగాఁజేయుచు, దట్టంపుచీఁకటిచేతను మిక్కుటంపు వెల్లువచేతను మెఱకపల్లములు సమములగుట తెలియునది. నెరసెన్ = పర్వెను.

భానుఁడు అరవిందోదర (విష్ణు) మూర్తిగాన విష్ణువువలెనె 'ఉష్మా ... నిధిఁజొచ్చి'నాఁడని అభేదాధ్యవసాయము. విష్ణువు వర్షర్తువున శయనించునుగాన యపుడు మెఱుపులుదోఁచి మబ్బులు క్రమ్మి జడివానలుగురిసి మెరకపల్లములు సమముగాఁ గురియునట్లె, సూర్యుఁడస్తమించినపుడు సంజ తోఁచి చీఁకట్లుగ్రమ్మి దెప్పరముగాఁబర్వి మెరకపల్లములు దోఁపనీయక వ్యాపించుచున్నవి. ఎండ

గోపమూర్తియైన శ్రీకృష్ణునికి, ఇది, మూఁడాకలాపము=నెమిలిపింఛె, ('కలాపో భూషణే బర్హే తూణీరే సంహతావపి.' అ.) దారు... కాముకుఁడు—దారుకావనమందుఁగల మునిభార్యలకుఁ గామించినవాఁడు, ఐన, పశుపతికిన్=శివునికి, ఇది, గళాభరణము = కంఠాభరణము-మెడనలుపని భావము. తారా...దరతన్ = బృహస్పతి భార్యయైన తారయొక్క, అభిసార=అభిసరణమందలి, సాదరతన్=ఆదరముతోడి కూడిక చేత, త్రిమ్మరిన=ప్రవర్తించిన, తమ్ములదాయకున్ = తామరలకు విరోధియైన చంద్రునకు, ఇది, ఉరోముద్ర యయ్యెన్ = ఱొమ్మున కలంకారమయ్యె ననియర్థము. కళంకమయ్యెననిభావము. (ఇట రాత్రియందహల్యాది కాంతాభిసారమం దావరసహాతు లైనయింద్రాదులకు సమయానుకూలమయిన తదలంకార చతుష్టయము ఏకొద్దమనోపయోగియై యహల్యాది స్త్రీలకుఁ దదాప్తిహేతువయ్యెనని తెలియునది.

ఇదియుంగాక, అభిమతి ..ర్ధాంజనంబు—అభిమతి = మిక్కిలి యిష్టులయిన, నవీన=అప్పటప్పటికిఁ గ్రొత్తలయిన, ఈర=ప్రియులనెడు, నిధాన = నిక్షేపములయొక్క, ఆప్తి=ప్రాప్తికి, హేతు=కారణమయిన, దివ్య ర్ధాంజనంబు=దివ్యమైన సిద్ధులచేత గల్పింపఁబడిన యంజనము, ఐన, దీనిపంటి=ఈ అంధకారమువంటె, అసుఁగున్=చుట్టమును, కనుఁగవ ... దటంచుమన్ = కన్నుల నొత్తుకొనుట ఏమివింతియనుచు నని యర్థము. కనుఁగవనొత్తుట యనుచో అంజన పక్షమున కన్నులధరించుటయనియు చుట్టముపట్టున ప్రేమ చేత కన్నులనొత్తికొనుట యనియు, చీఁకటిపట్టున కనుచూపునడ్డగించుట యనియు నర్థత్రియము గ్రహించునది. నుతింపన్=స్తోత్రము చేయఁగా, తిమిరంపు గుంపులు ఎసఁగెను. అలం. అంధకారమున కింద్రాదులయందు రత్నజాలాది రూపసంబంధములేకుండియు సంబంధమును జెప్పుటచే అతిశయోక్తి. 'అభిమత...ర్ధాంజనము' పరంపరితరూపకము. ఇంద్రాదులకు రత్నాదులైనదానిని కనుఁగవనొత్తుట యరుదుకాదనుటచే కావ్యలింగము. చీఁకటి ఇంద్రనీలాదులవనె నలువని యుపమాధ్వని.

తే. తపనుఁదఱిమి దురంతసంతమస మతని,సంతతులఁ బట్టితెచ్చి శీర్షములపై ని
జాంకమిడి కాచి విడిచెనా న్రగకలిత, కజ్జలము లైన గృహదీపకళికలమరె.

అ. అగ్రకలిత కజ్జలములు=అగ్రభాగములందుఁ గూడుకొన్న కాటుకలుగల, గృహదీపకళికలు=ఇంటిదీపపు మొగ్గలు, తపనున్=సూర్యుని, తఱిమి, దురంతసంతమసము = తుదిలేని కటికిచీఁకటిని, అతనిసంతతులన్ = ఆసూర్యునియొక్క సంతానములను, పట్టి తెచ్చి, శీర్షములపైని=తలలమీఁద, నిజాంకమిడి=తనలాంఛనములనిలిపి-తననిషాచేసి యనుట, కాచివిడిచెను = క్షమించివిడిచిపెట్టెనో,నాన్=అనునట్లుగా, అమరెన్=ఒప్పెను. ఇట, దీపకళికలను సూర్యునిసంతానములుగాను, దానిపయిని కాటుకను సంతమసమువైచిన నల్లనిముద్రలుగాను దెలియునది. పగవానిని బాఱఁదోలినను వానిసంతానములనుఁ దననిషాచేసి కాచివిడిచిపుచ్చుట జయశీలుఁడును దయాళువయిన రాజకృత్యము. అలం. ఉత్ప్రేక్షయు సమాసోక్తియు.

సీ. నటదీశహాసవిస్ఫుటతవేధోండరే,ఖలఁ దోఁచువరణాంబుకణక లనఁగఁ
బెల్లుబ్బునిర్లు పెక్కువ్వల్లి నల్లపదార్థములు మున్గఁ బొడముబుద్బుదము లనఁగ
రవికి మందేహనిర్మథనసాధనము లై, వచ్చినద్విజమంత్రకర్ణము లన
హరిపదంబును సీతుకశిరము నై ననభంబు, న నభోగతులు నించుకనన లనంగఁ

తే. చరమగిరి యనుమరకాఁడు జలధిసరణిఁ, దరణి డించిన నతఁడు తత్సలిలమగ్న
విమలముక్తాఫలంబులు వెలికిఁ జొరివె, ననఁగ నవతారకానికాయంబు లడరె.

అ. నవతారకానికాయంబులు=క్రొత్తలయిన చుక్కలగుంపులు, నట...రేఖలన్—నటత్=సంధ్యాకాలమందు నాట్యము సేయుచున్న, ఈశ=రుద్రునియొక్క, హాస=అట్టహాసముచేత, విస్ఫుటిత=పగిలిన, వేధోండరేఖలన్=బ్రహ్మాండముయొక్క పగుల్లయందె, తోఁచు=కనఁబడుచున్న, వరణాంబు కణికలు=ఆవరణ జలబిందువులో అనునట్లుగా, బ్రహ్మాండము చుట్టును పయిని మహాజల మావరించియుండునని శ్రుతి, శబ్దమునకు కఠినపదార్థములును బీటికలువాఱుట గలదు. కనుక, సంధ్యాకాలమున శివుఁడు తాండవముచేయునపుడు పెట్టిన పెడనవ్వు చప్పుడుచే బ్రహ్మాండపుఁజిప్పబీఁటికలు వాఱఁగా ఆ బీఁటికలగుండ నవ్వలి యావరణమహాజలమునుండి దోఁచుబొట్లవలె చుక్కలు చూపట్టెననుట.

పెల్లు...వెల్లి—మిక్కిలియు ఉల్బణించుచున్న చీఁకటివెల్లువయందు, ఎల్లపదార్థములు=సకల వస్తువులు, మున్గన్=మునుఁగఁగా, పొడము, బుద్బుదములు=నీరుబుగ్గలో యన్నట్లుగా, రవికిన్=సూర్యునికి, మందేహనిర్మథన సాధనములై=మందేహరాక్షససంహారమునకు ఆయుధములై, వచ్చిన ద్విజమంత్రవర్ణములనన్=వచ్చిన బ్రాహ్మణ మంత్రాక్షరములో యన్నట్లుగా, సూర్యుని ఉదయాస్తమయ కాలములందు మందేహాదిరాక్షసులు వచ్చి నిరోధింపఁగా ఆసమయములందు బ్రాహ్మణోత్తముల చేత నియ్యఁబడు మంత్రార్ఘ్య జలబిందువులు వజ్రాయుధప్రాయములై యారాక్షసులను వధించుచున్నవని ప్రసిద్ధము. ఇందులకు స్కాందమున, 'మన్దేహదేహనాశార్థ ముదయే స్తమయే రవిః, సమీహతే ద్విజోత్సృష్టమంత్రతోయాంజలిత్రయమ్'. అక్షరములు తెలుపుగణములోనిదనుటకు నిందే, 'రమణీయాక్ష సరాకృతింబొలుచు వర్ణశ్రేణివీణానులాపముచేతం గరఁగించి' యని యున్నది.

హరి...నభంబునన్=విష్ణువునకు పాదమును శివునకు శిరస్సునయిన యాకాశమునందు ('వియద్విష్ణుపదమ్' 'వ్యోమకేశో భవోభీమః' అ) నభోగములు = దేవతలు, నించు = పూజచేసిన, నవలవంగన్=పువ్వులో యన్నట్లుగా. చరమగిరి...కాఁడు=అస్తాద్రియనెడు ఓడసరంగు, జలధిసరణిన్ = సముద్రములోని మార్గమందు, తరణిన్=సూర్యుని, డించినన్=దింపఁగా, అతఁడు = ఆసూర్యుఁడు, తత్...ఫలంబులు—ఆసముద్రపు జలములందు మునిఁగియున్న అచ్చపు ముత్తెములచిప్పలను, వెలికిన్, జొనిపె ననఁగన్=బయటికిఁ దెచ్చెనో యన్నట్లుగా, అడరెన్=పర్వెను, ముత్తెముల సలాపకులవారు ఓడలలో మనుష్యులనెక్కించుకొనిపోయి ముత్తెములున్న సముద్రముప్పున మనుష్యులను లోనికి దింపఁగా వారు మునిఁగి ముత్తెపుఁజిప్పల నేరి పయికిఁ దెచ్చుటగలదు. అలం. 'నట...కణికలనఁగ' ఉత్ప్రేక్ష. 'పెల్లు...ద్బుదములనఁగ' ఉత్ప్రేక్ష. 'ఇల్లపెల్లి' యను పణామముచే అనుప్రాణితము. 'రవి...వర్ణములనన్' ఉత్ప్రేక్ష. 'హరి...నవలవంగన్' ఉత్ప్రేక్ష. హరిపదవిష్ణు శిరశ్శబ్దగత కావ్యలింగానుప్రాణితము. 'చరమ...చొరివెననఁగ' రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్ష.

చ. ఘనతరగాఢ సంతమసకల్పమహోదధి సన్న లోకముల్
తనఘనదయారుణద్యుతి నిశాతాను పేరిరజోగుణంబుచే
ననువుపడన్ సృజింపఁ గమలాసనుఁడై ద్విజరాజు రానమ
ర్చినధవళాబ్జపీఠమునఁ జెన్నలరెం దొలితెల్పు తూర్పునన్. 16

అ. తూర్పునన్, తొలితెల్పు = మొట్టమొదటఁ దోఁచుధవళిమ, ఘన...దధి—ఘనతర= మిక్కిలి యధికమైన, గాఢసంతమస=దట్టపు కటికిచీఁకటియనెడు, కల్పమహోదధిన్=ప్రలయసముద్రము, సన్నన్ = తీఁగిపోయిన పిమ్మట, లోకముల్, తన...గుణంబుచేన్—తనయుదయకాలపు సెజ్జునికాంతిసమూహమనెడు రాజసగుణముచేత, అనువుపడన్ = పొందికపడునట్లు, సృజింపన్ = నిర్మించుకొఅకు, రజోగుణ మరుణవర్ణమనియు, సృష్ట్యాదివ్యాపారాత్మకమనియుఁ బ్రసిద్ధము. ద్విజరాజు=చంద్రుఁడు, కమలాసనుఁడై=బ్రహ్మయై యనియర్థము. తామరలను దిరస్కరించినవాఁడైయని భావము. రాన్=రాఁగా, ద్విజరాజుగనుకఁ గమలాసనుఁడైనాఁడని స్వారస్యము గ్రహింపవలది. అమర్చిన, ధవళాబ్జ పీఠమనన్ = తెల్లదామరగద్దెయోయన్నట్టుగా, చెన్నలరెన్=ప్రకాశించినదయ్యె. రజోగుణము ఎఱుపును క్రియాత్మకమును, కనుక దానికి నచట ఉదయారుణద్యుతివితానము పేరిటిదిగాను సృష్టికర్తృత్వ యుక్తముగాను జెప్పఁబడినది. సంతమసము ఘనతరగాఢము. కావుననే కల్పపయోనిధిగాఁ జెప్పుట. లోకములన్నియుఁ గల్పపయోధిపాలనే ఘనసంతమసమును కబళించిన దనుట. అలం. శ్లేషమూలకమైన యుత్ప్రేక్ష. చంద్రుని యుదయమందు అరుణద్యుతి యెట్లనఁగా చంద్రోదయము దెలుపు కలిగిన యెఱుపుతోఁగూడినది. ఇందులకు,

తే. లలితకాశ్మీర భవసమాలంభకర్త్ర, పాటలంబైన నీముఖాబ్జంబుతోడ
నొరయుఁగాన భవత్కేళియోగ్యమైన, పొడుపుగుబ్బలిఁ బొడ తెంచుపూర్ణవిధుఁడు.
(శృంగారనైష. ౫. అ ౭౫.)

ఇట 'పాటలం' బనుటచే తెలుపుగలసిన యెఱుపునుదెలియునది. లోకములునసుట యనఁగా కల్పపయోధి పరముగా నశించుటయనియు కటికిచీకటిపరముగా ంతమాత్రమును గనఁబడకుండుట యనియుఁ దెలియునది. సృజించుటయనఁగా మరలఁ బుట్టించుటయనియు, మరలఁ గనబడఁజేయుట యనియుఁ గ్రమముగాఁ దెలియునది. కటికిచీఁకటి లోకములఁ [illegible]మైననియు చంద్రోదయసూచకముగాఁ దూర్పునఁ దెలుపుదోఁచెననియు ఇఁకఁ జంద్రుఁడెఱుపుగలసిన [illegible]లనికిరణములతో నుదయించుననియు వెన్నెలచేత లోకములు తేటపడఁగలవనియుఁ తామరలు [illegible]మొగుడుచున్నవనియుఁ దాత్పర్యము.

మ. హరిదంభోరుహలోచనల్ గగనరంగాభోగరంగ[illegible]
భరనేపథ్యము నొయ్య నొయ్య సడలింపన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టముం నిటలముం వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్. 17

అ. హరిదంభోరుహలోచనల్=దిక్కులనెడు తమ్మికంటులు-స్త్రీలు, గగన...ధ్యముల్—గగన=ఆకాశమనెడు, రంగాభోగ[illegible]నాట్యస్థానము నిండునట్లు - నాట్యస్థానమునందంతటను, రంగత్=ఒప్పుచున్న, తమోభర=చీకటిగుంపనెడి, నేపథ్యముల్=తెరను, ఒయ్యన్ [illegible]యన్=మెల్లమెల్లగా, సడలింపన్=తొలఁగఁదీయగా, రాత్రిశైలూషికిన్=రాత్రియనెడు ఆటకత్తెకు, వరుసన్ = క్రమముగా, మౌక్తికపట్టముల్=ముత్యాలపట్టయును, అనఁగా నొసటికిఁబయిని ముత్యాలజంపులతోఁ గూర్చియడ్డముగాఁగట్టుకొను పట్టయనుట, నిటలముల్=నొసటియు, వక్త్రంబునుల్ [illegible] మొగమును, తోఁచెనాన్=కనఁబడెనోయన్నట్లుగా, హరిణాంకాకృతి=చంద్రునియొక్క రూ[illegible] రేకయి=రేఖాకారమై, సగంబై=సగఁబాలై, బింబమై=గుండ్రనై, తూర్పునన్, పొల్చెను.

నేపథ్యమనఁగా తెర 'నేత్రయోః పథ్యమ్ నేపథ్యమ్' అని వ్యుత్పత్తి. ఇది పృషోదరాదిగణములోనిదిగాన 'త్ర' కారలోపము. నర్తకి తొలుత నేపథ్యమునసుండుట. 'నేపథ్యాంతరితా భూత్వా నర్తకీనృత్తమాచరేత్' (నృత్తప్రస్తారము) తమస్సుయొక్క ('భర'ము) పెల్లిదము చెప్పుటచే, గగనరంగముయొక్క ('ఆభోగము') అనఁగా నిండుపఱపున, రంగత్ = ఒప్పుచుండినది. పెల్లిదమగుటచే ఆకాశము విరివియంతయుఁ బరివియుండెననుట. చంద్రుఁడు, మొదటరేకగా నుండుటచే ముత్యాల పట్ట సగముచూపట్టఁగా, నిటలము; (బింబము) గుండ్రనై కనఁబడఁగా వక్త్రమనని క్రమాలంకారము. వరుసగఁదోఁపనేల ? నేపథ్యము సడలించుట 'ఒయ్యనొయ్య' గాన. చీఁకటి తూరుపునుండి మాసి తక్కినదిక్కులందు గ్రమ్మియుండుటచే తూర్పునుండి యాచీఁకటితెరను తక్కినదిక్కులనెడు స్త్రీలు తీసిపెట్టుకొనిరని చెప్పుట. 'హరిణాంకాకృతి' అనువిశేషణము రాత్రినలుపు కాన. చంద్రుని లోని హరిణరూపమయిననలుపు రాత్రియొక్క అచ్చంపుమేనిచాయ. ముత్యాలపట్టె ముత్యములచేత నయినది గావునను నొసలు అరచందురునివలెను మొగము నిండుచందురునివలె నుండును గావునను చెలువలమొగంబు తెలిమొగంబని వర్ణించుటయుగలదు గావునను, ముఖరేఖార్ధపూర్ణభాగములు మాత్రము తెల్లనిచంద్రుని భాగములవలె నుత్ప్రేక్షితములని తెలియునది.

చ. తనుఁ గడుపారఁ గాంచినసుధానిధిఁ గ్రాఁచుమహౌర్వకీలముల్
కనదుదయాంశుదంభమునఁ గైకొనివచ్చి యరివ్రజంబు నె
మ్మనమున వైచి పాండురుచిమండలకీర్తికలాప మొందు నిం
దునిమెయిఁ గందు దోఁచె నతిదుర్భరతద్భరణప్రసంగతిన్. 18

అ. తనుక్ కడుపారక్ కాంచిన సుధానిధిక్ = తన్ను అనఁగా చంద్రుని కడుపునిండ కన్నట్టి పాలసముద్రుని, గ్రాఁచు మహౌర్వకీలముల్ = ఉడికించుచున్న పెద్దవయిన బడబాగ్ని జ్వాలలు (జ్వాలకీలశబ్దములు [illegible] స్ఫులింగంబులు 'ద్వయోర్జ్వాలకీలౌ' అ), కనత్ ... దంభమునక్ — ప్రకాశించుచున్న ఉదయించునట్టి కిరణములనెడి నెపముచేత, కైకొనివచ్చి, అరివ్రజంబు నెమ్మనమునక్ = [illegible]వారివర్గముయొక్క హృదయమందు అని యర్థము—(అరి యనఁగా చక్రము. తన్మూలమున చక్రవాకము [illegible] వ్యక్తనామము [illegible] జక్రవాకమునకును జెల్లును. 'అరిదరకరుఁడై, సుమనో, వరభరణ [illegible]ఁడై యవారితలక్ష్మి, [illegible]సభాసురుండై, నరసింహుండొప్పె'నని నరసరాజీయము. చక్రవా[illegible] హృదయమందని భావము.) వైచి, హృదయమందు, బడబాగ్నివైచుటయనఁగా మిక్కుట [illegible] శోకాగ్నిని బుట్టించుటయని తెలియునది. పాండు...లాపము—పాండురుచిమండల = తెల్లని కిరణముల వెన్నెలల-పట్టులము, అనెడు, తెల్లనికాంతిసమూహముతోఁగూడిన, కీర్తికలాపము = కీర్తిసమూహమును, ఒందుఇందునిమెయిక్ = పొందుచున్న చంద్రునిదేహమందు, అతి ... సంగతిక్ — అతిదుర్భర = మిక్కిలిభరింప నలవికాని, తత్ = ఆబడబాగ్ని జ్వాలయొక్క, భరణ = మోచుటయొక్క, ప్రసంగతిక్ = కూడికవలన, కందు = కమిలి [illegible]నలుపు - అగ్ని [illegible] కాల్చుటచే మాఁడికలిగిన మచ్చ [illegible], తోఁచెను.

ఔర్వకీల [illegible] 'తను...సుధానిధిని గ్రాఁచుట [illegible] సి. ఉదయాంశుదంభమునఁ దెచ్చు [illegible] తూర్పు [illegible] నుండి [illegible] [illegible]కినుదయించుట. కాన యప్పుడాసముద్రమునందుండి [illegible]ర్వజ్వాలలను [illegible]. కాలచంద్రుఁ డెఱుపనుట ప్రసిద్ధము. అట్ల తంద్రిని గ్రాఁచు బడ

ఖాగ్ని నిదీసి శత్రువుల హృదయములందుఁ బెట్టుట మహాశౌర్యకృత్యము. కావుననే 'పాండు...కలాపము.' అంతటి కీర్తి ధావళ్యములో నల్లనిమచ్చయేమి. మోచితెచ్చిన యాబడబాగ్నిచే మాఁడి యేర్పడినమచ్చయది. ఇది వీరచిహ్నము. వీరులకు యుద్ధాదులవలని గాయములు మొదలగు వికృత చిహ్నములు వీరభూషణములుగాన కీర్తికిఁ గొఱంతలేదు. 'ఔర్వకీలముల్' 'మహత్'అయినవికాన 'కనత్' అంశువులుగా అపహ్నుతి. చంద్రుఁ డెఱుపుచాయలో నుదయించెననియు, చక్రవాకములకు విరహాగ్ని మిక్కుటమయిపాసెననియు, తెల్లనిపండువెన్నెలలు పర్వెననియు, చంద్రునినడుమ కలంకము గానిపించుచుండెననియు భావము. పూర్వపద్యమున 'బింబమై' అనుటచే ఇంచుమించుగా నిండుచందురుఁడె కావచ్చునుగాన 'పాండురుచిమండల'ము చెప్పఁబడెనని తెలియునది. అలం. 'తను...వైచి' సాపహ్నవమగు నతిశయోక్తి. 'అతి...సంగతిన్' గమ్యోత్ప్రేక్ష సమాసోక్తియు.

మ. పటుతారాపటఖండమండితనిజప్రాగంశుధారాపరి
స్ఫుటసూత్రంబులఁ బ్రోఁగువాఱె వెస నంభోవాహమార్గాఖ్య మా
నటవిం బ్రాక్తనభిల్లమౌళిమణి వేఁటాడన్ మదానేకప
చ్ఛట లోదంబులఁ బడ్డయట్లు తమముల్ జాఱెన్ బిలశ్రేణికిన్. 19

అ. ప్రాక్తనభిల్లమౌళిమణి=పురాతనపు బోయవాఁడయిన శివునియొక్క తలమానికమయిన చంద్రుఁడనెడు, ప్రాఁతబోయకు తలమిన్న, అంభోవాహమార్గాఖ్యము= మేఘమార్గమయిన ఆకాశము అనెడు, అటవిన్=అడవియందు, పటు...సూత్రంబులన్—పటు=దృఢమయిన, తారాపటఖండ= చుక్కలనెడు గుడ్డపేలికలచేత, మండిత=ఒప్పుచున్న, నిజ=తనవియగు, ప్రాగంశుధారా=ఎడతెగక నిగుడుచున్న తొలుతటి కిరణములనెడు, పరిస్ఫుటసూత్రంబులన్ = చక్కఁగా తెలియు త్రాళ్లచేత, పోఁగువాఱె=పోఁగుత్రాడుచుట్టి రాఁబఱపి. [ప్రోఁగువారి అని ముద్రణప్రతిపాఠము. అందులకుఁ గూడఁ బాఱినవాఁడై యని యర్థము వ్రాయఁబడియున్నది. పోఁగువాఱియనియె వ్రాఁతప్రతలం దున్నది. చుట్టును ప్రోఁగుపాఱించుట దానిని మెకము తగులఁగానే యది కదలుటచే దానిరాక బోయలకుఁ దెలిసి యెచ్చరికతోను నాయితపాటుతోను నుండుటకు ఇందులకు. మనుచరిత్రమున 'గాలిపరికించి దిగువదెస దొడ్డివల పన్నియెగువ, పొలిమేర బారాదియగు దూరంబేఁగఁ బోఁగువాఱించి యత్త్రోటవలమోవం దెరలెత్తి. (మను. చ. అ. 37 వచ)

వేఁటాడన్, మదానేకపచ్ఛటలు=మదపుటేనుఁగుల గుంపులు, ఓదంబులన్=కపటపు గుంటలను. (ఏనుఁగులకు ముఖ్యముగాను మఱియు వృషభాదులకును వేఁటకాండ్ర ఓదములు త్రవ్వుటకలదు. 'వలయురి యోదముగాలము, కలిగికదామృగముఁ బక్షిగజము ఝషము దత్తులు పట్టుదురు.'(భార. శాంతి. ర. ఆ.) 'వల్లియలువైచి యోదముల్ పెల్లుద్రవ్వి'యను చోటను త్రాళ్లువైచుట తెలియుటం బట్టి యిట పోఁగువాఱె యనుపాఠమే సరసము. ఓదములనఁగా నడవిలో వేఁటకాండ్రేనుఁగులను బట్టునపుడు వాని మోసపుచ్చెడుకొఱకు నిర్మించునట్టి కపటపుగుంటలు.) పడ్డయట్లు, తమముల్= చీఁకట్లు, బిలశ్రేణికిన్ జాఱెను=బిలములవరుసలలోఁ జొచ్చెను.

'ప్రాగంశువులు' ఉదయమునప్పటివిగాన అవియే చాలనిడుదలుగా నిగుడుటచే 'ధార' లనుటయు; దానిచే సూత్రంబులఁ బ్రోఁగువాఱుటయు. ఆకాశమధ్యంగతుఁడుగాని అపరదిగ్గతుఁడుగాని యగుచంద్రుని కిరణములంత దీర్ఘములుగాఁ జాపట్టవు. అప్పటికి గుహలందును జీఁకట్లు దట్టముగా

నుండవు. కావుననే నూత్రసామ్యమునకైన నిడివికిని,గుహలందు చీఁకట్లును దాఁగనిచ్చునంతటి పలుచన కును, ప్రాగంశువులనఁబడెను. 'తారాపటఖండము' దానికి గుడ్డపేలికలుచుట్టుట, 'పటు' అత్రాటి దార్ఢ్యమునొందుట. 'ప్రాక్తనభిల్లమాళిమణి' పెక్కు సంవత్సరములుగా వేఁటయందాఁతితేలిన బలుదిట్ట కావుననే యేనుఁగు లోఁదునుబంబడుట. చంద్రునికిరణములు ప్రసరించెననియు వెంటనే చంద్రుఁ డుదయించెననియు నంత చీఁకటులు విచ్చిపోయి వెన్నెల ప్రకాశించుచుండెననియుఁ దాత్పర్యము. అలం. రూప కానుప్రాణితమైన ఉత్ప్రేక్ష.

మ. ఉదయోలూఖల మెక్కి నిక్కి సహజాంకోపేంద్రసంయుక్తుఁడై
చద లన్ బూఁది శశాంకసీరి కరవిస్తారంబులం బట్టి బి
ట్టదుమం గాఁతెఁ జకోరగోపతతిపాలై చంద్రికాక్షీరముల్
పొదవెన్ ఘూర్ణితదుగ్ధధామనిబిడప్రోద్భూతసంరంభముల్. 20

అ. శశాంకసీరి=చంద్రుఁడనెడు బలరాముఁడు, సహజ...యుక్తుఁడై=తనతోఁగూడఁ బొడ చూపిన, అంక = చిహ్నమనెడు, సహజాంక=కూడఁబుట్టిన శ్రీవత్సమను లాంఛనముగల, లేక సహ జాంక=తోడఁబుట్టినవాఁడనెడు, ఉపేంద్ర=కృష్ణునితోడ, సంయుక్తుఁడై = కూడినవాఁడై, ఉదయ ఉలూఖలము=ఉదయాచలమనెడు ఱోటిని, ఎక్కి, నిక్కి, చదలు అన్ బూద=ఆకాశమనెడి బూద కుండను - అనఁగా ఉట్టిపైనున్న పాలకుండను, కరవిస్తారంబులన్=కిరణవిస్తారములనెడు చేతులు చాఁచుటలచేత, పట్టి, బిట్టు అదుమన్=గట్టిగా ఒత్తఁగా, చంద్రికాక్షీరముల్=వెన్నెలలనెడి పాలు, చకోరగోపతతిపాలై=వెన్నెల పులుఁగులనెడు (సహచరులయిన) గొల్లవాండ్రసమూహమునకు పాలు పడినవై - వారికబ్బినవైయనుట, ఘూర్ణి...రంభముల్—ఘూర్ణిత=తిరుగుడుపడుచున్న - చిమ్మిరేఁగు చున్న, దుగ్ధధామ=పాలసముద్రమనెడు పాలుంచునింటియందు నిబిడ=దట్టముగా, ప్రోద్భూత= పుట్టుచున్న, సంరంభముల్=జలసంరంభములును—(కలకలములనియు) పొదలెన్ = వ్యాపించెను - పుట్టెను. చంద్రోదయమున క్షీరసముద్రము మిక్కిలి ఉప్పొంగెననియర్థము. (పాలంతయుఁగాఁతి గొల్లలపాలై నశింపఁగా నది యుంచిన యింటిలోనివారు చూచి కొల్లపోయెనని గలకలమును పెట్టిరని భావము).

పొదవెన్-ఇది ఒదవుయొక్క రూపాంతరమైన నిచటనర్థము మఱింత పొంకముగా నుండెడిని. అయినను 'పూనుపొదవుల కాదిలోపం బొకండువచించె. అది నిరాకరంబు' అని చిన్నయ్యసూరిగారు విధించియుండుటచే,వ్యాప్త్యర్థమిట చెప్పఁబడెనని తెలియునది. చంద్రుఁడు కళంకయుక్తుఁడై యస్తా ద్రిపై నుదయించెననియు, చంద్రికలు చక్కఁగాఁ గాసెననియు చకోరములు చంద్రికా స్వాదనముఁ జేసెననియు, పాలసముద్రము చిమ్మరేఁగెననియుఁ దాత్పర్యము. రూపకసంకీర్ణమైన ఉత్ప్రేక్ష.

శా. ఆవేళం బతిసంభ్రమానుగుణ గంగాంభోఝరంబుల్వలెన్
ద్యోవీథిం దెలివెన్నెలల్ నిగుడ నిండుం డందుఁ గ్రీడించు దే
వావానద్విప మయ్యెఁ దన్మథితశుభ్రాబ్జంబులై తాఁతెఁ దా
రావర్గంబులు తత్కరోదకములై రాలెం దుషారాంబువుల్. 21

అ. ఆవేళన్, తెలివెన్నెలల్, పతి...వలెన్— పతి = పెనిమిటియొక్క, సంభ్రమ = ఉత్సాహమునకు - చిమ్మిరేఁగుటకని భావము, అనుగుణ=అనుకూలములయిన, గంగాంభోఝరంబుల్

వల=ఆకాశగంగ జలప్రవాహములో యున్నట్లుగా - (పతియగు సముద్రుఁడుప్పొంగి చెలరేఁగఁగా నతనిభార్యయైన యాకాశగంగయుఁ దాను నుప్పొంగుటకు సూచకముగా వెల్లివొడిచెనో యన్నట్ల నుట. ఇట 'ఆర్తార్తే ముదితాహృష్టే ప్రోషితే మలినాకృశా। మృతే మ్రియేత యానారీ సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా' అను పతివ్రతా నియమముచొప్పునఁ బతిసంతోషింపఁగాఁ బతివ్రత గావున గంగయు సంతోషించినదని తెలియునది. ఇందుండు = చంద్రుండు, అందుఁ=ఆ వెన్నెలరూపమయిన గంగా ప్రవాహమందు, క్రీడించు=విహరించెడు, దేవావాసద్విపము= దేవలోకపు ఏనుఁగు-ఐరావతము, తారా వర్గంబులు=నక్షత్రసమూహము, తత్ ...బ్జంబులు—ఆ (చంద్రరూపమైన) యైరావతముచేత, మథిత= కలంచి నలంపఁబడిన - తుత్తునియలు చేయఁబడిన, శుభ్రాబ్జంబులై=తెల్లదామరపువ్వులో యన్నట్లు, తారెక్=దిగుపారెను - కాంతిమాసి డిందెననుట, తుషారాంబువుల్ = మంచు తుంపురులు, తత్ కరోదకములై = ఆచంద్రుఁడనెడి యైరావతముయొక్క తొండమువలనఁ జాటిన (యాకాశగంగా జలముల) జలబిందువులో యన్నట్లు, రాలెను.

చంద్రోదయమయిన సముద్ర ముప్పొంగి రేఁగెననియు, ఆకాశమందుఁ దెల్లని వెన్నెల వెల్లికలు గాసెననియు చుక్కలు గాంతి మాసెననియు మంచుగురిసెననియు తాత్పర్యము. ఏనుఁగులు జలములం దీఁదులాడుటయు అంవలి తామరలు చెల్లచెదరు సేయుటయు, తొండముల నీరెక్కించి కొని తుంపరలుగా నెగఁజల్లుటయుఁ బ్రకటములు. అలం. ఉత్ప్రేక్ష.

సీ. మిత్రాధికారంబు మీఱరాదని కాక, వెసఁ బట్టపగలు గావింపలేదె
ప్రమాఁకుల క్రిందిసోమరు లెంత యనికాక, మలసి నీడలరూపు మాపలేదె
బాడబాక్షేప పాపమున కోపక కాక, యౌర్వాగ్ని నయినఁ జల్లార్పలేదె
రాజకాంతాకృతి ప్రతిసర్గ మని కాక, శిలలెల్ల సరసముల్ సేయలేదె

తే. జగతినిదియనిజగములు వాగడనెగడె, హరునితలయెక్కి వెలిదమ్మి నడఁగఁద్రొక్కి
కలశవారాశి నెమ్మేనఁ గలయఁబ్రాఁకి, కుముదరుచి నేలె కౌముదీసముదయంబు.

అ. కౌముదీ సముదయంబు = వెన్నెలల సమూహము, మిత్రాధికారంబు... కాక=(మిత్రుఁ డనఁగా చెలికాఁడును సూర్యుఁడును) చెలికాని యధికారమును జవదాఁట రాదనియేకాని యని యర్థము. (సూర్యాధికారము మీఱరాదనికాకయని యర్థాంతరము) వెసన్, పట్టపగలు గావింపలేదె= శీఘ్రముగా పట్టపగలుగానే చేయఁజాలదా - చేయనే చాలుననుట—(పగలు కావించుట సూర్యాధి కారమని భావము.) ప్రమాఁకుల... కాక=చెట్లక్రిందఁ బడియుండెడి మిక్కిలి సోమరులయిన వారలు ఎంతమాత్రపువారనియేకాని, మలసి=వ్యాపించి, నీడలన్, రూపుమాపలేదే=నశింపఁజేయఁజాలదా- అనఁగా నీడలనలుపు రూపును దెలుపుచేయఁ జాలదాయనుట. ఇక్కట నీడలే సోమరులన్నాఁడు. బాడబా...కాక — బ్రాహ్మణుల నాక్షేపించు దోషమునకు, ఓపక కాక = సహింపకయే కాని, (బడబానల మార్చుటయని యర్థాంతరము) ఔర్వాగ్నినైనన్ = (సముద్ర జలమందుండియు ఆఱని) బడబాగ్నినైనను, చల్లార్పలేదె=చల్లాఱునట్లు చేయఁజాలదా - చేయఁజాలుననుట. బాడబశబ్దము, బ్రాహ్మణునందును ఔర్వునందును వర్తించును. ఔర్వుని బాడబుఁడని—(అనఁగా బ్రాహ్మణుఁడని) అడంపక విడిచినదనుట. బాడబమని నామము గలిగియున్నదని భావము. రాజ...కాక=రాజాంతః పుర స్త్రీలయొక్క ఆకారములకు ప్రతిసృష్టియనియే కాని - చంద్రకాంత శిలాకార ప్రతిసృష్టి

యని భావము. శిలలెల్ల సరసముల్ చేయలేద = ఱాలనన్నిటిని నీరుగాఁ జేయఁజాలదా. చంద్రకాంతపుఱాలే కరఁగునది. తక్కిన ఱాలనుగూడఁ గరఁగునేని చంద్రకాంతపుఱాల కది మాఱగుచున్నది. ఇక్కడ 'రాజకాంత' అను శ్లేషముచేత నిది నిషిద్ధము గావించినాఁడు.

జగతిక్ ఇదియని, జగములు=లోకులు, పొగడఁక్ = పొగడునట్లుగా, హరునితలయొక్క=తెలుపుచేత హరుని మించినదైయని యర్థము—(హరుఁడు చంద్రుని తలయందుఁ గలవాఁడు గనుక నతని శిరసునందు పర్విియనియు లేక హరునిశిర మాకాశముగనుక దానియందు వ్యాపించియనియు నర్థాంతరము) తెలివమ్మిక్ అడఁగఁద్రొక్కి=తెలుపునందు తెల్లదామరను మీఱి (తెల్లదామరను మొగుడఁజేసి యనియు తనకాంతిచేత వన్నెమాపియనియు నర్థాంతరములు.) కలశవారాశి...ప్రాఁకి=పాలసముద్రముతో సాటియై, (పాలసముద్రముతో నేకీభవించి యనియు దానిని కౌఁగిలించికొనియు ననియు నర్థాంతరములు) కుముదరుచినేలి=తెల్లగలువకాంతి నతిశయించి. తనకాంతిచేత తెల్లగలువకాంతిని బోషించియని యర్థాంతరము. నెగడెక్=విజృంభించెను.

ఇట సూర్యుఁడు, ఔర్వుఁడు, చంద్రకాంతమను వానికిఁగల మిత్ర, బాడబ, రాజకాంతములను పర్యాయములనుగొని వాని యర్థాంతరములగు చెలికానిని, బ్రాహ్మణుని, రాజస్త్రీని నుల్లంఘింపరాదను శాస్త్రనియతిని శ్లేషశక్తిచే సంతరించి నిషేధములను సమర్థించినాఁడని తెలియునది. మ్రాఁకుల క్రిందిసోమరులు, ఇంటిపంచె కాక నేలపఱుపులేక చుట్టు ఆవరణములేక చెట్లక్రిందనే కాలు సేయియుఁ గదల్పలేక పడియుండువారు అతిమాత్రము సోమరలుగాన వారిని సరకుసేయమి. చెట్లక్రింది నీడలు తొలఁగిపోక స్థిరముగానుండుట ప్రకటముగాన సోమరికిసామ్యము. ఇందు అతిశయోక్తియలంకారము.

వ. (a) వెండియు నఖండశశిమండల కుండలితకుసుమకోదండ కాండాసన హిండిత కరకుముదకాండ ప్రకాండతాండవిత పాండురపరాగమండలంబున మెండుకొనుచు (b) నిండారఁ విరిసిన బొండుమల్లియల తండంబులం బొదలు మృదుల దలపుటాంతరంబుల వడిగొనిన తేటతేనియం దోఁచిన శిశిరకరకిరణాసారంబులుత్ఫుల్లహల్లకపరాగ మధురాచ్ఛ మత్స్యండికా పుంజంబులం బొరలించి పుక్కిళ్లకు వెక్కసంబుగా ముక్కునబంటి మెక్కి మెడలు నిక్కించు చలచ్చంచు సుందరీబృందంబుల యానందబాష్ప బిందుసందోహంబులం గ్రందుకొనుచు (c) జిగిమిగులుతోఁగల దొరనిగనిగల మిగులఁబుగులు కొనునెగులునం దనమగని నగణితి వనప్రదేశంబుల నరసియరసి వేసరి యోసరిలి సరసీముఖ్యంబునం దననీడఁజూచి కంటిఁగంటి నంటుకానిననుచు నంటంబోవ నదియునుం దవులకవలఁ జననాసన్నుండయ్యు నొల్లండువల్లభుండేల యని యుసురుసురనుచు, ననురుసురై సొక్కుజక్కవ జవరాలి బహువిధా విలవిలాపంబులకుం గనికరించిన తెఱంగునం గరంగు కురంగధగకాంత కందలంబుల జలజలని తెలినీటి జాలునం గ్రాలుకొనుచు, (d) నచ్చవెన్నెల విచ్చలవిడిఁ బెచ్చువెరిఁగి పచ్చఱామానికంపుఁ జిప్పలం బరిశుద్ధానవంబు నించకయు నిండినట్లుండఁ జాచలనఖాంచలంబులం బయలు చిందించు

వారును(e)బూర్ణ పాత్రంబులం దోఁచునిండుచందురుం బిండియమృతం బని వాసి తాసవంబుఁ గ్రోలుచుఁ గలంక శంకంగలువఱేకు దిగిచివైచువారును, ప్రతి ఫలితతారకంబులు ద్రాక్షాఫలంబు లని రిత్త చప్పరించువారును, నిజాననాం భోజభోజనంబులం బట్టిన మైరేయంబు మగలకుఁ ద్రావించునెడ వారు వాసనా శ్రిత సహకారపల్లవంబని చక్కెరమోవి చుఱుక్కున నొక్కినం గలక్వణిత కంకణాంకితకరంబులు విదిర్చుచుం గనీనికలు ఱెప్పలతుదల నప్పళించుచుం గమనీయసీత్కారకంఠనాదభేదంబులం గులుకరించుచుం బానశాలా పురో భాగసమానవలదకాయమానంబులం బొడము పొదవెన్నెలలఁ బువ్వులని మొత్తి యువ్వంబోవువారును,(f) కాదంబరీమదోన్మాదంబున మోదమ్ములు వెరిఁగి చేదమ్ములు చఱచుచుం జిందులుగ నాడుచుం బాడుచుందమ నృత్తంబులకు మెచ్చి నెత్తమ్ములపగఱపు తెంచిన యుడుగరులని మునింగిళ్ల రంగుమీఱు ముత్యాల యగుంగుల చెఱంగులం దుఱంగలించు మెఱుంగులు కరాంగుళుల విప్పి కప్పికొనఁబోవువారునునై (g) యతిప్రబంధ గంధోత్తమా గంధానుబంధ బంధుర లగు సిందుర యానలయుగ స్తనాసామణిప్రభా స్తబకంబుల నుల్లసిత గల్లసిత లోధ్రధూమాంగంబులనున్న మిత్రావటు విలంబిహారంబులఁ బేరెంబులువాఱె నో యనం (h) గొన్ని యెడల నున్నత చంద్రశాలా బహిరంగణంబుల నడుగులకు మడుగులుపఱచి నారని చరణ కిసలయాయాసంబు లెఱుంగక చందన తిలకం బులు గరంగఁ జారుహారంబులెగరఁ జపలమండల హీరకోరకంబులు వెలంగ భావిపుంభావసంభావనాపరిచయంబు సంపాదించు వెంపునం బంపిల్లుగూయు కలికి కోమరెల మొలకచనుమోసులం దులకరించిన తళుకుసిబ్బెంపుఁ దళతళ దళుముకొనియెనో యన (i) నొక్కొక్క గడంగడవరాని తమచేడియల బెడంగు నుడుగుల నడుగు లామడలుగా వచ్చి యభినవవిహారహర్మ్యంబులు సొచ్చి శాత కుంభ స్తంభంబుల నత్తమిల్లి యుత్తరీయంబులుపట్టి తివియ నీడిగలంబడుచుం దనులతల యడంకువలందఱఁగని వడంకులందను తానముడిసడలు నిద్దంపు వలు వలదరి పాటునంజరణాంగుళి దంశికలం బట్టి నుసిమిన మిట్టిపడి యిట్టట్టుఁగదల నేరక వరులహృదయపంజరంబులుదూఱి మెట్టకేలకుంజిట్టకాలకుం జెవియొగ్గిన సిగ్గరికత్తె యలు వాతాయనంబుల డగ్గఱి మెలంగు చలినిగ్గుల గనింగని తొంగి చూచు ధూర్తసఖీసుస్మిత వదనంబని యదరిపడి పొదవుకొన్న నున్నచేలలఁ జిన్నారి నెఱికలఁ జెన్నారు మిసమిసలఁ గన్నంబు వెట్టి కైకొనియెనో యనఁ(j) గతిపయ స్థలంబులం బచ్చి దేఱు నంగమచ్చంబులతో వచ్చి తచ్చన వినయంబులు దెచ్చు కొని మోవిమాటి మాటాడియుఁ జేతులుగట్టుక నిలిచియు గట్టువాతనంబున కొడిగట్టిన దిట్టవిటులంబట్టి పూదండలంగట్టి వ్రేలింపం జాలాగతకిరణ దండబు

లకుఁ జెయిసాఁచు ముగుదమగువల కరనఖరకాంతి భంగంబులం బొంగిపొర లెనోయన(*k*)వెన్నెలపుడుచాయలం గోయక కోయుకాయజుని మాయకత్తుల రాయిడింబడలేక ధవలాంబరమాల్యానులేపన నేపథ్యంబులుపూనిమునిమాపుచూచి వచ్చిన కర్పూరకదలికాంకిత కుంజంబులకువచ్చి యచ్చట నఖిలకుంజంబులు నట్లయుండం గొండొకసేపు వివరింపలేక వలపులవలనం దెలసి నిజసమయు నిలయంబు లీఁగు నిత్యరీజనంబుల మనంబు లరయవలసి మార్గ్యగలుమాటన కరుగుటయు, నవ్వేళ నెవ్వరింగానక యరణ్యరోదనంబు నిజంబయ్యెనని నిశ్శబ్దంబుగా నేద్పుచుం జేయునదిలేక చేష్టలు దక్కియున్న యన్నెలుగులు వారింప సన్నిహితులై వారు కన్నీరుదుడిచి కవుఁగిట మన్నించినం గనుదెఱచి చూచు నన్నెలంతల విస్మయసూచన ప్రభాదట్టంబుల నిట్టవాడిచెనో యన మఱియుం జెక్కునెళవులం గళల యిక్కువలు దెలసిన యదనమదనకదనంబున నదమదంబు లగు నంగంబుల నంగధట్టంబులు మార్పడవైచుకొని యుప్పరి గల బయళ్లకు నేఁగుదెంచి చందమామ గుటికలుగ్రోలు మందయానల చెక్కుల వెలుంగు వలి వెలుంగుంజూపి మీమొగినుల మిలమిలలు గిలుబాడవచ్చెఁజుమీ వెన్నెల బచ్చుముచ్చు వీఁడిచ్చోట మసలుట మనకునేరమని నారులం బునారతంబులకు నెలయించికొని పోవువలకారులజాఱు కొప్పులం దొరఁగు విరిగుత్తులతోఁ బొత్తుగలసెనోయన వెలసి (*l*) యభివ్యక్త శుద్ధవర్ణబ్రహ్మంబుగావున నుర్వింగలవారినెల్ల సర్వజ్ఞులంజేయుచుఁ దారవాద ధౌరేయంబుగావునఁ గొండలనెల్ల వెండికొండలఁ జేయుచుఁ బద్మాహిత పాదప్రభూత నూతనస్రోతో విశేషంబుగావున నఖిలభువన మాలిన్యంబులఁ దొలఁగింపుచుఁ బంకజభవాండ మంటపంబు సంకుచేసిన పొంకంబున నంకింపుచు నకలంకమీనాంక నిరంకుశయశోనురీచీ వీచీసమ్రీచీనంబై విజృంభించు సమయంబున. 23

అ. (*a*) వెండియుఁన్=మఱియు, అచ్చవెన్నెల - ఇదికర్త. అఖండ...మండలంబునన్— అఖండ=నిండయిన, శశిమండల=చంద్రబింబమనెడు, కుండలిత కుసుమకోదండకాండాసన = గుండ్రగాఁ జేయఁబడిన (అనఁగా వలయాకారముగా మోపెట్టఁబడిన) పూవిలుతుని వింటినుండి, హిండిత= వెడలుచున్న - (హిడిగతౌ అని ధాత్వర్థము) కర=కిరణములనెడు, కుముదకాండ ప్రకాండ = తెల్లగలువతూపుల మిన్నలయందు, తాండవిత=ఆడుచున్న - (గాలికిలేచి యాడుచున్న), పాండురపరాగమండలంబునన్=తెల్లనిపుప్పొడి సమూహముచేత, మెండుకొనుచున్=మిక్కిలియగుచు - ఇట చంద్రమండలమును గుండ్రముగా మోపెట్టఁబడిన మరునివిల్లుగాను, అందుండి నిగుడుకిరణములను, ఆవింటినుండి వెడలు తెల్లగలువ తూపులుగాను, రూపించినాఁడు. చంద్రబింబమగు జంద్రకిరణములును, మిక్కిలి స్మరోద్దీపకములుగా నున్నవని యాశయము. అచ్చవెన్నెలనుజెప్పి చంద్రునుండి వెడలు కిరణములుజెప్పుట పునరుక్తప్రాయము. రెండవదాని కుసుమకోదండుని విల్లును తూపులునుగా నవస్థాభేదమునం జెప్పుటచే భేదమేకాని పునరుక్తిగలుగదన్నచో, అవస్థాభేదమందును నది వెన్నెల మెండు

కొనుటకు నుపయుక్తముగాక దానియందు తాండవితమగు పరాగముచేతనే మెండుకొనుట గలుగు టచే నిరర్థకమగుచున్నది. అనఁగా వెన్నెల మెండుకొనుటకు చంద్రబింబకిరణములు మన్మథ ధను ర్బాణములుగా రూపించుట యావశ్యకములుగావు. కాన యిట పాఠదోషముగాఁ జూపఁబడినది. నిండయిన చంద్రబింబమువలె గుండ్రముగా మోపెట్టఁబడిన పూవిలుతుని వింటినుండి, హిండిత=వెడ లుచున్న, కుముద... తెల్లగలువ పూఁదూపులయందు, తాండవిత=ఱేఁగియాడుచున్న, పాండురపరాగ మండలంబు అనఁగా=తెల్లని పుప్పొడిసమూహమో యనునట్లు, మెండుకొనుచునని పాఠముగ్రహింప వచ్చును. ఇందు, 'కర' శబ్దము త్యక్తము. అఖండ... కుండలిత=ఉపమిత సమాసము గాఁ బడెను. వింటినిగుడుసు వెట్టి యవ్వారిగాఁదొడిగిన తెల్లగలువదూపుల దండడిని దొరుఁగు తెల్లని పుప్పొడివలె నచ్చవెన్నెల మెండుకొనియున్నదనుట. లేక, మొదటిపాఠముసేగాని, పాండురపరాగమండలంబున= ఆకలువపూవుఁ దూపులయందలి తెల్లని పుప్పొడియనెడు సాధారణముగాఁ బర్వియున్న పుప్పొడిచేత నని యభేదాధ్యవసాయముచేతను నర్థము గ్రహింపవచ్చును. సామాన్యమయిన తెలిపుప్పొడిని మరుని తెల్లగలువతూపులనుండి పర్విన పుప్పొడిగా నధ్యవసాయము.

(b) నిండా... తండంబులన్=సమూహములందు, పొదలు=ఒప్పుచున్న, మృదులు... రంబు లన్=సన్నని ఱేకు దొప్పలనడుమనుండి, వడిగొనిన = వడసినట్టి, తేటతేనియన్=తేటతేఁటగానున్న పూఁదేనెయందు, శిశిర... సారంబులు=చంద్రునికిరణముల జడులు—జడివలె నిగుడుచున్న కిరణము లనుట. ఉత్ఫుల్ల... జములన్—ఉత్ఫుల్ల=లెస్సగావిరిసిన, హల్లక = ఎఱ్ఱగలువలయొక్క, పరాగ= పుప్పొడియనెడు, మధుర= తియ్యని, అచ్ఛ = అచ్ఛమయిన, మత్స్యండికా=కండచక్కెరయొక్క, ('మత్స్యండీఫాణితం ఖండవికారే శర్కరా[illegible] అ.) [illegible]ంబులన్ [illegible]ల్లయందు, పొరలించి=పొ లిపి, చలచ్చంచు... హంబులన్—చలచ్చం[illegible]ందరీ=వె[illegible]పులుఁగు [illegible]ంట్లయొక్క- ('చలచ్చంచు ద్విజజ్యోత్స్నా ప్రయాశ్చ విషసూచకాః' [illegible]) బృంద[illegible]ల=సమూ[illegible]ములయొక్క, ఆనంద... హంబులన్, క్రందుకొనుచు[illegible]దడిపడుచు - అనఁగా బలి[illegible]చు-జల[illegible]మువులు [illegible]లుపువర్ణముగానివి గనుక వెన్నెలకు బలుపుగూర్చుట. బొండుమల్లియల నిం[illegible]రవిరియ[illegible], ఱేకులు సడ[illegible] [illegible]దేనె పక్వమైవడియుట. దలములు, [illegible]ములు (దొప్ప[illegible]) అనుట [illegible]దేనెనిలు[illegible]కు తే[illegible]వడిసి [illegible]గుట కిరణంబులఁదోఁచుటకు ఏదేని భే[illegible]గ్యములను కండచక్కెర [illegible]దలయిన[illegible]నితో [illegible]రపిగ[illegible] జము. ఇట కండచక్కెరకు, బదు[illegible]గా ఎఱ్ఱగలువ పుప్పొడిని [illegible]ప్పనాఁడు[illegible] ఇందు[illegible]కు 'గ[illegible]ల్లి కా గుచ్ఛంబుల్లిల్లార్చి ఖండశర్కరలతోఁ గలపిక[illegible]పి' (శృంగారనైషధము). నిండారబి[illegible] మల్లెలకును వెండిగిన్నెలకును అందలి పూదేనెకును మద్యమునకును, అందు వ్యాపిం[illegible]ంద్రకి[illegible] ములకును తెల్లని పిండివంటలకును ఎఱ్ఱగలువ పుప్పొ[illegible]ని కండచక్కెర పొడికిని ప్రతియ[illegible]లియు[illegible]. ముక్కునబంటియనుచో 'మాత్రార్ధ్యర్థేతు బంట్యాదిస్తతః పూర్వేతు వ[illegible]క్వచిత్' [illegible] యథర్వ[illegible]ణ వచనము.

(c) జిగి... నిగలన్=కాంతి అతిశయించుచున్న చంద్రుని[illegible] నిగని[illegible]గులన్= మిక్కిలి, బుగులుకొను=అతిశయించుచున్న, సెగలుశి[illegible]=వెతచేత, [illegible]మగనిన్=పో[illegible] [illegible]ణిత వనప్రదేశంబులన్=లెక్కలేని వనములపట్టులందు[illegible]క నీటిపట్టుల[illegible], [illegible]అరసి[illegible]క్కి,వేసరి= విసికి, ఒసరివి=ఒత్తిగిలినద[illegible] సరసీమధ్య[illegible]బునన్[illegible] మనికిపట్ట[illegible] [illegible]కొ[illegible]నద[illegible] [illegible]టుకానిక్= ప్రియుని, కంటికంటిక్ అనుచు, అంట[illegible]బోవ[illegible]కదియరాఁ[illegible] [illegible]=అ[illegible]ను, దవులక=

-చిక్కి, అవ్వలికిఁ+జనన్ =అవతలికిఁబోఁగా, ఆసన్నుండయ్యున్ = దగ్గఱినవాఁడయ్యును, వల్లభుండు=మగఁడు. ఏల ఒల్లండు, అని. ఉసురుసురనుచున్=ఉస్సురని నిట్టూర్పులు పుచ్చుచు, ఉసురుసురై = గ్రుక్కినదై.

క. 'ముసరుకొను జరభరంబున, నసురుసురైయున్న మమ్ము ♦ నడిఁకించితి వి
ట్లుసురు మనఁ బడుము' (మనుచరిత్రము)

ఘాక్కు=పరితపించుచున్న, జక్కవజవరాలి=చక్రవాకస్త్రీయొక్క, బహువిధ= పెక్కువిధములయిన, ఆవిల=కలఁతనొందిన, విలాపంబులకు= పలవించుటలకు, కనికరించిన = జాలిపడినట్లుగా, కరంగు, కురంగ...దళంబులన్=మొలకలవంటి చంద్రకాంతమణులవలన, జలజలని=జలజలప్రవహించుచున్న (జలజల ఇది నల్లాదులలో నిదిగాన నిష్ఠకము. నివర్తకము పరముగాకయుఁ బ్రయోగము గలదు. 'కలయవెల్లువఁగట్టి జలజలఁబ్రవహించు' (మను) జలజల నలరులు రాలెను. (వసు) తెలినీటి జాలునన్=తెల్లని నీటివెల్లువచేత, బ్రాలుకొనుచున్=ప్రకాశించుచు, చంద్రకాంతపు మోసులుకరఁగి లొరుఁగునీటిజాలువలన వెన్నెలతెలుపు మఱింత వెలింగెననుట.

(*d*) విచ్చలవిడిన్=అడ్డులేక, ఇందులకు కర్త అచ్చవెన్నెల. పెచ్చుపెరిఁగి=మిక్కిలి వర్ధిల్లి. తనధావళ్య ప్రకాశములకుఁ బుష్టి పూర్వోక్తవిధములఁ గలుగుటంజేసి, విచ్చలవిడి పెచ్చుపెరిఁగిన దనుట. పచ్చ...చిప్పలన్=మరకత మణిమయములయిన చిప్పలవంటి పాత్రలు, పరిశుద్ధాసవంబు = తెల్లనిసారాయము. నించకయె నించినట్లుండన్ = పోయకేపోసినట్లుండఁగా - ఆపచ్చరాపాత్రలలో వెన్నెలప్రసరించుటచే తెల్లనిసారా పోయకయే పోసినట్లుండెననుట, చంచలనఖాంచలంబులన్= కదలుచున్న వ్రేలికొనల [illegible]యలు[illegible]వారు=[illegible]కొలుకునట్లు చేయువారును-నిండుగనుండుట చేతఁ ద్రావుట కనువుపడ[illegible]గాఁ [illegible]ములికిం[illegible]రనుట. ఆసవమనఁగా చెఱకురసముతో జేయఁబడినమద[illegible].. ఇది [illegible]క తెగ[illegible]లు. ఇ[illegible] తెగ స్త్రీలు మీఁదఁ గొందఱు చెప్పఁబడెదరు. వీని [illegible]టికిని [illegible]' అను [illegible]నిలో న[illegible]యము.

[illegible] పూర్ణ[illegible]త్రంబ[illegible]=నిండిన[illegible]త్రలందు[illegible]ఁచు=ప్రతిబిం[illegible]చు,నిండుచందురునిపిండి,వాసి [illegible]న్=ఆ[illegible]త్రల[illegible]న్న కలువ[illegible]మొదలయిన పువ్వులచేత [illegible]సనగలదిగాఁ జేయఁబడినమద్య [illegible]మృతం[illegible]=చం[illegible] డమ్మ[illegible]యుఁడుగ[illegible]క వానిని నలిపి పిండఁగాఁ దొరిఁగిన యమృతమే [illegible]యించి, [illegible]లు[illegible]=[illegible]ము, కలం[illegible]ంకన్ = ఆచన్ద్రునియందలి కళంకమనుశంకచే, [illegible]న్=ఆ[illegible]సవ[illegible]దలి క[illegible]పూ రేకును తివిచివైచువారును= తీసివైచువా[illegible] - ఆసవము [illegible]గాఁ జెప్పుట [illegible]యమృతమని బ్రమ[illegible]లుపుటకు. ఇం[illegible]ఁ గేవలముగ్ధలని [illegible]యుచున్నది. [illegible]ఫలిత[illegible]ంబులు = అందు ప్రతిబింబించు[illegible]మక్కలు, ద్రా[illegible]ఫలంబులని = ద్రా[illegible]పండ్లని, రిత్త [illegible]పరించు[illegible] = వట్టిగ చప్పరించువారును [illegible]తారకళఙ్బము [illegible]కనీనికాయాం నక్షత్రే తారకం [illegible]మ.) [illegible]న పుంసకమునుం[illegible]ము. ద్రాక్షాఫలములు చుక్కలుగాఁ జెప్పుటకు

[illegible] డొక్క కయెడ, మరక[illegible]ణి పాత్ర గగనమండల మయ్యెన్
[illegible] పా[illegible]ధరుఁడయ్యె [illegible]క్కలయ్యె ♦ ద్రాక్షఫలంబుల్' (శృం.౩.౧౩౨)

[illegible]యంబు[illegible]క్కల్లలోఁ బట్టిన యుప్పపూఁగల్లను, మగలకున్, త్రావించు [illegible]న్=[illegible]పుడు, [illegible]రు=[illegible]యులు, [illegible]వాస...వంబని = వాసనవై వేయంబడిన [illegible]వి[illegible]క్కర[illegible]విని=చెక్కరవలె [illegible]యైన పెదవిని, చుఱుక్కునన్,నొ[illegible]...కరంబులు-కలక[illegible]=అవ్య[illegible]మధురమయిన ధ్వనులుగల,

కంకణ=కడియములచేత, అంకిత=గుఱుతిడఁబడిన, కరంబులు=చేతులు, విదిర్చుచుఁ, కనీనికల నప్పళించుచుఁ=నల్లగ్రుడ్లు కొనఱెప్పలచేతఁ గ్రమ్ముచు, కమనీయ=ఒప్పుచున్న,సీత్కార=సీత్ అని పలికెడుసీత్కారములనెడి,కంఠనాదభేదంబులఁ=ఎలుఁగు విశేషములను-అనగా స్త్రీలు రతికాలమందు పావురాలవలెఁజేయు కంఠధ్వనులను, గులుకరింపుచుఁ=మురిపెములుగాఁబచరింపుచు, పాన...మానంబులఁ = మద్యపానముసేయునట్టి యిండ్లముందర వెలుంగుచున్న పట్టివేళ్ల ('వలదంస్యాత్పుష్పరసో శిరమాంసీషు నద్వయోః' మేదిని.) పందిళ్లయందు, పొడము=పుట్టునట్టి, పొడవెన్నెలలఁ=వెన్నెల పొడలను, పువ్వులని=తెల్లనిపువ్వులని, భ్రమసి, ఎత్తి అువ్వఁబోవువారును. చేయివిదిర్చుట నల్లగ్రుడ్లను గొనఱెప్పలతో నప్పళించుట, సీత్కారములు సేయుటయు నొప్పిచేత. కులుకరించుట యని సొగసు గులుకఁజేయుటచే నాసీత్కారములు రతికాలికములవలెఁ జూపట్టుట. వెన్నెలపొడలను పువ్వులని రువ్వుట భ్రమము. పుక్కిళ్లతోనే త్రాగించుట వారలమోవి కొఱుకుట యలవడుటకు. అందులకు నెపము. వాసనగట్టుటకై పైచిన తియ్యమావి-చిగురనుట. దీనికిని 'ఐ'తో నన్వయము. మైరేయాదుల స్వరూపము.

'సీధురిక్షురసైః పక్వైరపక్వైరాసవో భవేత్ ।
మైరేయం ధాతకీపుష్ప గుడధాన్యామ్ల సంహితమ్' (మాధవః.)

పక్వమైన చెఱుకురసముతోఁ జేయఁబడినది సీధువు. పక్వముగాని చెఱుకురసముతోఁ జేయఁబడినది ఆసవము. ఆరెపువ్వు బెల్లము పులియఁబెట్టిన కడుగు అను వీనితోఁజేయఁబడినది మైరేయమని భేదము. కొన్నిప్రతుల'ధానామ్ల'మని యున్నది. అపుడు దనియాలును పులుసుతోఁ జేయఁబడినదని యర్థము. (మారం కామం జనయతీతి మైరేయం-మార+ఢక్)అను వ్యుత్పత్తిచే స్మరోద్దీపకముగనుక కామినీకాముకులు ద్రావుదురు. భేదములుపాటింపకయే సామాన్యముగా 'మద్యన్తు సీధుర్మైరేయమిరా చ మదిరా సురా।కాదంబరీ వారుణీచ హాలాపి బలవల్లభా'(భావప్రకాశము) అని చెప్పఁబడుచున్నది. మైరేయగుణములు - 'తీక్ష్ణః కషాయోమదకృత్ దుర్నామకఫగుల్మహృత్ । కృమిమేదోఽనిలహారో మైరేయో మధురోగురుః' సుశ్రుతము.

(*f*) కాదంబరీమద ఉన్మాదంబునఁ=(కదంబరస్య కుత్సితాంబరస్య నీలాంబరస్య ఇయం కాదంబరీ అని వ్యుత్పత్తి. బలరామునికిప్రియమైనదిగాన కాదంబరి-అనఁగా మద్యము.) మద్యపానము వలని మత్తుచేనయిన వేడుకచేత, మో-దమ్ములు=ఉబ్బులు, వెట్టివెట్టి సంతోషములు, పెరిఁగి, చేదమ్ములుసఱచుచుఁ=చప్పట్లుగొట్టుచు, చిందులుగఁ=చిందులుత్రొక్కునట్లుగా, ఆడుచుఁ పాడుచుఁ, నృత్తంబులకుఁ=నాట్యములకు, నెత్తమ్ములపగఱ=తామరలకుఁ బగవాఁడయినచంద్రుఁడు, పుత్తెంచిన ఉడుగరలు=పంపినకానుకలు, రంగుమీఱు=పన్నెమీఱుచున్న, అరుఁగులు=తిన్నెల, చెఱంగులఁ= తుదలందు తుఱంగలించు, మెఱుంగులు=ప్రకాశించుచున్న వెన్నెలతళుకులను, కరాంగుళులఁ విప్పి= వ్రేళ్లువిప్పి, కప్పుకొనఁబోవువారును =' మూసికొనుటకై గమకించువారును - ముత్యాలతిన్నెల తుదలందు వెన్నెలలు ప్రతిబింబించి మిక్కిలియు తళతళమని మెఱయుచుండుటచే వెన్నెలగాదు, తమకయిన కట్నములని భ్రాంతికలిగెననుట. ముంగిళ్లయందనుట వెన్నెలపయిఁ బ్రసరించుటకు. అరుంగులు ముత్యాలవియనుట వెన్నెల ప్రతిబింబించి తళతళలాడుటకు. అరుంగులనుట కానుకలునించినపాత్రికలవలెఁ దోఁచుటకు. ముత్యాలయరుంగులు కానుకలునింపు వెండిపళ్లెరములవలెను అందులకు దలఁ దళతళలాడు వెన్నెల తళుకు ఉడుగరలవలెననియు గ్రాహ్యము. వెండిపళ్లెర[illegible] గానుకలు నించుట ప్రకటము. ఇంకే

'అలరారన్ సెలఁగాలఁగట్టిన మహీజావాలముల్ గొన్ని స
త్ఫలసాంద్రంబులు గొన్ని పల్లవరుచిప్రాగ్భార పట్టాంబరో
జ్జ్వలముల్ గొన్ని సమగ్రశారదరజోజాలంబులై మాధవుం
డులుపానించిన రౌప్యపాత్రికలు నానొప్పెన్ నృపాగ్రంబునన్.' (౧ ఆ. ౧౫౪.)

ముత్యాలయరుంగులకు 'ముదురువెన్నెలగాయు ముత్యాలదిన్నెపైఁ, బైఁడియచ్చనగుండ్లు పాఱవైచి' (యయా.ఆ.3)ఐ=అగుచుండి - 'పచ్చతామానికంపుఁ జిప్పల్' మొదలుగా, 'కప్పుకొనఁబోవువారును' అనువఱకుంగల పలువగల స్త్రీలును నిట్లయిరనుట. చంద్రికచే నిన్నివిధముల భ్రాంతి బొందినవారై యనుట.

(*g*) అతి...బంధురలు—అతిప్రబంధ = మిక్కిలి యెడతెగక నిగుడుచున్న, గంధోత్తమా= ('గంధోత్తమాప్రసన్నేరాకాదంబర్యః' అ.) మద్యములయొక్క, గంధ=వాసనయందలి,[అతిప్రబంధ శబ్దమునకు 'అతిప్రబంధ ప్రహితాస్త్రవృష్టిభిః' (రఘు)] అనుబంధ=ఆసక్తిచేత, బంధురలు = ఒప్పుచున్నవారు, (అతిప్రబంధ అనుటకు మిక్కిలి వాసనగట్టినయని యర్థము పూర్వవ్యాఖ్యానమందున్నదిగాని దానికి ఆకరము తెలియలేదు.) అగు, సింధురయానల = ఏనుఁగునడవంటి నడగల స్త్రీలయొక్క, ఉదస్త = (మద్యము త్రావుటకై) పయికెత్తఁబడిన, నాసామణి = ముంగఱముత్తియముల యొక్క, ప్రభాస్తబకంబులన్=మెఱుంగు గుత్తులచేతను, ఉల్ల...చూర్ణంబులన్—ఉల్లసిత=ఒప్పుచున్న, గల్ల=చెక్కిళ్లయందలి, సితలోధ్రచూర్ణంబులన్ = (అలంకారముకొఱకై ధరించు) తెల్లని లొద్దుగు పుప్పొళ్లచేతను, (స్త్రీలలంకారమునకై లొద్దుగపుప్పొడిని దాల్చుటకలదు. అందులకు 'హస్తే లీలాకమలమలకే బాలకుందానువిద్ధం। నీతాలోధ్రప్రసవరజసా పాండుతామాననే శ్రీః। చూడాపాశే నవకురవకంచారుకర్ణే శిరీషమ్। సీమన్తే చత్వదుపమగజం యత్రనీపంవధూనామ్' (మేఘ) ఉన్నమిత=పైకెత్తఁబడిన, అవటు=మెడవంపులయందు, విలంబి=వ్రేలుచున్న, హారంబులన్=ముత్యాల పేరులచేత, పేరెంబులు వాటెనోయనన్=పరుగులెత్తెనోయనునట్లుగా, ఈవాక్యములకెల్ల వచనము తుదినున్న 'వెలసి' తోనన్వయము. ఇట నాసామణి 'ఉదస్త'మగుటయు,గల్లము ఉల్లసితమగుటయు, అవటు ఉన్నమితమగుటయు మద్యపానార్థము. వెన్నెల నాసామణి పయికెత్తఁబడునపుడు దానిపయి బొలసి చకచకలును,గల్లములు పుక్కిటి మద్యములచే మఱింత యుబ్బియు పయికెత్తంబడియునుండుట చేత దాని నిద్దంపు పయిభాగములఁ బూసియున్న లొద్దుగపుప్పొడిపయిఁ బొలసి మఱింతనిగనిగలును, మెడ పయికెత్తగా వ్రేలుచున్న హారములపయిఁ బొలసి మఱింత తళతళలును, గలిగించి తాను బలుపునొందినదని యాశయము. చంద్రికలు నాసామణ్యాదులపయిం బొలయుటకే 'ఉదస్తాది' విశేషణములు మూఁడు నుపయుక్తములు.

(*h*) కొన్నియెడల, ఉన్నత...రంగణంబులన్ = పొడవయిన మిద్దెటిండ్ల బయటి ముంగిళ్లయందు, అడుగులకు, మడుఁగులు=చలువగడ్డలు, చరణ...యాసంబు=చిగురుటాకులవంటి పాదముల కష్టములను, చందనతిలకంబులు (స్త్రీ) లుత్తరదేశములందు చందనముతోడను దిలకంబులు పెట్టుకొందురు 'దిక్సున్దరీవదన చందనబిన్దు రిన్దుః' బిల్హణ.) చారుహారంబులు=సొగసయిన ముత్తెపుసరులు, చపల...కోరకంబులు = అల్లలాడుచున్న చెవికమ్మలయందలి మగరాలమొగ్గలు, భావి...చయంబున్—భావి=మీఁదటి, పుంభావ = ఉపరిసురతముయొక్క - మగలాగునందలి, సంభావనా =కలుగుటలయొక్క-చందనతిలక స్రవణాదులయొక్కయనుట, పరిచయంబున్=అలవాటును, సంపాదించు

సొంపునన్=సమకూర్చుకొనురీతిని, పింపిళ్లుకూయు = చిడుగుడుకూయుచున్న, కలికి కొమెరల = చక్కని చిన్నపడుచులయొక్క, మొలకచను మోసులన్ = మొలకలవంటి పూపచన్నులందు, తులకరించిన=పొటమరించిన, తళుకు సిబ్బెంపు తళతళ = తళుకుగల పొడల తళతళయను కాంతులచేత, దలముకొనియెనో=దట్టమైనదో యన్నట్లుగాను, పింపిళ్లనఁగా పింపిసలు పెదవిమీఁదుగా నొకవిధమయిన ధ్వనిగలిగించుచు వర్తించెడు బాలికాక్రీడావిశేషము. (శ. రత్నాకరము). ఇపుడు కలికి కొమిరెలు - ఇంకను బెండ్లికాలేదు. పెండ్లియైనను ఉపరిసురతమునకు వలయునంత ప్రౌఢలునుగారు. కావుననే పుంభావరతము 'భావి'. ఉపరి సురతమందలి చందన తిలకము కరఁగుటలు, హారములెగురుటలు, మణితములు మొదలయినవి, నలవాటు చేయుచట్లున్నదనుట. వారిపింపిళ్లను, మణిత ధ్వనులలవాటు చేయుటగాఁ జెప్పినాఁడు. పుంభావమనఁగా.

'ఈషత్కమ్పపయోధరం గురుకటీ ప్రౌఢప్రహారాద్భుతం
స్విద్యత్ఫాల మనేకహాస్యసరసం సంకథ్యపాదవ్యథమ్
వారంవార మురఃప్రపాతసుభగం సందశ్యమానాధరం
కిఞ్చిద్దత్తనితమ్బదేశనఖరం ధన్యో రతం సేవతే.'
'పల్లత్కుఞ్చం వ్యాకులకేశపాశం స్విద్యన్ముఖం స్వీకృతమన్దహాసమ్
పుణ్యాతిరేకాత్పురుషాలభన్తే పుమ్భావ మమ్భోరుహలోచనానామ్'

ఇందు మణితములకు,

'ముక్తాభూషణమిన్దు బిమ్బమజని వ్యాకీర్ణతారం నభః
స్మారంచాప మపేత చాపలమభూ, ద్దీపరే ముద్రితే
వ్యాలీనం కలకణ్ఠమన్దరణితం మన్దానిలైర్నన్దితం
నిష్పన్నస్తబకాచ చమ్పకలతా సాఽభూ న్నజానే తతః.' (భవభూతి.)
'స్విన్నంమణ్డలమైన్దవం విలుళితం స్రగ్భారనద్ధంతమః
ప్రాగేవ ప్రథమానకైతకశిఖాలీలాయితం సుస్మితమ్
శాన్తంకుణ్డలతాణ్డవమ్, కువలయ ద్వన్ద్వంతిరోమీలితమ్
వీతం విద్రుమసీత్కృతం నహిశతో జానే కి మానీదితి.

సిబ్బెము తెల్లని పొడ కావుననే దాని తెలి తళతళలు వెన్నెలకు దలముకొలుపుట. చందన తిలకములు కరఁగుట, చారుహారము లెగురుట. హీరకోరకంబు లల్లలాడుటయు పింపిళ్లొటయందును పుంభావ సురతమందును గలుగుచున్నవని తెలియునది. పుంభావసురతమున చందనము తిలకము చెమటచేఁ గరఁగుటకు,

'పూవులభూరి సౌరభముఁపూని భరంపడి యేఁగుదెంచు బృం
దావన సంచరిష్ణుఁడు సదాగతి పొంతుఁడు దప్పిపెంపునన్
ద్రావఁగలాఁడు బాలునివిధంబునఁ జిత్రకగంధసార పం
కావిలమైననుం గువలయాక్షి భవద్రతిఘర్మతోయమున్.' (శృంగార.)

(i) ఒక్కొక్కకడన్, కడప...డియలన్=త్రోసిపుచ్చరాని చెలికత్తెలయొక్క, విడంగునుడుగులన్=ముద్దుమాటలకు - సొగసుపలుకులకు, అడుగులామడలుగా=ఒక్కొక్కయడుగు ఒక్కొక్కయామడఁగా, ఎప్పుడెప్పుడు చేరుదుమాయను తమిచేత అడుగామడగాఁ దోఁచెననుట. వచ్చి, అభినవ...హర్మ్యంబులు = క్రొత్తలయిన క్రీడార్థపు ఉప్పరిగలను, చొచ్చి, శాతకుంభ సంభ్రంబులన్ =

బంగారు కంబములందు, అత్తమిల్లి=చేరగిలంబడినిలిచి, ఉత్తరీయంబు=పయివస్త్రము, తివియన్= పెనిమిటి వీడుపఁగా, ఈడిగిలంబడుచున్=రాక పెనఁగులాడుచు, తనులతల అడంకువలన్=మేను తీఁగల ముడుంగుకొనుటలచేతను, తఱుగనివడంకులన్, తనుదాన = తనకుఁదానే, ముడిసడలు, నిద్దంపు=నునుపయిన, అదరిపాటునన్=ఉన్నట్టున-ఏమఱిపాటున, చరణాంగుళీదంశికలన్ = కాలి వ్రేళ్లనెడు పట్టుకారుచేత, నుసిమినన్=లాగివైవఁగా, మిట్టిపడి=దిగంబరలగుటచే బెదరున నుట్టిపడి, ఇట్టట్టుగదలనేరక=వలువలేనందున నెటుపోవనుంగూడక, వరులహృదయ పంజరములు = పెనిమిటుల గూండ్లవంటిఱొమ్ములందు-కౌఁగిళ్లయందనుట, ఎట్టకేలకున్=కొంతసేపటికి, చిట్టకాలకున్ = శృంగారపుఁబలుకులకు, చెవియొగ్గి=ఆలించి, అనుకూలలైన,సిగ్గరికత్తియలు=లజ్జావతులు-ముగ్ధాంగనలు, వాతాయనంబుల=కిటికీల, చలినిగ్గులగనిన్=చల్లనికిరణములకు గనియైన చంద్రునిని, కని, ధూర్త...వదనంబు=దుండగవు చెలికత్తె నవ్వుతోడి మొగము, పొదవు=కప్పుచున్న, నున్నచేలల = నునుపుగల వెలి పుట్టములవయిన, చిన్నారి నెఱికలన్=సొగసయిన పైఁటపావడలు, నునుపుఁగల సలిపంపు పైఁట పావడలనుట. నెఱికలనఁగా పైటపావడలనుటకు,

‘ అచ్చవెన్నెలచాయ నవఘళింపఁగఁజాలు, నిద్దంపు వెలిపట్టునెఱికగట్టి.’

పైఁటపావడయైననే పొదవుకొనుట కుపయుక్తము, చెన్నారుమిసమిసల=మిసమిసయను కాంతులను, కన్నంబునిడి కైకొనియెనో యనన్=కన్నమిడి దొంగిలించెనో యన్నట్లుగా, సిగ్గరికత్తియలుగావున పైఁట తివియఁగా ఈడిగిలంబడుట.తనులతల యడంకువలును,తఱుఁగనివడంకులును వలువనుడి తనుదాన వీడుటకు హేతువు. ఇట్టట్టుగదలలేకుండుటకు హేతువు, పెనిమిటిని వీడిన వలునల కాలివ్రేళ్ల తోఁబట్టి తటాలున లాగివైచుట. ముడివీఁడి క్రిందికిజాఱుటచేతనే కాలివ్రేళ్లతోఁబట్టి లాగఁగూడుట. తటాలునలాగుట యాపడఁతులు దానిని దోడనేయెత్తి కట్టుకొనకుండుటకు. కావుననే వారి కౌఁగిలి గూండ్లదూఱుట.గూండ్లనుటచే పిట్టలవశముగా గూండ్లం జిక్కునట్లు అవశలై పతుల కౌఁగిళ్లం జిక్కుపడుట. ఎట్టకేలకున్=వారి వశమునం జిక్కుటచే తుట్టతుదకు వారిచిట్టకాలకొగ్గుట. ఇంతలో కిటికీ దాపునఁదోఁచిన చంద్రబింబమును,నగుమొగముతోడితమతోడి చెలికత్తె మొగమని భ్రమయుట. అట్టి మంతనపువేళ తొంగిచూచుటచే సఖిధూర్త. పైటపావడ పొదువుకొనుట సిగ్గరికత్తె గాన.

(j) పచ్చితేఱు నంగమచ్చంబులతోన్=పచ్చియాఱనిదంత క్షతాదిచిహ్నములతో, వచ్చి, తచ్చనవినయంబులు=కొడిగపు అడఁకువలు,తెచ్చుకొని,మోవిమాటి=పెదవినిగనఁబడనీక-అనఁగా పల్లొత్తులు తెలియునని తెలియకుండునట్లుగా ననుట, చేతులుగట్టుక నిలిచియు, ఇటకొనికి కాదేశము విచారణీయము. గట్టుకొనియనియే యుండవలయును. దీనిచే అతివినయములు పచరించుట తెలియునది. గట్టువాతనంబునకున్=ధూర్తత్వమునకు, దిట్టవిటుల=గడుగాయలైన విటకాండ్రను, జాలాగత కిరణదండంబులకున్=కిటికీలనుండివచ్చిన చంద్రకిరణములనెడి కఱ్ఱలకు, ముగుదమగువల=ముగ్ధస్త్రీల యొక్క, నఖర...గంబుల = గోళ్లమొఱుఁగుల యలలచేత, పొంగిపొరలెనోయనన్=పల్లొత్తులు తెలియకుండుటకై మోవిమాటుట, ఱొమ్మునందలి గుఱుతులు తెలియమికొఱకు చేతులుగట్టుకొనుట, ఈ యంగమచ్చము లెప్పటివోకాక పచ్చిదేఱుచున్నందున నిట్టిచేఁతలు, ఇట్టిచేఁతలు వినయమునకును గలవు గాన వినయము నటించుట అనఁగా మోవిమాటుట చేతులుగట్టుట వినయముచేతనే కాని గోపనము కొఱకుఁగాదని తెలుపుటకై. ఇట్టి యపరాధులగు విటులకు గట్టివాతనము ‘దిట్టలుగాన’. జాలాగత కిరణములు దండంబులవలె నుండుటచే పూదండలని భ్రమము. ఇట్లని భ్రమయుటయు ముగుదలుగాన,

వ్రేలించుటకు గట్టిత్రాళ్లనుగాక పూదండలను గొనఁజూచుట దండనముకాని దండనము. ఇందులకు ప్రేమతోఁ గోపము పిరిగొనుట కారణము. వట్టికోపమయినంగదా గట్టిత్రాళ్లు, రాగము గూడియుండుటచే పూలదండలే త్రాళ్లయినవి. గోళ్లకాంతి భంగములనుట పొంగిపొరలుటకు. అలలచేతనే వెల్లువపొంగుట, రాగముపూవువలె మెత్తనయినది. కోపము త్రాడువలె బరువయినది. రాగమును గోపమునుగూడఁగా, త్రాడును బూవునుగూడిన పూదండ దండనసాధన మయినది.

(k) వేఱొండుచాయలన్=మఱియొక వైపులను, కోయకకోయు=కోసినట్లు కనఁబడకయె కోఁతలు పెట్టునట్టి, కాయజు మాయకత్తులు = మన్మథుని మాయకత్తులయొక్క, రాయిడింబడలేక= శ్రమకు నోరువఁజాలక—అనఁగా మన్మథవేదనకుఁ దాళలేకయనుట. ధవళా...పథ్యంబులు = తెల్లనివస్త్రములు పూదండలు మైపూఁతలు వీనితోఁగూడిన వేషములు, పూని, మునిమాపు=సాయంకాలమందు, కర్పూర...కుంజంబులకున్ = కర్పూర పరంట్లచేత గుఱుతిడంబడిన సంకేతపుఁ బొదరిండ్లకు, వచ్చి, (ఇట తెల్లనివలువలు మొదలయినవి గట్టి సంకేతస్థలములకు వచ్చినారనుటచే జ్యోత్స్నాభిసారికలని తెలియునది.

'మల్లికా మాలభారిణ్య స్సర్వాఙ్గీణార్ద్రచన్దనాః ।
క్షౌమవత్యో వలక్ష్యన్తే జ్యోత్స్నాయా మభిసారికాః' అని లక్షణము.

అఖిలకుంజంబులు = అన్నిపొదలును, అట్లయుండన్ = కర్పూర కదళికాంకిత సంకేత నికుంజములవలెనే, యుండఁగా—అనఁగా వెన్నెలచేత నన్నిపొదలును కర్పూరకదళికాంకిత సంకేత నికుంజములవలెనే యుండెననుట. కొండొకసేపు=కొంతసేపు, వివరింపలేక = తమసంకేతించిన పొదరిండ్లివి యని యేర్పఱుపనేరక, వలపువలనన్ = కర్పూరవాసనవలన, నిజసమయ నిలయంబులు = తాము సంకేతముచేసిన పొదరింటి పట్టులు, ఈఁగు=తూలు, ఇత్వరీజనంబుల ('పుంశ్చలీధర్షణీ బంధక్యసతీ కులటేత్వరీ' అమ.) విటకత్తియ గుంపులయొక్క, మనంబులు, అరయవలసి=తెలిసికొనవలసి, మార్గకలు=విటులు,మాటునకున్=చాటునకు, అరణ్యరోదనంబు=అడవి యేడుపన్నమాట, నిశ్శబ్దంబుగాన్= చప్పుడు లేకుండునట్లు - ఎలుఁగు వినఁబడనట్లు గాననుట, చేయునదిలేక = ఏమిచేయుటకుఁ దోఁపక, చెయ్వులు=చేష్టలు, (ఇట 'అవ్వేళ నెవ్వరింగానక నిశ్శబ్దముగా నేడ్చుచున్నా రనుటచే నాయికలు విప్రలబ్ధలును బరకీయలునని తెలియునది.

'క్వచిత్సంకేతమావేద్యదయితేనాథ వంచితా ।
స్మరార్తా విప్రలబ్ధేతి కళావిద్భిః ప్రకీర్తితా' అని లక్షణము.

అన్నెగులు = ఆవంతను, వారింపన్ = పోఁగొట్టుటకు, సన్నిహితులై = దగ్గఱవచ్చినవారై, వారి కన్నీరు=ఆస్త్రీలకన్నీరు, అన్నెలంతల=ఆవిటకత్తియల, విస్మయసూచన...ధట్టంబులన్=అచ్చెరుపాటును దెలుపుకన్నుల కాంతుల సమూహముచేత, నిట్టవొడిచెనోయనన్=నిగ్గినదో యనునట్లుగా, కాయజునికత్తులు మాయమైనవి గావుననే, కోయకకోయుట. ధవళాంబరాదులు ధరించుట ధవళమగు వెన్నెలలో తాము తెలియరాకుండుటకు. రూపువలనఁగాక వలపువలనం దెలియుట తెల్లని వెన్నెలలో నన్నిపొదరిండ్లును కర్పూరకదళికాంకితములగు నికుంజములవలెనే యుండుటంబట్టి. నిశ్శబ్దముగా నేడ్చుట పరకీయలుగాన, అరణ్యరోదనంబు = అడవిలో నెంతయేడ్చినను విను దిక్కులేనట్లు, తమ యేడ్పులునని. ఇందులకు 'కిమరణ్యే రుదితంమయా' యని శాకుంతలము. విస్మయరసమును తెలుపు లోచనప్రభలును దెలుపు.

'ధవళ బహుళముగ్ధా దుగ్ధకుల్యేవదృష్టిః' (ఉత్తరరామ)
'కటాక్షాః క్షీరోద ప్రసరదురువీచీ సహచారాః' (ప్రతాపరుద్రీయమ్.)

కావుననే వానిచేఁ దెలివెన్నెల నిట్టవోడుచుట. మఱియుఁ బెక్కునెలవులన్ = మఱియు ననేక స్థలములందు, కళలయిక్కువలన్ = మన్మథ కళాస్థానములను, కలసినయదనన్ = సంభోగించిన సమయమందు, మదన కదనంబునన్ = మన్మథయుద్ధమందు, సడమదంబులు=బడలి నలినలియైనవి, అగు, అంగంబులన్=దేహములయందు, అంగదట్టంబులు, మార్పడవై చుకొని=కట్టుకొనవలసిన ప్రక్క తప్పి వేఱుప్రక్కవైచుకొని లేక స్త్రీపురుష లొకరిపావడల నొకరుగప్పుకొని, చందమామ గుటి కలుగ్రోలు=చంద్రకిరణములు నాస్వాదించుచున్న, మందయానల=స్త్రీలయొక్క, చెక్కులవెలుంగు= చెక్కులందు ప్రతిఫలించిన, వలివెలుంగుల = చంద్రుని, మీమొగం... జుమీ = మీ ముఖములయందలి మిలమిలకాంతులను సంగ్రహించుకొను కొఱకు వచ్చినాఁడు సుమీ, వెన్నెలబచ్చు=వెన్నెల నాణె గాఁడు - అనఁగా చంద్రుఁడు, వీఁడు, ప్రుచ్చు=దొంగ, కాఁబట్టి, ఇచ్చోట మసలుట=తడవుగా నుండుట, నారులన్ = స్త్రీలను, పునారతంబునకున్ =పున స్సంభోగములకు, ఎలయించి=ఉల్లసింపఁ జేసి, కొనిపోవు=తోడ్కొనిపోవు, లేక, ఎలయించికొని=కూడఁదీసికొని, పోవు, వలకారులు=విట కాండ్రయొక్క, జారుకొప్పులు = సేసకొప్పులనుండి - జారుసిగలనుండి, తొరఁగు = రాలుచున్న, విరిగుత్తుల=పువ్వుగుత్తులతోడ, పొత్తుగలసెనోయనన్ = జతఁగూడినదో యన్నట్లుగా, (అంగములు సడమదంబులనుట కళలయిక్కువలు దెలిసి కలసినందున. అంగదట్టంబులు మార్పడవైచుకొనుటయు అంగములు సడమదము లగుటంజేసి, పావడలు సరిగాఁగట్టుకొనుటకును గూడ సత్తువలేనంత సడమద మును జెప్పుటచే గాఢరతి తెలియునది. బడలికదీఱుటకై యుప్పరిగల బయళ్లకురాక. చందమామ గుటకలు గ్రోలుట ఆప్యాయనమునకు. అందులకై మొగము పయికెత్తఁగా చెక్కుటద్దంబులందు చంద్రుఁడు ప్రతిబింబించుట.

వెన్నెలబచ్చనుట బచ్చువాండ్రకే మోసపుచ్చుటలు సహజముగాన చెక్కుల ప్రతిబింబిం చిన చంద్రుఁడు ముఖకాంతి నపహరింప వచ్చినాఁడని మసలరాదనుట నాయకులు మరలఁ బునా రతికిఁ గొంపోవుటకు. దీనిచే నాయికలును ముగ్ధలని తెలియునది.

(1) వెలసి=ప్రకాశించి, అభివ్యక్త... గావునన్ —అభివ్యక్త = ప్రత్యక్షమయిన, శుద్ధబ్రహ్మ వర్ణంబు=పరిశుద్ధాక్షర బ్రహ్మముగావున, ఉర్విఁగలవారలెల్లన్ =భూమిలోఁ గలవారినందఱను, సర్వ జ్ఞులన్ జేయుచున్ =సకల విద్యాపారంగతులను జేయుచునని యర్థము. లేక శుద్ధవర్ణబ్రహ్మమనఁగా-ధవ ళవర్ణబ్రహ్మము. వారుఁడు. ఆదేవుఁ డభివ్యక్తుఁడైన తాను సర్వజ్ఞుఁడు గనుక నుర్విఁగలవారినెల్ల సర్వజ్ఞు లను జేయుచున్నాఁడనఁగా సారూప్యదేదీప్యమానులం జేయుచున్నాఁడని యర్థాంతరము. అభివ్యక్త ధవళవృద్ధమనియు ఉర్విఁగలవారినెల్ల సకలపదార్థజ్ఞానము గలవారిని జేయుచున్నదనియుఁ జంద్రికా పరమయిన భావము. బ్రహ్మమనఁగా 'బృహబృహివృద్ధౌ' అనెడి ధాతువువలనఁ బ్రవృద్ధమైన వస్తువని తెలియునది.

తారవాద... చేయుచున్ —(తారవాదమనఁగా రసగుటిక - తరుసంబంధియైనది తారవము అనఁగా వృక్షరసము - దానిని భక్షించునది తారవాదములేక, తారమనఁగా వెండి, దానియొక్క వాదము తారవాదము. తక్కువలోహముల నెక్కువ లోహములుగాఁజేయు విద్య వాద మనఁబడును.

తారవాద ధౌరేయముగావునఁ గొండలనన్నిటిని వెండికొండలుగాఁ జేయుచునని యర్థము—తార మనఁగా నక్షత్రమును నపుంసకలింగమును. తారవాద ధౌరేయమనఁగా నక్షత్రముతో రచ్చలాడుట యందు గట్టిది—అనఁగా నక్షత్రకాంతితో నొడ్డారించి మించునది యనియును కొండలనెల్లఁ దెల్లఁగాఁ జేయుచున్నదనియును జంద్రికాపరమయిన భావము.

పద్మా...విశేషంబు—పద్మా=లక్ష్మీదేవికి, హిత=ప్రియుఁడయిన విష్ణుదేవునియొక్క, పాద= అడుగువలన, ప్రభూత=పుట్టిన, నూతన = క్రొత్తయగు, స్రోతోవిశేషంబు = ప్రవాహవిశేషము గనుక - అనఁగా విష్ణుపాదములందుఁ బుట్టిన భాగీరథి గనుక, అఖిలభు...గించుచున్ =సమస్తలోకములయొక్క, పాతకములను భంజించునని యర్థము - పద్మ=కమలములకు, అహిత=శత్రువైన చంద్రునియొక్క, పాద=కిరణములవలన, ప్రభూత=పుట్టిన, నూతనస్రోతో విశేషంబుగావున—ప్రభా రూపమయిన ప్రవాహముగాన - వెల్లివొడిచిన వెలుఁగుగాన యనుట, అఖిల...అడంగించుచున్=సమస్తలోకముల యంధకారములను నివారించినదని భావము. ఇట చంద్రికయందుఁ జంద్రకిరణ జనితస్రోతోవిశేషారోపము చేసినాఁడుగనుక రూపక మలంకారము. ఇది కవికల్పితముగాన యుత్ప్రేక్ష యనరాదు. 'స్వర్గఙ్గావిమనస్కకోక వదనస్రస్తా మృణాళీలతా' అనుచో స్వర్గంగా...స్రస్తమైన మృణాళీలత కవికల్పితమయ్యును రూపకాలంకారమున కుదాహరింపఁ బడియున్నది.

పంకజ భవాండమండపంబు = బ్రహ్మాండమనెడు మండపమును, సంకుచేసిన పొంకంబునన్= తెల్లరంగుచేసిన విధమున-సంకువుల సున్నముతో పాలగచ్చు చేసినట్లనుట, ఉల్లసిల్లుచున్, అకల...చీనంబై—అకలంక=నిర్మలమయిన, మీనాంక = మన్మథునియొక్క, నిరంకుశ=అడ్డులేని, యశః= కీర్తియొక్క, మరీచి=కాంతితోడ, సధ్రీచనంబై=సమానమై - అనఁగా మన్మథుని యశస్సుకాంతియో యనునట్లుగా - మన్మథోద్దీపకముగా ననిభావము, విజృంభించు సమయంబునన్ = చెలరేఁగునపుడు.

శా. అచ్చంపుం దెలి నిండువెన్నెలలతో నబ్జారి వచ్చెం గడున్
హెచ్చెం బచ్చని వింటిజోదు చలిగా నేప్పెతెంచె నిచ్చోటము
చ్చిచ్చుం గూడిన నోర్చునే చెలి యయో చెల్లంచు నాళీజనం
బిచ్చన్ మెచ్చఁగ మంజువాణి సకలాభీష్టక్రియాధుర్య యై. 24

అ. మంజువాణి, అబ్జారి=చంద్రుఁడు, అచ్చంపు...వెన్నెలలతోన్, వచ్చెను, పచ్చనివింటి జోదు=మన్మథుఁడు, ఏతెంచెన్ = వచ్చెను, ముచ్చిచ్చును = మూఁడగ్నులును, చెలి=గిరికాదేవి, అయోచెల్లంచున్ = అయ్యయ్యో నేఁజెల్లనని పలుకుచు, ఆళీజనంబు = చెలికత్తెలగుంపు, ఇచ్చన్ మెచ్చఁగన్=మనసున మెచ్చునట్లుగా, సకల...ధుర్యయై = అన్నికోరిన పనులభారము వహించినదై - నెఱవేర్పఁ బూనినదై మీఁదికన్వయము.

సీ. రిక్కరాయనికళల్ చెక్కుగీటకమున్న, వెడతూపు దృగ్వీథిఁ బడకమున్న
మెలతుమ్మెదలదిమ్ము తలఁగ్రమ్మకయ మున్న, చిగురు చేపట్లకు డిగకమున్న
కలికికోయిల గళగ్రహము సేయకమున్న, రాచిల్కమాటకు రాకమున్న
నిసువు తెమ్మెరదంట యసువులంటకమున్న, రాయంచ కాళ్లఁ దౌలకయమున్న

తే. యబ్జముఖులార యేఁబోయి యచలకన్య, యుత్తలము దెల్పి వసురాజుఁ దెచ్చి త్తమరసి
వత్తునత్యంతశుభవార్తఁ దెత్తుననుచుఁ, గొమ్మహారంబుపూని యేఁగుట్టయునిచట.

అ. అబ్జముఖులార = ఓచెలియలార, రిక్కరాయనికళల్ = చంద్రునికళలు, చెక్కుగీటకమున్న=బుగ్గలుపాడువకమునుపే—(ఇట చంద్రకళలు చెక్కుగీటు అనుటచే రెంటికిని సాదృశ్యము స్ఫురించెడిని. ఇట్లె మీఁదనెల్ల నొక్కొక్కదానికిని సాదృశ్యవ్యంజకముగా విధేయము విధించియుండుట తెలియునది). వెడతూపు=వెడవింటిపూఁదూపు లేక వెడయనఁగా వెట్టిబుట్టించునట్టి మన్మథుని బాణము - అనఁగా ఉన్మాదనమైన యరవిందబాణము. అది, దృగ్వీథిక్ =చూపుత్రోవను, పడకమున్న=పడుటకుమునుపే - ఇట కమలములకుచూపుతోడి సాదృశ్యసంబంధము స్ఫురించెడిని. మన్మథునిపరికరములగు చంద్రాదులలో చంద్రుఁడును, అరవిందబాణము నిట చెప్పఁబడినవి. బుగ్గలుపాడుచుటయు, దృష్టిపథమునఁ బొడకట్టుటయుఁ బ్రతికూలుర చేష్టితములని తెలియునది. మన్మథబాణములు ['ఉన్మాదనస్తాపనశ్చ శోషణః స్తమ్భన స్తథా । సమ్మోహనశ్చ కామస్య పఞ్చ బాణాః ప్రకీర్తితాః'] అని యుండుటంబట్టి ప్రథమబాణమయిన పద్మము ఉన్మాదకముగాన వెడదూపనఁబడినది.

ఎలతుమ్మెదలదిమ్ము=కొదమతేంట్ల రొద,తలఁగ్రమ్మకయమున్న=తలపట్టుకొనకమునుపే, చిగురు, చేపట్లకు =చేయిపట్టుకొనుటలకు-గ్రుద్దులాటకు, ఁగకమున్న,'తుమ్మెదలదిమ్ము' తుమ్మెదల సమూహము తలఁగ్రమ్ముటయనుటచే తుమ్మెదగుంపులకును తలఁగ్రమ్మిన కురులకును, 'చిగురు''చే'అనుటచే నీరెంటికిని, సాదృశ్యము వ్యంజితము. ఇటదిమ్ము శబ్దము సాదృశ్యపరముగా సమూహవాచకము 'తలదిమ్ముఘటించుఁ దుమ్మెదలదిమ్ముచటన్' (విజయవిలాసము) మన్మథపరికరములోనివి తుమ్మెదలును చిగుళ్లును. తలగ్రమ్ముటయు చేపట్లకు దిగుటయు ప్రతికూలుర లక్షణములు.

కలికికోయిల=సొగసయినకోకిలను, గళగ్రహము...మున్న= గొంతుపట్టకమునుపే, రాచిల్క, మాటకురాకమున్నె=వాదునకు రాకమునుపే,కోయిలయు రాచిల్కయు మన్మథునిపరివారము. కోయిల గళగ్రహము; 'రాచిల్క, మాటకురాక' యనువీనిచే సాదృశ్యమువ్యంజితము. గళగ్రహముసేయుట విరోధిలక్షణము. ఇటనేయార్థమున ప్రతికూలించుట. ఇందులకు 'గళగ్రాహీ పౌరందరపురవనీ పల్లవరుచాం । దినప్రాథమ్యానాం తపనమహసామాదిమగురుః సమింధే బంధూకస్తబకసహయోద్ధా దిశిదిశి । ప్రసర్పన్ కామాక్ష్యాశ్చరణకిరణానామరుణిమా' ॥ (మూకపంచశతి) మాటకువచ్చుట యనఁగా జోలికి లేక (వాదునకు) వచ్చుట. 'నామాటకు రావలదు' అని లోకోక్తియు. కానమాటకు వచ్చుటయు ప్రతికూలుర లక్షణము.

నిసువు తెమ్మెరదంట=బాలసమీరుఁడనుగడుసరి, అసువులంటకమున్న = ప్రాణముల నంటకమునుపే, రాయంచ, కాళ్లఁదొలకయమున్న=కాళ్లయందుఁ బెనఁగొనకమునుపే-బాలసమీర కలహంసములు మన్మథునివర్గములోనివి.నిసువు తెమ్మెరలకును అసువులకును సాజాత్యసంబంధము వ్యంజితము.కలహంసకును కాళ్లదవులుటకును సంబంధము. సంబంధస్ఫూర్తియందు, కాళ్లదవులుటయనఁగా పోనీక కాలనుబెనఁగొనుట. 'అంచలుగట్టి కాలితొడుపై చననీవుగదమ్మ ప్రోదిరాయంచ లివేటిసంగడములు' (మనుచరిత్ర) పోనీక కాలి నరికట్టుటయని ప్రాతికూల్యపరమయిన యర్థము. ప్రాణము లంటుటయుఁ బ్రాతికూల్యలక్షణమే. ఏఁగి=పోయి, అచలకన్య ఉత్తలము=గిరికవెత, అరసి=పరిశీలించి, కొమ్మహారంబుక్ =గిరికముత్తెపుఁబేరును - ఆనవాలుకొఱకనుట.

'ఇట చెక్కుగీటక, దృగ్వీథిఁబడక' ఇత్యాదులను నొక్కయర్థమున సాదృశ్యసంబంధములును స్ఫురించునట్లును మఱియొక యర్థమునఁ బ్రాతికూల్యము వివక్షితమగునట్లును బొందుపఱచినాఁడు.

ఎట్లన - రిక్క...మున్న=చంద్రకళలవంటి చెక్కుల తళతళలు-చెక్కుగీటుట, వెడ...మున్న=వెడ తూపయినతామరవంటికన్నులు-కన్నులగుట, ఎల...మున్న=తుమ్మెదలవంటి కురులు-తలగ్రమ్ముట,చిగు రు...మున్న=చిగురువంటిచేతులు-చేతులగుట, కలికి...మున్న=కోకిలవంటియెలుగు-గొంతునఁగలుగు ట,రాచి...మున్న=రాచిల్కమాటలు-మాటకు(మాటలాడుటకు)వచ్చుట,నిసువు...మున్న=లేతగాడ్పు వంటి ప్రాణములు-ప్రాణములుగనుండుట, కలహంస...మున్న, కలహంసవంటి నెన్నడలు-కాళ్లకు దగులుట యని యిట్లు సాదృశ్యమునకు సాధర్మ్యమునకు వ్యంజకములుగా క్రియలు జోడించినాఁడు. మన్మథపరికరములగుటచే బుగ్గలుపొడుచుట, కంటఁబడుట, తలగ్రమ్ముట, చేతిగ్రుద్దులాడక దిగుట, గొంతుపట్టుట, వాదుకువచ్చుట, ప్రాణములనుగలంచుట, కాళ్లు నరికట్టుట, యని యర్థములు దెలియు నది. ఇట చంద్రాదివస్తువులు తటస్థోద్దీపన విభావములుగనుక విరహవేదనా హేతువులని దెలియునది. అ౦. అతిశయోక్తి.

శా. క్రీడామందిరజాల మార్గములచక్కిక్కన్ నిక్కి జాబిల్లిఱా
గోడల్ నీరుగ జాఱఁ ద్రోచి నెలతక్కుల్ చొచ్చి వెన్నాడిమై
నాడం గోమలి యోర్వలేక వలవంతం బద్మినీజాతికిం
గీ డౌనుగ్రశిఖామణిం బలికె నక్షీణానులాపంబులన్. 26

అ. నెలతక్కుల్=చంద్రకిరణములు-గిరిక, క్రీడా...చక్కిన్=కేళీగృహముయొక్క కిటికీల సందులవైపుగా, నిక్కి=సాగి- లోనికినిగిడి యనుట. జాబిల్లిఱాగోడల్ = చంద్రకాంతపు గోడలను, నీరుగ...త్రోచి=నీరయికరఁగి జాఱిపోవునట్లుచేసి, (ఇట వెన్నెలతక్కులను దొంగలుగాఁగాని, పగ వారుగాఁగాని రూపించుటచే దొంగలు కిటికీలగుండ నిక్కిచూచి,) 'గోడలు నీఱుగన్, దుమ్ముగ గూలఁద్రోచి' యని యర్థాంతరము) చొచ్చి=లోపలఁజొరఁబడి, వెన్నాడి=వెంటఁబడి, మైన్=దేహ మును, ఆడన్=కాఁడఁగా - గ్రుచ్చుకొనఁగా, కోమలి=గిరిక, వలవంతన్= విచారముచేత, పద్మినీ జాతికిం=పద్మినీజాతిస్త్రీలకు - (తామరతీఁగలకని భావము) కీఁడు=సేగి, ఔ, ఉగ్రశిఖామణిన్= క్రూరజనులందు మిన్నయైనవానిని "ఉగ్రః కపర్దీ శ్రీకంఠశ్శితికంఠః కపాలభృత్" అన్నట్లు, ఉగ్రు డనఁగా శివుఁడు-అతనిచూడామణియైన చంద్రుననిభావము. అక్షీణానులాపంబులన్=తక్కువకాని-మాటిమాటికి చెప్పెడు-మాటలచే-అనఁగా రెట్టింపుమాటలచేత'అనులాపో ముహుర్భాషా' అ. పలికెను.

క్రీడా...త్రోచి=పగవారు (లేక దొంగలు) కిటికీలగుండ నిక్కిచూచి గోడల రాలఁగూలఁ ద్రోచి లోపలఁదూఱి వెంటఁబడి దేహము నాయుధములచేఁ గాఁడునట్లనుట. ఓర్వలేకపోవుట'కో మలి'గాన. కీడగుట పద్మినీజాతికేలయన్నచో వారు మిక్కిలియుఁ బతివ్రతలు - పతివ్రతులకే కదా యుగ్రశిఖామణులవలనఁ గీడు. ఆలాపములు 'అక్షీణ'ములగుట ఓర్వలేమిచేత. అవి ముహుర్భాషణ ములగుట 'వలవంత'చేత. అల. సమాసోక్తి; పర్యాయోక్తము 'పద్మినీజాతి'పదగతశ్లేషానుప్రాణితము,

శా. రాజీవాక్షుల నేఁచుపాతకివి చంద్రా రాజవా నీవు నీ
రాజత్వంబునఁ జక్రముల్ మనియెనో రంజిల్లి సత్సంతతుల్
తేజం బందెనొ డిందెనో యహిభయోద్రేకంబు తాఁ జెల్లరే
రా జై పుట్టుట రశ్మిమాత్రఫలమే రా జౌట దోషార్థమే. 27

అ. చంద్రా, రాజీవాక్షులన్=తమ్మికంటులను, ఏఁచుపాతకివి=బాధించునట్టి పాపాత్ముఁడవు, తామరలవంటి కన్నుల వారుగాన తామరలకుఁ బగయైననీవు వారినిబాధించుట యుక్తి, రాజీవాక్షు

విశేషణము సాభిప్రాయము. రాజవానీవు=నీవు రాజవగుదువా - కానేరవనుట. (రాజనామము గల వాఁడని భావము) నీరాజత్వంబునన్=నీప్రభుత్వముచేత (నీచంద్రత్వముచేతనని భావము) చక్రముల్=రాష్ట్రములు (చక్రవాకములని భావము), మనియెనో=బ్రతికినవా, సత్సంతతుల్=సత్పురుష సమూహములు (నక్షత్రసమూహములని భా.) రంజిల్లి, తేజంబందెనో = మహిమనుబొందెనా, (ప్రకాశమునుబొందెనా యని భా.) అహిభయోద్రేకంబు = ('మహీభుజామహిభయం స్వపక్షప్రభవం భయమ్') స్వపక్షమువలని భయము (సర్పమయిన రాహువువలని భయమును), తాన్=తాను, డిందెనో=తగ్గెనా, చెల్లరే=నేఁజెల్లబో, లేక, తాఁజెల్లరే= నేఁజెల్లఁబో, రాజైపుట్టుట=లోకమందు రాజాగా జన్మించుట. (రాజుఅను పేరితోఁబుట్టుటయని భా.) రశ్మిమాత్రఫలమే= ధనముగడించుమాత్రపుఫలమా - (కిరణసంపత్తిమాత్రఫలమాయని భావము) రాజౌట, దోషార్థమే. ('రాజ్యాన్తే నరకం ధ్రువమ్' అన్నట్లు) పాతకముకొఱకా - (రాత్రికొఱకా యనిభావము. చంద్రుఁడు నిశాకరుఁడనుటనిట యనుసంధించుట తెలియునది.)

రాజగుటకు రాష్ట్రములు బ్రతుకుటయు, సత్పురుషులు మహిమనొందుటయు స్వపక్షభయములేకుంటయు ఫలము. ధనముగడించి దోషములాచరించుటగాదని యర్థము. చంద్రునిచే చక్రవాకములు కుందునొందుటయు చుక్కలు కాంతిమాయుటయు రాహుగ్రహణభయమును కిరణప్రసారమును, రాత్రియగుటయుఁ గలుగుట ప్రకటము. అల. శ్లేషము.

ఉ. ఇంతుల నేఁచుపాతక మది యింతట నంతటఁ బోదు పాంథలో
కాంతక నిన్ను ఘోరతమమై ఘనమై యజహత్కళంకమై
వంతులఁ బెట్టి యాఱు పది వ్రక్కలు సేయక పూర్వపక్షపుం
గంతుల కేమి చూచెదవు గా తుది నీబహుళార్తిభేదముల్. 28

అ. పాంథలోకాంతక=విరహిజనులను తుదముట్టించువాఁడా, ఇంతులన్ = స్త్రీలను, ఏఁచు పాతకము అది= బాధించెడి యాపాపము, ఇంత నిన్నున్, ఘోరతమమై = మిక్కిలియు ఘోరమై, తమప్ ప్రత్యయము. 'రాహౌధ్వాన్తే గుణేతమః' వి. అన్నట్లు తమస్సనఁగా రాహువు గనుక భయంకరరాహు రూపమైయని భావము.) ఘనమై=మిక్కిలిగాఁ బెరిఁగినదై- (మేఘమైయనిభావము.) అజహత్కళంకమై=విడువని యపవాదమై - (విడువని చిహ్నమైయని భావము. 'కళంకోంకాపవాదయోః' అ. ఇట రాహు మేఘ కళంకముల నపహ్నవించి పాతకత్వ మారోపితమైనది, పాతకము నీలవర్ణమని కవిసమయము.) వంతలఁబెట్టి=బాధలనుబెట్టి, ఆఱుపది వ్రక్కలుసేయక = పదియాఱు తునకలుగావింపక (పదియాఱుకళలుగల వాఁడనిభావము.) ఇంతటనంతటన్ పోదు=ఇంతటంతటితో తప్పిపోదు. కాఁబట్టి పూర్వపక్షపుంగంతులకేమి = ముందటికిరాని యిప్పటిదుముకుల కేమివచ్చె - (శుక్లపక్షపు దినదినాభివృద్ధి కేమివచ్చెననిభా.) తుదిన్=కడపట, నీబహుళార్తి భేదముల్=నీతఱుచయిన యనుట అలం. శ్లేషసంకీర్ణాపహ్నవము. వ్యథవలని దుఃఖములను - (బహుళపక్షమందలి క్షయమునని భావము.) చూచెదవుఁగా=చూచెదవుపో.

సీ. కమలించెఁ గాక యంగజవిరోధిశిరోధిఁ, దల కెక్కఁ జాలెనే హాలహాలంబు
క్రాఁచెఁ గాక పయోధికాండప్రకాండంబుఁ, బైకిఁ బొంగించెనే బాడబంబు
తూఁటెఁగాక ముకుందతుందప్రఘాణంబు, వెడలెనే యొదఁ గాలివిపినకీలి
యడఁచెఁ గాక శిలోచ్చయచ్ఛదాహంకృతుల్, గరఁచెనే నీరుగాసురపహేతి

తే. నీకరణి నిట్లు దయలేక లోక మేర్చు, నీకరణి యైన యలయత్రినేత్రమునకు
ఖరకరాలోకగాఢనిష్ఠురతపోగ్నిఁ, బెటిలిపడ కున్కి భరమె కృపీటజన్మ. 29

అ. కృపీటజన్మ-(కృపీటమనఁగా జలము, దానివలన జన్మముగలవాఁడు అగ్నియు చంద్రుఁడునుగనుక) అగ్నిహోత్రుఁడా(చంద్రుఁడా యనిభా.)ఇట చంద్రుని నగ్నిహోత్రునిఁ గానధ్యవసించి యర్థము చెప్పుట తెలియునది. హాలహాలంబు=కాలకూటము, అంగజవిరోధి శిరోధి=(మన్మథుని శత్రువయిన) శివుని కుత్తుకను, కమలించెఁగాక=కమలి నల్లఁబడునట్లు చేసెనుగాని, నీకరణిన్=నీవలె, తలకెక్కఁజాలెనే= నెత్తికెక్కనేర్చెనా, (చంద్రుఁడు శివుని శిరసున భూషణమైనాఁడని భా.)

బాడబంబు=బడబాగ్ని, పయోధి...ండంబు=సముద్రముయొక్క మేలయిన నీటిని, క్రాఁచెఁగాక=కాలునట్లు చేసెనుగాని; (నీకరణిన్) పైకిన్, పొంగించెనే=ఉబికించెనా(చంద్రోదయమందు సముద్రము పొంగుచున్నదని భావము.) విపినకీలి=దవాగ్ని-కారుచిచ్చు, ముకుందతుందప్రఘాణంబు=శ్రీకృష్ణుండయిన విష్ణుని పొట్టయనెడు తలవాకిటి ముందటి చిన్నయింటిని, ('ప్రఘాణప్రఘణాలిందాః బహిర్ద్వారప్రకోష్ఠకే' అ.) తూఁటెఁగాక=తూఁటియడఁగి పోయెనేకాని, నీకరణిన్,ఎదఁగాలి = హృదయమును దహించి, వెడలెనే=బయలువెడలెనా, (చంద్రుఁడు విష్ణువు హృదయమునుండి పుట్టినాఁడని శ్రుతి. కృష్ణుఁడుగోపాదులను జుట్టుకొన్న దావాగ్ని మ్రింగి వారిని గాచుట భాగవతసిద్ధము.) సురపహేతి=దేవతలకధిపతియైన యింద్రుని ఆయుధమయిన వజ్రము, శిలో...తుల్—శిలోచ్చయ=కొండలయొక్క,ఛద=ఱెక్కలయొక్క,అహంకృతుల్=అహంకారములను,అడఁచెఁగాక=అడఁగించెనేకాని, నీరుగాఁ గరఁచెనే,(చంద్రకిరణములుచేతఁ జంద్రకాంతపుఱాలు కరఁగుచున్నవనిభావము.)

(కాలకూటాదులగు నాలుగింటికంటె నీవు వేంద్రమయినవాఁడవు.) ఏర్చు = దహించుచున్న, నీకున్=అగ్నిహోత్రుఁడయిన నీకు, అరణి=పుట్టుచోటు, ఐన, అల అత్రినేత్రమునకున్, ఖర ... గ్ని—ఖరకర+ఆలోక - (వేంద్రమయిన కిరణములుగల) సూర్యుని చూచుటయనెడి, గాఢ=గాటమును, నిష్ఠుర=కటువునయిన, తపోగ్నిన్=తపస్సువలని యగ్గిచేత, పెటిలిపడక ఉన్కి=చిట్లిపడిపోక యుండుట, భరమె=బరువా - కాదనుట. కాలకూటాదులను మించిన పెనువేంద్రముగల నీవంటి నిప్పునుగన్న యత్రికంటికి సూర్యునిఁజూచుచుఁ దపముసలుపుట యొక కష్టముగానేరదనుట.

'కృపీటజన్మ' అని చంద్రు నగ్నిగా నధ్యవసించుట తత్తీవ్రత్వాతిశయసమర్థనమునకై. సాటికిఁ దెచ్చిన కాలకూటాదులును నగ్నిస్వరూపములుగాన అత్రితపమును నగ్నిగా రూపించినాఁడు. అయగ్నులనెల్ల మించిన నీబోఁటియగ్నినిదాల్చిన వానికి నీయగ్గి యెంతమాత్రమనుట. ఖరకరశబ్దము సాభిప్రాయము. కాలకూటాదులకంటె మిక్కిలివేంద్రమయిన వాఁడవని తాత్పర్యము. అలం.పరికరము వ్యతిరేకధ్వనియుఁ రూపకమును.

మ. విషరాశిన్ జనియింపవో విషసహావిర్భూతి వాటింపవో
విషభృన్మార్గము నంటవో విషధరుల్ వేష్టింపఁ గాలూఁదవో
విషభుక్ఫాలికఁ బిన్ననాఁడె కనవో విఖ్యాతకౌటిల్యమున్
విషమం బెట్లగు నీకు జీవకృతవిద్వేషంబు దోషాకరా. 30

అ. దోషాకరా=పాపములకు ఆకరమైనవాఁడా - (రాత్రినిజేయువాఁడని భావము. దోషాశబ్దము రాత్రివాచకమయినపుడు, అవ్యయము. 'దోషానక్తం రజనావపి' అ.) విషరాశిన్=విషపుంజమందు - (విషమనఁగా జలమును గనుక జలరాశియందు జనించినాఁడని భా.) విషసహ, ఆవిర్భూతి

వాటింపవో=కాలకూటవిషముతోఁగూడఁ బుట్టుటను కయికొనవా, (కాలకూటమును చంద్రుఁడును సముద్రమునఁ బుట్టినవారని భా.) విషభృత్ మార్గముఁ అంటవో=విషమును భరించినవారి పద్ధతిని అవలంబింపవా - (విషభృత్ =అనఁగా జలమును భరించిన మేఘములు- వానిమార్గము ఆకాశముగనుక ఆకాశము నంటియున్నవాఁడని భావము.) విషధరుల్ వేష్టింపఁ=విషమును ధరించినవారు బలసియుండఁగా, విషభుక్ఛూలికన్=విషమును దిన్నవాని తలయందు, కాలూఁదవో=నిలిచియున్నావుగావా - (విషధరులనఁగా సర్పములు, విషభుక్కు=కాలకూటమును దిన్న శివుఁడు. అతనికి భూషణములు సర్పములు, గనుక సర్పములు పరివేష్టింపఁగా శివుని శిరస్సునం దున్నవాఁడని భా.) ఇందులకు

'సర్పప్రోతకలాపశుక్తిశకలైర్వ్యాకీర్ణ సచ్ఛేఖరమ్' అని యున్నది.

పిన్ననాఁడే=బాల్యమందె, విఖ్యాత కౌటిల్యముఁ కనవో = ప్రసిద్ధికెక్కిన కుటిలభావమును, బొందవా - (బాలచంద్రుఁడు కుటిలుఁడు అనఁగా వంకరగానుండునని భావము.) కాఁబట్టి, నీకుఁ=ఇట్టివాఁడవయిన నీకు, జీవ...ద్వేషంబు = ప్రాణులందుఁ జేయఁబడిన విరోధము, విషమంబు=అనర్హమయినది. ఎట్లనఁ - అర్హమే యగుననుట. (జీవశబ్దము 'జీవః ప్రాణిని గీష్పతౌ' విశ్వము. బృహస్పతికిని జెల్లును గాన బృహస్పతియందుఁ జేయఁబడిన విరోధము విషయముగా లేదని భావము. 'జీవ ఆంగీరసో వాచస్పతిశ్చిత్ర శిఖండిజః' అని అమరుఁడును.)

విషమున పుట్టుక. తోఁబుట్టువిషము. నడవడి విషవంతులది. కూడికవిషధరులతోడ. కాఁబట్టి ప్రాణుల బాధించుట నీకు విషమముగాదనుట అలం. శ్లేషమూలక కావ్యలింగము.

మ. కమలాభర్త భవద్విరోధిపయిఁ జక్రంబుం బ్రయోగింప ను
త్తమశస్త్రం బది యాత్మనామకభిదాగర్వాంధు నిన్నుఁ మొఱం
గి మహారాహువు దున్మియుం దునుమ కేఁగెం గాక చక్రంబుచేఁ
దుముఱై పోవనివారలుం గలరె నీదోషంబు గాదే శశీ. 31

అ. శశీ=చంద్రుఁడా, కమలాభర్త=లక్ష్మీపతి-విష్ణుఁడు - లక్ష్మికి నీవు సోదరుఁడవు గనుక, భవద్విరోధిపయిఁ=నీపగవాఁడయిన రాహువుమీఁద, చక్రంబుఁ=సుదర్శనమును, ప్రయోగింపఁ=వైవఁగా, ఉత్తమశస్త్రంబది=ఆమేటి ఆయుధము - దీనిచే దానికడ్డులేదనుట. ఆత్మక...ంధుఁ=చక్రమనెడు తనపేరువహించిన చక్రవాకములయొక్క భేదనము వలని గర్వముచేఁ గన్నుఁగానని వాఁడు, అగు నిన్నుఁ, మొఱంగి=మోసపుచ్చి, మహారాహువుఁ, తున్మియుం దునుమక=చంపియుఁ జంపక - చంపినట్లుగా తోఁపించి చంపక, ఏఁగెంగాక=పోయెనేకాని, (శిరస్సుఖండించియు నమృతపానముచే జీవితుఁడయినాఁడనిభావము.) లేనిచో, చక్రంబుచేఁ, తుముఱైపోవనివారలుఁ=పొడిపొడియైపోవనివారును, కలరె=లేరనుట. పొడిగాకుండుటకు హేతువేమనఁగా, నీదోషంబుగాదే=నీవుచేసికొన్న పాపమేకదా.

విష్ణుఁడు నీపగవానిపయి చక్రముప్రయోగించుట తనయిల్లాలయిన లక్ష్మికి నీవుతోఁబుట్టువయిన చుట్టరికమునుబట్టి, ఆచక్రమే ఉత్తమశస్త్రముగాన యడ్డులేనిది. అట్టిది రాహువునేల తుదముట్టింపదన్నచో తనపేరుగల చక్రవాకములను నీవు బాధించుటచే నీయందు ద్వేషముగలిగి నీపగవాఁడయిన యారాహువును జంపియుఁ జంపక ప్రాణములతోనే నిన్ను బాధించుటకై విడిచినది. చక్రముచేత నెట్టివారును జావవలసియుండఁగా రాహువుమాత్రము చావక బ్రదుకుటకు నీవుచేసినపాపకర్మమే హేతువుగాని మఱియొకటిగాదని తాత్పర్యము.

స్వపక్షాభిమానియైన విష్ణువుచేతనుండునది గనుక చక్రమును స్వపక్షాభిమానమును నిలిపినదని యాశయము. అలంకారము ఉల్లాసము. 'ఏకస్య గుణదోషాభ్యాముల్లాసోన్యస్య తౌయది' అని లక్షణము. కావ్యలింగమును ఉత్ప్రేక్షయు.

చ. సమధికకాలనేమిగుణశాలివి నీవుదరస్థలోక సం
ఘములకుఁ గీడొనర్తు వని కైటభదానవభేది యంతరం
గము వెడలించెఁగాని నిను గండడఁగింపక పోయె నిందిరా
రమణిఁ దలంచి రాత్రిచర రాగనిమగ్నుల కేడ ధర్మముల్. 32

అ. రాత్రిచర=నిశాచరుఁడా—రాక్షసుఁడా=(చంద్రుఁడాయని భా.) సమధిక...శాలివి=మిక్కిలియు కాలనేమియను రాక్షసునియొక్క గుణములవంటి గుణములు గలవాఁడవు—(కాలమనెడు చక్రమునకు నేమిగుణముచేత - చుట్టుకట్టుగా నుండుటచేత - ఒప్పువాఁడవనుట. ఇట కాలమునకు చక్రసామ్యము గమ్యము) నీవు, ఉదరస్థలోక సంఘములకున్=తన కడుపులోనున్న లోకసమూహములకు, కీడొనర్తువు, అని, కైటభదానవభేది = కైటభరాక్షసుని భేదించిన విష్ణువు, అంతరంగము వెడలించెన్ కాని = లోనుండి బయటికి వెడలఁద్రోచినాఁడే కాని, ఇందిరారమణిన్=నీతోడఁబుట్టగు లక్ష్మీదేవిని, తలఁచి, నినున్, గండడఁగింపక పోయెన్=ఉక్కుమడంపక పోయెను-చంపఁడయ్యె ననుట. (అంతరంగము వెడలించెననఁగా చంద్రుఁడు విష్ణువుమనస్సువలనఁ బుట్టినాఁడని భావము.) రాగ నిమగ్నులకున్ = స్త్రీలయందలి మక్కువయందు మునిఁగినవారికి, ధర్మముల్ ఏడ=మర్యాద లెక్కడివి. లేవనుట.

విష్ణుఁడు కైటభరాక్షసుని భేదించినవాఁడు గాన - రాత్రిచరుఁడు (రాక్షసుఁడు)అగు నిన్నును భేదింపవలెను. ఇందిరారమణుఁడు నగుటచే భేదింపక బయటికిఁ ద్రోచినాఁడింతే. లోకములకుఁ గీడొనర్చుచు నిన్ను, రాక్షసుని, కైటభ దానవునివలెఁ దుదముట్టింప వలసినది ధర్మము. అట్టి ధర్మము నతఁడుల్లంఘించుటరాగనిమగ్నుఁడుగాన అలం.పరికరముఉత్ప్రేక్ష,అతిశయోక్తి,అర్థాంతరన్యాసము.

ఉ. కొండొకసేపు నిన్ను మది గూర్చిన మాధవు నంతవానికిం
బండె వధూవధ ప్రబలపాతకజాతకళంక మింక నీ
దుండగ మేమి చెప్పఁదగుఁ దోయజవైరి శిఖండవీథి నీ
ఖండము పూను శంకరుఁ డఖండజగన్మథనుండు గాఁడొకో. 33

అ. తోయజవైరి=తామరలకుఁ బగవాఁడయిన చంద్రుఁడా, కొండొకసేపు = కొంతసేపు, నిన్ను మదిగూర్చిన...వానికిన్=నిన్ను మనస్సునంతరంగునిఁగాఁ జేర్చుకొన్న విష్ణువు నంతటివానికి—(మనస్సునుండి పుట్టకమును చంద్రుని విష్ణువు మనసునందుఁ గొంతసేపు నిలిపినాఁడని భావము) వధూ...కళంకము—(నీయందున్న) ఆఁడువారిని జంపుటవలనఁ గలిగిన మిక్కుటమయిన పాపసమూహపు కళంకము. పండెన్=ఫలించెను—సమకూడెను. (విరహిణులను వధించుటవలని ప్రబలపాతక సమూహరూపమయిన మాలిన్యమని చంద్రపక్షమునఁ దెలియునది. ఇట కలంకత్వము నపహ్నవించి పాతకత్వ మారోపించినాఁడు—విష్ణుపక్షమందు భృగుపత్నిని వధించుటవలని ప్రబలపాతకముచేఁ గలిగిన యపవాదమని యర్థము. (జాతమనఁగా సమూహమును బుట్టినదియు. కళంకమనఁగా 'కళంకోంకాపవాదయోః' అ. అంకమందును అపవాదమందును. మాధవుఁడు భృగుపత్నిని వధించి భృగుశాపమువలన దశావతారము లెత్తుట భాగవతమున చతుర్థస్కంధమందు ౧౦. ౧౨.

అధ్యాయమున నున్నది. ఇంక, నీదుండగము=ధార్ష్ట్యము, ఏమిచెప్పన్, శిఖండవీథిన్ ('కాకపక్షశ్శిఖణ్డకః' అ.) నెత్తిపయిపట్టున, నీఖండమున్=నీతునియును - అర్ధాకృతి యైనదానిని, పూను=ధరించిన, శంకరుఁడు=సుఖకరుఁడైన శివుఁడు, అఖండ...గాఁడో=(నీవలె) నిండుజగమును సంహరించువాఁడు గాఁకపోవునో—అగుననుట.

'సంసర్గజా దోషగుణాభవన్తి' అను న్యాయముచేతఁ జంద్రుని సహవాసమువలన మాధవశంకరులకును ధార్ష్ట్యము ప్రాప్తించినదనుట. నిన్ను మదిలోఁ జేర్చుకొన్నంతకే ప్రబలపాతకము పట్టినది, అదియుఁ గేవలునికిఁ గాదు. మాధవునంత వానికే. అతనికి బహుకాలమునకుఁ గాక - కొండొకసేపుననే, మాధవశబ్దము సాభిప్రాయము. లక్ష్మీకాంతకు ధవుఁడయ్యు వధూవధమును జేయునట్టివాఁడగుట అబ్బురము. శివుఁడును, శంకరుఁడు, సుఖప్రదుఁడు, అతఁడు నీనిలువెల్లను దలయందుఁ దాల్పలేదు; ఖండమే. అంతకే 'అఖండ...నుం'డయినాఁడు. కొండొకసేపు మనస్సునంతఁ జేర్చినంతనే కొండొకనీతునియ తలయందుఁ బెట్టుకొన్నంతనే మాధవుఁడువధూవధకరుఁడును శంకరుఁడు జగన్మథనుఁడు నయినాఁడు. కాఁబట్టి ఏమిచెప్ప నీదుండగము. అలం-అతిశయోక్తులు రెండుపరికరమును.

శా. ఈ వబ్జుండవు నీటఁ బుట్టితిఁ జుమీ యే నంచు మోమోటపుం
   ద్రోవల్ సెప్పఁగ సిగ్గు గాదె మఱి నీతోఁబుట్టు శ్రీదేవి లీ
   లావాసంబుసిరుల్ హరింతు వనుచో నయ్యో కళాదుండు చే
   తోవీథిన్ సహజాధనాపహరణోద్యోగంబు నెగ్గించునే. 34

అ. 'తోయజవైరి' అని అధ్యాహార్యము. నీతోఁబుట్టు, శ్రీదేవియొక్క, లీలావాస=క్రీడాగృహముయొక్క, సిరుల్=సంపదలను, హరింతువు అనుచోనని యర్థము -(లక్ష్మీనివాసమయిన తామరయొక్క శోభను హరించుచున్నాఁడని భా.) మఱి=ఇంక, నీవు, అబ్జుండవు = నీటియందుఁ బుట్టినవాఁడవు—(అబ్జనామము గలవాఁడని భా) ఏను నీటఁబుట్టితిని జుమీ=నేను శుక్తిమతి నీటియందుఁ బుట్టినదాననే చుమా, అని, (ఇట్లు నీకునాకును జుట్టఱికము అని), మోమో...మఱి = మొగమోటము నాయందుఁ గలుగు విధములను జెప్పుట. నాకు లజ్జగదా—అనఁగా చక్కఁ దోడఁబుట్టిన లక్ష్మీయింటి సంపద హరించిన నీకు నీవును నేను నీటఁబుట్టిన వారముగాన నాయందు దాక్షిణ్య ముంపవలయునని యంతలపొంతల చుట్టఱికములు దెలుపుకొన్నందున నయపుట్టునా యనుట—(మోమోటపుంద్రోవల్ = మొగమునం దోడిపోవు రీతులని, చంద్రునికినిఁ దనకునుగల ముఖసామ్యమిట స్ఫురించుచున్నది.) అయ్యో. కళాదుండు = ('నాడింధమ స్స్వర్ణకారః కళాదో రుక్మకారకః' అ.) కంసాలివాఁడు, చేతోవీథిన్ = మనస్సునందు, సహజాధనాపహరణోద్యోగంబున్ = తోడఁబుట్టిన దానియొక్క సొమ్మును దొంగిలించునట్టి పూనికను, ఎగ్గించునే = తప్పుగాఁ దలఁచునా—తలంపఁడనుట. లోకమునఁ గంసాలి తనతోడఁబుట్టినది చేయుమని యిచ్చిన సొమ్ములోఁగూడ దొంగిలించునని ప్రతీతి యిట యనుసంధించునది—(కళాదుండనఁగా దేవతలకుఁ గళాప్రదానముచేయు చంద్రుఁడని భావము). అలం. అర్థాపత్తియు, శ్లేషానుప్రాణితమైన యర్థాంతరన్యాసమును.

తే. నీరజారాతి నినుఁ దన నెలవుగూల, నేలసృజియించె విధి సృజియించుఁగాక
   మేలజై వాత్మకుని జేసె నేలతప్పఁ, బుడమిఁ "బావీచిరాయ"ననెడుఁగునుడుగు.

అ. నీరజారాతి=చంద్రా, విధి=బ్రహ్మ, తన నెలవుగూల=తనయిల్లు వశించునట్లుగా, నినున్, ఏల సృజియించెను - (బ్రహ్మనెలవు నీరజము అనఁగా తామరగనుక నది ముడుఁచుకొని చెడిపోవు

నట్లుగా నిన్నేల సృజించెనని భావము.) నీరజారాతి అనుసంబోధనము సాభిప్రాయము. సృజియించుఁ గాక=పుట్టించిన పుట్టించుఁగాక, ఏల జైవాతృకునిన్—(జైవాతృకః కృశేచన్ద్రే క్షేమజాయుష్మతోరపి' అ.) దీర్ఘాయుష్మంతునిఁగా, జేసెను. (జైవాతృకుఁడను పేరుగలవానినిగాఁ జేసినాఁడని భావము) పుడమిన్=భూమియందు, పాపీచిరాయుః = 'పాపీచిరాయుః సుకృతీ గతాయుః' అను మాట - అనఁగా పాపాత్ముఁడు దీరాయుష్యము గలవాఁడగుననుమాట, ఏలతప్పన్=ఎందుకులతప్పను.

అలం. శ్లేషము.

సీ. స్వామియై నిగమాతిభూమియై సురపురో, గామియై యబ్ధిజాకామి యుండ
హారియై హాలహలాహారియై భవదంశు, ధారియై ప్రసవాయుధారి యుండ
ధాతయై కుశలసంధాతయై భువననిర్, మాతయై వాగ్వధూనేత యుండ
మిత్రుఁడై పరమపవిత్రుఁడై విమలచా, రిత్రుఁడై నళినీకళత్రుఁ డుండఁ

తే. దొలుతొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళయొసంగి, నంటుగావించుటెల్ల ననాథయువతి
జనతనూదాహసాహాయ్యమునకుఁగాక, కానవా వారి నెవ్వారిఁ గమలవైరి.

అ. కమలవైరి=చంద్రా! స్వామియై=సకలమునకు అధినాథుఁడై, నిగమ అతిభూమియై= వేదములకు కడచిన మేరయై - వేదములకు ప్రతిపాదింప నలవికానివాఁడై, సురపురోగామియై=దేవతలు మొనకాఁడై, అబ్ధిజాకామి=లక్ష్మీ వలపుకాఁడయిన విష్ణుదేవుఁడు. హారియై = (సమస్తగుణముల చేత) ఒప్పుచున్నవాఁడై, హాలహాల ఆహారియై = (జగత్తున కుపద్రవకరమయిన) కాలకూటమును భక్షించి (మాన్చిన) వాఁడై, భవదంశుధారియై = కేవలము నీయొక్క కళనే ధరించియున్నవాఁడై, ప్రసవాయుధారి=(మన్మథునకు విరోధియైన) శివుఁడు. ధాతయై=జగత్తులను ధరించినవాఁడై, కుశల సంధాతయై= క్షేమముఁ బొందించువాఁడై, భువననిర్మాతయై=లోకములను సృజించువాఁడై, వాగ్వధూనేత=సరస్వతీ నాయకుఁడయిన బ్రహ్మ. మిత్రుఁడై = మిత్రత్వము గలవాఁడై—(మిత్రనామము గలవాఁడై యనియు) పరమ పవిత్రుఁడై=మిక్కిలియు పావనుఁడై— తాను స్వతస్సిద్ధముగా పవిత్రుఁడై, యన్యులను పవిత్రము చేయువాఁడై, విమలచారిత్రుఁడై = నిర్దుష్టమైన చరిత్రముగలవాఁడై, నలినీకళత్రుఁడు = సూర్యుఁడు.

తొలుతొలుతన్ = మొట్టమొదట, కృష్ణవర్త్మకున్—('బర్హిశ్శుష్మా కృష్ణవర్త్మా శోచిష్కేశ ఉషర్బుధః । ఆశ్రయాశో బృహద్భానుః కృశానుః పావకోఽనలః') అగ్నికి - (నల్లనిఅనఁగా మలినమైన మార్గముగలవానికి అని భావము.) కళయొసంగి = కళాప్రదానముచేసి, ('ప్రథమాంపిబతే వహ్నిః ద్వితీయాంపిబతేరవిః' అనుట తెలియునది.), నంటుగావించుటెల్ల = స్నేహముచేసికొనుట యంతయు, అనాథ...య్యమునకున్ కాక—అనాథయువతి జన=దిక్కుమాలిన వయసుకత్తెల గుంపులయొక్క, తనూ=దేహములను, దాహ=దహించుట యందలి, సాహాయ్యమునకున్ = తోడ్పాటునకే, కాక, వారి నెవ్వారిన్ = ఆవిష్ణువుమొదలయిన వారినెవ్వరిని, కానవె=కానవా - అనఁగా వారిలో నెవ్వరికయినను ముందుగాఁ గళాప్రదానము చేయవా యనుట.

హరిహర బ్రహ్మసూర్యులకు స్వామ్యాది విశేషణములు సత్పాత్రతాభిప్రాయములు. కృష్ణవర్త్మయనెడి అగ్నినామము అపాత్రతాభిప్రాయ గర్భము. అగ్ని మొట్టమొదట కళాప్రదానము సేయుట అనాథయువతులను మేనులను దహించుటకై యతఁడు తనకుఁ దోడ్పడుటకు. లేకున్న చల్లనివాఁడు వేఁడిమి యిట్లు గ్రాఁచునా? విరహిణులకు చంద్రుఁడు వేఁడిమియగుట. 'విసృజతి హిమ

గర్భై రగ్నిమిందు ర్మయూఖైః । త్వమపి కుసుమబాణాన్ వజ్రసారీకరోషి॥' (శాకుంతలము.)
ఇది అవకలి పడిసీసము, సీసము, సమ, సర్వతః ప్రాస, పడిసీస, అవకలి వడిసీస, విషమసీసము లని యేడు విధములు? అలం. ఉత్ప్రేక్షయును బరికరమును.

క. అని మఱియుఁ బెక్కుభంగుల, వనజారిని దూఱి నారి వనితాజనతా
ఘన తాప వజ్రఘనతా, భినుతాంబకధరుని మరునిఁ బేర్కొని కినుకన్.

అ. అని మఱియున్, పెక్కుభంగులన్=అనేకవిధముల చేత, నారి=గిరిక, వనజారిని=చంద్రుని, వనితా... ధరునిన్—వనితాజనతా=విరహిణీ స్త్రీసమూహముయొక్క, ఘనతాప=అధికమైన తాపమనెడు, వజ్ర=పిడుగునకు, ఘనతా=మేఘమువంటిదగుటచేత, అభినుత = మిక్కిలికొనియాడఁబడిన, అంబకధరునిన్=బాణమును ధరించినవాఁడగు, మరునిన్=మన్మథుని, కినుకన్=కోపముచేత. ఘనతాపము గనుక వజ్రముతో పోలిక. అట్టివేంద్రమయిన బాణముగలవాడు గావుననే 'కినుక.' అల. రూపకము.

క. వలదాశుగశిఖికీలల, వల దాశుగతిన్ నిగుడ్ప వలరాయఁడ చె
ల్వలదాయవె కలదా కే, వలదారుణవృత్తి దయ లవంబును వలదా. 38

అ. వలరాయఁడ=మన్మథుఁడా! వలత్ ... కీలలన్ = చుట్టఁబెట్టుచున్న బాణాగ్ని జ్వాలలను, ఆశుగతిన్=వేగమయినగతిచేత, నిగుడ్పువలదు, ఏమనిన, చెల్వలదాయవె = (నీవేమైని) స్త్రీలకు పగవాఁడవా, కేవలదారుణవృత్తి=అచ్చము ఇంతబెట్టిదమయిన వ్యాపారము, కలదా=ఎక్కడనయినను కలుగునా, దయ, లవంబును=ఇంచుకైనను, వలదా=అక్కఱలేదా.

'ఏదాతా ప్రశ్న లక్షణే భవతః' అనుసూత్రమువలన, దాయవే, కలదా, వలదా, అను ఏతత్పద ప్రత్యయాంత్యములందు ఏ ఆ అను ప్రశ్నార్థద్యోతకములగు అచ్చులుంపఁబడుటచే ఇవి ప్రశ్నార్థకములని తెలియునది. ఇందు ద్విప్రాసము.

ఉ. శంబరవైరి వీవు పటుశంబరపోషణశాలి యాతఁడ
బ్జాంబకధారి వీవు మథితాబ్జుఁ డతండు నిశాటఝూటద
ర్పం బడఁగించుబల్లిదునిపట్టివి నీవు నిశాటుఁ డాతఁడో
యంబుచరాంక నీకుఁ దగు నా హరిణాంకునితోడికూటముల్. 39

అ. ఈవు=నీవు, శంబరవైరివి=శంబరవిరోధివి. అతఁడు=ఆచంద్రుఁడు, పటుశంబరపోషణశాలి=శంబరపోషణముచేత నొప్పువాఁడు - నీవు శంబర హరణముచేయువాఁడవు. అతఁడు శంబర భరణముచేయువాఁడని యర్థము. (నీవు శంబరాసుర హరుఁడవు. అతఁడు మృగధరుఁడని భావము. 'శంబరం సలిలే పుంసి మృగదైత్యవిశేషయోః' మేదిని) ఈవు, అబ్జాంబకధారివి = అబ్జబాణము ధరించువాడవు. అతఁడు, మథిత+అబ్జుఁడు = కలంపఁబడిన అబ్జముగలవాఁడు - అబ్జవిరోధియనుట, నిశాటఝూటదర్పంబు = రాక్షస సమూహముయొక్క గర్వమును, అడఁగించు బల్లిదునిపట్టివి=పోఁగొట్టుబలవంతుని (విష్ణుదేవుని) కుమారుఁడవు. అతఁడు, నిశాటుఁడు, రాక్షసుఁడు - (రాత్రియందు సంచరించువాఁడని భావము.) ఓయంబుచరాంక=జలచరమును (చేఁపను) చిహ్నముగాఁగలవాఁడా! హరిణాంకుని తోడికూటముల్=(భూచరమైన) ఇఱ్ఱిచిహ్నముగాఁగలవాని (అనఁగా చంద్రుని) తోడి స్నేహములు, నీకున్ తగునా - తగదనుట. జలచరాంకునకు భూచరాంకునితోడి కూటములు తగవనుట. 'హరిణోమృగవారణః' వైజయంతి అని హరిణశబ్దమునకు వల అనునర్థముచెప్పి వల జలచరమునకు

విరోధిగనుక జలచరాంకునకు హరిణాంకునితో స్నేహమర్హము గాదని చెప్పుచున్నారు. వైజయంతిలో 'హరిణోమృగవారణః' అని కనిపింపలేదు. ఎందలిదో విచార్యము. అల. శ్లేషమూలక కావ్యలింగము.

ఉ. అద్దిర జీవమాత్రచరితార్థక నీయెడ గాలిపోయె న
స్మద్దయనీయవాక్యములు శాంభవలోచనవహ్నిఁ గ్రాఁగి పె
న్నిద్దురఁ బూని మేనెఱుఁగనేరక యుండెడు నీకు మ్రొక్కి వే
సుద్దులు చెప్పినన్ మనసుసొచ్చునె బోధము పుట్టనేర్చునే. 40

అ. అద్దిర=ఔరా, జీవమాత్ర చరితార్థక = ప్రాణధారణమాత్రము చేత చరితార్థుఁడవయిన వాఁడా, అనఁగా పరోపకార శూన్యుఁడాయని యర్థము. (జీవమాత్రము ఉన్నదేకాని దేహములేని వాఁడని భావము) అస్మత్...క్యములు—నాదయిన జాలిపుట్టుమాటలు, నీయెడన్ = నీయందు, గాలిపోయెన్=గాలికిపోయెను - అనఁగా వ్యర్థమాయెననుట (దేహములేక గాలి పిశాచమువలె నుండు నీయందుగాలికిఁ బోవలయునని స్వారస్యము), శాంభవలోచన వహ్నిన్ = శివునిసంబంధించిన కంటి నిప్పుచేత, క్రాఁగి=తపించి, పెన్నిద్దురన్ పూని=కటికినిద్రను వహించి, మేను...నీకు = దేహస్మృతి లేకయుండునట్టి నీకు - (దీర్ఘనిద్రను బొందినవాఁడనియు అనంగుఁడనియు భావము.) మ్రొక్కి, వేసుద్దులు=వేయిమాటలు, చెప్పినను, మనసుచొచ్చునె=మనసునందు చొచ్చునా, బోధముపుట్టనేర్చునే= తెలివిపుట్టనేర్చునా—నిద్దురపోవువాని కాళ్లకుమ్రొక్కి వేయిమాటలు చెప్పినను, అవివాని మనసునందుఁ జొరవు. వాని కెఱుక పడవు అనుట, నిదురపోవువాని కాళ్లకుమ్రొక్కినట్లు అనులోకోక్తి నిట ననుసంధించినాఁడు. పెన్నిద్దురపోయి నాఁడనఁగా మృతుఁడయినాఁడనియు, మేనెఱుంగనేరఁడనఁగా అతనుఁడనియు భావము. అల. అర్థాంతరన్యాస విశేషము.

మ. అణుమధ్యాతతిమీఁద నంతవిరసంబౌ చాపమున్ సీధుపా
రణ మత్తా గొని సోలునారి శిఖిమిత్రంబైన తేరున్ వనాం
గణలుబ్ధానుగకోటిఁ బూని వెడలంగా నిట్టిదే ధర్మ మే
గుణ మేయెక్కుడిదేఁ బలంబు సుమనఃకోదండ నీకెంతయున్. 41

అ. సుమనఃకోదండ = పూవిలుతుఁడా, అంత విరసంబు=అంతటివిరోధి, ఔ చాపమున్= అయిన విల్లును, సీధుపారణ = సురాపానముచేత, మత్తాగొని=మత్తుగొని, సోలు=సోలిపడుచున్న, నారి = అల్లెత్రాడును, (మత్తాపదము ఆకారాంతమైన దేశ్యపదము గనుక హ్రస్వము రాదయ్యె. ఇందులకు, 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాన్నచ దేశ్యపదే' (శబ్దానుశాసనము) శిఖిమిత్రంబైన తేరున్= అగ్నికి సాటియైన రథమును, వనాంగణ...కోటి—వనాంగణ = అరణ్య ప్రదేశమందలి, లుబ్ధ = కిరాతులనెడి, అనుగకోటిన్ = అనుచర సమూహమును, పూని = వహించి, అణుమధ్యాతతిమీఁదన్ = స్త్రీజనసమూహము మీఁద, వెడలంగాన్ = బయలుదేఱుటకు అని యర్థము. చాపము అంత విరసంబు = చెఱుకుతుంట కొనలయందు రసము లేనిదనియు, రథమయినవాయువు, అగ్నికి మిత్రమనియు, అనుచర తతియైన శుకపికాది పక్షిగణము వననివాసమందు లుబ్ధమనియు, భావము. ('లుబ్ధోమృగయుకాంక్షిణోః' అని విశ్వము.) నీకు, ఎంతయున్=ఎంత విచారించినను, ఇట్టిదే ధర్మము=ఇదేమిన్యాయము - (ఏమి ప్రశస్తమయిన విల్లనియు) ఏగుణము=ఏమిసద్గుణము-(ఏమి ప్రశస్తమయిన అల్లెత్రాడనియు) ఏయెక్కుడు=ఏమి అతిశయము - (ఏమి ప్రశస్తమైన వాహనమనియును) ఇదేబలంబు=ఇదిఏమి సామర్థ్యము-(ఏమి ప్రశస్తసైన్యమనియు). ఇందలంకారము క్రమము. శ్లేషమూలకాతిశయోక్తి.

మ. అనిదానాగ్రహముం బ్రియోక్తుల నమర్షాధిక్యముం బాంథమ
ర్దన నీకున్ మధుమత్తభావమునఁ గాదా కల్గెఁ గాకున్న నీ
వనిలాంకూరము నెక్కి యాడుదువొ వన్యానీడజశ్రేణిచేఁ
బనిపాటల్ గొనఁజూతువో మఱతువో ప్రఖ్యాతకాయక్రియల్. 42

అ. పాంథమర్దన=విరహిజనులను మర్దించువాఁడా యని యర్థము-(బాటసారులను గొట్టెడు వాఁడాయని యర్థాంతరము)- అర్థద్వయమునకు అభేదాధ్యవసాయము, నీకున్, అనిదానాగ్రహమున్—అనిదాన = కారణములేని, ఆగ్రహమున్ = నిగ్రహమును, ప్రియోక్తులన్=మంచిమాటల చేత, అమర్షాధిక్యమున్=మిక్కుటమయిన కోపమును - అనఁగా మంచిమాటలకుఁ గోప మతిశయించుటయు ననుట, మధుమత్తభావమునన్ కాదా కల్గెన్=సురాపానము ద్రావుటచేతఁ గదా కలిగెను అని యర్థము - (మన్మథుఁడు మధుమాసమున విజృంభించుచున్నాఁడని భావము.) కాకున్నన్=అట్లు కానియెడల, నీవు అనిలాంకూరము ఎక్కియాడుదువో = లేఁతగాలిపయి నెక్కి క్రీడింతువా. వన్యానీడజశ్రేణిచే=వన సమూహమందలి పక్షిసమూహముచేత, పనిపాటల్ గొనఁజూతువో=పనిపాటలు చేయించుకొనఁజూతువా యని యర్థము. ప్రఖ్యాత కాయక్రియల్ = ప్రసిద్ధములయిన శరీరచేష్టలు, మఱతువో=మఱచిపోదువా యని యర్థము. అనిలారూఢత్వమును పక్షినియామకత్వమును చేష్టారహితత్వమును, సురాపానమువలనఁ బుట్టెడు గుణములు; మన్మథునకు స్వభావగుణములునని తెలియునది.

సీ. మునుప లేఁడాయెనే మోహకగ్రాహ సం, గ్రస్త సామజ పరిత్రాణమునకు
మనుప లేఁడాయెనే మనుజాశనునిఁ జీరి, యనఘ నిష్ఠాయుక్తు నాత్మభక్తుఁ
బెనుప లేఁడాయెనే పృథ్వీసుపర్వ కు,మారు నిర్గత జీవ మారుతముల
నునుప లేఁడాయెనే యుగ్రఫాలాగ్నిఁ దూ,లిన లోక మెల్లఁ దొల్లింటిపగిది

తే. శౌరి యఘటితఘటనా విహారహారి, యేమి గావింపఁగా నేరఁ డామహాత్ముఁ
డసదృశచరిత్రు నినుఁ బుత్రుఁ డనక కినుక, గిరిశ ఫాలాగ్నిఁ బడ నుపేక్షించెఁ గాక.

అ. అఘటితఘటనావిహారహారి = పొందింపఁబడని కార్యముయొక్క పొందించునట్టి సామర్థ్యముచేత ఒప్పుచున్నవాఁడయిన, శౌరి=విష్ణువు, మోహక...త్రాణమునకున్—మోహక=వంచనకారియైన, గ్రాహ=మొసలిచేత, సంగ్రస్త=లెస్సగా గ్రహింపఁబడిన, సామజ=ఏనుఁగుయొక్క - గజేంద్రునియొక్క, పరిత్రాణమునకున్=కాపాడుటకు, మునుపలేఁడాయెనే=ముందు వడఁడయ్యెనా? ముందుగా సమర్థుఁడు కాకపోయెనా యనుట. మనుజాశనునిన్=మనుష్యులనాహరించు హిరణ్యకశిపుని, చీరి=చీల్చి, అనఘనిష్ఠాయుక్తున్ = కల్మషములేనిభక్తి ప్రపత్తినిష్ఠతోడఁగూడినవాఁడయిన, ఆత్మభక్తున్ = తనభక్తుఁడయిన ప్రహ్లాదుని, మనుపలేఁడాయెనె=బ్రతికింపఁ జాలకపోయినాఁడా!

పృథ్వీ...తరులన్=బ్రాహ్మణ కుమారునియొక్క వెడలిపోయిన ప్రాణవాయువులను, పెనుప లేఁడాయెనే=తిరిగి కొనసాఁగునట్లు చేయక పోయెనా! పెనుపయనుటకు తిరిగి పెనవేయఁజాలకపోయెనాయని కొందఱర్థము చేసెదరుగాని యది పెనపలేఁడాయెనేయని యుండవలయును. ఉత్వమధ్యములగు 'మనుప' ఇత్యాదుల కది సజాతీయము కాకపోవును గాన త్యాజ్యము—ఇట మృతినొందిన బ్రాహ్మణ కుమారుని మరల బ్రతికింపఁజాలకపోయెనా యనుట. ఉగ్రఫాలాగ్నిన్=రుద్రునియొక్క నొసటి (కంటి) నిప్పుచేత—అనఁగా ప్రలయాగ్నిచేత, తూలినలోకమెల్లన్=నశించిపోయిన జగమునంతయు, తొల్లింటిపగిదిన్=మునుపటివిధమున, ఉనుప లేఁడాయెనే=ఉండునట్లు చేయకపోయెనా.

ఏమిగావింపఁ గానేరఁడు = ఏమిచేయఁజాలఁడు---ఏదియైనను జేయఁగలఁడనుట. కనుక అతఁడు, అసదృశచరిత్రుఁడ్ = నీకు సాటిగాని నడవడి గలవాఁడయిన, నిన్, పుత్రుఁడనక,కినుకన్= కోపముచేత, గిరిశఫాలాగ్నిన్ = రుద్రుని కంటిమంటయందు, పడన్ = పడఁగా, ఉపేక్షించెఁ గాక = ఊరకుండెనేకాని. లేనిచో నిన్ను బాగుపఱుపఁడాయని తాత్పర్యము.

ఇందుఁ బ్రథమపాదమున గజేంద్రమోక్షణమును, రెండవపాదానియందు ప్రహ్లాదచరిత్రమును, మూఁడవపాదానియందు శ్రీరాముఁడుగాని కృష్ణుఁడుగాని బ్రాహ్మణమృతపుత్రునకుఁ బ్రాణదానము సేయుటయు ననుసంధింపఁబడినది. ఇది అక్కిలి ప్రాసనీసము. అల. ఉత్ప్రేక్ష.

తే. అనుచు ననవింటిపెనుదంట కాడరాని
గెంటసము లాడి మఱియు నక్మంటమారిఁ
గలయ నెక్కించుకొనివచ్చుకమలయ నగభు
జంగవిషదిగ్ధపవనుపైఁ జలము వొడమ. 44

అ. ననవింటిపెనుదంటన్ = పూవిలుగల గొప్పశూరుని--మన్మథుని, ఆడరానిగెంటసములు = చెప్పఁదగని కంటసపుమాటలు, అమ్మంటమారిన్=కోపస్వభావుఁడయిన యామన్మథుని, కలయన్ = అంతటను, మలయనగ...వనుపైన్=మలయ పర్వతమందలి పాములయొక్క విషముచేత, పూయం బడిన గాలిమీఁద=మలయమారుతముమీఁద, చలము పొడమన్ = హఠముపుట్టఁగా - మీఁది కన్వయము.

తనంతటనే 'మలయ......దిగ్ధుఁడు'. అంతటితోఁబోక 'మంటమారి...వచ్చు'వాఁడు. కావు ననే చలము. మలయపర్వతమందలి గందపుమ్రాఁకులకు పాములు పెనఁగొనుట ప్రసిద్ధము. పామునకు గాలి యాహారముగాన దానివిషముతోడ గాలికి సంబంధము చెప్పంబడినది. అల. కావ్యలింగము.

ఆ. విరియుఁగువలయుంబు విధిపదంబుచలించు,నెసఁగు భువనభంగ మీవువొలయ
మలయువలదు పవన జలదవేణికలపై, మలయువలదుపవనవలయభవన. 45

అ. మలయ...భవన—మలయ = గంధపుగొండను, వలత్=చుట్టియున్న, ఉపవన=తోఁటల యొక్క, వలయ = సమూహమే, భవన=ఇల్లుగాగలవాఁడయిన, పవన = గాలి - మలయమారుతమా యనుట. ఈవు, పొలయన్ = వీచినమాత్రముననే, కువలయంబు = భూమండలము,విరియున్=అవని పోవును - (కలువ వికసించుచున్నదనిభావము) విధిపదంబు=బ్రహ్మకు స్థానమయిన సత్యలోకము, చలిం చును, (బ్రహ్మకు పట్టయిన తామర చలించుచున్నదని భావము) భువనభంగము = (భువనమనఁగా లోకమును జలమును, భంగమనఁగా ప్రలయమును అలయును) లోకప్రలయము గలుగును. (జలము నలలు అతిశయించునని భావము.) కాఁబట్టి, జలదవేణికలపైన్ = మబ్బులవంటి జడలుగల పడఁతుల మీఁద, మలయువలదు = విసరవలదు.

జలదవేణికలు - జలదములు నీకాఁగదుగనుక నట్టివేణికలుగలవారును నీకాఁగలేరని యాశ యము. భూలోకమవియుటయే కష్టము, అంతకంటె చిరశాశ్వతమయిన సత్యలోకముగూడ చలిం చుట మఱింతకష్టము. సమస్తలోకమయమైన ప్రపంచమునకే ప్రలయమువచ్చుట మిక్కిలియుఁ గష్ట మని యారూఢిం దెలియునది. అల. శ్లేషమూలక కావ్యలింగము.

ఉ. కీలియు నీవుఁగూడి యుడికింతురు లోకమటంచు నెప్పుడున్
మూలలపైచె మిమ్ము నలుమోములవే ల్పటుపైచినం జనం

జాలక హవ్యవాహునిసంగతినుండి జగంబు గాలుపం
గాలుపదంబు చేరితి ప్రకంపన నీ వనుకంప చాలమిన్. 46

అ. ప్రకంపన = (లోకములను) మిక్కిలి కంపింపఁజేయువాఁడా--వాయూ అనుట. ఇది సాభిప్రాయము. కీలియున్ = అగ్నియు, నీవును, కూడి, లోకమున్, ఉడికింతురు, అటంచున్, నలుమోములవేల్పు = చతుర్ముఖబ్రహ్మ, ఎప్పుడున్ = ఎల్లప్పుడును, మూలలన్ వైచెన్ = మూలలయందు- అనఁగా ఈమూలనొక రొమూలనొకరుగాఁ బడవైచెనని యర్థము. (వాయవ్యాగ్నేయ కోణములందుంచినాఁడని భావము.) అటువైచినన్ = అట్లు పడవైచినప్పటికిని, నీవు, చనఁజాలక = ఒకరి నొకరెడఁబాసిపోలేక, హవ్యవాహునిసంగతిన్ = అగ్నిహోత్రుని పొత్తున, ఉండి, జగంబున్, కాలుపన్ = కాల్చుకొఱకు, కాలుపదంబున్ = యమునిస్థానమును, అనుకంపచాలమిన్ = కనికరములేమిం జేసి చేరితివని యర్థము. వాయు వగ్నిసఖుఁడనియు,యమునిదిక్కయిన దక్షిణమునుండి పుట్టుచున్నాఁడనియును భావము.

బ్రహ్మనియమమును గూడ నతిక్రమించి ధౌర్త్యము చేయుదువని యిట తాత్పర్యము.'అనుకంప చాలమి' కాలుపదంబుఁ జేరుటకు గారణము.కాలునికిఁగూడ ననుకంపలేదుగదా. మూలఁబడియుండుటయను లోకోక్తినుండి మూలలవైచుట యున్నీతమయినది. వాయువుచేత నగ్గి మఱిమఱి ప్రజ్వరిల్లుట ననుసంధించునది. అల. ఉత్ప్రేక్షలు రెండు.

క. గోలలనావల్లభుఁ డిది, గో లలనల యుసుఱు వ్రోసికొందు వని వనీ
బాలానిల నిను మెసవం, గాలాహికి నేండ్లు వేయు గావించె వెసన్. 47

అ. గోలలనావల్లభుఁడు—('స్వర్గేషు పశువాగ్వజ్ర దిఙ్నేత్ర ఘృణిభూజలే। లక్ష్యదృష్ట్యాః స్త్రియాంపుంసిగౌః' అనునట్లు గోవనఁగా వాక్కు) వాక్కు వనితప్రియుఁడు = బ్రహ్మ, ఇదిగో, లలనల= స్త్రీలయొక్క, ఉసుఱు పోసికొందువు = ప్రాణములను బుచ్చుకొను చున్నావు. అని, వనీబాల+అనిల=వనసంబంధియైన లేఁతగాడ్పా - అనఁగా మలయమారుతమా, నినున్, మెసవన్=తినుటకు, కాలాహికిన్=కాలసర్పమునకు, వెసన్ = యుక్తమగునట్లుగా, ఏండ్లువేయున్ కావించెన్= వేయిసంవత్సరముల యాయువు గలిగించెను - అనఁగా వేయేండ్లుగా సర్పములు పట్టి తినుచున్నప్పటికిని నశింపకయున్నావు గనుక నీబ్రతుకు మిక్కిలి మొండిబ్రతుకుగదా యని భావము. 'గృధ్రోలూక శుకధ్వాంక్షసర్పాణాంతు సహస్రకమ్' అని యున్నది గనుక పామునకు నాయువు వేయేండ్లనుట ప్రసిద్ధము. అల. ఉత్ప్రేక్ష.

మ. అమితోల్లాసి పలాశవృత్తి వయి బాల్యావస్థఁ గొల్లాడితో
సుమనస్సంపద నింక నీ వతనువిస్ఫూర్తిన్విజృంభింప లో
కము ధూలిం జనదే ప్రభంజన రమాకాంతుం డనంతావతా
రమహాయత్నము పూనికాని నినుఁ దీర్పంజాలఁ డల్పంబుగన్. 48

అ. ప్రభంజన=వాయూ-మిక్కిలి భంజించువాఁడని వ్యుత్పత్తిచే సాభిప్రాయము. అమిత... వృత్తివి—అమిత=మితిలేనట్లుగా, ఉల్లాసి=వికాసమును బొందిన, పలాశవృత్తివి=రాక్షసవర్తనము గలవాఁడవు, అయి, బాల్యావస్థన్=పిన్ననాఁడే, సుమనస్సంపదన్ = దేవతలయొక్క సంపత్తిని, కొల్లలాడితివో=చూఱగొంటివి భళా యని యర్థము. (పలాశియనఁగా 'పలాశీ వృక్షరక్షసోః' వి.

రాక్షసునియందును వృక్షమందును. సుమనశ్శబ్దము 'సుమనాః, పుష్పమాలత్యోః స్త్రియాం త్రిదశే కోవిదేపిచ' వి. అని దేవతలయందును బుష్పములందును వర్తించును గనుక పిన్నగాడ్పు వృక్షములందలి వర్తనముగలదై పుష్పసంపదను గొల్లలాడును అనఁగా పువ్వులను రాల్చు నని భావము.) ఇంకన్=ఇఁక మీఁద, నీవు, అతను విస్ఫూర్తిన్-విజృంభింపన్ = మిక్కుటమయిన స్ఫురణచే--అనఁగా ప్రౌఢత్వముచే- విజృంభిఁగితి వేని, లోకము, ధూళింజనదే=దుమ్మయి యెగిరిపోదా యని యర్థము (అతనుఁ డనఁగా మన్మథుఁడు గనుక మన్మథవిస్ఫూర్తిచే నీవు చెలరేఁగితివేని, లోకమంతయు వ్యాకుల మగు నని భావము. బాలవాయువు మన్మథోద్దీపకముగాఁ జెలంగుట నిట యాశయము. అతను విస్ఫూర్తి ననఁగా=తను (దేహ)విస్ఫూర్తి లేమిచేత విజృంభించుచున్నదనియు, లోకము ధూళింజనుట యనఁగా పెద్దగాలి విసరి యంతటను దుమ్ము గప్పుచున్నదనియు వాయుస్వభావ పరముగాఁ జెప్పవలయును.) రమాకాంతుండు=విష్ణుదేవుఁడు, అనంతావతార మహాయత్నము పూని కాని=అసంఖ్యములయిన యవతారములయొక్క మిక్కుటమయిన ప్రయత్నమును వహించిన మీఁదటఁగాని, అల్పంబునన్ = కొంచెమున, నినున్, తీర్పంజాలఁడు = సంహరింపలేఁడని యర్థము. ('శేషోఽనన్తః') అన్నట్లు ఆదిశేషావతారము దాల్చిగాని నినుఁ దుదముట్టింప లేఁడాయెనని భావము. శేషుఁడు సహస్రముఖుఁడని సాభిప్రాయము. అల. శ్లేషము.

పసితనముననే రాక్షసవృత్తివై దేవతల సంపదలనెల్లఁ గొల్లాడితివి. ఇఁకఁ బెద్దపెరిఁగి చెలరేఁగితివో జగము దుమ్మువమ్మయి పోవఁదా. ఇఁక శ్రీవిష్ణువు నిన్నుఁ దుదముట్టించుటకై పెక్కులవతారము లెత్తవలసి వచ్చునని యర్థము. రాక్షసులు దేవతలను బాధించుటయు వారి యుపద్రవ ముడుప్పుటకై విష్ణువవతారము లెత్తుటయును బ్రసిద్ధములు. లేఁతగాడ్పు పూచి కాచియున్న చెట్ల గుంపులపయిని బొలసి పువ్వుల రాల్చుటయు మిక్కుటముగాఁ జెరిఁగి చిమ్మిరేఁగినచో లోకమంతయు నాకులపడుటయు, వాయువునకు దేహస్ఫూర్తి లేమియు, మిక్కిలి చిమ్మిరేఁగినచో భూమ్యాకాశములందు దుమ్ము మిక్కిలి గ్రమ్ముటయు, సర్పము వాయువును భక్షించుటయుఁ బ్రకటములు.

క. చలదలఘు చటులకీలాం, హాలహాలమున నఖిలభువనసంహరణక్రీడా
హాలహాలిక వెలయు బలియుని, గలయం బవమాన నీవ సంగాంచితివి గదా.

అ. పవమాన=వాయూ, నీవ=నీవే, చల...హాలమునన్—చలత్=చలించుచున్న, అలఘు=గొప్పవయిన, చటుల = వేండ్రములు నయిన, కీలా=జ్వాలికలనెడు, హాలహాలమునన్=కాలకూటము చేత-('హాలాహాలో హాలహాలో హాలాహాల ఇతి త్రుతః' అ.) అఖిల...హాలికన్—అఖిలభువనః=సమస్తలోకములయొక్క, హారణక్రీడా = సంహరించెడి ఆటయందలి, హాలహాలికన్ = తొట్రుపాటుచేత, వెలయు బలియునిన్ = ప్రకాశించుచున్న బలవంతుని - అనఁగా ప్రలయాగ్నిని, కలయన్=కూడుకొను నట్టులుగా, లేక యంతటను గలయు నట్లుగా, నీవ కాంచితివి గదా. నీవే కంటివిగదాయని యర్థము. వాయువువలన నగ్ని పుట్టెనని శ్రుతియున్నది గనుక నగ్నిని వాయుకుమారునిఁగాఁ జెప్పినాఁడు- ప్రలయాగ్నికిఁ గన్నతండ్రివిగాన దానికంటెఁ గ్రూరుఁడవని భావము.

చ. నిబిడతమోనుబంధ మహనీయమహామహిజాతమైత్రిమైఁ
బ్రబలుశనైశ్చరుండ వతిసాంసుల నీ వికఁ భీకరాకృతిం
గబళము గొందుగాక త్రిజగంబు వడంక బెడంక నిత్తువే
యబలల జీవనానిలము లన్నియు నాఝుమకేతుసంగతిన్. 50

అ. అతిపాంసుల = మిక్కిలి పాపాత్ముఁడా - (పాంసువులచే - అనఁగా దుష్టులతోఁగూడిన వాఁడాయని భావము) నీవు, నిబిడ...మైత్రిమైన్ — నిబిడ = ఎడతెగని, తమః = రాహువుయొక్క, అనుబంధ=సాంగత్యముచేత, మహనీయ = మిక్కిలియొప్పుచున్న, మహత్ = అధికుఁడయిన, మహీజాత=భూపుత్రుఁడయిన యంగారకునియొక్క, మైత్రిమైన్=చెలిమిచేత, ప్రబలు శనైశ్చరుండవు= అతిశయించుచున్న శనిగ్రహమవని యర్థము. (నిబిడతమః+అనుబంధ = దట్టమయిన చీఁకటితోడి కూడికచేత, మహనీయ=గొప్పలయిన, మహామహీజాత=పెనుమ్రాఁకులయొక్క, మైత్రిన్ = సంబంధముచేత, ప్రబలు = ప్రబలుచున్న, శనైశ్చరుండవు = మెల్లగాచరించువాఁడవు. పెనుమ్రాఁకులడ్డపడుటచే మందముగా వీచువాఁడవనిభావము.) ఇఁకన్, భీకరాకృతిన్=భయంకరమయిన రూపముచేత, ఆఝషకేతుసంగతిన్=మీనమందున్న కేతుగ్రహసాంగత్యమువలన ననియర్థము. (ఝషకేతుఁడనఁగా చేఁపపడగఁగాఁ గలమన్మథుఁడు - మన్మథునితోడి కూడికవలన ననిభావము.) త్రిజగంబు వడంకన్=మూఁడులోకములును గంపించునట్లుగా, అబలల జీవనానిలము లన్నియున్ = స్త్రీల ప్రాణవాయువుల నన్నింటిని, కబలము గొనుగాక=మ్రింగుదువేకాని, వెడంకనిత్తువే=వెణికిపోనిత్తువా - అనఁగా తొలఁగిపోనిత్తువా యనుట.

రాహువు సర్పము. అనిలమును భక్షించునది. అట్టిదానితోడి సంగతిగల నీవు స్త్రీలప్రాణానిలములను విడిచిపుత్తువా యనుట.నిబిడ...మైత్రిమైన్ = పెనుమ్రాఁకులు మిక్కుటమయిన చీఁకటి గ్రమ్ముకొనఁగా మఱింతపెద్దవిగాఁ గానిపించుట ప్రసిద్ధము. 'శనైశ్చరుఁడు' - మందగామి చెట్లపయిఁ బొలయునపుడు. 'అతిపాంసుల'-మిక్కిలిదుమ్మెగసెత్తి భీకరాకృతిం జెలరేఁగునపుడో 'త్రిజగంబును గబలముగొనుట' మఱియు ఝషము జీవనమును (జలమును) గలంచునది. సర్పము అనిలమును భక్షించునది. అట్టిఝషమునందుఁగల కేతువుతోను సర్పరూపముగల రాహువుతోను గూడినపుడు స్త్రీల జీవనానిలములను వెడంకనిత్తువా యని యాశయము ధ్వనించెడిని. మఱియు, 'క్రూరాభానుతమశ్శనిధ్వజకుజాః' అను కాలామృతోక్తినిబట్టి నిచట పాపగ్రహకూటము గలుగునట్లుగాఁ జెప్పినాఁడు. అలం. పరికరము. కావ్యలింగము. రత్నావలియును.

క. అని వనిత నాలిగాలిం, గనలుచుఁ బోనాడి తుహిన కరకిరణఝరిన్
మునుఁగఁ జనఁ జెలులు గని హా, యని వనరుచు నడ్డగింపఁ నతిశోకమునన్.

అ. అని, వనిత=గిరిక, నాలిగాలిన్=కుటిలమయిన మందమారుతమును, కనలుచున్=కోపించుచు-కోపముతో, పోనాడి=నిందించి, తుహినకరకిరణఝరిన్ = చంద్రునివెన్నెలలవెల్లువయందు, మునుఁగన్ చనన్=మునుఁగవలయునని పోవఁగా, చెలులు, కని, హా, అని వనరుచున్=విచారపడుచు, అడ్డగింపన్=వారింపఁగా, అతిశోకమునన్=మిక్కుటమయిన దుఃఖముతో - మీఁది కన్వయము.

శా. ఆజాబిల్లివెలుంగువెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ బటాగ్రం బొత్తి యెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్. 52

అ. రాజీవానన = తామరవంటి మొగముగలది - గిరిక, ఆజాబిల్లి ... కలన్ = ఆచంద్రుని కిరణప్రవాహములను, డాయన్ లేక=తటిసిపోఁజాలక, రాకా నిశారాజ శ్రీసఖము = పున్నమనాఁటి

చంద్రునియొక్క శోభకు. చెలి-అనఁగా రాకాచంద్రునివలె శోభిల్లుచున్నది. ఏన మోమునన్, పటాగ్రంబు=పైటకొంగు, ఒత్తి=హత్తించుకొని, ఎగ్గత్తి = పెద్దగొంతు చేసికొని, కిన్నర...పూరంబు—కిన్నరవధూ=కిన్నరస్త్రీలయొక్క, రాజత్=ప్రకాశించుచున్న, కరాంభోజ = చేఁదమ్ములయందలి, కాంభోజీమేళ=కాంభోదిరాగ మేళముతోఁగూడిన, విపంచికారవ=వీణాధ్వనియనెడు, సుధాపూరంబు=అమృతపు ప్రవాహము, తోరంబుగాన్=విస్తరించునట్లుగా - అనఁగా కిన్నరస్త్రీలు కాంభోది రాగమును మేళవించి వాయించు వీణియరవళికి సాటియగునట్లుగా, ఏడ్చెను.

కాంభోదిరాగము దీనస్వరమగుట తెల్లము. ఇటఁ గరుణాత్మక వియోగశృంగారమును జెప్పినాఁడు. ఇందులకు నరసరాజీయము,

'వనితపరోక్షంబునఁ బతి,యును బ్రియునిపరోక్షమునఁ బంయోజాక్షియు రోదనమొనరించుట వర్ణం,చినఁ గరుణాత్మకవియోగశృంగార మగున్.'

ఉ. అప్పుడు ముద్దరాలిఁ జెలు లక్కునఁ జేర్చి ముఖాబ్జ మెత్తి కన్
దెప్పల బాష్పముల్ దుడిచి తేపె నృపాలుఁడు గారవింప నీ
వొప్పులకుప్పవై సిరుల నొందెద వేటికిఁ గుందెదమ్మ మా
యప్పవుగా మదిం దలఁప కమ్మ వినూతనసాహసంబులన్. 53

అ. చెలులు=చెలికత్తెలు, అప్పుడు, ముద్దరాలిన్=గిరికను, అక్కునఁజేర్చి=కౌఁగిలించుకొని, ముఖాబ్జము ఎత్తి=వంచుకొన్న మొగముపయికెత్తి, కన్ దెప్పల బాష్పముల్ తుడిచి, తేపె=నేఁడు లేదు రేపటిదినమే, నృపాలుఁడు=వసురాజు, గారవింపన్ = మన్నింపఁగా, నీవు, ఒప్పులకుప్పవై=ఒప్పిదములరాశివై - అనఁగా సకలశుభములకు నాస్పదురాలవై, సిరులన్=సంపదలను, ఒందెదవు, కాఁబట్టి, ఏటికిన్, కుందెదమ్మ = విచారపడుచున్నావమ్మా, మాయప్పవుగా = మాయమ్మవుగా, ఇది యత్యంతప్రేమచేతఁ బలికెడిమాట. వినూతన సాహసంబులన్ = క్రొత్తక్రొత్తలగు తెగువలను-అనఁగా మరణోద్యోగములను, మదిన్, తలఁపకమ్మ=తలఁచుకొనవలదమ్మా. మనస్సునందేని తలంపకు మనుచో నిఁకఁజేయుటవలదని చెప్పవలయునా యని భావము.

చ. అని మన సూర నూరడిల నాడి యయో మనమంజువాణియుం
జని తడవయ్యె నేమిటికి జా గొనరించెనొకో నగేంద్రనం
దనమది కొందలం బెఱుఁగదా తగదా పగదాయవెన్నెలన్
మునిఁగెడిబాల నెత్తి నయమున్ బ్రియముల్ దయ మున్నుగాఁగనన్. 54

అ. అని, మనసు, ఊరన్=మనసు ఆశయూరునట్లుగా, ఊరడిలన్ ఆడి = ఊరటఁబొందునట్లుగాఁజెప్పి, మనమంజువాణియును, చని, తడవయ్యెను = చాలసేపయ్యెను. ఏమిటికిన్, జాగు = ఆలస్యము, ఒనరించెనొకో=చేసెనో, నగేంద్ర...దలంబు=గిరిక మనసు తల్లడపాటును, ఎఱుఁగదా=తానుగుఱుతెఱుఁగదా, పగదాయవెన్నెలన్ = శత్రువయిన వెన్నెలయందు, మునిఁగెడుబాలను, గిరికను, ఎత్తి, నయమున్ = నయమును--మెత్తఁదనమును లేక మెలుపును, ప్రియముల్=హితవును, దయ=దయయు, మున్నుగాన్=ముందుఁగలుగఁగా, నయాదులను బురస్కరించుకొని యనుట, కనన్ తగదా=చూచుటకుఁ దగినదిగాదా. మీఁదికన్వయము.

శా. ఎట్టో కాకని యన్నులన్ని దెసలన్ వీక్షింప నప్పట్టునం
బుట్టుంగొంపున నింపుమీఱు రవిపెంపుం బెంపి దట్టంపుఁ గెం

బట్టుం బుట్టమురంగు నింగిరమ కాపాదించు దివ్యప్రభా
ధట్టం బొక్కటి పుట్టెఁ గట్టెదుర సంధ్యాలక్ష్మికిం జుట్ట మై. 55

అ. అన్నులు = స్త్రీలు - గిరిక చెలికత్తెలు, ఎట్టోకాక అని=ఇఁక నేమియో తోఁచలేదని-లేకమంజువాణి రాదయ్యె నేమో కాని యని, అన్ని దెసలన్, వీక్షింపన్ = చూచుచుండఁగా, అప్పట్టునన్=ఆసమయమందు, పుట్టుఁగెంపునన్=ఉదయకాలపు ఎఱ్ఱఁదనముచేత, ఇంపుమీఱు=మనోహర మగుచున్న, రవి=సూర్యునియొక్క, పెంపున్=అతిశయత్వమును, పెంపి=పోఁగొట్టి - అనఁగా నిరసించి, దట్టంపుకెంబట్టుం బుట్టమురంగు = దట్టమయిన యెఱ్ఱ పట్టుచీరయొక్క డాలు, నింగిరమకున్=ఆకాశలక్ష్మికి, ఆపాదించు దివ్యప్రభా ధట్టంబు=కలిగించు దివ్యమగు కాంతి సమూహము, సంధ్యాలక్ష్మికిన్=సంధ్యారక్తిమ సంపత్తికి, చుట్టమై=వియ్యమై - అనఁగా సంజకెంజాయకు సాటియై, కట్టెదురన్=సూటిగా నెట్టయెదుట, పుట్టెన్=పొడమెను - కనుపట్టె ననుట.

నింగియొక్క రమను జెప్పుట దివ్యప్రభా ధట్టమును గెంబట్టుచీరఁగా నలవరించినందులకు. ఈప్రభాధట్టము వసురాజుపద్మరాగ ముద్రాంగుళీయకప్రభ యని మీఁదిపద్యమునఁ దెలియునది.

సీ. ఇది తమ్మికంటిపై నీసడించిన నిశా, ధవుఁ దోలు లోకబాంధవుని పొడుపు
పొడుపు గా దిది తల్లి పడఁతి కెత్తఁగఁ దెచ్చు, రక్తరాజీవనీ రాజనార్చి
యర్చి గా దిది సహజానురక్తి నగాత్మ, జను బ్రోవఁ గదియు నోషధులచాయ
చాయ గా దిది కూఁతు చంద మారయవచ్చు, కోలాహలుని రక్తకూటదీప్తి
తే. దీప్తిమాత్రంబుగా దిది దివ్యధామ, మనుచుఁ జెలు లాడుకొన వచ్చె నంత నాన్ర
పార్చితనవాబ్జ రాగముద్రాంగుళీయ, రంజితాత్మీయ పాణియై మంజువాణి. 56

అ. చెలులు=గిరిక చెలికత్తెలు, ఇది=ఈకనఁబడుచున్న యెఱుపు, తమ్మికంటిపైన్=తామరల వంటి కన్నులుగల గిరికపై, ఈసడించిన = విరోధించిన, నిశాధవున్=చంద్రుని, తోలు=పలాయనము నొందించుచున్న, లోకబాంధవుని పొడుపు = సూర్యునియొక్క ఉదయము, ఇక్కడ 'తమ్మికంటి లోకబాంధవ' పదములు సాభిప్రాయములు. తమ్ములకుఁ బ్రియుఁడయి సూర్యునిచేత తమ్మికంటి రక్షణీయురాలనియు లోకములకు బంధువుగనుక ఆర్తజన రక్షణము కర్తవ్యమనియు, ఆశయముచేత సాభిప్రాయము. పొడుపుగాదిది=ఇది సూర్యోదయముగాదు. మ ఱేమనఁగా, తల్లి=గిరికతల్లియైనశుక్తిమతి, పడఁతికిన్=గిరికకు, ఎత్తఁగన్ = నివాళించుటకై, తెచ్చు రక్తరాజీవ నీరాజనార్చి=తీసికొని వచ్చుచున్న యెఱ్ఱతామరల రూపమయిన ఆరతిదీప జ్వాలిక. అర్చిగాదిది = ఇది యాజ్వాలిక కాదు. సహజానురక్తిన్ = తోఁడఁబుట్టిన దానియందలి యనురాగముచేత ననియర్థము. (సహజమయిన రక్తిమచేత ననిభావము.) నగాత్మజను=గిరికను - ( ఇట నగాత్మజశబ్దముచే గిరికకు నోషధులకును సహజత్వము సమర్థితము. ఓషధులును నగమునందుఁ బుట్టినవే కదా. ) బ్రోవన్ = కాచుటకై, కదియు = దగ్గఱుచున్నట్టి, ఓషధులచాయ = (సంజీవసంధానసావర్ణ్యవిశల్య కరణులనెడు) ఓషధులయొక్క కాంతియో, దివ్యౌషధు లెఱ్ఱఁగా వెలుఁగుననుట ప్రకటము. ఇందులకు 'జ్యోతిర్లతాప్రతానాతపంబో' యని పసపెండకు సాటిగా మనుచరిత్రమున వర్ణితము. చాయగాదిది=ఇదిఓషధుల కాంతిగాదు. కూఁతుచందము = కుమారితయొక్క యునికి తెఱఁగు, అరయన్=విచారించుటకు, వచ్చు, కోలాహలుని, రక్తకూటదీప్తి=గైరికధాతు మయమై యెఱ్ఱగానున్న

శిఖరముల కాంతి. దీప్తిమాత్రంబుగా దిది=ఇది సాధారణమైన కాంతిమాత్రముగాదు, దివ్యధామము= ఏదో దివ్యమైనయొక తేజస్సు, అనుచున్, ఆడుకొనన్ = చెప్పుకొనుచుండఁగా, అంత, అన్న...పాణియై—ఆవసురాజుచేత నియ్యఁబడిన, నవాబ్జరాగ=క్రొత్తపద్మరాగపు కెంపులతోఁగూడిన, ముద్రాంగుళీయ=ముద్రతోఁగూడిన యుంగరముచేత, రంజిత=ప్రకాశించుచున్న, ఆత్మీయ పాణియై=తనచేయి గలదై, మంజువాణి వచ్చెను. కాన మంజువాణిచేతనున్న వసురాజు పద్మరాగమణి యుంగరము దవ్వులవచ్చునపుడు, సూర్యునిపొడుపు కెంజాయగాను, మఱియుఁ దారసింపఁగా శుక్తిమతి నివాళించుటకైన యెఱ్ఱదామరలడాలుగాను రూపించినాఁడు. మఱియు సమీపించుటచేత ఉపహూన భూతములయిన ఓషధులకు 'కదియు' ననియు కోలాహలునికి 'వచ్చు' ననియు సామీప్యనిబంధకములు చెప్పఁబడెను. అల. సందేహము.

క. వచ్చి వసురాజశేఖరుఁ, డిచ్చిన ముద్రిక లతాంగి | యెదుట నిడి చెలుల్
గ్రచ్చుకొని యడుగ నిట్లను, నచ్ఛేడియ తనయుదంత | మాద్యంతంబున్. 57

అ. అచ్ఛేడియ=ఆగిరిక, వచ్చి, వసురాజశేఖరుఁ డిచ్చిన ముద్రికను, లతాంగియెదుటన్=గిరిక ముందట, ఇడి=ఉంచి, చెలుల్, గ్రచ్చుకొని యడుగన్ = క్రమ్ముకొని అడుగఁగా, తన ఉదంతము ఆద్యంతంబున్=తనవృత్తాంతమంతటిని, ('వార్తా ప్రవృత్తి ర్వృత్తాంత ఉదంతః' అ.) ఇట్లనున్= ఈలాగని పలికెను.

ఉ. అమ్మనుజేంద్ర చంద్రుహృదయ మ్మది యెట్టిదయో యెఱింగి యీ
కొమ్మమనమ్మునం గలుగు | కొందల మంతయుఁ దెల్పి రమ్ము పో
పొమ్మని మీరు వంపఁ బనిఁ | బూని పొలంతుకలార కార్యవే
గమ్మున నంబరోత్పతన | కౌశల మందితిఁ దత్క్షణంబునన్. 58

అ. అమ్మనుజేంద్రచంద్రు=ఆవసురాజుయొక్క...ఈకొమ్మ=ఈగిరికయొక్క,...పోపొమ్మని = పోపోఅని, పనిఁబూని=నియోగమును వహించి, పొలంతుకలార=చెలియలారా, కార్యవేగమ్మునన్= పూనినపనియందలి త్వరచేత, తత్క్షణంబునన్, అంబర+ఉత్పతన కౌశలము = ఆకాశమునకెగయు నేర్పును, అందితిని=పొందితిని; ఆకాశమార్గమున కెగసితి ననుట.

సీ. బడివాయ కిల నగ | ప్రతతితో జివ్వన, నెగిరిన ట్లైతోఁచు | మగువలార
పైపై సమీరణా | ర్భటి నింగి బోరన, నఱచిన ట్లైతోఁచు | నతివలార
నిఖిలభూములు జవ | నిక వాప దారున, నెదిరిన ట్లైతోఁచు | నింతులార
చనఁజన వెడఁదయై | శశిమేను గ్రక్కునఁ, బెరిఁగిన ట్లైతోఁచుఁ | దరుణులార
తే. కొండ లచ్చనగండ్లయి | నిండుచెఱువు, లెల్లనద్దంపు బిల్లలై | యేర్లు ముత్తి
యంపుసరులై యరణ్యాంపు | గుంపు లెల్ల, నారులై తోఁచుఁబొడువున | నారులార. 59

అ. పొడువునన్ = ఊర్ధ్వభాగమునఁ బోవుచున్నపుడు, మగువలారా=చెలియలార, బడిఁబాయక=వెంటనెడఁబాయక, ఇల=భూమి, నగప్రతతితోన్ = పర్వత సమూహముతోఁగూడ, జివ్వనన్=అతివేగముగా, ఎగిరనట్లైతోఁచున్=మీఁదికెగసి వచ్చినట్లుగాఁ గనఁబడును. అతివలార=చెలులార, పైపైన్=మీఁదమీఁద, సమీరణ ఆర్భటిన్ = వాయువుయొక్క ఆర్భాటముచేత-అనఁగా వాయువుయొక్క విట్టుతాఁకుడుచేత, నింగి=ఆకాశము, బోరనన్, అఱచినట్లైతోఁచును. ఇంతు

లార=చెలులార, నిఖిలభూములు = సమస్తజగత్తులు, జవనిక వాఁపఁగ = తెరదీయఁగానే, దారుణఁగ ఎదిరినట్లై=తెప్పున నెదురుపడ్డట్లుగా, తరుణులార=చెలులార, చనఁగ చనఁగ =పోఁగాపోఁగా, శశి మేను=చంద్రునిదేహము, వెడదయై = విరివియై, క్రక్కునఁగ పెరిఁగినట్లైతోఁచుఁగ=అతిశీఘ్రముగా వృద్ధిఁబొందినట్లు చూపట్టును. నారులార=చెలియలార, కొండలు, అచ్చనగండ్లయి = అచ్చనగాయ లంతలై, అరణ్యంపు గుంపులు, నారులై=నాఁటిపోసిన మొలక లంతలై, తోఁచుఁగ. అల.స్వభావోక్తి.

చ. పురములు దుర్గముల్ శిబిరముల్ ౹ వెలిపేటలు నూళ్లు పల్లియల్
ధరపయిఁ గుప్పవోసినవిధంబున నేర్పడకున్కిఁ గొంతసే
పరయుటకై వినిశ్చలతరాకృతి నుండి వసుక్షమాతలే
శ్వరునగరీలలామకము ౹ చాయఁ గనుంగొని సంభ్రమంబునన్. 60

అ. శిబిరముల్ = సేనవిడిపట్టులును, వెలిపేటలు = పట్టణమునకు వెలుపలనుండు పేటలును, ఊళ్లు=గ్రామములు, ధరపయిఁగ = భూమిమీఁద, కుప్పవోసిన విధంబునఁగ, ఏర్పడక ఉన్కిఁగ = రాశిపోసిన విధముగా నిది యదియని తెలియరాకుండుటచే, కొంతసేపు, అరయుటకై=విమర్శించుటకు, వినిశ్చలత రాకృతినుండి=కదలకుండి, వసు...చాయఁగ=వసురాజుయొక్క మేలయిన పట్టణము యొక్క జాడను, కనుంగొని, సంభ్రమంబునఁగ = (ఉద్దేశించిన కార్యమందలి) త్వరచేత మీఁది కన్వయము.

సీ. పోవఁబోవఁగఁదోఁచెఁ ౹ బురరమామకుటమా,ల్యంబులై భర్మహర్మ్యధ్వజంబు
లేఁగనేఁగనెదిర్చె ౹ గృహదేవతామాళి, కలితాబ్జకళికలై ౹ కలశతతులు
చేరఁజేరఁదలిర్చె ౹ పురలక్ష్మీవాస,వనజాతదళము లై ౹ వప్రశిఖలు
చనఁజనఁ దులకించె ౹ జగతీసతీకాంచి, హారపర్వంబులై ౹ తోరణంబు
తే. లరుగ నరుగంగఁజూపట్టె ౹ సిరి యనంత, తనువులై మల్లఖురళికాభినయవాటి
కాకరితురంగశాలికా ౹ గంధవిపణి,కాఃసుఖార్పితమణి పుత్రికాచయంబు. 61

అ. పోవఁగ పోవఁగ కఁగ=భూమికై దిగి పోఁగాపోఁగా, భర్మహర్మ్య ధ్వజంబులు=బంగారు మేడలమీఁది టెక్కములు, పురరమామకుటమాల్యంబులై=పురలక్ష్మీయొక్క కిరీటమందలి పూదండ లో యున్నట్లుగా, తోఁచెఁగ=కనుపట్టెను. ఏఁగఁగ ఏఁగఁగ = మఱియు క్రిందికిఁబోఁగాఁబోఁగా, కలశతతులు=గృహోపరిభాగములందుండు కలశ సమూహములు, గృహ...కళికలై—గృహదేవతా= గృహాధిదేవతలయొక్క, మాళి=కొదలలయందు, కలిత=ఒప్పుచున్న, అబ్జకళికలై=తామర మొగ్గలో యనునట్లుగా, ఎదిర్చెఁగ=ఎదురుపడెను. చేరఁగ చేరఁగ =మఱియు సమీపించిపోవఁగా, వప్రశిఖలు= కోటకొమ్మలు ('సానుప్రాకార యోర్వప్రః' విశ్వ. 'శిఖాశిఖాయాం చూడాయాం జ్వాలాయామగ్ర మాత్రకే' విశ్వ) పుర...దళములై = పురలక్ష్మికి ఉనికిపట్టులయిన తామరల రేకులో యనునట్లుగా, తలిర్చెఁగ=చూడనొప్పెను. చనఁగ చనఁగ =మఱియు దగ్గఱిపోఁగాపోఁగా, తోరణంబులు=(తోరణో స్త్రీ) బహిర్ద్వారమ్) బహిర్ద్వారములు, జగతీ...పర్వంబులై-జగతీసతీ=భూకాంతయొక్క,కాంచి= మొలనూలియందలి, హారపర్వంబులై=వజ్రగ్రంథులో యనునట్లుగా, తులకించెఁగ =ప్రకాశించెను.

అరుగఁగ అరుగఁగ =మఱిమఱి దగ్గఱకుఁబోఁగా, మల్ల...చయంబు—మల్లఖురళికా=సాము గరిడీలయొక్కయు, అభినయవాటికా=నాటకశాలలయొక్కయు, కరితురంగశాలికా=ఏనుఁగులయు

గుజ్జములయు శాలలయొక్కయు, గంధవిపణికా=వాసనద్రవ్యములమ్మెడు నంగడివీథులయొక్కయు, ముఖ=మొగదలలయందు, అర్పిత=నిలుపఁబడిన, మణిపుత్రికాచయంబు = రతనపుఁబ్రతిమలయొక్క సమూహము, సిరియనంత తనువులై=లక్ష్మియొక్క లెక్కలేని మూర్తులో యనునట్లుగా =చూపట్టెన్, కానిపించెను. వజ్రగ్రంథులనఁగా వజ్రపుకట్లు. అల. రూపకోత్ప్రేక్షలు.

• హర్మ్యములు పురలక్ష్మి కిరీటముంబోలుటకై భర్మమయములుగాఁ జెప్పఁబడినవి. ఇట తోరణములనఁగా మంగళతోరణములు, లేక బహిర్ద్వారములు. అవి వజ్రమయములగుటచే భూసతి మొల నూలియం దందంద దాపఁబడిన వజ్రపుకట్లవలెఁ జెప్పినాఁడు. మణిపుత్రికలు మిక్కిలి చక్కఁదనముగలిగియు లెక్కలేకయు నుండుటచే సిరియనంతతనువు లగుట. కోటప్రాకారము గుండ్రనై చుట్టును రేకులవలెఁ గొమ్మలుగలిగియుండుటచే వనజాత దళములుగాఁ జెప్పఁబడినవి. మిక్కిలి పొడవయినవి మేడలపయి ధ్వజములు. వానికిఁబిదప నందలి కలశములు, వానికిఁగొంత దిగువుగా కోటకొమ్మలు, అంతకుఁ గొంతక్రిందుగా తోరణములు. వానికి దిగువగా సాముగరిడీలు మొదలగువాని యందలి రతనపు బొమ్మలని తెలియునది. మల్లఖురళిక లనఁగా సాముగరిడీలనుటకు,

తే. బహువిరోధి మణిప్రభా ♦ పల్లవాగ్ర, మల్లసంగ్రామ ఖురళికా ♦ మండలాయ
మాననానా పరిష్కార ♦ మహితగాత్రి, మనుజపుత్రిక యాస్థాన♦మునకువచ్చె.(శృ.౫ఆ.౫ప.)

క. అందు ఘనసారమృగమద, చందన కాశ్మీరసార♦సౌరభలహరీ
సందోహదోహదానిల, కందళి నుపశమితగగన♦గమనశ్రమ నై. 62

అ. అందున్=ఆపట్టణమందు, ఘన...కందళిన్-ఘనసార=కర్పూరముయొక్కయు, మృగమద=కస్తూరియొక్కయు, చందన=శ్రీగంధముయొక్కయు, కాశ్మీర = కుంకుముపూ యొక్కయు, సార=మేలయిన, సౌరభ=పరిమళము యొక్క, లహరీ=వెల్లువయొక్క, సందోహ = సమూహమునకు, దోహద=ఉత్పాదక ద్రవ్యమయిన - అనఁగా కర్పూరాదుల పరిమళమును బ్రకటింపఁజేయుచున్న, అనిలకందళిన్=గాలిమొలకచేత - అనఁగా పిన్నవాయువుచేత, ఉపశమిత = నివారింపఁబడిన, గగనగమన శ్రమనై=ఆకాశ గమనమునఁ బుట్టిన శ్రమగలదాననై, మీఁదికన్వయము.

గగనగమనశ్రమ ముపశమించుటకు హేతువు అనిలముయొక్క కందళిగాన; అదియును ఘనసారాది వాసనలతోఁ గూడినదిగావునను; వీచుగాలియందే ఘనసారాది వాసనలు గుబాళించుచునను జెప్పుటచే పట్టనముయొక్క నిరతిశయమయిన భాగ్యసంపత్తియు, పురజనుల భోగసమృద్ధియు వ్యంజితములు.

చ. అదె యిదె వింతనీడ యని ♦ యారెకు లూరక సంభ్రమింపఁగాఁ
జెదరి కపోతముల్ గొణిగ ♦ చేరక తారకవీథిఁ బాఱఁగా
నిదురఁదొలంగి కేకిరమణీ నివహంబు విధూత పక్షమై
రొద లొదవింపఁగా నొక ♦ శిరోగృహపాళిక ప్రాలి యున్నెడన్. 63

అ. ఆరెకులు=తలారులు - గస్తు దిరిగెడువారలు- ఇది ఆరక్షక శబ్దభవము. 'అదెయిదె వింత నీడ' అని, ఊరక=ఏమియులేకయె, సంభ్రమింపఁగాన్ = తొందరపడఁగా, కపోతముల్=పావురాలు, చెదరి, కొణిగచేరక = మనికిపట్టయిన చూరుపట్టెకు రాక, తారకవీథిన్ = ఆకాశమందు, పాఱఁగాన్=సంచరింపఁగా, కేకిరమణీ నివహంబు=ఆఁడు నెమిళ్లసమూహము, నిదురన్ తొలంగి, విధూతపక్షమై = చలింపఁజేయఁబడిన ఱెక్కలుగలదై - ఱెక్కలు విదుర్చుచు ననుటు. రొదలు,

ఒదవింపఁగాన్ =కలిగింపఁగా, ఒక శిరోగృహపాళికన్ = ఒకానొక మేడమీఁది ప్రదేశమందు, వ్రాలియున్నెడన్=పయినుండి దిగియున్న సమయమునందు.

శిరోగృహమున వ్రాలుటచేత నే యందలి కొణిగయందలి పావురాలు కలగుండువడి చెదరుట. ఆఁడునెమిళ్లను స్త్రీలు మేడలమీఁదఁ బెంచుట ప్రకటముగాన కేకీరమణీ నివహ మిటచెప్పఁబడినది. స్త్రీజనసంబంధమును బట్టి ఆఁడునెమిళ్లను గ్రహించుట.

ఉ. సాలము యంత్రపీఠము విశాలకవాటికఘట్టనంబు దృ
 జ్మీలన మైందవామృతసమేతపతాకిక జిహ్వ చంద్రికా
 జాలము భూతిపూఁత నవచంద్ర శిలాంబువు లశ్రుధారగాఁ
 బ్రోలు ప్రశాంతఘోషమయి పూర్ణసమాధిఁ జెలంగె నయ్యెడన్. 64

అ. ఇందు చప్పుడుడిగియున్న పట్టణమునకు సమాధిదశ వర్ణించుచున్నాఁడు—సాలము= ప్రాకారమే, యంత్రపీఠము=యంత్రమయమయిన పీఠము. విశాలక వాటికఘట్టనంబు=వెడలుపయిన తలుపులమూఁతయే, దృక్ మీలనము=కనుమూఁతయు, ఐందవ...పతాకిక—ఐందవ = చంద్రునివలనఁ బుట్టిన, అమృత = జలముతోడ - అనఁగా మంచునీటితోడ, సమేత = కూడుకొన్న, పతాకిక = ధ్వజమే, ఐందవ=సహస్రారకమల మందలి చంద్రమండలము వలన స్రవించిన, అమృత=అమృతము తోడ, సమేత=కూడిన, జిహ్వ=జిహ్వయును - ఐందవామృత సమేతము అనునది. పతాకికకును జిహ్వకును విశేషణము, చంద్రికాజాలము=వెన్నెల సమూహము, భూతిపూఁత=విబూది పూసికొనుట, నవచంద్ర శిలాంబువులు = క్రొత్తవియగు చంద్రకాంతపు ఱాలనుండి తొరుఁగుచున్న నీళ్లు, అశ్రుధారగాన్=ఆనంద బాష్పధారగా, ప్రోలు=పట్టనము, ప్రశాంతఘోషము = మిక్కిలి యడఁగిన చప్పుడుగలది - అడఁగిన ప్రాణఘోషమనియు, ఐ, పూర్ణసమాధిన్=నిండయిన లంబికాయోగ సమాధి చేత; అయ్యెడన్=ఆనడిరేయియందు, చెలంగెన్=ఒప్పుచుండెను.

సమాధియనఁగా శబ్దాది విషయములయందు శ్రోత్రాదులు వర్తించువఱకును గావించునది ధ్యానము. శబ్దాదులనుండి బొత్తిగానివర్తించి మనస్సు ఆత్మతోలయించుట సమాధి. ఇందులకు

'శబ్దాదీనాంచ తన్మాత్రా యావత్కర్ణాదిషుస్థితాః। తావదేవకృతంధ్యానం స్యాత్సమాధిరతః పరమ్
జలసైంధవ యోస్సామ్యం యథాభవతి యోగతః। తథాత్మ మనసోరైక్యం సమాధి రిహాభణ్యతే॥

సమాధినిష్ఠుఁడు యంత్రపీఠము పైచుకొని కన్నులురెండు మూసికొని సహస్రారకమల చంద్రునినుండి యమృతము నాలుకయం దూరుచుండఁగా బూదిపూసికొని యానందబాష్పము దొరుఁగ, ఏచప్పుడును లేక నిశ్చలుఁడై యుండుట నిట యనుసంధింపఁ బడెను. ఇదియె పూర్ణసమాధి. దీనిచే నర్ధరాత్ర మూహ్యము. అల. రూపకసంకీర్ణమైన ఉత్ప్రేక్ష.

సీ. పతిగళార్పితభుజా - లతికలై రతికేళి, యలపార్పుముంగిళ్ల - మెలఁగువారు
 నలిగి యేఁగుచుఁ బ్రియుల్ - నిలిపిన నిజభుజం,గీభావ మేర్పడఁ - గెరలువారు
 వరులొండుకడ కేఁగఁ - బురుషభూమికఁ బూని, తెరువాఁగి భంగింపఁ - దిప్పువారు
 రాకుమారులయిండ్ల - కేకతంబునఁ దదా,ప్తులవెంట బుడిబుడిఁ - బోవువారు
తే. మదనమంత్ర రహస్యముల్ - సదనవలభి, నిభృత పారావతములకు - నేర్పువారు
 నైన వెలయాండ్రచే నప్పు - రాధిరాజ, వేశవాటిక చూడ్కికి - వేడ్కయొసఁగె. 65

అ. ఇందు వెలయాండ్రను వర్ణించుచున్నాఁడు - కొందఱు, పతిగళార్పి...కలై=మగల (విటుల)యొక్క కంఠములందు ఉంపఁబడిన తీఁగలవంటి చేతులుగలవారై, రతికేళి, యలపు= అలయికను, ఆర్పన్=తీర్చుకొనుటకు, ముంగిళ్లకున్=ఇంటిముంగిళ్లయందు, కొందఱు, అలిగియేఁగుచు= కోపించిపోవుచు, ప్రియుల్ = గాదిలి విటులు, నిలిచినన్ = పోవనీక యడ్డగింపఁగా, నిజభుజంగీభావము = (భుజంగియనఁగా ఆఁడుసర్పమును విటకత్తెయును గనుక) తమ సర్పాంగన చేష్టయని యర్థము. తమవిటకత్తెతనమనిభావము. ('భుజంగో విటసర్పయోః' అ. 'భావస్సత్తా స్వభావాభిప్రాయ చేష్టాత్మజన్మసు' అ.) ఏర్పడన్, కెరలువారు=చిరాకుపడువారు - సర్పములనాఁగిన చిరాకుపడుట సహజము. కొందఱు, వరులు=తమ ననుపుకాండ్రు - అనఁగా లంజెకాండ్రు, ఒండుకడకున్, ఏఁగన్ = వేఱొక స్త్రీతోడి సంభోగమునకై మఱియొకచోటికిఁ బోవఁగా, పురుషభూమికన్= ('భూమికారచనాయాంస్యాత్ స్థూల్యంతర పరిగ్రహే' అని విశ్వము.) పురుషవేషమును, పూని= తాల్చి, తెరువాఁగి=దారికాచి, భంగింపన్ తివురువారు=భంగపఱుప వలెనని ఉద్యుక్తులయ్యెడు వారు, కొందఱు, రాకుమారుల యిండ్లకున్ = రాజకుమారుల గృహములకు, ఏకతంబునన్=రహస్య ముగా, తదాప్తులవెంటన్ = వారికిష్టులయిన వారివెంబడిని, బుడిబుడిన్ పోవువారు=తెప్పతెప్పనఁ బోయెడువారు.

కొందఱు, సదన...తములకున్ — సదనవలభి=ఇండ్ల చూరుపట్టెలయందు, నిభృత=చలింపకుండునట్టి, పారావతములకున్ = పావురాలకు, మదనమంత్ర రహస్యముల్ = మన్మథ మంత్రముల యొక్క రహస్యార్థములను, నేర్పువారును, ఐన వెలయాండ్రచే, అప్పురాధిరాజ వేశవాటిక= ఆపట్టణ శ్రేష్ఠమంవలి బోగమువాడ, చూడ్కికిన్ వేడ్కయొసఁగెన్=చూపులకు వేడుకపుట్టించెను. ('వేశో వేశ్యా జనసమాశ్రయః' అ.) అల. స్వభావోక్తి.

సీ. కమనీయకౌముదీకాంతి వారి వియోగ, గాఢపాండిమపొత్తుఁ గలయఁబోలు
వలివెల్లు లావెల్లువలు వారిమదన వహ్ని, జ్వాలికలవేఁడి నిగురఁబోలుఁ
బ్రతిహట్టరత్నదీపములు వారిదృగంశు, యమునోర్మిమాలిక నడఁగఁబోలు
యామికారభటీభయంబు వారిమనోజ, భూవరాజ్ఞాసిద్ధిఁ బొలయఁబోలుఁ

తే. బండువెన్నెలయనక యాపణవిధూప, లాంబునక యాత్రోవరత్నాంకురార్చు
లనక యామీఁద నారెకులనక చనిరి, తరుణులొకకొందఱవియెల్ల వరసికొనుచు.

అ. కమనీయ కౌముదీకాంతి = ఒప్పుచున్న వెన్నెల తెల్లనివెలుంగు, వారివియోగ గాఢ పాండిమపొత్తున్ = ఆ స్త్రీలయొక్క విరహమువలని దట్టమయిన తెలుపుతోడి కూటమిని, కలయఁ బోలున్=కూడియుండఁబోలును. వలివెల్లు లావెల్లువలు = చంద్రకాంత శిలలయొక్క (వెన్నెలచేతఁ గరఁగి స్రవించిన) ప్రవాహములు, వారి మదనవహ్ని జ్వాలికలవేఁడిన్=ఆ స్త్రీ మన్మథాగ్ని సెగల వేండ్రముచేత, ఇగురఁబోలున్=ఇగిరిపోయి యుండవచ్చును. ప్రతిహట్ట రత్నదీపములు=ప్రతియంగడి వీథియందును గల రత్నమయములయిన దీపములు, వారి=ఆ స్త్రీలయొక్క, దృగంశు = దృష్టికాంతుల నెడు, యమునోర్మిమాలికన్=యమునా జలతరంగముల బంతిచేత, అడఁగఁబోలున్=అడఁగిపోయి యుండవచ్చును. యామికార భటీభయంబు = తలారుల యార్భాటమువలని భయము. వారి... సిద్ధిన్=ఆ స్త్రీలమన్మథ మహారాజుయొక్క ఆజ్ఞ సిద్ధించుటచేత - మన్మథుఁడు రాజువలె ఆజ్ఞ చేయఁ గావలుట, పొలియఁబోలున్=నశించి యుండవచ్చును. కనుక నే.

పండువెన్నెల, అనక, అపయిఁ = అటమీఁదట, విధు+ఉపల అంబువు = చంద్రకాంతపు తాలనీరు, అనక, అత్రోఁ=ఆదారియందు, రత్నాంకుర అర్చులు=మొలకలవంటి రతనంపు దివ్వెల జ్వాలలు, అనక,ఆమీఁదఁ, ఆరెకులు=తలారులు. అనక, ఒకకొందఱు తరుణులు=ఎల్లప్రాయముగల కొందఱు స్త్రీలు, అవియెల్లఁ = ఆపండువెన్నెల మొదలయిన వానినన్నిటిని, అరసికొనుచుఁ = చూచుచు, చనిరి=పోయిరి.

కొందఱు అంకుటాండ్రు, విటుల సంకేతమునుగూర్చి పోవునెడలఁ బండువెన్నెలయు, చంద్రకాంతపుతాల ముంపును, రత్నదీపములు కాంతులును, తలారుల యడవడియును విరుద్ధములయినను కామాతురత్వముచేత వానినెంతమాత్రము విచారింపక పోయిరని తాత్పర్యము. అల. ఉత్ప్రేక్ష.

చ. హరిహయ సౌధసన్నిభము లన్నియు నన్నియు నద్భుతాకృతుల్
హరితమణి ప్రకల్పితము లన్నియు నన్నియుఁ జిత్రకేతువుల్
హరిపద మార్గలంఘనము లన్నియు నన్నియు హేమవప్రముల్
పురిభవనంబు లిందు నృపపుంగవుమంగళధామ మెద్దియో. 67

అ. పురిభవనంబులు = పట్టణమందలి గృహములు, అన్నియుఁ=సమస్తమును, హరిహయ సౌధసన్నిభములు=ఇంద్రునిమేడతో సమానములయినవి, అన్నియుఁ, అద్భుతాకృతులు=ఆశ్చర్యకరమైన రూపముగలవి. అన్నియుఁ, హరితమణి ప్రకల్పితములు=పచ్చలచే నిర్మింపఁబడినవి. అన్నియుఁ, చిత్రకేతువుల్ = విచిత్రములయిన ధ్వజములుగలవి, అన్నియుఁ, హరిపదమార్గ లంఘనములు = ఆకాశమార్గముయొక్క దాఁటుటను గలవి. అన్నియుఁ, హేమవప్రములు = బంగారు ప్రాకారములు గలవి. కాఁబట్టి, ఇందుఁ=వీనిలో, నృపపుంగవు మంగళధామము=వసురాజు శుభాస్పదమయిన గృహము, ఎద్దియో. మీఁదికన్వయము.

మ. అని చింతించుచు నొక్కధామమునకుఁ యక్షాంగనల్ పుష్కర
ధ్వనితోఁ జారణకన్యకల్ చటులవాగ్వై చిత్రితోఁ బన్నగాం
గన లుద్యన్మణిదీపమాలికలతో గంధర్వ కాంతల్ సుకం
ఠనినాదాతిశయంబుతోఁ బ్రహరిచుట్టం గంటిఁ జిత్రంబుగాన్. 68

అ. ఒక్కధామమునకుఁ = ఒకానొకయింటికి, యక్షాంగనల్ = యక్షస్త్రీలు, పుష్కరధ్వనితోఁ=('పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండ ముఖేజలే'అ.)పుష్కరమనెడి వాద్యభాండముతోను, చారణకన్యకల్ = చారణస్త్రీలు, చటులవాగ్వైచిత్రితోఁ = పటుతరమైన వాక్యచమత్కారముతోడను, పన్నగాంగనలు = నాగకన్యకలు, ఉద్యన్మణిదీప మాలికలతోఁ = ప్రకాశించుచున్న రత్నదీప శ్రేణులతోడ, గంధర్వకాంతల్ = గంధర్వస్త్రీలు, సుకంఠనినాదాతిశయంబులతోఁ = మంచికంఠధ్వని పెంపుసొంపుతో - అనఁగా పాటతోడను, ప్రహరి = అలంగము, చుట్టఁ=తిరుగుచుండఁగా, చిత్రంబుగాఁ=ఆశ్చర్యమగునట్లుగా, కంటిఁ=చూచితిని.

ఇందు యక్షచారణపన్నగ గంధర్వకాంతలకుఁ దత్తదుచితవ్యాపారమును జెప్పినాఁడు. అనఁగా యక్షులకును వాద్యమును చారణులకును వాక్పటిమయు పన్నగులకు మణులును గంధర్వులకు గాంధర్వమును విశేషములు. ఇట దేవతాస్త్రీలు గొలుచుటకుఁ గారణము మీఁదఁ జెప్పుచున్నాఁడు.

మ. నరలోకంబఁట సిద్ధసాధ్యఫణిగంధర్వాంగనాసేవనా
పరిపాకంబఁట యెంతవింత యనుచుం బల్మాఱు వీక్షించి యే

సురరాడ్దత్త విమానచిత్రమహిమల్ సూ యంచు నూహించి యా
ధరణీనాథకులావతంసభవనద్వారంబు సేరం జనన్. 69

అ. నరలోకంబంట=లోకమువిచారింపఁగా మనుష్యలోకమంట, సిద్ధ... బంట=పరిచర్యవిచారింపఁగా సిద్ధసాధ్యపన్నగ గంధర్వస్త్రీలయొక్క పరిచర్యాసిద్ధియంట, ఎంతవింత=ఏమియాశ్చర్యము, అనుచు, చూచి, అనఁగా మనుష్యలోకమున దేవతాస్త్రీలు సేవసేయుట మిక్కిలి యద్భుతముగదా యని తలంచుచు ననుట, పల్మాఱు వీక్షించి=మాటికిఁజూచి, ఏక్ = నేను, సురరాట్దత్త విమానచిత్రమహిమల్ సూ=దేవేంద్రునిచేత వసురాజునకిఁబడిన దివ్యవిమానముయొక్క యద్భుతమయిన ప్రభావములు సుమీ. యని, ఊహించి=భావనచేసి, ఆధరణీనాథ కులావతంసభవనద్వారంబు=రాజకులశ్రేష్ఠుఁడయిన వసురాజుయొక్క గృహద్వారమును, సేరంజనక్=దగ్గఱిపోవఁగా,

దేవతాస్త్రీలు గొలుచుటకు హేతువది దేవేంద్రదత్తమగుట. అట్టిదిగావున నే యది వసురాజు గృహమని యిందు గృహములలో వసురాజు గృహమును గుఱుతెఱుంగుటకు సాధనము సవరించుట తెలియునది.

క. దానాగతరసికాళిస, దానాహతగీతి చెవులఁ నంటఁగ నిదురల్
పూనని బహిరంతరవీ, రానేకపరాజి యచట నచ్చెరు వొసఁగెన్. 70

అ. దాన...ళి—దాన=మదజలముకొఱకు - మదజలమును ఆనుటకు, ఆగత=వచ్చిన, రసిక=సరసములయిన, అళి=తుమ్మెదలయొక్క, సదా+అనాహత=ఎప్పుడును ఎడతెగని, గీతి = ఝుంకార ధ్వనియని యర్థము - (దాన=అర్థప్రదానముకొఱకు, ఆగత=వచ్చిన, రసికాళి=రసికజన సమూహము యొక్క, సదా అనాహత=సంతతమును గొట్టుపడకయున్న, గీతి = గానస్వరమని యర్థాంతరము.) చెవులక్ అంటఁగక్ = చెవిసోఁకఁగా, నిదురల్, పూనని=నిద్రింపకున్నట్టి, బహిరంతరవీర+అనేకప రాజి=బయటను లోపలనున్న మదించిన యేనుఁగులసమూహమని యర్థము. (నిదురింపకున్న - జాగరూకులైయున్న - బయటిలోపట వీరశ్రేష్ఠ సమూహమని యర్థాంతరము.) ఇట శ్రేష్ఠవాచి యగునాగ శబ్దమునకుఁ బర్యాయమయిన అనేకపశబ్దమునకు శ్రేష్ఠవాచకము సమర్థించుకొనునది. అచటక్ = ఆపట్టణమందు, అచ్చెరువు ఒసఁగెక్ = ఆశ్చర్యమును బుట్టించెను.

మదజలమునకు మూఁగి ఝుంకారములు సేయు తుమ్మెదలరొదలకు నిదురింపకున్న మదపుటేనుఁగులసమూహము లాశ్చర్యముగలిగెంచెననియును తమయీవికివచ్చి యెడతెగక రసికజనుల గానములు సేయుచుండుటచే నెచ్చరికగలిగియున్న వీరోత్తములు వింతగొలుపు చుండిరనియు రెండర్థములు తెలియునది. అల. శ్లేషము.

సీ. పటుహీరము లెచాలుఁ బాలసున్న మొనర్ప, శక్రాశ్మము లెచాలుఁ జాదుపూయ
శశికాంతము లెచాలు జలసేక మొనరింపఁ, గలికిపచ్చ లెచాలు నలికివైవ
విద్రుమంబు లెచాలు వింతజాజుఘటింప, ముక్తామణు లెచాలు ముగ్గుకలిడఁగ
వైడూర్యము లెచాలు వన్నెల తెరలుంపఁ, దేటకెంపు లెచాలు దివియలెత్తఁ
తే. జకచకిత పుష్యరాగమాళిక లెచాలు, గగనచిత్రవితాన సంగతి యొసంగ
నిమ్మహాస్థానిక నఁదోఁచెన్నృపుహజార, మామహామంటపముదాఁటియవలఁజనుచు.

అ. ఇమ్మహాస్థానికిక్ = ఈసభామంటపమునకు, పాలసున్న మొనర్పక్ = మెఱుఁగుసున్నము చేయుటకు - సన్నగచ్చుపూయుటయనుట, పటుహీరము లెచాలుక్ = మేలయిన వజ్రములేచాలు -

దాఁపినవజ్రములే మెఱుఁగుసున్నము చేసినట్లుగా గనఁబడుచున్న వనుట. ఇట్లె మీఁదనెల్లఁ దెలియునది. శక్రాశ్మముల=ఇంద్రనీలమణులు, చాఁదుపూయన్ (చాఁదనఁగా నల్లరంగు చేసెడువర్ణద్రవ్యము గనుక) చాఁదుపూయుటకు, చాలున్, శశికాంతములె=చంద్రకాంతపుఱాలె, జలసేకము ఒనరింపన్ = నీరుచల్లుటనుజేయుటకు, చాలున్, కలికిపచ్చలె=అందమయిన మరకతమణులె, విద్రుమంబులె=పగడములె, వింతజాజు=వింతగానున్న యెఱ్ఱజాజుపట్టెలు, తీర్చుటకు, చాలున్, ముక్తామణులె = ముత్తెములె. వైడూర్యములె, వన్నెలతెరలుంపన్ = వన్నెవన్నెపరదాలువేయుటకు, చాలు, వైడూర్యమణుల నూలుపోఁగులు తెరఁబాఱినటులుండుననుట ప్రసిద్ధము. తేటకెంపులె, దివియలెత్తన్ = దీపములుపెట్టుటకు, చాలున్, చకచకిత పుష్యరాగమాలికలె = చకిచకిమని మెఱయు పుష్యరాగమణిపంక్తులె, గగనవిచిత్రవితానసంగతిన్=ఆకాశమందు విచిత్రమయిన మేలుకట్లుకట్టుటకు, చాలున్, అనన్=అనునట్లుగా, నృపుహజారము = రాజుయొక్క కొలువుకూటము. తోఁచెను, ఆమహామంటపమును, దాఁటి అవలన్ చనుచు మీఁదికన్వయము. ఇందు నవరత్నములకుఁ దత్తద్వర్ణోచిత క్రియలను జెప్పినాఁడు.

చ. తళుకుఁబసిండియోవరులు దంతపుఁజావడు లర్చనాగృహం
బులు గుడినీరుమేడలును భోజనశాలలుఁ గెంపుటోడుబి
ళ్ళలగరిడీలు శీతలశిలాతలముల్ భువనేశ్వరంబు లు
జ్జ్వలజలయంత్రధామములు సజ్జలు దాఁటి ధరావతీర్ణయై. 72

అ. తళుకుపసిండియోవరులు=మెఱుపుగల బంగారపుఁ గేళీగృహములు, దంతపుచావడులు=దంతపుచవికలు, అర్చనాగృహంబులు=దేవపూజామందిరములును, కుడినీరుమేడలును = పానీయశాలలును, భోజనశాలలు=భోజనపుఁజావళ్లును, కెంపుటోడుబిళ్లలగరిడీలు=కెంపులచేఁ జేయబడిన గూనపెంకులు గప్పినసాముగరిడీలును, శీతలశిలాతలముల్ = చల్లని చంద్రకాంతపుఱాతికట్టనములును, అనఁగా నెలకట్లును, భువనేశ్వరంబులు = చుట్టుబవంతులను, ఉజ్జ్వలజలయంత్రధామములు = ప్రకాశించుచున్న కౌతుఖానాలుండెడు గృహములును, సజ్జలు = గృహవిశేషములును, దాఁటి, ధరావతీర్ణయై=భూమికి దిగినదానయై - మీఁదికన్వయము.

సీ. ఒకవంక నిర్మలోదకశంకసంకుచత్పరిధానయై రిత్తఁ బాఱ వెఱతు
నొకచోట విఘటితోరుకవాట గృహవాట.మని మిన్నకయ తూఱిచనఁదలంతు
నొకయిక్కనిది వితర్దికనిక్కమని పదాగ్రము నిక్కరహి నెక్కఁగాఁదలంతు
నొకచాయఁ జిత్రభిత్తికగా యనుచు సోయగమునఁ బాయక డాయఁగాఁదలంతు
తే. నిట్లు గృహరాజకేలితానేకరత్న, వివిధరుచివైభవంబుల వెగడుపఱుప
నిదియ కాఁబోలు నృపుకేళిసదనమనుచు, నచటమాయాబలతిరోహితాంగినగుచు.

అ. నిర్మలోదకశంకన్=తేటనీరనెడు సందేహముచేత, సంకుచత్పరిధానయై=పైకి ముడువఁబడుచున్న వస్త్రముగలదానయై, రిత్తన్=వ్యర్థముగా, పాఱన్ తలఁతును, విఘటితోరుకవాట గృహవాటము=తెఱవఁబడిన గొప్పతలుపులుగల యిండ్లవరుస, అని, మిన్నకయ=ఊరకయే, తూఱి=చొచ్చి, ఒకయిక్కన్=ఒకచోట, వితర్దికనిక్కము = నిజముగా అరుఁగేకాని మఱొకటిగాదని ('స్యాద్వితర్దిస్తువేదికా' అ.) పదాగ్రము నిక్కన్=కాలిచివరయెత్తఁబడునట్లుగా, రహిన్=ఉల్లాసముచేత,

చిత్రభిత్తికగా = చిత్తరువు వ్రాసిన గోడగదా, సోయగమునన్ = విలాసముచేత, పాయక=తొలఁగి పోక. గృహ...భవంబులు—గృహశ్రేష్ఠమందు కూర్పఁబడిన బహువిధములయిన రత్నములయొక్క నానాప్రకారములయిన కాంతి సంపదలు, వెగడుపఱుపన్=విభ్రాంతి పొందించుచుండఁగా, ఇదియ= ఇదే, నృపకేళిసదనము=రాజు క్రీడాగృహము కాఁబోలు నని, అచటన్=ఆగృహమందు, మాయాబల తిరోహితఅంగిన్=మాయయొక్క ప్రభావముచే మఱుఁగుపడిన - (ఇతరులకు గనఁబడని) దేహము గలదాననై - అదృశ్యాకారము గలదాననైయనుట. మీఁది కన్వయము. ఇందు ప్రాసనీసము.

చ. అనుపమరత్నసౌధకమలాలయవాటిక నొత్తగిల్లి పైఁ
జనుమొన దోఁప నొంటివలిజక్కవతో నరవిందముల్ మొగి
డ్చినయెలదమ్మితీవియలశీవిఁ గనుంగవ మూసియున్న యం
గనల ననంగదేవతలఁ గాంచితి రాజసమీపభూములన్. 74

అ. అనుపమ...వాటికన్—అనుపమ = సమానములేని, రత్నసౌధ=రతనాల మేడయనెడి, కమలాలయవాటికన్=కొలఁకుపట్టునందు, ఒత్తగిల్లి=ఒత్తిగిలిపరుండి, పైచనుమొన=మీఁదిప్రక్కనున్న కుచాగ్రము, తోఁపన్=కనఁబడఁగా, ఒంటివలి జక్కవతోన్ = (చక్రవాకి నెడఁబాసి) యొంటిగా నున్న చక్రవాకముతోడను, అరవిందముల్...శీవిన్ = తామరలు ముకుళించియున్న లేఁత తామర తీఁగలవలె, కనుంగవ, మూసియున్న, అనంగ దేవతలన్=మదనదేవతలవలె నుండెడు, అంగనలన్= స్త్రీలను కొందఱను, రాజసమీపభూములన్=వసురాజు దాపటిప్రదేశములందు, కాంచితిన్ = చూచితినని యర్థము. రాజనఁగా చంద్రుఁడునుగనుక, చంద్రసమీప ప్రదేశములందని యర్థాంతరము. అల. రూపకోపమలకు సంకరము.

వసురాజు మేడయం దాతనికి దాపటిస్థలములందు, ఒకవైపు చనుమొనలు పైకిఁ గనఁబడునట్లుగా నొత్తిగిలిపరుండి కన్నులుమూసికొని నిదురించుచున్న స్త్రీలు, చంద్రుని సమీపప్రదేశములందు తామర కొలంకునందు పెంటినిబాసిన యొంటి జక్కవపిట్టతోడ తామరలుమొగిడియున్న లేఁత తామర తీఁగలోయనునట్లు చూపట్టిరని తాత్పర్యము. ఇందు 'వలి' శబ్దము 'బలు' శబ్దమువంటిదని తెలియు నది. మేడకును తామరకొలంకునకును, ఒక చనుమొనకును ఒంటిజక్కవకును, మొగిడిన తామరలకును మూసిన కనుఁగవలకును, ఎలతామరతీఁగలకును, అంగనలకును ఉపమానోపమేయభావము తెలియునది.

సీ. ఒకతె చన్నులమీఁది యుదిరికిన్నర గాలిఁ, బలుక నింత చలించి బయలుమీఁటు
నొకతె యూరుపుగాలి నురిలిపూసురఁటి తే,నియ చిందఁగను విచ్చి బయలువిసరు
నొకతె చంద్రాశ్మవేదికముఖద్యుతిఁ జల్లఁ, బడనుల్కి చేయాకు బయలుసాఁచు
నొకతె కప్రపుఁగళాచిక దేంట్లు సందడిం, పఁగ మిట్టిపడి కేలు బయలుపట్టు
తే. నిదురతమినైన నుడిగంపుఁజదురు లిట్లు, వాసనాబలమునఁ బూను వనజముఖులఁ
గంటిఁ గని తత్ప్రదేశంబు గడచి చనఁగ, నువిద లిద్దఱు పతియొద్దనుండి వచ్చి.

అ. ...చన్నులమీఁది, ఉదిరికిన్నర=అచ్చపు బంగారుమయమయిన కిన్నరయను వీణావిశేషము, గాలిన్=వాయువశమున, పలుకన్=తనంతటఁ దానుమ్రోయఁగా, ఇంతచలించి=కొంచెము చలనమునొంది, బయలుమీటున్=ఒట్టిబయలు వ్రేళ్లతో మీటును - ఇది కిన్నరవాయించు నుడిగము సేయునది. ఊరుపుగాలిన్=నిట్టూరుపుగాడ్పుచేత, ఉరిలి=ఉరలఁబడి, పూసురఁటియందలి, తేని

యు, చిందన్ = ఒలుకఁగా, కనువిచ్చి = మెలఁకువగలిగి కన్నులు తెఱచి, బయలువిసరున్ = పట్టబయలున వీచును. ఇది సురఁటివీచు నుడిగము. చంద్రాశ్మవేదిక = తానున్న చంద్రకాంత మణిరచితమయిన యరుఁగు, ముఖద్యుతిన్ = ముఖచంద్రకాంతిచేత, చల్లఁబడన్, ఉల్కి = ఉలికిపడి, చేయాకు = చేతనున్న యాకుమడుపును, బయలుసాఁచున్ = బయలునకందిచ్చును. కప్రపుకళాచిక = కప్పురపు పెట్టియ, తేంట్లుసందడింపఁగన్ = తుమ్మెదలుకదల్పఁగా, మిట్టిపడి = అదరిపడి, కేలుబయలుపట్టున్ = చేయి బయలఁ జాఁపిపట్టును.

నిదురతమినైనన్ = నిద్రాపరవశత్వము చేతనైనను, ఉడిగంపుచదురులు = పరిచర్యలయందలి మెలఁకువలు, ఇట్లు, వాసనాబలమునన్ = పూర్వపరిచితి యొక్క దార్ఢ్యముచేత, పూను, వనజముఖులన్ = స్త్రీలను, కడచిచనఁగాన్ = దాఁటిపోఁగా, ఉవిదలిద్దఱు = ఇద్దఱు స్త్రీలు, పతియొద్దనుండి = రాజసన్నిధినుండి, మీదికన్వయము.

శా. ఏమే హేమలతా యటంచుఁ బని యేమే మాధవీ యంచు నీ
భామామన్మథుచంద మెట్లనుచుఁ జెప్పంజాల భూపాలుఁ డా
రామక్షోణికిఁ జన్న నాఁటఁగొలె నిద్రాసౌఖ్యముల్ మానినాఁ
డేమో యంచు వచింప వింటిఁ దమలో నేకాంతలీలాగతిన్. 76

అ. 'ఏమే హేమలతా' ఇది యొకతె యడుగువాక్యము. 'పనియేమే మాధవీ' మఱియొకతె యడుగుమాట. 'ఈభామామన్మథుచంద మెట్లు = స్త్రీలకు మన్మథుఁడయిన యితని వర్తమాన మేలాటిది' యని బదులుప్రశ్నము. చెప్పంజాల...మానినాఁడు ఏమో = నేనిదియని చెప్పఁజాలను. రాజు ఆటతోఁటపట్టునకుఁ బోయినది మొదలుగా, నిద్రవలని సుఖములను విడిచినాఁడు - అనఁగా నిదుర చెందకున్నాఁడు. అదెందువలననో కాని, యని బదులుమాట. ఏకాంత లీలాగతిన్ = రహస్యప్రకారముగా.

క. ఆమాట కొంత చెవులకు, నామెతగాఁ బ్రియము విస్మయము నాదుమనో
భూమిఁ దళుకొత్త నృపమణి, ధామాభ్యంతరము సొచ్చి తడయక యచటన్.

అ. ఆమాట = రాజుద్యానభూమికిఁ బోయివచ్చినది మొదలుకొని నిద్రాసుఖము మానినాఁడన్న మాట, కొంత, చెవులకున్ ఆమెతగాన్ = విందుకాఁగా - అనఁగా ఉద్యానభూమిని గిరికనుజూచి వలచినాఁడని వ్యంజితమగుటచే చెవులకుమిక్కిలి యింపుగలిగినదనుట. ప్రియమును, విస్మయమును = ఆశ్చర్యమును, నాదుమనోభూమిన్, తళుకొత్తన్, నృపమణిధామాభ్యంతరమున్ = రాజుయొక్క రత్నమందిరములోపల, చొచ్చి, అచటన్, తడయక = ఆలస్యముచేయక, మీఁదికన్వయము.

చ. మొలకమెఱుంగుఁ గెంపుమొనముక్కుల నిక్కు కిరీటిపచ్చఱా
చిలుకలకోళ్లతోఁ జికిలి చెంద్రికవన్నియ పట్టుపట్టెతోఁ
దొలఁకుపసిండివ్రాఁత తెరతో నెఱతావుల మేలుకట్టుతోఁ
జలువలు చిందు ముత్తియపుఁ జప్పరమంచముపై మహోన్నతిన్. 78

అ. మొలక...ముక్కులన్ = మెఱయుచున్న పద్మరాగపు రత్నాంకురములచేత రచితములయిన ముక్కులచేత, నిక్కు = నిక్కుచున్న, కిరీటిపచ్చఱా చిలుకలకోళ్లతో = మరకతమణులచేత నిర్మితములయిన చిలుకలుగల కోళ్లతోడను, చికిలిచెంద్రికవన్నియ పట్టుపట్టెతోన్ = తళుకుగల సిందూరవర్ణపుపట్టునవారుపట్టెతోడను, తొలఁకు... తెరతోన్ = తులఁకించుచున్న బంగారు వ్రాఁత

పనిగల తెరతోడను, నెఱతావుల మేలుకట్టుతోన్ = నిండయిన వాసనలుగల చందువాతోడను, చలువలుచిందుముత్తియపుఁ జప్పరమంచముపైన్ = చలువలు గుమ్మరించుచున్నదియు ముత్యాలుగూర్చి నట్టి దోమతెరమంచముమీఁద, మహోన్నతిన్=మిక్కిలి నిక్కుతోడ.

సీ. నేసకొప్పున జాఱుఁ జెంగల్వమొగడలు, జాగరారుణ కటాక్షముల నెనయ
నిద్దంపుఁ గపురంపుఁ నిడుదయొంటులచాయ, గండపాండిమకుఁ గైదండయొసఁగ
నెత్తమ్మినూలిజన్నిదము శయ్యావివ, ర్తనలూనహారసూత్రములఁ బెనఁగఁ
బలుచనివలిపదువ్వలువ తావియ చిక్కఁ, బూసిన గందంపుఁబూఁతఁ బోల

తే. నొప్పుపుష్పాడిపఱుపుపైఁ నొత్తగిల్లి, మోముఁదమ్మితలాడపైఁ మోపి యడుగుఁ
జివురు చిగురాకుబటువునఁ జేర్చి చిత్ర, ఫలకమీక్షించునాసార్వభౌముఁగంటి.

అ. నేసకొప్పునన్=కొండెసిగనుండి, జాఱు చెంగల్వమొగడలు=ఎఱ్ఱగలువమొగ్గలు, జాగర అరుణకటాక్షముల=నిదురమేలుకొనుటచే ఎఱ్ఱఁబడిన కడఁగన్నులతోడ, ఎనయన్=సరిపోలుచుండఁగా, నిద్దంపుకపురంపు నిడుదయొంటులచాయ=తేటలయినకర్పూరముతోఁ జేయఁబడిన సోగలయిన పాలకాయకుండలముల కాంతి, గండపాండిమకున్ = చెక్కుల తెలుపునకు, కైదండయొసఁగన్= చేయూఁతయియ్యఁగా - అతిశయింపఁజేయఁగా ననుట. నెత్తమ్మినూలిజన్నిదము = తామరతూఁడులోని నూలిచేనయిన జందెము, శయ్యావివర్తనలూన హారసూత్రములన్ = సెజ్జపయిని పొర్లాడుటచేత తెగినముత్తెపుసరిదారములతోడ, పెనఁగన్=పెనఁచుకొనఁగా, పలుచని వలిపదువ్వలువ = సన్ననయి తెల్లనిరవదుప్పటి, తావియచిక్కఁగాన్ = పరిమళముమాత్ర నిలుచునట్లు మిక్కిలి పలుచనగా, పూసిన గందంపుఁ బూఁతను, పోలన్=అనుకరించుచుండఁగా, తెల్లని సన్నని జిలుగువలువ వాసనమాత్రమే నిలుచునట్లు మిక్కిలి పలుచనగాఁబూసిన తెల్లని గందపుబూఁతవలె కనుపట్టెననుట.

ఒప్పు, పుష్పాడి పఱపుపైన్=పుష్పాడిచేఁ గల్పితమయిన సెజ్జమీఁద, మోము=ముఖము, తమ్మితలాడపైన్=తామరాకుల తలగడమీఁద, మోపి, అడుగుఁజివురు=చిగురాకులవంటి పాదములు, చిగురాకుబటువునన్=చిగురుటాకులతోఁ జేయంబడిన బటువుబిళ్లమీఁద, చిత్రఫలకము=చిత్తరువువ్రాసిన పలకను, ఈక్షించు=చూచు, ఆసార్వభౌమున్=ఆచక్రవర్తిని = వసురాజును. కటాక్షములు జాగరారుణములగుట, నిదురలేమిని. గండములకు పాండిమము, విరహవ్యథచేత. హారసూత్రములు తెగునట్లు పడుకపై పొరలాడుట మదనార్తిపట్టలేక. తెల్లనిగందపుఁబూఁత, శైత్యోపచారముకొఱకు. పుష్పాడి పఱుపును దమ్మితలాడయు చిగురాకుబటువును శిశిరక్రియలు. ఇవియెల్ల వేసవి యెండవేఁడ్రమునకయిన శిశిరోపచారములా. కడగన్నుల యెఱుపుసహజమనియు, తెలిగందపుఁబూత యలంకారార్థమనియుఁ జెప్పినచో చెక్కుల తెలుపును ముత్తెపుసరులు పెరుగుటయు సహజములుగావు ; మన్మథకృతములు. ఇంతకును మన్మథకృతమనుట సందేహమేని 'చిత్రఫలక' మీక్షించుట మన్మథకృతమని సిద్ధాంతీకరించుచున్నది. అయిన నీమరులు మంజువాణినాయికను గిరికనుగూర్చి యా మఱొక్కతిని గూర్చియా? ఇది మీఁదిపద్యమున నాక్షేపింపఁబడినది. తమ్మితలాడ = తామరాకులును శైత్యోపచారమునకు నుపయుక్తములు. ఇందే

'రమణిమెయింబిసాంకురపరంపరలుం ఘనసారవాలుకా
సముదయమున్ సుజాతజలజాతదళంబులు నుల్లసిల్లునే.' (3.ఆ-౧౦౫)

'నలదమయంతులిద్దఱు మనఃప్రభవానలబాధ్యమానులై
సలిపిరి దీర్ఘవాసర నిశల్ విలసన్నవనందనంబులన్
నలినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంసులన్
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారు చర్చలన్.' (భార. అరణ్య.)

అనియునుండుట నరయునది.

చ. కనుఁగొని యానృపాలకశిఖామణి డెందము శైలకన్యకా
మననమహానురాగఝురిమగ్నమొ కాక ప్రియాంతరస్పృహా
ఘనరసపోషరూషితమొ కందము గాక ని గంధతైల భా
జనభవనప్రదీపికలచాటున నల్లనఁ బొంచి యుండఁగాన్. 80

అ. ఆనృపా...డెందము=ఆరాజశ్రేష్ఠునిమనసు, శైల...మగ్నమొ—శైలకన్యకా=గిరికను గుఱించిన, మనసు = చింతనముతోఁగూడిన, మహానురాగ = మిక్కుటమయిన వలపుఅనెడి, ఝుర= ప్రవాహమందు, మగ్నమొ = మునిఁగినదో - అనఁగా గిరికయందలి మక్కువకు మిక్కిలి లోనయియున్నదో, కాక=అట్లుగాక, ప్రియా...రూషిత—మొ-ప్రియాంతర=మఱియొక ప్రియురాలియందలి, స్పృహా=ఆసక్తియనెడు, ఘనరసపోష=జలసమృద్ధిచేత, రూషితమో=వ్యాప్తమో - అనఁగా ముంపఁబడినదో, కందముకాక= చూతముకానీ, అని గంధ...చాటునన్—గంధతైల = వాసననూనెతో- అనఁగా సంపెంగనూనెతోఁగూడిన, భాజన = పాత్రలయందలి, భవనప్రదీపికల = ఇంటిదివ్వెలయొక్క, చాటునన్=మఱుఁగునందు, అల్లనన్=తిన్నగా, పొంచియుండఁగన్ = దాఁగియుండఁగా, మీఁది కన్వయము.

ఘనరసముచే రూషితమగుటకంటె ఝురియందు మగ్నమగుట యెక్కుడు. మంజువాణి గిరికవిషయమై రాజాను ఝురియందుముంచినది. అన్యకాంతవిషయమై, ఘనరసము నూరకపూసినది. అనఁగా రాజువలపు గిరికనుగూర్చినదే కాఁబోలునని యాచెలికి గాఢమయిన యభిప్రాయము.

చ. ఉసు రనుఁ గన్నుమోడ్చుఁ దలయూఁచుఁ దలంచు నగుం జెమర్చు న
ద్దెసలు గనుంగొనుం బొరలు లేచు వడంకుఁ జలింపకుండు హా
ప్రసవసుగంధి యంచుఁ బువుఁబాన్పున వ్రాలు నృపాలపుంగవుం
డసమశరప్రవీరనిశితాశుగదుర్దినదూయమానుఁడై. 81

అ. నృపాలపుంగవుండు = రాజశ్రేష్ఠుఁడు, ప్రసవసుగంధి = పువ్వులవంటిమేని మంచితావి గలదానా, పువుఁబాన్పునన్ = పుష్పశయ్యయందు, అసమ...మానుఁడై—అసమశర = మన్మథుఁడనెడి, ప్రవీర = మేటివీరునియొక్క, నిశిత = వాఁడియైన, ఆశుగ = బాణములవలననయిన, దుర్దిన = ముసురుదినముచేత - అనఁగా వర్షముచేత, దూయమానుఁడై = నొప్పింపఁబడుచున్నవాఁడై.

ఇందు ఉస్సురనుట పొరలుట చింతయనెడు సంచారిభావమున కనుభావములు. పొరలుట తాపకార్యము. తాపము చింతాకార్యము. తలయూఁచుట స్మృతియనెడు సంచారిభావమున కనుభావము. తలంచుట స్మృతియనుసంచారిభావము. నగుటయును నద్దెసలు గనుఁగొనుటయును లేచుటయును, హా ప్రసవసుగంధియంచుఁ బువుపాన్పునవ్రాలుటయును, ఉన్మాదమనెడి సంచారిభావమున కనుభావములు. చెమర్చుటయు వడంకుటయు చలింపకుండుటయు స్వేదవేపథుస్తంభము లనెడి సాత్త్వికభావములు. ఇట క్రియాసముచ్చయము.

క. భావగతభావనాసంభావితభావంబు లిట్లు ఽ మల్లడిగొనఁ గో
త్రావల్లభుఁ డిట్లనుఁ జిత్రావేశితవనితఁ గని మఽహా మోహమునన్. 82

అ. భావగ...భావంబులు—భాగవత = మనస్సునుబొందిన, భావనా= సంస్కారములచేత, సంభావిత= కయికొనఁబడిన, భావంబులు= సాత్త్వికసంచారిభావములు, ఇట్లు, మల్లడిగొనఁగాన్= చుట్టుఁబట్టఁగాఁ - ఒండొంటితోఁ బెనఁగఁగా, గోత్రావల్లభుఁడు ('గోత్రాకుః పృథివీ' అ) భూపతి= రాజు, చిత్రావేశితవనితన్= చిత్తరువులో చేర్పఁబడిన స్త్రీని, కని, మహామోహమునన్, ఇట్లనున్.

ఉ. ఏమిటి కల్గితే కువల ఽయేక్షణ పల్కవి దేటికే వధూ
టీమణి యేల ఱాకటికిఽడెందము పూనితివే లతాంగి య
య్యో మనసారఁ దావకపఽయోధర పాళి దృఢాంకపాళి యీ
వే మృదువాణి నీకు నొక ఽయెగ్గును జేయఁగదే తలోదరీ. 83

అ. కువలయేక్షణ=కలువరేకులవంటి కన్నులదానా, అల్గితే = కోపించితివే, వధూటీమణి= స్త్రీలయందు మేటియైనదానా, ఱాకటికి డెందము = ఱాయివలె కఠినమయిన మనస్సు, లతాంగి = తీఁగవంటి మేనుగలదానా, మనసారన్ =మనస్సు నిండునట్లుగా - నిండుమనస్సుతో లేక మనఃపూర్వకముగా, తావకపయోధరపాళి దృఢాంకపాళి—తావక = నీయొక్క, పయోధరపాళి = పాలిండ్లపట్టుయొక్క, (పాళిఃకేతుర్ధ్వజోలింగనిమిత్తం వ్యంజనపదం) దృఢ+అంకపాళి = ('అంకపాళిః పరిష్వంగస్సంశ్లేష ఉపగూహనమ్' అమరశేషము) బిగికౌఁగిలి, ఈవే = ఇయ్యవే, మృదువాణి = మృదువయిన పలుకులదానా, ఎగ్గు = నేరము, తలోదరీ = అరచేయంతటి కడుపుగలదానా.

'భూయోపిదేశ్య శబ్దేషులోప వర్ణాగమశ్రుతిః' అని యధర్వణ వచనముంబట్టి 'ఏమిటికి' అనుదానియందలి మధ్యము వర్ణమునకు లోపముచే 'ఏటికి' అనియు రూపము.

చ. అళులకు మోము ద్రిప్పుగతి ఽనంచలు రాఁ జెలిఁ బిల్చురీతి రా
చిలుకకుఁ బండ్లు గోయుక్రియఁ ఽజిత్రగృహంబుననుండి పోవుచున్
సొంపున నీవు నన్ మఱలి ఽచూడఁ ద్రిశుద్ధిగ నేలి తంచు నే
నలరితిఁగాని భావజుని ఽకగ్గము సేయు టెఱుంగఁ గోమలీ. 84

అ. అళులకున్ = తుమ్మెదలకు, అంచలురాన్ = హంసలురాఁగా, పిల్చురీతిన్ = వెనుకఁదిరిగిపిలిచినట్లును, చిత్రగృహంబుననుండి = రత్నములచే చిత్రితమయిన మందిరమునుండి, సొంపునన్ = దీనభావముచేత, త్రిశుద్ధిగన్ = త్రికరణశుద్ధిగా, ఏలితి=ఏలుకొంటివి-నన్నుఁ జేకొంటివి, అని, అలరితిన్ కాని = సంతోషించితినిగాని యని యర్థము. త్రివారదర్శనము - అనఁగా మూఁడుమాఱులు చూచుటయనిభావము. భావజునికిన్=మన్మథునికి, అగ్గముసేయుట=అప్పగించుట.

త్రిశుద్ధిగన్ = మనోవాక్కాయములనెడి త్రికరణముల శుద్ధితో-అనఁగా త్రికరణములను నొక్కరూపమున సమ్మతించి యని యర్థము. మనోవాక్కాయములను త్రికరణముల వ్యాపారముచేత ననిభావము - అనఁగా 'అళుల - త్రిప్పుగతి' కాయికవ్యాపారము. 'అంచల...రీతిన్' వాచికము. 'చిలుకకు...క్రియన్' మానసికము అని త్రికరణముల కేవలవ్యాపారములనుగాని త్రికరణశుద్ధిగనను నర్థము సమర్థించినాఁడు. ఇదియే

'..............అంచలు మూఁగిన నిల్చి నెయ్యపుం
జెలువలఁగూడఁ బిల్చుగతిఁ జిల్కుఁ బార్శ్వలతాంచలంబులన్
ఫలము దెమల్చురీతి నళిపంక్తికి మోముమలంచు గ్రైపడిన్'

అని మున్ను చెప్పఁబడినది. 'అంచలరా' నని పూర్వ పాఠము, 'అంచలుమూఁగిన...బిల్చుగతిన్' ననుటచే 'అంచలురాఁ జెలిఁ బిల్చురీతి'నని దిద్ది 'అంచలురాన్ = హంసలువచ్చి మూఁగగానని యర్థము సేయఁబడినది. లేదా 'అంచెలరా'నని పాఠముగ్రహించి తనతోఁబాటి వరుసను వచ్చుటకని యర్థమును జేయవచ్చును. అంచల ననఁగా పార్శ్వముల నని యర్థముగానిపింపదు.

ఆ. గురునిగుణ మురోజగిరులు గాంచినఁగాంచుఁ, గాక నీమనంబుఁ గాంచ నేల
తల్లికుటిలవృత్తి తగుఁగాక కురులకు, నింత నీదుచెయ్వు లెనయ నేల. 85

అ. ఇంతి = ఓపడఁతీ, గురునిగుణము = నీతండ్రియైన కోలాహలునియొక్క కాఠిన్యగుణమును, ఉరోజగిరులు = నీచనుఁగొండలు, కాంచినఁగాంచుఁగాక= పొందినను బొందుఁగాక - అనఁగా గిరిగుణములు గిరులకుపయుక్తమనుట. ఇట గురుత్వవాచకమయిన గురుశబ్దమును బుచ్చుకొన్నాఁడు గనుక గురుఁడయిన కోలాహలుని కాఠిన్యపుగుణము గురువులయిన నీచనుల కుపయుక్తమనియును జెప్పవచ్చును. నీమనంబున్, కాంచ నేల=అట్టి కాఠిన్యగుణముపొంద నేల, గురుగిరిశబ్దములచే నీతండ్రి గిరియు గురుఁడును మీరును గిరులును గురువులును, కాన యతనిగుణము మీకుఁదగినను దగునుగాని గురువును గిరియునుగాని మనసునకునెట్లు దగునని యాశయము. కాంచినన్ కాంచుఁగాక యని కష్టముతోడ యంగీకారము సూచించుటచేత, కుచములు కాంచుటయే యిష్టమంతఁగాఁ గాదనుచో మఱి మనసెట్లుకాంచనగుననియు ఆశయము ధ్వనితము. తల్లికుటిలవృత్తి=నీకుఁ దల్లియై కుటిలగామినియైన శుక్తిమతి కుటిలత్వము, కురులకున్ = నీతలవెండ్రుకలకు, తగున్‌గాక = తగునుగాని - అనఁగా కుటిలగామినియొక్క కుటిలత్వము కుటిలములయిన కురులకు నుపయుక్తమనుట. నీయొక్క చేష్టలట్టి కుటిలత్వమునెందులకుఁ బొందవలయును. కొండలు కఠినములగుటయు నదులు వంకలుగాఁ బ్రవహించుటయును బ్రకటములు.

సీ. కలికిపెన్నెఱు లింద్రశిలలయందముఁజూపుఁ, జూపుక్రొన్ననవిల్తుతూపుచిలుకు
చిలుకుతేనియల జొబ్బిలుమోవి సురమణి, రమణీయవజ్రాళి రదనపాళి
పాలిండ్లు పసిఁడిగుబ్బలులయి చెన్నారు, నారుశాతకృపాణి యందమెఱుఁగు
మెఱుఁగుచక్రముమించు మించుల జఘనము, ఘనమూరురుచికరికరముకన్నఁ
తే. గన్నశివుసేయుఁ గచ్ఛపాకారగరిమఁ, గరిమరాళికయాన నీచరణ మహిమ
మహిమనోభవమణి పుత్రిమాడ్కినీకు, నీకుటిలకర్కశత మాను నేలకలికి.

అ. కలికిపెన్నెఱులు = సొగసయిన సోగవెండ్రుకలు, ఇంద్రశిలలయందము = ఇంద్రనీలముల మురువును, చూపును, చూపు = చూడ్కి, క్రొన్ననవిల్తుతూపుచిలుకు = మన్మథుని బాణము యొక్క యలుఁగు అనఁగా ములికి. చిలుకు...మోవి=చిందుచున్న తేనెలచేత జొబ్బిల్లుచున్న యెఱ్ఱని పెదవి, సురమణి = చింతామణి, చింతామణి యెఱుపు కావుననే మోవితోడిపోల్కి 'బహుదివ్యఫలపరిపాక సౌభాగ్యంబు దొరయుకెమ్మోవి మానికముతోడ'అని యిదియె యిందుఁజెప్పినాఁడు. రదనపాళి = పలువరుస, రమణీయవజ్ర ఆళి = చక్కని మగరాలబంతి, పాలిండ్లు, పసిఁడిగుబ్బలులయి=

బంగారుకొండలై - కొండలవంటివై యనుట. నారు = నూఁగారు, శాతకృపాణి యందము=వాఁడి ఖడ్గముయొక్క సౌందర్యమును, ఎఱుఁగును - అనఁగా వాఁడి ఖడ్గమువలె నుండుననుట. జఘనము = కటిపురోభాగము, మెఱుఁగుఁ జక్రముల్ = మెఱుపుగల బండికల్లును, మించులన్ = కాంతులచేత, ఊరురుచి = తొడలశోభ, కరికరముకన్నన్ = ఏనుఁగు తొండముకంటెను. ఘనము = గొప్పది, కరిమరాళికయాన = ఏనుఁగు యొక్కయు ఆఁడు హంసయొక్క నడలవంటి నడలదానా! నీచరణమహిమ = నీయడుగుల (పయిభాగపు) పేరిమి; కచ్ఛపాకారగరిమన్ = తాఁబేటిరూపు యొక్క పెంపును, కన్నశవుసేయున్ = అగడుసేయును, ఎట్లనిన - మహిన్ = భూమియందు, మనోభవమణి పుత్త్రికమాడ్కిన్ = మన్మథుని రత్నప్రతిమవలె, నీకున్, కలికి= సుందరీ, ఈకుటిల కర్కశత = ఈవంకరదైన కాఠిన్యము - అనఁగా నిర్దయత్వము. ఏలమాను = ఎందులకు మానును.

మణిపుత్త్రికకు కఠినత్వము సహజమని భావము. క్రిందిపద్యమునఁజెప్పిన కఠినత్వమును గుటిలత్వమును ఇట అనువదించి మణిపుత్త్రికగాన యవి రెండును మానవన్నాఁడు. కాఠిన్యమునుబట్టి మణిపుత్త్రి. మోహకత్వమును బట్టి మనోభవుని మణిపుత్త్రి. ఇందు 'కలికి' యనుపదమును ఆద్యంతముల యందుఁ బెట్టుట తెలియునది. 'కలికి యొప్పిదంబు కాంతమయ్యో'నని నిఘంటువు. దీనంగాంతి యనెడు కావ్యగుణమును దెలియునది. కరిమరాళికయనుచోట సమాహారద్వంద్వముగావున నపుంసకము. లేక మరాళిక అని స్వార్థకప్రత్యయముఁ జేసినను సమంజసమే.

చ. అని విభుఁ డింతిఁ బల్కవిని యప్రతిమానసుధాపయోధి జీ
వనములఁ దేలినట్లు బహువాసరపుణ్యఫలంబు కన్నులం
గనుఁగొనఁ జాలినట్లు త్రిజగంబులు నొక్కట నేలినట్లు ప
ద్మనయనలార సంతసముఁ దాల్చితి మామకమానసంబునన్. 87

అ. విభుఁడు=వసురాజు, ఇంతిన్=గిరికనుగూర్చి, అప్రతి... జీవనములన్ = సాటిలేని యమృతంపు సంద్రముయొక్క జలములయందు, తేలినట్లు=ఓలలాడినట్లును, బహువాసర పుణ్యఫలంబు= పెక్కుదినములు చేసిన సుకృతముయొక్క ఫలము, కన్నులం గనుఁగొనఁజాలినట్లు= కన్నారఁజూడనయినట్లుగాను, త్రిజగంబులున్, ఒక్కటన్ ఏలినట్లు=మూఁడులోకములును ఒక్కసారిగానే యేలినట్లుగాను, పద్మనయనలార = చెలులార, మామక మానసంబునన్ = నామనస్సునందు, సంతసమున్, తాల్చితిని.

'అప్రతి... దేలినట్లు' అనుటచే నిరుపమమయిన సౌఖ్యాతిశయమును. 'బహు... జాలినట్లు' అనుటచే అసదృశమయిన సౌభాగ్యాతిశయమును. 'త్రిజగం... యేలినట్లె' అనుటచే అసమానమయిన మహౌన్నత్యమును ధ్వనితములు.

ఉ. వెండియు దూఱుచుండెఁ బృథివీపతి యానరలోకపుష్పకో
దండునిఁ బల్కరించి వనితామణియున్కియుఁ దెల్పి యాత్మకుం
బండు వొనర్తునంచు నృపమంచసమంచితయంత్రపుత్త్రికా
మండలిలోన నొక్కమణిమండితపుత్త్రికనై రయంబునన్. 88

అ. పృథివీపతి=రాజు, వెండియున్=మఱియును, దూఱుచుండెను = గిరికనుగూర్చి నిష్ఠుర వాక్యములు పలుకుచుండెను. ఆనరలోక పుష్పకోదండుని = మనుష్యలోకమందలి మన్మథుఁడయిన యారాజును, పల్కరించి=మాటలాడించి, వనితామణి ఉన్కియున్=గిరికయున్న స్థితియును, తెల్పి=

ఆయనకు; నెఱింగించి, ఆత్మకున్ పండువు=అతని మనస్సునకు ఉత్సవము, నృప...మండలిలోనన్= రాజు మంచముదాపున ఒప్పుచున్న కీలుబొమ్మలయొక్క చుట్టువరుసల్లోన, ఒక్క మణిమండిత పుత్రికనై= రతనంపు బొమ్మనై, రయంబునన్=శీఘ్రముగా, మీఁదికన్వయము.

చ. పకపక నవ్వి యోవసునృపాలక బాలిక దూఱెదేల సా
రెకుఁ బరతంత్ర లింతులు వరింతురె కాంతులఁ దమ్ముఁదామ క
న్యకలకు నేరమా యది యనన్యగతిన్ సుదతిన్ మనోజు బా
రికి నెరఁజేసి లోఁ గనికరింపనివారివి కాక నేరముల్. 89

అ. సారెకున్=మాటికి, బాలికన్ = గిరికను. ఇంతులు=స్త్రీలు, పరతంత్రలు=పరాధీనలు, తమ్ముఁదామ=తమంతటఁదామే, కాంతులన్=పెనిమిటులను, వరింతురె = వరింపరనుట. అది=అట్లు తమ్ముఁదామే వరింపకపోవుట, కన్యకలకున్, నేరమా = నేరముగాదనుట. నేర మెవ్వరిదనఁగా, అనన్యగతిన్ = మఱియొకదిక్కు, లేకున్నట్టి=మఱియొక ఏలుకొనఁదగువారు లేకున్న యట్టియనుట, సుదతిన్=స్త్రీని, మనోజుబారికిన్ = మన్మథునిబాధకు, ఎరఁజేసి=పాలుపఱిచి, లోన్=మనస్సునందు, కనికరింపనివారివి=జాలిపడకుండెడు వారివే, నేరముల్ కాక=తప్పితములగును గాని కన్యలు తామై పురుషులను వరింపకుండుట నేరముగాదనుట.

శా. మాయాశీలురు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైక కా
ర్యాయత్తుల్ సమయానుకూల హృదయవ్యాపారగోపాయనో
పాయజ్ఞుల్ మగవార లాపయి మహీపాలుర్ మహావైభవ
శ్రీయోగాంధులు సెప్పనేల మగవారిన్ నమ్మఁగా వచ్చునే. 90

అ. మగవారలు=సామాన్యముగా పురుషులు, మాయాశీలురు=కపటమే స్వభావము గాఁగలవారు, చంచలాత్ములు=నిలుకడలేని మనస్సుగలవారు, అనుకంపాశూన్యులు=దయమాలినవారు, ఆత్మ+ఏకకార్య+ఆయత్తుల్=తమయొక్క కార్యమునకే పూనికగలిగి యుండువారు. సమయా...జ్ఞుల్—సమయ అనుకూల=అప్పటి సమయమునకుఁ దగునట్లుగా, హృదయవ్యాపార = మనోవ్యాపారముయొక్క, గోపాయన=రక్షణమందలి, ఉపాయజ్ఞుల్=ఉపాయమును దెలిసినవారు. సామాన్యముగా మగవారిట్టివారు. ఇఁకన్, ఆపయిన్=అందుమీఁదట, మహీపాలురు=భూపతులు, మహావైభవశ్రీయోగ అంధులు=గొప్ప విభవముయొక్క పెంపుతోడి కూడికచే కన్నుఁగాననివారు. కాఁబట్టి, చెప్పనేల= వారిమాట చెప్పఁ బనియేలేదు. మగవారిన్, నమ్మఁగావచ్చునే= ఎన్నివిధములను నమ్మరాదనుట. అల. కావ్యలింగము.

ఉ. అంటి ననంగ నంగజనిభాంగుఁ డభంగుర విస్మయార్ణవం
బంటినచూడ్కితో విని ప్రియాహృదయానుశయాగ్ని సూచనం
గంటకితాఖిలాంగుఁ డయి కంతువనాటవిపాటఝాట సం
లుంటిత మైనడెందము ఝులుక్కని పెక్కుతలంపు లూరఁగాన్. 91

అ. అంటిని=ఇట్లని చెప్పితిని, అనంగన్=ఇట్లు నేను జెప్పఁగానే, అగంజ నిభాంగుఁడు= మన్మథునికిని సాటియైన మేనుగలవాఁడు. అభంగురవిస్మయ అర్ణవంబు = ఎడతెగని ఆశ్చర్యమనెడి సముద్రము, అంటిన=తగిలిన, చూపుతోన్, ప్రియా...చనం—ప్రియా=ప్రియురాలియొక్క, హృదయ

అసూయయ అగ్ని=మనస్సునందలి తాపమనెడు అగ్నియొక్క, సూచనన్=తెలుపిక చేత, కంటకిత అఖిల అంగుఁడు=గగురుపొడిచిన సమస్తములైన అవయవములు గలవాఁడు, అయి, కంతు...లుంటితము— కంతు=మన్మథుఁడనెడి, వనాట=బోయవానియొక్క, విపాట=విదారించుట కొఱకయిన, ఝాట=(ఝాటేనికుంజే కాంతారే ప్రణాదీనాంచ మారణే (మేదిని). శస్త్రవిశేషముచేత, సంలుంటితము=లెస్సగా ఛేదింపఁబడినది, ఐన డెందము, ఝలుక్కని=ఝల్లుమని, ఊరఁగన్=ఉదయింపఁగా.

'ఝలుక్కని' 'అని' అను క్త్వార్థకము సమనాశ్రయములం బూర్వకాలికంబు గానేరదు. ఇట 'రాహుశిరము తెగి దేహము ధరణిఁబడియె' నను భారతప్రయోగమందు 'తెగి' ధాతువువలె హేత్వర్థకమునం బ్రయుక్తమని తెలియునది. విపాఠమనఁగా పెద్దయమ్ము. కంతుఁడనెడు బోయవానియొక్క, విపాఠ = పొఱమ్ములయొక్క, ఝాట=సమూహముచేత, సంలుంటితము=లెస్సగాఁ గుంటు పఱుపఁబడినది-బాధింపఁబడినదని యర్థము ఉపపన్నము. 'ఝాటో...మారణే' అని యుదాహరించిన నిఘంటువున శస్త్రవిశేష మర్థమేమియుఁ గానరాదు. విపాఠమనియే దీనికిఁ దఱచుగా రూపము. బాణమని త్రికాండశేషము. ఇందులకు మహాభారతమున 'ఏకైకేన విపాఠేన జఘ్నే మా ద్రవతీసుతః' ఆరణ్య. ౨౭౦. అ. ౧౭. అల. ఏకదేశవివర్తి రూపకము.

ఉ. చారణకన్యయో ఖచరసారసగంధియొ కాక కిన్నరాం
భోరుహపాణియో చిలువపోల్తుకయో మఱి శైలకన్యకా
ధీరవయస్య యైనవనదేవతయో యొక మంజువాణి యే
తేరఁగఁబోలు బాలగతిఁ దెల్పఁగ నిచ్చటి కద్భుతంబుగాన్. 92

అ. ఖచర సారసగంధియో = దేవతాస్త్రీయో, చిలువపోల్తుకయో = పన్నగస్త్రీయో, శైల కన్యకా ధీరవయస్య=గిరికయొక్క దిట్టయైన చెలికత్తె, ఒక మంజువాణి=ఇంపయిన మాటలుగల యొకానొక స్త్రీ - బాలగతిన్=గిరికరీతిని, ఏతేరఁగఁబోలున్=వచ్చియుండవచ్చును. (అలం-ససందేహము.)

మంజువాణి యని రాజు స్త్రీసామాన్యపరముగాఁ జెప్పినమాట నిజముగా మంజువాణియను పేరుగల యాచెలికత్తెకు సంబంధించు స్వారస్యమిటఁ గవి కుదురుపఱిచినాఁడు. వనదేవతలు గిరికకుఁ జెలులని పూర్వము చెప్పఁబడియున్నది. 'ఆలిస్సఖీ వయస్యాచ' అని యమరుఁడు.

మ. అని యూహించి నదీతనూజతలఁ పాహా మామకప్రేమ బం
ధనిమగ్నం బని పల్క వింటె నిఁక నాతాపానలం బాఱెఁ బ్రా
క్తనపుణ్యంబు ఫలించెఁ బంచశర శస్త్రశ్రేణినిం జీరికిం
గొనఁబో నే నిఁక నొక్కఁడాప్రియతమాఘోరార్తికిం గుందెదన్. 93

అ. నదీతనూజ తలఁపు=గిరికాదేవి ఎన్నిక, మామకప్రేమబంధ నిమగ్నంబు = నాదయిన అనురాగమనెడు కట్టునందు మునిఁగినది - అనఁగా ఆగిరికాదేవియొక్క కోరిక నాయనురాగమందు లీనమైయున్నది. అని, పల్కన్ = చెప్పఁగా, ప్రాక్తనపుణ్యంబు = పూర్వసుకృతము, ఫలించెను. పంచశర శస్త్రశ్రేణిని=మన్మథుని కైదువులపంక్తిని, జీరికిఁగొనంబో = ఇంచుకయినను లక్ష్యముపెట్టను గదా, ఇఁకన్ ఒక్కఁడు = ఇఁకమీఁద నొక్కటి లక్ష్యపెట్ట వలసినది ఉన్నది - అదియేదనఁగా, ఆప్రియతమాఘోరార్తికిన్ = మిక్కిలి గాఢమయిన యాగిరిక బెట్టిదమయిన వ్యథకు, కుందెదన్= దుఃఖించుచున్నాను.

శా. నాడెందంబున నుండి కందెనొ కటా ! నన్నాత్మలో నుంచి తా
వాడంబాటెనొ నేనె తా నగుట నాకై వర్ధిష్ణుసంతాపచిం
తా డోలాకలనంబు దా నెనసెనో ! తథ్యంబు నావంకకై
తా డస్సెన్ నవలా యటంచు నొఱగెం ! దల్పప్రఘాణంబునన్. 94

అ. నాడెందంబుననుండి కందెనో=విరహాగ్నిచేఁ గ్రాఁగుచున్న నాహృదయమందు నిలిచి కమలిపోయెనో, కటా=అయ్యో, నన్నున్ ఆత్మలోన్ ఉంచి తాను వాడంబాటెనో=లేక తపించుచున్న నన్నుఁ దనమనస్సునందు నిలిపికొని వాడిపోయినదో లేక, నేనె తానగుటన్=నేనే తానై యుండుటచేత - అనఁగాఁ దన్ను ధ్యానముచేసి తనయొక్క తాదాత్మ్యమును బొందియున్న దగుటచేత ననుట. నావర్ధిష్ణు...కలనంబున్—నా, వర్ధిష్ణు = పెరుఁగుచున్న, సంతాప=తుందుడుకుగల, చింతా=విచారమనెడు, డోలా ఆకలనంబు=ఉయ్యెలయందు ఊఁగుటను, తాను, ఎనసెనో = పొందినదో, నావంకకై=నానిమిత్తమై, నవలా, తాను, డస్సెన్=శ్రమపడెను, తథ్యంబు=ఇదినిజము, అటంచున్, తల్పప్రఘాణంబునన్=శయ్యాముంగల, ఒఱగెను.

చ. ఒఱగినఁ జూచి యాన్నృపకులోత్తము చిత్తముకూర్మికాత్మ ని
వ్వెఱపడి తాపవారకము ! విస్మయనీయము నింతినెయ్యపుం
గుఱుతును నయిన మత్కరవినూతనహారము చేరఁబోయి యా
నెఱదొర కంఠపీఠమున ! నిల్పితి నిల్పఁ బ్రఫుల్లనేత్రుఁడై. 95

అ. అన్నృపకులోత్తము, చిత్తముకూర్మికిన్=మనస్సునందలి ప్రేమకు, ఆత్మన్=మనస్సునందు, నివ్వెఱపడి=మిక్కిలి యాశ్చర్యపడి, తాపవారకము=తాపమును బోఁగొట్టునదియు, విస్మయనీయము=ఆశ్చర్యపడఁ దగినదియును, ఇంతి నెయ్యపుంగుఱుతును = గిరికప్రేమకు ఆనవాలును, ఐన, మత్కర వినూతన రత్నహారము = నాచేతియందలి క్రొత్త ముత్తెపుసరిని, చేరఁబోయి = దగ్గఱకుఁబోయి, ఆ నెఱదొర కంఠపీఠమునన్=ఆమహారాజుయొక్క కంఠపీఠికయందు, నిల్పితిని=ఉంచితిని, నిల్పన్=అట్లుంపఁగా, ప్రఫుల్లనేత్రుఁడై=వికసించిన కన్నులుగలవాఁడై - కన్నులు తెఱచి యనుట.

ముత్తెములసరిగాన తాపవారకము, ఉన్నట్టుండి వచ్చుటచే విస్మయనీయము, రాజుచిత్తము కూర్మి తెలిసినదిగాన యింతి నెయ్యపుగుఱుతయిన హారమును నిల్పినదని యాశయము. నెయ్యపుంగుఱుతు. 'సమాసంబులందుఁ బుంపులకు పరుష సరలంబులు పరంబులగునపుడు నుగాగమంబగు' నను సూత్రముచే నిచట, నెయ్యపు+ను+గుఱుతు అనుచో ద్రుతమునకు సంశ్లేషము.

ఉ. అబ్బలభిన్నిభుఁడు మణిహారముఁ దప్పక చూచి యారయొం
తబ్బుర మీయమూల్య మణిహారము రాఁ గతమెద్ది యొక్కొ యే
గుబ్బెతహారమొక్కొ యిదికూరిమి నేచెలి దెచ్చె నొక్కొ హా
నిబ్బరమైన తాపము జనింపదుకో యిది మేనుసోఁకఁగాన్. 96

అ. అబ్బలభిన్నిభుండు=ఇంద్రుసమానుఁడయిన యారాజు, తప్పక, మణిహారమున్ చూచి, ఎంత అబ్బురము=ఆశ్చర్యము, అమూల్య=వెలలేని, రాన్ కతమెద్దియొక్కొ = వచ్చుటకుఁ గారణమేమియో, ఏగుబ్బెతహారమొక్కొ = ఏజవరాలిసరియో, కూరిమిన్=ప్రేమచేత, ఇది మేనుసోఁకఁగాన్, నిబ్బరము=తాళనలవిగానిది, జనింపదుకో=పుట్టదుగదా.

శా. ఈహారం బొకమాటు పిమ్మటికి నేఁ డెచ్చోటనో కన్న య
ట్లూహం బయ్యెడి నీయమూల్య మణిహారోత్తంసముం జిత్రక
న్యాహారంబు నుదారవైఖరి నొకండై తోఁచె నీహార మా
నీహారాద్రిజకన్యహార మగు సందేహంబు లేదెంతయున్. 97

అ. పిమ్మటికి = వెనుకటికి - అనఁగా నింతకుమునుపు, ఒకమాటు = ఒకసారి, ఊహంబు= మనస్సునకుఁ దోఁచిక, అమూల్య... త్తంసముఁ = వెలలేని ముత్తెపు సరిమిన్నను, చిత్రకన్యాహారంబును=చిత్తరువునందలి గిరికహారమును, ఉదారవైఖరిఁ =అతిశయమయినరీతిచే, ఒకండై=ఒక్కటై, తోఁచెను. ఆరెండు నొక్కటిగా దోఁచుట మిక్కిలి యతిశయముగా నున్నదనుట. ఈ హారము, ఆ నీహారాద్రిజ కన్యహారము=ఆ మంచుకొండ కొడుకయిన కోలాహలుని కూఁతురగు గిరికహారము.

ఊహాశబ్దమునకు 'సంభావనం యదిత్థంస్యా దిత్యూహోఽన్యస్యసిద్ధయే' అని చంద్రాలోకమునఁ బ్రయోగము. ఒకం డను నది యమహత్తయిన హారమునకు విశేషణమయినను దుష్టువచ్చినది. ఇందులకు 'క్వచిదమహదోఽపిడుజ్స్యాత్' అని నన్నయభట్టీయము. 'ఏకాదేః రమహతాంచడావున్న' అనుసూత్రముచే డుజ్పరమయ్యు ఉత్వము రాదయ్యెదని తెలియునది.

మాలినీవృత్తము.

అని విభుఁ డెద నుంచున్ హార మందంద కాంచున్
గనుఁగవఁ గదియించుం గంఠపీఠిన్ ఘటించున్
దను వఖిలముఁ జేర్చుం దత్క్షణస్వేదధారా
ఘననయనజలంబుల్ గాఢతన్మైత్రిఁ జూపన్. 98

అ. విభుఁడు=రాజు, ఎదన్=ఱొమ్ముమీఁద, అందంద=మాటమాటికి, కంఠపీఠిన్ = (పీఠపీఠశబ్దములు విటివికిసూచకముగా ననుప్రయుక్తములు. వక్షఃపీఠి, బాహుపీఠి, భుజపీఠి' యనియుఁ గలవు.)

చెలి భుజపీఠి నొత్తగిలి • చిల్కనుదువ్వుచు వాలుఁగన్నుఁ గ్రే
వల కుచధారచేర నొక•వారవిలాసిని చూచెరాసుతున్. (మనుచరిత్రము)

విటివిరైయైన కుత్తుకయందు, తనువు అఖిలమున్ = మేనుఅంతటిని, తత్క్షణ...జలంబుల్— తత్క్షణ=ఆక్షణమందే కలిగిన, స్వేదధారా=చెమ్మటధారచేత, ఘన=అధికమయిన, నయనజలంబుల్ =కన్నీళ్లను, గాఢ తన్మైత్రిన్= ఆగిరికయందలి దృఢమయిన నెయ్యమును, చూపన్ = చూపుచుండఁగా, 'చూపున్' అను పాఠము. చెమటనీటిచేత నధికమగుచున్న కన్నీళ్లను గిరికయందలి యగ్గలమయిన నెయ్యమును రాజు చూపునని యర్థము. ఇది సరసముగాదు. స్వేదబాష్పములు మైత్రిని జూపు ననుటయే సరసమును స్వభావాను గుణమును కాన 'చూపన్' అని పాఠము దిద్దఁబడెను. ఇది మాలినీవృత్తము. ననమయయగణములు. తొమ్మిదవయక్షరము యతిస్థానము.

క. ఈగతి నారా జుపకంఠాగతనక్షత్రదామ మభినవకర సం
యోగమున గారవించుచు, రాగోపనిబద్ధబంధురంబుగఁ బల్కెన్. 99

అ...ఆరాజు = వసురాజు - (చంద్రుఁడనియు), ఉపకంఠాగత నక్షత్రదామము = కంఠముదాపలికివచ్చిన - కంఠమునుబొందిన నక్షత్రమాలికయను ముక్తాహారము (సైవనక్షత్రమాలాస్యా

త్సప్తవింశతి మౌక్తికైః' అ.) —(ఉపకంఠ = సమీపమునకు, ఆగత=వచ్చిన, నక్షత్రదామము=అశ్వి న్యాది నక్షత్రసమూహమునని యర్థాంతరము.) అభినవకర సంయోగమునన్ = క్రొత్తయగు చేతి తాఁకుడుచేత - (క్రొత్తయగు కిరణము సోఁకుడుచేత ననియును) గారవించుచున్=మన్నించుచు - ఇంతవఱకుఁ బ్రకృతాప్రకృతశ్లేషము. రాగోప నిబద్ధబంధురంబుగన్ - రాగ= స్వరవిశేషముచేతను రాగవిశేషముచేతను - ఇక్కడ నర్థద్వయమును బ్రకృతపరముగానే గ్రహించునది. ఉపబద్ధ = కట్టఁ బడినదై, బంధురంబుగన్ = మనోహర మగుచుండునట్లుగా - అనఁగా స్వరభేదము ననురాగమును గనఁబడునట్లుగా వచించెననుట. లేక చంద్రుఁడు, రాగ = అనురాగముచేత నశ్విన్యాదులను జూచి చెప్పెననియు, వసురాజు, రాగ=స్వరవిశేషముతోడ ముత్తెపుసరిని జూచిచెప్పెననియును భావము.

మ. కమనీయద్యుతిధామమా విమలముక్తాదామమా సేమమా
కమలామోదకుఁ దత్సఖీసమితికిం గల్యాణమా తన్మరా
ళమయూరీ శుకశాబశారికల కెల్లన్ భద్రమా తెల్పుమా
ప్రమదారత్నము పేరుగా నెద నినుం బాటించి ప్రార్థించెదన్. 100

అ. కమనీయ ద్యుతిధామమా= సొగసయినకాంతికి స్థానమైనదానా ! ఇక్కడ ధామశబ్దము ద్యుతివాచకముగనుకఁ బునరుక్తవదాభాస మలంకారము. విమల ముక్తాదామమా = స్వచ్ఛమయిన మౌక్తికహారమా, కమలామోదకున్ = తామరవంటిమేని వాసనగల గిరికకు, సేమమా = కుశలమా, తత్సఖీసమితికిన్ కల్యాణమా=ఆగిరిక చెలికత్తెల సమూహమునకు శుభమా, తత్ = ఆబిడయొక్క, మరాల=పెంపుడుహంసలకును, మయూరీ=ఆఁడునెమిళ్లకును, శుకశాబ = చిలుకపిల్లలకును, శారికల కున్=గోరవంకలకును, ఎల్లన్=అన్నిటికి, భద్రమా=సుఖమా, తెల్పుమా= తెలియఁజెప్పుము. ఏమనిన, ఆప్రమదారత్నము పేరుగాన్ ఎద నినుంబాటించి ప్రార్థించెదన్= స్త్రీరత్నమయిన యాగిరికాదేవికి మాఱుగా మనస్సునందు నిన్ను మన్నించి వేఁడుకొనుచున్నానని యర్థము. (పేరుశబ్దము సరికి నర్థము. ఎదయనఁగా హృదయమును వక్షమును - గనుక ఆగిరిక ముత్యాలసరిగా నిన్ను వక్షస్థలమందు మన్నించుచున్నానని భావము.)

మ. నిను భాగ్యాక్షరపంక్తిగాఁ దలఁతునో నిర్వేలమూర్ఛాపనో
దనదివ్యామృత ధారగా మనమునం దర్కింతునో కాక మ
ద్ఘనపుణ్యద్రుమకోరకావలియ కాఁ గన్గొందునో ప్రేమ నే
మని వర్ణింతుఁ బ్రియాపయోధరవిహారా హారవంశోత్తమా. 101

అ. ప్రియా=ప్రియురాలయిన గిరికయొక్క, పయోధర=పాలిండ్లయందలి, విహారా=విహారము గలయట్టి,హారవంశోత్తమా=ముత్తెపుసరిమిన్నా, నినున్, భాగ్యాక్షరపంక్తిగాన్=మాయొక్క భాగ్య వర్ణముల వరుసగా, తలఁతునో, లేక, నిర్వేల...ధారఁగాన్=నిర్వేల—మితిలేని, మూర్ఛా=నన్నుఁ బొందిన మూర్ఛయొక్క, అపనోదన=పోఁగొట్టుటయందలి, దివ్యామృత ధారగాన్ = దివ్యమయిన యమృతధార యగునట్లుగా, మనమునన్, తర్కింతునో=ఊహింతునో, కాక=అట్లుగాక, మత్... వలియకా - మత్=నాయొక్క, ఘనపుణ్య = గొప్ప సుకృతమనెడు, ద్రుమ = వృక్షముయొక్క, కోరకావలియకాన్=పూమొగ్గలపంక్తిగానే, కన్గొందునో=చూతునా, ప్రేమన్=నీయందలి ప్రేమ చేత, ఏమనివర్ణింతును=ఏమని కొనియాడుదును. నాప్రేమ మిక్కుటమగుటచేత నిన్ను నేవిధము నను గొనియాడుటకు నాకుఁ దోఁపకున్నదియనుట. అలం. ఉల్లేఖాలంకార భేదము. ఏకస్య బహు ధోల్లే ఖేప్యసావిషయ భేదతః (అని లక్షితము.)

'హారవంశోత్తమా! యని సంబోధనమందును దద్విశేషణమయిన 'ప్రియాపయోధరవిహారా' యను సంబోధనమందును మువర్ణకము చెప్పమికి 'అంగభృంగాదిశబ్దేభ్యోమ్వాది రామంత్రణేనవా' అని యధర్వణవచనము. అక్షరపంక్తి దెల్లనిగణములోఁజేరినది. ఇందే సరస్వతీస్తోత్రమున.

'రమణీయాక్షసరాకృతింబొలుచు వర్ణశ్రేణి వీణానులా
పముచేతం గరఁగించి యాదు నిజబింబం బొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును దద్వర్ణాలియం దెల్లఁ బూ
ర్ణము గావించినవాణి తిర్మలమహారాయోక్తిఁ బొల్పుంగృపన్'.

అని చెప్పుట తెలియునది.

చ. వనజముఖీకుచోపరినివాససుఖోన్నతి నుక్కి మాని నా
మనికిత మార్ప వచ్చితివి మౌక్తికహారమ నీగుణంబు లే
మని వినుతింతు నట్టిద కదా యవదాతసువృత్తమూర్తు లెం
దును నిజసౌఖ్యభంగము గనుంగొన రార్తులఁ బ్రోచువేళలన్. 102

అ. వనజ...న్నతిన్—వనజముఖీ=గిరికయొక్క, కుచ+ఉపరి=చన్నులపయిని, నివాస=వసించుటవలని, సుఖ+ఉన్నతిన్=సుఖాతిశయముచేత, ఉన్కిన్ = ఉండుటను, మాని, నామనికితము=నామనోవ్యథను, ఆర్పన్ వచ్చితివి, మౌక్తికహారమ = ముత్తెపుసరీ, నీగుణంబులు=నీసుగుణములను, ఏమనివినుతింతున్=ఏమని కొనియాడుదును - అనఁగాఁ గొనియాడఁజాలనని యర్థము. (ముత్యాల యొక్క ఆణిసుపాణి సుతారములనెడు మూఁడుగుణముల నని భావము. ఇందులకు,

క. అఱలేని చుక్క తెఱఁగున, మెఱయు సుతారంబు మేలిమిగ వట్రువయై
మెఱుఁగొందుఁబాణి ఘనమై, నెఱసిరి వట్రువ సుపాణి నిర్మలకాంతిన్. (రత్నపరీక్ష.)

అట్టిదకదా=అట్లేకదా- అది యుక్తమేకదా యనుట, అవదాతసువృత్తమూర్తులు-అవదాత=పరిశుద్ధమైన, సువృత్త=మంచివర్తనముగల, మూర్తులు=స్వరూపముగలవారని యర్థము. [ముత్యములు-అవదాత=(అవదాతస్సితేపీతే విశుద్ధేప్రవరేఽపిచ' వి.) తెల్లనివియు, సువృత్త = చక్కఁగా గుండ్రనివియునయిన రూపుగలవని భావము] ఎందును = ఎక్కడను, ఆర్తులన్ = వ్యథపడుచున్నవారిని, ప్రోచువేళలన్, నిజసౌఖ్యభంగము=తమ సుఖము చెడిపోవుటను, కనుంగొనరు = పాటింపరు. హారమునకు వనజముఖీకుచోపరినివాసము సుఖప్రదమగుట రాజు బుద్ధినిబట్టి. అల. శ్లేషమూలకమగు అర్థాంతరన్యాసము.

చ. చెలుల మొఱంగి నాఁడు మణిచిత్రగృహంబున మోమువాంచి తొ
య్యలి భవదేకదర్శితమదాకృతిఁ జూచెఁగదా వినీలకుం
తలహృదయంబు నీకు విదితంబుగదా యిఁక దాఁచనేటికిన్
వెలఁదిమనంబు దెల్పఁ గదవే మణిహారమ నిన్ను వేఁడెదన్. 103

అ. మణిహారమ - నాఁడు = నేనక్కడకు వచ్చియున్ననాఁడు, చెలులన్, మొఱంగి=ఏమఱించి, మణిచిత్రగృహంబునన్=రత్నములచేత చిత్రితమయిన యింటియందు, మోమువాంచి=సిగ్గుచే మొగమువంచుకొని, తొయ్యలి=గిరిక, భవ...కృతిన్—భవత్ = నీచేత, ఏక = ముఖ్యమగు నట్టులుగా, దర్శిత=చూపఁబడిన, మదాకృతిన్ = నాయొక్కరూపమును - అనఁగా నీయందు ప్రతిఫలిం

చిన నారూపముననుట, చూచెఁగదా, వినీలకుంతల హృదయంబు= (నల్లని కురులుగల) గిరికయొక్క మనస్సు (హృదయమనఁగా రొమ్మునుగనుక గిరికయొక్క రొమ్మునని భావము), నీకు, విదితంబుగదా= తెలిసియున్నదిగదా. ('హృదయం మానసోరసోః' అ.) వెలఁదిమనంబున్, ఇఁకన్ దాఁచ నేటికిన్, తెల్పఁగదవే= తెలియఁజెప్పుమా, నిన్ను వేఁడెదన్ = నిన్నుఁ బ్రార్థించుచున్నాను. వెనుక కన్వయము.

మోమువాంచినది సిగ్గుచేత. కావుననే రొమ్ముపయిని తెలిముత్తెములందుఁ బ్రతిబింబించిన రాజునుజూడఁ గలుగుట. కాన, మోమువంచుటకు స్త్రీజనోచితమగు సిగ్గునకును దన్మూలమున రొమ్మునఁ బ్రతిఫలించు రాజును జూడఁగలుగుటకును నట్లుచూచుట తెలియకుండుటకును నుపయుక్తమగుచున్నది. సిగ్గు నెపమున నితరులకుఁ దెలియకుండఁగనే రాజునుజూచు నుపాయమిది.

ఉ. గ్రావసుతాకుచాగ్రపరిరంభనిగుంభసుఖోపలంభ సం
భావితభావిమత్కరవిమర్దన కోడకుమీ విశుద్ధము
క్తావలి బాలికానవసమాగమయోగ్య మహోపలాలన
శ్రీ వెలయింతుఁగాని నినుఁ జిక్కులఁ బెట్టఁ జుమీ రయంబునన్. 104

అ. గ్రావ...విమర్దనకున్—గ్రావసుతా - ('గిరి గ్రావాచల శైల శిలోచ్చయాః' అ) పర్వతపుత్రియైన గిరికాదేవియొక్క, కుచాగ్ర=చనుమొనలయొక్క, పరిరంభనిగుంభ = ఆలింగనము కూడుటవలననైన, సుఖ+ఉపలంభ =ఆనందము ననుభవించుటచేత, సంభావిత=పూజితమయినదానా! ఇట గ్రావసుత యన్నందునఁ గుచములయందుఁ గాఠిన్యము స్ఫురించుచున్నది. భావిమత్కర విమర్దనకున్=మీఁదట నాచేతులచే నయిన నలఁగుడునకు, ఓడకుమా=భయపడకుమా, విశుద్ధముక్తావలి= పరిశుద్ధమైనముక్తా మణిమాలికా యని యర్థము. (శుభవర్ణముగలదని భావము), బాలికా...శ్రీన్— బాలికా=గిరికయొక్క, నవసమాగమ=తొలుకూటమియందు, యోగ్య=తగిన, మహోపలాలనశ్రీన్= మిక్కిలియైన బుజ్జగింపు పెంపుచేత - పెంపుసొంపార మిక్కిలియు బుజ్జగించుటచేత ననుట, వెలయింతుఁగాని=ఉల్లసిలం జేయుదునేకాక, రయంబునన్=త్వరితముగా - ఉరవడితోననుట, నినున్, చిక్కులఁబెట్టన్ చుమీ = సంకటములందుఁ దగుల్పను జుమా యని యర్థము. (చిక్కుపఱుపనని భావము.)

ముక్తావలి విశుద్ధమైనది (మంచి నిర్మలవృత్తి) గలది, కావుననే, యావిశుద్ధికి ఫలముగా గిరికాకుచాగ్ర పరిరంభ సుఖముగన్నది. (మిక్కిలిశుభ్రములగుటచే నట్టికాంతామణి కుచాలంకారమయినదనియు) అట్టిహాయి ననుభవించుచున్నదానికి మీఁద నాచేత నలఁగుడు కలుగునని భయము వలదు. ఏలన గిరికబాలిక, అందును దొలుకూటమి. అది మిక్కిలి మెలుపుతోఁగూడియుండునుగాన కుచముల మృదుమర్దనమే కలిగి మిక్కిలియు బుజ్జవంపు పెంపుసొంపారునే కాని గాఢవిమర్దనముచేఁ జిక్కులఁబెట్టుటకలుగదు. బాలికతోడినవసమాగమము గావుననే ఉపలాలనము మహత్తయ్యు శ్రీ (పెంపు) గులుకుచు నుండుననుట. ఇట ముత్తెపుసరి శుద్ధిగలది. అందును మహాపదవియందు మిక్కిలి సుఖమనుభవించునది. కాన మీఁదటి మిక్కుటపు నలఁకువకోర్వదు. కావుననే బుజ్జగింతునుగాని జిక్కులఁబెట్టననియు నాశయము.

శా. శుక్తిక్రోడకుటీగుహావసతి వై సూచ్యగ్రసంస్థాయి వై
ముక్తాహారమ వై భజించితిగదా ముగ్ధాకుచద్వంద్వసం

సక్తిం దాదృశభూతి తావకకృపా సంసిద్ధి లేకబ్బునే
ముక్తాహారత నున్న యంతనె తలంపుల్ నింపు నా కింపుగాన్. 105

అ. శుక్తి...వసతిపై—శుక్తి = ముత్తెపుఁజిప్పయొక్క, క్రోడ = నడిమిప్రదేశమనెడు, కుటీ గుహా=గుడిసెవంటి గుహయందలి, వసతిపై = ఉనికిగలదానవై, సూచ్యగ్రసంస్థాయినై=సూదిమొన మీఁద నిలిచినదానవై, ముక్తాహారమవై=వదలఁబడిన ఆహారముగలదానవై యని యర్థము. గుహయం దుండుటయు సూదిమొనపై నిలుచుటయు, నిరాహారత్వమును దపశ్శాలులయొక్క ధర్మములుగాన యట్టి తాపసధర్మములుగలదానవై - అట్టినియమములతోఁ గడింది తపస్సుచేసిన దానవై యనుట. (ముత్తెములు, ముత్తెపుఁజిప్ప నడుమనుండునవియు, సూదిమొనచేత నవి బెజ్జమువేయఁబడుచున్న వనియు, అట్లు బెజ్జమువేయఁబడి వానిచేతఁ గూర్పంబడియు ముత్తెము హారమగుచున్నదని భావము. అర్థమున 'ముక్త+ఆహారము' అనియు భావమున 'ముక్తా+హారము' అనియు విభాగము.) ముగ్ధాకుచ ద్వంద్వసంసక్తిక్ = ముద్దరాలయిన గిరికయొక్క చన్నుఁగవతోడి కూటమిని, భజించితిగదా=పొం దితివిగదా. ముక్తాహారతక్ ఉన్నయంతనె = (గుహావాసమును సూచ్యగ్ర నివాసమును జేయలేక నేను) నిరాహారత్వమాత్రముచేత నున్నంతనే, తాదృశభూతి=(నీవు మూఁడునియమములను ఆచరించి పడసినట్టి) అటువంటి (గిరికా కుచసంపర్క రూపమయిన) వైభవము, తావక కృపాసంసిద్ధి=గుహా వాసాదులు మూఁడునుగల్గిన మహాతపస్వవగు నీదుకృప యొనఁగూడుట, లేక, అబ్బునే = ప్రాప్తిం చునా - ప్రాప్తింపదనుట. గొప్పవైభవములు సంశిత వ్రతులయిన మహనీయుల కృపాతిశయ ముచేతనే కలుగవలయును. కాఁబట్టి, నాకు, ఇంపుగా=ఇష్టమగునట్లుగా, తలంపుల్ నింపుము=కోరిక లొనఁగూర్పుము - అనఁగా గిరికా కుచసంపర్కము గలిగింపుమని యర్థము. ('ముక్తాహారత' ననుచో నిరాహారత్వమును ముక్తావలిగా నభ్యసించి తనయందు ముక్తావలిత్వ మాత్రమును దెలిపి నేనును నీవలె ముత్తెపుసరినే గనుక నంతమాత్రకు నాకును గిరికాకుచసంపర్కయోగ్యత యున్నందునఁ దత్ప్రాప్తి నొనఁగూర్పుమని ప్రకారాంతరము తెలియునది.)

ముత్తెపుఁ జిప్పలయందు ముత్యములు గాఁబుట్టి సూదులచే బెజ్జమువేయఁబడియు గ్రువ్వం బడియు ముత్తెపుసరులై ముద్దరాలి చనుమొనలపయి కెక్కుచున్నదని భావము. ఇదియె గుహలందు వసించి సూదిమొనపయి నిలిచి యాహారమువిడిచి యుట్టి కడిఁది తపసుచేసి ముద్దరాలి చనుమొన పట్టు లను బొందఁగలుగుటగా శ్లేషచే సమర్థించినాఁడు.

ఉ. చిన్నటనాఁటనుండియును జెల్వకుఁ గూర్చినదాన వౌట నేఁ
డెన్నిక కెక్కఁ దద్వ్యథకు నీవును గుందతిగాన సద్గుణా
భ్యున్నతరత్నమాలిక యహో నిను మచ్ఛ్రమశీకరార్ద్రయో
షిన్నవగంధసారములచేఁ దెలి వొందఁగఁ జేయుటెన్నఁడో. 106

చిన్నటనాఁటనుండియును=పసితనమునుండియు, చెల్వకుక్ =గిరికకు, గూర్చినదానవు=మిక్కిలి మనస్సు కలసినదానవని యర్థము. (గిరికకొఱకు చెలులచేతఁ గూర్పఁబడినదానవని భావము. ఇటచెలు లధ్యాహార్యము. 'అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా' 'కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణకశ్చతద్వ త్స్యాత్' అనుసూత్రము లిచట ననుసంధింపవలయును), నేఁడు, ఎన్నికకెక్కక్ = ప్రసిద్ధికెక్కు నట్లుగా, తత్ వ్యథకుక్ =ఆగిరిక విరహబాధకు, నీవును, కుందితివి = సొలసితివని యర్థము. (లెక్క పెట్టఁబడినదనియు గిరికదేహ తాపముచేతఁ గందినదనియు భావము) కాన, సద్గుణ+అభ్యున్నత రత్న

మాలిక=(చెలిమినిగొని యాడుటయనెడి) మంచిగుణముచేత మిక్కిలి యతిశయించిన మణిహారమా యని యర్థము.—(మంచిసూత్రమునం దొకదాని మీఁద నొకటిగాఁ గూర్పఁబడి యున్నతస్థితి నొందిన రత్నములయొక్క మాలికయని భావము), అహో = అకటా, నిరుక్, మత్...సారములచేక్- మత్ = నాయొక్క, శ్రమ = రతిశ్రమవలనఁ బుట్టిన, శీకర = తుంపరచేత - అనఁగా చిఱుచెమటచేత, ఆర్ద్రి=తడిసిన, యోషిత్=గిరికయొక్క, నవ=క్రొత్తయగు, గంధసారములచేక్=చందనములచేత, తెలివి, ఒందఁగక్ చేయుట = ఉల్లసిలఁజేయుట, ఎన్నఁడో = ఎప్పటికొకదాయని యర్థము. (తెలివొందఁ జేయుటయనఁగా కందుపోఁగొట్టుటయని భావము. చందనాదు లయిన పాళ్లను గలిపిన జలములందుఁ గందుపోవుట ప్రకటము.)

తత్ (గిరికా) వ్యధకుఁ గుందుట చిన్నటనాఁటనుండియును గూర్చినదగుటచేత. ఇట్టిదికావుననే సద్గుణాభ్యున్నత. తనచెమట తుంపరలును గిరిక చందనాదులును గలయుట యిరువుర రతిక్రీడయందుఁగదా. రెంటికలయికచే పరస్పరగాఢసంశ్లేషము వ్యంజితము. శ్రమజలములనఁగా శ్రమశీకరములనుట. పెనుచెమటచే చందనమంతయు గరఁగి కాతిపోవక చిఱుచెమటచేఁ దడిసి యనుకు రొంపియైనచో ముత్తెములకందు పోవుట కుపయుక్తమగును. గంధసారములు నవములగుట కందు మఱింతబాగుగ పోవుటకు. గిరికకును నాకును సంశ్లేష మెప్పుడుగలుగునో యని తాత్పర్యము.

మ. అని రాజేంద్రుఁడు రత్నపుత్రిఁగని యాహారాధిరాజంబుఁ దె
చ్చిన యోయప్రతిమోపకారసుకృతశ్రీకణ్యదాక్షిణ్యశా
లిని నీకుం బ్రతిమాపదేశ మిఁక నేలే పల్కవే సన్నిధిక్
వనితావల్లభజీవితంబులు సఖీవాక్యస్థితంబుల్ గదే. 107

అ. ...రాజేంద్రుఁడు=వసురాజు, రత్నపుత్రిక్ = రతనపు ప్రతిమను, హారాధిరాజంబుక్= హారశ్రేష్ఠమును, తెచ్చిన, ఓ అప్రతిమ...శాలిని—అప్రతిమ=సాటిలేని, ఉపకార = ఉపకృతిరూపమయిన, సుకృతశ్రీ=పుణ్యసమృద్ధిచేత, కణ్య=కొనియాడఁదగిన, దాక్షిణ్య=(పరకార్య నిర్వాహణ) శక్తిచేత, శాలిని=ఒప్పుచున్నదానాయని యర్థము. (అప్రతిమా=ప్రతిమగానిదానియొక్క, ఉపకార సుకృత శ్రీకణ్యదాక్షిణ్య శాలిని యని యర్థాంతరము).నీకు=ఇట్టినీకు, ఇఁకక్, ప్రతిమాపదేశము=ప్రతిమ యనెడు వ్యాజము, ఏలే=ఎందులకు, సన్నిధిక్=సమక్షమందు, పల్కవే = మాటాడవే, వనితావల్లభ జీవితంబులు=నాయికానాయకుల బ్రతుకులు, సఖీవాక్య స్థితంబుల్ గదే=చెలు (దూతిక)ల వాక్యములందున్నవే కదే.

అప్రతిమవలె నుపకారముచే నొప్పుచున్నదానికి ప్రతిమాపదేశ మేల? 'తెచ్చిన+ఓ అప్రతిమ' అను నీ సమాసమున సంబుద్ధివాచకములగు ఓయాదివ్యస్తములను సమసించుట తెలియునది. అప్రతి... శాలిని' యగుట అహారాధిరాజంబుఁ దెచ్చుటచేత. అల. కావ్యలింగము.

సీ. అన విని రఘునందనుని సన్నిధిఁ బ్రభూత, చైతన్యయై నిల్చుఁ జట్టుపొలఁతి
కరణి రత్నపుబొమ్మ గతి మాని ధృతిపూని, క్షితిజానికి జోహారు చేసి నిలిచి
పలికితి నోమహా భాగ తావకమహా, మహితోక్తి దప్పనే మంజువాణి
నచలకన్యక బోటినగుదుఁ గన్నియయున్కిఁ, దెలుపవచ్చితిఁగదా తెఱవనిట్లు
తే. పంచశరశాతశరహేతి పాలుచేసి, తిరిగిచూడవు దగునయ్య దొరలకెంచు
మఱపుగలిగిన నసదల మఱతురయ్య, వెలఁది దూఱిన దూఱులు వినఁగదయ్య.

అ. ...రఘునందనుని సన్నిధిన్ = రఘురాముని యెదుట, ప్రభూతచైతన్యయై=పుట్టినచేతన భావము గలదై-చేతనత్వమునొంది యనుట, నిల్చి, చట్టుపొలఁతి కరణిన్ =ఱాతిరూపమైన యహల్యవలె, రత్నపుబొమ్మగతిన్=రతనపుఁ బ్రతిమయై యుండువిధమును...ధృతిన్=ధైర్యమును, క్షితిజానికిన్= రాజునకు, జోహారుచేసి=మ్రొక్కి, మహాభాగ = మహాభాగ్యవంతుఁడా, తావకమహామహిత ఉక్తి తప్పునే=నీదు గొప్పదయిన సత్యవాక్యము అబద్ధమగునా, కాఁబట్టి, మంజువాణిని, అచలకన్యబోటిని ఆగుదున్ (ఇందు ౯౭ వ పద్యమున 'శైలకన్యకాధీర వయస్యయైన వనదేవతయో' యని సంభావన చేఁ జెప్పినమాట యథార్థమగుటయు, 'ఒకమంజువాణి' యని స్త్రీసామాన్య పరముగాఁ జెప్పినపదము మంజువాణియను నిక్కపుచెలి పేరగుటయుఁ, దారకాణించి చెప్పుట తెలియునది.) కన్నియ... గదా.—ఇది 'యేతేరఁగఁబోలు బాలగతిఁ దెల్పఁగ' ననుటకుఁ దారకాణము, తెఱవన్ = ఆచిన్న దానిని, పంచశర శాతశర హేతిపాలు=మన్మథుని వాఁడిబాణముల యగ్నికిలోను,...తిరిగిచూడవు= అటువైపు తిరిగిచూడవు, దొరలకు, ఎందుమఱపు గలిగినన్ = మఱిదేనియందు మఱపుగలిగినను, అనదలమఱతురయ్యా=అనాథలను - అనఁగా వేఱుదిక్కులేని వారిని మఱచిపోదురటయ్యా, వెలఁది= గిరిక, దూఱులు=నిందించినమాటలు....అల. ఉపమ.

ఉ. తావకశైలభేదనకథాబిరుదాంకము లేము పేర్కొనం
దా విని వెచ్చనూర్చి వనితామణి నిత్యకఠోరముల్ కుల
గ్రావము లంద్రు వానిఁ బదఘట్టన గీటడఁగించినట్టి గో
త్రావరుఁ డింక నేమిటఁ గరంగునయో యని నించు బాష్పముల్. 109

అ. వనితామణి=గిరిక, తావక...దాంకములు = నీదయిన కొండను (కోలాహలమును) భేదించిన చరిత్రతోఁ గూడిన, బిరుద నామములను, ఏము=మేము, పేర్కొనన్=చెప్పఁగా, తాను, విని, వెచ్చనూర్చి=వేఁడి నిట్టూర్పులుపుచ్చి, కులగ్రావములు= కులపర్వతములు, నిత్యకఠోరములు=ఎప్పటికిని గఠినములు, అంద్రు=అందురు, వానిన్=అట్టివానిని, పదఘట్టనన్ = కాలఁజిమ్ముటచే, గీటడఁగించి నట్టి గోత్రావరుఁడు=గర్వముదూల్చినట్టి భూపతి-వసురాజు, ఇంక, ఏమిటన్=దేనిచేత, కరంగున్= మెత్తఁబడఁగలఁడు, అయో, యని, బాష్పములు నించును.

నిత్యకఠోరములను కాలఁ జిమ్మినట్టివాఁడు అతిమాత్ర కఠినుఁడుగావలయును. అట్టివానిని గరఁగించుటకు మఱి వేఱొద్దియులేదు. ఇఁక నాపయిఁ గనికరించు టెక్కడిది యని కన్నీరునించుట.

మ. జనలోకస్పృహణీయభవ్యసుషమాసౌభాగ్యముం భాగ్యవ
జ్జనభోగానుగుణత్వముం దదితరాశానిత్యదైన్య వ్యథా
జనకత్వంబును గల్గఁ జూచియె ధరాజంభారి కంభోజజుం
డొనరించెన్ వసునామ మంచు నవలా యూహించు మోహంబునన్. 110

అ. నవలా=గిరిక, జన...భాగ్యమున్—జనలోక = జన సమూహమునకు, స్పృహణీయ= కోరఁదగిన, భవ్య=తగిన, సుషమా=మేలయిన కాంతియొక్క (సుషమాపరమాశోభా' అ.), సౌభాగ్యమున్ = చక్కఁదనమును, భాగ్య...త్వమున్—భాగ్యవత్ జన=భాగ్యవంతులయిన జనులకు, భోగ=భోగించుటకు, అనుగుణత్వమున్=అనురూపమై యుండుటయును, తది...కత్వంబును—తత్, ఇతర=అభాగ్యవంతులకంటె నితరులయినవారికి - అనఁగా అభాగ్యులకు, ఆశ=ఆసయు, నిత్యదైన్య

వ్యథా= ఎడతెగని దీనత్వముయొక్కయు కష్టముయొక్కయు, జనకత్వంబును=పుట్టించుటయును, కల్గన్ =కలిగియుండఁగా, అంభోజజుండు = (తామరయందుఁ బుట్టిన) బ్రహ్మ, చూచియొ, ధరాజంభారికిన్ =భూదేవేంద్రునకి, వసునామము=వసువనెడిపేరు, ఒనరించెన్ = చేసెను, అంచున్, మోహంబునన్ =వ్యామోహముచేత, ఊహించును.

వసువనఁగా బంగారు. జనలోక...సౌభాగ్యాది గుణములు బంగారునందును రాజునందును గలిగియుండుటను జూచి యతనికి బంగారు అనునర్థముగల 'వసు'వను నామము బ్రహ్మదేవుఁడు చేసినాఁడేమోయని తాత్పర్యము. రాజు భాగ్యవంతులకే భోగ్యుఁడు, భాగ్యవతికాని తనకో వట్టియాశ గొలుపుచు నెడతెగని దీనతయుఁ గష్టమునే పెట్టుచున్నాఁడు. తాను రాజును జేపట్టునంత భాగ్యవతి గాదనుట. అల. ఉత్ప్రేక్ష.

సీ. అనుఁగుఁదమ్ములఁ గాసి కనుసన్నల మెలంగు, నిందిరఁ దృణముగా నెంచు ననినఁ
గూర్మాసనాభ్యాసకర్మఠ యై భజిం, చు ధరిత్రిఁ జులుకఁగాఁ జూచు ననిన
మధురాధరస్పందవిధివశంవద యైన, భాష నొండొకమాఱు పల్కఁ డనిన
నాత్మపాణిస్పర్శ నాయత్త మగుకీర్తి, నెనసి దిక్కులకడ నునుచు ననిన
తే. జగతిఁ గొఱనోము నోఁచినజలజముఖుల, కూరిమిగణించి యతఁడేల గారవించు
వరుని బహువల్లభామనోహరునిఁ గోరు,
ముదిత ముదితయె యని బాల మోమువాంచు.  111

అ. బాల,—అనుఁగుఁదమ్ములన్ = గారాబు అనుజులను, పాసి, కనుసన్నలన్ మెలఁగు=కనుసైఁగలకు - అనఁగా మిక్కిలి చులకనియాజ్ఞలకును సైతము- లోనైవర్తించు, ఇందిరన్ =లక్ష్మీకాంతను, తృణముగానెంచున్ అనినన్ =చులకగాఁ జూచునని చెప్పఁగా ననియర్థము - (ప్రేమాస్పదములయిన తామరలను రాత్రియందెడఁబాయుచున్నదనియును, రాజుకనుమెలపినవారి నాశ్రయించుచున్నదియు, యాచకుల కిచ్చునెడఁ దృణప్రాయముగా చూడఁబడుచున్న దనియును భావము.) అనుఁగుఁదమ్ముల సైతము దిగవిడిచి తనయాజ్ఞ కతిమాత్రము లోనైయుండు కాంతను నెంతో గారవింపవలసియుండఁగా నట్టిదానినే తృణీకరించు చున్నాఁడనుట.

కూర్మాస...కర్మఠయై = కూర్మాసనమనెడి యాసనవిశేషమందలి యభ్యాసమునఁ గర్మశూరురాలై 'కర్మశూరస్తు కర్మఠః' అ.—మిక్కిలి వాఁడినియమముతో కూర్మాసన మభ్యసించుచున్నట్టిదై యనుట, భజించు ధరిత్రిన్ = తన్నుసేవించునట్టి భూకాంతను, చులుకఁగాన్ =అగౌరవముగా నని యర్థము - (ఆదికూర్మముమీఁద నిలిచియున్నదనియును దన్నుఁ బొందినదనియును, దుష్టనిగ్రహముచేసి బరువు లేకుండునట్లు చేయఁబడుచున్నదనియు భావము.) కూర్మాసనమునుండి గొలుచు కాంతనెంతో మన్నించుటకు మాఱుగా నగౌరవముతో చూచుచున్నాఁడనుట.

మధురా...వద—ఇంపుగా పెదవినిగదల్చిన పాటిక్రియకే వశ్యురాలైన, భాషన్ =సరస్వతీకాంతనుగూర్చి, ఒండొకమాఱు పల్కఁడనినన్ = మఱియొకసారి మాటాడఁడనఁగా - రెండవసారి మాటాడఁడని యర్థము - (తమ మధురాధరస్పంద విధానమువలన స్వాధీనురాలనియును గంభీరుఁడు గనుకఁ బలుమాఱు పలుకఁడనియును భావము - ఇట విధియనఁగా బ్రహ్మయును, భాషయనఁగా సరస్వతియుఁ గనుకఁ బ్రకృతములును సహపఠితములునైన సరస్వతీ బ్రహ్మవాచక పదములను జెప్పుటచేత రత్నావళ్యలంకారము. 'క్రమికం ప్రకృతార్థానాం న్యాసం రత్నావళిం విదుః' అని

లక్షణము.) పెదవియాడించిన మాత్రనే లోనై ప్రవర్తించునట్టి కాంతతో నెన్నిమాఱులేని పలుకఁ దగియుండఁగా మఱియొకమాఱు పలుకఁడనుట.

ఆత్మపాణి స్పర్శనాయత్తమగు కీర్తిన్=తమ పాణిగ్రహణమునకు లోనయిన కీర్తికాంతను, ఎనసి=కలసి, దిక్కులకడ నుంచుననిన్ = చేరువనుంచికొని యాదరింపక దూరముగాఁ జేసినవాఁడనఁగానని యర్థము - (కీర్తితన బాహుపరాక్రమమునకు లోనై యున్నదనియు, దిగంతములందు వ్యాపింపఁజేయఁ బడుచున్నదనియును భావము. ఇటఁగీర్తికిని స్త్రీలింగ మహిమచేత, బ్రతీయమానయైన నాయికకును అభేదాధ్యవసాయము.)

జగతిన్, కొఱనోములు = తక్కువనోములు, నోఁచిన, జలజముఖుల కూరిమి=స్త్రీల ప్రేమను, గణించి=సరకుసేసి, అతఁడు=ఆరాజు, ఏల, గారవించును = మన్నించును, బహువల్లభా మనోహరునిన్=పెక్కండ్రు ప్రియురాండ్రకు చెలువుఁ డయినవానిని, కోరుముదిత=స్త్రీ, ముదితయే=సంతోష చిత్తురాలా - కాదనుట, అని, చింతచేత, మోమువాంచును.

మిక్కిలి పరిచర్యావతులును మహాభాగ్యవతులును గొప్ప ప్రియురాండ్రు నయిన శ్రీభూవాణీకీర్తికాంతలనే యాదరింపనివాఁడు భాగ్యహీనురాల నయిన నన్ను మన్నించునాయనియు నట్టి బహుస్త్రీవల్లభుఁడయిన వానిని గోరినందున సంతోషము గలుగునాయనియుఁ దాత్పర్యము. శ్లేషమూలకమైన అర్థాపత్తి, పరికరము,

చ. అనుటయుఁ బిన్ననవ్వువొలయన్ బ్రణయంబున సారెసారెకున్
వినుచుఁ దదుక్తికౌశలము వేమఱు నాత్మఁ దలంచి మెచ్చుచున్
జనపతి యాదరాతిశయసాంద్రముగా నుచితోత్తరంబుగా
ఘనరసభావబోధకముగాఁ బలికెం గిలకించితంబుగాన్. 112

అ. పిన్ననవ్వు=చిఱునగవు, పొలయన్ = వ్యాపించునట్లుగా, ప్రణయంబునన్=ప్రేమచేత, తదుక్తికౌశలము=ఆమాటనేరుపు, వేమఱున్=పలుమాఱును, ఆత్మన్=మనస్సునందు, జనపతి=రాజు, ఆదరాతిశయ సాంద్రముగాన్ = మన్ననయొక్క పెల్లిదముచేత దట్టమగునట్లుగా, ఉచితోత్తరంబుగాన్=(ఆయాడినమాటలకు) తగిన ప్రత్యుత్తర మగునట్లుగా, ఘనరసభావ బోధకముగాన్= అధికమయిన అనురాగముగల తాత్పర్యమునకు తెలియఁజేయునది యగునట్లుగా - తన గొప్పయనురాగమును దెలియఁజేయునట్లుగా ననుట, కిలికించితంబుగాన్ - ('క్రోధాశ్రుహర్ష భీత్యాదేస్సంకరః కిలికించితమ్') కోపమును గన్నీరును సంతోషమును భయమును మొదలయిన వొక్కటిగాఁ గూడికొనునట్లుగా పలికెను. ఏమనియనఁగా.

శా. ఏమేమీ జగతిం గఠోరములు శైలేంద్రంబు లౌఁగా తదీ
యామేయస్మయభేది యంతకుఁ గఠోరాకారుఁ డౌనే కదా
యామేటిన్ ధృతివాపి చూపులనె యూఁటాడించువా రెంతవా
రో మీనేక్షణ తానెఱుంగదె తదారూఢ ప్రభావోన్నతుల్. 113

అ. ఏమేమీ = ఏమంటి వేమంటివి, శైలేంద్రంబులు = మేటిపర్వతములు, కఠోరములు, ఔఁగా=ఔనుగదా, తదీయ అమేయ స్మయభేది=వానియొక్క కొలఁదిలేని గర్వమును బోఁగొట్టినవాఁడు, అంతకున్ = వానికంటెను, కఠోరాకారుఁడు, ఔనేకదా, ఆమేటిన్ = అట్టిదిట్టకఠినుని, చూపులనె, ధృతివాపి=ధైర్యమునుబోఁగొట్టి, ఊఁటాడించువారు = ఉఱ్ఱూఁత లూఁచువారు, ఎంతవారో=ఎంతటివారో-ఎంతటి మహాకఠినాత్ములో యనుట, తత్ ఆరూఢప్రభావోన్నతుల్ — తత్ =

ఆకఠోరవస్తువులు మూఁటిలోపల, ఆరూఢ = కాఠిన్యాతిశయ స్థానముగల దానియొక్క, ప్రభావ+ఉన్నతుల్ = మహిమాతిశయములు, మీనేక్షణ=గిరికాదేవి, తాను ఎఱుంగదే - అనఁగాఁ గాఠిన్యోత్కర్షస్థానము గనుక గిరికాదేవి యారూఢురాలని తెలియవలయును. మీనేక్షణ పదము సాభిప్రాయము.

ఉ. ఆసలఁబెట్టి యేఁచు వసు వంచు వచింపఁగనేల సంతతో
ద్భాసినిజాభిజాత్యమునఁ దద్వసువుల్ వెలఁగొన్నమోహ సం
వాసపదంబు దా రమణి వారకశుక్తిమతిన్ జనించె ల
క్ష్మీసముదగ్రమై జగ మశేషము నివ్వెఱఁ గందఁ జేయఁగాన్. 114

అ. వసువు=బంగారము, ఆసలఁబెట్టి యేఁచునంచు వచింపఁగనేల = ఆశలుగొలిపి బాధించుచున్నదని చెప్పనేటికి, (వసురాజు ఆశలుపెట్టి బాధించుచున్నాఁడని చెప్పనేలయని భావము.) సంతత ఉద్భాసినిజ ఆభిజాత్యమునన్=ఎల్లపుడును మిక్కిలి ప్రకాశించుచున్న తన మంచికులముచేత ననియర్థము - ('అభిజాతస్తు నేతే న్యాయ్యేకులీన ప్రాప్తరూపయోః' అని విశ్వమునుబట్టి సౌందర్యముచేత ననిభావము-) తత్ వసువు...పదంబు=ఆబంగారును విలుచుకొన్న మోహనివాసస్థానము, అయిన ఉదారమణి=మేటిరత్నము - ('ఉదారో దాతృమహతోః' అ) అనఁగా ముక్తామణియని యర్థము-(ఆవసురాజు వశముచేసికొన్న మోహనివాసస్థానమయిన, తాను రమణి=స్త్రీయగు గిరికయనిభావము. ఇట మోహనివాస పదంబు+తాన్+రమణియని విభాగమూహ్యము. లేక ఉదారమణి యనియే భావము నుగ్రహించినచో గిరికను నిగరణముచేసి మణిగా నధ్యవసించినాఁడని తెలియునది) వారక, శుక్తిమతిన్, జనించి, లక్ష్మీసముదగ్రమై=కాంతిచే పరిపూర్ణమై, జగము అశేషమున్=సమస్తమయిన జగత్తును, నివ్వెఱఁగందన్ చేయఁగాన్=విభ్రాంతిని బొందునట్లు చేయఁగా, 'ఆసలఁబెట్టి...వచింపఁగనేల' యని సంబంధము. అల. రూపకాతిశయోక్తి.

బంగా రాశగొలిపి వేధించుచున్నదని చెప్పనేల. ఎప్పటికిని వన్నెకెక్కుచున్న జాతిమేలిమిచే నాబంగారమును గొనిన మోహనివాసస్థానమయిన మేటి ముక్తారత్నము, శుక్తిమతియందుఁ బుట్టి కాంతిచేత నతిశయించినదై సమస్తప్రపంచమును విభ్రాంతిఁ బొందించుచుండఁగా ననియర్థము.

వసురా జాశలుగొలిపి వేధించుచున్నాఁడని చెప్పనేల. ఎడతెగని మేలిసౌందర్యాతిశయముచే, నావసురాజుగొనిన మోహనివాస స్థానమయిన గిరిక శుక్తిమతియందుఁ బుట్టి సంపదచేతను లావణ్యముచేతను నతిశయించి జగమునంతయుఁ భ్రమింప జేయుచుండఁగా నని భావము.

శా. శ్రీవాణీధరణీ ముఖాంగనలపైఁ జిత్తంబులే కున్కి కే
మీ వేమాఱును దూఱ నిత్యగుణలక్ష్మిన్ సంతతావక్రవృ
త్త్యావిర్భావ నఖండరూపనిధిఁ గన్యం గోరువాఁ డేల సం
భావించున్ సిరిపెంపు వాగ్విలసనప్రౌఢిన్ మహీభోగమున్. 115

అ. శ్రీవాణీ...నలపైన్=లక్ష్మి సరస్వతి భూమి మొదలుగాఁగల స్త్రీలమీఁదను, చిత్తంబు లేకున్కికిన్ = మనస్సు లేకపోవుటనుగుఱించి, వేమాఱును దూఱనేమీ = పలుమాఱును నిందింపవలసినదెందులకు, నిత్యగుణలక్ష్మిన్= ఎన్నటికినుండు గుణములుగల లక్ష్మినని యర్థము. (అచంచలములగు గుణముల పెంపుసొంపునని భావము.) సంతత అవక్రవృత్త ఆవిర్భావన్—సంతత=ఎల్లప్పుడును, అవక్రవృత్త=కుటిలముకాని వృత్తితోడి, ఆవిర్భావ=ఆవిర్భవించుటగల సరస్వతియును, అఖండరూపనిధిన్ =

నిండయిన చక్కఁదనమునకు స్థానమయిన భూమియు అయినట్టి, కన్యను గోరువాఁడని యర్థము—లక్ష్మీదేవి అనిత్యగుణములు గలదనుట—(సిరులు నిలుకడలేనివని భావము) సరస్వతియైనచో సంతతమును అవక్రవృత్తావిర్భావములేనిదనుట. వక్రవృత్తావిర్భావముగల దని భావము. అనఁగా గురువులు వక్రాకారములును లఘువు లవక్రాకారములు నగునట్లుగా వ్రాయఁబడుచున్నవి గనుక గురులఘుయుక్త వృత్తరూపావిర్భావము గలదని తెలియవలయును. భూమియన్ననో ఖండరూపనిధియనుట——అనఁగా నవఖండస్వరూపముగలదని భావము. ఇట్టికొఱఁతలులేనట్టి కన్యనుగోరువాఁడు, సిరి సొంపు = లక్ష్మియొక్క అతిశయమును, వాగ్విలసత్ప్రౌఢిన్ = సరస్వతియొక్క విలాసప్రౌఢిని, మహీభోగమున్ = భూమియొక్క సుఖమును, ఏలసంభావించున్=ఎందులకు పాటిమన్నిం.—పాటింపఁడనుట. అనఁగా గుణశాలినియైన గిరికను గోరుచున్న తాను శ్రీవాణీ ధరణీ [illegible] కోరుముదితక్ష్మి[illegible]ప్పును ప్రౌఢినిని భోగమును సంభావింపనని యర్థము. సంపదలయొక్క యభివృద్ధి [illegible]ము, భూసౌఖ్యమును దనకు రుచింపకున్నవని భావము. ఇట అభేదాధ్యవసాయప్ర ప్రియురాండ్రయను నవస్థాభేదము చెప్పఁబడెను. 'అన్యత్రా ప్రీతి రరతిః' అని లక్షణము. అల. [illegible]నయిన నన్ను [illegible]వ్యలింగము.

క. నా విని చతురాస్యుఁడ వరు, దే వచనప్రౌఢి [illegible] గలుగునాం యుఁగ వియో
గావృత్తి కోర్వ దేఁచెదొ, వ్రో వెసఁ బ్రోచె[illegible] తెలుపు ముల్లం బనినన్. 116

అ. నాన్=వసురాజిట్లు చెప్పఁగా, విని, చతురాస్యుఁడవు = బ్రహ్మవని యర్థము - చతురమయిన నోరు అనఁగా మాటలుగలవాఁడవని యర్థాంతరము. వచనప్రౌఢి = మాటనేర్పు, నీకు, అరుదే = వింతయా! తెఱవ=గిరిక, ఇఁకన్, వియోగావృత్తికిన్=విరహముయొక్క మరలిరాకకు, ఓర్వఁదు, ఏఁచెదవో=ఇట్లెబాధపెట్టెదవో, లేక, ప్రోచెదవో = రక్షింపుచున్నావో, ఉల్లము, తెలుపుము. అనినన్=అనఁగా. అల. పరికరము.

ఉ. నామదిలోనఁ బాయనియనారతసారతరానురాగచిం
తామయదామయంత్ర పరిణాహము దాహము మోహముం బురం
ధ్రీమణి నీవ చూచితి గదే తగదే జగదేకధన్వి య
క్కాముని యాన సందియముగా ననుఁ బల్కి యఘంబు గైకొనన్. 117

అ. నా...పాయని—పాయని=విడువని,అనారత...ణాహము—అనారత=ఎడతెగని,సారతర=మిక్కిలి బలీయమయిన, అనురాగ=ప్రేమతోఁగూడిన, చింతామయ=చింతారూపమయిన, దామయంత్ర=ఉరిత్రాటియొక్క, పరిణాహము = విరివియు 'పరిణాహో విశాలతా' అ. దాహము=తాపమును, మోహమున్=అపేక్షయును, పురంధ్రీమణి=స్త్రీరత్నమా, నీవ=నీవే, చూచితికదే, కాఁబట్టి, జగదేకధన్వి = జగత్తులోపల మేటివిలుకాఁడయిన, అక్కామునియాన = ఆమన్మథునితోడు, ననున్, సందియముగాన్ పలికి=నన్నుగుఱించి సందేహమున్నట్లుగా చెప్పి—నావిషయమై సందేహపడి యనుట, అఘంబు=పాపమును, కైకొనన్ - తగదే = చేకొనుట అర్హముగాదే-నాదురవస్థను జూచియు నాయందు సందేహమున్నట్లుగాఁ బలికి పాపముగట్టుకొనుట నీకెంతమాత్ర ముచితముగాదనుట.

ఆ. నాతి విను నగేంద్రనందన గురుజనా, ధీన గాన మనసు గానకుంట
నెసఁగుసందియమున నిన్నాళ్లు నీఖేద, జలధిఁ గడవఁ దెప్పఁ గలిగె నేఁడు. 118

అ. నాతి=ఓమంజువాణీ! వినుము, నగేంద్రనందన=పర్వతరాజపుత్రియైన గిరిక, గురుజనఅధీన=తల్లిదండ్రులయొక్క యధీనురాలు, కాన = కనుక, మనసు గానకుంటన్ = దాని మనసు

తెలియక పోవుటచేత, ఎసఁగు సందియమునన్ = పెరుఁగుచున్న సందేహముచేత, ఇన్నాళ్లు, ఈ ఖేద జలధి=ఈ దుఃఖసముద్రము, కడవన్ = ఈఁది దాఁటుటకు, నేఁడు, తెప్ప=నీవనెడు తెప్ప, కలిగెను, నీవలన నీదుఃఖసముద్రమును దాఁటుదుననుట.

ఉ. మన్ననబోటి నేఁటిమునుమాపు మహేంద్రభుజిష్య వచ్చి తా
నన్నియుఁ దెల్పె నింద్రుఁడు మదాశయ మాత్త నెఱింగి భక్తిసం
పన్నతఁ బాణిపీడనశుభం బొనఁగూర్చుటకై నగోత్తముం
గన్నియ వేఁడవచ్చునఁట కౌతుకసాంద్ర మునీంద్రకోటితోన్. 119

అ. నేఁటి మునుమాపు = నేటిసాయంకాలము, మన్ననబోటి = బహుమాన పాత్రురాలయిన, మహేంద్రభుజిష్య=మహేంద్రుని యొక్క పరిచారిక, వచ్చి, తాను, అన్నియును తెల్పెన్ = అన్ని వర్తమానములు చెప్పెను—అవి యేవియనఁగా, ఇంద్రుఁడు, మత్ ఆశయము = నాయభిప్రాయమును, భక్తిసంపన్నతన్ = ప్రేమయొక్క పెంపుచేత, ఆత్మన్, ఎఱింగి, పాణిపీడనశుభంబున్=పాణిగ్రహణరూపమయిన శుభకార్యమును, ఒనఁగూర్చుటకై, కౌతుకసాంద్రమునీంద్రకోటితోన్=సంతోషము దట్టమయిన మేటిమునుల సమూహముతోడ, నగోత్తమున్=పర్వతశ్రేష్ఠుని - కోలాహలుని, కన్నియ వేఁడన్ వచ్చునఁట - మీఁదికన్యయను.

క. అచల్లని తియ్యనిశుభ, వాచావిభవంబు విన్నవాఁడ నయి సుమీ
వాచాలమదన గుణనా, రాచార్భటిఁ గోర్చినాఁడఁ బ్రాణంబులతోన్. 120

అ. అచల్లని తియ్యని, శుభ=మంగళకరమైన, వాచావిభవంబు=మాటపెంపు, విన్నవాఁడనయి చుమీ=వినుటంబట్టియెచుమా, వాచాల...ర్భటికిన్—వాచాల = మ్రోయుచున్న, మదనగుణ = మన్మథుని వింటినారియొక్కయు, నారాచ=బాణపాతముయొక్కయు, అర్భటికిన్ = ఆర్భాటమునకు, ప్రాణములతోన్, ఓర్చినాఁడను - లేనిచో నోర్వక ప్రాణములు విడిచియుందుననుట.

ఉ. ఈశుభవార్త మీ చెలియకిప్పుడ పోయి యెఱుంగఁ జెప్పి కా
మాశుగపీడితంబు లగుప్రాణము లూరడిలంగఁ జేయు మో
పేశలవాణి యంచు నను బేర్కొని యీమహితాంగుళీయ ము
ర్వీశుఁ డొసంగి వీడ్కొలిపె నేనును వచ్చితి నీక్షణంబునన్. 121

ఆ. ఈశుభవార్త, మీచెలియకున్ = మీగిరికాదేవికి, ఇప్పుడపోయి యెఱుంగఁజెప్పి, కామాశుగపీడితంబులు = మన్మథబాణములచేత బాధింపఁబడుచున్నవి, అగు, ప్రాణములు = గిరిక ప్రాణముల, ఊరడిలంగన్ చేయుము, ఓపేశలవాణి= ఓమంజువాణీ, యంచు, ననున్, పేర్కొని= పిలిచి, ఈమహిత అంగుళీయకము=ప్రశస్తమయిన యీముద్రికను. ఉర్వీశుఁడు = రాజు, ఒసంగి, వీడ్కొలిపెన్= పంపెను. నేనునువచ్చితి నీక్షణంబునన్.

చ. అని యఖిలంబుఁ దెల్పి రమణాంగుళిముద్రిక మంజువాణి యి
చ్చిన నవలా విలాసమునఁ జేకొని కైశ్యపయోదపద్ధతిం
దనరఁగఁ జేయు నేత్రనలినంబులనొత్తు ఘటించు నున్నత
స్తనయుగళీశిథాంగములఁ దద్రవి తేజము నేకతంబునన్. 122

అ. మంజువాణి...అఖిలంబున్=సమస్తమును, రమణ+అంగుళిముద్రిక=ప్రియుఁడయిన వసురాజు నిశాయుంగరమును, నవలా = గిరిక, విలాసమునన్ = కామలజ్జాది సంకీర్ణమయిన శృంగార

చేష్టచేత, తద్రవితేజమున్ = సూర్యప్రభవంటి ప్రభగల యాముద్రికను, ఏకతంబునన్ = ఒంటరి పాటున, కైశ్యపయోదపద్ధతిన్—('తద్బృందే కైశికం కైశ్యమ్' అ.) కేశబృందమనెడు మేఘమార్గమందు - అనఁగా ఆకాశమందు (ఇట ఆకాశమనక పయోదపద్ధతి యనుపర్యాయమును జెప్పుట పయోదముచే కైశ్యమునకు సామ్యము సూచించుటకని తెలియునది.) తనరఁగాన్ చేయున్ = ఒప్పునట్లుగాఁజేయును - అనఁగా మేఘమువంటి కొప్పుపైఁజేర్చుకొనుననుట, నేత్రనలినంబులన్ = కన్నుఁదామరలయందు - అనఁగా కమలములవంటి కన్నులయందు, ఒత్తున్ = ఒత్తికొనును, ఉన్నత స్తనయుగళీ రథాంగములన్ = పొడవులయిన చన్నుఁగవల నెడు జక్కవలందు - జక్కవలవంటి చన్నుంగవలందనుట, ఘటించున్ = హత్తించుకొనును.

రవితేజము పయోదపద్ధతియందును, నలినంబులందును, రథాంగములయందును వెలయును గదా. ఆముద్రికయు రవితేజముగాన కైశ్యపయోదపద్ధతియందును నేత్రనలినంబులందును, స్తనరథాంగములందును, హత్తినదని యానుపూర్వ్యము తెలియునది. అట్లుచేయుట అవివాహితగాన లజ్జం జేసి చాటుముగాఁగాదు. ఏకతమునన్ జొందల దాల్చుట గౌరవాతిశయముచేత. కన్నులనొత్తికొనుట కడులాలనముంబట్టి. చన్నులహత్తించుట మన్మథతాపశాంతికి. మఱియు ముద్రికను జేకొనుట గొబ్బుననా? నిర్వికారతనా? కాదు విలాసమున. ఇందు సిగ్గు పెంపున్నది - మరులు సొంపున్నది. మరులు తీసికొనుటకు నుంకింపక మానదు. సిగ్గుతీసికొనుటకుఁ గొంకకమానదు. ఆ ఉంకింపును ఈ కొంకును జేరి పొంకముగా విలాసమయినది. సీతయు హనుమంతుఁడిచ్చిన ముద్రికను గొన్నదానిని వాల్మీకి,

'గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్ ।
తతస్సా హ్రీమతీ బాలా భర్తృసందేశహర్షితా '

అన్నాఁడు. ప్రౌఢకును 'హ్రీమతీ' యని లజ్జపయికొనుట శృంగారరస ముప్పొంగుటం జేసియు, దానిని వెలిపుచ్చరాని పరసన్నిధానముంబట్టియు. ఇఁక ముగ్ధకుఁ బరిచితయగు చెలిసమక్షమున లజ్జాసంకలిత శృంగారరసముల్లాసమే విలాసమనఁబడుట తెలియునది. మఱియు నిట 'రవితేజ' మన్నందుననే ముందఱ వర్ణింపఁబడు సూర్యోదయము సూచితముగాన ముద్రాలంకారము. 'సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః' అని లక్షణము. శ్లేషముకూడ. ముద్రికావిశేషణము. 'రవితేజ' మని నపుంసక మగుటకు 'ఉభయవిధ మమవాతీనామ్' అని నన్నయసూత్రము.

ఉ. మున్నుగ నన్నగాత్మజను సీ ముద్రికపైఁ బతిపేరు సూడఁ దోఁ
చె న్నప్పుఁ జూచినట్ల నునుసిగ్గు తదూర్మిక వ్రేలఁ బూన భా
గ్యోన్నతిఁ దత్కరగ్రహ మహోత్సవ ముప్పుడె కాంచినట్లు మిం
చె న్నవకాంతివిభ్రమ విశేషససంభ్రమ వైభవోన్నతుల్. 123

అ. అన్నగాత్మజకున్ = ఆగిరికకు, మున్నుగన్ = ముందుగా, నునుసిగ్గు = ఇంచుకలజ్జ, తత్ + ఊర్మికన్ = ఆయుంగరమును, వ్రేలన్ పూనన్ = వ్రేలికి తొడుగుకొనఁగా, భాగ్యోన్నతిన్ = భాగ్యాతిశయముచేత, తత్ కరగ్రహ మహోత్సవము = ఆరాజుపాణిగ్రహణమను పెద్దవేడుక, కాంచినట్లు = పొందినట్లు, నవ...వోన్నతుల్—నవకాంతి = (ముఖవికాసముచేత నయిన) క్రొత్తతెలివి జిగియొక్క, విభ్రమవిశేష = (శృంగారరసప్రయుక్త) విలాసవిశేషములయొక్కయు, సంభ్రమవైభవ = సంబరముతోఁగూడిన పెంపుయొక్కయు, ఉన్నతుల్ = అతిశయములు, మించెను - ('సంభ్రమస్సాధ్వసేఽపిస్యాత్సంవే గాదరయోరపి' విశ్వము.)

'నునుసిగ్గు' నృపుఁజూచినట్లగుటచేత. 'నవకాంతి...వోన్నతులు' నృపుఁజెట్టఁబట్టినట్లగుటచేత. రాజు కరగ్రహము ఊరక కలుగదు 'భాగ్యోన్నతి' చేతనే - అట్టిదికావుననే యది మహోత్సవము. ఇందులకు సంవాదముగా వాల్మీకి రామ ముద్రాంగుళీయకము గొన్నపుడు సీతనుగూర్చి చెప్పినది చూడుఁడు.

'గృహీత్వాప్రేక్షమాణాసా భర్తుఃకర విభూషణం । భర్తారమివసంప్రాప్తా జానకీముదితాభవత్ ॥
చారుతద్వదనంతస్యా స్తామ్రశుక్లాయతేక్షణం । అశోభతవిశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్ ॥
తతస్సాహ్రీమతీబాలా భర్తృసందేశహర్షితా । పరితుష్టాప్రియంకృత్వా ప్రశశంస మహాకపిమ్' ॥
(రామా. సుందరకాండము. ౩౬ వ సర్గము.)

సీ. ఒకనాఁడుచూచె బాలిక నిలాపతియంచుఁ, బతియంచుఁ దనకు నప్పార్థివేంద్రు
నతివ గోరఁగ మించె నంగజానల మంచు, నలమంచుచాయవాఁ డబల నేఁచ
నుర్వీశుకడ కేఁగి యొక బోటి కొమ్మంచుఁ, గొమ్మంచు నతఁడును గుఱుతొసంగి
చెలియతోఁ దెలిపెఁ దొయ్యలిమీఁది తమియంచుఁ, దమియంచుముట్టునంత నెబలారి
తే. వచ్చునఁటవిందునకునిందు వనితనడుగ, ననుచు ననుచువయస్యలాద్యంతమును నె
ఱుంగఁ జెప్పినవినిమహా భంగగరిమఁ, బొంగెజనయిత్రి మిన్నందె భూమిధరము.

అ. ఇలాపతి=వసురాజు, ఒకనాఁడు బాలికను చూచెను. అతివ=గిరిక, అప్పార్థివేంద్రున్=ఆరాజును, గోరఁగన్=వలవఁగా, అంగజానలము=మన్మథాగ్ని, మించెను, అలమంచు చాయవాఁడు=ఆచంద్రుఁడు, ఏఁచన్=బాధింపఁగా, ఒక,బోటికొమ్మ=చెలికత్తె, ఉర్వీశుకడకున్=వసురాజునొద్దకు, అతఁడును=ఆ రాజును, కొమ్ముఅంచున్ = తీసికొమ్మని, గుఱుతు = ఆనవాలు - (ఉంగరమనుట.) చెలియతోన్=చెలికత్తెయగు మంజువాణితో, తొయ్యలిమీఁది తమి = గిరికపయింగల వలపు. (ఇట తెలుపుధాతువు షష్ఠికిమాఱుగా తృతీయతోడ నన్వయించుట తెలియునది. 'చెలియకున్ తెలిపె' లేక 'చెలియతోన్ తెలిపె'నని) తమి=రాత్రి ('రజనీయామనీతమీ' అ.) అంచుముట్టునంతనే=తుద ముట్టఁగానే - తెల్లవాఱఁగానే యనుట, బలారి=ఇంద్రుఁడు, విందునకున్=తనచెలికాఁడయిన వసు రాజునకు, వనితన్=గిరికను, అడుగన్ ఇందువచ్చునఁట, ననుచువయస్యలు=కూరిమిగల చెలికత్తెలు, ఆద్యంతమును, ఎఱుంగన్=తెలియునట్లుగా, మంజువాణి, చెప్పినన్, జనయిత్రి = గిరికతల్లియును, శుక్తిమతి, మహా=ఉత్సవముయొక్క, అభంగ=ఎడతెగని, గరిమన్ = అతిశయముచేత - ఎడతెగని వేడుక పెంపుతో, పొంగెన్=ఉప్పొంగెనని యర్థము. (మహాత్=అధికమయిన, భంగ=అలలయొక్క, గరిమన్=అతిశయముచేత, పొంగెనని యర్థాంతరము.) భూమిధరము = (కోలాహల) పర్వతము, మిన్నందెన్=మిన్నుముట్టెను - మిక్కిలి విఱ్ఱవీఁగెను. ఆకాశమువఱకుఁ బొడువుగలిగి యుండెనని యర్థాంతరము. 125

చ. అపు డరవిందగంధి హృదయాంబుజఖేద మడంప వచ్చి తో
రపురుచితో వెలుంగు వసురాజుకరోర్మికఁ గాంచి భీతిమైఁ
జపలవిలోచనం బొదువఁ జాలక తారభటాలితో నిశా
ధిపునిబలంబు లేఁగినగతిన్ రహిఁ వీడెను బాండుచంద్రికల్. 125

అ. అపుడు, అర...ఖేదము—అరవిందగంధి = గిరికయొక్క, హృదయాంబుజ=అంబుజము వంటిహృదయముయొక్క - (హృదయమనెడి యంబుజముయొక్కయనియు) ఖేదము = దుఃఖమును.

(వాఁడుటను),అడంపవచ్చి=పోఁగొట్టుటకువచ్చి,తోరపురుచితోన్=అగ్గలమయినకాంతితో, వెలుంగు వసురాజకర+ఊర్మిక=వసురాజుచేతి యుంగరమని యర్థము -(వసువులనఁగా కిరణములు వానికిరాజు సూర్యుఁడు గనుక సూర్యునికిరణపుచాలు అని యర్థాంతరము. ఇట ఊర్మికయనఁగా తరంగము - తరంగము రేఖాకృతిగాను చాలుగాను నుండుటచేత కిరణపురేఖయనికాని చాలనికాని గ్రహింపవచ్చును.) కాంచి=చూచి, భీతిమైన్=భయముతో, చపలవిలోచనన్=గిరికను, పొదువన్ చాలక = ఆక్రమింప లేక, నిశాధిపునిబలంబులు=చంద్రుఁడనురాజు సేనలు, తారభటాళితోన్ = నక్షత్రములవంటి భటుల సమూహముతోనని యర్థము - (భటులవంటి నక్షత్రసమూహముతోననియర్థాంతరము.) ఏఁగినగతిన్= తీసిపోయినవో యన్నట్లుగా, పాండుచంద్రికల్ = తెల్లనివెన్నెలలు, రహివిడెను = కాంతిడిందిన వయ్యెను.

కరోర్మిక వసురాజుది. హృదయమో అంబుజము; మఱియు అరవిందమువంటి గంధముగల దానిది. అరవిందమువంటి తావియు అరవిందమువంటి హృదయమునుగలది గాన నే అరవిందాప్తుఁడగు వసురాజు కరోర్మిక ఖేదమడంచుటకు వచ్చినది. అట్లువచ్చియు మబ్బులు మొదలయిన వానిచే మాటుపడినచో ఖేదమడంగదుగాన 'తోరపురుచితో' వెలింగినది. 'ఊర్మిక' గా అనఁగా రేఖగా నిగుడుటయు. ఒకసేనయందలి యూథ (పటాల)మున కొక్కొక్క యూథపతి - అనఁగా మేటి భటుఁ డుండుటగలదు. ఈతెల్లవెన్నెలయను సేనలకు ఒడయుఁడు చంద్రుఁడు, అందలి యూథపతులు, తారకములు. రాజుపోఁగా సేనలును సేనాభటులును దాఁటుట సహజమే కదా. మఱివసురాజు కరోర్మికను శ్లిష్టమహిమచే, వసురాజుచేతి యుంగరమును సూర్యకిరణప్రసారమునుగా ననుసంధించుటచే సూర్యోదయము కాఁగా వివాహప్రసక్తి యారంభించుటచేతను దానిచే గిరిక కానందమగుటచేతను సూర్యకిరణప్రసారము గిరికాఖేదనివారకముగా వచ్చునట్లు సారస్యము పొందించుట తెలియునది. ఇటయుత్ప్రేక్ష ప్రకృతి శ్లేషోత్థాపితము.

రాజు ముద్దుటుంగరమును జూడఁగానే గిరికమనసు శాంతి వాసెననియు నింతలోఁ జంద్రుఁడును నక్షత్రములును దాఁటఁగా వెన్నెలలు కాంతిడిందినవనియుఁ దాత్పర్యము.

మ. ఒకనాఁ డింద్రునియంత వేలుపు మదీయోక్తిన్ విడంబించి తా
నొకకాలం బెటిఁగింప వచ్చి మునిశాపోద్వృత్తిపా లయ్యె మా
మకశబ్దం బిది యల్పమే త్రిమునిసంభావ్యత్రికాలీవిబో
ధకమన్ రీతిఁ ద్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్రచూడౌఘముల్. 126

అ. ...ఇంద్రునియంత వేలుపు=ఇంద్రుఁడు అను అంతగొప్పదేవుఁడు, మదీయ+ఉక్తిన్=నా పలుకుబడిని, విడంబించి=అనుకరించి, తాను, ఒకకాలంబు = (నాయుక్తియందలి హ్రస్వదీర్ఘప్లుతములలో) ఒకానొక కాలమునని యర్థము-(ఒకానొకప్రాతఃకాలమునని భావము) ఎటిఁగింపన్, వచ్చి, మునిశాప ఉద్వృత్తిపాలు = గౌతమమునియొక్క శాపముయొక్క తనపయి వర్తించుటకులోను, అయ్యెను, కాఁబట్టి మామకశబ్దంబు ఇది = ఈనాదయిన శబ్దము, అల్పమే=కాదు - మిక్కిలిగొప్పదనుట. ఎట్లనఁగా, త్రిముని...ధకము—త్రిముని=వ్యాకరణశాస్త్రప్రవర్తకులయిన పాణిని, కాత్యాయనుఁడు పతంజలియనెడు ముగ్గురు మునులచేత, సంభావ్య=ఆదరింపఁదగిన, త్రికాలీ=మూఁడుకాలములకు, విబోధకము = తెలివిడి పలుకునట్టిది, అన్ రీతిన్ = అన్నట్లుగానని యర్థము. (త్రికాలి యనఁగా హ్రస్వ దీర్ఘ ప్లుతకాలములని భావము.) తామ్రచూడౌఘముల్=(కృకవాకుస్తామ్రచూడః కుక్కుటశ్చరణాయుధః' అ.) కోళ్లసమూహములు, చెంతన్=సమీపమందు,త్రిభంగిగాన్=మూఁడు విధములుగా - మూఁడువిధములతోఁ గూడినట్లుగాననుట, మొరసెన్=కూసెను.

తా. తమయుక్తిని ఎవ్వరోకాదు ఇంద్రుఁడంతదొడ్డదేవుఁడే యనుకరించెను. అనుకరించియు అందు ఒకకాలమే చెప్పఁగలిగెను. ఆకాలమును చెప్పినందులకు ఒకమునిచేతనైనను మన్ననవడసెనా? లేదు. ఒకమునిశాపమునకే పాలయ్యెను. మేమో మూఁడుకాలములను తెలుపఁగలము. మఱియూ మూఁడుకాలములును, మువ్వురుమునుల మన్ననవడసినట్టిది. కావుననే మామకశబ్దము. 'అల్ప'ము గాదు. అని మూఁడుప్రకారములను (అనఁగా కో-౧, కో-౨-కో౩) యని మొరసెనని యర్థము. మునిత్రయమును కోఁడికూఁతయందున్నట్టి ఉ, ఊ, ఊఁ 3 అనెడి హ్రస్వదీర్ఘప్లుతకాలములను ననుకరించి అకారాదిస్వరములకు హ్రస్వదీర్ఘప్లుతములను జెప్పినారనుట యిట యనుసంధించునది. అల. ఉత్ప్రేక్ష.

క. ఆతఱి నొకకాతర నే, త్రాతిలకము కలికిఁ బలికెఁ బ్రాభాతికశో
భాతిశయవత్కుశేశయ, నూతనమధుమధురతామనోహరఫణితిన్. 127

అ. ఆతఱిన్=ఆసమయమందు, ఒకకాతర నేత్రాతిలకము = బెళుకుఁ గన్నుల స్త్రీలలో మేటియైన యొకచెలికత్తియ, ప్రాభాతి... ఫణితిన్—ప్రాభాతిక=వేకువను సంబంధించిన, శోభాతిశయవత్=కాంతిపెల్లిదముతోఁగూడిన, కుశేశయ=తామరలందలి, నూతన = క్రొత్తయగు, మధు=పూఁదేనెయొక్క, మధురతా=తీపువంటి తియ్యఁదనముచేత, మనోహర=ఒప్పిదమయిన, ఫణితిన్=వాగ్వైఖరిచేత, కలికిన్=గిరికాదేవినిగూర్చి, పలికెను. అప్పుడు విరిసిన తామరయందలి క్రొందేనె మిక్కిలితీయన. అలం. ఉపమ.

మ. అమృతాంశుండు నిశాసతిం గలసి శీర్యచ్చంద్రికాగంధశి
ల్పముతోఁ బుష్కరశయ్యఁ బాసి చన వేళాదూతి తత్కాలసం
భ్రమసంకీర్ణతరోడుహారమణివారంబుం బేరి తా నొక్కచో
గుమిగాఁ బోసెనొ నా మినుక్కురను వేగుంజుక్కఁ గంటే చెలీ. 128

అ. చెలీ=గిరికా, అమృతాంశుండు=చంద్రుఁడనెడు నాయకుఁడు, ఇక్కడ నేకదేశవివర్తి రూపకము, నిశాసతిన్=రాత్రియనెడు స్త్రీని, కలసి=కూడి, శీర్యత్...ల్పముల్=చెదరిపోవుచున్న వెన్నెలయనెడు గంధపురచనతో - చందనపుఁబూఁత చెదరిపోవుచుండఁగా ననుట, పుష్కరశయ్యన్=('వ్యోమపుష్కరమంబరమ్') ఆకాశమనెడు సెజ్జను, పాపిచనఁగా, వేళాదూతి=వేకువకాలమనెడి దూతిక, తత్...వారంబు—తత్కాల=అప్పటికాలమనెడు రతికాలమందలి, సంభ్రమ=సంబరముచేత - తొందరచేత, సంకీర్ణతర = మిక్కిలియు చెదరిన, ఉడు = నక్షత్రములనెడు, హార=ముత్తెపు సరియొక్క, మణివారంబు=ముత్తెముల సమూహమును, ఏరి, తాను, ఒక్కచోన్, గుమిగా=గుంపుగా, పోసెనో నాన్=పోసినదో యనునట్లుగా, మినుక్కురను=తళుక్కుమని మెఱయునట్టి, వేగుంజుక్కను, కంటె=చూచితివా.

నాయకుఁడు మేనచందనముపూసికొని నాయికంగలయుటయు, రతికాలమందలి యురవడిచే ముత్తెపుసరియందలి ముత్తెములు తెగి శయ్యపై చెదరిపడుటయు, దూతిక దానినేరి యొకచో ప్రోవుగాఁ బెట్టుటయు నిట యనుసంధించినాఁడు. రాత్రియంతయు చంద్రుఁడు వెన్నెలగాయుచుండి తెల్లవాఱుజాము సమీపింపఁగా ఆకసముపీడి యస్తమించెననియు, చంద్రికలు పలుచంబాఱెననియు, చుక్కలుచెదరి తాఱెననియు వేగుఁజుక్క మినుక్కురని తోఁచెననియుఁ దాత్పర్యము. అల. రూపకసంకీర్ణమగు నుత్ప్రేక్ష.

మ. తొవకుం దూరపునంటు రేమగువ పొందుం బూర్వపక్షంబు వ
మ్మవుఁ దారారుచి మద్విభూతి నది గాక కబ్జారితో వారి కే
యవినాభావము నాకుఁ గాక యని చంద్రాపాయ వేళం బ్రదీ
పవిపాండుద్యుతిపేరఁ జంద్రిక శిఖిం బ్రాపించె నీక్షించితే. 129

అ. ఇట చంద్రికను విరహిణియగు నాయికగాఁజేసి వర్ణించుచున్నాఁడు. చంద్రిక= వెన్నెల యనెడు నాయిక, ఆనాయికచేయు చింతయేమనఁగా - తొవకుఁ, దూరపునంటు = కలువతీఁగకు దూరపు స్నేహమని యర్థము - (చంద్రునకును గలువలకును ద్విలక్షయోజన వ్యవధానమని భావము) రేమగువపొందుఁ = రాత్రియను కాంతతోడి కలయికయుఁ, పూర్వపక్షంబు = నిలుకడలేని దనియర్థము. (శుక్లపక్షమందే యోగమనిభావము. 'అన్యస్యాఽక్వచిద్భ వేచ్చాన్యా' అను సూత్రముచేత సప్తమ్యర్థమునఁ బ్రథమ.) తారారుచి = (అశ్విన్యాది) తారలయందలి రుచి అనఁగా అభిరతి, మద్విభూతిఁ = నా పెంపు సొంపుచేత, వమ్మవుఁ = వ్యర్థమగునని యర్థము - (రుచియనఁగాఁ గాంతియు గనుక వెన్నెలవలనఁ జుక్కలుకాంతి రహితములగుచున్న వని భావము.) అదిగాక = అదియునుంగాక, వారికి = అకుముదాదులకు, అబ్జారితోడ, ఏఁ అవినాభావము = ఏమి ఎడతెగనికూటమి, నాకుఁగాక = నాకే చంద్రునితోడి వీడ్పాటులేమి - కలువతీఁగకును రాత్రికిని తారలకును చంద్రునితోడి రాకపోకలుగలుగవు. వెన్నెలకే చంద్రుని వీడకుండు రాకపోకలని తాత్పర్యము. అని చంద్రాపాయవేళఁ = చంద్రుఁడు పాసిన సమయమందు - మృతుండుకాఁగాననుట - (అస్తమింపఁగా నని భావము) ప్రదీపవిపాండుద్యుతి పేరఁ = దీపములయొక్క మిక్కిలి తెల్లకాంతియనెడు మిషచేత, శిఖిఁ బ్రాపించెను = అగ్నినిబొందెను - అనగా సహగమనముచేసెను, ఈక్షించితే = చూచితివా.

తొవ మొదలయినవానికి చంద్రునితో వేఱుపాటు గలుగుటఁగలదు. చంద్రికకుమాత్రము వేఱుపాటు గలుగదు. కనుక నతఁడు మృతుండుకాఁగా నతనినుండి వేఱుపడియుండనిదిగాన తానును సహగమనముచేసి యతనిని గూడఁబోయె ననియర్థము. దీపములందు తెల్లవాఱునపుడు గలుగు తెలుపు వెన్నెలఁజొచ్చుటచే నయినదిగాఁ గవివర్ణించినాఁడు. తెల్లవాఱఁగా వెన్నెలతీసిపోయెననియు దీపములు తెల్లపాఱెననియుఁ దాత్పర్యము అలం. శ్లేషమూలక కావ్యలింగము, సమాసోక్తి, అపహ్నవము.

శా. తారాసస్యము పండినన్ గగనకేదారంబునం జంద్రికా
నీరం బాఱఁగఁ గోసి తద్రుచిఫలానీకంబు ప్రాతర్మహా
సీరిగ్రామణి తూరుపెత్తె ననఁ దోఁచెం దూర్పునం దెల్పు త
ద్దూరన్యస్తపలాలరాశిక్రియ నిందుం డేఁగె నిస్సారుఁడై. 130

అ. ప్రాతర్మహాసీరిగ్రామణి = ప్రాతఃకాలమనెడి పెద్దకాఁపుమిన్న, గగనకేదారంబునన్ = ఆకాశమనెడు వరిమడియందు, తారాసస్యము = నక్షత్రములనెడు వరిపైరు, పండినన్, చంద్రికానీరంబు = వెన్నెలయనెడు నీరు, అఱఁగాన్ =ఇంకిపోవఁగా, కోసి = కోఁతకోసి, తద్రుచిఫలానీకంబు= ఆనక్షత్రముల కాంతులనెడు ధాన్యపురాశిని, తూరుపెత్తెనన్ = తూరుపుదిక్కునందు తూర్పాఱఁబట్టెనోయనఁగా—ఇట తూరుపుఅనుట తూర్పుదిక్కునకును తూరుచు ధాతుకృత్తునకును బేరు. తూర్పునన్ తెల్పుతోఁచెను - అనఁగా తూర్పు తెల్లవాఱెననుట, తత్ ... క్రియన్—తత్ = తూర్పెత్తినయా ధాన్యరాశికి, దూర = దవ్వునందు, న్యస్త = ఉంపఁబడిన, పలాలరాశిక్రియన్ = (పలాలోస్త్రీ) సనిష్ఫలః' అ) పొల్లురాశివలె, ఇందుఁడు = చంద్రుఁడు, నిస్సారుఁడై= చేవతక్కినవాఁడై- (కాంతిహీనుఁడై యని భావము.) ఏఁగెన్ = పడమటి దిక్కునకుఁబోయెను.

పొలములందుఁ దడితీయఁగా శోఁతగోయుటయు శోసిన దానిని తూర్పెత్తి పొల్లను దూరము గానుంచుటయు ప్రకటము. తూర్పెత్తినచోట తెల్లగానుండునుగాన తూర్పునందుఁ దెలుపుతోఁచెనన్నాఁడు. చుక్కలు రుచిమాసెను. వెన్నెలతీసిపోయెను. తూరుపు తెల్లవారెను. చంద్రుఁడు కాంతి దూలి పడమట నస్తమించుచుండె నని తాత్పర్యము. అలం. రూపకము. 'తూరుపెత్తెనుచో' శ్లిష్టము, ఉత్ప్రేక్షయు.

మ. సిరి నెత్తామరయింటికిన్ మగిడిరాఁ జెంతన్ ద్విజారావమా
ధురిఁ బుణ్యాహముఁ దెల్పుచున్ గురుతరుల్ దోడ్తో నటత్పల్లవో
దరనీహారజలంబు చిల్కఁగ నయుక్తం బొంటిమై నుండ నం
చు రథాంగంబు ద్విజాతిగాన గవయై చూపట్టె నప్పట్టునన్. 131

అ. సిరి = లక్ష్మీదేవి, నెత్తామర...రాన్ = విడిచిపెట్టిన తామరయింటికి మరలరాఁగా నని యర్థము - (వేకువను తామరలు శోభాయుక్తములు కాఁగా ననిభావము) చెంతన్ = సమీపమందు, ద్విజారావమాధురిన్ = (ద్విజుఁడనఁగా బ్రాహ్మణుఁడును పక్షియుఁగనుక) బ్రాహ్మణమంత్రఘోషము మాధుర్యముచేత, పుణ్యాహముదెల్పుచున్ = పుణ్యాహవాచన మాచరించునని యర్థము. (పక్షి కలకలధ్వని మాధుర్యముచేత, పుణ్యాహము=మనోజ్ఞమయినదినమును దెలుపుచుననిభావము - పుణ్యమనఁగా 'పుణ్యేమనోజ్ఞేవిహితం తథాసుకృతధర్మయోః' విశ్వము. అహమనఁగా దినము) గురుతరుల్ = పెద్దలనియర్థము - (గొప్పవృక్షములని భావము) తోడ్తోన్ = పుణ్యాహవచనముకాఁగానే యనుట-(పక్షులుకలకలధ్వనులుచేయఁగానే యనిభావము.) నటత్ పల్లవ...జలంబు—నటత్=(చేతిచే ఆడించుటచే) నటించుచున్న, పల్లవ=చిగురుటాకులచేత, ఉదర = కలశములోపలి, నీహారజలంబున్ = పుణ్యాహవచన సంబంధియగు పన్నీరును, చిల్కన్ = చిలుకరింపఁగా - కలశములో మంత్రపూత జలముంచుకొని దానివాయి యందున్న మామిడి మొదలగువాని చిగుళ్లనెత్తి యాజలమునఁ దోఁచి యాచిగుళ్లచేఁ బ్రోక్షించుట యిటయను సంధించినది - (వాయువుచేత నటించుచున్న చివుళ్లచేత తమలోపలనున్న మంచినీరును జిలుకరింపఁగా ననిభావము - నీహారమనఁగా పన్నీరును మంచును), రథాంగంబు = చక్రవాకము, ద్విజాతిగాన = బ్రాహ్మణజాతిగనుక, ఒంటిమైన్ ఉండన్ = ఒంటిగా నెదురుపడియుండుట, అయుక్తంబు = అనుచితము, అంచునని యర్థము - అప్పట్టునన్ = ఆలక్ష్మీ ప్రవేశసమయమందు, కవయై = జోడై, చూపట్టెనని యర్థము - (చక్రవాకము ద్విజాతి పక్షి కావున జన్మద్వయము గలదనియుం, ప్రాతఃకాలమున, ఒంటిమైనుండన్ అయుక్తంబంచున్ కవయై-ఒంటరిగానుండుట తగదని పెంటితో జోడుగూడినదై యుండెననియు భావము.)

క్రొత్తగా గృహప్రవేశము సేయునపుడు బ్రాహ్మణులు పుణ్యాహవాచనము తెలుపుచు కలశమందలి మంత్రపూత జలమున మామిడిచిగుళ్లచే తోఁచి ప్రోక్షింతురు. ఒంటి బ్రాహ్మణుఁ డెదురు పడుట అయుక్తమని యిద్దఱుగాని యంత కెక్కుడుగాని బ్రాహ్మణు లెదురుపత్తురు. ఇదియె యిట యనుసంధింపఁబడినది. ఇది లక్ష్మీ గృహప్రవేశ మహోత్సవ సందర్భముగాఁగవి వర్ణించినాఁడు, తెల్లవాఱఁగా కొలంకుల తామరలువికసించి శోభనొందెననియు, పక్షులు కలకలధ్వనులుసేయఁగా నాదిన మింపయి తోఁచెననియు, వేకువగాలికి కొలనితీరమున చెట్లయందలి చిగుళ్లలోన రాత్రి పడియుండిన మంచుబొట్లు తామరలపయి నొలికెననియు, చక్రవాకములు జోడుగూడెననియుఁ దాత్పర్యము. ప్రాతఃకాలమున గాలిపొలయుట ప్రకటము.

సీ. తరుణులుఁ బతులువాఁ • తాయనంబుల నల్లఁ, బొలయుచువేఁబోకటి • మలయుపవను
నింపారుచోఁ యున • నిగుడొత్తు చిత్తంబులు. (విరాట ౨ ఆ. ౨౩౬)

చ. తెలతెలవాఱె నొయ్యనరుదెంచి నిశాంతర తాంతతాంతలా
చెలువల కింపుగా మెలఁగి చెక్కులఁ గూరిన చూర్ణకుంతలా
వలి సరలంబుగా జడిసి వాడిన సెజ్జలమీఁది ప్రావిరుల్
దొలఁగఁ బ్రభాతవాయువులు తోఁచెఁ బురింబరిచారికాకృతిన్. (పాండురంగవిజయము.)

అల. శ్లేషానుప్రాణితమగు నుత్ప్రేక్ష.

చ. ఎలమి మనోజలుబ్ధుఁ డొనరించిన జక్కవదీము పెంటి పే
రెలుఁగునఁ బిల్చి చూడ్కిఁ గదిరించి యెదుర్కొని మేను మేను ని
శ్చలగుణసంగతిం బెనఁచి చక్రము దామర తెంకిఁ జేర్పఁ ద
త్కలకలశంకఁ బోలె విహగంబులు వీడెఁ గులాయకూటముల్. 132

అ. మనోజలుబ్ధుఁడు = మన్మథుఁడనెడు బోయవాఁడు, ఎలమిన్ = ఉత్సాహముచేత, ఒనరించిన = పొందించిన, జక్కవదీముపెంటి = (దీమనఁగా నొకజాతి పక్షులను మోహపెట్టెడు కొఱకు వజ్జాతి స్త్రీ) పక్షినుంచి యందులో నురులొడ్డి యుంచెడు బోనుపెట్టె - అందున్న పిటయెదీముపెంటి) చక్రవాకియనెడు దీముపెంటి, పేరెలుఁగునన్ పిల్చి = పెద్దయెలుఁగుతోఁ బిలిచి, చూడ్కిన్ కదిరించి = (అట్లు పిలువఁగా వచ్చునట్టి పోతుస్స్వభావము = ఏమి [illegible] ఎదుర్కొని, ఈమూఁడుచోట్లను బ్రకృతాప్రకృత సాధారణమని తెలియు[illegible]గకును రాత్రికి నిశ్చలగుణసంగతిన్ పెనఁచి — మేనుమేను = దేహములు రెంటిని, నిశ్చలగుణసంగతిన్ = ప్రాకృత నిశ్చలత్వమనెడి నిశ్చలసూత్రముయొక్క కూడికచేత, పెనఁచి = ఒండొంటితో పెనవైచి, ఒండొంటినిగదియఁగాఁ బారవశ్యముచేఁ గలిగిన నిశ్చలత్వమునేయుట నిశ్చలమైన (గట్టి) త్రాటిచే గట్టుటగాఁ జెప్పినాఁడు, చక్రము = మగజక్కవను, తామర తెంకిన్ = తామరయనెడు నివాసస్థానమును, చేర్పఁగానని యర్థము. (ఈ యర్థమున చక్రమనెడు పదము ద్వితీయకుఁ బ్రథమవచ్చినది గనుక తామరయనెడి పదమునందలి మొదటి తకారమునకు దకారాదేశమువచ్చినది. దామర యనఁగా నురుగట్టిన త్రాడుగనుక దామర తెంకిఁ జేర్పఁగానే యని యర్థాంతరము. తత్ కలకలశంకఁ బోలెన్ = ఆయురిలోఁబడిన పక్షియొక్క కలకలమనెడు సందేహముచేతవలె, విహగంబులు = పక్షులు, కులాయకూటముల్ ('కులాయో నీడమస్త్రియామ్' అ.) నివాసస్థానములయిన గూండ్లను, వీడెన్ = విడిచిపెట్టెను.

తెల్లవాఱఁగానే రాత్రి జక్కవపోతునెడఁ బాసియున్న పెంటి, యెలుఁగించి పిలిచియదిరాఁగానే చూచి యెదురుకొని తనశరీరము దాని శరీరముతోఁ బెనఁచికొని వాసస్థానమయిన తామరకుఁ బ్రవేశపెట్టెను. పక్షులసమూహములన్నియును నెరకయి గూండ్లువిడిచి పోయెను అని తాత్పర్యము.

అల. శ్లిష్టరూపకానుప్రాణితమైన యుత్ప్రేక్ష.

ఉ. పంచశిలీముఖుండు తుదబాణమునన్ జగమెల్ల గెల్చి య
భ్యాంచితపుష్పవృష్టి మరుదావళి నింపఁగ నిప్పుడల్లు ము
ద్రించినజాడఁ దెల్పెను రతీమధుపంబు పరిచ్ఛదచ్ఛటా
కంచుకితోత్పలంబు తుదకచ్చునఁ జిక్కె యచంచలాకృతిన్. 133

అ. పంచశిలీముఖుండు = అయిదుబాణములుగల మన్మథుఁడు, తుదబాణమునన్ = ('అరవిందమశోకంచ చూతంచ నవమల్లికా, నీలోత్పలంచ పంచైతే పంచబాణస్య సాయకాః' అ. అన్నట్లు) నీలోత్పలము (నల్లగలువ) అనెడు కడపటిబాణముచేత, (లేక మన్మథుఁడు అరవిందము మొదలయిన బాణములు నాలుగును బ్రయోగించినపిదపఁ బ్రయోగించు బాణముగాన తుదబాణ మన్నాఁడనియుఁ దెలియునది.) ఇందుల కను రూపముగా.

క. కూడుడిగించునశోకము, వాడించును మల్లెవిరి విఁవర్ణతఁజేయుం
జూడఁగఁజూతము తలఁఫుల్, జోడించుం దప్పి చంపఁ ♦ జూచుంగలువల్.

అనియున్నది. కావుననే సర్వజ్ఞుఁడయిన యమరసింహుఁడు నీయభిప్రాయమునే మున్నిడికొని నల్లగలువను దుదనుజెప్పినాఁడు. అట్టి నీలోత్పలబాణముచేత, జగముఎల్లన్ గెల్చి—(అనఁగా రాత్రియందే తనకు నుద్రేకమును రాత్రియందె నల్లగలువలకు వికాసమును గనుక నల్లగలువలచేతనే) ప్రపంచమంతయు జయించి, మరుదావళి=('మరుతౌపవనామరౌ' అ. అన్నట్లు మరుత్తనఁగా వాయువును దేవతయు) దేవతాసమూహములని యర్థము (వాయుసమూహములని భావము.) అభ్యంచిత పుష్పవృష్టిన్=మిక్కిలియొప్పుచున్న పువ్వులవానను, నింపఁగన్ = సింపింపఁగా, కురియఁగాననుట. దేవతలు పువ్వులవాన కురియఁగానని యర్థము—వాయువులు పువ్వులు రాల్పఁగానని భావము, ఇప్పుడు= ఈసమయమందు, మధుపంబు = తుమ్మెద, ఉపరి ... కచ్చునన్ — ఉపరిచ్ఛదచ్ఛటా = పయినున్న యాకులగుంపులచేతి (అనికేవలముత్పలపరము - వస్త్రసమూహముచేతనని బాణపరమైన యర్థము.) కంచుకిత = కప్పఁబడిన, ఉత్పలంబు = నల్లగలువయొక్క, తుదకచ్చునన్ = చివరరేకుల కప్పులో, చిక్కి—అనఁగాఁ గొంతసేపము సముకిఁగప్పింపునట్లుగాఁ జివరను జిక్కుకొన్నదై, అచంచల ఆకృతిన్ = నిలింపని దేహముతోడ, అల్లు ముద్రించినజాడన్ = నల్లగలువబాణముయొక్క అలుఁగుమీఁద ముద్ర వేసినరీతిఁ, తెలిపెను.

పంచశిలీముఖుఁడని బాణములైదుగలవాఁడుగాఁ జెప్పుటచే అయిదవది కడపటిబాణమనియు అనఁగా నీలోత్పల మని తెలియుచున్నది. గెలుపునొంది దేవతాపుష్పవర్షమును బడిసిగురిసినపిదప బాణములతోఁ బనియేమి? దానిని గుడ్డలఁజుట్టి ముద్ర వేసి మూలవైచుటె కావలయును. తుమ్మెద తుదికచ్చునఁ గదలక చిక్కియుంగుటంబట్టియే మొనయలుఁగునంపలి నల్లని సికాము సాటియగుట. ఆకులొకటిపైనొకటిగాఁ గప్పియుండుట బాణముపయిఁ జుట్టిన గుడ్డమడత లొకటిపయినొకటి యుండునట్లు. ఛదశబ్దము వస్త్రపరమయినందులకు 'ఇభేడాగ్రాజినాచ్ఛచ్ఛదః' అని కాళిదాసు. ఇట కలువ మొగుడుటచే గుత్తముగా గప్పిన ఆకులు గట్టిగాచుట్టిన గుడ్డమడఁతలవలెను, మొగుడునపుడు చిక్కికొన్నతేటి లక్కగాను చెప్పఁబడెను. అలం. పరికరాంకురము. శ్లేషానుప్రాణితమగు నిదర్శన.

ఉ. తమ్మి పతంగపత్ని తమిఁ దాల్చినపాండురకోరకాండముల్
గ్రమ్మి నిమీలితచ్ఛదపరంపరచేఁ బ్రసవాప్తివేళ రా
నిమ్ముగ వాని నొయ్య విరియించిన హేతుగుణాప్తిఁ బాంధవ
గ్గమ్ముల నేఁచు తేటి పిలుకై కలవెడలెన్ సహజాసిపిచ్ఛవిన్. 184

అ. తమ్మి = తామరతీఁగయనెడు, పతంగపత్ని = (పతంగమనఁగా సూర్యుఁడును పక్షియును గనుక) పక్షికాంతయని యర్థము—(సూర్యపత్నియనిభావము) తమిన్ = రాత్రియందు, (రజనీయామినీతమీ' అ.) తాల్చిన, పాండురకోరక అండముల్ = తెల్లనిమొగ్గలనెడు గ్రుడ్లను, నిమీలితచ్ఛదపరంపరచేన్ = (ఛదమనఁగా ఆకులును రెక్కలునుగాన) మొగిడినయాకుల పరంపరయనెడు-ముడుఁగుకొన్న రెక్కల పరంపరచేత, గ్రమ్మి = పొదిగి, ప్రసవాప్తివేళ = విరిసిపువ్వులయ్యెడు సమయముఅనెడు ప్రసవకాలము, అనఁగా గ్రుడ్డునవియించునట్టికాలము, రాన్ = రాఁగానే, ('స్యాదుత్పాతేఫలే పుష్పే ప్రసవోగర్భమోచనే' అని విశ్వము) వానిన్, ఆమొగ్గలననుట, ఆగుడ్లనని భావము, ఇమ్ముగన్ = లెస్సగా, ఒయ్యన్ = క్రమముగా, విరియించినన్ = వికసింపఁజేయఁగా యని తామరతీగపరముగా నర్థము. ముక్కుతోఁబొడిచి గ్రుడ్డునవియింపఁగానని పక్షి

కాంత పరముగా నర్థము. ఉభయత్రఅభేదాధ్యవసాయము. హేతుగుణఆప్తిక్ =హేతువయిన రాత్రి యొక్క గుణప్రాప్తిచేత, పాంథవ... తేఁటిపిలుకల్ = విరహిసమూహమును బాధించు తుమ్మెద లనెడు పిల్లలు, సహజ అసితచ్ఛవిక్ = స్వభావసిద్ధమయిన నల్లని కాంతితోడ, వెడలెక్ = బయలు దేఱెను.

'కారణగుణాహి కార్యగుణానారభన్తే' అను న్యాయముచేత కారణమగు రాత్రియందుఁ బెట్టిన కోరకాండములవలనఁ గార్యములగు తేఁటిపిలుకలగుచున్నవి. కారణమగు రాత్రియొక్క గుణములగు పాంథబాధకత్వమును, అసితచ్ఛవియు కార్యములయిన తేఁటిపిలుకలయందును జూపట్టెనని యెఱుంగునది. పక్షికాంత తెల్లనిగ్రుడ్లను రెక్కలచేఁ బొదివి తగినకాలమున ముక్కుతోఁబొడిచి యవియించి పిల్లలను వెడలించుట నిట యనుసంధించినాఁడు. ఇట ముకుళించియుండిన తామరలు వికసించుటయు వానియందుఁ జిక్కుకొనియుండిన తేంట్లు వెడలుటయుఁ దెలియునది. అలం. శ్లిష్ట రూపకమును ఉత్ప్రేక్షయును.

చ. సమయమహర్షి బోధగుణశాలి మహోదయభూమభృద్వతం
సమునకుఁ బ్రాగ్వధూటియెడఁ జక్రహితుండు నశేషదేవతాం
శము నగుసూనునిం దలఁచి సాంధ్యమహోమయహోమవహ్ని దీ
ప్తముగ నొనర్చెఁ దారచరుభక్తశతాహుతిపూర్వకంబుగాన్. 135

అ. బోధగుణశాలి = మేలుకొనుటయనెడి జ్ఞానగుణముచేత ఒప్పుచున్నవాఁడయిన, సమయ మహర్షి = ప్రాతఃకాలమనెడి ఋషీశ్వరుఁడు, మహోదయభూమిభృత్ వతంసమునకుక్ = గొప్పది యగు ('ఉదయఃపూర్వపర్వతేచసమున్నతౌ' మేదిని.) ఉదయపర్వతశ్రేష్ఠము అనెడు ('భూభృద్భూమిధరే నృపే' అ) మిక్కిలి యభ్యుదయముగల రాజశ్రేష్ఠునకు, ప్రాగ్వధూటియెడక్ =తూర్పుదిక్కనెడు ధర్మపత్నియందు, చక్రహితుండుక్ = చక్రవాకహితుఁడును—(రాష్ట్రహితుఁ డునని యు), అశేషదేవతాంశమును = సమస్తదేవతాత్మకుఁడును—(ఆదిత్యహృదయమున సూర్యుఁడు సమస్తదేవతాత్మకుఁడగుట—'ఏషబ్రహ్మాచ విష్ణుశ్చశివః స్కందః ప్రజాపతిః, మహేంద్రోధనదఃకాలో యమస్సోమోహ్యపాంపతిః (రామా- యుద్ధ.) అని చెప్పఁబడియున్నది)—(రాజుపరముగా అష్టది క్పాలకాంశములని యర్థము—'అష్టాభిర్లోకపాలానాం మాత్రాభిర్నిర్మితోనృపః' అని రాజ అష్టదిక్పాల కాంశుఁడనుట ప్రసిద్ధము) అగు, సూనునిక్—(సూనుఃపుత్రేనుజేరవౌ' విశ్వము.) కుమారుననుట - (సూర్యుని అనియు)తలఁచి=సంకల్పించి, ఇక్కడ నభేదాధ్యవసాయము. సాంధ్యమహోమయహోమ వహ్నిక్ = తొలుసంజయనెడు హోమాగ్నిని, తారచరు...గాక్—తార=నక్షత్రములనెడు, చరు భక్త = హవ్యములయిన పక్వాన్నములయొక్క, శతఆహుతి = నూఱువేల్చుటలు, పూర్వకంబు గాక్=ముందుగలుగునట్లుగా - నక్షత్రములనెడు హవ్యాన్నపు మెతుకులను వందలకొలఁదిని మున్ను వేల్చియనియర్థము. [నక్షత్రములను తెల్లనియన్నపుమెతుకులుగా రూపించుట.

మఱునకొసంగ...సితోదుభక్తముక్.

హరిహయదిఙ్నభస్థలమునం బలి చల్లిపటాంకముక్ వహూ
త్కరభరితంబుసై వెలుఁగఁ గాంచిసుధానిధినెత్తె నత్తఱిన్.

అని మనుచరిత్రము. దీప్తముగనొనర్చెక్ = ప్రకాశమగునట్లుగాఁజేసెను.

భక్తమనఁగా 'భిస్సాస్త్రీభక్తమన్ధోఽన్నమ్' అని అమరుఁడు. మేలుకొనుట యనెడు పరి జ్ఞానముచేత నొప్పుచున్న ప్రాతఃకాలమనెడు ఋషీశ్వరుఁడు మహత్తయిన యుదయాచలేంద్ర

మనెడు మహాభ్యుదయముగల రాజశ్రేష్ఠునకుఁ బ్రాగ్దిశయనెడు ధర్మపత్నియందుఁ జక్రవాకహితుఁడును సమస్తదేవతాత్మకుఁడును నయిన సూర్యుఁడనెడు రాష్ట్రహితుఁడును నష్టదిక్పాలకాంశమును నయిన కుమారుఁడు గలుగునట్లుగా సంకల్పించి సంధ్యారాగమనెడు హోమాగ్నిని నక్షత్రములనెడు హవ్యాన్నశతములను ముందుగాఁ వేల్చి ప్రకాశించునట్లు చేసెను - అనఁగా పుత్రకామేష్టి చేసెనని తాత్పర్యము.

సంజకెంజాయలలోఁ దోఁగియున్న చుక్కలను, హోమాగ్నిలో వేల్చునన్నపు మెతుకులుగాఁ గవిరూపించినాఁడు. దీనినే పెద్దన 'స్ఫురదరుణప్రభాపథిక శోణితసిక్త సితోడుభక్తముల్' యని విరహులరక్తములోఁగూడిన యన్నపుమెతుకులుగా రూపించినాఁడు. నక్షత్రములను అన్నమువలె వేల్చుటంజెప్పుటచే అగ్నియందుఁ జల్లఁబడిన యన్నపుమెతుకులవలె చుక్కలు చెల్లచెదరైయుండుట అనఁగాఁ జుక్కలు చాలవఱకు దాఁగుట వ్యంజితము. తెల్లవాఱఁగా తూర్పుదిక్కున నుదయపర్వత మందుఁ గొన్నిచుక్కలు చెల్లచెదరుగాఁ జూపట్టఁగాఁ దొలుసంజ మిక్కిలిమెఱయుచు సూర్యోదయ ముపస్థితమగుట సూచించుచుండెనని ఫలితార్థము. అలం. శ్లిష్టరూపకము.

మ. కుముదాధారవిహారముల్ కమల కన్గోఁజాల కంభోజగే
హము మూయం దెఱపింతు వేగ నని వామాలోకముల్ మూటి యా
సమయోపేంద్రుఁడు దక్షిణాక్షిఁ దెఱచెన్ సంజాతరాగానుబం
ధముతో నా విధుఁ డేఁగెఁ బ్రొద్దు పొడిచెన్ బంధూకబంధుచ్ఛవిన్. 136

అ. కమల = లక్ష్మీదేవి, కుముదాధారవిహారముల్ =(కుశబ్దము 'గోత్రాకుః పృథివీ పృథ్వీ' అ. అని భూమికి చెల్లునుగాన తనసవతియైన) భూదేవియొక్క ప్రీతికి నూఁతయైన అనఁగా ప్రీతి ప్రేరితములయిన విహారములని యర్థము—(కుముదములనఁగా కలువలును గనుకఁ గలువలకాధారములయిన విహారములని భావము), కన్గోఁజాలక = చూడనోపక - చూచియోర్వఁజాలకయనుట. అంభోజగేహముమూయక = తామరయింటివాఁకిటిని మూసికొనఁగా నేయని యర్థము. చూపోపనివారు తక్కిన వారల పెంపుసొంపుతోడి విహారమును జూడలేక యింటితలుపుమూసికొనుట వాడుక. (రాత్రియందు దామరలు ముకుళించుచున్నవని భావము) వేగన్ తెఱపింతునని = శీఘ్రముగా తెఱచునట్లు చేయుదు నని యర్థము. (వేగన్ = తెల్లవాఱఁగానే, తెఱపింతునని = విరియఁజేయుదునని భావము.) ఆసమయ ఉపేంద్రుఁడు = ప్రాతఃకాలసమయమనెడు మహావిష్ణువు, వామ+ఆలోకముల్ = ఎడమ కన్నును, మూటి=మూసి, సంజాతరాగానుబంధముతోన్ =పుట్టిన యెడతెగని యనురాగముతో, దక్షిణాక్షిన్ =కుడికన్నును, తెఱచెన్ నాన్ = తెఱచినాఁడో యన్నట్లుగా, విధుఁడు=చంద్రుఁడు, ఏఁగెన్ =పోయెను, క్రుంకెననుట. బంధూకబంధు-ఛవిన్ =మంకెనపూవునకు చుట్టమయిన (అనఁగా ఎఱ్ఱని)కాంతితో, ప్రొద్దుపొడిచెన్ =సూర్యుఁడుదయించెను. అల. శ్లేషానుప్రాణితమైన యుత్ప్రేక్ష.

సవతి పెంపుసొంపుగ మగనితోఁ దిరుగుచుండుట చూడనోపక స్త్రీ యిల్లుమూసికొనుట ప్రకటము. విష్ణువునకు చంద్రుఁడు ఎడమకన్ను, సూర్యుఁడు కుడికన్ను. ఎడమకన్ను మూసెననఁగా చంద్రుఁడుక్రుంకెను. కుడికన్ను దెఱచెననఁగా సూర్యుఁడుదయించు నట్లుచేసెను. ఎందులకు? తన యిల్లాలయిన లక్ష్మియింటిని దెఱపించుటకు-అనఁగా సూర్యునికిరణపు సోఁకుచే తామరను వికసింపఁ

జేయుటకని భావము. అనురాగము అరుణమని కవిసమయము. మంకెన పూవువంటి కాంతితో నుదయ సూర్యుఁడు చూపట్టుటచే అనురాగముతోడ అనఁగా తద్వ్యంజకమయిన యరుణవర్ణముతోఁ గుడికన్ను దెఱచెనన్నాఁడు. దృష్టికి ననురాగయుక్తత్వము.

'కాకతిక్ష్మాపతేర్దృష్టి రనురాగతరంగితా లగ్నా కహ్లారమాలేవ వధ్వాస్తుంగ కుచద్వయే.' అని ప్రతాపరుద్రీయము. చంద్రుఁడ స్తమించెను. సూర్యుఁడెఱ్ఱని బింబముతో నుదయించెను. తామరలు వికసించెనని తాత్పర్యము.

శా. ఓచామీకరచారుగాత్రి నిను గోత్రోత్తంసముర్వేఁడి నేఁ
డాచేదిక్షితిపాలశేఖరునితో హత్తింపఁగా వచ్చు త
త్ప్రాచీభర్తకుఁ బట్టుపట్టుగొడుగై భానుండు దోఁపం బ్రభా
వీచుల్ తద్గతరత్నగుచ్ఛముల ఠీవిం బొల్చెఁ బ్రాంతంబునన్. 137

అ. ఓచామీకరచారుగాత్రి = (చామీకరం జాతరూపం మహారజత కాంచనే' అ) బంగారపు కణికవలె సొగసయిన దేహముగలదానా - గిరికా, నినుర్ గోత్రోత్తంసముర్ వేఁడి= నిన్నిచ్చునట్లు పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలుని యాచించి (ఇట వేఁడుధాతువు ద్వికర్మకము), నేఁడు, ఆచేది...నితోన్ = చేదిదేశపు రాజోత్తముఁడయిన యావసురాజుతో, హత్తింపఁగాన్= నిన్నుఁగూర్చుటకై, వచ్చు=వచ్చుచున్న, తత్ ప్రాచీ భర్తకున్=తూర్పుదిక్కునకు నాథుఁడయిన యింద్రునకు - [కన్నెనడుగవచ్చు వారు సభార్యులై వచ్చుటగలదు. కాన ప్రాచీభర్తయనుట. కాదేని ప్రాచియందు సూర్యుఁడు పట్టుగొడుగు పట్టినట్లు తోఁచుటచే ప్రాచీభర్తయనుట సాభిప్రాయము.] పట్టు=పట్టినట్టి, పట్టుగొడుగై=ఎఱ్ఱపట్టు గొడుగోయన్నట్లుగా, భానుండు=సూర్యుఁడు, తోఁపన్=కనఁబడఁగా, ప్రభావీచుల్ = కాంతుల యలలు, అలలవలె చాఁగివచ్చుచున్న యెఱ్ఱని కాంతులు, ప్రాంతంబునన్=దాపున, తద్గతరత్న గుచ్ఛముల ఠీవిన్ = ఆసూర్యుఁడనెడు గొడుగు నంటియున్న కెంపుమణుల గుత్తులవలెనే, పొల్చెన్=ప్రకాశించెను.

'నినుర్ గోత్రోత్తంసముర్ వేఁడి, ఇటవేఁడుధాతువు ద్వికర్మకము. ప్రాచీభర్తగావున నే యింద్రునకుఁ బ్రాచి యందు సూర్యుఁడను గొడుగు పట్టుట. 'రత్న' రత్నములు సామాన్యముగా వ్యవహరించునవు డరుణములుగా గ్రహించునది. ఎఱ్ఱపట్టుగొడుగు సూర్యుఁడు. దానికి వ్రేలఁగట్టిన కెంపుల జాలరులు ప్రభావీచులని తెలియునది. నిన్నిచ్చునట్లు వేఁడుట 'గోత్రోత్తంసముర్' అని ఉత్తంస శబ్దముచే నాయిక యాభిజాత్య స్ఫురితము. చేదిక్షితి పాలశేఖరుఁడని శేఖర శబ్దముచే నాయిక యత్యనురూపను వరప్రాప్తిరూపమయిన సౌభాగ్యము ధ్వనితము. ప్రాచీభర్తకు=ప్రాచి తనమగనికిఁ బట్టుపట్టు గొడుగువలె సూర్యుఁడున్నాఁడనుట. అల.రూపకమునకు ఉపమకు సంకరము.

క. అని విన్నవించుటయుఁ గ్రొ, న్ననపానుపు డిగి ప్రసన్ననళినానన దా
ననఘ దినాననకృత్యము, లొనరించి గురుర్ భజించి యుండెం బ్రీతిన్. 138

అ. ...విన్నవించుటయుర్ = చెలికత్తె విజ్ఞాపనముచేయఁగా, క్రొన్ననపానుపు= పూలసెజ్జ, ప్రసన్ననళినానన = కలఁకదేఱిన తామరవంటి మొగముగలది, తాను=ఆగిరిక, అనఘ...కృత్యములు—అనఘ=నిర్దుష్టములయిన, దినానన=అహర్ముఖమందలి - ప్రాతఃకాలమందలి, కృత్యములు = కరణీయములు, గురుర్=తండ్రియైన కోలాహలుని.

## ఆశ్వాసాంతము.

మ. అధరీభూతజయంత కంతుసుకుమారాకార ! రాకారజ
న్యధికోత్తేజితరాజ బింబరుచిధారాధార ! రాధారమ
ణ్యధినాథాంఘ్రిసరోరుహ ద్వితయసేవాచార ! వాచారమా
మధురాశేష విశేషభూషిత సుధీమందార ! మందారతా. 139

అ. అధరీ...కార—అధరీభూత=క్రిందుపఱుపఁబడిన, జయంతుఁడు, కంతు=మన్మథుఁడును గల, సుకుమార = మెత్తని, ఆకార=రూపముగలవాఁడా, రాకా...ధార—రాకారజనీ=పున్నమ రాత్రిచేత, అధిక=మిక్కిలిగా, ఉత్తేజిత=ప్రకాశింపఁజేయఁబడిన, రాజబింబ=చంద్రబింబముయొక్క, రుచిధారా=కాంతిప్రవాహములవంటి లావణ్యధారలకు, ఆధార = ఆస్పదమయినవాఁడా-అనఁగా చంద్రబింబమునందలి లావణ్యమువంటి లావణ్యముగలవాఁడా యనుట, రాధారమణీ=రాధికాకాంత యొక్క, అధినాథ=ప్రాణనాథుఁడయిన కృష్ణునియొక్క, అంఘ్రిన...సేవా=అడుగుదామరల జంటను గొలుచుటయే, ఆచార=ఆచరణముగాఁగలవాఁడా, వాచా...దార—వాచారమా= వచోలక్ష్మి యొక్క, మధుర=ఇంపయిన, అశేషవిశేష=సమస్త విశేషములచేత, భూషిత = అలంకృతులయిన, సుధీ=విద్వాంసులకు, మందార=కల్పవృక్షమైనవాఁడా=అనఁగా వారి వాంచితార్థముల నిచ్చువాఁడా యనుట, మందారతా-మంద=అలసులందు, అరతా=ఆసక్తిలేనివాఁడా, అని కృతిపతి సంబోధనము.

క. అబ్రాశిధీర ధీరచి, తబ్రాహ్మీధవవివేక తరుణచరణ భా
గిబ్రామశరణ సకలక, కుబ్రామాభరణకరణ గుణసంభరణా. 140

అ. అప్ రాశి ధీర=జలరాశివలె-అనఁగా సముద్రునివలె, ధీర=తొణఁకనివాఁడా-గంభీరుఁడా యనుట, ధీ...వివేక—ధీ=స్వబుద్ధిచేత, రచిత=చేయఁబడిన, బ్రాహ్మీధవ=సరస్వతి పెనిమిటియైన బ్రహ్మయొక్క, వివేక=యుక్తాయుక్త పరిజ్ఞానము గలవాఁడా - అనఁగా వివేకమందు బ్రహ్మసమానుఁడా యనుట, తరుణచర...శరణ—తరుణచరణభాక్ = మృదువులయిన యడుగులను బొందిన-నీయడుగులకుఁ బ్రణతుఁడయిన, ఇబ్రామ=ఇభరామ్ అనుతురకరాజునకు, శరణ = రక్షకుఁడయిన వాఁడా, ఫకల...భశణా—సకల=సమస్తమయిన, కకుభ్ రామా=దిక్కాంతలకు, ఆభరణకరణ= అలంకారములను జేయునట్టి, గుణ=గుణములను, సంభరణ=లెస్సఁగా భరించినవాఁడా-ఇతనిసుగుణములు దిక్కులందెల్ల సొంపుగా వెలుంగుచున్నవనుట. 'దిశస్తు కకుభఃకాష్ఠాః' అ.

మాలినీ. పరిచితకరహాటీ ప్రాప్తకర్పూర వీటీ
విరుత కటకలాటీ విశ్రుత స్వర్ణశాటీ
స్థిరవిజయ కిరీటీ తిమ్మమా గర్భపేటీ
వరమణి నిభధాటీ వల్గుధారాటఘోటీ. 141

అ. పరి...వీటీ—పరిచిత=పరిచితురాలయిన, కరహాటీ = కరహాటదేశస్త్రీచేత, ప్రాప్త = పొందఁబడిన, కర్పూరవీటీ=కపురవీడెముగలవాఁడా, విరుతకటకలాటీ - విరుతకటక=ఝుణఝుణ

యని మెఱయుచున్న కడియములుగలిగిన, లాటీ = లాటదేశ స్త్రీ)చేత, విశ్రుత = తెలియఁబడిన, స్వర్ణశాటీ=దానిబంగరు పైటవలువగలవాఁడా, స్థిరవిజయకిరీటీ=నిలుకడయైన గెలుపునందు అర్జునుఁడయినవాఁడా, తిమ్మమాగర్భపేటీ=తిమ్మాంబయొక్క గర్భమనెడు పెట్టెకు, వరమణినిభ=మేలిమాణిక్యమువంటివాఁడా, ధాటీ... ధారాళఘోటీ-ధాటీ=దాడియందు, ఎల్లు=సుందరమయిన, ధారా=అశ్వగతి పంచకముచేత, అట=సంచరించునవియు నగు, ఘోటీ =గుఱ్ఱములుగలవాఁడా - లేక, ధారాట =ధారాటదేశసంభవములయిన - ఇవి 'ధార్వాడ్' అనఁబడును, ఘోటీ=ఆఁడుగుఱ్ఱములుగలవాఁడా, అనఁగామాదువాను గుఱ్ఱములుగలవాఁడా యనుట. ధారాశబ్దము దేశవిశేష వాచకముగా, బాహ్లిక పారసీకశక ధారారట్ట ఘోట్టాణముల్' (ఆముక్తమాల్యద.)

## గద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత
సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితా
నిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబను మహా ప్రబం
ధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

# వసుచరిత్రము సవ్యాఖ్యానము.

## పంచమాశ్వాసము.



శ్రీసదృశ వేంగళాంబా
భాసురలాక్షాంఘ్రి శంఖ పద్మ శుభాంక
ప్రాసాద కేళిరసిక సు
ధీ సన్నుత గుణనికాయ తిరుమలరాయా. 1

అ. శ్రీ...రసిక—శ్రీసదృశ = లక్ష్మీసమానురాలయిన, వేంగళాంబా = వెంగళమ్మయొక్క, భాసుర=ప్రకాశించుచున్న, లాక్షా=లత్తుకచేత, రంజిత=రంజింపఁబడిన- రంగువేయఁబడిన, అంఘ్రి =పాదములందలి, శంఖపద్మ=శంఖములను పద్మములను సూచించు, శుభాంక = శుభ-చిహ్నములుగల- అనఁగా సెట్టినిశంఖములు పద్మములుంబోని ముగ్గులచేత - అనఁగా ముగ్గులచేత నలంకృతము లయినట్లున్న, ప్రాసాద=మేడయందలి, కేళీ=క్రీడయందు, రసిక=రసికుఁడయినవాఁడా. ఇట వస్తువుచేత నలంకారధ్వని. (ఈవిధముననే పెద్దన.

'తిరుమలదేవీ చరణో, దరలాక్షా కల్పకల్పిత స్థలకమల
స్ఫురదిందీవర బంధుర, హరిహయ మణివలయకూటహర్మ్యవిహారి'

అని కృష్ణరాయలకుఁ జెప్పినాఁడు) సుధీ, సన్నుత గుణనికాయ = విద్వాంసులచేత పొగడఁబడిన సుగుణసమూహముగలవాఁడా, తిరుమలరాయా=తిరుమల దేవరాయా, ఆశ్వాసాదిసంబోధనము.

తే. అవధరింపుము శౌనకాద్యఖిల సన్ము, నీంద్రులకు రౌమహర్షణి యిట్టులనియె
నాత్మకన్యోపలాలనాయత్తహృదయుఁ, డై హిమాహార్యసుతుఁడున్న యవసరమున.

అ. అవధరింపుము=చిత్తగింపుము, శౌనక ఆదిఅఖిల సన్మునీంద్రులకున్ = శౌనకుఁడు మొదలయిన సమస్త మునిశ్రేష్ఠులకు, రౌమహర్షణి=రోమహర్షణు పుత్రుఁడయిన సూతుఁడు,...హిమ+ ఆహార్యసుతుఁడు=హిమవంతుని కొమారుఁడయిన కోలాహలుఁడు, ఆత్మ...యుఁడై—ఆత్మకన్యా= తనకూఁతురయిన గిరికయొక్క, ఉపలాలన = బుజ్జగించుటయందు, ఆయత్త=అధీనమయిన, హృదయుఁడై = మనస్సుగలవాఁడై - తనకూఁతును బుజ్జగించుట మిక్కిలి యాసక్తి గలిగియనుట. మీఁది కన్వయము.

సీ. తొలుదొల్తఁ బారిజాతలతాంతమాలికా, పవనంబు ఘుమ్మనఁ బరిమళించె
నావెన్క నాకాండికాభ్రగర్జార్భటి, ఋభుదుందుభుల్ గుభుల్గుభులుమనియె
నాపిమ్మట వియచ్చరీపాణివల్లకీ, గుంభస్వరంబులు ఘుమ్ము రనియె
నాపిదప నఖండమై దండిమై నొక్క, దివ్యతేజము ధగద్ధగ వెలింగెఁ

తే. జదల నొకకొంత సేపునకిని విమాన, పంక్తి యనియును వీరు దిక్పాలురనియు
మునులనియు లేఖభామినులనియు నవనిఁ, గలజనులకద్భుతంబుగాఁ గానవయ్యె.

అ. తొలుదొల్తన్ = ముందుముందుగా, పారి...పవనంబు = పారిజాత పూదండలగాలి, ఆకాండిక...ర్భటిన్ — ఆకాండిక = ఆకస్మికమయిన, అభ్ర = మేఘములయొక్క, గర్జా ఆర్భటిన్ = ఉఱుముల యార్భటమువంటి యార్భటముచేత, ఋభుదుందుభులు = దేవతలదుందుభులు, వియచ్చరీ... స్వరంబులు — వియచ్చరీ = దేవతా స్త్రీలయొక్క, పాణి = చేతులందలి, వల్లకీ = వీణలవలన, గుంభ = కల్పితములయిన, స్వరంబులు = షడ్జపంచమాది ధ్వనులు, అఖండమై = అవిచ్ఛిన్నమై - మిక్కిలి నిండుకొన్నదై యనుట, దండిమైన్ = బలమగునట్లుగా, ఒక, దివ్యతేజము = దివ్యమయిన కాంతి, చదలన్ = ఆకాశమందు, లేఖభామినులనియు = వీరు దేవతా స్త్రీలనియును, అవనికిన్ = భూమియందు, అద్భుతంబుగాన్ = ఆశ్చర్యమగు నట్లుగా.

మొదట పారిజాతపుపువ్వులవాసన, పిదప దేవదుంధుభులధ్వని, పిమ్మట అప్సరల వీణారవము. అవ్వల 'మేలివెలుతురు. పిదప విమానములును దిక్పాలురను దేవతా స్త్రీలును అని ఇంద్రాగమనసూచకమైన బలంగము తెలియునది.

క. హరిముఖ హరిదీశానులు, హరిహయ సామజవిమాన హరిహరిణాక్షీ
హరిముఖ ముఖులును దోఁపఁగ, హరిహరి యంబరము చిత్రమై విలసిల్లెన్. 4

అ. హరిముఖ = ఇంద్రుఁడు మొదలయిన, హరిత్ + ఈశానులు = దిక్పాలురును, హరిహయ... ముఖులును — హరిహయసామజ = ఇంద్రుని యేనుఁగయిన యైరావతమును, విమాన = విమానమును, హరి = గుఱ్ఱమును — ఉచ్చైశ్శ్రవమును, హరిణాక్షీ = అప్సరః స్త్రీలును, హరిముఖ = అశ్వముఖులయిన గంధర్వులును, ముఖులు = మొదలయినవారును, హరిహరి ఇది యాశ్చర్యపూర్వకమయిన హరిస్మరణ, అంబరము = ఆకాశము, చిత్రమై = చిత్తరువు వ్రాయఁబడిన దానివలె, విలసిల్లెను = హరిశబ్దమునకు 'హరిర్వాతార్క చంద్రేంద్రయమోపేంద్రమరీచిషు, సింహాశ్వకపిభేకాహి శుకలోకాంతరేషుచ' అని విశ్వము.

మ. ప్రబలాకారముతో గిరీశశిరముం బ్రాపింపఁ బెన్ట్రాఁగ నాఁ
గ బెడంగయ్యె జనాపవాద మిది యుక్తం బౌనె నా కంచుఁ దా
నబలాకారముఁ బూనిచయ్యన గిరీశావాప్తికిన్ వచ్చె న
వ్విబుధేంద్రాపగ పద్మపాదపదవీ విన్యస్త భృంగాక్షియై. 5

అ. అవ్విబుధేంద్రాపగ = ఆదేవనది - ఆకాశగంగ, ప్రబలాకారముతోన్ = ప్రబలమయిన రూపముతోడ, గిరీశశిరముం బ్రాపింపన్ = కైలాసపతియైన శివునియొక్క తలపైనెక్కినందున, పెన్ట్రాఁగనాఁగన్ = పెద్దగయ్యాళి యనునట్లుగా, జనవాదము = నింద, బెడంగయ్యెన్ = అతిశయించెను, ఇది = ఈజననింద, యుక్తంబౌనాకున్ అంచున్ = నాకుఁ దగునాయని, తాను, అబలాకారమున్ -

పూని=ప్రబలముకాని యల్పాకారమును వహించి, చయ్యనన్, గిరీశావాప్తికిన్=గిరీశునిఁ జెందుటకు, వచ్చెనని యర్థము - అబలాకారము = స్త్రీరూపమును దాల్చి, పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలునిఁ జేరవచ్చెనని భావము. ఎట్లు వచ్చెననఁగా, పద్మపాద...గాక్షియై—పద్మములవంటి పాదముల యందు ఉంపఁబడిన తుమ్మెదలవంటి నేత్రములు గలదై యని స్త్రీపరమయిన యర్థము. పాదముల వంటి పద్మములం దుంపఁబడిన కన్నులవంటి తుమ్మెదలు గలదైయని యాకాశగంగాపరమైన యర్థము.

ప్రబలాకారమున గిరీశశిరమును ప్రాపించుటచే తాఁగయనినింద. దాని నుడుపుటకై అబలాకారములతో గిరిశప్రాప్తికి వచ్చినదనుట. బెడంగు శబ్దమిచట నతిశయపరముగా గ్రహించునది. గంగయు కోలాహలునికడకు వచ్చెనని తాత్పర్యము. అలం. ఉత్ప్రేక్ష.

సీ. తవిలి యర్ధపులాయితమున జోడనఁజూపు, నోజ జేజేరాచతేజి డిగియెఁ
దులకించు మొనవ్రేలఁ దలవంచుకొన్న వ, న్నియమీఱ వేల్పుకన్నియలుడిగిరి
కరఘాతపతదబ్దఘటఁ గొమ్ముకొనఁజిమ్ము, తమి దోనెడొగ్గి చౌదంతిడిగియె
రేచకాభ్యాససంసూచకాత్మీయచా, తురిఁ జేసి బాసవాల్దొరలు డిగిరి
తే. గిరిగరుచ్ఛేదిముఖవియచ్చరుల యుచిత, గమనకథనకటాక్షరేఖా గుణముల
వెంబడిన దివ్యరథకదంబంబు డిగియె, వసుధ నుద్గ్రీవులై యెల్లవారుఁ జూడ. 6

అ. తవిలి=అంటి, అర్ధపులాయితమునన్ = మండలగతి విశేషమందు, జోడనన్ చూపు నోజన్=ధౌరితకగతి కనఁబఱచునట్లుగా - అనఁగా కావాదిరిగినట్లుగా, జేజేరాచతేజి = ఇంద్రుని గుఱ్ఱము - ఉచ్చైశ్శ్రవము. క్రిందికి దిగెను. అల. ఉత్ప్రేక్ష.

తులకించు మొనవ్రేలన్ = తలతలమనుచున్న కాలిబొటన వ్రేలియందు, తలవంచుకొన్న వన్నియ=తలవంచికొని యున్నడంబు, మీఱన్=అతిశయింపఁగా-తలవంచుకొన్న తీరు నిద్దమయిన కాలి బొటనవ్రేలియందుఁ బ్రతిబింబించుచుండఁగా వేల్పుకన్నియలు అప్సరసలు దిగిరి. మొనవ్రేలికై తలవంచుకొనుట స్త్రీలకు స్వాభావికమైన చేష్టావిశేషము.

కర...ఘటన్—కర=తొండముచేత, ఘాత=చిమ్మంబడి, పతత్=పడుచున్న, అబ్దఘట=మబ్బులగుంపును, కొమ్ముకొనన్=దంతపుమొనచే, చిమ్ముతమిన్ = క్రుమ్మిచిమ్మివైచు తమకముచేత, చౌదంతి=చతుర్దంత దంతావళము, దోనెడొగ్గి=క్రిందికి మోఁకరించుకొని, దిగెను. ఏనుఁగులకు కాలఁ దాఁచి పడినదానిని మోఁకరించుకొని కొమ్ములఁ గ్రుమ్ముట స్వాభావికము - పడుచున్న మేఘమును జిమ్ముటంబట్టియు చిమ్ముటకయిన 'తమిం' బట్టియు, అవతరణలాఘవమును త్వరాతిశయమును వ్యంజితములు. అల. ఉత్ప్రేక్ష.

రేచకా...జేసి—రేచక+అభ్యాస = ప్రాణవాయువును అధోముఖము సేయుటయందలి అలవాటును, సూచక=తెలుపు, ఆత్మీయచాతురిఁజేసి=తమ చాతుర్యమువలన, బాసవాల్దొరలు=వాక్కులే కత్తులుగాఁగల - అనఁగా మాటలచేతనే కత్తిచేయు పనిచేయు, మునులు దిగిరి = మునులు మిక్కిలి నేరుపుతో దిగిరి. ఆనేరుపువారికి రేచకాభ్యాసమును సూచించెననుట. రేచకము నభ్యసించుచుఁ జతురముగా దిగిరనుట.

గిరి...వెంబడిన—గిరిగరుత్ ఛేది=కొండల ఱెక్కలు త్రుంచుదేవేంద్రుఁడు, ముఖ=మొదలయిన, వియచ్చరులు=దేవతలయొక్క, ఉచితగమన=తగినపోకను, కథన=చెప్పునట్టి - తెలుపునట్టి యనుట, కటాక్షరేఖా = క్రేగంటిచూపుల బంతులనెడు, గుణముల=త్రాళ్లయొక్క, వెంబడిన=

వెంటనే, దివ్యరథ కదంబంబు=దివ్యవిమానముల సమూహము, దిగెను. వసుధ=భూమియందు, ఎల్ల వారును, ఉద్గ్రీవులై = మెడయెత్తినవారయి, చూడన్ =చూచుచుండఁగా—పయిని చెప్పఁబడిన వన్నియు దిగెనని సంబంధము.

దివ్యరథములు, దేవతలు పలాయనపడగా పోవలయునని నిగిడిన కడగంటిచూపులచే సైగచేయఁగా ఆచూపులచాలు వెంటనే-అనఁగా ఆచూపులు నిగిడినవంకనే, వానితోఁబాటిగనే గమ్యస్థానమును జేరుననుట. చూపులు నిగిడినవంకకు నవి చేరునంత వడిగానే రథములును జేరుననుట.ఎట్లు ?అవి 'దివ్య' ములుగాన-లేక వానికిఁబూన్చిన యశ్వములు దివ్యములగుటం జేసియేని-మఱియునెట్లు 'గుణములన్' త్రాడుకట్టి యొకదాని నీడువఁగానవి యిటునటు తప్పిదాఱిపనక యీడ్చినదారినే చక్కనూటిగా వచ్చునట్లు, చూపులు నిగిడ్చినదారినే చక్కనూటిగా చనుననుట, ఆనూటిగా త్రాళ్లుగట్టి యీడ్చినంత ఋజువుగాను దప్పఁదొలంగుట లేకయు నుండెనని యాశయము.

ఇట నయ్యయ్యది స్వస్వభావాభ్యాసానుగుణముగాదిగిన వ్యాపారములను తత్తదుచిత చేష్టారూపములుగా వర్ణించుట తెలియునది.

మ. సకలామర్త్య భటాళికిన్ భటుల నాశాదంతికిన్ దంతి దే
జికిఁ దేజిన్ మణిబింబదంభమునఁ దాఁల్చెంగాక పైవచ్చు వ
జ్రికి గట్టేమియు నల్కఁడయ్యె వసుధాత్రీభృన్నఖాగ్రంబు వేఁ
తకు బిట్టోర్చినగట్టు దా వెఱచునే దంభోళిభృత్కేళికిన్. 7

అ. గట్టు = కోలాహలుఁడు, సకలఅమర్త్యభటఆళికిన్ = సకలమైన దేవతలబంట్ల సమూహమునకు, భటులన్ = బంట్లను - ఇంద్రునిబంట్లకు మాఱుగా బంట్లననుట, ఆశాదంతికిన్ దంతి= ఆ తెల్లయేనుఁగునకు ప్రతిగా నట్టి యేనుఁగును, తేజికిన్ తేజిన్ =ఆయుచ్చైశ్శ్రవమను గుఱ్ఱమునకుప్రతిగా నటువంటి గుఱ్ఱమును, మణిబింబదంభమునన్ =తనయందలి మణులయందు బ్రతిఫలించిన వాని ప్రతిబింబములనెడు మిషచేత, తాల్చెంగాక = ధరించెనేకాని—అనఁగా కోలాహలుఁ డింద్రునికిఁ బ్రతిగా వెనుదీయక భటాదిసన్నాహమును ప్రతిఘటించియే తీఱినాఁడు కాని, పైవచ్చు వజ్రికిన్ = తనపయి దండెత్తివచ్చుచున్న యింద్రునకని యర్థము - (తనపయిభాగమున వచ్చుచున్న యింద్రునకని భావము.) 'వజ్రికి' ననుట యిట సాభిప్రాయము. వజ్రాయుధమేకదా పర్వపక్షచ్ఛేదదక్షము. అట్టిది పూనివచ్చుచున్ననుగాని, ఏమియున్ అల్కఁడయ్యె=ఎంతమాత్రము జడిసినవాఁడుకాఁడు. ఇంద్రునికి జడిసినవాఁడేని పలాయితుఁడగునే కాని నిలిచి యతనికి మాఱుగా భటాదులను సమకట్టునాయనుట. ఇట్టి ధైర్యమునకు హేతువేమనఁగా, వసు...వేఁతకున్ = వసురాజు కాలిగోటి మొనవలని దెబ్బకు, బిట్టు=మిక్కిలియు, ఓర్చినగట్టు = సహించిన కోలాహలుఁడు, దంభోళిభృత్ కేళికిన్ =వజ్రాయుధమును ధరించిన యింద్రుని యాటలకు, వెఱచునే= వెఱవఁడనుట.

వసురాజు కాలిగోటి కడిఁది దెబ్బకు నోర్చినవాఁడు, ఇంద్రుఁడువజ్రము పయిఁబడి వైచినను సరకుసేయఁడనఁగా నిఁక నతఁడు వేడుకకు దానిని తెచ్చునపుడు వెఱచునా యని యాశయము. వసురాజు గోటిమొన వజ్రమునకంటె కఠినమనుట వ్యంజితము. వజ్రపుపోటుకే వెఱవఁడు, ఇఁక దాని యాటకు వెఱచునా యనుట. తానునగముల యింద్రుఁడుగాన యాదేవతల యింద్రునికి సాటిగా నెదురు చన్నాఁడనుట. అలం. అపహ్నవము.

చ. అమరసమాగమావిలమృగౌఘవిలంఘనదీర్ణధాతుచూ
ర్ణము బహువర్ణరత్నశిఖరద్యుతితో నవు డభ్రమార్గముం
గమిచె నగేంద్రుఁ డింద్రశుభకార్యసమాగతి కిచ్చ మెచ్చి త
త్సముచితచాపచంచదుపదాధరుఁ డై యెదురేఁగు కై వడిన్. 8

టీ. నగేంద్రుఁడు = ఈపదమందలి యింద్రశబ్ద మింద్రునితో సమానకక్షను దెలుపుచున్నది. పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలుఁడు, ఇంద్రశుభకార్యసమాగతికిన్ = ఇంద్రునియొక్క శుభకార్యమునుగూర్చి వచ్చుటకు, ఇచ్చన్ మెచ్చి, తత్...ధరుఁడై = ఆయింద్రునికిఁ దగిన మణిచాపమనెడు ప్రకాశించుచున్న కానుకను ధరించినవాఁడై, ఎదురేఁగు కై వడిన్ = ఎదురుగాఁ బోయినాఁడో యన్నట్లుగా, అమ...ర్ణము—అమర = దేవతలయొక్క, సమాగమ = రాకనుగుఱించి, ఆవిల=కలఁగిన, మృగఓఘ=మృగసమూహముయొక్క, విలంఘన=దాఁటులచేత, దీర్ణ=పగుల్పఁబడిన—అనఁగా నలిఁగిన, ధాతు = గైరికాదిధాతువులయొక్క, చూర్ణము=దుమ్ము, బహువర్ణరత్నశిఖరద్యుతితోన్ = పెక్కువర్ణముల రత్నములుగల శిఖరములయొక్క కాంతితో - శిఖరములందలి పెక్కురంగుల రత్నముల పలువన్నెల కాంతులతోడననుట, అపుడు, అభ్రమార్గమున్ = ఆకాశమార్గమును - లేక అభ్రమనఁగా ('అభ్రంమేఘః' అ) మేఘమును గనుక మేఘమార్గమ్మయిన యాకాశమును, కమిచెన్ = ఆక్రమించెను. (అభ్రంనభస్స్వర్గ వలాహకేషు' విశ్వము.)

గైరికాది ధాతుచూర్ణపటలము కోలాహలుఁడు. బహువర్ణరత్నశిఖరద్యుతి మణిచాపము. ఆపటలము ఆద్యుతితోడ పయికిఁబోవుట కోలాహలుఁడు మణిచాపమును గానుకగొని యెదురుపోవుటగా నుత్ప్రేక్షించినాఁడు.

ధాతుచూర్ణము ఆకాశమునకు దట్టముగా నెగయించుటకు మృగముల 'ఓఘములు' కావలయును. అవియు నూరకపరుగెత్తినఁగాదు 'విలంఘన' ములుచేసిన నలిఁగి అంతధూళిరేఁగును. ఆ చూర్ణమును జూడఁగా కోలాహలుఁడని తోఁచుట అంతటిబాహుళ్యమును ఔన్నత్యమునుబట్టి. ఆధూళితోఁగూడ శిఖరముపయి రత్నములకాంతులును పయికి నెగయుటకు ఆరత్నముల ప్రభాతిశయమును, ఆశిఖరముల ఔన్నత్యమును వ్యంజితములు. పలురంగుల రత్నములుచెప్పుట పలురంగుల మణిచాపము సిద్ధించుటకు. చాపము మణిమయమైనదిగాఁ గొనుట యింద్రునికి సముచితమయిన యుపదకై. ఇంద్రుఁడు మణిచాప (ఇంద్రధనుర్) ధరుఁడుగదా.

సీ. సరసపర్జన్యసంజ్ఞాధురంధరుఁడు రా, నాతెఁ గాంతారఘోరానలార్చి
శతకోటిదీప్తి దీపితకరుం డరుదేరఁ, దరలె గుహాంతరధ్వాంతరాజి
సకలజగన్నియామకుఁడు చెంగట నిల్వ, వదలె జంతుజజాతిరవైరవిస్ఫూర్తి
సతతసర్వర్తు సేవితుఁడు చెంతకుఁ జేరఁ, జనియెఁ గేకిపికాదిసమయముద్ర
తే. యమరపతి జంగమస్థావరాభివాద, నీయచరణాంబుజుండు సన్నిధియొనర్ప
ధరణిధరరాజమునఁ గల్గుతరులతాప్రరంపరలు మించె బహుఫలప్రసవవృష్టి. 9

అ. సరస...ధరుఁడు—(పర్జన్యుఁడనఁగా 'పర్జన్యో మేఘశబ్దేఽపిధ్వనదంబుదశక్రయోః' వి. అన్నట్లు ఇంద్రుఁడును మేఘుఁడునుగాన) రసికుఁడైన పర్జన్యనామము ధరించిన యింద్రుఁడని యర్థము, [రసము (జలము) తోఁగూడిన మేఘుఁడని యర్థాంతరము], రాన్=రాఁగానే, కాంతార...ర్చి = వనమందలి వెట్టిదమయిన యగ్నిమంట-కారుచిచ్చుమంట, ఆఱెను.

శతకోటి = (శతకోటిస్స్వరుశ్శంబో దంభోళిరశనిర్ద్వయోః' అ) వజ్రాయుధముయొక్క, దీప్తి=కాంతిచేత, దీపిత = ప్రకాశితమగు, కరుఁడు=హస్తముగలవాఁడు—ఇంద్రుడు, అరుదేరన్= రాఁగా నేయని యర్థము, శతకోటి = నూఱుకోట్లు-లెక్కలేనివి అనుట, దీప్తి = కాంతులచేత, దీపిత=ప్రకాశమానములయినవియు అగు, కరుఁడు=కిరణములుగల సూర్యుఁడు రాఁగా నేయని యర్థాంతరము, గుహాంతరధ్వాంతరాజి = గుహలయందలి చీఁకట్లగుంపు, తరలెన్ = వెడలిపోయెను.

సకలజగన్నియామకుఁడు=మూఁడులోకములకును నియంతయైన యింద్రుఁడనియర్థము - సమస్త లోకములకు నియంతయైన యీశ్వరుఁడని యర్థాంతరము, జంతుజ జాతి వైరవిహృతి = జంతువుల వలనఁ బుట్టెడు—అనఁగా మృగపక్షిప్రభృతులకుఁ గలిగియుండు, జాతి = జన్మసిద్ధమయిన, వైర= పగయొక్క, విహృతి = సాఁగుబడి, వదలెను. సర్వేశ్వరుని నియమములేక ప్రాణులకు పరస్పరము స్నేహవైరములు గలుగవు. అట్టి యతనిసన్నిధిని జాతివైరములు గలుగవయ్యె ననుట.

సతతసర్వఋతుసేవితుఁడు = ఎప్పుడును సమస్తమయిన ఋత్వధిదేవతలచేత కొలువఁబడు నింద్రుఁడని యర్థము, చెంతకున్ చేరన్, కేకిపికాదిసమయముద్ర = నెమిళ్లు కోయిలలు మొదలయిన వాని వాఙ్నియమముయొక్క యేర్పాటు, చనియెన్ = పోయెను. అనఁగా నెమిళ్లు వర్షర్తువందును కోకిలములు వసంతర్తువందును గూయిడుననను నియమమువదలి యవియు ధ్వనులుచేసెనని తాత్పర్యము.

జంగమ—జాండు=చరాచరభూతములచేత నమస్కరింపఁదగిన యడుగుఁదామరలుగల, అమర పతి= ఇంద్రుఁడు, సన్నిధియొనర్పన్, ధరణిధరరాజమునన్ = ఆపర్వతశ్రేష్ఠమందు, కల, తరులతా పరంపరలు, బహుఫలప్రసవవృష్టి=మిక్కుటమయిన పండ్లయు పువ్వులయు కురియుటచేత, మించెను.

ఇట 'సరస...ధురంధరుఁడు, మొదలయిన యింద్రునివిశేషణములందు ఘోరానల మార్పుట మొదలగు కార్యముల కుపయుక్తములయిన మేఘాదిపరములగు నర్థాంతరములు నిబంధించియుండుట తెలియునది. అల. కావ్యలింగము శ్లేషానుప్రాణితము.

మ. పతయాళు ప్రబలప్రపాతఝరముల్ పాద్యంబుగాఁ దిర్యగా
యతమందారతరుప్రసూనఘటనం బర్చావిధానంబుగా
నతదివ్యోపలకూటదర్శనము నానారత్నపూజాసమా
గతిగా నింద్రున కన్నగేంద్రుఁడు నతుల్ గావించె నత్యున్నతిన్. 10

అ. అన్నగేంద్రుఁడు = ఆపర్వతశ్రేష్ఠుఁడు - కోలాహలుఁడు, పతయాళుప్రబలప్రపాతఝర ముల్ - పతయాళు = పడుచున్న, ప్రబల = బలిష్ఠములయిన, ప్రపాత('ప్రపాతస్తుతటో భృగుః'అ)= తటములందలి, ఝరముల్ = ప్రవాహములు, పాద్యంబుగాన్ = పాదములం దర్పించునట్టి జలములు గాఁగాను, తిర్యక్ = అడ్డముగా, ఆయత = విస్తరించియున్న, మందారతరు = మందారములను దేవవృక్షములయొక్క, ప్రసూన = పువ్వులయొక్క, ఘటనంబు = ఒడఁగూర్చుట - ఆకొండయం దడ్డముగా నిగిడియున్న మందారవృక్షముల చాలు పువ్వులుదాల్చుటయనుట, అర్చావిధానంబుగాన్= పూజసేయుటగాను-పువ్వులర్పించుట పూజావిధానము. నత=వసురాజు పాదహతిచేవంగిన, దివ్యఉపల కూట=దివ్యములయిన ('ఉపలః ప్రస్తరేమణౌ' విశ్వము) మణులుగల శిఖరములయొక్క, దర్శనము= చూపిక, నానారత్నపూజాసమాగతిగాన్ = పలువిధముల రత్నము లర్పించురూపమయిన పూజా విధిగాఁగాను, ఇంద్రునకున్, అత్యున్నతిన్ = మిక్కిలి ఔన్నత్యముచేతనని యర్థము - మిక్కిలి వైభవముచేతనని భావము. నతుల్ గావించెన్ = ప్రణామములు చేసెను.

ప్రపాతఝురములు పతయాళువులుగావున నే పాద్యములయ్యెను. మందారతరువులు తిర్యగాయతము లనుట కడుపున కడ్డముగాఁ బట్టిన పూలపుట్టికం బోలుటకు. అట్లున్నయవి పువ్వుల రాల్చుట, పూజకుఁడు కడుపున కడ్డముగాఁబట్టిన పూలపుట్టికనుండి పువ్వులురాల్చినట్లు. కూటములు నతములగుట దానియందలి నానామణులచే నానారత్నపూజ గావించినట్లుండుటకు. ప్రబలప్రపాతఝురములు ఆయతమందారతరువులు, దివ్యోపలకూటములు ఇవి యన్నియు కోలాహలుని 'అత్యున్నతి' తెలుపునవి. ఇంతటియున్నతి వెలయించుచు నే ప్రణతుఁడయినాఁడని వైభవముయొక్కయు ఆచారములయొక్కయు ధౌరంధర్యము. మిక్కిలియున్నతుఁడయి ప్రణతుఁడెట్లని విరోధము; మిక్కిలి విభవాతిశయముతోఁ గూడిన వాఁడనుటచే తత్పరిహారము.

తే. వెండియునగేంద్రతనయుండు వేఁడివేల్పు,మున్నుగా వేఁడివేల్పుల మునులకెరఁగి
గంగనలరించి క్రమమెసఁగంగఁ గ్రతుభు,గంగనల నందఱమృదూక్తి నాదరించి.

అ. ...నగేంద్రతనయుండు=హిమవంతుని కొడుకు-కోలాహలుఁడు, క్రమము ఎసఁగంగన్ = వరుసపడి యొప్పునట్లుగా, వేఁడివేల్పు మున్నుగాన్=అగ్నిదేవుఁడు మొదలుగా, వేల్పులన్ = దేవతలను, వేఁడి, మునులకున్, ఎఱఁగి=మ్రొక్కి, గంగను, అలరించి=సంతోషింపఁజేసి, క్రతుభుగంగనలన్=దేవతాస్త్రీలను, మృదూక్తిన్=మెత్తనిమాటలచేత, ఆదరించి,మీఁదికన్వయము.

ఉ. నాకులదైవతంబు లలనాకులభూషణ మీలతాంగి మే
నాకులభూధరేంద్రుల యనాకులనిర్మలభాగ్యరాశి మై
నాకులముద్దుకూఁతురు పినాకులకోడ లటంచుఁ దెల్పి నా
నాకులపాలికల్ వొగడ నాకుల మ్రొక్కఁగఁ బంపె బాలికన్. 12

అ. ఈ లతాంగి, నాకులదైవతంబు = నాకులమునకు దేవతయైనది, లలనాకులభూషణము= స్త్రీసమూహమున కలంకారమైనది, మేనాకుల భూధరేంద్రుల= మేనకాదేవియొక్కయు కులపర్వతశ్రేష్ఠుఁడయిన హిమవంతునియొక్కయు,అనాకుల నిర్మలభాగ్యరాశి=కలఁత నొందనిదియు కల్మషము లేనిదియునగు భాగ్యములప్రోవు - వారిభాగ్యములకు ఫలమయినదనుట, మైనాకుల ముద్దుకూఁతురు= మాయన్నగారైన మైనాకపర్వతులయొక్క గారాబుకూఁతురు, పినాకులకోడలు=పినాకమనెడు విలుగల శివునకు మేనకోడలు, 'మైనాకుల' 'పినాకుల' అనుచోఁ బూజ్యార్థమున బహువచనము. 'స్యాత్పూజ్యత్వ వివక్షాయాం మహతాఁబహుతామతా' అధర్వణకారిక. నానాకులపాలికల్ = సకల కుల స్త్రీలును ('కులస్త్రీకులపాలికా' అ, కన్నియన్=కూఁతును - గిరికను, నాకులన్= దేవతలను, మ్రొక్కంగన్ పంపెను. మ్రొక్కు-ధాతువు 'నాకులన్' అనికర్మముతో నన్వయించుటచే నిట సకర్మకముగానున్నది. కోలాహలుఁడును పార్వతియును దోఁబుట్టువులు గనుక కోలాహలుని కూఁతురు పార్వతికిని తన్మూలమున శివునికిని మేనకోడలని తెలియునది.

క. గురుననుమతి గురుకుచభృతి, సరి నవనతిఁ గాంచి నిలుచు శైలజ గనఁగా
సురలయనిమేషభావము, హరి బహులోచనతయుం గృతార్థతఁ జెందెన్. 13

అ. గురు ననుమతిన్=తండ్రియగు కోలాహలుని యాజ్ఞచేత, గురుకుచభృతిన్=గొప్పలయిన చన్నులబరువుచేత, సరిన్=సరిగా, అవనతిన్=నమ్రత్వమును - వంగియుండుటను, కాంచి, నిలుచు, శైలజన్=గిరికను, కనఁగాన్=చూడఁగా చూడఁగా, సురలయనిమేషభావము = దేవతల ఱెప్పపాటులేమియును, హరిబహులోచనతయున్ = ఇంద్రుని పెక్కుకన్నులకలిమియును, కృతార్థతన్ చెందెను.

గిరిక చక్కఁదనమును దేవతలు ఱెప్పవాల్పక చూచిరనియును నింద్రుఁడు వేయిగన్నుల జూచెననియు భావము. గిరిక సౌందర్యము నిరతిశయము నత్యద్భుతము నయినదిగనుక నెడనెడ ఱెప్పవ్రాల్చిచూచు చూపుచాలదు - ఎడతెగక ఱెప్పవాల్పకయె చూచి తెలియవలయును. అందును రెండుగన్నులు చాలదు. వేయిగన్నులచేత నట్లుచూచిననే సరియగుననియు భావము. అందుల కుపయుక్తమయిన ఱెప్పపాటులేమి గలిగియుండుట దేవతల కపుడే సార్థకత్వమొందినదనియు, నింద్రుని వేగన్నుల కనురూపమయిన సౌందర్య దర్శనము గలుగుటచే నపుడేయవియు సార్థకములయ్యెననియును భావము.

సీ. తలయెత్తదయ్యెఁ గేవలజడస్థితి రంభ, జళుకుఁజూపులఁ జూడసాగె హరిణి
కుందుకుందునఁ జెందిక కొదఁ దెల్పె శశిరేఖ, పలపలనై వెల్లవాఱెఁ దార
యుచితకార్య వివేక ముడిగె మదాలస, మానె నుద్ధతభాష మంజుఘోష
మఱవక పూనె మైమఱువు వరూథిని, చెయ్వు లన్నియుఁ దక్కెఁ జిత్రరేఖ
ఱాపడియె సానుమతి సాంద్రతాపమునఁగ,రంగె హేమాభిధాన నిర్జరలతాంగు
లిట్లు దనుఁజూచి సిగ్గుపాటెనయ వినయ, వినతయైయున్న నగరాజతనయఁ జేరి.

అ. రంభ = రంభయను నప్సరసయని యర్థము - (అరఁటిచెట్టని యర్థాంతరము.) కేవలజడస్థితిన్ = కేవల మందభావముచేత, తలయెత్తదయ్యెను. వంచినతల యెత్తదయ్యెనని యర్థము - అరఁటిచెట్టు కేవలజడ (అనఁగా జల) స్థితిచేత అగ్రభాగము వంచుకొని యుండెననియును. లడలకభేదము. హరిణి = హరిణియనునది - (లేడియును) జళుకుచూపులన్ చూడసాగెను= ఎదిరించిచూడఁజాలని-అనఁగా. పిఱుదీయు- చూపులనుజూచెననుట-(లేడిసహజములయిన బెళుకుఁజూపులఁజూచెననియును). శశిరేఖ=శశిరేఖయను నప్సరస - చంద్రరేఖయు, కుందుకుందునన్ చెందికొదన్ తెల్పెను= కృశించు దుఃఖమునుబొంది లోపమును జూపెనని యర్థము - చంద్రరేఖ ముక్కలియు క్షీణత్వమును జెంది తక్కువగుటను దెలిపెననియును. తార=(తారయనఁగా అచ్చర-నక్షత్రమును)తారయనునచ్చర, పలపలనై, వెల్లవాఱెను=డిల్లపడి వెలవెలపోయెను. నక్షత్రము పలుచఁబాటి కాంతిహీన మయ్యెననియును.'

మదాలస=ఒకయప్సరయు - మద్యపానపు మత్తుచేత ప్రాలుమాలిక గలదియు - ఉచితకార్య వివేకము ఉడిగెను = (మదాలసయను నప్సరస - తనచక్కఁదనమం దోడుటచేత చిత్తభ్రమముచేత) అర్హాకృత్యములందలి వివేకమును విడిచిపెట్టెనని యర్థము. మద్యపాన మదముచే ప్రాలుమాలిక గలది, వివేకముచెడి అకార్యములాచరించెననియు, మంజుఘోష = ఒకయప్సరసయు - ఇంపయిన కంఠస్వరముగలదియు, ఉద్ధతభాషమానెను = దిట్టమయిన మాటలు నుడిగెను - అనఁగా మాటలు హీనస్వరమయ్యెననుట - ఇంపయిన కంఠస్వరముగలది పరుషములయిన భాషణములు మానెననియును.

వరూథిని=ఒకయప్సరసయు - సేనయును. మఱవక మైమఱువు పూనెను=(మఱువుఅనఁగా పయిముసుకును కవచమును) వరూథినియను నప్సరస పయిముసుకు నేమఱక తాల్చె ననియర్థము. సేన కవచము నేమఱక తాల్చెననియు, చిత్రరేఖ=ఒకయప్సరసయు, చిత్తరువును. చిత్రరేఖయను నప్సరసచేష్టలు మానెనని యర్థము - చిత్తరువు నిశ్చలత్వమును వహించెననియును.

సానుమతి - ఒకయచ్చరయు, సానువులు (అనఁగా కొండచఱులు) గలదియు. ఱాపడియెను= సానుమతియను నచ్చర రాయిడిపడెనని యర్థము - సానువులుగలది రాయి - పాషాణము - అయ్యె

ననియును, హేమాభిధాన=హేమయను పేరుగల యప్సరసయు బంగారును, సాంద్రతాపమునన్ కరంగెను=హేమయనునచ్చర గాఢతాపముచేత నీరయిపోయెను - బంగారు గాఢాగ్ని సంతాపముచేతఁ గరఁగెననియును, నిర్జరలతాంగులు=దేవతా స్త్రీలు, ఇట్లు, తన్నున్=తన్ను - గిరికను, చూచి, సిగ్గుపాటు, ఎనయన్=పొందుచుండఁగా, వినయవినతయై=అడఁకువచేతఁ దలవంచుకొన్నదై, ఉన్న, నగరాజ తనయను=గిరికాదేవిని, చేరి, మీఁదికన్వయము.

గిరిక నిరుపమాన సౌందర్యాతిశయమునకు రంభాద్యప్సరసలు సిగ్గుపాటునుబొంది తలయెత్తమి మొదలయిన వ్యాపారములను, అరఁటి మొదలగు వాని స్వాభావికచేష్టలగు అగ్రభాగము వంచుకొనుట మొదలయినవిగా శ్లేషముచేత సమర్థించుట తెలియునది.

ఉ. మన్నన నీశమౌళిమణిమండన యై శుచివృత్తిఁ జల్లఁగా
మన్ననదీలలామ గరిమన్ ననఁబోఁడిని గౌఁగిలించి యో
యన్నువ పట్టి నిన్ గనిన యన్ను వసుంధర సింధుజాతిలో
వన్నియ కెక్కె నీవు గలువన్ నియతోన్నతిఁ గాంచెఁ దండ్రియున్. 15

అ. మన్ననన్=ఆదరముచేత - గౌరవముచేత, ఈశమౌళిమణిమండనయై = (ఈశుఁడనఁగా పెనిమిటియును శివుఁడును) పెనిమిటికి ఔదల మణిభూషణమువలె శిరసావహింపం దగినదైయని యర్థము - శివుని శిరసునకు ముత్తెపుదండవలె నున్నదని భావము. శుచివృత్తిన్ = పరిశుద్ధమయిన నడవడిచేత, చల్లగా మన్న=హాయిగా బ్రతికిన - (పావనమయిన వృత్తిగలదై శైత్యప్రకృతియగు అని భావము.), నదీలలామ=నదులలో భూషణమయిన యాకాశగంగ, గరిమన్=గౌరవముచేత, ననఁబోఁడిని=గిరికను, కౌఁగిలించి, ఓ అన్నువపట్టి=ఓచిన్నబిడ్డా, నిన్, కనిన, అన్ను=కన్నట్టిపడఁతి, వసుంధరన్=భూమియందు, సింధుజాతిలోన్=నదీజాతిలో, వన్నియకెక్కెను = ప్రసిద్ధికెక్కెను. నీవు, కలువన్ = కలుగఁగా -['అనాద్యంబయి యద్విరుక్తంబయిన గకారంబునకు వకారంబగు' బా.వ్యా. దీనిచేత. 'పాయక ఔమ్మునం దవడుఁ బాముల (ఆదిపర్వము). 'వినుము నరేంద్ర విప్రుఁ డలివాన్' (శాంతిపర్వము). ఇత్యాదులు ప్రయుక్తములు తెలియునది] తండ్రియున్=నీతండ్రి కోలాహలుఁడును, నియత+ఉన్నతిన్ = ప్రమాణమయిన ఔన్నత్యమును, కాంచెనని యర్థము. (పర్వతము గనుక ఉన్నతమయినదని భావము.)

ఇట 'మన్నన...లలామ' యని అత్యంతము పాతివ్రత్య మహత్త్వముగలదిగాఁ జెప్పుట తత్ప్రియుక్తాశీర్వాద మక్షరశః స్సిద్ధించుటకని తెలియునది. ఇట తల్లిపక్షము తండ్రిపక్షమని యుభయపక్షముల యత్యుత్తమాభిజాత్యాదులు వర్ణితములు. ఇఁకనుత్తమ భర్తృప్రాప్తియే కొఱఁత ; ఇది యే మీఁదిపద్యమున గలుగునట్లు దీవన.

మ. చరణాగ్రానమితాచలేశ్వరునిఁగా సన్మార్గ సంచారిఁగా
స్థిరకల్యాణసమాఖ్యుఁగా హరికృపన్ శీఘ్రంబ చేపట్టి యో
గిరికన్యా యర లేక నీ వతఁడు నేకీభావముం జెందుమా
గిరికన్యామణి కన్న ధన్య వయి యక్షీణానుమోదంబునన్. 16

అ. ఓగిరికన్యా=గిరికాదేవీ, చరణాగ్ర...నిఁగాన్—చరణాగ్ర= పాదములయొక్క అగ్రభాగమందు - అడుగులముందట, ఆనమిత = నమ్రములుగాఁ జేయఁబడిన, అచలా+ఈశ్వరునిఁగాన్= (భూర్భూమిరచలా' అ) భూమీశ్వరులుగలవానిని గాను అనియర్థము. (కాలిమొనచేత తెన్నగా

వంపఁబడిన, అచల+ఈశ్వరునిఁగాన్ = పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలుఁడు గలవానినిగా ననియర్థాంతరము.) సన్మార్గసంచారిఁగాన్ = సజ్జనమార్గ ప్రవర్తకునిఁగానని యర్థము.(సత్ = అనఁగా నక్షత్రము సన్మార్గమనఁగా నక్షత్రమార్గమయిన యాకాశముగనుక ఇంద్రదత్తవిమానముచే ఆకాశమార్గమున సంచరించువానిని గానని యర్థాంతరము), స్థిరకల్యాణసమాఖ్యుఁగాన్ - స్థిర = శాశ్వతమయిన, కల్యాణ = శుభమును, సమాఖ్యన్ = కీర్తియును గలవానినిగానని యర్థము. (యశఃకీర్తిస్సమాఖ్యాచ)-(కల్యాణమనఁగా బంగారును - సమాఖ్యయనఁగా పేరునుగనుక. కల్యాణసమాఖ్యయైన వసువను పేరునుగలవానినిగానని యర్థాంతరము) హరికృపన్ = (శ్రీవిష్ణువు నను)గ్రహముచేత ననుట - ఇంద్రునికృపచేత ననియు, శ్రీఘ్రంబ, చేపట్టి = చెట్టఁబట్టి, అఱలేక = భేదములేక యనియర్థము - (అఱయనఁగా సగమునుగాన అర్ధశరీరత్వములేక యని యర్థాంతరము. 'గిరికన్యా' యను సంబోధనముచే పార్వతివలె ప్రకృతనాయికయు గిరికన్యయయ్యు ఆదేవివలె అఱలేనిదిగాన యామెకంటె ధన్యురాలని వ్యంజితము.) గిరికన్యామణికన్నన్ = హిమవంతుని కూఁతురయిన పార్వతికంటెను, ధన్యవయి, అక్షీణ+అనుమోదంబునన్ = సంపూర్ణమయిన సంతోషముచేత, నీవును, అతఁడును, ఏకీభావము = ఏకత్వము నని యర్థము - అన్యోన్యతనని యర్థాంతరము, చెందుమా.

పార్వతియు గిరికన్య, నీవును గిరికన్య. ఇంతమాత్రకు నిరువురు సాటియే. అయినను పార్వతియు శివుఁడును అఱగలిగి యేకీభావమును జెందినారు. నీవును నీపతియును అరలేక ఏకీభావమును బొందుదురుగాత. ఈవిషయమున నీవు పార్వతికన్న ధన్యురాల వగుదువని యాశయము. ఏకీభావము పార్వతీ పరమేశ్వరులకు దేహముచేతననియు నీకును నీపతికిని మనస్సుచేతననియు 'అఱలేక' యనుటచే వ్యంజితము. 'ఈశ...నదీలలామ' యన్న మహాపతివ్రతా తిలకము గనుక గంగ, సామాన్య ప్రతిపత్తితోఁ జెప్పిన 'చరణా(గానమితా చలేశ్వర'త్వాది లక్షణములు వసురాజునందు సన్వయించుట తెలియునది. పర్వతశ్రేష్ఠునిగూర్చి సామాన్యముగాఁ జెప్పినమాట వసురాజు పరముగా నను టయె గంగ సత్యవచస్కృతి నుద్ఘాటించుచున్నది. మహాపతివ్రత పలుకు తెలియకచెప్పినను బొల్లునా! అల. వ్యతిరేకము.

క. అని యనిమిషనది పలికిన, విని వినియతహృదయుఁడగుచు వినయమునఁ బునః
పునరవనతి సలిపి సురేం, ద్రుస కవనిధరేంద్రుఁ డిట్లనుఁ గృతాంజలియై. 17

అ. అని అనిమిషనది = గంగ, వినివినియతహృదయుఁడు = నియమముతోఁ గూడిన మనస్సుగలవాఁడు అగుచు, అవనిధరేంద్రుఁడు = కోలాహలుఁడు, సురేంద్రునకు, పునఃపునః అవనతిసలిపి = మరలమరల మ్రొక్కి.

మ. ఘనముల్ వాహనముల్ వదాన్యమణి యాకల్పంబు కల్పాగముల్
వనముల్ వేలుపు గిడ్డిదొడ్డిపసి దేవా నీకుఁ బౌదార్య్య ఖ
త్తునొ రత్నాంజలి యిత్తునో యలరుటెత్తుల్ దివ్యసద్వస్తు లి
త్తునొ యీ వేమిట మెత్తు వేమి దగ నిత్తున్ భక్తపుంజప్రియా. 18

అ. దేవా! భక్తపుంజప్రియా = భక్తసమూహమున కిష్టుఁడవయినవాఁడా, ఘనముల్ = (సమస్తములయిన జంతువులకు జలప్రదానముచేయు) మేఘములు, వాహనముల్ = నీయొక్కడు గుఱ్ఱములు, వదాన్యమణి = సకలవస్తువుల నిచ్చు చింతామణి, ఆకల్పంబు = నీసొమ్ము. కల్పఅగముల్ = (కోరిన కోర్కులు నొసంగు) కల్పవృక్షములు, వనముల్ = నీ యుద్యానవనములు, వేలుపుగిడ్డి = కామధేనువు,

దొడ్డిపసి = దొడ్డిలోనియావు, నీకుఁ=(ఇట్టి సర్వవస్తు ప్రదాతలయిన మేఘాదులే సొమ్ముగాఁగల) నీకు, పాదార్ఘ్యమిత్తునో = పాద్యమని యిత్తునా, రత్నాంజలి యిత్తునో=రత్నముల దోసిలియని యిత్తునా, అలరు+ఎత్తుల్=పూదండలను, దివ్యసద్వస్తులు=దివ్యములయిన మేలివస్తువులను, ఇత్తునో, అని క్రమాలంకారము. ఏమిటన్=దేనిచేత, ఈవు=నీవు మెత్తువు - నీవు మెచ్చున దేదియులేదనుట, ఏమితగన్ ఇత్తున్=ఏవస్తువును నీకుఁదగునట్లుగా ఇత్తును - నీవు మెచ్చునట్లు నీకొఁటి కియ్యఁదగినట్టి వస్తువిచ్చుట కేదియు లేదేయనుట - లేక నేను నీ కీఁదగు వస్తువులన్నియు నీయధీనములు గనుక నేదియును నీకుఁ దగినట్టుగా నీయఁజాలననుట.

జలము పాద్యమునకై యిత్తునన్న జలప్రదాతయగు మేఘములే నీవాహనములు. రత్నంపు దోసిలి యర్పింతునన్న చింతారత్నమే నీసొమ్ము, పూదండ లిత్తునన్న కల్పవృక్షములు నీతోఁటలోనివి. మఱి యేకామితమయిన గొప్పవస్తు విత్తునన్న కామధేనువు నీదొడ్డియావు. ఇందేదియిచ్చినను నన్నియు నీయధీనములే గనుక నీకు మెచ్చుగాదు. నీవొకవేళ దయచేత మెచ్చినను నీకుఁదగినదియుఁ గాదు. అయినను మాభక్తినిబట్టి నీవు దీనిని పరిగ్రహింపవలయును. ఏలన భక్తపుంజ ప్రియుఁడవుగదే. ఘనములనఁగా గొప్పలనియు వదాన్యమణి దాతృశ్రేష్ఠమనియు నర్థములు స్ఫురించెడిని. అలం. పరికరము. పరిశేషము.

సీ. మహనీయ యోగసన్నహసాధకుండ వై, యనఘాపగాంబుగాహనము గనుట
వసురాడఖర్వతీవ్రతరాంఘ్రి సహుఁడ వై, గాఢసంతాపాగ్నిఁ గ్రాఁగుచుంట
బహుదూరగతభూరిపక్షగౌరవుఁడవై, పరమనిశ్చలవృత్తిఁ బాదుకొనుట
యనవాప్తగురుబాంధవనిబంధనుండ వై, గిరికాననరసైకపరత మనుట
తే. యిది మదీయాపదానంబు కృప నపార,తరతపోరచనంబుగాఁ దలఁచి నన్నుఁ
గావవచ్చితో యహహ వెంకగలికిదోడు, వేల్పులనుమాటనిజముగా విబుధవర్య.

అ. మహ...కుండవై—మహనీయ = గొప్పదియగు, యోగ = కూడికలయొక్క - సంభోగములయొక్క, సన్నహ = పూనికిని, సాధకుండవై = సాధించినవాఁడవై - అనఘ ఆపగా అంబు గాహనమున్ = నిష్కల్మషమయిన (శుక్తిమతీ) నది జలములందలి ప్రవేశమును కనుటను - అనఁగా సంభోగములోఁ శుక్తిమతీ ప్రాప్తిఁగనుట యని యర్థము - గొప్పది యగు అష్టాంగయోగ ప్రయత్నమును సాధించువాఁడవై పుణ్య నదీ స్నానము సేయుట యని యర్థాంతరము. వసు...హుఁడవై— (వసురాట్టనఁగా వసురాజు సూర్యుఁడును, అంఘ్రియనఁగా చరణమును కిరణమును), వసురాట్ = వసురాజుయొక్క, అఖర్వ = కుంటువోని, తీవ్రతర = మిక్కిలియుతీక్ష్ణమయిన, అంఘ్రి = పాదమును—పాదహతిననుట, సహుఁడవై = సహించినవాఁడవై, గాఢసంతాపాగ్నిన్ = దృఢమయిన పరితాపమనెడు అగ్నిచేత, క్రాఁగుచుంట = వేగుచుంటయని యర్థము. (వసురాట్=సూర్యునియొక్క, యధిక=తీక్ష్ణములయిన, అంఘ్రి=కిరణములను - అంఘ్రిశబ్దము కిరణవాచకమగుట. 'జాలేషుమూర్ఛన్తి హిమంద్రపాదాః' కాళిదాసు. అని కిరణవాచకమగు పాదశబ్దమునకుఁ బర్యాయముగాన యిదియు కిరణార్థకమే.) సహించినవాఁడవై, గాఢసంతాప కరమయిన ఎరగలి(దావాగ్ని) చేతఁగాఁగుచుండుటయని యర్థాంతరము - పర్వతమునకు దవాగ్ని సహజముకదా.)

బహు...వుఁడవై—బహుదూరగత = మిక్కిలి దవ్వుగాపోయిన - చాల నశించినయనుట, భూరి=అధికమయిన, పక్షగౌరవుఁడవై = ఱెక్కలయొక్క గౌరవము గలవాఁడవై - నావెను

కెక్కలగరిమ మిక్కిలియుం దూలిపోయినవాఁడనై, పరమనిశ్చలవృత్తిన్ = మిక్కిలియు కదలక మెదలకుండు విధముచేత, పాదుకొనుట=స్థిరము నిలిచియుండుట - కెక్కల పసపోయినందున కదల మెదలనేరక యొక్కచోటనే కుదురుగాఁ బడియుండుటయని యర్థము - (బహుదూరగత = మిక్కిలి దూరమైపోయిన, భూరిపక్ష - ('భూరిః ప్రాజ్య సువర్ణయోః' విశ్వము) బంగారు విషమయిన గౌరవము గలవాఁడనై, ఉత్కృష్టమయిన నిశ్చల మనోవ్యాపారమున స్థిరీభూతుఁడ నగుట యని యర్థాంతరము. బంగారు నందలి గౌరవము మిక్కిలి దిగనాఁడుట యనుట).
అన... మండనై—అనవాప్త = పొందఁబడని, గురుబాంధవ=గురువులును బంధువులునయిన పర్వతములయొక్క, నిబంధనుండనై = కూడికలు గలవాఁడనై, గిరికానన... మనుట—గిరికా = కూఁతురయిన గిరికయొక్క, ఆననరస = ముఖమును చూచెడి యనురాగరసమునందె, ఏకపరతన్=ముఖ్యముగా ఆసక్తికలిమిచే, మనుట = బ్రతుకుట - బంధువులు గురులతోడి పొత్తుమాలి కన్నకూఁతురు మొగముచూడఁగన్న సొంపును బట్టిమాత్రము ఉసులు పెట్టుకొని యుండుటయని యర్థము-గురువుల యొక్కయు బంధువులయొక్కయు సాంగత్యమును వీడినవాఁడనై, గిరి+కానన = పర్వతములందును అరణ్యములందునును, రస=జలములందును, ముఖ్యాసక్తితోడ మనుట యని యర్థాంతరము.

ఇది మదీయాపదానంబు—(అపదానం కర్మవృత్తమ్' అ) నాదయిన యీగొప్పకార్యము, నాచేతఁ జేయఁగలిగిన ఘనకార్యమంతె యిదియె. అని నికర్షపరముగా చెప్పుట. కృపన్=దయచేత, అపారతర తపోరచనంబుగాన్ = మితిలేని తపస్సుచేయుటగా, తలఁచి, నన్నున్, కావవచ్చితో, అహహా=ఆశ్చర్యము, వెంగలికిన్ తోడువేల్పులు=వెఱ్ఱివానికి సహాయము వేల్పులు, అనుమాటన్= లోకోక్తి, నిజముగాన్ = నిక్కమగునట్లుగా, కావవచ్చితివో యని సంబంధము. విబుధవర్య= దేవతాశ్రేష్ఠా!

ఇందలి యర్థాంతరములు తపోరచన పరములు.అష్టాంగయోగమును సాధించు పుణ్యనదీ స్నానములు సేయుచు, సూర్యునివేఁడిమి కోర్చి బంగారమును సరకుసేయక, మనసు మిక్కిలి నిశ్చలము గావించికొని చుట్టాలు పెద్దలు మొదలగువారి పొత్తులుమాని, పర్వతములందును నడవులందును జలము లందును గాలముకడపుచు నుండుట మహాతపోరచనమని అర్థాంతరసారము.

ఉ. ఇచ్చటఁ జేదిరాజ నఖరిహేతిహతిన్ గతి దూలియున్న యీ
పిచ్చుకగుంటుమీఁదఁ గృపఁ బెంపున నామరలోకవాహినిం
దెచ్చితిఁగా నగారిజగతిం గృతినైతి భవత్ప్రసన్నతన్
హెచ్చె మదీయగౌరవ మహీనమహీధరజాతిలోపలన్. 20

అ. ...చేది—హతిన్ = చేదిపతియైన వసురాజుయొక్క కాలిగోరనెడు ఖడ్గముయొక్క దెబ్బచేత, గతిదూలి=గతిచెడి- అనఁగా దిక్కుమాలి, (...కములేక యనియర్థము) యున్న, ఈపిచ్చుక గుంటుమీఁద=కాళ్లులేని వానియెడ - అనఁగా తనఖిన్న... అమరలోకవాహినిన్ = దేవలోకమున నది యగు గంగను, తెచ్చితిగా=తెచ్చితివిగా, (ఇట ...గూపరి గంగ... పిచ్చుక కుంటుమీఁద భాగీరథి' యనెడు లోకోక్తి యనుసంధింపఁదగినవాఁడని ... కృతిని అయితిని=గంగవచ్చుటచే లోకమందుఁ బ్రఖ్యాతుఁడ నయితిని. ... భవత్ప్రసన్న తన్=నీయనుగ్రహముచేత,అహీనమహీధర జాతిలోపలన్=అధికములైన ... యము గౌరవము=నా పెరిమయును - పృథుత్వమును, హెచ్చెను

నీవో నగారివయ్యును నగమనయిన నాయెడ ననుగ్రహించితివి. నీ నిగ్రహమునకుఁ బాత్రుల యిన పర్వతములందు నీయనుగ్రహమునకుఁ బాత్రుఁడనగుటచే నాకు గౌరవము కలిగెను. ఱెక్కలు కొట్టుపడకుండుటచే పృథుత్వమును గలిగెనని యాశయము. నీవు నగవిరోధివి, కొండయెక్కడ? కొండలను జెండాడు నింద్రుఁడెక్కడ? అట్టినీవు నాకడకు ననుగ్రహింపవచ్చుట పిచ్చుక కుంటు మీఁద భాగీరథి వచ్చినట్లు. నిజమునకు నేను బిచ్చుకకుంటునే, 'చేదిరా...దూలి' యున్న వాఁడ నగుటచే.

మ. అన నింద్రుం డను లాఁతిరీతి నచలేంద్రా! యేల యిట్లాడ నీ
జనకుం డధ్వరభాగభోక్తయనిమేషశ్రేణిలోఁ బెద్ద త
త్తనయగ్రామణివైన నీకు నరుదే ధాత్రీధరేంద్రాభినం
ద్యనితాంతోన్నత కీర్తిగౌరవము మేనాశుక్తిముక్తామణీ. 21

అ. ...అచలేంద్రా=పర్వతశ్రేష్ఠా! లాఁతిరీతిన్=అన్యునివలె, నీజనకుండు=నీతండ్రి హిమ వంతుఁడు, అధ్వరభాగభోక్త=యజ్ఞభాగము ననుభవించువాఁడు, మఱియును, అనిమేష...పెద్ద= దేవసమూహములో గొప్పవాఁడు, తత్తనయగ్రామణివి = అతని కుమారశ్రేష్ఠుఁడవు, ధాత్రీ...గౌర వము—ధాత్రీధరేంద్ర=పర్వతశ్రేష్ఠులచేత, అభినంద్య=కొనియాడఁదగిన, నితాంత+ఉన్నత=మిక్కి లియు హెచ్చయిన, కీర్తి=యశస్సును, గౌరవమున్=అతిశయము ననియర్థము. నితాంత = ('తీవ్రై కాంత నితాంతానిగాఢ బాఢదృఢానిచ' అ) మిక్కిలియైన, ఉన్నత = పొడవయినవాఁడనెడు, కీర్తిగౌరవమును=గీర్తియును బృథుత్వమును నని యర్థాంతరము. (ఈయర్థమున 'జాతిరప్రాణినామ్' అనుసూత్రముచేత 'కీర్తిగౌరవము' అని యేకవద్భావము) మేనాశుక్తిముక్తామణీ= మేనకాదేవి యను ముత్తెపుఁజిప్పకు ముత్తెమయినవాఁడా! అరుదే=ఆశ్చర్యమా! (ఉ అదే=అనుపాఠమున 'తగదా' యని యర్థము) అనఁగా నీకు నీకీర్తిగౌరవములు స్వభావసిద్ధములే కాని యాశ్చర్యములోనివి కావనుట.

శా. చేదిక్ష్మావరపాదకంజకృత ఖంజీభావముం జెందునీ
ఖేదం బార్పఁగఁగల్గె నీతనయ లక్ష్మిం గన్న దుగ్ధాబ్ధి నా
నాదాక్షాయణిఁ గన్న పెన్నగము నా నర్హాధినాథార్పణా
హ్లాదం బందఁగరాదె మామకని యోగాయత్త చిత్తుండవై. 22

అ. చేది ..భావముం=చేదిరాజయిన వసురాజుయొక్క, అడుగుతామరచేత చేయఁబడిన కుంటితనము, చెందు=పొందిన- అనఁగాఁ గుంటివాఁడవయిన, నీ ఖేదమును, ఆర్పఁగన్, ఈతనయ=ఈ [illegible]తురు కలిగెను,-కాఁబట్టి, లక్ష్మింగన్న దుగ్ధాబ్ధినాన్ = లక్ష్మీదేవినిగన్న క్షీరసముద్రునివలెను, [illegible]...గమునాన్=అపార్వతినిగన్న పెద్ద పర్వతమును-అనఁగా హిమవంతుని-వలెను, అర్హా... [illegible]=తగిన [illegible]కిచ్చుటవలని సంతోషమును, మామకని యోగాయత్త చిత్తుండవై =నాయేర్పాటు [illegible]నయున[illegible]గలవాఁడవై - నాయానతికి సమ్మతించియనుట, అందఁగరాదే = పొందరాదా. [illegible] నాపం[illegible]న నీకూఁతుఁ దగినవరునకిమ్మనుట. అట్లుచేయుటవలన దుగ్ధాబ్ధి హిమవత్పర్వ [illegible]వతెఁ గృ[illegible] వగుదువని ప్రోత్సాహనము.

[illegible] ఈతనయ[illegible]న్న దుఃఖము[illegible]బోఁగొట్టునది. కలుగకున్న సంతోషము ఈతనయ [illegible] పొందద[illegible] యర్హ వరున[illegible]కిచ్చుటచే[illegible] మఱినాపంపున నిచ్చితివేని క్షీరాబ్ధిహి మవ[illegible]ములవలెఁ[illegible]గనుగూడ [illegible]దువు. నీ[illegible]ఖేదము వసురాజు పాదకృతము. అది యా [illegible] [illegible]తము. అట్టి [illegible]కమున రాజు ప్రసాదమునకయి యీకూఁతురు నీకు[illegible]వది, [illegible] [illegible]క్తిచేత [illegible] కీ[illegible]నిమ్మనుట వ్యంజితము.

క. అగతనయ యగతనయ నిగ, నిగ నిగనిమెఱుంగు దెగడు ♦ నీకన్నియకున్
మగనిఁ దగునతని గుణగరి, మగనిన్ వినిపింతు వినుము ♦ మత్ప్రాణసఖున్. 23

అ. అగతనయ=అగత=అనాగతమయిన - తెచ్చికొన్నది కాక స్వభావ సిద్ధమయిన, నయ=నీతిమార్గముగలవాఁడా! అగతనయ=పర్వత పుత్రుఁడా! కోలాహలా! నిగ... మెఱుంగున్ = నిగనిగనిగమని మెఱయునట్టి మెఱపుఁదీఁగను, తెగడు=తిరస్కరించు, ఈ కన్నియకున్, గుణగరిమగనిన్ = గుణము గౌరవమునకు గనియైనవాఁడును, తగునతనిన్=తగినవాఁడును, మత్ప్రాణసఖున్=నాప్రాణస్నేహితుఁడయినవాఁడును అగు, మగనిని, వినిపింతున్=వినుము.

మ. చరణాగ్రానమితాచలేంద్రుఁడు సదా♦సన్మార్గసంచారి సు
స్థిరకల్యాణసమాఖ్యుఁ డావసుధరా♦ధీశుండు వో గోత్రశే
ఖరగంగావచనం బపార్థ మగునే ♦ కల్యాణి నీకన్నె న
న్నరనాథాగ్రణిరాణిఁ జేసి కనుమా ♦ నానావిధైశ్వర్యముల్. 24

అ. గోత్రశేఖర=కులభూషణుఁడాయని యర్థము - పర్వతశ్రేష్ఠుఁడాయని భావము. చరణాగ్రానమితాచలేంద్రుఁడు=పాదములుంగల నమ్రులై మ్రొక్కుచున్న, అచలా+ఇంద్రుఁడు=భూపతులు గలవాఁడును, (పాదాగ్రపు దెబ్బచే తెస్సగావంగిన పర్వతశ్రేష్ఠుఁడు గలవాఁడును,) సదాసన్మార్గసంచారి=ఎప్పుడును సజ్జనమార్గమందే నడచువాఁడును-(ఎప్పుడును విమానముతోడ ఆకాశమార్గమున సంచరించువాఁడు.) సుస్థిరకల్యాణ సమాఖ్యుఁడు=శాశ్వతమయిన శుభమును కీర్తియునుగలవాఁడును-(కల్యాణమనఁగా బంగారును సమాఖ్య యనఁగా పేరునుగనుక బంగారుపేరయిన వసువను సంజ్ఞ గలవాఁడును), వసుధరాధీశుండువో=ఆవసురాజేసుమా, గంగావచనంబు=గంగ చెప్పినమాట, అపార్థ మగునే=నిరర్థకమగునా - గంగ పూర్వోక్తములయిన విశేషణములుగల వరునిఁ జేపట్టుమని దీవించి నదిగనుక నావిశేషణములుగలవాఁడు వసురాజే యాయెనుగాన యామెమాట వ్యర్థముగాదనుట. కాఁబట్టి, కల్యాణిని, ఈకన్నెను, ఆన్నరనాథాగ్రణి రాణిన్ చేసి=ఆరాజశ్రేష్ఠునియొక్క దేవినిగాఁజేసి, నానావిధైశ్వర్యముల్=సకలవిధములయిన వైభవములను, కనుమా=పొందుమా.

కల్యాణసమాఖ్యునికిఁగా కల్యాణి - కల్యాణునికి కల్యాణియే - తగినది. గంగగిరికకాశీర్వచనము సేయుట యీ యాశ్వాసమునందు ౧౬ వ పద్యముం జూచునది.

శా. లోకత్రయ్యభినందనీయవిమలా♦లోకుండు సుశ్లోకుఁ డా
లోకాలోకధరాధురీణుఁ డతఁ డ♦ల్లుం డయ్యెడిన్ నీతపః
పాకం బెట్టిదొ కాని పాదనిహతిం ♦ బైకొన్నవాఁ డంఘ్రినా
ళీకద్వంద్వనతుండు గా నెరపఁ గ♦ల్గెం గల్మియుం బల్మియున్. 25

అ. లోకత్రయీ=మూఁడులోకములవారిచేతను, అభినందనీయ = మిక్కిలికొనియాడఁదగిన, విమల=స్వచ్ఛమయిన, ఆలోకుండు=ప్రకాశముగలవాఁడు - అనఁగా తేజముగలవాఁడనుట, సుశ్లోకుండు=మంచికీర్తిగలవాఁడు, ఆలోకాలోక ధరాధురీణుఁడు=చక్రవాళపర్యంతమయినభూమియొక్క భారమును వహించినవాఁడు ('లోకాలోకశ్చక్రవాళః అ.) అతఁడు = అట్టియావసురాజు, నీకు అల్లుండు అయ్యెడిన్, నీతపఃపాకంబు ఎట్టిదోకాని = నీవుచేసిన తపస్సుయొక్క పరిపాక మెట్టిదో కాక, పాదనిహతిన్ పైకొన్నవాఁడు = కాలిదెబ్బచే ఆక్రమించినవాఁడు-కాలఁదన్ని నిర్మించినవాఁడనుట, అంఘ్రినాళీక ద్వంద్వనతుండుగాన్ = నీరెండు అడుగుదామరలకు మ్రొక్కెడు

వాఁడగునట్లుగా - అల్లుఁడు మామయుడుగులకు మ్రొక్కుట ప్రసిద్ధము. కల్మియున్=ఐశ్వర్యమును, బల్మియున్=సామర్థ్యమును, నెరపన్ కల్గెను = ప్రచరింపఁగలిగెను. కాన, నీతపఃపాకంబెట్టిదో కాని యని సంబంధము.

ఉ. నా వలచుట్టి హర్షకలనావలమానమనోంబుజంబుతో
నావలవైరిఁ బల్కెనచలాగ్రణి మామకశోకవార్ధికిన్
నావ లతాంగి నబ్ధిరశనావలయేశ్వరు కేలఁ గూర్చెదే
నావలవంత దీర్చెదె యనంతకృపారసవాస వాసవా. 26

అ. నాన్=అనియింద్రుఁడు చెప్పఁగా, ఆవలవైరిన్=ఆబలవైరిన్=బలాసురునకుశత్రువయిన యింద్రునిఁగూర్చి - (ఇటవబలకభేదము) వలచుట్టి=ప్రదక్షిణముచేసి, హర్షకలనావల మానమనోంబుజంబుతోన్ - హర్షకలనా=సంతోషాతిశయముచేత, వలమాన=ఆవరింపఁబడుచున్న, మనో అంబుజంబుతోన్=మనస్సుతామరతో, పల్కెన్=పలికెను, అనంతకృపారసవాస=అమితమయిన దయారసమునకు ఉనికి పట్టయినవాఁడా! వాసవా=ఇంద్రుఁడా! మామకశోక వార్ధికిన్=నా (పరాభవ జనితమయిన) దుఃఖమనెడు సముద్రమునకు, నావ=ఓడయైన, లతాంగిన్ = తీఁగవంటి మేనుగల నా కూఁతును, అబ్ధిరశనావలయ ఈశ్వరు కేలన్ = సముద్రము మొలనూలుగాఁగల భూమియొక్క మండలమునకు ప్రభుఁడయిన వసురాజుయొక్క హస్తమందు, కూర్చెదే=కూర్చుచున్నావా! అనఁగా వసురాజు పాణిగ్రహణముచేయించుచున్నావా! నావలవంత దీర్చెదే=ఇంతటితో నాచింతను దీర్చుచున్నావా!

అబ్ధిరశనావలయేశ్వరు = సముద్రము మొలనూలుగాగలభూమి - సముద్రముచే చుట్టఁబడిన భూమండలమంతయు ననుట, ‘సముద్రరశనా చోర్వీ సఖీచయు పయోరియమ్’ కాళిదాసు. ఇంద్రుఁడు ‘చేదిక్ష్మావర పాదకంజకృతఖంజీభావమున్ జెందునీ ఖేదంబార్పఁగఁ గల్గె నీతనయ’ యని గిరిక శోకమార్చునదని చెప్పి శోకమార్చుట ‘చేదిక్ష్మావర’ అనుపదముచే వసురాజును జెట్టపట్టుటచే నని సూచించి పిదప కంఠోక్తముగాఁ దెలిపినాఁడు. అవమాన దుఃఖముచేత సదామెరియుచున్నవానికి దుఃఖశల్య విమోచకముగా వసురాజునకుఁ గన్నె నిమ్మనుట తదనంగీకార లేశమును బొసంగనీని దృఢ సమ్మతికయి. భావి మహాసంతోషలబ్ధికంటెను చిరబాధకహృదయశల్య విముక్తి ప్రబలమయిన ప్రేరకముగదా. కాఁబట్టి రెండవదానినే ముఖ్యముగాఁ బురస్కరించుకొని మొదటిదానిని గౌణముగా నుపన్యసించినాఁడు. దీనినే ‘పాదనిహతింబైకొన్న వాఁడంఘ్రినాళీకద్వంద్వనతుండుగా నెరపఁ గల్గెం గల్మియున్’ అని స్పష్టముగా నెత్తి చెప్పినాఁడు. దీనినే కోలాహలుఁడును, ‘మామకశోక వార్ధికిన్ నావలతాంగి’ యనిచెప్పి, నావ యగువిధమును ‘అబ్ధిరశనా...వలవంతఁ దీర్చెదె’ యని చెప్పినాఁడని తెలియునది.

తే. అవని నొకవేల్పుప్రత్యక్షమైనసిరులు,దొరలునంద్రెందఱోవేల్పుదొరలుగొలువ
నీవ ప్రత్యక్షమై కృపనింపఁగా ఫ, లింపవె తలంపులెల్ల నిలింప రమణ. 27

అ. నిలింపరమణ=దేవనాథా! అవనిన్ = భూమియందు, ఒకవేల్పు=ఒకదైవము,...సిరులు దొరలును అంద్రు=సంపదలు పొంగిపొరలునని చెప్పుదురు. ‘తొరలు’నని తకారాదిగా గ్రహించినచో, కలుగునందురని యర్థము. ఎందఱో వేల్పుదొరలు కొలువన్ = పెక్కండ్రయిన దేవతాపతులు సేవింపఁగా, నీవ=నీవే - దేవాధీశ్వరుఁడవే, తలంపులెల్లన్ = కోరికలన్నియు, నింపఁగాన్=నింపఁగాఁ గూర్పఁగా...

సామాన్యముగా ఒకవేల్పు ప్రత్యక్ష మగుటమాత్రకే సిరులుకోరలు ననఁగా, వేల్పుదొర రెండ అనోగూడి వేలుపుతోఁడే ప్రత్యక్షమగుటయే కాక కృపయు నింపుచో ఫలము చెప్పవలెనా యనుట.
అల. అర్థాపత్తి.

చ. సతి నడిగించుభవ్యగుణ।శాలి వసుం డఁట వేఁడవచ్చువాఁ
డతులితదేవరాజ్య భర।నైకధురంధరుఁ డైనయాశత
క్రతుఁడఁట సత్కృపామహిమఁ।గన్నియనిచ్చుట సర్వదేవతా
హితమఁట యింతకన్న శుభ।మెయ్యది తొయ్యలిఁ గన్నవారికిన్. 28

అ. సతిన్=కన్నెను, అడిగించు భవ్యగుణశాలి=అడుగనంపించిన శుభగుణముచేత నొప్పువాఁడు, సత్ కృపామహిమన్ = మంచికరుణ పెంపుచేత, దేవరాజ్యభరణ ఏకధురంధరుఁడు=దేవతారాజ్యమును భరించుటయందు ముఖ్యసమర్థుఁడు, శతక్రతుఁడఁట = నూఱుయాగములు చేసిన యింద్రుఁడఁట, సర్వదేవతా హితమఁట=సమస్త దేవతలకు నిష్టమయినదఁట, తొయ్యలిఁ గన్నవారికిన్=పిల్లను గన్నట్టివారికి, ఇంతకన్నను శుభమెయ్యది=దీనికంటె వేఱొకశుభ మేమున్నది - ఇదియే శుభముగాని యింతకంటె మఱియొకటి లేదనుట.

ఉ. ఇమ్మనివేఁడ వేఱొకఁడ।నే భవదీయ జనుండఁ గానె నా
సొమ్మన నెద్ది నీయదియ।సు మ్మఖిలమ్మును దేవ యీయదూ
రమ్మున నున్నశుక్తిమతి।రాఁ గరుణించి తదీయబంధుజా
తమ్ము మదాప్తులం బిలిచి।తావకమిత్రున కిమ్ము కన్నియన్. 29

అ.... వేఱొకఁడనే=నే నన్యుఁడనా! భవదీయ జనుండను=నీవాఁడను, అఖిలమ్మునునీయదియ సుమ్ము, ఈ అదూరమ్మునన్ = ఈ సమీపమందు, రాన్ కరుణించి=వచ్చునట్లు దయచేసి, తదీయ బంధుజాతమ్ము = ఆశుక్తిమతి బంధుసమూహమును - అనఁగా నదులను, మద్+ఆప్తులన్ = నా బంధువులను - అనఁగా పర్వతములను, తావకమిత్రునకున్=నీస్నేహితునకు - వసురాజునకు.

ఇట వివాహమర్యాద చొప్పున తల్లివంక బంధువులను దండ్రిపక్షపువారిని నడిగియే తండ్రి కన్నె నిచ్చుట యౌచిత్యమని తద్భంగము కలుగకుండుటకై యిట్లు చెప్పినాఁడని తెలియునది.

చ. అనుటయుఁ దాతపార్శ్వగత।యై తగునాలతకూన దా నతా
ననయయి కేలికేళినలి।నంబు మొనల్ నఖరాంచలంబులం
దునుముచు నుండె వజ్రధర।దోరశని ప్రతిమాన మీనలాం
ఛనవిశిఖంబు లింక నఖ।సాధ్యము లంచు గణించుకైవడిన్. 30

అ. అనుటయున్ = కోలాహలుఁ డింద్రుని నిట్లు చెప్పఁగా, తాతపార్శ్వగతయై=తండ్రి ప్రక్కనున్నదై, ఆలతకూన=ఆగిరిక, తాను, నత+ఆననయయి=వంపఁబడిన మొగముగలదై, కేలికేలి నలినంబు మొనల్ = చేతియందలి, లీలార్థమయిన తామరపూవు చివరలను, నఖర+అంచలంబులన్=గోటికొనలచేత, తునుముచుండెను. ఎట్లనినన్-వజ్ర...ఖంబు—వజ్రధర=ఇంద్రునియొక్క, దోః=భుజమందలి, అశని=వజ్రాయుధముతోడ, ప్రతిమాన=సాటియైన, మీనలాంఛన విశిఖంబులు=మన్మథబాణములు - తామరలు, ఇంకన్, నఖసాధ్యములు=గోటఁజిమ్మఁ దగినవి, అంచున్, గణించుకైవడిన్=ఎంచినట్లుగా, తునుముచుండెనని సంబంధము.

తలవంచుట లజ్జచేత. దానిని దెలియకుండునట్లు మఱపుట్టకై లీలాపద్మము మొనలు ద్రుంచుట. ఏదేని మిక్కిలి సులువైనపనిని నోటితో నగునదని చెప్పుట గలదు. 'గోటనగుదానికి గొడ్డలి యేటికి' నని యిత్యాదులుగలవు. గోటఁద్రుంచుటను గోటిచేఁ దీర్పఁజాలుటగాఁ గవి నిబంధించినాఁడు.

చ. అంతకు మున్న సర్వకలుషాంతక మానగవైరి వాక్యముం
జెంతకు వచ్చు నెచ్చెలులచే విని పుణ్యమహాతరంగిణీ
కాంతలుఁ దాను శుక్తిమతి కౌశికుఁ గొల్వఁగవచ్చె దేవతా
సంతతి యాత్మ నాత్మశుభసంతతికల్మికి సంతసిల్లఁగాన్. 31

అ. ...సర్వ కలుషాంతకము=సమస్తములయిన కల్మషములను బోకార్చునది. జో=అగు, నగవైరివాక్యముక్=ఇంద్రునిమాటను, నెచ్చెలులచేక్=చెలికత్తెలచేత, పుణ్యమహాతరంగిణీ కాంతలుక్ తాను=తానును పావనలయిన గొప్ప నదీకాంతలను, శుక్తిమతి, దేవతాసంతతి=దేవసమూహము, ఆత్మక్=తమమనస్సునందు, ఆత్మశుభసంతతి కల్మికిక్ = తనయొక్క శుభసంతానపు కలిమికి, సంతసిల్లఁగక్, కౌశికుక్=ఇంద్రుని - (మహేంద్ర గుగ్గులూలూక వ్యాళగ్రాహిషు కౌశికః' అ.) కొల్వఁగక్ నచ్చెను. దేవేంద్రుఁడు తనకన్నెను వేఁడుట, వసురాజు వరుఁడగుట, యనునివియె శుక్తిమతియొక్క శుభసంతతి.

సీ. అమృతమూర్తి వహించుహరజటాసంభవ, సుమనోమణులఁ బ్రోచుసోమకన్య
ధరనుద్ధరించు భూదారరాజ తనూజ, తమమెల్ల వారించు తపనపుత్త్రి
కాలవైషమ్యముఁ గడపు రుద్రాంఘ్రిజ, చలువలు వెదచల్లు మలయదుహిత
యభవసాధనరత్న మగు పినాకోత్పన్న, యార్యాప్తి నెసఁగు శీతాద్రిజాత

తే. మఱియుఁ జక్కన పుణ్యనిమ్నగలు మరుద, ధీశభవ్య నిదేశాప్తదేశమున ని
జాప్తశుక్తిమతీతనయావివాహ, మహమునకు వచ్చి రాత్మీయమహిమ మెఱసి.

అ. అమృత...భవ—(అమృతమనఁగా మోక్షమును) మోక్షస్వరూపము దాల్చు (శివుని జటలందుఁబుట్టిన) ఆకాశగంగయని యర్థము - హరుఁ డమృతస్వరూపుఁడు గనుక నతని జడలవలనఁ బుట్టినది గంగయు నమృతస్వరూపమును వహించినదనుట - అమృతమూర్తి యనఁగాఁ జంద్రుఁడు. హరుఁడు చంద్రుని వహించినాఁడు గనుక హరజటాసంభవయైన గంగయును జంద్రుని వహించిన దని ప్రకారాంతరము - (అమృతమనఁగా నుదకముగనుక నుదకస్వరూపము వహించినదని భావము - మఱియు గంగ యమృతమూర్తిని వహించినదనఁగా గంగోదకములు అమృతమువలె మధురములని యు నుపమయును దెలియుచున్నది.)సుమనోమణులక్ బ్రోచుసోమకన్య=దేవతాశ్రేష్ఠులను బ్రోచెడి నర్మదానదియును అని యర్థము - సోముఁడు దేవతాశ్రేష్ఠులను బ్రోచువాఁడు గనుక నతనివలనఁబుట్టిన నర్మదయును దేవతాశ్రేష్ఠులను బ్రోచుచున్నదనుట- (మంచిమనస్సు గలవారిని రక్షించునదని భావము.

ధర...రాజతనూజ—భూమినుద్ధరించెడి భూదారరాజతనూజ=వారాహియనెడు నది.

('వారాహీయమునా గంగాకరతోయా సరస్వతీ
కావేరీ చంద్రభాగాచ సింధుభైరవ సాగరాః,
పశుస్నాన విధానాయసాన్నిధ్య మిహాకల్పయ'

(బృహన్నందికేశ్వర పురాణము.)

ఆదివరాహము భూమి నుద్ధరించినది గనుకఁ దత్సంభవయైన నదియును భూమి నుద్ధరించుచున్నదనుట - (భూమిజనుల నుద్ధరించుచున్న దనిభావము.) తమ...పుత్రి—చీఁకటి నంతయు నివారణముసేయు సూర్యునికూఁతురయిన యమునానదియని యర్థము. సూర్యుఁ డంధకారమును బోఁగొట్టువాఁడు గనుకఁ దత్పుత్రియు నంధకార నివారణము సేయుచున్నదనుట. (తమమనఁగా తమస్సు - తమోమూలకమయిన యజ్ఞానము - అజ్ఞాననివారణము సేయునదని భావము.

కాలవైష...ఘ్రిజ—కాల విపర్యాసమును గడపుచున్న రుద్రాంఘ్రిజయనెడు నదియని యర్థము. రుద్రుఁడు కాలత్రయాబాధ్యుఁడు గనుక దదంఘ్రిజయు గాలత్రయా బాధ్యయనుట - (కాలుఁడనఁగా యముఁడును గనుక యమదండనము లేకుండునట్లుగాఁ జేయునదని భావము.) చలువలు...దుహిత=శైత్యములను వెదచల్లునట్టి తామ్రపర్ణీనదియని యర్థము - మలయపర్వతము చందనాలయమై చలువలు వెదచల్లుచున్నది గనుకఁ దత్పుత్రియును చలువలు వెదచల్లు చున్నదనుట - (అది చల్లనిజలములు గలదని భావము.)

అభవ...కోత్పన్న—అభవ=శివునకు, సాధనరత్న = మేటిసాధనమయిన, పినాకమందుఁ బుట్టిన పినాకినీనదియని యర్థము - అభవునకు పినాక ముత్తమసాధనము గనుకఁ దదుత్పన్నయు నభవునకు నుత్తమసాధనమనుట - (అభవమనఁగా పుట్టుకలేమి - పుట్టుకలేమికి మేలయిన సాధనములలో శ్రేష్ఠమగుచున్నదని భావము.) ఆర్యాప్తి...జాత—ఆర్యా+ఆప్తిన్ = గౌరీప్రాప్తిచేత, ఎసఁగు, శీతాద్రిజాత=శీతాద్రిజాత యనెడు నదియని యర్థము - శీతాద్రి అనఁగా (హిమవంతుఁడు) గౌరీప్రాప్తిచేత నొప్పుచున్నది గనుకఁ దత్సంభవయు గౌరీప్రాప్తిచేత నొప్పుచున్నదనుట. (ఆర్యజనప్రాప్తిచేత నొప్పుచున్నదని భావము.)

ఇంతవఱకును 'కారణ గుణాహి కార్య గుణానారభన్తే' అనెడు న్యాయమ్ము ననుసంధించి చెప్పినాఁడు. మఱియున్, తక్కిన, పుణ్యనిమ్నగలు=పవిత్రనదులు, మరుత్ అధీశ=దేవతాపతియైన యింద్రునియొక్క, భవ్య=ముఖ్యమయిన, నిదేశ=రమ్మని యాజ్ఞాపించుట యనెడు, అపదేశమునన్ = వ్యాజముచేత, నిజాప్త = తమకాప్తురాలయిన, శుక్తిమతీ=శుక్తిమతియొక్క, తనయా=కూఁతురయిన గిరికయొక్క, వివాహమహమునకున్ = పెండ్లివేడుకకు, ఆత్మీయమహిమ మెఱసి = తమప్రభావమును బ్రకాశింపఁజేసి - ఇటమెఱయు బ్రేరణార్థకము; మెఱయించి యని యర్థము - కామరూపత్వముచేత స్త్రీరూపములదాల్చి యనుట - (లేక 'అమృతమూర్తి వహించుట యిత్యాదికములయిన తమ మహత్వములను బ్రకటించి యనియును అయిననిది సరసముగాదు.) వచ్చిరి.

ఇం దయ్యైనదులకు తమతమ సంభవమూలము నందగు మహనీయగుణములను శ్లేషముచేఁ జెప్పుట తెలియునది.

శా. ఉత్సాహంబున నిట్లనేకతటినీవ్యూహంబు లేతేరఁగా
వత్సాళిన్ వెనుకొన్న గోగణము తేవన్ వచ్చెఁ దోడ్తో మహీ
భృత్సందోహ మభంగశృంగములు నాకవీనన్నుతాంచన్నితం
బోత్సేధంబు వృషోపసర్పణవిధాయోగ్యక్రమంబున్ దగన్. 33

అ. అనేకతటినీవ్యూహంబులు = పెక్కునదీ సమూహములు, ఇట్లు, ఉత్సాహంబునన్ = ఉల్లాసముచేత, ఏతేరఁగాన్ = రాఁగా, వత్సాళి...తేవన్ = లేఁగదూడలను వెంబడించివచ్చిన ఆవులగుంపువలె, తోడ్తోన్ = నమువెంటనే, మహీభృత్సందోహము=పర్వతసమూహము - అభంగశృంగములు - (శృంగములనఁగా శిఖరములును గొమ్ములును - 'శృంగంప్రభుత్వే శిఖరేచిహ్నేపిజల

యంత్రకే విషాణోత్కర్షయోః' అని విశ్వము) అభంగ = వైకల్యములేని, శృంగములు = శిఖరములు-అని పర్వతపరమయిన యర్థము. వైకల్యములేని కొమ్ములు అని గోగణపరమయిన యర్థము. ఆపీన... ధంబు—ఆపీన = అంతటబలుపుగల, స్నుతా=(స్నుఃప్రస్థస్సాను ర స్త్రి)యామ్. అ) స్నువనఁగా కొండచఱిగనుక) చఱులుగలుగుటచేత, అంచత్ = ఒప్పుచున్న, నితంబ=కటకప్రదేశములయొక్క, (కటకస్తు నితమ్బోఽస్త్రీ)' అ.) ఉత్సేధంబు=ఔన్నత్యమునని పర్వతపరముగా - ఆపీన=(ఊధస్తు క్లీబమాపీనమ్' అ.) పొదుగునుండి, స్నుత = ('స్యన్నంరీణం ప్రసుతంస్నుతమ్' అ.) స్రవించునట్టి = స్రవించునట్టి పొదుఁగుయొక్కయు ననుట, అంచన్నితంబ = ఒప్పుచున్న పిఱుఁదులయొక్కయు, ఉత్సేధంబు = ఔన్నత్యమని గోగణపరముగా,) వృష...మంబున్—వృష(వృషశబ్దము 'వృత్రహా వృషా' అని నకారాంతమింద్రునియందు వర్తించును) ఇంద్రునియొక్క, ఉపసర్పణ = అనుసరణమందలి, యోగ్యక్రమంబున్ = తగినరీతియునని పర్వతపరము - (వృష = వృషభము యొక్క అనుకరణమునకు యోగ్యమయినరీతి యని, గోగణపరము) తగన్ = తగియుండఁగా, వచ్చెను.

పర్వతములవలన నదులు పుట్టునుగాన నదులవెంబడినివచ్చు పర్వతములను లేఁగదూడలవెంబడి యావులవలెఁ బోల్చినాఁడు. లేఁగదూడవెంట వెంటనె యావువచ్చునట్లు నదులువచ్చితోడనేపర్వతములువచ్చెనని యవ్యవహితా విలంబానుగతి సూచనకై పర్వతములకును గోగణమునకు నుపమానోపమేయభావముగల్పించి అభంగశృంగాది విశేషణములచే నర్థద్వయము బొందుపఱిచినాఁడు.

వికలముగాని గొమ్ములును బలుపయిన పొదుగులును బొడవులయిన పిఱుఁదులునుగలిగి యాఁబోతులు వెనుదగిలివచ్చుట కెంతయుఁ దగినవని గోగణపరముగాను - వికలముగాని శిఖరములును అంతట పెద్దవిగానున్న చఱులును కటకములును గలిగి యింద్రునింపు ననుసరించు విధముతో నని పర్వతపరముగాను నర్థములు గ్రహించునది. అల. శ్లేషను.

సీ. అజ్ఞాతగోత్ర యనాదిశక్తి సుగోత్ర, భవ యయ్యె నితనిగర్భమునఁ బుట్టి
యాదిభిక్షుండు దుర్గాధ్యక్షుఁడయ్యె నీ, తనిపాదతీర్థ మౌదల ధరించి
మితతేజుఁ డగుజగన్మిత్రుఁ డుత్కటవసు, స్థితి నొందె నీతనిదిక్కుఁ జేరి
కులమువా రభిరామగోరత్నములు గాంచి, రితని శేషంబున నిచ్ఛగించి
తే. తన కొకమఖాంశ మొసఁగునయ్యనిమిషులకు,
ననవరతయాగభాగ భోజనము లొసఁగి
యితఁ డపర్ణైకగురుఁ డన నెసఁగు ననుచు
నాకులు నుతింప వచ్చె మేనాకుటుంబి. 84

అ. ఇందు హిమవంతుని వర్ణించుచున్నాఁడు—మేనాకుటుంబి = మేనకభర్తయగు హిమవంతుఁడు - అజ్ఞాతగోత్ర =(గోత్రమనఁగా నిక్కడ కులము) తెలియఁబడని కులముగలది - ఏవో మిక్కిలి తక్కువకులమునఁ బుట్టినదనుట, అగు, అనాదిశక్తి = ఆదియేర్పడనిశక్తి, ఇతనిగర్భమునన్ = ఈతనికడుపున, పుట్టి, సుగోత్రభవ = సత్కులమునందుఁ బుట్టినదిఅయ్యెను—భవానికులము లేనిదనియు, హిమవంతునకుఁ బార్వతిగాఁ బుట్టినదనియును భావము.

ఆదిభిక్షుఁడు= జన్మమెత్తినది మొదలు భిక్షుకుఁడయినవాఁడు, ఈతని పాదతీర్థము = ఇతనిపదజలమును, ఔదలధరియించి = శిరస్సునందాల్చి, దుర్గాధ్యక్షుఁడయ్యెన్ = దుర్గాధిపతి యాయెనని యర్థము. మహనీయుల పాదతీర్థమును భక్తులుశిరసునఁ దాల్చుటయాచారము.—(ఆదిభిక్షుఁడనెడు

పేరుగల శివుఁడు హిమవంతుని పాదములందు - అనఁగా ప్రత్యంతపర్వతములందు-(పాదాః ప్రత్యంత పర్వతాః' అ) ప్రవహించుచున్న గంగను శిరస్సునధరించినాఁడనియు దుర్గాదేవికిఁ పెనిమిటియనియును భావము.

మితతేజుఁడగు జగన్మిత్రుఁడు= అల్పతేజుఁడయిన లోకోపకారకుఁడు, ఈతనిదిక్కున్ చేరి = ఇతని ప్రాపునండగొని, ఉత్కటవసుస్థితిన్ చెందెన్ = మిక్కుటమయిన ధనస్థితిని బొందెననియర్థము. జగద్బంధుఁడయిన సూర్యుఁడు దక్షిణాయనమందు మితతేజుఁడగుచున్నాఁడనియు, ఉత్తరాయణమందు ఉత్కటతేజుఁడగుచున్నాఁడనియును భావము. 'దేవభేదే నరే రశ్మౌ వసూరత్నే ధనేవసు' విశ్వ. హిమవంతుఁడుత్తరదిక్కునందుండెడువాఁడు గనుక నీతనిదిక్కుఁ జేరియున్నాఁడు.

కులమువారు = కులమువారందఱును, ఇతనిశేషంబునకు ఇచ్చగించి=ఇతని భుక్తశేషమను భవించుటకు సమ్మతించి, అభిరామగోరత్నములుగాంచిరి = మనోహరమయిన ప్రకాశముగల రత్నములను గాంచిరని యర్థము. ఇక్కడ గోశబ్దము కిరణవాచకము.

యద్గోసహస్రమపహన్తి తమాంసిపుంసామ్ నారాయణో వసతియత్రసశంఖచక్రః
యన్మండలం శ్రుతిగణం ప్రణదన్తివిప్రా స్తస్మైనమోవకులభూషణభాస్కరాయ'

సమస్తపర్వతములును భూమిని పృథుచక్రవర్తి పిదుకుకాలమున దూడగాపుననున్న హిమవంతుని చన్నుగుడిచిన యెంగిలికిచ్చగించి యభిరామములయిన గోవులనెడు భూసంబంధిరత్నములును బొందిన వనిభావము. ఇక్కడ గోశబ్దము భూవాచకము - 'స్వర్గేషుపశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే. లక్ష్య దృష్ట్యా స్త్రియాంపుంసిగౌః' అని అ.) పూర్వకాలమున సమస్తమయిన పర్వతములును భూమిని గోవునుగాను హిమవంతునిలేఁగను గానుజేసి రత్నములను నోషధులనుం బితికెననుట పురాణప్రసిద్ధము.

తనకున్, ఒకమఖాంశము = ఒక్కయజ్ఞభాగమును, ఒసఁగు = ఇచ్చిన, అనిమిషులకున్ = దేవతలకు, అనవరతయాగభోగభాజనములు ఒసఁగి = ఎడతెగని యజ్ఞభాగభోజనములుపెట్టి యని యర్థము - (యజ్ఞమునకు భాగములు - అనఁగా అంగములయిన సోమలతాదుల కుత్పత్తిస్థానమనియు తనపయిపట్టులందు యాగభాగ భోజనములుచేయుట నొడఁగూర్చెననియు భావము - హిమవంతము పయిని దేవతలు యాగములొనర్చుట ప్రసిద్ధము.

'పరిపరివిధంపు జన్నంపుఁబరికరంపు, సొంపుసంపద నిఖిలనిలింపసభయు,
నప్పటప్పటికిని జిహ్వాత్రుప్పుడుల్ల. నామెతలెతింగె నీతుపాత్రాద్రికతన. మనుచరిత్ర.

ఇతఁడు అపర్ణ ఏకగురుఁడనన్ =అపగతమయిన ఋణముగలవారలు అపర్ణులు-అనఁగా ఋణములేనివారు - వారికినితఁడు, ముఖ్యగురువు-అనఁగా అనృణశ్రేష్ఠుఁడనునట్లొప్పునని యర్థము - ఋణములేనివాఁడు పరమసంతుష్టుఁడని మహాభారతమందలి యారణ్యపర్వమున

'పఞ్చమేహనిషష్ఠేవా శాకం పచతి స్వేగృహే,
అనృణోహ్య ప్రవాసీచ సవారిచర మోదతే'

అని యక్షప్రశ్నములలో 'కోమోదతే' యని యక్షుఁడడుగఁగా ధర్మరాజు చెప్పిన యుత్తరము అపర్ణా = పార్వతికి. (అపర్ణా పార్వతీదుర్గా' అ) తండ్రియని భావము. అనుచున్, నాకులు = దేవతలు, నుతింపన్ = పొగడఁగా, వచ్చెను.

ఏమికులమో యెఱుఁగరానిది యితనికడుపునఁ బుట్టి మణికులప్రసూతయగుటయు, [illegible]టు విచ్చగాఁ డితనిపాదతీర్థము తలయందుఁదాల్చి దుర్గాధిపతియగుటయు, అల్పతేజముగలవాఁ[illegible] యండఁగొని గొప్పధనస్థితినొందుటయు, ఇతనికులమువా రితఁడు [illegible] మిగత్త యెంగి[illegible]గుడిచి[illegible]

యందలి మేలివస్తువులను బడయుటయు, తన కొక్క యజ్ఞభాగము నిచ్చినవారికి నెడతెగక పెక్కు యజ్ఞభాగభాజనములిచ్చుటయు ఏ యప్పును లేక మహామోదమునఁ దేలుచుండుటయు, దేవతలనుతికి పాత్రములయిన గుణములుగా నిందుఁజెప్పఁబడినవి.

తే. ఆనడఁకుమెట్టదొరకు హస్తావలంబ, మగుచు మేనక వచ్చె భవ్యగుణమంజి
మ నమరాళి మానసమున మనమరాళి,మనమరాలివివాహసంభ్రమముఁజూడ.

అ. ఆవడఁకుమెట్టుదొరకున్ = ఆహిమవత్పర్వతరాజునకు, మేనక, హస్తావలంబము = చేయూఁత, అగుచున్ వచ్చెను ఎందులకనఁగా - భవ్యగుణమంజిమన్ = సుగుణములయొక్క సొగసుఁదనము చేత, అమరఆళిమానసమునన్ = దేవతాసమూహముయొక్క మనస్సుఅనెడు మానససరోవరమందు, మనన్ = మనుటకు, మరాళి = ఆఁడుహంసయైన, మనమరాలి = కొడుకు కూఁతురయిన గిరికయొక్క, వివాహసంభ్రమము = పెండ్లిసంబరమును, చూడన్, వచ్చెను. మనుమరాలని ఈ రూపాంతర మున్నది.

[క. కనికనికర మొదవఁగఁ జ, క్కనికరములఁ గౌఁగిలించి కాంతాయుతుఁడౌ
మనుమని సుఖాన్వితుఁడవై, మనుమని దీవించె సబహుమానముగాఁగన్. (అనిరుద్ధ ౫ ఆ)
మన్మఁడు అనియు రూప ముత్వలోపమున సిద్ధించెననుట మఱింత సమంజసము.] ఇట 'మనమరాలి' అనెడి అనుప్రాసమునుబట్టి 'మనమరాలు' అనియు రూపాంతరము గ్రాహ్యము. 'మరాళి అగు మనమరాలి వివాహసంభ్రమము' అనుచో అగుధాతువ్యవధానము 'మరాళి' యనువిశేషణమునకు లేకయే ప్రథమవచ్చుటఁ దెలియునది. ఇదియె ప్రయోగవైచిత్ర్యంబుగాఁ జిన్నయసూరిగారు చెప్పిరి. మానసమున వాసమునకు మరాళి యెంతతగునో సురలమనసున మనుటకు గిరికయంత తగినదనుట. ఇందులకు నుభయత్ర హేతువు 'భవ్యగుణమంజిమ'. హస్తావలంబము పడఁకువానికిని దొరయగువానికిని-గాన 'వడఁకుమెట్టదొర' యనుట.

సీ. పిడుగుకైదువుపెట్టుతడకట్టుగాఁ బట్టి, ధిమహౌషధిరసంబు చమరెననఁగఁ
గడళి కరళ్లరాయిడిఁ గీడ్పడి తటాంత,వనరాజి మైనంటవ్రాలె ననఁగ
మున్నీటిపెన్నీటిముదురుచిల్వలయులజ, డికిఁ బచ్చలజోడుదొడిగె ననఁగఁ
దన[illegible]దనపుఁజాయ వెనుసీటికుప్పక, ప్పెనసిన పసఁబసరెక్కె ననఁగ

తే. సం[illegible]జలాంతరాళసంస్థానమహిమఁ, బ్రాఁచిపట్టిన మేనితో బయలుమెఱసి
[illegible]గట్టు తొలిపట్టివాసవాధి, వాహిత నిజానుజభవావివాహమునకు.

అ. వ[illegible]గట్టుతొలిపట్టి = హిమవంతుని పెద్దకొడుకయిన మైనాకుఁడు. పిడుగు...కట్టుగాన్, పిడుగు కైదువుపెట్టు = వజ్రా[illegible]ధపుదెబ్బ, తడకట్టుగాన్ = స్తంభనముగా - అడ్డగింపఁగా- ప[illegible] సముద్రుఁడు, మహా[illegible]ధిరసంబున్ = సిద్ధమూలికలయొక్క రసమును, చమరెననఁగన్ = పూ[illegible]యన్నట్లుగా.

[illegible]డలి కర[illegible]రాయిడికిన్ = [illegible]ముద్రపుఅలల ఘట్టనముచేత, కీడ్పడి = కూలి - త్రెళ్లిపడి, [illegible]వరాజి [illegible]రముతుదలయ[illegible]లి వనసము[illegible]ము, మైన్ అంటన్ వ్రాలెననఁగన్ = తనదేహ [illegible]వట్లు [illegible]చెనో యన్న[illegible]ను, మున్నీటిపెన్నీటి ముదురుచిల్వల యులజడికిన్ = సము ద్రము[illegible]క్క [illegible]రుద్ర[illegible]యొక్క [illegible]షవేధకు - అనఁగా విషమెక్కకుండునట్లుగా,

పచ్చలజోడు = గరుడపచ్చలచేత రచింపఁబడిన కవచము, తొడిగెననఁగన్, గరుడపచ్చలు విషహారములు.

మ. పవనాహార విషంబు సోఁకదు యదా పన్నాగంబునం గేకికే
కివిలాసంబునఁ దాండవారభటి సంక్రీడించుటన్ త్ర్యైళ మ
భ్యాసహారించెఁగపాలి యన్న మఱియేలా చెప్పఁదచ్ఛక్తి? య
న్నవగారుత్మతభుక్తి పాత్రియొసఁగెన్ రాజాత్మజాభర్తకున్. (శృంగా ౬-౯౯).

తనకుందనపుఁజాయ = కుందనపుబంగారు కాంతివంటితన దేహకాంతి, పెనునీటికుప్ప = మహాజలరాశియొక్క, కప్పు = నలుపు, ఎనసినన్ = కలియఁగా, పసఁబసరెక్కెననఁగన్ = మాగయిన పసరుచాయ యెక్కెనదోయన్నట్లుగా, ఇట కుందనపు ఎఱుపును కడలినలుపును జేరి మిసిమిపసిమియైనట్లు చెప్పినాఁడు. ఎఱుపుతో నలుపుగలియఁగా ఆకుపచ్చయనియు, తెలుపుగలియఁగా పసుపుపచ్చయనియు వర్ణ వ్యవస్థ.

ఇటపసశబ్దము తెల్లాదులకుంబోలెఁ గర్మధారయమున తెల్లనిపూస తెల్లఁబూస తెల్లనిపూస యనునట్లు పసని పసరు, పసఁబసరు అనిరూపము. లేక పసనుశబ్దముగా గ్రహించినచో పసనుశబ్దమునకు.

క. కుసుమం బగ్గినవిధమునఁ, బసుపున హత్తించినట్లు బంగారమునన్
బసనిచ్చినగతి సంధ్యా, పసరంబున నింగి యరుణవర్ణంబయ్యెన్. (వై ౨ ఆ)
అనుచో అరుణవర్ణముగను

చ. ఒసపరిజాణఁ డొక్కఁడొకయుగ్మలి చేరువ మాఱువెట్టఁగాఁ
బసనికురంగికాపలల ఫాళి నిజాధర పల్లవంబుపైఁ
బసిఁడొనిచేరఁబట్టిమునిపండులనొయ్యన నప్పళింపఁగా
మునిమునినవ్వునవ్వె నది మోము మొకయించుక యోరసేయుచున్. (వై-౬-౧౩౩)

అనుచు నధరమునకు సాటిగా మాంసముముక్కను పసనియనుటచే ఎఱుపుగాను అర్థము తోఁచుచున్నది. ఇట్లె 'పసనిపుప్పొడి' (కళా. ౩ ఆ) అనియున్నది. సీతారామాచార్యులు ఎఱుపు మించిన పసుపుపచ్చయని యర్థము వ్రాసినారు. కుందనపుచాయను ఎఱ్ఱనిపసరనుట అసంగతముగాదు. 'పసనిలేనవ్వు' (భాగ ౩ స్కం) అనునట్లు.

వసువు నిమ్మలగిరివ్రజ మనుపేరఁ, బసనుగా నిర్మించెఁ బట్టణం బొకటి. (రా. బా. కాం.)
......వాఁడీల్గకమున్నె, మసలక తెప్పించి మందుఁబోయించి
పసనుగానొనరింపు ప్రాణదానంబు. (హరివంశం. ద్విపద ౨ భా.)

ఇత్యాదులందలి 'బాగు' అనునర్థముగల పసను శబ్దముగా గ్రహించినచో 'పసఁబసరు' అని నువర్ణలోపము విచార్యము. పసశబ్దమె తెల్లాదులవలెఁ బ్రయుక్తముగా నోపు. లేదేని, 'పెనునీటికుప్ప కప్పు ఎనసినపసన్ = సముద్రముయొక్క నలుపును గూడినసొంపుచేత నసియు నర్థము చేయవచ్చును. కాన 'పస' శబ్దమే తెల్లాదులవలె నివర్ణపరకముగాను లేనిచో ద్రుతపరకముగాను బ్రయుక్తమనుట సమంజసము.

సంతత...మహిమన్ = ఎప్పుడును నీటిలోపల నుండుట యొక్క ప్రభావముచేత, ప్రాఁచిపట్టిన మేనితోన్ = పచ్చప్రాఁకుడు పట్టినదేహముతో, బయలు మెఱసి = (సముద్రము కుక్షినుండి) బయటికి వచ్చి, వాస...మునకున్ — వాసవ = ఇంద్రునిచేత, అధివాహిత = పూనుకొనఁబడిన, నిజ+అనుజభవా= తనతమ్మునికూఁతురయిన గిరికయొక్క, వివాహమునకున్, వచ్చెను.

మైనాకుఁ డింద్రునిచే ఱెక్కలు తుండింపఁబడుటకు వెఱచి సముద్రమునఁ దాఁగికొనుట రామాయణాదులయందుఁ బ్రసిద్ధము. అతఁడు తమ్మునికూఁతురు పెండ్లికివచ్చిన ఱెక్కలు పోవాయన్నచో ఱెక్కలు పోఁగొట్టు నింద్రుఁడేకదా యాపెండ్లికి నిర్వాహకుఁడు కనుకఁ, బెండ్లిపెద్దను నవమానించునా యని తెలియునది. మైనాకునికి కుంవనపుఁజాయ యెట్లన రామాయణమున,

ఇతికృత్వా మతింసాధ్వీం సముద్రశ్ఛన్నమంభసి, హిరణ్యనాభం మైనాక, మువాచగిరిసత్తమమ్. (సుంద. ౧-౯౪)

ఇందులకు 'హిరణ్యనాభం' 'హిరణ్యశృంగం' అనుచో 'నాభిశబ్దోహ్యాధ్యక్షవాచీ శృంగంచ పర్వతస్యాధ్యక్షమేవ' యని గోవిందరాజులు, 'హిరణ్యనాభం హిరణ్యప్రధానం హిరణ్మయ మిత్యర్థః' అని మహేశ్వరతీర్థులు.

చ. ఇరువురు దేవసంభరణు లిర్వురు నబ్జధరోన్నమత్కరాం
తరమహనీయు లిర్వురు ననంతగుణాఢ్యులు గావునం బర
స్పరసమతాసమగ్రతర సఖ్యమునం గనగూడి మేరుమం
దర ధరణీధరాన్వయవతంసులు వచ్చిరి తత్క్షణంబునన్. 37

అ. ఇందు మేరుమందరపర్వతములు రెంటికినర్థద్వయము గలుగఁజెప్పినాఁడు గనుక నభేదాధ్యవసాయము తెలియునది. ఇరువురును, దేవసంభరణులు - (మేరు) దేవతలకు గృహరూపమున భరించినవాఁడు - (మంద)దేవతలచేత సముద్ర మథనముకొఱకు భరింపఁబడినవాఁడు, ఇర్వురున్, అబ్జ...నీయులు—(అబ్జమనఁగా చంద్రుఁడును శంఖమును.) - (మేరు) అబ్జధర = చంద్రధరుఁడయిన శివుని యొక్క, ఉన్నమత్ = ఎత్తఁబడుచున్న, కరాంతర = చేతినడుమ, మహనీయుఁడు = (విల్లుగా) ఒప్పినవాఁడు, (మంద) అబ్జధర = పాంచజన్యమను శంఖమును ధరించిన విష్ణువుయొక్క, ఉన్నమత్కరాంతరములచేత, తఱువంబడినవాఁడు, (అబ్జోధన్వంతరౌచంద్రే నిచు శే శంఖపద్మయోః' విశ్వము) ఇర్వురున్, అనంతగుణ ఆఢ్యులు = (మేరు) అనంతుని - అనఁగా శేషుని, రూపముననున్న అల్లెత్రాటిచేత నిండినవాఁడు- (మంద) అనంతమైన వాసుకియనెడి కవ్వపుత్రాటిచేత నిండినవాఁడు, కావునన్, పరస్పర...సఖ్యమునన్ -పరస్పర = ఒండొరులతోడి, సమతా = సమానధర్మము వలని, సమగ్రతర = మిక్కిలిపూర్ణమయిన, సఖ్యమునన్ = మైత్రిచేత, కవగూడి = జతగూడి, మేరు......సులు — మేరుమందరములు అనెడి పర్వత కులశ్రేష్ఠులు, తక్షణంబునన్, వచ్చిరి.

ఉ. రోహణశైలరాజము మరుద్గిరితోడనె వచ్చి నిల్చె వై
వాహికకార్యకర్త మఘవంతుఁ డనంతసువర్ణరత్నసం
దోహము రాశి వోసి విబుధుల్ మనుజుల్ భుజగుల్ నుతింపఁగా
నాహిమవత్కుమారతన యామణి కుంకువ దెచ్చెనో యనన్. 38

అ. మరుత్ గిరితోడనె = మేరుపర్వతముతోఁగూడనే, రోహణశైలరాజము = రోహణమను పర్వతశ్రేష్ఠము, వచ్చి, నిలిచెను - ఎట్లనిన - వైవాహిక కార్యకర్త = పెండ్లికార్యమును జరుపువాఁడు, అగు, మఘవంతుఁడు = ఇంద్రుఁడు ('ఇంద్రోమరుత్వాన్ మఘవాన్' అ), అనంతసువర్ణ రత్న సందోహమున్ = కొలఁదిలేని బంగారము యొక్కయు రత్నములయొక్కయు సమూహమును, రాశి వోసి = కుప్పఁగాఁబోసి, విబుధుల్ = దేవతలును, మనుజులును, భుజగుల్ = నాగులును- అనఁగా దేవలోక

మర్త్యలోక పాతాళలోకములను ముల్లోకములందలి వారును, నుతింపఁగాన్, ఆహిమవత్ కుమార తనయామణికిన్ = హిమవంతుని కుమారుఁడయిన కోలాహలుని యీకూఁతురు మిన్నకు, ఊంకువు= ఓలి, తెచ్చెనోయనన్,= తెచ్చినాఁడో యనునట్లుగా, వచ్చి నిలిచెనని సంబంధము.

మేరుపర్వతము బంగరుకొండ. రోహణపర్వతము రతనాలకొండ. బంగారుకొండ వెంబడిని రతనాలకొండ వచ్చినిలుచుటను జూడఁగా పెండ్లిపెత్తనగాఁడయిన యింద్రుఁడు గిరికాదేవికి నోలిగా పెనుబంగారును రతనములును రాసులుగాఁబోసి నిలిపినట్లుండెనని యుత్ప్రేక్ష. రోహణము రత్నపర్వతమని ప్రసిద్ధి, 'గుణరత్నరోహణగిరే' అని ప్రతాపరుద్రీయము.

మ. మఱియున్ వచ్చిరి ధాత్రిఁ గల్గునగసామ్రాజ్యైక ధౌరేయు లం
దఱుఁ దద్భూరిభరార్తిఁ గ్రుంగు నవనిం దామ్యత్ఫణారాజిఁ బ
ల్మఱు సంధించుచునుండెఁ గాని వసుకల్యాణంబు వీక్షింప రా
వెఱచెన్ శేషుఁడు శేషవృత్తి కగునే విస్రంభసంచారముల్. 39

అ. ...నగసామ్రాజ్యైక ధౌరేయులు=పర్వతాధిపత్యమునకు ముఖ్యధురంధరులయినవారు - అనఁగా మిక్కిలి ముఖ్యులయిన పర్వతాధిపతులు అందఱును, వచ్చిరి. తత్ భూరిభర ఆర్తిన్= ఆమేటిపర్వతములయొక్క అధికమయిన బరువుయొక్క ప్రాప్తిచేత, క్రుంగు = దిగఁబడుచున్న, అవనిన్=భూమిని, శేషుఁడు, తామ్యత్ ఫణారాజిన్ = బడలుచున్న - అనఁగా సోలుచున్న-పడగలవరుసయందు, పల్మఱు, సంధించుచు నుండెఁగాని, వసుకల్యాణంబు=వసురాజు పెండ్లి, వీక్షింప రావెఱచెను. ఏలనఁగా, శేషవృత్తికిన్=దాసవృత్తిగల వానికని యర్థము - శేషశబ్దవృత్తిగలవానికని భావము. శేషుఁడను శబ్దమునామముగాఁ గలవానికనుట-ఇట వృత్తియనఁగా అభిధావృత్తి,విస్రంభసంచారముల్=ప్రణయ విహారములు- వేడుకకయిన తిరుగులాటలు, అగునే=అగునా- యుక్తపడవనుట.

వసుకల్యాణమనుచో కాంచనార్థకమయిన శబ్దద్వయమును గ్రహించుటచేఁ బునరుక్తవదాభాసము. అర్థాంతరన్యాసము నలంకారము.

ఉ. వచ్చిన సింధుకాంతల నవారిత సత్కరుణాభివృద్ధిచే
హెచ్చఁగఁ జేసి గోత్రశిఖరీంద్రుల నున్నతి గారవించి వై
యచ్చరలోకభర్తయు హిమాలయసూతికి నాస్పదంబుగా
నచ్చట నొక్కనూతనమహా నగరంబు మదిం దలంచినన్. 40

అ. వైయచ్చరలోకభర్తయున్=స్వర్గలోకాధిపతియైన యింద్రుఁడును, వచ్చిన, సింధుకాంతలన్=వివాహార్థమువచ్చిన నదీకాంతలను, అవారిత సత్కరుణాభివృద్ధిచేన్=అడ్డులేని మంచికృపారసము పెనుపుచేత, హెచ్చఁగజేసి=అతిశయించునట్లుచేసి, గోత్రశిఖరీంద్రులన్=కులపర్వత శ్రేష్ఠులను, ఉన్నతిన్ = పొడువుచేత, గారవించి= బహూకరించి, హిమాలయసూతికిన్ = కోలాహలునకు, ఆస్పదంబుగాన్ =పట్టుగా - విడిపట్టుగా ననుట, అచ్చట, ఒకనూతనమహా నగరంబున్, మదిన్ తలంచినన్.

సింధుకాంతలభివృద్ధిచే హెచ్చునవి. గోత్రశిఖరీంద్రులు ఉన్నతిచేత గారవ మందుదురు - కాన మొదటివానిని అభివృద్ధిచే హెచ్చించి రెండవవారిని ఉన్నతిచే గారవించినాఁడు-ఏధర్మముగలవారియం దాధర్మమాపాదించినాఁడనుట. కోలాహలునకు కేవలనగరముగాక మహానగరమేల? అందు నది నూతనమేల? యన్నచో హిమాలయ సూతికదా!. అట్టివానికి చిన్ననగరములు చాలవు. అప్పటి

మహానగరములును చాలవు. అంతకుఁదగిన పెద్దనగరము నూతనముగా నిర్మింపవలసినదే. అదియుఁ బని వాండ్రను గొని కట్టించుటకుఁ బెక్కేండ్లునుబట్టును కాన 'మదిఁ దలంచినఁ' చేయవలయును. చేయువాఁడు 'వైయచ్చరలోక భర్త' కదా. దీనికి మీఁదికన్వయము.

సీ. నిమ్నప్రపాతాంతనిర్ఝరపరిఖలఁ, గనుపట్టెఁ గోటలై కటకపరిధి
మణిచిత్రకిరణతోరణమాలికలతోఁ బ్రకాశించె గృహములై గహ్వరములు
శుచికరోపలభంగ సోపానసరణితోఁ, జెలఁగె సౌధాళియై శిఖరిపాళి
ఘనసారవసుసార గంధసారములతో, నలరె నంగణములై తటాజిరములు
తే. కలమధుర కోకిలాలాప కలనతోడఁ, జెన్నలరెఁ గన్నెలై కొన్ని చిన్నిలతలు
సమధికస్కంధ శాఖాభుజములతోడఁ, దనరెఁదరుణాగ్రగణ్యులై తరువులెల్ల.

అ. నిమ్న...పరిఖలఁ—నిమ్న=లోఁతియైన, ప్రపాత అంత=('ప్రపాతస్తుతటో భృగుః' అ.) పర్వతశిఖరములక్రింద నుండెడు పొడవయిన ప్రదేశములయొక్క చివరలను బ్రవహించునట్టి, నిర్ఝర=(ప్రవాహో నిర్ఝరో ఝరః' అ) సెలయేళ్లనెడు, పరిఖలఁ=అగడ్తలతో, కటకపరిధి=('కటకం వలయే సానౌ' అ 'పరివేషస్తుపరిధిః' అ) చక్రియొక్క వలయము - వలయాకారముగా నున్న నిలువుబండలచాలు, కోటలై, కనుపట్టెను. మణి...మాలికలతోఁ—మణి = రత్నములయొక్క, చిత్ర = నానావిధములయిన, కిరణ = కాంతులనెడు, తోరణమాలికలతోడఁ=తోరణములవరుసలతోడ, గహ్వరములు=గుహలు, గృహములై ప్రకాశించెను.

శుచి...రణితోన్—శుచికర = తెల్లనికిరణములుగల చంద్రునియొక్క, ఉపల= శిలలయొక్క-అనఁగా చంద్రకాంతపు ఱాలయొక్క, భంగ = తునియలనెడు, సోపానసరణితోడఁ = మెట్లచాలువులతోడ —, భంగ మనఁగా నిచట మెట్లవలెను అలలవలెను చాలువుగానుండునది; అలలచాలువుగానుండు చంద్రకాంతపుఱాలు,(ఇదియె. 'మణిపట్టిభంగసరణిఁ' అని మనుచరిత్రమునఁ జెప్పఁబడినది. మణిపట్టి=మణులపలకలయొక్క, భంగ = అలలవంటి చాలువులయొక్క, సరణిఁ =దారినని యర్థము. కాళిదాసును 'భంగీ భక్త్యావిరచితవపుః' మేఘసందేశము, అని మెట్లచాలువు పరముగాఁ జెప్పినాఁడు). సౌధాళియై = మేడలవరుసయై, శిఖరపాళి = శిఖరముల సమూహము, చెలఁగెను. ఘనసా...రములతోఁ—ఘనసార=కర్పూర పరఁటులనెడు కర్పూరములతోడను, వసుసార = రత్నశ్రేష్ఠములనెడు మఱింత మేలయిన మణులతోడను, గంధసారములతోఁ = చందనవృక్షములనెడు చందనముతోడను, తట అజిరములు= తటముల అంగణములు—అనఁగా ముంగిళ్లప్రదేశములు, అంగణములై, అలరెను.

కల...తోడఁ—కలమధుర = అవ్యక్త మధురములయిన, కోకిల ఆలాప=కోయిలపలుకులనెడు, కలనతోడఁ=అవ్యక్త మధురములయిన కోయిల పలుకులవంటి పలుకులతోడ, కొన్ని, చిన్నిలతలు=లేఁదీఁగలు, కన్నెలై = కన్నెపడుచులై, చెన్నలరెఁ = బాగుమీఱెను. సమధి...ములతోడఁ—సమధిక=పొడవులయిన, స్కంధ=బోదెలనెడు భుజశిరస్సులుగల, శాఖ=కొమ్మలనెడు, భుజములతోడఁ=బాహువులతో, తరువులెల్లఁ= వృక్షములన్నియు, తరుణ అగ్రగణ్యులై= మేటి వయసుకాండ్రగు పురుషులై, తనరెఁ=ఒప్పెను. ఇట్లు దానుగ్రహమున నిర్ఝరాదులకుఁ బరిఖాది రూపములు సిద్ధించుటవలన నారోపశంక సేయఁగూడదు.

ఉ. ధాతుపరాగ రక్తియును దంతవిభక్తియుఁ జామరప్రకా
శాతిశయంబు సంకులమదాంకనముం గదళీకదంబసం
భూతియుఁ గర్బురాకృతియుఁ బుష్కరభూతియుఁ బూని భద్రతా
ఖ్యాతి వహించె మించెఁ బృథుగండము లచ్చట నద్భుతంబుగాన్. 42

అ. ఇందు కోలాహలపర్వతమందలి గండశిలలు పట్టణమునకుఁదగిన భద్రగజత్వ ఖ్యాతిని వహించెనని చెప్పినాఁడు. కనుక, గండశిలా ధర్మములన్నియును భద్రగజధర్మములుగాఁ జెప్పఁబడుచున్నవి. ఎట్లనినన్—ధాతు పరాగరక్తియును = గైరికధాతువు ధూళియొక్క యెఱుపును, గైరిక ధాతురజముచే రేఖాశృంగార రంజనమును-రేకలుగా నలంకారమునకై రంగు పెట్టుట యనుట, దంత విభక్తియున్=('దన్తస్సానుని కథ్యతే' అని విశ్వముచొప్పున దంతమనఁగా సానువు గనుక) సానువుల ఏర్పాటును-ఏనుఁగు దంతముల విభాగమును, చామరప్రకాశ అతిశయంబు=చమరీ మృగసమూహముయొక్క, ప్రకాశాతిశయము = వింజామరల ప్రకాశాతిశయమును, సంకుల మదాంకనమున్= (సంకులనఁగా జవ్వాదిపిల్లులు) జవ్వాదిపిల్లుల మదచిహ్నమునని యర్థము - (సంకులన్నచోట. 'అసంబుద్ధా భవేద్వావుర స్త్రీయాంల్వాదివర్గకే' అను అథర్వణ వచనముచేత వుప్రత్యయము చెప్పినాఁడు గాఁడు. సంకుల మదాంకనమన్నది షష్ఠీతత్పురుషసమాసము. షష్ఠీభవే ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితానామ్నామ్' అను నన్నయభట్టీయ సూత్రముచేత షష్ఠీస్థానమందు 'సంకులన్' అని ద్వితీయ వచ్చినది.) సంకులమైన గజమదచిహ్నము నని యర్థాంతరము. కదళీకదంబ సంభూతియున్=అరఁటిచెట్లయొక్క కడప చెట్లయొక్క పుట్టుకయును - ('కదళీ వైజయన్త్యాంచ రంభాయాం హారిణాంతరే' వి. 'కదంబమాహుస్సిద్ధార్థే నీపేపి నికురుంబకే' విశ్వము.) అనుచొప్పున పతాకల సమూహముయొక్క గొప్ప వైభవము. [ఏనుఁగులపయిని పతాకలుగట్టుట ప్రసిద్ధము. దీనినె దెంచనములనెదరు. భారత విరాటపర్వమున,

పొడవుల సడిసన్న యొడళులు దెంచనమ్ముల పెంపు గగనంబు కొలఁదివెట్ట

ఇది యేనుంగుల పయిఁగట్టు నాయుధ ప్రాయములయిన పతాకలు. దీనినే కూలునేనుఁగులఁ గుంభమధ్యముల, వ్రాలుమావతులఁ బైవ్రాలుదెంచనలు' (రామా యుద్ధకా) అనియున్నది. విరాటపర్వమందలి దెంచనమ్ములకు మాఱుగా డెక్కెయమ్ములనియుఁ బాఠము చూపట్టుచున్నది. దీనిని పెద్ద పిరంగియని సీతారామాచార్యులు వ్రాసిరి. దంచన, దంచనము అను శబ్దములకే కాని దెంచనములకుఁ గాదు. 'దంచనపుఁజేతులు గంగను కాసెచుట్టుగా' (ఆముక్తమాల్యద.) దంచనములును జబురుజంగులును తుపాకులును (కళాపూర్ణోద.)

కదళీశబ్దమునకు, 'కదళీవైజయన్తీ' అని హలాయుధుఁడు. ఏనుఁగు నంబారిమీఁది టెక్కెమని శబ్దరత్నాకరము. 'కదళీకాంచన కక్ష్యలన్ మెఱయు లేఖస్వామి చౌదంతిపైన్' అని మనుచరిత్రమును 'అంబారిమీఁది టెక్కెమయిననే తిక్కన 'పొడువుల సడిసన్న యొడళులు దెంచనమ్ముల పెంపు' నని యొడలి పొడువులతో దెంచనమ్ముల పెంపును గగనమును కొలఁది పెట్టెనన్నాఁడు. కేవలాయుధపరమయినచో నట్లు చెప్పుటకు వీలుపడదు. కాన, దెంచనములనఁగా అంబారిమీఁది టెక్కెములె. తెక్కెయమ్ములని యిందులకుఁ బాఠాంతరము చూపట్టుటయు నిందుల కుపబలముగానే యున్నది.] కర్బురాకృతియున్ = తమ నీలవర్ణమును - ఏనుఁగు నీలవర్ణమును, పుష్కరభూతియున్=(పుష్కరమనఁగా 'పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండ ముఖేజలే' అ. అనుటచే జలమును ఏనుఁగు తొండము

శానయు, భూతియనఁగా 'భూతిర్మాతంగ శృంగారే జాతౌ భస్మని సంపది' వి. అనుటచే సమృద్ధియు నేనుంగు శృంగారమును) జలసమృద్ధి యని యర్థము. తొండము శృంగారమునని యర్థాంతరము. పూని=ధరించి, పృథుగండములు = గొప్పలయిన గండశిలలు, అచ్చటన్, అద్భుతంబుగాన్. భద్రతాఖ్యాతిన్ = భద్రగజములనెడి ప్రసిద్ధిని - భద్రగజములగుటను, వహించి, మించెననియర్థము, భద్రమనఁగా శుభమును, గండములనఁగా గండదోషములు పృథుగండములు అనఁగా గొప్ప గండములను దోషముల, భద్రతాఖ్యాతి వహించెన్=శుభములయి మించెను. ఇది అత్యాశ్చర్యము గాన 'అద్భుతంబుగా' నన్నాఁడు.

ఏనుఁగులకును గుఱ్ఱములకును నలంకారముగా చామరము గట్టుట తొల్లిగలదు. 'లంబమాన రవిరథతురంగ శృంగార చారుచామర చ్ఛటాప్రేక్షణ క్షణోద్గ్రీవ చమరసముదయంబగు నుదయంబున' (మను - 1-72) మఱియు శిలాతలంబుల జవ్వాదింగూర్చి కసటువో బీటెండఁ గరఁగి కజ్జలసంటి గమగమవలచు చొక్కపుజవాజి (మను-2-55).

ఉ. జాతికి నెల్ల రాజపరిచర్యయు గాలికి నెక్కుడన్న వి
ఖ్యాతియు రాఁ గురంగములు కోగట్టున నేమితపం బొనర్చెనో
యాతతశృంగభారరహితాత్మమహాముఖకాంతతాప్తి నౌ
రా తనరారె నన్నియుఁ దురంగములై తదభీష్టసంపదన్. **43**

అ. కురంగములు=లేళ్లు, జాతికి నెల్లన్=తమ లేడిజాతికంతయు, రాజపరిచర్యయున్=రాజసేవయని యర్థము - చంద్రసంగతియని భావము, గాలికిన్ ఎక్కుడు అన్న విఖ్యాతియున్=గమనవేగమందు వాయువుకంటె నధికమనెడు ప్రఖ్యాతియు నని యర్థము. వాయుదేవునకు - ఎక్కుఁడు వాహనమని భావము.) రాన్=ఈ రెండును వచ్చుటకొఱకు, గట్టునన్=కోలాహల పర్వతమందు, ఏమి తపంబు ఒనర్చెనో, తదభీష్టసంపదన్=వానికోరిక యొడఁగూడుటగా, ఆతత... తాప్తిన్—ఆతత=నిడుదలయిన, శృంగభార రహిత=కొమ్ములబరువు లేనట్టి, ఆత్మ మహాముఖ=తమ పెనుమొగముల యొక్క, కాంతతా+ఆప్తిన్ = సొగసుందనముయొక్క ప్రాప్తిచేత, అన్నియును, తురంగములై=గుఱ్ఱములై, తనరారెను, ఔరా=భళాయని యర్థము- (శృంగారము కొమ్ము అనఁగా ఉకారము-ఆతత శృంగభారరహిత = నిడుదలయిన ఉకారములేనట్టి, ఆత్మమహాముఖ=తమ కురంగశబ్దము ముఖవర్ణమయిన, కాంత=కకారముయొక్క, అంతము అనఁగా లోపముగల, తాప్తి=తకార ప్రాప్తిచేత, తురంగములై తనరారెననియు నర్థము.)

అనఁగా ఉకారరహితమయిన కురంగశబ్దము తొలికకారము కేవల కకారమని గ్రహించునది. కేవల కకారస్థానమందు 'త'కారము వచ్చి కకారముమీఁది ఉకారముతోఁ గూడికొని తువర్ణమయినదని యాశయము. అనఁగా కురంగాకారము తురంగాకారమై కురంగశబ్దము తురంగశబ్దమై ఆకృతిచేతను నామముచేతను కురంగములు తురంగములయ్యెనని యాశయము.

చ. హరిపర తంత్రవృత్తియు మహామణిచాప శరానుబంధ బం
ధురతయు రాజహంసకవినోదనముం బవిఘోషఘుర్ఘర
స్వరమును జిత్రవిగ్రహ విశంకటభావముఁ బూని శైలరా
ట్పురి నరదంబులై శరదబ్దముల్ నెరసెం జపలాంశుసంపదన్. **44**

అ. ఇందుఁ గోలాహలునియందలి మేఘములు పట్టణోచితరథము లయ్యెనని చెప్పినాఁడు గనుక మేఘధర్మములన్నియు రథధర్మములుగాఁ జెప్పఁబడినవి - హరిపరతంత్ర వృత్తియుక్ =(హరి యనఁగా నింద్రుఁడును గుఱ్ఱమును) ఇంద్రునకు లోనయినవృత్తిని - గుఱ్ఱములకు లోనయిన వృత్తిననియు, మహా...ధురతయుక్ — మణిచాపమనఁగా ఇంద్రధనుస్సును మణిమయమయిన చాపమును శర మనఁగా జలమును బాణమును.) ఇంద్రచాపముతోను జలముతోను కూడిన సొగసును - మణిమ యములయిన ఎండయు బాణములయు కూడికవలని సొగసును, రాజహంస కవి నోదనముక్ — రాజహంస = రాయంచలనెడు, కవి = పక్షులయొక్క, నోదనముక్ = పోకార్పును, (మేఘము లకును హంసలకును విరోధము—మేఘోదయమును జూడఁగా హంసలు మానస సరస్సునకుఁ బోవును. లేక — రాజ = చంద్రునియొక్కయు, హంస = సూర్యునియొక్కయు, కవి = శుక్రునియొక్కయు, నోదనముక్ = ఆచ్ఛాదనముననియు నర్థము. రాజహంసక = రాజశ్రేష్ఠుల యొక్క, వినోదనముక్ = క్రీడింపుటను - రాజోత్తములకు విహారాదులచే నుల్లాసముగొలుపు టయు నని యర్థాంతరము. పవిఘోషఘర్ఘరస్వరమును = ఘర్ఘర స్వరమువంటి- అనఁగా నేమి ధ్వనివంటి వజ్రనిర్ఘోషమును- అనఁగా ఉఱుమును - ఉఱుమువంటి నేమిధ్వనిని, చిత్రవిగ్రహవిశంకట భావముక్ = ('విశంకటం పృథుఃబృహద్విశాలం పృథులంమహత్' అ.) కామరూప శరీరమహత్త్వ మును - అద్భుతాకార మహత్త్వమును, పూని=వహించి, శైలరాట్పురిక్ =కోలాహలపర్వతరాజ పట్టణమందు, అరదంబులై=రథములై, శరదముల్ = మేఘములు, చపల +అంశుసంపదక్ =మెఱపుఁ దీఁగలయొక్క కిరణసంపత్తిచేతను—చపల+అంశుసంపదన్ =చంచలములయిన కాంతిసంపదచేతనని రథపరముగా, నెరసెక్ =వ్యాపించెను.

అ. గిరివరఘోరకందరలఁ గేవలవన్యగజైకవృత్తిచేఁ
దరలక యున్నసత్కృతము తప్పునె యప్పురికేసరుల్ నృకే
సరు లయి పూర్ణపౌరుషవిశాలత మించె మహానృకేసరిం
బరునకు మార్గ మిడమి భక్తునిఁ బ్రోవ సటల్ ఘటింపమిన్. 45

అ. గిరివరఘోరకందరలక్ = కోలాహలమందలి భయంకరములయిన గుహలయందు - (దరీ కుకన్దరోవా స్త్రీ)—'కందరాగ్రీవోల్కాప్రభృతుల స్త్రీత్వంబువై భాషికంబు') కేవల...వృత్తిచేక్ - కేవల =ముఖ్యమగునట్లుగా, వనీ = వనమందలి, అగ = వృక్షములవలన, జ=పుట్టిన, ఏకవృత్తిచేక్ = ఒక టేవృత్తిచేత,—అనఁగాఁ గేవల వనవృక్షఫలాద్యాహారనియతవ్యాపారముచేతనని యర్థము.— కేవలము, వన్యగజ = అడవియేనుఁగులే, ఏకవృత్తిక్ = ముఖ్యవ్యాపారముగా, అవియె ముఖ్యమయిన యాహారముగానని భావము, తరలక = చలింపక, ఉన్న, సత్కృతము = మంచికార్యము - పుణ్య పనుట—అనఁగా కొండగుహలందు వన్యాహారములతోఁ దపము చేయుట, తప్పునే = వ్యర్థమగునా! కాదు. కనుకనే, కేసరుల్ = సింహములు, అప్పురిక్ = ఆపట్టణమందు, నృకేసరులై = పురుష శ్రేష్ఠులై, పూర్ణపౌరుషవిశాలతక్ = నిండయిన పరాక్రమముయొక్క విశాలతచేతనని యర్థము - నిండయిన పురుషాకారముచేతనని భావము. (పౌరుషం పురుషస్యోక్తం భావేకర్మణి తేజసి' అనివిశ్వ ము.) మహానృకేసరిక్ = మహానృసింహుని, మించెను, ఎందుచేతననఁగా - పరునకు మార్గంబు ఇడ మిక్ = శత్రువునకు పెడమొగము వహింపకపోవుటచేతను - భక్తునిక్ ప్రోవక్, సటల్ = (సట

లనఁగా అసత్యములు) అసత్యములాడకపోవుటచేతను మహానృసింహుని మించెనని సంబంధము - మహానృసింహుఁడు పరునకు మార్గము పెట్టినవాఁడును భక్తునిఁ బ్రోచుటకు సటలు (అసత్యములు) ఘటించినవాఁడును, అని దోషారోపము, మార్గ్ఞంబిడుట = మనుష్యరూపమునకు మాఱయిన సింహ ముఖముఁదాల్చినవాఁడనియు సటలుఘటించినాఁడనఁగా మెడమీఁదజూలు గలవాఁడనియునుభావము.

మొదట కేసరులు పిదప నృకేసరులయినవి; అవతల మహానృకేసరిని మించినవి; అన్నందున కేసరు లుత్కృష్టమయిన నృకేసరిజన్మమునొంది యాజన్మమందుఁ దమకంటె నధికుఁడయిన మహా నృకేసరిని జయించిన సర్వోత్కృష్టదశను జెందెనని స్వారస్యము స్ఫురించుచున్నది. సటయనుపదము కల్లయనుటకు 'వలపులుసట వావులునహి' సారంగధరచరిత్రము. అల. శ్లేషానుప్రాణిత వ్యతిరేకము.

సీ. విపులవప్రంబులు ♦ విప్రవరావాస,వాటముల్ కల్యాణ♦కూటములును
భూదారవర్గముల్♦భూరికంచుకిఖడ్గి, హరిరాజతతులు యూ♦థాధిపతులు
శ్యామాసమాజముల్ ♦సామోదవిటపప్ర, కాండముల్ సరసుల♦తండములును
నిర్జరస్థానముల్ ♦నిరుపమగణికావి,నోదముల్ వంశని♦నాదములును
తే. గలుగుఁగాకేమి నగములఁ ♦ గలుగు టరుదె
కలయ నివియెల్ల నిజనామ♦గరిమ వదల
కచట నుచితార్థగతిఁ బూను ♦ టరిది గాక
యనఁగ హరికృపఁ బట్టనం♦బయ్యె వనము. **46**

అ. విపుల వప్రంబులు = విరివిగైనసానువులును, వి + ప్రవర+ఆవాసవాటముల్ = పక్షి శ్రేష్ఠములు నివాసపువరుసలు, కల్యాణకూటములును = (కూటో స్త్రీ) శిఖరంశృఙ్గమ్' అ) బంగారు శిఖరములును, భూదారవర్గముల్ = పందులగుంపులు, భూ...తతులు - భూరి = పెక్కులయిన, కంచుకి = సర్పములయొక్కయు, ఖడ్గి=ఖడ్గములయొక్కయు,హరి=సింహములయొక్కయు, రాజ= (రాజాప్రభౌనృపేచంద్రే యక్షేక్షత్రియశక్రయోః' విశ్వ) యక్షులయొక్కయు, తతులు = సమూహ ములును, యూథాధిపతులును = గుమికి మొనగాండ్రయిన మృగములును, శ్యామాసమాజముల్ =ప్రేం కణపులీఁగలగుంపులును, స+ఆమోదవిటప ప్రకాండముల్ = వాసనలతోఁగూడిన కొమ్మలుగల చెట్టు బోదెలును, సరసులతండములును = కొలఁకుల సమూహములును, నిర్జరస్థానముల్ = దేవతాస్థానము లును, నిరుపమగణికావినోదముల్ = సాటిలేని యడవిమొల్లల వేడుకలును - ('గణికాయూథికాం బష్ఠా' అ) వంశనినాదముల్ = బొంగువెదుళ్లయొక్క ధ్వనులును, కలుగుఁగాక యేమి = కోలా హలపర్వతమందుండిన నేమాయెను, నగములన్ = పర్వతములందు, కలుగుట = ఉండుట, అరుదె= ఆశ్చర్యమా-కాదనుట. ఇఁక నేమనఁగా, కలయన్ ఇవియెల్లన్ = ఈచెప్పఁబడిన వప్రాదులన్నియు ను, నిజనామగరిమన్ = తమపేరిగౌరవమును, వదలక, అచటన్, ఉచితఅర్థగతిన్ = పట్టణమునకు ఉచితమయిన వస్తురీతిని, పూనుట - అనఁగా.

విపులవప్రంబులు = ('సానుప్రాకారయోర్వప్రః' వి) విశేవిరైన కోటలును, విప్ర+వరావాస వాటముల్ = బ్రాహ్మణశ్రేష్ఠుల యిండ్లవాడలును, కల్యాణకూటములును = (వాసఃకూటోద్వయోః శాలా' అ) శుభకరమయిన గృహములును, భూదారవర్గముల్ = భూమి దార - అనఁగా పత్నిగా గలిగిన రాజుల సమూహములును, భూ...తతులు—భూరి=అనేకులయిన, కంచుకి=కవచముదాల్చిన వారియొక్కయు, ఖడ్గి = ఖడ్గములఁదాల్చినవారియొక్కయు, హరి = అశ్వములయొక్కయు, రాజ=

క్షత్రియులయొక్కయు, తతులు = సమూహములును, యూథాధిపతులు = సేనాపతులును, శ్యామాగమాజముల్ = నడియౌవనముగల స్త్రీలసమూహములును, ['శ్యామాస్వఙ్గం చకితహరిణీప్రేక్షణేదృష్టిపాతమ్' మేఘసందేశము. అని కాళిదాసును 'శ్యామాలతల' ను స్త్రీలమేనికి సాటిగాఁజెప్పినాఁడు. సామోదవిటప్రకాండముల్ = సంతోషముతోఁగూడిన విటశేఖరులు సమూహములును - (విటపో న స్త్రియాం స్తంబశాఖావిస్తారపల్లవే, విటాధిపేనా' మేదిని) సరసుల తండములును = రసికులసమూహములును, నిర్జరస్థానముల్ = జర - అనఁగా ముదిమి-లేనివారల (వయసుకాండ్ర) స్థానములును, నిరుపమగణికావినోదముల్ = అసమానలయిన వేశ్యాంగనల వినోదములును, వంశీనినాదములును = పిల్లఁగ్రోవుల ధ్వనులును, అని, ఉచితార్థగతిఁబూనుట = పట్టణమునకుఁ దగినవస్తువులరీతిని వహించుట - పట్టణమునకుఁదగిన ప్రాకారాదివస్తువులగుట, అరిదిగాక = ఆశ్చర్యమేకాని, అనఁగన్ = అనునట్లుగా, హరికృపన్ = ఇంద్రుని యనుగ్రహముచేత, వనము=కోలాహలపుఅడవి, పట్టనంబయ్యెన్ = ఒకపట్టనమాయెను.

మ. ఘనఘోషార్భటియున్ సమీరణముఖాఘాతాహితానాహత
స్వననానాసుషిరావళీఘుమఘుమవ్యాపారముం గిన్నరీ
నినదంబుం గలకంఠికారవసుధానిష్ఠ్యూతియున్ ఝర్ఝరౌ
ఘనినాదంబును నందుఁ గ్రందుకొనుచుం గప్పెం గకుప్పాళికన్. 47

అ. ఘనఘోషార్భటియున్ = మేఘములగొప్పధ్వనియని యర్థము—(కాంస్యంతాళాదికం ఘనమ్' అన్నట్లు ఘనమనఁగా కాంస్యతాళాదిధ్వని గనుక) తాళాదికాంస్యవాద్యఘోష మని యర్థాంతరము. సమీ ... వ్యాపారమున్ - సమీరణ = వాయువుచేత, ముఖాఘాత = ముఖప్రదేశమందలి తాఁకుడుచేత, ఆహిత = కూర్పఁబడినదియు, అనాహత = కొట్టుపడనిదియునయిన, స్వన= నాదముగల, నానాసుషిరావళీ= నానావిధబిలసమూహమందలి, ఘుమఘుమవ్యాపారమున్ =ఘుమఘుమాకారముననియర్థము. సమీరణ=(సమ్యక్+ఈరణం = సమీరణమనివ్యుత్పత్తి- లెస్సగాఁబలుకుచున్నదయిన, ముఖ = ముఖముచేత, ఆఘాత = పూరించుటచేత, ఆహిత అనాహత = ఆహితమును అనాహతమునయిన, స్వన = నాదముగల, నానా=నానావిధములయిన, సుషిరావళీ = వంశాదివాద్యములయొక్క, ఘుమఘుమవ్యాపారమని యర్థాంతరము. ('వంశాదికంతుసుషిరమ్' అని అ) కిన్నరీనినదంబున్ = కిన్నరపక్షి కాంతలధ్వనియునని యర్థము—కిన్నరీవాద్యవిశేషనాదమని యర్థాంతరము. కల...తియున్—కలకంఠికా = ఆఁడుకోవెలలయొక్క, ఆరవసుధా = నాదమనెడి అమృతముయొక్క, నిష్ఠ్యూతియున్ = వెడలఁగ్రక్కుటయు ననియర్థము - అవ్యక్తమధురమయిన కంఠనాదముగల స్త్రీలయొక్క మధురనాదమని యర్థాంతరము. ఝర్ఝర+ఓఘనినాదంబును=విశీర్ణనదియొక్క ప్రవాహధ్వనియునని యర్థము—(వాద్యప్రభేదాడమరు మడ్డుడిండిమఝర్ఝరాః' అని అ. 'విలంబితం ద్రుతం మధ్యం తత్త్వమోఘోఘనంక్రమాత్' అ) వాద్యవిశేషముయొక్క—అనఁగా జేగంటలయొక్కద్రుతనినాదమనియర్థాంతరము. అందున్ =ఆకోలాహలాచలపట్టణమందు, క్రందుకొనుచున్ = దొమ్మియగుచు, కకుబ్పాళికన్ =దిక్కులసమూహమును, కప్పెను-(దిశస్తుకకుభః కాష్ఠాః' అ) దిక్కులనెల్లఁ గ్రమ్మెననుట. పర్వతమందు స్వాభావికములగు మేఘాదులధ్వనులను పట్టణమందలి వాద్యాదులధ్వనిగా సమర్థించినాఁడు.

మ. అగురుక్షోదపటీరభేద ఘనసారామోదసంభేదము
మృగనాభిద్రవచర్చికల్ వికచమల్లీ మాలికల్ కీరరా

జగరుద్రాజివిరాజితోరణము లంచచ్చామరంబుల్ ధగ
ద్ధగితామూల్యమణీవితానకములుం దద్భూమిఁ బొల్చెం దగన్. 48

అ. అగురుక్షోద=అగరుచెట్ల పొడియొక్కయు, పటీరభేద=చందనపుఁ బ్రానితునియలయొక్కయు, ఘనసార = కర్పూరపరఁటులయొక్కయు, ఆమోదసంభేదముల్ = పరిమళములకూడికలని యర్థము—అగరుచందన కర్పూరములయొక్క మేళములని యర్థాంతరము. మృగనాభిద్రవచర్చికల్ = మృగములయొక్క నాభిరక్తపుఁబూఁతలని యర్థము—కస్తూరి గందపుఁబూఁతలని యర్థాంతరము. వికచమల్లీమాలికల్ = వికాసముతోఁగూడిన మల్లెతీఁగలచాలుపులని యర్థము. వికసించిన మల్లెపూలదండలని యర్థాంతరము. కీర ..రణములు—విరాజి=రాజిల్లుచున్న-తోరణములవలెనుండు, కీరరాజి= పేటిచిలుకలయొక్క, గరుత్‌రాజి= ఱెక్కలచాల్పులని యర్థము—ఉరణములనఁగా కొండగొఱియలు గనుక చిలుకల ఱెక్కలచాలుపులును గొండగొఱియలునుయు—కీరరాజగరుద్రాజులవంటి విరాజించుచున్న తోరణములని యర్థాంతరము. అంచత్‌చామరంబుల్ = ఒప్పుచున్న చమరీమృగ సమూహములని యర్థము—వింజామరలని యర్థాంతరము. ధగద్ధగితఅమూల్యమణీవితానకములున్ = ధగధగమని మెఱయు విలువలేని మణులసమూహములని యర్థము.—ధగధగమని మెఱయు వెలలేని రత్నముల (అస్త్రీ విశానముల్లోచః’ అని అ) మేలుకట్లులని యర్థాంతరము. తద్భూమిన్ = ఆస్థలమందు, తగన్, పొల్చెను. పర్వతమందలి సహజములయిన యగరుచందన వృక్షాదులను, పట్టణమందలి అగరుచందనాద్యలంకార వస్తుసామగ్రిగాఁ జెప్పినాఁడు.

సీ. పద్మినీనవపాత్ర పాళికానీతగం, ధరజంబు లొకవంకఁ దావులీన
వరవర్ణినీవర్గ పరికల్పితాంగరా,గ విశేష మొకచాయఁ గడలుకొనఁగ
రంభోరు కాండోత్కరపురోముఖన్యస్త, ఫలజాత మొకదెసఁ బరిఢవిల్ల
బూగీసుకంధరాపుంఖితక్రముకతాం, బూలీదళము లొక్కపొంత నెసఁగ

తే. మిత్రకాంతాభిలక్షితారాత్రికములు, శ్రుతిహిత ద్విజకామినీసుస్వరములు
మృగవిశాలేక్షణాదత్తమృగమదములు, బలసియందుశుభార్థవైభవము దెలుప.

అ. అందున్=ఆకోలాహలపర్వత పట్టణమందు, పద్మి...రజంబులు—పద్మినీ=తామర తీఁగ చేత, నవపాత్రపాలికా = వివాహమునందు నవధాన్యములు పోసెడిపాలిక మూఁకుళ్లవలెనున్న, నవ పాత్రపాలికా=క్రొత్త ఆకులసమూహముచేత, ఆనీత=చేకొనఁబడిన, గంధరజంబులు=పరిమళముతోఁ గూడిన పుప్పొడులని యర్థము - పద్మినీ=పద్మినీజాతి స్త్రీలచేత, నవపాత్రపాళికా = క్రొత్తపాత్రల వరుసచేత, ఆనీత=తేఁబడిన, గంధరజంబులు=గందవొళ్లని యర్థాంతరము- శుభసూచకముగాఁ బేరఁటాండ్రు పాత్రలయందు గందవొడి దెచ్చుట గలదు. ఒకవంకన్=ఒకవైపున, తావులీనన్=వాసనలు గుబాళింపఁగా,వర...విశేషము—వరవర్ణినీవర్గ= (స్త్రీరత్నేచ ఫలిన్యాంచ దృశ్యతే వరవర్ణినీ’ విశ్వము.) ప్రేంకణపుతీఁగల సమూహముచేత,పరికల్పిత=కల్పింపఁబడిన, అంగ=తమయాకారము యొక్క, రాగవిశేషము=రక్తచ్ఛాయా విశేషమని యర్థము. ప్రేంకణపుతీఁగ లెఱ్ఱగానుండును— (వరవర్ణినీవర్గ= స్త్రీసమూహముచేత, పరికల్పిత=చేయఁబడిన, అంగరాగ విశేషము = మైపూఁతయని యును) ఒకచాయన్=ఒక్కవైపున, కడలుకొనఁగన్ = నెరయఁగా, చందన చర్చితలగు స్త్రీలును శుభనిమిత్తమే.

రంభో...జాతము—రంభా=అరఁటిచెట్లచేత, ఊరు=గొప్పలయిన, కాండ=బోదెలయొక్క, ఉత్కర=సమూహముయొక్క, పురోముఖ = అగ్రభాగమందు, న్యస్త=ఉంపఁబడిన - అనఁగా గెల

వేయఁబడిన, ఫలజాతము = ఫలసమూహమని యర్థము. (రంభోరు=స్త్రీలయొక్క, కాండ=సమూహముయొక్క, ఉత్కర=ఎత్తఁబడిన చేతులయొక్క, పురోముఖ=అగ్రభాగమందు, న్యస్త=ఉంపఁబడిన, ఫలజాతము=నానావిధఫల సమూహమనియు.) ఒకదెసన్, పరిఢవిల్లన్=ఒప్పుచుండఁగా - స్త్రీలు చేతుల ఫలములెత్తికొని యుండుటయు శుభసూచకము. పూగీ...దళములు—పూఁగీ=పోఁక చెట్లచేత, సుకంధరా = యోగ్యమగు కంఠప్రదేశమందు, పుంఖిత = నిండింపఁబడిన, క్రముక = పోఁకలును, తాంబూలీదళములు = తములపాఁకు తీఁగలుననియర్థము-అనఁగా పోఁకచెట్లును తములపాకు తీఁగలును మెలఁగియున్నవనుట-(పూగీసుకంధరా=పోఁకబోదెలవంటి కుత్తుకలుగల స్త్రీలచేత, పుంఖిత=కూర్పఁబడిన, క్రముక తాంబూలీదళములు=పోఁకలును తములపాకులు ననియు) ఒక్కపొంతన్, ఎసఁగన్ = అతిశయింపఁగా, స్త్రీలు వక్కలాకులు తెచ్చుటయు శుభకరమే.

మిత్ర...త్రికములు—మిత్రకాంత=సూర్యకాంతముల చేత, అభిలక్షిత = కనఁబఱుపఁబడిన, అరాత్రికములు=రాత్ర్యభావములుగల సమయములనియర్థము. అనఁగా సూర్యకాంత మణిదీప్తుల చేత రాత్రులును బగళ్లవలె నగుచున్నవని భావము. ఇట రాత్రియను పదముపై బహువ్రీహియందు కప్రత్యయము - (మిత్రజనులయొక్క కాంతల చేత, అభిలక్షిత = కైకొనఁబడిన, ఆరాత్రికములు=ఆరతులనియు.) శ్రుతి...స్వరము—శ్రుతివిహిత = చెవికి ఇంపయిన, ద్విజకామినీ= పక్షికాంతల యొక్క, సుస్వరములు=మంచి కంఠధ్వనులని యర్థము - శ్రుతిహితద్విజ = వేదాధ్యయన పరులయిన బ్రాహ్మణులయొక్క, కామినీ= స్త్రీలయొక్క, సుస్వరములు=యోగ్యమయిన పెండ్లిపాటలయొక్క స్వరములనియు) మృగ...మదము—మృగవిశాలేక్షణా=కస్తూరీ మృగకాంతల చేత, దత్త=ఇయ్యఁబడిన, మృగమదములు=కస్తూరికలని యర్థము - (మృగములయొక్క నేత్రములవలెవిశాలములయిన నేత్రములుగల స్త్రీలచేత ఇయ్యఁబడిన మృగమదములనియును) బలసి=ఇవన్నియుఁ జుట్టును గలిగి - లేక బలిష్ఠములై, శుభార్థ వైభవమున్=శుభనిమిత్తకమయిన విభవమును, తెలుపన్ = తెలుపఁగా, మీఁదికన్వయము.

చ. కనుఁగొని కన్నెనెచ్చెలులు కాననదేవత లాయహార్యశా
సనవసువాసవప్రబలసఖ్యము నాత్మమనోరథద్రుమా
తనఫలపాకరేఖయు ముదంబున నెన్నుచుఁ బుణ్యవాహినీ
వనితలుఁ దారు సామయిక వైభవముల్ సమకూర్చునంతటన్. 50

అ. కన్నె...దేవతలు = గిరిక చెలికత్తెలయిన వనదేవతలు, కనుఁగొని = చూచి, ఆ...సఖ్యమున్—ఆ, అహార్యశాసన = పర్వతమును దండించిన, వసువాసవ = వసురాజుయొక్కయు ఇంద్రునియొక్కయు, ప్రబలసఖ్యమున్=బలీయమయిన చెలిమిని - ఇరువురును పర్వతశాసనులుగనుక నిరువురకును కేవలసఖ్యమే కాదు. ప్రబలమయిన సఖ్యమును ఘటిల్లెనని 'అహార్యశాసన' విశేషణసారస్యము. ఆత్మ...రేఖయున్—ఆత్మమనోరథ = తమకోరికలనెడు, ద్రు = వృక్షములయొక్క - (పలాశిద్రుద్రుమాగమాః' అ) ఫలపాకరేఖయును=ఫలపరిణతియును - అనఁగా ఫలించుటయును, ఎన్నుచున్= కొనియాడుచు, ఇట నెచ్చెలులు వనదేవతలుగనుక వారివృక్షఫల సంబంధము స్ఫురించుచున్నది. పుణ్యవాహినీ వనితలున్ తారున్=పుణ్యనదీకాంతలును తామును, సామయిక వైభవముల్ = సమయసంభవములయిన విభవములను, సమకూర్చు నంతటన్=ఆయిత పఱచుచున్న మీఁదట - అప్పటికిఁదగిన పెంపుసొంపుల నొడఁగూర్చుచున్నపు డనుట. మీఁదికన్వయము.

క. ఈరే యొకశుభలగ్నం, బీరే వివరించి వరున కింతికిఁ గుశలం
బీరే యన వాచస్పతి, యీరేడుజగంబు లేలునేలికఁ బలికెన్. 51

అ. ఇంద్రుఁడు - కర్త, అధ్యాహార్యము, బృహస్పతితో, ఈరేయి, ఈరే=మీరే, ఒకశుభలగ్నంబును, వివరించి=విచారించి, వరునకున్ ఇంతికిన్=వధూవరులకు, కుశలము, ఈరే = ఇయ్యరే, అనఁగా, వాచస్పతి=బృహస్పతి, ఈరేడుజగంబులు ఏలునేలికన్ = పదునాలుగు లోకములను బాలించు ప్రభువయిన యింద్రునిఁగూర్చి.

శా. సూర్యాదిగ్రహతారకా తదధిప స్తోమంబుతో నిట్టి స
త్కార్యం బీవు భరింప శోభనముహూ ర్తధ్యేయపుణ్యాపగా
హార్యస్వాములు పెండ్లిపెద్దలయి రా నస్మత్కృతాచార్యకం
బార్యప్రస్తుత మై వధూవరుల కత్యైశ్వర్య మీఁ జాలదే. 52

అ. సూర్యా...తోన్—సూర్యాదిగ్రహ=సూర్యుఁడు మొదలయిన నవగ్రహములతోడను, తారకా=అశ్విన్యాది నక్షత్రములతోడను,తత్ అధిపతిస్తోమంబుతోన్=ఆనక్షత్రముల కధిదేవతలయిన అశ్విదేవతలు మొదలయినవారిసమూహముతోడను,ఇట్టిసత్కార్యంబు, ఈవు=నీవు, భరింపన్=పూనుకొనఁగా,శోభ...స్వాములు—సుముహూర్తకాలమందుమహాసంకల్పములోఁజెప్పఁబడుచున్న గంగాదిపుణ్యనదులును మేరుమొదలయిన మేటిపర్వతములును, పెండ్లిపెద్దలు అయి రాన్ = పెండిపెత్తనగాండ్లయి వచ్చియుండఁగా, అస్మత్ కృత ఆచార్యకంబు = నాచేతఁజేయఁబడిన ఆచార్యత్వము, ఆర్యప్రస్తుతమై=పూజ్యులచేత స్తుతింపఁబడినదై, వధూవరులకున్, అత్యైశ్వర్యము=మిక్కుటమయిన విభవమును, ఈన్ చాలదే=ఇయ్యఁ జాలదా-ఈఁగలుగుననుట. నక్షత్రాధిపతులనిర్ణయము కాలామృతమున 3 వ శ్లోకమునఁ జూడనగును.

మహాసంకల్పమునజపింపఁబడువారే పెండ్లిపెద్దలు. నిర్వాహకుండవో నీవు. నీకుఁదోడయినవారో సూర్యాదులు, ఇఁక నాయాచార్యత్వమువలనఁ బ్రయోజనమేమి? లగ్నాధిపతులగు గ్రహనక్షత్రములు పెండ్లివిందులు. ఇఁకలగ్నమును శుభమయిన దానిని నిర్ణయింపవలసిన యగత్య మేమున్నది అందఱి శుభప్రదాతలందఱును సన్నిధిసేసియుండఁగా ? అయినను దానివలన నాకొక మంచివన్నెగలదు. మీరందఱునుజేరి మీయంతటఁ గలిగించుశుభము నే నాచార్యుఁడనయి పెట్టినలగ్నముచేతఁ గలిగినట్లుగా నాయాచార్యకమునకు లేని యార్యప్రస్తుతి కలుగఁ గలదు.కాన యక్కార్యము నాకీర్తికొఱకే కాని దీనివలనమీకొకలాభము కలుగుటలేదని యాశయము.

చ. అళి ఘట మీన కేసరి శరాసన గో మకరంబులం గచం
బులఁ గుచనేత్రమధ్యముల భ్రూకటి జంఘికలన్ జయించి ని
స్తులత నిజాంగనాధికయశోనిధి యైనయవక్రవృత్తికిం
గలికికి నియ్యోడన్ మిథునకల్పన సౌభాగ్య మటంచుఁ బల్కినన్. 53

అ. అళి...మకరంబులన్—(అళియనఁగా 'అళిర్వృశ్చికభృంగయోః' వి. వృశ్చికమును తుమ్మెదయును, గోవనఁగా వృషభమును భూమియును.) వృశ్చిక కుంభ మీన సింహ ధనుర్వృషభ మకరరాసులనని యర్థము. కచంబులన్ = తలవెండ్రుకలచేతను, కుచ = కుచములచేతను, నేత్ర = కన్నులచేతను, మధ్య= నడుముచేతను, భ్రూకటిజంఘికలన్-భ్రూ= కనుబొమలచేతను, కటి =

నితంబో పరిభాగముచేతను, జంఘికలన్=పిక్కలచేతను, జయించి = తిరస్కరించి, అని క్రమాలంకారము-ఇట కచములచేత అళిని జయించినదనఁగా తుమ్మెదను జయించినదనియు, కటిచేత గోవును జయించిన దనఁగా భూమిని జయించినదనియును భావము. ఘటాదిపదముల కర్థద్వయము స్పష్టము. (ఇచటఁ బ్రాణ్యంగముల కేకవద్భావముచేసి కుచనేత్రమధ్యమునన్ భూ)కటిజంఘమునన్ అని పాఠముఁ జేసిన బాగుగనుండును) నిస్తులతన్=తులారాశి నతిక్రమించుటచేతనని యర్థము. సమానరహితత్వముచేతనని భావము. అజాంగనాధిక యశోనిధి - (అజమనఁగా మేషరాశియుఁ గనుక)వీనికంటె నధికురాలనెడి కీర్తికి నిధియైనయని యర్థము. అజాంగన యనఁగా సరస్వతిగనుక ఆయమకంటె నధికధవళమైన కీర్తికి నిధియైనదని భావము. అవక్ర వృత్తికిన్ = కర్కట రాశివలె వక్రవృత్తి లేనిదానికని యర్థము - చక్కని నడకగలదని భావము. కలికికిన్=ఇట్టిగిరికాదేవికి, మిథునకల్పన=మిథునలగ్న నిర్ణయము, యోగ్యము అటంచున్ పల్కనన్=యుక్తమని పలుకఁగా అని యర్థము. మిథునరాశి స్త్రీపురుష యుగ్మరూపము గనుక మిథుననామక లగ్నకల్పన యోగ్యమనియును నర్థము. సుందరిపద్యముతో నన్వయము. శ్లేషమూలక కావ్యలింగము. రత్నావళియు.

శా. ఆచార్యోదితలగ్నమంగళ మహార్యస్వామికిం దెల్పి యా
ప్రాచీపాలుఁడు చేదిభర్త కెఱిఁగింపన్ వచ్చెఁ జంచత్పతా
కాచాంచల్యము కార్యసిద్ధియు సురీగానంబు కల్యాణచ
ర్యాచారంబును దూర్యఘోషము వరాహ్వానంబు సూచింపఁగాన్. 54

ఆ. ఆప్రాచీపాలుఁడు=తూర్పుదిక్కును బాలించెడి ఆయింద్రుఁడు, ఆచార్య...గళము=బృహస్పతిచేత చెప్పఁబడిన ముహూర్తరూపమైన శుభమును, అహార్యస్వామికిన్=పర్వతాధిపతియైన కోలాహలునికిని, తెల్పి, చేదిభర్తకున్=వసురాజునకు, చంచత్ పతాకాచాంచల్యము = ప్రకాశించుచున్న ధ్వజపటముయొక్క చలనము, కార్యసిద్ధియును=కార్యము సిద్ధించుటను, సురీగానంబు=దేవతాస్త్రీలయొక్క సంగీతము, కల్యాణచర్యా ఆచారంబును = వివాహమంగళాచారమును, తూర్యఘోషము=చతుర్విధవాద్యధ్వని-అనఁగాఁ గాంస్యతాళ మృదంగ వేణు వీణానాదము, వరాహ్వానంబున్=వరునిఁబిలుచుటను, సూచింపఁగాన్, ఎఱిఁగింపన్ = తెలియఁజేయుటకు - అనఁగా వివాహకార్యసిద్ధిని దెలియఁజేయుటకు, వచ్చెన్=అరుగుదెంచెను.

ధ్వజమెత్తికట్టుటచే పూనినకార్యము సిద్ధినొందుటఁ దెలుపుటవాడుక. జండా గాలికి అల్లలాడునట్లెత్తి గట్టుట వివాహకార్యమునకై ప్రయత్నము సిద్ధించెనని సూచించెను. దేవతాస్త్రీల పాటలు, పెండ్లిపనులు జరుగుచుంటను సూచించెను. వాద్యధ్వనులు వరునిఁ దోడ్తెచ్చుటకైన పిలుపును సూచించెను. ఇంద్రుఁడు వసురాజునకు వివాహకార్యము నాయత్తపఱచి వచ్చిన లక్షణములు ధ్వజపట చాంచల్యాదులచేత సూచనసేయుచు తద్వృత్తాంతము వసురాజునకుఁ దెలియఁజేయుటకు అతనియొద్దకుఁ దానైవచ్చెనని తాత్పర్యము. చంచత్పతాకా చాంచల్యాదులన్నియు సూచకములే. కంఠోక్తముగాఁ జెప్పుట యాచారము. కావుననే 'చేదిభర్త కెఱింగింపన్ వచ్చుట.' తెలుపువాఁడో ప్రాచీపాలుఁడు-అట్టివానిచే తెల్పఁబడుటకుఁ గోలాహలుఁడు అహార్యములకు స్వామియగుటచే దగువాఁడు; పిదప వసురాజు చేదికిభర్తయగుం గావున తెల్పఁదగువాఁడు; అని యిట్లు చెప్పువానికిని జెప్పఁబడువారికిని గల సాదృశ్యానురూప్యములను సమర్థించుటకై, స్వామి, పాల, భర్తృశబ్దములనుప్రయుక్తములగుట దెలియునది.

ఉ. నిండుమనంబునం దనమనీషిత మెల్ల ఘటింపవచ్చు నా
ఖండలు రాక చారణముఖంబున మున్న యెఱింగి చేదిభూ
మండలభర్త గాంచె నతిమాత్రముదం బది యెందుఁ జిత్రమే
కొండలు పిండిసేయు శతకోటియుతుండు హితుండు గల్గినన్. 55

అ. చేది భూమండలభర్త=వసురాజు, నిండుమనంబునన్ = సంపూర్ణభావముచేత, తనమనీషితము=తనమనస్సునఁ గోరినది, ఎల్లన్ ఘటింపన్ వచ్చు, ఆఖండలురాక = ఇంద్రుని వచ్చుటను, చారణముఖంబునన్ = చారణుల మూలముగా, మున్న=మునుపే, ఎఱింగి, అతిమాత్రముదంబు= కొలఁదిమీఱిన సంతోషమును, కాంచెన్=పొందెను, అది=అట్లుసంతోషించుట, ఎందున్, చిత్రమే= ఆశ్చర్యమా—కాదనుట, ఏలనఁగా, కొండలు పిండిసేయు=పర్వతములను నుగ్గునూఁచ చేసెడు, శతకోటియుతుండు = వజ్రాయుధముతోఁ గూడినవాఁడు, హితుండు = ఆప్తుఁడుగా, కల్గినన్, అది యెందున్ చిత్రమాయని వెనుక కన్వయము. శతకోటి పదార్థముగలవాఁడు హితుఁడుగాఁగా నని యును అర్థము స్ఫురించుచున్నది. అలం. అర్థాంతరన్యాసము.

తే. రత్నకూటవిహారగౌరవ మెకాని, యెందుఁగుస్పృష్టి యెఱుఁగనియింద్రు పదము
లపుడు నిజమౌళిరత్నకూటాగ్రసరణిఁ, గూర్చె నుచితంబుగా వసుక్షోణిభర్త.

అ. రత్నకూట=రత్నసమూహముమీఁది, విహార=సంచారమందలి, గౌరవమెకాని=గొప్ప తనమేకాని, ఎందున్=ఎప్పుడును, కుస్పృష్టి=నికృష్ట వస్తుస్పర్శను, ఎఱుఁగని, ఇంద్రు, పదములు= అడుగులు అని యర్థము. ఇంద్రునిపాదములు రత్నకూటము (అనఁగా మేరుపర్వతము) నందు సంచరించుననియు, కుస్పృష్టియనఁగా భూస్పర్శము గనుక నది యెఱుఁగనివనియును భావము. అపుడు= ఆసమయమందు, వసుక్షోణిభర్త=వసురాజు, ఉచితంబుగాన్ = అర్హమగునట్లుగా, నిజమౌళి రత్నకూట అగ్రసరణిన్=తనకిరీటమందలి రత్నసమూహముయొక్క అగ్రభాగమందు కూర్చెను.

రత్నకూట విహారముగల యింద్రునిపదములకు రత్నకూటవిహారమే యొనగూర్చినాఁడని యర్థము - అనఁగా నింద్రునిపాదములు తనకిరీటముమీఁద సోఁకునట్టులుగా నింద్రునకు నమస్కరించె నని తాత్పర్యము. దేవతలకు భూస్పర్శములేమి తెలియునది. అలం. శ్లేషానుప్రాణితమగు సమము.

క. అడుగుల కెరఁగినఁ బెండిలి, కొడుకవు గమ్మనుచు నలమికొని వజ్రి ముదం
బడర నొడలెల్లఁ గన్నులు, గడలుకొనం జూచి యవనికాంతునిఁ బలికెన్. 57

అ. వజ్రి=ఇంద్రుఁడు, అడుగులకున్ = తనపాదములకు, ఎరఁగినన్=మ్రొక్కఁగా, పెండిలి కొడుకవు కమ్ము, అనుచున్, అలమికొని=కదుముకొని - కౌఁగిలించికొని, ముదంబు, అడరన్, ఒడలెల్లన్ కన్నులు కడలుకొనన్ చూచి= తనగాత్రమంతయు నేత్రమయమగు నట్టులుగా అత్యంత ప్రీతిచేతఁ జూచియని యర్థము - దేహమంతయుఁ గల వేయికన్నులు గలవాఁడని భావము. దేహమంతయుఁ గన్నులుగాఁజేసి చూచుట అత్యంతప్రీతి సూచకము.

......మేనెల్లఁ గన్నులుగాఁజేసి కుమారుజవ్వనము చెన్నుంజూచు చందంబునన్' అనుట నుండి యిది యుద్ధృతము. రెండుగన్నులం జూచినఁజాలఁదు. ఒడలెల్లఁ గన్నులుచేసికొని చూచిననే తనివి. (అనఁగా అంతటి కుతూహలాతిశయము.) అవనికాంతునిన్=వసురాజునుగూర్చి, పలికెను.

ఉ. నిన్నటిమాపు మాపురమునీ రమణీయ సభావిభాగభా
గున్నతరత్నపీఠిఁ గొలువుండి సురాంగన లాడఁ గిన్నరుల్

కిన్నరమీఁటి పాడఁ దిలకించుచు నియ్యెడ కేల రాఁడొకో
మన్నిరవద్య మిత్రుఁ డనిక మక్కువ మీఱ నినుం దలంచితిన్. 58

అ. నిన్నటిమాపు = నిన్నటిరాత్రి, మా...పీఠిక—మాపురమణీ=మావేటి పట్టణమయిన అమరావతియందలి, రమణీయ=చెలువయిన, సభా=సుధర్మాఖ్య సభయొక్క, విభాగ=ఏకదేశమును, భాక్=పొందిన, ఉన్నత=పొడువయిన,రత్నపీఠిక=చింతామణి రత్నమయ సింహాసనమందు, కొలువుండి, సురాంగనలు = రంభాదులయిన దేవతాస్త్రీలు,ఆడక్=నృత్యముసేయఁగా, కిన్నరుల్, కిన్నరమీటి పాడక్, తిలకించుచున్ = విమర్శించి చూచుచు, ఇయ్యెడకున్, ఏల, మన్నిరవద్య మిత్రుఁడు=నాయొక్క యేదోషములేని చెలికాఁడు, రాఁడొకో, యని, మక్కువమీఱక్=ప్రేమ అతిశయింపఁగా, నినున్, తలంచితిని.

మిత్రుఁడు, నిరవద్యుఁడు, ఏనెుఱసును లేనివాఁడు కావుననే రావలయును. రాకుండుటకు అవద్యమేమి యుండునని యింద్రుని యాశయము. మక్కువమీఱుటచేతనే రాజును తలంచుకొనుట.

క. తలఁచి భవదీయమానస,తలచింత యెఱింగి యెంత క తలఁకెనొకో నా
చెలి పేరామని చెలికిం, గలువలచెలి కనుచు నిదురకంటికి రామిన్. 59

అ. తలఁచి=తలంచుకొని, భవ...చింత = నీదుమనస్సు పట్టునందలి, విచారమును, ఎఱింగి= దివ్యదృష్టిచేఁ దెలిసికొని, నాచెలి=నాచెలికాఁడు, వసురాజనుట, పేరామనిచెలికిక్=వసంతుని చెలికాఁడయిన మన్మథునికిని, కలువలచెలికిక్=చంద్రునకును, ఎంత, తలఁకెనొకో = భయపడెనో, అనుచున్, నిదురకంటికిక్, రామిక్=రాకపోవుటచేత నని యర్థము-దేవత లస్వప్ను లని భావము-మీఁది కన్వయము.

ఉ. అంబకపంచకంబుఁ గలకయం బచరించుచు నంబకత్రయా
డంబరశాలిచేఁ గడు విడంబితుఁ డై నయనంగుఁ డాసహ
స్రాంబకబాంధవుం జెనకి క యారడిఁ బెట్టెడివాఁడె యంచుఁ జి
త్తంబునఁ దావకాంగభవతాపనివారణ తత్పరుండ నై.

అ. అంబకపంచకంబుక్=బాణము లయిదింటిని, కలయక్, పచరించుచుక్ = ప్రయోగించుచు, అంబకత్రయాడంబరశాలిచేక్ = మూఁడుబాణముల యొగపుగలవానిచేత, కడుక్ విడంబితుఁడు=మిక్కిలి తిరస్కరింపఁబడినవాఁడు, ఐన, అనంగుఁడు=అంగరహితుఁడయిన మన్మథుఁడు, ఆసహస్రాంబక బాంధవుక్=సహస్రబాణములుగలవానియొక్క స్నేహితుని, చెనకి = తాఁకి, ఆరడిఁబెట్టెడివాఁడె = బాధపెట్టువాఁడాయెనా, అంచునని యర్థము. అంబకమనఁగా కన్నును గనుక, శివుఁడు మూఁడుకన్నులుగలవాఁడు, ఇంద్రుఁడు వేయికన్నులుగలవాఁడు అనిభావము, చిత్తంబునక్=మనస్సునందు, తావక అంగభవతాప నివారణ తత్పరుండనై=నీయొక్క మన్మథతాపమును నివారించుటయందలి యాసక్తిగలవాఁడనై, మీఁదికన్వయము.

మన్మథుఁడు అయిదు అంబకములును వేయుచున్నవేమి? మూఁడంబకములు గలవానికి నోడినట్టివాఁడు వేయంబకములుగలవాని చెలికానికి ఆరడిఁబెట్టువాఁడా, ఇంతేకాక 'అనంగుఁడు' అంగముకూడ లేనివాఁడు, ఇంతలు చేయువాఁడా యని యర్థము. అల. కావ్యలింగము.

ఉ. ప్రొద్దున వచ్చి శీతనగపుత్త్రినిఁ గన్నియ వేఁడి గట్టురా
పెద్దలఁ బుణ్యవాహినులఁ బెండ్లికి రా నియమించి నీకు న
మ్ముద్దులకన్నె నిచ్చునగముఖ్యున కొక్కపురీలలామకం
బుద్దవిడిన్ సృజించి సుముహూర్తము నేఁడె యనన్ రయంబునన్. 61

అ. ప్రొద్దునన్ = నేఁటివేకువను, వచ్చి, శీతనగ పుత్త్రినిన్ = హిమవంతుని కొడుకయిన కోలాహలుని, కన్నియన్ వేఁడి = చిన్నదానినడిగి, గట్టురాపెద్దలన్ = పర్వతశ్రేష్ఠులయిన మేరు మందరాదులను, పుణ్యవాహినులన్ = పుణ్యనదులను, పెండ్లికిన్ రాన్ నియమించి, నీకున్, అమ్ముద్దుల కన్నెను, ఇచ్చు, నగముఖ్యునకున్ = కోలాహలునికి, ఒక్క, పురీలలామకంబు = పట్టనశ్రేష్ఠమును, ఉద్దవిడిన్ = శీఘ్రముగా, సృజించి = నిర్మించి, సుముహూర్తము, నేఁడె, అనన్ = అని బృహస్పతి చెప్పఁగా, రయంబునన్ = శీఘ్రగతిచేత, మీఁదికన్వయము.

శా. గంధర్వానకదుందుభిధ్వనులతో గంగాది సాధ్వీరమా
బంధుశ్రీ పరిణీతిగానములతో భవ్యద్విజాశీర్వచ
స్సంధానంబులతో నగేంద్రతనయాసాంద్రానురాగద్విప
స్కంధారూఢుని నిన్నుఁ బెండ్లికొడుకుం గావింపఁగా వచ్చితిన్. 62

అ. గంధర్వానక దుందుభిధ్వనులతోన్ - గంధర్వ = గంధర్వులచేత వాయింపఁబడునట్టి, ఆనక = నిస్సాణములయొక్కయు, దుందుభి = భేరులయొక్కయు, ధ్వనులతోన్ = నాదములతో, గంధర్వానక ధుంధుమాధ్వనులతో నని పాఠాంతరము. అప్పుడు - ధుమధుమధ్వని యానకధ్వని కనుకరణమగుచున్నది - గంగాది...గానములతోన్—గంగాది = గంగ మొదలయిన, సాధ్వీ = పుణ్యాంగనలయొక్క, రమాబంధు శ్రీపరిణీతిగానములతోన్ = లక్ష్మీనారాయణులయొక్క పెండ్లి పాటలతోడ, భవ్యద్విజ ఆశీర్వచ స్సంధానంబులతోన్ = యోగ్యులయిన బ్రాహ్మణులయొక్క యాశీర్వాదముల ఒనగూర్పులతోడ, నగే...రూఢునిన్—నగేంద్రతనయా = గిరికాదేవియొక్క, సాంద్ర అనురాగద్విప = దట్టమయిన మక్కువయనెడు ఏనుఁగుయొక్క, స్కంధ = మూఁపునందు, ఆరూఢునిన్ = ఎక్కినవానిని, నిన్ను, పెండ్లికొడుకున్ కావింపఁగా వచ్చితిని.

పెండ్లిచవికకు గజస్కంధారోహణముతో వచ్చువాఁడు పెండ్లికొడుకు గావింపఁబడినవాఁడు - వసురాజునుగూడఁ బెండ్లికొడుకు గావింపనుండుటచే 'నగేం...రూఢుఁ' డయినాఁడన్నాఁడు—అనఁగా నిటఁ బెండ్లికొడుకునకు, విహితమై శ్వశురగృహగమనకాల కర్తవ్యమయిన గజస్కంధారోహణము సూచించినాఁడని సారస్యము గ్రహించునది. ఇది ముద్రాలంకారము.

చ. అనిన మహేంద్రు నానతి ముఖానతిఁ గాంచుమహీమహేంద్రు నె
మ్మనము నవంబుగా నెఱిఁగి మంత్రిపురోహిత దండనాథశా
సనధరు లాక్షణంబ శుభసంభ్రమ సన్నహనానులాపముల్
మొనపఁగ నమ్మహానగరము౦ గయిసేయుఁగఁ బంచి రెంతయున్. 63

అ. అనిన మహేంద్రు + ఆనతిన్ = ఇట్లు చెప్పిన దేవేంద్రునిపంపున, ముఖానతిన్ కాంచు మహీమహేంద్రు నెమ్మనమున్ = సిగ్గుచేత మొగమును వంచుటను బొందిన భూదేవేంద్రుఁడయిన వసురాజుయొక్క మనస్సు - (ఇట ఆనతివలన ఆనతిగాంచి నాఁడనియు మహేంద్రునకుఁ దాను

ప్రతిమ హేమ్ప్రముఁడనియు శబ్దవైఖరిచేఁ జమత్కారము గ్రహించునది) నవంబుగాన్=సరసమగుటను, ఎఱిఁగి, మంత్రిపురోహిత దండనాథ శాసనధరులు=మంత్రులును పురోహితులును, సేనాపతులును ఆజ్ఞలఁబూని నిర్వర్తించువారును, అక్షణంబ = అప్పుడే, శుభసంభ్రమ సన్నాహన అనులాపముల్ = శుభకార్యము చేతనయిన అత్యాదరముతోఁ గూడుకొన్న ప్రయత్నమందలి మాటిమాటికిఁ జెప్పఁబడు వాక్యములు, మొనపఁగన్ =ప్రకటమగునట్లుగా, అమ్మహానగరమును, కయిసేయఁగన్ =అలంకరించుకొఱకు, పంచిరి=పురజనులకందఱకు నాజ్ఞాపించిరి.

వివాహపుశుభ మిది, కావున సంభ్రమము - సంబరము. మఱియు నదియైనదా ఇది సిద్ధమా యని యాయితపాటునుగాన సన్నాహనమును. ఇట్టిసంబరమువలనను సన్నాహమునుబట్టియు పలుమాఱు మాటలాడికొనుచుండవలసి యుండుటచే 'అనులాపముల్'.

సీ. పన్నిరి మేరువుల్ బహుసంఖ్యలకొలందిఁ, జంద్రసూర్యాకల్ప శతముతోడ
నాటిరి హరిచందననగంబు లెన్నేని, యధికాయమానరంభాళితోడ
నవరించి రింద్రరత్నవితానములు పెక్కు, వజ్రకూటప్రభావలులతోడ
నిలిపిరి చిత్రరేఖలచాలు మితిమీఱ, నతులహేమాకృతి ప్రతతితోడ
తే. గట్టి రగణితపుండరీకవ్రజంబు, తగునెడ ననంతకుముదసంతతులతోడ
వాసవపురస్థితానేక వస్తుమహిమఁ, జూచి వాసవపురివారు చోద్యమంద. 64

అ. చంద్రసూర్య=చంద్రసూర్యులనెడు, ఆకల్ప శతముతోడన్ = వందలకొలఁది - అనఁగా లెక్కలేని-అలంకారములతోడను, బహుసంఖ్యలకొలఁదిన్ =అసంఖ్యములుగాను, మేరువులు= మేరు పర్వతములను, పన్నిరి=అమర్చిరని యర్థము - చంద్రసూర్య రూపములగు చిహ్నములను సారువులను బన్నిరని భావము. అధికాయమాన=అధికమగునట్లుగా ఆచరించుచున్న-అనఁగా అసంఖ్యమైన, రంభాళి తోడన్ =రంభలనెడి అప్సరస్స్త్రీసమూహముతోడను, ఎన్నేని=అసంఖ్యములయిన, హరిచందన నగంబులు=హరిచందనములనెడి దేవతావృక్షములను, నాటిరని యర్థము-అధికాయమాన=(కాయమానములనఁగా పందిళ్లు) పందిళ్లను మించిన, రంభాళితోడన్ =అరఁటిచెట్లతోఁగూడ, హరిచందన నగంబులన్-(హరిచందన మాఖ్యాతంగోశీర్షే సురపాదపే' విశ్వ) పచ్చచందన వృక్షములను నాటిరనిభావము. వజ్రకూట ప్రభావలులతోడన్ =వజ్రాయుధ సమూహముయొక్క కాంతివరుసలతోడను, ఇంద్రరత్న వితానములు పెక్కు=ఇంద్రనీల సమూహములను తఱచుగా, నవరించిరి = కుదురుకొలిపిరని యర్థము- వజ్రమణి సమూహముల కాంతులతో నీలములుగూర్చిన వితానములు - అనఁగా మేలుకట్లు-తఱచుగాఁ గట్టిరని భావము - (వజ్రో స్త్రీ హీరకేపవౌ' అని, అ). అతులహేమాకృతి ప్రతతితోడన్ =సాటిలేని హేమలు అనఁబడు అప్సరః స్త్రీ సమూహముతోడ,మితిమీఱన్ , చిత్రరేఖలచాలు= చిత్రరేఖలనెడు అచ్చరలపంక్తిని, నిలిపిరని యర్థము - బంగారు ప్రతిమలను చిత్తరువువ్రాసిన పటములను నిలిపినారని భావము. అనంతకుముద సంతతులతోడన్ =అమితములయిన కుముదములనెడి దిగ్గజసమూహములతోడ, తగునెడ=తగినస్థలమందు, అగణిత పుండరీక వ్రజము = లెక్కలేని పుండరీకములనెడి దిగ్గజసమూహమును, కట్టిరి=బంధించిరని యర్థము—(కుముదములనఁగా తెల్లగలువలు. పుండరీకములనఁగా తెల్ల తామరలు) తెల్లగలువలను తెల్లతామరలను తోరణములుగాఁ గట్టిరనిభావము. ఎట్లనినన్ - వాసవ పురస్థితానేకవస్తు మహిమన్ =వసురాజును సంబంధించిన పట్టణమందున్న వస్తువులయొక్క మహత్త్వమును, చూచి, వాసవపురివారు=స్వర్గపురమందలివారు-అనఁగా దేవతలు, చోద్యమందన్ =ఆశ్చర్యపడునట్లుగా పూర్వోక్తకార్యములను జేసిరని సంబంధము.

అధిష్ఠానపురమును అమరావతియు వాసవపురములే. అయినను అమరావతియందు మేరుగిరి చందనాదులొక్కొక్కటియో లేక యొకకొన్నియో. అధిష్ఠానమందో మేరుగిరిచందనాదులకు లెక్కయేలేదు. కావుననే దేవతలు చోద్యమంది రని యర్థము. భావార్థములందుఁ జెప్పఁబడిన ప్రకారమున అధిష్ఠానపురమును శృంగారించిరని ఫలితార్థము. వాసవా...మహిమ-ఇందలి మేరువు మొదలయిన వస్తువుల యనేకత్వమే దేవతల కాశ్చర్యహేతువని తెలియునది. అలం. అతిశయోక్త్యనుప్రాణతమైన కావ్యలింగము.

చ. పరిణతదివ్యగంధఫలభారనమత్కదళీపరంపరా
పరివృతకాయమానములఁ బర్వుఫలావళిఁ జూచి పైపయిం
బరిగొని వచ్చురాజశుకపంక్తులచొప్పున నొప్పె నప్పుడ
ప్పురవిపణిప్రఘాణములఁ భూరిహరిన్మణి తోరణావలుల్. 65

అ. అప్పురవిపణి ప్రఘాణములన్ = ఆపట్టనము నంగడులయొక్క బహిర్ద్వార గృహములందు, భూరిహరిన్మణి తోరణావళుల్ = పెక్కులయిన మరకతమణి తోరణములు, పరిణత...వళిన్ — పరిణత=కాలపరిపక్వమయిన, దివ్యగంధ=మంచిపరిమళముగలిగిన, ఫల=పండ్లయొక్క, భార=బరువుచేత, నమత్=వంగుచున్న, కదళీపరంపరా=అరఁటిచెట్ల చాల్పులచేత, పరివృత = ఆవరింపఁబడిన, కాయమానములన్=పందిళ్లయందు, పర్వు=ప్రవేలుచున్న, ఫలావళిన్=పండ్లగెలలనుచూచి, పైపయిన్ = మీఁదమీఁద, పరిగొని=మూఁకలుగట్టి,వచ్చు, రాజశుకపంక్తులచొప్పునన్=రాచిలుకలు వరుసలాయేమి యనునట్లు, అప్పుడు=ఆశృంగారించిన సమయమందు, ఒప్పెన్. అలం. ఉత్ప్రేక్ష.

ఆ యధిష్ఠానపురమం దంగడులముందటిచోపాలయందుఁ బందిళ్లువేసి పండ్ల గెలలతోనున్న యరఁటిచెట్లు నిలిపి, వానిమీఁద మరకతమణి తోరణములు గట్టఁగా నవి ఆ యరఁటిపండ్లకొఱకై బారులుగట్టుకొని వచ్చినిలిచిన రాచిలుక చాలుపులో యన్నట్లుండెనని తాత్పర్యము. 'ప్రఘాణ ప్రఘాణాలింద బహిర్ద్వార ప్రకోష్ఠకే' అని యమరము.

చ. పసిఁడికురుంజులన్ మెలఁగు బంగరుబొమ్మలఁ జూచు దేవతా
ప్రసవ సుగంధులన్ ధ్వజపరంపరఁ బిల్చి వివాహవీటికా
విసరమొసంగ నెత్తువసువీరపురేందిరబాహులో యనన్
లసదహివల్లికావృత ఫలక్రముకంబులు నాటి రెల్లెడన్. 66

ఆ. పసిండికురుంజులన్=బంగారు బురుజులమీఁద, మెలంగు=సంచరించుచున్న, బంగరుబొమ్మలన్=బంగారపు కీలుబొమ్మలను, చూచు=వింతగాఁ జూచుచున్న, దేవతాప్రసవ సుగంధులన్=దేవతాస్త్రీలను, ధ్వజపరంపరన్ = జెండాగుడ్డల యంచులచేత, పిల్చి, వివాహవీటికా విసరము=పెండ్లితాంబూలములను, ఒసంగన్, ఎత్తు=మీఁదికెత్తిన, వసువీర పురేందిర=వసురాజు పురలక్ష్మియొక్క, బాహులోయనన్=చేతులో యన్నట్లుగా, లస...కంబులు—లసత్=ప్రకాశించుచున్న, అహివల్లికా ('తాంబూలవల్లీ తాంబూలీ నాగవల్ల్యపి' అ.) తములపాకు తీఁగలచేత, ఆవృత=ఆవరింపఁబడిన, ఫల=ఫలసహితములయిన, క్రముకంబులు=పోఁకచెట్లు, ఎల్లెడన్ నాటిరి.

కురుంజులనఁగా ఎత్తుగావేసెడి చప్పరమువంటి మంచెలు. ఇందులకు

..............................జాళువా
యొప్పులకుప్పలై మెఱయుచుండెడు మేరువులుం గురుంజులుం

జప్పరముల్ వితానములు, సర్వము నాయితపెట్టి (విజయవిలాస. ౨. ఆ)
ఎత్తుగా వేయఁబడునవి గావుననే యందలి బొమ్మలకై దేవతాస్త్రీలు రాక. వారలువచ్చుట తమకంటె నాబొమ్మలు మిక్కిలి చక్కనైయుండుట కబ్బురపడి. దేవలోకమున మఱుఁగున నుండిరేని వారిని బిలుచుట పొసఁగదు. వారై పురికురుంజాలకు వఱకురాఁగా నిఁకఁ బేరంటము పిలువకుండుట తగదు. పేరంటము పిలుచు ముత్తైదువ పురలక్ష్మి. ఆమెకు వసురాజు పెండ్లికి పెత్తనమేలయున 'వసువీరుని' పురలక్ష్మిగాన. పిలుచుట యెట్లు? జెండాగుడ్డల యల్లలార్పులచేత - దూరమున నుండువారిని జెండా యల్లలార్చి పిలుచుట వాడుకగదా! అట్లు పిలువఁగా వచ్చువారికి చేతులుచాఁచి పోఁకలాకులు తాంబూలము పెట్టుట పెండ్లిమరియాద. పెండ్లికై నిలువున నాఁటిన పోఁకచెట్లు పురలక్ష్మి పైకిచాఁచిన చేతులు. దానిని బెనఁచికొనియున్న తమలపాఁకు తీఁగలందలి యాఁకులును దానియందలి (ఫలములును) పోఁకలును మరియాదకైన వక్కలాకులు (తాంబూలము). బంగారుకురుంజాలాకాశము నంటుచున్నవనియు నందలి బొమ్మలు దేవతాస్త్రీలకంటె మిక్కిలి చక్కనివనియు, ధ్వజములు నాకాశమార్గమున మిక్కిలి పొడువులయినవనియు పెండ్లికై తమలపాకుఁ దీఁగలు పెనఁచియున్న పోఁకచెట్లంతటను నిలిపిరనియుఁ దాత్పర్యము. అలం. ఉత్ప్రేక్షయు, వ్యతిరేకధ్వనియు.

చ. హిమసలిలాభిషిక్తయును హేమపటావృతయుం బటీరకుం
కుమ రసలిప్తయుం గుసుమగుంభితయుఙ్ నవధూపధూమసం
భ్రమపరిజృంభమాణశిఖిబర్హశిరోజయునై యెసంగె భూ
రమణపురాధిదేవత హిరణ్మయదర్పణదీప్యమానయై. 67

అ. ఇందుఁ బురాధిదేవత యనుటయందుఁగల స్త్రీలింగపు స్వారస్యముచేత స్ఫురించు నాయికపరముగాను రెండవయర్థము చెప్పఁబడుచున్నది - భూరమణ పురాధిదేవత=వసురాజుయొక్క పట్టణాధిదేవత, హిమసలిల అభిషిక్తయుఙ్=(పట్టణ) చల్లని జలములచేత అంతటను దడుపఁబడినదియును - (నాయిక) పన్నీటిచేత జలక మార్పఁబడినదియును, హేమపట ఆవృతయుఙ్ = (పట్ట) బంగారు వస్త్రముచేత ఆవరింపఁబడినదియు - (నాయిక) బంగారు పీతాంబరము గట్టుకొన్నదియు, పటీరకుంకుమ రసలిప్తయుఙ్=(ఉభయత్ర) చందన కుంకుమరసములచేత పూయఁబడినదియు, కుసుమ గుంభితయుఙ్=(ఉభ) పువ్వులచేతఁ గూర్పఁబడినదియు, నవ...రోజయుఙ్—(పట్టణ) నవ= క్రొత్తదయిన, ధూపధూమ=నల్లయగురు ధూపపుపొగచేత - ఆ పొగయందు మబ్బనెడి భ్రాంతిచేత ననుట, సంభ్రమ=సంబరముచేత, పరిజృంభమాణ = అంతటను విఱివియగుచున్న, శిఖిబర్హ శిరోజయుఙ్=నెమిలియొక్క తలపెండ్రుకలవంటి పురులుగలది, (నాయిక) క్రొత్తగా ధూపపుఁబొగ పట్టించు సంభ్రమముచేత విరియఁబోసికొన్న నెమిలిపురులవంటి తలవెండ్రుకలు గలదియును - ఐ, హిరణ్మయ దర్పణదీప్యమానయై=(పట్టణ) (గోడలయందుఁ గూర్పఁబడిన) బంగారు మయములయిన యద్దములచేతఁ బ్రకాశించుచున్నదై - (నాయిక) చూచుకొనుటకై తెచ్చిన బంగారపు టద్దమునందుఁ బ్రతిబింబించిన నిజరూపముచేతఁ బ్రకాశించినదై, ఎసంగెను=ఒప్పినదయ్యెను.

వసురాజు పట్టణమును జల్లనినీటిచేతఁ దడిపి సరిగగుడ్డల జెండాలెత్తి చందనము కుంకుమ రసమునుబూసి, పూదండలఁగట్టి, క్రొత్తనల్ల యగురుధూపములు పొగవేసి, గోడలయందు నిగనిగని బంగారపు టద్దములు నిలిపిరి. ఆనల్లని ధూపపుఁబొగలనుజూచి నెమిళ్లు మబ్బులని భ్రమించి సంబరములోఁ బురులువిప్పి యొప్పుచుండెనని తాత్పర్యము - ఒకనాయిక పన్నీటిజలకమాడి కురులతడి

యూటుట్నై దానినివిప్పి యగరుధూపము పొగవేసికొని, బంగారు సరిగచీరఁగట్టి చందనమును గుంకుమము నలందుకొని, పూదండలు చెక్కివి, యిట్లలంకరించుకొన్న తనరూపమును బంగారపు టద్దమునఁ జూచుకొనుట యిట యనుసంధింపఁబడినది. శ్లేషము.

ఉ. కాంచనపత్త్రికావళులఁ గౌతుకసూచకవాచికంబు వ్రా
యించి సమస్తదేశవసుధేశుల కంచిన వారు మౌళి సం
ధించి సువర్ణపట్టభృతి నేఁడుగదా మన కంచుఁ దెచ్చి ర
భ్యంచితపత్త్రయోగ్య నవహాటక పుష్ప ఫలోపహారముల్. 68

అ. కాంచన పత్త్రికావళులన్=బంగారపు టాకులయందు, కౌతుక సూచకవాచికంబు = పెండ్లినిసూచించు (సందేశ వాగ్వాచికంస్యాత్' అ) సందేశవాక్యమును, వ్రాయించి, సమస్తదేశ వసుధేశులకున్=సకలదేశముల రాజులకును, అంచినన్=పంపఁగా, వారు, మౌళిన్ సంధించి=తల యందుఁ జేర్చికొని (అని అలంకారపరముగా) శిరసావహించి (అని ఆజ్ఞాపరముగా) సువర్ణ పట్టభృతి=బంగారుపట్టెను దాల్చుట (అని ఆభరణపరముగా) - భాగ్యసూచకమయిన అక్కరము లతోఁగూడిన పట్టెనుదాల్చుట - మంచి తలవ్రాలను దాల్చుట యనియు (పత్త్రికలు కాంచనమయము లగుటచే బంగారుపట్టెలను తలయందుఁ దాల్చినట్లనియు, లిఖితములయిన వాచికాక్షరములు గలవి యగుటచే వానినితలఁ దాల్చుట మంచి తలవ్రాలను దాల్చినట్లనియును, జెప్పుట తెలియునది. మొదటియర్థమున రాజులు రాజచిహ్నముగా నొసటఁగట్టికొను బంగారుపట్టెగాన నేఁడే రాజత్వము తమకు లభించినదని యర్థము- రెండవయర్థము భాగ్యసూచకముగా బ్రహ్మనుదుట వ్రాయువ్రాలు గాన- నేఁడే భాగ్యవంతుల మయితిమని యర్థము తెలియునది.) నేఁడుగదా మనకు, (లభించెనని అధ్యా హార్యము) అంచున్, అభ్యంచిత... హారముల్—అభ్యంచిత = ఒప్పుచున్న, పత్త్ర=బంగారు శుభ లేఖకు, యోగ్య=తగినట్టి, నవ=క్రొత్తవియగు, హాటక=బంగారము, పుష్పఫల=పువ్వులు పండ్లు అనెడి, ఉపహారముల్=కానుకలు, తెచ్చిరి.

'అభ్యంచిత... హారముల్' అనుచో 'పత్త్ర, పుష్పఫల' అనుశబ్దములచే - పత్త్రమునకు (ఆఁకు నకు) యోగ్యములయిన పుష్పములును ఫలములు (పువ్వులుమ బండులు) ననియు ఆపత్త్రములు 'కాంచ నము' లగుటచేత పుష్పఫలములును 'హాటక'ములనియు నర్థసారస్యములు స్ఫురించెడిని.

రాజు బంగారులేఖను బొందఁగానే రాజు లప్పుడే రాజత్వమును బొందితిమనియు భాగ్య వంతుల మయితిమనియు నుబ్బుటనుబట్టి రాజులరాజత్వాదిప్రతిపత్తి వసురాజాజ్ఞారూపప్రసాదా మగుటచే నతని నిరతిశయ సార్వభౌమత్వము ధ్వనించెడిని.

సీ.[1] వైణికవల్లకీ శ్రేణి నిమ్ముల మీఱె, గాయకగాంధర్వ గమక రేఖ
గాంధర్వ గమక రేఖఁ బరాహతముచేసె, వాంశికవంశికా వైభవంబు
వాంశికవంశికా వైభవం బెగనూఁదెఁ, దాళికాధరకర తాళగరిమ
కరతాళగరిమంబు గంచుమించుగ నొత్తె, నానద్ధచటుల తూర్యవ్రజంబు

తే. చటుల తూర్యవ్రజమునంటఁ జెజచెఁబరిణ, యాగతదిగంతనృపతినాగాశ్వరథప
దాతికోలాహలంబు రోదసి నఖండ, మగుచు నాదాత్మకబ్రహ్మ మతిశయిల్ల.

అ. గాయక గాంధర్వగమకరేఖ - గాయక = సంగీతపాఠకులయొక్క, గాంధర్వ=సంగీత విషయమైన, గమక = ('స్వన స్సకంపో గమకస్సచపంచవిధస్స్మృతః' అన్నట్లు) స్వరకంపము

యొక్క—అనఁగా కంఠనాదమందలి కదలికయొక్క, రేఖ = తీరు, వైణికవల్లకీశ్రేణిక్ = వీణ వాయించువారి వీణెలసమూహమును, ఇమ్ములక్ = చక్కఁగా, మీఁటెక్ = గోటమీటెనని యర్థము. వీణలను గోటమీటుట సహజముగనుక నిక్కడ మీటఁదగినవానిని మీటెనదని యానురూప్యము, గమకరేఖ వీణెలనుమీటుట యసంభావ్యముగాన-మీటెననఁగా చిమ్మివైచెను అనఁగా అణఁచెననిభావము. వాంశికవంశికావైభవంబు-వాంశిక=పిల్లఁగ్రోవులు వాయించువారియొక్క, వంశికా=పిల్లఁగ్రోవుల (ధ్వని) పెంపుసొంపు, గాంధర్వగమకరేఖను, పరాహతముచేసెక్—(ఆహతానాహతలక్షణము.

'ఆహతోఽనాహతశ్చేతి ద్విధా నాదోనిగద్యతే,సోయంప్రకాశతేఖణ్డ స్తస్మాత్పిండోఽభిధీయతే। తత్రచానాహతం నాదం మునయస్సముపాసతే, గురూపదిష్టమార్గేణముక్తిదం నతురంజకమ్। ఆహతః కేవలం లోకరంజకో భవబంధకః। శ్రుత్యాదిద్వారతః' (సంగీతశాస్త్రము.)

కావున, పర=ఉత్కృష్టమయిన, ఆహతముచేసెక్=ఖండసంజ్ఞచే కేవలలోకరంజకమయిన దానినిగాఁ జేసెనని యర్థము—ఇక్కడ ఆహత స్వరమైనదానిని ఆహతస్వరముఁజేసెనని యానురూప్యము—గాయకగాంధర్వగమకమును పరాహతముచేసెననఁగామిక్కిలియుఁ దూలఁగొట్టెననిభావము.

తాళికాధరకరతాళగరిమ = తాళగాండ్ర చేతులయందలి కంచుతాళముల పెంపు, వాంశిక వంశికావైభవమును, ఎగనూఁదెక్ = ఊపిరిచేతఁ బూరించెననియర్థము—పిల్లఁగ్రోవులనూఁదుట సహజముగాన, ఊఁదఁదగినవానిని ఊఁదినదని యానురూప్యము. ఎగనూఁదెననఁగా నిలిచి కనఁబడకుండు నట్లు చేసెననిభావము.

ఆనద్ధ...వ్రజంబు—ఆనద్ధ = మృదంగాదులయొక్క, చటుల = వడిగల, తూర్యవ్రజంబు = వాద్యధ్వనిసమూహము. కరతాళగరిమంబుక్=అట్టి తాళగౌరవమును. కంచుమించుగక్ ఊఁదె= కంచుమించునట్లుగా ఒత్తెనని యర్థము-కాంస్యమయిన దానిని కాంస్యము మించునట్లుగా నొత్తినదని యానురూప్యము - కంచుమించుగ నూఁదెననఁగా ఆతాళనాదమును జెదరఁగొట్టెనని భావము.

పరిణ...హలంబు—పరిణయ ఆగత=పెండ్లికివచ్చిన, దిగంతనృపతి = దిక్కుల తుదలందలి రాజులయొక్క, నాగ, అశ్వరథ, పదాతులయొక్క, కోలాహలంబు = కలకలధ్వని, రోదసిక్= భూమ్యంతరిక్షములందు, నాదాత్మకబ్రహ్మము=శబ్దాత్మక బ్రహ్మము, అఖండమగుచుక్ = నిండినదై, అతిశయిల్లక్=అధికమగునట్లుగా, చటులతూర్య వ్రజమును, అంటక్ చఱచెక్=లెస్సగా వాయించెనని యర్థము - ఇట చఱవవలసిన దానిని చఱచినదని యానురూప్యము. చతురంగ కోలాహలము మృదంగాదుల ధ్వనిని అంటఁ జఱచెననఁగా అడఁగఁ గొట్టెనని భావము.

బ్రహ్మమనఁగా బృహతి బృంహతి యను వ్యుత్పత్తిచే సర్వత్ర పెరిఁగియుండునది. నాదము రోదసిని బెచ్చు పెరుఁగుటచే బ్రహ్మముగా రూపణము. బ్రహ్మమువలె అఖండముననియు. ఇందుమొదటి నాలుగుచరణములందు వీణయు, గీతమును, వేణువును, తాళమును, మృదంగాదులునని పంచవిధవాద్యములు చెప్పఁబడెను. గీతమందు చతుర్విధబలము చెప్పఁబడెను. భావార్థములనుబట్టి వెనుకటివాని కంటె ముందటికానికి ఆధిక్యము తెలియునది.

వీణెలరవళిని పాటగాండ్రగమనిక మించెను. దానిని పిల్లనగ్రోవిరవళి తూలించెను.ఆరవళిని తాళగాండ్ర కంచుతాళములయు లివు అడఁచెను. దానిని మద్దెలమొదలగు వాద్యములమ్రోఁత నడఁగఁ ద్రొక్కెను. దానిని రాజులచతురంగబలముల కలకలము దూలఁగొట్టి భూమ్యంతరిక్షములం దఖండమై బ్రహ్మమువలె నిండెను. ఇందు సీసపాదములు ముక్తపదగ్రస్తములు.

క. హరియనుమతి సప్తవ్రతి, హరిమధ్యలు దెచ్చి రరిదికోహరివాణములక్
హరితళతపర్వికాఫల, హరిచందనవీటికాళుభాకుతవితతిన్. 70

అ. సప్తప్రతిహారిమధ్యలు = సప్తర్షులభార్యలు, హారియనుమతిఁగా = ఇంద్రునిపంపున, అరిది హారివాణములఁగా = గొప్పపళ్లెరములచేత, హారిత...వితతిఁగా—హారిత = పసరువన్నెగల, శతపర్వికా ('దూర్వాతుశతపర్వికా' అ) గఱికయును, ఫల=పండ్లును, హారిచందన=పచ్చచందనమును, వీటికా= పోఁకలాకులును, శుభాక్షతవితతిఁగా=మంగళకరమగుయక్షింతల సమూహమును, తెచ్చిరి.హారిశబ్దమునకు

హారిర్యమార్కానిలేంద్ర చంద్ర విష్ణు సింహాంశువాజిషు
నాయుభేకాహిసింహేషుకపాచకపిల్లేఙిషు. నానార్థరత్నమాల.

చ. అకుటిలసౌమ్యమానలయ స్ఫురణంబును నాతిమాత్రతా
రకపరివర్తనంబు శుభరాగమిళత్పదపల్లవాంకము
ద్రికయును బెంపుమీఱ నజదృష్టులఁబోలిన సింధుకన్యకా
ప్రకటవివాహగీతికలు పాడిరి పుణ్యపురంధ్రికామణుల్. 71

అ. పుణ్యపురంధ్రికామణుల్ = సుమంగలులయిన పేరటాండ్ర మిన్నలు, అకుటిల...ణం బును—అకుటిల = వంకరలేనిదియు, సౌమ్య =తిన్ననదియునగు, మాన = ప్రమాణముగల, ని=నిషాద స్వరముయొక్కయు, లయ = లయలయొక్కయు, స్ఫురణంబును = స్ఫూర్తియును—(అని గీతి కాపరము] నిషాదస్వరమునకు

'శ్రుతిభ్యస్స్యుస్స్వరాష్షడ్జర్షభగాంధారమధ్యమా; పఞ్చమాధైవతశ్చాథ నిషాద ఇతిసప్తతే, తేషాంసంజ్ఞా స్సరిగమపధనీత్యపరామతాః' లయయనఁగా తాళాంతరానువర్తియః కాలో సౌలయనాల్లయః']

అకుటిలమును సౌమ్యమును మానలయమునయిన స్ఫురణముగలది (అని దృష్టి పరము) నాతి... నంబు—(గీతి) నాతిమాత్ర = అతిశయముకాని, తారకపరివర్తనంబు = ఉచ్చైస్స్వర సంచార మును - (దృష్టి) అతిశయముగాని, తారక = కనునల్లగుడ్లయొక్క, పరివర్తనంబు = తిరుగుట యును, శుభ...ద్రికయును - (గీతిక) శుభరాగ = మంచిరాగములతోడ, మిళత్=కూడికొనుచున్న పదపల్లవ = పదపల్లవులయొక్క, ముద్రికయును = అంకితమును - (దృష్టి) శుభ=మంగళకరమయిన, రాగ = ఎఱుపుతో, మిళత్ = కూడికొనుచున్న, పదపల్లవ = అడుగుఁజిగురునందలి, అంకముద్రిక యును = గుఱుతయిన ముద్రయనుట—అనఁగాఁ పాదన్యస్తమయిన దృష్టియనుట. ఇట గీత పరముగాను 'అజదృష్టులఁగా' అనుటచే దృష్టిపరముగాను అర్థద్వయము. స్త్రీలు మొనవ్రేలికై తలవంచుకొనుట స్వాభావికమయిన చేష్టావిశేషము. 'దులకించుమొనవ్రేలఁ దలవంచుకొన్న వన్నియమీఱ వేల్పుఁగన్నియలుడిగిరి' అని యిందును జెప్పఁబడియున్నది. పెంపుమీఱఁగా = అంత కంతకు మిక్కుటముకాఁగా, నిజదృష్టులఁగా = తమచూపులను పోలిన, సింధుకన్యకా = సముద్రుని కూఁతురయిన లక్ష్మీదేవియొక్క, ప్రకట = ప్రసిద్ధములయిన, వివాహగీతికలు=పెండ్లిపాటలు, పాడిరి- అనఁగా లక్ష్మీకల్యాణములు పాడిరనుట. సింధుకన్యకాశబ్దము సాభిప్రాయము-

పృథ్వీవృత్తము. సుపర్వగణికామణిస్ఫురణతో సుధారమ్య పా
త్రపాలికలతో శుభార్థ మగువేలుపున్నాతితో
నృపాలగృహసీమఁ జేరె న్దివహారిరాణి రామాసుధా
సుపాత్రతరుమాత్రపత్సురపదర్ప మల్పంబుగాన్. 72

అ. సుపర్వగణికామణి స్ఫురణతోఁగా = దేవతావేశ్యారత్నములయొక్క అనఁగా అచ్చర మిన్నలయొక్క స్ఫూర్తితోడనని యర్థము—సుపర్వ = మంచికణుపులుగల, గణికా = అడవిమొల్ల

త్రిఁగలయొక్కయు, మణి = రత్నముయొక్కయు, ఇవి శోభార్థము తేఁబడునవి, స్ఫురణతోనని భావము. సుధారమ్యపాత్రపాలికలతోన్ =అమృతముచే రమణీయములయిన కలశసమూహముతోడ నని యర్థము—సుధయనఁగా సున్నమునగనుక సున్నముపూసిన జాజాలమూఁకుళ్లతో లేక కుండల వరుసతోనని భావము. సుధాకుంభములకు బహుత్వము లేనందున 'స్ఫురణతా సుధారమ్యఁ అని పాఠాంతరమున్నది. అప్పుడు గణికలును సుధాపాత్రికలును నని బహుత్వముగాన యిదియె సమంజసము. శుభార్థమగు వేలుపుఁ బ్రమానితోన్ = శుభనిమిత్తకమయిన పారిజాతవృక్షముతోనని యర్థము - కులదేవతయగు వృక్షవిశేషముతోనని భావము. హరిరాణి=లక్ష్మీదేవియనియర్థము-హరిరాణియనిభావము—అనఁగా నరివేణియనుట. రామాసుధా...దర్పము - రామా=అప్సరస్త్రీలును, సుధాసుపాత్ర = అమృతకుంభములును, తరు = పారిజాతవృక్షము అని, మాత్ర = ఇవిమాత్రముగల, సురపదర్పము = ఇంద్రునిగర్వము, అల్పంబుగాన్ = కొంచెమగునట్లుగా, నృపాలగృహసీమన్ చెందెను = వసురాజుగృహమునందుఁ బ్రవేశించెను.

వసురాజగృహమునకు నింద్రునిగృహమునకును సుపర్వగణికామణులు, సుధాపాత్రపాలిక, శుభమగు వేలుపుఁబ్రమానును సమానములు. వసురాజగృహమునకు ఎక్కుడేమనిన హరిరాణిరాకడ - ఇది యింద్రునిగృహమునందు లేదుగాన యతనిగర్వమడంగెను. పాలసముద్రము చిలికినప్పుడు సుపర్వగణికాదులన్నియు నింద్రునిఁజేరెనుగాని లక్ష్మిమాత్ర మింద్రునివరింపక శ్రీమహావిష్ణువును వరించుట ప్రకటము- ఇది పృథ్వీవృత్తము. ఇందులకు గణములు జసజసయవలు తొమ్మిదవయక్షరము యతి.

ఉ. ముజ్జగ మేలువేల్పు తలమోసలనుండి వివాహయత్నమున్
సజ్జ మొనర్ప నాతనిప్రసాద మెఱింగి సురాంగనాజనం
బజ్జగతీ మహేంద్రుశిరసంట నలుంగిడ బుజ్జవంబునన్
మజ్జనమార్పఁగల్పకుసుమంబులు గూర్పఁగడంగిరయ్యెడన్. 73

అ. ముజ్జగ మేలువేల్పు = మూఁడులోకము లేలుచున్నదేవుఁడు—అనఁగా నింద్రుఁడు. తలమోసలన్ =తలవాకిట, ఉండి = నిల్చి, వివాహయత్నమున్ = పెండ్లిప్రయత్నమునంతయు, సజ్జమొనర్పన్ = ఆయత్తపఱుచుచుండఁగా, ఆతనిప్రసాదము=ఆయింద్రుని యనుగ్రహమును, ఎఱింగి= గుఱుతెఱింగి, సురాంగనాజనంబు=దేవతాస్త్రీసమూహము, అజ్జగతీమహేంద్రున్ =భూమహేంద్రుడయిన యావసురాజుయొక్క, శిరసంటన్ = తలయంటుటకును, నలుంగిడన్ = నలుఁగుపెట్టుటకును, బుజ్జవంబునన్ = లాలనముచేత, మజ్జనమార్పన్ = స్నానముచేయించుటకును, కల్పకుసుమంబులుగూర్పన్ = కల్పవృక్షపుఁ బువ్వులలంకరించుటకును, అయ్యెడన్ = ఆసమయమందు, కడంగిరి = పూనిరి.

మహేంద్రుని సురాంగనలు వసురాజునకు సేవసేయుట యతఁడు జగతీమహేంద్రుఁడుగాన. అతనిసురాంగనలు సేవలుసేయునంతపాటి వసురాజునకెట్లు ? వారియేలికయైన యింద్రుఁడే రాజుపెండ్లిపెత్తనగాండ్రలో నొకానొకఁడుగాక తలమోసలనుండి పెండ్లిజరుపు పెద్దపెత్తనగాఁడై యున్నాఁడు. మఱియాయింద్రుఁడో 'ముజ్జగములేలువేల్పు'గాన యట్టివాఁడు తలమోసలనుండి పెండ్లిజరుపునంతటి ప్రసాదముగన్నవాఁడు కేవలుఁడుగాఁడు. అవియట్లుండ రాజు తనంతటనే, జగతీమహేంద్రుఁడు. దేవలోకమున కాయింద్రుఁడుపలె భూలోకమునకుఁ దానింద్రుఁడు—

సీ. ఈరాజుఁగరమొప్పఁజేరి సేవలుసేయఁ, దఱి తారసిలెఁగదే తార యనుచు
రాజమాత్రుఁడె ధరేంద్రస్వామి యితనిమై, నంటుమైనంటు మేనక యటంచు

నీసర్వమంగళాశివానునిశిర సంట, శశిరేఖ నీవ పోశజాణ వనుచుఁ
గమనీయగతిఁ దిలోత్తమ నేర్పుఁగాక నూనియ యంటనెవ్వారుశనేర్తు రనుచుఁ
తే. బరమవసుసంవహనలీలఁశబరిఢవిల్ల, రత్నమంజరి నీవ నేశర్పరి వటంచు
నతిచటులచాటుచతురోక్తుశలాడుకొనుచుఁ,గదిసితత్స్థలమునశుభాశకుతములునుప.

అ. ఇందు నప్సరసలు దమలోఁదాము చతురోక్తు లాడుకొనుచు వసురాజునకు సేవసేయుట వర్ణించుచున్నాఁడు—తార = (ఒకయప్సరసయు నక్షత్రమును) తారయనుదానా, ఈరాజున్ = ఈవసురాజును, కరమొప్పన్ చేరి = మిక్కిలియొప్పునట్లుగా కదిసి, సేవలు సేయన్ = పరిచర్యలు చేయుటకు, తఱి = సమయము, తారసిలెన్ కదే = తటస్థించెనుగదా: అనుచు ననియర్థము—తార = నక్షత్రమా, ఈరాజున్ = ఈచంద్రుని, కరము = కిరణమును. (కిరణముచేత తృతీయచెప్పి యన్వయింపవలెను. అయినననిట్టి ప్రయోగము. పూర్వకవిమతవిరుద్ధము— లేక, కరము = కిరణము, ఒప్పుచుండఁగా, కిరణములచేతఁ బ్రకాశించుచుండఁగా ననియెనని యర్థము చేయవచ్చును,) సేవలు సేయఁ దఱితారసిలెఁ గదేయని యర్థాంతరము.

మేనక = (ఒకయప్సరసయు హిమవంతునిభార్య మేనకాదేవియు) మేనకయను అప్సరసా, ధరేంద్రస్వామి = భూపతిశ్రేష్ఠుఁడయిన వసురాజు, రాజమాత్రుఁడె = సామాన్యపురాజులవంటివాఁడా- అనఁగా రాజాధిరాజుగదా యనుట, ఇతనిమైన్ = ఈతని దేహమును, నంటుమైన్ = మక్కువతోడ, అంటుము = చమురంటుము (ఇటఁ బ్రార్థనార్థక మువర్ణకమునకవసానమునంజేసి పాక్షికలోపముచే లోపము.) అటంచు - నని యర్థము—మేనక = ఓ మేనకాదేవీ, ధరేంద్రస్వామి = ('అహార్యధరపర్వతాః' అ) పర్వతశ్రేష్ఠుఁడయిన హిమవంతుఁడు, ఇతనిమైన్ = ఇతని మేనిని, నంటుమైన్ = ప్రేమతోడ, అంటుము = హత్తికొనుము, అని యర్థాంతరము.

శశిరేఖ = (ఒకయప్సరసయు చంద్రరేఖయు) శశిరేఖయనుదానా, ('ఘృతాచీతిలోత్తమా... హేమారంభాశశిరేఖ, లుదారగుణాఢ్యలు మదీయ లగుప్రాణసఖుల్' మనుచరిత్రము) ఈసర్వమంగళ+ఆవాసుని శిరసంటన్ = సకలమంగళములకు మనికిపట్టయిన యీవసురాజు తలయంటుటకు, నీవపోజాణవు = నీవేసుమా నేర్పుకత్తెవు. అనుచునని యర్థము.—చంద్రరేఖా, ఈ సర్వమంగళా + వాసుని శిరసు అంటన్ = సర్వమంగళకువాసమైన - అనఁగా పార్వతిని వామాంగమందు దాల్చిన- శివునియొక్క శిరస్సును అంటియుండుటకు, నీవేతగినదానవని యర్థాంతరము.

కమనీయగతిన్ = ఒప్పిదమయినరీతిని, నూనియఅంటన్ = నూనెనంటుటకు, తిలోత్తమ = అను నప్సరస, నేర్పుఁగాక, ఎవ్వరు, మఱెవ్వరు, నేర్తురు, అనుచుననియర్థము—తిలోత్తమయనఁగా మేలయిన నువ్వులునుగనుక-నూనె నంటుటకు మేలయిన నువ్వులుగలదే నేర్పుఁగాక మఱియెవ్వరు నేర్తురని యర్థాంతరము.

రత్నమంజరి = (అప్సరసయు మణిగుచ్ఛమును) రత్నమంజరి యనుదానా, పరమవసుసంవహనలీలన్ - పరమ = అంగీకారమానట్లుగా, వసు సంవహనలీలన్ = వసురాజు ఒడలుపిసుకు పనిచేత, పరిఢవిల్లన్ = విలసిల్లుటకు, నీవ, నేర్పరివి అటంచున్ = నీవే నేర్పుగలదానవు అని పలుకుచు, నని యర్థము—ఓమణిగుచ్ఛమా, పరమ = ఉత్కృష్టమయిన, వసు = బంగారుయొక్క, సంవహనలీలన్ = వహించుటచేత, విలసిల్లుటకు నీవేతగినదానవని యర్థాంతరము - బంగారమునఁ బొదుఁగఁబడియుండుటను మణులకే యుక్తమ్ముగదా, అతిచటుల = మిక్కిలి చదురులయిన, చాటు = ఆదరపూర్వకము

లయిన, చతురోక్తులు = చాతుర్యపుమాటలు, ఆడుకొనుచును, కదిసి, తత్కాలమునన్ = ఆవసురాజు నొసటియందు, శుభాక్షతము లునుపన్ = మంగళప్రయుక్తములయిన యక్షింతల నుంపఁగాను, మీఁది కన్వయము.

ఇందు అప్సరః స్త్రీ) నామములయిన తారాదిపదములు నక్షత్రాద్యర్థాంతరవాచకములును గనుక నర్థద్వయమునకును నభేదాధ్యవసాయము చేసి యనురూపవ్యాపారము చేయవలయునట్లు చెప్పినాఁడు గాన అతిశయోక్త్యను ప్రాణితమయిన సమాలంకారమని తెలియునది.

చ. తఱు లర నిక్కఁ బూఁత నెఱితావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గ్రక్క నూరుపులమేలిమిఁ దేఁటులు సొక్క హారముల్
కుఱుచలు ద్రొక్క ముంగురులు క్రొంజెమటం బద నెక్క వేలుపుం
దెఱవ యొకర్తు చేదిజగతీపతికిన్ శిరసంటె వేడుకన్. 75

అ. వేలుపుం దెఱవ ఒకర్తు = ఒకదేవతా స్త్రీ)—అప్సరస, తఱులు=వళులు - కడుపుమీఁది మడతలు, అరనిక్కన్ =సగముపయికినిక్కఁగా, పూఁత నెఱితావియ చిక్కన్ =మైపూఁత నిండువాసన మాత్రమే మేనియందు మిగిలియుండఁగా—అనఁగా గందపుపూఁత యంతయు రాలిపోఁగానని భావము, అపాంగమాలికల్ =క్రేఁగంటిచూపులు, మెఱుఁగులు గ్రక్కన్ = కాంతులు వెదచల్లఁగా, ఊరుపులమేలిమిన్ = నిశ్వాసముల వాసనాసౌష్ఠవముచేత, తేఁటులుచొక్కన్, హారములు, కుఱుచలు త్రొక్కన్ = (కుఱుచలనఁగా నొకవిధమయిన నాట్యవిశేషము) తుంపెసలాడఁగా, ముంగురులు, క్రొంజెమటన్ = క్రొత్తచెమటచేత, పదనెక్కన్ = తడియఁగా, చేదిజగతీపతికిన్ = వసురాజునకు, వేడుకన్, శిరసంటెన్ = తలయంటెను.

సీ. భ్రమరకంబులచిక్కు వాపవే యన నింక, భ్రమరకంబులచిక్కు వాయుననుచు
బృథులకుచంబులు బ్బింపకే యనఁ బృథు, లకుచ ప్రకాశకాలం బటంచుఁ
గరఁగెఁ బో వరతిలకం బన సుస్నేహ, కలనఁ గరఁగు వరతిలక మనుచుఁ
గడు మొరయింపకే కటకంబుల న్రమోఁయుఁ, గటకముల్ శుభయత్నగరిమ ననుచుఁ

తే. జెలిపలుకు గేరడించుచుఁ జికిలిగోళ్ల, సొగసుసోఁకులఁ గళలు నించుచు మెఱుంగు
ముంగురులు గూడదువ్వుచు ముడికిఁ దార్చి, మజ్జనపువేళ తడ వేల మహిపయనుదు.

అ. ఇట తలయంటుచున్న పడఁతికిని మఱియొకపడఁతికిని గలుగు చతురోక్తిప్రత్యుక్తికను గవి చెప్పుచున్నాఁడు—భ్రమరకంబులచిక్కు వాపవేయనన్ - (భ్రమరకములనఁగా ముంగురులును తుమ్మెదలును) ముంగురులచిక్కు విడఁదీయవేయని యొకచెలికత్తె చెప్పఁగా, (తలయంటుచున్న చెలి) ఇంక భ్రమరకంబుల చిక్కువాయుననుచున్ =ఇఁకమీఁద ముంగురులచిక్కు వీఁడిపోవునని యర్థము- తుమ్మెదలవలని కస్తి యిఁకమీఁద తీసిపోవునని అర్థాంతరము.

పృథు+లకుచంబులు ఉబ్బింపకే అనన్ - గొప్పలయిన నిమ్మపండ్లు ('లకుచోలికుచోడహుః' అ) ఉబ్బింపకే = పట్టియొత్తకే, యనఁగా, పృథుల+కుచప్రకాశకాలంబు = గొప్పలయిన కుచములను ప్రకాశింపఁజేయు కాలమేయిదియని పలుకుచునని అర్థాంతరము - అభ్యంజనకాలమునఁదలకు నిమ్మపండ్లరసము పెట్టుటగలదు.

కరఁగెన్ పో వరతిలకంబు అనన్-వరతిలకంబు=(వరమనఁగా 'వరంకాశ్మీరజం మతమ్' అ.) కుంకుమబొట్టు, కరఁగెఁబో=కరఁగి పోయినదిచుమీ. అనఁగా, సుస్నేహకలనన్ =(స్నేహమనఁగా

చమురును నెయ్యమును) మంచి చమురుతగులుటచేత, వరతిలకము = మేలయిన కుంకుమబొట్టు, కరఁగును అనుచు నని యర్థము—నెయ్యముచేత, వరతిలకము = పెండ్లికొడుకుమిన్న—(ఇట తిలకశబ్దము శ్రేష్ఠవాచకము) కరఁగుచున్నాఁడని యర్థాంతరము.

కడున్ మొరయింపకే కటకంబులు అనన్ = (కటకములనఁగా గాజులును కాలివలయములును) గాజులు మిక్కిలి చప్పుడుగానీయకే యనఁగా, మ్రోయున్ కటకముల్ శుభయత్నగరిమన్ అనుచున్—శుభయత్నగరిమన్ = శుభకార్యమయిన పెండ్లిపనుల బాహుళ్యముచేత, కటకములు = గాజులు మ్రోయుచున్నవని యర్థము—'శుభక్రమాకలనచే' నిత్యాదులందుఁబోలె నిందును శుభశబ్దము వివాహపరము.—శుభయత్నగరిమన్ = సంభోగక్రియయొక్క పెల్లిదముచే-గాఢమయినరతి క్రీడచేతననుట, కటకముల్ = కాలివలయములు మ్రోయునని యర్థాంతరము.

చెలిపలుకు = ఇట్లు చెలికత్తె మొదటఁజెప్పుమాటలను, కేరడించుచున్ = కోడిగముగావించుచు-పరిహాసమునందుఁ బర్యవసింపఁజేయుచు ననుట, చికిలిగోళ్ల సొగసుసోఁకులన్ = వాఁడిగల గోళ్లయొక్క యొయ్యారపు చెనఁకులచేత, కళలునించుచున్ = కాంతులను నిండించుచునని యర్థము—మన్మథకళలూరఁజేయుచునని యర్థాంతరము. మెఱుంగుముంగురులుగూడఁ దువ్వుచున్ = నిగనిగలాడు ముంగురులుసయితము నిడుపతలవెండ్రుకలతోడఁ గలియునట్లుగా, దువ్వుచు, (ముంగురులుదువ్వుటయు కామోద్దీపకమగు వ్యాపారము) ముడికిన్ దార్చి = ముడివైచి, మహీపరాజా, మజ్జనపువేళ = స్నానసమయము, తడవేల, అనుఁడున్—మీఁదికన్వయము.

ఇందొక చెలికత్తె తలయంటు చెలికత్తెతో తలయంటునప్పటి చేష్టితములను అనఁగా ముంగురులచిక్కు వదలించుట, నిమ్మపండ్లరసమును చిలుకుట కుంకుమబొట్టు కరఁగుట చేతికడియములు గల్లుగల్లని మ్రోగుటయును వీనినిగుఱించి ముచ్చటింపఁగా ఆచెలి వానినెల్ల పతిసంభోగాభిముఖ్యప్రయుక్తములయిన ముద్దులుగా నన్వయించి కోడిగముసేయుట తెలియునది. పురుషుఁ డభిముఖుఁడు కాఁగానే మన్మథబాధాపరికరములోని(భ్రమరకముల)తుమ్మెదల కాఱియవాయుట, తనగబ్బిబలితంపుగుబ్బలు కామేంగితముగాఁ బచరించుట, అందులకు నెయ్యముప్పొంగ కాంతుఁడుకరఁగుట, పిదప సంభోగము, అందుఁ గోటిగోనను నొక్కుటచేఁ గళలూరఁజేయుట, ముంగురులు దువ్వుట, యని కాంతాభిముఖ్యము మొదలు సంభోగక్రీడాపర్యంతమయిన వ్యాపారములుగా నన్వయించుట తెలియునది.

తే. సింహగతిమీఱువసురాజుచెంతనొక్క, తోయధరవేణి పాదముల్ తుడిచిమెట్లు
వెట్టనొకకన్యహస్తమర్పింపవచ్చె, సలిలభవనంబునకుఁ బ్రజోత్సవముమెఱయ.

అ. ఇట వసురాజనుశబ్దము మజ్జనశాలకరుగు రాజునకును జలరాశిని బ్రవేశించు సూర్యునకును బరముగా నర్థద్వయముగలుగఁ జెప్పినాఁడు. సింహగతి మీఱు వసురాజుచెంతన్ = సింహపునడకచే-లేక పరాక్రమవిధముచేత - అతిశయించుచున్న వసురాజుచెంతనని యర్థము - సింహరాశి నతిక్రమించుచున్న సూర్యునిచెంతనని యర్థాంతరము - ఒక్క తోయధరవేణి - (వసు) మబ్బువంటి జడగల యొకస్త్రీ - (సూర్య) జడవంటి మేఘము, పాదముల్ తుడిచి మెట్లు పెట్టన్ = (వసు) అడుగులుతుడిచి పాదుకలు పెట్టఁగా - (సూర్య) పాదములనఁగా కిరణములును గనుక - కిరణములు ప్రసరింపకుండునట్లు నిలిపి నిలుకడపఱుపఁగానే, ఒకకన్య హస్తము అర్పింపన్ - (వసు) ఒకస్త్రీ కైదండ యొసఁగఁగా - (సూర్య) కన్యారాశి హస్తనక్షత్రమందుఁ బ్రవేశముసేయింపఁగా ['హస్తచిత్తార్థం

కన్యా’ యనుట తెలియునది.] ప్రజోత్సవము మెఱయన్ = ప్రజలకు వేడుక ప్రకాశించునట్లుగా శుభయాత్రసమము. సలిలభవనంబునకున్ - (వసు) జలకమింటికి - (సూర్య) జలరాశికి - లేక జలోత్పత్తికి (భవనమనఁగా గృహమును ఉత్పత్తియు) వచ్చెను.

సింహగతి మీఱవచ్చు వసురాజునొద్ద నొకయచ్చర యాతని యడుగులుదుడిచి పాదుకలు పెట్టఁగానే మఱియొక యప్సరస కైదండయియ్యఁగా జలకమింటికిఁ బ్రజలుల్లసిల్లఁగా వచ్చెననియర్థము - సూర్యుఁడు సింహరాశిని గడవఁగా నతనిపొంత నొకనల్లనిమబ్బు క్రమ్మి కిరణప్రసారము గాకుండఁజేసి నిలుకడసేయఁగానే, కన్యారాశి హస్తానక్షత్రమును జొప్పించెను. అంతఁ బ్రజలకెల్ల సంతోషము కలుగునట్లు జలోత్పత్తికి అనఁగా వర్షమునకుఁ జేరకుఁడుగాఁ బూనెనని యర్థాంతరము.

చ. పతియభిషేకవేళఁ గరభావితకుంభకురంగభృన్మణి
ప్రతిమలు నిర్జరీసుముఖభావముఁ గన్గొని నీరువంచి య
య్యతివలు సిగ్గునం గనలి యాస్యము వంచిన నూరకుండె న
ప్రతిమరసజ్ఞరత్నపరిపాకము లిట్టివకావె ధారుణిన్. 78

అ. కర...ములు—కర=చేతులందు, భావిత=ఉన్న, కుంభ = కుండలుగల, కురంగభృన్మణిప్రతిమలు=చంద్రకాంత రత్నపుఁ బ్రతిమలు - అనఁగా చేతులందు చంద్రకాంతపు గలశములుగల చంద్రకాంతపు ప్రతిమలనుట. పతియభిషేకవేళన్, నిర్జరీ సుముఖభావము=అప్సరసలయొక్క సుముఖత్వమును, కన్గొని=చూచి, నీరువంచి=కలశములవలన నీరు గ్రుమ్మరించి యని యర్థము - అప్సరసల ముఖములుచూచి చంద్రభ్రాంతిచే స్రవించినవని భావము - ఇట ప్రతిమలచేతులందలి కలశములు కొంచెము క్రిందుగానుండునని తెలియునది. అయ్యతివలు - ఆయప్సరఃస్త్రీలు, సిగ్గునన్ కనలి = తాము ప్రయత్నపడి చేయవలసినపనిని ప్రతిమ లప్రయత్నముగా చేసినందులకు సిగ్గుపడి కోపగించి, ఆస్యము వంచినన్ = మొగమువంచుకొనఁగా - అనఁగా విముఖులుకాఁగానే, ఊరకుండెన్ = నీరు గ్రుమ్మరింపక యుండెనని యర్థము. చంద్రభ్రాంతి జనకములయిన ముఖములను వంచుకొనుటచేత స్రవింపక పోయెనని భావము. (స్త్రీముఖములను జూచియు చంద్రకాంతము లచేతనములయ్యు స్రవించుట, యిందే పెక్కుపట్టులఁ దెలియునది) ధారుణిన్ = భూమియందు, అప్ర...పాకములు—అప్రతిమ=సాటిలేని, రసజ్ఞరత్న= రసికశ్రేష్ఠులయొక్క, పరిపాకములు=స్వభావములు, ఇట్టివకావే = ఈలాటివే కావా యనియర్థము. రసజ్ఞరత్నము లనఁగా చంద్రకాంతములు. చంద్రకాంతములు, అప్ప్రతిమలు - అప్ప్రచురములయిన ప్రతిమలు - అనఁగా జలము ప్రచురములయిన ప్రతిమలు. వేనిచేతనో యవి యప్ప్రతిమములు - అవియ రసజ్ఞరత్నములు, వానియొక్క పరిపాకము లీలాటివే కావాయని అర్థాంతరము.

చంద్రకాంతపు ప్రతిమలు, అప్సరసల సుముఖభావమును జూచి నీరు వంచినవి; విముఖభావమునుజూచి యూరకుండినవి. ఇట్టి స్వభావపరిపాకములు రసికులకు రావు, అప్రతిమ రసికరత్నములకే కలుగునవి. సిగ్గుచేత మొగమువంతురు. కనలుచేత మొగము త్రిప్పికొందురు. రెంటను సుముఖభావము గలుగదు. శ్లేషోత్థాపితమగు అర్థాంతరన్యాసము.

మ. ఘనచాంపేయకవాసనా వివశభృంగశ్రేణిఁ జేపట్టి చ
ల్లనిపూఁదేనియ చల్లి తేర్చుమధువేళాలక్ష్మి యో నాఁగ సో

గనెఱుల్ సంపెఁగనూనె నిగ్గుసడలంగాఁ బైపయిన్ దువ్వి నే
ర్పున గంధామలకంబు వెట్టె నొకయంభోజాక్షి భూజానికిన్. 79

అ. ఒక అంభోజాక్షి=ఒక యప్సరస, ఘన...శ్రేణిన్—ఘన=గొప్పదియగు, చాంపేయక=సంపెంగయొక్క, వాసనా=పరిమళముచేత, వివశ=మూర్ఛనొందిన, భృంగశ్రేణిన్ = తుమ్మెదచాలును, చేపట్టి=చేతఁబట్టుకొని, చల్లనిపూఁదేనియను, చల్లి, తేర్చు=సేదదేర్చునట్టి, మధువేళా లక్ష్మియోనాఁగన్=వసంతలక్ష్మియో యన్నట్లుగా, సోఁగనెఱుల్=నిడుదలయిన తలవెండ్రుకలు, సంపఁగెనూనె నిగ్గుసడలంగాన్=సంపఁగినూనె జిడ్డువదలునట్లుగా, పైపయిన్ = మీఁదమీఁద, దువ్వి, నేర్పునన్=మెలఁకువచేత, భూజానికిన్=రాజునకు, గంధామలకంబు = వాసనతోఁగూడిన యుసిరిక పిండి యుటకలిని, పెట్టెను - అనఁగా జిడ్డుచక్కఁగా తీసిపోవునట్లు పులుసుటకై గంధపుటటకలిని బెట్టె ననుట.

వెండ్రుకలు సోఁగలనుట భృంగములశ్రేణితోఁ బోలుటకు. సంపెంగనూనెచే నెఱులు తలకు నంటి వ్రాలుట సంపెంగవాసనకుఁ దుమ్మెదలు సోలుటవలె. నెఱులను జేతఁబట్టికొని దువ్వుట తుమ్మెదలను జేపట్టి తేర్చుటవలె. గంధపుటటకలి పెట్టుట, చల్లని పూఁదేనియ చల్లుటవలె. దువ్వుట, సంపెఁగనూనె జిడ్డుసడలుటకు. మిక్కిలి జిడ్డుంచిన మిక్కుటముగా పులుసువలసి వచ్చునుగదా. పయి దువ్వుట నొప్పిలేకుండుటకు. కావుననే 'నేర్పునన్' అన్నాఁడు, మధువేళాలక్ష్మి యేల? వసంతంపు పెంపేకదా తుమ్మెదలకు సొంపు. ఉత్ప్రేక్ష.

చ. కరముల నుజ్జ్వలాభినవగైరిక కుంభము లంటఁగూర్చి పు
ష్కరములు కంకణప్రకర సంభ్రమ మొప్పఁగ వంచి రాజకుం
జరునకుఁ గుంభినీభరణ సమ్మదశాలికిఁ బద్మినీవరం
పర పరమానురాగమున మజ్జన మార్చెఁ బయోగృహంబునన్. 80

అ. ఇందు రాజకుంజర శబ్దముచే రాజుపరముగాను కుంజరపరముగాను అర్థద్వయము తెలియు నది:- పద్మినీపరంపర-పద్మినీజాతి స్త్రీ పరంపరయని యర్థము - (పద్మములనఁగా 'పద్మకంబిందుజాలకమ్' అ. ఎఱ్ఱనిపొడలు-అవిగలది పద్మి. దానియాఁడుది పద్మిని-అనఁగా) ఆఁడేనుఁగుల పరంపరయని యర్థాంతరము - కరములన్=(రాజ)చేతులందు - (గజ) తొండములందు, ఉజ్జ్వల అభినవగైరిక కుంభములు=(రాజ) ప్రకాశించుచున్న క్రొత్తవైన బంగారుకలశములను, అంటఁగూర్చి= గట్టిగా సంధించి - పట్టుకొని యనుట - (గజ) ప్రకాశించుచున్న క్రొత్త, గైరిక = ('గైరికంకనకే ధాతౌ' విశ్వము) జాజురేఖలుగల, కుంభస్థలములను, అంటన్ కూర్చి = తాఁకునట్లుగాఁజేర్చి - ఏనుఁగులు తొండములతో కుంభములను స్పృశించుకొనుట ప్రకటము. పుష్క...వంచి—(రాజ) పుష్కరములు=జలములు, కంకణప్రకర సంభ్రమము ఒప్పఁగన్=చేతికడియముల సమూహముల ఝణఝణ ధ్వను లొప్పఁగా, వంచి=కుమ్మరించి - (గజ) పుష్కరములు = తొండము చివరలు, కంకణప్రకర= జలబిందుసమూహములయొక్క, సంభ్రమము=తిరుగుట - చిందుట, ఒప్పఁగాన్ క్రిందికివంచి, పరమానురాగమునన్=మిక్కిలియైన ప్రేమచేత, పయోగృహంబునన్ = జలకమింటియందు - నీటిపట్టునందనియు - అనఁగా కొలంకునందనుట, కుంభినీభరణ సమ్మదశాలికిన్ = భూభరణమందు సంతోషముచేత ఒప్పుచున్నవాఁడగు - (గజ) కుంభిని యనఁగా ఆఁడుగజముగనుక ఆఁడేనుఁగుల భరించుట

చే నొప్పువాఁడయిన, రాజకుంజరునకుర్ = రాజశ్రేష్ఠునకు - పురుషగజశ్రేష్ఠమునకును, మజ్జనమాచ్చెర్=జలకమాడించెను.

పద్మినీజాతులయిన యుత్తమస్త్రీలు, క్రొత్తబంగారు కలశములను జేతఁబట్టికొని కంకణములు ఝుణఝుణయని మ్రోఁగవంచి జలకమింటియందు రాజోత్తమునకుఁ బ్రేమమీఱ జలకమార్చిరని యర్థము - ఆఁడుగజములు క్రొత్తజాజురేఖలుగల కుంభస్థలములందు తొండములనెత్తి కూర్చి యక్కడి నుండి క్రిందికివంచి తొండముల చివరలనుండి జలబిందువులు పడుచుండఁగా కొలంకునందు మగయేనుఁగు మిన్నకు జలకమార్చెనని అర్థాంతరము.

చ. పడఁతి యొకర్తు చెందిరికపావడఁ బైతడి యొత్తి వైవ సు
గ్గడితపుజీబునేత్ర మొకకామిని గట్ట నొసంగ సంజకెం
పెడలిచి నిండువెన్నెల వహించి పయోనిధిమండలంబు వె
ల్వడునుడురాజు నా నలకళానిధి యంబుగృహంబు వెల్వడన్. 81

అ. పడఁతి ఒకర్తు=ఒకయప్సరఃస్త్రీ, చెందిరికపావడర్=చందురకావిపావడచేత, పైతడి యొత్తి వైవర్: సుగ్గడితపు జీబునేత్రము=దట్టపునేఁతగల కట్టుపుట్టము ఒకకామిని, కట్టర్=కట్టుకొనుటకు, ఒసంగర్,-('నేత్రంవస్త్రేక్షిశాఖా గుణభూరుహమూలయోః' నానా)ఇచట సుగ్గడితము జీబు అనుశబ్దములు విశేషణవిశిష్ట వస్త్రవాచకములయినను, నేత్రశబ్ద సాన్నిధ్యమువలన విశేషణ మాత్ర పర్యవసన్నములగును.) సంజకెంపు=తొలుసంధ్యయెఱుపును, ఎడలిచి= విడిచి, నిండువెన్నెల వహించి, పయోనిధి మండలంబు=పూర్వసముద్రపు పఱపును, వెల్వడు ఉడురాజునార్ = బయలు వెడలు చంద్రుఁడోయనునట్లుగా, అలకళానిధి = లావణ్యనిధియైన యావసురాజు, అంబుగృహంబు వెల్వడర్ = జలకమింటినుండి బయలుదేఱఁగానని యర్థము - (కళానిధియనఁగా చంద్రుఁడనియు అంబుగృహమనఁగా సముద్రమనియుఁ జమత్కారము.)

ఇట చెందిరికపావడకును తొలుసంజ యెఱుపునకును దట్టమయిన సన్నపు తెల్లవస్త్రమునకును నిండువెన్నెలకును జలకమింటనుండి వెడలు రాజునకును బయోనిధి మండలమునుండి బయలు దేఱిన చంద్రునకును ఉపమానోపమేయము భావము. ఇట నిండువెన్నెలకును సుగ్గడితపు జీబువలువకును సామ్యమునుబట్టి, నిండుకు ప్రతిగా సుగ్గడీత ముండుటచే - సుగ్గడితమనఁగా దట్టపునేఁతయని తెలియుచున్నది. జీబు అనఁగా ఆఁడుదాని కట్టుఁగోకయని సీతారామాచార్యులు. దీనిచేత సామాన్యముగా కట్టుఁగోకయని కాని లేక తెల్లని వస్త్రయనికాని తేలుచున్నది. ఉత్ప్రేక్ష.

తే. నవనవావర్త మండలోన్నమిత కద్రు,విద్రుమంబులఁ ద్రిప్పుసాముద్ర భద్ర
విమలతరవీచికలచంద మమర నమర,రమణులెత్తిరి మంగళారాత్రికములు.

అ. అమర రమణులు=దేవతాస్త్రీలు, నవ...ద్రుమంబులర్—నవనవ = మిక్కిలి క్రొత్తలయిన, ఆవర్త=సుళ్లయొక్క, మండల = సమూహమునందు, ఉన్నమిత=పైకిలేచిన, కద్రు=పింగళవర్ణములయిన - అనఁగా ఎఱుపుమించిన పసపుచాయగల, (కడారః కపిలః పింగ పిశంగౌకద్రు పింగళే' అ) విద్రుమంబులర్ = పగడపుఁ దీఁగె మోసులను, త్రిప్పు=తిరుగునట్లుగా చేయుచున్న, సాముద్ర=సముద్రసంబంధులును, భద్ర = సొగసయినవియును, విమలతర=మిక్కిలి స్వచ్ఛము లయినవియు, అయిన, వీచికల=అలలయొక్క, చందము అమరర్, మంగళా రాత్రికములు=మంగళపు హారతులు, ఎత్తిరి.

ఇక్కడ ఆవర్త మండలమునకును, ఆరతి పళ్లెరములకును, విద్రుమములకును దీపకళికలకును, వీచికలకును దేవతాస్త్రీలకును, ఉపమానోపమేయ భావము. సుళ్లు గిఱ్ఱునతిరిగినపుడు లోనున్నవి పయికిఁ దేలుటకలదు గాన ఉన్నమితము లనఁబడెను. విద్రుమములు కద్రువర్ణము లయినవి దీపకళికలతోడి సాటికి.

శా. అంభోజేక్షణువక్షమో యన శుభాంకాలంకృతంబున్ జతుః
స్తంభశ్రీకరవైభవాన్వితము భద్రశ్రీకృతామోదమున్
శుంభన్నూతన వైజయంతికము నై శోభిల్లు వైవాహికా
రంభస్థాపితవేదిఁ జెందె వసురాడ్రత్నంబు భవ్యోన్నతిన్. 88

అ. వసురాడ్రత్నంబు=వసురాజశ్రేష్ఠుఁడని యర్థము—వసువనఁగా రత్నమును గనుక, రత్నశ్రేష్ఠమయిన, రత్నము = పద్మరాగము - అనఁగాఁ గౌస్తుభమణి యని యర్థాంతరము. [రత్నసామాన్య మెఱుపు.

సామాన్యగ్రహణే వారిముచాం కృష్ణత్వమేవహి
రక్తత్వమేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్యమేవచ (కా. క. ల)

కావుననే రత్నమనఁగా నిట పద్మరాగముగాఁ దెలియుట] అంభోజేక్షణు వక్షమోయనన్ = శ్రీమహావిష్ణువు వక్షఃస్థలమో యనఁగా, ఇది మొదలు విశేషణములు విష్ణువక్షఃస్థల పరముగాను, వివాహవేది పరముగాను నర్థద్వయము గలుగఁ జెప్పవలయును. శుభాంక అలంకృతంబున్ = (వేది) శుభచిహ్నములచేత అలంకరింపఁబడినదియు - (వక్ష) శుభమయిన అంకము అనఁగా లాంఛనము—శ్రీవత్సము-దానిచేత నలంకరింపఁ బడినదియు, చతు...తమ—(వేది) చతుఃస్తంభ = నాలుగు కంబములయొక్క, శ్రీకర=శోభాకరములయిన, వైభవ = విభవములతోడ, అన్వితము = కూడుకొన్నదియును - (వక్ష), చతుః=నాలుగయిన, స్తంభశ్రీ=కంబముల శోభవంటి శోభగలిగిన, కర=హస్తములయొక్క, వైభవాన్వితము, భద్ర ..దమున్—(వేది)=భద్రశ్రీ - ('భద్రశ్రీ శ్చన్దనోస్త్రియామ్' అ.) చందనముచేత, కృత=చేయఁబడిన, ఆమోదమున్=పరిమళము గలదియు- (వక్ష) భద్ర=శుభాస్పదురాలయిన, శ్రీ=లక్ష్మీదేవికి, కృత=చేయఁబడిన, ఆమోదమున్=సంతోషము గలదియు. ('శ్రీవత్సాంకిత కౌస్తుభ స్ఫురితలక్ష్మీచారు వక్షఃస్థల శ్రీవిభ్రాజిత' (గంగన భాగవతము. ౫ స్కంధము) శుంభ...తికమ—(వేది) శుంభత్ =ప్రకాశించుచున్న, నూతన=క్రొత్తదియగు, వైజయంతికము=పతాకలు గలదియు - (వక్ష) ప్రకాశించుచున్న వైజయంతీ మాలికగలదియు, ఐ, శోభిల్లు=ప్రకాశించుచున్న, వైవాహికారంభ స్థాపిత వేదిన్= వివాహకర్మము తొలుతఁ బ్రతిష్ఠింపఁబడిన వేదికను, భవ్యోన్నతిన్=మిక్కిలి పెరిమతో, చెందెను = పొందెను.

రాజు, శుభలక్షణ లక్షితమైన, నాలుగు స్తంభములచే సొంపుగులుకుచు, చందనపు వాసనల గుబాళించుచు, క్రొత్తపతాకలు కట్టంబడియున్న వివాహవేదికను బొందెనని తాత్పర్యము.

సీ. ఆగిరిజాసక్తుఁ డొనాదల తడియార్చె, నొకశరద్రమ్య రాకేజ్జ్వలాస్య
యారాజహంసుపైఁ గనడరించె మృదుజలా, ర్ద్రానిలం బొక మానసాభిరామ
యామోహనాగ్రణిఁ గలరు లందిచ్చె నొ,క్కొలతానిభాత్యంతకోమలాంగి
యాజగజ్జీవనుఁ గనలరించె వరగంధ, పరిలేపమున నొక్కఁ సురభిచరిత

తే. ఘటితఘనకంకణ శుభాంకగరిమఁ దాల్చు, నాయగణ్యలావణ్యరత్నాకరునకు
బహువిధామూల్య మణికలాపంబు లొసఁగె, నిర్మలస్వాతి విఖ్యాతినిధియొకర్తు.

అ. ఒక, శ...లాస్య—శరత్ = శరత్కాలమందు, రమ్య=ఒప్పుచున్న, రాజ=చంద్రుని వలె, ఉజ్జ్వల=ప్రకాశమానమగు, ఆస్య=ముఖముగల యొకస్త్రీ, ఆగిరిజాసక్తు = పార్వతియం దాసక్తుఁడయిన యాశివునియొక్క, జౌదలతడి=శిరోగంగను, ఆర్చెన్ = తనకాంతిచేత అడఁగించెనని యర్థము - ఇట చంద్రునకు శరద్విశేషణము తత్సమాన ముఖమునకుఁ బ్రకాశాతిశయ సిద్ధికిని, ధావళ్యాతిశయమును వ్యంజితము గావించి శిరోగంగను గ్రిందుపఱుచుటకును నని తెలియునది - గిరికయందాసక్తుఁడయిన యావసురాజుయొక్క తలతడి యార్చెనని భావము.

ఒక మానసాభిరామ = మానస సరస్సువలె రమణీయ మయిన యొకస్త్రీ, ఆరాజహంసు పైన్ = ఆరాజ హంసముమీఁద, మృదు = మందమును, జలఆర్ద్ర = జలముచేఁ దడిసినదియు - చల్లనిదియునయిన, అనిలంబు=వాయువును, అడరించెన్ = వ్యాపింపఁజేసెనని యర్థము—మనసున కింపయిన యొకస్త్రీ ఆరాజోత్తమునిమీఁద విసనకఱ్ఱచేత విసరెనని భావము - మానసాభిరామయను చో మానససర స్సర్థమగునట్లు మానసశబ్ద ప్రయోగము రాజహంసమనెడి యర్థము పొసఁగుపాటునకై. మానస సరస్సునందలి యలలతుంపురులం దడిసెన చల్లని మెల్లనిగాలి విసరెననుట.

ఒక్కొలతాని భాత్యంతకోమలాంగి - లతా=ప్రేంకణపు తీఁగతోడ-(ఇట లతకు సామాన్య లతాపరముగాఁ జెప్పుటకన్నను ప్రేంకణపుఁ దీఁగయనుట మఱింత పొంకము.

'లతా గుం...గుంద్రాశ్యామాతు మహిళాహ్వయా' అమరుఁడు.

ఆతీఁగకు స్త్రీమేనితోడి యత్యంత సామ్యరూఢినిబట్టియే దానికి 'మహిళాహ్వయా' అనియుఁ బేరువచ్చినది. మఱియు, 'శ్యామాస్వంగంచ కితహారిణీ ప్రేక్షణే దృష్టిపాతమ్' అని మేనికి శ్యామను అనఁగా ప్రేంకణమునే పోల్కగా గాళిదాసును బరిగణించి యున్నాఁడు కాన యిది యెయుపపన్నము) నిభ=సాటియైన, అత్యంతకోమల అంగి=మిగుల మెత్తనిదేహము గలస్త్రీ, ఆమోహనాగ్రణికిన్=ఆమన్మథునకున్, అలరులందిచ్చెన్ = పువ్వులందిచ్చెనని యర్థము - లతలే కదపువ్వులిచ్చునది కావున లతా...ంగి యనియు, మన్మథునకుఁ దూపులకై పువ్వులే కదా కావలయుఁ గావున 'అలరులం దిచ్చె'ననియుఁ జమత్కారములు దెలియునది—సుందర పురుషులలో నగ్రణియైన యారాజునకుఁ బువ్వులందిచ్చెనని భావము. ఇట 'అందిచ్చె' ననుచో క్త్వార్థకేత్తునకు సంధిగా గ్రాహ్యముగాదు.

'విల్లందిమ్మనుడు' (భార. విరా) 'ఆనతిచ్చె' (విరాటపర్వ) ఇత్యాదిమహాకవి ప్రయోగాను గృహీతము లగుటంజేసి యివి శబ్దపల్లవములుగా నెన్నందగు 'ఒక్క' అనుటకు 'ఒక్కొ ముహూర్తంబున ...గూడం ద్రిలోకంబులన్' (భార. ఉద్యో)

ఒక్క, సురభిచరిత-సురభి = వసంతునియొక్క, చరిత=చరిత్రవంటి చరిత్రగలదని యర్థము - ప్రఖ్యాతమయిన చరిత్రగలదని భావము. ఆజగజ్జీవనున్ = జగత్ప్రాణుఁడయిన యావాయువును, వరగంధ పరిలేపమునన్=మేలయిన వాసనను బూయుట- అనఁగా కలిగించుట- చేత, అలరించెన్= సంతోషింపఁ జేసెనని యర్థము - జగత్ప్రియుఁడయిన యారాజును గుంకుమ గంధానులేపముచేత, సంతసిల్లఁ జేసెనని భావము (వరశబ్దమున కిచటఁ గుంకుమయని యర్థము.)

ఘటి...గరిమన్—ఘటిత=సంఘటింపఁబడిన, ఘన=మేఘముయొక్క, కంకణ=జలబిందురూపమయిన, శుభాంకగరిమన్ = శుభచిహ్న గౌరవమును, తాల్చు, ఆ, అగణ్యలావణ్య రత్నా

శరనకున్ = అప్రమేయుఁడయిన లవణసముద్రునకు, ఇట లవణమే లావణ్యమని తెలియునది. నిర్మల...నిధియొక్కర్తు—నిర్మల = స్వచ్ఛమయిన, స్వాతి = స్వాతినక్షత్రమువంటి, విఖ్యాతి=కీర్తికి, నిధి = స్థానమయిన, ఒక యప్సరసయని యర్థము. నిర్మల = స్వచ్ఛమయిన, స్వ = తన, అతి విఖ్యాతి=అత్యంతకీర్తికి, నిధియని భావము. బహువిధ = అణిపాణి సుపాణియను నివి మొదలుగా ననేక విధములయిన, అమూల్య=వెలలేని, మణి=ముక్తామణులయొక్క, కలాపంబులు=సమూహములను, ఉనిచెనని యర్థము. ఘటిత=సంఘటింపఁబడిన, కంకణ=వివాహసూత్రమనెడు, శుభాంకరిమను, తాల్చి, ఆయగణ్యలావణ్య రత్నాకరునకున్=కొలఁది యిడరాని లావణ్యమునకు సముద్రుఁడయిన యారాజునకు, బహువిధ అమూల్యమణి కలాపంబులు = అనేకవిధములయిన అమూల్య రత్నములు దాపిన భూషణములను, ఉనిచెనని భావము.

ఇట తాల్చిననుపదము వర్తమానార్థకమును భవిష్యదర్థకము నగునని గ్రహించునది. స్వాతి నక్షత్రమునఁ బడువర్షజలబిందువులు సముద్రమునందు ముక్తామణ్యుత్పాదకములని ప్రసిద్ధి. కావున నే స్వాతివంటి విఖ్యాతిగలది స్త్రీ, లవణసముద్రునియందు ముక్తామణి సమూహమును గలిగించెనని యర్థము. మఱియు 'శరద్రమ్యరాజోజ్జ్వలాస్య' 'మానసాభిరామ' 'లతానిభాత్యంతకోమలాంగి' 'సురభిచరిత' 'నిర్మలస్వాతివిఖ్యాతినిధి' అను ఈ స్త్రీవిశేషణములందు 'శరద్రమ్యరాజ' 'మానస' 'లతా' 'సురభి' 'స్వాతి' అనుపదములను అర్థములందుఁగల; శివునితల, గంగ, రాయంచ, మరుఁడు, వాయువు, లవణసముద్రము, అనువీనికిఁ బొసఁగునట్లుగా నిబంధించుట తెలియునది. శరచ్చంద్రబింబము గంగను ధావళ్యమున నడంచుటయు, మానససరస్సు రాయంచలకు నీటిబిందువులఁ దోఁగినమెల్లని గాడ్పును బొలయించుటయు, తీవియలు మరునికిఁ దూపులయిన పూవులిచ్చుటయు, వసంతము గాలిని వాసనలచే గుబాళింపఁజేయుటయు, స్వాతినక్షత్రములవణసముద్రమున ముత్తెములు పుట్టించుటయుఁ బ్రకటములు. మఱియు ఒక్క...కోమలాంగి' 'యనుచో ఒక్కయని హ్రస్వవక్రరూపము గలదు.

'ఒ, క్కని మేషంబున...గూడంద్రిలోకంబులన్.' — ఉద్యోగపర్వము.

ఒ,క్క మొగిం బెల్లగిలంగ బెట్టదిమెనుత్రోక్కి ధాంతరంగంబునన్.' — కర్ణపర్వము.

క. ఇట నవ్వరూథినియునొ,క్కటఁ గతిపయసఖులు దన్నుఁగొలిచినదువఁగాఁ
గటకరఘుశంఝుశరవపద, కటకసమాకృష్ట కేళికలహంసికయై. — మనుచరిత్రము.

స్రగ్ధర- ఆరాజన్యోత్తముం డిట్లనుదితరభసుండై భవత్సత్వరవ్యా
హారం బిట్లోర్చి యుం టన్యముగఁ గొనకు మాత్మాంగనాశుల్కతాదృ
క్సారోగ్రేష్వాస మట్లక్రమజిత మగు టెంచంగ నాచేతికాటం
గ్రూరేష్వాసంబులే దొక్కఁడు గలుగునె మద్ఘోరయుద్ధంబుపైఁపన్.

— రాఘవపాండవీయము.

చ. ఘనఘనసారచూర్ణతిలకంబు వహించి నిధీశదత్తనూ
తనమకుటంబుఁదాల్చి వసుధాపతి వక్రవతంసఖండచం
ద్రుని దిగఁద్రోచి యక్షయశిరోమణిభావవిభాసమాను నా
యనుమభాను భానుఁ దనయూదలఁ బూను మహేశుఁడై వడిన్. ౮౫

అ. వసుధాపతి = వసురాజు, ఘనఘనసార చూర్ణతిలకంబు = గొప్పదయిన కర్పూరము పొడిచేత రచింపఁబడిన తిలకంకాముమును, వహించి, నిధీశ...టంబు = కుబేరునిచేత నియ్యఁ

బడిన క్రొత్తకిరీటమును, వక్రవతంసఖండచంద్రునిన్ = వంకరరూపుగలిగి తలపువ్వుగానున్న అర చందురుని, దిగఁద్రోచి = క్రిందుగాఁజేర్చి యని యర్థము—(వక్రవతంస = ధూర్తశిరోమణియు, ఖండ = నిండుఁదనములేనివాఁడునుగాన చంద్రుని, దిగఁద్రోచి = క్రిందికిఁ బడఁద్రోచియనియు నర్థస్వారస్యముధ్వనించెడిని). అక్షయ...మాను—అక్షయ = నాశములేని, శిరోమణిభావ=చూడామణిత్వముచేత—(సూర్యుఁడు ద్యుమణి—అనఁగా ఆకాశమణియని వ్యవహరింపఁబడును—ఆకాశము వ్యోమకేశుఁడగు శివునకు శిరసుగాన ఆకాశము శివునకు శిరోమణియగుటను దెలియునది) విభాసమానుఁడు = మిక్కిలిప్రకాశించువాఁడు—(చంద్రుఁడు క్షయిష్ణుఁడు గనుక అక్షయశిరోమణి గాఁడనుట.) ఆ = అట్టి, అనుపమభానున్ = సాటిలేని కిరణములుగలవానిని, భానున్ = సూర్యుని, తన, జౌదలన్, పూను, మహేశుకైవడిన్ = శివునివలె, తాల్చెను.

మహేశుఁడనఁగా రాజునుగనుక సారస్యము గ్రహించునది. కుబేరుఁడు 'నిధీశు'ఁడు గావునే రత్నమకుట ప్రదాతృత్వమతనికిఁజెప్పుట. చంద్రుఁడు వక్రవతంసుఁడు - అనఁగా కుచ్చితుల మిన్న, అఱగొఱవాఁడును గావుననే వానిని దిగఁద్రోచుట. అనఁగాఁ బరిహాసముగా నిరసించుట. సూర్యుఁడో అక్షయశిరోమణి =అధ్యులతలమానికము, కావుననే జౌదలఁబూనుట అనఁగా శిరసా వహించుట మిగుల గారవించుటయనియు, 'దిగఁద్రోచు' 'జౌదలఁబూను' అను క్రియలచే ఆశయాంతరములును ధ్వనించెడిని. కప్పురపుగీరునామము తెల్లని వంకచంద్రునితోడి సాటికి. మణులకాంతులచే మెఱయుబంగారు కిరీటము కిరణములెనలేక నిగిడించు నెఱ్ఱనిసూర్యునితోడి సాటికి. శివుఁడు చంద్రధరుఁడేగాన సూర్యధారణ మెట్లనుచో నిది కవికల్పిత సృష్టిలోని సూర్యధారణము, లేదా, ఆకాశము శివునకు శిరసుగనుక అస్తమించినచంద్రుఁడు దిగఁద్రోయఁబడినట్లును ఆకాశమధ్యగతుండగు సూర్యుఁడు జౌదలఁదాల్పంబడినట్లును దెలియవచ్చును. ఇట నిధీశుని రత్నకిరీటదాతృత్వము వలెనే, మీఁదట దాతృదాతవ్యసంబంధము తెలియునది. అలం. ఉత్ప్రేక్ష.

మ. వసురాజన్యకిరీటవీథి ననఘస్వర్లోకవాస్తవ్యభ
వ్యసతీకల్పితకల్పదామఘటితంబై ముత్తెపుంబాసికం
బెసఁగెం గాంచనశైలరోహణమహాశృంగంబుపై నుద్భవిం
చుసురద్వీపవతీత్రిరూపవిపులస్రోతోవిశేషం బనన్. 86

అ. వసురాజన్యకిరీటవీథిన్ = వసురాజుయొక్క కిరీటపాళికయందు, అనఘ...ఘటితంబై—అనఘ = నిర్దోషమైన, స్వర్లోకవాస్తవ్య = ఇంద్రునియొక్క, భవ్యసతీ = ప్రియకాంతయైన శచీదేవిచేత, కల్పిత = కట్టఁబడిన, కల్పదామ = కల్పవృక్షపుఁ బూదండలచేత, ఘటితంబై=కూర్పఁబడినదై, ముత్తెపుంబాసికంబు...కాంచనశైలరోహణమహాశృంగంబుపైన్—కాంచనశైల = మేరు పర్వతమందలి, రోహణ = రోహణమను పేరుగల, మహాశృంగంబుపైన్ = పెద్దశిఖరముమీఁద, ఉద్భవించు, సురద్వీపవతీ = దేవతానదియొక్క—అనఁగా గంగయొక్క, విపుల = విస్తారమయిన, స్రోతోవిశేషం అనన్ = ప్రవాహవిశేషమో అన్నట్లుగా, ఎసఁగెను.

రోహణము - రత్నపర్వతము. అది మేరుగిరియొక్క శిఖరమనియుఁ బ్రతీతి. రాజు మేరుగిరి వలెను, కిరీటము రోహణశిఖరమువలెను, ముత్తెపుబాసికము మూఁడుమార్గములుగాఁ బ్రవహించుగంగా ప్రవాహమువలెను నున్నదని తాత్పర్యము. కల్పపుపూదండ ముత్తెపుబాసికమునకుఁ జుట్టుట మంగళార్థము. మఱియిట ధావళ్యాతిశయముచే త్రిపథగతోడి సాదృశ్యమును బుష్టినొందించుటయు నుప

యుక్తము. ముల్లోకముల నేలు కిరీటాధిపతి పట్టపుదేవికి కిరీటమునకు బాసికమును గట్టుట యెంతయుఁ నర్హము. వసురాజునొద్దు బోడుపుగలిమియు బంగారువన్నెచాయయు కాంచనపర్వతము చేత వ్యంజితము. కిరీటము రోహణసాదృశ్యము చేత రత్నమయము. త్రిరూపవిపులస్రోతోవిశేషంబు—ఒక వెల్లువయే మూడువంకలుగానుండునట్లు—ఒక బాసికమను భూషణమే మూఁడుసంపులుగానుండుట. స్రోతస్సు విపులమనుట వూదండచేఁ బెనఁచి వెడఁదయైన బాసికముతోడిసాటికి. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. క్షోణిబలారికిన్ బలనిషూదనదత్తములైన గొప్పక
ట్టాణి సుపాణిముత్తెములు లలరారె నగాత్మజలక్షణంబు శ
ర్వాణికి శక్రురాణికిని వాణికిఁ గానమటంచు నాఘన
శ్రోణివిధంబు దెల్ప గురుశుక్రులు వీనులు సేరిరో యనన్. 87

అ. క్షోణిబలారికిన్ = భూలోకదేవేంద్రుఁడయిన వసురాజునకు, బలనిషూదనదత్తములు = ఇంద్రుని చేత నియ్యఁబడినవి, ఐన, కట్టాణిసుపాణిముత్తెములు = గొప్పలయిన ఆణిసుపాణియనెడు రకముల ముత్యాల చెవిపోఁగులు—అనఁగా అంటుపోఁగులు, అలరారెన్ = ఒప్పుచుండెను—ఎట్లనిన—నగాత్మజలక్షణంబు = గిరికాదేవియొక్క వైఖరి, శర్వాణికిన్ = పార్వతికిని, శక్రురాణికిన్ = శచీదేవికిని, వాణికిన్ = సరస్వతికిని, కానము అటంచున్ = చూచినవారము కాము అని, ఆఘన శ్రోణివిధంబున్ = బలితములయిన పిఱుందులుగల యాగిరికయొక్క లక్షణము, తెల్పన్ = తెలుపుటకు, గురుశుక్రులు = బృహస్పతియు శుక్రుఁడును, వీనులు సేరిరో అనన్ = చెవులయొద్దకు వచ్చిరో యనునట్టుగా, అలరారెనని సంబంధము - (ఇందలి అంతరార్థము విచార్యము)

బలారి క్షోణిబలారికినిచ్చెనని యౌచిత్యము. అలం. ఉత్ప్రేక్ష.

మ. వెలిదీవిం దెలిబావిలో నమృతమున్ వే త్రావి దివ్యాంబుదం
బులు వర్షింప సుధాబ్ధిలోఁ బొడము బల్పూసల్ ఘటింపన్ సుధా
గుళికానిర్మలహారమయ్యె నిది కైకొమ్మాయురారోగ్యముల్
గలుగున్ నీ కని యబ్ధినాథుఁ డొకముక్తాహార మర్పించినన్. 88

అ. దివ్యాంబుదంబులు = దేవసంబంధులయిన మేఘములు, వెలిదీవిన్ దెలిబావిలో = శ్వేతద్వీపమందలి అమృతపుబావియందలి, అమృతమున్, వే, త్రావి, వర్షింపన్, సుధాబ్ధిలోన్ = పాలసంద్రములో, పొడము బలుపూసల్ = పుట్టినబటువులయిన ముత్తెములను, ఘటింపన్ = కూర్చుటవలన, సుధాగుళికా నిర్మలహారమయ్యెన్ = అమృతపుగుళికల చేత రచింపఁబడిన మాలిన్యములేని హారమైనది, ఇది, దీనిని కైకొమ్ము, నీకున్, ఆయురారోగ్యముల్ గలుగును, అని అబ్ధినాథుఁడు = సముద్రముల కధినాథుఁడయిన వరుణుఁడు, ఒకముక్తాహారమును, అర్పించినన్—మీఁదికన్వయము.

అంబుదంబులు దివ్యములనుట వెలిదీవియందలి తెలిబావిలోని యమృతమును ద్రావంగలుగుటం బట్టి. అమృతమును అనఁగా సుధను సుధాబ్ధియందు వర్షించుట ఉచితము-అందులకై పాలకును నమృతమునకును వాచకమయిన సుధాశబ్దము ప్రయోగించినాఁడు. మేఘములవలన ముత్యములు పుట్టుట ప్రకటము. అమృత సుధాబ్ధిలోఁబుట్టిన పూసలుగాన, సుధాగుళికా నిర్మలములగుట యని హేతువు. సుధ ఆయురారోగ్యముల నిచ్చునదిగావున, సుధాగుళికా మయమగు హారమునట్టిదే యగును. సుధాబ్ధిలోఁ బొడము నదిగాన యబ్ధినాథుఁ డొసంగుటయుం దౌచిత్యము.

ఉ. మానవనాథుఁ డయ్యమృతమౌక్తికహారము పేరురంబునం
బూనె నగాత్మజాభజనభూరిసుఖాచిరలాభహర్షసం
ధానవిశల్యకౌషధమునన్ మది నాటినపంచసాయకా
నూనలతాంతకోరకసముత్కరముల్ వెలిఁబర్వెనో యనన్. 89

అ. మానవనాథుఁడు=వసురాజు, అయ్యమృతమౌక్తికహారము=అమృతమయిన యాముత్యపుహారమును, పేరురంబునన్=విరివియైన వక్షఃస్థలమందు, పూనెను, అదియెట్లున్నదనఁగా- నగాత్మ...కౌషధమునన్—నగాత్మజా = గిరికయొక్క, భజన=పొందికవలని, భూరిసుఖ = మిక్కుటమయిన సౌఖ్యముయొక్క, అచిరలాభ=శీఘ్రప్రాప్తివలననయిన, హర్షసంధాన = సంతోషమును గూర్చుట యనెడి, విశల్యకౌషధమునన్ = విశల్యకరణిచే, - అనఁగా నాటిన ములుకులను వెలికిదీయునట్టి మహౌషధముచేత, మదిన్, నాటిన, పంచసాయక=మన్మథసంబంధియగు, అనూన = అధికమైన, లతాంతకోరక=పూమొగ్గరూపయిన బాణములయొక్క, సముత్కరముల్ = సమూహము, వెలిన్, పర్వెనోయనన్=వ్యాపించెనో యన్నట్లుగా, పేరురంబునన్ పూనెనని సంబంధము.

'హారము పేరురంబునన్, అనుచో హారము పేరని చెప్పుటచే పునరుక్తవదాభాసమలంకారము. 'యత్రార్థఃప్రముఖే కించిద్భాసతే పునరుక్తవత్ పునరుక్తవదాభాసస్సోఽలంకారస్సతాంమతః' 'లాభహర్షసంధాన విశల్యక' అనుచో సంధానశబ్దము నోషధీపరముగాన రత్నావళ్యలంకారము. 'క్రమికంప్రకృతార్థానాం న్యాసం రత్నావళింవిదుః' ఇందులకుఁ బాఠాంతరము. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. మానవనాథుఁ డయ్యమృతమౌక్తికహారము పేరురంబునం
బూనె నగాత్మజాపృథుసమున్నతవృత్తకుచోపగూహన
శ్రీనిరవద్యవైభవముఁ జెంతకుఁ దెచ్చినభాగ్యవర్ణసం
తానము తద్భుజాంతరమునం బ్రకటంబయి తోఁచెనో యనన్. 90

అ. మానవనాథుఁడు, అయ్యమృత...పూనెన్—ఎట్లనఁగా, నగాత్మ...వైభవమున్—నగాత్మజా=గిరికయొక్క, పృథు=గొప్పలయిన, సమున్నత=మిక్కిలి నిక్కుగల, వృత్త=వట్రువలగు, కుచ=చన్నులయొక్క, ఉపగూహనశ్రీ=కౌఁగిలింత పెంపుయొక్క, నిరవద్య=నెఱసులేని-నిర్దుష్టమయిన, వైభవమును, చెంతకున్ తెచ్చిన, భాగ్యవర్ణసంతానము=భాగ్యాక్షరపంక్తి, తత్ భుజాంతరమునన్=ఆవసురాజు బాహుమధ్యమునందు, ప్రకటంబయి, తోఁచెనోయనునట్లుగా, పేరురంబునం బూనె నని సంబంధము.

చ. గరుడసమన్వితాభినవగారుడరత్నమయాంగదంబు భూ
వరభుజపీఠిఁ బొల్చె నగవర్యసుతావరణాభ్యసూయచేఁ
దరలనిభూతధాత్రి యనఁ దత్సతిఁ బల్మఱు నూరడించువై
ఖరినడరెం దదీయభుజకాండపరిస్ఫురణంబు లయ్యెడన్. 91

అ. గరుడ...అంగదంబు—గరుత్మంతునిచేత ఈఁబడిన క్రొత్తదయిన గరుడపచ్చలు చెక్కిన బాహుపురి, భూవరభుజపీఠిన్=వసురాజు బాహుపీఠమందు, పొల్చెను-ఏలాగున ననఁగా, నగవర్యసుతా-వరణ-అభ్యసూయచేన్=గిరికాదేవి పెండ్లాడుటనుగుఱించిన యీసుచేత, తరలనిభూత్రియనన్ = కదలక నిలిచియున్న భూకాంతయో యనునట్లుగా, పొల్చెనని సంబంధము. భూ

దేవి నలుపని మహాకవి ప్రసిద్ధము. శ్రీవత్సోఙ్కురంగనాథ మెదపైఁ జెన్నొందఁ దవిశ్వంభరా దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీతిఁ నిల్పినాఁడోయనంగా. (మనుచరి)

అయిన నిట గరుడపచ్చలు ఆకుపసపువర్ణముగాన నల్లనిభూకాంతగాను త్ప్రేక్షించుటయెట్లన్నచో ఆపసిమి నలుపునందంతర్భూతము గాన గరుడపచ్చల బాహుపురిని భూదేవిగాఁ జెప్పినాఁడు. ఇందులకు గ్రంథాంతరము. 'మరకతమణి నీలంబాలమాలోకయేను, మరకతమణిస్తంభగంభీర బాహుమ్. (కృష్ణకర్ణామృత.)

నిఖిలభూావన...తనబాహుపురి మరతకముచేసె. (మనుచరిత్రము.)

ఉరుభుజశాఖలనుండు తేటులఁబోలెఁ గెలఁ బచ్చలకడియాలు దనరె.)

అయ్యెడన్=ఆసమయమందు, తత్సతిన్=ఆభూకాంతను, పల్మఱు, ఊరడించు వైఖరిన్=ఊరడించుచున్నట్లుగా, తదీయభుజకాండ=ఆవసురాజు దక్షిణబాహుదండముయొక్క, పరిస్ఫురణంబులు=అదరుటలు-చలనములు, అడరెన్ = ఒప్పెను. పురుషునకు కుడిభుజమదరుట శుభకరమని శాస్త్రము. 'దక్షిణాక్షిపరిస్పందా ద్దక్షిణస్యభుజస్యచ, మనసశ్చ ప్రసాదేన సానుకూల్యానిలేనచ, ఏవంనిమిత్తైర్నిశ్చిత్య విజయంభూపతిర్వ్రజేత్.' మానసోల్లాసము. ఇందులకున గాళిదాసుఁడు 'శాంతమిదమాశ్రమపదంస్ఫురతిచబాహుఃకుతఃఫలమిహాస్య, అథవాభవితవ్యానాందాంరాణిభవన్తిసర్వత్ర.' శాకుంతలము. 'భుజపీఠి' భూతధాత్రి-తరలకకూర్చుండుటకుఁ బీటవంటిది. 'భుజకాండ పరిస్ఫురణంబులు' పెక్కులదరుటలు, పల్మఱు ఊరడించు వైఖరికిఁగాను. అలం. రెండు ఉత్ప్రేక్షలు.

శా. సుత్రామప్రియ మిత్రపాణియుగళీన్ శోభిల్లెఁ జిత్రప్రభా
పాత్రస్ఫారవిదూరజాభరణముల్ పర్జన్యరాడ్దత్తముల్
క్షేత్రశ్రీకరసూత్ర సన్నహనలక్ష్మిం దన్నృపాగామి స
త్క్షేత్రశ్రీకరసూత్రసన్నహనలక్ష్మీ వైఖరుల్ తెల్పుచున్. 92

అ. పర్జన్యరాడ్దత్తముల్ = మేఘశ్రేష్ఠునిచే ఇయ్యఁబడిన, చిత్ర...భరణముల్—చిత్రప్రభా=వింతలయినకాంతులకు, పాత్ర=భాజనములును, స్ఫార=అధికములును, విదూరజ = వైడూర్యమణిమయములు నయిన-అనఁగా వైడూర్యములు దాఁపిన, ఆభరణముల్ = చేతికంకణములు, సుత్రామప్రియమిత్ర పాణియుగళిన్=ఇంద్రునకు అనుఁగు చెలికాఁడయిన వసురాజు చేదోయియందు, శోభిల్లెను- [ఇట మేఘధ్వనివలన వైడూర్యములు పుట్టుచున్నవి గనుకఁ బర్జన్యరాజు విదూరజాభరణము లిచ్చెనని చెప్పినాఁడు-ఇందులకు

'తయాదుహిత్రాసుతరాంచకాశే స్ఫురత్ప్రభామండలయా సవిత్రీ
విదూరభూమిర్నచమేఘ శబ్దాదుద్భిన్నయా రత్నశలాకయేవ. (కుమార సంభవము).

క్షేత్ర...క్ష్మిన్—క్షేత్ర=(ఆవైడూర్యరత్న) స్థానములందలి, శ్రీకర=శోభాకరములయిన, సూత్ర=నూలుదిరుగుటలయొక్క, సన్నహనలక్ష్మిన్=ప్రయత్నము పెంపుచేత, తత్...ఖరుల్—తత్ నృప=ఆవసురాజుయొక్క, ఆగామి=ముందురాఁగల, సత్ క్షేత్ర=('క్షేత్రంశరీరే కేదారే సిద్ధస్థానకళత్రయోః' అని అ) ఉత్తమకళత్రమయిన గిరికాదేవికి, శ్రీకర=సౌభాగ్యకరమైన, సూత్ర = మంగళసూత్రముయొక్క, సన్నహన=('ణహబంధనే' అనుధాతు నిష్పత్తిచే) బంధనము చేతయిన, లక్ష్మీ వైఖరుల్=శ్రేయోవైఖరులను, తెల్పుచున్=సూచించుచు, శోభిల్లెన్=ప్రకాశించెను.

వైడూర్య రత్నమందు సూత్రములు దిరుగుటకు

గీ. పగలుగొందిఁ గానఁబడెడు బిడాలంబు, కన్నుఁబోలి వెలుఁగు గలిగి నూలు
దిరుగునట్టుమీఁదఁ దెరవాఱు వైడూర్య, రత్నమునకు దీప్రయత్నమునకు.' రత్నపరీక్ష.

చేతులందలి కడియములందు నూలుదిరుగుట గిరికకు మంగళసూత్రముగట్టు సన్నాహమునకు సూచకముగా నున్నదని యుత్ప్రేక్ష.

చ. అలకారాజకుమారుఁ డద్భుతముగా నర్పించు చొక్కంపుఁ గెం
పుల పెండేరము చేదిరాజచరణాంభోజంబునం బొల్చె నీ
బలవద్దీప్తిఁ బ్రదీప్తమయ్యె నిదె నా పార్శ్వద్వయం బంచు నా
వలయగ్రావము వందనప్రవణమై వర్తిల్లు చందంబునన్. 93

అ. అలకారాజకుమారుఁడు = కుబేరుని కొడుకయిన నలకూబరుఁడు, అద్భుతముగాన్, అర్పించు, చొక్కంపుఁ గెంపుల పెండేరము=వట్టికెంపులమయమయిన గండపెండరము, చేదిరాజ చరణ అంభోజంబునన్=వసురాజుపాదమందు, పొల్చెను-ఏలాగనఁగా, నీబలవద్దీప్తిన్=బలీయమయిన నీప్రతాపముచేత, కాంతిచేత, ఇదె=ఇదిగో, నాపార్శ్వద్వయంబు = నాయొక్క వెనుకముందటి వైపులు, ప్రదీప్తమయ్యెన్=మిక్కిలియుఁ బ్రకాశించెను, అంచున్, ఆవలయగ్రావము=ఆచక్రవాళ పర్వతము, వందనప్రవణమై=మ్రొక్కుటయందలి ఆసక్తిగలదై, వర్తిల్లుచందంబునన్ = ప్రవర్తించుచున్న దోయన్నట్లుగా, ప్రకాశించెనని సంబంధము.

చక్రవాలపర్వతము భూమిచుట్టి ప్రాలి యెల్లగానుండునది. దాని లోవైపుననే సూర్యప్రకాశము; వెలిప్రక్క సూర్యచంద్ర ప్రకాశములులేక చీఁకటి గ్రమ్మియుండును. వసురాజుప్రతాపము చక్రవాలపర్వతముగూడ నతిక్రమించిపోవుటచే దాని రెండుప్రక్కలును బ్రకాశమానము లయినవి. అట్లు తనయవలిప్రక్కయుఁ బ్రదీప్తముగావించిన మహోపకారమునకై యాపర్వతము వసురాజునకు వందనప్రవణమైనది. కెంపులపెండెరము రూపమున ఇట కాలియందు గీలుకొనుటయె కాలికి వందనముచేయుటగాఁ జెప్పుట. అచ్చపుఁగెంపు పెండేరముగాన యిరువైపుల యెఱ్ఱఁదనము. దానినే చక్రవాలపు ఇరుప్రక్కల ప్రకాశమునకు నిరూపకముగాఁ జెప్పుట. ఇదె యని ప్రత్యక్షముగా నిజవందన హేతువగు నుభయపార్శ్వప్రదీప్తిని జూపుటగా గ్రహించునది. చక్రవాల పర్వతముయొక్క రెండుప్రక్కలను బ్రకాశింపఁ జేయునదిగాన రాజదీప్తి 'బలవత్' బలీయమయినది. అచ్చపు కెంపులదిగాన అద్భుతముగా నర్పింపఁబడుట. ఇచట బలవద్దీప్తిఅనుచో వసురాజు నరుణకాంతియని పూర్వవ్యాఖ్యగలదు గాని యది పెండేరము నిరుప్రక్కల వెలిఁగించుటకు నగును గానిచక్రవాలము నిరుప్రక్కలకుఁగాదు. కాన తేజఃప్రకాశమే న్యాయము. ప్రతాపమెఱుపని కవి సమయము. అలం. ఉత్ప్రేక్ష.

మ. చెఱఁగుల్ పూఁతపసిండిబ్రాఁతమిసిమిం జిత్రాతిచిత్రంబు లై
మెఱయన్ రత్నపుఁగుచ్చు లంచులబడిన్ మించుల్ దువాళించు గ్రొ
మ్మెఱుఁగుం జంద్రికకావిపట్టు సురభూమీజార్పితం బిచ్చె నా
తఱచుంగన్నులవేల్పుపట్టి వసుగోత్రామండలస్వామికిన్. 94

అ. తఱచుంగన్నుల వేల్పుపట్టి=మిక్కిలి కన్నులుగల - అనఁగా వేయికన్నులుగల-యింద్రుని కుమారుఁడయిన జయంతుఁడు, వసుగోత్రామండలస్వామికిన్ = భూమండలాధిపతియైన వసురాజునకు

పూఁత పసిండిఁ బ్రాఁత మిసిమిన్ = మేలైన బంగారపు వ్రాఁతపనియొక్క నిగనిగని కాంతిచేత, చెఱఁగుల్ = అంచులు, చిత్రాతిచిత్రంబులై = వింతలలో మిక్కిలి వింతలై, మెఱయన్, రత్నపు కుచ్చులు=ముత్యాలకుచ్చులు, అంచులబడిన్ =అంచులవెంట, మించుల్ = కాంతులు, దువాళించు = చల్లుచున్న, క్రొమ్మెఱుఁగుం జెంద్రికకావిపట్టు = క్రొత్తమెఱుఁగుగల చంద్రకావిపట్టు తాపితాను, సురభూమిజ అర్పితంబు=కల్పవృక్షముల చేత అర్పింపఁబడినదానిని, యిచ్చెను.

వస్త్రము, క్రొత్తచంద్రకావిపట్టు. దానిఅంచులు సరిగపనిచేసినవి. ఆ యంచులవెంబడిని ముత్యాలకుచ్చులు కూర్పఁబడినవి. మించుల్ దువాళించు...పట్టు=ఇట మించులు దువాళించునది రత్నపుఁగుచ్చులు గాని కావిపట్టు గాదు. 'దువాళించు' అను ధాతువిశేషణము ప్రాధాన్యవివక్షచే కుచ్చులతో నన్వయించునని తెలియునది.'నీవు సంకటపడినెడు దేవపదవియైన నేనొల్లను'(విరాటపర్వము)

ఉ. వ్రీళవివర్తితాస్య యయి వేలుపుటింతి యొకర్తు చేదిభూ
పాలమహేంద్రుకట్టెదుటఁ బట్టె మణీమయదర్పణంబు శో
భాలలితానురూప్యమునఁ బార్థివ యీముకురంబు మేలొ నా
మేలిమిచెక్కుటద్దములు మేలొ కనుంగొను మన్విధంబునన్. 95

అ. వేలుపుఇంతి ఒకర్తు=ఒకదేవతాస్త్రీ, వ్రీళవివర్తితఆస్య=(ఇట వ్రీళశబ్దము అకారాంతము కూగలదు 'వ్రీడో ఒక్లీ బేత్రపాలజ్జా'అని రభసుఁడు) సిగ్గుచేత అడ్డముగా మరల్చుకొనఁబడిన ముఖము గలది, ఐ, చేదిభూ ..దుటన్ =వసురాజు నెట్టయెదుట, మణీమయదర్పణంబు=రత్నవికారమయిన యద్దమును, పట్టెను-పీమనియనిన, శోభా-లలిత ఆభిరూప్యమునన్ =కాంతిచేత ఒప్పుచున్న చక్కఁదనముచేత, పార్థివ=రాజా, ఈముకురంబు మేలో, నా మేలిమి చెక్కుటద్ద మిది మేలో=నా మేలి బంగారమువంటి యీచెక్కుటద్దము మేలా, కనుంగొనుము = చూడు, అనువిధంబునన్, అద్దము నెదుటఁబట్టెనని సంబంధము.

అద్దముపట్టినది వేలుపుటింతి గదా. మనుజునిముందట వ్రీళయేల? కేవలరాజుగాదు భూపాలమహేంద్రుఁడు - తానుగొల్చుచున్న మహేంద్రునంతటివాఁడు - కావుననే సిగ్గు. అందును అద్దమునకై ఎట్టఎదుట నిలువవలసి వచ్చుటంబట్టి మొగము ఓరగామరల్చుటయు ఇదియే 'వంచనలేక నెమ్మొగమువంచిన యప్పుడుఫాలమోరగా,వంచినఁజెక్కుటద్దములు వ్రీడభరంబునకీలెఱింగిచుం,బించి, (శృంగారనైషధము. ౭.) అప్పుడు చేతఁబట్టిన యద్దమును చెక్కుటద్దమును సరిగా రాజునకభిముఖములగుచున్నవి. కావుననే యిదిమేలో యదిమేలో చూడుమన్నట్లున్నదనుట. అనఁగా నాపడఁతి చెక్కిలి అద్దముకంటె నిద్దమయి మఱింతబిగిదళుకొత్తుచుండెనని తాత్పర్యము. అద్దమువంటి చెక్కిలి గలది అద్దము పట్టెనని యౌచిత్యము. అలం. ఉత్ప్రేక్ష.

చ. వసువసుధాసుధాంశునకు వారిదవాహనుఁ డాక్షణంబునం
దసదృశచిహ్నమొక్కటి మహామహనీయమహోచితంబుగా
నొనఁగెఁ దలంచి దివ్యసరిదుద్భవరత్నమృణాళినీ బిస
ప్రసవసరంబు మంగళకరంబు గరంబున నెత్తి యిట్లనున్. 96

అ. వారిదవాహనుఁడు=మేఘవాహనుఁడయిన యింద్రుఁడు-వసువసుధాసుధాంశునకున్ =భూలోకచంద్రుఁడయిన వసురాజునకు,ఆక్షణంబునన్, అసదృశచిహ్నము=సాటిలేని రాజలాంఛనమును-

గుణింతునసుట, ఒక్కటిని, మహామహనీయ మహాఉచితంబుగాన్ =గొప్పదయిన మేలయిన వివాహోత్సవమునకుఁ దగియుండునదిగా, ఒసఁగన్ తలంచి, మంగళకరంబు=శుభకరమయినదగు, దివ్య...రంబు—దివ్యసరిత్ =ఆకాశగంగయందు, ఉద్భవ= సంభవించిన, రత్నమృణాళినీ = మణిమయ మయిన తామరతీఁగయందలి, బిసప్రసవ = తామరలచేతనయిన 'బిసప్రసూన రాజీవపుష్కరాంభోరుహాణిచ' అని. అ. సరంబు=మాలిక, కరంబునన్ ఎత్తి = చేతఁబైకెత్తి, ఇట్లనును.

తామర పూలదండపుట్టినది దివ్యనదిని;అందును మానికపుఁ దామరతీఁగయందు; కావుననే అసదృశచిహ్నమును మహామహనీయ మహోచితమును. మఱి'వసువసుధా సుధాంశునకున్''వారిద వాహనుఁడు' అనుశబ్దములలో సుధాంశుఁడును వాహనుఁడును తామరలకు విరోధులు. అంబోకరు దానికి దాతయు మఱొకఁడు ప్రతిగృహీతయునగు గొప్పము. కావుననే 'అసదృశము'. అయినను దివ్యసరిత్తునందలి రత్నమృణాళి నివిగాన విరోధము లేదు మంగళకరమేయనియు భావము ధ్వనించెడిని.

ఉ. కమ్మపసిండిగట్టుపయిఁ గ్రమ్మెడువేలుపుటేటిపార్శ్వదే
శమ్ముల నిమ్ములై పొదలు చాగపుమ్రాఁకుల మానికంపుఁ బూ
దుమ్ములు రాలఁగా నయిన తోరపుఁ బేర సటన్ జనించె నీ
తమ్ములు చిత్రదీప్తి మహితమ్ములొసంగు నభీప్సితమ్ములున్. 97

అ. ఈతమ్ములు=ఈతామరలు, కమ్మపసిండి గట్టుపయిన్ =అందమయిన బంగారుకొండమీఁద, క్రమ్మెడు=ఆక్రమించి పాఱుచున్న, వేలుపు+ఏటి, పార్శ్వదేశమ్ములన్ =ఆకాశగంగయొక్క రెండువైపులను, ఇమ్ములై=లెస్సగా, పొదలు=పెరుఁగుచున్న, చాగపుమ్రాఁకుల = ఈవిగల చెట్లయొక్క= అనఁగా కల్పవృక్షములయొక్క, మానికంపుఁ బూదుమ్ములు = మాణిక్యమయములయిన పుప్పొడులు,ఆగంగలోఁ,రాలఁగాన్, అయిన=ఏర్పడిన, తోరపుపేరసటన్ =విస్తారమయిన పెనుబురదయందు, జనించెను=పుట్టెను, కావుననే, చిత్రదీప్తిమహితమ్ములు (ఇతరములయిన తామరలకులేని) వింతకాంతిచే ఒప్పునవి. మఱియు, అభీప్సితమ్ములన్ =కోరినదానిని, ఒసంగును. తమ్ములు పుట్టినచోటు 'కమ్మపసిండిగట్టు' పాఱిననీళ్లు 'వేలుపుటేటి' వి. పెరిగినబురద కల్పవృక్షపు 'మానికంపుఁబూఁదుమ్ములు' రాలఁగానయినది. కావుననే 'చిత్రదీప్తి మహితమ్ములు' కల్పవృక్షముల పుష్పపరాగమందుఁ బుట్టినవి కావుననే 'ఒసంగు నభీప్సితమ్ములన్' ఏలన కల్పవృక్షములు 'చాగపుమ్రాఁకులు' గదా. అలం. కావ్యలింగము. పరికరమును.

ఉ. అవ్యయనవ్యవాసన లొకప్పుడు వీడక వాడకుండు నీ
దివ్యసరోజదామకము దీధితిమాత్రదినేశమిత్రతా
భవ్యము దీనిఁ గన్న నెడఁ బాయుఁ బ్రదోషము లన్నచోఁ బ్రదో
షవ్యసనంబు పైకొనఁగఁ జాలునె దీని జగత్త్రయంబునన్. 98

టీ. అవ్యయ - నవ్య - వాసనలు=ఉడిగిపోని - క్రొత్త - పరిమళములు, ఒకప్పుడున్, వీడక= వదలక, వాడక, ఉండు, ఈ, దివ్యసరోజదామకము=దివ్యమైన తామరదండ, దీధితి...భవ్యము— దీతిమాత్ర = కాంతిమాత్రముచేతనే, దినేశ = సూర్యునియొక్క, మిత్రతా = స్నేహమునకు, భవ్యము = యోగ్యమయినది - లోకమున తామరలు కాంతినపేక్షించి సూర్యునితో మైత్రిగలిగియుండును. ఇది యట్లుగావు. తమసమానకాంతిచేతనే సూర్యునకు మిత్రములగునదుట, దీనిన్, కన్న

చూడఁగానే, ప్రదోషములు = ప్రదోషకాలములు, ఎడఁబాయుర్ అన్నచోన్ = వీడిపోవునని చెప్పుచుండఁగా, జగత్త్రియంబునన్ = మూఁడులోకములందును, దీనిన్, ప్రదోషవ్యసనంబు = ప్రదోషకాలమందలి క్లేశము—అనఁగా స్త్రీవిరహక్లేశము, పైకొనఁజాలునె = ఆక్రమింపనేర్చునా- నేరదనుట. లేక ప్రదోషకాలకృతమగు దృష్టి నిరోధత్వముగాని ప్రదోషకాలమందలి ముకుళీభావముగాని దీనిని పైకొనఁజాలునాయని ప్రకారాంతరములు. ప్రదోషమనఁగా పాతకము. ఈపద్మమాలికను చూడఁగానే పాతకములు వీడిపోవుననుచుండఁగా పాతకములవలని క్లేశము దీనిని పైకొనఁజాలునా యనియును జెప్పనగును. ఈ నాలుగర్థములలో ప్రథమ ద్వితీయ చతుర్థార్థములు పద్మమాలిక ధరించినవారికే చెప్పవలయును. తృతీయార్థము పద్మమాలికకు చెప్పవలయును, 'ప్రదోషః కాలభేదేస్యాత్ప్రదోషాదోష ఇష్యతే' విశ్వ. 'వ్యసనంత్వశుభే శక్తౌ పానస్త్రీమృగయాదిషు' విశ్వ.

పద్మమాలిక 'దివ్య' మైనదిగావుననే 'అవ్య...వాడకుండు'ను.'దీధితి...భవ్యము' కానసామాన్యకమలములకంటె అతిశయించినదని వ్యతిరేకము వ్యంజితము. ఎడఁబాయు...జాలునే. అర్థాపత్తి.

క. ఈశరజాతములకు నెన
యేశరజాతములఁ గాన ♦ మివి బవరములో
నాశరజాతము వఱపెడు
నాశరజాతముల నడఁచు ♦ నభినవమహిమన్. 99

టీ. ఈశరజాతములకున్ = ఈతామరలకు (శరమనఁగా జలము. దానియందు పుట్టినది శరజాతము), ఎన = సమానము. ఏశరజాతములన్ = ఏతామరలను, కానము = చూడము, ఏలనఁగా, ఇవి = ఈతామరలు, బవరములోన్ = యుద్ధములో, ఆశరజాతము = (ఆశరులనఁగా రాక్షసులు, జాతమనఁగా సమూహము) రాక్షససమూహము, వఱపెడు = ప్రయోగించునట్టి, ఆశరజాతములన్ = ఆబాణ సమూహములను, అభినవమహిమన్ = వింతయైన మహత్త్వముచేత, అడఁచున్ = నిగ్రహించును. ఇది పంచప్రాసకందము. దీని మహిమ 'అభినవ'మైనదిగావున అసురసమూహమును నడఁచుచున్నవి. కావుననే వీనివంటి తామర లెచ్చటను గలుగవు. అలం. కావ్యలింగము. ఆశరశబ్దమునకు 'దాశరథీ కీశరథీ, యాశర నిర్వపణ వేంకటాచలరమణా' అని ప్రయోగము. 'క్రవ్యాదోస్రపఆశరః' అని అమరుఁడు.

శా. సోఁకన్ వచ్చు శిలీముఖంబుల నడంచున్ రాజహంసాళి న
ట్టాఁకం బెట్టు ననంతరత్నరుచి వ్రాలున్ నాడుం దపశ్శ్రీలకున్
వేఁకంబై వెలయున్ ఘనోదయమునన్ ♦ విప్పారు నిప్పద్మముల్
వీఁకం జిత్రచరిత్రపాత్రములు గా ♦ వే ధాత్రి నూహింపఁగాన్. 100

అ. ఇప్పద్మముల్ = ఈతామరలు, సోఁక...డంచున్ — (శిలీముఖములనఁగా 'అళిబాణౌ శిలీముఖౌ' అ, తుమ్మెదయు బాణములును) ముట్టవచ్చు తుమ్మెదలను వారించునని యర్థము. నాటవచ్చెడు బాణములను ప్రతిఘాతము సేయుననిభావము. రాజ...బెట్టును = రాయంచలను మిక్కిలియాఁకలబెట్టును - రాకుండ నడ్డగించునని యర్థము, రాజశ్రేష్ఠుల నిరాకరించునని భావము.అనంత...నాడున్ —(అనంత రత్నమనఁగా ద్యుమణి-సూర్యుఁడు గనుక) అతనియందలి ప్రీతి నిరసించునని యర్థము. అపరిమితములయిన పద్మరాగమణులయొక్క కాంతిని దిరస్కరించునని భావము. తపశ్శ్రీలకున్ =

(తపస్సనఁగా వేసవి) వేసవి యెండదీప్తులకు = బరువై -అనఁగా అసాధ్యమై, వెలయుననియర్థము- తపస్సంపదలకును దుర్లభములనిభావము. ఘనఉదయమునన్ = మేఘము తోఁచికయందు - అనఁగా వర్షర్తువునందు, విప్పారున్=వికసించునని యర్థము. అధికమయిన అభ్యుదయముచేత ఉల్లసిల్లు ననిభావము. ధాత్రిన్ = భూమియందు, ఊహింపఁగన్ = విచారింపఁగా, మీఁకన్ = ప్రభావము చేత, చిత్ర చరిత్ర పాత్రములుకావే = అద్భుతచరిత్రకుఁ దగినవికావా-వెనుక అర్థములందుఁ జెప్పఁ బడిన భృంగ నివారకత్వాదులయిన పద్మేతర ధర్మములు గలిగిన వగుటచే ఈ పద్మములు చిత్రచరిత్రములు గలవియనుట. ఇందు నాలవచరణమునఁ గాకు స్వరయతి. అలం. కావ్యలింగము.

ఉ. కమ్మనివింటిజోదు నెఱకైదువు లైన మిటారితమ్ము లీ
తమ్ముల నెట్లువోలు సతతమ్ము లతాంగుల మానయుక్త చి
త్తమ్ములఁగూడఁ బాఱు నవి తమ్ము లసన్మహిళామనోంబుజా
తమ్ములఁ గూడి మోహసహితమ్ములుగా నివి మించు మించులన్. 101

అ. కమ్మనివింటిజోదు = మన్మథునియొక్క, నెఱకైదువులు = మేలయిన ఆయుధములు, ఐన, మిటారితమ్ములు = చక్కనితామరలు, ఈతమ్ములన్ = ఈతామరలను, ఎట్లు పోలును=పోలనేరవనుట - ఎందుచేతననఁగా, అవి - ఆమన్మథాయుధములయిన తామరలు, సతతమ్ము=నిరంతరమును, లతాంగుల= స్త్రీలయొక్క,మానయుక్త చిత్తమ్ములన్=అలుకతోఁగూడినమనస్సులను,కూడఁబాఱున్ = వెంబడించిపోవును, ఇవి=ఈమాలికయందలి తామరలు, తమ్మున్, లసత్ - మహిళా-మనోంబుజాతమ్ములు = ఒప్పుచున్న-స్త్రీల-మనఃకమలములు, కూడి = కలసికొని, మోహసహితమ్ములుగాన్ = మోహముతోఁ గూడినవికాఁగా, మించులన్ = కాంతులచేత, మించున్ = అతిశయించును.

మన్మథాయుధములయిన తామరలు స్త్రీచిత్తముల ననుసరించునవి. ఈతామరలు స్త్రీల చిత్తములచేత ననుసరింపఁబడునవి. కనుక వానికి నివి సరికావనియర్థము. 'మానయుక్తచిత్తమ్ములఁ గూడఁ బాఱు' స్త్రీలు మానముచేత కలియని యపుడే కాముకులకు మన్మథ బాధమిక్కుటము 'కామకేళికిన్ గటుకులగాని మానములుగావెఁ ప్రదీపన సిద్ధిహేతువుల్' (శృంగా ౧-౪౨) కావుననే యట్టిమానముతోడి చిత్తమును మన్మథ బాణములయిన తామరలు అనఁగా మోహనబాణములు కూడఁ బాఱునను, ఈతామరలనో స్త్రీలమనసులే వెంబడించును. దీనిని దాల్చిన పురుషుని స్త్రీలెంతయు కామింతురనుట. ఆతమ్ములు ఒకానొక విలుకానిదిగాదు,కమ్మని వింటివానిది, మఱివానికి నెఱకైదువులు; ఇంతటివిగావుననే మిటారియైనవి. అయినను వీనితో సాటిగావు. అలం.

ఉ. తమ్ములకెల్లఁ బెద్దయగు తామర సోదర నాభికాసరో
జమ్మది విశ్వమున్ విధివశమ్మునఁ గాని సృజింపఁజాల దీ
తమ్ములయొత్తు చిత్రచరితమ్ము జగత్త్రియ సారవస్తుజా
తమ్ము సృజింప నేర్చు నిరతమ్ము దలంచిన యంతలోపలన్. 102

అ. తమ్ములకు ఎల్లన్ పెద్ద అగు తామర స+ఉదర నాభికాసరోజమ్ము,అది=తామరల కన్నిటికిని మొదటిదైన విష్ణుదేవుని నాభియందలి యాతామర, విశ్వమున్=ప్రపంచమును విధివశమ్మునన్ కాని = దైవ వశముచేతఁగాని యని యర్థము. బ్రహ్మమూలముచేత నని భావము. (విధి యనఁగా బ్రహ్మయను) సృజింపఁజాలదు. ఈతమ్ములయొత్తు = ఈతామరమాలిక, చిత్రచరితమ్ము = అద్భుత చరిత్రముగలది. ఎందుచేతననఁగా, నిరతమ్ము = నిరంతరమును, తలంచినయంతలోపలన్ = తలఁచుకొన్న

మాత్రముననే, జగత్త్రయ సారవస్తు జాతమ్మున్ = మూఁడు లోకములందుండెడు శ్రేష్ఠవస్తు సమూహమును, సృజింపనేర్చును.

అది, తమ్ములకెల్లఁబెద్ద = అనుజులకెల్లనుబెద్దది, ఇది తమ్ములయొత్తు = అనుజుల యౌన్నత్యము (గలది) యని రెంటికి భేదము చమత్కృతము. అది దైవవశముచేతనే కాని స్వశక్తిచేత సామాన్య ప్రపంచమును నిర్మింపఁజాలదు - ఇదియో తమ్ములయున్నతి గలిగి స్వశక్తిచేతనే, అదియుఁ దలంచిన మాత్రనే, సామాన్య ప్రపంచ మటుండ నంచలిసారవస్తు సమూహమునే నిర్మింపఁగలదు. కాన దాని కంటె నీపద్మమాలిక యధికప్రభావముగలది. కావుననే దీని చరిత్రము చిత్రము. అలం. వ్యతిరేకము.

ఉ. వాసవ మాలికాంకమున । వర్తిలునీ నిరవద్య వాసనా
వాసవరాస వాభినుత । వారిజ దామము ధాత్రిఁ జెందియున్
వాసవ మాలికాంకమున । వర్తిలుఁ దావకమై వసుక్షమా
వాసవ చాలనెత్తయిన । వారికి నెందును బేరు దప్పునే. 103

అ. వాసవమాలికా అంకమునన్ = వాసవమాలిక యనెడు పేరిచేత, వర్తిలు, ఈ, నిరవద్య = దోషరహితమయిన, వాసనా = పరిమళమునకు, వాస = స్థానమయిన, వర ఆసవ = మేలయినపూఁదేనెచేత, అభినుత = కొనియాడఁబడుచున్న, వారిజదామము = పద్మమాలిక, ధాత్రిన్ చెందియున్ = భూలోకమును బొందియు, వసుక్షమావాసవ = భూలోక దేవేంద్రుఁడా- వసురాజా, తావకమై = నీదియై, వాసవమాలికా అంకమునన్ = వాసవమాలిక యను పేరిచేతనే, వర్తిల్లును. (స్వర్గమందు వాసవుని మాలిక గనుక వాసవమాలికయనియు భూమియందు వసుసంబంధియైన మాలికగనుక వాసవ మాలికయనియును నామమొక్కటెతప్పకుండుట తెలియునది. లేక వసురాజు క్షమావాసవుఁడనుటచే నీతఁడును వాసవుఁడే గనుక వాసవుని మాలికయనియుఁ జెప్పవచ్చును) చాలన్ ఎత్తయిన...తప్పునే = (ఎత్తనఁగా ఉన్నతియు పూదండయును. పేరనఁగా నామమును హారమును) మిక్కిలి యున్నతిగలవారికి ఎక్కడనయినను ప్రసిద్ధి దప్పునాయని యర్థము - పువ్వుదండకు పేరని చెప్పుట తప్పునాయని యర్థాంతరము అల. శ్లేషమూలకమగు అర్థాంతరన్యాసము. ఇందు ద్విప్రాసము.

చ. ఉరగులకీసుపర్ణరుచి । యుక్తము డాయఁగడింది ధాత్రిపై
నరులకుఁ బోల వీకమల । నాయక తేజముఁ దేటిచూడ నీ
పరమమహేంద్రమాలిక సు । పర్వులకైన భరింప భారమో
గిరిహార నీవు నేనని సఖిత్వము మీఱఁగ నీకొసంగితిన్. 104

అ. ఉరగులకున్ = పాతాళ వాసులయిన పన్నగులకు, ఈ సుపర్ణరుచి యుక్తమున్ = (సుపర్ణుఁడనఁగా గరుడుఁడు) గరుడుని ప్రతాపముతోఁ గూడికొన్న యీ తామరదండను, డాయన్ కడింది = సమీపించుటయే దెప్పరము అని యర్థము - (సుపర్ణములనఁగా మేలయినయాకులు గనుక మేలి యాకులకాంతితోఁగూడిన దని భావము.) ధాత్రిపైనరులకున్ = భూమిపయినున్న మనుష్యులకు, ఈకమల నాయక తేజమున్ - (కమలనాయకుఁడు అనఁగా సూర్యుఁడు గనుక) సూర్యప్రకాశము గలయీ తామరదండను, తేటిచూడన్ = దృష్టినిలిపిచూచుటకే, పోలదు = శక్యముగాదని యర్థము - కమల నాయకములనఁగా కమలశ్రేష్ఠములు గనుక వానియొక్క తేజముగలదని

భావము. ఈపరమమహేంద్రమాలిక = ఉత్కృష్టమయిన యీ యింద్రమాలిక, సుపర్వులకైనన్ = దేవతలకయినప్పటికిని, భరింపన్, భారము = వ్రేఁగు- అలవిగాదనుట - అనఁగా స్వర్గమర్త్యపాతాళవాసులయం దెవ్వరికిని దాల్పశక్యముగాదనుట. అయినప్పటికిని, ఓగిరిహార=పర్వతభంజకుఁడా - వసురాజా, నీవునేను అని = నీవును గిరిహారుఁడవు నేనును గిరిహారుఁడను గావున నీవునేనుగానివేఱుగాదని, సఖిత్వమమీఱఁగన్ = చెలిమి అతిశయించునట్లుగా, నీకు, ఒసంగితిన్ = ఇచ్చితిని.

ఉరగులు సుపర్ణుని! డాయుట కడిందిగాన సుపర్ణరుచియుక్తమును డాయుటయుఁగడింది. నరులకు కమలనాయకునిఁ దేఱిచూడను బోలదుగాన కమలనాయకతేజమును దేఱిచూడఁబోలదు. సుపర్వులకు పరమమహేంద్రత్వము భరింపఁదరముగాదు గాన పరమమహేంద్రమాలికయు భరింపఁదరగాదు. 'గిరిహార' ఇది సాభిప్రాయము. ఇరువురును 'గిరిహారులము' కాన నేనే నీవు. ఇట్టి ప్రతాపసామర్థ్యమొక కారణమటుండఁగా మఱొకటి 'సఖిత్వమమీఱఁగాను' ననుటయు నొకకారణము. సమానులకే కదా సఖిత్వము. గిరిహారత్వముచే సమానులమే కాక నేనే నీవని యభేదప్రతిపత్తియుఁ గలిగినచో చెలిమిమీఱుట చెప్పవలయునా ? త్రిలోకవాసులకెవ్వరికినిలభ్యముగాని దీనిని మత్సామ్యమునుబట్టియు సఖిత్వమును బట్టియు నీకు లభ్యమని తాత్పర్యము. అలం. మూఁడు పాదము లందును గావ్యలింగములు 'గిరిపర' పరికరము.

శా. భూనాథోత్తమ యస్మదీయవరసంభూతామరత్వంబుతో
దీనిం గొమ్మని వాసవుం డొసఁగఁ జేదిస్వామినెమ్మేన న
మ్లానస్వచ్ఛసరోజమాల్య మది చాలం బొల్చె నింద్రైక్యదీ
క్షానిర్ణేతృమహా సహస్రనయనీసౌభాగ్యముం దెల్పుచున్. 105

అ. భూనాథోత్తమ=రాజవర్యా, అస్మదీయ వరసంభూత-అమరత్వంబుతోన్ = నాదయిన వరములవలనఁ-గలిగిన దేవత్వముతోడ, దీనిన్ కొమ్ము అని, వాసవుండు = ఇంద్రుఁడు, ఒసంగన్, చేదిస్వామి నెమ్మేనన్ = వసురాజుదేహమందు, అమ్లానస్వచ్ఛసరోజమాల్యము అది=ఎప్పటికినివాడిపోని నిర్మలమయిన యీతామరదండ, చాలన్ పొల్చెను—ఏలాగుననఁగా, ఇంద్ర...గ్యమున్— ఇంద్ర = ఇంద్రునితోడి, ఐక్యదీక్షానిర్ణేతృ = అభేదదీక్షను నిర్ణయపఱుచుచున్న, మహాసహస్రనయనీ = అధికమయిన వేయికన్నులయొక్క, సౌభాగ్యమున్ =చక్కఁదనమును, తెల్పుచున్, చాలం బొల్చెనని సంబంధము.

ఇంద్రునకు వేయిగన్నులు, కన్నులు తామరలువలెనుండును. వసురాజును తామరలదండవైచుకొనఁగా తామరలవంటి వేగన్నులుగలవానివలె నుండెను—వేగన్నులు ఒడలెల్ల నుండునట్లు తామరదండయు నుండవలయునుగాన 'నెమ్మేనన్' అన్నాఁడు. అతామరలు వాడనివి 'అమ్లాన' తన్నూలమున మొగుడనివియు; కావుననే మొగుడనికనులుగల యింద్రునితోడి సాదృశ్యము. త్వమింద్రుడిచ్చినాఁడు; దేవపతిత్వస్ఫూర్తి కమలమాలిక యిచ్చినదనుట. ఐక్యదీక్షానిర్ణేతృ ...ంనంతయు శిరసియున్న యీతామరలను జూడఁగా వేగన్నులయింద్రుఁడే యితఁడు అని వ్యాఖ్యానర్తిర్చుటకు నడుముకట్టుకొన్నట్లున్నదనుట. అత్యంతసాదృశ్యస్ఫూర్తి వ్యంజితము. సహస్రనయనీ - ద్విగువునందే కవద్భావము త్రిలోకీ యిత్యాదులందుంబోలె.

క. ఆవేళ దివిజమురజవి, రావము హరిరచితగిరిపుకరప్రాంగణవీ

థీవితతంబై గిరిజా, వైవాహికకలనమునకు కవడిఁ దరు విడియెన్. 106

అ. ఆవేళన్, దివిజసురజవిరావము = దేవతలమద్దెలధ్వని, హరి...తతంబు=ఇంద్రునిచేత నిర్మింపఁబడిన కోలాహలపర్వతపట్టణము యొక్క మంగిటిపట్టునందు విస్తరించినదై, గిరిజావైవాహికకలనమునకున్ = గిరికపెండ్లిపనిపాటలకు, ఇడిన్, తరువిడియెన్ = తరువుపెట్టెను - నిర్బంధపెట్టెననుట.

'తరువుపనిచెను దనదుకింకరుల వారు, నేఁగి ధనము నిచ్చుటకునైయిట్టునట్టుఁ
బరుసఁదనములుచూపి తద్విరచితావ, మానుశైక్రమ్మఱఁగవచ్చి మనుజపతికి. (పర. 8- ఆ)

కోలాహలపర్వతపట్టణమందు, వసురాజునొద్ది దేవతాసురజధ్వనులు వినఁబడఁగానే గిరికపెండ్లికయిన పనులు త్వరగా జరిగింపవలయునని యక్కడివారందఱును తొందరపడిరని తాత్పర్యము.

ఉ. ఆయెడ సంభ్రమం బెసఁగఁ గా నాప్తసఖీకుల ముత్సవాకులం
బై యగకన్యఁ జేరి శిరసంటుఁడు మజ్జన మార్పుఁ డర్థిఁ గై
సేయుఁడు లేశముం దడవుగాసేయకుఁ డంచు ముహూర్త మెంతయుం
డాయఁగ వచ్చెనంచు వినుఁ గడా నృపతూర్యము లంచుఁ బల్కఁగాన్.107

అ. ఆప్తసఖీకులము=గిరికకు ఆప్తురాండ్రయిన చెలికత్తెలసమూహము, ఆయెడన్=ఆమద్దెలలు వినఁబడునపుఁడు, సంభ్రమంబు = సంబరము, ఎసఁగన్, ఉత్సవ-ఆకులంబై= వేడుకచేతఁ - దొట్రుపడుచున్నదై, అగకన్యన్=గిరికను, చేరి, శిరసుఅంటుఁడు = తలయంటుఁడు, మజ్జనము ఆర్పుడు=స్నానముచేయింపుఁడు, అర్థిన్ = అక్కఱతో, కైసేయుఁడు=అలంకరింపుఁడు. లేశమున్ తడవుసేయకుఁడు అంచున్, ముహూర్తము ఎంతయున్, డాయఁగన్ వచ్చెన్= కదియవచ్చెను, అంచున్, నృపతూర్యములు వినుఁడా,అంచున్=వసురాజు తరలివచ్చెడు భేరీమృదంగాదివాద్యధ్వనులాలకింపుఁడీ యనుచును, పల్కఁగాన్ = ఒండొరులతో మాటాడికొనఁగా, మీఁదికన్వయము. వినుఁడా యనుచో ప్లుతయతి.

చ. హరికరుణాకటాక్షమహిమాగత దివ్యవివాహమందిరో
దరకురువిందవేదియెడఁ గ దార్చిన నిర్మలవజ్రపీఠిపై
ధరసుత నుంచి నెన్నుదుటఁ గ దామ్రతరాక్షతముల్ ఘటించి పె
ట్టిరి నలుఁగుల్ సకుంకుమపటీరరజంబునఁ బుణ్యభామినుల్. 108

అ. పుణ్యభామినుల్ = ముత్తైదువలు, హరి...రెయెడన్—హరి = ఇంద్రునియొక్క కరుణాకటాక్ష = దయతోడి కడగంటియొక్క, మహిమా = ప్రభావముచేత, ఆగత=ప్రాప్తించిన, దివ్యవివాహమందిర = యోగ్యమయిన పెండ్లిచవికలోనున్న, కురువింద వేదియెడన్ = కెంపుల అరుఁగునందు, తార్చిన = చేరనుంచిన, నిర్మలవజ్రపీఠిపైన్ = అచ్చపుమగరాలపీఁటమీఁద, ధరసుత = గిరికను, ఉంచి = కూర్చుండఁబెట్టి, నెన్నుదుటన్, తామ్రతర అక్షతములు = మిక్కిలియెఱ్ఱని యక్షింతలను, ఘటించి = పెట్టి, సకుంకుమపటీరరజంబునన్ = కుంకుమపువ్వుగలిపిన చందనపుఁబొడిచేత, నలుఁగులుపెట్టిరి. ఇట వివాహవేదియు నింద్రకల్పితమని తెలియుచున్నది.

సీ. కంకణగోమేధికచ్ఛాయఁ దొలుతొల్తఁ, దేటనూనియనిగ్గుకనీటునెఱపఁ
దరళవక్షోజముకక్తాధార బడిబడి, జాళువాబిందెలకజాలు పఱుపఁ

గమనీయనిశ్వాసకందళం బెడనెడ, సురఁటివట్రువగాలిసొగసుఁదెలుపఁ
దరుణారుణాంగుళీకిరణముల్ పయిఁబయిఁ, జెంగల్వరేకులచేరు చెరువ

తే. మున్న గానాత్మశృంగారము లెలతాంగి, మంగళస్నానవిభవసామగ్రిఁగూర్ప
గమ్మనఁ బిసాళివలపులు గుమ్మరించు, కమ్మజవ్వాదిఁదలయంటెఁ గలికి యొకతె. 109

అ. కంకణగోమేధికచ్ఛాయ = చేతికడియములందలి గోమేధికరత్నముల కాంతి, తొలుదొల్తన్ = ముందుముందుగా, తేటనూనియనిగ్గు = తేటగల నూనె మెఱుఁగుయొక్క, నీటు = సొగసును, నెరపన్ = పచరింపఁగా, గోమేధికములు గోమూత్రచ్ఛాయగలవి; కావుననే వానిని నూనెతోఁ బోల్చినాఁడు. ఇందులకు.

గోమేధికమణి నిర్మల, గోమూత్రచ్ఛాయఁజాలఁ గొమరై మేనం
బ్రేమ ధరించిన విజయో, ద్దామంబుగ నలవిధుండు దత్ప్రీతుఁడగున్. రత్నపరీక్ష.

చేతికడియముల గోమేధికములకాంతి నిగుడఁగా నది నూనెమెఱుఁగు తలపయిని జరిమినట్లు నూనె నంటకమునుపే కనఁబడినదనుట. తరళవక్షోజముక్తాధార - తరళ=ఒకానొకప్పుడుచలించు, వక్షోజ=గుబ్బలపయిని, ముక్తాధార = ముత్తెపుహారముయొక్క ధారారూపమయిన కాంతివిశేషము, బడిబడి=వెంబడివెంబడిగా, జాళువాబిందెల జాలుపఱుపన్ =బంగారుబిందెలనుండి వెడలునీటిజాలును గల్పింపఁగా, ఇటముక్తాధారయనుచో ముక్తాకాంతిధారయనుటకు నిందే 'తరళముక్తా దీప్తిధారాధివాసమై వేసవినిదిమహోల్లాసమొసఁగు (3 ఆ ౧౫) అని యున్నది. వక్షోజములు తరళములనుట నీరుపోయునప్పుడు బిందెలను గదల్చుటంబోలుటకు. ముక్తాధార - నీటిధారంబోలుటకు. ఒక్కగుబ్బెత చలించుచున్న గబ్బిగుబ్బలందలి ముత్తెసరులకాంతి ధారలు బంగారుబిందెలను గదల్చిపోయు నీటి ధారలవలె నుండుననుట. గుబ్బలును బంగారుకుండలును ముత్తెపుకాంతులును తెలినీటి ముంపును సమానములు.

కమనీయనిశ్వాసకందళంబు = మనోహరమయిన నిట్టూర్పుగాడుపు మొలక, ఎడనెడన్ = నడుమనడుమ, సురఁటివట్రువగాలిసొగసున్ = వట్రువగానుండు వీవనగాలియొక్క చెలువును, తెలుపఁగాను. సురఁటినుండి యల్లనిగాలి యింపుగాఁబోలయును. గాలియల్లనగు 'కందళ' యనియు ఇంపితమునకు 'కమనీయ' యనియు ఘటింపఁబడినది. తరుణ అరుణఅంగుళీ కిరణములు = మెత్తనయిన ఎఱ్ఱనిౘ్రేళ్లకాంతులు, పయిపయిన్ = మీఁదమీఁద, చెంగల్వరేకులచేరు = ఎఱ్ఱగలువరేకులదండను, చెరువన్ = చెక్కఁగాననియర్థము.

ఆత్మశృంగారములె=తనయొక్క చెలువములె, లతాంగి మంగళస్నానవిభవసామగ్రిన్ =గిరికాదేవి పెండ్లికయిన మంగళస్నానమునకుఁ దగు పెంపుసొంపుయొక్క నిండుఁదనమును—నిండయిన మంగళస్నానపు పెంపుసొంపును, కూర్పన్ =ఒడఁగూర్చుచుండఁగా, గమ్మనన్ =గమ్ముమనునట్లుగా, పిసాళివలపులు = దట్టమయిన వాసనలు, గ్రుమ్మరించు, కమ్మజవ్వాదిన్ =ఇంపయిన జవ్వాదిచేత, కలికి యొకతె, గిరికకు, తలయంటెను.

నూనెతోఁ దలయంటుట, బిందెలతోఁ నీరు పోయుట, ఎడనెడ సురఁటిగాలి విసరుట, పిదప చెంగల్వదండ చెరువుట, యని యివిక్రమవ్యాపారములు. ఇందులకు వలయు నూనెయు బిందెలు, నీరును, అల్లనిగాలియు చెంగల్వదండలును, అని మంగళస్నానమునకు సొంపుగూర్చునీపరికర

ములన్నియు కలికి చెలువములే యొడఁగూర్చినవని యాశయము. కమ్మజవ్వాదియనుచో జవ్వాదిమిళితమయిన నూనెయే కావలయును. అలం. సమాధి.

ఉ. మంజులచంద్రకాంతమణిమజ్జనశాలవిశాలహేమపీ
ఠిం జపలేక్షణార్పితపటీరజలోక్షితకేశపాశయై
కంజనిభాస్య పొల్చె నతిగౌరసుధానిధిమధ్యవీచికా
పుంజితఫేనయుక్తయయిపుట్టుసరోరుహగేహయో యనన్. 110

అ. కంజనిభాస్య=తామరవంటి మొగముగల గిరిక, మంజుల...ఠిన్ - మంజుల=మనోహరమయిన, చంద్రకాంతమణి=చంద్రకాంతమణిమయమైన, మజ్జనశాలన్ = జలకమింటియందు, విశాలహేమపీఠిన్ = విశాలమైన బంగారు పీఁటమీఁద, చపలేక్ష...శయై - చపలేక్షణా = స్త్రీలచేత, అర్పిత=అర్పింపఁబడుచున్న, పటీరజల=చందనజలముచేత, ఉక్షిత=పయిని పోయఁబడిన - అనఁగా తడుపఁబడిన, కేశపాశయై = తలవెండ్రుకలు గలదై, పొల్చెను. ఎట్లనఁగా-అతిగౌర...యుక్త - అతిగౌర=మిక్కిలి తెల్లనయిన, సుధానిధి=పాలసముద్రమందలి, మధ్యవీచికా=నడిమినీటియలచేత, పుంజిత=నిండింపఁబడిన, ఫేన=నురుఁగుతోడ, యుక్తయయి=కూడుకొన్నదై, పుట్టు = ఉద్భవించుచున్న, సరోరుహగేహయోయనన్ = తామరయే గృహముగాఁగల లక్ష్మీదేవియో యనునట్లుగా, పొల్చెనని సంబంధము.

ఇందు చంద్రకాంతమణిమయమజ్జనశాలకును క్షీరసముద్రమునకును, హేమపీఠికిని ఆసనపద్మమునకును, చందనోదక మర్పించుచున్న స్త్రీకిని మధ్యవీచికకును, చందనోదకమునకును ఫేనమునకును, గిరికకును లక్ష్మికిని, ఉపమానోపమేయభావము. వీచికలను

దివసముఖకార్యజాతంబు దీర్చివచ్చు, పతినెదుర్కొ-సెభక్తి సంభ్రమమెలర్పఁ
జెలువ ప్రత్యగ్దిశాసింధుసలిలవీచి, తూర్పుదెసవచ్చు నిండుచందురునిఁబోలె.

(శృంగార. ౧-౩౧)

అని స్త్రీసామ్యముగా వర్ణించుటగలదు. మధ్యవీచినిజెప్పుట సముద్రమధ్యమునలక్ష్మి పుట్టుటచేత. 'సరోరుహగేహ' యనువిశేషణముచేత హేమపీఠోపమానమగు ఆసనపద్మమువ్యంజితమని తెలియునది.

మ. ప్రమదాభ్యున్నతిఁ జెక్కుడోయి చెమరింపం బూర్ణశృంగారతన్
సుమనోదంతులు శాతకుంభకలశీశుద్ధాంబువుల్ నింపఁగాఁ
గమలాభ్యంచితపాణి పొల్చె సురరాట్కన్యారుణ్యాలబ్ధానివా
ర్యమహైశ్వర్యకులాదిగ్రధుర్యగృహసాక్షాల్లక్ష్మిచందంబునన్. 111

అ. ఇందు సుమనోదంతులనఁగా స్త్రీలును ఆఁడుగజములును గనుక జలకమార్చువారగు నీయుభయులపరముగా అర్థద్వయము చెప్పవలయును.—ప్రమదాభ్యున్నతిన్=ఆనందముయొక్క అతిశయముచేత, నని స్త్రీపరమైన యర్థము—మదముయొక్క యతిశయముచేతనని దేవతాగజపరమైన యర్థము. చెక్కుడోయి చెమరింపన్=చెక్కులు చెమ్మగిల్లఁగానని యర్థము - గండస్థలములు మదజలము చేఁదడియఁగానని యర్థాంతరము. పూర్ణశృంగారతన్=నిండయిన సింగారముతోననియర్థము. సింధూరరేఖాశృంగారముతో నని యర్థాంతరము — (శృంగారమనఁగా గజమండనమునకును పేరు.) సుమనోదంతులు— (సుమనస్సులనఁగా పువ్వులు—ఇట మొల్లలు) మొల్లపూవులవంటి దంతములుగల స్త్రీలని యర్థము - (సుమనశ్శబ్దముదేవతావాచకమును గనుక) దేవతాగజములని యర్థాంతరము. శాత

కుంభకలశశుద్ధాంబువుల్ నింపఁగాన్=బంగారు కుంభముల నిర్మలజలములను పైని బోయుచుండఁగా, కమలాభ్యంచితపాణి = తామరవలె మిక్కిలి యొప్పుచున్న హస్తములుగల గిరిక, కమలాభ్యంచిత పాణి=తామరలచేత నొప్పుచున్న హస్తములు గలదైన, సుర...ంబునన్ - సురరాట్=దేవేంద్రుని యొక్క, కారుణ్య=అనుగ్రహము చేత,లబ్ధ=పొందఁబడిన, అనివార్య=అడ్డులేని, మహైశ్వర్య=మహా వైభవముతోఁ గూడిన, కులాద్రిధుర్యగృహ=కులపర్వతాధ్యక్షుఁ డయినకోలాహలుని గృహమందలి, సాక్షాత్ లక్ష్మియోయనన్=ప్రత్యక్షలక్ష్మియో యన్నట్లుగా, పొల్చెననిసంబంధము. అల. ఉత్ప్రేక్ష.

ఇట గజలక్ష్మీస్నానము ననుసంధించినాఁడు. 'లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుంభైః' అని యున్నది. లక్ష్మికి జలకమార్చునది దివ్యగజములు. గిరికకు స్త్రీలు. కానలక్ష్మిగిరికలకు నిరువురకునన్వయించునట్లుగా దివ్యగజకామినీ వాచకమయిన 'సుమనోదంతు' లన్నాఁడు. లక్ష్మీదేవి రెండుచేతులను దామరలిడుకొని యుండును-గిరికకు రెండు చేతులునుదామరలవంటివిగాన యిరువుర కును బొసఁగినట్లుగా'కమలాభ్యంచితపాణి' యన్నాఁడు. ఇదియే రామాయణము సుందరకాండమునను

'నియుజ్యమానాస్తు గజాస్సుహస్తాః సకేసరాశ్చోత్పలపత్రహస్తాః
బభూవదేవీచకృతాసుహస్తా లక్ష్మీస్తథాపద్మిని పద్మహస్తా' (అష్టమస్సర్గః.)

చ. మెలఁతలు శైలరాట్తనయ మేదడి యొత్తఁగఁ గూర్చి నిండువె
న్నెలపొరవంటి దువ్వలువ నిద్దపుగుబ్బల ద్రావలుచున్ గళం
బలముచుఁ జెక్కు లంటుచు నుదంచిత రాగరసార్ద్రి మయ్యెఁ బూ
పలమెయిసోఁకినన్ విమలభావము నిల్చునె యెట్టిపట్టునన్. 112

అ. ఇందు గిరికాదేవి మేని తడి దుడుచుటకై స్త్రీలు గూర్చిన వెలిపట్టు దుప్పటియందు నాయకత్వారోపణము చేసి అర్థద్వయము గలుగఁ జెప్పినాఁడు. ఎట్లనఁగా - మెలఁతలు=స్త్రీలు, శైలరాట్తనయ=గిరికయొక్క, మేదడి, ఒత్తఁగన్ = తుడుచుటకు, కూర్చు=సమకట్టిన, నిండువెన్నెల పొరవంటి, దువ్వలువ=వెల్లపట్టుదుప్పటి, నిద్దపుగుబ్బలద్రావలుచున్ = నిగ్గుగల చన్నులపయిని ద్రావలు చును, గళంబు అలముచున్=కంఠము నప్పళించుచు, చెక్కులంటుచున్=కపోలములను స్పృశించుచు, ఈమూఁడుపనులు నాయకకృత్యములుగాను దెలియునది. ఉదంచితరాగరస ఆర్ద్రము = ఒప్పుచున్న కుంకుమాదులయొక్క రక్తిమతోఁ గూడిన జలముచేతఁ దడుపఁబడినది, అయ్యెనని యర్థము.—అను రాగరసార్ద్రమయ్యెనని నాయకపరమైన యర్థము. పూఁపలమెయి సోఁకినన్ =కోమలప్రాయము గల పడుచులదేహము నంటఁగా,ఎట్టిపట్టునన్=ఎటువంటి వెలిపట్టువస్త్రమందయినను, విమలభావము నిల్చునే=తెల్లఁదనము నిల్చునాయని యర్థము. ఎట్టిపట్టునన్=ఎటువంటి స్థలమందయినను, విమలభా వము నిల్చునె = పరిశుద్ధత్వము నిల్చునాయని నాయకపరముగా నర్థము గ్రహించునది. చెక్కులయం దును చన్నులయందును గుంకుమాదులపూఁతలు గనుక వానిపయి నలముటచే నెఱ్ఱఁదనము చెప్పినాఁ డు. తొలుతఁదడియొత్తు గుడ్డగుబ్బలపయిని వైచి కొంగు మెడను గొంచెము చుట్టుకొని మొగము దుడు చుకొనుట స్త్రీస్వభావముగాఁ దెలియునది.

చ. కళుకు మెఱుంగుఁ గ్రొంబసిఁడి కాంచికయై కటి మించఁజాలు నం
చులమణు లంఘ్రిభూషలయి శోభిలఁజాలుఁ జెఱుంగు ముత్తియం
బులె యెదనుంపఁజాలు సరముల్ పటవాసక సౌరభంబె మై
గలపము నింపఁజాలు ననఁ గట్టిరి దివ్యదుకూల మింతికిన్. 113

అ. కళుకు మెఱుంగు క్రొంబసిఁడి=తళుకుగల కాంతితోఁ గూడిన క్రొత్త బంగారపు తగటు, కళుక నఁగా తళుకనుటకు 'కళుకులు దేఱు గండములు గండములా శశిఖండలక్ష్మికిన్' అని ప్రయోగము. కాంచికరై = గంటలమొలనూలై, కటిన్ = పిఱుఁదులయందు, మించన్ చాలున్ = అతిశయింపఁ జాలును, అంచులమణులు = అంచులయందు గూర్చినరత్నములు, అంఘ్రిభూషలయి = కాలిసొమ్ములయి, శోభిలన్ చాలును, చెఱంగు ముత్తియంబులె = పైఁటకొంగునందుఁ గూర్పఁబడినముత్యములె, ఎదన్ సరముల్ ఉంపన్ చాలును=వక్షమునందు హారములుగా కల్పింపఁజాలును, పటవాసక=వస్త్రములను పరిమళింపఁజేయు బుక్కాముయొక్క, సౌరభంబె = పరిమళమే, మైన్ = దేహమునందు, కలపము నింపఁజాలున్=సుగంధద్రవ్యములుగూర్చి చేసిన మెయిపూఁతను గల్పింపఁజాలును, అనన్ = అనునట్లుగా, దివ్యదుకూలము = దివ్యమయిన వెలిపట్టుచీర, ఇంతికిన్ = గిరికకు, కట్టిరి.

గిరికకు దివ్యమయి వెలిపట్టుచీర కట్టిరి. దానికి బంగారుసరిగతగటుగలదు. దానిని నడుమునఁ జుట్టినపుడాతగటె కాంచికగానుండును. దానియంచుల జాలరులుగానుండు మణులు రెండుపాదములు చుట్టును వ్రేలునపుడు కాలిసొమ్ములవలెండును. దాని నడుమఁ గూర్చిన ముత్యములు పైఁటవేసినపుడు తోఁచున ముత్తెసరులవలె నొప్పుచున్నది. దానికిఁ బట్టించిన బుక్కామే మేన తావికలప మలందియుంటకు సాటి యగుచున్నది. ఇట్లు కట్టుచీరయొక్కటియే వస్త్రమే కాక యాభరణముగాను నిట్లువివిధాకారము గాఁ బరిణమించెడినని దానియతిశయమిచట వర్ణితము. పెక్కువగల సొమ్ములగుటచే వస్త్రముయొక్క మహార్హతయు వ్యంజితము.

చ. తమతమతమ్ములం దిగిచి తన్ముఖలక్ష్మికిఁ ద్రిప్పురీతి ను
త్తమతమపుణ్యసింధువనితల్ బహుచిత్రదళంపు టారతుల్
క్రమమున నెత్త నయ్యచలకన్యక వచ్చె నమూల్య పద్మమా
ల్యమున నెసంగు చేదిపభుజాంతరకల్ప వివాహవేదికిన్. 118

అ. ఉత్తమతమపుణ్యసింధు వనితల్ =మిక్కిలి యుత్తములయిన గంగాయమునాది పుణ్యనదీకాంతలు, తమతమతమ్ములన్ =తమతమయందున్న తామరలను, తిగిచి=తీసి, తన్ముఖలక్ష్మికిన్= ఆగిరిక మొగము చక్కందనపు పెంపునకు, త్రిప్పురీతిన్ =బడిమి ద్రిప్పినట్లుగా, బహుచిత్రదళంపుటారతుల్= అనేకములును వింతవింతలునయిన రేకులుగల పద్మమయనీరాజనములను, క్రమమునన్ =వరుసవెంబడిని, ఎత్తన్, అయ్యచలకన్యక=ఆగిరిక, అమూల్యపద్మమాల్యమునన్ -అమూల్య=విలువలేని, పద్మమాల్యమునన్ =ఇంద్రుఁడిచ్చిన తామరమాలికచేత, ఎసంగు=ఒప్పుచున్న, చేదిప=వసురాజుయొక్క, భుజాంతరకల్ప= వక్షమునకు సాటియైన - అనఁగా దానివలెనే అమూల్య పద్మమాలికాలంకృతమయిన, వివాహవేదికిన్ =పెండ్లియరుఁగునకు, వచ్చెను.

'అమూల్య పద్మమాల్యమునన్ ఎసంగు' ఇది వసురాజువక్షస్థలమునకును పెండ్లివేదికకును సాధారణవిశేషణము. కావుననే వివాహవేదిని చేదిప భుజాంతరకల్పమన్నాఁడు. గిరికముఖము తమ్మికంటె చక్కనయినదిగాన, తమ్ములనుదానికి దిగఁదుడుచునట్లుండెననుట. ఒకదానికిఁ బోలికరైనదానినే దానికి నివాళించుటయనఁగా నది దానికంటెఁ దక్కువయని లోకవ్యవహారశైలి. ఇందులకుఁ గర్ణామృతమున.

శ్లో. శుశ్రూషసే యదివచః శృణుమామకీనం, పూర్వైరపూర్వకవిభిర్నకటాక్షితం యత్

నీరాజనక్రమధురం భవదాననేన్దోః, నిర్వ్యాజమర్పితిచిరాయ శశిప్రదీపః. (౧ ఆ-౫౭ శా)
ఇక్కడ అరటిపళ్లెరములు ఆకులవలెఁ జుట్టు నమర్పంబడి తామరపూవులవలె నుండుటయు ఆ యాకులందు దీపములుంచి దిగఁదుడుచుటయుఁ గలదు. కావున వానికి తమ్ములతోడి సామ్యము. అవి బహుచిత్రదళములనుట పెక్కు నదీకాంతల వింతవింతలగు తమ్ములతోడి సాటికి. చేదిరాజు వక్షము ఇంద్రుఁడిచ్చిన యమూల్యపద్మమాల్యముచేతను వివాహవేది అలంకారార్థముగట్టిన యమూల్య పద్మమాల్యముచేతను అలంకృతము. ఉత్ప్రేక్షయు ఉపమయు.

క. ఆకల్పలలామకములు, నాకల్పకదామకములు నపు డగసుత కా
ర్యాకల్ప కనిచె హరిసతి, యాకల్పవిభూతి గలుగ నాళీతతిచేన్. 114

అ. హరిసతి=ఇంద్రునిభార్యయైన శచీదేవి, ఆకల్పలలామకములు= అలంకారశ్రేష్ఠములును, ఆ + కల్పకదామకములున్ = ప్రసిద్ధమయిన కల్పకపుపూదండలును, అపుడు,అగసుతకున్ = గిరికకు, ఆర్యాకల్పకున్=పార్వతితో సమానురాలయినదానికి, (గిరిక అగసుత.పార్వతియుఅగసుత.కావుననే గిరిక ఆర్యాకల్పయని 'అగసుతా' విశేషణముచే ధ్వనితము) ఆకల్పవిభూతి = కల్పమువఱకయిన యైశ్వర్యము, కలుగన్, ఆళీతతిచేన్=చెలికత్తెల సమూహముచేత, అనిచెన్ = పంపెను. 'ఇందు ద్విప్రాసము.

సీ. జవరాలినెఱివేణి జడవాహములమించఁ, దడియార్చిముడిఁచెఁబైదలియొకర్తు
తరుణిక్రొవ్వెద తుమ్మెదలదాఁటుదాఁట సంపఁగె దండచెఱివెఁగోమలియొకర్తు
చెలువవేనలి చిమ్మచీఁకటిఁ గికురింపఁ, జంద్రసూర్యులనుంచెఁ జామయోర్తు
మగువకొప్పునభంబుదెగడ, నిర్దోషంపుఁ, జుక్కచేలు ఘటించెసుదతియోర్తు

తే. నెలఁతతుఱుము మహామహా నీలరాశిఁ, బకపకహసింప మరకతశకలకలిత
మృదులదూర్వాంకురములలోఁగదియఁజేసెఁ,జకితసారంగశాబలోచనయొకర్తు.

అ. జవరాలినెఱివేణి=గిరిక నిండారుజడ, జడవాహములన్ = మేఘములను,మించన్= అతిశయించుటకు, పైదలి ఒకర్తు తడియార్చిముడిచెన్ =ఒకచెలికత్తె తడితుడిచి ముడిఁచెను. తడిలేక పోవుటయు ముడిగొనుటయు మేఘములకు సంభవింపవనిభావము.

కోమలిఒకర్తు, తరుణిక్రొవ్వెద=గిరికకొప్పు, తుమ్మెదలదాఁటున్=తుమ్మెదలగుంపును,దాఁటన్ =అతిక్రమించుటకు, సంపంగెదండను, చెరివెన్=చొప్పించెను, లేకముడిచెను-తుమ్మెదలకు సంపంగె పూలతోడి సఁగతిలేదనిభావము. చామఓర్తు(చామశబ్దముశ్యామాభవము), చెలువవేనలి = గిరికకొప్పు, చిమ్మచీఁకటిని, కికురింపన్=వంచించుటకు—నిరసించుటకనుట, చంద్రసూర్యులన్ ఉంచెన్= చంద్రునిని సూర్యునిని ఉంచెననియర్థము - చంద్రసూర్యరూపాభరణముల నుంచెనని భావము. చీఁకటి చంద్రసూర్యులురాఁగా విరిసిపోవునని భావము. సుదతియోర్తు, మగువకొప్పు,నభంబున్= ఆకాశమును, తెగడన్=తిరస్కరించుటకు, నిర్దోషంపుచుక్కచేలున్-(దోషయనఁగా 'దోషానక్తంచర జనా'అ.అన్నట్లు రాత్రి నిర్దోషంబనఁగా రాత్రి యందుదయింపనిది) అట్టిచుక్కచాలును ఘటించెనని యర్థము. ఆకాశమున రాత్రిలేనిచో చుక్కలు చూపట్టవని భావము. చకితసారంగశాబలోచన = బెదరిన లేడిపిల్లవంటి కన్నులుగలది ఒకతి, నెలఁతతుఱుమున్=గిరికకొప్పును, మహామహా నీలరాశి =

గొప్పలయిన మహానీలముల సమూహమును, [మహానీలములనఁగా, 'సింహళస్యాకరే ద్భూతా మహానీలాస్తుతేస్మృతాః' అని సింహళపురిని యందుఁ బుట్టునీలము లక్షణము.

క. కప్పునఁగు వెన్న వెదికి, ఫుప్పొరవన్నియకు సవతుఁ • బోలునుఁనఁగా
ముప్పాతిక రంగులతో, నొప్పుమహానీలమది శుంభోన్నతిఁజేయున్.' (రత్నపరీక్ష)

ఇంద్రనీలము దీనికంటెవేఱు. ఇందులకు రామాయణములో 'ఇంద్రనీల మహానీలమణి ప్రవర వేదికమ్.' (సుందరకాండము) అని యున్నది.] పకపకహాసింపన్=పకపకనవ్వెడుకొఱకు, అనఁగాఁ బరిహాసము చేయుకొఱకు, మరకతశక...లలోన్—మరకతశకలమరకతపుఁ బచ్చలమొలకలఫలె, కలిత=ఒప్పుచున్న, మృదుల=కోమలములయిన,దూర్వాంకురములన్=లేఁతగఱికపోఁచలను, లోన్= లోపల, కదియఁజేసెను=చొప్పించెను. అనఁగా అంతర్లీనము చేసెనుట- మహానీలములో తృణము నంతర్లీనముగాఁ జేయవనుట, ఇందులకు,

క. కసవుల నిసువులు కరమున, వెసనిడి నీలంబుమీఁద • విడ నూఁదుటయున్
వెసనెగసిపోక నిలిచిన, వసుధఁ దృణగ్రాహి • యనఁగ వర్ణనకెక్కున్. (రత్నపరీక్ష)
అన్నట్లు తృణములను గ్రహించుట మహానీలములకు లక్షణము - శుభార్థముగా గఱికపోఁచలను గొప్పనఁగూర్చిరని భావము. నీసపాదములు నాల్గిట ఁ లుగుత్పే)క్షలు, గీతియుండొకటి.

మ. ఘనశృంగారరసోత్తరంగ రుచిరంగద్వేణికిన్ బాసికం
బున దండన్ బలుగట్టు గట్టి విలసన్ముక్తాకలాపచ్ఛలం
బునఁ దూ మేర్పడఁబెట్టి బోటి గిరిజాభ్రూపుండ్రసౌభాగ్యము
ల్దనరం గస్తురిరేఖ దీర్చె నవకుల్యావైఖరిన్ మించఁగన్. 116

అ. ఘన...వేణికిన్—(వేణియనఁగా జడయు నదీప్రవాహమును) ఘన=అధికమైన, శృంగారరస=శృంగారరసమనెడు రసము (అనఁగా జలము) చేత, ఉత్తరంగ= కొలఁదికిమించిన (యని జడపరముగా)- పైకిలేచినయలలుగల (అని నదీప్రవాహపరముగా), రుచి=కాంతియనెడు తీయని చవి చేత, రంగత్=ఒప్పుచున్న, వేణికిన్=జడయనెడు నదీప్రవాహమునకు, బాసికంబునన్= బాసికము చేత, దండన్=సమీపమున, బలుగట్టు కట్టి, విలసన్ముక్తాకలాప చ్ఛలంబునన్= ప్రకాశించుచున్న, ముత్యాలబొట్టనెడి మిష చేత, తూమేర్పడన్ పెట్టి = తూముకట్టి, బోటి=చెలికత్తియ, గిరిజా... భాగ్యముల్—గిరిజా=గిరిజాదేవియొక్క భ్రూ=కనుబొమలనెడి, పుండ్ర=ఎఱుపుగలసిన నల్లచెఱకు యొక్క, సౌభాగ్యముల్=చక్కఁదనములు, (ఇక్కడ కనుబొమల సౌభాగ్యము చక్కఁదనమనియు చెఱకు సౌభాగ్యము తీయఁదనమనియుఁ దెలియునది) పుండ్రమనఁగా,

'ఇక్షుఃపీతః పుండ్రకః కృష్ణరక్తః కాంతారస్స్యచ్ఛ్వేత పీత స్తథైవ'

అన్నట్లు ఎఱుపుగలసిన నల్లచెఱకు.ఇట నల్లనిబొమలతో సాటికిఁజెప్పఁబడెను.) నవ = క్రొత్తదగు, కుల్యా=కాలువయొక్క, వైఖరిన్=రీతిచేత, మించఁగన్=అతిశయించునట్లుగా, కస్తురిరేఖన్=రేకవలె కస్తూరిబొట్టును, తీర్చెను.

ఇట జడకాంతి నదీప్రవాహము. పాపటనుండి యిరువైపుల చెవితమ్మెలవఱకు నెఱికురులకు నుదుటికి నడుమఁగట్టంబడునదిగాన బాసికము ఆప్రవాహమునకు కట్ట. అది యెత్తుగలదిగావున బలుగట్ట.బాసికమునడుమ పాపటచివరకడఁగట్టుముత్యాలటీకాబొట్టుదాని కేర్పఱిచినతూము.ఆబొట్టున

సరిక్రిందుగా బొమలనడిమికి రేకగాఁదీర్చిన కస్తూరిబొట్టు కాలువ. అదిపాఱి పయిరయినది బొమలనెడి నల్లచెఱకులు. జడకాంతి యనునీవెల్లువ నలుపుగాన యదిపాఱు కాలువయు నలుపుగానుండుటకై నల్లనికస్తూరిరేకను, దానినుండి పయిరగునదియు నల్లగానుండుటకై నల్లనిచెఱకులను, గయికొన్నాఁడని తెలియునది. 'రుచిరంగద్వేణి' యనుటమంచినీరుపాఱుటచేతనే చెఱకునకుఁదీపిపుట్టుటకు. నల్లచెఱకు మోసులవంటి యాకులుబొంపముగాఁగలిగి మిక్కిలినిడుదలయి యొప్పునట్లు కనుబొమలునువెండ్రుకలు దట్టముగాఁగలిగి నిడుదలయి కొనలవంపుగలిగియుండును. చెలువలబొమలను సామాన్యముగా మరుని చెఱకువిండ్లుగా వర్ణించుట ప్రకటము జడ మిక్కిలియు నలుపుగలిగి నిగనిగలుదేఱుచు నెంతయు మరులుగొలుపుననియు కనుబొమలు మిక్కిలి నలుపులయి దప్పములయి నిడుదలయి నీటయిన నలుపు గలిగి సొంపారుచుండుననియుఁ దాత్పర్యము. రూపకము, అపహ్నుతి.

శా. శ్యామోజ్జృంభితతారకా వరరుచిన్ సంధించి యెందున్ వసు
స్వామిం గన్గొనుచుం బ్రకామశరవర్షస్ఫూర్తిఁ జెన్నొంది ని
త్యామోదంబున మించు మంచుఁ జెలి నేత్రాబ్జంబులన్ వశ్యల
క్ష్మీమూలం బగుగావు నించె నన నుంచెం గజ్జలం బింతికిన్. 117

అ. ఇందు నేత్రాబ్జములనుటచే నేత్రపరముగాను అబ్జపరముగాను అర్థద్వయము తెలియునది. ఎట్లనఁగా-శ్యామ...రుచిన్—('శ్యామాస్యాచ్ఛారిబానిశా' అ.) (అబ్జ). శ్యామా = రాత్రియందు, ఉజ్జృంభిత = ప్రకాశమానుఁడైన, తారకావర = చంద్రునియొక్క, రుచిన్=ప్రీతితోడ, సంధించి= కూడికొని, (నేత్ర) శ్యామ=నల్లనికాంతిచేత, ఉజ్జృంభిత = అతిశయించిన, తారకా=నల్లగ్రుడ్లయొక్క, వర=మేలయిన, రుచిన్=కాంతితోడ, సంధించి, ఎందున్=అన్నిదిక్కులయందును, వసుస్వామిన్= (అబ్జ) సూర్యుని—(నేత్ర) వసురాజును, కన్గొనుచున్, ప్రకామ...చెన్నొంది— (అబ్జ) ప్రకామ=అధికమైన, శరవర్షస్ఫూర్తిన్=జలవర్షము తోఁపికచేత, చెన్నొంది=సొంపువహించి-(నేత్ర) అధికమయినమన్మథబాణవర్షస్ఫురణముచేత చెన్నొందియనిభావము. నిత్యామోదంబునన్ మించుచును = (అబ్జ) ఎడతెగనివాసనచేత అతిశయింపుమనియర్థము - (నేత్ర) ఎడతెగని ఆనందముచేత అతిశయింపుమనిభావము. అంచున్, చెలి=చెలికత్తియ, ఇంతికిన్=గిరికాదేవికి, నేత్రాబ్జంబులన్ = కమలములవంటినేత్రములందు, వశ్యలక్ష్మీమూలంబుఅగు=చంద్రసూర్యాది మిత్రామిత్ర వశ్యసంపత్తికి మూలమయిన, కావునించెననన్—కావలి బొట్టుపెట్టినదోయన్నట్లు గాననియర్థము—వసురాజవశ్య సంపత్తికి మూలమనిభావము. కజ్జలంబు=కాటుకను, ఉంచెను=పెట్టెను. శ్లేషము ఉత్ప్రేక్ష.

శరశబ్దమునకు 'శరోదధ్యాద్యగ్రసారే బాణే కాండే తృణాంతరే-శరంతునీరే' నానార్థ. తామరలకు చంద్రకాంతిసరిపడదు. సూర్యుఁడు పగటనేకనుపట్టును. ఈకనుదామరలకు చంద్రరుచి ఒప్పుటయేకాక సూర్యునెప్పుడునుజూచుటయుఁగలదు. మఱితామరలకువర్షమునందు చెన్నుదఱుఁగు టయుఁ ఆమోదముగుందుటయుఁగలదు. వీనికో వర్షమునఁ జెన్నొందుటయు ఆమోదము తప్పకుండు టయు. కావున మిత్రుఁడయిన సూర్యుఁడేకాక, శత్రువులయిన చంద్రవర్షాదులుగూడ మిత్రములు గావించుకొనుటకై కావు. పరులను వశముసేసికొనుటకై కావుబొట్టు కన్నులకుఁబెట్టుకొనుట యిట అనుసంధింపఁబడినది - నల్లనిమెఱుంగులు దుఱంగలించు కనుగ్రుడ్లు రుచిగులుక, వసురాజును జూచుచు నెప్పుడును నతనియెడ మరులుగొని యెంతయు సంతోషమున నొప్పుచుండుమనిభావము.

మ. అతితీవ్రాశుగవృత్తిమై నతనుధన్వాభోగసీమన్ గతా
గతముల్ సల్పి భ్రమించు లోలతరవీక్షాపాతపాంథాళికిన్
శ్రుతికూపాంతసుధానిపానకము లై శోభిల్లు నిత్యప్రభాం
చితవజ్రోపలకుండలంబులు ఘటించెన్ బోటి పూఁబోఁడికిన్. 118

అ. అతితీవ్రాశుగవృత్తిమైన్—(ఆశుగమనఁగా బాణమును వాయువును ఆశుగౌవాయు విశిఖౌ' అ) అతితీవ్ర = మిక్కిలియుతీవ్రమయిన, ఆశుగవృత్తిమైన్ = బాణవృత్తిచేత (ఇనివీక్షా పరమైనయర్థము)— అతి వేగముగల వాయువృత్తిచేత - అనఁగా వడగాలివేగముచేత (అనిపాంథ పరమయినయర్థము) అతను ధన్వ ఆభోగసీమన్.—(వీక్ష)అతను=మన్మథునియొక్క, ధను+ఆభోగసీమన్ - వింటి యొక్క నిండయినపట్టునందు—ఇట ఉపమానమయిన మరునిచాపముచేతనే ఉపమేయమైన భ్రూవల్లిని జెప్పినాఁడు - (పాంథ) అతను = అధికమైన, ధన్వ - ('ధన్వజాంగలదేశేస్యాద్ధన్వచాపే స్థలేఽపిచ' విశ్వము) మరుభూమియొక్క నిండుప్రదేశమునందు, గతాగతముల్=రాకపోకలు, సల్పి, భ్రమించు=తిరుగుచుండెడు, లోలతరవీక్షాపాత పాంథాళికిన్-(లోలమనఁగా చలనమును తృష్ణగల వాఁడును,'లోలశ్చాలసతృష్ణయోః' విశ్వము) లోలతర=మిక్కిలిచంచలములయిన, వీక్షాపాత=చూపు పాటులనెడు, లోలతర=మిక్కిలితృష్ణతోఁగూడిన, పాంథాళికిన్ = పథికసమూహమునకు, శ్రుతి .. లై —శ్రుతి= చెవులనెడు, కూప=బావులయొక్క, అంత=సమీపమందలి, సుధానిపానములై=(సుధ యనఁగా సున్నమును అమృతమును) నిపానమనఁగా నీళ్లకుఁగట్టించిన ధర్మపుగాఁడియునీటిపట్టును- ('ఆహావస్తు నిపానం స్యాదుపకూప జలాశయే' మ ) సున్నపుగచ్చుచేసిన నిపానములయి యని యర్థము - లేకయమృత జలాశయములై, శోభిల్లు=ప్రకాశించుచున్న, నిత్యప్రభా అంచిత=నిత్యమైన కాంతిచేత నొప్పుచున్న, వజ్రఉపలకుండలంబులు=వజ్రమణిమయములయినకమ్మలు, పూఁబోఁడికిన్= గిరికాదేవికి, బోటి=ఒకచెలికత్తియ, ఘటించెన్=కూర్చెను - అనఁగాఁజెవులందుఁ బెట్టెననుట.

అతి...సీమన్ గతాగతముల్ సల్పి, అతనుధన్వఆభోగసీమన్=మరునివింటినిండుపట్టునందు అనఁగామరునినెఱి వింటివలెనున్నకనుబొమలపట్టునందు,'అతితీవ్రాశుగవృత్తిమై'ఆకనుబొమలనెడు మరుని వింటినుండివాఁడిబెళుకుచూపులు-వాఁడిములుకులవలెనున్నవి. వీక్షాపాతములు,లోలతరములుకావున వేగ తాగతముల్ సల్పి భ్రమించుట. పాంథులు మరుభూమియందు వడగొనిదప్పికై నీటికొఱకు నిటునటు పోవుచును వచ్చుచునుందురుగాని నిడివి గాఁజూఁగిపోరు.వీక్షాపాతములువట్లైపోయిమరలివచ్చుచుండు ను-ఎంతవఱకు?('శ్రుతి...నిపానకము') ఒకయమృతమువలె తీయనినీరుగలపట్టో లేక యొకబావియొద్ది నీటిగాఁడిపట్టో అంతవఱకుఁబోయి యానీరుద్రాగి విశ్రమించును, అవతలఁబోవఁడు. చూపుపాటు ను చెవులవఱకును నిగిడియవలఁ జనకమరలును. నిత్య...లంబులు—ఇటకుండలము, నిపానకములు,నిత్య ప్రభ, యొడతెగనినీళ్లు, భ్రమించుచెలువల చూపులు, బెళుకులచే భ్రమించుటసహజము. మిట్టిమిట్టి పడుసంబు చరంబులుఁబోలె నత్తఱిన్. (వసుచరిత్రము.) మిట్టిమీఁనై పడెమెలఁకచూపు. (విజయ విలాసము. రూపకము.

మ. శ్రుతికూపామృతముల్ వతంసకలికాకర్ణోయంత్ర సంక్రాంతదీ
ధితిదండోజ్జ్వలవర్తులాభరణపాత్రిన్ నించి తాటంకక,

ల్పితకుల్యాముఖ హీరసారకిరణోద్భేదంబు పేరన్ వెలా
ర్చి తటిద్దేహకు నవ్యపత్త్రలతికాశ్రీ నించి రాళీజనుల్. 119

అ. ఆళీజనుల్ = చెలికత్తెలసమూహములు, శ్రుతికూపఅమృతమున్ = చెవియనెడిబావియందలి నీటిని, వత...త్రిన్ — వతంస = చెవిపువ్వయిన, కళికా = పూమొగ్గయనెడు, అర్ఘ్యోయంత్ర = ఏతపుపిడియందు, సంక్రాంత = తగులుకొన్న, దీధితి = కాంతియనెడు, దండ = కఱ్ఱచేత, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, ఎఱ్ఱులాభరణ = రత్నపుబవిరయనెడు, పాత్రిన్ = పాత్రయందు, నించి = నిండించి, తాట...రన్ — తాటంక = కమ్మలనెడు, కల్పిత = కల్పింపఁబడిన, కుల్యాముఖ = కాలువమొదటనున్న ఏతపుబానలో నీళ్లుగ్రుమ్మరించెడు మోటతొట్టియొక్క, హీర = వజ్రమణులయొక్క, సార శ్రేష్ఠమయిన, కిరణ+ఉద్భేదంబు పేరన్ = కిరణప్రసారమనెడుమిషచేత, వెలార్చి = వెడలఁబోసి, తటిద్దేహకున్ = మెఱుపుతీఁగవంటిదేహముగలదానికి- గిరికాదేవికి, నవ్యపత్త్రలతికాశ్రీన్ = క్రొత్తవయినమకరికాపత్త్రరచనలనెడు ఆ కులయొక్కయుతీఁగలయొక్కయు సమృద్ధిని, నించిరి. రూపకము, అపహ్నుతి.

'నవ్యపత్త్రలతికాశ్రీ' మకరికాపత్త్రరచనలే ఆకులునుతీఁగలును - దానినిపెంచుటకు నీరును అందులకై బావి, ఏతము, మొదలగు పరికరములును గావలయును. అందులకై గిరికచెవిపూవును ఏతపుపిడిగాను, రతనపుబవిరను ఏతపుబానగాను బవిరకిరణమును ఏతపుగడగాను, వజ్రపుకమ్మను బానలోనీళ్లు గ్రుమ్మరించెడు కాలువమొదటితొట్టిగాను, కమ్మలనుండి కాంతులు నిగుడుటను చెవిబావినుండి జలము పాఱుటగాను, పత్త్రరచనలను పత్త్రయుత లతలుగాను జెప్పినాఁడు. అనఁగా గిరికకు వజ్రపుకమ్మలు రతనాలబవిరలును దొడిగి చెక్కులమకరికా పత్త్రములువ్రాసి చెవిపువ్వుఘటించిరని తాత్పర్యము.

చ. సురభికురంగనాభికలఁ జొక్కపుఁగుంకుమఁ గప్పి కుంకుమ
స్ఫురితమహోష్మఁ గప్పురపుసోఁకులమానిపి కప్పురంపుఁజ
ల్మిరి మెఱుఁగుంజవాది నెడలించి కదంబము గూర్చి నెచ్చెలుల్
తరుణికలందిరన్నియును దత్తనువాసనఁ బూవుగట్టుచున్. 120

అ. సురభికురంగనాభికలఁ = మంచిపరిమళముగల కస్తూరియొక్కడాగు, చొక్కపుకుంకుమన్ = మేలయినకుంకుమపువ్వుచేత, కప్పి, కుంకుమస్ఫురితమహోష్మన్ = ఆకుంకుమపువ్వునందు స్ఫురించుచున్నయెక్కుడుకాఁకను, కప్పురపుసోఁకులన్ = కర్పూరపుమేళనములచేత, మానిపి = నివారించి, కప్పురంపుచల్మిరి = కర్పూరమందలి శైత్యమును, మెఱుఁగుంజవాదిన్ = నిగ్గుగలజవ్వాదిచేత, ఎడలించి = పోఁగొట్టి, కదంబముగూర్చి = కలపమేర్పఱచి, అన్నియును = ఈపరిమళద్రవ్యములనన్నిటిని, తత్తనువాసనన్ = ఆగిరియొక్కదేహపువాసనచేత, పూవుకట్టుచున్ = వాసనాయుక్తములుగాఁ జేయుచు, నెచ్చెలులు, తరుణికిన్ = గిరికకు, అలందిరి = పూసిరి.

కస్తురి కఱలు తెలియకుండునట్లు కుంకుమపువ్వు. ఆపువ్వుకాఁకనడంచుటకుఁ గర్పూరమును దాని చలువను బోఁగొట్టుటకు నిగ్గుజవ్వాదియుఁ జేర్చుట - ఇట్లు కఱలుపడక మిక్కిలివెట్టగాక చలువగాకయునున్నది గంధపుకదంబము కూర్పు. ఒక్కొక్కటియు మంచిపరిమళముగలది. అన్నియుఁ జేరఁగా పరిమళ మింతింతనరాదు. ఇంతటి పరిమళాతిశయమును నాయిక మేనివాసనముందఱ పరిమళము కాదయ్యె. కావుననే యామేనివాసనతో నాకదంబమునకుఁ బూవుగట్టుట.

సీ. అధరమాధుర్య భిక్షాగతంబగు సుధా, గుటిక నా ముంగఱఁ దగుదురుపఱిచి
సమయానుగుణమహోచ్చగతగ్రహాళినాఁ, జనుదోయినవరత్నసరము వైచి

కిసలకోరక భృంగకీరవర్గంబునా, దోర్వల్లిపయి వన్నెతొడవులునిచి
ఘనకుచాంగజదుర్గకల్పితాధరవప్రపరిధినా నొడ్డాణమిరవుకొల్పి
యనఘజఘనానుషంగ మష్టాంగయోగ
కలన నివి గాంచె నన వజ్రకాంచికలిడి
యంగజితరతిబిరుదాంక కమంఘ్రిఁగట్టు
కరణి మణిమయమకరనూపురము దొడిగి. 121

అ. అధర......గతంబు = క్రిందిపెదవియందలి తియ్యఁదనము యొక్క విచ్చముకోఁ బకు వచ్చిన, సుధాగుటికనాఁ = అమృతగుళికయోయన్నట్టు, ముంగఱ = ముక్కుము త్తియమును; కుదురుపఱిచి = సవరించి,

సమ.........హారినాఁ — సమయఅనుగుణ = వివాహసమయమునకు అనుగుణముగా, మహోచ్చగత= పరమోచ్చదళనుబొందిన—(అనిగ్రహాళిపరముగా)—సమ్యక్ = లెస్సయైన,అయ = శుభావహకర్మము దేనియందో యది ('అయశ్శుభావహోవిధిః') అటువంటియు, అనుగుణ = (గుణ మనఁగా సూత్రము గనుక అనుగతమయిన సూత్రము, దేనికిఁగలదో యది అనుగుణము) అటువంటియు, మహోచ్చగత=కుచరూపమైన యున్నతస్థానమును బొందినదనియు (నని నవరత్నసరము పరముగా నర్థము.) సమయానుగుణమహోచ్చగతగ్రహపంక్తియోయన్నట్లుగా సమయానుగుణమహోచ్చగత నవరత్నసరమును జనుదోయి యందువైచి యని యర్థము. నవరత్నములను వర్ణసామ్య నిమిత్తముచేత నవగ్రహములుగా నుత్ప్రేక్షించినాఁడు. గ్రహపరమయిన యర్థమున మహోచ్చగతు లన్నందులకు సూర్యాదిగ్రహములకు మేషాదిరాసులుచ్చస్థానములు, మేషాదిరాసులయొక్క ౧౦,౩, ౨౮,౧౫,౫, ౨౭,౨౦, భాగములు పరమోచ్చభాగములు. ఉచ్చస్థానమున కేడవది నీచస్థానము. ఇందులకు 'అజ వృషభమృగాంగనాకు ళీరాఝషవణిజౌ చదివాకరాదితుంగాః దశశిఖిమను యుక్తి థీంద్రి యాంశై స్త్రినవకవింశతిభ స్తద స్తనీచః' అని జ్యోతిశ్శాస్త్రము.

అ. కిసల...నాఁ—కిసల ('కిసాలయంకిసలయం కిసాలంకిసలంకిసమ్' ద్విరూప) = ఎఱ్ఱనిచిగుళ్ల యొక్కయు, కోరక = తెల్లనిపూమొగ్గల యొక్కయు, భృంగ = నల్లని తుమ్మెదల యొక్కయు, కీర=పచ్చనిచిలుకల యొక్కయు, వర్గంబునాఁ =సమూహమోయన్నట్లుగా, దోర్వ ల్లిఁ = బాహులనెడు తీఁగయందు, పఱువన్నెతొడవులు = రక్తశ్వేతనీల హరిద్వర్ణములుగల పద్మ రాగమౌక్తిక హరినీల మరకత మణిమయములైన భూషణములు, పెట్టి. ఘన=గొప్పలయిన, కుచ = చన్నులనెడు; అంగజదుర్గ=మన్మథగిరిదుర్గములకు, కల్పిత = రచింపఁబడిన, అధరవప్ర = క్రిందికో టయొక్క, పరిధినాఁ = వలయమోయన్నట్లుగా, ఒడ్డాణము, ఇరవుకొల్పి=పట్టుకొలిపి.

అనఘజఘనఅనుషంగము = నెఱసులేని కటిపురోభాగముయొక్క సాంగత్యమును, ఇవి=ఈ వజ్రకాంచికలు, అష్టాంగయోగకలన =(యమనియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారధ్యాన ధారణాసమాధులనెడుఅష్టాంగ:యోగములచేతనని యర్థము-) అష్టధారాయోగముచేతనని భావము. •(వజ్రమునకష్టధారలుండును.

క. రూపాదవి చులుకనై మెఱుఁ • గేపారఁగవానిధార లెనిమిదియగుచుఁ
దాపొల్చుమూలలారై, చూపట్టుట వజ్రమణికి శుద్ధగుణంబుల్

కాంచెనన్ = పొందినవో యనునట్లుగా, వజ్రకాంచికలిడి = వజ్రమణిమయములైన మొలనూళ్లు పెట్టి. అంగజిత రతిబిరుదాంకము-అంగజిత = మేనుచే (మేనిచక్కఁదనముచే.) గెలువఁబడిన, రతి=రతీదేవియొక్క ('అథోరతిః రతీకామప్రియాప్రీత్యోః' నానార్థ) బిరుదాంకము = మకరాకారమగుబిరుదు పెక్కుము. అంఘ్రిన్ కట్టుకరణిన్=కాలనుగట్టునట్లుగా, మణిమయ మకర నూపురము, రత్నమయములై మకరాకారమైన అందెను, తొడిగి. సీసము నాలుగును గీతిని రెండును త్వేక్షలు·

చ. చెలువలు బాల నిట్లు గయిసేయఁగఁ బైదలియోర్తు రాగ మం
ఘ్రుల నలరించి చూచితిరె కొమ్మలు తమ్ము లినాంఘ్రిరాగకం
దళిఁ దగు ధాత్రి నీయరిదితమ్ము లినోజ్జ్వలమౌళి రంజనా·
కలనము లంచుఁ బల్కఁ జెలి కన్నుల నించుక నించె రాగమున్. 122

అ. చెలువలు = చెలికత్తియలు, బాలన్, ఇట్లు, కయిసేయఁగన్ = శృంగారింపఁగా, పైదలియోర్తు = వారిలో నొకచెలికత్తె, రాగము = లత్తుకరసమును, అంఘ్రులన్ = పాదములందు, అలరించి=అలంకరించి, కొమ్మలు=చెలులారా, చూచితిరే=చూచినారటే, ధాత్రిన్ =భూమియందు-('ఉపమాతాచ ధాత్రీస్యాద్భూమిరామలకీచసా' నానార్థ), తమ్ములు = ప్రసిద్ధమయిన తామరలు, ఇనాంఘ్రిరాగకందళిన్ =—(ఇనశబ్దము పతియందు సూర్యునియందును, 'ఇనస్సూర్యే నృపేపత్యౌ' అని విశ్వము, ఇన=పతియొక్క, అంఘ్రి = పాదములయొక్క, రాగకందళిన్ =ఎఱుపు మొలకచేత, తగునని అర్థము—అనఁగా తద్రంజితములనుట—సూర్యకిరణములవలని యొఱ్ఱఁదనము మోసు చేఁదగునని భావము. ఈ అరిదితమ్ములు = ఈ (గిరికాచరణరూపములయిన) వింతతామరలు,—ఇటుచరణములను నిగరణము చేసితమ్ములని చెప్పినాఁడు.— ఇన...కలనములు - ఇన = పతియొక్క, ఉజ్జ్వల = ప్రకాశమానమగుచున్న, మౌళి=కిరీటముయొక్క (మౌళిస్సంయతకేశేషు చూడాయాం మకుటేద్వయోః' నానార్థ)రంజన=రంజనమందు—అనఁగా గిరీటమును బ్రకాశింపఁజేయుట యందు, ఆ కలనములు =సమర్థములయినవి.అంచున్,పల్కన్ =చెప్పఁగా, చెలి=గిరిక, రాగమున్ =ఎఱుపును, ఇంచుక, నించెను. శ్లేషమూలక వ్యతిరేకము.

గిరికయడుగులు పతికిరీటమును రంజించుట సురతబంధ విశేషమందుఁగాని, ప్రణయకోప నివారణార్థముగాని; పెనిమిటిచేత శిరసావహింపఁ బడుచున్నవని తాత్పర్యము. చెలికత్తె పలికిన నర్మోక్తికి సిగ్గుతోడి కినుక నించుక కన్నెఱ్ఱఁజేయుట. ఇందు ళశల కభేదప్రాసము. 'శేషమునకుఁ బైనుండు మాతృకకుఁ బెద్ద, శాయభేదాహ్వయప్రాసమై యెసంగు'.(అప్పకవీయము)

శా. కాంతల్ శుక్తిమతీనగేంద్రభవముక్తారత్నరాజిం దగే
కాంతస్వచ్ఛశరీరయుక్తి ననుజాకల్యాణవేళార్హ స
త్కాంతుల్ నించిరిగాక కానియెడ లోకశ్లాఘ్యసౌభాగ్యవ
త్కాంతాలోకమణీమణీశత ములంగై సేయఁగా ముగ్ధ లే. 123

అ. కాంతల్ = గిరికాదేని చెలులు, శుక్తి...రాజన్ శుక్తిమతీనదియందును కోలాహలుని యందును పుట్టిన ముత్తెములయొక్కయు, రత్నములయొక్కయు సమూహమందు, శుక్తిమతీ సంభవములు ముత్యములనియుఁ కోలాహల సంభవములు రత్నము లనియుఁ(క్రమము) తత్ = ఆగిరికాదేవియొక్క, ఏకాంతస్వచ్ఛ=ఒక్కరూపున నిర్మలమయిన, శరీర = మేనియొక్క,

యుక్తిన్ = యోగముచేత, అను...ంతుల్—అనుజా = తోడఁబుట్టినదయిన గిరికయొక్క, కల్యాణవేళా = పెండ్లిసమయమునకు, అర్హా = తగిన, సత్కాంతుల్ = శ్రేష్ఠమయినకాంతులను, నించిరిగాక = నిండఁజేసిరేకాని, కానియెడన్ = అట్లు గానిచోన్—గిరికమేనికాంతుల చేత ముక్తారత్నరాజినలంకరించుటకానిచో, లోక...మణిన్—లోకశ్లాఘ్య = లోకమువారిచేతఁ గొనియాడఁదగిన, సౌభాగ్యవత్ = సౌందర్యముగల్గిన, కాంత ఆలోక = మనోహరమయిన ప్రకాశముఁగలిగిన, మణిన్ = రత్నమును-అనియర్థము. (ఆలోకావర్శనద్యుతీ') అగ్నికాంతా జనరత్నమని భావము, మణిశతములన్ = రత్నముల వందలచేత = రత్న సమూహముచేత ననుట, కైసేయఁగాన్ = అలంకరించుటకు, ముగ్ధలే = తెలియనివారా - కారనుట. 'అథత్రిషుముగ్ధ స్సౌమ్యేనవేమూఢే' నానా.

'శుక్తిమతీ నగేంద్రభవముక్తా రత్నరాజి' ముక్తారత్నరాజి శుక్తిమతీ నగేంద్ర భవములు. గిరికయు శుక్తిమతీ నగేంద్ర భవ. కావుననే గిరిక ముక్తారత్నములకు అనుజ అనుజయైన గిరిక వివాహమున రత్నములలంకరించుకొ నవలయునుగదా కావుననే వానిని గిరిక దేహకాంతులచేత నలంకరించినారట. వానికంటె మించినకాంతులు గలగిరిక దేహమును వానిచేతనలంకరించుట ఘటిల్లదని చమత్కారము. అనఁగా గిరికాదేనికి నలంకరించిన రత్నాభరణము లామెదేహకాంతిచేతఁ బ్రకాశించుచున్నవే కాని యాభరణము లామెదేహమును బ్రకాశింపఁజేయఁ జాలకయుండెనని ఫలితార్థము.

శా. నానాభూషణ రత్నజాలములలోనం బొల్చు నాత్మీయకా
యానుచ్ఛాయలచేఁ గరం బలరె మేనాపత్య సత్పుత్రిని
త్యేనుల్ దాల్చి శుభాదిదేవతలుసంప్రీతిం బ్రవేష్టింప ని
త్యానందంబున నందమొందునరవిందావాస చందంబునన్. 124

అ. మేనాపత్యసత్పుత్రి = మేనక కొడుకయిన కోలాహలుని మేలికూఁతురయిన గిరిక, నానా భూషణరత్నజాలములలోనన్ = సకలాభరణములందలి రత్నసమూహములలోపల, పొల్చు = ప్రకాశించుచున్న, ఆత్మీయకాయ అనుచ్ఛాయలచేన్ = తనమేని ప్రతిబింబములచేత, కరంబుఅలరెను = మిక్కిలి ప్రకాశించెను. ఏలాగుననఁగా—శుభాధిదేవతలు = హ్రీశ్రీభీ మొదలయిన మంగళాధిదేవతలు, నేత్యేనుల్ దాల్చి, సంప్రీతిన్, ప్రవేష్టింపన్ = పరివేష్టించికొలువఁగా, నిత్యానందంబునన్ అందమొందు, అరవిందావాసచందంబునన్ = లక్ష్మీదేవివలె, కరంబలరెనని సంబంధము.

భూషణరత్నసమూహములందుఁ బ్రతిబింబించిన గిరికాదేహములను శుభాధిదేవతలుగాను, గిరికాదేవిని లక్ష్మీదేవిగాను జెప్పినాఁడు. ఉపమ.

క ఐదువగాణీలశుభా పాదనగేయములపేర భారతి సతిపై
మోదమున ధవళవర్ణ ప్రాదుర్భావంబు నెఱపెఁ బలుమఱు నచటన్. 125

అ. ఐదువగాణీల = (గాణీశబ్దము గాయనశబ్దభవము.) పాటపాడు ముత్తైదువలయొక్క శుభాపాదనగేయముల పేరన్ = మంగళపుఁబాటల నెపము నెపముచేత, భారతి = సరస్వతీదేవి,—అనఁగా గేయరూపభారతియనుట. సతిపైమోదమునన్ = గిరికమీఁది సంతోషముచేత, అచటన్, పలుమఱున్ = మాటిమాటికి, ధవళవర్ణప్రాదుర్భావంబున్ = శుభస్వరూపప్రాదుర్భావమునని యర్థము-ధవళాక్షరప్రాదుర్భావముననియు నెఱపెను. అపహ్నుతి, అతిశయోక్తి.

ధవళవర్ణములనఁగా ధవళములను పెండ్లిపాటలరాగము లని భావము. పెండ్లిలో ధవళముపాడుట ప్రకటము. 'ధవళంబువినిచొక్కుహాణుఁదెల్పెడులీలహాళిఁగోయిలపల్కులాలకించి'(విజయవిలాసము.

## ఆశ్వాసాంతము.

శా. సంధాభార్గవభార్గవవహ్నినయన జ్వాలాభ శౌర్యప్రభా
సంధానాదర నాదరక్తి రసిక శ్యామామనోవారణా
సంధారోహణ రోహణప్రతిమదో శ్చారుక్షమాపాలసం
బంధాపాదన పాదనమ్రహయరా డ్భాస్వత్సపాదాంకనా.

అ. సంధా = ప్రతిజ్ఞ యందు, భార్గవ = పరశురామా, ( 'సంధాప్రతిజ్ఞా మర్యాదా' అ భార్గ...ప్రభా - భార్గ=భర్గ(అనఁగాశివ) సంబంధియైన, వహ్నినయన=నిప్పుకంటియొక్క,జ్వాలా= మంటలయొక్క, ఆభ = ప్రకాశమువంటి ప్రకాశముగల, శౌర్యప్రభా=ప్రతాపప్రకాశముయొక్క, సంధాన = కూర్పుటయందలి, ఆదర = ఆసక్తిగలవాఁడా, అనఁగా ప్రతాపశీలుఁడనుట. నాద... రోహణా-నాదరక్తిరసిక=గానమందలి రసికత్వముగల, శ్యామా=నడి యౌవనపుఁబడఁతులయొక్క, మనః = మనస్సనెడు, వారణస్కంధ = ఏనుఁగుమూఁపునందలి, ఆరోహణ=ఎక్కుటగలవాఁడా— నడి యౌవనముగలజవరాండ్రమనసున కెక్కుటయేనుఁగుమూఁపునారోహించుటవంటిది—ఉత్కృష్టుల కేగజస్కంధారోహణము. శ్యామమనస్సమారోహణము చేరాజుసౌందర్యసౌభాగ్యాదులువ్యంజితములు. నాదరక్తిరసిక = గానమందలి యాసక్తిచేత రసికములయిన, శ్యామా = ప్రేంకణపుఁ దీఁగల యొక్క, మనః= మనస్సనెడు, అవారణస్కంధ = అడ్డుపాటులేని బోదియయందలి, ఆరోహణా= ఎక్కుటగలవాఁడాయనియు నర్థాంతరము. - ప్రేంకణమునకు గానముదోహదక్రియయనిప్రసిద్ధము— శ్యామయనఁగా అప్రసూతాంగనయు ప్రేంకణమును, స్కంధమనఁగా మూఁపును చెట్టుబోదెయు - చెట్టునడుగునుండి కొమ్మలవఱకునుండు ప్రాఁకు 'స్కంధః ప్రకాండే కాయేచబాహుమూలసమూహయోః అని అ. రోహణప్రతిమ = రత్నప్రదానమందు రోహణపర్వతమునకు సాటియైన, దోః= దక్షిణబాహువుచేత, చారు = ఒప్పుచున్న, క్షమాపాల = రాజులతోడ, సంబంధ ఆపాదన = సంబంధముచేసినవాఁడా, పాదనమ్ర = అడుగులకు ప్రణతుఁడయిన, హయరాట్ =అశ్వపతియొక్క, భాస్వత్ = అన్వర్థభాసురమయిన, సపాదఅంకనా = సపాదుఁడనెడు నామముగలవాఁడా. ఇది ముక్తపదగ్రస్తము.

క. ఖల్యాభయకర హయఖుర, హల్యాహతజన్యజాంగ లాంగణఫలసా
కల్యావహ బహుదిగ్జయ, కల్యాణ నిజామగుప్త కల్యాణహరా.

అ. ఖల్యా = ఖలసమూహమునకు—(ఖలానాంఖలినీఖల్యా' అ.) భయకర = భయంకరుఁడైనవాఁడా, హయ = గుఱ్ఱములయొక్క, ఖుర = గిట్టలనెడు, హల్యా = హలసమూహముచేత, (హల్యాహలానాం అ.) ఆహత = దున్నఁబడిన, జన్య= యుద్ధమనెడు, జాంగలఅంగణ ('జాంగలో జలనిర్ముక్తదేశే ' వి) జలములేని ప్రదేశమునకు, ఫలసాకల్యావహ = పంటలనిండుఁదనమునకును సంపాదకుఁడైనవాఁడాయని యర్థము—ఫలమనఁగా 'సబాణాగ్రయోఃఫలమ్ అని విశ్వము. బాణాగ్రము లు వైచినాఁడనిభావము.నిర్జలప్రదేశమందు సంపూర్ణఫలప్రాప్తి చేసినాఁడని యద్భుతార్థము. బహు దిగ్జయకల్యాణ=అనేకదిగ్జయరూప మయిన మంగళములు గల్గవాఁడా. నిజామగుప్తకల్యాణహరా =

నిజాముచేతఁ రక్షింపఁబడిన, కల్యాణపట్టణమును దీసికొన్నవాఁడా యని యర్థము నిజామునిచేతఁ దాఁపబడిన బంగారమును హరించినవాఁడాయనియు.

తరలము. ద్రమిళలాటకురువరాట కొదహళఖోటకుంభినీ
రమణజూట తటకిరీట కొ రత్నపాటలప్రభా
కమలఝాట కలితకూట కొ కనకవాటసంభ్రమ
ద్భ్రమితఘోట బెడదకోటకొ పటుకవాటపాటనా.

అ. ద్రమిళ, లాట, కురువరాట, దహన, ఖోట, అనుదేశములయొక్క, కుంభినీరమణ = రాజులయొక్క, జూటతట = శిరసులందలి, కిరీట = కిరీటములందలి, రత్న = మణులయొక్క, పాటలప్రభా = తెలుపుగలసినయెఱుపుచాయలనెడు, కమలఝాట = తామరవనముగలవాఁడా, కలిత = పొడవులయిన, కూట = శిఖరములుగల, కనక = కనకగిరియొక్క (ఇట నామైకదేశే నామగ్రహణమ్'.అనియున్నది గనుక కనక శబ్దముచేత కనకగిరి చెప్పఁబడెను.) వాట = ('వాటో మార్గేవృతిస్థాని' మేదిని)= మార్గమందు, సంభ్రమత్ = ధాటీవేగముచేత, భ్రమిత=భ్రమించుచున్న, ఘోట= గుఱ్ఱములుగలవాఁడా, బెదరకోట, అనెడుపట్టణముయొక్క, పటు=సమర్థమయిన, కవాట = పెద్ద దర్వాజాతలుపులయొక్క, పాటన = భేదనముగలవాఁడా,—బెదరకోటతలుపులు బ్రద్దలుచేసి లోపలికిఁబోయి జయించినాఁడనుట. ఈ వృత్తమునకు నభసనజరగణములు, పదునొకొండవ యక్షరము యతిస్థానము.

## గద్యము.

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత
సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితా
నిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబను మహాప్రబం
ధంబునందుఁ బంచమాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

# వసుచరిత్రము సవ్యాఖ్యానము.

## షష్ఠాశ్వాసము.



రామ చరణవందన
పారీణ యపారరణకృపారీణ ధను
ర్నారాచనవ్యదీవ్య
ద్వీరాచరితాంక గేయ తిరుమలరాయా. 1

అ. శ్రీరామ = రామస్వామియొక్క, చరణవందన = పాదప్రణామమునందు, పారణ = తుదముట్టినవాఁడా, అపార = మితిలేని, రణ = యుద్ధమందు, కృపాఅరీణ = దయారహితమయిన, ('స్యన్నంరీణమ్' అ) ధనుర్నారాచ = విలునమ్ములు గలవాఁడా, నవ్య = నూతనమయిన, దీవ్యత్ = ప్రకాశించుచున్న, వీరాచరితాంక = శౌర్యాంకములచేత, గేయ = స్తోత్రముచేయఁ దగినవాఁడా, తిరుమలరాయా.

ఆ. అవధరింపుము శౌనకాద్యఖిలసన్ము, నీంద్రులకు రోమహర్షణి యిట్లువలుకు
నితర దిక్పాలకాంతలు నిగురుఁబోఁడి, కర్హభూషావిశేషంబులనిపిరపుడు. 2

అ. అవధరింపుము = చిత్తగింపుము, రోమహర్షణి = సూతుఁడు, ఇతరదిక్పాలకాంతలున్ = మున్నుచెప్పినశచీదేవికాక తక్కినదిక్పాలకుల భార్యలును, ఇగురుబోఁడికిన్ = గిరికకు, అర్హభూషావిశేషంబులు = తగినయలంకారవిశేషములు, అపుడు, అనిపిరి.

శా. పౌలోమీప్రభృతుల్ కుమారి నిటుసంభావింపఁగా మున్ను ది
క్పాలుర్ భూపు నలంకరించి శుభలగ్నంబుం బ్రతీక్షింపఁగా
నాలోఁ దాను దదర్హవర్ణవిశేషోన్మేషసన్నద్ధుఁడో
నాలోకాప్తుఁడు చేరె రాగమహిమన్ రత్నాకరప్రాంతమున్. 3

అ. పౌలోమీప్రభృతుల్ = శచిమొదలయినవారు, కుమారికన్ = గిరికను, ఇటు సంభావింపఁగాన్ = గౌరవింపఁగా, మున్నె = ఇంతకుముందుగా, దిక్పాలుర్, భూపు = రాజున్, అలంకరించి, శుభలగ్నంబునన్, ప్రతీక్షింపఁగాన్ = ఎదురుచూచుచుండఁగా, ఆలోన్ తాను, తత్ = గిరిజావసురాజులకు, అర్హ = తగిన, సన్మణివిశేష = మేలయినమణి విశేషములయొక్క, అన్వేష = వెదకుటకు, సన్నద్ధుఁడో నాన్ = ఆయితపడ్డవాఁడో యనునట్లుగా, లోకాప్తుఁడు = సూర్యుఁడు, రాగమహిమన్ = ప్రేమాతిశయము చేతననియర్థము, ఎఱుపునతిశయము చేతనని భావము. రత్నాకరప్రాంతమున్ = రత్నములకు స్థానమయిన పడమటి సముద్రపు సమీపమును, చేరెను— అనఁగా సూర్యుఁడస్తమించెననుట ఉత్ప్రేక్ష.

దిక్పాలురవలెఁ దానును రాజునలంకరింప సన్నద్ధుఁడగుట'లోకప్తుఁడగుటచేత. రత్నములనే సన్నాహము చేయవలయుటచే' రత్నాకర' ప్రాంతమునకుఁ బోయినాఁడు.

మ. వసుసమ్రాడ్గిరికాకరగ్రహమహాశ్వ్యాలోకనానందసాం
ద్రసురేంద్రప్రమదాశ్రయం బగునభః ప్రాసాదదేశంబునన్
ఘుసృణాలేపమొనర్చి ధూపమిడి ముగ్గుల్ పెట్టిరో నాఁ గరం
బెసఁగెన్ సంజయు సిర్లుఁదారకలు భూయిష్ఠప్రకాశంబునన్. 4

అ. వసుసమ్రాట్ = వసురాజుయొక్కయు, గిరికా = గిరికాదేవియొక్కయు, కరగ్రహమహా = పాణిగ్రహణమహోత్సవముయొక్క, వ్యాలోకన = విశేషదర్శనమందలి, ఆనందసాంద్ర = ఆనందముచేత దట్టమయిన, సురేంద్రప్రమదా = ఇంద్రునిభార్యయైన శచీదేవికి, ఆశ్రయంబు = స్థానము, అగు నభః ప్రాసాదదేశంబునన్ = ఆకాశమనెడు మేడపట్టునందు, ఘుసృణాలేపము = కుంకుమపూఁత, ఒనర్చి, ధూపముఇడి = కృష్ణాగరుధూపమిచ్చి, ముగ్గుల్ పెట్టిరో = ముత్యాలముగ్గులు తీర్చిరో, నాన్ = అనునట్లుగా, సంజయున్ = సంధ్యారాగమును, ఇర్లున్ = చీఁకటియును, తారకలు = నక్షత్రములును, భూయిష్ఠప్రకాశంబునన్ = అతిశయప్రకాశముచేత, కరంబు, ఎసఁగెన్ = అతిశయించెను

ఇట సంధ్యారాగమును గుంకుమ పూఁతగాను చీఁకట్లను ధూపధూపములుగాను, నక్షత్రములను ముత్యపు ముగ్గులుగాను నుత్ప్రేక్షించినాఁడు. నభమను ప్రాసాదదేశంబనుట ఔన్నత్యస్ఫూర్తికిని సురేంద్రప్రమదకు ఆశ్రయంబగుటం బట్టియు. పెండ్లిమొదలగు వేడుకలను పడఁతులు మేడల తుదలందుండి చూచుట సహజము.

ఉ. ఒప్పుననంతసౌధమున నుండి తదుత్సవచిత్రసంపదల్
ముప్పదిమూఁడుకోట్ల సురముఖ్యులపట్టపుదేవు లందఱుం
దప్పకచూడఁగా నిడినదట్టపుసోరణగండ్లు నా దెసల్
గప్పురుచి ప్రరోహములఁ గానఁగ నయ్యె నపారతారకల్. 5

అ. ముప్పదిమూఁడుకోట్ల సురముఖ్యుల పట్టపుదేవులు, అందఱును, ఒప్పు అనంతసౌధమున నుండి = ప్రకాశించుచున్న ఆకాశమనెడు మేడలోపలనుండి, తత్ ఉత్సవ చిత్రసంపదల్ = ఆవివాహోత్సవముయొక్క వింత పెంపుసొంపులను, తప్పక చూడఁగాన్, ఇడిన = ఏర్పఱచిన, దట్టపుసోరణగండ్లునాన్ = క్రిక్కిఱిసిన కిటికీలో యన్నట్లుగా, అపారతారకల్ = మితిలేనినక్షత్రములు, దెసల్ కప్పు రుచిప్రరోహములన్ = దిక్కులను గ్రమ్ముచున్న కాంతి మొలకలచేత కానఁగనయ్యెను.

ఆ వివాహోత్సవము చిత్రసంపదలుగలది. కావున దానిని జూచుపడంతులు గొందఱనుగాని కేవలలుగాని కారు. ముప్పదిమూఁడుకోట్ల సురముఖ్యులపట్టపుదేవులు. కాన ఇంతమందియు జూచు సౌధము 'అనంత' మే (అంతములేనిదనియర్థము. ఆ కాశమనిభావము) కావలయును. ఈ యంద ఱునుదప్పక మాచుటకు సోరణగండ్లు దట్టముగా నుండును. తారకముల పారము లనుటకు సరిగా సోరణగండ్లు దట్టములనుట. అందఱు స్త్రీలును తప్పక చూచుటకు నవి అపారముల యిక్కిటిసి యుండకతీరదు. సోరణగండ్లనఁగా గవాక్షములరంధ్రములు - సోరణములనుమాత్రకే

'పెద్దతామర కెంపుబిగిపట్టి యలచేతసొబగైన ముత్యాలసోరణముల, (యయాతి - ౧)

గవాక్షములనియున్నవి, అందలిరంధ్రములనే గండ్లందురు. కావుననేదీని కేకవచనమును 'మెఱుంగుకెంపుసోరణగండిచిఱుత తెమ్మెరసోఁకున' (ఉ-రా-౬)అనియున్నది. ఇది యఱుపుళ్ళువలె బహువచనాంతమయ్యువృత్తియం' దేక వచనాంతమని సీతారామాచార్యులవారు వ్రాసిరికాని గండ్లు అనుటను బ్రత్యేకశబ్దముగా గ్రహింపమిచేనయిన పొరబాటు. గండియనఁగా రంధ్రమని ప్రత్యేకము గా అవృత్తియందును ప్రయోగము గలదుగాన యఱువుఁడునంటిదిగాదు. గవాక్షమందలి గండ్లు పెక్కులుగావున బహువచనము సంఖ్యనుబట్టి వచ్చినదేకాని స్వరూపసిద్ధముగాదు. ఒక్కగండినుండి వచ్చుటంజేసి 'చిఱుతతెమ్మెరసోఁకున' చిఱుత. యనియు'సోకున' వనియు స్వల్పార్థమును ఏకవచనాం తమును బ్రయుక్తములు. దీనికి నడుమ'పెద్దతామర కెంపుబిగిపట్టియు' 'మెఱుంగుకెంపుజా'అని కెం పుపట్టెలుండునట్లు వర్ణించుటచే నీకిటికీలు గుండ్రములై నడుమ నిలువునను నడ్డముగనుబట్టెలు గలిగియుండుననియు వానినడిమి చిన్నచిన్న సందులే గండ్లనియుఁ దేలుచున్నది. కావున నే యిటచుక్కలకును పట్టెలకుమాఱుగా, దిన...రోహ ములని కాంతిమోసులు చెప్పుట. అడ్డంబునిడు పుగానిగుడుకాంతిమోసులు. చుక్కలనెడు సోరణగండ్లకు పట్టెలలాగున నుండుటకు రామాయణమున కిటికీలను వర్ణించుచో ('జాలవాతాయనైర్యుక్తం కాంచనైస్స్ఫాటికైరపి') సుందర (నవమసర్గము.) అనుటకుగోవిందరాజులు. జాలాని 'తిర్యగూర్ధ్వవిన్యస్తఫలక ఘటితాని, వాతాయనాని కేవలా నిరం ధ్రాణి'యనియు,మహేశ్వరతీర్థులు' జాలవాతాయనైర్యుక్తం.కుడ్యోపరిభాగేఅలంకారార్థం స్వస్తిక సర్వతోభద్రాద్యాకారేణాయామవత్త్రయాకృతం జాలం,వాయు సంచారార్థం కృతోగవాక్షఃవాతా యనమ్' అని వ్రాసియున్నారు. దీనింబట్టి నడుమ పట్టెలుగలిగి గాలికొఱకయినదిసోరణ గండ్లని తెలియునది.

'తెల్లవాఱుచున్నదివియలల్లార్పుచు, సోర్లగండ్లయందుఁజొచ్చిసుడిసి
తిరిగి వేగుఁబోకతెమ్మర కలఁదిఁగ, కొనలవంకలొత్తు ననలఁబోచు.'

భారత - విరాటపర్వము

ఉ. ఉన్నతవైజయంతివలకే యోపరిభాగము చేరి చేదిభూ
భృన్నగరీమహోత్సవముకే పెం పఖిలంబును నిక్కి చూచువేఁ
గన్నులవేల్పురాణిముఖకే కంజము పైపయిఁదోఁచురేఖ దే
గన్నియతేని మేను తొలుకేగట్టుతుదం బొదలెం గ్రమంబునన్. 6

అ. ఉన్నత.. భాగము - ఉన్నత=పొడవయిన, వైజయం తపలయ (స్యాత్ప్రాసాదో వైజ యన్తః అ) ఇంద్రుని వట్టువమేడయొక్క, ఉపరిభాగమును, చేరి, చేదిభూభృత్ నగరీ మహోత్స వము=చేదిదేశపు రాజయిన వసురాజుయొక్క పట్టణమందలి పెద్దపెండ్లి వేడుకను, అఖిలంబునుఱ

సకల్గను, నిక్కి చూచు=తలయెత్తి చూచుచున్న, వేగన్నుల వేల్పురాణి ముఖకంజము= సహస్రనేత్రుఁడయిన యింద్రుని భార్య (శచి)యొక్క మోముదామర, పైపయిన్ తోఁచు రేఖన్ =మీఁద మీఁదఁ గనుపించుచున్నదో యన్నట్లుగా, రేగన్నియరేని మేను=(రాత్రి యనుపడఁతికి నాథుఁడయిన, చంద్రుని దేహము (అనఁగా బింబము) తొలుగట్టుతుదన్ =ఉదయ పర్వతపు కొనయందు, క్రమంబునన్, పొదలెన్ = ప్రకాశించెను.

వైజయంత మింద్రుని మేఁడ. అది యున్నతమయినది దాని యున్నతి చెప్పుట తొలుగట్టునకు సాటికి. దాని యుపరిభాగమును జెప్పుట తొలుగట్టు తుదను బోలుటకు. అందు. శచి కొంచెము మొగమెత్తి చూచినట్లు, కొంచెము చంద్రబింబము కనఁబడినది. పట్టణ మహోత్సవము పెంపునంతయుఁ జూడఁగోరినదిగాన పైపయి నిక్కఁగా మొగము కొంచెము కొంచెముగా పైకి తోఁచి యంతయు పొడగట్టినట్లు, చంద్రబింబమును క్రమముగాఁ బొదలెను. అనఁగా కొంచెముకొంచెముగా అంతయుఁ గనుపట్టి ప్రకాశించెను. ఇట చంద్రబింబము కొంచెముకొంచెముగా క్రమంబునఁ బైకివచ్చి యంతయుఁ గనఁబడుట శచీ పైపయి నిక్కినిక్కి చూడఁగా కొంచెకొంచెముగా నామె మొగమంతయుఁ గనఁబడినట్లుగా నుత్ప్రేక్ష. కనుక ఆమె మొగము పైపయిఁ దోఁచు రేఖ చంద్రబింబము క్రమంబునఁ బొదలుట.

చ. సరసిరుహారి యప్పు డిలఁ జందనసేకము దిక్తటంబులం
బరమసుధానులేపమున భంబునఁ బాండువితాన లక్ష్మియున్
నిరుపమకౌముదీరుచుల నించుచు సారె నలంకరించె నా
సురకుల సార్వభౌమహిత శోభనవేళ నజాండగోళమున్. 7

అ. సరసిరుహారి=చంద్రుఁడు, అప్పుడు, ఇలన్ = భూమియందు, చందనసేకము= తెల్లని శ్రీచందనపు నీటఁ దడుపుటయు, దిక్తటంబులన్ = దిక్కులపట్లయందు, పరమసుధా+అనులేపము = మిక్కిలి మేలయిన సున్నపు పూఁతను, నభంబునన్ = ఆకాశమందు, పాండువితాన లక్ష్మియున్ = తెల్లని మేలుకట్టు (చాందినీ) యొక్క శోభను, నిరుపమ కౌముదీరుచులన్ =సాటిలేని వెన్నెలయొక్క శుభ్ర కాంతులచేత, నించుచున్ =నిండించుచు, అజాండగోళమున్ =గోలవట్రువగా నుండు బ్రహ్మాండమును, ఆసురకుల సార్వభౌమహిత శోభనవేళన్ = దేవతాసమూహమునకు చక్రవర్తియైన యింద్రుని చెలికాఁడయిన వసురాజుయొక్క శుభ వివాహ సమయమందు, అలంకరించెను=శృంగారించెను.

నేలను చందనపు కలయంపి చల్లుటయు చుట్టును గోడలకు సున్నపు పూఁతపూయుటయు, పయిన మేలుకట్లు కట్టుటయు, శుభకార్యములకు నాప్తులు సింగారించు పనులు. చంద్రుఁడు వసురాజు పెండ్లికి బ్రహ్మాండగృహమును సింగారించెను. ఏలనఁగా నతఁడు సురకుల సార్వభౌమహితుఁడుగదా. ముల్లోకములరాజు నాప్తుఁడు గాన యాతనికి మాఱుగా బ్రహ్మాండము నలంకరించెననుట. ఆవివాహ సమయమున భూమ్యాకాశము లందును దిక్కులందును దెల్లని వెన్నెలలు గాయుచుఁ బ్రకాశించుచుండెనని తాత్పర్యము. ఉత్ప్రేక్ష,

చ. అతినికటంబు లగ్నమని యాంగిరసుం డపు డెచ్చరింప దై
వతవిభుఁ డాదరోక్తిఁ బిలువన్ నలువంకలఁ బుణ్యభామినీ
కృతశుభగేయముల్ మగధకీర్తనవైభవముల్ సెలంగఁగా
సితకరి నెక్కి యొప్పెఁ బతి శీతనగోజ్జ్వలశంకరాకృతిన్. 8

అ. ఆంగిరసుఁడు=('జీవ ఆంగిర సోవాచస్పతిశ్చిత్ర శిఖండిజః') బృహస్పతి, లగ్నము, అతిని కటంబు=మిక్కిలి సమీపించినది అని, ఎచ్చరింపన్, దైవతవిభుఁడు = ఇంద్రుఁడు, ఆదరోక్తిన్ = గారవంపుమాటలచేత. పిలువన్, నలుసంకలన్ = నాలుగుదిక్కులను, పుణ్యభామినీ కృత శుభ గేయములు=పుణ్యస్త్రీలచేతఁ జేయఁబడుచున్న పెండ్లిపాటలును, మగధకీర్తన వైభవములు=మాగధులుచేయు నట్టిగానములతోఁ గూడిన కైవారములయొక్క విభవములును, చెలంగఁగాన్, పతిన్=రాజు, సితకరిన్ = వెల్లయేనుఁగును-ఐరావతమును ఎక్కి శీతనగ ఉజ్జ్వలశంకర ఆకృతిన్=హిమవంతము మీఁద ప్రకాశించు శివునివలె ఒప్పెను. ఉపమ.

వ. ఇవ్విధంబున నవ్వసుంధరాధురంధరుండు పురందరసింధురస్కంధాధిరూఢుండై పాండురద్వీపరాజోపరిక్రీడనోల్లాసి యగు సింధుజావిలాసిరోయాయన నవంత మణిమాలికా మహితమహాభోగాత పత్రసహస్రంబులనడుమ విలసిల్లుచు నతిదుమల తసుధమామికా తమ్మటభేరి కాపట హాతుత్తుంభికాదివాదిత్ర గంభీర ఘోషసంరంభంబు కుంభినీకబళనారంభజృంభమాణ జంభారిపుర మురవరవంబునై అవ అవంబోలె హాటకగిరి కూటకటక వాటికాపాట నాటోపంబు వాటింప నిబిడతర విద్యోతమాన నూతనకేతన ప్రకాండదండాఘాతకాతరత్వంబున ధరాతలంబునకు దిగినజ్యోతిర్జాతంబుకరణి గణనాతీత గంధతైలదీపితకరదీపికానికాయంబులు వెలుంగ సమగ్రతరసాంబ్రాణికధూపధూమంబుల జాడలను జడిగొన్న గొడుగులనీడలను గెరవితెరలెత్తునిరులం దెరవింప ననేకరూపంబులం దీపించుతమోరిపుత్రయం బనం జిత్రయంత్రకార సంధానిత లీలాగ్నియంత్ర చంద్ర సూర్యజ్యోతుల మరిచి థట్టంబులు దట్టంబులై నెట్టనం బట్టపగలు గావింప నాత్మీయసామ్రాజ్య లక్ష్మీసకాశంబున ననిందిత స్థైర్యవిద్యాపరిచయంబుపచరింప నవతరించిన క్రొమ్మించుఁ దీవియగుంపునింపు వెలయం గలయ వెదకికొన వచ్చిన తదీయ విరహపాండురంబగు నంబుదంబుడంబు విడంబించుచుఁ గంబుకంఠీకదంబంబు పయిం బట్టినయుల్లాభంబు పళ్యల్లోచన వల్లభంబై మెఱయఁ బాకశాసనశాసనంబునంబరిణయోచితదివ్యవస్తు సంభారసంభావనంబు నకునై విశ్వంభరావలయంబుఁ జెందినమందారవల్లికలయందంబునం గొందఱిందువదనలు చిత్రజాంబూనదాంబరఫలకుసుమాది మంగళద్రవ్యంబులు పూని కుఱంగట నడవ జగత్త్రయ జేగీయమాన ధైర్యాసమాన వసుమానవనాథ చిత్తంబు శైలజాయుత్తంబుగా సమకట్టి గాసింబెట్టిన జగజెట్టి నేఱజోదని బిరుదు వక్కాణించి చెఱకువిలుకానికో దండంబులఁ బూదండలు గట్టి యగ్గించు తదీయవిజయేందిరల చందంబున మఱికొంద ఱిందీవరాక్షులు పుష్పమాలికాలంకృత పుండ్రేక్షుకాండంబులుపూని పురోభాగంబున కడతేరఁ గందర్ప కోటి సౌందర్యశాలియగు నితని కామనీయకంబు భవదీయలోకాలోకనీయ కుమారబృందంబునందు నెందేనియుం గంటిరే యనిదివిజభుజగరాజరాజీవ

గంధులకుం దెలుపుపాలువున లాస్య ప్రవీణ కమలాస్య లభినయ ముఖంబుగాఁ గరకిసలయంబులు సాఁచి మెలపుచూప వైవాహికముహూర్త సారప్రతీక్షాపర మహర్షులు పరమహర్షులై పర్వానుపర్వనుపర్వపాతితపారిజాత పరాగపాళికా దుర్లక్ష్యం బగు నంతరిక్షంబువలన సమక్షంబునకు నాకర్షించినదాక్షాయణీ చక్రంబుకై వడి నవక్రచక్రడోలాయంత్రింబులం దిరుగు మెఱుంగుఁబోండ్ల తండంబు శాణభ్రమన్మదనబాణభ్రమం బొసరింప నెడనెడం బన్నినయపరం జికురుంజాలపై రంజిల్లుచు మృదంగదింధి మిధ్వానంబులకు నాదుయంత్ర పాంచాలికాసముదయంబు విమలమణివిమానమండలంబుననుండి గొండ్లిఁ బరిఢవించు తెలుఁగంటి తెలుఁవలతెఱంగు నంగీకరింప వర్ణనీయవాగ్వరవర్ణినీ వారవారణదుర్లభయాన వైభవంబు వాసవావాస వామలోచనావర్గంబులకు వసుధాపద న్యాసవైధుర్యంబు సంపాదింపఁ బల్యంకికాదివాహనంబులు డిగ్గి పాదచారంబుల నడచు పట్టాభిషిక్తులపద్మరాగ కిరీటపాటల ప్రభాపటలంబులు పవనసఖ శిఖాముఖంబులకు మలినసరణి నవరింప సమస్తజన సముచితమార్గ మర్యాదానుశాసన సముద్దండదండధగ సంభ్రమంబులు సమవర్తికి సమధికశ్యామిక సమకూర్పఁ బ్రబలతమస్ఫార దురహంకార వీరభటకృపాణికాచాకచక్యంబులు రాత్రించరకరాళకరవాల కాళిమంబులు మూలకుం జొనుప బహులసితదంతిఘాటకోటీ సమాటీకనిర్వేల సర్వతోముఖవాహినీశ్వర సంసేవ్యమాన రసాధినాధ సన్నాహంబులు వారిధిస్వామికి వదలనిజడస్థితి యొసంగఁ బరిమళిత ఘన సారగంధసార పరిమిళిత కస్తూరికాసారంబుల వసంత మాడుసామంతబాంధవావళి గంధవహున కసారతారళ్యంబు వెనుప గంభీరబిరుదగాథాపఠన పరాయణ పాఠకపరంపరలకు నెడనెడ హితపురోహితామాత్యజనం బొసంగునసంఖ్యాత ధనసంఘాతంబుల ధనదున కమందమందాక్షభావంబు సంఘటింపఁ బ్రచండతరనటన ప్రకాండతాండవ పాండిత్యంబులు ప్రాచీననటునినెమ్మేనఁ బాండిమంబు నిండింప నిట్లాశాపతులకు నాశాసనీయంబును నహివల్లభులకు నతిదుర్లభంబును సిద్ధుల కననుభూతసిద్ధంబును సాధ్యుల కసాధ్యంబును జ్ఞానులకు నవిచారణీయంబును యక్షులకు ననక్షిలక్షితంబును నైనయనన్యసామాన్యమహావిభవంబునం గోలాహలపురంబుఁ జేరం జనుసమయంబున.

అ. అవ్వసుంధరాధురంధరుఁడు = భూమిభారమును వహించినవాఁడు-వసురాజు, పురందర ...రూఢుఁడు = ఇంద్రుని ఏనుఁగు(ఐరావతము) యొక్క మూఁపుమీఁద ఎక్కినవాఁడు, ఐ,పాండుర ద్వీపరాజ = మేటిదీవియైన శ్వేతద్వీపముయొక్క, ఉపరి = ఊర్ధ్వభాగమందలి, క్రీడన = విహరించుటయందు, ఉల్లాసి = ఉల్లాసము గలవాఁడు, అయిన, సింధుజావిలాసియో = అనక = లక్ష్మీకాంతుఁడో యన్నట్లు—ఐరావతారూఢుఁ డయిన వసురాజు శ్వేతద్వీపవాసి యైనలక్ష్మీకాంతుఁడో యన్నట్లుం డెననుట. వసుంధరాధురంధరుఁడనుట వసురాజేకాక విష్ణుండు నగును. సింధుజావిలాసి

యనుట విష్ణువే కాక వసురాజునగును. వసుంధరాధురంధరుఁడు సింధుజావిలాసియగుట సిద్ధమే కదా యని సారస్యము. సింధుజ యగులక్ష్మికి విలాసము నెఱపుటకై శ్వేతద్వీపమునవసించు విష్ణువుంబోలె సింధుజయగు గిరికకు వివాహవిలాసమునకై ఐరావతము నధిరోహించినాఁడనియు భావము ధ్వనించుచున్నది. సింధుజావిలాసిత్వమువలని విశేషమును జెప్పుచున్నాఁడు. అనంత...నడుమ విలసిల్లుచున్—అనంత = లెక్కలేని, మణిమాలికా=రత్నమాలికలచేత, మహిత=ఒప్పుచున్న, మహా+ఆభోగ = నిండు విఱివిగల, ఆతపత్ర = తెల్లగొడుగులయొక్క. సహస్రంబు=సమూహముయొక్క-నడుమ విలసిల్లుచునని రాజపరముగా—అనంత=శేషునియొక్క, మణిమాలికా = రత్నశ్రేణులచేత, మహిత = ఒప్పుచున్న, మహాభోగ ఆతపత్ర = తెల్లగొడుగులవంటి పెద్దపడగలయొక్క, సహస్రంబునడుమ విలసిల్లుచునని విష్ణుపరముగాను నర్థము. పెండ్లికొడుకు ఊరేఁగునపుడు వేలకొలఁది గొడుగులు పట్టుట ప్రకటము. 'ఇట్లుశృంగారంబు సేసినయమ్ముద్దియకు ముక్తాఫల ప్రాలంబమాలికలతోడి గొడుగులు పట్టించి యత్యాదరంబు...ధారాధరనికరమనోహరయగుపర్జన్యలక్ష్మియుంబోలె. (విరాటపర్వ. ౫ ఆ. ౩౫౬.)ఆదిశేషునకు వేయిపడగలనియు నతండు తెలుపుగాన నవియుఁ దెల్లగా నుండుననియుఁ దెలియునది.

అతి...సంరంభంబు. అతితుముల = మిక్కిలి దొమ్మియగుచున్న, ఢమామికా=ఢమాయులు, తమ్మట=తప్పెటలు. ('రాజకన్యా వివాహేతు కేవలంతమ్మట ధ్వనిః' అనిచాటువు)భేరికా= పెద్దనగారాలు,పటహ=తప్పెట, తుత్తుంభికా=ఇది యొక వాద్యవిశేషము, అనునివి, ఆది=మొదలుగాఁ గల, వాదిత్ర=('చతుర్విధమిదంవాద్యం వాదిత్రాతోద్యనామకమ్' అ) నాలుగు విధములయిన వాద్యముల గంభీర=మంద్రమైన, ఘోష=ధ్వనియొక్క, సంరంభంబు=విజృంభణము, కుంభినీ...రవంబుపైన్—యొక్క, కుంభినీకబళన=భూమిని మ్రింగివేయుటయొక్క, ఆరంభ=ప్రయత్నమందు, జృంభమాణ = విజృంభించుచున్న, జంభారిపుర=ఇంద్రుని పట్టణమందలి, మురవ=మద్దెలలయొక్క, రవంబుపైన్=ధ్వనిమీఁది, అసూయంబోలె=కొఱకొఱచేతవలె-అసూయచేతంబోలె ననుట, హాట...టోపంబు—హాటకగిరి = మేరు పర్వతముయొక్క, కూట=కొమ్ములయొక్కయు, కటక=చఱులయొక్కయు, వాటికా = వరుసయొక్క, పాటన = చీల్చుటయందలి, ఆటోపంబున్ = విజృంభణమును, పాటింపన్ = కనఁబఱుపఁగా, అనఁగా వివాహసమయమున స్వర్గమందుమద్దెలధ్వనియు, భూమియందు వాద్యధ్వనియుఁ జెలంగుచుండఁగా స్వర్గవాద్యధ్వని కుంభినీకబళన సంరంభమును జూపఁగానే వానిమీఁది యీసుచేతంబోలె భూమియందలి వాద్యధ్వనులు దేవతాస్థానమయిన మేరుపర్వతముయొక్క కూటకటకవాటికల నుత్పాటించెననుట - స్వర్గమందలి మద్దెలధ్వని భూమియంతయుఁ బర్వినట్లు చెలంగెననియు, భూమియందలి వాద్యధ్వనులు నింగిమ్రింగిచెలంగెననియుఁ దాత్పర్యము-మేరుశిఖరములు స్వర్గలోకమున నుండుటచే వానిని నుత్పాటించెననఁగా స్వర్గలోకమునిండఁ జెలంగెననియు మేరువుకటకములనుత్పాటించెననఁగా భూమినిండఁ జెలంగెననియు నూహించునది. భూమ్యాకాశనిబిడవ్యాప్తికే మేరువు కటకములను కూటములను గవిగ్రహించినాఁడు.

నిబిడ...వెలంగన్—నిబిడతర = మిక్కిలిదట్టమగునట్లుగా, విద్యోతమాన = ప్రకాశించుచున్న, నూతన = క్రొత్తవయిన, కేతనప్రకాండ = శ్రేష్ఠములయిన టెక్కెములయొక్క, దండ=కఱ్ఱలయొక్క, అఘాత = దెబ్బలవలని, కాతరత్వంబునన్ = భయముచే, ధరాతలంబునకున్=భూప్రదేశమునకు,దిగిన, జ్యోతిర్జాతంబుకరణిన్ = నక్షత్రసమూహమోయన్నట్లుగా, గణన+అతీత=

లెక్కమీఱిన, గంధతైల దీపిత = వాసనచమురుచేత వెలిఁగింపఁబడిన, కరదీపికా = చేదివ్వెల - దివ్వటీల. సమూహములు, వెలుంగన్ = జెండాలుఆకాశమునంటునంతపొడువులగుటచేగాలికల్లలాడువానిదండముల దెబ్బలకు జ్యోతులు భయపడిదిగుట. దివిటీలు లెక్కలేనివియు జ్యోతులవలెఁ బ్రకాశించునవియుఁగనుక లెక్కలేని జ్యోతులోయని యుత్ప్రేక్ష, మిక్కిలి పొడువుగా జెండాలెత్తిరనియు వేలకొలఁది దివ్వటీలు జ్యోతులవలె ప్రకాశించుచుండెననియు తాత్పర్యము.

సమగ్రతర...పగలు గావింపన్ —సమగ్రతర =సంపూర్ణములయిన, సాంబ్రాణికధూప=సాంబ్రాణిధూపములయొక్క, ధూమంబుల=పొగలయొక్క, జాడలన్ =మార్గములచేతను, జడిగొన్నగొడుగులనీడలను=ముసురుకొన్న గొడుగులనీడలచేతను, కెరలి = విజృంభించి, తెరలెత్తు = తెరలు గట్టుచున్న, ఇరులుల్ = చీఁకటిని, తెరలింపన్ = పోఁగొట్టెదు కొఱకు, అనేకరూపంబులన్ = పెక్కురూపులచేత, దీపించు = ప్రకాశించునట్టి, తమోరిపుత్రయంబు అనన్ - 'చంద్రాగ్న్యర్కాస్తమోనుదః') చంద్రసూర్యాగ్నులు మువ్వురోయనునట్లుగా, చిత్రయంత్రకార=బాణాకారీలచేత, సంధానిత=సంఘటింపఁబడిన, లీలాగ్నియంత్ర = వేడుకకొఱకయిన కొమ్మునల్లాలు మొదలయినవాని యొక్కయు, చంద్రసూర్యజ్యోతుల = చంద్రజ్యోతులయొక్కయు సూర్యజ్యోతుల యొక్కయు, మరీచి ధట్టంబులు=కాంతులసమూహములు,దట్టంబులై, నెట్టన్ =శీఘ్రముగా, పట్టపగలుగావింపన్,

ఆత్మీయ...మెఱయన్ —ఆత్మీయ = తనయొక్క, సామ్రాజ్యలక్ష్మీ = అచంచలమైన రాజ్యలక్ష్మి యొక్క, సకాశంబునన్ = సన్నిధానంబునందు, అనిందిత = నిందింపఁబడని, స్థైర్యవిద్యా = నిలుకడ (చలించి పోకుంట)అను విద్యయొక్క, పరిచయంబు=అభ్యాసమును, పచరించుకొఱకున్ = చేయుటకై, అవతరించిన=క్రిందికిదిగివచ్చిన, క్రొమ్మించుఁ దీవియగుంపు=మెఱుఁగు తీఁగలసమూహమును, ఇంపువెలయఁగన్, కలయన్ =అంతటను, వెదకికొనవచ్చిన,=వెదకుటకై వచ్చినదియు, తదీయ = ఆమెఱుఁగుఁ దీగలయొక్క, విరహ = వియోగముచేత, పాండురంబగు = పాలి తెల్లపడినదియు నగు, అంబుదంబు = మేఘముయొక్క, డంబున్ =వైఖరిని, విడంబించుచున్ = అనుకరించుచు, కంబుకంఠీకదంబంబుపయింబట్టిన = స్త్రీజనసమూహము మీఁదుగాఁబట్టినట్టి, ఉల్లాభంబు= వెలిపట్టుమేలుకట్టు - ఉల్లెడ, పశ్యత్ = చూచుచున్నవారికి, లోచనవల్లభంబై=కన్నులపండువై, మెఱయన్ =ఇట మెఱుపుతీఁగలకును స్త్రీలకును తెలిమేలుకట్టునకును తెల్లని మేఘమునకును, ఉపమానోపమేయభావము. లక్ష్మి సాధారణముగాచంచల. ఇతనిరాజ్య లక్ష్మియో అచంచలమైనది. మెఱుపుఁదీగలు స్వభావచంచలములుగాన రాజు రాజ్యలక్ష్మికడ అచాంచల్యమును గఱచుటకై క్రిందికిదిగివచ్చినట్లుమెఱుంగుఁబోండ్లు ఆమెఱుఁగుఁ దీఁగలవలని విరహమువలన వెలుకఁబాఱి వెదకికొనివచ్చిన మేఘమువలె తెల్లని యుల్లెడ. ఉల్లెడకుమేఘసామ్యముచే మిక్కిలి యెత్తును బఱపును వ్యంజితములగుచున్నవి. స్త్రీల నందఱను ఉల్లెడ గప్పియుండుటచే 'కలయన్' అనుట.

పాకశాసన...నడువన్ —పాకశాసనుశాసనంబునన్ =ఇంద్రుని యాజ్ఞచేత, పరిణయ+ఉచిత= పెండ్లికిఁదగిన, దివ్యవస్తు=దేవతా సంబంధములయిన వస్తువులయొక్క, సంభార=సమకట్టుటయొక్క, సంభావనంబునకై = ఒనగూడుటకై—సమకట్టుకొఱకనుట, విశ్వంభరావలయంబున్ = భూమండలమును. చెందిన, అనఁగా భూమికివచ్చిన, మందారవల్లికలయందంబునన్ =మందారమను దేవవృక్షముయొక్క తీఁగలోయన్నట్లు, కొందఱు, ఇందువదనలు, చిత్ర=చిత్రవర్ణముగల, లేక, వింతవింతలగు, జాంబూనద=బంగారుమయములయిన, అంబర = వస్త్రములును, ఫల=పండ్లును,

కుసుమ=పువ్వులును, ఆది=మొదలుగాఁగల, మంగళద్రవ్యంబులు= శోభన పదార్థములు, పూని=పట్టు కొని, కుఱంగటన్ = ముంగల, నడువఁగా, వస్త్రఫల పుష్పాదులగల కొందఱుస్త్రీలను, వస్త్రఫల పుష్పాది కామితవస్తువులను నొసంగు కల్పలతికలుగా నుత్ప్రేక్షించినాఁడు. కల్పలతికలతో ఒల్లియు మేనులంబట్టియు వస్త్రపుష్పాదులంబట్టియు సామ్యము, కల్పవృక్షము.

వాసశ్చిత్రం మధు నయనయోర్విభ్రమాదేశదక్షం

ప్రాయస్సూతే సకలమబలామణ్డనం కల్పవృక్షః (మేఘదూత.)

జగత్త్రియ...నడతేరన్—జగత్త్రియ = మూఁడులోకములవారిచేతను, జేగీయమాన=కొని యాడఁబడుచున్న, ధైర్య=ధీరత్వమందును, అసమాన=సాటిలేని, వసుమానవనాథ=వసురాజుయొక్క, చిత్తంబున్=మనస్సును, శైలజాయత్తంబుగాన్=గిరికకులోనైనదిగా, సమకట్టి=ఏర్పఱచి, గాసింబెట్టిన= శ్రమపఱిచిన, జగజెట్టి నైఱజోదుఅనన్=శ్రేష్ఠుఁడయిన బలియుఁడును, నిండుయోధుఁడు అని, బిరుదు వక్కాణించి = బిరుదావళిచెప్పి, చెఱకువిలుకాని = చెఱకువిల్లుగాఁగల మన్మథునియొక్క, కోదండదండంబులన్=వింటికఱ్ఱలయందు, పూదండలుగట్టి, అగ్గించు=పొగడుచున్న, తదీయవిజయ + ఇందిరల చందంబునన్ = ఆమన్మథునియొక్క విజయలక్ష్ములోయనునట్లుగా, మఱికొందఱు ఇందీవరాక్షులు, పుష్పమాలికాలంకృత పుండ్రేక్షుకాండంబులు = పువ్వుదండలచేత నలంకరింపఁ బడిన చెఱకుగడలు, పూని=పట్టుకొని పురోభాగంబునన్ = ముందఱ, నడతేరఁగా = నడువఁగా, కొండకంటె ధైర్యముగలవాఁడువసురాజు,అట్టివానిని ధైర్యమున కొండకుఁబుట్టినదానిచేతనే పోఁగొట్టి నవాఁడు మరుఁడు. ముల్లోకములను బేరువడ్డధీరు నిట్లు జయించినవాఁడుగాన మరుఁడు జగజెట్టి నెఱజోదు, మేటిజెట్టి, పూర్ణయోధుఁడు. అంతటిజెట్టియు అంతటియోధయు జగంబునఁ గలుగఁడు. ఒకశూరాగ్రణిని బొగడుట వానియాయుధములకుఁ బూదండలుచుట్టి వానినగ్గించుట లోకప్రసిద్ధము. ఇట మన్మథునికి వానిజయలక్ష్ములే యట్లగ్గించువారు. లక్ష్ములని బహుత్వము కొందఱు స్త్రీల బహుత్వమునుబట్టి. వివాహమునందు స్త్రీలు చెఱకుగడలకుఁ బువ్వులు చుట్టి కొనిపోవుట గలదు.

కందర్పకోటి...మెలుపుమాపన్—కందర్పకోటి సౌందర్యశాలి - కోటిమన్మథులయొక్క చక్కఁదనముచేత ఒప్పుచున్న, ఇతని = ఈవసురాజుయొక్క, కామనీయకంబు = చక్కఁదనము, త్రిపదీయలోక=మూఁడులోకములందు, ఆలోకనీయ = చూడఁదగియున్న, కుమార బృందంబునందున్ = వయసుకాండ్ర సమూహమునందు, ఎందేనియుం గంటిరేయని = ఎక్కడనైనను జూచితిరాయని, దివిజభుజగరాజ రాజీవగంధులకున్ తెలుపుపాలుపునన్ = దేవతాశ్రేష్ఠులయొక్కయు సర్పశ్రేష్ఠుల యొక్కయు స్త్రీలకుఁ దెలియఁజేయుచున్నారో యన్నట్లుగా, లాస్యప్రవీణ కమలాస్యలు = నాట్యమందు నిపుణలయిన స్త్రీలు, అనఁగా వేశ్యాంగనలు, అభినయముఖంబుగాన్ = అభినయ పూర్వకముగా, కరకిసలయంబులుసాఁచి=చిగురుటాకులవంటి చేతులుచాపి, మెలపుచూపన్=మెలఁ కువను - జాడను - గనఁబఱుపఁగా—భోగమువారు నాట్యముసేయునపుడు హస్తములను అభినయ మున మీఁదికిని గ్రిందికిని జూపుటగలదు. దానినే దేవతాస్త్రీలను పాతాళవాసి సర్పస్త్రీలను అట్ల డుగుటగానుత్ప్రేక్షించినాఁడు, అనఁగా క్రిందిమీఁది లోకములందు వసురాజువంటి చక్కనివాఁడు లేఁడనుట.

వైవాహిక...కొనరింపన్—వైవాహిక = వివాహసంబంధమైన, ముహూర్త = లగ్నము యొక్క, సార = పుష్కరాంశముయొక్క. (పుష్కరాంశములనఁగా.

'ఏకవింశో మనుశ్చైవ జలాక్షిమునయస్తథా
మేషాదిమీన పర్యన్తరాశీనాం పుష్కరాంశకాః.

మేష ౨౧, వృషభ ౧౪, మిథున ౨౪, కటక ౭, సింహ ౨౧, కన్య ౧౪, తులా ౨౪. వృశ్చిక, ౭, ధనుస్సు, ౨౧, మకర ౧౪, కుంభ ౨౪, మీన ౭-ఈరాసులయం దీభాగములు పుష్కరాంశములు.)

ప్రతీక్షాపర= కనిపెట్టుటయందాసక్తులైన, మహర్షులు, పరమహర్షులై = పరమానందయుక్తులై- పర్వానుపర్వ=దట్ట మగునట్లుగా, సుపర్వ= దేవతలచేత, పాతిత=గుప్పఁబడుచున్న, పారిజాత పరాగపాళికా=పారిజాతివృక్షముల పుష్పాదుల పరంపరలచేత, దుర్లక్ష్యంబు=కనఁబడనిది, అగు, అంతరిక్షంబువలనన్=ఆకాశమువలన, సమక్షంబునకున్=తనయెదిటికి, ఆకర్షించిన=రప్పించిననట్టి, దాక్షాయణీ చక్రంబు కైవడిన్ = ('దాక్షాయణ్యోశ్విన్యాదితారా' అ.) నక్షత్రమండలి యోయన్నట్లుగా, అవక్ర = వంకరలేని తిన్ననైన,! చక్రడోలాయంత్రంబులన్=చక్రాకారముగలిగిన తొట్లనమర్చిన యంత్రవిశేషములందు, తిరుగు, మెఱుఁగుఁబోండ్ల తండంబు = స్త్రీసమూహము, శాణ=చికిలిసానమీఁద, భ్రమత్ = తిరుగుచున్న, మదనబాణ = మన్మథబాణములో యనునట్టి, భ్రమంబు ఒనరింపన్=భ్రాంతిని గలిగింపఁగా, ఇట నిలువుగా నున్నచక్రమువలె ఈడోలా యంత్రముండును.ఆయంత్రము తుదపాడుగునను తొట్లుండును. దానియందు స్త్రీలు గూర్చుండఁగా ఆ యంత్రములు ద్రిప్పునపుడు ఆతొట్లలోనివారు క్రిందికిని మీఁదికిని గుండ్రముగా చుట్టుచుందురు. మహర్షులు లగ్నమునకు పుష్కరాంశమును గనిపెట్టుటయందే కన్ను గలిగియుండియు దేవతలు దట్టముగాఁ గురియు పుష్పాదులచే నాకాశము గ్రమ్మఁబడినది గాన ఆరాశినక్షత్రములను కనుఁగొనఁజాలక వానినెల్లం దమ యెదిటికి రప్పించినట్లు ఆచక్ర డోలాయంత్రమందలి స్త్రీలు చూపట్టిరనుట. అట్లు ఆస్త్రీలు చక్రయంత్రముపై చుట్టివచ్చుట మన్మథబాణములు పదను పెట్టునపుడు చికిలిసానమీఁద చుట్టివచ్చున ట్లుండెననియు, నుత్ప్రేక్ష.

ఎడనెడం...అంగీకరింపన్—ఎడనెడన్ = అంతటంతట, పన్నిన = అమర్చిన, అపరంజి కురుంజాలపైన్ = మేలిబంగారు మంచెలమీఁద, రంజిల్లుచున్, మృదంగధింధిమధ్వానంబులకున్ = ధింధిమ్మను మ్రోయు మద్దెలధ్వనులకు, ఆడు = తమంతటఁ దామే నాట్యమాడుచున్న, యంత్రపాంచాలికాసముదయంబు = కీలుబొమ్మల సమూహము, విమలమణి విమాన మండలంబుననుండి = నిర్మలమయిన రత్నములుగూర్చిన విమాన సమూహమునందుండి, గొండ్లి=నాట్యమును, పరిఢవించు = చేయుచున్న, తెలిగంటి తెలివల తెలింగున్= దేవతా స్త్రీల విధమును, అంగీకరింపన్=కయికొనఁగా, ఇక్కడఁ గీలుబొమ్మలను తెలిగన్నులుగలవి గనుక నుపమాభూతలగు దేవతాస్త్రీలను తెలిగంటితెలివలని సాభిప్రాయముగాఁ జెప్పినాఁడు, కురుంజాలనఁగా మిక్కిలి పొడువుగాఁ గట్టంబడి కీలుబొమ్మలు మొదలయినవానిచే నలంకృతములైయుండు మంచెలు, ఇందు మద్దెలగాండ్రు మొదలయినవా రుండి వాద్యములు వాయించుట గలదు. ఇప్పటికిని తురుష్కులు మొదలయిన వారి పెండ్లియందు చిన్నమంచెలు గట్టియందు వాద్యములు వాయించుటగలదు. మంచెలు మిక్కిలి పొడువులగుటచేతను, అపరంజి మయములగుటచేతను, విమానములతోడిసాటి. మద్దెలచప్పుళ్లకు కీలుబొమ్మలుగాన తమంతటనే యాడుట. తెలిగన్నులంబట్టియు చక్కందనపు పెంపుంబట్టియు దేవతా స్త్రీ సామ్యము.

వర్ణనీయ... సంపాదింపక్ — వర్ణనీయ = కొనియాడఁదగిన, వారవరవర్ణినీవార = వేశ్యాస్త్రీ సమూహముయొక్క, వారణదుర్లభ = ఏనుఁగులకును లభింపని, యానవైభవంబు = నడకయొక్క విభవము, వాసవ ఆవాస = ఇంద్రునకు ఆవాసమయిన, - స్వర్గసంబంధములయిన, వామలోచనా = స్త్రీలయొక్క, వర్గంబులకుక్ = సమూహములకు, వసుధా = భూమియందలి, పదన్యాస = అడుగు పెట్టుటయొక్క, వైధుర్యంబు = శూన్యత్వమును - లేమిని, సంపాదింపక్ - అనఁగా ఆవార కాంతలయొక్క నడక సొబగు తమకులేనందున సిగ్గుపడి దేవతాస్త్రీలు భూమియందు నడచుట మానినారని తాత్పర్యము. దేవతలు భూమిని స్పృశింపకుండుట ప్రకటము.

ఇది మొదలుగా దిక్పాలురయిన అగ్నియముఁడు మొదలయినవారిని గ్రిందుపఱచుటగా నర్థము పొందుపఱిచి క్రంతపెంపు సొంపును వర్ణించుచున్నాఁడు. పల్యంకికాది వాహనంబులు = పాలకీ మొదలయిన సవారులు, తగ్గి, పాదచారంబులక్ = కాలినడకలచే, నడుచు పట్టాభిషిక్తుల = రాజుల యొక్క, పద్మరాగకిరీటు పాటలప్రభాపటలంబులు = పద్మరాగమణి మయములయిన కిరీటములయొక్క కొంచెము తెలుపుగలసిన యెఱ్ఱనికాంతులయొక్క - అనఁగా అగ్నివర్ణముగల కాంతులయొక్క - సమూహములు, పవనసఖ = అగ్నియొక్క, శిఖా = జ్వాలికలయొక్క, ముఖంబులకుక్ = మొగములకు, మలిన సరణిక్ సవరింపక్ = వైవర్ణ్యము కలుగఁజేయుచుండగా అనఁగా ముఖము నల్లఁబుచ్చుకొనుటను గలుగఁజేయఁగాను. ఇట పద్మరాగ కిరీటపాటల ప్రభ లపరిమితములు గనుకఁ బరిమితములయిన (అనఁగా తొమ్మిదియైన) పవనసఖ శిఖలయొక్క ముఖములకు వైవర్ణ్యము సంపాదించినవని యర్థము. తిరస్కా రావమానాదులు పడ్డవానికి ముఖమునల్లఁబడుట ప్రకటము.

లలన, పాదమప్పలికినంచేఁ బలుకుటయును ♦ బుష్కరద్వీపపతియాస్య పుష్కరమునఁ
బవనవాస్తిజమున పరితాపవహ్ని ♦ చిహ్నమగు కార్ష్ణ్యమూమ మోక్షింపఁబడియె -

శృంగా. ౫-౩౯.

దాసిచేసిన యప్పరిహాసమునకు ♦ హాసపరిపాండురంబైన యక్కొలువున
నాన్నపాలు ముఖమ్లాని గానఁబడియె ♦ నలుపు గానఁగఁబడుఁగదా తెలుపులోన.

శృంగా. ౫-౧౩౭

ముఖములనఁగా నగ్రములనియు మలినసరణియనఁగా మొనలయందు వెడలు నల్లని పొగచాల నియు భావము. అగ్నియనఁగా నిట దిక్పాలుఁడయిన యగ్నిగానూహ్యము.

సమస్త... సంభ్రమంబులు — సమస్తజన = సకల జనులకు, సముచిత = తగినట్లుగా, మార్గమర్యాదా = త్రోవనడచురీతికి, అనుశాసన = శిక్షకులయిన, సముద్దండ = పరభీకరులైన, దండధర = దండధరులయొక్క, సంభ్రమంబులు = తొందరలు, సమవర్తికిక్ ('ధర్మరాజః పితృపతి స్సమవర్తీపరే తరాట్' అ) = యమునికి, సమధికశ్యామిక = మిక్కిలియైనదేహపు నల్లఁదనమును, సమకూర్పక్ = కలుగఁజేయఁగా - అనఁగా సమస్తజనసముచిత మార్గమర్యాదానుశాసనులై వర్తించిన వారు గనుక సమ వర్తులైన దండధరు లనేకులయినందున నొక సమవర్తియైన దండధరునకు శరీరవైవర్ణ్యము సంపాదిం చినారనియర్థము. దండధరులనఁగా వెత్తములవారు. వారు జనులనెల్ల పాయుదొలంగుఁడనిరాజు వచ్చు మార్గము మేరను ఏర్పఱచువారనియు, యముఁడు శ్యామిక యనఁగా దేహము నల్లనిదిగలవాఁడనియు భావము. ఇటయముఁడు చెప్పఁబడెను.

ప్రబల... బొనుపక్ — ప్రబల = బలిష్ఠములయిన, తమః = చీఁకటియందు, స్ఫార = అతిశయిం చుచున్న, దురహంకార = దుర్గర్వము గలవారని యర్థము - అనఁగా రాత్రించరులనుట, ప్రబలతమో

గుణమును స్ఫారమయిన దురహంకారము గలవారని భావము. అటువంటి వీరభటుల, కృపాణికా= ఖడ్గములయొక్క, చాకచక్యంబులు = చకచ్చకకాంతులు, రాత్రించర = నైరృతియొక్క, కరాళ= భయంకరమయిన, కరవాల = ఖడ్గముయొక్క, కాళిమంబులు = మాలిన్యములును, మూలకుఁజొను పన్ = అప్రయోజకము చేయఁగానని యర్థము. నిరృతి మూలను వసించుచున్నాఁడని భావము. ఇట నిరృతి చెప్పఁబడెను. నిరృతియు రాక్షసుఁడు గనుక నలుపుఛాయ చెప్పఁబడినది.

బహుల ... సన్నాహంబులు—బహుల = అనేకములయిన, సితదంతి = తెల్ల యేనుఁగుల యొక్క.యు, ధారాట = అశ్వముల యొక్కయు, అనఁగా ఐరావతోచ్చైశ్శ్రవముల యొక్క, కోటీ = సమూహములయొక్క, సమాటీక = సంచారములు గలిగిన, నిర్వేల = చెలియలికట్టను గడచిన, సర్వతోముఖ = జలములు గలిగిన, వాహినీశ్వర = నదీనాథుల చేత- అనగా సముద్రముల చేత, సంసేవ్యమాన=సేవింపఁబడుచున్న రసాధినాథ=జలాధిపతులయినవరుణులయొక్క, (ఇక్కడ రసశబ్దము జలపరము), సన్నాహంబులు= ఆడంబరములని యర్థము. బహు=అనేకములయిన, లసిత= ఒప్పుచున్న, దంతి=ఏనుఁగులయొక్కయు, ధారాట=గుఱ్ఱములయొక్కయు, కోటీ = సమూహముల యొక్క,సమాటీక=సంచారము గలిగినవియు, నిర్వేల=అతిమాత్రము లయినవియు, సర్వతోముఖ = నానా ముఖములయినవియునగు, వాహినీ = సేనలకు, ఈశ్వర=నాయకులయిన వారిచేత, సంసేవ్య మాన=సేవితులయిన, రసాధినాథ=భూపతులయొక్క (ఇట రసాశబ్దము భూపరము,)సన్నాహంబు లు=ఆడంబరములని భావము. వారిధిస్వామికిన్=వరుణునికి, వదలని జడస్థితియొసంగన్=విడువనిజా డ్యమును సంపాదింపఁగానని యర్థము, అనఁగా అనేకములయిన ఐరావతోచ్చైశ్శ్రవములయొక్క సం చారము గలిగి వేలాతిక్రాంతజలము గలిగినయనేక సముద్రములచేత సేవింపఁబడుచున్న వరుణు లనే కులు గనుక నొక్కయైరావతము యొక్కయు ఉచ్చైశ్శ్రవముయొక్కయు సంచారము గలిగి వేలను గడవలేని జలములు గలిగిన యొక్కసముద్రునిచేత సేవింపఁబడుచున్నయొక్క వరుణునికి జాడ్యమును సంపాదించినారనుట.జడస్థితి యనఁగా జలస్థితి. వరుణునకు జలస్థితి యని భావము. ఇట వరుణుఁడు చెప్పఁబడెను

పరిమళిత... పెనుపన్—పరిమళిత=సంజాతపరిమళములయిన, ఘనసారగంధసార=కర్పూరపు చందనములతోడ, పరిమిళిత=కూడుకొన్న, కస్తూరికా=కస్తూరియొక్క, ఆసారంబులన్=జడులచేత, వసంతంబులు ఆదు సామంతబాంధవ ఆవళి=సమానప్రతిపత్తిగల బంధుజనసమూహము, గంధవహున కున్=వాయువునకు, అపారతారళ్యంబు=అమితమైన చిత్తచాంచల్యమును, పెనుపన్=వృద్ధిపొందింపఁ గాను-అనఁగా సురభిద్రవ్యములచేత వసంతములాడి గంధవహులయిన బంధువులుగంధవహునకుఁజిత్త చాంచల్యము పుట్టించిరని యర్థము-వాయువుచంచలమని భావము. ఇందు వాయువు చెప్పఁబడెను.

గంభీర ... సంఘటింపన్—గంభీర=మంద్రధ్వని గలుగునట్లుగా, బిరుదగాథాపఠన=వసురాజు బిరుదావలులు చదువుటయందు, పరాయణ=ఆసక్తులైన, పాఠక=వందిమాగధులయొక్క, పరంపరల కున్=సమూహములకు, ఎడనెడన్=అప్పుడప్పుడు, హితపురోహిత అమాత్యజనంబు = ఇష్టులయిన మంత్రి పురోహితజనము, ఒసంగు=తామిచ్చునట్టి. అసంఖ్యాతధన సంఘాతంబులన్ = లెక్కలేని ధన సమూహములచేత, ధనదునకున్=కుబేరునకు, అమందమందాక్షభావంబు=అధికమయిన లజ్జాభావ మును, సంఘటింపన్=కలిగింపఁగా,అనఁగా అసంఖ్యాతధనసంఘాతప్రదాతలయిన హితపురోహితా

మార్త్యజనులు నవసంఖ్యాకనిధి ధన ప్రదాతయైన కుబేరుని సిగ్గుపడఁజేసినారని యర్థము. మందాక్షభావ మనఁగా కుబేరుఁడు పింగళాక్షుఁడుగనుక తద్భావమనఁగా కాయకంటివాఁడని భావము. ఇందుకుబేరుఁడు చెప్పఁబడెను.

ప్రచండ...నిండింపన్ — ప్రచండతర=మిక్కిలి వేండ్రమయిన, నటన=వీరతాండవము గలవారిలో, ప్రకాండ=శ్రేష్ఠులయినవారియొక్క తాండవపాండిత్యములు=నటనసామర్థ్యములు, ప్రాచీననటుని నెమ్మేనన్=హరునియొక్క దేహమందు, పాండిమంబునిండింపన్ = తెల్లఁదనమునుపూర్ణీభవింపఁ జేయఁగానని యర్థము. ఈశానునకు తెల్లఁదనమని భావము. ఈశ్వరుఁడు ధవళవర్ణుఁడనుట ప్రకటము. ఇట యీశానుఁడు చెప్పఁబడెను, సర్వత్రఅనేకత్వము వ్యతిరేకమని తెలియునది.

ఇట్లు, ఆశాపతులకున్ = దిక్పతులకు, ఆశాసనీయంబును = కోరఁదగినదియును, అహివల్లభులకున్ = సర్వశ్రేష్ఠులకు, దుర్లభంబును = పొంద శక్యముగానిదియును, సిద్ధులకున్ అననుభూతసిద్ధంబును=సిద్ధుల కనుభవసిద్ధముగానిదియును, సాధ్యులకున్ అసాధ్యంబును, చారణులకు, అవిచారణీయంబును, = విచారింపఁదరముగానిదియు, యక్షులకున్, అనక్షిలక్షితంబును = దుర్లక్ష్యమయినదియు, ఐన, అనన్యసామాన్య విభవంబునన్, కోలాహలపురంబును, చేరంజను సమయంబునన్ = సమీపించి పోవుసమయమందు.

ఇట ఆశాపతులకు నతిశయించిన పెంపుసొంపులు చెప్పఁబడుటచే వారికిఁగూడ ఆశాసనీయమనఁబడినది.

శా. క్రీడామంథరదృష్టిపాతముల నుర్వీపాలవంశాగ్రణీ
చూడారంజితపాదపీఠు నతనిం జూడన్ మణీనిర్మిత
క్రీడాసౌధతలంబు లెక్కిరి నవశ్రీమన్మహాశైలస
మ్రాడావాస పురాంగనల్ కుతుకసామగ్రీసముద్గ్రీవికన్.

అ. నవ...గనల్ — నవ = క్రొత్తదయిన, శ్రీమత్ = శ్రీమంతుఁడగు, మహాశైలసమ్రాట్ = కోలాహలమహాపర్వతరాజునకు, ఆవాస=నివాసమయిన, పుర=పట్టణమందలి, అంగనల్ = స్త్రీలు, క్రీడామంథర దృష్టిపాతములన్ - క్రీడా=సిగ్గుచేత, మంథర=మందప్రచారములుగల, - (మందగామీతుమంథరః అ.) దృష్టిపాతములన్ = చూపులచేత, ఉర్వీశ...పీఠున్ - ఉర్వీపాల వంశాగ్రణీ= రాజవంశ శ్రేష్ఠులయొక్క, చూడా = శిఖలచేత, రంజిత=ప్రకాశింపఁజేయఁబడిన, పాదపీఠున్ = పాదములక్రింది పీఠముగలవాఁడగు, అతనిన్ = ఆవసురాజును, చూడన్, కుతుక సామగ్రీసముద్గ్రీవికన్ - కుతుక=సంతోషముయొక్క, సామగ్రీ=నిండుఁదనమువలన - నిండయిన సంతోషమువలన ననుట, సముద్గ్రీవికన్ = మెడ యెత్తుటతోడ - ('గ్రీవోన్నయనముద్గ్రీవోద్గ్రీవికాచాపికథ్యతే') మణీనిర్మిత క్రీడాసౌధతలంబులు, ఎక్కిరి.

రాజు. కేవలుఁడుగాఁడు, ఉర్వీపాల...పీఠుఁడు. కావుననే యతనిని చూడవలయునని కుతుకము. అది సామగ్రికలదిగావుననే 'సముద్గ్రీవిక' ఎంత కుతుకములో మెడయెత్తినను దృష్టిపాతములు క్రీడామంథరములే. కుతుకము ప్రేరించుచున్న వ్రీడ మందగింపఁజేయుచున్నది. నిర్లజ్జదృష్టి స్త్రీస్వభావమున కనుగుణమునుగాదు అందమునుగాదు.

సీ. రాగంబు మూర్తమై రహిఁద్రోవఁజూపు పెంపునఁబదచ్ఛాయముందున్ననిగుడ
వీతాప్రహితదూతికైవెస నేఁగు మని మ్రొక్కు, గతి నలఘుఁగర్ణాబ్జకలిక వ్రాల

నీవిఁ జుట్టినభోగికి నిట్టూర్పుగమి నుబ్బ, సడలెనా నొడ్డాణ మెడలి తూలఁ
గందుసెన్నడుముపైఁ గరుణించి చనుదోయి చిందు పన్నీరునాఁ జెమరు దొరుఁగ,
తే. గటికరటికంఠపీఠిపైఁ గంతుఁ డనెడి, బిరుదుమావంతుఁ డేసినవీలుఁ జల్లి
పెంపుగను వెన్నెలుఁగుంపుఁ బ్రిదిలి జాఱ, వచ్చె నొక సతి వసుమతీశ్వరునిఁ జూడ.

అ. ఒకసతి = ఒక పడఁతి, రాగంబు=అనురాగము - (ఎఱుపు అనియును జమత్కారము గ్రహింపవలయును) మూర్తమై=ఆకృతి వహించినదై, రహిన్ = చక్కఁగా, త్రోవన్ చూపు పెంపునన్ = దారిచూపుచున్నదో యన్నట్లు, పదచ్ఛాయ=అడుగుల యెఱ్ఱనికాంతి, మున్మున్ నిగుడన్=ముందుముందు సాఁగఁగాను - ఇట ముందుగా నిగిడిన యడుగుల రాగమును (ఎఱుపును) ముందుగా దారిచూపు రాగముగా (అనురాగముగా) అధ్యవసించుట తెలియునది. అనురాగముచేత ప్రేరితయై కదా వచ్చుట. కావుననే యనురాగము దారిచూపునట్లు చెప్పినాఁడు. అనురాగము పురికొలుపఁగా అడుగుల యెఱుపుముందు నిగుడఁగాఁ బోయినదని తాత్పర్యము.

వీక్షాప్రహితదూతి - వీక్షా = చూపనెడు నాయికచేత, ప్రహిత = పంపఁబడిన, దూతి, వెసన్ ఏఁగుము అని, మ్రొక్కుగతిన్ = మ్రొక్కుచున్నదో యన్నట్లుగా, అంఘ్రిన్ = పాదములందు, కర్ణాబ్జకళిక = చెవి పువ్వయిన తామరమొగ్గ, వ్రాలన్ = పడఁగా-వీక్ష రాజుపై నిగుడ నువ్విళు లూరుచుండుటచేత రాజును బొందఁగోరు నాయికవలె స్త్రీలింగ సారస్యముచేత వ్యంజితమగుచున్నది. ఆ నాయికకు చెవి తామరమొగ్గ దూతిక. నాయికకు మిక్కిలి దాపున నున్న యాప్తురాలే దూతిక; మఱి నాయికకుఁ గొంతతక్కువయగు ప్రతినిధిగాను వ్యవహరించునది. దీనింబట్టి వీక్షకు దూతయగు నబ్జకళిక సన్నిహిత వర్తినిగాఁ జెప్పుటచే వీక్షకుఁ గర్ణాంతములవఱకు వాఁగియుండుటయు, వీక్షకు నబ్జకళిక కొంత తక్కువయగు ప్రతినిధియనుటచే అబ్జములకంటె నెక్కుడు సౌందర్యసంపదయు స్ఫురించుచున్నది. ఇట వేగముగా పోవుటచే చెవినుండి జాఱి పువ్వు అడుగులంబడుటను అడుగులంబడి మ్రొక్కుటగా నుత్ప్రేక్షించినాఁడు. చెవిపువ్వుపడుటే వేగమును దెలుపుచున్నది. వెస నేఁగుమని మ్రొక్కుచున్నట్లున్నదన్నాఁడు.

నీవిన్ — (నీవియనఁగా 'నీవీపరిపణే గ్రన్థౌ స్త్రీణాం జఘనవాససః' విశ్వ. పోకముడియు మూలధనమును పరిపణమనఁగా 'నీవీ పరిపణమ్ మూలధనమ్' అ.' అన్నట్లు మూలధనము) నీవి యనెడు నీవిని అనఁగా పోకముడియనెడు మూలధనమును, చుట్టినభోగి = పరివేష్టించియున్న సర్పము, నిట్టూర్పుగమిన్ = నిట్టూర్పుగాడ్పుల సమూహముచే, ఉబ్బి = ఉబ్బరించి, సడలెనాన్ = వదలినదో యన్నట్లు, ఒడ్డాణము = కమ్మరుపట్టా, ఎడలితూలన్ = వదలి తూలిపడుచుండగా—మఱుఁగునఁ బాఁతిన మూలధనమునకు పాములు చుట్టుకొని యుండునని ప్రతీతికలదు. ఇట నిట్టూర్పుగమి వేగాతిశయము తెలుపుచున్నది. దానిచే నడుమువడఁకుటయు ఒడ్డాణము సడలుటయు. పాములు నిండుగా గాలి యొరగొని యుబ్బరించెనేని మెలికగొనలేక తూలిపడుట ప్రకటము.

కందుసెన్నడుముపైన్ =బడలిక నొందుచున్న నడుముమీఁద, కరుణించి, చనుదోయి, చిందు= చిలకరించు, పన్నీరునాన్, చెమరు= చెమ్మటనీరు, తొరుఁగన్ =జాఱఁగాను, సెన్నడుము కందుట సన్నని దగుటచే వేగపాటువలని చన్నుల ప్రేఁకకు. కావుననే చన్నులు దానిపయి కరుణించుట. బడలికవాయుటకు పన్నీరు చిలుకుట ప్రకటము. ఇట చన్నులందుల చెమరు గమనవేగమువలని బడలికచేతను సాత్త్వికోదయమునను. కటికరటికంఠపీఠిపైన్-కటి=నితంబోపరిభాగమనెడు, కరటికంఠపీఠిపైన్ =ఏనుఁగు

మూఁపుమీఁద, కంతుఁడు=మన్మథుఁడు, అనెడి,బిరుదు మావంతుఁడు=దిట్టఁడయిన మావటీఁడు,ఏసిన, నీలిజల్లిపెంపు = నల్లసవరపు చౌరియొక్క ఘనతను,కను = పొందుచున్న, పెన్నెఱులగుంపు.ప్రిదిలి= సడలి, జాఱన్ = వ్రేలఁగాను, 'కటి'-మావంతునకు కరటిదేహమున కంఠపీఠి యెట్లో యట్లె మన్మథునకు స్త్రీదేహమున కటి యారోహణస్థానము - అనఁగా నది యత్యంతమదనోద్దీపకమనుట. నెఱులు నిడుదలగుట చే నితంబమండలిపైన త్తమిల్లినవి. గమనవేగముచే నెఱులు 'ముడివీడి' కటిపైఁ వ్రేలుట దెలియునది. వసుమతీవరునిన్=వసురాజు, చూడన్, వచ్చెను.

ఇం దావేగమనెడు సంచారిభావము. ఇందులకు 'ఇష్టానిష్టాగమాజ్జాతఆవేగశ్చిత్తవిభ్రమః' అని లక్షణము.

చెవిపువ్వు వ్రాలుట, ఒడ్డాణము తూలుట, చన్నులు చెమరించుట, నెఱికుఱులు జాఱుట యనునివి త్వరాగమనమునకును సాత్త్వికప్రాదుర్భావమునకును జిహ్నములు.

ఉ. డించఁగఁ బ్రొద్దు లేకెద ఘటించినరత్నవిపంచితో సు
వర్ణాంచితమూర్తి యోర్తు ముఖరాంఘ్రిసమాశ్రితసత్కలాప యై
యంచల వచ్చుపోయగవు టంచలఁదోలుచు మిన్కుచేడె యౌ
నంచు నుతింపవచ్చె వెస నాచతురాస్యునిమోముఁ గన్గొనన్.

అ. డించఁగన్ = దించి దిగువనుంచుటకు, ప్రొద్దు = వ్యవధానము, లేక, ఎదన్ ఘటించిన= ఱొమ్మునఁ బూనిన, రత్నవిపంచితోన్ = రత్నమయమైన వీణతోడను, సువర్ణఅంచితమూర్తి-ఓర్తు= (సువర్ణమనఁగా బంగారును చంపకమును) బంగారపు (లేక చంపకపు) కాంతివంటి కాంతిచేత,ఒప్పుచున్న శరీరముగల ఒకతి యని స్త్రీపరమైనయర్థము — శోభనవర్ణ స్వరూపురాలు అని సరస్వతీపరమైనయర్థము.ముఖర...లాపయై—(స్త్రీ)ముఖర=మ్రోయుచున్న,అంఘ్రి=అడుగులను,సమాశ్రిత= ఆశ్రయించిన, సత్కలాపయై = మేలిభూషణములు—అనఁగాఅందెలు-గలదై-(సరస్వతి)ముఖర = వాచాలురయిన, అంఘ్రిసమాశ్రిత=పాదాశ్రితులయిన, సత్ = సత్పురుషులయొక్క, కలాపయై = సమూహముగలదై, ('కలాపోభూషణేబర్హేతూణీరే సంహతావపి' విశ్వ.) అంచలవచ్చుపోయగపు అంచలన్ తోలుచున్ = (స్త్రీ) అండగొనివచ్చునట్టి యొయ్యారపురాయంచలఁ దొలఁగఁదోలుచు — (సరస్వతి) వాహనమయిన హంసమునకు సమీపముగా వచ్చు తక్కిన హంసములను తోలుచు-మిన్కుచేడె = సరస్వతీదేవియే, ఔనంచున్ = అగునని, నుతింపన్ = కొనియాడఁగా, వెసన్, ఆచతురాస్యునిమోమున్ కన్గొనన్ = స్త్రీ)నేర్పుమాటలుగల యా వసురాజు మొగమును చూచుట కనియర్థము.-(సరస్వతి) నాలుగు మొగములుగల ఆబ్రహ్మ మొగమందునునికి కొఱకని యర్థాంతరము, వచ్చెను.

;'డించఁగ... విపంచితోన్'-వీణనుడించుటకు క్షణముచాలును. అది చాలకుండుట అంతమాత్రము జాగును సైతము తాళకుండుటచేత. దీనిచే దర్శనకాతు కాతిశయము ధ్వనితము. సరస్వతికెప్పుడును ఎదను విపంచి ఘటితమైయుండుట ప్రకటము. చతురాస్యుఁడనుట స్త్రీకిని సరస్వతికిని బొసఁగుటకు. మాటకారినే కదా మగువలు మెత్తురు.

మ. పొలఁతి యొకర్తు చెంగలువపొట్లము చేతనె పూని వచ్చుచున్
వలపులదండ జాఱ గుణవద్ధమాత్రమె తాల్చె నిమ్మహీ
తలపతి కేన కూర్తు ననిత ప్తపరశ్వధ మెత్తి నైచి మం
జులదళ తంతులేశపరిశుద్ధి జనాళికిఁ దెల్పుకై వడిన్.

పాలఁతి యొకర్తు = మఱియొక పడఁతి, చెంగలువ పొట్లము=ఎఱ్ఱగలువపూదండ పొదిఁగినయాకు పొట్లము, చేతనె పూని, వచ్చుచుఁ, నలపులదండ=వాసనతోఁగూడిన యాపూవుదండ, జాఱఁ = జాఱిపడిపోవఁగా, గుణవత్ దళమాత్రమె = ఆపొట్లపు దారముతోఁ గూడిన యాపొట్లపు చిగురుటాకులను మాత్రమే, తాల్చెఁ = చేతఁ బట్టుకొన్నదాయెను. ఏలాగుననినఁ, ఇమ్మహీతలపతికిఁ = ఈవసురాజునకు, ఏన = నేనే, కూర్తును = ప్రియురాలగుదును, అని, తప్తపరశ్వధము = ఎఱ్ఱగాఁగాలిన గండ్రగొడ్డలి, ఎత్తివైచి = దూసివైచి, మంజుల = కమిలిపోక కోమలములయియున్న, దళ = చిగురుటాకులతోఁగూడిన, తంతులేశ = సన్నపు నూలుపోగులు గలుగునట్లుగా, పరిశుద్ధిఁ = తనయొక్క శపథపరిశుద్ధతను, జనాళికిఁ = చూచుజనములకు, తెల్పుకైవడిఁ, గుణవద్దళ మాత్రమె తాల్చెనని సంబంధము.

లోకములో నెవ్వరేని ప్రమాణము సేయువారు సన్నపు నూలుదారములతోఁ గూడిన లేఁత చిగురుటాకులను దోసిటంబెట్టికొని యెఱ్ఱగాఁగాలినయినుపముద్ద నాదోసిటనే పట్టియెత్తివైచి దానిచే నెంతమాత్రమును గందకుండెడు చిగురుటాకులును దగకుండు దారములును చూచువారి కందఱకును గనఁబఱిచి దృఢాధ్యవసాయమును బ్రకటము చేయుట ప్రసిద్ధము. ఆప్రతీతియిట అనుసంధింపఁబడినది. నీడిన చెంగలువదండ ఎఱ్ఱగాఁ గాలినయినుప గండ్రగొడ్డలి. పొట్లముగట్టిన చిగురుటాకులును దాని పయిఁ జుట్టిన దారములును ఆ లేఁత చిగురుటాకులును దారములునుగా గ్రహించునది.

ఉ. బిత్తఱి యోర్తు ముత్తియపుఁబేరు వలగ్నమునన్ ఘటించి కే
ల్గుత్తపుఁజన్నుదోయి నొనఁగూర్చి రయంబునఁ జూడవచ్చె రా
జోత్తము నాత్మహార విభవోజ్జ్వలు మధ్యవిదారణక్రియా
యత్తము లైనచన్నులఁబ్రియంబున వేఁడుచు వచ్చెనోయనన్.

అ. ఓర్తుబిత్తఱి = ఒక శృంగారవతి, ముత్తియపుపేరు = ముత్యాలహారము, వలగ్నమునన్ ఘటించి = నడుమున దోపుకొని, కేలు = చేయి, గుత్తపుచనుదోయిన్ = (గమనవేగముచేతఁ గంపించుచున్న వగనుక) బిగువైన చన్నుఁగవపైని, ఒనఁగూర్చి= చేర్చుకొని, రాజోత్తమున్, రయంబునన్, చూడవచ్చెను. ఎలాగుననసిన, ఆత్మహార విభవ = తనదయిన ముత్యాలహారము యొక్క వైభవముచేత, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, మధ్య=నడుముయొక్క, విదారణక్రియా ఆయత్తములు=భంజించుపనికి లోనయినవి-అనఁగా నడుమును భంగపెట్టుటకు నుద్యుక్తములగుచున్నవి,అగుచన్నులను, ప్రియంబునన్ = మంచితనముచేత, వేఁడుచువచ్చెనోయనన్-వచ్చెనని సంబంధము.

చెలి ఒకతె హారము మెడను వైచుకొనఁ జేత నెత్తుకొన్నది. ఇంతలో రాజు రాక చెవినిబడఁగానే యాహారము సవరించుకొనునంతసేపునకును దాళక దానిని నడుమున దోపుకొని గమనవేగమున నల్లలాడుచున్న బిగువుచన్నులను జేత నదుముకొని పరుగునఁ బోయెనని తాత్పర్యము.

ముత్తెపుసరి మెడను నలవరించుకొనునంతవిలంబమున నోర్వమిచే, నడుమున దోపుకొన్నది. రయంబునఁ జూడవచ్చుటచే చన్నులు గుత్తములయినవిగాన యల్లలాడుటంబట్టి కేలుదానిపయి నొనగూర్చినది. హారము కుచములది. అదినడుమునకు తోడుగఁగా కుచములు, దానిపయిఁగోపమున భంగపఱుపఁజూచినవి.వలదని దాని వేఁడుటకుఁగాను కేలు దానిపయిఘటించుట. చన్నులు గుత్తములుగాన దమ ప్రేఁగునను గమనత్వరచే నయిన తమకంపమునను సన్నని పేదనడుమును విదారింపఁజూచుట. తనవిభవమునుగొని పేదవాఁడొక్కఁడు విఱ్ఱవీఁగుచున్న బలుపుగలయిద్దఱు చూడఁగలరా? చేతిపొం

జతో నల్లసంటుచు సమాధానపెట్టుట ప్రకటము. ఇందువిభ్రమము. 'విభ్రమస్త్వరయాకాలే భూషాస్థానవిపర్యయః' అని లక్షణము. సన్ననినెన్నడుమును బిగువులయిన చనుల్నుగలిగి ముత్తెపుసొమ్ములు దాల్చునది గావుననే బిత్తరి.

మ. రమణీయోజ్జ్వలవజ్రకుట్టిమముపైఁ దత్నాంకభూషానుబం
ధముతోడం బరువెత్తె మే లని పదద్వంద్వంబుపై నాహిత
ప్రమదం బై హృదయంబు వేగ విగళత్ప్రాలంబముక్తాభిషే
కము గావింపఁగ వచ్చె నోర్తు వసులోకస్వామి వీక్షింపఁగన్.

అ. ఓర్తు=ఒక్కతి, రమణీయ ఉజ్జ్వ వజ్రకుట్టిముపైన్ = మనోహరముగా ప్రకాశించుచున్న వజ్రమణుల నెలకట్టుమీఁద, రత్న అంకభూష అనుబంధముతోడన్ = వజ్రచిహ్నితములయిన-వజ్రములు దాఁపిన - సొమ్ము అనఁగా అందెల-కూడికతోడ, పరువెత్తెన్=జాఱిపడక పరుగెత్తెను. మేలు=సెబాసు అని- పదద్వంద్వంబుపయిన్=అడుగుల జంటమీఁద, ఆహితప్రమదంబై = కూర్పఁబడిన సంతోషముగలదై, హృదయంబు = డెందము, వేగ = గమనంపువడిచేత, విగలత్=తెగిజాఱిపడుచున్న, ప్రాలంబ = హారసంబంధమయిన, 'ప్రాలంబమృజులంబి స్యాత్కంఠాత్' అని ఆ' ముక్తాఅభిషేకము = ముత్తియములచేత అభిషేకము, కావింపఁగన్, వసులోకస్వామిన్, ఈక్షింపఁగన్ = చూచుకొఱకు, వచ్చెను.

హృదయము రాజును త్వరగాఁ జూడవలయునని యువ్విళ్లూరుచున్నది. అయినను పాదద్వయముచేతనే కదా నడచిపోవలయును. అది పోవుచోట నిద్దమయిన వజ్రాల నెలకట్టు. దానితోఁ గూడ రత్నాల అందెలొకతోడును. అందును మెల్లగఁబోవుటకాదు - తన తహతహపాటునకుఁ దగినట్లుగా పరుగెత్తుట. ఇన్ని యిడుమలలో నుండుటచే నా పాదద్వయము జాఱిపడుదుమోయని రైన విచారింపక తన కనుకూలముగా పరుగెత్తుచున్నది. కాన సెబాసు అని మెచ్చుకొని దానిపయి హృదయము ముత్యాలతో నభిషేకము చేసినది. ముత్యాలు హృదయముతోఁ జేరినదిగదా (మనస్సుతో చేరినదని యర్థము. రొమ్ముతోఁ జేరినదనిభావము). కావుననే యది వానిని జల్లినది. తనయిష్టముచొప్పున సంకటములకు వెనుదీయక పనిచేసి తర్లినభృత్యుని సంపన్నుఁడగు ప్రభువు రత్నాభిషేకముసేయుట గలదుగదా. హృదయతయొక్క- యాతురతచొప్పున పాదద్వయము పరుగెత్తుట తెలియునది. రాజును జూడవలెనని యొకతె హృదయమున మిక్కిలి యపేక్షకలుగఁగా మగరాలనిద్దపు నెలకట్టున జాఱిపడుదుమని విచారింపక అందెలతోడుసును బాటింపక వేగముచే ముత్తెపుసరి ముత్తెములు తెగి యడుగులపయిఁ బడుచుండఁగా పరుగునఁబోయెనని తాత్పర్యము.

సీ. తనుఘనంబుగ నమ్మి దరియు నెమ్మికిఁ గొప్పు, మాల్యభోగి నొసంగి మఱలఁబంచెఁ
దనుఁగొండయనివచ్చు నునుజంకెఁ గుచముగా, రుడశిలాసరదూర్వ లిడి మరల్చెఁ
దనుఁగల్పలతికఁ గాఁదలఁచి వ్రాలెడుశారిఁ, గరము రత్నఫలాళి నెరపి నిలిపెఁ
దనుఁబద్మమనియంటఁ బెనఁగునంచకు నంఘ్రి, హీరాంగదమృణాళి మిచ్చియునిచె

తే. నాత్మపోషితవర్గంబు లవనిపావ, లోకగమనాంతరాయంబు గాకయుండ
నవయువంబులెతోడ య్యోనతివకనుచు, నెచ్చెలులు మెచ్చవచ్చె మానిని యొకర్తు.

అ. మానినిఒకర్తు=ఒక స్త్రీ), తనున్, ఘనంబుగన్ నమ్మి= మేఘమనినమ్మి యనియర్థము— గొప్పదియని నమ్మి అని యర్థాంతరము, దరియు=సమీపించివచ్చుచున్న, నెమ్మికిన్=నెమలికి, కొప్పు,

మాల్యభోగిన్=పూదండయనెడు సర్పమును, ఒసంగి, మరలన్ పంచెను=వెనుకకుఁ దిరుగఁబంపెను— ఇట మేఘమువలన నీరుపాములు పడుచున్నవిగాన భోగినిచ్చుటఁగాఁ జెప్పినాఁడు. నెమిళ్లకు పాము లాహారము. గొప్పగానమ్మి యుండఁజేరినందులకు గోరినతృప్తిచేయవలయునుగదా.

తనన్, కొండయని = పర్వతమని భ్రాంతిపడియని యర్థము—మహోన్నతవస్తువని యర్థాంతరము. వచ్చు,నును జింకన్=చిన్నలేడిని, కుచము = గుబ్బచన్ను, గారుడశిలాసర = గరుడపచ్చల బన్నసరమనెడు, దూర్వలు = లేగఱికపోఁచలు, ఇడి, (దూర్వాతుశతపర్వికా సహస్రవీర్యాభార్గ వ్యారుహానన్తా' అ)మరల్చెను. జింకకు గఱికపోఁచలిష్టము. కొండవలె నిను నమ్మితినని లోకములో చెప్పుటవాడుక - చనుగుబ్బలు కొండలవంటివనియు, గరుడపచ్చల బన్నసర మియ్యఁగా గఱికపోఁచలని తలఁచి పెంపుడుజింక మరలినదనియు భావము.

తనన్, కల్పలతికగాన్ = కల్పవృక్షపుఁ దీఁగయని, తలఁచి, యనియర్థము—కోరికలిచ్చెడు దానినిగాఁ దలఁచి యని యర్థాంతరము. వ్రాలెడు, శారిన్ = మాటాడెడు గోరువంకపక్షిని, కరము= చేయి, రత్నఫలాళిన్=రత్నములనెడు ఫలసమూహమును, నెరపి=వెదచల్లి, నిలిపెన్=నివారించెను. ['సామాన్యగ్రహణే...రక్తత్వమేవరత్నానామ్' కావ్యకల్పలత. అన్నట్లు రత్నములుసామాన్యముగా ఎఱుపనిగ్రహింపఁబడును. ఫలములును (పండ్లును) 'ప్రార్థ్య కల్పపాదప ప్రాజ్యఫలము........దీని మోవి'(శృం౫.)బహుదివ్యఫలపరిపాక సౌభాగ్యంబునెఱపు కమ్మోవిమానికముతోడ—(వసుచరి౧అ) అనిరెఱుపు]తనన్,పద్మముఅని తామరయని యర్థము.పద్మమనెడు నిధిగానని యర్థాంతరము.అంటన్ పెనఁగు = కదిసిమల్లాడుచున్న, ఆంచకున్, అంఘ్రి=పాదము, హీర=వజ్రమయమైన, అంగద=అందె యనెడు, మృణాళము = తామరతూఁడును, ఇచ్చి, అనిచెను. మృణాళము తెలుపుగనుక, హీర మయమయిన యందెను జెప్పినాఁడు.

ఆత్మపోషితవర్గంబులు = తనచేతఁ బోషింపఁబడుచున్న ఆ నెమ్మిమొదలయినవి, అవనిప అవలోకగమన అంతరాయంబు=వసురాజుయొక్క దర్శనమునకయిన పోకకు—వసురాజును జూచుటకై పోవుటకు, కాకయుండన్ = కాకుండునట్లుగా, అతివకున్ = ఈ స్త్రీకి, అవయవంబులె = కొప్పు చన్నులుచేయి అడుగులనెడి యీ యవయవములె, తోడయ్యెను = సహాయమయ్యెను, అనుచున్, నెచ్చెలులు = చెలికత్తెలు, మెచ్చన్ = మెచ్చుకొనఁగా, మానిని ఒకర్తు = ఒకస్త్రీ, ఎచ్చెను.

ఇట, ఘనము, కొండ, కల్పలతిక, పద్మము అనెడి యీపదములు. కొప్పు, కుచము, కరము, అంఘ్రి అను వీని కుపమానములగుటయేకాక బహుాకారమునకును ఆశ్రయమునకును నుపయుక్తములయిన విశేషణములుగాను నుండుట తెలియునది. మనుచరిత్ర.

'అంచెలు గట్టి కాలితొడుసై చన నీవుగదమ్మ ప్రోదిరా
యంచ లి వేటిసంగడమువేలయ్యెను దయ్యమ యేటికేడ్కనా
కంచుఁ బదంబునన్ మొరయు నందియ యూడఁగఁదన్ని పోయివీ,
క్షించె లతాంగి యోర్తు మురజిన్నిభు సాగరమేఖలావిభున్

అని అంచలయాగడు ముదుపుకొన్నట్లు చెప్పఁబడినది. ఇట దీనినే యనుసరించి మఱియు మాటివలని యాగడము మాన్పుకొనుట చెప్పఁబడెను. అచ్చటప్రోది రాయంచలు. ఇట ప్రోదినెమిలి, పెంపుడు జింక, గారాపు గోరువంక, అనుంగుటంచయు నని తెలియునది. ఇంతవఱకు ఆవేగమనెడు సంచారిభావము. ఇది అక్కలి ప్రాసనీసము.

ఉ. పౌరపురంధ్రు లిట్లు వసుపార్థివుఁ గన్గొన వచ్చి మంగళా
చార మనోజ్ఞలాజములు చల్లిరి సింధుభవావివాహదీ
క్షారమణీయమూర్తి యగు శౌరిపయిం గలశాబ్ధినిర్మలో
దారతరంగరేఖలు సుధాలవముల్ వెదచల్లుకైవడిన్.

అ. పౌరపురంధ్రులు=కోలాహల పురమందలి స్త్రీలు, ఇట్లు, వసుపార్థివున్=వసురాజును, కన్గొనన్ వచ్చి, మంగళాచార మనోజ్ఞలాజములు=మంగళాచరణమునకయిన సొగసయిన వరిపేలాలు. చల్లిరి, ఏలాగుననఁగా---సింధు...మూర్తి—సింధుభవా = క్షీరసముద్రుని కూఁతురైన లక్ష్మితోడ, వివాహ=పెండ్లియందలి, దీక్షా=నియమముచేత, రమణీయ=సుందరమగు, మూర్తి=ఆకృతిగలవాఁడు, అగు, శౌరిపయిన్ = విష్ణువుమీఁద, కల...ఖలు—కలశాబ్ధి = పాలసముద్రముయొక్క, నిర్మల=స్వచ్ఛములయిన, ఉదార=అతిశయములైన, తరంగరేఖలు=అలల బంతులు, సుధాలవముల్=అమృత జలబిందువులను, వెదచల్లుకైవడిన్=వెదచల్లినట్లు, సింధుభవా=శుక్తిమతినది సంభవయైనగిరికా దేవితోడి, వివాహదీక్షా=వివాహ నియమముచేత, రమణీయమూర్తి=సొగసయిన ఆకారముగలవాఁడు, ఐన, శౌరిపయిన్=శూరసంభవుఁడయిన వసురాజుమీఁద చల్లిరి.

ఇందు విష్ణువునకును వసురాజునకును, లక్ష్మీదేవికిని గిరికాదేవికిని, క్షీరాబ్ధి తరంగరేఖలకును పురస్త్రీలకును, సుధాలవములకు శుభలాజములకును ఉపమానోపమేయభావము. తరంగముల రేఖలనుట స్త్రీలింగముచే పురంధ్రులతోడి సాటికి.

మ. అపు డద్రీశ్వరుఁ డాప్తబాంధవులతో నభ్రాపగా ముఖ్యపు
ణ్యపురంధ్రీతతితో నెదుర్కొనఁ దదీయద్వారసీమన్ సిత
ద్విపమున్ డిగ్గి సురాధిరాజపురవేత్రిశ్రేణి సాహో యనన్
నృపచూడామణి తత్ప్రధానజనతానిర్దిష్టమార్గంబునన్.

అ. అపుడు, అద్రీశ్వరుఁడు=కోలాహలుఁడు, ఆప్తబాంధవులతోన్=ఆప్తులయిన బంధువులతోడను, అభ్రాపగా ముఖ్యపుణ్య పురంధ్రీతతితోన్ = ఆకాశగంగ మొదలయిన పుణ్యాంగనల సమూహముతోడను, ఎదుర్కొనన్=ఎదురురాఁగా, తదీయద్వార సీమన్=ఆకోలాహలపురముద్వార దేశమందు, సితద్విపమున్=తెల్లయేనుఁగును, డిగ్గి=దిగి, సురాధిరాజపుర వేత్రిశ్రేణి=ఇంద్రపురమునందలి అమరావతియందలి బెత్తాలవారి సమూహము—అనఁగాఁ జోపుదార్లు, సాహో అనన్=పరాకు దెలుపఁగా, నృపచూడామణి=వసురాజు, తత్ప్రధాన జనతానిర్దిష్ట మార్గంబునన్=ఆకోలాహలుని మంత్రిజనసమూహముచేత నియమింపఁబడిన మార్గముచేత-మీఁది కన్వయము.

సీ. మణికుట్టిమములు భామాగీతికార్ద్ర వి,భావ భవ్యజలాప్తిఁ బాద్య మిడఁగ
మందార సుమకాయమానముల్ పవమాన,శీర్ణ కేసరముల సేసచల్లఁ
జిత్రతారాత్రికాపుత్రికల్ కరదీప్త, రత్నదీధితుల నారతులు ద్రిప్ప
బహువిధద్వారరంభాకోటి పరిపక్వ, ఫలరసంబుల మధుపర్క మొసఁగ

తే. మున్నుగా నన్నగాన్వయముఖ్యభవన, లక్ష్మి యిట్లు వివాహవేళా మహోప
చారముల నన్నిటి ఘటింపసాంద్రవిభవ, కలితకల్యాణవేదికఁ గదిసె నపుడు.

అ. మణికుట్టిమములు=మణులచేత కట్టఁబడిన నెలకట్టులు. భామా... ప్తికిన్ — భామా = స్త్రీలయొక్క, గీతికా= పెండ్లి పాటలచేత, అర్ద్రవిభావ= కరఁగినందున, భవ్యజల అ ప్తికిన్= మంచి నీటిదొరకుట చేత, పాద్యము ఇడఁగన్-గానమునకు ఱాలుకరఁగునని ప్రతీతి- స్త్రీలు పెండ్లి పాటల మాధుర్యమునకు మణులును ఱాలుగనుక కరఁగి పాద్యము తనంతటనే యిచ్చినట్లుండె ననుట. మందారసుమకాయమానముల్ = మందారమను దేవతావృక్షముల పువ్వులచేతనయిన పందిళ్లు, పవమానశీర్ణ కేసరములన్ = గాలిచే రాల్పఁబడిన అకరువులచేత, సేసచల్లన్=సేసఁబ్రాలుచల్లఁగా, అకరువులు ఎఱ్ఱనివన్నెగలిగి సన్ననై యుండుటచేత అక్షింతలతో సాటి.

చిత్రిత ఆరాత్రికాపుత్రికల్---చిత్రిత=చిత్రములు గావింపఁబడిన-అనఁగా చిత్రదళయుక్తము లయిన, ఆరాత్రికా = ఆరతి పళ్లెరములతోఁగూడిన, పుత్రికల్ = కీలుబొమ్మలు, కర = చేతులందు, దీప్త = వెలుఁగుచున్న, రత్నదీధితులన్ = పద్మరాగ రత్నముల కాంతులచేత, ఆరతులుత్రిప్పన్ కీలుబొమ్మలచేత చిత్రపుఁబనిగలిగినయారతి పళ్లెరము లిడి యందు రత్నమయములగు దీపములుంపఁగా నవి కీలుబొమ్మలుగావున నారతులు త్రిప్పిన ట్లుండెననుట. బహువిధ ద్వారరంభాకోటి = పెక్కు దెఱఁగులయిన వాకిళ్లయందలి అరఁటులసమూహము. పరిపక్వఫల రసంబులన్=చక్కఁగాఁ బండిన పండ్లయొక్క రసముచేత, మధుపర్కము, ఒసఁగన్—ఇయ్యఁగాను-మధుపర్కమనఁగా.

'దధిసర్పిర్జలం క్షౌద్రంసితైతాభిస్తు పఞ్చభిః ప్రోచ్యతే మధుపర్కస్తు సర్వదేవౌఘతుష్టయే |
జలంతు సర్వతః స్వల్పంసితాదధిఘృతంసమమ్, సర్వేషామధికంక్షౌద్రంమధుపర్కేప్రయోజయేత్,'
పెండ్లికొడు కుపవాసముండి పిదప దీనినిశారణ చేయును.

ఇట్లు, మున్నుగాన్, అన్నగాన్వయ ముఖ్యభవనలక్ష్మీ=పర్వత కులశ్రేష్ఠుఁడయిన యాకోలాహలుని గృహసంపత్తి, వివాహవేళా మహోపచారములన్ = పెండ్లి సమయమున వరునకుఁ జేయవలసిన గొప్ప యుపచారములను, అన్నిటిని ఘటింపఁగా, అపుడు, సాంద్ర విభవ కలిత కల్యాణవేదికన్ =దట్టమయిన వైభవములతోడ కూడుకొన్న పెండ్లి బంగారపు టరుఁగును('కల్యాణంమఙ్గళేస్వర్ణే' నా),కదిసెన్=సమీపించెను.

పెండ్లి గృహమునకు వచ్చిన పెండ్లికొడుకునకుఁబాద్యమిచ్చుట, సేసచల్లుట, ఆరతులు త్రిప్పుట, మధుపర్కము నొసఁగుట యనునివి మహోపచారములు. దీనిని గోలాహలుని గృహంపు పెంపుసొంపే యప్రయత్నముగా నొడఁగూర్చినదని గృహలక్ష్మీ వైభవము స్ఫురించుచున్నది.

మ. నరనాథోత్తముఁబ్రోల నున్నమిత దంతస్తంభమై చారుచా
మరకస్త్యోకదళీకలాపశుభకుంభం బై సదామోదమే
దురసారంగమదాంక సంకలితమై తోడ్తో మహావారణ
స్ఫురణల్ దెల్పువివాహవేదకపయిన్ శోభిల్లెఁ బద్మాపళుల్.

ఆ. 'మహావారణస్ఫురణల్' 'వివాహవేదిక' అనురెంటిచే వివాహవేదికాపరముగాను గజపరముగాను అర్థద్వయము తెలియుననె—నరనాథోత్తముఁబ్రోలన్=ఎదుట. ఉన్నమితదంతస్తంభమై= (వేదిక) ఉన్నమిత= ఎత్తఁబడిన, దంత=ఏనుఁగుదంతముచేత నయిన, స్తంభమై= స్తంభములుగలదై--- (గజ) ఎత్తఁబడిన స్తంభములవంటి దంతములుగలదై, చారు ....కుంభంబై — (వేదిక) చారు= సొగసయిన, చామర—('చమరంచామరే స్త్రీతుమంజరీ మృగభేదయోః' మేదిని) - చమరి అనఁగా పూగుత్తి-చామరమనఁగా చమరీణాంసమూహశ్చామరమ్—పువ్వుఁ గుత్తుల సమూహ...

మరలును, కక్ష్యా = (కక్ష్యాబృహతికాయాంచ కాఞ్చ్యాం మధ్యేభబన్ధనే, హర్మ్యాదీనాం ప్రకోష్ఠేచ' విశ్వ) బంకఁలును— అనఁగా సందువీథులును, కదళీకలాప = ('కదళీవైజయన్త్యాంచ రమ్భాయాం హరిణాన్తరే' అ. 'కలాపోభూషణే బర్హే తూణీరే సంహతావపి' అ) అరఁటిచెట్ల సమూహములును, శుభకుంభంబై = పూర్ణకలశములును గలదై—(గజ) చారుచామర=సుందరములయిన వింజామరలును, కక్ష్యా=నడిమిమోకును, కదళీ=పయి జెండాలును—ఏనుఁగు జండాకు 'గజవైజయన్తీ కదళీ' అని పేరు. [కదళీ కాంచనకక్ష్యలన్ వెలయుశేఖస్వామి చౌదంతిపైన్] (మను చరిత్రము) కలాప=నెమిలిపురియు, శుభ కుంభంబై = సొగసయిన కుంభస్థలములును గలదై (కుమ్భౌభు శేభమూర్ధాంశౌ' అ), సదా......సంకలితమై-(వేదిక)-సత్ =మంచి, ఆమోద=పరిమళముచేత, మేదుర=దట్టమయిన, సారంగమద=కస్తూరియొక్క,అంక=చిహ్నములతోడ,సంకలితమై=కూడుకొన్నదై-కస్తూరిచే అలుకఁబడినదై యనుట--(గజ)సదా=ఎల్లప్పుడును,మోద మేదుర=ఆనందముచేదట్టములగుచున్న,సారంగ—('చాతకేహరిణే పుంసిసారఙ్గశ్శబలేత్రిషు' అ)తుమ్మెదలుగలిగిన, మద=మదజలములయొక్క, అంక=గుర్తులతో, కూడుకొన్నదై, తోడ్తోన్ = వెంబడిగా—అనఁగా గజపరములుగాఁ జెప్పఁబడిన యర్థాంతరములచేత - వేదిపరముగాఁ జెప్పఁబడుపదములచేతనే గజపరములుగాను దెలియఁబడు నర్థములచేత ననుట, మహా వారణస్ఫురణల్ తెల్పు= పెద్దయేనుఁగు స్ఫూర్తులను దెలియఁజేయుచున్న యనియర్థము, మహ=ఉత్సవముయొక్క , అవారణ=అనివార్యములయిన, స్ఫురణలు తెలియఁజేయుచున్నదని భావము. దంతస్తంభములు, అరఁటిచెట్లు మొదలయినవి వెంటనే పెండ్లి మహోత్సవమునకు త్రోసిపుచ్చరాని చిహ్నములనుట ['మహాభద్ర విస్ఫురణల్ తెల్పు' అని పాఠాంతరము. భద్రమనఁగా భద్రజాతియేనుఁగును మంగళమును గనుక గొప్ప యేనుఁగు స్ఫూర్తులుగాననియును గొప్ప మంగళముయొక్క స్ఫూర్తులనియు నర్థములు] వివాహవేదికపయిన్ = పెండ్లియరుఁగుమీఁద, పద్మావళుల్ = తామరదండలు,శోభిల్లెనని యర్థము (పద్మమనఁగా 'పద్మకంబిన్దు జాలకమ్') అన్నట్లు ఏనుఁగు దేహముమీఁది పొడలు-పొడలవరుసలు శోభిల్లెనని గజపరమయిన యర్థాంతరము.

పెండ్లి యరుఁగునందు దంతపు స్తంభములెత్తి పూగుత్తులు అరఁటిచెట్లుపూర్ణకలశములునుగూర్చి మంచివాసనగుబాళించు కస్తూరితో నలికి, తామరపూదండలచే దాని నలంకరించిరని యర్థము.

క. మనుజపతి యపుడు నగపతి, పనుపున మణిపీఠి నమరెఁ బ్రకటితకమలా
కనకాంబరకల్యాణాం, కనకాంతవివాహ సదనకాంచనవేదిన్.

అ. మనుజవిభుఁడు=వసురాజు, అపుడు, నగపతి పనుపునన్ =కోలాహలుని యాజ్ఞచే, ప్రక......వేదిన్—ప్రకటిత=ప్రసిద్ధమగుచున్న, కమలా కనకాంబర = లక్ష్మీనారాయణుల యొక్క, కల్యాణ అంకన= పెండ్లి పాటలచేత, కాంత=ఒప్పుచున్న, వివాహసదన = పెండ్లిచవికలోనున్న, కాంచనవేదిన్ =బంగారపు పెండ్లియరుఁగునందు, మణిపీఠిన్, అమరెన్,అనఁగాఁగూర్చుండెననుట.

చ. విధివిహితంబుగా బుధగవీదధిమిశ్రసురద్రుమమంజరీ
మధుమధుపర్కముల్ విమలమౌక్తికపాత్రికఁ దెచ్చి యాగుణో
దధికి నొసంగె మామ మధుదానపరికి లచ్చి నిచ్చునం
బుధి యమృతాంశుతో నమృతపూరము మున్నొసంగుకైవడిన్.

అ. మామ=మామయగు కోలాహలుఁడు, విధివిహితంబుగాన్ =శాస్త్రోక్తప్రకారముగను, బుధగ...ధర్కన్ —బుధగవీ=కామధేనువుయొక్క, దధి=పెరుఁగుతోడ, మిశ్ర=కలిసిన, సురద్రు=కల్ప

వృక్షముయొక్క, మంజరీ=పువ్వుగుత్తి యందలి, మధు=పూఁదేనెయనెడి, మధుపర్కముల్---'సర్వే
షాం మధికం క్షౌద్రం మధుపర్కే ప్రయోజయేత్' యన్నట్లు తేనె అందధికముగా జేరునుగాన దధి
మిశ్రమధువనియు మధుపర్కమను నామమనియుఁ జెప్పుట తెలియునది, విమల మౌక్తికపాత్రికన్ =
అచ్ఛమయిన ముత్తెపుగిన్నెతో.

'తందద్యాత్కాంస్య పాత్రేవారౌక్మ శ్వేత భవేనవా' అని కంచు, లేక, బంగారు వెండి
పాత్రలలో నియ్యవలయునని శాస్త్రము. ఇట ముత్తెపుగిన్నె 'శ్వేతభవేన' అనుటంబట్టి కావలెను.
శ్వేతమనఁగా శంఖము. శంఖమునఁబుట్టినవి శ్వేతభవములు. అనఁగా ముత్తెములు కాన యిటముత్తెపు
గిన్నెయన్నాఁడు. శంఖమున ముత్తెములు పుట్టుట.

'వరశంఖ జనిత మౌక్తిక, మరయఁ గపోతాండమువలె నత్యుజ్జ్వలమై
పరఁగు నది మంత్రసాధన, పరులకుఁ దక్కంగ దుర్లభంబితరులకున్ (రత్న పరీక్ష.)

ఇందే ప్రథమాశ్వాసమున

వీటన్ మీటగు జోటులేటి వఱపన్ వేమాఱుఁ గ్రీడింపఁద
త్పాటీరాంక సపంకశంఖగత ముక్తాశ్రేణి యవ్వాసనన్
బాటించున్ మృగనాభిపంకయుత భామాకంబు కంఠాస్థిఁ నే
నాటన్ మిన్కులు గల్గువాఁకగు జన్మస్థాన సౌఖ్యోన్నతుల్. అని యున్నది.

తెచ్చి, అగుణోదధికిన్ = గుణసముద్రుఁడయిన యావసురాజునకు, ఒసంగెన్ = ఇచ్చెను.
ఏలాగున ననిన, మధుదానవవైరికిన్ = శ్రీమహావిష్ణువునకు, లచ్చిన్ ఇచ్చు, అంబుధి=(పాల) సము
ద్రుఁడు, అమృతాంశుతోన్ = చంద్రునితోడ, అమృతపూరమున్, మున్నె = ముందుగా, ఒసం
గుకైవడిన్ = ఇచ్చినట్లు, ఇచ్చెనని సంబంధము.

ఇట వసురాజునకు విష్ణునకును, గిరికకును లక్ష్మికిని, కోలాహలునకును సముద్రునకును, ముత్తెపు
గిన్నెకును చంద్రునికిని, మధుపర్కమునకును అమృతపూరమునకును, ఉపమానోపమేయభావము. వసు
రాజునకు గిరికాదేవి నిచ్చునట్టి కోలాహలుఁడు ముత్తెపుగిన్నెలో మధుపర్కమిచ్చుట విష్ణుదేవునకు
లక్ష్మినిచ్చు సముద్రుఁడు చంద్రునితో నమృతపూరము నిచ్చినట్లుండె నని యర్థము. 'మున్నె యొసంగు
కైవడిన్' చంద్రుఁడును అమృతమును బుట్టినపిదప లక్ష్మియుదయించెనుగాన; అట్లు వారు ముందు
పుట్టుట ముందు ముత్తెపుగిన్నెతో మధుపర్కమిచ్చి పిదప లక్ష్మినిచ్చునట్లున్నదని పూర్వ సంభవమును
పూర్వప్రదానముగా నన్వయించినాఁడు. మౌక్తిక పాత్రికన్—అనఁగా పాత్రికలో మధుపర్కము
ఇటస్థలో' ఆధారాధేయభావమునుబట్టి. అమృతాంశుతోన్ అమృతపూరము. ఇట'తో' తత్సామ్యమున
కుఁ[illegible]ను ఆధారాధేయ సంబంధముగ్రహించుటపొసఁగుటకు అయిన నాసంబంధము పొసఁగదుగా
వున[illegible] అమృతాంశునితోఁగూడ అమృతమని సాహచర్యపరముగా భావము.ఈ యర్థభావములు రెంటికిఁ
బొసఁగుటకై 'లో' ననక 'తో' నని పెట్టుట. మధుపర్కమున 'సర్వేషామధికం క్షౌద్రం మధుపర్కేనయో
జయేత్' అనుటం బట్టి తేనె మిక్కిలిగాఁ జేరియుండును. తేనె ఎఱుపుగలసిన నలుపు. ఇందులకునిందే.

చ. రతిపతి ధర్మకర్త బుతు[illegible] జబలావళి నొంచి యేఁగు దు
ర్మతుల మథించి కైకొనిన మానధనంబుల ముద్ర పెట్టుచోఁ
బ్రతినవదీపికాశిఖఁ గరంగెడు లక్కయుఁబోలె పంజుల
స్థితిమయితేఁటి వెగ్గలపుఁ దేనియ గ్రాయుట గంటివే చెలీ. (3 - ఆశ్వా - 132)

అని కరఁగెడు లక్కగాఁదేనెను వర్ణించినాఁడు. తన్మిశ్రమయిన మధుపర్కము తెల్లని యమృతముతో సాటి యెట్లనఁగా దీనితో దధిమొదలగునవియు మిశ్రమయి యుండుటచే తెలుపు వన్నె సాటికి రావచ్చును; లేక 'దధిమధునీ సర్పి ర్వామధ్వలాభే' అన్నట్లు మధువులేనిచో నేయి కలుపవచ్చును. సర్పిష్మిశ్రమయ్యు నమృతపూరముతో వర్ణసామ్యమును బొందవచ్చును. ఇట మధుపర్కము మామ యల్లునకు మంగళసూత్రధారణమునకు మునుపిచ్చుట యాచారమై కనుపట్టెడి.

పారణచేసె రాజుమధుపర్కపుఁ దేనియ మామ భీమధా
త్రీరమణుండు మంత్ర సముదీరణ పూర్వముగాఁగ నీయ. (శృంగా ౬ - ౮౮)

క. విధియుతముగ ఖచరుఁ డవ, న్యధినాధున కొసఁగెఁ బసిఁడి పారివాణమునన్
మధుర మఖభుగ్గవీదధి, మధురస సంపర్కమయిన మధుపర్కంబున్. (మనుచరిత్ర-౫-౭౭)

మనుచరిత్రమున 'విద్రుమపాద సువర్ణపీఠిపైఁ బ్రభుతఁదలిర్పమానుపనుపన్ వసియించె'

'మధురమఖమగ్గవీదధి మధురస సంపర్కమయిన మధుపర్కంబున్' అను వీనింబాచియె యిందును. 'మనుజవిభుఁడపుడు నగపతి, పనుపున మణిపీఠి నమరె' నని యు 'బుధగవీ దధిమిశ్రసురద్రుమంజరీమధుమధుపర్క' మనియుఁ జెప్పంబడెను. అంబుధియనఁగా ఉదధి. విష్ణుదేవునికి మామ ఉదధి. (గుణ) ఉదధికి మామ కోలాహలుఁడు. విష్ణుదేవుని మామయైన యుదధికంటె గుణోదధికి మామయైన కోలాహలుఁడు అధికుఁడని వ్యతిరేకము తెలియునది. మామయగు ఉదధికంటె గుణోదధికి మామయైనవాఁ డధికుండగుట యుక్తము. మనుచరిత్రమున 'పసిండిపారివాణమునన్' మధుపర్క మిచ్చుట 'తందద్యాత్కాంస్య పాత్రేణ రౌక్మ శ్వేతభవేన వా' అని రౌక్మపాత్రను విధించుటంబట్టి. ద్రుశబ్దమునకు 'అనోకహాఃకుటస్సాలః పలాశి ద్రుద్రుమాగమాః' అని అమ.

చ. అపుడు పురంధ్రివర్గ వృత యై చరణాంకకృతార్థ మైనక
ప్రపునుముగ్గుపై మకరపద్మము లేర్పడ నీక్షణప్రభా
స్నపనపవిత్రకుట్టిమమునన్ వరసీలనిధుల్ జనింప నా
నృపమణి భాగ్యలక్ష్మి కరణిం దరుణీమణి వచ్చె నొయ్యనన్.

అ. అపుడు, తరుణీమణి = స్త్రీరత్నము—గిరిక, పురంధ్రివర్గవృతయై = ముత్తయిదువుల గుంపుచే పరివేష్టింపఁబడినదై, చరణాంక కృతార్థము = అడుగు గుఱుతులచే ధన్యమయినది, అగు, కప్రపునుము ముగ్గుపైన్ = కప్పురపుపొడితో రచింపఁబడిన నిద్దపు ముగ్గుమీఁద, మకరపద్మములు = మకరము పద్మము అనునిధులు, ఏర్పడఁగానని యర్థము. ఇక్కడ ముగ్గులరూపముననుండు మకరపద్మములనుమకరపద్మనిధులుగానధ్యవసించుట తెలియునది. మకరపద్మాకార ముద్రలేర్పడినవనిభావము. చరణాంకకృతార్థము అనుచో, చరణాంక = సకలసంపత్సంపాదకములయిన పాదశుభచిహ్నముల చేత, కృత = చేయఁబడిన, అర్థము = మకరపద్మ నిధులరూపమైన అర్థము -. అనఁగా ధనముగలది యనియు - లేక - కప్పురపుపొడియందు అడుగునొత్తుడుచేత రచితమైన మకరపద్మములయిన పాదచిహ్నము లనెడు మకరపద్మనిధిరూపమయిన యర్థముగలదనియు నర్థద్వయము సూక్ష్మదృష్టిచేతఁ దెలియునది. పాదతలచిహ్నములు పద్మాకారముగా నుండుటగలదు.

కాలియడుగు నొత్తురేక లంటినచోట మెట్టదామరలుగా నేర్పడెననియు జెప్పఁబడియున్నది. కాన కప్పురపుఁబోడియందు పద్మరూపములగు పాదముద్రల నిట పద్మనిధులుగా నధ్యవసించినాడని యెఱుంగునది. ఈక్షణప్రభా = చూపుకాంతులయొక్క, స్నపన = స్నానముచేత, పవిత్ర = పావనమయిన, కుట్టిమమునన్ = నెలకట్టునందు, వరనీలనిధుల్ - జనింపన్ = వరనిధియు నీలనిధియును బుట్టఁగాననియర్థము- మేలయిన నీలకాంతిస్తోమములుపుట్టఁగానని భావము. వరములైన నీలకాంతిస్తోమములను వరనిధిగను నీలనిధిగను నధ్యవసించినాఁడు. ఆనృపమణిభాగ్యలక్ష్మికరణిన్ = ఆవసురాజుయొక్క భాగ్యలక్ష్మివలె, ఒయ్యన్ =ఒప్పిదమగునట్లుగా, వచ్చెను.

అనఁగా వసురాజుయొక్క భాగ్యలక్ష్మివంటిదిగానఁ దాను త్రొక్కినచోట మకరపద్మనిధులును దానుజూచినచోట వరనీలనిధులును జనింపఁగా గిరికాదేవివచ్చిన దనుట. నీలశబ్దముచే నీలమణులు నర్థముగనుక నీలరత్నకాంతి సమూహములుతోఁచుటంబట్టి యిందలి యాశయము 'తిరుమలదేవీచరణోదర' యను పద్యమందలి 'స్థలకమల స్ఫురదిందీవర'శబ్దములచే ప్రేరితముగాఁ గన్పట్టెడి.

ఉ. ఐదువ లామహేంద్ర గురుశాసనతిఁ గెందెర యెత్తి విశ్వధా
త్రీదయితున్ సతిం గదియఁదెచ్చిరి వేడ్కఁ బ్రభాతవాతసం
పాదితబోధలై నవసుపద్మినులాత్మపరాగపాళికా
చ్ఛాదన మావహించి కవజక్కవలం గదియించుకైవడిన్.

అ. ఐదువలు = ముత్తైదువలు, ఆమహేంద్రగురు ఆనతిన్ = ఆబృహస్పతియొక్క యనుజ్ఞచేత, కెందెర = ఎఱ్ఱపట్టుతెర, ఎత్తి = ఎత్తిపట్టి, విశ్వధాత్రీదయితున్ = సమస్తభూమికిని వల్లభుఁడయిన వసురాజును, సతిన్=గిరికాదేవిని, వేడ్కన్, కదియఁదెచ్చిరి=సమీపించునట్లుతెచ్చిరి. —ఏలాగుననఁగా - ప్రభాత...బోధలు = వేకువగాడ్పుచేత పొందఁబడిన వికాసముగలవి, ఐన, నవపద్మినులు = క్రొత్తతామరతీఁగలు, ఆత్మపరాగపాళికా ఆచ్ఛాదనము = తమయొక్క రొజ్జని పుప్పొడిపటలముచేమాటును, ఆవహించి = కలిగించి, కవజక్కవలం=చక్రవాకపుజతను, కదియించుకైవడిన్ = కదియఁజేసినట్లుగా, కదియించిరని సంబంధము.

ఇట ఉపమానవాక్యమందలి'బోధ'కు వికాసమనియు ఎఱుకయనియు,పద్మినులకు తామరతీఁగలనియు పద్మినీజాతి స్త్రీలనియునర్థద్వయముగలదు. దీనింబట్టిఉపమేయవాక్యమునను బృహస్పతియానతిచేత సంపాదితబోధలయి న్నవపద్మినులగు ముత్తైదువలు రాజునుసతిని గదియదెచ్చిరని నర్థంపుసాంప్రసంక్రమించుచున్నది. వాతము 'ప్రభాత' మంవలిదిగావుననే పద్మినులకు 'బోధ'. వాతమునుబట్టియే పరాగములేచుట. పద్మపరాగ మెఱుపు గాన కెందెరకుసాటి. 'పద్మపరాగంబుపరఁగిన యరుణోదయంబుకాంతికి నునుడంబుగూర్చి — (భారతవిరాటపర్వము) పరాగము యొక'పాళికా'పటలమును జెప్పుట ఎత్తిపట్టిన తెరవలె పఱపుగలిగియుండుటకు. 'కవజక్కవలన్' ప్రభాతమందే జక్కవలు ఒండొకటిని గవగూడుట, మఱియు రాత్రియంతయు నెడఁబాసియుండిన జక్కవలవలెనే వధూవరులకు నొండొరులకుఁజూచుటయందును గూడుటయందును గల గుతుకమునుఆర్తియు ధ్వనితములు 'పద్మినులు'.—తామరతీఁగలయందు-అనఁగా తామరలందు-, జక్కవలకూడిక—మనుచరిత్రమున.

'అరసికన్నీటితో మరలితామరయొక్కి' వదనమెండఁగ సరోవారినద్దు
నద్రిత్రావఁగసైప కట్టిట్టుగన్గొని, ప్రతిబింబ మీక్షించి భ్రమసియుఱుకు
నుఱికిరొయిఱికలు దడియవేఱొక్కతమ్మి, కరుగు నరిగి రవంబుతోఁ దిరుగుతేంట్లఁ

బోడుచుముక్కున మఱియును బోవువెదక, సంజఁబ్రియుఁ బాసి వగనొక్క చక్రవాకి.

(మనుచరిత్ర-3-౧౬)

అని తామరలయందుఁ జక్రవాకి చక్రవాకమునరయుట చెప్పఁబడియున్నది. తామరతీఁగల యందలి పూవులు వేకువను విరియుటయు నపుడు సుడియుగాడ్పుచే నందలిపుప్పొడి రేఁగుటయు నపుడె యొండొరులకయి కవఁగూడ నువ్విళులూరుచున్న జక్కవజంట ఆతామరలయందుఁగది యుటయు నిట మిక్కిలి స్వాభావికవర్ణితము. వేగుంబోకగాడ్పుచే విరిసిన తామరతీఁగలు, తమయొత్తుపుప్పొడిని మాటుచేసి జక్కవకవను గదియించునట్లు, బృహస్పతి యనుమతిచే సంపాదిత బోధలైనను వాసినులెత్తుపట్టు తెరఁబట్టి వసురాజును గిరికాదేవిని గదియించిరని యర్థము. ఇందలం కార ముపమ.

ఉ. రాజకరానుషంగమున రామకరాంబుజ మొప్పఁ గన్యకా
రాజితహస్తయోగమున రాజకరంబు నతిప్రకాశమై
రాజిల రక్షగట్టుక్రియ రాజముఖీకరపంకజంబున
న్రాజకరంబునన్ గురుఁ డొనర్చె సమంత్రకకౌతుకాంకముల్.

అ. గురుఁడు = బృహస్పతి, రాజకరానుషంగమునన్ = వసురాజుయొక్క చేయితాఁకుచేత, రామకరాంబుజము = గిరికయొక్క తామరవంటిచేయి, ఒప్పఁగానని యర్థము—రాజకరములనఁగా చంద్రకిరణములు గనుక చంద్రకిరణానుషంగముచేత, రామ = రమణీయమైన, కరాంబుజము = చేయివంటి తామరయొప్పఁగానని యర్థాంతరము. కన్యకారాజిత హస్తయోగమునన్ రాజకరంబు అతిప్రకాశమయి రాజిలన్ = గిరికాదేవి ఒప్పిదమయిన హస్తస్పర్శముచేత వసురాజుయొక్క హస్తము మిక్కిలి ప్రకాశమై యొప్పునట్లుగానని యర్థము. కన్యారాశియైన హస్త నక్షత్రముతోడి యోగముచేతఁ జంద్రకిరణము ప్రకాశింపఁగానని యర్థాంతరము. ఇంతవఱకు నభేదాధ్యవసాయము. రక్షగట్టుక్రియన్ = రక్షాబంధనము చేసినట్లుగా, రాజముఖీ కరపంకజంబునన్ = గిరికచేయి తామర యందును, రాజకరంబునన్ = వసురాజుయొక్క చేతియందును, సమంత్రకకౌతుకఅంకముల్ = వేద మంత్రములతోఁగూడిన కంకణపుగుఱుతులను, ఒనర్చెను—అనఁగా కంకణములు గట్టెననుట.

కౌతుకమనఁగా పెండ్లియందుఁ గట్టెడు తోరము, కౌతుకమునకు సమంత్రకత్వము ధర్మశాస్త్ర మునందు.

'విశ్వేత్తా తే త్య్రచాపుంసాం బధ్నీయాద్దక్షిణే కరే
అథవామకరే స్త్రీణాం బృహత్సామేతి మంత్రతః'

అనియున్నది. కౌతుకశబ్దముచే వధూవరుల కదికౌతుకావహమగుటయు వ్యంజితము.

మ. సుముహూర్తం బని సన్మునుల్ దెలుప నచ్చో దివ్యశైలేంద్రుఁ డా
యమరాధీశహితక్రియానిరతు నాయమ్లానమాలాకలా
పమనోహారి నకుంఠవిక్రమునిఁ గాభావించి లక్ష్మీగురు
త్వము దీపింపఁగ ధారవోసెఁ దనయన్ వర్ధిష్ణుసంపన్నిధిన్.

అ. సన్మునులు, సుముహూర్తంబు అని తెలుపఁగా, అచ్చోన్ = ఆయెడ, దివ్యశైలేంద్రుఁడు = దేవతామహిమగల కోలాహలుఁడు, ఆ అమరాధీశహితక్రియానిరతున్ = ఇంద్రునకు ఇష్టమయిన

కార్యమందు ఆసక్తుఁడయిన యావసురాజునని యర్థము—రాక్షససంహారముచేసి దేవతాధిపతులకు హితముసేయుచుండువానిని— ( అనఁగా విష్ణువునని ) యర్థాంతరము. ఆ, అమ్లా ... హారిన్ — (వసు)అమ్లాన = వాడకుండు, మాలాకలాప = పద్మమాలికయను సొమ్ముచేత, మనోహారిన్ = ఒప్పుచున్న వానిని — (విష్ణు) వైజయంతీ మాలికాలంకృతుని, అకుంఠ విక్రమునిఁగాన్ — (వి అనఁగా పక్షి, ఇటగరుడుఁడు. క్రమమనఁగా సంచారముగనుక) యొక్కవాని గరుత్మత్సం చారముగలవానినిగా—అనఁగా నారాయణస్వరూపునిఁగా, భావించి యని యర్థము. వసురాజు అకుంఠితపరాక్రమముగలవాఁడని భావము. లక్ష్మీగురుత్వము దీపింపఁగాన్=లక్ష్మీజనకత్వము ప్రకాశింప గానని యర్థము—సంపత్తిగౌరవము దీపింపఁగా ననిభావము. వర్ధిష్ణుసంపన్నిధిన్=వృద్ధిఁబొందెడుసంప దల కాస్పద మయిన లక్ష్మీదేవినని యర్థము — అభ్యుదయమునకు నిధియైనదాని ననిభావము, తన యన్ = కొమార్తను, ధారవోసెను=ఉదకధారాపూర్వకముగా దానముచేసెను.

కన్యాదానముసేయునపు డల్లుని విష్ణుస్వరూపునిఁగాఁదలఁచి యతనికిఁగన్య లక్ష్మిగా ననుసం ధించుమంత్ర ముచ్చరించుచు ధారవోయుటంబట్టి యీపద్యార్థము నిబంధింపఁబడెను.

వసురాజును 'అకుంఠవిక్రమునిఁగా' నని విష్ణువుగా నర్థముగూర్చుటచే 'అమ ... నిరతున్' 'అమ్లాన...హారిన్' అనువిశేషణములు సయితము రాజునకును విష్ణునకును జెల్లునట్లు రచింపఁబడెను. రాజు విష్ణుఁడుకాఁగా కన్యాదాతయగు కోలాహలుఁడు సముద్రుఁడుగావలయునుగాన 'లక్ష్మీగురు' శబ్దము. ఇఁక గిరిక 'లక్ష్మి' కావలయునుగాన 'వర్ధిష్ణుసంపన్నిధి' విశేషణము.

మ. నతచూడాపరికర్మచంద్రతపనుల్ సనక్షత్ర దామంబునం
ప్రతిబింబింపఁగ నున్నకన్యయళులత్ సమాంగల్యసూత్రంబు శా
శ్వతకల్యాణగుణావహుం డునిచె నాసచంద్రార్కనక్షత్ర సం
తతిపై మించుతదీయనిత్య గుణముల్ సనాకుల్ ప్రశంసింపఁగన్.

ఆ. నత...తపనుల్—నత = సిగ్గుచేత వంచుకొనఁబడిన, చూడా = శిరస్సునందలి, పరికర్మ చంద్రతపనుల్ = అలంకారభూతులయిన చంద్రసూర్యులు, నక్షత్రదామంబునన్ = ముత్తెపుహార మునందు, ప్రతిబింబింపఁగన్ = ప్రతిఫలించునట్లుగా, ఉన్న, కన్య అళులత్ = గిరికాదేవి కంఠ మందు, మాంగల్యసూత్రంబు = మంగళసూత్రమును, శాశ్వతకల్యాణగుణ ఆవహుండు=శాశ్వతమయి న మంగళసూత్రము నావహించువాఁడని యర్థము - శుభగుణావహుఁడని భావము, అట్టివసురాజు, ఉనిచెను—ఏలాగున ననఁగా—ఆచంద్ర...మించు = (ఇచట 'అఙ్' ఆఙీషదర్థేఽభివ్యాప్తౌసీమార్థే ధాతుయోగజే' అమ. అనునట్లు అభివ్యాప్త్యర్థకము) చంద్రసూర్యులు నక్షత్రసమూహముల నెడి వీని మీఁద వ్యాపించుచున్న, తదీయనిత్యగుణముల్ = ఆగిరికాదేవియొక్క నిత్యములయిన సుగుణము లని యర్థము. ప్రతిబింబించు చంద్రార్కులతోఁగూడిన నక్షత్రదామముమీఁదనున్న గిరికాదేవి మం గళసూత్రత్రయమునని యర్థాంతరము (మంగళసూత్రత్రయమనుటకు గృహ్యాకారులు,

'మాఙ్గల్యతన్తునానేన బద్ధ్వామఙ్గళసూత్రకమ్,
హేమవస్త్రసరం బద్ధ్వా కణ్ఠేచ త్రిసరం తథా'

అనియున్నది. ఈ యాచారము దేశాంతరవిషయమని తెలియునది.) నాకుల్=దేవతలు, ప్రశం సింపఁగన్ = కొనియాడఁగా, మంగళసూత్రమును కట్టెనని సంబంధము.

ఆచంద్రార్క...నిత్యగుణముల్—ఆగుణములు చంద్రసూర్యనక్షత్రములపై వ్యాపించెననఁగా భూమియందు వ్యాపించి యూర్ధ్వలోకమందును వ్యాపించినవనుట. కావుననే నాకులు ప్రశంసించుట. గిరిక తలవంచుకొనఁగా ఆమె నొసటి చంద్రసూర్య భూషణములు వక్షమందలి నక్షత్రదామమునఁ బ్రతిఫలించెను. ప్రతిబింబిత చంద్రసూర్య కలితనక్షత్రదామరూపమై యున్న మూఁడు మంగళ గుణ(సూత్రము) లను చంద్రసూర్య నక్షత్రపు సమూహమునుపయి వ్యాపించిన మంగళగుణములుగా అభేదాధ్యవసితి చేసినాఁడు. రాజు శాశ్వతకల్యాణగుణావహుఁడు గావుననే కన్నెకు నిత్య(శాశ్వత)ములగు వినయాదిగుణములు. శాశ్వతమంగళ సూత్రావహుండుగానమాంగల్యసూత్రము. ముప్పేటలు ఆచంద్రార్కసంతతి పైమించుట ఆచంద్రార్క నక్షత్రస్థాయి యగుట యను భావములు ధ్వనించెడిని. నక్షత్రదామమనుటకు 'సైవనక్షత్ర మాలాస్యాత్సప్త వింశతిమౌక్తికా' అని అమ. ఇరువది యేడు ముత్తెములుండినది గాన యిరువదియేడు నక్షత్రములుగా రూపణమునకుఁ బొసఁగుట.

చ. అతివ సతీకరోన్నమితయై విభునౌదల సేసఁజల్లెఁ ద
త్పతినవమౌళి రత్నగత భవ్యనిజాకృతి చూచి కంటిరే
పతిశిర సెక్కె నీక్షణమె బాల యటంచు ధరాధరోపరి
స్థితి సరిదాత్మసంభవకుఁ జెల్లదె యంచు సఖుల్ వచింపఁగన్.

అ. అతివ = గిరికాదేవి, సతీకర+ఉన్నమితయై = పతివ్రతాస్త్రీల హస్తములచేత ఎత్తఁబడినదై, విభుమౌనలన్ = పతియైన వసురాజు శిరస్సునందు, సేసన్=తలఁబ్రాలును చల్లెను. ఏలాగున ననిన, తత్పతి = ఆవసురాజుయొక్క, నవ = క్రొత్తదయిన, మౌళి = కిరీటమందలి, రత్న = రత్నములయందు, గత = పొందియున్న-అనఁగా ప్రతిఫలించిన, భవ్య = మేలయిన, నిజాకృతిన్ = తనయొక్క రూపమును, చూచి, కంటిరే = చూచినారటే, బాల=ఈచిన్నది, ఈక్షణమె, పతిశిర సెక్కెను=పెనిమిటి తలపైకెక్కెను, అటంచును, ధరాధర ఉపరిస్థితి = పర్వతముమీఁది యునికి, సరిత్+ఆత్మసంభవకున్ = నదికిఁ బుట్టినదానికి, చెల్లదె అంమనని యర్థము. (వసు)రాజ శిరఃస్థితి శుక్తిమతీ సంభవయైన గిరికాదేవికిఁ జెల్లదాయని భావము. సఖుల్, వచింపఁగన్ = చెలికత్తెలు సరసోక్తులాడఁగా, సేసెచల్లెనని సంబంధము.

ఉ. శుక్తిమతీకుమారి కరశుక్తుల ముత్తెపుసేస చల్ల నా
రక్తసరోజపాణిపయి రమ్యగుణాబ్ధియు నట్లనించెఁ ద
న్మౌక్తికముల్ వధూకచసమాజకరాంబుజ కాయకాంతిసం
సక్తి ననేకవర్ణమణిజాలములై విభవంబుఁ దెల్పఁగన్.

అ. శుక్తిమతీకుమారి = గిరికాదేవి, కరశుక్తులన్ = చేతులనెడుముత్తెపుఁ జిప్పలచేత, ముత్తెపు సేస చల్లన్ = ముత్యాల తలఁబ్రాలుపోయఁగా—ఇట శుక్తిమతీకుమారి యను విశేషణముచే తల్లి శుక్తులు గలదిగాన కుమారియు కరము లనెడుశుక్తులు గలదని సారస్యము దెలియునది. ఆరక్తసరోజపాణిపయిన్=ఎఱ్ఱదామర పువ్వులవంటి చేతులుగల యాగిరికమీఁద, రమ్యగుణాబ్ధియున్=రమ్యగుణాబ్ధియనెడుఅబ్ధియును-అనఁగా సుగుణసముద్రుఁడయిన వసురాజనెడుసముద్రుఁడును, అట్లనించెన్=ఆతీరుగనే ముత్యాలతలఁబ్రాలు నింపెను. ఏలాగుననినిన, తత్ మౌక్తికముల్=ఆముత్తెములు, వధూ...సక్తిన్ వధూ=గిరికయొక్క, కచసమాజ=తలవెండ్రుకల గుంపులయొక్కయు,కరఅంబుజ = చేదామరల యొక్కయు, కాయ=మేనియొక్కయు, కాంతి=కాంతులయొక్క, సంసక్తిన్= సం

బంధముచేత, అనేక వర్ణమణిజాలములై = పెక్కువన్నెలుగల రత్నసమూహములై-అనఁగా కచకాంతిచేత ఇంద్రనీలములును, కరకాంతిచేత పద్మరాగములును, దేహకాంతిచేత పుష్యరాగములును నయినవనుట, విభవంబు తెల్పఁగన్' అట్లు, నించెనని వెనుకకు నన్వయము.'

శుక్తిమతీకుమారికి, రమ్యగుణాబ్ధిని వరించుటయె యందము. నదీకన్యకు నబ్ధియేకదా వరణీయుఁడు. శుక్తిమతీ సంభవయందును ముత్తెములు అబ్ధియందును ముత్తెములు. కాన పరస్పరపరివర్తనము. రక్తసరోజపాణి-యిది ముత్తెము లనేకవర్ణము లొందుట కొక కారణము గాన సాభిప్రాయము. అనేకవర్ణ మణిజాలము. ఇందులకు సంవాదము.

'జానక్యాః కమలామలాఞ్జలిపుటే యాః పద్మరాగాయితాః' (రామకర్ణామృతము.)

ఉ. అత్తఱి నమ్మహోనిధి నిరావరణస్ఫురణంబుతోఁ బరి
ద్యోతితపద్మినీ సుమమృదుచ్ఛదసంగ్రథితాంశుకాంతుఁడై
యాతతదీప్తి వైభవకృతాంబరపీఠికఁ బొల్చి ప్రాజ్యయో
గాతిశయ ప్రకాశము హుతాశికిఁ గూర్చె మహాద్భుతంబుగన్.

అ. అత్తఱిన్ = ఆసమయమందు, సుముహూర్తము రాత్రియందుఁ గనుక రాత్రియందనుట. అమ్మహోనిధి=ప్రతాపనిధి-వసురాజని యర్థము, సూర్యుఁడని యర్థాంతరము. నిరావరణస్ఫురణంబుతోన్-తెఱచాటు లేనియునికితో-తిమోరూపమైన యావరణము లేక యని యర్థాంతరము. పరి... కాంతుఁడై-పరిద్యోతిత = మిక్కిలి ప్రకాశించుచున్న, పద్మినీ = పద్మినీజాతి స్త్రీయైన గిరికయొక్క, సుమమృదుచ్ఛద = పుష్పమువలె మెత్తనయిన వస్త్రముతోడ, సంగ్రథిత = కూర్పఁబడిన, అంశుక అంతుఁడై= పుట్టము చెఱఁగుగలవాఁడై, యని యర్థము. పరిద్యోతిత = ప్రకాశితమైన, పద్మినీ = తామరతీఁగయొక్క, సుమమృదుచ్ఛద=పువ్వుల మెత్తనిరేకులతోడ, సంగ్రథిత =కూర్పఁబడిన, అంశు=కిరణములచేత, కాంతుఁడై = ఒప్పుచున్నవాఁడై యనియు, లేక అంశుకమనఁగా కప్రిత్యయముచేత-కిరణము గనుక కిరణాగ్రములు గలవాఁడై యనియునర్థాంతరము. ఆతత... పీఠికన్—ఆతత=విస్తారమైన, దీప్తివైభవ = రత్నకాంతుల విభవముచేత, కృత అంబర = వస్త్రముగల, పీఠికన్ = పీటయందు, పొల్చి = ప్రకాశించి యని యర్థము. అతిశయకాంతిచేత వ్యాప్తమయిన, అంబర = ఆకాశమనెడు, పీఠికన్ = పీఠమందు ప్రకాశించినవాఁడై యని యర్థాంతరము. మహాద్భుతంబుగన్ = మిక్కిలి యాశ్చర్యమగునట్లుగా, ప్రాజ్యయోగ = ప్రకృష్టమయిన ఆజ్యము (అహుతితోడి) కూడికచేతనయిన, అతిశయప్రకాశము = మిక్కుటమయిన ప్రకాశము, హుతాశికిన్ = అగ్నిహోత్రునకు, కూర్చెన్=కలుగఁజేసెనని యర్థము. ప్రాజ్యయోగ = (ప్రాంజ్యమనఁగా అధికము) అధిక సంయోగముచేతనైన అతిశయప్రకాశము నగ్నికిఁ గూర్చెనని యర్థాంతరము.

'దినాన్తే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః' అనువచనమువలనను 'ఆదిత్యోవా అస్తమయన్నగ్ని మను ప్రవిశతి, అగ్నింవావాదిత్యస్సాయం ప్రవిశతి' అను శ్రుతివలనను అస్తంగతుఁడయిన సూర్యుఁడు తనతేజము నగ్నియందుఁ జొనుపుచున్నాఁడనుట గలదు. కావుననే సూర్యుఁడు ప్రాజ్యయోగముచే నగ్నికి నతిశయప్రకాశము గూర్చుట. ఇట వసురాజు, తెరతీయఁగానే వధూవరుల చెఱంగులు ముడివేయఁబడఁగా తలతల మెఱయుచున్న వస్త్రముచేకప్పఁబడినపీఠికయందుఁగూర్చుండి అగ్నిహోత్రము మిక్కిలిప్రకాశించునట్లుగా నం దాజ్యముచే వేల్చెనని యర్థము. ఇంతేకాన 'మహాద్భుతంబుగన్' అననేల? అర్థాంతరమునుబట్టిమహాద్భుతము ఎట్లనఁగా—రాత్రియందు సూర్యుఁడు చీకటి

ముసరుమాన్చి తామరరేకులు విరియఁగిరణాగ్రముల నిగిడించుచు నాకాశమున మిక్కిలి ప్రకాశించుచుఁ దనతోడిమిక్కిలి కూడికచేత నగ్నికి నతిశయప్రకాశము గూర్చినాఁడనిగదా యర్థాంతరము. పగటి సూర్యుఁడుదయించుటయు నస్తమించునపుడు అగ్నియందుఁ దన తేజము నుంచుటయునని యుండఁగా రాత్రియం దుదయించుటయు ఉదయించునపుడు తనతేజ మగ్నియందుంచుటయుననుట మహాద్భుతముగదా. కాన యర్థాంతరము మహాద్భుతముగ నుండెను. మహాద్భుతంబుగననుటచే నర్థాంతరము సూచ్యము.

ఉ. లేజవరాలిపాణి యుగళీపరిరంభణ పాటలీభవ
ల్లాజచయంబు భావినిఖిలక్రతుభుక్తినిమంత్రణాక్షత
శ్రీజనకంబు గాఁగ మునిచెంత శిఖి నాశిఖియుం బ్రసన్నుఁడై
యాజితచిత్తభూరతులకారతు లిచ్చెఁ బ్రదక్షిణార్చులన్.

అ. లే జ... యంబు—లేజవరాలి = లేఁతవయస్సుగల గిరికాదేవియొక్క, పాణియుగళీ = చేదోయియొక్క, పరిరంభణ=కౌఁగిలింతచేత-పట్టుకొనుట చేతననుట, పాటలీభవత్ = తెలుపును ఎఱుపును గలసిన పాటలవర్ణమగుచున్న, లాజచయంబు = వరిపేలాలు, గిరికచేతు లెఱ్ఱనికాంతిగలవి గాన తత్సంపర్కముచేతఁ దెల్లనిలాజలు పాటలవర్ణములయినవని తెలియునది. భావి...గాఁగన్... భావి = మీఁదటి, నిఖిలక్రతు = అశ్వమేధాంతములయిన సకల యాగములందలి, భుక్తి = భోజనమునకొఱకు, నిమంత్రణ = నియమించిపిలుచుటకొఱకైన, అక్షత = అక్షింతలయొక్క, శ్రీ = పెంపునకు, జనకంబుగాఁగన్ = కలిగించునది యగునట్లుగా, శిఖిన్ = అగ్నియందు. ఉనిచెను. అనఁగా అగ్నియందు లాజహోమము చేసెననుట. ఆశిఖియున్ = ఆయగ్నిహోత్రుఁడును, ప్రసన్నుఁడై = అనుగ్రహించినవాఁడై, ఆజితచిత్తభూరతులకున్ = సౌందర్యముచేత జయింపఁబడిన మన్మథుఁడును రతిదేవియును గలవారికి- అనఁగా వసురాజునకును గిరికాదేవికిని, ప్రదక్షిణఅర్చులన్ = కుడివైపుగా చుట్టుజ్వాలలచేత, ఆరతులిచ్చెను.

ఇట నాయిక లేజవరాలు. 'పాణియుగళీపరిరంభణ'-అట్టిది రెండుచేతులను బిగియఁ గౌఁగిలించుకొనఁగా 'పాటలీభవత్' లాజలేని రక్తిమఁబూనకుండునా ! అని 'లేజవరాలు' 'పరిరంభణ'శబ్దములచే లాజలయందు నాయకత్వము ధ్వనించుచున్నది. 'లేజవరాలు చెక్కుగీటిన వనవల్చుశాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే' యనుచో లేజవరాలిచేతితాఁ కెంతయు వయసుకాండ్రకురసోద్దీపకముగదా. అట్టి లేజవరాలే 'పాణియుగళీ' తనరెండుచేతులను 'పరిరంభణ' బిగియఁ గౌఁగిలింపఁగా 'పాటలీభవత్' రక్తి కలుగకమానదు. 'నిఖిలక్రతు'—ఒక్కక్రతువుగాదు పెక్కులందు భోజనము. నిమంత్రణ = ఊరకపిలుచుటకాదు. త్రోసిపుచ్చరాకుండునట్టు నియమముతోఁ బిలుచుట. నిమంత్రణ మనఁగా.

'అత్రయస్యాకరణే ప్రత్యవాయ స్తన్ని మన్త్రణమ్ యథా 'ఇహాభుఞ్జీతభవాన్' యస్యాకరణే ప్రత్యవాయోనస్యాత్ తదామన్త్రణమ్ యథా 'ఇహాశయీత భవాన్' ఇతినిమన్త్రణా మన్త్రణయోర్భేదః' (ముగ్ధబోధటీకా దుర్గాదాసు)

అన్నట్లు చేయకుండరాని పిలుపు. అందులకై అక్షతలు పెట్టుట మఱింత నియమత్వాతిశయమునకు అపరిహార్యత్వమునకును. అన్నింటిక్రతువులం దట్టి పిలుపు గలుగఁగలదుగాన శిఖిప్రసన్నుఁడగుట. ప్రసన్నుఁడయినందులకు ఫలమేదక్షిణార్చులు. అదిశుభసిద్ధిసూచకము. అంతేకాని ఆరతులిచ్చుట

చూపులు కనుఁబాటు తగులకుండుటకై యారతు లిచ్చుట. ప్రదక్షిణముగాఁ దిరుగుజ్వాలలు ప్రదక్షిణముగా బడిసి రానిచ్చు ఆరతిదీపములవలె నుండుటచే ఆరతులుగా నధ్యవసించినాఁడు. ఒక్కయారతిదివ్వెగాదు. 'అర్చులన్' ఆసౌందర్యాతిశయమునకు పెక్కుదివ్వెలారతు లిచ్చినాఁడు. అగ్ని కుడివైపుగాఁ బ్రజ్వరిల్లుటచే శుభము చేకూడునని ప్రసిద్ధము.

మ. జనకోత్సంగనివాసవాసననొ రాజన్యన్యస్త హస్తాభిమ
ర్శనసౌఖ్యామృతపారవశ్యముననొ సైఁచెన్ శిలాయోజనం
బని సాధ్వుల్ వొగడం బ్రియాంఘ్రి సనెకల్ హత్తించె భూజాని త
ద్ఘనభాగ్యంబు ఝుళంఝుళత్కటకరత్నంబుల్ ప్రశంసింపఁగన్. 32

అ. భూజాని = వసురాజు, జనక+ఉత్సంగనివాస వాసననొ=తండ్రియైన కోలాహల పర్వతునియొక్క తొడయందలి ఉనికియొక్క సంస్కారము-అనగా అలవాటు - చేతనో, లేక, రాజ ... వశ్యముననో-రాజ = వసురాజుచేత, న్యస్త = ఉంపఁబడిన, హస్త = చేతియొక్క, అభిమర్శన = అంటుటవలన నయిన, సౌఖ్య అమృత = అమృతప్రాయమైన సుఖభావముచేత, పారవశ్యముననో = మైమఱపుచేతనో, శిలాయోజనంబు = రాతితోఁ గూర్చుటను-రాయితాఁకుననుట, సైఁచెన్=సహించెను. అని, సాధ్వులు = పతివ్రతలు, పొగడన్, ప్రియా అంఘ్రిన్ = ప్రియురాలిపాదమును, సనెకల్, హత్తించెన్ = తాఁకించెను. ఎట్లనిన - తత్ ఘనభాగ్యంబు = ఆసన్నెకల్లుయొక్క త్రొక్కించుట అను గొప్పభాగ్యమును, ఝుళంఝుళత్ కటకరత్నంబుల్=ఝుళంఝుళమని మ్రోఁగుచున్న అందెల యొక్కమణులు, ప్రశంసింపఁగన్=శ్లాఘించినట్లుగా, సన్నెకల్లు హత్తించెనని సంబంధము.

గిరిక యడుగు లత్యంత కోమలములు. అది సన్నెకంటి తాఁకుడును సైఁచుట అభ్యాసవాసనచే గాని పారవశ్యముచేతఁగాని కావలయు. వాసనయేని జనకోత్సంగ నివాసముయొక్క వాసన. పారవశ్యమేని రాజన్య...అమృతమువలని పారవశ్యము కావలయును. తద్ఘన భాగ్యంబు కటకమణులు ప్రశంసించుట తాము సుశిలాజాతియేకావున, మనజాతిలోని సన్నెకల్లు గిరికాపదస్పర్శభాగ్యముంబొందెనని ఝుళంఝుళధ్వనిచేఁ బొగడినవి. రాజు ప్రియురాలియడుగు నెత్తి యందియలు ఝుళంఝుళమని మొరయుచుండ సన్నెకల్లు మెట్టించెనని తాత్పర్యము.

చ. సిరులు ఫలింప దంపతులు చెంత నరుంధతిఁ జూచుచోఁ బర
స్పరనయనాంతముల్ గదియ బాలికచూపులు పర్వె నప్పు డ
ప్పరమసతీ పదాబ్జములపై భవదీయసువాసినీత్వవై
ఖరిఁ గరుణింపు మంచు విరిగల్వలఁ బూజలు సల్పెనో యనన్. 33

అ. దంపతులు = వధూవరులు, సిరులుఫలింపన్ = సకలసంపదలును ఒనఁగూడుకొఱకు, చెంతన్ = పెండ్లికై వచ్చి పొంతనేయున్న, అరుంధతిని, చూచుచోన్=చూచెడిసమయమందు, పరస్పరనయన అంతముల్ = ఒండొరుల కడగన్నులు, కదియన్=తారసింపఁగానే,—ఇరువురు గన్నులను ఒక్కలక్ష్యమునందే గిటికొనుటచే కడగన్నులు కదిసినవనుట. కడగన్నులు గదియుటవలన గడగంటి చూపులును గదియుట వ్యంజితము. బాలిక చూపులు=గిరిక చూపులు, అప్పుడు, అప్పరమసతీ పదాబ్జములపైన్ = పరమపతివ్రతయైన యాయరుంధతియొక్క యడుగుఁదామరలమీఁద, వ్యాపించెను. దంపతుల కడగంటి చూపులు గదియఁగానే గిరిక లజ్జచేతఁ దలవంచెననియు ఆయమ

చూపు లరుంధతియడుగులపయిని బ్రసరించెననియుఁ దాత్పర్యము. ఆ ప్రసరించుట యెట్లుండెననఁగా-భగవతీయ సువాసినీత్వవైఖరిన్ = నీదుముత్తైదువతనముయొక్క తీరుచే-నీముత్తైదు వతనమువంటి ముత్తైదువతనమును, కరుణింపుమంచున్ = దయసేయుమని, విరిగల్వలన్ = వికసించిన కలువపూలచేత, పూజలుసల్పెనోయనన్, బాలికచూపులు పరమసతీ పదాబ్జములపైఁ బర్వెనని సంబంధము.

ఎలజవ్వని చూపులు నల్లగలువలవలె నుండును.

'నీరాత్తీరముపాగతా శ్రవణయోస్సీమ్ని స్ఫురన్నేత్రయోః!
శ్రోత్రే లగ్నమిదం కిముత్పలమితి జ్ఞాతుంకరం న్యస్యతి
శైవాలాఙ్కురశఙ్కయా శశిముఖీ రోమావలీం ప్రోంఛతి
శ్రాన్తాస్మీతిముహుః సఖీ మవిదితశ్రోణీభరా పృచ్ఛతి. (రసమంజరి)

సీ. వెలయించి రభిజాతవేదులతో జాత, వేదుఁ బ్రదక్షిణాపాదనములఁ
గాంచిరి ధ్రువపదంబంచితామరవర్య, వరముతో నుత్తరోత్తరముగాఁగఁ
దాల్చిరి గురుతపోధనుల దీవనలతో, నమృతవర్ణంబు లార్ద్రాక్షితములు
తిలకించి రవలోకిచల కిరీటములతో, రత్నరమ్యములు నీరాజనములు
తే. తనిపి రనుపాధికహావప్రదత్తరుచిమ, దమృతసారాన్నసామగ్రినాత్మబంధు
జాతములతో మహోత్సవాయాతసకల, శతమఖపురాధివాసులసతియుఁబతియు.

అ. సతియున్ పతియున్ = గిరికాదేవియును వసురాజును, అభిజాతవేదులతోన్—(అభిజాతులనఁగా 'అభిజాతస్తుకులజే బుధే' అ. మంచికులముగలవారు వేదులనఁగా వేదముగలవారు) సత్కులీనులయిన శ్రోత్రియులతోడ, జాతవేదున్ = అగ్నిహోత్రుని, ప్రదక్షిణాపాదనములన్ (ప్రదక్షిణ+ఆపాదనములన్)=వలగొనుట గలిగించుటలచేతను, (ప్రదక్షిణా+ఆపాదనములన్ = ప్రకృష్టములయిన దక్షిణలను గలిగించుటలచేతను), వెలయించిరి = ఉల్లసిల్లఁజేసిరి.—అగ్నిదేవునిఁ బ్రదక్షిణములచేతను, శ్రోత్రియులను బ్రకృష్టదక్షిణలచేతను వెలయించిరని యర్థము.

అంచిత అమరవర్య వరముతోన్ = ఒప్పుచున్న మేటిదేవతల వరముతోడ, ధ్రువపదంబు = ధ్రువునియొక్క స్థానమును, ఉత్తరోత్తరముగాఁగన్ = ఉత్తరస్థితములయిన చుక్కలకు ఉత్తరముగాను, ఉత్తరోత్తరాభివృద్ధిగాను, కాంచిరి—ఉత్తరమున ధ్రువపదమును జూచిరనియు ఉత్తరోత్తరాభివృద్ధిగా దేవతావరము పడసిరనియు నర్థము.

గురుతపోధనుల దీవనలతోన్ = పెద్దలయిన మునులయొక్క దీవనలతోడ, అమృతవర్ణంబులు ఆర్ద్రాక్షితములు = అమృతమువలెఁ దెల్లని వన్నెగల యక్షింతలని యక్షతపరమైన యర్థము. అమృతాక్షరములు గలవియని దీవనలపరమైన యర్థము గనుక అమృతధవళాక్షతములను - అమృతాక్షర సహితములైన దీవనలను, తాల్చిరి.

అవలోకి...లతోన్—అవలోకి = చూచెడివారియొక్క, చల = శిరఃకంపమువలన చంచలములైన, కిరీటములతోన్, రత్నరమ్యములు = (నీరాజనపరముగా) రత్నములవలె రమ్యములైనవి—(కిరీటపరముగా) రత్నములచేత రమ్యములయినవి, అగు నీరాజనములను తిలకించిరి=చూచిరి. ఆవధూవరులను చూచిన రాజులందఱును మెచ్చి రత్నఖచితమకుటయుక్తములయిన శిరములనల్లార్చిరనియు, కనుఁబాటుబిగులకుండుటకై తోడనే రత్నములవలె వెలుంగుచున్న హారతులను నివాళించిరనియునర్థము.

ఆత్మబంధుజాతములతోఁ = తమబంధువుల సమూహముతోడ, మహోత్సవ = వివాహమను పెద్దవేడుకకు, ఆయాత = వచ్చిన, సకల = సమస్తమైన, శతముఖపురౌకసులన్ = ఇంద్రపట్టణమే నివాసముగాఁగల దేవతలను, అను... సామగ్రిన్—అనుపాధిక = అయత్నసిద్ధమైనదియు-తనంతటనే కలిగినదియు, హవ్యప్రదత్త = హోమముచేత ఈఁబడినదియు, రుచిమత్ = చవిగలిగినదియు, అగు, అమృతసార అన్నసామగ్రిన్ = హవనముచేత దత్తమైనది గనుక అమృతరూపమైన సారానము నిండుఁదనముచేత, తనిపిరి = దేవతలను తృప్తిపొందించిరనియు—అయత్నసిద్ధమైనదియు, హవ్యప్రదత్తము = ఆహ్వానముచేత ఈఁబడినదియు, రుచిమత్ = మధురుచులు గలదియు, అమృతసార = అమృతమువలె సారమైనదియునగు అన్నసమృద్ధిచేత ఆత్మబంధువులను తృప్తిఁబొందించిరనియు నర్థము. హవిస్సుచేత ఈఁబడినది అమృతమనఁ బడును. ఇదియే యజ్ఞశేషమందురని తెలియఁనది. 34

క. వీడు చదివించె నయ్యెడ, వీడనివేడుక బలారి విబుధులతో లే
వీడుమణు లనఁగఁదగు తన, వీడునఁ గలమానికములు వివిధాంబరముల్.

అ. అయ్యెడన్ = ఆసమయమందు, బలారి = ఇంద్రుఁడు. విబుధులతోన్ = దేవతలతోడ, వీడనివేడుకన్ = శిథిలముగాని యుత్సవముచేత, లేవు ఈడుమణులు అనఁగన్ తగు = వీనికి సాటియైన మణులు లేవనునట్లు దగియున్న, తనవీడునన్ = తనపట్టణమునందు, కలమానికములును, వివిధ అంబరముల్ = నానావిధములైన మేలువస్త్రములును, వీడుచదివించెన్ = కట్నము చదివించెను. 35

సీ. గండశైలములకుఁ గరపాదములు వచ్చె, నో యన మెఱయు నాగాయుతములు
హరిణజాతికి మరున్నిరసనోద్ధతి గల్గెనో యనఁ దగు సైంధవవ్రాతకరములు
నంభోదములకుఁ బాయనిమించులొదవెనో, యనమించుమణిమయస్యందనములు
నవలతావళికి యానవిలాస మెసఁగెనో, యనఁ బొల్చుసరసకన్యాయుతంబు

తే. లాత్మమణిహేమరజతంబులవుడయుచిత, తనువులువహించెనో యనఁ దనరువివిధ
శయనపాత్రాసనములు భూజాని కొసఁగె, హరికృపాలబ్ధశుభశాలి యచలమాలి.

అ. హరికృపాలబ్ధ శుభశాలి = ఇంద్రుని దయచేత పొందఁబడిన శుభములచేత ఒప్పుచున్నవాఁడగు, అచలమాలి = కోలాహలుఁడు, భూజానికిన్ = వసురాజునకు, గండశైలములకున్ = గండశిలలకు - పెద్దపెద్దబండరాలకు, కరపాదములు వచ్చెనో యనన్ = తొండములును కాళ్లను వచ్చెనో యేమి యన్నట్లుగా, మెఱయు = ప్రకాశించునట్టి, నాగాయుతములు = ఏనుఁగుల పదివేలు-పెక్కు పదివేల యేనుఁగలనుట.

హరిణజాతికిన్ = లేళ్ల సమూహమునకు, మరుత్ + నిరసన + ఉద్ధతి = వాయువును తిరస్కరించెడి యొగ్గు-(వాయువునకు లేళ్లు వాహనములై క్రిందపడియుండినవి. వానికి యిప్పుడు వాయువు నతిశయించునట్టియుద్ధతి,) కల్గెనో యనన్, తగు, సైంధవములు = గుఱ్ఱములును - వాయువునకును వేళ్లకును మించిన వేగముగల గుఱ్ఱములనుట.

అంభోదములకున్ = మేఘములకు, పాయనిమించులు = ఎడతెగని మెఱుపులు, ఒదవెనో అనన్ = పొందినవా యేమియనునట్లుగా, మించు, మణిమయ స్యందనములు = రత్నమయములయిన రథములును, నవలతావళికిన్ = లేఁదీఁగల గుంపులకు, యానవిలాసము = నడసొబగు, ఎసఁగెనో యనన్, పొల్చు, సరసకన్యా అయుతంబులు = పదివేలకొలఁది రసికురాండ్రగు స్త్రీలును.

ఆత్మమణి హేమరంజితంబులు=తనయందలి, రత్నములును బంగారమును వెండియు, అపుడ= ఆసమయమందే, ఉచితతనువులు=తగినట్టి దేహములు, వహించెనోయనఁగ, తనకు, వివిధ = పలు దెఱంగులయిన, శయన = శయ్యలును, పాత్ర = పాత్రములును, ఆసన=ఆసనములును, ఒసఁగెను.

గండశిలాదులు పర్వతస్థిత వస్తువులుగాఁ దెలియునది. 36

సీ. కస్తూరిమెకములు కమ్మజవ్వాదిపి, ల్లులు సు మ్మివి మదంక విలసితములు
ఘనసారకదళికల్ గంధద్రుమములు సు మ్మి, వి మదీయ జీవన సమధికములు
కిన్నరద్వంద్వముల్ కీరరాజములు సు,మ్మివి మదీయక్రోడ విచలితములు
మాణిక్యసారంబు లాణిముత్యములు సు,మ్మివి మదాకరవంశ హిండితంబు
తే. లివి మృదులదివ్యవసనంబు లివి యమూల్య
భూషణము లివి యమ్లానపుష్పములు మ
దగ్రసంతానజములు సు మ్మనుచుఁ దెలిపి
యల్లునికి నిచ్చె వెండియు నాదరమున. 37

అ...కమ్మ = సొగసయిన—లేక, కమ్మజవ్వాది=ఇంపయిన వాసనగల జవ్వాది.

('కమ్మజవాది వాసనలు గ్రమ్మఁగ', 'కమ్మ వలపు' ఇత్యాదులందుఁ గమ్మ శబ్దము వాసనకు విశేషణముగా ప్రయుక్తములు) ఇవి, మత్ అంకవిలసితములు = నాఒడియందు ఒప్పునవి - నా ఒడియందిడి ప్రేమతోఁ బ్రోచినవి యనుట. నాదాపున నొప్పుచుండునవని యర్థాంతరము.

ఘనసారకదళికల్ = కర్పూరపు అరంటులును, గంధద్రుమములు = శ్రీచందన వృక్షములును, ఇవి మదీయజీవన సమధికములు = నాయొక్క బ్రతుకునకంటె ఎక్కుడయినవి - అనఁగా నా ప్రాణముకంటె హెచ్చయినవని యర్థము—జీవనమనఁగా జలమును గనుక, నాయందలి జలములవలన అధికములయినవని అర్థాంతరము.

కిన్నరద్వంద్వముల్ = కిన్నరపక్షిమిథునములును, కీరరాజములు = రాచిలుకలును, మదీయ క్రోడ విచలితములు=నారొమ్మునందు వర్తించునట్టివి. అక్కున మక్కువతోఁ బెట్టుకొని పెంచికవని యర్థము - క్రోడమనఁగా గుహయు. నాదుగుహాంతరమందుఁ బ్రవర్తించునట్టివని యర్థాంతరము.

మాణిక్యసారంబులు = పద్మరాగమణి శ్రేష్ఠములును, ఆణి ముత్తెములును, మత్ ఆకరవంశ హిండితములు=నాకు గనియైన కులమందు ప్రవర్ధితములయినవని యర్థము. మత్ = నాయందలి, ఆకర = గనులయందును, వంశ = వెదుళ్లయందును, హిండితములని యర్థాంతరము.

వసనంబులు = వస్త్రములు. అమూల్య = వెలలేని. అమ్లాన = వాడని. ఈవసన భూషణ పుష్పములు మూఁడును, మదగ్రసంతానజములు = నాజ్యేష్ఠపుత్ర సంభవములని యర్థము. జ్యేష్ఠ పుత్రుని సంతానము తండ్రికిఁ బ్రియతమ మగుట ప్రకటము - అగ్రభాగములందలి సంతానము లనెడు దేవవృక్షములవలనఁ బుట్టినవని యర్థాంతరము. కల్పవృక్షములుగాన వస్త్రమాల్య భూషణముల నిచ్చుట. అనుచుఁ, తెలిపి, అల్లునకుఁ, వెండియుఁ, ఆదరమున, ఇచ్చెను.

(అంక) తొడయందిడి పెంచుట, (జీవన) ప్రాణములకంటె నెక్కుడగుట, (క్రోడ) అక్కునఁ బెట్టుకొని ప్రోచుట, కులమునందు వర్ధిలుట, పెద్దకొడుకు బిడ్డలగుట, యివిమూఁడును అత్యంత ప్రియములగుటకు సూచకములుగాన యిట్లు చెప్పఁబడినవి. ఇట్టి గారాబువస్తువుల నల్లున కిచ్చుట 'వెండియు నాదరమున.'

చ. అసదృశభక్తి శుక్తిమతిశయాత్మజరత్నములన్ నిరంకుశ
వ్యాప్తమరదీప్తివాని శుచివృత్తమహత్త్వమువాని నన్నిటిన్
వసున కొసంగి యయ్యెడ నవారితభూరితదీయసామ్యవ
ద్వసుపదనామపుత్త్రమణి తద్వసుపాదము సేర్చెఁ జేర్చినన్. 38

అ. శుక్తిమతి, అసదృశభక్తిన్ = సాటిలేనిభక్తిచేత, నిరంకుశత్ విస్పృమరదీప్తి వానిన్ = అడ్డు లేనిదానివలె ఆచరించుచున్న (అనఁగా నడ్డులేని) వ్యాపించు శీలముగల. కాంతి గలిగినవియు, శుచివృత్త మహత్త్వమువానిన్ = తెలుపును, గుండ్రనయు, ఉరువును గలిగినవియు, అగు, ఆత్మజరత్నములన్ = (శుక్తిమతియని సాభిప్రాయముగాఁ జెప్పుటవలన) తననలనఁబుట్టిన ముక్తామణులనని యర్థము. నిర ... వానిన్ = అప్రతిహతమను వ్యాపనశీలమునయిన, దీప్తివానిన్ = ప్రతాపము గలిగినవియు, శుచివృత్తమహత్త్వమువానిన్ = పరిశుద్ధమైన వర్తనపు పెంపుగలవియునగు, ఆత్మజరత్నములన్ = కుమార శ్రేష్ఠులనని యర్థాంతరము - ఇటరత్నశబ్దము శ్రేష్ఠవాచకము. అన్నిటిని, వసునకున్, ఒసంగి = వసురాజునకిచ్చియని యర్థము - వసువనఁగా బంగారము గనుక 'అనర్ఘ మపిమాణిక్యం హేమాశ్రయ మపేక్షతే' అన్నట్లు రత్నకాంచనయోగము గలిగించియని సారస్యము. అయ్యెడన్, అవారితభూరి... మణిన్ - అవారిత = వారింపరాని, భూరి = అధికమైన, తదీయ = ఆ ఆత్మజరత్నములయొక్క, సామ్యవత్ = సమాన ధర్మములు గలిగిన, వసుపదనామ = వసుపదుఁడను పేరుగల, పుత్త్రమణిని, తద్వసు పాదము చేర్చెన్ = ఆవసురాజుయొక్క అడుగులను జేర్చెను. అనఁగా రాజునకు నమస్కా రము సేయించెను, చేర్చినన్ = అట్లు చేర్పఁగా మీఁది కన్వయము.

వ్యాకరణము... 'నిరంకుశ... వానిన్' 'శుచి... వానిన్' అనుచో తచ్ఛబ్దము అమహద్వాచక నపుంసకలింగకములతోను సమసించుట ఘటించుచున్నది. పుల్లింగములకుఁగలదు - 'నలరాజు దెగడు సోయగమువాని' (వసుచ). 'చిప్పకూకటివానిఁ జిన్నినవ్వులవానిఁ జెరివినమంచి పించియమువాని' (పాండురంగ). ఇట 'వాని' అనునది అమహత్తు ద్వితీయా బహువచనముగాని మహత్తుద్వితీయైక వచ నముగాదు. అప్పటికి ప్రథమయందు 'నిరంకుశ... దీప్తిది' 'శుచి... త్త్వముది' అని రూపములు తెలియునది. వసుశబ్దమునకు 'వసువునకున్' 'వసునకున్' అని రెండురూపములునుగలదు. ఉకా రాంతములకు వుగాగమము వైకల్పికము. 'ఉకారాంతశబ్దములకు వైకల్పికముగా గోశబ్దంబులకునిత్యముగా వుగాగమంబగు' (బాలవ్యాకరణము) మఱియునిందులకు లక్షణము.

వుత్వమువిసర్గ లోపంబు నొందనొకటి, చనను కారాంతశబ్దంబు దెనుఁగుసేయ
రఘురఘువు బాహుబాహువు రాహురాహు, వూరు వూరువు నన మేరు మేరు వనఁగ

అవియును వీఁడును 'నిరంకుశ... దీప్తివారును' 'శుచి... త్త్వమువారును.' అవి ఆత్మజ(పుత్త్రి) రత్నములు, వీఁడు(పుత్ర) మణి—కావుననే (తదీయసామ్యవత్) వానితోడి సామ్యము వీనికి మఱియు 'ఆత్మజరత్నములనువసునకు కొసంగి' యనుచో ఆరత్నములు వసుపదమగుచున్నవి. వీఁడును 'వసుపద' అను అభిధేయమునుబట్టి వానితోడ అభిధేయత్వ సామ్యమునుగలఁడు. ఇట్లు తదీయసామ్యము 'భూరి' అధి కముగానున్నది. ఇట ముక్తామణులకును వసుపదమునకును శ్లిష్టవిశేషణ మహిమచేత సామ్యమును నిబం ధించి వానిని వసునకొసంగినట్లె వీనిని వసుపాదము సేర్చినాఁడని సామ్యమునకుఁ గల భూరిత్వమును ప్రకటించినాఁడు.

మ. సకలాశాంతనిశాంత రాజమకుటీసంక్రాంతమాణిక్యకో
రకనీరాజనముల్ మహాకటకధౌరంధర్యముం గాంచి పా
యక పద్మోన్నతిఁ బూనుచుల్ నిజపదాఖ్యాయోగ్యతల్ మించ రా
జకులగ్రామణి యుంచె నవ్వసుపదుల్ సైన్యాధిపత్యంబునన్. 39

అ. ఇందు 'నిజపదాఖ్యాయోగ్యత' ననుటచేవసురాజుపాదమునకును వసుపదునకును అర్థద్వయము గలుగఁజెప్పినాఁడు — సకల...రాజనముల్ — సకల ఆశాఅంత = సమస్త దిక్కుల తుదలు, నిశాంత=వాసముగాఁగలిగిన, రాజ=రాజులయొక్క, మకుటీ=కిరీటములందు, సంక్రాంత=కూడి కొన్న, మాణిక్యకోరక=మొగ్గలవలెనున్న పద్మరాగముల చేత, నీరాజనముల్=ఆరతియును, మహాకటకధౌరంధర్యముల్=మిక్కిలి గొప్పలయిన పాదవలయములయొక్క ధురంధరత్వమును, కాంచి=పొంది అని (పాదపరము), దిక్కుదిక్కులయందలి రాజులు కిరీట మాణిక్యకాంతులు పరిభ్రమించునట్లుగాఁజేయు చున్న శిరఃకంపములను, మహాపట్టన ధురంధరత్వమును బొందియని (వసుపదపరము), పాయక, పద్మోన్నతిల్ పూనుచుల్=విడువక తామరల యున్నతినిగాని పద్మరేఖోన్నతినిగాని వహించుచునని(పాదపరము) - సంపదభ్యున్నతిని వహించుచును అని (వసుపదపరము), నిజపద+ఆఖ్యాయోగ్యతల్ = తనయొక్క (అనఁగా వసురాజుయొక్క) పద=పాదమందలి, ఆఖ్యా=శోభయొక్క, యోగ్యతచే తనని యర్థము-నిజపద=తనపాదమనెడు అనఁగా వసుపదుఁడనెడు, ఆఖ్యా=పేరి యొక్క, అర్హత్వము చేతనని భావము, మించల్, రాజకులగ్రామణి = వసురాజు, ఆవ్వసుపదుల్, సైన్యాధిపత్యంబునల్, ఉంచెను.

వసురాజుపాదము 'సకలా...పద్మోన్నతిఁ బూనుచు' నుండినది. వసుపదుఁడునట్టివాఁడే. కావు ననే 'నిజ పదాఖ్యాయోగ్యత'-వసురాజోపాదముయొక్క శోభకు అర్హమగుటయు వసుపదుండను పేరికి అర్హమగుటయు. ఆ యోగ్యత అంతతోఁబోక 'మించు'టకై సైన్యాధిపత్యమునం దుంచెను. పద్మ మనఁగా తామర. పద్మయనఁగ లక్ష్మి ('లక్ష్మీః పద్మాలయా పద్మా' అమ) అనఁగా సంపద, ఆఖ్యయనఁగా పేరును శోభయును.

ఉ. రాజపురందరుండు నగరాజతనూజయు నిట్లు శక్రసం
యోజితమంగళం బెనసి యున్కిఁగనుంగొని మున్ను వారి ను
ద్వేజకతీవ్రతేజమున వేఁచినసాహసి గాన వేగ నం
భోజవిరోధి సేరెఁ బరభూధరకందరకోటరాంతమున్. 40

అ. రాజపురందరుండు = రాజేంద్రుఁడు-వసురాజు, నగరాజతనూజయుల్=గిరికయు, ఇట్లు, శక్రసంయోజిత మంగళంబు=ఇంద్రునిచేతఁ గూర్పఁబడిన వివాహమయమయిన శుభమును, ఎనసి = పొంది, ఉన్కిల్=ఉండుటను, కనుంగొని, మున్ను=పెండ్లికిముందు, వారిల్=ఆదంపతులకు, ఉద్వేజక తీవ్రతేజమునల్=భయపెట్టునట్టి వేంద్రమయిన ప్రతాపముచేత ననియర్థము-వేంద్రమయిన చంద్రిక చేత ననియర్థాంతరము—విరహులకు చంద్రకిరణములు వేఁడియనుట ప్రసిద్ధము. వేఁచినసాహసిగాన, వేగల్ = శీఘ్రముగాననియర్థము—తెల్లవాఱఁగా ననియర్థాంతరము. అంభోజవిరోధి = చంద్రుఁడు, పరభూధర......రాంతముల్—పరభూధర=పడమటి కొండయొక్క, కందర=గుహయనెడు, కోటర=తొఱ్ఱయొక్క, అంతముల్=లోపలిని, చేరెను—అనఁగా అస్తమించెననుట.

మ. జనరాడ్దివ్య వివాహవైభవము మించన్ రేయి రేరాజు నిం
చినజ్యోత్స్నాంశువితానతారకసుమశ్రేణుల్ నెఱుల్ వీడఁగా
దినరా జన్నియు నూడ్చి యయ్యెడ మిళత్తేజోమయాతామ్రనూ
తనపట్టాంబరముల్ ఘటించె హరిదంతవ్యోమభాగంబునన్. 41

అ. జనరాట్ దివ్యవివాహవైభవము=వసురాజుయొక్క మేలయిన పెండ్లిపెంపుసొంపు, మించన్=అతిశయించునట్లుగా, రేయి=రాత్రియందు, రేరాజు=చంద్రుఁడు, హరిత్ అంతవ్యోమభాగంబునన్=దిక్కుల తుదలందలి ఆకాశప్రదేశమందు, నించిన = నిండారఁజేసిన, జ్యోత్స్నా-అంశు-వితాన=వెన్నెల-కిరణముల-సమూహమనెడు (తెల్లనివస్త్రమును వస్త్రముతోఁగూర్చిన నవారు పట్టెలును గల) మేలుకట్టునందలి, (ఇట జ్యోత్స్నాంశు వితానమనెడి వితానము అని గ్రహించునది. చంద్రిక మేలుకట్టునందలి ధవళవస్త్రముగాను, తదంశువులు అందలి నవారుపట్టెలుగాను రూపించుకొనునది.) తారకసుమశ్రేణుల్ = నక్షత్రములనెడు పూవుపంక్తులు, నెఱుల్=బాగులను, వీడఁగా = బాగులుదప్పి చెడిపోఁగాననుట, దినరాజు = సూర్యుఁడు, అన్నియునూడ్చి = వానినన్నిటిని దీసివైచి, అయ్యెడన్ = ఆసమయమందు, మిళత్...బరముల్—మిళత్=కూడుకొనుచున్న, తేజోమయ = అరుణకాంతిరూపమైన, ఆతామ్ర = అంతట నెఱ్ఱనయిన, నూతన=క్రొత్తవియగు, పట్టాంబరముల్ = పట్టువస్త్రములను, ఘటించెన్ = కూర్చెను.

రేరాజును దినరాజును తమకువిహితమైన కాలమందు తగిన యలంకరణసామగ్రితో వసురాజును సేవించిరని యాశయము. రేరాజు తెల్లనిమేలుకట్టుకట్టి పూలపందిరులువైచెను. దినరాజు ఎఱ్ఱపట్టుగుడ్డల నలుదిక్కులను గట్టెను. తెల్లవాఱఁగానే వెన్నెలయొక్కయుఁ జంద్రకిరణములయొక్కయు, నక్షత్రములయొక్కయు సౌష్ఠవము చెడిపోయినదనియు, సూర్యునియొక్క అరుణకాంతి యంతటను వ్యాపించెననియుఁ దాత్పర్యము.

ఉ. ఇంతికిఁ జేదిభూపతికి నిట్లు వివాహమహంబు శేషహో
మాంత మొనర్చి యాచతురహంబులఁ బూర్ణహవాదిక క్రియా
సంతతదీయమానచరుసారములం బరితృప్తిఁగాంచి య
త్యంతకుతూహలంబున సుధాంధసు లిచ్చి రభీప్సితార్థముల్. 42

అ. ఇంతికిన్ = గిరికాదేవికిని, చేదిభూపతికిన్ = వసురాజునకును, ఇట్లు, వివాహమహంబు = కల్యాణోత్సవము, శేషహోమాంతము = శేషహోమమే చివరయగునట్లుగా, ఒనర్చి, ఆచతురహంబులన్ = ఆ పెండ్లి నాలుగుదినములయందు, పూర్ణ...రములన్—పూర్ణహవ+అదిక = పూర్ణాహుతులు మొదలయిన, క్రియా = హోమక్రియలందలి, సంతత = నిరంతరము, దీయమాన = ఇయ్యఁబడుచున్న, చరుసారములన్ = మేలయిన చరువులచేత—హోమయోగ్యపక్వాన్నము చరువు, పరితృప్తిన్ కాంచి= లెస్సగాఁ దృప్తినిబొంది, అత్యంతకుతూహలంబునన్ = మిక్కిలి సంతోషముచేత, సుధాంధసులు = (అమృతమన్నముగాఁగల) దేవతలు, అభీప్సిత అర్థముల్ = కోరిన ప్రయోజనములు, ఇచ్చిరి. అనఁగా గిరికా వసురాజులకు సమస్తవరముల నొసంగిరనుట.

సీ. సురభిసంతాన విస్ఫురణ మిచ్చె నగారి, యిష్టార్థసంసిద్ధి నిడియె వహ్ని
యుహతధర్మగుణంబు లర్పించె సమవర్తి, కామరూపతఁ గూర్చెఁ గ్రవ్యభోజి

భువనవశీకారకము ఘటించె సలిలేశుఁ, డసమదివ్యామోదక మొసఁగె గాడ్పు
కల్యాణసామగ్రి ఘటియించె నిధిరాజు, జితదర్పకత్వంబు చేర్చె శివుఁడు
తే. ప్రబల దీర్ఘాయురారోగ్యభాగ్యకరము
లగువరంబులు సమకూర్చి రఖిలమునులు
నూతన వివాహకౌతుకద్యోతమాన
మానసీయాకృతికిఁ జేదిమనుజపతికి. 43

అ. నూతన...కృతికిన్—నూతన = క్రొత్తదయిన, వివాహకౌతుక = పెండ్లితోరముచేత, ద్యోతమాన = ప్రకాశించుచున్న, మాననీయ = మన్నింపఁదగిన, ఆకృతికిన్ = ఆకారము గలవాఁడగు, చేది మనుజపతికిన్ = వసురాజునకు, నగారి = ఇంద్రుఁడు, సురభిసంతాన విస్ఫురణము = సురభిసంతాన విస్ఫురణముగలవాఁడు గనుక సురభిసంతాన విస్ఫురణ మిచ్చెననుట. ఉత్తరత్ర యీలాగుననే తెలియునది. కామధేను కల్పవృక్ష స్ఫూర్తి నిచ్చెనని యర్థము. సురభిగుణముల చేత పరిమళించుచున్న సంతానముల నిచ్చెనని యర్థాంతరము.

వహ్ని=అగ్ని, ఇష్టార్థసంసిద్ధిన్ ఇడియెన్=(ఇష్టమనఁగా 'ఏకాగ్నికర్మహవనం త్రేతాయాం యచ్చహూయతే। అంతర్వేద్యాంచయద్దాన మిష్టం తదభిధీయతే' అనిస్మృతిచొప్పున యాగము) యాగకార్య సంసిద్ధినిచ్చెనని యర్థము. అభీష్టార్థ సంసిద్ధి నిచ్చెనని యర్థాంతరము.

సమవర్తి = యముఁడు, అహతధర్మగుణంబులు = అవిచ్ఛిన్నమయిన ధర్మగుణముల నిచ్చెనని యర్థము. (ధర్మమనఁగా విల్లును గుణమనఁగా నారియుఁగనుక) విఱుగనివిల్లును నారియునిచ్చెనని యర్థాంతరము. క్రవ్యభోజి = నైరృతి, కామరూపతన్ కూర్చెను = కామరూపత్వమును గలిగించెనని యర్థము. కాముని అనఁగా మన్మథుని సౌందర్యమును గలుగుటను గూర్చెనని యర్థాంతరము.

సలిలేశుఁడు = వరుణుఁడు, భువనవశీకారము ఘటించెన్ = జలవశీకరణమును ఒనగూర్చెనని యర్థము. లోకవశీకరణము గలిగించెనని యర్థాంతరము. గాడ్పు, అసమదివ్య ఆమోదము, ఒసఁగెన్=సాటిలేని మేలయిన పరిమళము నిచ్చెనని యర్థము. మిక్కిలి యుత్కృష్టమయిన్నయానందము నిచ్చెనని యర్థాంతరము.

నిధిరాజు = కుబేరుఁడు, కల్యాణసామగ్రిన్ ఘటియించెను = బంగారు సమృద్ధిని ఒడఁగూర్చెనని యర్థము. శుభసామగ్రిని బొందించెనని యర్థాంతరము. శివుఁడు = ఈశానుఁడు, జితదర్పకత్వంబు చేర్చెను = జయింపఁబడిన మన్మథుఁడు గలుగుటను సమకూర్చెనని యర్థము. జయింపఁబడిన గర్వగ్రస్తులు గలుగుటను గూర్చెనని యర్థాంతరము.

అఖిలమునులున్, ప్రబల దీర్ఘాయురారోగ్యభాగ్యకరములు, అగువరంబులు, సమకూర్చిరి.

క. వెండియు నాఖండలుఁ డరి, ఖండనజయసాధన ప్రకాండము స[illegible]దు
ద్దండ మొకదివ్యవైణవ, దండము దయ నొస[illegible] ధరణీధవునకు [illegible] 44

అ. ఆఖండలుఁడు = ఇంద్రుఁడు, వెండియున్, అరిఖండన జయసాధన ప్ర[illegible]డము = [illegible]త్రువులను ఖండించినదయిన జయసాధనములందలి శ్రేష్ఠమయి[illegible]ము - అరిఖండ[illegible]మున జ[illegible]సాధన శ్రేష్ఠమనుట, సమిత్ ఉద్దండము = యుద్ధమందు మిక్కి[illegible]ప్రచండమయినదియు [illegible] సమిధ[illegible]కట్టెలయందు, ఉత్+దండము = అతిశయించినకట్టె[illegible]నదియు, [illegible] ఒక దివ్య, [illegible]దండము [illegible]వెదురుకఱ్ఱ, దయన్, ఒసఁగి, ధరణిధవునకున్, రాజునకు, ఇ[illegible]ను.

సీ. తనయనంతాదిదుర్దాంతమూలబలంబు, లహిలోకతల మెల్ల నాక్రమింపఁ
దనశతకోటి పర్వనితాంతమహిమ యం, తికనగంబుల వకావకలు సేయఁ
దనమేచకశిరోధికని రూఢనటన మ, భ్రగపురంబుల నెల్ల రాయిడింపఁ
దనయభిజాతనూతనసుపర్ణస్ఫూర్తి, విషధరంబులమూఁకవిప్పొనర్పఁ

తే. బుట్టెనేవంశ మపరంజిగట్టుమీఁద, దానితుదవ్రయ్య లీశానదనుజహరుల
కాదిఁ బృథుకార్ముకములయ్యె నయ్యఖండ, వేణుకాండంబునుమ్మిదివిబుధమిత్ర.

అ. తన...బలంబులు—తన, అనంత = లెక్కలేని, అతిదుర్దాంత = మిక్కిలియు అడంప రాని, మూల = వేళ్లయొక్క, బలంబులు = సత్తువలు, అహిలోకతలము ఎల్లన్ = పాతాళలోక ప్రదేశమంతటిని, ఆవరింపన్—అని యర్థము---అనంతుని (అనఁగా శేషుని) యొక్క అతిదుర్దాంతము లయిన, మూలబలములు = సొంతవర్గము లేక మూలసేనలు, నాగలోకప్రదేశము నాక్రమింపఁగానని యర్థాంతరము. ఇట్లే యర్థము నర్థాంతరమును మీఁదఁ దెలియునది.

తన...మహిమ—తన, శతకోటి = పెక్కుకోట్ల లెక్కగల, పర్వ = గనుపులయొక్క, నితాంతమహిమ = ఎక్కుడయిన ప్రభావము. అంతికనగంబులన్ = దాపటిచెట్లను, వకావకలు సేయన్ = బ్రద్దలు సేయఁగా---శతకోటి = వజ్రాయుధముయొక్క---(శతకోటి స్స్వరుశ్శంబోదంభోళిరశనిర్ద్వయోః' అ) పర్వ = (అది దధీచి నెన్నునెమ్ముగనుక) గనుపులయొక్క, అతిశయమహిమ, నగములను = పర్వతములను, వకావకలు సేయఁగాననియును---'శైలవృక్షేనగావగౌ' విశ్వము.

తన, మేచక...నటనము—తన, మేచక = నల్లనయిన, శిరః=కొనయొక్క, అధిక=బిట్టుగా, నిరూఢ = ఏర్పడిన, నటనము = ఆట-అల్లలాట, అభ్రగపురంబులన్ ఎల్లన్ = ఆకాశమందలి పట్టణముల నన్నిటిని, రాయడింపన్ = రాపిడి పెట్టఁగా—మేచకశిరోధిక = నల్లనికుత్తుకగల శివునియొక్క, నిరూఢమయిన, నటన = తాండవము. అభ్రగపురంబుల [illegible] రాయిడింపననియును—హరుఁడు తాండవముసల్పుచుఁగా నతని జటాసమూహమువలన ఆకాశభాగము రాయిడి నొందుచున్నదనుట 'ముహుర్ద్రావ్యర్థా [illegible] యాత్యనిభృతజటాతాడితతటా' లేక, నటనమనఁగా విలాసమని యర్థముచేసి నచో హరునివిలా[illegible] పురత్రయమును రాయిడిపెట్టినదనియు నర్థాంతరము.

తన...[illegible]—తన, అభిజాత[illegible] పుట్టిన, నూతన=క్రొత్తవియగు, సుపర్ణ = సొబగైన యాకులయొక్క, [illegible]ఫూర్తి, విష[illegible]రంబుల మూఁకవిప్పు=(విషధరములనఁగా జలధరములును సర్పములును). మేఘము[illegible]చెదరుటను[illegible] ఒనర్ప[illegible]= చేయఁగా - చెల్లాచెదరుచేయఁగాననుట. అభిజాత = సుందరమయి, నూ[illegible] = క్రొత్త[illegible]యిన—[illegible]పతిసవమయిన, సుపర్ణస్ఫూర్తి = గరుడునితోఁపిక—సర్ప[illegible] చెల్లాచెద[illegible] సే[illegible]ఁగాననియును [illegible] 'ఇట విషధరంబులకెల్ల విప్పొనర్ప' నని అచ్చుప్రతులఁ [illegible] [illegible]ది. అప్పుడువిప్ప[illegible]ఁగా విరియఁబాఱుట. ఈ పాఠమునే సీతారామా[illegible] [illegible]గ్రహిం[illegible]

'[illegible] [illegible]వలక్కు[illegible] [illegible] జుట్టతో విప్పుతో దరిఁ దొండమాడ' అముక్తమాల్యద. [illegible] [illegible]యఁబాఱుట' యని యర్థముచేసిరి. కాని సోమకవి వ్యాఖ్యా [illegible] [illegible]యేయున[illegible] యర్థ[illegible]ము మిక్కిలి యనుగుణము. మనుచరిత్రమందును '[illegible] [illegible]విప్ప' [illegible]యుక్తమైయున్నది.]

ఏవంశము = ఏవెదురు, అపరంజిగట్టుమీఁదన్ = మేరుపర్వతముపయిని, పుట్టెను. దాని, తుదగ్రవయ్యలు = చివరబద్దలు, ఈశానదనుజహరులకున్ = శివునకును విష్ణుదేవునకును, అదిన్ = తొల్లి, పృథుకార్ముకములు = గొప్పవిండ్లు, అయ్యెను. అయ్యఖండవేణుకాండంబు ఇదినుమ్ము ఆ= ఖండయిన (తెంపులేని) వెదురు కట్టునుమాయిది, విబుధమిత్ర = దేవసఖుఁడవయిన వసురాజా. ఇట నాలుగుపాదంబులయందును వరుసగా 'అనంత' 'శతకోటి' 'మేచకశిరోధిక' 'సుపర్ణ' యను శబ్దముల యర్థాన్వయమున కనుగుణముగా నర్థద్వయమును బొందుపఱచుట తెలియునది.

తుదగ్రవయ్యలే . విష్ణురుద్రులపెనువిండ్లయ్యె ననఁగా అఖండమయిన నడిమిబోదెపటిమఁ జెప్పనక్కఱలేదు. ఇట్టిది వసురాజున కిచ్చుటకు నతఁడు 'విబుధమిత్రుఁడు' గదా.

క. ఈదండము పరపాదప,వేదండము పరమపటిమకోవిహాసితపురభి
త్కోదండము భవదీయభు, జాదండమునన్ ఘటింపఁ జయ మగునాజిన్. 46

అ. పరపాదపవేదండము = శత్రువులు అనెడిచెట్లకు ఏనుఁగు అయినది - ఏనుఁగు వృక్షములను ధ్వంసము సేయునట్లు పగవారినిధ్వంసము సేయునది,పరమ...కోదండము = మిక్కుటమయినచేవచేత ఎగతాళిచేయఁబడిన (త్రిపుర సంహారకుఁడగు) శివుని విల్లుకలది—శివుని ధనుస్సును దిరస్కరించు పటుత్వముగల దనుట. భవదీయ భుజాదండమునన్ = దండమువంటినీచేతియందు, ఘటింపన్ = తాల్పఁగా, ఆజిన్ =యుద్ధమందు, జయము, అగును. దండమును భుజాదండమున ఘటించుట యను రూపమేగదా. శివుని కోదండమునకంటె పటువయి 'పర ... వేదండ' మగుటచే, జయకరమగును.

సీ. ఘనమై ఘటించు లోకక్రూరనిర్ఘాత, మాశుగమై కూల్చు ననలఘుతరుల
నతిఘోరతమమై పరాంధ్య మాపాదించుఁ, గీలియై సమిదిద్ధకేళి నెఱపు
విలసద్విశేషమై విషములనేఁచు న, చ్యుతమూర్తియై బలిస్ఫురణ మడఁచు
మహితోగ్రవృత్తియై యహితేభహతి సల్పు, భానిధియై ప్రతాపంబు సూపుఁ
తే. బార్థివ యఖర్వ సర్వసుపర్వ విభవ
ధూర్వహము గాన యిది యాజిఁ దోఁచు నఖల
దివ్యసాధన సారమై దీనిఁదాల్చు
ధన్యుఁ డుద్దండ సుభటమూర్ధన్యుఁ డరయ. 47

అ. ఘనమై ఘటించు లోకక్రూర నిర్ఘాతము=గొప్పదియై లోకద్రోహులగు జనులకు మిక్కిలి ఘాత మాచరించునని యర్థము—మేఘమై లోకమందు క్రూరమయిన అశనిపాతము (పిడుగుపాటు) చేయుననియర్థాంతరము—ఇట్లె అర్థద్వయము మీఁద నెల్లఁదెలియునది. ఆశుగమై కూల్చున్ అలఘు తరులన్ = తీవ్రగమనముగలదై మిక్కిలి అధికులయిన వారిని కూల్చును - వాయువై గొప్ప వృక్షములను కూలఁద్రోయుననియు. (ఆశుగమనఁగా తీవ్రగతిగలదియు వాయువును)

అతి ఘోరతమమై పరాంధ్యము ఆపాదించున్=మిక్కిలియు భయంకరమై పరులకు (శత్రులకు) అంధ్యము =అడ్డుపాటు, నిరోధము కలిగించును - మిక్కిలి ఘోరమయిన, తమమై = చీఁకటియై, పర=ఉత్కృష్టమయిన ఆంధ్యము=అంధత్వము - గ్రుడ్డితనమును, ఆపాదించుననియును, కీలియై సమిదిద్ధ కేళి నెఱపు - కీలియై = చిల్లులుగలదై, సమిత్ = యుద్ధమందు, ఇద్ధ = ప్రకాశించుచున్న, కేళి= క్రీడను, నెఱపును, కీలియై = కీలలనఁగా జ్వాలికలును గనుక అగ్నియై, సమిధ్ = కట్టెలయందు, ఇద్ధకేళి నెఱపుననియు.

విలసత్ విశేషమై విషములన్ ఏఁచున్ = విలసిల్లుచున్న విశేషము (అతిశయము) గలదై విషమజనులను బాధించును. వి = పక్షులలో, లసత్ విశేషమై = ప్రకాశించుచున్న అతిశయమై - అనఁగా గరుత్మంతుఁడై, విష నివారణముచేయుననియును, అచ్యుతమూర్తియై బలిస్ఫురణము అడఁచున్ = అభంగవిగ్రహముగలదై బలవంతుల స్ఫూర్తి నడఁచివేయును - విష్ణుమూర్తియై-అనఁగా వామనమూర్తియై - బలిచక్రవర్తియొక్క విజృంభణ మడఁచుననియును.

మహిత ఉగ్రవృత్తియై అహిత ఇభహతి సల్పున్ = ఒప్పుచున్న రౌద్ర వ్యాపారము గలదై, శత్రుశ్రేష్ఠులనుహతముసేయును (ఇట ఇభశబ్దము 'స్యురుత్తరపదేవ్యాఘ్ర పుంగవర్షభకుంజరాః। సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' అ. అని శ్రేష్ఠవాచకము)-ఉగ్రుఁడనఁగా శివుఁడు గనుక - శివుని వృత్తిగలదై, అహిత+ఇభహతి = శత్రువయిన గజాసురుని వధముసేయుననియు, భానిధియై ప్రతాపంబు సూపున్ =ప్రకాశనిధియై ప్రతాపము కనఁబఱుచును-సూర్యుఁడైయెండ తాపమును గనఁబఱుచుననియు.

పార్థివ=రాజా, అఖర్వ... గాన=అఖర్వ=వంకరలేని - చక్కనయిన, సర్వ = సకలమయిన, సుపర్వ = మంచి గనుపులయొక్క, విభవ = పెంపునకు, ధూర్వహముగాన = ధురంధర మయినది గనుక, - అఖర్వమయిన సమస్తదేవతావిభవములకు ధురంధరమయినది గనుకననియు, అఖిల దివ్య సాధనసారమై = సమస్తములయిన దివ్యాయుధములలో శ్రేష్ఠమై-దేవతాసాధనములందు శ్రేష్ఠమైన వజ్రమై, (సుపర్వ-మంచిగనుపుల సంపత్తి గలది యనుటకు మేటి దివ్యాయుధమై యనియు, సుపర్వ-దేవతల పెంపునకు ధురంధరమైన దనుచో, దివ్యమగు వజ్రాయుధమై యనియు, ఆయర్థద్వయమునకు ఈయర్థ ద్వయమును వరుసగా నన్వయించు కొనునది.) ఇది, ఆజిన్ =యుద్ధమందు, తోఁచున్, శాన, దీనిని దాల్చు ధన్యుండు, అరయన్ ఉద్దండ సుభటమూర్ధన్యుఁడు = ప్రచండులయిన శూరులలో శ్రేష్ఠుఁడుసుమా.—ఉన్నతదండము గల శూరులలోననియుఁ జమత్కారము.

శా. సచ్ఛిద్రం బసమగ్రసార మొకవంశం బూని గోచక్ర మా
త్మేచ్ఛాధీన మొనర్చె గోపతనయుం డీదివ్య వంశోత్తమం
బచ్ఛిద్రం బతిమాత్రసార మిది బాహామండలిం బూనువాఁ
డచ్ఛిన్నంబుగ నేలఁజాలఁడె సమస్తావక్రగోచక్రముల్. 48

అ. గోపతనయుండు = గొల్లపిల్లవాఁడని యర్థము - కృష్ణుఁడని భావము. సచ్ఛిద్రంబు = బొందతోఁగూడినది, అంతశ్ఛిద్రత్వమను దోషముతోఁగూడినదనియు నర్థము (లోపల బొంగుగానుండుట యొక దోషముగా గణింతురు). అసమగ్రసారము = నిండయిన చేవలేనిది - లోపల బొంగుగా సత్తువలేనిదనుట - దుర్బలమయినదనియు నర్థము, (అగు) ఒక వంశంబు ఊని = ఒక వెదురును దాల్చి, గోచక్రము = భూవలయమునని యర్థము - గోసమూహమునని భావము. ఆత్మఇచ్ఛా అధీనము = తన యిచ్ఛకులోనయినదానినిగా, చేసెను—తనకు స్వాధీనముగాఁ జేసికొనెననుట. ఈ దివ్యవంశ + ఉత్తమంబు = దేవసంబంధియైన యీ వెదురుమిన్న, అచ్ఛిద్రంబు = ఛిద్రములులేనిదియు, అతి మాత్రసారము = మితిమీఱిన లోనిచేవగలదియు - అధిక బలముగలదియు అని యర్థము. కాఁబట్టి ఇది, బాహామండలిన్ =భుజమండలమందు, పూనువాఁడు, సమస్త అవక్రగోచక్రముల్ = సమస్తమయిన వంకరలేని (అనఁగా సరిగాగుండ్రడ నయిన) భూచక్రమును, అచ్ఛిన్నంబుగన్ = అవిచ్ఛిన్నముగా-నడుమనెడతెఱపిలేకుండునట్లుగా, ఏలన్ చాలఁడె=ఏలఁజాలుననుట.

గొల్లపిల్లవాఁడొకఁడు లోపలసత్తువలేక బొంగయినవెదురు నొకటిగొని భూచక్రము నంతయుఁ దనయధీనముచేసికొనెనఁట. ఈ వెదుగు దివ్యమయినది. ఉత్తమమునయినది. లోపల బోలుకాదు-మతి చేవయతి మాత్రముగలది. ఇట్టిదానిని జేతబూనినవాఁడు భూవలయమునంతయు నేల నేర్చునసుట చెప్పవలయునా యని తాత్పర్యము. శ్రీ కృష్ణుఁడు బొంగువెదురు నొకటి పిల్లనగ్రోవిగాఁబట్టుకొని గోగణమునంతయు గాన ధ్వనిచే వశముచేసికొని యుండెనని భావము.

సచ్ఛిద్రము అసమగ్రసారమయిన ఒక (ఏదో సామాన్యమయిన) వంశము చేపట్టి గోచక్రము ఇచ్ఛాధీనమయ్యెను. అనఁగా తన యిచ్ఛకులోనయ్యెను. అచ్ఛిద్రమును అతిమాత్రసారమునయిన దివ్య వంశోత్తమును బూనినచో సమస్తాచక్రగోచక్రమును ఆత్మేచ్ఛాధీనము కాదా. గోపతనయుండు గోచక్రమును ఆత్మేచ్ఛాధీన మొనర్చెననఁగా శ్రీకృష్ణునకు భూవలయమంతయు సంకల్పాధీనమనియు భావము వ్యంజితము.

ఉ. చండతమంబు పర్వలవసంధి నొక నొకవేళ రాజమా
ర్తాండులఁబట్టి క్రాయునది ♦ దారుణచండతమంబె యీమహో
ద్దండతమం బఖండగతిఁ ♦ దార్కొని క్రమ్మఱ నీదు రాజమా
ర్తాండులఁ బర్వసంధి ఘటితద్రఢిమంబు నిరంతరంబుగన్. 49

అ. చండతమంబు='(చండ స్త్వత్యంతకోపనః' 'తమస్తు రాహుస్స్వర్భానుః' అ.) మిక్కిలి కోపముగల రాహుగ్రహము. పర్వలవసంధిన్ = పర్వముయొక్క సూక్ష్మకాల సంధియందు-అనఁగా పాడ్యమికిని పంచదశికిని నడిమి యవకాశమందనుట. ఒకానొకవేళన్, రాజమార్తాండులన్ పట్టి క్రాయున్=చంద్రసూర్యులను గ్రహించి వెంటనే వెడలఁగ్రక్కును. కాబట్టి అది, దారుణచండతమంబె=(దారుణపదము చండత్వస్తు తిపరము) దారుణచండతమమా కాదని యర్థము - అనఁగా చండతమ మనెడినామమునకు యోగ్యముగాదనియు చండ మయిన తమ మత్యంతచండముగాదనియుఁ దెలియునది. చండతమముగాని దారుణచండతమము గాదని యర్థాంతరము. ఈ మహోద్దండతమంబు = మహోద్దండమయిన యీ తమము (అనఁగా రాహువు) అని యర్థము, మహత్తరమయిన యున్నత దండశ్రేష్ఠమని భావము - (అతిశయితోద్దండః దండతమః ఉన్నతశ్చాసౌ దండతమశ్చ. ఉద్దండతమః మహాన్ ఉద్దండతమః మహోద్దండతమః అని విగ్రహము) అఖండగతిన్, తార్కొని= ఖండములేని - అనఁగానిండయిన - గతితోడ తారసించియని యర్థము- (ప్రసిద్ధరాహువుఖండితగాత్రుఁ డనుట.) రాజమార్తాండులన్=చంద్రసూర్యులనని యర్థము. (రాజశ్రేష్ఠులనని భావము) పర్వసంధి ఘటితద్రఢిమంబు = పర్వసంధియందు సంఘటితమైన రాజమార్తండ గ్రసనదార్ఢ్యము, నిరంతరంబుగన్ = ఎడతెగకుండునట్లుగా, —పర్వ సంధియందుఁ బట్టుట యెప్పుడును శిథిలముగా కుండునట్లుగా, క్రమ్మఱనీదు=మఱలిపోనీయదని యర్థము, గనుపుల సంధియొక్క-దార్ఢ్యము ఎడతెగకుండునట్లుగా రాజశ్రేష్ఠులను తప్పించుకొని మరలి పోనీయదని భావము.

క. ఈగద సాకారజయ శ్రీ, గద జగదవనధుర్య చిరకీర్తివధూ
యోగద యనఁదగు దీని న, యోగద లెన్నేనిఁ బోలనోపునె జగతిన్. 50

అ. జగత్ అవనధుర్య = లోకరక్షణమును వహించినవాఁడా, వసురాజా, ఈగద, సాకారయశ్రీకద= ఆకృతి దాల్చిన జయలక్ష్మిగదా, చిరకీర్తివధూయోగద=శాశ్వతకీర్తి యనెడు కాంత

తోడి కూడిక కలుగఁజేయునది. అనఁగా తగుదీనికిన్, జగతిన్, అయోగదలు = ఇనుపగుదియలు, ఎన్నేనిన్ పోలనోపునే — అనఁగాఁ బోలనేరవనుట.

చ. రతిపతి తండ్రితూపును (1) బురత్రయశాసను శాతహేతి భా
రతిపతియంబకంబు నగరంధ్రవిధాయకుశక్తి దీనికిం
బ్రతి సమ మీఁడు జోడనఁగరాదు ధరాధిప దీనిభక్తితోఁ
బ్రతిసమముల్ భజించుచు సపర్యలొనర్ప శుభంబు నీకగున్. 51

అ. ధరాధిప = రాజా, రతిపతి తండ్రితూపును = మన్మథుని తండ్రియగు విష్ణుదేవుని అస్త్రమును-అనఁగా నారాయణాస్త్రమును, లేక చక్రమును, పురత్రయశాసను శాతహేతి = త్రిపురాంతకుఁడగు శివునియొక్క వాడి ఆయుధమును, — అనఁగా పాశుపతాస్త్రమును, లేక త్రిశూలమును, భారతిపతి అంబకంబు = బ్రహ్మాస్త్రమును, నగరంధ్రవిధాయకుశక్తి = క్రౌంచపర్వతమునకు తొలచేసిన కుమారుని శక్తి అనెడు ఆయుధమును, దీనికిన్ = ఈవేణుదండమునకు, ప్రతి, సమము, ఈడు, జోడు, అనఁగరాదు — అనఁగా నారాయణాస్త్రము ప్రతియనియు పాశుపతాస్త్రము సమమనియు, బ్రహ్మాస్త్రమీడనియు శక్తిజోడనియు ననరాదు. — అనఁగా దీనికి నవి సమానము కావనుట, కాఁబట్టి, దీనిన్, ప్రతిసమము = ఏఁటేఁట - ప్రతిసంవత్సరమును, భజించుచున్ = కొలుచుచు, సపర్యలు = పూజలు, ఒనర్పన్ = చేయఁగా, శుభంబు నీకున్ అగును.

ప్రతిసమము - అనుచో - 'సమాసు సమాసు ప్రతిసమమ్' అనివ్యుత్పత్తి - 'సంవత్సరో వత్సరోబ్దో హాయనో స్త్రీశరత్సమాః' అమ. సమాశబ్ద మాకారాంత స్త్రీలింగంబును నిత్యబహువచనాంతంబునని తెలియునది. 'ప్రతిసమకల్పిత కరులై' అని భారత మాది పర్వము. ఇట తూపు, హేతి, అంబకంబు, శక్తి అనువీనికిఁ గర్తలగు విష్ణు రుద్ర బ్రహ్మకుమారులను 'రతిపతితండ్రి' 'పురత్రయశాసన' 'భారతిపతి' 'నగరంధ్ర విధాయక' అనువిశేషణముల చేఁ బేర్కొనుట తదతిశయ ద్యోతనార్థము; తన్మూలమున తదీయాయుధ ప్రాశస్త్యసమర్థనార్థమును.

ఆ. అనుచు దివ్యవంశ మాదివ్యవంశబాంధవున కఖిలధరణీధవున కొసఁగి
యతుల హితుల నెనసి యతులవైఖరి నేఁగె, వాసవుఁడు నిజాధివాసమునకు 52

అ. అనుచున్, వాసవుఁడు = ఇంద్రుఁడు, దివ్యవంశము = దివ్యమయిన యావెదురుఁగఱ్ఱను, ఆదివ్యవంశ బాంధవునకున్ = యోగ్యమయినకులమందలి సగోత్రపురుషుఁడైన యనియర్థము — దేవతావర్గమున కాప్తుఁడైన యనిభావము. 'వంశో వేణౌకులేవర్గేదృష్ట్యావయవేఽపిచ' విశ్వము. అనియిట వంశశబ్దము వర్గపరము. అఖిలధరణీధవునకున్ = సమస్తభూమికి నాథుఁడయిన వసురాజునకు, ఒసఁగి, యతులన్ = మునులను, హితులన్ = ఆప్తులను, ఎనసి = కూడికొని, నిజఅధివాసమునకున్, అతులవైఖరిన్ = సాటిలేనిరీతిని, ఏగెను. నిజాధివాసువునకు నని పాఠాంతరము. వాస్తువు అనఁగా నిల్లని కలదుగాని వాసువు శబ్దము మృగ్యము. ఇందు యమకము దెలియునది.

క. గిరియును గిరిజామాతయు, గిరిజామాతయు యథార్థ్యకృతసత్కారా
దరగరిమ ననుపఁ దమతమ, యిరువుల కరిగిరి సరిద్గిరీశ్వరు లంతన్. 53

1. క. బురత్రయహర్తనిశాతహేతి. గ. బురత్రయమంతను చేతిహేతి.

అ. గిరియును = కోలాహలుఁడును, గిరిజామాతయు = అతనికల్లుఁడయిన వసురాజును ('జామాతాదుహితుః పతిః' అ). గిరిజా+మాతయున్ = గిరికతల్లి శుక్తిమతియు, యథార్హాకృత సత్కారఆదర గరిమన్ = వారివారికిఁ దగినట్లుగా చేయఁబడిన పూజలచేతను ఆదరాతిశయము చేతను, అనుపన్, సరిత్ గిరీశ్వరులు=నదులును పర్వతశ్రేష్ఠులును, తమతమ, యిరువులకున్ = నివాసములకు, అరిగిరి, అంతన్.

ఉ. హేమలతానిభాంగికి నధీశనివేశనవప్రవేశదీ
క్షామహనీయమంగళము సర్వము సాంగముగా ఘటించి య
క్కోమలిఁ జేరఁబిల్చి తల* గ్రుచ్చియుఁ గౌఁగిటఁ జేర్చి భూధర
గ్రామణి పల్కె గాఢతర గద్గదికాఘన నిస్వనంబునన్. 54

అ. భూధరగ్రామణి = పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలుఁడు, హేమలతానిభాంగికిన్ = బంగారుతీఁగవంటి దేహము గల గిరికాదేవికి, అధీశనివేశన వప్రవేశదీక్షా మహనీయ మంగళము = పెనిమిటి గృహమునందలి క్రొత్తగా ప్రవేశించుటయొక్క నియమముగల ఒప్పిదమయిన శుభము,— అనఁగా నూతనగృహప్రవేశమునకుఁ దగిన లాంఛనము, సర్వము, సాంగముగాన్ = సమగ్రముగా, ఘటించి, అక్కోమలిన్ చేరన్ పిల్చి, తలగ్రుచ్చియు = తల కడుపులో నుంచియు, కౌఁగిటన్ చేర్చి, గాఢ... స్వనంబునన్=మిక్కిలి బిట్టయిన డగ్గుత్తికతోఁ గూడిన పెద్దయెలుంగుచేత, పల్కెన్.

క. నీతమ్ములశుభ వాసన, నీతలిదండ్రుల గభీర నిశ్చలగుణ వి
ఖ్యాతియును దలఁచి మెలఁగుము, నాతల్లీ కులవధూజనమతల్లికవై. 55

అ. నీతమ్ములశుభవాసన = నీ తోడఁబుట్టువులయొక్క మంచిశీలమును అనియర్థము—తామరలయొక్క మంచి వాసనను అనిభావము. నీతలిదండ్రుల=నీతల్లియైన శుక్తిమతియొక్కయు, నీతండ్రియైన నాయొక్కయు, గభీరనిశ్చలగుణ విఖ్యాతియును=గభీరనిశ్చలగుణములయొక్క ప్రసిద్ధియును అనియర్థము—లోఁతును గదలకుండుటయును అనిభావము. ఇట క్రమాలంకారము. తలంచి = విచారించి, నాతల్లీ=మాయమ్మా, కులవధూజనమతల్లికవు ఐ=పతివ్రతాజనములో శ్రేష్ఠురాలవై, మెలఁగుము.

సీ. మాఱుమాటాడదు మఱచియైనను గురు, వ్యాహారమున కీయహార్యతనయ
యానభ్రమగతిఁ బూను మానంపుసవతు లె, త్తినది నీవ్యరత్నానుజాత
తాఁగయ్యె మేర మీఱదు దొకప్పుడును ఘనశ్రీలఁ బొంగియును నీ సింధుకన్య
యేకాకృతి వహించు నిను రాగవృత్తికి, నపరాగవృత్తికి యబ్జవదన

తే. యచ్చెరువు వింత యబ్బురం బరిది యనుచు
విశ్వధాత్రీశ్వరులు మెచ్చ వెలయవమ్మ
యమ్మ భవదీయచిత్రగుణాతిశయము
వలన మాకెల్ల వన్నెరా మెలఁగవమ్మ. 56

* 'గ్రుచ్చికవుంగిటఁ జేర్చి' యని పాఠాంతరము.

అ. ఈఅహార్యతనయ = ఈపర్వతకుమారిక, గురువ్యాహారములకున్ ('వ్యాహారఉక్తిర్లపితమ్') పెద్దలయిన అత్తమామలు మొదలయినవారి మాటలకు మఱచియైనను, మాఱుమాట, ఆడదు అని యర్థము. పర్వతమైతే గురువ్యాహారమునకు మాఱుమాటాడుచున్నదనుట. పెద్దపెట్టుగాఁబలికినచోఁ బ్రతిధ్వని యిచ్చుచున్నదని భావము.

ఈదివ్యరత్న అనుజాత = మేలయిన ముక్తామణులతోఁ దోఁబుట్టువైనయిది, మానంపుసవతులు = కోపముగల సపత్నులు, ఎట్లైనన్ = తనయెడల నేలాగున విపర్యాసము జరిగించినప్పటికిని, ఆనమ్రగతిన్ పూనున్ = నమ్రత్వమును వహించునని యర్థము — ముక్తామణులైతే మానంపుసవతులెట్లయినను నమ్రభావము వహింపవనుట. రత్నములు తుల్యమానములైన - (సరియైనతూనిక కొలఁదులుగల) కట్టెల నీవలావల నిడి తూఁచినప్పటికిని సమానముగానే యుండునుగాని మ్రొగ్గుచూపవని భావము. సరియైన తూనిక గలవానికి సరిగానేతుల దూఁగును గదా. ఈ యర్థమం దిది సవతు శబ్దము బహువచనము. సవతు అనఁగా సాటి.

ఈసింధుకన్య = ఈనదికూఁతురు, ఘనశ్రీలన్ = గొప్పసంపదలచేత, పొంగి = ఉప్పొంగుచున్నను, ఒకప్పుడును, తాఁగదై = గయ్యాళియై, మేరమీఱదు. మర్యాదనతిక్రమింపదని యర్థము. నదియైతే ఘనశ్రీలచేత నుప్పొంగియొకప్పుడు తాఁగదై మేరమీఱుననుట. నదులు వర్షాకాలమందు మేఘోదకములచేతఁ బొంగి సంపూర్ణమై దరులనుమించి ప్రవహించుచున్నదని భావము.

అబ్జసహజ= తామరల తోఁబుట్టువు, ఇను = పెనిమిటియొక్క, రాగవృత్తికిన్ = అనురాగముతోఁ గూడిన నడవడికి, అపరాగవృత్తికిన్ = అనురాగములేని నడవడకిని, ఏకాకృతివహించున్ = ఒక్కవిధముగానే యుండునని యర్థము. అబ్జములో యినుని రాగవృత్తికిని అపరాగవృత్తికిని ఏకాకృతివహించి యుండవనుట. తామరలు, సూర్యుని రాగవృత్తికిన్ =(రాగముచేత ఉదయరాగము లక్షితముగాన) ఉదయపు ఉనికికిని, అపర అగవృత్తికిన్ =పడమటి కొండయందలి యునికికిని - అస్తమయమునకుననుట, ఏకవిధముగా నుండునని భావము.

అచ్చెరువు, వింత, అబ్బురంబు, అరిది. (చిన్నది మొదటి నాల్గుచరణములయందుఁ జెప్పిన చొప్పునఁ దనబంధువులకు విరుద్ధములయిన మంచిగుణములం జూపుటచే నాల్గింటికిని నాలుగాశ్చర్యవాచకములు) అనుచున్, విశ్వధాత్రీజనులు=సమస్తభూజనులు, మెచ్చన్ వెలయవమ్మ,అమ్మ=మాతల్లీ, భవదీయచిత్రగుణ అతిశయమువలనన్ = నీ యాశ్చర్యకరమైన గుణముల పెంపువలన, మాకెల్లన్, వన్నెరాన్ = వాసిగలుగునట్లుగా, మెలఁగవమ్మయని యర్థము. చిత్రగుణ అతిశయమువలనన్ =చిత్రవర్ణములగు నూలిపోఁగుల పెంపువలన, వన్నెరాన్ = వర్ణపుచీర కలుగునట్లుగా, అనియొక యర్థమును వ్యంజితమగుచున్నది. వన్నెయనఁగా వర్ణపుఁజీరయనుటకు.

తన్వంగి వలిపంబు దాల్చివచ్చిన కీవి వన్నెగట్టిన నాఁటి చెన్నుఁదన్ను (విజయ. 3)
వన్నెచీరలును... (గౌరన హరిశ్చంద్రద్విపద)

గుణములు చిత్రములు (ఆశ్చర్యకరములు) అగుట ఎవరికడుపునను ఎవరితోఁగూడను బుట్టెనో వారికిఁ గలిగియున్న గుణములకు విరుద్ధములై యుండుటంబట్టి. చిత్రగుణములచే వన్నెకలుగక మానదుగదా. చిత్రవర్ణపు పోఁగులచే వర్ణపుచీరయు కలుగునను ఆశయమును ధ్వనితము.

'వెలయవమ్మ యమ్మ......మెలఁగవమ్మ' అని [illegible]ట 'అమ్మ' అనుట ఆవర్తింపఁబడుట లిప్సకు గాని ప్రార్థనాగాఢత్వమునకుఁ గాని యని తెలియునది. ఇట్లే '......జయింపవయ్య అయ్యనీ ప్రోల మేలాడ రయ్యాజనులు' (భాగవత. ౩ స్కంధ).

చ. పతికృతధర్మకౌశలముఁ బట్టునఁ దోడగునారి నారి దాఁ
బితృశరణప్రచింత మదిఁ బెట్టక యీశనివేశితాత్మ యౌ
సతి సతి రాశికెక్కి యినసత్కృతిఁ గైకొనుకన్య కన్య శా
శ్వతమతి నిట్లుగా మనని వామయె వామ సుమమ్మ కోమలీ. 57

అ. పతి... నారినారి —(ధర్మమనఁగా సత్కర్మమును విల్లును. నారి యనఁగా స్త్రీయును అల్లెత్రాడును) పతి = నాథునిచేత, కృత = చేయఁబడిన, ధర్మకౌశలము పట్టునన్ = ధర్మనిపుణత్వపు వేళయందు, నిపుణముగా ధర్మము నాచరించు సమయమందనుట. తోడు అగు, నారి = స్త్రీ, నారి = నార్యుచిత ధర్మవతియని యర్థము. అధిపతిచేతఁ జేయఁబడిన విలువిద్య యందలి నేర్పుపట్టున సహాయపడు అల్లెత్రాడే అల్లత్రాడని యర్థాంతరము. దాన్, పితృశరణ... సతి సతి.(శరణమనఁగా గృహమును రక్షణమును ఈశుఁడనఁగా పెనిమిటియు శివుఁడును, ఆత్మ అనఁగా మనస్సును దేహమును, సతియనఁగా పతివ్రతయు పార్వతియు) పితృశరణ ప్రచింత = తండ్రి యింటి మీఁది తలంపు, మదిన్ పెట్టక, ఈశనివేశిత ఆత్మ = పెనిమిటియందు చేర్పఁబడిన మనస్సు గలది. ఔ, సతి= స్త్రీయే, సతి = పతివ్రతయని యర్థము. పితృశరణ ప్రచింత మదిపెట్టక = తండ్రియైన దక్షుని సంరక్షణమీఁది తలంపు మనస్సుననిడక, ఈశనివేశితాత్మ = శివునియందుఁ జేర్పఁబడిన యర్థదేహము గలది, ఔ సతియే, సతి = పార్వతియని యర్థాంతరము, రాశికెక్కి...కన్యకన్య— రాశికెక్కి = ప్రసిద్ధికెక్కి, ఇన= పెనిమిటియొక్క, సత్కృతిన్ కైకొను=మన్ననను బొందిన, కన్యయే, కన్యయని యర్థము. రాశి కెక్కి = ద్వాదశరాసులలో నొకరాశియై, ఇనసత్కృతిన్=సూర్యసత్కారమును గాంచిన కన్యయే కన్యారాశి యని యర్థాంతరము. శాశ్వమతిన్ = స్థిరబుద్ధిచేత, ఇట్లుగా = ఈవిధముగా, మననివామయె = బ్రతుకని స్త్రీయే, వామ = వక్రురాలు - ప్రతికూలురాలు, సుమమ్మ= చూడుమమ్మా, కోమలీ అని సంబోధనము.

పతికృత...ఇత్యాదులందుఁ జెప్పఁబడినట్లుగా నడచుకొనని స్త్రీయే, వామ=విపరీతవ్[illegible] ఇందులకుఁ గాళిదాసు 'శుశ్రూషస్వ గురూన్ కురుప్రియసఖీవృత్తిం సపత్నీజనే... భాగ్యేష్వ[illegible] యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాఃకులస్యాధయః' అని శకుంతలకు కణ్వుండిట్టి[illegible] వ్రతాధర్మముపదేశించుచో 'వామాఃకులస్యాధయః' అన్నాఁడు. దీనిని జూచియే మనక[illegible] శబ్దము ప్రయోగించుట. అచ్చుప్రతులందు 'శాశ్వతమతి నిట్లుగామనిన వామయె వామగ[illegible] అని పాఠము చూపట్టుచున్నది. ఇట్లుగా=పూర్వోక్తప్రకారముగా, మనిన బ్రతికిన, వామ[illegible] స్త్రీ[illegible] వామగదమ్మ = రమ్యురాలైనదిగదమ్మ. రమ్యపర్యాయమైన వామయను అన్వర్థనామము గ[illegible]దమ్మ అని యర్థము చేయఁబడినది. వామలోచన ఇత్యాదులందు వామశబ్దము రమ్యార్థక[illegible] పతి కులార్థమున వామశబ్ద మన్వర్థనామముగా[illegible] గలది యనుటయే యర్థాంతరము. [illegible]పద[illegible]న యమకము.

శా. ఈశైవాలవతీప్రతీరభజనం బీని[illegible]లప్రవా[illegible]రో
ద్దేశావాసము నీమృగార్భకశకుం[illegible]సఖ్యా[illegible] లే[illegible]జం
త్వాకల్యంబు వహింపకమ్మ చెలి [illegible]చ్ఛ[illegible]లెల్లం[illegible]
క్లే[illegible]గంబులు[illegible] కభీష్టవరలక్ష్మీధన్య కిం[illegible]టకిన్[illegible]

అ. ఈశైవాల...భజనంబు = ఈనదిగట్టును గొలుచుటయు, ఈనిర్మల ప్రస్తర ఉద్దేశఆవాసము = ఈశుభమైన కాలపట్టున నివసించుటయు, ఈమృగ అర్భకశకుంతీ సఖ్యముల్ = ఈలేడిపిల్లలయొక్కయు ఆఁడు పక్షులయొక్కయు చెలిమియు లేమిన్ = ఇకఁమీఁద లేకుండుటచేత, చింతాశల్యంబు=విచారమనెడు ఆయుధపుటలుగు-ఆయుధపుటలుగు గ్రుచ్చుకొనఁగా నెట్లో చింతయట్లె బాధించుననుట 'చింతాశల్యమువాసె నేమనకునిశ్చింతంబునం బొందెనే' భారతము. వహింపకమ్మ=మనసులో నిలుపుకొనకుమమ్మా. చెలి, ఏతత్ చర్య లెల్లన్ =ఈనడవళ్లన్నియు, తపఃక్లేశ అంశంబులు=తపోవిషయమయిన కష్టమునకు అవయవములు, కనుక ఇవి అభీష్టవరలక్ష్మీ ధన్యకున్ =అభిమతమయిన వరముయొక్క సంపత్తిచేఁ గృతార్థురాలయిన నీకు, ఇంకేటికిన్. వరముసిద్ధించినపిదప తపఃక్లేశ మేటి కనియర్థము. అభిమతుఁడయిన వరుఁ డనుసంపత్తిచేధన్యురాలయిన దానికనిభావము.ఇట గిరికాదేవి శుక్తిమతీ విహారాదులను తపశ్చర్యలుగాను అభీష్టపురుషప్రాప్తిని తత్తపస్సిద్ధిజనితమయిన అభీష్టవరప్రాప్తిగాను జెప్పుట తెలియునది.

శైవాలవతీ ప్రతిరభజనము=తల్లియొద్దిమనికి, నిర్మలప్రస్తరోద్దేశావాసము = తండ్రియొద్దిమనికి, మృగార్భకసఖ్యము = తండ్రివలని వానితోడి మచ్చిక. శకుంతీ = తల్లివలని వానియు తండ్రివలనివానియుతోడ మచ్చిక, తపస్సునకు నదీతీరములందు నుండుట యావశ్యకముగాన తద్భజనమును, పర్వతగుహలందువసించుట ఎలయుఁగాన తదావాసమును,నిర్జనంబగుచోఁబక్షిమృగాదులతోడిసహవాసము ఎలయుగాన తత్సఖ్యమును జెప్పినాఁడు. మహనీయుఁడయిన పురుషునిఁ జేపట్టిన పిదప మహార్హ సౌధములందు మెలఁగునీకు ఈనదీతీరభజనాదులు క్లేశప్రాయములే యని యాశయము.

క. అని తెలుప నశ్రుధారా, విని వేశ విలీయమానకవినతానన యా
తనయం గని కల్లోలిని, తనయంగనితాంతయుక్తిఁ జేదార్చుచుఁ బలికెన్. 59

అ....కల్లోలిని=నది శుక్తిమతి, అశ్రు ..నన—అశ్రుధారా=కన్నీటిదారలయొక్క,వినివేశ=[illegible]తోడ, విలీయమాన=కూడుకొనుచున్న, వినత = వంచుకొనఁబడిన, ఆనన = ముఖముగల[illegible] [illegible]=కూఁతును,కని, తన,అంగనితాంతయుక్తిన్ = మేనియొక్క బిట్టయిన కూడికను-అనఁగా [illegible], తార్చుచున్ = చేర్చుచు, కౌఁగిలించుకొనుచనుట, పలికెను.

[illegible]బంపుదున్ మణిశకతమ్ములఁ బంపుదు రాజహంసపో
[illegible]బంపుదున్ బరిచితమ్ములఁ గానన దేవతాళిజా
[illegible]బంపుదున్ ద్రుతకగతమ్ముల నేనును సారణీప్రవా
[illegible]త్తు విశ్వవి[illegible]తా ముదితా మది తాప మేటికిన్. 60

[illegible]తమ్ములన్ = సహ[illegible]దళములను - తామరలనని భావము. మణిశకతమ్ములన్ = పందల కొలఁది [illegible] రాజహంస [illegible]తమ్ములన్ [illegible]దమలను, [illegible]రిచితమ్ములన్=మచ్చికపడినవగు, [illegible]వత[illegible]జాతమ్ములన్ [illegible] వనదేవ[illegible] సంతతి [illegible]నెడు చెట్టుతీగెల సమూహములను, ద్రుతగ [illegible] = [illegible] స[illegible] ప్రవహమ్ములన్ = సారణీ చాల్వసరితి' పిల్లకాలువ. ప్ర[illegible]నెం[illegible]లయ[illegible]లయేళ్లయు రూపములతో, వత్తును, విశ్వ [illegible]మర[illegible],మదితాపము, ఏటికిన్.

[illegible] 'రాజహంసపోతమ్ములు'-రాజహంసములు పె ద్దదిగా[illegible]రం[illegible]పిల్లలకుండ్రేదు: కావున పోతమ్ముల

న్నాఁడు. కావుననే వెనుకటిపద్యమునమృగములను జెప్పకదాని అర్భకములన్నాఁడు; శకుంతములకు శకుంతీ అన్నాఁడు. సారణియని తన స్వకల్పితరూపము ; ప్రపాతమనుట కోలాహలుని ప్రేరిత రూపము. కావునని రెండును జెప్పఁబడినవి. మది యొక్క తాపము మదితాపమని సమాసము.

సీ. మెదలుమిటారితుమ్మెదలుజుమ్మని మ్రోయఁ,బొదలునిచ్చటిపువ్వుఁబొదలుచూడఁ
దేఁటి మాధురిఁగడకఁ దేఁటి పేరివమున, వారిసేయుమదీయవారిఁ దేల
* వలనంది దరుల క్రేవలనందికొనుచు నా,వల నగల్చు మహోర్మివలనమరయ
గములఁబాయక తరంగములపైఁ దగుసితాం,గముల మానసవిహంగములఁబట్ట

తే. నరిది వ్రతముల సరిగంగలాడఁ జైత్ర, శుచినభోబాహుల తపోవిశోభిసకల
సమయములఁ దావక ప్రాణసమునిఁ గూడి,యిచటనె మెలంగెదు కలంగెదేలతల్లి.

అ. తల్లి = గిరికా, మెదలుమిటారితుమ్మెదలు=తిరుగుచుండెడు సొగసయిన తేంట్లు. ... తేఁటి= తేటపడి, మాధురిన్ కడతేఁటి= తీయఁదనమందుఁ గడముట్టి—తీపియొక్క యెల్లనుబొంది, పేరివము= మిక్కిలి చలువ, ఇవమనఁగా ఇగము గకారమునకువకారము, అవారిసేయు = అవ్వారిగాఁ జేయు నట్టి—అపరిమితముగాఁ జేయునట్టి, మదీయవారిన్ = నాజలమునందు, తేలన్=జలక్రీడ సలుపు కొఱకు,వలను = ఒప్పిదమును, అంది, దరుల క్రేవలన్=గట్ల పార్శ్వములను, అందికొనుచున్ =వ్యా పించుచు (అంటికొనుచున్ = ఒరసికొనుచు), ఆవలన్ = పిదప, అగల్చు = ఆదరులను భేదించు నట్టి, మహోర్మివలనము=పెనుకరడుల సుడియుటను. గములన్ పాయక=గుంపులు వీడక, తరంగముల పైన్ = అలలమీఁద, తను సితాంగములన్ = తెల్లని దేహములుగల, మానస విహారములన్=మానస సరోవర సంబంధులయిన పక్షులను-అనఁగా రాజహంసములను.

అరిది వ్రతములన్=విశేష వ్రతములందు, సరిగంగల లాడన్=సరిగంగాస్నానములు సేయుట కొఱకును, చైత్ర శుచి నభోబాహుల తపోవిశోభి సకల సమయములన్-చైత్ర=చైత్రమాసము చేతను, శుచి=('శుచిస్త్వయం ఆషాఢే' అ) ఆషాఢమాసముచేతను,నభస్=('శ్రావణే తుస్యాన్నభాశ్శ్రావణి కశ్చసః'అ) ఆషాఢమాసముచేతను, బాహుల = ('బాహులోర్జౌ కార్తికికః' అ) కార్తిక మాసము చేతను, తపస్ = ('తపామాఘే' అ) మాఘమాసముచేతను, ఇట చైత్రాది మాసపంచకముచేత వసంత గ్రీష్మవర్షా శరచ్ఛి శిరర్తువులను గ్రహించునది. హేమంతము శిశిరర్తువునం దంతర్భూతము. తావక ప్రాణ సమునిన్=ప్రాణములకు సమానుఁడయిన నీ విభుని, కూడి, ఇచటనె మెలంగెదు, ఏల కలంగెదు.

వసంతర్తువునందుఁ బూఁబొదలు చూచుకొఱకును, గ్రీష్మర్తువున జలక్రీడ లాడుకొఱకును,వర్షర్తు వునందుఁ దరంగవిహారము విమర్శించుకొఱకును, శరదృతువునందు హంసలం బట్టెడుకొఱకును, నీవు నీ విభునితోఁగూడి యిక్కడనే విహరింతువనుట. ఇది అపకలి వడినీసము.

క. వెగడ వల దనుచు బెట్టిద, మగు నెవ్వగ నగడుపడుచుఁ నాఁడుఁబడుచు లే
పగవారికి వల దన నా, పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁ డనుచున్. 62

అ. వెగడవలదు = జడియకుము, బెట్టిదము=మిక్కిలియైనట్టి. నెవ్వగన్ = నిండు విచారముచేత, అగడుపడుచున్ = తొట్రుపడుచు, ఆఁడుఁబడుచులు, ఏపగవారికిన్ = ఎట్టి పగవారికియునను, వల దనన్ = కలుగరాదని లోకమందనుకొనఁగా, పద్మజుఁడు=బ్రహ్మ, ఆపగ వారికిన్ = ఆపగ యొక్క

* 'వలనంటిదరుల క్రేవలనంటికొనుచు' అని పాఠాంతరము.

వారికి నదీజలమునకు, ఏలఇచ్చెను, అనుచున్ ఇక్కడ ఏ పగవారికి వలదనఁగా ఆ పగ వారికిచ్చెనని స్వారస్యము. అపగవారి తత్సమసమాసముగనుక ఆపగా శబ్దమునకు హ్రస్వము. 'స్రోతస్వినీ ద్వీపవతీ స్రవన్తీ నిమ్నగాపగా' అని అ.

చ. అనుప మహేలతోఁ నరవరాగ్రణి రత్నరథాధిరూఢుఁడై
యనుపమహేలతోఁ గదలెనాత్మపురంబున కభ్రమండలిన్
ఘనమురవార్భటిం దెరువుగట్టి నిలింపనితంబినుల్ ఘనా
ఘనమురవార్భటిన్ మెఱచుకాఱుమెఱుంగులరంగు లీనఁగన్. 63

అ. అనుపన్ = పంపఁగా, ఇక్కడ 'ఆ పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁడనుచున్' అని కులకము చెప్పినాఁడు. ఆంధ్ర మందును గులకము చెప్పవచ్చు నన్నందులకు 'క్వచిత్కులక సంబన్ధో ప్యత్ర నాహిత కృద్భవేత్' (అధర్వణకారిక).

మహేలతోన్ =(మహేలా యోషితా యోషాయువతిః' అని అమరశేష.)(మహిళా మహేలాశబ్దములు రెండును స్త్రీపర్యాయములు గలవు) స్త్రీతోడ - గిరికతోఁగూడ నరవరాగ్రణి = వసురాజు, రత్నరథాధిరూఢుఁడై = రత్నమయమైన రథము నెక్కినవాఁడై, అభ్రమండలిన్ = ఆకాశమండల మందు, ఘన మురవ ఆర్భటిన్ = గొప్పదయిన మద్దెలధ్వనితో, తెరువుగట్టి = దారి నడ్డగించి, నిలింపనితంబినుల్ = దేవతాస్త్రీలు, ఘనాఘన మురవార్భటిన్ = వర్షించుచున్న మేఘముయొక్క ధ్వని యార్భటితో = అనఁగా ఉఱుముతోఁగూడి, మెఱచు, కాఱు మెఱుంగుల రంగులు = తొలకరి మెఱుపుఁదీఁగల యొక్క రీతులను, ఈనఁగన్ = పుట్టింపఁగా-కనఁబఱుపఁగా ననుట. అనుపమ హేలతోన్=అసమానమయిన విలాసముతో, ఆత్మపురంబునకున్ = తనపట్టనమునకు, కదలెను.

వసురాజు ఉపరిచరుఁడు గనుక 'రత్న రథాధి రూఢుఁడై అభ్రమండలి' నేఁగుట - ప్రయాణసూచకముగా 'ఘనమురవార్భటి'. అదివిని యాకాశమునఁ బోవునతనిని జూచుటకై యామార్గముగ నిలింపనితంబినులు దెరువుగట్టిరి. రథము ఘనాఘనము. మురవార్భటి=ఉఱుము. రథస్థుఁడగు రాజును జూచుటకై తెరువుగట్టిన నిలింపని తంబినులు మెఱచు కాఱుమెఱుంగులని యుపమ తెలియునది. లేక వసురాజు అభ్రమండలమునఁ బోయినచో భూవి యందలి పుర స్త్రీలు మిద్దెలెక్కి చూచుటఁ దటస్థింపదు. కాన వసురాజును గిరికను బెండ్లాడిపోవు నపుడు చూచెడి సంతోషమున దేవతాస్త్రీలు హర్షసూచకముగా మురవధ్వనులు చెలంగించుచుఁ దెరువుగట్టిరనుట యుక్తము. ఆకాశమున సంతోషసూచకముగా మురవధ్వనులు మొదలగు నవి గలుగుటకు-

క. నవననసౌరభములనై, కువకువలయ వర్షమపుడు కురిసెన్ మొరసెన్ ।
రవరవ మురజరవంబులు, దివి దివిషజ్జలజముఖులు తెలిసి నటింపన్ ॥

మురవశబ్దమునకు మురః చర్మపట్టికా సంవేష్టనమ్. తం వాతి ప్రాప్నోతీతి మురవః 'వా గతిగంధనయోః' అనిధాత్వర్థము.

ఉ. వేడుక నిట్లు గన్గొని విభ్రమధన్య యగేంద్రకన్య రాఁ
జూడఁ దలంచి నిల్చిరి వసుక్షితిపాల పురీపురంధ్రికల్
మాడువులన్ హజారములమచ్చుల సజ్జల గోపురంబులన్
మేడల నాట్యశాలికల మేరువులన్ భువనేశ్వరంబులన్. 64

అ. వేడుకన్ = ఉత్సవముతో, ఇట్లు, అగణ్యరుచి విభ్రమధన్య=ఎన్నఁదరముకాని కాంతి చేతను విలాసముచేతను కృతార్థురాలు. అగేంద్రకన్య = గిరిక, రాన్ = రాఁగా, చూడఁదలంచి, వసుక్షితిపాల పురీ పురంధ్రికల్ = వసురాజు పట్టనపు స్త్రీలు, మాడువులన్ = హర్మ్యములను, హజారములన్ = మొగసాలలయందు, మచ్చులన్ = డాబాల యంరు- మీఁద కట్టణములేని మిద్దె టింద్లయందనుట. సజ్జలన్ = శిరో గృహము లందును, గోపురంబులన్ = బహిర్ద్వారము లందును, మేడలన్ = సౌధములందును, నాట్యశాలికలన్ = నాటకసాల లందును, మేరువులన్ = పోఁత మట్టి దిబ్బలందును, సారువులందనుట, భువనేశ్వరంబులన్ = చుట్టుబవంతులందును, ఎక్కిరి. మాడు వనఁగా హర్మ్యమనుటకు

తే. కడురయంబునఁ జనునొక కాంతఁ గాంచి 'తరణిరోయిటవోయి దెవ్వరిదానవనిన
మాఱుపలుకకయుట సని యూడు వెక్కు, టయును గ్రక్కున నొక్కఁడహాయఘుగట్టె.

క. మనమున శంకింపక చ, య్యనఁ దానును దానిపజ్జ నాహర్మ్యంబెక్కె (మార్క. ౨. అ)

మేడయనఁగా సౌధమనుటకు

క. ఆమగువయట్లు పలుకుచు, నా మేడన్ వారినిలిపి యరుగు తెఱఁగుత
త్స్వామిని యగుగణికామణి, తామ ఉఱఁగున నుండి చూచి తలఁకెడుమదితోన్.

క. ఎవ్వారో దివ్యస్త్రీ, లివ్వరసౌధంబు నాశ్రయించి. (కళా. ౬. ఆ)

మచ్చుల మేడల నెలవులెల్ల. (అచ్చ.రా. అర. కాం) ఉ,ప్పరిగల్ సజ్జలు చప్పరాలు.చవికల్ పైఁజాడ లే దెక్కి. (రామా. ౬. ఆ) ఇత్యాదులచే నివి యెల్ల వేఱు వేఱని తెలియునది. 'చన్ద్రశాలాశిరోగృహమ్' 'హర్మ్యాదిధనినాంవాసః ప్రాసాదో దేవభూభుజామ్' 'సౌధో౽స్త్రీ రాజసదనమ్' అని హర్మ్యసౌధాదిశబ్దముల భేదము తెలియునది.

సీ. సరి గాదు మద్వధూసర్గ మీసతి కంచుఁ, దెలుప నందఱఁ దెచ్చెనే నలువ యనఁగ
నిజభాగ్యలక్ష్మి రానెమ్మిఁ బౌజిడ ననం, గుఁడు మూలబలమెల్లఁ గూర్చెననఁగఁ
గొనిరొ మాసికుల నీకొమ్మంచుఁ బతికిఁ దె,ల్ప నశేషయావతంసెనసెననఁగ
జలసుతాసమకన్య గలుగునో యని నేల, యీనున వేవేలసీనె ననఁగ

తే. గణనమీఱినవరో రూపగరిమమించు, లలనతోఁదులఁదూఁగఁ బాలకభజించి
రుపరిభాగంబులనఁ జేది నృపలలామ, పట్టనపయోజముఖులు చూపట్టి రపుడు.

అ. నలువ=బ్రహ్మ, మద్వధూసర్గము=నాయొక్క స్త్రీజనసృష్టి, ఈసతికిన్, సరిగాదంచున్ తెలుపన్, అందఱన్ = స్త్రీలనందఱను, ఒక్కచోటికి, తెచ్చెనోయన్నట్లుగా,నలువసృష్టియందే స్త్రీయునూ దానికి సాటిగారనుట, నలువ యంత చక్కనిదిగా నేపడఁతిని సృజించలేఁడయ్యె ననిభావము.

అనంగుఁడు = మన్మథుఁడు, నిజభాగ్యలక్ష్మి, రాన్ = వచ్చుచుండఁగా, నెమ్మిన్ = చెలిమిచేత, బౌజు= బారు, వరుస, ఇడన్ = ఉంచుటకు, మూలబలమెల్లన్ కూర్చెనోయనఁగా, రాజు మొదలగు వారువచ్చినప్పుడు మర్యాదకొఱకు, భృత్యులనుగాని సైనికులను గాని యిరువంకల బారునిలుపుట సహజము. ఇరువైపుల నున్న స్త్రీవర్గములను బారు నిలుపుటగా నిటఁ జెప్పినాఁడు. మూలబలమను టచే, మన్మథునకు జయప్రదమగు ముఖ్యబలముగాన యాస్త్రీలకు, మిక్కలి మోహోద్దీపకమగు చక్కఁదనమును పెక్కుండ్రగుట [illegible] వ్యంజితములు.

అశేషయావతంస = [illegible]ంద్ర సమూహము, ఈ[illegible]మ్మ, మాసికులన్ = సౌందర్య సంపదలన్ను, [illegible]. అని, పతికిన్ = వసురాజునకు, తెల్పన్, ఎనసెన్ అవఁగన్ =

గుంపుగూడినదో యనుట్లుగాను. సొమ్ము నపహరించిన ద్రుచ్చును రాజునకుఁ బట్టియియ్యవలయుఁ గదా. సకల యువతీజనుల సౌందర్యసంపదలను హరించెననుటచే, సర్వయువతీజన సౌందర్యములన్నియుఁ బ్రోవుచేసి చేసినది గిరిక-అనఁగా సర్వలోకాతిశాయి సౌందర్యవతి యనుట.

నేల, జలసుతాసమకన్య=జలమునఁబుట్టిన గిరికకు సాటియైన పడఁతిని, కలుగునో అని, ఈసునన్, వేవేలన్=వేలకొలఁది స్త్రీలను, ఈనెనో యనునట్లుగాను, భూతత్త్వము జలతత్త్వముపయి నీసుచే నట్లుచేసినదనుట. అందును గిరికకు సాటిగానొక్కతిని ఈనఁజాలదయ్యె. పెక్కండ్రను వేలకొలఁదిగా నీని యారొక్కతితో సాటినొందఁగఁ గోరినదనుట—భూమి యీనినదనుటచే భూమియందలి స్త్రీలెల్ల నందువచ్చిరో యనునట్లు లెక్కలేని స్త్రీలు చూడవచ్చిరని వ్యంజితమగుచున్నది.

వయోరూపగరిమన్=వయస్సుయొక్కయు రూపముయొక్కయు, గౌరవము అనెడి భారముచేత, మించు=అతిశయించుచున్న, లలనతోన్ = గిరికతో, తులఁ దూఁగఁజాలక=సరితూఁగలేక, ఉపరిభాగంబులన్ భజించిరనన్=పయికిఁబోయిరో యనునట్లు--గిరికను దక్కిన పడఁతులను చక్కఁదనమందుఁ దులయందు చెటియొక ప్రక్కనిడి తూపఁగా వయోరూపగరిమ బరువుచేత గిరిక మొగ్గు వహించి క్రిందనుండఁగా తేలికయైన తక్కినవారు సరితూఁగలేక మీఁదికి నెగసిరో యన్నట్లు, చేది...ముఖులు=వసురాజు పుర స్త్రీలు, గణనమీఱి యప్పుడు చూపట్టిరి.

ఆ స్త్రీలు మేడలు మొదలగు వానిపయి నెక్కుటయు గిరిక వారికిఁ గ్రింద నుండుటయుఁ గవి సౌందర్యపు తూనికయందు గిరిక మొగ్గి క్రిందికిఁబోవుటయు వారు తేలికపడి మీఁదికి నెగయుటయుఁగా నుత్ప్రేక్షించుట తెలియునది. గణనమీఱి యుండుటంబట్టియే 'అందఱుఁ దెచ్చె' 'మూలబలమెల్లం గూర్చె' 'అశేషయౌవతంబెనసె' 'వేవేల నేలయీనె' నని యపరిమితసంఖ్యాకత్వము చెప్పఁబడినది.

క. కమలోపమలోచన లా, కమలోపేంద్రులవిభూతిఁ గనఁ దగుజగదు
త్తమలోలాక్షీరమణులఁ, దమలో నెన్నుచు గుణార్హతమలోభమునన్. 66

అ. కమల ఉపమ + లోచనలు = తామరల వంటి కన్నులు గల స్త్రీలు, ఆ కమలా ఉపేంద్రుల విభూతి=ఆలక్ష్మీ నారాయణులవలె, జగదుత్తమలోలాక్షీరమణులన్=లోకోత్తరులయిన స్త్రీపురుషులను—గిరికావసురాజులను, తమలోన్, ఎన్నుచున్ = పొగడుచు, గుణార్హతమలోభమునన్ = గుణములచేత పూజ్యులయిన వారియందలి యాసక్తిచేత మీఁదికన్వయము.

చ. అమరబలావకృష్టమయి యంబుధిఁ జేరి యొసంగెఁ బూరుషో
త్తమునకు మందరాగ మొకతన్వి నదెంత యటంచు నీనగం
బమర నమందరాగ మయి యావరసింధువుఁ జేరి పూరుషో
త్తమున కొసంగె నౌర వనితామణి నంచు నుతించి రెంతయున్. 67

అ. అమరబల అవకృష్టమయి = దేవతలచేత బలాత్కారముగా ఈడువఁబడినదై యనియర్థము - దేవతాసైన్యముచేత నడుపఁబడినదని భావము. ('స్థౌల్యసామర్థ్యసైన్యేషు బలమ్' అ), అంబుధిన్ = సముద్రమును, చేరి, మందరాగము = మందమయి అనురాగముగల మందరపర్వతము, ఒకతన్విన్ = ఒక స్త్రీని - లక్ష్మినను‌ట, పురుషోత్తమునకున్ = విష్ణు[illegible]నకు, ఇచ్చెను. అది ఎంత అటంచున్, ఈనగంబు = ఈ కోలాహలము, అమరన్, అమందర[illegible] అయి = మిక్కిలి యనురక్తి గలదై, ఆవరసింధువున్ = శ్రేష్ఠమయిన సముద్రమును, చేరి, యన[illegible]ము. [illegible]కి[illegible]తీనదిన్ని చేరి యని

భావము (సింధుస్సముద్రేనద్యాంచ). విశ్వవనితామణిక = స్త్రీరత్నమును, పురుషోత్తమునకుఁ = విష్ణువునకని యర్థము— పురుషశ్రేష్ఠుఁడయిన వసుర్రాజన కని భావము, ఇచ్చెను. ఔర, అంచుక ఎంతయుఁక, నుతించిరి.

పూర్వపద్యాంతమందుఁ గల 'గుణార్ణ్వతమ లోభముసన్' అనుపదము నీపద్యమందలి 'నుతించిరెంతయుఁక'అనువాక్యముతో నన్వయించునది. మందరాద్రి మందరాగము,కోలాహలము అమంద రాగము. అది చేరినది: సామాన్యమైన అంబుధి-ఇది చేరినది 'పర' అంబుధి (సింధువు). అది యొసంగినది 'ఒకతన్వి' ఇది యొసంగినది వనితా 'మణి' అని వ్యతిరేకము తెలియునది.

ఉ. కాంతికలాపరూపజితకింతుజయంతున కీవసుంధరా
కాంతునకుం జరాచరయుగంబున నీడగుకాంత లేమి య
త్నాంతరశాలి యై విధి చరాచరయోజనచే సృజించెఁ గా
కింతి ఝురిం గిరిం బొడముకనే యని పల్కిరి కొంద ఱయ్యెడన్. 68

అ. అయ్యెడక = ఆసమయమందు, కొందఱు, పల్కిరి—ఏమని యనఁగా—విధి=బ్రహ్మ, కాంతి...యంతునకుఁ = కాంతిసమూహముచేతను రూపముచేతను జయింపఁబడిన మన్మథుఁడును జయంతుఁడును గల, ఈవసుంధరాకాంతునకుఁ = ఈవసురాజునకు, చరాచరయుగంబునక = జంగమములు స్థావరములు రెంటియందును, ఈడు అగుకాంత, లేమిక=లేనందున,యత్న అంతరశాలియై= మఱియొక యత్నముచే ఒప్పినవాఁడై, చరాచరయోజనచేక =జంగమస్థావరముల (యొండొంటితోడి) కూడికచే, సృజించెక = గిరికను నిర్మించినాఁడు; కాక=అట్లుకానిచో, ఇంతి=ఆఁడుది, ఝురిక= ప్రవాహమునందును, గిరిక = కొండయందును, పొడము నే = పుట్టునా. వెల్లువవలనను గొండవలనను ఆఁడుది పుట్టునా? అని, పల్కిరి.

ఈరాజో 'కాంతి...యంతుఁడు'. ఇతనికి నీడయిన కాంత తాను ప్రయత్నపడిచేసినచరసృష్టియందును లేదు. అచరసృష్టియందును లేదు. చరమును అచరమును వేఱువేఱ నట్టి స్త్రీని గలిగింపఁజాలమిచేత ఆరెంటిని ఒకటితో నొకటిగూర్చి చేయుట అను యత్నాంతరము. కావుననే చరమైన ఝురినిని అచరమైన గిరినిని యోజనచేసి గిరికను బుట్టించుట. ఇట్లు కాకున్న వెల్లికిని ఱాతికిని నాతి పుట్టునా? యని యర్థము. గిరిక అనన్య స్త్రీ సామాన్యమగు సౌందర్యాదులుగలది. అట్టిచెలువు ఏచెలువకుఁ గాని ఏచిత్తరువునకుఁగాని గలుగదు. కావుననే,'కాంతి...యంతునకు ఈడగు'ట యని యాశయము. 'ఝురిక గిరిక' రెండవపదము గిపర్ణాదియగుట చే'నదిగిది' అనునట్లు నిందాపరముగానువోఁచుట స్వారస్యము.

ఇట్లే 'ఎసఁగుభసలములను గిసలంబులనునీర, జాతములను గీరజాతములను'

అని ప్రయోగించియున్నాఁడు. చేతనములు చరము లనియు అచేతనములు అచరములనియు ప్రసిద్ధసంకేతము. ఇట ఝురి పాఱుచుండుటచే చరమనియు, గిరి కదలకుండుటచే అచరమనియుఁ బ్రయోగించిన భావమును దెలియునది.

సీ. తరుణ ధూర్తశిఖావకేతంమున కొక్క– కా, త్యాయనిఁ గూర్చినకేయురగొఱంత
రాజుతోసత్క–ళా కి రాశితో నక్షత్రజాతిఁ దార్చినపక్షపాతరచన
యభినవచ్ఛాయతో క్షనతిదుస్సహచ్ఛాయఁ, జేర్చిన నేరని కి చేతఁబట్టు
రతిల్లో నవిందితాకృతితో మధుపగుణం,బులవానిఁ గూర్చిన కి మోహ్యాప్సృష్టి

తే. సమవయోవంశలావణ్య సద్గుణాభి
నుతుల నీదంపతుల శుభాన్వితుల సంఘ
టించి వారించికొనియె విరించి యనుచుఁ
బొగడి రొక కొంద ఱానందపూర్ణఫణితి. 69

అ. ఒక కొందఱు=మఱికొందఱు, ఇట ఒకశబ్దము పృథగ్భూతిని దెలుపుట తెలియునది. ఆనందపూర్ణఫణితిన్ = సంతోషముచేత నిండిన వైఖరితోడ, పొగడిరి—ఏమని యనఁగా—తరుణ ధూర్తశిఖావతంసునకున్ =వయసుకాఁడయిన విటకానిమిన్నకు, ఒకకాత్యాయనిన్—('కాత్యాయన్య ర్ధవృద్ధాయాః కషాయవసనాధవా' అ) ఒకసగము ముదిసినదానిని, కూర్చిన, అఱగొఱంత=సగము తక్కువ- అర్ధలోపము-న్యూనసృష్టి యని యర్థము. తరుణ = క్రొత్తదియగు, ధూర్త = ('ధూర్తంతు ఖండలవణే ధుత్తూరేనావిటే త్రిషు' మేదిని.) ఉమ్మెత్తపువ్వు, శిఖావతంసునకున్ = శిరోభూషణ ముగాఁగల శివునకు, కాత్యాయనిన్ = పార్వతిని, కూర్చిన = (అర్ధదేహముగా) కూర్చినట్టి, అరగొఱంత =అర్ధనారీశ్వర సృష్టియనిభావము. శివునకు నుమ్మెత్తపువ్వు నివేద్యమగును.

పసిఁడిధుత్తూరపుష్పంబు ఫాలనయను, పానవట్టంబుపైఁ బెట్టఁబార్థివుండు.

(శృంగార. ౧. ౧౦౫.)

సత్కళారాశితోన్ = సకలవిద్యల ప్రోవయిన, రాజుతోన్ = క్షత్రియునితో, నక్షత్రజాతిన్ = క్షత్రేతరజాతిని, కూర్చిన = కూర్చిన, పక్షపాతరచన = పక్షపాతపు సృష్టియని యర్థము. (అనఁగా లోకములలో జాతిగాని జాతినిగూర్చినాఁడు గనుక నిట పక్షపాత సృష్టియనుట. ఇక్కడ, న+క్షత్రమ్=నక్షత్రమ్ 'సుప్సుపేతిసమాసః' అనియైనను లేక అక్షత్రమ్. అనిస్వరాదిగాఁ జెప్పి సంహితచేత నకారము వచ్చినదనియైనను జెప్పవచ్చు.) సత్కళారాశి యనఁగాషోడశకలానిధి. అట్టిరాజు అనఁగా చంద్రుఁడు. అట్టి చంద్రునితో అశ్విన్యాదినక్షత్రములను గూర్చిన శుక్లపక్ష కృష్ణపక్షపాతసృష్టియని భావము. ('రాజా ప్రభౌనృపేచన్ద్రే' యక్షే క్షత్రియశక్రయోః' విశ్వము.)

అభినవచ్ఛాయతోన్=కోమలమయిన చాయగల స్త్రీతో, అతిదుస్సహచ్ఛాయున్= మిక్కిలి సహింపఁగూడని చాయగల పురుషుని, చేర్చిన, నేరనిచేత ఆట్టు= చేతఁగాని పనిపలని అపవాదమని యర్థము. అభినవచ్ఛాయతోన్ = (అభినవచ్ఛాయ అనుపదము స్త్రీసామాన్యవాచకముగాన నిట ప్రకరణ బలముచేత సంజ్ఞానామక స్త్రీవిశేషవాచకమయినది, లేక, 'అభినవఛ్ఛాయాయస్యాః భవతీత్యభినవచ్ఛాయా' క్రొత్తదియగు ఛాయాదేవి యే స్త్రీవలననయినదో యా స్త్రీ అభినవచ్ఛాయ--అదియె సంజ్ఞాదేవి యని సంజ్ఞాదేవి యౌగికనామమయినను గావచ్చును. ఏలన సూర్యునితీవ్రకిరణముల వేండ్రమునకు తాళలేక సంజ్ఞాదేవి ఛాయాదేవిని నిర్మించి గృహమందు నిలిపి తాను దప మాచరింపఁబోయె నని విష్ణుపురాణ స్కాందపురాణములయం దున్నది. కనుక) సంజ్ఞాదేవితో, అతిదుస్సహతేజుఁడైన సూర్యునిఁగూర్చిననేరని సృష్టియని భావము.

అనిందిత+ఆకృతితోన్ = నెఱసులేని యాకారముగల, రతితోన్ = రతీదేవితో, మధుపగుణంబులవానిన్ = మద్యమును ద్రాగుగుణమును గల్గినవానిని, కూర్చిన, మోహసృష్టి = భ్రాంతిసృష్టి యని యర్థము. మధుపములు అనఁగా తుమ్మెదలు. వానిని గుణముగా(అనఁగా నారిగా) గల మన్మథునిఁ గూర్చినమోహవిద్యా సృష్టియని భావము.

సమవయో వంశలావణ్య సద్గుణ అభినుతులన్ = సమానమయిన వయస్సుచేతను, వంశము చేతను, కాంతిచేతను, మేలయిన గుణములచేతను, స్తుతిచేయఁబడినవారగు (ఇట క్రమాలంకారము. సమశబ్దము వయోవంశలావణ్యసద్గుణములకు విశేషణము.), శుభాన్వితులన్ = శుభలక్షణములతోఁ గూడినవారును, అగు, ఈదంపతులన్ = ఈవధూవరులను, సంఘటించి= కూర్చి, విరించి = బ్రహ్మ, వారించికొనియెన్ =(వెనుకఁజెప్పఁబడిన సృష్టిదోషములను) బోఁగొట్టుకొనెను. అనుచున్, పొగడిరి.

నాలుగు పాదములందును వరుసగా వయస్సునను, వంశమునను, కాంతిని, గుణములను, వైష మ్యము గల సృష్టి స్ఫురించుచున్నది. అట్టి సృష్టివలని దోషము నివారించుకొనుటకు వయస్సు మొద లగు నాలుగింటను సామ్యముగల యీదంపతులను సృజించినాఁడని యర్థము.

మ. అవి యాలించుచు వేడ్క నచ్ఛతరముక్తాలంకృతం బై ద్విజ
ప్రవరాధిష్ఠిత మై యనంతమణిశోభానిత్యనీరాజనో
త్సవదం బై తెలిదీవిఁ బోలునిజసద్మంబుం బ్రవేశించె న
య్యవనీభర్త తరంగిణీప్రియసుతాహస్తాంబుజాలంబి యై. 70

అ. ఇట 'అవనీభర్త' యనుపదము విష్ణువునకుఁ వసురాజునకు జెల్లును గనుకఁ దదుభయపరము గాను అర్థద్వయము తెలియునది. అయ్యవనీభర్త = ఆవసురాజు-ఆవిష్ణువనియు, అవి=ఆపౌరులాడు వాక్యములను,ఆలించుచున్,వేడ్కన్, అచ్ఛతరముక్తా అలంకృతంబై-(ఇది మొదలుగా విష్ణువాసమగు శ్వేతద్వీపమునకు వసురాజు గృహమునకు బరముగా నర్థద్వయము) (రాజగృహ) మిక్కిలి స్వచ్ఛమ యిన ముత్తెములచేత అలంకృతమై—(శ్వేతద్వీప) మిక్కిలిపరిశుద్ధులైన, ముక్త=ముక్తపురుషులచేత అలంకృతమై, ద్విజప్రవర అధిష్ఠితమై—(రాజగృహ)బ్రాహ్మణోత్తములచేత అధిష్ఠింపఁబడినదై,)శ్వేత ద్వీప) ద్విజప్రవరుఁడనఁగాపక్షిశ్రేష్ఠుఁడగు గరుడుఁడు, గరుత్మంతునిచేత నధిష్ఠింపఁబడినదై, అనంత ...త్సవదంబై—(రాజగృహ)లెక్కలేని మణులకాంతులచేత ఎప్పుడును ఆరతి (యెత్తుచున్న) వేడు కను గలిగించునదై—ఎడతెగక నిగుడుచుండు మణులకాంతులు ఎడతెగక హారతులునివాళించుచుండు నట్లు వేడుక గలిగించుచుండు ననుట. (శ్వేతద్వీప) అనంతుఁడనఁగా శేషుఁడు-ఆయనపడగలయందలి మణులకాంతులచేత నిత్యనీరాజనోత్సవము గలిగించునదై, తెలిదీవిన్ =(శ్వేతద్వీపమును, పోలు, నిజస ద్మంబున్ = తనగృహమును, తరంగిణీప్రియసుతాహస్త అంబుజ ఆలంబియై—తరంగిణీ=శుక్తిమతీ నదియొక్క, ప్రియసుతా = గారాబు కూఁతురయిన గిరికయొక్క, హస్త అంబుజ = చేఁదమ్మి యొక్క, ఆలంబియై = ఊఁనుటగలవాఁడై — గిరికచేయి పట్టుకొన్నవాఁడై యని య ర్థము—తరంగిణీప్రియ=నదీనాధుఁడయిన సముద్రుని యొక్క, సుతా = కూతురయినలక్ష్మియొక్క హస్తాంబుజము నవలంబించినవాఁడై యని విష్ణుపరమయిన యర్థము. ప్రవేశించెను.

రాజగృహము 'అచ్ఛతర... నీ రాజనోత్సవదంబై' యుండుటచేత తెలిదీవిం బోలుట. వసు రాజు పురజనుల స్తుతి వాక్యముల వినుచు గిరికాదేవి చేయి పట్టుకొని పూర్వోక్తవిశేషణములతోఁ గూడిన నిజగృహమును బ్రవేశించెనని తాత్పర్యము.

వ. ఇట్లు శుభలగ్నంబున [illegible]శావలగ్నయుం డ్గాను నవానందవిభవసందీపిత
నిజమందిరప్రవేశ మం[illegible] బంగీకరించి గురుబుధకవిసమాజంబునకు నతిభా
స్వద్బుద్ధికలాప[illegible]భాగ్యంబు సంఘటించుచు రాజమండలంబునకు [illegible]

విలాసంబు * సవరించుచు మిత్రవర్గంబునకు నసంఖ్యతరతురంగతరంగితశతాంగ
సంఘాతంబు నొసంగుచు మహానటులకు మహనీయచిత్రాంబర సంపదలసొంపు
సంపాదించుచు విద్యాధరులకు విపులవిపులాధిపత్యంబు వెలయించుచు మఱియుం
దక్కిన మార్గణగణంబులకు వేర్వేఱ యగణితఫలంబు లొసవించుచు విశ్వ
విశ్వంభరాజనవిస్మయనీయ వితరణచాతురీధురీణుండై విలసిల్లు నవ్విబుధరాజ
బాంధవుండు వివిధకల్యాణగుణవిభాసితం బగు నొక్కసమయంబున. 71

అ ... కృశావలగ్న = సన్నని నడుముగలది - గిరిక. అమంద ... మంగళంబు = అధిక మయిన విభవముచేత లెస్సగాఁ బ్రకాశింపఁజేయఁబడిన తన గృహమందలి ప్రవేశము అనుశుభమును, అంగీకరించి — స్వీకరించి - అనఁగా గృహ ప్రవేశముచేసి, గురు...బునకున్ - గురు = గురువుల యొక్కయు, బుధ = పండితులయొక్కయు, కవి = కవులయొక్కయు, సమాజంబునకున్ = సమూహమునకు, అతి భాస్వత్ = మిక్కిలి ప్రకాశించునట్టి, రుచి=కాంతులుగల, కలాప =భూష ణములయొక్క, సౌభాగ్యంబును = చక్కఁదనమును - సంఘటించుచున్ అని యర్థము - (గురుబుధ కవి సమాజంబునకున్ = బృహస్పతి బుధ శుక్రులకు, (కవి అనఁగా 'ఉశనాభార్గవః కవిః' అ.- అతి భాస్వత్ =(భాస్వత్ అనఁగా 'భాస్వద్వివస్వత్ సప్తాశ్వహరి దశ్వోష్ణరశ్మయః' అ)సూర్యుఁడు ('భాస్వాన్ భాస్వర సూర్యయోః' విశ్వము.) సూర్యు నతిక్రమించిన, రుచికలాప = కాంతి సమూ హముయొక్క, సౌభాగ్యంబును సంఘటించుమనని యర్థాంతరము. — రాజమండలంబునకున్ =రాజ సమూహమునకు, అక్షీణ = కొఱవడని, లక్ష్మీ విలాసంబున్ = సంపత్తి సోయగమును, సవరించుచు నని యర్థము (కల్పించుచునని పాఠాంతరము). రాజమండలమనఁగా చంద్రమండలము గనుక చంద్ర మండలమునకు కొఱవడని, లక్ష్మీ = ('శోభాసంపత్తి పద్మాసు లక్ష్మీ శ్శ్రీరపి కథ్యతే' అ) శోభ యొ క్క విలాసమును సవరించునని యర్థాంతరము. మిత్ర వర్గంబునకున్ = చెలికాండ్ర సమూహమునకు, అసంఖ్యతర = మిక్కిలియు లెక్కింపరాని, తురంగ = గుఱ్ఱములచేత, తరంగిత = పరంపరితమయిన, అనఁగా పెక్కు అశ్వములను బూన్చిన, శతాంగ సంఘాతంబున్ =రథముల సమూహమును, ఒసంగు చునని యర్థము. మిత్రుండనఁగా సూర్యుఁడు - ఆదిత్యుఁడు.మిత్రవర్గంబునకున్ = ద్వాదశాదిత్యు లకు, లెక్కలేని గుఱ్ఱములు పూన్చిన రథముల నిచ్చెనని యర్థాంతరము.

మహానటులకున్ = గొప్ప నట్టువులకు, మహనీయ చిత్రాంబర సంపదల సొంపు = మేలయిన చిత్రవస్త్రము సంపదలయొక్క బాగులను, సంపాదించుచునని యర్థము — 'మహానట' శబ్దము 'మహాకాలో మహానటః' అని శివపర్యాయముగాన, మహానటులకున్ =ఏకాదశ రుద్రులకు- మేలయిన చిత్రవర్ణములుగల వ్యాఘ్రచర్మాంబరము లిచ్చినాఁడని యర్థాంతరము. విద్యా ధరులకున్ = విద్యా వంతులకు, విపుల విపులా ఆధిపత్యంబు = విరివియైన భూమియొక్క పతిత్వమును, వెలయించుచునని యర్థము. విరివియైన భూము లిచ్చి యేలునట్లు చేసినాఁడనుట. విద్యా ధరులను దేవజాతివారికి విస్త రించిన ధరాధిపత్యము గలిగించినాఁడని యర్థాంతరము. మఱియును తక్కిన మార్గణ గణంబులకు— 'మార్గణో యాచకే శరే' విశ్వము అని మార్గణము యాచకునియందును బాణమందును ఫలశబ్దమున 'ఫలంలాభశరాగ్రయోః' విశ్వము లాభమందును బాణప్రశానందును ఫ[illegible]), యాచక సమూ

* కల్పించుచునని పాఠాంతరము.

హములకు, వేఱువేఱ, అగణితఫలంబులు=లెక్కలేని లాభములను, ఒదవించునని యర్థము- బాణముల కొకటి కొకటికి అనేకములయిన మొనల నొదవించి నాడని యర్థాంతరము. విశ్వ...రీణుండై — విశ్వ = సమస్తమైన, విశ్వంభరాజన = భూజనుల చేత, విస్మయనీయ = అబ్బుర పడఁదగిన, వితరణ = ఈవియందలి, చాతురీ = నేర్పునందు, ధురీణుఁడై = ధురంధరుఁడై, విలసిల్లి - ఇట వితరణ చాతురి, 'విస్మయనీయము' అనఁగా పూర్వోక్తములగు అర్థాంతరముల చేవిస్మయకరమనుట. అవ్విబుధరాజ బాంధవుండు=ఇంద్రుని చెలికాఁడు—వసురాజు,వివిధ కల్యాణగుణ విభాసితంబు=పలు తెఱగుల శుభగుణముల చేత మిక్కిలి వెలుంగునది అగు, ఒక సమయంబునన్, మీఁది కన్యరాము.

విశ్వవిశ్వంభరాజన ..................చాతురీధురీణుండు - వితరణచాతురి విస్మయనీయ మగుట గురుబుధకవి, మిత్ర, మహానట. ఇత్యాదులకు గల యర్థాంతరముల విషయములు విస్మయకరములుగాన, కావుననే యవి విశ్వవిశ్వంభరాజనులకు విస్మయము.

సీ. అత్రాసవృత్తిఁ జెన్నలరి నూతనరాగ,మహిమఁ గుల్కెడి కల్కిమానికములు
నవసమాగమమునఁ జవులు వక్కాణించి,మించఁజాలు వె లందిమిన్నగములు
మరుని తేజీలవైఖరిఁ బొల్చి రతులని,రూఢిఁ జూపు నితాంతరుచిరమణులు
ప్రౌఢపుంభావసంభావనల్ పచరించి, ప్రబలు వామాలోకరత్నతతులు

తే. గలయఁగీలించి చిత్రించికన్నియలకుఁ, గామ నిగమరహస్యప్రకాశనం బొ
నర్పఁ బన్నినయాత్మీయనర్మభర్మ, హర్మ్యరాజంబునకు వేడ్కనరిగి యచట.

అ. అత్రాసవృత్తిన్ = (త్రాసమనఁగా పద్మరాగమణియొక్క యాఱువిధములదోషములలో నొకటి.

'పగిలినగతి రేఖపైనున్నత్రాసంబు కలహమెప్పుడుఁదానఁ గలుగుచుండు'. (రత్న పరీక్ష)

త్రాసమనెడి దోషములేని వృత్తిచేత, చెన్నలరి=అందము ఒప్పి, నూతన రాగమహిమన్= క్రొత్తయగు ఎఱుపుయొక్క అతిశయము చేత, కుల్కెడు, కల్కిమానికములు = సొగసయిన పద్మరాగమణులని యర్థము. త్రాస మనఁగా లజ్జాకార్యమగుభయము. అత్రాసవృత్తియనఁగా లజ్జాభయరహితవృత్తి—అనఁగా ప్రౌఢత్వము - అట్టి ప్రౌఢత్వము చేత, చెన్నలరి=బాగుమీఱి, నూతన రాగమహిమన్ = క్రొత్త యనురాగంపు పెంపుచేత, కుల్కెడు, కల్కిమానికములు = కాంతారత్నములని యర్థాంతరము —(కలికి యనఁగా—కలికి యొప్పిదంబు కాంతయయ్యె, నన్నట్లు సొగసును స్త్రీయును), నవసమాగమమునన్ = క్రొత్తగావచ్చుట యందు, చవులు వక్కాణించి = (చవులనఁగా ముత్యాలయొక్క తూనిక మానములు. ఇందులకు విజయవిలాసము 'చక్కరమోవిచ్చి చవులఁ దేలించునీ ముత్యాలకమ్మలముద్దులాఁడి...)చవులును ప్రకటించి, మించన్ చాలు, వెలంది మిన్నగములు = మేలయిన రత్నముల సమూహములని యర్థము — అనఁగా ముత్యములనుట. వెలంది అనఁగా మేలనుటకు 'ఈ వెలంది యొడల్ పైఁడిలో వెలంది' (విజయ) మిన్నయనఁగా రత్నమనుటకు- కడలిఁగల మిన్నబలువన్నె గన్నవాఁడు' (సమీర 2 ఆ.) — నూతన సంభోగంపు రుచులను దేటపఱిచి అతిశయింపఁజాలిన, వెలంది మిన్నగములు = స్త్రీ రత్నములయొక్క సమూహములని యర్థాంతరము. ఇట నవ సమాగమ మనఁగా గిరికా వసురాజుల నవసంభోగమనియు గ్రాహ్యము.

మరుని తేజీల వైఖరిన్ = మన్మథుని గుఱ్ఱములు చిలుకలుగనుక చిలుకలవలె పసరుగలిగిన కాంతి చేతననుట, పొల్చి = ప్రకాశించి, రతులనిరూఢి = రత్నులనఁగా 'పచ్చల తుల్యామానములు.

('అలివినోదముగాఁగ రతులమెప్పించు నీ పచ్చలకడియాల పద్మగంధి' (విజయవిలాసము). రతులయొక్క నిరూఢిని అనఁగా ఉఱిదిని చూపుచున్న, నితాంత = మిక్కిలియు, రుచిర = ప్రకాశించుచున్నట్టి, మణులని యర్థము. పచ్చలనుట, మన్మథుని తేజీలవలెఁ బ్రకాశించి, రతుల = రతిక్రీడల యొక్క, నిరూఢిని జూపు, నితాంతరుచి = మిక్కిలియైన కాంతిగల, రమణులు = స్త్రీలని యర్థాంతరము.

ప్రౌఢపుంభావ సంభావనల్ - పుంభావ మనఁగా పురుషత్వము—ప్రౌఢ = ప్రవృద్ధమైన, పుంభావ = పురుషత్వముయొక్క, సంభావనల్ = తోఁపికలను, పచరించి = నెఱపి—అనఁగా పురుషరత్నములనెడు ప్రతీతిని గనఁబఱచియనుట. ప్రబలు వామ + ఆలోకరత్నతతులు = సొగసైన ప్రకాశముగల రత్నసమూహములని యర్థము. అనఁగా వజ్రములనుట-వజ్రములు పురుషరత్నములని ప్రసిద్ధము - ప్రవృద్ధ పురుషాయిత రతియందలి మన్ననలను గనఁబఱచి ప్రబలుచున్న వామా-లోక-రత్నతతులు = స్త్రీ-జన-రత్న సమూహములని భావము.

కలయన్ = అంతటను, కీలించి = (పూర్వోక్తములయిన పద్మరాగ మౌక్తిక మరకత వజ్రమణులను) చెక్కి, చిత్రించి = (పూర్వోక్త స్త్రీ రత్నములను) చిత్తరువుగా వ్రాసి యని క్రమాలంకారము. కన్నియలకు = నవోఢలకు, కామనిగమరహస్య ప్రకాశంబుఁ జనర్పన్ = మన్మథవేదరహస్యములను - అనఁగా సంభోగకేళీ మర్మములను ప్రకటముచేయు కొఱకు, పన్నిన = నిర్మించిన, ఆత్మీయనర్మభర్మ హర్మ్యరాజమునకున్ = తనక్రీడార్థమైన బంగారు మేటిమేడకు, వేడ్కన్, అరిగి, అచట, మీఁది కన్వయము.

ఇందు కల్కిమానికములు మొదలగువాని యందు స్ఫురించు రత్నములను స్త్రీ రత్నములను క్రమముగా కీలించియు చిత్రించియు నుండుట తెలియనది. మొదటి నాలుగు చరణములందుఁ గ్రమముగా నవోఢప్రథమానురాగ ప్రకటనము మొదలు ప్రౌఢపూరుషాయితక్రీడవఱకును, అనఁగా నవోఢరతిమౌగ్ధ్యము మొదలుగా ప్రౌఢబంధవైదగ్ధ్యమువఱకును గలదశలక్రమము చెప్పఁబడినది. మొదట (అజ్ఞాతసవృత్తి) లజ్జయును భయమునువీడి, క్రొత్తగా అనురాగము పెంపు గుల్కుట. పిదప నవసమాగమము చవులుచూపుట. పిదప బంధయుక్తముగ నానావిధరతుల నిరూఢిప్రకటించుట- పిదప ప్రౌఢతమిమీఱ పూరుషాయిత క్రీడల విజృంభించుట యని క్రమము. నూతనరాగ మహిమ 'కుల్కు' చును, నవసమాగమము చవులు 'వక్కాణించుచును' రతుల నిరూఢి 'చూపుచును' పుంభావములను 'పచరించు' చునుమండునవి గాన 'కామనిగమరహస్యప్రకాశనం బొనర్పఁబన్ని' నట్టివి. ఎవరికి ? కన్నియలకు— అనఁగా నవోఢలకు. ఆ నాలుగుచరణములయందలి చిత్తరువు పడఁతులును, గన్నియలకు సంభోగకేళీ రహస్యములను క్రమక్రమముగాఁ గఱపునట్టివి గనుక 'మహిమఁగుల్కు' 'మించఁజాలు' 'నిరూఢిఁజూపు' 'ప్రబలు' అని కామశాస్త్రోపదేశమందు దిట్టలగు ప్రౌఢలుగానే చెప్పఁబడిరి. కన్నియలకు లజ్జయుడిపి దిగులు దొలఁగించి, క్రొత్తయగు ననురాగమును బ్రకటింపఁజేసి నవసమాగమమునకు రుచిగల్పించి రతుల దిట్టతన మలవఱచి పూరుషాయితమునకు విజృంభించు నంతటితెఱఁగడఁగా దిద్దుటయే యీచిత్తరువుల పని. ఇట్టి హర్మ్యరాజము గావుననే రాజునకు 'నర్మ' మయినది. కనుక నందులకు నరుగునపుడు 'వేడ్క' తో అలం. శ్లేషము.

సీ. బంధీకృతాన్యరాడ్భువనలక్ష్మీ పరంపరలు నిట్టూర్పులలోపఱపుకరణిఁ
బుంజీకృత స్నేహభూరి విశ్వావానశక్తు, లను.రాగక[illegible]లఁజెఱచు కరణి[illegible]

నంగీకృతాంగచైత్రాధిదేవత లాత్మసుమచోరు మచ్చంబు చూపుకరణిఁ
బ్రకటీకృతానంత రతిమూర్తులు లతాంత, శరశాస్త్రసంచికల్ సాఁచుకరణి
తే. యంత్రపాంచాలికలు గొన్ని యగురుధూప, వితతి వెడలింపఁ గొన్ని దీవియలు దాల్పఁ
గొన్ని విరివీవనలు వీవఁ గొన్ని పసిఁడి, తళుకుటెలనాకు లొసఁగ సంతసము లెసఁగ.

అ. బందీకృత...పరులు—చెఱఁబెట్టఁబడిన శత్రురాజులయొక్క, గృహలక్ష్ముల పరుసలు, నిట్టూరుపుల్ పఱపుకరణిన్ = నిట్టూర్పులు పుచ్చుచున్నవో యన్నట్లుగాను—బందీకృతము లగుట చేతనే నిట్టూరుపులు పఱపుట. భవనలక్ష్ములుగా నుత్ప్రేక్షించుటచే బొమ్మల సౌందర్యంపు సొంపు పెంపును వ్యంజితములు.

పుంజీ...శక్తులు—పుంజీకృత = ప్రోవుచేయఁబడిన—కలయఁగూర్పఁబడినయనుట. స్నేహ = నెయ్యముగల, భూరిమోహనశక్తులు = అనేకములయిన సమ్మోహశక్తులు, అనురాగకలికలన్ = అనురక్తి మొగ్గలను, పెనఁచుకరణిన్ = పెనఁగఁబట్టునట్లుగాను–ఆబొమ్మలుమిక్కిలి మోహకరములగుటచే మోహనశక్తులన్నాఁడు.—స్నేహము ‘పుంజీకృత’మగుటచే అనురాగకలికలను ‘పెనఁచుట’ ఏభావమేని మిక్కుటమైనచో దానివ్యాపారము బిట్టుగా పచరింపఁబడును గదా. ఇట మోహనశబ్దము భావార్థవిహితల్యుట్ప్రత్యయాంతము—స్నేహమనఁగా చమురును, భూరియనఁగా బంగారును గనుక కలయఁగూడిన చమురుగలదై బంగారుమయములును, మోహన=మోహింపఁజేయు–సుందరము లయినవియనుట - అగుశక్తులనియు నర్థము.— ఇటమోహనపదము కర్త్రర్థవిహితల్యుట్ప్రత్యయాంతము. అనురాగమును కలికలుగాఁ జెప్పుట, పల్లవితాద్యవస్థలందు కోరకితముగాఁ జెప్పుట, దీపపుమొగ్గలకు సాటియగుటకొఱకు. స్నేహముగలవియేకదా అనురాగమును జూపుట.

అంగీకృతాంగ చైత్రాధిదేవతలు— అంగీకృత = స్వీకరింపఁబడిన, అంగ = దేహములుగల, చైత్రాధిదేవతలు = వసంతాధిదేవతలు, ఆత్మసుమచోరుమచ్చంబు = తమపువ్వుల దొంగ యొక్క గుఱుతును, చూపుకరణిన్ = వాని గుఱుతును జూపి యిచ్చినట్లుగాను, పూసురఁటి నుండి గాలినిబోలయించుటను, ఆగాలి తమపువ్వులను నపహరించిన ముచ్చని గుఱుతుచూపి పట్టి యిచ్చుటగా నుత్ప్రేక్షించినాఁడు.

ప్రకటీకృత అనంతరతి మూర్తులు—ప్రకటీ కృత = ప్రకటముగా చేయఁబడిన, అనంత=అపరిమితములయిన, రతిమూర్తులు = రతిక్రీడమూర్తులు—ఆకారము దాల్చినరతులు (ఇచ్ఛామూర్తులని కొందఱు) లతాంతశరశాస్త్రసంచికల్=మన్మథశాస్త్రపు సంచికలను, చాఁచుకరణిన్=అం[illegible]దిచ్చునట్లుగాను.

యంత్రపాంచాలికలు = జంత్రపుఁబొమ్మలు—కీలుబొమ్మలనుట, కొన్ని అగురుధూపవితతిన్, వెడలింపన్, కొన్ని దీవియలు దాల్పన్, కొన్ని విరివీవనలు = పూసురఁటులు,వీవన్, కొన్ని పసిఁడితళుకు తెలనాకులు = బంగారు వరకు వేసిన పండుటాకులు, ఒసఁగన్ అనిక్రమాలంకారము. సంతసములు, ఎసఁగన్ = అతిశయింపఁగా, భవనలక్ష్ములనుటచే సౌభాగ్యసంపత్తియు. మోహనశక్తులనుటచే సౌందర్యాతిశయమును, చైత్రాధిదేవతలనుటచే సౌరభ్యవిభవమును,రతిమూర్తులనుటచే ఉద్దీపకత్వమును బొమ్మలయందు వ్యంజితములు మీఁదికన్వయము. నాలు గుత్ప్రేక్షలు.

చ. చికిలిపసిండి వ్రాఁతనునుఁజెంద్రికవన్నియమేలుకట్టునం
జకచక పర్వఁ గ్రొవ్విరులు చంపకముల్సవి దేంట్లు మూఁతిము
ట్టక నవకంపుఁ గెంపుమొగడల్ గని రాఁ దెలిముత్తియంపుబ
ల్సకినలకూకలం గిలకిలన్ నగుమోహనశయ్య నున్నెడన్. 74

అ. చికిలిపసిండి వ్రాఁత = తళుకుగల బంగారు వ్రాఁతపని గలిగిన, నును = మెత్తని, చెంద్రిక వన్నియ=చంద్రకావిరంగుగల, మేలుకట్టునన్ = చాందినీయందు, చకచక పర్వన్=చకచక మెఱచుచుండెడు కాంతివ్యాపింపఁగా, గ్రొవ్విరులు = ఆచాందినియం దలంకరింపఁబడిన పువ్వులు, చంపకముల్ సవి = సంపెంగపువ్వులు అని భ్రాంతిచేత, తేంట్లు = తుమ్మెదలు, మూఁతిముట్టక = మూతితోఁ దాఁకక—ఆస్వాదింపకయనుట. నవకంపు కెంపుమొగడల్ కనిరాన్ = పడుకయందలి నేవళమయిన పద్మరాగమణులచేతఁ జేయఁబడిన మొగ్గలను జూచి యెఱ్ఱనిపువ్వులని భ్రమించిరాఁగా, తెలిముత్తియంపుబల్ సకినల కూకలన్ = తెల్లనిముత్యములు గూర్చిన కీఁచుబిళ్లలమ్రోఁతలనెడు వ్యాజముచేత, కిలకిలన్నగు=అపహసించుచున్న, మోహనశయ్యన్ = మోహనకరమయిన పానుపుమీఁద, ఉన్నెడన్ = ఉండఁగా, మీఁదికన్వయము.

మేలుకట్టు చంద్రకావివన్నె. అందు బంగారు వ్రాఁతపని. బంగారు తీఁగపువ్వులు సంపెంగపువ్వులని భ్రాంతి. బంగారమునకు సంపెంగకును వర్ణమున సామ్యము. 'పైఁడిగోళ్లుహింసారతి సేయు దర్పకుని సంపెఁగ ముల్కులువోలె మించఁగన్' అని మనుచరిత్రము. కావుననే తేంట్లు మూతిముట్టమి- కెంపు మొగ్గలను జూడఁగా అవియే యెఱ్ఱని పువ్వులని వచ్చినవి- వానిమౌఢ్యమునకు నాశయ్య కిలకిలనవ్వినట్లు, తెలి... ..కూకలు- తెలిముత్తియములచే 'నగుట' సకినలకూకలచే 'కిలకిలనగుట' 'మోహనశయ్య' శయ్యాయు నిటఁ దటస్థోద్దీపకముగాఁ జెప్పుట తెలియునది. అల. భ్రాంతి. ఉత్ప్రేక్ష.

ఇట 'చంపకముల్ సవి' యనుచో 'సవి' అనఁగా 'అని' యనియర్థము. ఇది దేశ్యావ్యయము. ఇందులకు నెఱ్ఱాప్రగడ.

'నాకునిచ్చియున్న నామెడహారంబు, నిజనఖాంకురముల నిగిడికొనుచు
సరభసముగఁ జనియె సవి రాత్రినేఁ గల, కంటి నపుడ మేలు కంటినవఘ.

(లక్ష్మీనృసింహావతారము 3-ఆ.)

శా. ఆకోలాహలశైల సంభవ రసవ్యాకృద్ఘనాళి ప్రయ
త్నైక ప్రస్థిత యై ప్రతిక్షణస భంగారాళి సంచార యై
వ్యాకీర్ణాంబరఫేన యై పిహితవక్త్రాబ్జస్ఫురద్వేణి యై
శ్రీకల్యాణ గుణార్ణవుం డలర వచ్చెన్ నూత్నరాగంబునన్. 75

అ. ఇట శైలసంభవ యనుట గిరికకును సెలయేటికిని జెల్లునుగాన ఉభయపరముగా అర్థద్వయము తెలియునది.—ఆకోలాహల శైలసంభవ = కోలాహల పర్వత పుత్రికయగు నా గిరికయని యర్థము - సెలయేఱని యర్థాంతరము.—ఇట్లే సర్వత్రరూపకమని తెలియునది - రస . స్థితయై—గిరిక) రస=శృంగారరసమును, వ్యాకృత్ = వెదచల్లుచున్న—అనఁగా తెలుపుచున్న, ఘన ఆళి= గొప్పవారలగు చెలికత్తెల యొక్క, ప్రయత్న=పూనికచేతనే, ఏకప్రస్థిత=ముఖ్యముగా తరలుచున్నదై—(సెల) రస = జలమును, వ్యాకృత్ = వెదచల్లుచున్న—అనఁగా కురియుచున్న, ఘన

ఆళి=మబ్బుల గుంపుయొక్క, ప్రయత్నముచేతనే ముఖ్యముగా ప్రవహించుటగలదై, ప్రతి...చారయై—(గిరిక) ప్రతిక్షణ = క్షణక్షణమును, సభంగ = తొట్రుపాటుతోఁగూడిన, అరాళ = కుటిలమైన, సంచారయై=గమనముగలదై—(సెల) ప్రతిక్షణమును, సభంగ=అలలతోఁగూడినదియువక్రమయి నదియునగు, సంచారముగలదై, వ్యాకీర్ణ అంబరఫేనయై—(గిరిక) వ్యాకీర్ణ = వ్యాప్తమయిన, అంబరఫేనయై = తెల్లని నురుఁగువంటి వస్త్రముగలదై— (సెల) వ్యాప్తమయిన యాకాశముగల అనఁగా ఆకాశమందు వ్యాపించిన నురుఁగులుగలదై, పిహిత...ణికయై—(గిరిక) పిహిత=ఆచ్ఛాదింపఁబడిన, వక్త్రాబ్జ = మోముదామరగలిగి, స్ఫురత్ = ప్రకాశించుచున్న, వేణికయై = జడగలదై,—(సెల) ఆచ్ఛాదింపఁబడిన ముఖమువంటి తామరలుగలదై ప్రకాశించుచున్న పాయలుగలదై,—గిరిక సిగ్గుచేత చేతులచే మొగము మాటికొని పెడమరలుగా నుండుటచే - మోముఁదామర గప్పంబడినదియు జడ ప్రకాశించుచున్నదనియు ననుట—మేఘవర్షణ సమయముగాన సెలయేటి తామరలు మాటుపడుటయు జలము మిక్కుటముగాఁ బొంగి పాయలువాఱుటయునని తెలియునది. శ్రీకల్యాణగుణ అర్ణవుండు = (గిరిక) సంపత్కరములయిన శుభగుణములకు సముద్రుఁడయి వసురాజు, (సెల) శుభగుణములుగల సముద్రుఁడు, అలరన్ = సంతోషించునట్లుగా, నూత్నరాగంబునన్ = (గిరి) క్రొత్తయనురాగముచేత—(సెల) (గైరికాదిధాతు మిశ్రముచేతఁగాని వండుచేతఁగాని కలిగిన) క్రొత్తయెఱుపుచేత - క్రొత్తవెల్లువ యెఱ్ఱగానుండుట ప్రకటము, వచ్చెను. అల. శ్లేషము.

ఉ. వచ్చి నృపాలకేళి గృహవాటము నెచ్చెలి పిండుచాటునం
 జొచ్చి మెఱుంగుదేఱుతొగచుట్టపురా మొగరంబుమాటుగా
 నచ్చపలాక్షి నిల్వ నది యవ్వలభర్తకుఁ జూపె రాచసొ
 మ్మెచ్చటనైన నిత్యశుచివృత్తులు మాటికొనంగ నేర్తురే. 76

అ. అచ్చపలాక్షి = గిరిక, వచ్చి, నృపాల కేళిగృహవాటము = రాజు క్రీడాగృహపుపట్టును, నెచ్చెలి పిండుచాటునన్ = చెలికత్తియలగుంపు మఱుఁగున, చొచ్చి, మెఱుంగుదేఱు=మెఱయుచున్న, తొగచుట్టపురా మొగరంబు మాటుగాన్=చంద్రకాంత శిలచేతనైన స్తంభముచాటుగా, నిల్వన్ = నిలిచియుండఁగా, అది = ఆ స్తంభము, అవ్వలన్ = ఆపిమ్మట, భర్తకున్ = పెనిమిటియైన వసురాజునకు, (గిరికను) చూపెను - (కంబముయొక్క ఈ ప్రక్క చాటునగిరిక మఱుఁగియుండఁగా, చంద్రకాంతపుఱాయి గనుక ఆప్రక్కను గూడ నద్దంబునందుం బోలె గిరిక కనఁబడఁగా వసురాజునకు నది గిరికను దెలిపినట్లుండెనన్నాఁడు.—రాచసొమ్ము=రాజద్రవ్యము, ఎచ్చటనైనన్, నిత్యశుచి వృత్తులు=ఎప్పుడును పరిశుద్ధ వర్తనముగలవారని యర్థము—ఎప్పుడును స్వచ్ఛముగా నుండినవని భావము. మాటికొనంగ నేర్తురే = దాఁచిపెట్టుకొనఁ జాలుదురా—చాలరనుట.

మ. నవరత్న ప్రతిబింబదంభమున నన్నాళీకపత్రాక్షిఁ ద
 త్సవయోరూపసఖుల్ భజింపఁగని లజ్జాయుక్తిమైఁ బోలె నా
 లివితానం బొకనేర్పునన్ వెడల నిల్చెం దాన వ్రీడావయ
 స్య వధూటీ లలితాంతరంగ చిరసఖ్యాభ్యాసబంధంబునన్. 77

ఆ. అన్నాళీక పత్రాక్షిన్ = (తామర రేకులవంటి కన్నులుగలయా) గిరికాదేవిని, నవరత్న ప్రతిబింబదంభమునన్ = గృహమందుఁ దాఁపిన క్రొత్తరత్నముల యందలి ప్రతిచ్ఛాయలు—అనఁగా

నీడలు అనెడి నెపముచేత, తత్సవయోరూప సఖుల్ = ఆగిరికాదేవికి సమానమయిన వయస్సును రూపమును గల చెలికత్తెలు, భజింపన్ = సేవింపఁగా, చుట్టునున్న రత్నములందలి గిరికా ప్రతిబింబ రూపములు. గిరిక వయసును రూపమునుగల చెలికత్తెలుగా బలసియుండునట్లుగాఁ దోఁచెననుట. కని= చూచి, ఆలీ సమూహంబు = చెలికత్తెలగుంపు, లజ్జాయుక్తిమైన్ పోలె = సిగ్గుతోఁగూడికొనుట చేతవలె, ఒకనేర్పునన్ = ఒకొక్కక్క మెలపుచేత, వెడలన్ = వెడలిపోఁగా,—చుట్టు రత్నములందలి గిరిక ప్రతిరూపములు - గిరికకు వయోరూపములందు సాటియైన బోంట్లవలె నుండుటఁజూచి యామె చెలికత్తెలు గిరిక కన్న వయో రూపములం దక్కువవా రగుటచేత, గిరికకు సాటిబోటులు బలసియుండఁగా వారికిఁ దాము తక్కువయగుటకు సిగ్గునొంది వెడలిపోయిరో యన్నట్లు ఒకొక్కక్క నెపమునుబన్ని వెడలిపోయిరనుట. వధూ...బంధంబునన్—వధూటీ = గిరికయొక్క, లలిత= చెలువయిన, అంతరంగ = మనస్సు నందు, చిర = చాలకాలమునుండిగల, సఖ్య = చెలిమి యందలి, అభ్యాసబంధంబునన్ = అలవాటుయొక్క కట్టుచేత ననియర్థము. గిరికయొక్క మనస్సునందు చిర కాలముగా పొత్తుగలిగియున్న యలవాటు కట్టుచేతనని భావము. వ్రీడావయస్య = లజ్జయనెడు చెలికత్తె, తాన = తానొక్కతియె, నిల్చెన్ = పోకనిలిచియుండెను.

చెలికత్తెలందఱు వెడలిపోయినను సిగ్గనెడు చెలి మాత్రమువిడిచిపోకయుండెను. చిరకాలముగా అంతరంగముయొక్క చెలిమి యలవాటుచేత-(అంతరంగమున చిరకాలముగానుండు నలవాటుచేతనని భావము). ('అన్యదా భూషణంపుంసాం...లజ్జైవయోషితామ్' అని కులకన్యలకు లజ్జభూషణము గనుక గిరికకు కులకన్యాత్వ ప్రయుక్తమయి తొడతెగకున్న సహజలజ్జను, వీడనిచెలిగా నిటరూపించినాఁడు. చెకలిత్తెలందఱు వెడలిపోయిరనియు గిరిక సిగ్గుగడలుకొన నిలుచుండెననియుఁ దాత్పర్యము.

సీ. అంబుజాంబకుపూన్కి నతినిర్మలస్థాణు, వున మించువామార్ధతను వనంగ
మోహకాగ్రణియత్నమునఁ దోఁచిమగుడఁగంబముఁ జేరుజంత్రంపుఁ బ్రతిమయనఁగ
సహకారతరుపరిగ్రహమునఁదగి యుపఘ్నవాప్తి యెడలనితీవ యనఁగ
మావంతుప్రార్థనామహిమ నాలానంబు,దరలి వచ్చుమనోజదంతి యనఁగ
తే. నట్టిరమణుండు దవియ నహార్యతనయ
విధుమణిస్తంభమున నరవెడలి బయలు
పడి పెనంగుచు మరలి కంబ మొకకేల
నూని యూఁతయుఁ దక్కి పాన్పొయ్యఁ జేరె. 78

అ. అంబుజాంబకు పూన్కిన్ = తామర బాణముగల మన్మథుని ప్రయత్నముచేత, అతినిర్మ ణువునన్ = మిక్కిలిధవళవర్ణుఁడయిన శివునియందు, మించు, వామార్ధతనువనంగన్ = ఎడమ సగము మేనయిన పార్వతియో యన్నట్లుగానని యర్థము—అంబుజ అంబకుఁడనగా తామరలవంటి కన్నులుగల వసురాజనియు, అతినిర్మలస్థాణువునన్ అనఁగా మిక్కిలిస్వచ్ఛమయిన చంద్రకాంతమణి స్తంభమందనియు వామ అర్థతనువనఁగా, వామ = చక్కనిదయిన గిరికయొక్క సగము దేహమనియు నర్థాంతరము. ('స్థాణుఃకీలేస్థిరేహరే' విశ్వము.)

మోహకాగ్రణి యత్నమునన్ = సూత్రధారియొక్క ప్రయత్నముచేత, తోఁచి = అగపడియని యర్థము—సౌందర్యాదులచేత లోకులను మోహింపఁజేయువాఁడయిన వసురాజుయొక్క

యత్నముచేత గనఁబడియని అర్థాంతరము. మగుడన్ = మరల, కంబముచేరు = స్తంభముచేరుచున్న, జంత్రపుఁ బ్రతిమయనఁగన్ = కీలుబొమ్మయో యన్నట్లుగాను.

సహకారతరుపరిగ్రహమునన్ = తియ్యమామిడిచెట్టు యొక్క పట్టుచేత ననియర్థము - సహకారతరు = సహాయశ్రేష్ఠుఁడయిన వసురాజుయొక్క, పరిగ్రహముచేతనని అర్థాంతరము. ఉపఘ్న = సమీపాశ్రయము - దాపటి యూఁత,దానియొక్క, అవాప్తి = పొందును, ఎడలని తీవయనఁగన్ - 'స్యాదుపఘ్నోంతికాశ్రయే' అ.

మావంతప్రార్థనామహిమన్ = మావటివాని వేఁడికొనుటయొక్క సామర్థ్యముచేత—బుజ్జగింపు పెంపుచేత ననియర్థము—మా అనఁగా లక్ష్మి. మావంతుఁడనఁగా శ్రీమంతుఁడయిన వసురాజుయొక్క ప్రార్థనముచేతనని యర్థాంతరము. ఆలానంబు = కట్టుగంబమును, తరలివచ్చు, మనోజదంతి యనఁగన్=మన్మథునియేనుఁగో యన్నట్లు ('ఆలానం బంధనస్తంభే' అ)

అట్టిరమణుండు = అటువంటి పెనిమిటి, ఇక్కడ అట్టియను పదము అంబు జాంబనుఁడును, మోహాకాగ్రణియు, సహకారతరుఁడును, మావంతుఁడయినయట్టి యని యీవిశేషపదముల యర్థాంతరముల నావిష్కరించుచున్నది. తివియన్ = చేయిపట్టి యీడువఁగా, అహార్యతనయ = పర్వతపుత్రియైన గిరిక, విధుమణిస్తంభమునన్ =చంద్రకాంతపు కంబమునందుండి, అరవెడలి = సగమువెలువడి, బయలుపడి పెనంగుచున్ = స్తంభమువదలియునురాక పెనఁగులాడుచును, మరలికంబము ఒకకేలనూని = తిరుగ స్తంభమునొకచేతఁ బట్టుకొన్నదై, ఊఁతయున్ తక్క = స్తంభముపట్టుకొనుటయుమాని, ఒయ్యన్ = మెల్లగా, పాన్పుచేరెను = పానుపుమీఁదికి వచ్చెను.

'అరవెడలి' = శివునియందు విలసిల్లుచున్న సగముదేహముగల పార్వతివలె చంద్రకాంతపు కంబమునుండి సగముతొలఁగినది. 'బయలుపడి పెనంగుచున్' సూత్రధారిప్రయత్నముచేత తోఁచిమరలఁ గంబముచేరు కీలుబొమ్మవలెమాటునుండి వెలువడివచ్చియుఁ గంబమునుబట్టుకొని పెనఁగులాడినది. 'మరలి కంబమొకకేలనూని' మామిడిచెట్టు నవలంబించియు దాపటిపట్టును వదలని తీఁగవలె రాజుచేతఁబట్టువడియు మరల కంబమునొకచేతఁబట్టుకొన్నది. 'ఊఁతయుఁదక్క పాన్పునొయ్యన్ చేరె' మావటివాని బుజ్జగింపుచేతఁ గట్టుఁగంబము దరలివచ్చిన యేనుఁగువలె రాజులాలనముచేత కంబముపట్టువదలి వచ్చినది. ఒయ్యన్ = ఏనుఁగువలె మందగంభీరముగా (సిగ్గుచేత) వచ్చుట. దంతి మనోజునిదనుటచే మన్మథునిరాకకు మేలివాహనమనుట-మన్మథోద్దీపనమునకుఁ బ్రకృష్టసాధనమని యాశయము. ఇట క్రమాలంకారము. ఒక్కొక్క పెద్దపాదమున ఒక్క ఉత్ప్రేక్ష.

మ. మృదుకర్ణోత్పల సంగతాళిరవభూరిప్రేరణన్బోలెఁ ద
త్పదనాధారము మాని మానిని సదాధారంబు భూభృజ్జయూ
స్పదదోస్స్తంభము డాయఁ దాదృశభుజాస్తంభోచ్ఛ్రియాసూయ న
భ్యుదితస్తంభములయ్యె నంబకము లాభూమండల స్వామికిన్. 79

అ. మానిని = గిరిక,మృదు...బోలెన్—మృదు = మెత్తని, కర్ణోత్పల=చెవియందలి నల్లగలువతోడ, సంగత = కూడికొన్న, అళిరవ తుమ్మెదయొక్క ఝుంకారమనెడు, అళిరవ = చెలికత్తె వాక్యపుధ్వనివలని, భూరిప్రేరణన్ పోలెన్ = అధికమయిన ప్రేరేపణముచేతవలె,తత్-సత్-అనాధారము = అసత్పురుషులకు అనాధారమయిన దానిని— స్తంభముననుట. మాని, అని యర్థము. ఆనతజనులయొక్క ఆధారమైనదానినని భావము. సత్ - ఆధారంబు = సజ్జనుల కాధారమయినదని

యర్థము—శ్రేష్ఠమయిన యాధారమనని యర్థాంతరము. అగుభూభృత్ జయ ఆస్పదదోః స్తంభముర్ - భూభృత్ = వసురాజుయొక్క, జయఆస్పద = జయమున కాస్పదమయిన, దోః స్తంభముర్ = భుజమనెడు స్తంభమును, డాయర్ = హత్తుకొనఁగా, తాదృశభుజా స్తంభ -ఉచ్ఛ్రియ-అసూయర్ = అట్టిభుజా స్తంభముయొక్క అతిశయమునందలి యీసుచేతనని యర్థము - ఉచ్ఛ్రియమనఁగా పొడువునగనుక భుజముల పొడువనిభావము—ఎగు బుజంబులనుట. అసూయాజననోపయుక్తికై అతిశయమనియు తాత్త్వికస్థితికి ఉన్నతియనియు నర్థము. అంగకములు= అవయవములన్నియు, ఆభూమండల స్వామికిర్ = ఆవసురాజునకు, అభ్యుదిత స్తంభములు అయ్యెర్ = అభ్యుదయమును బొందుచున్న స్తంభములాయెనని యర్థము. ('స్తంభస్స్యన్నిష్క్రియాఙ్గత్వం రాగభీత్యాదిసంభవమ్' అన్నట్లు), అభ్యుదిత = పుట్టినట్టి, స్తంభాఖ్యమగు సాత్త్వికభావముగలవి యాయెనని భావము.

చెవినల్లగలువయందలి అళి (తుమ్మెద) యొక్క ఝిట్టురవళిని చెవికడ మంతనమాడి పురికొలుపు అళియొక్క ప్రేరణోక్తిధ్వనిగాఁ జెప్పినాఁడు. ప్రేరణమంతయు చెడ్డది విడిచి మంచిదిచేపట్టుమని యేకదా. కాన, సత్+అనాధారముఅగు స్తంభమునుమాని సత్+ఆధారమగు రాజభుజా స్తంభమును డాయుమన్నది. రాజు భుజా స్తంభమునకు అంతటిఅతిశయముకలుగఁగానే రాజుతక్కినయవయవములును స్తంభములయ్యెను—భ్రమానుపడియుండెననుట. అనఁగా గిరికాదేవి చంద్రకాంతమణి స్తంభమును వదలి శయ్య పయికి వచ్చి వసురాజుయొక్క భుజా స్తంభమును హత్తఁగానే వసురాజునకు స్తంభమనెడు సాత్త్వికభావముదయించి, సర్వావయవములును నిశ్చలములై యుండెనని తాత్పర్యము.

క. అభ్యుదితరత్నకటకచ, యభ్యుదితనినాద మయ్యె నయ్యెడఁ జల మే
లమ్మని పతితోఁ దగు మే, లమ్మని సహజానురక్తి లాలించుక్రియన్. 80

అ. అభ్యుదిత...చయమ్ము=ఆగిరికాదేవి రత్నమయములయిన కడియముల సమూహము, అయ్యెడర్ = ఆసమయమందు, ఉదితనినాదము = పుట్టినధ్వనిగలది, అయ్యెను. ఏలాగనిన—చలము ఏలమ్మ అని, పతితోర్ మేలమ్ము తగును అని, సహజానురక్తిర్ = తోడఁబుట్టినదానియందలి మక్కువచేత—లేక సహజప్రేమచేత, లాలించుక్రియర్ = బుజ్జగించునట్లుగా, ఉదితనినాద మయ్యెనని సంబంధము. అలం. ఉత్ప్రేక్ష.

రత్నములు-కోలాహలునివలనఁగాని శుక్తిమతివలనఁగాని పుట్టినవిగాన యవియును గిరికయును సహజవస్తువులు కనుకనే సహజానురక్తిని జెప్పుట. కోలాహలమందు పద్మరాగాదిరత్నములును శుక్తిమతియందు ముత్యములును బుట్టుచున్నవని తెలియునది. రాజు ముఖచుంబన కుచాలింగన నీవీమోక్షణాదులను గిరిక సిగ్గుముంపుచేఁ దొందరపడి చేతులచే వారించుచుండుటచే ఆబిడ 'రత్నకటకచయ మ్ముదితనినాదమయ్యె' నని యూహించునది. ఆలజ్జాతిశయమునే మీఁద వర్ణించుచున్నాఁడు.

శా. * ఆశారోధక మావృతాంబర మనూనాంధాలోక మచ్ఛైచ్ఛిన్నో
ద్దేశప్రావరణంబునై యలఘువృత్తిన్ శ్యామమందాక్షము
ద్రాఘింభత్తిమిరంబు పర్వ మదనాంధ్వన్యుండు ఖిన్నాత్ముఁడై
యాశించెం గమనీయరాజ కరలీలాలంబ సంచారమున్. 81

అ. ఇందు 'మందాక్షముద్రాఘింభత్తిమిరంబు' అనుటచేతఁ గడపటికును మందాక్షపరముగాను తిమిరపరముగాను అర్థద్వయము తెలియునది—ఆశారోధకము-(మం) ఆశలక్ష్యఅడ్డు[illegible]నది.

* ఆశారోధక మస్ఫుటాక్షివలనంబాపాద్యమానాఖిలోద్దేశ । ప్రావరణంబు నై. ప్రా[illegible]ము

(తిమి) దిక్కులకు అడ్డయినది. ('దిశస్తుకకుభః కాష్ఠాఆశాశ్చ హరితశ్చతాః' అ.) ఆవృతఅంబరము-(మం) కప్పఁబడిన పయిపుట్టము—అనఁగా పయఁట- గలది - (తిమి) ఆవరింపఁబడిన ఆకాశము గలది, అనూఢాలోకము - (మం) పొందఁబడని చూపుగలది—(తి) పొందఁబడని వెలుతురుగలది. (వహప్రాపణే అనెడు ధాతువుమీఁద ఊఢశబ్దము నిష్పన్నమైనది.)ఉచ్చైస్తనోద్దేశప్రావరణంబున్. (మం) ఉచ్చైస్తన-ఉద్దేశ=ఉన్నతమయిన స్తనములమీఁది ప్రదేశముయొక్క, ప్రావరణము=చక్కని ముసుఁగుగలది - (తిమి) ఉచ్చైస్తన = ఉన్నతమయిన, ఉద్దేశ = ప్రదేశములయొక్క, ముసుఁగు-అనఁగా క్రమ్ముట - కలది, ఐ, అలఘువృత్తిన్ = అధికమయిన వర్తనముచేత, శ్యామ మందాక్షముద్రా శుంభత్తిమిరంబు—(మందాక్షము శ్యామలమని కవిసమయముగనుక) శ్యామ = నల్లనయిన—లేక - గిరికయొక్క, మందాక్షముద్రా = లజ్జాస్వరూపమనెడు, శుంభత్తిమిరంబు = విఱ్ఱవీఁగుచున్న చీఁకటి, పర్విన్ = వ్యాపింపఁగా, మదన అధ్వన్యుండు—('అధ్వనీనోఽధ్వగోఽధ్వన్యః పాన్థః పథిక ఇత్యపి' అ) మన్మథుఁడనెడు బాటసారి. ఖిన్నాత్ముఁడై=ఏమియుఁ దోఁపకుండు మనస్సుగలవాఁడై-కమనీయ...చారమున్ - కమనీయ=ఒప్పుచున్న, రాజకరలీలా=వసురాజుచేతి వ్యాపారము అనెడు, రాజకర=చంద్రకిరణముయొక్క,లీలా విలాసముయొక్క,ఆలంబ=ఊఁతతోఁగూడిన, సంచారమున్ = గమనమును, ఆశించెన్ = ఇచ్ఛగించెను.

మందాక్షముద్రకు 'అలఘువృత్తిన్' అనుటచే ప్రాబల్యమును 'మదనాధ్వన్యుండు ఖిన్నాత్ముఁడై' యనుటచే మన్మథునకు దౌర్బల్యమును జెప్పంబడినది గనుక 'ఉదయద్యౌవనాముగ్ధాలజ్జావిజితమన్మథా' అన్నట్లు గిరిక ముగ్ధయని తెలియునది. గిరికను మిక్కుటమయినలజ్జ క్రమ్మినదనియు కావున మన్మథుఁడు విచ్చలవిడి తనశక్తి గనఁబఱుపఁజాలఁడయ్యెననియు భావము. చీఁకటిగ్రమ్మఁగా ఇచ్చ చొప్పున నడవలేక బాటసారి 'రాజకర' చంద్రకిరణము వెలుతురును గోరునట్లు, గిరికకు సిగ్గుగ్రమ్మఁగా మన్మథుఁడు తనప్రవృత్తి సాఁగక 'రాజకర' రాజహస్తము ఆలంబనీయముగాఁ గోరెను.—కన్నుదెలియనివాఁడు మఱొకరిచేయూఁత గోరవలయునే కదా. చీఁకటియందు బాటసారి వెలుతురునుగోరును. 'లీలాలంబ' కన్నులుతెలియమిచేతనే చేయూఁతగోరినను పైకి విలాసార్థముగా కైదండ గొన్నట్లు తోఁచుటకై యని-'లీలా'శబ్దముచే ఒక సారస్యము స్ఫురించుచున్నది. రాజు తనహస్తముచేత నాయికకళాస్థానములు మెల్లనంటుచు మెలఁగఁగా మన్మథోద్దీపనము హెచ్చుచువచ్చెననియుఁ గావున నాహస్తము మన్మథునకు నూఁతగానుండెననియుఁ దాత్పర్యము.

'ఆశారోధక మస్ఫుటాక్షివలనం బాపాద్య మానాఖిలోద్దేశ ప్రావరణంబునై' అని పాఠాంతరము. అస్ఫుటాక్షివలనంబు = తేటగాని కన్నులుతిరుగుట గలది - నయనవ్యాపారము లేనిదనియు - చూపులు నిగుడ్చుటలేనిదనియును, ఆపాద్య...వరణంబు = కలిగింపఁబడుచున్న అన్ని (యవయవముల) పట్టులందలి ముసుఁగుగలదియు — కలిగింపఁబడుచున్న అన్ని ప్రదేశములందలి క్రమ్ముటగలదియు. పూర్వపాఠమున 'ఆవృతాంబర'మునకు'ఉచ్చై...వరణంబు' అనుట పౌనరుక్త్య ప్రాయమనియు ఈపాఠమున ఆ యసంగతి గానిపింపదు గాన మఱింత యంగీకార్యమనియుఁ గొందఱ మతము. చీఁకటి దిక్కులనుగ్రమ్ముచు, ఆకాశమునలముచు, వెలుతురును మాన్పి, పొడవులయిన ప్రదేశములను దుడ కాక్రమించుక్రమ మిట చెప్పఁబడినది. ఇల. శ్లిష్ట రూపకము.

ఉ. మంచు ముసుంగువ్వాని [illegible]మాత్రము పద్మిని మోముఁదమ్మి దీ-
[illegible] ఖిన్నమొగ్గ ల[illegible]భేద్యతరచ్ఛదగుప్తి నేమియు

న్మించమి * నేఁకటం గడు భ్రమించుచుఁ దత్సుమనోవికాసవే
ళాంచితవైభవంబునకు నాసపడుఁ న్నృపనేత్రభృంగముల్. 82

అ. ఇట 'పద్మిని' అనుటచే గిరికపరముగాను తామరతీఁగపరముగాను అర్థద్వయము — పద్మిని = పద్మినీ జాతి గిరికాదేవి యనెడు తామర తీఁగయొక్క, మోముఁదమ్మి = తామర వంటి మొగము- మొగమువంటితామర, మంచుముసుంగు = మంచువంటిముసంగు - ముసుఁగువంటి మంచు, పూని, లవమాత్రము = లేశమయినను, దీపించమిఁ = ప్రకాశింపక యున్నందున, చన్నుమొగ్గలు= కుచములనెడు మొగ్గలు, అవి...గుప్తిఁ —అవిభేద్యశర = భేదింపనలవిగాని, ఛద = వస్త్రమనెడు ఆకులయొక్క, గుప్తిఁ = క్రమ్మికచేత, ఏమియుఁ = ఎంతమాత్రమును, మించమిఁ = అతిశయింపకున్నందుచేతను, నేఁకటఁ = మిక్కుటమైన యపేక్షచే, కడుఁ భ్రమించుచు=మిక్కిలి చుట్టిచుట్టి తిరుగుచు, నృపనేత్రభృంగముల్ = వసురాజు కన్నులనెడు తుమ్మెదలు, తత్...వైభవంబునకుఁ—తత్ = ఆగిరికయనెడు తామరతీఁగయొక్క, సుమనోవికాసవేళా = యోగ్యమయిన మనోవికాసమనెడు పుష్పవికాసముయొక్క సమయమందలి, అంచిత వైభవంబునకుఁ = ఒప్పిదమయిన విభవమునకు, ఆసపడుఁ = ఎప్పుడోయని యాసపడుచుండెను.

గిరికాదేవి మిక్కుటమయిన సిగ్గుచేత సన్నపుముసుం గిడుకొని ముఖము విప్పిచూడక దట్టమయిన వస్త్రముచేత గుచములు గప్పిపెట్టుకొని యుండఁగా నాపడఁతి మన స్సుల్లసిల్లు సొంపెపుడు - అనఁగా మన్మథప్రాబల్యముచే నెపుడాభిముఖ్యముకొందు సొంపును - జూడఁగలుగునని రాజు కన్నులు గోరుచుండెనని తాత్పర్యము.

తామరతీఁగ మంచుగ్రమ్మఁగా పూవువెలయక మొగ్గరేకులు గుత్తముగా బిగిసికొనియుండుటచే నెంతమాత్రము విరియకుండఁగా,తుమ్మెదలు దానినిచుట్టిచుట్టి తిరుగుచు దాని పూవువిరియఁబాఱు సొంపు నెపుడు చూడఁ గలుగునోయని యాతురపడుచుండెననియు నర్థము. అల. రూపకము.

క. నవలానవలావణ్యా, ర్ణవలాలిత కాంతిరమకు నయనద్యుతులఁ
నవనీరాజన మొసఁగుచు, నవనీరాజాగ్రగణ్యుఁ డనియెం బ్రేమన్. 83

అ. నవలా = గిరికయొక్క [ఇది దేశ్యపదముగనుక 'నచదేశ్యపదే' (నన్నయ) అనుసూత్రము చేత నిచట హ్రస్వముగాదయ్యె], నవ = క్రొత్త,లావణ్య = కళయనెడు, అర్ణవ = సముద్రమందుఁ లాలిత = ఒప్పుచున్న, కాంతిరమకుఁ = (రమయనఁగా సమృద్ధియు లక్ష్మియునుగనుక) కాంతి సమృద్ధి యనెడు లక్ష్మికి, నయనద్యుతులఁ = తన కన్నులకాంతులచేత, నవనీరాజనము = క్రొత్తహారతి, ఒసఁగుచుఁ, అవనీరాజాగ్రగణ్యుఁడు = భూమియందలి రాజులలో శ్రేష్ఠుఁడు-వసురాజు, ప్రేమఁ, అనియెను.

అపూర్వ సౌందర్యాది గుణసంపత్తికి దృష్టిదోషనివారణమునకై నీరాజనము లిచ్చుటవాడుక. గిరికలావణ్యము ఇంతింతనరాదు.అది 'అర్ణవము'. దానికాంతిరమకు నీరాజన మావశ్యకము. రాజునేత్రకాంతులే నీరాజన మొసఁగెను — నీరాజనము చుట్టిచుట్టిరాఁ ద్రిప్పుటగాన గిరిక మిక్కుటమయిన లజ్జచేత మూర్తియ్యక తెలుపినియ్యకుండఁగా, రాజు కనుమిఱుఁగులు పర్వ నాపడఁతి లావణ్యకాంతి పట్టిపయి చుట్టిచుట్టి పఱుమాఱుచూపులు కలయనిగుడ్చుచుండుటచే, అది కాంతులు పర్వచుట్టిచుట్టి త్రిప్పఁబడు హారతివలెనుండెననుట. అది ఆ యపూర్వలావణ్యమునకు దోషనివారణార్థము హారతి ద్రిప్పి

* 'ఒక్కటంగడు' అని పాఠాంతరము.

వట్లుండినది. క్రిందికినిమీఁదికినిచుట్టిచుట్టి మెఱుఁగులు పర్వఁజాపులు సగుడ్చుటను హారతిఁద్రిప్పట గాఁ జెప్పినాఁడు 'నవ ..రమ' పాలసముద్రమం దొప్పు లక్ష్మివలనే లావణ్యపటలియం దొప్పు కాంతి పెంపు. అలం. పర్యాయోక్తము.

సీ. వరపద్మమకరముల్ కరగతంబులు నీకు, సతి నీవిచే యింతసడలరాదె
బహుళశతచ్ఛదరాశిభవదక్షియుగళంబు, నేత్రాంచలం బింత నెరపరాదె
యనఘదివ్యాహారఖని నీదు కెమ్మోవి, లేమ ముద్దింత పాలింపరాదె
తావిగంబూరంపు దీవి నీమొగ*మొక్క, పలుకింత నాపైని జిలుకరాదె

తే. చక్రవిజయం బొనర్చె నీచన్నుదోయి, కంచుకం బేల యింకఁ జాలించ రాదె
నిర్మలామూల్యగుణరత్ననిధికి నీకు, వనజముఖి త్రాస మిది యేలవదలరాదె 84

అ. సతి = గిరికా, నీకు, వరపద్మమకరముల్ = వరము పద్మము మకరము అనునిధులు, కరం గతంబులు = చేతిలోనివి, నీవి = మూలధనమును, ఇంత చేసడలరాదే=ఇంచుకంత చేయి వదలరాదా యని యర్థము—వర = శ్రేష్ఠములయిన పద్మమకరరేఖలు హస్తమందుఁగల వనియును నీవియనఁగా పోఁకముడిగాన దానిని కొంచెము చే వదలరాదాయనియును భావము.

భవత్ అక్షియుగళంబు= నీయొక్క కన్నుఁగవ. బహుళశతచ్ఛదరాశి = పెక్కువందల వస్త్రి రాసులుగలది గదా, నేత్రాంచలంబు = వస్త్రముకొంగును, ఇంత నెఱపరాదె = కొంచెమంతఘటిం పఁ జేయరాదాయని యర్థము — ('స్యాజ్జటాంశుకయోర్నేత్రమ్' అ. నేత్రమనఁగా వస్త్రములు శతచ్ఛదమనఁగా శతపత్రము. అనఁగా, తామర ) నీకన్నుఁగవ పెక్కుతామరల ప్రోవులయిన దని యును, కంటితుదను- (కడఁగంటిని) కొంచెమునా పయినిగిడింపరాదా యనియును భావము. స్త్రీలక నుచూడ్కులు తామరలచాలువలె నిగుడుటచేతఁ బెక్కు తామరలప్రోవనుట. లేక పెక్కుతామరల చక్కఁదనములను ప్రోవుచేయఁగా కన్నులగుననియు గ్రాహ్యము ('శతపత్రంకుశేశయమ్' అ.)

లేమ = గిరికా, నీదుకెమ్మోవి, అనఘదివ్యాహారఖని- అనఘ = నిష్కల్మషములయిన, దివ్య=శ్లాఘ్యములయిన, ఆహార = భోజ్యవస్తువులకు, ఖని = గనియైనది. ముద్దింత (ముద్ద+ఇంత) పాలింపరాదే= ముద్దకొంచెముగాభాగించి యీరాదా యనియర్థము — దివ్యాహారమనఁగా దివ్యులగు దేవతలకు ఆహారము-అనఁగా అమృతము—అట్టియమృతమునకు గనియైనదనియును, ముద్దింత అనఁగా ముద్దు ఇంత= చుంబనము, అది యించుకంత దయచేయుమనియును భావము.

నీమొగము, తావిగంబూరంపు దీవి = పరిమళము గల కర్పూరమునకు స్థానమయినది. ఒక్క పలుకింత (లేక అది, పలుకింత)=తునుక కొంచెము, నాపైని, చిలుకరాదె = చిలుకరింప రాదా యని యర్థము. మొగము కర్పూరవాసనగలది యనియును పలుకనఁగా వాక్యముగాన, కొలఁదిగానైనఁ బలుకరాదా యనియునుభావము. (పలుకు అనఁగా తునుకయు మాటయు)

నీచన్నుదోయి, చక్రవిజయంబు ఒనర్చెన్=రాష్ట్రవిజయమును చేసెను. కంచుకంబేల ఇంక చాలించరాదే=కవచమెందులకు ఇఁక దానిని విడువరాదా యనియర్థము. చక్రవాకములను [illegible]ంచినదని యును అవిక విడువరాదాయనియును భావము—(కంచుకమనఁగా కవచమును అవికయు) నిర్మ... [illegible]ధి నన్—నిర్మల=దోషరహితములును, అమూల్య=వెలలేనివియు, గుణ=కాంత్యాదిగుణములతోఁగూడి నవియు, అగు, రత్న=పద్మరాగమణులకు, నిధికిన్=స్థానభూతురాలవగు, నీకున్, వనజముఖి=గిరికా,

* [illegible] దీవి నీ మొగమది పలుకింత-అనిపాఠాం.

త్రాసమిదిఏల=త్రాసమనెడి రత్నదోషమిది ఎందులకు, వదలరాదె యనియర్థము—గుణరత్నములనఁగా శ్రేష్ఠములయిన గుణములు, వానికిస్థానమయినదనియు,త్రాసమనఁగా ('త్రాసోభీమణిదోషయోః' విశ్వ)లజ్జవలని భయముగాన యది విడువరాదాయనియును భావము. శ్లేషమూలక కావ్యలింగము లాఱు.

సీ. లాలింతు నేఁ బాదనాళీకయుగళి నా,కటకేశ్వరత్వంబుకి గణనమీఱఁ
బాలింతు నేఁ గటిస్పర్శ వైభవము నా, నే త్రాహ్వయంబు వన్నియకునెక్కఁ
గీలింతు నేఁ గుచశ్రీలాభగరిమ నా,నాయకత్వము సార్థకతాయుతముగ
శీలింతు నేఁ గర్ణసీమాంతికంబు నా,కువలయరాజత్వ మవనిఁ బొసఁగ
తే. నిగనిగనిసంజకెంజాయ*పొగడుదెగడు, మోవిమానిక మాని సంపూర్ణరుచిస
మగ్రత వహింతు నేనింతి మామకాభి,రామవసునామ ముచితగౌరవముదాల్ప.

అ. ఇంతి=గిరికా, నేను, నాకటకేశ్వరత్వంబు=నాయొక్క పాదవలయశ్రేష్ఠత్వము—మేటి యందియ అగుటననుట. గణనమీఱఁగ = ఎన్నికకెక్కునట్లుగా, ననియర్థము—కటకమనఁగా (కటకో స్త్రీనితంబో ద్రేర్దంతినాం దంతమండలే, సాముద్రలవణే రాజధానీవలయయోరపి' మేదిని) పట్టణాధీశ్వరత్వమనిభావము. పాదనాళీకయుగళిఁ=నీయొక్క యడుగుదామరదోయిని, లాలింతుఁ = లాలనముచేయుదును - అనఁగా నీ యడుగులను భజింతుననుట. కటకేశ్వరతకు అనఁగా మేటియందియ అగుటకు కాంతయడుగులను భజించుటయే గణనగదా.

నేను, నా నేత్ర-ఆహ్వయంబు = (నేత్రమనఁగా వస్త్రముగనుక) నావస్త్రాభిధానము, వన్నియకు నెక్కఁ=వన్నెకెక్కునట్లుగానని యర్థము. నేతృ+ఆహ్వయము (నేత్రాహ్వయము)=స్వామి అనునామము ననిభావము,కటిస్పర్శవైభవముఁ=నీదునితంబ స్పర్శంపుసొంపు పెంపును, పాలింతుఁ= పాలనముచేయుదును. వస్త్రమను పేరునొందుటకు కాంతకటిస్పర్శమునొందుట వన్నియగదా.

నేను, నా నాయకత్వము=నాయొక్క హారమధ్యనాయకమణిత్వమని యర్థము—స్వామిత్వమని భావము.('నాయకో నేతరి శ్రేష్ఠే హారమధ్యమణావపి' మేదిని),సార్థతాయుతముగఁ=సార్థకత్వము తోఁగూడుకొన్నట్లుగా, కుచశ్రీలాభగరిమఁ = నీచన్నుల శోభయొక్క లాభంపుపెంపును, కీలింతుఁ = సంఘటింతును. నాయకవస్తువగుటకు కాంతకుచమధ్యమునఁ గీలించుటయే కదా సార్థకత్వము.

నేను, నాకువలయరాజత్వము = నా ఉత్పలశ్రేష్ఠత్వమును—నల్లగలువపూమిన్నయగుటనని యర్థము. భూవలయరాజత్వమని భావము. అవనిఁ పొసఁగఁ=భూమియందొప్పునట్లుగా, కర్ణసీమాంతికంబు=నీచెవిపట్టుయొక్క దాపటిని, శీలింతుఁ = ఒప్పిదమగునట్లుగాఁజేయుదును. కువలయవస్తువనుటకు చెవిదాపట శీలించిననే అవనిని పొసఁగునుగదా.

నేను, మామక అభిరామ వసునామము = నాదయిన మనోహరమగు బంగారు అను పేరు. అని యర్థము, వసురాజనునామమనిభావము. ఉచితగౌరవముతాల్పఁ = అర్హమయిన ఘనతవహించునట్లుగా, నిగనిగనిసంజకెంజాయపొగడు = నిగనిగనిమెఱయు సంధ్యారాగముయొక్క శ్లాఘ్యతను, దెగడు=తిరస్కరించునట్టి, మోవిమానికము అని = నీదు పెదవియనెడు మాణిక్యమునుబొంది, సంపూర్ణరుచిసమగ్రతఁ=అత్యధికకాంతిపరిపూర్ణతను, వహింతుననియర్థము. అత్యంతమైన చవియొక్క పరిపూర్ణతను వహింతుననిభావము. రుచియనఁగా కాంతియు చవియు. రుచిర్మయూఖకళశోభాభిలాషేష్వపి

* పొగరుదెగడు అని పాఠాంతరము.

నెవ్వాఁడు రుచులచే ఫలమోహరుచులచేత' 'పొగడు దెగడు' అనుచో పొగరుఅని పాఠాంతరము. పొగరనఁగాఁ గాంత్యతిశయము. ఇదిమంచి పొగరుగానున్నదని వాడుటగలదు. 'కురుల పొగరుమ గుడక' (మనుచరిత్రము.) 'పొగరుపగలు' (రామాభ్యుదయము). కాన కెంజాయకాంతిని దెగడునని యర్థము. ఇదియే యుచితమని తోఁచెడిని. బంగారమైనందులకు మానికము నూని రుచిసమగ్రత వహించుటయేకదా యుచితగౌరవము. 'అనర్ఘమపిమాణిక్యంవసుసంయోగమీక్షతే' యనికదా యున్నది.

తే. అనుచు నరపతి కెంగేల నచలకన్య
కాత్రపాఝురగూఢాంగకములు దడవె
నొయ్య నాభికుచాదినిమ్నోన్నతప్ర
దేశములు తద్విగాహేచ్ఛఁ దెలియుకరణి. 86

అ. అనుచున్, నరపతి = వసురాజు, కెంగేలన్ = తనయెఱ్ఱని హస్తముచేత, అచల ... అంగకములు—అచలకన్యకా = కోలాహలపర్వతపుత్రియైన గిరికయనెడు పర్వతమువలనఁ బుట్టిన నెలయేటియొక్క, త్రపాఝుర = లజ్జయనెడు ప్రవాహముచేత, గూఢ = ఆచ్ఛాదింపఁబడియున్న, అంగకములు = అవయవములను, తడవెను—ఏలాగుననఁగా - తత్ విగాహేచ్ఛన్ = ఆలజ్జాప్రవాహమందుచొరఁబాఱవలెనన్నకోరికచేత, ఒయ్యన్ = తిన్నగా, నాభికుచాదినిమ్నోన్నతప్రదేశములు = బొక్కిలి చన్నులు మొదలయిన పల్లము మెరకయైన స్థలములను, తెలియుకరణిన్ = తెలిసికొనునట్లుం బలె, తడవెనని యన్వయము.

ఒకఁ డొక స్రోతఃప్రవాహమందు అవగాహింపఁగోరెనేని ముందుగా నందలి లోఁతు పట్టులను మెరకలను దడవి తెలిసికొని పిదప విచ్చలవిడి నందు నీఁదులాడును. ఇట గిరిక లజ్జాప్రవాహము పాఱుచున్నది. అందు ఆమె బొక్కిలి కుచము లాదిగాఁ గలుగునవి మునిఁగియున్నవి. అందు విగాహించుటకై మెరకపల్లములను దడవిచూచునట్లు నిమ్నమగు నాభిని ఉన్నతమగు కుచములను రాజు దడవిచూచె ననుట-అనఁగా లజ్జచేత గిరికనాభికుచాదులను గుప్తముగా మాటికొన్నదనియు రాజు అవి కళాస్థానములుగాన వానిని హస్తముతోఁ దడవెననియుఁ దాత్పర్యము. ప్రవాహమందు మెరకపల్లములనుదడవి తెలిసికొన్ననే దానిలోఁతు దెలిసి విచ్చలవిడి నీఁదులాడవచ్చును. లజ్జావ్యాప్తియందును బొక్కిలిని గుచములను దడవినచో లజ్జకొలఁది దెలిసి దానిని గయివసము చేసికొనవచ్చును. త్రప తనంతట నశముగాక యూరవడిచే వెల్లిగొనిముంచినట్టిదిగాన (ఝురము) నెలయేఱనుట. స్రోతఃగా ఒక్కమ్మడి మునుఁగఁబాఱిన వెల్లువగావుననే యందు మెరకపల్లములు తెలిసికొని యీఁదులాడవలయు. పరిచితమైనదాన నక్కఱలేదుగదా. ఇట లజ్జయుఁ గ్రొత్తదిగావుననే, కుచాదివిమర్శముననే దానిని హరింపఁదగును. నవోఢగాన లజ్జాక్రాంతి ఝురసామ్యము చెందినదని తెలియునది. శ్లిష్టరూపకము.

మ. తరళాధార మతిప్రవాళశయగుప్తం బంచు నభ్యంతర
స్మరుఁ డుత్తంభితకంపలోలపటసంజ్ఞం బిల్వ బాలాపయో
ధరదుర్గంబు గ్రహింపె రాజకర మేతజ్జాతసంత్రాసయై
ఖరిఁ దెల్పెన్ జఘనస్థలీవరణ [illegible] గ్రద్ఘంటికాఘోషముల్. 87

అ. తరళాధారము=([illegible] 'తరళంచంచలే పిద్గే భాస్కరే ... [illegible], హార మధ్య[illegible] [illegible]' మేదిని అన్నట్లు - నాయకమణి, తరళయనఁగా గం[illegible] [illegible]గాను దుర్గ[illegible] అర్థద్వయముగానో—(కుచ) నాయకమణి ఆధార

మయినది—(దుర్గ) గంజియాధారముగాఁగలది - అనఁగా దుర్గములోనిజనులకు గంజిమాత్రమే కాని యన్నములేదుగనుక సుఖసాధ్యమనిభావము.(యవాగువనఁగా గంజి)అతి...గుప్తంబు(కుచ)అతిప్రవాళ= చిగురుటాకుల నతిక్రమించిన, శయ=హస్తములచేత, గుప్తంబు=కప్పంబడినది - (దుర్గ) వాలమనఁగా ఖడ్గము-ప్రకృష్టమయినవాలము ప్రవాలము-అతిప్రవాల=అతీతములయిన ప్రకృష్టఖడ్గములుగల, శయ= హస్తములుగలవారిచేత-అనఁగాచేతఁ గత్తిలేని నిరాయుధులచేత, గుప్తంబు=కాపాడఁబడుచున్నది, అంచున్, అభ్యంతర స్మరుఁడు=లోపలనుండెడు మన్మథుఁడనెడి, అభ్యంతర స్మరుఁడు=ఒళవిచ్చెడు వాఁడు, ఉత్తంభిత...సంజ్ఞన్-ఉత్తంభిత,=పొఁదుకొనియున్న, కంప= సాత్త్వికభావజనితమయిన వడంకుచేత, లోలపట=చలించుచున్న వస్త్రమనెడు విసరఁబడుచున్న వస్త్రముయొక్క,సంజ్ఞన్= సైగచేత, పిల్వన్ = పిలువఁగా, రాజకరము = వసురాజుహస్తము, బాలాపయోధర దుర్గంబున్= గిరికయొక్క కుచపర్వతదుర్గమును, గ్రహించెన్ = స్వాధీనముచేసికొనెను. జఘన ... ఘోషముల్ —జఘనస్థలీ = కటిపురోభాగముయొక్క, వరణ=వేష్టనరూపమైన మొలనూలనెడు కోటయందలి, 'జఘనస్థలీవరణ' ఇట మొలనూలిని కోటయనుటకు 'ఘనకుచాంగజదుర్గకల్పితాధరవప్రపరిధి నానొడ్డాణ మిరవుకొల్పి. (౫. ఆ ౧౭౧) అనియిందే చెప్పియుండుట తెలియునది. జాగ్రత్ = హెచ్చరికసేయుచున్న, ఘంటికా = గంటలయొక్క, ఘోషముల్ = నాదములు, ఏతత్ జాతసంత్రాస వైఖరిన్ = రాజుకరము పయోధరదుర్గమును బట్టినందువలనఁబుట్టినమిక్కుటమయిన భయముయొక్క లక్షణమును, తెల్పెను. అలం. రూపకము శ్లేషానుప్రాణితము.

ఒకరాజు ఒకపర్వతదుర్గమును బట్టుకొనునపుడు వేచియుండి యాదుర్గములోని వాని నొకనిని ఒళవుగొని వాఁడందుఁగల వారికి అన్నాదులులేక వట్టిగంజియె యున్నదనియు,చేతఁ గత్తులును లేవనియును ఆక్రమింపవలసిన తఱియని వస్త్రమల్లలార్చి తెలుపు ఒళవుచెప్పఁగా, తోడనే యా దుర్గమున స్వాధీనముచేసికొనుటయు, అట్లు పరరాజు స్వాధీనమగుటచే నందలివారు దిగులుగొని కోటయందున్న పెద్దఘంటలవాయించి తెల్పుటయు నిటకవి యనుసంధించినాఁడు.

నాయకిమణిచే నొప్పుచు లేఁజిగురుటాకులను మీఱినచేతులచే గప్పికొనంబడి గిరిదుర్గమువలె నున్న గిరికాదేవి కుచములను, ఆబిడ మన్మథోద్దీపనముచే సాత్త్విక జనితమయినవడఁకు వడంకుచుండఁగా రాజు మన్మథప్రేరితుఁడై తనచేతులఁబట్టుకొనెననియు లజ్జవలని భయముచేత గిరిక చలింపఁగానే మొలనూలి చిఱుగంటలు మ్రోసెననియుఁ దాత్పర్యము.

'లోలపట' గిరికపలువ యల్లలాడుట 'ఉత్తంభితకంప' సాత్త్విక భావముచే నయినమేని వడంకుచేత. అది 'స్మర' మన్మథకృతము. అయినను మరుఁడు చక్కఁగా వెలువడలేదు 'అభ్యంతర' లోపలనేయున్నాఁడు.అది యెట్లు తెలియుట?వస్త్రముఅల్లాడుటచేతను తన్మూలకమగు వడంకుచేతను వాఁడు లోపలనేయున్నాఁడని మాత్రము దెలియుచున్నది. మీఁదు మిక్కిలి మరుఁడు వెలివిరిసెనేని నవోఢకు ముద్దుగాదు. కాన ముందు ఉచ్చైస్తనోద్దేశప్రావరణంబైన లజ్జ కొంతదీసిమరులు పైకొనియున్నందున సమయమిది బాలపయోధరములను గ్రహించుటకు.అందులకేల యింతపాటు?అది'దుర్గము'గిరిసదృశమేకాక గిరిదుర్గమువలె దుర్గ్రహమును.దుర్గమునుబట్టఁగానే దేశమంతయుఁ గయివసమగునట్లు, కుచదుర్గములను గ్రహింపఁగానే గిరిక యంతయు లోనయినట్లె.లోపల స్మరుఁడుండఁగా కంపము.రాజు కరములను బట్టఁగా సంత్రాసము. అట సాత్త్వికభావము [illegible] మాత్ర మల్లలాడినది. ఇట భయసమ్మేళనముచే జఘనచలనమును గూడినది. రాజు, గిరిక [illegible] మాత్రము [illegible]ను జూచి రసికుఁడుగాన వొడిఁబడక కరాస్఍ానమర్దనములచే [illegible]

యమును పటచలన మూలకకంపముచేఁ గనుంగొని యిదియె తఱియని కుచగ్రహణముచేసినాఁ డనియు,అందువలన గిరిక మిక్కిలి చలించుటచే మొలనూలిచిఱుగంటలు మొరసెననియుఁదాత్పర్యము.

ఉ. తొయ్యలి ముద్దరాలు కుచదుర్గము లాత్మశయైకవంచనన్
నెయ్యపుఁజేని పాల్పఱిచి నీవియుఁ గోల్పడఁగాఁ దలంచెఁ గా
కయ్యెడ నేలకోయునిచె నాత్మశయద్వితయంబు మున్నె లో
నయ్యె సరాగమై నృపకరార్పణ కింకఁ బెనంగ నేర్చునే. 88

అ. తొయ్యలి = గిరిక, ముద్దరాలు = ఎంతమాత్రము ప్రౌఢిలేనిదిగదా, ఏమనిన — కుచదుర్గములు = చన్నులనెడు గిరిదుర్గములు,ఆత్మశయైకవంచనన్ = ఆత్మశయైకవంచన యనెడు ఆత్మశయైకవంచనచేతననుట. ఆత్మశయమనఁగా తనహస్తము — ఆత్మశయుఁడనఁగా హృదయము నత్తుకొనియుండెడి మన్మథుఁడును. ఎల్లప్పుడును దనయొద్దఁగాచుకొనియుండెడిబంటును. ఇట కుచపరముగాను దుర్గపరముగాను అర్థద్వయము—తనయొక్క యేకహస్తమువలనివంచనచేతనని కుచపరమున్, మన్మథుఁడనెడియొక నమ్మకంపుబంటుయొక్కయొఱవుచేతననిదుర్గపరముగా, నెయ్యపుజేని పాల్పఱిచి = ప్రేమగల వసురాజు పాలుచేసియు, నీవియున్ గోల్పడఁగాన్ తలంచెన్ గాక (నీవియనఁగా పోఁకముడియు మూలధనమును) పోఁకముడియనెడు మూలధనమును బోఁగొట్టుకొనఁదలచినదియు గాక = లేనియెడ, అయ్యెడన్ = ఆనీవిస్థానమందు, ఆత్మశయద్వితయంబు = ఆత్మశయద్వితయమనెడు ఆత్మశయద్వితయమును, ఏలాకోఁనిచెన్ = ఎందులకుఁగాపుంచెను - అనఁగా వ్యర్థమనుట, ఆత్మహస్తద్వితయమని పోఁకముడిపరముగాను వంచకభటద్వితయమని మూలధనపరముగాను నర్థము గ్రహించునది. ఏమనినన్ — ఆయాత్మశయద్వితయము = అట్టి వంచక భటద్వితయము, సరాగమై = అనురాగముతోఁ గూడుకొన్నదై, నృపకర అర్పణకున్ =(ఆమూలధనమును)రాజుచేతి అప్పగించుటకు, మున్నె, లోనయ్యెన్ = ఆయతపడియుండెను. కాఁబట్టి, ఇంకన్ పెనంగనేర్చునే = ఇఁకమీఁద రాజుహరింపకుండఁ బోరాడఁజాలునాయని యర్థము - ఈయాత్మహస్తద్వితయము ఎఱుపుతోఁగూడినదై వివాహానంతరమందప్పగింతసేయునెడల రాజకరార్పణకు మున్నే లోపడియున్నదనియు, అట్టిది పోఁకముడిని రాజు హరింపకుండునట్లు పెనఁగఁ జాలునాయనియు హస్తపరమయిన యర్థము.

గిరికాదేవి రెండుచేతులచేతను చన్నుఁగవను గప్పుకొనియుండఁగా పోఁకముడిసడలుటచే నది జాఱకుండఁ బట్టుకొను నిమిత్తమొకచేయి వదలఁగానే రాజు కుచగ్రహణము చేసెననియును నంతట రెండుహస్తములును పోఁకముడియందే చేర్చుకొనియెననియుఁ దాత్పర్యము.'ఇట తలంచెఁ'గాక అఁచో 'కాక' యనునది 'కానిచో' నని పఠాంతరమును దెలుపుచున్నది.

'నృపకర అర్పణకున్'కరమనఁగాపన్నను గనుక రాజునకుపన్ను చెల్లించుటకనియు నర్థము స్ఫు రించుచున్నది. వివాహమందు వధువు చేదోయి వరునకప్పగించుటంబట్టియిట వానిని మును [illegible]రాజునకు లోనయినవిగా ననుసంధించినాఁడు. మునుపే పతినకు లోనయిన బంట్లను మరలనమ్మి మూలధనమునకుఁ గాపువెట్టినచో అది పరునిపాలు [illegible]దనుట. నిటసంభుట[illegible]ము. ఇంత మాత్రము తెలియనిది గాన ముద్దరాలు=వెల అని యర్థము-[illegible]త్నాలని భావము.

క. అతినీల[illegible] [illegible]తి, [illegible] హరింప లజ్జ[illegible]సనియో దృఢభూ
గత [illegible] [illegible]ను, [illegible] నీవిక లైనవా[illegible]కడ మంధుదురే. 89

అ. అతినీతసమయుఁడై = అతిక్రమింపఁబడిన నియమము గలవాఁడై, పతి = వసురాజు, సతి = గిరికయొక్క, నీవి హరింపన్ = మూలధనమును అపహరింపఁగానే యని యర్థము - ప్రజాధనాది రక్షణము సేయవలసినరాజు ఆనియమము తప్పి ఒక్కయిల్లాలి మూలధనమును హరింపఁగాననుట — స్త్రీధనాపహరణము రాజునకు నిషిద్ధముగనుక నది విచారింపక అతినీతసమయుఁడైనాఁడనుట—పోఁకముడిని హరింపఁగానే యని భావము. లజ్జ సనిరోన్ = లజ్జయనుచెలి కత్తెతొలఁగిపోయెనని యర్థము — సిగ్గు తొలఁగెనని భావము. 'నిర్చింగాకలజ్జావయస్య' యన్నాఁడుగనుక ఆ యర్థమిచటికాకర్షించు కొనవలయును. దృఢయోగతన్ = దృఢసాంగత్యముచేత, ఈవిగన్నబోంట్లును = ఈవిని- అనఁగా ధనధాన్యలాభమును - బొందియున్న సఖీజనులును, గతనీవిక లైనవారికడన్ ఉఁడుదురే=పోయిన మూలధనముగలవారి దగ్గఱనుందురాయని యర్థము-ఒకరికి ధనహీనతకలిగిన పిమ్మట వారిప్రాపెంత యనుభవించినవారుగాని వారియొద్దనుండరుగదాయనుట. (దృఢయోగతన్ నీవినిగన్నబోంట్లు—పోఁకముడినిఁబట్టునపుడే లజ్జమిక్కిలియు నెరయునుగాన లజ్జ పోఁకముడినిగట్టిగాఁ బొందియున్నదనియు గనుక వసురాజు పోఁకముడిని హరించినమీఁదట గిరికకడ నుండక తొలఁగెననియుఁ దాత్పర్యము.) పోఁకముడి హరింపఁగానే లజ్జయుండుటకు వీలులేక తీసెనని ఫలితార్థము. లజ్జను వయస్యగా ననుసంధించునపుడు 'దృఢయోగతన్ ఈవిఁగన్నబోంట్లును' - అనియు కేవలముగా ననుసంధించినపుడు 'దృఢయోగతన్ నీవిగన్నబోంట్లును' అనియు విచ్ఛేదము తెలియునది.

ఉ. చేడియకోమలావయవసీమలఁ * జెల్వునిసోయగంపుఁజే
యాడఁ బ్రభూతనూతనరసాకృతిఁ గ్రొంజెమ రొయ్య నొయ్యఁ బై
యాడఁ గరంగి జాఱె నెడనంటినకస్తురిరేఖ లాకుల
వ్రీడతమంబు లాత్మపదవిన్ నిలుపోపక పోవుకైవడిన్. 90

అ. చేడియ కోమల అవయవసీమలన్ = గిరికాదేవియొక్క మెత్తని కచకుచాద్యవయవముల పట్టులందు, చెల్వుని = వల్లభుఁడయిన వసురాజుయొక్క, సోయగంపుచే ఆడన్ = విలాసకరమైన హస్తము వ్యాపింపఁగాను, ప్రభూత నూతన రసాకృతిన్ = పుట్టిన క్రొత్తయనురాగరసమువలె, క్రొంజెమరు = సాత్త్వికభావజనితమైన క్రొత్తచెమట, ఒయ్యనొయ్యన్ = మెల్లమెల్లగా, పైయాడన్ = పైని వ్యాపింపఁగా, ఎడనంటిన కస్తురిరేఖలు = హృదయమందంటియున్న కస్తూరికాపత్రరచనలు, కరంగి, జాఱెన్ — ఏలాగనిన, ఆకుల వ్రీడతమంబులు = తొట్రుపడుచున్న లజ్జయను చీఁకట్లు, ఆత్మపదవిన్ = తనమార్గమందు, నిలుపోపక = నిలువలేక, పోవుకైవడిన్ = తొలఁగిపోయిన[illegible]లుగా, జాఱె నని సంబంధము—చేయి 'సోయగంబుగ ఆడుట' చేత రసాకృతిప్రభూతి. నూతనరా[illegible]ముతో పాటికి, చెమరనక క్రొంజెమరనుట; రసము నూతనముగాఁబుట్టెను; దానిచేఁ జెమ[illegible] క్రొత్తగాఁబుట్టెను. ఇటకారణమునకు కార్యమందుపచారము. కస్తురిరేఖలు ఎడనంటినవానినిగా గ్రహించుట. ఏడనుండిన వ్రీడతమఘుగా నుత్ప్రేక్షించుటకు. 'ఆత్మపదవిన్ నిలుపోపక'-రాజుచేయి నిగ్[illegible]డుదారిని నిలుపక లజ్జ పర్విడె ననుట. రాజు హస్తస్పర్శముచే కళాస్థానములఁ గరంచి లజ్జానిరాసము లెస్సఁగావించినాఁడనుట తె[illegible]న్నది.

సీ. నెలఁతగుత్తపు గుబ్బనెత్తమ్మిమొగడల, నెల[illegible]సోదములనిగుడకుండ
[illegible]ముదిత చందురకావిమోవి లేఁదలిరున, కలఘు[illegible]

అ. భువనసుందరి = గిరికాదేవి, సింధువర అమృతంబునన్ = సముద్రములలో శ్రేష్ఠమయిన పాలసముద్రపు సుధయందని యర్థము. సింధు=శుక్తి మతీనదియొక్క, వర=శ్రేష్ఠమయిన, అమృతంబునన్ = ('అమృతం యజ్ఞశేషేస్యాత్పీయూషేసలిలే ఘృతే' మేదిని) నీటియందని భావము. ఏ చొప్పునన్ పుట్టెనో = ఏప్రకారముగా జన్మించినదో, (కాని) నృపాలమౌళిన్ = వసురాజపర్యాని, ముప్పిరిగొన్న వాచవులమోహము ఒకింతయున్ తప్పనీదు = ముప్పిడిగా పెనఁచుకొన్న నోటి రుచులయందలి యా సక్తిని కొంచెమయినను వదలనీయదు. కన్ ఱెప్పలు, విప్పనీదు =విప్పిచూడ నీయదు. ఒక తఱిన్ చెమరు ఆఱఁగ నీదు=ఒక సమయమందయినను దేహమందు చెమట ఆఱనీయదు. ఎల్లప్పుడున్, తృష్ణచేన్ = దప్పిచేతనని యర్థము (పేరాసచేత నని భావము). తనివిన్ ఒందఁగనీదు = తృప్తి పొందనీయదు. అమృతమందు ఏ చొప్పునఁబుట్టెనో యని సంబంధము.

అమృతమందుఁ బుట్టినదానికి అమృతధర్మములు కలుగక అమృతేతరధర్మములుకలిగియుండుట వలన అమృతమం దేరీతిగాఁబుట్టినదో యని యాశ్చర్యము. అమృతాస్వాదనముచేసిన దేవతలకు, మఱియొక వాచవులయందు మోహము గలుగకుండుటయు, కన్నులకు ఱెప్పపాటు లేకుండుటయు, దేహమందుఁ జెమట పట్టకుండుటయును, దప్పిలేక యుండుటయుఁ బ్రసిద్ధము. అమృతమును ఆస్వాదించిన ఆదేవతల కట్లు. ఆయమృతమందే పుట్టిన దీని ననుభవించు రాజునకో కలిగింపరాని పెఱవాచవులందు మోహమును గలిగించుటె కాక దానిని తప్పనీదు. ఱెప్పమూయుట కలిగించుటె కాక దాని నించుకయు విప్పనీదు. చెమరు కలిగించుటె కాక దాని నొకతఱిని ఆఱఁగనీదు. తృష్ణ కలిగించుటె కాక దాని నెల్లప్పుడును దనియనీదు. ఇది వింతలలోని వింత? యనియర్థము. ఆగిరికభువనసుందరి కావుననే రాజున కెంతచుంబించినను మోవిరుచియందలి మోహమింతుక తప్పదయ్యెననియు, ఎడ తెగని సుఖపారవశ్యమున గన్నుఁగవ విప్పదయ్యెననియు, అవిచ్ఛిన్నమగు సురతశ్రమమున నతని మేని చెమరాఱదయ్యెననియు, ఎంతక్రీడసలిపినను నతనికిఁ దనివిదీఱదయ్యెననియు భావము. దీనిచే నాయిక లోకోత్తర నిరతిశయ సౌందర్య సౌకుమార్య లావణ్యవిభ్రమవిశేషములు వ్యంజితములు.

మ. సతిసాహిత్య రహస్య మీశువలనన్ సాధించి తోడ్తోన త
త్పతికిం బ్రత్యుపదేశ మిచ్చె నతఁడున్ బ్రౌఢిన్ ధ్వనివ్యక్తిఁ ద
చ్ఛ్రుతికిం జొన్పుచు లోచనాంజనరస ప్రోన్మేషముల్ తన్ముఖో
ద్గతముల్ సేయుచుఁ బ్రత్యలంకరణమౌఖర్యంబు దీపింపఁగన్. 94

అ. సతి=గిరికాదేవి యని యర్థము—(సతీదక్షసుతాసాధ్వ్యోః' నానార్థ) పార్వతి యను యర్థాంతరము - మీఁదనెల్ల గిరికాపార్వతీపరముగా అర్థద్వయమెఱుఁగునది-సాహిత్య రహస్యము కలయికయొక్క మర్మమును - అనఁగా సంభోగ రహస్యమని యర్థము— సాహిత్యవిద్యా [illegible] మని అర్థాంతరము, ఈశువలనన్—(ఈశశ్శంభౌ ప్రభౌ త్రిషు' నానా) పతియైన [illegible] వలన—(శివునివలన), సాధించి = అభ్యసించి, తోడ్తోన = వెంబడిగానే, తత్పతికిన్=ఆ పెనిమిటి యగు వసురాజునకు (పతియైన శివునకు), ప్రత్యలంకరణమౌఖర్యంబు దీపింపఁగన్=కంకణ [illegible] కాదులయిన ప్రత్యాభరణములయొక్క [illegible] ముఖర[illegible] అనఁగా మ్రోఁత. ప్రకాశింపఁగా నని యర్థము. (ఉపమ ఉత్ప్రేక్ష మొదలగు[illegible]గా ప్రత్యల[illegible]కారములయొక్క వాచాలత్వము ప్రకాశింపఁగానని అర్థాంతరము). అతఁడు [illegible] ప్రౌఢిన్ = అసమానమగున [illegible]ఢతనముచేత- మౌగ్ధ్యమునును వీడి ప్రౌఢయై యని యర్థము—(అసమానమయిన ప్రాగల్భ్యముచేత నని [illegible]ర్థాంతరము). ధ్వని వ్యక్తిన్ తత్ శ్రుతికిన్

చొన్పుచున్ = గళధ్వనియొక్క ప్రాకట్యము నాతని చెవికి వినఁబడునట్లుగా చేయుచుననియర్థము. (ధ్వన్యర్థము యొక్క ప్రాకట్యము నతఁడు వినునట్లుగా చేయుచుననియు) లోచన అంజన రస ప్రోత్సేచనముల్=కన్నుల యందలి కాటుక గలసిన యానందబాష్పజలముల వికాసములు, తత్ ముఖ ఉద్గతముల్ సేయఁచున్ =ఆ వసురాజు ముఖమునందుఁ బడునట్లుగా చేయఁచునని యర్థము-[లోచన= ప్రకాశించుచున్న, అంజన = వ్యంజనా వ్యాపారముయొక్కయు, (అంజనమనఁగా వ్యంజన

అనేకార్థ స్యశబ్దస్య వాచకత్వేనియన్త్రితే
సంయోగాద్యై రవాచ్యార్థధీకృద్వ్యాపృతి రంజనమ్') (కావ్యప్రకాశ)

రస = శృంగారాదిరసములయొక్కయు, ప్రోత్సేచనముల్ = అతిశయములను, తన్ముఖఉద్గతముల్ సేయుచున్ =అతని ముఖమునుండి వచ్చునట్లు చేయుచు—అతనిని పల్కించునట్లు చేయుచు నుట—లేక యతనిచేఁజెప్పించుచు], ప్రత్యుపదేశ మిచ్చెన్ =మరల నా సంభోగ రహస్యము నుపదేశించెనని యర్థము—తిరుగ నా సాహిత్య విద్యా రహస్యము నుపదేశించెనని అర్థాంతరము.

గిరిక పతివలన సంభోగరహస్యమును గ్రహించి ప్రౌఢయై యొక్కొక్క యాభరణమును మ్రోయుచుండఁగా మణితాది గళరవములు రాజునకు వినఁబడుచుండఁగా ఆనందాతిశయము చేత కన్నుల కాటుకతోఁగూడిన బాష్పజలములు రాజుమొగముపయిఁ బడఁగా పురుషాయితరతి గావించెనని యర్థము.

పార్వతి శివునివలన సాహిత్య విద్యారహస్యము నెఱింగి, మరలఁదాను నొక్కొక్క యలంకారము తోడనుగూడిన వాక్పటిమ మీఱఁగా ధ్వన్యర్థమును నతనికి వినిపించుచు వ్యంజనరసములు మొదలగు వాని విశేషములను నతనిచేఁ జెప్పించుచు నుపదేశమిచ్చెనని యర్థాంతరము.

అంజనశబ్దము పుంనపుంసకము. 'లోచనాంజన రస ప్రోత్సేచనముల్' అనుటకు—లోచన మనఁగా [illegible]స్థానభేదము—దానికి, అంజనము = కనఁబఱుచునది—అనఁగా కళాశాస్త్రము, దాని యందలి శృంగారాదిరసవికాసము లతనినివచించునట్లుగాఁజేయుచు' నని అర్థాంతరము పూర్వవ్యాఖ్యానమందున్నది కాని సాహిత్యవిద్యను ప్రత్యుపదేశమిచ్చునపుడు కళాశాస్త్రము దానిలో నంతగా అంతర్భూతమైనదిగాఁగొనుటయు, అది పార్వతి శివున కుపదేశించెననుటయు నంతగా సరసముగాదు. సాహిత్యమందలి, అంజనమనఁగా వ్యంజనావ్యాపార మని యర్థము సమంజసము. 'తోడ్తోన్' అనుటచే గిరిక సంభోగమర్మగ్రహణప్రౌఢియు పార్వతి సాహిత్యవిద్యాగ్రహణ ప్రౌఢియు వ్యంజితములు.

భూనాథాగ్రణికిన్ వధూమణికి సంభోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పె ననవద్యంబై యవేద్యాంతరం
[illegible] నిర్లేపకలాపమై క్రమవిముక్తానేకబంధానుసం
ధానంబై యపునర్భవప్రభవఖేదంబై విజృంభించుచున్. 95

అ. భూనాథాగ్రణికిన్ =వసురాజునకును, వధూమణికిన్ =గిరికాదేవికిని [illegible]గాంత సౌఖ్యం బు[illegible]సురతము కడపటి [illegible]భావము—అనఁగాఁ గ[illegible]లువదలెడు సమ్మయమం[illegible] సౌఖ్యము, బ్రహ్మానందానుభవంబున్ తెల్పెన్ = బ్రహ్మవిషయకమైన [illegible]ందముయొక్క [illegible]నుభవమును, తెలియఁజేసెను—ఏలాగుననఁగా—అనవద్యంబై=అనిందితమై [illegible] [illegible]భోగాంత[illegible]మైన యర్థము-నిర్దుష్టమైనదని బ్రహ్మానందానుభవపరమైన యర్థము. అవేద్య అంతరంబై = తెలియఁదగినది మఱియొకటి లేనిదై-తన్మయత్వమునొందియనుట. (ఇది ఉభయత్రసమానము) నిర్లేపకలాపమై=వీడిపోయినపైపూఁత

లును భూషణములు కలదై—(వీడిన సంసర్గ సమూహముగలదై యనియును), క్రమ విముక్త అనేక బంధఅనుసంధానం బై = క్రమక్రమముగా విడువఁబడిన పెక్కులయిన రతిబంధముల అనుష్ఠించుట గల దై యనియర్థము—వరుసగా ఒక్కొక్కబంధమును జేసి తీర్చుటగలదియనుట—(క్రమముగా వీడిన యనేక కర్మబంధముల అనుసంధానములుగలదై యని అర్థాంతరము). అపునర్భవ ప్రభవ ఖేదం బై= (పునర్భవమనఁగా గోరును పునర్జన్మమును 'పునర్భవః కరరుహో నఖో స్త్రీ నఖరో స్త్రియామ్' అ.) నఖక్షతములవలనఁ బుట్టెడు బాధ లేనిదై యని యర్థము—(పునర్జన్మమువలనఁబుట్టెడు దుఃఖములేని దని యర్థాంతరము). విజృంభించుచుఁ, బ్రహ్మానందానుభవంబు దెల్పెనని సంబంధము. 'అనవద్యం బై' యిత్యాదిబ్రహ్మ లక్షణంబులు గలిగియుండుటచే బ్రహ్మానందానుభవం బై విజృంభించెనని సారస్యము. నిర్లేపమనఁగా మైపూఁతలేనిదనియు సంగములేనిదనియుఁ జెప్పుటకు అనువాదము.

'నిర్లేపః కుచమణ్డలో మృగదృశాంహారావళీ నిర్గుణా।

నేత్రాంభోరుహ మంజనేన రహితమ్నీరాగ మోష్ఠాధరమ్, (ఆనందచంపువు వింశతి స్తబక.)

క. సుమనోనాళీకార్పిత, సుమనోనాళీకకలనఁ జొక్కుచు వసుధీ
రమణియు రమణియు నీక్రియ, రమణీయతఁ గాంచి రనవరతనవరతులన్. 96

అ. సుమనోనాళీక=పువ్వులే బాణములుగాఁగల మన్మథునియందు—('నాళీకం త్వజ్జే క్లీ బం శరేపుమాన్' నానా) అర్పిత=సమర్పింపఁబడిన, సుమనోనాళీకకలనన్ = మేలయిన మనః కమలములు కలుగుటచేత, (ఇటనాళీకమనఁగా కమలము) చొక్కుచున్=పారవశ్యమును బొందుచు, వసు ధీరమణియున్=వసువను ధీరశ్రేష్ఠుఁడును,రమణియున్=గిరికాదేవియును,ఈక్రియన్ =ఈరీతిని, అనవరత నవరతులన్=ఎడతెగని క్రొత్త సంభోగక్రీడలచేత, రమణీయతన్ గాంచిరి =ఒప్పిదమును బొందిరి.

సీ. అభిరామనవపల్లవారామకుంజవాటికలఁ గీరముల నాడించికొనుచుఁ
బద్మాలయోదర ప్రౌఢసారసవీథి, నంచలవేడంబులరసి కొనుచు
గాంగేయధామశృంగవిటంకముల నీల, కంధరోజ్జ్వలగతుల్ గాంచికొనుచు
విమలసింధుద్వీపవేదిక నరుణాప్త, ఖగవిహారప్రౌఢిఁ బొగడికొనుచు

తే. రతియుఁ జేతోభవుండును భారతియు నజుఁడు
శచియు నమరాధి నాథుండు జలధిసుతయు
నబ్జనాభుండు నన మించి యఖిలసమయ
సమ్ముదితకేళి సలిపిరి సతియుఁ బతియు.

అ. సతియున్ పతియున్=గిరికయువసురాజును, అభిరామ......వాటికలన్—అభిరామ= ఒప్పుచున్న, నవపల్లవ=క్రొత్తచిగుళ్లుగల, ఆరామ=ఉద్యానవనములందలి, కుంజవాటికలన్=పొదరిండ్ల చాలుపులయందు, కీరములన్ ఆడించికొనుచున్=చిలుక గుఱ్ఱముల నెక్కి త్రిప్పుచునని యర్థము-చిలు కల నాటలాడించి కొనుచునని భావము—దీని వలన రతిబంధసామ్యము.

పద్మా...వీథిన్—పద్మాలయ=తామరకొలనులయొక్క,ఉదర=గర్భమందు, ప్రౌఢ=చక్కఁ [illegible] సారస=తామరలయొక్క, వీథిన్=శ్రేణియందు, అంచల వేడంబులు అరసికొనుచున్= [illegible] నెక్కి వేడములను వానిగతి [illegible]

విహారములను జూచుచుననిభావము—వేడెమనఁగా మండలగతి-పద్మరాగమణిచూడంబగు కేడెంబునుం గొని వేడెంబునం దురంగంబువఱపి (స్వా-ర.అ.) దీనివలన వాణీహిరణ్యగర్భసామ్యము.

గాంగే... విటంకములన్ - గాంగేయధామ = బంగారునకుస్థానమైన మేరుపర్వతముయొక్క, (తపనీయంశాతకుమ్భంగాఙ్గేయం భర్మకర్బురమ్) శృంగవిటంకములన్ = శిఖరములయొక్క అంచులందు, నీలకంధరఉజ్జ్వలగతుల్ కాంచికొనుచున్ =(కంధరమనఁగా జలధరము మేఘము. కంధరయనఁగాకంఠము. 'గ్రీవాయాంకంధరా మేఘే పుమాన్' నానా) నీలకంధర=నీలమేఘములను వాహనములయొక్క, ఉజ్జ్వలగతులు=ప్రకాశమానములయిన గమనములను, కాంచికొనుచున్=పొందుచుననియర్థము—బంగారుమయములయిన కోలాహలపర్వతశిఖరముల పార్శ్వములందు, నీలకంధర=నీలకంఠముల (నెమిళ్ల)యొక్క నడకలు చూచుకొంచునని భావము. ఇందువలన శచీదేవేంద్రసామ్యము.

విమలసింధు ద్వీపవేదికన్=తెల్లనయిన సముద్రమందలి—అనఁగా పాలసముద్రమందలి వేదికవంటి శ్వేతద్వీపమందు, అరుణాప్తఖగవిహారప్రౌఢిన్=(అరుణుఁడనఁగా సూర్యుఁడును అనూరుఁడును 'అరుణోఽర్కేతత్సూతే' నానా) అరుణాప్తఖగ=అనూరునికాప్తుఁడగు పక్షియైన గరుత్మంతునియందును, విహారప్రౌఢిన్ = సంచారప్రౌఢి, పొగడికొనుచుననియర్థము—(సింధువనఁగా నదియుఁగనుక)—స్వచ్ఛమయినశుక్తిమతీనదియందలి వేదికవంటి యిసుకదిన్నెయందు, అరుణాప్తఖగములనఁగా సూర్యుఁడాప్తుఁడుగాఁగలపక్షులు, అనఁగా చక్రవాకములు గనుక-వానియొక్కవిహారప్రౌఢిని మెచ్చుకొనుచుననిభావము—ఇందువలన లక్ష్మీనారాయణసామ్యము.

రతియున్, చేతోభవుండున్=మన్మథుఁడును, భారతియున్=సరస్వతియు, అజుఁడు=బ్రహ్మయు, శచియున్, అమరాధినాథుఁడున్=దేవేంద్రుఁడును, జలధిసుతయున్=లక్ష్మియు, అబ్జనాభుండున్=విష్ణువును, అనన్, మించి. క్రమాలంకారము. అఖిలసమయసముచితక్రీడన్ = వసంతము మొదలయిన సమస్తఋతుసమయములయందును దగియుండునట్టి కేళిని, సలిపిరి.

'అఖిలసమయసముచితక్రీడసలిపిరి' ఎట్లు? 'నవపల్లవారామము'లనుటచే వసంతర్తువు. ఆఋతువునకు మంజువ్యంజకములుగాన 'కీరములు' 'పద్మాలయ' 'మనుట శరదృతువు. తద్వ్యంజకముగా 'అంచలు' 'గాంగేయధామశృంగము'లు (బంగారుహర్మ్యములు. శృంగశబ్దసారస్యముచే బంగారపు హర్మ్యశ్రీగృహములశిఖరములని తెలియునది) అనుటచే వర్షర్తువు. తద్వ్యంజకము 'నీలకంధరములు' (మబ్బులును నెమళ్లును) 'సింధుద్వీపవేదిక' యనుటచే హేమంతము 'తద్వ్యంజకము' అరుణాప్తఖగములు' కావున నే 'అఖిలసమయములు' చెప్పఁబడెను. అందందు ఉచితములగు కీరములు మొదలగు వానితోడి యాట [illegible] జెప్పుటచే 'సముచితక్రీడ[illegible]'యెను. ఏఋతువున కాక్రీడ యని సమయసముచితక్రీడోక్తి. [illegible] 'హిమశిశిరవసన్త గ్రీష్మవర్షాశరత్సు, స్తనతపన వనాంభోహర్మ్యగోక్షీరపాస్త్రై[illegible] సుఖమనుభవ[illegible]" అను శ్లోక మనుసంధింపవలయును.

[illegible] ఇట్లతఁడు శైలజకుఁ జొక్కుట యెఱిఁగియొక్కొ—
యులఘుసద్గోత్రనందన యయ్యెఁ గీర్తి
యగతనయ యయ్యె జయరమ యచలభూతి
మహితయై మించె నపుడు సామ్రాజ్యలక్ష్మి. 98

అ. ఇట్లు, అతఁడు, శైలజకున్=పర్వతపుత్రికయైన గిరికకు, చొక్కుట = వశుఁడగుట, ఎఱిఁగియొక్క=తెలిసికాఁబోలు, అపుడు, కీర్తి=వసురాజుకీర్తి, కాంతి, అలఘుసద్గో[illegible]

అయ్యెన్ =అధికమయిన మంచి కులపర్వతముయొక్క కొమార్తె యాయెననియర్థము—సత్కులము వారిని ఆనందింపఁజేయుచున్నదయ్యెనని భావము—(ఇట 'గోత్రమనఁగా గోత్రంనామ్ని కులే క్షేత్రే గోత్రా భువి గవాం గణే, గోత్రః శైలే' నానా. అన్నట్లు, పర్వతమునుకులమును, నందనశబ్దముసంతానమందును సంతోషింపఁజేయువానియందును వర్తించును. 'నన్దనం వాసవోద్యానే నందకే హర్షహేతుకే' మేదిని) జయరమ=అతనిజయలక్ష్మి, అగతనయ అయ్యెన్ =పర్వతపుత్రికయయ్యెననియర్థము-అగత=పోనట్టి,నయ అయ్యెన్ =నీతిగలదాయెననిభావము. ఇక్కడశబ్దశ్లేషము. సామ్రాజ్యలక్ష్మి=అతని రాజ్యలక్ష్మి, అచల భూతి మహితయై=పర్వతమువలని పుట్టుకచేత ఒప్పినదైయనియర్థము—చలింపని యైశ్వర్యముచేత ఒప్పినదైయనిభావము,అతిశయించెను. ఇట అచలమనఁగా పర్వతమును చలింపనిదియును-భూతియనఁగా పుట్టువును ఐశ్వర్యమును-'భూతిర్మాతఙ్గశృఙ్గారే జన్మ సంపత్తిభస్మసు' నానా.

అతనిభార్య శైలజకావునఁ జొక్కినాఁడని యతనికీర్తియు జయలక్ష్మియు రాజ్యలక్ష్మియు శైలములకుఁ బుట్టుక నొందినవని యర్థము.

వసురాజు గిరికాదేవియందాసక్తుఁడై వర్తించుచుండఁగా, ఆతనికీర్తి సత్పురుషులను సంతోషింపఁజేయుచుండెననియు, ఆతనిజయలక్ష్మి నీతిసహితయై యుండెననియు, ఆతనిరాజ్యలక్ష్మి సుస్థిరైశ్వర్యముచేత నొప్పుచుండెననియుఁ దాత్పర్యము.

సీ. ఆరాజు విమలవిఖ్యాతి చంద్రిక నిచ్చ, రహిఁ గెక్కె జాఱె జారప్రసంగ
మాఘనుదానధారాపూర్ణ వర్షము, ర్వరఁ బర్వ డిగియె నవగ్రహార్తి
యాలోకహితు ప్రతాపాతపం బవిరతో, దయ రూఢిఁ దగ నింకె దస్యుపంక
మాసద్గుణాబ్ధిచర్యామృతం బెల్లచో, దయివాఱఁ దెరలె నామయవిభూతి

తే. యమ్మహాశైలదమనురాజ్యమ[illegible]నిట్లు, ఫలము లీనెడు చెట్లతోఁ బాలవెల్లి
గాన్పు పసితో నఖండభోగ[illegible]తోడఁ, బ్రజలు గాంచిరి భూరివైభవసమృద్ధి.

అ. ఆరాజు=('రాజా నృపే తాల[illegible]త్యాక్షత్రి[illegible] చంద్రయోః' నానా.) ఆవసురాజనెడు చంద్రునియొక్క, ఇక్కడ శ్లిష్టరూపకము [illegible]ర్వాత వసుర[illegible]పర మయిన విశేష్యపదముల కన్నిటికి నిట్లె విచారింపవలయును. విమల విఖ్యాతచంద్రిక=తెల్లని [illegible]ర్తియనెడు వెన్నెల, నిచ్చ = నిరంతరమును, రహిఁ కెక్కన్=వన్నెకెక్కఁగా, జారప్రసంగము = విటులయొక్క ప్రసక్తి,జాఱెన్ వదలెను. విటులు చీకఁటియందె కాని వెన్నెలలందు వర్తింపరు.

ఆఘను = ఘనుఁడైన యా భూభుజుఁడనెడు మేఘునియొక్క('మేఘే పుమాన్ ఘనః' నా[illegible] దానధారా = [illegible] జలధారలనెడు, పూర్ణవర్షము = నిండువర్షము, ఉర్వరన్—('ఉర్వ[illegible] ర్వసస్యా[illegible]) సర్వ సస్యములచేతనిండిన భూమి యందు, పర్వన్, అవగ్రహార్తి = వ[illegible] వలని [illegible] = తగ్గిపోయెను. [illegible]చిన్నానలము వలెను [illegible]క్కుడుగదా.

ఆలో[illegible]=(ఇథ లోకహితుఁ[illegible] లో[illegible]బాంధ[illegible]డు - అనఁగా సూర్యుఁడు-ప్రద్యో[illegible] తనో దినమణిః [illegible]లో[illegible]క బాంధవః [illegible] జనహి[illegible]డయిన [illegible] వసురాజనెడు సూర్యునియొక్క, ప్రతా[illegible] ఆత[illegible]= ప్రతా[illegible]మనెడు [illegible] [illegible]దయరూఢిన్ = ఎడతెగని అభ్యుదయపు [illegible]ర్ఘాధి[illegible]త, [illegible] ఒప్పఁగా, దస్యుప[illegible] = [illegible]దస్యుః ప్రత్యర్థిచోరయోః' నానా) శత్రువులును [illegible] [illegible]ధదస్యు ఇం[illegible] ఎండలకు [illegible]యును.

అసద్గుణాబ్ధి = సద్గుణ సముద్రుఁడయిన యా వసురాజనెడు సముద్రుని యొక్క, చర్యా= శ్రుతి స్మృత్యాచార స్థిరవృత్తి యనెడు, అమృతంబు = సుధ, ఎల్లచోట్, దయివాఱన్ = నిండారఁగా, అమయ విభూతి=రోగసంపత్తి, తెరలెన్=విచ్చిపోయెను. అమృతమునకు రోగములు నిలువవు.

అమ్మహాశైలదమను = కోలాహల పర్వతశిక్షకుఁడయిన ఆ వసురాజనెడు శైలదమనునియొక్క—అనఁగా ఇంద్రునియొక్క, రాజ్యమునన్, ఇట్లు, ఫలము లీనెడుచెట్లతోన్ = కోరిన ఫలము లిచ్చెడు మందార పారిజాతాది వృక్షములతోడనని యర్థము - తియ్యనిపండ్ల నిచ్చెడు వృక్షములతోనని భావము. పాలవెల్లికాన్పు పసితోన్ = క్షీరసముద్రమువలనఁ బుట్టిన కామధేనుగణముతోనని యర్థము - పాలు వెల్లువవాఱనిచ్చునట్టి గోసమూహముతోనని భావము. అఖండభోగములతోడన్ =సంపూర్ణసుఖానుభవములతోనని యర్థము—అష్టభోగములతోనని భావము. భూరి వైభవ సమృద్ధిన్ .— భూరి= బంగారము యొక్కయు, వైభవ = విభవములయొక్కయు, సమృద్ధిన్ = సంపూర్ణతను, ప్రజలు, . కాంచిరి = పొందిరి. 'స్వర్ణేఽపి భూరి' అని అమ. ఇంద్రుని రాజ్యమంతే ఫలము లీనెడుచెట్లు, పాలవెల్లి కాన్పుపసియు, అఖండభోగములును. ఇంద్రుఁడు భోగములకుఁ బరమావధియు ఉపమాభూతుఁడును ('మానవేంద్రులు గాని మానవేంద్రులుగారు పోల్కన యాభోగ భోగకళలన్ = అనియిందేకలదు). 'ఇంద్రభోగములన్న సమిద్ధ సరణి' అహల్యా సంక్రందనీయము. వైభవములును ఇంద్రుని కసాధారణచిహ్నము.

క. అని యిట్లు రోమహర్షణ, తనయుఁడు వసురాట్కథాసుధారస మఖిలం
బును దెలుప విని మహోత్సవ, మునఁ బొదలిరి శౌనకాదిమునికులచంద్రుల్.

అ. అని, ఇట్లు, రోమహర్షణతనయుఁడు = సూతుఁడు, వసురాట్కథాసుధారసము=అమృతరసప్రాయమయిన వసురాజుచరిత్రము, అఖిలంబును, తెలుపన్, విని, శౌనకాది, మునికులచంద్రుల్= మునివంశ శ్రేష్ఠులు, మహోత్సవమునన్ పొదలిరి = [illegible]రమయిన వేడుకచే నొప్పిరి. 100

ఆశ్వాసాంత[illegible]

మ. దృఢబాహాబలభీమ భీమసమర[illegible]పింఛజ్ఞ[illegible]
ప్రబఢిమాఢౌకితభూమ భూ[illegible]తతూర్య[illegible]ధ్వానదత్తేశధా
క్కధమత్కారవినామ నామకథనశ్లాఘ్యాన్య హాఢిల్లికా
[illegible]ధరాడాద్యరిధామ ధామగరిమశ్రీగ స్తగహాక్షీశ్వరా. 101

అ. దృఢబాహాబలభీమ = గాఢమయిన చేతిబలిమిచేతను[illegible] భీమసేనుఁడయిన వాఁడా! [illegible] భూమా—భీమ సమర=భయంకర యుద్ధములందు, [illegible]=నటించుచు[illegible] [illegible]క్తి యొక్క, పరిబ్రఢిమా= పరిబృఢత్వముచేత-ఆధి[illegible]చేత ననుట-('ప్రభుః [illegible]'), వలలక భేదము. ఆ ఢౌకిత=వ్యా[illegible]యిన, [illegible]మర్థ్యము గల[illegible] [illegible]మియం దొప్పుచున్న, తూర్యధ్వాన= [illegible]ధ[illegible]ద[illegible]నులచేత, [illegible]త్త [illegible]బడిన, ఈ ధాక్కధమత్కార = హారునియొక్క [illegible]వంబం[illegible]యిన ధమ[illegible]ధ్వని[illegible], వినామ [illegible]న్రమభావము గలవాఁడా! అనఁగా, హారుని[illegible]యును దిక్కరించి[illegible]కా[illegible]ది ధ్వనులు గలవాఁడ[illegible] నామకథన = [illegible]యాత్రము[illegible]నే, [illegible]

పోవుచున్న, మహాఢిల్లికా గఢరాట్ ఆది=ఢిల్లీ ఆగఢా పాదుషాలు మొదలయిన, అరి = శత్రువుల యొక్క, ధామ=ప్రభ కలిగిన వాఁడా! అనఁగా ఈరాజు పేరు వినఁగానే వారికి ముఖవైవర్ణ్యము సంభవించుచున్నదనుట. ధామగరిమగ్రస్తగ్రహాధీశ్వరా - ధామగరిమ = తేజోగౌరవముచేత, గ్రస్త= కబళింపఁబడిన, గ్రహాధీశ్వరా = సూర్యుఁడు గలవాఁడా-సూర్యతేజస్సునకంటె అధికమయిన తేజస్సుగలవాఁడనుట. ఇది ముక్తపదగ్రస్తము.

క. ధాటీ బహుధాటీకన, ఘోటీ ఘోట్టాణ కోటి ఖురకోటిరజ
శ్శాటీవృత హరిదవధిప, ధూటీకుచశైల ప్రబల దోర్బలలీలా. 102

అ. ధాటీ= దాడియందు (ధాటియనఁగా
'శత్రుసేనావమర్దాయ సద్యస్సుభటఘోటకైః
విజిగీషా ప్రవృత్తిర్యా సాధాటీతి నిగద్యతే'
ణము) బహుధా=అనేక విధములయిన, ఆటీకన=గతి విశేషములుగలిగిన, ఘోటీ= ఆఁడు గు[illegible]యు), ఘోట్టాణ = మగగుఱ్ఱములయొక్కయు, కోటి = కోట్లయొక్క— అనఁగా కోట్ల[illegible]గుఱ్ఱములయు మగగుఱ్ఱములయు, ఖుర = గొరిజలయొక్క, కోటి=కొనల వలనఁబుట్టిన, రజః = [illegible]గెడు, శాటీ = వస్త్రముచేత, వృత = కప్పఁబడిన, హరిత్ అవధిప ధూటీ = దిక్కులే చివర[illegible] భూమి అనెడు స్త్రీయొక్క, కుచశైల = స్తనప్రాయములయిన పర్వతములుగలవాఁడా - దిగంతములు పఱకు దండయాత్రలు సలిపినవాఁడా. ప్రబలదోర్బల లీలా = బలిష్ఠమయిన చేతిబలిమియొక్క విలాసముగలవాఁడా-దిగంతములకొలఁకు జైత్రయాత్రచేసిన వాఁడని తాత్పర్యము.

## సుగంధివృత్తము

సారసాహితీసదధ్వచారిభూరిధీరసా
ధీరసాహసోరుదోరతిస్ఫురన్మహాసా
హారసానుమత్తటీసురాపగా సుధారసా
ధారసాధుకీర్తిహంసధారిసూరిసారసా. 103

అ. సార...రసా—సార = శ్రేష్ఠమయిన, సాహితీ = సాహిత్యమనెడు, సదధ్వ = [illegible] మార్గమందు, చారి = సంచరించు[illegible], భూరి = అధికమయిన, ధీరసా=బుద్ధి గుణముగలవా[illegible] [illegible] గుణార్థ[illegible]గా దావిషేవీర్య గుణేరాగేంద్రవేరసః' అని అ. ధీర[illegible] [illegible]త్రమైన [illegible]సముగల, [illegible]=నిడుదయైన, దోః=భుజము[illegible]దు, అతిస్ఫురత్ =మిక్కి[illegible] వెలు[illegible]చు[illegible] మహాత్ = విస్తీర్ణమయిన, రసా = ('రసావిశ్వం[illegible]' అ) భూమిగలవా[illegible] [illegible]ర = [illegible]) సంబంధమైన, సానుమత్ = పర్వతముయొక్క,—అనఁగా కైలాసము [illegible], తటీ = [illegible]కును, సుర ఆపగా=దేవనదికిని—ఆకాశ గ[illegible]కును, [illegible]రస = అమృత రస[illegible] [illegible]నను, ఆధార = ఆధారమయిన, సాధు = లెస్సయిన, [illegible] = కీర్తియనెడు, హంస = హ[illegible] [illegible]సను [illegible] = ధరించుచున్న, సూరి = విద్వాంసులనెడు, సారసా = కమలములుగలవాఁడా - [illegible] [illegible]నము.

మంచి సాహిత్యమందు బుద్ధి నెలకొల్పినవాఁడనియు, గొప్ప భూరాజ్యభరమును దాల్చినవాఁడనియు, కైలాసము, గంగ, అమృతమనెడు వీనికి సాటియైన తెల్లని కీర్తిగలవాఁడనియు, ఆ కీర్తిని పండితులు స్తుతించు చుందురనియుఁ దాత్పర్యము.

ఇది ముక్తపదగ్రస్తము. ఈ వృత్తమునకు. గణము ర, జ, ర, జ. రలు తొమ్మిదవ యక్షరము యతిస్థానము. ఇది పదునేనవ ఛందంబగు అతి శక్వరియందుఁబుట్టినది. దీనినే శాలినీ ప్రశాంతి చామర వృత్తంబులని కొందఱంద్రు. ఉత్సాహంబని మఱికొందఱు భ్రమింతురు.

## గద్యము.

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత
సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితా
నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబను మహాప్రబం
ధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

ఇది సకలవిబుధజనవిధేయ తంజనగిర దేవరాజనామధేయ విరచితంబగు వసుచరిత్ర వ్యాఖ్యయందు సర్వంబును
షష్ఠాశ్వాసము.

స ం పూ ర ్ణ ము.

ఓం శ్రీరామచంద్రార్పణమస్తు.

